## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit,<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్ తత్ సత్

# శ్రీ భగవద్గీత

## (గీతార్థ దీపికా సహితము)




అనువాదకులు :

న్యాయరత్న - న్యాయశాస్త్రశిరోమణి

శ్రీ కీళాత్తూరు - శ్రీనివాసాచార్యులుగారు



ప్రకాశకులు :

శ్రీ వ్యాసాశ్రమమువారు,

వ్యాసాశ్రమము పోస్టు, ఏర్పడు మార్గము, చిత్తూరు జిల్లా. (ఆం.ప్ర.)

1998

ఓమ్

# విషయసూచిక





విషయసూచికా సమాప్తము.



ఓమ్

# అధ్యాయ మాహాత్మ్య విషయసూచిక



శ్రీ

కృష్ణం వన్దే జగద్గురుమ్

రెండవ కూర్పు :-

# ప్రకాశకుల తొలిపలుకు

దైవాత్మ స్వరూపులగు ఆత్మ సోదరీ సోదరులారా!

శ్రీ మద్భగవద్గీత వివిధరీతులతో శ్రీ వ్యాసాశ్రమము తరపున ముద్రింపబడియుండుట పాఠకులకు, భక్తులకు విదితమే. అందు యీ 'మహా భగవద్గీత' పద, పదార్థ, తాత్పర్య విశేషార్థములతోనే గాక భాష్యత్రయ విశేషార్థములతోగూడి జిజ్ఞాసుపాఠకుల నిమిత్తముగ నాకర్షించినది. విశిష్ట యోగ్యత గలిగి, భాషాపరిచయమును సంపాదించుకొని, భగవద్గీతపై రచింప బడిన భాష్యత్రయములోని విశేషములను, అందందలి మతత్రయ సామ్య వైషమ్యభావములను సంగ్రహముగ దెలుసుకొన కుతూహలముగల జిజ్ఞాసువుల నిమిత్తమై యీ మహాగ్రంథము రచియింపబడినది.

భగవద్గీతకు మతత్రయాచార్యులగు శ్రీ శంకర, రామానుజ, మధ్వా చార్యులు ముగ్గురు భిన్నభిన్న భాష్యముల రచించి యుండుట సర్వజన విదితము. ఆ భాష్యములు దురూహములని యెంచి క్రమముగా తదనుయాయులగు శ్రీ శంకరానంద, శ్రీ మధుసూదనసరస్వతి, శ్రీధర, శ్రీ ఆనందగిరి మొదలగు అద్వైతులు, శ్రీ వేంకటనాథ, శ్రీ రాఘవేంద్రాది విశిష్టాద్వైత ద్వైతవాదులు నయితము తద్భాష్య విశేషముల దెలుపుచు వేరువేరు వ్యాఖ్యానముల రచించి యున్నారు. ఇట్టి వ్యాఖ్యానసారముల గ్రోలి, ద్రావిడ (తమిళము) భాషయందు పద, పదార్థ, తాత్పర్యములతో 'గీతార్థదీపిక' యను నామమున యీ మహో న్నత గ్రంథము రచింపబడియుండెను.

శ్రీ గురుదేవులు (బ్రహ్మీభూత మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాముల వారు) యీ ఉత్తమ గ్రంథమును తమ తపఃకాలములో గోగర్భమున నున్న సమయమున దర్శించిరట. అప్పటినుండి యీ గ్రంథరాజమును తెనుగున అనువదింప జేసిన బాగుండునని సంకల్పించియుండిరి. శ్రీవారి యీ సత్సం కల్పము 1949-వ సం॥మున ఫలించినది. ఆంధ్రానువాదము పూర్తి గావింప బడి అధికవ్యయముతో గ్రంథము ప్రకాశితమాయెను. భక్తపాఠకులు గ్రంథ మును అమిత ఆదరముతో గౌరవించిరి. ప్రథమ ముద్రణ ప్రతులు సంవత్స రము క్రితమే సమాప్తములైనవి. పునర్ముద్రణకై యెంతో ఆసక్తితో ప్రయ

త్నించియు వెంటనే భక్తులకు అందింపజాలకపోతిమి. ప్రస్తుత క్లిష్టపరిస్థితిలో, వస్తువుల ధరలన్నియు విపరీతముగా పెరిగిపోయిన యీ కఠినసమయములో యింతటి బృహద్గ్రంథమును పునర్ముద్రించుట యన యెంత క్లేశసాధ్యమో పాఠకులకు దెలియనిదికాదు. అయినను వ్యయ ప్రయాసలకోర్చి, శ్రీ గురుదేవుని ఆధ్యాత్మికసేవను ఆదర్శమును దృష్టియందుంచుకొని పునర్ముద్రణ కుపక్రమించితిమి. శ్రీ గురుదేవుని అమోఘాశీస్సుచే, దివ్యానుగ్రహముచే గ్రంథ ముద్రణ యథాతథముగ అనతికాలముననే సమాప్తము కాగలిగినది. ఇదియే కాదు యీలాటి, అనగా యోగవాసిష్ఠము, ఆత్మపురాణము, అనుభూతి ప్రకాశిక మొదలగు అనేక ఉద్గ్రంథములను ఆంధ్రభాషయందనువదింపజేసి ప్రకాశిత మొనర్చి ఆంధ్రభాషకు, ఆంధ్రలోకమునకు అనల్ప సేవజేసిన మహర్షి సద్గురుదేవునకు ( శ్రీ మలయాళస్వాములవారికి ) ఆంధ్రదేశము చిరఋణి యనక తప్పదు. ఇట్టి అపూర్వ భాషాపోషకునకు శ్రీ గురుదేవునికి ఆంధ్రప్రజ సదా అంజలి ఘటిల్లవలసియున్నది. ఈ మహోన్నత గ్రంథమును ఆదరముతో పఠించి గీతార్థమును గ్రహించి, ఆచరించి తరించుటయే యథార్థమగు అంజలి సమర్పణయగును. భక్తులు, పాఠకులు తప్పక పూర్వరీతిగనే యీ గ్రంథరాజమును ఆదరముతో పఠించి తరింతురుగాక !

కాగితపుధర, బైండింగ్ చార్జీ వగైరాలు పెరిగినందున వెల పూర్వముకన్న కొద్దిగ పెంచవలసివచ్చినది. అయినను విజ్ఞులగు జిజ్ఞాసు పాఠకులు అన్యథా భావింపక సహృదయతతో యీ భారమును సహింపగలరనియే విశ్వాసము.

శ్రీ గురుదేవుని నిర్యాణానంతరమిట్టి మహోన్నత గ్రంథము పునర్ముద్రితమగుట తత్ప్రత్యసంకల్పమే. శ్రీ గురుదేవుని అనుగ్రహముతో, తదాదర్శమునే ముందిడుకొని, తత్ప్రదర్శిత మార్గము ననుగమించుచు యితోధిక లోకసేవ చేయగలుగు శక్తిసామర్థ్యములు, మహదవకాశము పునః పునః కలుగుచుండుగాక !

ఓం లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

1—8—98 ప్రకాశకులు.

ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# పీఠిక

పరిశుద్ధమగు జ్ఞానము, కరుణయు గల ప్రియమైన ఆత్మసోదరీ సోదరులారా!

కరుణామూర్తియగు సర్వేశ్వరుని కృపవలన లోకములో జ్ఞానము, శాంతియు, కరుణయు, సద్భక్తియు వర్ధిల్లును గాక!

ఈ 'భగవద్గీతార్థ ప్రకాశిక' యను గ్రంథము అరవ (తమిళ) భాష నుండి ఆన్ధ్రీకరించబడినది. ఇది యీ ఉపాధి సిద్ధక్షేత్రమగు శ్రీ తిరుపతి గోగర్భగుహయందు తపమొనరించెడు కాలమున చూడడమైనది. అప్పుడిది ద్వైమాసిక సంచిక రూపముగ ప్రకటింపబడుచుండెను. దీని కారణకర్తల విషయములన్నియు ఇందుగల ఉపోద్ఘాతమున గనందగును. ఈ పుస్తకము చూచినప్పటినుండియు దీనిని ఆన్ధ్రీకరించిన బాగుండునని తలంపు గలిగి యుండెను. ఆంధ్రీకరింపవలసియుండిన అరవములోను, గ్రంథాక్షరములలోను, సంస్కృతములోను, తెనుగులోను పాండిత్యముండవలయును. అరవభాషలో గ్రంథాక్షరమను నొక లిపిగలదు. సంస్కృతమంతయు ఈ లిపిలోనే యుండును. అట్లు కాలమును నిరీక్షించియుండగా, యీ మధ్య మన వ్యాసాశ్రమ సంస్కృతపాఠశాలయందు 'న్యాయశిరోమణి' పరీక్షయందు త్తీర్ణులయిన వారొకరు కావలసివచ్చెను. అత్తరి దీనిని యాన్ధ్రానువాదము జేసిన ఉభయ వేదాంత శ్రీమాన్ కిళాత్తూరు శ్రీనివాసాచార్యులువారు దొరకిరి. వీరు ద్రవిడ దేశీయులయినను ఆంధ్రదేశమందే విద్యాభ్యాసము పూర్తిజేసినవారగుటచే తెనుగుభాషలోగూడ అలవాటుపడియుండిరి. ఈ పుస్తకమును తెనిగించిన బాగుండునని తెలుపగా మిక్కిలి సంతోషించినవారలై అట్టి భాగ్యము తనకు లభించినందులకు జన్మము ధన్యమయినదని తలంచుచున్నానని చెప్పి వెంటనే ఆన్ధ్రానువాదమునకు ప్రారంభించి అదే పనిలోనే రేయింబవళ్లు సమయమును వినియోగపఱచి అచిరకాలములోనే గ్రంథమును పూర్తిజేసిరి. అయినను యుద్ధ కాలమగుటచే కాగితము దొరకుట ప్రయాసమగుటవలన అపుడు ముద్రించుటకు అనుకూలపడినదికాదు. ఇప్పుడు దైవకృపచే ముద్రించుటకు అవకాశము గలిగెను. ఇంతటితో నీ విషయము సంగ్రహముగ ముగించడమైనది.

మఱియు, ఈ గ్రంథము ఆమూలాగ్రము జదివిన ఈ భగవద్గీతా విషయమై యేయొక సందేహముగూడ గలుగదని దలంచెద. మలయాళము, అరవము, తెనుగు, కన్నడములోను, హిందీ, సంస్కృతములలోను గీతకు సంబంధించిన కొన్ని గ్రంథములు చూచిన యుపాధియగుటచే, యింతసార భూతమగు గ్రంథము మఱియొకటి లేదనుతలంపు పొడమెను. అదే దీని నాంధ్రీకరింప జేయుటకు ముఖ్యకారణము. 'గీతార్థప్రకాశిక'యను నామకర ణము దీనికి ఎంతో తగియున్నది. దీనిని కోయంబుత్తూరు వాస్తవ్యులగు వి. కుప్పుస్వామిఅయ్యరున్ను, సి. వి. వెంకట్రమణఅయ్యరున్ను, కోయంబుత్తూరు నివాసులు, కొచ్చి. పుదుక్కోట మొదలగు సంస్థాన విద్వాంసులు నగు త్రిమత సిద్ధాన్తమును నెఱింగిన బ్రహ్మశ్రీ వేంకట్రమణాచార్యులవలన శ్రీ భగవద్గీతను శ్రవణముజేసి మనన, నిదిధ్యాసముల నొనర్చి అరవభాషలో వ్రాయడమైనది. దీనియందు మతత్రయాచార్యులగు శ్రీ శంకర, శ్రీ రామానుజ, శ్రీ మధ్వా చార్యుల గీతాభాష్యములకు సంబంధించిన తత్సాంప్రదాయికుల వ్యాఖ్యాన ములను చక్కగ పరిశీలించి వాటిలో ఎచ్చటెచ్చట భావముయొక్క మార్పు గలుగుచున్నదో, దానినిమాత్రము సమన్వయపరచి యీ గ్రంథమును నిర్మించి యున్నారు. శ్రీ శంకర భాష్యానుయాయులగు శ్రీ శంకరానందులు, శ్రీధరులు, శ్రీ ఆనందగిరి. శ్రీ మధుసూదనసరస్వతి మొదలగువారి వ్యాఖ్యానములున్ను, శ్రీ రామానుజులు, శ్రీ వేంకటనాథులు (శ్రీ వేదాన్తదేశికులు) శ్రీ మధ్వాచార్యులు, శ్రీ రాఘవేంద్రస్వాముల భాష్య వ్యాఖ్యానములున్ను లెస్సగా పరిశీలించి వాటిలో ఎచ్చటెచ్చట భావముయొక్క మార్పుగలుగుచున్నదో దానిని మాత్రము గ్రహించి యీ గ్రంథమును రచించియున్నారు. ఏ మతమును గురించిన ఖండనముగాని, మండనముగాని దీనియందు కొంచెమైనను లేదు. దీనిని జదివిన మతత్రయముయొక్క తత్త్వమునుగూడ తెలిసికొనవచ్చును.

మఱియు శ్రీ భగవద్గీత ఉపనిషత్తుల సారమని లోకవిదితము. కనుకనే ప్రతి యధ్యాయాంతమున, 'శ్రీ భగవద్గీతాసూపనిషత్సు' అని తెలుపుటకు కారణము. కావుననే ధ్యానశ్లోకములలో,

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సస్సుధీర్భోక్తా దుగ్ధంగీతామృతం మహత్ ॥

తా॥ సర్వోపనిషత్తులను గోవులుగా జేసుకొని శ్రీ కృష్ణభగవానుడు అర్జునుని దూడగాజేసి మహత్తరమగు గీతామృతమను క్షీరము పితికియిచ్చి నాడు." అని తెలుపుటకు కారణము.

ఈ విషయమై అ. 18 శ్లో 50 లో నుండి, 48 ఉపనిషత్తుల సారమును క్రోడీకరించి నిరూపించియున్నారు. అదేయీగ్రంథమునకుగల ముఖ్యగౌరవము.

'సిద్ధింప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే।
సమాసేనైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా॥'

దీనియందు "సమాసేనైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా" అని శ్రీ కృష్ణభగవానులు స్వయముగా జెప్పియున్నారు. బ్రహ్మనిష్ఠయొక్క పరాకాష్ఠయగు బ్రహ్మప్రాప్తిని సంక్షిప్తముగ తెలుపుచున్నానని సాక్షాత్ శ్రీకృష్ణభగవానుడే తెలిపెను. ఈ 50, 51, 52, 53 శ్లోకములను పఠించిన గీతాసారమంతయు గోచరముకాగలదు. నిత్యము గీతాపారాయణము జేయువారు కారణాంతరమున ఒకానొకసమయమున పారాయణము చేయుటకు సాధ్యముగానప్పుడు ఈ నాలుగు శ్లోకములను పఠించిన జాలును. ఎచ్చటైన యాత్ర జేయునప్పుడుగాని మఱియొకపుడుగాని దీనిని స్మరించి భోజనాదుల సలుపవచ్చును. గాన ఈ నాలుగుశ్లోకముల కంఠస్థముగా జేసికోవలయు.

మఱియు గీతాశాస్త్ర మొకటి యుండిన జాలుననియు, తక్కిన శాస్త్రముల సారములన్నియు దీనియందే గలవనియు జెప్పెడి శ్లోకముల జూడుడు.

'సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః।
సర్వతీర్థమయీ గంగా సర్వతేజోమయో హరిః॥''

ఏలాగున గంగ సర్వతీర్థమయమై యున్నదో, సూర్యుడు సర్వతేజోమయుడై యుంటున్నాడో హరి ఏలాగున సర్వవేదమయుడై యున్నాడో, ఆలాగున గీతయు సర్వశాస్త్రమయమై యున్నది.

'మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే।
సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనమ్॥'

తా॥ శరీరములోగల మాలిన్యము నశించుటకు ప్రతిదినమున్ను స్నానము జేయవలయు. ఒక్కరోజు శుద్ధముగ స్నానమాచరించినను మరురోజు మరల స్నాన మాచరించనిచో శుద్ధముకాదు. ఈ గీతయను గంగలో ఒకసారి స్నానమొనర్చిన అనాదిగవచ్చుచుండు యీ సంసారమాలిన్యమంతయు నశించును.

"సంసార సాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః।
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః॥

తా॥ జననమరణములనెడు ఘోరదుఃఖములకు గారణమగు యీ సంసారమును దాటుటకు యేమానవుడు గోరుచున్నాడో, అతడు శ్రీ భగవద్గీత యను ఓడ నాశ్రయించిన సుఖముగ దాటవచ్చును." "యోనరః" అని యుండుటచే మనుష్యమాత్రులలో నెవరైనను గీతాపఠనమున కర్హుడని గ్రహించుకొనవలయును. ఓడలో సర్వజనులు యేలాగున ప్రయాణముజేసి తీరమును జేరుచున్నారో, ఆలాగున స్త్రీలుగాని, పురుషులుగాని, గృహస్థులుగాని, సన్యాసులుగాని, బ్రాహ్మణులుగాని, అబ్రాహ్మణులుగాని, గీతనుపఠించి తరింపవచ్చును. మఱియు

"గీతాశాస్త్రమిదం పుణ్యం యః పఠేత్ప్రయతః పుమాన్ ।
విష్ణోః పదమవాప్నోతి భయశోకాది వర్జితః ॥

తా॥ మహాపుణ్యప్రదమగు యీ గీతాశాస్త్రమును పవిత్ర హృదయము గలిగి యేమనుజుడు పారాయణము జేయుచున్నాడో, అట్టివాడెవడైనను భయశోకాదులనుండి వివర్జితుడై, శ్రీమన్నారాయణుని పరమపదమును బొందుచున్నాడు." ఇచ్చటగూడ "యఃపఠేత్" అనియుండుటచే ఎవడైనను పఠించవచ్చును. ఇత్యాది ప్రమాణము లసంఖ్యాకములుగ గలవు. గ్రంథవిస్తరమగునని తలంచి నిలుపడమైనది. నిప్పును వృద్ధిజేయతలంచువారికి ఒక్క అగ్నికణము లభించిన జాలును. ఎక్కువ యక్కరలేదు. దానిని దూది మొదలగు వానిలోనుంచి ఊదినచో నదే యెంతో గొప్పనిప్పుగ వెలుగగలదు. అట్లుకానివానికి ఒక పళ్లెరము (తట్ట) నిప్పు నొసగినను దానిని ఎచ్చటనో పెట్టివేసిన లేక పారవైచినను అది బొగ్గై బూడిదై వ్యర్థమగును గదా! ఆలాగున శ్రద్ధగలవానికి ఒక్కవాక్యముచాలును. అట్లు కానివాడు ఎన్నిశాస్త్రముల చదివినను ప్రయోజనముండదు. ఇదియే దీనిలోగల సారము.

ఓమ్ తత్ సత్.

ఓం లోకాస్సమస్తాస్సుఖినోభవంతు.

ఇట్లు, మీ చరాచర సుఖాభిలాషియగు.

ఓమ్

శ్రీ కృష్ణాయ పరబ్రహ్మణే నమః.

# ఉపోద్ఘాతము



ప్రాణులన్నియు సుఖానుభవమువలన ఆనందమును బొందగోరుచున్నవను దానిని మనము ప్రతినిమిషమునందును చూచుచునేయున్నాము. అందులో జ్ఞానముతోగూడిన మనుష్యజన్మమును బొందియున్న మనము, అట్టి సుఖానుభవముల వలన పొందబడు నానందము శాశ్వతమైనదిగ నుండవలయునని యపేక్షించుచున్నామను విషయమున సందియములేదు.

ఇట్టి స్థిరమైన ఆనందము యిట్టిదనుదాని నెఱుంగునట్టి జ్ఞానమున్ను, దానిని బొందుటకు మార్గము యిట్టిదని జూపెడి శ్రుతిస్మృతి మొదలగు ప్రమాణములున్ను, మనకు ప్రసాదింపబడియున్నను వాటిని విమర్శించి యెఱుంగక అనేకులు ఇహలోక విషయములలో నట్టిశాశ్వతమైన యానందమున్నట్లు భ్రమించి స్వల్పసుఖములను నొక్కొక్కటిగ, అనేక జన్మములలోననుభవించి చూచిన పిదపనే వాటిలో నట్టిసుఖము లేదనుజ్ఞానమును పొందుచున్నారు. కావున వివేకముతో గూడినవారలట్టి శాశ్వతమైన సుఖమిట్టిదని శాస్త్రప్రమాణములవలన నెఱింగి యీ జన్మమునందే దాని నొందుటకు ప్రయత్నింపవలయును గదా!

వాస్తవమున, కోఱదగినదెట్టిదో దానినివిడచి కోరదగనిదానిని గోరుట లోకస్వభావమైనందున, సుఖముయొక్క తారతమ్యమును విచారించి, విమర్శించి యెఱుంగుట ఆవశ్యకమగుచున్నది.

సుఖమనునది యుత్తమము, మధ్యమము, అధమమని మూడువిధముల గును. వీటిలో నధమ మధ్యమ సుఖములనేకములైన అంతర్విభాగములు గలవైనను, అట్టి యంతర్విభాగములగూర్చి యిప్పుడు విచారింపక, సముదాయముగ విచారించుటయే చాలునని తోచుచున్నది.

అధమసుఖ మేదనగా, యీలోకమున చెవులతో వీణమొదలగు వాద్యాదులను వినుటవలనను, నేత్రములవలన విచిత్రములైన రూపాదులను జూచుటవలనను, ముక్కుతో పుష్పాదివాసనలను గ్రహించుటవలనను, నాలుకచే పండ్లు మొదలగువాటిని రుచిచూచుటవలనను, త్వక్కుమీద చందనము మొదలైన వాటిని పూయుటవలనను, మరి యీ విధముగనే ధన కనక వస్తు వాహన పుత్రమిత్ర కళత్రాదులతో గూడియుండుటవలనను గలిగెడి మనుష్యానందమని శ్రుతి స్మృతులలో జెప్పబడిన సుఖమే.

అధిక సంఖ్యాకులచేగోరబడు యిహలోకసుఖమును నధమమని యెట్లు చెప్పదగుననిన—అట్లు జెప్పుటకు పలుకారణములుగలవు. వాటిలో కొన్నింటిని యిచ్చట నుదాహరణముగ నెత్తుకొనెదము.

1. అది స్థిరముగ నున్నట్టిదిగాదు. ఎట్లనగా, వీణ మొదలగు వాద్యాదులను విన్నంతవఱకును, వినోదమైన రూపాదులను జూచుచున్నంతవఱకును, పుష్పాదులను వాసనజూచువఱకును, పండ్లు మొదలగునవి నాలుకతో సంబంధించి యున్నంతవఱకును, చందనాదులను దేహముమీద పూసియున్నంతవఱకును, ధన కనక వస్తు వాహన పుత్రమిత్రకళత్రాదులకు చెఱుపు కలుగకున్నంతవఱకును, యేదో స్వల్పకాలము సుఖముండగలదైనను, అట్టి సుఖము నిలకడగనుండజాలదు. మఱియు ఇట్టి సుఖము ననుభవించుకాలమునందే, యకస్మాత్తుగ సంభవించెడు దుఃఖసంబంధమువలన నట్టిసుఖముగూడ మార్పు జెందుచున్నది.

2. ఇటువంటి విషయ సుఖమెల్లఱికిని, సమముగనుండునట్లు జెప్పవచ్చుననిన, అదియు వీలుపడదు. ఒకనికి సుఖముగానున్నట్టి యాహారాదివస్తువులు మరియొకనికి సుఖకరముగ నుండుటలేదు.

3. కొందఱికి స్వల్పకాలమువరకైనను నున్నట్టిదిగ జెప్పబడిన యట్టి సుఖము దుఃఖసంబంధము లేనిదిగ నున్నదా? యనిన అట్లుగూడలేదు. రాజుగనుండి సకలభాగ్యముల ననుభవించుకాలమునందే దనవంశవృద్ధికై పుత్రుడు లేడనియు, నిత్యదరిద్రుడుగ నున్నవాడు పుత్రభాగ్యము గలిగెనని సంతోషించుచున్నప్పుడే యీ బిడ్డలను రక్షింప ధనములేదేయనియు, సుఖమునిచ్చదగిన సకలసంపదలనుండియు వాటిననుభవింప నవకాశములేక వ్యాధివలన పీడింపబడుచున్నాననియు, మఱియు ఈ విధముగనే ప్రతియొకడు సుఖముతో దుఃఖమును జేర్చియే యనుభవించుచున్నాడు.

కావున అనేకులచే గోరబడినను, ఇహలోకసుఖము వాస్తవమైన సుఖము గాదు. అయితే లోకములో దీనిని సుఖమని వ్యవహరించుచున్నారు గదా! యనిన, వాస్తవము నెఱుంగనందున అట్లు వ్యవహరింపబడుచున్నది. ఎట్లనగా రాజుగనుండుట అతిసుఖమని జెప్పితిమేని, ఆ రాజునకుగూడ పలువిధములైన దుఃఖములుగలవు. అతని యధీనముననున్న సేవకులు, పుత్రమిత్రకళత్రాదులు, వాహనాదులు, వీటిమూలముగను, శత్రువులమూలముగను, వ్యాధి, ఆకలి, దాహము, మొదలగువాటి మూలముగను, తనదేశమున గలిగెడి క్షామము మొదలగువాటి మూలముగను, తనతో సమానమైనవారలు, గురువులు, మిగతపెద్దలు, వీరల విషయమై జేయవలసినగౌరవము, పూజ మొదలగు వాటిలో కొఱతగలుగక జరుపవలసి నందుమూలముగను, దుఃఖము యెంత గలుగగలదో నంతటి సుఖము గలుగునవకాశములేదు. ఈ విధముగనే

నడచుటకు వీలులేనివాడు నడచువానిని, నడచెడివాడు వాహనాదులలో సవారిజేయువానిని సుఖియని వ్యవహరించినను, వాస్తవమున వారలను సుఖులని వ్యవహరింప నవకాశములేదు. గాన నీలోకసుఖమును అధమమనియే జెప్పవలెను.

మధ్యమ సుఖమనగా:— ఇహలోకమున, శ్రద్ధతో దేవతల నుద్దేశించియు, ఫలము నుద్దేశించియు జేసెడి వేదోక్త నిత్య నైమిత్తిక కర్మలు, సత్పాత్రమున జేయబడుదానము. దేవాలయ ప్రతిష్ఠ, సత్రము, బావడి, చలిపందిరి మొదలగువాటిని నిర్మించుట, తటాకాదులను త్రవ్వించుట. దేవాలయము, సత్రము, చలిపందిరి మొదలగువాటిలో పూజ, అన్నదానము మొదలగునవి జరిపించుట, యివి మొదలుగాగల పుణ్యకర్మలవలన ఆ కర్మలకు దగినట్లు ఫలము ననుభవించుటకై స్వర్గలోకము మొదలగు లోకములలో దేవశరీరమును బొంది, ఆ లోకములలో ననుభవింపదగినదిగను, దుఃఖసంబంధములేనిదిగను, ఎల్లప్పుడు సంతోషము గలదిగను, వ్యాధి మొదలగు దుఃఖములేనిదిగను, ఈ భూలోక సుఖమునకంటె పలురెట్లు శ్రేష్ఠమయినదిగను, దేవానందమని శ్రుతి స్మృతి పురాణాదులలో చెప్పబడినదిగనున్న సుఖమే. ఇట్టి స్వర్గాదిలోకములలో ననుభవింపబడు సుఖమును మధ్యమ సుఖమని ఎట్లు జెప్పదగుననిన, ఇది నాశములేని సుఖముకానందుననే. ఏలననగా యెట్టి పుణ్యకర్మముయొక్క ఫలము ననుభవించుటకై యే లోకమును నొకడు బొందునో ఆ లోకములో నట్టి పుణ్యకర్మముకొఱకై నేర్పఱచబడిన కాలమువరకే యా లోకసుఖము ననుభవించవచ్చును. ఆ పుణ్యఫలము ననుభవించుటకై యేర్పరచబడిన కాలము ముగియగనే, "తస్మిన్యావత్సంపాతముషిత్వాఽథైతమధ్వానం పునర్నివర్తన్తే" "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" అను ప్రమాణానుసారముగ అతడు యీ మనుష్యలోకమున జనించి మరల నీలోకమందలి సుఖదుఃఖాదులనే యనుభవింపవలసిన వాడుగ నున్నందుననే.

ఉత్తమ సుఖమనగా:— సర్వశ్రేష్ఠమైన మోక్షమే. మోక్షమను పదమునకు విడుదల బొందుటయనునదియే సరియగు నర్థము. దేనినుండి విడుదల పొందుటయనగా, జననమరణములనెడి సంసారదుఃఖమునుండియే. ఈ జననమరణమెట్లు దుఃఖమైనదనగా, మలమూత్ర రక్తమాంసము మొదలగు వాటివలన నిండిన తల్లియొక్క గర్భాశయమున కట్టుబడియుండుటయు దుఃఖమే, ఆ గర్భమునుండి తలక్రిందుగా బలుదుఃఖములజెంది భూమిలో జనించుటయు దుఃఖమే, జనించిన పిదప బాల్యకౌమార యౌవన వార్ధక్యదశలలో ఆకలి, దప్పి, వ్యాధి, కుటుంబసంరక్షణము, కుటుంబవియోగము, అశక్తి మొదలగునవియు దుఃఖమేను. కడపటిదియైన మరణావస్థగూడ దుఃఖమేను. కావున నీ సంసారము దుఃఖమని జెప్పబడినది. దానినుండి వీడుటయనెడి మోక్షము

నాశములేనిదైన నిత్యానందమనియు, బ్రహ్మానందమనియు శ్రుతి స్మృతి ఇతిహాస పురాణాదులలో ప్రసిద్ధముగనున్నది.

సుఖము యీ విధముగ మూడు విధములైన తారతమ్యము బడసియున్నందున ప్రతియొకడు నుత్తమసుఖమును బొందుటకై ప్రయత్నింపవలయునేగాని మిగత సుఖముల నిచ్ఛింపగూడదు. వానిని బొందుటకు ప్రయత్నించుచున్నచో వాని వాని ప్రయత్నమునకు దగినటుల యీ జన్మమందైనను, "బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అను ప్రమాణాను సారముగ కొన్ని జన్మములకు తర్వాతగాని యుత్తమ సుఖము నొందవచ్చును. మధ్యమాధమ సుఖములగోరి వాటియందే ఆసక్తిగలవాడు అనేక కోటిజన్మముల నెత్తినను, నుత్తమ సుఖమునొందజాలడు.

కావున నిట్టి యుత్తమ సుఖమును బొందుటకు సాధనమేదియని యిప్పుడు విచారింపవలసియున్నది. సాక్షాత్సాధనము జ్ఞానముగను, పరంపరా సాధనము నిష్కామకర్మలుగనున్నవి. ఆసాధనముల బొందుమార్గములనుమనకు బైటబెట్టుటలో ముఖ్యమైనదియు, సర్వశ్రేష్ఠమైనదియునగు ప్రమాణము శ్రుతియే. శ్రుతియనగా వేదమనినెఱుంగుడు. వేదమనునది కర్మకాండము, జ్ఞానకాండము అని రెండువిధములైనది. నిత్యనైమిత్తిక కర్మలనుగూర్చియు, వాటిననుష్ఠింపవలసిన పద్ధతిని గూర్చియు చెప్పెడిభాగము కర్మకాండమనియు, యేది మోక్షమునకు సాక్షాత్సాధనమో అట్టి జ్ఞానమును గలుగజేయునట్టిదియు, వేదాంతమని జెప్పబడునట్టిదియు నయిన భాగము జ్ఞానకాండమనియు చెప్పబడుచున్నది. ఈ కర్మకాండమున చెప్పబడియున్న నిత్యనైమిత్తిక కర్మలను వాటికై విధింపబడియున్న ఫలమును పొందవలయునను గోరికతో జేసినయెడల మధ్యమ సుఖము నొందగలము. ఫలాశగొనక విధ్యుక్తముగ జేసి ఈశ్వరార్పణము జేయుచున్నచో దానివలన చిత్తశుద్ధియు, చిత్తశుద్ధివలన జ్ఞానమున్ను, జ్ఞానము వలన మోక్షమున్ను పొందవచ్చును.

మహాత్ములకే గోచరమగునట్టిదియును, ఉత్తమ సుఖమును పొందించుటకు ముఖ్యసాధనమును బైట బెట్టునదియునైన వేదాంతమనెడి యుపనిషత్తుల యర్థములను పూర్ణముగ నెఱింగెడి శక్తి మనకులేదు గదా యనిన క్రూరమైన నీ కలియుగమున మనమిట్టి స్థితికిరాగలమని నుద్దేశించియే సాక్షాన్మహావిష్ణువు, కృష్ణావతార మెత్తినపుడు అర్జునుని నిమిత్తముగ గైకొని యెల్లరు కడతేరుటకు సులభముగ నుండుటకై వేదాంతార్థముల సారమైన గీతాశాస్త్రము నుపదేశించియున్నాడు.

మహావిష్ణువు కృష్ణావతారము నెత్తవలసినదేల? అతడర్జునుని నిమిత్తముగనుంచి యుపదే...పవలసినదేల? అనిన ఈ విషయము సాధారణముగ

బహు సంఖ్యాకులకు దెలిసియున్నను తెలియని కొందఱికొఱకై యీ చరిత్రము నిచ్చట సంగ్రహించి చెప్పెదము.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥"

(భ. గీ. 4 అధ్యా. 4, 5, శ్లోకములు)

అను భగవద్గీతా వాక్యానుసారముగ దుష్టనిగ్రహ శిష్టపరిపాలనము కొఱకున్ను, యాదవవంశమున జనించినవారలును మహాభక్తులయిన వసుదేవుడు దేవకి వీరల యిష్టపూర్తికొఱకున్ను వారలకు పుత్రుడుగ నవతరించెను.

ఆ కాలమున హస్తినాపురము నేలుచుండిన చంద్రవంశపు రాజుల సంతతిలో ధృతరాష్ట్రుడనియు పాండువనియు ఇరువురు సహోదరులుగలరు. ధృతరాష్ట్రుడు జన్మాంధుడు. అతడు పట్టమున కర్హుడుగాకున్నను, తమ్ముడైన పాండువు అన్నయందుండిన ప్రీతివలన అన్నను రాజుచేసి తాను యువరాజాయెను. కొంతకాలమునకు పాండురాజు చనిపోయెను. ఈ పాండురాజునకు ధర్మపుత్రుడు, భీమసేనుడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడని ఐదుగురు కొమార్లు. ధృతరాష్ట్రునకు దుర్యోధనుడు మొదలగు నూరుగురు కొమరులుండిరి. పాండుకుమారులు విద్యయందును,, సామర్థ్యమునందును, గొప్పతనమునందును, బుద్ధియందును, సకలవిధములయిన సద్గుణములందును దుర్యోధనాదులకంటె శ్రేష్ఠులుగను, యెల్లరిచే పొగడదగిన వారలుగ నున్నందున తన తండ్రికి తరువాత తనకు రాజ్యము లభింపకపోవచ్చునను భయమువలన దుర్యోధనుడు వీరలను విరోధించి తన్త్రముగ చంపుటకుగూడ దలంచెను. తన కుమారుడు పాండవులను విరోధించుచున్నాడనుసంగతిని ధృతరాష్ట్రుడెఱింగి, పాండవులకున్ను సగము రాజ్యము నొసగి ఇంద్రప్రస్థమను పట్టణమున వారలను నివసింపజేసెను. దుర్యోధను డంతటితో తృప్తినొందక పాండవులను జంపుటకై పలువిధములుగ ప్రయత్నించినను వీలులేక వారలనాశ్రయించి వారలయెడ స్నేహముజూపి, కడపట మోసపరచి ధర్మపుత్రుని జూదమాడ బిలచి తనకు (దుర్యోధనునకు) మేనమామయైన శకుని యనునతనిద్వారా మాయాజూదమాడించి పాండవులయొక్క సకలసొమ్ములను నపహరించినదేగాక పాండవులను, వారల పత్నియు పతివ్రతాశిరోమణియునైన ద్రౌపదిని సభలో మానభంగము జేసెను. భీష్మాచార్యులు మొదలగు పెద్దలకోరికమీద, పాండవులు పంద్రెండు సంవత్సరములు అరణ్యమున సంచరించి 13వ సంవత్సరము తనకు (దుర్యోధనునకు) కనబడనిచోట నివసించి, (అజ్ఞాతవాసముచేసి) తర్వాత వచ్చినచో సగము రాజ్యము ఇచ్చునట్లు దుర్యోధనుడు అంగీకరించెను.

మహాబలశాలురయినను ధర్మమను త్రాడువలన కట్టబడిన పాండవులు అరణ్యమునకేగి ప్రతిజ్ఞ తప్పక 13 సంవత్సరములు అరణ్యము, పర్వతము మొదలగు ప్రదేశములలో సంచరించి పిదప సగము రాజ్యమిచ్చునట్లు దుర్యోధనుని నడుగబంపిరి. అతడందులకు సమ్మతించలేదు. పిదప తమ మేనమామ కుమారుడున్ను తమయెడ అతివాత్సల్యముగలవాడునైన శ్రీకృష్ణపరమాత్మను ప్రార్థించి నతని మూలముగను దుర్యోధనుని సగము రాజ్యమిచ్చునట్లు నడుగ బంపిరి. దుర్యోధనుడు సూదిమోపుచోటునుగూడ నివ్వ మనస్సు లేదనెను. దాని వెనుక రెండుపక్షములవారలున్ను యుద్ధముజేయవలసినదిగా నేర్పడెను. ఇట్టి యుద్ధమునకు భారతయుద్ధమని పేరు.

ఈ యుద్ధారంభమున రెండు పక్షములసేనలున్ను యుద్ధరంగమున నిలబడునప్పుడు ఆ సైన్యముల నర్జునుడుజూచి యిరుపక్షపు సైన్యములలో నున్న వారలలో తరచుగ తన బంధువులు, స్నేహితులు, గురువులు నుండజూచి పరితాపమొంది తనకు సారథిగనుండి యనుగ్రహించిన శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి "నేనీసైన్యములనుజంప సాహసింపను, గురువు మొదలగు బంధువులను జంపినచో నరకమొందెదను. నాకు రాజ్యమువలదు. అరణ్యమునకే మరల వెళ్లెద"ననెను. ఆ మాటలువినిన కృష్ణపరమాత్మ అర్జునుని శోకమోహములను, ఆ విధముగనే యెల్లరి శోకమోహములను బోగొట్టి వారలకడ తేర్చుటకై వర్ణాశ్రమముల ధర్మములను, వానివాని వర్ణాశ్రమ ధర్మమునువిడచినవాడు నరక మొందుననియు, ఆత్మానాత్మ వివేకమును ఉత్తమసుఖమును బొందుటకైన జ్ఞానకర్మమార్గముల నుపదేశించెను. కావున నీ గ్రంథము భగవంతుడైన శ్రీకృష్ణపరమాత్మ చేతనే యుపదేశింపబడినందున భగవద్గీతయనియు, వేదార్థముల సంగ్రహించి చెప్పియున్నందున ఉపనిషత్తనియు, పరబ్రహ్మమును దెలిపెడు విద్యగనున్నందున బ్రహ్మవిద్యయనియు, ఆత్మానాత్మ వివేకమును స్పష్టపరచెడి సాంఖ్యయోగము కర్మయోగము యివి జెప్పబడియున్నందున యోగశాస్త్రమనియు, కృష్ణపరమాత్మకును అర్జునునకు జరిగిన ఉత్తరప్రత్యుత్తరరూపముగనున్నందున కృష్ణార్జున సంవాదమనియు జెప్పబడుచున్నది.

భారతయుద్ధమున జరుగు సంగతులన్నిటిని వెనువెంటనే ధృతరాష్ట్రునకు జెప్పమని, మహావిష్ణువుయొక్క అంశమువలన నవతరించియున్న వేదవ్యాసమహర్షిచే అనుగ్రహింపబడి, జ్ఞాననేత్రాదులుబడసిన సంజయుడను నతనిచే నీ యుపదేశమంతయు ధృతరాష్ట్రునకు జెప్పంబడియె. వేదవ్యాస మహర్షి మహాభారతమను గ్రంథమొనర్చునప్పుడు యీ గీతను మహాభారతముతో జేర్చెను. అట్లు జేర్చి 5000, సంవత్సరములకంటె అధికముగనుండవలయును. దాని తర్వాత కాలమున నీశాస్త్రార్థమును బాగుగ నెఱింగెడిశక్తి జనులలో

తక్కువైనందున, 2000 సంవత్సరములకుమునుపు శ్రీమచ్ఛంకరాచార్యులవారు యీ గీతార్థమును వివరించిచూపి అద్వైత సిద్ధాన్తము ననుసరించియు, దానికి కొంతకాలమైనపిదప శ్రీమద్రామానుజాచార్యులవారు విశిష్టాద్వైతమతసిద్ధాన్తము ననుసరించియు, శ్రీ మన్మధ్వాచార్యులవారు ద్వైతమతసిద్ధాన్తము ననుసరించియు భాష్యములు జేసియున్నారు. ఆ భాష్యములలోని యర్థములుగూడ తెలుసుకొనుటకు శక్తి జనులయెడ తగ్గుచుండగా ఆయామతము నాశ్రయించిన కొందఱుమహాత్ములు ఆయామతముల నాశ్రయించి మూలమునకు వ్యాఖ్యానము లున్ను, భాష్యములకు (టీకయని వ్యవహరింపబడుచున్న) వ్యాఖ్యానముల జేసిరి. ఈకాలమునందైతే వైదికమార్గముననున్న వృద్ధులు గొందఱుదప్ప మిగతవార్లయెడ సంస్కృత వ్యుత్పత్తి విశేషించిలేనందున వారలకొఱకై ప్రాకృతభాషలలోననువదించుట ఆవశ్యకమైనది. ఆ విధముగనే నుత్కృష్ట మగు నీగ్రంథము ఐరోపాఖండమున గ్రీక్, జర్మన్, లాటిన్, ఇంగ్లీషు, ఫ్రెంచ్ మొదలగు భాషలలోను, యీ దేశమున ఆంగ్లము, తెనుగు, కన్నడము, తమిళము మొదలగుభాషలలోను అనువదింపబడియున్నది. ఆ యనువాదముల కంటె యీ గ్రంథమువలన నధిక ప్రయోజనము గలదనుదానిని దీనిని గనినంతమాత్రమున నెల్లరు నెఱుంగగలరు. అనగా—మూలశ్లోకములు పద పదార్థములు, తాత్పర్యము ఇవి వ్రాయబడియున్నవి. వీటినుండి భేదముజెంది యున్న విషయములలో ప్రసిద్ధములైన పైగనిన త్రిమత భాష్యముల యొక్కయు, అద్వైత సిద్ధాన్తముననుసరించి శ్రీధరస్వాములున్ను, ద్వైతసిద్ధాన్తము ననుసరించి రాఘవేన్ద్రస్వాములున్ను జేసియున్న వ్యాఖ్యానముల యొక్కయు ముఖ్య తాత్పర్యములు వ్రాయబడియున్నవి. ఈ భాష్యముల యొక్కయు, వ్యాఖ్యానములయొక్కయు తాత్పర్యములు గొన్నిపదముల విషయ మున మాత్రము వేరుబడునప్పుడు ఆ పదముల గుర్తింపజేసి విభిన్నములైన యర్థములు క్రిందజూపబడియున్నవి. అద్వైతమతముననుసరించిన మధుసూదన సరస్వతియొక్క వ్యాఖ్యానమునుండియు, శ్రీమత్ శంకరాచార్యుల గీతాభాష్య మునకు ఆనందగిరి యనువారు జేసియున్నటీకనుండియు కొన్నియర్థభేదములు కొన్నిచోట్లలో ప్రకటింపజేయబడియున్నవి. భాష్యములనుగాని, వ్యాఖ్యాన ములనుగాని, పూర్ణముగ ననువదించియున్నట్లు గ్రహింపగూడదు. అట్లు జేయుటవలన అధికముగ గ్రంథము పెరుగుననిదలంచి ఆ యా తాత్పర్యములు వీలైనంతవరకు సంగ్రహించి చెప్పబడియున్నవి. భాష్యవ్యాఖ్యానములలో గుర్తించిన శ్రుతిస్మృతి పురాణాదివాక్యములున్ను, వాటి కర్థములును, ఆ యా చోటుల వ్రాయబడియున్నవి. శ్రీధరస్వాముల వ్యాఖ్యానము ననుసరించియే తరచు పదార్థతాత్పర్యములు వ్రాయబడియున్నవి. ఏదైన యొకమతమును శ్లాఘించి లేక దూషించి జెప్పతలంచలేదు, అట్లు జేయనులేదు. ఆ యా మత స్వరూపము తెలిసినవరకు స్పష్టపరచబడియున్నది.

ఈ విధముగ బ్రహ్మశ్రీ కోయంబుత్తూరు కుప్పుస్వామి అయ్యరుగారు, మతత్రయ సిద్ధాంత పారంగతులగు బ్రహ్మశ్రీ వెంకటరమణాచార్యులవారి సహాయముతో నీగ్రంథరత్నమును అఱవములో వ్రాసి, మఱికొందరు పండితవరేణ్యుల సహాయముతోను, బ్రహ్మశ్రీ సి. వి. వెంకటరమణయ్యగారి తోడ్పాటుతోను ముద్రించి లోకోపయుక్తము గావించిరి. అట్టి మహనీయులకు ధన్యవాదము లర్పించుట మన విధ్యుక్తధర్మమే గదా!

అది యట్లుండ, ఈ గ్రంథమును సొంతముపఠించి పరిశోధించి - ఇందలి రచనావైచిత్ర్యమును, సర్వోపాదేయతను గాంచి - శ్రీ వ్యాసాశ్రమ ప్రతిష్ఠాపకు లున్ను, ఆస్తిక్యమును విశిష్య పామరులకుపదేశించి వారలను తరింపజేయవలె నను పరమోద్దేశ్యము గలవారున్ను, ఏతాదృశ గ్రంథములను మూలభాష లోనే (సంస్కృతములోనే) పఠించి యెరుంగుట కనుకూలముగ నుండునని భావించి ఆశ్రమములో సంస్కృత పాఠశాల నేర్పరచి యస్మదాదులచే ప్రవచ నము గావించుచున్నవారునునగు శ్రీ శ్రీ శ్రీ సద్గురు మలయాళస్వాములవారు, యీ గ్రంథరత్నము నాంధ్రీకరించిన నాంధ్రలోకమునకు లాభదాయకము కాగలదని దలంచి - యిట్టి పవిత్రకార్యమునకై నన్ను నియోగించినందున "చెఱుకు దినుటకు కూలియేల?" యని ప్రవర్తించి పూర్తిజేసి, స్వాత్మను ధన్యము గావించితిని.

నేనీ గ్రంథమున ననువదించుటలో అతిసరళమగు వ్యావహారిక భాషనే గైకొంటిని. అందుల కనేక కారణములుగలవు

(1) గ్రాంథికభాషదెలియక, కేవలము చదువుటకుమాత్రము శక్తిగల వారుకూడా యీ గ్రంథమును జదివిన బోధపడవలెనని యుద్దేశించుట.

(2) అఱవభాషానువాదకులుకూడా యిదే యుద్దేశముతో (కాబోలు) సరళమైన నడకలోనే యెల్లరికి బోధయగునటుల వ్రాసియున్నందున "మహా జనో యేన గతస్స పంథాః" అనునీతి ననుసరించుట.

(3) మఱియొక ముఖ్యకారణమేమనిన — నేనరవదేశీయుడను. ఆంధ్ర దేశవాసమువలన లబ్ధములగు వ్యావహారికభాషాపదములే నా హృదయకోశము నందధికముగాగలవు. కాన ప్రయత్నముచేతనే గ్రాంథికత్వమును సంపాదింప వలసియున్నందున అట్లుద్దేశింపకుండుట.

మఱియొకమాట — చెఱుకును సాక్షాత్తుగా పండ్లతోకొఱికి గ్రహించిన రసము, పాత్రలోపిండినరసము, ఇవిరెండు చెఱకురసమేయైనను రుచిలో నీరెంటికి వ్యత్యాసముండును. అట్లే యనువాదమున మూలమునకంటె రుచిభేద ముండగలదు. అది యనువాదముయొక్క స్వభావమేగాని, యనువాదకుని దోషముగాదనుదానిని పాఠకులు గమనింపవలెను.

ఇక భాషవిషయమున నేను పొరబడియుంటినేని సహృదయ లోకము దానిని గణింపక, గ్రంథగౌరవమును గాంచి దోషములను విస్మరింతురుగాక యని ప్రార్థించుచున్నాను.

మరియొక ముఖ్యవిషయము — ఇటువంటి మహనీయ గ్రంథములను వెదకివెదకి యాంధ్రీకరించి, యాంధ్రలోకము నుజ్వలము గావించుచున్న శ్రీ వ్యాసాశ్రమ స్థాపకులు కొనియాడ దగినవారనియే.

ఈ ప్రకరణమున, నేననువదించిన యీ గ్రంథమును వ్రాసి నాకు తోడ్పడిన బ్రహ్మశ్రీ బాలకృష్ణశాస్త్రిగారిని, అట్లే శ్రీమాన్ శివచరణంగారిని స్మరించుచు నన్ను యీ సత్కార్యమున ప్రవర్తింపజేసి కొనసాగించిన నాయంతర్యామికి ధన్యవాదము లర్పించి ఈ కృతిని వాని పదకమలములలో నర్పించుచున్నాను.

శ్రీ పార్థివనామ సం॥
మాఘచతుర్థి
5—2—1946

ఇట్లు,
అనువాదకుడు.



ఓం జగత్పతయే నమః.

# మతత్రయ సిద్ధాన్త సంగ్రహము.



## అద్వైతము.

బ్రహ్మ మొకటే సత్యముగ నున్నది. రెండవ వస్తువు వాస్తవముగా లేదు. అనగా — జీవ జడ ప్రపంచములు దృశ్యములేగాని వాస్తవమైనవిగావు. బ్రహ్మమనగా నిర్గుణముగను, నిరాకారముగను, వికారరహితముగను, సచ్చిదానందముగను, అంతట నిండినదిగను, ఆసక్తిలేనిదిగను, స్వప్రకాశముగ నున్నది. ఆ బ్రహ్మమే జీవుడుగను, ఈశ్వరుడుగను, సకల ప్రపంచముగను తోచుచున్నది. అట్టిదృశ్యము యనాదిమాయవలన గలిగినట్టిది. పరమార్థ దశలో జీవుడు, ఈశ్వరుడు, మాయ జీవేశ్వరభేదము, మాయాకార్యమైన నీ ప్రపంచము ఇవి వాస్తవములుగావు. వీటి ననాదియని యేల జెప్పవలె ననగా — నవి ఒకకాలమున గలిగినవని గుర్తింపజేయదగినవి కానందుననే.

మాయయెడ సకల వస్తువులను గానవచ్చునట్లు జేయునది విక్షేపశక్తి యనియు, వస్తువుల స్వభావములను కనుపఱచకకప్పిపుచ్చెడిది ఆవరణ శక్తి యనియు రెండువిధములైన శక్తులుగలవు. విక్షేపశక్తిని మాయయనియు, ఆవరణశక్తిని అవిద్యయనియు చెప్పటగలదు. చైతన్యము (శుద్ధబ్రహ్మము) మాయాసంబంధమువలన ఈశ్వరుడనియు, అవిద్యా సంబంధమువలన జీవుడనియు వ్యవహరింప బడుచున్నది. ఈసంబంధముగూడ ననాదియే. విక్షేపశక్తియైన మాయయొక్క నంబంధముబడసిన ఈశ్వరుడు సర్వజ్ఞుడు. ఆవరణశక్తియైన యవిద్యా సంబంధముబడసిన జీవుడు కించిజ్ఞుడు. అనగా స్వల్పజ్ఞానముగలవాడు కావుననే బద్ధుడైయున్నాడు.

ఇట్టి బంధమునుండి నివృత్తి జెందవలసినచో వేదోక్తములైన నిత్యనైమిత్తికకర్మలను ఈశ్వరార్పణముగ జేయుటవలనను, భగవద్భక్తి నొనర్చుట వలనను, చిత్తశుద్ధినిబొంది సద్గురువుచే నుపదేశింపబడు "తత్త్వమసి" మొదలగు మహావాక్యార్థమగుజీవేశ్వరాభేదమును శ్రవణముజేసి, మాటిమాటికి చింతించుటయనెడి మననమును, యెడతెగక చింతించుటయనెడి నిదిధ్యాసము ననుష్ఠింపవలెను. అట్లుజేయుచుండినచో ప్రత్యక్షముగా గలిగెడు "అహం బ్రహ్మాఽస్మి"యను మహావాక్యముయొక్క అర్థమగు జీవేశ్వరాభేదానుభవము వలన ప్రపంచవాసనయు, సకలకర్మలు నశించి, తన వాస్తవ స్వరూపమును ఆనందమునైన బ్రహ్మస్వరూప మగుచున్నాడు. ఇదే ముక్తియని జెప్పబడుచున్నది.

ఇట్టి ముక్తియనునది జీవన్ముక్తియనియు, విదేహకైవల్యమనియు రెండు విధములగును. పైజెప్పిన విధమున తానే బ్రహ్మయను ననుభవ బలముచే ప్రారబ్ధముదప్ప మిగత సకలకర్మలును, వాటికి గారణమగు యవిద్యయు నశించి ఈ దేహమునకు కారణమైన ప్రారబ్ధము నశించుటవలన సకల ఆసక్తులు లేనివాడైనను అసక్తిగలవానివలె ఇతరులకు కనబడుస్థితియే జీవన్ముక్తిదశ. ఈ స్థూలదేహము, సూక్ష్మదేహము, కారణదేహము, ఇవి నశించి బ్రహ్మముగ నుండు స్థితియే విదేహకైవల్యము.

ఇవిగాక క్రమముక్తియని మఱియొక ప్రకారముగలదు. అదేమనిన సగుణబ్రహ్మమనెడి ఈశ్వరోపాసన, పంచాగ్నివిద్య, మొదలగు వాటివలన ఈశ్వరానుగ్రహముబడసి ఈ దేహముపోయినతోడనే అర్చిరాదిమార్గమున* బ్రహ్మలోకమునకువెళ్ళి, బ్రహ్మవలన నుపదేశముబడసి బ్రహ్మతో విదేహ కైవల్యము నొందుటయే.

"తత్త్వమసి" వాక్యమున కర్థమేమనగా – తత్ = అది, (సర్వజ్ఞుడైన ఈశ్వరుడు) త్వం = నీవు, (కించిత్‌జ్ఞుడైన జీవుడు) అసి = ఉన్నావు. అనగా – జీవుడైననీవు ఈశ్వరుడుగ నున్నావననదే. దీని తాత్పర్యమేమన జీవుడైన నీకుగల నుపాధియైనమాయను త్రోసిచూచిన ఈ రెండును నొక్కటే యనునదే.



## విశిష్టాద్వైతము

ఈశ్వరుడు, జీవులు, జడప్రపంచము ఇవి వేరువేరుగను, వాస్తవముగ నున్నవి. ఈశ్వరుడు సర్వజ్ఞానము, సత్యసంకల్పము మొదలగు ననంత కల్యాణ గుణగణనిధిగను, సర్వస్వతంత్రుడుగను, జీవజడ ప్రపంచముల కంతర్యామిగను, వాటికిశరీరిగను, నియామకుడుగను, శేషిగ • నున్నాడు.

జీవులు ఈశ్వరుని యంశములుగను, శరీరముగను, శేషముగను •, జ్ఞానమును గుణముగ గలవార్లుగను, అణువులుగనున్నారు. అనాదికర్మ యనెడి యవిద్యవలన తమయొక్క గుణము జ్ఞానము తగ్గి సంసారులుగ నున్నారు. వీరలు భగవదారాధనారూపముగ జేయబడిన నిత్యనైమిత్తిక కర్మలవలనను, భక్తిప్రపత్తుల వలనను, జీవేశ్వరుల యథార్థజ్ఞానమువలనను, స్వస్వరూపానుసంధానమువలనను ప్రకృతి సంబంధముదొలంగి స్వస్వరూప మును బడయుచున్నారు. ఇదియే కైవల్యమని చెప్పబడుచున్నది. ప్రకృతి

* ఈ మార్గమిట్టిదని యీ పుస్తకమున 8-వ యధ్యాయమున 23-వ శ్లోకముక్రింద చెప్పబడియున్నది.

శేషశేషిభావ మెట్టిదని యీ గ్రంథమున 7-వ అధ్యాయము 7-వ శ్లోకముక్రింద చూడుడు.

విముక్తాత్మస్వరూపముజెందిన యీ యవస్థలో జీవులజ్ఞానగుణము వికాసమును జెంది సకలమును నెరుంగగలరు. దీనివెనుక భగవద్ధ్యానాదులవలన వైకుంఠమున భగవంతుని శరీరముతో సమానమగు నప్రాకృత దివ్యమంగళ విగ్రహములను బడసినవారై భగవత్సన్నిధి మొదలగు వాటివలన గలిగెడు పరమానందము ననుభవించుచున్నారు. ఇదియే ముక్తియనంబడుచున్నది. "తత్త్వమసి" మొదలగు నభేదవాక్యములకనగా, సూక్ష్మచిదచిద్విశిష్టుడైన (శరీరియైన) ఈశ్వరునకు, స్థూలచిదచిద్విశిష్టుడైన (శరీరియైన) ఈశ్వరునకు అభేదమే అర్థము గావున విశిష్టాద్వైతమని పేరుబడసెను.

## మ ధ్వ మ త ము

ఐదు భేదములు • వాస్తవముగను, అనాదిగను యున్నవి. జీవులు నిత్యసంసారులు, నిత్యనరకులు, ముక్తియోగ్యులని మూడువిధములైన వారలు. * ప్రతివిభాగమునందును అనేక యంతర్విభాగములు గలవు. జీవులయొక్క స్వరూపమునందును మనుష్యపశుపక్ష్యాది భేదములు గలవు. ముక్తియోగ్యులు దప్ప మిగత విధములైన జీవులలో తమతమ స్వరూపము (మనుష్య పక్ష్యాదులలో) యెద్దానిదో ఆ స్వరూపముతో ముక్తి జెందుచున్నారు. ముక్తిలో వారివారి యుపాసనకు తగినట్లు ఆనందమున తారతమ్యము గలదు. ముక్తి జెందుటకు పైగనిన పంచభేదజ్ఞానము సాధనమైనది. "తత్త్వమసి" యను వాక్యమునకు నీవు ఈశ్వరునితో సమానమైన రూపము గలవాడవుగా నున్నావని యర్థము.

మిగత విషయములలో తరచు విశిష్టాద్వైత మతమువంటిదే.



• ఈ భేదముల వివరణమును ఈ గ్రంథమున 6-వ అధ్యాయమున 8-వ శ్లోకముక్రింద జూడుడు.

* జీవభేదములనుగూర్చి యీ గ్రంథమున 17-వ యధ్యాయమున 3-వ శ్లోకముక్రింద జూడుడు.

ఓమ్

# అథ శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమ్

ధరోవాచ = భూదేవియిట్లనెను.

శ్లో॥ భగవన్ పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో ॥ ౧

తా॥ ఓ భగవంతుడా! అంతర్యామీ! ప్రభువా! ప్రారబ్ధము ననుభవించువానికి పరమేశ్వరునియందు అఖండమైన భక్తిగలుగుటయెట్లు?

విష్ణురువాచ : -విష్ణు విట్లనెను

శ్లో॥ ప్రారబ్ధంభుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।
సముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥ ౨

తా॥ ఎవరు గీతాభ్యాసమునందు నిరతుడైయుండునో అతడు ప్రారబ్ధము ననుభవించుచుండినను "కర్మలిప్తుడు" గానేరడు. (అనుభవింపతగిన కర్మకలవాడు కానేరడు) లోకమునందు అతడే ముక్తుడు. సుఖియు నతడే.

శ్లో॥ మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।
క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నళినీదళమంభసా ॥ ౩

తా॥ ఎవరైతే గీతాధ్యానమును చేయుదురో వారికి కమలపత్రమునకు నీరంటని చందంబున మహాపాపాది పాపములు కొంచమైనను నంటవు.

శ్లో॥ గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై ॥ ౪

తా॥ ఎచ్చట గీతాపుస్తకముండునో, ఎచ్చట నియమపూర్వకముగ గీతాపారాయణము జేయబడునో ఆ స్థలమునందు ప్రయాగమొదలగు సమస్త తీర్థములుండును.

శ్లో॥ సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చయే ।
గోపాలాగోపికావాఽపి నారదోద్ధవ పార్షదైః ।
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే ॥ ౫

తా॥ ఎచ్చట గీతాపారాయణము చేయబడుచుండునో, అచ్చట సమస్తదేవతలు, ఋషులు, యోగులు, అనంతుడు వాసుకిమొదలగు నాగులు, గోపాలురు, గోపికలు, నివసింతురు. మఱియు భగవత్పార్శ్వవర్తులగు నారదోద్ధవాది పరమభాగవతోత్తములతో లభించు సహాయము శీఘ్రముగా గలుగును, అట్టివారందఱు సహాయులైయుందురు అని భావము.)

శ్లో॥ యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృథ్వి! నివసామి సదైవ హి ॥ ౬

తా॥ ఓ భూదేవీ! ఎచ్చట గీతయొక్క విచారము, పఠనము (చదువుట) పాఠనము (చదివించుట) శ్రవణము జరుగుచుండునో, అచ్చట నిశ్చయముగా నేను వసించుచున్నాను.

శ్లో॥ గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్ ।
గీతాజ్ఞానముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్ ॥ ౭

తా॥ నేను గీత నాశ్రయించి యున్నాను, గీతయే నాకు ఉత్తమమైన గృహము. మఱియు గీతాజ్ఞానము నాశ్రయించియే మూడులోకములను పాలించుచున్నాను.

శ్లో॥ గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః ।
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా ॥ ౮

తా॥ గీత బ్రహ్మరూపముగను, ప్రణవస్వరూపముగను, నాశరహితముగను అనిర్వాచ్యముగను, నిత్యముగను నుండునది గావున గీతయే నా పరమవిద్య.

శ్లో॥ చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్ ।
వేదత్రయీ పరానందతత్త్వార్థజ్ఞానసంయుతా ॥ ౯

తా॥ ఋగ్వేదాది వేదత్రయ రూపముగను, పరమానందరూపముగను, తత్త్వజ్ఞాన గర్భితముగనుండు నీ గీతను చిదానందస్వరూపుఁడగు శ్రీ కృష్ణభగవానుఁడు స్వయముగా నర్జునున కుపదేశించెను.

శ్లో॥ యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చలమానసః ।
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరంపదమ్ ॥ ౧౦

తా॥ ఏ పురుషుఁడు నిశ్చలమైన మనస్సుగలవాఁడై ప్రతిదినము పదునెనిమిది యధ్యాయములను జపించునో (పారాయణము జేయునో) అతఁడు జ్ఞానసిద్ధిని బొందును, దానిచే మోక్షమును బడయును.

శ్లో॥ పాఠేఽసమర్థస్సంపూర్ణే తదర్ధం పాఠమాచరేత్ ।
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః ॥ ౧౧

తా॥ సంపూర్ణముగ చదువుటయందు శక్తిలేనివాఁడు అర్ధమైనను (9 అధ్యాయములనైనను) చదువవలెను. దానివలన గోదానమంతటి పుణ్యము గలుగును, ఇందుకు సంశయములేదు.

శ్లో॥ త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్ ।
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్ ॥ ౧౨

తా॥ గీతయొక్క మూడుభాగములలో నొకభాగముగు ఆరు అధ్యాయములను జదువువానికి గంగాస్నానఫలము ప్రాప్తమగును. ఆరింటిలో నొకభాగమును (మూఁడధ్యాయములను) పారాయణ మొనరించువానికి సోమయాగఫలము లభించును.

శ్లో॥ ఏకాధ్యాయంతు యో నిత్యం పఠతే భక్తిసంయుతః ।
రుద్రలోకమవాప్నోతి గణో భూత్వా వసేచ్చిరమ్ ॥ ౧౩

తా॥ భక్తితో నెవఁడైతే యొక అధ్యాయమునైనను జదువునో అతఁడు రుద్రలోకమును బొంది, రుద్రగణములలో నొకఁడై అచ్చట బహుకాలముండును.

శ్లో॥ అధ్యాయశ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః ।
న యాతి నరకాం యావన్మనుకాలం వసుంధరే ॥ ౧౪

తా॥ ఓభూదేవీ! ఏమనుష్యుడు అధ్యాయముల శ్లోకములందు నాల్గింటనొకభాగము నైనను నిత్యముపఠించునో, అతడు యొకమన్వంతరమువరకు మానవజన్మమునే బొందును.

శ్లో॥ గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్।
ద్వౌత్రీనేకం తదర్ధంవా శ్లోకానాం యః పఠేన్నరః॥ ౧౫

,, చన్ద్రలోకమవాప్నోతి వర్షాణామయుతం ధ్రువం।
గీతాపాఠసమాయుక్తో మృతోమానుషతాం వ్రజేత్॥ ౧౬

తా॥ ఏ మనుష్యుడు గీతయొక్క పదిశ్లోకములుగాని, లేక ఏడు, ఐదు, నాల్గు, మూడు, రెండు, అథవా ఒకటిగాని, తుదకు అర్ధశ్లోకమునైనను జదువునో, నతడు చంద్రలోకమునుబొంది పదివేలసంవత్సరములుండును, ఇది నిశ్చయము. గీతాపారాయణమును జేయుచుమృతుడైనవాడు. ఈ దేహనాశానంతరము మానవజన్మమునే బొందును.

శ్లో॥ గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తిముత్తమామ్।
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్॥ ౧౭

తా॥ పైజెప్పబడినటుల నరజన్మమును బొందినవాడు గీతాభ్యాసమునందు నిరతుడై యుత్తమమైన ముక్తినిబొందును. మరణకాలమున "గీతా గీతా" అను శబ్దమునుచ్చరించుచు ప్రాణము విడుచువాడునహా సద్గతిని బొందును.

శ్లో॥ గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపివా।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే॥ ౧౮

తా॥ మహాపాపముతోకూడిన వాడైనన్ను గీతార్థమునువినుటయందాసక్తుడైనచో వైకుంఠ మునుబొంది అచ్చుత విష్ణువుతోగలిసి, సంతోషముగానుండును.

శ్లో॥ గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః।
జీవన్ముక్తస్స విజ్ఞేయో దేహాన్తే పరమంపదమ్॥ ౧౯

తా॥ ఎవడు అనేక కర్మములజేసినను, ప్రతిదినము గీతార్థవిచారణ జేయుచుండునో అతడు జీవన్ముక్తుడు అని తెలియఁదగినది. మఱియు దేహానన్తరమున పరమపదమునుగూడ బొందును.

శ్లో॥ గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః।
నిర్ధూతకల్మషా లోకే గీతా యాతాః పరంపదమ్॥ ౨౦

తా॥ జనకుడు మొదలగు యనేక రాజర్షులు గీత నాశ్రయించినవారలై లోకమున కీర్తింపబడినవారై పాపరహితులై యుత్తమమైన పదమును బొందిరి.

శ్లో॥ గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్।
వృథాపాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః॥ ౨౧

తా॥ గీతను చదివి దాని మాహాత్మ్యమును ఎవడు చదువడో, అట్టివాని గీతాపఠనము తగిన ఫలమునివ్వక వ్యర్థమగును. అందుచే నాతని గీతాపఠనము శ్రమకారియే యని దెలుపబడినది.

శ్లో॥ ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః।
న తత్ఫలమవాప్నోతి దుర్లభాం గతిమాప్నుయాత్ ॥ ౨౨

తా॥ అందువలన నీ మాహాత్మ్యముతో గూడిన గీతాభ్యాసము జేయువారు మీదజెప్పబడిన ఫలమును బొంది దుర్లభమైన గతిని (మోక్షమును) బొందును.

సూత ఉవాచ = సూతుడిట్లనెను.

శ్లో॥ మాహాత్మ్యమేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్।
గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్ ॥ ౨౩

ఇతి శ్రీ వ రా హ పు రా ణే శ్రీ గీ తా మా హా త్మ్యం
సం పూ ర్ణ మ్.

తా॥ సనాతనమైన నీగీతామాహాత్మ్యమును నేను దెలిపితిని. గీతాపారాయణానంతరమున ఎవడు దీనిని పఠించునో, వాడు పైజెప్పబడిన ఫలమును బొందును.

ఇట్లు వరాహపురాణమందలి గీతామాహాత్మ్యము సంపూర్ణము.

(ఓమ్ తత్ సత్.)



ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

## ధ్యానము

ఓమ్ శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే॥ 1

## గురుధ్యానమ్

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో।
వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః॥ 2

ఓం గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥ 3

ఓం వన్దే గురూణాం చరణారవిన్దే సన్దర్శితస్వాత్మసుఖావబోధే।
జనస్య యే జాఙ్గలికాయమానే సంసారహాలాహలమోహశాన్త్యై॥ 4

ఓం శ్రుతిస్మృతిపురాణానామాలయం కరుణాలయం।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్॥ 5

ఓం శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం।
సూత్రభాష్యకృతౌ వన్దే భగవన్తౌ పునః పునః॥ 6

ఓం ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే।
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః॥ 7



## శ్రీ వ్యాసాశ్రమ గురుపరమ్పరా స్తోత్రమ్

ఓం నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తి తాపసం।
పరాశరం చ తత్పుత్రం వ్యాసం వేదాబ్జభాస్కరం॥

ఓం విరక్తం శ్రీశుకం దేవం జ్ఞానవైరాగ్యరూపిణం।
గౌడపాదం చ గోవిన్దం యోగీన్ద్రం జ్ఞానినాం వరం॥

ఓం తచ్ఛిష్యం శఙ్కరాచార్యమద్వైతస్థాపకం గురుం।
తచ్ఛిష్యాన్పద్మపాదాదీన్ శ్రౌతతత్త్వార్థబోధకాన్॥

ఓం అసఙ్గానన్దగుర్వాదీనస్మద్గురువరాన్పరాన్।
నిర్భిన్నాజ్ఞానతమసో వన్దే జ్ఞానప్రదాయినః॥

ఓం శ్రీనారాయణగుర్వాద్యాం శివలిఙ్గార్యమధ్యమాం।
అసఙ్గానన్దపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్॥

ఇతి శ్రీగురుపరమ్పరాస్తోత్రమ్ సంపూర్ణమ్.

## శ్రీ వైష్ణవ సాంప్రదాయ గురుధ్యానము

ఓమ్ లక్ష్మీనాథ సమారమ్భాం నాథయామునమధ్యమాం
అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్॥
ఓం అస్మద్గురు సమారమ్భాం నాథయామునమధ్యమాం।
లక్ష్మీవల్లభపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్॥

## ఇతర సాంప్రదాయ గురుధ్యానము

ఓమ్ సదాశివసమారమ్భాం శంకరాచార్య మధ్యమాం।
అస్మదాచార్య పర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్॥
ఓం నమశ్శివాయ గురవే సచ్చిదానన్దమూర్తయే।
నిష్ప్రపంచాయ శాన్తాయ నిరాలమ్బాయ తేజసే॥



## వ్యా స ధ్యా న మ్

ఓమ్ వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషం।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్॥ 1
ఓం సమ్యఙ్న్యాయకలాపేన మహతా భారతేన చ।
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే॥ 2
ఓం కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతం।
వేదాబ్జభాస్కరం వన్దే శమాదినిలయం మునిమ్॥ 3
ఓం వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే।
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః॥ 4
ఓం మునిం స్నిగ్ధామ్బుదాభాసం వేదవ్యాస మకల్మషం।
వేదవ్యాసం సరస్వత్యాఽఽవాసం వ్యాసం నమామ్యహం॥ 5
ఓం అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః।
అఫాలలోచనశ్శమ్భుర్భగవాన్ బాదరాయణః॥ 6
ఓం నమోఽస్తుతే వ్యాసవిశాలబుద్ధే! ఫుల్లారవిన్దాయతపత్రనేత్ర!।
యేనత్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయప్రదీపః॥ 7

## కృ ష్ణ ధ్యా న మ్

ఓమ్ కృష్ణం కమల పత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనం ।
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్ ॥ 1

ఓం ప్రపన్నపారిజాతాయ తోత్రైకపాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥ 2

ఓం కృష్ణాయ యాదవేన్ద్రాయ జ్ఞానముద్రాయ యోగినే ।
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాన్తవేదినే ॥ 3

ఓం సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః ।
పార్థోవత్స స్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥ 4

ఓం సారథ్యమర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ ।
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః ॥ 5

ఓం వాచకః ప్రణవో యస్య క్రీడావస్త్వఖిలం జగత్ ।
శ్రుతిరాజ్ఞా వపుర్జ్ఞానం తం వన్దే దేవకీసుతమ్ ॥ 6

ఓం వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనం ।
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 7

ఓం మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం ।
యత్కృపా తమహం వన్దే పరమానన్దమాధవమ్ ॥ 8

ఓం కరకమలనిదర్శితాత్మముద్రః పరికలితోన్నత బర్హిబర్హచూడః ।
ఇతరకరగృహీతవేత్రతోత్రో మమ హృది సన్నిధి
మాతనోతు కృష్ణః ॥ 9

ఓం అతామ్రపాణికమలప్రణయప్రతోదం
ఆలోలహారమణికుండల హేమసూత్రం ।
అవిశ్రమామ్బుకణ మమ్బుదనీల మవ్యాత్
ఆద్యం ధనఞ్జయరథాభరణం మహోనః ॥ 10

ఓం అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్
పశ్చాత్పార్థం ప్రణయసజుషా చక్షుషాఽవేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రాం
అభిభ్రాణో రథమధివసన్ పాతు న స్సూతవేషః ॥ 11

ఓం వన్దే కృష్ణార్జునౌ వీరౌ నరనారాయణావుభౌ ।
ధృతరాష్ట్రసుతోన్మత్తగజారోహణవల్లభౌ ॥ 12

ఓం యం బ్రహ్మావరుణేన్ద్రరుద్రమరుతః స్తున్వన్తి దివ్యైః స్తవైః ।
వేదైస్సాంగ పదక్రమోపనిషదైర్గాయన్తి యం సామగాః ।
ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యన్తి యం యోగినో ।
యస్యాన్తం న విదుస్సురాసురగణా దేవాయ తస్మై నమః ॥ 13

ఓం నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥ 14

## మహాభారతస్తుతిః

ఓం భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా,
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా ।
అశ్వత్థామ వికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ,
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకే కేశవే ॥

ఓం పారాశర్యవచః సరోజమమలం గీతార్థగంధోత్కటం,
నానాఖ్యానక కేసరం హరికథా సద్బోధనా బోధితమ్ ।
లోకే సజ్జన షట్పదై రహరహః పేపీయమానం ముదా,
భూయాద్భారతపంకజం కలిమలప్రధ్వంసి నః శ్రేయసే ॥

## శ్రీభగవద్గీతా ధ్యానమ్

ఓం గీతాకల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం,
వేదవ్యాసవివర్ధితం శ్రుతిశిరోబీజం ప్రబోధాంకురమ్ ।
నానాశాస్త్రరహస్యశాఖమరతిక్షాంతిప్రవాళాంకితం,
కృష్ణాంఘ్రిద్వయభక్తిపుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినామ్ ॥ 1

ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం,
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతమ్ ।
అద్వైతామృతవర్షిణీం భగవతీమష్టాదశాధ్యాయినీ -
మమ్బ త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥ 2

### అథ ఋష్యాదిన్యాసః

అస్యశ్రీ భగవద్గీతాశాస్త్రమహామంత్రస్య శ్రీవేదవ్యాసో భగవానృషిః అనుష్టుప్ఛందః, శ్రీకృష్ణ పరమాత్మాదేవతా. అశోచ్యానన్వశోచ స్త్వ మితిబీజమ్, సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి శక్తిః, అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకమ్, మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసీతి కవచమ్, కిరీటినం గదినం చక్రహస్త మిత్యస్త్రమ్, అనాదిమధ్యాంతమనంతవీర్యమితి ధ్యానమ్ జ్ఞానయజ్ఞేన భగవదారాధనార్థే గీతాపారాయణే జపే వినియోగః – ఇతి ఋష్యాదిన్యాసః.

---

### అథ కరన్యాసః

జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ అంగుష్ఠాభ్యాం నమః, ఐశ్వర్యాత్మనే గోవిం దాయ తర్జనీభ్యాం నమః, శక్త్యాత్మనే వేదవ్యాసాయ మధ్యమాభ్యాం నమః, బలాత్మనే బలభద్రాయ అనామికాభ్యాం నమః, తైజసాత్మనే వాసుదేవాయ కనిష్ఠికాభ్యాం నమః, విజయాత్మనే గాండీవధన్వనే అర్జునాయ కరతల కర పృష్ఠాభ్యాం నమః – ఇతి కరన్యాసః.

### అథ హృదయాదిన్యాసః

జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ హృదయాయ నమః ఐశ్వర్యాత్మనే గోవిందాయ శిరసేస్వాహా, శక్త్యాత్మనే వేదవ్యాసాయ శిఖాయై వషట్ బలాత్మనే బల భద్రాయ కవచాయ హుం, తైజసాత్మనే వాసుదేవాయ నేత్రత్రయాయ వౌషట్, విజయాత్మనే గాండీవధన్వినే అర్జునాయ వీర్యాయ అస్త్రాయ ఫట్, ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః – ఇతి హృదయాదిన్యాసః.

యద్వా,

### అథ ఋష్యాదిన్యాసః

ఓం అస్య శ్రీభగవద్గీతాశాస్త్రమహామంత్రస్య, భగవాన్వేదవ్యాస ఋషిః అనుష్టుప్ ఛన్దః, శ్రీకృష్ణపరమాత్మాదేవతా, అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞా వాదాంశ్చభాషస ఇతిబీజం, సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి

శక్తిః, అహం త్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతికీలకం, మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసీతి కవచం, కిరీటినం గదినం చక్రహస్తమిత్యస్త్రం, అనాదిమధ్యాన్తమనన్తవీర్యమితి ధ్యానం, జ్ఞానయజ్ఞేనభగవదారాధనార్థే శ్రీకృష్ణపరమాత్మప్రీత్యర్థే గీతాపారాయణే జపే వినియోగః. ఇతి ఋష్యాదిన్యాసః.



## అథ కరన్యాసః

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావక ఇత్యంగుష్ఠాభ్యాం నమః, నచైనంక్లేదయంత్యాపో నశోషయతి మారుతః ఇతి తర్జనీభ్యాం నమః, అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చేతి మధ్యమాభ్యాం నమః, నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతన ఇత్యనామికాభ్యాం నమః, పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశ ఇతి కనిష్ఠికాభ్యాం నమః, నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచేతి కరతలకరపృష్ఠాభ్యాం నమః. ఇతి కరన్యాసః.



## అథ హృదయాదిన్యాసః

నైనంఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావక ఇతిహృదయాయనమః- నచైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుత ఇతిశిరసే స్వాహా - అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చేతి శస్త్రై శిఖాయై వషట్ - నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతన ఇతి కవచాయ హుం - పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశ ఇతి నేత్రత్రయాయ వౌషట్ - నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచేతి అస్త్రాయ ఫట్ - భూర్భువస్సువరోమితి దిగ్బంధః ఓం శ్రీ కృష్ణపరమాత్మ ప్రీత్యర్థే గీతాపారాయణే (జపే వా) వినియోగః.

ఇతి హృదయాది న్యాసః

అతః పరం యథార్హం సంపూజ్య పారాయణాదికం కార్యమ్.



హరిః ఓమ్

శ్రీకృష్ణాయ పరబ్రహ్మణే నమః

# భగవద్గీతార్థదీపికా సహిత



## (అర్జున విషాదయోగము)

ధృతరాష్ట్ర ఉవాచ :—

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ! ॥

-: పదచ్ఛేదము :-

ధర్మక్షేత్రే - కురుక్షేత్రే (1) - సమవేతాః - యుయుత్సవః ।
మామకాః (2) - పాండవాః - చ - ఏవ - కిం - అకుర్వత - సంజయ (3)

| అన్వయము. | అర్థము. | అన్వయము. | అర్థము. |
|---|---|---|---|
| ధృతరాష్ట్ర ఉవాచ | ధృతరాష్ట్రుడు చెప్పినది | పాండవాశ్చ | పాండవులు |
| హే సంజయ ! | ఓ సంజయా ! | యుయుత్సవ ఏవ | యుద్ధము చే వారలుగనే |
| ధర్మక్షేత్రే | ధర్మభూమియైన | | |
| కురుక్షేత్రే | కురుక్షేత్రమునందు | సమవేతాః | చేరి |
| మామకాః | మావారును | కిం అకుర్వత ? | ఏమిచేసిరి ? |

తాత్పర్యము :—

ధృతరాష్ట్రుడు సంజయునిగూర్చి చెప్పినది—సంజయా ! ధర్మభూమియైన కురుక్షేత్రమను ప్రదేశమునందు (నా కుమారుడు దుర్యోధనుడు మొదలైన) మా వారును (నా సహోదరుడగు పాండువు కుమారులు ధర్మపుత్రుడు మొదలైన) పాండవులును యుద్ధము చేయగోరినవారలుగనే ఒకరినొకరు సంధించిన పిమ్మట నేమి చేసిరి ?

(1) కురుక్షేత్రము - కౌరవ పాండవుల ఆదిపురుషుడైన కురుమహారాజు అనేకధర్మములు మొదలగునవి చేసిన స్థానము.

(2) మామకాః - పాండవులుగూడ, ధృతరాష్ట్రునకు సంబంధించినవారైయుండగా, దుర్యోధనాదులైన తన కుమారులనుమాత్రము మావారనియు, పాండవులను వేరుపరచియుజెప్పుట ధృతరాష్ట్రుని పక్షపాతమును, ద్రోహచింతనమును చూపుచున్నది.

(3) సంజయ - రాగద్వేషాదులను బాగుగ జయించినవాడు.

(స్వకీయము) ఈ గీతాశాస్త్రము శ్రీ వేదవ్యాసులు ప్రసాదించిన శ్రీ మహాభారత భీష్మ పర్వమునందు భగవద్గీతాపర్వమను అంతర్భాగముగ ప్రకటింపబడియున్నది. ఆ శ్రీమహాభారతము యొక్క సంగ్రహము, ధృతరాష్ట్రుడు, పాండవులు, వీరిపరిచయము, భారతయుద్ధముయొక్క వృత్తాంతము నీ గ్రంథమునందలి ఉపోద్ఘాతమున చెప్పబడియున్నవి. అయితే ధృతరాష్ట్రుడు సంజయునిగూర్చి యీ శ్లోకములో గనుబరచిన ప్రశ్నను అడిగినసమయమున పదిరోజులయుద్ధము గడచినట్లు భారతమునందు తెలియుటవలన నీ ప్రశ్నయడిగిన సందర్భమెట్టిదని కొంతవిస్తరముగ చెప్పుట యావశ్యకమని తోచుచున్నది. అనగా,

ఇరుపక్షములవారైన కౌరవులును, పాండవులును తమ తమ సైన్యములతో యుద్ధము కొఱకు కురుక్షేత్రమునుగూర్చి బయలుదేరి వెళ్లినతర్వాత ధృతరాష్ట్రుడు వ్యాకులత చెందియుండెను. అపుడు వ్యాసమహర్షి యచ్చట ప్రత్యక్షమై ధృతరాష్ట్రుని ఓదార్చి యతడు జన్మాంధుడు గావున భారతయుద్ధమును జూచుటకు కోరికయుండినయెడల నేత్రములనిచ్చునట్లుచెప్పగా, అతడు బంధువుల సంహారమును జూచుటకు తనకు కోరికలేదనియు యుద్ధమునందలి సంగతులను చెప్పగ వినిననే చాలుననియు ప్రార్థించగా, వ్యాసుడు సంజయునకు జ్ఞాననేత్రము మొదలగునవి ప్రసాదించి, పైయుద్ధమున జరుగు నన్నిసంగతులను జరిగినటుల చెప్ప నాజ్ఞాపించి వెళ్లినపిమ్మట, ధృతరాష్ట్రుడు సంజయునిగూర్చి మొదట భూమి మొదలగు ఖండములగూర్చి ప్రశ్నింపగా, వాటినిగూర్చి "భూమి పర్వ"మను ఖండమును జెప్పి పూర్తి చేసెను.

తర్వాత సంజయుడు యుద్ధభూమికివెళ్లి పదిరోజులయుద్ధముజరిగినపిమ్మట భీష్ముడు బాణపీడితుడై పడిపోయిన వృత్తాంతమును యుద్ధభూమినుండి మరుగెత్తివచ్చి ధృతరాష్ట్రునకు జెప్పినది మొదలు "భగవద్గీతాపర్వ"మనునది ప్రారంభింపబడుచున్నది. ఆ వృత్తాంతమును వినిన ధృతరాష్ట్రుడు అనేకవిధముల విలపించి యిరుపక్షములవారును యుద్ధమునకు సన్నద్ధులైనది మొదలుజరిగిన ప్రతియొక్కసంగతిని క్రమముగ తనకు చెప్పవలయునని సంజయునియడుగగా, నతడా విధముగనే యన్నివిషయముల విస్తరముగ జెప్పుచు, యుద్ధారంభదినమున సూర్యోదయమునకు పూర్వము ఇరుపక్షసేనలును యుద్ధభూమియందు సమావేశమయి కోలాహలము చేసిరని ముగించగా, పుత్రవాత్సల్యముచేతను, రాజ్యలోభముచేతను, మూఢుడై ధర్మమార్గమును పరిత్యజించి తనపుత్రునకే జయముగోరెన ధృతరాష్ట్రుడు, పైజరిగిన వృత్తాంతమును తెలియగోరి ఈ శ్లోకమున గనుపరచినటుల ప్రశ్నించుచున్నాడు. దీనికి ప్రత్యుత్తరముగ శ్రీకృష్ణపరమాత్ముడు లోకానుగ్రహార్థమై సకల వేదాంతసారములను సంగ్రహించి అర్జుననకుపదేశించిన ఈ గీతాశాస్త్రమును భగవంతునినుండి సంజయుడు ప్రత్యక్షముగ వినిన ప్రకారమే ధృతరాష్ట్రునకు చెప్పినట్లే భగవద్గీత 18 వ అధ్యాయము 75 వ శ్లోకముచే ప్రకటితమగుచున్నది.

ఈ విధముగ సంజయునిద్వారా ధృతరాష్ట్రునకు గీతాశాస్త్రమును జెప్పుమని సర్వజ్ఞులైన శ్రీ వేదవ్యాసుడేర్పరచిన భావమేమన : — ఈ గీతోపదేశమేదో యుద్ధభూమియందు విలబడిన క్షత్రియుడైన అర్జుననకు యుద్ధముచేయుటకు మాత్రము చెప్పబడినదిగాదు. ఈ ప్రపంచ రూపమైన అజ్ఞానాంధకారమందు మగ్నులై పడియున్న సకలజనులున్ను ఈ గీతాశాస్త్రమును వినుటచేతను చదువుటచేతను వారివారి అజ్ఞానమునుండి విడుపబడి మోక్షమును నిశ్చిత

ముగ పొందుటకు మార్గమిదియేయని నొక్కి చూపించుటకే. ఈ భగవద్గీతయందు తత్త్వోపదేశము, వెనుకరాబోవు రెండవ అధ్యాయము పదునొకండవ శ్లోకము మొదలుకొనియే భగవంతునిచే చెప్పబడియుండగా, దానికి పూర్వమున్న యీ శ్లోకములకు ప్రయోజనమేమని యోచింపగా:— పై రెండవ అధ్యాయము 11-వ శ్లోకము మొదలు ఉపదేశింపబడిన ఆత్మతత్త్వము శోకమోహముల నివృత్తికొఱకుపయోగపడుచున్నదనియు, దానికి పూర్వమున్న శ్లోకములు, సాధారణముగ మానవులు శోకమోహములజెందు విధమును, వాటి స్వభావమును, జననమరణాత్మకమైన సంసారమునకు బీజమైన శోకమోహములను జనులు పొందుటచే వివేకహీనులై వారివారి స్వధర్మముల పరిత్యజించుటకును, పరధర్మములను గైకొనుటకును నెట్లు తలపెట్టుచున్నారనుటయు, అట్లు స్వధర్మము ననుష్ఠించుటయందును, అహంకార మమకారములతోగూడి ఫలాపేక్షగలిగియుండుటయు, దృష్టాంతముగజూపి వాటినివృత్తిని సులభముగ పొందించుటయందు మిక్కిలి సాధకముగ నున్నవనియు బాగుగా స్పష్టమగును.

కొందఱీ భగవద్గీతకు గూఢమగు తాత్పర్యమునుగైకొని శ్రీకృష్ణభగవంతుని పరమాత్మునిగను, అర్జునుని జీవునిగను, పాండవులను ధర్మాదిసద్గుణములుగను, దుర్యోధనాదులను కామము క్రోధము మొదలగు దుర్గుణములుగను, నీ రెండుగుణములలో నొకటి మఱియొకదానిని అతిక్రమింప ప్రయత్నించుటయే భారతయుద్ధముగను, ఆ యుద్ధక్షేత్రమైన కురుక్షేత్రము ఈ శరీరముగను, అంతమున మనుష్యుని వివేకముప్రబలి సద్గుణములు ప్రకటితములగుటయే పాండవుల విజయమనియు, సద్గుణములు స్వల్పములైనను అవి జయించుటకు కారణము భగవంతుని శరణముగ నొందుటయేయనియు భావించుచున్నారు.

సంజయ ఉవాచః—

శ్లో॥ దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్ ॥ 2

పద॥ దృష్ట్వా - తు (1) పాండవ అనీకం - వ్యూఢం - దుర్యోధనః (2) తదా,
ఆచార్యం - ఉపసంగమ్య - రాజా - వచనం - అబ్రవీత్ ॥

| | | | |
|---|---|---|---|
| సంజయ ఉవాచ | సంజయుడు చెప్పినది | దృష్ట్వాతు | చూచిన తర్వాత |
| తదా | అప్పుడు | ఆచార్యం | ఆచార్యుని |
| రాజా | రాజైన | ఉపసంగమ్య | సమీపించి |
| దుర్యోధనః | దుర్యోధనుడు | వచనం | (వెనుక చెప్పబోవు) వాక్యమును |
| వ్యూఢం | క్రమముగా వరుస చేయబడిన | | |
| పాండవానీకం | పాండవుల సైన్యమును | అబ్రవీత్ | చెప్పెను. |

తా॥ సంజయుడు ధృతరాష్ట్రునిగూర్చి చెప్పినది:— (ఉభయపక్ష సేనలును యుద్ధభూమియందు సంధించిన) అపుడు రాజైన దుర్యోధనుడు, క్రమముగా వరుస పరచబడియున్న పాండవుల సేనను జూచినతోడనే ద్రోణాచార్యుని సమీపమున కేగి వెనుక చెప్పబోవు వాక్యమును జెప్పెను.

(1) తు - శబ్దప్రయోగము, పాండవులు ధైర్యన్యూనతను బొందలేదనియు, దుర్యోధనుడే మనోదౌర్బల్యమును బొందెననియు సూచించుచున్నది.

(2) దుర్యోధనః - యుద్ధమునందు జయింపబడ శ్రమసాధ్యమైనవాడు.

(స్వకీయము) దుర్యోధనుడు పాండవసైన్యమున కృష్ణార్జునులను, భయంకరుడైన భీముని చూచినమాత్రమున మిక్కిలి భీతినొందుటయు, దానిని గుర్తించిన ద్రోణాచార్యునియొద్ద కతడేగి దానికి సమాధానముగ జెప్పుమాటలను, దుర్యోధనుడు చెప్పినప్రకారముగనే చెప్పివేయుట ధృతరాష్ట్రునకు హితముగా నుండునని భావించి సంజయుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య! మహతీం చమూం ।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ 3

పద॥ పశ్య - ఏతాం (1) - పాండుపుత్రాణాం - ఆచార్య! - మహతీం (2) - చమూం ।
వ్యూఢాం - ద్రుపదపుత్రేణ (3) - తవ - శిష్యేణ - ధీమతా - ॥

| | | | |
|---|---|---|---|
| ఆచార్య ! | (ద్రోణ) ఆచార్యా ! | వ్యూఢాం | క్రమముగా వరుసపరచబడియున్న |
| తవ | మీయొక్క | మహతీం | విశాలమైన (గొప్పదైన) |
| శిష్యేణ | శిష్యుడైన | పాండుపుత్రాణాం | పాండుపుత్రులయొక్క |
| ధీమతా | అతిబుద్ధిమంతుడైన | ఏతాం చమూం | ఈ సైన్యమును |
| ద్రుపదపుత్రేణ | ద్రుపదరాజు కుమారునిచేత | పశ్య | చూడుడు. |

తా॥ (దుర్యోధనుడు ద్రోణాచార్యులను చూచి జెప్పుమాటలను సంజయుడు ధృతరాష్ట్రునకు జెప్పినది) ద్రోణాచార్యా ! మీ శిష్యుడును, అతి బుద్ధిమంతుడునైన ద్రుపదరాజకుమారుడగు ధృష్టద్యుమ్నునిచే వ్యూహముగ మోహరింపబడియున్న విశాలమైన పాండుకుమారుల పక్షమైన ఈ మహాసైన్యమును జూడుడు.

(1) ఏతాం — అనునది పాండవసైన్యము భయములేక అలక్ష్యముగా సమీపించి నిలుచుటను తెలుపుచున్నది.

(2) మహతీం — స్వల్పమైన పాండవసైన్యమును జూచి దుర్యోధనుడిట్లు చెప్పుట అతని అధైర్యమునకు, మనోవ్యాకులతకు సూచన అని భావించవలయును' ఎందుకనగా దుర్యోధనుని సైన్యము పదునొకండు అక్షౌహిణులుగలది. పాండవుల సైన్యము ఏడు అక్షౌహిణుల పరిమితమే. అక్షౌహిణి యనగా 21870 రథములు, అన్ని ఏనుగులు, 65610 గుఱ్ఱములు, 109350 పదాతులు నిమిడినది. ఇదేవిధముగా నుద్యోగపర్వము 155-వ అధ్యాయమున దుర్యోధనుడు పాండవసైన్యమునుజూచి 'ఇది కలతపెట్టరానిది, సముద్రము వంటిది' అని చెప్పుటను జూడుడు.

(3) ద్రుపదపుత్రేణ — ధృష్టద్యుమ్నుడని చెప్పక ద్రుపదపుత్రుడని దుర్యోధనుడు గుర్తించి చెప్పుటచే ద్రోణాచార్యునియందు గలిగినద్వేషముచే ద్రుపదరాజు యాగముచేసి ద్రోణాచార్యుని చంపుటకయ్యే యీ ధృష్టద్యుమ్నుని కనెను అనుదానిని తలంచి దుర్యోధనుడు మనోవ్యాకులత జెందుటను జూపుచున్నది. (శ్రీమహాభారతము ఆదిపర్వము 131 - 133 - 169 అధ్యాయములలోని కథావృత్తాంతమును జూడుడు.)

(స్వకీయము) మూడవది మొదలు 11 వ శ్లోకముతోసహ దుర్యోధనుని వాక్యములు. అంత్యమున దుర్యోధనుడు పొందబోవు అపజయమునకు సూచనగా శత్రుసైన్యమును జూచిన మాత్రముననే యతనికి గల్గిన మనోవ్యాకులత యతని మాటలచేతనే ప్రకటిత మగుచున్నది.

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ 4

,, ధృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్।
పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥ 5

,, యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥ 6

పద॥ అత్ర - శూరాః - మహేష్వాసాః - భీమార్జునసమాః (1) - యుధి - ।
యుయుధానః (2) - విరాటః (3) - చ - ద్రుపదః (4) - చ - మహారథః॥
ధృష్టకేతుః (5) - చేకితానః - కాశీరాజః - చ - వీర్యవాన్ ।
పురుజిత్ (6) - కుంతిభోజః (7) - చ - శైబ్యః (8) - చ - నరపుంగవః॥
యుధామన్యుః (9) - చ - విక్రాంతః - ఉత్తమౌజాః (10) - చ - వీర్యవాన్ ।
సౌభద్రః (11) - ద్రౌపదేయాః (12) - చ - సర్వే - ఏవ మహారథాః (13)॥

| | | | |
|---|---|---|---|
| అత్ర | ఇచ్చట (పాండవసైన్యములో) | కాశీరాజశ్చ | కాశీదేశ రాజును |
| శూరాః | అతిశూరులును | పురుజిత్ | పురుజిత్తనువాడును |
| మహేష్వాసాః | పెద్దధనుస్సులు గలవారును | కుంతిభోజశ్చ | కుంతిభోజుడున్ను |
| యుధి | యుద్ధమునందు | నరపుంగవః | మనుష్య శ్రేష్ఠుడైన |
| భీమార్జున సమాః | భీమార్జునులతో సమానులైన | శైబ్యశ్చ | శైబ్యుడను వాడును |
| యుయుధానః | యుయుధానుడును (సాత్యకి యని మారుపేరు) | విక్రాంతః | పరాక్రమవంతుడైన |
| | | యుధామన్యుశ్చ | యుధామన్యుడును |
| విరాటశ్చ | విరాటదేశ రాజును | ఉత్తమౌజాశ్చ | ఉత్తమౌజస్సు అనువాడును |
| మహారథః | మహారథికుడైన | వీర్యవాన్ | పరాక్రమశాలియైన |
| ద్రుపదశ్చ | ద్రుపద రాజును | సౌభద్రః | సుభద్ర కుమారుడును |
| ధృష్టకేతుః | ధృష్టకేతువును | ద్రౌపదేయాశ్చ | ద్రౌపదీ పుత్రులును |
| చేకితానః | చికితానుని పుత్రుడైన చేకితానుడును | సర్వే | అందరును |
| | | మహారథాఏవ | మహారథులుగనేయున్నారు. |
| వీర్యవాన్ | వీర్యవంతుడైన | | |

తా॥ ఇచ్చట (పాండవసేనలో) అతి శూరులును గొప్ప ధనుస్సులుగల వారును యుద్ధమునందు (అతి సమర్థులని పేరుబడసిన) భీమార్జునులతో సమానులైన యుయుధానుడు, విరాటుడు, మహారథికుడైన ద్రుపదుడు, ధృష్టకేతువు, చికితానుని పుత్రుడు, వీర్యవంతుడైన కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, నరశ్రేష్ఠుడైన శైబ్యుడు, పరాక్రమశాలియైన యుధామన్యుడు, ఉత్తమౌజస్సు, అతి సామర్థ్యముగల సుభద్రకుమారుడైన అభిమన్యుడు, ద్రౌపది పుత్రులు, వీరందరు మహారథులుగనే యున్నారు.

(1) భీమార్జునసమాః - దుర్యోధనుడు పలుమారు భీమార్జునులవలన దెబ్బతిని ప్రాణముదప్పి పరుగెత్తియుండుటను స్మరించి వారలను జయించుట సులభముగాదని యిప్పుడు తలంచునట్లు చూపుచున్నది.

(2) యుయుధానః - అతిశయముగా యుద్ధముచేయువాడు. ఇతనికి 'సాత్యకి' యనియుపేరు.

(3) విరాటః - యుద్ధమున అధికముగ పరిహసించువాడు. ఈ విరాటరాజ్యమునందే పాండవులు ఒక సంవత్సరము అజ్ఞాతవాసముచేసినది, విరాటుని పుత్రియగు ఉత్తరను అర్జునుని కుమారుడైన అభిమన్యుడు వివాహము చేసికొనినది.

(4) ద్రుపదః - వృక్ష ధ్వజముగలవాడు - ఇతని కుమారులు ధృష్టద్యుమ్నుడు, శిఖండియని యిరువురు. ఇతని కూతురు ద్రౌపది.

(5) ధృష్టకేతుః - ఇతడు చేదిదేశరాజు. శిశుపాలుని పుత్రుడు. వీని సహోదరి కృణుమతి అను నామెను నకులుడు వివాహమాడెను.

(6) పురుజిత్ - అనేకులను యుద్ధమందు జయించినవాడు - ఇతడు కుంతిభోజుని సహోదరుడు.

(7) కుంతిభోజః - యాదవవంశమునకు చెందినవాడు. కృష్ణపరమాత్మని తండ్రియగు వసుదేవుని తండ్రికి మేనత్తకుమారుడు. వీరికి సంతానములేమిచే వసుదేవుని సహోదరియగు "పృధ" అను నామెను కూతురుగా పెంచుటచే నామెకు కుంతియనిపేరు. ఈ పృధయే పాండవుల తల్లియగు కుంతీదేవి.

(8) శైబ్యః - శిబిగోత్రమున పుట్టినవాడు.

(9) యుధామన్యుః - యుద్ధమున అతికోపమును జూపువాడు.

(10) ఉత్తమౌజాః - మేలైన ఓజస్సు (బలము) గలవాడు.

(11) సౌభద్రః - సుభద్రకు అర్జునునివలన పుట్టినవాడు - అభిమన్యుడు.

(12) ద్రౌపదేయాః - ద్రౌపది ద్రుపదుని కుమార్తె. యాగమునందు అగ్నినుండి జన్మించినది. ఈమెను పాండవులు పెండ్లాడిరి. ఈమెకు ధర్మపుత్రునివలన ప్రతి వింద్యుడున్ను, భీమసేనునివలన సూతసోముడున్ను, అర్జునునిచే శ్రుతకీర్తియు, నకులునిచే సదానీకుడును, సహదేవునిచే శ్రుతసేనుడున్ను జనించిరి. వీరుఅయిదుగురును ద్రౌపదేయులు.

(13) సర్వ ఏవ మహారథాః - ఉద్యోగపర్వమున దుర్యోధనునకు భీష్ముడు, పాండవసైన్యములో రథికులు, మహారథులు, అతిరథులు నెవరెవరని వివరించినపుడు చేకితానుని రథికునిగమాత్రము సూచించియుండగా, దుర్యోధనుడు వానినిగూడ మహారథుడని చెప్పుట ప్రస్తుతము దుర్యోధనునకు గలిగిన మనోవ్యాకులతచేతనే యని యెరుంగవలయును.

మహారథుడు మొదలగువారి లక్షణము లేవనగా :—

శ్లో॥ ఆత్మానం సారథిం చాశ్వాన్ రక్షన్ అక్షతమాయుధైః।
యో యుధ్యత్యయుతైర్వీరైః స మహారథ ఉచ్యతే ॥

తనను, సారథిని గుఱ్ఱములను శత్రువులయొక్క ఆయుధములచే గాయపడక కాపాడుచు పదివేలవీరులతో నెవడు యుద్ధముచేయునో యతడే మహారథుడనబడును.

శ్లో॥ ఏకో దశసహస్రాణి యోధయేద్యస్తు ధన్వినాం।
శస్త్ర శాస్త్ర ప్రవీణశ్చ మహారథ ఇతి స్మృతః ॥

ఏ యొకడు విల్లును చేబట్టి యుద్ధముచేయుచున్న పదివేలయోధులనెదిరించి, యుద్ధము చేయుసామర్థ్యము, ఆయుధశాస్త్రమందు మిక్కిలి అభ్యాసము గలవాడో అతడే మహారథుడని చెప్పబడును.

శ్లో॥ అమితాన్యోధయేద్యస్తు సంప్రోక్తోఽతిరథస్తు సః ।
రథీత్వేకేన యో యుధ్యేత్ తన్న్యూనోఽర్ధరథోమతః ॥

అసంఖ్యాకులగు రథికులనెదిరించి యుద్ధముచేయు సామర్థ్యము, ఆయుధముల అభ్యాసము గలవాడు అతిరథుడనియు, ఒకేరథమునందుండి మఱియొక రథమునందుండు తనతో సమానుడగు నొకనిని ఎదిరించి యుద్ధము చేయునతడు రథియనియు, అతనికి తగ్గినవాడు అర్ధరథుడనియు చెప్పబడును.

శ్లో॥ అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ!
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్బ్రవీమి తే ॥

పద॥ అస్మాకం - తు (1) - విశిష్టాః - యే - తాన్ - నిబోధ - ద్విజోత్తమ! (2) ।
నాయకాః - మమ - సైన్యస్య - సంజ్ఞార్థం - తాన్ - బ్రవీమి - తే ॥

| | | | |
|---|---|---|---|
| ద్విజోత్తమ ! | బ్రాహ్మణశ్రేష్ఠా ! | నాయకాః | నాయకులు |
| అస్మాకం తు | అయితే మనపక్షమున | (యే) | (ఎవరు గలరో) |
| విశిష్టాః | శ్రేష్ఠులు | తాన్ | వారలను |
| యే | ఎవరు గలరో | సంజ్ఞార్థం | గుర్తుకొఱకు |
| తాన్ | వారలను | తే | మీకు |
| నిబోధ | తెలిసికొనుడు. | బ్రవీమి | చెప్పుచున్నాను, |
| మమసైన్యస్య | నా సైన్యమునకు | | |

తా॥ బ్రాహ్మణశ్రేష్ఠులైన ద్రోణాచార్యా! అయితే మనపక్షమునగూడ శ్రేష్ఠులెవరో వారలను తెలిసికొనుడు. నాసైన్యమున సేనాధిపతులెవరో వారలను నేను గుర్తుకొఱకు తమకు చెప్పుచున్నాను.

(1) 'తు' — శబ్దప్రయోగము, దుర్యోధనుడు తనకు పూర్వముగలిగిన అధైర్యమును కప్పిపుచ్చి ధైర్యమును ఆశ్రయింప ప్రయత్నించుటను చూపుచున్నది.

(2) ద్విజోత్తమ — "ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలంబలం" క్షత్రియబలము ప్రయోజనము లేనిది, బ్రహ్మతేజోబలమేబలము అనునట్లు తమయొక్క బ్రహ్మతేజోబలముచేతనే మీరు మమ్ములను రక్షించి శత్రువులను జయింప సమర్థులుగదా? అట్లుండగా నేనెందుకు అధైర్యపడవలయునని దుర్యోధనుడు ఆచార్యుని శ్లాఘించి ఉత్సాహపరచుచున్నాడు.

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః * ॥
అన్యేచ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥

పద॥ భవాన్ - భీష్మః (1) - చ - కర్ణః (2) - చ - కృపః (3) - చ - సమితింజయః ।
అశ్వత్థామా (4) - వికర్ణః (5) - చ - సౌమదత్తిః - జయద్రథః (6) ॥
,, అన్యే - చ - బహవః - శూరాః - మదర్థే - త్యక్తజీవితాః (7)
నానాశస్త్రప్రహరణాః - సర్వే - యుద్ధవిశారదాః ॥

| | | | |
|---|---|---|---|
| భవాన్ | (ద్రోణాచార్యులైన) మీరును | బహవశ్శూరాః | అనేకశూరులును |
| భీష్మశ్చ | భీష్ములున్ను | సర్వే | అందఱును |
| కర్ణశ్చ | కర్ణుడును | మదర్థే | నా కొఱకు |
| కృపశ్చ | కృపాచార్యులును | త్యక్త జీవితాః | ప్రాణమిచ్చుటకు సన్నద్ధులును |
| సమితింజయః | యుద్ధమున జయశాలియైన | నానాశస్త్ర ప్రహరణాః | కొట్టుటకు సాధనమైన పలువిధములగు ఆయుధములు గలవారును |
| అశ్వత్థామా | అశ్వత్థామయు | | |
| వికర్ణశ్చ | వికర్ణుడును | | |
| సౌమదత్తిః | సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడును | యుద్ధ విశారదాః | యుద్ధమునందు మిక్కిలి ఆరితేరిన వారలుగను |
| జయద్రథః | జయద్రథుడును | (తిష్ఠంతి) | (నిలబడి యున్నారు.) |
| అన్యేచ | మఱియు | | |

తా॥ ద్రోణాచార్యులైనతమరు, భీష్ములు, కర్ణుడు, కృపాచార్యులు, యుద్ధమునందు జయశాలియైన అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడు, జయద్రథుడు, మఱియు అనేకశూరులు, వీరందఱు నాకొఱకు ప్రాణమిచ్చుటకు సాహసించినవారలుగను, కొట్టుటకు సాధనమైన పలువిధములగు ఆయుధములుగలవారలుగను యుద్ధమునందు ఆరితేరినవారలుగను నిలువబడియున్నారు.

*జయద్రథః-దీనికి బదులుగా "తథైవచ" అనియొక పాఠము. దానికి "అవిధముగనే"యని అర్థము.

(1) భీష్మః — భయంకరమగు వ్రతమును గైకొనినవాడు. వీరు శంతనమహారాజునకు గంగాదేవి యందు సంభూతులు. వీరికి దేవవ్రతుడని ప్రథమనామము. వీరితండ్రిగారు సత్యవతిని వివాహమాడ గోరినపుడు ఆమె యుదరమున జనించు పుత్రునికి పట్టముగట్టినయెడలనే సమ్మతింతుననుటచే నా దేవవ్రతుడు దానినంగీకరించి తాను పెండ్లియాడక బ్రహ్మచారిగనే యుండి సద్గతిని పొందునటుల నపుడు ప్రతిజ్ఞచేసెను. ఈ భయంకరమగు ప్రతిజ్ఞను వినిన దేవతలు మొదలగువారు "వీరు భీష్ములు" అని చెప్పగా అదిమొదలు వారు భీష్ములని పేరువడసిరి. (భారతము ఆదిపర్వము 100-వ అధ్యాయము చూడుడు.)

(2) కర్ణః — పాండవుల తల్లియైన కుంతీదేవి తనవివాహమునకు పూర్వము దూర్వాసమహర్షికి జేసిన శుశ్రూషచే నతడు సంతసించి యామెకుపదేశించిన మంత్రములతో సూర్యు నుద్దేశించిన మంత్రము నామె జపింపగా సూర్యభగవానుని అనుగ్రహమున కుంతీదేవికితడు బుట్టినవాడు. ఇతడు జనించినపుడే కర్ణకుండలకవచములతో బుట్టెను. ఇంద్రుడు తనపుత్రుడైన అర్జునునకు అనుకూలత కల్పింప నుద్దేశించి బ్రాహ్మణ వేషముధరించి ఈతని కర్ణకుండలములను కవచమును దానముడుగగా, వాటినికోసియు, చీరియు నిచ్చెను. ఇతనికి "వసుషేణుడ"నియు "సూతపుత్రుడ"నియు నామాంతరములుగలవు. (భారతము ఆదిపర్వము 111-వ అధ్యాయము చూడుడు.)

(3) కృపః - గౌతముని తపస్సునకు విఘ్నమొనర్చుటకు ఇంద్రుడు జాలవతియను అప్సరసను పంప, నామెను అతడుచూచి మనశ్చాంచల్యము నొంద నతని రేతస్సు ఒకానొక రెల్లు పొదలో రెండుగాచెదరిపడగా దానినుండి యొకటి పురుషసంతానము, మఱియొకటి స్త్రీ సంతానమును వెంటనేగలిగెను. వేటయాడుటకై అచ్చటికి వచ్చియున్న శంతన మహారాజుయొక్క మంత్రి ఆ శిశువులను చూచి యెత్తుకొనివచ్చి రాజునకు సమర్పింపగా రాజు కృపతో వారలను కాపాడుటచే నా శిశువులకు 'కృపు'డనియు, 'కృపి'యనియు పేరువచ్చెను. ఈ కృపియను నామెనే ద్రోణాచార్యులు వివాహమాడెను. (భారతము ఆదిపర్వము 130 అధ్యాయము చూడుడు).

(4) అశ్వత్థామా - ఇతడు ద్రోణాచార్యునకు కృపియందు జనించిన పుత్రుడు. ఈతడు జనించిన తోడనే దేవలోకమునందలి ఉచ్చైశ్శ్రవమువలె శబ్దించుటచే వీనిని 'అశ్వత్థామ'యని పిలువమని ఆశరీరవాక్కు పలికెను. (భా, ఆ, ప, 131 అధ్యాయము చూడుడు).

(5) వికర్ణః - ఇతడు దుర్యోధనుని తమ్ముడు.

(6) జయద్రథః - ఇతడు సింధుదేశరాజు, దుర్యోధనుని సహోదరి దుశ్శలయొక్క భర్త.

(7) త్యక్తజీవితాః - నా కొఱకు ప్రాణములను పరిత్యజించుటకు సిద్ధముగనున్నవారలు.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥ 10

పద॥ అపర్యాప్తం (1) - తత్ - అస్మాకం - బలం - భీష్మాభిరక్షితం ।
పర్యాప్తం - తు - ఇదమ్ - ఏతేషాం - బలం - భీమాభిరక్షితమ్ ॥

| | | | |
|---|---|---|---|
| తత్ | ఆ (పైచెప్పబడిన శూరులతో కూడిన) | ఏతేషాం | వీరలయొక్క |
| | | ఇదం బలం తు | ఈ సైన్యమైతే |
| అస్మాకం | మనయొక్క | పర్యాప్తం | మితముగనుండి (స్వల్పముగనుండి) |
| బలం | సైన్యము | భీమాభిరక్షితం | భీమునిచేత (గదా!) కాపాడ బడుచున్నది. |
| అపర్యాప్తం | అపరిమితముగనుండి | | |
| భీష్మాభిరక్షిత | భీష్మునిచే బాగుగా రక్షింపబడుచున్నది | | |

తా॥ పై జెప్పిన శూరులతోగూడిన యీ మన సైన్యము అపరిమితముగా నుండుటయేగాక (అతి బలపరాక్రమము గలిగి, స్వేచ్ఛామరణవరము బడసి, అతిసూక్ష్మబుద్ధిగల) భీష్మునిచే బాగుగా రక్షింపబడియున్నది. వీరలయొక్క (పాండవులయొక్క) యీ సైన్యమైతే మితమైనదియు (స్వల్పమైనదియు) అతి చంచలబుద్ధిగల భీమునిచేతనే రక్షింపబడియున్నది. (అనగా భీష్ములు ఎవని చేతను జయింపరానివారు, తనకు ఇష్టమైనపుడు తన ప్రాణములను విడచుటకు వరము బడసియున్నారు. వీరు తన పక్షమున నుండునప్పుడు తన జయమునకు సందియము లేదని దుర్యోధనుని యభిప్రాయము.)

ఈ శ్లోకముచేత దుర్యోధనుడు తన సైన్యము పాండవసైన్యమునకంటె మిక్కిలి పరాక్రమము గలదియని చెప్పుచున్నాడని కొందఱు వ్యాఖ్యాతలును, దానికి విరుద్ధముగా చెప్పుచున్నాడని మఱికొందఱును తాత్పర్యమునుగొనిరి. వారువారు చేసియున్న యన్వయక్రమమును వాటియర్థములును క్రిందకనుబరచబడియున్నవి:—

**ఆనందగిరిః** — (1) అస్మాకంఖలు ఇదమేకాదశసంఖ్యాకాక్షౌహిణీపరిగణిత మపరిమితంబలం, భీష్మేణచ ప్రథితమహామహిమ్నా సూక్ష్మబుద్ధినా సర్వతః రక్షితం పర్యాప్తం పరేషాం పరిభవే సమర్థం. ఏతేషాం పునః తత్ అల్పం సప్తసంఖ్యాకాక్షౌహిణీపరిమితం బలం భీమేనచ చపలబుద్ధినా కుశలతావికలేన పరిపాలితం అపర్యాప్తం అస్మానభిభవితుమసమర్థమిత్యర్థః.

అనగా పదునొకండు అక్షౌహిణులతోగూడి యధికమైన మన యీ సైన్యము ప్రసిద్ధ మహామహిమగల, సూక్ష్మబుద్ధిగల భీష్మునిచే నన్నిప్రక్కల రక్షింపబడినదిగను, శత్రువులను అవమానపరచుటలో (జయించుటలో) సామర్థ్యముగలదిగ నున్నది. ఏడు అక్షౌహిణులతోగూడిన అల్పమైన వీరలయొక్క (పాండవులయొక్క) సైన్యమైనచో చపల (నిలకడలేని) బుద్ధియు సామర్థ్యహీనతయు గల భీమునిచే రక్షింపబడినదిగను, మనలను అవమానపరచుటలో సామర్థ్యము లేనిదిగను ఉన్నది.

(2) తదిదమస్మాకం బలం భీష్మాధిష్ఠితమపర్యాప్తం, అపరిమితం అధృష్య మక్షోభ్యం. ఏతేషాం తు పాండవానాం బలం భీమేనాభిరక్షితం పర్యాప్తం పరిమితం సోఢుం శక్యమిత్యర్థః.

అటువంటి మనయొక్క బలము భీష్మునిప్రధానునిగ గలదిగను, అపరిమితమై ఎదిరింప వీలులేనిదిగను, కలతపెట్టరానిదిగను ఉన్నది. ఈ పాండవుల సైన్యమన్ననో భీమునిచే రక్షింపబడినదిగను మితముగను ఉన్నది. జయించవచ్చునని తాత్పర్యము.

**మధుసూదనః** — తత్ పాండవానాం బలం అపర్యాప్తం = నాలం అస్మాక మస్మభ్యం, కిదృశం తత్, భీష్మోఽభిరక్షితోఽస్మాభిః యస్మై యన్నివృత్త్యర్థ మిత్యర్థః. తత్ పాండవబలం భీష్మాభిరక్షితం. ఇదం పునః అస్మదీయంబలం ఏతేషాం పాండవానాం పర్యాప్తం = పరిభవే సమర్థం. భీమోఽతిదుర్బలహృదయః రక్షితః యస్మై తదస్మాకంబలం భీమాభిరక్షితం. యస్మాత్ భీమోఽత్యయోగ్య ఏవై తన్నివృత్త్యర్థం తైః రక్షితః. తస్మాదస్మాకం న కించిదపి భయకారణమస్తీత్యభిప్రాయః.

ఆ పాండవుల సైన్యము మనకు (మనలనుజయింప) చాలినంతలేదు. ఆ సైన్యమెట్టిదనమనచే బాగుగా రక్షింపబడిన భీష్ముడు నాశకుడుగా గలిగినది. ఇదియే భీష్మాభిరక్షితం అను దాని భావము. ఈ మన సైన్యమన్ననో యీ పాండవుల నవమానించుటకు సమర్థముగనున్నది. మన సైన్యమెట్టిదనగా వారలచే (పాండవులచే) రక్షింపబడిన అతిదుర్బల హృదయుడగు భీముడు నాశకుడుగ గలిగినది. ఇదియే భీమాభిరక్షితమనుదాని భావము. ఏ కారణముచే మిక్కిలి యయోగ్యుడైన భీముడు ఈ మన సైన్యమును నాశముచేయుటకు పాండవులచే రక్షింపబడియున్నాడో ఆ కారణముచేత మనకు భయపడుటకు ఏమియు హేతువులేదు అని భా

శంకరానందః — అపర్యాప్తం యుద్ధాయ యదనలమస్మాకం నిరుక్తేభ్యః భిన్నం తత్ భీష్మాభిరక్షితం భీష్మేణాభితః శరీరవాక్శస్త్రాస్త్రబలేన రక్షితం సత్ మమ జయసంపాదనాయ పర్యాప్తమేవ భవతి మహాపురుషాశ్రయబలాత్, తేషాం పాండవానాంతు ఇదం పురో దృశ్యమానం బలం పర్యాప్తమపి భీమేనాభిరక్షితం సత్ అపర్యాప్తమేవ భవతి, హీనపురుషాశ్రయాదితి భావః.

పూర్వము చెప్పిన వారలకంటెను భిన్నమైన ఏ మన సైన్యము యుద్ధముకొఱకు మనకు చాలనిదిగ నున్నదో అది, శరీరవాక్శస్త్రాస్త్రబలములతో మహాపురుషులైన భీష్ములచే రక్షింపబడినదై మనకు జయమును సంపాదించుటలో సామర్థ్యము గలిగినదైయున్నది. ఈ యెదుట గనుపడు పాండవసైన్యమనగా చాలినంతయున్నను హీనపురుషుడైన భీమునిచే రక్షింపబడియుండుటచేత వారలకు జయమునిచ్చుటకు సామర్థ్యము లేనిదిగనున్నది.

భాష్యోత్కర్ష దీపికా — తత్ పరేషాం బలమస్మాకం బలం సైన్యమభిభవితుమపర్యాప్తమసమర్థం. యతోఽస్మాకంబలం భీష్మేణ ప్రథితమహిమ్నాఽతిశూరేణ రక్షితం. ఇదమస్మదీయంతు బలమేతేషాం సైన్యమభిభవితుం పర్యాప్తం సమర్థం. యతః పరేషాంబలం భీమేన బాలేనాభిరక్షితమిత్యర్థః,

శత్రువులయొక్క యీ సైన్యము మన సైన్యమును అవమానపరుప సామర్థ్యములేనిదిగనున్నది. ఏ కారణముచేత? అతి మహిమగల శూరులైన భీష్ములచే మన సైన్యము రక్షింపబడియుండుటచేత, ఈ మన సైన్యమన్ననో వారల సైన్యమును అవమానపరుప చాలినంత సామర్థ్యము గలదిగనున్నది. ఏ కారణముచే ననగా? శత్రువులయొక్క సైన్యము బాలుడైన భీమునిచే రక్షింపబడుచుండుటచేతనే.

(౩) తత్పరోక్షం సర్వం విషయీకర్తుమశక్యమస్మాకం బలం భీష్మేణచాభిరక్షితమతోఽపర్యాప్తం, పర్యాప్తం అభిభవితుం క్షోభయితుమశక్యం· ఏతేషాం త్విదం పరిదృశ్యమానం పరిమితమితి యావత్. భీమేనచాభిరక్షితమతః పర్యాప్తం, పర్యాప్తమభిభవితుం క్షోభయితుం సోఢుంచ శక్యమిత్యర్థః.

మన సైన్యము కనులకందనిదిగను, భీష్ములచే రక్షింపబడియుండుటచే శత్రువులచే నవమానపరుప, కలతపెట్ట వీలులేనిది. వారలయొక్క యీ సైన్యము కనులకందునది, అనగా మితమైనది. భీమునిచే రక్షింపబడియుండుటచే నవమానపరుప వీలుగలది, కలతపెట్టదగినది అనగా జయింపదగినది.

(౪) తత్ తస్మాత్ అస్మాకమిదం బలమపర్యాప్తం పరి సమంతాదితస్తతః సర్వం ప్రాప్తం న భవతి. కింతు స్వకీయమేవ బహు. ఏతేషాంతు బలం పరి సమంతా దితస్తతః ప్రాప్తం పర్యాప్తం. అతః అస్మత్సైన్యం మనో దత్వా యుద్ధం కరిష్యతీతి కృత్వా అస్మాకం ప్రాబల్యమితి భావః.

ఆ కారణమువలన ఈ మన సైన్యమంతయు యితరులనుండి సంపాదింపబడినదికాదు. మన సొంత సైన్యమే యధికముగ నున్నదని తాత్పర్యము. ఈ (పాండవ) సైన్యమన్ననో అనేకుల నుండి సంపాదింపబడినది, అందుచేత మన సైన్యము మనసుంచి యుద్ధము చేయును కనుక మనకే ప్రాబల్యమని భావము.

శ్రీధరః — తత్ తథాభూతై ర్వీరైర్యుక్తమపి, భీష్మేణాభిరక్షితమప్యస్మాకం బలం సైన్యమపర్యాప్తం. తైస్సహ యోద్ధుమసమర్థం భాతి. ఇదంతు ఏతేషాం పాండవానాం బలం భీమే నాభిరక్షితం సత్ పర్యాప్తం సమర్థం భాతి. భీష్మస్య ఉభయపక్షపాతిత్వాత్ అస్మద్బలం పాండవ సైన్యం ప్రతి అసమర్థం. భీమస్య ఏకపక్షపాతిత్వాత్ ఏతద్బలం అస్మద్బలం ప్రతి సమర్థం భాతి.

అటువంటి వీరులతో గూడినదైనను భీష్మునిచే రక్షింపబడియుండుటచే మన సైన్యము వారలతో యుద్ధముచేయ సామర్థ్యములేనిదిగ గనబడుచున్నది. ఈ పాండవసైన్యమన్నో భీమునిచే రక్షింపబడియుండుటచే సామర్థ్యము గలదిగ కనబడుచున్నది. భీష్ముడు ఉభయపక్షపాతి యగుటచే మన సైన్యము పాండవసైన్యమునుద్దేశించి సామర్థ్యము లేనిదిగను, భీముడు ఏకపక్షపాతి యగుటచే వారల సైన్యము మన సైన్యముకన్న సామర్థ్యము గలదిగను గనపడుచున్నది.

(స్వకీయము) ఈ శ్లోకముచే దుర్యోధనుడు చెప్పదలంచినదానిని స్పష్టపరచుటకు పలు విధముల నన్వయపరచి చెప్పియుండు పైగనిన తాత్పర్యముల తారతమ్యములను పర్యాలోచన చేయుటకు క్రిందకనబరచిన విషయములు ముఖ్యముగ గమనింపదగినవిగ భావింతుము:—

(1) ఈ యుద్ధారంభమున దుర్యోధనుడు తన సైన్యమును నిందించియు, శత్రుసైన్యముల శ్లాఘించియు తన పక్షముచేరినవారలను అధైర్యపరచినదిగ గ్రహించుట, అతడు పూర్వము చెప్పియున్న మాటలకు సంగతముగ కనబడదు.

(2) పూర్వము ఉద్యోగపర్వమున పాండవుల జయించుట అసాధ్యమనియు, అందుచేత యుద్ధము వలదనియు దుర్యోధనునకు ఇతరులు బుద్ధి చెప్పగా, అతడు తన సైన్యము అపరిమితమైన దనియు, తాను కోరినపుడు తన ప్రాణముల విడచుటకు వరముబడసిన భీష్ములు తనకు సేనాధిపతిగనుండగా భయమేమనియు అదే యుద్యోగపర్వమున రథాతిరథులను చెప్పునపుడు "మీరు సేనాధిపతిగ నుండునపుడు దేవలోకరాజ్యాధిపత్యమున్ను లభించుటలో సందియములేదు" అనియు పలికియున్నాడు.

(3) భీష్ములను ఎవ్వరు జయించలేరనియు పరశురాములుగూడ వారితో యుద్ధము చేసి జయింపలేక పోయిరనియు తెలిసి దుర్యోధనుడు భీష్ముని ప్రాబల్యమును అనేక ప్రదేశముల నెత్తిచెప్పియున్నాడు.

(4) మఱియు ఈ భగవద్గీతాపర్వారంభమున, యుద్ధారంభదినమున యుద్ధమునకు తన సైన్యమును వరుసపరచమని దుర్యోధనుడు దుశ్శాసనునిగూర్చి దీనికి కొంచెముపూర్వము చెప్పినపుడు "ఈ యుద్ధమున మనము చేయవలసిన ముఖ్యమైన పని భీష్ములను గాపాడుటతప్ప మఱియొకటిలేదు. వారిని గాపాడినయెడల వారు పాండవులు మొదలగు వారలను చంపివేయుదురు. కావున మన సైన్యమువారందరు శిఖండి భీష్మునియొద్దకు సమీపింపకుండునట్టుల రక్షించవలయు" నని పలికియున్నాడు. ఇప్పుడును ఆ విధముగనే యితడు 11-వ శ్లోకమున "కావున మీరందఱు భీష్ములనే రక్షింతు"రని చెప్పుచున్నాడు.

(5) అదియుగాక ముందు రాబోవు భీష్మపర్వము 51-వ అధ్యాయమున రెండవరోజు యుద్ధము ప్రారంభమగుటకు పూర్వము ద్రోణుడు కృపుడు మొదలగువారలవద్దకు దుర్యోధనుడు పోయి "మీరొక్కొకరు ఒంటరిగనే పాండవులను వారల సైన్యముతో చంప సమర్థులు. అట్టిందఱగ మీరందఱు, భీష్ములు నొకటిగ చేరినపుడు మీ పరాక్రమమును చెప్పవలయునా?" అని యిటే

శ్లోకమును,ఇవే వాక్యములను చెప్పి భీష్ములనందఱు రక్షించవలయునని చెప్పియున్నాడు. అచ్చోట ఈ శ్లోకముచేత తనసైన్యమును దుర్యోధనుడు శ్లాఘించిచెప్పెనని గ్రహించవలయునేగాని వేరు విధముగా నర్థము చేయుట కవకాశములేకున్నది.

(1) పర్యాప్తం — పరి + ఆప్ = పొందుచున్నది. దీనిచే కోరిక పూర్తియగుచున్నది. అనగా చాలినది యనియొక అర్థము. 'పర్యాప్తం' అనుదానికి ఎల్లకు లోబడినది. అనగా మితమైన దని మఱియొక యర్థము వ్యాఖ్యాతలు చేసియున్నారు. అపర్యాప్తమను పదమునకు ఈ అర్థ ప్రయోగము "జగత్యపర్యాప్తసహస్రభానునా" అని మాఘము 1-వ సర్గము 27-వ శ్లోకమున చెప్పబడియుండుటను చూడుడు.

(2) భీష్మపదమునందు భీమపదము యెట్లు అణగినదో అట్లే పరాక్రమమునందును భీష్మునియందు భీముడు అణగినవాడుగ గ్రహింపుడు.

శ్లో॥ *అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః।
భీష్మమేవాభిరక్షంతు భవంతః సర్వ ఏవ హి ॥ 11

పద॥ అయనేషు - చ - సర్వేషు - యథాభాగం - అవస్థితాః ।
భీష్మం - ఏవ - అభిరక్షంతు - భవన్తః - సర్వే - ఏవ - హి ॥

| | | | |
|---|---|---|---|
| హి | కావుననే | యథాభాగం | వారివారి చోట్ల |
| భవన్తః | మీరు | అవస్థితాః | ఉన్నవారై |
| సర్వేఏవ | అందఱునున్న | భీష్మమేవ | భీష్మునే |
| సర్వేషు | సమస్తములైన | అభిరక్షంతు | అన్ని ప్రక్కల కాపాడవలయును |
| అయనేషు చ | (సేనలో ప్రవేశించు) మార్గములయందును | | |

**తా॥ (భీష్ముడే మన జయమునకు ఆధారభూతుడు అనే) ఈ కారణముచేత మీరందరును, సేనలో ప్రవేశించుచున్న సమస్తమార్గములయందును వారివారికి నియమింపబడియుండిన ప్రదేశములనున్నవారై భీష్ములనే యన్ని ప్రక్కల రక్షింపవలెను.**

*అయనేషుతు, అని యొక పాఠము.

(స్వకీయము) భీష్ములు తనసైన్యమును రక్షించువారు. వారు ఎవ్వనిచేతను జయించ రానివారు, వారుండుటచే జయమునకు సందేహములేదని పూర్వశ్లోకమున దుర్యోధనుడు చెప్పినటుల చెప్పియుండగా ఈ శ్లోకమునందు భీష్ముని నందరు కాపాడుడు అని చెప్పుట సంగతమాయనగా ఈ భగవద్గీతాపర్వారంభమున 15-వ అధ్యాయమున దుర్యోధనుడే యాకారణమును చెప్పి యున్నాడు. అదియేమనగా, పాండవుల పక్షమునందున్న శిఖండియనునతడు పూర్వము కాశీరాజు పుత్రి అంబయైయుండి యామెకు భీష్మునివిషయమున గలిగిన వైరమ్యముచే నతనిని చంపుటకే తపముచేసి ద్రుపదరాజునకు సంతానముగ బుట్టినప్పుడు స్త్రీరూపమున జనించి, తదనంతరమొక యక్షుని సహాయముచేత పురుషభావము నందినవాడు, ఇతడు స్త్రీరూపముగ పూర్వమున్న కారణముచే నితనిపై బాణసంధానమును, వీనిని చంపుటయును, చేయనని భీష్ముడు ప్రతిజ్ఞ చేసి

యున్నాడు. భీష్ములను ఎవరును యుద్ధముచేసి చంపవీలులేనందున ఈ శిఖండినిగొని వారిని జంపనుద్దేశించి అర్జునుడు శిఖండిని స్వయముగనే జాగ్రతతో కాపాడి యుంచుకొనియున్నాడు. ఇట్టి శిఖండి భీష్ముని సమీపించినయెడల వారు అతని నెదిరించకయుందురు. అపుడు వారి నాతడు సులభముగ పడగొట్టును గావున ఆ శిఖండి భీష్ములను సమీపించకుండునటులను, కొట్ట కుండునటులను రక్షించుటకొఱకు దుర్యోధనుడు తనసైన్యమునకు ఈ శ్లోకముచే నాజ్ఞాపించు చున్నాడు. భీష్మునికిన్ని శిఖండికిగల ద్వేషమెట్టిదనియు, శిఖండి ప్రథమము స్త్రీగనుండి మాఱిన వృత్తాంతమును భారతము ఉద్యోగపర్వాంతర్గతమగు అంబోపాఖ్యానపర్వమున జూడుడు.

శ్లో॥ తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ 12

పద॥ తస్య - సంజనయన్ - హర్షం - కురువృద్ధః - పితామహః ।
సింహనాదం - వినద్య - ఉచ్చైః - శంఖం - దధ్మౌ - ప్రతాపవాన్ (1) ॥

| | | | |
|---|---|---|---|
| ప్రతాపవాన్ | మిక్కిలి కీర్తిబడసినవారును | సంజనయన్ | కలుగ జేయుచు |
| కురువృద్ధః | కురువంశస్థులలో వయోవృద్ధులునగు | ఉచ్చైః | గట్టిదైన |
| | | సింహనాదం | సింహధ్వనివంటి నాదమును |
| పితామహః | తాత (భీష్ములు) గారు | వినద్య | చేసి |
| తస్య | అతనికి (దుర్యోధనునికి) | శంఖం | శంఖమును |
| హర్షం | ఉత్సాహమును | దధ్మౌ | ఊదెను. |

తా॥ మిక్కిలి కీర్తిబడసినవారును, కురువంశమందున్నవారలలో వయసు చెల్లి తాత వరుసగల భీష్ములు ఆ దుర్యోధనునకు ఉత్సాహము గలుగునటుల పెద్దదగు సింహధ్వనివంటి శబ్దమునుచేసి శంఖమును ఊదెను.

(1) ప్రతాపవాన్ — అనునది పరశురాముడు మొదలగువారలకు యుద్ధముచేసి జయింపవీలులేని భీష్మునియొక్క కీర్తిని సూచించుచున్నది.

(స్వకీయము) భీష్ముడు దుర్యోధనున కుత్సాహమును కలుగజేయుటకు శంఖధ్వానము జేసెననునది, పూర్వము అతనికి మనోదౌర్బల్యము గలిగియుండెనని సూచించును. మఱియు దుర్యోధనాదులకును పాండవులకును భీష్ముడు పితామహ బాంధవ్యము గలిగియున్నను అతడు అధర్మిష్ఠుడైన దుర్యోధనుని పక్షమున జేరి అతనికి సంతోషమును గలుగజేయుట అతని ద్రవ్యమును అన్నమును పొందియుండుటచేత నతనికి తనదేహమును అర్పించుట తనకర్తవ్యమని భీష్ముడు తలంచి యుద్ధము చేసినదిగ జూపుచున్నది. అయితే భీష్ముడు పాండవులక్షేమమును ఎల్లపుడు మనసుచే గోరువాడు.

శ్లో॥ తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః ।
సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్ ॥ 13

పద॥ తతః - శంఖాః - చ - భేర్యః - చ - పణవ ఆనక గోముఖాః ।
సహసా - ఏవ - అభ్యహన్యంత - సః - శబ్దః - తుములః - అభవత్ ॥

| | |
|---|---|
| తతః | దానికి తర్వాత (భీష్ముడు శంఖధ్వానముచేసినతర్వాత |
| శంఖాశ్చ | శంఖములును |
| భేర్యశ్చ | భేరులును |
| పణవానకగోముఖాః | తప్పెటలు; పలకలు, ఊదు కొమ్ములును |
| సహసైవ | వెంటనే |
| అభ్యహన్యంత | ప్రయోగింప బడెను |
| సః శబ్దః | ఆ శబ్దము |
| తుములః | అంతట వ్యాపించినదిగ |
| అభవత్ | అయెను. |

తా॥ (భీష్ముడు శంఖధ్వానముచేసిన) పిదప కౌరవ సైన్యముననున్న తదితరులచే శంఖములు, భేరులు, తప్పెటలు, పలకలు, ఊదుకొమ్ములు వెన్వెంటనే ప్రయోగింపబడెను. ఆ శబ్దము అంతటను వ్యాపించెను.

శ్లో॥ తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥　　14

పద॥ తతః - శ్వేతైః - హయైః - యుక్తే - మహతి (1) - స్యందనే - స్థితౌ ।
మాధవః (2) - పాండవః (3) - చ - ఏవ (4) - దివ్యౌ (5) - శంఖౌ (6) - ప్రదధ్మతుః ॥

| | |
|---|---|
| తతః | తర్వాత |
| శ్వేతైః హయైః | తెల్లనిగుఱ్ఱములతో |
| యుక్తే | గూడిన |
| మహతి | గొప్పదైన |
| స్యందనే | రథమునందు |
| స్థితౌ | ఉన్న |
| మాధవః | లక్ష్మీపతియైన కృష్ణపరమాత్మయును |
| పాండవశ్చైవ | పాండుపుత్రుడైన అర్జునుడును (ఏకమై) |
| దివ్యౌ | దేవత్వమును బడసిన |
| శంఖౌ | శంఖములను |
| ప్రదధ్మతుః | గట్టిగ ఊదిరి. |

తా॥ దాని తర్వాత తెల్లని గుఱ్ఱములుగట్టిన మహత్తరమైన రథమున నున్నవారై లక్ష్మీపతియైన కృష్ణస్వామియు అర్జునుడును ఏకీభవించి (ఒకే సమయమున) దేవత్వముపొందిన శంఖములను గట్టిగ నూదిరి.

(1) మహతి స్యందనే - సోమునివద్దనుండి వరుణుడు ఈ రథము మొదలగునవియు, గాండీవమను ధనుస్సును సంపాదించెను వీటిని అగ్నిదేవుడు ఖాండవవన దహనకాలమున వరుణుని నుండి తీసి అర్జునునకు ఇచ్చెను. దేవతలచేనైనను ఇవి విరుచుటకును నాశనముచేయుటకును వీలులేనివి, ఈ రథమునకు ఎల్లప్పుడును మిక్కిలి తెల్లనైనట్టియు మనోవేగముగలిగినట్టియు గంధర్వాంశ సంభూతములైన గుఱ్ఱములు జోడింపబడియుండును. ఈ రథము సూర్యతేజస్సుగలది. ఇవే గుఱ్ఱములుగల, ఈ రథముననుండియే శ్రీ కృష్ణపరమాత్మయు, నర్జునుడును దేవతలతో యుద్ధముచేసి జయించి ఖాండవవనమును దహించిరి. ఇవి కావలసినపుడు స్మరణ మాత్రము చేతనే వచ్చునట్టివి. ఆ రథమును, ఆ మాధవుడును, ఆ అర్జునుడునుజేరి యిప్పుడు యుద్ధమునకు వచ్చిరనగా జయమునకు సందియము ఉండదా? శ్రీకృష్ణుడుండినచోటనె జయమని సంజయుడు సూచించుచున్నాడు,

(2) మాధవః - ఛాందోగ్యోపనిషత్తునందలి మధువిద్యయను వేదభాగిముచేత పొగడబడిన వాడగుటచే మాధవుడనియు, మా = లక్ష్మికి, ధవః = పతి (భర్త) లక్ష్మీపతియగుటచే మాధవుడనియు, మౌనము, ధ్యానము, యోగము వీటినిగలిగినవాడగుటచే మాధవుడనియు పేరువచ్చెను. పాండవసైన్యమున ప్రథమముగ మాధవుడు శంఖధ్వానము జేసెనని చెప్పుట, అతనే ప్రధానుడు, తదితరులు నిమిత్తమాత్రులను దానిని సూచించుచున్నది. ఇతడు లక్ష్మీపతియగుటచే నింతవరకు కౌరవపక్షముననుండిన రాజ్యలక్ష్మిని శంఖధ్వానముచేసి ఆకర్షించుకొనెను అను దానిని సంజయుడు సూచించుచున్నాడు.

(3) పాండవః - అనునది అర్జునునిమాత్రము గుర్తించునదిగ ఏల గ్రహించవలయుననగా - "పాండవానాంధనంజయః" అనిముందు చెప్పబోవుప్రకారము వీరిద్దరు నరనారాయణావతారభూతులు. ఒకేరథమున నొకే యాసనముననుండి మాధవుని సదావీడని పాండవు డర్జునుడే.

(4) ఏవ - అనునది యీ రెండు శంఖధ్వానములును వెవ్వేరుగ వినబడక రెండును ఒకేకాలమున నొకే ధ్వనిగ నుండెననియు, మాధవుని ప్రథమమున చెప్పుటచే ప్రాబల్యము వానిశంఖ ధ్వానమునకే యనియు సంజయుడెత్తి చెప్పుచున్నాడు.

(5) శంఖం - దుఃఖమును శమనముచేయుటచే, (లేక) దుష్టులను శాంతపరచుటచే లేక సుఖమును గలుగజేయుటచే శంఖమనిపేరు.

(6) ప్రదధ్మతుః - దీనిచే, నేకమై మాధవుడును అర్జునుడును జేసిన శంఖధ్వానము అధికమైన శబ్దముతో వేరుధ్వనులను అణగగొట్టి యధికముగ మ్రోగెననునది గుర్తింపబడుచున్నది.



శ్లో॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥ 15
,, అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ ॥ 16

పద॥ పాంచజన్యం (1) - హృషీకేశః (2) - దేవదత్తం - ధనంజయః (3) ।
పౌండ్రం - దధ్మౌ - మహాశంఖం - భీమకర్మా (4) - వృకోదరః ॥
,, అనంతవిజయం - రాజా (5) - కుంతీపుత్రః - యుధిష్ఠిరః ।
నకులః - సహదేవః - చ - సుఘోషమణిపుష్పకౌ ॥

| | | | |
|---|---|---|---|
| హృషీకేశః | హృషీకేశుడైన కృష్ణపరమాత్మ | పౌండ్రం | పౌండ్రమను |
| పాంచజన్యం | పాంచజన్యమను శంఖమును | మహాశంఖం | పెద్ద శంఖమును |
| (దధ్మౌ) | (ఊదెను) | దధ్మౌ | ఊదెను |
| ధనంజయః | అర్జునుడు | రాజా | రాజైన |
| దేవదత్తం | దేవదత్తమను శంఖమును | కుంతీపుత్రః | కుంతీదేవి పుత్రుడైన |
| (దధ్మౌ) | (ఊదెను) | యుధిష్ఠిరః | యుధిష్ఠిరుడు (ధర్మపుత్రుడు) |
| భీమకర్మా | భయంకరమైన (పరాక్రమగల) వ్యాపారముగల | అనంతవిజయం | అనంతవిజయమను శంఖమును |
| | | (దధ్మౌ) | (ఊదెను) |
| వృకోదరః | భీమసేనుడు | నకులః | నకులుడును |

| | |
|---|---|
| సహదేవశ్చ | సహదేవుడున్ను |
| సుఘోష | సుఘోషమను శంఖమును, (దధ్మతుః) (ఊదిరి.) |
| మణిపుష్పకౌ | మణిపుష్పకమను శంఖమును |

తా॥ హృషీకేశుడైన శ్రీకృష్ణస్వామి పాఞ్చజన్యమను శంఖమును (ఊదెను) అర్జునుడు దేవదత్తమను శంఖమును (ఊదెను). భయంకరమైన వ్యాపారముగల భీమసేనుడు పౌండ్రమను గొప్పదైన శంఖము నూదెను. రాజైన కుంతీపుత్రుడగు యుధిష్ఠిరుడు (ధర్మరాజు) అనంతవిజయమను శంఖమును (ఊదెను). నకులుడు సుఘోషమను శంఖమును, సహదేవుడు మణిపుష్పకమను శంఖమును (ఊదిరి).

(1) పాఞ్చజన్యం - కృష్ణపరమాత్మ, తన గురుపుత్రుని నపహరించుకొనిపోయిన పఞ్చజనుడను రాక్షసుని కడుపుచీల్చి వాని యెముకలనుండి గ్రహించుటచే నీశంఖము పాఞ్చజన్యమను పేరుబడసెను.

(2) హృషీకేశః - హృషీక = ఇంద్రియములకు, ఈశః = (సాక్షిగనుండుటచే) యజమానుడైన క్షేత్రజ్ఞుడుగనుండుటచే హృషీకేశుడనియు, ఇంద్రియములను స్వాధీనముగ నుంచుకొని వాటిని విషయములయందు ప్రేరేపించుచున్న పరమాత్మయగుటచే హృషీకేశుడనియు, సూర్యచంద్ర రూపములుగనున్న భగవంతుడు ఆ సూర్యచంద్రులయొక్క కేశములు (వెంట్రుకలు) అని జెప్పబడిన కిరణములచేత జగత్తునకు జాగ్రత్సుషుప్త్యవస్థలచే సంతోషము గలుగజేయుటవలన హృషీకేశుడనియు పేరునొందెను.

(3) ధనంజయః - రాజసూయ యాగమునకై అనేకరాజులనుజయించి ధనమును సంపాదించినవాడగుటచేత ధనఞ్జయుడు, లేక ధనమునందు ఆశలేనివాడగుటచేతను ధనంజయుడని పేరుబడసెను.

(4) వృకోదరః - అన్నిటిని భస్మముజేయు ''వృక'' మనునగ్నిని ఉదరమున గలవాడు. లేక తోడేలు ఉదరమువంటి ఉదరము గలవాడు.

(5) రాజా - యుధిష్ఠిరుడు (ధర్మరాజు) రాజపదవియందిపుడు లేనప్పటికిన్ని అతనిని రాజని చెప్పుట, ముందీతడు రాజ్యాధిపత్యమును నిశ్చయముగ నొందబోవుచున్నాడని సూచించుచున్నది.

(స్వకీయము) ఈ శ్లోకములలో మొదట శ్రీ కృష్ణపరమాత్ముని శంఖము, దానికి తరువాత అర్జునుని శంఖము, పిదప భీమునిశంఖము, ఈ విధముగ జెప్పుటచే పూర్వము జెప్పిన శంఖధ్వానమున వెనుకజెప్పిన శంఖముయొక్క ధ్వని ఇమిడినదిగ గ్రహింపుడు.

---

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాసశ్శిఖండీ చ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః ॥ 17
,, ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే!
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్దధ్ముః పృథక్పృథక్ ॥ 18

పద॥ కాశ్యః - చ - పరమేష్వాసః - శిఖండీ (1) - చ - మహారథః ।
ధృష్టద్యుమ్నః (2) విరాటః - చ - సాత్యకిః - చ - అపరాజితః ॥

పద॥ ద్రుపదః - ద్రౌపదేయాః - చ - సర్వశః - పృథివీపతే ! (3)
సౌభద్రః - చ - మహాబాహుః - శంఖాన్ - దధ్ముః - పృథక్ - పృథక్ ॥

| | | | |
|---|---|---|---|
| హే పృథివీపతే ! | ఓ ధృతరాష్ట్ర మహారాజా ! | ద్రౌపదేయాశ్చ | ద్రౌపదియొక్క కుమారులున్ను |
| పరమేష్వాసః | శ్రేష్ఠమైన ధనుస్సుగల | మహాబాహుః | భుజబలము గలవాడైన |
| కాశ్యశ్చ | కాశీరాజున్ను | సౌభద్రశ్చ | సుభద్రా కుమారుడైన అభిమన్యుడున్ను |
| మహారథః | మహారథుడైన | | |
| శిఖండీచ | శిఖండియనువాడున్ను | (ఏతే) | (వీరలు) |
| ధృష్టద్యుమ్నః | ధృష్టద్యుమ్నుడున్ను | సర్వశః | అందఱుగ చేరి |
| విరాటశ్చ | విరాటదేశ రాజున్ను | పృథక్ పృథక్ | (వారివారి) వేర్వేరైన |
| అపరాజితః | అపజయమొందనివాడైన | శంఖాన్ | శంఖములను |
| సాత్యకిశ్చ | సాత్యకియను వాడున్ను | దధ్ముః | ఊదిరి. |
| ద్రుపదః | ద్రుపదరాజున్ను | | |

తా॥ ఓ ధృతరాష్ట్ర మహారాజా ! శ్రేష్ఠమైన ధనుస్సుగల కాశీ రాజును, మహారథుడైన శిఖండియును, ధృష్టద్యుమ్నుడున్ను, విరాటరాజున్ను అపజయ మొందనివాడైన సాత్యకియు, ద్రుపదమహారాజున్ను, ద్రౌపది కుమారులున్ను, భుజబలముగల అభిమన్యుడున్ను వీరందఱును చేరి వెవ్వేరైన వారి వారి శంఖముల నూదిరి.

(1) శిఖండి - ముఖమున మీసములులేనివాడు "శిఖండంశ్మశ్రు హాస్యతా". ఇతడు భీష్ముని చంపుటకొఱకే తపస్సుజేసి జనించి మొదట ఆడుదిగనుండి తరువాత పురుషత్వ మొందినవానినిగూర్చి ఈ అధ్యాయము 11 వ శ్లోకము క్రింద టిప్పణిలో చూడుడు.

(2) ధృష్టద్యుమ్నః - ఎవనిచేతను ఎదిరింప వీలులేనివాడు. జనించినపుడే రత్నహారము మొదలగు వాటితో బుట్టినవాడు, ద్రోణాచార్యుని చంపుటకొఱకే, ద్రుపదుడు యజ్ఞముచేయగా జనించినవాడు.

(3) పృథివీపతే - ధృతరాష్ట్రుడు ఈ సంగతులను వినగ వినగ, నిట్టూర్పువిడుచుటను సంజయుడు చూచి "పృథివీ" భూమి యెట్లు అన్నిటిని సహించుకొనుచున్నదో అటులనే మీరున్ను అన్నిదుఃఖములను సహించుకొనవలయునని ధృతరాష్ట్రునకు సూచించుచున్నాడు. లేక భూమియంతయు ఏలుచున్న ఇప్పుడున్న మీ పదవి ఇంతటితో ముగిసినదని సూచించుచున్నదిగను గ్రహింపవచ్చును.



శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్ ॥ 19

పద॥ సః - ఘోషః - ధార్తరాష్ట్రాణాం - హృదయాని - వ్యదారయత్ ।
నభః - చ - పృథివీం - చ - ఏవ - తుములః - వ్యనునాదయన్ ॥

| | | | |
|---|---|---|---|
| తుములః | అంతట వ్యాపించిన | పృథివీంచ | భూమిని |
| సః-ఘోషః-ఏవ | ఆ శబ్దమే | వ్యనునాదయన్ | ప్రతిధ్వనులు నటులు చేయుచున్నదై |
| నభశ్చ | ఆకాశమును | | |

| | | | |
|---|---|---|---|
| ధార్తరాష్ట్రాణాం | ధృతరాష్ట్రుని చేరినవారి యొక్క | హృదయాని | హృదయములను |
| | | వ్యదారయత్ | చీల్చెను. |

**తా॥ అంతట వ్యాపించిన యా (శంఖ) శబ్దమే ఆకాశమును, భూమిని ప్రతిధ్వనినిచ్చునట్లులజేసి ధృతరాష్ట్రుని జేరినవారల హృదయములను చీల్చెను.**

(స్వకీయము) ఈ శ్లోకమున సంజయుడు, ధృతరాష్ట్రుని జేరినవారల హృదయమును. మాధవుడు చేసిన శంఖధ్వానము చీల్చెనని జెప్పుటకు భావమేమన ఇప్పుడే వారెల్లరు ఈ శంఖ ధ్వానముచే చంపబడినవారలైయుద్ధమున దెబ్బతగిలి పడువరకు జీవచ్ఛవములుగ నిలబడిరి అనునదే. ఎందువలననగా ముందు రాబోవు 11 వ అధ్యాయము 33 వ శ్లోకమున "మయైవైతే నిహతాః పూర్వమేవ = నాచేతనే వీరలు ముందుగనే చంపబడియున్నారు" అని భగవంతుడు పలికియున్నాడు. అట్లు ముందుగనే చంపియున్నాననుట ఈ శ్లోకమున జెప్పుచున్న శంఖధ్వనిచే హృదయము చీలెనని జెప్పుటలోని అంతర్భావమని ఊహింపవలసియున్నది.

ఐతే ఈ 15-18 శ్లోకములలో ననేకులు శంఖధ్వానముజేసినదిగ జెప్పఁబడియుండుటచే ఈ 19-వ శ్లోకమున "సః, ఘోషః" అనునది భగవంతుని శంఖధ్వనినిమాత్రము గుర్తించునదిగ నెట్లు భావింతుమనగ ఆ 15-18 శ్లోకముల యంతమున జెప్పియున్నట్లు భగవంతుని శంఖ ధ్వనిలో మిగత యంతయు లోబడినదిగ గ్రహింపవలెను. మరియు 14 వ శ్లోకమున "ప్రదధ్మతుః = గట్టిగనూదిరి" అనిచెప్పియుండుట పైజెప్పిన తాత్పర్యము నాదరించునదిగ తోచుచున్నది.

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః ॥　20
,, హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే !

పద॥ అథ - వ్యవస్థితాన్ - దృష్ట్వా - ధార్తరాష్ట్రాన్ - కపిధ్వజః (1) ।
ప్రవృత్తే - శస్త్రసంపాతే - ధనుః - ఉద్యమ్య - పాండవః ॥
హృషీకేశం - తదా - వాక్యం - ఇదం - ఆహ - మహీపతే ॥

| | | | |
|---|---|---|---|
| హే మహీపతే | ఓ ధృతరాష్ట్రమహారాజా ! | ప్రవృత్తే | మొదలుపెట్టగా |
| అథ | తరువాత | ధనుః | ధనుస్సును |
| కపిధ్వజః | వానరధ్వజుడైన | ఉద్యమ్య | పైకెత్తుకొని |
| పాండవః | పాండుపుత్రుడైన అర్జునుడు | హృషీకేశం | కృష్ణపరమాత్మను (గూర్చి) |
| వ్యవస్థితాన్ | యుద్ధముజేయ సిద్ధముగనున్న | తదా | అప్పుడు |
| ధార్తరాష్ట్రాన్ | ధృతరాష్ట్రుని జేరినవారలను | ఇదం వాక్యం | ఈ మాటను |
| దృష్ట్వా | చూచి | ఆహ | పలుకుచున్నాడు. |
| శస్త్రసంపాతే | ఆయుధ ప్రయోగకాలము | | |

**తా॥ ఓ ధృతరాష్ట్రమహారాజా! తరువాత వానరధ్వజుడైన అర్జునుడు యుద్ధము జేయుటకు సిద్ధముగనున్న దుర్యోధనాదులనుజూచి ఆయుధప్రయోగ కాలము మొదలు పెట్టిన (సమీపించిన)ప్పుడు, ధనుస్సు నెత్తుగనెత్తుకొని శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి ఈ (క్రింద చెప్పబోవు) మాటను జెప్పుచున్నాడు.**

(1) కపిధ్వజః - భీమసేనుని ప్రార్థనమీద హనుమంతుడు యుద్ధమున పాండవులకు జయము గలుగుటకై అర్జునుని రథమునందలి ధ్వజమున నిల్చియుండునట్లు వరమిచ్చిన ప్రకారముగ, ఇప్పుడు నిల్చియుండుటచే వానరధ్వజుడని చెప్పబడినది. (భారతము, అరణ్యపర్వమున 151 వ అధ్యాయమునందు భీముడు మందారపుష్పము దెచ్చుచున్న కథను జూడుడు.)

(స్వకీయము) హనుమంతుడు అర్జునుని రథధ్వజమునందుండుటయందలి గూఢార్థమే మన శ్రీరామునివద్ద నుండినలక్ష్మియగు సీతాదేవి నపహరించిన రావణుని ఇతడు హతమొనర్చి మరల శ్రీరామునివద్ద చేర్చినట్లు, పాండవుల రాజ్యలక్ష్మి నపహరించుకొనిన దుర్యోధనాదులనుజంపి పాండవులకు మరలరాజ్యలక్ష్మిని జేర్చుట నిశ్చయమనుదానిని సూచించుచున్నది.

అర్జున ఉవాచః-

శ్లో॥ సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥ 21
యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।
కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్ రణసముద్యమే ॥ 22

పద॥ సేనయోః — ఉభయోః — మధ్యే — రథం — స్థాపయ — మే — అచ్యుత (1)॥
,, యావత్ — ఏతాన్ — నిరీక్షే(2) — అహం — యోద్ధుకామాన్ — అవస్థితాన్।
కైః — మయా — సహ(3) — యోద్ధవ్యం — అస్మిన్ — రణసముద్యమే॥

| | | | |
|---|---|---|---|
| అర్జునః ఉవాచ | అర్జునుడు చెప్పినది | యోద్ధవ్యం | యుద్ధము జేయవలెను |
| హే అచ్యుత! | అచ్యుతుడైన ఓ కృష్ణా | కైః | ఎవరిచే |
| ఉభయోఃసేనయోః | రెండు సేనలయొక్క | మయాసహ | నాతోగూడ (ఎదిరించి) |
| మధ్యే | మధ్యమున | యోద్ధవ్యం | యుద్ధము జేయవలెను |
| మే | నాయొక్క | (ఇతి) | (అని, దీనికై) |
| రథం | రథమును | యోద్ధుకామాన్ | యుద్ధముజేయ కోరికగల వారలై |
| స్థాపయ | నిలబెట్టుము | | |
| అస్మిన్ | ఈ | అవస్థితాన్ | (ఇచ్చట) నిలబడియున్న |
| రణసముద్యమే | యుద్ధారంభమున | ఏతాన్ | ఈ జనులను |
| మయా | నాచేత | అహం | నేను |
| కైఃసహ | ఎవరితోగూడ (ఎదిరించి) | యావన్నిరీక్షే | చూడబోవుచున్నాను. |

తా॥ అర్జునుడు చెప్పినది - అచ్యుతుడవైన ఓ కృష్ణా! రెండుసేనల మధ్య నా రథమును నిలుపుము. ఈ యుద్ధారంభమున నే నెవరితోగూడ (ఎదిరించి) యుద్ధముజేయవలయును, ఎవరు నాతో (ఎదిరించి) యుద్ధముజేయుదురు అను దీనినెఱుంగుట కొఱకు, యుద్ధముజేయకోరిక గలవారలై (ఇచ్చట) నిలబడియున్న ఈ జనులను నేను జూడబోవుచున్నాను.

(1) అచ్యుతః- నాశములేనివాడు, స్వరూప సామర్థ్యమునకు నాశములేనివాడు. దేశకాలవస్తువులయందు వికారములేనివాడు. లేక తనస్థానమునుండి చలించనివాడగుటచే అచ్యుతుడనియు గ్రహించవచ్చును.

(2) నిరీక్షే - అనునది వర్తమానకాలము (జరుగుచున్నకాలము) ఐనను "యావత్పురానిపాత యోర్లట్" అనువ్యాకరణ సూత్రానుసారముగ 'యావన్నిరీక్షే' అని వచ్చినప్పుడు, చూడబోవుచున్నాననను భవిష్యత్కాలమును (రాబోవుకాలమును) చూపుచున్నది.

(3) సహ - ఈశబ్దమును, "మయాసహ= నాతోకూడ" "కైఃసహ= ఎవరితోకూడ" అను ఈరెండు పదములతోచేర్చి అన్వయపరచి "నేను ఎవరినెదిరించి యుద్ధము జేయవలయును, ఎవరు నాతోకూడ నెదిరించి యుద్ధముజేయవలెను" అనివ్యాఖ్యాతలు అర్థముజేసియున్నారు.

స్వకీయము ఈ 21శ్లో-22-వ శ్లోకములరెంటిని ఆనందగిరి మధుసూదనులను వ్యాఖ్యాతలు ఒకటిగచేర్చి అన్వయపరచి యున్నారు. పదములయర్థమంతయునొక్కటే. ఐతే"యావత్" అనుదానికి మాత్రము ఏప్రదేశమనియు, లేక ఎంతకాలమువఱకనియు, అర్థముచేసియున్నారు. తాత్పర్యమేమన ఈయుద్ధారంభమునందు ఎవరితో యుద్ధము చేయవలయునని తెలిసికొనుటకై ఇచ్చట నిలబడియున్న ఈజనులను నేను "యావన్నిరీక్షే= ఎంతవరకు చూచెదను లేక ఎచ్చోటనుండి జూచెదను, తావత్=ఆకాలమువఱకు లేక అచ్చోట నారథమును నిలబెట్టుము" అనునది.

శంకరానందుడు, శ్రీధరుడు, వీరిద్దరు ఈ రెండు శ్లోకములతో 23-వ శ్లోకమునుజేర్చి అన్వయపరచియుండుటను జూడుడు.

(స్వకీయము) అర్జునుడు తనస్థితిఁదప్పి అహంకారముచేత సర్వలోకనియన్తయైన భగవంతుని ఈవిధముగ నాజ్ఞాపించుట ఏమి విపరీతము. ఇతనిమాటలచే నతనికి కోపముగలుగకుండుటకు "అచ్యుత" అనియు జెప్పుచున్నాడు.



శ్లో॥ యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః ॥　　23

పద॥ యోత్స్యమానాన్ - అవేక్షే - అహం - యే - ఏతే - అత్ర - సమాగతాః॥
ధార్తరాష్ట్రస్య - దుర్బుద్ధేః - యుద్ధే - ప్రియచికీర్షవః॥

| | | | |
|---|---|---|---|
| దుర్బుద్ధేః | చెడ్డబుద్ధిగల | సమాగతాః | చేరియున్నారో |
| ధార్తరాష్ట్రస్య | ధృతరాష్ట్రుని పుత్రుడు దుర్యోధనునకు | తాన్ | వారలను |
| | | యోత్స్యమానాన్ | (దానికై) యుద్ధముజేయబోవుచున్నవారలుగ |
| యుద్ధే | యుద్ధమునందు | | |
| ప్రియచికీర్షవః | ప్రియమును జేయగోరువారై | అహం | నేను |
| యే ఏతే | ఏ ఈ జనులు | అవేక్షే | చూచుచున్నాను. (ఎరుగుచున్నాను) |
| అత్ర | ఇచ్చట | | |

**తా॥ దుర్బుద్ధిగల ధృతరాష్ట్రుని పుత్రుడైన దుర్యోధనునికి, యుద్ధమున ప్రియమును జేయగోరినవారలై, యే ఈ జనులు ఇచ్చట జేరియున్నారో వారలను, (దానికొఱకై యుద్ధముజేయబోవు వారలుగ) నేను చూచుచున్నాను.**

(స్వకీయము) అర్జునుడు ఈ శ్లోకముచే జెప్పినదియు, ముందు 22వ శ్లోకముచేజెప్పినదియు నేమనగా-ఈ యుద్ధారంభమున నేనెవరితో యుద్ధముజేయవలెను, వన్నెదిరించి యుద్ధముచేయబోవు

వారెవరు? అనియుద్ధముజేయుటకై వచ్చియున్న వీరిని నేనుజూడబోవుచున్నాను. దానికై రెండు సేనలమధ్య నారథమునునిలబెట్టుమని ముందుశ్లోకమున జెప్పిముగించెను. ఐతే వీరెల్లరును '"యోద్ధు కామాన్ - అనుటదెట్లు? నీకు దుర్యోధనుడు దప్ప విరోధులు లేరేయనగా, ఇచ్చట దుర్యోధనుని పక్షమున వచ్చియున్నరాజులు నాయెడవారలకుగల విరోధముచే నాతో యుద్ధముజేయబోవువారు కారు. దుర్యోధనుని నిర్బంధముమీద యుద్ధమున వానికిష్టమైనదేదియో దానిని జేయుటకై ఇచ్చటకు వచ్చియుండుటచే వారలు నన్నెదిరించి యుద్ధముజేయబోవు వారలుగ నేనెరుంగుచున్నాను'' అని ఈశ్లోకమున జెప్పుచున్నాడని తాత్పర్యము.

సంజయ ఉవాచః—

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥ 24

,, భీష్మద్రోణప్రముఖతస్సర్వేషాం చ మహీక్షితాం।
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥ 25

పద॥ ఏవం - ఉక్తః - హృషీకేశః (1) - గుడాకేశేన(2) - భారత (3) ।
సేనయోః - ఉభయోః - మధ్యే - స్థాపయిత్వా - రథోత్తమమ్॥
,, భీష్మద్రోణప్రముఖతః(4) - సర్వేషాం - చ - మహీక్షితాం ।
ఉవాచ - పార్థ(5) - పశ్య - ఏతాన్ - సమవేతాన్ - కురూన్(6) - ఇతి॥

| | | | |
|---|---|---|---|
| సంజయ ఉవాచ | సంజయుడు చెప్పినది | సర్వేషాం మహీక్షి- తాం (ప్రముఖే) ։ | అందరురాజులకు నెదురుగను |
| హే భారత | భరతవంశమున జనించిన ధృతరాష్ట్రుడా ! | రథోత్తమం | శ్రేష్ఠమైన రథమును |
| గుడాకేశేన | నిద్రనుజయించిన అర్జునునిచేత | స్థాపయిత్వా | నిలబెట్టి |
| ఏవం | ఈ విధముగా | హే పార్థ | ఓ అర్జునుడా ! |
| ఉక్తః | చెప్పబడిన | సమవేతాన్ | చేరియున్న |
| హృషీకేశః | కృష్ణపరమాత్మ | ఏతాన్ కురూన్ | ఈ కౌరవులను |
| ఉభయోః సేనయోః | రెండు సేనలయొక్క | పశ్య | చూడుము |
| మధ్యే | మధ్యను | ఇతి ఉవాచ | అని చెప్పెను |
| భీష్మద్రోణప్రముఖతః | భీష్మద్రోణుల కెదురుగను | | |

సంజయుడు చెప్పినది:—

**తా॥ భరతవంశమున ఉదయించిన ధృతరాష్ట్రుడా! నిద్రను జయించిన వాడైన అర్జునునిచే ఈ విధముగ చెప్పబడిన కృష్ణపరమాత్మ, యిరు సేనల మధ్య భీష్మ ద్రోణులకెదురుగను, రాజులందరి కెదురుగను, శ్రేష్ఠమైన రథమును నిలువబెట్టి "ఓ అర్జునుడా! చేరియున్న ఈ కౌరవులను చూడుము" అని చెప్పెను.**

(1) హృషీకేశః ఈ పదమునకర్థమును పూర్వపు 15-వ శ్లోకము టిప్పణిలో జూడుడు.

(2) గుడాకేశః - గుడాకేశుడు అనగా నిద్రను జయించినవాడు. లేక దట్టమైన కేశములుగలవాడు.

(3) భారత - అనగా భరతుని వంశమున బుట్టినవాడు. భరతుడనురాజు దుష్యంత మహారాజునకు శకుంతలయందు జనించినవాడు. కణ్వమహర్షిచే పోషింపబడిన శకుంతలయను నామెను, వనమునకు వేటాడుటకై వచ్చిన దుష్యంతుడు, పై కణ్వాశ్రమమున జూచి వారు లేనప్పుడు ఆమెను గాంధర్వ వివాహము జేసికొనిన సమయమున, ఈ భరతుని నామె గర్భమున ధరించెను. భరతుడు జన్మించిన తరువాత కణ్వమహర్షి, ఆబిడ్డతో శకుంతలను దుష్యంత మహారాజు నొద్దకు పంపించగా వారల నా దుష్యంతుడు తన బిడ్డగను భార్యగ నంగీకరించక పోవుటచే నామె అతిదుఃఖమునుపొందియుండగా, ఆకాశవాణి దుష్యంతునకు "ఈ బిడ్డ నీకుమారుడే" యనిచెప్పి యాదరించుటచే నాబిడ్డకు భరతుడని పేరువచ్చెను, ఈ భరతుడు మిక్కిలి కీర్తితో ధర్మరాజ్య పరిపాలనముజేసిన నిమిత్తముగ నితని వంశపరంపర భరతవంశమని ప్రసిద్ధిపొందెను.

(4) ద్రోణః - ద్రోణమనునది కమండలమువంటి యొక కాష్ఠపాత్రము. భరద్వాజ మహర్షియొక్క రేతస్సు మనోవికారముచే వెలువడగా దాని నొక కాష్ఠ(కొయ్య) పాత్రముననుంచెను. దానినుండి వీరు గలిగినవారగుటచే వీరికి ద్రోణుడని పేరు.

(5) పార్థ - కుంతిపేరు పృథ. ఆమె పుత్రుడు పార్థుడు. పార్థయనిచెప్పుటచే స్త్రీ సహజమైన శోక మోహములను అర్జునుడు పొందబోవునదిగ భగవంతుడు సూచించుచున్నాడు.

(6) కురూన్ - అని అర్జునుని వంశమును గుర్తించి చెప్పుట యతనికి బంధుశోక మోహములు గలుగబోవుచున్నవనుదానిని ముందుగనే తెలుపుచున్నది.

(స్వకీయము) ఈ బంధువులనుచూచి అర్జునుడిప్పుడు శోకమోహములను నిశ్చయముగ నొందబోవుచున్నాడని ఎరింగ అతని ఇష్టములకన్నింటికిని మొదటనదీనమై నడుచుచున్న సర్వలోకశరణ్యుడైన ఆ భగవంతుడు భక్తునికొఱకు ఏమిజేయడు! ఆటులనే వెనుక శోకమోహ సముద్రమున బడుచున్న అర్జునుని దానినుండి తరింపజేయుటకై ఆత్మతత్త్వమును అతని కుపదేశించుటకు సమయమును జూచియున్న భగవంతునికి భక్తులయందు ఆహా! ఎట్టి వాత్సల్యము! అర్జునునిభాగ్యమే భాగ్యము! అతను జన్మించిన ఈ భరతకులముజేసిన పుణ్యమే పుణ్యము! అని సంజయుడు తనలోనే ఆనందపడినవాడై "ఓభారత" యని ధృతరాష్ట్రునిజూచి చెప్పుచున్నాడు.

---

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా ॥ 26
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।

పద॥ తత్ర - అపశ్యత్ - స్థితాన్ - పార్థః - పితౄన్ - అథ - పితామహాన్ ।
ఆచార్యాన్ - మాతులాన్ - భ్రాతౄన్ - పుత్రాన్ - పౌత్రాన్ - సఖీన్ - తథా॥
శ్వశురాన్ - సుహృదః - చ - ఏవ - సేనయోః - ఉభయోః - అపి ।

| | | | |
|---|---|---|---|
| అథ | దానికి (కృష్ణపరమాత్మ చెప్పినదానికి) తరువాత | స్థితాన్ | —ఉన్న |
| | | పితౄన్ | పితృవర్గమువారలను |
| పార్థః | అర్జునుడు | పితామహాన్ | తాత వర్గమువార్లనున్ను |
| తత్ర | అచ్చట | ఆచార్యాన్ | గురువులనున్ను |

| | | | |
|---|---|---|---|
| మాతులాన్ | మేనమామలను | ఉభయోస్సేనయోరపి | ఇరుపక్ష సేనల యందును |
| భ్రాతౄన్ | సహోదరులను | శ్వశురాన్ | మామలను |
| పుత్రాన్ | పుత్రులను | సుహృదశ్చైవ | ప్రతిప్రయోజనమును ఎదురుచూడని స్నేహితులను |
| పౌత్రాన్ | మనుమలను | | |
| సఖీన్ | స్నేహితులను | అపశ్యత్ | చూచెను |
| తథా | అటులనే | | |

తా॥ అట్లు కృష్ణపరమాత్మ చెప్పిన తరువాత అర్జునుడు అచ్చటనున్న (భూరిశ్రవస్సువంటి) పితృబాంధవ్యముగలవారిని, (భీష్మునివంటి) పితామహత్వము గలవారిని, (ద్రోణాచార్యులవంటి) గురువులను, (శల్యునివంటి) మేనమామ బంధుత్వముగలవారిని, (దుర్యోధనునివంటి) సహోదరత్వముగలవారిని, (దుర్యోధనుని) కుమారుడు లక్ష్మణుడువంటి) పుత్రత్వముగలవారిని, (లక్ష్మణుడు మొదలైనవారి కుమారులైన) పౌత్రత్వముగలవారిని, (అశ్వత్థామవంటి స్నేహితులను, అట్లనే యిరుపక్ష సేనలలోనున్న (ద్రుపదరాజువంటి) కూతుళ్లనిచ్చిన మామగార్లను ప్రయోజనము నొందవచ్చునని తలంపుతో స్నేహము జేయువారివలె నుండని వారలైన (కృతవర్మవంటి) స్నేహితులను జూచెను.

శ్లో॥ తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూనవస్థితాన్ ॥ 27
కృపయా పరయాఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్ ।

పద॥ తాన్ - సమీక్ష్య - సః - కౌంతేయః - సర్వాన్ - బంధూన్ - అవస్థితాన్ ।
కృపయా - పరయా - అవిష్టః - విషీదన్ - ఇదం - అబ్రవీత్ ॥

| | | | |
|---|---|---|---|
| సఃకౌంతేయః | కుంతీపుత్రుడైన ఆ అర్జునుడు | కృపయా | కృపచేత, మోహముచేత |
| అవస్థితాన్ | నిలబడియున్న | ఆవిష్టః | ప్రవేశింపబడిన వాడుగను |
| తాన్ | ఆ | విషీదన్ | వ్యసనము నొందినవాడుగను |
| సర్వాన్ | అందరు | ఇదం | దీనిని (ముందు రాబోవు వాక్యమును) |
| బంధూన్ | బంధువులను | | |
| సమీక్ష్య | బాగుగచూచి | అబ్రవీత్ | చెప్పెను |
| పరయా | విలక్షణమైన | | |

తా॥ కుంతీపుత్రుడైన ఆ అర్జునుడు యుద్ధభూమియందు నిలబడియున్న యా బంధువులెల్లరిని బాగుగ చూచి విలక్షణమైనకృప, అనగా మోహమొందిన వాడుగను, దుఃఖముజెందినవాడుగను అయి, ముందు చెప్పబోవు వాక్యమును పలికెను.

(స్వకీయము) ఈ శ్లోకములలో అర్జునుడు ఆ సేనలోనున్న పితలు, పితామహులు, గురువులు మొదలైన బంధువులెల్లరిని బాగుగ చూచెనన్నందున, ఇంతవరకు వారలను జూడక, ఇప్పుడేచూచెనని యర్థముకాదు. ఇంతవరకు శత్రువులుగ భావించిన వీరలను ఇప్పుడు శోకమోహములనొందుటచే తనబంధువులనే భావనగల దృష్టినొందినవాడై చూచెనని తాత్పర్యము.

అర్జునునకు ఇప్పుడు గలిగియున్న కృప లోక ప్రసిద్ధమైన కృపగాదు. విలక్షణమైన కృప. అతడు కృపయని తలంచుచున్నాడేగాని అది వాస్తవమైన కృపగాదు. మఱేమన మోహమే.

ముందు రాబోవు 2-వ అధ్యాయము 2-3 శ్లోకములలో భగవంతుడు "ఈ కశ్మలము" నిన్నెట్లు పొందెననియు "ఈ క్లైబ్యము" నొందకుమనియు జెప్పియుండుట ననుసరించి అర్జునున కిప్పుడు గలిగిన మనోభావము ఇట్టిదని ఊహింపవచ్చును. పైశ్లోకముల టిప్పణిని జూడుడు.



అర్జున ఉవాచ:—

శ్లో॥ దృష్ట్వేమంస్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం ॥
సీదన్తి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥ 29

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥ 30

పద॥ దృష్ట్వా - ఇమం - స్వజనం - కృష్ణ (1) - యుయుత్సుం - సముపస్థితం ॥
సీదన్తి - మమ - గాత్రాణి - ముఖం - చ - పరిశుష్యతి ।
వేపథుః - చ - శరీరే - మే - రోమహర్షః - చ - జాయతే ॥
గాండీవం - స్రంసతే - హస్తాత్ - త్వక్ - చ - ఏవ - పరిదహ్యతే ।
న - చ - శక్నోమి - అవస్థాతుం - భ్రమతి - ఇవ - చ - మే - మనః ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | వేపథుశ్చ | వణకున్ను |
| హే కృష్ణ ! | ఓ కృష్ణుడా ! | రోమహర్షశ్చ | గగుర్పాటున్ను |
| యుయుత్సుం | యుద్ధముజేయ గోరినట్టియు | జాయతే | కలుగుచున్నది |
| సముపస్థితం | చేరినిలబడియున్నట్టియు | గాండీవం | గాండీవమను నాధనుస్సు |
| ఇమంస్వజనం | ఈ బంధువులను | హస్తాత్ | చేతినుండి |
| దృష్ట్వా | చూచి | స్రంసతే | జారుచున్నది |
| (స్థితస్య) | (నిలిచియున్న) | త్వక్చైవ | దేహముమీది తోలును |
| మమ | నాయొక్క | పరిదహ్యతే | తపించుచున్నది (మండుచున్నది) |
| గాత్రాణి | అవయవములు | | |
| సీదన్తి | పడిపోవుచున్నవి | అవస్థాతుం | నిలిచియుండుటకు |
| ముఖంచ | నోరున్ను | నశక్నోమి | శక్తిలేనివాడుగనున్నాను |
| పరిశుష్యతి | ఎండిపోవుచున్నది | మే | నాయొక్క |
| మే | నాయొక్క | మనః | మనస్సు |
| శరీరే | దేహమునందు | భ్రమతీవచ | భ్రమనొందుచున్నట్లున్నది. |

తా॥ అర్జునుడు (కృష్ణపరమాత్మను గురించి) చెప్పినది - ఓ కృష్ణా! యుద్ధముజేయుగోరికతో చేరినిలబడియున్న ఈ బంధువులనుజూచి నా యవయవములు క్రుంగిపోవుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. నా దేహమున వణకున్ను, గగుర్పాటున్ను గలుగుచున్నవి. గాండీవము చేతినుండి జారు

చున్నది. దేహముమీద చర్మము మండుచున్నది. రథమున నిలబడుటకు శక్తిలేనివానిగనున్నాను. నా మనస్సు భ్రమనొందినదివలె నున్నది.

(1) కృష్ణా - కృష్ = భూమి, న - సుఖము. భూస్వరూపముగను, సుఖస్వరూపముగ నుండుటచే కృష్ణుడనియు, నీరుగొన్న మేఘమువంటి నల్లని దేహముగలవాడగుటచే కృష్ణుడనియు పేరు. లేక దైత్యులను సంహరించువాడగుటచే కృష్ణుడనియు జెప్పవచ్చును.

(స్వకీయము) ఈ శ్లోకములలో అర్జునుడు తనకుగలిగినట్లు జెప్పినవన్నియు శోకము యొక్క గుర్తులు. అతనిగాండీవము చేతినుండిజారుట, అతడు తన స్వధర్మమునువిడచి పారుచున్నాడనుదానిని సూచించుచున్నది.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే ॥ 31

,, న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా ॥ 32

పద॥ నిమిత్తాని - చ - పశ్యామి - విపరీతాని - కేశవ (1)।
న - చ - శ్రేయః - అను - పశ్యామి - హత్వా - స్వజనం - ఆహవే ॥

,, న - కాంక్షే - విజయం - కృష్ణ (2) - న - చ - రాజ్యం - సుఖాని - చ।
కిం - నః - రాజ్యేన - గోవింద (3) - కిం - భోగైః - జీవితేన - వా ॥

| | | | |
|---|---|---|---|
| హే కేశవ! | ఓ కేశవుడా! | రాజ్యం చ | రాజ్యమునుగాని |
| విపరీతాని నిమిత్తాని చ | అపశకునములను | నకాంక్షే | నేను కోరుటలేదు |
| పశ్యామి | చూచుచున్నాను | సుఖాని చ | సుఖములనున్ను |
| ఆహవే | యుద్ధమునందు | | కోరుటలేదు |
| స్వజనం | సొంత బంధు జనులను | | ఓ గోవిందా! |
| హత్వా | చంపి | నః | మాకు |
| అను | పిదప | రాజ్యేన | రాజ్యముచేత |
| శ్రేయః | (దానిచే) శ్రేయస్సును | కిం | ఏమి? (ప్రయోజనము) |
| న పశ్యామి | నేను చూచుటలేదు | భోగైః | భోగములచేతగాని |
| హే కృష్ణ! | ఓ కృష్ణుడా! | జీవితేనవా | బ్రతికియుండుటచేతగాని |
| విజయం | జయమునుగాని | కిం | ఏమి (ప్రయోజనము?) |

**తా॥** ఓ కేశవా! అపశకునములనున్ను చూచుచున్నాను. యుద్ధమున సొంతబంధువులను చంపి వెనుక (దానిచేనెట్టి) గొప్పతనమును (పురుషార్థమును) నేను జూచుటలేదు. ఓ కృష్ణా! జయమునుగాని, రాజ్యమునుగాని, సుఖములన్నుగాని, నేను కోరుటలేదు. ఓగోవిందా! మాకురాజ్యముచేతగాని, భోగములచేతగాని, బ్రతికియుండుటచేతగాని, ఏమి ప్రయోజనము?

(1) కేశవ　అందమైన వెంట్రుకలు గలవాడగుటచే కేశవుడనియు, కేశియను అసురుని జంపినందున కేశవుడనియు, కః = బ్రహ్మ = అః = విష్ణువు, ఈశః = రుద్రుడు, ఈ ముగ్వురును వః - స్వాధీనముననుంచి యున్నవాడగుటచే కేశవుడనియు, కః = బ్రహ్మ, ఈశః = రుద్రుడు, వీరలను (సృష్ట్యాదికార్యములయందు) ప్రవర్తించియుండునటుల ప్రేరేపించు వాడగుటచే కేశవుడనియు జెప్పవచ్చును.

లేక "క్లేశవః క్లేశనాశాయ'' అనునది పురాణప్రసిద్ధమైనదిగాన క్లేశమునునివృత్తిజేయు వాడు కావున నా క్లేశమును నివృత్తిజేయుమని అర్జునుడు చెప్పనదిగను జెప్పవచ్చును.

(2) కృష్ణ - భక్తులశోకమును కర్షించువాడు అనగా నాశముచేయువాడు. కావున నా శోకమును నివర్తించుము. లేక "సర్వం కరోతీతి కృష్ణః'' అన్నిటిని జేయువాడగుటచే నామోహ మునకును కారణము నీవేయను విపరీతజ్ఞానముతో జెప్పినదిగను జెప్పవచ్చును. మోహ మనునది జీవుని మనోభావములచే జీవుడు సృష్టించుకొనునది. (తానుగ నేర్పరచు కొనునది.) త్రాటినిచూచి సర్పమని భ్రాంతిపొందినట్లు ఇది ఈశ్వరుని సృష్టిగాదు. ఈ మోహమునకు జీవుడే ఉత్తరవాది, ఏలన వివేకముచే 'పాముగాదు, త్రాడు' అను జ్ఞానమువచ్చినపిమ్మట మోహము నివర్తించుచున్నది. దానిని ఈశ్వరునియందు ఆరో పించుట మోహలక్షణమని గ్రహింపుడు.

(3) గోవింద - వరాహరూపమెత్తి నీటిలోమునిగియుండిన, గో = భూమిని, విందా = పొందిన వాడు (అనగా బయటబెట్టినవాడు) అగుటచే గోవిందుడనియు, లేక "గాం + విందతి = వేదవాణీం ప్రాప్నోతి'' వేదము నొందినవాడు గావున గోవిందుడనియు, లేక, గాం = ధేనుం + విందతి = గోవులనొందినవాడు అనగా స్వాధీనముచేసికొనినవాడు కావున గోవిందుడనియు పేరు. జీవులకు గోవులనియు పేరు.

❖❖❖❖❖❖❖❖❖❖❖

శ్లో॥ యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥　33
,, ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః।
మాతులాశ్శ్వశురాః పౌత్రాః స్యాలాస్సంబంధిన స్తథా॥　34

పద॥ యేషాం - అర్థే - కాంక్షితం - నో - రాజ్యం - భోగాః - సుఖాని - చ।
తే - ఇమే - అవస్థితాః - యుద్ధే - ప్రాణాన్ - త్యక్త్వా - ధనాని - చ॥
ఆచార్యాః - పితరః - పుత్రాః - తథా - ఏవ - చ - పితామహాః।
మాతులాః - శ్వశురాః - పౌత్రాః - స్యాలాః - సంబంధినః తథా॥

| | | | |
|---|---|---|---|
| యేషాంఅర్థే | ఎవరికొఱకు | యేషాంఅర్థే కాంక్షితాని | ఎవ్వరికొఱకు కోరబడ దగినవో |
| నః | మాకు | | |
| రాజ్యం | రాజ్యము | తే | అటువంటి |
| కాంక్షితం | కోరబడ తగినదో | ఆచార్యాః | గురువులు |
| భోగాః | భోగములున్ను (సుఖసాధన విషయములున్ను) | పితరః | తండ్రులు |
| | | పుత్రాః | పుత్రులు |
| సుఖానిచ | సుఖములున్ను | తథైవ చ | అటులనే |

| | | | |
|---|---|---|---|
| పితామహాః | తాతలు | ఇమే | వీరెల్లరును |
| మాతులాః | మేనమామలు | ప్రాణాన్ | ప్రాణములనున్ను |
| శ్వశురాః | మామలు | ధనాని చ | ధనములనున్ను |
| పౌత్రాః | మనుమలు | త్యక్త్వా | విడిచి (విడుచుటకు సిద్ధమై) |
| స్యాలాః | బావ మరదులు | యుద్ధే | యుద్ధరంగముమీద |
| తథా | అటులనే | అవస్థితాః | నిలబడియున్నారు. |
| సంబంధినః | సంబంధులు | | |

తా॥ ఎవరికొఱకు మాచే రాజ్యమున్ను, భోగములున్ను, (సుఖసాధన విషయములున్ను) దానిచే గలుగు సుఖములున్ను కోరదగినవో, అట్టి గురువులు, తండ్రులు, పుత్రులు, అటులనే తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమరదులు అటులనే సంబంధులు, వీరెల్లరును ప్రాణములను, సొమ్ములను, విడిచి (విడువసాహసించి) యుద్ధభూమిమీద నిలబడియున్నారు.

---

శ్లో॥ ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥ 35

పద॥ ఏతాన్ - న - హంతుం - ఇచ్ఛామి - ఘ్నతః - అపి - మధుసూదన (1) ।
అపి - త్రైలోక్యరాజ్యస్య - హేతోః - కిం ను - మహీకృతే ॥

| | | | |
|---|---|---|---|
| హే మధుసూదన | ఓ కృష్ణా ! | హేతోరపి | నిమిత్తముచేతను |
| ఘ్నతోఽపి | (నన్ను) చంపువారుగనున్నను | హంతుం | చంపుటకు |
| ఏతాన్ | వీరలను | నేచ్ఛామి | నేను గోరుటలేదు |
| త్రైలోక్య రాజ్యస్య | మూడులోకముల రాజ్యాధిపత్యముయొక్క | మహీకృతే | భూమికొఱకై |
| | | కింను | ఏమి? |

తా॥ ఓ మధుసూదనుడా ! ఈ దుర్యోధనాదులు, నన్ను జంపువారుగనున్నను వీరలను మూడులోకముల రాజ్యాధిపత్యముకొఱకైనను నేను చంపగోరుటలేదు. ఈ భూమికొఱకు చెప్పునదేమి? అనగా ఈ యల్పమైన రాజ్యముకొఱకయ్యే వారల నేను జంపగోరెదనా? కోరను అని తాత్పర్యము.

(1) మధుసూదన - మధువను నసురుని జంపినవాడుగాన ఈ పేరు బడసెను.

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యాజ్జనార్దన ।
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః ॥ 36

పద॥ నిహత్య - ధార్తరాష్ట్రాన్ - నః - కా - ప్రీతిః - స్యాత్ - జనార్దన (1) ।
పాపం - ఏవ (2) - ఆశ్రయేత్ - అస్మాన్ - హత్వా - ఏతాన్ - ఆతతాయినః - (3) ॥

| | |
|---|---|
| హే జనార్దన | ఓ జనార్దనుడా ! |
| ధార్తరాష్ట్రాన్ | ధృతరాష్ట్రుని పుత్రులను |
| నిహత్య | చంపి |
| నః | మాకు |
| కాప్రీతిః | ఏమిసంతోషము |
| స్యాత్ | కాబోవుచున్నది |
| ఆతతాయినః (అపి) | ఆతతాయులైనను |
| ఏతాన్ | వీరలను |
| హత్వా | చంపి |
| (స్థితాన్) | (నిలచియున్న) |
| అస్మాన్ | మమ్ములను |
| పాపమేవ | పాపమే |
| ఆశ్రయేత్ | పొందును. |

తా॥ ఓ జనార్దనుడా ! ధృతరాష్ట్రుని పుత్రులనుజంపిన మాకేమి సంతోషము గలుగబోవుచున్నది? ఆతతాయులైనను (ఆతతాయులను జంపు విషయమున దోషములేదని చెప్పవచ్చును ఐనను) వీరలను జంపుటచే మాకు పాపమే సంభవించును.

(1) జనార్దన - దుష్టనిగ్రహము జేయువాడు కావున జనార్దనుడనియు, ఇహమునందును పరమునందును సౌఖ్యములనిచ్చుటకై జనులచే యాచింపబడుచున్నవాడుగాన జనార్దనుడనియు పేరు. లేక జనులకు వారి వారి పాపమునకు తగినటుల శిక్షను విధించువాడుగావున జనార్దనుడు. అందుచేత ఈ పాపమును మేముజేసిన నీవు శిక్షించక విడచెదవా యని యర్జునుని తాత్పర్యము.

(2) ఏవ - ఈ శబ్దమును "అస్మాన్" అనుదానితోజేర్చి అస్మానేవ = మమ్ములనే పాపమొందును. వార్లనొందదనియు, లేక "ఆశ్రయేదేవ" అనియెత్తుకొని మమ్ములను పాప మొందనే పొందును. అనగా నిశ్చయముగ పొందుననియు అన్వయపరచవచ్చును.

(3) ఆతతాయినః - ఆతతాయులెవరనగా:—

శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః।
క్షేత్రదారాపహర్తాచ షడేతే హ్యాతతాయినః ॥

(ఇంటికి) నిప్పంటించినవాడు, (అన్నములో) విషముగలిపినవాడు, ఆయుధముచే జంపవచ్చినవాడు, ధనమునపహరించినవాడు, భూమిని ఆక్రమించినవాడు, భార్యనపహరించిన వాడు, ఈ యారుగురున్ను ఆతతాయులని చెప్పబడుదురు. ఈ ఆరువిధములైన వ్యాపారములున్ను దుర్యోధనాదులచే పాండవుల విషయమున జేయబడినవి. అందుచేత నాతతాయులని చెప్పఁబడిరి. (మహాభారతము, ఆదిపర్వము - 128, 148, సభాపర్వము 76 ఈ అధ్యాయములను జూడుడు) ఆతతాయులను జంపుటలో దోషములేదనుదానికి ప్రమాణమేమనగా:—

శ్లో॥ ఆతతాయిన మాయాంతం హన్యాదేవావిచారయన్ ।
నాతతాయివధే దోషో హంతుర్భవతి కశ్చన ॥

ఎదుటబడిన ఆతతాయులను విచారించకయే చంపవలయును. ఆతతాయులను జంపువారికి ఎట్టిదోషమునులేదు. (పద్మపురాణము, సృష్టికాండము 51 వ అధ్యాయమును జూడుడు)

(స్వకీయము) ఈ శ్లోకము 2 వ పాదమునకు ఆనందగిరి మొదలగువారలు రెండు విధములుగ, క్రిందకనబరచియున్నట్లు అన్వయము చేసియున్నారు. ఎట్లనగా:

1. అస్మాన్ = (యుద్ధముచేయక నిలబడియున్న) మమ్ములను, హత్వా = చంపిన యెడల, ఏతాన్ = ఈ, ఆతతాయినః = ఆతతాయులను, పాపమొందనేయొందును.

2. ఏతాన్ = గురు సహోదర సుహృత్ప్రభృతులైన వీరలను, హత్వా = చంపి, వయం = మేము, ఆతతాయినః = ఆతతాయులుగ, స్యామ = అగుదుము, తరువాత పాపము మమ్ములనే పొందును.

తాత్పర్యమేమనగ, గురువు మొదలగువార్లతోగూడి నిలబడియున్న ఆతతాయులైన వీరలను మనము యుద్ధమున జంపుటచే వారలకు ఆతతాయిత్వము పోయి వారలు స్వర్గమునొందుదురు. ఎందువల్లననగా-"ద్వావిమౌ పురుషౌలోకే సూర్యమండలభేదినౌ, పరివ్రాడ్యోగయుక్తశ్చ రణేచాభిముఖో హతః" అనునట్లు, యుద్ధమున జంపఁబడినవానికి స్వర్గము. కావున దుర్యోధనాదులను మనము యుద్ధమున జంపుటచే వారలకు స్వర్గలోకము లభించుటయు, మనకు నరకప్రాప్తియు గలుగుటయే ఫలమని అర్జునుడు చెప్పినట్లగుచున్నది.

అయితే ఆతతాయులను జంపుటలో పాపములేదని మునుపు ప్రమాణము జెప్పఁబడియుండగా అర్జునుడు దుర్యోధనాదులైన ఆతతాయులను చంపుటచే తనకు పాపమేగలుగునని ఎట్లు చెప్పవచ్చుననగా, పూర్వము ఆతతాయులను చంపమనిజెప్పిన ప్రమాణము అర్థశాస్త్రవచనము. దానికంటె మేలైనదియు ప్రాబల్యముగలదియునైన ధర్మశాస్త్రప్రమాణము "నహింస్యాత్సర్వా భూతాని = ఏ ప్రాణులకున్ను ఎప్పుడున్ను హింసజేయగూడదు" అనియు "స ఏవ పాపిష్ఠతమో యః కుర్యాత్కులనాశనం = ఎవ్వఁడు కులనాశనమును చేయుచున్నాడో అతడు పాపులలో మొదటివాడ"నియు ఉండుటచేత దుర్యోధనాదులనుజంపి కులనాశమును గలుగచేయుటచే పాపమవశ్యముగ తమకు సంభవించునని అర్జునుని తాత్పర్యము.



శ్లో॥ తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్ ।
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ ॥ 37

పద॥ తస్మాత్ - న - అర్హాః వయమ్ - హన్తుం - ధార్తరాష్ట్రాన్ - సబాంధవాన్ ।
స్వజనం - హి - కథం - హత్వా - సుఖినః - స్యామ - మాధవ (1) ॥

| | | | |
|---|---|---|---|
| హే మాధవ ! | ఓ మాధవుడా ! | నార్హాః | యోగ్యులు కాకాలము |
| తస్మాత్ | అందువలన | స్వజనం | బంధువులను |
| సబాంధవాన్ | బంధువులతోగూడిన | హత్వా | చంపి |
| ధార్తరాష్ట్రాన్ | ధృతరాష్ట్రుని పుత్రులను | కథం | ఎట్లు |
| హన్తుం | చంపుటకు | సుఖినః | సుఖముగలవారముగ |
| వయం | మేము | స్యామ హి | అగుదుము? |

తా॥ ఓ మాధవుడా ! అందుచేత బంధువులతోగూడిన ధృతరాష్ట్రుని పుత్రులను చంపుటకు మేము యోగ్యులము కాము. బంధుజనులనుచంపి ఎట్లు సుఖముగలవారమగుదుము?

(1) మాధవ - నీవు లక్ష్మీపతివి కావున ఈ అలక్ష్మీకృతమైన కార్యమును నేను జేయుట నీకు సమ్మత మగునా? అనునది అర్జునుని తాత్పర్యము.

శ్లో॥ యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకం ॥　　38

,, కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుం ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ॥　　39

పద॥ యది - అపి - ఏతే - న - పశ్యన్తి - లోభోపహత చేతసః ।
కులక్షయకృతం - దోషం - మిత్రద్రోహే - చ - పాతకం ॥
,, కథం - న - జ్ఞేయం - అస్మాభిః - పాపాత్ (1) అస్మాత్ - నివర్తితుం ।
కులక్షయకృతం - దోషం - ప్రపశ్యద్భిః - జనార్దన (2) ॥

| | | | |
|---|---|---|---|
| లోభోపహతచేతసః | లోభముచే వివేకనాశముగల మనస్సుగల | దోషం | దోషమును (పాపమును) |
| | | ప్రపశ్యద్భిః | ఎరుగుచున్న |
| ఏతే | వీరలు (దుర్యోధనాదులు) | అస్మాభిః | మాచేత |
| కులక్షయకృతందోషం | కులనాశముచే గలుగు దోషమునున్ను | అస్మాత్ పాపాత్ | ఈ పాపమునుండి |
| | | నివర్తితుం | నివర్తించుకొనుటకు |
| మిత్రద్రోహే | మిత్రద్రోహమున (గలుగు) | హే జనార్దన ! | ఓ జనార్దనుడా ! |
| పాతకంచ | పాతకమునున్ను | కథం | ఎట్లు |
| యద్యపి న పశ్యన్తి | తెలిసికొనక పోయినను | నజ్ఞేయం | తెలిసికొనక పోవచ్చును? |
| కులక్షయకృతం | కులనాశముచే గలుగునట్టి | | |

తా॥ (రాజ్య) లోభముచే వివేకశూన్యమగు మనస్సుగల దుర్యోధనాదులు కులనాశముచే గలుగు దోషమును, మిత్రద్రోహముచే గలుగు పాతకమును తెలిసికొనక పోయినను కులనాశముచే గలుగుదోషము నెరుంగుచున్న మేము ఈ పాపమునుండి నివర్తించుకొనుటకు ఓ జనార్దనా! ఎట్లు తెలిసికొనకుందుము?

(1) పాపాత్ - 'ఈ పాపము' అనుదానికి "బంధువధము ఫలముగాగల యుద్ధరూపమైన పాపము" అని ఆనందగిరి మొదలగువారు అర్థముజేసియున్నారు. ఐతే శంకరానందులు "ఈ పాపము" అనునది కులక్షయమగు పాపమని అర్థము చేసియున్నారు.

(2) జనార్దన - పాపిష్ఠి జనులయొక్క హృదయమున నీవు భీతినిగలుగజేయువాడవు కావున పాపము అని తెలిసియు ఆ పాపము నెట్లుచేయ మనస్సు సాహసించునని తాత్పర్యము. లేక జనులను వారి వారి పాపములకు తగినట్లు శిక్షించువాడవగుటచే ఈ పాపమును జేసిన, నీ శిక్షనుండి ఎట్లు తప్పగలమని చెప్పినట్లు గ్రహించవచ్చును.

(స్వకీయము) మూఢజనోచితమైన క్షణికమగు ఆభాస సుఖముయొక్క ఆశచే, దుర్యోధనాదులు మతిభ్రష్టులై కులనాశముచేయుటలో గలుగుపాపము నెరుంగని కారణమున ఆ పాపమును జేయయత్నించినను, బంధువధరూపమైన ఈ కులక్షయ కృతపాపము నిరంతరమైన నరకమునకు కారణమని ఎరింగిన మనము ఆ పాపమును తెలిసియేచేయుట మహత్తైన పాపము. దీనిని చేయక నివృత్తిచేసికొనుటయే మన వివేకమునకు ఫలమని అర్జునుని తాత్పర్యము.

శ్లో॥ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత ॥ 40

,, అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥ 41

,, సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।
పతన్తిపితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః ॥ 42

,, దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ 43

,, ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।
నరకే నియతంవాసో భవతీత్యనుశుశ్రుమ ॥ 44

పద॥ కులక్షయే - ప్రణశ్యన్తి - కుల ధర్మాః - సనాతనాః ।
ధర్మే - నష్టే - కులం - కృత్స్నం - అధర్మః - అభిభవతి - ఉత ॥

,, అధర్మాభిభవాత్ - కృష్ణ (1) - ప్రదుష్యన్తి - కులస్త్రియః ।
స్త్రీషు - దుష్టాసు - వార్ష్ణేయ - (2) - జాయతే - వర్ణసంకరః ॥

,, సంకరః - నరకాయ - ఏవ - కులఘ్నానాం - కులస్య - చ ।
పతన్తి - పితరః - హి - ఏషాం - లుప్తపిండోదక క్రియాః ॥

,, దోషైః - ఏతైః - కులఘ్నానాం - వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యన్తే - జాతిధర్మాః కులధర్మాః - చ - శాశ్వతాః ॥

,, ఉత్పన్నకులధర్మాణాం - మనుష్యాణాం - జనార్దన (3) ।
నరకే - నియతం - వాసః - భవతి - ఇతి - అనుశుశ్రుమ ॥

| | |
|---|---|
| కులక్షయే | కులనాశనముచే |
| సనాతనాః | అనాదిగనున్న |
| కులధర్మాః | కులధర్మములు |
| ప్రణశ్యన్తి | పూర్తిగా నాశమొందును |
| ధర్మేనష్టే | (కుల) ధర్మము నశించినచో |
| కృత్స్నంకులం ఉత | (మిగత) కులమంతయును గూడ |
| అధర్మః | అధర్మము |
| అభిభవతి | వ్యాపించును |
| హే కృష్ణ ! | ఓ కృష్ణుడా ! |
| అధర్మాభిభవాత్ | అధర్మము వ్యాపించినచో |
| కులస్త్రియః | కులస్త్రీలు |
| ప్రదుష్యన్తి | పాతివ్రత్య హీనలగుదురు |
| స్త్రీషుదుష్టాసు | స్త్రీలు పాతివ్రత్యము చెడినచో |
| వర్ణసంకరః జాయతే | జాతులు కలియుట గలుగును |
| హే వార్ష్ణేయ ! | ఓ కృష్ణా ! |
| సంకరః | జాతుల కలయిక |
| కులఘ్నానాం | కులనాశము చేయువారికిన్ని |
| కులస్యచ | కులమునకున్ను |
| నరకాయైవ | నరకహేతువేయగును |
| ఏషాం | వీరియొక్క |
| పితరః | పితరులు |
| లుప్తపిండోదకక్రియాః | పిండోదక క్రియలులేక |
| పతన్తి | (నరకమున) పడుదురు |
| వర్ణసంకరకారకైః | జాతులచేరికను గలుగ చేయునట్టి |
| ఏతైః | ఈ |
| కులఘ్నానాం | కులమును చెడిపినవారల యొక్క |

| | | | |
|---|---|---|---|
| దోషైః | దోషములచేత | ఉత్సన్నకులధర్మాణాం | నశించిన కులధర్మములుగల |
| శాశ్వతాః | అనాదిగనున్న | మనుష్యాణాం | మానవులకు |
| జాతిధర్మాః | జాతిధర్మములున్న | నరకే | నరకమున |
| కులధర్మాశ్చ | కులధర్మములున్ను, ఆశ్రమ ధర్మాదులున్ను | నియతం | ఎల్లప్పుడును |
| | | వాసః | నివాసము |
| ఉత్సాద్యన్తే | నశింపజేయబడుచున్నవి | భవతీతి | కలుగునని |
| హే జనార్దన ! | ఓ జనార్దనుడా ! | అనుశుశ్రుమ | వినియున్నాము. |

తా॥ కులము నాశమొందినచో అనాదిగనున్న కులధర్మమంతయు నశించును. కులధర్మము నశించినచో, మిగత కులమునకంతకునుగూడ నధర్మము వ్యాపించును. ఓ కృష్ణా! అధర్మము వ్యాపించినచో కులస్త్రీలు పాతివ్రత్యము చెడినవారగుదురు. స్త్రీలపాతివ్రత్యము నశించినచో జాతులకలయిక యేర్పడును. ఓ కృష్ణా! జాతులకలయిక కులనాశముచేయువారికిని కులమునకున్ను నరకహేతువేయగును. వీరల పితరులు పిండముచేతను (అన్నముచేత చేయబడే ఉంట) (ఉదక) నీటిచే చేయబడు (శ్రాద్ధ తర్పణాది) క్రియలచేగలుగు ప్రయోజనములేక నరకమున బడుదురు. జాతుల కలయికను కలుగజేయుచున్న ఈ కులమును జెడిపినవారల దోషములచేత అనాదిగనున్న జాతి ధర్మములున్ను, కులధర్మములున్ను, ఆశ్రమధర్మాదులున్ను నాశనముజేయబడుచున్నవి. ఓ జనార్దన! కులధర్మములను విడచిన మానవులకు నరకమున నెల్లప్పుడును వాసముగలుగునని వినియున్నాము.

(1) కృష్ణ - అధర్మమును సంహరించువాడు. అధర్మనివృత్తికొఱకై యవతరించుచున్న నీకు అధర్మము వ్యాపించునట్లుజేయు కార్యములు సమ్మతములగునా యని తాత్పర్యము.

(2) వార్ష్ణేయ - వసుదేవునికులమైన వృష్ణికులమున నవతరించినవాడు కావున వార్ష్ణేయుడనిపేరు. ఇచ్చట అర్జునుడు "వార్ష్ణేయ" అని వసుదేవుని కులమును గుర్తించి జెప్పుట ఆ కుల స్త్రీలను కురుకులమువారు వివాహము జేసికొని యుండుటచే ఆ కులమునందలి స్త్రీలకు అపవాదము గలిగినచో వారలు జన్మించిన కులమైన వృష్ణికులమునకున్ను ఆ కులమున నవతరించిన మీకున్ను అపవాదమునకు కారణమగునని సూచించుచున్నది.

(3) జనార్దన - భగవంతుని యాజ్ఞారూపమైన శ్రుతిస్మృతులను ఉల్లంఘన చేసిన పాపులను దానికై పీడించువాడు. అనగా నరకమున త్రోయువాడు - లేక జనులెల్లరిచేతను నరకము నుండి రక్షించుటకై యాచింపబడువాడు. నరకమునుండి నివృత్తిని నీవద్దనుండి ఎల్లరు యాచించునడిగ నుండగ, నరకమునకు హేతువైన ఈ కార్యమున మనము ప్రవర్తించుట ఉచితముగాదని తాత్పర్యము.

(స్వకీయము) 40-వ శ్లోకమున కులము నశించుటచే కులధర్మములు నశించిపోవునని జెప్పుకారణము పై ధర్మములను స్త్రీలుజేయ నధికారులుగారు. కావున వాటి ననుష్ఠించుటకు కర్తలు లేకుండుటచే అనిభావము. పై శ్లోకము ఉత్తరార్ధమున అధర్మము కులమంతటిని వ్యాపించునని

చెప్పబడియున్న కులము అవశిష్టకులము. అనగా నశించినవారుపోగా ఆ కులమున మిగిలియున్న వారు. 41-వ శ్లోకమున జెప్పిన వర్ణసాంకర్యము కులమును జెడిపినవానికి నరక హేతువుగ నెట్లగు ననగా, కులనాశముజేసిన పాపమునకు శిక్షగా నరకమున వాడు త్రోయబడును అనుదానిచేతనే ఈ కులఘ్నునియొక్కయు, కులముయొక్కయు పితరులుపిండము మొదలైన క్రియలులేక నరకమున బడుదురని పై శ్లోకము ఉత్తరార్ధమున జెప్పబడియున్నది. ఇది క్షయమొందిన కులము యొక్క పితరులవిషయములో జెప్పటతగును. ఏలనగా పైకులక్షయముచేత జాతికలయికగలిగి పిండము మొదలైన క్రియలను జేయుటకు శాస్త్రము ననుసరించి యోగ్యులైన సంతతి లేకపోవుటచే పైపితరులు పైక్రియలనుగాని, వాటిఫలమునుగాని పొందక నరకమున బడుచున్నారు. ఐతే కులఘ్నుని పితరులున్ను ఆ పిండము మొదలైన క్రియలులేక నరకమున బడుటకు కారణమేమన పైపిండోదక క్రియలు పైవంశమున క్రమముగ బుట్టినవార్లచే ఇవ్వబడినను వారలు అశుచులుగను, పాపులుగను ఇప్పుడైనందున ఆ క్రియలను పితరులు గ్రహించుకొనకపోవుటచేతనే.



శ్లో॥ అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయం।
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః ॥ 45

పద॥ అహో - బత - మహత్ - పాపం - కర్తుం - వ్యవసితాః - వయం।
యత్ - రాజ్యసుఖలోభేన - హన్తుం - స్వజనం - ఉద్యతాః ॥

| | | | |
|---|---|---|---|
| వయం | మనము | (ఏతత్) | (ఈ) |
| రాజ్యసుఖలోభేన | రాజ్యసుఖలోభముచేత | మహాత్పాపం | గొప్పపాపమును |
| స్వజనం | బంధుజనమును | కర్తుం | చేయుటకు |
| హన్తుం | చంపుటకు | వ్యవసితాః | ప్రయత్నపడితిమి |
| ఉద్యతాః(ఇతి)యత్ | సాహసించితిమనునది ఏది కలదో | అహోబత | మహాకష్టము ! |

తా॥ మనము రాజ్యసుఖముయొక్క ఆశచేత బంధుజనమును జంపుటకు సాహసించితిమనునట్టి ఈ మహత్తైన పాపము జేయుటకున్ను ప్రయత్నపడితిమి. ఇది మహాకష్టము.

(స్వకీయము) ఈ శ్లోకమునకు భావమేమనగా - మునుపుజెప్పిన శ్లోకములచే స్వజనులను జంపుట నరకహేతువని ఏర్పడుటచే రాజ్యకాంక్షచే స్వజనులను జంపవలయునని మనస్సుచేత సాహసించుటయే పాపము. అట్లు స్వజనవధచే కులక్షయముగలుగుననియు, దానిచేగలుగు పాపమిట్టిదనియు తెలిసియు దానిని చేయవలయునని మనస్సున నిశ్చయముచేయుటయే దానికన్న గొప్పదైన పాపము. అదియుగాక దానిని చేయుటకున్ను ప్రయత్నము జేసిన అదియెంత పాపమో జెప్పవలయునా? అనునదే.

అనగా పాపకర్మలనుచేయ మనస్సునందపేక్షించుటయే పాపము. ఆ కర్మలు పాపమని తెలిసియు వాటినిజేయ భయపడక వాటినిజేసియే తీరవలయునని నిశ్చయముచేసికొనుట మహత్తైన పాపము. ఆ నిశ్చయమును కర్మేంద్రియములచేత (చెయ్యి మొదలైన అవయవములచేత) నెరవేర్ప నారంభించుట దానికంటె మహామహత్తైన పాపమని తాత్పర్యము. ఈ శ్లోకమునకు క్రింద కను

బరచినట్లున్ను అన్వయము చేయబడుచున్నది — యత్ = ఏ కారణముచేత, వయం = మనము, రాజ్యసుఖలోభేన = రాజ్యసుఖమునందాశచేత, స్వజనంహంతుం - బంధుజనమును జంపుటకు, ఉద్యతాః = సాహసించితిమో (తత్) ఆ కారణముచేత, మహత్పాపం = మహాపాపమును, కర్తుం వ్యవసితాః = చేయనిశ్చయించితిమి. అహో = (ఇదేమి) ఆశ్చర్యము, బత = (మహా) కష్టము.

ఇవ్విధమైన కులక్షయ కృతపాపమునకు తోడుపడిన తన్నుతానే యర్జునుడు నిందించుకొనుటను, పశ్చాత్తాపపడుటను 'అహోబత' అనువచనములు చూపుచున్నవి.

శ్లో॥ యదిమామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్॥ 46

పద॥ యది - మాం - అప్రతీకారం - అశస్త్రం - శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రాః - రణే - హన్యుః - తత్ - మే - క్షేమతరం - భవేత్॥

| | | | |
|---|---|---|---|
| అశస్త్రం | చేతియందాయుధము లేనట్టియు | హన్యుర్యది | చంపినట్లైతే |
| అప్రతీకారం | ఎదిరించకయున్న | తత్ | అది |
| మాం | నన్ను | మే | నాకు |
| శస్త్రపాణయః | చేతియందాయుధములు గలవారైన | క్షేమతరం | మిక్కిలి క్షేమముగా |
| ధార్తరాష్ట్రాః | ధృతరాష్ట్రుని పుత్రులు | భవేత్ | అగును. |
| రణే | యుద్ధమునందు | | |

తా॥ చేతియందాయుధములేకయు ఎదిరించకయునున్న నన్ను ఆయుధములుగలవారైన ధృతరాష్ట్రుని పుత్రులు యుద్ధమున జంపినట్లైతే అది నాకు మిక్కిలి క్షేమకరమగును.

(స్వకీయము) "ప్రాయశ్చిత్తమకుర్వాణాః పాపేషు నిరతా నరాః।
అపశ్చాత్తాపినః కష్టాన్నిరయాన్యాన్తి దారుణాః॥

అనగా "పాపములనుచేసియు, ప్రాయశ్చిత్తమును చేసికొనకయు, పశ్చాత్తాపము పడకయునున్న జనులు భయంకరమైనట్టియు, కష్టముగనున్నట్టియు నరకములను పొందుచున్నారు" అను ప్రమాణానుసారముగ మునుపుజెప్పిన మహాపాపముకొఱకై మొదట పైశ్లోకమున పశ్చాత్తాపపడి, తరువాత అర్జునుడు ఈశ్లోకమున ఆపాపమునకు ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు. అదేమన దుర్యోధనాదులను జంపి కులనాశమును చేయ ప్రయత్నించిన మహాపాపమునకు ప్రాయశ్చిత్తము ప్రాణమును బలియిచ్చుటయే. అట్లుచేయుటచేత పైపాపము నివర్తించి పరలోకమున క్షేమముగలుగునని అర్జునుని తాత్పర్యము.

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః॥ 47

పద॥ ఏవం - ఉక్త్వా - అర్జునః - సంఖ్యే - రథోపస్థే - ఉపావిశత్ ।
విసృజ్య - సశరం - చాపం - శోకసంవిగ్నమానసః॥

| | | | |
|---|---|---|---|
| సంజయ ఉవాచ | సంజయుడు చెప్పినది | సశరం | బాణముతోగూడిన |
| అర్జునః | అర్జునుడు | చాపం | ధనుస్సును |
| ఏవం | ఈ ప్రకారముగ | విసృజ్య | విడిచి |
| ఉక్త్వా | చెప్పి | సంఖ్యే | యుద్ధభూమియందు |
| శోకసంవిగ్నమానసః | దుఃఖముచేత వణుకుచున్న మనస్సుగలవాడై | రథోపస్థే | రథమునందు(తేరుతట్టుమీద) |
| | | ఉపావిశత్ | కూర్చొనెను. |

తా॥ సంజయుడు (ధృతరాష్ట్రునితో) చెప్పినది అర్జునుడు ఈ విధముగ జెప్పి దుఃఖముచే కంపించుచున్న మనస్సుగలవాడై తనచేతియందున్న బాణముతోగూడిన విల్లును విసర్జించి యుద్ధభూమియందు రథమున తేరు తట్టు మీద కూర్చొనెను.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే "అర్జునవిషాద యోగో" నామ
ప్రథమోఽధ్యాయః.

శ్రీ మద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న
శ్రీ కృష్ణార్జున సంవాదమున ''అర్జునవిషాదయోగ''మను
మొదటి అధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు

ద్వితీయాధ్యాయ ప్రారంభః

# రెండవ అధ్యాయము

## (సాంఖ్యయోగము)



సంజయ ఉవాచ: —

శ్లో॥ తం తథా కృపయాఽఽవిష్టమశ్రుపూర్ణాకులేక్షణం।
విషీద న్తమిదం వాక్యమువాచ మధుసూదనః ॥

పద॥ తం - తథా - కృపయా (1) - ఆవిష్టం (2) - అశ్రుపూర్ణాకులేక్షణం।
విషీద న్తం - ఇదం - వాక్యం - ఉవాచ - మధుసూదనః (3) ॥

| | | | |
|---|---|---|---|
| సంజయఉవాచ | సంజయుడు జెప్పినది | విషీద న్తం | దుఃఖపడు చున్నట్టివాడునునైన |
| తథాకృపయా | (మునుపుచెప్పిన) అట్టి కృప చేత (మోహముచేత) | తం | అతనికి (అర్జునునిగూర్చి) |
| | | మధుసూదనః | కృష్ణపరమాత్మ |
| ఆవిష్టం | ఆవేశింపబడిన వాడున్ను | ఇదంవాక్యం | ఈ మాటను |
| అశ్రుపూర్ణాకులేక్షణం | కన్నీరునిండియు, కలతచెందియు నున్న నేత్రములతో గూడినవాడున్ను | ఉవాచ | చెప్పెను. |

తా॥ (ధృతరాష్ట్రునకు) సంజయుడు జెప్పినది — (మునుపుజెప్పిన) ఆ విధమైన కృప, అనగా మోహముచేత పట్టుబడినవాడును, కన్నులు కలత జెందియు కన్నీరునిండియు నున్నవాడును, దుఃఖము జెందినవాడునైన యాతనికి (అర్జునునిగూర్చి) కృష్ణపరమాత్మ (యిక జెప్పబోవు) ఈ మాటను జెప్పెను.

(1) తథాకృపయా - "ఆ విధమైన కృప" యనునది 1-వ అధ్యాయము 28 వ శ్లోకమున జెప్పఁబడిన "పరయాకృపయా" అను దానిని గుర్తించుచున్నది. ఇది వాస్తవమైన కృపగాదు. మోహమేయని ఈ శ్లోకము క్రిందనే (2 - 2) చెప్పఁబడియున్నది.

'కృప' అనునది "పరదుఃఖ ప్రహాణేచ్ఛ" అనగా ఇతరుల దుఃఖమును పోగొట్టవలయునని కోరిక. అట్టిలక్షణముతో గూడినది గాదు ఇది.

(2) ఆవిష్టం - అనుపదమునకు ఆవేశించుట, లేక పట్టుట అనియర్థము. సాధారణముగ పిశాచముబట్టిన వారల లక్షణములైన కన్నీరువిడుచుట దుఃఖపడుట మొదలగునవి ఇప్పుడు, మోహపిశాచముచే పట్టుబడిన అర్జునుని యందును కనబడుటవలన ఆవిష్ట పదము ప్రయోగింపబడియున్నది.

(3) మధుసూదనః - మధువను నసురుని సంహారముజేసినవాడు. అట్టివానికి ఈ మోహపిశాచమును పారద్రోలుట యొకవిషయమా? (లక్ష్యమా?) ఈ మధుసూదనుని మాటలనెడి

మంత్రము ఉచ్చరింపబడిన మాత్రమున ఆ మోహమంతయు నివర్తించును, నీవు మనోరాజ్యము చేయకుము, అని ధృతరాష్ట్రునకు సంజయుడు సూచించుచున్నాడు. లేక మధుసూదనుడనగా దుష్ట నిగ్రహముచేయువాడు. దుష్టనిగ్రహముకొఱకే యవతారము చేసియున్న యితడు, దుష్టులైన నీ పుత్రులను విడువడు. వారలను లోకానుగ్రహమునకై చంపుట ఆవశ్యకమని జెప్పబోవుచున్నదిగ సంజయుడు సూచించుచున్నట్లు జెప్ప వచ్చును.

(స్వకీయము) మొదటి యధ్యాయమునందు, శోకమోహములు గలుగువిధమున్ను వాటి లక్షణములున్ను చెప్పబడినవి. ఈ రెండవ అధ్యాయారంభమున శోకమోహములచే స్వధర్మమును విడిచి పరధర్మానుష్ఠాన ప్రవృత్తిగలుగుటయు. ఏడవశ్లోకమున శోకమోహనివృత్తికై సద్గురువును పొంది శరణాగతి పొందవలసిన ఆవశ్యకతయు, 11 వ శ్లోకము మొదలు 38 వ శ్లోకము వఱకు పైకనిన శోక మోహములను సాక్షాత్తుగ నివృత్తిజేయుచున్న ఆత్మ తత్త్వమును 39 మొదలు 53 వ శ్లోకము వరకు ఆ యాత్మతత్త్వమును స్థిరముగ పొందుటకు సాధనమైన యోగమును, 54 మొదలు 72 వ శ్లోకమువఱకు జ్ఞానము నిలకడపొందిన స్థితప్రజ్ఞుని లక్షణమున్ను దానినొందుటకైన సాధన మున్ను ఉపదేశింపబడుచున్నవి.

"తత్త్వమసి" మహావాక్యమునందలి "త్వంపదలక్షణము" ఈ గీత మొదటి ఆరు అధ్యాయములయందును, "తత్" పదలక్షణము 6 మొదలు 12 అధ్యాయములలోను, వీటి ఐక్యమైన "అసి" పదలక్షణము 12 మొదలు 18 అధ్యాయములలోను నిరూపింపబడియున్నది.

భగవానువాచ (1):—

శ్లో॥ కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితం ।
అనార్యజుష్టమస్వర్గ్య మకీర్తికరమర్జున ॥ 2

పద॥ కుతః (2) - త్వా - కశ్మలం (3) - ఇదం - విషమే (4) - సముపస్థితం ।
అనార్యజుష్టం (5) - అస్వర్గ్యం - అకీర్తికరం - అర్జున (6) ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | భగవంతుడైన కృష్ణపరమాత్మ చెప్పినది | అకీర్తికరం | కీర్తి గలుగజేయనట్టియు |
| | | ఇదం కశ్మలం | ఈ మోహము |
| హే అర్జున ! | ఓ అర్జునుడా! | కుతః | ఏ కారణముచేత |
| అనార్యజుష్టం | ముముక్షువులచే సేవింపబడనట్టియు | విషమే | (ఈ) అకాలమున |
| | | త్వా | నిన్ను |
| అస్వర్గ్యం | స్వర్గసాధనముగానిదైనట్టియు | సముపస్థితం | పొందినది ? |

తా॥ భగవంతుడైన శ్రీకృష్ణపరమాత్మ (అర్జునునిగూర్చి) చెప్పినది. ఓ అర్జునా! మోక్షమున కోరికగలవార్లచే సేవింపబడనిదియు, స్వర్గసాధనము గానిదియు, కీర్తినిగలుగజేయు సామర్థ్యము లేనిదియునైన ఈ మోహము ఏ కారణముచే నీయకాలమున (యుద్ధకాలమున) నీకు కలిగెను?

(1) భగవాన్— "ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః ।
వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీరణా ॥"

సంపూర్ణమైన అణిమాద్యష్టైశ్వర్యములు, వీర్యము, యశస్సు, సంపద, వైరాగ్యము, అదేవిధముగ మోక్షసాధనమైన జ్ఞానము అను నీయారింటికిన్ని భగమనిపేరు. ఇవి ఏకాలమందును క్షీణించక ఎవరియందున్నవో అతడే భగవంతుడు అని చెప్పదగినవాడు. (విష్ణుపురాణము అంశ 6-అధ్యా. 5 శ్లో. 74, అగ్నిపురా. బ్రహ్మ జ్ఞానఖండ అధ్యా. 378, శ్లో. 11 చూడుడు) లేక —

"ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానామాగతిం గతిం।
వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవానితి॥"

భూతముల యుత్పత్తికారణము, ప్రళయకారణము, రాబోవు సంపద్విపత్తులు, విద్య అవిద్య వీటినన్నిటిని ఎవ్వడెరుంగుచున్నాడో అతడే భగవంతుడని జెప్పదగినవాడు (విష్ణుపురా.అం. 6 అధ్యా. 5 శ్లో 78-చూడుడు) అట్టిభగవంతుడు శ్రీవాసుదేవుడు.

(2) కుతః - ఏకారణముచేత? అనగా మోక్షేచ్ఛచేతనా? స్వర్గేచ్ఛచేతనా? లేక కీర్తినిగోరియా? ఈ బంధు విషయమైన మోహము నీకిప్పుడు గలిగియున్నదని భగవంతుడు ప్రశ్నించుచున్నాడు. మోక్షసాధనము కాదనుదానిని ఈఅధ్యాయము 11-31 శ్లోకములలోనున్ను, 'అస్వర్గ్యం' అనుదానినీ 32-33 శ్లోకములయందును, 'అకీర్తికర'మనుదానిని 34-38 వరకున్న శ్లోకములలోను జెప్పి నిరూపించియున్నాడు.

(3) కశ్మలం - కశతి తనూకరోతి, ఇంద్రియప్రచారమితి కశ్మలం = ఇంద్రియముల వ్యాపారములను లేక శక్తిని అల్పముగజేయుచున్నది. "మూర్ఛాతు కశ్మలం మోహః" అను నమరకోశ వాక్యమును జూడుడు. అనగా మూర్ఛ, కశ్మలము, మోహము, ఇవి ఒకే అర్థమునుఁ దెలుపుచున్న అనేక పేర్లు.

(4) విషమే - యుద్ధసంకటకాలమందు, యుద్ధభూమిమీద ఈ యుద్ధారంభ సమయమున అర్జునునకు బంధువులను జంపగూడదని గలిగిన తలంపు, యుద్ధనిశ్చయమునకు పూర్వము గలిగియుండిన యెడల తగును. అట్లుకాక మొదటినుండియు యుద్ధము జేయవలయుననియే నిశ్చయముచేసి సకలప్రయత్నములతోను యుద్ధభూమి చేరిన తరువాత ఇట్టితలంపు శస్త్రప్రయోగారంభ కాలమున గలుగుటచే "అకాలము" అని జెప్పబడినది.

(5) అనార్యజుష్టం - పాపకర్మభ్యః ఆరాద్దూరాద్యాంతతి ఆర్యాః = పాపకర్మలనుండి దూరముగ పోవువారు ఆర్యులు, అనగా మోక్షమార్గమునే పొందువారు. లేక-ఆరణీయః, అభిగమ్యోవా ఆర్యః = పొందదగినవాడు పూజింపదగినవాడు. అనార్యులనగా నీచులు. అనార్యజుష్టం — నీచులచే సేవింపబడినదనియు, అస్వర్గ్యం = నరకమునిచ్చునదనియు, అకీర్తికరం = అపకీర్తిని గలుగచేయునదనియు, వ్యాఖ్యాతలు అర్థము జేసియున్నారు.

(6) అర్జున - అర్జునపదమునకు తెలుపుఅర్థము. "అర్జున!" అని భగవంతుడు చెప్పుటచేత "నీవు అతిపరిశుద్ధమైన అంతఃకరణము గలవాడవుగదా, అట్టి నీయందు ఈ కశ్మలము (మోహము) ఎట్లు వచ్చిచేరినదని అతడు పరితాపపడుటను చూపుచున్నది, "నీవు ఈ మోహమును ఈ అకాలమున ఎట్లుపొందితి"వని భగవంతుడడుగక "ఈమోహము ఈ

అకాలమున నిన్నెట్లు పొందినది" అని కర్తృత్వమును మోహముమీద నారోపించి యడుగుట, స్వభావముగ అర్జునుడు పరిశుద్ధమైన అంతఃకరణముగలవాడు, ఈమోహము తాత్కాలికముగ వానివద్ద వచ్చిచేరినది, అని స్పష్టపరచుచున్నది. అర్జునపదమునకు "శుక్లాంతరాత్మ స్వభావ విశుద్ధాంతఃకరణ, అహశ్చ కృష్ణమహార్జునంచ ఇతిదర్శనాత్" అని వెనుక రాబోవు 18వ అధ్యాయము 61 వ శ్లోకము క్రింద శంకరభాష్యము చేసి యుండుటను చూడుడు.

శ్లో॥ క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥

పద॥ క్లైబ్యం - మా - స్మ - గమః - పార్థ - న - ఏతత్ - త్వయి - ఉపపద్యతే।
క్షుద్రం - హృదయదౌర్బల్యం - త్యక్త్వా - ఉత్తిష్ఠ - పరంతప ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ ! | ఓ అర్జునుడా ! | హే పరంతప ! | ఓ శత్రువును తపింపజేయు వాడా ! |
| క్లైబ్యం | (నపుంసకత్వమును) అధైర్యమును | క్షుద్రం | నీచమైన |
| మాస్మగమః | పొందకుము | హృదయదౌర్బల్యం | మనస్సునందలి యధైర్యమును |
| ఏతత్ | ఇది | త్యక్త్వా | విడచి |
| త్వయి | నీయందు | ఉత్తిష్ఠ | లెమ్ము |
| నోపపద్యతే | తగినదికాదు | | |

తా॥ ఓ అర్జునుడా! అధైర్యమును పొందకుము. ఇది నీకు తగినదికాదు. శత్రువును తపింపజేయువాడా! మనస్సునందలి నీచమైన అధైర్యమును విడచి లెమ్ము.

(స్వకీయము) ఈ శ్లోకమునందును, దీనికిముందు శ్లోకమందును భగవంతుడు అర్జుననకు గలిగియున్న యుద్ధనివృత్తికి వాస్తవమైనకారణము ఇట్టిదని నిర్దేశించి దాని నివృత్తికి మార్గమును "పరంతప = శత్రువును తపింపచేయువాడా" అని చెప్పుటచేత తెలియపరచుచున్నారు. అనగా పాండవుల విషయమున దుర్యోధనాదులుజేసిన చెరుపులను అర్జునుడు తలంచి చూచినచో వారలు జన్మప్రభృతి తమ శత్రువులను స్మరణగలిగి మోహము నివృత్తిపొందునని భావము. నీవు అజ్ఞాత వాసకాలమున నపుంసకత్వమును పొందినది చాలును, మరలను దానినొందకుమని యును పరిహసించుచున్నారు.

అర్జున ఉవాచ :—

శ్లో॥ కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ॥

పద॥ కథం - భీష్మం - అహం - సంఖ్యే - ద్రోణం - చ - మధుసూదన।
ఇషుభిః - ప్రతియోత్స్యామి - పూజార్హౌ - అరిసూదన ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | కథం | ఎట్లు |
| మధుసూదన ! | ఓ మధుసూదనుడా ! | ప్రతియోత్స్యామి | ఎదిరించి యుద్ధము చేయుదును |
| భీష్మం | భీష్మాచార్యులనున్ను | అరిసూదన ! | ఓ శత్రుసంహారకుడా ! |
| ద్రోణం చ | ద్రోణాచార్యులనున్ను | (తౌ) | (వారిద్దరు) |
| సంఖ్యే | యుద్ధమున | పూజార్హౌ | (పుష్పములచే) పూజింపదగిన వారుగా |
| అహం | నేను | | |
| ఇషుభిః | బాణములచేత | (శరవతః) | (ఉన్నారు) |

తా॥ అర్జునుడు చెప్పినది:— ఓ మధుసూదనా! భీష్మాచార్యులు, ద్రోణాచార్యులు వీరలను నేను యుద్ధముననెదిరించి బాణములచే నెట్లు యుద్ధము జేసెదను? ఓ అరిసూదనుడా! ఆ ఇరువురు నాచే పుష్పములుగొని పూజింప దగినవారలుగ నున్నారు. (అనగా మహానుభావులైన నాపితామహుడు భీష్మాచార్యులు, నాకు ధనుర్విద్యనేర్పిన ద్రోణాచార్యులు వీరలను నేను పుష్పములచే పూజచేయవలసియుండగా, యుద్ధమున వారలమీద బాణములను ప్రయోగించి జగడమాడుటకు నా మనస్సు సాహసింపదే యని అర్జునుడు చెప్పు చున్నాడు.)

(స్వకీయము) ఈ లోకమున, వివేకముతోగూడిన జనులుగూడ సాధారణముగ, వారి యందు శోకమోహములచేగలిగియున్న దోషములను పెద్దవారెత్తిచూపి, వాని నివృత్తికై మార్గమును గూడ ఉపదేశించుటచేత కడపట వివేకమును పొందుచున్నారు. ఐనను పూర్వము వారలకు గలిగి యుండిన మోహము నిశ్శేషముగ వెంటనే నివర్తింపక మరల మరల కొంచెము కొంచెముగా వచ్చి మూయుటచేత, తమకు మునుపు తోచినదే న్యాయమను భ్రమతో వ్యవహరింపబూనుట ఎట్లు స్వాభావికమైనదో అదేవిధముగ నిప్పుడు భగవంతుడు మునుపటి రెండుశ్లోకములలో నర్జునునకు జేసిన హితోపదేశమువలన నతని యహంకారము ఒకవిధముగ అణగినను, మోహశేషమింకను వానియందుండుటచే యుద్ధము చేయనని తాను చెప్పుట అధైర్యము చేతగాని, లేక మోహము వలన గాని కాదనియు, యుద్ధముచేత గలుగు అనర్థమునుద్దేశించి అట్టినివృత్తి తనకు గలిగియున్నదిగ, ఈ 4-5-6 శ్లోకములలో ప్రత్యుత్తరము జెప్పుచున్నాడు. ఐనను అర్జునుడు అతివివేకముతోగూడిన ముముక్షువగుటచే, వెనుక వాస్తవమైన ప్రజ్ఞను పొందియు 7వ శ్లోకమున ధర్మమిట్టిదని తనకు తెలియలేదని ఒప్పుకొని తనకు శ్రేయస్కరమైన దానినుపదేశించునటుల తనగురువైన భగవంతుని శరణాగతిపొంది ప్రార్థించుచున్నాడు.

అర్జునుడు ఈ శ్లోకమునందు భగవంతుని మొదట ఓ మధుసూదనా! అనియు, మరల ఓ అరి సూదనా! అనియు జెప్పుటకు తాత్పర్యమేమన — "నీవు మధువను దుష్టుడైన శత్రువును యుద్ధముజేసి సంహారముజేసితివి. ఆవిధముగనే నేనున్ను దుష్టులైన శత్రువులను యుద్ధముజేసి చంపుటన్యాయము. ఐనను నన్ను బాల్యము మొదలు ఎత్తి పోషించి రక్షించి హితోపదేశములనుజెప్పి యాదరించిన నా పితామహుడు భీష్ముడు, నాకు బాల్యముమొదలు విలువిద్యను నేర్పి, అతిరహస్య మైన మంత్రములనుజెప్పి పుత్రునికన్న నధికముగ భావించుచున్న ద్రోణులు, వీరలు ఏదియో కాలగతిచేత శత్రుపక్షమున రావలసి వచ్చినను వారలు మనక్షేమమునే ఎల్లప్పుడు గోరుచున్నవారు గావున వారల నేనెట్లు యుద్ధముజేసి చంపుట" అని సంకోచించుటను జూపుటకొఱకు ఓ మధు సూదనా! అనియు, మరియు పూజింపదగిన వారలైన వీరలను రాజ్యభోగాదులనొందగోరి కామ క్రోధములచే జంప నేను ప్రయత్నించుట నీకు సమ్మతమగునా? నీవు అరిసూదనుడవుగదా! అనగా భక్తుల కామక్రోధాదులను నిశ్శేషముగ పోగొట్టువాడవుగదా? నేనును నీభక్తుడనేగదాయని వినయ ముగ సూచించుటకొఱకు ఓ అరిసూదనా! యనియు సంబోధించుట. "అరిసూదన-అరీన్ కామాదీన్ సూదయతీతి = భక్తుల కామాదిశత్రువులను పోగొట్టువాడు" అని శంకరానందుడు అర్థముజేసి యున్నాడు. కొందరు వ్యాఖ్యాతలు మధుసూదనా యని అర్జునుడు భగవంతునిజూచి చెప్పుటచే "నీవు మధువువంటి దుష్టులను జంపుమని చెప్పుటన్యాయము. ఇట్టి పూజ్యులైన భీష్మద్రోణాదు లను ఎట్లు చంపుమని ప్రేరేపింపదగునని యు, - ఐతే పూజార్హులైన నామాతులుడు (మేనమామ)

కంసుని నేను జంపలేదా అనెదవా? కంసుడు జన్మప్రభృతి నీ శత్రువు. నీవు అరిసూదనుడవు అనగా శత్రువులను జంపువాడవు. వీరలు అట్టిశత్రువులుగారే" యనియు జెప్పునదిగ తాత్పర్యము జెప్పుచున్నారు.

కొందరు వ్యాఖ్యాతలు - అర్జునుడు, మధుసూదనా! అరిసూదనా! యని యొకే అర్థముగల మాటలను తిరిగిజెప్పుట వానికి గలిగియున్న శోకముచేత అని అభిప్రాయపడుచున్నారు.

శ్లో॥ గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే ।
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుఞ్జీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥

పద॥ గురూన్ (1) అహత్వా - హి (2) - మహానుభావాన్ (3)
శ్రేయః - భోక్తుం - భైక్ష్యం - అపి - ఇహ - లోకే ।
హత్వా - అర్థకామాన్ (4) - తు - గురూన్ - ఇహ - ఏవ
భుఞ్జీయ - భోగాన్ - రుధిరప్రదిగ్ధాన్ (5) ॥

| | | | |
|---|---|---|---|
| మహానుభావాన్ | అధిక గొప్పతనముబడసిన | అర్థకామాన్ | ధర్మాది పురుషార్థముల నుపదేశించుచున్న |
| గురూన్ | ఆచార్యులను | | |
| అహత్వా | చంపక | గురూన్ | ఆచార్యులను |
| ఇహలోకే | ఈ లోకమున | హత్వాతు | చంపినచో |
| భైక్ష్యమపి | (క్షత్రియునికి తగని) భిక్షాన్నముగూడా | రుధిరప్రదిగ్ధాన్ | (వారల)రక్తముచే పూయబడిన |
| భోక్తుం | తినుటకు | భోగాన్ | భోగములను(విషయములను) |
| శ్రేయః హి | మంచిదిగదా | ఇహైవ | ఈ లోకముననే |
| | | భుఞ్జీయ | అనుభవింతును |

తా॥ అధికమైన మహిమబడసిన ఆచార్యులనుజంపక ఈలోకమున క్షత్రియునకు నిషిద్ధమైన భిక్షమెత్తితినుటయు మంచిదిగదా! ధర్మాది పురుషార్థోపదేష్టలైన గురువులను చంపినచో వారలరక్తమయమైన (అనగా - వారల రక్తము చెదురుటచే నొందబడిన) నరకహేతువులైన భోగములను ఈలోకమందే యనుభవింతును. (అనగా - యుద్ధముజేసి గురువులనుచంపి నారకీయములైన అనుభవముల ననుభవించుటకన్న భిక్షమెత్తితినుట మంచిదని తలంచుచున్నానని అర్జునుని తాత్పర్యము.)

(1) గురూన్-ఇది బహువచనము. అనగా ఇద్దరికన్న ఎక్కువవారిని గుర్తించు వచనము. ఐతే మునుపటి శ్లోకమున భీష్ముడు ద్రోణుడు వీరల యిరువురి పేర్లనుమాత్రము చెప్పియుండుటచేత గౌరవముగ వారలకు బహువచనము ప్రయోగింపబడి యున్నట్లుగాని, లేక కృపుడు, మొదలగువార్లనున్ను భీష్మ ద్రోణులతోచేర్చి గుర్తించుటకొరకై బహువచన ప్రయోగము చేయబడియున్నట్లుగాని గ్రహింపవచ్చును.

(2) హి - అనునది ప్రసిద్ధిని జెప్పునదిగ కొందరు వ్యాఖ్యాతలు అర్థముజేసియున్నారు.
ఈ "హి" శబ్దమును, దానికి పిమ్మట రాబోవు 'మహానుభావాన్' అనుపదముతో జేర్చి

హిమహానుభావాన్'' అని ఒకేపదముగ నెత్తుకొని ''హిమం = జాడ్యం అపహన్తీతి హిమహా ఆదిత్యోఽగ్నిర్వా. తస్యేవానుభావః సామర్థ్యం యేషాం తాన్'' శైత్యమును బోగొట్టుచున్న సూర్యుడు అగ్ని వీరలువలె సామర్థ్యముగలవారు. అనగా అతితేజస్వులైన వారలయందు దోషము లెట్లంటవో అట్లే భీష్మద్రోణాదులయందును దోషము లంటుటలేదని మధుసూదనసరస్వతి వ్యాఖ్యానము జేసియున్నారు.

(3) మహానుభావాన్ - ఎట్లు మహానుభావులనగా - స్వేచ్ఛామరణము, నైష్ఠిక బ్రహ్మచర్యము, సర్వధర్మ పరిజ్ఞానము, సర్వశాస్త్రార్థసంపద, వేదాధ్యయనము, తపోనిష్ఠ, వీటితోగూడి యుండుటచేత నని భావింపవలెను. ఐతే రాఘవేంద్రస్వాములు ఈ పదమునకు హరి భక్తి మొదలగు గుణములతో గూడినవారలని అర్థము జేసియున్నారు.

(4) అర్థకామాన్ - ఈ పదమునకు క్రిందకనబరచినటుల మూడు విధములైన వ్యాఖ్యానములు జేయబడియున్నవి:—

1. "కామిర్జ్ఞానార్థః. అర్థాన్ = ధర్మాదిపురుషార్థాన్, శిష్యేభ్యః కామయన్తి = బోధయన్తీతి అర్థకామాః తాన్". కామిధాతువునకు జ్ఞానమని యర్థము. ధర్మాదిపురుషార్థములను ఉపదేశించుచున్న గురువులనునదిగ శంకరానందులు వ్యాఖ్యానముజేసిరి.

''అర్థాఏవ అర్థకాః. స్వార్థేకప్రత్యయః, అర్థకాన్ = ధర్మాదిపురుషార్థాన్, అమయన్తి బోధయన్తీత్యర్థకామాః, గత్యర్థకస్య అమేః జ్ఞానార్థకత్వం ఇతివా'' యనియు కొందరు పండితులు వ్యుత్పత్తి చేయుచున్నారు.

2. ఈ 'అర్థకామా'నను పదమును ముందువచ్చుచున్న భోగపదమునకు విశేషణముగ నుంచి భోగాః = పురుషార్థములని అర్థముచేసికొని అర్థకామాన్ భోగాన్'' అనుదానికి ధర్మార్థకామ మోక్షములైన నాలుగువిధములైన పురుషార్థములలో అర్థకామరూపములుగ మాత్రమున్న పురుషార్థములను ఈ లోకమునందే యనుభవింతును. పరలోకమునగాదు. అని వ్యాఖ్యానించియున్నారు.

3. అర్థకామానను పదమును గురూనను దానికే విశేషణముగ భావించి అర్థకామాన్ గురూననగా ధనమునందు కోరికగల గురువులను, అనగా అర్థేచ్ఛచేత దుర్యోధనాదులకు ఈ భీష్మద్రోణాదులు కట్టుబడియుండుటచే వాని సహాయమునకై వారలు తప్పక వచ్చియేతీరుదురు. దానిచే వారలవధము నిశ్చయముగ సంభవించునను తాత్పర్యముగొని అర్జునుడు ఈ శ్లోకమున "అర్థకామాన్ గురూన్'' అని చెప్పెనదిగ కొందరు వ్యాఖ్యానముజేసియున్నారు.

భీష్మద్రోణాదులను మొదట మహానుభావులనిచెప్పి ఇప్పుడు అర్థకాములని చెప్పుట తగునాయన, తాము అర్థముచేత దుర్యోధనాదులకు కట్టుబడియున్నటుల యుధిష్ఠిరునివద్ద యుద్ధమునకు మునుపు ''అర్థస్యపురుషోదాసః దాసస్త్వర్థో నకస్యచిత్. ఇతిసత్యంమహారాజ బద్ధోస్మ్యర్థేన కౌరవైః = మనుష్యుడు అర్థమునకుదాసుడు. అర్థము ఎవనికిని బానిసయైనదిగాదు. ఓ రాజా! ధనమూలముగ కౌరవులచే కట్టబడినవానిగనున్నాను అనునది సత్యము'' అని వారలే చెప్పియున్నారు.

(5) రుధిరప్రదిగ్ధాన్ - రక్తముచేత పూయబడినవని పదమునకర్థము. ఐతే వాస్తవమున్ననవి, రక్తముచే బూయబడినవిగావు. గురువులను చంపినతరువాత పొందదగిన రాజ్యభోగములు, వారల రక్తప్రవాహములేక పొందదగినవి కావు. కాన రక్తముచే పూయబడిన

పదార్థము లెట్లు జుగుప్సితములో అటులనే పై రాజ్యభోగములున్ను అనుభవించుటకు జుగుప్సితములు, యోగ్యములుకావని తాత్పర్యము. ఇది అతిశయోక్త్యలంకారము.

రాఘవేంద్రస్వాములు ఈ శ్లోకమునకు, హరిభక్తి మొదలగు గుణములు గలవారైన ఇట్టి పెద్దలు, రాజ్యము తమకు స్థిరముగ చెందవలయునని ఆశతో యుద్ధమునకు వచ్చియున్నారు. నేను వారేమడిగినను ఇచ్చి వారలను పూజింపవలసినవానిగనుండగా, అట్టివారలుకోరు ఈ రాజ్యము వారలను జంపివేసి నేననుభవించుట ధర్మముగాదని అర్జునుడు జెప్పెనదిగ తాత్పర్యమును జేసియున్నారు



శ్లో॥ న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః ।
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6

పద॥ న - చ - ఏతత్ - విద్మః - కతరత్ - నః - గరీయః
యత్ - వా - జయేమ - యది - వా - నః - జయేయుః ।
యాన్ - ఏవ - హత్వా - న - జిజీవిషామః
తే - అవస్థితాః - ప్రముఖే - ధార్తరాష్ట్రాః ॥

| | | | |
|---|---|---|---|
| (భైక్ష్యయుద్ధయోర్మధ్యే) | (భిక్షమెత్తుట, యుద్ధము చేయుట ఈ రెంటిలో) | నః | మమ్ములను |
| | | జయేయుః | జయించెదరో |
| కతరత్ | ఏది | ఏతత్ | దీనిన్ని |
| నః | మాకు | నవిద్మః | ఎరుగము |
| గరీయః | మిక్కిలి శ్రేష్ఠమైనదో | (వయం) | (మేము) |
| ఏతత్ | దీనిని | యాన్ | ఎవరలను |
| (వయం) | (మేము) | హత్వా | చంపి |
| నవిద్మః | ఎరుగము | నజిజీవిషామః | జీవింపగోరమో |
| (వయం) | (మేము) | తే | అట్టి |
| (తాన్) | వారలను | ధార్తరాష్ట్రాఏవ | ధృతరాష్ట్రుని చేరినవారలే |
| జయేమయద్వా | జయించెదమో | ప్రముఖే | ఎదుట |
| యదివా | లేక | అవస్థితాః | నిలబడియున్నారు. |
| (తే) | (వారలు) | | |

తా॥ (భిక్షమెత్తి బ్రతుకుట, స్వధర్మమని యుద్ధముజేసి జయించి రాజ్యభోగములను అనుభవించుట అను ఈ రెంటిలో) ఏది మాకు మిక్కిలి శ్రేష్ఠమో దీనిని మేము ఎరుగము. (మరియు) మేము వార్లజయించెదమో లేక వారలు మమ్ములను జయించెదరో అదియు మాకు తెలియదు. మేము ఎవరలను జంపిన పిదప బ్రతుకగోరమో ఆ ధృతరాష్ట్రుని జేరినవారలే (ఈ యుద్ధభూమిమీద) మనకెదురుగ నిలబడియున్నారు.

ఈ శ్లోకమునకు శ్రీధరులు మొదలైన కొందరు వ్యాఖ్యాతలు క్రిందకనుపరచినటుల వేరు విధముగను అర్థముజేసి యున్నారు— "(వయం = మేము) తాన్=వారలను, జయేమయద్వా = జయించెదమా, యదివా = లేక, తే = వారలు, నః = మమ్ములను, జయేయుః = జయించెదరా, (ఏతయోర్మధ్యే = ఈ రెంటిలో) కతరత్ = ఏది, నః = మాకు, గరీయః = గొప్పదిగ (భవిష్యతి = అగునో) ఏతత్ = దీనిని, నవిద్మః = ఎరుగము"

(స్వకీయము) పూర్వము 5 వ శ్లోకమున అర్జునుడు చెప్పినదేమన— "యుద్ధము స్వధర్మమైనను దానిలో గురువులను జంపి రాజ్యభోగములను పొందుటకంటె క్షత్రియ ధర్మము కానట్టి భిక్షమెత్తి జీవించుట తగినదని నాకుతోచుచున్న"దనునదియే. ఐనను ఈ శ్లోకమునజెప్పిన దేమన:— "పైజెప్పినటుల తనకుతోచినను ఆ రెంటిలో నిది తమకు శ్రేష్ఠము కాగలదనికూడ నిశ్చయింప వీలులేక యున్నది. ఐతే యుద్ధముజేసి భోగముల నొందుటయే శ్రేష్ఠమని యొక పక్షము గ్రహించినను ఆ భోగములను మనమొందగలమనునదియు స్థిరముగాదు. ఎందుకనగా కడపట జయమువారలకా, మనకాయని సందేహముగనుండుటచేత లేక జయము మనకే కలుగు నదిగ నెంచుకొనినను దానిచే ప్రయోజనము గలుగుటలేదు. ఏలనగా ఎవరిని విడిచి మేము జీవింప గోరమో వారలను జంపిననే ఆ జయము గలుగును." అని.



శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ॥
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం ॥

పద॥ కార్పణ్యదోషోపహతస్వభావః (1)
పృచ్ఛామి - త్వాం - ధర్మసమ్మూఢచేతాః (2) ।
యత్ - శ్రేయః - స్యాత్ - నిశ్చితం(3) - బ్రూహి - తత్ - మే
శిష్యః - తే - అహం - శాధి - మాం - త్వాం - ప్రపన్నం ॥

| | | | |
|---|---|---|---|
| కార్పణ్యదోషోప-హతస్వభావః | కృపణత్వమను దోషముచేత చెడిపోయిన స్వభావముగల | తత్ | దానిని |
| | | మే | నాకు |
| (అహం) | (నేను) | బ్రూహి | చెప్పుము |
| ధర్మసమ్మూఢచేతాః | ధర్మవిషయమున సందేహము గల మనస్సుగలవాడనై | తే | నీకు |
| | | అహం | నేను |
| త్వాం | నిన్ను | శిష్యః | శిష్యుడను |
| పృచ్ఛామి | అడుగుచున్నాను | త్వాం | నిన్ను |
| యత్ | ఏది | ప్రపన్నం | శరణమొందిన |
| నిశ్చితం | నిశ్చితమైన (గట్టిదైన) | మాం | నన్ను |
| శ్రేయః | శ్రేయస్సుగా | శాధి | అనుగ్రహింపుము. |
| స్యాత్ | అగునో | | |

తా॥ కృపణత్వము (ఆత్మజ్ఞానశూన్యత) అనుదోషముచేత చెడిపోయిన స్వభావముగలనేను ధర్మవిషయమున మనస్సందేహము గలవాడనై నిన్నడుగు చున్నాను. ఏది (శ్రుతిస్మృతి ప్రమాణానుసారముగ) నిశ్చితమైన శ్రేయస్సో

దానిని నాకు జెప్పుము. నేను నీకు శిష్యుడను (గదా). నిన్ను శరణమొందిన నన్ను శిక్షించి అనుగ్రహము జేయుము.

(1) కార్పణ్యం - అర్జునుడు తమగురువు మొదలగువార్లనుజంపి ఎట్లుజీవించెదననుచున్నాడనియు, అతడు అనుభవించు వ్యసనమే కార్పణ్యమనునదిగను, శ్రీధరుడు మొదలైన కొందరు వ్యాఖ్యాతలు అర్థముచేసియున్నారు. ఐతే ఆనందగిరి మొదలగువారలు ''యోవా ఏతదక్షరం గార్గ్య - విదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతి సకృపణ ఇతి(శ్రుతేః'' అనువాక్యము ననుసరించి ఎవ్వడు ఆత్మస్వరూపము నెరుగక ఈ లోకమునుండిపోవునో అతడు కృపణుడనియు, ఆ యాత్మ స్వరూపము నెరుంగని స్వభావమే కార్పణ్యమనియు వ్యాఖ్యానము చేసియున్నారు.

సాధారణముగా లోకమునందెవ్వడు తనధనమును స్వల్పమైనను వ్యయపరుప సహింపడో యతడే కృపణుడని ప్రసిద్ధియున్నది. ఆవిధముగనే ఎవడు తన యజ్ఞాన నాశమును స్వల్పమున్ను సహించుటలేదో అతడున్ను కృపణుడు అనగా ఆత్మస్వరూపమును కప్పివేయుచున్న అజ్ఞానమును పోగొట్టుకొని ఆత్మనెరుంగనివాడు కృపణుడని చెప్పబడినది.

దోషం అనుదానికి 'స్వకులక్షయకృతం' అనునదిగ నర్థముచేసి కార్పణ్యముచేతను దోషము చేతను ఉపహతమైన చేతస్సని శ్రీధరులు వ్యాఖ్యానము చేసియున్నారు.

స్వభావః - క్షత్రియుని శౌర్యాది స్థితియే స్వభావమనునదిగ శ్రీధరుడున్ను, ఆనందగిరి మొదలగు వారలు అంతఃకరణమనియు అర్థముచేసియున్నారు. శంకరానందులు ఈ పదమునకు ఆత్మస్వరూపమని అర్థముచేసికొని ''ఉపహతస్వభావః = కప్పబడిన ఆత్మస్వరూపమును గలవాడ''ని వ్యాఖ్యానము చేసియున్నారు.

(2) ధర్మమనగా అవిద్యచేత సంసారసముద్రమున త్రోయబడియున్న పురుషుడు దేనిచే గట్టెక్కింపబడుచున్నాడో అనగా స్వరూప ప్రకాశమునున్ను జ్ఞానమునున్ను పొందుచున్నాడో అది ధర్మమని శంకరానందులు వ్యాఖ్యానించియున్నారు.

ఆనందగిరి ''ధర్మో ధారయతీతి పరంబ్రహ్మ'' అనగా దేనిచే సకలమును ధరింపబడుచున్నదో అది, పరబ్రహ్మము, అని యర్థము చేసియున్నారు.

కొందరు ధర్మమనగా తాను చేయవలసిన కర్తవ్యమని అర్థము చేసియున్నారు.

(3) నిశ్చితం - ఈ పదమున్ను శ్రేయస్సను పదమున్ను వేర్వేరుగ నెత్తుకొని శంకరానందులు, శ్రుతిస్మృతులచేతను మహర్షులచేతను నిశ్చయింపబడినదిగను, శ్రేయస్సాధనముగను ఏది యున్నదో అదియని అర్థము చేసియున్నారు. ఆనందగిరి మొదలగువారు ''నిశ్చితముగు శ్రేయస్సు''అనగా ఐకాంతికముగాను, ఆత్యంతికముగాను, అనాపేక్షికముగాను ఉన్నట్టి శ్రేయస్సు ఏదిగలదో అది యని అర్థము చేసియున్నారు.

ఐకాంతికమనగా ఏ సాధనముచేత నొకదానినొంద వీలగునో ఆ సాధనము ఏర్పడినతోడనే నిశ్చయముగ నేదిగలుగునో అది. ఆత్యంతికమనగా కలిగి మరల నశించకయుండుట. అనాపేక్షికమనగా ఇతరసాధనాపేక్ష లేనిది.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోకముచ్ఛోషణ మింద్రియాణాం।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ 8

పద॥ న - హి - ప్రపశ్యామి - మమ - అపనుద్యాత్
యత్ - శోకం - ఉచ్ఛోషణం - ఇంద్రియాణాం ।
అవాప్య - భూమౌ - అసపత్నం - ఋద్ధం
రాజ్యం - సురాణాం - అపి - చ - ఆధిపత్యం ॥

| | | | |
|---|---|---|---|
| భూమౌ | ఈ భూలోకమునందు | మమ | నాయొక్క |
| అసపత్నం | శత్రువులేని | ఇంద్రియాణాం | ఇంద్రియములకు |
| ఋద్ధం | వృద్ధిపొందియున్న | ఉచ్ఛోషణం | ఎండుటను కలుగజేయుచున్న |
| రాజ్యం | రాజ్యమునున్ను | శోకం | దుఃఖమును |
| చ | లేక | యత్ | ఏది |
| సురాణాం | (పరలోకమున) దేవతలకు | అపనుద్యాత్ | పోగొట్టునో |
| ఆధిపత్యం | అధిపతిగనుండుటన్ను | తత్ | దానిని |
| అవాప్య | పొంది | నహిప్రపశ్యామి | నేను జూచుటయే లేదు |
| స్థితస్యాపి | ఉన్నవాడనైనను | | |

తా॥ ఈ భూలోకమున శత్రువులేని సమృద్ధియైన (సంపదతోనిండిన) రాజ్యాధిపత్యమునున్ను, పరలోకమున దేవేంద్రపదవిన్ని పొందియుండినను ఇంద్రియములకు శోషణమును (ఎండిపోవుటను) కలుగజేయు నా వ్యసనము నేదిపోగొట్టునో అది యిట్టిదని నాకు దెలియుటయేలేదు.

(స్వకీయము) మొదటి అధ్యాయముమొదలు ఈ రెండవ అధ్యాయము 8-వ శ్లోకమువరకు చెప్పబడిన శ్లోకముల తత్త్వార్థమిట్టిదని మధుసూదనసరస్వతి వ్యాఖ్యానమున జెప్పినది క్రింద సంగ్రహముగ వ్రాయబడుచున్నది — మునుపుచెప్పిన గ్రంథముచేత సంసారదోషమును నిరూపించి జ్ఞానాధికారి విశేషణములు చెప్పబడినవి. వానిలో "న చ శ్రేయోనుపశ్యామి'' అను శ్లోకముచేత నిత్యానిత్య వస్తువివేకమున్ను, "న కాంక్షే విజయం కృష్ణ'' అను శ్లోకముచేత ఇహలోకఫల విరాగమున్ను, "అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః'' అను శ్లోకముచేత పరలోకఫల విరాగమున్ను, "నరకే నియతం వాసః'' అను శ్లోకముచేత ఆత్మ, స్థూలదేహమునకంటె వేరైనదనియు, "కిన్నో రాజ్యేన'' అను శ్లోకముచే శమమున్ను, "కిం భోగైః'' అను శ్లోకముచే దమమున్ను, "యద్యప్యేతే న పశ్యన్తి'' అనుశ్లోకముచే లోభరాహిత్యమున్ను "తన్మే క్షేమతరం భవేత్'' అను శ్లోకముచే తితిక్షయు, చూపబడినవి. ఈ రెండవఅధ్యాయమున "శ్రేయోభోక్తుంభైక్షమపి'' అనుశ్లోకమున సన్యాసము ప్రతిపాదింపబడినది. "కార్పణ్య దోషోపహతస్వభావః ........... త్వాం ప్రపన్నం'' అను శ్లోకముచే సంసారదోషములను బాగుగ నెరింగి విశేషవైరాగ్యము నొందినవాడై "ఆత్మజ్ఞాన మును వెదకునతడు'' విధ్యుక్తప్రకారముగ గురుశరణాగతి నొందవలసినది ఆవశ్యకమని చూప బడినది. "న హి ప్రపశ్యామి'' అను శ్లోకముచేత ఇహాముత్రఫలభోగవిరాగము జ్ఞానాధికారికి ఆవశ్యకమైనదనియు చూపబడినది.

సంజయ ఉవాచ: —

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః।
న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ॥ 9

పద॥ ఏవం - ఉక్త్వా - హృషీకేశం - గుడాకేశః - పరంతపః।
న - యోత్స్యే - ఇతి - గోవిందం (1) - ఉక్త్వా - తూష్ణీం - బభూవ - హ (2)

| | | | |
|---|---|---|---|
| సంజయఉవాచ | సంజయుడు చెప్పినది | (పునరపి) | (మరల) |
| పరంతపః | శత్రువును తపింపజేయునట్టి | గోవిందం (ప్రతి) | గోవిందుని గూర్చి |
| గుడాకేశః | గుడాకేశుడైన అర్జునుడు | నయోత్స్యే ఇతి | యుద్ధము చేయనని |
| హృషీకేశం | హృషీకేశుడైన కృష్ణునిజూచి | ఉక్త్వా | చెప్పినతరువాత |
| ఏవం | ఈ (మునుపుచెప్పిన) ప్రకారము | తూష్ణీం | మౌనముగ |
| | | బభూవహ | ఉండెను |
| ఉక్త్వా | చెప్పి | | |

తా॥ సంజయుడు (ధృతరాష్ట్ర మహారాజునుజూచి) చెప్పినది. శత్రువులను తపింపజేయుచున్న, తమస్సును జయించునటువంటి అర్జునుడు కృష్ణ పరమాత్మనుజూచి మునుపుజెప్పిన ప్రకారముగ జెప్పి మరల గోవిందునిజూచి యుద్ధము జేయనని చెప్పి పిదప మౌనముగ నుండెను.

(1) గోవిందం - "గోభిః వేదాంతవాక్యైరేవ విద్యతే లభ్యత ఇతి గోవిందః" = వేదాంతవాక్యముల చేతనే పొందదగినవాడు,

(2) హ - దీనిని కొందరు వ్యాఖ్యాతలు వాక్యాలంకారముగ నెత్తుకొని అర్థము చేయక విడిచి యున్నారు. కొందరు ఈ పదము ఆశ్చర్యమును గుర్తించునదిగ నర్థము చేసియున్నారు.

ఈ "హ" అనునది అధికధైర్యము, బలముగల అర్జునునకుకూడ అధైర్యముగలుగుటనుగూర్చి సంజయుడు ఆశ్చర్యపడెనని గుర్తించునదిగ రాఘవేంద్రస్వాములు అర్థము చేసియున్నారు.

హృషీకేశపదమునకు 1-15 వద్దను గుడాకేశ అనుపదమునకు 1-24 వద్దను అర్థము పూర్వము చెప్పబడియున్నది.

(స్వకీయము) భగవంతునిచే ఇంత హితోపదేశము చేసినను అర్జునుడు కొంతవివేకముతో గూడినవానివలె మొదట మాటలాడి మరల యుద్ధముచేయనని చెప్పుట ఏమి ఆశ్చర్యము! ఎట్టి వివేకినైనను తనకు వశపరచుకొను మోహముయొక్క శక్తి ఎట్టిశక్తి! అని సంజయుని తలంపు. ఈ మోహసముద్రమునుండి అర్జునుని భగవంతుడు వేదాంతవాక్యముల నుపదేశించియే తరింపచేసి తన్నొందునట్లు చేయబోవుచున్నాడు, మార్గాంతరములేదు, అని సూచించుటకై గోవిందపదము ప్రయోగింపబడియున్నట్లు చెప్పవచ్చును.

❖❖❖❖❖❖❖❖

శ్లో॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।
సేనయోరుభయోర్మధ్యే విషీదంతమిదం వచః॥ 10

పద॥ తం - ఉవాచ - హృషీకేశః (1) - ప్రహసన్(2) - ఇవ - భారత।
సేనయోః(3) - ఉభయోః - మధ్యే - విషీదంతం - ఇదం - వచః॥

| | | | |
|---|---|---|---|
| హృషీకేశః | హృషీకేశుడైన శ్రీకృష్ణపరమాత్మ | ప్రహసన్నివ | నవ్వుచున్నవానివలె |
| ఉభయోః సేనయోః | రెండు సేనలయొక్క | హే భారత ! | ఓ భరతవంశమున నుదయించిన అర్జునుడా! (యని పిలిచి) |
| మధ్యే | మధ్య | ఇదంవచః | ఈ (చెప్పబోవు) వాక్యమును |
| విషీదంతం | దుఃఖపడుచున్న | ఉవాచ | చెప్పెను. |
| తం | వానిని (అర్జునుని) గూర్చి | | |

**తా॥ హృషీకేశుడైన కృష్ణపరమాత్మ రెండుసేనలమధ్య దుఃఖించుచున్న అతనిని (అర్జునునిజూచి) నవ్వుచున్నవానివలె ఓ భరతవంశమున నుదయించిన అర్జునుడా! యని పిలిచి ఈ (ముందు రాబోవు) వాక్యమును జెప్పెను.**

(1) హృషీకేశః - అను నీపదమునకు, 'ఇంద్రియములను స్వాధీనమునసుంచి వాటిని విషయములలో ప్రవర్తింప జేయుచున్న పరమాత్మ' అను తాత్పర్యమును, భగవంతుడు అర్జునునకు రథసారథిగ నలంకరించుట సూచించుచున్నది. సకల ప్రాణులను ప్రేరేపణ చేయుచున్న భగవంతునికి ఏది వీలుగానిదని భావము.

(2) ప్రహసన్నివ - పరిహాసమునకు ఫలము విరోధమనునది లోకప్రసిద్ధము. ఈ పరిహాసమునకనగా జ్ఞానోత్పత్తి ఫలము అను ఈ భేదమును "ఇవ" శబ్దము చూపుచున్నది. కొందరు వ్యాఖ్యాతలు ఈ"ఇవ" శబ్దమును వాక్యాలంకారముగనుంచి "ప్రహసన్నివ" అనుదానికి ప్రసన్నముఖముగ నున్నవాడై యని అర్థము జేసియున్నారు.

(3) సేనయోరుభయోర్మధ్యే - అనుటచే అర్జునుడు ఇట్టి అనుచితకాలమున శోకమునొంది యుద్ధము చేయనని చెప్పినను ఆ యుద్ధభూమియందు శస్త్రప్రయోగారంభ కాలమైన (అనగా తత్త్వోపదేశమునకు సాధారణముగ యోగ్యముగాని కాలమైన) ఆ సమయముననే భగవంతుడు ముందు రాబోవు ఆత్మతత్త్వముపదేశించెనని చెప్పుట, భగవంతుని అనుగ్రహమున కెవ్వడు పాత్రుడగునో అతనికి తన సన్నిధాన మాత్రము చేతనే జ్ఞానప్రాప్తిని భగవంతుడు కలుగచేయునట్టి కరుణానిధి యనుదానిని జూపుచున్నది.

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః ॥　　11

పద॥ అశోచ్యాన్ - అన్వశోచః(1) - త్వం - ప్రజ్ఞావాదాన్ (2) - చ - భాషసే।
గతాసూన్(3)-అగతాసూన్(4) - చ - న - అనుశోచన్తి - పండితాః(5) ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | భగవంతుడైన కృష్ణపరమాత్మ (అర్జునునిగూర్చి) చెప్పినది | భాషసే | మాటలాడుచున్నావు |
| త్వం | నీవు | పండితాః | జ్ఞానులు |
| అశోచ్యాన్ | దుఃఖపడదగనివారిని గూర్చి | గతాసూన్ | ప్రాణములు పోయినవారిని గూర్చియు |
| అన్వశోచః | దుఃఖపడుచున్నావు | అగతాసూంశ్చ | బ్రతికియున్నవారిని గూర్చియు |
| ప్రజ్ఞావాదాంశ్చ | బుద్ధిమంతుల మాటలనున్ను | నానుశోచన్తి | దుఃఖపడరు. |

తా॥ భగవంతుడైన కృష్ణపరమాత్మ (అర్జునునిగూర్చి) చెప్పినది — ఓ అర్జునా! నీవు దుఃఖింపదగని వారినిగూర్చి దుఃఖించుచున్నావు. బుద్ధిమంతుల మాటలను జెప్పుచున్నావు. ఆత్మజ్ఞానముగలవారు మరణించినవారిని గూర్చియు బ్రతికియున్నవారిని గూర్చియు దుఃఖింపరు.

(1) అన్వశోచః - ఈ పదము భూతకాలమును జూపుచున్నది. అనగా "దుఃఖపడితివి" అని అర్థము. ఐనను మునుపటి 10-వ శ్లోకమున "విషీదంతం" అని చెప్పియుండుటను జూచి అర్జునుడు ఈ యుపదేశకాలమునందును దుఃఖపడుచున్నాడని సిద్ధించుటచే దీనిని ఆర్షప్రయోగముగ నుంచుకొని "దుఃఖపడుచున్నావు" అని వర్తమానకాలముగ అర్థమును వ్యాఖ్యాతలు చేసియున్నారు.

(2) "ప్రజ్ఞావాదాన్ — నీబుద్ధికి తోచిన మాటలను" అనిమధ్వాచార్యులు, "ప్రజ్ఞ=జ్ఞానులు, అవాదాంశ్చ=చెప్పదగనిమాటలను" అనిరాఘవేంద్రులు, "దేహమే ఆత్మయను బుద్ధినిగలవాడు మాట్లాడు మాటలను" అని రామానుజులు అర్థము జేసియున్నారు.

(3) గతాసూన్— 'దేహములనుగూర్చి' అనిరామానుజులు అర్థముజేసియున్నారు.

(4) అగతాసూన్—"ఆత్మలనుగూర్చియు" అనిరామానుజులు అర్థపరచియున్నారు. వెంకటనాథులు ఈపదమునకు "ఆసన్నమరణులు" అనగా—సమీపమున మరణమునొందబోవువారు అని అర్థముజేసియున్నారు.

ప్రాణముతో గూడియున్నవారినిగూర్చి సాధారణముగ లోకమున దుఃఖపడుట ఎట్లు స్వాభావికముగాదో అటులనేమరణించినవారినిగూర్చి దుఃఖపడుటయు పండితులకు స్వాభావికము గాదు. దుఃఖపడరని కొందరు తాత్పర్యముజేసియున్నారు.

(5) పండితాః — ఎవరికి ఆత్మవిషయమైన జ్ఞానముగలదో వారే పండితులగుదురు. "పాండిత్యం నిర్విద్యబాల్యేనతిష్ఠాసేత్" అనుశ్రుతి వాక్యమును బృహదారణ్యకోపనిషత్ అధ్యా. 5 బ్రాహ్మణం 1, మంత్రములోచూడుము.

(శంకరభాష్యము) ఈ విధముగ తానుజేయవలసిన ధర్మవిషయమున మోహమొందిన మనస్సుగలవాడై, మహత్తైన శోకసముద్రమున మునిగియున్న అర్జునుని ఆత్మజ్ఞానముచేతనే గాని వేరువిధముగ తరింపజేయుటను ఎరుగని భగవంతుడైన వాసుదేవుడు, అర్జునుని నిమిత్తముగగైకొని సకల ప్రాణులున్ను కడతేరుటకై ఆత్మజ్ఞానమును ఇదిమొదలుగ నుపదేశించుచున్నాడు.

భీష్మద్రోణాదులు ఎవ్వరిచేతను దుఃఖింపదగినవారలుకారు. ఏలన సదాచారముగల వారలు, పారమార్థికముగను నిత్యులైనవారలు. వీరలు మరణింపబోవుచున్నారే, వారికి నేనుగదా కారణమని దుఃఖపడుటయు, జ్ఞానుల మాటలను ఆడుటయు ఉన్మత్తునివలె మూఢుపాటును చూపుచున్నది. ఎందుకనగా — పండితులు — అనగా — ఎవరికి ఆత్మవిషయమైన జ్ఞానముగలదో వారలు, మరణించిన వారినిన్ని బ్రతికియున్నవారినిన్నిగూర్చి దుఃఖింపరు.- (రెండున్ను వారికి సమమేయని భావము) కావున నీవు మూఢుడవగుచున్నావని తాత్పర్యము.

(స్వకీయము) ఈ శ్లోకము బీజమంత్రమని జెప్పబడియున్నది. అనగా — వృక్షమెట్లు విత్తనమునందు ఇమిడియున్నదో అటులనే గీతాశాస్త్రమంతయు ఈశ్లోకమున ఇమిడియున్నదగును.

అర్జునుడు గొప్పదైన శోక మోహసముద్రమున మునిగియుండుట యనునదియు, దాని నుండి తరింప ఆత్మజ్ఞానముతప్ప మార్గాంతరము లేదనుటయు ఎట్లను విషయమును స్పష్టముగను విస్తరముగను తెలిసికొనుటకు, ఈ భగవద్గీత 18 అధ్యాయములను భాష్యవ్యాఖ్యానములతో బాగుగ విమర్శనచేసియే తెలిసికొనుట ఆవశ్యకమైనను, ఆవిషయములు సంగ్రహముగ నిచ్చట ఎత్తిచూపుట కొంత ఉపయోగముగనుండును.

శోకమోహములననవి "నేను వీరలను చేరినవాడను, వీరలు నన్నుచేరిన వారలు" అను ఈ విధమైన తలంపుచే గలుగునభిమానమున్ను, ఆవిధముగ నభిమానముంచబడినవాటిని వదలిపెట్టుటచే గలుగుదుఃఖమున్ను "నేనుకర్త, నేను భోక్త" అను ఈ విధమైన వాటిచేగలుగు భ్రమయే. దీనిని నివర్తింపజేయునట్టి ఆత్మజ్ఞానము "తత్త్వమసి' మహావాక్యముయొక్క లక్ష్యార్థమైన జీవేశ్వరైక్య సాక్షాత్కారమే.

ఈశ్వరుడెవ్వడనః— ఈ జగత్తంతయు వ్యాపించి స్థూలసూక్ష్మ ప్రపంచమునంతయు తన దేహమున ధరించియున్న పరిపూర్ణమైన బ్రహ్మము. ఈ యీశ్వరునికి స్థూల, సూక్ష్మ దేహము లెట్లనో అటులనే జీవులైన మనకును ఈ స్థూలదేహమున్ను, సూక్ష్మదేహమున్నుగలదు. సూక్ష్మ దేహమనునది జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, పంచ ప్రాణములు, మనస్సు, బుద్ధి ఇవి యంతయు చేరినది. ఇట్టి దేహములతోగూడిన జీవులకున్ను ఈశ్వరునికిగల సంబంధమేమనగా - ఈశ్వరుని దేహమైన ఈ ప్రపంచమున జీవకోటియంతయు తమతమ స్థూల సూక్ష్మ దేహములతో అణువులువలె నిమిడియున్నవి. దీనికి ఉపమానము స్థూలమైన మనదేహమే. దీనిలో ఎట్లు అనేక కోటి అణువులు నిలిచియున్నవో అటులనే, ఈ అణువులకు పై దేహమున దప్ప వేరైనస్థానము, మంచి చెడ్డలు, ఎట్లులేవో అట్లనే ఈ జీవులైన మనకున్ను ఈశ్వరుని విడిచి ప్రత్యేకించియుండుట యనునదియు, మంచి చెడ్డలనునదియు, లేవు. వాని ప్రాణములే ఈ జీవుల ప్రాణములు. వాని దేహమైన ఈ లోకముయొక్క క్షేమము, మంచి చెడ్డలు ఇవియే జీవులైన మనయొక్క క్షేమము, మంచి చెడ్డలుగనున్నవి. ఈశ్వరుడు సృష్టికాలమున ఈ జనులను సృష్టించి వారలు కడతేరుటకై వేదశాస్త్రాదులను ప్రకటింపజేసి ధర్మశాస్త్రములని జెప్పఁబడుచున్న వర్ణాశ్రమ ధర్మములు ఇట్టివని ఏర్పరచియున్నాడు. వాటిలో ఈ లోకముయొక్క సముదాయ క్షేమమును గలుగచేయుటయే స్వధర్మమని జెప్పబడినది. ఆ విధముగ వాని వాని స్వధర్మము ననుష్ఠించుటయే సామాన్యముగ లోకమునకున్ను, దానిచే జీవులైన మనకున్ను క్షేమమును గలుగచేయును. దానినివిడిచి లోకమున ఇతరుల క్షేమమువేరు, తనక్షేమమువేరని విభజించుకొని సముదాయ క్షేమమును గోరక తన క్షేమమునే గోరువాడు, దుఃఖమును, బంధమును పొందును. స్వప్రయోజనమనునది లోక సముదాయ ప్రయోజనమున నిమిడిపోవలయును. ఇట్టి తలంపుతో ఫలాపేక్షను విడిచి లోక క్షేమమునకై వాని వాని స్వధర్మమును ఈశ్వరార్పణముగ చేయుచుండుటయే జీవుల కర్తవ్యము. అట్లు చేయుచున్నచో చిత్తశుద్ధియు, చిత్తశుద్ధిచేత జ్ఞానమున్ను, జ్ఞానముచేత మోక్షమున్ను పొందుటకు మార్గమిదేగాని మార్గాంతరముకాదు. ఈ విషయము అర్జునునకు స్పష్టముగ బోధపడిన పిదపనే "నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత, స్థితోఽస్మిగతసందేహః కరిష్యేవచనం తవ' "నేను నీ మాటను నెరవేర్చెదను" అని భగవంతునితోజెప్పి మరల అతడు యుద్ధము చేయ నారంభించెను.

ఈ శ్లోకమునందంతర్గతమైన తాత్పర్యమును వివరించి జెప్పుచున్న వరాహపురాణము వ భాగము అధ్యాయము 187 లో గల క్రింద కనుబరచిన శ్లోకములను జూడుడు:—

శ్లో॥ అశోచ్యమనుశోచంస్త్వం ప్రజ్ఞావాన్నావబుద్ధ్యసే ॥ 62

,, గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః ।

మృతం వా యదివా నష్టం యో యాంతమనుశోచతి ॥ 63

,, అమిత్రాస్తస్య హృష్యన్తి న చాపి న నివర్తతే ।

అమరత్వం న పశ్యామి త్రైలోక్యే స చరాచరే ॥ 64

,, దేవతాసురగంధర్వా మానుషా మృగపక్షిణః ।

సర్వే కాలవశం యాన్తి సర్వః కాలముదీక్షతే ॥ 65

,, జాతస్య సర్వభూతస్య కాలో మృత్యురుపస్థితః ।

అవశ్యం చైవ గన్తవ్యం కృతాంత విహితేన చ ॥ 66

,, జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్య చ ।

మోక్షః కర్మవిశేషేణ ప్రాయశ్చిత్తేన చ ధ్రువం ॥ 87

,, త్యజ శోకం మహాభాగ శోకస్సర్వవినాశనః ॥ 95

,, శోకో దహతి గాత్రాణి బుద్ధిశ్శోకేన నశ్యతి ।

లజ్జా ధృతిశ్చ ధర్మశ్చ శ్రీః కీర్తిశ్చ స్మృతిర్నయః ॥ 96

,, త్యజన్తి సర్వధర్మాశ్చ శోకేనోపహతం నరం । 96½

నీవు దుఃఖింపదగని విషయమునకై దుఃఖించుచున్నావు. వివేకిగనుండియు, తెలిసికొనలేదు. 62. మరణించినవారినిగూర్చియు, బ్రతికియున్నవార్లనుగూర్చియు జ్ఞానులు దుఃఖింపరు. (ఏలనగా జ్ఞానులకు స్నేహితుడు, విరోధియనువారులేరు. స్నేహమే మరణించిన వానినిగూర్చి దుఃఖించుటకును, విరోధమే యున్న వానినిగూర్చి సంతోషపడుటకున్ను కారణము. గతించినవానిని గూర్చికాని ఏమైనాడో తెలియకుండా తప్పిపోయినవానినిగూర్చికాని శోకించువానిని జూచి వాని విరోధులు సంతోషించుచున్నారు. ఆ శోకించుటచే గతించినవారు తిరిగి వచ్చుటలేదు. 63. స్థావర జంగమములతోగూడిన ఈ మూడులోకములలోను మరణములేనిదానిని (జంతువును) నేను జూడలేదు. దేవతలు, అసురులు, గంధర్వులు మనుష్యులు, మృగములు, పక్షులు, మొదలగు జంతువులన్నియు కాలమునకు లోబడినవై కాలము నెదురుచూచు చున్నవి. 65. జనించియున్న సకల భూతములకున్ను మరణమనెడు యముడు సమీపించియే యున్నాడు. నిశ్చయింపబడియున్న కాలమునందవశ్యముగ మరణించియే పోవలసియున్నది. 66. జనించినవారికి గతించుట గలదనునది నిశ్చయము. గతించినవానికి జననము గలదనునదియు నిశ్చయము. కర్మవిశేషముచేతను. ప్రాయశ్చిత్తముచేతను మోక్షము (జననమరణములనుండి విడువబడుట) నిశ్చయము. 87. ఓ భాగ్యవంతుడా ! దుఃఖమును విడిచిపెట్టుము. దుఃఖము అన్నిటిని నాశముచేయును. 95 దుఃఖము దేహమును దగ్ధముచేయును. దుఃఖముచేత బుద్ధి నాశమొందును. దుఃఖోపహతుడైన పురుషుని లజ్జ, ధైర్యము, ధర్మము, కీర్తి, స్మరణము, సదాచారము తదితరములైన ధర్మములు, ఇవి త్యజించుచున్నవి. (అనగా వానియందు ఆ గుణములుండవని తాత్పర్యము.) 96½

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।

న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ ॥ 12

పద॥ న - తు - ఏవ - అహం - జాతు - న - ఆసం - న - త్వం - న - ఇమే - జనాధిపాః ।
న - చ - ఏవ - న - భవిష్యామః - సర్వే - వయం - అతః - పరమ్ ॥

| | | | |
|---|---|---|---|
| అహం | నేను | (జాతు) | (ఒకకాలమునందుగాని) |
| జాతు | ఒకకాలమునందుగాని | (నాసఞ ఇతి) న | లేకుండలేదు |
| నాసం (ఇతి) తుచైవ | లేక యుండనే లేదు | వయంసర్వే | మనమందరము |
| త్వం | నీవు | అతః పరం చ | దేహము నశించిన తరువాతను |
| (జాతు) | (ఒకకాలమునందుగాని) | | కూడ |
| (నాసీరితి) న | లేక యుండనే లేదు | న భవిష్యామః | ఉండకపోవుట అనునదే లేదు |
| ఇమే జనాధిపాః | ఈ రాజులు | ఇతినైవ | |

తా॥ నేను, నీవు, ఈ (యుద్ధభూమిమీదనున్న) రాజులున్ను, మనమందరమును ఒకకాలమునందుగాని లేకుండలేదు. దేహము నశించిన పిదపను మనమందరమున్ను లేకపోవుటయనునదిలేదు. (అనగా-భూతకాలము, వర్తమానకాలము, భవిష్యత్కాలము అను మూడు కాలములలోను మనము ఆత్మస్వరూపముచేత నిత్యమైనవారలమని భావము)

(శ్రీధరులు) ఈ శ్లోకమునందు ప్రయోగింపబడియున్న బహువచనములైన పదములు దేహమును గురించినవేగాని ఆత్మను గురించినవిగావు. అనేకదేహములలోనున్న ఆత్మయొక్కటే.

(రామానుజులు) అహం = సర్వేశ్వరుడైన నేను, జాతు = అనాదికాలముమొదలు ఇంతవరకు ఒకకాలముననైనగాని, నాసమితిన = లేననునదిలేదు, త్వం, ఇమే జనాధిపాః = నీవు మొదలైన ఈ సకలరాజులున్ను (అనగా-నా యాజ్ఞకులోబడి నడచుచున్న జీవులు) నా సన్నితి న = లేరనునదియులేదు. సర్వేవయం = నేను నీవు వీరందరు, అతః పరం = ఇకమీదను, నచైవ న భవిష్యామః = ఉండబోవుట లేదనునదియు లేదు (అనగా ఎప్పుడునుందుము.) ఈ శ్లోకమునకు తాత్పర్యమేమనగా-సర్వేశ్వరుడనైన నేనెట్లు నిత్యుడననువిషయమున సందేహములేదో, అటులనే జీవాత్ములైన మీరున్ను నిత్యులుగనున్నవారలని యెరుంగవలయును. ఈ విధముగ పరమాత్మయైన సర్వేశ్వరునినుండి జీవాత్మలలో పరస్పరభేదము వాస్తవమని కృష్ణపరమాత్మచేతనే జెప్పబడినదిగ, గనబడుచున్నది. మోహమొందియున్న అర్జునునకు ఆత్మస్వరూప నిశ్చయమనే తత్త్వము నుపదేశించుచున్న ఈ సమయమున, నీవు, నేను, ఈ రాజులనియు, మనమందరమనియు, భగవంతుడు చెప్పియుండుటచేతనే, ఇట్టిభేదము వాస్తవముగనే యుండవలయును." ఈఆత్మభేదము అసత్యమైనది. ఉపాధిచేత కల్పితమైనది'' అను పక్షమున, వాస్తవముగ ఆత్మతత్త్వోపదేశకాలమున భగవంతుడైన కృష్ణపరమాత్మ మిథ్యగనున్న (అబద్ధముగనున్న) భేదజ్ఞానము నుపదేశించుననుట అసంభావితముగనున్నది. మరియు ఇట్టిభేదము ఎల్లప్పుడు నున్నదనియే "నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానాం, ఏకో బహూనాం యో విదధాతి కామాన్=నిత్యుడుగను, చేతనుడుగను, ఒకడుగను ఉన్న పరమాత్మ, నిత్యులుగను అనేకులుగను ఉన్న చేతనులగు జీవులకు వారివారి ఇష్టములను ఇచ్చుచున్నాడు" అను నీశ్రుతివాక్యముచేత స్పష్టమగుచున్నది. జీవేశ్వరభేదము అజ్ఞానముచే కల్పితమను పక్షమున సర్వేశ్వరుడుగన్ను శుద్ధనిత్యస్వరూపుడుగను, స్వరూప సాక్షాత్కారముచేతనే అజ్ఞానము, అజ్ఞానముచే గలుగుకార్యములు, లేకున్న కృష్ణపరమాత్మకు, "నీవు, నేను, వాడు" అనుభేదజ్ఞానము ఇట్టితత్త్వోప

దేశకాలమునందుండగూడదు. భగవంతుడైన కృష్ణపరమాత్మకు అజ్ఞానమున్ను, దానికార్యము లున్ను లేకపోయినను దగ్ధమైనవస్త్రము ఉపయోగయోగ్యముగానిదైనను జూచుటకు వస్త్రమువలె కనబడునట్లు, అజ్ఞానము దానికార్యములు వీటివాసనచే భగవంతుడుపదేశించెననుపక్షమున అదియు నసంభావితమే. పరమాత్మయైన కృష్ణస్వామికి అజ్ఞానముగాని, దానికార్యముగాని, దానివాసనగాని ఎప్పుడునులేదు. కావున కృష్ణపరమాత్మ తనకంటె వేరొకవస్తువులేదనియు, ఇప్పుడు కనబడు చున్నట్లును, ఉన్నట్లును జెప్పుట అజ్ఞానముచే గల్పితమైనదనియు, వాస్తవముగనున్న పక్షమున తత్త్వోపదేశకాలమునందు అభేదమును జెప్పక "నీవు, నేను, వాడు"ను భేదమును జెప్పుననుట మరియు నసంభావితముగ నున్నది. అజ్ఞానము, దానికార్యములు ఇవి లేని భగవంతునకు వాటి వాసనమాత్రము, దగ్ధమైనవస్త్రమువలె నుండుననుటయు సరియైనదిగాదు. భగవంతుడు సర్వజ్ఞు డనియు జ్ఞానమునే స్వరూపముగ గలవాడనియు, మాయాతీతుడనియు శ్రుతి ప్రమాణములలో జెప్పబడియున్నది గావున భగవంతుడైన కృష్ణపరమాత్మకు అజ్ఞానముండెనని చెప్పనవకాశములేదు. తనకంటె వేరొకవస్తువులేదనియే తలంచి యుండినచో, తన ప్రతిబింబమువంటి అర్జుననకు ఉపదేశించుట ఎట్లు? దర్పణమున (అద్దము) కనబడు తన రూపమనే ప్రతిబింబము తనకంటె భిన్నము గాదను నిశ్చయజ్ఞానముగలవాడు అద్దమునందున్న తన యా ప్రతిబింబమునకు ఉపదేశము చేసెనని చెప్పదగునా? భగవంతునికంటె అర్జునుడు వేరుకాడనినచో జ్ఞానానందస్వరూపియైన భగవంతుడు ఉపదేశింప కారణమేలేదు. అర్జుననివలె భగవంతుడున్ను అజ్ఞానియైనచో, ఒక అజ్ఞానికి మరియొక యజ్ఞానియుపదేశించుట ప్రయోజనములేనిది. కావున ఉపదేశమున్ను, ఉప దేశమును గ్రహించుటయు వ్యర్థమే. కావున ఈ శ్లోకమునందలి తాత్పర్యము జీవేశ్వరభేదమునే స్పష్టముగ ప్రకటించుచున్నది.

(రాఘవేంద్రులు) అర్జునుడు మోహముచేత బంధువుల నెట్లుచంపుటయని దుఃఖించు చున్నాడుగదా. అదుఃఖమును పోగొట్టుటకై మునుపటి శ్లోకముమొదలు తత్త్వోపదేశము చేయబడు చున్నది. నీవు దుఃఖపడుటదేనినిగూర్చి? దేహమునుగూర్చియా? ఆత్మనుగూర్చియా? లేక దేహమే ఆత్మయనుదానినిగూర్చియా? దేహము పోవుచున్నదే యని వ్యసనముగలిగి యున్నచో "దేహినోఽస్మిన్ యథా దేహే, వాసాంసి జీర్ణాని యథావిహాయ" అనుశ్లోకములలో జెప్పినటుల ఒకదేహము పోవుటయు మరియొకటి వచ్చుటగనే యుండుటచే జడమైనదేహము ఒకదినము నశించుట నిశ్చయము. నిశ్చయముగ నశించుస్వభావమేగల దేహము నీవు వ్యసనపడుటచే నశించక యుండునా? అందువలన జడమైన దేహమునుగూర్చి నీవు వ్యసనపడ కారణములేదు. ఆత్మపోవు చున్నదను దానినిగూర్చి వ్యసనించినచో ఈ శ్లోకముచేతను, ముందుచెప్పబడు అనేకశ్లోకములచేతను "నిత్యోనిత్యానాం" అనుశ్రుతివాక్యముచేత పరమాత్మ యెట్లు నిత్యుడో, అటులనే జీవుడున్ను నిత్యుడని జెప్పబడియుండుటచే నాశములేని స్వభావముగల ఆత్మనుగూర్చి వ్యసనింపకారణమేలేదు. దేహమే యాత్మ అనుదానిని గూర్చినదైనచో "దేహినోఽస్మిన్, వాసాంసిజీర్ణాని" మొదలగు శ్లోకముల చేతను, తదితరములైన శ్రుతిప్రమాణములచేతను దేహములనొందుటయు విడుచుటయు జీవునికార్యమే. దేహమున్ను, జీవుడున్ను ఏకమైనచో దేహముపోయినచో జీవుడున్ను పోవలయునుగదా! ఒక దేహ మును విడుచుటయు, మరియొకదేహమును పొందుటయు జీవునికార్యమని జెప్పబడియుండుటచే 'దేహమే ఆత్మగాదు, అందువలన దుఃఖించుటకు కారణము లేద'ని తాత్పర్యము. దీనిచేత భగవంతునివలె జీవుడున్ను అనాది, నిత్యుడని తేలుచున్నది.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతర ప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి ॥ 13

పద॥ దేహినః — (1) — అస్మిన్ — యథా — దేహే — కౌమారం — యౌవనం — జరా
తథా — దేహాంతరప్రాప్తిః — ధీరః — తత్ర(2) — న ముహ్యతి ॥

| | | | |
|---|---|---|---|
| దేహినః | దేహికి (దేహముతో నుండు నాత్మకు) | యథా | ఎటులనో |
| | | తథా | అటులనే |
| అస్మిన్‌దేహే | ఈ దేహమున | దేహాంతరప్రాప్తిః | వేరుదేహము వచ్చుటయు |
| కౌమారం | బాల్యమున్ను | తత్ర | అట్లుండునప్పుడు |
| యౌవనం | యౌవనదశయు | ధీరః | జ్ఞానవంతుడు |
| జరా | వృద్ధాప్యము (ముసలితనమున్ను) | నముహ్యతి | మోహము చెందుటలేదు. |

**తా॥ దేహికి (శరీరముతో నిలబడు ఆత్మకు) బాల్యము, యౌవనము, ముసలితనము ఇవి యెట్లనో (అనగా, భేదముగల ఈమూడు అవస్థలున్ను ఆత్మ యొకనికే ఒకటివెనుక నొకటిగ ఆత్మకు మార్పులేకయే వచ్చుచున్నవో) అటులనే (గదా!) ఈ దేహముపోయి మరియొక దేహము వచ్చుటయు. అట్లుండుట చేత (నే) జ్ఞానులు మోహము పొందుటలేదు.**

(1) దేహినః — దేహాభిమానముగల జీవుడని శ్రీధరులు అర్థము జేసియున్నారు.

(2) తత్ర — అనుదానికి "ఇట్లుండుటచే, అనగా దేహము నశించినను ఆత్మ మూడుకాలముల లోను మార్పుచెందక నిత్యుడుగ నుండుటచేత" అని శంకర భాష్యము.

"దేహనాశోత్పత్తులలో" అని శ్రీధరులు, వేంకటనాథులు ఇరువురు తాత్పర్యముచేసి యున్నారు. శంకరానందులు "ఆత్మ నిత్యుడను విషయమున" అని అర్థము చేసియున్నారు.

(శంకరభాష్యము) మునుపటి శ్లోకములో ఆత్మనిత్యుడని చెప్పుట యెట్లని ఈశ్లోకమున భగవంతుడు దృష్టాంతము జెప్పుచున్నాడు. శరీరముతో నిలబడునాత్మకు ఇప్పుడున్న దేహమునందు బాల్యావస్థ, యౌవనావస్థ, జరావస్థయను ఈ మూడు అవస్థలును ఒకటికొకటి వేరుపడినవి. వాటిలో మొదటి అవస్థ నాశమొందునప్పుడు ఆత్మనశించుటలేదు. రెండవ అవస్థ కలుగునప్పుడు ఆత్మ కలుగుటలేదు. ఇకనేమనగా, బాల్యావస్థ మారినను ఆత్మ మార్పుచెందక రెండవ, మూడవ అవస్థలను పొందుటను చూచుచున్నాము. అటులనే ఆత్మ, వికారమొందకయే దేహాంతరమును బొందుచున్నది. ఇది ఇట్లుండుటచేతనే జ్ఞానవంతుడు (అనగా శ్రుతిస్మృతియుక్తులచేత ఆత్మనిత్యుడని యెరింగినవాడు.) మోహము జెందుటలేదు.

(స్వకీయము) ఈ 11, 12, 13-వ శ్లోకములలో నిరూపింపబడిన విషయమిట్టిదని క్రింద కనుబరచబడియున్నది. అదేమనగా:— భూలోకమునందున్న సకలజనులున్ను "నేను నేను" అని వ్యవహరించుకొని యుండుటను మనము ప్రతివిషయమున చూచుచున్నాముగదా. అట్లు "నేను నేను" అని వ్యవహరించుట స్థూలమైన ఈ దేహమేయని బాలురొకవేళ తలంతురుగాని, లోకానుభవముగల జనులు అట్లు తలంతురని చెప్పుట కవకాశములేదు. ఏలన లోకమున సాధారణముగ జనులు మరణమొందుకాలమున ప్రాణము ఈ దేహమును విడిచి పోయినదిగ జెప్పుటయు, అట్లు ప్రాణములేని దేహమును ఉపయోగములేనిదని దహనము చేయుటయు, వాడుకగదా? కావున ప్రాణముతోనుండు నప్పుడు స్థూలమైన ఈ దేహమునకు ఆధారముగ దానిని ధరించియున్న

"నేను" అనునది యెద్దియో అది ఈ దేహము కంటె అన్యమైనదనుటలో సందియములేదు. ఇదియే ఈ శ్లోకమున 'దేహి' యని చెప్పబడియున్నది.

ఐనను ఈదేహము నశించిన పిదప 'దేహి' అని యొకటియుండునట్లు మనకు కనబడక యుండుటచేత దేహముతో దేహియు నశించినట్లు తలంచి మరణించినవానినిగూర్చి చింతించు చున్నాము. ఆ విధముగనే అర్జునుడున్ను భీష్మాదులను గూర్చి "వీరలు నాచే చంపఁబడి మరణింతురే. వారలులేక నేనుండి ఏమిఫలము?" అని దుఃఖించుటకు కారణము, వారలదేహములకు నాశమువచ్చినచో వాటితో వారలుపోవుదురని తలంచుటచేతనే.

ఎల్లరికిన్ని ఇట్టి శోకమును నివర్తింప జేయుటకై భగవంతుడు ఈ శ్లోకములచే దేహి నిత్యుడు. దేహము నాశముచెందినను దేహి నాశమొందుటలేదని నిరూపించుచున్నాడు. ఎట్లనగా:— మరణించినవానినిగూర్చియు, బ్రతికియున్నవానినిగూర్చియు ఆత్మజ్ఞానముగలవారికి ఎట్టివ్యత్యాసము తోచదు. ఏలనగా ఈదేహము పోయినపిదప మనము లేకపోవుచున్నామనునది లేదు, దీనికిమునుపు మనము లేకుంటిమనునదియులేదు. కావున దేహి త్రికాలములలోను ఉన్నవాడు, నిత్యుడు, దేహము నశించి పోయినను అతడెట్టి వికారమును చెందుటలేదు. అయితే "దేహమునశించిన పిదప దేహినశింప కున్నట్లు ప్రత్యక్షముగ కనబడుటలేదే?"యనినచో దాని ననుమానముచేత నెరుంగుటకై ఈ 13-వ శ్లోకమున ఈదేహి, ఈదేహముతో గూడియున్నప్పుడే బాల్యము,యౌవనము, వృద్ధాప్యము మొదలైనఒకటి వెనుకనొకటి మార్పుగలయవస్థలను పొందియు 'నేను' అనుదేహి మార్పుచెందక యుండుటవలె ఈ దేహముపోయినపిదప దేహికి దేహాంతరమువచ్చునని దృష్టాంతముచెప్పబడినది. కావున ఈదృష్టాంతమును గైకొని 'దేహి' (ఆత్మ) నిత్యుడని యెరింగి శోకమునుండి నివృత్తి పొందుమార్గము చూపబడినది. ఐననుఆత్మ ఇట్టివాడని గుర్తింపఁదగినవాడు కాడు. ఇంద్రియములకు గోచరించడు అనాదియైనవేదముగూడ ఆత్మను 'నేతినేతి=ఇదికాదు ఇదికాదు' అనిచెప్పకనే చూపునట్లు ఈమూడు శ్లోకములలోను ఆత్మ, స్థూలదేహవిలక్షణుడని చూపబడినది.

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః।
అగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత ॥ 14

పద॥ మాత్రాస్పర్శాః — తు — కౌన్తేయ — శీతోష్ణసుఖదుఃఖదాః।
అగమాపాయినః — అనిత్యాః — తాన్ (1) — తితిక్షస్వ — భారత ॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ | ఓ కుంతీ పుత్రుడా ! | అనిత్యాః | అనిత్యములుగను ఉన్నవి |
| మాత్రాస్పర్శాస్తు | ఇంద్రియములకు విషయములతో సంబంధములు | (అతః) | (కావున) |
| | | తాన్ | వానిని (ఆ శీతోష్ణాదులను) |
| శీతోష్ణ సుఖదుఃఖదాః | శీతము, ఉష్ణము, సుఖము దుఃఖము వీటినిచ్చునవిగను | హే భారత ! | ఓ భరతవంశమున నుదయించినవాడా ! |
| ఆగమాపాయినః | కలిగి అంతరించు స్వభావము గలవిగను | | ఓర్చుకొనుము. |

తా॥ ఓ అర్జునా! (చెవి) మొదలైన ఇంద్రియములు శబ్దాది విషయములతో సంబంధించినచో, ఆసంబంధముచేత శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము ఇవి గలుగుచున్నవి. ఐనింకి అంతరించుస్వభావముగలవై అనిత్యములుగ

నుండుటచే వాటిని (శీతోష్ణాదులను) ఓ భరతవంశమున నుదయించినవాడా! ఓర్చుకొనుము. అనగా వాటివిషయమున సంతోషమునుగాని, దుఃఖమునుగాని పొందకుమని భావము.

(1) తాః - అనునది మాత్రాస్పర్శములను గుర్తించునదిగ శ్రీధరుడు మొదలగువారు అర్థముచేసి యున్నారు.

(రాఘవేంద్రులు) ఇంద్రియములకు విషయములతో సంబంధము స్వభావముగా శీతోష్ణ సుఖదుఃఖాదులను గలుగజేయదు. ఐనను విషయములతో అభిమానముతో గూడిన సంబంధమే శీతోష్ణ సుఖదుఃఖాదులను గలుగజేయుచున్నది. కావున "తాః = అట్టి యభిమానముతో గూడిన విషయేంద్రియ సంబంధములను, తితిక్షస్వ = విడిచిపెట్టుము."

(స్వకీయము) ఈ 14, 15 వ శ్లోకములచేత, ఆత్మ సూక్ష్మదేహ విలక్షణుడని యెట్లు నిరూపింపబడినదనుదానినిగూర్చి 15-వ శ్లోకముక్రింద జెప్పియుండుటను జూడుడు. అర్జునుని మొదట 'కౌంతేయ' (కుంతీపుత్రుడా) అనియు, మరల నదేశ్లోకమున 'భారత' యనియు జెప్పుట నీవు ఉభయకులశుద్ధుడవు. ఉభయకుల శుద్ధుడుగ నున్నవాడే జ్ఞానమున కధికారి. నీవు అట్టి వాడవుగ నుండుటచేత నీకి శోకముతగదు. నీ పూర్వీకులవలె నీవున్ను ఆత్మజ్ఞానమునుచెంది, వారల మార్గమును అనుష్ఠించవలయునని యెత్తిచూపునదిగ వ్యాఖ్యాతలు తాత్పర్యముజేసి యున్నారు.



శ్లో॥ యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ 15

పద॥ యం - హి - న - వ్యథయన్తి - ఏతే (1) - పురుషం - పురుషర్షభ ।
సమదుఃఖసుఖం - ధీరం (2) - సః - అమృతత్వాయ - కల్పతే ॥

| | | | |
|---|---|---|---|
| హే పురుషర్షభ! | ఓ పురుషశ్రేష్ఠుడా! | యం పురుషం | ఏ పురుషుని |
| ఏతే | ఇవి (శీతోష్ణాదులు) | నవ్యథయన్తి హి | చలింపజేయుటలేదో |
| సమదుఃఖ సుఖం | సుఖదుఃఖములను సమముగ గ్రహించిన | సః | అతడు |
| | | అమృతత్వాయ | మోక్షమునకు |
| ధీరం | ధీరుడైన (వివేకియైన) | కల్పతే | తగినవాడగును |

తా॥ సుఖదుఃఖములను సమముగ నెంచుచున్న (అనగా సుఖము వచ్చినప్పుడు సంతోషము, దుఃఖము వచ్చినప్పుడు వ్యసనము, నొందని) ఏ ధీర పురుషుని (జ్ఞానిని) ఇవి (మునుపుజెప్పిన శీతోష్ణాదులు) చలింపజేయుటలేదో (బాధించుటలేదో) అతడు మోక్షమునకు తగినవాడగును.

(1) ఏతే - అనునది మాత్రాస్పర్శముల గుర్తించునదిగ శ్రీధరుడు మొదలగువారలు అర్థముచేసి యున్నారు.

(2) ధీరం - నిత్యమైన ఆత్మజ్ఞానముగలవాడు. అతడు నిత్యమైన ఆత్మస్వరూపమును కనిపెట్టి ఎరుంగుటలో స్థిరముగ నిలబడియుండుటచేతనే చలి, తాపము మొదలగు ద్వంద్వములు వానిని బాధించుటలేదు. మునుపటిశ్లోకమున జెప్పిన తితిక్షమాత్రము మోక్షమొందుటకు

చాలదు. వివేకము, వైరాగ్యముగూడ కావలయునని చూపుటకై ఈ శ్లోకమునందు "సమదుఃఖసుఖం ధీరం" అని ప్రయోగింపఁబడియున్నది.

(స్వకీయము) ఆత్మ, స్థూలదేహ విలక్షణుడని 13-వ శ్లోకముచేత భగవంతుడు నిరూపించిన పిదప ఈ 14-15 వ శ్లోకములచే ఆత్మ సూక్ష్మదేహ విలక్షణుడనియు నిరూపించుచున్నాడు.

సూక్ష్మదేహమనగా:— సూక్ష్మమైన ఆకాశము మొదలైన పంచభూతముల చేరికచే గలిగిన కన్ను మొదలైన అయిదు జ్ఞానేంద్రియములు, చెయ్యి మొదలగు నైదు కర్మేంద్రియములు, (స్థూలములైన ఈ కండ్లు చేతులుకావు) అపానము మొదలైన ఐదుప్రాణములు, మనస్సుబుద్ధి మొదలగు ఇవి యన్నియు నొకటిగ చేరినదైన శరీరమే. దీనిలో ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములుగలవు. (ఈ విషయమును విస్తరముగ కైవల్యనవనీతము మొదలైన గ్రంథములలోను, వాసుదేవ మననము మొదలగు గ్రంథములలోను సృష్టిక్రమమునుగూర్చి చెప్పఁబడియున్న భాగమున జూడవచ్చును.)

ఈ సూక్ష్మదేహము, స్థూలములైన ఈ కన్ను మొదలైన వాట్లచే నెరుంగదగినదికాదు. కావున దానిని ఆ దేహధర్మములద్వారా యెరింగించుటకై "మాత్రాస్పర్శాస్తు" అని భగవంతుడు అరంభించుచున్నాడు.

మాత్రయనగా కొలతయని అర్థము. పడి మొదలగు వాటివలె ఏదియొక కొలతగ నుంచుకొనబడి తదితరములను కొలుచుటకు సాధనముగనున్నదో అదియే మాత్ర. అటులనే ఇంద్రియముల సమూహమైన సూక్ష్మ శరీరమును గైకొని సూక్ష్మమైన ప్రపంచమును కొలిచి యెరుంగుటకును, దానిమూలముగా ఆత్మస్వరూపజ్ఞానమును పొందుటకును సాధనముగనై శరీరము జీవునికి అమర్చియుండుటచే ఇంద్రియములు మాత్రలని చెప్పబడినవి. ఈ ఇంద్రియములకు వాటి విషయములైన శబ్దాదులతో సంబంధము (స్పర్శము) కలుగునప్పుడు శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము, వీటినిచ్చుచున్నవి. చలి మొదలగునవి, పై దేహమునకు అనుకూలములుగ నుండునప్పుడు సుఖముగను, ప్రతికూలములుగ నుండునప్పుడు దుఃఖముగనునగుచున్నవని తాత్పర్యము. వచ్చుటయు, పోవుటయుగలవైన, అనిత్యములైన, ఈ సుఖదుఃఖములు, నిత్యుడని నిరూపింపబడిన ఈ దేహికి ఎట్లుండగలవు? అవి ఆ సూక్ష్మదేహధర్మములేగాని ఆత్మధర్మములుగావు. ఇట్లుండినను ఆ సుఖదుఃఖములచేత సంతోషమున్ను, వ్యసనమున్ను దేహి (ఆత్మ) పొందుచున్నాడు. ఏ కారణముచేతననగా:- సూక్ష్మశరీరమైన ఉపాధిని "తాను, తనది" అని యీ దేహి యభిమానించుటచే ఆ దేహధర్మములు తనకుగలవవి భ్రమనొందుచున్నాడు. నిర్మలమైన స్ఫటికమునకు సమీపమున జపాకుసుమమును (లేక యెఱ్ఱపత్తి పుష్పమును) ఉంచినచో స్ఫటికము యెఱ్ఱనైనదిగ భ్రమనొందుటవలెనె. కావున ఆత్మ సూక్ష్మదేహ విలక్షణుడని యెరింగి పై భ్రమనుండి నివృత్తినొంది "సుఖదుఃఖాదులు ఆత్మకులేవు, దానిచే నాత్మయైన నేను సంతోషమునుగాని వ్యసనమునుగాని, పొందగూడద"ని, నిత్యాత్మస్వరూపదర్శనముచేత స్థిరముగ నిలబడువాడే మోక్షమును పొందుటకు సమర్థుడని భగవంతుడు చెప్పి ముగించుచున్నాడు.

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ 16

పద॥ న - అసతః - విద్యతే - భావః - న - అభావః - విద్యతే - సతః ।
ఉభయోః - అపి - దృష్టః - అంతః - తు - అనయోః - తత్త్వదర్శిభిః ॥

| | | | |
|---|---|---|---|
| అసతః | అసత్తునకు (లేనిదానికి, అబద్ధమైన వస్తువునకు) | నవిద్యతే | లేదు |
| భావః | (వాస్తవమైన) ఉండుట | అనయోః ఉభయోరపి | ఈ రెంటియొక్కయు |
| నవిద్యతే | లేదు | అంతః | ముగింపు (నిశ్చయము) |
| సతః | సత్తునకు (ఉన్నదానికి, నిజమైన వస్తువునకు | తత్త్వదర్శిభిః తు | తత్త్వమును (బ్రహ్మమును) ఎరింగిన వారలచేతనే |
| అభావః | లేకపోవుట | దృష్టః | తెలిసికొనబడియున్నది. |

**తా॥ అసత్తునకు (లేనిదానికి - అసత్యమైన వస్తువునకు) వాస్తవమైన స్థితి (ఉండుట) అనునదిలేదు. సత్తునకు (ఉన్నదానికి-సత్యమైన వస్తువునకు) లేకుండుట అనునదిలేదు. ఈ రెంటియొక్క నిశ్చయము, తత్త్వమును (బ్రహ్మమును) ఎరింగిన వారలచేతనే తెలిసికొనబడియున్నది.**

(శంకరభాష్యము) శీతోష్ణాదులను శోక మోహములను విడిచి సహించుకొనవలెనను దానికి మరియొక కారణమేమన:— ''అవి అసత్యమైన వస్తువులైనందున" అని ఈ శ్లోకమున జెప్పబడుచున్నది. వ్యవహారస్థితిలో సద్బుద్ధి, అసద్బుద్ధి యను రెండువిధములైన బుద్ధులుగలవు. దేని నాధారపడియుండు బుద్ధి మార్పుచెందుటలేదో అది "సత్తు" (సత్యమైన వస్తువు), దేనినాధారపడి యుండు బుద్ధి మార్పుజెందునో ఆది "అసత్తు'' (అసత్యమైనవస్తువు). ఇట్లు "సత్, అసత్" అను భేదము బుద్ధిననుసరించి నిలబడియున్నది.

పై జెప్పిన శీతోష్ణములు మొదలైన ద్వంద్వములున్ను వాటికారణములైన నీరు, అగ్ని, మొదలగునవియు"అసత్తు". ఏలనగా:— ప్రమాణములననుసరించి విమర్శించునపుడు వాటితత్త్వము (వాస్తవమైనస్థితి) అనునదిలేదు. అవిమార్పును పొందుచునేయున్నవి. ఐనను ఇట్టిమార్పును ఆత్మ పొందుటలేదు. దానికి 'లేకపోవుట' యనునదేలేదు. ఇట్లు "సత్తు, అసత్తు'' అనే "ఆత్మ, అనాత్మ" ఈ రెంటి విషయమున ''అసత్త'' నునది ఏకాలమునందును లేనిదేయని అంత్యమైన నిర్ణయమును తత్త్వదర్శులు ఎరింగియున్నారు. ''తత్'' అనునది సకలమునకునుపేరు· సర్వము బ్రహ్మమగుటచే దానిపేరు "తత్'' అయినది. దాని స్వభావము తత్త్వము. అనగా బ్రహ్మమున్నటులనుండు స్వభావము. దానినిచూచు స్వభావముగలవారే తత్త్వదర్శులు. నీవున్ను తత్త్వదర్శుల సిద్ధాంతము ననుసరించి శోకమును, మోహమును విడిచి, చలి తాపము మొదలగు ద్వంద్వములు వికారములు గల "అసత్తులు" గనేయుండి ఎండమావులవలె సత్యముగ కనబడుచున్నవి అని మనస్సున నిశ్చయించి ధీరత్వముతో శాంతుడవై ఓర్చుకొనవలెనని భావము.

(స్వకీయము) ''నాసతో విద్యతే భావః'' అనుదానికి శీతోష్ణాదులు ఆత్మను ఆశ్రయించినవి గావు. కాన వాటికి స్థానములేదని శ్రీధరులున్ను, అచేతనములైన దేహాదులకు అవినాశిస్వభావము (నాశమొందకయుండుట) లేదని రామానుజులున్ను, ప్రకృతికి లేకుండుటలేదని మధ్వాచార్యులున్ను, దుష్కర్మచేత సుఖము గలుగనేరదని రాఘవేంద్రులున్ను, ''నాభావో విద్యతే సతః'' అనుదానికి ఆత్మకు లేకుండుటయనునది లేదని శ్రీధరులున్ను, జీవేశ్వరులకు నాశమొందు స్వభావము లేదని రామానుజులున్ను, బ్రహ్మమునకు లేకుండుట లేదని మధ్వాచార్యులున్ను, సత్కర్మముచేత దుఃఖము గలుగనేరదని రాఘవేంద్రులున్ను, జెప్పియున్నారు.

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి॥ 17

పద॥ అవినాశి - తు - తత్ - విద్ధి - యేన (1) - సర్వం - ఇదం (2) - తతమ్।
వినాశం - అవ్యయస్య - అస్య - న - కశ్చిత్ - కర్తుం - అర్హతి॥

| | | | |
|---|---|---|---|
| ఇదం | ఈ జగత్తంతయు | అవ్యయస్య | (తన) స్థితిమారని |
| యేన | ఏ బ్రహ్మముచేత | అస్య | దీనికి |
| తతమ్ | వ్యాపింపబడియున్నదో | వినాశం | నాశమును (లేకుండుటను) |
| తత్ తు | దానినే | కర్తుం | చేయుటకు |
| అవినాశి | నాశములేనిదిగా (సత్తుగా) | కశ్చిత్ | ఎవడున్ను |
| విద్ధి | తెలిసికొనుము | నార్హతి | శక్తుడుగాడు |

తా॥ ఇదియంతయు (ఈ జగత్తంతయు) ఏ బ్రహ్మముచేత వ్యాపింపబడియున్నదో దానినే నాశములేనిదానినిగ నెరుంగుము. తన నిలకడ మారని దీనికి నాశమును గలుగజేయ నెవనిచేతను గాదు.

(1) యేన - అనుదానికి "చేతనముచేత" అనగా జీవేశ్వరులచేత అని రామానుజులున్ను, "ఏ యీశ్వరునిచే" అని రాఘవేంద్రులున్ను అర్థముజేసియున్నారు.

(2) ఇదం - అనుదానికి "జడమైన సకలవస్తువులున్ను" అని రామానుజులు అర్థముచేసియున్నారు.

(శంకరభాష్యము) ఈ శ్లోకముచే, నెప్పుడు సత్తుగనే ఉన్నది ఏదియని చెప్పబడుచున్నది. దీనిలో ప్రయోగింపఁబడియున్న "తు" శబ్దము అసత్తునుండి సత్తునువిభజించి చూపుచున్న భేదస్థితి ద్యోతకము. కుండ మొదలైనవి ఆకాశముచేత వ్యాపింపఁబడియుండుటవలె ఆకాశముతోగూడిన యీజగత్తంతయు ఏ "సత్" అను పేరుగల బ్రహ్మముచేత వ్యాపింపఁబడియున్నదో దానిని నాశరహితముగ తెలిసికొనవలెను. ఇట్టి సత్తైన ఈ బ్రహ్మము, శరీరాదులవలె తనస్థితినుండి మారుటలేదు. కావున తన స్థితిమారని ఈ బ్రహ్మమునకు ఎవ్వనిచేతను నాశము గలిగింప వీలులేదు. ఆత్మకు నాశమును గలుగజేయ ఈశ్వరునిచేతనుగాదు. ఎందుకన ఆత్మ బ్రహ్మము.

---

శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥ 18

పద॥ అన్తవన్తః - ఇమే - దేహాః (1) - నిత్యస్య - ఉక్తాః - శరీరిణః।
అనాశినః - అప్రమేయస్య (2) - తస్మాత్ - యుధ్యస్వ - భారత॥

| | | | |
|---|---|---|---|
| నిత్యస్య | నిత్యుడుగను | అన్తవన్తః | ముగింపుగలవిగ |
| అనాశినః | నాశము లేనివాడుగను | ఉక్తాః | చెప్పఁబడియున్నవి |
| అప్రమేయస్య | ప్రమాణములను గైకొని యెరుంగఁబడదాలనివాడుగను ఉన్న | హే భారత! | ఓ భరతవంశమున నుదయించిన అర్జునుడా! |
| శరీరిణః | దేహియొక్క (ఆత్మయొక్క) | తస్మాత్ | అందువలన |
| ఇమే దేహాః | ఈ దేహములు | యుధ్యస్వ | యుద్ధముజేయుము. |

తా॥ నిత్యుడుగను, నాశములేనివాడుగను, ప్రత్యక్షాది ప్రమాణముల చేత నెరుంగదగని వాడుగనుఉన్న దేహియొక్క (ఆత్మయొక్క) ఈ దేహములు ముగింపుగలవిగ (జ్ఞానులచే) చెప్పబడియున్నవి. ఓ భరతవంశమున నుదయించిన అర్జునుడా! అందువలన యుద్ధము చేయుము.

(1) దేహాః - 'ఈదేహముల'ని గుర్తించి చెప్పబడుటచేత ఈదేహము నాశముగలదనియు, నాశము లేని యొక దేహము జీవునికి ముక్తిదశలో కలదనియు, అర్థము జేయవలయునని రాఘవేంద్రుల తాత్పర్యము.

(2) అప్రమేయస్య - ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి, యనెడు నీయారు ప్రమాణములచేత నెరుంగ తగనివాడని శంకరులున్ను, కాలము, దేశము, స్వరూపము, వీటిచేకొలుచుటకు వీలులేనివాడని శ్రీధరులున్ను, జీవుడు తెలిసికొను వాడేగాని దేహాదులవలె తెలిసికొనబడువాడు గాడని రామానుజులున్ను, సర్వవ్యాపకుడైన ఈశ్వరునకు ప్రమాణమైన రూపము మొదలగునవి గలవాడని రాఘవేంద్రులున్ను, అర్థము చేసియున్నారు.

(శంకరభాష్యము) ఈశ్లోకముచేత "అసత్" పదార్థమెట్టిదని చెప్పబడుచున్నది. నిత్యుడైన ఆత్మయొక్క (స్థూల సూక్ష్మ కారణ) శరీరములు స్వప్నమునందును, ఇంద్రజాలమునందును కనబడు శరీరములవలె నాశముగలవి. అనగా మృగతృష్ణికలో జలమున్నదను బుద్ధి యెడతెగక యున్నను ప్రత్యక్షాది ప్రమాణవిమర్శలకు పిదప ఆబుద్ధివిడువబడి మృగతృష్ణికాజలము లేకపోవుట వలె (అసత్యవస్తువగుటవలె) ఈశరీరములున్నవను బుద్ధి, విమర్శచేత నివర్తించునప్పుడు శరీరము లున్ను నాశమొందుచున్నవి. అసత్యవస్తువులగు చున్నవి. ఏలనగా ఈ శరీరములు ఆత్మయందు మృగతృష్ణికాజలమువలె తోచుచున్నవిగాని వాటికి వాస్తవమున ప్రత్యేకముగ స్థితియనునది లేదు. ఆత్మ "నిత్యుడు, నాశము లేనివాడు'' అనిచెప్పుట లోకమునందు కనబడుచున్న రెండువిధములైన నాశములున్ను ఆత్మకులేవను దానిని చూపుచున్నది. అనగా - శరీరము భస్మమై కనబడకపోవుట వంటి నాశమొకటి, శరీరము ప్రాణముతో నుండునప్పుడే వ్యాధిమొదలగు వాటిచే వేరువిధముగ మారుట మరియొకటి. ఆత్మ ఈ రెండు విధములైన నాశములేనివాడని చెప్పినచో భూమిమొదలైనవి వలె ఆత్మ నిత్యమని తోచును.

''ఆత్మ ఇట్లుండుటవలన నీవు యుద్ధము జేయుము'' అనిభగవంతుడు విధించునదిగ గ్రహింపగూడదు. యుద్ధము చేయుటకయ్యేవచ్చిన అర్జునుడు, శోకమోహములచే నడ్డగింపబడి నిలచియుండుట వలన వాటిని నివర్తించుటయే భగవంతునిచే చేయబడుచున్నది. యుద్ధముజేయ వలయునని స్వయముగనే సైకొన్న స్వధర్మమునుండి జారుటవలదని తాత్పర్యము.

(స్వకీయము) 'దేహముగలవాడు' అనుదానిచేత అద్వైతసిద్ధాంతానుసారముగ వ్యవహార దశలో జీవుడుగను, పారమార్థికదశలో బ్రహ్మముగను చెప్పదగినది.

---

శ్లో॥ య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥ 19

పద॥ యః - ఏనం - వేత్తి - హంతారం - యః - చ - ఏనం - మన్యతే - హతమ్।

ఉభౌ - తౌ - న విజానీతః - న - అయం - హన్తి - న - హన్యతే॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవడు | హతం | చంపబడినవానినిగ |
| ఏనం | వీనిని (దేహిని) | మన్యతే | ఎరుగుచున్నాడో |
| హన్తారం | చంపువానిగ | తావుభౌ | వారిద్దరును |
| వేత్తి | ఎరుఁగుచున్నాడో | నవిజానీతః | ఆత్మనెరింగినవారలు కారు. |
| యః | ఎవడు | అయం | ఇతడు (ఆత్మ) |
| ఏనం | వీనిని | న హన్తి | చంపుటయులేదు |
| | | నహన్యతేచ | చంపబడుటయులేదు. |

తా॥ ఎవ్వడు దేహియైన వీనిని హింసావ్యాపారము చేయువానినిగ ఎరుగుచున్నాడో, ఎవడు ఈ శరీరము చంపబడుటచేత దేహియైన వీనిని చంపబడినవానినిగ నెరుంగునో, ఆ యిరువురున్ను వాస్తవమును (ఆత్మను) ఎరింగినవారలుకారు. ఆత్మయగు నితడు చంపుటయులేదు, చంపబడుటయులేదు.

(శంకరభాష్యము) గీతాశాస్త్రము సంసారమునకు కారణమైన శోకమోహాదుల నివృత్తికొరకే గాని దానిలో ప్రవర్తించునటుల జేయుటకై కాదను విషయమునకు సాక్షిగ "అశోచ్యాన్" మొదలుగ జెప్పబడిన ఆత్మతత్త్వమును ఆదరించునట్టి రెండుశ్రుతి వాక్యప్రమాణములను కఠోపనిషత్తు 2వ వల్లి 18-19 ఋక్కులనుండి యెత్తి భగవంతుడు ఈ 19-20-శ్లోకములలో జెప్పుచున్నాడు.

అర్జునుడు "భీష్మాదులు నాచేయుద్ధమున చంపబడుచున్నారు. నేనేవారలనుజంపువాడను" అని తలంచుచున్న యీబుద్ధి యెట్లుతప్పోఅది ఈ శ్లోకముచే నిరూపింపబడుచున్నది. దేహమును చంపుటచేత "నేను చంపబడు వాడను, నేను చంపువాడను" అని ఈ విధముగ దలంచి ఆత్మను "నేను" అనుతలంపునకు నందునదిగ నెరుంగువారలు ఆత్మ ఇట్టిదని విమర్శించి ఎరుంగనివారలే.

(స్వకీయము) ఇంతవరకు జెప్పుచువచ్చిన ఆత్మతత్త్వము భగవద్వాక్యమగుటవలన అదియే ప్రమాణముగనుండినను, మరలను దానికి సాక్షిగ శ్రుతివాక్యములనెత్తి చెప్పుటలో భావమేమనగా:- తాను సర్వేశ్వరుడుగనున్నను తానుగూడ శ్రుతిని ప్రమాణముగ గైకొనియుండుటనెత్తిచూపి లోకమునందలి వారును ఆవిధముగనే శ్రుతియే ప్రమాణమని యెరింగి దానిననుష్ఠించి కడతేరవలయునను కరుణచేతనే యని గ్రహింపవలయును. పైశ్రుతివాక్యములను అటులనే చెప్పక కొంచెముమార్చి భగవంతునిచే చెప్పబడుటకు కారణమేమన:- ఈగీతాశాస్త్రము శ్రుతిని స్వరముతో నధ్యయనము చేయుటకు అధికారులుకానివారికిని ఉపయోగపడవలయునను తాత్పర్యముచేనని తోచుచున్నది.

ఈ శ్లోకముయొక్క భావము:- అవివేకులు "ఇతడువానిని చంపెననియు, అతనిచే నితడు చంపబడె"ననియు తలంచుచున్నారు. ఆత్మ నిత్యుడున్ను, నాశములేనివాడునునగుటచేత ఆయాత్మ, చంపువాడునుగాడు, ఒకనిచే చంపబడువాడునుగాడు.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ 20

పద॥ న - జాయతే - మ్రియతే - వా - కదాచిత్
న - అయం - భూత్వా - భవితా - వా - న - భూయః ।
అజః - నిత్యః - శాశ్వతః - అయం - పురాణః
న - హన్యతే - హన్యమానే - శరీరే ॥

| | | | |
|---|---|---|---|
| అయం | ఇతడు (ఆత్మ) | అయం | ఇతడు (ఆత్మ) |
| అజః | జననములేనివాడు | కదాచిత్ | ఒకప్పుడున్ను |
| నిత్యః | నాశములేనివాడు | న హన్యతే | చంపబడుటలేదు |
| శాశ్వతః | శాశ్వతముగ నున్నవాడు | న జాయతే | జనించుటయు లేదు |
| పురాణః | ప్రాచీనుడు | న మ్రియతేవా | మరణించుటయు లేదు |
| (తస్మాత్) | (అందువలన) | భూత్వా | కలిగి |
| శరీరే | దేహము | భూయః | మరల |
| హన్యమానే | చంపబడినను | భవితా వా న | ఉన్నవానిగను నుండదు |

**తా॥ ఆత్మ-జనన రహితుడు, నాశరహితుడు, శాశ్వతముగ నున్నవాడు, ప్రాచీనుడు. కావున దేహము చంపబడినను ఆత్మ యెప్పుడును చంపబడుటలేదు, జనించుటలేదు, మరణించుటయులేదు. కలిగి మరల నున్నవానిగను లేదు.**

(శంకరభాష్యము) ఈ మంత్రముచేత, లోకమునందు వస్తువులకుగల ఆరు వికారము లున్ను ఆత్మకు లేవనునది జెప్పబడినది. ఆరు వికారములనగా:= జననము, స్థితి, వృద్ధిపొందుట, తిరుగుట, (వేరొకటిగ మారుట) అరిగిపోవుట, నశించుట, ఇవి.

అత్మ, ఒక కాలమునందును జనించుటలేదు. ఏకాలమునందును మరణమొందుటలేదు. ఒక కాలమునందు భూత్వా = ఉండి, భూయః = మరల, అభవితావా = లేకపోవుట నొందుట, న = లేదు. దీనివలననే మరణించుటలేదనునది. ఏ కాలమునందును, నభూత్వా = లేకయుండి, భూయః = మరలను, భవితావా న - ఉన్నవానిగనులేదు. దీనివలననే జనించుటలేదనబడినది. కావున (ఆత్మయిట్లుండుటచేత) జనించనివాడు నిత్యుడు, శాశ్వతుడు, పురాణుడుగనున్నవాడు, శరీరము హింసింపబడునప్పుడు నితడు చంపబడుటలేదు. ఇక్కడ 'హింసింపబడుట' అనుదానికి అర్థము స్థితి మారుట యని గ్రహింపవలయును. జనించనివాడన్నందున ఆత్మకు జననమున్ను, నిత్యుడన్నందున మరణమున్ను, శాశ్వతుడన్నందున అరిగిపోవుటయు, పురాణుడన్నందువలన వృద్ధిపొందుటయు, హింసింపబడుటలేదన్నందున మార్పున్ను, ఈ వికారములు ఆత్మకులేవనబడినది. జననమనెడు మొదటి వికారమున్ను, మరణమను కడపటి వికారమున్ను నిషేధింపబడగా అన్ని వికారములున్ను నిషిద్ధములగుచుండగా మిలిగిన "శాశ్వతః" మొదలైన పదము లెందులకనగా యౌవనాది సమస్త వికారములను నిషేధించుటకు. ఎట్టి వికారమున్ను ఆత్మకులేదని భావము. ఈ విధముగ నుండుటవలన "వారిరువురు నెరుంగుటలేదు" అను మునుపటి శ్లోకముతో నీ శ్లోకమును చేర్చుకొనుడు.

(రాఘవేంద్రులు) ఈశ్వరునివలె జీవుడున్ను జననమరణములు మొదలగునవి లేనివాడు. ఈశ్వరస్వరూపమునకు సమమైన రూపముగలవాడుగ చెప్పబడుచున్నాడు. అయితే జనన మరణ ములు గలవాడుగ చెప్పబడుచున్నాడేయనినచో, దేహమునొందుటయు విడుచుటయు గలవాడుగనే యుండుటచే అజ్ఞానులు 'జనించుచున్నాడు, గతించుచున్నాడ'ని వ్యవహరించుచున్నారు.

శ్లో॥ వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్ ॥ 21

పద॥ వేద - అవినాశినం - నిత్యం - యః - ఏనం - అజం - అవ్యయమ్।
కథం - సః - పురుషః - పార్థ - కం - ఘాతయతి - హన్తి - కమ్ ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ ! | ఓ అర్జునుడా ! | వేద | ఎరుంగునో |
| యః | ఎవ్వడు | సః పురుషః | ఆ పురుషుడు |
| ఏనం | వీనిని (ఆత్మను) | కథం | ఎట్లు |
| అజం | జననము లేనివానిగను | కం | ఎవనిని |
| అవ్యయం | తగ్గుట లేనివానిగను | ఘాతయతి | చంపించుచున్నాడు? |
| అవినాశినం | నాశము లేనివానిగను | కం | ఎవ్వనిని |
| నిత్యం | మార్పులేనివానిగను | హన్తి | చంపుచున్నాడు? |

తా॥ ఓ అర్జునుడా ! ఎవ్వడు ఆత్మ జననములేనిది, తగ్గుట లేనిది, నాశములేనిది, మార్పులేనిది అని యెరుంగునో ఆ పురుషుడు ఎవ్వనినైనను చంపుటగాని, చంపించుటగాని ఎట్లు చేయగలడు ?

(రాఘవేంద్రులు) ఈ శ్లోకమునకు పరబ్రహ్మ పరముగను ఒక అర్థము కలదు. అదేమన:- ఓ అర్జునుడా ! ఏనం = పరమాత్మను, అజం = జననరహితుడు, అవ్యయం = వికారరహితుడు, అవినాశినం = దేహనాశము లేనివాడు, నిత్యం = స్వరూపనాశము లేనివాడు అని యః = ఎవడు, వేద = ఎరుంగునో (మిగత వాటికి మునుపు జెప్పిన అర్థమే). ఇట్లు బ్రహ్మమును ఎవ్వడెరింగియున్నాడో అతడు తాను కర్తగాడు, సర్వమునకున్ను కర్త ఈశ్వరుడే అనే జ్ఞానము గలవాడుగనుండును. కాన అతడొకనిని చంపుటగాని, చంపించుటగాని చేయ వీలుపడదని తాత్పర్యము.



శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా-
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ 22

పద॥ వాసాంసి - జీర్ణాని - యథా - విహాయ
నవాని - గృహ్ణాతి - నరః - అపరాణి ।
తథా - శరీరాణి - విహాయ - జీర్ణాని
అన్యాని - సంయాతి - నవాని - దేహీ ॥

| | | | |
|---|---|---|---|
| నరః | మనుష్యుడు | అపరాణి | వేరైన |
| యథా | ఎట్లు | (వాసాంసి) | వస్త్రములను |
| జీర్ణాని | పాతవైన (చినిగినటువంటి) | గృహ్ణాతి | గ్రహించుచున్నాడో |
| వాసాంసి | వస్త్రములను | తథా | అటులనే |
| విహాయ | విడిచిపెట్టి | దేహీ | దేహముగలవాడు (ఆత్మ) |
| నవాని | క్రొత్తవైన | జీర్ణాని | పాతవైన (శిథిలములైన) |

| | | | |
|---|---|---|---|
| శరీరాణి | దేహములను | అన్యాని | వేరైన |
| విహాయ | విడిచిపెట్టి | (శరీరాణి) | (దేహములను) |
| నవాని | క్రొత్తవైన | సంయాతి | పొందుచున్నాడు |

తా॥ మనుష్యుడు ఎట్లు ప్రాతవస్త్రములను విడిచిపెట్టి వేరు క్రొత్త వస్త్రములను గ్రహించుచున్నాడో, అటులనే (దేహముగలది) యాత్మ ప్రాతశరీరములను విడిచిపెట్టి వేరైన క్రొత్తశరీరములను తాను మార్పుచెందకయే పొందుచున్నది.

శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః॥
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥　　23

పద॥ న - ఏనం - ఛిన్దన్తి - శస్త్రాణి - న - ఏనం - దహతి - పావకః।
న - చ - ఏనం - క్లేదయన్తి - అపః - న - శోషయతి - మారుతః॥

| | | | |
|---|---|---|---|
| శస్త్రాణి | ఆయుధములు | అపః | జలములు |
| ఏనం | ఇతనిని (ఆత్మను) | ఏనం | వీనిని (ఆత్మను) |
| నఛిన్దన్తి | నరుకుటలేదు | నక్లేదయన్తి | తడుపుటలేదు |
| పావకః | అగ్ని | మారుతః | వాయువు |
| ఏనం | ఇతనిని (ఆత్మను) | (ఏనం) | వీనిని (ఆత్మను) |
| నదహతి | కాల్చుటలేదు | నచశోషయతి | ఎండబెట్టుటయులేదు |

తా॥ ఆత్మను ఆయుధములు నరుకుటలేదు. నిప్పు కాల్చుటలేదు. నీరు తడుపుటలేదు. గాలి యెండించుటయులేదు.

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః॥　　24

పద॥ అచ్ఛేద్యః - అయం - అదాహ్యః (1) - అయం - అక్లేద్యః - అశోష్యః - ఏవ - చ।
నిత్యః - సర్వగతః - స్థాణుః - అచలః - అయం - సనాతనః॥

| | | | |
|---|---|---|---|
| అయం | ఇతడు (ఆత్మ) | (తస్మాత్) | (అందువలన) |
| అచ్ఛేద్యః ఏవ | నరుకుటకు వీలుకానివాడు | అయంనిత్యః | ఇతడు (ఆత్మ) నిత్యుడు |
| అయం | ఇతడు (ఆత్మ) | సర్వగతః | అంతట నిండినవాడు |
| అదాహ్యః ఏవ | దహించుటకు వీలుకానివాడు | స్థాణుః | స్థిరమైనవాడు |
| అక్లేద్యః ఏవ | తడుపను వీలుకానివాడు | అచలః | చలనము లేనివాడు |
| అశోష్య ఏవ చ | ఎండించుటకున్ను వీలుకానివాడు | సనాతనః | ఎల్లప్పుడు నుండువాడు |

తా॥ ఆత్మయగు వీనిని నరుకనే వీలులేదు. దహించుటకు వీలులేదు. తడుపుటకు వీలులేదు. ఎండించుటకును వీలులేదు. కావున నీ యాత్మ నిత్యమైనవాడు. (నిత్యుడగుటవలన) అంతట నుండువాడు. (అంతటనుండుట వలన) స్థిరమైన

వాడు. (స్థిరుడగుటవలన) చలనము లేనివాడు. (చలనము లేకుండుటవలన) నెల్లప్పుడు నున్నవాడు. ప్రాచీనుడు.

(1) స్థాణుః - ఎల్లప్పుడు సంతత వ్యాపించియున్న బ్రహ్మముయొక్క అధారముమీదను, అణువుగ నున్నవాడు.

(రామానుజులు) ఈ శ్లోకమునకున్ను, మునుపటిశ్లోకమునకున్ను భేదమేమనగా - మునుపటి శ్లోకమున నాత్మను నరుకుట దహించుట మొదలగువాటిని చేయునట్టి శక్తి ఆయుధము మొదలగు వాటికి లేదనునది చెప్పబడినది. ఎందువలన ఆయుధము మొదలగు వాటికి శక్తిలేదనగా:- ఆత్మస్థిరస్వభావము మొదలగునవి గలవాడగుటవలన నతడు నరుకబడుటకుగాని, దహింపబడుటకు గాని తగినవాడు కాడు కనుక.

శ్లో॥ అవ్యక్తోఽయమచిన్త్యోఽయ మవికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి॥ 25

పద॥ అవ్యక్తః - అయం - అచిన్త్యః - అయం - అవికార్యః - అయం - ఉచ్యతే।
తస్మాత్ - ఏవం - విదిత్వా - ఏనం - న - అనుశోచితుం - అర్హసి॥

| | | | |
|---|---|---|---|
| అయం | ఇతడు (ఆత్మ) | ఉచ్యతే | (వేదములచేత) చెప్పబడు చున్నాడు |
| అవ్యక్తః | వ్యక్తమైన (చూడదగిన) వాడుకాడు | తస్మాత్ | అందువలన |
| | | త్వం | నీవు |
| అయం | ఇతడు (ఆత్మ) | ఏనం | వీనిని (ఆత్మను) |
| అచిన్త్యః | చింతింప (తలంప) వీలులేనివాడు | ఏవం | ఈ విధముగ |
| అయం | ఇతడు (ఆత్మ) | విదిత్వా | తెలిసికొని |
| అవికార్యః | ఎట్టివికారమున్ను లేనివాడు | అనుశోచితుం | దుఃఖించుటకు |
| (ఇతి) | (అని) | నార్హసి | యోగ్యుడవుకావు |

తా॥ (ఆత్మయగు) ఇతడు వ్యక్తమైనవాడుకాడు, (చూడదగినవాడు కాడు) చింతింపదగినవాడుకాడు, (తలంపున కందనివాడు,) ఎట్టివికారము గలవాడుకాడు (అని వేదములచేత) చెప్పబడుచున్నాడు. అందువలన నీవు (ఆత్మయగు) వీనిని ఇట్లు ఎరింగినవాడవై (నేను వీరలను చంపెడివాడను, వీరలు నాచే చంపబడబోవుచున్నారని) దుఃఖింపకుము.

(శంకరభాష్యము) ఈ యాత్మ ఇంద్రియము లన్నిటికిని అందనిది కావున అవ్యక్తము. (కనబడనిది) ఏది ఇంద్రియములకు అందునో అదియే చింతింపదగినది (తలంపున కందునది). ఈ యాత్మయన్నో - ఇంద్రియముల కందనిదగుటవలన చింతింప వీలులేనిది. ఈ యాత్మ, ఎట్లు పాలు మజ్జిగ సంబంధముచేత పెరుగుగా మారుచున్నవో అట్లు మారునదిగాదు. అవయవశూన్యమగుటచేత అవికారి యగును. అవయవము లేనిదెద్దియు వికారస్వభావము గలదిగ గనబడుట లేదుగదా! కావున ఆత్మను మునుపుజెప్పిన ప్రకారముగ తెలిసికొని "నేను వీరలనుచంపువాడను. వీరలు నాచే చంపబడబోవుచున్నారు" అని దుఃఖించుట తగదు.

"న జాయతే మ్రియతేవా" అని ప్రారంభమగుచున్న మునుపటి (20-వ) శ్లోకముచేతనే ఆత్మనిత్యుడనియు, నిర్వికారియనియు చెప్పబడియున్నను, మరల ఈ (21-25) శ్లోకములలో దానినే త్రిప్పిచెప్పుటకు కారణమేమన-ఆత్మవస్తువు నెరుంగుట యధిక దుర్లభమగుటచేత, కొంచెమైనను స్పష్టముగ తెలియరాని తత్త్వమును సంసారుల బుద్ధికి ఎట్లైనను అందించి సంసారనివృత్తి నొందునట్లు చేయవలయుననను కరుణచే భగవంతుడగు వాసుదేవుడు మరల మరల పైవిషయము నెత్తుకొని యదే భావమును వేరుమాటలచే తెలియబరచుచున్నాడని గ్రహింపుడు.

(రాఘవేంద్రులు) ఈ శ్లోకమున జెప్పబడియున్న విశేషములుగల ఈశ్వరుడు సర్వస్వతంత్రుడు, నేనతనికి అధీనుడనై యుద్ధముచేసి యతనికి సమర్పింపవలసినవాడనను నీవిధముగ తలంచినచో నీకు దుఃఖమునకు హేతువే యుండదని తాత్పర్యము.

❖❖❖❖❖❖❖❖❖❖

శ్లో॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి॥ 26

పద॥ అథ - చ - ఏనం — నిత్యజాతం — నిత్యం — వా — మన్యసే — మృతమ్।
తథా — అపి — త్వం — మహాబాహో — న — ఏవం — శోచితుం — అర్హసి॥

| | | | |
|---|---|---|---|
| అథ చ | ఒకవేళ | మన్యసే తథాపి | తలంచుచున్నవాడవైనను |
| త్వం | నీవు | హే మహాబాహో! | ఓ భుజబలముగలవాడా! |
| ఏనం | ఇతనిని (ఆత్మను) | త్వం | నీవు |
| నిత్యజాతం | ఎల్లప్పుడు జననము గలవాడుగను | ఏవం శోచితుం | ఈవిధముగ దుఃఖింప |
| నిత్యం మృతం వా | ఎల్లప్పుడు మరణముగలవాడుగను | నార్హసి | యోగ్యుడవుగావు |

తా॥ ఒకవేళ నీవాత్మను ఎల్లప్పుడును జననమరణములు గలదిగ తలంచినను ఓ అర్జునా! నీవు ఈవిధముగ దుఃఖింప యోగ్యుడవుగావు.

(1) అథచ — అనునది ఇతరుల మతమును నంగీకరించి చెప్పునట్టి తాత్పర్యముగలది. అనగా — 'ఆత్మ అనేకదేహములు గలుగునప్పుడు జనించుచున్నదనియు, ఆయాదేహములు నశించునప్పుడు మరణించుననియు సామాన్యజనులు తలంచునటుల నీవును భావించుకొనినను' అని తాత్పర్యము. దీనికి రామానుజులు "దేహమే యాత్మయని ఒకవేళ తలంచినను" అని తాత్పర్యమును జేసియున్నారు.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి॥ 27

పద॥ జాతస్య — హి — ధ్రువః — మృత్యుః — ధ్రువం — జన్మ — మృతస్య — చ।
**తస్మాత్ — అపరిహార్యే — అర్థే — న — త్వం — శోచితుం — అర్హసి॥**

| | | | |
|---|---|---|---|
| జాతస్య హి | జనించినవానికనగా | అపరిహా | పరిహరింప (పోగొట్ట) వీలు లేని ఈవిషయమున |
| మృత్యుః ధ్రువః | మరణము నిశ్చితము | | |
| మృతస్య చ | మరణించినవానికిన్ని | త్వం | నీవు |
| జన్మ ధ్రువం | జనించుట నిశ్చితము | శోచితుం | దుఃఖించుటకు |
| తస్మాత్ | అందువలన | నార్హసి | యోగ్యుడవుగావు |

తా॥ జనించినవానికి మరణమున్ను, మరణించినవానికి జననమున్ను నిశ్చితమగుటవలన నివ_ర్తింపవీలులేని యీవిషయమునుగురించి నీవు దుఃఖించుట యు_క్తముగాదు.

•○•○•○•○•

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్య_క్తమధ్యాని భారత।
అవ్య_క్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥ 28

పద॥ అవ్యక్తాదీని (1) — భూతాని (2) — వ్యక్తమధ్యాని — భారత।
అవ్య_క్తనిధనాని — ఏవ — తత్ర — కా — పరిదేవనా॥

| | | | |
|---|---|---|---|
| భూతాని | భూతములు (ప్రాణులు) | అవ్యక్త నిధనా-న్యేవ | అవ్యక్తమునే (కనబడకుండు టనే) ముగింపుగనుగలవి. |
| అవ్యక్తాదీని | అవ్యక్తమును (కనబడకుండు టను) ఆదిగను | హే భారత! | ఓ అర్జునుడా! |
| వ్యక్తమధ్యాని | కనబడుటను మధ్యముగను | తత్ర | ఆవిషయమున |
| | | పరిదేవనాకా ? | ప్రలపించుట యేల ? |

తా॥ భూతములు (ప్రాణులు) ఆదియందు (ఉత్ప_త్తికిమునుపు) కనబడక యుండి, మధ్యన (ఉత్ప_త్తి మరణములమధ్య) కొంతకాలము కనబడి అంతమున (మరణమునకు పిదప) మరల కనబడకనే పోవుచున్నవి. ఓ అర్జునుడా ఆవిషయమై ప్రలపించుటయేల? (అనగా-మొదట కనబడక, పిదపకనబడి, మరల నంతరించుచున్న భ్రాంతియైన ఆభూతములనుగూర్చి ఏమిప్రలాపము? అనియే)

(1) అవ్యక్తం— అనుదానికి 'ప్రధానం' (అనగా ప్రకృతి) అని శ్రీధరులు అర్థము చేసియున్నారు.

(2) భూతాని—అనుదానికి, జలము, భూమి మొదలగు కార్యకారణముల చేరికచేత గలిగిన పుత్రమిత్రాదులని శంకరులున్ను, శరీరములు (దేహములు) అని శ్రీధరులున్ను, పృథ్వి(భూమి) మొదలగు భూతమయమైన శరీరములని మధుసూదనసరస్వతియు నర్థముచేసియున్నారు.

(స్వకీయము) ఈశ్లోకము వంటిదైన-

" అదర్శనాదాపతితః పునశ్చాదర్శనంగతః।
నాసౌ తవ న తస్య త్వం వృథా కా పరిదేవనా॥ "

కనబడనిదానినుండి వచ్చినవాడు మరల కనబడనితనమునే పొందెను. అతడునిన్ను చేరినవాడుకాడు. నీవువానిని జేరినవాడవుగావు. వ్యర్థముగనేలప్రలపించుట? యను పురాణవాక్యమును (మహాభారతము స్త్రీపర్వము 2-13) చూడుడు.

•—•—•—•—•

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనం
ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి
శ్రుత్వాఽప్యేనం వేద నచైవ కశ్చిత్ ॥ 29

పద॥ ఆశ్చర్యవత్ - పశ్యతి - కశ్చిత్ - ఏనం
ఆశ్చర్యవత్ - వదతి - తథా - ఏవ - చ - అన్యః।
ఆశ్చర్యవత్ - చ - ఏనం - అన్యః - శృణోతి
శ్రుత్వా - అపి -ఏనం - వేద - న - చ - ఏవ - కశ్చిత్ ॥

| | | | |
|---|---|---|---|
| కశ్చిత్ | ఒకడు | అన్యశ్చ | మరియొకడున్ను |
| ఏనం | ఇతనిని (ఆత్మను) | ఏనం | ఇతనిని (ఆత్మను) |
| ఆశ్చర్యవత్ | ఆశ్చర్యమైనదానినివలె | ఆశ్చర్యవత్ | ఆశ్చర్యమైనదానినివలె |
| పశ్యతి | చూచుచున్నాడు. | శృణోతి | వినుచున్నాడు |
| తథైవ | అటులనే | శ్రుత్వాపి | వినియు, చూచియు, చెప్పియు |
| అన్యశ్చ | మరియొకడున్ను | కశ్చిత్ చ | (వారలలో) ఒకడైనను |
| (ఏనం) | ఇతనిని (ఆత్మను) | ఏనం నైవవేద | ఇతనిని (ఆత్మను) ఎరుంగు |
| ఆశ్చర్యవత్ | ఆశ్చర్యమైనదివలె | | టయేలేదు. (సాక్షాత్తుగ ననుభ |
| వదతి | మాటలాడుచున్నాడు | | వించి ఎరుంగుటలేదు. |

తా॥ ఆత్మను ఒకడాశ్చర్యమైన వస్తువునువలె చూచుచున్నాడు. (అనగా యెవ్వనిచేతను మునుపు చూడబడని యొక అద్భుతము అకస్మాత్తుగ చూడబడుటవలె చూచుచున్నాడు.) అటులనే మరియొకడు ఆశ్చర్య వస్తువునువలె చెప్పుచున్నాడు. మరియొకడు ఆశ్చర్యవస్తువునువలె వినుచున్నాడు. వినియు, చూచియు, చెప్పియు, వారిలో నెవ్వడున్ను ఆత్మను యథావత్తుగ (ఉన్నదున్నట్లు) ఎరుంగుటయే లేదు. (సాక్షాత్తుగ ననుభవించుట లేదు.)

(శంకరభాష్యము) ఈ శ్లోకమునకు వేరొకవిధముగను అర్థము చేయవచ్చును. అదేమన ఆత్మను జూచువాడున్ను, చెప్పునట్టివాడున్ను, వినువాడున్ను, లోకమునందు ఆశ్చర్యమువలె నగుదురు. (ఇతరులచే ఆశ్చర్యపడదగినవారలగుదురు.) అట్టివాడు అనేకవేలలో నొకడేఉండును. కావున ఆత్మనెరుంగుట మిక్కిలి అరుదైనది.

(శ్రీధరులు) శాస్త్రము, ఆచార్యోపదేశము, వీటివలన లభించినయోగముచేత ఆత్మనుజూచుచున్న ఒకడు, సర్వవ్యాపకుడుగను, జ్ఞానానంద స్వరూపుడుగను, లోకవిలక్షణుడుగను, తనచేత నెప్పుడుగాని చూడబడియుండని వాడుగను, ఆయాత్మయుండుటవలన ఆశ్చర్యపడుచున్నాడు. మరియొకడు శాస్త్రాదులచే ఆత్మ పైచెప్పినవిధమైన స్వరూపముగలవాడని యెరింగినదానిని ఒకనికి జెప్పుచున్నాడు. అట్లు చెప్పునప్పుడు తానెరింగి చెప్పుచున్న ఆ యాత్మస్వరూపమును తలంచి ఆశ్చర్యపడుచున్నాడు. ఇట్లు చెప్పగ వినినవాడు ఇట్టివస్తువుగలదాయని వినినతోడనే ఆశ్చర్యపడుచున్నాడు. ఇట్లుచూచినవాడుగాని, చెప్పినవాడుగాని, వినినవాడుగాని, నిత్యానందస్వరూపుడైన ఆత్మను పూర్ణముగ నెరింగినవాడుగాడని తాత్పర్యము,

(స్వకీయము) కఠోపనిషత్తు 2 వ వల్లి 7 వ మంత్రము ఈ శ్లోకమును పోలినది. "శ్రవణాయాపి బహుభిర్యో నలభ్యః శృణ్వన్తోఽపిబహవోయం న విద్యుః। ఆశ్చర్యోవక్తా కుశలోఽస్యలబ్ధా ఆశ్చర్యోజ్ఞాతా కుశలానుశిష్టః" ఆ యాత్మస్వరూపమును అనేకులు వినుటకు లభించని వారలైయున్నారు. అనేకులు వినినను తెలిసికొను సామర్థ్యములేనివారలుగ నున్నారు. ఈ యాత్మనుపదేశించువాడును ఆశ్చర్యపడుచున్నాడు, ఉపదేశము పొందినవాడును ఆశ్చర్యపడు చున్నాడు, ఆత్మనెరుంగువాడును ఆశ్చర్యపడుచున్నాడు.

భగవంతుడుపదేశింపనారంభించిన యాత్మతత్త్వవిషయమును ఈ 29-30-వ శ్లోకము లలోజెప్పి విరమించుచున్నాడు. ప్రకృతము చెప్పుచున్న ఈ యాత్మనెరుంగుట మిక్కిలి అరుదైనది. అతడు "అవ్యక్తుడుగను, అప్రమేయుడుగను" ఉండుటవలన అతని నెరుంగ వీలుకానందులకు కారణముగనున్న మోహము సకలజనులకున్ను సమానమే. అనేకజన్మలలోజేసిన పుణ్యావశమున గాని ఆత్మవిచారముచేయ ప్రవృత్తిగలుగనేరదు. అట్టిప్రవృత్తి గలుగుట అనేకవేల సంఖ్యాకులలో ఒకనికే. అట్లుప్రవర్తించువారిలో నెవ్వడోయొకడే ఈ యాత్మను అద్భుతముగ జూచుచున్నాడు, లేకచెప్పుచున్నాడు, లేక వినుచున్నాడు. అట్లుచూచినను చెప్పినను వినినను ఈ యాత్మను యథా వత్తుగవారలు సాక్షాత్తుగ ననుభవించి యెరుంగుటలేదు. అనగా అట్లు సాక్షాత్తుగ నెరుంగువారు మిక్కిలి దుర్లభమని భావము. "మనుష్యాణాం సహ స్రేషు కశ్చిద్యతతి సిద్ధయే" అని భగవంతుడు ముందు రాబోవు 7 వ అధ్యాయము 3 వ శ్లోకములో జెప్పుటను జూడుడు.

---

శ్లో॥ దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి ॥ 30

పద॥ దేహీ - నిత్యం - అవధ్యః - అయం - దేహే - సర్వస్య - భారత ।
తస్మాత్ - సర్వాణి - భూతాని - న - త్వం - శోచితుం - అర్హసి ॥

| | | | |
|---|---|---|---|
| హే భారత! | ఓ అర్జునుడా! | అవధ్యః | చంపబడదగిన వాడుకాడు |
| సర్వస్యదేహే | అందరిదేహమును | తస్మాత్ | అందువలన |
| (వధ్యమానేపి) | (చంపబడినను) | సర్వాణిభూతాని | సకలప్రాణులనుగూర్చియు |
| అయందేహీ | దేహముగల ఈ ఆత్మ | త్వం శోచితుం | నీవు దుఃఖించుటకు |
| నిత్యం | ఒకప్పుడున్ను | నార్హసి | తగినవాడవుకావు |

తా॥ ఓ అర్జునుడా! అందరి దేహము చంపబడినను ఈ దేహముగల ఆత్మ ఒకప్పుడున్ను చంపబడ దగినవాడు కాడు. కావున (భీష్ముడు మొదలైన) ఏప్రాణులను గూర్చియు దుఃఖించుటకు నీవు తగినవాడవు కావు.

---

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥ 31

పద॥ స్వధర్మం - అపి - చ - అవేక్ష్య - న - వికమ్పితుం - అర్హసి ।
ధర్మ్యాత్ - హి - యుద్ధాత్ - శ్రేయః - అన్యత్ - క్షత్రియస్య - న -

| | | | |
|---|---|---|---|
| (త్వం) | (నీవు) | హి | ఏలనగా |
| స్వధర్మం | స్వ (నీ) ధర్మమును | ధర్మ్యాత్ యుద్ధాత్ | న్యాయమైనయుద్ధమునకంటె |
| అవేక్ష్య అపి చ | చూచునప్పుడున్ను | అన్యత్ శ్రేయః | వేరుశ్రేయస్సు |
| వికంపితుం చ | వణుకుటకు (లేక) జంకుటకు | క్షత్రియస్య | క్షత్రియునకు |
| నార్హసి | యోగ్యుడవుకావు | నవిద్యతే | లేదు |

తా॥ నీవు నీవర్ణస్థులకు విధింపబడియున్న (అనగా క్షత్రియునకుయుద్ధము చేయుట స్వధర్మమైనందువలన అట్టి) ధర్మమును చూచినప్పుడున్ను యుద్ధము చేయ వెనుదీయుట నీకుసరియైనదిగాదు. ఏలనగా క్షత్రియునకు న్యాయమైన యుద్ధమునకంటె హితమైనది వేరొక్కటిలేదు.

(రామానుజులు) అగ్నిష్టోమాది యాగములలో పశుహింస యెట్లుధర్మమైనదో, అటులనే క్షత్రియుడవైన నీకు న్యాయముగ సంభవించియున్న ఈ యుద్ధము స్వధర్మమగుటచేత దానిచే దోషము గలుగదు.

(స్వకీయము) పరమార్థ తత్త్వము నుద్దేశించి మాత్రమే శోకమోహములనొంద న్యాయము కాదనుట మాత్రమేగాదు. యుద్ధము క్షత్రియధర్మమను దానినిగూడ నీవు ఆలోచించిచూచి క్షత్రియుడవైన నీకు స్వభావముగనే కుదిరియున్న ధర్మమునుండి వెనుదీయుట తగదు. ఆ యుద్ధము భూమిని జయించుట మూలముగి ధర్మమునకున్ను, ప్రజలను కాపాడుటకున్ను, ఉపయోగపడుట వలన న్యాయవిరుద్ధము కానట్టి శ్రేష్ఠమైనధర్మమే. అట్టిన్యాయమైన యుద్ధమునకంటె క్షత్రియునకు హితమైనది మరొకటిలేదని తాత్పర్యము.

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతం ।
సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధమీదృశమ్ ॥ 32

పద॥ యదృచ్ఛయా — చ — ఉపపన్నం — స్వర్గద్వారం — అపావృతమ్ ।
సుఖినః — క్షత్రియాః — పార్థ — లభన్తే — యుద్ధం —

| | | | |
|---|---|---|---|
| ! | ఓ అర్జునుడా! | ఈదృశం యుద్ధం | ఇటువంటియుద్ధమును |
| యదృచ్ఛయా | స్వభావసిద్ధముగనే | (యే) క్షత్రియాః | (ఏ) క్షత్రియులు |
| ఉపపన్నం | ఏర్పడియున్నదియు | లభన్తే | పొందుచున్నారో |
| అపావృతం స్వర్గద్వారంచ | తెరచియున్న స్వర్గద్వారమైనట్టియు | తే సుఖినః | వారలు సుఖులు |

తా॥ ఓ అర్జునుడా! తనంతటనే యేర్పడియున్నటువంటియు, తెరచియున్న స్వర్గద్వారమైనట్టియు ఇటువంటి యుద్ధమును జేయునట్టి క్షత్రియులు సుఖులు. అనగా ధర్మయుద్ధమున మరణించినవారలకు స్వర్గముయొక్కద్వారము తెరచియున్నదని తాత్పర్యము.

శ్లో॥ అథ చేత్త్వం ధర్మ్యమిమం సంగ్రామం న కరిష్యసి ।
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥ 33

పద॥ అథ — చేత్ — త్వం — ధర్మ్యం — ఇమం — సఙ్గ్రామం — న — కరిష్యసి।
తతః — స్వధర్మం — కీర్తిం — చ — హిత్వా — పాపం — అవాప్స్యసి॥

| | | | |
|---|---|---|---|
| అథ | మరియు | స్వధర్మం | స్వధర్మమునున్ను |
| త్వం | నీవు | కీర్తించ | కీర్తినిన్ని |
| ధర్మ్యంఇమం | న్యాయమైన యీ | హిత్వా | విడిచిపెట్టి |
| సంగ్రామం | యుద్ధమును | పాపం | పాపమునే |
| నకరిష్యసిచేత్ | చేయకపోయినచో | అవాప్స్యసి | పొందగలవు. |
| తతః | దానివలన | | |

తా॥ స్వర్గప్రయోజనమును త్యజించుట మాత్రమేగాక నీవు ధర్మముతో గూడిన యీ యుద్ధమును జేయకపోయినచో నీయొక్క (క్షత్రియ ధర్మమైన) స్వధర్మమునున్ను, శివుడు మొదలగువారిని ఎదిరించుటవలన లభించిన కీర్తినిన్ని త్యజించి పాపమునే పొందెదవు.

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయాం।
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే॥ 34

పద॥ అకీర్తిం — చ — అపి — భూతాని — కథయిష్యన్తి — తే — అవ్యయాం।
సంభావితస్య — చ - అకీర్తిః — మరణాత్ — అతిరిచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| అపిచ | మరియు | సంభావితస్య | బాగుగ గౌరవింపఁబడు వానికి |
| భూతాని | (ప్రాణులు) జనులు | | |
| అవ్యయాం | చాలకాలమువరకు స్థిరమైన | అకీర్తిః | అపకీర్తి |
| తే | నీయొక్క | మరణాత్ | మరణమునకంటె |
| అకీర్తించ | అపకీర్తినిగూడ | అతిరిచ్యతే | అధికమగును. |
| కథయిష్యన్తి | చెప్పెదరు. | | |

తా॥ మరియు, జనులు చాలకాలమువరకు నీయపకీర్తినిగూడ చెప్పెదరు. బాగుగ గౌరవింపబడుచున్నవానికి అపకీర్తి మరణమునకంటె అధికమైనది.

---

శ్లో॥ భయాద్రణాదుపరతం మంస్యన్తే త్వాం మహారథాః।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవం॥ 35

పద॥ భయాత్ — రణాత్ — ఉపరతం — మంస్యన్తే — త్వాం — మహారథాః।
యేషాం - చ — త్వం — బహుమతః — భూత్వా — యాస్యసి — లాఘవమ్॥

| | | | |
|---|---|---|---|
| మహారథాః | మహారథులు | యేషాం | ఎవరివద్ద |
| త్వాం | నిన్ను | బహుమతః (అభూః) | గొప్పతనము బడసి యున్నావో. |
| రణాత్ | యుద్ధమునుండి | | |
| భయాత్ఉపరతం | భయమువలన వెనుదీసిన వానినిగా | తే | వారలవద్ద |
| | | భూత్వాచ | మరలను |
| మంస్యన్తే | తలంతురు | లాఘవంయాస్యసి | చిన్నతనమును బడసెదవు |
| త్వం | నీవు - | | |

తా॥ మహారథులు నిన్ను యుద్ధమునుండి భయమువలన వెనుదీసిన వానినిగ తలంతురు. నీవు ఎవరివద్ద గొప్పతనమును బడసియున్నావో వారల వద్దనిప్పుడు చిన్నతనమును బడయగలవు.

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః।
నిందన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిం॥ 36

పద॥ అవాచ్యవాదాన్ — చ — బహూన్ — వదిష్యన్తి — తవ — అహితాః।
నిందంతః — తవ — సామర్థ్యం — తతః — దుఃఖతరం — ను — కిం॥

| | | | |
|---|---|---|---|
| తవ అహితాః | నీ శత్రువులు | వదిష్యన్తి | చెప్పెదరు |
| తవసామర్థ్యం | నీసామర్థ్యమును | తతః | దానికంటె |
| నిన్దన్తః | నిందించువారలై | దుఃఖతరం | అధికమైనదుఃఖము |
| బహూన్ | అనేకములైన | కింను? | ఏమున్నది? |
| అవాచ్యవాదాంశ్చ | చెప్పదగని మాటలను | | |

తా॥ నీ శత్రువులు నీ సామర్థ్యమును నిందించి చెప్పదగని యనేక మాటలను చెప్పెదరు. దానికంటె అధికమైన దుఃఖమేమున్నది?

శ్లో॥ హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః॥ 37

పద॥ హతః — వా — ప్రాప్స్యసి — స్వర్గం — జిత్వా — వా - భోక్ష్యసే — మహీం।
— ఉత్తిష్ఠ — కౌన్తేయ — యుద్ధాయ —

| | | | |
|---|---|---|---|
| (త్వం) హతోవా | నీవు చంపబడినచో | హే కౌంతేయ! | ఓ అర్జునుడా! |
| స్వర్గం ప్రాప్స్యసి | స్వర్గమునుపొందెదవు | యుద్ధాయ కృత-నిశ్చయః | యుద్ధముజేయ నిశ్చయించినవాడవుగ |
| జిత్వావా | జయించినచో | ఉత్తిష్ఠ | లెమ్ము. |
| మహీంభోక్ష్యసే | రాజ్యముననుభవించెదవు | | |
| తస్మాత్ | అందువలన | | |

తా॥ ఓ అర్జునా! నీవు చంపబడినచో స్వర్గమునుపొందెదవు. జయించినచో రాజ్యము ననుభవించెదవు. కావున యుద్ధముకొఱకు నిశ్చయముజేసికొనిలెమ్ము.

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥ 38

పద॥ సుఖదుఃఖే — సమే — కృత్వా (1) — లాభాలాభౌ - జయాజయౌ।
తతః — యుద్ధాయ — యుజ్యస్వ — న — ఏవం — పాపం — అవాప్స్యసి।

| | | | |
|---|---|---|---|
| సుఖదుఃఖే | సుఖదుఃఖములను | తతః | దానికి పిదప |
| సమేకృత్వా | సమముగజేసి (తలంచి) | యుద్ధాయయుజ్యస్వ | యుద్ధమునకై సిద్ధపడుము |
| లాభాలాభౌ | లాభనష్టములను | (త్వం) ఏవం (చేత్) | నీవు ఇట్టినిశ్చయముగలవాడవైనచో |
| జయాజయౌ | జయాపజయములను | | |
| (సమాకృత్వా) | సమముగ తలంచి | పాపం నావాప్స్యసి | పాపమునొందవు |

తా॥ సుఖదుఃఖములను, లాభనష్టములను, జయాపజయములను సమముగ భావించుకొని పిదప యుద్ధమునకై సిద్ధుడవగుము. ఇట్టి నిశ్చయము గలవాడవైనచో (యుద్ధము జేసినచో) పాపము నొందవు.

(1) సమేకృత్వా — సమముగజేసికొని. అనగా — సుఖదుఃఖములు మొదలగువాటివలన రాగ ద్వేషములను పొందక వాటిని సమముగ తలంచుట యని భావము.

(శ్రీధరులు) సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములను పదార్థములు కారణ కార్యములుగనున్నవి. సుఖదుఃఖములకు కారణములు లాభనష్టములు. లాభనష్టములకు కారణములు జయాపజయములు. కావున కారణము కార్యము ఈ రెంటిని విడిచిపెట్టవలయునని తాత్పర్యము.

---

శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి॥ 39

పద॥ ఏషా — తే - అభిహితా — సాంఖ్యే — బుద్ధిః — యోగే - తు - ఇమాం — శృణు।
బుద్ధ్యా — యుక్తః — యయా — పార్థ — కర్మబంధం (1) — ప్రహాస్యసి॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ అర్జునా! | యుక్తః | కూడినవాడవైతే |
| సాంఖ్యే | ఆత్మతత్త్వమున | కర్మబంధం | కర్మయను కట్టును |
| ఏషాబుద్ధిః | ఈబుద్ధి | ప్రహాస్యసి | విడిచెదవో |
| | నీకు | (తాం) | అటువంటి |
| అభిహితా | చెప్పబడినది | యోగేతు | యోగవిషయమున |
| (త్వం) యయాబుద్ధ్యా | నీవు ఎట్టిబుద్ధితో | ఇమాం బుద్ధిం శృణు | ఈ (యోగ) బుద్ధినివినుము |

తా॥ ఓ అర్జునా! ఆత్మతత్త్వవిషయమునందు ఈ బుద్ధినీకు (ఇంతవరకు) చెప్పబడినది. ఎట్టి బుద్ధితో గూడినవాడవైనచో కర్మబంధమునుండి విడివడెదవో అట్టి ఆత్మజ్ఞానము పొందుటకు మార్గమైన (కర్మ) యోగవిషయమైన బుద్ధిని చెప్పెదను వినుము.

(1) కర్మబంధం ప్రహాస్యసి — కర్మమేయగు ధర్మము, అధర్మము అను పేరుగల బంధమును నివర్తించుకొనుము. అనగా ఈశ్వరానుగ్రహమువలన లభ్యమగు జ్ఞానమును బడయుట చేతనే ఆ బంధమును నివర్తించుకొనుము అనితాత్పర్యము

(స్వకీయము) ఈశ్లోకమునందు చెప్పబడియున్న సాంఖ్యబుద్ధి, యోగబుద్ధి అనునవి యిట్టి వనువిషయమును, ఆరెంటికినిగల వ్యత్యాసమున్ను స్పష్టముగ తెలిసికొనుటఆవశ్యకము. 'సమ్యక్ ఖ్యాయతే ఇతిసంఖ్యా=బాగుగ పరమార్థతత్త్వమును ఏది ప్రతిపాదించుచున్నదో (స్పష్టపరచుచున్నదో) అది సంఖ్యా' అనగా ఉపనిషత్తు. ఆయుపనిషత్తులచేత ఏ పరమాత్మతత్త్వము నిరూపింపబడుచున్నదో

అదియే సాంఖ్యమనబడును. ఈ ఆత్మతత్త్వము భగవంతునిచే మునుపటి శ్లోకములలో బోధింపబడినది. అదియే ఇచ్చట సాంఖ్యమని చెప్పబడినది. ఆత్మకు జననము మొదలగు వికారములు లేనందున ఆత్మ 'అకర్త' అన్నియు, ప్రకరణముయొక్క భావమును విమర్శించి యెరుంగుటవలన ఆ యాత్మతత్త్వ విషయమై యెట్టి నిశ్చయబుద్ధి గలుగుచున్నదో అది సాంఖ్యబుద్ధి యగును. అది యే జ్ఞానులకు సంబంధించినదో వారలు సాంఖ్యులగుదురు. ఈ సాంఖ్యబుద్ధి గలుగుటకు మునుపు ఆత్మను దేహము మొదలగువాటికంటె వేరైనదిగను, కర్తగను, భోక్తగను, మరియు నిట్టి స్వభావము గలదిగను భావించుకొని దానికి తగినటుల ధర్మాధర్మముల వివేకముతోగూడి ముక్తికి సాధనమైన కర్మను అనుష్ఠించుట యోగమనబడును. దానివిషయమైన నిశ్చయబుద్ధియే యోగబుద్ధియగును. అదిస్వకర్మను జేయవలసిన అధికారులైన యెవరికి సంబంధించినదో వారలే యోగులనంబడుదురు. కర్తయను తలంపుపైనను, అనేకమను తలంపుపైనను ఆధారపడి నిలబడునట్టి జ్ఞానము అకర్తయను తలంపుపైనను, ఏకమను తలంపుపైనను ఆధారపడినట్టి జ్ఞానముతో నొకటిగజేరి నిలబడకుండుటను జూచి భగవంతుడు సాంఖ్యబుద్ధి, యోగబుద్ధియను రెండువిధములైన నిష్ఠలను ప్రత్యేకముగ విభజించి తెలుపుచున్నాడు. సంసారమునకు కారణమైన అజ్ఞానమును నేరుగపోగొట్టుచున్న సాంఖ్యముగు నీ యాత్మజ్ఞానము పరవస్తువును ఉన్నదున్నట్లు విమర్శింపవలయునని మునుపు చెప్పబడినది. అట్టి జ్ఞానమునొందుటకు మార్గమై, ద్వంద్వములను లక్ష్యముజేయక ఆసక్తిలేక ఈశ్వరుని ఆరాధించుటకొరకై చేయునట్టి కర్మానుష్ఠానమగు కర్మయోగము సమాధియోగము. ఇట్టి యోగమును గురించినబుద్ధి ఇది మొదలు చెప్పబడుచున్నది. ఐనను 31 వ శ్లోకము మొదలు 38-వ శ్లోకము వరకు లోకమునందు అనుష్ఠానమునన్న న్యాయము, అర్జునుని శోకమోహములను పోగొట్టుటకై మధ్యనెత్తి చెప్పబడినదేగాని వాటిచే నాత్మతత్త్వమును తెలియబఱచినట్లుగ భావింపగూడదు. అయితే పరవస్తువును చూపుటకే యెత్తుకొనిన విషయము కావున ఈ శ్లోకమునందు దానిని యోగమునుండి విభజించిచూపి ముగించుచున్నాడు. ఈ విధముగ గ్రంథముయొక్క విషయమును విభజించి చూపిననే వినువారికి తెలిసికొన సులభముగ నుండుటతోబాటు ముందురాబోవు 3 వ అధ్యాయము 3 వ శ్లోకమునకున్ను తగియుండును.

శ్వేతాశ్వతరోపనిషత్తు 6 వ అధ్యాయము 13 వ మంత్రమున నిత్యో నిత్యానాం......... తత్కారణం సాంఖ్యయోగాధిగమ్యం" అని ప్రయోగింపబడియుండుటను జూడుడు.

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ 40

పద॥ న - ఇహ - అభిక్రమనాశః - అస్తి - ప్రత్యవాయః - న - విద్యతే ।
స్వల్పం - అపి - అస్య - ధర్మస్య - త్రాయతే - మహతః - భయాత్ ॥

| | | | |
|---|---|---|---|
| ఇహ | ఈ మోక్షమార్గమైన కర్మయోగమునందు | అస్యధర్మస్య | ఈ కర్మయోగమగు ధర్మముయొక్క |
| అభిక్రమనాశః | మొదలుపెట్టుట వ్యర్థము | స్వల్పమపి | స్వల్పభాగమైనను |
| నాస్తి | కానేరదు | మహతః | మిక్కిలి పెద్దదైన |
| ప్రత్యవాయః | దోషము | భయాత్ | జననమరణ భయమునుండి |
| నవిద్యతే | కానేరదు | త్రాయతే | రక్షించుచున్నది. |

తా॥ ముక్తికి మార్గముగనున్న ఈ కర్మయోగమున, ఆరంభించి ఏ కొంచెమాచరించినను అది వ్యర్థముకానేరదు. (అనగా దీనిలో జేయు ప్రయత్నమునకు నిశ్చితముగ ఫలము గిట్టును.) దోషముగలుగనేరదు. (అనగా వైద్యము చేయుటలో అనర్థము కొన్ని సమయములలో సంభవించుటవలె సంభవించదు.) ఈ కర్మయోగమగు ధర్మముయొక్క చిన్నదైన భాగముగూడ (అనగా ఈ యోగమును కొంత యనుష్ఠించుటయు) మిక్కిలి గొప్పదైన జనన మరణ భయమునుండి రక్షించును.

(శ్రీధరులు) వ్యవసాయము మొదలగు కర్మలను చేయనారంభించి మధ్య విడిచిపెట్టుట వలనగాని, లేక విఘ్నములేర్పడి దానివలన జరుప వీలులేనందునగాని ఎట్లు ఆ సస్యము (పైరు) ప్రయోజనమివ్వక వ్యర్థమగుచున్నదో, అట్లు నిష్కామకర్మము వ్యర్థముకానేరదు. చేసినవరకు మోక్షసాధనమైన గొప్పప్రయోజనమును కలుగచేయునని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) 40-వ శ్లోకముమొదలు 44-వ శ్లోకమువరకు, కామ్య, (ఫలముకావల యునని కోరికతోగూడిన) కర్మము నిందింపబడుచున్నది.

---

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన ।
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం ॥ 41

పద॥ వ్యవసాయాత్మికా (1) - బుద్ధిః - ఏకా (2) - ఇహ (3) - కురునందన ।
బహుశాఖాః - హి - అనంతాః - చ - బుద్ధయః - అవ్యవసాయినాం (4) ॥

| | | | |
|---|---|---|---|
| హే కురునందన ! | ఓ కురువంశమున జనించినవాడా! | అవ్యవసాయినాం | నిశ్చయబుద్ధి లేనివారలయొక్క |
| ఇహ | ఈ శ్రేయోమార్గమునందు | బుద్ధయః | బుద్ధులు |
| వ్యవసాయాత్మికా | నిశ్చయస్వరూపమైన | బహుశాఖాః | అనేక తెగలు గలవిగను |
| బుద్ధిః | బుద్ధి | అనంతాశ్చ | అనేకములుగను ఉన్నవి. |
| ఏకా హి | ఒక్కటే | | |

తా॥ ఓ అర్జునా! ఈ శ్రేయోమార్గమున నిశ్చయస్వరూపమైన బుద్ధి యొక్కటే. నిశ్చయబుద్ధి లేనివారల బుద్ధులు పలుతెగలు కలవిగను, అనేకములుగను నున్నవి.

(1) వ్యవసాయబుద్ధి - అనగా - (శ్రీధరులు) ఈశ్వరభక్తివలన నేనుసంసారమను సముద్రమును దాటగలనను నిశ్చితమైనబుద్ధి, (రామానుజులు) పరమాత్మను ఎరింగి నేను చేసిన వేదోక్తములైన సకలకర్మలను ఆ పరమాత్మకు అర్పణముచేసి దానిచేతనే నేను కడ తేరుచున్నానను నిశ్చితమైనబుద్ధి, (రాఘవేంద్రులు) శాస్త్రప్రమాణములచే నిర్ణయింపబడిన పరమార్థమైన, ఈశ్వర విషయమైన బుద్ధి.

(2) ఏకా - (రామానుజులు) ఒకటే, అనగా మోక్షమనెడు ఫలమొక్కటే. దానికి సాధనమునొక్కటే యని తాత్పర్యము.

(3) ఇహ - అనగా, (రామానుజులు) శాస్త్రోక్తమైన కర్మలో.

(4) అవ్యవసాయినాం— (శ్రీధరులు) భక్తిలేని కామ్యకర్మచేయువారు.

(శంకరభాష్యము) సాంఖ్యమునుగూర్చియు, యోగమునుగూర్చియు మునుపు చెప్పియున్న బుద్ధికి లక్షణము దీనిలోజెప్పబడుచున్నది. ఈ శ్రేయోమార్గమున నిశ్చయస్వరూపబుద్ధి యొక్కటే. అది సరియైన ప్రమాణమునుండి కలిగినందున తదితరమైన అనేక తెగలుగల విపరీత బుద్ధులను రానివ్వక అడ్డగించుచున్నది అయితే యే విపరీతబుద్ధులు పలుతెగలుగ వీడిపోవుటవలన సంసారము ముగియక ఎల్లప్పుడును వ్యాపించి స్థిరమగుచున్నదో, సరియైన ప్రమాణముచేత కలుగునట్టి వివేకబుద్ధివలన లెక్కలేని ఏ భేదబుద్ధులు నశించి సంసారమున్ను నశించుచున్నదో అట్టి విపరీతబుద్ధులు లెక్కలేనివే. ఎవరికి ఇవి గలవనిన, దృఢత్వములేనివారలకును సరియైన ప్రమాణమువలన గలిగిన వివేకజ్ఞానము లేనివారలకును అని గ్రహింపుడు.

(స్వకీయము) నిశ్చయబుద్ధియొక్కటేయనియు, అనిశ్చయబుద్ధులనేకములనియు, దీనిలో చెప్పబడియున్నది. అనిశ్చయబుద్ధియనునది కామ్యకర్మ విషయమునకు సంబంధించినది. అదెట్లనగా స్వర్గమును పొందగోరినవాడు జ్యోతిష్టోమమను యాగమును, పశువులు అధికముగ కావలెనని కోరినవాడు సత్రయాగమును చేయవలయుననియు, ఈ విధముగనే ప్రతి కర్మమునకును ఆయా ఫలములు చెప్పబడియున్నవి. ఆ ఫలములు తనకు గిట్టవలయునను కోరికగలవాడు ఏకర్మకు విశేషఫలమును కర్మచేయుటలో స్వల్ప ప్రయాసమునుగలదో తెలిసికొనవలయును. పిదప దానిని జేయుటకుస్థానము, అర్థము, ప్రేరేపణము, వీటిని వెతుకవలయును. ఇవి అన్నియు అనుకూలములై యజ్ఞాదికర్మలను ఆరంభించినచో దానిలోనెట్టి యాటంకములేక ముగియవలయును. ఏదైన నొక విఘ్నము సంభవించినచో చేసిన కార్యము వ్యర్థమగుటయేగాక పాపమున్ను గలుగును. కామ్యకర్మమగు దీనిలో నింత నిర్బంధముండుటవలన దీనిని చేయువానికి అనేక తెగలుగల అనేకబుద్ధులని చెప్పబడినది. ఇంత ప్రయాసపడి చేయుటకు ఫలమునిచ్చునట్టి దేవత ఒకటేనా? అన్నచో-అదియు లేదు. ఇంద్రుడు, అగ్ని, వాయువు, మొదలైన పలుదేవతలున్నారు. వారలచే నివ్వబడు ఫలములనగా స్వర్గము, దానికి తగ్గినవేకాని దానికన్న శ్రేష్ఠములైనవికావు. ఫలమునొక్కటిగాదు. స్వర్గము మొదలగువాటిని అనుభవించువాడు నిర్దిష్టకాలమువరకు అచ్చటనుండి పిదప జన్మమెత్తవలసియే యున్నది. జననమరణములు అతనిని విడిచి నివర్తించుటయే లేదు. కావున ఒకనిశ్చయములేని పలుబుద్ధులుగలవానికి ఇట్టిఫలమే గిట్టును. ఇదేకర్మలను వాటికిగల ఫలములను గోరక ఈశ్వరార్పణముగ జేసినచో వానికి ఏకర్మకు ఎట్టిఫలమని తెలిసికొనవలసినదియులేదు. ప్రయాసమధికమా? స్వల్పమా? యనుదానిని విచారింపవలసినదియులేదు. స్థానము, ప్రేరేపణము, ఇవి లభించలేదేయను విచారమున్నులేదు. మొదలుపెట్టిన కర్మము ముగించనిచో పాపమువచ్చునను భయమును లేదు. ఎట్టి విచారములేక తన శక్త్యనుసారము సత్కర్మలనుజేసి ఈశ్వరార్పణముచేసినచో ఈశ్వరుడు చిత్తశుద్ధినిజ్ఞానమును గలుగజేసి జననమరణదుఃఖమునుపోగొట్టి నిత్యానందమైన మోక్షము నొందింపజేయును. ఇట్టి కర్మయోగికి తానుచేయుచున్న కర్మఎట్టిది, దానిని ఎట్లుచేయవలయును, ఏ యేవస్తువులు కావలెననునది మొదలైన పలుబుద్ధులకు అవకాశములేక సత్కర్మలనుచేసి ఈశ్వరార్పణముచేసి మోక్షమొందవలయునను నొకబుద్ధియే ఉండును. కావున నితడు ఒకేనిశ్చయ బుద్ధిగలవాడుగ జెప్పబడెను.

ఒకడు కర్మయొక్క ఫలమునపేక్షించుటయులేదు. చేయుచున్న కర్మను ఈశ్వరార్పణ బుద్ధిగ చేయుటయు లేదు.అట్టి కర్మకు ఏమిఫలమను ప్రశ్న దీనివలన గలుగుచున్నది. తనకుగాని, ఇతరులకుగాని ప్రయోజనములేని పనిచేయుట ఎట్లు వ్యర్థమగుచున్నదో అటులనే వ్యర్థమగుచున్నదనియే ఉత్తరము చెప్పవలయును.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః॥ 42

,, కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ 43

,, భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే॥ 44

పద॥ యాం - ఇమాం - పుష్పితాం - వాచం - ప్రవదన్తి - అవిపశ్చితః।
వేదవాదరతాః - పార్థ - న (1) - అన్యత్ - అస్తి - ఇతి - వాదినః॥
,, కామాత్మానః - స్వర్గపరాః - జన్మకర్మఫలప్రదాం।
క్రియావిశేషబహులాం - భోగైశ్వర్యగతిం - ప్రతి॥
,, భోగైశ్వర్య ప్రసక్తానాం - తయా - అపహృతచేతసాం।
వ్యవసాయాత్మికా - బుద్ధిః - సమాధౌ (2) - న - విధీయతే॥

| | |
|---|---|
| హే పార్థ! | ఓ అర్జునుడా! |
| వేదవాదరతాః | వేదమునందలి ఫలములుచెప్పునట్టి వాక్యములలో (అర్థవాదములో) ప్రీతిగలిగినట్టియు |
| నాన్యదస్తీతివాదినః | స్వర్గాదిఫలములకు సాధనములైన కర్మలకంటె వేరుగ మోక్షముగాని, ఈశ్వరుడుగాని, లేదని చెప్పునట్టియు |
| కామాత్మానః | కామస్వరూపము గలిగినట్టియు (ఆశచేనిండిన మనస్సు గలిగినట్టియు) |
| స్వర్గపరాః | స్వర్గమునే గొప్పపురుషార్థముగ తలంచినట్టియు |
| అవిపశ్చితః | అవివేకులు |
| భోగైశ్వర్యగతిం ప్రతి | భోగైశ్వర్యముల నొందుటకు సాధనములైన |
| క్రియావిశేష బహులాం | కర్మవిశేషము లధికమైనట్టియు |
| జన్మకర్మఫలప్రదాం | జన్మము, కర్మము, కర్మఫలము వీటి నిచ్చునట్టియు |
| పుష్పితాం | (ఫలములేని) పుష్పములుగల వృక్షములవలె స్పష్టముగనున్న |
| ఇమాం | ఇటువంటి |
| యాం వాచం | ఏ మాటను |
| ప్రవదన్తి | చెప్పుచున్నారో మఱియు |
| తయా | ఆ మాటచేత |
| అపహృతచేతసాం | అపహరింపబడిన మనస్సుగలవారుగను |
| భోగైశ్వర్య ప్రసక్తానాం | భోగైశ్వర్యములలో ఆశగలవారుగనువున్నారో వారలకు |
| వ్యవసాయాత్మికా బుద్ధిః | సాంఖ్యమునందుగాని, యోగమునందుగాని నిశ్చయస్వరూపమైనబుద్ధి |
| సమాధౌ | మనస్సునందు |
| న విధీయతే | కలుగనే కలుగదు |

తా॥ ఓ అర్జునా! వేదమునందు ఫలమును చెప్పుచున్న వాక్యములైన అర్థవాదమునందు ప్రీతిగలవారును, స్వర్గాది ఫలముల నొందుటకు సాధనములైన కర్మలకంటె వేరు మోక్షముగాని, ఈశ్వరుడుగాని లేదని చెప్పుచున్న వారును, కామస్వభావముగలవారును, (అనగా - పుత్రమిత్రకళత్రాదులలో నాశగలవారును) స్వర్గమే గొప్ప పురుషార్థమని తలంచియున్నవారును అగు అవివేకులు భోగైశ్వర్యముల నొందుటకు సాధనములైన అనేక కర్మభేదములను

జెప్పునట్టియు, దానిచే జననము, కర్మము, కర్మఫలము, వీటినిచ్చునట్టియు ఫలములులేని పుష్పములుగల వృక్షములవలె ప్రకాశించుచున్నట్టియు ఏ ఈ మాటను జెప్పుచున్నారో, ఆ మాటచే మోసము జెందిన మనస్సుగలవారును, భోగైశ్వర్యములయందు ఆసక్తిగలవారును అగు వారి మనస్సున, సాంఖ్యము నందుగాని, యోగమునందుగాని, నిశ్చయస్వరూపమైన బుద్ధి కలుగనేరదు.

(1) నాన్యదస్తీతివాదినః - అనుదానికి 'వేదములన్నియు భగవంతునిగూర్చియే చెప్పుచున్నవని యెరుంగని వారల'ని మధ్వాచార్యులున్ను, 'ఈశ్వరుడుగాని మోక్షముగాని లేదని వాదించువారలు' అని రాఘవేంద్రులున్ను అర్థముచేసియున్నారు.

(2) సమాధౌ - అనగా అంతఃకరణమున అని శంకర రామానుజులున్ను, యోగసమాధిలో అని శ్రీధరులున్ను, ఈశ్వరధ్యాన విషయమునందు అని మధ్వాచార్యులున్ను, భగవంతుని యందు అని రాఘవేంద్రులున్ను అర్థముచేసియున్నారు.

(స్వకీయము) యజ్ఞము మొదలగు కర్మలకు శ్రేష్ఠములైన ఫలములు స్వర్గాదులనియు, పుత్ర, మిత్ర, కళత్ర, ధన, ధాన్య, వస్తు, వాహనాది ఫలములును గలుగుననియు, వేదములయందు ఫలములను జెప్పుచున్న అర్థవాదములనువిని భోగైశ్వర్యాదులలో నా సక్తిగలిగి వాటిచే నీడువబడి యున్న మనస్సు గలవానికి ఆత్మస్వరూప జ్ఞానమునందు ప్రవృత్తియే కలుగనేరదని ఈ శ్లోకముల భావము.

oooooooo

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45

పద॥ త్రైగుణ్యవిషయాః (1) - వేదాః - నిస్త్రైగుణ్యః (2) - భవ - అర్జున ।
నిర్ద్వన్ద్వః (3) - నిత్యసత్త్వస్థః (4) - నిర్యోగక్షేమః (5) - ఆత్మవాన్ (6) ॥

| | | | |
|---|---|---|---|
| | ఓ అర్జునుడా ! | నిర్ద్వన్ద్వః | (సుఖదుఃఖములు, లాభనష్టము లు మొదలగు) ద్వన్ద్వములు లేనివానిగను |
| వేదాః | వేదములు (కర్మకాండము) | | |
| త్రైగుణ్యవిషయాః | గుణత్రయముచే గలిగిన సంసారమును విషయముగ గలవి | నిత్యసత్త్వస్థః | నిత్యసత్వ స్థితిగలవానిగను |
| త్వం | నీవు | నిర్యోగ క్షేమః | యోగ క్షేమములులేనివానిగను |
| నిస్త్రైగుణ్యః | గుణత్రయములులేనివానిగను, అనగా ఆశలేనివానిగను | ఆత్మవాన్ (చ) | అప్రమత్తునిగను (ఆత్మజ్ఞాన మునందు జాగ్రత్తగల వానిగను) |
| | | భవ | అగుదువుగాక |

తా॥ ఓ అర్జునా! వేదములు (కర్మకాండము) సత్వాది మూడు గుణము లచే గలిగిన సంసారము విషయముగ గలవి. (అనగా కామ్యకర్మలకై ఏర్పడినవి.) నీవు ఆశ లేని వానిగను, ద్వంద్వములులేనివానిగను, నిత్యసత్వస్థితి గలవానిగను, యోగక్షేమములు లేనివానిగను, అప్రమత్తునిగను (ఆత్మజ్ఞాము నందు జాగ్రత్తగలవానిగను) ఉండవలయును. (స్వధర్మమును నీవు అను ష్ఠించునప్పుడు గైకొనదగిన ఉపదేశమిది.)

(1) త్రైగుణ్యవిషయాః - స్వర్గాదులను తెలియబరచుచున్నవని రాఘవేంద్రులు అర్థము చేసియున్నారు.

(2) నిస్త్రైగుణ్యః - గుణత్రయమును వదలినవానిగను, అనగా గుణత్రయముచే కలుగునట్టి కార్యములను విడిచినవాడని రాఘవేంద్రుని తాత్పర్యము.

(3) నిర్ద్వన్ద్వః - సుఖదుఃఖములకు కారణములైన శీతము ఉష్ణము, లాభము నష్టము, జయము అపజయము, హితము అహితము, ఇట్లుపరస్పర విరోధముగల రెండువస్తువులు ద్వంద్వములని చెప్పబడును.

(4) నిత్యసత్వస్థః - అనుదానికి ఎల్లప్పుడును శుద్ధ సత్వగుణమునే ఆశ్రయించిన వానిగను అని శంకరరామానుజులును, ఎల్లప్పుడును ధైర్యముగల వానిగను అని శ్రీధరులున్ను, ఎల్లప్పుడున్ను హరిధ్యానమే గలవానిగను అని రాఘవేంద్రులును అర్థమును జేసియున్నారు.

(5) నిర్యోగక్షేమః - యోగము అనగా సంపాదించనిదానిని సంపాదించుట, క్షేమమనగా సంపాదించిన దానిని కాపాడుట, యోగక్షేమములను ముఖ్యముగగైకొనినవాడు ముక్తిని పొందుట అరుదు కావున యోగక్షేమములు లేనివాడవుగ నుండుమని జెప్పబడెను.

(6) ఆత్మవాన్ - అనుదానికి ఆత్మజ్ఞానిగను అని రామానుజులున్ను, హరియే స్వామియను నమ్మకముగల వానిగను అనిరాఘవేంద్రులున్ను అర్థముచేసియున్నారు.

(రామానుజులు) గుణత్రయముయొక్క అధికారులకు వారివారి కర్మలచే గలుగునట్టి ఫలములు దీనిలో జెప్పబడినవి.

(రాఘవేంద్రులు) ఈ శ్లోకము మొదలు 6-వ అధ్యాయము ముగియువరకు నిష్కామ కర్మయోగముపదేశింపబడుచున్నది. అయితే కొన్ని శ్లోకములలో వేరుసంగతులు చెప్పబడి యున్నవే యనినచో అవిమధ్యగలిగిన ప్రశ్నల కుత్తరములుగ నుండును.

(స్వకీయము) మునుపటి శ్లోకములలో జెప్పబడిన కామస్వభావముగల అవ్యవసాయులకు అనగా వేదప్రమాణములవలన కలుగునట్టి వివేకబుద్ధిలేనివారలకు జననమరణ రూపమైన సంసారమే ఫలమని ఈ శ్లోకమునందు జెప్పబడినది.

శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః 46

పద॥ యావాన్ - అర్థః - ఉదపానే - సర్వతః - సంప్లుతోదకే।
తావాన్ - సర్వేషు - వేదేషు - బ్రాహ్మణస్య - విజానతః॥

| | | | |
|---|---|---|---|
| ఉదపానే | స్నానపానాదులకై స్వల్పముగ నీరుగల బావి మొదలగు వాటియందు | తావానర్థః | అంతటిప్రయోజనమున్ను |
| | | సర్వతస్సంప్లుతోదకే | అంతట ప్రవహించిన మహత్తైన జలప్రవాహమునందు |
| యావానర్థః | ఎంతటి ప్రయోజనము గలదో | భవతియుంటా | (ఇమిడి) యుండుటవలె |

| | | | |
|---|---|---|---|
| సర్వేషు వేదేషు | వేదములలో నంతటను జెప్ప బడినకర్మలలో | విజానతః బ్రాహ్మణస్య | పరమార్థతత్త్వము నెరింగిన బ్రహ్మనిష్ఠునకు |
| (యావానర్థః) | ఎంతటి ప్రయోజనము గలదో | (భవతి) | (బ్రహ్మనందముననిమిడి) |
| (తావానర్థః) | అంతటి ప్రయోజనమున్ను | | గలదు. |

**తా॥ స్నానపానాదులకై స్వల్పమైన నీరుగల బావి మొదలగు వాట్లలో ఎంతప్రయోజనముగలదో, అంతప్రయోజనమున్ను అంతట ప్రవహించి సముద్రమువంటి మహత్తైన జలప్రవాహమునందు ఇమిడి యున్నదివలె వేదములలో నంతట చెప్పబడిన సకలకర్మములచేతను ఎట్టి ప్రయోజనముగలదో అట్టి ప్రయోజనమున్ను పరమార్థతత్త్వము నెరుంగుచున్న బ్రహ్మనిష్ఠునకు బ్రహ్మనందమున నిమిడి యున్నది.**

(శంకరభాష్యము) వేదములలో జెప్పబడిన సకలకర్మలయొక్క అసంఖ్యాకములైన ఫలములన్నియు కోరదగనివైనచో అకర్మలు ఈశ్వరార్పణముగ నిష్కామముతో ఎందులకు ననుష్ఠించబడవలయుననునది ఈ శ్లోకముచేత చెప్పబడుచున్నది.

లోకమునందు బావి తటాకమువంటి యనేకములైన స్వల్పజలముగల జలస్థానములలో స్నానపానములు మొదలగు ఎంతటి ప్రయోజనములుగలవో ఆ ప్రయోజనములన్నియు, అంతట ప్రవహించిన మహాప్రవాహమునందును గలవు. ఆ ప్రయోజనములు దీనిలో నిమిడియున్నవని భావము. ఇటులనే వేదములలోనంతటను చెప్పబడిన కర్మలలోనెట్టి ప్రయోజనము (కర్మఫలము) కలదో ఆ ప్రయోజనమంతయు పరమార్థతత్త్వమును చూచి యెరింగిన విరక్తుడైన బ్రాహ్మణునికి కలుగుచున్నదై అంతట ప్రవహించుచున్న మహాప్రవాహముతో సమానమైన జ్ఞానఫలములో (అనగా బ్రహ్మనందమున) కలుగుచున్నది. అనగా ఆ యానందమునందు ఇముడుచున్నది.

"యథా కృతాయవిజితాయాధరేయాః సంయంత్యేవమేనగ్ సర్వం తదభి సమేతి యత్కించప్రజాః సాధు కుర్వంతి యస్తద్వేదయత్సవేద" అనగా జూదమున జయింపబడిన కృతుడను రాబడికి దానికంటె తక్కువైన త్రేతామొదలగు వరుసహానములు వచ్చిచేరునటుల జనులుచేయునట్టి సత్కర్మయంతయు వానిని (రైక్వుని) చేరుచున్నవి. అతడు ఎరింగినదానిని ఎరుంగునట్టి వాడెవడో అతడున్ను దానినేపొందుచున్నాడు. అను చాందోగ్యోపనిషత్తు 4 వ ప్రపాఠకము 1 వ ఖండము 4 వ మంత్రమైన శ్రుతిచేత దీనిని తెలిసికొనుడు. ఇదే విషయమును భగవంతుడు రాబోవు 4 వ అధ్యాయము 33 వ శ్లోకమునందు "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" ఓ పార్థ! ముక్తికి సాధనమైన జ్ఞానములో కర్మలన్నియు ముగియుచున్నవి. (లోబడి నిలుచుచున్నవి) అని చెప్పుటను చూడుడు. బ్రహ్మనందము నొందుటకు నిష్కామకర్మము పరంపరయైన - కారణము గావున కర్మము బావి, తటాకము, మొదలగు వాటితో సమానముగ నుండినను జ్ఞాననిష్ఠకు అధికార మొందుటకు పూర్వము కర్మమునందే యధికారముగలవాడు కర్మమును చేయవలయును.

(రామానుజ భాష్యము) పలుదిక్కులనుండియు వచ్చుచున్న యధిక జలముగల చెరువు మొదలగువాట్లలో దాహమునకు నీరు త్రాగబోయినయతడు తనకెంతకావలయునో అంతే ఉపయోగించుటవలె వేదములెంత విస్తారములుగనున్నను వేదోక్త కర్మానుష్ఠానముగల వేదార్థముల నెరింగినవాడు తనకు వేదమునుండి ఉపయోగించుకొనదగినదెంతయో అంతమాత్రమే ఉపయోగించుకొనునని తాత్పర్యము.

రాఘవేంద్రులు, మొదట అన్వయముచేసి వ్రాయబడిన అర్థమునేచెప్పి మరల క్రింద కనబరచిన విధముగ వేరొక అర్థము చేసియున్నారు - సర్వతస్సంప్లుతోదకే = ప్రళయజలము నందున్న, ఉదపానే - ఉత్ = ఉత్తముడును, అప = ఎవరిచేతను రక్షింపబడనివాడును, అనే= సకలప్రపంచములను నడుపుచున్నవాడునైన పరమాత్మయే (ప్రసన్నే సతి) ప్రసన్నుడైనచో, సర్వేషు వేదేషు యావానర్థః = కామ్యకర్మలను చేయువానికి వేదములలో జెప్పబడియున్న ఫలమెంతగలదో, తావాన్ = అంతటి ఫలమున్ను, విజానతః = శాస్త్రాచార్యోపదేశమువలన బ్రహ్మము నెరింగినవాడై బ్రాహ్మణస్య = బ్రహ్మమును నేరుగచూచిన వానికి, (భవతి) కలుగును.

(స్వకీయము) స్వల్పజలముగల బావి, గుంటలు మొదలగువాటి నాశ్రయించువానికి కలుగు ప్రయోజనము మిక్కిలి స్వల్పమైనదిగనే యుండును. గొప్ప చెరువు, నది, మొదలగువాటి నాశ్రయించిన వానికి బావి గుంట మొదలగువాటివలన కలుగు ప్రయోజనమునకంటె అనేక రెట్లు అధికముగానుండును. ఎట్లనగా, బావినీరు కొన్ని స్వల్పకార్యములకు ఉపయోగపడునేగాని, నంజ పంటకు ఉపయోగించునా? అన్ని పనులకు నిరంతరముగ నుపయోగింపవీలగునా? నది, చెరువులయితే ఇట్టిసకల కార్యములకును ఉపయోగపడును. ఆ యుపయోగమున బావి యుపయోగముకూడా ఇమిడియేయున్నది. ఆ విధముగ బ్రహ్మజ్ఞానికి గొప్పదైనట్టియు, నిత్యసుఖమైనట్టియు మోక్షఫలము వేదములలో జెప్పబడియున్న స్వర్గాది ఫలములకంటె ఎంతయో మేలైనది కావున దానికంటె అల్పములైన కామ్యకర్మ ఫలములను బ్రహ్మజ్ఞాని యపేక్షించడు. బ్రహ్మానందమైన మోక్షము అల్పమైన స్వర్గాది ఫలములను లోబరచుకొని యున్నదనియే భావము.

ఈ శ్లోకమునకు వేరొక విధముగను అర్థముచేయుచున్నారు. అన్ని వేదములలోను అనేకములైన కర్మలు చెప్పబడియుండగా స్వధర్మమని వానివానికి ఏర్పడియున్న స్వల్పకర్మలను మాత్రమనుష్ఠించుట చాలునని చెప్పుట సరియేనా? అనగా, దాహమునుదీర్చుకొను నపేక్షగలవాడు ఒక గొప్ప సముద్రమువంటి ప్రవాహమును పొందినచో దానిలోనున్న నీరంతయు అతనికి ఆవశ్యకము కానిదై అతని దాహమును పోగొట్టదగిన స్వల్పజలము మాత్రమే ఎట్లు ప్రయోజన పడుచున్నదో ఆ విధముగనే ఆత్మజ్ఞానము నొందగోరిన బ్రాహ్మణునికి అన్ని వేదములచే చెప్పబడిన కర్మలలో అతనికి బ్రహ్మజ్ఞానము నిచ్చునట్టి స్వకర్మానుష్ఠానమునకు తగిన కర్మలుమాత్రము చాలినవి. తదితరములైన వేదోక్తకర్మలచే కావలసినదేదియు లేదు. అవి అతనికి నిష్ప్రయోజనము లని భావము.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి॥ 47

పద॥ కర్మణి - ఏవ - అధికారః - తే - మా - ఫలేషు - కదాచన।
మా - కర్మఫలహేతుః - భూః - మా - తే - సంగః - అస్తు - అకర్మణి

| | | | |
|---|---|---|---|
| తే | నీకు | (అధికారః) | అధికారము |
| కర్మణ్యేవ | కర్మజేయుట యందేగదా | మా | లేదు |
| అధికారః | అధికారమున్నది. | కర్మఫలహేతుః | కర్మఫలమునకు పాత్రముగ |
| కదాచన | ఒకప్పుడున్ను | మాభూః | నుండకుము |
| ఫలేషు | ఫలములలో | | |

| | | | |
|---|---|---|---|
| అకర్మణి | కర్మముచేయకయుండుటలో | సంగః | ఆసక్తి |
| తే | నీకు | మాను | కూడదు |

తా॥ (అర్జునా!) నీకు కర్మచేయుటయందేగదా యధికారమున్నది? (ఐతే) ఒకప్పుడున్ను (కర్మ) ఫలమునందధికారము వలదు (జననమరణములకు హేతువైన) కర్మఫలమును రప్పించుకొనువానిగ నుండకుము. కర్మము చేయక యుండుటలో ఆశ యుంచకుము,

(శంకరులు) కర్మమునందే నీకధికారము, జ్ఞాననిష్ఠలో కాదు. అట్లు కర్మముచేయుచున్న నీకు దానిఫలమునందాసక్తి ఎట్టిపరిస్థితిలోనువలదు. కర్మఫలమున ఆశయుంచి కర్మచేయుచున్న వాడు కర్మకు ఫలమైన జననమునకు కారణుడగును. కర్మఫలమును కోరనిచో దుఃఖస్వరూపమైన కర్మచే నేమి? యని తలంచి కర్మ చేయకయుండుటలో నాసక్తిగలిగి యుండగూడదు.

(రామానుజులు) కర్మను ఈశ్వరాధీనముగ నీవు చేయవలసినవాడవు. దానిఫలము నపేక్షించకయు, కర్తృత్వాభిమానములేకను కర్మనుజేసినచో దానిఫలము నొందక మోక్షఫలమొందెదవు. కర్మనువిడిచిపెట్ట నీకధికారములేదు. ఏలనగా ఈశ్వరాధీనముగ జేయవలసినవాడవని తాత్పర్యము

(రాఘవేంద్రులు) కర్మచేయుటలో నీకు అధికారమని చెప్పినందున కర్మఫలమునొందుటకు గూడ నధికారముగలదని తలంపకుము. నీవుచేసిన కర్మకు ఫలమిచ్చుట నా యిచ్ఛగనున్నది. నీవు జ్ఞానివగునంత వరకు కర్మలను విడువకనే చేయవలయును. జ్ఞానికూడ ఫలాపేక్షలేక కర్మచేసినచో అట్లు చేసినకర్మ సత్కర్మయైనచో మోక్షమునందధికమైన ఆనందము గలుగును. కావున జ్ఞానికూడ జేయవలసినదిగనున్న కర్మను నీవుచేయక విడచిపెట్టుటకు యోగ్యుడవుకావు. ఐతే ఫలమును మాత్రము అపేక్షించకుము. ఫలమును పొందుటకు నీవు స్వతంత్రుడవని తలంపకుము. ఈశ్వరుడు యజమానుడనియు, నీవు దాసుడవనియు తలంచి ఐక్యభావమును విడనాడి ఈశ్వరారాధన రూపములైన కర్మలను చేయుమని తాత్పర్యము.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥ 48

పద॥ యోగస్థః (1) — కురు — కర్మాణి — సంగం (2) — త్యక్త్వా — ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోః (3) — సమః — భూత్వా — సమత్వం — యోగః — ఉచ్యతే॥

| | | | |
|---|---|---|---|
| హే ధనంజయ ! | ఓ ధనాశలేని అర్జునుడా! | సమః భూత్వా | సముడుగనున్నవాడవై |
| త్వం యోగస్థః | నీవుయోగమునందుండి | కర్మాణి కురు | కర్మలనుచేయుము |
| సంగంత్యక్త్వా | అభిమానమును విడచి | సమత్వం | సమముగనుండుటయే |
| సిద్ధ్యసిద్ధ్యోః | ఫలమునొందినను, పొందక పోయినను | యోగ ఇత్యుచ్యతే | యోగమని చెప్పబడుచున్నది. |

తా॥ ఓధనాశలేని అర్జునుడా! నీవు యోగమునందున్నవాడవై ఆసక్తిని విడిచి కర్మఫలమైన జ్ఞానసిద్ధినొందినను పొందకపోయినను వాటిలో సముడుగ నున్నవాడవై (అనగా జ్ఞానసిద్ధినొందితినని సంతోషముచేత గర్వించకయు,

సిద్ధినిపొందలేదేయను దుఃఖముచేత మైకమొందకయు) కర్మలను చేయుము. సిద్ధి అసిద్ధి రెండిటిలోను సమముగనుండుట యోగమని చెప్పబడును.

(1) యోగస్థః—కర్మయోగము, అనగాజ్ఞానోపాయము (రాఘవేంద్రులు).

(2) సంగం — రాజ్యము, బంధువులు, పుత్రమిత్రకళత్రాదులు వీటియందభిమానమును విడిచి (రామానుజులు), ఫలాపేక్షను విడిచి (రాఘవేంద్రులు).

(3) సిద్ధిఅసిద్ధి - యుద్ధమున జయమువచ్చినను అపజయమువచ్చినను (రామానుజులు).

(శంకరభాష్యము) కర్మఫలమునందు ఆసక్తిచే ప్రేరేపింపబడి కర్మను చేయవలదనినచో అప్పుడు దేనిని ఉద్దేశించి కర్మచేయవలయుననునది చెప్పబడుచున్నది. ఈశ్వరుని కొరకే కర్మలను, యోగమునందు స్థిరతపొందిచేయవలయును. దానిలోను "ఈశ్వరుడు నాకు ప్రసన్నుడగునుగాక" యను ఆసక్తినిగూడ విడిచిపెట్టవలయును. ఫలమునందాసక్తి లేనివాడు కర్మమును చేయుచున్నప్పుడు వానికి కలుగుచున్న చిత్తశుద్ధిచే జ్ఞానమును పొందుట సిద్ధియనంబడును. దానికి విరుద్ధమైన మనస్సుయొక్క అశుద్ధిచే గలుగునట్టిది అసిద్ధియగును. ఆ సిద్ధ్యసిద్ధులు రెంటిలోను సమముగనుండుటయే యోగమనబడుచున్నది.



శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ 49

పద॥ దూరేణ — హి — అవరం - కర్మ — బుద్ధియోగాత్ — ధనంజయ।
బుద్ధౌ (1) శరణం — అన్విచ్ఛ — కృపణాః (2) — ఫలహేతవః॥

| | | | |
|---|---|---|---|
| హే ధనంజయ ! | ఓ అర్జునా ! | (అతః) | అందువలన |
| బుద్ధి యోగాత్ | సమత్వబుద్ధితోగూడిన బుద్ధి యోగమగు కర్మకంటె | బుద్ధౌ | (ఆ) బుద్ధిలో |
| | | శరణం | శరణమును |
| కర్మ | ఫలాపేక్షతోచేయబడు కామ్యకర్మము | అన్విచ్ఛ | వెదకుకొనుము |
| | | ఫలహేతవః | ఫలమును గోరువారలు |
| దూరేణ అవరంహి | మిక్కిలి నీచమైనదిగదా | కృపణాః | దీనులు (తక్కువైనవారు) |

తా॥ ఓ అర్జునా! సమత్వబుద్ధితో గూడిన బుద్ధియోగమగు కర్మకంటె ఫలేచ్ఛచేత చేయబడు కామ్యకర్మము మిక్కిలి నింద్యముగదా? కావున (ఆ) బుద్ధిలో నీకు శరణమును వెదకుకొనుము. ఫలమును గోరువారలు దీనులగుదురు. (దుఃఖము నొందెదరు).

(1) బుద్ధౌ = జ్ఞానముకొరకు, శరణం = కారణమైన కర్మయోగమును లేక రక్షకుడైన ఈశ్వరుని, అన్విచ్ఛ = ఆశ్రయించెదవుగాక అని శ్రీధరులు, కామ్యకర్మము జననమరణములకు హేతువైనదనియు, నిష్కామకర్మము మోక్షమునకు హేతువగునను వివేకము నొందెదవుగాక అని రామానుజులు, బుద్ధౌ = జ్ఞానమునకు కారణమైన నిష్కామకర్మయోగమునందు అని రాఘవేంద్రులు అర్థము చేయుచున్నారు.

(2) కృపణాః — జననమరణ దుఃఖమునొందెదరు. (మధుసూదనసరస్వతి) ఫలహేతవః కృపణాః = ఈశ్వరైక్యజ్ఞానమును కోరువారలు అంధకారము నొందెదరు (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) సిద్ధ్యసిద్ధులలో సమత్వబుద్ధితోగూడి ఈశ్వరారాధన కొరకు చేయబడునట్టి బుద్ధియోగమను నిష్కామ కర్మకంటె ఫలాపేక్షతో చేయబడు కామ్యకర్మము మిక్కిలి తక్కువైనది. ఎందుకనగా ఈ కామ్యకర్మ జననము మరణము మొదలగువాటికి కారణమగుటవలన. ఇట్లుండుటచేత యోగమును గురించిన బుద్ధియందుగాని, దాని పరిపాకముచే కలుగునట్టి సాంఖ్యబుద్ధియందుగాని భయములేకుండుటకు కారణమైన శరణాగతిని వెదకుకొనుము. పరమార్థజ్ఞానమునే శరణముగ నొందినవానిగ నుండుమని భావము. ఏలనగా ఫలాపేక్షచేత ప్రేరేపింపబడినవారై తక్కువైనకర్మను జేయువారు కృపణులు. (దీనులు). దీనిని "యోవా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మాల్లో కాత్ప్రైతి సకృపణః = ఓగార్గీ! ఎవ్వడీ నాశములేని వస్తువును ఎరుంగకయే ఈ లోకము నుండి వెడలిపోవుచున్నాడో అతడు కృపణుడు అనుబృహదారణ్యకోపనిషత్తు 5-వ అధ్యాయము 8-వ బ్రాహ్మణము 10-వ శ్రుతివాక్యముచేత నెరుంగుడు.



శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ 50

పద॥ బుద్ధియుక్తః (1) జహాతి - ఇహ (2) — ఉభే — సుకృతదుష్కృతే (3)।
తస్మాత్ — యోగాయ (4) — యుజ్యస్వ — యోగః — కర్మసు — కౌశలమ్ (5)॥

| | | | |
|---|---|---|---|
| బుద్ధియుక్తః | సమత్వబుద్ధితోగూడినవాడు | యోగాయ | (సమత్వబుద్ధి) యోగమును |
| ఇహ | ఈ లోకమునందే | యుజ్యస్వ | కూడెదవుగాక |
| ఉభేసుకృతదుష్కృతే | పుణ్యాపాపములరెంటిని | యోగః | యోగము |
| జహాతి | నివర్తింపజేసికొనుచున్నాడు | కర్మసు | కర్మలలోనున్న |
| తస్మాత్ | అందువలన | కౌశలం | సామర్థ్యమే. |

తా॥ సమత్వబుద్ధిగలవాడు పుణ్య పాపముల రెంటిని ఈ లోకమునందే నివర్తింపజేసికొనుచున్నాడు. కావున సమత్వబుద్ధియోగము కొరకు ప్రయత్నించుము. యోగము, కర్మలలోనున్న సామర్థ్యమే.

(1) బుద్ధియుక్తః — భగవద్ జ్ఞానముతో గూడినవాడు (రాఘవేంద్రులు)

(2) ఇహ — ఈ జన్మమునందు (శ్రీధరులు)

(3) సుకృతం - పుణ్యముగూడ పాపమువలె మరల జననమరణములను కలుగజేయునట్టిదిగాన జ్ఞానియైనవాడు పాపఫలమును ఎట్లు అపేక్షించడో అటులనే పుణ్యఫలమునుగూడ అపేక్షించడు. పుణ్యఫలమును విడువరాదని చెప్పెదరు. అట్లు చెప్పెడివారలు అవివేకులు, (మధ్వాచార్యులు) పుణ్యకర్మ ఫలములలోని జననమును కలుగజేయునట్టి పుణ్యకర్మ ఫలములను విడచిపెట్టవలెను. మోక్షమునందానంద వృద్ధిచేయునట్టి పుణ్యకర్మల ఫలములను విడువకూడదు. (రాఘవేంద్రులు)

(4) యోగాయ - జ్ఞానోపాయమైన నిష్కామకర్మయోగము కొరకు.

(5) కౌశలమ్ - సమత్వబుద్ధిచేత బంధ స్వభావముగల కర్మనుండి నివర్తించుచున్న సామర్థ్యము (శంకరులు)- కర్మలలో శ్రేష్ఠమైనది (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) సమత్వబుద్ధితోగూడినవారై స్వధర్మము ననుష్ఠించువాడు ఏఫలమును పొందుచున్నాడో అది ఈశ్లోకములో చెప్పబడుచున్నది. ఈలోకమునందు కర్మలలో సమత్వవిషయమైన బుద్ధితోగూడిన యతడు చిత్తశుద్ధిని, జ్ఞానమునుబడసి దానిమూలముగ పుణ్యాపాపములరెంటిని తన్నాశ్రయించనటుల నివర్తిచేసికొనుచున్నాడు. కావున సమత్వబుద్ధియోగమును చేరవలెను. యోగమనగా కర్మలలోని సామర్థ్యముగదా! అనగా ఈశ్వరునియెడ మనస్సు నర్పించియుండుటచేత స్వధర్మమనబడు కర్మలలో నున్నవానికి ఫలము సమకూరుటలోను సమకూరమిలోను గల సమత్వబుద్ధియే. కర్మలు ప్రాణులను సంసారమునందు బంధించునట్టి స్వభావముగలవైనను సమత్వబుద్ధితో చేయబడునప్పుడు అట్లు బంధించునట్టి తమస్వభావమునుండి నివర్తించుచున్నవనునదేగదా సామర్థ్యము! కావున నీవు సమత్వబుద్ధిగలవానిగ నుండుమని భావము.

(శ్రీధరులు) "కర్మలలోనున్న సామర్థ్యము" అనగా కర్మలయొక్క స్వభావముబంధము నిచ్చుటయైనను ఆకర్మనే ఫలాపేక్షలేక ఈశ్వరార్పణబుద్ధితో చేసి, దానినే మోక్షమునకు సాధనముగ జేసికొనుటయే.

(రామానుజులు) యోగః కర్మసుకౌశలం = కర్మచేయు విషయమున సమత్వబుద్ధి ప్రయాసచే పొందదగినది యని తాత్పర్యము.



శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥ 51

పద॥ కర్మజం — బుద్ధియుక్తాః — హి — ఫలం — త్యక్త్వా — మనీషిణః
జన్మబంధవినిర్ముక్తాః — పదం — గచ్ఛన్తి — అనామయమ్ ॥

| | | | |
|---|---|---|---|
| హి | ఎందువల్లననగా | జన్మబంధవినిర్ముక్తాః | జననమను బంధమునుండి పూర్తిగా విడువబడి |
| బుద్ధియుక్తాః | సమత్వబుద్ధి గలవారలు | | |
| కర్మజం | కర్మచే గలుగుచున్న | అనామయం | దుఃఖములేని |
| ఫలం | ఫలమును | పదం | పదవిని (స్థానమును) |
| త్యక్త్వా | విడిచి (తొలగించి) | గచ్ఛన్తి | పొందుచున్నారు. |
| మనీషిణః(భూత్వా) | జ్ఞానులై | | |

తా॥ ఎందువల్లననగా సమత్వబుద్ధి గలవారలు కర్మచే గలుగునట్టి ఫలమును విడనాడి జ్ఞానముగలవారలై జనన దుఃఖమునుండి పూర్తిగ విడువబడి దుఃఖము లేనిపదవిని (మోక్షమును) పొందుచున్నారు.

(శంకరభాష్యము) కర్మచే కలుగునట్టి ఫలము ఏదనగా కర్మమునుండి గలుగుమంచివో చెడ్డవో అయిన శరీరములను పొందుట. సమత్వబుద్ధిగల సాధువులు ఆఫలమును గోరక జ్ఞానులై జననమను బంధమునుండి ప్రాణముతో నుండునప్పుడే పూర్ణముగ విడువబడినవారలై ఎట్టి సంకటములులేని మోక్షమనబడు విష్ణువుయొక్క పరమపదమును చేరెదరు.

లేక ముందురాబోవు ప్రకారముగను చెప్పవచ్చును - అంతట ప్రవహించు (గొప్ప) జల ప్రవాహమును బోలిన కర్మయోగముచేత వచ్చునట్టి చిత్తశుద్ధివలన కలుగు పరవస్తువును చూచి యెరుంగుటయనెడు బుద్ధి, "బుద్ధియోగమునకంటె" అనునదిమొదలు ఇంతవరకు నెత్తిచూపబడినది.

(అది)పుణ్యపాపములను నివర్తించుకొనుటమొదలగువాటికి నేరుగా కారణమైనదని శ్రుతిచెప్పుటవలన.

(స్వకీయము) స్వర్గాదులకు నాశముకలదనియు, మోక్షమునకు నాశములేదు, దానినొంది నచో దుఃఖములేదనియు గుర్తించి చూపుటకొరకు "అనామయం" అను పదము ప్రయోగింపబడి యున్నది.

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ ॥ 52

పద॥ యదా – తే – మోహకలిలం - బుద్ధిః - వ్యతితరిష్యతి।
తదా - గన్తాసి - నిర్వేదం - శ్రోతవ్యస్య - శ్రుతస్య - చ॥

| | | | |
|---|---|---|---|
| యదా | ఎప్పుడు | శ్రోతవ్యస్య | వినవలసిన వేదాంతార్థము నందును |
| తే బుద్ధిః | నీ బుద్ధి | శ్రుతస్య చ | వినిన వేదాంతార్థమునందును |
| మోహకలిలం | మోహస్వరూపమైన అవివేక మను కలతను | నిర్వేదం | వైరాగ్యమును |
| వ్యతితరిష్యతి | తరించునో లేక దాటునో | గన్తాసి | పొందగలవు. |
| తదా | అప్పుడు | | |

తా॥ ఎప్పుడు నీబుద్ధి మోహస్వరూపమైన అవివేకమను దోషమును దాటునో, అప్పుడు ఇదివరకు వినినవేదాంతార్థమునందును ఇక వినబోవునట్టి వేదాంతార్థమునందును విరక్తిని పొందగలవు.

(శంకరభాష్యము) యోగమునునుష్ఠించుటచేత కలుగునట్టి చిత్తశుద్ధి వలన గలుగుబుద్ధిని బడయుట యెప్పుడని ఈశ్లోకముచే చెప్పబడుచున్నది. ఆత్మానాత్మలను వెవ్వేరుగ నెరింగెడు జ్ఞానమును కలతబెట్టి మనస్సును విషయములలో ప్రవేశింపజేయుచున్న మోహస్వరూపమైన అవి వేకమను కలతను నీబుద్ధి ఎప్పుడు దాటగలదో, అనగా పరిశుద్ధస్వభావము నొందగలదో అప్పుడు నీవు వినవలసినదాని యందును వినినదానియందును ఆసక్తిలేనితనమును పొందగలవు. అప్పుడు నీకు వినవలసినదియు వినినదియు నిష్ప్రయోజనమని తోచును.

(రామానుజులు) ఎప్పుడు నీబుద్ధియజ్ఞానమును దాటగలదో అప్పుడు నేనిదివరకు దేనిని విడువజెప్పితినో ఇక దేనినిజెప్పబోవు చున్నానో వాటిలో వైరాగ్యము నొందగలవు.

(రాఘవేంద్రులు) ఎప్పుడు నీబుద్ధి విపరీతజ్ఞానమగు దోషమును దాటి నిలబడగలదో అప్పుడు ఇంతవరకు పెద్దలనుండి వినినదానికిని, వినబోవుదానికిని ఫలమొందగలవు. నిష్కామకర్మ యోగమువలన కలుగునట్టియు మోక్షహేతువైనట్టియు జ్ఞానము నొందగలవని తాత్పర్యము.

(స్వకీయము) ఇదివరకుచేసియున్న వేదాంతవిచారమునందును, ఇకచేయవలసిన వేదాంతశ్రవణమునందును నీకిప్పుడు విరక్తికలుగగూడదు. ఏలనగా నీవు అజ్ఞానస్థితిలో నుండుటవలన వేదాంతార్థముల నెరింగి తదనుసారముగ నడువవలసిన వానిగ నున్నావు. కర్మమును. దానినిచేయ వలసిన వివరమును చెప్పునట్టి వేదవాక్యములలో విరక్తినొందుట బ్రహ్మజ్ఞానికి తగినదైనను నీవట్లు విరక్తి చెందదగినవాడవు కావు. నీకు జ్ఞానాధికారమింకను రాలేదని తాత్పర్యము.

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥ 53

పద॥ శ్రుతివి ప్రతిపన్నా - తే - యదా - స్థాస్యతి - నిశ్చలా।
సమాధౌ - అచలా - బుద్ధిః - తదా - యోగం - అవాప్స్యసి ॥

| | | | |
|---|---|---|---|
| శ్రుతి విప్రతిపన్నా | అనేకములైన అర్థములను వినుటచే కలతచెందియున్న | అచలా | స్థిరముగ |
| తే | నీయొక్క | స్థాస్యతి | నిలబడునో |
| బుద్ధిః | బుద్ధి, లేక అంతఃకరణము | తదా | అప్పుడు |
| యదా | ఎప్పుడు | యోగం | వివేక బుద్ధియగు సమాధియోగ మును |
| నిశ్చలా | కలతచెందనిదై లేక చలించనిదై | అవాప్స్యసి | పొందగలవు. |
| సమాధౌ | ఆత్మయందు | | |

తా॥ అనేక శాస్త్రార్థములను వినుటవలన పలువిధములుగ కలతచెంది యున్న నీబుద్ధి, లేక అంతఃకరణము ఆత్మయందు సంశయ విపరీతములేనిదై యెప్పుడు స్థిరముగ నిలబడునో అప్పుడునీవు సమాధియోగము నొందగలవు.

(శంకరభాష్యము) మోహస్వరూపమైన కలత నివర్తించుటవలన ఆత్మ, వివేక బుద్ధిని బడసి కర్మయోగఫలముగ కలుగునట్టి పరమార్థయోగమును (జ్ఞానయోగమును) బడయుట యెప్పు డనునది దీనిలో జెప్పబడుచున్నది.

అనేకఫలములను, వాటిని బడయుటకైన యనేకసాధనములను ఆరెంటియొక్క సంబంధములను ప్రకాశపరచి, ప్రవృత్తినివృత్తులను తెలియబరచునట్టి శాస్త్రములను వినుటచే పలువిధములుగ మైకమొంది కలతచెందియున్న నీ యంతఃకరణము, చిత్తమును తనలోనుంచుకొన్నట్టి ఆత్మ యందుసంశయ విపరీతములేనిదై ఎప్పుడు స్థిరముగ నిలబడునో అప్పుడు నీవుయోగమును అనగా వివేకబుద్ధియగు సమాధిని పొందగలవు.

(రామానుజులు) శ్రుతి = మనమింతవరకు జెప్పుచువచ్చిన శాస్త్రార్థమును నీవువినినందున, వి = విశేషముగ, ప్రతిపన్నా = ఆత్మను ప్రపంచమునకంటె విలక్షణుడనియు, నిత్యుడనియు, నిరతిశయుడనియు, సూక్ష్ముడనియు గ్రహించియున్న, తే = నీయొక్క, బుద్ధిః = బుద్ధి, యదా = ఎప్పుడు, సమాధౌ = కర్మానుష్ఠానముచేత శుద్ధినొందియున్న మనస్సునందు, నిశ్చలా = చలింపక, అచలా = ఒకేవిధముగ, స్థాస్యతి = నిలబడగలదో, తదా = అప్పుడు, యోగం = జ్ఞానయోగ మగు ఆత్మదర్శనమును, అవాప్స్యసి = పొందగలవు.

అర్జున ఉవాచః—

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥ 54

పద॥ స్థితప్రజ్ఞస్య - కా - భాషా - సమాధిస్థస్య - కేశవ।
స్థితధీః - కిం - ప్రభాషేత - కిం - ఆసీత - వ్రజేత - కిం

| | | | |
|---|---|---|---|
| అర్జున ఉవాచ | అర్జునుడు చెప్పినది | భాషా కా | లక్షణము చెప్పుట యెట్లు? |
| హే కేశవ! | ఓ కేశవా! | స్థితధీః | స్థిరమైన జ్ఞానముగలవాడు |
| సమాధిస్థస్య | సమాధియందున్న | కిం ప్రభాషేత | ఎట్లుమాటలాడును? |
| స్థితప్రజ్ఞస్య | స్థిరమైన జ్ఞానము గలవాని | కిం ఆసీత | ఎట్లుండును? |
| | యొక్క | కిం వ్రజేత | ఎటు నడచును? |

**తా॥ అర్జునుడు జెప్పినది — ఓ కేశవా! సమాధియందున్న స్థిరజ్ఞానమును పొందినవానిని జెప్పుటయెట్లు? అనగా - వానిలక్షణమెట్టిది? స్థిరజ్ఞానము గలవాడెట్లు మాట్లాడును? ఎట్లుండును? ఎట్లునడచును?**

(శంకరభాష్యము) ప్రశ్నయడుగుటకు సమయము లభించుటను జూచి అర్జునుడు ఆత్మ జ్ఞాన మొందినవాని లక్షణమును తెలిసికొనవలెనను కోరికతో ఈ శ్లోకమున కనబరచిన విధమున ప్రశ్నించు చున్నాడు.

"నేను బ్రహ్మముగానున్నాను." అనుజ్ఞానము నిలకడపొంది సమాధియందు నిలబడునట్టి వానిని చెప్పుటయెటుల? అనగా ఇతరులచే నితడు ఎట్లుచెప్పబడుచున్నాడు? ఇతని లక్షణమేమి?

(రామానుజులు) స్థిరమైనజ్ఞానముగలవాని వాచికము (నోటిచేమాట్లాడుట మొదలగునవి) ఎట్లుండును? మానసికము (మనోవృత్తి) ఎట్లుండును? కాయికము (దేహముచే చేయబడు వ్యాపారము) ఎట్టిదైయుండును.

(స్వకీయము) దీనియందు నాలుగుప్రశ్నలు ఇమిడియున్నవిగ చెప్పవచ్చును. లేక లక్షణమను దానిని సాధారణమైన ప్రశ్నయనియు, మిగత మూడున్ను దానికి వివరణమనియు జెప్పవచ్చును. నాలుగు ప్రశ్నలుగ భాష్యకారులున్ను, వ్యాఖ్యాతలున్ను అభిప్రాయపడియున్నారు.



శ్రీ భగవానువాచ:—

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ 55

పద॥ ప్రజహాతి - యదా - కామాన్ (1) - సర్వాన్ - పార్థ - మనోగతాన్ ।
ఆత్మని (2) - ఏవ - ఆత్మనా (3) - తుష్టః - స్థితప్రజ్ఞః - తదా - ఉచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీ కృష్ణపరమాత్మ జెప్పినది | ఆత్మనా | తనచేతనే |
| హే పార్థ! | ఓ అర్జునా! | తుష్టః | సంతుష్టిగలవానిగ |
| యదా | ఎప్పుడు | (భవతి) | అగునో |
| మనోగతాన్ | మనస్సులోనున్న | తదా | అప్పుడు |
| సర్వాన్ కామాన్ | సకలములైన కోరికలను | స్థితప్రజ్ఞః (ఇతి) | స్థిరమైన జ్ఞానముగలవాడని |
| ప్రజహాతి | పూర్తిగవిడుచుచున్నాడో, | ఉచ్యతే | చెప్పబడుచున్నాడు |
| ఆత్మన్యేవ | ఆత్మయందే | | |

**తా॥ శ్రీ కృష్ణపరమాత్మ అర్జుననిగూర్చి జెప్పినది— ఓపార్థ! ఎప్పుడు మనస్సునందున్న కోరికలన్నిటిని పూర్తిగావిడిచి ఆత్మయందే తానుగనే సంతుష్టిగల వాడుగనగునో అప్పుడు స్థిరమైన జ్ఞానియని చెప్పబడును.**

(1) కామాన్ — కామముక్రోధము, మొదలగువాటిని (రాఘవేంద్రులు)

(2) ఆత్మని — ప్రత్యగాత్మ స్వరూపమునందే యని భాష్యకారులు ముగ్గురున్ను అర్థముజేసి యున్నారు. తనస్వరూపానందమునందే (శ్రీధరులు)

(3) ఆత్మనా—మనస్సులో (రామానుజులు) పరమాత్మయొక్క ప్రసాదమునందు (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) ఎవ్వడు మొదటినుండియు కర్మలను విడనాడి జ్ఞానయోగనిష్ఠ యందే ప్రవర్తించుచున్నాడో, మరియు నెవ్వడు కర్మలను విడువక కర్మయోగమునందు ప్రవర్తించు చున్నాడో వారిద్దరికిని జ్ఞానము స్థిరపడినవానియొక్క లక్షణములున్ను, వానిస్థితిని పొందుటకైన సాధనములున్ను, ఇదిమొదలు ఈ అధ్యాయము ముగియువరకు ఉపదేశింపబడుచున్నవి. ఏలనగా ముక్తినిబడసినవాని లక్షణములెవ్వియో అవియే వేదాంతగ్రంథములలో నంతట సాధనములుగ నుపదేశింపబడుచున్నవి. ఇతరులకు ఏవియత్నసాధ్యమైన సాధనములో అవియే సిద్ధపురుషులకు స్వాభావిక లక్షణములగుచున్నవి.

ఎప్పుడొకడు తనమనస్సునందు ప్రవేశించియున్న అన్నికోరికలను పూర్ణముగ వీడగొట్టునో, లోనున్న ఆత్మస్వరూపమునందే స్వయముగనే తృప్తుడై వెలుపటి లాభములను గోరనివాడై పర మార్థ దర్శనమువలన నైన అమృతరసము లభించినందున తదితర వస్తువులు వలదను తలంపుగల వాడై యుండునో, అప్పుడు అతడు ఆత్మానాత్మల విమర్శచేగలిగిన జ్ఞానముస్థిరముగ కలిగినవాడై విద్వాంసుడనబడుచున్నాడు. అన్నికోరికలను తొలగించినమాత్రమున సంతోషమును గలుగజేయ నెద్దియు లేనందువలనను దేహముతోగూడి నిలబడుటకు కారణమైన కర్మయొక్క శేషము ఇంకను ఉండుట వలనను జ్ఞానముస్థిరమొందిన వానినడక పిచ్చివాని నడకవలె నుండునను హేతువుచే "స్వయముగ ఆత్మయందే సంతోషించియున్నవాడై" అనిప్రసాదించియున్నాడు. సంతతి వస్తువు, లోకము అనువాటిలో నాసక్తిని విడిచి అన్నిటినిత్యజించినవాడై, ఆత్మయందే సంతోషించుచున్న వాడై ఆత్మతో నాటలాడువాడు జ్ఞానస్థిరతగలవాడని కడపటి భావము.

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 56

పద॥ దుఃఖేషు — అనుద్విగ్నమనాః — సుఖేషు - విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః — స్థితధీః — మునిః (1) - ఉచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| దుఃఖేషు | దుఃఖమువచ్చినను | వీతరాగభయక్రోధః | కోరిక, భయము, కోపము, ఇవిలేని వాడును |
| అనుద్విగ్నమనాః | తపించనిమనస్సుగలవాడును | | |
| సుఖేషు | సుఖమువచ్చినను | మునిః | మౌనిలేక సన్న్యాసియైనవాడును |
| విగతస్పృహః | ఆస క్తిలేనివాడును | స్థితధీః | స్థిరమైన జ్ఞానిగ |
| | | ఉచ్యతే | చెప్పబడుచున్నాడు. |

తా॥ దుఃఖమువచ్చినను తపించని మనస్సుగలవాడుగను, సుఖమువచ్చి నను దానియందాసక్తిలేనివాడుగను, కోరిక, భయము, కోపము ఇవి లేనివాడు గను ఉన్నమునియైనవాడు స్థిరమైనజ్ఞానిగ చెప్పబడుచున్నాడు.

(1) మునిః - ఆత్మధ్యానముగలవాడు (రామానుజులు)

(శంకరభాష్యము) ఆధ్యాత్మికము మొదలగు దుఃఖములు వచ్చినప్పుడు మనఃస్థిరత చలించి అధైర్యమొందకుము. అటులనే సుఖములు వచ్చినప్పుడు, కట్టెలు మొదలగువాటి నుంచునప్పుడు అగ్ని మరింతగా వృద్ధిపొందుటవలె, కోరికలు సుఖములతో మరింతగా వృద్ధిపొందకుండుట, భయకోపములు విడనాడుట, యివి గలవాడెవ్వడో అతడు ముని, సన్యాసి అనబడుచున్నాడు.

(శ్రీధరులు) ఈశ్లోకముచేతను దీనికి మునుపటిశ్లోకముచేతను మొదటిప్రశ్నయైన స్థిరజ్ఞానియొక్క లక్షణము జెప్పబడినది.

(రామానుజులు) మునుపటి శ్లోకమునందెవ్వనిగూర్చి జెప్పబడినదో అతడు మొదటి శ్రేణిలోనివాడు, ప్రపంచవాసన సర్వదాలేనివాడు. దీనియందు చెప్పబడినవాడన్ననో 2-వ శ్రేణిలోనివాడు, ప్రపంచవాసననంతను త్యజింపక ఇంకను కొంతయాసక్తిగలవాడు.



శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

పద॥ యః - సర్వత్ర (1) - అనభిస్నేహః - తత్ - తత్ - ప్రాప్య - శుభాశుభమ్॥
న - అభినందతి - న - ద్వేష్టి - తస్య - ప్రజ్ఞా - ప్రతిష్ఠితా॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వడు | నాభినందతి | సంతోషపడడో |
| సర్వత్ర | సకలమునందును | నద్వేష్టి | ద్వేషించడో |
| అనభిస్నేహః | అభిమానము లేనివాడో | తస్య | వానియొక్క |
| తత్తత్ శుభాశుభమ్ | ఆయాఇష్టానిష్టములను | ప్రజ్ఞా | జ్ఞానము |
| ప్రాప్య | పొందినను | ప్రతిష్ఠితా | నిలకడపొందినట్టిది. |

తా॥ ఎవ్వడు సకలమునందు నభిమానము లేనివాడై, ఆయా యిష్టానిష్టముల నొందినపుడు సంతోషముగాని ద్వేషముగాని పొందకయుండునో వాని జ్ఞానము స్థిరమైనదని చెప్పబడును.

(1) సర్వత్ర - పుత్రమిత్రాదులందు (శ్రీధరులు), ఇష్టములైన వస్తువులందు (రామానుజులు).

(శంకరభాష్యము) మునియనునతడు శరీరజీవనము మొదలగు వాటియందుగూడ నాసక్తి లేనివాడై మంచిచెడ్డలను పొందినపుడు సంతోషించుటగాని ద్వేషముపొందుటగానిచేయడు. ఇట్లు సంతోష వ్యసనములు లేనివారికి వివేకమువలన కలిగిన జ్ఞానము నిలకడచెంది స్థిరమగుచున్నది.

(శ్రీధరులు) దీనిలో జెప్పబడినవాడు ఉదాసీనః = తటస్థముగనున్నవాడు. ఎట్లనగా దుఃఖముగలిగినచో దుఃఖింపక దీనితో నాకేమిసంబంధమనియు, సుఖముగలిగినచో సంతోషపడక ఈ ప్రపంచసుఖము సుఖమగునా? ఇది నాకు సంతోషమును కలుగజేయనేరదనియు చెప్పును. ఇది 54 వ శ్లోకమునందలి 2 వ ప్రశ్నయైన "ఎట్లు మాట్లాడును" అనుదానికి ఉత్తరముగ చెప్పబడినదైయున్నది.

(రామానుజులు) దీనిలో చెప్పబడినవాడు 3 వ కక్ష్యలో చేరినవాడు. ప్రపంచవిషయమునందు మనఃప్రవృత్తిగలవాడుగను, అయితే అట్టి ప్రవృత్తిచే గలుగునట్టి సుఖ దుఃఖాదులతో తాను సంబంధములేనివాడనని ఉదాసీనుడుగనున్నవాడు.



శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58

పద॥ యదా - సంహరతే - చ - అయం - కూర్మః - అంగాని - ఇవ - సర్వశః ।
ఇంద్రియాణి - ఇంద్రియార్థేభ్యః - తస్య - ప్రజ్ఞా - ప్రతిష్ఠితా

| | | | |
|---|---|---|---|
| అయం | ఇతడు (స్థిరమైనజ్ఞానముగల యోగి) | ఇంద్రియాణి | ఇంద్రియములను |
| | | యదా | ఎప్పుడు |
| కూర్మః | తాబేలు | సంహరతే | ఈడ్చుకొనుచున్నాడో |
| అంగానీవ | అవయవములను (లోపలకులాగుకొనుట) వలె | (తదా) | అప్పుడు |
| | | తస్య | అతనియొక్క |
| సర్వశః | సకలములైన | ప్రజ్ఞా | జ్ఞానము |
| ఇంద్రియార్థేభ్యః | విషయములనుండి | ప్రతిష్ఠితా | స్థిరతనొందినది. |

తా॥ నిలకడచెందిన జ్ఞానముగల యోగియైనవాడు తాబేలు (భయమువలన తన) అవయవములను లోనికీడ్చుకొనుటవలె సకల విషయములనుండియు ఇంద్రియములను ఎప్పుడు ఈడ్చుకొనుచున్నాడో అప్పుడతని జ్ఞానము నిలకడ చెందినదని చెప్పబడును.

(శ్రీధరులు) తాబేలు తన యవయవములను కష్టములేకనే ఈడ్చుకొనుటవలె ఇతడున్ను విషయములలో ప్రవర్తించియున్న ఇంద్రియములను కష్టములేకనే స్వాధీనము జేసికొనునను దానిని గుర్తించిచూపుటకై తాబేలు ఉదాహరణముగ జెప్పబడినది.

(రామానుజులు) ఈతడు ఇంద్రియములను విషయములనుండి ఈడ్చుటయు, మరల విడుచుటయు గలవాడై ఇంద్రియములను తన స్వాధీనముగ నుంచుకొన ప్రయత్నము చేయువాడు. కావున నాలుగవ కక్ష్యలో జేరినవాడు.



శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ 59

పద॥ విషయాః (1) - వినివర్తన్తే - నిరాహారస్య (2) - దేహినః (3) ।
రసవర్జం - రసః - (4) - అపి - అస్య - పరం (5) - దృష్ట్వా - నివర్తతే ॥

| | | | |
|---|---|---|---|
| నిరాహారస్య | ఆహారములేకున్న | అస్య | ఇతనికి |
| దేహిన | దేహికి | రసోఽపి | (విషయ) ఇచ్ఛయును |
| రసవర్జం | ఇచ్ఛనుదప్ప | పరం | పరమాత్మను |
| విషయాః | విషయానుభవములు | దృష్ట్వా | చూచి |
| వినివర్తన్తే | నివృత్తి చెందును. | నివర్తతే | నివృత్తియగుచున్నది |

తా॥ ఆహారము లేనటువంటి దేహముతోగూడి నిలబడు ఆత్మకును అనగా మనుష్యునకును ఇంద్రియములు విషయములనుండి నివృత్తి పొందుచున్నవి. ఐనను విషయములలోనున్న ఆసక్తిమాత్రము నివర్తించుటలేదు. ఇతనియొక్క ఆయాసక్తిగూడ బ్రహ్మమునుజూచి యెరింగిన పిదప తొలగి పోవుచున్నది.

(1) విషయాః — అనగా విషయములచే తెలియబరచబడిన ఇంద్రియములు.

(2) నిరాహారస్య — అనుపదమునకు అర్థము "భోజనములేని" అనునది. అయితే భాష్యకారు లున్ను వ్యాఖ్యాతలున్ను ''ఇంద్రియముల ఆహారమైన విషయానుభవములేని'' అనునదిగ తాత్పర్యము జేసియున్నారు.

(3) దేహినః—దేహముగలవాడని సరియైన అర్థము. దేహముగలవాడెవ్వడనగా 'జీవుడని' ద్వైతుల యొక్కయు, విశిష్టాద్వైతులయొక్కయు అర్థము. అద్వైతులకు అవిద్యతో సంబంధపడి యుండువరకు జీవుడని వ్యవహారమేగాని వాస్తవమున జీవుడువేరు, పరమాత్మ వేరని లేదని యర్థము. ఆత్మఅనునది జీవాత్మ పరమాత్మ యిరువురికి సరిపడుపదము. సందర్భమునకు తగినట్లు అర్థము జేయవలెను.

(4) రసః — రసమనుపదము, రాగము అనగా ఆసక్తి అను అర్థమున ప్రయోగింపబడియున్నది.

(5) పరం — తన్నే పరమాత్మగ (శంకరులు) విషయములకంటె అన్యముగను, సుఖస్వరూపము గనుఉన్న ఆత్మస్వరూపముగ, (రామానుజులు)

(శంకరభాష్యము) విషయములను గ్రహించని వ్యాధిగ్రస్తునకున్ను ఇంద్రియములు సంకోచమొందు చున్నవి. ఐనను విషయములమీదగల యాసక్తి తగ్గుటలేదు. అది సంకోచించువిధము ఎటులని ఈ శ్లోకమున జెప్పబడుచున్నది. ఇచ్చట ''విషయములు'' అనుపదముచే జెప్పబడినవి ఆ విషయములచే తెలియబరచబడిన ఇంద్రియములు. విషయములను తొలగించి, కఠోరతపస్సు చేయునట్టి మూఢమనుష్యునకును ఇంద్రియములు తమ తమ విషయములనుండి తొలగుచున్నవైనను విషయములలో నున్నరసము తప్ప మిగతది తొలగుచున్నది. అనగా ఆసక్తిమాత్రము నివర్తించుట లేదు. రసమను పదము ''ఆసక్తి'' అను అర్థమున ప్రయోగింపబడుచున్నది. ''స్వరసేన ప్రవృత్తః రసికః = రసజ్ఞః'' స్వరసముగ ప్రవేశించినవాడు. రసికుడు, రసజ్ఞుడు అనుదానినిబట్టి చూడుడు. పరమార్థ తత్త్వమైన బ్రహ్మమునుచూచి యెరింగి "నేనేయది'' యనియున్న ఈయతికి సుఖము నందలి రుచియనెడు అట్టి యాసక్తియు తొలగుచున్నది. విషయముల జ్ఞానము వేరుతోనష్టమగుచున్నదని భావము, తత్వజ్ఞానమనే జ్ఞానమును స్థిరముగ నుండునటుల జేసికొనవలయునని తాత్పర్యము.

(స్వకీయము) ఇంద్రియములు బయటనున్న విషయములైన వస్తువులనే ఎల్లప్పుడు చూచు చుండుటవలన ఇంద్రియములకు విషయములు ఆకారములుగనున్నవి. కావున మొదట ఇంద్రియములను అణగగొట్టవలెను. ఇంద్రియములను అణగగొట్టినను ఇచ్ఛాస్వరూపమైన మనస్సుఅణుగదు. పరమాత్మ దర్శనమువలన ఆ మనస్సునందలి ఇచ్ఛగూడ యణిగిపోవుననునది యొక అర్థము. మరియొక అర్థమేమన ఆహారములేకున్నవానికి ఆకలిచే కష్టపడునప్పుడు దేహబలము క్రుంగి కన్ను నోరు మొదలగు ఇంద్రియములు అలసటపొంది ఇంద్రియములు విషయములలో ప్రవర్తింపక విషయములనువిడిచి ఇంద్రియములు వేరుకాగలవైనను మనస్సునందలి యాశయగు ఇచ్ఛపోవుట లేదు. ఇట్లు ఇంద్రియములు అణగుటవలన మనస్సునందలి ఆశనివృత్తియగుటగాని, పరమాత్మ దర్శనమునకు యోగ్యమైనదనుటగానిలేదు. జ్ఞానియనగా ఇంద్రియములను స్వేచ్ఛగ అణగగొట్టి మనస్సును పరమాత్మయందుంచుటవలన పరమాత్మ దర్శనమునకు యోగ్యుడుగనున్నవాడు. ఈ అర్థమునుగూడ శ్రీధరులాదరించుచున్నారు.

◆◆◆◆◆◆◆◆◆◆

శ్లో॥ యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః॥ 60

పద॥ యతతః - హి - అపి - కౌంతేయ - పురుషస్య - విపశ్చితః।
ఇంద్రియాణి - ప్రమాథీని - హరన్తి - ప్రసభం - మనః॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ | ఓ కుంతీపుత్రుడా! | మనోఽపి | మనస్సునుగూడ |
| హి | ఎందుకనగా | ప్రమాథీని | కలతబెట్టుచున్న |
| యతతః | (మోక్షముపొంద) ప్రయత్నము జేయుచున్న | ఇంద్రియాణి | ఇంద్రియములు |
| | | ప్రసభం | బలాత్కారముగ |
| విపశ్చితః | వివేకియైన | హరన్తి | ఈడ్చుకొని పోవుచున్నవి. |
| పురుషస్య | పురుషునియొక్క | | |

తా॥ ఓ కుంతీపుత్రుడా! ఏలనగా మోక్ష మొందుటకై ప్రయత్నించుచున్న వివేకియైన పురుషుని మనస్సునుగూడ కలతబెట్టుచున్న ఇంద్రియములు (ఆమనస్సును) బలవంతముగ నీడ్చుకొని పోవుచున్నవి.

(శంకరభాష్యము) తత్వజ్ఞానము (మంచితెలివి) అనుబుద్ధిని స్థిరపరచ కోరినవాడు మొదట ఇంద్రియములను తనస్వాధీనమునందుండునటుల జేయవలెను. ఏలనగా ఇంద్రియములను అణుగ గొట్టకయుండుటవలన గలుగునట్టి చెడుపు ఇట్టిదని దీనిలో జెప్పబడుచున్నది. అన్నిటిని కలతబెట్టు స్వభావముగల ఇంద్రియములు విషయములలో ప్రవృత్తిగల పురుషుని కలతబెట్టి, మరియు విషయములయొక్క చెడుపులను అతడు చూచుచున్నప్పుడే వివేకబుద్ధితో శుద్ధముగ నిలబడిన ఆ బుద్ధిశాలియొక్క మనస్సును బలవంతముగ అవి ఈడ్చుకొని పోవుచున్నవి,

(రాఘవేంద్రులు) ఇంద్రియములను వైరాగ్యముచే నణుగద్రొక్కినచో మనస్సుగూడ స్వాధీనమై బ్రహ్మదర్శనమునకు అనుకూలమగునేగాని (మునుపటి శ్లోకమునజెప్పియున్నటుల) ఆహారము భుజింపక యుండుటచే ఇంద్రియములు అణిగియున్నవానికి మనస్సు స్వాధీనమగుట గాని, పరమాత్మ దర్శనము గలుగుటగాని సాధ్యముగానేరదనునది తాత్పర్యము.

(స్వకీయము) వివేకుల మనస్సునుగూడ ఇంద్రియములు బలాత్కారముగ నీడ్చుకొని పోవుననుటవలన అవివేకుల మనస్సును ఈడ్చుకొనిపోవుట ఆశ్చర్యముగాదను అర్థము ధ్వనించుచున్నది.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 61

పద॥ తాని - సర్వాణి - సంయమ్య - యుక్తః - ఆసీత (1) - మత్పరః।
వశే - హి - యస్య - ఇంద్రియాణి - తస్య - ప్రజ్ఞా - ప్రతిష్ఠితా॥

| | | | |
|---|---|---|---|
| హి | అందువలన | యుక్తః | మనఃస్థైర్యము (నిలకడ) గలవాడుగను |
| తానిసర్వాణి | వానిని (ఇంద్రియములను) అన్నిటిని | మత్పరః | నన్నే ఆశ్రయించినవాడుగను |
| సంయమ్య | అణగ ద్రొక్కుకొని | ఆసీత | ఉండవలెను. |

| | | | |
|---|---|---|---|
| యస్య | ఎవనియొక్క | (వర్తన్తే) | ఉన్నవో |
| వశే | స్వాధీనమున | తస్యప్రజ్ఞా | అతనిజ్ఞానము |
| ఇంద్రియాణి | ఇంద్రియములు | ప్రతిష్ఠితా | నిలకడ గలిగియున్నది |

తా॥ కావునఆ(మునుపుజెప్పిన) ఇంద్రియములనన్నిటిని అణచుకొని మనఃస్థైర్యము గలవాడుగను నన్నే ఉత్కృష్టమని యాశ్రయించినవాడుగను నుండవలెను. ఎవ్వని స్వాధీనమున నింద్రియములు గలవో అతనిజ్ఞానము నిలకడ గలదని చెప్పబడును.

(1) ఆసీత — జ్ఞానసమాధియందుండవలెను (రామానుజులు)

(శంకరభాష్యము) ఆ యింద్రియములన్నిటిని వశపరచుకొని అణకువగనున్నవాడైసకల మునకును అంతర్యామినైన (లోనున్న), ఆత్మనైన, వాసుదేవుడనైన నాయెడ ఆసక్తిగలవాడై నిలువబడవలెను. "నేను అతనికంటె వేరుకాను'' అని గ్రహించియుండవలెనని అర్థము. ఇట్లున్నట్టి ఏయతికి తన ఇంద్రియములు అభ్యాసమువలన వశమునందున్నవో అతనిజ్ఞానము నిలకడచెందినది.

(శ్రీధరులు) అర్జునుని 3-వ ప్రశ్నయైన "కిమాసీత = ఎట్లుండును'' అనుదానికి ఉత్తరము చెప్పబడినది.

(స్వకీయము) ఇంద్రియములను సులభముగ స్వాధీనమగునటుల జేసికొనవలె ననునది 58-వ శ్లోకముచేతను, ఐనను ఆయింద్రియములు వివేకియొక్క మనస్సునుగూడ కలతబెట్టి ఈడ్చుకొనిపోవునట్టి శక్తిగలవనునది 59-60-వ శ్లోకములచేతను, అట్టి ఇంద్రియములను నణుగబెట్టుటకు మనఃస్థిరతయు, పరమాత్మయందు విశ్వాసమును కారణములుగనున్నవని ఈ శ్లోకమునందును చెప్పబడి యున్నది.

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసః సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥ 62
క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥ 63

పద॥ ధ్యాయతః - విషయాన్ - పుంసః - సఙ్గః - తేషు - ఉపజాయతే।
సఙ్గాత్ - సంజాయతే - కామః - కామాత్ (1) - క్రోధః - అభిజాయతే॥
క్రోధాత్ - భవతి - సమ్మోహః (2) - సమ్మోహాత్ - స్మృతివిభ్రమః (3)।
స్మృతిభ్రంశాత్ - బుద్ధినాశః (4) - బుద్ధినాశాత్ - ప్రణశ్యతి (5)॥

| | | | |
|---|---|---|---|
| విషయాన్ | విషయములను | సంజాయతే | కలుగుచున్నది |
| ధ్యాయతః | చింతించుచున్న | కామాత్ | కోరికనుండి |
| పుంసః | పురుషునికి | క్రోధః | కోపము |
| తేషు | వాటిలో | అభిజాయతే | కలుగుచున్నది |
| సఙ్గః | ఆసక్తి (ప్రీతి) | క్రోధాత్ | కోపమునుండి |
| ఉపజాయతే | కలుగుచున్నది | సమ్మోహః | మోహమున్ను (కార్యాకార్య వివేకశూన్యతయు) |
| సఙ్గాత్ | ఆసక్తినుండి | | |
| కామః | కోరిక | భవతి | కలుగుచున్నది. |

| | | | |
|---|---|---|---|
| సమ్మోహాత్ | మోహమునుండి | (భవతి) | కలుగుచున్నది. |
| స్మృతివిభ్రమః | జ్ఞాపకములేకపోవుట | బుద్ధినాశాత్ | బుద్ధినాశమువలన |
| (భవతి) | కలుగుచున్నది | ప్రణశ్యతి | అన్నిచెడినవాడగును (అనగా ఉపయోగములేని పురుషుడగును) |
| స్మృతిభ్రంశాత్ | జ్ఞప్తిలేనితనమునుండి | | |
| బుద్ధినాశః | బుద్ధినాశము | | |

తా॥ విషయములను చింతించుచున్న (లోకమునందలి వస్తువులయందు ఎల్లప్పుడుఆలోచనగల)పురుషునికి అవస్తువులలో ఆసక్తిగలుగుచున్నది.ఆసక్తిచే కోరికయు, కోరికచే కోపమున్ను కోపముచే మోహమున్ను (కార్యాకార్యవివేకము లేకపోవుటయు) మోహముచే జ్ఞప్తిలేనితనమును, జ్ఞప్తిలేనితనముచేత బుద్ధినాశమున్ను గలిగి బుద్ధినాశమువలన నన్నియు జెడినవాడగును.

(1) కామాత్ - కోరినవస్తువు నొందుటలో విఘ్నముగలిగినచో దానివలన (శంకరులు, రాఘవేంద్రులు)

(2) సమ్మోహః - పాపకార్యమునందు ఇచ్ఛ (రాఘవేంద్రులు)

(3) స్మృతివిభ్రమః-శాస్త్రము, ఆచార్యోపదేశము వీటివలన తెలిసికొనిన అర్థమును మరచి పోవుట,

(4) బుద్ధినాశః - కార్యాకార్య వివేకమునకు యోగ్యమైన అంతఃకరణముమలినమగుట (శంకరులు)

(5) ప్రణశ్యతి - పురుషార్థమునకు యోగ్యుడు కానివాడగును. (శంకరులు) సంసారమును పొందుచున్నాడు. (రామానుజులు) నరకమును పొందుచున్నాడు. (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) ఇక చెడిపోవువాని అనర్థములన్నిటికిని కారణము, విషయములను చింతించుటయే యనునది చెప్పబడుచున్నది. శబ్దముమొదలగు విషయవిశేషములలో అనగా అవిషయములమీద తానుగ భావించుకొనిన అందముమొదలగు వాటిలో భావమునుంచుచున్న పురుషునికి ఆవిషయములమీద ప్రీతిగలుగుచున్నది. ఏదైనఒక కారణముచేత కోరికతీరనిచో దానివలన కోపము గలుగుచున్నది. కోపమునుండి మోహముగలుగుచున్నది. చేయదగనివాటిని చేయదగిన వాటిని గూర్చిన వివేకము లేకపోవుటయేమోహము. కోపముగలవాడు ఏదియు దెలియక మైకమొందినవాడై గురువునుగూడ దూషించు చున్నాడు గదా! ఈ మైకమునుండి జ్ఞప్తితప్పుట కలుగుచున్నది. అనగా శాస్త్రము, ఆచార్యుడు వీరియుపదేశమువలన బుద్ధిలో కలుగునట్టి అభ్యాసము వలన కలుగు ధర్మన్యాయముల జ్ఞాపకము తప్పిపోవుచున్నది. ఆజ్ఞాపకము కలుగుటకు కారణమేర్పడియున్నను తాను వినియున్న సదుపదేశము జ్ఞాపకమునకు రాగలదిగనున్నను కోపమువచ్చినప్పుడు అతడు మైకముచే కప్పబడుటవలన అతనికి ఆ జ్ఞాపకముకలుగుటలేదు. ఆ జ్ఞాపకము తప్పుటవలన జ్ఞానమునకు చెడుపువచ్చుచున్నది. అంతఃకరణమునకు, కార్యాకార్యములను విభజించి ఎరుంగలేని తనము బుద్ధినాశమనబడును. బుద్ధినాశమువలన పూర్తిగనశించుచున్నాడు. ఎంతకాలము అతని అంతఃకరణము కార్యాకార్యములను విభజించి యెరుంగుశక్తిగలదో అంతకాలమేగదా పురుషుడనబడును. అట్లు విభజించి ఎరుంగుటకు యోగ్యత లేనిచో పురుషుడు నశించిన వాడుగనే యగును. అనగా అతని యంతఃకరణముయొక్క బుద్ధినాశమువలన నశించి పోవుచున్నాడు. పురుషార్థమునకు తగనివాడగుచున్నాడని భావము.

(స్వకీయము) ఈశ్లోకములలోని అర్థమును ఇచ్చునట్టి బృహన్నారదీయపురాణము 31-వ అధ్యాయమునందున్న క్రిందకనబరచిన శ్లోకమును జూడుడు.

కర్మణా దేహమాప్నోతి దేహీ కామేన వర్ధతే।
కామాల్లోభాభిభూతశ్చ లోభాత్క్రోధపరాయణః॥ 4
క్రోధాచ్చ ధర్మనాశస్స్యాద్ధర్మనాశాన్మతిభ్రమః।
ప్రణష్టబుద్ధిర్మనుజః పునః పాపం కరోతి చ॥ 5
తస్మాద్దేహః పాపమూలః పాపకర్మరతస్తథా॥

దేహికి (జీవునికి) కర్మమువలన దేహము గలుగుచున్నది. (జీవునికి) కామము (ఆశ) వృద్ధి పొందుచున్నది. (అనగా కామముచేత లోకవ్యాపారములను జేయుచున్నాడు) కామముచేత లోభము గలుగుచున్నది. లోభమువలన క్రోధము (కోపము) కలుగుచున్నది. క్రోధమువలన ధర్మమునశించు చున్నది. ధర్మనాశమువలన బుద్ధిభ్రమగలుగు చున్నది. బుద్ధిభ్రమచెందిన మనుష్యుడు మరల పాపమును జేయుచున్నాడు. కావునదేహము పాపమునకు కారణముగనున్నది. దానిచేత పాపమును జేయప్రయత్నించుచున్నాడు. (అనగా పూర్వకర్మచేత దేహము గలుగుటయు, ఆ దేహముచేత పాపము జేయుటయుగానున్నది. దేహమెత్తినవాడు పాపముచేసినయెడల దానివలన మాటిమాటికి పాపస్వరూపమైన దేహము నొందునని తాత్పర్యము)

శ్లో॥ రాగద్వేషవియుక్తైస్తు విషయ నింద్రియైశ్చరన్।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి॥ 64

పద॥ రాగద్వేషవియుక్తైః - తు - విషయాన్ - ఇంద్రియైః - చరన్।
ఆత్మవశ్యైః - విధేయాత్మా - ప్రసాదం - అధిగచ్ఛతి॥

| | | | |
|---|---|---|---|
| | స్వాధీనమైన మనస్సుగలవాడైతే | విషయాన్ | విషయములను |
| రాగద్వేషవియుక్తైః | రాగద్వేషములులేనట్టియు | చరన్ | అనుభవించుచు |
| ఆత్మవశ్యైః | తనకుస్వాధీనములుగనున్నట్టియు | ప్రసాదం | మనస్సమాధానమును (నిర్మలత్వమును) |
| ఇంద్రియైః | ఇంద్రియములచేత | అధిగచ్ఛతి | పొందుచున్నాడు |

తా॥ స్వాధీనమైన మనస్సుగలవాడనగా రాగద్వేషములులేక తనకు స్వాధీనముగనున్న ఇంద్రియములచేత అన్నపానాది విషయములను అనుభవించుచు మనస్సమాధానము నొందుచున్నాడు.

(శంకరభాష్యము) విషయములను ధ్యానముజేయుట అనర్థములన్నిటికిని కారణమని మునుపటి శ్లోకమున జెప్పబడినది. ఇక మోక్షమునకు మార్గమెద్దియో అది ఈ శ్లోకమునందు జెప్పబడుచున్నది. ఇంద్రియముల స్వభావమైన ప్రవృత్తియనునది రాగద్వేషములను ముందుంచుకొనిగదా యున్నది! ఇక సంసారమునుండి విడువబడ కోరువాడెవ్వడో అతడు రాగద్వేషములనుండి నివర్తించినవాడై తనవశములైన చెవిమొదలగు ఇంద్రియములచేత ఆహారము మొదలగు నివర్తింపవీలుగాని విషయములను పొందుచున్నవాడై తనఇష్టానుసారముగ నడువదగిన అంతఃకరణమునుబడసి ప్రసన్నత పొందుచున్నాడు. ప్రసన్నత యనునది కలత చెందకయుండుట, నిలకడబడసిన స్వభావము, శాంతము గలిగియుండుట.

(శ్రీధరులు) మునుపటి 2 శ్లోకములున్ను ఈ శ్లోకమునకు సంబంధపడినవే. విషయములను విడువవలయునని మునుపు చెప్పబడియున్నను అవశ్యకమైనంతవరకు విషయములను అనుభవించుట చేత బాధకమొందడనునది దీనిలో చెప్పబడినది. అనగా అర్జునునియొక్క 4-వ ప్రశ్నయైన "వ్రజేత కిం = ఎట్లునడచును లేక వ్యాపారమెట్లుండును" అనుదానికి ఉత్తరముగనున్నది.

(స్వకీయము) జ్ఞానియైనవాడు ఇంద్రియములను, మనస్సును విషయములలో ప్రవేశింపనీయక అడ్డగించవలయునని మునుపు చెప్పబడినదిగదా? అట్లుండినను ఎడతెగక బ్రహ్మధ్యానముజేయు నతడుగూడ దేహమును కాపాడనియెడల బ్రహ్మధ్యానమునకు విఘ్నముగలుగును, కావున దేహ సంరక్షణార్థమై అవశ్యముగ నెంతకావలయునో అంతవరకు అన్నాదులను సంపాదించుటకై విషయ ములలో ప్రవర్తింపదగును. అట్లుప్రవర్తించియుండుటవలన ఇంద్రియములు, మనస్సు, వీటిని స్వాధీనపరచిన వానికి అన్నపానాదుల నిమిత్తము గలిగిన విషయానుభవము ధ్యానమునకు అడ్డము కానేరదని తాత్పర్యము.



శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥ 65

పద॥ ప్రసాదే - సర్వదుఃఖానాం - హానిః - అస్య - ఉపజాయతే।
ప్రసన్నచేతసః (1) - హి - ఆశు - బుద్ధిః - పర్యవతిష్ఠతి (2) ॥

| | | | |
|---|---|---|---|
| ప్రసాదే (సతి) | మనస్సమాధానమైన పిదప | ప్రసన్నచేతసః | సమాధానమొందిన మనస్సు గలవానికి |
| అస్య | ఇతనికి | | |
| సర్వదుఃఖానాం | సకలదుఃఖముల | ఆశు | శీఘ్రముగ |
| హానిః | నాశము | బుద్ధిః | బుద్ధి |
| ఉపజాయతే | కలుగుచున్నది | పర్యవతిష్ఠతి | స్థిరముగ నిలబడును. |
| హి | ఏలనగా | | |

తా॥ మనస్సమాధానము, నిర్మలత గలిగినవానికి దుఃఖములన్నియు నాశమొందును. ఏలనగా సమాధానము చెందిన మనస్సుగలవాని బుద్ధి శీఘ్ర ముగ స్థిరతచెందును.

(1) ప్రసన్నచేతసః - శుద్ధాంతఃకరణము గలవానికి (శంకరులు.) ఆత్మదర్శనమునకు విరోధమైన దోషములు నివర్తించిన మనస్సుగలవానికి (రామానుజులు.)

(2) పర్యవతిష్ఠతి - బుద్ధియైనది అఖండబ్రహ్మాకారముగ నిలబడును. అనగా బ్రహ్మముతప్ప వేరే దియు కనబడదు. (శంకరులు.) బుద్ధిః = ఆత్మదర్శనము, పర్యవతిష్ఠతి = కలుగును (రామానుజులు, రాఘవేంద్రులు) 'పర్యవతిష్ఠతే'యని యొకపాఠము. ఇదియే సరియైన పాఠమని తోచుచున్నది. (శ్రీధరులు.)

(శంకరభాష్యము) ప్రసన్నతకలిగిన యెడల పిదప ఏమిగలుగుననునది చెప్పబడుచున్నది. ప్రసన్నతకలుగునప్పుడు ఈయతియొక్క ఆధ్యాత్మికము మొదలైనదుఃఖములన్నిటికిని నాశముగలుగు చున్నది. మరియు శుద్ధమైన యంతఃకరణముగలవానికి దేనివలన బుద్ధి శీఘ్రముగ నిలకడపొందు

చున్నవో అనగా ఆకాశమువలె సంతత నిలకడబడసి యున్నదో, ఆత్మస్వరూపముగానే చలింపక స్థిరముగ నిలబడియున్నదో దానిచేత బుద్ధిప్రసన్నతకై ప్రయత్నము చేయవలయును.

ఇట్లుమనస్సు ప్రసన్నమై బుద్ధినిలకడ జెందినవానికి పురుషార్థము చేకూరుచున్నది. కావున సంసారములనుండి విడువబడ గోరునతడు రాగద్వేషములు లేని ఇంద్రియములచేత శాస్త్ర విరుద్ధములుగానివై నివర్తింపవీలులేని ఆహారము మొదలగు విషయములను ప్రశాంతముగనొంద వలెననునది ఈ సందర్భమున జెప్పబడిన అర్థము.



శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య నచాయుక్తస్య భావనా।
న చాభావయతశ్శాంతి రశాంతస్య కుతస్సుఖమ్॥　　66

పద॥ న - అస్తి - బుద్ధిః (1) - అయుక్తస్య (2) - న - చ (3) అయుక్తస్య-భావనా।
న - చ - అభావయతః - శాంతిః (4) - అశాంతస్య - కుతః (5) - సుఖమ్॥

| | | | |
|---|---|---|---|
| అయుక్తస్య | మనస్సు ఒకేనిలకడ చెందని వానికి | న | లేదు |
| | | అభావయతః | ఆత్మధ్యానము లేనివానికి |
| బుద్ధిః | ఆత్మస్వరూపజ్ఞానము | శాంతిః న చ | శాంతియు (సమాధానము) లేదు |
| నాస్తి | లేదు | అశాంతస్య | సమాధానములేనివానికి |
| అయుక్తస్య | మనస్సునిలకడ చెందనివానికి | సుఖం కుతః | సుఖమేది? |
| భావనాచ | ఆత్మధ్యానమున్ను | | |

తా॥ మనఃస్థైర్యము లేనివానికి ఆత్మస్వరూప జ్ఞానముగాని, ఆత్మధ్యానము గాని కలుగనేరదు. ఆత్మధ్యానము లేనివానికి శాంతి (మనస్సమాధానము) లేదు. మనస్సమాధానము లేనివానికి సుఖమేది?

(1) బుద్ధిః - ప్రకృతినుండి విడువబడిన ఆత్మస్వరూపజ్ఞానము (రామానుజులు)

(2) అయుక్తస్య - మనస్సమాధానములేనివానికి (శంకరులు) మనస్సును నాయెడనుంచకయే ఇంద్రియస్వాధీనము జేయువానికి (రామానుజులు.)

(3) భావనా - ఆత్మజ్ఞానములోని ప్రయత్నము, లేక తలంపు (శంకరులు,) ఆత్మస్వరూపమును విమర్శించి యెరుంగుట (రామానుజులు)

(4) శాంతః - విషయాసక్తి లేకపోవుట (రామానుజులు)

(5) కుతః సుఖమ్ - ఇంద్రియనిగ్రహ సుఖములేదు. అనగా ఇంద్రియములను విషయములలో ప్రవర్తించునటుల విడిచియున్నంతవరకు సుఖమే యుండనేరదనునదే (శంకరులు) మోక్షానందమేది? (రామానుజులు)

(శంకరభాష్యము) ఈ మనశ్శుభ్రతను దీనిలో శ్రీభగవంతుడు ప్రశంసించి (పొగడి) చెప్పుచున్నాడు, మనస్సు నిలకడచెందనివానికి ఆత్మస్వరూపమునుగూర్చియు జ్ఞానము గలుగదు. నిలకడచెందని వానికి ఆత్మనెరుంగుటలో మిక్కిలి ఆతురతకలుగదు. అటులనే ఆత్మనెరుంగుటలో మిక్కిలి ఆతురతలేనివానికి ఉపశమము గలుగుటలేదు. ఉపశమములేనివానికి సుఖమేది? ఇంద్రియ

ములు విషయానుభవాసక్తినుండి నివర్తించుటయేగదా సుఖము. విషయములనుగూర్చిన ఆసక్తి దుఃఖమేగదా? విషయాసక్తిగలచోటున సుఖముయొక్క వాసనగూడ కలుగదని భావము.

రాఘవేంద్రులు ఈ శ్లోకమునకు జేసియున్న అర్థము:—

అయుక్తస్య = మనోనిగ్రహములేనివానికి, భావనానాస్తి = ధ్యానములేదు. అభావయతః బుద్ధిః న = ధ్యానములేనివానికి అపరోక్షజ్ఞానములేదు. అబుద్ధేః శాంతిః న = అపరోక్షజ్ఞానము లేని వానికి మోక్షములేదు. అశాంతస్యసుఖంకుతః = మోక్షమొందనివానికి సుఖమేది?

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥ 67

పద॥ ఇంద్రియాణాం - హి - చరతాం - యత్ - మనః - అనువిధీయతే।
తత్ - అస్య - హరతి - ప్రజ్ఞాం - వాయుః - నావం - ఇవ - అంభసి ॥

| | | | |
|---|---|---|---|
| హి | ఎందువల్లననగా | తత్ | ఆ మనస్సు |
| చరతాం ఇంద్రియాణాం | (విషయములలో) తిరుగుచున్న ఇంద్రియములను | అస్యప్రజ్ఞాం | ఇతని వివేకమును |
| | | అంభసినావం | నీటిలోఓడను |
| యత్ మనః | ఏ మనస్సు | వాయురివ | గాలివలె |
| అనువిధీయతే | అనుసరించి పోవుచున్నదో | హరతి | ఈడ్చుకొనిపోవుచున్నది |

తా॥ విషయములలో ప్రవర్తించుచున్న ఇంద్రియములను ఏమనస్సు అనుసరించిపోవుచున్నదో. ఆమనస్సు పురుషుని వివేకమును, సముద్రములోని ఓడను గాలి యెట్లు ఈడ్చుకొనిపోవుచున్నదో అట్లు ఈడ్చుకొని పోవుచున్నది.

(శంకరభాష్యము) మనఃస్థైర్యములేనివారికి ఏల జ్ఞానముగలుగుటలేదనునది దీనిలో జెప్పబడుచున్నది. ఏలనగా తమ తమ విషయములలో ప్రవర్తించుచున్న ఇంద్రియములను ఏమనస్సు వెంబడించుచున్నదో, అనగా ఇంద్రియవిషయములను విమర్శించుకొని పోవునట్టి మనస్సు ఆత్మానాత్మల విమర్శవలన కలుగుచున్న ఈ యతియొక్క జ్ఞానమును నశింపజేయుచున్నది. ఎట్లు గాలి నీటిలో పోవుటకు మొదలుపెట్టిన నావికుల (ఓడవాండ్ల) మార్గమునుండి ఓడను నివర్తించి తప్పు మార్గమున పోవునట్లు చేయుచున్నదో అటులనే మనస్సు ఆత్మనుగూర్చిన జ్ఞానమును అపహరించి విషయములను చూచునటుల జేయుచున్నది.

శ్రీధరులు మొదలైన కొందరు వ్యాఖ్యాతలు చేయునర్థము:—

చరతాం = విషయములలో ప్రవేశించుచున్న, ఇంద్రియాణాం = ఇంద్రియములమధ్య, (అనగా ఇంద్రియములలోపల,) యత్ = ఏఇంద్రియమును, మనః = మనస్సు, అనువిధీయతే = అనుసరించిపోవుచున్నదో, తత్ = అయొక్కటే ఇంద్రియము, అస్య = ఈ పురుషునియొక్క, ప్రజ్ఞాం = వివేకమును, అంభసి = సముద్రమునందు, నావం = ఓడను, వాయురివ = గాలివలె, హరతి హి = అపహరించుచున్నది.

(స్వకీయము) ఒక ఇంద్రియమే ఇంతటి యనర్థమునుగలుగజేయగలదైనచో ఇంద్రియములన్నియు జేరినప్పుడు కలుగగల అనర్థమునుగూర్చి చెప్పవలెనా? యనునది తాత్పర్యము.

పైయర్థము ననుసరించి దీనిలోనున్న ఉపమానోపమేయములను క్రింద కనబరచినటుల చెప్పవచ్చును-సంసారమనే సముద్రమును దాటి తరింపనుద్దేశించి ప్రజ్ఞయను ఓడను ఆధారముగ

గైకొని దృఢబంధముజేసి శాస్త్రోక్తమైన నేరు(త్రోవలో మనస్సను నావికుడు (ఓడ నడుపువాడు) అనావను నడుపునప్పుడు ఆ మనస్సను నావికుడు ఇంద్రియములనెడి ప్రతికూలవాయువునకు వశమై దానిని వెంబడించినచో అయింద్రియములనెడి ప్రతికూల వాయువు ప్రజ్ఞయను ఓడను మార్గము తప్పించి ఈడ్చుకొనిపోయి అటునిటు(త్రోసి నాశపరచుచున్నది. అయితే ప్రజ్ఞను మనస్సు ఈడ్చుకొనిపోవునదిగ శంకరులు చెప్పనటుల నుంచుకొనినచో ఇంద్రియముల ననుసరించి పోవుచున్న మనస్సు ప్రతికూల వాయువుకున్ను, ఇంద్రియములనుండి యీడ్చబడిన మనస్సు అనుకూలవాయువుకున్ను సమానము.

మధుసూదన సరస్వతి వ్యాఖ్యానానుసారముగ ఇంద్రియ విషయములలో పోవుచున్న చంచలమనస్సు సముద్రజలమునకున్ను, ఆత్మను పొందుచున్న దృఢమనస్సు భూమికిని సమానము. ఇంద్రియములనెడి గాలి, ప్రజ్ఞయను ఓడను, భూమియందుండునప్పుడు కదిలించజాలదు. చంచల మనస్సు అనే జలమున ఆ ఓడ దొరకుకొన్నచో దానిని ఈడ్చుకొనిపోవుటకు సామర్థ్యము ఇంద్రియ మనెడి వాయువునకు కలుగుచున్నది.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68

పద॥ తస్మాత్ - యస్య - మహాబాహో - నిగృహీతాని - సర్వశః ।-
ఇంద్రియాణి - ఇంద్రియార్థేభ్యః - తస్య - ప్రజ్ఞా - ప్రతిష్ఠితా ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో ! | ఓ భుజబలముగల అర్జునుడా! | ఇంద్రియార్థేభ్యః | విషయములనుండి |
| తస్మాత్ | అందువలన | నిగృహీతాని | అణగ బెట్టబడుచున్నవో |
| యస్య ఇంద్రియాణి | ఎవ్వని ఇంద్రియములు | తస్యప్రజ్ఞా | అతనిజ్ఞానము |
| సర్వశః | సకలములైన | ప్రతిష్ఠితా | నిలకడ చెందియున్నది. |

**తా॥ ఓ అర్జునా! (ఇంద్రియములు ఈ విధముగ నీడ్చుకొనిపోవు శక్తి గలవిగనున్నవి.) కావున ఎవ్వని ఇంద్రియములు సకలములైన విషయముల నుండియు నివర్తింపజేయబడుచున్నవో యతని జ్ఞానము నిలకడ చెందినదని చెప్పబడును.**

(శంకరభాష్యము) "యతతోహ్యపి" అనుమునుపటి 60 వ శ్లోకమునందు జెప్పినవిషయ మునకు పలువిధములుగ అనుగుణ్యమును (పొంతనము) జెప్పి పిదప అదేవిషయమును భగవంతుడు నిరూపించి ముగించుచున్నాడు. ఏకారణముచేత ఇంద్రియములు విషయములలో ప్రవర్తించుట వలన కలుగునట్టి చెరుపు బోధింపబడినదో ఆ కారణమువలన మనస్సు మొదలైన పలువిధముల చేతను (మనస్సు వాక్కు కాయములచేతను) ఏ యతియొక్క ఇంద్రియములు శబ్దము మొదలైన విషయములనుండి నివర్తింపబడినవో వాని జ్ఞానము నిలకడ చెందినది,

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ 69

పద॥ యా - నిశా - సర్వభూతానాం - తస్యాం - జాగర్తి - సంయమీ ।
యస్యాం - జాగ్రతి - భూతాని - సా - నిశా - పశ్యతః - మునేః ॥

| | | | |
|---|---|---|---|
| సర్వభూతానాం | ప్రాణులన్నిటికిని | యస్యాం | దేనిలో (ఏ లోకదృశ్యరూపమైన భేదబుద్ధిరూపమైన అజ్ఞానమునందు) |
| యా | ఏది (ఏ పరమార్థతత్త్వము) | భూతాని జాగ్రతి | ప్రాణులు మేలుకొనియున్నవో |
| నిశా | రాత్రియగునో (రాత్రివలె నున్నదో) | సా | అది (ఆ యజ్ఞానావస్థ) |
| తస్యాం | దానిలో (ఆ పరమార్థ తత్త్వములో) | పశ్యతః | పరమార్థ తత్త్వమునుచూచుచున్నవాడైన |
| సంయమీ | ఇంద్రియములణగిన యోగియైనవాడు | మునేః నిశా | మునికి రాత్రి (రాత్రివంటిది) |
| జాగర్తి | మేలుకొనియున్నాడు | | |

తా॥ ఏ పరమార్థతత్త్వమైనది ప్రాణులన్నిటికిని రాత్రివలెనున్నదో, అనగా రాత్రియందు వస్తువులు తెలియకుండుటవలె తెలియుటలేదో, ఆ పరమార్థ తత్త్వమునందు ఇంద్రియములను జయించిన యోగియైనవాడు అజ్ఞాన నిద్రను విడిచి మేలుకొనియున్నాడు. (అనగా ఆ పరమార్థతత్త్వము ఇతనికి తెలియుచున్నదని భావము) ఏ భేదరూపమైన లోకదృశ్యమగు అజ్ఞానమునందు ప్రాణులు మేలుకొనియున్నవో ఆ యజ్ఞానావస్థ పరమార్థతత్త్వమును చూచుచున్నట్టి మునికి రాత్రివంటిది.

(శంకరభాష్యము) లౌకికముగను, వైదికముగనుఉన్న ఈ వ్యవహారమేదిగలదో అది, అజ్ఞానముయొక్క కార్యమైనందున - వివేకబుద్ధిగలిగి జ్ఞానము నిలకడచెందినవానికి అజ్ఞానము నివర్తించినతోడనే నివర్తించుచున్నది. అజ్ఞానము జ్ఞానమునకు విరుద్ధమైనందునను దానియెదుట నిలబడనందువలనను నివర్తించుచున్నది, అనువిషయమును స్పష్టపరచుటకై భగవంతుడు ఈ శ్లోకమును ప్రసాదించుచున్నాడు. జ్ఞానస్థైర్యముగలవానికి అందునట్టి పరమార్థతత్త్వము ప్రాణులన్నిటికిని, ప్రతివస్తువును వెవ్వేరుగ విభజించి యెరుంగ వీలులేనటుల జేయునట్టి తమస్స్వభావముగల రాత్రిగానున్నది అనగా ఎట్లు రాత్రియందు సంచరించు గ్రుడ్లగూబ మొదలగువాటికి రాత్రి పగలుగనేయుండునో తదితరములైన కాకి మొదలగు వాటికి అది రాత్రిగనెట్లు అగుచున్నదో, అటులనే పరవస్తువుయొక్క తత్త్వము రాత్రియందు తిరుగునవి వలెనున్న అజ్ఞానులైన ప్రాణులన్నిటికిని రాత్రివలెనుండుటవలన రాత్రిగనేయున్నది. అది జ్ఞానము లేనివారికందదు కావున, అని గ్రహింపుడు. ఆ పరమార్థతత్త్వమునందు శాంతస్వభావుడై ఇంద్రియములను జయించిన జ్ఞానయోగియైనవాడు అజ్ఞాననిద్రవిడిచి మేలుకొనియున్నాడు. తెలిసికొనబడునట్టియు తెలిసికొనుచున్నదియునైన భేదలక్షణమగు ఏ అజ్ఞానరాత్రిలో నిద్రించుచునేయున్న ప్రాణులు మేలుకొనియున్నవని చెప్పబడుచున్నవో, ఏ అజ్ఞాన రాత్రిలో అవి నిద్రించినవివలె స్వప్నము జూచుచున్నవో అది అజ్ఞానాకారముగావున పరమార్థతత్త్వమును చూచునట్టి మునికి అది రాత్రి యనబడును. (జీవన్ముక్తునకు ఈ ప్రపంచ వ్యవహారము స్వప్నమువంటిదని భావము.) కావున ఈ భేద సమూహమైన లోకదృశ్యమంతయు రాత్రివలె యజ్ఞానమేయని తలంచు నాత్మజ్ఞునికి కర్మలన్నిటిని విడుచుటయందే యధికారము. కర్మనుజేయుటయందు గాదు,

◆◆◆◆◆◆◆◆

శ్లో॥ అపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్

తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాంతిమాప్నోతి న కామకామీ॥ 70

పద॥ అపూర్యమాణం - అచలప్రతిష్ఠం - సముద్రం - ఆపః - ప్రవిశన్తి - యద్వత్।
తద్వత్ - కామాః - యం - ప్రవిశన్తి - సర్వే - సః- శాంతిం- ఆప్నోతి-న-కామకామీ॥

| | | | |
|---|---|---|---|
| అపూర్యమాణం | జలములచేత పూర్ణముగ నిండి నట్టియు | తద్వత్ సర్వేకామాః | అటులనే కోరికలన్నియు |
| అచలప్రతిష్ఠం | నిలకడమారని స్థితిని గలిగి నట్టియు | యం ప్రవిశన్తి | ఏ మునినిప్రవేశించుచున్నవో |
| సముద్రం | సముద్రమును | సః శాంతింఆప్నోతి | అతడు మోక్షమును పొందు చున్నాడు. |
| ఆపః | (నదిమొదలగువాటి) జలములు | కామకామీ న | విషయాసక్తిగలవాడుపొందు టలేదు |
| యద్వత్ ప్రవిశంతి | ఎట్లుప్రవేశించుచున్నవో | | |

తా॥ జలములచేత పూర్ణముగ నిండి స్థిరమైన స్థితిబడసిన సముద్రమును, నది మొదలగు జలము లెట్లుపొందునో (నదులు పోయిజేరుటవలన సముద్రము గట్టుమీరుటగాని, ఎట్టి వికారమొందుటగాని ఎట్లులేదో) అటులనే కోరికలన్నియు బ్రహ్మనిష్ఠుని పోయిచెందినను అతడు (దానివలన వికారమొందక) మోక్షమును పొందును. విషయేచ్ఛగలవాడు మోక్షమును పొందుటలేదు.

(శంకరభాష్యము) ఆసక్తిని విడిచిన స్థితప్రజ్ఞుడైన యతికే ముక్తికలుగును, కర్మను త్యజింపక కర్మనుకోరియున్న వానికికాదు, అనువిషయమును దృష్టాంతముచేత తెలియబరచుటకై శ్రీభగవంతుడు మరల ప్రసాదించుచున్నాడు. జలములచేనన్ని ప్రక్కలనిండినదై, మారనిస్థితికలదై, వేరుబాటులేక ఒకేస్వభావముగ తనస్థానములో నిలబడియున్న సముద్రమును అన్నిదిక్కులనుండియు నదులు మొదలగువాని జలములెట్లు ప్రవేశించుచున్నవో, అనగా ఆ జలములు తాము ప్రవేశించుట వలన సముద్రమునందు ఎట్టి మార్పునుకలుగజేయ వీలులేకతామే అంతర్గతములగుచున్నవో, ఆవిధ ముగనే పలువిధములైన కోరికలన్నియు ఏ మునిని విషయములయందు వికారపరచక ప్రవేశించు చున్నవో, అనగా ఏ మునిని తమవశముగ చేయవీలులేక తామేఅతనియందు ఇముడుచున్నవో అతడు శాంతిని (ముక్తిని) బడయుచున్నాడు. విషయములను కోరుస్వభావముగలవాడు మోక్ష మొందుటలేదని భావము.

(స్వకీయము) ఈ శ్లోకము అవధూతోపనిషత్తునందు కనబడుచున్నది.

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః।
నిర్మమో నిరహంకార స్స శాంతి మధిగచ్ఛతి ॥ 71

పద॥ విహాయ - కామాన్ - యః - సర్వాన్ - పుమాన్ - చరతి (1) నిస్స్పృహః।
నిర్మమః (2) - నిరహంకారః - సః - శాంతిం - అధిగచ్ఛతి॥

| | | | |
|---|---|---|---|
| యః పుమాన్ | ఏ (బ్రహ్మనిష్ఠుడైన)పురుషుడు | నిరహంకారః | (తానను) అహంకారములేకయు |
| సర్వాన్కామాన్ | సమస్తవిషయములను | చరతి | (అంతట) సంచరించుచున్నాడో |
| విహాయ | విడిచి | సఃశాంతిమధిగచ్ఛతి | అతడు మోక్షమును పొందు చున్నాడు |
| నిస్స్పృహః | దేనియందును ఆసక్తిలేకయు | | |
| నిర్మమః | (తనదను) మమతలేకయు | | |

**తా॥ ఏ బ్రహ్మనిష్ఠుడైన పురుషుడు సమస్తవిషయములను విడిచిపెట్టి సకలమునందును ఆసక్తి, మమత, అహంకారము ఇవిలేక సంచరించునో అతడు సకల దుఃఖములనుండి విడువబడి మోక్షము నొందుచున్నాడు.**

(1) చరతి — ప్రారబ్ధమువలన వచ్చినదానిని అనుభవించువాడు (శ్రీధరులు)

(2) నిర్మమః — దేహమే యాత్మయని తలంచనివాడు (రామానుజులు)

(శంకరభాష్యము) విరక్తుడైన ఏపురుషుడు కర్మలను కొంచెమైనను శేషములేక పూర్తిగ తొలగించి తిరుగుచున్నాడో (అనగా జీవించియుండుటకు కావలసిన వ్యాపారములనుమాత్రముంచుకొనినవాడై తిరుగుచున్నాడో,) ఆసక్తిలేనివాడై (అనగా కేవలము శరీరము జీవించియుండుటయందు గూడ ఆసక్తిలేనివాడై,) మమకారము లేనివాడై (అనగా శరీరము జీవించియుండుటకు మాత్రము కావలసిన వస్తువునందుగూడ "ఇదినాది" అను ఆసక్తిలేనివాడై,) అహంకారములేనివాడై (అనగా విద్య గలిగియుండుట మొదలగువాటివలన కలుగునట్టి "నేను" అని తన్నుతానే నుతించుట లేనివాడై,) యుండునో అతడు అట్లున్నవాడై, జ్ఞానము నిలకడ చెందినవాడై, బ్రహ్మమునెరింగినవాడై, సంసార దుఃఖమంతయు తొలగుటయైన నిర్వాణమను పేరుగల శాంతిని, మోక్షమును పొందుచున్నాడు. బ్రహ్మముగనేయగుచున్నాడు.

(రాఘవేంద్రులు) ఏ బ్రహ్మనిష్ఠగల పురుషుడు నిషిద్ధమైన కర్మయందాసక్తిలేకయు, మమతలేకయు, అహంకారము లేకయు, సకల విషయములలో నాసక్తిలేకయు సంచరించునో ఆతడు శాంతినొందును.

---

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 72

పద॥ ఏషా - బ్రాహ్మీ (1) - స్థితిః - పార్థ - న - ఏనాం - ప్రాప్య-విముహ్యతి।
స్థిత్వా - అస్యాం - అంతకాలే - అపి - బ్రహ్మనిర్వాణం (2) ఋచ్ఛతి ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ కుంతీపుత్రుడా! | నవిముహ్యతి | సంసార మోహమునుపొందుట లేదు |
| బ్రాహ్మీస్థితి | బ్రహ్మజ్ఞాననిష్ఠయైనది | | |
| ఏషా | ఇంతవరకు చెప్పినదిగ నున్నది | అస్యాం | ఈ బ్రహ్మజ్ఞాననిష్ఠలో |
| | | అంతకాలేస్థిత్వాపి | మరణకాలమందుండినను |
| ఏనాంప్రాప్య | ఈ (బ్రహ్మజ్ఞాననిష్ఠను) పొంది | బ్రహ్మనిర్వాణం ఋచ్ఛతి | బ్రహ్మములో లయమును పొందుచున్నాడు. |

**తా॥ ఓ కుంతీపుత్రుడా! బ్రహ్మజ్ఞాననిష్ఠయనునది ఇంతవరకు చెప్పినదై యున్నది. జనుడు ఈ బ్రహ్మజ్ఞాననిష్ఠనుపొంది (పిదప) సంసారమోహమును పొందుటలేదు. ఈ బ్రహ్మజ్ఞాననిష్ఠలో మరణకాలమునందుండినను బ్రహ్మములో లయమునొందుచున్నాడు.**

(1) బ్రాహ్మీఏషాస్థితిః - ఆత్మస్వరూప నిశ్చయముతోగూడిన కర్మయోగ స్థితియైనది బ్రాహ్మీ బ్రహ్మమును పొందించును (రామానుజులు)

(2) బ్రహ్మనిర్వాణం - ఆనందరూపమైన బ్రహ్మమును (రామానుజులు) ప్రాకృతశరీరములేని బ్రహ్మమును (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) ఇంతవఱకు జెప్పినది బ్రహ్మమునుగూర్చిన స్థితి, బ్రహ్మస్వరూపము గనే యుండుటయనునది. ఓ పార్థ ! ఈ స్థితినిబడసి ఎవ్వడున్ను మోహమునుపొందడు. బ్రహ్మము నాశ్రయించిన ఈ స్థితిలో నొకడు కడపటి వయస్సునందుండినను బ్రహ్మానందమను మోక్షమును పొందుచున్నాడు. ఎవ్వడు బ్రహ్మచర్యమందుండియే సన్న్యాసమునుపొంది జన్మమంతయు బ్రహ్మమునందే నిలబడునో అతడు బ్రహ్మానందమును బడయుటను జెప్పవలెనా?

(స్వకీయము) జననముమొదలు మరణమువరకు బ్రహ్మజ్ఞాననిష్ఠయందుండిననే మోక్షము కలుగునని రాఘవేంద్రుని అభిప్రాయము. మరణకాలమునందైనను బ్రహ్మనిష్ఠలోనుండినచో మోక్షము లభించుననునది ఇతరుల అభిప్రాయము.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే సాంఖ్యయోగోనామ
ద్వితీయోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న
శ్రీకృష్ణార్జున సంవాదమున సాంఖ్యయోగమను
రెండవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు.

తృతీయాధ్యాయ ప్రారంభః.

# మూడవ అధ్యాయము

## (కర్మయోగము)

అర్జున ఉవాచః—

శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥ 1

పద॥ జ్యాయసి - చెత్ - కర్మణః - తే - మతా - బుద్ధిః - జనార్దన (1) ।
తత్ - కిం — కర్మణి - ఘోరే - మాం - నియోజయసి - కేశవ (2) ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడుచెప్పినది. | కిం | ఏ కారణమువలన |
| హేజనార్దన ! | ఓ జనార్దనా ! | ఘోరే | భయంకరమైన (ప్రాణి హింసాకరమైన) |
| కర్మణః | (నిష్కామ) కర్మకంటె | | |
| బుద్ధిః | జ్ఞానము | కర్మణి | కర్మలో |
| జ్యాయసీ | శ్రేష్ఠమనునది | మాం | నన్ను |
| తేమతాచేత్ | నీకు సమ్మతమైనచో | నియోజయసి | ప్రవర్తింపునటుల ప్రేరేపించుచున్నావు. |
| తత్ | అప్పుడు | | |
| హే కేశవ! | ఓ కేశవా ! | | |

తా॥ అర్జునుడు (శ్రీ కృష్ణపరమాత్మనుజూచి) చెప్పినది—ఓ జనార్దనా! జ్ఞానము నిష్కామకర్మకంటె శ్రేష్ఠమైనదనునది నీ యభిప్రాయమైనచో, అప్పుడు ఓ కేశవా! ఏ కారణమువలన ప్రాణిహింసాకరమైన క్రూరకర్మయందు నన్ను ప్రవర్తించునటుల ప్రేరేపించుచున్నావు.

(1) జనార్దన - "జనం = జననం, తత్కారణం అజ్ఞానం చ స్వసాక్షాత్కారేణ అర్దయతి హినస్తీతి జనార్దనః." అనగా జననము, దానికి కారణమైన అజ్ఞానము, ఈ రెంటిని తన సాక్షాత్కారముచేత నశింపజేయువాడని శంకరానందులు అర్థము చేసియున్నారు. అనగా అజ్ఞానమును పోగొట్టుచున్న నీవేల నన్ను అజ్ఞానమైన కర్మయందు ప్రేరేపించుచున్నావు? అని భావము.

(2) కేశవ - "కేశవః క్లేశనాశాయ" అని పురాణప్రసిద్ధము. అందరి క్లేశములను పోగొట్టుచున్న నీవు నా క్లేశముమగ్గూడ నివృత్తిచేయుమని తాత్పర్యము.

(శంకరభాష్యము) శాస్త్రానుసారముగ ప్రవృత్తిబుద్ధి అనగా యోగబుద్ధి, నివృత్తిబుద్ధి అనగా సాంఖ్యబుద్ధి, అని రెండుమార్గములు గలవు. "ప్రజహాతి యదా కామాన్" (2-55) అనునది మొదలు "ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ" (2-72) అను నంతవరకు సాంఖ్యమగు నివృత్తిబుద్ధిచేత అనగా కర్మసన్న్యాసముచేత కృతార్థుడు కావచ్చునని రెండవ అధ్యాయమునందు జెప్పబడినది. "కర్మణ్యే

వాధికారస్తే'', మాతేసంగో స్త్వకర్మణి'' (2-47) అనుదానిలో యోగబుద్ధిని ఆశ్రయించి కర్మమునే (నీవు) చేయవలయునని (ప్రవృత్తిబుద్ధిని) భగవంతుడు అర్జునునకు జెప్పెను. ఐనను దానివలననే శ్రేయఃప్రాప్తిని చెప్పలేదు. దానిని, దీనిని ఆలోచించి కలతచెందిన యర్జునుడు ''ఏది శ్రేయస్సును పొందుటకు నేరుగానున్న సాధనమో ఆ సాంఖ్యబుద్ధినిష్ఠను, శ్రేయస్సును గోరునట్టి భక్తునకు నాకు ఉపదేశించి, తిరిగి ప్రత్యక్షముగ పలువిధములైన అనర్థములతో గూడినదియు, పరంపరగాగాని శ్రేయఃప్రాప్తిఫలము నిశ్చితముకానట్టిదియునైన కర్మమునందు నన్నెట్లు ప్రేరేపింపదగును?'' అని మనశ్చాంచల్యము పొందుట తగును. దానిని అనుసరించియే ''నీవు కర్మకంటె జ్ఞానము హితమైన దని చెప్పితివిగదా. ఓ కేశవా! ఏకారణమువలన తిరిగి హింసాలక్షణమైన క్రూరకర్మయందు ప్రేరేపించుచున్నావు?'' అని భగవంతుని దూషించునట్టి వానివలె అర్జునుడు అడుగుచున్నాడు.

కొందరు:— మోక్షమొందుటకు జ్ఞానము కర్మము (మిశ్రము) రెండును కావలసినవని చెప్పుచున్నారు. ఇదియే కృతార్థమనుచున్నారు. ఈ యభిప్రాయము పొరబాటైనది. శ్రుతిస్మృతులలో సకలాశ్రమములకును (సన్న్యాసి, వానప్రస్థుడు, బ్రహ్మచారి, గృహస్థుడు వీరలకు) కర్మ సన్యాసము చెప్పబడియున్నది. అసన్న్యాసికి మాత్రమే కర్మము జేయవలసినదిగను జెప్పబడి యున్నది. మోక్షేచ్ఛగల జ్ఞాననిష్ఠునకు కర్మము ఆవశ్యకముగాదనుదానికి అనేక ప్రమాణములు గలవు. కావున జ్ఞానము, కర్మము రెండున్ను ఒక్కడే చేయవలెనని చెప్పబడినదిగ తలంపగూడదు. ఒక్కొక్క యధికారికి ఒక్కొక్కటి చెప్పబడినదిగ గ్రహింపవలెను. రెండు నొకనికి జెప్పబడినవి కానందున మోక్షము పొందుటకు జ్ఞానము కారణమేగాని, జ్ఞానకర్మలు రెండున్ను కారణములు కావనునది తాత్పర్యము. (అధ్యాయము 18-శ్లో 66 లో ఈ తాత్పర్యము విస్తారముగ జెప్పబడి యున్నది.)

(రామానుజులు) ఇంద్రియముల నణుగబెట్టుకొని, చేయదగిన ఆత్మజ్ఞాననిష్ఠనుగూర్చి చెప్పితివి. ఇంద్రియములను విషయములలో ప్రవర్తింపజేసి చేయునట్టి నిష్కామ కర్మము జ్ఞానమునకు కారణమనియు జెప్పితివి. జ్ఞాననిష్ఠకు విరుద్ధమైనదియు, ఇంద్రియములను విషయములలో ప్రవర్తింపజేయునట్టిదియునైన కర్మను ఏల నన్ను చేయమని చెప్పుచున్నావని అర్జునుని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) కర్మకంటె బుద్ధియోగమగు జ్ఞానము విశేషమైనదని (2-వ అధ్యా - 49-వ శ్లో -) చెప్పబడియున్నది. స్వర్గాదిప్రాప్తిని పొందించునట్టి కామ్యకర్మను చేయునట్లును (పై అధ్యా - 37-వ శ్లో) చెప్పబడియున్నది. కడతేరవలయునని యడిగిననాకు కామ్యకర్మను జేయమని జెప్పినది నన్ను సంసారమున తీసికొనివచ్చి విడుచుటగనున్నది. పై యధ్యాయము 39-వ శ్లోకమున నిష్కామకర్మయోగమే సకల బంధములను నివర్తించి మోక్షమొందించుటకు హేతువని చెప్పబడియున్నది. ఇట్లు పలువిధములుగ జెప్పుటవలన కలతచెందియున్నాను. నిష్కామకర్మము మోక్షహేతువా? ఆత్మజ్ఞాననిష్ఠ మోక్షహేతువా? యని సందేహపడి అర్జును డడుగుచున్నాడు.

(స్వకీయము) మునుపు రెండవ అధ్యాయమునందు భగవంతుడు మొదట ఆత్మజ్ఞానమును, పిదప కర్మయోగమును సంగ్రహముగజెప్పెను. ఐతే ఆరెంటిని ఒకడే-అనుష్ఠించుటయా? లేక ఒక్కొక్క దానిని వెవ్వేరధికారులు అనుష్ఠింపవలయునా? యని అధికారి భేదము మొదలైన విభాగములు విస్తరింపబడలేదు. సంగ్రహముగ జెప్పినదానినిబట్టి జ్ఞానము శ్రేష్ఠమని అర్జునుడు తాత్పర్యము గైకొనెను. అయినను ''నీవు కర్మయోగమునకే అధికారివి'' అని భగవంతుడు అతనికి

కంఠోక్తముగ జెప్పియున్నాడు. వీటిని పర్యాలోచించి మనశ్చాంచల్యముగలిగి భగవంతుడు సులభమైనట్టిదియు శ్రేష్ఠతరమైనట్టిదియునైన నివృత్తిమార్గమైన జ్ఞానమార్గము ననుష్ఠించునట్లు నాకు జెప్పక, మిక్కిలి దుఃఖముతోగూడిన హింసారూపమైన ఘోరకర్మమున ప్రవర్తించునట్లు ఏల చెప్పెను? నేను, ఏల జ్ఞానయోగమైన నివృత్తి మార్గమును అనుష్ఠింపకూడదు అని వ్యాకులబుద్ధినిపొంది ఈ శ్లోకమునందు ప్రశ్నించినట్లు తోచుచున్నది,

---

శ్లో॥ * వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్॥ 2

పద॥ వ్యామిశ్రేణ - ఇవ - వాక్యేన - బుద్ధిం - మోహయసి - ఇవ - మే।
తత్ - ఏకం - వద - నిశ్చిత్య - యేన - శ్రేయః - అహం - ఆప్నుయాం॥

| | | | |
|---|---|---|---|
| వ్యామిశ్రేణేవ | సంశయమును కలుగజేయునది వలెనున్న | యేన | దేనిచేత |
| | | శ్రేయః | శ్రేయస్సును |
| వాక్యేన | వాక్యముచేత | అహం అప్నుయాం | నేను పొందగలనో |
| మే బుద్ధిం | నా బుద్ధిని | తదేకం | ఆ యొకదానినే |
| మోహయసీవ | మోహింపజేయు వానివలె కనబడుచున్నావు. | నిశ్చిత్యవద | నిశ్చయించిచెప్పుము. |

తా॥ సంశయమును గలుగజేయునట్టిదివలెనున్న వాక్యముజేత నా బుద్ధిని మోహింపజేయునట్టి వానివలె కనబడుచున్నావు. దేనిచేత మోక్షమును నేను పొందగలనో ఆ యొకదానినే నిశ్చయించి చెప్పుము.

(శంకరభాష్యము) భగవంతుడు స్పష్టముగ జెప్పునట్టివాడైనను మందబుద్ధినైన నాకు భగవంతునిమాట సందేహింప జేయునదివలె తోచుచున్నది. దానివలన నా బుద్ధిని మోహింపజేయు వానివలె కనబడుచున్నావు. మందబుద్ధినైన నా మోహమును పోగొట్టుటకే ప్రవర్తించిన నీవు ఎట్లు మోహింపజేసెదవు? అనగా జేయవు, కావుననే, నా బుద్ధిని మోహింపజేయువానివలె కనబడుచున్నావని చెప్పితిని. అయినను జ్ఞానము ననుష్ఠించువాడు వేరు, కర్మము ననుష్ఠించువాడు వేరు. ఒకడే ఒకే కాలమున రెంటినిచేర్చి అనుష్ఠించుట వీలుకాదని నీవు తలచినచో, అప్పుడు వాటిలో ఏదైన ఒక దానిని "ఇదియే అర్జునునకు తగినది. అతని బుద్ధి సామర్థ్యమునకును, స్థితికిని సరి పోవునది" అని నిశ్చయించి ప్రసాదించవలెను. జ్ఞానముచేగాని, కర్మముచేగాని ఏయొక్కదానిచే నేను శ్రేయస్సును పొందుదునో దానిని జెప్పుమని భావము. * "వ్యామిశ్రేణైవ" అని యొక పాఠము (రామానుజులు) సంశయమునే గలుగచేయుచున్నావని తాత్పర్యము.

---

శ్రీ భగవానువాచః—

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం॥

పద॥ లోకే - అస్మిన్ - ద్వివిధా - నిష్ఠా - పురా (1) ప్రోక్తా - మయా - అనఘ।
జ్ఞానయోగేన - సాంఖ్యానాం - కర్మయోగేన - యోగినాం॥

| | | | |
|---|---|---|---|
| శ్రీ భగవానువాచ | శ్రీభగవంతుడు చెప్పినది | యోగినాం | యోగులకు |
| హే అనఘ ! | ఓ పాపములేనివాడా ! | కర్మయోగేన | (నిష్కామ) కర్మయోగము చేతను |
| పురా | మునుపు | | |
| అస్మిన్‌లోకే | ఈ లోకమునందు | ద్వివిధా నిష్ఠా | రెండు విధములైన నిష్ఠ |
| సాంఖ్యానాం | సాంఖ్యులకు | మయా ప్రోక్తా | నాచేత చెప్పబడినది |
| జ్ఞానయోగేన | జ్ఞానయోగముచేతను | | |

తా॥ భగవంతుడైన శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునిగూర్చి చెప్పినది:— ఓ పాపములేనివాడా! మునుపు (సృష్టికాలమున) ఈ లోకమునందు జ్ఞానయోగము సాంఖ్యులకును, కర్మయోగము యోగులకునని రెండువిధములైన నిష్ఠ, నాచే చెప్పబడినది.

(1) పురా - మునుపు నేను సృష్టిచేసిన కాలమునందు (శంకరులు), మునుపుజెప్పిన అధ్యాయమునందు అని (శ్రీధరులు) అర్థము చేసియున్నారు.

(శంకరభాష్యము) సర్వజ్ఞుడనై ఈశ్వరుడనైన నేను సృష్ట్యారంభమున జనులను సృజించి వారికి సంపదయు, ముక్తియు లభించుటకు సాధనమైన వేదార్థ సంప్రదాయమును ప్రకటింపజేసినప్పుడు ఈ లోకమునందు శాస్త్రార్థము ననుష్ఠింప నధికారముబడసిన త్రైవర్ణికులకున్ను రెండు విధములైన నిష్ఠను అనగా అనుష్ఠింపవలసిన స్థితిని జెప్పితిని. ఆ రెండు విధములైన నిష్ఠ యిట్టిదని చెప్పుచున్నాను. వాటిలో ఆత్మానాత్మలను వివేచించి యెరుంగునట్టి జ్ఞానము గలవారై, బ్రహ్మచర్యాశ్రమమునుండియే సన్న్యాసమునొందినవారై, వేదాంతజ్ఞానముచేత బాగుగ వస్తునిర్ణయము జేసినవారై, పరమహంసులగు సన్న్యాసులై బ్రహ్మమునందే నిలబడుచున్న సాంఖ్యులకు జ్ఞానమను యోగముచేత జ్ఞాననిష్ఠను జెప్పితిని. కర్మమను యోగముచేత యోగులైన కర్ములకు కర్మనిష్ఠను జెప్పితిని. అనిభావము.

ఒకేపురుషునిచేత ఒకేపురుషార్థముకొరకై జ్ఞానకర్మలను ఒకటిగజేర్చి అనుష్ఠింపబడవలెననునది గీతలో భగవంతునిచేత తన యభిప్రాయముగ జెప్పబడినదిగను వేదములలోను జెప్పబడినదిగను ఉన్నచో, భగవంతుడు తన్ను శరణుపొందిన ప్రియుడైన అర్జునునకు, జ్ఞాననిష్ఠను అనుష్ఠించుటకు యోగ్యుడైన పురుషుడువేరు, కర్మనిష్ఠను అనుష్ఠించుటకు యోగ్యుడైన పురుషుడువేరని ఇచ్చట ఎట్లు చెప్పును? కావున ఏ విధముగను జ్ఞానకర్మలు ఒకటిగజేరుటకు వీలులేదని గ్రహింపుడు.



శ్లో॥ న కర్మణామనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 4

పద॥ న - కర్మణాం - అనారంభాత్ - నైష్కర్మ్యం - పురుషః - అశ్నుతే ।
న - చ - సన్న్యసనాత్ - ఏవ - సిద్ధిం - సమధిగచ్ఛతి

| | | | |
|---|---|---|---|
| పురుషః | పురుషుడు | సన్న్యసనాదేవ | జ్ఞానములేని, కేవలము కర్మపరిత్యాగముచేతనే (విడచిపెట్టుటచేతనే) |
| కర్మణాం | కర్మలయొక్క | | |
| అనారంభాత్ | అనుష్ఠానము లేకుండుటవలన | | |
| నైష్కర్మ్యం | కర్మము నివర్తించినస్థితిని | సిద్ధిం న సమధిగచ్ఛతి | సిద్ధిని పొందుటలేదు |
| నాశ్నుతే | పొందుటలేదు | | |

తా॥ పురుషుడు (ఒకడు) కర్మలను చేయకుండుటవలన నైష్కర్మ్యమును అనగా కర్మలేనిస్థితిని (జ్ఞానయోగమువలన నిష్ఠను) పొందుటలేదు. జ్ఞానము లేక, కేవలము కర్మపరిత్యాగము చేతనే (కర్మను విడిచి పెట్టుటచేతనే) మోక్షమునుగూడ పొందుటలేదు.

(శంకరభాష్యము) జ్ఞానము, కర్మకంటె మేలైనదని అర్జునుడు చెప్పినది స్థిరమైనది. ఏలనగా:— భగవంతుడు దానిని నిషేధింపక యుండుటచేతనే. మరియు జ్ఞానకర్మలు వెవ్వేరు పురుషులచే ననుష్ఠింపదగినవని చెప్పనట్టి భగవంతుని వాక్యముచేత ఆ జ్ఞాననిష్ఠయనునది సన్న్యాసిచేతనే యనుష్ఠింప బడదగినదనియు సిద్ధించినది. ఈ విధముగనే భగవంతుని తాత్పర్యమని తెలియుచున్నది. ఇక "సంసారబంధమునకు కారణమైన కర్మలో నన్నేల ప్రేరేపించుచున్నావ"ని చింతించుచున్న అర్జునుడు "కర్మను చేయను'' అనితలంచి యున్నటుల జూచి భగవంతుడు "నకర్మణాం అనారంభాత్'' అను నీశ్లోకమును అనుగ్రహించియున్నాడు. లేక ముందురాబోవు విధముగ తాత్పర్యముచేయదగును:—

జ్ఞానకర్మనిష్ఠలు ఒకదాని కొకటి వ్యతిరేకమై యుండుటవలన ఒకేపురుషుడు వాటిని ఒకే సమయమునందు అనుష్ఠింప వీలులేనందున అవి యొకదానికొకటి యాధారపడి నిలువకయే పురుషార్థమిచ్చునవి యని సిద్ధించెను. కాని కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠను బడయుటకు కారణమైనందున పురుషార్థము నిచ్చునదనబడును, అంతేకాని స్వతంత్రముగనే (తానుగనే) ఆ పురుషార్థము నిచ్చునదిగాదు. జ్ఞాననిష్ఠయనగా కర్మనిష్ఠయను నుపాయముచేత పొందదగినదై సహాయాంతరములేకయే నేరుగ పురుషార్థమిచ్చునది, అను నీవిషయమును స్పష్టముగ దెలియబరుచుటకొరకు భగవంతుడు ఈ శ్లోకమును జెప్పినదిగ గ్రహింపవచ్చును.

ఈ జన్మయందుగాని మునుపటి జన్మమునందుగాని అనుష్ఠింపబడిన యజ్ఞము మొదలగు కర్మలు మునుపుచేసిన పాపమును పాగొట్టుటవలన చిత్తశుద్ధిని కలుగచేయుచున్నవి. దానిచే జ్ఞానము గలుగుట మూలముగా జ్ఞాననిష్ఠకు కారణములగుచున్నవి. అవియెట్లు జ్ఞానమునకు కారణములగుచున్నవను దానిని ''జ్ఞాన ముత్పద్యతేపుంసాం క్షయాత్పాపస్యకర్మణః। యథాఽఽదర్శతలప్రఖ్యే పశ్యత్యాత్మాన మాత్మని'' పాపకర్మ క్షీణించుటచేత మనుష్యులకు జ్ఞానము గలుగుచున్నది. అప్పుడొక్కడు శుభ్రమైన అద్దమునందువలె తనలోతన్ను చూచుచున్నాడు. అను శ్రీమహాభారతము శాంతిపర్వము 204 వ అధ్యాయము 7 వ శ్లోకమైన స్మృతివచనముచే చూడుడు.

కర్మలను చేయకుండుటవలన నైష్కర్మ్యమును, అనగా కర్మనివర్తించిన స్థితిని, ప్రవృత్తిలేనిస్థితిని, జ్ఞానయోగమువలన నిష్ఠను, అకర్తయైన ఆత్మస్వరూపముగనే నిలబడుటను ఒకడు పొందలేడని భావము. "న కర్మణాం అనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే'' అను వచనముచేత దాని నిషేధమువలన, అనగా కర్మ ననుష్ఠించుటవలన కర్మము నివర్తించిన స్థితిని బడయునని తోచుచున్నది. మరి యే కారణమువలన కర్మలను చేయనందున కర్మలనుండి విడువబడిన స్థితిని పొందజాలడనగా:— కర్మనుచేయుటయే కర్మములేనిస్థితిని పొందుటకు ఉపాయము కావున, అని గ్రహింపుడు. ఉపాయము లేక ఏ ఫలమును పొందుటలేదుగదా? నైష్కర్మ్యస్థితియైన జ్ఞానయోగమునకు కర్మయోగము ఉపాయమగును. అటులనే శ్రుతియందును, ఇచ్చట గీతయందును స్పష్టపరచబడియున్నది. శ్రుతియందనగా ప్రకృతము వ్యవహరించుచు వచ్చు

చున్నట్టియు, తెలిసికొనదగినదియునైన ఆత్మయను లోకము నెరుంగుటకు ఉపాయముగ 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన' అను శ్రుతిచేత కర్మయోగము జ్ఞానయోగమునకుపాయమని చెప్పబడియున్నది. గీతలోను 5-వ అధ్యాయము 6-వ శ్లోకమునందు 'సన్న్యాసస్తుమహాబాహో దుఃఖమాప్తు మయోగతః" సన్న్యాసమనగా కర్మ యోగములేకుండా బడయుట కష్టమే. "యోగినః కర్మకుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మ శుద్ధయే" యోగులు ఆసక్తిని విడచి చిత్తశుద్ధికొరకు కర్మను చేయుచున్నారని 5-వ అధ్యాయము 11-వ శ్లోకమునందును, ''యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం'' యజ్ఞము దానము తపస్సు, ఇవి ఫలము నెదురుచూడని వారలకు పరిశుద్ధమును జేయునట్టివి, అని 18-వ అధ్యాయము 5-వ శ్లోకమునందును జెప్పబడుచున్నవి. అయితే ఇక వేరొకసందేహము కలుగగలదు. అదేమన "అభయం సర్వభూతేభ్యోదత్వా నైష్కర్మ్యమాచరేత్" ప్రాణులన్నిటికిని అభయమిచ్చిన పిదప నైష్కర్మ్యమును గైకొననలయు ననునది మొదలగు వాటిలో ఒకడు తాను చేయవలసిన కర్మలను విడుచుటచేతను నైష్కర్మ్యమును పొందవచ్చునని చూపబడుచున్నది. లోకమునందును కర్మ చేయకుండుటవలన కర్మము నివర్తించుట యనునది అందరు నెరింగిన విషయము కావున నైష్కర్మ్యమును వెతకువానికి కర్మను చేయుటవలన కలుగునదెట్టిదనినచో దానికొఱకే శ్రీ భగవంతుడు ''న చ సన్న్యసనాదేవ'' సన్న్యాసముచేతనే లేదని జెప్పుచున్నాడు. అనగా కర్మను విడుచుట మాత్రమే యైన, జ్ఞానములేని వట్టి త్యాగముచేతనే సిద్ధిని (జ్ఞానయోగ నిష్ఠను) పొందనేరడు. అధ్యా. 18, శ్లో॥ 49 భాష్యమును చూడుడు.

(స్వకీయము) అర్జునుడు కర్మలనుచేయక విడుచుటయే జ్ఞానమునకు లక్షణమని తప్పుగ గ్రహించిన భావమును భగవంతుడు పరిహరించుచున్నాడు.

---

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥

పద॥ న - హి - కశ్చిత్ - క్షణం - అపి - జాతు - తిష్ఠతి - అకర్మకృత్ ।
కార్యతే - హి - అవశః - కర్మ - సర్వః - ప్రకృతిజైః (1) - గుణైః ॥

| | | | |
|---|---|---|---|
| కశ్చిత్ | ఒకడున్ను | సర్వః | ప్రతిప్రాణియు |
| జాతు | ఒక కాలమునందును | ప్రకృతిజైః | ప్రకృతినుండి గలిగిన |
| క్షణమపి | క్షణకాలముగాని | గుణైః | (సత్త్వరజస్తమో)గుణములచేత |
| అకర్మకృత్ | కర్మచేయనివాడుగ | అవశః | |
| న హి తిష్ఠతి | ఉండుటలేదు | కర్మకార్యతే | కర్మ చేయించబడుచున్నది. |
| హి | ఏలనగా | | |

తా॥ ఎవ్వడున్ను, ఏకాలమునందును, క్షణ కాలముగాని కర్మము చేయక యుండుటలేదు. ఏలనగా ప్రాణులన్నియు ప్రకృతినుండి గలిగిన సత్త్వరజస్తమోగుణములచేత అవశమై అనగా స్వాధీనములేక కర్మను జేయునట్లు చేయబడుచున్నది.

(1) గుణైః - ప్రాచీనకర్మానుసారముగ వృద్ధిపొందియున్న సత్త్వాదిగుణములచేత (రామానుజులు,) ఇచ్ఛ, ద్వేషము మొదలగు గుణములచేత (శ్రీధరులు.)

(శంకరభాష్యము) మరి యేకారణమువలన ఎవ్వడున్ను జ్ఞానములేక, కేవలము కర్మను విడుచుటచేతనే నైష్కర్మ్యలక్షణమైన సిద్ధిని పొందుటలేదనుదానికి కారణము చెప్పబడుచున్నది.

సర్వః = ప్రతిప్రాణియు అనుదానికిముందు "అజ్ఞానియైన" అను పదము విశేషణ ముగ నున్నటుల గ్రహింపుడు. ఏలన "గుణైర్యో న విచాల్యతే = ఎవ్వడు గుణములచేత కదలింప బడుటలేదో" అని జ్ఞానినిగూర్చి ముందు రాబోవు 14-వ అధ్యాయము 23-వ శ్లోకమునందు చెప్పబడియుండుటవలన జ్ఞానిని సత్త్వాదిగుణములు కదలించుటలేదు. కావున ఈ శ్లోకము అజ్ఞాను లను గూర్చియే చెప్పబడినది. అజ్ఞానులకే కర్మయోగము జ్ఞానులకు గాదు. గుణములచేత కదలింప బడని జ్ఞానులకు తమలో కదలుట అనగా ఎట్టి వికారము లేనందువలన కర్మయోగము తగినది గాదు. ఈ విధముగనే "వేదావినాశినం" అను రెండవ అధ్యాయము 21-వ శ్లోకముక్రింద జెప్ప బడియున్నది.

(రాఘవేంద్రులు) జాతు = జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలోను, కశ్చిత్ = జ్ఞానియైనగాని అజ్ఞానియైనగాని, క్షణమపి = ఒక క్షణముగూడ, అకర్మకృత్ = కర్మనుచేయక, నహితిష్ఠతి = ఊరకుండుట లేదు, అవశః = విష్ణుని అధీనమైన, సర్వః (సర్వేణ) = సకల జనులచే, ప్రకృతి జైర్గుణైః = ప్రకృతినుండి గలిగిన సత్త్వాదిగుణములచేత, కర్మ = కర్మయనునది, కార్యతే = చేయ బడుచున్నది.



శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే ॥ 6

పద॥ కర్మేంద్రియాణి (1) - సంయమ్య - యః - ఆస్తే - మనసా - స్మరన్ ।
ఇంద్రియార్థాన్ - విమూఢాత్మా - మిథ్యాచారః (2) - సః - ఉచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| యః విమూఢాత్మా | ఏ అజ్ఞానియైనవాడు | స్మరన్ ఆస్తే | తలంచుకొనుచున్నాడో |
| కర్మేంద్రియాణి | కర్మేంద్రియములను | సః | అతడు |
| సంయమ్య | అణచి | మిథ్యాచారః | మిథ్యాచారము (అబద్ధమైన |
| ఇంద్రియార్థాన్ | ఇంద్రియవిషయములను | ఉచ్యతే | ఆచారము) గలవాడుగ |
| మనసా | మనస్సుచేత | | చెప్పబడుచున్నాడు. |

తా॥ ఎవ్వడు కర్మేంద్రియములను అణచుకొని ఇంద్రియముల విషయము లను మనస్సునందుంచుకొనియున్నాడో, మోహ మొందిన అంతఃకరణముగల (మూఢుడైన) అతడు అబద్ధపు ఆచారముగలవాడుగ చెప్పబడుచున్నాడు.

(1). కర్మేంద్రియాణి - జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను (రాఘవేంద్రులు)

(2) మిథ్యాచారః - డంభాచారుడు (శ్రీధరులు,) కర్మభ్రష్టుడు (రామానుజులు)

(శంకరభాష్యము) ఆత్మను ఎరుంగనివాడు తనకు విధింపబడియున్న కర్మనుచేయక యుండుట సరియైనదిగాదు. అట్లు చేయక యుండుటవలన తన్నుతానే చెడుపుకున్నవాడగు చున్నాడు, అనునది దీనిలో జెప్పబడుచున్నది. చేతులు మొదలైన కర్మేంద్రియములను అణచి ఇంద్రియ (కర్మేంద్రియ జ్ఞానేంద్రియ) విషయములను మనస్సునందుంచుకొని అంతఃకరణము మైకమొంది నిలబడువాడు ఆచారచోరుడు, అబద్ధపు ఆచారముగలవాడు, పాపమైన ఆచారము గలవాడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే ॥

పద॥ యః - తు - ఇంద్రియాణి (1) - మనసా (2) - నియమ్య (3) - ఆరభతే
అర్జున - కర్మేంద్రియైః - కర్మయోగం (4) - అసక్తః - సః - విశిష్యతే (5) ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున ! | ఓ అర్జునుడా ! | అసక్తః | ఫలాపేక్షలేక |
| యస్తు | మరియెవడు | కర్మేంద్రియైః | కర్మేంద్రియములచేత |
| ఇంద్రియాణి | (జ్ఞాన) ఇంద్రియములను | కర్మయోగం | కర్మయోగమును |
| మనసా | మనస్సుచేత | ఆరభతే | ఆరంభించునో |
| నియమ్య | నియమించుకొని | సః విశిష్యతే | అతడు శ్రేష్ఠుడగును. |

తా॥ ఓ అర్జునా! మరియెవ్వడొకడు జ్ఞానేంద్రియములను మనస్సుచేత (శాస్త్రోక్తరీతిగ) నియమించుకొని ఫలాపేక్షలేనివాడై, కర్మేంద్రియములచేత కర్మయోగము ననుష్ఠించునో అతడు శ్రేష్ఠుడగును.

(1) ఇంద్రియాణి - ఇదిసామాన్యముగ ఇంద్రియములన్నిటిని గుర్తించునదైనను ఇచ్చట జ్ఞానేంద్రియములను మాత్రమే గుర్తించునదిగ గ్రహింపవలెను. ఏలన కర్మేంద్రియములచేత కర్మయోగముచేయునదిగ ఉత్తరార్ధములో చెప్పబడుచున్నది కనుక.

(2) మనసా - ఆత్మను యెరుంగుటకు ప్రవర్తించియున్న మనస్సుచేత (రామానుజులు)

(3) నియమ్య - ఈశ్వరవిషయముగచేసి (శ్రీధరులు)

(4) కర్మయోగం - వర్ణాశ్రమయుక్తము, జ్ఞానసాధనమునైన కర్మమును (రాఘవేంద్రులు)

(5) విశిష్యతే - అబద్ధాచారముగలవానికంటె శ్రేష్ఠుడు (శంకరులు,) జ్ఞానవంతుడగును (శ్రీధరులు)

(శంకరభాష్యము) అయితే కర్మకు తగినవాడై అజ్ఞానియైన ఎవడు, మనస్సుచేత జ్ఞానేంద్రియములను నియమనము చేసికొని ఫలము నెదురుచూడనివాడై నోరు చెయ్యిమొదలైన కర్మేంద్రియములచేత కర్మయోగము ననుష్ఠించునో అతడు మునుపటి శ్లోకమునందు జెప్పిన అసత్యాచారునికంటె శ్రేష్ఠమైనవాడగును.

(స్వకీయము) ఈ శ్లోకమునందును, దీనికిమునుపటి శ్లోకమునందును ఇంద్రియములున్ను వాటి విషయములున్ను గుర్తింపబడినవి. అవి యెవ్వియనః:

| | | | |
|---|---|---|---|
| నోరు | మాటలాడుట | కన్ను | చూచుట |
| చెయ్యి | ఎత్తుట | చెవి | వినుట |
| కాలు | నడచుట | ముక్కు | వాసనను ఎరుంగుట |
| పాయువు | మలమువిడుచుట | నాలుక | రుచియెరుంగుట |
| ఉపస్థము | జలమువిడుచుట | త్వక్కు | స్పర్శము నెరుంగుట |

మునుపు 6 వ శ్లోకమునందు కర్మేంద్రియములనుమాత్రము వాటి విషయములలో ప్రవర్తించునట్లు అణచుకొని మనస్సుచేత ఇంద్రియముల, అనగా కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల విషయములను స్మరించుకొనియే యుండునతడు, అసత్యాచారుడు పాపాచారము గలవాడని చెప్పబడెను. కర్మేంద్రియ వ్యాపారము లేక యుండుటవలన తదితరులు ఇతనిని కర్మము లేనివానిగ తలంప నవకాశముగలదైనను ఇతనికి ఆత్మజ్ఞానము లేనిచో మనస్సు ఒక నిలకడ చెందక చంచలముగనే విషయములను చింతించుకొని యుండును. దీనిని కర్మములేనిస్థితియని యెట్లు చెప్పదగును? కావున ఆత్మజ్ఞానమును ఇకపొందవలసినవారు జ్ఞానేంద్రియములను శాస్త్రోక్తముగ నియ

మనము చేసికొని ఫలము నెదురుచూడక నోరు మొదలైన కర్మేంద్రియములచేత కర్మయోగమును చేయుచున్నచో దానిచేత చిత్తశుద్ధినిపొంది పిదప ఆత్మజ్ఞానమును పొందును. ఇట్లుండుటచేతనే యితడు మునుపు చెప్పిన మిథ్యాచారునికంటె శ్రేష్ఠుడని చెప్పబడెను.

శ్లో॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ 8

పద॥ నియతం (1) - కురు - కర్మ - త్వం - కర్మ - జ్యాయః - హి - అకర్మణః।
శరీరయాత్రా - అపి - చ - తే - న - ప్రసిద్ధ్యేత్ - అకర్మణః ॥

| | | | |
|---|---|---|---|
| త్వం | నీవు | జ్యాయః | శ్రేష్ఠమైనది |
| నియతం కర్మ | నిత్యకర్మను | అకర్మణః | కర్మచేయక యుండుటవలన |
| కురు | చేయుము | శరీరయాత్రాపి చ | శరీరమును నడుపుట(రక్షించుట)యు |
| హి | ఏలనగా | | |
| కర్మ | కర్మనుజేయుట | | నీకు |
| అకర్మణః | కర్మజేయకుండుటకంటె | న ప్రసిద్ధ్యేత్ | సిద్ధింపనేరదు (వీలులేదు) |

తా॥ నీవు నిత్యకర్మను జేయుము. ఏలన కర్మజేయుట కర్మజేయక యుండుటకంటె శ్రేష్ఠమైనది. కర్మజేయకయుండుటవలన శరీరమును నడుపుట, అనగా రక్షించుటగూడ నీకు సిద్ధించదు. అనగా సాధ్యపడదు.

(1) నియతం - వర్ణాశ్రమములకు ఏర్పడిన కర్మలు (రాఘవేంద్రులు.)

(శంకరభాష్యము) ఎవ్వడీకర్మకు అధికారియగునో, వేదమునందు ఎవ్వనికే కర్మము ఎట్టి ఫలమును బడయుటకొరకు చేయవలసినదిగ జెప్పబడియున్నదో, వానియొక్క ఆ నిత్యకర్మము వానికి అవశ్యకమైన కర్మయని చెప్పబడును. వానిని దానికధికారి జేయవలయును. ఏలనగా కర్మముచేయుట, చేయకయుండుటకంటె ఫలవిషయమున మిక్కిలి శ్రేష్ఠమైనది. కర్మను జేయక యుండుటవలన లభించు ఫలముకంటె కర్మనుచేయుటయందున్న ఫలము అధికమని భావము. ఎట్లనగా, ఏకర్మను ఒకడు చేయకయుండిన, శరీరము నిలుచుటయు వీలుపడదు. కావున లోకమునందు చేయుటకును, చేయకయుండుటకును ఇట్లు వ్యత్యాసము కనిపెట్టి యుంచబడియున్నది.

(శంకరానందులు) ముముక్షువు నిత్యకర్మము మొదలగువాటిని నైష్కర్మ్య సిద్ధికొరకును మిథ్యాచారదోష నివృత్తికొరకును చేయవలెననునది చెప్పబడుచున్నది.

పురుషునకు కర్మబంధము దేనివలన నేర్పడదో అదియే అకర్మము, లేక కర్మసన్యాసమనబడును. "నేను కర్మచేయుటలేదు" అను నభిమానముగల మూఢుడు చెప్పుచున్న కర్మసన్యాసమునకంటె, ఈశ్వరార్పణముగ కర్మలను అభిమానములేక చేయునట్టి ముముక్షువుయొక్క కర్మము శ్రేష్ఠమని చెప్పబడినది. అయితే 'సన్న్యాసమే అన్నిటికంటె గొప్పది, సర్వోత్కృష్టమైనది, అని శ్రుతియే చెప్పుచున్నదే, అనిన ఏయేకార్యమునకు ఏయే పురుషుడు అధికారియగునో, అనగా యోగ్యతగలవాడగునో, ఆ విధముగ నతడు తనకు యోగ్యమైన సాధనమును ఉపయోగించిననే అది కర్మసిద్ధి నిచ్చును. అందువలన ఆత్మతత్త్వము నెరుఁగని అవివిదిషుడైన పురుషుడు కర్మసన్న్యాసము చేసినచో దానివలన మొదట ప్రత్యవాయమను అనర్థమున్ను, రెండవది నరక

హేతువున్ను, మూడవది నీచయోని ప్రాప్తియున్ను, నాలుగవదిగ మోక్షహానియున్ను ఏర్పడుచున్నవి. ముముక్షువు నిత్యనైమిత్తిక కర్మలను క్రమముగ జేయుచున్నచో పై జెప్పిన అనర్థములు లేకపోవుటయేగాక, ఈశ్వరప్రసాదమున్ను, చిత్తశుద్ధియు, జ్ఞానము, మోక్షము ఇవియు సిద్ధించును. కావున కర్మజేయుటలో ఫలమధికమని యేర్పడినది

మరియు కర్మముజేయుటవలన పరలోకసుఖమేగాక ఇహలోకసుఖముగూడ గలదని చెప్పబడుచున్నది. పెద్దరాయివలె శరీరము కదలక ఒకపురుషుడుండినచో శరీరసంరక్షణగూడ అశక్యము. దానికొఱకైన కర్మజేసియే తీరవలెను. అట్లైనచో దేహసంరక్షణకు ఎంతకర్మ అవశ్యకమో, దానిని జేసిన ఛాలునుగదా యనినచో, అప్పుడునీవు మూఢుడవు, సన్యాసమునకు అనర్హుడవనుదానిని చూపుచున్నది. ఏలనగా అనాత్మయైన దేహమునుమాత్రము రక్షింపమార్గము వెదకుకొని, జనన మరణ ప్రవాహమునుండి నీయాత్మను రక్షింపమార్గమును వెదుకనివాడవగుచున్నావు. కావున కర్మచేత శరీరరక్షణమును అధికమైన ఆస్థతోనెట్లుచేయుచున్నావో, అటులనే విహితములైన కర్మలనుచేసి చిత్తశుద్ధిని, దానివలన జ్ఞానమును, ఆ జ్ఞానముచేత మోక్షమును పొందుటకు యత్నించవలెను. శరీరమును రక్షించుట దీనికొరకయ్యే.

(రామానుజులు) ప్రతియొక్కడున్ను తానున్యాయమైన పద్ధతిన సంపాదించిన ద్రవ్యాదులను ఖర్చుచేసి యజ్ఞము మొదలైన సత్కర్మలను జరిపి యజ్ఞ శేషమును భుజించుటచేత చిత్తశుద్ధిని, చిత్తశుద్ధివలన జ్ఞానమును పొందవలెను. ఈ జ్ఞానము కర్మచేత కలుగునదైనందున కర్మము శ్రేష్ఠమని చెప్పబడినది. జ్ఞానము కర్మకంటె శ్రేష్ఠమను వాక్యము జ్ఞానాధికారి విషయమున చెప్పబడినదేగాని, జ్ఞానమొందనివాని విషయమై చెప్పబడినదిగాదు. అట్లు జ్ఞాననిష్ఠగల జ్ఞానాధికారిగూడ జ్ఞాననిష్ఠకు అనుకూలమైన "దేహము నిలిచియుండుటకొరకు" ఆవశ్యకముతైన కర్మలను చేయవలసినవాడుగ నున్నాడు. కావున కర్మము జ్ఞాననిష్ఠకు పూర్వపుసాధనముగ నుండుటవలన కర్మము శ్రేష్ఠమని జెప్పబడినది.

(స్వకీయము) తినుట, ధరించుట, నిద్రించుట, మొదలగునవియు కర్మలేగదా! వాటిని చేయకయుండినచో దేహము నిలబడునా? దేహము నిలబడనిచో ఏ కార్యములేదు. కావున కర్మలను చేయకయుండుటకు ఎవ్వనికిని వీలులేదు. దీనికొఱకే నిత్యకర్మలు విధింపబడియున్నవి. అవి యెవ్వియనగా, తినుటకుమునుపు స్నానము, సంధ్యావందనము మొదలగు ఆహ్నికములున్ను, దేవ, పితృ, అతిథిపూజ, స్వామినైవేద్యము, అగ్నిహోత్రము, బలికరణము మొదలగునవియే. వీటిని విధింపనుద్దేశ మేమన, ప్రతిదినమున్ను ఇట్టి నిత్యకర్మలనుచేసి వాటిఫలమును కోరక ఈశ్వరార్పణము చేసినచో చిత్తము శుద్ధమై జ్ఞానముపొంది అతిశీఘ్రమున మోక్షమొందగలడనునదే. ఆహారాది అవశ్యమైన కర్మలనుదప్ప, మిగతవాటిని విడిచిపెట్టుట జ్ఞానికి తగినదైనను ముముక్షువునకు తగినదిగాదు. అజ్ఞానివిషయమున జెప్పవలయునా?



శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగస్సమాచర ॥

పద॥ యజ్ఞార్థాత్ (1) - కర్మణః - అన్యత్ర - లోకః - అయం - కర్మబంధనః ।
తదర్థం - కర్మ - కౌంతేయ - ముక్తసంగః - సమాచర (2) ॥

| | | | |
|---|---|---|---|
| యజ్ఞార్థాత్ | యజ్ఞముకొఱకైన | తదర్థం కర్మ | ఆ యజ్ఞార్థమైన కర్మను |
| కర్మణః | కర్మకంటె | హే కౌంతేయ! | ఓ కుంతీపుత్రుడా! |
| అన్యత్ర | ఇతర కర్మలచేత | ముక్తసంగః | ఫలాపేక్షను విడిచి |
| అయంలోకః | ఈలోకము | సమాచర | బాగుగచేయుము. |
| కర్మబంధనః | కర్మబంధమును పొందుచున్నది | | |

తా॥ యజ్ఞముకొఱకైన, అనగా ఈశ్వరారాధన రూపమైన కర్మకంటె ఇతర కర్మలచేతనే ఈలోకము కర్మబంధమును పొందుచున్నది. (కావున) ఓ కుంతీపుత్రా! ఆ ఈశ్వరార్పణమైన కర్మను ఫలాపేక్షవిడిచి బాగుగ చేయుము.

(శంకరభాష్యము) మరియు కర్మము బంధమునకు కారణముగాన దానిని చేయవలదని తలంచుట సరియైనదికాదు. యజ్ఞోవైవిష్ణుః = యజ్ఞమేవిష్ణువు" అనుశ్రుతిచేత యజ్ఞమనుదానికి ఈశ్వరుడని అర్థము. ఏది ఈశ్వరునికొరకై చేయబడుచున్నదో అదియజ్ఞముకొఱకైన కర్మము. కర్మమున కధికారియైనవాడు తనకు విధించినకర్మదప్ప మిగతకర్మచేత బంధమును పొందుచున్నాడు. ఈశ్వరునికొఱకైన కర్మచేతనైతే ఇట్టిబంధమును పొందుటలేదు. కావుననే కర్మఫలము నందాసక్తి లేనివాడై ఈశ్వరార్పణముగ కర్మనుచేయుచుండవలెను.

(శ్రీధరులు) కర్మము పునర్జననమును సంసారమును కలుగచేయగలది. కావున కర్మము చేయగూడదని కొందరు చెప్పునట్టి ఆక్షేపమును నివర్తించుటకై భగవంతుడు యజ్ఞమనునది విష్ణువే కావునను యజ్ఞము చేయుటవిష్ణువును ఆరాధించుటయగును. కావునను యజ్ఞాదికర్మలనుచేసి ఫలమును ఈశ్వరార్పణము చేయుటవలన బంధహేతువు కాదనుదానిని దీనిలో వివరించెనని తాత్పర్యము.

(రామానుజులు) యజ్ఞార్థాత్కర్మణః = యజ్ఞముచేయుటకొరకు ద్రవ్యమును సంపాదించుట మొదలగు కర్మలకంటె అన్యమైన దేహసంరక్షణ మొదలగువాటికై ద్రవ్యము సంపాదించుట మొదలగు కర్మలు బంధహేతువైనందున, ముక్తసంగః = తనకుకావలెనను అభిమానమును విడిచి, కర్మను చేయవలెనని తాత్పర్యము.



శ్లో॥ సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్ ॥ 10

పద॥ సహయజ్ఞాః - ప్రజాః - సృష్ట్వా - పురా - ఉవాచ - ప్రజాపతిః ।
అనేన - ప్రసవిష్యధ్వం - ఏషః - వః - అస్తు - ఇష్టకామధుక్ (1) ॥

| | | | |
|---|---|---|---|
| ప్రజాపతిః | ప్రజాపతి | ఏషః | ఈ యజ్ఞము |
| సహయజ్ఞాః | యజ్ఞముతోగూడ | వః | మీకు |
| ప్రజాః | జనులను | ఇష్టకామధుక్ | హితమైనభోగము ఇచ్చునదిగ |
| పురా | ఆదికాలమున | అస్తు | ఉండుగాక |
| సృష్ట్వా | సృష్టించి | (ఇతి) | అని |
| అనేన | ఈ యజ్ఞముచేత | ఉవాచ | చెప్పెను. |
| ప్రసవిష్యధ్వం | వృద్ధిపొందుదురుగాక | | |

తా॥ ప్రజాపతి, యజ్ఞముతోగూడనే జనులను ఆదికాలమున, అనగా సృష్ట్యారంభమున సృజించి "ఈ యజ్ఞముచేతనే వృద్ధిపొందుదురుగాక, ఈ యజ్ఞము మీకు హితమైనభోగము నిచ్చునదగునుగాక" యని చెప్పెను.

(1) ఇష్టకామధుక్ - మోక్షప్రయోజనమును దాని కనుగుణమైన తదితర ప్రయోజనము నిచ్చునదిగ (రామానుజులు).

(మధుసూదన సరస్వతి) ఈ శ్లోకమునందలి యజ్ఞమనునది ఆవశ్యకములైన కర్మలను గుర్తించుచున్నది. ఏలనగా వీటిని చేయనిచో ప్రత్యవాయము (పాపము) కలుగునని చెప్పబడియున్నది. "ఇష్టకామధుక్" అనుదానిచేత కామ్యకర్మలను గుర్తించునదిగ గ్రహింపగూడదు. "మా కర్మఫలహేతుర్భూః" అని మునుపటి 2వ అధ్యాయము 47వ శ్లోకమున జెప్పియున్నందున కామ్యకర్మ ప్రస్తావమునకు కారణములేదు. ఐనను నిత్యకర్మలకును ఆనుషంగికమైన ఫలముండుట వలన "ఇష్టకామధుక్" అని చెప్పినది ఉచితమే. ఆ విధముగనే ఆపస్తంబులు, ధర్మ ప్రశ్నమున "ఎట్లు ఫలమునకై మామిడిచెట్టును నాటినచో దానినీడయున్ను, గంధమున్ను తోడనే స్వయముగ కలుగుచున్నవో అటులనే ధర్మమునను ష్ఠించినచో అర్థములు తోడనే గలుగుచున్నవి. అట్లుకలుగక పోయినను కర్మకు హానిలేదు" అని చెప్పియున్నారు. కామ్యమునకును నిత్యమునకును ఫలమొక్కటే. ఫలమును అపేక్షించుట, అపేక్షింపకయుండుట యిదే రెంటికి వ్యత్యాసము. వస్తుతత్త్వముచేత అపేక్షించినను అపేక్షింపకపోయినను ఫలము గలుగుటలో వ్యత్యాసము లేదు.

(స్వకీయము) ఈ శ్లోకమునందలి "ఇష్టకామాన్" అనుదానికి "హితమైన, అనగా మోక్షమునకనుకూలమైన ఫలములను" అని అర్థము చేయబడియున్నది. ఐతే "ఇష్టకామాన్" అనుదానికి అపేక్షించిన, కోరుచున్న ఫలములని ఎంచుకొనినచో, కామ్యకర్మలనుగూడ జేయుట కొరకే యజ్ఞములను సృష్టించినట్లు అర్థమగుచున్నది. ఏలన "వృద్ధిపొందుదురుగాక" "ఇష్టమైన భోగముల నిచ్చునట్టిదగునుగాక" అను వాక్యములు, కామ్యఫలమును గుర్తించునవిగ భావింపవలసియున్నది మునుపటి శ్లోకములో కామ్యకర్మలు బంధమును కలుగజేయునవిగాన నిష్కామకర్మము చేయవలెనని చెప్పబడినది. ఇవి పరస్పర విరుద్ధములుగావు. ఎట్లనగా:– యజ్ఞాదికర్మలు వాటికిగల ఫలమునపేక్షించి చేసినచో బంధహేతువైన భోగమునిచ్చును. ఫలాపేక్షలేక ఈశ్వరార్పణముగ జేసినచో మోక్షహేతువైన జ్ఞానమునిచ్చును. ఒకేకర్మ ఒకవిధముగచేసిన బంధహేతువుగను, మరియొక విధముగచేసిన మోక్షహేతువుగను అగుటవలన, చేయువాని తలంపుననుసరించి ఫలము సిద్ధించుగాక యను ఉద్దేశముతో యజ్ఞము సృష్టింపబడినది. ఆ యజ్ఞము భోగమునివ్వక జ్ఞానమును మాత్రమిచ్చునటుల ఏల బ్రహ్మదేవుడు విధింపగూడదనినచో, జ్ఞానము మాత్రము దానికి ఫలమైయుండినచో, ఆ ఫలమును పొందగోరు జనులు అతిస్వల్పసంఖ్యాకులైయుందురు. జ్ఞానమునందాసక్తిలేక స్వర్గాదిభోగముల ననుభవింప నాసక్తిగలవారలైన తదితరులు, యజ్ఞమువలన గలుగునట్టి ప్రయోజనమును పొందుటకు వీలుండదు. స్వర్గాదిభోగము బంధహేతువుగనుండగా దానినేలపొందుటకు ప్రయత్నించవలెననినచో, అది క్రమక్రమముగ మోక్షహేతువగును. ఎట్లనగా - స్వర్గాదిభోగము ననుభవించునతడు అట్లనుభవించు సమయమున ఆ స్వర్గాదిలోకమున గలవారు, ఆ స్వర్గాదులే కడపట సుఖమని తలంచి యున్నారా? లేక దానికంటె విశేషసుఖమున్నదిగ భావించి దానినొందుటకు ప్రయత్నించెదరా? అనుదాని నెరుంగును. అప్పుడు ఈ

స్వర్గాదులకంటె శ్రేష్ఠమైన సుఖమున్నటుల దెలిసినచో ఆ శ్రేష్ఠమైన సుఖము నొందవలెనను తలంపు గలుగును. మరియు తనపుణ్యఫలమునకు నియమితకాలము ముగిసినతోడనే "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశన్తి" అను వాక్యానుసారముగ పుణ్యము నశించినతోడనే భూలోకమున త్రోయబడుటను ఎరుంగుచున్నాడు అప్పుడతడు ఏమి తలంచుననిన, నేను కామ్యముగ యజ్ఞముచేసినందున జనన మెత్తవలసివచ్చెను. నిష్కామముగ యజ్ఞమును చేసినయెడల మోక్షమొందగలనని తలంచి ఫలా పేక్షలేని నిష్కామకర్మమునుచేయ మొదలుపెట్టుచున్నాడు. ఇట్లు కొన్ని జన్మలకు పిదప అతనికి అది మోక్షహేతువగును. అందువలన జనులమీద కృపగల బ్రహ్మదేవుడు యజ్ఞమును జనుల సద్గతి కొరకే సృష్టించెనను విషయమున సందియములేదు.

శ్లో॥ దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః ।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ॥ 11

పద॥ దేవాన్ - భావయత - అనేన - తే - దేవాః - భావయన్తు - వః ।
పరస్పరం (1) - భావయన్తః - శ్రేయః (2) - పరం - అవాప్స్యథ ॥

| | | | |
|---|---|---|---|
| అనేన | ఈ యజ్ఞముచేత | భావయన్తు | రక్షింతురుగాక, లేక హితము |
| దేవాన్ | దేవతలను | | లనిచ్చి వృద్ధిపొందింతురుగాక |
| భావయత | ఆరాధింతురుగాక-లేక హవి ర్భాగాదులచేత వృద్ధి పొందింతురుగాక | పరస్పరంభావయన్తః | ఒకరినొకరు అభివృద్ధి జేసికొని |
| | | పరం | ఉత్కృష్టమైన |
| | | శ్రేయః | శ్రేయస్సును |
| తేదేవాః | ఆ దేవతలు | అవాప్స్యథ | పొందినవారగుదురుగాక |
| వః | మిమ్ములను | | |

తా॥ ఈ (మునుపుజెప్పిన) యజ్ఞముచేత దేవతలను ఆరాధింతురుగాక, లేక హవిర్భాగాదులచేత వృద్ధి పొందింతురుగాక, ఆ దేవతలు మిమ్ముల రక్షింతురుగాక. ఇట్లు (మీరు దేవతలను, దేవతలు మిమ్ములను) ఒకరి నొకరు అభివృద్ధి జేసికొని ఉత్కృష్టమైన శ్రేయస్సును పొందువారగుదురుగాక.

(1) పరస్పరం - అనునది భావనకు విశేషణమేగాని శ్రేయస్సునకు గాదనునది శంకరానందుని తాత్పర్యము.

(2) శ్రేయః—క్రమముగ బ్రహ్మజ్ఞానమును, లేక స్వర్గమును పొందుట. సంసారమునుండి విడువ బడగోరువారికి క్రమముగ బ్రహ్మజ్ఞానమును పొందుట గొప్పహితము. సంసారవిషయ ములను అనుభవింప గోరునతనికి స్వర్గమే గొప్పదైన హితము.

(స్వకీయము) దీనిలో దేవతల మనుష్యుల ఇరువురి అభివృద్ధియు, శ్రేయస్సును జెప్ప బడియున్నవి. దేవతలు తమను హవిర్భాగము మొదలగువాటిచే తృప్తిపరచిన మనుష్యులకు వారలపేక్షించిన భోగాదుల నిచ్చుట ఆ మనుష్యులకు శ్రేయస్సుగ జెప్పవచ్చును. మనుష్యులచే నివ్వబడు హవిర్భాగాదులచేత దేవతలకు శ్రేయస్సుగలుగుచున్నదనుట ఎట్లనుశంకను క్రిందికనుబరచిన విధముగ పరిహరింపదగును. యజ్ఞాదికర్మలను చేయువారలకు ఆయాకర్మలకు విధింపబడియున్న ఫలమునిచ్చుటకున్ను, మనుష్యులకు కావలసిన వర్షము ఎండ గాలి మొదలగువాటిని సకాలమునందు

ఉపకరించుటకును దేవతలు పరమాత్మచే నియమింపబడియున్నారు పరమాత్ముని యాజ్ఞను సరిగా నెరవేర్చుటయే దేవతలకు శ్రేయస్సు. అనగా వారలకై ఏర్పరచబడియున్న ధర్మములను జేయు చుండుటయే మోక్షమునకు మార్గమని భావము. లేక దేవతలు అమృతపానము జేసినవారలైనను దానిచే దేవతలకు మరణములేదు కాని ఆకలి, దేహము, లేవనిచెప్పదగదు. కావున మనుష్యులచే చేయబడుచున్న యజ్ఞాది క్రతువుల మూలముగ నివ్వబడు హవిర్భాగమువలన దేవతలు తృప్తిపొందు చున్నారని శాస్త్రములలోజెప్పబడియున్నది. హిరణ్యకశిపుడు, బలిచక్రవర్తి, శూరపద్ముడు మొదలగు నసురులు దేవతలకు, మనుష్యులు హవిర్భాగము నిచ్చుటను నిషేధించినకాలమున దేవతలు ఆకలిచే దుఃఖించినదిగ పురాణములలో జెప్పబడియున్నది. కావున దేవతలు యజ్ఞాదిక్రతువులలో నివ్వబడు హవిర్భాగమును ఆహారముగ స్వీకరించి దానిచే దేహపుష్టిగలిగి భోగముల ననుభవించుచున్నారు. ఇవియే ఆ దేవతలకు శ్రేయస్సనియు జెప్పవచ్చును.

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥ 12

పద॥ ఇష్టాన్ — భోగాన్ — హి — వః - దేవాః - దాస్యన్తే - యజ్ఞభావితాః ।
తైః - దత్తాన్ - అప్రదాయ - ఏభ్యః - యః - భుఙ్క్తే - స్తేనః - ఏవ - సః

| | | | |
|---|---|---|---|
| యజ్ఞభావితాః | యజ్ఞములచే నారాధింపబడిన | దత్తాన్ | ఇవ్వబడువాటిని (అన్నాదికమును) |
| దేవాః | దేవతలు | ఏభ్యః | ఈ దేవతలకొరకు |
| వః | మీకు | అప్రదాయ | ఇవ్వక (అర్పణముజేయక) |
| ఇష్టాన్ | హితములైన | యః | ఎవ్వడు |
| భోగాన్ | భోగములను | | (తాను) అనుభవించునో |
| దాస్యన్తేహి | ఇవ్వగలరుగదా | సః | అతడు |
| తైః | ఆ దేవతలచేత | స్తేనఏవ | దొంగవాడే |

తా॥ (బ్రహ్మ మరియు జనులను జూచి జెప్పినది.) యజ్ఞములచే నారాధింపబడిన దేవతలు మీకు హితమైనభోగములను ఇవ్వగలరుగదా. అట్లు దేవతలచే నివ్వబడినవాటిని ఆ దేవతలకివ్వక అనగా ఆ ఋణమును దీర్చక ఎవ్వడు తానే యనుభవించునో అతడు దొంగయే.

(స్వకీయము) ఒకడు యజ్ఞాదిక్రతువుల మూలముగ దేవతలకిచ్చిన హవిర్భాగమునకు బదులుగ దేవతలు అతనికిచ్చినదానినిఅతడు మరల దేవతలకర్పణముజేయక యనుభవించుటవలన ఇతనిని దొంగగ ఎట్లుజెప్పదగుననినచో, ఇతడిచ్చునట్టి హవిర్భాగమునకు అనేకరెట్లు అధికమైన భోగములను దేవతలు ఇతనికిచ్చుచున్నారు. అట్లధికముగనిచ్చుటకు కారణమేమన ఇతనిచే ముందు బాగుగ యజ్ఞాదులచేత ఆరాధింపబడగలమనునదే. ఈ కారణముచేతనే శాస్త్రములలో ఒకడనుభవించు భోగమునందు ఇంతభాగము దేవతలకు ఇవ్వవలెనని విధింపబడియున్నది. కావున దేవతలకు గల ఋణమునివ్వక తానేయనుభవించువాడు దొంగయని చెప్పబడెను.

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః ।
తే త్వఘం భుఞ్జతే పాపా యే పచన్త్యాత్మకారణాత్ ॥ 13

పద॥ యజ్ఞశిష్టాశినః - సన్తః - ముచ్యన్తే - సర్వకిల్బిషైః ।
తే - తు - అఘం - భుఞ్జతే - పాపాః - యే - పచన్తి - ఆత్మకారణాత్

| | | | |
|---|---|---|---|
| యజ్ఞశిష్టాశినః సన్తః | పంచమహాయజ్ఞములంజేసి మిగిలిన అమృతమను అన్నమును భుజించునట్టి సత్పురుషులు | యేతు | మరియెవ్వరు |
| | | ఆత్మకారణాత్ | తమకొరకే |
| | | పచన్తి | పాకముజేసి (వంటజేసి) భుజించుచున్నారో |
| సర్వకిల్బిషైః | (పంచసూనాదులగు) సకల పాపములనుండియు | తే పాపాః | ఆ పాపులు |
| | | అఘం తు | పాపమునే |
| ముచ్యన్తే | విడువబడుచున్నారు | భుఞ్జతే | భుజించుచున్నారు. |

తా॥ పంచమహాయజ్ఞములనుజేసి మిగిలిన అమృతమనబడు నన్నమును భుజించుచున్న సత్పురుషులు పంచసూనాదులగు సకలపాపములనుండియు విడువబడుచున్నారు. మరియెవ్వరు (ఈశ్వరార్పణముజేయక) తమకొఱకే పాకముజేసి భుజింతురో అపాపులు పాపమునే భుజించుచున్నారు

(స్వకీయము) ఈ శ్లోకమునందు 'యజ్ఞములోమిగిలిన అన్నమును తినువాడు సకలపాపముల నుండియు విడువబడుచున్నాడు' అనువాక్యములు పెక్కువ్యాఖ్యానము లపేక్షించుచున్నవి. "యజ్ఞములోమిగిలిన అన్నము" అనుసామాన్యమైన వాక్యము ఉపయోగింపబడియున్నది. ఎట్టి యజ్ఞమనునది స్పష్టముగ చెప్పబడలేదు, (శంకరులు) దేవయజ్ఞమునుండి మిగలిన అన్నమనియు, (శ్రీధరులు) వైశ్వదేవము మొదలగు యజ్ఞములలోమిగిలిన అన్నమనియు, (రామానుజులు, భగవన్నివేదితమైన ప్రసాదమనియు, (రాఘవేంద్రులు) విష్ణువునకున్ను ఇతరదేవతలకున్ను నివేదనము చేసిన అన్నమనియు అర్థముజేసియున్నారు. దీనివలన జ్యోతిష్టోమాది యజ్ఞములు మాత్రమేగాక మనుష్యుడు ప్రతిదినము జేయవలసిన పంచయజ్ఞములుగూడ ముఖ్యమని చెప్పినదిగకనబడుచున్నది. ఎందువల్లననగా "సర్వకిల్బిషైః" అనుపదమునకు పంచసూనలు అనుపాపములని అర్థముజేయుట యేగాక అపదముల వివరమున్ను పైవారలచే చెప్పబడియుండుటవలన పంచయజ్ఞములలో మిగిలిన అన్నమనియు తలంపవలసియున్నది. పంచయజ్ఞములెవ్వియనగా:—

శ్లో॥ "అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణం ।
హోమోదైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనం ॥
పంచైతాన్యోమహాయజ్ఞాన్నహాపయతి శక్తితః ।
స గృహేపి వసన్నిత్యం సూనాదోషైర్నలిప్యతే ॥

వేదముపదేశించుటయను బ్రహ్మయజ్ఞము, జలతర్పణముచేత పితృవులను తృప్తిపరచుటయను పితృయజ్ఞము, దేవతలనుగూర్చి అగ్నిలోహోమము జేయుటయను దేవయజ్ఞము, వాయసబలి మొదలగు వాటినుంచుట యనుభూతయజ్ఞము, అతిథులకు అన్నముపెట్టుటయను మానుషయజ్ఞము, ఈఐదు మహాయజ్ఞములను తనశక్త్యనుసారముగ నెవ్వడుజేయునో అతడు గృహస్థాశ్రమమునందుండినను

పంచసూనలను (ఐదు ప్రాణిహింసలు) దోషమునుండి విడువబడుచున్నాడు. (మనుస్మృతి 3-వ అధ్యాయము 70-71 శ్లోకములను జూడుడు.) పంచసూనాదోషమనునది ఏది అనగా,

"పంచసూనా గృహస్థస్య చుల్లీ పేషణ్యుపస్తరః।
కండనీచోదకుంభశ్చ బధ్యతే యాస్తువాహయన్॥
తాసాం క్రమేణ సర్వాసాం నిష్కృత్యర్థం మహర్షిభిః।
పంచక్లృప్తా మహాయజ్ఞాః ప్రత్యహం గృహమేధినాం॥

గృహస్థునికి కట్టెలు మొదలగువాటిని కాల్చుటచేతను, పొత్రము (రుబ్బుడురాయి) తిరుగలి మొదలగు వాటిలో రుబ్బుటచేతను, రోకలి మొదలగువాటిచే దంచుటచేతను, బిందెలో నీరు తెచ్చి ఆ నీరు నుపయోగించుటచేతను, ఊడ్చుట లేక అలుకుటచేతను జంతువులు చంపబడుదోషము గలుగుట వలన ఈ ఐదు విధములైన పాపములను పోగొట్టుటకై మహర్షులచేత గృహస్థాశ్రమమున నుండు వానికి క్రమముగ ఐదు మహాయజ్ఞములు విధింపబడియున్నవి. (మనుస్మృతి 3-వ అధ్యా - 68-69 - వ శ్లోకములను, స్కాందపురాణము కాశీఖండము మొదటిభాగము 38-వ అధ్యాయము 23-24-వ శ్లోకములనున్ను జూడుడు.)

"కుట్టనీ పేషణీ చుల్లీ ఉదకుంభీ చ మార్జనీ।
పంచసూనా గృహస్థస్య తాభిస్స్వర్గం న గచ్ఛతి॥"

దంచుట, రుబ్బుట, దహించుట, నీరు దెచ్చుట, ఊడ్చుట, ఈ ఐదు విధములవలన గలుగునట్టి జీవహింసలచేత గృహస్థుడు స్వర్గమొందలేడు. గనుక గృహస్థుడు ప్రతిదినము గలుగునట్టి ఇట్టి పాపములను నివర్తించుకొనుటకై పైజెప్పిన యజ్ఞములనుజేసి ఈశ్వరార్పణముజేసి మిగిలిన అన్నమును భుజింపక తన కడుపు నిండుటకొరకే వంటచేసి భుజించినచో పాపమును భుజించుచున్నాడు. అనగా - పాపస్వరూపమైన అన్నమును భుజించుచున్నాడని తాత్పర్యము. అయినను తమకొఱకే పాకముచేసి భుజించువారలు పాపులగుటకు రామానుజులు చెప్పుకారణమెట్టిదనగా, ఈశ్వరుడు తన్నారాధించుటకై మనుష్యుల కిచ్చిన ఆహారాది వస్తువులను ఆ ఈశ్వరునకు అర్పణముజేయక తమకొఱకే పాకముజేసి భుజించువారలు పాపమును భుజించువారలనునదే. (4-వ అధ్యాయము 31-వ శ్లోకమును జూడుడు.) ఈ అధ్యాయము 10-వ శ్లో - మొదలు ఈ శ్లోకముతోసహా ప్రజాపతి యొక్క వాక్యములు.



శ్లో॥ అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసంభవః।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥ 14

,, కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ 15

,, ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి॥ 16

పద॥ అన్నాత్ - భవన్తి - భూతాని - పర్జన్యాత్ - అన్నసంభవః।
యజ్ఞాత్ - భవతి - పర్జన్యః - యజ్ఞః - కర్మసముద్భవః॥

,, కర్మ - బ్రహ్మోద్భవం - విద్ధి - బ్రహ్మ - అక్షరసముద్భవమ్।
తస్మాత్ - సర్వగతం - బ్రహ్మ - నిత్యం - యజ్ఞే - ప్రతిష్ఠితం॥

,, ఏవం ప్రవర్తితం - చక్రం - న - అనువర్తయతి - ఇహ - యః।
అఘాయుః - ఇంద్రియారామః - మోఘం - పార్థ - సః - జీవతి॥

| | |
|---|---|
| అన్నాత్ | అన్నమునుండి |
| భూతాని | ప్రాణులు (శరీరములు) |
| భవన్తి | కలుగుచున్నవి |
| పర్జన్యాత్ | మేఘమునుండి(వర్షమువలన) |
| అన్నసంభవః(భవతి) | అన్నము గలుగుచున్నది |
| యజ్ఞాత్ | యజ్ఞమునుండి |
| పర్జన్యః | మేఘము (వర్షము) |
| భవతి | కలుగుచున్నది |
| యజ్ఞః | యజ్ఞము |
| కర్మసముద్భవః | కర్మనుండి గలుగుచున్నది |
| కర్మ | కర్మము |
| బ్రహ్మోద్భవం | బ్రహ్మము (వేదము) నుండి కలిగినదిగను |
| బ్రహ్మ | బ్రహ్మము (వేదము) |
| అక్షరసముద్భవం | నాశములేనివస్తువు (పరమాత్మ)నుండి గలిగినదిగను |
| విద్ధి | తెలిసికొనుము |
| తస్మాత్ | అందువలన |
| సర్వగతం | సకలమును ఆశ్రయించిన |
| బ్రహ్మ | బ్రహ్మము (వేదము) |
| నిత్యం | ఎల్లప్పుడు |
| యజ్ఞే | యజ్ఞమునందు |
| ప్రతిష్ఠితం | స్థిరపడియున్నది |
| ఏవం | ఈ విధముగ |
| ప్రవర్తితం | ప్రవర్తింపజేయబడిన |
| చక్రం | (జగత్)చక్రమును |
| ఇహ | ఇచ్చట (ఈలోకమునందు) |
| యఃనానువర్తయతి | ఎవ్వడనుసరించుటలేదో |
| సః | అతడు |
| అఘాయుః | పాపజీవనము (బ్రతుకు) గలవాడుగను |
| ఇంద్రియారామః | ఇంద్రియములచేత (విషయములో) రమించుకొనియుండువాడుగను ఉండి |
| హే పార్థ! | ఓ పార్థా! |
| మోఘం | వ్యర్థముగ |
| | జీవించుచున్నాడు. |

తా॥ అన్నమువలన ప్రాణులు గలుగుచున్నవి. (అనగా తినబడు అన్నము రక్తముగను, పిదప రేతస్సుగనుమారి దానివలన ప్రాణులు శరీరములతో గలుగుచున్నవి.) అన్నము వర్షమువలన గలుగుచున్నది. వర్షము యజ్ఞము వలన గలుగుచున్నది. యజ్ఞము కర్మనుండి గలుగుచున్నది.

కర్మయు బ్రహ్మమునుండి అనగా వేదమునుండి గలిగినదిగను, బ్రహ్మము (అనగా-వేదము) నాశములేని పరమాత్మనుండి గలిగినదిగను (నీవు) తెలిసికొనుము. అందువలన సకలము నాశ్రయించిన (అనగా తెలియబరచుచున్న ఆ) బ్రహ్మము(అనగా వేదము) యజ్ఞములో నిలకడ చెందియున్నది. (అనగా యజ్ఞవిధులనే ప్రధానముగ గలదని భావము.)

ఈ విధముగ ప్రవర్తింపజేయబడిన జగచ్చక్రమును ఈ లోకమునందెవ్వడనుసరించుటలేదో (అనగా యజ్ఞాదికర్మలచే జగత్తు నడచుటకు అనుకూలము

**చేయుటలేదో) అతడు పాపజీవనముగలవాడుగను, ఇంద్రియములచే విషయములలో రమించుకొని, అనగా ఆటలాడుకొని యుండువాడుగను ఉండి, ఓ పార్థ! వ్యర్థముగ జీవించుచున్నాడు.**

(శంకరభాష్యము) కర్మము జగచ్చక్రమును నడుపుచున్నదను కారణముచేతను కర్మకు అధికారి కర్మముజేయవలయుననునదియు, కర్మజగచ్చక్రమును ఎట్లునడుపుచున్నది అనునదియు చెప్పబడుచున్నది.

భుజించిన ఆహారము రక్తముగను, రేతస్సుగనుమారి దానినుండి ఎల్లరికిని ప్రత్యక్షముగ ప్రాణులు గలుగుచున్నవి. ఆ యన్నము వర్షమువలన గలుగుచున్నది. ఆ వర్షము యజ్ఞమునుండి కలుగుచున్నది. ఆ యజ్ఞము కర్మనుండి గలుగుచున్నది.

అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగాదిత్యముపతిష్ఠతే।
ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః ॥

అగ్నియందుంచిన ఆహుతినేరుగ సూర్యునిజేరగా సూర్యునినుండి వర్షము గలుగుచున్నది. వర్షమునుండి అన్నమును, అన్నమునుండి ప్రాణులున్ను గలుగుచున్నవి. అను మనుస్మృతి వాక్యమును జూడుడు.

ఈ శ్లోకమున యజ్ఞము అనుదానికి "అపూర్వము" అని భావము (అనగా కర్మచేయ బడు కాలమునకును, ఫలమునిచ్చు కాలమునకును మధ్య ఎవ్వరిచేతను తానుచూడబడక యుండు నట్టిస్థితి. కర్మయొక్క కార్యమైన ఫలమును, ముందుగాకనుబడకనే ఇచ్చునట్టి ఒకవిధమైన స్వభావము.) కర్మమనగా ఋత్విక్కులును, (అనగా యజ్ఞము చేయునప్పుడు దేవతలకు ప్రతినిధులుగ ఏర్పరచబడి, జరుపవలసిన కార్యములను జరుపువారు) యజమానుడున్ను (అనగా యజ్ఞమును జేయునతడున్ను) అయిన వీరల వ్యాపారము (అనగా హోమము, మంత్రము, తంత్రాదిక్రియలు). ఈ కర్మనుండి యజ్ఞము గలుగుచున్నది. అనగా పైజెప్పిన ఋత్విక్కులతోగూడి, యజమానుడు జేయునట్టి వ్యాపారమును కర్మచేత, మునుపు కలుగకనే, పిదప ఫలమును గలుగజేయు స్వభావమైన అపూర్వము అదృష్టము కలుగుచున్నదని తాత్పర్యము. ఎట్లు వర్షమునుండి అన్నము, అన్నము నుండి ప్రాణులు ప్రత్యక్షముగ కలుగుచున్నవో, అట్లు ఇది ప్రత్యక్షమైనదికాదని తలంపుడు.

ఆ కర్మయు బ్రహ్మమునుండి (వేదములనుండి) వెలువడినది. వేదమను పేరుగల బ్రహ్మమనగా నాశములేని పరమాత్మనుండి వెలువడుచున్నది. బ్రహ్మమనుదానికి వేదమని అర్థము. మనుష్యునివద్దనుండి శ్వాసము వెలువడుటవలె పరమాత్మయను నాశములేని వస్తువునుండి వేదము సాక్షాత్తుగ గలిగినది. ఆ వేదము సకలవిషయములను ప్రకటింపచేయునది. కావున 'సర్వగతమ్' అనబడుచున్నది. ఐనను అది యజ్ఞాదులను ప్రధానముగ గలదైనందున ఎప్పుడును యజ్ఞమునందే నిలకడ చెందియున్నదని గ్రహింపుడు.

ఈ విధముగ ఈశ్వరునిచేత వేదములను యజ్ఞములను ముందుంచి నడుపబడుచున్న జగచ్చక్రమును అనుసరింపక, పాపాయుష్యము (జీవితమంతయు ఇంద్రియములచేత విషయములలో ఆటలాడుట) గలవాడై యెవ్వడున్నాడో, అతడు వ్యర్థముగ జీవించుచున్నాడు. (కర్మచే యజ్ఞము, యజ్ఞముచే వర్షము వర్షముచే అన్నము, అన్నముచే ప్రాణులు, మరల ఆవిధముగనే ప్రాణులచే కర్మము, కర్మచే యజ్ఞము, ఇట్లు చక్రమువలె చుట్టివచ్చుటవలన జగచ్చక్రమని చెప్పబడినది.)

కనుకనే కర్మకు అధికారియైన అజ్ఞాని, కర్మను జేయవలయుననునది ఈ సందర్భము నందలి తాత్పర్యము. కర్మమునందే అధికారియైన అనాత్మజ్ఞుడు, ఆత్మనిష్ఠకుతగిన యోగ్యతను పొందుటకై ప్రయత్నించి అది చేకూరుటకై కర్మయోగము ననుష్ఠింపవలయుననునది ''న కర్మణామ నారంభాత్" (3-4) అనునదిమొదలు "శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః'' (3-8) అనునది వరకు చెప్పబడినది. ''యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర'' (3-9) అనునది మొదలు ''మోఘంపార్థ స జీవతి'' (3-16) అనునదివరకు కర్మాధికారియై ఆత్మను ఎరుంగనివాడు కర్మ ననుష్ఠింపవలసిన ఆవశ్యకతనుగూర్చి మధ్యసంభవించిన ప్రస్తావముచేత పలుకారణములు చెప్పబడినవి. దానిని చేయక యుండుటవలన కలుగు చెరుపులుగూడ చెప్పబడినవి.

(రామానుజులు) కర్మబ్రహ్మోద్భవం = కర్మము ప్రకృతి వికారమైన దేహమునుండి కలుగుచున్నది, బ్రహ్మ = దేహము, అక్షరసముద్భవః = జీవునివలన కలుగుచున్నది. ఎట్లనగా జీవుడు భుజించిన అన్నాదులచే వృద్ధిపొందినందున జీవునివలన దేహము కలిగినదని తాత్పర్యము, సర్వగతం = సకలజీవులను పొందియున్న, బ్రహ్మ = దేహము, నిత్యం = ఎల్లప్పుడు, యజ్ఞే ప్రతిష్ఠితం = యజ్ఞమునకు మూలముగనున్నది. అఘాయుః = పాపముచేత గలిగిన ఆయుష్యము, లేక పాపమునకు హేతువైన ఆయుష్యము గలవాడు (ఇదియే అభిప్రాయభేదముగల భాగము.)

(రాఘవేంద్రులు) కర్మబ్రహ్మోద్భవం = కర్మము పరబ్రహ్మమునుండి కలిగినది. బ్రహ్మ = పరబ్రహ్మము, అక్షరసముద్భవం = వేదముచేత ఎరుగబడదగినది. సర్వగతం = సర్వ వ్యాపకమైన, బ్రహ్మ = పరబ్రహ్మము, నిత్యం = ఎల్లప్పుడు, యజ్ఞే = యజ్ఞమునందు, ప్రతిష్ఠితం = ఉన్నది, ''యజ్ఞము విష్ణువు'' అని శ్రుతిలో చెప్పబడియుండుటచేతను. యజ్ఞము విష్ణువునకు అతిప్రియమైనది కావునను యజ్ఞమున పరబ్రహ్మము ఎల్లప్పుడునున్నదని చెప్పబడినది,

(స్వకీయము) ఈ శ్లోకమున దేహాదులు ఒకటినుండి మరియొకటి గలుగునదిగజెప్పి, కడపట "ఏవం ప్రవర్తితం చక్రం = ఈ విధముగ కలిగియున్న చక్రమును'' అని చెప్పబడి యుండుటవలన ఆ చక్రమిట్టిదని శ్రీధరులు, రాఘవేంద్రులు వీరలు చెప్పియున్న వాక్యముల ననుసరించి చక్రములుగ వ్రాసి క్రింద కనుబరచబడుచున్నవి:—






రామానుజుల తాత్పర్యము శ్రీధరులవంటిదే. ఐనను ''అన్నమువలన శరీరము'' అనుదానికి బదులుగ ''శరీరము అన్నమువలన'' అన్నట్లు వాచకమునందుమాత్రము భేదముగలదు. పైనవ్రాయబడియున్న చక్రమున ఒకదానినుండి మరియొకటి కలిగినదై ఒక ముగింపు నొందక చుట్టుచునే యుండుటవలనను, చుట్టుచున్న చక్రమువలె నుండుటవలనను చక్రమని చెప్పబడినది. ఈ చక్రమునుజూచిన యెడల దానిలో కనుబరచబడినవానిలో ఏది మొదలు కలిగినదని ఎరుంగుట శక్యముగాదు. 'బీజాంకురన్యాయము' వలెనున్నది. అనగా విత్తనము మొదటగలిగెనా? వృక్షము మొదటగలిగెనా? అని యడిగినచో విత్తనములేక వృక్షములేదు. వృక్షములేక విత్తనములేదు. గనుక మునుపుగలిగినదేదియని చెప్పుటయెట్లు అశక్యమో అట్టిదిది.

రాఘవేంద్రులు మరియొక అభిప్రాయముగూడ జెప్పియున్నారు. అనగా:— ఈ చక్రమును అనుసరింపవలసినది గృహస్థాశ్రమికిమాత్రము అనితలంపదగినదైనను సన్న్యాసివానప్రస్థుడు బ్రహ్మచారి ఈ ఆశ్రమస్థులు నివర్తింపబడి యున్నటుల తలంపగూడదు. ఏలనగా వారలకును మనోవాక్కాయములచే జేయదగిన పెక్కుకర్మలుగలవు. కాన వారలున్ను ఈ చక్రమునననుసరించ వలసినదే.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే॥ 17

పద॥ యః - తు - ఆత్మరతిః - ఏవ - స్యాత్ - ఆత్మతృప్తః - చ - మానవః
ఆత్మని - ఏవ - చ - సంతుష్టః - తస్య - కార్యం - న - విద్యతే॥

| | | | |
|---|---|---|---|
| యస్తుమానవః | డు | సంతుష్టః | సంతోషమొందినవాడుగను |
| ఆత్మరతిరేవ | ఆత్మయందే రమించువాడుగను | స్యాత్ | అగునో |
| తృప్తశ్చ | ఆత్మయందే తృప్తిపొందిన వాడుగను | తస్య | అతనికి |
| | | కార్యం | చేయవలసినది |
| ఆత్మన్యేవ చ | ఆత్మయందే | న విద్యతే | లేదు |

తా॥ మఱి యే మానవుడు ఆత్మయందే రమించువాడుగను, ఆత్మయందే తృప్తిజెందువాడుగను, ఆత్మయందే సంతోషమొందువాడుగను అగునో అతనికి జేయవలసిన దొక్కటియులేదు. (ఆత్మనెరుంగునతనికి కర్మయోగము అక్కర లేదనిభావము.)

(శంకరభాష్యము) ఈ విధముగ ప్రవర్తింపజేయబడిన చక్రమును ఎల్లరు అనుసరింపవలయునా? లేక ఆత్మనెరుంగనివాడు కర్మయోగ నిష్ఠోపాయమువలన పొందదగినదియు, ఆత్మనెరుంగు సాంఖ్యులవలన అనుష్ఠింపదగినదియునైన జ్ఞానయోగనిష్ఠను బడయని వాడుమాత్రమే అనుష్ఠింపవలయునా? అను విషయమును శ్రీభగవంతుడు తానుగనే అర్జునుని ప్రశ్నగళంకించి (మునుపు జ్ఞానయోగముచేత సాంఖ్యులకు, అని 3-వ శ్లోకమున జెప్పిన) గ్రంథముయొక్క అభిప్రాయము స్పష్టముగదెలియుటకై "ఏతంవైతమాత్మానం విదిత్వా నివృత్తమిథ్యాజ్ఞానాః సంతః బ్రాహ్మణాః మిథ్యాజ్ఞానవద్భిః అవశ్యం కర్తవ్యేభ్యః పుత్రైషణాభ్యో వ్యుత్థాయాథ భిక్షాచర్యం శరీరస్థితిమాత్ర ప్రయుక్తంచరన్తి న తేషాం ఆత్మజ్ఞాననిష్ఠావ్యతిరేకేణ అన్యత్కార్యమస్తి'' బ్రాహ్మణులు ప్రసిద్ధమైన యీ ఆత్మ నెరింగి మిథ్యాజ్ఞానము నివర్తింపబడి మిథ్యాజ్ఞానముగలవార్లచే అవశ్యముగ చేయబడదగినట్టి పుత్రేచ్ఛమొదలగువాటిని విడచి పిదప దేహమునిలుచుటకు మాత్రము కావలసిన

భిక్షాటనమునుజేసి తిరుగుచున్నారు. వారలకు ఆత్మ జ్ఞాననిష్ఠ తప్ప మరియొక కార్యములేదు.'' అనుబృహదారణ్యకోపనిషద్వాక్యమైన వేదతాత్పర్యమే ఇచ్చట గీతాశాస్త్రమున బోధింపతలంచినదను దానిని స్పష్టపరచుటకై దీనినిజెప్పుచున్నారు. (తుశబ్దము భేదస్థితి తాత్పర్యముగలది) మరి యే సాంఖ్యుడు ఆత్మనెరుంగుటలో స్థిరముగనిలబడి ఆత్మయందేకాని విషయములలో రమించనివాడు గను, ఆత్మచేతనేగాని ఆహారము రుచి మొదలగువాటివలన తృప్తిపొందని వాడుగను నుండునో, ఆ సన్న్యాసియైన మనుష్యుడు ఆత్మయందే సంతోషించుచున్నాడు. ధనము మొదలగు బాహ్యవస్తువులను బడయుటవలననే గదా ఎల్లరికిని సంతోషము గలుగుచున్నది. ఇతడనగా ఆ ధనము మొదలగువాటిని పొందగోరక ఆత్మయందే సంతోషమొందినవాడు, దేనియందు నా సక్తిలేనివాడు. ఎవ్వడు ఇట్టియాత్మజ్ఞానిగ నుండునో అతడు చేయవలసినదేదియు లేదని తాత్పర్యము.

(శ్రీధరులు) ఈ అధ్యాయమునందలి 4-వ శ్లో - మొదలు 16-వ శ్లో - వరకు అజ్ఞాని అంతః - కరణశుద్ధికొరకై కర్మలను చేయవలయునని చెప్పబడినది. ఈ శ్లోకముచేతను పై శ్లోకము చేతను బ్రహ్మజ్ఞానికి కర్మవలన ప్రయోజనము లేదనునది చెప్పబడుచున్నది.

(రామానుజులు) (17–18–19 - ఈ మూడు శ్లోకములకు ఒకే అన్వయము గావున ఆశ్లోకముల తాత్పర్యములుగూడ సంగ్రహించి ఇచ్చటనే వ్రాయబడుచున్నది) ఎట్టిసాధనములేక బ్రహ్మదర్శన మొందినవారుగను, నిత్యముక్తులుగనునున్న (నిత్యసూరులు) వారలకు కర్మము అవశ్యకముగాదు. సాధనములవలన ముక్తిపొందు బ్రహ్మజ్ఞానులకు స్వల్పకర్మయైనగలదు కాన వారలకు కర్మములేదని చెప్పగూడదు. గనుక ఓ అర్జునా! నీవు ఫలాపేక్షలేక కర్మచేయుమని భావము.

(స్వకీయము) ఈ శ్లోకమునందలి "ఆత్మయందే'' అనువాక్యమునకు అద్వైతపక్షమున 'తనలోనే' యనియు, ద్వైతపక్షమున 'పరబ్రహ్మమునందే' యనియు అర్థము.

---

శ్లో॥ నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥ 18

పద॥ న - ఏవ - తస్య - కృతేన - అర్థః - న - అకృతేన - ఇహ - కశ్చన
న - చ - అస్య - సర్వభూతేషు - కశ్చిత్ - అర్థవ్యపాశ్రయః ॥

| | | | |
|---|---|---|---|
| తస్య | అతనికి (మునుపుజెప్పిన ఆత్మ జ్ఞానికి) | కశ్చన(దోషః) | ఎట్టి దోషమున్ను |
| | | న | లేదు |
| ఇహ | ఈ లోకమున | అస్య | ఇతనికి |
| కృతేన | కర్మజేయుటచేత | సర్వభూతేషు | సకల భూతములవద్దను |
| కశ్చనఅర్థః | ఏ ప్రయోజనమును | కశ్చిత్ అర్థవ్యపాశ్రయః న చ | ప్రయోజనమునకై ఆశ్రయింపవలసిన దేదియులేదు. |
| నైవ | లేనేలేదు | | |
| అకృతేన | | | |

తా॥ ఆత్మయందే తృప్తిమొదలగు వాటిని పొందిన ఆత్మజ్ఞానియైన అతనికి ఈ లోకములో కర్మము జేయుటవలన ఎట్టి ప్రయోజనము లేనేలేదు. కర్మము జేయనందువలన ఎట్టి దోషమును లేదు. ఇతనికి (ఈ ఆత్మనిష్ఠునకు) సకలభూతముల వద్దను ఎట్టి ప్రయోజనమునకైగాని ఆశ్రయింపవలసినది ఏమియు లేదు.

(రాఘవేంద్రులు) బ్రహ్మమునుదప్ప మఱిదేనిని తలంచనివాడైన అసంప్రజ్ఞాత సమాధి యందుండునతడు దేవతలు గురువు మొదలగువారలకు నమస్కరింపవలసిన కాలములలో నమస్కరించక పోయినను అతనికి ఎట్టిబాధకములేదు. అతనికి ఎవ్వరిచేతను కావలసిన ప్రయోజనమేదియు లేదు.



శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ 19

పద॥ తస్మాత్ - అసక్తః - సతతం - కార్యం - కర్మ - సమాచర ।
అసక్తః - హి - ఆచరన్ - కర్మ - పరం - ఆప్నోతి - పూరుషః ॥

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | అందువలన | అసక్తః | ఫలాపేక్షను విడిచి |
| (త్వం) | నీవు | కర్మ | కర్మను |
| సతతం | ఎల్లప్పుడును | ఆచరన్ | అనుష్ఠించుచున్న |
| అసక్తః | ఫలాపేక్షలేనివాడవై | పూరుషః | పురుషుడు |
| కార్యం | చేయవలసిన | పరం | ఉత్తమమైనదానిని (మోక్షమును) |
| కర్మ | నిత్యకర్మమ | | |
| సమాచర | బాగుగజేయుము | ఆప్నోతి | పొందుచున్నాడు. |
| హి | ఎందువలననగా | | |

తా॥ (నీవు కర్మకు అధికారిగనున్నావు.) కావున కర్మఫలమునందాసక్తిని విడిచి చేయవలసిన నిత్యకర్మను ఎల్లప్పుడును బాగుగ చేయుము. ఏలన ఆసక్తిలేనివాడై కర్మజేయునట్టి పురుషుడు ఉత్తమమైనదానిని (మోక్షమును) పొందుచున్నాడు.

(శంకరభాష్యము) "సర్వతస్సంప్లుతోదక స్థానీయం" అంతట ప్రవహించిన గొప్ప సముద్రమువంటి జలప్రవాహమునుబోలిన ఆత్మజ్ఞానములో నీవు లేవుగనుక చేయవలసిన నిత్యకర్మను ఫలాపేక్షను విడచి ఎల్లప్పుడును బాగుగచేయుము. ఏలనగా ఆసక్తిలేనివాడై ఈశ్వరార్పణముగ కర్మనుచేయునతడు చిత్తశుద్ధినిబడసి దాని మూలముగ జ్ఞానమునుపొంది మేలైన మోక్షమును పొందుచున్నాడు. (ఈ కర్మయోగమను సాధనమువలన మోక్షమును నిశ్చయముగ పొందవచ్చును. కాన కర్మయోగమే అపాయములేని సులభమైన మార్గమని భావింపుడు.)

(రాఘవేంద్రులు) అసంప్రజ్ఞాత సమాధిలేనివాడవును, మోక్షేచ్ఛ గలవాడవునైన (ముముక్షువువైన) నీవు కర్మముచేసియే తీరవలెనని తాత్పర్యము.

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 20

పద॥ కర్మణా - ఏవ - హి - సంసిద్ధిం - ఆస్థితాః - జనకాదయః (1) ।
లోకసంగ్రహం (2) - ఏవ - అపి - సంపశ్యన్ - కర్తుం - అర్హసి ॥

| | | | |
|---|---|---|---|
| హి | ఎందువల్లననగా | త్వం | నీవు |
| జనకాదయః | జనకుడు మొదలగువారలు (నిష్కామ) కర్మచేతనే | లోకసంగ్రహమే-వాపి సంపశ్యన్ | లోకమును సన్మార్గమున ప్రవర్తింపజేయుటను మాత్రము గొని బాగుగ నుద్దేశించి |
| సంసిద్ధిం | సిద్ధిని (ముక్తిని) పొందుటకు | | |
| ఆస్థితాః | ప్రవర్తించిరి (ప్రయత్నము చేసిరి) | కర్తుం | (కర్మను) జేయుటకు |
| | | అర్హసి | తగియున్నావు |

తా॥ నీవు ఇక ఏకారణమువలన కర్మనే చేయవలెననినచో, పూర్వీకులైన జనకుడు మొదలగు వారలు (నిష్కామ) కర్మచేతనే సిద్ధిని, అనగా ముక్తిని బడయ ప్రయత్నించిరి. (అనుదానివలన) నీవు లోకమును సన్మార్గమున ప్రవర్తింపజేసి దుర్మార్గమున ప్రవర్తించుట అడ్డగించుటయను ఈ ఫలమునుమాత్రము బాగుగ నాలోచించియైనను కర్మనుజేయుటకు తగినవాడవగుచున్నావు.

(1) జనకాదయః - జనకుడు నీవలె క్షత్రియుడుగను రాజుగనుండుటతోబాటు విశేష జ్ఞానియని ప్రసిద్ధిబడసినవాడుగనుండియు, అతడున్ను కర్మచేతనే సిద్ధిపొందుటకు ప్రయత్నించెననిన నీవు కర్మచేయవలసినవాడవే యనునది సిద్ధము. మరియు జనకుడు మొదలగు వారలు వాస్తవమైన జ్ఞానులుగనుండియు ప్రారబ్ధకర్మచేత క్షత్రియజన్మమెత్తిన కారణమునుబట్టి క్షత్రియధర్మముకాని సన్న్యాసమును, జ్ఞానయోగనిష్ఠను గైకొనగూడదనుదానిని ఎరింగి, తమ ప్రారబ్ధకర్మననుసరించి కర్మను విడువకచేసి సిద్ధిని పొందిరనుదానిని ఎత్తిజూపునదిగ వ్యాఖ్యాతల తాత్పర్యము. 'జనకుడు మొదలగువారలు' అనుదానిచే అశ్వపతి, అంబరీషుడు, భగీరథుడు, ప్రియవ్రతుడు, అజాతశత్రువు, వీరలను గుర్తించినదిగ భావింపుడు.

(2) లోకసంగ్రహం-అనగా లోకమునందలి జనులు నీమార్గమున అనగాతప్పుమార్గమున నడుపకుండ వారలను త్రిప్పి స్వధర్మములో ప్రవర్తించునటుల చేయుట, అనగా తాను సన్మార్గమున ధర్మమార్గమున నడచిచూపి మిగతవారును తన్ను జూచి దుర్మార్గమున ప్రవర్తింపకుండ త్రిప్పి సన్మార్గమున నడచునట్లుచేయుట. దీనినెట్లు చేయవలెననునది రాబోవుశ్లోకములచే స్పష్టమగుచున్నది.

(శంకరభాష్యము) మరియు ఏ కారణముచేత నీవు కర్మనే యనుష్ఠింపవలెననగా పూర్వీకులైన క్షత్రియులైన జనకుడు అశ్వపతి మొదలైన జ్ఞానులు కర్మచేతనే మోక్షమొంద ప్రవర్తించిరనుదానివలననే. వారలు ఆత్మదర్శనమును బడసినందున అప్పుడు ప్రారబ్ధ కర్మముండినందున, కర్మ సన్న్యాసము అనగా కర్మను విడిచిపెట్టుటలేకయే కర్మతోగూడ నే మోక్షమును పొందుటకు ప్రయత్నించిరి. జనకుడు మొదలగువారలు ఆత్మదర్శనమును బడయనిచో అప్పుడు చిత్తశుద్ధికి సాధనమైన కర్మను గైకొని మోక్షమును పొందుటకై క్రమక్రమముగ ప్రయత్నించిరని ఈ శ్లోకము వ్యాఖ్యానింపదగినది. ఇక "జనకాదులైన పూర్వీకులు అజ్ఞానులై యుండినప్పుడే నిత్యకర్మను జేసిరి. కావున ఆత్మదర్శనముగలవాడై పురుషార్థము చేకూరి మరియొకడు కర్మను అవశ్యము చేయవలెననునది తగదు" అనినీవు తలంచినను క్షత్రియజన్మను ఇప్పుడు నీకిచ్చియున్న ప్రారబ్ధకర్మకులోబడియున్న నీవు లోకమును ఉన్మార్గమున అనగా దుర్మార్గమున నడచుటనుండి నివారించుట అను ఈ ఫలమునుమాత్రముగొని బాగుగ నాలోచించి కర్మను చేయవలెను.

(శ్రీధరులు) నీవు, 'నాకు జ్ఞానముగలిగినది, కర్మచేయ నక్కరలేద'ని తలంచినను జ్ఞానమున ప్రవృత్తి లేనట్టియు, అజ్ఞానమునందుండి కర్మయందే అధికారము గలిగినట్టియు జనులు సత్కర్మలను జేయగోరుటకును, దుష్కర్మలలో ప్రవర్తింపక యుండుటకును గొప్పవార్లు తమకు కర్మవలన కావలసినదేదియు లేకపోయినను లోకజనులకై సత్కర్మలను జేసిచూపవలెను.

(రాఘవేంద్రులు) ముక్తిలో ఆనందము అధికముగ గలుగుటకై బ్రహ్మజ్ఞానులుగూడ నిష్కామకర్మ చేయుచున్నారు.

(స్వకీయము) జనులకు హితముచేయువానిమీద ఈశ్వరునకు ప్రీతిగలుగుచున్నదని తాత్పర్యము. జనకరాజును దృష్టాంతముగ జెప్పుటలో ఉద్దేశమేమనగా - "అర్జునా! నీవలె రాజుగనుండుట మాత్రమేగాదు, మహాజ్ఞానిగ నుండిన జనకమహారాజే కర్మము చేసియుండగా నేను కర్మము చేయనక్కరలేదని నీవు తలంచినయెడల అదితప్పు" అనుదానిని తెలియబరచుటకై యని భావింపుడు.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ 21

పద॥ యద్యత్ - ఆచరతి - శ్రేష్ఠః - తత్తత్ - ఏవ - ఇతరః - జనః।
సః - యత్ - ప్రమాణం - కురుతే - లోకః - తత్ - అనువర్తతే॥

| | | | |
|---|---|---|---|
| శ్రేష్ఠః | ప్రధానుడైనవాడు | సః | అతడు |
| యద్యత్ | దేనినిదేనిని | యత్ ప్రమాణం కురుతే | దేనిని ప్రమాణముగ గైకొనుచున్నాడో |
| ఆచరతి | ఆచరించునో | | |
| తత్తదేవ | దానినే | తత్ | దానిని |
| ఇతరః జనః | ఇతరజనుడు | లోకః | లోకము |
| ఆచరతి | చేయుచున్నాడు | అనువర్తతే | అనుసరించుచున్నది. |

తా॥ (వయస్సు, యోగ్యత, ఆచారము, మొదలగువాటిలో) ప్రధానుడైనవాడు ఏయేకర్మల ననుష్ఠించునో (చేయుచున్నాడో) దానినే ఇతర జనులు చేయుచున్నారు. ఆ గొప్పవాడు ఏ శాస్త్రములను ప్రమాణముగగైకొని (దాని ప్రకారము) చేయుచున్నాడో దానినే లోకము (లోకమునందలి జనులు) వెంబడించుచున్నది. అనగా ప్రమాణముగ గైకొనుచున్నది.

(శంకరభాష్యము) లోకసంగ్రహమును (లోకహితమును) ఎవ్వడు చేయవలెను, ఎట్లు చేయవలెను, అనునది చెప్పబడుచున్నది. గొప్పవాడై శ్రేష్ఠుడైనవాడు ఏయే కర్మ ననుష్ఠించునో అయా కర్మనే వానివెంబడిన ఇతరజనులు అనుష్ఠించుచున్నారు. మఱియు మనుష్యులలో శ్రేష్ఠుడైన అతడు లౌకికవిషయమునగాని, వైదికవిషయమునగాని దేనిని ప్రమాణముగ గైకొనునో దానినే లోకము అనుసరించుచున్నది. అనగా ప్రమాణముగ గైకొనుచున్నది.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ 22

పద॥ న - మే (1) - పార్థ - అస్తి - కర్తవ్యం - త్రిషు - లోకేషు - కించన।
న - అనవాప్తం - అవాప్తవ్యం - వర్తే - ఏవ - చ - కర్మణి॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ కుంతీపుత్రుడా! | కించన | ఏదియు |
| త్రిషులోకేషు | మూడులోకములలోను | నాస్తి | లేదు |
| మే | నాకు | (తథాపి) చ | అట్లుండినను |
| కర్తవ్యం | చేయవలసినది | అహం | నేను |
| నాస్తి | ఏదియులేదు | కర్మణి | కర్మలో |
| అనవాప్తం | (ఇప్పుడు) పొందనిదై | వర్తఏవ | ప్రవర్తించుచునే యున్నాను. |
| అవాప్తవ్యం | (ఇక) పొందవలసినది | | |

తా॥ ఓ కుంతీపుత్రుడా! మూడులోకములలోను నాకు చేయవలసినది (ఒక్కటియు) లేదు. ఇప్పుడు నేను పొందనిది ఇక పొందవలసినది ఏదియులేదు. అట్లున్నను కర్మలో ప్రవర్తించుచునే యున్నాను. అనగా కర్మను జేయుచునే వచ్చుచున్నాను.

(1) మే - సర్వేశ్వరుడుగను, సర్వజ్ఞుడుగను, మూడులోకములలోను దేవమనుష్యరూపముల అవతారము చేయువాడనగునాలో లేనిదొక్కటియులేనట్టియు, కనుకనే పొందవలసిన దేదియు లేనట్టియువాడనైన నాకు (రామానుజులు)

ఓ పార్థా! లోకసంగ్రహమును అనగా లోకహితమును జేయవలయునను ఈ విషయము నందును నీకు సంశయముండినచో నీవు ఏల నన్ను దృష్టాంతముగ జూడవు అని భగవంతుడు చెప్పుచున్నాడు. (శంకరులు)



శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥ 23

పద॥ యది - హి - అహం - న - వర్తేయం జాతు - కర్మణి - అతంద్రితః।
మమ - వర్త్మ - అనువర్తన్తే - మనుష్యాః - పార్థ - సర్వశః॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ కుంతీపుత్రా! | నవర్తేయంయది | ప్రవర్తింపక యుండినచో |
| హి | ఎందువల్లననగా | మనుష్యాః | మనుష్యులు |
| అహం | నేను | సర్వశః | అన్నివిధముల |
| జాతు | ఎప్పుడైనను | మమ | నాయొక్క |
| అతంద్రితః | సోమరితనములేనివాడనై | వర్త్మ | మార్గమునే (త్రోవనే) |
| కర్మణి | కర్మయందు | అనువర్తన్తే | అనుసరింతురు |

తా॥ ఓ కుంతీపుత్రా! నే నేకాలమునందును సోమరితనములేక జాగ్రత్తగా (శాస్త్రవిధిని తప్పక) కర్మయందు ప్రవర్తింపక యుండినచో మనుష్యులు (అన్నివిధముల ప్రాణులకు హితమైనదై యున్న) నామార్గమును (నేనెట్లు నడచుచున్నానో ఆ విధమును) అనుసరింతురు.

(1) వర్తేయం - అని పరస్మైపదప్రయోగము అర్షముగ నుంచుకొనవచ్చును. లేక 'వర్తే + అయం అని రెండుపదములుగ విభజించి 'అయం' అనుదానిని 'అహం' అనుదానితోజేర్చి 'అయం అహం = ఈ నేను,' అని అర్థము చేసినను జేయవచ్చునని వెంకటనాథుని తాత్పర్యము.

(స్వకీయము) నేను కర్మయందు ప్రవర్తింపనిచో మనుష్యులు ఏల నా మార్గము ననుసరింతురనిన:— నేను పరమపురుషుడనని ఎరుంగనట్టియు అజ్ఞానులైనట్టియు జనులు శ్రేష్ఠకులమున బుట్టినవాడను, శక్తి, సామర్థ్యము, కీర్తి, మొదలగు వాటివలన గొప్పవాడని తలంపబడు వాడను ఐన, నేనే కర్మము చేయకుండినచో దానినిజూచి కృష్ణుడే కర్మచేయనందున మనమేల చేయవలెనని కర్మను విడిచిపెట్టుదురని తాత్పర్యము.

శ్లో॥ ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మచేదహం।
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః ॥　　24

పద॥ ఉత్సీదేయుః - ఇమే - లోకాః - న - కుర్యాం - కర్మ - చేత్ - అహం ।
సంకరస్య (1) - చ - కర్తా - స్యాం - ఉపహన్యాం - ఇమాః - ప్రజాః ॥

| | | | |
|---|---|---|---|
| అహం | నేను | సంకరస్య చ | (జాతుల) కలయికకును |
| కర్మ | కర్మను | కర్తా | కరగ |
| న కుర్యాంచేత్ | చేయకుండినచో | స్యాం | కాగలను |
| ఇమేలోకాః | ఈ లోకములు | ఇమాఃప్రజాః | ఈ జనులను |
| ఉత్సీదేయుః | (కర్మలోపమువలన) నశించును | ఉపహన్యాం | చెరిపినవాడనగుదును. |

తా॥ నేను కర్మను జేయకయుండినచో ఈ లోకమునందలి జనులు చెడిపోవుదురు. నేను జాతుల కలయికకు కారణమగుదును. ఆ కారణమువలన ఈ జనులను చెడిపినవాడనగుదును

(1) సంకరస్య - కర్మవలన వర్ణాశ్రమ ధర్మములు నిలకడ చెందియుండుటచేత కర్మనుజేయనిచో వర్ణాశ్రమధర్మములు చెడిపోయి దానివలన జాతులకలయిక కలుగును (రాఘవేంద్రులు)

(శంకరులు) అట్లునేను కర్మననుష్ఠించక యుండుటవలన గలుగు చెడుపేమనగా నేను కర్మను క్రమముగననుష్ఠింపక విడిచిపెట్టుటవలన ఆవిధముగ అందరు విడిచిపెట్టెదరు. అప్పుడు లోకము నిలకడజెందుటకు కారణమైన కర్మలేనందున ఈ లోకమంతయు చెడిపోవును. ఇదియుగాక జాతుల కలయికకున్ను కారణము (చేయువాడను) అగుదును. ఆ కారణమువలన ఈ ప్రాణులను చెరిపినవాడనగుదును. "ప్రాణులను అనుగ్రహింప ప్రవర్తించిన నేను వాటికి చెరుపుచేసెదను." అనునది ఈశ్వరుడనైన నాకు తగదు

(రామానుజులు) ప్రజలను అనుగ్రహింప ప్రవర్తించియున్న నాకు జనులు చెడిపోదగిన ఇట్టికార్యముజేయుట తగినది కాదనునది తాత్పర్యము.

(స్వకీయము) అర్జునుడు మొదటి అధ్యాయమున కులస్త్రీలు చెడిపోయినచో జాతుల కలయిక కలుగునని చెప్పెను. దానివలనమాత్రము జాతుల కలయిక కలుగునని తలంపవద్దు, వర్ణాశ్రమధర్మములు లేకపోవుటవలనకూడ జాతుల కలయిక కలుగునని జెప్పినదిగను భావింపవచ్చును.

శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।
కుర్యాద్విద్వాంస్తథాఽసక్త శ్చికీర్షుర్లోకసంగ్రహమ్॥ 25

పద॥ సక్తాః - కర్మణి - అవిద్వాంసః - యథా - కుర్వన్తి - భారత ।
కుర్యాత్ - విద్వాన్ - తథా - అసక్తః - చికీర్షుః - లోకసంగ్రహం ॥

| | | | |
|---|---|---|---|
| హే భారత! | ఓ భరతవంశమున జనించిన వాడా ! | తథా | అటులనే |
| | | విద్వాన్ | ఆత్మజ్ఞానముగల జ్ఞానియైనవాడు |
| అవిద్వాంసః | అజ్ఞానులు | అసక్తః | ఫలమును గోరనివాడై |
| కర్మణి | కర్మలో | లోకసంగ్రహం | లోకసంగ్రహమును (హితమును) |
| సక్తాః | ఫలాసక్తిగలవారలై | చికీర్షు | చేయగోరినవాడై |
| యథా | ఎట్లు | కుర్యాత్ | కర్మను జేయవలెను. |
| (కర్మ) కుర్వన్తి | కర్మనుజేయుచున్నారో | | |

తా॥ ఓ భారతా ! ఆత్మజ్ఞానములేని అజ్ఞానులు కర్మను ఫలాసక్తిగల వారలై ఎట్లు చేయుచున్నారో అటులనే ఆత్మజ్ఞానముగల జ్ఞానియు ఫలమును గోరనివాడై లోకమును సన్మార్గమున ప్రవర్తింపజేయగోరి కర్మను జేయవలెను.

(శంకరభాష్యము) నీవుగాని లేక వేరొకడుగాని నావలె ఆత్మనెరింగినవాడుగను తనకు పురుషార్థము చేకూరినదను బుద్ధిగలవాడుగను నుండినచో అట్టివానికి చేయవలసినదేదియు లేకున్నను అతడున్ను ఇతరులకు అనుగ్రహమే చేయవలెననునది చెప్పబడుచున్నది. నేను చేయు చున్న ఈ కర్మయొక్క ఫలము నాకుకలుగునను ఆసక్తిగలవారలు, కర్మఫలమును ఎదురుచూచు నట్టి అజ్ఞానులు. వారలు ఎట్లు కర్మలను జేయుచున్నారో ఆ విధముగనే ఆత్మజ్ఞాని ఆసక్తిలేనివాడై వాటిని జేయవలెను. అతడు అజ్ఞాని చేయువిదముగ ఎందుకై చేయుచున్నాడు? లోకహితమునకై. అజ్ఞాని ఫలమునపేక్షించి కర్మలను ఎంతటి శ్రద్ధతో జేయునో అంతటిశ్రద్ధతో జ్ఞాని లోకసంగ్ర హము నుద్దేశించి చేయునని భావము.

(రామానుజులు) (ఈ శ్లోకమును పైశ్లోకముతోచేర్చి ఒకే అన్వయముగ చేసియుండుట వలన ఆరెండుశ్లోకముల అర్థమున్ను ఇచ్చటనే విస్తరింపబడుచున్నది.)

ఆత్మావలోకనము లేనివారలుగను, మోక్షాపేక్షగలవారలుగను, కర్మయందు శ్రద్ధగలవారలు గను, కర్మచేయుచునే యున్నవారలుగను ఉన్న జనులకు కర్మకంటె ఆత్మావలోకనమునకు వేరొక్క సాధనమున్నదని చూపి బుద్ధిభేదమును కలుగచేయకూడదు. బుద్ధిభేదము కలుగుటకు కారణమేమన, ఆత్మావలోకనశక్తుడైనవానికి కర్మచేయుటవలన ప్రయోజనమేదియులేదు. కావున ఇతడు కర్మచేయుట లేదు. అజ్ఞానియైనవాడు, ఆత్మావలోకనము గలవాడు కర్మనువిడుచుటకు కారణమిట్టిదని తెలియక తానుగూడ కర్మను విడిచి పెట్టుచున్నాడు. వానికి ఆత్మావలోకనము గలుగుటయు లేదు, కర్మ చేయుటవలన కలుగు ప్రయోజనమున్నులేదు. రెండును చెడినవాడగును. కావున జ్ఞానులు, ఇట్టి అవి వేకులు చెడిపోక యుండుటకై, కర్మయందాసక్తికల వారలు కర్మనైనను క్రమముగజేయుచుండుటకై, తాముచేసియు చేయించియు చూపవలెననునది తాత్పర్యము.

శ్లో॥ * న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినాం।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్ ॥ 26

పద॥ న - బుద్ధిభేదం (1) - జనయేత్ - అజ్ఞానాం - కర్మసంగినాం ।
జోషయేత్ - సర్వకర్మాణి - విద్వాన్ - యుక్తః (2) - సమాచరన్ ॥

| | | | |
|---|---|---|---|
| విద్వాన్ | జ్ఞానియైనవాడు | సర్వకర్మాణి | సకల కర్మలను |
| అజ్ఞానాం | అజ్ఞానులై | (స్వయం) యుక్తః | తానేయోగయుక్తుడై |
| కర్మసంగినాం | కర్మమునందాసక్తి గలవారలకు | సమాచరన్ | బాగుగ అనుష్ఠించుకొని |
| బుద్ధిభేదం | బుద్ధిభేదమును (కలతను) | జోషయేత్ | (వారలచేత) చేయించ |
| న జనయేత్ | కలుగజేయగూడదు | | వలెను. |

తా॥ జ్ఞానియైనవాడు అజ్ఞానులై కర్మమునందాసక్తి గలవారలకు బుద్ధిభేదమును కలుగజేయగూడదు. (అనగా వారలకు కర్మనుజేసి ఫలమనుభవింపవలెనను నిశ్చితబుద్ధిని కలతచెందునటుల చేయకూడదు.) మరేమి చేయవలెననగా సకల కర్మలను తాను యోగయుక్తుడైయుండి బాగుగ ననుష్ఠించుచు (ఆ కర్మలను) వారలనుగూడ అనుష్ఠించునటుల చేయవలెను.

* ఈ శ్లోకమును గర్గసంహిత మాధుర్యఖండము అధ్యా. 1 శ్లో. 47 లో చూడుడు.

(1) బుద్ధి భేదం - ఆత్మ, కర్తకాదు. భోక్తకాదు. అన్నియు పరబ్రహ్మమే. అను నీ విధమైన ఉపదేశములవలన "నేను ఈ కర్మనుచేయవలెను. ఈ కర్మయొక్క ఫలము ననుభవింపవలెను"అని సాధారణ జనులకున్న నిశ్చిత బుద్ధికి చలనమును (కలతను) కలుగజేయుట.

(2) యుక్తః - దేహాదులలో అభిమానములేని వివేకము గలవాడై అనగా యోగనిష్ఠుడై (శంకరానందులు.)

(శంకరభాష్యము) ఈ విధముగ లోకసంగ్రహము చేయగోరిన వాడను ఆత్మనెరింగిన వాడను అయిన నాకుగాని, అట్టివేరొక్కనికిగాని, లోకమును సన్మార్గమున ప్రవర్తింప చేయుటకై మేము నడచిచూపుటకన్న మరియెద్దియు చేయనక్కరలేదు. కావున ఆత్మనెరింగిన యతనికి ఈశ్లోకమున కనుబరచినట్లు ఉపదేశింపబడుచున్నది. కర్మయందాసక్తిగల అజ్ఞాని "నేను ఈ కర్మనుచేసి దానిఫలమును అనుభవింపవలె"నను నిశ్చితబుద్ధిగలవాడుగ నున్నాడు. ఇతని ఈ దృఢమైన నమ్మకమును జ్ఞానియైనవాడు పోగొట్టగూడదు. మరియతడు చేయవలసినదేమనగా అజ్ఞానుల ఆ కర్మనే తాను ఉత్సాహముతో బాగుగననుష్ఠించుచు వారలనుగూడ ఆకర్మలననుష్ఠించునటుల చేయవలెను.



శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥ 27

పద॥ ప్రకృతేః (1) - క్రియమాణాని - గుణైః - కర్మాణి - సర్వశః ।
అహంకారవిమూఢాత్మా - కర్తా - అహం - ఇతి - మన్యతే ॥

| | | | |
|---|---|---|---|
| ప్రకృతేః | ప్రకృతియొక్క | అహంకార విమూ | అహంకారముచేత మోహము |
| గుణైః | గుణములచేత | ఢాత్మా | చెందిన అంతఃకరణము |
| సర్వశః | అన్నివిధముల | | గలవాడు |
| క్రియమాణాని | చేయబడుచున్న | అహం కర్తా ఇతి | నేను జేయువాడనని |
| కర్మాణి | కర్మలను | మన్యతే | తలంచుచున్నాడు. |

తా॥ ప్రకృతియొక్క గుణములచేత అన్నివిధముల చేయబడుచున్న కర్మలను, అహంకారమువలన మైకమొందియున్న మనస్సు (అంతఃకరణము) గలవాడు "అహంకర్తా" అనగా నేను చేయువాడను అని తలంచుచున్నాడు.

(1) ప్రకృతేః - పరమేశ్వరశక్తిని ప్రకృతియనియు, మాయయనియు జెప్పుదురు. (వేంకటనాథులు)

(శంకరభాష్యము) జ్ఞాని, అజ్ఞాని ఇరువురున్ను కర్మచేసినను ఆత్మను ఎరుంగని యజ్ఞానియైనవాడు కర్మమునందెట్లు ఆసక్తిగలవాడగుననునది దీనిలో జెప్పబడుచున్నది.

ప్రకృతి లేక ప్రధానమనునది, సత్త్వము, రజస్సు, తమస్సు, అనుగుణముల సమస్థితి అనగా న్యూనాధికత (హెచ్చుతక్కువ) లేక చేరియుండు అవస్థ. ఆ ప్రకృతియొక్క గుణములనగా వికారములు. అనగా శరీరముగను ఇంద్రియములుగను కనబడుట. వీటిచే లౌకికము, వైదికము అయిన అన్నికర్మలును చేయబడుచున్నవి. "శరీరేంద్రియముల చేరికయే యాత్మ" అను భావము అహంకారము. ఈ అహంకారమువలన పలువిధములుగ మోహమొందియున్న అంతఃకరణముగలవాడు అనగా శరీరేంద్రియముల స్వభావమును గలవాడై తన్ను అట్టి స్వభావము గలవానిగనే తలంచినవాడై శరీరేంద్రియములే తానని తలంచుచున్న ఇతడు (అనగా దేహేంద్రియములు తన వద్దనున్నవిగను, వాటికి - తనకుగల వ్యత్యాసము నెరుంగక అవియే తానని తలంచునతడు) అజ్ఞానముచేత ఆత్మయందు కర్మలనారోపించుకొని ఆయాకర్మలకు "కర్తనేను" అని తలంచుచున్నాడు. (18 వ అధ్యాయము 14-15 శ్లోకములలో కర్మయొక్క 5 కారణములు చెప్పియుండుటను చూడుడు)

(రాఘవేంద్రులు) "ప్రకృతేః = మాయయొక్క, గుణైః = సత్త్వాది గుణములను గైకొని, ప్రకృతేః = జీవస్వభావముయొక్క, గుణైః = గుణములచేత, అనగా — తత్త్వజ్ఞానము, మిథ్యాజ్ఞానము, మిశ్రజ్ఞానము వీటిచేత, ప్రకృతేః = పరమాత్మయొక్క, గుణైః = ఇచ్ఛాశక్తి మొదలగు గుణములచేత" యని ఇట్లు మూడు విధములుగా అర్థముచేసియున్నారు. కర్మలనగా సాధుకర్మము, మిశ్రకర్మము, అసాధుకర్మము.



శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః ।
గుణా గుణేషు వర్తన్తే ఇతి మత్వా న సజ్జతే ॥ 28

పద॥ తత్త్వవిత్ - తు - మహా బాహో - గుణకర్మవిభాగయోః ।
గుణాః - గుణేషు - వర్తన్తే - ఇతి - మత్వా - న - సజ్జతే ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో ! | ఓ గొప్పభుజములుగలవాడా ! | తత్త్వవిత్తు | యథార్థము నెరింగినవాడైతే |
| గుణకర్మ విభాగయోః | గుణములయొక్కయు, కర్మలయొక్కయు విభాగములయొక్క | గుణాః | ఇంద్రియము లనెడి గుణములు |
| | | గుణేషు | (శబ్దాది) విషయములనే గుణములలో |

| | | | |
|---|---|---|---|
| వర్తన్తే | ప్రవర్తించుచున్నవి | మత్వా | తెలిసికొని |
| ఇతి | అని | న సజ్జతే | ఆసక్తి గొనుటలేదు. |

తా॥ ఓ గొప్ప భుజములుగల అర్జునా! గుణముల విభాగమున్ను, వాటి వ్యాపారములైన కర్మల విభాగమున్ను, వీటితత్త్వమునున్ను ఎరింగినవాడు (అనగా జ్ఞాని)అయినచో ఇంద్రియరూపములైన గుణములు వాటివిషయములైన శబ్దాది రూపములైన గుణములలో ప్రవర్తించుచున్నవి, అవి ఆత్మకుకావు అని తెలిసికొని (కర్మలయందు) ఆసక్తి లేనివాడుగ నుండును.

(శ్రీధరులు) గుణ కర్మల విభాగముయొక్క వాస్తవతను ఎరింగినవాడనగా సత్త్వము, రజస్సు, తమస్సు, అను గుణములు తనవికావు, ఆత్మయైన తాను ఆ గుణములు కాదు. కర్మతనది కాదు, తాను కర్మలను చేసెడివాడుకాడు. గుణములు, కర్మలు, వీటికంటె తాను వేరైనవాడు అని ఎరింగినవాడే గుణకర్మ విభాగములను ఎరింగినవాడని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) గుణకర్మ విభాగయోః - గుణానాం = భగవంతుని ఇచ్ఛ మొదలగు గుణములకున్ను, ప్రకృతియొక్క సత్త్వాదిగుణములకున్ను, ప్రకృతివికారమైన దేహేంద్రియ మనస్సులకున్ను పరస్పరభేదములున్ను, కర్మణాం = భగవత్సృష్టి మొదలగు కర్మలకున్ను, భగవదధీనుడైన జీవునిచే చేయబడు కర్మలకున్ను పరస్పరభేదమునున్ను, తత్త్వవిత్తు = యథార్థముగ నెరింగినవాడు, గుణాః = భగవదిచ్ఛాది గుణములు, గుణేషు = జీవస్వభావ కర్మాదులలోను, గుణాః = ఇంద్రియములు భగవదిచ్ఛానుసారముగ, గుణేషు = శబ్దాది విషయములలోనున్ను, వర్తన్తే = ప్రవర్తించుచున్నవి, అని వ్యాఖ్యానించియున్నారు.

శ్లో॥ ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు ।
తానకృత్స్నవిదోమన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥ 29

పద॥ ప్రకృతేః - గుణసమ్మూఢాః - సజ్జన్తే - గుణకర్మసు ।
తాన్ - అకృత్స్నవిదః - మన్దాన్ - కృత్స్నవిత్ - న - విచాలయేత్ ॥

| | | | |
|---|---|---|---|
| (యే) | ఎవరు | తాన్ | |
| ప్రకృతేః | ప్రకృతియొక్క | అకృత్స్నవిదః | పూర్తిగ ఎరుగని |
| గుణసమ్మూఢాః | గుణములచే బాగుగ మోహ | మన్దాన్ | మన్దబుద్ధిగలవారలను |
| (సన్తః) | మొందినవారలై | కృత్స్నవిత్ | అన్నిటిని ఎరింగిన ఆత్మజ్ఞాని |
| గుణకర్మసు | గుణకర్మలలో | నవిచాలయేత్ | కలతచెందునటు చేయకూడదు |
| సజ్జన్తే | ఆసక్తియుంచెదరో | | |

తా॥ ఎవ్వరు ప్రకృతియొక్క గుణములచేత బాగుగ మతిమైకముచెందిన వారలై గుణములయొక్క కర్మలలో నాసక్తియుంచెదరో, ఆ మందబుద్ధి గల వారలను (అజ్ఞానులను) అన్నియునెరింగిన ఆత్మజ్ఞానియైనవాడు కలతచెందు నటుల జేయగూడదు. (అనగా అజ్ఞానముచేత, "కర్మను జేయుచున్నాము, దాని ఫలమును బడయుటకై" అని కర్మఫలములో దృష్టిగల కర్మాసక్తిగల వారలకు కర్మజేయుటయందున్న నిశ్చితబుద్ధిని మార్పగూడదని భావము.)

(రామానుజులు) కృత్స్నవిత్ = సకలకర్మలున్ను ప్రకృతికార్యమని యెరింగినజ్ఞాని ఆత్మానాత్మజ్ఞానములేని మూఢులకు కర్మనువిడిచి జ్ఞానమార్గమున ప్రవర్తించునట్లు బోధింపగూడదు. ఏలనగా మూఢుడున్ను అవివేకియునైన అతనికి జ్ఞానమార్గము సిద్ధింపనేరదు. ఈ జ్ఞానియైనవాడు కర్మవలన ప్రయోజనములేదని చెప్పినవాక్యమును ఆధారముగగైకొని మూఢుడు కర్మను మాత్రము విడిచిపెట్టును. దానివలన కర్మఫలము గలుగుటకు హేతువున్ను పోవును. జ్ఞానసిద్ధికి యోగ్యుడున్ను కాడు. రెండున్ను చెడినవాడగును. కావున జ్ఞానియైనవాడు, కర్మ ఆత్మదర్శనమునకు సాధనమైనదనియు, దానిని విడిచిన నీకుమరియొక ప్రయోజనము లభింపదనియుజెప్పి తాను కర్మనుజేసియు, జేయించియు చూపవలెనని తాత్పర్యము.

(మధ్వాచార్యులు) ఇంద్రియములు, శబ్దాదివిషయములు, సత్త్వరజస్తమస్సులు ముఖ్యములుకానివెవ్వియో అవి మొదలగు వీటికన్నిటికిని గుణములనిపేరు.

(స్వకీయము) మాయయొక్క గుణములచేత మూఢులుగనున్న ఎవ్వరు ఇంద్రియముల వ్యాపారములలో అభిమానముంచెదరో, ఎవరు ఏదియు ఎరుంగని జ్ఞానహీనులో వారిని ఆత్మజ్ఞానియైనవాడు కర్మను విడిచి మారుగనడచునట్లు చేయగూడదు.



శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥ 30

పద॥ మయి - (1) - సర్వాణి - కర్మాణి - సన్న్యస్య - (2) - అధ్యాత్మచేతసా। (3)
నిరాశీః - నిర్మమః - భూత్వా - యుధ్యస్వ - విగతజ్వరః ॥

| | | | |
|---|---|---|---|
| (త్వం) | నీవు | నిరాశీః | ఆశలేనివాడవై |
| అధ్యాత్మచేతసా | ఆత్మనాశ్రయించిన మనస్సుతో | నిర్మమః | మమకారములేనివాడవై |
| సర్వాణి కర్మాణి | సకల కర్మలనున్ను | విగతజ్వరః భూత్వా | దుఃఖమును విడచినవాడవై యుండి |
| మయి | నాయందు | | |
| సన్న్యస్య | అర్పించి | యుధ్యస్వ | యుద్ధమును జేయుము. |

తా॥ (ఓ అర్జునా!) నీవు సకలకర్మలనున్ను నాయెడ నొప్పగించి కర్మలయొక్క ఫలములను నాకర్పణముచేసి, అనగా 'నేను పరమాత్మయొక్క దాసుడనై సకలకర్మలనుజేసి పరమాత్మకు అర్పణము చేయదగినవాడను' అను ఈ వివేకబుద్ధితో ఫలాపేక్షలేకయు 'ఇది నాది'యను మమకారమునువిడిచియు వ్యసనమును విడిచినవాడవైయుండి యుద్ధమును జేయుము.

(1) మయి - అన్నిటియాత్మగను సర్వజ్ఞుడుగను పరమేశ్వరుడుగను ఉన్న భగవంతుడనై వాసుదేవుడనైన నాయెడ (శంకరులు,) పరమాత్మయైన నాయందు (రామానుజులు.)

(2) సంన్యస్య - నిక్షిప్య = ఒప్పగించి, అనగా అర్పణముచేసి (శంకరులు,) భగవంతుడే నా హృదయమునందుండి చేయుచున్నాడను తలంపుతోజేసి అతనికి ఒప్పగించి (రాఘవేంద్రులు.)

(3) అధ్యాత్మచేతసా - నేను జేసెడివాడను, ఈశ్వరునికై కింకరునివలె కర్మను జేయుచున్నాను, అను వివేకబుద్ధితో (శంకరులు,) కృష్ణపరమాత్మ సర్వోత్తముడైయున్న పరమాత్మయను బుద్ధిచేత (రాఘవేంద్రులు.)

(స్వకీయము) సంసారమునుండి విడువబడి మోక్షమొందగోరుచున్న అజ్ఞానియగు కర్మాధికారి కర్మను ఎట్లు చేయవలెననునది ఈ శ్లోకమున జెప్పబడినది. శ్రుతులవలన గలిగిన ఆత్మస్వరూప విషయమైన జ్ఞానముతో, అనగా తాను భగవంతునికి శరీరమనియు, భగవంతునిచే ప్రవర్తింపజేయబడువాడనియు తలంచి ఎల్లరికిని ఈశ్వరుడును, నియమించువాడును, శేషియు, అనగా పరిపాలకుడునైన పరమపురుషుడే, తనవాడైన ఆత్మచేత, తన యుపకరణము (సాధన సామగ్రి) చేత తన ఆరాధనకొఱకై తానుగనే తన కర్మలను చేయించుకొనుచున్నాడని నమ్మి, మమకారము మొదలగువాటినివిడిచి పరమ పురుషుడే కర్మలచే నారాధింపబడి సంసారబంధము నుండి విడిపింపగలడని తలంచి కర్మ చేయబడవలె ననునది విశిష్టాద్వైతపరమైన తాత్పర్యము.



శ్లో॥ యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥ 31

పద॥ యే - మే - మతం - ఇదం - నిత్యం - అనుతిష్ఠన్తి - మానవాః ।
శ్రద్ధావన్తః - అనసూయన్తః - ముచ్యన్తే - తే - అపి - కర్మభిః ॥

| | | | |
|---|---|---|---|
| యే మానవాః | ఏ మనుష్యులు | నిత్యం | ఎల్లప్పుడు |
| మే | నాయొక్క | అనుతిష్ఠన్తి | అనుసరించినడుచుచున్నారో |
| ఇదంమతం | ఈ మతమును (అభిప్రాయమును) | తేపి | వారలుగూడ |
| శ్రద్ధావన్తః | శ్రద్ధగలవారుగను | కర్మభిః | కర్మలచేత |
| అనసూయన్తః | అసూయ లేనివారుగను | ముచ్యన్తే | విడువబడుచున్నారు. |

తా॥ ఏ మనుష్యులు ఈ నామతమును (అభిప్రాయమును, సిద్ధాంతమును) శ్రద్ధావిశ్వాసముతోను, (నమ్మకముతోను) దూషింపకయు, ఎల్లప్పుడును అనుసరించి నడచుచున్నారో వారుగూడ ధర్మాధర్మములనే పేరుగల కర్మలచేత (కర్మబంధమునుండి) విడువబడుచున్నారు.

(శంకరులు) "అజ్ఞానికర్మను జేయవలెను'' అని నేను న్యాయముతో జెప్పిన నా యీ సిద్ధాంతమును అట్లనుసరించు వారలు క్రమక్రమముగ ముక్తిబడయుదురనునది చెప్పబడుచున్నది. ఎవరు సకలప్రాణులహృదయమున నివసించువాడను, పరమగురువును, వాసుదేవుడను అగు నన్నుగూర్చి అజ్ఞానము వలనగాని, అసూయవలనగాని "నన్నే శరణముగ గైకొనుమని భగవంతుడు ఆత్మశ్లాఘచేయుచున్నాడు'' అని దూషింపక నమ్మకముతో నా యొక్క పైజెప్పిన మతము ననుష్ఠించెదరో, వారు ధర్మాధర్మములను పేరుగలకర్మలచే విడువబడుదురు. (అసూయ యనగా గుణముగనున్నదానిమీద దోషము నారోపించుట, శ్రద్ధయనగా గురువుచేతను శాస్త్రములచేతను ఇహపర విషయముగ జెప్పబడిన ఉపదేశమునందు పూర్ణమైన నమ్మకముంచి నడచుట)

(రామానుజులు) "తేఽపి=వారలుగూడ" అనువాక్యమునందుగల 'అపి' శబ్దము మరి కొందరిని చేర్చునటుల ఉపయోగింపబడియున్నది. వారలెవరనగా శాస్త్రాధికారులైన యే మనుష్యులు ఈ గీతాశాస్త్రమే శాస్త్రార్థమని తెలిసి ఆ విధముగ అనుష్ఠించెదరో వారలున్ను, లేక అనుష్ఠింపక పోయినను ఈ శాస్త్రార్థమును ఎరింగి దానిలోభక్తి శ్రద్ధలనుంచెదరో వారలున్ను, భక్తిశ్రద్ధలు లేక పోయినను ఈ శాస్త్రమును నిందింపకయున్నారో వారలున్ను, అనాదిగ వచ్చియున్న సకల కర్మలనుండియు విడువబడుచున్నారు.

(స్వకీయము) "ఇదంమతం = ఈ యభిప్రాయము" అనునది దీనికి మునుపటి శ్లోక మున జెప్పిన అభిప్రాయమని తోచుచున్నది. అనగా కర్మలను ఈశ్వరార్పణముగచేసి ఫలమును ఈశ్వరుని కొప్పగించి ఫలమును గోరకయు అభిమానములేకయు నుండుటయే.

శ్లో॥ యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః ॥ 32

పద॥ యే - తు - ఏతత్ - అభ్యసూయన్తః - న - అనుతిష్ఠన్తి - మే - మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాన్ - తాన్ - విద్ధి - నష్టాన్ - అచేతసః ॥

| | | | |
|---|---|---|---|
| యేతు | మరియెవ్వరు | సర్వజ్ఞాన విమూఢాన్ | బ్రహ్మవిషయమైన సకల కర్మ విషయమైన జ్ఞానమునందు మూఢులుగను ఉన్న |
| మే | నాయొక్క | | |
| ఏతత్ మతం | ఈ (పైజెప్పిన) అభిప్రాయమును | | |
| అభ్యసూయన్తః | ద్వేషించుచున్నవారై | తాన్ | వారిని |
| నానుతిష్ఠన్తి | అనుసరించి నడచుటలేదో | నష్టాన్ | చెడిపోయినవారినిగ |
| అచేతసః | అవివేకులుగను | విద్ధి | ఎరుంగుము. |

తా॥ మరియెవ్వరు నా యీ యభిప్రాయమును ద్వేషించుచున్నవారలై అనుసరించుటలేదో, మఱియు అవివేకులుగను, బ్రహ్మవిషయమునను సకల కర్మల విషయమునను జ్ఞానములేని మూఢులుగను ఉన్న అట్టివారిని చెడి పోయినవారినిగ ఎరుంగుము. (వీరలుమునుపటి శ్లోకమున జెప్పబడినవారలకు విపరీతమైనవారలు)

(1) మతం - సకలవస్తువులున్ను నాశరీరము కావున నన్నేఆధారముగ గలవనియు, నాయొక్క శేష భూతములనియు, నాచేతనే ప్రేరేపింపబడుచున్నవనియు గల నా మతమును (రామానుజులు).



శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥ 33

పద॥ సదృశం - చేష్టతే - స్వస్యాః - ప్రకృతేః - జ్ఞానవాన్ - అపి ।
ప్రకృతిం - యాన్తి - భూతాని - నిగ్రహః - కిం - కరిష్యతి ॥

| | | | |
|---|---|---|---|
| జ్ఞానవానపి | జ్ఞానముగలవాడుగూడ | భూతాని | ప్రాణులు |
| స్వస్యాః | తనయొక్క | ప్రకృతిం | స్వభావమును (ప్రకృతిని) |
| ప్రకృతేః | ప్రకృతికి (స్వభావమునకు) | యాన్తి | అనుసరించుచున్నవి |
| సదృశం | తగినట్లే | నిగ్రహః | (దానిని) అడ్డగించుట |
| చేష్టతే | నడచుచున్నాడు | కిం కరిష్యతి | (వీరలకు) ఏమిచేయగలదు? |

తా॥ జ్ఞానికూడ తన స్వభావమునకు అనగా పూర్వజన్మ వాసనకు తగినట్లే నడుచుచున్నాడు. ఇట్లు ప్రాణులన్నియు తమతమ స్వభావము ననుసరించి నడుచుటవలన దానిని శాస్త్రముగాని నేనుగాని అడ్డగించుట ఏమి ప్రయోజనమును కలుగజేయగలదు?

(1) నిగ్రహః - శాస్త్రనిషేధము (శంకరులు), మనోనిగ్రహము, లేక, దండించుట (రాఘవేంద్రులు).

(శంకరభాష్యము) పైజెప్పిన వారలు ఏకారణమువలన నీ మతము ననుష్ఠించక పర ధర్మములను అనుష్ఠించుచున్నారు? స్వధర్మమునున్ను అనుసరించుటలేదు? నీకు ప్రతికూలముగ నడిచెడివారలు నీ యాజ్ఞను ఉల్లంఘించుటయను నపరాధమునకు ఏల భయపడుటలేదు? అనుదానికి కారణము జెప్పబడుచున్నది. జ్ఞానవంతుడుగూడ తన స్వభావమునకు తగినట్లు కర్మను జేయు చున్నాడు. స్వభావమనగా ఈ జన్మారంభమున వెలువడినదై మునుపటి జన్మములలో చేయబడిన ధర్మాధర్మముల సంస్కారము, అనగా వాసన, అదియే ఈ శ్లోకమున వారివారి ప్రకృతియని చెప్ప బడినది. దానిననుసరించియే ప్రాణులన్నియు, (జ్ఞానముగలవాడుకూడ) నడచుచున్నవి. ఇక మూఢునిగూర్చి వేరేచెప్పవలెనా? కావున ప్రాణులు తమ తమ ప్రకృతిని వెంబడించుచున్నవి. నేను గాని మరియొకడుగాని దానినడ్డగించి అణగద్రొక్కుట ఏమిచేయగలదు? జ్ఞానవంతుడుకూడ పూర్వ జన్మవాసనకు వశుడై పాపములైన దుష్కర్మములను లెక్కింపక చేయుచున్నాడని గ్రహింపుడు.

(స్వకీయము) 'ప్రకృతేః' అనుపదమునకు శంకరులు, రాఘవేంద్రులు 'పూర్వకర్మ సంస్కారమనియు', రామానుజులు పూర్వకర్మవాసనయనియు, శ్రీధరులు పూర్వకర్మ సంస్కార మునకు లోబడిన స్వభావ'మనియు జెప్పియున్నారు. అన్వయార్థమున స్వభావమని యుంచబడి యున్నది. ఇవియన్నియు ఒకదానినే గుర్తించుచున్నవి. వాటిలో ఒకదానికి జెప్పబడు అర్థమే అన్నిటికిని చెప్పబడినదగును. పూర్వజన్మమున ఒకడు చేసిన పుణ్యకర్మలకై స్వర్గాదిలోకములలో సుఖఫలమును, పాపములకై నరకాదిలోకములలో దుఃఖఫలమును పొందుచున్నాడు. అట్లు స్వర్గ నరకాదిలోకములను చెందినవాడు ఆ లోకములలో సుఖదుఃఖముల ననుసరించి మిగిలియున్న కర్మ (పాపముగాని పుణ్యముగాని) ఏదికలదో దానికి తగినట్లు ఈ మనుష్యలోకమునందుగాని, లేక దానికన్న శ్రేష్ఠమైన, లేక తక్కువైనలోకమునందుగాని జన్మ ఎత్తుచున్నాడు. ఆ మిగిలిన భాగమే కర్మశేషము, కర్మవాసన, సంస్కారము అని చెప్పబడుచున్నది. ఆ మిగతయనునది ఎట్టిదనగా కస్తూరి, పునుగు, మొదలగు వాసనగల వస్తువు లుంచబడియున్న పెట్టెమొదలగు వాటిలో ఆ వస్తువులుపూర్తిగా వ్యయమైపోయినను పెట్టెమొదలగు వాటిలో వాసనమాత్రము ఎట్లు పోకుండునో మఱియు నూనెయుంచిన పాత్రములో నూనెవ్యయమైనపిదప నూనెవాసన ఎట్లుండునో అటులనే పుణ్యపాపకర్మలకు ఫలమనుభవించిన పిదపకూడ ఆ కర్మలవాసన వాని వెంబడే తనకు తగినటుల జన్మములనున్ను ప్రవృత్తినిన్ని కలుగచేయుచున్నదని కొందరిపక్షము. శంకరులు బ్రహ్మ

సూత్రము 3-1-8 కి చేసియున్న భాష్యమున కర్మశేషమనునది అనుభవింపక మిగిలియున్న సంచితమేగాని అనుభవించిన కర్మయొక్క వాసన కాదని చెప్పియున్నారు.

శ్లో॥ ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ॥ 34

పద॥ ఇంద్రియస్య - ఇంద్రియస్య - అర్థే - రాగద్వేషౌ - వ్యవస్థితౌ।
తయోః - న - వశం - ఆగచ్ఛేత్ - తౌ - హి - అస్య - పరిపంథినౌ॥

| | | | |
|---|---|---|---|
| ఇంద్రియస్య ఇంద్రియస్య | ఆయా ఇంద్రియముయొక్క | నాగచ్ఛేత్ | పొందగూడదు |
| అర్థే | శబ్దాది విషయములలో | హి | ఏలనగా |
| రాగద్వేషౌ | రాగద్వేషములు | తౌ | అవి |
| వ్యవస్థితౌ | అమర్చబడియున్నవి | అస్య | ఇతనికి |
| తయోః | వాటియొక్క | పరిపంథినౌ | శత్రువులుగ నున్నవి. |
| వశం | వశమును | | |

తా॥ రాగద్వేషములు ఆయా ఇంద్రియముయొక్క విషయమునందు అమర్చబడియున్నవి. ఎవ్వరున్ను ఆ రాగద్వేషాదులకు వశము కాకూడదు. అనగా వాటికి లోబడగూడదు. ఏలన ఆ రాగద్వేషాదులు ఇతనికి (పురుషునికి) విరోధులైయున్నవి.

(శంకరభాష్యము) సకల ప్రాణులున్ను తమతమ ప్రకృతికి (స్వభావమునకు) తగినట్లే నడచునట్టివిగాను, ప్రకృతిలేనిదిగ ఒక్కటియు లేదనునదిగాను ఉండినచో పురుష ప్రయత్నమునకు అవకాశము లేకపోవుటవలన శాస్త్రము వ్యర్థమని దానిని దూషణముగ జెప్పవలసివచ్చుననినచో దానికి ప్రత్యుత్తరము ఈ శ్లోకమున భగవంతునిచే చెప్పబడుచున్నది.

ఇంద్రియములన్నిటికిన్ని విషయములైన శబ్దాదులలో ఒకనికి ఇష్టమైనదానిలో రాగమున్ను (కోరికను), ఇష్టముకానిదానిలో ద్వేషమున్ను, ఈ విధముగ ప్రతి ఇంద్రియ విషయమునందును రాగద్వేషములు తప్పక గలుగుచున్నవి. ఇచ్చటనే పురుష ప్రయత్నమునకున్ను శాస్త్ర విషయమునకున్ను అవకాశమున్నట్లు చెప్పబడుచున్నది. శాస్త్రవిషయమును గైకొని నడచెడివాడు మొదటనుండే రాగద్వేషములకు లోబడగూడదు. ఏలనగా పురుషుని ప్రకృతి (స్వభావము) అనునది రాగద్వేషముల మార్గముగనే అనగా ఆ రాగద్వేషములను ముందుంచియే ఆ పురుషుని తన త్రోవకు ఈడ్చుచున్నది. అప్పుడు స్వధర్మమును విడనాడుటయు, పరధర్మమును గైకొనుటయు గలుగుచున్నవి. అయినను ఎప్పుడొకడు రాగద్వేషములను వాటివిరోధియైన వివేకబుద్ధినిగొని అడ్డగించి అణచునో అప్పుడాపురుషుడు శాస్త్రమున నమ్మకము గలవాడగునేగాని ప్రకృతి వశుడగుటలేదు. కావున ఎవ్వరును ఈ రాగద్వేషములకు వశముగాకూడదు. ఏలన అవి మార్గమునందలి దొంగలవలె ఈ పురుషునికి సన్మార్గమునకు విఘ్నముచేయునట్టి శత్రువులు. కావున, శ్రేయోమార్గమును గోరునతడు శాస్త్రీయమైన వివేక బుద్ధిచేత మంచిదానిని తెలిసికొని చేయుటయు, చెడ్డదానిని ఎరింగి విడుచుటయు పురుషప్రయత్నముచేత కాగలదని భావము.

(శ్రీధరులు) రాగద్వేషములకు స్వాధీనముకాక యుండవలెనననిచో శాస్త్రార్థముల నెరింగి అనుష్ఠించి ఈశ్వరభజన జేయుచుండవలసినది ముఖ్యమైనది.

(మధ్వాచార్యులు) కర్మవాసనచే ఈడ్వబడునతనికి ఇంద్రియనిగ్రహముచేత ప్రయోజనములేదని మునుపే చెప్పబడినది. కామక్రోధములకు స్వాధీనముకాగూడదని దీనిలో చెప్పబడుచున్నది. ఇందువలన క్రమక్రమముగ ఇంద్రియనిగ్రహము చేయుచుండినచో (పిదప కామక్రోధాదుల నణచి) కాలాంతరమున ప్రయోజనమొందవచ్చునని తాత్పర్యము.

(స్వకీయము) శ్రీధరస్వాముల యభిప్రాయమును స్వల్పముగవివరించి క్రిందకనబరచినటుల చెప్పవచ్చును:— ఇంద్రియములచే లోకమునందలి వస్తువులనుచూచుట, వినుట మొదలగు వాటివలన ఆశ, కోపము, లేకద్వేషము, ఇవి గలుగుచున్నవి. ఎట్లనగా సుఖము గలుగజేయదగిన ఒకవస్తువును కన్ను చూచినతోడనే ఆ వస్తువుయెడ ఆశ గలుగుచున్నది. కోరినవస్తువు లభించుటలో ఏదైన ఒకవిఘ్నము గలుగజేయబడినచో ఆ విఘ్నము ఎవ్వరిచే గలిగెనో వారియెడకోపము, లేక ద్వేషము కలుగుచున్నది. కావుననే రాగమున్ను ద్వేషమున్ను విషయములైన వస్తువుల యందున్నదిగ చెప్పబడినవి. జ్ఞానియైనవాడు వస్తువులలో కోరికయుంచినచో దానినుండి ఆశయు, కోపముకలిగి జ్ఞానప్రవృత్తిని చెడుపును. కావున జ్ఞానికి శత్రువని చెప్పబడినవి. శాస్త్రార్థవిచారము, పరమేశ్వర భజనమును గలుగజేయుచున్నది. పరమేశ్వరభజనము రాగద్వేషములకు లోబడక కాపాడుచున్నది.

శ్లో॥ శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35

పద॥ శ్రేయాన్ (1) - స్వధర్మః (2) - విగుణః (3) - పరధర్మాత్ (4) - స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే - నిధనం - శ్రేయః - పరధర్మః - భయావహః ॥

| | | | |
|---|---|---|---|
| స్వనుష్ఠితాత్ | బాగుగ ననుష్ఠింపబడిన | (స్థితస్య) | ఉండినవానికి |
| పరధర్మాత్ | ఇతరుల ధర్మమునకంటె | నిధనం | మరణమైనను |
| విగుణః | గుణములేని | | శ్రేష్ఠమగును. |
| స్వధర్మః | తన ధర్మము | పరధర్మః | ఇతరుల ధర్మము |
| శ్రేయాన్ | శ్రేష్ఠమగును | భయావహః | (నరక) భయమును గలుగ |
| స్వధర్మే | తన ధర్మమున | | జేయును. |

తా॥ ఇతరులధర్మము బాగుగ అనుష్ఠింపబడినను, దానికంటె తన సొంత ధర్మము గుణములేనిదైనను శ్రేష్ఠమగును. ఇతరుల ధర్మము నాశ్రయించుకొని బ్రతుకుటకన్న స్వధర్మమునందుండి మరణమునొందినను హితమైనదగును. ఏలన ఇతరులధర్మము నరకము మొదలగు భయమును (అపాయమును) కలిగించును.

(1) శ్రేయాన్ — స్వర్గాదిప్రాప్తినిచ్చును. (శ్రీధరులు)

(2) స్వధర్మః - తనవర్ణాశ్రమములకు సంబంధించిన ధర్మము. (రాఘవేంద్రులు), కర్మయోగము (రామానుజులు).

(3) విగుణః - అంగహీనం, అనగా పరిపూర్ణముకాని కర్మ (శ్రీధరులు, రాఘవేంద్రులు).

(4) పరధర్మాత్ - జ్ఞానయోగముకంటె (రామానుజులు), ఇతరుల వర్ణాశ్రమములకు తగిన ధర్మము కంటె (రాఘవేంద్రులు).

(రామానుజులు) అర్జునా! కర్మకు మాత్రము అధికారివైన నీవు, శ్రేష్ఠమైన జ్ఞానాధికారికి తగిన జ్ఞాననిష్ఠను అనుష్ఠించవచ్చునని తలంచి యుద్ధముచేయుటను విడచిపెట్టినచో నరకమొందగలవు అని భగవంతుడు చెప్పుచున్నాడు,

(స్వకీయము) రాగద్వేషాదులవలన ప్రేరేపింపబడినవాడు ఇతరులధర్మమున్ను ధర్మమే, అదిగూడ అనుష్ఠింపదగినదేయని శాస్త్రవిషయమును తప్పుగా గ్రహించుకొనుచున్నాడు అది సరియైనదిగాదు. ప్రతియొక్కడు వానివాని పూర్వజన్మపరిపాకమునకు తగినస్వభావము, దాని కనుకూలమైన జాతి, కులము, దేశము మొదలగువాటిలో ఇప్పుడు జనించుచున్నాడు. ఆ జాతి మొదలగువాట్లకు తగిన ధర్మములు ఇట్టివని లోకసంగ్రహము నుద్దేశించి సర్వజ్ఞుడైన ఈశ్వరునిచే, వేదశాస్త్రాదుల మూలముగ ప్రకటింపబడియున్నదే వానివాని స్వధర్మమని చెప్పబడుచున్నది. ఇట్లు ఈశ్వరుడు వానివాని స్వభావమునకు తగినటుల జననమున్ను 'స్వధర్మమున్ను ఇచ్చియుండినను దానికి విరోధముగ తత్కాలమున జనులు తమ అల్పబుద్ధిచేత పరధర్మములు తమకు శ్రేష్ఠములని నిశ్చయించుకొని ఆ పరధర్మములను అనుష్ఠించుచున్నారు. అల్పబుద్ధినిగైకొని ఇతడు తనకు శ్రేయస్సని నిశ్చయించుకొనిన పరధర్మము, అంతమున చెరుపునే కలుగజేయునదిగావున ఈ శ్లోకమునందు ప్రతియొక్కడు వానివానికి ఏ (కర్మము) ధర్మము విధింపఁబడియున్నదో దానిననుష్ఠించుట శ్రేష్ఠమేగాని తనధర్మముకంటె ఇతరులధర్మము శ్రేష్ఠముగ దోచినను ఆయితరుల ధర్మము ననుష్ఠించునతడు నరకమొందునని చెప్పబడినది. ఉదాహరణము:— వైశ్యుడు వానికర్మలైన పైరు పెట్టుట, గోసంరక్షణ వ్యాపారము వీటినివదలి క్షత్రియధర్మమైన యుద్ధము, రాజ్యపరిపాలనము మొదలగువాటిని జేయుటయు, అటులనే క్షత్రియుడు తన స్వభావమునకు తగనివ్యాపారము పైరు బెట్టుట మొదలగు కర్మలను జేయుటయు మొదలుపెట్టినచో లోకము బాగుగ నడువక చెడిపోవును. ఆ కారణమువలన అది నరకము నిచ్చుచున్నది. అయినను తన స్వధర్మము కొరతగలదిగ తోచినను దానినే యనుష్ఠించినచో మరల ఈశ్వరుడు దానిమూలముగనే ఇతడు సద్గతిని పొందునటుల జేయుచున్నాడు. ముందురాబోవు 18-వ అధ్యాయమున నాల్గు వర్ణస్థుల స్వభావమైన కర్మలిట్టివని చెప్పి 47-వ శ్లో-నందును"శ్రేయాన్ స్వధర్మో విగుణః"అని జెప్పబడి యుండుటనున్ను జూడుడు. మఱియు:-

"స్వధర్మాచరణం శక్త్యా విధర్మాచ్చ నివర్తనం।
దైవాల్లబ్ధేన సంతోష ఆత్మవిచ్చరణార్చనం ॥"

"తన చేతనైనంతవరకు స్వధర్మము నాచరింపవలయును. ఇతరుల ధర్మమును అనుష్ఠింపక నివర్తింపవలెను. దైవాధీనముగ లభించినవస్తువులలో సంతోషమొందువాడుగను జ్ఞానుల పాదసేవ చేయువాడుగను నుండవలసినది" అని శ్రీ భాగవతము 3 - 22 - 8 లో చెప్పబడియుండుటను జూడుడు.

అర్జున ఉవాచ:—

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥ 36

పద॥ అథ - కేన - ప్రయుక్తః - అయం - పాపం - చరతి - పూరుషః ।
అనిచ్ఛన్ (1) - అపి - వార్ష్ణేయ - బలాత్ - ఇవ - నియోజితః ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు జెప్పినది | బలాత్ | బలాత్కారముగ |
| హే వార్ష్ణేయ ! | ఓ వృష్ణివంశమున జనించిన వాడా! | నియోజిత ఇవ | ప్రేరేపింపబడినవానివలె |
| | | కేన | దేనిచేత |
| అథ | అట్లైనచో | ప్రయుక్తః | ప్రేరేపింపబడినవాడై |
| అయం పూరుషః | ఈ పురుషుడు | పాపం | పాపమును |
| అనిచ్ఛన్ అపి | (పాపముజేయ) కోరనప్పటికిని | చరతి | చేయుచున్నాడు. |

**తా॥ అర్జునుడు జెప్పినది - ఓ వృష్ణివంశమున జనించిన కృష్ణా! అట్లైనచో ఈ పురుషుడు పాపము చేయగోరనప్పటికిని దేనివలన ప్రేరేపింపబడినవాడై బలాత్కారము చేయబడినవానివలె పాపము చేయుచున్నాడు?**

(1) అనిచ్ఛన్నపి - విషయానుభవమునందు కోరికలేకున్నను విషయానుభవ రూపమైన పాపమును జేయుచున్నాడు (రామానుజులు).

(స్వకీయము) మనుష్యునియందున్న కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనే ఈ (అరిషడ్వర్గము) అరిటిలో ప్రధానమైనవి కామక్రోధములు. ఈ రెంటికిని లోబడగూడదని మునుపు (34 వ శ్లోకమున) జెప్పబడినది. ఆ రెంటిలో పాపమును ప్రేరేపించునదేదని, అర్జునుడు అడుగునటుల మధ్వాచార్యుల తాత్పర్యము. అయితే శంకరాచార్యులు భాష్యమున ఈ శ్లోకమునకు అవతారికను క్రిందకనబరచినటుల వ్రాసియున్నారు:—

"ధ్యాయతో విషయాన్పుంసః" అను రెండవ అధ్యాయము 62-వ శ్లోకమునందును మూడవ అధ్యాయము 34 వ శ్లోకమునందును చెరుపునకు మూలము చెప్పబడియున్నను పలు చోట్ల చెదరియున్నట్టిదియు, బాగుగ తెలియక యున్నట్టిదియునైన మునుపుజెప్పిన విషయమును స్పష్టముగాను, సంగ్రహముగాను ఎరుంగతలంచి ఆ చెడుపునకు సరియైన మూలము ఇట్టిదని తెలిసినచో దానిని నివర్తింపజేయుటకు ప్రయత్నము చేయవచ్చునని అర్జునుడు ఈ విధముగ భగవంతుని అడుగుచున్నాడు.



(1) శ్రీ భగవానువాచ:—
శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణం ॥ 37

పద॥ కామః - ఏషః - క్రోధః - ఏషః — రజోగుణసముద్భవః ।
మహాశనః - మహాపాప్మా - విద్ధి - ఏనం - ఇహ - (2) వైరిణం ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీ భగవంతుడు చెప్పినది | క్రోధః | కోపము |
| ఏషః | ఇది (నీ వడిగినకారణము) | రజోగుణసముద్భవః | (ఇదియే) రజోగుణమునుండి గలిగినది. |
| కామః | కామము | | |
| ఏషః | ఇదియే | మహాశనః | (ఇది) గొప్పఆహారముగలది |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మహాపాప్మా | (ఇది) మహాపాపము | వైరిణం | శత్రువుగ | | | | |
| వినం | దీనిని (కామమును) | విద్ధి | ఎరుంగుము. | | | | |
| ఇహ | ఇచ్చట | | | | | | |

తా॥ శ్రీ భగవంతుడు చెప్పినది — ప్రాణులు ఏ కారణమువలన పాపము జేయుచున్నారనగా, సకల అనర్థములకును కారణమైన కామముచేతనే. ఈ కామమే కోపమగుచున్నది. అనగా ఏదైన ఒక కారణముచేత ఈ కామము అడ్డుపరచబడినచో అది కోపముగ మారుచున్నది. ఈ కామము రజోగుణము నుండి కలుగును. ఇది గొప్ప ఆహారముగలది. అనగా కామమునకు కావలసిన ఆహారములైన విషయానుభవములను అనుభవింప ననుభవింప తృప్తిపొందక పైపైగా విషయానుభవములను కోరుచున్నది. ఈ కామముచే ప్రేరేపింపబడి ప్రాణులు మహాపాపమును జేయుచున్నవి కావున ఇచ్చట, అనగా ఈ లోకములో లేక ఈ సంసారమున ఈ కామమును శత్రువుగ నెరుంగుము.

(1) భగవాన్ - అనుశబ్దమునకు తాత్పర్యమెట్టిదని రెండవ అధ్యాయము రెండవ శ్లోకముక్రింద చెప్పబడియుండుటను చూడుడు.

(2) ఇహ - ఇచ్చట, అనగా ఈ సంసారమునందు అని శంకరులున్ను, జ్ఞానయోగమునందు అని రామానుజులున్ను, ఇహపర పురుషార్థ విషయమునందు అని రాఘవేంద్రులున్ను అర్థముచేసియున్నారు.

(స్వకీయము) రెండవ అధ్యాయము 62-63-వ శ్లోకములలో విషయచింతనవలన కామము, కామముచే క్రోధము మొదలగునవి కలుగునని ఆశ్లోకముకింద శంకరభాష్యమున దానినెత్తి చెప్పియుండుటను చూడుడు.

ఈ శ్లోకమున ప్రాణుల దుఃఖములన్నిటికి మూలకారణము కామము (కోరిక) అని చెప్పబడినది. ఈ కోరిక నెరవేరక మరియొకదానిచే అడ్డగింపబడినచో కోపము గలుగుచున్నది. కావున ఈ కామము సర్వలోక శత్రువని చెప్పబడినది. "రజోగుణసముద్భవః" అనుదానికి శంకరులు మరియొక విధముగను తాత్పర్యముచేసియున్నారు. అదేమన ఈ కామము రజోగుణము గలుగుటకు కారణము. అనగా ఈ కామముచేతనే రజోగుణము గలుగుచున్నది. అదెట్లన కామము (కోరిక) కలిగిన వెంటనే అది రజోగుణమును తలయెత్తచేసి మనుజుని కార్యమున ప్రవేశపెట్టుచున్నది. రజోగుణమునకు కార్యమైన బానిసతనము మొదలగువాటిలో నుండి దుఃఖించునట్టి దౌర్భాగ్యవంతులు "కోరికచేగదా నేను బానిస వ్యాపారమును చేయునటుల చేయబడితిని" అని ప్రలపించుటను వినుచున్నాముగదా? "మహాశనః" అనగా ఈ కామమునకు అనుభవింపదగిన విషయములు అనేకములనియు తాత్పర్యము చేయవచ్చును.



శ్లో॥ ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్ 38

పద॥ ధూమేన - ఆవ్రియతే - వహ్నిః - యథా - ఆదర్శః - మలేన - చ।
యథా - ఉల్బేన - ఆవృతః - గర్భః - తథా - తేన - ఇదం (1) - ఆవృతమ్॥

| | | | |
|---|---|---|---|
| వహ్నిః | అగ్ని | ఉల్బేన | గర్భాశయముచేత |
| ధూమేన | పొగచేతను | యథా | ఎట్లు |
| ఆదర్శః | అద్దము | ఆవృతః | కప్పబడియున్నదో |
| మలేన చ | మురికిచేతను | తథా | అట్లే |
| యథా | ఎట్లు | ఇదం | ఇది (జ్ఞానము) |
| ఆవ్రియతే | కప్పబడుచున్నదో, లేక చుట్టు కొనబడుచున్నదో | తేన | దానిచేత (ఆ కోరికచేత) |
| | | ఆవృతం | కప్పబడియున్నది. |
| గర్భః | గర్భమునందున్న శిశువు | | |

తా॥ అగ్ని పొగచేతను, అద్దము మురికిచేతను, గర్భముననున్న శిశువు గర్భాశయము (మావి)చేతను, ఎట్లు కప్పబడియున్నదో అటులనే ఈ జ్ఞానము ఆ కోరికచే కప్పబడియున్నది.

(1) ఇదం - అనుదానికి ప్రాణులని రామానుజులున్ను, ఈశ్వరుడు, జీవుడు, అంతఃకరణము అని రాఘవేంద్రులున్ను అర్థముజేయుచున్నారు.

(రాఘవేంద్రులు) స్వయంప్రకాశముగల అగ్ని అంధకారమనెడు తోడబుట్టిన పొగచేత కప్పబడియుండుటవలె సర్వజ్ఞుడైన ఈశ్వరుడు జీవునకు కామముచే కప్పబడియున్నాడు. అందువలన ఈశ్వరుడు జీవునిచే ఎరుంగబడుటలేదు. అద్దము మురికిచే కప్పబడియుండుటవలె అంతఃకరణము కామముచే కప్పబడియున్నది. ఎట్లనగా అంతఃకరణము కామముచే కప్పబడినదై ఈశ్వరుడు జీవుడు వీరలనుచూచుటలేదు. శిశువు గర్భాశయమునందున్నప్పుడు ఎట్లు ఏకార్యమున్ను జేయుటకు శక్తిలేక యున్నదో అట్లే కామముచేత కప్పబడియున్న జీవుడు బ్రహ్మమునుగాని, జ్ఞానము మొదలగువాటిని గాని పొందదగనివాడగుచున్నాడు.

(స్వకీయము) ఈ శ్లోకమున శ్రీభగవంతుడు మునుపుచెప్పిన యా కామము జ్ఞానమునకెట్లు శత్రువనుదానిని మూడు దృష్టాంతములచే చెప్పుచున్నాడు.

కామము-సత్త్వము, రజస్సు, తమస్సను ఈమూటి గుణాంశభేదములను అనుసరించిమూడు విధములైన స్వరూపములచేత జ్ఞానమును కప్పుచున్నది. రాబోవు 14-వఅధ్యాయము 6-7-వ శ్లోకములలో సత్త్వరజస్తమో గుణముల స్వరూపమెట్టిదనియు, పైయధ్యాయము 17-వ శ్లోకమున సత్త్వము నుండి జ్ఞానమున్ను, రజస్సునుండి లోభమున్ను, తమస్సునుండి మోహమున్ను అజ్ఞానమున్ను కలుగుచున్నవనియు, 18-వ అధ్యాయము 30-31-32- శ్లోకములలో సాత్త్విక, రాజస, తామస బుద్ధుల స్వరూపమిట్టిదనియు చెప్పబడియుండుటను వాటి వ్యాఖ్యానములను జూడుడు.

జ్ఞానము, సత్త్వాంశముగల కోరికలచే కప్పబడునప్పుడు, అగ్ని ఎట్లుపొగచే కప్పబడి అగ్నియొక్కతేజస్సు దానిక్రిందభాగమున ప్రకాశించుచున్నదో అటులనే జ్ఞానమున్ను దానిస్వరూపాంశముతో ప్రకాశించుచున్నది. జ్ఞానము రజోగుణాంశముగల కామముచే కప్పబడినప్పుడు మురికిచే కప్పబడిన అద్దముయొక్క ప్రకాశము కనబడక పోయినను దానిస్వరూపమంతయు కప్పబడనిదానివలె జ్ఞానముయొక్క ప్రకాశముమాత్రము కప్పబడి దానిస్వరూపము కప్పబడకయే యున్నది. అయితే తమోగుణాంశముగ కోరికచే జ్ఞానముకప్పబడినచో గర్భాశయపుమావిచేత కప్పబడిన శిశువు

తేజస్సుకప్పబడి యుండుటయేగాక దానిస్వరూపమంతయు కప్పబడియుండుటవలె జ్ఞానముయొక్క ప్రకాశము అడ్డుపడుటయేగాక జ్ఞానముయొక్క స్వరూపముగూడ కనపడక పోవుచున్నదని చెప్ప వచ్చును. లేక కామము స్థూలసూక్ష్మకారణ శరీరముల నాశ్రయించి నిలుచునప్పుడు దృష్టాంతమున జెప్పినట్లు మూడువిధములైన స్వరూపములతోగూడి జ్ఞానమును కప్పునదిగను చెప్పవచ్చును.

లేక ఈశ్లోకములో చెప్పబడిన మూడుదృష్టాంతములచేత ఆశచే చుట్టబడిన అంతఃకరణము గల మూడువిధములైన జనులను గుర్తించునదిగ భావింపదగును. అనగా కోరికయనే పొగచేత ఆత్మ జ్ఞానమను అగ్నికప్పబడియుండువారు ఒకవిధమైన జనులు. వీరలెట్టివారనగా ఆత్మజ్ఞానముగల వారలే, ఐనను నిష్కళంకముగ ఆత్మజ్ఞానమునందే నిలకడలేకయు, విషయాసక్తిని పూర్తిగవిడువ కయునుండువారలు. వీరలు అతిశీఘ్రమున ఆత్మజ్ఞానము పొందగలరు. అది యెట్లనగా అగ్నిని చుట్టియున్న పొగ యెంతవ్యాపకమైనను అగ్నికి క్రిందిభాగమున్ను, గాలి మొదలగు వాటివలన పొగ నివర్తింపబడినప్పుడు మరికొన్ని భాగములున్ను కనిపెట్టుదగినవిగనే యుండును. మరియు అగ్ని బాగుగప్రకాశింప మొదలుపెట్టినతోడనే పొగయుండినచోటు తెలియకపోవును. దానివలె ఇతడు అతిశీఘ్రమున అభ్యాసముచేత ఆత్మజ్ఞానము పొందగలడు. కావున ఇతడు మొదటి కక్ష్యలో చేరినవాడు.

మురికిచే కప్పబడియున్న అద్దమునచూచునతనికి ముఖము ప్రకాశముగను శుద్ధముగను కనబడకపోయినను ఏకదేశము కనబడును. అయినను ముఖముప్రకాశముగ కనబడవలెనను తలంపు మాత్రమున్నది.మురికినిపోగొట్టినచో అద్దము ప్రకాశించునను జ్ఞానముమాత్రములేదు. ఆవిధముగఆత్మ జ్ఞానము సంపాదించవలెనను సపేక్షయున్నది. అయితే ఆశను తొలగించినచో ఆత్మజ్ఞానమొందగల మనునిశ్చయమును పొందక కలతచెంది నిలబడియున్నాడు. ఇతడు రెండవకక్ష్యలో చేరినవాడు.

గర్భాశయమునందున్న శిశువు ఎట్లు తానుగనే ఆ ఆశయమునువిడిచి బైటబడ శక్తిలేక యున్నదో అట్లే ఆత్మజ్ఞానములేనివాడు ఆత్మయిట్టిదనియే యెరుంగకయు. ఆ కోరికయనె వలచే కట్టుబడియునుండును. కావున కోరికను నివర్తింప శక్తిలేకయున్న ఇతడు మూడవకక్ష్యలో చేరిన వాడు. ఈ మూడు కక్ష్యలవారికిగల తారతమ్యమును స్పష్టపరచుటకై మూడు దృష్టాంతములు చెప్పబడిన వనితోచుచున్నది.

శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥ 39

పద॥ ఆవృతం - జ్ఞానం - ఏతేన - జ్ఞానినః - నిత్యవైరిణా ।
కామరూపేణ (1) - కౌంతేయ - దుష్పూరేణ - అనలేన (2) చ ॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ! | ఓ కుంతీపుత్రుడా! | అనలేన చ | తృప్తిలేనట్టిదియునైన |
| జ్ఞానినః నిత్యవైరిణా | జ్ఞానికెల్లప్పుడు శత్రువున్ను | ఏతేన | ఈ (కామము) కోరికచేత |
| కామరూపేణ | ఆశాస్వరూపమైనట్టియు | జ్ఞానం | జ్ఞానము |
| దుష్పూరేణ | నిండనిదియు | ఆవృతం | కప్పబడియున్నది. |

తా॥ ఓ కుంతీపుత్రా! జ్ఞానికెల్లప్పుడు శత్రువును, విషయానుభవముల వలన పూర్తిచేయదగనిదియు, తృప్తిపొందనిదియునైన ఆశయే స్వరూపముగా గల ఈ కామముచేత జ్ఞానము కప్పబడియున్నది.

(1) కామరూపేణ - కామమను పేరుగలది. (రాఘవేంద్రులు) అయితే, రామానుజులు కామకారేణ= మోహమును గలుగజేయుచున్న అని అర్థము చేసియున్నారు.

(2) అనలేన - అగ్నివంటిది. అనగా ఇంతటికట్టెలుంచువరకే నేను వాటిని దహింతును. మరియు కట్టెలుంచినచో నేను దహింపను, అని యెట్లు అగ్ని తృప్తిపొందుటలేదో, అట్లే తృప్తి పొందనిదని తాత్పర్యము.

(శంకరభాష్యము) మునుపటి శ్లోకములో "ఇదం=ఇది" అనుపదముచే చెప్పబడినదియు. కామముచేత కప్పబడి యున్నదియు ఏదిఅనునది దీనిలో చెప్పబడుచున్నది.

జ్ఞానియైనవాడు "నేనుదీనిచేత అనర్థములలో ప్రవర్తింపజేయబడితిని" అనిచెరుపులు వచ్చుటకు మునుపే యెరుంగుచున్నాడు. కావున ఎల్లప్పుడును దుఃఖించువాడగును. కాన కామము ఎల్లప్పుడును శత్రువనునది జ్ఞానికేగాని మూఢునికిగాదు, ఏలనగా మూఢుడు ఒకవిషయమునుకోరి అనుభవించు సమయమున కామమును మిత్రునివలెచూచుచు దానిచే దుఃఖమువచ్చునప్పుడు "నేను కోరికచే ఇట్లు దుఃఖించునటుల చేయబడితిని" అని వెనుకతెలిసికొను చున్నాడేగాని మొదటనే ఎరుంగుట లేదు. కావున కామము జ్ఞానికే ఎల్లప్పుడు శత్రువగును. ఏ రూపముచేత శత్రువు? విష యానుభవములచే పూర్ణముగానట్టియు, విషయానుభవములు ఇంతచాలునని లేకయున్నట్టియు, కోరికయను ఆకారముగల కామరూపముచేతనే.

(స్వకీయము) కామము జ్ఞానికెల్లప్పుడు శత్రువనుటవలన అజ్ఞానికి ఏదైన ఒక కాలమునందు మాత్రము శత్రువని తలంపదగియున్నది. అజ్ఞానికి ఒక కాలమున శత్రువుగనున్న కామము జ్ఞానికెల్ల ప్పుడు శత్రువుగనుండుట యెట్లనగా, అజ్ఞాని ఒక కార్యముచేయ మొదలుపెట్టినప్పుడు దానివలన కలుగు విరోధము, లేక విపరీతమును ఎరుంగక ఆపనినిచేయుచున్నాడు. దానివలన దుఃఖమును పొందిన పిదప ఈకార్యము తనకుశత్రువని తలంచుచున్నాడు. జ్ఞానియన్ననో పూర్వకర్మవశముగా తనఇష్టము లేకయే ఒకకార్యము చేయుటకు బలాత్కారముగ కోరునట్లు చేయబడుచున్నాడు. అదెట్లనగా జడభరతుడని మారుపేరుగల భరతుడను నతడు మహాతపస్వియై బ్రహ్మనిష్ఠయందుండి నదిలోస్నానము చేయుటకై పోయినప్పుడు పూర్ణగర్భముగనున్న ఒకలేడి సింహనాదముచే భయపడగా దానిగర్భమునుండి శిశువు నదియొడ్డున పడినపిదప ఆతల్లియైనలేడి నదిలోపడి మరణించుటను జూచెను. ఈ శిశువును ఎవ్వడు కాపాడగలడు? ఇచ్చట ఒక్కడులేడే. మనముకాపాడనిచో ఈశిశు వున్ను మరణింపగలదని పరితాపముగలిగెను. ఆ శిశువును తన స్వస్థానమునకుతెచ్చి పోషించు చుండెను. అట్లు కొంతకాలము సంరక్షణచేసిరాగా అతనికి మరణకాలము సమీపించెను. ఆకాలమున ఈ జింకను ఎవ్వడిక సంరక్షణ చేయగలడని మనోదుఃఖముతో గతించెను. మరణకాలమున లేడిని స్మరించుటవలన లేడిగా మైజన్మపొందెను. (భాగవతము 5-వ స్కంధము 8-వ అధ్యా. ను జూడుడు) ఇతనికి లేడి పిల్లను మొదటఎత్తు నప్పుడున్ను, తనస్వస్థానమునకు తీసికొని వచ్చినప్పుడున్ను, దానిని సంరక్షించునప్పుడున్ను దీనివలన కలుగు దుఃఖమిట్టిదని తెలిసియున్నను ఇదితనయొక్క జ్ఞాననిష్ఠకు శత్రువని తెలిసియు పూర్వకర్మశేషము వాని నిష్ఠనుజెడిపెను. కావున జ్ఞానికెల్లప్పు డున్ను శత్రువను జెప్పబడినది.



శ్లో॥ ఇంద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినం ॥ 40

పద॥ ఇంద్రియాణి - మనః - బుద్ధిః - అస్య - అధిష్ఠానం - ఉచ్యతే ।
ఏతైః - విమోహయతి - ఏషః - జ్ఞానం - ఆవృత్య - దేహినం ॥

| | | | |
|---|---|---|---|
| ఇంద్రియాణి | ఇంద్రియములు | ఏషః | ఈ కామము |
| మనః | మనస్సు | ఏతైః | వీటిచేత (ఇంద్రియాదులచేత) |
| బుద్ధిః | బుద్ధి | జ్ఞానం | ఆత్మజ్ఞానమును |
| అస్య | ఈకామమునకు (కోరికకు) | ఆవృత్య | కప్పి |
| అధిష్ఠానం | వాసస్థానముగ | దేహినం | దేహిని |
| ఉచ్యతే | చెప్పబడుచున్నది | విమోహయతి | మోహింపజేయుచున్నది. |

తా॥ ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ఇవికామమునకు నివాసస్థానముగ జెప్పబడుచున్నవి. ఈకామము ఇంద్రియము, మనస్సు,బుద్ధి, వీటిద్వారా జ్ఞానమును కప్పి దేహిని (శరీరిని) మోహింపజేయుచున్నది. (మైకము జెందించుచున్నది.)

(స్వకీయము) జ్ఞానమును కప్పుటవలన సకల లోకములకును శత్రువుగనేర్పడుచున్న కామమునకు వాసస్థానమేదని విమర్శింపగా, అదియిచ్చట చెప్పబడుచున్నది. ఏలన శత్రువు స్థానముదెలిసినచో వానినిచంపుట సులభముగదా? కావున కామమునకు నివాసస్థానము ఇంద్రియములు మనస్సు బుద్ధి ఇవియే యనిచెప్పబడినది. ఏలనగా శబ్దాదివిషయములనుఇంద్రియములు గ్రహించి మనస్సులో చేర్చుచున్నవి. మనస్సుతాను విషయములను గ్రహించినతోడనే బుద్ధియెడ జేర్చుచున్నది. బుద్ధిఆత్మయెడచేర్చును. నిష్కళంకమైన ఆత్మయందు విషయములనే మాలిన్యములను (అనగా కామమును) చేర్చినవి ఇంద్రియములు మనస్సు బుద్ధి ఇవి కావున, అవి కామమునకు నివాసస్థానమని చెప్పబడినవి. అనగా ఇంద్రియములు మొదలైన వాసస్థానములద్వారా ఆత్మయొక్క స్వరూపము గోచరింపకుండ కప్పుచున్నది. అప్పుడు నిష్కళంకమైన తనస్వరూపము (ఆత్మస్వరూపము) కప్పబడి దేహి మైకమొందుచున్నాడు. శ్రీధరులు ఈతాత్పర్యమును సంగ్రహముగ జెప్పియున్నారు.



శ్లో॥ తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ 41

పద॥ తస్మాత్ - త్వం - ఇంద్రియాణి - ఆదౌ (1) - నియమ్య - భరతర్షభ ।
పాప్మానం - ప్రజహిహి - ఏనం - జ్ఞానవిజ్ఞాననాశనం - (2) ॥

| | | | |
|---|---|---|---|
| హే భరతర్షభ! | ఓ భరతవంశశ్రేష్ఠుడా! | జ్ఞానవిజ్ఞాన నాశనం | జ్ఞానవిజ్ఞానము(శాస్త్రజ్ఞానము అనుభవజ్ఞానము) లను నశింపజేయుచున్న |
| తస్మాత్ | అందువలన | | |
| త్వం | నీవు | | |
| ఆదౌ | మొదట | పాప్మానం | పాపస్వరూపమైన |
| ఇంద్రియాణి | ఇంద్రియములను | ఏనం | ఈ కామమును (కోరికను) |
| నియమ్య | అణచి | ప్రజహిహి | త్రోసివేయుము. |

తా॥ ఓ భరతవంశశ్రేష్ఠుడా! (కామము ఇంతటి యనర్థమును కలుగజేయుచున్నది) కావున నీవు మొదట ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వీటినణచి జ్ఞానవిజ్ఞానములను పోగొట్టుచున్న అనగా శాస్త్రజ్ఞానమును అనుభవజ్ఞానమును నశింపజేయుచున్న పాపస్వరూపమైన ఈ కామమును విడిచిపెట్టుము.

(1) ఆదౌ - అనుదానికి మోక్షోపాయమును వెతక నారంభించునప్పుడు మొదట (జ్ఞానమునకు కారణమైన కర్మయోగారంభమునకు మొదట) అని రామానుజులున్ను, "కోరికలను అడ్డగించుటకు మొదట" అని కొందరు వ్యాఖ్యాతలున్ను అర్థము జేయుచున్నారు.

(2) జ్ఞాన విజ్ఞానం - జ్ఞానమనగా శాస్త్రములనుండియు ఆచార్యునివద్దనుండియు ఆత్మ మొదలైన విషయములనుగూర్చి తెలిసికొనుటఅని శంకరులున్ను, ఆత్మస్వరూపజ్ఞానమని రామానుజులున్ను, విజ్ఞానమనగా అట్లు నేర్చిన వస్తువులను సొంత అనుభవముచేత అనుభవించి ఎరింగిన జ్ఞానమని శంకరులున్ను, ఆత్మ స్వరూపవివరణ జ్ఞానమని రామానుజులున్ను అర్థము జేయుచున్నారు. ఈజ్ఞానమున్ను విజ్ఞానమున్ను మోక్షమొందుటకు సాధనములు.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥ 42

పద॥ ఇంద్రియాణి - పరాణి - ఆహుః - ఇంద్రియేభ్యః - పరం - మనః।
మనసః - తు - పరా - బుద్ధిః - యః - బుద్ధేః - పరతః - తు - సః (1) ॥

| | | | |
|---|---|---|---|
| ఇంద్రియాణి | (స్థూలదేహముకంటె) ఇంద్రియములు | బుద్ధిః | బుద్ధి |
| | | పరా | శ్రేష్ఠమైనది |
| పరాణి | మేలైనవిగ | బుద్ధేః | బుద్ధికంటె |
| ఆహుః | (జ్ఞానులు) చెప్పుచున్నారు. | పరతః | మేలైనవాడు |
| | ఇంద్రియములకంటె | యస్తు | యెవ్వడో |
| మనః | మనస్సు | సః | అతడు (మునుపుజెప్పిన దేహి, పరమాత్మ) |
| పరం | శ్రేష్ఠమైనది | | |
| మనసను | మనస్సుకంటె | | |

తా॥ స్థూలదేహముకంటె ఇంద్రియములు మేలైనవని జ్ఞానులు చెప్పుచున్నారు. ఇంద్రియములకంటెను మనస్సు మేలైనది. మనస్సుకంటె బుద్ధి శ్రేష్ఠమైనది. ఎవ్వడు బుద్ధికంటె శ్రేష్ఠుడుగను సాక్షిగనుఉన్నాడో అతడే మునుపు చెప్పినదేహి, పరమాత్మ.

(1) సః - అనుదానికి పరమాత్మయని శంకరులును రాఘవేంద్రులును, బుద్ధికిసాక్షిగను దేహము గలవాడుగనుఉన్న ఆత్మయని శ్రీధరులును, కామమని రామానుజులును అర్థము చేసి యున్నారు.

(శంకరభాష్యము) మొదట ఇంద్రియములను వశపరచుకొని నీశత్రువైన కామమును చంపుమని చెప్పబడినది. అట్లు కామమును ఎచ్చట నిల్చబడియుండి, అనగా ఎవరిని ఆశ్రయించి చంపవచ్చుననునది దీనిలో జెప్పబడుచున్నది.

చెవిమొదలైన ఇంద్రియములుఐదు. స్పష్టముగ కనబడునదియు కొలతకు లోబడినదియు నైన స్థూలదేహముతో పోల్చిచూచునప్పుడు ఈ యింద్రియములు సూక్ష్మములై లోపలవ్యాపించి, మిక్కిలి శక్తిగలిగియుండుట మున్నగుగుణములు గలిగియుండుటచే జ్ఞానులు ఇంద్రియములను ఆ స్థూలమైన దేహముకంటె మేలైనవిగ చెప్పుచున్నారు. ఆ విధముగనే సంకల్పవికల్పాత్మకమైన, అనగా తలంపు, మార్పు, మొదలగువాటిరూపమైన మనస్సనునది ఇంద్రియములకంటె మేలైనది. నిర్ణయస్వరూపముగల బుద్ధి ఈ మనస్సుకంటె మేలైనది. ఆవిధముగనే బుద్ధితోగూడ కనబడు

చున్న సకలమునకును లోపలను బయటను ఎవ్వడుకలడో ఏదేహిని కామము ఇంద్రియములు మొదలగువాటిని వాసస్థానముగగైకొని జ్ఞానమునుకప్పి మోహింపజేయునని చెప్పబడినదో అతడు బుద్ధికంటెను శ్రేష్ఠుడు అతడు బుద్ధిని జూచుచున్న ఆత్మ. అతడే తెలిసికొనుచున్న పరమాత్మ.

(రామానుజభాష్యము) ఇంద్రియములు మేలైనవనగా జ్ఞానమునకు విరుద్ధముగ నుండుటలో ప్రాబల్యముగలవని భావము. ఇంద్రియములు విషయవ్యాపారమున ప్రవర్తించియుండినచో ఆత్మజ్ఞాన ప్రవృత్తికలుగదు ఇంద్రియములు అణగినను మనస్సు విషయములను చింతించుచుండినచో ఆత్మజ్ఞానమునకు విరోధముగలుగుటవలన మనస్సు ఇంద్రియములకన్న దానిలో మేలైనది. మనస్సు అణగినను బుద్ధివిరోధియైన నిశ్చయమునుగొనినచో సాధకములను తెలియబరచక జ్ఞానమునకు అడ్డుగలుగుటవలన మనస్సుకంటె బుద్ధిదానిలో గొప్పది. ఇవియన్నియుండినను కోరికయనునదుండినచో ఆ బుద్ధితో సహ పైయన్నిటిని తనవిషయమున నడిపించి ఆత్మజ్ఞానమును నశింపజేయును. కాన జ్ఞానమునకు విరోధమును జేయుటలో బుద్ధికంటె ఆ కామము మేలైనదని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) ఇంద్రియములు దేనికంటె గొప్పవనగా, దేహమునకంటెయని చేర్చుకొనవలెను. ఇంద్రియములకు అభిమానదేవతలైన చంద్రుడు, కుబేరుడు, సూర్యుడు, వరుణుడు. అశ్వనీదేవతలు, అగ్ని, ఇంద్రుడు, జయంతుడు, యముడు, దక్షుడు, వీరలకంటె విషయాభిమాన దేవతలైన సౌపర్ణి, వారుణి, పార్వతి, వీరలు శ్రేష్ఠమైనవారలు. వీరలకంటె మనోభిమాని దేవతలైన గరుడుడు శేషుడు, రుద్రుడు, వీరలు శ్రేష్ఠులు. వీరలకంటె బుద్ధ్యభిమాని దేవతయైన సరస్వతి శ్రేష్ఠమైనయామె. ఈమెకంటె మహత్తత్త్వాభిమానియైన బ్రహ్మశ్రేష్ఠుడు. ఆ బ్రహ్మకంటె ప్రకృత్యభిమాని దేవతయైన లక్ష్మి శ్రేష్ఠురాలు లక్ష్మికంటె సకలగుణ పరిపూర్ణుడైన విష్ణువు శ్రేష్ఠుడు. వీరికన్న గొప్పవాడెవ్వడు లేడు. అతడే పొందదగినవాడు.

(స్వకీయము) ఈ వ్యాఖ్యానమున కాధారముగ కఠోపనిషద్వాక్యమును, దానిభాష్యమును గుర్తించుచున్నారు. కఠోపనిషత్తు 3-వ వల్లి 10-11-వ వాక్యములు:—

"ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।
మనసశ్చ పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్పరః ॥
మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ।
పురుషాన్న పరంకించిత్సా కాష్ఠా సా పరాగతిః ॥"

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥ 43

పద॥ ఏవం - బుద్ధేః - పరం - బుద్ధ్వా - సంస్తభ్య - ఆత్మానమ్ (1) - ఆత్మనా ।
జహి - శత్రుం - మహాబాహో - కామరూపం - దురాసదమ్ ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో ! | ఓ గొప్పభుజములుగలవాడా ! | పరం (ఆత్మానం) | మేలైన ఆత్మను |
| ఏవం | ఈ విధముగ | బుద్ధ్వా | ఎరింగి |
| బుద్ధేః | బుద్ధికంటె | ఆత్మనా | ఆత్మచేత |

| | | | |
|---|---|---|---|
| ఆత్మానం | ఆత్మను | కామరూపం శత్రుం | కామరూపమైన శత్రువును |
| సంస్తభ్య | అణచి | జహి | నశింపజేయుము. |
| దురాసదం | జయించుటకు కష్టమైన | | |

తా॥ ఓ అర్జునా! బుద్ధికంటె శ్రేష్ఠమైన ఆత్మను ఈవిధముగ నెరింగి, ఆత్మచేత (తనచే) ఆత్మ నణచి, జయించుటకు కష్టమై, కామమే రూపముగా గల కోరికయను శత్రువును నశింపజేయుము.

(శ్రీధరులు) విషయేంద్రియములవలన కలుగుచున్న కామాది వికారములు బుద్ధి వరకు గల తత్త్వములలో జేరినవి. ఆత్మకు జేరినవిగావని తాత్పర్యము.

(స్వకీయము) శత్రువును జంపుటకు ఆయుధమువలెనున్న జ్ఞానము ఏ జ్ఞానమనగా, బుద్ధికంటె ఉత్కృష్టమైన ఆత్మనుగూర్చిన జ్ఞానము. ఈ జ్ఞానము స్థిరముగనిలుచుటకు మనస్సు చలింపక నిలుచుట, అనగా మనస్సమాధానము, కావలెను. ఈ మనస్సమాధానమునకు పరిశుద్ధమైన మనస్సు కారణము. "ఆత్మానం ఆత్మనా" అనుదానికి "మనస్సును నీ మనస్సుచేతనే చలింపక బాగుగ నిలబెట్టి, అనగా శుద్ధముగనున్న మనస్సుచే సమాధానపరచి"యని శంకరులు అర్థముచేసి యున్నారు. కొందరు వ్యాఖ్యాతలు "మనస్సును బుద్ధిచే సమాధానపరచి" అని అర్థముచేసి యున్నారు. ఈ కామము తెలిసికొనుటకు అసాధ్యములైన అనేక విశేషములను అనగా పలుస్వభావములనుకలది. కావున జయించుటకు కష్టమైనది. "పరం దృష్ట్వా నివర్తతే" అని రెండవ అధ్యాయము 59-వ శ్లోకములో జెప్పబడియుండుటను జూడుడు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే కర్మయోగోనామ
తృతీయోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న
శ్రీకృష్ణార్జున సంవాదమున కర్మయోగమను
మూడవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు.

చతుర్థాధ్యాయ ప్రారంభః.

# నాల్గవ అధ్యాయము

## (జ్ఞానయోగము)

శ్రీభగవానువాచః—

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్।
వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥

పద॥ ఇమం - వివస్వతే - యోగం (1) - ప్రోక్తవాన్ - అహం - అవ్యయం ।
వివస్వాన్ - మనవే - ప్రాహ మనుః - ఇక్ష్వాకవే - అబ్రవీత్ ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీభగవంతుడుచెప్పినది | వివస్వాన్ | సూర్యుడు |
| అవ్యయం | నాశములేని (ఫలముగల) | మనవే | మనువునకు |
| ఇమంయోగం | ఈ యోగమును | ప్రాహ | చెప్పెను |
| అహం | నేను | మనుః | మనువు |
| (పురా) | ఆదికాలమున | ఇక్ష్వాకవే | (తన కుమారుడైన) ఇక్ష్వాకునకు |
| వివస్వతే | సూర్యునకు | | |
| ప్రోక్తవాన్ | చెప్పితిని | అబ్రవీత్ | చెప్పెను. |

తా॥ శ్రీభగవంతుడు అర్జునునకు జెప్పినది — నాశములేని ఫలమును, అనగా మోక్షమును ఇవ్వగల (మునుపు 2-3- అధ్యాయములలో జెప్పిన) ఈ యోగమును నేను సృష్టికాలమున సూర్యునకు జెప్పితిని, సూర్యుడు మనువునకు జెప్పెను. మనువు తన కుమారుడైన ఇక్ష్వాకువునకు జెప్పెను.

(1) యోగం - ఈ కర్మయోగమును (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) కర్మయోగమును సాధనముగ గైకొని సన్యాసముతోగూడియుండు జ్ఞాననిష్ఠయను ఏయోగము మునుపటి రెండు అధ్యాయములలో జెప్పబడినదో, ప్రవృత్తి లక్షణముతో గూడిన కర్మయోగమున్ను, నివృత్తి లక్షణముతోగూడిన జ్ఞానయోగమున్ను, అయిన వేదార్థము దేనిలో ముగిసియున్నదో అట్టి యీ యోగమే గీతయందంతటను శ్రీభగవంతుడుపదేశింప దలంచినది. కావున వేదమున ప్రతిపాదించిన అర్థమును ఆ జ్ఞానయోగమునందు ముగియునదిగా భావించి శ్రీభగవంతుడు దానిసంప్రదాయ వృత్తాంతమును జెప్పి దానినిచ్చట పొగడుచున్నాడు.

"లోకమును కాపాడి రక్షించు క్షత్రియులకు బలము గలుగజేయుటకై మునుపటి రెండు అధ్యాయములచే జెప్పిన ఈ యోగమును నేనుసృష్ట్యారంభమున సూర్యునకు జెప్పితిని. ఆయోగబలముగల క్షత్రియులుగదా బ్రాహ్మణులను రక్షింపసమర్థులగుదురు? బ్రాహ్మణులున్ను క్షత్రియులున్ను రక్షింపబడిననే జగమును పరిపాలింప వీలగును. ఈ యోగము నాశము లేనిదనగా నాశములేని ఫలము గలది అని యర్థము. (ఏలనగా ఈ యోగము నిష్ఠమైయున్నదిగ

పైశ్లోకమున జెప్పబడుచున్నది.) ఉన్నదానిని ఉన్నట్లుచూచుట యనెడు ఈ జ్ఞానయోగముయొక్క మోక్షమను ఫలము, ఎల్లప్పుడును నాశములేనిది. ఆ వివస్వంతుడు (సూర్యుడు) దానిని మనువునకును, మనువు తన పుత్రుడు ఇక్ష్వాకువను సూర్యవంశపు మొదటిరాజునకును చెప్పెను."

(రామానుజులు) నీవు యుద్ధముచేయుటకొరకై నీకి కర్మయోగమును జెప్పినదిగ తలంపకుము. మన్వంతరముయొక్క ఆదిలోనే నేను దీనిని సూర్యునకు జెప్పియున్నాను.

---

శ్లో॥ ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ॥

పద॥ ఏవం - పరంపరాప్రాప్తం - ఇమం - రాజర్షయః (1) - విదుః ॥
సః - కాలేన - ఇహ - మహతా - యోగః - నష్టః (2) - పరంతప ॥

| | | | |
|---|---|---|---|
| హే పరంతప! | ఓ శత్రువును తపింపజేయువాడా! | విదుః (స్మ) | ఎరిగియుండిరి |
| ఏవం | ఈ విధముగ | మహతాకాలేన | చాలకాలమగుటవలన |
| పరంపరాప్రాప్తం | పరంపరగవచ్చిన | సః యోగః | ఆ యోగము |
| ఇమం | ఈ యోగమును | ఇహ | ఈ లోకములో, లేక ఇప్పుడు |
| రాజర్షయః | రాజర్షులు | నష్టః | నష్టమైనది. |

తా॥ ఓ పరంతప! ఈ విధముగ పరంపరగ (చెప్పబడి) వచ్చిన ఈ యోగమును రాజర్షులు ఎరింగియుండిరి. బహుకాలమైనందున ఆ యోగమిప్పుడు నష్టమైనది. అనగా పరంపరగవచ్చు క్రమము తప్పిపోయినది.

(1) రాజర్షయః - రాజులున్ను ఋషులున్ను, లేక రాజర్షులు (రాఘవేంద్రులు.)

(2) నష్టః - నష్టమైనదనగా కాలము గడువగా సంప్రదాయానుసారముగ ఉపదేశించువారలున్ను, ఉపదేశమునువిని తెలిసికొనుచున్న బుద్ధిమంతులున్ను లేకపోవుటవలన పరంపరగరాక వీడిపోయినదని భావము. లేక నష్టమైనదివలె అయ్యెను (రామానుజులు)

(శంకరభాష్యము) ఈ విదముగ పరంపరగవచ్చిన ఈ యోగమును రాజర్షులు ఎరింగియుండిరి. రాజర్షులనగా:— జనకుడు మొదలగువారివలె రాజులుగను ఋషులుగను ఉన్నవారు. దీర్ఘకాలమైనందున ఆ యోగ సంప్రదాయము ఎడతెగిపోయినది. పరంతప అనగా: - తనకు శత్రువులుగ నున్నవారు "పరులు". వారలను తన బలపరాక్రమముల తేజస్సుచేత సూర్యునివలె దహించువాడు పరంతపుడు. శత్రువులను తపింపజేయువాడవగు అర్జునా! అని అర్థము.

---

శ్లో॥ స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥　　3

పద॥ సః - ఏవ - అయం - మయా - తే - అద్య - యోగః - ప్రోక్తః - పురాతనః ।
భక్తః - అసి - మే - సఖా - చ - ఇతి - రహస్యం - హి (1) - ఏతత్ (2) ఉత్తమమ్ ॥

| | | | |
|---|---|---|---|
| (త్వం) | నీవు | తే | నీకు |
| మే భక్తః | నా భక్తుడవుగను | మయాఅద్య | నాచే ఇప్పుడు |
| సఖా చ | స్నేహితుడవుగను | ప్రోక్తః | చెప్పబడినది |
| అసి ఇతి | ఉన్నావని | హి | ఎందువల్లననగా |
| అయం పురాతనః | ఈ ప్రాచీనమైన | ఏతత్ | ఇది |
| స ఏవ యోగః | ఆ యోగమే | రహస్యం ఉత్తమం | పరమరహస్యము, శ్రేష్ఠమైనది. |

తా॥ నీవు నా భక్తుడుగను మిత్రుడుగనున్నావు అను కారణమువలన ఈ పాతదైన అదియే (సూర్యునకుజెప్పిన) యోగము నాచే ఇప్పుడు నీకు జెప్పబడినది. ఏలనగా ఈ యోగము పరమరహస్యమైనదియు, శ్రేష్ఠమైనదియు.

(1) హి = ఎందువల్లననగా - ఈ యోగమును మిగతవారికి చెప్పక నీకుమాత్రము జెప్పుటకు కారణము:- ఇది పరమరహస్యమైనది కావున మహాదుర్లభమైనది. నీవంటి భక్తుడై పక్వావస్థలోనున్నవానికి తప్ప ఇతరులకు చెప్పదగినది కాదనునదియే.

(2) ఏతత్ - ఇది, మునుపటి అధ్యాయములలో జెప్పిన యోగము, అనగా జ్ఞానము (శంకరులు) (స్వకీయము) ఈ యోగము మనోదార్ఢ్యములేనివారలై ఇంద్రియముల నణచుటకు శక్తిలేనివారివద్ద చిక్కుకొని చెదరియుండుటనున్ను లోకమునందలి జనులు పురుషార్థమును పొందకయుండుటనున్ను జూచి శ్రీ భగవంతుడు ఈ రహస్యమును యోగ్యతగల తన భక్తునికి జెప్పెనదిగ ఈ శ్లోకమునకు శంకరులు అవతారిక చేసియున్నారు. ఈ యోగము అనాదియైన వేదార్థము కావున పురాతనమని చెప్పబడినది.

⋄⋄⋄⋄⋄⋄⋄⋄

అర్జున ఉవాచః—

శ్లో॥ * అపరం భవతో జన్మ పరంజన్మ వివస్వతః ।
కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ 4

పద॥ అపరం - భవతః - జన్మ - పరం - జన్మ - వివస్వతః ।
కథం - ఏతత్ - విజానీయాం - త్వం - ఆదౌ - ప్రోక్తవాన్ - ఇతి ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | త్వం | నీవు |
| భవతః జన్మ | నీయొక్క జననము | ఆదౌ | ఆదికాలమున |
| అపరం | వెనుకటిది | ప్రోక్తవానితి ఏతత్ | చెప్పితివనుటీనిని |
| వివస్వతఃజన్మ | సూర్యుని జననము | కథం విజానీయాం | ఎట్లెరుంగగలను. |
| పరం | మునుపటిది | | |

తా॥ అర్జునుడు చెప్పినది - సూర్యుని ఉత్పత్తి మునుపు సృష్ట్యారంభమున గలిగినది. నీజననము పిదప గలిగినది. (అనగా వసుదేవుని యింట బుట్టిన కాలమున గలిగినది.) ఇట్లుండగా నీవీయోగమును సూర్యునకు ఆది కాలమున చెప్పితివని నేనెట్లు తెలిసికొందును?

* అపరం - 'అవరం' అనియునొక పాఠము. అర్థమొక్కటే.

(శంకరభాష్యము) శ్రీ భగవంతుడు చెప్పినది ఒకదాని కొకటి విరుద్ధముగనున్నదను తలంపు ఎవ్వనికిని కలుగగూడదని తలంచి, ఆతనిముఖకమలము చేతనే అట్టివిరోధమును పరిహరించుటకై అర్జునుడు ఆక్షేపించువానివలె అడుగుచున్నాడు. కృష్ణా! నీవు వసుదేవుని యింట బుట్టినది యిప్పుడు జరిగినది. సూర్యుడుగలిగినది సృష్ట్యారంభమున, అనగా నీజ ననమునకు బహుకాలము ముందు. అట్లుండగా నీవు ఈ యోగమును ఆదికాలమున ప్రసాదించితివి, అప్పుడు ప్రసాదించిన నీవే, యిప్పుడు నాకు దానిని మరల ప్రసాదించుచున్నావను దీనిని ఒకదానితో మరియొకటి విరోధించని విషయముగ నేను తెలిసికొనదగిన విధమెట్లు? అనగా ఈ రెంటిని నేనెట్లు సమరసపరచుకొనగలను అనునది. కృష్ణపరమాత్మ సర్వేశ్వరుడు, అవతారపురుషుడు, అనిఅర్జునునకు తెలిసియున్నను దానినిభగవంతుని మాటచేతనే బయటబడునటుల జేయుటవలన జనులకు నమ్మకముగలిగి వారలు కడతేర వలెననునది అర్జునుని తాత్పర్యము.

(రామానుజులు) ఇరువైయెనిమిది చతుర్యుగములకు మునుపుగలిగిన సూర్యునకు ఇప్పుడు స్వల్పకాలమునకు మునుపు బుట్టిన నీవెట్లు చెప్పియుండగలవనునది అర్జునుని ప్రశ్న.

శ్రీ భగవానువాచః—

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప॥

పద॥ బహూని - మే - వ్యతీతాని - జన్మాని - తవ - చ - అర్జున।
తాని - అహం - వేద - సర్వాణి - న - త్వం - వేత్థ - పరంతప॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీభగవంతుడు చెప్పినది | వ్యతీతాని | గడచిపోయినవి |
| హే అర్జున ! | ఓ అర్జునా ! | తానిసర్వాణి | వానివన్నిటిని |
| మే | నాయొక్కయు | అహంవేద | నేనెరుంగుదును |
| తవ చ | నీయొక్కయు | హే పరంతప ! | శత్రువులను తపింప జేయువాడా ! |
| బహూని | అనేకములైన | | |
| జన్మాని | జన్మలు | త్వం న వేత్థ | నీవెరుంగవు. |

తా॥ శ్రీ భగవంతుడైన కృష్ణపరమాత్మ (అర్జునునిగూర్చి) చెప్పినది — ఓ అర్జునా! నీకును నాకును అనేకజన్మములు గడచిపోయినవి. పరంతపుడా! వాటినన్నిటిని నేనెరుంగుదును, నీవెరుంగవు.

(శంకరభాష్యము) వాసుదేవుడు ఈశ్వరుడుకాడు, సర్వజ్ఞుడుకాడని మూఢులకు కలుగునట్టి శంకను పోగొట్టవలెనని అర్జునుడుతలంచి మునుపటి ప్రశ్ననడిగినందున దానిననుసరించి భగవంతుడు ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు. అర్జునా! నీవు ధర్మాధర్మములు మొదలగువాటివలన కప్పబడిన జ్ఞానశక్తి గలవాడవు. కావున నీవు వాటినన్నిటిని ఎరుంగవు. నేననగా స్వభావముగనే నిత్యుడుగను శుద్ధుడుగను ముక్తుడుగను సత్యస్వభావముగలవానిగ నుండుటవలన, కప్పబడని జ్ఞానశక్తిగలవాడను గాన జన్మలన్నియు నాకు తెలియును.

(రామానుజులు) నీకున్ను నాకున్ను అనేకజన్మలయినవి అని చెప్పుటవలన ఈ జన్మలన్నియు వాస్తవమైనవని చెప్పుటయగుచున్నది.

(రాఘవేంద్రులు) పరమాత్మ తనజన్మనుగూర్చి మాత్రము బదులు జెప్పవలసియుండగా అర్జునుని జన్మమునున్ను జెప్పి "నేనెరుంగుదును, నీవెరుంగవు" అని చెప్పుటకుద్దేశమేమనగా, నేను పరబ్రహ్మము, నీవు జీవుడు, పర బ్రహ్మము సకలము నెరుంగును, జీవుడు సకలము నెరుంగజాల్డు, కావున జీవుడు వేరు, పరబ్రహ్మము వేరను భేదమును జూపుటకై భగవంతుడు అర్జునునిగూర్చి జెప్పి ఉత్తరము జెప్పినది.

(స్వకీయము) భగవంతునికి జన్మలనునవి అవతారములు.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥

పద॥ అజః - అపి - సన్ - అవ్యయాత్మా - భూతానాం - ఈశ్వరః - అపి - సన్ ।
ప్రకృతిం - స్వాం - అధిష్ఠాయ - సంభవామి - ఆత్మమాయయా ॥

| | | | |
|---|---|---|---|
| అహం | నేను | స్వాం ప్రకృతిం | నా సొంతమైనమాయను |
| అజోఽపిసన్ | జననములేనివాడనైనను | అధిష్ఠాయ | వశపరచుకొని |
| అవ్యయాత్మా (అపిసన్) | నాశములేని జ్ఞానశక్తిగలవాడనైనను | ఆత్మమాయయా | నా మాయచేత |
| భూతానాం | ప్రాణులకు | సంభవామి | జనించుచున్నాను (అవతరించుచున్నాను.) |
| ఈశ్వరోపిసన్ | ఈశ్వరుడుగనున్నను | | |

తా॥ నేను జననములేనివాడనుగను, నాశములేని జ్ఞానశక్తిగలవాడనుగను ఉన్నను ప్రాణులకు ఈశ్వరుడనైవను నాసొంతమైన మాయను వశపరచుకొని నామాయచేతనే అవతరించుచున్నాను.

(శంకరభాష్యము) నిత్యుడవై ఈశ్వరుడవైయున్న నీకు ధర్మాధర్మములులేకున్నను జనన మెట్లు? అనిన జననములేనివాడనైనను మరియు స్వభావముగనే తక్కువలేని జ్ఞానశక్తిగలవాడనైనను, మరియు బ్రహ్మమొదలుకొని తృణము వరకుగల భూతము లన్నిటిని ఏలు స్వభావముగలవాడనైనను ఈ లోకమంతయు దేనికిలోబడియున్నదో, మరియునది దేనిచే మోహింపజేయబడి వాసుదేవుడనైన నన్ను తనయాత్మగ నెరుంగ లేదో అప్రకృతిని అనగా విష్ణువునకధీనమైనట్టియు, త్రిగుణాకారము గలిగినట్టియు నామాయను వశపరచుకొని నామాయచేత శరీరముతో నిలబడువానివలె జనించిన వానివలె నేనున్నాను. అయితే లోకమునందలి వారివలె వాస్తవముగ నేను జనించుటలేదు.

(రామానుజులు) స్వాంప్రకృతిం అధిష్ఠాయ=నాస్వకీయమైన స్వభావముతోగూడి, ఆత్మ మాయయా = నాయొక్క ఆత్మజ్ఞానమను సంకల్పముచేత, సంభవామి=దేవమనుష్యాది రూపములై అప్రాకృతశరీరముతో అవతరించుచున్నాను, అప్రాకృతమనగా లోకములో కనబడుదానివలె నుండక లోకవిలక్షణమైనది.

(రాఘవేంద్రులు) అవ్యయాత్మా = నాశములేని స్వభావమును దేహమునుగల వాడైనను, స్వాం = సొంతమైన. నావలన కలుగజేయబడిన, ప్రకృతిం=వాసుదేవాది దేహములను, అధిష్ఠాయ= ప్రవేశించి, ఆత్మమాయయా = స్వేచ్ఛచేత, లేక స్వజ్ఞానముచేత, సంభవామి = కలిగిన వానివలె నగుచున్నాను.

శ్లో॥ యదాయదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహం॥ 7

పద॥ యదాయదా - హి - ధర్మస్య (1) - గ్లానిః - భవతి - భారత।
అభ్యుత్థానం - అధర్మస్య - తదా - ఆత్మానం - సృజామి - అహం॥

| | | | |
|---|---|---|---|
| హే భారత ! | ఓ భరతవంశమునబుట్టినవాడా! | భవతి | కలుగుచున్నదో |
| యదాయదా | యే యే కాలములలో | తదా హి | అప్పుడే |
| ధర్మస్య | ధర్మమునకు | ఆత్మానం | నన్ను |
| గ్లానిః | కొరతయు | అహం | నేను |
| అధర్మస్య | అధర్మమునకు | సృజామి | సృష్టించుకొనుచున్నాను. |
| అభ్యుత్థానం | అభివృద్ధియు | | |

తా॥ ఓఅర్జునా! యేయేసమయమున (వర్ణాశ్రమాది) ధర్మమునకుచేరుపును, అధర్మమునకు అభివృద్ధియుగలుగుచున్నదో,అప్పుడు నన్ను నేను సృష్టించుకొనుచున్నాను. (నేనొకరూపముతో వెలువడుచున్నాను. లేక అవతరించుచున్నాను)

(1) ధర్మస్య - నన్నే ఆశ్రయించుకొనియు, నాదర్శనము నెదురుచూచుకొనియు, తన దేహసంరక్షణలో నాసక్తిని విడచియు, నన్ను చూడని క్షణకాలమును అనేక కల్పములుగనెంచియు, దేహేంద్రియములను అణచియునున్న వైష్ణవశ్రేష్ఠులకు (రామానుజులు)

(శంకరభాష్యము) ఇక అటుజనించుట యేకాలమున ఎందుకొరకై యనుదానిని చెప్పెదను. వర్ణము ఆశ్రమము మొదలైన వాటిచేత ఎరుంగబడదగినదై, ప్రాణుల సంపదకును దృఢమై హితమగు ముక్తికి సాధనమైయునున్న ధర్మమునకు కొరతయు అధర్మమునకు అభివృద్ధియు వచ్చునప్పుడెల్ల నేను నన్నుమాయచేత సృజించుకొనుచున్నాను. జనులకు కనబడుచున్నాను.

---

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

పద॥ పరిత్రాణాయ (1) - సాధూనాం - వినాశాయ - చ - దుష్కృతాం (2)।
ధర్మసంస్థాపనార్థాయ (3) - సంభవామి - యుగే - యుగే (4)॥

| | | | |
|---|---|---|---|
| సాధూనాం | సాధువుల | ధర్మసంస్థాపనార్థాయ | ధర్మమును నిలబెట్టుటకును |
| పరిత్రాణాయ | రక్షణకొరకును | యుగేయుగే | ప్రతియుగమునందును |
| దుష్కృతాం | దుష్టుల | సంభవామి | అవతరించుచున్నాను. |
| వినాశాయ చ | నాశముకొరకును | | |

తా॥ సాధువుల రక్షణకొరకును, దుష్టుల నాశముకొరకును (అనగా వారలను శిక్షించి సన్మార్గమునకు తెచ్చుటకై)ధర్మమును నిలబెట్టుటకొరకును ప్రతియుగమునందును అవతరించుచున్నాను.

(1) పరిత్రాణాయ - నా స్వరూపదర్శన లీలా విశేషములను జూపుటవలనను, నాతో సంభాషించునట్లు చేయుటవలనను, సంరక్షించుట కొరకు (రామానుజులు)

(2) దుష్కృతాం - పై జెప్పిన సాధువులు కానివారల (రామానుజులు)

(3) ధర్మసంస్థాపనార్థాయ - వేదోక్తముగను, నా యారాధనారూపముగను ఉన్న ధర్మమును రక్షించుటకు (రామానుజులు)

(4) యుగే యుగే - ఆయాకాలమున (శ్రీధరులు)

(స్వకీయము) మునుపటి శ్లోకమున భగవంతుడు 'నన్ను సృష్టించు కొనుచున్నాను' అనుట యెందుకనునది ఈ శ్లోకములో జెప్పబడుచున్నది. సాధువులనగా సన్మార్గమునందుండు వారు, దుష్కృతులనగా పాపములను జేయువారు. భగవంతుడు అవతరించియే రక్షింపవలెనను నిబంధన లేదు. అతనికిష్టమైన వేరు విధముగాను రక్షింపగలడు.

శ్లో॥ జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి త త్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున॥

పద॥ జన్మ - కర్మ చ - మే - దివ్యం (1) ఏవం - యః - వేత్తి - త త్త్వతః।
త్యక్త్వా - దేహం (2) - పునః - జన్మ (3) - న - ఏతి - మాం - ఏతి - సః - అర్జున'

| | | | |
|---|---|---|---|
| హే అర్జున ! | ఓ అర్జునా ! | సః | అతడు |
| దివ్యం | దివ్యమైన | దేహం త్యక్త్వా | దేహమునువిడచి |
| మే జన్మ | నా జన్మమునున్ను | పునః జన్మ | మరల జన్మను |
| కర్మ చ | వ్యాపారమునున్ను | నైతి | పొందుటలేదు |
| యః ఏవం | ఎవ్వడీవిధముగ | మాం | నన్ను |
| త త్త్వతః వేత్తి | వాస్తవముగ నెరుంగునో | ఏతి | పొందుచున్నాడు. |

తా॥ ఓ అర్జునా! దివ్యమైన నా యవతారమునున్ను, వ్యాపారమునున్ను, ఎవ్వడు ఈ విధముగ వాస్తవముగ నెరుంగునో అతడు తనదేహమును విడిచిన పిదప మరల జన్మను పొందుటలేదు. నన్ను పొందుచున్నాడు.

(1) 'దివ్యం' అనుదానికి అప్రాకృతం (ప్రకృతి సంబంధములేని) ఐశ్వరం (ఈశ్వర సంబంధమైనది) అనిశంకరులు అర్థముచేసియున్నారు. దైవసంబంధమైనది అని శ్రీధరులున్ను, అప్రాకృతమైన యని రామానుజులున్ను, అర్థముచేసి యున్నారు. ఇతరాపేక్షలేక, స్వయముగనే ప్రకాశించునదైన యని శంకరానందులు.

(2) దేహం - దేహాభిమానమును (శ్రీధరులు)

(3) జన్మ - సంసారమును (శ్రీధరులు)

(శంకరభాష్యము) మనుష్యుని శరీరమువలె ప్రకృతివలన గలిగినదికాక ఈశ్వరునకని విశేషముగ ఏర్పడిన మాయవతారము, మాయచేనైనదనియు, వాఖ్యాపారము సత్పురుషులను కాపాడుట మొదలైనదనియు, ఇట్లుమునుపు చెప్పినట్లు ఉన్నదానిని ఉన్నట్లు ఎవ్వడెరుంగునో అతడు ఈదేహమును విడచినతోడనే మరల జననమును పొందనేరడు. అతడు నన్ను పొందుచున్నాడు. సంసారమునుండి పూర్తిగ విడువబడుచున్నాడు.

(రామానుజులు) మే = గుణత్రయముతో గూడిన ప్రకృతి సంబంధమైన జననములేనివాడనుగను, సర్వేశ్వరత్వ సర్వజ్ఞత్వసత్యసంకల్పత్వాదులైన అనంతకల్యాణగుణములతో కూడినవాడనుగను

ఉన్న నాయొక్క, జన్మ = అవతారమునున్ను, కర్మచ = సాధువుల సంరక్షణార్థముగను, నన్నాశ్రయించిజనులు కడతేరుట కొరకును, నేనుజేసిన అవతారచరిత్రమునున్ను, దివ్యం = అప్రాకృతమని యథార్థముగ యెవ్వడెరుంగునో.

(రాఘవేంద్రులు) భగవంతుని అవతారమహిమ, చరిత్రమహిమ వీటితత్త్వము నెరింగి, దానిచే ముక్తి పొందదగిన జీవుడెవ్వడో అట్టిజీవుఢు ముక్తి బొందు విషయమును నిరూపించి చూపుటకై ఈ శ్లోకముద్భవించినదని ఎరుంగదగినది.

(స్వకీయము) ఈ శ్లోకములో శ్రీకృష్ణభగవంతుని జన్మ = అవతారము, కర్మ = వ్యాపారము వీటి నెరింగినవానికి మరల జననములేదని చెప్పబడియున్నది. రామకృష్ణాద్యవతారములను, రావణ శిశుపాలాదివధము మొదలగు వ్యాపారములను సాధారణ జనులుగూడ ఎరుంగుదురు గదా! వారలకెల్ల పైజన్మలేదా? యనిన,

ఇందులో జెప్పిన జ్ఞానము, పైకనిన సామాన్యమైన జ్ఞానముకాదు. ఏలననగా "తత్త్వతః యథార్థముగ" అను పదము ఈ శ్లోకమునందుపయోగింపబడియున్నది. అందువలన అవతార పురుషు డెవ్వడు? అతనివ్యాపారమెట్టిది? అనువాటిని ఎరుంగవలసినదావశ్యకమగుచున్నది. మునుపటి శ్లోకములచేత లోకములో ధర్మముతగ్గి, అధర్మము తలయెత్తుకాలమునందును, దుష్టులధికరించి సత్పురుషులకు దుఃఖము గలుగునప్పుడును అవతారములు చేయబడినవిగ జెప్పబడుచున్నవి. ఏ ఉద్దేశముతో అవతారము చేయబడుచున్నదో ఆ యవతారమునందు ఆ కార్యము అడ్డులేక నెరవేర్పబడుచున్నది. వీటిని సామాన్యమైన దేవతగాని, మనుష్యుడుగాని చేయగలడా? కావున సాక్షాత్పరమేశ్వరుడే లోకమును రక్షించుటకొరకై యవతరించి దుష్టులనుఅణచి సత్పురుషులను రక్షించుచున్నాడనియు, అతడు అనంతకళ్యాణ గుణగణనిధియనియు. సకలలోకములను సృష్టించి దానిలో తాను లీలావతారము చేయుచున్నాడనియు, అతడులేక అణువైనను కదలదనియు వానిని స్మరించిన వాని పాపము నశించుననియు, యథార్థముగ నెరింగి (పై శ్లోకానుసారముగ) లోకమునందలి యాసక్తిని విడనాడి మనస్సును ఆ పరమేశ్వరునియెడ నిలబెట్టువాడు మరుజననములేని వైకుంఠ పదవిని పొందగలడు. దానిలో సందియమేలేదు. అట్లుగాక రామకృష్ణాద్యవతారముల జేయుచున్న పురుషులను సాధారణ రాజకుమారులనియు, అయితే విశేషబలమును సామర్థ్యమును గలవారలనియుతలంచి తత్త్వము నెరుంగక పోయినచో, వారలు జననమను సముద్రమునుండి తరింపజాలరనునది ఈ శ్లోకమునందలి భావము.

శ్లో॥ వీతరాగభయక్రోధామన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ 10

పద॥ వీతరాగభయక్రోధాః (1) - మన్మయాః (2) - మాం - ఉపాశ్రితాః (3) ।
బహువః - జ్ఞానతపసా (4) - పూతాః - మద్భావం (5) - ఆగతాః ॥

| | | | |
|---|---|---|---|
| వీతరాగభయక్రోధాః | కోరిక, భయము, కోపము నివర్తించినవారలై | జ్ఞాన తపసా | జ్ఞానమనుతపస్సుచేత |
| | | పూతాః | పరిశుద్ధులై |
| మన్మయాః | నామయులైనవారలై | మద్భావం | నా భావమును (మోక్షమును) |
| మాం ఉపాశ్రితాః | నన్నే యాశ్రయించినవారలై | ఆగతాః | పొందిరి |
| బహవః | అనేకులు | | |

తా॥ కోరిక, భయము, కోపము ఇవి లేనివారై, నా మయమైనవారై (అనగా తన యాత్మకును, ఈశ్వరునికిని భేదము లేదని చూచువారై) నన్నాశ్రయించినవారై, అనగా పరమేశ్వరుడనైన నన్నే శరణము గైకొన్నవారై, అనేకులు జ్ఞానమను తపస్సుచేత పరిశుద్ధులై నా సాయుజ్యమును పొందిరి. (అనగా ఐక్యముక్తిని పొందిరని తాత్పర్యము.)

(1) రాగము - అనగా ఫలమునందు కోరికయని మధుసూదన సరస్వతియు, భోగములయందును, ఉపకారముచేయు వారలయందును గల యాశయని శంకరానందులును, విషయములలో రంజనరూపమైన మనోవృత్తియని భాష్యోత్కర్షదీపికాకర్తయున్ను అర్థముచేసియున్నారు.

(2) మన్మయాః - తామే యీశ్వరుడని యెరింగినవారలైయున్న (శంకరులు) నన్నుదప్ప ఇతర వస్తువులలో దృష్టిలేని (మధ్వులు) నేనే సర్వోత్తముడనియు, సకలజగమునకును ముఖ్య కారణుడనియు నెరింగియున్న (రాఘవేంద్రులు)

(3) ఉపాశ్రితాః - జ్ఞాననిష్ఠవలన నెరుంగుచున్న (శంకరులు) నన్నే శరణము పొందియున్న (రాఘవేంద్రులు)

(4) జ్ఞానతపసా - జ్ఞానముచేతను తపస్సుచేతను (శ్రీధరులు) నా జన్మకర్మలయొక్క తత్త్వము నెరుంగుచున్న జ్ఞానమను తపస్సుచేత (రామానుజులు) జ్ఞానమను తపస్సుచేత, లేక జ్ఞానముచేతను తపస్సుచేతను (రాఘవేంద్రులు)

(5) మద్భావం - మోక్షమును (శంకరులు) సాయుజ్యమును, శ్రీనారాయణుని సమీపము నందుండుట సాయుజ్యమని చెప్పబడును. (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) ఈ మోక్షమార్గము ఈ కాలమున నేర్పడినదిగాదు. అది ఆది కాలమునందుగూడ గలదనుదానిని భగవంతుడు చెప్పుచున్నాడు. 'మన్మయాః' = బ్రహ్మవిత్తుగ, అనగా బ్రహ్మము నెరింగినవారలై ఈశ్వరునకు, తనకు భేదములేదని చూచువారలు. మా ముపాశ్రితాః = పరమేశ్వరుడనైన నన్నే శరణముగ పొందినవారలు, అనగా జ్ఞానమొకదానియందే స్థిరముగ నిలబడువారలు. ఇట్లు అనేకులు పరమాత్మనుగూర్చిన జ్ఞానమను తపస్సుచేత శ్రేష్ఠమైన పరిశుభ్రతనుబడసి, నా భావమును, అనగా ఈశ్వరునిస్థితిని, మోక్షమును బాగుగపొందిరి. జ్ఞాననిష్ఠ మోక్షమిచ్చు విషయమున తనకు సహాయముగ ఇతర తపస్సుల నపేక్షింపక నిలుచుటను గుర్తించుటకై 'జ్ఞానమను తపస్సుచేత' అను విశేషణము చేర్చబడియున్నది.

(స్వకీయము) 'మద్భావం' దీనికి రామానుజులు అర్థముజెప్పలేదు. అయినను ఎనిమిదవ అధ్యాయము 5-వ శ్లోకమున నీ పదమునకు "నన్ను ఏరూపముతో స్మరించునో ఆ స్వరూపము" అనియు, 14 వ అధ్యా-19-20 వ శ్లోకములలో "ఆత్మానుభవమును" అనియు అర్థముచేసి యుండుటవలన వాటియందొకదాని నిచ్చట జెప్పినదిగ గ్రహింపదగును.



శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥

పద॥ యే - యథా (1) - మాం - ప్రపద్యన్తే - తాన్ - తథా - ఏవ - భజామి (2) - అహం।
మమ - వర్త్మ (3) - అనువర్తన్తే - మనుష్యాః (4) పార్థ - సర్వశః॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ అర్జునా! | అహంభజామి | నేను అనుగ్రహించుచున్నాను |
| | ఎవ్వరు | మనుష్యాః | మనుష్యులు |
| యథా | ఏవిధముగ | మమవర్త్మ | నా మార్గమును |
| మాం ప్రపద్యన్తే | నన్ను ఉపాసించుచున్నారో | సర్వశః | అన్ని విధముల |
| తాన్ | వారిని | అనువర్తన్తే | అనుసరించుచున్నారు. |
| తథైవ | ఆ విధముగనే | | |

తా॥ ఓ అర్జునా! ఎవ్వరేవిధముగ నన్నుపాసించుచున్నారో వారలను ఆవిధముగనే నేననుగ్రహించుచున్నాను. మనుష్యులు నామార్గమును అన్ని విధముల అనుసరించుచున్నారు.

(1) యథా — ఫలమును గోరిగాని, కోరకగాని (శంకరులు)

(2) భజామి — ఈపదమునకు భజించుచున్నాను, ఉపాసించుచున్నాను అనుఅర్థమే సాధారణ ముగ జెప్పదగియున్నను ఇది పరమాత్మయైన కృష్ణభగవంతుని వాక్యమైనందున భాష్య కారులు 'అనుగ్రహించు చున్నా'నని అర్థముచేసిరి.

(3) వర్త్మ—పూజారూపమైన మార్గమును (శంకరులు) భజన మార్గమును (శ్రీధరులు) స్వభావ మును (రామానుజులు)

(4) సర్వశః—సత్కర్మవలనగాని, జ్ఞానమువలనగాని, కీర్తనాదులచేగాని, మరి యేవిధముగ నైనను (స్వకీయము)

(శంకరభాష్యము) అట్లైన, నీకు ఒకనియెడప్రీతియు, మరియొకనియెడ ద్వేషమునుగలవని సిద్ధించుచున్నది, ఏలన, నీవు ఆత్మస్థితిని, అనగా మోక్షమును కొందరికి మాత్రమేగాని, యందరికి నిచ్చి యనుగ్రహించుటలేదుగదా? అనిన, దానికి ప్రత్యుత్తరము జెప్పుచున్నాడు:—

ఎవ్వరు ఏవిధముగ ఏప్రయోజనముతో అనగా ఏఫలమునుగోరి, నన్ను పొందెదరో ఆవిధముగనే ఆఫలము నిచ్చుటవలన వారల ననుగ్రహించుచున్నాను. ఎవ్వరికి మోక్షమున ఆసక్తి లేదో వారలు దానిని కోరనందున పొందుటలేదు. సంసారమునుండి విముక్తిచెందుటకు కోరికగలిగి యుండుటయు, ఇహపర ఫలములలో నాసక్తి గలిగియుండుటయు నొకనికి ఒకేకాలమున సంభ వింపవుగదా? కావున స్వప్రయోజనమును అపేక్షించువారలకు వారల యిష్టపూర్తినిచేయుచున్నాను. అయితేయెవ్వరు శాస్త్రమున జెప్పిన విధముగనన్నిటిని జేయువారలై ఇహపరఫలములను గోరనివారలై సంసారము నుండి విడువబడగోరినవారై యున్నారో వారలకు జ్ఞానమునిచ్చి యనుగ్రహించు చున్నాను, జ్ఞానులుగను, సన్న్యాసులుగను, ముముక్షువులుగ నున్నవారెవ్వరో వారలను మోక్ష మిచ్చుటవలన అనుగ్రహించుచున్నాను. ఆవిధముగనే దుఃఖితులను వారల దుఃఖమును బోగొట్టుట వలన అనుగ్రహించుచున్నాను. ఎవ్వరు నన్ను ఏవిధముగ పొందుచున్నారో వారలను ఆవిధము గనే యనుగ్రహించుచున్నానని భావము. మరియు ప్రీతిచేగాని ద్వేషముచేగాని మోహముచేగాని నేనెవ్వరిని అనుగ్రహించుటలేదు. అన్నివిధములైన స్థితిగలవాడనై అంతట ఆత్మ స్వరూపముగనే యున్న ఈశ్వరుడనైన నాచే చెప్పబడియున్న జ్ఞానకర్మ మార్గములను మనుష్యులన్నివిధముల నను

సరించుచున్నారు. ఏఫలమునుగోరి దానికి తగినయేకర్మను జేయనధికారులై ఎవ్వరు ప్రయత్నించె దరో ఆఫలమును బడయుటకై ఆపనిని జేయువారలు "మనుష్యులు" అనబడుచున్నారు. ఇచ్చట మనుష్యులు అనుదానికి మనుష్యులను, రాక్షసుడు, కోతి, ఏనుగు మొదలగు ఇతరప్రాణులను లోబరచి యనిభావము. (ఇచ్చట మార్గమనగా:— జ్ఞానకర్మ రూపమైనది)

(శ్రీధరులు) నన్నే యుపాసించువారలకు సాయుజ్యపదవి నిచ్చుచున్నానని మునుపు చెప్పబడినందున మరి, యింద్రాది దేవతలనుపాసించువారలకు ఫలమునిచ్చుటలేదని చెప్పినదగును. దీనివలన ఈశ్వరునివద్ద పక్షపాతమున్నదిగ కనబడుచున్నదిగదా? యనిన అట్లు పక్షపాతములేదను దానిని ఈ శ్లోకముచేత భగవంతుడు ప్రకటింపజేయుచున్నాడు. ఎట్లనగా ''యథా = ఏవిధముగ'' అనుపదముచేత ఫలమునుగోరిగాని, కోరకగానినన్ను సాక్షాత్తునగాని, ఇంద్రాదిదేవతా స్వరూపమైన నన్ను ఆదేవతలుగగాని యుపాసించుచున్నారో వారలకు వారివారి కోరికననుసరించి నేను ఫల మిచ్చుచున్నానని చెప్పినదగుచున్నది.

(స్వకీయము) యజ్ఞముచే నారాధించుచున్న ఇంద్రాది దేవతానామములు నానామములే కావున, ఆనామములచే నారాధింపబడుచున్నవాడను నేనేయగుచున్నాను, అనునదితప్ప మిగత భాగములకు పైజెప్పినటులనే మధ్వాచార్యులు తాత్పర్యము చేయుచున్నారు. నన్నాశ్రయించుచున్న వానినిమాత్రము అనుగ్రహించుచున్నాననునదిలేదు. నన్నాశ్రయింప కోరికగలవాడై యే ఫలమును గోరిగాని యుపాసించునతనినిగూడ అనుగ్రహించి దర్శనమును ఇచ్చుచున్నాననునది రామానుజుల తాత్పర్యము.



శ్లో॥ కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥ 12

పద॥ కాఙ్క్షన్తః - కర్మణాం - సిద్ధిం - యజన్తే - ఇహ - దేవతాః।
క్షిప్రం - హి - మానుషే - లోకే - సిద్ధిః - భవతి - కర్మజా॥

| | | | |
|---|---|---|---|
| ఇహ | ఈ లోకములో | హి | ఎందువలననగా |
| కర్మణాం సిద్ధిం | కర్మల ఫలమును | కర్మజా సిద్ధిః | కర్మవలన గలుగుచున్న ఫలము |
| కాఙ్క్షన్తః | అపేక్షించువారలు | మానుషేలోకే | మనుష్యలోకములో |
| దేవతాః | ఇంద్రాదిదేవతలను | క్షిప్రం భవతి | శీఘ్రముగ గలుగుచున్నది. |
| యజన్తే | ఆరాధించుచున్నారు | | |

తా॥ ఈలోకములో కర్మల ఫలము నపేక్షించువారలు ఇంద్రాది దేవతల నారాధించుచున్నారు. ఏలనగా, కర్మఫలము మనుష్యలోకమున శీఘ్రముగ గలుగుచున్నది.

(శంకరభాష్యము) ఈశ్వరుడవైన నీకు ఆశ మొదలగు దోషములులేనందున ప్రాణులను తరింపజేయవలెనను కోరిక సకలప్రాణులయెడను సమముగనున్నది. నీవన్నో అన్నిఫలములను ప్రసాదింప సమర్థుడవు. ఇట్లుంతగా ఎల్లరు "అన్నియు వాసుదేవుడే" అనుజ్ఞానముచేతనే సంసారము నుండి విడువబడగోరినవారై నిన్నేయేల పొందుటలేదనిన, దానికి కారణము చెప్పెదను వినుము:—

ఈ లోకములో తాము చేయుకర్మలకు ఫలము తమకు జేకూరుటను గోరువారలు ఇంద్రుడు, అగ్ని మొదలైన దేవతలనుపాసించుచున్నారు. దీనిని "అథ యః అన్యాం దేవతాం ఉపాస్తే అన్యః అసౌ అన్యః అహం అస్మి ఇతి న స వేద యథాపశుః ఏవం సదేవానాం = ఇక ఎవ్వడు, అతడువేరు నేను వేరు అనుకొని దేవతాంతరమునుపాసించుచున్నాడో అతడు మనుష్యులకు గొఱ్ఱె గోవు లెట్లనో అట్లనే దేవతలకు అతడగును" అనుబృహదారణ్యకోపనిషత్తు (1-4-10) శ్రుతివాక్యముచే చూడుడు. ఫలమునుగోరి దేవతాంతరములను పూజించువారలై, వర్ణమునకును ఆశ్రమమునకును అధికారులై ఆ వర్ణాశ్రమములకు తగినట్లు తమ తమ కర్మను జేయుచున్నవారలకు ఆ కర్మచే రాగల ఫలము శీఘ్రముగ చేకూరుచున్నది. శాస్త్రముయొక్క అధికారము మనుష్యలోకమునందే. అనగా మనుష్యలోకమునకయ్యే యేర్పడినదని భావము. మనుష్యలోకములో "శీఘ్రముగ" అను విశేషణముచేత లోకాంతరములయందును కర్మకు ఫలముగలుగునమదానిని భగవంతుడెత్తి చూపుచున్నాడు. అయితే వర్ణము, ఆశ్రమము, మొదలగువాట్లకు తగినట్లు కర్మయందధికారము ఈ మనుష్యలోకమునందేగాని లోకాంతరములయందు లేదనునదే యీ లోకమునకును లోకాంతరమునకునుగల భేదము.

(రామానుజులు) కర్మజా = కర్మచేత కలుగుచున్న, సిద్ధిః = ఫలము, ఇహమానుషే లోకే = ఈ మనుష్యలోకమునందును, స్వర్గలోకమునందును, హి = యే కారణమువలన, క్షిప్రం- శీఘ్రముగ, భవతి = కలుగుచున్నదో (అతః) ఆ కారణమువలన, కర్మణాం సిద్ధిం = కర్మవలన గలుగుచున్న పశుపుత్ర స్వర్గాదిఫలమును, కాఙ్క్షన్తః = అపేక్షించువారలు, దేవతాః = దేవతలను, యజన్తే = ఆరాధించుచున్నారు. దీని తాత్పర్యమేమనః— దేవతల నారాధించువారలకు శీఘ్రముగ ఫలముగిట్టునని జెప్పినదానిచేతనే నన్నారాధించువారలకు శీఘ్రముగ ఫలము లభింపనేరదని చెప్పినదగుచున్నది. కాన నిత్య సుఖమైన మోక్షఫలము శీఘ్రముగ లభింపనేరదనియు, ఈ మోక్షఫలము నపేక్షించువారలు మిక్కిలి కొందరే యనియే.

(రాఘవేంద్రులు) ఏదేవతల నారాధించినను ఆ దేవతాంతర్యామిగనున్న నేనే ఫలము నిచ్చుచున్నాను.



శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయం ॥ 13

పద॥ చాతుర్వర్ణ్యం (1) - మయా - సృష్టం (2) - గుణకర్మవిభాగశః ।
తస్య - కర్తారం - అపి - మాం - విద్ధి - అకర్తారం - అవ్యయం ॥

| | | | |
|---|---|---|---|
| చాతుర్వర్ణ్యం | నాలుగు వర్ణములున్ను | కర్తారమపి | కర్తయైనను |
| మయా | నాచేత | మాం | నన్ను |
| గుణకర్మవిభాగశః | గుణకర్మల విభాగముచేత | అకర్తారం | కర్తకానివానిగను |
| సృష్టం | సృష్టింపబడినవి | అవ్యయం | నిర్వికారిగను |
| తస్య | దానికి | విద్ధి | ఎరుంగుము. |

**తా॥ (బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర,) నాలుగు వర్ణములున్ను నాచే గుణములు కర్మలు వీటివిభాగములకు తగినటుల సృష్టింపబడినవి. ఆ గుణకర్మ విభాగమైన సృష్టులకు నేనే కర్తనైనను నన్నువాస్తవమున కర్తకానివానిగను, నిర్వికారిగను నెరుంగుము.**

(1) చాతుర్వర్ణ్యం — నాలుగువర్ణములను ముఖ్యముగ గలిగి బ్రహ్మమొదలు స్తంబమువరకు నున్న జగత్తు (రామానుజులు)

(2) సృష్టం — అనుదానిలో స్థితియు సంహారమును నిమిడియున్నవి (రామానుజులు)

(శంకరభాష్యము) "మనుష్యలోకమునందే వర్ణము, ఆశ్రమము మొదలగువాట్లకు తగినటుల కర్మయందధికారము. లోకాంతరములలో ఇట్లులేదు" అనునియమము ఎందువల్లనైనదనునది దీనిలో జెప్పబడుచున్నది. లేక "వర్ణము ఆశ్రమము మొదలగు విభాగముగల మనుష్యులు ఏవిధముగను నా మార్గమునే అనుసరించుచున్నారు." అని మునుపు చెప్పబడినదిగదా? వారలు ఏ కారణమువలన నీ మార్గమునేగాని మార్గాంతరముననుసరించుటలేదనునది చెప్పబడునదిగను గ్రహింపదగును.

నాలుగేయైనజాతులనగా గుణములయొక్క పలువిధములైన హెచ్చుతక్కువయైన పరిమాణమునకు తగినట్లును, ఆవిధముగనే కర్మలయొక్క పలువిధములైన పరిమాణమునకు తగినట్లును ఈశ్వరుడనైన నాచేత ఏర్పరుపబడియున్నది. దీనిని "బ్రాహ్మణుడు ఈతని ముఖమయ్యెను" (ఋగ్వేదము 10-90) అనునది మొదలైన శ్రుతిచే ఎరుంగుడు. గుణములు సత్త్వము, రజస్సు, తమస్సు అనునవి. ఆ నాలుగు వర్ణములలో సత్త్వగుణమును ప్రధానముగగల బ్రాహ్మణునకు శాంతము దమము (ఇంద్రియనిగ్రహము) తపస్సు మొదలగునవి స్వభావములైన కర్మలు. సత్త్వగుణమును సహాయముగను రజోగుణమును ప్రధానముగను గలక్షత్రియునకు పరాక్రమము మొదలగునవి స్వభావములైన కర్మలు. తమోగుణమును సహాయముగ బడసి రజోగుణమును ప్రధానముగగల వైశ్యునకు కృషి మొదలగునవి స్వభావములైన కర్మలు. రజోగుణమును సహాయముగ బడసి తమోగుణమును ప్రధానముగగల శూద్రునికి స్వభావమైనది సేవయను ఒకేకర్మయే. (18 వ అధ్యాయము 42-43-44-శ్లోకములను జూడుడు) ఇట్లు గుణము కర్మయనువాటి పలువిధమైన పరిమాణమునకు తగినట్లు నాలుగువర్ణములున్ను నాచే సృష్టింపబడినవని భావము. ప్రసిద్ధములైన యీ నాలుగుజాతులున్ను లోకాంతరములో లేవు. కావుననే "మనుష్యలోకమునందు" అను విశేషణము మునుపు 12 వ శ్లోకమున జెప్పబడినది. అప్పుడు ఈ నాలుగు వర్ణములను సృష్టించుటకు నీవు కర్తవు గావున దానిఫలమునకు కట్టుబడియున్నావు. కాన నీవు సంసారమునుండి విడువబడినవాడవుగను, ఎల్లప్పుడును ఈశ్వరుడవుగను కాజాలవే యనినచో అట్లుకాదు. మాయయొక్క వ్యవహారముచేత నేను ఆ వ్యాపారమునకు కర్తగ వ్యవహరింపబడినను యథార్థముగ అకర్తయైనందున నేను సంసారమునకు లోబడనివాడనని తెలిసికొనుము.

(స్వకీయము) ఈ శ్లోకములో మొదట సృష్టికి కర్త తాననియు, పిదపసృష్టికి తాను కర్తకాదనియు చెప్పబడియున్నది. ఇది పరస్పర విరుద్ధమువలె కనబడినను విరోధము లేదనుదానిని క్రిందకనబరచిన భాష్యకారులున్ను వ్యాఖ్యాతలున్ను నిరూపించియున్నారు. ఎట్లనగా:- మాయను స్వీకరించి సృష్టులను జేయుటవలన కర్తగజెప్పబడినను పారమార్థికముగ కర్త కాదని శంకరులున్ను, సృష్టివిషయమున నేను కర్తనైనను ఫలాపేక్షగాని ఆసక్తిగాని నాకు లేనందున ఆసృష్టికర్మఫలము నన్ను అంటుటలేదు. కావున నేనుకర్తకానని శ్రీధరులును, నాకొకదానిని సృష్టించుటలో ఎట్టి ప్రయాసము లేదు. ఇతరులు ఒకదానిని కలుగజేయుటకు అధికమైన ప్రయాసపడవలెను. నేను తలంచినమాత్రముననే సృష్టియగును. కాన నేను కర్తకానని మధ్వులున్ను, సకలసృష్టికి నేనే కర్తనైనను నాకు కర్తలేనందున నేను (అకర్తా) కర్తకలవాడను కాను. ఎందువలన అకర్తయను దానికి కారణముపై శ్లోకమున జెప్పబడునట్లు రాఘవేంద్రులున్ను జెప్పుచున్నారు.

దీనిలో జెప్పబడియున్న వర్ణములనునవి బ్రాహ్మణాది నాలుగుజాతులు. గుణములనునవి మూడువిధములగును. అవియేవన ఉత్తమమైన సత్త్వగుణము, మధ్యమమైన రజోగుణము అధమమైన తమోగుణము. కర్మలనునవి బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులకు విధింపబడినవియు, 18 వ అధ్యాయము 42 - 43 - 44 శ్లోకములలో జెప్పబడియున్నవియునే. గుణవిభాగముమాత్రము భాష్యకారులున్ను, వ్యాఖ్యాతలున్ను జెప్పియున్నటుల క్రింద విస్తరింపబడుచున్నది.

(1) బ్రాహ్మణునికి.- సత్త్వగుణమధికము. రజోగుణము తక్కువయని శంకరులు, శ్రీధరులు, రాఘవేంద్రులు వీరలున్ను, సత్త్వగుణము గలవాడు బ్రాహ్మణుడని మధ్వులున్ను.

(2) క్షత్రియునకు - సత్త్వగుణము తక్కువ. రజోగుణముఅధికము అని శంకర రాఘవేంద్రులున్ను, సత్త్వరజోగుణము లధికములని శ్రీధరులున్ను, సత్త్వరజోగుణములుగలవాడు క్షత్రియుడని మధ్వులున్ను.

(3) వైశ్యునకు - రజస్తమోగుణములురెండును అధికమని శంకరులును, రజస్సుఅధికము దానికంటె సత్త్వముతక్కువ, దానికన్న తమస్సుతక్కువయని రాఘవేంద్రులున్ను, రజోగుణతమోగుణములు గలవాడు వైశ్యుడని మధ్వులున్ను.

(4) శూద్రునికి - రజస్సుస్వల్పము, తమస్సుఅధికము (శంకరులు), తమస్సు అధికము (శ్రీధరులు. మధ్వులు) తపస్సుఅధికము దానికంటె రజస్సుసత్త్వము తక్కువ (రాఘవేంద్రులు)

ఈతాత్పర్యములను జేర్చిచూచినచో ప్రతివర్ణపువారును మూడుగుణములు గలవారనియు, కొన్నిగుణములు కొందరియెడ అధికముగను, కొంతరియెడ తక్కువగను ఉండుననియుగుర్తించిచూపు నదిగనున్నది. ఆ వర్ణములు సృష్టింపబడుకాలమున వానివాని పూర్వజన్మకర్మానుసారముగ సృష్టింపబడినవి. ఎట్లనగా - సత్త్వగుణప్రధానమైన శమముదమముమొదలగు ధర్మములనుగలవానిని బ్రాహ్మణుడుగను, రజోగుణప్రధానమైన శౌర్యముమొదలగు ధర్మములుగలవానిని క్షత్రియుడుగను, మరియీ విధముగనే ఇతరవర్ణములున్ను సృష్టింపబడినవిగ తాత్పర్యము. రాఘవేంద్రులు - సాత్త్వికములో సాత్త్వికము, రాజసములో సాత్త్వికము. తామసములో సాత్త్వికమని విభజించి మధ్యలోనున్న రాజస సాత్త్వికములను మాత్రము ఎత్తుకొని పై జెప్పినవిధముగ విభజింపవలెనని చెప్పియున్నారు.



శ్లో॥ న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14

పద॥ న - మాం - కర్మాణి - లింపన్తి - న - మే - కర్మఫలే - స్పృహా।
ఇతి - మాం - యః - అభిజానాతి - కర్మభిః - న - సః - బధ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| కర్మాణి | కర్మలు | ఇతి | ఈవిధముగ |
| మాం నలింపన్తి | నన్నంటుటలేదు | యః మాం | ఎవ్వడు నన్ను |
| మే | నాకు | అభిజానాతి | తెలిసికొనుచున్నాడో |
| కర్మఫలేస్పృహా | కర్మఫలమునందు కోరిక | సః | అతడు |
| న | లేదు | కర్మభిః న బధ్యతే | కర్మలచే కట్టుబడుటలేదు. |

తా॥ కర్మలునన్ను అంటుటలేదు. నాకుకర్మఫలమునందాసక్తిలేదు. అను నీవిధముగ నన్నెవ్వడు తెలిసికొనుచున్నాడో అతడు కర్మలచే కట్టుబడుటలేదు. (ఏలనగా కర్మలకు కారణమైన అహంకారము నివర్తించుటచేతనే)

(శంకరభాష్యము) నీవు నన్ను ఏకర్మలకు కర్తయనితలంచుచున్నావో వాటికి నేను వాస్తవముగ కర్తనుగాను, ఏలనగా నాకు అహంకారములేనందున ఆ కర్మలునన్ను పట్టుటలేదు. అనగా నాకు దేహాదులను జన్మను కలుగజేయుటలేదు. ఆ కర్మల ఫలములలో నాకాసక్తియులేదు. అయితే సంసారులైన లోకజీవనమున ఆసక్తిగల యెవ్వరికి కర్మలలో "నేనుకర్త" అనుతలంపును, వాటిఫలములలో నాసక్తియుగలవో వారలను కర్మలు పట్టుచున్నవనుటతగును. అవినాకు లేనందున కర్మలు నన్ను పట్టనేరవు. "నేను కర్తనుకాను, నాకు కర్మ ఫలమునందాసక్తిలేదు" అను నీవిధముగ నెరుంగువాడు వేరెవ్వడైనను అతడున్ను కర్మలచే కట్టుబడుటలేదు. వానికిగూడ జన్మాంతరమును (శరీరము మొదలగువాటిని) కలుగజేయునట్టి కర్మలులేవని తాత్పర్యము.

(రామానుజులు) నన్ను కర్మఫలమేల అంటుటలేదనగా ఆయాప్రాణుల ప్రాచీనకర్మలకు తగినటుల దేవమనుష్య పశుపక్ష్యాదిదేహములుగ సృష్టించుచున్నానేగాని ఎట్టి వైషమ్యముచేతగాని నేనట్లుసృష్టించుటలేదు. ఆయా ప్రాణులదేహమునకు కారణము వారివారి ప్రాచీనకర్మయైనందున నేను ఎట్టి పక్షపాతమునుగాని చేసెడివాడనుగాను. ఎట్టి దోషముగాని నన్నంటనేరదు. అటులనే ప్రాచీన కర్మకుతగినటుల వారలకు భుజింపదగిన వస్తువులనున్ను సృష్టించుచున్నాను. దానిఫలము నందు నాకెట్టి సంబంధములేదు. కానఫలమున్ను నన్నంటుటలేదు. సృష్టికికారణము వారివారి ప్రాచీనకర్మయే. నేను నిమిత్తకారణముగ మాత్రమున్నాను. ఇట్లు నన్నెవ్వడుఎరుంగునో అతడు అతని కర్మయోగమునకు విరోధియైన ప్రాచీనకర్మచేత కట్టుబడుటలేదు.

(మధ్వులు) పక్షపాతము (వైషమ్యము) లేనందున కర్మమంటుటలేదు. కోరికలేనందున ఫలమంటుటలేదు.

(రాఘవేంద్రులు) జీవునివలె నేను ఫలమునపేక్షించి కర్మలనుజేయుటలేదు. కావున కర్మలు గాని ఫలముగాని నన్నుకట్టిపెట్టుటలేదు. ఆయా ప్రాణియొక్క ప్రాచీనకర్మననుసరించి సృష్టించుట వలన పలువిధములైన విచిత్రసృష్టిచేసిన పక్షపాతదోషము నన్నుపొందుటలేదు. ఈ విధముగ నన్నెరింగిన వానికి బంధములేదు. వానికే బంధములేనప్పుడు నాకు బంధమెట్లుగలుగును? ''ఈవిధముగ నన్నెరింగినవాడు'' అను వాక్యముచేత శ్రీకృష్ణపరమాత్మ పరమాత్మయనియు, ఎరుంగునతడు జీవుడు, ఎరుంగబడువాడు ఆ పరమాత్మయనియు వ్యక్తమగుచున్నది. కాన జీవేశ్వరభేదము స్థాపింపబడినది.

(స్వకీయము) కర్మలుగాని వాటిఫలముగాని భగవంతునియంటుటలేదని మాత్రము తెలిసి కొనినవాడు కర్మలచే కట్టుబడుటలేదని చెప్పినచో జ్ఞాననిష్ఠమొదలగునవి అనావశ్యకములగును. కావున మునుపటిశ్లోకమున జెప్పినట్లు భగవంతుని సృష్ట్యాదికర్మలకు కర్తయనితలంచుట మాయ యొక్క వ్యవహారమువలన అజ్ఞానదశయందు కల్పింపబడుచున్నది. వాస్తవమున ఆత్మఅకర్తయని ఆత్మతత్త్వము నెరుంగవలెను. అయాత్మసాక్షాత్కారమును పొందగోరి కర్మయోగము ననుష్ఠించిన వాడు ''కర్మలకు నేను కర్తనుగాను'' అనియహంకారమునువిడిచి "నాకు కర్మఫలమునందాసక్తి లేదు'' అని చేయుకర్మలు అతనిని బంధపరచనేరవనునది నిశ్చితము.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం॥ 15

పద॥ ఏవం - జ్ఞాత్వా - కృతం - కర్మ - పూ ర్వైః - అపి - ముముక్షుభిః।
కురు - కర్మ - ఏవ - తస్మాత్ - త్వం - పూర్వైః - పూర్వతరం - కృతం॥

| | | | |
|---|---|---|---|
| ఏవం జ్ఞాత్వా | ఈ విధముగ నెరింగి | త్వం | నీవు |
| ముముక్షుభిః | మోక్షేచ్ఛగల | పూర్వైఃకృతం | పూర్వికులచే అనుష్ఠింపబడినట్టియు |
| పూర్వైః అపి | పూర్వికులచేతను | పూర్వతరం | మిక్కిలి పురాతనమైనదియునైన |
| కర్మకృతం | కర్మచేయబడినది | కర్మైవ కురు | కర్మనే చేయుము. |
| తస్మాత్ | అందువలన | | |

తా॥ (నేను కర్తనుగాను, నాకు కర్మఫలమునందాసక్తి లేదు, అని) ఈవిధముగ దెలిసి పూర్వీకులును మోక్షేచ్ఛగలవారునునైన జనకాదులచేతగూడ కర్మ చేయబడినదిగాన పూర్వీకులచే జేయబడినదియు దీర్ఘకాలమునుండి వచ్చినదియు నైన కర్మనే నీవు చేయుము. (మహాజ్ఞానులైన జనకుడు మొదలైన వారలున్ను కర్మచేయుచువచ్చిరి. కావున నీవు కర్మచేయననిచెప్ప యోగ్యుడవుకావనియు, కర్మనుజేసి ఫలమును ఈశ్వరార్పణముచేసినచో దానివలన చిత్తశుద్ధిని జ్ఞానమును పొంది జ్ఞానముచేత మోక్షమొందవచ్చుననునదియు తాత్పర్యము.)

(శంకరభాష్యము) నేను కర్తనుగాను, నాకు కర్మఫలమునందాసక్తిలేదు. అని యీ విధముగ తెలిసికొని సంసారమునుండి విడువబడగోరిన పూర్వీకులచేతను కర్మము అనుష్ఠింపబడినందున నీవు కర్మనే చేయవలెనేగాని మౌనముగ కూర్చొనియుండుటగాని కర్మలను విడచిపెట్టుటగానివలదు.

నీవు ఆత్మజ్ఞానము లేనివాడవైనచో, అప్పుడు చిత్తశుద్ధికై కర్మ ననుష్ఠించవలెను. నీవు ఆత్మ జ్ఞానముగలవాడవైనచో లోకసంగ్రహమునకై అనగా లోకమునకు సన్మార్గమును చూపుటకైనను కర్మచేయవలెను. మరియు ఆ కర్మ, పూర్వము జనకాదులైన పూర్వీకులచే అనుష్ఠింపబడి వచ్చినదేగాని ఇప్పుడు క్రొత్తగా ఏర్పరచబడినదిగాదు.

(స్వకీయము) "ఈ విధముగ నెరింగి" అనగా మునుపటి శ్లోకములో జెప్పినట్లని అర్థము. పై శ్లోకముల క్రింద స్వకీయాభిప్రాయమున జెప్పబడియుండుటను జూడుడు.

---

శ్లో॥ కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః।
[illegible] 16

పద॥ కిం - కర్మ - కిం - అకర్మ - ఇతి - కవయః - అపి - అత్ర - మోహితాః।
తత్ - తే - కర్మ - ప్రవక్ష్యామి - యత్ - జ్ఞాత్వా - మోక్ష్యసే - అశుభాత్॥

| | | | |
|---|---|---|---|
| కర్మకిం | కర్మయనునదేది | కవయోఽపి | పండితులుగూడ |
| అకర్మకిం | అకర్మయనునదేది | మోహితాః | మోహము చెందియున్నారు |
| ఇత్యత్ర | అను నీ విషయమున | యత్ జ్ఞాత్వా | దేనినెరింగి |

| | | | |
|---|---|---|---|
| అశుభాత్ | సంసారబంధమైన పాపమునుండి | తత్ కర్మ (తదకర్మ) | ఆ కర్మాకర్మలను |
| మోక్ష్యసే | విడువబడెదవో | తే ప్రవక్ష్యామి | నీకు చెప్పబోవుచున్నాను. |

తా॥ కర్మయనునదెట్టిది? అకర్మయనునదెట్టిది? అను విషయములో పండితులుగూడ మోహముచెందియున్నారు. దేనినెరింగి, లేక అనుష్ఠించి సంసారబంధమునుండి విడువబడగలవో ఆ కర్మాకర్మలను నీకు జెప్పబోవుచున్నాను.

(శంకరభాష్యము) ఈ మనుష్యలోకములో కర్మచేయవలెననినచో దానికి నీవు చెప్పిన దానినే ప్రమాణముగగ్రైకొని నేను కర్మనుజేసెదను. అట్లుండగా పూర్వీకులచేత పూర్వకాలమున కర్మ చేయబడినదని పొగడిజెప్పుటవలన నేమి విశేషమనినచో, కర్మయిట్టిదని తెలిసికొనుటలో మిక్కిలి కష్టముకలదు. ఏలన కర్మయెట్టిది, అకర్మయెట్టిదనుదానిని తెలిసికొనువిషయమున పండితులుగూడ మోహమును జెందియున్నారు. అనగా తప్పిపోవుచున్నారు. కావున కర్మ, అకర్మఅను నీరెంటి తత్త్వము ఇట్టిదని నేను నీకు విస్తరించిచెప్పుచున్నాను. దీనిని తెలిసికొనుటవలన సంసారమను దుఃఖమునుండి నీవు విడువబడగలవు.

(స్వకీయము) ఈ శ్లోకమున రెండవభాగమున 'తత్తేకర్మ' అనువాక్యము ప్రయోగింపబడియున్నది. ఈ పదములను రాఘవేంద్రులు - తత్ - తే - కర్మ - అని మొదటవిడతీసిరి. అట్లైనచో తత్ - ఆ, కర్మ = కర్మను, తే = నీకు అని అర్థమగుచున్నది. కర్మను నీకుజెప్పెదననగా అకర్మను చెప్పనుఅనియగును. అకర్మయెట్టిదని పై పైగా ప్రశ్నింపబడియున్నను రాగల శ్లోకమునందు త్తరము చెప్పబడియున్నను అకర్మనుగూడ చెప్పెదననునది ఈ శ్లోకముచేత స్పష్టముకావలెను. కావున తత్ - తే - కర్మ. తత్ - తే - అకర్మ అని విడదీసి ఆ కర్మాకర్మలను నీకుచెప్పెదనని మరియొక అర్థమునుజేసెను. శంకరులున్ను, శ్రీధరులున్ను అకర్మనుగూడజేర్చిరి. రామానుజులు - కర్మకిం = ముముక్షువు లనుష్ఠింపవలసిన కర్మయెట్టిది? అకర్మకిం = అకర్మకులోబడియున్న అట్టి కర్తయొక్క ఆత్మస్వరూప జ్ఞానమను అకర్మయెట్టిది? అనువిషయమున విద్వాంసులుగూడ మోహించియున్నారనునదిగ అర్థముచేసియున్నారు. (అకర్మయనగా కర్మజేయువాని ఆత్మస్వరూపమిట్టిదని తెలిసికొను జ్ఞానమేదో ఆ జ్ఞానమనియు, ఆ జ్ఞానముకర్మలో నిమిడియున్నదనియు రామానుజుని తాత్పర్యము.)



శ్లో॥ కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17

పద॥ కర్మణః - హి - అపి - బోద్ధవ్యం - బోద్ధవ్యం - చ - వికర్మణః ।
అకర్మణః - చ - బోద్ధవ్యం - గహనా- కర్మణః - గతిః ॥

| | | | |
|---|---|---|---|
| హి | ఎందువలననగా | అకర్మణశ్చ | అకర్మనుగూర్చియు |
| కర్మణః అపి | కర్మనుగూర్చియు | బోద్ధవ్యం (అస్తి) | తెలిసికొనవలసినదున్నది |
| బోద్ధవ్యం | తెలిసికొనవలసినది | కర్మణః గతిః | కర్మ (అకర్మ వికర్మ) |
| (అస్తి) | ఉన్నది | | యొక్క గమనము. |
| వికర్మణః చ | వికర్మనుగూర్చియు | గహనా | ఎరుంగుటకు కష్టమైనది. |
| బోద్ధవ్యం (అస్తి) | తెలిసికొనవలసినదున్నది. | | |

తా॥ ఏలనగా కర్మనుగూర్చియు తెలిసికొనవలసినది ఉన్నది, వికర్మను గూర్చియు తెలిసికొనవలసినది కలదు. అకర్మనుగూర్చియు తెలిసికొనవలసినది కలదు. కర్మ (అకర్మ వికర్మ)యొక్క గమనము అనగా వాటి తత్త్వము ఎరుంగుటకు కష్టమైనది.

(1) కర్మణః - శాస్త్రవిహితమైన కర్మ (శంకరులు) వేదోక్తమైన సత్కర్మ (శ్రీధరులు, రాఘవేంద్రులు) మోక్షసాధనమైన కర్మ (రామానుజులు )

(2) వికర్మణః - చేయగూడదని వేదముచే నిషేధింపబడిన నిషిద్ధకర్మ (శంకరులు, శ్రీధరులు, రాఘవేంద్రులు). నిత్యనైమిత్తిక కామ్యకర్మలును, వాటికి కారణములైన ద్రవ్యసంపాదనము మొదలగు పలువిధములైన కర్మలున్ను (రామానుజులు.)

(3) అకర్మణః - కర్మనుజేయకుండుట (శంకరులు, శ్రీధరులు, రాఘవేంద్రులు). కర్మలో నిమిడి యున్న అకర్తయైన తనయాత్మ స్వరూపజ్ఞానము. (రామానుజులు.)

(శంకరభాష్యము) కర్మయనునది శరీరము మొదలగువాటి చలనమనియు అకర్మయనునది వాటి వ్యాపారములేమియనియు లోకమునందెల్లరకు తెలిసినదే. కావున దానిలో తెలిసికొనవలసిన దేమి? ఒక్కటియులేదు. అనినీవు ఈ విధముగ గ్రహింపగూడదు. ఏలనగా శాస్త్రములో విధింపబడిన కర్మనుగూర్చియు తెలిసికొనవలసినది కలదు, నిషేధింపబడిన వికర్మనుగూర్చియు తెలిసికొనవలసినది ఉండనేయున్నది. ఆ విధముగనే మౌనముగ నుండుటయైన అకర్మను గూర్చియు తెలిసికొనవలసినది కలదు. కర్మ వికర్మ అకర్మ వీటిగతి, యథాస్థితమైన స్వభావము, అనగా వాటితత్త్వము కష్టమైనది. అనగా ఎరుంగుటకు అరుదైనది. "ఉన్నది" అనుదానిని మూడు చోట్లలోనున్ను అనువర్తించుకొనుడు, "కర్మయొక్క" అనునది ఉపలక్షణముచేత వికర్మ మొదలైన వాటిని గుర్తించి నిలబడియున్నది. ఉపలక్షణము - ఒకపదము తనతో తనసదృశమైనవాటిని గ్రహించుటకు యోగ్యతగలిగి నిలబడుట. 'అన్నము తినెను' అన్నచో దానితో కూరలు మొదలగు వాటిని తినెననునది చెప్పకనే లభించును. కావున అన్నమనుమాట ఇతరములైన కూరలు మొదలైన తనతో సదృశమైనవాటిని గ్రహించుటకు యోగ్యతగలిగి నిలుచుటవలెననుడు.

(స్వకీయము) శ్రీధరులు మొదలైన వ్యాఖ్యాతలు కర్మణః = కర్మయొక్క అని యెత్తుకొని కర్మణఃతత్త్వం = కర్మయొక్క తత్త్వమని అర్థముజేసియున్నారు. వికర్మయందెరుంగవలసినదే మన - నిత్యనైమిత్తిక కామ్యద్రవ్యార్జనాది కర్మలలో ఫలభేదమును విడిచి మోక్షమే ఫలమనియు, కర్మల స్వభావమొక్కొక్కటియు అనుసంధానము అనునది రామానుజుల అభిప్రాయము. రాఘవేంద్రులు కర్మణః - నః - మనకు, కర్మ = కర్మఉత్తమమైనది. వికర్మణః = నః = మనకు, వికర్మ = వికర్మమైనది; నిషిద్ధమైనది. అకర్మణః - నః = మనకు, అకర్మ = సకలకర్మలున్ను ఈశ్వరాధీనములైయున్నవి. అని యెరుంగుట అనుచున్నారు.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ 18

పద॥ కర్మణి - అకర్మ - యః - పశ్యేత్ - అకర్మణి - చ (1) - కర్మ - యః।
సః - బుద్ధిమాన్ - మనుష్యేషు - సః - యుక్తః - కృత్స్నకర్మకృత్ ॥

| | | | |
|---|---|---|---|
| యః కర్మణి | యెవ్వడు కర్మయందు | సః | వాడు |
| అకర్మపశ్యేత్ | అకర్మను చూచునో | మనుష్యేషు | మనుష్యులలో |
| యః | ఎవ్వడు | బుద్ధిమాన్ | బుద్ధిమంతుడు |
| అకర్మణి చ | అకర్మయందును | సః యుక్తః | అతడుయోగి |
| కర్మ (పశ్యేత్) | కర్మనుజూచునో | కృత్స్నకర్మకృత్ | సకల కర్మలను జేసినవాడు |

తా॥ ఎవ్వడు కర్మయందు అకర్మనున్ను అకర్మయందు కర్మనున్ను జూచునో అతడు మనుష్యులలో వివేకము గలవాడుగను మనస్సమాధానము గల యోగిగను సకలములైన కర్మలను జేసినవాడుగను నగును.

(1) అకర్మణి చ = ఇచ్చటనున్న 'చ' శబ్దముచేత వికర్మగూడ గుర్తింపబడునదిగ భావింపవచ్చును.

(శంకరభాష్యము) అయితే కర్మాకర్మలనుగూర్చి విశేషముగ తెలిసికొనవలసినదియు, నాకు జెప్పవలసినదిగ నీవు తలంచుచున్నదియు, నైన కర్మాకర్మల తత్త్వమెట్టిది? అనియడిగినచో దానిని వినుము. కర్మయనగాచేయుట, లోకజనులుచేయు సకలవ్యాపారములు (చెప్పుట, నిలబడుట, నడచుట తలంచుట, మొదలగు అన్నివ్యాపారములున్ను).

ప్రవృత్తియు నివృత్తియు చేయువాడైన కర్తపై నాధారపడియుండుటవలన కర్మయందకర్మను అకర్మయందుకర్మను చూడదగును. (ప్రవృత్తియనునదే కర్మచేయుటయైన ప్రయత్నము. నివృత్తి యనునది దానికెదురైన అకర్మ, విశ్రాంతియగు ప్రయత్నము) కృత్యము చేయువాడు అనువ్యవహారమున్ను మరి యీ విధములైన వ్యవహారములన్నియు అజ్ఞానస్థితిలో అనగా యథార్థ వస్తువును పొందనిచోట గదా గలవు? కర్మయందు కర్మలేనితనమును, కర్మలేనితనమున కర్మను ఎవ్వడుచూచునో అతడు బుద్ధిమంతుడు. అతడు యోగి. అతడు కర్మలన్నిటిని చేసినవాడని ఈ విధముగ కొనియాడబడుచున్నాడు.

(ఆక్షేపణ) కర్మయందకర్మను అకర్మయందు కర్మను చూచెడివాడు, అనునది ఎంత సంబంధములేనిదై విరోధము గలిగియున్నది? వాస్తవముగ కర్మ ఎప్పుడున్ను అకర్మకానేరదు. అకర్మయు కర్మకానేరదు. ఒకదానిని చూచెడివాడు దానిలో దానికి విరోధమైనదాని నెట్లు చూడగలడు. అనినచో.

(సమాధానము) అట్లుగాదు. వాస్తవమున అకర్మగనేయున్నట్టిది వివేకబుద్ధిమైకమొందిన జనులకు కర్మవలె కనబడుచున్నది. ఆ విధముగనే కర్మగనేయున్నట్టిది అకర్మవలె తోచుచున్నది. భగవంతుడు వాటిని ఉన్నటుల బోధించుటకై "ఎవ్వడు కర్మలో అకర్మమును జూచునో" అని మొదలుపెట్టుచున్న శ్లోకమును జెప్పుచున్నాడు. మూఢదృష్టిచేత ఆత్మయెడదోచిన కర్తలో అకర్తను జూచుటయనునది భ్రాంతివలన కనబడినదైన వెండిలో సీసమునుజూచుటవంటిది. మరియు ఆత్మైక జ్ఞానముచేత ఆత్మయెడదోచిన అకర్మలోకర్మను జూచుటయనునదియు నావిధముగనే. ఎట్లనగా ఒక వస్తువుయొక్క జ్ఞానముండినగాని ఆవస్తువులేదను జ్ఞానముకాజాలదు, సీసమునుజూచి వెండియను చోట, సీసములో వెండికల్పితమైనది. ఆవిధముగనే దానినిజూచి "ఇచ్చట మునుపుకనబడిన వెండి లేదు" అనుచోట 'లేదు' అనుజ్ఞానము కల్పితమైన వెండియొక్కజ్ఞానముపై నాధారపడియుండుట

వలనసీసములో వెండిలేదనునదియుకల్పనయే. దీనిని సూక్ష్మముగపరిశీలించి ఎరుంగవలెను. ఈవిధముగనే ఆత్మయెడ కర్మయు కర్మకాదనునదియు కల్పితమనికనుగొనుడు (ఆనందగిరి). కావున భగవంతుడు చెప్పినదానిలో విరోధమొక్కటియులేదు. వివేకముబడయుట మొదలగునవి ఇతరజ్ఞానములచేగాక ఆత్మజ్ఞానమొక్కదానిచేతనే ఏర్పడును. కావునను కర్మాకర్మలను తెలిసికొనవలయునని మునుపు చెప్పియుండుటవలనను, భగవంతుడు ఉన్నదానినున్నట్లు తెలియబరచుటకై ఈ శ్లోకమును జెప్పుచున్నాడు. ఇదియుగాక అహితమునుండి నివర్తించుటయు మోహము చెందిన జ్ఞానముచేత సంభవించదు ఏలనగా "దేనినెరింగి నీవు అశుభమునుండి నివర్తింపగలవో" అని ఈ 16 వ శ్లోకమున జెప్పబడియున్నది. కావున ప్రాణులన్నియు కర్మాకర్మలరెంటిని విపరీతముగ గైకొని యున్నవని దానిని నివర్తించుటకై ఈ శ్లోకమును భగవంతుడు చెప్పుచున్నాడనుడు. కర్మ అకర్మ ఇవి రెండును సామాన్యజనులచేత మృగతృష్ణికలో (ఎండమావులలో) జలమువలెగాని, సీసములో వెండి వలెగాని విపరీతముగ గ్రహింపబడియున్నవని సిద్ధము. అట్లైన కర్మయెల్లరికిని కర్మగనేయున్నది. అది ఎచ్చటను వేరొకటిగ మారుట లేదే యన్నచో - అదిసరియైనదిగాదు. ఓడలోనున్నవానికి ఓడతొందరగా పోవునప్పుడు గట్టుమీద నిలబడునట్టి చెట్లు వాస్తవమున కదలిపోవుట లేకున్నను వానికి అవి ఆవిధముగ ఎదురుగపోవుట తోచుటవలెను, సమీపమునగాక చాలదూరములో నడచువాడు అట్లుపోక నిలబడుట కంటికికనబడుటవలెనున్ను, ఆత్మయెడ అకర్మలో కర్మకనబడుటయు కర్మలో అకర్మ తోచుటయు విపరీతమైన దృశ్యమనుడు. అయితే ఆవిపరీతమైనదృశ్యము వాస్తవమువలె నున్నందున దానిని నివర్తించుటకై భగవంతుడు ''కర్మలో అకర్మను'' అని ప్రసాదించుచున్నాడు ఇట్టి సందేహనివృత్తికై మాటిమాటికి పలుచోట్ల ప్రత్యుత్తరమివ్వబడి యున్నను, మిక్కిలి విపరీతమైన జ్ఞానముచేత వాస్తవముకాని వస్తువుయొక్క వాననయే లోకజనుల మనస్సున నాక్రమించి యున్నందున మాటిమాటికి మోహము చెందునదైన లోకము, ఒక సారికి పలుమారులుగ వినబడియున్న తత్త్వమును మరచిమరచి, యేదోఒక అబద్ధమైన మోహమున ప్రవేశించి ప్రవేశించి, ఆత్మయెడ కర్మగలదని ఆక్షేపించుటనున్ను, యథార్థవస్తువు నెరుంగుట మిక్కిలి కష్టమైనదనుదానినిన్ని, ఉద్దేశించి భగవంతుడు మరలమరల ఆవిషయము నెత్తుకొని ఉపదేశించుచున్నాడు.

ఆత్మయెడ కర్మలేదనునది శ్రుతిలోను, స్మృతిలోను, యుక్తిచేతను బాగుగ స్పష్టమగును. భగవంతుడున్ను మునుపు రెండవ అధ్యాయములోను వెనుకటి అధ్యాయములలోను దానిని జెప్పియున్నాడు. ఐనను ఆత్మయెడ కర్మలేని స్వభావమైన అకర్మలో కర్మయనే విపరీతమును జూచుట ప్రాణుల మనస్సులో మిక్కిలి స్థిరతచెంది యుండుటవలననే, ''ఏది కర్మము ఏది అకర్మము అను నీ విషయమున జ్ఞానులుగూడ మోహముచెందియున్నారు" అని చెప్పబడినది. "నేనుచేయువాడను, ఇది నా వ్యాపారము, ఈ కర్మకు ఫలమును నేననుభవింపవలెను'' అని శరీరము మొదలగువాటిపై నాధారపడియుండు కర్మను ఆత్మయెడ నారోపించి, ఆ విధముగనే, నేనుబాధలేక కర్మలేక సుఖిగనుండునట్లు మౌనముగనున్నాను'' అని దేహము మనస్సు ఇంద్రియములను వాటి నాధారపడియున్న విరామమున్ను, అనగా వ్యాపారము లేకయుండుటనున్ను దాని వలనకలుగు సౌఖ్యమునున్ను (సుఖముగానుండుటనున్ను) ఆత్మయెడ ఆరోపించి ''నే నేదియు చేయుటలేదు. మౌనముగ సుఖముగనున్నాను'' అని లోకము అభిమానించి నిలబడుటకు కారణము నేనను అహంకారము పైబడియుండుటవలననే. ఇట్లుండుటవలన, జనుల మోహజ్ఞానమును పోగొట్టుటకై భగవంతుడు దీనిని జెప్పుచున్నాడు.

కావున దేహము, మనస్సు, ఇంద్రియములు, అనువాటిపై నాధారపడియుండు కర్మ కర్మగనేయుండి వ్యవహారావస్థలో ఎల్లరిచేతను కర్మలేని నిర్వికారియైన ఆత్మయెడ ఆరోపింపబడి యున్నది. ఏలనగా పండితులుగూడ "నేనుచేయుచున్నాను" అనితలంచుచున్నారు. అప్పుడు ఈ శ్లోకమునందలి భావమేమనగా తెప్పమీదనున్నవాడు ఎదురుగ పోవుటవలన వేగముగ నడుచు నట్టివివలె కనబడుచున్నవై నదియొడ్డుననిలబడు వృక్షములయెడ వాస్తవమున నిశ్చలతను చూచుట వలె, ఎవ్వడు ఆత్మతోసమవేతమైయున్నట్లు సకలజనులును విపరీతముగ తెలిసికొనియున్న కర్మలో కర్మలేనితనమున్నట్లు చూచునో అతడు వివేకముగలవాడు. (సమవేతముగ నుండుటయనగా దారముతో తెలుపురంగువలె కలిసియుండుట.) దేహము, మనస్సు ఇంద్రియములు వీటియొక్క వ్యాపారము తొలగుటయైన అకర్మ ''నేను మౌనముగ ఒక్కటియు చేయక సుఖముగనున్నాను'' అను అహంకారముతోగూడిన కర్మకు కారణమగుటవలన ఆత్మయెడ కర్మవలె అబద్ధముగ ఆరోపింపబడిన అకర్మయందును ఎవ్వడుకర్మను, అనగా ''నేనొక్కటియు చేయక సుఖముగ నున్నాను'' అని అహంకరించుటవంటి వ్యాపారమును జూచునో, అనగా నెవ్వడు ఈ విధముగ కర్మాకర్మల వ్యత్యాసమును విభజించి యెరుంగునో అతడు మనుష్యులలో వివేకముగలవాడు, అతడు యోగి, అతడు అశుభమునుండి విడువబడినవాడై చేయవలసినదానిని జేసియున్నవాడై ముక్తిచేకూరినవాడనునది పిండీకృతమైన భావము.

(ఇక ఈ శ్లోకములో కర్మయనునది నిత్యకర్మయనియు, దానిని చేయకయుండుట అకర్మయనియు, మరికొందరు చేయునట్టి అర్థము తగినదికాదని ఈ భాష్యమున జెప్పబడియుండు టనుజూడుడు) పైజెప్పబడినదానిని సంగ్రహముగ జెప్పవలయుననగా - దేహము మనస్సు ఇంద్రియములు వీటి వ్యాపారములు కర్మయనియు, దేహాదులచే ఏ వ్యాపారము చేయబడుటలేదో అ చేయకయుండు స్వభావము అకర్మయనియు చెప్పబడును. ఆత్మకు చేయుట చేయకుండుటయను కర్మాకర్మలు రెండునులేవు. అవివేకులు కర్మాకర్మలను ఆత్మయెడ ఆరోపించి అహంకార మమ కారములవలన "నేనుచేయుచున్నాను, నేను చేయకున్నాను" అని వ్యవహరించుచున్నారు. దాని వలన ఆత్మకర్మచేయునదివలె కనబడినను కర్మజేయునవి దేహాదులనియు, ఆత్మ కర్మచేయునది కాదనియు నెవ్వడెరుంగునో అతడుకర్మలో అకర్మనుజూచుచున్నాడు, అదెట్లనగా నదిలో పడవమీద వేగముగ ఒకడు పోవుచున్నాడు. ఆ నదియొడ్డున నున్న వృక్షములు వేగముగ పోవునవివలె అతనికి కనబడుచున్నవి. వేగముగపోవుటయను వ్యాపారము పడవమీదనున్న తనయెడ నుండగా వ్యాపారములేకున్న వృక్షములలో వ్యాపారమును చూచుచున్నాడు. దానివలె దేహాదులు చేయు కర్మను ఆత్మచేయునట్లు చూచుచున్నాడు. వృక్షములలో కర్మలేకుండుటవలె ఆత్మయందును కర్మ లేదనిచూచువాడు కర్మలో అకర్మను చూచుచున్నాడు. మనస్సు, దేహము, ఇంద్రియములు వీటి వ్యాపారవిరామము అనగా ఏదియు చేయకయుండుట అకర్మగ నుండగా దానిని తాను (ఆత్మ) చేయలేదని మూఢుడు అహంకారముచేత వ్యవహరించుచున్నాడు. ఎట్లనగా ''నేను దానినిచేయలేదు, అందువలన సుఖిగనున్నాను'' అనుచున్నాడు. ఆ చేయకయుండుటయను అకర్మలో "దానినినేను చేయలేదు, అందువలన సుఖవంతుడుగను నున్నాను'' అను అహంకారముయొక్క కర్మయున్నది. దీనియందే వివేకి అకర్మలోకర్మను జూచుచున్నాడు. అనగా చేయకయుంటుటయందుగూడ తాను కర్తనను తలంపున్నదని వివేకి యెరుంగుచున్నాడనునది భావము.

(రామానుజులు) తన ఆత్మస్వరూపానుసంధానముతోగూడి జేయబడు కర్మలో ఆత్మ స్వరూపజ్ఞానమిమిడియున్నట్లు ఎరింగినవాడు కర్మలో జ్ఞానమును అకర్మను జూచుచున్నాడు.

అకర్మయగు తనయాత్మ స్వరూపజ్ఞానముతో చేయబడుకర్మ జ్ఞానముతో కలసినందున జ్ఞానమగు అకర్మలో కర్మను జూచుచున్నాడు. ఈ విధముగ జ్ఞానకర్మలు రెండును ఒకటితో నొకటిచేరి యుండుటవలన జ్ఞానము కర్మాకారముగను కర్మ జ్ఞానాకారముగను అగుచున్నదనుదాని నెరింగిన వాడు వివేకియని తాత్పర్యము.

(మధ్వులు) కర్మ = వ్యాపారము క్రియ, అకర్మ అ = విష్ణువు, కర్మ = వ్యాపారము. విష్ణువుయొక్క వ్యాపారము, లేక విష్ణువునుచేరినవ్యాపారము. తాను కర్మచేసినను అట్టికర్మకు కర్తయు కర్మను చేయించువాడును విష్ణువు కావున తాను కర్తకాదనియు, కర్మవిష్ణువును చేరిన దనియు ఎవ్వడెరుంగునో అతడు కర్మలో అకర్మను జూచుచున్నాడు. జీవుడు కర్మచేయనికాలమైన నిద్రకాలమునందు స్వప్నావస్థలో అనేకకర్మలను తాను చేసినట్లు చూచుచున్నాడు. స్వప్నావస్థలో కనబడు సకలకార్యములున్ను ఈశ్వరసృష్టియైనను, తానుచేసినవిగ్రలె స్వప్నములో జూచు చున్నాడు. స్వప్నావస్థలో తాను ఎట్టికర్మనుచేయని అకర్మగనున్నప్పుడు కనబడు వ్యాపార మంతయు ఈశ్వరసృష్టియని ఎవ్వడెరుంగునో అతడు అకర్మలో కర్మను జూచుచున్నాడు. (రాఘవేన్ద్రులు) (ఈ వాక్యములు వ్యత్యస్తములైనను మధ్వుల తాత్పర్యముననుసరించియే మొదట నొకవిధముగ అర్థముచెప్పి మరల నొకఅర్థమును చెప్పియున్నారు. అదేమన్న కర్మయనునది బంధము కావునను, జీవుడు బంధములో జిక్కుకొని యున్నందునను కర్మయనగా జీవుడు, వాని యెడ కర్తృత్వము లేదని యెఱింగెడివాడు కర్మలో కర్మనుజూచుచున్నాడు. కర్మబద్ధుడుకానందున అకర్మయనగా నీశ్వరుడు. అతనియెడ ప్రపంచసృష్టి మొదలగు కర్మయున్నట్లు ఎవ్వడెరుగునో అతడు అకర్మలో కర్మను జూచుచున్నాడు.

(శ్రీధరులు) (కర్మణాబధ్యతే జన్తుః = ప్రాణియైనవాడు కర్మచే కట్టబడుచున్నాడు. అనుప్రమాణముచేత) కర్మయొక్క స్వభావమే బంధమునిచ్చునదిగనున్నది. అట్లు బంధమునిచ్చున దైన కర్మయే ఫలాపేక్షలేక, మమకారాహంకారములను విడిచి ఈశ్వరార్పణబుద్ధితో చేయువానికి తనస్వభావమైన బంధమును ఇవ్వక ప్రాచీన కర్మబంధమునుగూడ నివర్తింపచేసి మోక్షప్రయోజన మును కలుగచేయుచున్నది. కావున బంధరూపమైన కర్మలో బంధనివృత్తియైన అకర్మను చూచు చున్నాడు. అనగా చేయుచున్న కర్మయే అకర్మయగుచున్నది.

సోమరితనముచేగాని దోషబుద్ధివలనగాని సత్కర్మలను విడిచి పెట్టుచున్నాడు. సత్కర్మ లను చేయక విడుచుటయే దోషమును బంధమును కలుగచేయునదై యున్నది. కావున కర్మను విడుచుటయను అకర్మలో దోషమను బంధమునిచ్చుచున్న కర్మయిమిడియున్నదనియు, కర్మను విడిచిపెట్టక చేయవలెననియు ఎరింగినవాడు అకర్మలో కర్మను జూచుచున్నాడు.

(స్వకీయము) కర్మఅనగా ప్రపంచసృష్టి, అకర్మఅనగా పరబ్రహ్మము. సృష్టికర్మలో సృష్టికి కర్తపరబ్రహ్మముకాదు, వానిసన్నిధానమాత్రమున సకల ప్రపంచ సృష్టులగుచున్నవి. కావున సృష్టికార్యమున పరబ్రహ్మమును, అకర్తయగు అకర్మయని చూచువాడును, అట్టి అకర్మ యగు బ్రహ్మముదప్ప ప్రపంచసృష్టి కార్యముచేయగల మరియొక్కడులేడు. కాన అకర్మమగు బ్రహ్మములో సృష్టియను కర్మమును చూచువాడును, మనుష్యులలో వివేకిగను, యోగిగను, సకల కర్మలను జేసినవాడుగను అగును. దీని తాత్పర్యమేమనగా — బ్రహ్మముయొక్క శక్తిలేక సృష్టి కాలేదు. అయితే ఆ బ్రహ్మము కుమ్మరికుంతను చేసినట్లు, ప్రపంచమును సృష్టించలేదు. అతడు కోరిన మాత్రము చేతను, అతని సన్నిధానమాత్రముచేతను సకలసృష్టియు నెరవేరుచున్నదనియే.

ఈ యర్థమునే భగవంతుడైన కృష్ణపరమాత్మ ఈ అధ్యాయము శ్లో 13 లో "సృష్టికి నేను కర్త నైనను నేను కర్తనుకానని యెరుంగుము'' అని అర్జునునకు జెప్పియున్నట్లు తోచుచున్నది.

ఇట్లు బ్రహ్మము నెరుంగుటవలన ప్రయోజనమేమనగా బ్రహ్మస్వరూపము, శక్తి, మహిమ, వీటినెరుంగుటయే మోక్షసాధనముగను, అట్టి బ్రహ్మము నాశ్రయించి భక్తిచేసినచో బంధనివృత్తి పొందగలమనుదార్ఢ్యము గలుగుటకు హేతువుగను ఉన్నది.

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః ॥ 19

పద॥ యస్య - సర్వే - సమారంభాః - కామసంకల్పవర్జితాః (1) ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం (2) - తం - ఆహుః - పండితం - బుధాః ॥

| | | | |
|---|---|---|---|
| యస్య | ఎవ్వనియొక్క | తం | వానిని |
| సర్వే | సమస్తములైన | బుధాః | జ్ఞానులు |
| సమారంభాః | కర్మలును | పండితం | వివేకిగ |
| కామసంకల్పవర్జితాః | ఆశ, సంకల్పము ఇవి లేకుండునో | ఆహుః | చెప్పుచున్నారు. |
| జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం | జ్ఞానమను అగ్నిచేకాల్చబడిన కర్మగల | | |

తా॥ ఎవ్వని సకలకర్మలున్ను కోరిక, (దీనిని పొందవలెనను కోరిక యను) సంకల్పము లేకున్నవో, జ్ఞానమను అగ్నిచేత దహింపబడిన కర్మలు గల యట్టివానిని వివేకిగ జ్ఞానులు చెప్పుచున్నారు.

* ఈ శ్లోకమును గర్గసంహిత మాధుర్యఖండము 1–6–48 లో జూడుడు.

(1) కామసంకల్పవర్జితాః - ఫలేచ్ఛ, కర్మవలన స్వర్గమొందగలనను ఉద్దేశము, ఇవిలేకయుండునో (రాఘవేంద్రులు). ఫలేచ్ఛలేనిదైయున్నదో (శ్రీధరులు). ఫలేచ్ఛలేనివారుగను, ప్రకృతి విముక్తమైన ఆత్మస్వరూపానుసంధానము గలవారుగను ఉన్న (రామానుజులు).

(2) జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం - కర్మలోనిమిడియున్న తనస్వరూప జ్ఞానమను అగ్నిచే దహింపబడిన పూర్వకర్మను బడసిన (రామానుజులు). తానుకర్తకాదు. సకలమునకును కర్తవిష్ణువని తెలిసిన జ్ఞాని (రాఘవేంద్రులు). కర్మ అకర్మయగుచున్నదని తాత్పర్యము. (శ్రీధరులు).

(శంకరభాష్యము). కావున కర్మలో నకర్మను, అకర్మలో కర్మను చూచుటను భగవంతుడు ఈశ్లోకమున పొగడి చెప్పుచున్నాడు. ఆ విధముగ తత్త్వమును చూచువానిచేత చేయబడు కర్మలన్నియు ఆశలు, వాటికి కారణములైన సంకల్పములు (అభిమానములు) ఇవి విడిచిన వట్టివ్యాపారములుగ ఊరక అనుష్ఠింపబడుచున్నవి. అతడు ప్రవృత్తిమార్గమున నున్నవాడైనచో లోకసంగ్రహము కొరకును అతడు నివృత్తిమార్గమున నున్నవాడైనచో జీవించుటకు మాత్రమును ఆ కర్మలను చేయుచున్నాడు. ఎవ్వనిహితాహితములన్నియు కర్మలో అకర్మను, అకర్మలో కర్మను, చూచుటయైన జ్ఞానమను అగ్నిచేత దహింపబడియున్నవో, వానిని జ్ఞానులైన బ్రహ్మవిత్తులు, అనగా బ్రహ్మ నెరింగినవారలు, యథార్థమైన పండితుడనెదరు.

(స్వకీయము) ఆశ, సంకల్పములులేక ఈశ్వరార్పణ బుద్ధితో కర్మచేసి వచ్చినచో చిత్త శుద్ధియు పిదప జ్ఞానోదయమున్ను కలుగును. అట్లుదయించిన జ్ఞానము, అగ్ని యెట్లు కుప్పమొదలగు వాటిని దహించునో ఆవిధముగ సంచితము మొదలగు కర్మబంధములను దహించుననిభావము.

సంచితము మొదలగు కర్మల వివరణము శివపురాణము వాయుసంహిత అధ్యాయము 29 లోచూడదగును. అవి యీవిధములైనవి;—

"కర్మ చ త్రివిధం ప్రోక్తం కిం తచ్ఛ్రూయతాం పునః ।
సంచితం క్రియమాణం చ ప్రారబ్ధం చ త్రిధా మతం ॥
పూర్వజన్మ సముద్భూతం సంచితం సముదాహృతం ।
తేన జన్మాంతరం యచ్చ క్రియతే కర్మసాంప్రతం ॥
శుభాశుభం చ యచ్చైవ క్రియమాణం విదుర్బుధాః ।
భుజ్యతే చ శరీరేణ ప్రారబ్ధం పరికీర్తితం ॥
ప్రారబ్ధకర్మణోభోగాత్ క్షయశ్చైవ న చాన్యథా ।
పాపం వినా శరీరస్య దుఃఖం నాస్తి పదేపదే ॥
యత్కించిద్దృశ్యతే దుఃఖం సర్వం పాపసముద్భవం ।
స్థూలం చైవాథ సూక్ష్మం చ దుఃఖం పాపసముద్భవమ్ ॥
అపాపం చ యదా స్యాద్వై శరీరం సుఖభాజనమ్ ।
భోగం వినా న ప్రారబ్ధం గచ్ఛతీతి సునిశ్చితమ్ ॥"

కర్మలు మూడువిధములైనవిగా చెప్పబడియున్నవి. అవెట్టివనినవినుడు, సంచితము, క్రియమాణము (ఆగామి), ప్రారబ్ధము, అనిమూడు విధములు. మునుపటి జన్మములలో కలిగి యున్నది (మునుపటి జన్మములలోచేసి అనుభవింపబడక బాకీయున్నది) సంచితమని చెప్పబడును. సంచిత కర్మవలన పొందిన జన్మలోనిప్పుడు శుభాశుభములైన యేకర్మలు చేయబడుచున్నవో దానినే క్రియమాణము (ఆగామి) అని విద్వాంసులెరుంగుదురు. ఈ దేహముచేత అనుభవింపదగినదే ప్రారబ్ధ మనిచెప్పబడుచున్నవి. ప్రారబ్ధకర్మ అనుభవించినగాని నశించుటలేదు. పాపములేక శరీరమునకు దుఃఖమనునది లేదు. దుఃఖమెట్టిదైనను అదియంతయు పాపమువలన కలిగినదే. దుఃఖము పెద్దదై నను స్వల్పమైనను అదిపాపము వలన కలిగినదే. ఎప్పుడు శరీరము పాపము లేనిదగునో అప్పుడు సుఖమునకు స్థానమగును. అనుభవించినగాని ప్రారబ్ధము నాశమొందదనునది నిశ్చితము.

ఆచతుర్దశకాద్వర్షాత్ కర్మాణి నియమేన తు ।
దశాపరాణాం దేహానాం కారణాని కరోత్యయం ॥
కథం కర్మ క్షయాన్ముక్తిః కుత ఏవ భవిష్యతి ।

దేహముగలవాని (జీవుని) 14-వ వయస్సు మొదలు చేసినకర్మలు ఒక్కొక్కటియు పది జన్మలనిచ్చి, అట్లు ఇచ్చునట్టి జన్మలలో దాని ఫలము ననుభవింప జేయునదిగనున్నది. ఈవిధముగ పలుజన్మలలోచేసిన పలుకర్మల ఫలముననుభవించి ముగియుటయు మోక్షము పొందుటయునేది? దీనిని మధ్వభాష్యమున జూడుడు.

ఆ చతుర్దశకాద్వర్షాన్న భవిష్యతి పాతకం।
పరతః కుర్వతామేవ దోష ఏవ భవిష్యతి॥

దీనికి మునుపటి అర్థమే. మహాభారతము 1-108-23 లో చూడుడు.

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః॥ 20

పద॥ త్యక్త్వా - కర్మఫలాసంగం - నిత్యతృప్తః (1) - నిరాశ్రయః (2)।
కర్మణి - అభిప్రవృత్తః - అపి - న - ఏవ - కించిత్ - కరోతి (3) - సః॥

| | | | |
|---|---|---|---|
| కర్మఫలాసంగం | కర్మయందభిమానమునున్ను ఫలము నందాసక్తినిన్ని | యః | ఎవ్వడున్నాడో |
| | | సః | అతడు |
| త్యక్త్వా | విడచి | | కర్మలో |
| నిత్యతృప్తః | ఎల్లప్పుడు తృప్తిపొందినవాడు గను | అభిప్రవృత్తోఽపి | ప్రవర్తించియున్నను |
| | | కించిత్ | ఒక కర్మనుగూడ |
| నిరాశ్రయః | ఆశ్రయము లేనివాడుగను | న కరోత్యేవ | చేయుటయే లేదు. |

తా॥ కర్మలో నభిమానమును ఫలమునందాసక్తియు విడచి ఎల్లప్పుడు ఆత్మానందమున తృప్తిచెందినవాడుగను, ఎవ్వరిని ఆశ్రయించనివాడుగను ఎవ్వడున్నాడో అతడు కర్మలో ప్రవర్తించియుండినను అతడు ఏ కర్మను జేయుటయే లేదు.

(1) నిత్యతృప్తః - తన ఆత్మ స్వరూపమునందే తృప్తికలవాడుగను (రామానుజులు)

(2) నిరాశ్రయః - స్థిరముకాని ప్రకృతియెడ ఆశ్రయ బుద్ధిలేనివాడుగను (రామానుజులు)

(3) న కరోతి - కర్మచేసినను జ్ఞానాభ్యాసమునే చేయుచున్నాడు. కర్మచేయని వాడు కాదు (రామానుజులు)

(శంకరభాష్యము) కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూచెడివాడెవ్వడో అతడు, ఆత్మానాత్మలను వెవ్వేరుగ నెరుంగుటకు మునుపు కర్మలో ప్రవృత్తిగలవాడైనను, వాటిని వెవ్వేరుగ నెరింగిన పిదప కర్మమొదలగువాటిలో అకర్మమొదలగువాటిని చూచుటవలననే కర్మనివర్తించిన వాడై, సన్యాసియై, జీవించుటకు మాత్రము కావలసిన వ్యాపారము గలవాడైనందున కర్మలో ప్రవర్తించుటలేదు. అయితే ఎప్పుడు కర్మచేయ నారంభించి దానిపిదప ఆత్మనున్నట్లు ఎరుంగు జ్ఞానియగునో అతడు ఏకర్మలోను ఫలమును కానక కర్మనున్ను దానికి సాధనములనున్ను త్యజించుచున్నాడు. అతడేదో ఒక కారణమువలన కర్మను త్యజింప వీలులేనప్పుడు కర్మలోను దానిఫలములోను ఆసక్తి లేనందున లోకమునకు సన్మార్గమును చూపుటకొరకు స్వప్రయోజనము కొరక మునుపువలె కర్మననుష్ఠించుచున్నను అతడు వాస్తవమున నేమియు చేసెడివాడు కాడు. జ్ఞానమను అగ్నిచేత కర్మయంతయు దహింపబడినందున అతని కర్మ అకర్మయేయగును అను నీవిషయమును తెలియ బరచుటకై భగవంతుడీ శ్లోకమును జెప్పుచున్నాడు. పైజెప్పిన ఆత్మజ్ఞానమువలన జ్ఞానియైనవాడు కర్మలలో నభిమానమును ఫలమునందాసక్తిని విడిచి యెల్లప్పుడు తృప్తియు విషయములతో ద్వేషమును గల వాడని భావము, ఆశ్రయమనగా ఒకడు దేనిపైనాధారపడి నిలిచి తనకు కావలసిన వాటిని

సాధించుకొన గోరుచున్నాడో అది. ఇహపరఫలములకైన సాధనములను వెదుకనివాడు నిరాశ్రయు డగును. ఈ విధముగనున్న ఆ జ్ఞానియైనవాడు తనకెట్టి ప్రయోజనము లేనందున కర్మను దానికైన సాధనములను విడిచి తొలగవలెనని చెప్పుట తగును. అట్లు కర్మజేయుటనుండి నివర్తింప వీలు లేకుండుట సంభవించినచో అతడు లోక సంగ్రహార్థమైగాని, సత్పురుషుల నిందరాకుండ జేసికొన వలెనను తలంపువలనగాని మునుపువలె కర్మననుష్ఠించుచున్నను కర్మలేని ఆత్మయొక్క దర్శనమును బడసియుండుటవలన అతడు వాస్తవముగనే దేనిని జేసినవాడుకాడు.

(స్వకీయము) ఈ శ్లోకములోని అర్థమును స్పష్టముగ వివరించి చెప్పుచున్న వరాహోపనిషత్తు రెండవ అధ్యాయములో క్రిందకనబరచిన శ్లోకమును జూడుడు.—

పుంఖానుపుంఖ విషయేక్షణతత్పరోఽపి। బ్రహ్మావలోకనధియం న జహాతి యోగీ।
సంగీత తాళ లయవాద్య వశంగతాఽపి। మౌళిస్థ కుంభ పరిరక్షణధీర్నటీవ॥

సంగీత తాళ లయవాద్యములకు స్వాధీనమైయున్నను ఆటకత్తె తన తలమీదనున్న కుండను సంరక్షణజేయు విషయమున బుద్ధిగలిగియుండుటవలె గుంపులుగుంపులుగానున్న విషయములను జూచుకొని వాని స్వాధీనమైయున్నను యోగియైనవాడు బ్రహ్మమును జూచుచున్న బుద్ధిని విడుచుటలేదు.



శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం॥　　21

పద॥ నిరాశీః - యతచిత్తాత్మా (1) - త్యక్తసర్వపరిగ్రహః (2)।
శారీరం - కేవలం - కర్మ - కుర్వన్ - న - ఆప్నోతి - కిల్బిషం (3)॥

| | | | |
|---|---|---|---|
| నిరాశీః | ఆశలేనివాడై | శారీరం కర్మ | శరీరము నిలబడియుండుటకు |
| యతచిత్తాత్మా | అంతఃకరణము ఇంద్రియములు వీటి నణచినవాడై | కేవలం | గల (ఆహారాది నిమిత్తమైన) కర్మనుమాత్రము |
| త్యక్త సర్వపరిగ్రహః | ధనము, గృహము, మొదలగు నన్నిటిని విడిచినవాడై | కుర్వన్ | చేసెడివాడు |
| | | కిల్బిషం నాప్నోతి | పాపమును పొందుటలేదు. |

తా॥ ఆశ లేకయు, మనస్సు ఇంద్రియములు వీటి నణచియు, సకల విధములైన సంపాద్యములను విడిచియు, శరీరము నిలబడుటకై ఆహార నిమిత్తమై చేయవలసిన కర్మ ఎంతయో అంత మాత్రము చేసెడివాడు పాపమును పొందుటలేదు.

(1) యతచిత్తాత్మా - చిత్తము మనస్సు వీటిని స్వాధీనము చేసికొనియున్నవాడు (రామానుజులు, రాఘవేంద్రులు.)

(2) త్యక్తసర్వపరిగ్రహః - ఆత్మనే ముఖ్యప్రయోజనమనియెంచి ప్రకృతి, ప్రకృతివలన గలిగిన వస్తువులు వీటిలో మమతలేనివాడు (రామానుజులు) దేహేంద్రియాదులలో అభిమానమును విడిచినవాడు (రాఘవేంద్రులు.)

(3) కిల్బిషం - పాపపుణ్యముల ఫలమైన సంసారమును పొందుటలేదు. (శంకరులు). కర్మ యోగము చేతనే ఆత్మను చూచుచున్నాడు. (రామానుజులు).

(శంకరభాష్యము) మరియెవ్వడు మునుపుజెప్పబడిన వానివలెగాక కర్మచేయుటమొదలు పెట్టుటకుమునుపే అన్నిటిలోనున్న ఆత్మయైన బ్రహ్మమే ప్రత్యగాత్మయైన తానని యెరింగి అనుభ వించునో అతడు ఇహపరవిషయములలో ఆసక్తి తొలగినవాడైనందున ఆవిషయములకు తగిన కర్మలలో ఎట్టిఫలమునుచూడక కర్మను దానికిసాధనమైన దానిని త్యజించి దేహము నిలబడుటకు మాత్రమేచేయవలసిన వ్యాపారములుగలవాడై జ్ఞానములో స్థిరముగ నిలబడు యతియై సంసారము నుండి విడువబడుచున్నాడు, అను నీవిషయమును తెలియబరచుటకై భగవంతుడీశ్లోకమును ప్రసాదించుచున్నాడు. ఎవ్వనినుండి ఆశలు నివర్తించినవో, ఎవ్వనిచే అంతఃకరణమున్ను బయట కనబడుచున్న దేహేంద్రియములలో చేరికయనను రెండును అణచబడినవో, మరియెవ్వనిచే తన వస్తువు గృహము మొదలగు సొమ్ములన్నియు త్యజింపబడినవో అతడు తన శరీరము నిలబడి యుండుటకు మాత్రమే అభిమానములేక చేసెడివాడై అహితమైన పాపము పుణ్యము వీటిని పొందుటలేదు. సంసారమునుండి విడువబడగోరినవానికి పుణ్యముగూడపాపమే. ఏలనగా జననము మరణము మొదలగు సంసారబంధమును అది కలుగజేయుచున్నది. కావున అతడు సంసారము నుండి విడువబడినవాడగునని తాత్పర్యము ('శారీరం కేవలం కర్మ' అనగా శరీరమువలన చేయ దగిన కర్మగాదు. శరీరము నిలబడియుండుటకుమాత్రము కావలసిన కర్మయని గ్రహించుటకు కావలసిన ఆక్షేపసమాధానములు భాష్యములో జెప్పబడియున్నవి).

(స్వకీయము) మునుపటి శ్లోకములో జెప్పబడినవాడు కర్మయోగనిష్ఠుడు. ఇతడు ఆరు రుక్షువనియు జెప్పబడెను. ఈశ్లోకములో జెప్పబడినవాడనగా వానికన్న పైయంతస్థులోనున్న బ్రహ్మజ్ఞాననిష్ఠుడు. ఇతడు ఆరూఢుడని చెప్పబడుచున్నాడు. పైకనిన 20-21-శ్లోకములను కూర్మ పురాణము ఉత్తరభాగము అధ్యాయము 11 లోను, 21 వ శ్లోకమును గర్గసంహిత మాధుర్య ఖండము అధ్యా -1-6-46 లోను జూడుడు.

~~~~~~~~~~~~~~

శ్లో॥ యదృచ్ఛాలాభసంతుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే॥ ౨౨

పద॥ యదృచ్ఛాలాభసంతుష్టః (1) - ద్వన్ద్వాతీతః - విమత్సరః।
సమః - సిద్ధౌ (2) - అసిద్ధౌ - చ - కృత్వా (3) - అపి - న - నిబధ్యతే॥

| | | | |
|---|---|---|---|
| యదృచ్ఛాలాభ సంతుష్టః | కోరకనే లభించిన లాభము వలన తృప్తిపొందినవాడై | సిద్ధౌ అసిద్ధౌ చ | (ఆహారాదులు) లభించినను లభించకపోయినను |
| ద్వన్ద్వాతీతః | శీతోష్ణ సుఖదుఃఖాదులలో ఇచ్ఛాద్వేషములు లేనివాడై | సమః | సంతోషముగాని వ్యసనము గాని లేక సమముగ నున్న వాడు |
| విమత్సరః | మాత్సర్యములేనివాడై | కృత్వా న నిబధ్యతే | (కర్మలను) చేసినను (కర్మలచే) కట్టబడుటలేదు. |

తా॥ కోరకనే లభించిన లాభముచేత తృప్తిపొందినవాడై, శీతోష్ణ సుఖ దుఃఖాదులలో రాగద్వేషములు లేనివాడై, మాత్సర్యము లేనివాడై, ఆహారాదులు
~~~~~~~~~~~~~~

లభించినను లభించకున్నను సంతోషము వ్యసనములేక సమముగ నున్నవాడు కర్మలను అనగా శరీర రక్షణకు మాత్రము గల భిక్షాటనాదులను జేసినను కర్మలవలన బంధమును పొందుటలేదు.

(1) యదృచ్ఛాలాభ సంతుష్టః - కోరక శరీర సంరక్షణాకై లభించినవరకు తృప్తి పొందినవాడు (రామానుజులు.)

(2) సిద్ధౌ - యుద్ధము మొదలగు కర్మలలో జయము మొదలగునవి కలిగినను కలుగకపోయినను (రామానుజులు.)

(3) కృత్వా - జ్ఞాననిష్ఠగాక కర్మనే చేసినను (రామానుజులు.)

(శంకరభాష్యము) తన సొమ్ములన్నిటిని చేయివిడచిన యతికి శరీరము నిలబడి యుండుటకు కారణమైన ఆహారము మొదలగునవి లేనందున అతడు భిక్షాటనము మొదలగు వాటివలన శరీరమును నిలబెట్టవలెనని సిద్ధించెను. కావున యతికి శరీరము నిలబడియుండుటకు కారణమైన ఆహారము మొదలగునవి "అయాచితమసంక్లప్తం ఉపపన్నం యదృచ్ఛయా" భిక్ష ఇతరులయెడ యాచింపబడనిదై మొదటనే యేర్పరచి యుంచబడనిదై యదృచ్ఛగ స్వప్రయత్నములేక తేబడినదై యుండవలెను (బోధాయన ధర్మసూత్రము 2-8-12) అనునది మొదలైన వచనములనుండి అనుమతి బడసినదను దానిని స్పష్టపరచి చెప్పుచున్నాడు.

స్వయముగ లభించుటయనగా (తాను ఇతరులయెడ) యాచింపక వచ్చునది. దానివలన (ఇది) చాలునను తలంపు వచ్చినవాడు (జ్ఞాని). శీతము, ఉష్ణము, మొదలగువాటివలన ముట్టడింపబడినను మనస్సు చలింపక యున్నవాడు ద్వన్ద్వములను దాటినవాడనబడును. మాత్సర్యము లేనివాడు వైరములేని బుద్ధిగలవాడు. కోరకనే లభించుటయనగా (తనకు) ఏర్పడినను ఏర్పడక పోయినను (అతడు) సమమైనవాడు. ఈ విధమైన యే యోగి శరీరము నిలబడి యుండుటకు కారణమైన ఆహారము మొదలగునవి లభించినను లభించకున్నను సమముగనుండి సంతోషము దుఃఖములేనివాడై కర్మ మొదలగువాటిలో అకర్మ మొదలగువాటినిజూచి ఆత్మను ఉన్నట్లెరుంగుటలో స్థిరముగ నిలబడి శరీరము నిలకడచెందియుండుటకు మాత్రము కావలసినట్టియు శరీరము మొదలగువాటి వలన చేయబడునట్టియు భిక్షకుపోవుట, మొదలైనకర్మలున్ను "నేనొక్కటియు చేసెడివాడనుకాను ఇంద్రియములు విషయములలో ప్రవేశించుచున్నవి." అను నీవిధముగ ఎల్లప్పుడు బాగుగనెరింగి ఆత్మకర్తకాదు అను దానిని చూచుచున్నవాడైయుండునో అతడు భిక్షకుపోవుట మొదలగు ఏకర్మను జేయుటలేదు. అయితే (అజ్ఞానియందువలె అతనియందును స్నానపానములు మొదలగు) లోకవ్యవహారము సమముగ కనబడుచున్నందున సామాన్యజనులు "అతడుగూడ మనవలె కర్మనుజేయు కర్తయే" అని ఆరోపించుటవలన అతడు భిక్షకుపోవుట మొదలగు కర్మలోకర్తయగును. మరియు శాస్త్రప్రమాణము మొదలగు వాటివలన కలిగిన తనయనుభవముచేత (అతడు) అకర్తయే యగును. అతడు కర్తయని ఈ విధముగ నితరులచే నారోపింపబడి శరీరము నిలకడ చెందియుండుటకు మాత్రము కావలసిన భిక్షకుపోవుట మొదలగు కర్మలను జేసినను (అతడు వాటిచే) కట్టబడుటలేదు. ఏలన కట్టుకు కారణమైన కర్మయు దాని కారణమున్ను జ్ఞానమనునగ్నిచే దహింపబడినందున. (4, 19, 21-వ శ్లోకములలో) చెప్పియున్నవాటి యనువాదమే యిది.

శ్లో॥ గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ 23

పద॥ గతసంగస్య (1) - ముక్తస్య (2) - జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞాయ (3) - ఆచరతః - కర్మ - సమగ్రం (4) - ప్రవిలీయతే॥

| | | | |
|---|---|---|---|
| గతసంగస్య | ఆసక్తి లేనివాడై | యజ్ఞాయ | భగవత్ప్రీతికై |
| ముక్తస్య | (ధర్మాధర్మములను కట్టుచే) విడువబడినవాడై | ఆచరతః | చేయువానియొక్క |
| జ్ఞానావస్థితచేతసః | జ్ఞానమునందే స్థిరమైన మనస్సు గలవాడై | కర్మ సమగ్రం | కర్మ యంతయు, అనగావల ముతోగూడ |
| | | ప్రవిలీయతే | కరిగిపోవుచున్నది. |

తా॥ అన్నిటినుండియు ఆసక్తి తొలగినవాడై, ధర్మము అధర్మమను కట్టునుండి తాను నివర్తించినవాడై, జ్ఞానమునందు స్థిరమైన మనస్సు గలవాడై, భగవంతుని ప్రీతికై చేయువానియొక్క కర్మ యంతయు ఫలముతో నశించుచున్నది. అనగా అతనికి ఆ కర్మయు దాని ఫలమును లేకపోవుచున్నదని భావము.

(1) గతసంగస్య - ఫలాపేక్షలేనివాడు (రాఘవేంద్రులు)

(2) ముక్తస్య - శరీరాదులలో అభిమానమును విడిచినవాడు (రాఘవేంద్రులు)

(3) యజ్ఞాయ - జనుల ప్రయోజనములనుద్దేశించి జ్ఞానులుచేయునట్టి యాగములని శ్రీధరులు మరియొక అర్థమును జేసియున్నారు.

(4) సమగ్రం - ప్రాచీనకర్మయంతయు (రామానుజులు)

(స్వకీయము) ఎవ్వడుకర్మను జేయుచున్నప్పుడు నిష్క్రియమైన బ్రహ్మయే తానను దానిని చూచునో అప్పుడు అతడు వ్యాపారమనియు, చేయువాడనియు, ఫలమనియు, లేకుండుటను చూచుట వలన అతనికి కర్మపరిత్యాగస్థితి వచ్చియుండియు ఏదోఒక కారణముచేత అతడు మునుపువలె కర్మ ననుష్ఠించుచుండినను అతడు వాస్తవముగ దేనిని చేయుటలేదని మునుపటి 20-వ శ్లో-న జెప్పబడినది: ఎవ్వనికి ఈ విధముగకర్మ లేకుండుట చెప్పబడినదో అతనికే బంధములేదనునది యీ శ్లో-న జెప్పబడుచున్నది.



శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం *।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥ 24

పద॥ బ్రహ్మ - అర్పణం (1) - బ్రహ్మ - హవిః - బ్రహ్మాగ్నౌ - బ్రహ్మణా - హుతం।
బ్రహ్మ - ఏవ - తేన - గన్తవ్యం - బ్రహ్మకర్మసమాధినా॥

| | | | |
|---|---|---|---|
| అర్పణం | హవిస్సును అగ్నిలో విడుచుటకు సాధనమైన గరిట మొదలగునవి | హవిః | హవిస్సుగూడ (అన్నము నెయ్యి మొదలగునవియు) |
| | | బ్రహ్మైవ | బ్రహ్మమే |
| బ్రహ్మైవ | బ్రహ్మమే | బ్రహ్మాగ్నౌ | బ్రహ్మరూపమైన అగ్నిలో |

| | | | |
|---|---|---|---|
| బ్రహ్మణా | యజ్ఞకర్తయగు బ్రహ్మముచేత | బ్రహ్మకర్మసమాధినా | బ్రహ్మమగు (ఈయజ్ఞ) కర్మలో నిలకడగల మనస్సుగల |
| హుతం | చేయబడుచున్న హోమమున్ను | తేన | అతనిచేత |
| (బ్రహ్మైవ) | బ్రహ్మమే | గన్తవ్యం | పొందబడునదియు |
| | | బ్రహ్మైవ | బ్రహ్మమే |

తా॥ (బ్రహ్మ విత్తైనవాడు) యజ్ఞములో నెయ్యి మొదలగు హవిస్సును అగ్నిలో హోమము జేయుటకు సాధనముగ దేని నుపయోగించునో దానిని బ్రహ్మమే యని చూచుచున్నాడు. అతనికాహవిస్సు బ్రహ్మమే. అగ్నియు బ్రహ్మమే. యజ్ఞ కర్తయు బ్రహ్మమే. చేయబడు హోమము బ్రహ్మమే. ఆ బ్రహ్మమైన యీ యజ్ఞకర్మలో నిలకడగల మనస్సు గలవాడైన అతనిచే పొందబడునదియు బ్రహ్మమే.

* ఈ శ్లోకమును, శరభోపనిషత్తులో జూడుడు.

(1) అర్పణం - స్రుక్ - స్రువః = స్రుక్కనగా యజ్ఞములో హోమముచేయవలసిన అన్నాదులు దేనిచే నెత్తబడి హోమముజేయబడుచున్నవో అట్టి కొయ్యచే చేయబడియున్న పాత్రము. స్రువమనగా పైకనిన విధముగ హోమముజేయుటకై నెయ్యి మొదలగువాటి నెత్తుపాత్ర. (మనము అన్నము నెయ్యి వీటిని హోమముజేయుటకై మోదుగఆకు నుపయోగించుటవలె.)

(శంకరభాష్యము) మరియే కారణమువలన జ్ఞానిజేయు కర్మ తన ఫలమును గలుగ జేయక పూర్తిగ తొలగిపోవుచున్నదనుదానికి కారణము ఈ శ్లోకములో జెప్పబడుచున్నది.

బ్రహ్మము నెరింగినవాడు ఏ సాధనముచేత హవిస్సును అగ్నిలో నుంచుచున్నాడో అది బ్రహ్మమేయని చూచుచున్నాడు. సీసములో వెండిలేకపోవుటను (సీసమేగాని వెండిలేదని) చూచుట వలె ఆత్మకంటె వేరైన అదిలేదని చూచుచున్నాడు. కావున హవిస్సునర్పించు సాధనము బ్రహ్మమే యనబడుచున్నది. ఉదాహరణముగ వెండిగ తోచునది సీసముగనే యున్నదేయనుడు. బ్రహ్మ, అర్పణం, అనునవి వ్యస్త పదములు. లోకములో, (జనులు) దేనిని హవిస్సునర్పించు సాధనమను కొనెదరో అది యా ఆత్మజ్ఞానికి బ్రహ్మమేయనిభావము. ఆవిధముగనే (వారలు) దేనిని హవిస్సు అను కొనెదరో అది) యతనికి బ్రహ్మమేయగును. ఆ విధముగనే (మునుపటివలెగాక) బ్రహ్మాగ్నౌ అనునది సమస్త పదము. (యజమానుడైన) చేసెడివాడగు బ్రహ్మము దేనిలో (హవిస్సును) హోమము చేయునో ఆ అగ్నియు బ్రహ్మమే. చేసెడివాడు బ్రహ్మమే యనునది (ఇచ్చట చెప్పువాని) సూచన. అతడు హోమముజేయుటయను వ్యాపారము బ్రహ్మమే. అతడు పొందవలసిన ఫలమెట్టిదో అదియు బ్రహ్మమే. బ్రహ్మమగు కర్మలో సమాధిగలవానిచేతను, బ్రహ్మమును చూచుటయను కర్మలో ప్రవేశించి ఆ బ్రహ్మమునే అంతట చూచువానిచేతను పొందబడునది బ్రహ్మమే.

ఈ విధముగనే లోకమును సన్మార్గమున ప్రవర్తింపజేయగోరువాడుకూడ చేయుచున్న కర్మవాస్తవముగ అకర్మయే ఏలన అన్నియు బ్రహ్మమనుబుద్ధిచేత కర్మయనుబుద్ధి త్రోయబడి నందున, ఇట్లుండుటవలన ఒకడు కర్మనుండి తొలగినవాడైనను సకలకర్మలను త్యజించిన వాని యధార్థజ్ఞానమును పొగడుటకై జ్ఞానములో యజ్ఞము నారోపించి చెప్పుట బాగుగ తగియున్నది. వాస్తవమైన యాగములో నుపయోగింపబడుచున్నట్టి హవిస్సునర్పించుసాధనము మొదలగునవేవియో

అవి పరవస్తువును చూచుచున్న ఇతనికి తన యాత్మయైన బ్రహ్మమేయని యగును. అట్లులేనిచో సకలము బ్రహ్మముగానుండగా హవిస్సునర్పించు సాధనము మొదలగు వాటినిమాత్రము బ్రహ్మముగ పొగడి జెప్పుట ఫలములేనిదగును. కావున ఇవియన్నియు బ్రహ్మమే అని యెరుంగునతనికి కర్మలేదు. మరియు కారకమునుగూర్చిన తలంపే లేనందునను అతనికి కర్మయే లేదు.

(రామానుజులు) కర్మ, దానికి సాధనమైన సకల వస్తువులున్ను బ్రహ్మమను అను సంధానముతో చేయబడుచున్నందున జ్ఞానాకారమగుచున్నది. ఈ కర్మలో పరబ్రహ్మము అత్మగ గలవాడు ఆత్మస్వరూపమును బొందుచున్నాడని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) యజ్ఞసాధనములైన వన్నియు పరబ్రహ్మమున కధీనమైనందున అవియు బ్రహ్మమేయని చెప్పబడినవి. లేక సకలమునకును బ్రహ్మము స్వామియైనందున అన్నియు బ్రహ్మమేయని చెప్పబడినది. దీనివలన అభిమానత్యాగము చెప్పబడినదగును.

(స్వకీయము) మునుపటి శ్లోకమున 'యజ్ఞాయ' అనుపదమునకు జ్ఞానులు జనుల ప్రయోజనము నుద్దేశించి, లేక యజ్ఞసంరక్షణార్థము యజ్ఞముచేయుచున్నారని శ్రీధరులు అర్థము చేసియున్నారు. ఆ యర్థమునననుసరించియే వారీశ్లోకమునకును అట్టిజ్ఞానులు చేయు యజ్ఞములో నుపయోగింపబడు వస్తువులన్నియును యజ్ఞమును చేయించుచున్న ఋత్విక్కులు మొదలైన సర్వమును పరబ్రహ్మమను అను సంధానముతో చేయుచున్నందున వారు బ్రహ్మమగుచున్నారని అర్థముచేసియున్నారు. "సర్వం ఖల్విదం బ్రహ్మ=సకలము బ్రహ్మస్వరూపమే" అని యున్నందున తానుచేయుచున్న ప్రతికర్మలో కనబడుచున్న వస్తువులన్నిటిలోను బ్రహ్మము నిండియున్నటుల అనుసంధానము చేసికొని యెవ్వడు తానుజేయు ప్రతికర్మను దానిసాధనములను బ్రహ్మమేయని యెరుంగునో అతడు బ్రహ్మ యగుననునది యీశ్లోకమునందలి భావమని తోచుచున్నది.

---

శ్లో॥ దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥ 25

పద॥ దైవం - ఏవ - అపరే - యజ్ఞం - యోగినః - పర్యుపాసతే।
బ్రహ్మాగ్నౌ - అపరే - యజ్ఞం - యజ్ఞేన - ఏవ - ఉపజుహ్వతి ॥

| | | | |
|---|---|---|---|
| అపరేయోగినః | కొందరు కర్మయోగులు | బ్రహ్మాగ్నౌ | బ్రహ్మరూపమగు అగ్నిలో |
| దైవం ఏవ | దేవతలనుద్దేశించినదిగనేయున్న | యజ్ఞేనైవ | ఆత్మచేతనే |
| యజ్ఞం | యజ్ఞమునే | యజ్ఞం | ఆత్మను |
| పర్యుపాసతే | చేయుచున్నారు. | ఉపజుహ్వతి | హోమముచేయుచున్నారు. |
| అపరే | ఇతరులు (బ్రహ్మవిత్తులు) | | |

తా॥ ఇతరులైన కర్మయోగులు (ఇంద్రాది) దేవతల నుద్దేశించినదిగనే యున్న యజ్ఞమును చేయుచున్నారు. బ్రహ్మ విత్తులైన మిగతవారు ఈ బ్రహ్మరూపమగు అగ్నిలో ఆత్మను ఆత్మచేతనే హోమము చేయుచున్నారు.

(శంకరభాష్యము) జ్ఞాన యజ్ఞమును జెప్పినపిదప ఇప్పుడు దానిని పొగడుటకై మరి వేరువిధములైన యజ్ఞములున్ను ఇది మొదలు చెప్పబడుచున్నవి. ఏ యాగముచేత ఇంద్రుడు మొదలైన దేవతలుపాసింపబడుచున్నారో అది దైవయజ్ఞము. ఆ యజ్ఞమునే కొందరు యోగులు

అనుష్ఠించుచున్నారు, "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ, విజ్ఞానమానందం బ్రహ్మ, యత్సాక్షాద పరోక్షాత్ బ్రహ్మ య ఆత్మాసర్వాంతరః"

"బ్రహ్మము వాస్తవవస్తువుగను జ్ఞానస్వరూపముగను అంతములేనిదిగను ఉన్నది." "బ్రహ్మము జ్ఞానముగను అనందముగనుఉన్నది" "యేది సమీపమునందును దూరమునందును గలదో యేది అన్నిటికిని లోపలనున్న ఆత్మగనున్నదో అది బ్రహ్మము" అనుశ్రుతి వాక్యములచే చెప్పబడి ఆకలి, దప్పి, మొదలగు సంసారస్వభావములేనిదై (నేతి నేతి) 'ఇదికాదు ఇదిగాదని' ఎట్టి విశేషణములేనిది బ్రహ్మమను మాటచే చెప్పబడుచున్నది. హోమమునకు స్థానముగ గ్రహించి నందున బ్రహ్మము అగ్నియనుడు. బ్రహ్మము నెరుంగుచున్నవారలైన కొందరు బ్రహ్మమును నగ్నిలో యథార్థముగ బ్రహ్మముగనే యున్నదై బుద్ధి మొదలగు నుపాధులతోగూడి దానివలన తనలో నాయుపాధుల ధర్మమంతయు నారోపింపఁబడి నిలబడు ఆత్మయగు ఆహుతిని క్రిందజెప్పిన లక్షణముగల అనగా ఆకలి దప్పి మొదలగు నెట్టి సంసారస్వభావము మొదలగు లక్షణముతో గూడని ఆత్మచేతనే యర్పించుచున్నారు. ఉపాధిగల ఆత్మను ఉపాధిలేని బ్రహ్మస్వరూపముగనే జూచి తెలిసికొనుట యేదియో అది దానిలో బ్రహ్మములో హోమముచేయుట యనబడును. బ్రహ్మమున్ను తాను ఒక్కటేయని చూచుటలో స్థిరముగ నిలబడు సన్న్యాసులు దానిని చేయు చున్నారని (నిష్కృష్టమైన) తాత్పర్యము. (యాస్కుడు) ఆత్మయొక్క పేర్లలో యజ్ఞమను శబ్దము నెత్తి చెప్పుటవలన యజ్ఞమను పదమునకు (ఇచ్చట) ఆత్మయని అర్థము. ఏది తన స్వభావమును మరియొకదానియెడ ఉన్నట్లు కనబరచునో అది ఉపాధియనఁబడును. ఒకస్ఫటికము దగ్గరనున్న జపాపుష్పము (దాసానిపువ్వు) తన స్వభావమైన ఎరుపురంగును ఆ స్ఫటికమునందున్నట్లు కన బరచుచున్నది. అనగా అది స్ఫటికముగనే కనబడక, యెర్రటి రాయివలె తోచుచున్నది. కావున స్ఫటికమునకు జపాపుష్పము ఉపాధియగును. దానివలె నిచ్చట కనుగొనుఁడు.

(రామానుజులు) ఈ శ్లోకము మొదలు కర్మయోగము పలువిధములైన దనునది చెప్ప బడుచున్నది. అపరే = మరికొందరు కర్మయోగులు, బ్రహ్మాగ్నౌ = అగ్నినే బ్రహ్మముగనెంచి, యజ్ఞేనైవ = స్రుక్ స్రువము మొదలగువాట్లచేత, యజ్ఞం = హవిస్సును, ఉపజుహ్వతి = హోమము జేయుచున్నారు. దైవం = దేవతార్చన రూపమైన యజ్ఞము.

(మధ్వులు) అపరేయోగినః = కొందరు జ్ఞానులు, దైవమేవ = భగవంతునే, యజ్ఞం = ఆరాధించి, పర్యుపాసతే = ఉపాసన చేయుచున్నారు. అపరే = కొందరు జ్ఞానులు, యజ్ఞేనైన = యజ్ఞమగు పశువుచేత, యజ్ఞం = విష్ణువునుగూర్చి, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమును అగ్నిగభావించి యా అగ్నిలో, ఉపజుహ్వతి = హోమము జేయుచున్నారు.

"విష్ణుం యజ్ఞేనపశునా బ్రహ్మా జ్యేష్ఠేన సూనునా,
అయజన్మానసే యజ్ఞే పితరం ప్రపితామహం

(పైకనిన తాత్పర్యమున కాధారముగ నీ వాక్యములను గుర్తించుచున్నారు.) ఈ శ్లో-న వెనుకటి భాగము మానసయజ్ఞమని యెరుంగదగినది.

(రాఘవేంద్రులు) దైవం = విష్ణువు, కావున విష్ణువుయొక్క ఉపాసనయగు యజ్ఞమును చేయుచున్నారు. యజ్ఞేనైన = భగవంతుని నిమిత్తముగ గైకొని, బ్రహ్మాగ్నౌ = స్వానందమైనహవిస్సును భుజించుచున్నందున అగ్నిగనే చెప్పబడిన బ్రహ్మమునందు, ఉపజుహ్వతి = సమర్పించుచున్నారు.

(స్వకీయము) దీని తాత్పర్యమేమనగా నెయ్యి అగ్నిలో నెట్లు చేర్చబడుచున్నదో ఆవిధ ముగ ఉపాధిగల ఆత్మను నిరుపాధికుడైన పరమాత్మయెడ ఐక్యమును చేయించుటయే. ఈ అధ్యా - న 25 మొ - 29 - వరకుగల శ్లో॥ లో జెప్పినవిషయములను మనుస్మృతి 4-వ అధ్యా -22-23-24 శ్లో - లో జూడుడు.

---

శ్లో॥ శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥ 26

పద॥ శ్రోత్రాదీని - ఇంద్రియాణి - అన్యే - సంయమాగ్నిషు - జుహ్వతి।
శబ్దాదీన్ - విషయాన్ - అన్యే - ఇంద్రియాగ్నిషు - జుహ్వతి॥

| | | | |
|---|---|---|---|
| అన్యే | మిగతవారలు | అన్యే | మరికొందరు |
| | చెవి మొదలైన | శబ్దాదీన్ | శబ్దము మొదలగు |
| ఇంద్రియాణి | ఇంద్రియములను | విషయాన్ | విషయములను |
| సంయమాగ్నిషు | అణచుటయను అగ్నిలో | ఇంద్రియాగ్నిషు | ఇంద్రియములను అగ్నులలో |
| జుహ్వతి | హోమము జేయుచున్నారు | హ్వతి | హోమము చేయుచున్నారు. |

తా॥ మరికొందరు యోగులు చెవి మొదలగు ఇంద్రియములను వాటి నణచుట యను అగ్నిలో, అనగా వాటి విషయములనుండి మరలించుట యను అగ్నిలో హోమము జేయుచున్నారు. కొందరు శబ్దము మొదలగు విషయములను ఇంద్రియములను అగ్నులలో హోమము జేయుచున్నారు.

(శంకరభాష్యము) బ్రహ్మార్పణమని మొదలుపెట్టి మునుపటి 24-వ శ్లో-న జెప్పబడిన యధార్థజ్ఞానమును అట్టి ఈయజ్ఞమును ''ద్రవ్యములచేతనగు యజ్ఞమునకన్నను జ్ఞానయజ్ఞము మేలైనది'' అనివెనుకటి 33-వ శ్లో - లో శ్లాఘించుటకై దైవయజ్ఞము మొదలగు యజ్ఞముల మధ్య ఆ జ్ఞానయజ్ఞమును భగవంతుడుంచి యనుగ్రహించుచున్నాడు. అణచుటయనునది అనేకవిధము లైన ప్రతియింద్రియమునకును వెవ్వేరుగనుండుటవలన 'అగ్నులలో' అని బహువచనముగనే చెప్ప బడినది. కొందరు యోగులు చెవి మొదలగు నా యింద్రియములను అణచుటయను అగ్నిలో హోమము చేయుచున్నారనగా ఇంద్రియముల నణచుటనే చేయుచున్నారని భావము. కొందరు శబ్దము మొదలగు విషయములను ఇంద్రియములను అగ్నిలో హోమము చేయుచున్నారనగా శాస్త్రవిరుద్ధముకాని విషయములను చెవి మొదలగు ఇంద్రియములచే గ్రహించుటనే హోమముగ గ్రహించుచున్నారు. తమకు గిట్టిన వాటిలోనిషిద్ధములైన విషయములను విడిచి మిగతవాటిని ఆ యా ఇంద్రియములచే రాగద్వేషములులేక అనుభవించుచున్నారని భావము.

(శ్రీధరులు) నైష్ఠిక బ్రహ్మచారికి ఇంద్రియముల నణచుటయే యజ్ఞమగును. ఎట్లనగా యజ్ఞములో పలువస్తువులు అగ్నియందాహుతి చేయబడుచున్నవి. అగ్నిలో వేయబడిన ఆవస్తువులు నశించి (వస్తువులరూపముతెలియక) పోవుచున్నవి. దానివలె ఇంద్రియముల వ్యాపారమును అవి పోవుచున్న మార్గముల నడ్డగించి నిలబెట్టుటయే అగ్నియనబడును. ఆ యగ్నిలో ఇంద్రియముల వ్యాపారమును హోమము చేసినచో ఆవ్యాపారము నశించును.

గృహస్థాశ్రమమునందున్న వానికి విషయములందాసక్తిని విడచుటయే యజ్ఞమగును. ఎట్లనగా అతడు శబ్దాదివిషయములను అనుభవించుచున్నను, ఆ విషయములలోగల ఆసక్తిని హవిస్సుగను, ఇంద్రియములను అగ్నిగను భావించి ఆవిషయాసక్తియను హవిస్సును ఇంద్రియములను అగ్నిలో హోమముజేయుచున్నాడు. ఆయాఇంద్రియములు ఏ వస్తువును గ్రహించినను ఆవస్తువునెడ గలుగుచున్న ఆసక్తిని నశింపజేయుటయే హోమము.

(రాఘవేంద్రులు) విషయభోగముల ననుభవించినను అట్లనుభవించుచున్న విషయములను ఈశ్వరారాధనముగ తలంచుటయే హోమము (ఈ భేదముతప్ప మిగతఅంతయు పైకనిన అర్థముతో తుల్యముగనున్నది.

(స్వకీయము) ఈ శ్లో॥లో పూర్వభాగము బ్రహ్మచారిని గూర్చినది, వెనుకటిభాగము గృహస్థునిగూర్చినది.

శ్లో॥ సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ 27

పద॥ సర్వాణి - ఇంద్రియకర్మాణి - ప్రాణకర్మాణి - చ - అపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ - జుహ్వతి - జ్ఞానదీపితే॥

| | | | |
|---|---|---|---|
| అపరే | మరికొందరు (జ్ఞాననిష్ఠులు) | ఆత్మసంయమ | ఆత్మయెడ మనస్సును నిల |
| సర్వాణి ఇంద్రియ కర్మాణి | అన్నివిధములైన ఇంద్రియముల వ్యాపారములను | యోగాగ్నౌ | బెట్టుటయైన యోగమను |
| ప్రాణకర్మాణి చ | ప్రాణముల వ్యాపారములను | జుహ్వతి | హోమము జేయుచున్నారు. |
| జ్ఞాన దీపితే | జ్ఞానముచేత ప్రకాశింపజేయబడిన | | |

తా॥ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములయొక్కయు ప్రాణవాయువు మొదలగు పది వాయువులయొక్కయు వ్యాపారములను, బ్రహ్మజ్ఞానముచేత ప్రకాశించుచున్న బ్రహ్మజ్ఞాననిష్ఠలో మనస్సును నిలబెట్టుటయైన యోగమను అగ్నిలో హోమము జేయుచున్నారు. (ఇంద్రియముల వ్యాపారమునందుగాని, ప్రాణము మొదలగు వాయువుల వ్యాపారమునందుగాని మనస్సును ప్రవర్తింపనీయక అడ్డగించుటయే హోమమనునది రామానుజుని తాత్పర్యము.)

(స్వకీయము) ఆత్మ సంయమమనగా ఆత్మయెడ మనస్సును తిరుగనీయక నిలబెట్టుట అదియే యోగమను అగ్ని.

నూనెచే దీపము ప్రకాశించుటవలె, వివేకజ్ఞానముచేత ప్రకాశ స్వభావము నొందించబడిన ఆ అగ్నిలో ఇంద్రియములు, ప్రాణము, వీటిసర్వవ్యాపారములను కొందరర్పించుచున్నారు అనగా వ్యాపారములనన్నిటిని అడ్డగించి ఆత్మయెడ మనస్సుజేరుటను చేయుచున్నారని తాత్పర్యము. ఈ శ్లో-లో జెప్పబడినది సన్న్యాసుల విషయము దీపమునకు నూనెవలె ఆత్మసంయమమునకు జ్ఞానమగును. ప్రాణమనగా శరీరమునందుగల ఒక వాయువు దాని వ్యాపారము వంగుట, లేచుట మొదలగునవి. దేహమునందుగల పదివాయువులనున్ను వాటి వ్యాపారములనున్ను క్రింద కనబరచినటుల శ్రీధరులు చెప్పియున్నారు.

(1) ప్రాణము – దేహములోనుండి జ్ఞానేంద్రియముల ద్వారా కొంతభాగము వెలుపల పోవుట వచ్చుటగ నున్నది.

(2) అపానము – అపానముద్వారా కొంత భాగము బయటపోవుటయు వచ్చుటయు గలది.

(3) వ్యానము – దేహమంతయు తిరుగుచున్నట్టిది. (ఈ వాయువు తిరుగుట వలననే రక్తమును దేహమంతయు ప్రవహించునట్లు చేయుచున్నది.

(4) ఉదానము – దేహములోపల నాభినుండి శిరస్సు పైభాగము వరకు రాకపోకలు గలది.

(5) సమానము – ఆహారాదులను జీర్ణింపజేయించి ఆహారమునందలి సారములను అవిపోయి చేరవలసిన చోట్లచేర్చి అసారమును మలజలరూపమై బయట బడునట్లు జేయునది.

(6) నాగము – వాంతిని కలుగ జేయునది

(7) కూర్మము – కండ్లను వికసింపజేయునది.

(8) కృకరము – తుమ్ముటను కలుగ జేయునది,

(9) దేవత్తము - ఆవులింతను కలుగ జేయునది.

(10) ధనంజయము – దేహమున ప్రాణమున్నప్పుడును ప్రాణముపోయిన పిదపను దేహములో నున్నది.

ఈ పది (10) వాయువుల పేర్లను, వ్యాపారములను యోగచూడామణ్యుపనిషత్తు నందును లింగపురాణము అధ్యా - 8 - 6 మొదలు 66 వరకుగల శ్లో-ను, శివపురాణము - వాయుసంహిత అధ్యా - 29-39 మొ - 41 వరకు శ్లో-ను చూడుడు,

శ్లో॥ ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః॥ 28

పద॥ ద్రవ్యయజ్ఞాః (1) - తపోయజ్ఞాః (2) - యోగయజ్ఞాః (3) తథా - అపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః (4) - చ - యతయః (5) - సంశితవ్రతాః (6)॥

| | | | |
|---|---|---|---|
| అపరే | కొందరు | స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాశ్చ | వేదాధ్యయనమే యజ్ఞముగ గలవారు, కొందరు శాస్త్రముల అర్థజ్ఞానమే యజ్ఞముగ గలవారు |
| ద్రవ్యయజ్ఞాః | ద్రవ్యదానము యజ్ఞముగగలవారు | | |
| (అపరే) | కొందరు | | |
| తపోయజ్ఞాః | తపస్సు యజ్ఞముగగలవారు | | |
| (అపరే) | కొందరు | (అపరే) | ఇక కొందరు |
| యోగయజ్ఞాః | యోగమే యజ్ఞముగగలవారు | యతయః | మంచిప్రయత్నము గలవారై |
| తథా | అట్లే | సంశితవ్రతాః | మిక్కిలి కఠినమైన వ్రతము గలవారు |
| (అపరే) | మరికొందరు | | |

తా॥ కొందరు ద్రవ్యదానము, కొందరు తపస్సు, కొందరు యోగము, కొందరు వేదాధ్యయనము, కొందరు విచారము జేయుట, యను వీటిని యజ్ఞ

ములుగ గలవారు. మరికొందరు మంచి ప్రయత్నము గలవారై మిక్కిలి కఠినములైన వ్రతములు గలవారు.

(1) ద్రవ్యయజ్ఞాః-ద్రవ్యములను (వస్తువులను) దివ్యక్షేత్రము తీర్థముగలచోట సత్పాత్రములో దానముచేయుటయే యజ్ఞమని తలంచుచున్నారు (శంకరులు). న్యాయముగ సంపాదించిన వస్తువును స్వామిపూజ, యాగములు, నియమముగ జేయుచున్న హోమము, దానము మొదలగు విషయములకై ఖర్చుచేయుటయే యజ్ఞమని తలంచుచున్నారు. (రామానుజులు). ఆత్మసంయమయోగాగ్నిలో హవిస్సు మొదలగు ద్రవ్యములను హోమముచేయుట, లేక వస్తువులను యోగ్యులకు దానముచేయుట (మధ్వులు). భగవదర్పణముగ ద్రవ్యమును వ్యయపరచుట (రాఘవేంద్రులు).

(2) తపోయజ్ఞాః - తపస్సుచేయుటయే యజ్ఞమని తలంచుచున్నారు (శంకరులు). కృచ్ఛ్రచాంద్రాయణ వ్రతములు, ఉపవాసాది (శ్రీధరులు, రామానుజులు, రాఘవేంద్రులు). తాను చేయు తపస్సును బ్రహ్మార్పణముచేయుట (మధ్వులు). ఈ యర్థమునుగూడ రాఘవేంద్రులు ఒప్పుకొనుచున్నారు.

(3) యోగయజ్ఞాః - ప్రాణాయామ ప్రత్యాహారాది అష్టాంగయోగము (శంకరులు). మనస్సును సమాధానముగ ఒకేచోట నిలబెట్టుట (శ్రీధరులు), పుణ్యక్షేత్రము పుణ్యతీర్థముగలచోట వాసముచేయుట (రామానుజులు). భగవద్ధ్యానమగు యజ్ఞము (రాఘవేంద్రులు),

(4) స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాః - స్వాధ్యాయ యజ్ఞము = వేదాది పారాయణము, జ్ఞాన యజ్ఞము వేదార్థ విచారముచేసి యెరుంగుజ్ఞానము (శంకరులు, శ్రీధరులు, రామానుజులు, రాఘవేంద్రులు). లేక వేదార్థవిచారమువలన సంపాదించునట్టి జ్ఞానమే యజ్ఞము (శ్రీధరులు).

(5) యతయః — యత్నశీలాః (శంకరులు, రామానుజులు, రాఘవేంద్రులు). ప్రయత్నశీలాః (శ్రీధరులు). ఈ రెండువాక్యముల అర్థమొక్కటే, అనగా, ప్రయత్నించువారలు.

(6) సంశితవ్రతాః — దృఢమైన నిశ్చయముగల వారలు (రామానుజులు). (స్వాభిప్రాయము) ప్రతిదినము సహస్రము (1000) శివలింగములనుచేసి పూజచేసినగాని భుజించను. ద్రవ్యము సంపాదించి ఈ దేవాలయమును కట్టువరకు అరికంఠము వేసికొనెదను. తిరుపతికి అంగప్రదక్షిణము చేయుచు పోయెదను అనునీవిధములైన కఠినవ్రతములను చేసికొని ఆవిధముగ నడుచువారలు.

(స్వకీయము) ఈ శ్లోకమున ఆరుయజ్ఞములు చెప్పబడియున్నవి. అవేవన - పుణ్య తీర్థము క్షేత్రము మొదలగుచోట యోగ్యులకు ధనమిచ్చుట యజ్ఞమను బుద్ధితో చేయునది. (1) తపస్సు చేయుచున్న కొందరు తపస్సు యజ్ఞముగచేయుట, (2) కొందరు ప్రాణాయామము, అనగా ప్రాణ వాయువులను అణచుట, ప్రత్యాహారము, అనగా మనస్సును బాహ్యవిషయములనుండి మరలించి లోపల ప్రవేశింపచేయుట మొదలగు వాటినిచేయుటయను యోగమునే యజ్ఞమని భావించిచేయుట, (3) కొందరు ఋగ్వేదము మొదలగు వేదములను విధిప్రకారము అభ్యసించుటను యజ్ఞముగ చేయుట, (4) కొందరు శాస్త్రార్థములను బాగుగ విచారించి విమర్శించి యెరుంగుటనే యజ్ఞమని చేయుట, (5) మరికొందరు ఉత్సాహముగల స్వభావముతోగూడి కఠినములైన వ్రతములననుష్ఠించుట, (6) అయితే కొందరు వ్యాఖ్యాతలు దీనిలో ఐదు యజ్ఞములే చెప్పబడినవిగ భావించి "యత

యః సంశితవ్రతాః" అను దానికి మునుపుజెప్పిన ఐదుయజ్ఞములున్ను మిక్కిలి ప్రయత్నముతో నున్ను కఠినమైన వ్రతముతోను కూడినవని తాత్పర్యము చేయుచున్నారు మధుసూదన సరస్వతి "అగ్నిలో నెయ్యి మొదలగు ద్రవ్యములను విడిచి హోమముచేయుటయే ద్రవ్యయజ్ఞము"ని అభిప్రాయపడుచున్నారు. తపోయజ్ఞమనగా కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలగు ఉపవాసములను గుర్తించునట్లు ద్వైతపరమైన తాత్పర్యము.



శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥ 29

పద॥ అపానే - జుహ్వతి - ప్రాణం - ప్రాణే - అపానం - తథా - అపరే।
ప్రాణాపానగతీ - రుద్ధ్వా - ప్రాణాయామపరాయణాః॥

| | | | |
|---|---|---|---|
| అపరే | మరికొందరు | అపానం | అపానవాయువును |
| అపానే | అపానవాయువులో | జుహ్వతి | హోమము జేయుచున్నారు |
| ప్రాణం | ప్రాణవాయువును | ప్రాణాపానగతీ | ప్రాణాపానవాయువుల గతులను |
| జుహ్వతి | హోమము జేయుచున్నారు | రుద్ధ్వా | అడ్డగించి |
| తథా | అటులనే | ప్రాణాయామ | ప్రాణాయామము జేయుటయందే |
| ప్రాణే | ప్రాణవాయువులో | పరాయణాః | ఆసక్తిగలవారలైయున్నారు. |

తా॥ మరికొందరు అపానవాయువులో ప్రాణవాయువును హోమము జేయుచున్నారు. ఆ విధముగనే ప్రాణవాయువులో అపానవాయువును హోమము జేయుచున్నారు. ప్రాణాపానముల గతుల నడ్డగించి ప్రాణాయామమును జేయుటయందే ఆసక్తి గలవారలై యున్నారు.

(శంకరభాష్యము) మరికొందరు అపానముయొక్క వ్యాపారములోనే ప్రాణముయొక్క వ్యాపారమును అర్పించుచున్నారు, అనగా పూరకమనే ప్రాణాయామమును చేయుచున్నారని భావము. ఆ విధముగనే కొందరు ప్రాణములో నపానమును అర్పించుచున్నారు. అనగా రేచకమను ప్రాణాయామమును చేయుచున్నారని అర్థము. నోరు ముక్కు వీటిద్వారా వాయువు బయటపోవుట ప్రాణముయొక్క గతియనబడును. దానికి విపరీతముగ లోపలికిపోవుట అపానముయొక్క గతి. కొందరు ప్రాణాపానముల ఆయాగతుల నడ్డగించి ప్రాణాయామమునందే ఆసక్తిగలవారలైయున్నారు. అనగా కుంభకమను ప్రాణాయామమును చేయుచున్నారని భావము.

(శ్రీధరులు) పూరకమనగా ముక్కుచే శ్వాసమును లోనికీడ్చుట. కుంభకమనగా ముక్కుచే లోనికిడ్చిన శ్వాసమును లోపలనిలబెట్టుట. రేచకమనగా నిలబెట్టబడిన శ్వాసములో కొద్దిభాగమును బయటికి విడుచుట. పూరకకాలమున ఒకముక్కుచేత శ్వాసమీడ్వబడు చున్నది. రేచకకాలమున మరియొకముక్కుచే శ్వాసము విడువబడుచున్నది. ఇట్లు శ్వాసము నీడ్చునప్పుడును "హంసః సోహం" అని నేరుగను తలక్రిందుగను ప్రకాశించుచున్న అజపామంత్రముచేత ''తత్త్వమసి'' అనుచోట చెప్పబడుచున్న జీవబ్రహ్మైక్యమును మరలమరల చింతించుచున్న వారలైయున్నారు. (దీనికాధారముగ యోగశాస్త్రమునుండి ఒక శ్లోకమును సూచించుచున్నారు.)

"సకారేణ బహిర్యాతి హకారేణ విశేత్పునః।
ప్రాణస్తత్ర సఏవాహం హంస ఇత్యనుచింతయేత్"॥

ఈశ్లోకమునకర్థము, దీనివ్యాఖ్యానార్థమువీటినితెలుపుచున్నస్కాందపురాణము కాశీఖండము మొదటిభాగము అధ్యాయము 41 లోగల క్రిందకనుబరచిన వాక్యములను చూడుడు:—

అపానః కర్షతి ప్రాణం ప్రాణోఽపానం చ కర్షతి।
ఊర్ధ్వాధస్సంస్థితావేతౌ సంయోజయతి యోగవిత్॥
హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్పునః।
హంసహంసేత్యతో మంత్రం జీవో జపతి సర్వదా॥
షట్ శతాని దివారాత్రౌ సహస్రాణ్యేకవింశతిః।
ఏతత్సంఖ్యాన్వితం మంత్రం జీవోజపతి సర్వదా॥
అజపానామ గాయత్రీ యోగినాం మోక్షదాయినీ।
అస్యాస్సంకల్పమాత్రేణ నరః పాపైః ప్రముచ్యతే॥

అపానవాయువు ప్రాణవాయువు నీడ్చుచున్నది. ప్రాణవాయువు అపానవాయువు నీడ్చుచున్నది. పైనక్రిందనున్న యీ (రెండు) వాయువులను యోగమెరింగినవాడు చేర్చుచున్నాడు. (అనగా కదలనీయక చేయుచున్నాడు) హకారరూపముగ బయట బెట్టునదియు సకారరూపముగ లోనికీడ్చునదియు గలవాడుగనున్నాడు. దీనివలన "హంస హంస" అను మంత్రమును జీవుడెల్లప్పుడును జపముజేయు చున్నవాడగును. ఈ మంత్రమును జీవుడు రాత్రిపగలు చేరిన ఒకదినమునందెల్లప్పుడు జపించినచో 21600 మంత్రములగును. (అనగా అంతశ్వాసము విడుచునని తాత్పర్యము) ఈఅజప (జపించని) మంత్రమైన గాయత్రి యోగులకు మోక్షమివ్వగలదిగనున్నది. ఈ గాయత్రిని జేయతలంచిన మాత్రమున మనుష్యుడు పాపమునుండి విడువబడుచున్నాడు.

(స్వకీయము) ఈ శ్లోకమునందలి అర్థముబోలిన క్రిందకనబరచిన శ్లోకమును యోగచూడా మణ్యుపనిషత్తునందును, యోగశిఖో పనిషత్తు 1-6-అధ్యాయములలోను, ధ్యానబిందూపనిషత్తునందును చూడుడు.

హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్పునః।
హంస హంసేత్యముం మంత్రం జీవో జపతి సర్వదా॥

మరియొక పాఠము:—

హంస హంసేతి మంత్రోఽయం సర్వజీవైశ్చ జప్యతే।

(స్వకీయము) ఈ 29-వ శ్లోకమునకు శంకరానందులు క్రింద కనబరచినట్లును అన్వయము చేసియున్నారు.

ప్రాణాయామ పరాయణాః = ప్రాణాయామము చేయుచున్నవారైన, అపరే = మరికొందరు, ప్రాణాపాన గతీరుద్ధ్వా = ప్రాణాపానవాయువుల గతులనడ్డగించి, అపానేప్రాణం = అపాన వాయువులో ప్రాణవాయువునున్ను; తథా = అట్లే, ప్రాణేఽపానం = ప్రాణవాయువులో అపాన వాయువునున్ను, జుహ్వతి = హోమము చేయుచున్నారు.

మధుసూదన సరస్వతి మొదలైన కొందరు ముందురాబోవు శ్లోకమునందలి మొదటి భాగమైన "అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి" అనుదానిని ఈ శ్లోకముతోజేర్చి అన్వయ పరచియున్నారు.

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥ 30

పద॥ అపరే - నియతాహారాః - ప్రాణాన్ (1) - ప్రాణేషు - జుహ్వతి।
సర్వే - అపి - ఏతే - యజ్ఞవిదః - యజ్ఞక్షపితకల్మషాః॥

| | | | |
|---|---|---|---|
| అపరే | కొందరు | యజ్ఞవిదః | యజ్ఞము నెరింగిన, లేక అనుష్ఠించిన |
| నియతాహారాః | మితమైన ఆహారముగలవారలై | | |
| ప్రాణాన్ | ప్రాణము మొదలగు వాయువులను | ఏతేసర్వేపి | ఈ (మునుపుజెప్పిన)వారందరు |
| ప్రాణేషు | ప్రాణము మొదలగు వాయువులలో | యజ్ఞక్షపితకల్మషాః | క్రిందజెప్పిన యజ్ఞములచేత పాపనాశము బడసినవారలు |
| జుహ్వతి | హోమము చేయుచున్నారు. | | |

తా॥ కొందరు మితమైన ఆహారము గలవారలై ప్రాణము మొదలగు వాయువులను ఆ ప్రాణము మొదలగు వాయువులలోనే హోమము జేయుచున్నారు. (అనగా పలువిధములైన వాయువులలో ఏయే వాయువు జయింపబడునో ఆయా వాయువులో మిగత వాయు విశేషములను అర్పించుచున్నారు. (అవి వాటిలో ప్రవేశించి క్రుంగినవివలె నగుచున్నవని భావము.) పై జెప్పబడిన వీరెల్లరు యజ్ఞకర్మ నెరింగినవారలు. వీరలు పైజెప్పిన యజ్ఞములచేత తమ పాపములను పోగొట్టుకొన్నవారలు.

(1) ప్రాణాన్ — అనుదానికి ఇంద్రియ వ్యాపారములనియు, ప్రాణేషు అనుదానికి వశమైన ఇంద్రియములలో అనియు శ్రీధరులు అర్థము చేసియున్నారు.

(శ్రీధరులు) మితమైన ఆహారమనగా ఒకడు తనకడుపంతయు నిండింపనెంత ఆహారము కావలెనో ఆ పరిమాణమును నాలుగు భాగములుజేసి రెండు భాగములను అన్నాదులచేతను, ఒక భాగమును జలముచేతను నింపి, మరియొక భాగమును నింపక విడిచిపెట్టుట. (ఏలనగా వాయువులు సంచారము చేయవలెననియే.) ఇట్లు భుజించుటయే మితమైన ఆహారము.

(స్వకీయము) ఇంద్రియ వ్యాపారములను ఇంద్రియములలో అణచుటయని శ్రీధరులును, ప్రాణము మొదలగు వాయువులను ప్రాణము మొదలగు వాయువులలో అణచుటయని శంకరులున్ను చెప్పియున్నారు. ఇంద్రియములు, లేక, వాయువులు వీటిని ఒకదాని యందొకదానిని యణచుట ఎట్లనినచో యోగాభ్యాసము చేసెడివారలు ఇంద్రియములు వాయువులు వీటినివాటి విషయములలో ప్రవేశింపనీయక అణచవలసినది అవశ్యకమైనది. ఇంద్రియముల నన్నిటినిగాని, లేక వాయువులనుగాని ఒకేకాలము నందణచుట ఆరంభమున సాధ్యముకానిదైనను ఒక్కొక్కటిగ అణచవలెను. మొదట ఏది అణచబడు చున్నదో దానితో అణచబడని వాటిని ఒక్కొక్కటిగ చేర్చుటయే ఒకదానిలో మరి

యొక దానిని చేర్చుట, లేక హోమముచేయుట. ఇట్లు అణచుకొనుచు కడపట అన్నియణగినచో అనగా ప్రాణములన్నిటిని ఏకీభవించునటుల జేసినచో పిదప మనస్సు చలింపక ఒకేనిలకడలో నిలబడును. ఈ యర్థము నిచ్చునట్టి శ్లోకమును 9-వ అధ్యాయమున 6 వ శ్లోకముయొక్క వ్యాఖ్యానములో జూడుడు.



యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాఽయం లోకో స్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥ 31

పద॥ యజ్ఞశిష్టామృతభుజః - యాన్తి - బ్రహ్మ - సనాతనమ్ ।
న - అయం - లోకః - అస్తి - అయజ్ఞస్య - కుతః - అన్యః - కురుసత్తమ ॥

| | | | |
|---|---|---|---|
| యజ్ఞశిష్టామృత భుజః | (మునుపుజెప్పిన) యజ్ఞశిష్టమైన (మిగిలిన) అమృతమును భుజించువారలు | అయం లోకః | (అల్పసుఖములైన ధర్మార్థ కామానుభవముగల) ఈ లోకము |
| సనాతనం బ్రహ్మ | శాశ్వతమైన బ్రహ్మమును | నాస్తి | లేదు. |
| యాన్తి | పొందుచున్నారు. | అన్యః | (స్వర్గాదులైన) ఇతరము |
| హే కురుసత్తమ! | ఓ కురువంశశ్రేష్ఠుడా! | కుతః | ఏది? |
| అయజ్ఞస్య | యజ్ఞములేనివారికి | | |

తా॥ (మునుపు జెప్పిన యజ్ఞమునుండి మిగిలిన అమృతమును భుజించువారలు అనగా ఆ యజ్ఞమును జేసినవారలు శాశ్వతమైన బ్రహ్మమును పొందుచున్నారు. ఓ అర్జునా! పై జెప్పిన యజ్ఞములలో నొక్కటియు లేనివానికి ఈ లోకము లేదు. మిగత యేది? అనగా ఎవ్వనికి ఈ యజ్ఞములలో నొక్కటైన లేదో వానికి ఈ లోకసుఖమే లేదనినచో జ్యోతిష్టోమము మొదలగు శ్రేష్ఠమైన సాధనములచేత సాధింపదగిన మిగత స్వర్గాది లోకసుఖమెట్లు కలుగగలదని భావము.

(శంకరభాష్యము) ఈ విధముగ క్రిందజెప్పిన యజ్ఞములను జేసినకాలముగాక మిగిలియున్న కాలమున తనకు విధింపబడిన యజ్ఞముచేసిన పిదపగల అమృతమగు అన్నమును ఎవ్వరు విధిప్రకారముగ భుజింతురో వారలు సంసారమునుండి విడువబడగోరినచో నిత్యమైన బ్రహ్మమును కాలక్రమమున పొందగలరు. కాలక్రమమున అనునది యుక్తిచే ఉంచుకొనవలసియున్నది. క్రింద చెప్పిన యజ్ఞములలో ఎవ్వనికి ఒకయజ్ఞముగానియుండదో వానికి ప్రాణులన్నిటిని సాధారణమైన యీ లోకమే లేదనినచో జ్యోతిష్టోమము మొదలగు విశేషసాధనములచే పొందదగిన మిగత స్వర్గాది లోకములేవి? అనగా లేనేలేవని భావము.

(శ్రీధరులు) ద్రవ్యయజ్ఞయ తపోయజ్ఞము మొదలగు యజ్ఞములు మునుపుచెప్పబడియున్నవిగదా? ఆ యజ్ఞములలో అన్నమేది? శేషమేది? యనినచో ఏయేయజ్ఞములలో అన్నము మిగులునో వాటి విషయమున అన్నశేషమనియు అన్నసంబంధములేని యజ్ఞవిషయములో యజ్ఞముచేసిన కాలముపోగా మిగిలినకాలములో విధ్యనుసారముగ భుజింపదగిన శుద్ధమైన అన్నమనియు తాత్పర్యము.

(రామానుజులు) అయజ్ఞస్య = మహాయజ్ఞముతో నిత్యనైమిత్తిక యజ్ఞము చేయనివానికి, అయంలోకః = స్వర్గాదిలోకములలో ధర్మార్థకామముల అనుభవముగాని, అన్యః = మోక్షముగాని, కుతః = ఏది, నాస్తి = కలుగనేరదు.

(స్వకీయము) మునుపు 3 వ అధ్యాయము 9-13-శ్లోకములను ఈ ప్రకరణమునజేర్చి చూచినచో దీనిభావము స్పష్టముగ తెలియును అచ్చట యజ్ఞమనగా ఈశ్వరుడనియు, ఆ ఈశ్వరుని కొరకు చేయబడునదే యజ్ఞమున్కైన కర్మయనియు, అవిధములైన యజ్ఞకర్మలు తప్ప ఇతరకర్మల చేత బంధమునకు కారణమగుననియు, దేవయజ్ఞము మొదలగు పంచమహాయజ్ఞములు చేసినపిదప వాటిశేషమై అమృతమను అన్నమును భుజించు సాధువులు సకలపాపములనుండియు విడువబడు చున్నారనియు ఇదియే తాత్పర్యము చెప్పబడియున్నది. అయినను ఇచ్చట యజ్ఞశేషమైన అమృత మును భుజించుట యనునది పైజెప్పిన అనేకవిధములైన యజ్ఞములనుజేసి ముగించిన పిదప వారిచే అనుభవింపబడు ఆ ఫలమును, లేక, వారల మనస్సులో కలిగియుండు తృప్తిని, గుర్తించునదిగాను గ్రహింపదగునని తోచుచున్నది.



శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాꣳ విద్ధి తాꣳ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥

పద॥ ఏవం - బహువిధాః - యజ్ఞాః - వితతాః - బ్రహ్మణః - ముఖే ।
కర్మజాꣳ - విద్ధి - తాꣳ - సర్వాꣳ - ఏవం - జ్ఞాత్వా - విమోక్ష్యసే

| | | | |
|---|---|---|---|
| ఏవం | ఇటువంటి | కర్మజాꣳ | (మనోవాగ్దేహముల వ్యాపార మైన) కర్మవలన కలిగినవిగ |
| బహువిధాః | అనేకవిధములైన | | |
| యజ్ఞాః | యజ్ఞములు | విద్ధి | ఎరుంగుము |
| బ్రహ్మణః ముఖే | వేదముయొక్క ముఖములో (వేదములో) | త్వం | నీవు |
| వితతాః | విస్తరించి చెప్పబడియున్నవి. | ఏవం జ్ఞాత్వా | ఈ విధముగ ఎరింగి (జ్ఞాన నిష్ఠుడవై) |
| సర్వాꣳ తాꣳ | ఆ సమస్తయజ్ఞములనున్ను | | |
| | | విమోక్ష్యసే | కర్మబంధమునుండి విడువబడెదవు |

తా॥ (పై జెప్పి వచ్చిన) ఇటువంటి అనేకవిధములైన యజ్ఞములు వేద ములో విస్తరించి చెప్పబడియున్నవి. ఆ సమస్త యజ్ఞములను మనస్సు వాక్కు దేహము వీటి వ్యాపారమైన కర్మవలన గలుగునవిగ ఎరుంగుము. ఈ విధ ముగ ఎరింగి (జ్ఞాననిష్ఠను పొందినచో) కర్మబంధమునుండి విడువబడగలవు.

(శంకరభాష్యము) క్రిందజెప్పిన పలువిధములైన యజ్ఞములు వేదముయొక్క ముఖ మున విస్తారముగనున్నవి. వేదముద్వారా వేదమునుండి యెరుంగబడుచున్నవి గాన వేదముయొక్క ముఖమున విస్తరించియున్నవని చెప్పబడుచున్నవి. అది "వాచి హి ప్రాణం జుహుమః = వాక్కు నందుగదా ప్రాణమును హోమము చేయుచున్నాము" అనునది మొదలైన వేదవాక్యములచే జూడుడు. వాటినన్నిటిని అనేక విధములైన కర్మమార్గములుగ ఎరుంగుము. ఏలనగా ఆత్మ, వ్యాపారము లేనిది. కావున ఆత్మవలన కలుగునవికావు. గాన నీవిట్లు ఎరింగి అహితమునుండి నివర్తించెదవుగాక. "ఇవి నా వ్యాపారములుకావు. నేను వ్యాపారములేనివాడను, ఉదాసీనుడను" ... నీ కిట్లు తెలిసిన తోడనే యీ యథార్థజ్ఞానముచేత అహితమైన సంసారమను కట్టునుండి

తేలిన భావము. (ఉదాసీనుడు = ఉపేక్షగలవాడు, అనగా వివాదముజేయుచున్న యిరువురి జయాపజయములతో సంబంధపడక వాటివలన రాగల సుఖదుఃఖములను పొందక యెట్టివికారము లేక యుండువాడు.)

(రామానుజులు) ఏవంబహువిధాః = ఇటువంటి అనేకవిధములైన. యజ్ఞాః = కర్మయోగములు, బ్రహ్మణోముఖేవితతాః = ఆత్మస్వరూప నిశ్చయమొందుటకు కారణములుగనున్నవి. సర్వాన్ తాన్ కర్మజాన్ = పైజెప్పిన సకల కర్మయోగములున్ను ప్రతిదినము తాననుష్ఠించుచున్న నిత్య నైమిత్తిక కర్మలవలన కలిగినవని, విద్ధి=ఎరుంగుము, ఏవం=ఈ విధముగ, జ్ఞాత్వా = ఎరింగియు అనుష్ఠించియు వచ్చినచో, విమోక్ష్యసే = మోక్షమొందగలవు.

(రాఘవేంద్రులు) బ్రహ్మణోముఖేవితతాః = యజ్ఞభోక్త బ్రహ్మమైనందున బ్రహ్మము యొక్క ముఖమున యజ్ఞములు విశాలముగనున్నవి, సర్వాన్తాన్ కర్మజాన్విద్ధి = ఈ యజ్ఞము లన్నియు మనోవాక్కాయముల కర్మలవలన కలిగినవని యెరుంగుము. (వేరు వ్యత్యాసములేదు.)



శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥　　33

పద॥ శ్రేయాన్ - ద్రవ్యమయాత్ - యజ్ఞాత్ - జ్ఞానయజ్ఞః - పరంతప
సర్వం - కర్మ - అఖిలం - పార్థ - జ్ఞానే - పరిసమాప్యతే ॥

| | | | |
|---|---|---|---|
| హే పరంతప! | ఓ శత్రువునుతపింపజేయువాడా! | సర్వం కర్మ | కర్మయంతయు |
| జ్ఞానయజ్ఞః | జ్ఞానయజ్ఞము | అఖిలం | కొరతలేక |
| ద్రవ్యమయాత్ | ద్రవ్యములవలన నగు | జ్ఞానే | (మోక్షసాధనమైన) జ్ఞానములో |
| యజ్ఞాత్ | యజ్ఞమునకంటె | పరిసమాప్యతే | అంతర్భవించుచున్నది (అణిగి నిలబడుచున్నది.) |
| శ్రేయాన్ | శ్రేష్ఠమైనది | | |
| హే పార్థ! | ఓ కుంతీపుత్రుడా! | | |

తా॥ ఓ అర్జునా! ద్రవ్యాదులవలన (ధనములేక యజ్ఞమునందుపయోగింపవలసిన వస్తువులవలన) చేయదగిన యజ్ఞమునకంటె జ్ఞానమను యజ్ఞము శ్రేష్ఠమగును. ఓ కుంతీపుత్రా! ఈశ్వరార్పణముగ జేయబడు సకల కర్మయు దానిఫలముతో బ్రహ్మజ్ఞానమందిమిడియున్నది. (జ్ఞానమునకంటె కర్మఫలము మిక్కిలి అల్పమైనదని భావము.)

(శంకరభాష్యము) బ్రహ్మార్పణం - అని మొదలుపెట్టు శ్లోకముచేత బ్రహ్మజ్ఞానము, సమ్యగ్దర్శనము అనునదే ఒక యజ్ఞముగ జెప్పబడినది. దానిపిదప పలుయజ్ఞములు ఉపదేశింపబడినవి. ఒకడు కోరిన పురుషార్థములను బడయుటకు సాధనమైన ఆ మిగిలిన యజ్ఞములకంటె జ్ఞానము శ్రేష్ఠమైనదని భగవంతుడు పొగడుచున్నాడు. ద్రవ్యములైన సాధనములచేత సాధింపబడు యజ్ఞమే ఫలమిచ్చునది. జ్ఞానమను యజ్ఞము అట్టిఫలమును కలుగజేయనిది. కావున ఇది మేలైనది. ఎట్లనగా — ముక్తికి సాధనమైన జ్ఞానమున సకలకర్మయు అంతర్భవించియున్నది. ఇమిడియున్నదని భావము. కావున జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. దీనిని "యథాకృతాయ విజితాయాధరేయాః"

అను(శ్రుతిచే ఎరుంగుడు, (ఈ ఛాందోగ్యోపనిషత్తు వాక్యము దాని తాత్పర్యము మునుపు 2 వ అధ్యాయము 46 వ శ్లోకము క్రిందచెప్పబడియుండుటను జూడుడు).

(రామానుజులు) ద్రవ్యము మొదలగువాటివలన చేయబడు (కర్మమను) యజ్ఞములో జ్ఞానమిమిడియున్నది. ఎట్లనగా యజ్ఞరూపమైన ఒక్కొక్క కర్మలోను ఒకభాగము కర్మగను, మరియొకభాగము జ్ఞానముగను నున్నది. కర్మభాగముకన్న జ్ఞానభాగము శ్రేష్ఠమైనది. ఓ అర్జునా! సకలకర్మయు అఖిలం = ఆ కర్మకు ఉపయోగమైన సకలవస్తువులున్ను జ్ఞానమున ముగింపు పొందును. అనగా ఇట్లు కర్మముచేయుచుండినచో ఆ కర్మయే జ్ఞానాకారమగునని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) అఖిలం = సర్వం, కర్మ = పూర్ణముగ (కొరతలేక) చేయబడుకర్మ, జ్ఞానము ఫలముగ గలదగును.



శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ 34

పద॥ తత్ - విద్ధి - ప్రణిపాతేన - పరిప్రశ్నేన - సేవయా ।
ఉపదేక్ష్యన్తి - తే - జ్ఞానం - జ్ఞానినః - తత్త్వదర్శినః ॥

| | | | |
|---|---|---|---|
| తత్ | దానిని (అజ్ఞానమును) | తత్త్వదర్శినః | తత్త్వము నెరింగిన |
| ప్రణిపాతేన | సాష్టాంగ నమస్కారముచేతను | జ్ఞానినః | బ్రహ్మజ్ఞానులు |
| పరిప్రశ్నేన | బాగుగ అడుగుటచేతను | తే | నీకు |
| సేవయా | (గురువునకు)శుశ్రూషజేయుటచేతను | జ్ఞానం | జ్ఞానమును |
| విద్ధి | తెలిసికొనుము | ఉపదేక్ష్యన్తి | ఉపదేశింపగలరు. |

తా॥ మునుపు చెప్పిన ఆ జ్ఞానమును సాష్టాంగ నమస్కారము చేయుటవలనను, (బంధము మోక్షము మొదలగు వాటినిగూర్చి) బాగుగ విమర్శించి యడుగుటచేతను, ఆచార్యునకు శుశ్రూష చేయుటచేతను, నీవు తెలిసికొనుము. తత్త్వమెరింగిన అనగా వాస్తవము నెరింగిన జ్ఞానులు ఆ శ్రేష్ఠమైన జ్ఞానమును నీకుపదేశింపగలరు.

(శంకరభాష్యము) మునుపుచెప్పిన యీ శ్రేష్ఠమైన జ్ఞానము ఎట్లు లభించునో ఆ మార్గమును భగవంతుడు ఉపదేశించుచున్నాడు. జ్ఞానమునెట్లు సంపాదించవలెనని తెలిసికొనుము. ఆచార్యునివద్దకుపోయి బాగుగ క్రిందపడి నమస్కరించుటయను దీర్ఘమైన నమస్కారముచేయుటవలనను, "ఈ సంసారబంధమెట్లు వచ్చినది? దీనినుండి విముక్తిచెందుటయెట్లు? విద్యయనగానేమి? అవిద్యయనగానేమి? యను నీ విధముగ వారిని అడుగుటవలనను, ఆచార్యునకు శుశ్రూషచేయుటవలనను, మరి యిటువంటివాటివలనను, నీవు జ్ఞానమును పొందెదవు.

భక్తిశ్రద్ధలుగలిగిన వినయవిధేయతలను సేవవలన హృదయమున దయాప్రవాహము బయలుదేరిన జ్ఞానులైన ఆ యాచార్యులు మునుపే పొగడిచెప్పియున్న జ్ఞానమును నీ కుపదేశించి యనుగ్రహింతురు. జ్ఞానవంతులయినను తత్త్వమును ఉన్నటుల కనుగొని అనుభవించువారు మిక్కిలి

స్వల్పసంఖ్యాకులు. మిగతవారట్లుగారు. కావుననే "తత్త్వదర్శినః = వాస్తవమునుచూచి యెరింగిన జ్ఞానులు''అను విశేషణము చేర్చబడియున్నది. ఎవ్వరు తత్త్వము నెరింగి స్వానుభవముతోగూడిన జ్ఞానులగుదురో వారలుపదేశించు జ్ఞానమే మోక్షసిద్ధి నిచ్చుసాధనమగును. ఇతరములుకావని భగవంతుని యభిప్రాయము.

(రామానుజులు) ''అవినాశితుతద్విద్ధి" (అధ్యా - 2 - శ్లో - 17) మొదలు "ఏషాతేఽభిహితా సాంఖ్యే' (అధ్యా 2. శ్లో - 39) వరకు గల శ్లోకములచేత ఆత్మ విషయమును నీకు జెప్పియున్నాను. ఇప్పుడు నేను చెప్పియున్న విధముగ కర్మయోగమును నీవనుష్ఠించుచున్నచో కర్మయోగము యొక్క సిద్ధిగలుగును. అట్లు కర్మయోగసిద్ధి నీకు గలిగినప్పుడు పెద్దలనుపొంది సేవ చేసినచో వారలు నీకు జ్ఞానము నుపదేశింపగలరని భావము.

(రాఘవేంద్రులు) "నత్వేవాహం జాతునాసం" (అధ్యా 2. శ్లో - 12). మొదలగు శ్లోకములచేత ఆత్మజ్ఞానము సంగ్రహముగ జెప్పబడినది. ''జ్ఞానం తేహం సవిజ్ఞానం'' (అధ్యా 7 శ్లో-2) మొదలగు శ్లోకములచేత అయాత్మజ్ఞానము ఇక ఉపదేశింపబడుచున్నది, అర్జునునకు జ్ఞానోపదేశము చేయుటకొఱకే ఈ గీత ఆరంభింపబడినందున, ఉపదేక్ష్యన్తి = ఉపదేశింపగలరు. అనగా మేము (భగవంతుడు) ఉపదేశించుచున్నామని తాత్పర్యము.

(స్వకీయము) బ్రహ్మజ్ఞానము గురూపదేశమువలన పొందవలసినదనియు, జ్ఞానోపదేశము బడయగోరువాడు ఉపదేశించు గురువునకు సేవ, వందనము మొదలగునవి చేయవలెననియు బ్రహ్మజ్ఞానోపదేశము చేయుటకు బ్రహ్మజ్ఞానులే తగినవారలనియు భగవంతుడు ప్రకటింపజేసినదిగను జెప్పవచ్చును.



శ్లో॥ యద్ జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి॥　　35

పద॥ యత్ - జ్ఞాత్వా - న - పునః - మోహం - ఏవం - యాస్యసి - పాండవ!
యేన - భూతాని - అశేషేణ - ద్రక్ష్యసి - ఆత్మని - అథో - మయి॥

| | | | |
|---|---|---|---|
| హే పాండవ! | ఓ పాండవా! | భూతాని అశేషేణ | ప్రాణులన్నిటిని |
| త్వం | నీవు | ఆత్మని | నీయెడను |
| యత్ | దేనిని (ఏ జ్ఞానమును) | అథో | ఆ విధముగనే |
| జ్ఞాత్వా | తెలిసికొనినయెడల | మయి | నాయెడను |
| పునః | మరల | ద్రక్ష్యసి | చూడగలవో |
| ఏవం మోహం | ఇట్టి మోహమును | తత్ | దానిని (ఆ జ్ఞానమును) |
| న యాస్యసి | పొందవో | ఉపదేక్ష్యన్తి | ఉపదేశింతురు |
| యేన | దేనిచేత (ఏ జ్ఞానముచేత) | | |

తా॥ ఓ పాండవా! తత్త్వదర్శులుపదేశించుజ్ఞానమును పొందుటవలన నీవు మరల నీ విధమైనమోహమును పొందవు. ప్రాణులన్నిటిని నీయెడను అట్లే పరమేశ్వరుడను వాసుదేవుడను ఐన నాయెడను అజ్ఞానముచేత వేరుగా చూడగలవు.

(శంకరభాష్యము) "తథా చ సతి ఇదమపి సమర్థం వచనం" ఆ విధముగ నున్నప్పుడే యీ శ్లోకమున జెప్పుమాటయు తగియుండును.

తత్త్వదర్శులుపదేశించిన జ్ఞానమును పొందినచో నీ విప్పుడు మోహమొంది యున్నటుల మరల మోహమొందవు. (నీ మోహము నివర్తించును.) మరియు బ్రహ్మమొదలు తృణమువరకుగల ప్రాణులనన్నిటిని "మత్స్థం స్థాని ఇమాని" ఇవి నాయెడనున్నవి అని నీయెడను, "పరమేశ్వరేచ ఇమాని'' ఇవి పరమేశ్వరునియెడనున్నవని వాసుదేవుడనైన నా యెడను, ఆ జ్ఞానముచేత సాక్షాత్తుగ (నేరుగ) చూడగలవు. ఉపనిషత్తులన్నిటిలోను మిక్కిలి స్పష్టముగ బోధింపబడిన జీవేశ్వరైక్యమును (జీవులు ఈశ్వరుడు ఒక్కటే యనుదానిని) కనుగొని యెరుంగుమని భావము.

(శ్రీధరులు) భూతములన్నిటిని నీయెడ అభేదముగజూచి పిదప నిన్నును నా యెడ అభేదముగ చూడగలవని తాత్పర్యము.

(రామానుజులు) ఏ జ్ఞానమును పొందిన దేహాదులలో ఆత్మాభిమానము, వాటిలోగలిగిన మమత మొదలగునవియను మోహమొందవో, యే జ్ఞానమునొందిన దేవమనుష్యమృగాది రూపముతో నున్న భూతములన్నిటిని నీ యెడచూచెదవో, నా వలన ప్రకృతినుండి విముక్తిచెందిన జీవాత్మ స్వరూపములన్నియు ఒకే విధముగ నీయాత్మస్వరూపమువలె జ్ఞానాకార స్వరూపమని చూచెదవో యని తాత్పర్యము. ఈయర్థము ''నిర్దోషంహి సమం బ్రహ్మతస్మాద్బ్రహ్మణితేస్థితాః''(అధ్యా5-శ్లో19) అనుచోట చెప్పబడియున్నది. ఆవిధముగనే నా యెడ ప్రాణులన్నిటిని చూచెదవో నాచే ప్రకృతి విముక్తమైన సకల జీవస్వరూపమును నా స్వరూపమునకు సమమని చూచెదవోయని తాత్పర్యము. ఈ యర్థము ''ఇదంజ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః'' (అధ్యా 14-శ్లో-2-) అను చోటను "తదా విద్వాన్ పుణ్యపాపేవిధూయ నిరంజనః పరమం సామ్యముపైతి'' అనుశ్రుతివాక్యము నందును చెప్పబడియున్నది. ఇట్టి వాక్యములచేత జీవాత్మ స్వరూపములన్నియు ఒకదానితో నొకటి సమానమైనవనియు, ఆ విధముగనే సకలజీవాత్మ స్వరూపములున్ను పరమాత్మ స్వరూపముతో సమమైనవనియు చూచెదవని తాత్పర్యము.

(మధ్వులు) నీవు జ్ఞానమొందిన సకలభూతములను నాయెడను, నీయెడ నన్నును చూడ గలవని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) నీవు జ్ఞానమొందిన, ఆత్మని = అంతర్యామిగనున్న, మయి=నాయెడ, లేక, ఆత్మని = సర్వవ్యాపకమైన, మయి = నా యెడ సకల ప్రపంచమునున్నదిగ చూడగలవని తాత్పర్యము.

(స్వకీయము) ఈ శ్లోకమును మునుపటి 34-వ శ్లో-ను జేర్చి క్రిందకనుబరచినటుల కొందరు అన్వయము చేసియున్నారు:—

హేపాండవ = ఓపాండవా! తత్త్వదర్శినః = (ఆత్మ) తత్త్వమునెరింగిన = జ్ఞానినః= బ్రహ్మజ్ఞానులు-యత్‌జ్ఞానం = ఏబ్రహ్మజ్ఞానమును - తే = నీకు - ఉపదేక్ష్యన్తి = ఉపదేశింపగలరో (యత్) జ్ఞాత్వా = ఏ జ్ఞానమును పొంది, పునః= మరల, ఏవంమోహం= ఈ విధమైన మోహమును, నయాస్యసి = పొందవో, యేన = దేనిచేత (ఏజ్ఞానముచేత) భూతాని అశేషేణ = ప్రాణులన్నిటిని ఆత్మని = నీయెడను, అథో=ఆవిధముగనే, మయి (చ) = నాయెడను, ద్రక్ష్యసి = చూడగలవో, తత్=ఆజ్ఞానమును, ప్రణిపాతేన=సాష్టాంగనమస్కారముచేతను, పరిప్రశ్నేన = బాగుగ అడుగుట చేతను, సేవయా = గురువందనముచేతను, విద్ధి = తెలిసికొనుము.

అయితే 33 వ శ్లో - న "కర్మలన్నియు జ్ఞానమునందిమిడియున్నవని జ్ఞానముయొక్క శ్రేష్ఠతను భగవంతుడు చెప్పి 34 వ శ్లో-న ఆశ్రేష్ఠమైన జ్ఞానమును పొందుటకు మార్గమునున్ను, 35 వ శ్లో-న జ్ఞానమును తత్త్వదర్శులచే ఉపదేశింపబడసినచో దానివలన లభించు ఫలము

జీవేశ్వరైక్యసాక్షాత్కారమనియు నుపదేశించు నటుల తాత్పర్యమగునట్లు అన్వయము జేయుట శ్లాఘ్యముగను తగియునున్నదిగను తోచుచున్నది. కావుననే 'యద్జ్ఞాత్వా' అని మొదలు పెట్టుచున్న ఈ 35వ-శ్లో- వేరుగ అన్వయపరచి ''తత్-ఉపదేక్ష్యన్తి" అనిచేర్చి ముగింపబడియున్నది.

శ్లో॥ అపిచేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ 36

పద॥ అపి - చేత్ - అసి - పాపేభ్యః - సర్వేభ్యః - పాపకృత్తమః ।
సర్వం - జ్ఞానప్లవేన - ఏవ - - వృజినం - సంతరిష్యసి ॥

| | | | |
|---|---|---|---|
| త్వం | నీవు | జ్ఞానప్లవేనైవ | జ్ఞానమను తెప్పచేతనే |
| సర్వేభ్యః పాపేభ్యః | పాపులందరికన్నను | సర్వం వృజినం | పాపములన్నిటిని (సకలపాపములనే సముద్రమును) |
| పాపకృత్తమః అపి చేదసి | మిక్కిలి పాపము జేసినవాడవు గనున్నను | సంతరిష్యసి | దాటెదవు |

తా॥ (మునుపుచెప్పిన విధముగ జ్ఞానమొందినచో) పాపము లన్నిటిని చేసియున్న పాపులకన్న నీవు మిక్కిలి పాపము జేసియున్నను ఆ పాపములనెడి సముద్రమును జ్ఞానమను తెప్పచేతనే దాటెదవు.

(స్వకీయము) మునుపు చెప్పిన జ్ఞానముయొక్క మాహాత్మ్యమును ఈ శ్లోకమున భగవంతుడు చెప్పుచున్నాడు. పాపముల నన్నిటిని అనినందున పుణ్యముగూడ వాటిలో జేరినదని గ్రహింపవలెను. ఏలనగా జననమరణరూపమగు సంసారమునుండి విముక్తి చెందగోరువానికి పుణ్యమున్ను పాపమువంటిదే. "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి" అనిరాబోవు 9వ అధ్యాయము 21వ శ్లో-న జెప్పియున్నట్లు పుణ్యముచేసినవాడును వానిపుణ్యమునశించినపిదప స్వర్గలోకానుభవములునశించి మరల మనుష్యలోకమును పొందుచున్నాడు. "జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం = కర్మబంధము జ్ఞానమనునగ్నిచే దహింపబడుచున్నది" అని (అధ్యా 4-శ్లో 19లో) జెప్పబడి యుండుటను ఈశ్లోకముతోపోల్చి చూడుడు - ఈ అర్థము పైశ్లోకమునందును చెప్పబడుచున్నది.



శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37

పద॥ యథా - ఏధాంసి - సమిద్ధః - అగ్నిః - భస్మసాత్ - కురుతే - అర్జున ।
జ్ఞానాగ్నిః - సర్వకర్మాణి - భస్మసాత్ - కురుతే - తథా ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున ! | ఓ అర్జునా ! | తథా | ఆ విధముగనే |
| సమిద్ధః అగ్నిః | బాగుగజ్వలించుచున్న అగ్ని | జ్ఞానాగ్నిః | జ్ఞానమను అగ్ని |
| ఏధాంసి | కట్టెలను | సర్వకర్మాణి | కర్మలన్నిటిని |
| యథా | ఏ విధముగ | భస్మసాత్కురుతే | భస్మముగ జేయుచున్నది |
| భస్మసాత్కురుతే | భస్మముగ జేయుచున్నదో | | (నశింపజేయుచున్నది.) |

తా॥ ఓ అర్జునా! బాగుగ జ్వలించుచున్న అగ్ని (దానినాశ్రయించియున్న) కట్టెలను ఎట్లు దహించి భస్మముగ జేయునో (అనగా కట్టెలరూపము తెలియకుండ నశింపజేయునో) ఆ విధముగనే జ్ఞానమను నగ్ని కర్మలనన్నిటిని (వాటిఫలముతో) నశింపజేయును.

(శంకరభాష్యము) జ్ఞానము పాపమును ఎట్లుపోగొట్టుచున్నదనుదానికి ఈ శ్లో-న దృష్టాంతము చెప్పబడుచున్నది. బాగుగ జ్వలించుచున్నఅగ్ని కట్టెలను భస్మము చేయుటవలె జ్ఞానమను నగ్నికర్మలనన్నిటిని భస్మపరచుచున్నది. అనగా విత్తనముకాజాలనట్లును, మొలచు శక్తి పోవునట్లును జేయుచున్నది. ఫలములేనిదిగ జేయుచున్నదనిభావము. కట్టెలను అగ్నినేరుగ భస్మముజేయుటవలె జ్ఞానమను నగ్ని కర్మలను వాస్తవమున నేరుగ భస్మముజేయనేరదుగదా?

కావున కర్మలన్నియు ఫలమునివ్వక విత్తనముగాకపోవుటకు యథార్థజ్ఞానము కారణమని భావము. ఏ కర్మవలన ఈ శరీరమువచ్చెనో ఆ ప్రారబ్ధమను కర్మ తనఫలము నివ్వనారంభించినందున అది యనుభవించిననే ముగియుచున్నదనుదానిని యుక్తిచే కనుగొనుడు. అయినను తమతమఫలమునివ్వ మొదలుపెట్టని కర్మలుఏవియో వాటినన్నిటిని జ్ఞానమను నగ్నిభస్మముజేయుచున్నది. జ్ఞానము గలుగుటకు మునుపుచేయబడినవియు, జ్ఞానముతో కలిగినవియు, గడచిన అనేకజన్మములలో సంపాదింపబడినవియునైన కర్మలనుమాత్రము జ్ఞానము భస్మముచేయునేగాని ప్రారబ్ధమునుగాదు. ప్రారబ్ధము అనుభవించియే తీరవలెనని తాత్పర్యము.

(స్వకీయము) 'సర్వకర్మాణి' అనుదానికి శంకరులు, శ్రీధరులు, రాఘవేంద్రులు, వీరలు ప్రారబ్ధకర్మము తప్ప ఇతర సకలకర్మలననియు, రామానుజుల అనాదిగననుసరించి వచ్చియున్న కర్మల అనేక సముదాయములననియు అర్థముజేసియున్నారు. ఏలనగా ప్రారబ్ధము అనుభవము చేత నశింపవలయునేగాని జ్ఞానముచే నశింపనేరదు.



శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥ 38

పద॥ న - హి - జ్ఞానేన - సదృశం - పవిత్రం - ఇహ - విద్యతే।
తత్ - స్వయం - యోగసంసిద్ధః - కాలేన - ఆత్మని - విందతి

| | | | |
|---|---|---|---|
| ఇహ | ఈ లోకమున | యోగసంసిద్ధః | యోగసిద్ధిని పొందినవాడు |
| జ్ఞానేన | జ్ఞానముతో | కాలేన | కాలక్రమమున |
| సదృశం | సమానమై | స్వయం | తానుగనే |
| పవిత్రం | పరిశుద్ధిచేయునది | ఆత్మని | తనయెడ |
| న హి విద్యతే | లేనేలేదు | విందతి | పొందుచున్నాడు. |
| తత్ | ఆ జ్ఞానమును | | |

తా॥ ఈ లోకమున జ్ఞానముతో సమానమైన పరిశుద్ధిజేయగలది వేరొకటి లేదు. యోగసిద్ధిని పొందినవాడు కాలక్రమమున ఆ జ్ఞానమును తానుగనే తనయెడ పొందుచున్నాడు. అనగా ఆ జ్ఞానమును, తనయాత్మయెడ చూచుచున్నాడు.

(స్వకీయము) శ్రీధరులు "ఆత్మనితత్ = ఆత్మస్వరూపజ్ఞానమును" అని అర్థము చేసియున్నారు. ఒకనిని పరిశుద్ధపరచు విషయమున జ్ఞానమునకు సమముగ వ్యవహారదశలో వేరొక్కటియులేదు. సంసారమునుండి విముక్తిచెందగోరువాడు కర్మయోగము చేతను, సమాధి యోగముచేతను జ్ఞానమొందుటకు తగినవాడై బహుకాలమునకు పిదప జ్ఞానమును తానుగనే తన యెడ పొందుచున్నాడు. జ్ఞానమతనికి తనకుతానే ఉదయించునని తాత్పర్యము.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి ॥ 39

పద॥ శ్రద్ధావాన్ - లభతే - జ్ఞానం - తత్పరః - సంయతేంద్రియః ।
జ్ఞానం - లబ్ధ్వా - పరాం - శాంతిం - అచిరేణ - అధిగచ్ఛతి ॥

| | | | |
|---|---|---|---|
| శ్రద్ధావాన్ | శ్రద్ధగలవాడుగను | లభతే | పొందుచున్నాడు |
| తత్పరః | జ్ఞానముసంపాదించుటయందే కావలసిన సాధనములలో ప్రయత్నము గలవాడుగను | జ్ఞా | జ్ఞానమును |
| | | లబ్ధ్వా | పొందినపిదప |
| | | పరాంశాంతిం | ఉత్తమమైన శాంతిని |
| సంయతేంద్రియః | ఇంద్రియములను అణచిన వాడుగను ఉన్నవాడు | అచిరేణ | శీఘ్రముగ |
| | | అధిగచ్ఛతి | పొందుచున్నాడు. |
| జ్ఞానం | బ్రహ్మజ్ఞానమును | | |

తా॥ గురువాక్యము, శాస్త్రము, వీటిలో నమ్మకమును, జ్ఞానము సంపాదించుటలోనే ప్రయత్నమునుగలవాడై ఇంద్రియములను అణచియున్నవాడు జ్ఞానమును పొంది పిదప శీఘ్రముగ శాంతిని మోక్షమును పొందుచున్నాడు.

(శంకరభాష్యము) జ్ఞానమును బడయుట దేనివలన నిశ్చయముగ చేకూరునో ఆ యంతరంగమైన మార్గమును భగవంతుడు దీనిలో నుపదేశించుచున్నాడు. వేదము మొదలగువాటిలో శ్రద్ధ, అనగా నమ్మకము, గలవాడు. జ్ఞానమును పొందుచున్నాడు. నమ్మకము గలిగియున్నను ఒకడు జ్ఞానసాధనమున బోవుటకు మందుడై (తలంపులేనివాడై) ఉన్నాడు. కావున "జ్ఞానమొందుటకు సాధనములైన గురు నమస్కారము మొదలగు వాటిలో ఉత్సాహముకలవాడై యుండవలెన"నుచున్నాడు గురువుయొక్క ఉపదేశమున నమ్మకమును, వారిని నమస్కరించుట మొదలగువాటిలో నుత్సాహమును గలవాడై ఇంద్రియములను బాగుగ నణచియుండువాడెవ్వడో అతడవశ్యముగ జ్ఞానమును పొందుచున్నాడు. బహిరంగ సాధనమైన సాష్టాంగనమస్కారము మొదలగునవి ఫలమివ్వకయుండ వచ్చును. ఏలనగా మనస్సునందొక్కటియు వెలుపల నొక్కటియు చూపించువారును గలరు. కావున అట్టి మాయస్వభావము మొదలగు వాటివలన ఫలము సిద్ధింపనేరదు. అయినను అట్టి మోసము 'నమ్మకము గలిగియుండుట' మొదలగువాటిలో సంభవింపదు. కావుననే యీ నమ్మకము గలిగియుండుట మొదలగునవి జ్ఞానమును బొందుటకు నిశ్చయమైన మార్గము. ఈ జ్ఞానమును పొందుటవలన కాగలదేమనిన, అట్లు జ్ఞానమును పొందినపిదప మోక్షమనబడు శ్రేష్ఠమైన విశ్రాంతిని అలస్యము లేక మిక్కిలి శీఘ్రముగనే పొందును. యథార్థజ్ఞానముచేత శీఘ్రముగనే మోక్షము పొందుట యనునది సకలశాస్త్రములచేతను యుక్తిచేతను నిరూపించి బాగుగ నిర్ణయింపబడిన విషయము.

(రాఘవేంద్రులు) 'శ్రద్ధావాన్' అనగా ఆస్తిక్యబుద్ధిగలవాడు. 'తత్పరః' అనగా భగవంతునియెడ నిష్ఠగలవాడు.

(స్వకీయము) ఈశ్లోకమును గర్గసంహితమాధుర్యఖండము మొదటి అధ్యాయము 50 శ్లోకమున జూడుడు.

ఈశ్లోకము యొక్కయు, దీనికి మునుపటి రెండు శ్లోకముల యొక్కయు అర్థమును వివరించుచున్న శివపురాణము వాయుసంహిత అధ్యాయము 29లో గల క్రిందకనబరచిన శ్లోకములను జూడుడు.

"నాస్తి ధ్యానం వినా జ్ఞానం నాస్తి ధ్యానమయోగినః ।
ధ్యానం జ్ఞానంచ యస్యాస్తి తీర్ణస్తేన భవార్ణవః ॥
జ్ఞానం ప్రసన్నమేకాగ్రమశేషోపాధివర్జితం ।
యోగాభ్యాసేన యుక్తస్య యోగిన స్త్వవసిధ్యతి ॥
ప్రక్షీణాశేషపాపానాం జ్ఞానేధ్యానే భవేన్మతిః ।
పాపోపహతబుద్ధీనాం తద్వార్తాపి సుదుర్లభా ॥
యథావహ్నిర్మహాదీప్తః శుష్కమార్ద్రంచ నిర్దహేత్ ।
తథా శుభాశుభంకర్మ జ్ఞానాగ్నిర్దహతే క్షణాత్ ॥
అత్యల్పోపి యథా దీపస్సుమహన్నాశయేత్తమః ।
యోగాభ్యాస స్తథాల్పోపి మహాపాపం వినాశయేత్ ॥
ధ్యాయతః క్షణమాత్రంవా శ్రద్ధయా పరమేశ్వరం ।
యద్భవేత్సుమహచ్ఛ్రేయ స్తస్యాంతో నైవ విద్యతే ॥
నాస్తి ధ్యానసమం తీర్థం నాస్తి ధ్యానసమం తపః ।
నాస్తి ధ్యానసమో యజ్ఞః తస్మాద్ధ్యానం సమాచరేత్ ॥

ధ్యానములేక జ్ఞానముండదు. యోగములేనివానికి ధ్యానములేదు. ఎవ్వనికి ధ్యానము జ్ఞానముగలవో అతడు సంసారమను సముద్రమును దాటుచున్నాడు. యోగాభ్యాసమునందున్న యోగికి శుద్ధమైనదియు, ఒకేనిలకడయందున్నదియు, ఉపాధిలేనిదియు, నైనజ్ఞానము సిద్ధించుచున్నది. పాపమంతయు నశించినవారలకు జ్ఞానమునందును, ధ్యానమునందును బుద్ధిగలుగుచున్నది. పాపముచే కొట్టబడిన బుద్ధిగలవారలకు ఆ (జ్ఞానధ్యానముల) మాటగూడ అతిదుర్లభమైనది. మండుచున్నఅగ్ని యెట్లు ఎండిన కట్టెలను దహించునో ఆవిధముగనే జ్ఞానమనునగ్ని శుభా శుభ కర్మలను క్షణకాలములో దహించుచున్నది. దీపము మిక్కిలిచిన్నదైనను గొప్పఅంధకారమును ఎట్లునశింపజేయునో ఆవిధముగనే యోగాభ్యాసము స్వల్పముగజేసియున్నను అదిగొప్పదైన పాపమును నశింపజేయును. శ్రద్ధతోభగవంతుని పరమేశ్వరుని క్షణకాలమైనను ధ్యానించువానికి అధికమైన యేశ్రేయస్సు కలుగునో దానికి ముగింపేలేదు. (గంగమొదలగు) తీర్థముగాని, తపస్సుగాని, యజ్ఞముగాని ధ్యానమునకు సమానము కానేరదు. కావున ధ్యానము చేయవలెను.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥ 40

పద॥ అజ్ఞః - చ - అశ్రద్దధానః - చ - సంశయాత్మా - వినశ్యతి (1) ।
న - అయం - లోకః - అస్తి - న - పరః - న - సుఖం - సంశయాత్మనః ॥

| | | | |
|---|---|---|---|
| అజ్ఞః | అజ్ఞానియు (ఆత్మను నెరుంగనివాడు) | సంశయాత్మనః | సందేహముగల మనస్సుగల వానికి |
| అశ్రద్దధానశ్చ | (గురువాక్యమునందును, శాస్త్రమునందును) నమ్మకము లేనివాడును | అయంలోకః | ఈ లోకమున్ను |
| | | నాస్తి | లేదు |
| | | పరశ్చ | పరలోకమును |
| సంశయాత్మా చ | సందేహము గల మనస్సు గలవాడును | న | లేదు |
| | | సుఖం | సుఖమున్ను |
| వినశ్యతి | చెడిపోవును | న | లేదు. |

తా॥ ఆత్మను ఎరుంగని అజ్ఞానియు, గురు వాక్యమునందును శాస్త్రము నందును నమ్మకములేనివాడును, దానివలన కోరినఫలముగలుగునో కలుగదో యని సంశయముగలవాడును చెడిపోవుచున్నాడు. సందేహముగల మనస్సు గలవానికి ఈ లోకమునందుగాని స్వర్గాదిలోకములయందుగాని ప్రయోజనము లేదు. సుఖములేదు.

(1) వినశ్యతి = నరకమును పొందును - (రాఘవేంద్రులు)

(శంకరులు) ఈ (మునుపుచెప్పిన) విషయమున సంశయము గలుగగూడదు. ఏలనగా సంశయమనునది మిక్కిలి గొప్పపాపము. అది యెట్లోవినుము. అజ్ఞాని అనగా ఆత్మజ్ఞానములేని వాడును గురువాక్యమునందును శాస్త్రమునందును నమ్మకములేనివాడును చెడిపోవుచున్నారు. అయితే సందేహముగల మనస్సుగలవాడు ఎట్లు చెడిపోవునో అట్లువీరలు చెడిపోవుటలేదు. సంశయ ముగలవాడే అందరికన్న మిక్కిలి గొప్పపాపి. ఎట్లనగా అతనికి సాధారణమైన యీ లోకములేదనిన యీ లోకప్రయోజనములేదు. అటులనే పరలోకములేదు సందేహమనస్సుగలవానికి ఇహము పరము రెండును సందిగ్ధముగనే యుండుటవలన సుఖములేదు. కావున సంశయింపగూడదు.



శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞాన సంఛిన్నసంశయమ్।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ॥ 41

పద॥ యోగసన్న్యస్త కర్మాణం (1) - జ్ఞానసంఛిన్నసంశయమ్ (2)।
ఆత్మవన్తం (3) - న - కర్మాణి - నిబధ్నన్తి - ధనంజయ ॥

| | | | |
|---|---|---|---|
| హే ధనంజయ! | ఓ ధనంజయుడా! | ఆత్మవన్తం | ఆత్మజ్ఞానమున జాగ్రత్తగల వాడుగను ఉన్నవానిని |
| యోగసన్న్యస్త కర్మాణం | యోగముచే కర్మలను వదలిన వాడుగను | కర్మాణి | కర్మలు |
| జ్ఞానసంఛిన్నసంశయు | జ్ఞానముచే సంశయము నివర్తించిన వాడుగను | న నిబధ్నన్తి | కట్టుపరచుటలేదు. |

తా॥ ఓ ధనంజయ! యోగముచే కర్మలను వదలినవాడుగను, జ్ఞానముచే సంశయము నివర్తించినవాడుగను, ఆత్మజ్ఞానమున జాగ్రత్తగలవాడుగనున్నవానిని కర్మలు కట్టుపరచుట లేదు.

(1) యోగసన్న్యస్తకర్మాణం - జ్ఞానయోగముచేత సకలకర్మలును విడచిన వాడుగను (శంకరులు). జ్ఞానాకారమైన కర్మనుగలవాడై (రామానుజులు). ఫలాపేక్షను విడచి ఈశ్వరార్పణబుద్ధిగ చేయునట్టి కర్మయోగిగను (శ్రీధరులు).

(2) జ్ఞానసంఛిన్నసంశయం - బ్రహ్మజ్ఞానముచేత సంశయములన్నిటిని పోగొట్టుకొన్న వాడుగను (శ్రీధరులు). గురువుచే నుపదేశింపబడిన జ్ఞానముచేత ఆత్మయెడ సంశయములన్నిటిని పోగొట్టుకొనినవాడుగను (రామానుజులు).

(3) ఆత్మవన్తం - ఉపదేశింపబడిన అర్థమున దృఢమైన మనస్సుగలవాడుగను (రామానుజులు), పరమాత్మభక్తుడుగను (రాఘవేంద్రులు). తప్పుచేయనివానిని (శ్రీధరులు).

(శంకరులు) పరవస్తువును చూచువాడు ఆపరవస్తువును చూచుటయను యోగముచేత ధర్మాధర్మమనబడు కర్మలను త్యజించి నిలబడుట యెట్లనుదానిని జెప్పుచున్నాడు. (అతడు) తన్ను ఈశ్వరుని ఒకటిగ చూచుటయను జ్ఞానముచేత సంశయము నశింపబడసినవాడు. ధనంజయ! ఎవ్వడిట్లు యోగముచే కర్మలను త్యజించునో అట్టి సావధానుడైన జ్ఞానిని గుణత్రయముల వ్యాపారములుగ కనబడుకర్మలు కట్టుబరచుటలేదు. అహితముమొదలగు ఫలమును కలుగజేయుటలేదనుడు.



శ్లో॥ తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత॥ 42

పద॥ తస్మాత్ - అజ్ఞానసంభూతం - హృత్స్థం - జ్ఞానాసినా - ఆత్మనః।
ఛిత్త్వా - ఏనం - సంశయం - యోగం - ఆతిష్ఠ - ఉత్తిష్ఠ - భారత

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | అందువలన | ఛిత్త్వా | నరికి |
| త్వం | నీవు | యోగం | (జ్ఞానయోగసాధనమైన కర్మ) యోగమును |
| అజ్ఞానసంభూతం | అజ్ఞానమువలన గలిగినదై | | |
| హృత్స్థం | బుద్ధిలో నిలకడ చెందియున్న | ఆతిష్ఠ | అనుష్ఠింపుము |
| ఆత్మానం | ఆత్మనుగూర్చిన | హే భారత! | ఓ భరతవంశమున బుట్టినవాడా! |
| ఏనం సంశయం | ఈ సందేహమును | ఉత్తిష్ఠ | (యుద్ధమునకై) లెమ్ము. |
| జ్ఞానాసినా | జ్ఞానము అను కత్తిచేత | | |

తా॥ కావున నీవు అవివేకమువలన గలిగినదై బుద్ధిలో నిలకడచెందియున్న ఆత్మనుగూర్చిన యీ సందేహమును జ్ఞానమను కత్తిచే నశింపజేసి తత్త్వజ్ఞానమునకు సాధనమైన కర్మయోగమును గైకొనుము (చేయుము). ఓ భారత! యుద్ధమునకై లెమ్ము.

(శంకరులు) కర్మయోగానుష్ఠానముచేత చిత్తశుద్ధి గలిగి, దానిమూలముగ జ్ఞానమును పొంది, ఆ జ్ఞానముచేత సంశయమును పోగొట్టుకొనినవాడుగనున్నవానిని కర్మలు బంధపరచుట లేదు. ఏలనగా జ్ఞానమను నగ్నిచే కర్మలన్నియు దహింపబడుటవలననే యనుడు. మరియు జ్ఞాన కర్మలను అనుష్ఠించు విషయమున సందేహముగలవాడు చెడిపోవునను ఈ రెండు కారణముల చేతను నీవుమిక్కిలి క్రూరమైనదియు అవివేకమువలన గలిగినదియు, బుద్ధిలో నిలకడ చెంది యున్నదియు, నీవుచెడుటకు కారణమైనదై, ఆత్మనుగూర్చినదైన నీ యొక్క ఈ సంశయమును, దుఃఖము మోహము మొదలగు అహితములను పోగొట్టగల తత్త్వజ్ఞానమను కత్తిచే కోసి పరమార్థ జ్ఞానమునకు సాధనమైన కర్మానుష్ఠానమునుచేయుము. పోరుచేయలెమ్ము, అని భగవంతుడుపదేశించు చున్నాడు,

సంశయము ఆత్మనుగూర్చినదైనందున "తనయొక్క" సంశయమని ఉంచుకొనవలెను. ఒకని సంశయమును అతడే విడువవలెనుగాని మరియొకడు విడువజాలడు. కావున "తనయొక్క" అను విశేషణమును చేర్చుకొనవలెను. కావున సంశయము ఆత్మనుగూర్చినదైనను తనదే యగును.

(ఆనందగిరి) తాననునది ఆత్మ. ఒకడు సీసమునుజూచి ఇది సీసమా వెండియా అని సందేహింపగా ఆ సందేహము సీసమునుగూర్చినదై వానియెడగలదు. కాని ఇచ్చట ఆ విధముగ గాదు. సంశయము తన్నుగూర్చినదై తనయెడనేగలదు. దీనినితెలియబరచుటకై "తనయొక్క" అను దానిని రప్పించుకొనవలెనని చెప్పబడినది.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగో నామ
చతుర్థోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న
శ్రీకృష్ణార్జున సంవాదమున జ్ఞానయోగమను
నాల్గవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు.

పంచమాధ్యాయ ప్రారంభః.

# ఐదవ అధ్యాయము

## (కర్మసన్న్యాస యోగము)

అర్జున ఉవాచః—

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితం॥ 1

పద॥ సన్న్యాసం - కర్మణాం - కృష్ణ - పునః - యోగం - చ - శంససి।
యత్ - శ్రేయః - ఏతయోః - ఏకం - తత్ - మే - బ్రూహి - సునిశ్చితం॥

| | | | |
|---|---|---|---|
| అర్జున ఉవాచ | అర్జునుడు చెప్పినది. | ఏతయోః | ఈ రెంటిలో |
| హే కృష్ణ! | ఓ కృష్ణా! | యత్ | ఏది |
| కర్మణాం | | శ్రేయః | మిక్కిలి శ్రేష్ఠముగ |
| సన్న్యాసం | విడిచిపెట్టుటనున్ను | సునిశ్చితం | బాగుగ నిశ్చయింపబడియున్నదో |
| పునః | మరల | తత్ ఏకం | ఆ ఒక్కదానినే |
| యోగం చ | కర్మయోగమునున్ను | మే | నాకు |
| శంససి | చెప్పుచున్నావు | బ్రూహి | చెప్పుము. |

తా॥ అర్జునుడు చెప్పినది:— ఓ కృష్ణా! కర్మలను విడిచిపెట్టునట్లును, మరల కర్మయోగమును చేయునట్లును చెప్పుచున్నావు. ఈ రెంటిలో నేది శ్రేష్ఠమైనదిగ బాగుగ నిశ్చయింపబడియున్నదో దానినొకదానినే నాకు చెప్పుము.

(శంకరభాష్యము) "కర్మణ్యకర్మ యః పశ్యేత్" (అధ్యా 4-శ్లో-18) అనునది మొదలు "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం, శారీరం కేవలం కర్మకుర్వన్, యదృచ్ఛాలాభసంతుష్టః, బ్రహ్మార్పణం బ్రహ్మహవిః, కర్మజాన్విద్ధితాన్ సర్వాన్, సర్వం కర్మాఖిలంపార్థ, జ్ఞానాగ్నిః సర్వకర్మాణి, యోగసన్న్యస్తకర్మాణం," (అధ్యా-4-శ్లో-19-21-22-24-32-33-37-41) వరకుగల వచనములచే కర్మలన్నిటిని విడచి పెట్టుటను భగవంతుడు చెప్పెను. "ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠ" (అధ్యా4-శ్లో-42) అనువచనముచేత కర్మానుష్ఠానమైన యోగమునున్ను నీవుచేయవలెనని చెప్పెను. ఇకకర్మలననుష్ఠించుట, కర్మలవిడిచి పెట్టుటయను నివిరెండును, నిలుచుట నడుచుటవలె పరస్పరము విరోధము గలిగినందున వాటినొక్కడు ఒకే కాలమున అనుష్ఠింప వీలుగాదు. మరియు వాటిని వెవ్వేరుకాలముల అనుష్ఠించవచ్చుననియు విధింపబడలేదు. కావున ఈ రెంటిలో దేనినైన నొకదానిని అనుష్ఠింపవలెననునది తాత్పర్య సిద్ధమైనందున "కర్మలను అనుష్ఠించుట, కర్మలను

విడిచిపెట్టుట" యను నీ రెంటిలో నేది శ్రేష్ఠమో దానిని చేయవలెను, ఇతరమునుకాదు, అని ఈ విధముగ అభిప్రాయపడి అర్జునుడు శ్రేష్ఠమైనదానిని తెలిసికొనవలెనను కోరికతో "కృష్ణా"యని యీ శ్లోకమునందడుగుచున్నాడు. ఐతే మునుపు 3-వ అధ్యాయము 1-2 శ్లోకములలో "జ్ఞానము కర్మకన్న శ్రేష్ఠమైనందున కర్మలో నేల ప్రేరేపించుచున్నావు" అనియు "నేను దేనిచే శ్రేయస్సును పొందగలనో దానినొకదానినే చెప్పుము" అనియు అర్జునునిచే అడుగబడిన భగవంతుడు సాంఖ్యులైన సన్న్యాసులకు జ్ఞానయోగముచే నిష్ఠయున్ను యోగులకు కర్మయోగముచే నిష్ఠయున్ను చెప్పబడినవని తీర్మానించెను. మరియు "వట్టిసన్న్యాసముచేత మాత్రము సిద్ధిపొందుటలేదు", (అధ్యా-3శ్లో4) అనువచనముచేత జ్ఞానముతోగూడిన సన్న్యాసమే సిద్ధికిసాధనమని గ్రహింపబడినది. మరియు కర్మయోగమును జేయునట్లు విధించినందున అదియు సిద్ధికి సాధనమని గ్రహింపబడినది.

జ్ఞానములేని సన్న్యాసము గొప్పదా? లేక కర్మయోగముగొప్పదా? అనునీరెంటిలో మేలైన దానినెరుంగగోరి అర్జునుడు అడుగుచున్నాడు. ఇది అజ్ఞానావస్థలో నున్నవానినిగూర్చిన ప్రశ్న. జ్ఞానిని గూర్చినదిగాదు. అజ్ఞానియైనను విషయములలో వైరాగ్యముగలవాడైనచో వాడుగూడ కర్మసన్న్యాసములో నధికారియగును. జ్ఞానికే అధికారమనిలేదు. కావున అజ్ఞానికిగూడ ఒకసమయమున కర్మసన్న్యాసముకలదని యెరుంగుడు.

"శాస్త్రములో జెప్పినపలువిధములైన అనుష్ఠానములను విడచుటను పొగడిచెప్పుచున్నావు. మరలవాటినే యనుష్ఠించుట అవశ్యము చేయదగినదనియు జెప్పుచున్నావు. కావున నేదిమేలైనదని నాసంశయము. కర్మననుష్ఠించుట మేలైనదా? లేకదానిని విడుచుటమేలైనదా యని. ఐతే గొప్పదాని ననుష్ఠింపవలసినందున కర్మసన్న్యాసము కర్మయోగము అనునీరెంటిలో నేది గొప్పదో, దేని ననుష్ఠించుట వలననేను హితమును పొందగలనని నీవుతలంచుచున్నావో అట్టియొకదానినే, అనగా నీ భావము ఇట్టిదేయని తీర్మానించి, నాకు చెప్పవలెను. అవిరెండును ఒకేపురుషుడు ఒకేకాలమున అనుష్ఠింప దగినవిగావు. అనిఅర్జునుడు అడుగుచున్నాడు.

(శ్రీధరులు) "యస్త్వాత్మరతిరేవ స్యాత్" (అధ్యా 3-శ్లో-17) "సర్వం కర్మాఖిలం పార్థ" (అధ్యా-4-శ్లో-33) ఇవిమొదలగు వాటిచేత జ్ఞానికి కర్మసన్న్యాసము (కర్మను విడిచిపెట్టుట) చెప్పబడినది. ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠభారత" (అధ్యా-4-శ్లో-42) అను దానిచేత కర్మనుజేయునట్లు చెప్పబడినది. ఈరెంటిని ఒకేకాలమున ఒకమనుష్యుడు అనుష్ఠించుట సాధ్యముకానందున వీనిలో శ్రేష్ఠమైన ఒకదానిని చెప్పుమని తాత్పర్యము.

(రామానుజులు) 4వ అధ్యాయమున కర్మయోగములో జ్ఞానమిమిడి యున్నందున కర్మను జేయుచున్నచో ఆ కర్మయే జ్ఞానాకారమగుచున్నట్లును అట్టిజ్ఞానమే శ్రేష్ఠమైనదనియు చెప్పబడినది. 3వ అధ్యాయమున జ్ఞానాధికారికికూడ కర్మయోగమున జ్ఞానమిమిడియుండుటచేతను, సులభముగ నుండుటచేతను, అప్రమాదం - పొరబాటు లేకుండుటచేతను కర్మయోగము శ్రేష్ఠమని చెప్పబడినది, ఇప్పుడు జ్ఞాననిష్ఠకంటె కర్మయోగము ఆత్మప్రాప్తిని శీఘ్రముగ కలుగజేయగలదనియు కర్మయోగమున తానుకర్త కాదను ఆత్మానుసంధానమున్ను ఆత్మస్వరూపము నెరుంగుటకు కారణమైన జ్ఞానముయొక్క వివరణమున్ను ఈ అధ్యాయమున జెప్పబడుచున్నది.

ఈశ్లోకమునందలి తాత్పర్యమేమనగా - సన్న్యాసమును జ్ఞానయోగమునున్ను మరల కర్మయోగమునున్ను జెప్పబడినట్లు కనబడుచున్నది. అదియెట్లనగా, రెండవఅధ్యాయములో

ముముక్షువులకు మొదట కర్మయోగమే చేయవలసినదనియు, కర్మయోగముచేత అంతఃకరణశుద్ధి పొందినవానికి జ్ఞానయోగమువలన ఆత్మదర్శనము కలుగుచున్నదనియు జెప్పి మరల 3-వ అధ్యాయమునందును నాల్గవ అధ్యాయమునందును జ్ఞానాధికారులకుకూడ కర్మయోగమేశ్రేష్ఠ మనియు, ఏలనగా ఆకర్మయోగము జ్ఞానయోగమునపేక్షింపకయె ఆత్మప్రాప్తిని కలుగజేయునట్టి దనియు జెప్పియున్నావు. ఈకర్మయోగము, జ్ఞానయోగము ఈరెంటిలో నేదిసులభముగను శీఘ్ర ముగను ఆత్మప్రాప్తిని కలుగజేయునో దానిని చెప్పుమనితాత్పర్యము.

(రాఘవేంద్రులు) "యోగస్థః కురుకర్మాణి" (అధ్యా 2 శ్లో-48) అనుదానిచేత కర్మలు చేయవలెనని సామాన్యముగ జెప్పబడినది. ఆ కర్మలను ఫలాపేక్షలేక ఈశ్వరార్పణ బుద్ధితో చేయ వలెనని మూడవఅధ్యాయమున జెప్పబడినది, పైజెప్పిన కర్మయోగమే ఈ అధ్యాయమున విస్తార ముగ జెప్పబడుచున్నది.

ఈ శ్లోకమునందలి తాత్పర్యమేమనగా - (మధ్వులు - రాఘవేంద్రులు) "యదృచ్ఛా లాభసంతుష్టో" (అధ్యా 4-శ్లో-22) అనుశ్లోకముచేత కర్మాదులను విడిచిపెట్టుటయను సన్న్యాస మున్ను, "కురుకర్మైవ తస్మాత్త్వం" (అధ్యా 4-శ్లో-15) అను శ్లో-చేత ఈశ్వరార్పణబుద్ధిగ జేయు నట్టియు, వర్ణాశ్రమధర్మములకు యోగ్యమైనట్టియు కర్మయోగమున్ను చెప్పబడినవి. వీటిలో నేది శ్రేష్ఠమైనదో దానిని నిశ్చయించి చెప్పుమనునది తాత్పర్యము.



శ్రీభగవానువాచః—

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥

పద॥ సన్న్యాసః (1) - కర్మయోగః - చ - నిశ్శ్రేయసకరౌ - ఉభౌ ।
తయోః - తు - కర్మసన్న్యాసాత్ (2) - కర్మయోగః - విశిష్యతే ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీకృష్ణభగవంతుడు చెప్పినది | నిశ్శ్రేయసకరౌ | మోక్షమిచ్చునవి |
| సన్న్యాసః | కర్మసన్న్యాసమున్ను, (కర్మను విడుచుటయు) | తయోస్తు | అయితే వాటిలో |
| | | కర్మసన్న్యాసాత్ | కేవలకర్మసన్న్యాసముకంటె |
| కర్మయోగశ్చ | కర్మయోగమున్ను (కర్మా నుష్ఠానమున్ను) | కర్మయోగః | కర్మయోగము |
| | | విశిష్యతే | శ్రేష్ఠమగుచున్నది. |
| ఉభౌ | రెండును | | |

తా॥ శ్రీభగవంతుడు చెప్పినది:— కర్మసన్న్యాసము (పరిత్యాగము), కర్మయోగము (కర్మానుష్ఠానము), అను ఈ రెండున్ను మోక్షసాధనములే ఐతే వాటిలో కర్మయోగము కర్మసన్న్యాసముకంటె శ్రేష్ఠమగుచున్నది.

(1) సన్న్యాసః - జ్ఞానియైనవాడు కర్మనువిడుచుటయు (శ్రీధరులు), జ్ఞానయోగమున్ను (రామాను జులు). కామక్రోధాది ద్వంద్వములను విడుచుటయు (రాఘవేంద్రులు).

(2) కర్మసన్న్యాసాత్ - జ్ఞాననిష్ఠకంటె (రామానుజులు). కర్మానుష్ఠాన విషయములో కర్మాది వర్జనరూపమైన సన్న్యాసముకంటె (రాఘవేంద్రులు).

(శంకరులు) అజ్ఞానికి ఏది తగినదనుదానిని నిశ్చయించుటకై తన యభిప్రాయమును భగవంతుడు ఈ శ్లోకమున జెప్పుచున్నాడు. కర్మలను విడుచుటయు, వాటిననుష్ఠించుటయు అను రెండున్ను జ్ఞానముగలుగుటకు కారణములైనందున మోక్షమునిచ్చుచున్నవి. ఈ రెండును మోక్షము నిచ్చునవైనను వాటిలో కర్మయోగము, వట్టికర్మసన్న్యాసముకంటె మేలైనదని కర్మయోగమును పొగడుచున్నాడు. వట్టికర్మసన్న్యాసమనగా జ్ఞానములేని కర్మసన్న్యాసము.

(శ్రీధరులు) కర్మయోగము సాక్షాత్తుగ మోక్షమునకు కారణముగాకున్నను జ్ఞానమునకు కారణమగుచున్నది. ఆ జ్ఞానము మోక్షమునకు కారణమైయున్నది. జ్ఞాని కర్మనువిడువగలిగినను అధికారివిషయముగ జూచునప్పుడు నీవంటివాడు కర్మను విడువకూడదు.

శ్లో॥ జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి ।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ ప్రముచ్యతే ॥　　3

పద॥ జ్ఞేయః - సః - నిత్యసన్న్యాసీ (1) - యః - న - ద్వేష్టి - న - కాంక్షతి (2) ।
నిర్ద్వన్ద్వః - హి - మహాబాహో - సుఖం - బన్ధాత్ - ప్రముచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో ! | ఓ గొప్పచేతులుగలవాడా ! | హి | ఏలనగా |
| యః | యెవ్వడు (ఏ కర్మయోగి) | నిర్ద్వన్ద్వః | సుఖదుఃఖాది ద్వన్ద్వములు లేనివాడు |
| నద్వేష్టి | ద్వేషించుటలేదో | | |
| న కాంక్షతి | కోరుటలేదో | బంధాత్ | కర్మబంధమునుండి |
| సః | అతడు | సుఖం | ప్రయాసలేక |
| నిత్యసన్న్యాసీ(ఇతి) | నిత్యసన్న్యాసిగ ఎరుంగ దగినవాడు | ప్రముచ్యతే | విముక్తి చెందుచున్నాడు. |

తా॥ ఓ అర్జునా ! ఎవ్వడు రాగద్వేషములు లేకుండునో అతనిని నిత్య సన్న్యాసిగ ఎరుంగదగును. ఏలనగా సుఖదుఃఖాది ద్వన్ద్వములను దాటినవాడు కర్మబంధమునుండి ప్రయాసలేక విముక్తి చెందుచున్నాడు.

(1) నిత్యసన్న్యాసీ - ఎల్లప్పుడు జ్ఞాననిష్ఠలో నున్నవానిగ తెలిసికొనదగినవాడు (రామానుజులు). యతి మొదలగు సన్న్యాసి విషయముగాదు. కామ్య కర్మలను విడచిన వానిగనెరుంగ దగినవాడు (రాఘవేంద్రులు).

(2) నకాంక్షతి - కర్మలో నిమిడియున్న ఆత్మానుభవమును తృప్తిపొందియుండుటవలన దానిలో తప్ప మిగతవాటిలో కోరికలేనివాడు (రామానుజులు)

(శంకరులు) కర్మయోగము దృఢమైన హితమును చేయుట దేనివల్లననునది దీనిలో జెప్పబడుచున్నది. ఎవ్వడు దేనినిన్ని ద్వేషించుటలేదొ, అనగా దుఃఖమునున్ను దానినిచ్చు వస్తువుల నున్ను ద్వేషించుటలేదో ఆవిధముగనే సుఖమునున్ను, దానినిచ్చు వస్తువులనున్ను కోరుటలేదో ఆకర్మయోగి ఎల్లప్పుడు సన్న్యాసియని తెలిసికొనుడు. ఎవ్వడీ విధముగనుండునో అతడు కర్మలను చేయుచున్నవాడైనను ఎల్లప్పుడు సన్న్యాసిగ గ్రహింపదగినవాడని భావము. ఏలనగా, రాగము ద్వేషము మొదలగు ద్వన్ద్వములులేనివాడు కర్మమను కట్టునుండి ఆయాసములేక సులభముగ విడువబడుచున్నాడు.

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథక్ బాలాః ప్రవదన్తి న పండితాః।
ఏకమప్యాస్థిత స్సమ్యగుభయోర్విందతే ఫలమ్ ॥

పద॥ సాంఖ్యయోగౌ - పృథక్ - బాలాః - ప్రవదన్తి - న - పండితాః।
ఏకం - అపి - ఆస్థితః - సమ్యక్ - ఉభయోః - విన్దతే - ఫలమ్ ॥

| | | | |
|---|---|---|---|
| బాలాః | బాలురు (అవివేకులు) | ఏకమపి | ఏ ఒకదానినైనను |
| సాంఖ్యయోగౌ | సాంఖ్యము, యోగము వీటిని | సమ్యక్ | బాగుగ |
| పృథక్ (ఇతి) | వెవ్వేరని | ఆస్థితః | అనుష్ఠించినవాడు |
| ప్రవదన్తి | చెప్పుచున్నారు. | (ఉభయోః) | రెంటియొక్క |
| పణ్డితాః | వివేకులు (జ్ఞానులు) | ఫలమ్ | ఫలమును (మోక్షమును) |
| న | (అట్లు) చెప్పుటలేదు. | విన్దతే | పొందుచున్నాడు. |
| ఉభయోః | రెంటిలో | | |

తా॥ జ్ఞానయోగ ఫలమువేరు, కర్మయోగఫలమువేరని అవివేకులు చెప్పుచున్నారు. జ్ఞానులట్లు చెప్పుటలేదు. ఏలనగా రెంటిలో ఏ ఒకదానినైనను బాగుగ ననుష్ఠించినవాడు రెంటియొక్క ఫలమైన మోక్షమును పొందుచున్నాడు.

(శంకరభాష్యము) వెవ్వేరుపురుషులచే అనుష్ఠింపదగినవియు, ఒకదానికొకటి విరుద్ధమైనవియునైన కర్మసన్న్యాసము కర్మయోగమను నీరెండును వాటిఫలములలోకూడ విరుద్ధమగుట తగునుగాని రెండున్ను మోక్షమను స్థిరమైనహితమునే చేయునవేయనుట యెట్లుతగుననగా, దానికై భగవంతుడు చెప్పుచున్నాడు. బాలురు అనగా గ్రంథతాత్పర్యమును విమర్శించనివారలు. సాంఖ్యము, యోగము, ఇవిరెండును, ఒకదానితో నొకటి మారుబాటుచెందిన ఫలములుగలవియని చెప్పు చున్నారు. పండితులు అట్లుచెప్పరు. వివేకులైన జ్ఞానులు అవి విరోధములేని ఒకే ఫలముగలవియని గ్రహింతురు. ఎట్లనగా సాంఖ్య, యోగములలో నొకదానినైన బాగుగననుష్ఠించినవాడు రెంటి ఫలమును పొందుచున్నాడు. ముక్తియనబడు నొకేఫలముగదా రెంటికి గలదు! కావున ఫలమున వ్యత్యాసములేదనుడు. ఐతేప్రకృతము సన్న్యాసము, కర్మయోగము, వీటినిగూర్చి చెప్పవలసి యుండగా ఇచ్చట సాంఖ్యమునకును యోగమునకును ఫలమొక్కటేయని చెప్పుటయెట్లు సంగత మగుననగా—

అర్జునుడు పట్టి కర్మసన్న్యాసము, పట్టికర్మయోగము వీటిని మనంబునగొని ప్రశ్నించినను అవి రెండును సాంఖ్యము, యోగము, అనువేరు పదములచే చెప్పదగియున్నందున భగవంతుడు వాటిని విడువకయే తానుద్దేశించియున్న విశేషమునుగూడచేర్చి ప్రత్యుత్తరము నిచ్చుచున్నాడు. జ్ఞానము, దానిసాధనమైన సమబుద్ధి, మొదలగువాటితోగూడిన ఆ కర్మసన్న్యాసము, కర్మ యోగము, ఇవియే సాంఖ్యము, యోగము, అనుపదములచే జెప్పదగినవని భగవంతుని భావము. (అర్జునుడు పట్టికర్మసన్న్యాసమును పట్టికర్మయోగమునుగూర్చి భగవంతుని నడుగగా నతడు దానికి ప్రత్యుత్తరమిచ్చువాక్యమున "జ్ఞానమను విశేషముతోగూడిన కర్మసన్న్యాసము, సమత్వ బుద్ధియను విశేషముతోగూడిన కర్మయోగము" ఇవియే శ్రేష్ఠమైనవియను తన భావమును తెలుపుటకై సాంఖ్యము, యోగము, అనుపదములను ప్రయోగించి యున్నాడనుడు.)

(రాఘవేంద్రులు) జ్ఞానమునకు ఫలమువేరు, కర్మకుఫలమువేరు, కావున జ్ఞానమునకు కర్మసాధనముకాదని అవివేకులు చెప్పుచున్నారు. వివేకులు జ్ఞానమునకు కర్మము సాధనముగను, కడపట మోక్షఫలము నివ్వదగినదిగను ఉన్నదని చెప్పుచున్నారు.

(శ్రీధరులు) కర్మసన్న్యాసము, కర్మయోగము, వీటిలోనేది శ్రేష్ఠమని అర్జునుడు అడిగిన దానికి బదులుగ సాంఖ్యయోగము, కర్మయోగము వీటిని జెప్పవలసినదేల యనిన సాంఖ్య మనగా జ్ఞానము. జ్ఞానమే కర్మసన్న్యాసమగుచున్నది. ఎట్లనగా జ్ఞాననిష్ఠకలవానికి కర్మవీడి పోవుచున్నది. కావున సన్న్యాసమునకు ప్రతిపదముగ జ్ఞానమనంబడు సాంఖ్యమనుపదము దీనిలో ప్రయోగింపబడియున్నది.

(రామానుజులు) కర్మయోగమునకు ఫలము జ్ఞానయోగమనియు, జ్ఞానమునకు ఫలము ఆత్మదర్శనమనియు, కావున నీ రెంటికి ఫలము వెవ్వేరనియు, నవివేకులు చెప్పుచున్నారు. జ్ఞాను లట్లు జెప్పుటలేదు. ఏలనగా జ్ఞానయోగము కర్మయోగము రెంటికిని ఆత్మదర్శనమను నొకే ఫలమైనందున.

(స్వకీయము) జ్ఞానయోగము మోక్షమునకు కారణమైనదనియు, కర్మయోగము జ్ఞాన మునకు కారణమైనదనియు జ్ఞానయోగమే శ్రేష్ఠమైనదనియు, మునుపు చెప్పబడియున్నది. ఇకను జెప్పబడుచున్నది. ఇవిరెండు నొక్కటే, రెంటికిఫలమొక్కటే యనిచెప్పుట యెట్లుతగుననినచో జ్ఞాననిష్ఠకు యోగ్యుడుగనుండక, కర్మయోగమునకు అధికారిగనున్నవానినిగూర్చి "జ్ఞాననిష్ఠయే శ్రేష్ఠమైనది, దానినే నీవుఅనుష్ఠింపవలెను" అనిచెప్పినయెడల జ్ఞాననిష్ఠచేయులకు శక్తిలేనట్టివాడు కర్మయందును శ్రద్ధలేక రెండునుచెడినవాడగును. కావున కర్మను శ్లాఘించినదిగ గ్రహింపవలెను.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥ 5

పద॥ యత్ - సాంఖ్యైః - ప్రాప్యతే - స్థానం (1) - తత్ - యోగైః - అపి-గమ్యతే
ఏకం - సాంఖ్యం - చ - యోగం - చ - యః - పశ్యతి - సః - పశ్యతి ॥

| | | | |
|---|---|---|---|
| సాంఖ్యైః | జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులచేత | సాంఖ్యం చ | సాంఖ్యయోగమునున్ను |
| యత్ స్థానం | యే స్థానము (మోక్షము) | యోగం చ | కర్మయోగమునున్ను |
| ప్రాప్యతే | పొందబడుచున్నదో | ఏకం | ఒకే ఫలముగలదిగ |
| తత్ | ఆ స్థానము | పశ్యతి | చూచునో |
| యోగైరపి | కర్మయోగులచేతను | సః | అతడు |
| గమ్యతే | పొందబడుచున్నది | | చూచుచున్నాడు (బాగుగ నెరుంగుచున్నాడు.) |
| యః | ఎవ్వడు | | |

తా॥ జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులచే ఏ స్థానము పొందబడునో, అస్థాన మైనది కర్మయోగులచేతను పొందబడును. సాంఖ్యయోగమును కర్మయోగ మును నొకేఫలముగలవిగ ఎవ్వడెరుంగునో అతడు సరిగా నెరింగినవాడు.

(1) స్థానం - ఆత్మదర్శనము (రామానుజులు)

(శంకరభాష్యము) పై జెప్పిన రెండుమార్గములలో ఒకదానిని మాత్రము నేరుగ ననుష్ఠించుటవలన రెంటిఫలమును ఒక్కడెట్లు పొందుననునది దీనిలో జెప్పబడుచున్నది.

జ్ఞానములో స్థిరముగ నిలబడు సన్న్యాసులచేత ఏస్థితి పొందబడుచున్నదో అది యోగుల చేతను బొందబడుచున్నది. ఎవ్వరు జ్ఞానమునకు సాధనముగ కర్మలను ఈశ్వరునియెడ నర్పించి తమకు ఫలము నెదురుచూడక అనుష్ఠించుచున్నారో, వారలు యోగులు. ఆ యోగులున్ను పర

మార్థజ్ఞానము, సన్న్యాసము, వీటినిబడసి వాటిద్వారా అదేస్థితిని పొందుచున్నారని భావము గనుక ఫలమొక్కటిగ నుండుటవలన ఎవ్వడు సాంఖ్యయోగముల నొక్కటిగ చూచునో, అతడు నేరుగ చూచుచున్నాడు. అనగా అతడు సరియైన విధమున నెరుంగుచున్నాడని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) సాంఖ్యమనగా జ్ఞానము, యోగమనగా నిష్కామకర్మము. జ్ఞానమునకు ఫలము మోక్షము, నిష్కామకర్మకు ఫలము జ్ఞానము. ఇవి రెండు నొకేఫలముగ ఎట్లగుననగా, జ్ఞానము వెంటనే మోక్షఫలము నిచ్చుటచేతను నిష్కామకర్మ స్వల్పకాలవిలంబముగ మోక్షమునిచ్చుటచేతను ఫలమొక్కటేయని చెప్పబడినది. మరియు జ్ఞానకర్మలు కార్యకారణరూపములై ఒకటిగనేయున్నవి. (దీనికి వీరు మరియొకవిధముగను అర్థముచేసియున్నారు. అదేమన) యతియైనజ్ఞాని మోక్షమునందు ఆనందవృద్ధికై కర్మచేయవలెను. గృహస్థుడైనకర్మయోగి మోక్షమొందుటకై జ్ఞానముతో కర్మను జేయవలెను. కనుక అధికారక్రమముగ జూచినచో జ్ఞానికి కర్మయు, కర్మయోగికి జ్ఞానమున్ను కావలసియున్నందున జ్ఞానకర్మలొక్కటిగ జెప్పబడినవని తాత్పర్యము.

(స్వకీయము) మునుపుకర్మయోగము శ్రేష్ఠమనిచెప్పి ఇప్పుడు జ్ఞానయోగము కర్మయోగము రెండు నొక్కటనియు, ఒకేఫలముగలవనియు నెట్లుచెప్పదగుననగా కర్మయోగము జ్ఞానయోగమును గలుగజేసి కడపట మోక్షమునిచ్చుచున్నది. జ్ఞానముగూడ మోక్షమునే ఇచ్చుచున్నది. కడపటిదైన ఫలము రెంటికి నొక్కటేగనుక రెండునొక్కటని జెప్పబడినది. జ్ఞానయోగమునకంటె కర్మయోగము ఒకమెట్టుతగ్గియుండగా కర్మయోగము శ్రేష్ఠమని ఎట్లచెప్పదగుననగా కర్మచేయక విడుచుటయైన సన్న్యాసము శ్రేష్ఠమైనదా? కర్మయోగము శ్రేష్ఠమైనదా అని నీవడిగినందునను నీవు ఇప్పుడు కర్మాధికారిగనున్నందునను నీకు కర్మయోగము శ్రేష్ఠమైనదని చెప్పితిమి. వాస్తవమున జ్ఞానయోగమే శ్రేష్ఠమైనది.



శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ॥ 6

పద॥ సన్న్యాసః (1) - తు - మహాబాహో - దుఃఖం - ఆప్తుం - అయోగతః ।
యోగయుక్తః - మునిః - బ్రహ్మ (2) - న - చిరేణ - అధిగచ్ఛతి ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో ! | ఓ భుజబలముగలవాడా ! | యోగయుక్తః | కర్మయోగముతో గూడిన |
| సన్న్యాసస్తు | (పరమార్థ) వాస్తవమైన సన్న్యాసమనగా | మునిః | ముని (ధ్యానముచేయువాడు) |
| | | బ్రహ్మ | బ్రహ్మమును |
| అయోగతః | (కర్మ)యోగమువలనగాక | నచిరేణ | శీఘ్రముగ |
| ఆప్తుం | పొందుటకు | అధిగచ్ఛతి | పొందుచున్నాడు. |
| దుఃఖం | (కష్టమైనది) అరుదు | | |

తా॥ పరాక్రమముగల ఓ అర్జునా ! వాస్తవమైన సన్న్యాసమనగా (కర్మ)యోగమువలనగాక పొందుటకు కష్టమైనది (అరుదు) కర్మయోగముతో గూడి భగవంతుని నెడతెగక ధ్యానముచేయు మునియైనవాడు శీఘ్రమున బ్రహ్మమును పొందుచున్నాడు.

(1) సన్న్యాసః - పరమార్థసన్న్యాసము అనగా జ్ఞాననిష్ఠను స్థిరముగ పొందినవాని కర్మ, తాను గనే విడచిపోవుటయే (శ్రీధరులు). జ్ఞానయోగము (రామానుజులు).

(2) బ్రహ్మ - పరమాత్మ నిష్ఠయను వాస్తవమైన సన్న్యాసమును (శంకరులు).

(శంకరభాష్యము) ఈ శ్లోకముచేత సన్న్యాసమే యోగముకంటె మేలైనదనిచెప్పినదగు చున్నది. అట్లైనచో ఈ అధ్యాయము రెండవశ్లోకమున "కర్మసన్న్యాసముకంటె కర్మయోగము మేలైనది" అనిచెప్పినదెట్లు సంగతమగును. అనగా అచ్చట అర్జునుడు (జ్ఞానములేని) వట్టి కర్మ సన్న్యాసమును వట్టికర్మయోగమును మనస్సునందుంచి "వాటిలో నేదిమేలైనది" అనియడిగెను. దానిననుసరించి భగవంతుడు జ్ఞానములేని వట్టిసన్న్యాసమునకంటె కర్మయోగము శ్రేష్ఠమైనదని చెప్పెను. జ్ఞానముపై నాధారపడి యుండుసన్న్యాసమే సాంఖ్యమని భగవంతుని భావము వాస్తవమైన యోగముకూడ అదియే. ఐతే యోగమను పదమున్ను సన్న్యాసమను పదమున్ను కర్మయోగమను నర్థములో నుపయోగింపబడుచున్నవిగదా యనిన, వేదమున జెప్పిన కర్మయోగ మేదియో అది దాని కొరకైనందున (వాస్తవమైన సన్న్యాసమునకుపయోగపడుటవలన) యోగ మనియు సన్న్యాసమనియు ఉపచారముగ జెప్పబడుచున్నది. కర్మయోగమెట్లు సన్న్యాసము కొరకగుచున్నది యనుదానిని భగవంతుడు దీనిలో జెప్పుచున్నాడు.

వాస్తవమైన సన్న్యాసము నయితే కర్మయోగము చేతనేగాని వేరుమార్గముచే పొంద జాలము. ఈశ్వరునియెడ నర్పింపబడునట్టియు ఫలము నెదురుచూడనట్టియు వేదమున జెప్పబడినది యునైన కర్మయోగముతోగూడి ఈశ్వరుని యాకారమును ఎడతెగక ధ్యానము చేయుచున్నవాడు పరమార్థజ్ఞాననిష్ఠయనెడి వాస్తవమైన సన్న్యాసమును శీఘ్రముగ పొందుచున్నాడు. కావుననే కర్మ యోగము మేలైనదనబడెను. ప్రకృతములో జెప్పిన సన్న్యాసము పరమాత్మ జ్ఞానముకావున బ్రహ్మమనంబడు చున్నది. "న్యాసఇతి బ్రహ్మ బ్రహ్మ హిపరః" న్యాసమనునది బ్రహ్మ, బ్రహ్మయే మేలైనవాడు. అనుశ్రుతిచేత (తైత్తిరీయోపనిషత్తు 4-78) చూడుడు.

(రామానుజులు) మునిః = స్వరూపానుసంధానముతోనున్న, యోగయుక్తః=కర్మయోగి, బ్రహ్మ = తనయొక్క ప్రకృతివిముక్త ఆత్మస్వరూపమును, నచిరేణ=శీఘ్రముగ, అధిగచ్ఛతి = పొందుచున్నాడు. జ్ఞానియైనవాడు ప్రయాసతో జ్ఞానయోగమును సాధించుటవలన అతనికి అధిక కాలము గడచును.

(మధ్వులు) సన్న్యాసమనగా కామక్రోధాదులను విడచుటయే. యోగమనగా ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణ బుద్ధిగ జేయుటయైన నిష్కామకర్మయే. ఒక్కడు కామక్రోధాదులను విడిచిన మాత్రముచేతనే బ్రహ్మమును పొందజాలడు. కామక్రోధాదులనువిడిచి నిష్కామకర్మ యోగము చేయుచున్నచో శీఘ్రముగ బ్రహ్మమును పొందగలడు. కావున కామక్రోధాదులను విడుచుటయను సన్న్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠమైనదని చెప్పబడినది. కామక్రోధాదులను విడచుటచేత శుద్ధి మొదలగు ఫలముగలుగునుగదాయనిన అవి అల్పఫలములైనందున అది ఇచ్చట ఉద్దేశింప బడలేదు.

(రాఘవేంద్రులు) కామక్రోధాది త్యాగములేకనే కర్మయోగము మాత్రముగాని, కర్మ యోగములేకనే కామక్రోధాది త్యాగము మాత్రముగాని మోక్షహేతువు కానేరదు. త్యాగము, కర్మయోగము, చేరినచో శీఘ్రముగ మోక్షములభించునని తాత్పర్యము.

(స్వకీయము) ఈశ్లోకమునందలి మొదటి పాదమునకు భాష్యోత్కర్షదీపికకర్తయైన ధనపతి యనువారు క్రిందకనబరచినట్లును అన్వయము జేయవచ్చుననుచున్నారు - అయోగతః = యోగములేక, కృతః = చేయబడుచున్న, సన్న్యాసః = వట్టిసన్న్యాసము, దుఃఖం = నరకరూపమైన దుఃఖమును, ఆప్తుంచ = పొందుటకైయే, (భవతి) = అగుచున్నది.

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7

పద॥ యోగయుక్తః - విశుద్ధాత్మా - విజితాత్మా - జితేంద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా (1) - కుర్వన్ - అపి - న - లిప్యతే ॥

| | | | |
|---|---|---|---|
| యోగయుక్తః | కర్మయోగముతో గూడినవాడును | సర్వభూతాత్మ- | తన ఆత్మను సకలభూతముల |
| విశుద్ధాత్మా | పరిశుద్ధమైన మనస్సుగలవాడును | | ఆత్మగ ఎరింగియున్నవాడు |
| విజితాత్మా | దేహమును జయించినవాడును, | కుర్వన్నపి | కర్మలను జేయుచుండినను |
| | అనగా దేహస్వాధీనము | నలిప్యతే | కర్మచేత అంటబడుటలేదు. |
| | గలవాడును | | అనగా కర్మబంధమును |
| జితేంద్రియః | ఇంద్రియములను జయించినవాడును | | పొందుటలేదు. |
| | అయి | | |

తా॥ కర్మయోగిగను, పరిశుద్ధమైన మనస్సుగలవాడుగను, దేహమును వశపరచుకొనినవాడుగను, ఇంద్రియములను అణచినవాడుగను, సకలభూతములలోనున్న పరమాత్మయు తనయాత్మయు నొక్కటని తెలిసియున్నవాడుగనుఉన్నవాడు (లోకసంగ్రహమునకై) కర్మలను జేయుచుండినను కర్మబంధమును పొందుటలేదు.

(1) సర్వభూతాత్మ భూతాత్మా - తనయాత్మను సకలభూతముల ఆత్మగగొన్నవాడు. తనలోనున్న ఆత్మను బ్రహ్మమొదలు తృణమువరకుగల సకలభూతముల ఆత్మగచూచెడివాడు. అనగా సమ్యగ్దర్శి (శంకరులు). దేవాది సకలభూతములకును ఆత్మగనున్న స్వరూపమునే తనకు నాత్మగ నెరింగెడివాడు. అనగా జ్ఞానాకారముచేత ఆత్మలు సమానమైనవారలని యెరింగెడివాడు (రామానుజులు). బ్రహ్మమొదలుగాగల సకలప్రపంచమునకును ఈశ్వరుడెవ్వడో అతడే తనకునీశ్వరుడని యెరింగెడివాడు (రాఘవేంద్రులు).

శ్లో॥ నైవ కించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్స్వపన్శ్వసన్ ॥

పద॥ న - ఏవ - కించిత్ - కరోమి - ఇతి - యుక్తః - మన్యేత - తత్త్వవిత్ ।
పశ్యన్ - శృణ్వన్ - స్పృశన్ - జిఘ్రన్ - అశ్నన్ - గచ్ఛన్ - స్వపన్ - శ్వసన్ ॥

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్నిమిషన్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥ 9

పద॥ ప్రలపన్ - విసృజన్ - గృహ్ణన్ - ఉన్మిషన్ - నిమిషన్ - అపి।
ఇంద్రియాణి - ఇంద్రియార్థేషు - వర్తన్తే - ఇతి - ధారయన్ ॥

| | | | |
|---|---|---|---|
| తత్త్వవిత్ | తత్త్వమును (యథార్థమును) ఎరింగినవాడు | విసృజన్ అపి | (జలమలములు) విడిచినను (వాయువు ఉపస్థముల వ్యాపారము) |
| పశ్యన్నపి | చూచినను (కండ్లవ్యాపారము) | | |
| శృణ్వన్ (అపి) | వినినను (చెవులవ్యాపారము) | గృహ్ణన్ అపి | ఎత్తినను (చేతులవ్యాపారము) |
| స్పృశన్ ,, | తాకినను (త్వక్కువ్యాపారము) | ఉన్మిషన్ అపి } | కండ్లను తెరచినను మూసినను |
| జిఘ్రన్ ,, | ఆఘ్రాణించినను (ముక్కు వ్యాపారము) | నిమిషన్ అపి } | (కూర్మమను వాయువు వ్యాపారము) |
| | భుజించినను(నాలుకవ్యాపారము) | ఇంద్రియాణి | ఇంద్రియములు |
| గచ్ఛ। | నడచినను (కాళ్ళవ్యాపారము) | ఇంద్రియార్థేషు | ఇంద్రియ విషయములలో |
| స్వప। | నిద్రించినను (బుద్ధివ్యాపారము) | వర్తన ఇతి | ప్రవర్తించుచున్నవని |
| శ్వస। | శ్వాసము విడిచినను (ప్రాణ వాయువు వ్యాపారము) | ధారయన్ | నిశ్చయించుకొన్నవాడై |
| | | యుక్తస్సన్ | సమాహితుడుగనుండి |
| ప్రలపన్ ,, | మాటలాడినను (నోటి వ్యాపారము) | అహంకించిత్ | నేనొక కార్యమునున్ను |
| | | నైవకరోమీతి | చేయుటయేలేదని |
| | | మన్యేత | తలంచును. |

తా॥ యథార్థమునెరింగినవాడు (అనగా ఆత్మయొక్క వాస్తవమైన స్వభావము నెరింగినవాడు, పరవస్తువును జూచెడివాడు) చూచుట, వినుట, తాకుట, ఘ్రాణించుట, భుజించుట, నడచుట, నిద్రించుట, శ్వాసము విడచుట, మాటలాడుట, మలజలములు విడచుట, ఎత్తుట- కండ్లనుతెరచుట, మూయుట యను నీ వ్యాపారములను జేసినవాడుగనున్నను, ఇంద్రియములు వాటికార్యమైన విషయములలో ప్రవర్తించుచున్నవని నిశ్చయించుకొని మనఃస్థైర్యము గలవాడై యుండి "ఒక కార్యమునుగూడ నేను చేయుటయేలే"దని తలంచవలెను.

(శంకరులు) 'మన్యేత = తలంచవలెను' అని మునుపటి వాక్యముతోనే 9వ శ్లో-ను జేర్చుకొనుడు. అతడు యథార్థమును బాగుగ నెరింగినవాడై ఎప్పుడు ఏవిధముగ గ్రహింపవలెననునది చెప్పబడుచున్నది. ఇట్లు యథార్థము నెరింగి దేహేంద్రియముల సకలవ్యాపారములలోను, అనగా సకలకర్మలలోను అకర్మనే జూచెడివాడై ఉన్నదానిని ఉన్నటుల చూచుచున్న అతనికిని సర్వకర్మసన్న్యాసమునందే యధికారము. అతడు కర్మలేని స్వభావమును చూచుటవలననుడు. ఎండమావులలో నీరున్నదని తలంచి నీరుత్రాగుటకై పోయినవాడు అచ్చట నీరు లేదని తెలిసిన పిదప నీరు త్రాగుటయను ప్రయోజనమునకై మరల నచ్చటకు వెళ్ళుటలేదుగదా.

(స్వకీయము) దీనిలో చెప్పబడియున్నవానిని జ్ఞానాధికారిగ ఎరుంగదగినది. వాస్తవమైన సన్న్యాసము ఇదియే.

~~~~~~~~~~~~~~~

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా॥　　10
~~~~~~~~~~~~~~~

పద|| బ్రహ్మణి(1) - ఆధాయ - కర్మాణి - సంగం(2) - త్యక్త్వా - కరోతి - యః।
లిప్యతే - న - సః - పాపేన - పద్మపత్రం - ఇవ - అంభసా ||

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వడు | సః | అతడు |
| | కర్మలను | అంభసా | జలముచేత |
| | బ్రహ్మమునందు | పద్మపత్రమివ | తామరాకువలె |
| ఆధాయ | ఒప్పజెప్పి (అర్పణముచేసి) | పాపేన | (పుణ్య) పాపములచేత |
| సంగంత్యక్త్వా | ఫలము నందాసక్తినివిడిచి | నలిప్యతే | అంటబడుటలేదు. |
| కరోతి | (కర్మలను) చేయునో | | |

తా|| ఎవ్వడు కర్మలను పరమాత్మయెడ నొప్పజెప్పి (ఈశ్వరార్పణ బుద్ధితో జేసి) ఫలాపేక్షను విడనాడి చేయునో అతడు తామరాకు ఎట్లు జలముచేత అంటబడుటలేదో ఆ విధముగ (పుణ్య) పాపములచే నంటబడుటలేదు.

(1) బ్రహ్మణి - ప్రకృతియెడ (రామానుజులు)

(2) సంగం - మోక్షఫలమునందుగూడ కోరికను (శంకరులు)

(శంకరభాష్యము) ఐతే ఎవ్వడు వాస్తవము నెరుంగడో, మరియు కర్మయోగము నాశ్రయించినవాడో అతడు పనివాడు యజమానునికై పనిజేయుటవలె "నేనుఆతనికై (ఈశ్వరునికై) కర్మను జేయుచున్నాను" అని సకలకర్మలను ఈశ్వరునియెడ నుంచి ముక్తియను ఫలమునందు గూడ నాసక్తిని విడిచి చేయుటవలన అతనియెడ తామరాకులో నీరువలె పాపమంటుటలేదు. కేవలము మనస్సు పరిశుద్ధపడుట మాత్రమే అతని కర్మకు ఫలమగుచున్నది.

(స్వకీయము) దీనిలో గుర్తింపబడియున్నవానిని కర్మాధికారిగ నెరుంగదగినది. ఈ శ్లోకమును గర్గసంహిత మాధుర్యఖండము అధ్యాయము 1-శ్లో-54 లో చూడుడు.

---

శ్లో|| కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి।
యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే|| 11

పద|| కాయేన - మనసా - బుద్ధ్యా - కేవలైః - ఇంద్రియైః - అపి।
యోగినః - కర్మ - కుర్వన్తి - సంగం - త్యక్త్వా - ఆత్మశుద్ధయే ||

| | | | |
|---|---|---|---|
| యోగినః | కర్మయోగులు | | వట్టి బుద్ధిచేతను |
| సంగంత్యక్త్వా | ఫలాపేక్షనువిడచి | కేవలైః ఇంద్రియైరపి | వట్టి ఇంద్రియములచేతను |
| ఆత్మశుద్ధయే | చిత్తశుద్ధికై | కర్మ | కర్మను |
| కేవలేనకాయేన | వట్టి దేహముచేతను | కుర్వన్తి | చేయుచున్నారు. |
| కేవలేనమనసా | వట్టి మనస్సుచేతను | | |

తా|| కర్మయోగులు ఫలాపేక్షను విడచి చిత్తశుద్ధికై వట్టి దేహముచేతను వట్టిమనస్సుచేతను వట్టిబుద్ధిచేతను వట్టిఇంద్రియములచేతను కర్మను జేయుచున్నారు.

(శంకరులు) "నాది" అనుదానిని విడిచి "ఈశ్వరునికొరకే చేయుచున్నాను. నా ప్రయోజనమునకై కాదు" అని ప్రతి వ్యాపారమునందును నాది అనునది లేకుండుటకొరకు, కేవలైః = వట్టి (అనగా మమకారములేని) అనుమాటను శరీరముమొదలగు వాటితోను వేర్వేరుగ జేర్చి, కర్మయోగులు

ఫలాపేక్షను విడచి చిత్తశుద్ధికై (వట్టి) దేహముచేతను, (వట్టి) మనస్సుచేతను, (వట్టి) బుద్ధిచేతను, (వట్టి) ఇంద్రియములచేతను కర్మను జేయుచున్నారని గ్రహింపవలెను. గనుక దానియందే నీ కధికారము. కావున నీవు కర్మనే జేసెదవుగాక.

(శ్రీధరులు) చిత్తశుద్ధికై దేహముచే చేయదగినవి స్నానాదులు, మనస్సుచే చేయదగినవి ధ్యానాదులు, బుద్ధిచే చేయదగినవి తత్త్వనిశ్చయము, ఇంద్రియములచే చేయదగినవి శ్రవణ కీర్తనాదులు.

(స్వకీయము) "కేవలైరింద్రియైః" అనుదానికి "అభిమానములేని ఇంద్రియములచేత" అనిఅర్థము చేయవచ్చును. అనగా తానుజేయు కర్మలో ఇంద్రియములచే గ్రహింపబడు వస్తువులలో రాగద్వేషములుంచకయుండుటయని భావము.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీం ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ 12

పద॥ యుక్తః (1) - కర్మఫలం - త్యక్త్వా - శాంతిం (2) - ఆప్నోతి - నైష్ఠికీం ।
అయుక్తః - కామకారేణ - ఫలే - సక్తః - నిబధ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| యుక్తః | కర్మయోగముతో గూడినవాడు | ఆప్నోతి | పొందుచున్నాడు |
| | (కర్మయోగియైనవాడు) | అయుక్తః | యోగయుక్తుడుగనుండక |
| కర్మఫలం త్యక్త్వా | కర్మయొక్క ఫలమునందు | కామకారేణ | కామముయొక్క ప్రేరణచేత |
| | అపేక్షనువిడచి | ఫలే | ఫలమునందు |
| నైష్ఠికం | నిష్ఠవలన గలుగుచున్న | సక్తః | ఆసక్తిగలవాడు |
| శాంతిం | శాంతిని | నిబధ్యతే | (కర్మచేత) కట్టుబడుచున్నాడు. |

తా॥ కర్మయోగియైనవాడు కర్మమునందు ఫలాపేక్షను విడచి (ఆత్మ) నిష్ఠవలన పొందదగిన శాంతిని (మోక్షమును) పొందుచున్నాడు. యోగముతో గూడినవాడుగ నుండక ఆశచే ప్రేరేపింపబడి ఫలమునందాసక్తిగలవాడు (కర్మచేత) కట్టబడుచున్నాడు.

(1) యుక్తః - ఈశ్వరునికొరకు కర్మలను జేయుచున్నాను, నా ఫలమునకై కాదు. అను చిత్త సమాధానముగలవాడు (శంకరులు). పరమేశ్వరుని నిష్ఠలో నిలకడచెందియున్నవాడు (శ్రీధరులు). ఆత్మప్రయోజనమునందే దృష్టిగలవాడు (రామానుజులు).

(2) శాంతిం - ఆత్మానుభవ సుఖమును (రామానుజులు).

(శంకరభాష్యము) ఈశ్వరునికై కర్మలను జేయుచున్నాను, నా ఫలమునకై కాదు. అని యీ విధముగ మనస్సమాధానమును పొందినవాడై కర్మయొక్క ఫలమునువిడిచి కర్మనుచేసెడివాడు, మొదట సత్త్వశుద్ధి, (అంతఃకరణశుద్ధి) పిదప జ్ఞానప్రాప్తి, పిదప సర్వకర్మ సన్న్యాసము, తరువాత జ్ఞాననిష్ఠ వీనిని క్రమక్రమముగపొంది కడపటిదిగ మోక్షమనే శాంతిని పొందుచున్నాడు. సత్త్వశుద్ధి యగుట, పిదప జ్ఞానమొందుట, పిదప సకల కర్మలను విడచుట, పిదప జ్ఞాననిష్ఠను పొందుటయను నిట్టి క్రమము వాక్యమున ధ్వనించునట్లు గ్రహింపవలెను. ఐతే ఒక నిలకడలేని

మనస్సు గలవాడై కామముచే ప్రేరేపింపబడి "నా ప్రయోజనమునకై ఈ వ్యాపారమును చేయుచున్నాను" అని ఫలమునందాసక్తిగలవాడు కర్మచే కట్టుబడియున్నాడు కావున నీవు కర్మ యోగముతో గూడినవాడవై యుండుమని తాత్పర్యము.

~~~~~~

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహీ*నైవ కుర్వన్న కారయన్ ॥ 13

పద॥ సర్వకర్మాణి - మనసా - సన్న్యస్య - ఆస్తే - సుఖం - వశీ ।
నవద్వారే - పురే - దేహీ - న - ఏవ - కుర్వన్ - న - కారయన్

| | | | |
|---|---|---|---|
| | ఇంద్రియములను జయించిన | నైవకుర్వన్ | (దేనిని) చేయనివాడుగనే |
| | దేహియైనవాడు | నకారయన్ | చేయించనివాడుగనే |
| సర్వకర్మాణి | సకల కర్మలను | నవద్వారే | తొమ్మిది వాకిళ్ళుగల |
| మనసా | వివేకబుద్ధిచేత | పురే | పట్టణమున - అనగా దేహమున |
| సన్న్యస్య | తొలగించి | సుఖం ఆస్తే | సుఖముగ నిలబడియున్నాడు. |

తా॥ ఇంద్రియములు మనస్సు వీటిని స్వాధీనపరచిన దేహియైనవాడు (దేహముతోగూడి నిలబడువాడు) వివేకమునబడసిన మనస్సుచే సకలకర్మలను తొలగించి, తొమ్మిదివాకిండ్లుగల పట్టణమువంటి దేహమునం దొక్కటియు చేయకయు చేయించకయు ఆనందముగ నిలబడియున్నాడు.

* దేహే అనియొక పాఠముకలదు.

(శంకరభాష్యము) అయితె పరవస్తువును చూచెడివాడు ఎవ్వడు అతడు ఎట్లుండును? అనునది దీనిలో జెప్పబడుచున్నది. ఆ విధముగ పరతత్త్వమును జూచినవాడు నిత్యము నైమిత్తికము, కామ్యము, ప్రతిషిద్ధము అను సకలకర్మలను వివేకబుద్ధిచే తొలగించి అనగా కర్మ మొదలగు వాట్లలో నకర్మనుజూచి, కర్మలను పూర్తిగ విడిచి, సుఖముగ నిలబడియున్నాడు. [నిత్యకర్మ మనగా తప్పక అవశ్యకముగ చేయవలసినవి (సంధ్యావందనము మొదలగునవి). నైమిత్తిక కర్మ మనగా యేదైన ఒకనిమిత్తము వలన కాదగినది (గ్రహణకాలమున స్నానముచేయుటవంటిది). కామ్యకర్మమనగా ఏదైన ప్రయోజనమునుద్దేశించి చేయబడునది. ఇవిచేసియే తీరవలెననునదిలేదు. ప్రతిషిద్ధము చేయదగనిదని నిషేధింపబడినది.] అతడు దేహము వాక్కు మనస్సు వీటివ్యాపారములను విడిచినవాడు, ఆయాసము లేనివాడు, శుద్ధమైన (సంతోషముకల) మనస్సుకలవాడు, ఆత్మనుదప్ప. బయటి ప్రయోజనములన్నియు తొలగినవాడైనందున అతడు సంతోషముగ నిలబడి యున్నాడని చెప్పబడినది. "వశీ" యనుదానికి ఇంద్రియములను జయించి యనిభావము. అతడు ఎచ్చట ఎట్లు నిలబడియున్నాడనునది చెప్పబడుచున్నది. తొమ్మిదివాకిళ్లుగల పట్టణమనునది ఈ దేహము. ఎట్లనగా ఆత్మ, తెలిసికొనుటకు ద్వారములై తలలోగల ద్వారములు (వాకిండ్లు) ఏడు అనగా కండ్లు రెండు, చెవులు రెండు ముక్కుద్వారములు రెండు, నోరొక్కటి, మలజలములను విడచుటకైన క్రిందిద్వారములు రెండు కావున నీ తొమ్మిది ద్వారములతోగూడిన దేహము తొమ్మిది వాకిండ్లుగల పట్టణమనబడినది. అదిపట్టణమువలెనున్నందున పట్టణము అనబడినది. ఈ పట్టణము ఆత్మనే రాజుగగలిగినది. ఈ నగరమునకు ప్రజలు అనగా పంచేంద్రియములు మనస్సు బుద్ధి వాటి విషయములె ఈ ప్రజలందరును ఆ [illegible] సమలకు వ్యాపారములో [illegible] ప్రవరించు
~~~~~~

వారై తమప్రభువైన ఆత్మకు వెలుపలి విషయములను తెలియబరచునట్టి కరణములైనందున ప్రజలనుబోలుదురు. ఇవిచేయు సకలవ్యాపారములున్ను ఆత్మయొక్క ప్రయోజనము కొరకే యగును. ఈ తొమ్మిది వాకిండ్లుగలపట్టణమైన అదేహమున దేహి (ఆత్మ) సకలకర్మలను తొలగించి యేకార్యమును జేయువాడును జేయించువాడును గాకయే సుఖముగ నిలబడి యున్నాడు.

సన్న్యాసియైనను సన్న్యాసికానివాడైనను ప్రతిజీవుడును దేహమునందే నిలబడియున్నందున ఇచ్చట "ఆస్తే" అను విశేషణమునకు ప్రయోజనమేమనగా, దేహము, ఇంద్రియములు వీటి చేరికను ఆత్మగనెరుంగు అజ్ఞానియైన జీవునికే (ఇంటిలోనో నేలమీదనో లేక ఆసనమునందో నిలబడియున్నానను తలంపు కలుగుటవలె) దేహమునందు నిలబడియున్నానను తలంపు గలుగుట లేదు. ఐతే దేహము మొదలగు వాటిచేరికకంటె వేరుగ నాత్మనెరుంగు జ్ఞానికి దేహమునందు నిలబడియున్నానను తలంపుగలుగును. సకలకర్మలనువిడిచిన జ్ఞాని గృహమున తానుండుటవలె తొమ్మిదివాకిళ్ల పట్టణమైన దేహములో ప్రారబ్ధకర్మ ముగియువరకు నిలబడియుండుట యనునది తగును. కావుననే ఈ విశేషణము జ్ఞానిఅజ్ఞాని వీరల తలంపుల భేదమును గుర్తించుచున్నది. జ్ఞాని, దేహము ఇంద్రియము వీటివ్యాపారములను తొలగించుచున్నవాడైనను తెలుపురంగు పాలతో జేరియుండుటవలె, చేయువాడుగను చేయించువాడుగను ఉన్నట్టి స్వభావము ఆత్మతోకలసి యుండవచ్చునని సందేహము కలుగకుండుటకై "నైవ కుర్వ౯ నకారయ౯" అని చెప్పబడిన విశేషణము ఆత్మకు ఇవి స్వభావముగనే లేవనుదానిని గుర్తించుచున్నది. "అవికార్యోఽయం" అని 2వ అధ్యా-25-శ్లోకములోను, "శరీరస్థోపి న కరోతి న లిప్యతే" అని 13వ అధ్యా 32వ శ్లోకమునందును చెప్పబడియున్నది. "ధ్యాయతీవ లేలాయ తీవ = ఆత్మ ధ్యానించుటవలెను కదలుటవలెను ఉన్నది." అను బృహదారణ్యకము (4-3-7) శ్రుతిచేతను దీనినెరుంగుడు.

(స్వకీయము) దేహము 9 ద్వారములును గలదైనందున ఆదేహము తొమ్మిది వాకిళ్లుగల పట్టణముతో సమానముగ వర్ణింపబడినది. దేహమునందలి తొమ్మిదివాకిండ్లు ఏవనగా-కండ్లు2, చెవులు 2, ముక్కు 2, నోరు 1, పాయువు 1, ఉపస్థము 1, మొత్తము తొమ్మిది. పట్టణమును ఉపమానముగ జెప్పిన భావమేమనగా తొమ్మిది వాకిండ్లు గల ఒకకోటయందుండి తానుగను తన మంత్రి మొదలగు పరివారముల మూలముగను పలువిషయములలో ప్రవర్తించియు పలువ్యాపారములను జేయుచుండియు జేయించుకొనియు చాలకాలము రాజ్యతంత్రము నడపిన ఒకరాజు రాజ్యాధికారమున ద్వేషము గలిగి ఆయధికారమును మరియొకని వశముచేసి అపట్టణమునందే నివసించుచున్నాడు. అతడు అపట్టణములోనే నివసించుచున్నను రాజ్యతంత్రమువలన గలుగు సకలదుఃఖములును ఆరాజును విడనాడగా చింతలేక ఆరాజుఎట్లు సుఖముగనుండునో ఆవిధమున దేహమనే కోటలోనుండి ఇంద్రియములు మనస్సు బుద్ధి, అహంకారము, దేహము వీటివలన జేయబడు సకలకర్మలను తానే చేయునదిగను ఇంద్రియాదులనుగొని తానుచేయించునదిగను భ్రమించిదానివలన సుఖదుఃఖములు తనవని భావించివచ్చిన ఈ ఆత్మయైనవాడు జ్ఞానమునుపొంది తాననుభవించుచుండిన సుఖదుఃఖాదులు తనవికావు, దేహేంద్రియాదుల వ్యాపారమునకు తాను కర్తకాదని ఎరింగినచో, అట్లెరింగిన పిదప దేహాదులవలన వాటివ్యాపారము జరుగుచుండినను వాటిసంబంధమును విడిచి దేహములో సుఖముగనుండును. అనుదానిని స్పష్టపరచుటకై పట్టణము దృష్టాంతముగ జెప్పబడినది.

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావస్తుప్రవర్తతే ॥ 14

పద॥ న - క ర్తృత్వం - న - కర్మాణి - లోకస్య --సృజతి - ప్రభుః (1) ।
న - కర్మఫలసంయోగం - స్వభావః - తు - ప్రవర్తతే ॥

| | | | |
|---|---|---|---|
| ప్రభుః | ప్రభువు (ఆత్మ) | కర్మఫలసంయోగం | కర్మయొక్క ఫలముతో కలియుటను |
| లోకస్య | లోకమునకు | న (సృజతి) | సృష్టింపలేదు. |
| కర్తృత్వం | కర్తృత్వమును | స్వభావస్తు | స్వభావమనునదే |
| నసృజతి | సృష్టించలేదు | ప్రవర్తతే | ప్రవర్తించుచున్నది. |
| కర్మాణి | కర్మలను | | |
| న (సృజతి) | సృష్టింపలేదు | | |

తా॥ దేహమునకు అధిపతియైన ఆత్మయనే ప్రభువు లోకమునకు కర్తృత్వమునుగాని, కర్మలనుగాని, కర్మఫలము నందాసక్తినిగాని కలుగ జేయలేదు. స్వభావమనునదే అనగా మాయయే ప్రవర్తించుచున్నది (కర్తృత్వము మొదలైనది, మాయయొక్క గుణముచే కలిగినదని తాత్పర్యము).

(1) ప్రభుః - ఈశ్వరుడు (శ్రీధరులు) పరిపాలకుడని భావము. రాబోవు శ్లోకమున 'విభుః' అనుప్రయోగమునున్ను చూడుడు.

(శంకరభాష్యము) కర్తయగుటను ఆత్మ కలుగజేయదు. అనగా "నీవు దీనిని చేయుము" అనితానుగ ఆత్మఒకనిని ప్రేరేపించుటలేదు. ఒకడుతాను పొందగోరిన బండ్లు, ఘటములు, గృహములు మొదలగువాటినిగూడ ఆత్మ లోకమునకై కలుగజేయుటలేదు. మరియు బండిమొదలగు వాటినిజేసినవాడు ఆవ్యాపారముయొక్క ఫలముతో కలియుటనుగూడ ఆత్మ కలుగజేయుటలేదు. ఆత్మస్వయముగ నొకదానిని జేయుటయు చేయించుటయు లేనిచో అప్పుడేది చేయునదిగను చేయించునదిగను నున్నదనగా, స్వభావమనునదే. ఆదేమనగా, అవిద్య ప్రకృతి త్రిగుణమయమైన మాయ చేష్టించుచున్నది. ''దైవీహ్యేషాగుణమయీ మమమాయా'' అనిరాబోవు 7వ అధ్యా-14-వశ్లోకమునందు చెప్పబడియుండుటను చూడుడు.

(రామానుజులు) లోకస్య = దేవమనుష్య పశుపక్షిస్థావరాది రూపములైనదియు, ప్రకృతి సంబంధముతోకూడియున్నదియునైన ఈ లోకమునకు, కర్తృత్వం = దేవమనుష్యాదులలో వారి వారికి ప్రత్యేకించిన కర్తృత్వమునున్ను, కర్మాణి = వారివారికి ప్రత్యేకించిన కర్మలనున్ను, కర్మఫలసంయోగం = ఆయాకర్మలవలన కలిగిన ఫలములలో వారి వారికి ప్రత్యేకించిన సంబంధమునున్ను, ప్రభుః = కర్మబంధముతొలగి తనస్వరూపముతోనున్న ఆత్మ, నసృజతి = కలుగజేయుటలేదు, స్వభావస్తు = ప్రకృతివాసనయై అనాదికాలముగ వెంబడించివచ్చుచున్న పూర్వకర్మలవలన కలిగిన దేవమనుష్యాద్యాకారములైన ప్రకృతి సంబంధమువలన గలిగిన దేహాభిమానవాసనయనునది, ప్రవర్తతే = కలుగజేయుచున్నది. కర్తృత్వాదులు స్వభావమువలన గలిగినవేగాని ఆత్మకు కర్తృత్వములేదు.

(రాఘవేంద్రులు) ప్రభుః = జడవస్తువులకంటె సమర్థుడైనజీవుడు, లోకస్య = జనులకుగాని తనకుగాని, కర్తృత్వం = కర్తృత్వమునుగాని, కర్మాణి = కర్మలనుగాని, కర్మఫలసంయోగం= కర్మఫలమునందాసక్తినిగాని. నసృజతి=స్వతంత్రముగ కలుగచేయుటయందుగాని, తాను పొందుటయందుగాని శక్తుడుకాడు. స్వభావస్తు = స్వతంత్రుడుగ సకలమును కలుగచేయునట్టి ఈశ్వరుడు, ప్రవర్తతే = స్వతంత్రుడుగ కలుగచేయుచున్నాడు. లేక, ప్రభుః = ఈశ్వరుడు, లోకస్య = జీవులకు,

కర్తృత్వం =కర్తృత్వము, కర్మాణి = కర్మలు, కర్మఫల సంయోగంచ = కర్మఫల సంబంధము వీటిలో, న సృజతి = స్వాతంత్ర్యమిచ్చుటలేదు.

శ్లో॥ నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః॥　　15

పద॥ న - ఆదత్తే - కస్యచిత్ - పాపం - న - చ - ఏవ - సుకృతం - విభుః।
అజ్ఞానేన - ఆవృతం - జ్ఞానం - తేన - ముహ్యన్తి - జన్తవః॥

| | | | |
|---|---|---|---|
| విభుః | అంతట నిండిన ఆత్మ | జ్ఞానం | జ్ఞానము |
| కస్యచిత్ | ఒకనియొక్క | అజ్ఞానేన | అజ్ఞానముచేత |
| పాపం | పాపమునున్ను | ఆవృతం | మూయబడియున్నది. |
| నైవాదత్తే | తీసుకొనుటయేలేదు. | తేన | దానిచేత |
| సుకృతం చ | పుణ్యమునున్ను | జన్తవః | ప్రాణులు |
| నైవఅదత్తే | తీసుకొనుటయేలేదు. | ముహ్యన్తి | మోహమును పొందియున్నవి |

తా॥ అంతటనిండిన పరమాత్మ ఒకని పాపమునుగాని పుణ్యమునుగాని తీసికొనుటలేదు. జ్ఞానము అజ్ఞానముచేత మూయబడియున్నది. దానిచే ప్రాణులు మోహమును పొందియున్నవి.

(శంకరులు) ఒకడు వాస్తవమున భక్తుడైయున్నను వాని పుణ్యమునుగాని, లేక, భక్తులచే చేయబడిన పాపమునుగాని, సర్వవ్యాపిమైన పరమాత్మ తీసికొనుటలేదు. అట్లైన భక్తులచే పూజ, యాగము, దానము, హోమము మొదలగు సత్కర్మలు ఎందులకై చేయబడుచున్నవనినచో, వివేకజ్ఞానము అజ్ఞానముచే మూయబడియున్నది. కావున వివేకములేని సంసారులైన ప్రాణులు "నేనుచేయుచున్నాను, చేయించుచున్నాను. అనుభవించుచున్నాను, అనుభవించునట్లు చేయుచున్నాను" అని మోహమువలన తలంచుచున్నారు. (ఈ మోహము నివర్తించుటకొరకే సత్కర్మలు చేయబడుచున్నవి.)

(శ్రీధరులు) ఈశ్వరుడు సర్వత్ర సమముగనున్నాడను జ్ఞానము, శిక్షగూడ అను గ్రహమేయని యెరుంగనట్టి అజ్ఞానముచేత మూయబడియున్నది. దానిచే, తమపూర్వకర్మాను సారముగ దుఃఖముననుభవించునప్పుడు భగవంతుడు పక్షపాతియని తలంచుచున్నారు.

(రామానుజులు) విభుః = ఆత్మ (జీవుడు) కస్యచిత్ = పుత్రమిత్రులయొక్క, పాపం = పాపఫలమైన దుఃఖమును, నాదత్తే = పోగొట్టుటలేదు. అనగా తనవాడను నభిమానముచే ఆ పాపమునకు పరిహారము జేయుటగాని దానిని తాను గ్రహించుకొనుటగాని, యేర్పడుటలేదు. కస్యచిత్ = శత్రువైన, ఒకనియొక్క, సుకృతం = పుణ్యఫలమైన శుభమును, నాదత్తే = పోగొట్టుటలేదు. ఏలనగా, విభుః = గుర్తించిన ఒక దేశమునందుండెడివాడు కాదు. అనగా అంతట వ్యాపించిన వాడు. ఇతనికి పుత్రమిత్రులనియులేరు, ద్వేషియులేదు గనుక ఒకని పాపపుణ్యములను పోగొట్ట కారణమేలేదు. అయితే లోకములో ద్వేషి బంధువు అని వ్యవహరింపబడుచున్నదిగదా యనినచో ఆ వ్యవహారము పూర్వకర్మ వాసనవలన కలిగినది. ఎట్లనగా "అజ్ఞానేనావృతంజ్ఞానం = సుఖస్వరూపమైన జ్ఞానము అజ్ఞానముచే కప్పబడియున్నది" దానివలన బంధువు, ద్వేషియనునభిమానము కలుగుచున్నది.

(రాఘవేంద్రులు) విభుః = జీవుడు, కస్యచిత్ పాపంనాదత్తే = ఒకదుష్కర్మకు ఫల మైన పాపమును స్వతంత్రముగ పొందుటకుగాని, కస్యచిత్ సుకృతం - ఒకసత్కర్మకు ఫలమైన పుణ్యమును స్వతంత్రముగ పొందుటకుగాని శక్తుడుకాడు. ఈశ్వరుడే ఆ కర్మఫలముల నివ్వశక్తుడు. లేక విభుః = ఈశ్వరునికి పాపకర్మగాని పుణ్యకర్మగాని ఏదియు లేనందున ఆ కర్మఫలము నతనికి లేదు. పాపపుణ్యఫలములులేని ఈశ్వరుడొకడున్నచో ఏలకనబడుట లేదనగా జీవునిజ్ఞానము అజ్ఞాన ముచే కప్పబడి యున్నందున ఈశ్వరుని ఎరుంగలేదు.



శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః *।
తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరం॥ 16

పద॥ జ్ఞానేన - తు - తత్ - అజ్ఞానం - యేషాం - నాశితం - ఆత్మనః ।
తేషాం - అదిత్యవత్ - జ్ఞానం - ప్రకాశయతి - తత్ - పరం (1) ॥

| | | | |
|---|---|---|---|
| యేషాం | ఎవరియొక్క | తేషాం తుజ్ఞానం | వారలకే, జ్ఞానము |
| తదజ్ఞానం | ఆ యజ్ఞానము | ఆదిత్యవత్ | సూర్యునివలె |
| ఆత్మనః జ్ఞానేన | ఆత్మనుగూర్చిన జ్ఞానముచేత | తత్పరం | ఆ పరవస్తువును |
| నాశితం | నశింప జేయబడియున్నదో | ప్రకాశయతి | ప్రకాశింప జేయుచున్నది. |

తా॥ ఎవ్వరియొక్క ఆ యజ్ఞానము ఆత్మనుగూర్చిన జ్ఞానముచేత నశింప జేయబడియున్నదో వారలకే జ్ఞానము సూర్యునివలె పరబ్రహ్మస్వరూపమును ప్రకాశింప జేయుచున్నది. సూర్యుని ప్రకాశము అంధకారమును పోగొట్టి వస్తువులను ప్రకాశింపజేయుటవలె ప్రకాశింపజేయుచున్నది.

* 'ఆత్మనాం' అనియుపాఠము. ఆత్మలయొక్క అనియర్థము.

(1) తత్పరం - పరిపూర్ణమైన ఈశ్వరస్వరూపమును (శ్రీధరులు)

(శంకరులు) ఏ అజ్ఞానముచే మూయబడి ప్రాణులు మైకమొందుచున్నవో ఆయజ్ఞానము ఆత్మనుగూర్చిన వివేకబుద్ధిచే నశింపచేయబడినయెడల అప్పుడాప్రాణులకు అట్టి జ్ఞానము సూర్యుడు ప్రపంచమునందలి వస్తువుల సమూహములన్నిటిని స్పష్టముగ కనబరపించుటవలె ఎరుంగవలసిన పరమార్థతత్త్వమైన ఆపరవస్తువంతయు బాగుగ తెలియునట్లు చేయుచున్నది.

(రామానుజులు) యేషామాత్మనాం = ప్రకృతినుండి విముక్తిచెందియున్న ఆత్మల యొక్క, అజ్ఞానం = అనాదికాలముగ ప్రవర్తించియున్న కర్మల సమూహములైన అజ్ఞానము, జ్ఞానేన = యేజ్ఞానముచేత అనగా ఆత్మస్వరూపవిషయ పరిపూర్ణజ్ఞానముచేత, నాశితం = నశింపజేయ బడినదో, తేషాం = ఆయజ్ఞానము నివర్తించిన వారలయొక్క, తత్పరంజ్ఞానం = పరిపూర్ణమైనట్టియు స్వభావమైనదియునైన ఆజ్ఞానము, ఆదిత్యవత్ = సూర్యునిప్రకాశమువలె, ప్రకాశయతి = సకలమును ప్రకాశింప చేయుచున్నది. ఎవ్వరియజ్ఞానము నశించెనో, 'తేషాం = వార్లయొక్క' అనుబహు వచనము జీవస్వరూపము అనేకమనుదానిని చూపుచున్నది. అవిద్యచే అనేకముగ తోచుచున్నదే గాని వాస్తవమునందొక్కటేయను పక్షము సరియైనదికాదు. ఏలనగా అవిద్యవశించిన పిదపను అనేకమను నర్థము దీనిలో జెప్పబడియుండుటవలన జీవులు పలువురనియు జీవేశ్వర భేదమును నదియు నేర్పడుచున్నది.

శ్లో॥ తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః * ॥ 17

పద॥ తద్బుద్ధయః (1) - తదాత్మానః (2) - తన్నిష్ఠాః (3) - తత్పరాయణాః (4) ।
గచ్ఛన్తి - అపునరావృత్తిం (5) - జ్ఞాననిర్ధూతకల్మషాః ॥

| | | | |
|---|---|---|---|
| తద్బుద్ధయః | (పరమార్థ తత్త్వమైన) దానిలో బుద్ధిగలవారుగను | జ్ఞాననిర్ధూతకల్మషాః | జ్ఞానముచే పాపములను పోగొట్టుకొన్నవారుగను ఉన్నవారు |
| తదాత్మానః | దానినే ఆత్మగ గొన్నవారుగను | | |
| తన్నిష్ఠాః | దానియందే నిలకడ చెందినవారుగను | అపునరావృత్తిం | మరల పుట్టకుండుటను (మోక్షమును) |
| తత్పరాయణాః | దానినే పరమగతిగ(శరణముగ) పొందినవారుగను | గచ్ఛన్తి | పొందుచున్నారు |

తా॥ బ్రహ్మమునందు బుద్ధిస్థైర్యము గలవారుగను, బ్రహ్మమునే తమ యాత్మగ నెంచువారుగను, బ్రహ్మనిష్ఠులుగను అనగా బ్రహ్మమునందే స్థితి గలవారుగను, బ్రహ్మమునే పరమగతిగ పొందినవారుగను, జ్ఞానముచే సకల పాపములను పోగొట్టుకొన్నవారుగను ఉన్నవారు మరల జననమరణరూపమైన సంసారమునకు రాజాలని స్థానమైన మోక్షమును పొందుచున్నారు.

* ఈ శ్లోకమును కూర్మపురాణము 12 వ అధ్యాయమున చూడుడు.

(1) తద్బుద్ధయః - తమయాత్మస్వరూపదర్శనమున నిశ్చయజ్ఞానము గలవారుగను (రామానుజులు). నిశ్చయమైన బ్రహ్మజ్ఞానము గలవారుగను (శ్రీధరులు).

(2) తదాత్మానః - బ్రహ్మమే తమయాత్మగ గలవారు, తానే బ్రహ్మమను నిశ్చయము గలవారు (శంకరులు). ఆత్మస్వరూపదర్శనమున మనస్సును ప్రవర్తింపజేయువారు (రామానుజులు). తనకు పరమాత్మయే యజమానుడని తలంచువారు (రాఘవేంద్రులు). బ్రహ్మమునందు నిలకడ చెందిన మనస్సుగలవారు (శ్రీధరులు).

(3) తన్నిష్ఠాః - ఆత్మస్వరూపమునందెల్లప్పుడు అభ్యాసము గలవారు (రామానుజులు) అచంచలమైన బ్రహ్మనిష్ఠగలవారు (రాఘవేంద్రులు).

(4) తత్పరాయణాః - తనయాత్మ స్వరూపము నెరుంగుటయే పరమప్రయోజనమని తలంచినవారు (రామానుజులు) బ్రహ్మమే ఆశ్రయముగ గలవారు (శ్రీధరులు).

(5) అపునరావృత్తి - పునర్జననములేని తన ముక్తి స్వరూపమును (రామానుజులు).

(శంకరులు) జ్ఞానముచే ప్రకాశింపజేయబడిన పరవస్తువైన పరమార్థతత్త్వమేదో దానిలో బుద్ధిగలవారు అనగా బ్రహ్మమునందు బుద్ధి ప్రవర్తించినవారు. దానినే పరబ్రహ్మమునే తన యాత్మగ చూచెడి వారలుగను బ్రహ్మమునందే నిష్ఠగలవారు, అనగా సకల కర్మలను విడచి బ్రహ్మమునందే తమస్థితి గలవారు. అదియే ఎవ్వరికి శ్రేష్ఠమైన ఆశ్రయముగనున్నదో వారుదానినే గొప్ప శరణముగగైకొన్నవారు. ఆత్మ యొకదానియందే సంతోషము పొందియున్నవారు అని

భావము. ఎవ్వరి అజ్ఞానము ఆత్మనుగూర్చిన జ్ఞానముచే నశింపజేయబడియున్నదో వారు పైజెప్పిన విధమైనస్థితిని గలవారై మరల సంసారమునకు రాకుండుటను, అనగా మరల దేహముతో గూడుట లేనితనమును పొందుచున్నారు. సంసారకారణమైన పాపము మొదలగు అహితములు, మునుపు చెప్పిన జ్ఞానముచే ఎవ్వరికి నశింపజేయబడియున్నవో వారు జ్ఞానముచే పాపము పోగొట్టబడినవారు, మతులు అని తాత్పర్యము.

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః * ॥ 18

పద॥ విద్యావినయసంపన్నే - బ్రాహ్మణే - గవి - హస్తిని।
శుని - చ - ఏవ - శ్వపాకే - చ - పణ్డితాః - సమదర్శినః ॥

| | | | |
|---|---|---|---|
| పండితాః | జ్ఞానులు | శ్వపాకేచ | కుక్కను వండిభుజించు చండాలునియందును |
| విద్యావినయసంపన్నే | విద్య, శాంతము. ఇవిగల | | |
| బ్రాహ్మణే | బ్రాహ్మణునియందును | సమదర్శినః ఏవ | సమముగ బ్రహ్మమును చూచు స్వభావముగలవారుగనే యున్నారు. |
| గవి | గోవునందును | | |
| హస్తిని | ఏనుగునందును | | |
| శునిచ | కుక్కయందును | | |

తా॥ జ్ఞానులు, విద్య శాంతము వీటితోగూడిన బ్రాహ్మణుని యెడను, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కనువండి భుజించు చండాలునియందును సమదర్శులుగనే, అనగా సమముగ నిర్వికారిగనున్న బ్రహ్మమును వాట్లలో వ్యత్యాసములేక చూచువారలుగనే యున్నారు.

* ఈ శ్లోకమును బ్రహ్మపురాణము అధ్యాయము 126 శ్లో-14 లో చూడుడు.

(శంకరభాష్యము) ఎవ్వరి యజ్ఞానము ఆత్మనుగూర్చిన జ్ఞానముచే నశింపజేయబడి యున్నదో ఆ జ్ఞానులు ఎట్లు ఆ తత్త్వమును చూచుచున్నారనునది చెప్పబడుచున్నది.

విద్యయు, శాంతముగూడిన విద్వాంసుడై వినయముగల బ్రాహ్మణుడెవ్వడో వానియందును, అనగా బ్రహ్మవిద్య, వినయము, వైదికసంస్కారము, సత్త్వగుణము ఇవిగల ఉత్తముడైన బ్రాహ్మణునియందును, రజోగుణముగలదై వైదిక సంస్కారము లేనిదై మధ్యమమైన గోవునందును, వట్టి తమోగుణము గల అధమముగనున్న యేనుగు మొదలగువాటి యందును సమముగ బ్రహ్మమొకేదానినే చూచెడివారలు జ్ఞానులు.

సత్త్వము మొదలగు గుణములున్ను వాటివలన గలుగు సత్త్వమైన వాసనలు, రాజసమైన వాసనలు, తామసమైన వాసనలు, వీటిలో నేదియు తన్నుకలియుటలేనిదై సమమై ఏకమై నిర్వికారియైయున్న ఆబ్రహ్మమును చూచెడి స్వభావమెవ్వరికిగలదో వారలు జ్ఞానులు సమదర్శులు

(రామానుజులు) పణ్డితాః = ప్రకృతివిముక్తమైన ఆత్మస్వరూపము నెరింగినవారలు, సమదర్శినః = సకలజీవ స్వరూపమున్ను జ్ఞానాకారమై సమమైనదని యెరుంగుచున్నారు.

(రాఘవేంద్రులు) సమదర్శినః = ఉత్తమ - మధ్యమ - నికృష్టప్రాణులయెడ సకలగుణ పరిపూర్ణుడైన పరమాత్మ అంతర్యామియై సమముగనున్నాడని యెరుంగువారలు. అనగా ఉత్తమమైన

వస్తువున పరమాత్మ పూర్ణముగను, నికృష్టమైన వస్తువున స్వల్పముగను ఉన్నట్లు అజ్ఞానులు తలంతురు. వివేకులు అంతట పరమాత్మ సమానముగనున్నట్లు చూచెదరనునది తాత్పర్యము.

(స్వకీయము) బ్రాహ్మణుడు మొదలైన అందరియెడ బ్రహ్మమును సమముగ జూచెడి వారలు జ్ఞానులని చెప్పబడుచున్నారు అని శ్రీధరులు అన్వయపరచియున్నారు.



శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥ 19

పద॥ ఇహ (1) - ఏవ - తైః - జితః - సర్గః - యేషాం - సామ్యే(2) - స్థితం - మనః
నిర్దోషం - హి - సమం - బ్రహ్మ - తస్మాత్ - బ్రహ్మణి - తే - స్థితాః ॥

| | | | |
|---|---|---|---|
| యేషాం | ఎవరియొక్క | జితః | జయింపబడినది. |
| మనః | మనస్సు | హి | ఏలనగా |
| సామ్యే | సర్వమునందును బ్రహ్మమును సమముగ జూచుటలో | బ్రహ్మ | బ్రహ్మము |
| | | నిర్దోషం | దోషములేనిది |
| స్థితం | స్థిరముగనున్నదో | సమం | సమమైనది |
| తైః | వారిచే | తస్మాత్ | అందువలన |
| ఇహైవ | ఈ దేహముతో నుండునప్పుడే | తే | వారు |
| సర్గః | జననము (జననమరణరూప సంసారము) | బ్రహ్మణి | బ్రహ్మమునందు |
| | | స్థితాః | స్థిరముగ నుండువారు |

తా॥ ఎవ్వరి మనస్సు సకలమునందును బ్రహ్మమును సమముగ జూచుటలో స్థిరముగనున్నదో ఆ సమదర్శులైన జ్ఞానులచే ఈ శరీరముతో నుండునప్పుడే జననమరణరూపమగు సంసారము జయింపబడినది (వశపరచుకొనబడినది). ఏలనగా బ్రహ్మము దోషములేనిదిగను సమముగను (ఏకముగను) ఉన్నందున బ్రహ్మమునందే వారు స్థిరపడి యుండువారు.

(1) ఇహ - అనుదానికి 'ఈలోకమునందు' అనికొందరు అర్థముచేసియున్నారు.

(2) సామ్యే - కల్యాణగుణములు, దోషములేమి వీటిలో సమముగనున్న (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) "సమాసమాభ్యాం విషమసమే పూజాతః" అను గౌతమస్మృతి (17-20) వాక్యప్రకారముగ తనకు సమమైనవారలను సమముగాకను, సమానులుగాక తక్కువైన వార్లను తనకు సమముగను గౌరవించినవాని అన్నమును భుజింపగూడదు. కావున మునుపటి శ్లోకమునందు జెప్పిన సమదర్శులు ఇతరులు భుజింపరాని అన్నము కలవారలగుచున్నారుగదా? దానివలన వారలు పాపులగుచున్నారుగదా? అనియడుగుపక్షమున వారలట్లు కాజాలరు. అది యేకారణమువలననునది ఈ శ్లోకమున జెప్పబడుచున్నది.

ఎవ్వరిమనస్సు, లేక అంతఃకరణము 'బ్రహ్మము సకల భూతములలోను సమముగ నున్నద'నుస్థితిలో చలింపకనిలబడునో ఆసమదర్శులైన జ్ఞానులు ఈశరీరముతో గూడియున్నప్పుడే జనన మరణములను జయించినవారలు. అనగా వశపరచుకొన్నవారలు. కుక్కను భుజించు చండాలుడు మొదలగువారల అపవిత్రమైన శరీరముతోగూడి ఆత్మ ఆయపవిత్రతలచేదోషముగల

వానివలెమూఢులచేతలంపబడినను అదిగుణభేదమువలన కలుగు విరోధములేనిదైదోషములేనిదై శుద్ధముగనున్నది. అది నిర్గుణము కావున స్వగుణ భేదమువలన వెవ్వేరైనదిగ లేదు. చైతన్యమునకు గుణములేనందున ననుడు. శ్రీభగవంతుడుగూడ ముందురాబోవు 13వ అధ్యా-6వ శ్లోకమున ఇచ్ఛమొదలైనది శరీరధర్మమనియు, "అనాదిత్వాన్నిర్గుణత్వాత్" అని 13వ అధ్యాయము 31 శ్లోకమునందును జెప్పుచున్నారు. (వైశేషికులు జెప్పునట్లు) ఆత్మను వెవ్వేరుగ వేరుబరచు అంత్యవిశేషములు గూడలేవు. ఏలనగా ప్రతిశరీరమునందును అవి కలవనుదానికి ప్రమాణము కుదురనందున నేయనుడు. ప్రతిశరీరమునందును ఆత్మవెవ్వేరుగ నున్నదనునది కుదిరినచో అప్పుడు అంత్యవిశేషములు ఆత్మయెడ కలవనుట కుదురును. మరియునవి కలవనికుదిరిననే ఆత్మప్రతిశరీరమునందును వెవ్వేరుగ కలదనుటకుదురును. కావున ఈవిధముగ నొకదానిపై మరియొకటి యాధారపడుట యను (అన్యోన్యాశ్రయ) దోషమువచ్చుటను జూడుడు. వైశేషికుల మతానుసారముగ అంత్యవిశేషమనగా ఒకనిత్యవస్తువును మరియొక నిత్యవస్తువునుండి వేరుపరచు లక్షణము. ఉదాహరణము- నీటిపరమాణువులను నిప్పుపరమాణువులనుండి వేరుబరచునదేదో అదియంత్య విశేషము. అనగా కడపటి గుర్తులనబడును. ఈలక్షణము ఎత్తిజెప్పవీలులేనిది (ఆనందగిరి)

కావున బ్రహ్మము సమముగను ఏకముగను ఉన్నది. గనుకనే పండితులు (జ్ఞానులు) బ్రహ్మమునందే నిలకడ జెందినవారలైరి దేహము మొదలగువాటి చేరికయే ఆత్మయను నభిమానమున్ను, నేనను అహంకారమున్ను వారలకు లేనందున అ పవిత్రతయొక్క వాసనగూడ జ్ఞానులకు చేరదు.

దేహము మొదలగువాటిచేరికయే ఆత్మగనభిమానించి "నేను" అను నహంకారముతో గూడియున్నవారలకు మాత్రమే "సమాసమాభ్యాం" అనిపూర్వము చెప్పిన (గౌతమ) సూత్రము తగును. ఏలనగా అదిపూజింపబడువారల విశేషస్వభావమును గుర్తించి నిలబడు చున్నది. "ఇతడు బ్రహ్మము నెరింగినవాడు, ఇతడు అనుశాస్త్రముల నెరింగినవాడు, ఇతడు నాలుగువేదముల నెరింగినవాడు" అనుగుణవిశేషములుకుదిరియున్నవను భావనయేగదా గౌరవించుట, దానమిచ్చుట మొదలగువాటిలో ముఖ్యకారణములుగ కనబడుచున్నవి. అయితే బ్రహ్మమనగా నెట్టిగుణముతోను ఎట్టి దోషముతోను సంబంధపడనందున, 'వారలు బ్రహ్మమునందు స్థైర్యముపొందినవారలు' అను కారణము చెప్పబడినది. మరియు "సమాసమాభ్యాం" అనిమొదలు పెట్టు సూత్రము కర్మవిషయమును గూర్చినది. కాని ఈప్రకరణమన్ననో "సర్వకర్మాణిమనసా" అను ఈయధ్యాయము 13వశ్లోకము మొదలు అధ్యాయము కొనవరకు సర్వకర్మ సన్న్యాసమును జెప్పబూనినదై యున్నది.

(శ్రీధరులు) తనతోసమానులైన వార్లను తక్కువగను, తక్కువైనవార్లను సమానముగను గౌరవించువానికి ఈలోకమునందును పరలోకమునందును నిందయే కలుగుచున్నదని గౌతమ మహర్షి చెప్పియున్నాడుగదా? అట్లుండగా సకలమును సమముగ నెట్లుజూడదగుననినచో ఆత్మ స్వరూప జ్ఞానమెవ్వనికి కలుగలేదో అతనికి తారతమ్యజ్ఞానము చెప్పబడినదేగాని ఆత్మస్వరూప జ్ఞానముగలవానికి తారతమ్యజ్ఞానము చెప్పబడలేదు.

(రామానుజులు) సామ్యే = ప్రకృతివిముక్తమైన ఆత్మస్వరూపములన్నియు సమములను విషయమున, యేషాంమనఃస్థితం = ఎవ్వరిమనస్సు స్థిరముగనున్నదో, తైః = వారిచేత, ఇహైవ= సాధనానుష్ఠాన సమయమునందే, సర్గఃజితః=జననమరణములు జయింపబడినవి. నిర్దోషం=ప్రకృతి సంబంధదోషములేనిదియు, సమంహి = సకలమునందును జ్ఞానస్వరూపముగనేయున్నట్టిదే ఆత్మ

బ్రహ్మ = బ్రహ్మమని చెప్పబడుచున్నది. తే = ఆ ప్రకృతి విముక్తులైన ఆత్మస్వరూపులు, బ్రహ్మణి స్థితాః = జ్ఞానాకార స్వరూపముతోనున్నారు.

శ్లో॥ న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియం।
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః॥ 20

పద॥ న - ప్రహృష్యేత్ - ప్రియం - ప్రాప్య - న - ఉద్విజేత్ - ప్రాప్య - చ - అప్రియం।
స్థిరబుద్ధిః - అసంమూఢః (1) - బ్రహ్మవిత్ (2) - బ్రహ్మణి - స్థితః॥

| | | | |
|---|---|---|---|
| స్థిరబుద్ధిః | బ్రహ్మమునందు స్థిరమైనబుద్ధి గలవాడుగను | బ్రహ్మణి స్థితః | బ్రహ్మమున నిలకడజెందినవాడుగనున్నవాడు |
| అసంమూఢః | మోహములేనివాడుగను | ప్రియంప్రాప్య న ప్రహృష్యేత్ | ప్రియమైనదానిని పొందినచో సంతోషింపడు |
| బ్రహ్మవిత్ | బ్రహ్మమునెరింగినవాడుగను | అప్రియంప్రాప్యచ నోద్విజేత్ | ప్రియముకానిదానినిపొందియు వ్యసనింపడు. |

తా॥ బ్రహ్మమునందు స్థిరమైనబుద్ధిగలవాడై, మోహములేనివాడై, బ్రహ్మము నెరింగినవాడై, బ్రహ్మమునందు స్థిరముగనున్నవాడు ఇష్టమైనదానిని పొందిన సంతోషమునుగాని, ఇష్టము కానిదానినిపొందినవ్యసనముగానిపొందడు.

(1) అసమ్మూఢః - దేహమే యాత్మయని తలంచనివాడు (రామానుజులు), తాను స్వతంత్రుడు అజ్ఞానములేనివాడు (రాఘవేంద్రులు)

(2) బ్రహ్మవిత్ - పరమాత్ముడే స్వతంత్రుడని యెరింగినవాడు (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము, ఆత్మయైన బ్రహ్మము దోషములేనిదిగను సమమైనదిగను ఉన్నందున "సకల భూతములయందును ఆత్మ అట్లు ఏకమైసమమైయున్నది" అని సంశయములేని నిశ్చితమైన దృఢమైన బుద్ధి యెవ్వనికిగలదో అతడు మోహములేనివాడు. బ్రహ్మము నెరింగినవాడు. బ్రహ్మమున స్థిరముగనున్నవాడు. కర్మలను జేయనివాడు. సర్వకర్మ సన్న్యాసి. దేహమునే ఆత్మగ తలంచువారలకు ఇష్టమైన వస్తువనియు ఇష్టముకాని వస్తువనియుఉండి, వాటివలన సంతోషము దుఃఖము అనునవియు కలుగగలవు. కేవలము ఆత్మనే ఉన్నట్లు చూచెడివారికి సంతోషముగాని దుఃఖముగాని కలుగనేరవు. ఏలనగా ఆత్మకు ఒకప్పుడున్ను ప్రియమైనది, ప్రియముకానిది అనునదిలేదు. కావుననే బ్రహ్మమున స్థిరముగ నుండువాడు ప్రియమైన దానినిపొంది సంతోషించుటయు సంభవించదు. ప్రియము కానిదానిని పొంది దుఃఖించుటకును వీలులేదు.

(రామానుజులు) (మునుపటి శ్లోకమున జేసినవిధముగనే బ్రహ్మ పరముగజెప్పియున్న వాటి నన్నిటిని ఆత్మపరముగ నీశ్లోకమునందును అర్థముచేసి యుండుటయే వ్యత్యాసము. మిగతవి మారు పడవు.)

(స్వకీయము) ఇట్టి బ్రహ్మనిష్ఠునకు ఇష్టానిష్టము లెట్లుకలుగుననగా అతని కిష్టమైనదియు, అనిష్టమైనదియు లేదనునది నిశ్చయము. ఐనను ప్రారబ్ధకర్మము వానినీదేహమున్నంతవరకు విడు

వదు. దాని నతడు అనుభవించియే తీరవలెను. అట్లనుభవించునప్పుడు ఆ దేహమునకు కలుగుచున్న ఇష్టానిష్టములను అతడనుభవించుటయేలేదు. ఐనను అతడనుభవించుచున్నట్లు ఇతరులకు కనబడును.



శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥ 21

పద॥ బాహ్యస్పర్శేషు - అసక్తాత్మా - విందతి - ఆత్మని (1) - యత్ - సుఖమ్ (2)।
సః - బ్రహ్మయోగయుక్తాత్మా - సుఖం - అక్షయం - అశ్నుతే ॥

| | | | |
|---|---|---|---|
| సః | అతడు (బ్రహ్మనిష్ఠుడు) | విందతి | పొందుచున్నాడు |
| బాహ్యస్పర్శేషు | వెలుపలి విషయములలో | సః | అతడు |
| అసక్తాత్మా | అసక్తిలేని అంతఃకరణముగలవాడై | బ్రహ్మయోగయుక్తాత్మా | బ్రహ్మసమాధితోగూడిన అంతఃకరణముగలవాడై |
| ఆత్మని | ఆత్మయందు | అక్షయం సుఖం | కొరతలేనిసుఖమును |
| యత్ సుఖం | యేసుఖముగలదో | అశ్నుతే | పొందుచున్నాడు. |
| తత్ సుఖం | ఆసుఖమును | | |

తా॥ బ్రహ్మనిష్ఠుడైన అతడు శబ్దాది బాహ్యవిషయములలో ఆసక్తిలేని యంతఃకరణముగలవాడై ఆత్మయెడ నేసుఖముగలదో ఆ సుఖమును పొందు చున్నాడు. అతడు బ్రహ్మసమాధితోగూడిన అంతఃకరణముగలవాడై ముగింపు లేనిసుఖము ననుభవించుచున్నాడు.

(1) ఆత్మని - తన యాత్మస్వరూపమునందు (రామానుజులు). తన అంతఃకరణమునందు (శ్రీధరులు),

(2) యత్సుఖం - యస్సుఖం అనిపాఠము. యః = ఎవ్వడు, సుఖం = సుఖమును, విందతి = పొందునో, సః = అతడు (రామానుజులు).

(శంకరులు) అదియుగాక బ్రహ్మమునందు స్థిరముగనున్నవాడు ఇంద్రియములచే స్పృశింప బడునట్టి శబ్దాదిబాహ్య విషయముల యందాసక్తిలేనివాడై ఆత్మయెడ ఎట్టిసుఖముగలదో దానిని పొందుచున్నాడు. అతడు బ్రహ్మసమాధిలో మనఃస్థైర్యముగలవాడై ముగింపులేని సుఖమును అంతట పొందుచున్నాడు. అనగా ఆత్మసుఖానుభవ రూపముగనే యగునని భావము. గనుక ఆత్మయెడగల నాశములేని సుఖమును వెదకువాడు క్షణకాలము మాత్రము నిలబడు బాహ్యవిషయ సుఖములనుండి ఇంద్రియములను మరలించి ఈడ్చుటవలె ననునది తాత్పర్యము.

(స్వకీయము) లోకమునందలి విషయములలో ఆశలేని మనస్సుగలవాడు తన యంతః కరణమునం దేసుఖముగలదో ఆ సుఖమును పొందుచున్నాడు. బ్రహ్మధ్యానములో మనస్సుగల వాడైనచో అతడు నాశములేని సుఖమును పొందుచున్నాడు. అనగా, విషయములలో నాసక్తిగల వానికి ఎల్లప్పుడు మనంబున చింతకలుగుచునే యుండును. ఆసక్తిలేని మనస్సు గలవాడైనచో చింతలేని యంతః కరణమును పొందును. అట్లుచింతలేకుండుటయే సుఖముగదా? ఐతే ఇది అల్పమైన సుఖమే. చింతలేని ఆయంతఃకరణము బ్రహ్మధ్యానమున నిలబడినచో నాశములేని మోక్షసుఖము లభించునని భావము.

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥ 22

పద॥ యే - హి - సంస్పర్శజాః (1) - భోగాః - దుఃఖయోనయః - ఏవ - తే।
ఆద్యంతవంతః - కౌంతేయ - న - తేషు - రమతే - బుధః ॥

| | | | |
|---|---|---|---|
| హి | ఏలనగా | దుఃఖయోనయ ఏవ | (ఇహమునందును పరము నందును) దుఃఖమునకే కారణములు |
| సంస్పర్శజాఃభోగాః | (ఇంద్రియ) విషయముల సంబంధమువలన కలుగుభోగములు | ఆద్యంతవంతః | ఆద్యంతములుగలవి |
| యే | ఏవియో | హేకౌంతేయ! | ఓ కుంతీపుత్రా ! |
| తే | అవి | బుధః | జ్ఞాని (యథార్థమెరింగినవివేకి) |
| | | తేషు న రమతే | వాటిలో రమించుటలేదు. |

తా॥ ఏలనగా ఇంద్రియములున్ను, వాటివిషయములైన శబ్దము మొదలగునవియు సంబంధించుటవలన కలుగుభోగములు ఏవియో అవి (ఈలోకమునందెట్లో అవిధముగనే పరలోకమునందును) దుఃఖమునకే కారణములైనవి. మరియు అవి ఆదిఅంతములుగలవి. అనగా అనిత్యమైనవి. స్థిరముగానివి. ఓ కుంతీపుత్రా! యథార్థమెరింగిన వివేకముగలజ్ఞాని, యాభోగములలో రమింపడు. సంతోషము పొందడు.

(1) సంస్పర్శజాః - విషయేంద్రియ సంబంధమువలన గలిగిన (రామానుజులు). రెండవ అధ్యాయము 14-వ శ్లోకము "మాత్రాస్పర్శాస్తు" చూడుడు.

(శంకరభాష్యము) ఇంద్రియములను వాటి విషయములనుండి ఈ కారణముచేతను నివర్తింపవలెను. ఏలనగా ఇంద్రియములున్ను వాటివిషయములున్ను సంబంధించుటవలన కలుగు భోగములెవ్వియో అవి దుఃఖమును కలుగజేయునవే. అవిద్యచే కలిగినందుననుడు. ఆధ్యాత్మికము మొదలగు దుఃఖములు దానినిమిత్తమై వచ్చునవిగనే కనబడుచున్నవిగదా? వాటివలన దుఃఖము గలుగుట ఈ లోకమునందెటులనో ఆ విధముగనే పరలోకమునందును అని "ఏవ" శబ్దమువలన తెలియవచ్చుచున్నది. సంసారమున సుఖము, దాని గంధముమాత్రముగూడ లేదనితెలిసి విషయములనెడి ఎండమావులనుండి ఇంద్రియములను నివర్తించవలెను. భోగములు దుఃఖమును గలుగజేయునవి మాత్రముగావు. ఆద్యంతములనున్ను గలిగినవి. భోగములకు ఆదియనగా, విషయములు ఇంద్రియములు సంబంధించుటయే. ఇంద్రియము దానివిషయమునుండి నివర్తించుటయే ఆ భోగములకు ముగింపనబడును. ఇట్లు ఆదికిని అంత్యమునకును మధ్యలోగల నిమిషమాత్రమే అవి యున్నందున అనిత్యములైనవి. కౌంతేయ! పరమార్థ తత్త్వము నెరింగి వివేకముతో నున్నవాడు ఆ భోగములచే సంతోషింపడు. పశుపక్ష్యాదులవంటి స్వభావముగల మూఢులకేగదా విషయములలో రుచి కనబడుచున్నది!



శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్ససుఖీ నరః ॥ 23

పద॥ శక్నోతి - ఇహ (1) - ఏవ - యః - సోఢుం - ప్రాక్ - శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం - వేగం - సః - యుక్తః - సః - సుఖీ (2) - నరః ॥

| | | | |
|---|---|---|---|
| యః నరః | ఏ మనుష్యుడు | కామక్రోధోద్భవం | కామము, కోపము, వీటివలన |
| ఇహైవ | ఇచ్చటనేలేక బ్రతికియున్నప్పుడే | వేగం | గలుగువేగమును |
| | | సోఢుం | సహించుటకు |
| శరీర విమోక్షణాత్ప్రాక్ | శరీరమునువిడచుటకు మునుపు | శక్నోతి | శక్తిగలిగియుండునో |
| | | సః యుక్తః | అతడుయోగి |
| | | సః సుఖీ | అతడు సుఖి |

తా॥ ఏ మనుష్యుడు ఇచ్చటనే అనగా బ్రతికియున్నప్పుడే శరీరమును విడుచుటకుమునుపు కామము, కోపము, వీటివలన కలుగువేగమును సహించుటకు శక్తిగలిగియుండునో ఆమనుష్యుడు యోగి. అతడు ఈలోకములో సుఖియగును.

(1) ఇహ - సాధనములను అనుష్ఠించుటకు అనుకూలమైన శరీరములో (రామానుజులు.)

(2) సుఖీ - ఆత్మానుభవమువలన గలుగు సుఖమును పొందినవాడగును (రామానుజులు)

(శంకరభాష్యము) శ్రేయోమార్గమునకు, అనగా సద్గతికి అడ్డుగానిలబడిన శత్రువైన (కామ క్రోధములను) దోషమొక్కటిగలదు. అది మిక్కిలి క్రూరమైనది. అనర్థములన్నిటిని కలుగజేయునది. దానిని తొలగించుట మిక్కిలికష్టసాధ్యము. దానిని పరిహరించు విషయమున బలవత్తైన ప్రయత్నము జేయవలెనని భగవంతుడు చెప్పుచున్నాడు. "ఇహైవ" అనగా జీవించి యున్నప్పుడే, శరీరమునివర్తించుటకుమునుపే, అనగా మరణమువరకు, అని మరణమును ఎల్లగుర్తించుటవలన బ్రతికియున్న వానికి కామము కోపము వీటివలన కలుగువేగము తప్పక వచ్చుననియు, దానికి కారణములులెక్కలేనివనియు, మరణక్షణపర్యంతము కామక్రోధములను అణచితిమని నమ్మగూడదనియు తాత్పర్యము. కామమనగా ఇంద్రియములచే ఎరుంగబడి సుఖము నిచ్చునట్టిదై అనుభవింపబడిన ప్రియమైనవస్తువు నొకదానిని వినినప్పుడుగాని తలంచునప్పుడుగాని ఏకోరికదానిమీద ప్రవర్తించుచున్నదో అది కామ మనబడును. కోపమనగా దుఃఖమును గలుగుజేయునదై తనకు ప్రియముకాని వస్తువులను చూచు నప్పుడును వినునప్పుడును ఏద్వేషము వాటిమీద ప్రవర్తించునో అట్టిది.

వీటివేగమనగా వీటివలనగలుగు అంతఃకరణముయొక్క చంచలత, మనస్సుకు కలత. కామ వేగమునకు గగుర్పాటు, నేత్రవికాసము, సంతోషించిన ముఖము, మొదలగునవి లక్షణములు. కోపము యొక్కవేగమునకు శరీరమువణకుట, చెమటపట్టుట, పెదవిని కొరుకుట, కండ్లెర్రబడుటమొదలగునవి గుర్తులు. కామక్రోధములవలన కలుగునావేగమును ఎవ్వడు సహించుకొనగలడో, వాటికి చోటివ్వక వాటిని జయించువాడెవ్వడో ఆమనుష్యుడు యోగి, అతడే ఈలోకమునందు సుఖియునగును.

(శ్రీధరులు) ప్రాణవియోగముగలిగిన పిదప స్త్రీలు ఆలింగనము జేయుటవలనను పుత్రుడు దహనముజేయుటవలనను ఎట్లుమనోవికారము గలుగదో అట్లే ప్రాణముతోనున్నప్పుడే తనదేహ విషయమై గలుగు సుఖదుఃఖములలోను వికారమొందక యుండవలెననునది తాత్పర్యము. (దీనికి జ్ఞానవాసిష్ఠ శ్లోకమును ఉదహరించుచున్నాడు.) అదేమన,

ప్రాణే గతే యథా దేహః సుఖదుఃఖే న విందతి,
తథాచేత్ ప్రాణయుక్తోఽపి స కైవల్యాశ్రయో భవేత్.

(రాఘవేంద్రులు) పశుపక్ష్యాది దేహముల నొందినచో కామక్రోధాదులను అణచుట సాధ్యముకాదు. కావున ఈ మనుష్యదేహమునందున్నప్పుడే అణచవలెనని చెప్పబడినది,

శ్లో॥ యోఽన్తస్సుఖోఽన్తరారామః తథాన్తర్జ్యోతిరేవ యః।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥ 24

పద॥ యః - అన్తస్సుఖః - అన్తరారామః (1) - తథా - అన్తర్జ్యోతిః (2) - ఏవ - యః।
సః - యోగీ - బ్రహ్మనిర్వాణం (3) - బ్రహ్మభూతః (4) - అధిగచ్ఛతి॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వడు | అన్తర్జ్యోతిరేవ | లోపలనే (ఆత్మయందే) ప్రకాశముగలవాడుగను |
| అన్తస్సుఖః | (తన) లోపల (ఆత్మయందే) సుఖముగలవాడుగను | యః | ఎవ్వడీ విధముగనుండునో |
| తథా | అటులనే | సః యోగీ | ఆ యోగి |
| అన్తరారామః | లోపల (ఆత్మయందే) రమించువాడుగను | బ్రహ్మభూతః | (తానే) బ్రహ్మమై |
| | | బ్రహ్మనిర్వాణం | బ్రహ్మానందమును |
| తథా | ఆ విధముగనే | అధిగచ్ఛతి | పొందుచున్నాడు. |

తా॥ ఎవ్వడు తనలో, అనగా ఆత్మయందే సుఖమును జూచెడివాడుగను, ఆ విధముగనే తనలోనే, అనగా ఆత్మయందే రమించువాడుగను (ఆటలాడువాడుగను) అట్లే తనలోనే, అనగా ఆత్మయందే ప్రకాశముగలవాడుగను ఎవ్వడుండునో ఆ యోగి తానే బ్రహ్మమై బ్రహ్మానందమును అనగా మోక్షమును గూడ పొందుచున్నాడు.

(1) అన్తరారామః = తన ఆటలాడుట ఆత్మయందేగాని వెలుపల వస్తువులలో కలుగుటలేదు. (శ్రీధరులు). అన్తర = పరమాత్మ దర్శనము, స్వదర్శనము, సల్లాపము మొదలగు పలు విధమై కలుగజేయ బడిన, ఆరామః = సుఖముగలవాడు (మధ్వులు). భగవద్దర్శనము వలన గలిగిన సుఖముగలవాడు (రాఘవేంద్రులు)

(2) అన్తర్జ్యోతిః - తనలో ప్రకాశించుచున్న భగవంతుడను జ్యోతిస్సుగలవాడు (రాఘవేంద్రులు)

(3) బ్రహ్మనిర్వాణం - తనయొక్క ఆత్మానుభవ సుఖమును (రామానుజులు). బ్రహ్మములో లయమును (శ్రీధరులు).

(4) బ్రహ్మభూతః - బ్రహ్మమునందు నిష్ఠగలవాడై (రాఘవేంద్రులు). జీవన్ముక్తుడై (శ్రీధరులు)

(స్వకీయము) ఈశ్లోకమునందు ఎటువంటివాడు బ్రహ్మములోస్థిరపడి బ్రహ్మమునుపొందును అనునది భగవంతునిచే చెప్పబడుచున్నది. ఆత్మయందే సుఖము, రమించుట, ప్రకాశము వీటి ననుభవించువాడు తానే బ్రహ్మమని నిశ్చయించి ఈ లోకమున బ్రతికియున్నప్పుడే మోక్షమును పొందుచున్నాడు. సాధారణ జనులకు సుఖము మొదలగునవి బాహ్యవిషయములనుండి కలుగుచున్నవి గదా? ''అహమేవ సుఖం నాన్యదన్యచ్చేన్నైవతత్సుఖం। అమదర్థంనహి ప్రేయోమదర్థం నస్వతః ప్రియం'' నేనేసుఖము, మరియొకటిగాదు. వేరే సుఖము ఒకటి ఉన్నచో అదిసుఖముగాదు. నాప్రయోజనము కొరకుతప్ప ప్రేమఅనునది లేదు. నాకొరకే యున్న అప్రియము నాస్వభావముగాదు.

శ్లో॥ లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మానస్సర్వభూతహితే రతాః॥ 25

పద॥ లభన్తే - బ్రహ్మనిర్వాణం (1) - ఋషయః (2) - క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధాః (3) - యతాత్మానః - సర్వభూతహితే - రతాః॥

| | | | |
|---|---|---|---|
| క్షీణకల్మషాః | పాపమును పోగొట్టుకొన్నవారుగను | సర్వభూతహితే రతాః | సకలప్రాణుల హితమునే గోరినవారుగను ఉన్న |
| ఛిన్నద్వైధాః | సంశయములేనివారుగను | ఋషయః | ఋషులు (జ్ఞానులు) |
| యతాత్మానః | ఇంద్రియములను అణచినవారుగను | బ్రహ్మనిర్వాణం లభన్తే | బ్రహ్మానందమును (మోక్షమును) పొందుచున్నారు. |

తా॥ పాపములను, సంశయములను, నివర్తించుకొనియు, ఇంద్రియములను స్వాధీనములో నుంచుకొనియు, సకలప్రాణుల హితమునే గోరుచు, అనగా ఎవ్వరికి హింసకలిగింపకయున్న ఋషులు (జ్ఞానులు) బ్రహ్మానందమును (మోక్షమును) పొందుచున్నారు.

(1) బ్రహ్మనిర్వాణం - తన ఆత్మానుభవసుఖమును (రామానుజులు). బ్రహ్మముచే నివ్వబడిన సుఖమును (మధ్వులు). ప్రాకృత శరీరములేని బ్రహ్మమును (రాఘవేంద్రులు).

(2) ఋషయః - ఉన్నదానిని ఉన్నట్లు చూచుసన్న్యాసులు (శంకరులు). ఆత్మదర్శనము గలవారలు (రామానుజులు).

(3) ఛిన్నద్వైధాః - శీతోష్ణాది ద్వంద్వములులేనివారలు అని చెప్పినను తగును (రామానుజులు). ఛిన్నద్వైధాఽఽయతాత్మానః - ఛిన్నద్వైధాః = సంశయము విపరీతజ్ఞానము ఇవిలేనివారలుగను, ఆయతాత్మానః = విశాలమైనమనస్సుగల వారలుగను ఉన్న వారలు (మధ్వులు). మనస్స్వాధీనముగలవారలు (రాఘవేంద్రులు).



శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసాం।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనాం॥ 26

పద॥ కామక్రోధవియుక్తానాం - యతీనాం (1) - యతచేతసాం।
అభితః (2) - బ్రహ్మనిర్వాణం - వర్తతే - విదితాత్మనాం (3)।

| | | | |
|---|---|---|---|
| కామక్రోధవియుక్తానాం | కామక్రోధములువీడినవారుగను | బ్రహ్మనిర్వాణం | బ్రహ్మానందము అనగా మోక్షము |
| యతచేతసాం | మనస్సు నణచినవారుగను | అభితః | రెండు విధములుగను, అనగా జీవించియున్నను మరణించినను |
| విదితాత్మనాం | ఆత్మను ఎరింగినవారుగనుఉన్న | | |
| యతీనాం | యతులకు (సకలకర్మలను విడిచిన బ్రహ్మనిష్ఠులకు) | వర్తతే | ఉన్నది. |

తా॥ ఆశ కోపములులేనివారై మనస్సు నణచి, ఆత్మతత్త్వము నెరింగి, సకలకర్మలు వీడిపోయిన వారుగనున్న బ్రహ్మనిష్ఠులైన యతులకు బ్రహ్మానందము, మోక్షము, అంతటనున్నది.

(1) యతీనాం - ప్రయత్నించువారలకు (రాఘవేంద్రులు)

(2) అభితః - అన్నిచోట్ల (మధ్వులు). అన్నికాలములలోను చోట్లలోను (రామానుజులు)

(3) విదితాత్మనాం - విజితాత్మనాం అనిపాఠము = మనస్సును జయించినవారలు (రామానుజులు)

శ్లో॥ స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ ॥ 27
యతేంద్రియమనో బుద్ధిర్మునిర్మోక్ష పరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ॥ 28

పద॥ స్పర్శాన్ - కృత్వా - బహిః - బాహ్యాన్ - చక్షుః - చ - ఏవ - అంతరే (1) - భ్రువోః ।
ప్రాణాపానౌ - సమౌ - కృత్వా - నాసాభ్యంతరచారిణౌ ॥
,, యతేంద్రియమనోబుద్ధిః (2) - మునిః - మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధః - యః - సదా - ముక్తః (3) - ఏవ - సః ॥

| | | | |
|---|---|---|---|
| బాహ్యాన్ స్పర్శాన్ | వెలుపలనున్న శబ్దాదివిషయములను | విగతేచ్ఛాభయక్రోధ | కోరిక, భయము, కోపము, వీటిని విడనాడి |
| బహిః కృత్వా | వెలుపలనే నిలబెట్టి | మోక్షపరాయణః | మోక్షమునే సద్గతిగగైకొన్న |
| భ్రువోః అంతర ఏవ | కనుబొమ్మల మధ్యలోనే | మునిఃయః | (భగవంతుని ధ్యానము చేయుచున్న) మునియెవ్వడో |
| చక్షుః కృత్వా | కండ్లను నిలబెట్టి | | |
| నాసాభ్యంతరచారిణౌ | ముక్కుద్వారా సంచరించుచున్న | | |
| ప్రాణాపానౌ | ప్రాణాపానవాయువులను | సః | అతడు |
| సమే చ కృత్వా | సమముగజేసి | సదా | ఎల్లప్పుడు |
| యతేంద్రియ మనో బుద్ధిః | ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వీటిని అణచి | ముక్తఏవ | ముక్తుడే (విడువబడినవాడే) |

తా॥ ఇంద్రియముల విషయములగు వెలుపలగల శబ్దము మొదలగు వాటిని లోపలబుద్ధిలో ప్రవేశింపనీయక బయటనే నిలబెట్టి కనుబొమ్మలకు మధ్యలో కండ్లను అనగా కండ్లచూపును నిలబెట్టి ముక్కుద్వారా లోపలను బయటను పోవుచున్న ఊపిరియగు ప్రాణము అపానమను వాయువులను సమముగ నిలబెట్టి, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వీటినిఅణచి, కోరిక, భయము, కోపము వీట్లనువిడనాడి, మోక్షమునే శ్రేష్ఠమైనగతిగనమ్మి, భగవంతుని ఎల్లప్పుడు మననము చేయుచున్నట్టి మునియెవ్వడో అతడు ముక్తుడే. అనగా జననమరణములనుండి విడువబడినవాడే.

(1) అంతరేభ్రువోః - అనుదానికి నాసికాగ్రే = ముక్కుకొనయని రామానుజులు అర్థముజేయుచున్నారు. ముక్కు కొన - కొనయనగా కనుబొమ్మలకు సమీపమున సన్నగనున్న

భాగమనియు, లేక దీనిని మొదలుగబెట్టుకొనినచో మరియొక కొనగనున్నదానిని కొన యనియు, చెప్పవచ్చును. ఐనను 'కనుబొమ్మలమధ్య' యని ఈ శ్లోకమునందున్నందు నను దానికే 'నాసికాగ్రే'యని రామానుజు లర్థముజేసి యున్నందునను ముక్కుకొన కనుబొమ్మలకు సమీపమున సన్నగనున్న భాగమనియే అర్థమగుచున్నది. 6-వ అధ్యాయము 13, 8-వ అధ్యాయము 10 శ్లోకములనుగూడ చూడుడు.

(2) యతేంద్రియ మనోబుద్ధిః - ఆత్మదర్శనము కొరకు ఇంద్రియము, మనస్సు, బుద్ధి వీటి నణచి యనియు, మునియనుదానికి ఆత్మదర్శనమునందే యున్నవాడనియు, సదా అనుదానికి సాధనానుష్ఠాన సమయమునందును అనియు రామానుజులు అర్థముచేసియున్నారు.

3) ముక్తః - ముక్తునివలె నున్నవాడే. అనగా కామక్రోధాదులనుండి విడువబడినందున ముక్తునికి సమానమైనవాడు (రాఘవేంద్రులు)

(శంకరులు) సమ్యగ్దర్శన నిష్ఠగల అనగా, యథార్థజ్ఞానములో స్థైర్యముగలిగి నిలబడు సన్న్యాసికి సద్యోముక్తి అనగా వెంటనే మోక్షము లభించుననియు ఈశ్వరునికే అర్పింపబడిన దేహేంద్రియాదులు మొదలగువాటి యన్నిటి వ్యాపారముతో ఈశ్వరుడైన బ్రహ్మమునందుంచి చేయుచున్న కర్మయోగికి క్రమముక్తి మెట్టుమెట్టుగ అనగా మొదట సత్త్వశుద్ధి, అనగా మనస్సు పరిశుద్ధమగుట, పిదప జ్ఞానమొందుట, పిదప సర్వకర్మసన్న్యాసము ఇట్లు క్రమక్రమముగ కడపట ముక్తికిట్టుచున్నదనుదానిని భగవంతుడు మాటిమాటికి చెప్పియున్నాడు. ఇకను జెప్పబోవుచున్నాడు. ఇప్పుడు యథార్థజ్ఞానమునకు అంతరంగసాధనమైన ధ్యానయోగమును విస్తరించి చెప్పనుద్దేశించి దానికి సూత్రమువంటి ఈశ్లోకమునుపదేశించుచున్నాడు.

శబ్దము మొదలగు విషయములు చెవి మొదలగు వాటిద్వారా లోపల బుద్ధిలో ప్రవేశించునట్లు చేయబడుచున్నవి. ఈ శబ్దము మున్నగు వెలుపలి విషయములను తలంచనివానికి శబ్దము మొదలగు వెలుపలి విషయములు వెలుపలనే నిలబెట్టబడియున్నవి. వాటి నీ విధముగ నిలబెట్టి కండ్లను రెండు కనుబొమ్మల మధ్యలో "కృత్వా = నిలబెట్టి" అని చేర్చుకొనుడు. దీనిలో జెప్పబడియున్న స్థితిలో శరీరమును నిలబెట్టియున్న సన్న్యాసి మోక్షమే మేలైనగతియని గ్రహించినవాడై భగవంతుని నెడతెగక తలంచువాడగును. ఎవ్వడు ఇట్టి సన్న్యాసియో అతడుముక్తుడే, విడువబడినవాడే. మోక్షమునకై వానిచే చేయదగినది మరియొక్కటి లేదు.

(స్వకీయము) శ్రీధరస్వాముల వ్యాఖ్యానమును ఆధారముగగైకొని ఈ శ్లోకములలో నున్న క్రిందవ్యవహరించిన పదములకు విస్తారముగ అర్థము వ్రాయబడుచున్నది. — "వెలుపల నున్న విషయములను వెలుపలత్రోసి" అనగా ఇంద్రియములకు గోచరమగునట్టి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ఇవిగల వస్తువులు, ఇవియే విషయములని చెప్పబడుచున్నవి. ఈ విషయములను ఇంద్రియములు గ్రహించుకొనిపోయి మనస్సునందు చేర్చుచున్నవి. మనస్సు ఆవిషయములను బుద్ధియందు చేర్చుచున్నది. ఆత్మ తన యుపాధియైన బుద్ధి మొదలగువాటిద్వారా ఆవిషయములను గ్రహించినచో వాటివలన గలుగు సుఖదుఃఖములను ఆత్మపొందుచున్నాడు. ఆ సుఖదుఃఖములను ఆత్మ గ్రహించుకొని యున్నంతవరకు నిష్ఠజేయ యోగ్యుడు కానేరడు. కావుననే దేహమునకు వెలుపలనున్నట్టి విషయములను వెలుపలనుండి తనలోనికి తీసికొనివచ్చి చేర్పుటకు అవకాశమివ్వక వెలుపలనే త్రోసివేయవలెనని చెప్పబడినది. తన సమీపమున వచ్చిన విషయములను అనుభవింపకయే త్రోసివేయుటకు మంచిజ్ఞాని తగినవాడైనను యోగాభ్యాసి తగినవాడుకాడు.

కావునవానికి ఉపాయము ఈ శ్లోకమునందే జెప్పబడియున్నది. అదేమన:—- విషయములను ఏవి తన యందు తెచ్చి చేర్చుచున్నవో, అట్టి బుద్ధి మనస్సు ఇంద్రియములు వీటినణచుటయే. వీటిలో మొదట అణచవలసినవి ఇంద్రియములే. ఏలనగా అవియే మొదట విషయములను గ్రహించుచున్నవి. అభ్యాసముచేత మొదట ఇంద్రియములనున్ను, పిదప మనస్సునున్ను, పిదప బుద్ధినిన్ని క్రమముగ నణచవలెను. ఇవి అణగినచో సుఖదుఃఖాదులు ఆత్మకు కలుగ హేతువే యుండదు. ఇంద్రియములలో ప్రధానేంద్రియములైన కన్ను ముక్కు నోరులను అణచుమార్గమున్ను దీనిలో జెప్పబడియున్నది. ఎట్లనగా, కండ్లనుమూసికొన్నచో నిద్రవచ్చును. తెరచియున్నచో విషయములను గ్రహించును. కావున అర్ధము మూసియు, అర్ధము తెరచియు నున్నటులజేసి వాటిచూపును కనుబొమ్మల మధ్య నిలబెట్టవలెను. ప్రాణాపానవాయువులద్వారా ముక్కు వాసన మొదలగువాటిని గ్రహించుచున్నందున ఆ వాయువులను వెలుపలను లోపలను అధికముగ సంచరింపజేయక ముక్కు లోపలనే అణచవలెను. ఏలనగా వాయువులను పూర్తిగనణచిన ప్రాణము నిలువదు. పూర్తిగవిడిచి ఈడ్చినచో వాసన మొదలగువాటిని గ్రహించుచుండును. మౌనం:- మౌనమనగా వాక్కు, నాలుక, వీటి ప్రవృత్తిని అడ్డగించుట. కావున మౌనముచేత వాక్కును నిలబెట్టునట్లును జెప్పబడినది.



శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి ॥ 29

పద॥ భోక్తారం - యజ్ఞతపసాం - సర్వలోకమహేశ్వరం ।
సుహృదం - సర్వభూతానాం - జ్ఞాత్వా - మాం - శాంతిం - ఋచ్ఛతి

| | | | |
|---|---|---|---|
| యజ్ఞతపసాం | యజ్ఞము తపస్సు వీటిని | సుహృదం | మిత్రుడుగను |
| భోక్తారం | అనుభవించువాడుగను | మాం | నన్ను |
| సర్వలోక మహే శ్వరం | సకలలోకములకు మేలైన ఈశ్వరుడుగను | జ్ఞాత్వా | యెరింగి (ఉన్నవాడు) |
| | | శాంతిం | శాంతిని (మోక్షమును) |
| సర్వభూతానాం | సకలప్రాణులకు | ఋచ్ఛతి | పొందుచున్నాడు. |

తా॥ యజ్ఞము, తపస్సు వీటిననుభవించువాడుగను, సకల లోకములకు మేలైన ఈశ్వరుడు (యజమానుడు లేక ప్రభువు) గను, సకలప్రాణులకు ప్రత్యుపకారము నెదురుచూడక ఉపకారముజేయు మిత్రుడుగను నన్నెవ్వ డెరుంగునో అతడు మోక్షమును పొందును.

(శంకరులు) ఈ విధముగ మనస్సును ఒకనిలకడలో నిలబెట్టి సమాధితో గూడినవాడు దేనినెరుంగవలెను? ధ్యానయోగములో అతడు ధ్యానింపదగినదేది? అనుదానిని భగవంతుడు దీనిలో జెప్పుచున్నాడు. నారాయణుడనైన నేనే యజ్ఞములను, తపస్సులను, వాటినిజేయుకర్తగను, వాటి వలన ఆరాధింపబడు దేవతగను అనుభవించువాడను. అన్నిలోకములకంటెను మేలైన ఈశ్వరుడు, ప్రత్యుపకారమును కోరక సకలప్రాణులకు ఉపకారము జేయుమిత్రుడు, సకలభూతముల హృదయ

ములో నివసించువాడు, సకలకర్మల ఫలముల కధికారి, అనగా ఆ ఫలములను గమనించి భాగించిఇచ్చువాడు, అన్నిజ్ఞానములకు సాక్షి, అనగా జ్ఞానమునకుగూడ జ్ఞానమైనవాడు, అని నారాయణుడనైన నన్ను అతడీవిధముగ తెలిసికొని శాంతిని పొందుచున్నాడు. అనగా సంసారము పూర్తిగ తొలగుటయను మోక్షమును పొందుచున్నాడు.

(రామానుజులు) నేను సకలలోకములకును ఈశుడననియు, సకలప్రాణులకును సుహృత్తుననియు నెరింగి కర్మయోగము చేయుటయందే మానవుడు సుఖమును పొందుచున్నాడు.

(స్వకీయము) యజ్ఞము తపస్సు వీటిఫలమును తాననుభవించునట్లు భగవంతుడు చెప్పుటకు భావమేమని మధ్వాచార్యుల అభిప్రాయము ననుసరించి క్రింద వివరముగ జెప్పబడు చున్నది. అదేమనః— సర్వప్రాణులకును ఈశుడైన పరమాత్మ వానియధీనులైన జీవులు చేయునట్టి యజ్ఞ తపస్సుల పూర్ణమైన ఫలములలో ఆయా జీవస్వభావమునకు తగినట్లు వారలకెంతగిట్టదగునో అంతభాగము వారలకిచ్చి మిగత భాగమును ఈశ్వరుడే అనుభవించుచున్నాడు. అదియెట్లనగా - రాజుచే దేశాంతరమునకు యుద్ధముకొరకై పంపబడిన సేనాధిపుడు ఆ విధముగపోయి దేశమును జయించి సంపాదించిన వస్తువు లన్నిటిని ఆ రాజే భుజించుచున్నాడు. ఐనను ఆ సేనాధిపతి మొదలగువారిలో వారి వారి యోగ్యతానుసారముగ ఆ వస్తువులలో వారలకు కొంతభాగ మిచ్చుట వలె జీవునకు స్వల్పఫలమును ఈశ్వరుడిచ్చుచున్నాడనునది తాత్పర్యము.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగో నామ
పంచమోఽధ్యాయః

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న
శ్రీ కృష్ణార్జున సంవాదమున కర్మసన్న్యాసయోగమను
ఐదవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు.
షష్ఠాధ్యాయ ప్రారంభః.

# ఆరవ అధ్యాయము

## (ధ్యాన యోగము)



శ్రీ భగవానువాచః—

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః ॥

పద॥ అనాశ్రితః - కర్మఫలం - కార్యం - కర్మ - కరోతి - యః ।
సః - సన్న్యాసీ - చ - యోగీ - చ - న - నిరగ్నిః - న - చ - అక్రియః ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీభగవంతుడు చెప్పినది. | సన్న్యాసీ చ | సన్న్యాసిగను |
| యః | ఎవడు | యోగీ చ | యోగిగను |
| కర్మఫలం అనాశ్రితః | కర్మఫలమును అపేక్షించని వాడై | (భవతి) | అగుచున్నాడు |
| | | నిరగ్నిః | అగ్నిలేనివాడు |
| కార్యం కర్మ | చేయవలసిన కర్మను | న | కాడు |
| కరోతి | చేయునో | అక్రియశ్చ | కర్మలేనివాడును |
| సః | అతడు | న | కాడు. |

తా॥ శ్రీభగవంతుడు చెప్పినది — కర్మఫలమునందు అపేక్షలేనివాడై చేయవలసిన (నిత్యనైమిత్తిక) కర్మనెవ్వడు చేయునో అతడు సన్న్యాసి, అతడు యోగి. అగ్నిలేనివాడుగను అనగా కర్మకుసహాయమైన దక్షిణాగ్ని మొదలగు నగ్నిలేనివాడుగను, కర్మలేనివాడుగను అనగా అగ్నిసాధనములేని దానము తపస్సు మొదలగు కర్మలను విడచియునున్నవాడు తానుసన్న్యాసియు యోగి యునగుదుననునది కాదు.

(శంకరభాష్యము) మునుపు ౫-వ అధ్యాయాంతములో యథార్థమైన జ్ఞానమును బడ యుటకు అంతరంగసాధనమైన ధ్యానయోగము, సూత్రమువంటి సదరు అధ్యాయములోని 27-29 శ్లోకములలో నుపదేశింపబడినది.

దానినే విస్తరించి చెప్పువ్యాఖ్యానమువంటిది ఇప్పుడు ప్రారంభింపబడు నీయారవ అధ్యాయము. ఇక కర్మ, ధ్యానయోగమునకు బహిరంగ సాధనమైనందున కర్మకధికారియైన గృహస్థుడు ధ్యానయోగమును జేయుటకు సమర్థుడగువరకు కర్మను జేయవలెను. దానినుద్దేశించి భగవంతుడీ విధముగ కర్మనుస్తుతించుచున్నాడు. అదేమన, సన్న్యాసిగను యోగిగనుఉన్నవాడు కేవలమగ్నియు కర్మయులేనివాడు మాత్రముకాడు. కర్మను కలిగినవాడుకూడ కర్మఫలములో నాసక్తినివిడచి చిత్త శుద్ధికై కర్మయోగము ననుష్ఠించుచున్నవాడై సన్న్యాసిగను యోగిగను అగునని పొగడబడుచున్నదే గాని వాస్తవమైన సన్న్యాసికి అగ్నియు కర్మయు లేదనుదానిని నిషేధించునదిగ భావింపగూడదు.

ఏలనగా అగ్నియు, కర్మయులేని పరమార్థసన్న్యాసికి శ్రుతులలోను స్మృతులలోను పురాణములలోను ఇతిహాసములలోను యోగశాస్త్రములలోను సన్న్యాసిస్థితిని యోగిస్థితిని స్పష్టముగ విహితమైయున్న దానిని భగవంతుడు తిరస్కరింపడు. మరియు భగవంతుడే 'సర్వకర్మాణి మనసాసన్న్యస్య .... నైవ కుర్వన్న కారయః ఆస్తే, (5-వ అధ్యాయము 13-వ శ్లోకము) ''మౌనీ....సంతుష్టో యేనకేనచిత్'' (12-అధ్యాయము 19-శ్లో) ''విహాయకామాః యస్సర్వాః" (2-వ అధ్యాయము 71-శ్లో) "సర్వారంభ పరిత్యాగీ" (12-వ అధ్యాయము 16-వశ్లో) అని యీవిధముగ గీతలో జెప్పియున్నాడు. 4-వ ఆశ్రమమును తిరస్కరించుట అవాక్యములకు విరుద్ధమగును. కావున గృహస్థస్థితిలోనున్నవాడై యోగమును గూడుటలో అభిప్రాయముగల మునికి ఫలమునుగోరక అనుష్ఠింపబడు అగ్నిహోత్రహోమము మొదలగుకర్మ, ధ్యానయోగమును చేరుటకు సాధనమగుటను చిత్తశుద్ధిద్వారా పొందుచున్నదిగాన అట్టివాడు సన్న్యాసియనియు యోగియనియు స్తుతింపబడుచున్నాడు.

అనాశ్రితః = అనగా ఆధారపడనివాడు. దేనినాధారపడని వాడనగా, కర్మఫలమును. అనగా కర్మఫలమునందాసక్తి లేనివాడు. ఎవ్వడు కర్మఫలమునందాసక్తి గలవాడో అతడు కర్మఫలము నాశ్రయించినవాడగును. ఇతడనగా వానికి విరుద్ధుడు. ఎవ్వడొక్కడు ఈవిధముగ కర్మఫలమును కోరనివాడై కామ్యకర్మకంటె వేరైనదియు అవశ్యముగ జేయవలసినదియునైన అగ్నిహోత్రము మొదలగు నిత్యకర్మముజేసి పూర్తిజేయునో ఇట్టియాకర్మి ఇతరకర్ములకంటె మేలైనవాడను నీతాత్పర్యమును చూపుట కొరకు అతడు సన్న్యాసిగను యోగిగను అగుచున్నాడని చెప్పబడినది. విశ్రాంతి యెవ్వనికిగలదో అతడు సన్న్యాసి. చిత్తసమాధాన మెవ్వనికిగలదో అతడు యోగి. పై జెప్పినవాడు ఇట్టిగుణముగలవాడని భావింపవలెను. కేవలము అగ్నిలేనివాడుగను కర్మలేనివాడుగను ఉన్నవాడు మాత్రమే సన్న్యాసిగను యోగిగనుఅగునని గ్రహింపగూడదనియే ఈశ్లోకము రెండవపాదమునందలి తాత్పర్యము. కర్మలకు అంగభూతములైన దక్షిణాగ్ని మొదలగు అగ్నులు ఎవ్వనినుండి వీడిపోయినవో అతడు అగ్నిలేనివాడు. అగ్నిని సాధనముగ గలిగినవిగానట్టి తపస్సు, దానము, మొదలగు కర్మలు ఎవ్వనికిలేవో అతడు కర్మలేనివాడు (అగ్నిని స్వర్గసాధనముగ కఠోపనిషత్తునందు జెప్పియుండుటను జూడుడు)

(స్వకీయము) జ్ఞానమొందుటకుమునుపు అగ్నిహోత్రము వైశ్వదేవము మొదలగు క్రియలను విడువగూడదు, ఏలనగా బ్రహ్మక్షత్రియవైశ్యులకు అవియావశ్యకములని విధింపబడియున్నది'' అగ్నౌదేవోద్విజాతీనాం మునీనాం హృదిదైవతం। ప్రతిమాస్వప్రబుద్ధానాం సర్వత్రసమదర్శినాం =ద్విజులకు (బ్రహ్మక్షత్రియవైశ్యులకు) దైవమగ్నియందు, మునులకు దేవుడు హృదయమునందు, అజ్ఞానులకు (ఆత్మజ్ఞానము లేనివారలకు) దేవుడుప్రతిమలలో, సమదృష్టిగలవారలకు అంతటదేవుడు'' అని ఉత్తరగీతలో జెప్పియుండుటను జూడుడు. కావున ద్విజులు జ్ఞానమొందుటకుమునుపు అగ్నిని కర్మాంగభూతముగ నుంచి చేయవలసిన క్రియలను చేయనిచో దానివలన చెరుపుపొందగలరేగాని సన్న్యాసి కాజాలరు.

శ్లో॥ *యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ।
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన॥ 2

పద॥ యం - సన్న్యాసం - ఇతి - ప్రాహుః - యోగం (1) - తం - విద్ధి - పాండవ
న - హి - అసన్న్యస్తసంకల్పః - యోగీ - భవతి - కః - చన॥

| | | | | |
|---|---|---|---|---|
| హే పాండవ! | ఓ అర్జునా! | హే | ఏలనగా | |
| యం | దేనిని | అసన్న్యస్త సంకల్పః | సంకల్పమును | (తలంపులను) తొలగగొట్టని |
| సన్న్యాసమితి | సన్న్యాసమని | | | |
| ప్రాహుః | చెప్పెదరో | కశ్చన | ఎవ్వడున్ను | |
| తం | దానిని | యోగీ | యోగిగ | |
| యోగం | యోగముగ | న భవతి | అగుటలేదు | |
| విద్ధి | ఎరుంగుము | | | |

తా॥ ఓఅర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పెదరో అదియే యోగమని ఎరుంగుము. ఏలనగా సంకల్పమును అనగా ఫలమునుగూర్చిన కోరికను విడువని యెవ్వడున్ను యోగిగనగుటలేదు.

* "సన్న్యాస ఇతి" అనియు పాఠము. జ్ఞానయోగమని అర్థము. (రామానుజులు.) కామ క్రోధాదులను విడచుట (రాఘవేంద్రులు).

(1) యోగం - ధ్యానయోగమునకు కారణమైనదియు కామక్రోధాదులనువిడచి చేయబడునదియు నైనకర్మయోగములో నిమిడియున్నదిగ నెరుంగుము. (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) అగ్నిలేనివాడుగను కర్మలేనివాడుగనుఉన్నవాడే సన్న్యాసిగను యోగిగను అగుననునది శ్రుతి స్మృతి యోగశాస్త్రములలో ప్రసిద్ధముగనుండగా అగ్నిగలవాడుగను కర్మనుగలవాడుగను ఉన్న వాడుగూడ సన్న్యాసిగను యోగిగను అగునని అప్రసిద్ధమైనదానిని చెప్పుట తగునా? అనినచో, కర్మఫలములో నా సక్తిని విడచుటవలన సన్న్యాసియగుట యనునదియు, ధ్యానయోగమునకు సాధనముగ కర్మలను అనుష్ఠించుటచేతను, చిత్తము చలించుటకు కారణమైన కర్మయొక్క ఫలములోగల ఆసక్తిని తొలగించుటచేతను యోగియగుటయనునదియు ఒకవిధమైన ఉపచారవాదముచే ఆ రెంటిని ఆరోపించి చెప్పవలెననుతాత్పర్యముతోననుడు. మఱికర్మయోగి శ్రేష్ఠుడైన సన్న్యాసిగను శ్రేష్ఠుడైన యోగిగను అగుననునది తాత్పర్యముకాదు. ఈ తాత్పర్యమును తెలియబరచుటకై భగవంతుడీ శ్లోకమును ప్రసాదించుచున్నాడు.

శ్రుతులను స్మృతులను ఎరింగినవారలు సకల కర్మలను వాటిఫలమును విడుచుట యను దేనిని వాస్తవమైన సన్న్యాసమనెదరో అపరమార్థ సన్న్యాసమే కర్మలను అనుష్ఠించుట యను యోగమని యెరుంగదగినదిగ భగవంతునిచే చెప్పబడుచున్నదిగదా? అట్లైన కర్మననుష్ఠించుట యైన కర్మయోగమునకు, దానికి విరుద్ధమైన కర్మను విడచిపెట్టుటయను నివృత్తిలక్షణముతో గూడిన పరమార్థ సన్న్యాసముతో ఎట్టి సమత్వమున్నట్లు అంగీకరించి సన్న్యాసస్వభావము దానికి చెప్పబడుచున్నది? అనుదానిని పర్యాలోచింపగా కర్త (అనగా చేయువాని) ద్వారా కర్మ యోగమునకు పరమార్థ సన్న్యాసముతో సామ్యము గలదు. ఎట్లనగా పరమార్థసన్న్యాసి సకల కర్మలనున్నువాటికైన సాధనములనున్ను విడచియున్నందున సకలకర్మలను వాటిఫలములను గూర్చిన తలంపును అనగా కర్మలో ప్రవర్తించుటకు కారణముగనున్న ఆసక్తికి హేతువుగ నుండు టను త్యజించుచున్నాడు. ఈ కర్మయోగికూడ కర్మను జేయువాడుగనేయున్నను. మునుపు జెప్పిన సన్న్యాసివలె ఆకర్మల ఫలములనుగూర్చిన జ్ఞాపకమును త్యజించుచున్నాడు అను నీవిషయము నందే సమత్వము అనునది భావము. ఫలమును తలంచుట మనస్సు చలించుటకు కారణము కావున ఫలమునుగూర్చిన తలంపును విడువని ఏకర్మియు యోగికానేరడు. కావున ఫలమును

గూర్చిన తలంపును విడచినవాడు ఎంతటికర్మియైనను అతడు యోగియగుటకు మనస్సు చలించని వాడగును. మనస్సు చలించుటకు కారణముగనుండుటను (అనగా ఫలమును తలంచుటను) త్యజించి నందున అనునది తాత్పర్యము.

శ్లో॥ ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ॥ 3

పద॥ ఆరురుక్షోః - మునేః - యోగం (1) - కర్మ - కారణం - ఉచ్యతే ।
యోగారూఢస్య - తస్య - ఏవ - శమః (2) - కారణం - ఉచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| యోగం | యోగమును | యోగారూఢస్య | యోగమునుపొందిన |
| ఆరురుక్షోః | పొందగోరుచున్న | తస్యైవ | అతనికే |
| మునేః | మునికి | శమః | శమము లేక విశ్రాంతి |
| కర్మ | కర్మ | కారణం ఉచ్యతే | కారణముగ, అనగా సాధన ముగ చెప్పబడుచున్నది |
| కారణం ఉచ్యతే | కారణముగ అనగా సాధన ముగ చెప్పబడుచున్నది | | |

తా॥ (ధ్యాన) యోగమును పొందగోరుచున్న మునికి కర్మ, సాధన మనంబడుచున్నది. ఐతే (ధ్యాన) యోగమును పొందినప్పుడు అతనికే సకల కర్మలనుండి తొలగుటయను విశ్రాంతియే సాధనమనబడుచున్నది. అనగా యోగ మును జేరి నిలబడు స్థితికి విశ్రాంతియే సాధనమనుడు.

(1) యోగం - తన ఆత్మస్వరూప దర్శనము (రామానుజులు). జ్ఞానయోగము (శ్రీధరులు).

(2) శమః - భగవత్ జ్ఞానములో ఎల్లప్పుడు నిష్ఠయు, స్తోత్రము, కీర్తనము నమస్కారము అర్చన మొదలగునవియు, కారణం = ముక్తికి ఉపాయముగ, ఉచ్యతే = చెప్పబడు చున్నది (మధ్వులు, రాఘవేంద్రులు). సమాధి, చిత్త విక్షేపకర్మోపరమము (శ్రీధరులు) శమః = అంతరింద్రియ నిగ్రహము అనగా మనస్సు బుద్ధి చిత్తము అహంకారము ఈ నాల్గింటిని వాటివిషయములలో ప్రవేశింపనీయక అడ్డగించుట (స్వకీయము).

(శంకరభాష్యము) యథార్థమైన సన్న్యాసమునకును కర్మయోగమునకును ఫలమును విడచుటలో చేయువాని మూలముగ గల సమత్వము నుద్దేశించి మునుపటిశ్లోకమున "దేనినిసన్న్యాస ముగ జెప్పెదరో దానినియోగమని యెరుంగుము'' అని కర్మయోగమును పొగడుటకొరకు దానిని భగవంతుడు సన్న్యాసమని చెప్పెను. ఫలాపేక్షలేని కర్మయోగము ధ్యానయోగమునకు బహిరంగ మైన సాధనమని దానిని సన్న్యాసముగ పొగడిన పిదప, ఇప్పుడు కర్మయోగము ధ్యానయోగ మునకు సాధనమగుటను ఈ శ్లోకమున దెలియపరచుచున్నాడు.

యోగమును గూడుటలో తాత్పర్యముగల మునికి — అనుటవలన ధ్యానయోగములో నిలబడుటకు యోగ్యతను ఇకను పొందనివాడని భావము. మునికి అనునది ఇకమీద ముని కాబోవువాడై ఇప్పుడు కర్మయొక్క ఫలమును త్యజించు కర్మయోగినిగూర్చి ఉపచారవాదముచే మునియని చెప్పబడినది. దేనినిగూడుటలో తాత్పర్యముగలవాడనగా ధ్యానయోగమును. కర్మ అతనికి మొదట చిత్తశుద్ధిని, పిదప ధ్యానయోగములో ఆసక్తిని పిదప ఆ ధ్యానయోగమునకు తగిన

యోగ్యతను కలుగ జేయుచున్న సాధనమనబడుచున్నది. ఐతే యోగమును జేరినచో అప్పుడతనికి సకలకర్మల నుండియు తొలగుటయనే విశ్రాంతియే సాధనము. అతడెంతకెంత కర్మలనుండి తొలగునో అంతకంత బాధలేనివాడై ఇంద్రియములను జయించిన అతనికి మనస్సు స్థైర్యమును పొందుచున్నది. అట్లున్న వాడు శీఘ్రమున యోగమున జేరినవాడగును.

"నైతాదృశం బ్రాహ్మణస్యాస్తివిత్తం యదైకతా సమతాసత్యతాచ। శీలంస్థితిర్దండ నిధాన మార్జవం తతస్తతశ్చోపరమః క్రియాభ్యః" బ్రహ్మము అంతటను ఒకటిగను సమముగనున్నది అను జ్ఞానమును వాస్తవముగ గలిగియుండుటయను సత్ప్రవర్తనయు, సన్మార్గములో దృఢత్వమున్ను, అహింసయు, ఋజుత్వమున్ను, అనేక కర్మలనుండి విశ్రాంతియు ఎట్టివో అట్టి ఐశ్వర్యము బ్రాహ్మణునికి వేరొక్కటి లేదు అని మహాభారతము శాంతిపర్వము మోక్షధర్మము 175—38 లో చెప్పబడియున్నది.

(శ్రీధరులు) నిష్కామకర్మ, జ్ఞానమునకు కారణముగను, జ్ఞానమొందినవానికి మనస్సును నిలబెట్టుట స్థిరమైన ధ్యానమునకు కారణముగను ఉన్నది.

(రామానుజులు) శమః = కర్మను విడిచిపెట్టుట, కారణముచ్యతే = కారణముగ జెప్పబడుచున్నది. ఏలనగా ఆత్మావలోకనమువరకే కర్మ చేయవలసినది. తన ఆత్మ స్వరూపదర్శనమగు మోక్షమును పొందినవాడు పిదప కర్మను విడిచిపెట్టదగును.



శ్లో॥ యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే॥

పద॥ యదా - హి - న - ఇంద్రియార్థేషు - న - కర్మసు - అనుషజ్జతే।
సర్వసంకల్పసన్న్యాసీ (1) — యోగారూఢః - తదా - ఉచ్యతే॥

| | | | |
|---|---|---|---|
| యదా | ఎప్పుడు | సర్వసంకల్ప | సకలసంకల్పములను, తలంపు |
| ఇంద్రియార్థేషు | ఇంద్రియవిషయములలో | సన్న్యాసీ | లను విడిచిపెట్టునో |
| నానుషజ్జతే | ఆసక్తినిఉంచడో | తదా హి | అప్పుడే |
| కర్మసు న | కర్మలను జేయుటలో నాసక్తి యుంచడో | యోగారూఢః | యోగారూఢుడని |
| | | ఉచ్యతే | చెప్పబడుచున్నాడు. |

తా॥ (ఒక్కడు) ఎప్పుడు ఇంద్రియ విషయములమీద కోరికనుంచడో, కర్మలలో నాసక్తి కలిగియుండడో, సంకల్పములన్నిటిని, అనగా తలంపులన్నిటిని విడచిన వాడగునో అప్పుడే (అతడు) యోగారూఢుడని చెప్పబడుచున్నాడు.

(1) సర్వసంకల్పసన్న్యాసీ - కర్మలన్నిటిని విడుచువాడు. అనగా తనప్రయత్నములేక లభించిన వస్తువులయందుగూడ అభిమానమును విడిచినవాడని తాత్పర్యము. (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) ఇక ఒకడు ఎప్పుడు యోగారూఢుడు, అనగా యోగమునుగూడిన వాడగునని జెప్పబడుచున్నది.

యోగి, మనస్సును ఒకనిలకడలోనుంచుకొని ఇంద్రియవిషయములైన శబ్దము మొదలగు వాటిలోను, నిత్యము, నైమిత్తికము, కామ్యము, ప్రతిషిద్ధము అనుకర్మలలోను ప్రయోజనములేదవి యెరింగి ఆసక్తినుంచుటలేదో అనగా నవి తనకవశ్యముగ కావలసినవను బుద్ధిని గైకొనుటలేదో

మరియు నతడు ఎప్పుడు ఇహపరవస్తువులను గోరుటకు కారణములైన తలంపులన్నిటిని త్యజించు స్వభావముగలవాడగునో అప్పుడాతడు యోగమును గూడినవాడు. అనగా యోగమును పొందినవాడనబడును. ''సర్వసంకల్ప సన్న్యాసీ'' అను వచనముచేత కోరికలన్నిటిని కర్మలన్నిటిని త్యజించవలెనని తాత్పర్యము. ఏలనగా సకలకోరికలకును సంకల్పములే కారణములు.

"సంకల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః" మనుస్మృతి 2-వ అధ్యాయము 2-వ శ్లో-) సంకల్పమనునది కామమునకువేరు. యజ్ఞములకు సంకల్పమే పుట్టిల్లు "కామజానామితే మూలం సంకల్పాత్త్వం హి జాయసే ! నత్వాం సంకల్పయిష్యామి సమూలో న భవిష్యసి" (మహాభారతము శాంతిపర్వము మోక్షధర్మమున 177-25) ఓకోరికా ! నీ మూలము నాకు తెలుసును. నీవు సంకల్పమునుండిగదా పుట్టుచున్నావు? నిన్ను నేను తలంపను. నీవు వేరుతో నుండజాలవు. అనగా సమూలముగ నశించెదవు. ఇవి మొదలగు స్మృతులచే చూడుడు. ఇక కోరికలన్నిటిని విడచినపిదప సర్వకర్మలను విడచుట తానే గలుగుచున్నది. అను దానిని "స యథా కామో భవతి తత్క్రతుర్భవతి, యత్క్రతుర్భవతి తత్కర్మకురుతే = ఆతడు దేనిని గోరుచున్నవాడై యుండునో దానిని జేయవలసినవాడగును. దేనిని జేయవలసిన వాడుగనున్నాడో ఆ కర్మను ప్రకటముగ చేయుచున్నాడు'' అను బృహదారణ్యక శ్రుతిమొదలగువాటిచేతను, "యద్యద్ధికురుతే జన్తుః తత్తత్కామస్య చేష్టితం = ప్రాణి దేనిదేనిని చేయుచున్నదో అది అది కోరికయొక్క వ్యాపారము" అను మనుస్మృతి మొదలగువాటిచేతను ఎరుంగుడు. మఱియు యుక్తిచేతను ఆ విధముగనే తెలిసికొనవచ్చును. ఏలనగా సంకల్పము లన్నిటిని త్యజించినప్పుడు ఒకడు కదలుటకుకూడ వీలుగాదు. కావున "సర్వసంకల్ప సన్న్యాసీ" అను వచనముచేత భగవంతుడు కోరికలన్నిటిని కర్మలన్నిటిని తొలగగొట్టునట్లు చెప్పుచున్నాడని అర్థమగుచున్నది.

శ్లో॥ ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥

పద॥ ఉద్ధరేత్ - ఆత్మనా (1) - ఆత్మానం - న - ఆత్మానం - అవసాదయేత్ ।
ఆత్మా (2) - ఏవ - హి - ఆత్మనః - బంధుః - ఆత్మ - ఏవ - రిపుః -

| | | | |
|---|---|---|---|
| ఆత్మానం | తన్ను | హి | ఏలనగా |
| ఆత్మనా | తనచేత | ఆత్మనః | తనకు |
| ఉద్ధరేత్ | తరింపజేసికొనవలెను | ఆత్మైవ బంధుః | తానేబంధువు. |
| ఆత్మానం | తన్ను | ఆత్మనః | తనకు |
| నావసాదయేత్ | చెరచుకొనగూడదు. | ఆత్మైవ రిపుః | తానే శత్రువు |

తా॥ తన్ను (సంసారసముద్రమునుండి) తానే తరింపజేసికొన వలెను. దానిలో మునిగిపోవునట్లు తన్ను చెరచుకొన గూడదు. ఏలనగా తానే తనకు మిత్రుడు, తానే తనకు శత్రువు.

(1) ఆత్మనా - వివేకముతోగూడిన మనస్సుచేత (శ్రీధరులు, - మధుసూదన సరస్వతి, వేంకటనాథుడు) మనస్సుచేత లేక పరమాత్మచేత (రాఘవేంద్రులు) "ఆత్మైవ" అనుదానికిని వారలిటులనే అర్థముచేసియున్నారు.

(2) ఆత్మైవ=లోకమునందున్న బంధువులు స్నేహపాశమునకు పాత్రమగుదురేగాని మోక్షమునకు

వారలు విరోధులే. కావున వారలు బంధువులుకారు. తానేతనకు బంధువుగను, సుహృత్తు గను కావలెనని శంకరులున్ను, తనమనస్సే తనకు బంధువు, ఎట్టిమనస్సనగా విషయ ములలో నాసక్తిలేని మనస్సని రామానుజులున్ను, మనస్సే బంధువు, లేక పరమాత్మయే బంధువు, ఏలనగా అతనియెడ భక్తిచేసిన బంధువువలెనగును అని రాఘవేంద్రులున్ను చెప్పుచున్నారు.

(3) రిపుః - తనఆత్మయే ఇతరులను శత్రువుగ తలంపకారణమగుచున్నందున తనకు తన యాత్మయే శత్రువగునని శంకరులున్ను; తనమనస్సే తనకు శత్రువు, ఎట్టిమనస్సనగా విషయము నందు ఆసక్తిగల మనస్సని రామానుజులున్ను; పరమాత్మయెడ భక్తిచేయనిచో పరమాత్మ ఇతనిని శత్రువువలె తలంచుచున్నాడని రాఘవేంద్రులున్ను జెప్పుచున్నారు.

(శంకరభాష్యము) ఒకడు మునుపు చెప్పినవిధముగ యోగారూఢుడైన పిదప సంసారపు అనర్థముల గుంపునుండి తానే తనచే తరింపజేయబడినవాడగును, అనునది చెప్పబడుచున్నది. సంసారమనే సముద్రములోపల మునిగియున్నవారలు తమ్ము దానినుండి తామే పైకితీసి తరింప జేసికొనవలెను. అనగా యోగమునుగూడి నిలబడుటను పొందజేయవలెనని తాత్పర్యము. ఆ సంసార సముద్రములో తన్ను క్రిందమునిగిపోవునట్లు చేయించుకొనగూడదు. ఏలనగా తనకు తానే బంధువు. సంసారమునుండి విముక్తిచెందుటకు ఉపయోగపడగల మిత్రుడు తనకంటె వేరొకడు లేడుగదా! బంధువైనవాడుగూడ మోక్షవిషయములో శత్రువే. స్నేహము మొదలగు బంధమునకు అతనిచే అవకాశము గలుగుటవలన ననుడు,

కావుననే "తానేతనకు బంధువు'' అను దృఢమైననిర్ణయము సరియైనదనుడు. అటులనే తానేతనకు శత్రువు. చెరుపును చేయువాడై, తనకంటె వేరుగబయటనున్న శత్రుడెవ్వడో వానిని గూడ తానే ఒకడుతనకు శత్రువుగ చేసికొనుచున్నాడు. అనగా బాహ్యశత్రువులున్ను ఆత్మనను సరించియే యుండుటవలన ''తానే తనకు శత్రువు'' అను నిర్ణయము తగినదే.

(స్వకీయము) ప్రతియొక్కడు మోక్షమునులేక నరకమును, సుఖమునులేక దుఃఖమును, పొందుటకు అతని స్వప్రయత్నము కారణమని గుర్తించి చూపబడినది. ఈ శ్లోకమునకు శంకరా నందులు క్రిందకనబరచినట్లు విస్తారమైన అర్థముచేసియున్నారు — ఆత్మానం = సంసారసాగరములో మునిగి జన్మమృత్యుజరాది దుఃఖములచే హతము చేయబడినవాడుగనున్నాను అని ప్రలపించుచున్న తన్ను, ఆత్మనా = శ్రద్ధాభక్తులచే నారాధించి పొందిన పరమేశ్వర ప్రసాదము, వైరాగ్యసాధనము శ్రవణమననాదులనుజేసి ఆత్మజ్ఞానములో నిలకడచెందియున్న తనచేత తరింపజేసికొనవలెను. ఆత్మనః = తన యవిద్యచేత జననమరణములు అనే దుఃఖప్రవాహములో బడి ఆధ్యాత్మికము మొద లగు తాపత్రయాగ్నిచే తపింపబడిన తనకు, బంధుః = సంసారదుఃఖమునుండి నివర్తింపజేసి నిర తిశయమైన మోక్షసుఖములో చేర్పించుచున్న బంధువు తానే, శాంతి దాంతిమొదలగు సాధనసంపద లచే ఆత్మోద్ధరణమునకై సమాధియోగము చేయకున్న తానే తనకు శత్రువు.



శ్లో॥ బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥

పద॥ బంధుః - ఆత్మా (1) - ఆత్మనః - తస్య - యేన - ఆత్మా - ఏవ - ఆత్మనా - జితః।
అనాత్మనః - తు - శత్రుత్వే - వర్తేత - ఆత్మా - ఏవ - శత్రువత్ ॥

| | | | |
|---|---|---|---|
| యేన ఆత్మనా | ఏ ఆత్మచేత | అనాత్మనస్తు | ఆత్మను (దేహేంద్రియముల చేరికను) జయించనివానికనగా |
| ఆత్మా జితః | ఆత్మ (దేహేంద్రియములచేరిక) జయింపబడియున్నదో | | |
| తస్య ఆత్మనః | ఆ ఆత్మకు | శత్రువత్ | (వెలుపలి) శత్రువువలె |
| ఆత్మైవ | | శత్రుత్వేవర్తేత | శత్రుభావములో నుండును, |
| బంధుః | బంధువు | | |

తా॥ ఏ జీవాత్మచే దేహము, ఇంద్రియములు అను వాటిచేరికయైన ఆత్మ వశబరచబడియున్నదో, అనగా నెవ్వఁడు దేహేంద్రియములను జయించియుండునో అతనికి అతడే స్నేహితుడు. మఱి ఇంద్రియములను జయించినవానికి వెలుపలిశత్రువువలె తానే శత్రుత్వములోనున్నాడు. అనగా తనకంటె వేరుగ బయటనున్న శత్రువు తనకెట్లు చెరుపుచేయునో అట్లు తనకుతానే చెరుపుచేసికొనుటలో నున్నాడని తాత్పర్యము.

(1) ఆత్మా - వివేకమనస్సు.

(రాఘవేంద్రులు) ఏజీవునిచే పరమాత్మ జయింపబడెనో అనగా భక్తిచే స్వాధీనముజేసికొనబడినవాడాయెనో, ఆజీవునికి ఆపరమాత్మ బంధువు. పరమాత్మయెడ భక్తిచేయనివానికి ఆపరమాత్మయే శత్రువువలె అపకారము చేయుచున్నాడు.

(స్వకీయము) మునుపటి శ్లోకమున తనకు ఆత్మయే బంధువు, ఆత్మయే శత్రువని చెప్పబడినది. తనకుతాను బంధువు అనువానికి లక్షణమెట్టిది? తనకు తాను శత్రువు అనువానికి లక్షణమెట్టిది? అనునది దీనిలో జెప్పబడుచున్నది. ఇంద్రియములను జయించినవాడు తనకుతానే బంధువు. అట్లు జయించనివాడు తనకుతానే శత్రువుగనున్నాడని తాత్పర్యము.



శ్లో॥ జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మ సమాహితః।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానాపమానయోః ॥

పద॥ జితాత్మనః - ప్రశాంతస్య - పరమాత్మా - సమాహితః।
శీతోష్ణసుఖదుఃఖేషు - తథా - మానాపమానయోః ॥

| | | | |
|---|---|---|---|
| జితాత్మనః | దేహేంద్రియములను జయించినవాడుగను | శీతోష్ణ సుఖదుఃఖేషు | శీతోష్ణ సుఖదుఃఖములలోను |
| | | తథా | అట్లనే |
| ప్రశాంతస్య | మనస్సమాధానముగలవాడుగనుఉన్నవానికి | మానాపమానయోః | మానాపమానములలోను |
| | | సమాహితః | ఒక నిలకడ చెందియున్నది. |
| పరమాత్మా | పరమాత్మ స్వరూపము | | |

తా॥ ఒకడు దేహము ఇంద్రియములు వీటిని జయించి మనస్సమాధానము గలిగి (సన్న్యాసిగ) ఉన్నప్పుడు పరమాత్మ స్వరూపము చలివేడులలోను,

సుఖదుఃఖములలోను, ఆవిధముగనే గౌరవాగౌరవములలోను వాటిచే కొట్టబడి కదలింపబడనిదై వానిచిత్తములో నెల్లప్పుడు స్థిరముగ నిలబడుచున్నది. అది అతనియొక్క వాస్తవమైన ఆత్మస్వరూపముగనే యున్నదని తాత్పర్యము.

(శ్రీధరులు) శీతోష్ణసుఖదుఃఖములలోను మానాపమానములలోను సమముగనుండియు కామక్రోధములను అణచియు మనస్సు ఇంద్రియములు వీటిని జయించియున్న వాని హృదయములో, పరమాత్మా సమాహితః = పరమాత్మ ప్రకాశించుచున్నాడు,

(రామానుజులు) పరమాత్మా సమాహితః - ఆత్మ = తన స్వరూపము, సమాహితః = ప్రకాశించుచున్నది. ఇట్టి ఆత్మస్వరూపము ప్రకృతిబంధమును పోగొట్టుకొని శుద్ధముగనున్నందున, పరమాత్మా = పరమాత్మయని చెప్పబడినది. లేక, ఆత్మా = ఆత్మ, పరం = అధికముగా, సమాహితః = ప్రకాశించుచున్నది. అనియు చెప్పవచ్చును.



శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః ॥

పద॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా (1) - కూటస్థః (2) - విజితేంద్రియః ।
యుక్తః (3) - ఇతి - ఉచ్యతే - యోగీ (4) సమలోష్టాశ్మకాంచనః (5) ॥

| | | | |
|---|---|---|---|
| జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా | జ్ఞానము, తెలిసికొనిన విధముగ అనుభవము, వీటి వలన తృప్తిచెందిన మనస్సుగలవాడుగను | సమలోష్టాశ్మకాంచనః | మట్టిగడ్డ, రాయి, బంగారము వీటిని సమముగ తలంచువాడుగనుడున్న |
| కూటస్థః | (దేనికి) కదలనివాడుగను | యోగీ | యోగి |
| విజితేంద్రియ | ఇంద్రియములను బాగుగ జయించినవాడుగను | యుక్త ఇత్యుచ్యతే | సమాధినిగూడినవాడు (యోగారూఢుడు) అని చెప్పబడుచున్నాడు. |

తా॥ శాస్త్రజ్ఞానముచేతను, అనుభవజ్ఞానముచేతను, మనస్తృప్తిచెంది జ్ఞానవిజ్ఞానములు చాలునని తలంపుగల మనస్సుగలవాడై దేనికి కదలనివాడై ఇంద్రియములను జయించి మట్టిగడ్డ, రాయి, స్వర్ణము మొదలగువాటిని సమముగ తలంచునట్టి యోగియైనవాడు సమాధిని గూడినవాడు, యోగారూఢుడు అని చెప్పబడుచున్నాడు.

(1) జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా - జ్ఞానమనగా, ఆత్మస్వరూపజ్ఞానమే. విజ్ఞానమనగా క్రియలన్నిటిని నడుపునది ప్రకృతియేగాని ఆత్మకు సంబంధములేదని యెరుంగుటయే, ఇట్టిజ్ఞానముచే తృప్తిపొందిన మనస్సు గలవాడు (రామానుజులు). జ్ఞానమనగా భగవత్స్వరూపమును ఎరుంగునట్టి జ్ఞానము, లేక భగవద్విషయమైన శ్రవణమననాదులవలన కలుగునది. విజ్ఞానమనగా భగవన్మహిమలను విశేషముగ నెరుంగునది, లేక శ్రవణాదులవలన గలిగిన జ్ఞానముచే లభించు భగవద్దర్శనము (మధ్వులు). భగవంతుడు సర్వోత్తముడనుదానిని వేదములచే ఎరుంగుటయే జ్ఞానము. భగవంతుని మహిమలను వేదముచే నెరుంగుట విజ్ఞానము (రాఘవేంద్రులు),

(2) కూటస్థః - దేవమనుష్యాది దేహములలోనుండినను జ్ఞానాకారమైన ఆత్మస్వరూపముతో నున్నవాడు (రామానుజులు). కూటము - ఆకాశము, ఆకాశమువలెనున్నవాడు అనగా శీతోష్ణాదులచే వికారమొందనివాడు (మధ్వులు, రాఘవేంద్రులు.)

(3) యుక్తః - స్వరూపము నెరుంగునట్టి యోగాభ్యాసమునకు తగినవాడని చెప్పబడుచున్నాడు. (రామానుజులు). సంపూర్ణమైన యోగము గలవాడుగ చెప్పబడుచున్నాడు (రాఘవేంద్రులు). యోగారూఢుడు (శ్రీధరులు, మధుసూదనసరస్వతి).

(4) యోగీ - కర్మయోగి (రామానుజులు). జ్ఞానయోగి (మధ్వులు).

(5) సమలోష్టాశ్మకాంచనః - మట్టి మొదలగు సకలవస్తువులను వాటి వాటి స్వభావమెట్టిదో ఆ విధముగనే బాగుగనెరుంగుట (మధ్వులు). ఈమత సిద్ధాన్తానుసారముగ ఐదు విధములైన భేదజ్ఞానము మోక్షహేతువు. భేదములనగా - (1) జీవేశ్వరభేదము, (2) జీవపరస్పరభేదము, (3) జీవజడభేదము, (4) జడపరస్పరభేదము, (5) జడేశ్వరభేదము. వీనిలో నాలుగవ కక్ష్యలో ఈ మట్టి - రాయి - బంగారము మొదలగునవి చేరుచున్నవి. బంగారమును బంగారముగను, రాయిని రాయిగను, మట్టిని మట్టిగను ఇటులనే మిగిలిన జడవస్తువులను వాని వాని స్వభావానుసారముగ నెరుంగుటయే సమమైన జ్ఞానము. అట్లుగాక మట్టిని రాయిగను, రాయిని బంగారముగను అట్లే ఒకదానిని మరియొకటిగ ఎరుంగుటయే విపరీత జ్ఞానము

(స్వకీయము) జ్ఞానమనగా శాస్త్రములో జెప్పియున్న వస్తువులను దెలిసికొనుట. విజ్ఞానమనగా శాస్త్రమువలన తెలిసికొన్నవాటిని ఆ విధముగనే తనయనుభవమునకు తెచ్చుకొనుట అని శంకరులున్ను, జ్ఞానమన్గగా ఆత్మస్వరూపమును తెలిసికొనుట, విజ్ఞానమనగా ఆత్మస్వరూపము ప్రకృతి కంటె వేరైనలక్షణములుగల ఆకారముగలదని తెలిసికొనుట అని రామానుజులున్ను, విజ్ఞానమను దానికి సాధారణజనులు ఎరుంగని విశేషముల నెరుంగు జ్ఞానమనియు జెప్పవచ్చునని మధ్వులున్ను తాత్పర్యము చెప్పుచున్నారు.



శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే ॥ 9

పద॥ సుహృత్ - మిత్రం - అరిః - ఉదాసీనః - మధ్యస్థః - ద్వేష్యః - బంధుషు।
(ఇవియన్నియు ఒకేపదము.)
సాధుషు - అపి - చ - పాపేషు - సమబుద్ధిః - విశిష్యతే॥

| | | | |
|---|---|---|---|
| సుహృన్మిత్రార్యు దాసీనమధ్యస్థ ద్వేష్యబంధుషు | మంచిహృదయము గలవాడు, స్నేహముగలవాడు, శత్రువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు, ద్వేష్యుడు, బంధువు, వీరియందును | సాధుష్వపి పాపేషు చ సమబుద్ధిః విశిష్యతే | సాధువులయందును పాపులయందును సమమైన బుద్ధిగలవాడు శ్రేష్ఠుడగును. |

తా॥ సుహృత్తు (అనగా ప్రత్యుపకారమునుకోరక ఉపకారమునుజేయువాడు), స్నేహముగలవాడు, శత్రువు, ఉదాసీనుడు (అనగా ఎవ్వరికక్ష్యలోను చేరనివాడు), మధ్యస్థుడు (అనగా రెండుకక్ష్యలకును హితమును గోరువాడు), ద్వేష్యుడు (అనగా ద్వేషింపదగినవాడు, తనకు కానివాడు, శత్రువు), బంధువు, ఐన వీరియందును, సాధువులయందును అనగా శాస్త్రముననుసరించినడచువారియందును, పాపులయందును అనగా, చేయతగనిదని శాస్త్రాదులచే నిషేధించిన దానిని జేయుపాపులయందును సమమైన బుద్ధిగలవాడు గొప్పవాడగును.

* "విశిష్యతే" అనుదానికి 'విముచ్యతే' అనియు పాఠము. సంసారమునుండి విడువబడును అని అర్థము.

(శంకరులు) సమదృష్టిగలవాడు అనగా, ఇతనెవ్వడు? ఇతని వ్యాపారమేమి అనుపర్యాలోచనలో బుద్ధినిపోనివ్వనివాడు. దీనిలో జెప్పబడినవాడు యోగారూఢులలో శ్రేష్ఠుడనిభావము (మిగత పదములకు అర్థము ప్రతిపదార్థములోనే వీరి భాష్యానుసారముగ వ్రాయబడియున్నది.)

(రామానుజులు) సుహృత్ = వయోవిశేషానంగీకారేణ స్వహితైషిణః = సుహృత్తనగా వయస్సుయొక్క విశేషమును గమనింపకయే తనకెవ్వడుపకారము జేయునో అతడే సుహృత్తు, మిత్రం= తనతో సమానమైన వయస్సుగలవాడుగను తనకుపకారము చేయువాడుగనుఉన్నవాడు మిత్రుడు, అరిః = ఒకనిమిత్తమునుగొని తనకపకారము జేయువాడు శత్రువు, ఉదాసీనః = ఉపకారాపకారములకు నిమిత్తములేనందున ఉపకారాపకారములు చేయకయుండువాడు ఉదాసీనుడు, మధ్యస్థః = జననముమొదలు ఉపకారాపకారములు చేయనివాడు మధ్యస్థుడు ద్వేష్యః =పుట్టినదిమొదలు చెరుపును తలంచువాడు, బంధుః = పుట్టినదిమొదలు హితమునుగోరువాడు. సాధుష్వపి - ధర్మము గలవారియందును, పాపేషుచ = అధర్మమును చేయువారి యందును. వీరందరిని సమముగ జూచెడివాడు,

(రాఘవేంద్రులు) మిత్రం = తనస్నేహితునికి ఇట్టికార్యముజేసిన చెరుపుగలుగునని చెప్పి దానినుండి రక్షించువాడు మిత్రుడు, ఉదాసీనః = అపకారోపకారములు చేయుటకు నిమిత్తముండియు జేయనివాడు. మధ్యస్థః = ఉపకారము అపకారము రెండునుజేయువాడు, బంధుః = ప్రతిప్రయోజనము నెదురుచూచి ఉపకారము చేయువాడు. సమబుద్ధిః = సుహృత్త్వము, మిత్రత్త్వము మొదలగునవి అంతఃకరణమువలన కలుగునవేకాని జీవస్వరూపమునకు లేవనియు, జీవస్వరూపములన్నియు చైతన్యాంశమున ఒకేవిధముగ సమముగనున్నవనియు నెరింగినవాడు.

శ్లో॥ యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసిస్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥ 10

పద॥ యోగీ - యుఞ్జీత - సతతం - ఆత్మానం - రహసి - స్థితః।
ఏకాకీ - యతచిత్తాత్మా - నిరాశీః - అపరిగ్రహః॥

| | | | |
|---|---|---|---|
| యోగీ | యోగియైనవాడు | స్థితః | స్థిరముగనుండి |
| రహసి | ఏకాంతమైనచోట | యతచిత్తాత్మా | అంతఃకరణమును దేహమును |
| ఏకాకీ | ఒకడై | | స్వాధీనపరచుకొన్నవాడై |

| | | | |
|---|---|---|---|
| నిరాశీః | కోరికలను విడిచినవాడై | ఆత్మానం | మనస్సును |
| అపరిగ్రహః | స్వత్వము అనగాతనది అనునది ఒక్కటియు లేనివాడుగనుండి | సతతం | ఎల్లప్పుడు |
| | | యుంజీత | సమాధిలో నిలబెట్టవలెను. |

తా॥ యోగియైనవాడు (ధ్యానముచేయువాడు) గుహమొదలైన ఏకాంతమైనచోట ఒక్కడై (సహాయములేక) స్థిరముగనుండుచు, అంతఃకరణమును దేహమును వశపరచుకొన్నవాడై, కోరికలన్నిటిని తొలగించినవాడై, తనవస్తువనునదొక్కటియు లేనివాడై, అనగా ఆసక్తిలేనివాడై, ఎల్లప్పుడు మనస్సును సమాధిలో నిలబెట్టవలెను.

(శంకరులు) కావున మునుపు చెప్పిన ఉత్తమమైన ఫలమును పొందుటకై చేయవలసినది దీనిలో జెప్పబడుచున్నది. ధ్యానము జేయువాడు కొండలోని గుహమొదలగుచోట సహాయమెవ్వరు లేనివాడై యోగమునుచేరవలెను. ''రహసిస్థితః ఏకాకీ'' అనువిశేషణముచే సన్న్యాసము చేసికొనవలెననితాత్పర్యము. అట్లు సన్న్యాసిగనుండినను కోరికలను, సొమ్ములను అన్నిటిని విడచితొలగించినవాడుగ నుండవలెను. కౌపీనము మొదలగు వాటిలోను నాది అను నాసక్తిని ఉంచగూడదని భావము.

(రామానుజులు) ఇంతవరకు జెప్పబడిన, యోగీ = కర్మయోగనిష్ఠుడు, సతతం = ప్రతిదినము యోగాభ్యాసకాలమంతయు, యుంజీత = తనయాత్మదర్శన నిష్ఠనుగలవాడై చేసికొనవలెను. నిరాశీరపరిగ్రహః = ఆత్మనుదప్ప మరిదేనియందును ఆసక్తియు మమకారమును లేనివాడు.

(రాఘవేంద్రులు) యోగీ = జ్ఞానోపాయము ననుష్ఠించువాడు, యుంజీత = అఖండధ్యానములో నిలబెట్టవలెను.

(స్వకీయము) ఇక సమాధియోగక్రమము చెప్పబడుచున్నది. మనస్సును సమాధియోగముతో గూడినట్లు చేయుటయే.

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరం॥ 11
,, తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే॥ 12

పద॥ శుచౌ - దేశే - ప్రతిష్ఠాప్య - స్థిరం - ఆసనం - ఆత్మనః।
న - అత్యుచ్ఛ్రితం - న - అతినీచం - చైలాజినకుశోత్తరం॥
,, తత్ర - ఏకాగ్రం - మనః - కృత్వా - యతచిత్తేంద్రియక్రియః।
ఉపవిశ్య - ఆసనే - యుఞ్జ్యాత్ - యోగం - ఆత్మవిశుద్ధయే॥

| | | | |
|---|---|---|---|
| (యోగీ) | యోగియైనవాడు | తత్రఆసనే | ఆ ఆసనముమీద |
| నాత్యుచ్ఛ్రితం | మిక్కిలి యెత్తుగానట్టియు | | కూర్చొని |
| నాతినీచం | మిక్కిలి తక్కువగానట్టియు | మనః | మనస్సును |
| చైలాజినకుశోత్తరం | వస్త్రము, (జింక) చర్మము, దర్భ, వీటిని పైగా గలిగి నట్టియు | ఏకాగ్రంకృత్వా | ఒకే నిలకడగలదిగచేసి |
| | | యతచిత్తేంద్రియ క్రియః | చిత్తము ఇంద్రియములు వీటి వ్యాపారములను అణచినవాడై |
| స్థిరం ఆసనం | స్థిరమైన ఆసనమును | ఆత్మవిశుద్ధయే | అంతఃకరణశుద్ధికై |
| శుచాదేశే | పరిశుద్ధమైనచోట | యోగం యుఞ్జ్యాత్ | యోగమును గూడవలెను. |
| ఆత్మనః ప్రతిష్ఠాప్య | తనకై యేర్పఱచుకొని | | |

తా॥ (యోగియైనవాడు) మిక్కిలి యెత్తుగానట్టియు, మిక్కిలి తక్కువ గానట్టియు వస్త్రము, చర్మము, దర్భ,వీటిని మీదుగా గలిగినదియు స్థిరమైనదియు నైన ఆసనమును పరిశుభ్రమైనచోట తనకై యేర్పరచుకొని ఆ యాసనము మీద కూర్చొని మనస్సు నొకేనిలకడగజేసి చిత్తము ఇంద్రియములు వీటి వ్యాపారములను అణచినవాడై అంతఃకరణశుద్ధికై యోగమును జేయవలెను.

(శంకరులు) ఇక యోగమును గూడువానికి అతడు కూర్చొనదగిన ఆసనము, అతడు తినదగిన ఆహారము, అతనికాలము గడుపుటకు తగిన వినోదము మొదలగువాటి క్రమమును యోగమునకు సాధనముగ జెప్పుటయేగాక దానితో యోగమును పొందినవాని లక్షణమును, ఆ యోగమునకు ఫలము మొదలగువాటినెత్తి చెప్పవలెను గావున వాటినన్నిటిని ఉపదేశింపబూని వాటిలో మొదటిదైన ఆసనముయొక్క క్రమమును మొదట భగవంతుడు చెప్పుచున్నాడు.

పరిశుద్ధమైనచోటు అనగా, స్వభావముగగాని అలుకుట మొదలగు వాటివలనగాని పరిశుద్ధమైన చోటని తాత్పర్యము. అట్టి ప్రదేశము నిర్జనమైన ప్రదేశముగ నుండవలెను. వస్త్రము మొదలగు వాటిక్రమము పాఠముయొక్క క్రమమునను సరించి మొదట వస్త్రము. పిదప చర్మము, తరువాత దర్భ యని మారియున్నది. అనగా మొదట దర్భ, దానిమీద చర్మము, దానిమీద వస్త్రము అని తాత్పర్యము. (చర్మము ఆసనమని జెప్పినందున జింక చర్మము, లేక పులి చర్మము అని గ్రహింపవలెను.)

ఇట్టి ఆసనమును ఏర్పరచుకొని ఏమిచేయవలెననగా ఆ యాసనముమీదకూర్చొని యోగమును గూడవలెను. ఎట్లనగా సకల విషయములనుండియు మనస్సునీడ్చి ఒక నిలకడ చెందించి చిత్తము ఇంద్రియములు వీటినణచినవాడై కూడవలెను. అతడు దేనికై ఆ విధముగ యోగమును గూడవలెననగా చిత్తశుద్ధికయ్యే.

(రామానుజులు) పరిశుద్ధులుకానివారలు చేరనట్టియు, వారలు చుట్టుకొననట్టియు, పరిశుద్ధములుకాని వస్తువుల సంబంధములేనట్టియు పవిత్రమైనచోట కొయ్యచే చేయబడినట్టియు దాని మీద దర్భలు, జింక చర్మము, వస్త్రము, వీటిని క్రమముగ ఒకటిమీద నొకటిగ పరచినదైన ఆసనమును ఏర్పరచుకొని బంధనివృత్తికై యోగమును, అనగా ఆత్మావలోకమును జేయవలెను.

(స్వకీయము) 11-12-వ శ్లోకములనున్ను - మునుపటి 10-వ శ్లోకములోని ఉత్తరార్ధమును వరాహ పురాణము 187-వ అధ్యాయములో చూడుడు.



శ్లో॥ సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ 13

,, ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥······ 14

పద॥ సమం - కాయశిరోగ్రీవం - ధారయన్ - అచలం - స్థిరః ।
సంప్రేక్ష్య - నాసికాగ్రం (1) - స్వం - దిశః - చ - అనవలోకయన్ ॥

,, ప్రశాంతాత్మా = విగతభీః - బ్రహ్మచారివ్రతే (2) - స్థితః
మనః - సంయమ్య - మచ్చిత్తః - యుక్తః - ఆసీత - మత్పరః ॥

| | |
|---|---|
| (యోగీ) | యోగియైనవాడు |
| కాయ శిరోగ్రీవం | దేహము, మెడ, తల, వీటిని |
| సమం | సమముగను (నేరుగను) |
| అచలం | చలింపకయు (కదలకయు) |
| ధారయన్ | ఉంచుకొనియు |
| స్థిరః | స్థిరముగనుండియు |
| స్వంనాసికాగ్రం | తన ముక్కుకొనను |
| సంప్రేక్ష్య | చూచుకొని |
| దిశః చ | దిక్కులను |
| అనవలోకయన్ | చూడకను |
| ప్రశాంతాత్మా | మిక్కిలి శాంతమైన అంతఃకరణ మును గలవాడుగను |
| విగతభీః | భయము వీడినవాడుగను |
| బ్రహ్మచారివ్రతే | బ్రహ్మచారి వ్రతమున |
| స్థితః | ఉన్నవాడుగను |
| మనః సంయమ్య | మనస్సును అణచి |
| మచ్చిత్తః | చిత్తమును నాయెడనుంచిన వాడుగను |
| మత్పరః | నన్నే ఉత్కృష్టముగ గైకొన్న వాడుగను |
| యుక్తః | సమాహితుడుగను |
| ఆసీత | కూర్చొనియుండవలెను. |

తా॥ యోగియైనవాడు దేహము, మెడ, తల, వీటిని సమముగను నేరుగను కదలకయుంచుకొనియు, స్థిరముగనుండుకొనియు, తన ముక్కు కొనను గమనించి చూచుచుండియు, దిక్కులను (చుట్టుప్రక్కలను) చూడకయు, మిక్కిలి శాంతమైన అంతఃకరణముగలవాడై, భయము వీడినవాడై, బ్రహ్మచారి వ్రతముననుండి మనోవృత్తులను అణచి, అనగా మనస్సును విషయములలో పోనివ్వక మరలించి చిత్తమును నాయెడనుంచి, నన్నే ఉత్కృష్టముగ గైకొని, సమాహితుడుగ అనగా ధ్యానయోగముతో గూడినవాడుగ కూర్చొని యుండవలెను.

(1) నాసికాగ్రం - ముక్కుకొనయనునది కనుబొమ్మలకు మధ్య సన్నగనున్న ముక్కు భాగమని అర్థము. 5-వ అధ్యాయము 27-వ శ్లోకమునందలి టిప్పణిని చూడుడు. కనుబొమ్మల మధ్యప్రదేశమును చూచుటవలె దృష్టినుంచి అని తాత్పర్యము.

(2) బ్రహ్మచారివ్రతే - స్త్రీ విషయమునుగూర్చి చింతించకయుండుట, భిక్షమెత్తిన అన్నమును భుజించుట, గురుశుశ్రూషచేయుట, వేదాధ్యయనముచేయుట, బ్రహ్మ విచారముచేయుట, ఇవి బ్రహ్మచారి వ్రతములు. (స్వకీయము.)

(శంకరభాష్యము) మునుపటి శ్లోకములలో వెలుపలి ఆసనముయొక్క క్రమము చెప్పబడినది. ఇక శరీరధారణము, అనగా శరీరము నుంచుకొనవలసిన స్థితి యెట్లనునది మొదలగునవి చెప్పబడుచున్నవి. శరీరము, తల, మెడ వీటినివంచక నేరుగనుంచుకొనవలెను. అట్లుంచుకొనినను వానికి కదలుట కలుగగలదు. కావున ''అచలం'' అను విశేషణము చేర్చబడినది. ''స్థిరః'' అను దానిచేత నిలకడగలవాడై అనగా దేహేంద్రియ విషయములచే ముట్టడింపబడి చలించనివాడై స్థిరముగనుండి అనునది భావము. ''ముక్కుకొనను నేరుగ చూచుకొని అనుదానికి చూచుట ''వలె'' నుండుచు అని గ్రహింపవలెను. ''ఇవ = వలె'' అనుశబ్దము ఏల చేర్చుకొనవలెననగా ఇచ్చట భగవంతుడు విధింపగోరినది ముక్కుకొననే వాస్తవముగ గమనించి చూడవలెననునదిగాదు. మరియేమనగా కండ్లచూపు వెలుపలి విషయములలో ప్రవర్తింపక, రెండుకండ్లను ఒకటిగజేర్చి అంతర్ముఖమగునట్లు జేయుటయనుడు. మఱియు అది అంతఃకరణముయొక్క శాంతమైనస్థితికి తగినట్లు నిలచుటయని భగవంతుడుపదేశింపగోరిన సూచన. ఇదిగాక ముక్కుకొనను జూచుటయే ఉపదేశింపగోరినదైనచో మనస్సు

అచ్చుటనేలయించునుగాని ఆత్మయెడ నిలబడదు. ఐతే వాస్తవమున ఆత్మయెడ మనస్సు ఒక నిలకడగా నిలబడుటనుగదా ఈ అధ్యాయము 25 వ శ్లోకమున భగవంతుడు జెప్పుచున్నాడు. కావుననే "వలె" అనుపదము లేనందున కండ్లచూపులను ఒకటిగజేర్చి లోనికిపడద్రోయుటయే "సంప్రేక్ష్య" అనిజెప్పబడుచున్నది. "బ్రహ్మచారివ్రతము"అనునది గురువునకు శుశ్రూషజేయుట, భిక్షాన్నము భుజించుట మొదలగువాటిలోనుండుట అతడు వాటిననుష్ఠించువాడుగ నుండవలెనని తాత్పర్యము "మనస్సును అణచి అనగా మనస్సుయొక్క వృత్తులను అణగద్రొక్కి" అని తాత్పర్యము. "నాయెడ" పరమేశ్వరుడనైన నాయెడ. కామవికారము గలవాడొక్కడు స్త్రీ యెడ చిత్తమునుంచినవాడై యామెనే ఎల్లప్పుడు తలంచుచున్నవాడైయుండును. ఐనను అతడు ఆమెనే అందరికన్న గొప్పదానిగ గ్రహించుటలేదు. అతడు తన రాజునుకాని, మహాదేవునిగాని గొప్పగ, ప్రభువుగ, భావించుచున్నాడు. ఈ యోగియనగా నన్నే ఎల్లప్పుడు తలంచుచున్నాడు. నన్నే మేలైనదిగ, ప్రభువుగ, గైకొన్నవాడుగనున్నాడు.

శ్లో॥ యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః ।
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ 15

పద॥ యుఞ్జన్ (1) - ఏవం - సదా - ఆత్మానం (2) - యోగీ - నియతమానసః ।
శాంతిం - నిర్వాణపరమాం (3) - మత్సంస్థాం (4) - అధిగచ్ఛతి ॥

| | | | |
|---|---|---|---|
| ఏవం | ఈ విధముగ (పైజెప్పినవిధముగ) | యోగీ | యోగియైనవాడు |
| ఆత్మానం | మనస్సును | మత్సంస్థాం | నాయెడనున్న (నేనుగనేయున్న) |
| సదా | ఎల్లప్పుడు | నిర్వాణ పరమాం | మోక్షములో ముగియునట్టిదైన |
| యుఞ్జన్ | ధ్యానములో నిలబెట్టినవాడై | శాంతిం | శాంతిని (విశ్రాంతిని) |
| నియతమానసః | అంతఃకరణమును అణచిన | అధిగచ్ఛతి | పొందుచున్నాడు |

తా॥ పై జెప్పినవిధముగ మనస్సు నెల్లప్పుడు ధ్యానములో నిలబెట్టినవాడై అంతఃకరణ మణచిన యోగియైనవాడు నాయెడగల అనగా నేనుగనేయున్న మోక్షములో చేర్పించునట్టి శాంతిని పొందుచున్నాడు.

(1) యుఞ్జన్ - సమాధానం కుర్వన్ = సమాధానముజేసికొని (శంకరులు) ధ్యానముచేయువాడై (రాఘవేంద్రులు)

(2) ఆత్మానం - పరమాత్మను (రాఘవేంద్రులు)

(3) నిర్వాణపరమాం = పొందదగినదైయున్న మోక్షముగలది (శ్రీధరులు) సుఖము అంత్యమైనదిగ కలిగియున్న (రామానుజులు) శరీరము పోయినతోడనే (మధ్వులు)

(4) మత్సంస్థాం - నాయధీనమును (శంకరులు) నా వద్దనుండుటను (రామానుజులు, మధ్వులు) నా స్వరూపముగ నుండుటయనే (శ్రీధరులు)

(స్వకీయము) మునుపుజెప్పిన విధముగ చేయబడిన యోగమునకు ఫలమిట్టిదని ఈశ్లోకమున జెప్పబడుచున్నది.

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంతమనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ 16

పద॥ న - అత్యశ్నతః - తు - యోగః - అస్తి - న - చ - ఏకాంతం - అనశ్నతః ।
న - చ - అతిస్వప్నశీలస్య - జాగ్రతః - న - ఏవ - చ - అర్జున ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున ! | ఓ అర్జునుడా ! | | లేదు |
| యోగః | ధ్యానయోగము | అతి స్వప్నశీలస్య | మిక్కిలి నిద్రగలవానికిన్ని |
| అత్యశ్నతః | అధికముగ తినువానికి | న చ | లేదు |
| నత్వస్తి | (చేకూరుట) లేనేలేదు | అతిజాగ్రతశ్చ | అధికముగ మేలుకొనియున్న వానికిని |
| ఏకాంతం అనశ్నతశ్చ | కొంచెముగూడ తిననివానికిన్ని | నైవ | లేదు. |

**తా॥ ఓ అర్జునా! అధికముగ తినువాడు, బొత్తిగ తిండిని వదలినవాడు, మిక్కిలి నిద్ర గలవాడు, బొత్తిగ నిద్ర లేనివాడు వీరలకు ధ్యానయోగము లేదు. అనగా సిద్ధింపనేరదు.**

(శంకరభాష్యము) దీనిలో యోగి అనుసరింపవలసిన ఆహారము మొదలగు నియమము చెప్పబడుచున్నది.

కొలతకంటె అధికముగ తినువానికి యోగము సిద్ధింపనేరదు. అనగా తన ఆత్మసమ్మతమైన అన్నముకంటె అధికమైన అన్నమే కొలతకంటె అధికమనంబడును. ఎంతటి అన్నముతినిన అజీర్ణము కాకుండునో, పని మొదలగువాటికనుకూలముగ నుండునో అదియే ఆత్మసమ్మతమైన కొలత "యదుహవా ఆత్మసమ్మితం అన్నం తదవతి తన్నహినస్తి యద్భూయోహినస్తితద్యత్ కనీయో న తదవతి = ఏ అన్నము తన కొలతకు తగినదో (తనదేహమునకు చాలినదో) ఆ అన్నము కాపాడుచున్నది. అది చెరుపుచేయుటలేదు. దానికంటె అధికమైనది చెరుపు చేయుచున్నది. దానికంటె తగ్గినది కాపాడుటలేదు'' అను శతపథబ్రాహ్మణము మొదలగు శ్రుతులచే ఆహారముయొక్క క్రమమును కనుగొనుడు. అందువలన యోగి తన దేహమునకు తగినకొలతకు అధికముగగాని తక్కువగగాని అన్నమును భుజించగూడదు. లేక ''అర్ధం సవ్యంజనాన్నస్యతృతీయముదకస్యచ। వాయోస్సంచరణార్థంతు. చతుర్థమవ శేషయేత్॥ అన్నమునకును కూరమొదలగు వాటికిని సగము కడుపు, జలమునకు మూడవపాతిక కడుపు, గాలిసంచరించుటకై మిగిలిన నాలుగవపాతిక కడుపును మిగులబెట్టి ఖాళీగాచేయవలెను'' అను యోగశాస్త్రవిధిలోని కొలత ప్రకారమని చెప్పవచ్చును.

(శ్రీధరులు) ''ద్వౌభాగౌ పూరయేదన్నైస్తోయేనైకం ప్రపూరయేత్। మారుతస్యప్రచారార్థం చతుర్థమవశేషయేత్'' (యోగశాస్త్రము) (ఈ శ్లోకమునకు అర్థము 4 వ అధ్యాయము 30-వ శ్లోకముక్రింద చూడుడు.)

(మధ్వులు) ''నిద్రాశనభయశ్వాసచేష్టాతంద్రాది వర్జనం । కృత్వా నిమీలితాక్షస్తు శక్తో ధ్యాయన్ ప్రసిద్ధ్యతి'' (నారదీయపురాణము) = శక్తిగలవాడు, నిద్ర, ఆహారము, భయము, శ్వాసము, చేష్ట, సోమరితనము మొదలగువాటిని విడిచి కండ్లను మూసికొని యోగముచేయవలెనని చెప్పబడియున్నది. (ఐతే ఈగీతాశ్లోకము ఆహారము మొదలగువాటిని సర్వథా విడువశక్తిలేని యోగి విషయముగ చెప్పబడినదని యెరుంగవలెను.)

(స్వకీయము) ఈ ఆహారవిషయమై 4-వ అధ్యాయము 30-వ శ్లోకములో జెప్పబడియున్న దానిని చూడుడు.

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ 17

పద॥ యుక్తాహారవిహారస్య - యుక్తచేష్టస్య - కర్మసు।
యుక్తస్వప్నావబోధస్య - యోగః - భవతి - దుఃఖహా (1)

| | | | |
|---|---|---|---|
| యుక్తాహారవిహారస్య | సరియైన ఆహారము, నడత, నీటినిగలవాడుగను | యుక్తస్వప్నావబోధస్య | సరియైననిద్రయు, మేలుకొనుటయు గలవాడుగనున్న వానికి |
| కర్మసుయుక్త చేష్టస్య | కర్మలలో సరిగప్రవర్తించు వాడుగను | యోగః | ధ్యానయోగము |
| | | దుఃఖహా | దుఃఖమును బోగొట్టునదిగ |
| | | భవతి | అగుచున్నది. |

తా॥ సరియైన (విధింపబడిన కొలతలో) ఆహారమున్ను, విహరించుటయు గలవాడుగను ఆ విధముగనే విహితమైన కాలమున కర్మలో ప్రవర్తించు వాడుగను, ఆ విధముగనే విహితమైన కాలమున నిద్రయు మేలుకొనుటయు గలవాడుగ నున్న యోగికి ధ్యానయోగము సకల సంసార దుఃఖములనున్ను పోగొట్టునదగును.

(1) దుఃఖహా - సంసారదుఃఖమనెడి జనన దుఃఖమును పోగొట్టునదగును. (మధ్వులు)

(స్వకీయము) మునుపటి శ్లోకములో యోగసిద్ధికి ప్రతికూలము లైనవాటినిజెప్పి దీనిలో యోగమును పొందుటకు అనుకూలమైన ఆహార నియమము దానిప్రయోజనము ఇవి చెప్పబడు చున్నవి.

---

శ్లో॥ యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥ 18

పద॥ యదా - వినియతం - చిత్తం - ఆత్మని (1) - ఏవ - అవతిష్ఠతే।
నిస్పృహః - సర్వకామేభ్యః - యుక్తః (2) - ఇతి - ఉచ్యతే - తదా॥

| | | | |
|---|---|---|---|
| యదా | ఎప్పుడు | తదా | అప్పుడు |
| చిత్తం | చిత్తము | సర్వకామేభ్యః | సకల విషయములనుండియు |
| వినియతం | బాగుగ అణచబడి | నిస్పృహః | కోరిక నివర్తించినవాడై |
| ఆత్మన్యేవ | ఆత్మయెడనే | యుక్త ఇతి | సమాధినిపొందినవాడని |
| అవతిష్ఠతే | నిలబడుచున్నదో | ఉచ్యతే | చెప్పబడుచున్నాడు. |

తా॥ ఎప్పుడు చిత్తము బాగుగ నణచబడి అనగా బాహ్యవిషయములను తలంచుటను విడిచి ఒక నిలకడ చెంది ఆత్మయెడ మాత్రము నిలబడునో అప్పుడు అతడు సకల విషయములనుండి ఆసక్తి నివర్తించినవాడై సమాధిని పొందిన వాడని చెప్పబడుచున్నాడు.

(1) ఆత్మని - తనయాత్మ స్వరూపములో (శంకరులు)

(2) యుక్తః - యోగము చేయుటకు అర్హుడని (రామానుజులు.)

(స్వకీయము) అతడు యోగమును గూడినవాడుగ ఎప్పుడగును అనునది దీనిలో జెప్ప బడుచున్నది.



శ్లో॥ యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః॥ 19

పద॥ యథా - దీపః - నివాతస్థః - న - ఇంగతే - సా - ఉపమా - స్మృతా।
యోగినః - యతచిత్తస్య - యుఞ్జతః - యోగం - ఆత్మనః॥

| | | | |
|---|---|---|---|
| నివాతస్థః | గాలిలేనిచోటనున్న | యుఞ్జతః | అనుష్ఠించుచున్న |
| దీపః | దీపము | యోగినః | యోగియొక్క |
| యథా | ఎట్లు | యతచిత్తస్య | అణగినచిత్తమునకు |
| నేంగతే | - కదలకయుండునో | ఉపమా | ఉపమానముగ |
| సా | అది | స్మృతా | తలంపబడుచున్నది. |
| ఆత్మనః యోగం | ఆత్మసమాధిని | | |

తా॥ గాలి లేనిచోట నున్న దీపమెట్లు కదలకయుండునో అది ఆత్మ సమాధిని అనుష్ఠించుచున్న యోగియొక్క అణగిన చిత్తమునకు ఉపమానముగ యోగము నెరింగినవారిచే తలంచబడుచున్నది.

(శంకరులు) ఏ యోగియొక్క చిత్తము సమాధినిగూడియున్నదో అట్టి స్థితిలోనున్న చిత్తమునకుపమానము దీనిలో చెప్పబడుచున్నది. యోగము నెరుంగువారై చిత్తవృత్తులను చూచెడి స్వభావముగలవారలు అంతఃకరణము అణగి సమాధిననుష్ఠించుచున్న యోగియొక్క చిత్తమునకు, గాలి లేనిచోటనున్న దీపమెట్లు కదలకయుండునో దానినుపమానముగ జెప్పుచున్నారు.

(రామానుజులు) యతచిత్తస్య = మనస్స్వాధీనముగల, యోగినః = యోగియొక్క, యోగం యుఞ్జతః = యోగమును జేయుచున్న, ఆత్మనః = ఆత్మస్వరూపమునకు (మిగత భాగమునకు అర్థములో వ్యత్యాసములేదు.)

(స్వకీయము) మధుసూదన సరస్వతి దీనికి రామానుజునివలె అన్వయము జేసికొని "ఆత్మనః" అనుదానికి 'చిత్తమునకు' అనిఅర్థముచేసియున్నారు. ఆనందగిరి చెప్పుటలో గాలిలేనిచోటనున్న దీపముయొక్క కదలనిస్థితిని బాహ్యవిషయములను చింతింపకయున్న యోగియొక్క చిత్తముయొక్క నిశ్చలమైనస్థితికి ఉపమానమనుచున్నారు. రామానుజులు మొదలగువారలు ఆత్మకును దీపమునకును ఉపమానోపమేయభావము చెప్పుచున్నారు.



శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా *।
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥ 20

పద॥ యత్ర (1) - ఉపరమతే - చిత్తం - నిరుద్ధం - యోగసేవయా।
యత్ర - చ - ఏవ - ఆత్మనా - ఆత్మానం - పశ్యన్ - ఆత్మని - తుష్యతి॥

| | | | |
|---|---|---|---|
| చిత్తం | చిత్తము | ఆత్మనా | శుద్ధమైన అంతఃకరణముచేత |
| యోగసేవయా | యోగానుష్ఠానముచేత | ఆత్మానం | పరమాత్మను |
| నిరుద్ధం | అణచబడి | పశ్యన్ | చూచి (అనుభవించుచు) |
| యత్ర | ఎప్పుడు | ఆత్మన్యేవ | తన యాత్మయెడనే |
| ఉపరమతే | అవకాశము (విశ్రాంతి) పొందుచున్నదో | తుష్యతి | సంతోషించునో |
| యత్ర | ఎప్పుడు | (తత్ర) | అప్పుడు |
| (యోగీ) | యోగియైనవాడు | (యోగసిద్ధిర్భవతి) | యోగసిద్ధికలుగుచున్నది. |

తా॥ ఎప్పుడు చిత్తము యోగము ననుష్ఠించుటచేత వేరుదేనియందును ప్రవేశింపక అణచబడి విశ్రాంతిని బొందునో, ఎప్పుడు (యోగియైనవాడు) పరిశుద్ధమైన అంతఃకరణముచే పరమాత్మను చూచి యెరింగి అనగా అనుభవించి తన ఆత్మయెడనే సంతోషమును పొందుచున్నాడో అప్పుడాతనికి యోగము సిద్ధించుచున్నది.

* ఈ 20-21-22 శ్లోకములను యోగశిఖోపనిషత్తునందు అధ్యాయము 3-లో చూడుడు.

(1) యత్ర - ఏఅవస్థలో (శ్రీధరులు, మధుసూదన సరస్వతి)

(శంకరులు) ఇట్లు యోగాభ్యాస బలముచే ఒకనిలకడచెంది గాలిలేనిచోటనున్న దీపము వలెనున్నదై యోగానుష్ఠానముచే చిత్త మెచ్చటను ప్రవర్తింపక యుండునట్లు అణచబడి విశ్రాంతిని పొందునో, ఎప్పుడు అతడు జ్యోతిస్స్వరూపముగ ప్రకాశించుచున్న జ్ఞానమైన ఆత్మయనే పరమచైతన్యమును సమాధిచే పరిశుద్ధమైన అంతఃకరణముచే చూచియెరింగిన తనయాత్మ యెడనే సంతోషమును పొందుచున్నాడో.

(మధ్వులు) ఆత్మన్యేవ = తనదేహములోనేయున్న, ఆత్మానం = పరమాత్మను, ఆత్మనా = మనస్సుచేత, పశ్యన్ = చూచుచున్నవాడై, తుష్యతి = సంతోషించునో.

(స్వకీయము) ఈ 20-వ శ్లోకము వాస్తవమున పూర్తిగలేనందున దానిని రాబోవు 21-22-23-శ్లోకములతో నొకటిగచేర్చియే తఱచు అందరు అన్వయపరచియున్నారు. ఐతే ఆనందగిరి, భాష్యోత్కర్ష దీపికాకారుడు, వీరలు "తత్రకాలే యోగసిద్ధిర్భవతి" అనుదానిని వాక్యశేషముగ నెత్తుకొనియున్నారు, ఆ విధముగనే ఈ 20-వ శ్లోకమును పై శ్లోకములను వెవ్వేరుగ అన్వయపరచుట కొంచెము స్పష్టముగ నుండవచ్చునని ప్రత్యేకించిన అన్వయమే చేయబడియున్నది.

శ్లో॥ సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియం।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥ 21

పద॥ సుఖం - ఆత్యంతికం - యత్ - తత్ - బుద్ధిగ్రాహ్యం - అతీంద్రియం।
వేత్తి - యత్ర - న - చ - ఏవ - అయం - స్థితః - చలతి - తత్త్వతః (1)॥

| | | | |
|---|---|---|---|
| బుద్ధిగ్రాహ్యం | బుద్ధిచేతనే గ్రహింపదగినదియు | సుఖం యత్ | సుఖమెట్టిదో |
| అతీంద్రియం | ఇంద్రియములనుదాటి నిలబడినదియు | తత్ | దానిని (ఆ సుఖమును) |
| | | (యోగీ) | యోగియైనవాడు |
| ఆత్యంతికంచ | ముగింపులేనట్టిదియునైన | యత్రవేత్తి | ఎప్పుడనుభవించి యెరుంగునో |

| | | | |
|---|---|---|---|
| (యత్ర) | ఎప్పుడు | తత్త్వతః | (అ) తత్త్వస్వరూపమునుండి |
| అయం | ఇతడు | నైవ చలతి | కదలుటయే లేదో |
| స్థితః | ఆత్మస్వరూపములో స్థిర మైనవాడై | (తత్ర) | అప్పుడు |
| | | (యోగసిద్ధిర్భవతి) | యోగసిద్ధి గలుగుచున్నది. |

తా॥ (ఇంద్రియములను కోరని) బుద్ధిచే మాత్రము గ్రహింపబడునట్టియు ఇంద్రియములకందక తరువాత నున్నట్టియు ముగింపు లేనట్టియునైన ఈసుఖమును యోగియైనవాడు ఎప్పుడనుభవించి యెరుంగునో ఎప్పుడు ఈ జ్ఞాని ఆత్మస్వరూపమునందే నిలకడ చెందినవాడై ఆ తత్త్వస్వరూపమునుండి కదలుటయే లేదో, అనగా జారనే జారడో అప్పుడు యోగసిద్ధి గలుగుచున్నది.

(1) తత్త్వతః - భగవంతుని రూపమునుండి (మధ్వులు.)



శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిం స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే॥ 22

పద॥ యం (1) - లబ్ధ్వా - చ - అపరం - లాభం - మన్యతే - న - అధికం -
యస్మిన్ - స్థితః - న - దుఃఖేన - గురుణా - అపి - విచాల్యతే॥

| | | | |
|---|---|---|---|
| (అయం) | ఇతడు | నమన్యతే | తలంచుటలేదో |
| యం చ | దేనిని (ఆత్మలాభమును) | యస్మిన్ స్థితః | దేనిలో స్థిరముగ నిలబడువాడు |
| లబ్ధ్వా | పొంది | గురుణా | మిక్కిలి గొప్పదైన |
| అపరంలాభం | వేరులాభమును | దుఃఖేనాపి | దుఃఖముచేతను |
| తతః | దానికంటె | నవిచాల్యతే | కదలింపబడుటలేదో |
| అధికం | మేలైనదిగ | (సః యోగః) | అదియోగము. |

తా॥ ఏ ఆత్మలాభమును పొందియున్నవాడు పిదప దానికంటె (ఆత్మను పొందుటకంటె) మేలైనదై మరియొకటి యున్నదని తలంచుట లేదో దేనిలో, (ఏ ఆత్మతత్త్వములో) స్థిరముగ నిలబడువాడు మిక్కిలి గొప్ప దుఃఖముచేతను కదలింపబడుటలేదో అదియే యోగమనంబడును.

(1) యం - ఏ యోగమును (రామానుజులు.)

శ్లో॥ తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితం।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥ 23

పద॥ తం - విద్యాత్ (1) - దుఃఖసంయోగవియోగం - యోగసంజ్ఞితం
సః - నిశ్చయేన - యోక్తవ్యః - యోగః - అనిర్విణ్ణచేతసా॥

| | | | |
|---|---|---|---|
| దుఃఖసంయోగ వియోగం తం | దుఃఖముయొక్క చేరికనుండి విడుచుటయనే మునుపు జెప్పినదానిని | సః యోగః | ఆ యోగము |
| | | నిశ్చయేన | నిశ్చయముచేతను |
| | | అనిర్విణ్ణచేతసా | కలతచెంది దుఃఖించనిమనస్సు చేతను |
| యోగసంజ్ఞితం | యోగమనుపేరుగలదిగ | | |
| విద్యాత్ | తెలుసుకొనవలెను | యోక్తవ్యః | పొందదగినది. |

తా॥ దుఃఖముయొక్క చేరికనుండి కదలుట యనేదానిని, అనగా దుఃఖ సంబంధము లేకుండుటను యోగమను పేరు గలదిగ తెలిసికొనవలెను. ఆ (మునుపు జెప్పిన ఫలముగల) యోగమును నిశ్చితబుద్ధితోను కలత చెంది దుఃఖించని మనస్సుతోను అనగా ఉత్సాహముతోగూడిన మనస్సుతోను పొంద వలెను. అనగా అట్టి మనఃస్థితియే యోగసిద్ధిని పొందుటకు అనుష్ఠింపవలసిన సాధనము అని తాత్పర్యము.

(1) విద్యాత్ - వింద్యాత్ అని యొక పాఠము. అర్థమొక్కటే.

(2) అనిర్విణ్ణచేతసా - రాఘవేంద్రులు నిర్విణ్ణచేతసా అని పదవిభాగము చేసుకొని దానికి 'విషయ వైరాగ్యమును పొందిన మనస్సుగలవానిచేత, అని అర్థము జేసియున్నారు.

(శంకరులు) ఈ అధ్యాయమున 20-వ శ్లోకము మొదలు కొన్ని విశేష వాక్యములచే పొగడి చెప్పబడిన ఒక విధమైన ఆత్మస్థితియగు యే యోగముపదేశింపబడినదో దానిని, అనగా దుఃఖముయొక్క చేరికనుండి వదలుటయే యోగమను పేరుగలదిగ తెలుసుకొనవలెను. యోగమనగా చేరిక, కూడుట. వియోగమనగా వదలుట. దుఃఖముయొక్క చేరికనుండి వదలుటకు విపరీత లక్షణచే యోగమని పేరు బెట్టబడినది (విపరీతలక్షణయనగా మూఢునిజూచి అతిబుద్ధిశాలియని జెప్పుటవంటిది. లక్షణయనగా వాచకములుగ నిలబడు పదములు తమ తమ అర్థమును తెలియ బరచక దాని తాత్పర్యార్థమును ఎరుంగజేయుట. ఉదాహరణము - "ఇతడు పశువు" అనుచోట పశువు అనుపదము తన యర్థము నెరింగింపక మూఢుడను తాత్పర్యమునుజూపి నిలుచుటను చూడుడు.)

భగవంతుడు యోగముయొక్క ఫలమునుజెప్పి ముగించి పిదప దార్ఢ్యము, మనస్సు కలతచెంది దుఃఖింపకనుండుట, అనగా ఉత్సాహము ఇవి యోగమునకు సాధనములని విధించు టకై మరల నా యోగమును పొందు మార్గము నుపదేశింపబూని యోగము నుత్సాహముతోను నిశ్చ యముతోను అనుష్ఠింపవలెనని చెప్పుచున్నాడు.



శ్లో॥ సంకల్పప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ 24

,, శనైశ్శనైరుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥ 25

పద॥ సంకల్పప్రభవాన్ - కామాన్ (1) - త్యక్త్వా - సర్వాన్ - అశేషతః (2) ।
మనసా (3) - ఏవ - ఇంద్రియగ్రామం - వినియమ్య - సమంతతః (4) ॥

,, శనైః - శనైః - ఉపరమేత్ - బుద్ధ్యా - ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం - (5) మనః - కృత్వా - న - కించిత్ - అపి - చింతయేత్ ॥

| | | | |
|---|---|---|---|
| సంకల్పప్రభవాన్ | సంకల్పము పుట్టిల్లుగగల | వినియమ్య | అణచి |
| సర్వాన్ | సమస్తములైన | ధృతిగృహీతయా | ధైర్యముచే పట్టబడిన |
| కామాన్ | కామములను, కోరికలను | బుద్ధ్యా | బుద్ధిచేత |
| అశేషతః | బాకిలేక అనగా ఆసక్తిలేక | శనైశ్శనైః | మెల్లమెల్లగా (కొద్దికొద్దిగా) |
| త్యక్త్వా | విడిచి | ఉపరమేత్ | విశ్రాంతిని పొందవలెను |
| మనసైవ | మనస్సుచేతనే | మనః | మనస్సును |
| ఇంద్రియగ్రామం | సకలమైన ఇంద్రియసమూహ మును | ఆత్మసంస్థంకృత్వా | ఆత్మయెడనే నిలబడునదిగజేసి |
| | | కించిదపి | దేనిని |
| సమన్తతః | అన్నిప్రక్కలనుండియు | నచింతయేత్ | చింతింపగూడదు. |

తా॥ సంకల్పము (తలంచుట) పుట్టిల్లుగగల కోరికలన్నిటిని నిశ్శేషముగ అనగా కొంతయు ఆసక్తిలేక విడిచి మనస్సుచేతనే ఇంద్రియసమూహమును అన్నిప్రక్కలనుండియు అణచి ధైర్యముతోగూడిన బుద్ధిచే మెల్లమెల్లగా విరామమును పొందవలెను. మనస్సును ఆత్మయెడ నిలచినదిగజేసి అనగా సకలము ఆత్మయే, దానికంటె వేరొక్కటిలేదను నిశ్చయముతో అతడు దేనిని చింతింపగూడదు.

(1) కామాన్ - కామములు సంకల్పమువలన కలుగునవి, స్పర్శమువలన కలుగునవి అని రెండు విధములు. సంకల్పమనగా ఇట్టికార్యమును చేయవలెను. దానిచే నిట్టిఫలమును పొందగలము అని మనస్సున తోచుట, లేక మనస్సుచేత ఉద్దేశించుట. దీనివలన గలుగునది పుత్రాదులమీద ఆసక్తి. స్పర్శమనగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు విషయములలో సంబంధించుట. దీనివల్లన గలుగునవి శీతోష్ణాదులు. ఈ రెండు విధములుగనే కామములు గలుగుచున్నవి. మొదటి దానిని విడిచిపెట్టవలెను. రెండవదానినంతను విడచుట అసాధ్యమైనందున దానిమూలమునగలుగు సుఖదుఃఖములను విడువవలెను. (రామానుజులు)

(2) అశేషతః - కొంతయు నాసక్తిలేక (శంకరులు)

(3) మనసా - వివేకముతో గూడిన మనస్సుచే (శంకరులు)

(4) సమన్తతః - సకల విషయములనుండియు (మధుసూదన సరస్వతి)

(5) ఆత్మసంస్థం - సకలము ఆత్మయే, దానికంటె వేరొక్కటిలేదు అని మనస్సును ఆత్మయెడ నిలకడ చెందినదిగచేసి (శంకరులు). పరమాత్మయెడ నున్నట్లు (మధ్వులు).

(స్వకీయము) ఈ 25-వ శ్లోకము ధ్యానబిందూపనిషత్తులో చూడుడు. ఈ శ్లోకములో విహితమైయున్న మనఃస్థితియే అనగా మనస్సు చలింపక ఆత్మయెడ నిలచుటయే యోగముయొక్క ఉన్నతస్థితి పరమరహస్యము. "మెల్లమెల్లగా" అని చెప్పుటవలన సాధారణముగ మన మీ విషయములోజేయు త్వరగూడదని గుర్తించి చూపుటను గమనింపుడు.

~~~~~~~~

శ్లో॥ యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥ 26
~~~~~~~~

పద॥ యతః - యతః - నిశ్చరతి - మనః - చంచలం - అస్థిరం ।
తతః - తతః - నియమ్య - ఏతత్ - ఆత్మని - ఏవ - వశం - నయేత్ ॥

| | | | |
|---|---|---|---|
| చంచలం | మిక్కిలి చంచలమైనదియు | తతస్తతః | దానిదానినుండి |
| అస్థిరం | స్థిరముకానిదియునైన | ఏతత్ | ఈ మనస్సును |
| మనః | మనస్సు | నియమ్య | అణచి (త్రిప్పి) |
| యతోయతః | దేనిదేని నిమిత్తమై | ఆత్మన్యేవ వశం | ఆత్మయెడనే వశముగ |
| నిశ్చరతి | తిరుగుచున్నదో | నయేత్ | చేసికొనవలెను. |

తా॥ మిక్కిలి చంచలమైనదియు, కావుననే స్థిరము కానిదియునైన మనస్సు ఏ యే విషయముల నిమిత్తమై తిరుగునో ఆయా కారణమైన విషయములనుండియు ఈ మనస్సును త్రిప్పి ఆత్మయెడనే వశముగనున్నట్లు చేసికొనవలెను.

(శంకరులు) మనస్సును ఆత్మయెడ స్థిరపరచుటకై ప్రయత్నించుచున్న యోగియైనవాడు మరియు తెలిసికొనవలసినదేమనగా, మనస్స్థైర్యమువిడిచి పరుగెత్తుటకు కారణములు శబ్దము మొదలగు విషయములు. ఇట్లు శబ్దాదివిషయములచే నీడువబడి తిరుగుట యధార్థముకాని జ్ఞానము నాధారపడి నిలబడునట్టి కోరిక మొదలగునట్టి మనస్సుయొక్క స్వభావమైన దోషముచేననుడు. ఇంద్రియవిషయములు, వాటి వాస్తవమైన స్వభావము, వీటివిమర్శచేతను వైరాగ్యము నాదరించుట చేతను అవి వాస్తవమైనవి కావని నిశ్చయించుకొని ఈ మనస్సును విషయములనుండి మరలింపచేసి ఆత్మకు వశముగ చేయవలెను. ఇట్లు యోగాభ్యాసముయొక్క బలముచే మనసు ఆత్మయెడనే శాంతమగుచున్నది.

~~~~~~~~~~~~~

శ్లో॥ ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥ 27

పద॥ ప్రశాంతమనసం - హి - ఏనం - యోగినం - సుఖం - ఉత్తమం ।
ఉపైతి - శాంతరజసం (1) - బ్రహ్మభూతం (2) - అకల్మషం (3) ॥

| | | | |
|---|---|---|---|
| ప్రశాంత మనసం | మిక్కిలి శాంతమైన మనస్సు గలవాడై | ఏనం | ఇటువంటి |
| శాంతరజసం | రజోగుణము అణగి | యోగినం హి | యోగినే |
| అకల్మషం | పాపములేనివాడై | ఉత్తమం సుఖం | ఉత్తమమైన సుఖము |
| బ్రహ్మభూతం | బ్రహ్మమే తానుగ(జీవన్ముక్తుడుగ)నున్న | ఉపైతి | వచ్చిచేరుచున్నది. |

తా॥ మిక్కిలి శాంతమొందిన మనస్సుగలవాడై రజోగుణమణగి పాపములేనివాడై బ్రహ్మమే తానుగ అనగా జీవన్ముక్తుడుగనున్న ఇట్టి యోగినే పరమానందము నిశ్చయముగ వచ్చి చేరుచున్నది.

(1) శాంతరజసం - మోహము మొదలగు దుఃఖములకు కారణమైన రజోగుణము నివర్తించి (శంకరులు.)

(2) బ్రహ్మభూతం - బ్రహ్మమే తానుగనిలబడు యోగి "సకలము బ్రహ్మమే" అను నీ విధముగ నిశ్చయముగలవాడు, జీవన్ముక్తుడు, అనగా బ్రతికియున్నప్పుడే ముక్తిపొందినవాడు
~~~~~~~~~~~~~

(శంకరులు). ప్రకృతి సంబంధము తొలగి తన స్వరూపముతోనున్న (రామానుజులు). బ్రహ్మధ్యానములో స్థిరముగనున్న (రాఘవేంద్రులు).

(3) అకల్మషం - ధర్మము అధర్మము మొదలగునవి, అనగా పుణ్యము పాపము మొదలగునవి తొలగిన (శంకరులు).

శ్లో॥ యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే ॥ 28

పద॥ యుఞ్జన్ (1) ఏవం - సదా - ఆత్మానం (2) - యోగీ - విగతకల్మషః (3) ।
సుఖేన - బ్రహ్మసంస్పర్శం - అత్యన్తం - సుఖం - అశ్నుతే ॥

| | | | |
|---|---|---|---|
| ఏవం | ఈ విధముగ (పైజెప్పిన విధముగ) | యోగీ | యోగియైనవాడు |
| | | బ్రహ్మసంస్పర్శం | బ్రహ్మసంబంధముగల |
| సదా | ఎల్లప్పుడు | అత్యన్తం సుఖం | ముగింపులేనిసుఖమును |
| ఆత్మానంయుఞ్జన్ | అంతఃకరణమును ఆత్మయెడ స్థిరపరచి | సుఖేన | అయాసములేక (సులభముగ) |
| | | అశ్నుతే | పొందుచున్నాడు. |
| విగతకల్మషః | పాపముతొలగిన | | |

తా॥ పై జెప్పిన విధముగ ఎల్లప్పుడు నంతఃకరణమును ఆత్మయెడ స్థిరపరచుకొని పాపములన్నియు తొలగినవాడైన యోగి, బ్రహ్మముతో చేరుటయనే, బ్రహ్మముగనే అగుటయనే, మేలైన సుఖమును ఆయాసములేక అనగా సులభముగ పొందుచున్నాడు. అనగా బ్రహ్మానందానుభవరూపముగనే యున్నాడని తాత్పర్యము.

(1) యుఞ్జన్ - ధ్యానముచేయుచున్న (రాఘవేంద్రులు)

(2) ఆత్మానం - పరమాత్మను (రాఘవేంద్రులు)

(3) విగతకల్మషః - ప్రాచీనకర్మలన్నియు పోగొట్టుకొనియున్న (రామానుజులు). కామక్రోధములను పోగొట్టుకొనియున్న (రాఘవేంద్రులు)

(4) బ్రహ్మసంస్పర్శం = బ్రహ్మైక్యమనే (శంకరులు). బ్రహ్మానుభవ రూపమైన (రామానుజులు). భగవంతుని పొందినపిదప తనకు గలుగునట్టి (రాఘవేంద్రులు).

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29

పద॥ సర్వభూతస్థం - ఆత్మానం - సర్వభూతాని - చ - ఆత్మని ।
ఈక్షతే - యోగయుక్తాత్మా - సర్వత్ర - సమదర్శనః ॥

| | | | |
|---|---|---|---|
| యోగయుక్తాత్మా | యోగముతోగూడిన అంతఃకరణముగలవాడై | సర్వత్ర | (బ్రహ్మమొదలు తృణమువరకుగల) సకలవస్తువులలోను |

| | | | |
|---|---|---|---|
| సమదర్శనః | సమమైన చూపుగలవాడు | సర్వభూతాని | సకలభూతములున్ను |
| ఆత్మానం | (తన) ఆత్మను | ఆత్మని చ | ఆత్మయెడ నున్నవిగను |
| సర్వభూతస్థం | సకలభూతములలోనున్నదిగను | ఈక్షతే | చూచుచున్నాడు. |

తా॥ యోగముతోగూడిన అంతఃకరణముగలవాడై బ్రహ్మమొదలు తృణమువరకుగల వస్తువులన్నిటిని సమముగ జూచెడివాడు (తన) ఆత్మను సకలభూతములలోను ఉన్నదిగను సకలభూతములున్ను (తన) ఆత్మయెడ నున్నవిగను చూచుచున్నాడు.

(శంకరులు) అంతట బ్రహ్మమొక్కటేయని చూచుట యోగమునకు ఫలము, సంసారమంతయు తొలగిపోవుటకు కారణమైనది, అను జ్ఞానము దీనిలో నుపదేశింపబడుచున్నది. యోగియైనవాడు తనయాత్మను సకలభూతముల యెడనున్నదిగ చూచుచున్నాడు. బ్రహ్మమొదలు తృణమువరకుగల సకలభూతములను ఆత్మయెడనొక్కటిగ నున్నవిగ చూచుచున్నాడు. బ్రహ్మమొదలు స్థావరము వరకుగల వెవ్వేరైన సకలభూతములయెడను మార్పులేని ఒకేచూపు, అనగా బ్రహ్మమున్ను తనయాత్మయు ఒక్కటే యనుజ్ఞాన మెవ్వనికికలదో అతడే "సర్వత్ర సమదర్శనః" అంతట ఒకే చూపుగలవాడు.

(రామానుజులు) ప్రకృతినుండి విముక్తమైన ఇతర జీవస్వరూపమున్ను ప్రకృతి విముక్తమైన తనయొక్క జీవస్వరూపమున్ను సమానమైనదనియు ప్రకృతి విముక్తమైన తన జీవస్వరూపము ప్రకృతివిముక్తమైన ఇతరజీవస్వరూపముతో సమానమైనదనియు చూచెడివాడు యోగి (అనగా) తనయొక్క ప్రకృతి విముక్త స్వరూపమును చూచెడివాడు. ఇతరులున్ను ప్రకృతివిముక్తులైన యెడల తనయొక్క విముక్తస్వరూపముతో సమానమైన వారని నిశ్చయించెడివాడని తాత్పర్యము. ఈఅర్థము 5 వ అధ్యాయము 19 శ్లోకములోను ఈ అధ్యాయము 33 శ్లోకములోను చెప్పబడియున్నది.

(మధ్వులు) ప్రపంచమునందలి వస్తువు లన్నిటిలోను బ్రహ్మమొక్కటే విధముగ నున్నట్లును వస్తువులన్నియు బ్రహ్మమునందున్నట్లును ఎరింగెడివాడు యోగి అని తాత్పర్యము.

(స్వకీయము) సకల భూతములలోను ఆత్మ తానేయనియు తనయెడ భూతములన్నిటిని సమముగను (అనగా) ఆత్మఒక్కటే అనియు చూచెడివాడే యోగి అని తాత్పర్యము. పైశ్లోకమును చూడుడు. ఈ శ్లోకముయొక్క అర్థమునే చెప్పెడి శ్రుతులుక్రింద గుర్తింపబడుచున్నవి.– "యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి। సర్వభూతేషు చాత్మానం న తతో విజుగుప్సతే॥ (ఈశావాస్యోపనిషత్తు 6 వ వాక్యము) సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని। సంపశ్యన్బ్రహ్మపరమం యాతి నాన్యేన హేతునా॥ (కైవల్యోపనిషత్తు).

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥　30

పద॥ యః - మాం - పశ్యతి - సర్వత్ర - సర్వం - చ - మయి - పశ్యతి ।
- అహం - న - ప్రణశ్యామి - సః - చ - మే - న - ప్రణశ్యతి ॥

| | | | |
|---|---|---|---|
| యః మాం | ఎవడునన్ను | సర్వం | సకలభూతములను |
| సర్వత్ర | సకలభూతములయెడను | మయి చ | నాయెడను |
| పశ్యతి | చూచుచున్నాడో | పశ్యతి | చూచుచున్నాడో |

| | | | |
|---|---|---|---|
| తస్య | అతనికి | సచ | అతడున్ను |
| అహం | నేను | మే | నాకు |
| న ప్రణశ్యామి | ప్రత్యక్షముకాకయుండుటలేదు | న ప్రణశ్యతి | ప్రత్యక్షముకాక యుండుటలేదు. |

తా॥ ఎవ్వడు (పరమాత్మయైన) నన్ను సకల భూతములయెడ చూచునో, సకల భూతములను నా యెడనుచూచునో అతనికి నేను కనపడక యుండుట లేదు. నాకతడు కనపడక యుండుటయు లేదు.

(శంకరులు) "అంతట ఆత్మ ఒక్కటే" అని చూచుటకు ఫలము దీనిలో చెప్పబడు చున్నది. సకలమునకును ఆత్మయైన వాసుదేవుడైన నన్ను సకలభూతములలోను ఎవ్వడుచూచునో, బ్రహ్మ మొదలైన భూతవర్గములన్నిటిని సర్వాత్ముడైన నా యెడను చూచునో అట్టివానికి అనగా నీ విధముగ "అంతట ఆత్మ ఒక్కటే'' అని చూచువానికి ఈశ్వరుడైన నేను ప్రత్యక్షముగాక యుండను. ఆ జ్ఞానియు వాసుదేవుడైన నాకు ప్రత్యక్షముగాకయుండడు. నేను అతనిని విడిచియు అతడు నన్ను విడచియు వేరుపడము. నేనే అతడు. అతడే నేను. అతని ఆత్మయు నా యాత్మయు ఒక్కటి కావున ననుడు. తన యాత్మ తనకు తెలియునదిగనే ఉన్నదిగదా?

(రామానుజులు) సర్వత్ర = ప్రకృతి విముక్తులైయున్న సకలప్రాణుల స్వరూపములకు' మాం = సమమైన స్వరూపముగలవానిగ నన్ను, యః = ఎవ్వడు, పశ్యతి = చూచునో లేక యెరుంగునో, మయి = నా స్వరూపముతో సమానమైన స్వరూపముగలదిగ, సర్వంచ = ప్రకృతి విముక్తమైన సకల ఆత్మస్వరూపమునున్ను, యః = ఎవ్వడు, పశ్యతి = చూచునో, తస్య = అట్టి యాత్మదర్శనముగల యోగికి, అహం = నేను, నప్రణశ్యామి = ప్రత్యక్షముగనేయున్నాను. సచ = అతడున్ను, మే = నాకు, నప్రణశ్యతి = ప్రత్యక్షముగనేయున్నాడు.

(మధ్వులు) నా యెడ సకలభూతములను, సకలభూతములలో నన్ను చూచెడివాని యొక్క, నప్రణశ్యామి = యోగ క్షేమములకు నేను బాధ్యపడకయుండుటలేదు. అతడు నా యొక్క, నప్రణశ్యతి = భక్తుడుగాక యుండుటలేదు.

(రాఘవేంద్రులు) సర్వంచమయిపశ్యతి=సకలభూతములును నాయధీనమైనవని చూచునో (మిగిలినవి మధ్వులవలె)



శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః।
సర్వథా వర్తమానోపి స యోగీ మయి వర్తతే॥ 31

పద॥ సర్వభూతస్థితం - యః - మాం - భజతి - ఏకత్వం (1) - ఆస్థితః ।
సర్వథా (2) - వర్తమానః - అపి - సః - యోగీ - మయి (3) - వర్తతే ॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వడు | భజతి | భజించునో |
| ఏకత్వం ఆస్థితః | (ఆత్మ ఒక్కటేయను) ఏకత్వ మును నిలకడగగైకొని | సః యోగీ | ఆ యోగి |
| | | సర్వథావర్తమానోపి | ఎట్లున్నను అనగా యేమార్గము నందున్నను |
| మాం | నన్ను | | |
| సర్వభూతస్థితం | సకలభూతములలో నున్నట్టి | మయివర్తతే | నాయెడనున్నాడు. |

తా॥ ఎవ్వడు ఆత్మ 'అంతట ఒక్కటే' అను ఏకత్వమును స్థిరముగ గైకొని నన్ను సకల భూతములలో నున్నవానిగ భజించునో ఆ యోగి ఏ విధముగ నుండినను (ఏ మార్గమునందున్నను) నా యెడనే యున్నాడు.

(1) ఏకత్వం - పూర్ణమైన జ్ఞానాకారమై ఒకే విధముగనున్న (రామానుజులు)

(2) సర్వథా - ఏకాలమునందును అనగా ధ్యానకాలమునందును, ధ్యానమును విడిచి లేచిన కాలమునందును (రామానుజులు). పుణ్యపాప కర్మలను చేసినను (రాఘవేంద్రులు).

(3) మయివర్తతే - విష్ణువుయొక్క పరమపదమైన నాయున్నతస్థానములో నిత్యముక్తునిగనున్నాడు. (శంకరులు). ముక్తినిపొందుచున్నాడు (శ్రీధరులు). తన్ను, ఇతరప్రాణులను నా రూపమునకు సమానమైన రూపముగలవార్లుగ చూచుచున్నాడు (రామానుజులు). మోక్షమునందున్నాడు (మధ్వులు).

(శంకరులు) నేనే సకలమునకును ఆత్మనై, ఆత్మఒక్కటి అని చూచెడివాడు నేనుగనే కావున అట్లు ఒక్కటేయని జూచి యనుభవింప ప్రయత్నించవలెనని మునుపటి శ్లోకమున జెప్పిన సమ్యగ్దర్శనమునే మఱలను నొక్కిచెప్పి ఆ జ్ఞానమునకు ఫలము మోక్షమేయని భగవంతుడు చెప్పుచున్నాడు. ఉన్నదానిని ఉన్నట్లుజూచెడి యోగి ఏ విధముగ నున్నవాడైనను నా యెడ అనగా విష్ణువుయొక్క స్థితియైన పరమపదములో నున్నాడు. అతడు నిత్యముక్తుడే. ఎల్లప్పుడు మోక్షమొందినవాడే. అతడు మోక్షమును జెందువిషయములో దేనిచేతను అడ్డగింపబడడు అని తాత్పర్యము.



శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥　　32

పద॥ ఆత్మౌపమ్యేన - సర్వత్ర - సమం - పశ్యతి - యః - అర్జున।
సుఖం - వా - యది - వా - దుఃఖం - సః - యోగీ - పరమః - మతః॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున ! | ఓ అర్జునా ! | సుఖం వా | సుఖమునున్ను |
| యః | ఎవ్వడు | యదివా దుఃఖం | దుఃఖమునున్ను |
| ఆత్మౌపమ్యేన | తన్ను ఉపమానముగ నుంచి | సమం పశ్యతి | సమముగ జూచునో |
| సర్వత్ర | అంతటను (సకలభూతముల యెడను) | సః యోగీ | ఆ యోగి |
| | | పరమః మతః | మేలైనవాడుగ తలంపబడును. |

తా॥ ఓ అర్జునా ! ఎవ్వడు తన్నే దృష్టాంతముగనుంచి సకల భూతముల యెడను సుఖమును దుఃఖమును తనయెడవలె సమముగ జూచునో అతడు యోగులలో గొప్పవాడుగ తలంపబడును. (అనగా సకల భూతముల సుఖ దుఃఖములున్ను తనవిగనే సమదృష్టితో చూచెడివాడు ఉత్కృష్టమైన యోగి యనునది తాత్పర్యము.

(శంకరులు) తానే ఉపమానముగనుండు స్వభావముచే, అనగా తన్నే దృష్టాంతముగ నుంచుకొని సకల భూతములయెడ ఎవ్వడు సమముగ జూచునో అతడు సమముగ దేనిని జూచుచున్నాడు? అనగా ఎట్లు తనకు సుఖమిష్టమైనదో అటులనే సకల ప్రాణుల సుఖమున్ను అనుకూలమైనది. (అనగా తన సుఖమును తానెట్లు కోరునో ఆ విధముగనే సకల ప్రాణుల సుఖమున్ను

తన కనుకూల మైనదని సమముగ జూచుట) "వా" శబ్దము 'చ' అను సముచ్చయార్థములో నిల బడునది. మరియు యే దుఃఖము తనకెట్లు ప్రతికూలమైనదో అనగా ఇష్టము కానిదో అట్టి దుఃఖము సకల ప్రాణులకును ఆ విధముగనే ప్రతికూలమైనదే, కోరదగనిదే, అని ఈ విధముగ తన్నే దృష్టాంతముగ నుంచుకొని సకల భూతములయెడను అతడు సుఖమును అనుకూలముగను, దుఃఖ మును ప్రతికూలముగను తన యెడవలె సమముగ జూచుచున్నాడు.

ఒకనికిని చెరుపుచేయుటలేదు. హింసచేయని వాడని తాత్పర్యము. ఎవ్వడీ విధముగ హింసించనివాడై సమ్యగ్దర్శన నిష్ఠలో స్థిరపడెనో అతడు యోగులలో గొప్పవాడుగ తలంపబడు చున్నాడు.

(రామానుజులు) ప్రకృతి విముక్తమైన తనయాత్మ స్వరూపములో ప్రకృతి సంబంధము గల సుఖదుఃఖము లెట్లు అంటుటలేదో దానివలె ఇతర ప్రాణుల ప్రకృతివిముక్త ఆత్మస్వరూప ములో సుఖదుఃఖములు అంటుటలేదని ఎరింగెడివాడు శ్రేష్ఠుడు. లేక ఇతరులకు కలుగు సుఖ దుఃఖములచే నెట్లు తాను రాగద్వేషములను పొందుటలేదో ఆవిధముగనే తనకుగలుగు సుఖదుఃఖ ములచే తాను రాగద్వేషములను పొందక యుండువాడుశ్రేష్ఠుడనునది నా యభిప్రాయము.

(శ్రీధరులు, రాఘవేంద్రులు) తనకు సుఖమునందాసక్తియు దుఃఖమునందు ద్వేషము ఆ విధముగనే ఇతర ప్రాణులకును సుఖము గలుగునట్లును దుఃఖము గలుగకుండుటను గోరి ఆ విధముగ నడచెడి వాడెవ్వడో అతడు సమముగ జూచు యోగిగను శ్రేష్ఠుడుగను ఉన్నాడనునది తాత్పర్యము.

ఈ శ్లోకమునకు అంతరంగమైన తాత్పర్య మిట్టిదని బాగుగ నాలోచించి యెరుంగ దగినది. దీనిలో జెప్పబడిన యోగి యోగులందరిలోను మిక్కిలి గొప్పవాడనబడుచున్నాడు. మునుపు ఈ అధ్యాయము 29-వ శ్లోకములో జెప్పబడిన సమదర్శికంటె ఇతడేవిధముగ గొప్పవా డగునని విచారింతము. "అంతట ఆత్మ ఒక్కటే" అని బుద్ధియుక్తిచే ఎరింగి నిశ్చయించి నమ్మ కము గలిగి ఆత్మయెడ మనస్సు నెల్లప్పుడు స్థిరపరచుటకు ప్రయత్నించు యోగులలో ఇచ్చట జెప్పబడినవాడు సర్వప్రాణుల ఆత్మ తనయాత్మ యొకటేయను సమత్వమును సాక్షాత్తుగజూచి యనుభవించువాడు. అతడా సమత్వమును దేనిలో చూచుచున్నాడు. అనిన సకలప్రాణుల సుఖ దుఃఖములు తనవిగనే ప్రత్యక్షముగ జూచుచున్నాడు. ఇది యెంతటి దుర్లభమైనదని చెప్పవలెనా? ఇట్టివాడు పరమయోగియనుటలో సందేహముగలదా? ఈ సమత్వమును సాక్షాత్తుగజూచి యనుభ వించి ఆత్మదర్శనములో నెల్లప్పుడు స్థిరముగ నిలబడుటకు సులభమైన మార్గమును జూపదలంచి పరమకృపాళుడైన భగవంతుడు ఎల్లరికిని ప్రత్యక్షమైన ఒక ఉపమానమునుజూపి దానిని స్పష్ట ముగ మనస్సుకు గోచరించునట్లు చేయుచున్నాడు. "ఆత్మౌపమ్యేన సర్వత్రసమంపశ్యతి" తన్నే ఉపమానముగ నుంచుకొని సర్వభూతములయెడ సమముగ జూచుట అనగా వాటికి గలుగు సుఖ దుఃఖములు తనవిగనే చూచుట సమదర్శనము.

ఎట్లనగా ఈ దేహముతోగూడి నిలబడు మనము కొంత యాలోచించి చూచినయెడల దీనిలో పలువిధములైన నామరూపములచే మారుబడిన అనేక అవయవములు, ఉత్కృష్టమనియు, నికృష్టమనియు వ్యవహరింపదగిన అనేక భాగములు, అనేకకోటి అణువులు ఇమిడియున్నను వాటిలో ఒకదానికి కలుగు సుఖదుఃఖములు మిగతవాటికి కలిగినవిగనే సమమైన భావనయున్నది గదా? కాలిలో ముల్లు గ్రుచ్చుకొనినచో చెయ్యి ఆ దుఃఖమును తనదిగనే భావించి వెంటనే తీయుట వలె ఈ ప్రపంచమనే ఈశ్వరుని దేహమున నిమిడియున్న మనము ఇతర సకల భూతములకును కలుగు సుఖదుఃఖములు మనవిగనే సమముగజూచి పై యుపమానము ననుసరించి యెడతెగక

స్మరించి దానిలో స్థిరముగ నిలబడువాడు పరమయోగి అని భగవంతుని భావము. ''అండము నందున్నట్లు పిండమునందు'' అనుసూక్తిని అందరు వినియున్నాముగదా?

అర్జున ఉవాచ:—

శ్లో॥ యోఽయం యోగ స్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన।
వీతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరాం ॥ 33

పద॥ యః - అయం - యోగః - త్వయా - ప్రోక్తః - సామ్యేన - మధుసూదన।
ఏతస్య - అహం - న - పశ్యామి - చంచలత్వాత్ - స్థి - స్థిరాం।

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు జెప్పినది | స్థిరాం | స్థిరమైన |
| హే మధుసూదన! | ఓ మధుసూదనా! | స్థితిం | స్థితిని |
| సామ్యే న | సమముగ జూచుటయనే | చంచలత్వాత్ | (మనస్సు) మిక్కిలి చంచల ముగలదిగ నుండుటవలన |
| యోఽయం యోగః | ఏ యీయోగము | | |
| త్వయా ప్రోక్తః | నీచే ఉపదేశింపబడినదో | అహం | నేను |
| వీతస్య | ఆ యోగముయొక్క | న పశ్యామి | చూచుటలేదు(ఎరుంగుటలేదు) |

**తా॥ అర్జునుడు చెప్పినది — ఓ మధుసూదనా! సమముగ జూచుటయనే ఏయీయోగమునీచే ఉపదేశింపబడినదో ఆ యోగముయొక్క స్థిరమైనస్థితిని మనస్సు మిక్కలిచంచలము గలదిగనుండుటవలన నేను తెలిసికొనుటలేదు. అనగా దీనికి స్థిరమైనస్థితిని నేనుజూడలేదు.**

(రామానుజులు) (33-34 శ్లోకములనుజేర్చి భాష్యము జేయబడియున్నది. అది యెట్లన్న ప్రకృతి సంబంధముచే దేవతలు వేరు, మనుష్యులువేరు, మిగతజంతువులువేరని తోచుచున్నది. ప్రకృతి సంబంధము తొలగినచో ఆత్మస్వరూపములన్నియు జ్ఞానాకారములైనందున దేవమనుష్యాది భేదములు లేక సమముగనే యుండును. అట్లుప్రకృతి సంబంధముతొలగిన జ్ఞానాకారముగనున్న ఆత్మయు, పరమాత్మయు భేదముగలవారైనను పరమాత్మకెట్లు ప్రకృతి సంబంధమున్ను కర్మాదు లున్ను లేవో అటులనే ప్రకృతి విముక్త ఆత్మలకునులేవు. కావున జీవేశ్వర ఆకారభేదమైన సమత్వము చెప్పబడినది. దానినెరుంగుటయే సమదర్శన యోగమనియు జెప్పితివి. ఇది అసాధ్యమని నాకు తోచుచున్నది. ఏలనిన జీవుని కర్మవాసనచే అతని మనస్సు బహుకాలముగ నెల్లప్పుడు విషయము లలో మునిగి ఆ విషయములలోను ఒకనిలకడను పొందక చంచలముగనే యున్నది. ఇట్లు బహు కాలము అభ్యసించుట వలన దార్ఢ్యము గలిగియున్న ఈ మనస్సును ఎప్పుడును చూడనట్టియు విన నట్టియు తలంచనట్టియు ప్రకృతివిముక్తమైన ఆత్మస్వరూపము సామ్యదర్శనమను ధ్యానయోగములో స్థిరముగ నుంచవలెననగా, ఎట్లుసాధ్యమగును? గొప్పగాలి నడ్డగించి నిలబెట్టుటయెట్లు అసాధ్యమైనదో ఆ విధముగనే అడ్డగింపదగనిదనియు, బలవంతముగ తనకోరిక ప్రకారము ప్రవేశించునదిగనున్న మనస్సును నిలబెట్టుట అసాధ్యమనియు అర్జునుని తాత్పర్యము.

(శ్రీధరులు) బ్రహ్మధ్యానములో చలింపక స్థిరముగ మనస్సును నిలబెట్టవలెనని చెప్పి నది అసాధ్యమైనదని అరునుని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) సకల ప్రాణుల యెడను పరమాత్మనొకేవిధముగ జూచుటయనే సమదర్శన యోగమున్ను, సుఖదుఃఖములలో తన్నువలె సకల ప్రాణులను జూచుటయనే సమదర్శన యోగమున్ను చెప్పితివి. దానిలోమనస్సు స్థిరముగనుండుట అసాధ్యమని అర్జునుని తాత్పర్యము.

(స్వకీయము) సకలవస్తువులను బ్రహ్మముగను, బ్రహ్మమును సకలవస్తువులుగను సమముగ నెరుంగ వలెనని జెప్పితివి. మనస్సుచంచలమైనది. కావున అట్టి అభేదబుద్ధి స్థిరముగగలుగుట మిక్కిలి కష్టమని అర్జునుని తాత్పర్యము.

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ 34

పద॥ చంచలం - హి - మనః - కృష్ణ - ప్రమాథి - బలవత్ - దృఢమ్।
తస్య - అహం - నిగ్రహం - మన్యే - వాయోః - ఇవ - సుదుష్కరమ్॥

| | | | |
|---|---|---|---|
| హే కృష్ణ! | ఓ కృష్ణా! | దృఢం హి | దార్ఢ్యముగలదనునది ప్రసిద్ధము |
| మనః | మనస్సు | తస్య నిగ్రహం | దాని అణచుటను |
| చంచలం | మిక్కిలి చలనముకలది | వాయోరివ | గాలిని (అణచుట) వలె |
| ప్రమాథి | కలత బెట్టు స్వభావముగలది | సుదుష్కరం | మిక్కిలి అసాధ్యముగ |
| బలవత్ | మిక్కిలి బలముగలది | అహం మన్యే | నేను తలంచుచున్నాను. |

తా॥ ఓ కృష్ణపరమాత్మా! మనస్సు స్వభావముగనే మిక్కిలి చలనము గలదిగను, దేహేంద్రియాదులను కలతబెట్టుచున్న స్వభావముగలదిగను, ప్రబలమైనదిగను అనగా అణచవీలులేనిదిగను, దార్ఢ్యముగలదిగనుఉన్నది. అనునది ప్రసిద్ధము. ఆ మనస్సును అణచుట గాలిని అణచుటవలె మిక్కిలి అసాధ్యమైనదిగ నేనుతలంచు చున్నాను.

(శంకరభాష్యము) ఇంతవరకు విస్తరించి చెప్పబడిన సమదర్శన లక్షణముతోగూడిన ఈ యోగస్థితిని పొందుట అరుదుఅనిచూచి దానిని పొందుటకు మార్గమును తెలియగోరి ఈ 33-34 శ్లోకములలో అర్జునుడు భగవంతుని ప్రశ్నించుచున్నాడు.

'కృష్ణ' అనుపదము గీరుట అనుఅర్థముగల 'కృష్' అనుధాతువునుండి పుట్టినది. భక్తజనుల పాపము మొదలగు దోషములు అరిగిపోవునట్లు గీరుటవలన అతనికి కృష్ణుడని పేరు. మనస్సు మిక్కిలి చలనముగలది మాత్రముగాదు, కలతబెట్టు స్వభావముగలదికూడ. దేహము, ఇంద్రియములు మొదలగువాటిని కలతబెట్టి స్థితిమారునట్లు చేయుచున్నది. మిగతవాటికి వశమగునట్లు చేయుచున్నది. దానినడ్డగించి క్రుంగింపచేయుట మిక్కిలి అరుదు. మరియు నదిదృఢమైనది. తంతునాగము లేక వరుణపాశమను చేపవలె నణుకవీలులేనిది. గాలిని అణచుట వీలులేనట్లు పైజెప్పిన విధమైన ఆమనస్సునణచుట వీలులేనిదని తలంచుచున్నాను. గాలిని అణచుటకంటె మనస్సు నణచుట మిక్కిలి అసాధ్యమైనదిగ తలంచుచున్నానని తాత్పర్యము.

శ్రీభగవానువాచ:—

శ్లో॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 35

పద॥ అసంశయం - మహాబాహో - మనః - దుర్నిగ్రహం - చలమ్ ।
అభ్యాసేన - తు - కౌంతేయ - వైరాగ్యేణ - చ - గృహ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీ భగవంతుడు చెప్పినది | అసంశయం | దీనిలో సందేహములేదు |
| మహాబాహో! | పొడుగైన భుజములుగలవాడా! | హే కౌంతేయ | ఓ కుంతీపుత్రా! (అర్జునా) |
| మనః | మనస్సు | అభ్యాసేన తు | ఐతే అభ్యాసముచేతను |
| దుర్నిగ్రహం | అణచుటకు మిక్కిలి కష్టమైనది | వైరాగ్యేణ చ | వైరాగ్యముచేతను |
| చలం | చాంచల్యము గలది | గృహ్యతే | అణచబడుచున్నది. |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ చెప్పినది — ఓ అర్జునా! మనస్సు మిక్కిలి చంచలమైనది. ఎవ్వనిచేతను అణచ వీలులేనిది. దీనిలో సందేహములేదు. ఐనను ఓ కుంతీపుత్రా! అభ్యాసముచేతను వైరాగ్యముచేతను అది అణచబడుచున్నది.

(శంకరులు) ఓ అర్జునా! నీవుజెప్పినట్లు మనస్సు అణచుట కశక్యమైనది, చంచలమైనదను దానిలో సందియములేదు. ఐతే తిరుగుచున్న మనస్సుయొక్క గమనము అభ్యాసముచేతను వైరాగ్యముచేతను అణచబడుచున్నది. అభ్యాసమనగా చిత్తముయొక్క ఏకాగ్రమనెడి ఒకస్థితిలో ఒకటే విధమైన తలంపును మాటిమాటికి తలంచుట, అనగా ధ్యానించుట. వైరాగ్యమనగా జన్మజన్మాంతరములలో కోరబడు సుఖములలో మాటి మాటికి చెరుపులనుజూచెడి అభ్యాసముచే గలుగు నిరాశ, అనగా ఆశలేనితనము ఈ విధముగ ఆ మనస్సు అణచబడుచున్నది, అనగా అడ్డగించి క్రుంగింపజేయబడుచున్నది అని భావము.

(రామానుజులు) ఆత్మ, గుణస్వరూపమైనదని మాటిమాటికి తలంచుటవలన దానియెడ గలుగు విశేషము చేతను ఆత్మకాని ఇతరమైన వాట్లయెడగల దోషములను తెలిసికొనుటవలన కలుగు ఆశలేనితనముచేతను ఒక విధముగ మనస్సు నిగ్రహింపబడును.

(స్వకీయము)

మనసో వృత్తిశూన్యస్య బ్రహ్మాకారతయా స్థితిః ।
యా సంప్రజ్ఞాతనామాసౌ సమాధిరభిధీయతే ॥

ప్రవృత్తిలేని మనస్సుయొక్క బ్రహ్మాస్వరూపముగనున్న స్థితియెట్టిదో అది అసంప్రజ్ఞాత సమాధియని చెప్పబడుచున్నది. (యోగశాస్త్రము)

వైరాగ్యం పుష్కలం న స్యాన్నిష్ఫలం బ్రహ్మాదర్శనం ।
తస్మాద్రక్ష్యేత విరతిం బుధోయత్నేన సర్వదా ॥

(గౌతమస్మృతి)

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥ 36

పద॥ అసంయతాత్మనా - యోగః - దుష్ప్రాపః - ఇతి - మే - మతిః ।
వశ్యాత్మనా - తు - యతతా - శక్యః - అవాప్తుం - ఉపాయతః ॥

| | | | |
|---|---|---|---|
| అసంయతాత్మనా | అణచబడని మనస్సుగలవానిచే (మనస్సు నణచనివానిచే) | వశ్యాత్మనా | మనస్సునణచి |
| | | యతతా | ప్రయత్నించువానిచే |
| యోగః | యోగము | (యోగః) | యోగము |
| దుష్ప్రాప ఇతి | పొందుటకు అశక్యమైన దనునది | ఉపాయతః | (అభ్యాసవైరాగ్యరూప) ఉపాయముచే |
| మే | నాయొక్క | | |
| మతిః | అభిప్రాయము | అవాప్తుం | పొందుటకు |
| తు | | శక్యః | సాధ్యమైనది. |

తా॥ అణచబడని మనస్సు గలవానిచే అనగా మనస్సునణచనివానిచే యోగముపొందుట కశక్యమైనది అని నాయభిప్రాయము ఐతే మనస్సునణచి ప్రయత్నించువానిచే యోగము, అభ్యాసము వైరాగ్యము అను ఉపాయములచే పొందుటకు సాధ్యమైనది.

(రామానుజులు) యోగమని ఇచ్చటజెప్పినది సమదర్శనయోగము. ఉపాయమనగా మునుపు చెప్పబడియున్న నా ఆరాధనారూపమైనదియు, జ్ఞానమును లోబరచుకొనియున్నదియునైన కర్మయోగమనే యుపాయము.

(స్వకీయము) అభ్యాసముచేతను వైరాగ్యముచేతను అణచబడని అంతఃకరణము గలవానిచే యోగముపొందుట అశక్యమనియు, ఐతే అట్టి అభ్యాస వైరాగ్యములచే అంతఃకరణము నణచిస్వాధీనము జేసికొని మరలను ప్రయత్నించువాడు మునుపుజెప్పిన ఉపాయముచే యోగస్థితిని పొందగలడనియు భావము.

అర్జున ఉవాచః—

శ్లో॥ అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ 37

పద॥ అయతిః - శ్రద్ధయా - ఉపేతః - యోగాత్ - చలితమానసః ।
అప్రాప్య - యోగసంసిద్ధిం - కాం - గతిం - కృష్ణ - గచ్ఛతి ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | చలితమానసః | తప్పిన మనస్సుగలవాడైనఅతడు |
| హే కృష్ణ! | ఓ కృష్ణా! | యోగసంసిద్ధిం | యోగమునకు ఫలమైన సమ్యగ్దర్శనమును (యథార్థజ్ఞానమును) |
| శ్రద్ధయా ఉపేతః | శ్రద్ధతోగూడినవాడై | అప్రాప్య | పొందక |
| అయతిః | స్వల్పప్రయత్నముగలవాడై | కాంగతిం | ఏగతిని |
| యోగాత్ | మరణకాలమునయోగమునుండి | గచ్ఛతి | పొందుచున్నాడు? |

తా॥ అర్జునుడు చెప్పినది — ఓకృష్ణా! శ్రద్ధతో అనగా నమ్మకముతోగూడిన వాడై యోగమున స్వల్పప్రయత్నముగలవాడై మరణకాలమున యోగము నుండి తప్పిన మనస్సుగలవాడు యోగమునకు ఫలమైన సమ్యగ్దర్శనమును (యథార్థజ్ఞానమును) పొందక ఏగతిని పొందుచున్నాడు?

(శంకరులు) ఒకడు యోగాభ్యాసమును చేబట్టుటవలన ఇహజన్మమునందును జన్మాంతరమునందును మేలును పొందుటకు కారణములైన కర్మలన్నిటిని త్యజించుచున్నాడు. యోగసిద్ధికి ఫలమైన మోక్షసాధనమైన సమ్యగ్దర్శనమున్ను అతనికి ఇకను కలుగలేదు. ఇట్టిస్థితిలోనున్న యోగి మరణకాలమున యోగమార్గమునుండి మనస్సుచలించి వ్యాకులత చెందువాడుగను కాగలడు. అట్టైన యెడల అతనికి ఎట్టిచెరుపు వచ్చునోయని అర్జునుడు సందేహించి ఇందుకనబరచినట్లు అడుగుచున్నాడు. యోగములో ఫలముగలదను తలంపును నమ్మకమునుగలవాడై, ఖతే యోగమార్గములో (అధికమైన) ప్రయత్నములేనివాడై అనగా స్వల్పప్రయత్నముగలవాడై మరణకాలమున యోగమార్గమునుండి జ్ఞప్తితప్పిన అతడు యోగమునకు ఫలమైన సమ్యగ్దర్శనమును పొందుటలేదుగదా? మఱియతడు ఏగతిని పొందుచున్నాడు? అనగా అతడు అన్నియుచెడి నశించిపోవుచున్నాడా? అని అర్జునుడడుగుట అట్టి అపాయము దీనిలో లేదనుదానిని బయటపెట్టుటకొరకే.



శ్లో॥ కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥

పద॥ కచ్చిత్ - న - ఉభయవిభ్రష్టః - ఛిన్నాభ్రం - ఇవ - నశ్యతి।
అప్రతిష్ఠః - మహాబాహో - విమూఢః - బ్రహ్మణః - పథి ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో ! | ఓ భుజబలముగలవాడా ! | బ్రహ్మణః పథి | బ్రహ్మమును పొందుత్రోవలో |
| ఉభయవిభ్రష్టః | (కర్మమార్గముయోగమార్గము) రెంటినుండియు తప్పి | విమూఢః | మోహమొందియున్నవాడు |
| | | ఛిన్నాభ్రమివ | చెదరిన మేఘమువలె |
| అప్రతిష్ఠః | ఆశ్రయములేక | ననశ్యతి కచ్చిత్ | నశించిపోవుటలేదా ? |

తా॥ ఓ భుజబలముగల కృష్ణా! కర్మమార్గము యోగమార్గము ఈ రెంటి నుండి జారి, అనగా రెండుచెడి ఆశ్రయములేక, అనగా తానుండుటకు స్థానము లేక బ్రహ్మమును పొందదగిన మార్గములో మోహముచెంది నిలబడువాడు చెదరిన మేఘమువలె నశించిపోవుచున్నాడు గదా!

(శ్రీధరులు) ఎట్లు రెండును చెడినవాడగుననగా - యోగమున ప్రవేశించినందున ఇప్పుడు కర్మానుష్ఠానములేదు. మునుపుజేసిన కర్మలఫలమును ఈశ్వరార్పణము చేసినందున కర్మఫలమైన స్వర్గాది సుఖఫలమునులేదు. అభ్యాసవైరాగ్యములు మొదలగు సాధనములతో ప్రయత్నము లేనందున జ్ఞానయోగసిద్ధినిపొంది మోక్షఫలము నొందుటకు హేతువున్ను లేదననదే. "ఆశ్రయములేని" అనగా కర్మలో పట్టునులేదు జ్ఞానమొందుటకు మార్గమైన యోగములో పట్టునులేదననదే. "బ్రహ్మమును పొందునుపాయము" అనగా మనోనిగ్రహము, ఇంద్రియనిగ్రహము, శమదమాదులు, వీడని ప్రయత్నము, వైరాగ్యము మొదలగునవే. "చెదిరిపోయిన మేఘమువలె నాశమొందునది" అనగా గుంపుగా

జేరియున్న మేఘము గాలిచేత్నే విభజింపబడి చెదరిపోవుచున్నది. అట్లుచెదరిన మేఘము తాను దేనినుండి వేరైనదో, ఆమేఘముతో మరలపోయి జేరకను, లేక వేరుమేఘములతో చేరకను దాని స్వరూపము కనబడకనే నాశము నొందును. కావున ఇదిధ్యానమునుండి జారిన యోగభ్రష్టునికి దృష్టాంతముగ జెప్పబడినది.

(రామానుజులు) ఉభయవిభ్రష్టః = రెండుచెడినవాడు. ఎట్లనగా అప్రతిష్ఠః = స్వర్గాది ప్రాప్తికి హేతువైన కర్మఫలమును త్యజించినందున స్వర్గాదులు లభించునట్లు చేసికొననివాడు. విమూఢో బ్రహ్మణః పథి = బ్రహ్మమును పొందదగిన యోగమార్గమును విడిచిన అజ్ఞాని.

(రాఘవేంద్రులు) ఉభయవిభ్రష్టః = స్వర్గములేదు, మోక్షములేదు. లేక స్వర్గప్రాప్తిసాధనమైన కామ్యకర్మయు లేదు. మోక్షమునకు సాధనమైన పూర్ణమైన ధ్యానయోగములేదు. ఇక ఇహలోక సుఖములేదు, పరలోకసుఖములేదు. కావున రెండు చెడినవాడని చెప్పబడినది.

శ్లో॥ ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హ స్యశేషతః।
త్వదన్యస్సంశ యస్యాస్యఛేత్తా నహ్యుపపద్యతే॥ 39

పద॥ ఏతత్ - మే - సంశయం - కృష్ణ - ఛేత్తుం - అర్హసి - అశేషతః।
- అన్యః - సంశయస్య - అస్య - ఛేత్తా - న - హి - ఉపపద్యతే॥

| | | | |
|---|---|---|---|
| హే కృష్ణ! | ఓ కృష్ణా! | అర్హసి | తగియున్నావు |
| ఏతత్ | ఈ | హి త్వదన్యః | నీకంటె వేరొక్కడు |
| మే సంశయం | నా సందేహమును | అస్య సంశయస్య | ఈ సంశయమును |
| అశేషతః | కొరతలేక (అంతయు) | ఛేత్తా | నివర్తించువాడు |
| ఛేతుం | నఱుకుటకు (నివర్తించుటకు) | నోపపద్యతే | లేడు. |

తా॥ ఓ కృష్ణా! ఇట్టి నాసందేహమును పూర్తిగ పోగొట్టుటకు నీవే తగినవాడవు. ఏలనగా నీకంటె వేరొక్కడు (ఋషిగాని, దేవతగాని) ఈ సందేహమును పోగొట్టగలవాడుగ లేడు.

శ్రీభగవానువాచః—

శ్లో॥ పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే।
న హి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి॥ 40

పద॥ పార్థ - న - ఏవ - ఇహ - న - అముత్ర - వినాశః (1) - తస్య - విద్యతే।
న - హి - కల్యాణకృత్ (2) - కశ్చిత్ - దుర్గతిం - తాత - గచ్ఛతి॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీభగవంతుడుచెప్పినది | న | నాశముగలుగుటలేదు |
| హే పార్థ! | ఓ అర్జునా! | హి | ఏలనగా |
| తస్య | అతనికి (యోగభ్రష్టునికి) | తాత! | నాయనా! |
| ఇహ | ఈ లోకములో | కల్యాణకృత్‌కశ్చిత్ | సత్కర్మనుజేసిన ఎవ్వడున్ను |
| వినాశః | నాశము | దుర్గతిం | నీచమైనగతిని |
| నైవవిద్యతే | కలుగుటయేలేదు | న గచ్ఛతి | పొందడు |
| అముత్ర | పరలోకమునందును | | |

తా॥ ఓ అర్జునా! యోగభ్రష్టునికి ఇహలోకమునందు నాశము గలుగుటయే లేదు. పరలోకమునందును అతనికి చెరుపుకలుగదు. ఏలనగా నాయనా! (బిడ్డా) సత్కర్మను జేసిన ఎవ్వడున్ను (మునుపటి జన్మకంటె) నీచమైనగతిని పొందనే పొందడు.

(1) వినాశః - ఈ జన్మకంటె తక్కువైన జన్మము (శంకరులు). దోషముగాని నరకప్రాప్తిగాని (శ్రీధరులు). స్వర్గాద్యనుభవము, బ్రహ్మప్రాప్తి వీటిలో తానుగోరినది గిట్టకపోవుట యను వినాశము, లేక ఆరంభించిన కార్యమును మధ్యలో విడిచిపెట్టుట వలన కలుగు దోషము (రామానుజులు). ఈ లోకములో మృగాది జన్మలుగాని, పరలోకములో, నరకముగాని (రాఘవేంద్రులు).

(2) కల్యాణకృత్ ఆస్తిక్యబుద్ధితో కొంతకాలమైనగాని ఈశ్వరధ్యానాదులను జేసిన (రాఘవేంద్రులు).

(శంకరులు) "తాత" అనుపదము తండ్రిని గుర్తించును. తండ్రితన్ను పుత్రునియాకారముగ జేసికొనుచున్నాడు. అనగా తన ఇంద్రియముద్వారా తానేతన ఆకారమైన పుత్రరూపముగ పరిణమించుచున్నాడు. కావున "తాత" తండ్రి అనబడుచున్నాడు. ఈ విధముగ 'తండ్రియే తనయుడు' కావున పుత్రుడున్ను తాత = తండ్రి అనబడుచున్నాడు. శిష్యుడు పుత్రుడుగాకున్నను పుత్రునివలెనున్నందున ఇచ్చట భగవంతుడు అర్జునుని "తాత" అనిచెప్పెను.



శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ 41

పద॥ ప్రాప్య - పుణ్యకృతాం - లోకాన్ - ఉషిత్వా - శాశ్వతీః - సమాః।
శుచీనాం - శ్రీమతాం - గేహే - యోగభ్రష్టః - అభిజాయతే॥

| | | | |
|---|---|---|---|
| యోగభ్రష్టః | యోగమునుండి జారినవాడు | ఉషిత్వా | నివసించి |
| పుణ్యకృతాం | పుణ్యముచేసిన వారియొక్క | శుచీనాం | |
| లోకాన్ | లోకములను | శ్రీమతాం | ఐశ్వర్యము గలవారియొక్క |
| ప్రాప్య | పొంది | గేహే | ఇంటిలో |
| సమాః శాశ్వతీః | దీర్ఘమైనవత్సరములు | అభిజాయతే | పుట్టుచున్నాడు. |

తా॥ యోగభ్రష్టుడైనవాడు (అశ్వమేధాది క్రతువులు జేసిన) పుణ్యము గలవారు ఏలోకమును పొందెదరో ఆలోకమునుపొంది బహుకాలము సుఖముగ నుండి (పిదప) సదాచారముగల ఐశ్వర్యవంతుల గృహములో మరల పుట్టుచున్నాడు.

(శంకరులు) ఐతే ఈ యోగభ్రష్టులకు ఎట్టిగతి లభించుచున్నదనునది చెప్పబడుచున్నది. సందర్భము ననుసరించి చూడగా ఈ యోగమార్గమున ప్రవర్తించిన సన్న్యాసినిగూర్చి చెప్పినట్లు తెలియుచున్నది. అతడు పుణ్యముచేసిన వారల, అనగా అశ్వమేధయాగము మొదలగు సత్కర్మలను జేసిన వారలలోకములకుబోయి అచ్చట అనేక సంవత్సరములు వాసముచేసి అచ్చటనున్న, అనుభ

వింప వలసిన సుఖములను అనుభవించిన పిదప సంపద, శుచి, అనగా శాస్త్రమున జెప్పినవిధముగ కర్మలను జేయువారి ఇంటిలో మరల పుట్టుచున్నాడు.

(రామానుజులు) ఏ విషయానుభవమును ఇచ్ఛయించి యోగమును విడిచిపెట్టునో అట్టి విషయానుభవమును పుణ్యలోకములలో తనకిష్టమైన కాలమువరకు అనుభవించి పిదప ఈ లోకమున శుద్ధియు ఐశ్వర్యముగల యోగమునకు యోగ్యమైన కులమున బుట్టుచున్నాడు.

శ్లో॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం ॥ 42

పద॥ అథవా - యోగినాం - ఏవ - కులే - భవతి - ధీమతాం ।
- హి - దుర్లభతరం - లోకే - జన్మ - యత్ - ఈదృశం ॥

| | | | |
|---|---|---|---|
| అథవా | లేక | ఈదృశం | ఇటువంటి |
| ధీమతాం | జ్ఞానులైన | జన్మ | జన్మము |
| యోగినామేవ | యోగులుగనే యున్నవారి యొక్క | యత్ | ఏదియో |
| | | ఏతత్ హి | అదియే |
| కులే | కులమునందు | లోకే | ఈ లోకమునందు |
| భవతి | జనించుచున్నాడు, (పుట్టు చున్నాడు.) | దురలభతరం | లభించుట మిక్కిలి అరుదు |

తా॥ లేక, అతడు జ్ఞానవంతులై యోగులుగనే యున్నవారల వంశములో బుట్టుచున్నాడు. ఇట్టి జన్మమేదిగలదో అది లభించుటయే ఈ లోకమున మిక్కిలి దుర్లభమైనది. అనగా పొందుటకు మిక్కిలి అరుదైనది.

(శంకరులు) లేక సంపత్తుగలవారి ఇంటబుట్టక వారినుండి వేరుబడిన జ్ఞానులైయోగులుగనేయున్న దరిద్రులకులమునందు అతడు పుట్టుచున్నాడు. ఇట్లు దరిద్రులైన యోగుల కులమున బుట్టుట యనునది మొదటిదానికంటె పొందుటకు మిక్కిలి అరుదైనది.

(రామానుజులు) మునుపటి శ్లోకములో గుర్తింపబడినవాడు స్వల్పకాలము యోగాభ్యాసముచేసి పిదప విడిచిపెట్టినవాడు. ఈశ్లోకమున గుర్తింపబడినవాడనగా, బహుకాలము యోగముచేసి వచ్చి సిద్ధిపొందు సమయమున విడిచిపెట్టినవాడు. ఏతత్ = ఇది, అనగా మునుపటి శ్లోకమునజెప్పిన జననమున్ను, ఈశ్లోకమున జెప్పిన జననమున్ను. లోకములో ప్రకృతిని ఆశ్రయించి నడచువారలకు లభించుట దుర్లభము.

(స్వకీయము) ఈ శ్లోకములో "ఏతత్" అనుపదమునకు దరిద్రులైన యోగులకులములో బుట్టుటయనియు, ఇట్టి జననమే మిక్కిలి దుర్లభమనియు భగవంతుడు జెప్పెనదిగ శంకరులు జేసియున్న తాత్పర్యము మిక్కిలి ఉచితముగను, అనుభవముతో గూడినదిగను ఉన్నదని తోచుచున్నది. ఏలనగా ఆత్మజ్ఞాన స్థితిని పొందుటకు ప్రయత్నముచేయు యోగికి ఐశ్వర్యము మొదలగు నీసంపదలు ప్రతిబంధకములుగనే యగునే గాని సాధనములుగానేరవు. ఐతే దారిద్ర్యమనగా అనుభవజ్ఞానమును పొందించి దానిలో దృఢముగ నిలబడునట్లు చేయుటలో అసమానమైన సాధనముగ నున్నది. ఐశ్వర్యములో మునిగియున్నవానికి పురుగుమొదలగు ప్రాణులన్నిటికిని ఈశ్వరుడే అన్నము పెట్టు

చున్నాడనునది ప్రత్యక్షముగ తెలియుట కవకాశమెచ్చట? మఱియు నిత్యదరిద్రుడై ఆదినము భుజించుటకే అన్నము దొరకుట కవకాశము లేనివాడై, ఐతే ఈశ్వరునేగతియని నమ్మియున్న ఒకనికి యదృచ్ఛగా ఈశ్వరుని ప్రేరేపణచే మఱియొకడు ఆహారము దెచ్చి బలాత్కరించి ఇచ్చునప్పుడుగదా భగవంతుడు తన్నే శరణముగ గైకొన్నవారి యోగక్షేమమును వహించునట్లు వాగ్దానము జేసియుండుట కాగితపువ్రాత కాదని ప్రత్యక్షముగ తెలియుటకును దృఢపడుటకును అవకాశమేర్పడుచున్నది.

(ఈ శ్లోకము మొదటనున్న 'అథవా' అను పదమునకు 'మునుపటి దేహముపోయిన తోడనే'యని శంకరానందులు తాత్పర్యము జేయుచున్నవారు. అనగా 41 వ శ్లోకమున జెప్పినవాని వలె బహుకాలము గడచినపిదప పుట్టక, వెంటనే యోగికులమున జనించుచున్నాడని తాత్పర్యము.

శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం।
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన॥　　　　43

పద॥ తత్ర (1) - తం - బుద్ధిసంయోగం - లభతే - పౌర్వదైహికం ।
యతతే - చ - తతః - భూయః (2) - సంసిద్ధౌ - కురునందన ॥

| | | | |
|---|---|---|---|
| హే కురునందన ! | ఓ కురువంశమున జనించిన వాడా! | లభతే | పొందుచున్నాడు |
| | | చ | మఱియు |
| తత్ర | దానిలో | సంసిద్ధౌ | మోక్షవిషయములో |
| పౌర్వదైహికం | పూర్వదేహములో గలిగిన | తతః | దానికంటె |
| తం | ఆ | భూయః యతతే | అధికముగ ప్రయత్నించుచున్నారు. |
| బుద్ధిసంయోగం | ఆత్మవిషయబుద్ధితో జేరుటను | | |

తా॥ ఓ కురువంశపు అర్జునా! (ఆయోగభ్రష్టుడు) మునుపటి శరీరము గలిగిన ఆయాత్మవిషయబుద్ధితో చేరికను మఱల పొందుచున్నాడు. మఱియు మోక్ష విషయములో మునుపటి జన్మలోచేసిన ప్రయత్నముకంటె అధికమైన ప్రయత్నమును (ఇప్పుడు) చేయుచున్నాడు.

(1) తత్ర - అచ్చట, అనగా యోగులకులములో (శంకరులు), ఆ జన్మలో (మధుసూదన సరస్వతి, శ్రీధరులు)

(2) భూయః - అధికముగ (శంకరులు, రాఘవేంద్రులు) మఱలను (శంకరానందులు).

(స్వకీయము) రామానుజులు తప్ప మిగత భాష్యకారులున్ను వ్యాఖ్యాతలున్ను 44-వ శ్లోకముయొక్క పూర్వార్థమును ఈ శ్లోకముతోజేర్చి అన్వయము చేయకయుండినను ఈ శ్లోకముతో జేరినదిగనే అర్థముచేసియున్నారు. మఱియు వెనుకటి అర్థశ్లోకమునకు జేసియున్న అర్థము ఈ 43-వ శ్లోకమున గుర్తింపబడినవానిని గుర్తించక, వేరుగ ప్రత్యేకించినవాడైన జిజ్ఞాసువును గుర్తించుచున్నది. పై శ్లోకమునందలి పూర్వార్థమును రామానుజులు దీనితోజేర్చి అర్థముచేసియున్నారు.

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥　　　　44

పద॥ పూర్వాభ్యాసేన - తేన - ఏవ - హ్రియతే - హి - అవశః - అపి - సః।
జిజ్ఞాసుః - అపి - యోగస్య - శబ్దబ్రహ్మ - అతివర్తతే॥

| | | | |
|---|---|---|---|
| హి | ఏలనగా | యోగస్యజిజ్ఞాసురపి | యోగము నెరుంగగోరినవాడు గూడ |
| సః | అతడు (యోగభ్రష్టుడు) | | |
| అవశోపి | (యోగమును ఆశ్రయించుటలో) కోరికలేనివాడైనను | శబ్దబ్రహ్మ | శబ్దబ్రహ్మమును(వేదోక్తకర్మ ఫలమును) |
| పూర్వాభ్యాసేన తేనైవ | అట్టి పూర్వ (జన్మ) అభ్యాసము చేతనే | అతివర్తతే | అతిక్రమించుచున్నాడు, దాటి నిలబడుచున్నాడు. |
| హ్రియతే | ఈడువబడుచున్నాడు | | |

తా॥ ఏలనగా ఆయోగభ్రష్టుడు యోగమునాశ్రయించుటలో కోరికలేని వాడైనను మునుపటి జన్మలోజేయబడిన అభ్యాసముచేతనే యోగమార్గములో నీడువబడుచున్నాడు. యోగము నెరుంగగోరువాడుకూడ శబ్దబ్రహ్మమును అనగా వేదమునజెప్పిన కర్మలను అనుష్ఠించుటకు ఫలమును అతిక్రమించుచున్నాడు, దాటుచున్నాడు.

(శంకరభాష్యము) యోగభ్రష్టుడు మునుపటి శరీరములో గలిగిన జ్ఞానముతోగూడుట ఎల్లనునది దీనిలో జెప్పబడుచున్నది. ఆయోగభ్రష్టునికి యోగమును మఱల అనుష్ఠించుటలో ఇష్టములేకున్నను మునుపటి జన్మలోజేసిన, బలమైన ఆయభ్యాసముచేతనే సిద్ధిపొందుమార్గమున బలాత్కారముగ నీడ్చుకొని పోబడుచున్నాడు, యోగాభ్యాసమువలన గలుగు సంస్కారము (వాసన) కంటె మిక్కిలి బలముగల అధర్మము మొదలగు కర్మను చేయనివాడైనచో అప్పుడతడు మునుపటి యోగాభ్యాసము వలనగలిగిన వాసనచే ఈడువబడుచున్నాడు. అధర్మమును బలముగజేసి అది పైబడియుండినచో యోగాభ్యాస వాసన నిష్ప్రయోజనమై తిరస్కరింపబడి నిలబడును. ఐతే ఆ అధర్మమునకు ఫలము నశించిన తోడనే యోగాభ్యాసమువలన గలిగిన వాసన తానే తనకార్యమును (ఫలమును) చేయబూనుచున్నది. అనగా అది బహుకాలము అడ్డుపడి నిలబడునట్టిదైనను దానికి నాశములేదు. అనేకకోటి జన్మలు గడచినను పూర్వజన్మ సంస్కారము తనకు తగిన కాలములో తన ఫలమునిచ్చియేతీరును అని తాత్పర్యము. దీనిలోజెప్పబడిన యోగభ్రష్టుడన్నవాడు సన్న్యాసి యని యుక్తిచే తెలియుచున్నదనుడు. యోగస్వరూపమును ఎరుంగగోరినవాడుగూడ, అనగా యోగ మార్గములో ప్రవర్తించిన ఆసన్న్యాసిగూడ (మిగతవారలుకారు) శబ్దబ్రహ్మమును అనగావేదమున జెప్పిన కర్మల ఫలమును దాటుచున్నాడు. దానికంటె గొప్పపదవిని పొందుచున్నాడు. ఇతడే ఇట్టి నచో ఎవ్వడు యోగము నెఱింగి దానిలో దృఢముగ నిలబడి అభ్యాసముచేయునో అతడు కర్మను, దానిఫలమును దాటుచున్నాడని చెప్పవలెనా?

(శ్రీధరులు) జిజ్ఞాసురపి = యోగమునెరుంగ వలెనని ఇచ్ఛయించి దానిలో ప్రవర్తించిన సన్న్యాసిగూడ. మునుపు చెప్పబడియున్న యోగభ్రష్టునికంటె ఇతనికి ముక్తి పొందు కాలము పొడవైనది శబ్దబ్రహ్మాతివర్తతే = వేదోక్త కర్మల ఫలముకంటె అధికమైన ఫలమును పొందు చున్నాడు. కైముత్యన్యాయమని గ్రహింపదగినది. (అనగా జిజ్ఞాసువునకు ఈ ఫలమైనచో మునుపటి వానికి ఫలము చెప్పవలెనా?)

(రామానుజులు) ఈ శ్లోకముయొక్క వెనుకటి అర్ధశ్లోకమునకు యోగస్య = యోగమును, జిజ్ఞాసుః = తెలిసికొనవలెనను కోరికగలవాడు ఆ జన్మలో తెలిసికొననిచో పై జన్మలో నెరింగి అనుష్ఠించి జ్ఞానియై, శబ్ద = దేవమనుష్య భూమిస్వర్గాది శబ్దములచే (పేర్లచే) చెప్పదగిన, బ్రహ్మ = ప్రకృతిని,అతివర్తతే = అతిక్రమించుచున్నాడు. జ్ఞానానందస్వరూపమైన ఆత్మస్వరూపమును పొందుచున్నాడు.

(మధ్వులు) శబ్దబ్రహ్మ = పరమాత్మను, అతివర్తతే = క్రమక్రమముగ పొందుచున్నాడు. ఎట్టి క్రమముచే అనునది పై శ్లోకముచే చెప్పబడుచున్నది.

(రాఘవేంద్రులు) శబ్దబ్రహ్మ = వేదములోగల విధినిషేధములను, అతివర్తతే = అతిక్రమించుచున్నాడు. అనగా ముక్తుడగుచున్నాడని భావము. ఇది కైముత్యన్యాయము.

---

శ్లో॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిం ॥ 45

పద॥ ప్రయత్నాత్ - యతమానః - తు - యోగీ - సంశుద్ధకిల్బిషః ।
అనేక జన్మసంసిద్ధః - తతః - యాతి - పరాం - గతిం ॥

| | | | |
|---|---|---|---|
| ప్రయత్నాత్ యతమానః | మిక్కిలి ప్రయత్నముతో యత్నించుచున్న | అనేకజన్మసంసిద్ధః | అనేకజన్మములచే జ్ఞానపరిపక్వమును పొందినవాడై |
| యో తు | యోగియనగా | తతః | దానిచే లేక దానిపిదప |
| సంశుద్ధకిల్బిషః | పాపములనుండి పరిశుద్ధుడైనవాడై | పరాంగతిం యాతి | ఉన్నతమైన గతినిపొందును. |

తా॥ ఉత్సాహముతో ప్రయత్నించుచున్న యోగి అన్ననో పాపములనుండి పరిశుద్ధుడై అనేక జన్మలచే జ్ఞానపరిపక్వమును పొందినవాడై ఆ యోగవాసనచేత తత్త్వజ్ఞానమునుపొంది దానిచే లేక దానితరువాత ఉత్తమమైన గతిని పొందుచున్నాడు.

(శంకరులు) మఱియు నేకారణముచే యోగిగనుండు స్వభావము శ్రేయస్కరమైనది అనునది దీనిలో జెప్పబడుచున్నది, (మిక్కిలి) అధికముగా యోగములో ప్రయత్నించుచున్న జ్ఞానియగుయోగి అనేక జన్మలలో కొంచెము కొంచెముగా సంస్కారములను, అనగా యోగవాసనల గుంపును సంపాదించి చేర్చుకొని అట్లు సంపాదించి చేర్చియుంచబడినదానిచే పరిపక్వమునుపొంది సిద్ధినిబడసి సమ్యగ్దర్శనమును అనగా తత్త్వజ్ఞానమును పొందినవాడై మేలైనగతిని పొందుచున్నాడు.

(రామానుజులు) అనేకజన్మ = అనేక జన్మలలో సంపాదించిన పుణ్యకర్మలచే, సంశుద్ధకిల్బిషః = పాపములను పోగొట్టుకొన్న వాడుగను, సంసిద్ధః = సిద్ధినిపొందినవాడుగను, ప్రయత్నాద్యతమానస్తు = మఱలను యోగములో ప్రయత్నించు వాడుగనున్న, యోగీ = యోగియైనవాడు యోగమునుండి చలించినను, తతః = యోగాభ్యాస మహిమచే, పరాంగతిం యాతి = మోక్షమును పొందుచున్నాడు.

(రాఘవేంద్రులు) మునుపటి శ్లోకములో గుర్తింపబడిన జిజ్ఞాసువు విషయమై ఈ శ్లోకము ప్రవర్తించినది.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున॥ 46

పద॥ తపస్విభ్యః (1) - అధికః - యోగీ - జ్ఞానిభ్యః (2) - అపి - మతః - అధికః।
కర్మిభ్యః (3) - చ - అధికః - యోగీ - తస్మాత్ - యోగీ - భవ - అర్జున॥

| | | | |
|---|---|---|---|
| యోగీ | యోగియైనవాడు | యోగీ | యోగియైనవాడు |
| తపస్విభ్యః | తపస్సుగలవారికంటె | కర్మిభ్యశ్చ | కర్మగలవారికంటెను |
| అధికః | మేలైనవాడు | అధికః | మేలైనవాడు |
| జ్ఞానిభ్యోఽపి | జ్ఞానముగలవారికంటెగూడ | తస్మాత్ హేఅర్జున! | అందువలన ఓ అర్జునా ! |
| అధికః మతః | మేలైనవాడుగ తలంచబడుచున్నాడు | (త్వం) యోగీభవ | నీవు యోగివిఅగుదువుగాక. |

తా॥ యోగియైనవాడు తపస్సుగలవారికంటె గొప్పవాడు. జ్ఞానముగల వారికంటెగూడ గొప్పవాడుగ తలంపబడుచున్నాడు. యోగియైనవాడు కర్మగలవారికంటె గొప్పవాడు. కావున ఓ అర్జునా! నీవు యోగివగుదువుగాక.

(1) తపస్సు - కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు, అనగా దేహపుష్టిని తగ్గించుటకై చేయబడు వ్రతములు. ఈ వ్రతములతో మంత్రములను జపించుటయు కలదు. ఇదియే తపస్సు (శ్రీధరులు), బ్రహ్మచర్యంతథా మౌనం నిరాహారత్వమేవచ। అహింసా సర్వతశ్శాంతి స్తప ఇత్యభిధీయతే (లింగపురాణ పూర్వఖండ దశమోఽధ్యాయము)

(2) జ్ఞాని - ఇచ్చట జ్ఞానమనగా శాస్త్రముల జ్ఞానము, అనగా గ్రంథార్థజ్ఞానము (శంకరులు)

(3) కర్మ - ఇచ్చట కర్మమనగా అగ్నిహోత్రము మొదలగు కర్మలు (శంకరులు)

(స్వకీయము) తపస్సు, శాస్త్రజ్ఞానము, కర్మము, వీటికంటె యోగమెట్లు శ్రేష్ఠమైనదనగా ఈ మూడున్ను ధ్యానయోగియెడ నున్నవి. దానితో ధ్యానయోగము చేరుటవలన ధ్యానయోగి శ్రేష్ఠుడే. ఇతడు రాగద్వేషములు లేనివాడు.

శ్లో॥ యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా।
శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ 47

పద॥ యోగినాం - అపి - సర్వేషాం - మద్గతేన - అంతరాత్మనా।
శ్రద్ధావాన్ - భజతే - యః - మాం - సః - మే - యుక్తతమః - మతః॥

| | | | |
|---|---|---|---|
| సర్వేషామపియోగినాం | సకలవిధమైన యోగులలో | మాంభజతే | నన్ను భజించునో |
| యః | ఎవ్వడు | సః | అతడు |
| శ్రద్ధావాన్ | శ్రద్ధగలవాడుగను | మేయుక్తతమః | నాకు శ్రేష్ఠుడైనయోగిగ |
| మద్గతేన | నాయెడ నిలబెట్టబడిన | మతః | అంగీకరింపబడుచున్నాడు. |
| అంతరాత్మనా | అంతఃకరణముతో | | |

తా॥ సకలవిధమైన యోగులలో నెవ్వడు శ్రద్ధగలవాడై, నాయెడ నిలబెట్టబడిన అంతఃకరణముతో నన్ను భజించునో అట్టివాడు ధ్యానముతో గూడియున్నవారిలో గొప్పవాడని నా భావము.

(శంకరులు) సకల యోగులలోను, అనగా రుద్రుడు ఆదిత్యుడు మొదలగువారిని ధ్యానించుటలో తాత్పర్యముగల సకలవిధములైన యోగులలోను అని తాత్పర్యము. వీరిలో వాసుదేవుడైన నాయెడ నుంచబడిన అంతఃకరణముతో ఎవ్వడు నన్ను సేవించునో అతడు మిక్కిలియుక్తుడగును అని భావము.

(రామానుజులు) మద్గతేనాంతరాత్మనా = నాకుప్రియము జేయుటదప్ప ఇతరములైన సమస్తవ్యాపారములను విడిచియున్న మనస్సుచేత, అనగా బాహ్యాంతర (వెలుపలిలోపలి) వృత్తుల రెంటిలోను నన్నేమిక్కిలి ప్రియమైనవస్తువని గ్రహించి, నన్నువిడచి ఒకక్షణకాలముగూడ వేరుపడకయు, నన్నువిడిచి వేరుపడినచో నశించెదము అను తలంపుగల మనస్సుచేత శ్రద్ధావాన్ = నన్ను శీఘ్రముగ పొందవలెననుదానిలో మిక్కిలి ఆతురత గలిగి యున్నాడు. కావుననే ఇతడు శ్రేష్ఠుడు.

(స్వకీయము) యోగినామపి సర్వేషాం = యోగులలో శ్రేష్ఠుడు ఇతడని చెప్పబడియున్నది. ఎటువంటి యోగులలో శ్రేష్ఠుడనే ప్రశ్న గలుగుచున్నది. దీని విషయమైవ్యక్తముగ జెప్పకున్నను ఇందలి 4-వ అధ్యాయము 25 మొదలు 30 వరకుగల శ్లోకములలోచెప్పబడియున్న యజ్ఞము అనుపేరుతో పిలువబడు పదునొకండు విధములైన కర్మలనుజేయు కర్మయోగులలో నేరుగ ఈశ్వర భక్తినిజేసి ఈశ్వరునే భజించు ధ్యానయోగి శ్రేష్ఠుడని శ్రీధరులభిప్రాయ పడినట్లు తోచుచున్నది. ఈ అధ్యాయము 29 వ శ్లోకములో గుర్తించిన యోగికంటె 31 వ శ్లోకములో గుర్తించిన యోగిశ్రేష్ఠుడు. వీనికంటె 32 వ శ్లో-లో గుర్తించిన యోగిశ్రేష్ఠుడని ఆయాశ్లోకావతారికలో రామానుజులు చెప్పియుండుటయే గాక అట్టి నాలుగువిధములైన యోగులకంటె ఇతడు శ్రేష్ఠుడని దీనిలోనుజెప్పియున్నారు.

(రాఘవేంద్రులు) జ్ఞానయోగి భక్తియోగి వీరిలో భక్తియోగి శ్రేష్ఠుడు. ఏలనగా భక్తితో భగవంతుని సేవించెడివాడు గనుకనే అనిచెప్పియున్నారు. కొందరుయోగులు యోగసమాధిలో ధ్యానమునకు విషయముగ రుద్రుడు, ఇంద్రుడు, సూర్యుడు, సుబ్రహ్మణ్యుడు, గణపతి, మొదలగు దేవతలలో నొకరిని గుర్తించుకొనుచున్నారు. కొందఱు యోగులు ధ్యానమునకు విషయముగ పరమాత్మనే గుర్తించుకొని మిక్కిలి భక్తి విశ్వాసములతో ధ్యానముజేయుచున్నారు. వీరిలో పరమాత్మ ధ్యానముగల యోగియే శ్రేష్ఠుడని శంకరులు తాత్పర్యపడుచున్నారు. ఈ యర్థమును ఏడవ అధ్యాయము 23 వ శ్లోకమగు ''అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసాం। దేవాన్దేవయజో యాన్తి మద్భక్తా యాంతి మామపి'' అనుదానిలో చూడుడు.

(స్వకీయము) ఈగీతలో ''యోగము'' అనుపదము పలుచోట్ల ప్రకరణమునకు తగినట్లు కర్మయోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము, వీటిలో నేదైన నొకదానినిమాత్రము గుర్తించుటకై ప్రయోగింపబడియున్నందున ఆయోగముల స్వరూపమిట్టిదని భాష్యవ్యాఖ్యానాదులలో చెప్పియున్న దానిని తెలిసికొనవలసిన దవశ్యమగుచున్నది. యోగము = మార్గము, సాధనము = ఉపాయము, కర్మయోగమనగా కర్మయనే మార్గము ననుష్ఠించుట. ఇదికర్మనిష్ఠ అనిచెప్పబడును, అనగాకర్మమార్గములో దృఢముగ నిలబడుట. దీనిననుష్ఠించువాడు కర్మయోగి జ్ఞానయోగి, ధ్యానయోగి యనునదియు ఈ విధముగనే. కావున కర్మయోగియనబడువాడు తనకు విహితమైన శాస్త్రోక్తములైన

కర్మలను ఈశ్వరార్పణబుద్ధితో ఫలాపేక్షలేక అనుష్ఠించువాడు. ధ్యానయోగియనువాడు సాధన చతుష్టయ సంపన్నుడై యమము, నియమము, ఆసనము మొదలగువాటిచే చిత్తవృత్తులను అణచి యున్నవాడు. దీనికి యోగమార్గ మనిపేరు. సాంఖ్యమార్గమనగా సాధనచతుష్టయ సంపదతోగూడి యథార్థవస్తువును (ఆత్మను)విమర్శించి యెరుంగుట. (సాంఖ్యమనగా యధార్థవస్తువుయొక్క విమర్శ). జ్ఞానయోగి అనగా లోపలనున్న ఆత్మను గూర్చిన జ్ఞానముయొక్క ధారవంటి యెడతెగని వెంబడిం పును స్థిరపరచుటతో మిక్కిలి ఉత్సాహము గలవాడు.

ఇక కర్మయోగముచే చిత్తము పరిశుద్ధముకాగా తీవ్రమైన వైరాగ్యము పుట్టుచున్నది. దానిచే యథార్థవస్తువును ఎరుంగవలెనను భావము దృఢముగ స్థిరపడుచున్నది, ఇట్టి సమయమునందే సాంఖ్యమార్గమునకుగాని యోగమార్గమునకుగాని కావలసిన అవకాశమునిచ్చి సహాయముచేయునట్టి సన్న్యాసము ఆవశ్యకమగుచున్నది. ఇదియే అజ్ఞానస్థితిలోనున్నవాడు సన్న్యాసమును గూడుటకు తగినకాలము. సన్న్యాసములో విద్వత్సన్న్యాసము, వివిదిషాసన్న్యాసము, అనిభేదములు రెండు గలవు. విద్వత్సన్న్యాసమనగా జీవన్ముక్తి సుఖమునకై జ్ఞానిపొందునది. వివిదిషఅనగా వస్తువు నెరుంగవలెనను కోరిక. వివిదిషాసన్న్యాసమనునది అజ్ఞాని సాంఖ్య యోగమార్గములకు సాధనమై తనకు తత్త్వజ్ఞానముచేకూరుటకై చేసికొనునది. కావుననే ఇట్లు సకలకర్మసన్న్యాసమును పొంద దగిన సన్న్యాసియైనవాడు ఉత్తమాధికారియైనచో సాంఖ్యమార్గము ననుష్ఠించుచున్నాడు, మధ్య మాధికారియైనచో యోగమార్గము ననుష్ఠించుచున్నాడు. రెంటికధికారియైనచో రెంటిని అనుష్ఠించు చున్నాడు, ఏలనగా అవివెవ్వేరుగగాని ఒకటిగ చేరిగాని జ్ఞానయోగమునకు సాధనమగును.

ఈవిధముగ మందాధికారియైనవాడు కర్మయోగమును చేపట్టవలెను. కర్మయోగము సాంఖ్య మార్గమునకును యోగమార్గమునకును బహిరంగసాధనము. సన్న్యాసము వాటికంతరంగ సాధనము. 5-వ అధ్యాయము 1-వ శ్లోకములో అర్జునుడడిగినది అజ్ఞానిని గూర్చిన వివిదిషాసన్న్యాసము. ఈ 6-వ అధ్యాయములోజెప్పిన యోగభ్రష్టుడు సాంఖ్యమార్గము నుండిగాని యోగమార్గము నుండిగాని జారినవాడు. అనగా కర్మానుష్ఠానమును త్యజించి పొందవలసిన జ్ఞానయోగమును పొందక రెండు చెడినవాడుగ మధ్యలో నిలబడువాడు అని తాత్పర్యము.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే ధ్యానయోగో నామ
షష్ఠో౾ధ్యాయః

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న
శ్రీ కృష్ణార్జున సంవాదమున ధ్యానయోగమను
ఆరవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు

సప్తమాధ్యాయ ప్రారంభః.

# ఏడవ అధ్యాయము

## (విజ్ఞాన యోగము)



భగవానువాచ:—

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్ మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥

పద॥ మయి - ఆసక్తమనాః - పార్థ - యోగం - యుఞ్జన్ - మదాశ్రయః।
అసంశయం - సమగ్రం (1) మాం - యథా - జ్ఞాస్యసి - తత్ - శృణు॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీభగవంతుడు చెప్పెను | యోగం యుఞ్జన్ | యోగమును చేరువాడవుగను |
| హేపార్థ! | ఓ కుంతీపుత్రా! | సమగ్రం మాం | సంపూర్ణుడనైన నన్ను [ఉండి |
| త్వంమయి | నీవు నాయందు | యథా | ఏ విధముగ |
| ఆసక్తమనాః | ఆసక్తిగల మనస్సుగలవాడవుగను | అసంశయంజ్ఞాస్యసి | సంశయములేక తెలిసికొనెదవో |
| మదాశ్రయః | నన్నే ఆశ్రయముగగలవాడవుగను | తత్ శృణు | దానిని వినుము |

తా॥ శ్రీ భగవంతుడు (కృష్ణపరమాత్మ) చెప్పినది — ఓపార్థుడా! పరమేశ్వరుడనైన నాయందు మనస్సునుంచి, నన్నేశరణముగ గలవాడవై యోగముతోగూడిన వాడవైయుండి సంపూర్ణుడనైన నన్ను ఏ విధముగ సంశయములేక ఎరుగుదువో దానిని చెప్పెదను వినుము.

(1) సమగ్రం - సకలవిభూతి, బలము, శక్తి, ఐశ్వర్యము మొదలగు గుణసంపన్నుడుగానున్న (శ్రీధరులు).

(శంకరులు) సకలయోగులయందును ఎవడు విశ్వాసముతో నన్నుపొందిన అంతఃకరణముతో నన్నునమస్కరించు చున్నాడో అతడు ధ్యానయుక్తులైనవారందరికంటె మేలైనవాడనునది నాభావము. అని భగవంతుడు 6-వ అధ్యాయము 47-వ శ్లోకమున చెప్పుటవలన, అట్లగుట ఎటులు? ఒకడు తనయంతఃకరణము నతనియందు నుంచినవాడుగా నెట్లుకాగలడు? అనుప్రశ్నలకు అవకాశము గలిగెను. కావున ఆ భగవంతుని తత్వము ఇట్టిది - ఒకడు తనయంతఃకరణము భగవంతుని చెందినదిగ ఇట్లు చేయగలడు అను విషయములను తానే చెప్పతలంచినవాడై దీనిని ప్రసాదించు చున్నాడు. ఏ యొకడు ఒకపురుషార్థమును గోరుచున్నాడో అతడు దానికి సాధనమైన అగ్నిహోత్రము మొదలగుకర్మనుగాని తపస్సునుగాని, దానమునుగాని ఏదైననొకదానిని శరణముగ నొందుచున్నాడు. ఈ యోగియనగా నన్నే శరణముగ పొందుచున్నాడు. తదితరములైన సాధనములను విడనాడి

నాయందే మనోరతిగల వాడగును. ఎవడు ఇట్లుమనస్సును నాయందుంచినవాడో అతడు, అనగా అట్టి నీవు ఈ విధమైన సమస్తవిభూతి, బలము, శక్తి, లోకపరిపాలనమున సామర్థ్యము ఇవి మొదలుగాగల సకల గుణములతోనుగూడి నన్ను, భగవంతుడు ఇట్లేయున్నాడని సంశయములేక ఎట్లెరుగుదురో దానిని నేను చెప్పుచున్నాను వినుము. యోగమును జేరుటయనగా మనస్సు నొకనిలకడ నొందునట్లు చేయుట,

(శ్రీధరులు) ఇంతవరకు ఆత్మతత్త్వమునుచెప్పి ఇక యుపాసింపదగిన రూపమును చెప్పబోవుచున్నాడు.

(రామానుజులు) మొదటి 6 అధ్యాయములచే పరమాత్మునైన నారాయణుని పొందుటకు కారణమైన ఉపాసనను చెప్పుటకై, తనయొక్క (జీవునియొక్క) ఆత్మస్వరూపనిశ్చయముతోగూడిన కర్మానుష్ఠానము చెప్పబడినది. ఇదిమొదలు ఆరుఅధ్యాయములచే, పరమాత్మ స్వరూపమును పరమాత్మను పొందుటకు కారణమైన యుపాసనయని జెప్పబడు భక్తియు చెప్పబడును. ఈ ఏడవ అధ్యాయమున పరమాత్మ స్వరూపనిశ్చయమును, ప్రకృతిచే పరమాత్మ స్వరూపము జీవునికి గోచరించకయుండు విధమును, ప్రకృతిని పోగొట్టుటకై చేయవలసిన శరణాగతియొక్క వివరమును, శరణాగతి చేయబడినవారిలో భేదమును, జ్ఞానము శ్రేష్ఠమనుటయు జెప్పబడుచున్నది.

ఈ శ్లోకార్థమేమనగా - మయ్యాసక్తమనాః = నన్నెదురుజూచియు, నాయందు ప్రీతినుంచియు, నాస్వరూపము, గుణము, వ్యాపారము, మహిమ, వీటిలోనెల్లప్పుడు ననురాగముకల మనస్సుగలిగియు. మదాశ్రయః - నన్నే ఆధారముగ గలిగి - యోగం - నావిషయమైన యోగమును, యుఞ్జన్ = ప్రారంభముచేయుచున్న నీవు, అసంశయం = సంశయములేక, సమగ్రం = పూర్ణుడనుగానున్న, మాం = నన్ను, యథా = ఎట్లు - జ్ఞాస్యసి = ఎరుగుదువో - తచ్ఛృణు = దానిని వినుము.

(రాఘవేంద్రులు) మయ్యాసక్తమనాః - నాయందు ప్రీతినుంచిన మనస్సు గలిగినదియు మదాశ్రయః = "భగవంతుడే నన్నుగైకొని సకలమును చేయించుచున్నాడు. అతడే శరణమునొందుటకు తగినవాడు, సమస్తమునకు నతడేకర్త" యనునిశ్చయముగల, యోగం యుఞ్జన్ = యోగమున ప్రవేశించువాడును (మిగత అర్థములో వ్యత్యాసములేదు.)



శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే॥

పద॥ జ్ఞానం (1) తే - అహం - సవిజ్ఞానం (2) ఇదం - వక్ష్యామి - అశేషతః।
యత్ - జ్ఞాత్వా - ఇహ (1) భూయః - అన్యత్ - జ్ఞాతవ్యం - అవశిష్యతే॥

| | | | |
|---|---|---|---|
| యత్ | దేనిని | సవిజ్ఞానం | అనుభవజ్ఞానముతోగూడిన |
| జ్ఞాత్వా (స్థితస్య) | తెలిసికొనియున్నవానికి | ఇదంజ్ఞానం | ఇట్టి జ్ఞానమును |
| ఇహభూయః | ఇచ్చట మరలను | అశేషతః | శేషములేక పూర్ణముగ |
| జ్ఞాతవ్యం అన్యత్ | తెలిసికొనదగినది మరియొకటి | అహం తే వక్ష్యామి | నేను నీకు చెప్పబోవు |
| నావశిష్యతే | మిగిలినదిగనుండదో | | చున్నాను. |

తా॥ దేనిని తెలిసికొనియున్నవానికి ఇచ్చట మరల తెలిసికొనదగినది వేరొక్కటి మిగిలినదిగ నుండదో దానిని, అనగా విజ్ఞానముతో గూడిన ఈజ్ఞానమును నేను నీకు శేషములేక, అనగా నమస్తమును చెప్పబోవుచున్నాను.

(1) జ్ఞానం - భగవత్స్వరూపజ్ఞానము (రామానుజులు). నావిషయమైన జ్ఞానము (మధ్వాచార్యులు). సామాన్యమాహాత్మ్యజ్ఞానము (రాఘవేంద్రులు).

(2) సవిజ్ఞానం - జీవజడములకు విలక్షణమైన భగవంతుని మహిమలను గుణాతిశయములను తెలిసికొనుచున్న జ్ఞానముతోగూడిన (రామానుజులు). భగవంతుని విశేషమహాత్మ్య జ్ఞానముతోగూడిన (మధ్వులు).

(3) ఇహ-అనుదానికి "మయి"-నాయందు (రామానుజులు). ఈ మోక్షమార్గమునందు (శ్రీధరులు).

(శంకరులు) నన్నుగురించిన ఆజ్ఞానమును నేను నీకు తెలియునట్లుచెప్పెద నను చున్నాడు. భగవంతుడు తానుపదేశింప తలంచిన ఆ జ్ఞానమును "ఏజ్ఞానమును తెలిసికొనిన తరువాత ఇచ్చట మరల తెలిసికొనదగిన పురుషార్థసాధనము మరియొకటి మిగిలినదిగలేదో" అనిపొగడుట వినువానిని అభిముఖునిగ జేయుటకొరకు. అనగా వినుటలో అతనిమనస్సు ఆసక్తమగుటకొఱకని భావము. భగవంతుని తత్త్వము నెఱిఁగిన వాడెవడో యతడు సకలము నెఱిఁగినవాడు అనిభావము. కావున జ్ఞానము శ్రేష్ఠమైనఫలముగలది. కనుక పొందుట కశక్యమైనది. 'జ్ఞానముతో' = స్వానుభవ జ్ఞానముతో.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

పద॥ మనుష్యాణాం (1) సహస్రేషు - కశ్చిత్ - యతతి - సిద్ధయే ।
యతతాం - అపి - సిద్ధానాం - కశ్చిత్ - మాం - వేత్తి - తత్త్వతః ॥

| | | | |
|---|---|---|---|
| మనుష్యాణాం | మనుష్యులయొక్క | యతతామపి | ప్రయత్నముచేయుచున్న |
| సహస్రేషు | అనేకవేలలో | సిద్ధానాం | సిద్ధులందరిలోను |
| కశ్చిత్ | ఒకడు | కశ్చిత్ | ఎవడో ఒకడే |
| సిద్ధయే | సిద్ధికొఱకు జ్ఞానమొందుటకై | మాం తత్త్వతః వేత్తి | నన్ను వాస్తవముగ నెఱుగు |
| యతతి | ప్రయత్నించుచున్నాడు. | | చున్నాడు. |

తా॥ అనేకవేల మనుష్యులలో ఒకడే సిద్ధికొరకు, అనగా జ్ఞానప్రాప్తి కొఱకు ప్రయత్నము చేయుచున్నాడు. అట్లు ప్రయత్నించి సిద్ధులైన వారిలోను ఎవడో ఒక్కడే నన్ను ఉన్నటుల తెలిసికొనుచున్నాడు.

(1) మనుష్యాణాం - శాస్త్రాధికారులైనవారు (రామానుజులు).

(శంకరులు) ఎట్లనగా పలువేలమనుష్యులలో ఒకడు సిద్ధికొఱకైన జ్ఞానముగలుగుట కొఱకు ప్రయత్నముచేయుచున్నాడు. ఎవరుముక్తికొఱకై ప్రయత్నించు చున్నారో వారలుసిద్ధులు. జ్ఞానము నొందినవారలు. జ్ఞానమునొందబోవు వారిని పొందినవారని పలుకుట ఉపచారవాదము. ప్రయత్నించి సిద్ధులైన వారిలోను ఎవ్వడో యొకడే నన్ను యథావత్తుగా నెఱుగుచున్నాడు.

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ 4

పద॥ భూమిః - ఆపః - అనలః - వాయుః - ఖం - మనః - బుద్ధిః - ఏవ - చ।
అహంకారః - ఇతి - ఇయం - మే - భిన్నా - ప్రకృతిః - అష్టధా ॥

| | | | |
|---|---|---|---|
| మే ఇయం | నాదైన ఈ | ఖం | ఆకాశము |
| ప్రకృతిరేవ చ | మాయయే | మనః | మనస్సు |
| భూమిః | భూమి | బుద్ధిః | బుద్ధి |
| ఆపః | జలము | అహంకారః | అహంకారము |
| అనలః | అగ్ని | ఇతిఅష్టధా | అని యెనిమిదివిధములుగా |
| వాయుః | గాలి | భిన్నా | భిన్నముగనున్నది |

తా॥ నాయొక్క ఈ ప్రకృతియే (మాయయే) భూమి జలము అగ్ని వాయువు ఆకాశము మనస్సు బుద్ధి అహంకారము ఇట్లు ఎనిమిది విధములుగ భిన్నమైయున్నది.

(శంకరులు) భగవంతుడు తనయుపదేశమున రుచినికలుగజేయుటచే వినువానిని సన్నద్ధునిగ జేసికొని తన ప్రకృతివలన ప్రపంచము పరిణమించుటను జెప్పుచున్నాడు. ప్రకృతి యెనిమిది విధములుగ పరిణమించినదని జెప్పబడుటచే దీనిలో భూమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము అనునవిస్థూలములైన పృథివి మొదలగు వాట్లను గుర్తించునవిగ గ్రహింపగూడదు. అనగా భూమియనుదానిచే పృథివి తన్మాత్రను ఇచ్చట గుర్తించినదిగ భావించవలెను. అట్లే నీరు మొదలగు వాటికిగూడ. తన్మాత్రయనగా మహాభూతములయొక్క మిక్కిలి సూక్ష్మావస్థ. మనస్సనగా మనస్సునకు కారణమైన అహంకారమును గుర్తించునదిగ గ్రహింపదగును. "బుద్ధి" యనునది అహంకారమునకు కారణమైన మహత్తత్త్వము. "అహంకారము" అనగా అవిద్యతోగలిగి అవిద్యారూపమైన అవ్యక్తము. విషముతోగూడిన అన్నమును విషమని బలుకుటవలె అహంకారముయొక్క వాసనతో గూడినదై మూలకారణముగ నిలబడియున్న అవ్యక్తము అహంకారమనఁబడుచున్నది. అహంకారముగదా సకలప్రాణులును ప్రవర్తించుటకు కారణముగనే లోకమున గనబడుచున్నది! ఇట్లు చెప్పబడిన నాదైన ఈ ప్రకృతి ఈశ్వరునికి అధీనమైన మాయగను శక్తిగను నున్నది. ఇది యెనిమిది విధములుగా భేదమునుబొంది యున్నది.

(రామానుజులు) "బుద్ధి" యనునది మనస్సు మొదలైన ఇంద్రియములు.

(శ్రీధరులు) భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశమనునవి ఆ భూతములయొక్క సూక్ష్మమైన తన్మాత్రలు. లేక స్థూల సూక్ష్మభూతములు. "మనస్సు" అనునది మనస్సుకు కారణమైన అహంకారతత్త్వము, లేక ప్రధానము. "బుద్ధి" యనునది మహత్తత్త్వము. "అహంకారము"నునది అవిద్య, లేక అహంకారమున్ను ఇంద్రియములున్ను.

(మధ్వులు) అహంకారతత్త్వమున్ను మహత్తత్త్వమే. అహంకారతత్త్వమున మహత్తత్త్వము చేరియే యుండుటచే మహత్తత్త్వము ప్రత్యేకముగ చెప్పబడలేదు.

(స్వకీయము) దీనియందు ప్రకృతి (తత్త్వము) యెనిమిదివిధములుగ చెప్పబడియున్నద్ధి. కొన్నిపురాణములయందు తత్త్వములు 17 అనియు, 23 అనియు, 24 అనియు, 36 అనియు. 96 అనియు ఇట్లు పలువిధములుగ చెప్పబడియున్నవి. ఐతే అట్లు చెప్పుటతప్పని భావింపవీలులేదు.

ఎందుకన, ఈశ్లోకార్థములోనే శ్రీధరులు చెప్పిన ప్రకారముగ దీని 13-వ అధ్యాయము 6-వ శ్లోకమున జెప్పబడియున్న 24 తత్త్వములను సంగ్రహించి దీనిలో 8 గ జెప్పబడియున్నటుల సంగ్రహించియు వివరించియు జెప్పుటచేత పురాణాదులలో అట్లు వ్యత్యాసము కనబడుచున్నది. ఈ భూతతత్త్వముల యుత్పత్తి క్రమమును సృష్టిక్రమమును గుఱించి విష్ణుపురాణము మొదటి అంశము 2-వ అధ్యాయమునందును, భాగవతము 2-వ స్కంధము 5-వ అధ్యాయమునందును, వాసుదేవమననము గ్రంథమునందును జెప్పబడియుండుటను గమనింపుడు.



శ్లో॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥

పద॥ అపరా - ఇయం - ఇతః - తు - అన్యాం - ప్రకృతిం - విద్ధి - మే - పరాం।
జీవభూతాం - మహాబాహో - యయా - ఇదం - ధార్యతే - జగత్ ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో! | ఓ భుజబలముగలవాడా ! | ఇతః అన్యాం | దీనికంటె వేరైనదిగను |
| ఇయంఅపరా | ఇది నికృష్టమైనది (నీచమైనది) | పరాం | శ్రేష్ఠమైన |
| యయాతు | మఱిదేనిచేత | మే ప్రకృతిం | నాయొక్క ప్రకృతిగను |
| ఇదం జగత్ | ఈ జగత్తు | జీవభూతం | జీవస్వరూపమైనదిగను |
| ధార్యతే | ధరింపబడుచున్నదో | విద్ధి | ఎరుగుము. |
| తాం | దానిని | | |

తా॥ ఓ భుజబలముగల అర్జునుడా! ఇది (పూర్వముచెప్పిన భూమి మొదలగునవి) నికృష్టమైన (అనగా నీచమైన) ప్రకృతి. మఱి దేనిచే ఈ ప్రపంచము ధరింపబడుచున్నదో దానిని దీనికన్న వేరుగను, శ్రేష్ఠమైన నా ప్రకృతిగను, జీవస్వరూపమైనదిగను నెరుంగుము.

(శంకరులు) పూర్వము చెప్పిన భూమిమొదలగు అచేతన ప్రకృతి శ్రేష్ఠముగాదు. తక్కువయైనది. అపరిశుద్ధమైనది; అనర్థములను (చెడుపులను) జేయునది. సంసారబంధ స్వరూపముగనున్నది. మఱియే ప్రకృతి, లోపలనిలబడి ఈ జగత్తును ధరించుచున్నదో అట్టి ప్రకృతి పూర్వము చెప్పిన ప్రకృతికంటె వేరైనది. పరిశుద్ధమైనది నా యాత్మగనే యున్నది, శ్రేష్ఠమైనది. క్షేత్రజ్ఞుడుగనున్నది, ప్రాణమునిలచి యుండుటకు కారణమైనదని తెలిసికొనుము. (ముందు రాబోవు 13-వ అధ్యాయము 1-2-5 శ్లోకములను చూడుడు.)

(రామానుజులు) నాయొక్క జడప్రకృతిని నాయొక్క చేతన ప్రకృతి ధరించుకొని యున్నది.

(మధ్వులు) చేతన ప్రకృతియైన లక్ష్మిచేత జడప్రకృతియైన యీ ప్రపంచము ధరింపబడియున్నది. ప్రాణములను ధరించుటచేతను, ఎల్లప్పుడును ఎచ్చోటను వ్యాపించియుండుటచేతను ఈ లక్ష్మి జీవభూతమని చెప్పబడినది.



శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా ॥ 6

పద॥ ఏతత్ - యోనీని - భూతాని - సర్వాణి - ఇతి - ఉపధారయ।
అహం - కృత్స్నస్య - జగతః - ప్రభవః - ప్రళయః - తథా॥

| | | | |
|---|---|---|---|
| సర్వాణి భూతాని | సకల భూతములున్ను | అహం | నేను |
| ఏతద్యోనీని | ఇవి పుట్టిల్లుగ గలిగినవి | కృత్స్నస్యజగతః | సకలజగత్తునకును |
| ఇతి ఉపధారయ | అని తెలిసికొనుము | ప్రభవః | ఉత్పత్తికి కారణము |
| (తస్మాత్) | అకారణముచేత | తథా ప్రళయః | అట్లే నాశమునకును కారణము |

తా॥ సకల భూతములున్ను ఈ (జడ, చేతనములను) రెండు విధములైన ప్రకృతిచేతనే కలుగునవిగ నెఱుగుము. వాటిమూలముగ సకల జగత్తునకును ఉత్పత్తిలయములకు కారణము నేనే.

(శంకరులు) శ్రేష్ఠమును అపకృష్టమునగు క్షేత్రము క్షేత్రజ్ఞుడు అను లక్షణములతో గూడిన ఈ రెండు ప్రకృతులు సమస్తభూతములకును పుట్టిల్లు. నా ప్రకృతి సకలభూతములకును పుట్టిల్లగుటచే నేను సకల జగత్తునకును ఉత్పత్తిగను నాశముగను ఉన్నాను. నేను ఈ రెండు ప్రకృతులద్వారముగ సర్వజ్ఞుడైన ఈశ్వరుడను, జగత్తునకు కారణమైనవాడను అని భావము. 13-వ అధ్యా-27-శ్లోకమును జూడుడు.



శ్లో॥ మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥

పద॥ మత్తః - పరతరం - న - అన్యత్ కించిత్ - అస్తి - ధనంజయ।
మయి - సర్వం - ఇదం - ప్రోతం - సూత్రే - మణిగణాః - ఇవ॥

| | | | |
|---|---|---|---|
| హే ధనంజయ! | ఓ ధనంజయుడా! | సూత్రే | దారమునందలి |
| మత్తః | నాకంటె | మణిగణా ఇవ | మణుల సమూహామువలె |
| పరతరం | మిక్కిలి శ్రేష్ఠమైనది | మయి | నాయందు |
| అన్యత్ కించిత్ | మరియొకటి ఏదియు | ఇదం సర్వం | ఈ ప్రపంచమంతయు |
| నాస్తి | లేదు | ప్రోతం | కూర్చబడినది. |

తా॥ ఓ అర్జునుడా! నాకంటె శ్రేష్ఠమైనది వేరొక్కటిలేదు. ఐతే కనబడుచున్న ప్రపంచమంతయు, సూత్రమున మణులు కూర్చబడినట్లు నాయందు కూర్చబడియున్నది.

(శంకరులు) కావున పరమేశ్వరుడనైన నాకన్న వేరుకారణమేదియులేదు. అనగా నేనే జగత్కారణమని తాత్పర్యము. ఇట్లుండుటచే నాయందు సకల భూతములును ఈ సకల జగత్తున్ను పొడవైనదారములందు వస్త్రమువలెనున్ను, సూత్రమున రత్నములవరుసలువలెనున్ను కూర్చబడియున్నవి.

(రామానుజులు) "మహాశ్రేష్ఠమైనది" ఎట్లన పరమాత్ముడు జడచేతనములకు శేషిగను, వాట్లకు కారణముగను ఉండుటచేతను, జ్ఞానము, శక్తి, బలము మొదలగు గుణములతో గూడియుండుటచేతను శ్రేష్ఠముగ జెప్పబడుచున్నది. "సూత్రమున మణులువలె నాయందు సమస్త ప్రపంచమున్ను గ్రథింపబడియున్నది" ఎట్లన కార్యకారణావస్థలతో గూడియున్న ఈజడ చేతనరూపమైన సకల

ప్రపంచమున్ను నాకుశరీరము, సకలమునకును ఆత్మయైన (శరీరినైన) నాయందు సకలప్రపంచమును ఆశ్రయించి యున్నదని తాత్పర్యము. ఈయర్థము ''యస్య పృథివీశరీరం యస్య ఆత్మాశరీరం ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యోదేవ ఏకోనారాయణ ఇతి" అనుశ్రుతి వాక్యముల యందును చెప్పబడియున్నది.

(స్వకీయము) శేషియనునదెట్లన, జీవుడు శేషి. అతనికి దేహేంద్రియములున్ను శబ్దాది విషయములున్ను తదితర వస్తువులున్ను భోగ్యవస్తువులుగ నుండుటచేత ఇవి శేషములు. ఈప్రకారమే పరమాత్ముడు శేషి. జీవుడును తదితరములైన అచేతన ప్రపంచమున్ను పరమాత్మకు భోగ్యమగుటచేత ఆ చేతనాచేతనములు శేషములు.

శ్లో॥ రసోఽహమప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ 8

పద॥ రసః - అహం - అప్సు - కౌంతేయ - ప్రభా - అస్మి - శశిసూర్యయోః।
ప్రణవః - సర్వవేదేషు - శబ్దః - ఖే - పౌరుషం - నృషు॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ! | ఓ కుంతీపుత్రుడా! | ప్రణవః | ప్రణవమను ఓంకారముగను |
| అహం | నేను | ఖే శబ్దః | ఆకాశమున - శబ్దముగను |
| అప్సు - రసః | జలములలో రుచియు | నృషు | మనుష్యులలో |
| శశిసూర్యయోః | చంద్రసూర్యులలో | పౌరుషం | మనుష్యత్వముగను |
| ప్రభా | కాంతి, లేక జ్యోతిస్సుగను | అస్మి | ఉన్నాను. |
| సర్వవేదేషు | సమస్త వేదములయందు | | |

తా॥ ఓ కుంతీపుత్రుడా! నేనుజలమున రుచిగను, చంద్రసూర్యులలో ప్రకాశముగను, అన్నివేదములలో ప్రణవముగను (ఓంకారముగను) ఆకాశమున శబ్దముగను, మనుష్యులలో మనుష్యత్వముగనుఉన్నాను.

(శంకరులు) ఏ యే స్వభావము గలవారియందు ఇవన్నియు కూర్చబడి యున్నవనునది చెప్పబడుచున్నది. నీటిలో ఏది సారమైనదో అదియే రసము. ఆ రుచిగల నాయందు జలము కూర్చబడియున్నదని భావము. ఇట్లే సకలమునందును కనుగొనుఁడు. నేను నీటిలో రసముగనుండుటవలె చంద్రసూర్యులలో ప్రకాశముగనున్నాను. అన్నివేదములలోను ఓంకారముగనున్నాను. ఆయోంకారముగనున్న నాయందు సకలవేదములున్ను గ్రథితములైయున్నవి, అట్లే ఆకాశమున సారభూతమైన శబ్దముగనున్నాను. ఆ స్వరూపముగనున్న నాయందు ఆకాశము గ్రథితమైయున్నది. అట్లే యొకనికి తాను మనుష్యుడనుభావము దేనిచే కలుగుచున్నదో అట్టి మనుష్యత్వముగ మనుష్యులలో నున్నాను. అట్టి మనుష్యత్వమునకు సాధారణుడైన నాయందు మనుష్యులు గ్రథితులైయున్నారు.

(స్వకీయము) ఇది మొదలు 11 వరకున్న శ్లోకముల వ్యాఖ్యానము 11 వ శ్లోకము క్రింద చూడుడు.



శ్లో॥ పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥

పద॥ పుణ్యః - గంధః - పృథివ్యాం - చ - తేజః - చ - అస్మి - విభావసౌ ।
జీవనం - సర్వభూతేషు - తపః - చ - అస్మి - తపస్విషు ॥

| | | | |
|---|---|---|---|
| అహం | నేను | అహం | నేను |
| పృథివ్యాం | భూమిలో | సర్వభూతేషు | సకలప్రాణులలోను |
| పుణ్యః గంధశ్చ | మంచివాసనగను | జీవనం | జీవనముగను |
| విభావసౌ | అగ్నియందు | తపస్విషు | తపస్సుచేయువారిలో |
| తేజశ్చ | ప్రకాశముగను | తపశ్చ | తపస్సుగను |
| అస్మి | ఉన్నాను | అస్మి | ఉన్నాను. |

తా॥ నేను భూమిలో మంచి వాసనగను, అగ్నిలో ప్రకాశముగను, సకల ప్రాణులు దేనిచే బ్రతికియున్నవో యట్టి యన్నరసముగను, తపస్సు గలవారిలో తపస్సుగను ఉన్నాను.

(శంకరులు) నేను భూమిలోనున్న మంచివాసనగనున్నాను. ఆ వాసనగనున్న నాయందు భూమి గ్రథితమైయున్నది. వాసనకు సత్స్వభావము స్వభావమైనదే. జలము మొదలగువాట్లలోని రుచి మొదలగువాటియొక్క సత్స్వభావమును తెలియపరచుటకై భూమియందలి ఆ వాసనయొక్క మంచి తనము ఎత్తిచూపబడినది. ఐతే దుర్వాసన యనునది యేమనగా, ప్రాణులయవిద్య అధర్మము మొదలగువాటికి తగినటుల కొన్ని భూతములతోఁజేరి వికారమొందుటచే గలుగుచున్నదని భావము. దేనిచే ప్రాణులెల్ల జీవించుచున్నవో యట్టి యమృతమను అన్నరసముగనున్నాను. తపస్సు గలవారి యొక్క తపస్సుగనున్నాను. ఆ తపస్సుగనున్న నాయందు తపస్సుగలవారలు గ్రథితులైయున్నారని భావము.



శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనం ।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహం ॥ 10

పద॥ బీజం - మాం - సర్వభూతానాం - విద్ధి - పార్థ - సనాతనమ్ ।
ర్ధిః - బుద్ధిమతాం - అస్మి - తేజః - తేజస్వినాం - అహం ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ కుంతీపుత్రుడా! | విద్ధి | ఎరుంగుము |
| (త్వం) | నీవు | అహం | నేను |
| మాం | నన్ను | బుద్ధిమతాం బుద్ధిః | బుద్ధిమంతుల జ్ఞానముగను |
| సర్వభూతానాం | సకలభూతములకును | తేజస్వినాం తేజః | తేజస్సుగలవారి తేజస్సుగను |
| సనాతనం బీజం | నాశములేని విత్తనముగ | అస్మి | ఉన్నాను. |

తా॥ ఓ కుంతీపుత్రుడా! నన్ను సకలభూతములకును నాశములేని విత్తన ముగ నెఱుఁగుము. నేను బుద్ధిశాలుల నిశ్చయ జ్ఞానముగను, తేజస్సు గల వారలయొక్క తేజస్సుగనుఉన్నాను.

(శంకరులు) 'బీజం' అనునది మొలచుటకు కారణముగనున్నది. 'బుద్ధి' యనునది అంతఃకరణముయొక్క వివేచనాశక్తి. అట్టి వివేచనాశక్తిగలవారిలో ఆ వివేచనాశక్తిగ నేనున్నాను. తేజః = ప్రాగల్భ్యం = వీరత్వము - లేక మనోధైర్యము, ఇతరులచే తాను జయించ బడగూడదు. తాను ఇతరులను జయించు సామర్థ్యము.

శ్లో॥ బలం బలవతాం చాహం కామరాగవివర్జితం।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ 11

పద॥ బలం - బలవతాం - చ - అహం - కామరాగవివర్జితమ్।
ధర్మావిరుద్ధః - భూతేషు - కామః - అస్మి - భరతర్షభ ॥

| | | | |
|---|---|---|---|
| హే భరతర్షభ ! | ఓ భరతకులశ్రేష్ఠుడా ! | బలం | సామర్థ్యముగను |
| అహం | నేను | భూతేషు | ప్రాణులయొక్క |
| బలవతాం | బలవంతులయొక్క | ధర్మావిరుద్ధః | ధర్మమునకు విరుద్ధముకానట్టి |
| కామరాగవివర్జితం | కామమురాగములేని | కామః చ అస్మి | కోరికగనున్నాను. |

తా॥ ఓ భరతకుల శ్రేష్ఠుడా! నేను బలవంతులైన వారల కామరాగములు లేని సామర్థ్యముగను, ప్రాణులయొక్క ధర్మమునకు విరోధములేని కోరికగనున్నాను.

(శంకరులు) కామమనగా ఇంద్రియములతో తత్కాలము సంబంధములేని విషయముల మీదనున్న కోరిక.

రాగమనగా ఇంద్రియములచే పొందబడియున్న విషయముల మీదనున్న రుచి, లేక ప్రీతి. ఇవిరెండునులేని శరీరము మొదలగువాట్లనుమాత్రము ధరించుటకు తగినబలము, అనగా సామర్థ్యముగ నేనున్నాను. అయితే సంసారుల కోరికకును అభిమానమునకును కారణమైన సామర్థ్య మెద్దియో యదికాను. మఱియు ప్రాణులయందున్న శాస్త్రవిరోధములేని, లేక శాస్త్రమును అనుసరించిన కోరికయేదో అనగా దేహమును సంరక్షించుట మొదలగువాట్లకు మాత్రము కావలసినదైన ఆహారమును భుజించుట, నీరుత్రాగుట ఇట్టిదానిని గురించిన కోరిక యెద్దియో యదిగ నేనున్నాను.

ఈయెనిమిదవ శ్లోకము క్రిందకనబరచినటుల యదిమొదలు 11-వ శ్లోకమువరకు శ్రీధరులు మొదలగువారి తాత్పర్యము:—

(శ్రీధరులు) రసముయొక్క సూక్ష్మభాగము నాయంశము. ఆయంశము విభూతియని చెప్పబడును. ఆ నాయంశమైన రసమునకు నేను స్థానమగుటచేత "జలములోని రసమునేన"ని చెప్పబడినది. మిగతయంతయు ఇదేయర్థమున గ్రహింపబడవలయును. రాగః = లభించినది చాలదు. మఱియు కావలయుననే యపేక్ష. ('బలంబలవతామస్మి'యని వీరిపాఠము) ధర్మావిరుద్ధఃకామః = తన స్త్రీ విషయమునగలుగు కామవిషయమునగూడ ధర్మమునకు విరోధముగ నుండగూడదు.

(రామానుజులు) రసముమొదలగునవి నాకంటె వేరైనను అవినాచే కలిగింపబడినవి. నాచే కలిగినవిగను, నన్ను ఆశ్రయించినవిగను, నాశరీరముగను, నాయొక్క శేషముగను, నేను వాటికి శేషిగనుండుటచే అవి నేనని చెప్పఁబడినవి. మిగతయంతయు ఇటులనే గ్రహింపుడు.

(మధ్వులు) సకలవస్తువులున్ను ఈశ్వరాధీనముగ ఈశ్వరుని ఆధారముగ గలిగియుండుటచే ఏవస్తువు ఎవనియధీనముగనున్నదో యావస్తువువాడుగనే చెప్పబడుచున్నది. కావున తనయధీనములైన రసముమొదలగునవి తానేయని భగవంతుడు పలికెను. జలము మొదలగువాటిలో రసము మొదలగునవి ఎట్లు శ్రేష్ఠములో అట్లనే నేనును అంతట శ్రేష్ఠుడుగనున్నాను.

(రాఘవేంద్రులు) జలమునందున్న రసముమొదలగువాటిని దానియందున్న పరమాత్మకు ప్రతిమగభావించి యుపాసించుచున్న జ్ఞానులుగలరు. కావున రసముమొదలగునవి నేనేయని భగవంతుడు అభేదముగఁజెప్పెను. "నామబ్రహ్మేత్యుపాస్తే" మొదలగు శ్రుతివాక్యములలో ఉపాసనాస్థలములయందు ప్రతిమయైన నామములను, ఉపాసింపబడెడు బ్రహ్మమును అభేదముగ జెప్పియుండుటవలె ఇచ్చోటను నభేదముగ జెప్పినదిగ నెఱుంగవలయును. లేక జలము మొదలగువాటి యభిమాని దేవతలయందున్న పరమాత్మస్వరూపము నుపాసించుటకొఱకు అభేదముగ చెప్పినదిగ నైనను గ్రహింపవలయును.



శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి॥ 12

పద॥ యే - చ - ఏవ - సాత్త్వికాః - భావాః - రాజసాః - తామసాః - చ - యే।
మత్తః - ఏవ - ఇతి - తాన్ - విద్ధి - న - తు - అహం - తేషు - తే - మయి॥

| | | | |
|---|---|---|---|
| సాత్త్వికా ఏవ | సత్త్వగుణముచేతనే గలిగిన | తాన్ | వాటిని |
| భావాః | వస్తువులు | మత్త ఏవేతి | నావద్దనుండియే కలిగినవియని |
| యే | యెవ్వియో | విద్ధి | తెలిసికొనుము |
| రాజసాశ్చ | రజోగుణముచే గలిగినవియు | అహం తేషు న | నేను వాటిలో లేను |
| తామసాశ్చ | తమోగుణముచే గలిగినవియు | తు | మరేమనగా |
| (భావాః) | వస్తువులు | తే మయి (సన్తి) | అవి నాయందున్నవి |
| యే | యెవ్వియో | | |

తా॥ సత్త్వరజస్తమోగుణములచే గలిగిన వస్తువులెవ్వియో యవి నా చేతనే గలిగినవనియు, నేను వాటియందు లేననియు అవి నాయందున్నవనియు నీవెఱుంగుము.

(శంకరులు) సాత్త్వికం = సత్త్వగుణముచేనైనది, రాజసం = రజోగుణముచేనైనది. తామసం = తమోగుణముచేనైనది. ప్రాణులకు తమకర్మవశముగ సాత్త్వికముగను, రాజసముగను, తామసముగనుఉన్న యే యే వస్తువులు గలుగుచున్నవో వాటినన్నిటిని నావద్దనుండియే గలిగినవిగ తెలిసికొనుము. ఇట్లు అవి నావలన కలుగుచున్నవైనను సంసారులవలె నేను వాటినాశ్రయించి తద్వశముగ నున్నవాడను కాను. మరేమన అవి నావశముగ నన్నాశ్రయించి యున్నవి.

(శ్రీధరులు) సత్వగుణముచే గలిగిన శమదమాదులు, రజోగుణముచేగలిగిన హర్షదర్పాదులు, తమోగుణముచేగలిగిన శోకమోహాదులు వీటికినేను స్వాధీనుడనుగాను. అవి నాయధీనములైయున్నవి.

(రామానుజులు) నాస్థితి సత్త్వాదిగుణముల యధీనముగాదు. ఐతే యవి నాకధీనములైనవి. అవి నాకు శరీరమై నన్నాశ్రయించియున్నవి. దీనితాత్పర్యమేమన్న ఆత్మలేక శరీరముండజాలదు. ఆత్మ దేహమును విడిచియునుండగలదు. అతడు దేహముచేత భోగవిషయమున నుపకారము నొందుచున్నాడు. నాకు దేహముచే కావలసినదేదియులేదు. లీలకొఱకు దేహమును గ్రహించియున్నాను.



శ్లో॥ త్రిభిర్గుణమయైర్భావైరేభిస్సర్వమిదం జగత్।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్॥ 13

పద॥ త్రిభిః (1) - గుణమయైః - భావైః - ఏభిః - సర్వం - ఇదం - జగత్ ।
మోహితం (2) - న - అభిజానాతి - మాం (3) - ఏభ్యః - పరం - అవ్యయం ॥

| | | | |
|---|---|---|---|
| సర్వం ఇదం జగత్ | ఈ సకలప్రపంచమున్ను | మాం | నన్ను |
| త్రిభిఃగుణమయైః | మూడువిధములైన గుణ వికారములుగనున్న | ఏభ్యః | వీటికంటె |
| | | పరం | వేరైనవానిగను |
| ఏభిః భావైః | ఈ వస్తువులచే | అవ్యయం | వికారములేనివానిగను |
| మోహితం | మోహింపబడి | నాభిజానాతి | బాగుగ నెఱుఁగుటలేదు. |

తా॥ ఈ సకల ప్రపంచమున్ను (ప్రాణులున్ను) సత్త్వము రజస్సు తమస్సను మూడువిధములుగనున్న గుణవికారములైన ఈ (ముందుజెప్పిన) వస్తువులచే మోహమును (అవివేకమును) పొందింపబడి నన్ను వీటికన్న వేరైన వానిగను, అనగా ఈ గుణముల తరువాత నున్నవానిగను, వికారములేక, మార్పులేనివానిగను నెఱుఁగుటలేదు.

(1) త్రిభిః - దేహము, ఇంద్రియములు, భోగ్యస్వరూపములైన వస్తువులని మూడువిధములు (రామానుజులు)

(2) మోహితం - గుణరూపములతోనున్న జీవులు తామువలె పరమాత్మయు గుణరూపములుగలిగి యున్నటుల మోహముగలవారలై యున్నారు. (మధ్వాచార్యులు)

(3) మాం - అప్రాకృత దేహముగల నన్ను (మధ్వాచార్యులు.)

(శంకరులు) పరమేశ్వరుడైన నేను స్వభావముగనే నిత్యుడుగను శుద్ధుడుగను బుద్ధుడుగను ముక్తుడుగను సకలభూతముల యాత్మగను నిర్గుణుడుగను సంసారదోషమైన బీజమును కాల్చుటకు కారణముగనున్నను నన్ను ఈ జగత్తు తెలిసికొనలేదేయని భగవంతుడు దయాభావమును చూపించు చున్నాడు. ఆయజ్ఞానము ఈ జగమునకు ఎందుచే గలిగినదని కారణమున్ను జెప్పుచున్నాడు. ఈ ప్రాణివర్గము రాగము విరాగము మోహము మొదలైన పూర్వముజెప్పిన సత్త్వాది గుణవికార ములచే గలిగిన ఈ వస్తువులచే అవివేకమును పొందింపబడి నన్ను పూర్వము జెప్పిన ఈ గుణ ములకు అతీతుడైయున్నవానిగను వేరైనవానిగను అవ్యయునిగను అనగా లోకమునందున్న వస్తువు లకుగల జననము మొదలగు నెట్టి వికారమున్ను లేనివానిగను ఎఱుఁగుటలేదు.

(స్వకీయము) "వస్తువులకంటె వేరైయున్న" "నాశములేని" యను ఈ విశేషములచే కనబడు సకలప్రపంచ స్వరూపమునకంటె బ్రహ్మస్వరూపము వేరైనదనియు, కనబడుచున్న ఈ సకల ప్రపంచమున్ను నాశమునొందుననియు, బ్రహ్మస్వరూపము నాశమునొందదనియు ఈ సకల వస్తువులయందున్న బ్రహ్మము "సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ" అను వేదవాక్యానుసారముగ అవస్తువులయందంటక సాక్షిమాత్రముగనున్నదేగాని వస్తుస్వరూపముగ లేనందుచేత వస్తునాశముచే బ్రహ్మమునకు నాశములేదనియు తేలుచున్నది.

(స్వకీయము) ఈ శ్లోకమున భగవంతుడు తన్ను ఈ జగము ఏల యథావత్తుగ (ఉన్నట్లు) తెలిసికొనుటలేదనుదానికి కారణముజెప్పియుండుటను స్పష్టముగ దెలిసికొనుట యుక్తము. ఏకముగనేయున్నబ్రహ్మము సత్త్వరజస్తమో గుణముల వికారములచే వేరుబడినదిగ అజ్ఞానముచే కనబడుచున్నదేగాని వేఱులేదు ఇదిమాయయొక్క కార్యము. ఈ దైవమాయను దాటుట అతి

దుర్లభము, ముందు రాబోవు 25 శ్లోకమున "నేను నాయోగమాయచే కప్పబడి నా భక్తులుతప్ప మఱెవ్వరికి కనబడుటలేదు. కావున ఈ మాయకు వశమై మోహమును ఈ జగత్తు పొంది నన్ను ఆత్మగ నెఱుఁగుటలేదు" అని భగవంతుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే.॥ 14

పద॥ దైవీ - హి - ఏషా - గుణమయీ - మమ - మాయా - దురత్యయా ।
మాం - ఏవ - యే - ప్రపద్యన్తే - మాయాం - ఏతాం - తరన్తి - తే ॥

| | | | |
|---|---|---|---|
| గుణమయీ | గుణములచేనైన | యేమామేవ | యెవరు నన్నే |
| ఏషామమ | ఈ నాయొక్క | ప్రపద్యన్తే | శరణమొందుచున్నారో |
| దైవీమాయా | దైవమాయయైనది | తే | వారు |
| దురత్యయా హి | దాటుట కతిదుర్లభమైన దగుటచే | ఏతాం మాయాం | ఈ మాయను |
| | | తరన్తి | దాటుచున్నారు. |

తా॥ మూడు గుణములచేనైన నాయీ (పూర్వముచెప్పిన) దైవమాయ దాటుటకు అతిదుర్లభమైనదగుటచే ఎవరు నన్నే శరణాగతినొందుచున్నారో వారు మాత్రము ఈ మాయను దాటుచున్నారు.

(శంకరులు) ఐతే త్రిగుణస్వరూపమైన దీనిని, అనగా విష్ణువుయొక్క దైవమాయను ఒకడు ఎట్లుదాటి నిలువగలడనునది జెప్పబడుచున్నది. సర్వవ్యాపియగు ఈశ్వరుడైన నాకు సొంతమైనదియు సత్త్వాదిగుణ వికారమును ఐన పూర్వము చెప్పబడిన నాయీ మాయ, దాటుటకు మిక్కిలి దుర్లభమైనది. కావున (అది యిట్లుండుటచేత) ఎవరు సకలకర్మలనువిడిచి మాయ గలవారై వారి ఆత్మగనున్న నన్నే సర్వవిధములుగను పొందుచున్నారో, వారు సకల ప్రాణులను మోహింపజేయుచున్న ఈ మాయను దాటుచున్నారు. అనగా సంసారబంధమునుండి విడువబడు చున్నారని భావము.

(రామానుజులు) మాయ మూడు గుణములు గలది. అది ఈశ్వరునిచే సృష్టింపబడినది. అది (మాయ) మిథ్య (అబద్ధము) యనుట యుక్తముగాదు. అది సత్యమైనది. ఎట్లన మంత్రములు, మందులు (ప్రేఖుడు) మొదలగువాట్లలో పలువిధమైన విచిత్రములను జూపువారు మాయావులని చెప్పబడుచున్నారు. ఇట్టి ఇంద్రజాలము మొదలగు విద్యలచేతను గనబడుచున్న విచిత్రములు మిథ్యయైనను, ఆ యింద్రజాలము మొదలగు విద్యలలో కనబడుచున్న విచిత్రములు దేనిచేనైనవో దాని సాధనమైన మంత్రాదులు మిథ్యగావు. ఈ సత్యమైన మాయనే "మాయాంతు ప్రకృతిం విద్యాత్" అను శ్రుతిలో ఈశ్వరమాయయని జెప్పియున్నది. ఇది యెట్లు లోకమును మోహింపజేయుచున్నదనిన, ఈశ్వర స్వరూపమును కప్పి, విషయములలో అభిమానమును గలుగజేయుచున్నది. ఇది యీ మాయయొక్క శక్తి. ఈ శక్తియు, ఆ మాయయు సత్యమైనవే గాని మిథ్యగావు. ఈ మాయను దాటుటయనగా, మాయను పోగొట్టుకొనుటగాదు. మాయచే గలుగు కష్టములను నివర్తించు కొనుటయే,

(రాఘవేంద్రులు) మాయయనునామె విష్ణువుయొక్క ఒక స్త్రీయైన దుర్గ. ఈమె లోక మును మోహింపజేయుశక్తి బడసినది. ఆమెచే గలుగుదుఃఖమును నివర్తించుకొనుట కఠినమని తాత్పర్యము.

(స్వకీయము) "నన్నే శరణమొందినవారు" అనగా ప్రపంచవాసనలేక, బ్రహ్మము తప్ప మఱియొకదానిని చింతించకయున్న బ్రహ్మనిష్ఠులనునది తాత్పర్యము.



న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥ 15

పద॥ న - మాం - దుష్కృతినః - మూఢాః - ప్రపద్యన్తే - నరాధమాః।
మాయయా - అపహృతజ్ఞానాః - ఆసురం (1) - భావం - ఆశ్రితాః॥

| | | | |
|---|---|---|---|
| మాయయా అపహృతజ్ఞానాః | మాయచేత నపహరింపబడిన జ్ఞానముగలవారు (ఆత్మజ్ఞానములేనివారు)గను | నరాధమాః | మనుష్యులలో నికృష్టులుగను |
| | | దుష్కృతినః | పాపులుగనుఁన్న |
| | | మూఢాః | మూఢులు |
| ఆసురంభావం | అసురస్వభావమును | మాం న ప్రపద్యంతే | నన్ను పొందుటలేదు. |
| ఆశ్రితాః | ఆశ్రయించినవారుగను | | |

తా॥ మాయచేత నపహరింపబడిన జ్ఞానముగలవారై, అసురత్వము నాశ్రయించి (పొంది), మనుష్యులలో నికృష్టులై (కడపటివారై), పాపములఁ చేయుచున్న మూఢులు నన్ను శరణమొందుటలేదు (ఉపాసించుటలేదు).

(1) ఆసురం - పరహింసయు అసత్యమునుగల స్వభావమును (శంకరులు). "దంభోదర్పోఽతిమానశ్చ" అను 16-వ అధ్యా 4-వ శ్లోకమునందు చెప్పియున్న స్వభావములు (శ్రీధరులు). దేహేంద్రియ ప్రాణములను రక్షించుటలో దృష్టిగలవారు అసురులు. అట్టి స్వభావము గలవారు అసురస్వభావముగలవారు (రాఘవేంద్రులు).

(రామానుజులు) పాపులు నాలుగు విధములగుదురు. — (1) మూఢులు - ఒకదానిని మరియొకటిగ గ్రహించుచున్న విపరీతజ్ఞానముగలవారు. అనగా ఈశ్వరునికే శేషముగ నుండ వలసిన (జీవ) ఆత్మను, భోగమున కుపయోగమైన లోకమునందలి వస్తువులను తన శేషముగ తలంచువారు. (2) నరాధములు - సామాన్యముగ ఈశ్వరస్వరూపజ్ఞానమున్నను దానియందే యాసక్తి నుంచుటకు యోగ్యతలేనివారు. (3) మాయచే నపహరింపబడిన జ్ఞానముగలవారు. ఈశ్వరుని స్వరూపజ్ఞానము, ఐశ్వర్యము, మహిమ, మొదలగు జ్ఞానము వీటిని కుతర్కములచే అసంభావితమని తలంచువారు. (4) ఆసురస్వభావముగలవారు - ఈశ్వరుని మహిమ ఐశ్వర్యము మొదలగువాటి నెఱిగియు ఆ మహిమ మొదలగువాటిని దూషించి ఈశ్వరునియందు ద్వేషము జేయువారు.

వీరు క్రమముగ ఒకరికన్న మరియొకరు అధికపాపులు.

(స్వకీయము) నిన్ను పొందువారు ఈ మాయను దాటుచున్నారనగా ఏకారణముచే నందఱు నిన్నే పొందుటలేదనునది ఈ శ్లోకముచే చెప్పబడినది.



శ్లో॥ చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥ 16

పద॥ చతుర్విధాః - భజంతే - మాం - జనాః - సుకృతినః - అర్జున ॥
ఆర్తః (1) - జిజ్ఞాసుః (2) - అర్థార్థీ (3) - జ్ఞానీ (4) - చ - భరతర్షభ ॥

| | | | |
|---|---|---|---|
| హే భరతర్షభ అర్జున ! | ఓ భరతకులశ్రేష్ఠుడవైన అర్జునుడా ! | అర్థార్థీ | సంపత్తును గోరువాడును |
| | | జ్ఞానీ చ | జ్ఞానియుఅను |
| ఆర్తః | వ్యాధిమొదలగు కష్టము నొందినవాడును | (ఇతి) | ఈ |
| | | చతుర్విధాః | నాలుగువిధములైన |
| జిజ్ఞాసుః | స్వరూపజ్ఞాన మొంద గోరికగలవాడును | సుకృతినః - జనాః | పుణ్యశాలురైన జనులును |
| | | మాం భజన్తే | నన్ను భజించుచున్నారు. |

తా॥ భరతకుల శ్రేష్ఠుడవైన ఓ అర్జునుడా! వ్యాధి మొదలగు దుఃఖము నొందినవాడును (ఆత్మ) స్వరూపజ్ఞానము నొంద గోరికగలవాడును, సంపత్తును గోరువాడును, బ్రహ్మజ్ఞానియు అను నీ నాలుగువిధములైన పుణ్యశాలురైన జనులును నన్ను భజించుచున్నారు.

(1) ఆర్తః - కష్టముచే కప్పబడినవాడు, దొంగలు, పులి, వ్యాధి, మొదలగువానిచే ఆక్రమింపబడిన వాడు, ఆపత్తునొందినవాడు (శంకరులు). పోగొట్టుకొనిన ఐశ్వర్యమును మరల కోరువాడు (రామానుజులు).

(2) జిజ్ఞాసుః - ఎవడు భగవత్తత్త్వము నెఱుంగ గోరుచున్నాడో అతడు (శంకరులు). దారిద్ర్యము నుండి భాగ్యమును కోరువాడు (రామానుజులు).

(3) అర్థార్థీ - ద్రవ్యముమీద ఆశగలవాడు (శంకరులు) ప్రకృతివిముక్తమైన తన స్వరూపమును పొందగోరినవాడు (రామానుజులు).

(4) జ్ఞానీ = విష్ణువుయొక్క తత్త్వము నెఱింగినవాడు (శంకరులు). ఈ యధ్యాయము 5-వ శ్లోకము మొదలు చెప్పియున్నట్లు భగవంతునికి శేషముగనున్న తన యాత్మస్వరూపము నెఱింగి తనచే పొందదగినవాడు పరమాత్మయని తెలిసికొనువాడు (రామానుజులు).

(స్వకీయము) ఇతడు ఆత్మజ్ఞాని, 6-వ అధ్యాయము 46-వ శ్లోకమున జెప్పిన జ్ఞాని కాడు. ముగ్గురు అధికారులనునది రామానుజుల యభిప్రాయము.

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం; స చ మమ ప్రియః ॥ 17

పద॥ తేషాం - జ్ఞానీ - నిత్యయుక్తః (1) - ఏకభక్తిః (2) - విశిష్యతే।
ప్రియః - హి - జ్ఞానినః - అత్యర్థం - అహం - సః - చ - మమ - ప్రియః ॥

| | | | |
|---|---|---|---|
| తేషాం | వారిలో | అహం | నేను |
| ఏకభక్తిః | ఒకదానియందే భక్తిగలవాడై | జ్ఞానినః | జ్ఞానికి |
| నిత్యయుక్తః | ఎల్లప్పుడును యోగముతోగూడిన | అత్యర్థం ప్రియః | మిక్కిలి ప్రియమైనవాడను |
| జ్ఞానీవిశిష్యతే | జ్ఞాని శ్రేష్ఠుడగుచున్నాడు | సః చ మమ ప్రియః | అతడును నాకు ప్రియమైనవాడు |
| హి | ఎందుకనగా | | |

తా॥ పూర్వము చెప్పిన నలుగురిలో, ఆత్మయగు నాయందే భక్తిగలవాడై ఎల్లప్పుడును యోగముతోగూడియున్న జ్ఞానియైనవాడు శ్రేష్ఠుడగుచున్నాడు. ఏలనగా ఆ జ్ఞానికి నేనుమిక్కిలి ప్రియుడను, అతడును నాకు మిక్కిలి ప్రియుడు.

(1) నిత్యయుక్తః - ఒక కార్యము పూర్తియగు వఱకు మిగతవారు నాయందు భక్తి చేయుదురు. ఇతడు నిత్యముగ ఆశ్రయించుకొని యున్నవాడు (రామానుజులు).

(2) ఏకభక్తిః - పరమాత్మను విడిచి వేరువస్తువు లేకుండుటచే ఒకే భక్తిగలవాడు (శంకరులు). నాయందే భక్తిగలవాడు (రామానుజులు).

(శంకరభాష్యము) పూర్వము చెప్పిన ఆ నలువురిలో జ్ఞానియైనవాడు తత్త్వము నెఱింగియుండుటచే భగవంతుడైన ఆత్మయందే ఎల్లప్పుడును ఒక నిలకడగలవాడుగను ఒక దానియందే, అనగా ఆయాత్మయందే అతిప్రీతి గలవాడుగనుఉన్నాడు. అతడు తన ప్రీతినర్పింప మఱియొకటి కనబడక యుండుటచేతనేయనిభావము. కావున అయొకదానియందే అతిప్రీతిగల అతడేమేలైనవాడగుచున్నాడు, నేనుజ్ఞానియొక్క ఆత్మనగుటచేనతనికి నేనుమిక్కిలి ప్రియమైనవాడను. ఎవ్వనికిని తనయాత్మ ప్రియమైనదనునది లోకమున నెల్లఱకు తెలిసినదిగదా! వాసుదేవుడనైన నేను జ్ఞానియొక్క ఆత్మనగుటచేత జ్ఞానికి మిక్కిలి ప్రియమైనవాడను. ఆ జ్ఞానియు వాసుదేవుడనైన నాయొక్కయాత్మగనే యుండుటచే నాకు మిక్కిలి ప్రియమైనవాడనునది భావము.

(స్వకీయము) విషయములకంటె, అనగా లోకముననున్న వస్తువులకంటె అహం = నేను, ప్రియః = ఇష్టుడను, అని అర్థముండవచ్చును.

---

శ్లో॥ ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥　　18

పద॥ ఉదారాః - సర్వే - ఏవ - ఏతే - జ్ఞానీ - తు - ఆత్మా - ఏవ - మే - మతమ్।
ఆస్థితః - సః - హి - యుక్తాత్మా - మాం - ఏవ - అనుత్తమాం - గతిమ్॥

| | | | |
|---|---|---|---|
| ఏతేసర్వే | వీరందఱు | యుక్తాత్మా | మనస్సు ఒకచోట స్థిరముగగల |
| ఉదారాః ఏవ | శ్లాఘ్యమైనవారలే | సః | అతడు |
| జ్ఞానీ తు | జ్ఞానియనగా | మామేవ | నన్నే |
| ఆత్మైవ (ఇతి) | ఆత్మయేయనునది | అనుత్తమాంగతిం | సర్వోత్తమమైనగతిగ |
| మేమతం | నాయొక్క నిశ్చయము | ఆస్థితః | పొందియున్నాడు. |
| హి | ఎందుకనగా | | |

తా॥ పైజెప్పిన నలువురును శ్లాఘ్యులైనవారలే, అయినను (వారలలో) జ్ఞానిమాత్రము నేనేయనునది నానిశ్చయము. ఏలన అతడు (అజ్ఞాని) నాయెడ మనస్సును స్థిరముగ నుంచినవాడుగను, నన్నే సర్వోత్తమమైనగతిగ నమ్మినవాడుగనుఉన్నాడు.

(శంకరులు) అట్లయిన యెడల కష్టముగలవాడు మొదలగు ముప్పురును వాసుదేవునికి ప్రియమైనవారు కారని భావమా? యనిన నట్లు కానేరదు. వీరందఱుశ్రేష్ఠులే, మిగత ముగ్గురున్ను నాకు ప్రియమైన వారలే. నా యేభక్తుడును వాసుదేవుడనైన నాకు ప్రియుడుగాక యుండడుగదా!

ఐతే జ్ఞాని మిక్కిలి ప్రియుడైయున్నాడు అను ఈ భేదముఁగలదు. అదియేలన, జ్ఞానియనగా ఆత్మయే నాకంటె వేరైనవాడు కాదనునది నానిశ్చయము. ఏలన అజ్ఞాని "నేనేభగవంతుడైన వాసుదేవుడను, వేరుకాను" అనిఇట్లు సమాహిత చిత్తుడై పొందవలసిన పరబ్రహ్మమునే మిక్కిలి శ్రేష్ఠమైన గతిగ పొంద దలబెట్టుచున్నాడు.

(రామానుజులు) నన్నువిడిచి ఆ జ్ఞానికి ప్రాణధారణ లేనందున నాకు ఆ జ్ఞానితప్ప ఇతర ఆత్మధారణలేదు.

(రాఘవేంద్రులు) ఆత్మైవ = నేనే యనుటచే అధిక ప్రియముచే ఒకనిని గురించి మాట్లాడునపుడు "వాడు నేనే" యనిజెప్పబడుటవలె భగవంతుడు జ్ఞానులవద్ద నున్న ప్రీతిచే నేనేయని పలికినదిగ గ్రహించవలెను. లేక, ఆస్థితః = ప్రయత్నముచేసి. మామేవ = నన్నే, ఆత్మా = పొంది యున్నాడు అని అర్థముచేయవచ్చును.



శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥ 19

పద॥ బహూనాం - జన్మనాం - అన్తే - జ్ఞానవాన్ - మాం - ప్రపద్యతే।
వాసుదేవః - సర్వం - ఇతి - సః - మహాత్మా - సుదుర్లభః॥

| | | | |
|---|---|---|---|
| బహూనాం జన్మనాం అన్తే | అనేకజన్మముల యంతమున | వాసుదేవః ఇతి | వాసుదేవ స్వరూపమని |
| | | మాం ప్రపద్యతే | నన్ను పొందుచున్నాడు. |
| జ్ఞానవాన్ | జ్ఞానమొందినవాడు | సః మహాత్మా | అటువంటివాడు మహాత్ముడు |
| సర్వం | సకలమున్ను | సుదుర్లభః | లభించుట మిక్కిలి దుర్లభము |

తా॥ అనేక జన్మములెత్తినపిదప జ్ఞానియైనవాడు సకలమును వాసుదేవ స్వరూపమని నన్నుపొందుచున్నాడు. అటువంటి గొప్పమహాత్ముడు లభించుట మిక్కిలి అరుదు.

(శంకరులు) మరలను జ్ఞానిని పొగడుచున్నాడు. జ్ఞానమునకు కావలసిన మంచివాసన గలుగుటకు స్థానమైన పలుజన్మములనెత్తి కడపట జ్ఞానపరిపక్వమును పొందినవాడు ప్రత్యగాత్మయైన (లోపలనున్న ఆత్మయైన) వాసుదేవుడైన నన్ను పొందుచున్నాడు. ఎట్లు? "సర్వము వాసుదేవుడు" అనియెవడు ఇట్లు అన్నిటిని, ఆత్మగనున్న నన్ను పొందుచున్నాడో, యతడు మహాత్మ, అనగా అన్నిటికి మేలైనవైభవము నొందినవాడు. అతనికి సమానముగాగాని, అధికముగగాని, మరియొకడులేడు. ఇట్టివాడు లభించుట అతిదుర్లభము. "మనుష్యాణాం సహస్రేషు" అని ఈ అధ్యాయము 3-వ శ్లోకమున జెప్పబడియున్నది గదా?

(రామానుజులు) జ్ఞానవాన్ - వాసుదేవునికి, "నేను శేషభూతుడు, నాస్వరూపము యొక్కస్థితి, ప్రవృత్తి, యివివానికి అధీనమైనవి. అతడు సకలకల్యాణ గుణములచే శ్రేష్ఠుడు" అని జ్ఞానమును పొందినవాడై, వాసుదేవస్సర్వమితి = "నేనొందదగిన శ్రేష్ఠమైనవస్తువు వాసుదేవుడే" యనియు, "నన్నుపొందించువాడు నతడే" యనియు, "నామనస్సునందున్న సకలకోరికలును అతడే" యనియు, మాంప్రపద్యతే = నన్నుపాసించుచున్నాడు. ఈయర్థమున కాధారము ఈ యధ్యాయము 4, - 5, - 6, - 7, - 12, - 17, - 18, శ్లోకములు.

(రాఘవేంద్రులు) సకల ప్రపంచస్థితి మొదలగునవి వాసుదేవాధీనములు, లేక, సర్వం = పూర్ణమైనవస్తువు, వాసుదేవః = వాసుదేవుడే.

(స్వకీయము) సకలమునందును తాను నివసించుటచేతను, సకలమును తనయందు నివసింపజేయుటచేతను, సకలమును త్రిప్పుటచేతను 'వాసు' అనిపేరు. మోక్షము నొందగోరునట్టి ముముక్షువులచేత ప్రార్థింపబడువాడును, సర్వస్వతంత్రుడుగ నుండువాడును అగుటచేత దేవుడు అనబడుచున్నాడు. కావున వాసుదేవుడని శంకరులు సహస్రనామ భాష్యమున అర్థము చేసియున్నారు.



శ్లో॥ కామై స్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా॥ 20

పద॥ కామైః - తైః - తైః - హృతజ్ఞానాః (1) - ప్రపద్యన్తే - అన్యదేవతాః (2)।
తం - తం - నియమం - అస్థాయ - ప్రకృత్యా - నియతాః - స్వయా॥

| | | | |
|---|---|---|---|
| తైస్తైః | ఆయా | స్వయాప్రకృత్యా | తమ స్వభావముచే |
| కామైః | కోరికలచేత | నియతాః | ప్రేరేపింపబడినవారై |
| హృతజ్ఞానాః | జ్ఞానమపహరింపబడినవారు | అన్యదేవతాః | ఇతర దేవతలను |
| తంతం నియమం | ఆయా నియమమును | ప్రపద్యన్తే | పొందుచున్నారు, భజించుచున్నారు. |
| అస్థాయ | చేబట్టి | | |

తా॥ దేని దేనియందు కోరికగలదో ఆయా కోరికలచే నపహరింపఁబడిన జ్ఞానము గలవారలు ఆయా నియమమును చేబట్టి తమ స్వభావముచే ప్రేరితులై ఇతర దేవతలను పొందుచున్నారు.

(1) హృతజ్ఞానాః - నా స్వరూపజ్ఞానము లేనివారు (రామానుజులు)

(2) అన్యదేవతాః - తన యాత్మస్వరూపియైన బ్రహ్మమును వదలి ఇతర దేవతలను (శంకరులు). భూతప్రేతపిశాచములు మొదలగు క్షుద్రదేవతలను (శ్రీధరులు). ఇంద్రాదిదేవతలు నా శరీరమని యెఱుగనివారలను (రామానుజులు).

(శంకరులు) సకలమున్ను వాసుదేవుడైన ఆత్మయే యను జ్ఞానము ఏల గలుగుటలేదను దానికి కారణము దీనియందు జెప్పఁబడుచున్నది, పుత్రుడు పశువు స్వర్గము మొదలగువాటిని గురించిన ఆయాకోరికలచే అపహరింపబడిన వివేకశక్తి గలవారు ఇతర దైవములను ఆరాధించుటకు కావలసిన నియమము ఎద్ధియో దానిదానినిగైకొని తమస్వభావముచేతనే అనగా, పూర్వజన్మముల యందు సంపాదించియుంచబడిన సంస్కారవిశేషముచేత అణగద్రొక్కబడినవారలై ఆత్మయైన వాసుదేవునికంటె వేరైన దేవతలను నమస్కరించుచున్నారు.

(స్వకీయము) దేవతలను భజించుటకు నియమముతోగూడిన యజ్ఞాదులను చేయవలెను గదా? ఆ యజ్ఞాదులకు వేదమున విధింపఁబడిన నియమములలో నల్పమైన వ్యత్యాసములేక చేయవలెను. తప్పిన యెడల ఫలము చెడుట మాత్రముగాదు, దానిచే దోషములున్ను గలుగును. ఆ యజ్ఞాదుల ఫలమనగా నల్పమైనది ఈశ్వరుని భజించు విషయమున అట్టి యే నియమము నావశ్యకముగాదు. ఇంద్రియములు మనస్సు వీటిని విషయములయందు ప్రవేశింపనీయక అడగించి

ఈశ్వరునియందు మనస్సునుంచి ధ్యానముచేయుట ప్రయోజనకరముగను సులభమైనదిగను ఉన్నది. ఎట్లు సులభమనగా, యజ్ఞాదులను జేయుట కెంతగా వస్తువులును మనుష్యసహాయమును ద్రవ్యములును కావలయునో, ఎంతగా దేహాయాసమును ఇంద్రియములు మనస్సు మొదలగువాటికి శ్రమను గలుగునో అంతశ్రమ బ్రహ్మధ్యానమునలేదు. మరియు బ్రహ్మధ్యానమును స్వల్పముచేసి విడిచిపెట్టినను, చేసినవఱకు ఫలముండునేగాని దోషముగలుగదు. (యోగభ్రష్టుని విషయమున 6-వ అధ్యాయము 40-వ శ్లోకము మొదలు 44-వ శ్లోకమువఱకు చూడుడు) పూర్ణమైన ధ్యానము చేసిన యెడల నాశములేని ఫలము గిట్టును.



శ్లో॥ యోయో యాంయాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితుమిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం ॥ 21

పద॥ యః - యః - యాం - యాం - తనుం - భక్తః - శ్రద్ధయా - అర్చితుం - ఇచ్ఛతి
తస్య - తస్య - అచలాం - శ్రద్ధాం - తాం - ఏవ - విదధామి - అహం ॥

| | | | |
|---|---|---|---|
| యః యః | యెవ్వడెవ్వడు | తస్య తస్య | వానివానియొక్క |
| యాం యాం తనుం | యే యే దేవతామూర్తిని | తామేవ శ్రద్ధాం | దానియందేయున్న శ్రద్ధను |
| భక్తస్సన్ | భక్తితోగూడినవాడై | అహం అచలాం | నేను స్థిరముగ |
| శ్రద్ధయా అర్చితుం ఇచ్ఛతి | శ్రద్ధతో పూజింపగోరుచున్నాడో | విదధామి | జేయుచున్నాను. |

తా॥ ఎవడెవడు ఏ యే దేవతామూర్తిని భక్తితోగూడినవాడై శ్రద్ధతో పూజింపగోరుచున్నాడో వానివానియొక్క ఆయా దేవతామూర్తియందున్న అదే శ్రద్ధను (నమ్మకమును) చలింపక స్థిరముచేయుచున్నాను.

(రామానుజులు) యః యః భక్తః = ఇంద్రాది దేవతలు నా శరీరమని యెఱుగని యే యే దేవతాభక్తుడు, యాం యాం తనుం = నా శరీరమైన ఇంద్రాది దేవతనని తాత్పర్యము. ఏలన "యస్య ఆత్మాశరీరం", యస్యఆదిత్యశ్శరీరం" మొదలగు శ్రుతివాక్యములచేత సకల దేవతలును ఈశ్వరునియొక్క శరీరమని సిద్ధించుచున్నది. ఏ దేవతను పూజించినను ఈశ్వరదేహమును పూజించినదిగనే యగును. అట్లు పూజించుటను ఈశ్వరుడు తన్ను పూజించినటులనే గ్రహించి దానికిగల ఫలము నిచ్చుచున్నాడు. కావున ఇట్టి ఆరాధనము ఈశ్వరారాధనమే యని తాత్పర్యము.



శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్త స్తస్యా రాధనమీహతే।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్హి తాన్ ॥ 22

పద॥ సః - తయా - శ్రద్ధయా - యుక్తః - తస్యాః - రాధనం - ఈహతే।
లభతే - చ - తతః - కామాన్ - మయా - ఏవ - విహితాన్ - హి - తాన్ ।

| | | | |
|---|---|---|---|
| సః | అతడు (పైజెప్పినభక్తుడు) | మయైవ విహితాన్ | నాచేతనే ఏర్పరచబడిన |
| తయా శ్రద్ధయా యుక్తః | ఆ శ్రద్ధతో గూడినవాడై | తాన్ కామాన్ హి | ఆ కోరినవస్తువులనే |
| తస్యాః రాధనం | ఆ మూర్తియొక్క పూజను | తతః | ఆ దేవతామూర్తులవలన |
| [illegible] | [illegible] | లభతే | పొందుచున్నాడు. |

తా॥ ఆ పూర్వము చెప్పినభక్తుడు స్థిరమైన ఆ నమ్మకముతో గూడినవాడై ఆ దేవతామూర్తియొక్క పూజను జేయుచున్నాడు. వాస్తవమున నాచేతనే ఏర్పరచబడిన ఆకోరినవస్తువులను ఆ దేవతామూర్తులనుండి గ్రహించుచున్నాడు.

(శంకరులు) ఎవ్వడెవ్వడు ఏనమ్మకముతో ఇట్లుముందుగనే స్వభావముగ తలపెట్టి, ఏ ఏ దేవతాకారమును ఆరాధింప గోరుచున్నాడో అతడు నాచే నియమింపబడిన ఆ విశ్వాసముతో గూడినవాడై ఆ దేవతా మూర్తియొక్క ఉపాసననుజేసి కడతేరుచున్నాడు. నేను కర్మయు, దాని ఫలమునైన వాటివ్యాపకత్వము నెఱింగియుండుటచే సర్వజ్ఞుడను పరమేశ్వరుడను ఐన నాచేతనే నియమింపబడిన ఆకర్మలను, అతడు కోరినవస్తువులచే ఆరాధింపబడిన ఆదేవతామూర్తివలన పొందుచున్నాడు. ఆకర్మలు భగవంతునిచేతనే నియమింపబడిన వగుటచే వాటినతడు అవశ్యము పొందుచున్నాడు అని భావము. (ఒకడు ఏవస్తువునుగోరి దేవతాంతరము నుపాసించుచున్నాడో ఆవస్తువు అతనియొక్క యుపాసనకు ఫలము. ఇకదీనికి ఇదిఫలమని ఏర్పరచువాడును ఆఫలము నిచ్చువాడును సకలమునెఱిగిన సర్వేశ్వరుడైన భగవంతుడగుటచే ఆ దేవతాంతరములోను అంతర్యామిగనున్న ఆ భగవంతుడు, అతడు కోరినవస్తువులను అతనియుపాసనకు తగినటుల తానేయమర్చి, ఐతే తానే నేరుగనుండక, ఆదేవతమూలముగనే ప్రసాదించుచున్నాడు అనునది నిష్కృష్టార్థము)

"హితాన్" అని పదవిభాగముచేసినయెడల 'సుఖకరమైన కర్మలను' అని భావము లభించును. అప్పుడు కర్మలు మంచివని ఉపచారవాదముగ గ్రహించవలసివచ్చును. కర్మలు దుఃఖకరములేగాని యెవనికి క్షేమకరములుగావుగదా! కావున దానిని ఉపచారవాదముగను గ్రహింపగూడదని భావింపుడు.

---

శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥ 23

పద॥ అన్తవత్ - తు - ఫలమ్ - తేషాం - తత్ - భవతి - అల్పమేధసామ్।
దేవాన్ - దేవయజః - యాన్తి - మద్భక్తాః - యాన్తి - మాం - అపి॥

| | | | |
|---|---|---|---|
| అల్పమేధసాం | అల్పబుద్ధిగల | దేవయజః | దేవతలను పూజించువారు |
| తేషాం | వారియొక్క | దేవాన్ యాన్తి | దేవతలను పొందుచున్నారు |
| తత్ ఫలం | ఆ దేవతాపూజలచే గలుగు ఫలము | మద్భక్తాః | నా భక్తులు |
| | | మాం అపి యాన్తి | నన్ను పొందుచున్నారు. |
| అన్తవత్తుభవతి | ముగింపుగలదగును | | |

తా॥ అల్పబుద్ధిగలవారల యాదేవతాపూజచే లభించు ఫలము ముగింపు గలదిగనే యగుచున్నది. దేవతలను (యజ్ఞాదిక్రతువులచే) పూజించువారు దేవతలను పొందుచున్నారు. నాభక్తులనగా (వారునేరుగ నన్నే పూజించుటచేత) నన్నే పొందుచున్నారు.

(శంకరులు) వారలు ముగింపుగల ఫలమునొందుటకైన మార్గముతో ప్రయత్నించువారుగను వివేకము లేనివారుగను కాములుగనుఉన్నారు. కావున భగవంతుని ఆరాధించుటయందును

దేవతాంతరమును ఆరాధించుటయందును నాయాసము తుల్యముగనున్నను, నశించుఫలముకొఱకు వారలు దేవతాంతరములను బొందుచున్నారేగాని నాశములేని ఫలముకొఱకై నన్నే పొందుటలేదు. ఆహా! మిక్కిలి శోచనీయులుగనున్నారుగదా? అని భగవంతుడు దయనుచూపుచున్నాడు. (సకల మున్ను నశించు ప్రళయకాలమున దేవతలు, వారల లోకములు, నశించిపోవుటచే వారలనుపాసించు వారికి ఆ లోకములలోని సుఖవాసము అప్పుడు ముగిసిపోవుచున్నది. కావున మరల వారలు తమ కర్మానుసారముగ మనుష్యలోకమున జన్మించుచున్నారు. (అధ్యాయము 9 లో 21-24-25-వ శ్లోకములనుజూడుడు) (ఐతే భగవద్భక్తులు "నన్నును పొందుచున్నారు" అను అపిశబ్దముచేత మొసలిచేమ్రింగబడిన గజేంద్రుడు మొదలగువారివలె, మొదట తాముకోరిన వాటిని గ్రహించి, పిదప జననములేని శాశ్వతఫలమైన ముక్తిని క్రమక్రమముగ గ్రహించుచున్నారని కనుగొనుడు.)

(రాఘవేంద్రులు) మామపి = నన్నుగూడ, యాన్తి = పొందుచున్నారు. అనగా ఆయా దేవతలను క్రమక్రమముగనొంది కడపట నన్నుగూడ పొందుచున్నారనునది తాత్పర్యము. ఇంద్రాది దేవతలు పరమాత్మకు శరీరమను జ్ఞానములేనివారై ఆ దేవతలను పూజించువారు అల్పబుద్ధిగలవారు. అల్పమైన ఫలమున బుద్ధిగలవారు.

(స్వకీయము) ఏయే దేవతలను పూజించుచున్నారో ఆయా దేవతలలోకమును, ఆయా లోకము నందలి సుఖమెట్టిదో ఆ సుఖమునుపొందుచున్నారు. ఆ లోకమున్ను, సుఖమున్ను ముగింపు గలవి. దేవతలకే ముగింపున్నందున వారల నొందినవారికిని ముగింపుగలదనునది శ్రీధరుని తాత్పర్యము. నన్నొందినయెడల శాశ్వతమైన ఫలముగలదని భావము.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః ।
పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్ ॥ 24

పద॥ అవ్యక్తం - వ్యక్తిం - ఆపన్నం - మన్యన్తే - మాం - అబుద్ధయః ।
పరం - భావం - అజానన్తః - మమ - అవ్యయం - అనుత్తమమ్ ॥

| | | | |
|---|---|---|---|
| మమ | నాయొక్క | అవ్యక్తం మాం | కనబడని నన్ను |
| అవ్యయం అనుత్తమమ్ | నాశములేని సర్వోత్తమమైన | వ్యక్తిం ఆపన్నం | ఇంద్రియములకు గోచరతను పొందినవారికి |
| పరంభావం | మేలైనస్వభావమును | | |
| అజానన్తః అబుద్ధయః | ఎఱుగని యవివేకులు | మన్యన్తే | తలంచుచున్నారు. |

తా॥ నాయొక్క నాశములేని సర్వోత్తమమైన పరమాత్మస్వరూప మెఱుంగని యవివేకులు ఇంద్రియములచే కనిపెట్టబడని నన్ను ఇంద్రియములకు గోచరతను (కనబడుటను) పొందిన ఒక మనుష్య జీవునిగా తలంచుచున్నారు.

(శంకరులు) ఏకారణముచే వారలు నన్నే పొందుటలేదనునది దీనియందు జెప్పబడు చున్నది. నేను ఎల్లప్పుడు ప్రసిద్ధుడైన ఈశ్వరునిగనున్నను వివేకములేనివారు నానిర్వికారమైన సర్వోత్తమ పరమాత్మస్వరూపము నెఱుంగనివారలై ఈదేహము నెత్తుటకుపూర్వము ఇంద్రియములకు విషయముగాకయున్న నన్ను, ఇప్పుడు వసుదేవుని గృహమున నతడు పుత్రుడై దేహముతో నుండు

నపుడు ఇంద్రియములకు) కనబడుటను పొందిన వానిగ (కృష్ణుడని పేరుగల ఒకమనుష్య జీవునిగ) గ్రహించుచున్నారు.

(శ్రీధరులు) అవ్యక్తం = ప్రపంచాతీతుడుగను, మాం = జగద్రక్షణార్థము లీలచే ప్రకాశించుచున్న యనేకవిధరూపములు గలవాడుగను, శుద్ధసత్త్వస్వరూపుడుగను ఉన్ననన్ను, వ్యక్తిమాపన్నం = కర్మచేగలిగిన పాంచభౌతిక దేహముగలవానిగను, దేవతలతో సమానునిగను, మన్యన్తే = తలంచుచున్నారు.

(రామానుజులు) నా యనంతకల్యాణగుణములను, స్వరూపమును, నేనులోకసంరక్షణార్థమై అవతారముచేసి యున్నానను దానిని ఎరుంగనివారు, లోకముననున్న రాజకుమారులలో నొకనిగ నన్ను భావించుచున్నారు.

(మధ్వులు) సచ్చిదానంద దేహముగలవాడనైననన్ను అవివేకులు గుణత్రయములచే గలిగిన దేహముగలవానిగ తలంచుచున్నారు.

(రాఘవేంద్రులు) అవ్యక్తం = ఎవరికి తెలియని మహామహిమతోగూడిన, మాం=నన్ను, వ్యక్తిమాపన్నం = ఇప్పుడు నేను ప్రకాశింపజేయుచున్న స్వల్పమైన మహిమనుమాత్రమే బడసినవాడని, మన్యన్తే = తలంచుచున్నారు.

శ్లో॥ నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకోమామజమవ్యయం ॥ 25

పద॥ న - అహం - ప్రకాశః - సర్వస్య - యోగమాయాసమావృతః (1) ।
మూఢః - అయం - న - అభిజానాతి - లోకః - మాం - అజం - అవ్యయం ॥

| | | | |
|---|---|---|---|
| యోగమాయా సమావృతః | యోగమాయచే బాగుగ కప్పబడియున్న | అయం లోకః | ఈ లోకము |
| అహం | నేను | మాం | నన్ను |
| సర్వస్య ప్రకాశః న | అందరికి కనపడువాడనుకాను | అజం అవ్యయం | జన్మములేనివానిగను, నాశరహితునిగను |
| (అతఏవ) | అందువలననే | నాభిజానాతి | ఎఱుగుటలేదు. |
| మూఢః | వివేకములేని | | |

తా॥ యోగమాయచే కప్పబడియున్న నేను అందఱికిని కనబడుటలేదు. కావున అవివేకులైన ఈ జనులు నన్ను జననములేని వానిగను, నాశములేని వానిగను నెఱుంగుటలేదు.

(1) యోగమాయా సమావృతః = గుణములచేరిక మాయ, లేక "భగవచ్చిత్తాసమాధానం" అనునది యోగము. దానిచే కలిగినదిమాయ (శంకరులు). జీవుడొందదగిన మనుష్య దేహమునొందుట యోగము. అదియేమాయ. ప్రకృతము నే నాదేహము నొంది యుండుటచే, యోగమాయచే దాగియున్నానని తాత్పర్యము (రామానుజులు). యోగ సామర్థ్యము ఒకయుపాయము. దానిచేతను మాయచేతను, సమావృతః = చుట్టబడి యున్నాను. (రాఘవేంద్రులు). మనుష్యులచే కలిగింప వీలులేనట్టిదియు ఈ విధముగ కలుగజేయవచ్చునని మనుష్యుడు మనస్సుచే తలంచ వీలుగాని విచిత్రమైన సృష్ట్యాది శక్తి (శ్రీధరులు)

(శంకరభాష్యము) పూర్వము చెప్పినవారల యజ్ఞానము ఏ కారణముచేనైనదనునది దీనియందు జెప్పఁబడుచున్నది. నేను సకలజనులకు స్పష్టముగ గనపడుటలేదు. అనగా భక్తులైన కొందరికి మాత్రము నేను ప్రకాశముగనున్నానని భావము. యోగమన్నగా త్రిగుణములచేరిక. అదియే మాయయనునది. యోగమైన మాయ, యోగమాయయనబడును. ఆయోగమాయచే నేను బాగుగ మూయబడియున్నాను. అనగా అంతటకప్పబడియున్నానని గ్రహింపుడు. కావుననే మోహ మొందిన ఈ లోకము నన్ను జననములేనివానిగను, నాశములేనివానిగను నెరుంగుటలేదు.

---

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26

పద॥ వేద - అహం - సమతీతాని - వర్తమానాని - చ - అర్జున ।
భవిష్యాణి - చ - భూతాని - మాం - తు - వేద (1) - న - కశ్చన ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున ! | ఓ అర్జునుడా ! | భవిష్యాణి చ | రాబోవునట్టియు (కలుగబోవు) |
| సమతీతాని చ | గడచిపోయినట్టియు | భూతాని అహంవేద | ప్రపంచములను నేనెరుగుదును |
| వర్తమానాని చ | ఉన్నట్టియు (ఇప్పుడు కన బడుచున్న) | మాంతు కశ్చననవేద | నన్ననగా నెవ్వడు నెఱుంగడు |

తా॥ ఓ అర్జునుడా! గడచిపోయిన, ఉన్న, రాబోవు ప్రపంచములను నేనెరుగుదును. నన్ననగా నొకండు నెఱుగడు.

(1) వేద - లోకోపకారార్థమై కృష్ణావతారము చేసియున్నటుల నెఱుంగుట (రామానుజులు). తన స్వశక్తిచే నెరుంగుట (మధ్వులు)

(శంకరులు) లోకము ఏ యోగమాయచే చుట్టబడి నన్నెరుంగుట లేదో ఆ యోగమాయ నాదగుటచే ఆమాయగల ఈశ్వరుడనైన నా జ్ఞానమును అడ్డగించ వీలులేదు. ఉదాహరణముగ (లోకములోనింద్రజాల) మాయగల వేరొకనికిగూడ వాని యాయింద్రజాలమాయ వానిజ్ఞానము నడ్డగించి మోహింపజేయదు, ఆ విధముగ భావింపుడు. ఇట్లుండుటచే నన్నే శరణముగైకొనిన నా భక్తుడొకడుతప్ప మరెవ్వడును నన్నెరుంగజాలడు. నా యొక్క తత్త్వము నెరుంగుటలేదు. కావుననే నన్ను పూజించుటలేదు.

---

శ్లో॥ ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప ॥ 27

పద॥ ఇచ్ఛాద్వేషసముత్థేన - ద్వన్ద్వమోహేన - భారత ।
సర్వభూతాని - సమ్మోహం - సర్గే - యాన్తి - పరంతప ॥

| | | | |
|---|---|---|---|
| హే పరంతప భారత ! | ఓ శత్రువులను తపింపజేయు చున్న భారతుడా ! | ఇచ్ఛాద్వేషసముత్థేన | కోరిక ద్వేషములతో గలుగు నట్టి |
| సర్గే | పుట్టినప్పుడే | ద్వన్ద్వమోహేన | ద్వన్ద్వమోహముచే |
| సర్వభూతాని | సకలప్రాణులున్ను | సమ్మోహం యాన్తి | మోహమొందుచున్నవి. |

తా॥ ఓ శత్రువులను తపింపజేయు భారతా! జనించినప్పుడే సకలప్రాణులును కోరిక ద్వేషములనెడు ద్వన్ద్వములచే గలుగు మైకముచేత మోహమొందుచున్నవి.

(శంకరభాష్యము) మఱియు, జన్మించు సకల భూతములును భగవంతుని తత్త్వము నెఱుంగుటకు అడ్డముగానున్న దేనిచే నడ్డగింపబడి వానినెఱుంగుటలేదు? అని ఆలోచించగా, దానికై భగవంతుడు దీనిని జెప్పుచున్నాడు. ఇచ్ఛాద్వేషములతో గలుగుచున్న దేనిచే? అని నిర్దిష్ట వస్తువులను చూడగా "ద్వన్ద్వమోహముచే" యనుదానిని జెప్పుచున్నాడు. ద్వన్ద్వములచే కలుగు మైకము ద్వన్ద్వమైకము. చలివేడివలె ఒకటి కొకటి వేరుబడినవై సుఖదుఃఖములను వాటికారణములైన చలివేడి మొదలగువాటి ననుసరించి వచ్చుచున్నవై కాలానుగుణముగ ఒక్కొక్క ప్రాణితోను చేరుచున్న, అనగా తమకులభించు సమయములలో ప్రాణులన్నిటికి మాటిమాటికి మొలకెత్తుచున్న, ఇచ్ఛాద్వేషములు అనునవే 'ద్వన్ద్వములు' అను పదముచే చెప్పబడుచున్నవి. ప్రతియొక ప్రాణియందును ఇచ్ఛాద్వేషములు, సుఖదుఃఖములును వాటికారణములున్ను వచ్చి చేరుటచే తమ స్వరూపమును బడసి ప్రకటమై నిలబడగా ఆయిచ్ఛాద్వేషములు రెండును సకలప్రాణుల జ్ఞానమును తమకు వశపరచుకొని ఆమార్గమున పరమార్థమైన ఆత్మనుగురించిన జ్ఞానముగలుగుటకు అడ్డమైన మోహమును గలుగజేయుచున్నవి. ఇచ్ఛాద్వేషములచే వశపరచబడిన చిత్తముగలవానికి బయట గూడ ఒకవస్తువును గురించిన జ్ఞానము యథావత్తుగ కలుగుట లేదుగదా? అవిప్రవేశించియున్న బుద్ధి గలవాడై మైకముగలవానికి అహంకారము మొదలగు ననేకఅడ్డములుగల అంతర్యామియైన (లోపలనున్న) ఆత్మయందు జ్ఞానముగలుగదని చెప్పవలయునా? కావున భరతకులమున బుట్టిన ఓ పరంతపుడా! పుట్టినప్పుడే సకలప్రాణులున్ను మోహింపబడి ఆమోహస్థితినొందియున్నవి. జనించుచున్న ప్రతిప్రాణియు మోహమునకు వశముగనుండియే పుట్టుచున్నదనిభావము. ఇట్లుండుటచే ఆ ద్వన్ద్వమైకముచే జ్ఞానమడ్డుపడి మోహించి సకల భూతములున్ను ఆత్మయైన నన్నెఱుంగుటలేదు. కావుననే నన్ను ఆత్మగపూజించుటలేదు.

(స్వకీయము) విషయాభిమానమనునది లోకమునందలి రూప, రస, గంధాది స్వరూపములైన వస్తువులయందు కలుగు పట్టుదల. అట్టి పట్టుదలకు కారణము సుఖదుఃఖములు. సుఖదుఃఖములకు కారణములు ఇచ్ఛాద్వేషములు. ఇవిదేహము నొందునప్పుడే పూర్వజన్మకర్మ వాసనకు తగినట్లు కలుగుచున్నవి. ఆత్మకు సుఖదుఃఖాదులు వాస్తవమున సంబంధపడినవి కావు.

శ్లో॥ యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణాం।
తే ద్వన్ద్వమోహనిర్ముక్తాః భజన్తే మాం దృఢవ్రతాః * ॥ 28

యేషాం - తు - అన్తగతం - పాపం - జనానాం - పుణ్యకర్మణాం।
తే - ద్వన్ద్వమోహనిర్ముక్తాః - భజన్తే - మాం - దృఢవ్రతాః॥

| | | | |
|---|---|---|---|
| తు | ఐతే | ద్వన్ద్వమోహ నిర్ముక్తాః | ద్వన్ద్వమోహముచే విడువబడినవారై |
| పుణ్యకర్మణాం | పుణ్యకర్మగల | దృఢవ్రతాః | దృఢమైన వ్రతముగలవారలై |
| యేషాం జనానాం | యే జనులకు | మాం భజనే | నన్ను భజించుచున్నారు. |
| పాపం అన్తగతం | పాపము అంతమొందినదో | | |
| తే | వారలు | | |

తా॥ ఐతే సత్కర్మగల పుణ్యశాలులైన యే జనులకు పాపము ముగింపు నొందినదో, నశించినదో ఆ జనులు ద్వన్ద్వమోహమునుండి విడువబడినవారలై దృఢమైన వ్రతముగలవారలై నన్ను భజించుచున్నారు (నమస్కరించు చున్నారు.)

"* పుణ్యకర్మణా" అనిపాఠము. 'పుణ్యకర్మలచేత' అని అర్థము.

(శంకరభాష్యము) ఐతే యెవరు ఈద్వన్ద్వమోహమునుండి విడువబడినవారలై మిమ్ముల నెఱిగి ఆత్మగ శాస్త్రానుసారముగ భజించుచున్నారు? అను ప్రశ్నకు ఎదురుచూడదగిన ఉత్తర మును బోధించుటకు భగవంతుడు దీనిని జెప్పుచున్నాడు.

చిత్తశుద్ధికి కారణమైన పుణ్యకర్మ యే జనులకుగలదో వారల పాపము, చాలవరకు అరిగి నశించినది. వారలు పూర్వముచెప్పిన ద్వన్ద్వమోహముచే విడువబడినవారై దృఢమైన వ్రతముగల వారలై నన్ను పరమాత్మగ భజించుచున్నారు. సకలమున్ను పూర్ణముగ పరిత్యాగముచేయుటయను వ్రతముతో "పరమార్థతత్త్వమిటులనే యున్నది. వేరువిధముగలేదు" అను అనుభవజ్ఞానమును ఇట్లు నిశ్చయించుకొనినవారు దృఢవ్రతులు.



శ్లో॥ జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మచాఖిలమ్॥ 29

పద॥ జరామరణమోక్షాయ (1) - మాం - ఆశ్రిత్య - యతన్తి - యే।
తే - బ్రహ్మ - తత్ - విదుః - కృత్స్నం - అధ్యాత్మం - కర్మ - చ - అఖిలమ్॥

| | | | |
|---|---|---|---|
| యే | ఎవరు | తే | వారలు |
| జరామరణమోక్షాయ | వృద్ధాప్య మరణమలను పోగొట్టుటకై | తత్ బ్రహ్మ | ఆ బ్రహ్మమును |
| మాం ఆశ్రిత్య | నన్నాశ్రయించి | కృత్స్నం అధ్యాత్మం | సకలమైన అధ్యాత్మమును |
| యతన్తి | ప్రయత్నించుచున్నారో | అఖిలం కర్మ చ | సకల కర్మమును |
| | | విదుః | ఎఱుగుచున్నారు. |

తా॥ ఎవ్వరు వార్ధక్యము (ముసలితనము) మరణము వీటిని నివర్తించు టకై నన్ను శరణముగగైకొని ప్రయత్నించుచున్నారో వారలు ఆ బ్రహ్మమును, సకల అధ్యాత్మమును, అనగా ఆత్మనుగుఱించిన సకల తత్త్వమును సకల కర్మల నెఱుంగుచున్నారు.

(1) జరామరణ మోక్షాయ - ప్రకృతివిముక్తమైన ఆత్మస్వరూపదర్శనము కొఱకు (ఇతడేజిజ్ఞాసువు) (రామానుజులు). భక్తులలో ఉత్తముడు, మధ్యముడు, అధముడని మూడువిధములైన భక్తులుగలరు. వార్లలో ఉత్తమభక్తు డెవ్వడనగా శ్రీనారాయణుని చరణారవిందభక్తిని తప్ప మోక్షముమొదలగు నొకదానియందును అపేక్షయే లేనివాడు. మధ్యమభక్తు డెవ డన మోక్షాపేక్షగలవాడు. అధమభక్తుడనగా స్వర్గాది ఫలమునపేక్షించువాడు ఈమువ్వ రిలో ఇతనిని మధ్యమభక్తునిగ జెప్పవచ్చును. (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) వారలు నన్ను ఎందుకొఱకు నమస్కరించుచున్నారను దానిని చెప్పె దము. వృద్ధాప్యమును మరణమును నివర్తించుకొనుటకై యెవరు పరమేశ్వరుడనైన నన్ను శరణముగ

గైకొని చిత్తమును నాయొద్దనేయుంచినవారలై ప్రయత్నముచేయుచున్నారో వారు పరబ్రహ్మమునే ఎరుంగు చున్నారు, లోపలనున్న యాత్మను గుఱించిన యాసకల తత్త్వము నెరుంగు చున్నారు కర్మనంతను నెఱుంగుచున్నారు.



శ్లో॥ సాధిభూతాధి దైవం మాం సాధియజ్ఞం చ యే విదుః।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః॥ 30

పద॥ సాధిభూతాధిదైవం - మాం - సాధియజ్ఞం - చ - యే విదుః।
ప్రయాణకాలే - అపి - చ - మాం - తే - విదుః - యుక్తచేతసః॥

| | | | |
|---|---|---|---|
| యే | ఎవరు | విదుః | ఎఱుగుచున్నారో |
| మాం | నన్ను | తే | వారలు |
| సాధిభూతాధిదైవం | ఆదిభూత అధిదైవముతో గూడినవానిగను | ప్రయాణకాలేఽపి చ | మరణకాలమునందును |
| | | యుక్తచేతసః | ఒక నిలకడగల మనస్సుగల వారలై |
| సాధియజ్ఞం చ | అధియజ్ఞముతో గూడిన వానిగను | మాం - విదుః | నన్నెరుంగుచున్నారు. |

తా॥ ఎవ్వరు అధిభూత, అదిదైవములతోగూడినట్టియు, అధియజ్ఞముతో గూడినవాడనైన నన్ను తెలిసికొనుచున్నారో వారలు మరణకాలము నందును సమాహిత చిత్తముగలవారై, అనగా నాయెడ మనస్సునుంచిన వారలై నన్నెఱుంగు చున్నారు.

(రామానుజులు) "జరామరణమోక్షాయ = ప్రకృతివిముక్తమైన ఆత్మదర్శనముకొఱకై" ప్రయత్నించువారలని మునుపటి శ్లోకమున చెప్పబడియున్నవారు, కర్మము, అధ్యాత్మము, బ్రహ్మము, వీటినెరుంగ ప్రయత్నించుచున్నారు. కొందఱు ఐశ్వర్యమొందుటకై సాధిభూతం = సాధిభూతుడును సాధిదైవుడునగు నన్నెరుంగ ప్రయత్నించుచున్నారు. ఈ రెండువిధములైన వారలున్ను జ్ఞానియు సాధియజ్ఞమైన నారాయణుని ఉపాసించు వారలుగనున్నారు ఈ మూడు విధములైన వారలున్ను మరణకాలమున ఎవ్విధమైన నా స్వరూపమొందగోరుచున్నారో ఆ విధముగ వారలుకోరు ఆ రూపమును వారు వారు కోరినటుల నెరుంగుచున్నారు (చూచుచున్నారు).

(స్వకీయము) పూర్వ శ్లోకమునందును ఈ శ్లోకమునందును చెప్పబడియున్న కర్మము, అధ్యాత్మము, బ్రహ్మము, అధిభూతము, అధిదైవతము, అధియజ్ఞము, ప్రయాణకాలము, ఇవియెట్టివనునది భగవంతునిచే యెనిమిదవ అధ్యాయమున వివరింపఁబడియుండుటను చూడుడు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విజ్ఞానయోగో నామ
సప్తమోఽధ్యాయః

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న
శ్రీ కృష్ణార్జున సంవాదమున విజ్ఞానయోగమను
ఏడవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు.

అష్టమాధ్యాయ ప్రారంభః.

# ఎనిమిదవ అధ్యాయము

## (అక్షరపరబ్రహ్మయోగము)



అర్జున ఉవాచ:—

శ్లో॥ కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ।
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే॥

పద॥ కిం - తత్ - బ్రహ్మ - కిం - అధ్యాత్మం - కిం - కర్మ - పురుషోత్తమ।
అధిభూతం - చ - కిం - ప్రోక్తం - అధిదైవం - కిం - ఉచ్యతే॥

| | | | |
|---|---|---|---|
| అర్జున ఉవాచ | అర్జునుడు చెప్పినది | కర్మకిం | కర్మయనునదెట్టిది |
| హే పురుషోత్తమ! | ఓ పురుషులలో ఉత్తముడా! | అధిభూతం కిం | అధిభూతమనునదెట్టిది |
| ప్రోక్తం | (మునుపు) చెప్పబడిన | అధిదైవం చ | అధిదైవమని |
| తత్ - బ్రహ్మ - కిం | ఆ బ్రహ్మము ఎట్టిది | కిం ఉచ్యతే | ఏది చెప్పబడుచున్నది. |
| అధ్యాత్మం కిం | అధ్యాత్మమనునదెట్టిది | | |

తా॥ అర్జునుడు చెప్పినది:— ఓపురుషోత్తమా! మునుపు జెప్పిన ఆబ్రహ్మమెట్టిది? అధ్యాత్మమనునదెట్టిది? కర్మమనగానేమి? అధిభూతమనగానేమి? అధిదైవమని ఏది చెప్పబడుచున్నది?

(శంకరులు) భగవంతుడు అర్జునుడు ప్రశ్నించుటకు కారణములైన విషయములను మునుపు 7-వ అధ్యాయము కడపట "తేబ్రహ్మతద్విదుఃకృత్స్నం అధ్యాత్మం" అని ఉపదేశించెను. కావున వాటిని అర్జునుడడుగుటకై దీనిని జెప్పుచున్నారు.

(రామానుజులు) ప్రకృతి విముక్తాత్మ దర్శనమునకై ప్రయత్నించువార లెరుంగవలసిన బ్రహ్మము అధ్యాత్మము' కర్మ ఇవియెట్టివి? ఐశ్వర్యాదులను గోరువారలెరుంగ ప్రయత్నించునట్టి అధిభూతము, అధిదైవము అనగానెట్టివి? మూడువిధములైన వారలున్ను ఎరుంగవలసిన అధియజ్ఞ శబ్దమునకు విషయమైనవారెవ్వరు? వారిస్వభావమెట్టిది? ఈముగ్గురిచేతను మరణకాలమున నీవెట్లు ఎరుంగ బడవలసినవాడవు?



శ్లో॥ అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః॥ 2

పద॥ అధియజ్ఞః - కథం - కః - అత్ర - దేహే - అస్మిన్ - మధుసూదన।
ప్రయాణకాలే - చ - కథం - జ్ఞేయః - అసి - నియతాత్మభిః॥

| | | | |
|---|---|---|---|
| హే మధుసూదన! | ఓ మధుసూదనా! | ప్రయాణ కాలే చ | మరణకాలమునందును |
| అధియజ్ఞః | అధియజ్ఞమనగా | నియతాత్మభిః | మనస్సును అణచినవారిచే |
| అత్రదేహే కః | ఈ శరీరములో నెట్టిది? | కథం | ఏ విధముగ |
| అస్మిన్ | దీనిలో (ఈ దేహములో) | జ్ఞేయః అసి | ఎరుంగదగినవాడవుగనున్నావు |
| కథం | ఏ విధముగ (చింతింపదగినవాడు) | | |

తా॥ ఓ మధుసూదనా! అధియజ్ఞమనగా ఈ శరీరములో నెట్టిది? దీనిలో, అనగా ఈ దేహములో అధియజ్ఞుడు ఏ విధముగ చింతింపదగినవాడు? మఱియు మనస్థైర్యము గలవారిచే మరణసమయమునందును నీవెట్లు ఎరుంగదగినవాడ వగుచున్నావు?

(రాఘవేంద్రులు) అధియజ్ఞః = అధియజ్ఞుడు, కః = ఎవ్వడు, అధియజ్ఞః = అధియజ్ఞుడు, కథం = ఎట్టివాడు? ఈ రెండు చేర్చి యెనిమిది విధములైన ప్రశ్నలగుచున్నవి. మొదటి శ్లోకము స్వరూపమునుగూర్చిన ప్రశ్న. రెండవ శ్లోకము ధర్మమును గూర్చిన ప్రశ్న.



శ్రీ భగవానువాచ:—

శ్లో॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః॥

పద॥ అక్షరం - బ్రహ్మ (1) - పరమం - స్వభావః - అధ్యాత్మం (2) - ఉచ్యతే।
భూతభావోద్భవకరః - విసర్గః (3) - కర్మసంజ్ఞితః॥

| | | | |
|---|---|---|---|
| శ్రీ భగవానువాచ | శ్రీకృష్ణపరమాత్మ చెప్పినది | | |
| అక్షరం | నాశములేనిదిగను | భూతభావోద్భవ కరః విసర్గః | భూతములనేవస్తువులకు ఉత్పత్తిని జేయునట్టి యాగము మొదలగు త్యాగము |
| పరమం | మేలైనదిగ నున్నట్టిది | | |
| బ్రహ్మ | బ్రహ్మము | | |
| స్వభావః అధ్యాత్మం ఉచ్యతే | స్వభావము (బ్రహ్మము జీవస్వరూపముగనుండుట) అధ్యాత్మమని జెప్పబడుచున్నది. | కర్మ సంజ్ఞితః | కర్మ అనే పేరుగలది |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ చెప్పినది:— నాశములేనిదిగను మేలైనదిగను ఉన్నట్టిది బ్రహ్మము. అట్టి బ్రహ్మము ప్రతి శరీరమునందును లోపలనున్న ఆత్మగనుండుటను, అనగా జీవస్వరూపముగ నుండుటను అధ్యాత్మమను చున్నారు. భూతములగు స్థావరజంగమ వస్తువులకు ఉత్పత్తిని గలుగజేయునట్టి దేవతల నుద్దేశించి చేయబడు యాగము హోమము మొదలగు పరిత్యాగము, కర్మమనే పేరుగలది.

(1) "బ్రహ్మము" అనగా నాశములేనిది. అక్షరము - అది పరమాత్మ. "ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి - ఓ గార్గి" ఈ నాశములేనివస్తువుయొక్క ఆజ్ఞచేతగదా (సూర్యుడున్ను చంద్రుడున్ను భూమియు ఆకాశము స్థిరముగ నిలబడు చున్నవి) అను (బృహదారణ్య

కము 5-వ అధ్యాయము 8-వ బ్రాహ్మణము 9-వ) శ్రుతిచే ఎరుంగుడు. "ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ" అని ముందు రాబోవు 13-వ శ్లోకమున చెప్పబడియున్నను ఇచ్చట అక్షరమను పదమునకు ఓంకారమని యర్థము గ్రహింపగూడదు. ఏలనగా బ్రహ్మ మను పేరుచే ఓంకారమును విశేషించి చెప్పుటచే ననుడు. మఱియు, పరమం = మేలైనది అను విశేషణము ఓంకారము మొదలగు వాటికంటె పైబడిన నాశములేని బ్రహ్మముయొక్క విషయములోనే బాగుగ తగియున్నది.

2) అధ్యాత్మం - ఆ బ్రహ్మము ప్రతి దేహమునందును లోపలనున్న ప్రత్యగాత్మగ నుండుటను అధ్యాత్మ మనుచున్నారు. శరీరమును ఆశ్రయించి లోపలనున్న ఆత్మయగుటకు తల బెట్టి కడపట వాస్తవమైన బ్రహ్మముగనే యున్నవస్తువు అధ్యాత్మమను పదముచే చెప్ప బడుచున్నది. అధ్యాత్మమనగా శరీరములోనున్నట్టిది. దేహము నివాసస్థానముగ గలదెట్టిదో అట్టి జీవస్వభావము,

(3) విసర్గః - అనగా దేవతలనుగూర్చి చరువు, పురోడాశము మొదలగు వస్తువుల నిచ్చుట (అదియే) స్థావరజఙ్గమ వస్తువులను, కలుగజేయునది. కావుననే ఇట్టి త్యాగమనే యాగము కర్మ అనే పేరుబడసినది. అనగా కర్మమనే పదముచే చెప్పబడునట్టిది. విత్తనముగనున్న దీనినుండిగదా స్థావరజఙ్గమ వస్తువులు, వర్షము మొదలగు క్రమముచే కలుగుచున్నవి.

(శంకరభాష్యము) పైకనిన ఈ ప్రశ్నలను స్పష్టపరచుటకై, అనగా వాటియుత్తరమును బాగుగ తెలియబరచుటకై శ్రీభగవంతుడు ఈ (3, 4, 5 -) శ్లోకములను ప్రసాదించుచున్నాడు.

(శ్రీధరులు) స్వభావః = దేహము నాశ్రయించి, లేక అనుసరించుకొనియు, "నేను చేయు చున్నాను, నే ననుభవించుచున్నాను" అనునది మొదలగు నభిమానమును గైకొనియు ప్రకాశించు చున్న బ్రహ్మముయొక్క అంశమైన జీవస్వరూపము స్వభావము. అట్టి స్వభావమే అధ్యాత్మము. భూతభావోద్భవకరః - భూతం = వస్తువులకు, భావః = ఉత్పత్తి, ఉద్భవః = వృద్ధి - కర = కలుగజేయునట్టి, విసర్గః = దేవతల నుద్దేశించి మంత్రపూర్వకముగ యజ్ఞములో నివ్వబడు ఆహు తియే కర్మము.

(రామానుజులు) అక్షరం = నాశములేని క్షేత్రజ్ఞ సమష్టిరూపమైన, పరమం = ప్రకృతి విముక్తాత్మ జీవస్వరూపము, బ్రహ్మ = బ్రహ్మమని జెప్పబడుచున్నది. (అనగా ముక్తజీవస్వరూపము)

స్వభావః = ప్రకృతి, అధ్యాత్మం = జీవునికి సాధకముగనున్న సూక్ష్మభూతములు అనగా ఆత్మకానివియు ఆత్మవంటివియునైన భూతసూక్ష్మాదులు. ఇదియే అధ్యాత్మము.

భూతభావోద్భవ కరోవిసర్గః కర్మసంజ్ఞితః - భూతభావః = మనుష్య పశుపక్ష్యాదుల యొక్క, ఉద్భవకరః - ఉత్పత్తిని జేయునట్టి, విసర్గః = పురుషసంబంధముచే గలుగుచున్న రేతస్స్ఖలనము, కర్మసంజ్ఞితః = కర్మమని జెప్పబడుచున్నది. ఈ మూడున్ను ముముక్షువులు తెలిసికొనుటకై చెప్పబడినవి. ఏలనగా మొదట జెప్పిన ముక్తజీవ స్వరూపమును పొందుటనున్ను వెనుక జెప్పిన రెంటిని విడువవలెననియు ముముక్షువు లెరుంగవలసిన వారుగనున్నారు.

(రాఘవేంద్రులు) ఉత్తమమైనదియు నాశములేనిదియునైన విష్ణువే బ్రహ్మము.

జీవుని చేరినవస్తువులు స్వభావము, అనగా అతని కుపకారకమైన దేహేంద్రియాంతః కరణములు మొదలగునవి. ఇవియే అధ్యాత్మమని చెప్పబడుచున్నవి. లేక, జీవుని స్థిరమైనస్థితియే స్వభావము: అదియే అధ్యాత్మము.

భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః - భూత = జీవులకును, భావ = జడపదార్థములకును, ఉద్భవ = ఉత్పత్తిని, కరః = చేయునట్టి, విసర్గః = ఈశ్వరసృష్టియనునది, కర్మ సంజ్ఞితః = కర్మమని చెప్పబడుచున్నది.



శ్లో॥ అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతం।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాంవర ॥

పద॥ అధిభూతం (1) - క్షరః - భావః - పురుషః - చ - అధిదైవతం (2)।
అధియజ్ఞః (3) - అహం - ఏవ - అత్ర - దేహే - దేహభృతాంవర ॥

| | | | |
|---|---|---|---|
| భావః క్షరః | కలిగి నశించెడి వస్తువులు | అధిదైవతం | అధిదైవతము |
| అధిభూతం | అధిభూతము | దేహభృతాంవర | దేహముగలవార్లలో శ్రేష్ఠుడా ! |
| పురుషశ్చ | శరీరమునందును నిలబడి యున్నవాడు | అత్రదేహే | ఈ దేహములో |
| | | అహమేవ అధియజ్ఞః | నేనే అధియజ్ఞుడను |

తా॥ పుట్టినశించుచున్న వస్తువులు అధిభూతమని చెప్పబడునవి. పురుషుడు, అనగా శరీరములో నిలబడువాడు అధిదైవము అనబడుచున్నాడు. దేహమును ధరించియున్నవారలలో ఉత్తముడైన ఓ అర్జునా! ఈ శరీరములో నేనే అధియజ్ఞుడని జెప్పబడువాడను. అనగా ఈశరీరముతో జేసి ముగింపదగిన ఎట్టి యాగముకలదో దానికి వాసుదేవుడనైన నేనే యజ్ఞదేవతను.

(1) అధిభూతం - జననమరణములుగల వస్తువులన్నియు అధిభూతము (శంకరులు). నాశమొందదగిన దేహాదులు అధిభూతము (శ్రీధరులు). ఐశ్వర్యమునుగోరు జనులచే నెరుంగవలసినదిగ జెప్పబడిన అధిభూతము నశింపదగినదిగను, పంచమహాభూతములలోనున్నదిగను, పంచమహాభూతముల వలన గలిగినదిగనున్న స్థూలశబ్దస్పర్శాదులు (రామానుజులు). నాశమొందదగిన సకల వస్తువులున్ను అధిభూతమనిచెప్పబడుచున్నవి. ఏలనగా అట్టి సకల వస్తువులున్ను జీవునిచేరినవే. జీవునికి ఉపయోగములేని వస్తువు ఒక్కటియు లేదని తాత్పర్యము. (మధ్వులు).

(2) అధిదైవతం - సూర్యమండలమునందున్న వాడుగను, ఇంద్రాదులను ప్రేరేపించునట్టివాడునైన హిరణ్యగర్భుడే అధిదైవతము (శంకరులు). సూర్యమండలముననున్న వాడుగను, తన అంశములైన దేవతల కధిపతిగనున్నవాడైన (బ్రహ్మ) విరాట్పురుషుడే అధిదైవతము (శ్రీధరులు). బ్రహ్మాదిదేవతలకు పైబడినవాడుగను వారలనుభవించు విషయములకంటె విశేష విషయములను అనుభవించెడి వాడునైన పురుషుడే అధిదైవము (రామానుజులు). దేవేంద్రుడు మొదలగు దేవతలకు అధిపతియైన బ్రహ్మయే అధిదైవము, లేక జీవాభిమానియైన సంకర్షణమూర్తియే (మధ్వులు).

(3) అధియజ్ఞః - దేహములచే నడుపబడునట్టి యజ్ఞములకు అభిమానియైన విష్ణువు అధియజ్ఞుడు. అతడే నేను (శంకరులు). దేహములో అంతర్యామిగనుండుకొని యజ్ఞములో ప్రవర్తించునట్లు ప్రేరేపించువాడుగను ఫలమునిచ్చువాడుగనున్న నేనే అధియజ్ఞుడను (శ్రీధరులు).

కము 5-వ అధ్యాయము 8-వ (బ్రాహ్మణము 9-వ) శ్రుతిచే ఎరుంగుడు. " ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ" అని ముందు రాబోవు 13-వ శ్లోకమున చెప్పబడియున్నను ఇచ్చట అక్షరమను పదమునకు ఓంకారమని యర్థము గ్రహింపగూడదు. ఏలనగా బ్రహ్మ మను పేరుచే ఓంకారమును విశేషించి చెప్పుటచే ననుడు. మఱియు, పరమం = మేలైనది అను విశేషణము ఓంకారము మొదలగు వాటికంటె పైబడిన నాశములేని బ్రహ్మముయొక్క విషయములోనే బాగుగ తగియున్నది.

2) అధ్యాత్మం - ఆ బ్రహ్మము ప్రతి దేహమునందును లోపలనున్న ప్రత్యగాత్మగ నుండుటను అధ్యాత్మ మనుచున్నారు. శరీరమును ఆశ్రయించి లోపలనున్న అత్మయగుటకు తల బెట్టి కడపట వాస్తవమైన బ్రహ్మముగనే యున్నవస్తువు అధ్యాత్మమను పదముచే చెప్ప బడుచున్నది. అధ్యాత్మమనగా శరీరములోనున్నట్టిది. దేహము నివాసస్థానముగ గలదెట్టిదో అట్టి జీవస్వభావము,

(3) విసర్గః - అనగా దేవతలనుగూర్చి చరువు, పురోడాశము మొదలగు వస్తువుల నిచ్చుట (అదియే) స్థావరజఙ్గమ వస్తువులను, కలుగజేయునది. కావుననే ఇట్టి త్యాగమనే యాగము కర్మ అనే పేరుబడసినది. అనగా కర్మమనే పదముచే చెప్పబడునట్టిది. విత్తనముగనున్న దీనినుండిగదా స్థావరజఙ్గమ వస్తువులు, వర్షము మొదలగు క్రమముచే కలుగుచున్నవి.

(శంకరభాష్యము) పైకనిన ఈ ప్రశ్నలను స్పష్టపరచుటకై, అనగా వాటియుత్తరమును బాగుగ తెలియబరచుటకై శ్రీభగవంతుడు ఈ (3, 4, 5 -) శ్లోకములను ప్రసాదించుచున్నాడు.

(శ్రీధరులు) స్వభావః = దేహము నాశ్రయించి, లేక అనుసరించుకొనియు, "నేను చేయు చున్నాను, నే ననుభవించుచున్నాను" అనునది మొదలగు నభిమానమును గైకొనియు ప్రకాశించు చున్న బ్రహ్మముయొక్క అంశమైన జీవస్వరూపము స్వభావము. అట్టి స్వభావమే అధ్యాత్మము. భూతభావోద్భవకరః - భూతం = వస్తువులకు, భావః = ఉత్పత్తి, ఉద్భవః = వృద్ధి - కర = కలుగజేయునట్టి, విసర్గః = దేవతల నుద్దేశించి మంత్రపూర్వకముగ యజ్ఞములో నివ్వబడు ఆహు తియే కర్మము.

(రామానుజులు) అక్షరం = నాశములేని క్షేత్రజ్ఞ సమష్టిరూపమైన, పరమం = ప్రకృతి విముక్తాత్మ జీవస్వరూపము, బ్రహ్మ = బ్రహ్మమని జెప్పబడుచున్నది. (అనగా ముక్తజీవస్వరూపము)

స్వభావః = ప్రకృతి, అధ్యాత్మం = జీవునికి సాధకముగనున్న సూక్ష్మభూతములు అనగా అత్మకానివియు ఆత్మవంటివియునైన భూతసూక్ష్మాదులు. ఇదియే అధ్యాత్మము.

భూతభావోద్భవ కరోవిసర్గః కర్మసంజ్ఞితః - భూతభావః = మనుష్య పశుపక్ష్యాదుల యొక్క, ఉద్భవకరః - ఉత్పత్తిని జేయునట్టి, విసర్గః = పురుషసంబంధముచే గలుగుచున్న రేతఃస్ఖలనము, కర్మసంజ్ఞితః = కర్మమని జెప్పబడుచున్నది. ఈ మూడున్ను ముముక్షువులు తెలిసికొనుటకై చెప్పబడినవి. ఏలనగా మొదట జెప్పిన ముక్తజీవ స్వరూపమును పొందుటనున్ను వెనుక జెప్పిన రెంటిని విడువవలెననియు ముముక్షువు లెరుంగవలసిన వారుగనున్నారు.

(రాఘవేంద్రులు) ఉత్తమమైనదియు నాశములేనిదియునైన విష్ణువే బ్రహ్మము.

జీవుని చేరినవస్తువులు స్వభావము, అనగా అతని కుపకారకమైన దేహేంద్రియాంతః కరణములు మొదలగునవి. ఇవియే అధ్యాత్మమని చెప్పబడుచున్నవి. లేక, జీవుని స్థిరమైనస్థితియే స్వభావము: అదియే అధ్యాత్మము.

భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః - భూత = జీవులకును, భావ = జడపదార్థములకును, ఉద్భవ = ఉత్పత్తిని, కరః = చేయునట్టి, విసర్గః = ఈశ్వరసృష్టియనునది, కర్మ సంజ్ఞితః = కర్మమని చెప్పబడుచున్నది.



శ్లో॥ అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతం।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాంవర ॥

పద॥ అధిభూతం (1) - క్షరః - భావః - పురుషః - చ - అధిదైవతం (2)।
అధియజ్ఞః (3) - అహం - ఏవ - అత్ర - దేహే - దేహభృతాంవర ॥

| | | | |
|---|---|---|---|
| భావః క్షరః | కలిగి నశించెడి వస్తువులు | అధిదైవతం | అధిదైవతము |
| అధిభూతం | అధిభూతము | దేహభృతాంవర | దేహముగలవార్లలో శ్రేష్ఠుడా ! |
| పురుషశ్చ | శరీరమునందును నిలబడి యున్నవాడు | అత్రదేహే | ఈ దేహములో |
| | | అహమేవ అధియజ్ఞః | నేనే అధియజ్ఞుడను |

తా॥ పుట్టినశించుచున్న వస్తువులు అధిభూతమని చెప్పబడునవి. పురుషుడు, అనగా శరీరములో నిలబడువాడు అధిదైవము అనబడుచున్నాడు. దేహమును ధరించియున్నవారలలో ఉత్తముడైన ఓ అర్జునా ! ఈ శరీరములో నేనే అధియజ్ఞుడని జెప్పబడువాడను. అనగా ఈశరీరముతో జేసి ముగింపదగిన ఎట్టి యాగముకలదో దానికి వాసుదేవుడనైన నేనే యజ్ఞదేవతను.

(1) అధిభూతం - జననమరణములుగల వస్తువులన్నియు అధిభూతము (శంకరులు). నాశమొందదగిన దేహాదులు అధిభూతము (శ్రీధరులు). ఐశ్వర్యమునుగోరు జనులచే నెరుంగవలసినదిగ జెప్పబడిన అధిభూతము నశింపదగినదిగను, పంచమహాభూతములలోనున్నదిగను, పంచమహాభూతముల వలన గలిగినదిగనున్న స్థూలశబ్దస్పర్శాదులు (రామానుజులు). నాశమొందదగిన సకల వస్తువులున్ను అధిభూతమనిచెప్పబడుచున్నవి. ఏలనగా అట్టి సకల వస్తువులున్ను జీవునిచేరినవే. జీవునికి ఉపయోగములేని వస్తువు ఒక్కటియు లేదని తాత్పర్యము. (మధ్వులు).

(2) అధిదైవతం - సూర్యమండలమునందున్న వాడుగను, ఇంద్రాదులను ప్రేరేపించునట్టివాడునైన హిరణ్యగర్భుడే అధిదైవతము (శంకరులు). సూర్యమండలముననున్న వాడుగను, తన అంశములైన దేవతల కధిపతిగనున్నవాడైన (బ్రహ్మ) విరాట్పురుషుడే అధిదైవతము (శ్రీధరులు). బ్రహ్మాదిదేవతలకు పైబడినవాడుగను వారలనుభవించు విషయములకంటె విశేష విషయములను అనుభవించెడి వాడునైన పురుషుడే అధిదైవము (రామానుజులు). దేవేంద్రుడు మొదలగు దేవతలకు అధిపతియైన బ్రహ్మయే అధిదైవము, లేక జీవాభిమానియైన సంకర్షణమూర్తియే (మధ్వులు).

(3) అధియజ్ఞః - దేహములచే నడుపబడునట్టి యజ్ఞములకు అభిమానియైన విష్ణువు అధియజ్ఞుడు. అతడే నేను (శంకరులు). దేహములో అంతర్యామిగనుండుకొని యజ్ఞములో ప్రవర్తించునట్లు ప్రేరేపించువాడుగను ఫలమునిచ్చువాడుగనున్న నేనే అధియజ్ఞుడను (శ్రీధరులు).

ఇంద్రాదిదేవతలకు శరీరియైనట్టియు సకలయజ్ఞములచేతను ఆరాధింపబడునట్టియు నేనే అధియజ్ఞుడను (రామానుజులు). సకలదేహములలోను అంతర్యామిగనున్న నేను యజ్ఞ ఫలమును భుజించెడివాడను కావున నేనే అధియజ్ఞుడను ఇతడే "అక్షరం బ్రహ్మ పరమం" అనే పరమాత్మ. అధియజ్ఞుడెట్టివాడు? అతడెవ్వడు? అనుప్రశ్నలకు దీనిచే బదులుచెప్పబడినదిగ గ్రహింపవలెను (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) అధిభూతమనునది ప్రాణివర్గము నాశ్రయించి నిలబడునది. అది యెట్టిదనగా నశించెడివస్తువు. పుట్టుకగల వస్తువులన్నియు అనుడు. పురుషుడనగా అన్నిటిని నిండుగా వ్యాపించియున్నవాడు. లేక శరీరములో నిలబడియున్నవాడు. సూర్యమండలములోనున్న హిరణ్యగర్భుడు అన్నిప్రాణుల ఇంద్రియములను అనుగ్రహించువాడు, అనగా ఆ ఇంద్రియములను సరియైన నిలకడలో నిలబెట్టువాడు అధిదైవమనుడు. అధియజ్ఞమనగా యాగములన్నిటిని అభిమానించు విష్ణువనుదేవత.

"యజ్ఞో వైవిష్ణుః = యజ్ఞ మేవిష్ణువు" అనుశ్రుతిచే చూడుడు. ఆవిష్ణువు నేనే. ఈ శరీరములో ఏయాగముగలదో దానికినేను యజ్ఞ దేవతను. యాగము శరీరముచే జేయదగినది. కావున శరీరముతో నిత్యసంబద్ధమైనది. కావుననే శరీరము స్థానముగగలది. శరీరములో నిలబడియున్నట్టిది యనుడు.



శ్లో॥ అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

పద॥ అంతకాలే - చ - మాం (1) - ఏవ - స్మరన్ - ముక్త్వా - కళేబరం।
యః - ప్రయాతి - సః - మద్భావం (2) - యాతి - నాస్తి - అత్ర - సంశయః॥

| | | | |
|---|---|---|---|
| యః అంతకాలే చ | ఎవ్వడు అంత్యకాలమునందును | సః మద్భావం యాతి | అతడు నాస్వరూపమును పొందుచున్నాడు. |
| మామేవ స్మరన్ | నన్నే స్మరించువాడై | | |
| ముక్త్వా | శరీరమును విడచి | అత్రసంశయః నాస్తి | ఇందులో సందేహములేదు. |
| ప్రయాతి | పోవునో | | |

తా॥ ఎవ్వడు మరణకాలములో నన్నే స్మరించువాడై శరీరమును విడచి పోవునో అతడు నాస్వరూపమును పొందుచున్నాడు. ఇందులో సందేహములేదు. అనగా నాస్థితిని పొందునా? పొందడా? అనువిషయములో సందేహములేదు.

(1) మాం - పరమేశ్వరుడుగను విష్ణువుగనున్న నన్నే (శంకరులు). అంతర్యామి రూపముగనున్న పరమేశ్వరుడనైన నన్నే (శ్రీధరులు)

(2) మద్భావం - విష్ణువుయొక్క (అంతటనున్న వస్తువుయొక్క) వాస్తవమైనస్థితిని (శంకరులు). నన్ను ఏవిధమైన స్వరూపముగ స్మరించునో దానివంటి ఆకారమును (రామానుజులు) నాయెడ నిత్యానందమైన స్థితిని (మధ్వులు).

శ్లో॥ యం యం వాఽపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరం।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః॥

పద॥ యం - యం - వా - అపి - స్మరన్ - భావం - త్యజతి - అన్తే - కళేబరం।
తం - తం - ఏవ - ఏతి - కౌంతేయ - సదా - తద్భావభావితః॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ! | ఓ కుంతీపుత్రా! | కళేబరం త్యజతి | దేహమును విడుచునో |
| (యః) అన్తే | ఎవ్వడు అంత్యకాలములో | (సః) సదా | అతడెల్లప్పుడు |
| యం యం వాపి | ఏ యే | తద్భావ భావితః | దానినే చింతించువాడై |
| భావం స్మరన్ | వస్తువును స్మరించెడివాడై | తం తం ఏవ ఏతి | దానిదానినే పొందుచున్నాడు. |

తా॥ ఓ కుంతీపుత్రా! ఎవ్వడంత్యకాలములో ఏయే వస్తువును స్మరించుచు దేహమును విడుచునో అతడెల్లప్పుడు అయాభావముయొక్క స్మరణతో గూడినవాడై అయాభావమునే పొందుచున్నాడు.

(శంకరులు) పైజెప్పిన ఇట్టినియమము నన్నుగూర్చి మాత్రమున్నట్టిదిగాదు. మిగతభావములన్నిటికిని ఇదే నియమమని చెప్పబడుచున్నది. భావమనగా దేవతావిశేషము. ఒకడు ఏయొక విశేష దైవమును ప్రాణము దేహమునువిడచిపోవు కాలములో చింతించుకొని మరణమొందునో అతడు అట్టి దేవతావిషయమైన వాసనను యెడతెగక స్మరించి అభ్యాసము చేసికొన్నవాడై దానినే పొందుచున్నాడు. అనగా స్మరించిన వస్తువునేగాని వేరొక్కవస్తువును పొందుటలేదనుడు.

(శ్రీధరులు) ఎవ్వడు మరణకాలములో ఈశ్వరధ్యానముచేయక దేవతలు (మనుష్యులు మృగములు) మొదలగు ఏరూపములో మనస్సునుంచునో లేక మనస్సున నేరూపమును తలంచుకొని యుండునో అవిధమైన దేహమే పైజన్మమునందును పొందునని తాత్పర్యము. రాఘవేంద్రులు ఈ అభిప్రాయము నాదరించుచున్నారు.

(స్వకీయము) మరణకాలమున లేడిని (జింకను) స్మరించిన జడభరతునకు లేడిజన్మము వచ్చిన దానిని దీనికి దృష్టాంతముగ గ్రహింపవచ్చును. (విష్ణుపురాణము 2-వ అంశము 13-వ అధ్యాయము 32-33 శ్లోకములను చూడుడు) పరమాత్మ స్మరణగాని దేవతాస్మరణగాని ఒకనికంత్యకాలమున కలుగ వలెననినచో సదాకాలమునందును స్మరణచేసి అభ్యాసపరచి యుండిననే గాని కలుగనేరదు. అంత్యకాలములో పరమాత్మస్మరణ ఎవ్వనికి కలుగునో అతనికి మరల జననమనునది లేనందున ముముక్షువైన ప్రతియొక్కడు ఎల్లప్పుడు పరమాత్మను భజించుచునే యుండవలసినదావశ్యకము.



శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ।
మయ్యర్పితమనో బుద్ధిర్మామేవైష్యసంశయః *॥

పద॥ తస్మాత్ - సర్వేషు - కాలేషు - మాం - అనుస్మర - యుధ్య (1) - చ।
మయి - అర్పితమనోబుద్ధిః - మాం - ఏవ - ఏష్యసి - అసంశయః॥

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | అందువలన | ర్పిత మనోబుద్ధిః | మనస్సు బుద్ధి వీనినుంచినవాడవై |
| సర్వేషు కాలేషు | అన్నిసమయములలోను | | |
| మాం అనుస్మర | నన్నుస్మరించుచుండుము | మామేవ | నన్నే |
| యుధ్య చ | యుద్ధమునుగూడ జేయుము | ఏష్యసి | పొందగలవు. |
| మయి | నాయెడ | అసంశయః | సందేహములేదు. |

తా॥ (నాయెడ ఎల్లప్పుడు మనస్సునుంచుకొని యున్నవాడు మరణకాలమునందును నాయెడనే మనస్సుగలవాడుగ నుండును.) కావున అన్నికాలములలోను నన్నుస్మరించుచుండుము. యుద్ధమునుగూడ జేయుము. నాయెడ మనస్సు, బుద్ధి, వీటి నుంచినవాడవైనచో నన్నే పొందగలవు. సంశయములేదు.

* అసంశయం = అనియునొకపాఠము. అర్థభేదములేదు. (రాఘవేంద్రులు)

(1) యుధ్యచ = యుద్ధమునున్ను, నిత్యనైమిత్తిక కర్మలనున్ను జేయుము,

(శంకరులు) మరణకాలములో కడపటిదైన భావన, అనగాతలంపు, రాగల దేహమును పొందుటకు ఈ విధముగ కారణమగుచున్నది. ఇకరాబోవు శరీరమెట్టిదనుదానిని నిశ్చయపరచుచున్నది అనుసీకారణముచే నీవెల్లప్పుడు శాస్త్రానుసారముగ నన్నుధ్యానించవలెను, మరియు స్వధర్మమైన యుద్ధమునున్ను చేయవలెను. నీవువాసుదేవుడనైన నాయెడనే మనస్సును బుద్ధిని ఉంచినవాడవై నీవుధ్యానము చేసినప్రకారము నన్నేవచ్చి చేరెదవు. ఇందులో సందేహములేదు.

(రామానుజులు) సర్వకాలమునందును నన్నేస్మరించుకొని యుండుము అని భగవంతునిచే చెప్పబడినది. భగవంతునియెడ ఎల్లప్పుడు మనస్సునుంచుకొని యుండవలసియున్నందున ఇక యుద్ధము చేయవలసినది లేదని అర్జునుడు తలంచునని తలంచి నీవు నన్నుస్మరించుచునే యుద్ధము జేయుమని భగవంతుడు జెప్పెను. ఎట్లు నిన్నుస్మరించుచు యుద్ధముచేయుట? అని అడిగినచో యుద్ధము మొదలగు వ్యాపారమువలన గలుగు జయాపజయములలో మనస్సునుంచక ఈశ్వరకైంకర్యమని స్మరించుచు యుద్ధముచేయుము అనునది తాత్పర్యము.

~~~~~~

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్ ॥

పద॥ అభ్యాసయోగయుక్తేన (1) - చేతసా - న - అన్యగామినా।
పరమం - పురుషం (2) - దివ్యం - యాతి - పార్థ - అనుచిన్తయన్ ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ పార్థా! | చేతసా | మనస్సుచేత |
| అభ్యాస యోగ యుక్తేన | అభ్యాసమనెడి యోగముతో గూడి | దివ్యం | ప్రకాశరూపమైన |
| | | పరమం పురుషం | పరమపురుషుని |
| నాన్యగామినా | వేరువిషయములలో ప్రవేశములేని | అనుచింతయన్ | ధ్యానించువాడు |
| | | (తమేవ) యాతి | వానినే పొందుచున్నాడు. |

తా॥ ఓపార్థా! అభ్యాసమనెడి యోగముతో గూడినదియు, వేరువిషయములలో ప్రవేశించనిదియునైన మనస్సుచే ప్రకాశరూపమైన పరమపురుషుని (బ్రహ్మమును) క్రమముగ ధ్యానించువాడు అపరమ పురుషునే పొందును.

(1) అభ్యాసయోగయుక్తేన - మొదట నేవస్తువును ధ్యానింపబూనెనో దానినే విడువక ధ్యానించుటయే అభ్యాసము. ఇదియే పొందుటకుపాయమగుచున్నది (శ్రీధరులు). నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానములకు విరోధము లేనికాలములలో తానుతలంచుచున్నమూర్తిని ధ్యానించుటకు మనస్సును అలవాటుపరచుట అభ్యాసము. అట్టి మూర్తిధ్యానమే యోగము, (రామానుజులు). 12-వ అధ్యాయము 9-వ శ్లోకమును జూడుడు.
~~~~~~

(2) పురుషం - సూర్యమండల మధ్యస్థుడైన పురుషుని (శంకరులు). నారాయణుడనైన నన్ను, అనుచింతయన్ = అంత్యకాలములో స్మరించువాడు నాతోసమానమైన రూపమును, యాతి = పొందుచున్నాడు (రామానుజులు).

(శంకరులు) అభ్యాసమనగా చిత్తమునుంచియుండుటకు స్థానముగనున్న నన్ను మాత్రము గూర్చిన ఒకేతలంపు, మాటిమాటికి మధ్యలో వేరుతలంపుకలుగక ఎడతెగకయుండుట. అదియే యోగమనబడును. యోగియొక్క చిత్తము ఇట్టి అభ్యాసమే ప్రధానముగగలది. అన్నిటికంటె మేలైన వాడై సూర్యమండలములోనున్న, అనగా నచ్చట విశేషముగ ప్రకాశించుచున్న పురుషుని వేరు విషయములలో ప్రవేశించు వాడుకలేని అట్టిమనస్సుచే శాస్త్రము ఆచార్యులు వీరల ఉపదేశము ననుసరించి ధ్యానించువాడు ఆ పురుషునే పొందును.

(స్వకీయము) ఈ శ్లోకమును మునుపటిశ్లోకముతోజేర్చి అర్థముచేసిన, మనస్సును ఈశ్వర ధ్యానములో నిలుపనభ్యసించినవాడు వేరు విషయములలో ప్రవేశించినను అతని మనస్సు ఈశ్వర ధ్యానమునందే యుండునను అర్థము లభించుచున్నది,



శ్లో॥ కవిం పురాణ మనుశాసితార మణోరణీయాంస మనుస్మరేద్యః।
సర్వస్య ధాతారమచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ 9

పద॥ కవిం - పురాణం - అనుశాసితారం (1) అణోః - అణీయాంసం (2) - అనుస్మరేత్ - యః। సర్వస్య - ధాతారం (3) - అచిన్త్యరూపం (4) ఆదిత్యవర్ణం (5) - తమసః (6) - పరస్తాత్ ॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వడు | అచింత్యరూపం | చింతింపవీలులేని రూపము గలవాడై |
| కవిం | కవియై (సర్వము నెరింగినవాడై) | ఆదిత్యవర్ణం | సూర్యునివంటి ప్రకాశము గలవాడై |
| పురాణం | అనాదికాలముగ నున్నవాడై | తమసః పరస్తాత్ | అజ్ఞానమనెడి అంధకారమును దాటినవాడుగనున్నవానిని |
| అనుశాసితారం | సకలజగత్తు నేలెడివాడై | | |
| అణోః | అణువుకంటె | | |
| అణీయాంసం | అతిసూక్ష్మడై | అనుస్మరేత్ | యెడతెగక స్మరించునో |
| సర్వస్య ధాతారం | సకలమును వీర్పరచువాడై | సః తం యాతి | అతడు అట్టి పురుషునిపొందును |

తా॥ అన్నియు నెరింగినవాడుగను, అనాదికాలముగనున్న వాడుగను, సకల జగము నేలెడివాడుగను, అణువుకంటెసూక్ష్మమైన అణువుగను, అన్నిటిని నియమించువాడుగను, అనగా సకలప్రాణులకును కర్మఫలములను విభజించి ఇచ్చువాడుగను, ఇట్టిరూపముగలవాడని చింతింప వీలుగానివాడుగను, సూర్యుని కాంతివంటి నిత్యజ్ఞానముయొక్క ప్రకాశముగలవాడుగను, అజ్ఞానమనెడి చీకటినిదాటి నిలబడువాడుగను ఉన్నవాని నెవ్వడొక్కడు యెడతెగక ధ్యానించునో అతడట్టి పురుషుని చింతించు చున్నవాడై అట్టిపురుషునే పొందును.

(1) అనుశాసితారం - సకలలోక నియామకుడు (రాఘవేంద్రులు).

(2) అణీయాంసం - జీవునికంటె అణువుగనున్నవాడు (రామానుజులు)

(3) ధాతారం - సకలకర్మఫలములను భాగించి ఇచ్చువాడు (శంకరులు), సకల ప్రపంచములను సృష్టించువాడు (రామానుజులు). సకల ప్రపంచములను ధరించువాడును పోషించు వాడును (రాఘవేంద్రులు).

(4) అచింత్యరూపం - ప్రపంచ విలక్షణరూపము గలవాడు (రామానుజులు).

(5) ఆదిత్యవర్ణం - అప్రాకృత, స్వాభావిక, అసాధారణ దివ్యరూపముగలవాడు (రామానుజులు).

(6) తమసఃపరస్తాత్ - మోహాంధకారములేనివాడు (శంకరులు) మాయను, లేక మృత్యువును దాటినవాడు (రాఘవేంద్రులు).

(శంకరభాష్యము) మునుపుజెప్పినవిధముగ ధ్యానించువాడు ఎట్టి పురుషుని పొందునను నది చెప్పబడుచున్నది. కవి, అనగా గడచినవి, రాబోవునవి మొదలగునవన్నియు నెరుంగు స్వభావముగలవాడు, సర్వము నెరింగినవాడు, సకలజగత్తునేలువాడు సకలము నేర్పరచువాడు, అనగా, కర్మలు వాటిఫలములు అనువాటినన్నిటిని ప్రాణులకు పలువిధములుగ విభజించి ఇచ్చు వాడు. ఇతనికి రూపముకలదైనను అది ఇట్టిదేయని తలంపవీలులేనిది. ఇతడు సూర్యునికాంతివంటి దైన నిత్యచైతన్య ప్రకాశమును, నిత్యజ్ఞాన ప్రకాశమునుగలవాడు. అజ్ఞానము, ఎరుంగనితనము అను మోహాంధకారమునకు, చీకటికి తరువాత నిలబడువాడు. ఎవ్వడొక్కడు ఇట్టిపురుషుని ఎడ తెగక ధ్యానించునో అతడాతనిని జింతించుచున్నవాడై అట్టి పురుషుని పొందుచున్నాడు, "అనుచింత యఞ యాతి'' అని మునుపటి శ్లోకముతో జేర్పుడు.



శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ స తం పరం పురుషముపైతి దివ్యం॥ 10

పద॥ ప్రయాణకాలే - మనసా - అచలేన - భక్త్యా - యుక్తః - యోగబలేన - చ - ఏవ।
భ్రువోః - మధ్యే - ప్రాణం - ఆవేశ్య - సమ్యక్ - సః - తం - పరం - పురుషం - ఉపైతి- దివ్యం॥

| | | | |
|---|---|---|---|
| అచలేన మనసా | చంచలతలేని మనస్సుతోను | భ్రువోఃమధ్యే | రెండు కనుబొమ్మల మధ్య |
| భక్త్యా | భక్తితోను | సమ్యక్ ఆవేశ్య | బాగుగ నిలబెట్టి |
| యోగబలేన | యోగబలముతోను | తం దివ్యం | (మునుపుజెప్పిన) ఆ దివ్యమైన |
| యుక్తః సః | గూడిన అతడు | పరం పురుషమేవ | పరమపురుషునే |
| ప్రయాణకాలే | అంత్యకాలములో | ఉపైతి | పొందుచున్నాడు. |
| ప్రాణం | ప్రాణమును | | |

తా॥ చంచలముకాని మనస్సుతోను, భక్తితోను, యోగబలముతోను గూడిన మునుపు చెప్పినవాడు, అంత్యకాలములో ప్రాణవాయువును రెండు కనుబొమ్మలమధ్య బాగుగ నిలబెట్టి, ఆ మునుపుజెప్పిన లక్షణముగల పరమపురుషుని పొందుచున్నాడు.

(1) పరంపురుషం - పరమపురుషుని యొక్క ఐశ్వర్యముతో సమమైన ఐశ్వర్యమునుగల రూపమును, ఆకారమును (రామానుజులు).

(శంకరభాష్యము) యోగబలమనగా చిత్తము తిరుగక దృఢముగ నిలబడుట. అది సమాధి వలన గలుగు సంస్కారము, లేక అభ్యాసమువలన కలుగునది. మొదటహృదయపద్మములో చిత్తమును వశపరచి పిదప పైకి పోవునట్టి "సుషుమ్న" అనునాడిచే భూమిమొదలగు పంచభూతములను క్రమక్రమముగా జయించి ప్రాణమును రెండుకనుబొమ్మలమధ్య సావధానుడై నిలబెట్టి ఈవిధముగ అట్టిజ్ఞానియైన యోగి, మునుపటి శ్లోకములో జెప్పిన లక్షణమును, ప్రకాశస్వరూపమునుగల పురుషుని జేరును.

(స్వకీయము) ఈ శ్లోకములచే, ఈదేహముపోయినపిదప ఉత్తమమైన దేహమును పొందుటకుపాయము బైటబెట్టబడియున్నది.

మనస్సు చలనము తొలగి ఒక వస్తువునుబట్టియే యుండవలెను. భక్తి (విశ్వాసము, లేక ప్రీతి) లేనివస్తువును మనస్సుపట్టదు. గావున భక్తియుకావలెను. అవిరెండును కొన్నికొన్ని కాలములలోనుండిన అది మరణకాలమున సహాయముజేయుట అసంభవము. కావున బలమైనట్టియు స్థిరమైనట్టియు దీర్ఘకాలపు అభ్యాసముకావలెను. ప్రాణవాయువును (మిగిలిన వాయువులున్ను దానిలో జేరినవి) అడ్డగించి నిలబెట్టినగాని ధ్యానము నిలకడచెందదు. కనుక వాయువుల నడ్డగించి కనుబొమ్మలమధ్య నిలబెట్టవలెను. ఇంతటిప్రయాసపడినను ధ్యేయవస్తువు క్షుద్రదేవతయైనచో పునర్జననములేని యానందాను భవముండదు. కావున ఈశ్లోకములలో జెప్పబడు ఉత్తమ గుణములుగల (బ్రహ్మవిష్ణువు రుద్రులగు) సగుణబ్రహ్మోపాసనగ నుండవలెను. ఇట్టి యుపాసనచే ఉపాసించుచున్న సగుణబ్రహ్మ స్వరూపమును పొందుచున్నాడు. ఆ స్వరూపముతో ఆనందము ననుభవించి పిదప మోక్షమును పొందుచున్నాడు. ఇదిక్రమముక్తి మార్గమని చెప్పబడును. ఇదియే పరమాత్మను పొందునట్టిదిగ చెప్పబడినది.



శ్లో॥ యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥ 11

పద॥ యత్ - అక్షరం (1) - వేదవిదః - వదన్తి - విశన్తి - యత్ - యతయః - వీతరాగాః।
యత్ - ఇచ్ఛన్తః - బ్రహ్మచర్యం - చరన్తి తత్ - తే - పదం (2) సంగ్రహేణ - ప్రవక్ష్యే॥

| | | | |
|---|---|---|---|
| వేదవిదః | వేదార్థముల నెరింగినవారలు | బ్రహ్మచర్యం చరన్తి | బ్రహ్మచర్యము ననుష్ఠించుచున్నారో |
| యత్ అక్షరంవదన్తి | దేనిని నాశములేనిదిగ చెప్పెదరో | తత్ పదం | అట్టి స్థితిని |
| యతయఃవీతరాగాః | యతులు కోరికలు లేనివారై | తే | నీకు |
| యత్ విశన్తి | దేనిని ప్రవేశింతురో | సంగ్రహేణ | సంగ్రహముగ |
| యత్ ఇచ్ఛన్తః | దేనిని కోరువారలు | ప్రవక్ష్యే | చెప్పెదను. |

తా॥ వేదార్థముల నెరింగినవారలు దేనిని నాశరహితమైనదని చెప్పుచున్నారో, కామక్రోధాదులను విడిచియున్న సన్న్యాసులు దేనిని పొందుచున్నారో, దేనినెరుంగగోరి బ్రహ్మచారివ్రతము ననుష్ఠించుచున్నారో అట్టి స్థానమును (అది యెట్టిదని) సంగ్రహముగ నీకు చెప్పెదను.

(1) అక్షరం - స్థూల సూక్ష్మరూపములులేనిదై (రామానుజులు)

(2) పదం - మనస్సుచే ఎరుంగదగినదైన నా స్వరూపమును (రామానుజులు)

(శంకరభాష్యము) బ్రహ్మవిద్య లేకపోయినను లోకమార్గమునను సరించుటచేతనే బ్రహ్మము పొందబడుచున్నది అని ఈవిధముగ ఏర్పడియున్నప్పుడు ఇది చెప్పబడుచున్నది. వెనుక 13-వ శ్లోకములో మరలను జెప్పబడుచున్న "ఓం" అనే ప్రణవమనే ఉపాయముతో యోగిచే పొందగోరబడినదై వేదము నెరింగినవారలు చెప్పుట, అనగా వేదము నెరింగినవారిచే "నాశము లేనిదిగ చెప్పబడుచున్న" అనునది మొదలైన విశేషణములకు విశేష్యముగనున్న బ్రహ్మమునకు భగవంతుడు పేరు పెట్టుచున్నాడు. (యోగమార్గమున ప్రవేశించిన మధ్యమాధికారియు, సాంఖ్యమార్గములో ప్రవేశించిన ఉత్తమాధికారియు ఇరువురు వరుసగా ధ్యానయోగముయొక్క అభివృద్ధిచేతను నిదిధ్యాసము యొక్క అభివృద్ధిచేతను వేదాంతమహావాక్యములచేతనే మోక్షమును పొందుచున్నారను నది ఉపనిషత్తుల రహస్యము.) వేదార్థము నెరింగినవారలు అక్షరమను నాశములేనివస్తువును, బుద్ధి మొదలగువాటిచే ఎరుంగదగిన ఎట్టి విశేషస్వభావమును లేనిదిగ జెప్పుచున్నారు. "ఏతద్వైతదక్షరంగార్గి బ్రాహ్మణా అభివదంతి" ఓ గార్గి! (నీవెరుంగవలసినదెట్టిదో) అట్టి అక్షరమిదియే. బ్రహ్మము నెరింగినవారలు అది స్థూలముకాదు, సూక్ష్మముకాదు, ఇవి మొదలగువాటిని జెప్పుచున్నారా? అను బృహదారణ్యకశ్రుతిచే చూడుడు. మఱియు కోరిక నివర్తించినవారై ప్రయత్నముతోగూడిన సన్న్యాసులు తత్త్వజ్ఞానమువచ్చినతోడనే నాశము లేనివస్తువును ప్రవేశించుచున్నారు. అనగా ఆవస్తువుగనే యున్నారు. మఱియు అక్షరము నెరుంగగోరువారు ఆచార్యునియెడ బ్రహ్మచర్యమును అనగా గురుకులవాసము మొదలగువాటిని అనుష్ఠించుచున్నారు "దేనిని ఎరుంగ గోరువారలు" అని వాక్యశేషముగ ఉంచుకొనుడు. నీవు పొందవలసిన అట్టి అక్షరమనుస్థితిని సంగ్రహముగ జెప్పెదననుచున్నాడు భగవంతుడు.

---

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణాం॥ 12

,, ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిం॥ 13

పద॥ సర్వద్వారాణి (1) - సంయమ్య - మనః - హృది (2) - నిరుధ్య - చ।
మూర్ధ్ని (3) - ఆధాయ - ఆత్మనః - ప్రాణం - ఆస్థితః - యోగధారణాం (4)॥
,, ఓం - ఇతి ఏకాక్షరం - బ్రహ్మ - వ్యాహరన్ - మాం - అనుస్మరన్।
యః - ప్రయాతి - త్యజన్ - దేహం - సః - యాతి - పరమాం - గతిం (5)॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వడు | బ్రహ్మ | బ్రహ్మమునకు పేరైన |
| సర్వద్వారాణి | అన్ని ఇంద్రియ ద్వారములను | ఓ మిత్యేకాక్షరం | ఓం అనెడి అక్షరమును |
| సంయమ్య | అణచి | వ్యాహరన్ | ఉచ్చరించుచు |
| మనః హృది నిరుధ్య | మనస్సును హృదయకమలములో నిలబెట్టి | మాం అనుస్మరన్ | నన్ను ఎడతెగక స్మరించుచు |
| | | దేహం త్యజన్ | దేహమును విడిచి |
| ఆత్మనః ప్రాణం | తనప్రాణమును | ప్రయాతి | పోవునో |
| మూర్ధ్ని ఆధాయ చ | శిరస్సున నిలబెట్టియు | సః | అతడు |
| యోగధారణాం | యోగమునుధరించుటకు | పరమాంగతింయాతి | శ్రేష్ఠమైన స్థితినిపొందును. |
| ఆస్థితః | ప్రవర్తించినవాడై | | |

తా॥ ఎవ్వడు తనయొక్క సకలములైన ఇంద్రియముల ద్వారములను అణచి, మనస్సును హృదయకమలములో స్థిరముగ నిలబెట్టి, తన ప్రాణమును శిరస్సులోనిలబెట్టి, స్థిరమైన యోగమును ధరించుటకు ప్రయత్నించినవాడై, బ్రహ్మమునకు పేరైన ఓంకారమనెడి ఒక అక్షరమును ఉచ్చరించుచు, నన్నెడ తెగక స్మరించువాడై ఈ దేహమును విడచి పోవునో, అతడు శ్రేష్ఠమైనగతిని పొందును.

(1) సర్వద్వారాణి - జ్ఞానేంద్రియములను (రామానుజులు). సుషుమ్నానాడి తప్ప ఇతరనాడులను (రాఘవేంద్రులు).

(2) హృది - హృదయములోనున్న నాయెడ (రామానుజులు, మధ్వులు).

(3) మూర్ధ్ని - కనుబొమ్మలమధ్య (శ్రీధరులు). బ్రహ్మరంధ్రముచే (రాఘవేంద్రులు).

(4) యోగధారణాం - యోగమనే ధారణ, అనగా అఖండధ్యానము (రామానుజులు)

(5) పరమాంగతిం - ప్రకృతి విముక్తమైనట్టియు నాతోసమానమైన ఆకారము గలిగినట్టియు పునర్జననము లేనట్టియు ఆత్మను (రామానుజులు)

(శంకరభాష్యము) ప్రశ్నోపనిషత్తు ఐదవ ప్రశ్నము 1-2-మంత్రములలో పిప్పలాదుని గూర్చి శిబి కుమారుడైన సత్యకాముడనునతడు "ఓ భగవంతుడా! మనుష్యులలో దానికధికారియైన ఎవ్వడొకండు ఓంకారమును (ప్రణవమును) మరణపర్యంతము అట్లు ధ్యానముచేసి ఉపాసించునో అతడు దానిచే ఏ లోకమును జయించును? అనగా పొందును." అని అడుగగా పిప్పలాదులు సత్య కామునకు చెప్పుచున్నారు. "ఓ సత్యకామా! సగుణము నిర్గుణమునైన ఈ బ్రహ్మము ఓంకారమే అని మొదలు పెట్టి మూడు మాత్రలుగల ఓంకారమను నక్షరముచేతనే ఎవ్వడీపరమపురుషుని ధ్యానించునో అతడు సామగానములచే పైకి బ్రహ్మలోకమునకు తీసికొని పోబడుచున్నాడు." అను నది మొదలుగాగల్గ వచనముచేతను "ధర్మముగాకను, అధర్మముగాకను ఉన్న దేనిని నీవు చూచు చున్నావో దానిని నాకు చెప్పుము" అని కఠోపనిషత్తు రెండవ అధ్యాయము 14 వ మంత్రములో యమధర్మరాజును నచికేతుడు అడుగగా అతడు దానికి "వేదములన్నియు ఎట్టిస్థితిని చెప్పుచున్నవో తపస్సులన్నియు దేనిని జెప్పుచున్నవో, దేనినిగోరువారలు బ్రహ్మచర్యము ననుష్ఠించుచున్నారో

అట్టిస్థితిని నీకు సంగ్రహముగ జెప్పుచున్నాను. ఇది ఓంకారమనునదే" అని చెప్పునట్టిదైన శ్రుతి వాక్యములచేతను ఓంకారమనే ప్రణవోపాసన చెప్పబడుచున్నది. కావున ఓంకారము బ్రహ్మమును బోధించు శబ్దముగగాని, ప్రతిమవలె అనగా విగ్రహమువలె సూచకముగగాని గ్రహింపబడి మంద మైనబుద్ధియు, మధ్యమమైనబుద్ధియు గలవారలు బ్రహ్మము నెరుంగుటకు సాధనమని భావింపబడి యున్నది.

ఏ ఓంకారముయొక్క ధ్యానము కాలాంతరములో ముక్తినిచ్చునదిగ చెప్పబడినదో, అదియే ఇచ్చటను ఈ అధ్యాయములో చెప్పబడునది. "కవిం పురాణమనుశాసితారం, యదక్షరం వేద విదోవదన్తి" అని చెప్పబడిన బ్రహ్మము నెరుంగుటకు మునుపు జెప్పినట్లు సాధనముగనున్న ఓంకారోపాసన, అనగా కాలాంతరమున ముక్తినిచ్చునదై యోగములో చిత్తము స్థిరముగ నిలబడుటతోగూడిన ధ్యానము, ముఖ్యముగ నుపదేశింపవలసినది. ముఖ్యమైన ఓంకారధ్యానము ననుసరించి వచ్చిన మఱికొన్ని విషయములున్ను ఉపదేశింపదగినవి. ఇట్టి ఉద్దేశముతో ఈ శ్లోక ములు మొదలుపెట్టబడుచున్నవి.

జ్ఞానమునకు మార్గములుగనున్న ఇంద్రియములన్నిటిని అణచి మనస్సును హృదయ పద్మములోనుంచి, అనగా తిరుగక నిలకడజేసి ఈవిధముగ నచ్చట వశపరచబడిన మనస్సుతో హృదయమునకు పైభాగమున పోవు "సుషుమ్న" అనునాడిచే హృదయమునకు పైగానెక్కి, ప్రాణవాయువును శిరస్సులోనిలబెట్టి యోగధారణను స్థిరపరచబూనినవాడై, బ్రహ్మమునకు నామ మైన ఓంకారమనెడి ఒక అక్షరమును ఉచ్చరించువాడై, అట్టి ఓంకారార్థమైన ఈశ్వరుడైన నన్ను గూడ ఎడతెగక ధ్యానించువాడై, ఎవ్వడు శరీరమును విడిచి మృతిపొందునో అతడీ విధముగ శరీరమును విడుచువాడై మేలైన గతిని పొందును. పోవుట అనునది శరీరమును విడచుటవలన ఏర్పడునదేగాని ఆత్మస్వరూపము నశించుటవలనగాదు, అనిభావము ధారణ యనగా మనస్సు నొకదానిలోనిలబెట్టుట. శరీరమును విడిచి అనునది పోవుట అను దానిని విశేషించుటకై, అనగా పోవువిధమును జూపుటకై జెప్పబడినది.

(స్వకీయము) 17 వ అధ్యాయము 23 శ్లోకమునున్ను, ఛాందోగ్యోపనిషత్తు మొదటి ప్రపాఠకము 1 మొదలు 10 వరకుగల ఖండములున్ను చూడుడు.

శ్లో॥ అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః॥ 14

పద॥ అనన్యచేతాః - సతతం - యః - మాం - స్మరతి - నిత్యశః।
తస్య - అహం - సులభః - పార్థ - నిత్యయుక్తస్య (1) - యోగినః॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ అర్జునా! | తస్య | అటువంటి |
| యః | ఎవ్వడు | నిత్యయుక్తస్య | ఎల్లప్పుడు ఒకనిలకడచెందిన |
| సతతం మాం } | వేరువిషయములలో మనస్సు | యోగినః | యోగికి |
| అనన్య చేతాః } | నుంచక యెడతెగక నన్ను | అహం సులభః | నేను సులభముగా పొంద |
| నిత్యశః స్మరతి | చాలకాలము స్మరించునో | | దగినవాడను |

తా॥ ఓ అర్జునా! ఎవ్వడు వేరువిషయములలో మనస్సు నుంచక ఎడ తెగక నన్ను స్థిరముగ స్మరించునో, ఎల్లప్పుడు స్థిరమైన మనస్సుగల అట్టి యోగికి నేను సులభుడను (సులభముగా పొందదగినవాడను).

(1) నిత్యయుక్తస్య - స్థిరముగనన్ను పొందవలెనను ఆశతోగూడియున్న (రామానుజులు)

(శంకరభాష్యము) వేరువిషయములలో మనస్సు ప్రవర్తించనివాడైన ఏయోగి ఎల్లప్పుడు ఎడతెగక పరమేశ్వరుడనైన నన్ను చిరకాలము స్మరించుచుండునో, అట్లు ఎల్లప్పుడు మనస్సు ఒక నిలకడ చెందిన యోగికి నేను సులభముగా పొందదగినవాడను. 'చాలాకాలము' అనుదానిచే పొడవైన కాలము చెప్పబడుచున్నది. అరునెలలుగాని, 1 సంవత్సరముగానికాదు. మఱి యేమన తన జీవిత కాలమంతయు ఎడతెగక నెవ్వడు తలంచునో యనుడు. ఈ విధముగనే ఒకడు వేరొక దానిలో మనస్సు లేనివాడై భగవంతుడనైన నా యెడనే ఎల్లప్పుడు స్థైర్యముపొంది యుండవలెను.

(రామానుజులు) ఇంతవరకు ఐశ్వర్యమును గోరువారును, విముక్తాత్మస్వరూపమును పొందువారును ఉపాసించు మార్గమును జెప్పి ఇప్పుడు దీనిలో జ్ఞానినిగూర్చి చెప్పుచున్నాడు.

శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం ।
నాప్నువంతి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః ॥ 15

పద॥ మాం - ఉపేత్య - పునః - జన్మ - దుఃఖాలయం - అశాశ్వతం ।
న - అప్నువన్తి - మహాత్మానః - సంసిద్ధిం - పరమాం - గతాః ॥

| | | | |
|---|---|---|---|
| మాముపేత్య | నన్నుపొంది | పునః | మరలను |
| పరమాం సంసిద్ధిం | శ్రేష్ఠమైనమోక్షమును | దుఃఖాలయం | దుఃఖమునకువాసస్థానమున్ను |
| గతాః మహాత్మానః | పొందినమహాత్ములు (యోగులు) | అశాశ్వతం | అనిత్యమునైన |
| | | జన్మనాప్నువన్తి | జననమును పొందుటలేదు |

తా॥ నన్నుపొంది శ్రేష్ఠమైన మోక్షమునుపొందిన మహాత్ములు (యోగులు) : మరల దుఃఖములకు వాసస్థానముగను అనిత్యముగను ఉన్న జన్మాంతరమునుపొందుట లేదు.

(శంకరభాష్యము) భగవంతునియొక్క సులభముగా పొందదగిన స్వభావముచే అనగా భక్తులకు సులభముగ పొందదగినవాడు అనే కారణమువలన అగునట్టిది ఏదనునది దీనిలో జెప్ప బడుచున్నది. వారలు ఈశ్వరుడనైన నన్నుపొంది నా స్థితిని పొందినపిదప జన్మాంతరమును పొందుట లేదు. ఎట్టి జన్మాంతరమును పొందుటలేదు అనుదాని విశేషమును జెప్పుచున్నాడు. జననమనునది ఆధ్యాత్మికము మొదలగు దుఃఖములకు వాసస్థానము మాత్రముగాదు. నిలకడలేని స్వభావముగలది గూడ. మహాత్ములైన యతులు మోక్షమనెడి మేలైన స్థితిని బడసినవారై ఇట్టి జన్మాంతరమును పొందుటలేదు. ఐతే ఎవ్వరు నన్ను పొందుటలేదో వారలు మరలను తిరిగివచ్చుచున్నారు. (మఱలను పుట్టుచున్నారు), రజస్తమోగుణములుతొలగి శుద్ధముగ తేలియున్న సత్త్వగుణమును మాత్రము గలవారు నన్నుపొంది పిదప మోక్షమును పొందిరి. కావున సగుణబ్రహ్మోపాసకులకు క్రమముక్తి చూపబడినది.

(స్వకీయము) ఈ శ్లోకములో మోక్షమొందిన మహాత్ములు నన్నుపొంది జననమును పొందుటలేదు. అని జెప్పబడియున్నందున మోక్షమనునది వేరుగను నన్ను అనునది వేరుగను తోచుచున్నది. అట్లు వేరుకాదు. బ్రహ్మమును పొందుటయే మోక్షమొందుట. మోక్షమొందుటయే బ్రహ్మమునొందుట. దీనిలో నెట్టిభేదమున్నులేదు అనుదానిని చూపించుటకై 'మోక్షమొందినవార

నన్నుపొందినవాడగును' అని చెప్పినదిగ భావింపవలెను. భాష్యకారులున్ను వ్యాఖ్యాతలున్ను "నన్ను పొందిన పిదప జననమును పొందుటలేదు. ఏలనన శ్రేష్ఠమైన మోక్షమును పొందినవారలై నందుననే" అని అర్థముచేసియున్నారు. దీనిచేతను మునుపటి అధ్యాయము మొదలగువాటిచేతను బ్రహ్మమగుటయే మోక్షమని స్పష్టమైయున్నది.



శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున।
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే॥ 16

పద॥ ఆబ్రహ్మ భువనాత్ - లోకాః - పునరావర్తినః - అర్జున।
మాం - ఉపేత్య - తు - కౌంతేయ - పునః - జన్మ - న - విద్యతే॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున! | ఓ అర్జునా! | హే కౌంతేయ! | ఓ కుంతీపుత్రా! |
| ఆబ్రహ్మభువనాత్ | బ్రహ్మలోకముమొదలు | మాముపేత్యతు | నన్నుపొందినచో |
| లోకాః | సకలలోకములున్ను | పునర్జన్మ న విద్యతే | మరల జననములేదు. |
| పునరావర్తినః | మరల ఉత్పత్తిగలవి | | |

తా॥ ఓ అర్జునా! బ్రహ్మలోకము మొదలుగాగల సకలలోకములున్ను మరలఉత్పత్తిగలవి. అనగా మరల కలుగు స్వభావముకలవి. ఓ కుంతీపుత్రా! మఱి నన్ను పొందినవారికనగా మరుజననములేదు.

(శంకరులు) ఐతే నీకంటె వేరొకదానిని పొందినవారు మరలను తిరిగివచ్చుచున్నారా? అను ప్రశ్నకు ఉత్తరము దీనిలో జెప్పబడుచున్నది. భువనమనగా వస్తువులు కలుగుచోటు. మాం= నన్నొకనినే పొందినవారికి పునర్జన్మము, అనగా మఱల కలుగుట, లేదు.

(శ్రీధరులు) బ్రహ్మలోకములో ముక్తికి బోవుమార్గముగ మాత్రమున్నట్టి క్రమముక్తిని బొందువారలకు పునర్జన్మములేదు. వారలకు పునర్జననము జెప్పినదిగ భావింపగూడదు.

(రాఘవేంద్రులు) "బ్రహ్మలోకము మొదలుగనున్న" అనుదానిచే, బ్రహ్మలోకమునకున్ను క్రిందివైన సకలలోకములకున్ను అచ్చటనున్న జనులకున్ను పునర్జననము కలదని తాత్పర్యము. ఇట్లుచెప్పినందున బ్రహ్మలోకమునందున్నవారికి పునర్జననము లేదనియగును. "నన్నుపొందినవారికి పునర్జననము లేద"ని చెప్పబడియున్నందున బ్రహ్మలోకము నందున్నవారికి పునర్జననము కలదని తోచుచున్నది. ఇట్లు ఒకదానికొకటి విరుద్ధముగ తోచుచున్నదిగదా! అనిన "బ్రహ్మలోకములో నన్ను ఉపాసించుకొనియున్నవారికి పునర్జననములేదు." అనునదే "నన్నుపొందినవారికి" అనుదాని తాత్పర్యము. మిగతవారలకు జననముకలదు.

(స్వకీయము) బ్రహ్మలోకము మొదలుగాగల సకలలోకములున్ను పునర్జననముకలవను దానికి, బ్రహ్మలోకమున్ను దానిక్రిందివిగనున్న లోకములున్ను అనిగాని, బ్రహ్మలోకముపరకని గాని అర్థముగావచ్చును. పునర్జన్మ మొందించునవి లోకములా? అనినచో దానితాత్పర్య మట్లుగాదు. క్రమముక్తికి యోగ్యులు కానివారు బ్రహ్మలోకమునుగాని, మఱి ఏ లోకమునుగాని పొందినచో మరల జన్మమును పొందెదరు. మఱియు నాలోకముగూడ నశింపదగినదే. నశింపదగిన లోకమునే పురుషార్థమని తలంచి పొందినవారున్ను నశింపదగినవారలే కావున మోక్షమొందినగాని పునర్జన్మ విడువదని తాత్పర్యము.



శ్లో॥ సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః।
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః॥ 17

పద॥ సహస్రయుగపర్యంతం - అహః - యత్ - బ్రహ్మణః - విదుః।
రాత్రిం - యుగసహస్రాంతాం - తే - అహోరాత్రవిదః - జనాః॥

| | | | |
|---|---|---|---|
| అహోరాత్రవిదః | పగలురాత్రుల నెరింగిన | సహస్రయుగ పర్యన్తం | వెయ్యియుగములను కడపటి దిగ గలిగినదిగను |
| జనాః | జనులు | రాత్రిం | రాత్రిని |
| యే, తే | ఎవ్వరో, వారలు | యుగసహస్రాంతాం | వెయ్యియుగములను కడపటి దిగ గలదిగను |
| బ్రహ్మణః అహః | బ్రహ్మయొక్క పగలు | విదుః | ఎరింగెదరు |
| యత్ తత్ | ఏదో దానిని | | |

తా॥ పగలును, రాత్రిని, అనగా కాలపరిమాణము నెఱుంగు జనులు ఎవ్వరో వారలు బ్రహ్మయొక్క పగలు అనునది వెయ్యియుగములు ఎల్లగగలిగిన దనియు, రాత్రి యనునదియు వెయ్యియుగములు ఎల్లగగలిగినదనియు నిర్ణయించి ఎరింగియున్నారు.

(శంకరులు) బ్రహ్మలోకమునులోబరచి సకలలోకములును ఎందువలన మరల తిరిగి వచ్చు స్వభావముగలవనగా, కాలమును ఎల్లగాగలిగియున్నందున. అదియెట్లని చెప్పబడుచున్నది. బ్రహ్మకు, అనగా విరాట్ప్రజాపతికి, రాత్రిపగళ్ళయొక్క పరిమాణము వేయేసి మహాయుగములు ఎవ్వరు పగలును రాత్రిని ఎరుంగుచున్నారనుదానిని చెప్పుచున్నాడు. పగలును రాత్రిని ఎరింగిన వారలు, అనగా కాలపరిమాణము నెరుంగు జనులు, బ్రహ్మయొక్క ఒకపగలు వెయ్యి చతుర్యుగ పరిమితమనియు, రాత్రియు నదేవిధముగ గలదనియు నెరుంగుదురు. ఈ విధముగ ఆ లోకములు కాలముచేత హద్దుగలవైయున్నందున మఱలను తిరిగి పుట్టుస్వభావముగలవి. అని తాత్పర్యము.

(శ్రీధరులు) ఈ శ్లోకమునకన్వయము - బ్రహ్మణః = బ్రహ్మకు, యత్ అహః - ఏ పగలును, సహస్రయుగపర్యంతం = వెయ్యి యుగములను కడపటిదిగ గలదిగను, రాత్రిం = రాత్రిని, యుగసహస్రాంతాం = వేయి యుగములను ముగింపుగ గలదిగను, యేజనాః = ఏజనులు, విదుః = ఎరింగియున్నారో, తే = వారలు, అహోరాత్రవిదః = పగలు రాత్రుల నెరింగియున్నవారలు, అని భావము. బ్రహ్మలోకము చాలాకాలము అనువర్తించియున్నదనియు శ్రేష్ఠమైనదనియు చూపుటకై ఈ శ్లోకము ప్రారంభింపబడినది. వేయి యుగములనగా వేయి చతుర్యుగములని అర్థము.

(మధ్వులు) బ్రహ్మణః = పరబ్రహ్మముయొక్క, సహస్రయుగపర్యంతం = యుగసహస్రాంతం అనేక వేలయుగములను. అనగా రెండు పరార్థములు, లేక చతుర్ముఖబ్రహ్మయొక్క ఆయుష్యమును పరిమాణముగగల కాలము. పరబ్రహ్మమునకు ఇట్టి అనేకవేల చతుర్యుగములను ఒక పగలుగను, అనేకవేల చతుర్యుగములను ఒక రాత్రిగను ఎరింగినవారలు రాత్రింబగలు నెరింగిన వారలు. అనగా బ్రహ్మలోకము మొదలు దానిక్రిందివైన సకలలోకములున్ను ప్రళయములో మునుగు కాలమగు మహావిష్ణువుని యోగనిద్రాకాలమును రాత్రిగను, సకల ప్రపంచములున్ను సృష్టియగు కాలమును పగలుగను ఉపచారముగ జెప్పబడినదని గ్రహింపవలెను.

(స్వకీయము) ఒకబ్రహ్మయొక్క ఆయుస్సును (శకాబ్దమును) లెక్కించుట ఎట్లనగా:—

| | | | |
|---|---|---|---|
| 18 కండ్లరెప్పపాటుల ప్రొద్దుగలది | కాష్ఠ 1 | 2 పక్షములు | మాసము 1 |
| 30 కాష్ఠలు | కల 1 | 2 మాసములు | ఋతువు 1 |
| 30 కలలు | ముహూర్తము 1 | 3 ఋతువులు | అయనము 1 |
| 30 ముహూర్తములు | రాత్రిపగలుగలదినము 1 | 2 అయనములు | సంవత్సరము 1 |
| 15 దినములు | పక్షము 1 | 1 మనుష్యసంవత్సరము | దేవదినము 1 |

{ ఉత్తరాయణము 6 మాసములు పగలు }
{ దక్షిణాయణము 6 మాసములు రాత్రి }

| | | | | |
|---|---|---|---|---|
| 490 | దేవదినములు | | గలది | దేవవర్షము |
| 4800 | దేవవర్షములు, లేక | 17,28,000 | మనుష్యవర్షములు | కృతయుగము |
| 3600 | " | 12,96,000 | ,, ,, | త్రేతాయుగము |
| 2400 | " | 8,94,000 | ,, ,, | ద్వాపరయుగము |
| 1200 | " | 4,32,000 | ,, ,, | కలియుగము |

ఇటువంటి 4 యుగములుచేరినది, అనగా దేవవర్షములు 12000, మనుష్యవర్షములు 43,20,000 గలది చతుర్యుగము 1. ఇట్టి చతుర్యుగములు 1000 గలది చతుర్ముఖబ్రహ్మయొక్క ఒక్కపగలు. ఈపగటి కాలములో 14 మన్వంతరములగుచున్నవి. (71 చతుర్యుగములుగలది ఒకమన్వంతరము, చతుర్యుగములు 1000 గలది బ్రహ్మకు 1 రాత్రి, ఇట్టి పగలు, రాత్రి చేరినదినము 360 గలది బ్రహ్మకు 1 సంవత్సరము ఇట్టి 100 వర్షములుగలది బ్రహ్మయొక్క ఆయుష్యము. ఈఆయుష్య కాలము పరా అని చెప్పబడుచున్నది. 1 పరాకు (311040000000000) మూడుకోట్ల పదునొకండు లక్షల వేలకోట్ల మనుష్యవర్షములగుచున్నది.

పైజెప్పిన కృతయుగములో 800 సంవత్సరములున్ను, త్రేతాయుగములో 600 సం-న్ను, ద్వాపరయుగములో 400 న్ను కలియుగములో 200 న్ను, సంధియని జెప్పబడును. ఇట్టిప్రతి సంధిసంవత్సరములలోను సగము పూర్వసంధియనియు, మిగతసగము ఉత్తరసంధియనియు చెప్ప బడును. విష్ణుపురాణము ప్రథమాంశము 3-వ అధ్యా. లింగపురాణము అధ్యా, 4, కూర్మ పురా. అధ్యా. 5, పద్మపురాణము సృష్టిఖండము అధ్యా. 36 వీటినిచూడుడు.

పైజెప్పిన సంధియనునది యెట్లనగా మొదటియుగమైన కృతయుగమునకు కడపట 400 సంవత్సరములున్ను, 2 వ యుగమైన త్రేతాయుగమునకారంభములో 400 సంవత్సరములున్ను జేరిన 800 సంవత్సరములు మొదటియుగమునకు సంధి. ఆ విధముగనే 2-వ యుగము కడపట 300 సం॥లు, మూడవయుగమున కారంభములో 300 సంవత్సరములుచేరిన 600 సం॥లు రెండవ యుగమునకు సంధి. ఈ విధముగనే మిగతయుగములకు సంధి సంవత్సరములను లెక్కించవలెను, ఇట్టి సంధి సంవత్సరముల ప్రయోజనమేమనగా కృతయుగమునకు కడపటనున్న 400 సంవత్సరము లనెడి సంధిలోనే త్రేతాయుగముయొక్క ధర్మము మొదలగు గుణములు కనబడును. త్రేతాయుగ అరంభము 400 సంవత్సరములనెడి సంధికాలములో కృతయుగముయొక్క ధర్మము మొదలగు గుణములు ఉంటూనేయుండును. అట్టి సంధి సంవత్సరములు ముగిసిన పిదప ఆ యుగమునకు స్వభావమైన ధర్మము మొదలగు గుణములు మాత్రముండును. ఇట్టి సంధి సంవత్సరములను త్రోసి వేయగా మిగిలియున్న సంవత్సరములే యుగమని చెప్పబడుచున్నది. మిగత యుగములకును ఈ విధముగనే సంధి సంవత్సరముల నెరుంగవలెను.



శ్లో॥ అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవన్త్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే॥ 18

పద॥ అవ్యక్తాత్ (1) - వ్యక్తయః - సర్వాః - ప్రభవన్తి - అహరాగమే।
రాత్ర్యాగమే - ప్రలీయన్తే - తత్ర - ఏవ - అవ్యక్తసంజ్ఞకే॥

| | | | |
|---|---|---|---|
| అహరాగమే | పగలు వచ్చునప్పుడు | రాత్ర్యాగమే | రాత్రి వచ్చినప్పుడు |
| అవ్యక్తాత్ | అవ్యక్తమునుండి | అవ్యక్త సంజ్ఞకే | అవ్యక్తమను పేరుగల |
| సర్వాః వ్యక్తయః | చరాచర వ్యక్తులన్నియు | తత్రైవ ప్రలీయన్తే | దానిలోపలనే దాగుకొనుచు న్నవి. |
| ప్రభవన్తి | బయటబడుచున్నవి | | |

తా॥ బ్రహ్మయొక్క పగటికాలములో, అనగా మేలుకొనియుండు కాలములో చరాచరములైన దృశ్యములన్నియు ఆ అవ్యక్తమునుండి బయట బడుచున్నవి. బ్రహ్మకు రాత్రి వచ్చునప్పుడు, అనగా నిద్రసమయమున అట్టి అవ్యక్తమను పేరుగల దానిలోనే, అనగా నిద్రావస్థలోనున్న ప్రజాపతి యెడనే అవి దాగుకొనుచున్నవి.

(1) అవ్యక్తాత్ - ప్రజాపతియొక్క నిద్రావస్థ. మాయకాదు (శంకరులు). కారణమునుండి (శ్రీధరులు) చతుర్ముఖ బ్రహ్మయొక్క దేహమునుండి (రామానుజులు). విష్ణువువద్దనుండి (మధ్వులు). (శంకరులు) ప్రజాపతియొక్క పగలులోను రాత్రిలోను ఏది జరుగుచున్నదో అది దీనిలో జెప్పబడు చున్నది.

(శ్రీధరులు) మునుపటి శ్లోకములో "యత్ అహః = ఏదిపగలో" అని చెప్పబడియున్నది గదా? ఈచోట ఆ బ్రహ్మయొక్క పగలనియు రాత్రియనియు గ్రహించుకొనవలెను.

శ్లో॥ భూతగ్రామస్స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే॥ 19

పద॥ భూతగ్రామః - సః - ఏవ - అయం - భూత్వా - భూత్వా - ప్రలీయతే।
రాత్ర్యాగమే - అవశః (1) పార్థ - ప్రభవతి - అహరాగమే॥

| | | | |
|---|---|---|---|
| పార్థ! | ఓ పార్థా! | రాత్ర్యాగమే | రాత్రివచ్చునప్పుడు |
| స ఏవాయం భూతగ్రామః | (మునుపటి కల్పమునందుండిన) అదే -ఈ భూతవర్గములే | ప్రలీయతే | దాగుచున్నది |
| | | అహరాగమే | పగలువచ్చునప్పుడు |
| అవశః భూత్వా భూత్వా | అవశముగ బుట్టిపుట్టి | ప్రభవతి | బయటపడుచున్నది |

తా॥ ఓ పార్థా! (స్థావరజంగమములైన) యే భూతవర్గములు మునుపటి కల్పము నందుండినవో అట్టివే ఈ (ఇప్పుడున్న) భూతవర్గములు, తాను అవశముగ బుట్టిపుట్టి (బ్రహ్మకు) రాత్రివచ్చు కాలమున నశించి లీనమై, పగలు వచ్చు కాలమున అవశముగనే కలిగి బైటబడుచున్నవి.

(1) అవశః - కర్మాధీనమై (రామానుజులు). భగవదధీనమై (రాఘవేంద్రులు). అధ్యా-9-శ్లో-8 చూడుడు (స్వకీయము).

(శంకరులు) ఒకడు తాను చేయనివాటి ఫలము ననుభవించుచున్నాడు. తానుజేసిన వాటిఫలము ననుభవించుటలేదు. అనిచెప్పు కుతర్కమును నివర్తించుట కొఱకును, బంధము మోక్షము వీటినిగూర్చి శాస్త్రప్రవృత్తికి ఫలముగలదని చూపుటకొఱకును, అవిద్యమొదలగు దోషములు మూలముగగల ధర్మాధర్మములనెడి కర్మయొక్క బలముచే స్వతంత్రతలేని ప్రాణివర్గములు పుట్టిపుట్టి మరణించుచున్నవి. కావునవాటికి సంసారములో వైరాగ్యమును కలుగజేయుట కొఱకును భగవంతుడీ శ్లోకమును ప్రసాదించుచున్నాడు.

స్థావరజంగమములైన ఏభూతవర్గము బ్రహ్మయొక్క మునుపటి కల్పముననుండెనో అదియే ఇప్పుడున్నదియు. ఇదివేరైనదికాదు. కల్పమనగా బ్రహ్మయొక్క దినమొక్కటి. బ్రహ్మకు పగలు వచ్చునప్పుడు అవశముగబైటబడి పగలుయొక్క కడపటి భాగములో మఱలను అవ్యశము గనే అంతరించుచున్నది, అనగా నశించిపోవుచున్నది,

(రామానుజులు) ఐశ్వర్యమునుగోరి బ్రహ్మలోకము మొదలగు లోకములను బొందిన వారలు వారు పొందిన లోకమున్ను లోకమునందలి ఐశ్వర్యమున్ను నశించుటవలన మరల భూలోకమున జనన మొందెదరనునది దీనిచే బైటబెట్టబడినది.

(స్వకీయము) ఈ అధ్యాయము 16 మొదలు 19 వరకుగల శ్లోకములచే తెలిసికొనవలసిన దేమనగా సకల దేవతలకు మునుపటివాడును వారలకు నియామకుడునైన బ్రహ్మకుగూడ కాలపరిమాణము ఏర్పడియున్నందునను సృష్టిలో నిమిడియున్న సకలలోకములకును మేలైనదైన బ్రహ్మలోకముగూడ నశింపదగినదిగనున్నందునను మిగతప్రాణులయొక్కయు మిగతలోకముల యొక్కయుగతి ఇట్టిదేయని తానుగ తెలియగలదు. కావుననిట్టి ప్రపంచములోనిత్యమైన లేకనాశములేని ప్రయోజనములేదని విరక్తినిపొంది శాశ్వతమైన మోక్షమునొందుటకు ప్రయత్నించ వలెననునదే.

~~~~~~~~~~

శ్లో॥ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ 20

పద॥ పరః - తస్మాత్ - తు - భావః - అన్యః - అవ్యక్తః - అవ్యక్తాత్ - సనాతనః ।
యః - సః - సర్వేషు - భూతేషు - నశ్యత్సు - న - వినశ్యతి ॥

| | | | |
|---|---|---|---|
| తు | ఐతే | యః భావః | ఏ వస్తువు కలదో |
| తస్మాత్ అవ్యక్తాత్ | ఆ అవ్యక్తమునకంటె | సః | అది |
| అన్యః | విలక్షణముగను | సర్వేషు భూతేషు | భూతములన్నియు |
| అవ్యక్తః | ఇంద్రియములకు గోచరము కాని అవ్యక్తముగను | నశ్యత్సు | నాశమొందినను |
| | | న వినశ్యతి | నశించుటలేదు. |
| పరః సనాతనః | ఉత్కృష్టముగను, నిత్యముగను ; | | |

తా॥ ఐతే మునుపు జెప్పిన అప్రకృతియనే అవ్యక్తముకంటె విలక్షణముగను, అనగా వేరైనదిగను, ఇంద్రియములకు గోచరముకాని అవ్యక్తముగను, ఉత్కృష్టముగను, అన్నికాలములలో నున్నట్టిదియునైన వస్తువు, అనగా పరబ్రహ్మమేదిగలదో అది సకలభూతములును నశించిపోవునప్పుడును తాను నాశమును బొందుటలేదు.
~~~~~~~~~~

(శంకరభాష్యము) "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అనునది మొదలగు శ్లోకములచే మునుపు ఏ నశించని వస్తువు విస్తరించి చెప్పబడినదో దానిని పొందుటకు మార్గము గుర్తింపజేసి తెలియ బరచబడినది. ఇకనిప్పుడు అట్టినశించని వస్తువునే ఇట్టిదని గుర్తించి చూపి తెలియబరచవలెనను తాత్పర్యముతో ఈ యోగమార్గముచే పొందదగిన దెట్టిదని భగవంతుడు దీనిలో ననుగ్రహించు చున్నాడు.

బ్రహ్మము దేనికంటె వేరైనది? అనిన మునుపుజెప్పిన ఆ అవ్యక్తమునకంటె. "తు" శబ్దము ఇచ్చట చెప్పగోరిన నశించనివస్తువైన బ్రహ్మము అవ్యక్తమునకంటె వేరైనదను విశేషణ మును అర్థముగ గలది. "భావః" అనగా అక్షరమను పేరుగల పరబ్రహ్మము. అది అవ్యక్తము కంటే వేరుగనున్నను ఒకటే స్వభావముగలదిగ నుండవచ్చునను సందేహము కలుగగలదు, దానిని నివర్తించుటకై "అన్యః = విలక్షణమైనది" అని జెప్పబడినది. "అవ్యక్తః" అనగా ఇంద్రియముల కందనిది. "పరస్తస్మాత్ = దానికంటె వేరైనది" అని చెప్పబడినదిగదా. దేనికంటెవేరైనది? భూత వర్గమునకు విత్తనమై, మునుపుచెప్పిన అవిద్యయగు అవ్యక్తముకంటె వేరైనది. బ్రహ్మము దీని కంటె సర్వదా వేరైనవస్తువని తాత్పర్యము. ఏది ఎల్లప్పుడుగలదో అది బ్రహ్మమొదలగు సకలభూత ములున్ను నశించిపోవునప్పుడున్ను తాను నశించుటలేదు. అవ్యక్తము = ప్రకటముగ ఉండనిది.

(రామానుజులు) 20-21-శ్లోకములకు ఒకే అన్వయము. తస్మాదవ్యక్తాత్ - ఆ అచేతన ప్రకృతికంటె (బ్రహ్మయొక్క దేహముకంటె) పరః = పురుషార్థము కావున ఉత్తమముగను, అన్యః = జ్ఞానాకారముచేత వేరుగను, అవ్యక్తః = ఏ ప్రమాణముచేతను తెలిసికొనుటకు వీలులేనట్టిది కావున కనబడనిదిగను, సనాతనః = నిత్యముగనున్న, యఃభావః = ఏ వస్తువు, సర్వేషు భూతేషు = కార్య కారణములతోగూడిన పంచమహాభూతములు మొదలగునవి, నశ్యత్సు = నశించుకాలములోను, నవినశ్యతి = నాశమొందుటలేదో, సః = అట్టిచేతన ప్రకృతియైన పురుషుడు, అక్షర ఇత్యుక్తః = అక్షరుడని చెప్పబడుచున్నాడు. తం = వానిని, పరమాంగతిం = ప్రకృతివిముక్తాత్మ స్వరూపమనే పరమమైన గతియని, ఆహుః, వేదము నెరింగినవారలు చెప్పుచున్నారు. యం = ఏప్రకృతివిముక్త మైన (జీవ) ఆత్మస్వరూపమును, ప్రాప్య = పొంది, న నివర్తన్తే = తిరుగుటలేదో (పునర్జనన మొందుటలేదో) తత్ = ఆ స్వరూపము. మమ = నాకు, పరమంధామ = ప్రేరేపించుటకు ముఖ్య మైన పాత్రమగును. అనగా మిగత జడచేతనములున్ను నా ప్రేరేపణకు పాత్రములైనను, ప్రకృతి విముక్తమైన ఆత్మ నా ప్రేరేపణకు (ఆజ్ఞకు) ముఖ్యపాత్రమని తాత్పర్యము,

(గీ. వి.) తస్మాదవ్యక్తాత్ = ఆ భూత సమూహములకంటె, అన్యః = విలక్షణుడుగను, భావః = స్వతంత్రుడుగను, పరః = ఉత్తముడుగను, సనాతనః = అనాదిగనుఉన్న, యః అవ్యక్తః = ఏ భగవంతుడు, సర్వేషుభూతేషు = సకలభూతములున్ను, నశ్యత్సు = నశించినను, నవినశ్యతి = నాశమొందుటలేదో, సతు = అతడే, అక్షరఇత్యుక్తః = అక్షరుడని చెప్పబడుచున్నాడు, తం = వానిని, పరమాంగతిం = పొందదగిన ఉత్తమమైనస్థానమని, ఆహుః = జ్ఞానులు చెప్పుచున్నారు. యం = దేనిని, ప్రాప్య = పొంది, న నివర్తన్తే = తిరుగుటలేదో, తత్ = అది, మమ = నాయొక్క, పరమం ధామ = శ్రేష్ఠమైన స్వరూపము. 20-21-వ శ్లోకములకు ఒకే అన్వయము.

శ్లో॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిం।
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ 21

పద॥ అవ్యక్తః - అక్షరః - ఇతి - ఉక్తః - తం - ఆహుః - పరమాం - గతిం।
యం - ప్రాప్య - న - నివర్తన్తే - తత్ - ధామ - పరమం - మమ ॥

| | | | |
|---|---|---|---|
| యః | ఏ (బ్రహ్మము) | యం | దేనిని |
| "అవ్యక్తః అక్షరః" | "అవ్యక్తము అక్షరము" | ప్రాప్య | పొంది |
| ఇతి ఉక్తః | అని చెప్పబడినదో | నని వర్తన్తే | తిరిగి వచ్చుటలేదో |
| తం | దానిని (ఆ బ్రహ్మమును | తత్ | అది |
| పరమాంగతిం | శ్రేష్ఠమైనగతియని | మమ | నాయొక్క |
| ఆహుః | (వేదములు) చెప్పుచున్నవి. | పరమంధామ | మేలైనచోటు (పరమపదము) |

తా॥ ఎవ్వడు కనబడనివాడనియు, నాశరహితుడనియు వేదములో జెప్పబడుచున్నాడో అతనిని పరమపురుషార్థమని వేదములు జెప్పుచున్నవి. దేనినిపొంది, తిరుగుట లేదో (మరల జనన మొందుటలేదో) అట్టి ఉత్తమమైన స్వరూపము నాయది.

శ్లో॥ పురుషస్స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా।
యస్యాన్తస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ 22

పద॥ పురుషః - సః - పరః - పార్థ - భక్త్యా - లభ్యః - తు - అనన్యయా (1)।
యస్య - అన్తస్థాని - భూతాని - యేన - సర్వం - ఇదం - తతమ్ ॥

| | | | |
|---|---|---|---|
| హేపార్థ! | ఓపార్థా! | తతం | వ్యాపింపబడియున్నదో |
| యస్య | ఎవనిలోపల | సః పరః పురుషః | అట్టిపరమ పురుషుడు |
| భూతాని | ప్రాణులన్నియు | అనన్యయా | వేరొకటిలేని |
| అన్తస్థాని | ఉన్నవో | | భక్తిచేతనే |
| యేన | ఎవనిచేత | లభ్యః | పొందదగినవాడు |
| సర్వం ఇదం | ఈసకల ప్రపంచమున్ను | | |

తా॥ ఓ పార్థా! ప్రాణులు ఎవనిలోపల (ఇమిడి) ఉన్నవో, ఎవనిచే ఈ సకల ప్రపంచమున్ను వ్యాపింపబడియున్నదో అట్టి పరమపురుషుడు వేరు ఆసక్తిలేని భక్తిచే పొందదగినవాడు.

(స్వకీయము) ఈ శ్లోకమునకు రామానుజులు పరమాత్మ పరముగను, మునుపటి శ్లోకమునకు ముక్తాత్మ పరముగను అర్థముజేసియున్నారు.

(1) అనన్యయా = ఆత్మవిషయమైన (శంకరులు).

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ 23

పద॥ యత్ర - కాలే (1) - తు - అనావృత్తిం - ఆవృత్తిం - చ - ఏవ - యోగినః (2)।
ప్రయాతాః - యాన్తి - తం - కాలం (3) - వక్ష్యామి - భరతర్షభ ॥

| | | | |
|---|---|---|---|
| హేభరతర్షభ! | ఓ భరతులలో శ్రేష్ఠుడా! | అవృత్తిం చైవ | పునర్జననమును (తిరిగి వచ్చుటను) |
| యత్రకాలేతు | ఏకాలములో | | |
| ప్రయాతాః | (దేహమును విడిచి) పోయిన | యాన్తి | పొందెదరో |
| యోగినః | యోగులు | తంకాలం | ఆకాలమును |
| అనావృత్తిం | అపునర్జననమును (తిరిగి రాకుండుటను) | వక్ష్యామి | చెప్పుచున్నాను. |

తా॥ ఓ అర్జునా! ఏకాలములో దేహమును విడచిపోవు యోగులు పునర్జన్మమును పొందరో, (ఏకాలములో దేహమును విడచి పోవుయోగులు) పునర్జననమును పొందెదరో ఆకాలమును జెప్పెదను వినుము.

(1) కాలే - కాలాభిమాని దేవతలు నివసించిన లోకముల మార్గముగా (శ్రీధరులు, రామానుజులు, మధ్వులు), (గీ. వి.)

(2) యోగినః - జ్ఞానయోగులు, కర్మయోగులు (శంకరులు, శ్రీధరులు, రామానుజులు) (గీ. వి.)

(3) కాలం - కాలాభిమానిదేవతలు నివసించిన లోకముల మార్గమును (శ్రీధరులు, రామానుజులు మధ్వులు,) (గీ. వి.)



శ్లో॥ అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24

పద॥ అగ్నిః - జ్యోతిః (1) - అహః (2) - శుక్లః - (3) - షణ్మాసాః - ఉత్తరాయణమ్ (4), తత్ర - ప్రయాతాః - గచ్ఛన్తి - బ్రహ్మ - బ్రహ్మవిదః - జనాః ॥

| | | | |
|---|---|---|---|
| అగ్నిః | అగ్ని | తత్ర | దానిలో |
| జ్యోతిః | ప్రకాశము | ప్రయాతాః | పోయిన |
| అహః | పగటికాలము | బ్రహ్మవిదః | బ్రహ్మజ్ఞానులైన |
| శుక్లః | శుక్లపక్షము | జనాః | జనులు |
| ఉత్తరాయణం | ఉత్తరాయణము | బ్రహ్మ | పరబ్రహ్మమును |
| షణ్మాసాః | ఆరునెలలు | గచ్ఛన్తి | పొందుచున్నారు. |

తా॥ అగ్ని, ప్రకాశము, పగటికాలము, శుక్లపక్షము, ఆరు మాసములుగల ఉత్తరాయణము, వీటికి అభిమానిదేవతలయొక్క లోకముల మార్గముగాబోవు జ్ఞానులు పరబ్రహ్మమును (క్రమముగ) పొందెదరు.

(1) జ్యోతిః - అర్చిస్ఆనుదేవత (గీ. వి.)

(2) అహః - అభిజిద్దేవత, అనగా మధ్యాహ్నకాలమునకు అభిమాని దేవతతోసహా పగటికాలమునకు అభిమానిదేవత (గీ, వి.)

(3) శుక్లః - పౌర్ణమికి అభిమానదేవతతోసహా శుక్లపక్షాభిమానిదేవత (గీ. వి,)

(4) ఉత్తరాయణమ్ - ఉత్తరాయణములోనున్న ఆరునెలలలో ఒక్కొక్క మాసాభిమానిదేవతల లోకమునున్ను, పిదప ఉత్తరాయణాభిమాని దేవతయొక్క లోకమునున్ను (గీ. వి.)

విషువాభిమాని దేవతగూడ దీనిలో జేరినట్లు గ్రహింపదగును. (మధ్వులు గీ. వి.) (శంకరులు, శ్రీధరులు) ఉపాసకులు క్రమక్రమముగ ఆయాలోకములను పొంది పిదప బ్రహ్మమును పొందుచున్నారు. వీరలే క్రమముక్తిని పొందువారలు.



శ్లో॥ ధూమో రాత్రిస్తథా కృష్ణఃషణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే॥ 25

పద॥ ధూమః - రాత్రిః - తథా - కృష్ణః - షణ్మాసాః - దక్షిణాయనమ్।
తత్ర - చాంద్రమసం - జ్యోతిః - యోగీ - ప్రాప్య - నివర్తతే॥

| | | | |
|---|---|---|---|
| ధూమః | పొగ | తత్ర | దానిలో |
| రాత్రిః | రాత్రి | (ప్రయాతః) | పోయిన |
| తథా | ఆ విధముగనే | యోగీ | యోగియైనవాడు |
| కృష్ణః | | చాంద్రమసంజ్యోతిః | చంద్రునికాంతిని |
| దక్షిణాయనం షణ్మాసాః | దక్షిణాయనము ఆరుమాసములు | ప్రాప్య | పొంది |
| | | నివర్తతే | తిరిగివచ్చుచున్నాడు. |

తా॥ పొగకు రాత్రికి కృష్ణపక్షమునకు దక్షిణాయనమునకు అభిమానులైన దేవతల లోకముల మార్గముగా బోవుయోగి చంద్రప్రకాశముగల స్వర్గలోకమును పొంది మరలుచున్నాడు. (పునర్జన్మమును పొందుచున్నాడు.)

(రాఘవేంద్రులు) ఈధూమాది మార్గములో పితృలోకాదులున్ను చేరినవిగ గ్రహింపవలెను.

(గీ. వి.) మునుపటి 24-వ శ్లోకములో జెప్పిన అర్చిరాది మార్గములో బోవువాడెవ్వడనగా అంత్యకాలమున బ్రహ్మమును స్మరించుచు దేహమును విడిచెడివాడు. అతడు మోక్షమొందదగిన వాడే. ఈ 25-వ శ్లోకమున జెప్పిన ధూమాదిమార్గమున బోవువాడెవ్వడనగా కర్మయోగిగనుండి అంత్యకాలమున బ్రహ్మమును స్మరింపక దేహమును విడిచెడివాడు. అతడు స్వర్గాది లోకములను పొందదగినవాడే. ఇష్టమైన కాలమునందును ఇష్టమైనమార్గమునందును బ్రహ్మలోకము మొదలగు లోకములలో సంచరించు, లేక ఆయాలోకములలో నివసించు మిగతజ్ఞానులున్ను, కర్మిష్ఠులున్ను ఈరెండు మార్గములలో నొకదానియందే పోవలెననుట ఆవశ్యకము గాదు.



శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః॥ 26

పద॥ శుక్లకృష్ణే (1) - గతీ - హి - ఏతే - జగతః - శాశ్వతే - మతే।
ఏకయా - యాతి - అనావృత్తిం - అన్యయా - ఆవర్తతే - పునః॥

| | | | |
|---|---|---|---|
| శుక్లకృష్ణే | ప్రకాశము చీకటిగానుండు శుక్లకృష్ణపక్షములు మొదలగువాని అభిమాని దేవతల లోకములైన | జగతః | (జ్ఞానులు కర్ములైన అధికారులుగల) జగమునకు |
| | | శాశ్వతే మతే | శాశ్వతమైనవని తలంపబడియున్నవి |
| విశేహి గతీ | ఇట్లిప్రసిద్ధములైన మార్గములు | | |

| | | | |
|---|---|---|---|
| ఏకయా | (మునుపటి) ఒకమార్గముచేత | అన్యయా | మఱియొకమార్గముచే |
| అనావృత్తిం | అపునర్జన్మమును | పునః | మఱలను |
| యాతి | పొందుచున్నాడు | ఆవర్తతే | జన్మమును పొందుచున్నాడు. |

తా॥ (మునుపుచెప్పబడిన) శుక్ల కృష్ణ పక్షములు మొదలగువాని అభిమాని దేవతల లోకములగు మార్గములు జ్ఞానులకును కర్మిష్ఠులకును (వెవ్వేరుగ) శాశ్వతముగ గలవని నా యభిప్రాయము. మొదటి మార్గమున బోవు జ్ఞానులు పునర్జన్మను పొందుటలేదు. వెనుకటి మార్గములోబోవు సకామ కర్మిష్ఠులు పునర్జన్మమును పొందుచున్నారు.

(1) శుక్లకృష్ణే - శుక్ల = జ్ఞానప్రకాశము. కృష్ణ = అజ్ఞానము (శంకరులు). శుక్ల = ప్రకాశము గలది. కృష్ణ = చీకటిగలది. (శ్రీధరులు).

(స్వకీయము) ఈ యధ్యాయమునందలి 24 వ శ్లోకమున ప్రకాశముగల (అర్చిరాది) మార్గమొక్కదానిని, 25 వ శ్లోకమున అంధకారముగల (ధూమాది) మార్గమొక్కదానినిజెప్పి, ఈ శ్లోకములో ఆ రెండు మార్గముల బోవదగినవార లిట్టివారు, వారు పొందు ఫలమిట్టిదని చెప్పబడినది. (24 వ శ్లోకములో) బ్రహ్మవిదోజనాః = బ్రహ్మజ్ఞానులైనజనులు అనియు (25 వ శ్లోకమున) యోగీ - అనియు చెప్పియుండుటవలన వ్యాఖ్యాతలు వారిని వరుసగా జ్ఞానియనియు, కర్మయోగియనియు అర్థముచేసియున్నారు. అద్వైత సిద్ధాన్తము ననుసరించి విదేహకైవల్యమగు సద్యోముక్తిని పొందదగిన పరమార్థ సన్న్యాసియగు జీవన్ముక్తుడు, పైకనిన అర్చిరాదిమార్గమున వెళ్ళవలసినవాడగునా? (క్షుద్రకర్ములు) పాపపుణ్య మిశ్రకర్ములు పైకనిన రెండు మార్గములలో ఏ మార్గమునందుగాని వెళ్ళుటకు యోగ్యులగుదురా అనుసందేహము జనింపవచ్చును. సద్యోముక్తి అనగా జీవన్ముక్తదశనుండి ప్రారబ్ధదేహము పోయినతోడనే విదేహకైవల్య మొందుట. ఇతనికి వెళ్ళవలసినమార్గమనునదే లేదు.

"యత్ర యత్ర మృతో జ్ఞానీ యేన వా కేన మృత్యునా।
యధా సర్వగతం వ్యోమ తత్ర తత్ర లయం గతః ॥
ఘటాకాశమివాత్మానం విలయం వేత్తి తత్త్వతః।
సగచ్ఛతి నిరాలంబం జ్ఞానలోకం సమన్తతః ॥"

జ్ఞానియైనవాడు యేయే చోట ఏ విధముగ మరణించినను అంతటవ్యాపించిన ఆకాశమువలె ఆయా చోటనే లయము నొందుచున్నాడు. వాస్తవముగ ఘటాకాశమువలె (ఘటము పగిలినతోడనే ఘటాకాశము మహాకాశములో లయమునొందుటవలె) ఆత్మలయమొందునని ఎరుంగదగినది. అతడు నిరాలంబమైన (తనకాశ్రయమైన వస్తువుగలవాడు కానివాడై) జ్ఞానప్రకాశమునంతట పొందుచున్నాడు. (పైంగలోపనిషత్తు 4 వ అధ్యాయమును చూడుడు.) క్రమముక్తిని పొందదగినవాడున్ను నిష్కామ కర్మచే చిత్తశుద్ధిద్వారా జ్ఞానమొందినవాడున్ను ఎవ్వడుగలడో అతడే అర్చిరాది మార్గముగ పోవువాడు. ఇట్టి రెండు విధములైన ముక్తుల విషయమై వరాహోపనిషత్తు 4-వ అధ్యాయమున చెప్పబడియున్నదేమనగా-

"శుకో ముక్తోవామదేవోపి ముక్తస్తాభ్యాం వినా ముక్తి భాజో న సన్తి,
శుకమార్గం యేఽనుసరన్తి ధీరాః సద్యో ముక్తాస్తే భవన్తీహ లోకే।

వామదేవం యేఽనుసరన్తినిత్యం మృత్వా జనిత్వాచ పునః పునస్తత్,
తే వై లోకే క్రమముక్తాభవన్తి యోగైస్సాంఖ్యైః కర్మభిస్సత్వయుక్తైః।
శుకశ్చ వామదేవశ్చ ద్వేస్సృతీదేవనిర్మితే,
శుకో విహంగమః ప్రోక్తో వామదేవః పిపీలికా।
అతద్వ్యా వృత్తిరూపేణ సాక్షా ద్విధిముఖేనవా,
మహావాక్య విచారేణ సాంఖ్యయోగ సమాధినా।
విదిత్వా స్వాత్మనోరూపమసంప్రజ్ఞాసమాధితః,
శుకమార్గేణ విరజాః ప్రయాన్తి పరమంపదం।
యమాద్యాసనజాయాస హఠాభ్యాసాత్పునః పునః,
విఘ్నబాహుళ్య సంజాత అణిమాది వశాదిహ।
అలబ్ధ్వావిఫలం సమ్యక్పునర్భూత్వా మహాకులే,
పూర్వవాసన యైవాయం యోగాభ్యాసం పునశ్చరన్।
అనేకజన్మాభ్యాసేన వామదేవేన వైపథా,
సోఽపి ముక్తిం సమాప్నోతి తద్విష్ణోః పరమంపదం।
ద్వావిమావథ పంథానౌ బ్రహ్మప్రాప్తికరౌ శివౌ,
సద్యోముక్తి ప్రదశ్చైకః క్రమముక్తి ప్రదః పరః"

శుకుడు ముక్తుడు. వామదేవుడు ముక్తుడు. వీరుదప్ప ముక్తిపొందినవారలులేరు. (వీరిరువురి మార్గమునకంటె ముక్తికి వేరు మార్గములేదని తాత్పర్యము.) ఈ లోకములో శుకమార్గము ను ఏ ధైర్యశాలులు అనుసరించుచున్నారో వారలు సద్యః (= వెంటనే అనగా ఈ దేహము పోయినతోడనే) ముక్తులగుచున్నారు. ఈ లోకములో వామదేవమార్గము నెల్లప్పుడు అనుసరించు వారలు మరల మరల జననమునుపొంది సత్త్వముతోగూడిన యోగ మార్గములచేతను, సాంఖ్య - (జ్ఞాన) మార్గములచేతను, కర్మలచేతను క్రమముక్తులగుచున్నారు. శుకమార్గము, వామదేవమార్గ మని రెండు మార్గములు దేవునిచే ఏర్పరచబడినవి. శుకమార్గమనగా, పక్షిమార్గము (అనగా గుర్తించినచోటునకు పక్షి మిక్కిలి శీఘ్రముగ ఎగిరిపోవుటవలె దేహము పోయినతోడనే ముక్తి పొందుట.) అనియు, వామదేవమార్గమనగా, చీమల మార్గము. (అనగా గుర్తించినచోటుకు చీమ పోవలెననిన ప్రాకిపోవుటవలె ఒక్కొక్క లోకముగ పోయి కడపట జన్మాంతరములేని బ్రహ్మ లోకము, వైకుంఠము మొదలగువాటిని పొందుట) అనియు జెప్పబడియున్నది. విధివాక్యములచే గాని, నిషేధవాక్యములచేగాని, అసంప్రజ్ఞాత సమాధిచేగాని తమ యాత్మస్వరూపము నెఱింగి నిర్మలమైనవారలు శుకమార్గముచేత పరమపదమును (మోక్షమును) పొందుచున్నారు. యమము మొదలగు ఆసనములచేగలుగు ఆయాసమగు హఠాభ్యాసముచేత మాటిమాటికి అనేక అర్థులచే గలిగిన అణిమాది సిద్ధులకు లోబడినవారై, మంచిఫలమును పొందక (అనగా అర్చిరాది మార్గ ములను దేవతల లోకమునుపొంది) మరల సత్కులమునబుట్టి మునుపటి (జన్మయొక్క) వాసన చేతనే మరల యోగాభ్యాసముచే వామదేవ మార్గముచేత ఆ విష్ణువుయొక్క పరమపదమగు ముక్తిని పొందుచున్నారు. బ్రహ్మప్రాప్తి నివ్వదగినవియు, మంగళకరమైనవియునగు ఈ రెండు మార్గములు కలవు. వీటిలో నొకటి సద్యోముక్తిని, మఱియొకటి క్రమముక్తిని ఇవ్వదగినది.

దీనిలో కనిన వామదేవమార్గమే అర్చిరాది మార్గమని గ్రహింపదగినది. ధూమాది మార్గము ఫలాపేక్షతో కర్మజేసిన కర్మయోగి పోవుమార్గము. వారలు ఆ కర్మఫలము ననుభవించిన తోడనే తక్కువైన జన్మములను పొందెదరు. క్షుద్రకర్ములు (పాపపుణ్య మిశ్రకర్మలు జేసినవారు.) స్వర్గాది లోకములనుగాని, నరకాది లోకములనుగాని పొందక అయా కర్మఫలమునకు తగినట్లు ఈ లోకమునందు మఱలమఱల జననమును పొందుచున్నారు.

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥ 27

పద॥ న - ఏతే - సృతీ - పార్థ - జానన్ - యోగీ - ముహ్యతి (1) - కః - చన।
తస్మాత్ - సర్వేషు - కాలేషు - యోగయుక్తః (2) - భవ - అర్జున॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ కుంతీపుత్రా ! | తస్మాత్ | అందువలన |
| ఏతేసృతీ | ఈ రెండుమార్గములనున్ను | హే అర్జున ! | ఓ అర్జునా ! |
| జానన్ | ఎరుంగుచున్న | సర్వేషు కాలేషు | అన్నికాలములలోను |
| కశ్చనయోగీ | (జ్ఞాన) యోగియెవ్వడున్ను | యోగయుక్తః | (జ్ఞాన) యోగిగా |
| న ముహ్యతి | మోహమును పొందుటలేదు. | భవ | అగుదువుగాక |

తా॥ ఓ కుంతీపుత్రా ! (అర్చిరాది, ధూమాది) ఈ రెండు మార్గముల నెఱింగియున్న జ్ఞానయోగియైన ఎవడున్ను అజ్ఞానమును పొందుటలేదు. కావున ఓ అర్జునా! అన్ని కాలములలోను జ్ఞానయోగివగుదువుగాక (అనగా పునర్జనన మిచ్చునట్టి కామ్యకర్మను జేయకుము అనునది తాత్పర్యము).

(1) న ముహ్యతి - స్వర్గాదిసుఖముల నపేక్షించక పరమేశ్వర నిష్ఠుడగును (శ్రీధరులు). మరణ కాలమున భగవంతుని మరచుటలేదు (గీ. వి.).

(2) యోగయుక్తః - అర్చిరాది మార్గమున వెళ్లవలెనను తలంపగు యోగముతో గూడినవాడవుగా (రామానుజులు). భక్తితో జ్ఞానము కర్మము రెంటి ననుష్ఠించువాడవుగ (గీ. వి.).

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యం॥ 28

పద॥ వేదేషు - యజ్ఞేషు - తపస్సు - చ - ఏవ
దానేషు - యత్ - పుణ్యఫలం - ప్రదిష్టం।
అత్యేతి - తత్ - సర్వం - ఇదం - విదిత్వా (1)
యోగీ - పరం - స్థానం (2) - ఉపైతి - చ - ఆద్యం॥

| | | | |
|---|---|---|---|
| వేదేషు | వేదములను బాగుగ పఠించిన చోటను | యోగీ | (జ్ఞాన) యోగియైనవాడు |
| యజ్ఞేషు | యజ్ఞములను సాంగోపాంగ ముగ అనుష్ఠించినచోటను | అత్యేతి | అతిక్రమించుచున్నాడు (దీని కంటె గొప్పదైన ఫలము ను పొందుచున్నాడు. లేక దీనిని స్వల్పఫలమని తలంచు చున్నాడు.) |
| తపస్సు | తపస్సులను బాగుగ జేసిన చోటను | (కిం) చ | మఱియు |
| దానేషు చైవ | దానములను బాగుగనిచ్చిన చోటను | ఇదం విదిత్వా | దీనినెరింగి |
| యత్ | ఏ | ఆద్యం | మూలకారణమైన |
| పుణ్యఫలం | పుణ్యఫలము | పరంస్థానం | ఉత్తమమైన స్థానమునుగూడ |
| ప్రదిష్టం | చెప్పబడియున్నదో | ఉపైతి | పొందుచున్నాడు. |
| తత్సర్వం | ఆ ఫలమునంతను | | |

తా॥ వేదములలోను, యజ్ఞములలోను, తపస్సులలోను, దానముల లోను ఏయే పుణ్యఫలము చెప్పబడియున్నదో అట్టి సకలఫలమును జ్ఞానయోగి యైనవాడు అల్పమనితలంచును. మఱియు దీనినెఱింగి మూలకారణముగను ఉత్తమముగనుఉన్న స్థానమును పొందును.

(1) ఇదంవిదిత్వా - ఈ అధ్యాయమున అర్జునుడడిగిన ఏడు ప్రశ్నలకు చెప్పబడియున్న ఉత్తరముల నెఱింగి, వానిననుసరించి అనుష్ఠించి జ్ఞానియై (శంకరులు). (7-8-వ) రెండధ్యాయ ములలో చెప్పబడియున్న భగవంతుని మహిమలనెఱింగి (రామానుజులు). అధ్యాత్మము మొదలగు వాటిని, శుక్లకృష్ణ మార్గములను ఎరింగి (గీ. వి.).

(2) పరంస్థానం - బ్రహ్మమును (శంకరులు). విష్ణువుయొక్క పరమపదమనే స్థానమును (శ్రీధరులు, గీ. వి ).



ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగో నామ అష్టమోఽధ్యాయః

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న శ్రీ కృష్ణార్జున సంవాదమున అక్షరపరబ్రహ్మయోగమను ఎనిమిదవ అధ్యాయము ముగిసెను.

శ్రీరస్తు.

నవమాధ్యాయ ప్రారంభః.

# తొమ్మిదవ అధ్యాయము

## ( రాజవిద్యా రాజగుహ్య యోగము )

భగవానువాచ:—

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥

పద॥ ఇదం - తు - తే - గుహ్యతమం - ప్రవక్ష్యామి అనసూయవే।
జ్ఞానం - విజ్ఞానసహితం - యత్ - జ్ఞాత్వా - మోక్ష్యసే - అశుభాత్ ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | భగవంతుడు చెప్పినది | విజ్ఞాన సహితం | అనుభవజ్ఞానముతోగూడిన |
| యత్ | దేనిని | గుహ్యతమం ‡ | మిక్కిలి రహస్యముగనున్న |
| జ్ఞాత్వా * | ఎరింగి | ఇదం జ్ఞానం † | ఈ జ్ఞానమునే |
| అశుభాత్ • | సంసారమునుండి | అనసూయవే * | అసూయలేని |
| మోక్ష్యసే | నీవు విముక్తిచెందెదవో | తే | నీ కొఱకు |
| (తత్) | అట్టి | ప్రవక్ష్యామి | బాగుగ జెప్పెదను |

తా॥ దేని నెఱింగి సంసార (బంధ) మునుండి విముక్తి చెందెదవో అట్టి మిక్కిలి రహస్యమైనదియు, ఉపాసనతో గూడినదియునైన ఈ బ్రహ్మ జ్ఞానమును అసూయలేనివాడవైన నీకొఱకు బాగుగ చెప్పెదను.

(గీ. వి.) ఏడవ అధ్యాయము కడపట జెప్పిన "సాధిభూతం సాధియజ్ఞం" మొదలగు భగవంతుని మహిమలు ఈ అధ్యాయమున విస్తరించి చెప్పబడుచున్నవి. ఎనిమిదవ అధ్యాయము నందే ఏల అవి చెప్పబడలేదనగా, అర్జునుడు "సాధిభూతము సాధియజ్ఞము" మొదలగునవి ఎట్టి వని అడుగక "అధిభూతము, అధియజ్ఞము" మొదలగునవి ఎట్టివని అడిగినందున వాటికి మాత్రము ఆ 8-వ అధ్యాయమున ఉత్తరము చెప్పబడినది.

* ఎరింగి అనుష్ఠించి (రామానుజులు).

• నన్ను పొందుటలో ప్రతిబంధకమైన సకల పాపములనుండియు (రామానుజులు).

‡ (శ్రీధరులు) గుహ్యం = ధర్మజ్ఞానము, గుహ్యతరం = ఆత్మస్వరూప జ్ఞానము. గుహ్యతమం = పరబ్రహ్మ జ్ఞానము.

† (శంకరులు) అనుభవజ్ఞానముతోగూడిన (రామానుజులు). ఉపాసనను ఈ విధముగ జేయవలె నను దానినెఱుంగుట విజ్ఞానము. దానితోగూడిన.

(గీ. వి.) విశేషముగ ఎరుంగవలసినదానితో గూడియున్న

• (శంకరులు) ఇంతవఱకు జెప్పివచ్చినట్టియు, ఇక చెప్పబోవునట్టిదియునైన జ్ఞానమును (రామానుజులు) ఇదం = భక్తిరూపమైన ఉపాసన అనేపేరుగల, జ్ఞానం = జ్ఞానమును (గీ. వి.) ఇక చెప్పబోవు జ్ఞానమును.

* (శ్రీధరులు) మాటిమాటికి తన మహిమనే కృష్ణపరమాత్మ చెప్పుకొనుచున్నాడని అసూయలేని (రామానుజులు) భగవంతుడు చెప్పుచున్న, వానిమహిమలన్నియు షాస్తవములని నమ్మియున్న.



శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥

పద॥ రాజవిద్యా - రాజగుహ్యం - పవిత్రం - ఇదం - ఉత్తమమ్ ।
ప్రత్యక్షావగమం - ధర్మ్యం - సుసుఖం - కర్తుం - అవ్యయమ్ ॥

| | | | |
|---|---|---|---|
| ఇదం | ఈ జ్ఞానము | ధర్మ్యం • | ధర్మమునుండి నివర్తించనిది |
| రాజవిద్యా | విద్యలకెల్ల రాజు | కర్తుం | చేయుటకు (అనుష్ఠించుటకు) |
| రాజగుహ్యం | రహస్యములకెల్లరాజు | సుసుఖం | మిక్కిలి సులభమైనది |
| ఉత్తమం పవిత్రం | గొప్పగా పరిశుద్ధపరచునది | అవ్యయం ‡ | నాశములేనిది |
| ప్రత్యక్షావగమం * | ప్రత్యక్షముగ నెఱుంగదగినది | | |

తా॥ (మునుపటి శ్లోకమున జెప్పిన అతిరహస్యమైన) ఈ జ్ఞానము విద్యలకెల్ల శ్రేష్ఠము. రహస్యములకెల్ల శ్రేష్ఠము. ఉత్తమమైనది. పరిశుద్ధమైనది. ప్రత్యక్షముగ నెఱుంగదగినది. ధర్మముతోగూడినది. అనుష్ఠించుటకు మిక్కిలి సులభమైనది. నశించని ఫలము నివ్వగలది.

* (రామానుజులు, మధ్వులు) ప్రత్యక్షముగనున్న చూపింపదగినది.

• (రామానుజులు) మోక్షసాధనమైనది. (మధ్వులు, గీ. వి.) సకలజగత్తును ధరించుటచే ధర్మమనగా భగవంతుడు. భగవద్విషయమైన జ్ఞానమైనందున 'ధర్మ్యం' అని చెప్పబడినది.

‡ (గీ, వి.) నాశములేని ఫలము నిచ్చునట్టిది.



శ్లో॥ అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥

పద॥ అశ్రద్ధధానాః - పురుషాః - ధర్మస్య - అస్య - పరంతప ।
అప్రాప్య - మాం - నివర్తన్తే - మృత్యుసంసారవర్త్మని ॥

| | | | |
|---|---|---|---|
| హే పరంతప! | ఓ అర్జునా! | మాం అప్రాప్య | నన్నుపొందక |
| అస్యధర్మస్య * | ఈ(ఆత్మజ్ఞానమనే) ధర్మమును | మృత్యుసంసార | మృత్యువుతోగూడిన సంసార |
| అశ్రద్ధధానాః • | నమ్మనివారైన | వర్త్మని | మార్గమున |
| పురుషాః | పురుషులు | నివర్తన్తే | స్థిరముగనున్నారు. |

తా॥ ఓ అర్జునా! ఇట్టి భక్తితోగూడిన జ్ఞానమనెడి ధర్మమును నమ్మని పురుషులు నన్నుపొందక, మృత్యువుతోగూడిన సంసారమార్గమున నిలకడ చెందియున్నారు. (అనగా దుఃఖమగు సంసారమునుపొందుట కొఱకే మఱల జనన మొందుచున్నారు.)

* (శంకరులు) ఈ ఆత్మజ్ఞానస్వరూపవిషయమునందును దాని ఫల విషయమునందును (రామానుజులు) ఇట్టి ఉపాసన అనెడి ధర్మమున.

† (శంకరులు, రామానుజులు) విశ్వాసములేకున్న (గీ. వి.) మోక్షహేతువనే విషయమున శ్రద్ధ లేకున్న.

---

శ్లో॥ మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్థ్సాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥ 4

పద॥ మయా - తతం - ఇదం - సర్వం - జగత్ - అవ్యక్తమూర్తినా ।
మత్థ్సాని - సర్వభూతాని - న - చ - అహం - తేషు - అవస్థితః ॥

శ్లో॥ న చ మత్థ్సాని భూతాని పశ్య మే యోగమైశ్వరం।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః॥ 5

పద॥ న - చ - మత్థ్సాని - భూతాని - పశ్య - మే - యోగం - ఐశ్వరం ।
భూతభృత్ - న - చ - భూతస్థః - మమ - ఆత్మా - భూతభావనః ॥

| | | | |
|---|---|---|---|
| అవ్యక్త మూర్తినా | వ్యక్తముకాని స్వరూపముగల | భూతాని ః | భూతములు |
| మయా * | నాచేత | మత్థ్సాని న చ * | నాయెడఉండుటయేలేదు. |
| ఇదం సర్వంజగత్ † | ఈ సకలజగమున్ను | ఐశ్వరంమేయోగం | ఈశ్వరుని యొక్కదైన నా |
| తతం | వ్యాపింపబడియున్నది | పశ్య † | యోగమునుచూడుము |
| సర్వభూతాని ః | సకలభూతములున్ను | మమ ఆత్మా ః | నా ఆత్మ |
| మత్థ్సాని ః | నా యెడనున్నవి | భూతభృత్ | భూతములనుభరించుచున్నది. |
| అహం * తేషు † | నేను వాటిలో | భూతభావనః ః | భూతములను గలుగజేయునది |
| నచావస్థితః ః | ఉండుటలేదు. | చ | ఐతే |
| | | భూతస్థః న * | భూతములయెడ లేదు. |

తా॥ ఎరుంగబడని రూపముగల నాచే ఈసకల ప్రపంచమున్ను వ్యాపింపబడియున్నది. సకలభూతములున్ను నాయెడనున్నవి. నేను వాటియెడ నుండుటలేదు. భూతములు నాయెడనుండుటలేదు. నా యొక్క అద్భుతమైన శక్తిని జూడుము. నా స్వరూపము భూతములను ధరించునదియు, భూతములను కలుగజేయుచున్నదియునైనను, లేక రక్షించునట్టిదైనను భూతములయెడ నున్నట్టిదిగాదు.

(స్వకీయము) ఈ శ్లోకములో పరస్పర వ్యత్యాసముకనబడును. ఎట్లనగా భూతములు నాయెడ నున్నవని ఒకచోటను, లేవని ఒకచోటను, నేను భూతములలోలేనని ఒకచోటను, నేను భూతములను ధరించుచున్నానని మరియొకచోటను చెప్పబడియున్నది. ఐతే విరోధములేదు. బ్రహ్మము తనకు స్వాధీనమైన మాయాశక్తిమూలమున ప్రపంచముల సృష్టి స్థితి లయాదులకు కారణమైయున్నందున అట్టి ప్రపంచములన్నియు బ్రహ్మములోనేయున్నవి. పారమార్థికముగ జూచినచో అట్టి నిర్గుణమైనదియు అసంగమైనదియునైన బ్రహ్మస్వరూపమునకున్ను మాయా కార్యములకున్ను సంబంధములేనందున. వస్తువులు బ్రహ్మమువద్దనుండుటలేదు. బ్రహ్మము వస్తువుల యెడ నుండుటలేదు. అనునది తాత్పర్యము.

* (రామానుజులు) అంతర్యామిగనున్న నాచే (శ్రీధరులు) జగత్కారణముగనున్న నాచే.

• (రామానుజులు) (గీ. వి.) చేతానాచేతనమైన ఈ సకల ప్రపంచము

‡ (శ్రీధరులు) చేతనాచేతనమైన సకల ప్రపంచములు

† (శంకరులు) నన్ను ఆత్మగ కలిగియున్నవి. (రామానుజులు) అంతర్యామియైన నాకధీనమైన స్థితిని గలిగియున్నవి. (గీ. వి.) నా యాధారము మీదనే నిలబడుచున్నవి.

‡ (శంకరులు, శ్రీధరులు) నేను వాటిలో నంటియుండుటలేదు. ఎట్లనగా ఆకాశమువలె. (రామానుజులు) నేను వాటికధీనమైన స్థితినిగలవాడుకాను. అనగా నా స్థితికి అవి యాధారములుకావు. (మధ్వులు, గీ. వి.) జలము భూమినెట్లు ఆధారముగ గలిగి యున్నదో అట్లు నా స్థితికి ఆధారముపనిలేదని తాత్పర్యము.

† (రామానుజులు) జలము భూమినంటియుండుటవలె భూతములు నా యెడనంటియుండుటలేదు (గీ. వి.) నేను అప్రాకృతుడను, ప్రాకృతములైన వస్తువులు నన్నంటజాలవు. కావున భూతములు నాయెడ అంటియుండలేదు.

• (శ్రీధరులు) అఘటిత ఘటనా చాతుర్యమగు యోగమాయా వైభవములేక (రామానుజులు, శ్రీధరులు) అసాధారణమైన (వేరెచ్చటనులేని) యోగమును

[‡] నా సంకల్పము (గీ. వి.) నా దేహము

† (రామానుజులు) భూతములను ధరించునదియు నియమించునదియు

* (రామానుజులు) భూతములపై నాధారపడి నేనుండుటలేదు. (గీ. వి.) భూతములను అంటి యుండలేదు.



శ్లో॥ యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్థ్సానీత్యుపధారయ ॥ 6

పద॥ యథా - ఆకాశస్థితః - నిత్యం - వాయుః - సర్వత్రగః - మహాన్ ।
తథా - సర్వాణి - భూతాని - మత్థ్సాని - ఇతి - ఉపధారయ ॥

| | | | |
|---|---|---|---|
| సర్వత్రగః | సర్వవ్యాపిగనున్నట్టియు | ఆకాశస్థితః | ఆకాశమునందున్నదో (ఆకాశ ములో నంటకయున్నదో) |
| మహాన్ | నిండియున్నదియునైన | | |
| వాయుః | వాయువు | తథా | అట్లే |
| నిత్యం | ఎల్లప్పుడు | సర్వాణిభూతాని | సకలభూతములున్ను |
| యథా | ఎట్లు | మత్థ్సాని ఇతి * | నాయెడనున్నవిగ |
| | | ఉపధారయ | తెలిసికొనుము. |

తా॥ సర్వవ్యాపిగను నిండియునున్న వాయు వెల్లప్పుడును ఎట్లు ఆకాశ మున (అంటక) ఉన్నదో అట్లే సకల భూతములున్ను నా యెడ నంటక యున్నవిగ తెలిసి కొనుము.

(గీ. వి.) ఎట్లు అంటక యుండగలదు? అనినచో జలముయొక్క రేణువులను వాయువు తీసికొనివచ్చి మనకు శైత్యము కలుగజేసినను ఆ జల రేణువులు వాయువులో నంటకయుండుటవలె.

* కనబడని మూర్తిగల నా యెడనున్నవిగ (రామానుజులు)

శ్లో॥ సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాన్తి మామికాం।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం ॥ 7

పద॥ సర్వభూతాని - కౌంతేయ - ప్రకృతిం - యాన్తి - మామికాం।
కల్పక్షయే - పునః - తాని - కల్పాదౌ - విసృజామి - అహం ॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ! | ఓ కుంతీపుత్రా! | కల్పాదౌ | సృష్టికాలమున |
| కల్పక్షయే * | ప్రళయకాలమున | తాని | వాటిని |
| సర్వభూతాని • | సకలభూతములున్ను | పునః | మఱలను |
| మామికాం ‡ ప్రకృతిం † | నా మాయను | అహం | నేను |
| | | విసృజామి • | సృష్టించుచున్నాను |
| యాన్తి * | పొందుచున్నవి | | |

తా॥ ఓ కౌంతేయా! ప్రళయకాలమున భూతములన్నియు నా మాయను పొందుచున్నవి. (మాయలో లీనమగుచున్నవి.) సృష్టికాలమున మరలను వాటిని నేను సృష్టించుచున్నాను.

* (రామానుజులు) చతుర్ముఖ బ్రహ్మయొక్క అంత్యకాలమున

• (రామానుజులు) (గీ. వి.) స్థావరజఙ్గమ రూపములైన సకల భూతములు

‡ (రామానుజులు) నాయొక్క శరీరమైన (గీ. వి.) నా యధీనమైన

† (రామానుజులు) తమస్సనుపేరుగల ప్రకృతిని (గీ. వి.) త్రిగుణమయమైన ప్రకృతిని

* (రామానుజులు) నా సంకల్పమువలన పొందుచున్నవి.

• (రామానుజులు) సంకల్పమువలన సృష్టించుచున్నాను. (గీ. వి.) పలువిధముగ సృష్టించుచున్నాను.

శ్లో॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ ॥

పద॥ ప్రకృతిం - స్వాం - అవష్టభ్య - విసృజామి - పునః - పునః।
భూతగ్రామం - ఇమం - కృత్స్నం - అవశం - ప్రకృతేః - వశాత్ ॥

| | | | |
|---|---|---|---|
| ప్రకృతేః వశాత్ | ప్రాచీనకర్మస్వభావము ననుసరించి | స్వాం • ప్రకృతిం | నా (అధీనమైన) దైన మాయను |
| అవశం • | ప్రాచీన కర్మాధీనమైన | అవష్టభ్య • | ఆశ్రయించి, (స్వీకరించి) |
| కృత్స్నంఇమంభూతగ్రామం | సకలమైన ఈ భూతసమూహములను | పునః పునః | మరల మరల |
| | | విసృజామి | సృష్టించుచున్నాను. |
| అహం | నేను | | |

తా॥ నా దైన మాయనుస్వీకరించి ప్రాచీన కర్మాధీనములైన సకల భూతములను ఆ ప్రాచీనకర్మననుసరించియే మరల మరల సృష్టించుచున్నాను.

(రామానుజులు) నా యొక్క స్వాధీనమైన ప్రకృతిని, అవష్టభ్య = ఎనిమిది విధములుగ పరిణమింపజేసి, ప్రకృతేః వశాత్ = ప్రకృతికి స్వాధీనముగనుండుటవలన, అవశః = పరాధీనముగ నున్న, ఇమంకృత్స్నం = ఈ దేవమనుష్య తిర్యక్ మొదలగు సకల భూతములను మరల మరల సృష్టించుచున్నాను.

* (శంకరులు) అవిద్య మొదలగు దోషములకు వశబడియుండుటవలన అస్వతంత్రమైన (గీ. వి.) ప్రకృతికి స్వాధీనమైనందున పరాధీనమైన, లేక, అ = విష్ణువు, వశం = స్వాధీనముగ నున్న, అనగా విష్ణువునకు స్వాధీనమైన ప్రకృతికి అధీనముగనుండుటవలన విష్ణువున కధీనముగనున్న అనియు అర్థము. (స్వకీయము) అధ్యాయము 8-19-చూడుడు.

• (స్వకీయము) అధ్యా-4-శ్లో-6-చూడుడు.

‡ (మధ్వులు) ప్రకృతినాశ్రయించి-ఆశ్రయింపకనే నేను సృష్టింపగలవాడైనను, దృఢముగనున్న వాడు విహారార్థమై చేతిలో కర్రను పట్టుటవలె (గీ. వి.) ఉపాదానకారణముగ ఆశ్రయించి.



శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ ।
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు ॥ 9

పద॥ న - చ - మాం - తాని - కర్మాణి - నిబధ్నన్తి - ధనంజయ ।
ఉదాసీనవత్ - ఆసీనం - అసక్తం - తేషు - కర్మసు ॥

| | | | |
|---|---|---|---|
| హే ధనంజయ! | ఓ అర్జునా! | అసక్తం • | అభిమానము తొలగియున్నవాడునైన |
| తానికర్మాణి | అసృష్టికర్మలు | మాం | నన్ను |
| ఉదాసీనవత్ ఆసీనం • | ఉదాసీనునివలెనున్నట్టియు | న నిబధ్నన్తి | బంధింపనేరవు |
| తేషు కర్మసు | ఆ కర్మలలో | | |

తా॥ ఓ అర్జునా! ఆ సృష్టికర్మలలో అభిమానములేకయు, కర్మలను జేయని వానివలెను, లేక సంబంధము లేనివానివలెనున్న నన్ను ఆ సృష్టి కర్మలు బంధించుట లేదు.

(రామానుజులు) పైజెప్పిన పలువిధమైన సృష్టి, విషమసృష్టిగనుండుట (అనగా ప్రాణు లన్నిటిని సమముగ సృష్టింపక దేవమనుష్యాది పలువిధముగనుండుట) వలన నాకుపుణ్యాపాపము లనుగాని, దయలేనివాడు, పక్షపాతముగలవాడు అను నపవాదమునుగాని కలుగజేయుటలేదు. ఏలననగా ఆయాప్రాణుల పూర్వకర్మకు తగినట్లు సృష్టించుటచేతను, ఫలాపేక్షగాని, కర్తృత్వాభి మానముగాని లేకుండుట చేతనే.

* (శంకరులు) బంధమునకు హేతువైన కర్మ ఫలమునందపేక్షగాని కర్తృత్వాభిమానముగాని లేకున్న

• (గీ. వి.) కర్మలుజేసినను కర్మజేయనివానికి ఎట్లు ఫలములేదో అట్లు నాకు ఫలములేదు. కావున చేయనివానివలెనున్న.

శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం ।
హేతునాఽనేన కౌంతేయ జగద్విపరివర్తతే ॥ 10

పద॥ మయా - అధ్యక్షేణ - ప్రకృతిః సూయతే - సచరాచరం ।
హేతునా - అనేన - కౌంతేయ - జగత్ - విపరివర్తతే ॥

| | | | |
|---|---|---|---|
| ప్రకృతిః | మాయయైనది | సూయతే | కలుగజేయుచున్నది. |
| అధ్యక్షేణ | సాక్షిగనున్న | హే కౌంతేయ! | ఓ కుంతీపుత్రా! |
| మయా | నాచేత(నాయొక్కసన్నిధినిమిత్తముచేత) | అనేన హేతునా | ఈ నిమిత్తముచేత |
| సచరాచరం | స్థావరజఙ్గమరూపమైన జగత్తును | జగత్ | జగత్తు |
| | | విపరివర్తతే | తిరుగుచునేయున్నది |

తా॥ ఓ కుంతీపుత్రా! సాక్షిగనున్న నాయొక్క సన్నిధాన విశేషముచేత మాయయైనది. స్థావరజఙ్గమముతోగూడిన ఈ ప్రపంచమును గలుగజేయు చున్నది. (ఇట్టిసన్నిధాన విశేషమనెడి) నిమిత్తముచే ప్రపంచము తిరుగుచునే యున్నది.

(స్వకీయము) 'కౌంతేయ' అను సంబోధనకు తాత్పర్యము - కుంతీదేవి పాండువును సాక్షిగ నుంచుకొని నిన్ను కలుగచేసినట్లు మాయ నన్ను సాక్షిగనుంచుకొని జగమును సృష్టించు చున్నది.

* † (రామానుజులు) ప్రాణుల పూర్వజన్మ కర్మలననుసరించి సత్యసంకల్పముతోగూడిన నాచే చూడబడిన ప్రకృతియైనది. (గీ. వి.) ముఖ్యకర్తగనున్న నాచే ప్రేరేపింపబడిన నాయధీనమైన ప్రకృతియైనది, లేక (పురుషుడగు) అధిపతియగు నాచే (స్త్రీయగు) ప్రకృతియైనది, సచరాచరం సూయతే = చరాచర ప్రపంచమున ప్రసవించుచున్నది.

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరం ॥　11

పద॥ అవజానన్తి - మాం - మూఢాః - మానుషీం - తనుం -
పరం - భావం - అజానన్తః - మమ - భూతమహేశ్వరం ॥

| | | | |
|---|---|---|---|
| భూత మహేశ్వరం | భూతములకీశ్వరుడనైన | అజానన్తః | ఎరుంగని |
| మమ | నాయొక్క | మూఢాః | మూఢులు |
| పరం భావం | (మేలైనస్థితిని) పరమతత్త్వమును (శ్రేష్ఠమైనస్వరూపమును) | మానుషీంతనుం | మనుష్యదేహమును |
| | | ఆశ్రితం మాం | ఆశ్రయించియున్నట్టి నన్ను |
| | | అవజానన్తి | అవమతించుచున్నారు. |

తా॥ నాయొక్క పరమతత్త్వము నెరుంగని మూఢులు భూతములకెల్ల మహేశ్వరుడుగనున్న నన్ను మనుష్యదేహము నాశ్రయించి యున్నవానిగ అవమతించుచున్నారు. (అనగా అగౌరవదృష్టితో చూచుచున్నారు.)

(స్వకీయము) అవతారరూపములను మనుష్యరూపములుగ తలంచెడివారలు మూఢులని తాత్పర్యము.

భక్తులను అనుగ్రహించుటకై మనుష్యదేహమును స్వీకరించి వ్యవహరించుచున్న నన్ను దేహాభిమానముగల కేవల మనుష్యుడనియు, ఈశ్వరుడు కాడనియు నీ విధముగ నగౌరవించు చున్నారు.

* (రామానుజులు) జనులకు అనుగ్రహము చేయుటకై దయతో నేను చేసియున్న ఈ యవతారము యొక్క తాత్పర్యమును (గీ. వి.) నా యొక్క శ్రేష్ఠమైన యథార్థమును.

(రామానుజులు) సాధారణ మనుష్యునిగ తలంచి అగౌరవించుచున్నారు.

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥ 12

పద॥ మోఘాశాః - మోఘకర్మాణః - మోఘజ్ఞానాః - విచేతసః।
రాక్షసీం - ఆసురీం - చ - ఏవ - ప్రకృతిం - మోహినీం - శ్రితాః॥

| | | | |
|---|---|---|---|
| (తే) | వారలు | మోహినీం • | మోహింపజేయునట్టియు |
| మోఘాశాః • | వ్యర్థమైన ఆశలుగలవారు | రాక్షసీం | రాక్షసముగను |
| మోఘకర్మాణః • | వ్యర్థములైన కర్మలుగలవారు | ఆసురీం | అసురముగఉన్నట్టియు |
| మోఘజ్ఞానాః ‡ | వ్యర్థమైన జ్ఞానముగలవారు | ప్రకృతి మేవ చ | స్వభావమునే |
| విచేతసః † | వివేకములేనివారు | శ్రితాః | పొందినవారు. |

తా॥ వ్యర్థమైనకోరిక, వ్యర్థమైన కర్మలు, వ్యర్థమైన జ్ఞానములు, వీటిని గల అవివేకులు మోహింపజేయునవైన రాక్షస అసురస్వభావములనే ఆశ్రయించుటవలన నన్ను అగౌరవించుచున్నారు.

* (శ్రీధరులు) అన్యదేవతలను ఆశ్రయించినచో శీఘ్రముగ ఫలమునిచ్చుననే వ్యర్థమైనకోరిక. (మధ్వులు) తానుజేయుకర్మయే తనకు ఫలమిచ్చుననే ఆశ.

• (శ్రీధరులు) వ్యర్థమైన ఆశచే చేయుకర్మ నాయారాధనకాదు. కావున అది వ్యర్థమైనది.

‡ (శ్రీధరులు) తానునేర్చిన శాస్త్రాదిజ్ఞానములను, కుయుక్తివాదములచే వ్యర్థపరచుకొనుట. (రామానుజులు) నా యొక్కదైన (అనగా నా యొక్క శేషభూతముగను శరీరముగనున్న) సకల చరాచర ప్రపంచములో విపరీత జ్ఞానముగల.

† (శ్రీధరులు, గీ. వి.) దుర్మార్గమున ప్రవర్తించియున్న మనస్సునుగలవారలు. (రామానుజులు) సకలమునందును యథార్థజ్ఞానములేనివారలు.

* (శ్రీధరులు) బుద్ధిని చెరుపుచున్న (రామానుజులు) మనుష్యావతారమును జేసియున్న నా యొక్క పూర్ణకారుణ్యము సర్వోత్తమత్వము మొదలగువాటిని కప్పియుంచునట్టి.

• (శ్రీధరులు) ఇతరులకు ఉపద్రవముచేయు తలంపుగలదైన తామసస్వభావము (రామానుజులు) నా యొక్క మహత్తైన గుణములను మరువజేయుచున్న స్వభావము.

(శ్రీధరులు) అత్యాశ, అహంకారము, కోపము మొదలగు గుణములనుగల రాజస స్వభావము.

(స్వకీయము) కశ్యప ప్రజాపతికి దితియను నామెయెడ గలిగినవారలు అసురులు. పులస్త్య మహర్షియొక్క సంతతులు రాక్షసులని చెప్పబడుచున్నారు.

శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః।
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ 13

పద॥ మహాత్మానః - తు - మాం - పార్థ - దైవీం (1) - ప్రకృతిం - ఆశ్రితాః।
భజన్తి - అనన్యమనసః - జ్ఞాత్వా (2) - భూతాదిం - అవ్యయమ్ (3)॥

| | | | |
|---|---|---|---|
| | ఓ పార్థా! | భూతాదిం | భూతములకు కారణముగను |
| మహాత్మానస్తు | మహాత్ములైతే | అవ్యయం | నాశములేనివానిగను |
| దైవీం ప్రకృతిం ఆశ్రితాః | దేవతలస్వభావము నాశ్రయించినవారలై | జ్ఞాత్వా | ఎరింగి |
| | | అనన్యమనసః | వేరుదేనిలోను మనస్సునుంచనివారై |
| మాం | నన్ను | భజన్తి | భజించుచున్నారు. |

తా॥ ఓ అర్జునా! మహాత్ములు దేవతలయొక్క సాత్త్విక స్వభావమునే ఆశ్రయించి నన్ను భూతములకు కారణముగను, నాశములేనివానిగను ఎరింగి, వేరుదేనిలోను మనస్సునుంచక నా యెడనే మనస్సునుంచి (నన్నే) భజించుచున్నారు.

(1) దైవీం - ముక్తి యోగ్యమగు ఉత్తమస్వభావము నాశ్రయించినవారలు (రాఘవేంద్రులు), ఇట్టి దైవసంపత్తు విషయమును అధ్యాయము 16 లో చూడుడు.

(2) జ్ఞాత్వా - పూర్ణదయతోగూడి సాధువులను రక్షించుటకొరకై మనుష్యరూపముగ నవతరించి యున్నానని ఎరింగి (రామానుజులు).

(3) అవ్యయం - వాఙ్మనస్సులకు అందని నామకర్మలుగల (రామానుజులు).

(శంకరులు) మఱియు నెవ్వరు నమ్మకముగలవారై భగవద్భక్తియనెడి మోక్షమార్గము నందే వెళ్ళియున్నారో అట్టి మహాత్ములు, అనగా హీనబుద్ధిలేనివారలు యజ్ఞము మొదలగువాటిచే చిత్తపరిశుద్ధిబడసిన వారలు, దేవతల స్వభావమును, అనగా మనస్సు వాక్కు కాయము ఇవియణగి యుండుటయు, ఇంద్రియములు అణగియుండుటయు, దయ, విశ్వాసము. మొదలగువాటిని గల వారలై మనస్సును వేరుదేనియందును ప్రవేశింపజేయనివారలై నన్ను, అనగా ఈశ్వరుని, భూతము లకు అనగా ఆకాశము మొదలగువాటికిని, ప్రాణముగల ప్రాణులకును కారణముగను, నాశము లేనివానిగను నెరింగి భజించుచున్నారు.



శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ 14

పద॥ సతతం - కీర్తయన్తః - మాం - యతన్తః - చ - దృఢవ్రతాః।
నమస్యన్తః - చ - మాం - భక్త్యా - నిత్యయుక్తాః - ఉపాసతే॥

| | | | |
|---|---|---|---|
| (తే) | వారలు | దృఢవ్రతాః | దృఢమైనవ్రతముగలవారుగను |
| సతతం | ఎల్లప్పుడు | నిత్యయుక్తాః | ఎల్లప్పుడు ఒకనిలకడగలవారుగను |
| మాం | (భగవంతుడనైన) నన్ను | | |
| కీర్తయన్తశ్చ | కీర్తనముజేయువారుగను | భక్త్యానమస్యన్తశ్చ | భక్తిచే నమస్కరించువారుగను |
| యతన్తః | ధర్మమార్గమున ప్రయత్నము గలవారుగను | మాం ఉపాసతే | నన్ను ఉపాసించుచున్నారు. |

తా॥ వారు బ్రహ్మస్వరూపియగు భగవంతుడనైన నన్ను ఎల్లప్పుడు కీర్తనము జేయువారుగను (ఇంద్రియనిగ్రహము;- శమము, దమము, దయ,

అహింస మొదలగు ధర్మములతోగూడి) ప్రయత్నించువారుగను, దృఢమైన వ్రతము ననుష్ఠించువారుగను, ఎల్లప్పుడు నొకే నిలకడ గలవారుగను, భక్తితో హృదయకమలవాసియగు ఆత్మనైన నన్ను నమస్కారముచేసి ఉపాసించు చున్నారు.

(శ్రీధరులు) కొందరు ఈశ్వరపూజ మొదలగు వాటిలో ప్రయత్నించువారుగను, దృఢమైన వ్రతముగలవారుగను, కొందఱు ఎల్లప్పుడు నన్ను జాగ్రత్తతోను భక్తితోను కీర్తనముచేయు వారుగను, కొందఱు జాగ్రత్తతో భక్తిచే ఎల్లప్పుడు నన్నునమస్కరించువారుగను ఉపాసించు చున్నారు.

(రామానుజులు) సతతం కీర్తయన్తః = ఎల్లప్పుడు నా యొక్క గుణవిశేషములను జెప్పునట్టి నాయొక్క నామములనుస్మరించుటవలన గలుగు గగుర్పాటు, గద్గద స్వరము, వీటితోగూడిన వారుగను, నారాయణకృష్ణవాసుదేవాది నామములనుచ్చరించువారుగను, దృఢవ్రతాః యతన్తః = నాయారాధనలోను, ఆరాధన కుపయోగముగ దేవాలయము నిర్మించుట, నందనవనముంచుట మొదలగు వ్యాపారములలోను దృఢమైన ప్రయత్నముగలవారుగను, భక్త్యామాం నమస్యన్తః = మిక్కిలి భక్తిచే వంగిన మనస్సు బుద్ధి అహంకారము కాళ్లు చేతులు శిరస్సు మొదలగు నీయెనిమిది అంగములచే రాయి ముల్లు దుమ్ము మొదలగునవి గల ప్రదేశములని చూడక దండాకారముగ నమస్కారము జేయువారుగను, మాం = నన్ను, నిత్యయుక్తాః = ఎల్లప్పుడు నన్నే పొందవలెనను తలంపుతో గూడియు, తమను తమకు జేరిన సకలవస్తువులను పరమాత్మకు అర్పించుచున్నామను నిశ్చయముతోగూడియు, ఉపాసతే = ఉపాసించుచున్నారు.

(రాఘవేంద్రులు) వారు రామకృష్ణాదినామములను కీర్తనముచేయువారుగను, ఉపవాసాది దృఢవ్రతములను గలవారుగను, ఎల్లప్పుడు నా యెడ మనస్సునుంచినవారుగను నన్నుపాసించుచున్నారు.

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖం ॥ 15

పద॥ జ్ఞాన యజ్ఞేన (1) - చ - అపి - అన్యే - యజన్తః - మాం - ఉపాసతే।
ఏకత్వేన (2) - పృథక్త్వేన (3) - బహుధా - విశ్వతోముఖం ॥

| | | | |
|---|---|---|---|
| జ్ఞానయజ్ఞేన | జ్ఞానమనే యజ్ఞముచేత | (అన్యే పృథక్త్వేన | కొందఱు వేరుగ (భేదభావనతో) |
| యజన్తః అన్యే | పూజించుచున్న మిగతవారు | (ఉపాసతే) | ఉపాసించుచున్నారు |
| మాం చ అపి | ఈశ్వరుడనైన నన్నే | విశ్వతోముఖం | విశ్వరూపియైన నన్ను |
| ఏకత్వేన | ఒకటిగ (అభేదముగ) | బహుధా | అనేకవిధములుగ |
| ఉపాసతే | ఉపాసించుచున్నారు. | ఉపాసతే | కొందఱు ఉపాసించుచున్నారు. |

తా॥ జ్ఞానమను యజ్ఞముచేతనే పూజించెడి మిగతవారలు ఎల్లరు వేరు దేవతయొక్క ఉపాసననువిడిచి ఈశ్వరుడనైన నన్నే ఒకటైన బ్రహ్మముగ అభేదముగ నుపాసించుచున్నారు. కొందఱు నన్ను వెవ్వేరుగ, అనగా సూర్యుడు మొదలగు వెవ్వేరు ఆకారముతోనున్నట్లు భేదభావనతోనుపాసించుచున్నారు. కొందఱు విశ్వరూపినైన నన్ను అనేకవిధములుగ నుపాసించుచున్నారు.

(1) జ్ఞానయజ్ఞేన - భగవద్విషయక జ్ఞానమను యజ్ఞముచేత (శంకరులు) సకలము బ్రహ్మ స్వరూపమనెడి జ్ఞానమను యజ్ఞముచేత (శ్రీధరులు)

(2) ఏకత్వేన - పరమాత్మ ఒక్కడేయను పరమాత్మ దర్శనముచేత (శంకరులు), తానే బ్రహ్మము బ్రహ్మమే తాను అను నభేదభావనచేత (మధుసూదన సరస్వతి)

(3) పృథక్త్వేన - విష్ణువు సూర్యచంద్రాది దేవతారూపిగ నున్నాడనే భావనచేత (శంకరులు), నేను ఈశ్వరుని దాసుడననే భావనచేత (శ్రీధరులు)

(శంకరులు) వారలు ఏయేవిధముగ నుపాసించుచున్నారనునది చెప్పబడుచున్నది. భగవంతునిగూర్చిన జ్ఞానమే యజ్ఞము. మిగతవారలు, అనగా బ్రహ్మనిష్ఠులు అట్టిజ్ఞానమనే యజ్ఞముచేత ఈశ్వరుడగు నన్నే పూజించువారలై వేరుదేవత నుపాసించుటను త్రోసివేసి నన్నే ఉపాసించుచున్నారు. ఇక అట్టిజ్ఞానము అనేక విధములుగనున్నది, కొందఱు సకలము, పర బ్రహ్మము ఒక్కటే యను పరమార్థదర్శనముతో భజించి ఉపాసించుచున్నారు. కొందఱు విష్ణువగు ఆ భగవంతుడే సూర్యుడు చంద్రుడు మొదలగు భేదముతో సూర్యుడు మొదలగు నాకారముగ నున్నాడనే జ్ఞానముతో నుపాసించుచున్నారు. కొందఱు పలువిధములుగ అగ్ని, సూర్యుడు మొదలగు నాకారముచే సకలరూపిగను సకల ఆత్మగనుఉన్న అతనిని, పలువిధములుగనున్న అట్టి భగవంతుడే అంతట గలవాడుగను సకలరూపిగను ఉన్నాడను జ్ఞానముతో నుపాసించుచున్నారు.

(రామానుజులు) కొందఱు మహాత్ములు మునుపటి శ్లోకమున జెప్పినట్లు కీర్తన నమస్కారాదులచేతను, జ్ఞానమనే యజ్ఞముచేతను నన్ను భజించి యుపాసించుచున్నారు. ఎట్లనగా -

పృథక్త్వేన = జగదాకారముచేత, విశ్వతోముఖం = సకల శేషియైన, మాం=నన్ను, బహుధా=అనేకవిధములుగ, ఏకత్వేన = ఒకటేయనియెరింగి ఉపాసించుచున్నారు, అది యెట్లనగా-

భగవంతుడైన వాసుదేవుడు నామరూపములు లేకుండిన సూక్ష్మ చిదచిద్వస్తువులను శరీరముగ గలిగియుండి, సత్యసంకల్పుడైన అతడు స్థూలచిదచిద్వస్తువుల దేహిగ తాను కావలెనని సంకల్పించిన మాత్రమున దేవమనుష్య పశుపక్షి మృగస్థావరాది వెవ్వేరు విచిత్రమైన వస్తువులను శరీరముగ గలవాడై అతడొక్కడే యున్నాడని అనుసంధానముజేసి ఉపాసించుచున్నారు.

(మధ్వులు) ఏకత్వేన = అంతటనిండియున్న నారాయణుడొక్కడే యని కొందరున్ను, పృథక్త్వేన = ఆ నారాయణుడు సకల వస్తువులకంటె విలక్షణుడని కొందఱున్ను, బహుధా = ఆ నారాయణుడు అనేక రూపములను బడసినవాడని కొందఱున్ను ఉపాసించుచున్నారనునది ఈ శ్లోకమందలి తాత్పర్యము

శ్లో॥ అహం క్రతురహం యజ్ఞః స్వధాఽహమహమౌషధం।
మంత్రోఽహమహమేవాజ్యమహమగ్నిరహం హుతం॥    16

పద॥ అహం - క్రతుః - అహం - యజ్ఞః - స్వధా - అహం - అహం - ఔషధం (1)
మంత్రః - అహం - అహం - ఏవ - ఆజ్యం - అహం - అగ్నిః - అహం - హుతం॥

| | | | |
|---|---|---|---|
| అహం క్రతుః | నేనే క్రతువనే వేదోక్తకర్మము | అహం మంత్రః | నేనే మంత్రము |
| అహం యజ్ఞః | నేనే యజ్ఞము | అహం ఆజ్యం | నేనే హవిస్సు |
| అహం స్వధా | నేనే స్వధా అనే పితృవులకివ్వబడు అన్నము | అహం అగ్నిః | నేనే అగ్ని |
| | | అహమేవ హుతం | నేనే హోమకర్మ |
| అహం ఔషధం | నేనే ఔషధము | | |

తా॥ నేనే వేదమున విహితమైన క్రతువనెడి కర్మ. నేనే వైశ్వదేవము మొదలగు యజ్ఞము. నేనే స్వధా అనెడి పితృవులకివ్వబడు అన్నము. నేనే ఔషధము (మందు). నేనే మంత్రము, నేనే హోమముజేయబడు హవిస్సగు నెయ్యి, ఆహవిస్సుచే హోమము చేయబడునదైన అగ్నినేనే, నేనే అట్టి హోమకర్మ, అనగా నేనే ఆ హవిస్సును అర్పించుటయనెడి వ్యాపారము.

(1) ఔషధం - హవిస్సు (రామానుజులు)

(శంకరులు) మునుపుజెప్పిన వారలు పలువిధముగ నుపాసించినచో దానిచే భగవంతుడైన నిన్నే ఉపాసించుచున్నారనునది ఎట్లగును? అను శంకను కలుగజేయును. కావున భగవంతుడు దీనిని ప్రసాదించుచున్నాడు. క్రతువనగా వేదమున విహితములైన కర్మలలో ఒక భాగము. యజ్ఞమనునది స్మృతిలో విహితమైన వైశ్వదేవము మొదలగు యజ్ఞము. స్వధా అనగా పితరులకు శ్రాద్ధాదులలో నివ్వబడు అన్నము, లేక సామాన్యమైన అన్నము. ఔషధం = అన్ని ప్రాణులచేతను భుజింపబడునట్టివై ఓషధియనుపదముచే జెప్పబడిన సాధారణములైన వడ్లు గోధుమలు మొదలగునవి. లేక వ్యాధిని శాంతపరచుటకైన మందు అనియు గ్రహింపదగును. మంత్రము = పితరులకును దేవతలకును ఏ మంత్రముచే హవిస్సు ఇవ్వబడుచున్నదో అట్టి మంత్రము నేనే. హోమముజేయబడు హవిస్సగు నెయ్యినేనే. అగ్నిః = దేనిలో హవిస్సు హోమము జేయబడుచున్నవో అట్టి అగ్ని నేనే. హుతం = హవిస్సును అగ్నిలో నర్పించుట హోమకర్మయు నేనే.

(రాఘవేంద్రులు) యజ్ఞః = ముఖ్యదేవతనుద్దేశించి చేయబడిన ప్రధానహోమము. ఈ శ్లోకమున "క్రతువు మొదలగునవి నేనే" అని చెప్పిన తాత్పర్యమేమనగా, వాటికి నేను నియామకుడుగను, వాటి హవిస్సు మొదలగువాటిని భుజించువాడుగను ఉండుటచేత 'అవి, నేను' అనే అభేదము ఉపచారముగ జెప్పబడినది. ఇందులోని 7-వ అధ్యాయము 11-వ శ్లోకమునందలి వ్యాఖ్యానమును చూడుడు.

శ్లో॥ పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవ చ ॥ 17

పద॥ పితా - అహం - అస్య - జగతః - మాతా - ధాతా (1) - పితామహః (2)।
వేద్యం - పవిత్రం - ఓంకారః - ఋక్ - సామ - యజుః - ఏవ - చ ॥

| | | | |
|---|---|---|---|
| అస్య జగతః | ఈ జగమునకు | పవిత్రం | శుద్ధిపరచువస్తువున్ను, |
| పితామాతా | తండ్రియు తల్లియు | ఓంకారః | ఓంకారమున్ను |
| పితామహః | తాతయు | ఋక్సామ యజుః చ | ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదమున్ను |
| ధాతా | కర్మఫలమును విభజించి ఇచ్చువాడను, | అహమేవ | నేనే |
| వేద్యం | ఎరుంగవలసిన వస్తువున్ను, | | |

తా॥ ఈ జగమునకు తండ్రియు తల్లియు తాతయు కర్మఫలమును విభజించి ఇచ్చువాడను ఎరుంగవలసిన వస్తువున్ను పరిశుభ్రపరచు వస్తువున్ను ఓంకారమున్ను ఋగ్వేదము సామవేదము యజుర్వేదము ఇవియన్నియు నేనే.

(1) ధాతా - విధాతా - కర్మఫలమును జేయువాడున్ను (శ్రీధరులు). రక్షకుడున్ను (రాఘవేంద్రులు).

(2) పితామహః - పూజ్యుడున్ను (రాఘవేంద్రులు)

~~~~~~~~

శ్లో॥ గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్ ।
ప్రభవః ప్రళయస్స్థానం నిధానం బీజమవ్యయం ॥ 18

పద॥ గతిః (1) - భర్తా - (2) - ప్రభుః - సాక్షీ (3) - నివాసః (4) శరణం (5) - సుహృత్ (6) ।
ప్రభవః - ప్రళయః - స్థానం - నిధానం (7) - బీజం (8) - అవ్యయం ॥

| | | | |
|---|---|---|---|
| గతిః | పొందబడునట్టిదియు | ప్రభవః | ఉత్పత్తిస్థానమున్ను |
| భర్తా | పోషకుడున్ను | స్థానం | నిలకడ చెందుచోటున్ను |
| ప్రభుః | ప్రభువున్ను | ప్రళయః | నశించుచోటున్ను |
| సాక్షీ | సాక్షియు | నిధానం | గరిసెయు (కణజము) |
| నివాసః | ఉండుచోటును | అవ్యయం బీజం | నాశములేని విత్తనమున్ను |
| శరణం | శరణమొందదగినవాడును | (అహమేవ) | నేనే |
| సుహృత్ | సుహృత్తును | | |

తా॥ పొందబడునట్టిది అనగా కర్మఫలము, పోషకుడు, ప్రభువు అనగా స్వామి, సాక్షి, ప్రాణులు నివసించుచోటు, శరణమొందదగినవాడు అనగా తన్నువచ్చి పొందినవారల దుఃఖమును తీర్చువాడు, సుహృత్తు అనగా బదులు కుపకారము నెదురుచూడక సహాయముచేయువాడు, సృష్టిస్థితిలయ స్థానము, గరిసె (కణజము) అనగా ప్రాణులు ముందుకాలమున అనుభవింపవలసిన వాటిని ఉంచుచోటు, నాశములేని విత్తనము, ఇవి నేనే.

(1) గతిః - కర్మలఫలము (శంకరులు, శ్రీధరులు) - పొందవలసిన స్థానము (రామానుజులు), ముముక్షువులచే నెరుంగదగినది (రాఘవేంద్రులు).

(2) భర్తా - ధరించువాడు (రామానుజులు).

(3) సాక్షీ - ప్రాణులుచేయుట, చేయకవిడుచుట వీటినిజూచుచుండెడివాడు (శంకరులు, శ్రీధరులు).

(4) నివాసః - ప్రాణులుండుచోటు (శంకరులు, శ్రీధరులు). ఆశ్రయుడు (రాఘవేంద్రులు).

(5) శరణం - తన్నుపొందినవారల దుఃఖమును పోగొట్టువాడు (శంకరులు). ఆశ్రయింపదగినవాడు (రామానుజులు). సంసారభయమునుండి రక్షించువాడు (రాఘవేంద్రులు).

(6) సుహృత్ - ప్రతిప్రయోజనము నెదురుచూడక యుపకారము చేయువాడు (శంకరులు, రాఘవేంద్రులు.)
~~~~~~~~

(7) నిధానం - నిక్షేపము, ప్రాణులచే కాలాంతరమున ననుభవింపబడు వస్తువులుంచుచోటు (శంకరులు). ఉత్పాద్యం = కలుగజేయదగిన వస్తువున్ను, ఉపసంహార్యం = సంహరింపబడు వస్తువున్ను (రామానుజులు). ప్రళయకాలమున సకలమునకు ఉండుచోటు (రాఘవేంద్రులు).

(8) బీజం - విత్తనము, మొలచు స్వభావముగల వస్తువులు మొలచుటకు కారణము. ఆ విత్తనము సంసారమున్నంతవఱకు ఉన్నందున నాశములేనిది. విత్తనములేక ఒక్కటియు మొలచుటలేదు. ఎల్లప్పుడు మొలకను చూచుటవలన విత్తనముయొక్క అనుస్యూతి (వెంబడించుట) తొలగలేదని తెలియుచున్నది (స్వకీయము).

శ్లో॥ తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥ 19

పద॥ తపామి (1) - అహం - అహం - వర్షం - నిగృహ్ణామి - ఉత్సృజామి - చ।
అమృతం - చ - ఏవ - మృత్యుః - చ - సత్ (2) అసత్ - చ - అహం - అర్జున

| | | | |
|---|---|---|---|
| హే అర్జున! | ఓ అర్జునా! | నిగృహ్ణామి చ | షింపక నిలబెట్టుచున్నాను. |
| అహం తపామి | నేనే తాపమును గలుగజేయుచున్నాను | అమృతం చ | రణింపక యుండుటయు |
| | | మృత్యుశ్చ | మరణమున్ను |
| అహం | నేను | సత్ - అసచ్చ | సత్తు అసత్తున్ను |
| వర్షం ఉత్సృజామి | వర్షమును గలుగజేయుచున్నాను | అహమేవ | నేనే |

తా॥ ఓ అర్జునా! నేను తాపము గలుగజేయుచున్నాను. నేను వర్షమును గురిపించుచున్నాను. దానిని వర్షింపక నిలబెట్టుటను జేయుచున్నాను. మరణము లేమి – మరణము, సత్తు – అసత్తు నేనే.

(1) తపామి - నేను సూర్యుడుగనుండి తాపమును గలుగచేయుచున్నాను. (శ్రీధరులు). నేను అగ్ని, సూర్యుడు ఈ రూపముచే తపింపజేయుచున్నాను (రామానుజులు)

(2) సత్ - తత్కాలమునందుండు వస్తువులు. అసత్తనునది మునుపుండినది, ఇకరాబోవునది (రామానుజులు) సత్ = కార్యము, అసత్ = కారణము. (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) నేను సూర్యుడుగనుండుచు తీక్ష్ణములైన కొన్ని కిరణములచే వేడినిచ్చుచున్నాను. కొన్ని కిరణములచే వర్షమును గలుగచేయుచున్నాను. కలుగచేసినపిదప కొన్ని కిరణములచే వర్షమును యెనిమిదినెలలు నిలబెట్టుచున్నాను. మఱలను దానిని మిగిలిన నాలుగు నెలలగు వర్షాకాలమున గలుగచేయుచున్నాను. నేను దేవతల మరణములేనితనముగను, మనుష్యుల మరణముగను ఉన్నాను. ఏ కార్యము ఏకారణముతోగూడియున్నదగునో, అనగా బయటపడునో అదిసత్తు (ఉన్నట్టిది), దానికి విపరీతమైనది అసత్తు (లేనట్టిది) అనబడును. భగవంతుడు తాను ఉన్నట్టిదిగను లేనట్టిదిగను నున్నాననుటవలన అతడు సర్వథా లేనివస్తువుగ కానేరడు. అతని కార్యమున్ను కారణమున్ను వరుసగా ఉన్న వస్తువుగను లేనివస్తువుగను కానేరవు (ఇచ్చట కార్యమనగా బాహ్యములైన నామరూపములు, అనగా పేరున్నరూపమున్ను) కారణమనగా బయటబడని నామరూపములు. ఆధారమగు బ్రహ్మము లేనియెడల కారణమనెడి కల్పనయే నిలబడదు.

అధారమగు త్రాడులేనిచో సర్పమనెడి కల్పనసంభవించక యుండుట వలె. సత్తు - అసత్తు వీటినిగూర్చి రెండవ అధ్యాయము శ్లోకము 16, 11-వ అధ్యా. శ్లో॥ 37, 13-వ అధ్యా. శ్లో॥ 12-ను, భాష్యమునున్ను చూడుడు.

---

శ్లో ॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్ 20

పద॥ త్రైవిద్యాః - మాం - సోమపాః (1) - పూతపాపాః
యజ్ఞైః - ఇష్ట్వా - స్వర్గతిం - ప్రార్థయన్తే।
తే - పుణ్యం - ఆసాద్య - సురేంద్రలోకం
అశ్నన్తి - దివ్యాన్ - దివి - దేవ భోగాన్ ॥

| | | | |
|---|---|---|---|
| (యే) | ఎవరు | స్వర్గతిం | స్వర్గమనేగతిని |
| [త్రైవి]ద్యాః | మూడువేదముల నెరింగినవారలై | ప్రార్థయన్తే | ప్రార్థింతురో |
| సోమపాః | సోమపానము జేసినవారలై | తే పుణ్యంసురేన్ద్ర లోకం అసాద్య | వారలు పుణ్యమైన దేవేంద్ర లోకమునుపొంది |
| పూతపాపాః | పాపము తొలగినవారలై | దివి దివ్యాన్ | స్వర్గమున దివ్యములైన |
| యజ్ఞైః | యజ్ఞములచేత | దేవభోగాన్ | దేవతల భోగములను |
| మాం ఇష్ట్వా | నన్నుపూజించి | అశ్నన్తి | అనుభవించుచున్నారు. |

తా॥ ఎవరు మూడు వేదముల నెరింగినవారలై సోమపానము చేయు వారలై పాపమునుండి పరిశుద్ధులైనవారలై స్వర్గమగుగతిని కోరెదరో వారలు పుణ్యఫలమైన దేవేంద్రలోకమునుపొంది స్వర్గమున దేవతలదివ్యములైన భోగముల ననుభవింతురు.

(1) సోమపాః - సోమలత (తిప్పతీగె) నుండి పిండి ఎత్తబడు రసమును వేదమంత్రములచే హోమము చేసి మిగిలినదానిని యజమానుడు ఋత్విక్కులు త్రాగుటకలదు, అట్లు త్రాగినవారలు సోమపానముచేసిన వారలని చెప్పబడెదరు.

(శంకరులు) జ్ఞానము నెరింగిన యే నిష్కాములు 'ఒకటి' అనుజ్ఞానమున్ను 'వేరు' అనుజ్ఞానమునైన దీనివంటి క్రిందజెప్పిన నివృత్తిలక్షణమైన జ్ఞానయజ్ఞములచే నన్ను పూజించు వారలై భజింతురో వారలు తమతమ అనుభవ జ్ఞానమునకు తగినట్లు నన్నే పొందెదరు. ఐతే ఎవ్వరు అజ్ఞానులై ఆశావిషయములను కోరెడివారలో అట్టివారలు ఋక్కు, యజుస్సు, సామ ముల నెరింగినవారలై సోమపానముచేసినవారై ఆ సోమపానముచేతనే పాపమునుండి పరిశుద్ధులై, వసువులు మొదలగు దేవతల యాకారముగల నన్ను అగ్నిష్టోమము మొదలగు యాగములచే స్వర్గమనేగతిని కోరుచున్నారు. వారలు నూరు యాగములచే పొందదగిన ఇంద్రునిలోకమును తాము చేసిన పుణ్యమునకు ఫలముగ పొంది మనుష్యులకు గిట్టని దేవభోగముల ననుభవించు చున్నారు.

(శ్రీధరులు) మూడు వేదములను అధ్యయనము చేయువారలు, లేక వాటి అర్థవిచారము చేయువారలు త్రైవిద్యులు. అనగా ఆ వేదములలో జెప్పియున్న విధముగ యజ్ఞాదుల ననుష్ఠించు వారలు దేవతాస్వరూపముగ నేనున్నాననుదానినెరుంగక పూజించుచున్నారు. (మిగత వాటిలో మార్పులేదు).

(రామానుజులు) వేదముల నెరింగియు, వేదాంతమును (బ్రహ్మవిద్యను) ఎరుంగక వేదోక్త కర్మల ననుష్ఠించి నన్ను దేవతాస్వరూపముగ నెరుంగక పూజించుచున్నారు. పూతపాపాః= స్వర్గమును పొందుటకు విరుద్ధములైన పాపములేనివారలై.

(రాఘవేంద్రులు) మూడు వేదముల నెరింగినవారలు, విష్ణువు సర్వోత్తముడని తెలిసి యున్నను వేదమున మొట్టమొదట చెప్పబడియున్న స్వర్గాదిఫలమునుద్దేశించి అన్యదేవతలను భజించవలెనని తెలిసి యనుష్ఠించి కడపట విష్ణువగు నాకొఱకు సమర్పణము చేయుచున్నారు. వారలు స్వర్గాదులను పొందుటకై నన్ను ప్రార్థించుచున్నారు.

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే ॥ 21

పద॥ తే - తం - భుక్త్వా - స్వర్గలోకం - విశాలం
క్షీణే - పుణ్యే - మర్త్యలోకం - విశన్తి ।
ఏవం - త్రయీధర్మం - అనుప్రపన్నాః
గతాగతం - కామకామాః - లభన్తే ॥

| | | | |
|---|---|---|---|
| తే తం | వారలు అట్టి | ఏవం త్రయీధర్మం | ఇట్టు మూడువేదములచే చెప్ప బడిన ధర్మమును |
| విశాలం స్వర్గలోకం | విశాలమైన స్వర్గలోకమును | అనుప్రపన్నాః | అనుసరించువారలై |
| భుక్త్వా | అనుభవించి | కామ కామాః | విషయేచ్ఛగలవారలై |
| పుణ్యేక్షీణే | పుణ్యముక్షీణమైన పిదప | గతాగతం లభ[న్తే] | పోవుటను వచ్చుటను పొందుచున్నారు. |
| మర్త్యలోకం | మనుష్యలోకమును | | |
| విశన్తి | ప్రవేశించుచున్నారు. | | |

తా॥ వారలు అట్టి విశాలమైన స్వర్గలోకము ననుభవించి పుణ్యము నశించినపిదప మనుష్యలోకమును పొందుచున్నారు. ఇట్టు వేదోక్తధర్మము ననుసరించినవారలై విషయేచ్ఛగలవారలు జననమరణములను పొందుచున్నారు.

(శంకరులు) అట్టి సకాములు విశాలమైన ఆ స్వర్గలోకమున వారల పుణ్యమునకు తగిన భోగముల ననుభవించిన పిదప మనుష్యలోకమున ప్రవేశించుచున్నారు. అనగా జనించుచున్నారు. మునుపు చెప్పినట్లు మూడువేదములలో విహితమైన కేవలము వైదిక కర్మనుమాత్రమనుష్ఠించి వారలు పోవుటను వచ్చుటను, అనగా జననమును మరణమును పొందుచున్నారు. అనగా స్వతంత్రమైన నిలకడను ఒక చోటను బడయుటలేదని తాత్పర్యము.

(స్వకీయము) ఈ గీత 8-వ అధ్యాయము 25-వ శ్లోకములో చెప్పబడియున్న ధూమ (= పొగ) మార్గమున బోవువాడు ఈ శ్లోకమున గుర్తింపబడినవాడుగ కనబడుచున్నాడు.

శ్లో॥ అనన్యాశ్చింతయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం॥ 22

పద॥ అనన్యాః (1) - చింతయన్తః - మాం - యే - జనాః (2) - పర్యుపాసతే।
తేషాం - నిత్యాభియుక్తానాం (3) - యోగక్షేమం (4) - వహామి - అహం॥

| | | | |
|---|---|---|---|
| యేజనాః | ఏజనులు | నిత్యాభియుక్తానాం | ఎల్లప్పుడు ధ్యానమున నిలకడ చెందియున్న |
| అనన్యా | నాకంటె అన్యులుకానివారై | | |
| మాం చింతయన్తః | నన్నే ధ్యానించువారై | తేషాం యోగక్షేమం | అట్టి జనుల యోగక్షేమమును |
| పర్యుపాసతే | అంతట నుపాసించుచున్నారో | అహం వహామి | నేను వహించుచున్నాను. |

తా॥ ఏ జనులు తాము నాకంటె వేరైనవారలు కారని నన్నే ధ్యానించి ఎడతెగక నంతట నుపాసించుచున్నారో, ఎల్లప్పుడు ధ్యాననిష్ఠగల అట్టివారల యోగక్షేమమును నేనే వహించుచున్నాను.

(1) అనన్యాః - నన్ను అన్యునిగ తలంచక నారాయణుడనైన నేనే వారలయాత్మయని చింతించి (శంకరులు). నన్ను తప్ప వేరుగ ఎట్టి ప్రయోజనమును ఇచ్చింపక నన్నే పరమప్రయోజనమని తలంచి ధ్యానించి (రామానుజులు). నాకంటె భజింపదగిన వేరొకదేవత లేదను తలంపుగల వారలై (శ్రీధరులు). చింతతొలగి నన్నే చింతించి (రాఘవేంద్రులు).

(2) జనాః - సన్న్యాసులైన జనులు (శంకరులు). మహాత్ములు (రామానుజులు).

(3) నిత్యాభియుక్తానాం - నిత్యాభియోగినః (శంకరులు). ఎల్లప్పుడు నన్ను పొందవలెనని భావించుచున్న (రామానుజులు). సర్వకాలములందును సర్వావస్థలలోను నన్ను మరువకయున్న (మధ్వులు). సకలదేశకాలములలోను మనోవాక్కాయములచే ఎడతెగక నా సేవలో నున్న (రాఘవేంద్రులు).

(4) యోగక్షేమం - పొందనిదానిని పొందుటయోగము, పొందినదానిని రక్షించుటక్షేమము (శంకరులు). ధనాదులను పొందుటయోగము, పొందినదానిని రక్షించుటక్షేమము. ఇట్టిదానిని, లేక మోక్షమును (శ్రీధరులు). నన్ను పొందుటయోగము, మరల జననము తొలగిపోవుట క్షేమము. (రామానుజులు). లభించనిది లభించినచో యోగము, దానిని రక్షించుట క్షేమము, లేక మోక్షమున శాశ్వతముగ నున్నట్టిది యోగక్షేమము (రాఘవేంద్రులు). (స్వకీయము) అధ్యా 2 - శ్లో. 45. చూడుడు,

(శంకరభాష్యము) ఇకనెవ్వరు కోరిక తొలగినవారలై సమ్యగ్దర్శనముగలవారలో, ఎట్టి సన్న్యాసులైన జనులు అన్యభావము లేనివారలై, అనగా బ్రహ్మదేవుడైన శ్రీనారాయణుని తమ ఆత్మగగొన్నవారై అట్టిఆత్మనే ధ్యానించువారలై నన్ను అంతటనున్న వస్తువుగ చూచెదరో, అట్టి ఎల్లప్పుడు ధ్యానమున ఎగతెగని ప్రయత్నముగల పరమాత్మదర్శులైన వారలకు యోగక్షేమమును నేను నడుపుచున్నాను. యోగమనగా పొందనిదానిని పొందుట. క్షేమమనగా దానిని కాపాడుట. "జ్ఞానీత్వాత్మైవమేమతం" సచమమ ప్రియః" (7-అధ్యా-శ్లో॥ 18-17-) అనుకారణముచే వారలు నాయొక్క ఆత్మగను నాకు ప్రియులుగనునున్నారు అనుట.

మిగతభక్తులకును భగవంతుడు వారల యోగక్షేమమును జరుపనే జరుపుచున్నాడు అనునదియు వాస్తవమే. ఐనను ఇదియే దానిలోని వ్యత్యాసము. మిగతభక్తులెవ్వరో వారలు తమకై యోగక్షేమముకొరకు తాముకూడా ప్రయత్నించుచున్నారు. ఐతే తమకంటెవేరైనదానిని చూడని వారలు తమకైన యోగక్షేమముకొరకు ప్రయత్నించుటలేదు. వారలు ఆత్మజ్ఞానులు, జీవించుటలో గాని మరణించుటలోగాని తాము ఆశగలిగి యుండుటలేదుగదా? వారలు భగవంతునిమాత్రమే శరణముగ గైకొన్నవారలు. కావున భగవంతుడే వారల యోగక్షేమమును నడిపించుచున్నాడు.



శ్లో॥ *యేఽప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేఽపి మామేవ కౌంతేయ యజన్త్యవిధిపూర్వకం ॥ 23

పద॥ యే - అపి - అన్యదేవతాభక్తాః - యజన్తే - శ్రద్ధయా - అన్వితాః।
తే - అపి - మాం - ఏవ - కౌన్తేయ - యజన్తి - అవిధిపూర్వకం (1) ॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ! | ఓ కుంతీపుత్రుడా! | యజన్తే | (ఇతరదేవతలను) పూజించుచున్నారో |
| యేపి | ఎవ్వరైతే | | |
| అన్యదేవతా భక్తాః | వేరుదేవతలయెడ భక్తిగలవారై | తేపి | వారున్ను |
| | | అవిధిపూర్వకం | విధిదప్పిన అజ్ఞానపూర్వకముగ |
| శ్రద్ధయా అన్వితాః | నమ్మకముతోగూడినవారై | మామేవ యజన్తి | నన్నే పూజించుచున్నారు. |

తా॥ ఓ కుంతీపుత్రా! ఎవ్వరు ఇతరదేవతలయెడ భక్తిగలవారై నమ్మకముతో, అనగా ఆస్తిక్యబుద్ధితో గూడినవారై అట్టి అన్యదేవతలను పూజించుచున్నారో వారున్ను అజ్ఞానముతో నన్నే పూజించుచున్నారు. అనగా నేను సకలమునకునుఆత్మగ నున్నాననుదాని నెరుంగక ఇంద్రాది దేవతలను నాకంటె అన్యమని కల్పించుకొని పూజించినను వాస్తవముగ నన్నే పూజించుచున్నారు.

(1) అవిధిపూర్వకం - వాసుదేవునికంటె వేరైనవస్తువు లేదనుజ్ఞానమే విధిపూర్వకము. భాష్యోత్కర్షదీపిక). భగవద్గీత 16 అధ్యా-శ్లో-17-కూడ చూడుడు.

(శంకరులు) వేరుదేవతలున్ను నీవేయైనచో అప్పుడు వారలభక్తులున్ను నిన్నే పూజించుచున్నారనగా అదియెట్లు వాస్తవమనునది ఇందులో జెప్పబడుచున్నది. ఏ జనులుగూడ అన్యదేవతలయెడ భక్తిగలవారలై (ఫలము లభించుచున్నదను) నమ్మకముతోగూడి ఆ దేవతలను పూజించుచున్నారో వారలున్ను నన్నే ఆరాధించుచున్నవారలైనను అజ్ఞానపూర్వకముగ తెలియనితనముతో నన్నారాధించుచున్నారు.

(రామానుజులు) ఇంద్రాది దేవతలయెడ భక్తిశ్రద్ధలతోగూడిన ఏ యొక్క జనులు అట్టి దేవతల నారాధించినను వారలున్ను నన్నే ఆరాధించినవారలగుచున్నారు. ఎట్లనగా ఇంద్రాది దేవతలు నా యొక్క శరీరమైనందునను ఇంద్రాది శబ్దములకు నేనే విషయభూతుడనైనందునను అట్టి దేవతా శరీరారాధనము శరీరినైన నన్ను ఆరాధించినదగుచున్నది. ఐతే వారలు సాక్షాత్తుగ ఆత్మయైన నన్నారాధించనులేదు. అట్టి దేవతలు నా శరీరమని తెలిసియు నారాధించలేదు. కావున క్రమమైన విధమున నారాధింపలేదని చెప్పబడినది.

* "యేత్వన్య" అనియు పాఠము (రామానుజులు).

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే   24

పద॥ అహం - హి - సర్వయజ్ఞానాం - భోక్తా - చ - ప్రభుః - ఏవ - చ।
న - తు - మాం - అభిజానన్తి - తత్త్వేన - అతః - చ్యవన్తి - తే ॥

| | | | |
|---|---|---|---|
| సర్వయజ్ఞానాం | సకలయజ్ఞములకు | మాం తత్త్వేన | నన్ను యథార్థమైన విధముగ |
| భోక్తా చ ప్రభుశ్చ | భోక్తయు ప్రభువు | నాభిజానన్తి | ఎరుంగుటలేదు |
| అహమేవ హి | నేనేగదా | అతః చ్యవన్తి | కావున యజ్ఞఫలమునుండి (వారలు) జారుచున్నారు |
| తు | ఐతే | | |
| | వారలు | | |

తా॥ సకల యజ్ఞఫలముల ననుభవించువాడును, ఫలమునిచ్చుస్వామియు ను. ఐతే జనులు నన్ను యథార్థముగ నెరుంగుటలేదు. కావున (అన్యదేవతలను పూజించుచున్న) వారలు యజ్ఞఫలమునుండి జారుచున్నారు. అనగా పునర్జన్మమును పొందుచున్నారు.

(శంకరులు) దేనిచే వారలు అవిధిపూర్వకముగ పూజించుచున్నారనునది ఇందులో జెప్పబడుచున్నది. నేను శ్రుతిలోను స్మృతిలోను విహితములైన సకలయజ్ఞములను ఆ యా దేవతారూపముగ భుజించువాడను, యజమానుడనుగనున్నాను. నేనుగదా యజ్ఞమునకు స్వామిని! "ఈ శరీరమున నేనే అధియజ్ఞ" మని 8 వ అధ్యాయము 4 వశ్లోకమున జెప్పబడియున్నది. ఐతే వారలు నన్నావిధముగ ఎరుంగుటలేదు. కావుననే అజ్ఞానముతో యాగముచేసి యాగఫలమునుండి జారుచున్నారు. ("సకల యజ్ఞములను వసువులు మొదలగు నా యా దేవతారూపముగ భుజించువాడను నేనే. అంతర్యామి స్వరూపముగ ఆ యజ్ఞములకు సొంతదారుడను నేనే" అనుదానిని తెలిసికొనని దేవతాంతరభక్తులు అజ్ఞానముచే నాయెడ కర్మలనర్పింపక ఆ కర్మకు నశించెడి ఫలమునుపొంది ఆయాలోకములకు వెళ్లి మరలను తిరిగి వచ్చుచున్నారనునది తాత్పర్యము.)

శ్లో॥ యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మాం ॥   25

పద॥ యాన్తి - దేవవ్రతాః - దేవాన్ - పితౄన్ - యాన్తి - పితృవ్రతాః।
భూతాని - యాన్తి - భూతేజ్యాః - యాన్తి - మద్యాజినః - అపి - మాం (1)

| | | | |
|---|---|---|---|
| దేవవ్రతాః దేవాన్యాన్తి | దేవతలనుద్దేశించి వ్రతములను జేయువారలు దేవతలను పొందుచున్నారు. | భూతేజ్యాః | భూతములను పూజించువారలు |
| | | భూతాని యాన్తి | భూతములను పొందుచున్నారు. |
| పితృవ్రతాః పితౄన్యాన్తి | పితరులనుగురించి వ్రతము జేయువారలు పితరులను పొందుచున్నారు. | మద్యాజినోఽపి | నన్ను పూజించువారును |
| | | మాం యాన్తి | నన్నే పొందుచున్నారు. |

తా॥ దేవతల నుద్దేశించి వ్రతములను జేయువారు దేవతలనున్ను, పితరులనుగూర్చి వ్రతములను జేయువారలు పితరులనున్ను, వినాయకాది (భూత

సమూహములపేరు, విఘ్నేశ్వరుడుకాదు) భూతములను పూజించువారలు ఆ భూతములను పొందుచున్నారు. నన్ను పూజించువారలు నన్నే పొందుచున్నారు. (దేవతల మొదలగువార్లను పొందుచున్నారనగా ఆ దేవతలు మొదలగు వారల లోకమును పొందుచున్నారని తాత్పర్యము. 7-వ అధ్యాయము 23-వ శ్లోకము చూడుడు.)

(1) మాం - నాశములేని పరమాత్మస్వరూపమైన నారాయణుడనగు నన్ను (శ్రీధరులు)

(శంకరులు) మఱియెవ్వరు అన్యదేవతలయెడ భక్తిగలిగియుండుటవలన అజ్ఞానముతో నన్ను భజించుచున్నారో వార్లకును యజ్ఞముయొక్క ఫలము అవశ్యముగలుగుట - అనగా వారలకు తిరిగిరాకుండుటయనే ఫలములేకున్నను వారలు చేయుచున్న ఆయా దేవతాపూజకు తగినట్లు నిశ్చితముగా ఫలము గలుగుట - ఎట్లు అనునది జెప్పబడుచున్నది.

దేవతలయెడ నమస్కరించుట ప్రదక్షిణముజేయుట మొదలగు నియమములు, భక్తి, ఇవిగల వారలు దేవతలను పొందుచున్నారు. శ్రాద్ధము మొదలగు కర్మలలో శ్రద్ధగలవారై పితరుల యెడ భక్తిగలవారలు అగ్నిష్వాత్తుడు మొదలగు పితరులను, అనగా పితృలోకమును పొందుచున్నారు. భూతములను పూజించువారలు, వినాయకులు, మాతృగణములు, నలుగురు భగినులు మొదలగు భూతములను అనగా వాటిలోకమును పొందుచున్నారు. నన్నుపూజించు స్వభావము గలవారైన విష్ణుభక్తులునన్నే పొందుచున్నారు. శ్రమయొక్కటిగనున్నను అజ్ఞానులు నన్నే పూజించుటలేదు. అజ్ఞానముచే ననుడు. కావున వారలు స్వల్పఫలమును పొందువారుగనున్నారు అనునది తేలిన తాత్పర్యము.

(రామానుజులు) ఇంద్రాదిదేవతలనుగూర్చి యజ్ఞము చేయుచున్నానని సంకల్పము జేసికొనియు, పితరులను గురించి శ్రాద్ధాదులను జేయుచున్నానని సంకల్పించుకొనియు యక్షరాక్షసాది భూతములను పూజించుచున్నానని సంకల్పించుకొనియు, దేవతాశరీరిని పరమాత్మను వాసుదేవుడను భగవంతుడనువన నన్నుపాసించునట్లు సంకల్పముజేసికొనియున్నవారును, ఎవ్వరి నుపాసించుచున్నారో వారినే పొందుచున్నారు.



శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః* ॥ 26

పద॥ పత్రం - పుష్పం - ఫలం - తోయం - యః - మే - భక్త్యా (1) - ప్రయచ్ఛతి।
తత్ - అహం - భక్త్యుపహృతం - అశ్నామి (2) - ప్రయతాత్మనః (3) ॥

| | | | |
|---|---|---|---|
| యః పత్రం పుష్పం | ఎవ్వడు ఆకుపుష్పము | ప్రయతాత్మనః | (అట్టి) పరిశుద్ధమైన బుద్ధి గలవాడు |
| ఫలం తోయం | పండు, నీరు వీటిని | | |
| మే భక్త్యా | నాకొఱకు భక్తితో | భక్త్యుపహృతంతత్ | భక్తితోనిచ్చిన దానిని |
| ప్రయచ్ఛతి | ఇచ్చుచున్నాడో | అహం అశ్నామి | నేను భుజించుచున్నాను. |

తా॥ ఎవ్వడు నాకొఱకు భక్తితో పత్రము, పుష్పము, పండు, జలము వీటిని నివేదనము జేయుచున్నాడో, శుద్ధమైన మనస్సుగలవాడైన వానిభక్తిచే నివ్వబడినవాటిని నేను భుజించుచున్నాను. అనగా గ్రహించి తృప్తి పొందుచున్నాను.

(1) భక్త్యా-నా కర్పణము చేయని యెడల తన ప్రాణధారణము కానేరదనుతలంపుతో (రామానుజులు)

(2) అశ్నామి-గృహ్ణామి = తీసికొనుచున్నాను (శంకరులు). నేను సర్వేశ్వరుడనుగను, ఏ యొక్క అపేక్షమొదలగునవి లేనివాడుగను ఉన్నను, లభించని వస్తువు లభించినట్లు అంగీకరించుచున్నాను. దీనికాధారముగ మోక్షధర్మమందలి క్రిందకనుబరచిన శ్లోకము చూడుడు:—

"యాః క్రియాస్సంప్రయుక్తాస్స్యురేకాంత గతబుద్ధిభిః।
తాస్సర్వాశ్శిరసా దేవః ప్రతిగృహ్ణాతి వై స్వయం॥"

ఏకాంతభక్తిగలవారిచే ఈశ్వరునికొరకు ఏ క్రియలు సమర్పింపబడుచున్నవో వాటిని భగవంతుడు శిరస్సుచే నంగీకరించుకొనుచున్నాడు. (రామానుజులు)

(3) ప్రయతాత్మనః - పరిశుద్ధమైన బుద్ధిగలవాడు (శంకరులు). భగవంతుని కర్పణముచేయుటయే పరమప్రయోజనమని తలంచియున్న శుద్ధమైన మనస్సుగల (రామానుజులు). వైరాగ్యము గల (రాఘవేంద్రులు).

(స్వకీయము) నన్నే పూజించు నా భక్తులు మరల తిరిగి రాకుండుటయనే లక్షణముతో గూడిన ముగింపులేనిఫలమును పొందుటమాత్రముగాదు. నేనుగూడ సులభముగ పూజింపదగినవాడను. అనగా నన్ను పూజించుటకూడ వారలకెట్లు సులభమైనదనుదానిని భగవంతుడు ఇందు జెప్పుచున్నాడు. భగవంతుని పూజింప విశేషమైన ద్రవ్యము మొదలగునవి సంపాదించుటయు, ఖర్చుచేయుటయు, ప్రయాసనొందుటయు నక్కరలేదు. ఫలాపేక్షలేక భక్తిపూర్వకముగ శుద్ధమైన మనస్సుతో ఒక భక్తునిచే నివ్వబడువస్తువులు ఎంత అల్పమైనను భగవంతుడు అట్టివస్తువులను మిక్కిలిప్రీతితో గ్రహించుచున్నాడనునది దీనిచే తెలుపబడినది. విదురుడు మిక్కిలిప్రీతితో శ్రీకృష్ణ పరమాత్మకు గంజియిచ్చిన విషయమున భగవంతుడు పొందిన సంతోషమునుగూర్చి మహాభారతము ఉద్యోగపర్వమున్ను, సుదాముడను మారుపేరుగల కుచేలుడు మిక్కిలి ప్రీతితో కృష్ణపరమాత్మకు అటుకులు ఇచ్చిన విషయమున భగవంతుడు పొందిన సంతోషమును గూర్చి భాగవతము 10 వ స్కంధము 81 వ అధ్యాయమున్నుచూడుడు.

* ఈ శ్లోకమును శ్రీ భాగవతము 10 - 81 - 5 లో చూడుడు.



శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం॥ 27

పద॥ యత్ - కరోషి - యత్ - అశ్నాసి - యత్ - జుహోషి - దదాసి - యత్।
యత్ - తపస్యసి - కౌంతేయ - తత్ - కురుష్వ - మదర్పణమ్॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ! | ఓ కుంతీపుత్రా! | యత్ దదాసి | దేనిని దానముగ నిచ్చుచున్నావో |
| యత్ కరోషి | దేనిని చేయుచున్నావో | యత్ తపస్యసి | ఎట్టి తపస్సును జేయుచున్నావో |
| యత్ అశ్నాసి | దేనిని భుజించుచున్నావో | తత్ మదర్పణం | దానిని నా కర్పితముగ |
| యత్ జుహోషి | దేనిని హోమముజేయుచున్నావో | కురుష్వ | చేసెదవుగాక! |

తా॥ ఓ కుంతీపుత్రా! దేనిని జేసినను, దేనిని భుజించినను, ఎట్టిహోమము చేసినను, దేనిని దానము చేసినను, ఎట్టి తపస్సు చేసినను దానిని నా కర్పణముగ జేసెదవుగాక.

(శంకరులు) ఈ విధముగనుండుటవలన ఓ కుంతీపుత్రా! నీవు తానుగనేర్పడిన అనగా శాస్త్రమువలన గాక ప్రాణులప్రకృతివశముగా నేర్పడి, నడచుట తినుట మొదలగు దేనిని చేయుచున్నావో, దేనిని భుజించుచున్నావో, ఎట్టి భోగము ననుభవించుచున్నావో, శ్రుతిలోగాని స్మృతిలో గాని విహితమైన ఎట్టి హోమమునుజేసి పూర్తిజేయుచున్నావో బ్రాహ్మణులు మొదలగువార్లకు ఎట్టి స్వర్ణము మొదలగువాటి నిచ్చుచున్నావో, ఎట్టి తపస్సు ననుష్ఠించుచున్నావో వాటినన్నిటిని నా కర్పితముగ చేసెదవుగాక.

(శ్రీధరులు) మునుపటి శ్లోకమున జెప్పబడియున్న పుష్పాదులను సంపాదింప స్వల్పముగానైనను ప్రయాసకలదు. అట్టి ప్రయాసగూడ నక్కరలేదు. ఎవరెవ్వరికి ఏదేదిదొరకునో, ఎవ్వడు దేనిని జేయుచున్నాడో దానినంతను భగవంతుని కర్పితము జేయవచ్చుననునది తాత్పర్యము.

(రామానుజులు) లౌకిక వైదికములైన సకల విషయములలోను జేయబడు కార్యములన్నిటిని భగవంతుని కర్పణముచేయుము. అని భావము.

శ్లో॥ శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥ 28

పద॥ శుభాశుభఫలైః - ఏవం - మోక్ష్యసే - కర్మబంధనైః।
సన్న్యాసయోగయుక్తాత్మా - విముక్తః - మాం - ఉపైష్యసి॥

| | | | |
|---|---|---|---|
| ఏవం | ఈ విధముగ (జేసినయెడల) | (త్వం) సన్న్యాస యోగయుక్తాత్మా | నీవు సన్న్యాసయోగముతో గూడిన మనస్సుగల |
| శుభాశుభఫలైః | శుభాశుభములు ఫలముగ గల | | |
| కర్మబంధనైః | కర్మయొక్క కట్లచే | విముక్తః | కర్మయొక్క కట్లనుండి విడువబడి |
| మోక్ష్యసే | విడువబడెదవు | మాముపైష్యసి | నన్ను వచ్చి చేరెదవు. |

**తా॥ ఈ విధముగ కర్మలను నాయెడ అర్పణముజేసితివేని శుభాశుభ (పుణ్యపాప) ములను ఫలముగ గల్గిన కర్మబంధమునుండి విడువబడి నన్ను వచ్చి చేరెదవు.**

(శంకరులు). ఈ విధముగ నీవుచేసినదానివలన నీకేది గలుగుననుదానిని వినుము — నీవు సకలమునున్ను నా కర్పణముజేయునప్పుడు ఇష్టానిష్టఫలముగల కర్మబంధమునుండి విడువబడెదవు. సకలమును భగవంతుడనైన నాకు అర్పించుటగా నున్నందున ఇది సన్న్యాసమనబడును. (సన్న్యాసము = త్యజించుట. ఈ పదమున కర్థము 6 వ అధ్యాయము 2-వ శ్లోకములోను, 18-వ అధ్యా - 2 వ శ్లోకములోను చూడుడు.) కర్మగనున్నందున ఇది యోగముకూడ. కావున అది సన్న్యాసయోగ మనబడినది. నీవు అట్టి సన్న్యాసయోగముతోగూడిన మనస్సుగలవాడవై బ్రతికియున్నప్పుడే బంధమునుండి విడువబడి శరీరము నశించిన పిదప నన్ను వచ్చిచేరెదవు.

(రామానుజులు) నీవు నా శేషభూతుడవనియు నాచే ప్రేరేపింపబడువాడవనియు తెలిసి సకలకర్మలు భగవదారాధనమను ననుసంధానముతో వైదిక లౌకిక కర్మలనుచేయుచున్నచో బంధనివృత్తినిపొంది మోక్షమొందెదవు. అనునది తాత్పర్యము.

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం ॥ 29

పద॥ సమః - అహం - సర్వభూతేషు - న - మే - ద్వేష్యః - అస్తి - న - ప్రియః ।
యే - భజన్తి - తు - మాం - భక్త్యా - మయి - తే - తేషు - చ - అపి - అహం ॥

| | | | |
|---|---|---|---|
| సర్వభూతేషు | సకలప్రాణులయెడను | భక్త్యాభజన్తి | భక్తితో భజించుచున్నారో |
| అహం సమః | నేను సమముగనున్నాను | తే మయి (వర్తన్తే) | వారలు నాయెడనున్నారు |
| మేద్వేష్యః నాస్తి | నాకు శత్రువులేడు | అహమపి | నేనుగూడ |
| ప్రియః న | ప్రియమైనవాడులేడు | తేషు చ (వర్తే) | వారలయెడ నున్నాను. |
| తు యే మాం | ఐతే ఎవ్వరు నన్ను | | |

తా॥ నేను సకలప్రాణులయెడను సమముగనున్నాను. నాకుశత్రువు లేడు, మిత్రుడులేడు. ఎవ్వరు నన్ను భక్తిచే భజించుచున్నారో వారలు నాయెడనున్నారు. నేను వారలయెడ నున్నాను.

(శంకరభాష్యము) అట్లైన భగవంతుడు రాగద్వేషములు, గలవాడు. ఏలనగా అతడు భక్తుల ననుగ్రహించుచున్నాడేగాని మిగతవారల ననుగ్రహించుటలేదు. అను ఆక్షేపణకు సమాధాన మిందులో భగవంతునిచే చెప్పబడుచున్నది.

నేను అగ్నివలెనున్నాను, అనగా ఎట్లు నిప్పు దూరమునందున్న వార్లకు చలినిపోగొట్టుట లేదో, ఐతే సమీపించువారలచలిని పోగొట్టుచున్నదో అటులనే నేను నా భక్తులను అనుగ్రహించు చున్నాను. మిగతవారలను లేదు. ఈశ్వరుడనైననన్ను ఎవరుభక్తితో భజింతురో వారలు స్వభావ ముగనే నా యెడనున్నారు. నాకు వారలయెడనున్న ఒక విధమైన ఆసక్తివలన కాదు. వారల యెడ నేను స్వభావముగనేయున్నాను. మిగత వార్లయెడలేను. ఈ మాత్రము చేతనే నాకు వార్ల యెడ ద్వేషమున్నట్లుకాదు.

(శ్రీధరులు) సకలప్రాణులకు సమముగనున్న ఈశ్వరుడు, తన భక్తులకుమాత్రము ఫలమునిచ్చుట పక్షపాతముగదా అనిన, కాదు. అగ్ని ఎల్లరకును సాధారణమైనను దానిని సమీపించిపోయిన వానిచలిని పోగొట్టుటయు, దానినాశ్రయించిన వానికి ప్రకాశమిచ్చుటయు ఎట్లో సర్వసాధారణమైన కల్పవృక్షము తన్నుకోరివచ్చినవానికి మాత్రము ఫలమిచ్చుట ఎట్లో ఆ విధముగనే భగవంతుని మహిమ, వాని నాశ్రయించినవానిని రక్షించును.

(రామానుజులు) దేవమనుష్య పశుపక్షి మొదలగు ప్రాణులలో నేను సమముగనున్నాను. వారల ఆకారము స్వభావము జ్ఞానము వీటివలన ఇతడు శ్రేష్ఠుడని ఒకనిని చేర్చుకొనుటలేదు. నికృష్టుడని ఒకనిని నివర్తించుటలేదు. (దీని తాత్పర్యమేమనగా దేవతలు శ్రేష్ఠులు, మనుష్యుడు నికృష్టుడనియు, మనుష్యుడు శ్రేష్ఠుడు మృగాదులు నికృష్టములనియు భగవంతునికి లేదననదే.)

(రాఘవేంద్రులు) వారివారి భక్తి, ద్వేషము వీటికి తగినట్లు ఫలమునిచ్చుటవలన నేను పక్షపాతినికాను. "వారలు నాయెడనున్నారు" అనగా వారలు నా యధీనులుగనున్నారు. "నేను వారల యెడనున్నాను" అనగా నేను వార్లకు ఇష్టుడుగను ప్రియుడుగనున్నాను. లేక అధీనుడుగ నున్నాను.

(స్వకీయము) భగవంతుని భజించుటయనగా వర్ణము ఆశ్రమము మొదలగువాటి ధర్మ ములను ఈశ్వరార్పణముగ ననుష్ఠించుట. దీనికి భగవద్భక్తి యనిపేరు. ఈ భక్తియొక్క మహిమ

తలంచుటకుకూడ అశక్యమైనది. ఇదియే మనస్సునందలి మురికిని తొలగించి బుద్ధిని శుద్ధముగ దిద్దునది. ఈ విధముగ దీనిచే బుద్ధి కుదిరినవారల చిత్తము భగవంతుడు ప్రత్యక్షమగుటకు తగిన యోగ్యతను బడయుచున్నది. కావుననే "వారలు నా యెడనున్నారు" అనగా రజస్సు తమస్సు అనెడి మురికితొలగి అతిస్వచ్ఛముగనున్న వారలయొక్క అట్టి యంతఃకరణము నా యాకారమును ఉన్నటులగ్రహించి పట్టుకొనుచున్నది అనుట. "నేను వార్లయెడనున్నాను" అనగా సూర్యుని ప్రకాశము అంతటనున్నట్టిదైనను స్వచ్ఛమైన అద్దమునబడిన మాత్రమున ఎట్లు విశేషముగ ప్రతి ఫలింపకయుండదో ఆవిధముగనే వారల స్వచ్ఛమైన చిత్తమున భగవంతుడు అవశ్యముగ విశేషముగ ప్రతి ఫలించుచున్నాడనుట. భగవంతుడు అంతటనుండువాడైనను భక్తులస్వచ్ఛమైన చిత్తమున బయట బడుచున్నాడు. భక్తులు కానివారల అశుద్ధమైన చిత్తమున ప్రకటమగుటలేదు. కావున సూర్యునకు అద్దమున ప్రీతియు, మట్టి పెళ్లలో ద్వేషము లేకుండుటవలె భగవంతునికిగూడ ఒకనియెడ రాగము మరియొకనియెడ ద్వేషము లేదనుట.

శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః ॥ 30

పద॥ అపి - చేత్ - సుదురాచారః - భజతే - మాం (1) - అనన్యభాక్ ।
సాధుః - ఏవ - సః - మన్తవ్యః - సమ్యక్ (2) - వ్యవసితః - హి - సః

| | | | |
|---|---|---|---|
| సుదురాచారోపి | ఒకడు మిక్కిలి దురాచారము గలవాడైనను | మన్తవ్యః | తలంపదగినవాడు |
| | | హి | ఏలనగా |
| అనన్యభాక్ | అన్యదేవతను భజించనివాడై | సః | అతడు |
| మాం భజతేచేత్ | నన్నుభజించినచో | సమ్యక్ వ్యవసితః | మంచినిశ్చయము గలవాడు |
| సః సాధురేవ | అతడు మంచివాడుగనే | | |

తా॥ ఒకడు మిక్కిలి దురాచారము గలవాడైనను అన్యదేవతలను భజింపక నన్నే భజించినచో వానిని శ్రేష్ఠునిగనే తెలిసికొనదగును. ఏలనగా అతడు మంచి నిశ్చయముగలవాడు.

(1) మాం - నారాయణుడగు నన్ను (శ్రీధరులు).

(2) సమ్యక్ - ఈశ్వరభజన జేయుటవలననే నేను కృతార్థుడు కావలెనను నిశ్చయముగలవాడు (శ్రీధరులు)

(శంకరులు) నాయెడనుంచు భక్తియొక్క మహిమను వినుము. మిక్కిలి దురాచారము గలవాడైనను, అన్యభక్తిలేనివాడై నన్నే భజించుచున్నవానిని సదాచారముగలవానిగనే తెలిసికొన వలెను. ఏలనగా అతడు సరియైన నిశ్చయ దార్ఢ్యముగలవాడు. దురాచారము గలవానిని సదాచారము గలవానిగ నెట్లు తలంచుట యనినచో అతడు తనలోపలనున్న సరియైన నిశ్చయముయొక్క బలముచే వెలుపలనున్న చెడ్డప్రవర్తనను విడిచి శీఘ్రముగా సత్ప్రవర్తనమున మనస్సుగలవాడగు చున్నాడు. అని పైశ్లోకమున జెప్పబడుచున్నది.

(రామానుజులు) వర్ణాశ్రమ ధర్మములకు విరుద్ధముగ నడచుటయనే దురాచారముగల వాడైనను, భజన తప్ప వేరుప్రయోజనములేదను నిశ్చయముతో నన్ను భజించినచో అతడు వైష్ణవ శ్రేష్ఠుడు (బహు) మన్తవ్యః = బహుమానింపదగినవాడు. మునుపటి శ్లోకములలో జెప్పబడియున్న

మహాత్ములలో జేరినవాడు. మంచినిశ్చయముతో గూడినవాడు. దీనితాత్పర్యమేమనగా సకల జగత్కారణుడును, పరమాత్మయు చరాచర సకలప్రపంచమునకు స్వామియు భగవంతుడును నైన నారాయణుడు నాకుగురువు, స్నేహితుడు, భోగ్యవస్తువు అనే నిశ్చయముతో నన్ను భజించుట వలన శ్రేష్ఠుడు.

(రాఘవేంద్రులు) సదాచారముగల చంద్రసూర్యాదిదేవతాంశములైన ఋషులు మొదలగు వారలు దైవాధీనులై పుణ్యములను పోగొట్టునట్టి మిక్కిలి దురాచారము గలవారైనను ఇతర దేవతలను భజింపక నన్నే భజింతురేని వారలేశ్రేష్ఠులు. ఏలనగా భగవత్తత్త్వ నిశ్చయముగలవారై నందుననే.

(స్వకీయము) దురాచారముగలవాడు భగవంతుని భజించుట దుర్లభము.

* ఈ శ్లోకమును గరుడపురాణము అధ్యా 219-6-27 లో చూడుడు.

---

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి।
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి *॥ 31

పద॥ క్షిప్రం - భవతి - ధర్మాత్మా (1) - శశ్వత్ - శాన్తిం - నిగచ్ఛతి (2)।
కౌంతేయ - ప్రతిజానీహి (3) - న - మే - భక్తః - ప్రణశ్యతి (4) ॥

| | | | |
|---|---|---|---|
| (సః) క్షిప్రం | అతడు శీఘ్రముగ | హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! |
| ధర్మాత్మా భవతి | ధర్మమున మనస్సుగలవా డగుచున్నాడు | మే భక్తః | నాయొక్క భక్తుడు |
| | | న ప్రణశ్యతి (ఇతి) | చెడిపోజాలడని |
| శశ్వత్ శాంతిం | ఎల్లప్పుడు విరామమును | ప్రతిజానీహి | నిశ్చయముగ ప్రతిజ్ఞచేయుము |
| నిగచ్ఛతి | పొందుచున్నాడు | | |

తా॥ మునుపుచెప్పిన భక్తుడు శీఘ్రముగ ధర్మములో మనస్సుగలవాడగును. స్థిరమైన విశ్రాంతిని పొందును. ఓ కుంతీపుత్రా! నా భక్తుడు చెడిపోనేరడని నిశ్చయముగ నీవు ప్రతిజ్ఞచేయుము.

(1) ధర్మాత్మా - ధర్మమున మనస్సుగలవాడుగనే (శంకరులు). భజనలోనే మనస్సుగలవాడుగ (రామానుజులు).

(2) శాంతిం నిగచ్ఛతి - శాశ్వతముగ పునర్జన్మలేనట్టి నాయొక్కప్రాప్తికి అడ్డుగానున్న దురాచారము నుండి నివృత్తిని పొందుచున్నాడు (రామానుజులు). శాశ్వతమైన మోక్షమును పొందుచున్నాడు (రామానుజులు).

(3) ప్రతిజానీహి - నిశ్చయమైన ప్రతిజ్ఞను చేయుము (శంకరులు). వాదముచేసెడిసభలో, నగార కొట్టుచు చేతినిపైకెత్తుకొని, "దురాచారముగలవాడైనను నా భక్తుడు చెడిపోవుటలేదు" అని సత్యముచేయుము (శ్రీధరులు).

(4) న ప్రణశ్యతి - పరిపూర్ణమైన భక్తిగలవాడగును (రామానుజులు). నరకము మొదలగు నవర్థ మును పొందుటలేదు (రాఘవేంద్రులు).

(శంకరులు) మునుపుచెప్పిన అట్టి దురాచారముగలవాడైనను నన్నుదప్ప వేరొకదానిని భజించని నాభక్తుడు అట్టి అంతరంగమైనవానిలోనున్న మంచి నిశ్చయ సామర్థ్యముచే వెలుపలి యనుష్ఠానమున గనబడు దురాచారములను విడిచి శీఘ్రముగ ధర్మమున చిత్తమును గలవాడుగనే నిత్యమైన ఉపశమనమును (దుష్ప్రవర్తననుండి తొలగుటను) పొందుచున్నాడు. ఓ కౌంతేయా! దీని తత్త్వమును వినుము. నా యెడ అంతఃకరణమును బాగుగనుంచియున్న నా భక్తుడు ఒకప్పుడు గూడ చెడిపోడు. అని నీవునిశ్చయముగ ప్రతిజ్ఞ చేయుము.

(మధ్వులు) ఇందులో జెప్పబడియున్న భక్తుడు దేవాంశముగలవాడు.

* ఈశ్లోకమును గరుడపురాణము 4-28 లో చూడుడు.

శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిం ॥ 32

పద॥ మాం - హి - పార్థ - వ్యపాశ్రిత్య - యే - అపి - స్యుః - పాపయోనయః ।
స్త్రియః - వైశ్యాః - తథా - శూద్రాః - తే - అపి - యాన్తి - పరాం - గతిం ॥

| | | | |
|---|---|---|---|
| హి | ఏలనగా | యేపి స్యుః | యెవ్వరున్నారో |
| హే పార్థ! | ఓ పార్థా! | తేపి మాం | వారలుకూడ నన్ను |
| పాపయోనయః | పాపజన్మములైన | వ్యపాశ్రిత్య | ఆశ్రయముగ (శరణముగ)గైకొని |
| స్త్రియః వైశ్యాః | స్త్రీలుగను, వైశ్యులుగను | పరాంగతిం యాన్తి | ఉత్తమమైన గతిని పొందుచున్నారు. |
| తథా శూద్రాః | అటులనే శూద్రులుగను | | |

తా॥ ఏలనగా ఓ పార్థ! ఎవ్వరు పాప జన్మములైన స్త్రీజన్మము, వైశ్యజన్మము, అటులనే శూద్రజన్మము వీటిని పొందుచున్నారో వారలుగూడ నన్నే శరణముగగైకొని ఉత్తమమైన గతిని పొందుచున్నారు.

(స్వకీయము) ఈ శ్లోకమున ప్రయోగింపబడియున్న "పాపయోనయః" అనుపదమును విశేషణముగ నెత్తుకొని పాపమువలన గలిగినజన్మములైన స్త్రీ వైశ్యశూద్రులగు ఈ జన్మములు, అనగా స్త్రీ మొదలగుజన్మములు పాపమువలన గలిగినవని (శంకరులు, రామానుజులు, రాఘవేంద్రులు) మొదలగు వారలు తాత్పర్యముచేసియున్నారు. ఐతే శ్రీధరుని తాత్పర్యము-యేపి=ఎవరు, పాపయోనయఃస్యుః=నికృష్టజన్మములైన అన్త్యజాతులుగనున్నారో, యేపి=ఎవరు, తథా ఆ విధమైన, అనగా వేదాధ్యయనము మొదలగునవి లేనందున మిక్కిలి నికృష్టులైన, స్త్రియః శూద్రాః=స్త్రీలుగను శూద్రులుగను, వైశ్యాః = కేవలము వైశ్యులుగను, అనగా కృషి మొదలగు వ్యాపారములు మాత్రము జేయుచున్న వైశ్యులుగను నున్నారో అనునది.

స్త్రీ మొదలగు జన్మము నికృష్టజన్మమనుదానికి నృసింహతాపిన్యుపనిషత్తునుచూడుడు.

స్త్రీ మొదలగు జన్మములు నికృష్టములను దానికి తాత్పర్యమేమన వారికి ఆత్మజ్ఞానము పొందుట కనుకూలమైన సాధనసంపత్తులు అధికముగ లేవనునదే.

---

శ్లో॥ కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా ।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మాం * ॥ 33

పద॥ కిం - పునః - బ్రాహ్మణాః - పుణ్యాః - భక్తాః - రాజర్షయః - తథా ।
అనిత్యం - అసుఖం - లోకం - ఇమం - ప్రాప్య - భజస్వ - మాం ॥

| | | | |
|---|---|---|---|
| పుణ్యాః | పుణ్యవంతులుగను | అనిత్యం అసుఖం | నిలకడలేనట్టియు సుఖము లేనట్టియు |
| భక్తాః | భక్తిగలవారలుగనునున్న | | |
| బ్రాహ్మణాః | బ్రాహ్మణులున్ను | ఇమం లోకం | ఈ లోకమును |
| తథా | అటులనే | ప్రాప్య | పొంది, (పొందియున్న నీవు) |
| రాజర్షయః | రాజర్షులున్ను | మాం భజస్వ | నన్ను భజింతువుగాక |
| (పరాంగతిం యాన్తి) ఇతి కిం పునః | మేలైనగతిని పొందెదరని వేరే చెప్పవలెనా? | | |

తా॥ (స్త్రీ శూద్రాదులే మునుపు జెప్పినట్లు సద్గతిని పొందుదురేని) పుణ్యవంతులుగను భక్తిగలవార్లుగను నున్న బ్రాహ్మణులున్ను అటులనే రాజర్షులున్ను ఉత్తమగతిని పొందగలరని రేవే చెప్పవలెనా? నిలకడలేనిదియు సుఖములేనిదియునైన ఈ లోకమును పొందియున్న నీవు నన్ను భజింతువుగాక.

(శంకరులు) పరిశుద్ధమైన జన్మముగల బ్రాహ్మణులైన భక్తులున్ను, రాజులుగను ఋషులుగనునున్న రాజర్షులైన భక్తులున్ను మేలైనస్థితిని పొందుచున్నారని వేరే చెప్పవలెనా? ఈవిధముగనుండుటవలన అనిత్యమైన, అనగా క్షణకాలమున నశించు స్వభావముగలదై సుఖములేని మనుష్యలోకమునుపొంది మోక్షమునకు సాధనమైనట్టియు, లభించుటకు అరుదైనట్టియు మనుష్యత్వమును బడసినతోడనే నీవు నన్ను సేవింపవలెను. (మనుష్యదేహములేక, ఇతర పశుపక్షిదేహములలో భగవంతుని భజించుటకు యోగ్యతలేదనునది తాత్పర్యము.)

(రాఘవేంద్రులు) (వీరు ఈ శ్లోకమును మునుపటి శ్లోకముతోజేర్చి అన్వయించియున్నారు — అదేమనగా) పాపమువలన స్త్రీ జన్మమును పొందినపురుషులున్ను, వైశ్యశూద్రజన్మములను పొందిన బ్రాహ్మణులున్ను భగవద్భక్తిచే ఉత్తమగతిని పొందెదరు. స్వభావముచే శూద్రాది తక్కువవర్ణపువారలే భగవద్భక్తిచే బ్రాహ్మణక్షత్రియ ఋషి మొదలగు గొప్ప జన్మమునుపొంది సద్గతిని పొందినచో పాపముచే తక్కువ జన్మ పొందిన గొప్పవర్ణపువారలైన భగవద్భక్తులకు సద్గతి విషయమున సందేహమేల? "స్త్రియోవైశ్యాః" అనుచోట స్వభావముత పురుషుడు మొదలగువారుగనుండి పాపముచే స్త్రీ మొదలగు జన్మమొందినవారలు అని అర్థమేగాని, స్వభావముచేతనే స్త్రీ మొదలగువార్లని అర్థముగాదు. "న స్త్రియోయాన్తి పుంస్త్వం తు స్వభావా దేవ యాఃస్త్రియః" అను ప్రమాణమువలన స్వభావముగా స్త్రీలకు పురుషజన్మము లేదు.



శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః ॥ 34

పద॥ మన్మనాః - భవ - మద్భక్తః - మద్యాజీ - మాం - నమస్కురు ।
మాం - ఏవ - ఏష్యసి - యుక్త్వా - ఏవం - ఆత్మానం - మత్పరాయణః ॥

| | | | |
|---|---|---|---|
| మన్మనాః | నాయెడ మనస్సునుంచినవాడవుగను | ఏవం యుక్త్వా | ఈ విధముగ మనస్సును నిలబెట్టి |
| మద్భక్తః | నాయెడ భక్తిగలవాడవుగను | మత్పరాయణః | నన్నే మేలైనగతి యనుకొన్నవాడవై |
| మద్యాజీ | నన్ను ఆరాధించువాడవుగను | ఆత్మానం మామేవ | ఆత్మయగు నన్నే |
| భవ | అగుదువుగాక | ఏష్యసి | పొందగలవు |
| మాం నమస్కురు | నన్నునమస్కరింపుము | | |

తా॥ నాయెడ మనస్సునుంచినవాడవుగను, నాయెడ భక్తిగలవాడవుగను, నన్ను పూజించుస్వభావముగలవాడవుగను అగుదువుగాక. నన్ను గూర్చి నమస్కారముజేయుము. ఈవిధముగ మనస్సును నాయెడనుంచి నన్నే మేలైన గతి.యనుకొన్నవాడవైనచో సకలమునకు ఆత్మయగు నన్నే వచ్చిచేరెదవు.

(శంకరులు) నాయెడ, అనగా వాసుదేవుడనైన నాయెడ మనస్సును దృఢముగ నిలబెట్టి ఆ విధముగనే నాయెడ భక్తిగలవాడవుగను, నన్ను పూజించు స్వభావముగలవాడవుగను నుండవలెను. ఈ విధముగ జిత్తమును స్థిరపరచి భగవంతునియెడ నుంచినచో నన్నే పొందగలవు. నేనుగదా సకల భూతములకును ఆత్మగను, పొందవలసిన మేలైనగతిగను నున్నాను. అట్లు ఈ విధముగనున్న నన్ను, అనగా ఈశ్వరుడైన ఆత్మను వచ్చిచేరెదరని చెప్పుడు.

(రామానుజులు) మన్మనాః = సర్వేశ్వరుడు దోషములేనివాడు, అనంతకల్యాణ గుణములుగలవాడు, సర్వజ్ఞుడు, సత్యసంకల్పుడు, జగత్కారణుడు, పరబ్రహ్మము, పురుషోత్తముడు, అరవిందాక్షుడు, నీలమేఘవర్ణుడు, ఒకటే కాలమున ఉదయించిన అనేకసూర్యుల ప్రకాశముకంటె అధికమైన ప్రకాశముగలవాడు, మిక్కిలి అందమైనవాడు, శ్రేష్ఠమగు నాలుగుభుజములు గలవాడు. మెరుపుతీగెవంటి పీతాంబరము ధరించినవాడు. నిర్మలములైన నవరత్నములచే చెక్కబడిన కిరీటకుండలహారకేయూరకటకములు మొదలగు నాభరణములను ధరించినవాడు. అపారకారుణ్యము సౌందర్యము మంచినడక మధురవాక్కు, గాంభీర్యము, ఉదారత్వము, భక్తవాత్సల్యము ఇవి మొదలగు ననేక గుణములకు నిధిని, శరణమొందదగినవాడను సర్వస్వతంత్రుడను నగునాయెడ, ఒక పాత్రమునుండి మఱియొక పాత్రమున నూనెనువిడిచినచో ఆ నూనెయొక్కధార రెండుపాత్రముల మధ్య యెడతెగక ఒకేధారగనుండుటవలె మనస్సునుంచినవాడవై మద్యాజీ భవ = నీ కిష్టమైన సకల వస్తువులను నాకొప్పజెప్పుము. మాం నమస్కురు = పరమాత్మగను, సర్వశేషిగను నున్న నాయెడ నెల్లప్పుడు మిక్కిలి వంగియుండుము. మత్పరాయణః = నన్నే యెల్లప్పుడు నాశ్రయించియుండుము. అని తాత్పర్యము.

* ఈ శ్లోకమును భవిష్యత్పురాణము. అధ్యా 62, 4 - 18 - 19 లో చూడుడు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యా రాజగుహ్యయోగో నామ
నవమోఽధ్యాయః

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న
శ్రీ కృష్ణార్జున సంవాదమున రాజవిద్యా రాజగుహ్య యోగమను
తొమ్మిదవ అధ్యాయము ముగిసెను.

శ్రీరస్తు.

దశమాధ్యాయ ప్రారంభః.

# పదియవ అధ్యాయము

## (విభూతి యోగము.)

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥

పద॥ భూయః - ఏవ - మహాబాహో - శృణు - మే - పరమం (1) - వచః।
యత్ - తే - అహం - ప్రీయమాణాయ (2) - వక్ష్యామి - హితకామ్యయా (3)

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీ భగవంతుడు చెప్పినది | అహంయత్ వక్ష్యామి | నేను దేనిని చెప్పబోవు చున్నానో |
| హే మహాబాహో! | ఓ భుజబలము గలవాడా! | | |
| ప్రీయమాణాయతే | నామాటచే సంతసించుచున్న నీకు | తత్, మే పరమంవచః | అట్టి నాయొక్క శ్రేష్ఠమైనమాటను |
| హిత కామ్యయా | హితమునుకోరి | భూయ ఏవ శృణు | మరలను వినుము. |

తా॥ శ్రీ భగవంతుడు చెప్పినది— ఓ భుజబలముగల అర్జునా! నామాటను విని సంతసించుచున్న నీకు క్షేమమును గలుగజేయవలెనను కోరికతో నేను దేనిని చెప్పబోవుచున్నానో అట్టి శ్రేష్ఠమైన నామాటను మరల వినుము.

(1) పరమం - పరమాత్మస్వరూపమును ప్రకాశింపజేయుచున్న (శంకరులు) నా మహిమను అధికముగ తెలుపునట్టి (రామానుజులు.)

(2) ప్రీయమాణాయ - నామాటనువిని అమృతపానము జేయువానివలె సంతసించుచున్న (శంకరులు) నా మహిమలనువిని ప్రీతిచెందియున్న (రామానుజులు) నా మాటనువిని సంతసించియున్న (మధ్వులు) "ప్రియమాణాయ" అనియు కొన్నిపాఠములు గలవు.

(3) హితకామ్యయా - భక్తి మిక్కిలి వృద్ధిపొందుటవలన కలుగు ఫలమును నీవు పొందవలెనను కోరికచే (రామానుజులు)

(శంకరభాష్యము) ఏడవ అధ్యాయమునందును, 9 వ అధ్యాయమునందును భగవంతుని తత్త్వము విభూతి,*ఇవి యెత్తి స్పష్టపరచబడినవి. ఇక నిప్పుడు ఏ యే భావములలో భగవంతుడు ధ్యానింపదగునో ఆ యా వస్తువులను జెప్పవలెను. భగవంతుని తత్త్వము ముందుగనే చెప్పబడిన దైనను అది అనుభవముచే గ్రహించుటకు (ఎరుంగుటకు) దుర్లభమైనందున దానిని మఱల చెప్పవలెనని తలంచి భగవంతుడు దీనిని ప్రారంభించుచున్నాడు.

మహాబాహో! నీవు నా మాటచే అమృతపానమును చేసినవానివలె మిక్కిలి సంతసించుచున్నావు. కావున నేను నీకు మేలైన, అనగా అన్నిటిలోను ఉత్కృష్టమైన నిరతిశయ వస్తువును

బయటబెట్టు మాటను జెప్పెదను. అది నీ క్షేమమునుగోరి, అనగా అనుభవముచే నేరుంగుట కరుదైన యథార్థజ్ఞానము నీకు కలుగజేయుటకయే.



శ్లో॥ న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః॥ 2

పద॥ న - మే - విదుః - సురగణాః - ప్రభవం - న - మహర్షయః।
అహం - ఆదిః - హి - దేవానాం - మహర్షీణాం - చ - సర్వశః॥

| | | | |
|---|---|---|---|
| మేప్రభవం | నాయొక్క ఉత్పత్తిని | హి అహం | ఏలనగా నేను |
| సురగణాః | దేవతల సమూహములు | దేవానాం | దేవతలకున్ను |
| న విదుః | ఎరింగినవిగావు | మహర్షీణాం చ | మహర్షులకున్ను |
| మహర్షయః న | మహర్షులున్ను ఎరుంగలేదు. | సర్వశః ఆదిః | అన్నివిధముల మొదటివాడను |

తా॥ నాయొక్క ఉత్పత్తిని (లేక) ప్రభావమును దేవతలున్ను మహర్షులున్ను ఎరుంగలేదు. ఏలనగ నేను వారలకు అన్నివిధముల కారణముగ నున్నాను.

(శంకరులు) "దేనికొఱకై దీనిని జెప్పుచున్నాను" అనుదానికి ఇందులో భగవంతుడు కారణము జెప్పుచున్నాడు. బ్రహ్మమొదలగు దేవతల సమూహములు నా ప్రభుశక్తియొక్క అతిశయమును, లేక ఉత్పత్తిని ఎరుంగలేదు. భృగువు మొదలైన మహర్షులున్ను ఎఱుంగరు. వారలేల ఎరుంగలేదనినచో చెప్పెదను. ఏలనగా నేను దేవతలకును మహర్షులకును అన్ని విధముల మొదటివాడను, కారణమైన వాడననుడు.

(రామానుజులు) దేవతలున్ను ఋషులున్ను కంటికి కనబడని వస్తువులనున్ను గడచిన కాలము రాబోవుకాలములలో జరిగిన జరగబోవుసంగతులనున్ను ఎరుంగశక్తిగలవారలు. వారల జ్ఞానమున్ను శక్తియు మిగతవారలకన్న అధికమైనది. అట్లున్నను వారలు నా యొక్క నామకర్మ స్వరూప స్వభావాది మహిమలను ఎరుంగలేదు. ఏలనగా వారలకునేను అది కారణముగ నున్నాను. నాచే నివ్వబడిన, వారల జ్ఞానాదులు స్వల్పములైనవి. నా సకలమహిమల నెఱుంగ జాలినవిగావు అని తాత్పర్యము.



శ్లో॥ యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరం।
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥ 3

పద॥ యః - మాం - అజం (1) - అనాదిం (2) - చ - వేత్తి - లోకమహేశ్వరం (3)।
అసమ్మూఢః - సః - మర్త్యేషు - సర్వపాపైః - ప్రముచ్యతే॥

| | | | |
|---|---|---|---|
| యః మాం | ఎవ్వడు నన్ను | మర్త్యేషు | మనుష్యులలో |
| అజం అనాదిం చ | జననరహితునిగను, అనాదిగను | అసమ్మూఢః | మోహములేనివాడు |
| లోకమహేశ్వరం | లోకములకు పరమేశ్వరునిగను | సర్వపాపైః | సకల పాపములచేతను |
| వేత్తి సః | ఎరుంగునో అతడు | ప్రముచ్యతే | విడువబడుచున్నాడు. |

తా॥ ఎవ్వడు నన్ను ఆదిలేనివాడు, జననరహితుడు, సకలలోకమునకు ఈశ్వరుడు అనునీవిధముగ నెరుంగునో అతడు మనుష్యులలో మోహము

తొలగినవాడు. అనగా అజ్ఞానములేనివాడు. సకలపాపములనుండి విడువబడు చున్నాడు, (అనగా ఈవిధముగ ధ్యానించుచున్న యెడల కర్మబంధమునుండి విడువబడునని తాత్పర్యము.)

(1) అజం - జననరహితుడు మాత్రమేగాక. ఉత్పత్తిగల అచేతన వస్తువులు సంసారియైనచేతన వస్తువులు వీటికంటెను వేరైనవాడు (రామానుజులు,)

(2) అనాదిం - ఆదిరహితుడేగాక జననముతొలగిన ముక్తులకంటె వేరైనవాడు. ముక్తులకు జననము తొలగిపోవుట ముక్తిపొందిన పిదపనేగాని వారలు అనాదిగ జననరహితులు కారు. (రామానుజులు) అనాది = అన - ఆది అన = సకలలోకములనున్ను చేష్టింప జేయువాడు. ఆది = సకలలోకములకును కారణుడు (మధ్వులు) లేక అన = ముఖ్య ప్రాణమునకును (వాయువునకును) ఆది = కారణుడు (రాఘవేంద్రులు.)

(3) లోకమహేశ్వరం — బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు లోకాధిపతులు కర్మలచే ఒక్కొక కాలములలో, ఒక్కొక లోకాధిపత్యమును పొందిరి, అటులనే యోగులు అణిమాద్యష్టైశ్వర్యములను పొందిరి, భగవంతుడన్ననో అనాదియై సకలలోకములకును ఆ లోకాధిపతులకును ఈశ్వరుడనియు (రామానుజులు.)

(శంకరులు) మఱియు నేను దేవతలకును మనుష్యులకును ఆదియైనందున నాకు వేఱొక ఆది యనునదిలేదు, కావున నేను జనించనివాడను. ఆదియు లేనివాడను. ఆదిలేకుండుట జనించకుండుటకు కారణమగును.

అసమ్మూఢః = మైకములేనివాడు. సర్వపాపైః = అనగా బుద్ధితోను బుద్ధిలేకయు, అనగా తెలిసియు తెలియకయు చేయబడిన సకలపాపములచేతను విడువబడుచున్నాడు.

---

శ్లో॥ బుద్ధిర్జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః।
సుఖం దుఃఖం భవో భావో భయం చాభయమేవ చ ॥ 4
,, అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ 5

పద॥ బుద్ధిః (1) - జ్ఞానం (2) - అసమ్మోహః (3) క్షమా - సత్యం - దమః - శమః ।
సుఖం - దుఃఖ - భవః - అభావః - భయం - చ - అభయం - ఏవ - చ ॥
,, అహింసా - సమతా - తుష్టిః - తపః - దానం - యశః - అయశః ।
భవన్తి - భావాః - భూతానాం - మత్తః - ఏవ - పృథగ్విధాః ॥

| | | | |
|---|---|---|---|
| బుద్ధిః జ్ఞానం | బుద్ధి, జ్ఞానము | సుఖం దుఃఖం | సుఖము దుఃఖము |
| అసమ్మోహః | మోహములేకుండుట | భవః అభావః | ఉత్పత్తినాశము |
| క్షమాసత్యం | ఓర్పు, సత్యము | భయంచ అభయంచ | భయమున్ను భయము లేకుండుటయు |
| దమః శమః | బాహ్యేంద్రియములు అణిగి యుండుట అంతఃకరణ విశ్రాంతి | అహింసా | ప్రాణి హింసచేయకుండుట |
| | | సమతా | చిత్తము సమముగనుండుట |

| | | | |
|---|---|---|---|
| తుష్టిః | తృప్తి | పృథగ్విధాః భావాః | పలువిధములైన స్వభావములు |
| తపః దానం | తపస్సు, దానము | భూతానా మేవ చ | ప్రాణులకొఱకే |
| యశః అయశః | కీర్తి, అపకీర్తి (అగు) | మత్త ఏవ భవన్తి | నాయెడనుండియే కలుగుచున్నవి |

తా॥ బుద్ధి, జ్ఞానము, మోహము లేకుండుట, సత్యము, ఇంద్రియనిగ్రహము అంతఃకరణ నిగ్రహము సుఖము దుఃఖము ఉత్పత్తి నాశము భయము అభయము ప్రాణులకు చెరుపు చేయకుండుట చిత్తము సమముగనుండుట సంతోషము తపస్సు దానము కీర్తి అపకీర్తి ఇవి ప్రాణులకు నావద్దనుండియే కలుగుచున్నవి.

(శంకరులు) ఈ కారణముచేతను లోకములకు తాను పరమేశ్వరుడు అనుదానిని భగవంతుడు ఇందులో జెప్పుచున్నాడు — బుద్ధియనగా సూక్ష్మమైన విషయములను గ్రహించునట్టి అంతఃకరణముయొక్క సామర్థ్యము. దానిని గలవాడుగదా బుద్ధిమంతుడని చెప్పబడును? జ్ఞానము = అనగా ఆత్మ మొదలగు పదార్థముల నెరుంగునట్టి తెలివి. మోహము లేకుండుట = అనగా తత్కాలము జేయవలసిన వాటియందును ఎరుంగవలసిన వాటియందును వివేకముతో ప్రవర్తించుట. ఓర్పు = అనగా ఒకడు తిట్టినను కొట్టినను దానిచే మారని మనస్సుగల స్వభావము, సత్యము = అనగా ఇతరునిబుద్ధికి గోచరముగుటకై తన అనుభవమును తాను జూచినట్లును వినినట్లును అట్లే జెప్పబడుమాట. దమము = అనగా వెలుపలి ఇంద్రియములను అణచిపెట్టుట. శమము = అనగా అంతఃకరణముయొక్క ఉపశమనము, సుఖము = అనగా ఆహ్లాదము, లేక సంతోషము, దుఃఖము = అనగా సంతాపము కష్టము.

అహింస — అనగా ప్రాణులకు చెరుపుచేయకుండుట. సమతా = అనగా రాగద్వేషములచే మార్పు చెందక సమముగ నిలబడు చిత్తమును గలిగియుండుట. తుష్టిః = తృప్తి, సంతోషము, అనగా లభించిన వస్తువులతో చాలును అనుతలంపు. తపస్సు = ఇంద్రియములను అణచుటతో బాటు దేహమును కష్టపెట్టుట, దానము = శక్తికి తగినట్లు వస్తువులను ఇతరులకు విభజించి ఇచ్చుట, యశః = ధర్మమువలన గలుగు పొగడ్త, అయశః = అధర్మమువలన గలుగు నింద, అపకీర్తి. ఇట్టి మునుపు జెప్పిన పలువిధములైన స్వభావములు ఈశ్వరుడైన నావద్దనుండియే ప్రాణులకు వాటికర్మకు తగినట్లు కలుగుచున్నవి.

(రామానుజులు) బుద్ధి = అనగా మనస్సుయొక్క నిరూపణ సామర్థ్యము, జ్ఞానమ్ = చిదచిద్వస్తువుల నిశ్చయము, అసమ్మోహః = భ్రమనివృత్తి, భవః = అనుకూలమైన అనుభవము వలన కలిగిన మనఃస్థితి, భయం = ఇక రాబోవు దుఃఖమునకు హేతువైన వస్తువులను చూచుట వలన గలుగుదుఃఖము, తుష్టిః = కనబడు సకల ఆత్మలయందును సంతోషించుట, తపః = వీర్పడియున్న భోగములను తగ్గించి శాస్త్రానుసారముగ వ్రతములచే దేహమును కష్టపరచుట, దానం = తనకు సుఖమునిచ్చునట్టి తన యధీనములైన వస్తువులను ఇతరుల కిచ్చుట, యశః = ఇతరులు మంచివారని చెప్పుట, మత్తఏవ = నా సంకల్పముచేతనే కలుగుచున్నవి.

(రాఘవేంద్రులు) బుద్ధిః = అనునది కార్యాకార్యములను నిశ్చయించుచున్నది, జ్ఞానమ్ = సామాన్యజ్ఞానము, అసమ్మోహః = కార్యములలో ఇచ్ఛలేకుండుట, లేక మిథ్యాజ్ఞానములేకుండుట, క్షమాః = ద్వేషములేకుండుటయేగాక అపకారముచేసినను ఉపకారమునే చేయుట. సత్యం = వాస్తవమైన జ్ఞానముతో అనుష్ఠానముచేయుట, లేక వాస్తవమైనవచనము, దమః = ఇంద్రియనిగ్రహము,

శమః = భగవన్నిష్ఠ, తపః = బ్రహ్మచర్యవ్రతము మొదలగునవి. 6-వ అధ్యా. 46-వ శ్లోకమును చూడుడు. దానం - ధర్మమార్గమున సంపాదించిన వస్తువులను ఇతరుల కిచ్చుట.

శ్లో॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥

పద॥ మహర్షయః - సప్త - పూర్వే - చత్వారః - మనవః - తథా।
మద్భావాః - మానసాః - జాతాః - యేషాం - లోకే - ఇమాః - ప్రజాః॥

| | | | |
|---|---|---|---|
| లోకే | లోకమునందున్న | చత్వారః మనవః | (సావర్ణి మొదలగు) నలుగురు మనువులున్ను |
| ఇమాః ప్రజాః | ఈ ప్రాణులన్నియు | మద్భావాః | నాయొక్క ధ్యానమును గలిగిన వారలై |
| యేషాం (సృష్టిః) | ఎవ్వరి (సృష్టిలో) | మానసాజాతాః | నామనస్సంకల్పమువలన పుట్టిన వారలు |
| (తే)సప్తమహర్షయః | (అట్టి)ఏడుగురు మహర్షులున్ను | | |
| తథా పూర్వే | ఆ విధముగనే పూర్వీకులైన | | |

తా॥ లోకమునందలి ప్రాణులన్నియు ఎవ్వరిచే గలిగినవో అట్టి భృగువు మొదలగు నేడుగురు మహర్షులున్ను ఆ విధముగనే గడచినకాలమునకు జేరిన వారలైన సావర్ణి మొదలగు నలుగురు మనువులున్ను నాయొక్క ధ్యానమును గలవారలై నా మనస్సంకల్పముచే కలిగింపబడిన వారై పుట్టినవారు.

(శంకరులు) భృగువు మొదలగు మహర్షులు ఏడుగురు. గడచినకాలమునకుజేరిన నలుగురు మనువులను "సావర్ణులు" అని ప్రసిద్ధిచెందినవారలు. వారందరు నాయెడ చిత్తము నుంచిన వారు. విష్ణువుయొక్క శక్తినిగలవారు నాచే మనస్సుచేతనే కలిగింపబడినవారలు. లోకములోని ఈచరాచర ప్రాణులు, ఆ మనువులు మహర్షులు అనబడు వారలయొక్క సృష్టియనుట.

(శ్రీధరులు) లోకేఇమాః ప్రజాః = లోకమందలి ప్రజలందరును, యేషాం = ఎవరి సంబంధమై (ఎవరినుండి) జాతావర్తన్తే = పుట్టియున్నారో, తే = అట్టి, సప్తమహర్షయః = ఏడుగురు ఋషులున్ను, పూర్వే = వారలకు మునుపటి వారలైన, చత్వారః = సనకాదినలుగురున్ను, తథా = అటులనే, మనవః = స్వాయంభువుడు మొదలగు మనువులున్ను, మద్భావాః = నాప్రభావమును గలవారలై మానసాజాతాః = హిరణ్యగర్భరూపుడనైన నాయొక్క మనస్సంకల్పమువలన గలిగిన వారలు. వీరలు లోకములను పుత్రపౌత్ర శిష్యాదులద్వారా సృష్టించిరి.

(రామానుజులు) పూర్వీకులున్ను గడచిన మన్వంతరముననున్న వారునునైన భృగువు మొదలగు ఏడుగురు ఋషులను, ఎల్లప్పుడు సృష్టిజరుగుచుండుట కొఱకై బ్రహ్మదేవుడు మనస్సుచే సృష్టించెను. సృష్టియైన ప్రజల సంరక్షణార్థమై నలుగురు మనువులను బ్రహ్మమనస్సుచేతనే సృష్టించెను. సృష్టికాలము మొదలు ప్రళయకాలమువఱకు ఆ ఏడుగురు ఋషులు సృష్టించుచు, ఆ నలుగురు మనువులు సృష్టియైన ప్రజలను సంరక్షించుచు-వచ్చుచున్నారు. మద్భావాః = వారలు నాసంకల్పము ననుసరించి నడచెడి వారలు.

(రాఘవేంద్రులు) సప్తమహర్షయః పూర్వే = పూర్వీకులైన "మరీచిరత్ర్యంగిరసౌపులస్త్యః పులహః క్రతుః వసిష్ఠశ్చమహాతేజాః పూర్వేస ప్తర్షయస్స్మృతాః" అనినట్లు మరీచి అత్రి, అంగిరసుడు,

పులస్త్యుడు, పులహుడు. * క్రతువు, వసిష్ఠుడు, ఈఏడుగురు ఋషులున్ను, చత్వారః మనవః పూర్వే = పూర్వికులైన స్వాయంభువుడు, స్వారోచిషుడు, రైవతుడు, ఉత్తముడు, ఈనలుగురు మనువులున్ను మద్భావాః మానసాజాతాః = నాయొక్క మనస్సంకల్పము వలన నావద్దనుండి పుట్టిన వారలు. వీరలు చతుర్ముఖ బ్రహ్మవద్దనుండి పుట్టినదిగ జెప్పుపురాణాదులకు బ్రహ్మయొక్క అంతర్యామినైన నేను బ్రహ్మమూలముగ కలుగజేసితిని అనునది తాత్పర్యము.

(స్వకీయము) విష్ణుపురాణము మొదటి అంశము 7-వ అధ్యాయమున ఈపులహుని జెప్పలేదు. ఇతర అరుగురి పేర్లకు భృగువు, దక్షుడు, నారదుడు, ఈముగ్గురినిజేర్చి 9 గురు చెప్ప బడియున్నారు. వీరలు నవప్రజాపతులుగ చెప్పబడియున్నారు. మనువులు 14 రు. వార్లలో నలుగురు మాత్రము పైన చెప్పబడియున్నందున వారలపేర్లను మిగతవార్ల పేర్లను క్రిందకనబరచ బడుచున్నవి. (1) స్వాయంభువుడు-ఇతడు ప్రకటింప జేసినస్మృతియే ఈనాటి వరకు మనుస్మృతియని ప్రసిద్ధముగ వ్యవహరింపబడుచున్నది. (2) స్వారోచిషుడు, (3) ఉత్తముడు, (4) తామసుడు, (5) రైవతుడు, (6) చాక్షుషుడు, (7) వైవస్వతుడు, వీనిమన్వంతరమే ఇప్పుడు జరుగుచున్నది. ఇక రాబోవు మనువులు ఎవరన, (8) సావర్ణి, (9) దక్షసావర్ణి, (10) బ్రహ్మసావర్ణి, (11) ధర్మసావర్ణి (12) రుద్రసావర్ణి, (13) రౌచ్యుడు, (14) హౌత్యుడు, విష్ణుపురాణము 3-వ అంశము 1-2-అధ్యాయములను చూడుడు.

(స్వకీయము) ఈ శ్లోకమందలి తాత్పర్యమేమనగా భగవంతుడు సకలమునకు కారణ భూతుడు మాత్రముగాడు. అన్నియునెరింగినవాడు సకలము నేలువాడుకూడ. అతడు మహర్షులను మనువులను సృష్టించెను. భృగువుమొదలు వసిష్ఠుడువరకు గల మహర్షులు అన్నియునెరింగినవారై విద్యాసంప్రదాయమును మొదట నుపదేశించినవారలు. మనువులు తామే ఏలువారై ప్రాణులను కాపాడిరి. మనువులున్ను మహర్షులున్ను ఆదికాలమున నుండిరి. భగవంతుని మనస్సునుండి పుట్టినవారలు, తమచిత్తమును భగవంతునియెడ అర్పించి దానిచే విష్ణువుయొక్క సామర్థ్యమును బడసి జ్ఞానమునుకూడ పొందిరి. ఈ లోకమునందలి ప్రాణులన్నియు జననముచేతను విద్యచేతను వారల సంతతిగనున్నవి యనునదే.



శ్లో॥ ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥ 7

పద॥ ఏతాం - విభూతిం (1) యోగం (2) చ - మమ - యః - వేత్తి - తత్త్వతః।
సః - అవికంపేన - యోగేన (3) - యుజ్యతే - న - అత్ర - సంశయః॥

| | |
|---|---|
| యః మమ | ఎవ్వడు నాయొక్క |
| ఏతాం విభూతిం | ఈవిభూతిని (వైభవమునున్ను) |
| యోగం | యోగమునున్ను |
| తత్త్వతః వేత్తి | యథార్థముగ నెఱుంగునో |
| సః అవికంపేన | అతడు కదలని |
| యోగేన యుజ్యతే | యోగముతో గూడుచున్నాడు |
| అత్ర సంశయః న | ఇందులో సందేహములేదు. |

తా॥ ఎవ్వడు నాయొక్క పైజెప్పిన విభూతి స్వరూపమును యోగైశ్వర్యమును వాస్తవముగ నెఱుంగునో అతడు నిశ్చయమైన యోగముతో గూడినవాడగును. ఈ విషయమున సందేహము లేదు.

(1) విభూతిం = విస్తారం (శంకరులు) సృష్టిమొదలగు ప్రవృత్తి (రామానుజులు) అనేక విభూతి రూపములు (రాఘవేంద్రులు)

(2) యోగం = యుక్తి, యోగైశ్వర్య సామర్థ్యము (శంకరులు). అనంతకల్యాణ గుణములు (రామానుజులు). బుద్ధిమొదలగు వాటిని సృష్టించు సామర్థ్యము (రాఘవేంద్రులు),

(3) యోగేన = తత్త్వజ్ఞానముతో (శంకరులు). భక్తియోగముతో (రామానుజులు). ధ్యానించు ఉపాయముతో (రాఘవేంద్రులు).

(శంకరభాష్యము) ఎవ్వడు మునుపు జెప్పిన విధమైన నాయొక్క ఈవిభూతిని, అనగా విస్తారమును, లేకవై భవమునున్ను యోగమునున్ను ఉన్నటుల నెఱుంగునో అతడు యథార్థజ్ఞానమున స్థిరముగ నిలబడుటయను చలించని యోగముతో గూడుచున్నాడు. ఈవిషయమున సందియములేదు. యోగమనగాయుక్తి, అమర్చుట, ఆయావస్తువులనుసృష్టించు సామర్థ్యము. యోగైశ్వర్య సామర్థ్యము, లేక యోగమువలన కలుగునది, భగవంతుని ధ్యానించుటవలన గలుగునది యోగమనియు జెప్పవచ్చును. అట్టియోగము వస్తువులను సృష్టించుసామర్థ్యము పరిపాలించు సామర్థ్యము సకలము నెఱుంగు స్వభావము ఇవియే యనుడు.

(ఆనందగిరి) భగవంతుడు అంతటనున్నవాడై అన్నియాకారములుగనున్నాడు, అనియు మనువులున్ను మహర్షులున్ను ఆభగవంతుని జ్ఞానసామర్థ్యములలో ఒకచిన్నభాగమును మాత్రము పొంది దానిచే జ్ఞానులుగను సామర్థ్యముగలవారుగను అయిరి, అనియు ఎవ్వడెరుంగునో అతడు సమాధియోగమును గూడుచున్నాడు. కావుననే సగుణ బ్రహ్మము నెఱుంగుట నిర్గుణబ్రహ్మము నెఱుంగుటకు మార్గమనబడును.

* అవికంప్యేన = అనియు నొకపాఠము. ఎవరిచేతను కదలింపవీలులేని అనియర్థము.

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావ సమన్వితాః॥ 8

పద॥ అహం - సర్వస్య - (1) - ప్రభవః - (2) - మత్తః - సర్వం (3) - ప్రవర్తతే।
ఇతి మత్వా - (4) - భజన్తే - (5) - మాం - బుధాః - భావసమన్వితాః।

| | | | |
|---|---|---|---|
| అహం సర్వస్య | నేను సకలమునకును | ఇది మత్వాబుధాః | ఈ విధముగ నెరింగి జ్ఞానులు |
| ప్రభవః | ఉత్పత్తిస్థానము | భావ సమన్వితాః | ధ్యానముతో గూడినవారై |
| మత్తః సర్వం | నావద్దనుండియే సకలమున్ను | మాం భజ నే | నన్ను భజించుచున్నారు. |
| ప్రవర్తతే | ప్రవర్తించుచున్నది | | |

తా॥ నేను సకల జగత్తునకు ఉత్పత్తి కారణభూతుడను. నావద్దనుండియే సకలమున్ను ప్రవర్తించుచున్నది. ఈవిధముగ నెఱింగి జ్ఞానులు ధ్యానముతో గూడిన వారలై నన్ను భజించుచున్నారు.

(1) సర్వస్య - విచిత్రచిదచిత్ప్రపంచములకు (రామానుజులు)

(2) ప్రభవః - భృగువుమనువు మొదలగు వారలద్వారా ఉత్పత్తికారణుడు (శ్రీధరులు)

(3) సర్వం = బుద్ధి - జ్ఞానము, అసమ్మోహము మొదలగునవి. (శ్రీధరులు)

(4) మత్వా = నాయొక్క అనంతకల్యాణగుణగణ యోగము నెఱింగి (రామానుజులు)

(5) భజన్తే - అర్చనము ధ్యానము మొదలగువాటివలన భజించుచున్నారు. (రాఘవేంద్రులు)

(శంకరులు) ఎట్టి చలించని యోగముతో జేరుచున్నాడు? అనునది ఇందులో జెప్పబడు చున్నది. పరబ్రహ్మమగు నేను అన్ని జగత్తులకును ఉత్పత్తిస్థానము, ఉండుట, నాశము, వ్యాపారము కర్మఫలములు, వాటి అనుభవము, అనే వికారరూపమైన ప్రపంచమంతయు నావద్దనుండియే కలిగి వ్యాపించుచున్నది. పరమార్థతత్త్వము నెఱింగిన జ్ఞానులీవిధముగ భగవంతుని మహిమనెఱిగి పరమార్థ తత్త్వమున మిక్కిలి ఉత్సాహముతో విడువని ప్రయత్నముగలవారలై నన్ను భజించు చున్నారు. సేవించుచున్నారు.

(రాఘవేంద్రులు) ఈ శ్లోకమునందలి పూర్వార్ధముచేతనే, మాం = (నన్ను) అనునర్థము లభించియుండగా ఉత్తరార్ధమున, మాం = (నన్ను) అని ప్రయోగించుటలో తాత్పర్యమేమనగా జీవేశ్వరభేదమును గుర్తింపజేయుటకొఱకయ్యే.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరం।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ॥ 9

పద॥ మచ్చిత్తాః - మద్గతప్రాణాః - బోధయన్తః (1) - పరస్పరం।
కథయన్తః - చ - మాం - నిత్యం - తుష్యన్తి (2) - చ - రమన్తి - చ॥

| | | | |
|---|---|---|---|
| మచ్చిత్తాః | (వారలు) నాయెడచిత్తము నుంచినవారుగను | కథయన్తశ్చ | నన్ను కీర్తనముజేయువారుగను |
| మద్గతప్రాణాః | నాయెడప్రాణము నర్పించిన వారుగను | నిత్యం తుష్యన్తి చ | ఎల్లప్పుడు సంతోషించుచున్నారు |
| మాం పరస్పరం | నన్ను ఒకరికొకరు | రమన్తి చ | ఉత్సాహమును పొందుచున్నారు |
| బోధ యన్తః | బోధించుకొనుచున్నవారుగను | | |

తా॥ (మునుపుజెప్పిన వారలు) నాయెడ చిత్తమునుంచిన వారలుగను నాయెడ ప్రాణములనర్పించిన వారలుగను నన్నుగూర్చి ఒకరికొకరు బోధించుకొనియు నన్నుకీర్తనముజేయు వారలుగను ఎల్లప్పుడు సంతోషించుచున్నారు, ఉత్సాహమునున్ను పొందుచున్నారు.

(1) బోధయన్తః = తామనుభవించిన భగవంతుని గుణములను చెప్పుకొనుచున్న వారలు (రామానుజులు)

(2) తుష్యన్తి = విషయములనుండి నివృత్తి పొందుచున్నారు (రాఘవేంద్రులు). భగవద్గుణములను జెప్పుటవలన సంతోషించుచున్నారు. రమన్తి = భగవద్గుణములను వినుటవలన అధికమైన ప్రీతితో ఆనంద మొందుచున్నారు (రామానుజులు).

(శంకరులు) మఱియు మునుపు జెప్పినవారలు నాయెడ చిత్తమునుంచిన వారలు మద్గతప్రాణాః = నన్ను వచ్చిచేరిన ప్రాణములను, కన్నుమొదలగు నింద్రియములను గలవారలు అనగా ఇంద్రియములు నాయెడ అణగినవారలు. లేక నాయెడ ప్రాణమును అర్పించినవారలు అనుడు. జ్ఞానము, బలము, వీర్యము మొదలగు ధర్మములను గల నన్ను ఒకరికొకరు బోధించు వారలు కీర్తనము జేయువారలు. ఈ విధముగవారు సంతోషించుచున్నారు. తృప్తిపొందుచున్నారు, రమన్తి = కామినీ కాముకుల చేరికవలన వలె ఆనందమును పొందుచున్నారు.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే॥ 10

పద॥ తేషాం - సతతయుక్తానాం - భజతాం - ప్రీతిపూర్వకం।
దదామి - బుద్ధియోగం - తం - యేన - మాం - ఉపయాన్తి - తే॥

| | | | |
|---|---|---|---|
| యేన | (మునుపుజెప్పిన) వారలు దేనివలన | ప్రీతిపూర్వకం | ప్రీతితో భజించువారలుగను |
| | | భజతాం సతత | ఎల్లప్పుడు నాయెడ మన |
| మాం ఉపయాన్తి | నన్ను పొందుచున్నారో | యుక్తానాం | స్సుగలవారలుగనున్న |
| తం బుద్ధియోగం | అట్టి బుద్ధియోగమును | తేషాం దదామి | వారలకు (నేను) ఇచ్చుచున్నాను |

తా॥ (మునుపుజెప్పిన) వారలకు, అనగా ఎల్లప్పుడు నాయెడ మనస్సుగలవారలై ప్రీతితోభజించువారలకు దేనిచే నన్ను వారలు పొందుచున్నారో అట్టి బుద్ధి యోగమును నేనిచ్చుచున్నాను.

(1) బుద్ధియోగం = బుద్ధిః = ఆత్మతత్త్వవిషయమైన నిశ్చయజ్ఞానము, యోగః = అట్టి జ్ఞానము నందాసక్తి (శంకరులు) జ్ఞానయోగమును (శ్రీధరులు) జ్ఞానరూపమగు ముక్తియొక్క ఉపాయమును (రాఘవేంద్రులు) పరిపక్వదశను పొందియున్న బుద్ధియోగమును. సతతయుక్తానాం = ఎల్లప్పుడు నాయెడ చేరియుండవలెనను కోరికగలవారలుగ నున్న వారలకు, దదామి = ప్రీతిపూర్వకముగ బుద్ధి యోగమును నేనిచ్చుచున్నాను (రామానుజులు).

(శంకరులు) మునుపు జెప్పినట్లు ఎవ్వరు భక్తితోగూడిన వారలైనన్ను భజించుచున్నారో వారలకు ద్రవ్యమును కోరుటమొదలగు కారణముచేత వీరలు భగవంతుని భజించువారలుకారు. మరి ఏమన ప్రీతిచే ఎల్లప్పుడు ఎడతెగని ప్రయత్నముగలవారలై స్నేహముచేత నన్నుభజించు వారలకు వారల యథార్థజ్ఞానమగు ఎట్టి జ్ఞానయోగముచే పరమేశ్వరుడైన ఆత్మయగునన్ను తమ యాత్మగ నెరింగెదరో అట్టి బుద్ధియోగమును, అనగా జ్ఞానయోగమును నాతత్త్వమును గూర్చిన యథార్థజ్ఞానముతో జేరుటను ఇచ్చుచున్నాను. ఇట్టి యోగమున కధికారు లెవ్వరనగా, ఎవ్వరు ఈ 9-వ శ్లోకమున జెప్పినవిధముగ నాయెడ చిత్తముగల వారలగుట మొదలగువిధములచే నన్ను భజింతురో అట్టివారలు.



శ్లో॥ తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥ 11

పద॥ తేషాం - ఏవ - అనుకంపార్థం - అహం - అజ్ఞానజం (1) - తమః।
నాశయామి - ఆత్మభావస్థః - జ్ఞానదీపేన - భాస్వతా॥

| | | | |
|---|---|---|---|
| తేషాం అజ్ఞానజం తమః | వారలకు అజ్ఞానమువలన గలిగిన చీకటిని | భాస్వతా జ్ఞానదీపేన | ప్రకాశముగల జ్ఞానమను దీపముచేత |
| అహం ఆత్మభావస్థః | నేను వారల అంతఃకరణ వృత్తిలో నున్నవాడనై | అనుకంపార్థమేవ నాశయామి | కారుణ్యము చేతనే పోగొట్టుచున్నాను. |

తా॥ ఆ భ క్తులకు అజ్ఞానమువలన గలిగియున్న సంసారమను నంధ కారమున (చీకటిని) నేను వారల బుద్ధిలోనున్నవాడనై ప్రకాశించుచున్న జ్ఞాన మను దీపముచేత కారుణ్యముచేతనే పోగొట్టుచున్నాను.

(1) అజ్ఞానజం - నాయొక్క జ్ఞానమును పొందుటకు విరోధియైన ప్రాచీనకర్మరూపమగు అజ్ఞానము వలన గలిగిన, తమః = అసత్యమును సత్యముగ గ్రహించునట్టిదైన మోహాంధ కారమును. (శంకరులు) సుఖదుఃఖరూపమైన బంధమును (రాఘవేంద్రులు) చాలకాల ముగ అనుసరించి వచ్చిన విషయాభిమానమనెడి అజ్ఞానమును. జ్ఞానదీపేన = వారల మనోవృత్తి ధ్యానమునకు విషయముగానుండియు నాయొక్క అనంతకల్యాణ గుణ ములను ప్రకాశింపజేసియు.

(శంకరులు) ఎందుకై నీయొక్క ఆ భక్తులకు బుద్ధి యోగమును ప్రసాదించుచున్నావు. ఇట్టి బుద్ధియోగము నిన్ను పొందుటలో విఘ్నమొనర్చు దేనిని నశింపజేయుచున్నది? అని యడుగు విషయమున దానికై భగవంతుడు ఇందులో ననుగ్రహించుచున్నాడు. నేను కారుణ్యముచేత, అనగా భక్తులకు ఏ విధమున హితముగలుగునో అనుదయచేత, అవివేకమువలన గలిగిన అయథార్థ జ్ఞాన మనెడి చీకటిని నాయెడ నిలకడచెందినదైన వారల అంతఃకరణ వృత్తిలోనుండుచు జ్ఞానమను దీప ముచే తొలగించుచున్నాను. అట్టి జ్ఞానమనేదీపము వివేకజ్ఞానమను అకారముగ గల్గినది భక్తి వలన గలుగునట్టిదైన భగవంతుని అనుగ్రహమనెడి నూనెచే తడుపబడినది, నన్ను ధ్యానించవలె నను విడువని ప్రయత్నమను (ప్రకటింపజేయు) గాలిచే వీచబడినది. బ్రహ్మచర్యము మొదలగు సాధన సంస్కారములవలన గలిగిన ప్రజ్ఞ (వివేకము) అనువత్తిగలది విరక్తిగల, అనగా ఆశతొలగిన, అంతఃకరణమనే పాత్రమును (ప్రమిదవంటి దానిని) ఆధారముగగలది, విషయములలో నంటకయు రాగద్వేషము లనెడి గాలిచే కలతబెట్టబడకయునున్న చిత్తమనెడి గాలిలేని అరలోనున్నట్టిది. నిరంతరమగు ఐకాగ్ర్యమువలన ఏర్పడిన ధ్యానమువలన గలుగునట్టి నిశ్చయ జ్ఞానమనెడి ప్రకాశ మును గలిగినది. ఇట్టి లక్షణములతో గూడినది ఆ దీపము.



అర్జున ఉవాచః—

శ్లో॥ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుం ॥ 12

,, ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నార దస్తథా ।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే ॥ 13

పద॥ పరం - బ్రహ్మ - పరం - ధామ (1) - పవిత్రం (2) - పరమం - భవాన్ (3) ।
పురుషం - శాశ్వతం - దివ్యం (4) - ఆదిదేవం - అజం - విభుం ॥
ఆహుః - త్వాం - ఋషయః - సర్వే - దేవర్షిః - నారదః - తథా ।
అసితః - దేవలః - వ్యాసః - స్వయం - చ - ఏవ - బ్రవీషి - మే ॥

| | | | |
|---|---|---|---|
| అర్జున ఉవాచ | అర్జునుడు చెప్పినది | భవాన్ | నీవే |
| పరంబ్రహ్మ | పరబ్రహ్మము | సర్వే ఋషయః | వసిష్ఠుడు మొదలగు సకల |
| పరం ధామ | ఉత్కృష్టమైన తేజస్సు | త్వాం | ఋషులు నిన్ను |
| పరమం పవిత్రం | ఉత్తమమైన పరిశుద్ధవస్తువు | దివ్యం పురుషం | దివ్యమైన పురుషునిగను |

| | | | |
|---|---|---|---|
| శాశ్వతం అదిదేవం | నిత్యునిగను మొదటిదేవునిగను | అసితః దేవలః | అసితుడున్ను దేవలుడున్ను |
| అజంవిభుంఆహుః | జనించనివాడనియు సర్వవ్యాపి యనియు చెప్పుచున్నారు | వ్యాసః ఆహుః | వ్యాసుడున్ను చెప్పుచున్నాడు |
| | | త్వం చ స్వయమేవ | మఱియు నీవు సాక్షాత్తుగనే |
| తథాదేవర్షిః నారదః | అటులనే దేవర్షియైన నారదు లున్ను | మే తథా బ్రవీషి | నాకు ఆ విధముగనే చెప్పుచున్నావు. |

తా॥ అర్జునుడు చెప్పినది — పరబ్రహ్మమున్ను ఉత్కృష్టమైన తేజస్సు (ప్రకాశమున్ను) ఉత్తమమైన పరిశుద్ధవస్తువున్ను నీవే. నిన్ను వసిష్ఠుడు మొదలగు సకలమహర్షులున్ను నిత్యునిగను దివ్యపురుషునిగను దేవతల కాదిగను జననములేని వానిగను సర్వవ్యాపిగను చెప్పుచున్నారు. అవిధముగనే దేవర్షియైన నారదుడు అసితుడు దేవలుడు వ్యాసుడు ఋషులు చెప్పుచున్నారు. నీవుగూడ అవిధముగనే నాకుజెప్పుచున్నావు.

(1) పరంధామ - ఉత్తమమైన తేజస్సు (శంకరులు, రామానుజులు).

(2) పవిత్రం - స్మరించువారల సకలపాపములనున్ను పోగొట్టువాడు (రామానుజులు).

(3) దివ్యం - లోకవిలక్షణుడైనవాడు. శాశ్వతం = వికారములేనివాడు, పరంబ్రహ్మ = పరిపూర్ణుడు, పురుషం = పూర్ణషడ్గుణుడు, (రాఘవేంద్రులు).

(4) విభుం - విభవన శీలః = ఏలెడిస్వభావముగలవాడు.

(శంకరులు) పలువిధరూపములుగ జూచెడివాడు (మధ్వులు) విశిష్టతయా వివిధతయాచ భవన హేతునా విభుశబ్దవాచ్యమాహుః = అన్నిటిలోను వ్యాపించియు వెవ్వేరుగనున్నందున విభుశబ్దముచే చెప్పబడదగినవాడు (రాఘవేంద్రులు)

శ్లో॥ సర్వమేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ।
న హి తే భగవన్వ్యక్తిం విదుర్దేవా న దానవాః॥ 14

పద॥ సర్వం - ఏతత్ (1) - ఋతం - మన్యే - యత్ - మాం - వదసి - కేశవ।
న - హి - తే - భగవన్ - వ్యక్తిం - విదుః - దేవాః - న - దానవాః॥

| | | | |
|---|---|---|---|
| హే కేశవ! | ఓ కేశవా! | హే భగవన్! | ఓ భగవంతుడా! |
| మాం యత్ వదసి | నాకు దేనిని చెప్పుచున్నావో | తే వ్యక్తిం | నీ ఉత్పత్తిని |
| ఏతత్సర్వం | దీనినంతయు | దేవాః న విదుః హి | దేవతలెరుంగుటయే లేదు |
| ఋతం మన్యే | యథార్థముగ నమ్ముచున్నాను. | దానవాః న | అసురులున్ను ఎరుంగుటలేదు. |

తా॥ ఓకేశవా! (నీవు) దేనిని చెప్పుచున్నావో దానినంతను నేను వాస్తవమని యెఱుంగుచున్నాను. ఓభగవంతుడా నీయుత్పత్తిని అవతారమహిమను దేవతలున్ను ఎరుంగనేలేదు. దానవులున్ను ఎరుంగలేదు. (అనగా తమ అనుగ్రహముకొఱకై నీవు అవతరించియున్నట్లు దేవతలునెరుంగలేదు. తమనాశముకొఱకై నీవు అవతారము జేసియున్నట్లు అసురులైన దానవులున్ను ఎరుంగలేదనునది తాత్పర్యము.)

(1) ఏతత్ - ఋషులున్ను నీవు జెప్పినట్లు మునుపటి శ్లోకమున జెప్పినదానిని

(2) భగవన్ - నిరతిశయజ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు వీటికివాసస్థానమైనవాడా!

శ్లో॥ స్వయమేవాఽఽత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15

పద॥ స్వయం - ఏవ - ఆత్మనా - ఆత్మానం - వేత్థ - త్వం - పురుషోత్తమ ।
భూతభావన - భూతేశ - దేవదేవ - జగత్పతే ॥

హే పురుషోత్తమ! — ఓ పురుషోత్తముడా!
భూతభావన — భూతములను గలుగజేసినవాడా!
భూతేశ — భూతములకు ఈశ్వరుడా!
హే దేవదేవ! — ఓ దేవతలకు దేవుడా!
హే జగత్పతే — జగత్తునకు పాలకుడా!
త్వం ఆత్మానం — నీవు తన్ను
ఆత్మనా — తనచే
స్వయమేవ వేత్థ — తానుగనే ఎరుంగుచున్నావు.

తా॥ ఓ పురుషులలో నుత్తముడా! భూతములను గలుగజేసినవాడా! ప్రాణులకు నియామకుడా! సూర్యాదిదేవతలను ప్రకాశింప జేయువాడును సకల ప్రపంచమును పరిపాలించువాడా! నిన్ను నీచేతనే స్వయముగనే ఎరింగెదవు.

(శంకరులు) నీవు దేవతలు మొదలైనవారలకు మొదటివాడవైనందున అన్నిటికంటె పైబడిన జ్ఞానము, ఏలు స్వభావము సామర్థ్యము శక్తి మొదలగు సామర్థ్యముగల ఈశ్వరునిగ నిన్ను నీవే ఎరుంగుచున్నావు. (భగవంతుని సగుణస్వరూపముగూడ ఇతరులచే ఎరుంగుట కశక్యమైనదనుట - ఆనందగిరి.

శ్లో॥ వక్తుమర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16

పద॥ వక్తుం - అర్హసి - అశేషేణ - దివ్యాః - హి - ఆత్మవిభూతయః ।
యాభిః - విభూతిభిః - లోకాన్ - ఇమాన్ - త్వం - వ్యాప్య - తిష్ఠసి ॥

యాభిః విభూతిభిః — ఏ విభూతులచేత
త్వం ఇమాన్ లోకాన్ — నీవు ఈ లోకములను
వ్యాప్యతిష్ఠసి — వ్యాపించుకొని యున్నావో
దివ్యాః హి — అత్యద్భుతములుగనేయున్న
ఆత్మ విభూతయః — నీ విభూతులు
(యాః) — ఏవిగలవో
(తాః) అశేషేణ — వాటినన్నిటిని నిరవశేష
వక్తుం అర్హసి — చెప్పుటకు నీవు యోగ్యుడవుగనున్నావు.

తా॥ ఏ విభూతి రూపములచే ఈ లోకములను నీవు వ్యాపించుకొని యున్నావో అత్యద్భుతములుగనేయున్న నీవిభూతి రూపములు ఏవిగలవో వాటి నన్నింటిని జెప్పుటకు నీవు యోగ్యుడవుగనున్నావు.

ఆత్మవిభూతయః - ఏ ఆత్మయొక్క మాహాత్మ్యవిస్తారములచేత (శంకరులు) ఎట్టి నియమన విశేషములచేత (రామానుజులు) రామకృష్ణాది అనేకరూపములచేత, లేక సన్నిధి మాహాత్మ్యముచే ఆయావస్తువులకు యోగ్యత నిచ్చిన విష్ణురూపములచేత (రాఘవేంద్రులు)

(ఆనందగిరి) నా వంటివారలకు తెలియని నీ యాకారమును వారలు ఎరుంగవలసి యున్నందున నీవు నీయొక్క ఎట్టి మాహాత్మ్య విస్తారముచే వ్యాపించియున్నావో అదియంతయు చెప్పుము.

శ్లో॥ కథం విద్యా మహం యోగిం * స్త్వాం సదా పరిచింతయన్
　　కేషు కేషు చ భావేషు చిన్త్యోసి భగవన్మయా ॥　　　17

పద॥ కథం - విద్యాం - అహం - యోగిన్ - త్వాం - సదా - పరిచింతయన్।
కేషు - కేషు - చ - భావేషు - చింత్యః (1) - అసి - భగవన్ - మయా ॥

| | | | |
|---|---|---|---|
| హే యోగిన్ | ఓ యోగియైనవాడా! | హే భగవన్! | ఓ భగవంతుడా! |
| అహం సదా త్వాం | నేను ఎల్లప్పుడు నిన్ను | కేషు కేషు చ భావేషు | ఏయే వస్తువులలో |
| పరిచింతయన్ | ధ్యానించువాడనై | మయా చింత్యః అసి | నాచేధ్యానింపదగిన వాడవుగ నున్నావు. |
| కథం విద్యాం | ఎట్లు ఎరుంగగలను | | |

తా॥ ఓ సకలైశ్వర్య పరిపూర్ణుడవైన భగవంతుడా! నేనెల్లప్పుడు నిన్ను ధ్యానించువాడనై ఎట్లెరుంగుదును. ఓ భగవంతుడా! ఏ యేవస్తువులలో నాచే ధ్యానింపదగిన వాడవుగనున్నావు.

(1) చింత్యః - ఏయే విభూతిరూపములుగ (నాచే) చింతింపదగినవాడవుగ (శ్రీధరులు)

(రామానుజులు) యోగీ - భక్తియోగనిష్ఠుడై, త్వాం = నిన్ను, సదా = ఎల్లప్పుడు, పరిచింతయన్ = చింతింపబూనియున్న, అహం = నేను, త్వాం = పరిపూర్ణైశ్వర్యము, అనంతకల్యాణ గుణములు, వీటిని గలిగిన నిన్ను, కథం విద్యాం = ఎట్లెరింగెదను, కేషుకేషుచభావేషు = మునుపు నీవు చెప్పినబుద్ధి జ్ఞానము అసమ్మోహము మొదలగు వస్తువులకంటె అన్యములైన వస్తువులలో ఏయే వస్తువులయెడ ఏ విధముగ ప్రేరేపించువాడవై, మయా=నాచేత, చింత్యః = ధ్యానింపదగినవానిగ, అసి = ఉన్నావు.

(ఆనందగిరి) మితమైన బుద్ధిగల నేను ఏ విధముగ నిన్ను ఎల్లప్పుడు ధ్యానించి దాని వలన బుద్ధి కుదిరినవాడనై నిర్గుణమైన నిన్ను ఎరింగెదను? అని అర్జునుడడుగుచున్నాడు.

* యోగీత్వాం - అనియు నొక్కపాఠము (రామానుజులు)

శ్లో॥ విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన।
　　భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతం ॥　　　18

పద॥ విస్తరేణ - ఆత్మనః - యోగం - విభూతిం - చ - జనార్దన ।
భూయః - కథయ - తృప్తిః - హి - శృణ్వతః - న - అస్తి - మే - అమృతమ్ ।

| | | | |
|---|---|---|---|
| హే జనార్దన! | ఓ జనార్దనా! | హి అమృతం | ఏలనగా అమృతమును |
| ఆత్మనః యోగం | నీయొక్క యోగమును | శృణ్వతఃమే | వినెడి నాకు |
| విభూతించభూయః | విభూతిని మరల | తృప్తిఃనాస్తి | తృప్తిలేదు |
| విసరేణకథయ | విస్తారముగ జెప్పవలెను. | | |

తా॥ ఓ జనార్దనా! నీయొక్క యోగమును విభూతిని సవిస్తారముగ మఱలను జెప్పుము. ఏలనగా నీయొక్క ముఖారవిందమునుండి కలుగువాక్యమను నమృతమును వినెడివాడనైన నాకు తృప్తి కలుగనేలేదు.

(శంకరులు) తనయొక్క అతిరహస్యమైన యోగైశ్వర్యమనెడి సామర్థ్యము, ఏలు స్వభావము ఈ శక్తుల గొప్పదనమును ధ్యానింపదగిన వస్తువుల విస్తారమును (గుంపును) విస్తరముగ జెప్పవలెను. జనార్దన అనుపదము 'చెప్పుట' అను వ్యాపారమును అర్థముగగలిగిన, అర్ద్ = అను ధాతువునుండి పుట్టిన పదము. దేవతలకు శత్రువులైన అసురజనులను నరకము మొదలగువాటిలో ప్రవేశపెట్టుటవలన జనార్దనుడు, లేక స్వర్గము మోక్షము అనుపురుషార్థములకై భగవంతుడు సకల జనులచేతను యాచింపబడుచున్నాడు కావున జనార్దనుడు అనియు గ్రహింపదగినవాడు. యోగము విభూతి ఇవి మునుపు చెప్పబడినను వాటిని మఱలను జెప్పగోరుచున్నాను. ఏలనగా నీ ముఖకమలమునుండి వెడలుమాటయనెడి అమృతమును వినునట్టి నాకు తృప్తికలుగలేదు.

(రామానుజులు) యోగమనగా సృష్టి సామర్థ్యము, విభూతి = నియమనము, అమృతం = అమృతము - భగవంతుని మాహాత్మ్యమనెడి అమృతము.

(రాఘవేంద్రులు) యోగం = వస్తువులకు యోగ్యతనిచ్చునదిగను, విభూతిం = అనేక విధములుగనున్న పరమాత్మ స్వరూపమును



శ్రీభగవానువాచ:—

శ్లో॥ *హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే ॥ 19

పద॥ హన్త (1) - తే - కథయిష్యామి - దివ్యాః - హి - ఆత్మవిభూతయః ।
ప్రాధాన్యతః - కురుశ్రేష్ఠ - న - అస్తి - అన్తః - విస్తరస్య - మే ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీ భగవంతుడు చెప్పినది | హన్తతేకథయిష్యామి | ఇప్పుడు నీకు చెప్పగలను |
| హే కురు శ్రేష్ఠ | ఓ కురుకులశ్రేష్ఠుడా | హిమేవిస్తరస్య | ఏలనగా నా యొక్క విభూతులకు |
| దివ్యాః ఆత్మవిభూతయః (యాః) | దివ్యములైన నా విభూతు లెవిగలవో | అన్తః నాస్తిః | ముగింపులేదు. |
| తాః ప్రాధాన్యతః | వాటిలో ముఖ్యమైనవాటిని | | |

తా॥ శ్రీకృష్ణభగవంతుడు జెప్పినది — ఓ కురుకులశ్రేష్ఠుడా! అద్భుతములైన నాయొక్క విభూతిరూపములెవ్వో వాటిలో ముఖ్యములైన వాటిని ఇప్పుడు నీకు జెప్పగలను ఏలనగా నా విభూతిరూపముల విస్తారమునకు ముగింపులేదు.

* హన్తతే కథయిష్యామి విభూతీరాత్మనశ్శుభాః = అని యొక పాఠము. దయకు పాత్రుడవైన నీకు మంగళకరములైన నా యొక్క నియామ్యరూపములను (నాప్రేరేపణకు తగిన వస్తువులను) చెప్పెదను. (రామానుజులు).

(1) హన్త — ఇప్పుడు (శంకరులు) దయకుపాత్రుడైన (శ్రీధరులు) సంతోషము (రాఘవేంద్రులు)

(2) ఆత్మవిభూతయః - వస్తువులకు మేలునివ్వదగిన నా యొక్క పలువిధరూపములు (రాఘవేంద్రులు)

(శంకరులు) ప్రాధాన్యతః = అనగా ఎచ్చటెచ్చట నా యొక్క ఏయేవిభూతివైభవము మొదలగునవిగలవో వాటిని నేను జెప్పెదను. ఐతే వాటిని 100 సంవత్సరములలోకూడ కొలత పెట్టక జెప్పజాలము. ఏలనగా నా యొక్క విభూతి విస్తారమునకు ఎల్ల అనునదిలేదు.

శ్లో॥ అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥　　20

పద॥ అహం - ఆత్మా - గుడాకేశ - సర్వభూతాశయస్థితః ।
అహం - ఆదిః - చ - మధ్యం - చ - భూతానాం - అన్తః - ఏవ - చ ॥

| | | | |
|---|---|---|---|
| హే గుడాకేశ | ఓ గుడాకేశా | అహం భూతానాం | నేను భూతములకు |
| అహమేవసర్వభూతాశయస్థితః | నేనేసకలప్రాణులహృదయమునను్న | ఆదిశ్చ-మధ్యంచ అన్తశ్చ | ఆదిగను,స్థితిగను,కొనగను (ఉన్నాను.) |
| ఆత్మా | పరమాత్మ | | |

తా॥ ఓ నిద్రను జయించిన అర్జునుడా! నేనే సకలప్రాణుల హృదయమున ప్రేరకుడుగనున్న పరమాత్మను. భూతములకు ఆదియు స్థితియు అంతము నేనే.

(శంకరులు) ఇక మొదట దీనిని వినుము. గుడాకేశ, గుడాకాం = నిద్రను, ఈశః = ఏలువాడు అనగా సోమరితనమును జయించినవాడు. లేక ఘనకేశః = దట్టమైన వెంద్రుకలుగలవాడు. ఆత్మా = ప్రత్యగాత్మ అనగా లోపలనున్న ఆత్మయగు నేను సకల ప్రాణుల హృదయముననున్నవానిగ (ఉత్తమాధికారులచే) ఎల్లప్పుడు ధ్యానింపదగినవాడను. దానికి తగని (మధ్యమాధికారియు, మందాధికారియు) ఇక జెప్పబడు వస్తువులలో నన్ను ధ్యానము జేయవలెను. ఏలనగా నేను ప్రాణులకు కారణముగను స్థితిగను ముగింపుగనున్నాను.



శ్లో॥ ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవి రంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥　　21

పద॥ ఆదిత్యానాం - అహం - విష్ణుః - జ్యోతిషాం - రవిః - అంశుమాన్ ।
మరీచిః - మరుతాం - అస్మి - నక్షత్రాణాం - అహం - శశీ ॥

| | | | |
|---|---|---|---|
| అహంఆదిత్యానాం | నేను అదిత్యులలో | అంశుమాన్‌రవిః | వ్యాపించిన కిరణములుగల సూర్యుడుగను |
| విష్ణుః | విష్ణువనే ఆదిత్యుడుగను | మరుతాం మరీచిః | మరుత్తులలో మరీచిగనున్నాను. |
| జ్యోతిషాం | వస్తువులను ప్రకాశింపజేయువాటిలో | నక్షత్రాణాం | నక్షత్రములలో |
| | | అహంశశీ (అస్మి) | నేను చంద్రుడుగ ఉన్నాను. |

తా॥ పన్నెండు ఆదిత్యులలో విష్ణువనే ఆదిత్యుడున్ను ప్రకాశములైన వస్తువులలో అంతటవ్యాపించిన కిరణములుగల సూర్యుడున్ను ఏడుగురు మరుత్తులలో మరీచియనే వాయువు, లేక మరుత్తున్ను, నక్షత్రములలో చంద్రుడున్ను నేనుగ నున్నాను.

ఆదిత్యులలో ఉత్కృష్టుడగు విష్ణువను ఆదిత్యుడు నేనే మిగతవాటికిని ఉత్కృష్టమను పదము జేర్చుకొనదగినది. నక్షత్రములకు యజమానుడైన చంద్రుడు నేనే.

ఇట్టి విభూతిరూపములు కనబడు (ప్రత్యక్ష) రూపములనియు, కనబడకనుండుచు వస్తువులకు ఉత్కృష్టత్వమును (గొప్పతనమును) ఇచ్చుచున్న రూపములనియు రెండు విధములు. విష్ణువు, కపిల, వ్యాస, వాసుదేవ, రామాదిరూపములు ప్రత్యక్షములు. మిగిలినవి కనబడనివి. ఈ శ్లోకమున జెప్పబడియున్న విష్ణువు అనునతడు సర్వవ్యాపిగను సర్వాంతర్యామిగనునున్న మహావిష్ణువే.మరుత్తులు 49 గురు.

(స్వకీయము) ఈ ఆదిత్యులు 12 గురు. వారల పేర్లేవనగా — ధాతా, అర్యమా, మిత్రః, వరుణః, ఇన్ద్రః, వివస్వాన్, పూషా, పర్జన్యః, అంశుః, భగః, త్వష్టా, విష్ణుః, వీరలు వరుసగా చైత్రమాసము మొదలు ఫాల్గుణమాసము వఱకు ఒక్కొక్క మాసమునకు ఒక్కొక్కరు (విష్ణు పురాణము రెండవ అంశము 10 వ అధ్యాయము చూడుడు.) ఈ సూర్యులలో ధాత వైశాఖమాసమునకును, అర్యముడు ఆషాఢమాసమునకును, మిత్రుడు మార్గశిరమాసమునకును, వరుణుడు మాఘమాసమునకును, ఇంద్రుడు జ్యేష్ఠమాసమునకును, వివస్వాన్ శ్రావణమాసమునకును, పూష ఫాల్గుణమాసమునకును, పర్జన్యుడు ఆశ్వయుజమాసమునకును, అంశువు చైత్రమాసమునకును, భగుడు భాద్రపదమాసమునకును, త్వష్ట్వ కార్తీకమాసమునకును, విష్ణువు, పుష్యమాసమునకును, సూర్యులని లింగపురాణము 1 వ భాగము 59 వ అధ్యాయమున జెప్పబడియున్నది. ఈ పంన్రెండు పేర్లు తప్ప మఱియు ననేక పేర్లను స్కాందము కాశీఖండమున చూడుడు.

మరుత్తులనే వారలు దేవతలలో ఒకజాతివారు (శ్రీధరులు) ఏడుగురు మరుమత్తులను చున్నారు. వారలపేర్లు – ఆవహః, ప్రవహః, వివహః, పరావహః, ఉద్వహః, సంవహః, పరివహః.

◆◆◆◆◆◆◆◆◆◆

శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా (1) ॥ 22

పద॥ వేదానాం - సామవేదః - అస్మి - దేవానాం - అస్మి - వాసవః ।
ఇంద్రియాణాం - మనః - చ - అస్మి - భూతానాం - అస్మి - చేతనా (1) ॥

| | | | |
|---|---|---|---|
| వేదానాం సామ వేదః అస్మి | వేదములలో సామవేదముగ నున్నాను. | ఇంద్రియాణాం | ఇంద్రియములలో |
| దేవానాం వాసవః అస్మి | దేవతలలో ఇంద్రుడుగ నున్నాను. | మనశ్చ అస్మి | మనస్సుగనున్నాను. |
| | | భూతానాం చేతనా అస్మి | ప్రాణులలో చేతనముగ నున్నాను |

తా॥ వేదములలో సామవేదము, దేవతలలో ఇంద్రుడు, ఇంద్రియములలో మనస్సు; ప్రాణులలో చైతన్యము, అనగా జ్ఞానశక్తియు, ఇవి నేనుగనేయున్నాను.

(1) చేతనా - భూతములలో వివేకముగల భూతములేవిగలవో అట్టి భూతముల వివేకముగూడ నేనే, (రామానుజులు)

(శంకరులు) దేవతలలో, అనగా రుద్రుడు, ఆదిత్యుడు, మొదలగువార్లలో నేను వాసవుడు దేవరాజైన ఇంద్రుడు. కండ్లుమొదలగు పదునొకండు ఇంద్రియములలో నేను మనస్సనే ఇంద్రియము, భూతములయెడనున్న చైతన్యము అనగా జ్ఞానము, దేహము ఇంద్రియములు వీటి చేరికవలన వెలువడిన బుద్ధియొక్క వృత్తి.

శ్లో॥ రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసాం।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహం ॥ 23

పద॥ రుద్రాణాం - శంకరః - చ - అస్మి - విత్తేశః - యక్షరక్షసాం।
వసూనాం - పావకః - చ - అస్మి - మేరుః - శిఖరిణాం - అహం ॥

| | | | |
|---|---|---|---|
| అహంరుద్రాణాం | నేను రుద్రులలో | యక్షరక్షసాం | యక్షులు రాక్షసులువీర్లలో |
| శంకరః అస్మి | శంకరుడనే రుద్రుడుగనున్నాను | విత్తేశః చ | కుబేరుడుగను |
| | | వసూనాం పావకశ్చ | వసువులలో అగ్నిగను |
| | | శిఖరిణాంమేరుఃఅస్మి | శిఖరముగల పర్వతములలో మేరువుగనున్నాను. |

తా॥ నేను పదునొకండుగురగు రుద్రులలో శంకరుడను రుద్రుడుగను యక్షులు రాక్షసులు వీర్లలో ధనమునకధిపతియైన కుబేరుడుగను ఎనమంద్రు వసువులలో అగ్నిగను శిఖరముగల పర్వతములలో మేరుపర్వతముగనున్నాను.

(స్వకీయము) పదునొకండు రుద్రుల పేర్లు — (1) అజుడు, (2) ఏకపాదుడు, (3) అహిర్బుధ్న్యుడు, (4) త్వష్టా, (5) రుద్రుడు, (6) హరుడు, (7) శంభువు, (8) త్ర్యంబకుడు, (9) అపరాజితుడు, (10) ఈశానుడు, (11) త్రిభువనుడు. ఐతే కొన్ని గ్రంథములలో 4-వ రుద్రుడు విరూపాక్షుడు, 5-వ వాడు సురేశ్వరుడు, 7-వ వాడు జయంతుడు, 10-వ వాడు బహురూపుడు, 11-వ వాడు సావిత్రుడనియు చెప్పబడియున్నది. ఇచ్చట గుర్తింపబడిన శంభువే శంకరుడని శ్లోకమున జెప్పబడుచున్నాడు.

శ్లో॥ పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిం।
సేనానీనామహం స్కంద స్సరసా మస్మి సాగరః॥ 24

పద॥ పురోధసాం - చ - ముఖ్యం - మాం - విద్ధి - పార్థ - బృహస్పతిం।
సేనానీనాం - అహం - స్కందః - సరసాం - అస్మి - సాగరః ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ | ఓ కుంతీపుత్రా | అహం సేనానీనాం | నేను సేనాధిపతులలో |
| పురోధసాంమాం | పురోహితులలోనన్ను | స్కందః | సుబ్రహ్మణ్యుడుగను |
| ముఖ్యంబృహస్పతించ విద్ధి | మొదటివాడైన బృహస్పతిగను ఎఱుంగుము | సరసాం | జలాశయములలో |
| | | సాగరః అస్మి | సముద్రముగనున్నాను. |

తా॥ ఓ కుంతీపుత్రా! పురోహితులలో శ్రేష్ఠుడైన బృహస్పతిగ నన్ను తెలిసికొనుము. నేను సేనాధిపతులలో స్కందుడుగను చెరువు తటాకము మొదలగు జలాశయములలో సముద్రముగనున్నాను.

(శంకరులు) పురోహితులలో, అనగా రాజపురోహితులలో, బృహస్పతి ఇంద్రునికి పురోహితుడు గావున పురోహితులలో శ్రేష్ఠుడు. స్కందుడు, దేవతల సైన్యమునకధిపతి. దేవతలు త్రవ్విన జలస్థానములలో నేను సముద్రముగ నున్నాను.

శ్లో॥ మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః॥ 25

పద॥ మహర్షీణాం - భృగుః - అహం - గిరాం - అస్మి - ఏకం - అక్షరమ్।
యజ్ఞానాం - జపయజ్ఞః - అస్మి - స్థావరాణాం - హిమాలయః॥

| | | | |
|---|---|---|---|
| అహంమహర్షీణాం | నేను మహర్షులలో | యజ్ఞానాంజపయజ్ఞః | యజ్ఞములలో జపమనే |
| భృగుః | భృగుమహర్షిగను | | యజ్ఞముగను |
| గిరాంఏకం అక్షరం | పదములలో ఒక అక్షరమైన | స్థావరాణాం | స్థావరములలో |
| అస్మి | ఓంకారముగను ఉన్నాను | హిమాలయః | హిమవత్పర్వతముగను |
| | | అస్మి | ఉన్నాను. |

తా॥ మహర్షులలో భృగు మహర్షియు వాక్కులలో ఒకటే అక్షరమైన ఓంకారమున్ను, యజ్ఞములలో జపయజ్ఞమున్ను, స్థావరములలో హిమాలయ పర్వతమున్ను నేనే.

శ్లో॥ అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః।
గంధర్వాణాం చిత్రరథస్సిద్ధానాం కపిలో మునిః॥ 26

పద॥ అశ్వత్థః - సర్వవృక్షాణాం - దేవర్షీణాం - చ - నారదః।
గంధర్వాణాం - చిత్రరథః - సిద్ధానాం - కపిలః - మునిః॥

| | | | |
|---|---|---|---|
| సర్వవృక్షాణాం | సకల వృక్షములలో | గంధర్వాణాం | గంధర్వులలో |
| అశ్వత్థః | అశ్వత్థ వృక్షముగను | చిత్ర రథః | చిత్రరథుడుగను |
| దేవర్షీణాం నారదః | దేవర్షులలో నారదమహర్షిగను | సిద్ధానాం | సిద్ధులలో |
| | | కపిలోమునిః (అస్మి) | కపిలమునిగను ఉన్నాను. |

తా॥ వృక్షములలో అశ్వత్థవృక్షముగను, దేవర్షులలో నారదుడుగను, గంధర్వులలో చిత్రరథుడుగను, జననము మొదలు జ్ఞానముగలవారలైన సిద్ధులలో కపిలుడనే మునిగను, నేనున్నాను.

(శంకరులు) దేవర్షులు అనబడువారు దేవతలుగనే యుండువారలు. వారలు మంత్రములను జూచెడివారలైనందున ఋషిత్వమును పొందిరి. సిద్ధులనగా పుట్టునప్పుడే ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యాతిశయము వీటినధికముగ బడసినవారలు.

శ్లో॥ ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవం ।
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపం ॥ 27

పద॥ ఉచ్చైశ్శ్రవసం – అశ్వానాం – విద్ధి – మాం – అమృతోద్భవం ।
ఐరావతం (1) – గజేంద్రాణాం – నరాణాం – చ – నరాధిపం ॥

| | | | |
|---|---|---|---|
| అశ్వానాంమాం | గుఱ్ఱములలో నన్ను | గజేంద్రాణాం | శ్రేష్ఠములైన ఏనుగులలో |
| అమృతోద్భవం | అమృతముతో బుట్టిన | ఐరావతం | ఐరావతమను ఏనుగుగను |
| ఉచ్చైశ్శ్రవసం | ఉచ్చైశ్శ్రవస్సుఅనుగుఱ్ఱముగను | నరాణాం | మనుష్యులలో |
| | | నరాధిపంచవిద్ధి | రాజుగను ఎఱుంగుము. |

తా॥ నన్ను గుఱ్ఱములలో అమృతమునకై సముద్రము మథించినప్పుడు బుట్టిన ఉచ్చైశ్శ్రవస్సను గుఱ్ఱముగను శ్రేష్ఠములైన ఏనుగులలో ఐరావతమనెడి ఏనుగుగను మనుష్యులలో రాజుగను తెలిసికొనుము.

(1) ఐరావతం – ఇరావతియొక్క బిడ్డ (శంకరులు)

(స్వకీయము) దేవతలున్ను అసురులున్ను క్షీరసముద్రమును (పాలసముద్రమును) మథనముచేసి నప్పుడు దానినుండి అమృతముతో పదునాలుగు వస్తువులు కలిగినట్లు మొత్తముగా చెప్పబడుచున్నది. రామాయణమున 9 మహాభారతమున 9 భాగవతమున 10 పాద్మపురాణమున 9 వాయుపురాణమున 12 మత్స్యపురాణమున 14 ఈవిధముగ మొత్తము సంఖ్యలో వ్యత్యాసమున్నది. ఐతే కలిగిన అనేకవస్తువు లేవనగా — హాలాహలవిషము, (2) వారుణి లేక సురా, (3) ఉచ్చైశ్శ్రవస్సనుగుఱ్ఱము, (4) కౌస్తుభాభరణము, (5) చంద్రుడు, (6) అమృతకలశముతోధన్వంతరి, (7) లక్ష్మి, (8) అప్సరసలు, (9) కామధేనువు, (10) పారిజాతవృక్షము, (11) ఐరావతము, (12) వరుణునిగొడుగు, (13) ఇంద్రునిచే అతనికివ్వబడిన కర్ణకుండలములు, (14) సూర్యుని తెల్లని గుఱ్ఱము (దీనిని పచ్చని గుఱ్ఱమనియు జెప్పుటగలదు) వీటిలో సూర్యుని గుఱ్ఱమునుచేర్చక ధన్వంతరిని వేరుగను అమృతకలశమును వేరుగనుంచి 14 గ లెక్కించుటయుగలదు. వాయుపురాణమున జెప్పబడియున్న 12 లో తులసి యొకటిగ చెప్పబడియున్నది. వరుణుని గొడుగును కర్ణకుండలములను గూర్చి మత్స్యపురాణమున జెప్పబడియున్నది. పాద్మపురాణము ఉత్తర ఖండమున చెప్పబడియున్న 9 క్రింద కనబరిచినవి. (1) విషము, (2) జ్యేష్ఠాదేవి, (3) సురా, (4) నిద్ర, (5) అప్సరసలు, (6) ఐరావతము, (7) లక్ష్మి, (8) చంద్రుడు, (9) తులసి.

---

శ్లో॥ ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥ 28

పద॥ ఆయుధానాం – అహం – వజ్రం – ధేనూనాం – అస్మి – కామధుక్ (1) ।
ప్రజనః – చ – అస్మి – కందర్పః – సర్పాణాం (2) – అస్మి – వాసుకిః ॥

| | | | |
|---|---|---|---|
| అహం ఆయుధానాం | నేను ఆయుధములలో | ప్రజనః కందర్పః | ప్రజను బుట్టించుచున్న మన్మ |
| వజ్రం | వజ్రాయుధముగను | అస్మి | థుడుగను ఉన్నాను |
| ధేనూనాం కామధుక్ | ఆవులలో కామధేనువుగను | సర్పాణాం వాసు | సర్పములలో వాసుకియను |
| అస్మి | ఉన్నాను | కిశ్చ అస్మి | సర్పముగను నేను ఉన్నాను |

తా॥ నేను ఆయుధములలో వజ్రాయుధముగను, ఆవులలో కామధేనువుగను ఉన్నాను. ప్రజల ఉత్పత్తికి కారణుడైన మన్మథుడుగను ఉన్నాను. పాములలో వాసుకియనే పాముగను నేను ఉన్నాను.

(1) కామధుక్ - ఇష్టమైనదాని నిచ్చుటవలన కామధేనువని పేరువచ్చెను. (శ్రీధరులు)

(2) సర్పాణాం-విషముగల పాములలో (శ్రీధరులు) ఒక తలనుగల పాములలో (రామానుజులు, రాఘవేంద్రులు)

(శంకరులు) వజ్రాయుధమనునది దధీచియనువాని ఎముకవలననైనది. కామధుక్ అనగా కోరినదానినంతను ఇచ్చునట్టిదైన వసిష్ఠునియొక్క కామధేనువను ఆవు, లేక అధికముగ పాలనిచ్చునట్టి సామాన్యమైన ఆవు. కందర్పుడనగా కాముడు. సర్పమనేజాతిలో నేను సర్పములకు రాజైన వాసుకిని.

విష్ణుచక్రము మొదలగు మహామహిమబడసిన ఆయుధములనుజెప్పక వజ్రాయుధమును శ్రేష్ఠముగజెప్పుట యేలనగా చక్రము మొదలగు నాయుధములు యెల్లప్పుడునున్నట్టివి. కలుగజేయ బడినవిగావు. కలుగజేయబడిన ఆయుధములలో వజ్రాయుధము శ్రేష్ఠము కావున ఇచ్చట జెప్పబడెను.



శ్లో॥ అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహం।
పితౄణామర్యమాచాస్మి యమ స్సంయమతామహం॥ 29

పద॥ అనన్తః - చ - అస్మి - నాగానాం (1) వరుణః - యాదసాం - అహం।
పితౄణాం - అర్యమా - చ - అస్మి - యమః - సంయమతాం - అహం

| | | | |
|---|---|---|---|
| అహం నాగానాం | నేను నాగములలో | అహం పితౄణాం | నేను పితృవులలో అర్యముడు |
| అనన్తః | అనన్తుడుగను | అర్యమా | గను |
| యాదసాంవరుణఃచ | జలదేవతలలో వరుణుడుగను | సంయమతాం యమః | దండించువారలలో యము |
| అస్మి | ఉన్నాను | చ అస్మి | డుగనునున్నాను |

తా॥ నేను నాగములలో అనన్తుడైన శేషుడుగను జలదేవతలలో వరుణుడుగనున్నాను. పితృదేవతలలో అర్యమగను, దండించువార్లలో యముడుగను నేనున్నాను.

(1) నాగానాం - విషములేని పాములలో (శ్రీధరులు) ఒకటికంటె అధికములైన తలలుగల పాములలో (రామానుజులు, (రాఘవేంద్రులు) సర్పములను త్రాచు పాములనియు నాగుపాములనియు జెప్పుటవాడుక. మఱియు పురాణములలో నాగకన్యకయనియు, నాగరాజనియు ఈ నాగములునివసించుచోటు నాగలోకమనియు వ్యవహరించబడు చున్నది. ఈ నాగములకు, తల మొదలునడుమువఱకు మనుష్యులవలెను నడుముకు క్రింద పాములవలెను స్వరూపము జెప్పబడినది.

శ్లో॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహం।
మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణాం॥ 30

పద॥ ప్రహ్లాదః - చ - అస్మి - దైత్యానాం (1) - కాలః - కలయతాం (2) - అహం।
మృగాణాం - చ - మృగేంద్రః (3) - అహం - వైనతేయః - చ - పక్షిణాం॥

| | | | |
|---|---|---|---|
| దైత్యానాం ప్రహ్లాదః | దైత్యులలో ప్రహ్లాదుడుగను | మృగాణాం మృగేంద్రశ్చ | మృగములలో రాజైన సింహముగను |
| కలయతాం కాలః | గణించువారలలో కాలము | | |
| చ అస్మి | గను నేనున్నాను | పక్షిణాం వైనతేయశ్చ | పక్షులలో వినతపుత్రుడైన గరుడుడుగను |
| | | అహం అస్మి | నేను ఉన్నాను. |

తా॥ నేను దైత్యులలో ప్రహ్లాదుడుగను గణనము జేయువార్లలో కాలముగనున్నాను. మృగములలో రాజైన సింహముగను పక్షులలో రాజైన వినత పుత్రుడైన గరుడుడుగను నేనున్నాను.

(1) దైత్యానాం దితియను నామెయొక్క వంశమునబుట్టిన వారైనందున దైత్యులు. (శంకరులు)

(2) కలయతాం - జనులకు చెరుపుజేయగోరిన వారియొక్క, కాలః = మృత్యువు, అహం = నేను (రామానుజులు). బంధమును కలుగజేయువారిలో కాలుడను నేను (రాఘవేంద్రులు).

(3) మృగేంద్రః - మృగములకు రాజైన సింహము, లేక పులి (శంకరులు).

శ్లో॥ పవనః పవతామస్మి రామ శ్శస్త్రభృతామహం।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ॥ 31

పద॥ పవనః - పవతాం - అస్మి - రామః - శస్త్రభృతాం - అహం।
ఝషాణాం - మకరః - చ - అస్మి - స్రోతసాం - అస్మి - జాహ్నవీ॥

| | | | |
|---|---|---|---|
| పవతాం | పరిశుభ్రపరచు వస్తువులలో | ఝషాణాం | చేపలలో |
| పవనః | వాయువుగను | మకరః చ అస్మి | మకరమీనముగనున్నాను |
| శస్త్రభృతాం | ఆయుధముధరించినశూరులలో | స్రోతసాం జాహ్నవీ | నదులలో గంగానదిగ |
| రామః | రాముడు (దాశరథి)గను | అస్మి | ఉన్నాను |
| అహం అస్మి | నేను ఉన్నాను | | |

తా॥ నేను పరిశుభ్రపరచు వస్తువులలో వాయువుగను ఆయుధము ధరించిన వారిలో దశరథపుత్రుడైన రామునిగను చేపలలో మకరమనెడి చేపగను నదులలో గంగానదిగను ఉన్నాను.

(రామానుజులు) ఆయుధము ధరించినవారిలో రాముడని చెప్పినచోట ఆయుధమెత్తుట యనుక్రియయే, భగవంతుని విభూతి. సూర్యులలో విష్ణువనునది మొదలు ఇంతవరకు జెప్పివచ్చిన దంతయు భగవంతుని విభూతియేయని ఎరుంగదగినది.

(మధ్వులు) అనంతరూపిగను పూర్ణుడుగను చూచెడివారికి ఆనందము నిచ్చువాడుగను నుండుటవలన రాముడని చెప్పబడుచున్నాడు.

(రాఘవేంద్రులు) లోకమును సంతోషింపజేయువాడైనందున రాముడు.

శ్లో॥ సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున ।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహం ॥ 32

పద॥ సర్గాణాం - ఆదిః - అంతః - చ - మధ్యం - చ - ఏవ - అహం - అర్జున ।
అధ్యాత్మవిద్యా - విద్యానాం - వాదః - ప్రవదతాం - అహం ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున ! | ఓ అర్జునా ! | అహం విద్యానాం | నేను విద్యలలో |
| అహమేవ సర్గాణాం | నేనేసృష్టులకు | అధ్యాత్మ విద్యా | ఆత్మనుగూర్చిన విద్యగను |
| ఆదిః మధ్యం చ | మొదలుగను మధ్యగను | ప్రవదతాం వాదః | తర్కించువారల వాదముగను |
| అంతశ్చ | అంతముగను ఉన్నాను, | అస్మి | ఉన్నాను |

తా॥ ఓ అర్జునా! నేనే సృష్టులకు ఉత్పత్తియు మధ్యయున్ను, అనగా స్థితియు, లయమున్ను, ముగింపున్ను అనగా నాశముగను ఉన్నాను. నేను విద్యలలో ఆత్మనుగూర్చిన విద్యగను తర్కించువారల యొక్క వాద జల్ప వితండములుగను ఉన్నాను.

(శంకరులు) ఓ అర్జునా ! సర్గాణాం = సృష్టులకు ఆదియు మధ్యయు అంతమున్ను, అనగా, ఉత్పత్తిస్థితిలయములున్ను నేనే. ఈ యధ్యాయము 20 వ శ్లోకమున భూతములకు, అనగా ప్రాణముగల వస్తువులకు భగవంతుడాదిగను అంతముగనునున్నాడని చెప్పబడినది. ఈ శ్లోకమున సృష్టి సామాన్యమైన సకలమునకును భగవంతుడాదిగను అంతముగను నున్నాడని గుర్తింపబడుచున్నది. పలువిధములైన జ్ఞానములలో ఆత్మనుగూర్చిన జ్ఞానము ముక్తినిచ్చునదైనందున శ్రేష్ఠమైనది. "తర్కముచేయువార్లలో" అని చెప్పినందున తర్కముచేయువారలద్వారా వారలయొక్క ఒకవిధమైన మాటలెయైన వాదము, జల్పము, వితండము, అనువాటిని ఇచ్చట లక్షణచే గ్రహింపవలెను. వీటిలో వాదమనునది యథార్థమును నిశ్చయించుటకు సాధనముగ నున్నందున గొప్పది. కావున ఆ వాదముగ తానున్నట్లు భగవంతుడు చెప్పుచున్నాడు.

(శ్రీధరులు) వాదము మూడు విధములు. వాదము, జల్పము, వితండావాదమని. వాదమనగా రాగద్వేషములులేని గురుశిష్యులుగాని లేక వేరెవ్వరుగాని, తత్త్వనిర్ణయము కొఱకై ఉత్తర ప్రత్యుత్తర రూపముగా ప్రమాణములతోజేయు సంభాషణ. జల్పమనగా - శాస్త్ర ప్రమాణములు యుక్తులు వీటిచే తనవాదమును స్థాపించుకొని ప్రతివాది పక్షమును ఖండించుటయనే రెండుపక్షములవారల వాదము. వితండావాదమనగా ఘనమతమిట్టిదని చెప్పకయు స్థాపింపకయు ప్రమాణములద్వారా ప్రతివాదియొక్క మతమును దూషణచే నిరాకరించుట. ఈ మూడింటిలో కామక్రోధములను బడసిన వెనుకటి రెంటికంటె కామక్రోధము లేనిదైన మొదటిది శ్రేష్ఠమైనది.

(రామానుజులు) ప్రాణులను సృష్టించువారలు సంరక్షించువారలు సంహరించువారలు ఎవ్వరుగలరో వారలున్ను నేనే. అనునది తాత్పర్యము.

---

శ్లో॥ అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ ।
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః ॥ 33

పద॥ అక్షరాణాం - అకారః - అస్మి - ద్వన్ద్వః (1) - సామాసికస్య - చ ।
అహం - ఏవ - అక్షయః - కాలః (2) - ధాతా (3) - అహం - విశ్వతోముఖః (4) ॥

| | | | |
|---|---|---|---|
| అక్షరాణాం | అక్షరములలో | అక్షయః కాలః | ముగియని కాలమున్ను |
| అకారః | "అ" అను అక్షరముగను | అహమేవ | నేనే |
| సామాసికస్య | సమాసముల సమూహములో | విశ్వతోముఖః | అంతట ముఖముగలవాడనై |
| ద్వన్ద్వః అస్మి | "ద్వన్ద్వము" అనే సమాసముగను ఉన్నాను. | ధాతా అహం | కర్మఫలమును విభజించిఇచ్చు వాడనున్ను నేనే |

తా॥ అక్షరములలో "అ" అను అక్షరముగను, సమాసములలో అనగా చాల పదములను ఒకటే పదముగ జేర్చి చెప్పువాటిలో "ద్వన్ద్వము" అను పేరు గల సమాసముగను నేనున్నాను. ముగియక గడచుచున్న ఎల్లలేని "కాలము" అను నదియు నేనే. అనేక ముఖములనున్నవాడనై కర్మల ఫలములను విభజించి ఇచ్చు "దాత"ను నేనే.

(1) సామాసికస్య - పదములను ఒకటితో నొకటిజేర్చి ఒకటే పదము జేయుటకు సమాసమని పేరు. వాటిలో ముఖ్యములైన ఆరు సమాసములేవనగా - (1) తత్పురుషము, (2) ద్వన్ద్వము, (3) ఏకశేషము, (4) ఉపమితసమాసము, (5) అవ్యయీభావసమాసము, (6) బహువ్రీహి సమాసము, ఏక శేషమును జేర్పక ప్రాది సమాసమునుజేర్చి లెక్కించుటయు గలదు. (స్వకీయము)

(2) అక్షయఃకాలః - ముగియని కాలము, అనగా క్షణమని పేరుగల ప్రసిద్ధమైన కాలసూక్ష్మము క్షణ స్వరూపముగ ఎడతెగక పోవునట్టి ఎల్లలేనికాలము. అతి సూక్ష్మమైన మిక్కిలి చిన్న ప్రొద్దు క్షణమనుడు. లేక కాలమునకు కాలమైన పరమేశ్వరుడని గాని గ్రహింపుడు (శంకరులు). కాలః కలయతామహం = అనుచోట నాశమును పొందు కాలమని చెప్పబడినది. ఇచ్చట నాశమొందని కాలమనుటవలన ప్రవాహరూపముగ నాశములేనిదని తాత్పర్యము (శ్రీధరులు)

(3) ధాతా - అన్ని జగత్తులకు అంతట ముఖముగలవాడై కర్మఫలమును విభజించి ఇచ్చువాడు (శంకరులు). కర్మ ఫలము నిచ్చువారిలో అనేకముఖములుగనుండి కర్మఫలము నిచ్చువాడు (శ్రీధరులు), సృష్టిజేయు చతుర్ముఖ బ్రహ్మ (రామానుజులు) ధరించువాడుగను. రక్షించువాడుగనునున్న అంతట వ్యాపించిన ముఖాద్యవయవములు గలవాడు (రాఘవేంద్రులు).

(4) విశ్వతోముఖః = 11-వ అధ్యాయము 11-వ శ్లోకము 9-వ అధ్యాయము 15-వ శ్లోకము చూడుడు. (స్వకీయము)

---

శ్లో॥ మృత్యు స్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతాం।
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥　　34

పద॥ (1) మృత్యుః - సర్వహరః - చ - అహం - ఉద్భవః - చ - భవిష్యతాం।
కీర్తిః - శ్రీః - వాక్ - చ - నారీణాం - స్మృతిః - మేధా - ధృతిః - క్షమా॥

| | | | |
|---|---|---|---|
| సర్వహరః | సకలమునపహరించు | నారీణాం కీర్తిః | స్త్రీలలో కీర్తియు |
| మృత్యుశ్చ | మృత్యువుగను | శ్రీః | ఐశ్వర్యమున్ను |
| భవిష్యతాం | ధనవంతులు కాబోవువార్లకు | వాక్స్మృతిః మేధా | వాక్కు, స్మరణము, జ్ఞానము |
| ఉద్భవశ్చ | వృద్ధి పొందునట్టి సంపదగను | ధృతిఃక్షమాచ అహం | ధైర్యము ఓర్పున్ను నేనే |

తా॥ సకలము నపహరించునట్టి మృత్యువున్ను, సంపదను పొందబోవు వారికి వృద్ధిపొందు సంపదగను, స్త్రీ దేవతలలో కీర్తియు, ఐశ్వర్యము, వాక్కు, స్మరణము, మేధ అనగా జ్ఞానము, ధైర్యము, ఓర్పు, ఇవియు నేనే.

(1) మృత్యుః = సంహారముజేయువారిలో సర్వసంహారకుడైన మృత్యువున్ను (శ్రీధరులు) సకల ప్రాణులను అపహరించునట్టి మృత్యువున్ను (రామానుజులు). మృత్యువులో నుండుచు సకలమును నశింపజేయువాడు (రాఘవేంద్రులు)

(2) భవిష్యతాం = సుఖము పొందదగిన మంచిప్రాణుల శుభప్రాప్తియు (శ్రీధరులు).

(శంకరులు) మృత్యువు రెండువిధములు. ధనముమొదలగువాటి నపహరించుట ఒకటి. ప్రాణము నపహరించుట మరియొకటి. వాటిలో నేదిప్రాణము నపహరించునట్టిదో అదిసకలము నపహరించునదనబడుచున్నది. నేనదిగనున్నాను, లేక ప్రళయకాలమున సకలమును నశింప చేయుట వలన పరమేశ్వరుడు సర్వహరుడు అట్టి పరమేశ్వరుడుగ నేనున్నాను. అనిగాని గ్రహింప వచ్చును. నేను వృద్ధిపొందు సంపదగను దానినిష్పొందుటకు సాధనముగనున్నాను. ఎవ్వరికనగా ఇకమీద సంపదను పొందబోవువార్లకు, అనగా సంపదను పొందదగినవార్లకు, నారీణాం = స్త్రీలలో దేనియొక్క సంబంధము కించిత్ ఉన్నట్లుతోచుట మాత్రముచేతనే జనులు తమలను మిక్కిలి గొప్ప తనము బడసినవార్లుగ అనగా తమకుసకలము గైకూడినట్లు తలంతురో అట్టి కీర్తి మొదలగు నీ గొప్ప స్త్రీదేవతలను గుర్తింపజేయునట్లు తోచుచున్నది. ధృతియనగా మనస్సును పాతివ్రత్యధర్మమున నిలబెట్టు స్థైర్యము.

(మధ్వులు) కీర్తిమొదలగు నేడింటిలో నేను అంతర్వ్యాపిగ నున్నానని తాత్పర్యము.

(స్వకీయము) ఈ శ్లోకమున నారీణాం అహంకీర్తిః = అనుదానికి స్త్రీదేవతలలో కీర్తి మొదలగు దేవతలుగ నేనున్నాను. అని శ్రీధరులు మధుసూదన సరస్వతి, శంకరానందులు మొదలగువారలు అర్థముచేసియున్నారు.



శ్లో॥ బృహత్సామ తథా సామ్నాంగాయత్రీ ఛందసామహం।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః॥ 35

పద॥ బృహత్సామ - తథా - సామ్నాం - గాయత్రీ - ఛందసాం - అహం।
మాసానాం - మార్గశీర్షః - అహం - ఋతూనాం - కుసుమాకరః॥

| | | | |
|---|---|---|---|
| తథా సామ్నాం | అటులనే సామములలో | మాసానాం | మాసములలో |
| బృహత్సామ | బృహత్సామము | మార్గశీర్షః | మార్గశిర మాసమున్ను |
| ఛందసాం గాయత్రీ | ఛందస్సులలో గాయత్రియు | ఋతూనాం | ఋతువులలో |
| అహం | నేను | కుసుమాకరః అహం | పుష్పించుకాలమున్ను నేనే |

తా॥ అటులనే సామవేదముయొక్క గానములలో బృహత్సామమనెడి సామమున్ను ఛందస్సులలో గాయత్రియను ఛందస్సున్ను నేను. మాసములలో మార్గశిరమాసమున్ను ఆరుఋతువులలో పుష్పములు గలుగుకాలమైన వసంత ఋతువున్ను నేనే.

(స్వకీయము) సామములలో "బృహత్" అనేసామము శ్రేష్ఠమైనది. గాయత్రీమొదలగు 26 ఛందస్సులుగల ఋక్కులలో నేను గాయత్రియను ఋక్కుగ ఉన్నాను.

(స్వకీయము) మాసములలో మార్గశీర్షమాసము నేను. అని భగవంతుడు చెప్పుటవలన, ఆ మాసముగొప్పదని తెలుచున్నది. మృగశీర్ష నక్షత్రముతోగూడిన పూర్ణిమ ఏ మాసమునవచ్చునో ఆమాసము మార్గశీర్షమాసము. దీనికి ఆగ్రహాయణికమనియు పేరుగలదు. అదేమన, హాయనః = సంవత్సరము, అగ్రం = అరంభము. అనగా సంవత్సరారంభమున మొదటిమాసమని అర్థము. కావున పూర్వకాలమున ఈ మాసము సంవత్సరమునకు మొదటి మాసముగ ఉండియున్నట్టిది. ఈ మార్గశిరమాసము నందే క్రొత్తధాన్యములు వడ్లు మొదలగునవి ఫలితములగుటవలనను ఈ క్రొత్త ధాన్యముచే ఈనెల పౌర్ణమినాడు సంవత్సరముమొదట హవిర్భాగము చేయుటవలనను వైద్యశాస్త్రము ననుసరించి ఈ హేమంతఋతువున ప్రాణులకు బలము వృద్ధిపొందునదిగ చెప్పబడియున్నందు నను ఈ మాసము శ్రేష్ఠమైనదనియు మిక్కిలి ఉష్ణముగను మిక్కిలి శీతలముగను లేక, సమము గను సుఖముగను నున్నట్టి మాసములనియు మధుసూదన సరస్వతి మొదలగు వ్యాఖ్యాతలు చెప్పు చున్నారు.

మునుపు 8-వ అధ్యాయము 17-వ శ్లోకము క్రింద జెప్పియున్నట్లు మనకు ఒక సంవత్సరము దేవతలకు 1 దినము. పుష్యమాసము మొదలుగానున్న అరునెలలగు ఉత్తరాయణము దేవతలకు ఒక దినమున పగలగుచున్నది. వారలకు రాత్రియైన మిగత ఆరునెలలలో మార్గశిర మాసము కడపటిది కావున మనకెట్లు, పగటికి పూర్వమున్న రాత్రియొక్క ముగింపు విశేషమైన ఉషఃకాలమగునో ఆ విధముగనే ఈ మార్గశిరమాసము దేవతలకు పగలగు ఉత్తరాయణమునకు ఉషఃకాలము. జపము, తపస్సు మొదలగు వాట్లకు శ్రేష్ఠమైనకాలము కావున భగవంతుడే ఈ మాసమని చెప్పునట్లు గ్రహింపవచ్చును,

"కోదండస్థే సవితరి ప్రత్యూషేకమలాపతేః।
సహ స్రవార్షికీ పూజా దినేనైకేన లభ్యతే।
హేమంత ప్రథమేమాసి నందవ్రజకుమారికాః॥"

అను ప్రమాణముచేత ఈమాసమున పూజజేయుట అధికమైన ఫలముతోగూడినది గావున శ్రేష్ఠమని ఏర్పడుచున్నది.

మఱియు ఈమాసమునందే గర్భఋతువు అరంభమని ఎల్లరెరింగిన విషయమే, ఐతే నేటికాలమున అనుభవములో మార్గశిరమాసము అనుకూలము కానిదిగనుండుటకు కారణము, పర్వములలక్షణము రానురాను మార్పుచెందుటవలననే యని తోచుచున్నది.

శ్లో॥ ద్యూతం ఛలయతా మస్మి తేజస్తేజస్వినామహం।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహం॥ 36

పద॥ ద్యూతం - ఛలయతాం - అస్మి - తేజః - తేజస్వినాం - అహం।
జయః - అస్మి - వ్యవసాయః - అస్మి - సత్త్వం - సత్త్వవతాం (1) - అహం॥

| | | | |
|---|---|---|---|
| అహం ఛలయతాం ద్యూతం | నేను వంచకులయొక్క జూదముగను (మోసముగను) | అహం జయః అస్మి | నేను జయముగనున్నాను. |
| తేజస్వినాం తేజః అస్మి | తేజస్సుగలవారల తేజస్సుగను ఉన్నాను | అహం వ్యవసాయః | నేను ప్రయత్నముగను |
| | | సత్త్వవతాంసత్త్వం అస్మి | సాత్వికుల సత్త్వగుణముగను ఉన్నాను |

తా॥ నేను పలువిధములైన, మోసములలో జూదమాడుటయను మోసముగను, తేజస్సుగల వారలయొక్క తేజస్సుగను, జయముగలవార్లయొక్క జయముగను, ప్రయత్నముగలవార్లయొక్క ప్రయత్నముగను, సాత్త్వికులయొక్క సత్త్వ గుణముగనున్నాను.

(1) సత్త్వవతాం = మంచి మనస్సు గలవార్లయొక్క మనస్సున్ను (రామానుజులు). బలవంతుల యొక్క బలము (రాఘవేంద్రులు)

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోస్మి పాండవానాం ధనంజయః।
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనాకవిః॥ 37

పద॥ వృష్ణీణాం - వాసుదేవః - అస్మి - పాండవానాం - ధనంజయః।
మునీనాం - అపి - అహం - వ్యాసః - కవీనాం - ఉశనాకవిః॥

| | | | |
|---|---|---|---|
| వృష్ణీనాం వాసుదేవః | యాదవులలో వాసుదేవుడుగను | మునీనామపి వ్యాసః | మునులలో వేదవ్యాసులంగను |
| | | కవీనాముశనా కవిః | కవులలో శుక్రుడను కవిగను |
| పాండవానాం | పాండవులలో | అహం అస్మి | నేనున్నాను |
| ధనంజయః | ధనంజయుడుగను | | |

తా॥ యాదవులలో వాసుదేవుడున్ను పాండవులలో అర్జునుడున్ను మునులలో వ్యాసులున్ను కవులలో, అనగా సూక్ష్మదర్శులలో శుక్రకవిగను నేనే ఉన్నాను.

(శంకరులు) వృష్ణీనాం = అనగా యాదవవంశమున బుట్టిన వార్లలోనేను వాసుదేవుడను నీ స్నేహితుడైన ఈ నేనే ధనంజయుడగునీవు. మునులనగా ఆలోచించు స్వభావముతో సకల వస్తువుల నెరుంగువారలు. కవులనగా క్రాంతదర్శులు, దాటివిలబడువాటిని చూచెడివారలు. సూక్ష్మదర్శులు అనగా అతిసూక్ష్మమైన వాటిని విమర్శించి యెరుంగువారలు.

(రామానుజులు) మునులనగా వస్తువులను విమర్శించి యెరింగిన నిశ్చిత జ్ఞానముగల వారలు. కవులనగా విద్వాంసులు.

శ్లో॥ దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతాం।
మౌనం చైవాస్మిగుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహం॥ 38

పద॥ దండః - దమయతాం - అస్మి - నీతిః - అస్మి - జిగీషతాం (1)।
మౌనం - చ - ఏవ - అస్మి - గుహ్యానాం - జ్ఞానం - జ్ఞానవతాం - అహం॥

| | | | |
|---|---|---|---|
| దమయతాం | దండించువారలలో | గుహ్యానాం మౌనంచ | రహస్యములలో మౌనముగను |
| దండః అస్మి | దండనగనున్నాను. | జ్ఞానవతాం జ్ఞానం | జ్ఞానుల జ్ఞానమున్ను |
| జిగీషతాం నీతిః అస్మి | విజయమును గోరువార్లలో నీతిగనున్నాను | అహమేవ అస్మి | నేనుగనేయున్నాను |

తా॥ దండించువారిలో దండమున్ను, జయింపగోరువారిలో సామదాన భేదదండములను ఉపాయములున్ను, రహస్యములలో మౌనమున్ను, తత్త్వజ్ఞానుల జ్ఞానమున్ను, నేనే.

(1) మౌనం - రహస్యమును బయటబెట్టక అణచుటకు మౌనము సాధనముగనున్నందున మౌనము విశేషించి చెప్పబడినది (శ్రీధరులు)

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం ॥ 39

పద॥ యత్ - చ - అపి - సర్వభూతానాం - బీజం - తత్ - అహం - అర్జున ।
న - తత్ - అస్తి - వినా - యత్ - స్యాత్ - మయా - భూతం - చరాచరం ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున! | ఓ అర్జునా! | చరాచరం | జంగమస్థావరమైన |
| సర్వభూతానాం చ | సకలభూతములకును | యత్ భూతం స్యాత్ | ఏవస్తువుగలదో |
| యత్ బీజం అపి | యేది విత్తనమో | తత్ మయా వినా | అదినన్ను విడచి |
| తత్ అహం | అది నేను | నాస్తి | లేదు |

తా॥ ఓఅర్జునా! సకలభూతములున్ను కలుగుటకు కారణమైనవిత్తనమేదో అది నేను. జంగమస్థావరమైన ఏవస్తువుగలదో అదినన్ను విడిచియుండదు.

(శంకరులు) సకలవస్తువులకును ఉత్పత్తికారణమైన విత్తనము, అనగా మొలచునట్లు జేయునదేదో అదినేనే. ప్రకృతము జెప్పవచ్చినవిషయమును ముగించుట కొఅకై తనవైభవముయొక్క సంగ్రహమునుజెప్పి ముగించుచున్నాడు. - జంగమముగగాని స్థావరముగగాని ఏవస్తువుగలదో అదియంతయు నన్ను విడిచిలేదు. నాచే వ్యాపింపబడని వస్తువు ఆత్మలేనిదై పాడైనదిగ గదా నిలబడును! కావుననే అన్నియునన్నే ఆత్మగగలిగినవి అని తాత్పర్యము. ఆత్మలేనిదిగ ఒక్కటియు ఉండజాలదనునది తేలిన తాత్పర్యము.

(రామానుజులు) చేతనాచేతనమైన సకల ప్రపంచమున్ను నన్ను శరీరిగను శేషిగను కలిగి యుండుటవలననేను లేక, ఎట్టిభూతములకును స్థితిలేదనునది తాత్పర్యము.

శ్లో॥ నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।
ఏషతూద్దేశతః ప్రోక్తోవిభూతేర్విస్తరోమయా ॥ 40

పద॥ న - అన్తః - అస్తి - మమ - దివ్యానాం (1) విభూతీనాం - పరం తప ।
ఏషః - తు - ఉద్దేశతః - ప్రోక్తః - విభూతేః - విస్తరః - మయా ॥

| | | | |
|---|---|---|---|
| హే పరంతప! | ఓ శత్రువులను తపింపజేయువాడా! | విభూతేః | విభూతిరూపముయొక్క |
| | | ఏషతు విస్తరః | ఈవిస్తారము |
| మమదివ్యానాం | నాయొక్క దివ్యములైన | ఉద్దేశతః | ఏకదేశము (అనగాస్వల్పము)గ |
| విభూతీనాం | వైభవములకు | మయా ప్రోక్తః | నాచే చెప్పబడినది |
| అన్తః నాస్తి | ముగింపులేదు | | |

తా॥ ఓ అర్జునా! అద్భుతములైన నావిభూతిరూపములకు ముగింపులేదు. విభూతిరూపముయొక్క ఈవిస్తారము సంగ్రహముగ నాచే చెప్పబడినది.

(1) దివ్యానాం = మంగళకరములైన (రామానుజులు)

(శంకరులు) సకలమునకును ఆత్మయైన ఈశ్వరునియొక్క దివ్యములైన వైభవములు ఇంతటివని చెప్పుటగాని ఎరుంగుటగాని యెవ్వనికిని వీలుగానిది గదా.



శ్లో॥ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవం ॥ 41

పద॥ యత్ - యత్ - విభూతిమత్ (1) - సత్త్వం - శ్రీమత్ (2) - ఊర్జితం (3) ఏవ వా-।
తత్ - తత్ - ఏవ - అవగచ్ఛ - త్వం - మమ - తేజోంశసంభవం (4) ॥

| | | | |
|---|---|---|---|
| విభూతి మత్ | గొప్పమహిమ గలదిగగాని | తత్ తత్ | అదియది |
| శ్రీమత్ | ఐశ్వర్యముగలదిగ గాని | మమ తేజోంశ సంభవమేవ | నాయొక్క తేజస్సుయొక్క ఒక అంశము వలనకలిగినదిగనే |
| ఊర్జిత మేవవా | ఉత్సాహముతో గూడినదిగ గాని (ఉన్నట్టి) | త్వం అవగచ్ఛ | నీవు తెలిసికొనుము. |
| సత్త్వంయత్ యత్ | వస్తువేదేదిగలదో | | |

తా॥ మహిమగలదిగగాని (శ్రీ) ఐశ్వర్యమును గలదిగగాని ఉత్సాహముతో గూడినదిగగాని ఉన్నవస్తువేదేదో అవియన్నియు ఈశ్వరుడనైన నాయొక్క తేజస్సుయొక్క ఒక అంశము, అనగా ఒక భాగము వలన గలిగినదిగనే నీవు తెలిసికొనుము.

(1) విభూతిమత్ - విభూతితోగూడిన (శంకరులు). నేను తప్ప వేరుకాని (మధ్వులు).

(2) శ్రీమత్ - సంపత్తుగల (శ్రీధరులు, రామానుజులు, రాఘవేంద్రులు).

(3) ఊర్జితం - ఉత్సాహముతో గూడినదియు (శంకరులు) శుభకార్యములను జేయుటకు యత్నము గలిగినట్టియు (రాఘవేంద్రులు).

(4) తేజోంశసంభవం - నాతేజస్సుయొక్క అంశమునుండి కలిగినదిగ (శంకరులు, రామానుజులు) కపిలుడు, రాముడు, వాసుదేవుడు మొదలగు రూపములు పూర్ణములైనవి. మిగతవి అంశములు (మధ్వులు)

శ్లో॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥ 42

పద॥ అథవా - బహునా - ఏతేన - కిం - జ్ఞాతేన - తవ - అర్జున।
విష్టభ్య - అహం - ఇదం - కృత్స్నం - ఏకాంశేన - స్థితః - జగత్ ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున! | ఓ అర్జునా! | అహం ఇదంకృత్స్నం | నేను ఈ సకలమైన |
| అథవా | అట్లుకానిచో | జగత్ | జగత్తును |
| జ్ఞాతేన బహునా | తెలుసుకొనబడిన అనేకమైన, | ఏకాంశేన | ఒక అంశముచేత |
| ఏ తేన తవ కిం | దీనిచే నీకు ఏమి? | విష్టభ్య స్థితః | ధరించుకొనియున్నాను. |

తా॥ ఓ అర్జునా! తెలిసికొనబడిన అనేకములైన ఈ విభూతులచే నీకేమి ప్రయోజనము? నేనుసకలమైన ఈజగత్తును ఒక అంశముచే వ్యాపించుకొని, లేక ధరించుకొనియున్నాను.

(శంకరులు) ఓ అర్జునా! ఇట్టి జ్ఞానమువంటి విస్తారమైన, ఐతేనిండని అనగా కొఱతతో గూడిన జ్ఞానముచే నీకుకాగలదేమి? నేను ఈ విషయమునంతను చెప్పెదనువినుము. నేను ఈ జగత్తంతయు ఒక అంశముచే, ఒక అవయవముచే, అనగా వస్తువులన్నిటి యాకారముగనున్న ఒక పాదముచేత బాగుగాధరించి నిలబడియున్నాను. ఆ విధముగనే "పాదోస్యవిశ్వాభూతాని" వస్తువు లన్నియు ఇతని పాదముగనున్నవి. అని మంత్రవర్ణము చెప్పుచున్నది. (తైత్తిరీయ అరణ్యాకము 8 - 12 చూడుడు.)

(రామానుజులు) నా యొక్క కోట్లకొలది అంశములలో ఒకఅంశముచే ఈ ప్రపంచము వ్యాపింపబడి ప్రకాశించుచున్నదని ఎరింగి ఉపాసింతువేని అదియే ముఖ్యప్రయోజనము అనునది తాత్పర్యము.

(స్వకీయము) బ్రహ్మకైవర్త పురాణము 2 వ భాగము అధ్యాయము 73, వరాహ పురాణము మొదటిభాగము అధ్యాయము 113, కూర్మపురాణము ఉత్తరభాగము అధ్యా 7, పద్మ పురాణము సృష్టి కాండము అధ్యా 36, స్కందపురాణము కాశీఖండము పూర్వభాగము అధ్యా 21 వీటిలో ఈ 10 వ అధ్యాయమువంటి విభూతియోగమును చూడుడు.

* జ్ఞానేన = అనియొకపాఠము జ్ఞానముచేత అనియర్థము (రామానుజులు)

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే విభూతియోగో నామ
దశమోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగనున్న
శ్రీ కృష్ణార్జున సంవాదమున విభూతి యోగమను
పదియవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు

ఏకాదశాధ్యాయ ప్రారంభః

# పదునొకండవ అధ్యాయము

## (విశ్వరూప సందర్శన యోగము)

అర్జున ఉవాచ:-

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితం ।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ ॥ 1

పద॥ మదనుగ్రహాయ (1) - పరమం - గుహ్యం (2) - అధ్యాత్మ సంజ్ఞితం (3) ।
యత్ - త్వయా - ఉక్తం - వచః - తేన - మోహః (4) - అయం - విగతః - మమ॥

| | | | |
|---|---|---|---|
| అర్జున ఉవాచ | అర్జునుడు చెప్పినది | యత్ వచః త్వయా | ఏ వాక్యము నీచే |
| మదనుగ్రహాయ | నన్ను అనుగ్రహించుటకొఱకు | ఉక్తం | చెప్పబడినదో |
| అధ్యాత్మసంజ్ఞితం | అధ్యాత్మమనే పేరుగల | తేన మమ | ఆ వాక్యముచేత నా యొక్క |
| పరమం గుహ్యం | పరమరహస్యమైన | అయంమోహఃవిగతః | ఈ మోహము పోయినది. |

అర్జునుడు చెప్పినది:—

తా॥ నన్ను అనుగ్రహించుటకై అధ్యాత్మమని పేరుబడసిన అతిరహస్యమైన యెట్టి వాక్యమును నీవు చెప్పితివో ఆ వాక్యమువలన నా యొక్క యీ మోహము తొలగినది.

(1) మదనుగ్రహాయ - నాయొక్క దుఃఖమును పోగొట్టుటకొఱకై (స్వకీయము)

(2) గుహ్యం - తత్త్వార్థముతోగూడిన రహస్యమును (శ్రీధరులు). ఉత్తమమైన రహస్యమును (రామానుజులు).

(3) అధ్యాత్మసంజ్ఞితం - ఆత్మానాత్మ వివేకమును కలుగజేయునట్టియు (శంకరులు, శ్రీధరులు). ఆత్మ విషయమైన వాక్యమైనట్టియు (రామానుజులు). భగవంతునిగూర్చి చెప్పబడు వాక్యమైనట్టియు (రాఘవేంద్రులు).

(4) మోహః - అవివేకబుద్ధి (శంకరులు) దేహమే ఆత్మయను నభిమానరూపమైన మోహమును (రామానుజులు). బంధుస్నేహరూపమైన మోహము (రాఘవేంద్రులు).

(శంకరభాష్యము) భగవంతుని వైభవములు చెప్పబడినవి. ఇక "నేను ప్రపంచ మంతయు ఒక అంశముచే ధరించి నిలబడియున్నాను'' అని మునుపు 10-వ అధ్యాయము 42-వ శ్లోకమున భగవంతుడనుగ్రహించినదానిని అర్జునుడు విని ఈశ్వరుని ప్రపంచస్వరూపమైన ఆది రూపమును తాను నేరుగచూడగోరువాడై దీనిని చెప్పువాడాయెను.

(స్వకీయము) తన గురువుమొదలగువార్లను చంపుటవలన పాపమువచ్చును. సుఖము లేదని మునుపుపొందియుండిన మోహము "చంపెడివాడను నేనుకాను, చంపబడెడివారలు నాబంధువులుకారు. కర్తృత్వము ఆత్మకులేదు అనుజ్ఞానోపదేశమును వినుటవలన అర్జుననకు నివర్తించెన"ని తాత్పర్యము.

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా*।
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయం॥

పద॥ భవాప్యయౌ - హి - భూతానాం - శ్రుతౌ - విస్తరశః - మయా।
త్వత్తః - కమలపత్రాక్ష - మాహాత్మ్యం (1) - అపి - చ - అవ్యయం॥

| | | | |
|---|---|---|---|
| హేకమలపత్రాక్ష! | ఓ తామరదళములవంటి కండ్లుగలవాడా! | త్వత్తః శ్రుతౌ | నీవద్దనుండి వినబడినవి |
| భూతానాం | ప్రాణులయొక్క | అవ్యయం | శాశ్వతమైన |
| భవాప్యయౌ | ఉత్పత్తినాశములు | మామహాత్మ్యమ పి చ | (నీయొక్క) మాహాత్మ్యము కూడ |
| మయా | నాచే | (శ్రుతం) | (వినబడినది) |
| విసరశఃహి | విసారముగనే | | |

తా॥ ఓ ఎఱ్ఱతామర దళములవంటి కండ్లుగలవాడా! ప్రాణులయొక్క ఉత్పత్తియు నాశమున్ను నాచేసంగ్రహముగగాక విస్తరముగనే నీవద్దనుండి వినబడినవి. మఱియు నీయొక్క శాశ్వతమైన మహిమకూడ నాచే వినబడినది.

(1) మహాత్మ్యం - సృష్టిస్థితి మొదలగువాటికి కర్తగను సర్వనియంతగను శుభాశుభకర్మలను చేయించువాడుగను బంధమోక్షాది విచిత్రఫలము నిచ్చువాడుగనునున్నను వాటివలన వికారమొంద నట్టియు, పక్షపాతములేనట్టియు, ఆసక్తిలేనట్టియు ఉదాసీన భావము గలిగినట్టియు పలువిధములైన మాహాత్మ్యమున్ను (శ్రీధరులు). చేతనాచేతన శేషిత్వము, జ్ఞానము, బలము, శక్తి, మొదలగు గుణములచే ఉత్తమత్వము ఇవిమొదలగు మహిమనున్ను (రామానుజులు).

* (స్వకీయము) విస్తరతః - అనికొన్ని పాఠములుగలవు. అర్థమొక్కటే.

◆◆◆◆◆◆◆◆◆◆

శ్లో॥ ఏవమేతద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర।
ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ॥

పద॥ ఏవం - ఏతత్ - యథా - ఆత్థ - త్వం - ఆత్మానం - పరమేశ్వర।
ద్రష్టుం - ఇచ్ఛామి - తే - రూపం - ఐశ్వరం (1) - పురుషోత్తమ॥

| | | | |
|---|---|---|---|
| పరమేశ్వర! | ఓ పరమేశ్వరా! | హే పురుషోత్తమ | ఓ పురుషోత్తమా! |
| త్వం ఆత్మానం | నీవునిన్ను | తే | నీయొక్క |
| యథా ఆత్థ | ఎట్లు చెప్పుచున్నావో | ఐశ్వరం రూపం | ఈశ్వరరూపమును |
| తత్ ఏవం | అది అటనే | ద్రష్టుం ఇచ్ఛామి | చూడగోరుచున్నాను. |

తా॥ ఓ పరమేశ్వరా! నీవు నిన్నుగూర్చి ఎట్టి మహిమగలవాడవని చెప్పితివో, అది యావిధముగనే యగును. వేరుకాదు. ఓ పురుషోత్తమా! నీయొక్క అనేక మహిమలుబడసిన రూపమును జూడ నిచ్ఛించుచున్నాను.

(1) ఐశ్వరం - జ్ఞానము, ఐశ్వర్యము, బలము, శక్తి, వీర్యము, తేజస్సు ఇవి మొదలగు గుణములతో గూడి అంతటనున్న వస్తువుగ నిలబడు విష్ణురూపమును (శంకరులు, శ్రీధరులు) - శిక్షించునట్టి రక్షించునట్టి సృష్టించునట్టివాడుగను నియమించువాడుగను ప్రభువుగను కల్యాణ గుణములుగలవాడుగను, ఉత్తముడుగను సకల వస్తువులకంటె విలక్షణుడుగ నునున్న నీరూపమును (రామానుజులు). అచింత్యశక్తి బడసినదైన రూపమును (రాఘవేంద్రులు).

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాఽఽత్మానమవ్యయం ॥

పద॥ మన్యసే - యది - తత్ - శక్యం - మయా - ద్రష్టుం - ఇతి - ప్రభో ।
యోగేశ్వర (1) - తతః (2) - మే - త్వం - దర్శయ - ఆత్మానం - అవ్యయం ॥

| | | | |
|---|---|---|---|
| హే ప్రభో! | ఓ స్వామీ! | హే యోగేశ్వర! | ఓ యోగులకీశ్వరుడా! |
| తత్ | అది | తతః త్వం మే | అప్పుడు నీవునాకు |
| మయాద్రష్టుం | నాచేచూడబడుటకు | అవ్యయం | శాశ్వతమైన |
| శక్యమితి | సాధ్యమని | ఆత్మానం దర్శయ | నిన్ను చూపవలెను. |
| మన్యసేయది | తలంతువేని | | |

తా॥ ఓ స్వామీ! అట్టి రూపము నాచే చూడబడుటకు సాధ్యమైనదని నీవు తలంతువేని అప్పుడు, ఓ యోగులకెల్లరకునీశ్వరుడా! శాశ్వతమైన అట్టి నీ రూపమును నీవు నాకు చూపవలెను.

(1) యోగేశ్వర - జ్ఞానాది సకల కల్యాణ గుణములు గలిగినవాడా! (రామానుజులు)

(2) తతః - నేను దానిని చూచుటకు మిక్కిలి ఆతురతతో నున్నానను కారణముచేత (శంకరులు)

శ్రీ భగవానువాచః—

శ్లో॥ పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥

పద॥ పశ్య - మే - పార్థ - రూపాణి - శతశః - అథ - సహస్రశః ।
నానావిధాని - దివ్యాని (1) - నానావర్ణాకృతీని (2) - చ ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీ భగవానువాచ | శ్రీ కృష్ణపరమాత్మ చెప్పినది | | |
| హే పార్థ! | ఓ పార్థా! | శతశః | నూరు సంఖ్యలుగను |
| నానావిధాని | అనేక విధములుగను | అథసహస్రశః | మరియువెయ్యిసంఖ్యలుగనునున్న |
| దివ్యాని | అద్భుతములుగను | మే రూపాణి | నా రూపములను |
| నానావర్ణాకృతీనిచ | పలురంగులను ఆకారములను గలవిగను | పశ్య | చూడుము |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ చెప్పినది:— ఓ కుంతీపుత్రా! అనేకవిధములుగను, లోకవిలక్షణములుగను అనగా అద్భుతములుగను పలురంగులు పలు అవయవములు గలిగినవిగను నూర్లలెక్కలోను, వేలలెక్కలోను నున్నట్టి, అనగా (అనేకములుగనున్న) నా రూపములను చూడుము.

(1) దివ్యాని - అప్రాకృతాని = అనగా ప్రకృతివలన కలుగనివైన, అద్భుతమైన (శంకరులు).

(2) నానావర్ణాకృతీని - పలువిధములైన నీలము పసుపుపచ్చ మొదలగు వర్ణములున్ను అవయవముల యొక్క సన్నివేశవిశేషములున్ను గలిగిన (శంకరులు).

(మధుసూదనసరస్వతి) పశ్య = చూడుము అని భగవంతుడు ప్రేరేపించుట అర్జునా! నీవు చూడదగినవాడవే అను యోగ్యార్థమును గల్గియున్నది.



శ్లో॥ పశ్యాదిత్యాన్ వసూన్రుద్రా నశ్వినౌ మరుత స్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ 6

పద॥ పశ్య - ఆదిత్యాన్ - వసూన్ - రుద్రాన్ - అశ్వినౌ - మరుతః - తథా।
బహూని - అదృష్టపూర్వాణి (1) - పశ్య - ఆశ్చర్యాణి - భారత ॥

| | | | |
|---|---|---|---|
| హే భారత | ఓ భరతవంశమున బుట్టినవాడా! | మరుతః పశ్య | మరుత్తులను చూడుము |
| ఆదిత్యాన్ | ఆదిత్యులను | తథా బహూని | అటులనే అనేకములైన |
| వసూన్ | వసువులను | అదృష్టపూర్వాణి | మునుపు చూడబడని |
| రుద్రాన్ | రుద్రులను | ఆశ్చర్యాణి | ఆశ్చర్యములను |
| అశ్వినౌ | అశ్వినీదేవతలను | పశ్య | చూడుము |

తా॥ ఓ భారతా! ఆదిత్యులను వసువులను రుద్రులను అశ్వినీదేవతలను మరుత్తులను అటులనే అనేకములుగను మునుపు చూడబడనివిగను ఉన్నట్టి ఆశ్చర్యములనున్ను (నా యొక్క విశ్వరూపదేహమున) చూడుము.

(1) అదృష్టపూర్వాణి - ఎవ్వడును చూచియుండనట్టియు శాస్త్రములలో జెప్పియుండనట్టియు (రామానుజులు).

(శంకరులు) 12 గురు ఆదిత్యులను 8 గురు వసువులను 11 గురు రుద్రులను ఇద్దరు అశ్వనీదేవతలను ఏడు ఏడుగా ఏడు వరుసలైన 49 గురు మరుత్తులను చూడుము. ఆ విధముగనే ఇంతవఱకు నీ చేతను నీ కంటె వేరైన మఱియెవనిచేతను మనుష్యలోకమున మునుపు చూడబడని ఇతరములైన అనేక అద్భుతములనున్ను చూడుము.

(స్వకీయము) ఈ శ్లోకమునందలి ఆదిత్యుడు మొదలగు పేర్లు మునుపు 10-వ అధ్యాయమున అవి వచ్చియున్నచోట్లలో విస్తరింపబడియున్నవి.

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి ॥

పద॥ ఇహ - ఏకస్థం (1) - జగత్ - కృత్స్నం - పశ్య - అద్య - సచరాచరం ।
మమ - దేహే - గుడాకేశ - యత్ - చ - అన్యత్ (2) - ద్రష్టుం - ఇచ్ఛసి ॥

| | | | |
|---|---|---|---|
| హే గుడాకేశ! | ఓ గుడాకేశా ! | అద్య పశ్య | ఇప్పుడు చూడుము. |
| మమ | నా యొక్క | అన్యత్ చ యత్ | వేరు ఇకనుదేనిని |
| | ఈ దేహమున | ద్రష్టుం | చూచుటకు |
| ఏకస్థం | ఒక భాగమునందున్న | ఇచ్ఛసి | ఇచ్ఛించుచున్నావో |
| సచరాచరం | జంగమస్థావరములతోగూడిన | తత్ పశ్య | దానినికూడ చూడుము |
| జగత్కృత్స్నం | జగతునంతను | | |

తా॥ ఓ గుడాకేశా! నా యొక్క ఈ దేహములో ఒకభాగమునందున్న స్థావరజంగమములతోగూడిన సమస్తమైన జగత్తునుచూడుము. ఇంకను మఱి దేనిని చూచుటకు నీవు ఇచ్ఛించుచున్నావో దానినిగూడ ఇప్పుడే చూడుము.

(1) ఏకస్థం - అవయవరూపముగ నొకచోట ఉన్నట్టిదిగ (శ్రీధరులు). అవయవము యొక్క ఒక భాగమునందున్నట్టిదిగ (రామానుజులు).

(2) అన్యత్ - ఎట్టి జయము అపజయము మొదలగుదానిని సందేహించుచున్నావో "యద్వాజయేమయదివానోజయేయుః" (అని అధ్యా 2-శ్లో 6) దేనిని చెప్పితివో దానినిగూడ (శంకరులు శ్రీధరులు).

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరం ॥ 8

పద॥ న - తు - మాం - శక్యసే - ద్రష్టుం - అనేన - ఏవ - స్వచక్షుషా ।
దివ్యం - దదామి - తే - చక్షుః - పశ్య - మే - యోగం (1) - ఐశ్వరం ॥

| | | | |
|---|---|---|---|
| అనేనైవస్వచక్షుషా | నీ యొక్క ఈ కండ్లచేతనే | | |
| మాం | విశ్వరూపమును ధరించిననన్ను | తేదదామి | నీకు ఇచ్చుచున్నాను |
| ద్రష్టుం | జూచుటకు | మే ఐశ్వరం యోగం | నా యొక్కయోగశక్తిమహిమను |
| నశక్యసే తు | శక్తుడేకానేరవు | పశ్య | చూడుము |
| దివ్యంచక్షుః | దివ్యమైనకండ్లను | | |

తా॥ నీ యొక్క ఈకండ్లచేతనే విశ్వరూపమును ధరించిన నన్ను జూచుటకు శక్తుడవు కాజాలవు. దివ్యమైన జ్ఞాననేత్రమును నీకే ఇచ్చుచున్నాను. నా యొక్క అచింత్యశక్త్యతిశయ మహిమలతోగూడిన ఈశ్వరయోగమును చూడుము.

(1) ఐశ్వరం, యోగం - అఘటిత ఘటనా సామర్థ్యము (శ్రీధరులు). అనంతమైన జ్ఞానయోగమునున్ను అనంతమైన విభూతియోగమున్ను (రామానుజులు).

(శంకరులు) విశ్వరూపమును ధరించిన నన్ను అనేనైవ-ప్రకృతివలననైన ఈకన్నుతో నీవు చూడజాలవు. నీవు దివ్యమైన ఏ జ్ఞాననేత్రముచే నన్ను చూడగలవో అట్టి దివ్యనేత్రమునునేను నీకు

ఇచ్చెదను. దానితో నాయొక్క ఈశ్వరయోగమును, అనగా నేను ఈశ్వరుడుగనున్నప్పుడు నాకని గొప్పగా ఏర్పడు యోగమును జూడుము. యోగమును, అనగా యోగబలముయొక్క గొప్ప తనమును.



సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరం॥

పద॥ ఏవం - ఉక్త్వా - తతః - రాజన్ - మహాయోగేశ్వరః - హరిః।
దర్శయామాస - పార్థాయ - పరమం - రూపం - ఐశ్వరం॥

| | | | |
|---|---|---|---|
| సంజయఉవాచ | సంజయుడు చెప్పినది. | తతః | తరువాత |
| హే రాజన్! | ఓ ధృతరాష్ట్ర మహారాజా! | ఐశ్వరం | ఈశ్వరుని సంబంధమైన |
| మహాయోగేశ్వరః | మహాత్ములై యోగులకు ఈశ్వరుడగు | పరమం | మేలైన |
| | | రూపం | రూపమును |
| హరిః | హరి | పార్థాయ | పార్థునికొఱకు |
| ఏవముక్త్వా | ఈ విధముగ జెప్పి | దర్శయామాస | చూపించెను. |

తా॥ సంజయుడు చెప్పినది:— ఓ ధృతరాష్ట్ర మహారాజా! మహాత్ములయు యోగులకెల్ల ఈశ్వరుడును నారాయణుడునునైన కృష్ణపరమాత్మ ఈవిధముగ జెప్పి, (అనగా జ్ఞాననేత్రమునిచ్చిన పిదప) పార్థుడైన అర్జునుని కొఱకు ఈశ్వరుని సంబంధమైన గొప్పరూపమును చూపించెను.

శ్లో॥ అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనం।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధం॥ 10

,, దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం।
సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖం॥ 11

పద॥ అనేకవక్త్రనయనం - అనేకాద్భుతదర్శనం।
అనేకదివ్యాభరణం - దివ్యానేకోద్యతాయుధం॥

,, దివ్యమాల్యాంబరధరం - దివ్యగంధానులేపనం।
సర్వాశ్చర్యమయం - దేవం - అనన్తం (1) - విశ్వతోముఖం॥

| | | | |
|---|---|---|---|
| అనేక వక్త్ర నయనం | అనేక ముఖములను కండ్లను | దివ్యానేకోద్యతాయుధం | దివ్యములైన అనేక ఆయుధములను గలిగినట్టియు |
| అనేకాద్భుతదర్శనం | అనేక అద్భుతములైన దృశ్యములను | దివ్యమాల్యాంబరధరం | దివ్యములైన పుష్పములను వస్త్రములను ధరించినట్టియు |
| అనేక దివ్యాభరణం | అనేక దివ్యమైన ఆభరణములను | | |

| | | | |
|---|---|---|---|
| దివ్య గంధానులేపనం | దివ్యములైన వాసనద్రవ్యములచే పూయబడినట్టియు | అనన్తం | అంతములేనియు |
| సర్వాశ్చర్యమయం | అంతయునాశ్చర్యమైనట్టియు | విశ్వతోముఖం | అంతట ముఖములగలిగిన |
| దేవం | జ్వలించునట్టియు | (రూపం దర్శయామాస) | (విశ్వ) రూపమును చూపించెను |

తా॥ అనేకముఖములను కండ్లనుగలిగినట్టియు, అనేకఅద్భుతములైన దృశ్యములను గలిగినట్టియు, అనేకములుగను దివ్యములుగను నున్న ఆభరణములను ధరించినట్టియు, దివ్యములుగను అనేకములుగనునున్న పైకెత్తబడిన ఆయుధములను ధరించినట్టియు, దివ్యములైన హారములను వస్త్రములనున్న ధరించియున్నట్టియు, శ్రేష్ఠములైన వాసనద్రవ్యములను పూసియున్నట్టియు, ఎల్లరకు ఆశ్చర్యమును గలుగజేయునట్టియు, జ్వలించునట్టియు, అంతములేనట్టియు, అంతటముఖములు గలిగినట్టియు విశ్వరూపమును చూపించెను.

(1) అనంతం - సర్వకాలములలో నున్నందునను సకలవస్తువులకును ఆధారముగ నున్నందునను సకలలోకములలోను సర్వకాలములలోను వ్యాపించియున్నందునను ఎల్లలేనిది, (శ్రీధరులు, రామానుజులు, రాఘవేంద్రులు)

(శంకరులు) ఈశ్వరుడు భూతములన్నిటికిని ఆత్మగనున్నందున అతనియాకారము అంతట ముఖముగలదని చెప్పబడినది "అట్టిరూపమును చూపించెను," అనిగాని, లేక "అర్జునుడు చూచెను" అనిగాని ఉంచుకొని శ్లోకమును పూర్తిచేసికొనవలెను.



శ్లో॥ దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః ॥ 12

పద॥ దివి - సూర్యసహస్రస్య - భవేత్ - యుగపత్ - ఉత్థితా ।
యది - భాః - సదృశీ - సా - స్యాత్ - భాసః - తస్య - మహాత్మనః ॥

| | | | |
|---|---|---|---|
| సూర్యసహస్రస్య | వెయ్యి సూర్యులయొక్క | సా | అది |
| భాః | ప్రకాశము | తస్య మహాత్మనః | ఆ మహాత్మునియొక్క |
| యుగపత్ | ఒకటేకాలమున | భాసః | కాంతికి |
| దివి | ఆకాశమున | సదృశీస్యాత్ | సమానముగ అగును. |
| ఉత్థితా భవేద్యది | కలిగియుండునేని | | |

తా॥ వెయ్యిసూర్యులకాంతి ఒకటే సమయమున ఆకాశమున కలుగునేని అది అట్టి విశ్వరూపమును ధరించిన మహాత్ముని కాంతితో సమానమగును.

(శంకరులు) ఇక విశ్వరూపమును ధరించిన భగవంతుని కాంతియేదిగలదోదానికి ఉపమానము చెప్పబడుచున్నది. దివి అనగా ఆకాశమున; అంతరిక్షమున, అనగా మధ్యనున్న విష్ణులోకమున, లేక ఈలోకమునుండి మూడవదైన విష్ణులోకమున. ఆవిశ్వరూపముయొక్క కాంతికి సమానమైనది లేనియెడల అప్పుడు విశ్వరూపముయొక్క కాంతియే అన్నిటికంటె మేలైన దగుచున్నది. అనునది తాత్పర్యము (లేనివస్తువును ఉపమానముగ చెప్పుటవలన విశ్వరూపముయొక్క కాంతితో సమానమైనదే లేదనియగును.)



శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా॥ 13

పద॥ తత్ర - ఏకస్థం - జగత్ - కృత్స్నం - ప్రవిభక్తం (1) - అనేకధా (2) ।
అపశ్యత్ - దేవదేవస్య - శరీరే - పాండవః - తదా॥

| | | | |
|---|---|---|---|
| దేవదేవస్య | దేవతలకు దేవతయైనవానియొక్క | కృత్స్నం జగత్ | సకలమైన జగత్తును |
| తత్ర శరీరే | ఆ విశ్వరూపశరీరమున | ఏకస్థం | ఒకభాగమునందున్నట్లుగా |
| అనేకధా | పలువిధముల | పాండవః | అర్జునుడు |
| ప్రవిభక్తం | విభక్తముగనున్న | తదా అపశ్యత్ | అప్పుడు చూచెను. |

తా॥ పలువిధములుగను వెవ్వేరుగనునున్న సకలమైన జగత్తును దేవతలకెల్ల దేవతయైన శ్రీకృష్ణపరమాత్మునియొక్క అట్టి విశ్వరూపమున ఒకచోట నున్నట్లు అర్జునుడుచూచెను.

(1) ప్రవిభక్తం - బ్రహ్మాదివివిధ విచిత్రదేవ మనుష్య మృగస్థావరాది భోగము ననుభవించుచున్న చేతనులయొక్క సమూహమైనట్టియు, పృథ్వి, అంతరిక్షము. స్వర్గము, పాతాళము మొదలగు భోగస్థానములుగను, భోగయోగ్యములైన పలువస్తువులుగను భోగమునకు సాధనములైన పలువిధములైన దేహేంద్రియాదులుగను వెవ్వేరుగనున్న సకలమైన జగత్తును (రామానుజులు).

(2) అనేకధా - దేవ పితృమనుష్యాది భేదములచే పలువిధములుగను (శంకరులు).

శ్లో॥ తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలిరభాషత॥ 14

పద॥ తతః - సః - విస్మయావిష్టః - హృష్టరోమా - ధనంజయః।
ప్రణమ్య - శిరసా - దేవం - కృతాంజలిః - అభాషత॥

| | | | |
|---|---|---|---|
| తతః | తరువాత | శిరసా | శిరస్సుతో |
| సః ధనంజయః | ఆ అర్జునుడు | ప్రణమ్య | బాగుగ నమస్కరించి |
| విస్మయావిష్టః | ఆశ్చర్యమొందినవాడుగను | కృతాంజలిః | చేతులను జోడించినవాడై |
| హృష్టరోమా | గగుర్పాటుగలవాడుగను | అభాషత | చెప్పెను |
| దేవం | భగవంతుని | | |

తా॥ అట్టి విశ్వరూపము జూచినపిదప ఆ అర్జునుడు ఆశ్చర్యమొందినవాడుగను గగుర్పాటుగలవాడుగను అయి విశ్వరూపమును ధరించియున్న భగవంతుని శిరస్సుచే వంగి నమస్కరించి చేతులు జోడించి మాట్లాడదొడగెను.

అర్జున ఉవాచ:

శ్లో॥ పశ్యామి దేవాంస్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్ ।
బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చసర్వానురగాంశ్చదివ్యాన్ ॥ 15

పద॥ పశ్యామి - దేవాన్ - తవ - దేవ - దేహే - సర్వాన్ - తథా - భూతవిశేషసంఘాన్ ।
బ్రహ్మాణం - ఈశం - కమలాసనస్థం - ఋషీన్ - చ - సర్వాన్ - ఉరగాన్- చ-దివ్యాన్॥

| | | | |
|---|---|---|---|
| అరునఉవాచ | అర్జునుడు చెప్పినది | కమలాసనస్థం | పద్మాసనమున నున్న |
| హే దేవ | ఓ దేవ | ఈశం | ఈశ్వరుడైన |
| తవదేహే ! | నీ దేహమున (విశ్వరూప దేహమున) | బ్రహ్మాణం | చతుర్ముఖబ్రహ్మనున్ను |
| | | సర్వాన్ ఋషీంశ్చ | సకల ఋషులనున్ను |
| సర్వాన్ దేవాన్ | సకల దేవతలనున్ను | దివ్యాన్ | దివ్యములైన |
| తథా | ఆ విధముగనే | ఉరగాంశ్చ | సర్పములనున్ను |
| భూతవిశేషసంఘాన్ | భూతములయొక్క పలుతెగల సమూహములనున్ను | పశ్యామి | (నేను) చూచుచున్నాను. |

తా॥ అర్జునుడు చెప్పినది:— ఓ దేవా! నీయొక్క విశ్వరూప శరీరమున ఇంద్రాది సకల దేవతలనున్ను అవిధముగనే స్థావర జంగమములుగనున్న వస్తువులయొక్క పలుతెగలైన భూతసమూహములనున్ను దేవతలకు ఈశ్వరుడుగ కమలాసనాసీనుడైన చతుర్ముఖ బ్రహ్మనున్ను సకలఋషులనున్ను విచిత్రములైన దివ్య సర్పములనున్ను నేనుచూచుచున్నాను.

(1) కమలాసనస్థం - తామరపుష్పమువలెనున్న భూమిలో కర్ణిక (కాయ)వలెనున్న మేరు పర్వతమున నివసించు వాడైన (శంకరులు). లేక నీయొక్క నాభికమలమను ఆసనముమీద నున్నవాడైన (శ్రీధరులు). కమలాసనే = కమలాసనుడైన బ్రహ్మయొక్క అధీనమున, స్థం = ఉన్న, ఈశం = రుద్రుని (రామానుజులు, రాఘవేంద్రులు).

(శంకరులు) ఓదేవా! నీయొక్క ఈదేహమున సకలదేవతలను చూచుచున్నాను. అనగా ఎరుంగుచున్నాను. భూతవిశేషసంఘాన్ = స్థావరజంగమములయొక్క పలురూపములుగల వెవ్వేరైన వస్తువులయొక్క బ్రహ్మాణం = బ్రహ్మను అనగా చతుర్ముఖుని, ఈశం = ఈశ్వరుడైన అనగా ప్రజలను ఏలుచున్న, కమలాసనస్థం = భూమియనెడి తామర పుష్పము మధ్య మేరుపర్వతమనెడి తామరకాయ అనే ఆసనముమీద కూర్చొనియున్న అనుట. వసిష్ఠుడు మొదలైన ఋషులనున్ను వాసుకి మొదలైన సర్పములనున్ను చూచుచున్నాను.

(శ్రీధరులు) పలువిధములైన భూతసమూహములేవనగా - జరాయుజాః = (జరాయుజములు) అనగా గర్భకోశమునుండి జనించు మనుష్యాది జంతువులు. అండజాః (అండజములు) గ్రుడ్డునుండి జనించు పక్షి, పాము మొదలగునవి. స్వేదజాః (స్వేదజములు) చెమటనుండి కలుగు తేలు, నల్లి, పేను మొదలగునవి. ఉద్భిజ్జాః (ఉద్భిజ్జములు) భూమిని పగులగొట్టుకొని జనించు వృక్షము, తీగె, మొదలగునవి.

శ్లో॥ అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామిత్వా* సర్వతోఽనన్తరూపం।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం పశ్యామివిశ్వేశ్వర విశ్వరూప॥ 16

పద॥ అనేకబాహూదరవక్త్రనేత్రం - పశ్యామి - త్వా - సర్వతః - అనన్తరూపం।
న - అన్తం - న - మధ్యం - న - పునః - తవ - ఆదిం - పశ్యామి - విశ్వేశ్వర - విశ్వరూప॥

| | | | |
|---|---|---|---|
| హే విశ్వేశ్వర ! | ఓ సకలజగత్తునకీశ్వరుడా ! | సర్వతః | అంతట |
| హే విశ్వరూప ! | ఓ విశ్వరూపమును ధరించి యున్నవాడా ! | పశ్యామి | చూచుచున్నాను |
| | | పునః తవ ఆదిం | ఐతే నీయొక్క ఆదిని |
| అనేక బాహూదర వక్త్రనేత్రం | అనేకములైన చేతులు, ఉదరములు, ముఖములు కండ్లనున్ను | న పశ్యామి | నేను జూచుటలేదు |
| | | మధ్యం న | మధ్యను జూడలేదు |
| అనన్తరూపం | అనేక రూపములను గల | అన్తం న | ముగింపును జూడలేదు. |
| త్వా | నిన్ను | | |

తా॥ ఓ సకల జగత్తున కీశ్వరుడా! విశ్వరూపమును ధరించియున్న వాడా! అనేకములైన చేతులు, కడుపులు, ముఖములు, కండ్లు గలిగినట్టియు అనేక రూపములను గలిగినట్టియు నిన్ను అంతట చూచుచున్నాను. నీయొక్క ఆదినిగాని మధ్యనుగాని కొసనుగాని నేను చూడలేదు.

(రామానుజులు) ఒక దేహమున అనేక కడుపులు మొదలగునవి ఎట్లుండగలవనినచో ఆ విశ్వరూపముననున్న నడుము అపరిమితమైన వైశాల్యము గలిగినట్టిది. ఆ నడుముకు పైగా అనేక కడుపులు మొదలగునవియు క్రింద అనేకపాదములు మొదలగునవియు ఉన్నవని తాత్ప ర్యము. (ఈ యర్థమును ఇచ్చట 19-వ శ్లోకమున భాష్యములో జూడుడు.

(స్వకీయము) ఈ విధములైన స్తోత్రములను కూర్మ పురాణము 16-వ అధ్యాయము నందును వరాహ పురాణము పూర్వభాగము 10-వ అధ్యాయమునందును చూడుడు.

* త్వాం అనియు నొక్క పాఠముగలదు, అర్థమొక్కటే, (శ్రీధరులు)



శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమంతం।
పశ్యామి త్వా దుర్నిరీక్ష్యం* సమన్తాద్దీప్తానలార్కద్యుతి మప్రమేయం॥17

పద॥ కిరీటినం - గదినం - చక్రిణం - చ - తేజోరాశిం - సర్వతః - దీప్తిమంతం।
పశ్యామి - త్వా - దుర్నిరీక్ష్యం - సమన్తాత్ - దీప్తానలార్కద్యుతిం - అప్రమేయం (1)॥

| | | | |
|---|---|---|---|
| కిరీటినం | కిరీటముగలవాడుగను | సర్వతః | అంతట |
| గదినం | గదాయుధము గలవాడుగను | దీప్తిమన్తం | కాంతిగలవాడుగను |
| చక్రిణం చ | చక్రాయుధము గలవాడుగను | దుర్నిరీక్ష్యం | మిక్కిలి శ్రమపడి చూడదగిన వాడుగను |
| తేజోరాశిం | తేజస్సుల సమూహముగను | | |

| | | | |
|---|---|---|---|
| దీప్తానలార్కద్యుతిం | జ్వలించుచున్న అగ్ని సూర్యుడు వీరల కాంతివంటి కాంతి గలవాడుగను | అప్రమేయం | కొలత బెట్ట వీలులేనివాడుగనున్న |
| | | త్వా సమన్తాత్ | నిన్ను అన్నిచోట్లను |
| | | పశ్యామి | చూచుచున్నాను. |

తా॥ కిరీటము, గదాయుధము, చక్రాయుధము వీటిని గలవాడుగను తేజస్సమూహముగను అంతట వ్యాపించిన కాంతిగలవాడుగను, మిక్కిలి కష్టముమీద చూడదగినవాడుగను, జ్వలించుచున్న సూర్యుడు, అగ్ని, వీరివంటి కాంతిగలవాడుగను కొలతబెట్టదగని వాడుగనునున్న నిన్ను అన్నిచోట్లలో చూచుచున్నాను.

(1) అప్రమేయం - మిక్కిలి ప్రకాశముగలిగినట్టి (రాఘవేంద్రులు),

* దుర్నిరీక్ష్యం అనియు పాఠము. చూచుటకసాధ్యమైనట్టియు అని యర్థము (శ్రీధరులు)

---

శ్లో॥ త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా సనాతన స్త్వం పురుషో మతో మే ॥ 18

పద॥ త్వం - అక్షరం - పరమం - వేదితవ్యం (1) - త్వం - అస్య - విశ్వస్య - పరం - నిధానం।
త్వం - అవ్యయః (2) - శాశ్వతధర్మగోప్తా - సనాతనః - త్వం - పురుషః - మతః - మే ॥

| | | | |
|---|---|---|---|
| త్వం | నీవు | త్వం అవ్యయః | నీవు వికారములేనివాడవు |
| వేదితవ్యం | తెలిసికొనదగిన | శాశ్వత ధర్మగోప్తా | శాశ్వతమైన ధర్మమును రక్షించువాడవు |
| అక్షరం | నాశములేని | | |
| పరమం | పరమమైనవస్తువు | త్వం సనాతనః | నీవు సనాతనుడైనవాడవు |
| త్వం | నీవు | పురుషః (ఇవ) | పరమపురుషుడవు అని |
| అస్యవిశ్వస్య | ఈ ప్రపంచమునకు | మే మతః | నాచే తెలిసికొనబడు చున్నావు. |
| పరం నిధానం | గొప్పదైన ఆధారము | | |

తా॥ నీవు ముముక్షువులచే నెరుంగదగిన పరబ్రహ్మము. నీవు ఈ సకల ప్రపంచమునకును ఉత్తమమైన ఆధారము. వికారము లేనివాడవు. నీవు శాశ్వతములైన ధర్మములకు రక్షకుడవు. నీవు సనాతనుడైనవాడవు, పరమపురుషుడవునని నేనెరుంగుచున్నాను.

(1) వేదితవ్యం - వేదాంతమున, ఎరుంగ దగినవాడుగ చెప్పబడియున్న వాడెవ్వడో అతడు (రామానుజులు)

(2) అవ్యయః - స్వరూపవిభవగుణాదులకు నాశములేనివాడు (రామానుజులు) కొలత లేనివాడు (రాఘవేంద్రులు)

(స్వకీయము) ఇట్టి నీయొక్క యోగశక్తియొక్క దర్శనమువలననే నేను ఇందు గనపరచిన విధముగ అనుమానించుచున్నానని అర్జునుడు జెప్పినట్లు శంకరులీ శ్లోకమునకు అవతారికను జేసి

యున్నారు. ఈ శ్లోకమును కూర్మపురాణము ఉత్తరభాగమున అధ్యా 5 లో చూడుడు. ఈ యధ్యాయములోని 38, 9-వ అధ్యాయములోని 18-వ ఈ శ్లోకములను చూడుడు.



శ్లో॥ అనాదిమధ్యాన్త మనన్తవీర్య మనన్త బాహుం శశిసూర్యనేత్రం।
పశ్యామిత్వాం దీప్తహుతాశవక్త్రంస్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥ 19

పద॥ అనాదిమధ్యాంతం - అనంతవీర్యం - అనంతబాహుం - శశిసూర్యనేత్రం।
పశ్యామి - త్వా - దీప్తహుతాశవక్త్రం - స్వతేజసా - విశ్వం - ఇదం - తపన్తమ్ ॥

| | | | |
|---|---|---|---|
| అనాదిమధ్యాన్తం | ఆదియు మధ్యయు ముగింపును లేనివాడుగను | దీప్తహుతాశవక్త్రం | జ్వలించుచున్న అగ్నిని ముఖముగ గలవాడుగను |
| అనంతవీర్యం | అపరిమితమైన పరాక్రమము గలవాడుగను | స్వతేజసా | తన కాంతిచే |
| | | ఇదం విశ్వం | ఈ ప్రపంచమును |
| అనంతబాహుం | లెక్కలేని చేతులుగలవాడుగను | తపన్తం | తపించువాడుగనునున్న |
| శశిసూర్యనేత్రం | చంద్రసూర్యులను కండ్లుగ గలవాడుగను | త్వా పశ్యామి | నిన్ను చూచుచున్నాను. |

తా॥ ఉత్పత్తిస్థితి నాశములు లేనివాడుగను అపరిమితమైన పరాక్రమము గలవాడుగను లెక్కలేని, లేక మహావీర్యముగల చేతులను గలవాడుగను సూర్యచంద్రులను కండ్లుగాగలవాడుగను జ్వలించుచున్న అగ్నిని ముఖముగగలవాడుగను తనయొక్క (నీయొక్క) కాంతిచే ఈ సకల ప్రపంచమును తపింపజేయువాడుగనునున్న నిన్ను నేను చూచుచున్నాను.

(రామానుజులు) అనంతవీర్యం = జ్ఞానము, బలము, ఐశ్వర్యము, శక్తి, వీర్యము, తేజస్సు, మొదలగువాట్లకు వాసస్థానముగనున్నవాడుగను, అనన్తబాహుం = అనేక చేతులు, కడుపులు, ముఖములు, పాదములు వీటినిగలవాడుగను (ఇందులోగల కడుపువిషయమైన యర్థము 16 వ శ్లోకమున క్రింద జూడుడు) శశిసూర్యనేత్రం = చంద్రునివలె చల్లనైనట్టియు సూర్యునివలె తపించుచున్నట్టియు సకల నేత్రములను గలవాడు. అనగా భక్తులైన దేవతలు మొదలగువారల విషయమున చంద్రునివలె ప్రసన్నములైన కండ్లను గలవాడుగను, తన్ను ద్వేషించు అసురులు మొదలగువారల విషయమున తాపమును గలుగజేయునట్టి సూర్యునివలె తపింపజేయుకండ్లను గలవాడుగను నున్నట్లు తాత్పర్యము. దీప్తహుతాశవక్త్రం = ప్రళయకాలాగ్నివలె జ్వలించుచున్న ముఖముగలవాడుగ నున్నాడు.

(రాఘవేంద్రులు) చంద్రుడు సూర్యుడు వీరలు పరమాత్మయొక్క నేత్రమునుండి గలిగిన వార్లు గావున వారలే నేత్రమని ఉపచారముగ జెప్పబడినదేగాని వారలు నేత్రములు కారు.

శ్లో॥ ద్యావాపృథివ్యో రిదమన్తరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥

పద॥ ద్యావాపృథివ్యోః - ఇదం - అంతరం - హి - వ్యాప్తం - త్వయా - ఏకేన - దిశః - చ - సర్వాః ।
దృష్ట్వా-అద్భుతం-రూపం-ఉగ్రం-తవ-ఇదం-లోకత్రయం-ప్రవ్యదితం-మహాత్మన్ (1) ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాత్మన్ ! | ఓ మహాత్ముడా ! | (త్వయావ్యాప్తాః) | నీచే వ్యాపింపబడియున్నవి |
| ద్యావాపృథివ్యోః | ఆకాశము భూమి వీటిమధ్య ప్రదేశమైన | తవ ఉగ్రం | నీయొక్క భయంకరమైన |
| | | అద్భుతం | ఆశ్చర్యమైన |
| ఇదం అంతరం హి | ఈ యంతరిక్షము | ఇదం రూపం | ఈ రూపమును |
| త్వయా ఏకేన | నీ యొకనిచేతనే | దృష్ట్వా | చూచి |
| వ్యాప్తం | వ్యాపింపబడియున్నది. | లోకత్రయం | మూడులోకములున్ను |
| సర్వాః దిశశ్చ | సకల దిక్కులున్ను | ప్రవ్యథితం | కలత చెందుచున్నవి. |

తా॥ ఓ పరమాత్ముడా! ఆ కాశభూముల మధ్యప్రదేశమైన అంతరిక్షము నీ యొకనిచేతనే వ్యాపింపబడియున్నది. సకల దిక్కులున్ను నీచే వ్యాపింపబడి యున్నవి. భయంకరముగను ఆశ్చర్యముగనునున్న నీ యొక్క ఈ విశ్వరూపమునుజూచి మూడు లోకములున్ను మిక్కిలి భయమును పొందుచున్నవి. అనగా మూడు లోకములలోని ప్రజలు భయపడియున్నట్లు నేను నీదేహమును చూచుచున్నానునది తాత్పర్యము.

(1) మహాత్మన్ - అక్షుద్రస్వభావ = అల్పమైన స్వభావములేనివాడా! (శంకరులు)

(రామానుజులు) "మూడు లోకములున్ను భయపడియున్నవి" అనగా బ్రహ్మాది దేవతలు, అసురులు, పితరులు, సిద్ధులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, వీర్లలో కొందఱు పాండవుల కనుకూలురుగను, కొందఱు దుర్యోధనాదుల కనుకూలురుగను, కొందఱు మధ్యస్థులుగను నున్నారు. ఈ మూడు విధములైన జనులున్ను భయపడిరని తాత్పర్యము. జ్ఞాననేత్రములేనిదే విశ్వరూపమునుజూచుట యశక్యముగదా. విశ్వరూపమును జూచినగాని భయపడనక్కరలేదుగదా. అనినచో వారలున్ను చూచి భయపడిరను దానిని అర్జునుడెరుంగుటకై భగవంతుడు అట్టి మూడు విధములైన జనులకును అర్జునునకిచ్చినట్లు జ్ఞాననేత్రములనిచ్చెను. కావుననే ఆ మూడు విధములైన జనులున్ను భయపడినట్లు అర్జునుడు తెలిసికొనుటకు కారణము కలిగెను.

(రాఘవేంద్రులు) మూడు లోకములలోని వారును భయపడిరి. అనగా మూడు లోకములలోని భక్తజనులు భయపడిరని తాత్పర్యము. భక్తులు కానివారికి చూచెడి యోగ్యతలేనందున వారలు భయపడుటకు కారణములేదు. లేక మూడు లోకములలోని వారలు ఈ రూపమును కండ్లచే చూడకపోయినను మనస్సుచే అను సంధానముజేసికొని దానివలన వారలు భయపడుటను అర్జునుడుజూచి వారుగూడ తనవలెజూచి భయపడునట్లు తలంచెనని గాని గ్రహింపదగును.

శ్లో॥ అమీ హి త్వాం సురసంఘా విశన్తి కేచిద్భీతాః ప్రాంజలయోగృణన్తి।
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥ 21

పద॥ అమీ - హి - త్వాం - సురసంఘాః - విశన్తి - కేచిత్ - భీతాః - ప్రాంజలయః - గృణన్తి।
స్వస్తి - ఇతి - ఉక్త్వా - మహర్షిసిద్ధసంఘాః - స్తువన్తి - త్వాం - స్తుతిభిః - పుష్కలాభిః॥

| | | | |
|---|---|---|---|
| అమీహి | ఈ | మహర్షి సిద్ధసంఘాః | మహర్షులు సిద్ధులు వీరల సమూహములు |
| సురసంఘాః | దేవసమూహములు | | |
| త్వాం విశన్తి | నిన్ను ప్రవేశించుచున్నారు | స్వస్తి ఇతి | మంగళము గలుగుగాక అని |
| కేచిత్ | కొందరు | ఉక్త్వా | చెప్పి |
| భీతాః | భయపడినవారలై | పుష్కలాభిః | పూర్ణములైన |
| ప్రాంజలయః | చేతులు జేర్చినవారై | స్తుతిభిః | నుతులచే |
| గృణన్తి | స్తుతించుచున్నారు. | త్వాం | నిన్ను |
| | | స్తువన్తి | స్తోత్రము చేయుచున్నారు. |

తా॥ ఈ దేవసమూహములు నిన్ను ప్రవేశించుచున్నారు. కొందఱు భయపడి వణకి చేతులనుజేర్చి నిన్ను స్తుతించుచున్నారు. మహర్షులు సిద్ధులు వీర్ల సమూహములు "లోకమునకు మంగళము (అనగా క్షేమము) కలుగుగాక" యని ఆశీర్వదించి పూర్ణములైన స్తుతులచే నిన్ను స్తుతించుచున్నారు.

(శంకరులు) మనము వార్లను జయింపగలమా? లేక వారలే మనలను జయించగలరా అని అర్జునునకు ఏ సంశయముండినదో (2-అధ్యా-శ్లో-6) దానిని నివర్తింపజేసి నిశ్చయించుటకొఱకై "పాండవులకు విజయము నిశ్చితమనుదానిని చూపించెదను" అని భగవంతుడు ఇప్పుడు ప్రవర్తించెను, అట్లు ప్రవర్తింపగా భగవంతునిజూచి అర్జునుడు ఈ విధముగ జెప్పుచున్నాడు. ఈ దేవసమూహములు అనగా యుద్ధముచేయు యుద్ధవీరులై భూభారమును తగ్గించుటకై ఇప్పుడు మనుష్య రూపముతో నవతరించియున్న వస్తువులు మొదలగు దేవతల సమూహములు. వారలు నిన్ను ప్రవేశించువారలుగ కనబడుచున్నారు. వీర్లలో కొందరు పరుగెత్తను వీలులేనివారలై నీకు భయపడి చేతులుజేర్చి స్తుతించుచున్నారు యుద్ధము మొదలుపెట్టగా మహర్షులు సిద్ధులు వీరలసమూహములు ఉత్పాతము మొదలగు నపశకునములజూచి జగత్తునకు క్షేమము గలుగుగాకయని యాశీర్వదించి సంపూర్ణములైన (అర్థపుష్టములైన) స్తుతులచే నిన్ను స్తోత్రము చేయుచున్నారు.

(రామానుజులు) ఈ దేవసమూహములు సకలమునకును ఆశ్రయముగనున్న విశ్వరూపముతోగూడిన నిన్నుజూచి మిక్కిలి సంతోషముతో నీ సమీపమునకు వచ్చుచున్నారు. వార్లలో కొందఱు మిక్కిలి ఉగ్రముగను అద్భుతముగనునున్న నీ రూపమునుజూచి భయపడి చేతులుజేర్చుకొని తెలిసినంతవఱకు స్తుతించుచున్నారు. వీర్లలోజేరని మహర్షులు సిద్ధులు వీరలు ఇక జరుగబోవు విపరీత కార్యముల నెఱింగి క్షేమము గలుగుగాకయని అధికములైనట్టియు భగవద్గుణముల ననుసరించినట్టియు స్తుతులచే స్తోత్రము చేయుచున్నారు.

(స్వకీయము) త్వా అనియు పాఠముకలదు. మధుసూదన సరస్వతి అమీహి - త్వా - అసుర సంఘాః = అని పదవిభాగముజేసి ఈ అసుర సమూహములు అనగా దుర్యోధనాదులనియు తాత్పర్యము జేసియున్నారు. ఇందులో జెప్పబడిన వారలు అముక్తులైన దేవసమూహములు, మును పటి 15-వ శ్లోకమున కనుబరచిన వారలు ముక్తులైన దేవసమూహములని రాఘవేంద్రులు జెప్పు చున్నారు.

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ।
గంధర్వ యక్షాసుర సిద్ధసంఘాః వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥ 22

పద॥ రుద్రాదిత్యాః - వసవః - యే - చ - సాధ్యాః - విశ్వే - అశ్వినౌ - మరుతః -చ- ఊష్మపాః-చ
గంధర్వయక్షాసురసిద్ధసంఘాః - వీక్షన్తే - త్వాం - విస్మితాః - చ - ఏవ - సర్వే॥

| | | | |
|---|---|---|---|
| | | ఊష్మపాశ్చ, గంధర్వ | పితృదేవతలున్ను, గంధర్వు |
| రుద్రాదిత్యాః | రుద్రులున్ను ఆదిత్యులున్ను | యక్షాసురసిద్ధ | లు, యక్షులు, అసురులు, |
| వసవః | వసువులున్ను | సంఘాః యే | సిద్ధులు, వీరలసమూహ |
| సాధ్యాః | సాధ్యులున్ను | | ములున్ను ఎవరుగలరో |
| విశ్వే | విశ్వే దేవతలున్ను | (తే) సర్వేచైవ | వారలందరున్ను |
| అశ్వినౌ | అశ్వినీదేవతలున్ను | విస్మితాః | ఆశ్చర్యమొందినవారలై |
| మరుతశ్చ | మరుత్తులున్ను | త్వాం | నిన్ను (ఎడతెగక) |
| | | వీక్షంతే | చూచుచున్నారు. |

తా॥ పదునొకండుగురు రుద్రులున్ను, పంన్రెండుగురు ఆదిత్యులున్ను వసువులున్ను, సాధ్యులనేదేవతలున్ను, విశ్వేదేవతలున్ను, అశ్వినీదేవతలున్ను, మరుత్తులున్ను, పితృదేవతలున్ను, గంధర్వులు, యక్షులు, అసురులు సిద్ధులు వీరల సమూహములున్ను వీరందరున్ను ఆశ్చర్యమును పొందినవారలై నిన్ను ఎడతెగక చూచుచున్నారు.

(శంకరులు) గంధర్వులు హా హా హూ హూ మొదలగువారలు. యక్షులు కుబేరుడు మొదలగువారలు. అసురులు విరోచనుడు మొదలగువారలు. సిద్ధులు కపిలుడు మొదలగువారలు.

(శ్రీధరులు) అన్నము మొదలగు ఆహారవస్తువులు ఉడుకు (వేడిగా) గా నుండునప్పుడు భుజించువారలకు ఊష్మపులనిపేరు. అట్లు వేడిగ నున్నప్పుడు భుజించువారలు పితృదేవతలు. కావున పితృదేవతలని అర్థము చేయబడినది.

శ్లో॥ యావ దుష్ణం భవేదన్నం యావదశ్నన్తి వాగ్యతాః।
పితరస్తావదశ్నన్తి యావన్నోక్తా హవిర్గుణాః॥

అన్నము మొదలగు భుజింపదగిన వస్తువు లెంతవఱకు వేడిగనున్నవో ఎంతవరకు బ్రాహ్మణులు పదార్థములయొక్క (ఉప్పు కారము పులుపు మొదలగు) గుణములను జెప్పక మౌనముగ భుజింతురో అంతవఱకు పితరులు భుజించుచున్నారు.

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదం।
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వాలోకాః ప్రవ్యథితా స్తథాహం॥ 23

పద॥ రూపం - మహత్ - తే - బహువక్త్రనేత్రం - మహాబాహో - బహుబాహూరుపాదం।
బహూదరం - బహుదంష్ట్రాకరాళం - దృష్ట్వా - లోకాః - ప్రవ్యథితాః - తథా - అహం॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో! | ఓ గొప్పచేతులు గలవాడా! | మహత్ | మహత్తుగనున్న |
| బహువక్త్రనేత్రం | అనేక ముఖములను కండ్లను | తే రూపం | నీయొక్క రూపమును |
| బహుబాహూరు - పాదం బహూదరం | పలుచేతులు తొడలు,పాదములు వీటినిగలదియు అనేక కడుపు లనుగలదియు | దృష్ట్వా | చూచి |
| | | లోకాః | ప్రాణులు |
| | | ప్రవ్యథితాః | వణకుచున్నవి |
| బహుదంష్ట్రాకరాళం | పలువక్రదంతములచే భయం కరమైనట్టియు | అహం తథా | నేనుగూడ ఆ విధముగనే (భయపడుచున్నాను.) |

తా॥ ఓ శ్లాఘ్యములైన చేతులుగలవాడా! అనేకముఖములు కండ్లు చేతులు తొడలు పాదములు కడుపులు వీటినిగలిగినట్టియు అనేక వక్రదంతములచే భయంకరమైనట్టియు నీయొక్క ఇట్టి గొప్పదైన రూపమునుజూచి ప్రాణులు మిక్కిలి భయపడి వణకుచున్నవి. నేనున్ను ఆ విధముగనే భయము చెంది యున్నాను.

(రామానుజులు) ఈ యధ్యాయములోని 20-వ శ్లోకమున జెప్పినవిధముగ పాండవ పక్షమున విజయము గలుగవలెనని కొందఱున్ను కౌరవపక్షమున విజయము గలుగవలెనని కొంద ఱున్ను ఇరుపక్షములలోను చేరనిమధ్యస్థులైన కొందరున్ను అని యీవిధముగ మూడువిధములైన జనులని తాత్పర్యము.

శ్లో॥ నభస్స్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రం।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితా న్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో॥ 24

పద॥ నభఃస్పృశం - దీప్తం - అనేకవర్ణం (1) - వ్యాత్తాననం - దీప్తవిశాలనేత్రం।
దృష్ట్వా-హి-త్వాం-ప్రవ్యథితాంతరాత్మా - ధృతిం (2)-న-విందామి-శమం (3)-చ-విష్ణో॥

| | | | |
|---|---|---|---|
| హే విష్ణో! | ఓ మహావిష్ణువా! | దీప్తవిశాలనేత్రం | జ్వలించుచున్న విశాలములైన కండ్లుగలవాడుగనున్న |
| నభస్స్పృశం | ఆకాశమునంటియున్న వాడుగను | త్వాం | నిన్ను |
| దీప్తం | జ్వలించువాడుగను | దృష్ట్వాహి (అహం) | చూచినతోడనే నేను |
| అనేకవర్ణం | పలువర్ణములు గలవాడుగను | ప్రవ్యథితాంతరాత్మా | మనస్సు వణకినవాడనై |
| వ్యాత్తాననం | తెరచియున్న నోళ్లుగలవాడుగను | ధృతిం | ధైర్యమునున్ను |
| | | శమం చ | మనస్సమాధానమునున్ను |
| | | న విందామి | పొందుటలేదు |

తా॥ ఓ మహావిష్ణువా! ఆకాశమునంటియున్నవాడుగను జ్వలించుచున్నవాడుగను పలువర్ణములుగలవాడుగను తెరచియుంచిన నోళ్లుగలవాడుగను జ్వలించుచున్న విశాలములైన కండ్లను గలవాడుగనునున్న నిన్ను జూచిన తోడనే నేను మిక్కిలి భయపడిన మనస్సుగలవాడనై ధైర్యమును మనస్సమాధానమును పొందుటలేదు.

(1) అనేకవర్ణం - అనేకములుగను భయంకరములుగనునున్నట్టి పలుఅవయవములనున్ను ఆకారములనున్ను గలిగినట్టి (శంకరులు)

(2) ధృతిం - నాయొక్క దేహమును ధరింప శక్తిలేనివాడనుగనున్నాను. (రామానుజులు)

(3) శమం - సంతోషమునున్ను (రామానుజులు, రాఘవేంద్రులు)

(రామానుజులు) నభః = త్రిగుణమగు ప్రకృతికి అదీనమైన పరమాకాశము. 20-వ శ్లోకమున జెప్పిన ఆకాశమున్ను ఇదియే, ప్రకృతివలన గలిగిన సకల ప్రపంచమున్ను ఈ విశ్వరూప దేహమున నిమిడినందున ప్రకృతివలన గలిగిన ప్రపంచమునకు బాహ్యమైన (వెలుపలనున్న) పరమాకాశమును ఇచ్చట గ్రహింపవలెను. నవిందామి = మైకము చెందియున్న ఇంద్రియములు గలవాడనుగ నున్నాను.

---

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 25

పద॥ దంష్ట్రాకరాళాని - చ - తే - ముఖాని - దృష్ట్వా - ఏవ - కాలానలసన్నిభాని।
శః - న - జానే - న - లభే - చ - - ప్రసీద - దేవేశ - జగన్నివాస ॥

| | | | |
|---|---|---|---|
| దంష్ట్రాకరాళానిచ | కోరపండ్లచేభయంకరముగను | శర్మ చ | సుఖమునున్ను |
| కాలానలసన్నిభాని | ప్రళయకాలపు అగ్నితో సమానముగనునున్న | న లభే | పొందుటలేదు, |
| | | హే దేవేశ! | ఓ దేవతలకీశ్వరుడా! |
| తేముఖాని | నీ ముఖములను | హే జగన్నివాస! | ఓ జగమున కాధారముగనున్నవాడా! |
| దృష్ట్వైవ | చూచినతోడనే | | |
| దిశః | దిక్కులను | ప్రసీద | ప్రసన్నుడవగుదువు గాక! |
| నజానే | నేనెరుంగుటలేదు, | | |

తా॥ కోరపండ్లచే భయంకరముగను ప్రళయకాలాగ్నితో సమానముగనునున్న నీ ముఖములను జూచినతోడనే దిక్కులను నేను విమర్శించి యెరుంగజాలను. అనగా నీయొక్క ముఖప్రకాశ ప్రాబల్యముచే సూర్యునికాంతి మందమై తూర్పు పడమర మొదలగు దిక్కులు తెలియుటలేదు. నీ దర్శనమువలన గలుగు సుఖమునున్ను పొందనేలేదు. కావున ఓ దేవతల కీశ్వరుడవైనవాడా! ఓ జగత్తున కాధారముగనున్నవాడా! ప్రసన్నుడవగుదువుగాక! అనగా భయంకర ముకాని రూపముతోగూడిన వాడవుగనగుదువుగాక!

శ్లో॥ అమీ చ త్వాం* ధృతరాష్ట్రస్య పుత్రా
స్సర్వే * సహైవావనిపాలసంఘైః।
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః॥ 26

శ్లో॥ వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయానకాని।
కేచిద్విలగ్నా దశనాన్తరేషు
సన్దృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః॥ 27

పద॥ అమీ - చ - త్వా - ధృతరాష్ట్రస్య - పుత్రాః - సర్వే - సహ-ఏవ - అవనిపాలసంఘైః
భీష్మః - ద్రోణః - సూతపుత్రః - తథా - అసౌ - సహ - అస్మదీయైః - అపి-యోధముఖ్యైః॥

పద॥ వక్త్రాణి - తే - త్వరమాణాః - విశన్తి - దంష్ట్రాకరాళాని - భయానకాని।
కేచిత్ - విలగ్నాః - దశనాన్తరేషు - సన్దృశ్యన్తే - చూర్ణితైః - ఉత్తమాఙ్గైః॥

| | | | |
|---|---|---|---|
| అమీ ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వేచ | ఈధృతరాష్ట్రుని పుత్రులెల్లరు | (అమీ) దంష్ట్రాకరాళాని | వీరందరు కోరపండ్లచే క్రూరములుగను |
| అవని పాలసంఘైః సహైవ త్వాం విశన్తి | రాజుల సమూహములతో గూడనే నిన్నుప్రవేశించుచున్నారు. | భయానకాని | భయంకరములుగనునున్న |
| | | తే వక్త్రాణి | నీయొక్క నోళ్ళను (నోటిలోపల) |
| తథా | ఆ విధముగనే | త్వరమాణాః | వేగముతో |
| భీష్మః | భీష్ముడు | విశన్తి | ప్రవేశించుచున్నారు |
| ద్రోణః | ద్రోణుడు | కేచిత్ | కొందరు |
| అసౌసూతపుత్రః | ఈ సూతపుత్రుడైన కర్ణుడు (వీరందరును) | దశనాంతరేషు | పండ్లరంధ్రములలో |
| | | విలగ్నాః | చిక్కుకొని |
| అస్మదీయైః | మనలను జేరినవారలైన | చూర్ణితైః | పొడియైయున్న |
| యోధముఖ్యైః సహ అపి | గొప్పయుద్ధవీరులతో గూడ | ఉత్తమాంగైః | తలలతో |
| | | సందృశ్యన్తే | కనబడుచున్నారు. |
| త్వా * విశన్తి | నిన్ను ప్రవేశించుచున్నారు | | |

తా॥ ఈ ధృతరాష్ట్ర పుత్రులైన దుర్యోధనాదు లందరును ఈ (మిగిలిన) రాజసమూహములతోను, ఆవిధముగనే భీష్ముడు, ద్రోణుడు, ఈ సూతపుత్రుడైన కర్ణుడు వీరలున్ను, మనలను జేరిన యుద్ధములోని ముఖ్యులైన యుద్ధ వీరులతోను నిన్ను ప్రవేశించుచున్నారు. కోరపండ్లచే క్రూరములైనట్టియు భయంకరములైనట్టియు ఈనోళ్లలో వీరెల్లరు వేగముగా ప్రవేశించుచున్నారు కొందరుపండ్ల సందులలో చిక్కుకొని పొడియైన తలలతో గనబడుచున్నారు.

(శంకరులు) ఎవరివలన అపజయము రాగలదను సందేహము తనకుండెనో ఆ భయము గూడ ఏకారణముచే నివర్తించెనో దానినర్జునుడు ఇందులోజెప్పుచున్నాడు. "త్వరమాణాఃవిశన్తి"

అనిముందు రాబోవుపదములనుజేర్చి ఈ శ్లోకమును పూర్తిజేయుడు, 'మనయొక్క గొప్పవీరులు' అనునది ధృష్టద్యుమ్నుడు మొదలగు వార్లను గుర్తించుచున్నది.

* అమీనర్వేఅనిపాఠము - సర్వైః అనియుపాఠము. అర్థభేదములేదు.

* (శ్రీధరులు) త్వా అని పాఠము.

శ్లో॥ యథా నదీనాం బహవోఽమ్బువేగాః సముద్రమేవాభిముఖా ద్రవన్తి।
తథా తవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥ 28

పద॥ యథా - నదీనాం - బహవః - అమ్బువేగాః - సముద్రం - ఏవ - అభిముఖాః - ద్రవన్తి।
తథా - తవ - అమీ - నరలోకవీరాః - విశన్తి - వక్త్రాణి - అభివిజ్వలన్తి॥

| | | | |
|---|---|---|---|
| యథా నదీనాం | ఎట్లు నదులయొక్క | అమీ | ఈ |
| బహవః | అనేకములైన | నరలోకవీరాః | మనుష్యలోకమండలిశూరులు |
| అంబువేగాః | వేగముగల జలప్రవాహములు | అభివిజ్వలన్తి | అంతటజ్వలించుచున్న |
| సముద్రమేవ | సముద్రమునే | తవ | నీయొక్క |
| అభిముఖాః | ఎదురుముఖముగాగలవై | వక్త్రాణి | నోళ్ళను (నోళ్ళలో) |
| ద్రవన్తి | ప్రవేశించుచున్నవో | విశన్తి | ప్రవేశించు చున్నారు |
| తథా | ఆ విధముగనే | | |

తా॥ నదులయొక్క అనేకములైన జలప్రవాహములు సముద్రమున కభిముఖములై ఎట్లు ప్రవేశించుచున్నవో ఆ విధముగనే ఈ మనుష్య లోక మండలి శూరులు మిక్కిలి జ్వలించుచున్న నీయొక్క నోళ్ళలో ప్రవేశించు చున్నారు.

(శంకరులు) నోళ్లు ఎటువంటివి? వక్రములైన పండ్లచే వికారముగను భయంకరముగ నునున్నట్టివి. మఱియు నోటిలో ప్రవేశించినవారిలో కొందఱు పండ్లమధ్య కొఱికి నమలబడిన మాంసమువలె చిక్కుకొన్నవారై కనబడుచున్నారు.

(శంకరులు) "ఈ శూరులు" అనునది భీష్ముడు మొదలగువార్లను గుర్తించుచున్నది,

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశన్తి లోకాస్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥ 29

పద॥ యథా - ప్రదీప్తం - జ్వలనం - పతఙ్గాః - విశన్తి - నాశాయ - సమృద్ధవేగాః।
తథా - ఏవ - నాశాయ - విశన్తి - లోకాః - తవ - అపి - వక్త్రాణి - సమృద్ధవేగాః॥

| | | | |
|---|---|---|---|
| యథా | ఎట్లు | సమృద్ధవేగాః | మిక్కిలివేగముగలవై |
| పతఙ్గాః | మిడతలు | నాశాయవిశన్తి | (తమయొక్క)నాశముకొఱకు ప్రవేశించుచున్నవో |
| ప్రదీప్తం | మండుచున్న | | |
| జ్వలనం | అగ్నిని (దీపమును) | తథైవ | ఆ విధముగనే |

| | | | |
|---|---|---|---|
| లోకా అపి | ఈ జనులున్ను | నాశాయ | (తమ) నాశముకొఱకై |
| తవవక్త్రాణి | నీయొక్కనోళ్ళను (గూర్చి) | సమృద్ధవేగాః | మిక్కిలివేగముగలవారలై |
| | | విశన్తి | ప్రవేశించుచున్నారు. |

తా॥ మిడతలు పెద్ద వేగముగలవై తమ నాశముకొఱకు జ్వలించుచున్న అగ్నిని ఎట్లు ప్రవేశించుచున్నవో ఆ విధముగనే ఈ జనులున్ను నీ యొక్క నోళ్లలో పెద్ద వేగము గలవారలై తమ నాశముకొఱకై ప్రవేశించుచున్నారు.

(శంకరులు) వారలెందుకై ఈ విధముగ ప్రవేశించు చున్నారను దానిని అర్జునుడిందులో జెప్పుచున్నాడు.

శ్లో॥ లేలిహ్యసే గ్రసమానస్సమన్తాల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః
తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో॥ 30

పద॥ లేలిహ్యసే (1) - గ్రసమానః - సమన్తాత్
లోకాన్ - సమగ్రాన్ - వదనైః - జ్వలద్భిః।
తేజోభిః - ఆపూర్య - జగత్ - సమగ్రం
భాసః - తవ - ఉగ్రాః - ప్రతపన్తి - విష్ణో।

| | | | |
|---|---|---|---|
| హే విష్ణో! | ఓ విష్ణో! | గ్రసమానః | మ్రింగుచున్నవాడవై |
| (త్వం) | నీవు | సమన్తాత్ | అంతటను |
| సమగ్రం జగత్ | జగత్తునంతను | లేలిహ్యసే | రుచిచూచుచున్నావు |
| తేజోభిః | తేజస్సులచే | తవ | నీయొక్క |
| ఆపూర్య | వ్యాపించి | ఉగ్రాః | క్రూరములైన |
| సమగ్రాన్‌లోకాన్ | లోకములన్నిటిని | భాసః | కాంతులు |
| జ్వలద్భిః | జ్వలించుచున్న | ప్రతపన్తి | తాపమునుకలుగజేయుచున్నవి |
| వదనైః | నోళ్ళచేత | | |

తా॥ ఓ సర్వవ్యాపియైన విష్ణో! తేజస్సులచే ప్రపంచమునంతటిని వ్యాపించి సకల జనులను జ్వలించుచున్న ముఖములచే భక్షించుచు అంతట రుచిచూచుచున్నావు. నీయొక్క క్రూరములైన కాంతులు తాపమును గలుగజేయుచున్నవి.

(1) లేలిహ్యసే - నీయొక్క పెదవులలో అంటియున్నట్టి నీవు భక్షించిన జనుల యొక్క రక్తమును నాలుకచే గ్రహించుచున్నావు. (రాఘవేంద్రులు)

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద।
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిం॥ 31

పద॥ ఆఖ్యాహి - మే - కః - భవాన్ - ఉగ్రరూపః - నమః - అస్తు - తే - దేవవర - ప్రసీద।
విజ్ఞాతుం - ఇచ్ఛామి - భవన్తం - ఆద్యం - న - హి - ప్రజానామి - తవ - ప్రవృత్తిం॥

| | | | |
|---|---|---|---|
| ఉగ్రరూపః | క్రూరమైన రూపముగల | భవన్తం | నిన్ను |
| భవాన్ కః | నీవుయెవ్వడవు? | విజ్ఞాతుం | విశేషముగ నెరుంగుటకు |
| మే ఆఖ్యాహి | నాకుచెప్పుము | ఇచ్ఛామి | కోరుచున్నాను. |
| తే నమః | నీకు నమస్కారము | హి | ఏలనగా |
| అస్తు | అగుగాక | తవ | నీయొక్క |
| దేవవర! | ఓ దేవశ్రేష్ఠుడా! | ప్రవృత్తిం | వ్యాపారమును |
| ప్రసీద | అనుగ్రహింపుము. | నప్రజానామి | (నేను) ఎరుంగను. |
| ఆద్యం | మొదటనున్న | | |

తా॥ క్రూరమైన రూపముగల నీ వెవ్వడవు? నాకు చెప్పవలెను. నిన్ను గూర్చి నమస్కారమగునుగాక. ఓ దేవశ్రేష్ఠుడా! అనుగ్రహించవలెను. ప్రసన్నుడవగుదువుగాక. (భయంకరముకాని మునుపటి స్వరూపమును పొందెదవుగాక) ఆదిగనున్న నిన్ను విశేషించి ఎరుంగ గోరుచున్నాను. ఏలనగా నీయొక్క వ్యాపారమును నేనెరుంగనే లేను.



శ్రీ భగవానువాచః—

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్సమాహర్తు మిహప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ 32

పద॥ కాలః - అస్మి - లోకక్షయకృత్ - ప్రవృద్ధః (1)
లోకాన్ - సమాహర్తుం - ఇహ - ప్రవృత్తః।
ఋతే - అపి - త్వా (2) - న - భవిష్యన్తి - సర్వే
యే - అవస్థితాః - ప్రత్యనీకేషు - యోధాః॥

| | | | |
|---|---|---|---|
| శ్రీ భగవానువాచ | శ్రీకృష్ణభగవంతుడు చెప్పినది | ప్రవృత్తః | ప్రవర్తించియున్నాను. |
| లోకక్షయకృత్ | లోకములకు నాశమునుగలుగ జేయునట్టి | ప్రత్యనీకేషు | శత్రువుల సైన్యమున |
| | | యోధాః | ఏ యుద్ధవీరులు |
| కాలః | కాలుడుగ | అవస్థితాః | నిలబడియున్నారో |
| ప్రవృద్ధోస్మి | వృద్ధిపొందియున్నాను. | (తే) సర్వే | వారలెల్లరు |
| లోకాన్ | లోకములను | త్వా | నిన్ను |
| సమాహర్తుం | సంహరించుటకై | ఋతేపి | విడిచికూడ |
| ఇహ | ఇప్పుడు | న భవిష్యన్తి | ఉండబోవుటలేదు. |

తా॥ శ్రీకృష్ణభగవంతుడు చెప్పినది:— లోకములకు నాశమును గలుగ జేయు మిక్కిలి క్రూరుడైన కాలుడుగ వృద్ధి పొందియున్నాను. లోకములను సంహరించుటకై ఇప్పుడు ప్రవర్తించి యున్నాను. శత్రుసేనలో యుద్ధము చేయు వారైన యుద్ధవీరులెవ్వరు గలరో అనగా నెవ్వరినుండి విజయవిషయమైన సందే

హము గలిగి యున్నదో, అట్టి భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మొదలగు సకలమైన వారలున్ను, నిన్ను విడిచిగూడ ఉండబోవుట లేదు. అనగా నీవు చంపకున్నను బ్రతికి యుండబోవుటలేదు అని తాత్పర్యము.

(1) ప్రవృద్ధః - మిక్కిలి వృద్ధిపొందియున్న (శంకరులు) సంపూర్ణగుణములతో గూడియున్న (రాఘవేంద్రులు)

(2) ఋతేపి త్వా - నీయొక్క ప్రయత్నము లేకున్నను (రామానుజులు) నీవు మొదలగు పాండవులైదుగురున్ను అశ్వత్థామ, కృతవర్మ, కృపాచార్యుడు, వీరలు తప్ప (రాఘవేంద్రులు)

(శంకరులు) ఎందుకైనేను ప్రవర్తించియున్నానో దానిని వినుము. ఇప్పుడు లోకములను సంహరింప దలపెట్టియున్నాను. ఏ భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మొదలగు వారలనుండి నీకు సంశయముండెనో, అనగా భయము కలిగియుండెనో, వారలగు యుద్ధవీరులెల్లరు నీవు యుద్ధము చేయక పోయినను అనగా నీయొక్క ప్రయత్నములేకయే మరణించెదరు.

(స్వకీయము) మునుపటి శ్లోకమున నీవు ఎవ్వడవు అనియడిగిన ప్రశ్నకు నేను కాలుడ ననియు నీ వ్యాపారమిట్టిదని ఎరుంగలేనని అడిగినదానికి జనులను సంహరించుట వ్యాపారమనియు బదులు జెప్పబడినది.

శ్లో॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ
జిత్వా శత్రూన్భుఙ్క్ష్వరాజ్యంసమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ 33

పద॥ తస్మాత్ - త్వం - ఉత్తిష్ఠ - యశః (1) - లభస్వ
జిత్వా - శత్రూన్ - భుఙ్క్ష్వ - రాజ్యం - సమృద్ధం।
మయా - ఏవ - ఏతే - నిహతాః (2) - పూర్వం - ఏవ
నిమిత్తమాత్రం - భవ - సవ్యసాచిన్ ॥

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | అందువలన | ఏతే | వీరలు |
| త్వం | నీవు | మయైవ | నాచేతనే |
| ఉత్తిష్ఠ | లెమ్ము | నిహతాః | నిశ్చయముగ చంపబడియున్నారు. |
| యశః | కీర్తిని | | |
| లభస్వ | పొందుము | హేసవ్యసాచిన్ | ఎడమచేతిచే బాణము ప్రయోగించు అర్జునుడా! |
| శత్రూన్‌జిత్వా | శత్రువులను జయించి | | |
| సమృద్ధం రాజ్యం | శత్రువులులేని రాజ్యమును | నిమిత్తమాత్రం | నీవు నిమిత్తకారణముగనే |
| భుఙ్క్ష్వ | అనుభవించుము | భవ | ఉండుము. |
| పూర్వమేవ | ముందే | | |

తా॥ కావున నీవు యుద్ధమునకై లెమ్ము. కీర్తినిపొందుము. శత్రువులను జయించి సకల భోగములచే నిండియున్న ఈ రాజ్యము ననుభవించుము.

వీరలు (-ఈ సేనలోనున్న వారలు) నాచేమునుపే చంపబడి యున్నారు. ఓ అర్జునా! నీవు నిమిత్తమాత్రముగ నుండుము. అనగా నిమిత్తమాత్రముగ యుద్ధము జేయుమని తాత్పర్యము.

(1) యశః - దేవతలకు కూడ జయింప వీలులేని భీష్ముడు, ద్రోణుడు, వీర్లను జయించితివను కీర్తిని (శ్రీధరులు)

(2) నిహతాః - మునుపే చంపబడుటకై ఉద్దేశింపబడి యున్నారు. (రామానుజులు)

(శంకరులు) తస్మాత్ - ఆకారణమువలననే ఏకారణమువలన? భీష్ముడు, ద్రోణుడు, వీరలు చంపబడగలరనునది దేనిచే నీవిధముగ (మునుపటి శ్లోకమున జెప్పినట్లు) నిశ్చితమైయున్నదో ఆకారణముచేత నీవు యుద్ధముచేయుటకై లెమ్ము. కీర్తినిపొందుము. అనగా దేవతలచేతను జయింప వీలుకాని భీష్ముడు, ద్రోణుడు. మొదలగు నతిరథులను అర్జునుడు జయించెను అను కీర్తినిపొందుము. అపొగత్త పుణ్యమువలననే గదా లభించును. శత్రువులను=దుర్యోధనుడు మొదలగు వార్లను. సమృద్ధం = శత్రువులేని, విఘ్నముజేయువారులేని, నిహతాః = నిశ్చయముగ చంపబడిరి. అనగా ప్రాణములనుండి వేరుచేయబడిరి, ఎడమచేతితోను అర్జునుడు బాణములను ధనుస్సున సంధానము చేసి ప్రయోగించుట వలన అతడు 'సవ్యసాచి' యనంబడుచున్నాడు.



శ్లో॥ ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాం స్త్వం జహి మావ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాఽసి రణేసపత్నాన్ ॥ 34

పద॥ ద్రోణం - చ- భీష్మం - చ - జయద్రథం - చ - కర్ణం - తథా - అన్యాన్ - అపి - యోధవీరాన్।
మయా - హతాన్ - త్వం - జహి - మా - వ్యథిష్ఠాః - యుధ్యస్వ - జేతాసి - రణే - సపత్నాన్ ॥

| | | | |
|---|---|---|---|
| మయా | నాచే | యోధవీరాన్ | యుద్ధవీరులను |
| హతాన్ | చంపబడియున్న | త్వం | నీవు |
| ద్రోణంచ | ద్రోణుని | జహి | (నిమిత్తమాత్రముగ) చంపుము |
| భీష్మం చ | భీష్ముని | మావ్యథిష్ఠాః | భయపడకుము |
| జయద్రథం చ | జయద్రథుని | యుధ్యస్వ | యుద్ధముచేయుము |
| కర్ణం | కర్ణుని | రణేసపత్నాన్ | యుద్ధమున శత్రువులను |
| తథా | అవిధముగనే | జేతాసి | జయింపగలవు. |
| అన్యానపి | ఇతరులైన | | |

తా॥ నానే చంపబడియున్న ద్రోణుడు, భీష్ముడు, జయద్రథుడు, కర్ణుడు, అవిధముగనే మిగత శూరులుగనున్న యుద్ధముచేయగల వీరలను నీవు నిమిత్తమాత్రముగ చంపుము. నీవు భయపడకుము. లేక వ్యసనమును పొందకుము. యుద్ధమును చేయుము. యుద్ధమున శత్రువులను జయింపగలవు.

(శంకరులు) అర్జునునకు ఏయే యుద్ధవీరులయెడ సంశయము గలదో అనగా నేయే యుద్ధవీరుల విషయమున "వీరలను మనమెట్లు జయింపగలమో" అని మనోదౌర్బల్యముగలదో ఆయాయుద్ధవీరులు ''మయాహతాన్ = నా చేచంపబడియున్న వారల''ని భగవంతుడు చెప్పు చున్నాడు. ద్రోణుడు, భీష్ముడు, వీరలయెడ మొదట శంకకు కారణము ప్రసిద్ధమై, అనగా స్పష్ట ముగ నున్నది. ఎట్లనగా ద్రోణాచార్యుడు యుద్ధశాస్త్రనిపుణుడు అస్త్రశస్త్రములను ప్రయోగించుటలోని మర్మములను బాగుగ నెరింగినవాడు. దివ్యములైన ఆయుధములను బడసినవాడు. క్షత్రియ వంశ మునకు కాలుడుగను (యముడుగను) యుద్ధము మొదలగు సకల విషయములలోను తేరినవాడు నైన పరశురాముని శిష్యుడు. యుద్ధశాస్త్రవిషయమున తనకు (అర్జునునకు) ప్రియుడైన ముఖ్య గురువుగనున్నాడు. భీష్ముడు తన కిష్టమైనప్పుడు తాను మరణమును పొందునట్లు వరముపొందిన వాడు. దివ్యములైన ఆయుధములగలవాడు. మఱియు పరశురామునితో ద్వంద్వయుద్ధముజేసినవాడు. అందులోను ఓడింపబడలేదు. ఆ విధముగనే జయద్రథుడుగూడ. వాని తండ్రి ''నా యొక్క పుత్రుని తలను ఎవ్వడు భూమిమీద పడద్రోయునో వాని తలగూడ పగిలిపడుగాక" అని తపస్సు చేయు చున్నాడు. కర్ణుడైతేనో ఇంద్రునిచే నివ్వబడిన మహామహిమ బడసినట్టియు ఎవ్వనిమీద ప్రయో గింపబడినదో వానిని తప్పక చంపునట్టియు శక్తియను నాయుధమును అర్జునుని చంపుటకొఱకే పొందియున్నవాడు, సూర్యుని కుమారుడు. ఇతడు కన్యకకు బుట్టినవాడైనందున పేరుచేతనే వానిని గుర్తించి చూపుచున్నాడు. నాచే చంపబడియున్న వీర్లను నీవు నిమిత్తమాత్రము అనగా యుద్ధము జేయువాని చేతిలోని ఆయుధమువలె నిమిత్తముగనుండుచు చంపెదవుగాక, భయపడవలదు. నీవు దుర్యోధనుడు మొదలగు శత్రువులను చంపగలవు. ద్రోణుడు, భీష్ముడు మొదలగువారలు గురువు, బంధువులు అని సంబంధమును జెప్పివారల నెట్లుచంపుటయని నీవు భయపడితివిగదా! వారలు శత్రుపక్షముగనున్న వారుగను మీకు పలువిధములైన చెరుపులను జేసినవారుగను నుండుటవలన వారలను నేనే చంపనుద్దేశించితిని. మావ్యథిష్ఠాః = ధర్మాధర్మములను పర్యాలోచించియు బంధువు లను దానిని విమర్శించియు దయతోను ఎట్లు చంపగలనని భయపడితివి గదా! అట్లుభయపడ నక్కరలేదనునది తాత్పర్యము.

---

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలిర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య॥ 35

పద॥ ఏతత్ - శ్రుత్వా - వచనం - కేశవస్య - కృతాంజలిః - వేపమానః - కిరీటీ।
నమస్కృత్వా - భూయః - ఏవ - ఆహ - కృష్ణం - సగద్గదం - భీతభీతః - ప్రణమ్య.

| | | | |
|---|---|---|---|
| సంజయఉవాచ | సంజయుడు చెప్పినది | కృష్ణం | కృష్ణపరమాత్మను |
| వేపమానః | వణకుచున్న | నమస్కృత్వా | నమస్కరించి |
| కిరీటీ | కిరీటియైన అర్జునుడు | భీతభీతః | మిక్కిలి భయపడినవాడై |
| కేశవస్య | కేశవునియొక్క | ప్రణమ్య | బాగుగ వంగి |
| ఏతత్ వచనం | ఈ వాక్యమును | సగద్గదం | గద్గదమైన గొంతుతో |
| శ్రుత్వా | విని | భూయ ఏవ | మరలను |
| కృతాంజలిః | చేతులు జేర్చినవాడై | ఆహ | చెప్పుచున్నాడు. |

తా॥ సంజయుడు ధృతరాష్ట్రునిగూర్చి చెప్పినది:— వణకుచున్న అర్జునుడు కృష్ణపరమాత్మయొక్క ఈ (మునుపుజెప్పిన) వాక్యమునువిని చేతులు జేర్చుకొని కృష్ణపరమాత్మను నమస్కారముజేసి మిక్కిలిభయపడి బాగుగ వంగి గద్గదమైన వాక్కుతో మరలను జెప్పుచున్నాడు.

(శంకరభాష్యము) ఏ తద్వచనం = మునుపటి శ్లోకములలో భగవంతుడు చెప్పిన వచనమును. కిరీటియనగా కిరీటముగలవాడు. భయముచేత వ్యాపింపబడినవానికి దుఃఖమువచ్చి ముట్టడించుటచేతను ప్రీతిచే వ్యాపింపబడినవానికి సంతోషము గలుగుటవలనను కండ్లు కన్నీరుచే నిండి తొణకుచు కఫముచేత గొంతుకడ్డము గలుగగా దానిచేమాటకు స్పష్టతలేమియు మందమైన స్వరమున్ను ఏదికలదో అది గద్గదము. గద్గదమైన గొంతుతో మాటను మాట్లాడెను. అనగా మాట్లాడుట అను విశేష్యమునకు విశేషణమని గ్రహింపుడు. భీతభీతః = మాటిమాటికి భయముచే వ్యాపింపబడిన మనస్సుగలవాడై మాట్లాడ దొడగెను. అనుదానికి వంగి మాట్లాడెను. అని అనుస రించును.

ఈ సమయమున సంజయునిమాటలు అనుతాపముతో గూడినవి. ఎట్లనగా జయింప వీలులేని ద్రోణుడుమొదలగు నలువురను అర్జునుడు చంపబోవుచున్నాడని తెలిసినచో అప్పుడు దుర్యోధనుడు తన ముఖ్యవీరులు లేనివాడగును. సందేహములేక చంపబడినవాడేయని ధృతరాష్ట్రుడు తలంచి విజయాశను విడిచి ఇకనైనగాని సమాధానము జేసికొనడా, అట్లైన ఇరువురికి శాంతియు క్షేమము కలుగుననునది సంజయునిలోని తాత్పర్యము. ఐతే ధృతరాష్ట్రుడు విధివశమున ఆవిధముగ జేయనులేదు. దానిని వినను లేదు.

అర్జున ఉవాచ:

శ్లో॥ స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశోద్రవన్తి సర్వేనమస్యన్తి చ సిద్ధసంఘాః ॥ 36

పద॥ స్థానే - హృషీకేశ - తవ - ప్రకీర్త్యా - జగత్ (1) - ప్రహృష్యతి - అనురజ్యతే - చ ।
రక్షాంసి - భీతాని - దిశః - ద్రవన్తి - సర్వే - నమస్యన్తి - చ - సిద్ధసంఘాః ॥

| | | | |
|---|---|---|---|
| అర్జున ఉవాచ | అర్జునుడు చెప్పినది | రక్షాంసి | రాక్షసులు |
| హే హృషీకేశ! | ఓ హృషీకేశా ! | భీతాని | దిగులుపొందినవారై |
| తవ | నీయొక్క | దిశః | దిక్కులనుగూర్చి |
| ప్రకీర్త్యా | మహిమను జెప్పుటవలన | ద్రవన్తి | పరుగెత్తుచున్నారు |
| జగత్ | జగత్తు | సిద్ధసంఘాః సర్వే | సిద్ధుల సమూహములన్నియు |
| ప్రహృష్యతి | మిక్కిలి సంతోషించుచున్నది | నమస్యన్తి చ | నమస్కరించుచున్నారు. |
| అనురజ్యతే చ | మిక్కిలి ప్రీతినికూడ పొందు చున్నది. | (ఏతాని) స్థానే | ఇవియన్నియు యుక్తమే. |

తా॥ అర్జునుడు చెప్పినది:— ఓ హృషీకేశా! నీ యొక్క మహిమను కీర్తనము జేయుటవలన ప్రపంచము మిక్కిలి సంతోషమొందుచున్నది. మఱియు మిక్కిలి ప్రీతినిన్ని పొందుచున్నది. రాక్షసులు భయపడి దిక్కుల

గూర్చి పరుగెత్తుచున్నారు. సిద్ధుల సమూహములన్నియు నిన్ను నమస్కరించు చున్నారు. ఇదంతయు యుక్తమే. (నీమహిమకుతగినవేయని తాత్పర్యము.)

(1) జగత్ = యుద్ధమును జూడవచ్చియున్న సకలదేవతలు, గంధర్వులు, సిద్ధులు, యక్షులు, విద్యాధరులు, కిన్నరులు, కింపురుషులు మొదలగు జగత్తు (రామానుజులు).

(శంకరభాష్యము) స్థానే = ఇది యుక్తమైనది. ఏది యుక్తమైనది? నీగొప్పతనమును కీర్తనముచేయుటవలనను, అనగా జెప్పుటవలనను వినుటవలనను జగత్తంతయు సంతోషించుచున్న దనునది ఏదిగలదో అది సరియైనది. తగియున్నదనుట లేక, స్థానే అనుదానిని భగవంతునికి విశేషణముగ భావింపవచ్చును. అదేమనగా భగవంతుడు సంతోషము మొదలగువాటికి తగినవస్తువనునది యుక్తము. ఏలనగా ఈశ్వరుడు అన్నిటికిని ఆత్మయు సుహృత్తునుకూడ. అవిధముగనే లోకము ఆశపడుటకు నీవుతగినవాడవుగనున్నావు అనునదియు యుక్తమే. మఱియు రాక్షసులు భయముచే ఆవరింపబడినవారై దిక్కులనుగూర్చి పోవుచున్నారు, అదియు తగినఅధికారివస్తువైన నిన్నుగూర్చి అనుట. మఱియు కపిలుడు మొదలైన సిద్ధులగుంపులన్నియు నీకు నమస్కారము జేయుచున్నవి. అదియు యోగ్యవస్తువైన నిన్నుగూర్చి యనుట.



శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।
అనంత దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥ 37

పద॥ కస్మాత్ - చ - తే - న - నమేరన్ - మహాత్మన్ (1) -
గరీయసే - బ్రహ్మణః - అపి - ఆదికర్త్రే
అనంత - దేవేశ - జగన్నివాస -
త్వం - అక్షరం - సత్ - అసత్ (2) - తత్ - పరం - యత్ ॥

| | | | |
|---|---|---|---|
| | | హే అనంత! దేవేశ! | ఓ ముగింపులేనివాడా! ఓ దేవతల కీశ్వరుడా! |
| హే మహాత్మన్ ! | ఓ మహాత్మా ! | జగన్నివాస ! | జగమున కాశ్రయమైనవాడా ! |
| గరీయసే | మిక్కిలి గొప్పవాడవై | సదసచ్చ | సత్తున్ను అసత్తున్ను |
| బ్రహ్మణోపి | బ్రహ్మకుకూడ | పరం | మేలైనదియు |
| ఆదికర్త్రేతే | మూలకారణుడవైన నీకొఱకు | అక్షరం | నాశములేనిదియు |
| కస్మాత్ | ఎందులకై | యత్ | ఏదిగలదో |
| ననమేరన్ | నమస్కరింపక యుండగలరు? | తత్ చ త్వం | అదియు నీవే |

తా॥ ఓ మహాత్మా! మిక్కిలి గొప్పవాడవై బ్రహ్మకుగూడ ఆదికారణమైన నీ కొఱకు (వారలు) ఏల నమస్కారము జేయకయుందురు. ఓ ముగింపులేనివాడా! ఓ దేవతలకీశ్వరుడా! ఓ జగత్తునకు ఆధారమైనవాడా! సత్తున్ను, అనగా ఉన్నవస్తువును, అసత్తున్ను అనగా లేనిదియు వీనికి తరువాతనున్న మేలైనదియు నాశములేనిదియు ఏదిగలదో అదియు నీవే.

(1) మహాత్మన్ = పూర్ణమైన ఆత్మ (మధ్వులు)

(2) సత్ అసత్ = కార్యకారణమైనవాడును (మధ్వులు)

(శంకరులు) భగవంతుడు సంతోషము మొదలగువాటికి తగినవాడను విషయమున అర్జునుడు కారణమును ఇందులో నెత్తిచూపుచున్నాడు. ఏకారణమువలన బ్రహ్మకును, అనగా హిరణ్యగర్భునికిని మూలకారణమైన మిక్కిలిగొప్పవాడవై మహాత్ముడవై నీవున్నావోఆకారణమువలన నీవుసంతోషము మొదలగు వాటికిని నమస్కారమునకును తగిన ఆధారవస్తువు. కావునవారలు ఎట్లు నిన్నునమస్కరింపక యుందురు? తప్పక నమస్కరింతురని భావము. వేదాంతములలో నేది ప్రకటింపబడుచున్నదో అట్టిమేలైన నశించనివస్తువునీవే. అదియేది? సత్ = యథార్థమున్ను, అసత్ = లేనితనమున్ను అనునది. సత్తనునది ఎల్లప్పుడు ఉన్నట్టిది. అసత్తనునది దేనిని ఆధార పడి, లేదను జ్ఞానముగలుగుచున్నదో అట్టిది. అట్టి అక్షరవస్తువునకు అట్టి సత్ అసత్ రెండును ఉపాధులుగనున్నట్టివి. అవస్తువు సత్తనియు అసత్తనియు వాటిద్వారా ఉపచారవాదముచే చెప్ప బడుచున్నది. మఱియు వాస్తవమున వేదము నెరింగినవారలు దేనిని నశించనివస్తువని చెప్పు చున్నారో అది సత్ - అసత్ - ఈ రెంటినతిక్రమించి యున్నట్టిది. అదినీవే, వేరుగాదు. అని తాత్పర్యము.

(రామానుజులు) అక్షరం = నాశములేని జీవాత్మతత్త్వమున్ను, త్వమేవ = నీవే, సత్ = నామరూపవికారములతోనున్న కార్యమైనవస్తువున్ను, అసత్ = నామరూపవికారములులేని కారణ ప్రకృతిరూపమున్ను, త్వమేవ = నీవే, తత్పరం = ప్రకృతితత్త్వము ప్రకృతిసంబంధముతోగూడిన జీవతత్త్వము వీటికంటె భిన్నమైన ముక్తాత్మతత్త్వమున్ను, త్వమేవ = నీవే.



శ్లో॥ త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానం।
వేత్తాఽసివేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వమనంతరూప ॥ 38

పద॥ త్వం - ఆదిదేవః - పురుషః - పురాణః - త్వం - అస్య - విశ్వస్య (1) - పరం - నిధానం (2)।
వేత్తా - అసి - వేద్యం - చ - పరం - చ - ధామ (3) - త్వయా - తతం - విశ్వం-అనంతరూప ॥

| | | | |
|---|---|---|---|
| త్వం | నీవు | వేత్తావేద్యం | తెలిసికొనువాడుగను, తెలిసి కొనబడదగిన వస్తువుగను |
| ఆదిదేవః | ఆదిదేవుడవు | పరం చ ధామ అసి | శ్రేష్ఠమైన స్థానముగను ఉన్నావు |
| పురాణః | పాతవాడవైన | హే అనంతరూప ! | ఓ లెక్కలేని రూపములుగల వాడా |
| పురుషః | పురుషుడవు | త్వయా విశ్వం తతం | నీచే సకలము వ్యాపింపబడి యున్నది. |
| త్వం | నీవు | | |
| అస్యవిశ్వస్య | ఈ ప్రపంచమునకు | | |
| పరం | శ్రేష్ఠమైన | | |
| నిధానం | వాసస్థానముగను | | |

తా॥ నీవు ఆదిదేవుడవు. పురాతనుడైన పురుషుడవు. నీవు ఈ ప్రపంచ మునకు శ్రేష్ఠమైన వాసస్థానముగను అన్నియు నెరుంగువాడుగను ఎరుంగ దగిన వస్తువుగను ఉత్తమమైన (విష్ణు) స్థానముగనునున్నావు. కొలతలేని రూపములుగలవాడా! నీచేతనే సకలము వ్యాపింప బడియున్నది.

(1) విశ్వస్య — ఇట్టి నీయొక్క శరీరమైన ప్రపంచమునకు (రామానుజులు)

(2) నిధానం — ఆధారమును (రామానుజులు). ఆశ్రయముగను (రాఘవేంద్రులు). ఈ యధ్యాయము 18-వ 9-వ అధ్యాయము 17-వ శ్లోకములను చూడుడు. (స్వకీయము)

(3) ధామ — తేజస్సుల సమూహమున్ను (రాఘవేంద్రులు).

(శంకరులు) అర్జునుడు భగవంతుని మరలను స్తుతించుచున్నాడు. జగత్తును సృష్టించువాడైనందున ఆదిదేవుడు. శరీరముననుండువాడు గనుక పురుషుడు. మహాప్రళయము మొదలగు వాటిలో ప్రపంచమంతయు నిలబడుచోటైనందున నిధానము. ఎరుంగబడు వస్తువులవర్గములన్నిటిని నీవెరుంగు వాడవుగనున్నాను. ఎరుంగబడువస్తువేది గలదో అదియునీవే. పరంధామ అంతటనున్న వస్తువుయొక్క అన్నిటికంటె మేలైనవైష్ణవపదము.

శ్లో॥ వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః
　　ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ।
నమోనమస్తేఽస్తు సహస్రకృత్వః
　　పునశ్చ భూయోఽపి నమో నమస్తే॥ 39

పద॥ వాయుః - యమః - అగ్నిః - వరుణః - శశాంకః
ప్రజాపతిః - త్వం - ప్రపితామహః - చ।
నమః - నమః - తే - అస్తు - సహస్రకృత్వః
పునః - చ - భూయః - అపి - నమః - నమః - తే॥

| | | | |
|---|---|---|---|
| వాయుః యమః అగ్నిః | వాయువు, యముడు, అగ్నియు, | తే | నీకు |
| | | నమః నమః | నమస్కారము నమస్కారము |
| వరుణః శశాంకః | వరుణుడు, చంద్రుడు, | అస్తు | అగునుగాక. |
| ప్రజాపతిః | ప్రజాపతియు | పునశ్చభూయోపి | మరలను మరలను |
| ప్రపితామహశ్చ | ప్రపితామహుడున్ను | తే నమః నమః | నీకు నమస్కారము నమస్కారము. |
| త్వం | నీవే | | |
| సహస్రకృత్వః | వెయ్యిమార్లు | | |

తా॥ వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, చతుర్ముఖబ్రహ్మ, చతుర్ముఖబ్రహ్మకుతండ్రి వీరలు నీవే. నిన్నుగూర్చి వెయ్యిమార్లు నమస్కారమగునుగాక. మరలను మరలను నిన్నుగూర్చి నమస్కారము.

(శంకరులు) వరుణః = జలమునకధిపతి. ప్రజాపతి = కాశ్యపుడు మొదలగు ప్రజాపతి. ప్రపితామహుడు = తాతకుతండ్రి. "పునశ్చభూయోపి" అనగా విశ్వాసము, భక్తివీటియాధిక్యముచే అర్జునునకు తృప్తిలేనితనము చూపుచున్నది.

(స్వకీయము) ఇందు గనపడచిన వాయు అనుపదమునకు అనేకవిధజ్ఞానరూపమైనట్టియు ఈ విధముగనే ఇతరపదములకును పరమాత్మపరముగనే రాఘవేంద్రులు అర్థము జేసియున్నారు.

శ్లో॥ నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ।
అనంత వీర్యామిత విక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥ 40

పద॥ నమః - పురస్తాత్ - అథ - పృష్ఠతః - తే - నమః - అస్తు - తే - సర్వతః - ఏవ - సర్వ।
అనంతవీర్యామితవిక్రమః - త్వం - సర్వం - సమాప్నోషి - తతః - అసి - సర్వః ॥

| | | | |
|---|---|---|---|
| తే పురస్తాత్ | నీకు ముందుప్రక్కలోను | త్వం | నీవు |
| పృష్ఠతః నమః | వెనుకప్రక్కను నమస్కారము | సర్వం | సకలమును |
| హే సర్వ ! | ఓ సర్వమునైనవాడా ! | సమాప్నోషి | బాగుగ వ్యాపించి నిలబడి యున్నావు |
| అథ సర్వత ఏవ | ఆ విధముగనే అంతటనే | | |
| తే నమః అస్తు | నీకు నమస్కారమగునుగాక | తతః | అందువలన |
| అనంత వీర్యామిత విక్రమః | అంతము లేనివీర్యమును అపరిమితమైన పరాక్రమమును గల | సర్వః అసి | సర్వముగనున్నావు. |

తా॥ ఓ సర్వముగనున్నవాడా! నీ ముందుప్రక్కను వెనుకప్రక్కను నమస్కారము. ఆ విధముగనే సకలదిక్కులలోను నీకొఱకు నమస్కారముండు గాక! కొలతలేనివీర్యము అపరిమితమైన పరాక్రమమునుగల నీవు సకలమును వ్యాపించియున్నావు. కావుననే సకలముగ నున్నావు. అనగా సర్వస్వరూపు డుగ నున్నావు.

(శంకరులు) పురస్తాత్ = తూర్పుదిక్కులోను, సర్వత ఏవ = అన్నిదిక్కులలోను అంతటనున్న నీకునమస్కారము. వీర్యము బలము (విక్రమః) పరాక్రమము అనగా ధైర్యము. ఒకడు బలముగలవాడైనను శత్రువులను జంపువిషయమున సాహసించుటలేదు. లేక మందమైన ధైర్యముగలవాడుగ నుండవచ్చు. నీవైతే అపరిమితమైనబలమును ధైర్యమునుగలవాడవు. ఆత్మయనే ఒకదానిచే జగత్తునంతయు వ్యాపించియుండుటవలన నీవు సకలముగనున్నావు. అనగా నీవులేని దొక్కటియు లేదనునది తాత్పర్యము.

(రామానుజులు) చిదచిద్వస్తువులైన సకల ప్రపంచమున్ను నీకు శరీరమైనందునను త్వత్ప్రకారత్వాత్ = అన్నియు నీయొక్క శేష (అంశ)ముగా నుండుటవలనను నీవుసర్వాత్మగను సర్వప్రకారిగ నుండుటవలనను సర్వమని నీవు చెప్పబడుచున్నావు.

(రాఘవేంద్రులు) ఇచ్చట "సర్వం" అని చెప్పియుండుటవలనను శ్రుతిలో "సర్వం ఖల్విదంబ్రహ్మ" అని చెప్పియుండుటవలనను సకలముబ్రహ్మమని అర్థముగాదు. సర్వాశ్రయము బ్రహ్మమని తాత్పర్యము (అనగా సర్వశబ్దములచేతను పిలువబడువాడు అనునది తాత్పర్యము.)

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హేకృష్ణ! హేయాదవ! హేసఖేతి।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి॥ 41

శ్లో॥ యచ్చాపహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు।
ఏకోఽథవాఽప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వామహ మప్రమేయమ్॥ 42

పద॥ సఖా - ఇతి - మత్వా - ప్రసభం (1) - యత్ - ఉక్తం
హేకృష్ణ - హే - యాదవ - హే - సఖే - ఇతి।
అజానతా - మహిమానం - తవ - ఇదం
మయా - ప్రమాదాత్ - ప్రణయేన (2) - వా - అపి॥

,, యత్ - చ - అపహాసార్థం - అసత్కృతః - అసి
విహారశయ్యాసనభోజనేషు।
ఏకః (3) - అథ - వా - అపి - అచ్యుత - తత్ - సమక్షం (4)
తత్ - క్షామయే - త్వాం - అహం - అప్రమేయం॥

| | | | |
|---|---|---|---|
| తవ ఇదం మహిమానం | నీయొక్క (ఈరూపము) మహిమను | అథవా | లేక |
| అజానతా | ఎరుంగనివాడనైన | ఏకః | ఏకాంతముగ నున్నప్పుడైన గాని |
| మయా | నాచే | సమక్షమపి | ప్రత్యక్షముగగాని |
| సఖేతి మత్వా | స్నేహితుడని తలంచి | అపహాసార్థం | పరిహాసముకొఱకు |
| ప్రమాదాత్ | అలక్ష్యమువలన గాని | తత్ | ఆ విధముగ |
| ప్రణయేన వాపి | ప్రీతిచేగాని | అసత్కృతోసియత్ | అవమతింప బడియున్నావనునది యేదిగలదో |
| హే కృష్ణ హే యాదవ | రే కృష్ణ! రే యాదవ! | | |
| హే సఖేఇతి | రే స్నేహితుడా! అని | తత్ | దానినంతను |
| ప్రసభం | అలక్ష్యముగ | హే అచ్యుత! | ఓ అచ్యుతా! |
| యత్ ఉక్తం | ఏదిచెప్పబడినదో | అప్రమేయం | కొలతబెట్ట వీలులేని |
| విహారశయ్యాసన భోజనేషు చ | ఆటలాడునప్పుడును పరుండునప్పుడును ఆసనముమీద నున్నప్పుడును భుజించునప్పుడును | త్వాం | నిన్ను |
| | | అహం | నేను |
| | | క్షామయే | మన్నించునటుల వేడుకొనుచున్నాను. |

తా॥ నీయొక్క ఈ విశ్వరూపమునున్ను మహిమనున్ను ఎరుంగని మూఢుడనైన నాచే అజ్ఞానముచేగాని స్నేహముచేగాని మిత్రుడని తలంచి ఒరే కృష్ణుడా! ఒరేయాదవా! అరే స్నేహితుడా! అని అలక్ష్యముగా ఏమాటచెప్పబడినదో (దానిని), అదియుగాక ఆటలాడునప్పుడుగాని పరుండునప్పుడుగాని సింహాసనమున కూర్చొని నప్పుడుగాని భుజించునప్పుడుగాని ప్రత్యేకముగ ఇతరులు చూడనప్పుడుగాని, లేక ప్రత్యక్షముగ పలువురియెదుటగాని పరిహాసమునకై అవిధముగ్గ అవమతింపబడియున్నావనునది ఏదిగలదో, వాటి నన్నిటిని, ఎవ్వరిచేతను కొలతబెట్ట వీలులేని నిన్ను, నేను క్షమించునట్లు ప్రార్థించుచున్నాను.

(1) ప్రసభం = వినయము లేక (శంకరులు, రామానుజులు)

(2) ప్రణయేన = చాలకాలపు పరిచయముచేత (రామానుజులు)

(3) ఏకః = కనపడకగాని (శంకరులు, రామానుజులు.) సర్వోత్తముడుగనున్నను. (రాఘవేంద్రులు)

(4) సమక్షం - ప్రత్యక్షముగగాని (శంకరులు) ఎదుటగాని (రామానుజులు) తత్ = ఆ అపరాధమును, సమక్షం = నీ యెదుటనే, క్షామయే = క్షమించునట్లు అడుగుకొనెదను. (రాఘవేంద్రులు)

(శంకరభాష్యము) సఖేతి = సమమైన వయస్సుగలవాడవని, మత్వా = విపరీతబుద్ధిచే తలంచి, ప్రసభం - అభిభూయ = అలక్ష్యముజేసి, ప్రసహ్య = దుడుకుగా ఏదిజెప్పబడినదో, అజానతా = ఎరుంగని, లేక జ్ఞానములేని మూఢుడనైన నాచే. దేనినెరుంగని? అనునది చెప్పబడుచున్నది. ఈశ్వరుడైన నీయొక్క గొప్పతనమునున్ను ఇట్టి విశ్వరూపమునున్ను ఎరుంగని "తవ ఇదం మహిమానం అజానతా" అని వైయధికరణ్యముగ, అనగా ఒకేవస్తువును గుర్తించనిదిగ ఉంచుకొనుడు. లేక 'తవేమం' అనుపాఠమైనచో అప్పుడు సామానాధికరణ్యమే అనగా ఒకేవస్తువును గుర్తించి నిలబడు స్వభావమే. దీనిని వివరించిచెప్పుటకై "తవేదం" అనుపాఠము నుంచుకొనినచో ఇదం అనునది నపుంసక లింగము మహిమానం అనునది పుంలింగము, కావున మునుపటిపదము వెనుకటిపదమునకు విశేషణముగ నుండజాలదు. కావుననే ఇదం అనుపదమునకు విశ్వరూపమును అనియు మహిమానం అనుదానికి లోకైశ్వర్యము మొదలగు గొప్పతనమును అనియు అర్థమును గ్రహించవలెను. "తవేమం" అనుపాఠమున ఇమం అనుపదము మహిమానం అనుదానికి విశేషణమగును. ఈ విధముగ మొదటి పాఠమున ఇదం మహిమానం - అనుపదములు వెవ్వేరు అర్థములను గుర్తించునట్లును మిగతపాఠములలోని ఇమం మహిమానం - అనుపదములు ఒకదానినొకటి విశేషించి ఒకేవస్తువును గుర్తించి నిలబడునదిగను గ్రహింపవలెను. ప్రమాదాత్=వేరువిషయములలో చిత్తము చెదరియుండుటవలన, ప్రణయేన వాపి=ప్రీతిచేగాని, ప్రీతియనగా స్నేహము వలన కలుగునమ్మకము, దానివలనను దేనిని చెప్పియున్నానో దానినిన్ని మన్నింపుము.

అపహాసార్థం = పరిహాసమునకై, అసత్కృతః = నీవు అవమతింపబడి యున్నావు. ఎచ్చట? ఆటలాడుట మొదలగువాటిలో, తత్, అనుపదము క్రియను విశేషించు అర్థముమీద నిలబడునది, తత్క్షామయే = ఆ అపరాధసమూహమునంతయు క్షమింప వేడుకొనుచున్నాను. అప్రమేయం = కొలతబెట్ట వీలులేని, అనగా ప్రమాణములను అతిక్రమించి నిలబడు నిన్ను.

శ్లో॥ పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావ ॥ 43

పద॥ పితా - అసి - లోకస్య - చరాచరస్య - త్వం - అస్య - పూజ్యః - చ-గురుః - గరీయాన్ (1) ।
న - త్వత్సమః - అస్తి - అభ్యధికః - కుతః - అన్యః - లోకత్రయే - అపి - అప్రతిమప్రభావ ॥

| | | | |
|---|---|---|---|
| త్వం | నీవు | త్వత్సమః | నీకు సమానమైనవాడు |
| చరాచరస్య | జంగమస్థావరములైన | నాస్తి | లేడు |
| అస్యలోకస్య | ఈ లోకమునకు | హే అప్రతిమప్రభావ! | ఓ సదృశములేని మహిమగల వాడా ! |
| పితా | తండ్రిగను | | |
| పూజ్యశ్చ | పూజింపదగినవాడవుగను | లోకత్రయేపి | మూడులోకములలోను |
| గరీయాన్ | మిక్కిలి గొప్ప | అభ్యధికః | నీకంటె మేలైనవాడు |
| గురుః అసి | గురువుగ నున్నావు | అన్యః కుతః | వేరొకడేడి ? |

తా॥ నీవు స్థావరజంగమములైన ఈ ప్రపంచమునకు తండ్రిగను పూజింపదగిన వాడవుగను శ్రేష్ఠుడైన గొప్పగురువుగనునున్నావు. నీకు సమానమైన వాడులేడు. ఓ సదృశములేని మాహాత్మ్యము గలవాడా! మూడు లోకములలోను నీకంటెమేలైనవాడు వేరొక్కడేడి?

(1) గరీయాన్ శ్రేష్ఠమైన పూజ్యుడున్ను (రామానుజులు)

(శంకరులు) ఏలనగా నీవు (లోకస్య =) ప్రాణివర్గమునకు తండ్రిగనున్నావు. నీవీలోకమునకు తండ్రివిమాత్రముగావు. ఎల్లరిచేతను పూజింపదగినవాడవుకూడ, మిక్కిలిగొప్ప గురువు కావున. ఏకారణమువలన మిక్కిలి గొప్పగురువు అనుదానిని చెప్పుచున్నాడు. నీతోసమానమైన వాడు లేడు. ఇరువురు ఈశ్వరులుండ జాలరు. ఒక ఈశ్వరునికంటె అధికమైన ఈశ్వరుడుండినచో లోకవ్యవహారము బాగుగ జరుగనేరదు. మొదట నీకు సమానముగనే వేరొకడుండ జాలడనిన అప్పుడు నీకంటె గొప్పవాడు మఱియొకడు మూడులోకములలోనేడి? ఎట్లుండగలడు? లేడనునది తాత్పర్యము.

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశ మీడ్యం।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥ 44

పద॥ తస్మాత్ - ప్రణమ్య - ప్రణిధాయ - కాయం
ప్రసాదయే - త్వాం - అహం - ఈశం - ఈడ్యం
పితా - ఇవ - పుత్రస్య - సఖా - ఇవ - సఖ్యుః
ప్రియః - ప్రియాయాః - అర్హసి - దేవ - సోఢుం

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | అంచువలన | ప్రణిధాయ | క్రిందపడవైచి |
| అహం | నేను | ప్రణమ్య | నమస్కరించి |
| ఈశం | ఈశ్వరుడున్ను | ప్రసాదయే | మన్నించుమనట్లు ప్రార్థించు చున్నాను |
| ఈడ్యం | స్తుతింపదగినవాడునైన | | |
| త్వాం | నిన్ను | పుత్రస్య | పుత్రునికి |
| కాయం | శరీరమును | పితేవ | తండ్రివలెను |

| | | | |
|---|---|---|---|
| సఖ్యుః | మిత్రునికి | ప్రియః (ఇవ) | ప్రియునివలెను |
| సఖేవ | స్నేహితునివలెను | హే దేవసోఢుం | ఓ దేవా! ఓర్చుకొనుటకు |
| ప్రియాయాః | ప్రీతిగలస్త్రీకి | అర్హసి | అర్హుడవుగనున్నావు |

తా॥ ప్రియాయాః - ప్రియః (ఇవ) ప్రీతిగలస్త్రీకి ప్రియునివలెను. హేదేవ సోఢుం అర్హసి = ఓదేవా! ఓర్చుకొనుటకు అర్హుడుగనున్నావు. (నీతో సమానమైన వారునుమేలైనవారును ఎవ్వరులేరు) కావున నేను ఈశ్వరుడుగను అనగా సకలము నేలువాడుగను స్తుతింపదగినవాడుగనునున్న నిన్ను, నా శరీరమును భూమిమీదపడవైచి నమస్కరించి మన్నించునట్లు ప్రార్థించుచున్నాను. అపరాధములను క్షమించు విషయమున పుత్రునికి తండ్రివలెను మిత్రునికి స్నేహితునివలెను ఇష్టనాయికకు నాయకునివలెనున్ను నాయొక్క అపరాధమును ఓస్వామీ! క్షమించుటకు నీవు యోగ్యుడవుగనున్నావు. అనగా క్షమించవలెను.

(శంకరులు) పుత్రస్య అపరాధం పితాయథాక్షమతే సర్వం = పుత్రుని, అపరాధములన్నిటిని తండ్రి ఎట్లు ఓర్చుకొనుచున్నాడో లేక మన్నించుచున్నాడో స్నేహితుని తప్పును స్నేహితుడున్ను లేక ప్రీతిగలనాయికయొక్క అపరాధమును నాయకుడు ఎట్లు ఓర్చుకొనుచున్నాడో ఆవిధముగనే నీవున్ను నాయొక్క అపరాధములన్నిటిని మన్నించవలెను.

(స్వకీయము) 'ప్రసాదయే' అను పదము శ్లోకమునందుండుటచేతనే 'అపరాధం' అను పదము లభించుచున్నదని తలంపబడవలెను. వ్యాఖ్యాతలున్ను అట్టితాత్పర్యమునుగొని అపరాధమను పదమును అవశ్యకమైనచోట చేర్చియున్నారు. ''ప్రియః ప్రియాయార్హసి'' ఈ వాక్యమునకు రామానుజులు ప్రియాయ = ప్రియుడైన నాకొఱకు, ప్రియః = ప్రియుడైన నీవు, అర్హసి = తప్పులన్నిటిని ఓర్చుకొన యోగ్యుడుగనున్నావు. అని అర్థముచేసియున్నారు, ఐతే ''ప్రియాయార్హసి'' అను వాక్యమును ప్రియాయాః అని విభజించుటయందనగా మునుపటి ఇతరపదములవలె షష్ఠీవిభక్త్యర్థముగనున్నది. ప్రియాయ అనినచో చతుర్థీవిభక్త్యర్థమును ఇచ్చును. ప్రియాయాః అనివిభజించవలెనినచో శ్లోకమున 'ప్రియాయా అర్హసి' అనియుండవలెను. ఐతే ఋషివాక్యమైనందున ప్రియాయార్హసి అనియు ప్రయోగింపబడదగునని ఆనందగిరి టీకలో చెప్పబడియున్నది. ఇట్టి ప్రయోగము పురాణాదులలో పలుచోట్లగలదు.

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మిదృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే।
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస॥ 45

పద॥ అదృష్టపూర్వం - హృషితః - అస్మి - దృష్ట్వా - భయేన - చ - ప్రవ్యథితం - మనః - మే। తత్ - ఏవ - మే - దర్శయ - దేవ - రూపం - ప్రసీద - దేవేశ - జగన్నివాస॥

| | | | |
|---|---|---|---|
| అదృష్టపూర్వం | మునుపుచూడని విశ్వరూపమును | తద్రూపం ఏవ | ఆ (పూర్వ) రూపమునే |
| దృష్ట్వా | చూచి | హే దేవ! | ఓ దేవా! |
| హృషితః | సంతోషించినవాడనుగ | మేదర్శయ | నాకు చూపుము |
| అస్మి | ఉన్నాను | హే జగన్నిః | ఓ జగత్తున కాధారమైనవాడా! |
| మేమనః | నాయొక్కమనస్సు | హే దేవేశ! | ఓ దేవతలకీశ్వరుడా |
| భయేన | భయముచేత | ప్రసీద | ప్రసన్నుడవగుదువుగాక |
| ప్రవ్యథితం చ | వణకుచునున్నది | | |

తా॥ ఇదివఱకు చూడకయుండిన ఈ విశ్వరూపమునుజూచి సంతోషించినవాడనుగనున్నాను. భయముచే నాయొక్కమనస్సు వణకుచునున్నది. ఓ స్వామీ! ఆ పూర్వరూపమునే నాకుచూపుము. ఓ దేవతలకీశ్వరుడా! ఓజగత్తున కాధారమైనవాడా! ప్రసన్నుడవగుదువుగాక! (ప్రసన్నుడవు కావలెనని ప్రార్థించుచున్నాను.)

(శంకరులు) నీయొక్క ఈవిశ్వరూపము నాచేగాని మఱియెవ్వరిచేతగాని మునుపు ఒకప్పుడును చూడబడలేదు. నేను ఆ విశ్వరూపమునుజూచి సంతోషించియున్నాను. ఐనను నా మనస్సు భయముచే వణకియున్నది. కావున నామిత్రుడుగనున్న రూపమెట్టిదో దానినే నాకు చూపుము.



శ్లో॥ కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ।
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో! భవవిశ్వమూర్తే॥ 46

పద॥ కిరీటినం - గదినం - చక్రహస్తం - ఇచ్ఛామి - త్వాం - ద్రష్టుం - అహం - తథా - ఏవ।
తేన - ఏవ - రూపేణ - చతుర్భుజేన - సహస్రబాహో - భవ - విశ్వమూర్తే॥

| | | | |
|---|---|---|---|
| కిరీటినం గదినం | కిరీటమును గదాయుధమును గలవాడవును | ద్రష్టుం | చూచుటకు |
| | | అహం ఇచ్ఛామి | నేను కోరుచున్నాను. |
| చక్రహస్తం | చక్రమును చేతిలోగలవాడవునునైన | సహస్రబాహో | వెయ్యిచేతులుగలవాడవై |
| | | విశ్వమూర్తే | విశ్వరూపముగలవాడా! |
| త్వాం | నిన్ను | చతుర్భుజేన తేన ఏవ | నాలుగుచేతులుగల అదే |
| తథైవ | ఆ విధముగనే | రూపేణ భవ | రూపముతో ఉండెదవుగాక |

తా॥ మునుపువలె నిన్ను కిరీటము గలవానిగను, గదాయుధముగలవానిగను, చేతిలో చక్రాయుధముగలవానిగను, చూచుటకు నేనిచ్ఛయించుచున్నాను. ఓ అనేక చేతులుగలవాడా! ఓ విశ్వరూపము గలవాడా! నాలుగు చేతులతో గూడిన ఆ (పూర్వ) రూపము గలవాడవుగనే అగునట్లు వేడుకొనుచున్నాను.

(శంకరులు) ఇచ్ఛామి = ప్రార్థించుచున్నాను. తథైవ = మునుపువలె, ఈవిధముగనుండుట వలన, అనగా నేను ప్రార్థించుటవలన, వసుదేవ పుత్రరూపముతోనే ఉందువుగాక! విశ్వరూపమును విడిచిపెట్టి ఆమునుపటి ఆకారముతోనే ఉండునట్లు వేడుకొనుచున్నాను. అనునది తాత్పర్యము. వెయ్యిచేతులు గలవాడా అనుట ఇప్పుడున్న విశ్వరూపము ననుసరించి యనుడు.

(రామానుజులు) ఈ శ్లోకమువలన విశ్వరూపము ఎత్తుటకు మునుపు కృష్ణపరమాత్మ నాల్గుచేతులనున్న శంఖము, చక్రము, మొదలగువాటిని గలవాడుగ నుండెనని కానవచ్చుచున్నది. వసుదేవునిపుత్రునిగ అవతరించినప్పుడు ఇట్టిరూపముతో నుండినట్లును, దేవకి వసుదేవుల ప్రార్థన మీదకంసుని సంహరించువఱకు రెండు చేతులతోనుండినట్లును భాగవతమున చెప్పబడియున్నది. కంసవధయైన పిదప రుక్మిణి కల్యాణకాలమున శిశుపాలుడు ధ్యానించినరూపము చతుర్భుజము, శంఖచక్రము మొదలగు వాటితోగూడినదనియు భాగవతమున జెప్పబడియున్నది. ఇందులో అర్జునుడున్ను ఆవిధముగనే చెప్పియున్నాడు. (ఈయర్థమును దీని 50-వ శ్లోకమునకు వీరు జేసియున్న భాష్యమున చూడుడు.

(స్వకీయము) మునుపు 17-వ శ్లోకమున కిరీటము, గద, చక్రము వీటినిగలిగిన రూపము చెప్పబడియున్నది. ఐతే అది శ్లోకమున కోరబడు పాతరూపముకాదు. అది అనేకకిరీటములు మొదలగు వాటినిగల కొలతబెట్టజాలని రూపము.

శ్రీభగవానువాచ:—

శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వ మనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ 47

పద॥ మయా - ప్రసన్నేన - తవ - అర్జున - ఇదం
రూపం - పరం - దర్శితం - ఆత్మయోగాత్ (1)
తేజోమయం - విశ్వం (2) - అనన్తం (3) - ఆద్యం
యత్ - మే - త్వదన్యేన (4) - న - దృష్టపూర్వం ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున ! | ఓ అర్జునా ! | అనన్తం | ముగింపులేనిదిగను |
| ప్రసన్నేనమయా | అనుగ్రహింప గోరిననాచేత | ఆద్యం | ఆదిలోనున్నదియునైన |
| ఇదం పరం రూపం | ఈ మేలైనరూపము | మే | నాయొక్క |
| ఆత్మయోగాత్ | నా యోగశక్తిచే | యత్ (తత్) | ఏ (రూపముగలదో) అది |
| తవ దర్శితం | నీకు చూపబడినది | త్వదన్యేన | నీవుదప్ప వేరొకనిచేతను |
| తేజోమయం | కాంతిమయమును | న దృష్టపూర్వం | మునుపు చూడబడలేదు. |
| విశ్వం | సమస్తమును | | |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ చెప్పినది:— ఓ అర్జునా! ప్రసన్నముగనున్న, అనగానిన్ను అనుగ్రహించి రక్షించవలెనను తలంపుగలవాడనైన నాచే ఈమేలైన విశ్వరూపము నాయోగైశ్వర్య సామర్థ్యముచే నీకు చూపబడినది. తేజోమయముగను సమస్తముగను అంతములేనిదిగను ఆదియైనదిగనునున్న నాయొక్క ఈ విశ్వరూపము నీవుదప్ప మఱెవనిచేతను ఇంతవఱకు చూడబడ లేదు.

(1) ఆత్మయోగాత్ - నాయొక్క ఈశ్వరసంబంధమైన సామర్థ్యముచేత (శంకరులు) నాయొక్క సత్యసంకల్పముచేత (రామానుజులు) స్వరూపసామర్థ్యముచేత (రాఘవేంద్రులు)

(2) విశ్వం - సకలమునకును ఆత్మయైనట్టియు (రామానుజులు) పూర్ణమైనట్టియు (రాఘవేంద్రులు).
(3) అనంతం - ఆదిమధ్యాంతములు లేనట్టియు (రామానుజులు). సకల దేశకాలములలో నున్నట్టియు (రాఘవేంద్రులు .
(4) త్వదన్యేన-నీకంటె తక్కువైన వార్లచే (రాఘవేంద్రులు)

(శంకరులు) శ్రీ భగవంతుడు అర్జునుడు భయపడుటనుజూచి విశ్వరూపమును విడిచి పెట్టి ప్రియములైన మాటలచే వానిని ఓదార్చుచు ఇందులో గనపరచినట్లు ప్రసాదించుచున్నాడు. ప్రసాదమనగా అర్జునుని యెడ అనుగ్రహబుద్ధి. అనగా అతనిని తరింపజేయవలెనను తాత్పర్యము. దానినిగలవాడు ప్రసన్నతగలవాడు.

(స్వకీయము) ఈ శ్లోకమునకు మధుసూదన సరస్వతి శంకరానందులు మొదలగువారలు క్రిందకనబరచినట్లు అన్వయము తాత్పర్యము జేసియున్నారు. తేజోమయం విశ్వం అనంతం - ఆద్యం - త్వదన్యేన - న - దృష్టపూర్వం - మే - ఇదం - పరం - రూపం - యత్ - తత్ ప్రసన్నేన మయా - హేఅర్జున-తవ ఆత్మయోగాత్ దర్శితం = ప్రకాశస్వరూపమైనట్టిదియు సకల ప్రపంచమును వ్యాపించినట్టిదియు నాశములేనిదియు ఆదిలోనున్నదియు నీచేదప్ప మరి ఎవని చేతను మునుపుచూడబడనిదియునైన నా యొక్క ఈ ఉత్తమ రూపమేదిగలదో ఆ రూపము అనుగ్రహము జేయగోరిన నాచే ఓ అర్జునా! నీకు నా యొక్క యోగసామర్థ్యముచే చూపింపబడినది.

శ్లో॥ న వేదయజ్ఞాధ్యయనైర్నదానైర్నచ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవంరూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ 48

పద॥ న - వేదయజ్ఞాధ్యయనైః - న - దానైః - న - చ - క్రియాభిః - న - తపోభిః - ఉగ్రైః ।
ఏవంరూపః - శక్యః - అహం - నృలోకే - ద్రష్టుం - త్వదన్యేన - కురుప్రవీర ॥

| | | | |
|---|---|---|---|
| హే కురుప్రవీర | ఓ కౌరవులలో శ్రేష్ఠుడవైన వీరుడా! | వేదయజ్ఞాధ్యయనైః | వేదములు, యజ్ఞములు వీటిని చదువుట వలన |
| ఏవం రూపః | ఇట్టివిశ్వరూపమును గలవాడనైన | ద్రష్టుం | చూచుటకు |
| | | నశక్యః | సాధ్యమైనవాడనుకాను |
| అహం | నేను | దానైఃన | దానములచేతనుకాను |
| నృలోకే | మనుష్యలోకమున | క్రియాభిః న | కర్మలచేతనుకాను |
| త్వదన్యేన | నీవుదప్ప మరియెవనిచేతను | ఉగ్రైః | ఉగ్రములైన |
| | | తపోభిశ్చ న | తపస్సులచేతనుకాను |

తా॥ ఓ కురుశ్రేష్ఠుడా! ఇట్టి విశ్వరూపము గలవాడనైన నేను మనుష్య లోకమున నిన్నుదప్ప మఱి ఇతరులచే వేదముల నధ్యయనము జేయుటవలన గాని, యజ్ఞములద్వారా బాగుగ నెరుంగుటవలనగాని, దానములచేగాని, కర్మలచేగాని, క్రూరములైన తపస్సులచేగాని, చూచుటకు సాధ్యుడైన వాడను కాను.

(శంకరులు) "నా యొక్క విశ్వరూపదర్శనముచేత నీవు కృతార్థుడవైతివి'' అని అట్టి దర్శనమును ఇందులో పొగడు చున్నాడు. వేదాధ్యయనమనగా నాలుగు వేదములను నియమముతో చదువుట. వేదములను చదువుటచేత అనుటవలననే యజ్ఞాధ్యయనమున్ను ఇందులో నిమిడియుండగా

యజ్ఞాధ్యయనమును వేరుగానెత్తి చెప్పుటలో తాత్పర్యమేమనగా యజ్ఞములను, ఇతర మీమాంసాది శాస్త్రములను ప్రమాణముగగైకొని బాగుగ నెరుంగు జ్ఞానమును తెలియబరచుటకయ్యే. ఇదియే యజ్ఞాధ్యయన మనబడును. దానైః = తులాదానము మొదలగు వాటిచే. తులాదానమనగా ఒకడు తనదేహపుటెత్తుతో సమానమైన బంగారమును బ్రాహ్మణునికి దానమిచ్చుట. క్రియాభిః = శ్రుతి మొదలగువాటిలో విహితములైయున్న అగ్ని హోత్రము మొదలగు కర్మలచే, తపోభిః = చాంద్రాయణము మొదలగు తపస్సులచే. ఇప్పుడు జూపిన విశ్వరూపమును జూచుట అశక్యము.

(ఆనందగిరి) వేదాధ్యయనమనగా అర్థజ్ఞానము లేకయే దానిని కంఠపాఠముగ జెప్పుట అనికొందరి తాత్పర్యము. అవిధముగ పెద్దలు గ్రహించియున్నారు. కావున అట్టిజ్ఞానము అవశ్యకమని విధించుటకై ఈవిధముగ యజ్ఞాధ్యయనైః అని జెప్పవలసినదాయెను.

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదం।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య॥ 49

పద॥ మా - తే - వ్యథా - మా - చ - విమూఢభావః - దృష్ట్వా
రూపం - ఘోరం (1) - ఈదృక్ - మమ - ఇదం।
వ్యపేతభీః - ప్రీతమనాః - పునః - త్వం
తత్ - ఏవ - మే - రూపం (2) - ఇదం - ప్రపశ్య॥

| | | | |
|---|---|---|---|
| మమ-ఈదృక్ ఘోరం | నాయొక్క ఇంతటిఘోరమైన | వ్యపేతభీః | భయమును విడచినవాడవుగను |
| ఇదంరూపం | ఈ రూపమును | ప్రీతమనాః | మనస్సు సంతోషించినవాడవుగను |
| దృష్ట్వా | జూచి | | |
| తే | నీకు | పునః | మరలను |
| వ్యథామా | భయముకలుగవలదు | మే ఇదం | నాయొక్క ఈ |
| విమూఢభావః చ | మైకముచెందిన స్వభావమున్ను | తదేవరూపం | ఆదేరూపమును |
| మా | వలదు | ప్రపశ్య | బాగుగచూడుము. |
| త్వం | నీవు | | |

తా॥ ఇంతటి భయంకరమైన నాయొక్క ఈరూపమునుజూచి నీకుభయము కలుగకుండు గాక. అజ్ఞానముగూడ వలదు. నీవు భయమును విడచినవాడవుగను మనస్సంతోషమును చెందినవాడవుగను నాయొక్క, ఇప్పుడు నేనుధరించియున్న, పూర్వరూపమునే మరల చూడుము.

(1) ఘోరం = సంహారముజేయు రూపమైన

(2) రూపం = విశ్వరూపమును విడిచిపెట్టి మరలనెత్తియున్న రూపము. అనగా నాలుగు చేతులు గలదై శంఖము చక్రము గద వీటినిధరించినదై అర్జునుడు కోరినరూపము (శంకరులు).

సంజయఉవాచ:—

శ్లో॥ ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా ॥ 50

పద॥ ఇతి - అర్జునం - వాసుదేవః - తథా - ఉక్త్వా
స్వకం - (1) రూపం - దర్శయామాస - భూయః -
ఆశ్వాసయామాస - చ - భీతం - ఏనం -
భూత్వా - పునః - సౌమ్యవపుః - మహాత్మా - (2) ॥

| | | | |
|---|---|---|---|
| సంజయఉవాచ | సంజయుడు చెప్పినది | మహాత్మా | మహాత్ముడు |
| వాసుదేవః | వాసుదేవుడైన భగవంతుడు | పునః | మరలను |
| ఇతి | ఈ విధముగ | సౌమ్యవపుః | శాంతరూపముతో గూడినవాడై |
| అర్జునం ఉక్త్వా | అర్జుననిగూర్చి చెప్పి | భూత్వా | అయి |
| తథా | ఆ విధమైన | భీతం | భయపడియున్న |
| స్వకంరూపం | తన (పూర్వ) రూపమును | ఏనం | ఇతనిని (అర్జునుని) |
| భూయః | మరలను | ఆశ్వాసయామాసచ | సమాధానపరచెనుగూడ |
| దర్శయామాస | చూపించెను | | |

తా॥ సంజయుడు చెప్పినది:— వసుదేవుని పుత్రుడైన కృష్ణపరమాత్మ అర్జుననిగూర్చి ఈ విధముగ జెప్పి ఆ విధమైన తనపూర్వరూపమును అనగా వసుదేవపుత్రుడై చతుర్భుజములుగలవాడుగనున్న రూపమును మరలను జూపించెను. అపరిమితమైన దయగల మహాత్ముడైన శ్రీకృష్ణపరమాత్మ ప్రసిద్ధమైన రూపముతో గూడినవాడై భయపడి వణకినిలబడియున్న ఈ యర్జునుని మరలను సమాధానపరచి ఓదార్చెను.

(1) స్వకంరూపం = వసుదేవుని గృహమునబుట్టిన తనఆకారమును (శంకరులు).

(2) మహాత్మా = సత్యసంకల్పుడైన ఆ కృష్ణపరమాత్మ (రామానుజులు)

అర్జునఉవాచ:—

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥ 51

పద॥ దృష్ట్వా - ఇదం - మానుషం - రూపం (1) - తవ - సౌమ్యం - జనార్దన -
ఇదానీం - అస్మి - సంవృత్తః - సచేతాః - ప్రకృతిం - గతః ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | సౌమ్యం ఇదం | ప్రసన్నమైన ఇట్టి |
| హే జనార్దన! | ఓ జనార్దనా ! | మానుషం రూపం | మనుష్యరూపమును |
| తవ | నీయొక్క | దృష్ట్వా | చూచి |

| | | | |
|---|---|---|---|
| ఇదానీం | ఇప్పుడు | ప్రకృతిం గతః | స్వభావమును పొందినవాడనుగను |
| సచేతాః | మనస్సుశుద్ధమైనవాడనుగను | సంవృత్తః అస్మి | అయియున్నాను. |

తా॥ అర్జునుడు కృష్ణపరమాత్మనుగూర్చి చెప్పినది. ఓ జనార్దనా నీ యొక్క ఇట్టి సౌమ్యమైన, ప్రసన్నమైన, మనుష్యరూపమునుజూచి ఇప్పుడు నేను మనస్సు శుభ్రమైనవాడనుగను, నా స్వభావమును పొందినవాడనుగను అయియున్నాను.

(1) మానుషం = నాస్నేహితుడవుగనున్న ప్రసన్నమైన రూపమును (శంకరులు) మనుష్యుని రూపమువలె కనబడుచున్నందున మనుష్యరూపమని చెప్పబడినది. (రాఘవేంద్రులు)

***********

శ్రీభగవానువాచః—

శ్లో॥ సుదుర్దర్శ మిదం రూపందృష్టవానసి యన్మమ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శ నకాంక్షిణః॥ 52

పద॥ సుదుర్దర్శం (1) - ఇదం - రూపం - దృష్టవాన్ - అసి - యత్ - మమ।
దేవాః - అపి - అస్య - రూపస్య - నిత్యం - దర్శనకాంక్షిణః॥

| | | | |
|---|---|---|---|
| శ్రీ భగవానువాచ | శ్రీభగవంతుడు చెప్పినది | సుదుర్దర్శం | చూచుటకు మిక్కిలి అరుదు |
| మమ | నాయొక్క | దేవా అపి | దేవతలుగూడ |
| యత్ రూపం | ఏ రూపమును | అస్యరూపస్య | ఈ రూపముయొక్క |
| దృష్టవాన్ అసి | చూచియున్నావో | నిత్యం | ఎల్లప్పుడు |
| (తత్) ఇదం (రూపం) | అట్టి ఈ విశ్వరూపము | దర్శనకాంక్షిణః | దర్శనమును కోరుచున్నారు. |

తా॥ శ్రీభగవంతుడైన కృష్ణపరమాత్మ అర్జుననిగూర్చి చెప్పినది. నా యొక్క ఏ విశ్వరూపమును జూచితివో అట్టి ఈ విశ్వరూపము ఎల్లప్పుడు జూడ వీలులేనిది. దేవతలుగూడ ఎల్లప్పుడును ఈ రూపముయొక్క దర్శనముకొఱకై ఇచ్ఛించుచున్నారు. (ఐతే చూచుటలేదు.)

(1) సుదుర్దర్శం = మిక్కిలి ప్రయాసచే చూడతగినది (శంకరులు). సుఖముచేతను దుఃఖముచేతను చూడతగినది (రాఘవేంద్రులు).

(శంకరులు) దేవతలు ఈ రూపమును జూడగోరువారైనను నీవు చూచియున్నట్లు చూడనే లేదు. చూడబోవుటయులేదు అని తాత్పర్యము.

~~~~~~~~~~~~~~

శ్లో॥ నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధోద్రష్టుం దృష్టవానసి మాం యథా॥* 53

పద॥ న - అహం - వేదైః - న - తపసా - న - దానేన - న - చ - ఇజ్యయా।
శక్యః - ఏవంవిధః - ద్రష్టుం - దృష్టవాన్ - అసి - మాం - యథా॥
~~~~~~~~~~~~~~

| | | | |
|---|---|---|---|
| త్వం | నీవు | వేదైః ద్రష్టుం | వేదములచే జూచుటకు |
| మాం | నన్ను | నశక్యః | సాధ్యమైనవాడనుకాను |
| యథా | ఏ విధముగ | తపసాచ న | తపస్సుచేతనుకాను |
| దృష్టవాన్ అసి | చూచియున్నావో | దానేన న | దానముచేతనుకాను |
| ఏవం విధః | (అట్లు) ఈ విధమైన | ఇజ్యయా న | యజ్ఞముచేతనుగాను |
| అహం | నేను | | |

తా॥ నీవు నన్నెట్లు చూచియున్నావో ఆ విధముగ ఒకనిచేతను అనగా మునుపు చెప్పిన ఈ విధముగనున్న నేను వేదములచేగాని దానముచేగాని యజ్ఞముచేగాని జూడసాధ్యమైన వాడనుకాను. (అనగా ఈ విశ్వరూపము తపస్సు మొదలగు వాటిని జేయుటవలన జూడలభింపదని తాత్పర్యము.)

* ఈశ్లోకమును కూర్మపురాణము ఉత్తరభాగము 4-వ అధ్యాయమున జూడుడు.

(రామానుజులు) ఈ శ్లోకముతో పైశ్లోకమును జేర్చి అన్వయము. వేదైః అనుదానిచే వేదాధ్యయనము ప్రవచనము అధ్యాపనము శ్రవణము జపము మొదలగు వాటిచేతను హోమముల చేతను అని గ్రహింపవలెను. భక్తిలేక వేదాధ్యయనము తపస్సు మొదలగు వాటిచే సాధ్యముకాదని తాత్పర్యము. "నాయమాత్మా ప్రవచనేనలభ్యో-వృణుతేతనూంస్వాం" మొదలగు శృతివాక్యములను జూడుడు.

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ 54

పద॥ భక్త్యా - తు - అనన్యయా (1) - శక్యః - అహం - ఏవంవిధః - అర్జున ।
జ్ఞాతుం - ద్రష్టుం - చ - తత్త్వేన - ప్రవేష్టుం (2) - చ - పరంతప ॥

| | | | |
|---|---|---|---|
| పరంతప ! | ఓ శత్రువులను తపింపజేయు | తత్త్వేన | ఉన్నట్లు |
| అర్జున | అర్జునా ! | జ్ఞాతుం | ఎరుంగుటకును |
| అనన్యయా | అన్యముకాని | ద్రష్టుం చ | జూచుటకును |
| భక్త్యాతు | భక్తిచేతనే | ప్రవేష్టుం చ | పొందుటకును |
| ఏవం విధః | ఈ విధమైన | | శక్యుడను |
| అహం | విశ్వరూపినైననేను | | |

తా॥ ఓ శత్రువులను తపింపజేయువాడవైన అర్జునా! ఇట్టివిశ్వరూపినైన నేను, ఉంచబడిన అన్యముకాని భక్తిచేతనే యథార్థముగ అనగా ఉన్నట్లు ఎరుంగుటకును జూచుటకును పొందుటకును వీలైనవాడను.

(1) అనన్యయా=సకలేంద్రియములకును వాసుదేవునితప్ప వేరొకటి విషయముకానిదైయున్న అభేదమైనభక్తి (శంకరులు) అన్యాసాధారణ్యా = అన్యులకు సాధారణముకానిదైన (రాఘవేంద్రులు) ఇందలి 9వ అధ్యాయము 22వ శ్లోకమును జూడుడు.

(2) ప్రవేష్టుం-మోక్షమును పొందుటకును (శంకరులు). సాయుజ్యమొందుటకును (రాఘవేంద్రులు)

(శంకరులు) మఱియేవిధముగ చూడదగినవాడు అనునది ఇందులో చెప్పబడుచున్నది. ఐతే భక్తిచేతనే ఒకడునన్ను జూడగలడు. ఏ విధమైన భక్తిచే? అనుదానిని జెప్పుచున్నాను. అనన్యయా = అపృథగ్భూతయా వేరుకాని. ఏ భక్తియైనది భగవంతునియెడదప్ప వేరుచోట ఒకప్పుడున్నులేదో, అదియే వేరుకాని భక్తియనబడును. సకలేంద్రియములచేతను భగవంతుడైన వాసుదేవునికంటె వేరైన ఒకటియు ఏ భక్తిచే ఎరుంగబడకేదో, అదియే అనన్యమైనభక్తి. అట్టి అనన్యమైన, అనగా వేరొకదానిలోను ప్రవేశించక భగవంతుని యొకనియెడనే దృఢముగ నిలకడ చెందిన భక్తిచే విశ్వరూపాకారముగనున్న నన్ను ఒకడు శాస్త్రములద్వారా ఎరుంగగలడు. అతడు నన్ను శాస్త్రములచే నెరుంగుటకు మాత్రముకాదు. నన్ను ఉన్నట్లు సాక్షాత్తుగ జూచుటకును, ప్రవేష్టుం = నన్నుప్రవేశించుటకును అనగా మోక్షమును పొందుటకును శక్తుడు.

(రామానుజులు) ఈ శ్లోకమందలి "తత్త్వేన" అనుపదము ఎరుంగుచున్న, చూచుచున్న, పొందుచున్న, అనుపదములకన్నిటికిని విశేషణముగ గ్రహింపవలెను.

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగ వర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ ॥ 55

పద॥ మత్కర్మకృత్ - మత్పరమః - మద్భక్తః - సంగవర్జితః ।
నిర్వైరః - సర్వభూతేషు - యః - సః - మాం - ఏతి - పాండవ ॥

| | | | |
|---|---|---|---|
| హే పాండవ ! | ఓ పాండవా ! | సంగవర్జితః | ఆసక్తిలేనివాడై |
| మత్కర్మకృత్ | నాకై కర్మలను జేసెడివాడై | సర్వభూతేషు | సకలప్రాణులయెడను |
| మత్పరమః | నన్నే గొప్పగ గైకొన్నవాడై | నిర్వైరఃయః | ద్వేషములేనివాడై ఎవ్వడుండునో |
| మద్భక్తః | నాయొక్క భక్తుడై | సః మాం ఏతి | అతడు నన్ను పొందుచున్నాడు. |

తా॥ ఓ అర్జునా! నా కొఱకు కర్మలనుచేయువాడును నన్నే పరమ పురుషార్థమని నమ్మియున్నవాడును సకలములైన విషయాభిమానముల విడచినవాడును సకల ప్రాణులయెడ ద్వేషములేనివాడును ఎవ్వడో అతడు నన్ను పొందుచున్నాడు.

(శంకరులు) గీతాశాస్త్రమంతటిలోను సారభూతమై ముక్తినివ్వగల ఈ ఉపదేశము సంసారమునుండి విడువబడ గోరువార్లచే అనుష్ఠింపబడవలెనని ఇప్పుడు ఒకటిగాజేర్చి ఇందులో భగవంతునిచే అనుగ్రహింపబడుచున్నది.

పనివాడు యజమానునికై పనులను జేయుచున్నాడు. మఱి తాను మరణించిన పిదప పొందవలసిన మేలైనగతి యజమానుడేయని యజమానునిపొందుటలేదు. నాభక్తుడైతే నాకొఱకయ్యే కర్మనుజేయువాడై నన్నే మేలైనగతియని పొందుచున్నాడు. ఆ విధముగనే ఇతడు అన్ని విధముల పూర్ణమైన మనస్సుతోను సర్వప్రయత్నముతోను నన్నే భజించుచున్నాడు. కావున నా భక్తుడనుడు. సంగవర్జితః = ఆసక్తిలేనివాడు, అనగా ద్రవ్యము సంతానము స్నేహితులు భార్య బంధువులు భోగములు వీటిమీద ప్రీతియు ఆశయు లేనివాడు, నిర్వైరః = వైరములేనివాడు తనకు పూర్తిగ చెరుపును జేయుచుండెడివానియెడను ద్వేషములేనివాడు. ఎవ్వడిట్టి వాడగునో అతడు నన్నువచ్చి

చేరుచున్నాడు. నేనే అతనికి మేలైనగతి, నాకంటె వేరొకగతియులేదు. ఓ పాండవా! నేను నీకుప దేశించు ఉపదేశమిదియే.

(రామానుజులు) మత్కర్మకృత్ = సకలకర్మలను నాయొక్క ఆరాధనారూపముగ జేయువాడు మత్పరమః = సకలకార్యములకును నన్నే ఉద్దేశించినవాడు.

మద్భక్తః = మిక్కిలి ప్రీతితో నా యొక్క కీర్తనము, స్తుతి, ధ్యానము, అర్చనము, నమస్కారము, వీటి నెల్లప్పుడు జేసినగాని తనప్రాణాధారము లేనివాడు. సంగవర్జితః = నాయెడనే మిక్కిలి ప్రీతిగలవాడై ఇతరవిషయములలో ప్రవృత్తిలేనివాడు, నిర్వైరః = నన్ను ఆధారపడి యుండునది సుఖమనియు, నన్ను విడచియుండునది దుఃఖమనియు, తనకు దుఃఖము సంభ వించినచో అది తన అపరాధమువలన గలిగినదనియు, సకల ప్రాణులు ఈశ్వరాధీనులనియు, ఎల్లప్పుడు అనుసంధించు చుండుటవలన ప్రాణులయెడ ద్వేషమునకు కారణములేదు. కావున ద్వేషములేనివాడు.

(రాఘవేంద్రులు) మత్పరమః = నేను ఉత్తముడనని తలంచియున్నవాడు సంగవర్జితః= ఫలాపేక్షలేనివాడు.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూపసందర్శనయోగోనామ
ఏకాదశోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగవిద్యగ నున్న
శ్రీకృష్ణార్జున సంవాదమున విశ్వరూపసందర్శన యోగమను
పదునొకండవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు

ద్వాదశాధ్యాయ ప్రారంభః

# పండ్రెండవ అధ్యాయము

## (భక్తియోగము)

అర్జున ఉవాచ:-

శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥ 1

పద॥ ఏవం - సతతయుక్తాః - యే - భక్తాః - త్వాం - పర్యుపాసతే।
యే - చ - అపి - అక్షరం - అవ్యక్తం - తేషాం - కే - యోగవిత్తమాః

| | | | |
|---|---|---|---|
| అర్జున ఉవాచ | అర్జునుడు చెప్పినది | అవ్యక్తం అక్షరం | ప్రకటముగలేని నాశములేని బ్రహ్మమును |
| యే భక్తాః ఏవం | ఏ భక్తులు ఈ విధముగ | | |
| సతతయుక్తాః | ఎల్లప్పుడు నీయెడ మనస్సుగల వారలై | (పర్యుపాసతే) | ఉపాసించుచున్నారో |
| | | తేషాం కే | వారిరువురిలో ఎవ్వరు |
| త్వాం పర్యుపాసతే | నిన్ను ఉపాసించుచున్నారో | యోగవిత్తమాః | యోగమును బాగుగ నెరింగిన వారు |
| యే చాపి | మరియెవ్వరు | | |

తా॥ అర్జునుడు చెప్పినది - ఏభక్తులు ఈ విధముగ, అనగా మునుపు చెప్పినట్లు ఎల్లప్పుడు నీయెడ మనస్సుగలవారలై నిన్నుపాసించుచున్నారో, మరియు నెవ్వరు అవ్యక్తమైన, అనగా కనబడని, నాశములేని, బ్రహ్మమును ధ్యానించుచున్నారో ఈ ఇరువురిలో ఎవ్వరుయోగమును బాగుగ నెరింగినవారు?

(శంకరులు) రెండవ అధ్యాయము మొదలు విభూతి అధ్యాయమువరకుగల అధ్యాయములలో పలువిధములైన ఉపాధులన్నియు తొలగినవై నాశములేని బ్రహ్మముగనున్న పరమాత్మను ఉపాసించుట ఉపదేశింపబడినది. సర్వయోగైశ్వర్యము సర్వజ్ఞానశక్తియుగలవాడవై సత్త్వగుణమును ఉపాధిగగొన్నవాడవై ప్రపంచము నేలునట్టివాడవైన నిన్నుగూడ ఉపాసించుట అచ్చటచ్చట ఉపదేశింపబడినది. ఐతే విశ్వరూపాధ్యాయమున సకల జగత్స్వరూపమై అదిగనున్నట్టి నీయొక్క ఈశ్వరస్వరూపము ఉపాసించుటకొఱకయ్యే నీచేనాకు చూపబడినది. అదియుగాక దానిని చూపినపిదప "మత్కర్మకృత్" మొదలగువాటిని జెప్పియున్నావు. కావున నీ రెంటిలో గొప్పదానిని తెలిసికొన వలెనను తాత్పర్యముతో నిన్నడుగుచున్నాను అని అర్జునుడు చెప్పుచున్నాడు.

ఏవం-అనునది మునుపటి అధ్యాయము కడపటి శ్లోకమున "మత్కర్మకృత్" అనిచెప్పబడిన విషయమును గుర్తించుచున్నది. సతతయుక్తాః-భగవంతునికై కర్మచేయుట మొదలగుమునుపు జెప్పినవిషయమున సమాహితులై, అనగా నొక నిలకడజెందినవారలై ఎడతెగక ప్రవర్తించియున్న

అనితాత్పర్యము. ఏభక్తులు తమకు వేరు శరణము లేనివారై మునుపు జూపిన విశ్వరూపమును బడసిన నిన్ను ధ్యానించుచున్నారో వారలు ఒక తరగతికి జేరినవారు. మఱియు ఉపాధులన్నియు తొలగి యున్నందున ఇంద్రియముల కందనిదై మునుపు విశేషించి చెప్పిన అక్షరబ్రహ్మమును, ఎవ్వరు కోరికలన్నియు వదలి కర్మలన్నియు తొలగించి ధ్యానము జేయుచున్నారో వారలు మరియొక తరగతికి జేరినవారలు. ఏది ఇంద్రియముల కందునదో అదివ్యక్తమని చెప్పబడుచున్నది. "వి" అను ఉపసర్గముగల "అంజ్" ధాతువునకు బైటబెట్టబడిన వస్తువని యర్థము. ఈ అక్షరవస్తువనగా దానికి విపరీతమైనది. అవ్యక్తమైనది. అనగా ఇంద్రియముల కందనిది. ఉత్కృష్టముగ జెప్పబడు విశేషణములు బడసిన అట్టి నిర్గుణ బ్రహ్మమును ఎవ్వరు ధ్యానించుచున్నారో ఇకనెవ్వరు సగుణ బ్రహ్మమునుపాసించుచున్నారో, ఈ రెండు పక్షములలో జేరినవారలలో యోగము అను సమాధిని విశేషముగ పొందిన వారలెవ్వరు? అనునది అర్జునుని ప్రశ్న.

(శ్రీధరులు) మత్కర్మకృత్ (అధ్యా-11-శ్లో 55) "కౌంతేయ ప్రతిజానీహి (అధ్యా-9-శ్లో 31) వీటివలన భక్తినిష్ఠతోగూడినవాడు శ్రేష్ఠుడనియు ఆవిధముగనే "తేషాం జ్ఞానీనిత్యయుక్తః" (అధ్యా 7-శ్లో 17) సర్వంజ్ఞానప్లవేనైవ (అధ్యా 4-శ్లో 36) వీటివలన జ్ఞాననిష్ఠుడు శ్రేష్ఠుడనియు చెప్పబడినది. ఈ రెండు విధములైన నిష్ఠగలవారలు శ్రేష్ఠులైనను సగుణోపాసకులు నిర్గుణోపాసకులు వీర్లలో ఎవ్వరు శ్రేష్ఠులనునది అర్జునుని ప్రశ్న. అది ఎట్లనగా సతతయుక్తాః=సత్కర్మలను జేసి ఫలాపేక్షలేక ఈశ్వరార్పణము జేయు ఏయొకభక్తులు, త్వాం = విశ్వరూపిగను సర్వజ్ఞుడుగను సర్వశక్తిగల వాడుగనునున్న సగుణబ్రహ్మమగు నిన్ను, పర్యుపాసతే = ఉపాసించుచున్నారో, యేచాపి = ఎవ్వరు అవ్యక్తం = అప్రత్యక్షమైన, అక్షరం = నిర్గుణబ్రహ్మమును, పర్యుపాసతే = ఉపాసించుచున్నారో. తేషాం = వార్లలో, కే = ఎవ్వరు, యోగవిత్తమాః = పెక్కుగ యోగము నెఱింగినవారలు (వార్లలో శ్రేష్ఠులెవ్వరు?)

(రామానుజులు) భక్తిచే భగవంతుని భజించువారలొందదగిన పరబ్రహ్మమగు నారాయణుని విశ్వరూపమును జూడవలెనని ప్రార్థించిన అర్జునునకు భగవంతుడైన కృష్ణపరమాత్మ తన విశ్వరూపమును జూపించెను. ఈ జ్ఞానమున్ను దర్శనమున్ను భక్తిచేతనే పొందదగినదేగాని మఱియొకదానిచే కాదనియు జెప్పియున్నది. ఇప్పుడు ఆత్మప్రాప్తికి సాధనమైన ఆత్మోపాసనకంటె భక్తిరూపమైన భగవదుపాసన అట్టి ఆత్మప్రాప్తిని శీఘ్రముగను సులభముగను కలుగజేయుటవలన భగవదుపాసనకు శ్రేష్ఠత్వమున్ను దానికుపాయమున్ను దానిలో నశక్తుడైనవానికి అక్షరోపాసనయు దానికికావలసిన సాధనములున్ను చెప్పబడుచున్నవి. ఏలనగా పొందదగిన స్థానమునకంటె ఉపాసనయే శ్రేష్ఠమైనది కావుననే 'యోగినామపి సర్వేషాంమద్గతేనాంతరాత్మనా శ్రద్ధావాన్భజతే యోమాం సమేయుక్తతమో మతః' (అధ్యా - 6 శ్లో 47) అనుచోట ఇట్టి శ్రేష్ఠత్వము చెప్పబడియున్నది. (కనుక ఈ శ్లోకమున కర్థమేమనగా) ఏవం = మత్కర్మకృత్ = (అధ్యా 11 - శ్లో. ౫౫) అనుచోట జెప్పియున్నట్లు సతతయుక్తాః = భగవంతుడవైన నిన్నేపొందదగిన శ్రేష్ఠమైనస్థానమని తలంచియున్న, యే భక్తాః = ఏభక్తులు, త్వాం = కొలతబెట్ట జాలనట్టియు శ్లాఘ్యమైనట్టియు సౌందర్యము, సద్గుణము, సర్వజ్ఞత్వము, సత్య సంకల్పము ఇవి మొదలగు గుణముల సాగరమైన నిన్ను, పర్యుపాసతే = పూర్ణముగనుపాసించుచున్నారో, యేచాపి=ఏభక్తులు, అవ్యక్తం = కండ్లు మొదలగువాటికి కనబడని.స్వరూపమగు, అక్షరం=ప్రత్యగాత్మ స్వరూపమును (జీవస్వరూపమును)

పర్యుపాసతే = ఉపాసించుచున్నారో, తేషాం = ఆ ఇరువురిలో, కేయోగవిత్తమాః = తాముకోరిన దానిని శీఘ్రముగ పొందగలవారలు ఎవరు ?

(మధ్వులు) ఈ శ్లోకమందలి మొదటిభాగము పరమాత్మయైన నారాయణునిగూర్చిన దనియు వెనుకటిభాగము శ్రీ దేవియైన లక్ష్మినిగూర్చినదనియు నెరుంగదగును. ఎవ్వరు, త్వాం= బ్రహ్మమగు నిన్నుపాసించుచున్నారో ఎవ్వరు (అవ్యక్తం అక్షరం) అవ్యక్తము, అక్షరము అని చెప్పబడు లక్ష్మినుపాసించుచున్నారో వీరలలో శ్రేష్ఠులెవ్వరనునది అర్జునుని ప్రశ్న, అవ్యక్తము అక్షరము అనుపదములు లక్ష్మిని గుర్తించునవని ఎట్లు చెప్పఁదగుననిన "ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః అర్థేభ్యశ్చపరం మనః। మనసస్తుపరాబుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః। మహతః పరమవ్యక్తం అవ్యక్తాత్పురుషః పరః। పురుషాన్న పరంకించిత్ సాకాష్ఠాసా పరాగతిః" ఇంద్రియములకంటె గొప్పది వస్తువు, వస్తువులకంటె గొప్పది మనస్సు, మనస్సుకంటెగొప్పది బుద్ధి, బుద్ధికంటెగొప్ప వాడు చతుర్ముఖ బ్రహ్మ, చతుర్ముఖబ్రహ్మకన్న గొప్పది అవ్యక్తము (లక్ష్మి), అవ్యక్తముకంటె గొప్పవాడు పురుషుడు (నారాయణుడు), పురుషునికంటె గొప్పదొక్కటియు లేదు. ఇదియే కడపటిదియు గొప్పదియు (కఠోపనిషత్తు 3 వ వల్లి 10 - 11 వాక్యములు) ఈ శ్రుతిచే అవ్యక్త మనగా లక్ష్మియని చెప్పబడియున్నందున అట్లు చెప్పదగును. లక్ష్మినుపాసించుటవలన మోక్ష మొందవచ్చునా? యనిన కఠోపనిషత్తులో "నిచాయ్యతం మృత్యుముఖాత్ప్రముచ్యతే" ఋగ్వేద ములో "శ్రియం వసానా అమృతత్వమాయన్" సామవేదములో అగ్నివేశీయ శాఖలో "ఉపాస్యతాం" అను మొదలగు వాక్యములచే అవ్యక్తోపాసన మోక్షమునకు కారణమని చెప్పబడి యున్నందున లక్ష్మియొక్క ఉపాసనచేత మోక్షము పొందవచ్చును. మఱియు ఋగ్వేదమున "చతుష్కపర్దాచతుశ్శిఖండా అహంరుద్రేభ్యః యంకామయే అహంరుద్రాయ" మొదలగు భాగ ములచేతను లక్ష్మికి సకలదేవతలకంటె ఉత్తమత్వమున్న మహిమయు చెప్పబడియున్నందునను యజుర్వేదమున "అంభస్యపారే" అను ఉపనిషత్తులో "త్వయాజుష్టఋషిర్భవతిదేవి" ఈ వాక్యముచేతను లక్ష్మియొక్క మహిమజెప్పబడియున్నందునను లక్ష్మియొక్క ఉపాసన మోక్ష కారణమే. "అక్షరాత్పరతః పరః" పరః = ఇతరదేవతలకంటె ఉత్తమమైన అక్షరాత్ = లక్ష్మి కంటె పరః = నారాయణుడు శ్రేష్ఠుడని చెప్పబడియున్నందున అక్షరమనునదియు లక్ష్మియే.

శ్రీభగవానువాచః—

శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః॥ 2

పద॥ మయి - ఆవేశ్య - మనః - యే - మాం - నిత్యయుక్తాః (1) - ఉపాసతే।
శ్రద్ధయా - పరయా - ఉపేతాః - తే - మే - యుక్తతమాః (2) - మతాః॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీభగవంతుడు చెప్పినది | పరయా శ్రద్ధయా ఉపేతాః | మేలైన నమ్మకముతోగూడిన వారలై |
| యేమయిమనఃఆవేశ్య నిత్యయుక్తాః | ఎవ్వరు నాయెడ మనస్సునుంచి ఎల్లప్పుడు ఒకనిలకడ జెందిన వారై | మాం ఉపాసతే తే యుక్తతమాః మే మతాః | నన్ను ఉపాసించుచున్నారో వారలు గొప్పయోగులుగ నాచే నెరుంగబడుచున్నారు. |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ చెప్పినది: పరమేశ్వరుడనైన నాయెడ మనస్సును నిలువబెట్టి ఎల్లప్పుడు ఒకనిలకడ జెందినవారలై శ్రేష్ఠమైన శ్రద్ధతోగూడియు ఎవ్వరు

పరమేశ్వరుడనైన నన్ను ఉపాసించుచున్నారో వారలు శ్రేష్ఠులనినాకు సమ్మతమైనవారు. (వారలు శ్రేష్ఠులని నాయొక్క నిశ్చయమనునది తాత్పర్యము.)

(1) నిత్యయుక్తాః - మత్కర్మకృత్ అను శ్లోకమున జెప్పినట్లు నాయెడ ఎల్లప్పుడు నిష్ఠగలవారై (శంకరులు) ఎల్లప్పుడు నాయెడ నుండవలెనను అభిప్రాయముగలవారై (రామానుజులు) కర్మయోగధ్యాన యోగములతో గూడినవారై (రాఘవేంద్రులు).

(2) యుక్తతమాః—ఎల్లప్పుడు నాయెడ మనస్సునుంచియు రాత్రింబగళ్లు యెడతెగక నన్ను ధ్యానించియు ఈవిధముగనే ఎల్లప్పుడు కాలమును గడుపుచున్నందున శ్రేష్ఠులు (శంకరులు) సుఖముగను శీఘ్రముగనునన్ను పొందదగినవారలు (రామానుజులు) మోక్షోపాయము తెలిసినవార్లలో శ్రేష్ఠులు (రాఘవేంద్రులు)

(శంకరులు) శ్రీ భగవంతుడు ఎవ్వరు యధార్థజ్ఞానము బడసి కోరికలుతొలగి నశించని వస్తువు నుపాసించుచున్నారో వారలుంచురునాక, వార్లనుగూర్చి చెప్పవలసినదానిని తరువాత జెప్పెదము. ఐతేమిగత వారలెవ్వరోవార్లనుగూర్చి ఇందు జెప్పెదము. ఎవ్వరు విశ్వరూపమును ధరించిన పరమేశ్వరుడనైన నాయెడమనస్సు నుంచి భక్తులై, మునుపటి అధ్యాయము కడపటనున్న శ్లోకమున జెప్పబడిన ఉపదేశమును క్రమముగననుష్ఠించుటవలన ఎల్లప్పుడు ఒకనిలకడ చెందిన వారలై, అధీశ్వరులై సర్వజ్ఞులై ఆశ మొదలగు చెరుపులకు కారణమైన అజ్ఞానమను అంధకారము వలన గలుగు అయధార్థజ్ఞానముతొలగిన నన్ను నమ్మకముతో నుపాసించుచున్నారో వారలు గొప్ప యోగులనునది నాయొక్క అభిప్రాయము. నిశ్చయముగ వారలు నన్ను ఎడతెగక చింతించుచు రాత్రింబగళ్లను గడుపుచున్నారు. పగటిలోను రాత్రిలోను నన్నధికముగ ధ్యానించుచున్నారు. కావున వారలు గొప్పయోగులు అని వార్లను గూర్చి జెప్పుట తగును.

---

శ్లో॥ యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగమచింత్యం చ కూటస్థ మచలం ధ్రువం ॥ 3
,, సన్నియమ్యేంద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూత హితే రతాః ॥ 4

పద॥ యే - తు- అక్షరం - అనిర్దేశ్యం - అవ్యక్తం - పర్యుపాసతే ।
సర్వత్రగం - అచింత్యం - చ - కూటస్థం - అచలం - ధ్రువం ॥
,, సన్నియమ్య - ఇంద్రియగ్రామం - సర్వత్ర - సమబుద్ధయః ।
తే - ప్రాప్నువన్తి - మాం - ఏవ - సర్వభూతహితే - రతాః ॥

| | | | |
|---|---|---|---|
| యేతు | మఱియెవ్వరు | అవ్యక్తం | అవ్యక్తమైనట్టియు |
| ఇంద్రియగ్రామం | ఇంద్రియసమూహమును | సర్వత్రగం అచింత్యం | అంతట వ్యాపించియున్నట్టియు చింతింప వీలులేనట్టియు |
| సన్నియమ్య | బాగుగ అణచి | కూటస్థం, అచలం | కూటస్థమున్ను, కదలికలేనిదియు |
| సర్వత్రసమబుద్ధయః | ఎల్లప్పుడు సమబుద్ధిగలవారలై | ధ్రువం, అక్షరం | నిత్యమైనదియునైన నిర్గుణబ్రహ్మమును |
| సర్వభూత హితే రతాః | సకలప్రాణులకును క్షేమమును కోరువారలై | పర్యుపాసతే | అంతటనుపాసించుచున్నారో |
| అనిర్దేశ్యం | గుర్తించి చూపి ఎరింగింప వీలులేనట్టియు | తే మామేవ ప్రాప్నువన్తి | వారలు నన్నే వచ్చి చేరుచున్నారు, |

తా॥ మఱియునెవ్వరు ఇంద్రియముల సమూహమును బాగుగ నణచి ఎల్లప్పుడు సమబుద్ధిగలవారలై సకలప్రాణులకును హితమునుగోరువారలై గుర్తించిచూపి ఎఱింగింపరానట్టియు ప్రకటము కానట్టియు అంతట వ్యాపించి యున్నట్టియు మనస్సుచే భావింపవీలులేనట్టియు కూటస్థమైనట్టియు చలనము లేనట్టియు శాశ్వతమైనట్టియు నిర్గుణబ్రహ్మము నుపాసించుచున్నారో వారలు నన్నేవచ్చి చేరుచున్నారు.

(శంకరులు) మిగతవారలు యోగులలో గొప్పవారలుకారా? యనినవార్లనుగూర్చి నేను చెప్పెదను వినుము.

నశించని వస్తువువ్యక్తముగలేనందున మాటకు అందనిది కావున ఒకనిచేత దానిని గుర్తించిచూపి తెలియబరచుట అశక్యము. అది ఎరుంగుటకు సాధనమైన దేనికిని గోచరము కానిది. కావున ఇట్టిదని గుర్తింపవీలులేనట్టిది. ఆశ తొలగి యథార్థజ్ఞానముతో గూడినవారలు దానినంతట నుపాసించుచున్నారు. శాస్త్రముననుసరించి ఉపాసింపవలసిన వస్తువును ధ్యానమునకు విషయమగునట్లు చేసికొనుటవలన (దాని) సమీపమునుపొంది తైలధారవలె ఎడతెగని సరుసయైన ఒకటే తైలప్రవాహమై దీర్ఘకాలముండుట ఏదికలదో దానిని ఉపాసనము (ఉపాసించుట పూజించుట) అనుచున్నారు. ఉపాసింపవలసిన నశించనివస్తువుయొక్క గొప్పతనమును ఇచ్చట ప్రసాదించుచున్నాను — (నశించని వస్తువు) అంతటనున్నది. ఆకాశమువలె వ్యాపించియున్నట్టిది. ప్రకటముగలేనందున తలంపవీలులేనిది. ఏది ఇంద్రియములకు గోచరమగునో అది మనస్సుచేతను భావింపదగినది. నశించని వస్తువనగా దానికి విపరీతముగనున్నందున భావింపవీలులేనిది. కూటస్థమైనది. కూటమనగా పైగా చూచుటకు గుణమున్ను లోపలదోషమున్నుగల వస్తువు. కూటరూపం (దొంగఆకారము, అబద్ధపు ఆకారము) కూటసాక్ష్యము (అబద్ధపుసాక్షి) ఇది మొదలగు వాటిలో కూటమనుపదము లోకమున వాడబడుచున్నది. ఆ విధముగనే పలుసంసారములకు విత్తనమై లోపలదోషముగలదై, మాయ, అవ్యాకృతము, మొదలగు పదములచే చెప్పబడిన ప్రకృతిని మాయగను మాయగలవానిని మహేశ్వరునిగను ఎరుంగవలెను. "మాయాంతుప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరం'' (శ్వేతాశ్వతరము 4—10).

"మమ మాయా దురత్యయా'' నాయొక్క మాయ దాటుటకరుదైనది. (ఇందలి అధ్యా 7 శ్లో 14) మొదలగువాటిలో వాడబడియున్న అవిద్యమొదలగునవి ఏదో అది (ఇచ్చట) కూటమనంబడును. అట్టికూటములో దానికి ప్రధానమైన ద్రష్టయైనిలచుటవలన కూటస్థమనుడు. లేక రాశివలె నిలచుట కూటస్థమనియు చెప్పవచ్చును (కూటం - రాశి) కావున నశించని వస్తువు, కదలనిది కదలనిది కావున నిత్యమైనదనుడు. ఎవ్వరు ఇంద్రియ సమూహమును బాగుగ నణచి, కావలసినది వచ్చినప్పుడును అనిష్టమైనది వచ్చినప్పుడును సర్వకాలమున సమముగ నిలబడు బుద్ధిగలవారై సకల ప్రాణులహితమున తాత్పర్యముగలవారై యున్నారో వారలు నన్నేవచ్చి చేరుచున్నారు. వారలునన్ను వచ్చిచేరుచున్నారని వార్లనుగూర్చి చెప్పనక్కరలేదు. ఏలనగా "జ్ఞానియనగా నా ఆత్మయే" అని మునుపు 7-వ అధ్యాయమున జెప్పబడియున్నది. భగవంతుని స్వరూపముగనే యున్నవారలను గొప్పయోగులనిగాని గొప్పయోగులుకారనిగాని చెప్పనక్కరలేదుగదా ?

(రామానుజులు) ఈ 3, 4, 5=వ శ్లోకములకు ఒకే అన్వయము) యేతు = ఎవ్వరు, అక్షరం=ప్రత్యగాత్మ (ప్రకృతి విముక్తజీవాత్మ) స్వరూపమును, అనిర్దేశ్యం=దేహముకంటె అన్యమై

నందున దేవాదిశబ్దములచే జెప్పదగనిది. కావున, అవ్య క్తం = కండ్లు మొదలగు కరణములచేజూడ జాలనిది, సర్వత్రగమచింత్యంచ = దేవాదిదేహములతోనున్నను ఆదేహాదులకు విజాతీయమైనందున అట్టి దేవాది రూపములచే చింతింపరానిదిగనుక, కూటస్థం=సర్వసాధారణము. అట్లున్నను దేవాది దేహములకు సంబంధించనిదిగనున్నది. అచలం = మారని స్వభావముగలదైనందున తనయొక్క అసాధారణమైన ఆకారమునుండి మార్పుచెందనిది. కావున, ధ్రువం = నిత్యమైనదని, సన్నియ మ్యేంద్రియగ్రామం = కండ్లు మొదలగు ఇంద్రియములను వాటివ్యాపారమునుండి అణచి, సర్వత్రసమబుద్ధయః = దేవాదివిషమాకారములైన దేహాదులలోనున్న ఆత్మను జ్ఞానాకారముచే సమ మని ఎరుంగువారలుగను, కనుకనే, సర్వభూతహితేరతాః=సకలభూతములకును దేహాభిమానముచే అహితముచేయక యున్నవారలుగను, పర్యుపాసతే = ఉపాసించుచున్నారో, తేపి - వారలున్ను. మాం ప్రాప్నువంత్యేవ = నాతోసమానమైన ఆకారముగలదైన అసంసారియైన ఆత్మస్వరూపమును పొందుచున్నారు. "మమసాధర్మ్యమాగతాః" అని ఇక జెప్పబోవుటవలనను "నిరంజనః పరమం సామ్యముపైతి" అనిశ్రుతిలో జెప్పబడియున్నందునను "మాం" అనుపదమునకు నాతోసమాన మైన ఆకారమని అర్థముచేయబడినది. ఆవిధముగనే"కూటస్థోక్షర ఉచ్యతే-ఉత్తమః పురుషస్త్వన్యః" అనువాటిలో అక్షరశబ్దముచే చెప్పబడు కూటస్థునికంటె పరబ్రహ్మము వేరైనదని ఏర్పడుచున్నది. "అథపరాయయాతదక్షరమధిగమ్యతే" అను ఉపనిషత్తులో జగత్కారణముగ జెప్పబడుటవలన అచ్చట అక్షరశబ్దము పరబ్రహ్మమునే జెప్పుచున్నది. "తేషామవ్యక్తాసక్త చేతసాం క్లేశస్తు అధిక తరః" అవ్యక్తము నందాసక్తిగల మనస్సుగల వారలకు ప్రయాసఅధికము. ఏలనగా అవ్యక్తాహి గతిః = అవ్యక్తవిషయమైన మనోవృత్తియైనది దేహవద్భిః=దేహమే ఆత్మయను అభిమానముగల వార్లచే, దుఃఖమవాప్యతే - దుఃఖేన అవాప్యతే=దుఃఖముచే పొందబడుచున్నది.

(మధ్వులు) (పైయన్వయమున గుర్తింపబడియున్నట్లు) అనిర్దేశ్యము మొదలు అక్షరము వఱకుగల యెనిమిదిపదములున్ను శ్రీ వాచకమే. అనగా లక్ష్మినిగురించినవే. క్రిందకనబరచిన శ్రుతివాక్యమును చూడుడు. "అజరమక్షరమనిర్దేశ్యం ఏషహ్యేవ ప్రకృతిస్సర్వగా అచింత్యా అవ్యక్తా సర్వత్రగా నిత్యా కూటస్థా శాశ్వతా సైషా ప్రకృతిః"

(3-4-శ్లోకములకుమాత్రము) అవ్యక్త (లక్ష్మి) ఉపాసనకంటె నా యొక్క ఉపాసన శ్రేష్ఠమని చెప్పబడినది. అవ్యక్తోపాసనకు మోక్షము లభించనియెడల శ్రీ యుపాసన మోక్షమునకు కారణమనిచెప్పు "శ్రియంవసానా అమృతత్వమాయన" మొదలగు శ్రుతులకు విరోధమువచ్చును. శ్రీ యుపాసనకు మోక్షముగలదనిన నన్నుపాసించువారలు శ్రేష్ఠులని చెప్పవలసినదేల యనినచో అవ్యక్తోపాసనకున్ను మోక్షము లభింపగలదైనను అది మిక్కిలికష్టముతో పొందదగినది. నాయు పాసనచే మోక్షమొందుట సులభమైనది. కావున నాయుపాసన శ్లాఘ్యమైనదని ఎరుంగుము అని రె శ్లోకములచే చెప్పబడుచున్నది.

యేతు - ఎవ్వరు, అక్షరం = నాశములేని, అనిర్దేశ్యం=సూక్ష్మమైనందున కనబడని, అవ్యక్తం - ప్రసిద్ధముకానందునను జగత్తునకు ఉపాదానకారణమైనప్రకృతికి అభిమానియైనందునను అవ్యక్తమని చెప్పబడుచున్న, సర్వత్రగం=సకలదేశములలోను వ్యాపించియున్న, అచింత్యం=అనేక

గుణములతోగూడినదైనందున, చింతింపరాని, కూటస్థం = అవ్యాకృతాకాశమున అభిమానిగనున్న అచలం = తన స్థానమునుండి కదలకయున్న, ధ్రువం=వికారములేకున్న శ్రీ తత్త్వమును (లక్ష్మిని) సన్నియమ్యేంద్రియగ్రామం = ఇంద్రియములను విషయములనుండి మరలింపజేసి, సర్వత్రసమబుద్ధయః మంచిజ్ఞానముగలవారలుగను, సర్వభూతహితేరతాః = సకలభూతములకును హితము జేయుటలో దృష్టి గలవారుగను, పర్యుపాసతే=విష్ణుభక్తి విష్ణుశ్రద్ధ విష్ణుసర్వోత్తమతత్త్వజ్ఞానము విష్ణూపాసన మొదలగువాటిని ముందుగానుంచి ఉపాసించుచున్నారో, తే = వారలు, మా మేవ = నన్నే ప్రాప్నువన్తి=పొందుచున్నారు. (దీనివలన విష్ణువును ముందుగానుంచికొని శ్రీ యుపాసనజేయువారలున్ను విష్ణువును పొందుచున్నారనునది తాత్పర్యము.



శ్లో॥ క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్తచేతసాం।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥ 5

పద॥ క్లేశః అధికతరః - తేషాం - అవ్యక్తాసక్తచేతసాం।
అవ్యక్తా - హి - గతిః - దుఃఖం - దేహవద్భిః - అవాప్యతే॥

| | | | |
|---|---|---|---|
| అవ్యక్తాసక్తచేతసాం తేషాం | నిర్గుణబ్రహ్మమునెడ మనస్సు బెట్టిన వారలకు | అవ్యక్తా గతిః | నిర్గుణ విషయమైనగతియైనది |
| క్లేశః అధిక తరః | ప్రయాస మిక్కిలి యధికమైనది | దేహవద్భిః | దేహాభిమానముగలవార్లచే |
| హి | ఏలనగా | దుఃఖం అవాప్యతే | కష్టముచే పొందబడుచున్నది. |

తా॥ నిర్గుణ బ్రహ్మములో మనోనిష్ఠను గోరువారలకు ప్రయాసమిక్కిలి యధికము. నిర్గుణవిషయమైన నిష్ఠ దేహాభిమానముగలవార్లచే పొందుట కష్టము. దేహాభిమానమును అంతయు విడచుట మిక్కిలి ప్రయాసమైనందునను, దేహాభిమానమంతయు తొలగినగాని నిర్గుణబ్రహ్మనిష్ఠ సాధ్యముకాజాలదు గనుకను, మిక్కిలి ప్రయాసయని చెప్పబడినది.

(శంకరులు) నాకొఱకై కర్మచేయుట మొదలగువాటిమీద తాత్పర్యముగల వారలకు ప్రయాస అధికమైనను ప్రకటముగలేని నిర్గుణబ్రహ్మయెడ మనస్సుబెట్టినవారై నశించిన వస్తువు యొక్క ఆకారముగలవారలై పరవస్తువును జూచువారలకు దేహాభిమానము విడువవలసియుండుటచే గలుగుప్రయాస ఇంకను యధికమనుడు. ఏలనగా నిర్గుణబ్రహ్మమనెడి నశించని వస్తువను గతియైనది దేహాభిమానముగలవార్లచే పొందుట కరుదైనది. కావుననే దేహాభిమానమును విడువవలసియున్నందున ప్రయాసమిక్కిలి యధికమనంబడెను.

(మధ్వులు) సర్వేంద్రియ నిగ్రహము సర్వసమత్వబుద్ధి సర్వభూతహితము సదాచారము దృఢమైన విష్ణుభక్తి ఇవి మొదలగు సాధనములులేక శ్రీ ప్రత్యక్షముకలుగదు. కావున శ్రీయుపాసన మిక్కిలి ప్రయాసమైనది (రాఘవేంద్రులు) విష్ణుసంబంధములేక శ్రీనిమాత్రము వేరుగానుపాసించి దానివలనవిష్ణువును పొందుట మిక్కిలి కష్టము. ఏలనగా ఇంద్రియనిగ్రహము, సమబుద్ధి సకలభూతహితము, ఆచారము మొదలగునవి కావలసియున్నందున.

శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥

,, తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసాం ॥

పద॥ యే — తు — సర్వాణి — కర్మాణి — మయి — సన్న్యస్య — మత్పరాః।
అనన్యేన – ఏవ – యోగేన – మాం – ధ్యాయన్తః – ఉపాసతే ॥

,, తేషాం — అహం — సముద్ధర్తా — మృత్యుసంసారసాగరాత్ ।
భవామి — న — చిరాత్ — పార్థ — మయి — ఆవేశితచేతసాం ॥

| | | | |
|---|---|---|---|
| యే తు మయి | మరి ఎవ్వరు నాయెడ | మయి ఆవేశిత చేతసాం | నాయెడబెట్టిన మనస్సుగల వారలైన |
| సర్వాణి కర్మాణి | సకల కర్మలను | తేషాం హే పార్థ! | వారలయొక్క ఓ అర్జునా ! |
| సన్న్యస్య మత్పరాః | అర్పించి నన్నే మేలైనగతి యనుకొన్నవారై | మృత్యు సంసార సాగరాత్ | మృత్యువుతోగూడినసంసార సముద్రమునుండి |
| అనన్యేనైవ యోగేన | అనన్యమైనయోగముచే | నచిరాత్ అహం | శీఘ్రముగ నేను |
| మాం | నన్ను | సముద్ధర్తాభవామి | తరింపజేయువాడగు చున్నాను. |
| ధ్యాయన్తః | ధ్యానించువారలై | | |
| ఉపాసతే | ఉపాసించుచున్నారో | | |

తా॥ మఱియెవ్వరు సకలకర్మలను నాయెడ సమర్పించి నన్నే మేలైన గతియని గ్రహించి అనన్యమైన, అనగా నన్నుదప్ప మఱియొక దానిని విషయముగ గ్రహించని సమాధియోగముచే నన్ను ధ్యానించుచు ఉపాసించుచున్నారో నాయెడ నుంచబడిన మనస్సుగల అట్టివారలను ఓ అర్జునా! మృత్యువనెడి సంసారసాగరమునుండి శీఘ్రముగ నేను తరింపజేయువాడనుగ నున్నాను.

(శంకరులు) అక్షరవస్తువును ఉపాసించువారల ప్రవర్తన ఎట్టిదో అదిరాబోవు 11-13 శ్లోకములలో చెప్పబడును. ఇప్పుడు సగుణబ్రహ్మోపాసకులనుగూర్చి చెప్పబడుచున్నది. మయి = ఈశ్వరుడనైన నాయెడ, అనన్యేనైవ = విశ్వరూపమును ధరించిన పరమాత్మయైన నన్నుదప్ప మఱి దేనిని ఆలంబనముగ (పట్టుగ) అనగా నుపాసించుటకు విషయముగ గ్రహించని అట్టిసమాధిచే నన్నుపాసించుట యందే పూర్తిగ తాత్పర్యముగల వారలను ఈశ్వరుడైన నేను తరింపజేయు చున్నాను. దేనినుండి తరింపజేయుటయనగా మృత్యువుతోగూడిన సంసారసాగరమునుండి అది సముద్రమువలె దాటుట కరుదైయున్నందున సముద్రమని చెప్పబడినది. మృత్యువుతోగూడిన అట్టి సంసారసాగరమునుండి నేను వారలను చాలకాలమునకు పిదప ఉద్ధరించుచున్నాననునది లేదు. అతి శీఘ్రముగనే ఎత్తుచున్నాననుడు. మయి ఆవేశితచేతసాం = విశ్వరూపము బడసిన నాయెడమనస్సు నిలకడచెందిన వారలు.

(రామానుజులు) సర్వాణి కర్మాణి యనగా లౌకికవైదిక కర్మలను, అనగా దేహాదులను సంరక్షించుటకైన ఆహారాదుల విషయమైన లౌకిక కర్మలనున్ను, యాగము, దానము, హోమము, తపస్సు, జపము, మొదలగు వైదికకర్మలనున్ను వాట్లకు కారణమైనట్టియు వాటియుద్దేశములతో గూడినవియునైన మిగత సకల కర్మలనున్ను,

మత్పరాః = ముఖ్యముగ పొందదగినవాడను నేనను నిశ్చయముగలవారలై, అనన్యే నైవయోగేన = నన్నుదప్ప వేరు ప్రయోజనములేనిభక్తిచే. ఉపాసతే = ధ్యానము, అర్చనము, శ్రవణము, కీర్తనము, స్తుతినమస్కారాదులను జేయుచున్నారు. మృత్యుసంసార సాగరాత్ = న్నన్ను పొందుటలో విరోధిగనున్న సంసారమనెడి సముద్రమునుండి.

(రాఘవేంద్రులు) భగవదుపాసనలో అంతటి ప్రయాసలేదనునది చెప్పబడుచున్నది. యేతు = ఎవ్వరు, సర్వాణికర్మాణి = సకలకర్మలను, మయి సన్న్యస్య = సర్వస్వతంత్రుడైన హరియేనాలోనుండి తనపూజ మొదలగు కర్మలను తనయధీనమైనకర్తయగు నాచే చేయించు చున్నాడు అను ననుసంధానముతో నాయెడ సమర్పించి. మత్పరాః = నేనే ఉత్తముడనని తెలిసిన వారలై = అనన్యేనైవయోగేన = భగవదధీనమనియు, భగవత్పరివారమనియు, లక్ష్మీబ్రహ్మాదుల విషయమైన ధ్యానయోగముచే, మాంధ్యాయన్తః = నా విషయమైన ధ్యానముజేయువారుగనే, ఉపాసతే = ఉపాసించుచున్నారో, అవ్యక్తోపాసన మిక్కిలి కష్టమైనదని చూపుటకై అచ్చోట (మునుపటి 3-4 శ్లోకములలో) "పర్యుపాసతే" అనుపదమున్ను భగవద్విషయమైన ఉపాసన సులభమైనదని చూపుటకై ఇచ్చట "ఉపాసతే" అనుపదమున్ను ప్రయోగింపబడియున్నవి. భగవదుపాసనకు అవ్యక్తోపాసనవలె ఇంద్రియనిగ్రహము మొదలగునవి అంతగా నక్కరలేదు. "నచిరాత్" అనుటచే అవ్యక్తోపాసనకంటె తక్కువైన ఉపాసనజేసినను భగవత్ప్రసాదము శీఘ్రముగగలుగుచున్నది, ఇంద్రియనిగ్రహము ఆచారము మొదలగునవి కొరతబడినను నా భక్తులకు నేను సౌలభ్యమునుగలుగజేసి శీఘ్రముగ కృతార్థులుగజేయుచున్నాను. కావున నా యుపాసన శ్రేష్ఠము. అనన్యేనైవ అనుదానికి చిత్ప్రకృతి (లక్ష్మి) మొదలగు పరివారదేవతలను విడిచి నన్ను ధ్యానించుట యనితాత్పర్యముగాదు. లక్ష్మిమొదలగు పరివార దేవతలతోజేర్చి ధ్యానించవలెననునది తాత్పర్యము.

"నచిరాత్" అనుదానికి నన్ను వేరుగను, లక్ష్మిని వేరుగను ఉపాసించియు పిదప లక్ష్మి మొదలగు పరివారములతో నన్నుపాసించియు మోక్షమొంద చాలకాలము పట్టును. లక్ష్మి మొదలగు పరివారములతో నన్నుపాసించువారలు త్వరగా మోక్షమొందగలరనునది తాత్పర్యము.

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8

పద॥ మయి - ఏవ - మనః - ఆధత్స్వ - మయి - బుద్ధిం (1) - నివేశయ ।
నివసిష్యసి - మయి (2) - ఏవ - అతః - ఊర్ధ్వం (3) - న - సంశయః ॥

| | | | |
|---|---|---|---|
| మయ్యేవ | నాయెడనే | అత ఊర్ధ్వం | ఇకమీద |
| మనః ఆధత్స్వ | మనస్సును నిలబెట్టుము | మయ్యేవ | నాయెడనే |
| మయి బుద్ధిం | నాయెడ బుద్ధిని | నివసిష్యసి | నివాసము జేయగలవు |
| నివేశయ | ప్రవేశపెట్టుము | న సంశయః | సందియములేదు. |

తా॥ నా యెడనే మనస్సును స్థిరపరచుము. నాయెడబుద్ధిని ప్రవేశ పెట్టుము. ఇకమీద నాయెడనే నివసింపగలవను దానిలో సందియములేదు.

(1) బుద్ధిం = భగవంతుడనైన నేనేపొందదగినవాడనను నిశ్చయబుద్ధిని (రామానుజులు) నా విషయ మైన జ్ఞానమును, నివేశయ = సంపాదించుము. (రాఘవేంద్రులు)

(2) మయ్యేవ = నాయొక్క స్వరూపముగనుండెదవుగాక (శంకరులు - శ్రీధరులు). నాయెడనిత్య ముక్తుడుగనుండెదవుగాక (మధ్వులు). నిర్దుఃఖమైనట్టియు ఆనందానుభవ స్వరూపమైనట్టియు స్థితినిపొందెదవు (రాఘవేంద్రులు).

(3) అత ఊర్ధ్వం = ఈ శరీరముపోయిన పిదప (శంకరులు-శ్రీధరులు). దానిపిదప (రామానుజులు) (రాఘవేంద్రులు).

(శంకరులు) ఈ విధముగనుండుటవలన మనస్సును, అనగా సంకల్పవికల్పాత్మకమైన దానిని, మయ్యేవ = విశ్వరూపముబడసిన ఈశ్వరుడనైన నా యెడనేయుంచివేయుము. నిర్ణయము చేయుబుద్ధినిగూడ నా యెడనుంచివేయుము. అట్లుచేయుటవలన నీకుగలుగునది ఎట్టిదనుదానిని వినుము. ఈ శరీరము నశించినపిదప నీవు నేనుగనే నా యెడ నిశ్చయముగ నివాసము చేయగలవు. అనగా నేనుగనే యుండగలవు. ఇందుసంశయింపకుము



శ్లో॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం ।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥

పద॥ అథ - చిత్తం - సమాధాతుం - న - శక్నోషి - మయి - స్థిరం ।
అభ్యాసయోగేన (1) - తతః - మాం - ఇచ్ఛ - ఆప్తుం - ధనంజయ ॥

| | | | |
|---|---|---|---|
| హే ధనంజయ ! | ఓ ధనంజయా ! | అథతతః | పిదప |
| చిత్తం మయి | చిత్తమును నాయెడ | అభ్యాస యోగేన | అభ్యాసయోగముచేత |
| స్థిరం సమాధాతుం | నిలకడగ నిలబెట్టుటకు | మాం ఆప్తుం ఇచ్ఛ | నన్ను పొందుటకు ఇచ్ఛింపుము |
| న శక్నోషి | శక్తిలేనివాడెనచో | | |

తా॥ ఓ ధనంజయా ! మనస్సును నాయెడ స్థిరముగ నిలబెట్టుటకు శక్తిలేని వాడవైనచో పిదప అభ్యాసయోగముచే నన్నుపొందుటకు ప్రయత్నము జేయుము.

(1) అభ్యాసయోగేన - చలించెడి మనస్సును మరలను ఈడ్చి భగవంతునియెడ నిలబెట్టి అభ్యసించుట (శ్రీధరులు). మిక్కిలి ప్రీతితో మాటిమాటికి నన్నుస్మరించుటయను అభ్యాసయోగముచే (రామానుజులు) చూ. 8వ అధ్యా-8వ శ్లో.

(శంకరులు) నేను చెప్పినట్లు నీవు నాయెడ మనస్సును చలింపక నిలబెట్టశక్తిలేనివాడవైనచో పిదప (అప్పుడు) విశ్వరూపము బడసిన నన్ను అభ్యాసయోగముచే పొందవలెను. అభ్యాసమనగా అన్నిప్రక్కలనుండియు చిత్తమునీడ్చి మాటిమాటికి ఒకేపట్టులో నిలబెట్టుట. దానివలన గలుగు యోగము అభ్యాసయోగమగును. ఇది మనస్సు ఒకనిలకడ జెందుట అను యోగమగును.



శ్లో॥ అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ 10

పద॥ అభ్యాసే - అపి - అసమర్థః - అసి (1) - మత్కర్మపరమః - భవ ।
మదర్థం - అపి - కర్మాణి - కుర్వన్ (2) - సిద్ధిం - అవాప్స్యసి ॥

| | | | |
|---|---|---|---|
| అభ్యాసే | అభ్యాసమునందును | భవ | ఉండుము |
| అసమర్థః అసి చేత్ | అసమర్థుడవుగనున్నచో | మదర్థమపి కర్మాణి | నాకొఱకై కర్మలను |
| మత్కర్మపరమః | నాకై కర్మలను జేయుటయే | కుర్వన్నపి | జేయువాడవైనను |
| | ముఖ్యమని తలంచినవాడవుగ | సిద్ధిమవాప్స్యసి | సిద్ధిని పొందగలవు |

తా॥ (మునుపుచెప్పినట్లు మనస్సును ఈడ్చి నిలబెట్టుటయను) అభ్యాసమునందును అసమర్థుడవుగనున్నచో నాకు ప్రీతినిగలుగజేయు కర్మలే ఉత్తమమనితెలిసి అనుష్ఠించువాడవుగ అగుదువుగాక. నాయొక్క ప్రీతికొఱకయ్యే కర్మలను జేయుచుండిన మోక్షమొందగలవు. (అనగా చిత్తశుద్ధిని, పిదప జ్ఞానమును పొంది, మోక్షమొందగలవనునది తాత్పర్యము.)

(1) మత్కర్మపరమః=నాకైచేయవలసిన కర్మలను ముఖ్యముగ నాశ్రయించినవాడవుగ (శంకరులు) ఏకాదశి యుపవాసము వ్రతానుష్ఠానము, నామసంకీర్తనము మొదలగు కర్మలను ఉత్తమములని ఎరింగి (శ్రీధరులు). మత్కర్మ=ఆలయనిర్మాణము, నందనవనముంచుట, అఖండదీపముంచుట, దేవాలయము ఊడ్చుట, అలుకుట, చల్లుట, ముగ్గు మొదలగు వాటిచే నలంకరించుట, పుష్పము, తులసి మొదలగువాటిని తెచ్చియిచ్చుట, పూజ జరిపించుట, నామసంకీర్తనము, ప్రదక్షిణము, నమస్కారము, స్తోత్రపాఠము, మొదలగు కర్మలు (రామానుజులు).

(2) సిద్ధిం = చిత్తశుద్ధిద్వారా యోగజ్ఞానముచే మోక్షమును (శంకరులు). మోక్షమును (శ్రీధరులు) నాయొక్క ప్రాప్తిని (రామానుజులు).

(శంకరులు) నీవు అభ్యాసములేక, అనగా అభ్యాసయోగమునభ్యసింప సామర్థ్యములేనివాడవుగనున్నను కర్మలనుమాత్రము నాకొఱకై చేసిన మనస్సు సరియగుట, ఏకనిష్ఠజెందుట, యథార్థమునుజూచి యెరుంగుట, మొదలగువాటిని క్రమముగపొంది పిదప సిద్ధిని, అనగా బ్రహ్మముయొక్క స్థితిని పొందగలవు.



శ్లో॥ అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ 11

పద॥ అథ - ఏతత్ - అపి - అశక్తః - అసి - కర్తుం - మద్యోగం - ఆశ్రితః।
సర్వకర్మఫలత్యాగం - తతః - కురు - యతాత్మవాన్॥

| | | | |
|---|---|---|---|
| ఏతదపి కర్తుం | దీనిని గూడజేయుటకు | యతాత్మవాన్ | మనస్సు నణచినవాడవై |
| అశక్తః అసి అథ తతః | శక్తిలేనివాడవైనచో పిదప | సర్వకర్మఫలత్యాగం | అన్నికర్మల ఫలమును |
| మద్యోగం ఆశ్రితః | నావిషయమైన యోగము | కురు | విడుచుటను చేయుము. |
| | నాశ్రయించినవాడవై | | |

తా॥ దీనిని (నాకు ప్రియమైన కర్మలను) కూడజేయుటకు శక్తిలేనివాడవైనచో దానిపిదప నావిషయమైన యోగము నాశ్రయించినవాడవై నన్ను శరణముగ పొంది అణగిన మనస్సుగలవాడవై సకలకర్మల ఫలములను ఈశ్వరార్పణము జేయుటయను త్యాగమునుచేయుము.

(శంకరులు) ఏతదపి = దీనినిన్ని అనగా నాకొఱకై కర్మలను జేయుటను ముఖ్యముగ భావించుటయగు మునుపు చెప్పిన ఉపదేశమెట్టిదో దానినిన్ని, మద్యోగం = నా విషయమైన యోగము, అనగాచేయబడు కర్మలను నాయెడ నర్పించి వాటి ననుష్ఠించుట.

(రామానుజులు) మద్యోగమాశ్రితః = నాయొక్క గుణానుసంధానము జేయుచు నాకు ప్రియమైన భక్తియోగము నాశ్రయించినవాడవై, ఏతదపి = భక్తియోగమునకు మొలకగనున్న ఈ కర్మనున్ను. అథకర్తుమశక్తోసి = చేయుట కశక్తుడవైనచో, తతః = దానిపిదప, యతాత్మవాన్ = మనస్సునణచినవాడవై, సర్వకర్మఫలత్యాగం = ఆత్మస్వరూపాను సంధానరూపముగను పరమ భక్తిని గలుగజేయునదిగను దీని మొదటి ఆరు అధ్యాయములలో జెప్పబడియునున్న అక్షర యోగము నాశ్రయించి దానికుపాయమైన సకలకర్మలఫలములను త్యాగము చేయుము. నేనే మిక్కిలి ప్రియమైన వస్తువును. నేనొక్కడనే ముఖ్యముగ పొందదగినవాడను అను బుద్ధి సకల పాపములు నశించియున్న వానికి కలుగుచున్నది. కావున ఫలాపేక్షలేక, నాయొక్క ఆరాధనా రూపముగనున్న కర్మవలన గలుగు తనయాత్మధ్యానముచే ప్రత్యగాత్మస్వరూపసాక్షాత్కారము కలుగుచున్నది. అనగా నాయొక్క శేషభూతమైన ప్రకృతివిముక్తాత్మస్వరూపమును పొందు చున్నాడు. అట్లు పొందిన. నాయెడ శ్రేష్ఠమైనభక్తి స్వయముగనే గలుగుచున్నది. ఈ యర్థమును క్రిందకనబరచిన శ్లోకములలో చూడుడు.

" స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధింవిందతి మానవః" " విముచ్య నిర్మమశ్శాంతః " "సమస్సర్వేషు భూతేషు మద్భక్తింలభతే పరాం " (18-వ అధ్యాయము 46-53-54 శ్లోకములను చూడుడు)

(రాఘవేంద్రులు) ఏతదపి = సకల జపము ఆచమనము, మొదలగు విష్ణుసంబంధము గల కర్మములను, అథకర్తుమశక్తోసి = చేయుటకు శక్తిలేనివాడవైనచో, తతః = దానితరువాత, మద్యోగమాశ్రితః = అన్యదేవతలను గూర్చి కర్మలనుజేసి దానిని నాకర్పించుట యనుయోగము నాశ్రయించి, యతాత్మవాన్ = మనస్సునణచి, సర్వకర్మఫల త్యాగం = సకల కర్మఫలముల త్యాగమును, కురు = చేయుము ఏ విధముగగాని నన్ను ఉపాసింపవలెననునది తాత్పర్యము.

(స్వకీయము) ఈ శ్లోకార్థము సర్వసాధారణముగ ఎల్లరకును అనుష్ఠింపదగినదిగను, సులభముగనునున్నది. ఇదియుగాక అతిశీఘ్రముగ మోక్షఫలమును పొందుటకు మార్గముగ నున్నది. ఎట్లనగా సకల కర్మలను వదలి మనస్సును వేరొకచోట పోనివ్వక పరమాత్మయెడనే నిలబెట్టి స్థిరమైన యోగములో నున్నవానిని సంసారమునుండి నివర్తిజేయునట్లు ఈ యధ్యాయము 6-7 శ్లోకములచేతను అట్టి స్థిరమైన యోగము మనస్సు బుద్ధి వీటిని భగవంతునియెడ నిలబెట్టుట వలన పొందబడుచున్నదనునది 8-వ శ్లోకముచేతను అట్లు మనస్సు బుద్ధి వీటిని నిలబెట్టుట మిక్కిలి కష్టమైనదిగదా అది ఎట్లు సాధ్యమగుననిన అభ్యాసముచేత సాధ్యమగుననునది 9-వ శ్లోకముచేతను. అట్లు మనోబుద్ధులను నిలబెట్టు శక్తిలేనిచో నా విషయముమైన కర్మలనే ముఖ్యముగ చేయవలయునని 10-వ శ్లోకముచేతను జెప్పి, ఇట్టి కర్మలనుగూడ జేయుటకశక్తుడైనచో అట్టివాడు గూడ కడతేరవలెనను తాపముతో కృపాళువైన భగవంతుడు ఈ శ్లోకముచే మార్గమును శిక్షించు చున్నాడు. ఈ మార్గము ననుసరించినవాడు భగవత్కృపచే అతిశీఘ్రమున చిత్తశుద్ధియు పిదప జ్ఞానమును పొంది కడపట మోక్షమొందును. దీనినిగూడ అనుష్ఠింపక వ్యర్థముగ కాలము గడపినచో అట్టివాడు లెక్కలేని జన్మములగు సంసారమునుండి నివృత్తి పొందజాలడు. ఈ మార్గము సులభమైనదని ఎట్లు జెప్పదగును. ఇంద్రియ నిగ్రహమునకంటె మనోనిగ్రహము మిక్కిలి కష్టమైనది. అట్టి మనోనిగ్రహము ఇందు జెప్పబడుచున్నదిగదా యనిన ఇచ్చట జెప్పియున్న

మనోనిగ్రహము 6-7-8 శ్లోకములలో జెప్పియున్న అచంచలమైన మనోనిగ్రహముకాదు మనస్తృప్తి యేయగును. అనగా వ్యర్థవిషయములలో మనస్సును విడువకయు, దురాశ, అత్యాశ మొదలగు వాటిని విడిచియు తనకుగిట్టిన వఱకు చాలినంతతృప్తి పొందుటయే. ఇట్టిమనస్సు గలవారై, మద్యోగమాశ్రితః = నా విషయమైన యోగము నాశ్రయించి అనగా ఆస్తిక్య బుద్ధితో గూడినవారై, సర్వకర్మ ఫలత్యాగం = తాను ప్రతినిమిషమున్ను చేయు వైదిక లౌకికములైన సకల కర్మలనున్ను తనయొక్క, లేక తన్ను ఆధారపడిన వారల ప్రయోజనోద్దేశమైచేయక ఈశ్వరార్పణము జేయుటయే. ఎట్లనగా వండబడు ఈ యన్నము భగవన్నివేదనము కొఱకు. ఈ వ్యాపారమునలభించిన ద్రవ్యము భగవదారాధనార్థమగును గాక. నేను విను ఈ సంగీతము భగవత్ప్రీతియగునుగాక అను నీ విధముగనే ఇదియే ఇచ్చటజెప్పిన సకల కర్మ ఫలత్యాగము. సకల కర్మలనినందున దుష్కర్మగూడ చేయవచ్చునని అర్థమగుచున్నదేయనిన అది సరిగాదు. ఏలనగా దుష్కర్మచేయ కుండుటకై తాను నిశ్చయమైన మనస్సు గలవాడని ఇందు ప్రయోగింపబడి యున్నది. ఈ త్యాగము ఉత్తమమని పై శ్లోకముచే పొగడబడినదేగాని "ఏతాన్యపితుకర్మాణి సంగంత్యక్త్వా ఫలానిచ" (అధ్యా 18, శ్లో-6) "త్యాగీసత్త్వసమావిష్టః మేధావీ ఛిన్న సంశయః" (అధ్యా 18, శ్లో 10) ఇది మొదలగుచోట చెప్పబడిన జ్ఞాననిష్ఠుని విషయమైన ఉత్తమత్యాగము కానేరదు, ఏలనగా అశక్తుని విషయమైనందుననే.

శ్లో॥ శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తి రనన్తరం॥ 12

పద॥ శ్రేయః - హి - జ్ఞానం - అభ్యాసాత్ - జ్ఞానాత్ - ధ్యానం - విశిష్యతే
ధ్యానాత్ - కర్మఫలత్యాగః - త్యాగాత్ - శాంతిః - అనన్తరం ॥

| | | | |
|---|---|---|---|
| జ్ఞానం | జ్ఞానము | కర్మఫలత్యాగః | కర్మయొక్క ఫలమునువిడుచుట |
| అభ్యాసాత్ | అభ్యాసమునకంటెను | ధ్యానాత్ | ధ్యానముకంటె |
| శ్రేయోహి | శ్రేష్ఠమైనదిగదా | విశిష్యతే | వేరైనదగుచున్నది. |
| ధ్యానం | ధ్యానము | త్యాగాత్ శాంతిః | త్యాగమువలన విశ్రాంతి |
| జ్ఞానాత్ | జ్ఞానమునకంటెను | అనన్తరం భవతి | వెంటనే కలుగుచున్నది. |
| విశిష్యతే | మేలైనదగుచున్నది | | |

తా॥ మనస్సును మాటిమాటికి నిలబెట్టుటయను అభ్యాసముకంటె జ్ఞానమున్ను, జ్ఞానముకంటె ధ్యానమున్ను, ధ్యానముకంటె కర్మఫలత్యాగమున్ను శ్రేష్ఠము. కర్మఫలత్యాగముచే త్వరగా విశ్రాంతిగలుగును.

(శంకరులు) సకలకర్మల ఫలములను త్యజించుటను భగవంతుడు పొగడుచున్నారు. జ్ఞానము మిక్కిలిగొప్పదిగదా. దేనికంటెననిన అజ్ఞానముతోగూడిన అభ్యాసముకంటె జ్ఞానమనగా శాస్త్రముచేతను యుక్తిచేతను ఆత్మను నిశ్చయించుట. అభ్యాసమనగా జ్ఞానమునుగలుగజేయు శాస్త్రార్థమును మాటిమాటికిని విమర్శించుట, లేక స్థైర్యముతోగూడి ధ్యానమునభ్యసించుట. అట్టిజ్ఞానముకంటె జ్ఞానముతోగూడిన ధ్యానముగొప్పదగును. జ్ఞానముగలవాని ధ్యానముకంటె కర్మఫలమునువిడచుట "గొప్పదగును" అని చేర్చుకొనుడు మనస్సునణచినవారై మునుపుజెప్పిన విశేషముతోగూడి ఈవిధముగ కర్మఫలమును త్యజించుటవలన మూలకారణమగు అజ్ఞానముతో సంసారముతొలగుట

వెంటనే కలుగును. కాలాంతరమును గోరుటలేదు. అనగా కాలతామసములేక కలుగుచున్నదని తాత్పర్యము. కర్మలో ప్రవర్తించియున్న అజ్ఞానికి మునుపటి శ్లోకములలో ఉపదేశింపబడిన సాధనములను అనుష్ఠింప సామర్థ్యములేనియెడల సకలకర్మల ఫలములనువిడుచుట మోక్షమునకు మార్గమని ఉపదేశింపబడినది. ఐతే ఒకనికి మునుపుజెప్పినదానిని అనుష్ఠింప శక్తియుండినయెడల వెనుక జెప్పినదానిని అనుష్ఠింపవలెనని చెప్పబడలేదు. కావున ''శ్రేయోహిజ్ఞానమభ్యాసాత్" అను శ్లోకముచే సకలకర్మఫలత్యాగము పొగడబడుచున్నది. ఎట్లనగా ముక్తికై యేర్పడిన నిర్గుణబ్రహ్మో పాసన మొదలగు సాధనములననుష్ఠింప నశక్తుడైనచో సర్వకర్మఫలత్యాగమును అనుష్ఠింపవలెనని ఉపదేశింపబడినందున ననుడు. ఏ ధర్మముచే ఇది స్తుతియగుచున్నదనిన:—

"యదా సర్వేప్రముచ్యన్తే = ఎప్పుడు విడువబడుచున్నవో అప్పుడు మనుష్యుడు మర ణించనివాడగుచున్నాడు'' అని కఠోపనిషత్తు 6-వ వల్లి 14-వ మంత్రము ననుసరించి ఆశావిష యము లన్నిటిని తొలగించుటవలన అమరత్వము చెప్పబడుచున్నది. మఱియు అది ప్రసిద్ధముగ నున్నది. ఇక ఆశావిషయములన్నియు శ్రుతులలోను స్మృతులలోను జెప్పబడిన సకలకర్మల ఫలములుగనున్నట్టివి. ధ్యానముచే స్థిరమైన జ్ఞానికి వాటిని విడుచుటవలన విశ్రాంతి వెంటనే వచ్చు చున్నది, కావుననే ఆశావిషయములనన్నిటిని విడుచుట యగు త్యాగము ఎల్లప్పుడు పొదువైనది. అజ్ఞాని కర్మలయొక్క ఫలములను విడచుటలోను కలదను, అట్టి సామాన్యవచనముచే సకలకర్మల ఫలములను విడచుట. పొగడబడినదగును. ఈవిధముగ పొగడుట, వినువారికి రుచిని గలుగజేసి వారలు కర్మలఫలములను విడచుటను అనుసరించునట్లు చేయుటకై యనుడు. ఉదాహరణముగ అగస్త్యుడను బ్రాహ్మణునిచే సముద్రము త్రాగబడినదని ఇప్పడున్న బ్రాహ్మణులున్ను బ్రాహ్మణు లను జాతిచే పొగడబడుచున్నారు, ఈవిధముగ కర్మయోగము కర్మయొక్కఫలమును విడుచుట వలన ముక్తికి సాధనమగునని ఉపదేశింపబడినది. కర్మల ఫలములు కామములు. ఆశావిషయములు. కర్మఫలములను త్యజించు జ్ఞానికిగూడగల త్యాగమగు సాధారణత్వమును ఈవిధముగ కనుగొనుడు.

(శ్రీధరులు) జ్ఞానములేక చేయబడు అభ్యాసముకంటె గురువుచే తగినఆధారములతో బోధింపబడిన జ్ఞానము శ్రేష్ఠమైనది. ఇట్టి జ్ఞానముకంటె ఈ జ్ఞానముతోగూడిన ధ్యానము శ్రేష్ఠ మైనది. అట్టి ధ్యానముకంటె మునుపటి శ్లోకమున జెప్పబడియున్న కర్మఫల త్యాగము శ్లాఘ్య మనునది తాత్పర్యము.

(రామానుజులు) ప్రీతిలేని అభ్యాసముకంటె అక్షర (ప్రకృతి విముక్తాత్మ) స్వరూప నిశ్చయానుసంధాన పూర్వకమైన దృఢముకాని అక్షరాపరోక్షజ్ఞానము శ్రేష్ఠమైనది. ఇట్టి జ్ఞానము కంటె ఇట్టి జ్ఞానమునకు కారణమైన దృఢపడని ఆత్మధ్యానము శ్రేష్ఠము. అట్టి ధ్యానముకంటె ఈశ్వరార్పణముగ జేయబడు కర్మఫల త్యాగము శ్రేష్ఠమైనది. కర్మఫలత్యాగమును శ్రేష్ఠమని చెప్పుట ఏలనిన, ప్రీతిలేని అభ్యాసయోగము. దృఢపడని అక్షరాపరోక్షజ్ఞానము, దృఢపడని ఆత్మ ధ్యానము ఇవి అశక్తులకొఱకై చెప్పబడి యున్నందున వారలు ఫలాపేక్షలేక భగవదర్పణముగా కర్మచేయుట శ్రేష్ఠమే. అది మోక్షమున కాదికారణముగ నున్నది. ఎట్లనగా కర్మఫలత్యాగమువలన పాపనివృత్తియగును. పాపనివృత్తియైన మనస్సు సమాధానమొందును. మనస్సు సమాధానమొందిన ఆత్మధ్యానము దృఢమగును, ఆత్మధ్యానము దృఢపడిన ఆత్మాపరోక్షజ్ఞానము గలుగును, అపరోక్ష జ్ఞానము గలిగిన దృఢభక్తి గలుగును. దృఢభక్తివలన మోక్షము గలుగుననునది తాత్పర్యమేగాని కర్మఫలత్యాగమే మోక్షమొందింపగలదనునదికాదు. అదిమోక్షమునకు ఆదికారణమని తాత్పర్యము.

(మధ్వులు) కేవలము జ్ఞానములేక చేయబడు అభ్యాసముకంటె అభ్యాససహితమైన జ్ఞానము శ్రేష్ఠము. దానికంటె జ్ఞానముతోగూడిన ధ్యానము శ్రేష్ఠము. ధ్యానముకంటె అపరోక్ష జ్ఞానము శ్రేష్ఠము, ఇట్టి అపరోక్షజ్ఞానముచేతనే మోక్షమొందవచ్చును. వీటియన్నిటికిని ఆదికారణమైనట్టియు నిష్కామకర్మజేసి ఈశ్వరార్పణము జేయుటయగుత్యాగమే మోక్షసాధనమని స్తుతిగా జెప్పబడినది. "తయోస్తుకర్మ సన్న్యాసాత్" అను శ్లోకమునందును, దీనికి మునుపటి రెండుశ్లోకములలోను అశక్తుని విషయమున చెప్పబడినది. ఏలనగా కర్మఫలత్యాగమే మోక్షసాధనమనిన మునుపటి గీతావాక్యములకు విరోధమువచ్చును. కావున అశక్తునికి సౌలభ్యమును, విశ్వాసమును కలుగజేయుటకై కర్మఫలత్యాగము మోక్షమును గలుగజేయునదిగ జెప్పబడినదని గ్రహింపవగియున్నది. (ఈ యర్థమును గీ. వి. గూడ ఆదరించియున్నాడు.)



శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥ 13

,, సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః ॥ 14

పద॥ అద్వేష్టా (1) - సర్వభూతానాం - మైత్రః (2) - కరుణః (3) - ఏవ - చ ।
నిర్మమః (4) - నిరహంకారః (5) - సమదుఃఖసుఖః (6) - క్షమీ (7) ॥
సంతుష్టః (8) - సతతం - యోగీ (9) - యతాత్మా (10) - దృఢనిశ్చయః (11) ।
మయి - అర్పితమనోబుద్ధిః (12) - యః - మద్భక్తః (13) - సః - మే - ప్రియః ॥

| | | | |
|---|---|---|---|
| సర్వభూతానాం | సర్వప్రాణులను | సంతుష్టః | సంతోషము గల వాడుగను |
| అద్వేష్టా | ద్వేషించనివాడుగను | యోగీయతాత్మా | యోగిగను అణగినస్వభావము గలవాడుగను |
| మైత్రః | మిత్రుడుగను | దృఢనిశ్చయః | దృఢమైన నిశ్చయముగల వాడుగను |
| కరుణః చ | దయగలవాడుగను | మయి ఏవ | నాయెడనే |
| క్షమీ | ఓర్పుగలవాడుగను | అర్పిత మనోబుద్ధిః | మనస్సు బుద్ధి వీటిని బెట్టిన వాడుగనున్న |
| నిర్మమః | మమకారము నివర్తించిన వాడుగను | మద్భక్తః | నాయొక్క భక్తుడు |
| నిరహంకారః | అహంకారము తొలగినవాడుగను | యః | ఎవ్వడుగలడో |
| సమదుఃఖసుఖః | సుఖదుఃఖములను సమముగ గొన్నవాడుగను | సః మే | అతడు నాకు |
| సతతం | ఎల్లప్పుడు | ప్రియః | ప్రియమైనవాడు |

తా॥ సకల ప్రాణులకు ద్వేషము జేయనివాడుగను, మిత్రుడుగను, కరుణగలవాడుగను, అహంకార మమకారములు లేనివాడుగను, సుఖదుఃఖములను సమముగ భావించువాడుగను, ఓర్పుగలవాడుగను, ఎల్లప్పుడు సంతోషముగలవాడుగను, ధ్యానము జేయువాడుగను, మనస్సు నణచెడి స్వభావము గలవాడుగను, దృఢమైన నాయొక్క స్వరూప నిశ్చయముగల వాడుగను, మనస్సు బుద్ధి వీటిని నాయెడ సమర్పించినవాడుగనున్న నాయొక్క భక్తుడెవ్వడుగలడో అతడు నాకు ప్రియమైనవాడు.

* ఈ 13-14-15-16-19 శ్లో॥లను కూర్మపురాణము ఉత్తరభాగము 11-వ అధ్యాయమున చూడుడు.

(1) అద్వేష్టా - తనకు దుఃఖము గలుగజేసినవానియెడనైనను, ద్వేషము లేనివాడు. ఏలనగా సకల భూతములనున్ను తనయాత్మగ జూచుచున్నాడు. కావున ద్వేషింప కారణమేలేదు, (శంకరులు). ఉత్తమునియెడ ద్వేషములేనివాడై (శ్రీధరులు). ఉపకారి, అపకారి, ద్వేషి, వీరియెడ ద్వేషము లేనివాడు. ఏలనగా తన కర్మానుసారముగ భగవంతునిచే ప్రేరేపింపబడినవారలై ఉపకారము అపకారము ద్వేషము వీటిని జేసిరేగాని వారియెడ అపరాధములేదని ఎరుంగుటవలన ద్వేషించుటలేదు (రామానుజులు). ఒకనికిని అప్రియము జేయనివాడు (రాఘవేంద్రులు).

(2) మైత్రః - తనకు సమానమైన వార్లయెడ ప్రీతిగలవాడు (శ్రీధరులు). పైకనిన కారణములచే ఎల్లరియెడ ప్రీతిజేయువాడు (రామానుజులు). ఒకనికివచ్చు ఆపదను గుర్తింపజేసి ఆ యాపదనుండి అతనిని రక్షించువాడు (రాఘవేంద్రులు).

(3) కరుణః - తక్కువైనవార్లయెడ కరుణగలవాడుగను (శ్రీధరులు). పైకనిన వార్లలో ఎవ్వరైన దుఃఖించునప్పుడు దయచూపువాడు (రామానుజులు). ఎల్లప్పుడు ఎల్లరియెడ దయగలవాడు (రాఘవేంద్రులు).

(4) నిర్మమః - దేహేంద్రియములలోను, దేహసంబంధముగల పుత్రమిత్రకళత్రాదులలోను తనది, తనవారు అను మమతలేనివాడు (రామానుజులు). తనది అను స్వతంత్రబుద్ధిలేనివాడు (రాఘవేంద్రులు).

(5) నిరహంకారః - దేహమే తానను నభిమానములేనివాడు (రామానుజులు). తనయెడలేని గుణములు తనవద్దనున్నట్లు తలంచి అజ్ఞానమొందనివాడు (రాఘవేంద్రులు).

(6) సమదుఃఖసుఖః - ఇతరుల సుఖదుఃఖములను తనవివలె తలంచువాడు (శ్రీధరులు). సుఖమునందు సంతోషము, దుఃఖమున ద్వేషము లేనివాడు (శంకరులు, రామానుజులు). విషయసంబంధసుఖము ఎవరిదుఃఖముతో సమానమో అతడు (స్వకీయము). ఇందలి 14-వ అధ్యాయము 24-వ శ్లోకమును చూడుడు.

(7) క్షమీ - తన్ను బాధపెట్టినను వికారమొందనివాడు (శంకరులు). విషయసంబంధములవలన అనిష్టమువచ్చినను అప్పుడు మనోవికారము లేనివాడు (రామానుజులు).

(8) సంతుష్టః - లభించినచో సంతోషమున్ను, లభించనియెడల దుఃఖమున్నులేక, తృప్తితో గూడియున్నవాడు (శ్రీధరులు) దేహధారణకై దొరికినది స్వల్పమైనను అదియే చాలునను తృప్తియు, దొరకినది మంచిదైనను చెడ్డదైనను ఇదియైన దొరికెనేయని సంతోషము గలవాడు (శంకరులు). ప్రయత్నములేక దేహధారణకై ఏది యెంత గిట్టునో అంతటితో తృప్తిగలవాడు (రామానుజులు).

(9) యోగీ - చిత్తసమాధానముగలవాడు (శంకరులు). అప్రమత్తః = తప్పనివాడు (జారనివాడు) (శ్రీధరులు). ప్రకృతికంటె అన్యమగు తనస్వరూపానుసంధానములోనున్నవాడు (రామానుజులు). కర్మ, ధ్యానము, ఇవి యగు జ్ఞానోపాయముగలవాడు (రాఘవేంద్రులు).

(10) యతాత్మా - మనస్సును విషయములలో ప్రవర్తింపనీయక తనస్వాధీనమునునుంచియున్న వాడు (రామానుజులు, రాఘవేంద్రులు).

(11) దృఢనిశ్చయః - ఆత్మతత్త్వ నిశ్చయమున దార్ఢ్యముగలవాడు (శంకరులు) వేదాంతశాస్త్రార్థ ములలో దార్ఢ్యముగలవాడై దానిప్రకారము నడచువాడు (రామానుజులు). ఆ ప్రమాణ మనెడి సందేహములేని తత్త్వనిశ్చయముగలవాడు (రాఘవేంద్రులు).

(12) అర్పితమనోబుద్ధిః - ఫలాపేక్షలేక నాచే ననుష్ఠింపబడిన కర్మలవలన ఆరాధింపబడిన భగ వంతుడైన వాసుదేవుడు నాయొక్క ఆత్మదర్శనమును కలుగజేయగలడు. అను మనో నిశ్చయము, బుద్ధి, వీటినిగలవాడు (రామానుజులు).

(13) మద్భక్తః - కర్మయోగముచే నన్ను ఆరాధించువాడైన భక్తుడు (రామానుజులు).

(శంకరులు) ఇచ్చట ఆత్మకును ఈశ్వరునికిని భేదమునుంచుకొని విశ్వరూపమున ఈశ్వ రునియెడ మనస్థైర్యమను యోగమున్ను, ఈశ్వరునికొఱకై కర్మననుష్ఠించుట మొదలగునవియు ఉపదేశింపబడినవి. కర్మయోగమును "దీనినిగూడ జేయుటకు శక్తిలేనివాడైనచో" అని అజ్ఞానము యొక్క వ్యాపారముగ గుర్తింపజేయుటవలన ఆత్మకును ఈశ్వరునికిని భేదమును చూడనివాడై నశించని వస్తువును భజించువాని కర్మయోగము తగదని చూపుచున్నాడు. ఆ విధముగనే భగవం తుడు నశించని వస్తువు నుపాసించుట కర్మయోగికితగదని చూపుచున్నాడు. నశించని వస్తువును భజించువానికి కైవల్యము గైకూడుటలో "వారలు నన్నే పొందుచున్నారు" అని స్వాతంత్ర్యమును జెప్పిన పిదప మిగతవారికి "నేను వారలను తరింపజేయువాడను" అని పారతంత్ర్యమును, అనగా ఈశ్వరుని ఆధారపడి నిలబడుటను తెలియపరచియున్నాడు. వారలు ఈశ్వరుని ఆత్మగనే యున్నారని గ్రహించిన మార్గము వారలు ఆత్మకును ఈశ్వరునికిని అభేదమునుచూచి యెరింగిన వారైనందున నశించనివస్తువాకారము గలవార్లుగనే ఉన్నారనుడు. కావుననే అట్టివారిని తరింప జేయుటయను వ్యాపారమునకు విషయముగ, తరింపజేయబడువారలుగ జెప్పుట అట్టివారి విషయ మున తగినదికాదు. మరియు ఇక రాబోవు కారణమువలనను అర్జునునికి మిక్కిలి హితమునుగోరు భగవంతుడు యథార్థజ్ఞానముతో గూడనట్టియు, భేదదృష్టినేగలదియు, "ఆత్మవేరు, ఈశ్వరుడువేరు" అని భేదభావమే గలదియునైన కర్మయోగమును అతనికుపదేశించుచున్నాడు. మఱియు ప్రమాణ ములచే ఆత్మను ఈశ్వరుడని ఎరింగినపిదప ఒకడు మరియొకనికి సేవజేయుటను (విధేయుడగు టను) కోరడు. విరోధముచే ఏలబడు స్వభావమున్ను ఏలెడి స్వభావమున్ను ఒకనియెడ ఒకే కాలమున ఉండజాలనందున ఏలబడినవాడు విధేయుడు, ఏలువాడు ఈశ్వరుడు. కావున ముందు రాబోవు విశేషణములు ఐదింటిని అజ్ఞానియైన కర్మయోగి యనుసరింప వీలులేనందున యథార్థ జ్ఞానమున నిలకడజెందినత్యాగులై (సన్యాసులై) ఆశలన్నిటిని విడచినవారై నిత్యవస్తువును భజించు వారలకు అమరత్వమునకు నేరుగా సాధనమై ఎట్టిప్రాణిని ద్వేషించనివాడుగను అనునది మొదలు గాగల విశేషణపరంపరను చెప్పెదనని భగవంతుడు ప్రవర్తించియున్నాడు'

కరుణః - అతడు దుఃఖించిన వార్లయెడ దయగలవాడు, సర్వప్రాణులకును అభయ మిచ్చినవాడు సన్న్యాసియని భావము. మమకారము తొలగినవాడు అనగా ఇది నాదియను తలంపు లేనివాడు. అహంకారము తొలగినవాడు, అనగా నేను అను తలంపులేనివాడు. అతడు రాగద్వేష ములను గలుగజేయు సుఖదుఃఖములను సమముగ భావించినవాడు. ఓర్పుగలవాడు, అనగా తిట్టి నను కొట్టినను కోపము మొదలగువాటిని పొందక నేయున్నవాడు. ఎల్లప్పుడు తృప్తిగలవాడు శరీరము

నిలచుటకు కావలసినవి లభించుటలోను లభింపకుండుటలోను చాలునను తలంపు బడసినవాడు ఆ విధముగనే మంచిది లభించుటలోను, లభింపకుండుటలోను తృప్తిగలవాడు. ఎల్లప్పుడు యోగి చిత్తమొకనిలకడ చెందినవాడు. యతాత్మా=స్వభావమును, అనగా దేహమును ఇంద్రియములను అణచినవాడు. ఆత్మ యాథాత్మ్య విషయమున నిశ్చయముగలవాడు. అట్టి సన్యాసి సంకల్పవికల్పాత్మకమైన మనస్సునుగూడ నిర్ణయించు స్వభావముగల బుద్ధినిన్ని నాయెడనే నిలబెట్టినవాడు. ఎవ్వడు నాయొక్క ఇట్టి భక్తుడు గలడో ఆతడు నాకు ప్రియమైనవాడు. నేను జ్ఞానికి మిక్కిలి ప్రియమైనవాడను. అతడున్ను నాకు ప్రియమైనవాడని 7-వ అధ్యాయము 17-వ శ్లోకమున గుర్తింపచేయబడినది. అది ఇచ్చట స్పష్టపరచబడుచున్నది.

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః ॥ 15

పద॥ యస్మాత్ (1)-న-ఉద్విజతే (2) -లోకః - లోకాత్ - న - ఉద్విజతే - చ - యః ।
హర్షామర్షభయోద్వేగైః (3) - ముక్తః - యః - సః - చ - మే - ప్రియః ॥

| | | | |
|---|---|---|---|
| లోకః | లోకము | యః | ఎవ్వడు |
| యస్మాత్ | ఎవ్వనివద్దనుండి | హర్షామర్ష భయోద్వేగైః | సంతోషము కోపము భయము కలత వీటిచే |
| నోద్విజతే | భయము చెందుటలేదో | | |
| చ | మఱియు | ముక్తః | విడువబడినవాడో |
| యః లోకాత్ | ఎవ్వడు లోకమునుండి | స చ | అతడే |
| నోద్విజతే | భయము చెందుటలేదో | మేప్రియః | నాకు ప్రియమైనవాడు. |

కా॥ ఎవ్వనివద్దనుండి జనులు భయపడుటలేదో, జనులవద్దనుండి ఎవ్వడు భయపడుటలేదో, సంతోషము కోపము భయము మనస్సుకలత చెందుట వీటినుండి ఎవ్వడు విడువబడెనో అతడున్ను నాకు ప్రియుడు.

(1) యస్మాత్ - ఏ సన్న్యాసివద్దనుండి (శంకరులు) ఏ కర్మనిష్ఠుని నిమిత్తమై, అనగా ఒకనికి భయమును గలుగచేయునట్టి కర్మనుచేయనివాని నిమిత్తమై, అని తాత్పర్యము. ఆ విధముగనే ఒకనికిని ఇతడు విరోధికాడు కావున ఒకనిచేతను ఇతడు భయముచెందనక్కరలేదు. (రామానుజులు)

(2) ఉద్విజతే - భయము వచ్చునని దిగులు పొందుట (శంకరులు).

(3) హర్షామర్ష భయోద్వేగైః - హర్షః = కోరినవస్తువు గిట్టినమాత్రమున మనో వికాసము. ఆదిగ గుర్పాటు, కన్నీరు విడుచుట, మొదలగువాటివలన ఎరుంగదగినది (శంకరులు). ఉత్సాహము (శ్రీధరులు). మదముచే అధర్మమున ప్రవేశించుట (రాఘవేంద్రులు), అమర్షః = ఓర్వనితనము (శ్రీధరులు), దోషము (రాఘవేంద్రులు), ఉద్వేగః = భయము మొదలగు వాటివలనగలుగు మనోవ్యాకులత (శ్రీధరులు), ఇతడు ఒకనికి విరోధి కానందున ఒకనినిగూర్చి సంతోషము, ఒకనినిగూర్చి అసూయ, ఒకనినిగూర్చి భయము ఒకనినిగూర్చి మనోవ్యాకులము ఇవి లేని వాడు (రామానుజులు).

శ్లో॥ అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥ 16

పద॥ అనపేక్షః (1) - శుచిః (2) - దక్షః (3) - ఉదాసీనః (4) - గతవ్యథః (5) ।
సర్వారంభపరిత్యాగీ (6) - యః - మద్భక్తః - సః - మే - ప్రియః ॥

| | | | |
|---|---|---|---|
| అనపేక్షః | అపేక్షలేనివాడుగను | సర్వారంభపరిత్యాగీ | సకలప్రయత్నములను విడచిన వాడుగనునున్న |
| శుచిః దక్షః | పరిశుద్ధుడుగను సమర్థుడుగను | మద్భక్తః | నాయొక్క భక్తుడు |
| ఉదాసీనః | ఉదాసీనుడుగను | యః | ఎవ్వడుగలడో |
| గతవ్యథః | భయములేనివాడుగను | సః మే ప్రియః | అతడు నాకు ప్రియుడు. |

తా॥ అపేక్షలేనివాడుగను, శుద్ధిగలవాడుగను, సామర్థ్యము గలవాడుగను, ఉదాసీనుడుగను, భయము పోయినవాడుగను, సకలప్రయత్నములను విడచినవాడుగనునున్న నాయొక్క భక్తుడెవ్వడుగలడో అతడు నాకు ప్రియమైనవాడు.

(1) అనపేక్షః - దేహము ఇంద్రియములు విషయములు వీటి సంబంధము మొదలగువాటిమీద ఆసక్తిలేనివాడు (శంకరులు). తన ప్రయత్నములేక, గిట్టిన వస్తువులయందుగూడ అపేక్షలేనివాడు (శ్రీధరులు). ఆత్మ దప్ప ఇతర వస్తువులలో ఆసక్తి లేనివాడు (రామానుజులు). భగవత్ప్రీతిని పొందవలెననునది దప్ప ఇతర విషయములలో ఆశలేని వాడు (రాఘవేంద్రులు),

(2) శుచిః - లోపలను బయటను శుద్ధముగనున్నవాడు. అనగా కామక్రోధములు మొదలగ మనస్సుయొక్క మురికిని, దేహము యొక్క మురికిని పోగొట్టుకొని శుద్ధముగ నున్న వాడు (శ్రీధరులు). శాస్త్రోక్తమార్గమున సంపాదించిన ఆహారాదులచే దేహమును వృద్ధి చేసికొని యున్నవాడు (రామానుజులు).

(3) దక్షః - సామర్థ్యము గలవాడు కార్యములు ధడామని సంభవించినప్పుడు వాటిని వెంటనే సరిగా నెరుంగుటకును జేయుటకును సామర్థ్యముగలవాడు. (శంకరులు) సోమరితనము లేనివాడు (శ్రీధరులు). ఇతరకర్మలలో ఆసక్తిలేనివాడై శాస్త్రోక్తములైన కర్మలను చేయుటలో అలస్యములేనివాడు (రామానుజులు). భగవత్ప్రీతికరమైన కర్మలను చేయుటలో జాగ్రత్తగలవాడు (రాఘవేంద్రులు).

(4) ఉదాసీనః - స్నేహితులు మొదలగువారి పక్షములోను ఎవ్వడు చేరుటలేదో అతడు (శంకరులు). జనులు తనకుపకారముచేసినను అపకారముచేసినను ఆ రెంటిలో ఉపేక్షగనుండువాడు అధ్యా 14-శ్లో-23 చూడుడు (రాఘవేంద్రులు)

(5) గతవ్యథః - భయము పోయినవాడు (శంకరులు) శాస్త్రోక్తములైన కర్మలను చేయుటకై స్నానాదులు చేయుటలో శీతము, ఉష్ణము మొదలగువాటిచే దుఃఖమొందనివాడు (రామానుజులు). ఇతరులుచేసిన అపరాధముచే మనఃక్లేశము పొందనివాడు (రాఘవేంద్రులు) మనోవ్యాధి తొలగినవాడు (శ్రీధరులు)

(6) సర్వారంభపరిత్యాగీ - సకల ప్రయత్నములను విడచి తొలగించినవాడు, కోరినవాటినిచ్చునట్టి ఇహపరములకైన కర్మలను పూర్తిగ త్యజించు స్వభావముగలవాడు (శంకరులు). దృష్టా

దృష్టవస్తువులనుద్దేశించి ప్రయత్నము చేయనివాడు (శ్రీధరులు). శాస్త్రోక్తకర్మలను దప్ప ఇతర కర్మలను విడిచినవాడు (రామానుజులు). విష్ణుసంబంధములేని కర్మలను విడిచినవాడు, లేక సకలకర్మలలోను అభిమానములేనివాడు, లేక సకలకర్మలను భగవదర్పణము జేసినవాడు (రాఘవేంద్రులు).

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః॥ 17

పద॥ యః - న - హృష్యతి - న - ద్వేష్టి - న - శోచతి - న - కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ - భక్తిమాన్ - యః - సః - మే - ప్రియః॥

| | | | |
|---|---|---|---|
| యః న హృష్యతి | ఎవ్వడు సంతోషించుటలేదో | యః శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ | ఎవ్వడు పుణ్యపాపములను విడచినవాడుగను భక్తి గలవాడుగ నున్నాడో |
| న ద్వేష్టి | ద్వేషించుటలేదో | | |
| న శోచతి | దుఃఖించుటలేదో | | |
| న కాంక్షతి | అపేక్షించుటలేదో | సః మే ప్రియః | అతడు నాకు ప్రియమైనవాడు |

తా॥ ఎవ్వడు సంతోషము, ద్వేషము, వ్యసనము, కోరిక ఇవిలేక, శుభాశుభములలో ఆసక్తి లేనివాడై భక్తి జేయునో అతడు నాకు ప్రియమైనవాడు.

(శంకరులు) ఎవ్వడుకోరినవి వచ్చినపుడు సంతోషించుటలేదో, కోరనివి సంభవించినప్పుడు ద్వేషించుటలేదో, ప్రియమైనదానిని పోగొట్టుకొన్నప్పుడు దుఃఖించుటలేదో, లభించనిదానిని కోరుటలేదో, శుభాశుభములను బొత్తుగత్యజించు స్వభావముగలవాడై భక్తిగలిగియుండునో అతడు నాకు ప్రియమైనవాడు.

(రామానుజులు) ఏకర్మయోగియైనవాడు సంతోషమునకు కారణమైనట్టియు ఇష్టమైనట్టియు వస్తువులు లభించినను సంతోషించుటలేదో, దుఃఖమునకు కారణమైన అనిష్టములు గలిగినను ద్వేషించుటలేదో, పుత్రమిత్రకళత్రాది వియోగముచే దుఃఖించుటలేదో, ఎట్టి వస్తువు నశించిన తనకు దుఃఖముగలుగునో అది నశింపక యుండగోరుటలేదో, పాపమువలె పుణ్యముగూడ బంధహేతువైనందున పుణ్యపాపముల రెంటిని విడిచిపెట్టునో అతడు నాకు ప్రియమైనవాడు.

(రాఘవేంద్రులు) ఎవ్వడు తన దేహమున్నంతవఱకు భగవంతుడుతప్ప ఇతర వస్తువులలో సంతోషించుటలేదో, నకాంక్షతి = జ్ఞానము భక్తి వైరాగ్యము వీటికంటె అన్యమైన దానిని అపేక్షించుటలేదో, జ్ఞానము భక్తి వైరాగ్యము వీటికంటె అన్యమైన శుభాశుభములను త్యజించినవాడో అతడు నాకు ప్రియమైనవాడు (స్వకీయము) రెండవఅధ్యాయము 56-వ శ్లోకము, 9-వ అధ్యా 28-వ శ్లోకములను చూడుడు.

శ్లో॥ సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః॥ 18

శ్లో॥ తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్।
అనికేతస్స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః॥ 19

పద॥ సమః - శత్రౌ - చ - మిత్రే - చ - తథా - మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు - సమః - సంగవివర్జితః॥
,, తుల్యనిందాస్తుతిః - మౌనీ - సంతుష్టః - యేన - కేన - చిత్।
అనికేతః - స్థిరమతిః - భక్తిమాన్ - మే - ప్రియః - నరః॥

| | | | |
|---|---|---|---|
| శత్రౌ చ | శత్రువునెడను | తుల్యనిందాస్తుతిః | నింద, స్తుతి వీటిని సమముగ గొన్నవాడున్ను |
| మిత్రేచ | మిత్రునియెడను | మౌనీ | మౌనముగలవాడున్ను |
| సమః | సమమైన వాడున్ను | యేన కేన చిత్ | ఏదిగిట్టెనో దానితో |
| తథా | అ విధముగనే | సంతుష్టః | సంతోషము జెందినవాడును |
| మానావమానయోః | మానమునందును అవమానమునందును | అనికేతః | నివసించుటకు ఒకస్థానము ఏర్పరచుకొననివాడున్ను |
| శీతోష్ణసుఖదుఃఖేషు | శీతము ఉష్ణము సుఖము దుఃఖము వీటిలో | స్థిరమతిః | పరమార్థ విషయమున మనఃస్థైర్యముగలవాడున్ను |
| సమః | సమానమైనవాడును | భక్తిమాన్ నరః | భక్తిగలవాడునైన మనుష్యుడు |
| సంగవివర్జితః | ఆసక్తిలేనివాడున్ను | మే ప్రియః | నాకు ప్రియుడు. |

తా॥ శత్రువు, మిత్రుడు, మానావమానములు, శీతోష్ణ సుఖదుఃఖములు, వీటిలో సమముగనున్నవాడును, ఒకదానియందును ఆసక్తి లేనివాడును, నిందాస్తుతులలో సమముగనున్నవాడును, మౌనముగనున్నవాడును, ఎంత లభించినను అందులో సంతోషమొందినవాడును, స్థిరమైన వాసస్థానములేని వాడును, పరమార్థ విషయమున స్థిరబుద్ధిగలవాడును, భక్తిగలవాడునైన మనుష్యుడు నాకు ప్రియమైనవాడు.

(శంకరులు) మౌనీ - సంయతవాక్ = వాక్కు నణచినవాడు, సంతుష్టః = శరీరము నిలబడుటకు కారణమైన, విడువరాని ఆహారము మొదలగువాటిచే మాత్రము తృప్తిచెందినవాడు. "యేనకేన చిదాచ్ఛన్నో యేనకేనచిదాశ్రితః। యత్రక్వచన శాయీస్యాత్ తం దేవాబ్రాహ్మణం విదుః" స్వయముగా లభించిన ఏ విధమైన వస్త్రాదులనైనను ధరించుటయు, ఏది లభించెనో దానిని భుజించుటయు, ఎచ్చోట నిద్రవచ్చునో (ఆచోటు ఇట్టిదని గమనింపకయే) ఆచోట పరుండుకొను వాడుగ నెవ్వడు గలడో వానిని దేవతలు బ్రాహ్మణుడని చెప్పెదరు. అని మహాభారతము శాంతి పర్వముమోక్షధర్మము 245-12-లో చెప్పబడియున్నది. అనికేతః = ఎల్లప్పుడు తనకు నివాస మునకుఒకచోటును ఏర్పరచుకొననివాడు "నాఒగారే ఇంటిమీద ఆసక్తిలేదనునది మొదలైన మరియొక శ్రుతిచేతను అనుడు.

స్థిరమతిః = పరమార్థవస్తు విషయమున స్థిరమైన మనస్సుగలవాడు.

(రామానుజులు) "అద్వేష్టాసర్వభూతానాం" అనుచోట చెప్పబడినవానికంటె ఈ శ్లోక మున చెప్పబడియున్నవాడు సమీపమున సంభవించిన ద్వేషము మొదలగువాటివలన కలతచెందు వాడు కాదనుదానిని చూపుటకై ఈ శ్లోకమున మఱల చెప్పబడినది.

(రాఘవేంద్రులు) సంగవివర్జితః = ఫలాపేక్షలేనివాడు, తుల్యనిందాస్తుతిః = స్తుతిని నిందవలె తలంచువాడు. అనికేతః — అ = విష్ణువు, నికేతః = వాసస్థానము. అనగా విష్ణువునే వాసస్థానముగ గలవాడు. స్థిరమతిః = కుతర్కముచే చలించని మనస్సుగలవాడు.

శ్లో॥ యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥　20

పద॥ యే - తు - ధర్మ్యామృతం (1) - ఇదం - యథా - ఉక్తం - పర్యుపాసతే।
శ్రద్దధానాః - మత్‌పరమాః - భక్తాః - తే - అతీవ - మే - ప్రియాః॥

| | | | |
|---|---|---|---|
| యేతు | ఎవ్వరైతే | యథోక్తం | చెప్పినప్రకారము |
| శ్రద్దధానాః | నమ్మకముగలవారై | పర్యుపాసతే | బాగుగ ననుష్ఠించుచున్నారో |
| మత్పరమాః | నేనే మేలైనదిగగల | తే | వారలు |
| భక్తాః | భక్తులై | మే | నాకు |
| ధర్మ్యామృతమిదం | ధర్మమునుండి నివర్తించని ఈ యమృతమును | అతీవ ప్రియాః | మిక్కిలి ప్రియమైనవారలు |

తా॥ చెప్పబడియున్న అద్వేషము మొదలగు ఇట్టి ధర్మములైన మోక్ష సాధనములను నమ్మినవారలుగను, నన్నే ఉత్తముడని పొందినవారుగను ఎవ్వరనుష్ఠించుచున్నారో అట్టి భక్తులు నాకు మిక్కిలి ప్రియమైనవారు.

(1) ధర్మ్యామృతం ధర్మామృతమని పాఠము. ఇట్టి ధర్మమేదనగా ఇందలి 13-వ శ్లోకము మొదలు 16-వ శ్లోకము వఱకు చెప్పివచ్చినవే. ఆ ధర్మములు మోక్షమునకు కారణములు. కావున అమృతమని జెప్పబడినవి. (శ్రీధరులు) ధర్మ్యః = విష్ణుః - విష్ణువిషయమై నందున ఇది ధర్మ్యమనియు. మృతం = మరణము - మొదలగు సకల దుఃఖములను పోగొట్టి ముక్తినిచ్చునది కావున అమృతమనియు చెప్పబడినది. (మధ్వులు)

(శంకరులు) పరమార్థజ్ఞాననిష్ఠలో నిలబడువారై అక్షరోపాసకులైన సన్న్యాసుల నుద్దేశించి ''అద్వేష్టాసర్వభూతానాం'' అని మొదలుపెట్టిన ధర్మము లన్నిటిని ఇందులో భగవంతుడు ముగించుచున్నాడు.

యే = ఏ సన్న్యాసులు. ధర్మ్యామృతం = ధర్మమునుండి వివర్తించని, అనగా సత్ప్రవర్తన నిండిన అమృతము. మరణింపకుండుటకు సాధనమైనందున ద్వేషములేకుండుట, కోరికలేకుండుట, ఓర్పు మొదలగువాటిని అమృతమనుడు — (అమృతము = మరణింపకుండుట ముక్తియనబడును). ఈ విధముగ ''అమృతమును'' అనుదానికి అద్వేషము మొదలగు మోక్షసాధనములను అని అర్థముచేయుడు. క్రింద జెప్పిన ''ఏ ప్రాణిని ద్వేషించనివాడు'' (12 - 13) అనునది మొదలుకొని చెప్పబడిన నన్నే, గొప్పదనుకొన్న నశించనివస్తువైన నన్నే అన్నిటికన్న మేలైన గతియని గ్రహించిన భక్తులై యథార్థజ్ఞానమనే శ్రేష్ఠభక్తిలో ప్రవర్తించినవారై ''నేను జ్ఞానికి మిక్కిలి ప్రియమైన వాడను'' (7-17) అని యేది గుర్తింపజేయబడినదో దానిని విస్తరించి చెప్పి ''వారలు నాకు మిక్కిలి ప్రియులు'' (12 - 20) అని యిచ్చట పూర్తిచేయఁబడినది. సత్ప్రవర్తననిండిన క్రింద గనుపఱచిన యీ మోక్షసాధనముల ననుష్ఠించువాడు అంతటనున్న పరమేశ్వరుడైన భగవంతునికి మిక్కిలి ప్రియుడగుచున్నాడు. కావున సంసారమునుండి విముక్తి చెందగోరినవారై విష్ణువునకు ప్రియమైన గొప్పస్థితిని బొందగోరువాడు సత్ప్రవర్తననిండిన యీ మోక్షసాధనములను ప్రయత్నముతో ననుష్ఠించవలెననునది యీ ప్రకరణమందలి తాత్పర్యమనుట.

ఓంతత్పదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే భక్తియోగోనామ
ద్వాదశోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ ఉపనిషత్తులుగ బ్రహ్మవిద్యగ యోగశాస్త్రముగ నున్న
శ్రీ కృష్ణార్జున సంవాదమున భక్తియోగమను
పంౘ్రెండవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు

త్రయోదశాధ్యాయ ప్రారంభః

# పదమూడవ అధ్యాయము

## (క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము)

◆◆◆◆◆◆◆◆◆◆◆◆

అర్జున ఉవాచ :—

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ।
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ॥

పద॥ ప్రకృతిం - పురుషం - చ - ఏవ - క్షేత్రం - క్షేత్రజ్ఞం - ఏవ - చ।
ఏతత్ - వేదితుం - ఇచ్ఛామి - జ్ఞానం - జ్ఞేయం - చ - కేశవ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | క్షేత్రజ్ఞమేవచ | క్షేత్రజ్ఞుని |
| హే కేశవ ! | ఓ కేశవ ! | జ్ఞానం | జ్ఞానమును |
| ప్రకృతిం | ప్రకృతిని | జ్ఞేయం చ | ఎరుంగవలసిన వాటిని |
| పురుషం చైవ | పురుషుని | ఏతత్ | వీటిని |
| క్షేత్రం | క్షేత్రమును | వేదితుం ఇచ్ఛామి | తెలియకోరుచున్నాను. |

తా॥ అర్జునుడు కృష్ణపరమాత్మను గూర్చి చెప్పినది — ఓ కేశవ ! ప్రకృతి నిన్ని పురుషునిన్ని క్షేత్రమునున్ను క్షేత్రజ్ఞునిన్ని జ్ఞానమునున్ను ఎరుంగ వలసిన వాటినిన్ని తెలియకోరుచున్నాను.

(స్వకీయము) ఈ శ్లోకము శంకరులు, శ్రీధరులు, రామానుజులు, రాఘవేంద్రులు వీరి వ్యాఖ్యానములు గల పుస్తకములలోగాని, మరికొన్ని పాతపుస్తకములలోగాని లేదు. చెన్నపట్టణ మున ద్రావిడాక్షరమున ముద్రింపబడియున్న శంకరభాష్యముతోచేరిన కొన్ని పుస్తకములలోను మూలముమాత్రముగల కొన్ని పుస్తకములలోను, బంగాళము బొంబాయిదేశములలో దేవనాగరా క్షరమున ముద్రింపబడియున్న మూలమాత్రముగల కొన్ని పుస్తకములలోను, కలకత్తాలో ముద్రింపబడియున్న మహాభారతమునందును ఈ శ్లోకము 13-వ అధ్యాయము మొదటి శ్లోకముగ ముద్రింపబడియున్నది. శంకరభాష్య పీఠికలో 700 శ్లోకములుగ ఈ గీత వేదవ్యాసమహర్షిచే చేయ బడినదని చెప్పబడియున్నది. ఈ శ్లోకమును గూడ చేర్చి లెక్కించిన 701 శ్లోకములగుచున్నవి. ఒక్కశ్లోక మధికముగ నుండుటవలన ఒకటి క్రొత్తగా చేర్చబడియుండవలెను. అది యీ శ్లోకమే యని పాతపుస్తకముల ననుసరించి నిశ్చయింపదగియున్నది. రాబోవు శ్లోకము రెండవ శ్లోకమని యిందు గుర్తింపబడియున్నను అది భాష్యము మొదలగు వాటిలో మొదటి శ్లోకముగనే గుర్తింపబడి యుండుటను గుర్తింపవలెను.

~~~~~~~~
~~~~~~~~

భగవానువాచ :—

శ్లో॥ ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

పద॥ ఇదం - శరీరం - కౌంతేయ - క్షేత్రం - ఇతి - అభిధీయతే।
ఏతత్ - యః - వేత్తి - తం - ప్రాహుః - క్షేత్రజ్ఞః - ఇతి - తద్విదః॥

| | | | |
|---|---|---|---|
| శ్రీ భగవానువాచ | శ్రీ భగవంతుడు చెప్పినది | అభిధీయతే | చెప్పబడుచున్నది. |
| హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! | ఏతత్ యఃవేత్తి | దీనినెవ్వడు ఎరుంగునో |
| ఇదం | ఈ | తం క్షేత్రజ్ఞఇతి | అతనిని క్షేత్రజ్ఞుడని |
| శరీరం | శరీరము | తద్విదః | దాని నెరింగినవారలు |
| క్షేత్రమితి | క్షేత్రమని | ప్రాహుః | చెప్పుచున్నారు. |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ చెప్పినది—ఓ కౌంతేయ! భోగమునకు కారణమైన యీ శరీరము క్షేత్రమని చెప్పబడుచున్నది. ఇట్టి క్షేత్రమును ఎవ్వడు తాను తనది అని తలంచునో అతనిని క్షేత్రజ్ఞుడని క్షేత్ర, క్షేత్రజ్ఞుల నెఱింగిన వారలు చెప్పుచున్నారు.

"క్షేత్రజ్ఞమితి" అని పాఠము, అర్థమున బేదములేదు. (శ్రీధరులు) (శంకరులు) :— ఇందలి ఏడవ అధ్యాయమున (4, 5. శ్లోకములలో) ఈశ్వరునియొక్క రెండు ప్రకృతులు గుర్తింపబడియున్నవి. వాటిలోనొకటి అపరాప్రకృతి. అనగా సంసార హేతువైనట్టియు, ఎనిమిది విధములుగ జెప్పబడినట్టియు, త్రిగుణములను బడసినదే. ఇది క్షేత్రమని చెప్పబడుచున్నది. మఱి యొకటి పరాప్రకృతి, అనగా జీవభావమునుపొందిన యీశ్వరుని స్వరూపముగనున్నది. ఇట్టి రెండు ప్రకృతులచే ఈశ్వరుడు జగత్తుయొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారణమగుచున్నాడు. క్షేత్రము క్షేత్రజ్ఞుడనెడి యీ రెండు ప్రకృతులను బడసిన ఈశ్వరుని తత్వనిశ్చయముఃకొరకు జ్ఞానులే ధర్మము ననుష్ఠించుటవలన భగవంతునికి ప్రియమైన వారలుకాగలరో దానిని తెలియబఱచుటకై యీ యధ్యాయము ప్రారంభింపబడుచున్నది, గడచిన పన్నెండవ అధ్యాయమున తత్వజ్ఞానులగు సన్న్యాసులకు నిష్ఠ, అనగా వారు నడచువిధము చెప్పబడినది. అయితే వారలు ఎట్టి యథార్థజ్ఞానముతో గూడినవారలై మునుపుచెప్పిన కర్మల ననుష్ఠించుటవలన భగవంతునికి ప్రియమైన వారగుచున్నారు అను నీ విషయమును గలిగినదై యీ యధ్యాయము మొదలుపెట్టబడుచున్నది.

ఇక త్రిగుణాకారమైన ప్రకృతియైనది శరీరములు, ఇంద్రియములు, ఇంద్రియ విషయములు వీటినన్నిటి యాకారముగ పరిణమించి భోగము మోక్షము అనుఫలములను పురుషుడు చేసికొనుటకై దేహేంద్రియములు మొదలగు నాకారముగ నొకటిగా చేర్చబడియున్నది. అట్టి యీ చేరికయే యీ శరీరము. కావుననే భగవంతుడు ఇందు కనుబరచినట్లు చెప్పుచున్నాడు. 'ఇదం= ఇది' అను సర్వనామముచే చెప్పబడినది శరీరమని విశేషించి చెప్పబడుచున్నది. ఈ శరీరము చెరుపునుండి కాపాడబడుటవలనను, నశించుటవలనను, అరుగుటవలనను, క్షేత్రమున ధాన్యము వలె ఇందు కర్మఫలము పండుటవలనను్ను క్షేత్రమని చెప్పబడుచున్నది. ఇదం = అనుపదము క్షేత్రమనుపదమునే అర్థముగ గొన్నది. ఈ శరీరమనెడి క్షేత్రమును ఎవ్వడెరుంగునో, అనగా అరికాలు మొదలు తల పైభాగమువరకు జ్ఞానముచేనందుచున్నాడో, స్వభావజ్ఞానముచేగాని ఉపదేశ

జ్ఞానముచేగాని తనకంటె వేరుగ విషయపరచి యెరుంగునో, అట్లెరుంగువానిని క్షేత్రజ్ఞుడని చెప్పుచున్నారు. ఎవ్వరు చెప్పుచున్నారు? ఆ క్షేత్రమును క్షేత్రజ్ఞునిఎరింగినవారలు, 'ఇతి' అనుపదము క్షేత్రజ్ఞుడనుపదమునే అర్థముగాగొన్నది.

(రామానుజులు) ఈ అధ్యాయమున దేహము ఆత్మ (జీవుడు) వీటిస్వరూపము, దేహము యొక్క వాస్తవజ్ఞానము, దేహమునువిడచి ఆత్మస్వరూపము పొందుటకు కావలసిన ఉపాయము, విముక్తాత్ముని శోధనము, ఆత్మకు ప్రకృతిసంబంధము గలిగినందులకు కారణము, వీటినెఱింగి వివేకముతో అనుసంధానము చేయవలసిన విధము ఇవి చెప్పబడుచున్నవి. (ఈ శ్లోకమునకు తాత్పర్యమేమనగా) భోగమునకుకారణమైనది దేహము. భోగముననుభవించువాడు జీవుడు (ఆత్మ). దేహమున్ను ఆత్మయున్ను వేర్వేరుఅయినను, అజ్ఞానులు నేను దేవుడను, నేను మనుష్యుడను, నేను బలిసియున్నాను, నేను చిక్కియున్నాను అని దేహమును జీవునితోచేర్చి దేహమేఆత్మయని వ్యవహరించుచున్నారు. దేహమువేరు, ఆత్మవేరు అని యెరింగినవారు ఆ దేహమును క్షేత్రమని చెప్పుచున్నారు. ఎవ్వడు అవయవములతోగూడిన యీదేహము తనదనియు దేహమేతాననియు నెరుంగునో అతనిని (ఆ ఆత్మను) దేహమువేరు, ఆత్మవేరని యెరింగినవారలు క్షేత్రజ్ఞుడని చెప్పుచున్నారు. జీవాత్మస్వరూపము ఇంద్రియములకు గోచరముగానిదిగను మనస్సుచేధ్యానించి యెఱుంగదగినది గను నున్నందున ధ్యానించి మనస్సువలన నెఱుంగ శక్తిలేని అవివేకులు దేహమే యాత్మయని తలంచుచున్నారు.

(రాఘవేంద్రులు) మునుపటి పన్నెండు అధ్యాయములలో చెప్పియున్న సంగతులు బుద్ధిలో నాటుకొనుటకై సంగ్రహించి యీ యద్యాయమున చెప్పబడుచున్నవి. "ఇదం శరీరం" అనినందుచే ఈ శరీరమునకు కారణముగనున్న అవ్యక్త మహదహంకారాదులు అని గ్రహించవలెను. ఈ అవ్యక్తాదులు క్షేత్రమని చెప్పబడుచున్నవి. అవి (క్షేత్రజ్ఞుడైన) భగవంతునికి వాసస్థానమైనందున వాటికి క్షేత్రమని పేరువచ్చెను. ఇట్టి క్షేత్రమగు అవ్యక్తాదులను ఎఱుంగువాడు క్షేత్రజ్ఞుడు భగవంతుడు అని క్షేత్రక్షేత్రజ్ఞుల నెఱింగినవారలు చెప్పుచున్నారు.



శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ॥ 3

పద॥ క్షేత్రజ్ఞం - చ - అపి - మాం - విద్ధి - సర్వక్షేత్రేషు - భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయోః - జ్ఞానం - యత్ - తత్ - జ్ఞానం - మతం - మమ॥

| | | | |
|---|---|---|---|
| హే భారత! | ఓ భరతవంశమున బుట్టినవాడా! | క్షేత్రక్షేత్రజ్ఞయోః | క్షేత్రముక్షేత్రజ్ఞుడు వీరలయొక్క |
| సర్వక్షేత్రేషు | సకల క్షేత్రములలోను (ఉన్న) | జ్ఞానం యత్ | జ్ఞానమేదికలదో |
| క్షేత్రజ్ఞం | క్షేత్రజ్ఞుని | తత్ | అది |
| మాం చాపి | నేనుగనే | జ్ఞానం ఇతి | మంచి జ్ఞానమని |
| విద్ధి | యెరుంగుము | మమ మతం | నాయొక్క మతము (నిశ్చయము) |

తా॥ ఓ అర్జునా! సకల దేహములలోను నన్నే క్షేత్రజ్ఞునిగ నెఱుంగుము. దేహము, ఆత్మ, వీటి వివేకజ్ఞానము (ఆత్మ ఇట్టివాడు, దేహమిట్టిది అను వివేకము) ఏది గలదో అదియే జ్ఞానమని నాయొక్క నిశ్చయము.

ఈ మొదటి యర్ధశ్లోకమును కూర్మపురాణము ఉత్తరభాగము 4-వ అధ్యాయములో చూడుడు.

(శంకరులు) ఈవిధముగ క్షేత్రక్షేత్రజ్ఞులు ఇరువురును వివరింపబడిరి. శరీరమునెరుగు వాడైన ఆత్మ, ఆ శరీరముకన్న వేరుఅనే యింతమాత్రజ్ఞానముచేతనే వారే యెరుగగలిగినవారలా? అనిన అట్లుకాదు. అంతటిజ్ఞానము మాత్రముచాలదు. మరియేమనిన, అదియిందులో చెప్పబడు చున్నది. మునుపుచెప్పిన క్షేత్రజ్ఞుని జనించి మరణించి పొరలు లోకమునందలి ప్రాణిగానట్టి పరమేశ్వరుడైన నేనని యెఱుంగుము. ఎవ్వడు క్షేత్రములన్నిటిలోను క్షేత్రజ్ఞుడై బ్రహ్మమొదలు గడ్డి వరకుగల క్షేత్రములగు అనేక ఉపాధులచే పలువిధములుగ వేరుపడియున్నాడో అతనిని ఉపాధులయొక్క ఎట్టిమార్పును లేనివాడుగను, ఉన్నది, లేనిది, మొదలగు మాటలకును, తలంపు కును గోచరము గానివాడుగను తెలిసికొనుము అని తాత్పర్యము. ఓ భారత! క్షేత్రము, క్షేత్రజ్ఞుడు ఈశ్వరుడు వీరలస్థితిని తప్ప ఎరుంగవలసినది మఱియొకటి మిగిలియుండలేదు. కావున ఎరుంగ బడు వస్తువులైన క్షేత్రక్షేత్రజ్ఞులు ఏజ్ఞానముచే ఎఱుంగబడెదరో అట్టిజ్ఞానము యథార్థజ్ఞానమని అంతట వ్యాపించిన వస్తువైన యీశ్వరుడైన నాయొక్క తాత్పర్యము. అట్లైన క్షేత్రములన్నిటిలోను ఈశ్వరుడొక్కడే యున్నాడేగాని వానిలోను వేరుగ ననుభవించువాడు మఱియొకడులేడు, అట్లనిన ఈశ్వరుడు సంసారియని చెప్పవలసివచ్చును. లేక ఈశ్వరుడు దప్ప మఱియొక సంసారి లేనం దున సంసారము లేకుండవలెను, అవి రెండును తగనివి. ఏలనగా అప్పుడున్ను బంధమోక్షముల నున్ను వాటి కారణములనున్ను గూర్చిన గ్రంథములు వ్యర్థములు గావలెను, మఱియు సంసారము లేదనుట ప్రత్యక్షము మొదలగు ప్రమాణములకు విరుద్ధమగును. మఱియు ప్రపంచమున వెవ్వే రైన భేదమును చూచుటవలన పుణ్యాపాపములవలన నగు సంసారము అనుమానింపబడుచున్నది. ఆత్మయు ఈశ్వరుడును ఒక్కడే యని యుండిన ఇవి యన్నియు సంగతముగావే యని యాక్షేపిం చిన అది సరియైనదికాదు. జ్ఞానమునకును అజ్ఞానమునకును గల భేదముచే అవి యన్నియు సంగ తములు గాగలవు. "దూరమేతే విపరీతే విషూచీ అవిద్యాయా చ విద్యేతి జ్ఞాతా" అజ్ఞానమనియు జ్ఞానమనియు నెఱుంగబడిన వెవ్విగలవో ఆ రెండును తమలో మిక్కిలి మారుబాటు గలిగినవి, వెవ్వేరు ఫలముల నిచ్చునవి. ఆ విధముగనే "శ్రేయశ్చ ప్రేయశ్చ" (కఠో 2-24) అని ఫలమున మార్పున్నట్లు గుర్తించి చూపబడియున్నది, శ్రేయస్సన్నది విద్యావిషయమైనది, ప్రేయస్సన్నది అవిద్యాకార్యము, ఆ విధముగనే వ్యాసులు "ద్వావిమావథ పంథానౌ" "ఇమౌ ద్వావేవ పంథానౌ" ఈ రెండు మార్గములున్నవి, ఈ మార్గములు రెండే అని అనుగ్రహించియున్నాడు. ఇచ్చట గీత లోను రెండు మార్గములు చెప్పబడియున్నవి. అవిద్యను దాని కార్యముతో నివర్తింపజేయవలె నన్నది శ్రుతిచేతను స్మృతిచేతను యుక్తిచేతను స్పష్టమగుచున్నది. "ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహ వేదీ న్మహతీ వినష్టిః" నేను బ్రహ్మమని ఈ లోకమున నెవ్వడెఱుంగునో అతనికి వెంటనే వాస్తవమైన కైవల్యము గలదు, ఎవ్వడు ఆ విధముగ నీ లోకమున నెఱుంగలేదో అతనికి గొప్ప చెరుపు గలుగును. (కేనోపనిషత్ 2-5) "తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పంథా విద్య తేఽయ నాయ" అతనిని (ఆత్మను) ఈ విధముగ నెఱింగినవాడు ఇచ్చట మరణించనివాడగును. చేరవలసిన చోటికి మఱియొక మార్గము లేదు. (పురుషసూక్తము) "విద్వాన్న బిభేతి కుతశ్చన" విద్వాంసుడు దేనినుండియు భయపడుటలేదు. (తైత్తిరీయోపనిషత్ 2-4) అజ్ఞానినిగూర్చి ముందు రాబోవు శ్రుతులను చూడుడు —

"అథ తస్య భయం భవతి" ఐతే అతనికి భయముగలదు. (తై 2-7) "అవిద్యాయా మన్తరే వర్తమానాః" అజ్ఞానములో నుండువారలు జనించి మరణించి కష్టపడుచున్నారు. (కఠ 2-5) బ్రహ్మవేద బ్రహ్మైవభవతి" బ్రహ్మము నెవ్వడెరుంగునో అతడు బ్రహ్మముగనేయున్నాడు. (ముండక 3, 2, 9,) "అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథా పశు రేవం సదేవానాం" ఇతడు వేరు నేను వేరని ఎవడు ఉపాసించునో అతడెరుంగనివాడు. మనుష్యులకు పశుపక్ష్యాదులు ఏ విధముగనగునో ఆ విధముగ నతడు దేవతలకు "ఆత్మవిత్ యః సఇదం సర్వం భవతి" = ఆత్మ నెరింగిన వాడెవ్వడో అతడు ఇవియన్నియుగనున్నాడు. (బృహదా-1-4-10) "యదాచర్మవత్" = ఎప్పుడు తోలువలె ఆకాశమును ఒకడు చుట్టగలడో అప్పుడున్ను అతనికి ఆత్మను ఎరుంగక దుఃఖము నివర్తింపదు. (శ్వేతాశ్వ 6-20) ఇట్లు సహస్ర సంఖ్యాకములైన శ్రుతులు గలవు. స్మృతులు "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః" "ఇహైవతైర్జితస్సర్గో" (భగవద్గీత అధ్యా॥ 5, శ్లో॥ 15, 19) మఱియు "మనుష్యులు పాములను, ముండ్లను, బావిని ఎరింగి దూర ముగ బోవుచున్నారు. కొందఱు అజ్ఞానముచే వాటిలో బడుచున్నారు. జ్ఞానమునందలి గొప్పదన మును బడసియుండుటను తెలిసికొనుము" అను మహాభారతము శాంతిపర్వము మోక్షధర్మము (201-16) లో చెప్పబడియున్నది. మఱియు దేహము మొదలగువాటిలో ఆత్మబుద్ధిగలవాడైన అజ్ఞాని రాగద్వేషములచే జయింపబడి మంచి చెడ్డలను చేయువాడై జనించుచున్నాడు, మరణించుచున్నాడు అనునదియు, దేహము మొదలగువాటికంటె వేరుగ నాత్మను చూచెడివారలు నివృత్తిమార్గమునుండి సంసారమునుండియు విముక్తి చెందుచున్నారనునదియు, ఎవ్వనిచేతను యుక్తిచే నిషేధింప జాలనివి. కావున క్షేత్రజ్ఞుడు ఈశ్వరుడుగనే యున్నవాడై అవిద్యవలన గలిగిన ఉపాధుల మారు బాటుచే సంసారివలె నగుచున్నాడు. ఆత్మ దేహము మొదలగు నాకారము గలవాడుగ బాహ్య జ్ఞానము గలవానికి కనబడుచున్నాడనుడు.

దేహము మొదలగు ఆత్మ కానివాట్లలో ఆత్మత్వబుద్ధియైనది ప్రాణులన్నిటికిని సాధారణ ముగ నున్నది. అవిద్య యను నంధకారము స్తంభమున మనుష్యుడను తలంపువలె నిశ్చితముగ నున్నట్టిది. దీనిచే మనుష్యుని స్వభావము స్తంభమునకు రాజాలదు. స్తంభముయొక్క స్వభావము గూడ మనుష్యునకు రాదు. ఆ విధముగనే శరీరమునకు చైతన్యములేదు. సుఖము దుఃఖము మోహము మొదలగు దేహధర్మముగూడ చైతన్యముగల ఆత్మకు తగదు. వృద్ధాప్యము, మరణము వలె అవిద్య అంధకారమగుటయేగాని వేరు లేనందున ఈ విధముగ నున్నప్పుడు చేయుటయు అను భవించుటయునైన సంసారము ఎరుంగబడు వస్తువైన క్షేత్రమునందున్నట్టిదై ఎరింగెడి వస్తువైన ఆత్మయెడ అజ్ఞానముచే ఆరోపింపబడి యున్నదనునది నిశ్చితము. దీనివలన ఎరింగెడి వస్తువునకు ఎట్టి చేటును కలుగదు. పిల్లలచే ఆకాశము గిన్నెవలె లోపలి వంపును, మఱికిని గలదని అజ్ఞాన ముచే తలంపబడుటచే ఆకాశమున కెట్టి చెరుపును కలుగకుండుటవలె, భగవంతుడన్ని క్షేత్రము లలో నున్నను క్షేత్రజ్ఞుడైన ఆ ఈశ్వరునికి సంసారిత్వముయొక్క వాసనగూడ సందేహింపదగినది గాదు. అజ్ఞానముచే ఆరోపింపబడిన ధర్మములచే దేనికిన్ని ఉపకారముగాని, అపకారముగాని లోకమునందెచ్చోటను కానవచ్చుట లేదుగదా.

మఱియు మారుబాటులేని ఆకాశమువలె అంతట నున్న రూపములేని ఆత్మకు ఒకదానితో చేరుటయు విడచిపెట్టుటయు తగదు. కావున క్షేత్రజ్ఞుడు ఎల్లప్పుడు ఈశ్వరుడని ఏర్పడినది. "అనాదిత్వాన్నిర్గుణత్వాత్" అనాది యనుటచే, నిర్గుణమనుటచే అని ఈశ్వరుడు ఈ అధ్యా॥ 31-వ శ్లోకమునందును చెప్పియున్నాడు.

ఈశ్వరుడున్ను క్షేత్రజ్ఞుడున్ను ఒక్కటని చూచి బ్రహ్మము నెఱింగినవాడు విధి నిషేధము లలో ప్రవర్తింపడు. ఆ విధముగనే ఆత్మ లేదని చెప్పువాడున్ను జన్మాంతరము లేదని వాటిలో ప్రవర్తింపడు. ఐతే శాస్త్రము ననుసరించువాడు విధి నిషేధ స్వరూపమైన శాస్త్రముయొక్క ఉప దేశము వేరు విధముగ సరిపడనందున ఆత్మ యున్నదని అనుమానించుకొన్నవాడై ఆత్మయొక్క మహత్త్వమును నెరుగ జూడనివాడై కర్మఫలములో నాసక్తి గలుగజేయింపబడి విధులలో నమ్మక ముతో ప్రవర్తించుచున్నాడనియు, నిషేధములనుండి తొలగుచున్నాడనియు ప్రత్యక్షముగనున్నది. కావున శాస్త్రము వ్యర్థమగుటలేదు.

అవిద్యయు దాని వ్యాపారమున్ను క్షేత్రజ్ఞుడైన తటస్థవస్తువునకు లేదు. మఱియు ఆ యథార్థ జ్ఞానము వాస్తవమైన వస్తువును నిషేధింపజాలదు. ఎండమావుల జలము ఊషరక్షేత్రమును తడిపి బురద జేయజాలనట్లు అనుడు.

అజ్ఞాని ఫలమును గోరువాడైనందున కర్మలో తలబెట్టుచున్నాడు. నిర్వికారియైన ఆత్మను జూచెడి జ్ఞాని యనగా ఫలమును గోరువాడుకాడు. కావున దేహేంద్రియముల చేరికవలన గలుగు వ్యాపారము తొలగగా అతడు కర్మనుండి తొలగెనని ఉపచారవాదముచే చెప్పబడుచున్నది.

కావున ఈశ్వరుడున్ను క్షేత్రజ్ఞుడున్ను ఏకమైనచో ఈశ్వరుడు సంసారియని చెప్పవలసి వచ్చునే యను నాక్షేపణమునకు అజ్ఞానమువలన కల్పితమైన దోషముచే ఆ కల్పనకు ఆధారముగ నున్న యథార్థవస్తువు చెడజాలదనియు, ఆ విధముగనే ఎండమావుల నీటిచే ఇసుకభూమి బురద గాజాలదను దృష్టాంతమున్ను చూపబడినది. లేక సంసారికాడు అనుదానివలన సంసారము లేకుం డుట కావలెనను నాక్షేపణమునకు సంసారమున్ను సంసారియు అవిద్యచే కల్పితములైనవను న్యాయముచే సమాధానము జెప్పబడినది.

జ్ఞానాకారమై నిర్వికారిగనే యున్న ఆత్మ నెరుంగు వస్తువనునది ఉపచారవాదము. అగ్నికి ఉష్ణమాత్రముచే దహించుట యను వ్యాపారమెట్లు ఉపచారవాదమో ఆ విధముగనే అవిద్యచే నేర్పడినవియేయైన క్రియ కారకము మొదలగునవి ఆత్మయెడ ఉపచారవాదముచే చెప్పబడుచున్నవి. క్రియ కారకము ఫలము అను వీటి యాకారముగ నుండుట ఆత్మయెడ స్వయముగనే లేదనునది భగవంతునిచే ఇచ్చట (గీతలో) బోధింపబడియున్నది. "య ఏనం వేత్తి హంతారం'' మొదలగు శ్లోకములచే చూడుడు.

ఆత్మ శరీరముకంటె వేరుగ నున్నదను జ్ఞానము మాత్రమే కర్మిష్ఠులకు కావలనేగాని ఆత్మ ఆకలి మొదలగు స్వభావము లేనిదను జ్ఞానమక్కరలేదనునది శాస్త్రమందలి తాత్పర్యము.

క్షేత్రజ్ఞుడు నేనని చెప్పుటవలనను, క్షేత్రక్షేత్రజ్ఞ వివేకమే జ్ఞానమని చెప్పినందునను ఈశ్వ రుడే క్షేత్రజ్ఞుడనియు, ఆ ఈశ్వరుడు ఇట్టివాడు, క్షేత్రమిట్టిది అని ఎరుంగునట్టిదే జ్ఞానమనియు ఏర్పడుచున్నది. ఇందువలన ఈశ్వరునికే సంసారబంధమున్ను మోక్షమున్ను అని యగుచున్నది. సంసారబంధమును గలవాడు ఈశ్వరుడు కాజాలడు. ఈశ్వరుడన్నచో అతనికి సంసారబంధమనునది కూడదు. కావున ఈశ్వరుడే క్షేత్రజ్ఞుడని చెప్పుటతగదను నాక్షేపణము సరియైనదిగాదు. ఈశ్వరునికి సంసారము మొదలగునవి ఎప్పుడును లేవు. అవిద్యచే ఈశ్వరునియెడ సంసారము మొదలగునవి ఆరోపింపబడుచున్నవి. అది యెట్లనగా ఎండమావులలో నీరున్ను, సీసములో వెండియు, త్రాడులో సర్పమున్ను, అజ్ఞానముచే నెట్లు ఆరోపితమో ఆ విధముగనే స్వభావమున సంసారాదిబంధముగల

వస్తువున్నచో దానికి నివృత్తియనునదే తగదు. నివృత్తికలదనిన అది స్వభావముగాదు. ఆగంతుక మనియే చెప్పవలెను, ఎట్లనగా అగ్నికి ఉష్ణత్వము స్వభావము. ఉష్ణత్వముతొలగిన అగ్నికి స్థితియున్నదా? లేదు. జలమునకు శైత్యము స్వభావము. అగ్ని సంబంధముగలిగిన శీతలస్వభావముమారి అగ్నిస్వభావమైన ఉష్ణముగమారుచున్నది. ఆ యుష్ణము శాంతమైన పిదప మరల శీతలమగుచున్నది. జలమునకుష్ణము ఆగంతుకమైనందున నివృత్తికలదు. కావున ఈశ్వరునియెడ సంసారము ఆరోపితమే. అట్టి యారోపమునకు కారణము అవిద్యయను నజ్ఞానమే. ఆత్మ వాస్తవమున అవిద్యగలవాడుగాడు. చంద్రుడు రెండుగ కనబడిన అట్లు గనబడుట దోషమగు నేత్రము యొక్క ఉపాధిచేతనేగాని వాస్తవమైనదిగాదు. నేత్రముయొక్క దోషమగు నుపాధిని పోగొట్టి చూచిన చంద్రుడు రెండనునది ఆరోపితమే యని తెలియగలదు. ఆ విధముగనే సంసారము మొదలగు బంధమున్ను మోక్షమున్ను వాస్తవమున నాత్మకులేవు. ఆత్మయొకదానిని విడువ వలసినదిలేదు. ఒకదానిని పొందవలసినదిలేదు. కావున ఆత్మయగు నీశ్వరుడు అవిక్రియుడు. అవిద్యచే సంసారము వానియెడ నారోపింపబడు చున్నది. సకల వికారములున్ను అవిద్యా కార్యము అని ఎరింగెడి జ్ఞానమే జ్ఞానము, అనునదియే నామతము అని తాత్పర్యము.

దేహాత్మవివేకజ్ఞానముదప్ప తదితర జ్ఞానము జ్ఞానముగాదు. ఎట్లు నిష్కామకర్మయే కర్మ అయి, మిగత సకామకర్మ కర్మకానేరదో, ఆ విధముగనే మోక్షసాధనమైన ఆత్మానాత్మజ్ఞానమే జ్ఞానము. మిగత జ్ఞానమంతయు అజ్ఞానము. అట్టియాత్మ ఎవ్వడనగా "తత్త్వమసి" యనువాక్యము యొక్క లక్ష్యార్థమైన చిత్స్వరూపముగను సకల దేహములలోను అనుగతముగను నున్నట్టిదేది గలదో అదియే. ఇట్టి జ్ఞానమే జ్ఞానము.

(రామానుజులు) క్షేత్రజ్ఞుడు, జీవుడని మునుపటి శ్లోకమున జెప్పినదానికి విరుద్ధముగ క్షేత్రజ్ఞుడు నేనని ఈ శ్లోకమున జెప్పబడియున్నదే యనిన విరోధములేదు. ఎట్లనగా జీవుడు భగవంతుని శరీరము. జీవునికి భగవంతుడుశరీరి. కావున తన శరీరమే తానని చెప్పబడినది. అట్లు చెప్పఁదగునా యనిన జీవుడున్ను భగవంతుడున్ను వేరైనను పరమాత్మనువిడిచి జీవుడు వేరుపడక యుండుటయను అపృథక్ సిద్ధత్వముచేతను, శరీరశరీరిభావముచేతను జీవుడనునేననియే భగవంతుడు చెప్పెను. దేనివలెననగా నేను దేవుడను, నేను దేవతను, నేను మనుష్యుడను, అని చెప్పబడగా దేవమనుష్యాద్యాకారము దేహమును బట్టినదేకాని ఆత్మనుబట్టినదిగాదు. దేహమున్ను ఆత్మయు వెవ్వేరుగనుండగా ఆ దేహమును నేనని చెప్పుటవలె భగవంతుని, జీవుని అభేదముగ జెప్పుట అయినది. కావున భగవంతుడు తానే క్షేత్రజ్ఞుడనని చెప్పుకొనుచున్నాడు. క్షేత్రజ్ఞుడుతానని ఏకారణముచే భగవంతుడు చెప్పెనో అదేకారణముచేత క్షేత్రముకూడ తానని భగవంతుడు చెప్పినట్లు ఈ శ్లోకమందలి 'అపి' శబ్దముచే గ్రహింపవలెను. క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపభేదమునున్ను అవి పరమాత్మను ఆత్మగ గలవనుదానినిన్ని ఎరుంగుటయే ఉత్తమమైనదియు, ఈ శ్లోకమున జెప్పఁబడినదియునైన జ్ఞానము.

(రాఘవేంద్రులు) జీవునకు అల్పక్షేత్రజ్ఞాన ముండుటవలన అతనిని క్షేత్రజ్ఞుడని చెప్పగూడదు. అవ్యక్తమహదాది సకల క్షేత్రములలోను నన్ను క్షేత్రజ్ఞుడుగ నెరుంగుమనునదే తాత్పర్యము. క్షేత్రజ్ఞుడు జీవుడుకాడు. ఈ విధముగ నెఱుంగుటయే జ్ఞానము.

శ్లో॥ తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చయత్।
సచ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥

పద॥ తత్ - క్షేత్రం - యత్ - చ - యాదృక్ - చ - యత్ - వికారి - యతః - చ - యత్।
సః - చ - యః - యత్ప్రభావః - చ - తత్ - సమాసేన - మే - శృణు॥

| | | | |
|---|---|---|---|
| తత్ క్షేత్రం | ఆ క్షేత్రము | యత్ప్రభావశ్చ | ఎటువంటి మహిమగలవాడో |
| యచ్చయాదృక్చ | ఎట్టి రూపముగలదో ఎట్టి స్వభావములగలదో | తత్ | దానిని (అంతను) |
| | | సమాసేన | సంగ్రహముగ |
| యద్వికారి | ఎట్టి వికారముగలదో | మే | నాయొక్క వాక్యముచే |
| యతశ్చయత్ | దేనినుండి యేదిగలుగుచున్నదో | శృణు | వినుము. |
| స చ యః | (క్షేత్రజ్ఞుడైన) అతడెవ్వడో | | |

తా॥ ఆ క్షేత్రము ఎట్టి స్వరూపముగలదో, ఎట్టి గుణములుగలిగినదో, ఎట్టి వికారముగలిగినదో, దేనివలన గలిగినదో, ఆ క్షేత్రజ్ఞుడు ఎట్టి స్వరూపము గలవాడో, ఎట్టిమహిమలను బడసినవాడో, వాటిని సంక్షేపముగ నావద్దనుండి వినుము.

(శంకరులు) క్షేత్రమును గూర్చిన ఈ యధ్యాయమందలి విషయమును తరచుగ జెప్పునట్టి ఈ శ్లోకము మొదలు, క్షేత్రక్షేత్రజ్ఞులలక్షణము విస్తరింపబడుచున్నది. నిర్దేశించి తెలియపరచబడిన ఈ క్షేత్రము ఏ యాకారముగలదనుదానిని, ఎట్టిధర్మము అనగా స్వభావము గలదను దానిని, ఎట్టి వికారములు అనగా మార్పు గలదనుదానిని తెలిసికొనుము. దేనినుండి ఏది? అనగా ఏ కారణమునుండి ఏ కార్యము గలుగుచున్నదనుదానినిగూడ తెలిసికొనుము. 'కార్యము కలుగుచున్నది' అను వాక్యము విశేషించి నిలబడుచున్నది. క్షేత్రజ్ఞుడుగ గుర్తింపబడి తెలియజేయబడినవాడు ఎవ్వడను దానిని, ఉపాధులైన ఏ శక్తులను బడసినవాడను దానిని తెలిసికొనుము. ఈ విధముగ విశేషింపబడిన క్షేత్రక్షేత్రజ్ఞుల యాథార్థ్యమును సంగ్రహముగ నా మాటలచే వినుము. దానిని విని నిర్ణయించుకొనుమనిభావము. ఇందలి 'చ' శబ్దములన్నియు ఏవకారార్థ వాచకములు. క్షేత్రక్షేత్రజ్ఞులను అన్నివిధములచేతను ఎరుంగవలెననుదానిని తెలియబరచుచున్నది.

(రామానుజులు) యచ్చ = ఏ వస్తువు, యాదృక్చ = వేటికి ఆశ్రయమైనదో, యతశ్చ = ఎట్టి ప్రయోజనమునకై కలిగినదో, యత్ = ఎటువంటి స్వభావముగలదో దానిని వినుము.

(రాఘవేంద్రులు) క్షేత్రం = అవ్యక్తమహదాదులైనవి. యతశ్చ = ఏ పురుషునిచే నడుపబడునట్టిదిగనున్నదో, స చ = అట్లు నడుపువాడు మొదలగు దానినివినుము.

---

శ్లో॥ ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః॥ 5

పద॥ ఋషిభిః - బహుధా - గీతం - ఛందోభిః - వివిధైః - పృథక్ :
బ్రహ్మసూత్రపదైః - చ - ఏవ - హేతుమద్భిః - వినిశ్చితైః॥

| | | | |
|---|---|---|---|
| ఋషిభిః | ఋషులచే | హేతుమద్భిః వినిశ్చితైః | యుక్తులతోగూడిన నిశ్చిత జ్ఞానము గలుగజేయునట్టి |
| బహుధా | పలువిధములుగను | | |
| వివిధైఃఛందోభిః | పలుఛందస్సులచేతను | బ్రహ్మసూత్రపదైశ్చైవ | బ్రహ్మమును గుర్తించు సకల పదములచేతను |
| పృథక్ | వెవ్వేరుగను | | |
| గీతం | పాడబడినది | (గీతం) | పాడబడినట్టిది |

తా॥ (క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపము) అనేక విధములుగ ఋషులచేతను, పలువిధములైన వైదిక ఛందస్సులచేతను, వేర్వేరుగ పాడబడియున్నది. యుక్తితో గూడినట్టియు, సందేహములేక అర్థములను స్థాపించి నిశ్చయజ్ఞాన మును గలుగజేయునట్టియు, బ్రహ్మసూత్రపదములచేతను జెప్పబడియున్నది.

(శంకరులు) ఎరుంగగోరిన క్షేత్రక్షేత్రజ్ఞుల అట్టి యాథార్థ్యమును (ఉన్నట్టిస్థితిని) విను వానికి రుచిగలుగజేయుటకై స్తోత్రము జేయుచున్నాడు. ఋషులచే వసిష్ఠుడు మొదలగువార్లచే పాడబడినది, చెప్పబడినది. ఛందస్సులు ఋక్ మొదలగునవి పలుపలువిధములైన - వేర్వేరుగ - విడదీసి విడదేసి వేటినిగైకొని బ్రహ్మమెరుంగబడుచున్నదో అవి పదములనబడుచున్నవి. బ్రహ్మ మును గుర్తించు మాటలగు ఆపదములచే క్షేత్రక్షేత్రజ్ఞుల యధార్థస్థితియైనది, "పాడబడెను" అని యనివర్తించును. ''ఆత్మేత్యేవోపాసీత'' ఆత్మయనియే ఉపాసించవలెను. (బృ 1-4-7) అనునది మొదలైన బ్రహ్మసూత్రపదములచే (బ్రహ్మముగ గుర్తించు మాటలచే) ఆత్మయెరుంగబడుచున్నది. కారణము బడసిన యుక్తితోగూడి నిశ్చయముగలిగి, సంశయములేనివై. నిశ్చయబుద్ధిని గలుగ జేయునవై యని తాత్పర్యము.

(శ్రీధరులు) (క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూపము మొదలగునవి) వసిష్ఠాది ఋషులచే యోగ శాస్త్రమున ధ్యానధారణము మొదలగు విషయములకు యోగ్యములుగ చెప్పబడియున్నవి. వైరాజ విరాడ్రూపము మొదలగు పలురూపములుగను చెప్పబడియున్నవి.

''పలువిధములైన వేదములచేత'' నిత్యకర్మలను జెప్పునది, నైమిత్తిక కర్మలను జెప్పు నది, కామ్యకర్మలను జెప్పునది మొదలగు పలువిధవేదములచేత. "ప్రత్యేకముగను"-క్షేత్రము పలు విధములైన కర్మానుష్ఠానములకు యోగ్యమైనట్టిదిగను, క్షేత్రజ్ఞుడు యజ్ఞాది కర్మానుష్ఠానములో పలువిధములైన దేవతాస్వరూపిగను, ''బ్రహ్మసూత్రపదములు" బ్రహ్మసూత్రమనునది, బ్రహ్మము యొక్క స్వరూపమును జూపించెడి ఉపనిషత్తులలో తటస్థ లక్షణములైన ''యతోవా ఇమాని భూతాని జాయన్తే'' మొదలగు వాక్యములు. పదమనునది స్వరూపలక్షణములగు ''సత్యం జ్ఞాన మనంతం'' మొదలగు వాక్యములు. లేక, వేదవ్యాసులుజేసియున్న వేదాంతసూత్రములోని పదములు.

వీటిచే క్షేత్రజ్ఞునిగూర్చి పలువిధములుగ జెప్పబడియున్నది. ఇట్లు విస్తారముగ జెప్పబడి యున్నందున నేను సంగ్రహముగ జెప్పెదను వినుము, అనునది తాత్పర్యము.

(స్వకీయము) తటస్థలక్షణమనగా కొంతకాలముండుట, కొంతకాలములేకుండుటయగు సగుణ బ్రహ్మలక్షణము. స్వరూపలక్షణమనగా ఎల్లప్పుడు మారకుండుటయను నిర్గుణ బ్రహ్మ లక్షణము.

(రామానుజులు) క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపము పరాశరులు మొదలగుఋషులచే బహు విస్తా రముగ జెప్పబడియున్నది. విష్ణుపురాణమున 2 వ అంశము 13 వ అధ్యా - 66 - 70 - 70½ శ్లోకములు) ఓ రాజా! నేను, నీవు, మిగతవారలు, దేహములుగమారి నిలబడుచున్న పృథ్వి మొద లగు పంచభూతములచే మోయబడుచున్నాము. ఈ భూతవర్గములున్ను గుణముల ప్రవాహమున బడి దానివశముచే నడచుట మొదలగు వ్యాపారములను బడసియున్నవి. సత్త్వము మొదలైన ఆ గుణములుగూడ కర్మలకు వశమైయున్నవి. అట్టికర్మలు అవిద్యచే సంపాదింపబడియున్నవి. ఆ యవిద్య సకలప్రాణులయెడ నున్నది, ఆత్మయనగా శుద్ధముగను, నాశములేనిదిగను, ఆకలి మొద లగు షడూర్ములు లేనిదిగను, సత్త్వాది గుణరహితముగను గుణమయమైన ప్రకృతికంటె వేరైనది గనునున్నది. (పైయధ్యా-19 వ శ్లో-) ''దేహమే యాత్మయనిన ఆ దేహము తల, కాలు, చెయ్యి

మొదలగు అనేకవస్తురూపమైనందున నే అవయవమున అపదమును ప్రయోగింపదగును?'' (పై అధ్యా 102 - 103 శ్లో.) 'నీ వెవ్వడు? శిరస్సా మెడయా. కడుపా, లేక కాలుమొదలగు వాట్లలో నేదైననా? ఓ రాజా! ఈ విధముగ సకల అవయవములకంటెను వేరుగనిలబడు నీవు బాగుగనాలోచించి నేనెవ్వడనని చింతించుకొనుము, విష్ణుసహస్రనామమున (136 వ శ్లో) ''ఇంద్రియాణి మనోబుద్ధిః సత్త్వంతేజోబలంధృతిః। వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రంక్షేత్రజ్ఞమేవచ॥'' అనుదానిచే ఇంద్రియాది సకలమున్ను వాసుదేవస్వరూపమనియు చెప్పబడియున్నది. ఇట్లు ఋషులచే బహువిధముగ జెప్పబడియున్నది,

''వేదములచే ప్రత్యేకముగను బహువిధములుగను జెప్పబడియున్నది'' అనగా ఋగ్యజుస్సామాథర్వణము మొదలగు వేదములచే క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపము వెవ్వేరుగ జెప్పబడియున్నది. తైత్తిరీయోపనిషత్తుచే ఆత్మనుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలమునుండి పృథివి (భూమి), భూమినుండి పైర్లు, పైర్లచే అన్నము, అన్నముచే దేహము అని క్షేత్రమనే శరీరమునుజెప్పి ఈ శరీరముకంటె అన్యుడై లోపలనుండువాడు ప్రాణమయుడు, అతని కంటె లోపలనుండువాడు మనోమయుడు, అనిచెప్పి ఇతనికంటె లోపల నుండువాడు విజ్ఞానమయుడు. ఇతడే క్షేత్రజ్ఞుడు. ఇతడే జీవుడు. క్షేత్రమునకంటె అన్యుడైన జీవునికంటె అన్యుడు ఆనందమయుడు. ఇతడే పరమాత్మ, అని క్షేత్రజ్ఞునిగూర్చి ఈ విధముగ వేదాదులలో జెప్పబడియున్నది,

''బ్రహ్మసూత్రపదములు'' అనగా ''నవియదశ్రుతేః'' మొదలగు సూత్రములచే క్షేత్రస్వరూపమున్ను, ''జ్ఞోత ఏవ'' మొదలగు సూత్రములచే క్షేత్రజ్ఞస్వరూపమున్ను చెప్పబడియున్నది. ''పరాత్తు తత్ శ్రుతేః'' మొదలగు సూత్రములచే భగవంతునిచే నియమింపబడుటవలన క్షేత్రము క్షేత్రజ్ఞుడు రెండును భగవత్స్వరూపమేయని చెప్పబడియున్నది.

ఈ విధముగ విస్తరించి చెప్పబడియున్న దానిని నీకు సంగ్రహముగ చెప్పెదనని భగవంతుడు చెప్పినట్లు తాత్పర్యము.

(స్వకీయము) ఈ శ్లోకమున గుర్తించిన 'బ్రహ్మసూత్రపదములు' అనునవి శ్రీమహావిష్ణుని అంశావతారుడైన వేదవ్యాసమహర్షిచే ప్రకటింపజేయబడినట్టియు, శ్రీ మచ్ఛంకరాచార్యులు మొదలైన భాష్యకారులచే భాష్యము జేయబడి యున్నట్టియు బ్రహ్మసూత్రములే.

---

శ్లో॥ మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః ॥ 6

,, ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥ 7

పద॥ మహాభూతాని - అహంకారః - బుద్ధిః - అవ్యక్తం - ఏవ - చ ।
ఇంద్రియాణి - దశ - ఏకం - చ - పంచ - చ - ఇంద్రియగోచరాః ॥
ఇచ్ఛా - ద్వేషః - సుఖం - దుఃఖం - సంఘాతః - చేతనా - ధృతిః ।
ఏతత్ - క్షేత్రం - సమాసేన - సవికారం - ఉదాహృతమ్ ॥

| | | | |
|---|---|---|---|
| మహాభూతాని | ఆకాశాది పంచమహాభూతములు | ఇచ్ఛాద్వేషః | కోరిక ద్వేషము |
| అహంకారః | అహంకారము | సుఖందుఃఖం | సుఖము దుఃఖము |
| బుద్ధిః | బుద్ధి | సంఘాతః | (ఇంద్రియములయొక్క) చేరిక |
| అవ్యక్తమేవచ | అవ్యక్తమున్ను | చేతనా | జ్ఞానాత్మక అంతఃకరణవృత్తి |
| | ఇంద్రియములు | ధృతిః | ధైర్యము |
| దశ | పదియు | సవికారం | (అను) వికారములతోగూడిన |
| ఏకం చ | మఱియు (మనస్సు) ఒక్కటియు | ఏతత్ క్షేత్రం | ఈ క్షేత్రము |
| ఇంద్రియగోచరాః | ఇంద్రియవిషయములు | సమాసేన | సంగ్రహముగా (నెత్తి) |
| పంచ చ | ఐదున్ను | ఉదాహృతం | చెప్పబడినది. |

తా॥ ఆకాశాది పంచమహాభూతములు అహంకారతత్త్వము, బుద్ధితత్త్వము, అవ్యక్తము, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పది, మనస్సొక్కటి, ఇంద్రియ విషయములైదు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియముల చేరిక, జ్ఞానాత్మకమైన అంతఃకరణవృత్తి, ధైర్యము, ఇట్టి వికారములతో గూడిన ఈ క్షేత్రము (దేహము) సంక్షేపముగ జెప్పబడినది.

(శంకరులు) స్తుతింపబడినందున ఆతురత గల అర్జునునకు భగవంతుడు ఇందు కనబరచినట్లు ప్రసాదించుచున్నాడు. నేల, నీరు మొదలగు వికారములన్నిటిని, మారుబాటులన్నిటిని వ్యాపించియున్నందున అవి మహాభూతములనుడు. ఇవి సూక్ష్మభూతములు, స్థూలములు కావని గ్రహింపవలెను. ఏలనగా స్థూలభూతములనగా ఇంద్రియ విషయములు, అను మాటచే ఇక జెప్పబడుచున్నవి. అహంకారమనగా నేనను తలంపుతో నుండుట. ఇట్టి యహంకారము మునుపు జెప్పిన మహాభూతములకు కారణముగ నున్నట్టిది. బుద్ధి యనునది నిశ్చయాకారముగ నున్నట్టిది. (ఇదియే మహత్తత్త్వము) ఇది అహంకారమునకు కారణమైనది. ఈ బుద్ధికి కారణము అవ్యక్తము. అవ్యక్తమనగా ప్రకటముగా లేనట్టిది. వికారమును అనగా మారుబాటును పొందనిది. "నాయొక్క మాయ దాటుట కరుదైనది." అని మాయగను ఈశ్వరశక్తిగను చెప్పబడినట్టిది. ప్రకృతి ఎనిమిది విధములను దానిని గుర్తించుటకై స్పష్టముగ "ఏవ" అను పదము ప్రయోగింపబడియున్నది. ఈ విధముగ ప్రకృతి ఎనిమిది విధములుగ విడివడియున్నది. "ఏవ చ" అను వాటిలో 'చ' శబ్దము తన్మాత్ర మొదలగు మారుబాటులను ఒకటిగా జేర్చు తాత్పర్యము గలిగినది. చెవి మొదలగు ఐదు ఇంద్రియములున్ను జ్ఞానమును గలుగజేయునట్టివి గావున జ్ఞానేంద్రియములనబడును. చెయ్యి మొదలగు ఐదును పనులు చేసి ముగించునవి గావున కర్మేంద్రియములనబడును. ఇట్లు అవి పదియగును. ఇకను ఒకటి గలదు. అది ఏది? జ్ఞాన (స్మరణ) ఆకారముగ నున్న మనస్సు. ఇది పదకొండవ ఇంద్రియము. శబ్దాది విషయములు ఐదు. ఇట్లు ఇవి ఇరవైనాలుగు (24) తత్త్వములని సాంఖ్యులచే చెప్పబడుచున్నవి.

ఇక వైశేషికులు వేటిని ఆత్మయొక్క గుణములని చెప్పెదరో అట్టి ఇచ్ఛ మొదలగునవి గూడ క్షేత్రముయొక్క ధర్మములేగాని క్షేత్రజ్ఞుడైన ఆత్మయొక్క ధర్మములు కావని భగవంతుడెత్తి చెప్పుచున్నాడు.

ఇచ్ఛ యనగా ఒకడు ఏ పక్షమున జేరిన వస్తువును సుఖమిచ్చునదిగ చూచునో, ఆ పక్షమున జేరిన వస్తువును మఱల జూచునప్పుడు సుఖమిచ్చునదని ఆ వస్తువును చేబట్టగోరుట. కావుననే ఇట్టి

ఇచ్ఛ అంతఃకరణముయొక్క ధర్మమందురు. ఇది ఎరుంగబడు వస్తువైనందున క్షేత్రమనబడును. ఆ విధముగనే ద్వేషముగూడ ననుడు. సుఖమనునది అనుకూలమై శాంతము గలిగి సత్త్వగుణా కారమై నిలబడునది. దుఃఖమనునది ప్రతికూలాత్మకమైనది. ఇవియు ఎరుంగబడు వస్తువైనందున క్షేత్రమగును. సంఘాతః = అనగా శరీరము ఇంద్రియములు అనువాటి చేరిక, చేతనా = అనగా ఇట్టి దేహేంద్రియముల చేరికలో బైటబడిన అంతఃకరణవృత్తి. బాగుగ కాగిన లోహపు ముద్దలో నిప్పు వ్యాపించి బైటబడుటవలె దేహేంద్రియముల చేరికలో అంతఃకరణవృత్తి బైటబడుచున్నది. నిప్పు లోహపుముద్దలో వ్యాపించి బైటబడినదై ఆ లోహపుముద్దయే నిప్పుని గ్రహించునట్లు చేయు చున్నది. ఆ విధముగనే ఆత్మజ్ఞానము, అనగా స్వరూపజ్ఞానము అంతఃకరణవృత్తిలో బైటబడినదై ఆ బుద్ధి వృత్తినే ఆత్మ యని తెలియబఱచుచున్నది. కాన స్వరూపజ్ఞానముయొక్క ఆభాసదృశ్యము చేత వ్యాపింపబడిన ఆ బుద్ధివృత్తియే "చేతనా" అనునది (ఇచ్చట తెలియబరచునట్టిది మొదలగు నవి ఉపచారము) ఇదిగూడ ఎరుంగబడువస్తువైనందున క్షేత్రమగును. భగవంతుడు ఇచ్చట రాగము మొదలగు పదములచే వాటి జాతిలో జేరిన తలంపు మొదలగు అంతఃకరణ ధర్మములన్ని టినిగూడ గుర్తించునట్లు భావింపవలెను. ఏలనగా ఇచ్చట జెప్పచుండిన క్షేత్రమునుగూర్చి ఇచ్చట ముగించుచున్నాడు కావున "సవికారం" ఈ క్షేత్రము మహత్తు (బుద్ధి) మొదలైన వికారముతో చెప్పబడినది.

(రామానుజులు) శరీరమే క్షేత్రము. మహాభూతాదులు క్షేత్రమని కొందఱు జెప్పి యున్నారు. అవి క్షేత్రములుగావు. పంచమహాభూతములు, అహంకారతత్త్వము, మహత్తత్త్వము, ప్రకృతి, ఈ ఎనిమిదిచేతను శరీరము గలిగినందున ఆ యెనిమిది తత్త్వములనున్ను క్షేత్రమని ఉపచారముగ చెప్పబడినదని గ్రహింపవలెను. ఇంద్రియములు, మనస్సు, విషయములు, అగు నీ పదహారున్ను (16) క్షేత్రము నాశ్రయించి యున్నట్టివి. ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, ఈ నాలుగున్ను దేహమువలన గలుగజేయబడినట్టివి. ఆ ఇచ్ఛ మొదలగు నాలుగున్ను ఆత్మను ఆశ్రయించినవేగాని దేహము నాశ్రయించినవిగావు. ఐనను ఆత్మ దేహమును పొందినపిదపనే అతనికి ఇచ్ఛ మొదలగు గుణములు గలుగుచున్నవి. కావున దేహము నాశ్రయించినవని చెప్పబడి యున్నది. ఇచ్ఛ మొదలగునవి ఆత్మ నాశ్రయించినట్టివని "పురుష స్సుఖదుఃఖానాం" (ఈ యధ్యా - 21-వ శ్లో॥) అనుచోట జెప్పబడినది, చేతనాధృతిః = చేతనునికి ఆధారమైనది. అనగా పంచమహా భూతాది తత్త్వసమూహములైన ఈ శరీరము స్వర్గాదులను మోక్షమునుపొందు చేతనుడైన ఆత్మకు ఆధారముగ నుండును. ఈ యాధారముద్వారా సుఖదుఃఖాదులను ఆత్మ అనుభవించుచున్నాడు. ప్రకృతిమొదలు భూమివరకు గల యెనిమిది ద్రవ్యములవలన గలిగినదిగను, ఇంద్రియముల కాశ్రయముగను, ఇచ్ఛ మొదలగువాటిని గలుగజేయునట్టిదిగను, భూతము మొదలగువాటియొక్క సమూహములిమిడిన స్వరూపముగను, సుఖదుఃఖాదుల ననుభవించుటకు ఆధారమనెడి ప్రయో జనమును బడసినదిగనునున్న క్షేత్రమనెడి శరీరము సంక్షేపముగ చెప్పబడియున్నది.

ఇచ్ఛ మొదలగునవి క్షేత్రముయొక్క వికారములు. మహాభూతాది క్షేత్రాభిమానులను, వాటి వికారములై న ఇచ్ఛ మొదలగువాటి యభిమానులను తెలియవలసియున్నందున వార్లను గూర్చి చెప్పబడుచున్నది.

| | | |
|---|---|---|
| ఆకాశమునకు | అభిమాని | విఘ్నేశ్వరుడు |
| వాయువునకు | " | ముఖ్యవాయువువలన గలిగినమరీచి |
| అగ్నికి | " | వహ్ని |

| | | |
|---|---|---|
| జలమునకు | అభిమాని | వరుణుడు |
| భూమికి | | భూదేవి |
| అహంకారతత్త్వమునకు | | శివుడు |
| మహత్తత్త్వమునకు | | బ్రహ్మ |
| బుద్ధికి | | ఉమా (పార్వతి) |
| అవ్యక్తమునకు | | లక్ష్మి |
| మనస్సునకు | | స్కంద, ఇంద్ర, అనిరుద్ధులు |
| శ్రోత్రమునకు (చెవి) | | చంద్రుడు |
| త్వక్కునకు (చర్మము) | | వాయువుయొక్క కుమారుడు |
| నేత్రమునకు (కన్ను) | | సూర్యుడు |
| జిహ్వకు (నాలుక) | | వరుణుని మరియొక రూపము. |
| ఘ్రాణమునకు (ముక్కు) | | అశ్వినీదేవతలు |
| వాక్కునకు | | అగ్ని |
| చేతికి | | వాయుకుమారులైన ఇద్దరు మరుత్తులు |
| పాదమునకు | | విష్ణువుయొక్క ఆవేశముగలవార్లుగను, శచికుమారులుగనునున్న యజ్ఞుడు, శంబు వీరలు. |
| పాయువునకు | | యముడు |
| ఉపస్థమునకు | | శివుడు, మనువు |
| శబ్దాదివిషయములకు | | శివపుత్రులైదుగురు |
| ఇచ్ఛకు | | లక్ష్మి - భారతులు (వాయువుయొక్క పత్ని భారతి) |
| ద్వేష దుఃఖములకు | | కలి ద్వాపరులు |
| సుఖమునకు | | ముఖ్యవాయువు |
| ధృతికి | | సరస్వతి-భారతులు (వాయుపత్ని) |
| చేతనకు (జ్ఞానము) | | లక్ష్మి |
| సంఘాతమునకు | | అనేకులుగలరు. |

ఈ తత్త్వములున్ను వాటి యభిమాన దేవతలున్ను భగవంతునికి వాసస్థానములైనందున క్షేత్రమని చెప్పబడుచున్నవి.



శ్లో॥ అమానిత్వమదంభిత్వమహింసా క్షాన్తిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥ 8

,, ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।
జన్మమృత్యు జరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥ 9

,, అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥ 10

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది ॥ 11

,, అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్।
ఏతద్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా ॥ 12

పద॥ అమానిత్వం (1) - అదంభిత్వం (2) - అహింసా (3) - క్షాంతిః (4) - ఆర్జవమ్ (5)ః
ఆచార్యోపాసనమ్ (6) - శౌచం (7) - స్థైర్యం (8) - ఆత్మవినిగ్రహః (9) ॥

,, ఇంద్రియార్థేషు - వైరాగ్యం (10) - అనహంకారః (11) - ఏవ - చ।
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ (12) ॥

,, అసక్తిః (13) - అనభిష్వంగః (14) - పుత్రదారగృహాదిషు।
నిత్యం - చ - సమచిత్తత్వం (15) - ఇష్టానిష్టోపపత్తిషు ॥

,, మయి - చ - అనన్య యోగేన (16) - భక్తిః - అవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వం (17) - అరతిః (18) - జనసంసది (19) ॥

,, అధ్యాత్మజ్ఞాననిత్యత్వం (20) - తత్త్వజ్ఞానార్థదర్శనమ్ (21)।
ఏతత్ - జ్ఞానం (22) - ఇతి - ప్రోక్తం - అజ్ఞానం - యత్ - అతః - అన్యథా ॥

| | | | |
|---|---|---|---|
| అమానిత్వం | తన్ను పొగడుకొనకుండుట | ఇష్టానిష్టోపపత్తిషు | ఇష్టానిష్టములువచ్చుటలో |
| అదంభిత్వం | డంబములేకుండుట | నిత్యం | ఎల్లప్పుడు |
| అహింసా | హింసజేయకుండుట | సమచిత్తత్వం చ | ఒక్కటే విధమైన మనస్సు గలిగియుండుటయు |
| క్షాంతిః | ఓర్పు | | |
| ఆర్జవం | సరియైన నడత | మయి చ | నాయెడ |
| ఆచార్యోపాసనమ్ | ఆచార్యుని సేవించుట | అనన్యయోగేన | అనన్యమైన యోగముచేత |
| శౌచం స్థైర్యం | (శరీరమనశ్శుద్ధి) మోక్షమార్గమున దృఢముగ నిలబడుట | అవ్యభిచారిణీ | చలించని |
| | | భక్తిః | భక్తియు |
| ఆత్మవినిగ్రహః | తన్ను అణచుకొనుట | వివిక్తదేశసేవిత్వం | ప్రత్యేకమైనచోటున పేక్షించు వాడగుటయు |
| ఇంద్రియార్థేషు | ఇంద్రియ విషయములలో | | |
| వైరాగ్యం | ఆసక్తిలేకుండుట | జనసంసది | సామాన్య జనసమూహమున |
| అనహంకారః ఏవ చ | తాను అను అహంకారము లేకుండుటయు | అరతిః | జుగుప్సయు |
| | | తత్త్వజ్ఞానార్థదర్శనమ్ | తత్త్వజ్ఞానముయొక్క ఫలమును చూచుటయు |
| జన్మమృత్యు జరావ్యాధిదుఃఖ దోషానుదర్శనమ్ | జననము మరణము ముసలితనము రోగము దుఃఖము వీటిలోని దోషము నెరుంగుట. | ఏతత్ | ఇదంతయు |
| | | జ్ఞానమితిప్రోక్తం | జ్ఞానమని చెప్పబడినది |
| పుత్రదార గృహాదిషు | సంతానములు, పత్ని, ఇల్లు మొదలగు వాటిమీద | అతః | దీనికంటె |
| | | అన్యథా | అన్యమైనది |
| అసక్తిః | ఆసక్తిలేకుండుటయు | యత్ | ఏదిగలదో |
| అనభిష్వంగః | అభిమానము లేకుండుటయు | తత్ అజ్ఞానమ్ | అది అజ్ఞానమగును. |

తా॥ తన పొగడ్తలేకుండుట, డంభములేకుండుట, ఇతరులకు చెరుపు చేయకుండుట, ఓర్పు, సరియైన నడత, సద్గురుసేవ, మనశ్శరీరశుద్ధి, మోక్షమార్గమున స్థిరత్వము, తన్నుఅణచుట, అహంకారము లేకుండుట, ఇంద్రియ విషయములలో ఆసక్తి లేకుండుట, జననమరణ రోగదుఃఖములలోని దోష

ములను విమర్శించుట, పుత్రుడు, పత్ని, ఇల్లు మొదలగు వాటిలో ఆసక్తి లేకుండుట, తానను నభిమానము లేకుండుట, ఇష్టానిష్టములు సంభవించినప్పుడు ఒకేవిధమైన మనస్సుతో గూడియుండుట, సకలము నాత్మస్వరూపమని తెలిసి పరమేశ్వరుడైన నాయెడ స్థిరమైన అన్యములేని భక్తి జేయుట, జనులులేనిచోట నివసించుట, అవివేకులైన జనులసమూహమునజుగుప్స (ద్వేషము), ఆత్మతత్త్వజ్ఞానమున నెల్లప్పుడునుండుట, తత్త్వజ్ఞానమునకు ఉత్తమమైన ఫలము మోక్షమని యెరుంగుట, ఇట్లు ఈ ఇరువదియు జ్ఞానమని చెప్పబడియున్నవి. దీనికంటె అన్యమైనది అజ్ఞానమే.

(1) అమానిత్వం - మానమనగా దాగినగర్వము. అదిగలవాడు మాని. మానియొక్క స్వభావము తనపొగడ్త. అదిలేనివాడు అమాని (శంకరులు). పెద్దలను అవమతింపకుండుట (రామానుజులు).

(2) అదంభిత్వం - తన ప్రవర్తనమును - గొప్పతనము మొదలగువాటికై ప్రసిద్ధపరచుట డంబము గల వానిస్వభావము. అది లేకుండుట (శంకరులు) తాను మిక్కిలి ధర్మిష్ఠుడని జనుల వలన కీర్తిబడయవలెనని ఉద్దేశించి ధర్మములను జేయుట డంభము. అదిలేకయే ధర్మమును జేయుట (రామానుజులు) తాను తక్కువైన వాడైనను మిక్కిలి తెలిసినవాడని చూపకయుండుట (మధ్వులు).

(3) అహింసా - ప్రాణులను హింసింపకుండుట (శంకరులు). వాక్కు మనస్సు దేహము వీటిచే ఇతరులకు చెరుపు చేయకుండుట (రామానుజులు),

(4) క్షాంతిః - ఇతరులు చెరుపుజేసినను మనస్సు మారకయుండుట (శంకరులు). తనకు చెరుపు జేసిన వానినిగూర్చి మనస్సునందుగూడ తలంపకయుండుట (రామానుజులు).

(5) ఆర్జవం - నేరైన స్వభావము, వంకరలేనితనము మనస్సులోనున్నట్లు వ్యవహరించుట (శంకరులు). నెరైన మార్గమునందుండుట (ఋజుత్వము) (శ్రీధరులు). ఇతరుల విషయమున మనోవాగ్దేహములచే ఒకేవిధముగ నడచుట (రాఘవేంద్రులు).

(6) ఆచార్యోపాసనమ్ - మోక్షమునకు సాధనమైన జ్ఞానమునుపదేశించిన గురువును శుశ్రూష మొదలగువాటిని జేసి సేవించుట (శంకరులు). తనకు జ్ఞానోపదేశము జేసిన గురువునకు నమస్కరించి తాను జేయవలసినదానిని అడిగి యెరింగ వారికార్యములలో సరిగా నడచుట (రామానుజులు). జ్ఞానుల సేవజేయుట (రాఘవేంద్రులు).

(7) శౌచం - మట్టిచేతను జలముచేతను దేహమునందలి మురికిని శుద్ధపరచుటయు, మనస్సునందలి కామక్రోధాదులను విడచి నిర్మలముగ నుండుటయు (శంకరులు). బాహ్యాంతరశుద్ధిః-

శ్లో॥ శౌచం తు ద్వివిధం ప్రోక్తం బాహ్యమాభ్యంతరం తథా।
మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం బావశుద్ధిస్తథాంతరం॥

జలాదులచే దేహశుద్ధి, ఆశమొదలగు వాటిని విడచుట వలన మనశ్శుద్ధి, అని రెండువిధములు (శ్రీధరులు). ఆత్మజ్ఞానమును దానికిసాధన భూతమైన దానినిన్ని సంపాదించుటకై మనోవాగ్దేహములకు గలుగవలసిన శాస్త్రోక్తమైన శుద్ధి (రామానుజులు).

(8) స్థైర్యం - మోక్షసాధనమైన ప్రయత్నమునందే స్థిరముగ నుండుట (శంకరులు). వేదాంతశాస్త్రార్థములో ఎల్లప్పుడు దృఢమైన నమ్మకముతోనుండుట (రామానుజులు). భయము మొదలగువాటివలన స్వధర్మమును విడువకయుండుట (రాఘవేంద్రులు).

(9) ఆత్మవినిగ్రహః - తాను కడతేరుటకు తనకు సహాయము జేయుటవలన తానను శబ్దముచే చెప్పబడు దేహేంద్రియములచేరికను అణచుట. స్వభావముగనే అన్ని త్రోవలలో ప్రవర్తించెడి దేహేంద్రియములను అడ్డుపరచి సన్మార్గమునందే నిలబెట్టుట. ఒకడు ముక్తి జెందుటకు శరీరమే మొదటి సాధనము. ఎట్లనగా శరీరముచే నిత్యకర్మల ననుష్ఠించగా దానివలన పుణ్యము గలుగగా దానిచే పాపము తొలగుచున్నది. దానిచే బుద్ధి బాగుబడి జ్ఞానముగలిగి ముక్తిబడయవచ్చును (శంకరులు). ఆత్మస్వరూపమున కంటె ఇతర విషయములలోని మనస్సును స్వాధీనముజేసి ఆత్మయెడనే యుంచుట (రామానుజులు). విశేషమైన మనో నిగ్రహము (రాఘవేంద్రులు).

(10) వైరాగ్యం - ఇష్టములైన ఇహపరవిషయములలో ఆసక్తిలేకుండుట (శంకరులు). ఆత్మకన్యమైన విషయములలోని దోషమునెఱింగి అది తనకు చెడుపైనదని తెలిసి భయముతో దానిలో నెల్లప్పుడు ఆసక్తితొలగియుండుట (రామానుజులు),

(11) అనహంకారః - ఆత్మశ్లాఘలేకున్నను నేను గొప్పవాడను అని మనస్సులో గర్వముగలుగ వచ్చును. అదియే అహంకారమనునది, అదిలేకుండుట (శంకరులు). దేహేంద్రియములలో తాననెడి అహంకారము లేకుండుటయు, తనవికానివస్తువులలో తనదను అభిమానములేకుండుటయు (రామానుజులు). తనయెడ లేనట్టిగుణములు తనయెడనున్నట్లు తలంచి అజ్ఞాన మొందకుండుట (రాఘవేంద్రులు).

(12) జన్మమృత్యు .... దోషానుదర్శనమ్ - జననమరణములు. వృద్ధాప్యము, రోగము, దుఃఖము వీటిలోని దోషము నెరుంగుట, అనగా జననమునందలి దోషములు గర్భవాసము మొదలగునవి, మరణమందలి దోషములు మరణవేదన మొదలగునవి వార్ధక్యము నందలి దోషము జ్ఞాపకము తగ్గిపోవుట, బలముతగ్గుట, చూపుతగ్గుట స్వజనముల వలన అవమతి మొదలగునవి. రోగమందలి దోషములు కన్ను తల మొదలగువాటిలో వ్యాధి మొదలగు వాటివలన గలుగు దుఃఖములు. దుఃఖమందలి దోషము ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము మొదలగు దుఃఖములు (తన్నుగూర్చియు, ఇతరప్రాణుల గూర్చియు రాగలదానిని ఆలోచించుట) లేక ముందుచెప్పబోవునట్లు చెప్పవచ్చును - దుఃఖములనగా చెరుపు. దానిని జననము మొదలగువాటిలో మునుపువలె నాలోచించుట. జననము దుఃఖము; మరణము దుఃఖము; వార్ధక్యము దుఃఖము; వ్యాధులు దుఃఖము; జననము మొదలగునవి దుఃఖములకు కారణమైనందుననే దుఃఖములుగాని తమ యాకారముతోనే దుఃఖములుకావు. (వాటి యాకారమే దుఃఖాకారముగాదు) అనుడు. ఈ విధముగ జననము మొదలగువాటిలో దుఃఖమని దోషము నెరుంగుటవలన దేహము ఇంద్రియములు, విషయములు వీటియొక్క భోగములమీద కోరికలేకుండుట గలుగుచున్నది. దానివలన ఇంద్రియములు ఆత్మను జూచుటకై లోపలనున్న ఆత్మన గూర్చి వెళ్లును. ఈ విధముగ జననము మొదలగువాటిలో దుఃఖమనెడి దోషము

నెరుంగుట జ్ఞానము నిచ్చునట్టిది కావున జ్ఞానమనంబడుచున్నది (శంకరులు). దేహముండు వఱకు జననము మరణమువృద్ధాప్యము, వ్యాధి, దుఃఖము మొదలగు దోషములు విడువ జాలవను ననుసంధానముతో నుండుట (రామానుజులు).

(13) అసక్తిః - ఆసక్తికి కారణమైన వస్తువులలో ప్రీతిమాత్రము సక్తి. అదిలేనితనము అసక్తి యనబడును (శంకరులు). ఆత్మనుదప్ప అన్యములైన (పుత్రదారాది) వస్తువులలో సంబంధములేకుండుట (రామానుజులు).

(14) అనభిష్వంగః - అభిమానములేకుండుట. అభిమానమనగా వేరుకాని తన్ను భావించుటయను (ఆసక్తియుంచబడిన వస్తువున్ను తానున్ను ఒక్కటేయని భావించుటయను) అధికమైన ఒక విధమైన యాసక్తియే. ఉదాహరణముగా, మఱియొకడు సుఖమునుగాని దుఃఖ మునుగాని బడసినవాడగుచుండగా "నేనే సుఖమును గలవాడను, నేనే దుఃఖమును గలవాడను" (అనుదానినిన్ని) మఱియొకడు బ్రతికియున్నప్పుడుగాని మరణించు నప్పుడుగాని "నేనే బ్రతుకుచున్నాను, నేనే మరణించుచున్నాను" (అనుదానినిన్ని) చూడుడు. ఇట్టి యాసక్తి లేనితనము అభిమానము లేనితనము ఎచ్చట అనుదానిని చెప్పుచున్నాడు. పుత్రులు, పత్ని, ఇల్లు మొదలగు వారలమీద. "మొదలగువారలు" అన్నందున మిక్కిలి ప్రియులైన తదితరులైన పనివారు మొదలగువారియెడననుడు. అవి రెండును (అసక్తిలేనితనము అభిమానములేనితనము) జ్ఞానమునకు ఉపయోగ పడుటవలన జ్ఞానమనబడుచున్నది. (శంకరులు) శాస్త్రోక్తములై కర్మానుష్ఠాన విషయ ములుదప్ప ఇతర విషయమైన వ్యవహారము లేకుండుట(రామానుజులు). పుత్రాదులలో విశేషస్నేహము లేకుండుట (రాఘవేంద్రులు).

(15) సమచిత్తత్వం - ఎల్లప్పుడు ఒకేమనస్సు గలిగియుండుట జ్ఞానసాధనము. (శంకరులు) సంతోషమును వ్యసనమును విడచియుండుట (రామానుజులు).

(16) అనన్యయోగేన - అనన్యయోగమనగా వేరుతలంపులేక ఈశ్వరుడైన నాయెడ ఒకటే సమా ధిగ నుండుట (అనగా) "భగవంతుడైన వాసుదేవునికంటె వేరొకడులేడు. కావున అతడే మనకు శరణము" అని ఈ విధముగ నిశ్చయముతోనున్న చలించనిబుద్ధి, దానిచే (భగ వంతుని) ఉపాసించుట అనన్యమైనభక్తి భజనము అవియు జ్ఞానసాధనము (శంక రులు) ఏకాంత యోగముచేత (రామానుజులు) లక్ష్మి బ్రహ్మ మొదలగు వారెవ్వరు స్వతంత్రులుకారు. ఈశ్వరుడే స్వతంత్రుడను తలంపుతో ఏకాంతభక్తి చేయుటచేత (రాఘవేంద్రులు).

(17) వివిక్తదేశసేవిత్వం — స్వభావముగాగాని · శుద్ధిజేయుటవలనగాని శుద్ధముగనున్నట్టియు దొంగలు దుష్టజనులు మొదలగునవి లేనట్టియు అడవి, నదిఒడ్డు, ఇసుకదిబ్బ, గుడి మొదలగుచోట నివసించుట. ప్రత్యేకమైనచోటగదా మనస్సు నిర్మలమగుచున్నది! కావున ఆత్మను ధ్యానించుట ఏకాంతమున బాగుగ సంభవించుచున్నందున ఏకాంత మైనచోటు నాశ్రయించిన వాడగుట జ్ఞానమనబడుచున్నది. (శంకరులు). చిత్తశుద్ధిని కలుగజేయు ప్రదేశమున (శ్రీధరులు). రహస్యమైన స్థలమున నివసించుట (రామాను జులు). జనులు లేనిదియు శుద్ధమైనదియునైన స్థలమున నివసించుట (రాఘవేంద్రులు.)

(18) అరతిః - ప్రీతిలేకుండుట (శంకరులు, శ్రీధరులు, రామానుజులు).

(19) జనసంసది - జనసమూహమనగా ఇచ్చట జ్ఞానము లేనివారలై చిన్నవారలై సత్ప్రవర్తనలేని సామాన్య జనుల సమూహము. దిద్దుపాటుచెంది జ్ఞానముగలవారలై సత్ప్రవర్తనగల వారల సమూహముగాదు, ఏలన అట్టివారలచేరిక జ్ఞానమున కుపకారమగుననుడు. కావున సామాన్య జనసమూహమున ద్వేషము గలుగుట జ్ఞానమున కుపయోగపడుట వలన అది జ్ఞానసాధనమగును. (శంకరులు).

(20) అధ్యాత్మజ్ఞాననిత్యత్వం - ఆత్మ మొదలగు వాటి స్వభావమునుగూర్చిన జ్ఞానమున ఎల్లప్పుడు స్థిరముగ నిలబడుట (శంకరులు). ఆత్మస్వరూప జ్ఞాననిష్ఠలోనుండుట (రామానుజులు). పరమాత్మజ్ఞానము సంపాదించుటలోనే ఎల్లప్పుడుండుట (రాఘవేంద్రులు).

(21) తత్త్వజ్ఞానార్థదర్శనమ్ - యథార్థజ్ఞానమైనది అమానిత్వము మొదలగు మునుపుజెప్పిన జ్ఞాన సాధనములయొక్క అభ్యాసపరిపక్వమువలన వచ్చునట్టిది, దాని ఫలము మోక్షము. సంసారము తొలగుట. దాని నాలోచించుట దర్శనమనబడును. యథార్థజ్ఞానము యొక్క ఫలము నాలోచించునప్పుడుగదా దాని సాధనముల ననుష్ఠించుటలో ప్రవృత్తి గలుగును. కావున ఇదిగూడ జ్ఞానమున కుపయోగపడుటవలన జ్ఞానమనబడెను. (శంకరులు). తత్త్వజ్ఞానార్థ చింతనమ్ = ఎల్లప్పుడు తత్త్వజ్ఞానముయొక్క ప్రయోజనమును చింతించుట (రామానుజులు). తత్త్వజ్ఞానమును సంపాదించుటకై శాస్త్రవిచారమును జేయుట (మధ్వులు), లేక తత్త్వజ్ఞానమునకు విషయుడుగనున్న విష్ణువుయొక్క దర్శనము (రాఘవేంద్రులు)

(22) జ్ఞానమ్ - అమానిత్వాదులు ఇరవైయిన్ని జ్ఞానమునకు కారణములైనందున వాటి ననుష్ఠింప వలెననుదానిని దృఢపరచుటకై జ్ఞానసాధనములైన అవి జ్ఞానమనియే చెప్పబడినది. దీనికి విపరీతమైన మానిత్వము, డంబము, మొదలగునవి సంసారము గలుగుటకు కారణములైనందున వాటిని నివర్తింపగోరి అవి యజ్ఞానమనియు చెప్పబడినవి. (శంకరులు). జ్ఞానసాధనమైనది (శ్రీధరులు). అమానిత్వాదులు ఆత్మజ్ఞానమునకు కారణములైనందున జ్ఞానమని చెప్పబడినది (రామానుజులు). అమానిత్వాదులు జ్ఞానముగను జ్ఞానసాధనముగనైనది (రాఘవేంద్రులు).

(శంకరులు) ఏ క్షేత్రముయొక్క మారుబాటు లన్నిటియొక్క చేరికయనునది ఈ శరీరమనెడి క్షేత్రమని చెప్పబడినదో అట్టి క్షేత్రము మహాభూతములు మొదలగు విభాగములుగా వేరు బడినదై ధృతివఱకు విస్తరించి చెప్పబడినది. క్షేత్రముయొక్క గొప్పతనము, స్వభావములు. ఇవి ఇక జెప్పబడును. సామర్థ్యము బడసిన ఏ క్షేత్రజ్ఞుని గూర్చిన జ్ఞానముచే అమరత్వము (మరణించకుండుట) గిట్టునో దానిని భగవంతుడు "ఎరుంగవలసినదేదియో దానిని జెప్పెదను'' అనునది మొదలుగ తానే విశేషించి చెప్పగలడు. ఐతే ఇప్పుడు జ్ఞానమునకు సాధనమైన వినయము మొదలగు ప్రవర్తనమును చెప్పుచున్నాడు. ఏదియుండిన ఒక డెరుంగవలసిన దాని నెరుంగుటకు తగిన వాడుగను అధికారము గలవాడుగనగునో దేనిలో భావము చెందిన విరక్తుడు జ్ఞాననిష్ఠుడు (జ్ఞానమార్గమున నిలకడ జెందినవాడు) అనబడునో అట్టి వినయము మొదలగు ప్రవర్తనము భగవంతుడనుగ్రహించుచున్నాడు. ఆ ప్రవర్తనము జ్ఞానసాధనమైనందున జ్ఞానమను శబ్దముచే చెప్పబడుచున్నది. (అట్టి సత్ప్రవర్తనమునకే జ్ఞానమనిపేరు.)

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥ 13

పద॥ జ్ఞేయం - యత్ - తత్ - ప్రవక్ష్యామి - యత్ - జ్ఞాత్వా - అమృతం - అశ్నుతే।
అనాదిమత్ - పరం - బ్రహ్మ - న - సత్ - తత్ - న - అసత్ - ఉచ్యతే।

| | | | |
|---|---|---|---|
| జ్ఞేయం యత్ | ఎరుంగవలసినదేదో | పరంబ్రహ్మ | పరబ్రహ్మము |
| యత్ జ్ఞాత్వా | ఒకడు దేనినెరింగి | అనాదిమత్ | ఆదిలేనిది |
| అమృతం | మరణింపకుండుటను | తత్ | అది |
| అశ్నుతే | పొందునో | సత్ | సత్తుగ |
| తత్ | దానిని | నోచ్యతే | జెప్పబడుటలేదు |
| ప్రవక్ష్యామి | బాగుగ జెప్పెదను | అసత్ న | అసత్తుగ జెప్పబడుటలేదు. |

తా॥ ఎరుంగ వలసినదైన జ్ఞేయమనునదేదిగలదో, దేనినెరింగి (జీవుడు) మోక్షమొందునో దానిని బాగుగ విస్తరించి చెప్పెదను. బ్రహ్మము ఆదిలేనిది. అదిసత్తుగ జెప్పబడుట లేదు. అసత్తుగ జెప్పబడుటయులేదు. (ఏలనగా) విధినిషేధములకు అన్యమైనందున అనునది తాత్పర్యము.

(శంకరభాష్యము) మునుపుచెప్పిన జ్ఞానమువలన నెరుంగవలసిన వస్తువేదను దానికి భగవంతుడిందులో జెప్పుచున్నాడు.

(ఆక్షేపము) అట్టైన అమానిత్వము మొదలగునవి యమనియమములే. అనగా ఒక విధమైన ఆత్మసంయమమే (తన్ను అణచుటయే). వాటివలన ఎరుంగవలసిన వస్తువెరుంగబడుట లేదు. అమానిత్వము మొదలగునవి ఒకవస్తువును నిర్ణయించునవిగ, అనగా నెరుంగునవిగా కనబడుటలేదు. మఱియు అంతటను జ్ఞానము దేనినిగూర్చినదో అట్టి ఎరుంగవలసిన వస్తువును ఆ జ్ఞానమే ఎరుంగునదిగ కనబడుచున్నది. ఒకదానినిగూర్చిన జ్ఞానముచే మఱియొక్కటి ఎరుంగబడదు. ఉదాహరణముగా ఘటమునుగూర్చిన జ్ఞానముచే అగ్ని ఎరుంగబడదు.

(సమాధానము) ఇది దోషముగాదు. ఏలనగా అవి జ్ఞానమునిచ్చునవైనందున జ్ఞానమనబడుచున్నవని చెప్పియున్నాము. అవి జ్ఞానమునకు దూరకారణమైనందునను జ్ఞానమనుడు.

''ఎరుంగవలసిన వస్తువేదో దానినున్నట్లు స్పష్టముగ జెప్పెదను'' అని భగవంతుడు వినువానికి రుచినిగలుగజేసి ఆతురతతో వినునట్లు చేయుటకై అట్టి జ్ఞానమునకు ఫలమెట్టిదని అనుగ్రహించుచున్నాడు. ఎరుంగవలసిన వస్తువును ఒకడెరింగి అమరత్వమును పొందుచున్నాడు. అనగా మరలను మరణించుటలేదని తాత్పర్యము. ఆదిలేనిదే అదియెక్కడిది? అన్నిటికంటె మేలైన బ్రహ్మమే ఎరుంగవలసిన వస్తువని ప్రకృతము మాట్లాడబడునది.

'అనాదిమత్పరం బ్రహ్మ'అను వాక్యమును కొందఱు, అనాది = ఆదిలేని. మత్ = అహంవాసుదేవాఖ్యో = వాసుదేవుడైన నేనే, పరం - పరాశక్తిః = ఉత్తమమైనశక్తిగా, యస్య = దేనికున్నానో, తత్ = అది. బ్రహ్మ = బ్రహ్మమని అర్థము చేసియున్నారు. ఇది సరియైన అర్థము నిచ్చునదైనచో ఇట్లు చేయుటయుక్తమే. అట్టి యర్థముచేత వాసుదేవుడైననన్ను ఉత్తమమైన శక్తిగా గలిగియున్నట్టిది బ్రహ్మమని తేలుచున్నది. అనగా శక్తితోనున్న సగుణమును జెప్పినట్లగును.

ఈ శ్లోకమున ప్రయోగింపబడియున్న "నసత్తన్నాసదుచ్యతే" అనుదానిచే నిర్గుణబ్రహ్మము గుర్తింపబడుచున్నదేగాని సగుణముగాదు. కావున అట్టి యర్థము సరియైనదిగాదు. 'మత్'అనునది శ్లోకపూర్తికై చేర్చబడియున్నదే గాని దానికి విశేషమైన అర్థములేదని ఎరుంగదగినది. తెలియవలసిన బ్రహ్మము సత్తుగాదు,' అసత్తుగాదని ఈ శ్లోకమున జెప్పబడినది. (సత్ అనగా ఉన్నట్టిది. అసత్ అనగా లేనట్టిది.) కావున ఉన్నదియు బ్రహ్మముగాదు, లేనిదియు బ్రహ్మముగాదు, అని జెప్పి నదగుచున్నదే. ఇది సరియైనదని చెప్పవచ్చునా ? యనిన క్రిందకనబరచిన శ్రుతి ప్రమాణములను బట్టి చెప్పవచ్చును, ఆశ్రుతులను విస్తరించి క్రిందగుర్తింపజేసి వానియర్థముగూడ వ్రాయబడు చున్నది.

"స ఏషః నేతినేత్యాత్మా అగృహ్యో న హి గృహ్యతే అశీర్యో న హి శీర్యతే అసంగో న హి సజ్జతే అసితో న వ్యథతే నరిష్యత్యేతముహైవైతేన తరత ఇతి" (బృహదారణ్యకోపనిషత్తు 6-వ అధ్యా. 4-వ బ్రాహ్మణము 22-వ వాక్యము) జ్ఞేయమనునదేదో దేనినెరుంగునో దానిని జెప్పెదను. అను నీవిధముగ జెప్పబడుటలేదు. అసత్తు (ఏలనగా విధి నిషేధములకు విషయుడుగాడు.) నాశములేనివాడైనందున నశింపజేయబడదగిన వాడుగాడు. సంగములేనివాడైనందున ఒకదాని యందును అంటువాడుగాడు. కట్టుకు లోబడక యుండుటవలన దుఃఖమొందుటలేదు నశింపదగిన వాడుగాడు. ఇట్లెరింగినవానిని పాపపుణ్యములు వెంబడించుటలేదు.

"అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమలోహిత మస్నేహమచ్ఛాయమతమః అవాయ్వనాకాశమ సంగమరసమగంధ మచక్షుష్కమశ్రోత్రమవాక్ అమనః అతేజస్కమప్రాణమముఖ మమాత్రమనం తరమబాహ్యంనతదశ్నాతికించన నతదశ్నాతి కశ్చన" (బృహదారణ్యకోపనిషత్ 5-వ అధ్యా - 8-వ బ్రాహ్మణము, 8-వ వాక్యము.)

(ఆ బ్రహ్మము) స్థూలముగాదు. అణువుగాదు. పొట్టిదిగాదు. పొడవుగాదు. ఎర్రనిది గాదు. పసగలదిగాదు. (అనగా నూనె మొదలగు ద్రవత్వముగల వస్తువువలె అంటునదిగాదు.) నీడగలిగినదిగాదు. చీకటిగాదు. వాయువుగాదు. ఆకాశముగాదు. ఒకదానితో సంబంధము గలదిగాదు. రసముగలదిగాదు. వాసనగలదిగాదు. కండ్లుగలదిగాదు. చెవులుగలదిగాదు. వాక్కు గలదిగాదు. మనస్సుగలదిగాదు. కాంతిగలదిగాదు. ప్రాణముగలదిగాదు. ముఖముగలదిగాదు. పరిమాణముగలదిగాదు. లోపలనున్నట్టిదిగాదు. వెలుపలనున్నట్టిదిగాదు. అదియొకదానిని తినుట లేదు. దానిని (ఒకప్పుడు) ఏదియు తినుటలేదు. ।

ఈ శ్రుతులవలన "విశేషప్రతిషేధేనైవనిర్దిశ్యతే" = విశేషములను నిషేధించుటవలననే బ్రహ్మము నిరూపించి చూపబడినది. ఏలనగా వాక్కు మొదలగువాటికి బ్రహ్మము విషయము గానిదైనందున ఏ వస్తువున్నట్టిదో అదియున్నదని చెప్పబడుచున్నది. ఉన్నదని ఏదిచెప్పబడు చున్నదో అది లేనేలేదు. సకలవస్తువులున్ను ఉండుట యనుదానినిగాని, లేకుండుట యనుదానినిగాని యనుసరించియే యుండును. అట్లుండగా బ్రహ్మము ఉన్నదనుబుద్ధికి (జ్ఞాన మునకు) విషయమైనదా? లేక లేదనుబుద్ధికి (జ్ఞానమునకు) విషయమైనదా? అనుపక్షమున ఇంద్రి యాదులకు విషయముగ నెప్పుడగుటలేదో అప్పుడు ఈ రెండుబుద్ధులకును విషయమైనదికాదు ఘటముమొదలగు వస్తువు ఉన్నదను బుద్ధికి విషయమగుచున్నది. లేదనుబుద్ధికిగూడ ఘటము మొదలగునదే విషయము (అదెట్లనగా ఒక వస్తువును ఎప్పుడు చూడకయు వినకయునుండగా లేదనిమాత్రము ఎట్లు జెప్పదగును? ఏవస్తువు ఇంద్రియాదులచే ఎరుంగదగునో దానినే లేదనియు చెప్పవచ్చుననునదే) కావున ఎరుంగవలసినదిగ చెప్పబడిన పరబ్రహ్మము ఇంద్రియములకు

విషయముకానందున శబ్ద (వేద)ముచేతనే ఎరుంగదగినది. అందువలననే సత్తుగాదు. అసత్తు గాదని చెప్పబడినది. (ఈ విధముగనే కేనోపనిషద్వాక్యమున) అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి = బ్రహ్మముతెలిసిన వస్తువుకంటెను తెలియని వస్తువుకంటెను అన్యమైనది. అని జెప్పబడియున్నది. ఒక వస్తువును గురించి చెప్పవలెననిన జాతి క్రియగుణము సంబంధము వీటి ననుసరించియే చెప్పవలెను. అదెట్లనగా గోవు గుఱ్ఱము మొదలగు పదములు జాతినిబట్టియు, పాఠకుడు వంటజేయువాడు. మొదలగు పదములు క్రియలనుబట్టియు, ఎరుపు నలుపు మొదలగు పదములు గుణములనుబట్టియు, ఎక్కువ ధనముగలవాడు ఎక్కువ పశువులు గలవాడు మొదలగు నవి సంబంధమునుబట్టియు చెప్పబడుచున్నవి. లోకమందలి సకలపదములున్ను వీటిలో నొకదానిని బట్టియే యున్నవి. బ్రహ్మమనగా, నిష్క్రియం = క్రియలేనిది, నిష్కలం = అవయవములేనిది, శాంతం = శాంతమైనది ఇది మొదలైన శ్రుతివాక్యము లుండుటవలన జాతి మొదలగు సంబంధములో జెప్పదగినదిగాదు. రెండువస్తువులుండినగదా ఒకదానితో మఱియొకదానికి సంబంధము చెప్ప గలము. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ = బ్రహ్మయొక్కటే రెండవదిలేదు" అనుశ్రుతివాక్యము ననుసరించి బ్రహ్మముదప్ప వేరువస్తువులు లేనందున బ్రహ్మమునకు వేరొకదానితో సంబంధము చెప్పగూడదు. కావున బ్రహ్మమును సత్తనిగాని అసత్తనిగాని చెప్పగూడదు. ''యతో వాచోనివర్తన్తే, అప్రాప్యమనసాసహ=వాక్కు దేనికి లక్షణము చెప్పజాలక మనస్సుతో వెనుకకు తిరుగుచున్నదో" అను నీశ్రుతివాక్యమును జూడుడు. ఆ బ్రహ్మము తన యాత్మయైనందున దానిని ఏ ప్రమాణమున్ను గుర్తించి చూపజాలదు. (అధ్యా 18-శ్లో 50 భాష్యమును జూడుడు).

(శ్రీధరులు) 'అనాదిమత్ పరంబ్రహ్మ' అనుచోట ఆదిలేనిది అను అర్థము 'అనాది' అనుపదముచేతనే లభించియుండగా, మత్ - అనుదానికి ప్రయోజనము లేకున్నను ఛాందస మైనందున (వేదమువంటిదైనందున) ఏల ప్రయోగింపబడినదని ప్రశ్నింపగూడదు. లేక, అనాది= ఆదిలేని, మత్పరం - మత్ = విష్ణువైన సగుణుడుగనున్న నా యొక్క, పరం = నిర్గుణస్వరూపము, బ్రహ్మ = బ్రహ్మము, తత్ = అది, సత్ నోచ్యతే = ప్రమాణముచే విధింపబడుటలేదు. నాసత్ = ప్రమాణాది నిషేధముచే నిషేధింపబడుటయులేదు. ఏలనగా ఇంద్రియగోచరము కానిదైనందుననే.

(రామానుజులు) జ్ఞేయంయత్ = జ్ఞేయమనునది, అమానిత్వం మొదలగువాటివలన ఎరుంగదగినదైన ప్రత్యగాత్మ స్వరూపము (జీవస్వరూపము) యత్ జ్ఞానత్వాఅమృతమశ్నుతే = ఏ స్వరూపము నెఱింగిన జననమరణము మొదలగు ప్రకృతి సంబంధమునుండి విముక్తి చెంది శుద్ధాత్మ స్వరూపమును చెందెనో, తత్ = అజ్ఞేయమనెడి ఎరుంగదగిన ముక్తాత్మస్వరూపము, అనాది = ఆదిలేనిది. దీనివలన (అనంతం) అంతము లేనిదనియు గ్రహింపవలెను. 'నజాయతే మ్రియతే' అను శ్రుతిని దీని యధ్యాయము 2, శ్లోకము 20 ని చూడుడు. మత్పరం = నన్నుపర మైన (ఉత్తమమైన) దేవతగగలది. జీవస్వరూపము వేరనుదానిని చెప్పియున్న "అపరేయ మితస్త్వన్యాం"అను 7 వ అధ్యా 5 వ శ్లోకమును జూడుడు. ప్రత్యగాత్మ స్వరూపము భగవంతునికి శరీరముగను శేషభూతముగనున్నది. "యఆత్మనితిష్ఠన్నాత్మనోన్తరోయం ఆత్మన వేదయస్య ఆత్మా శరీరం" "ప్రధాన క్షేత్రజ్ఞపతిః గుణేశః'' ఇటువంటి శ్రుతివాక్యములవలన ఆత్మయు (జీవుడు) జడ వస్తువులున్ను పరమాత్మకు శరీరమనియు పరమాత్మ జీవాదులకు స్వామియనియు చెప్పబడి యున్నది. బ్రహ్మ = బృహత్వం (అనగా మహత్తైన లేక పూర్ణమైన పరిమాణమును) గలిగినదియు శరీరమునకంటె అన్యమునైనక్షేత్రజ్ఞత్వము "సచానన్త్యాయ కల్పతే" అను శ్రుతిని జూడుడు. అట్టి

యాత్మకు పలుశరీరములలో నిమిడిన తక్కువ పరిమాణము స్వభావ కర్మమువలన వచ్చినది. కర్మబంధమునుండి విముక్తి జెందినవాడు మహత్పరిమాణముగల స్వరూపమును పొందుచున్నాడు. ఆత్మ పూర్ణత్వము, లేక మహత్వముగలవాడైనందున ఆత్మకు బ్రహ్మమను పదము ప్రయోగింప బడియున్నది. ఎచ్చట ఆ విధముగ ప్రయోగింపబడి యున్నదనగా "సగుణాన్స మతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే" "బ్రహ్మణోహి ప్రతిష్ఠాహం అమృతస్యావ్యయస్యచ" (ఇందలి 14 వ అధ్యా - 26-27-శ్లోకములు) "బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి। సమస్సర్వేషు భూతేషు మద్భక్తింలభతేపరాం (18 వ అధ్యా 54 వ శ్లో-) వీటిలోనే. సత్ = కార్యము, అసత్ = కారణము. జీవుడు తనయొక్క ప్రకృతి విముక్తాత్మ స్వరూపమును పొందినచో అప్పుడు అతనిని కార్యమనిగాని కారణమనిగాని చెప్పగూడదు. అతడు కార్యావస్థలోనుండునప్పుడు దేవ మనుష్యాది రూపములను పొందుటవలన అప్పుడు (సత్) కార్యమని చెప్పబడుచున్నాడు. అతడు కారణావస్థలో నుండునప్పుడు దేవాది నామరూపములు లేనందున అప్పుడు (అసత్) కారణమని జెప్పబడు చున్నాడు. "అసద్వా ఇదమగ్ర ఆసీత్। తతోవైసదజాయత" ఇత్యాది శ్రుతులనుచూడుడు. ఇట్టి కార్యకారణావస్థ కర్మస్వభావమైన అవిద్యయొక్క సంబంధమువలన గలిగినదేగాని స్వభావముగాదు. కావున సత్ అసత్ శబ్దములచే ఆత్మస్వరూపము జెప్పబడుటలేదు "అసద్వా ఇదమగ్ర ఆసీత్" అను శ్రుతివాక్యమును సకలమునకు కారణము బ్రహ్మమని చెప్పియుండగా ఆత్మకు కారణత్వ మెట్లు చెప్పదగుననిన, సర్వకారణము బ్రహ్మమనుట యుక్తమే, సూక్ష్మచిదచిద్వస్తువులైన క్షేత్ర క్షేత్రజ్ఞులున్ను బ్రహ్మముయొక్క శరీరమైనందున అట్టి శరీరముతోజేరిన బ్రహ్మమువలన జేయబడు కార్యములను శరీరముగూడ జేసినట్లే యగుచున్నది. కావున శరీరమను క్షేత్రము, క్షేత్రజ్ఞుడు వీ రిరువురు కారణముగ జెప్పబడుచున్నారు.

(రాఘవేంద్రులు) ప్రాకృతదేహేంద్రియాదులను గలిగినట్టిది ఆదిమత్ అని చెప్పబడు చున్నది. ప్రాకృతదేహేంద్రియాదులను గలిగినట్టిది ఆదిమత్ అని చెప్పబడుచున్నది. ప్రాకృత దేహేన్ద్రియాదులు లేనిది అనాదిమత్తని జెప్పబడుచున్నది. తెలిసికొన దగినది ఆ పరమాత్మయే నసత్తన్నాసదుచ్యతే = ఆపరమాత్మ, నసత్ = కార్యమను ప్రపంచమున జేరినవాడుకాడు. రెంటి కంటె అన్యుడైనందున అతనిని, సత్ - అసత్ అని చెప్పగూడదు. లేక మూర్తామూర్తములకు అతీతుడైనందున సత్ అసత్ అని చెప్పగూడదు.

(స్వకీయము) ఈ శ్లోకమున ప్రయోగింపబడియున్న సత్ అసత్ అను పదములు మునుపటి 9 వ అధ్యా - 19 శ్లో - 11 వ అధ్యా 37 వ శ్లోకమునందును ప్రయోగింపబడియున్నవి. సదరు 19 వ శ్లోకమున "సత్తు అసత్తునేను" అని భగవంతుడు చెప్పియున్నాడు. సదరు 37 వ శ్లోకముచే అర్జునుడు సదసత్తు కంటె అన్యమైన అక్షరమునీవేయని చెప్పియున్నాడు. ఈ శ్లోకము నందయితే బ్రహ్మమును సత్‌అనిగాని అసత్‌అనిగాని చెప్పగూడదని చెప్పియున్నది. ఇది పరస్పర విరుద్ధముగ గనబడుచున్నది. అయితే అట్లు విరోధములేదను దానిని ఆయాచోట్లలో భాష్యకారు లున్ను, వ్యాఖ్యాతలున్ను, పలుదృష్టాంతములతో చూపియున్నారు.

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 14

పద॥ సర్వతః - పాణిపాదం - తత్ - సర్వతః - అక్షిశిరోముఖమ్ ।
సర్వతః - శ్రుతిమత్ - లోకే - సర్వం - ఆవృత్య - తిష్ఠతి ॥

| | | | |
|---|---|---|---|
| తత్ | ఆ బ్రహ్మము | సర్వతః | అంతట |
| సర్వతః | అంతట | శ్రుతిమత్ | చెవులు గలది |
| పాణిపాదం | చేతులను కాళ్ళను గలది | లోకే | లోకమున |
| సర్వతః | అంతట | సర్వం | సకలమును |
| అక్షిశిరోముఖం | కళ్లను తలలను ముఖములను గలది | ఆవృత్యతిష్ఠతి | వ్యాపించుకొనియున్నది. |

తా॥ ఎరుంగవలసినదై (మునుపుజెప్పిన) ఆ బ్రహ్మము అంతటను చేతులను, కాళ్ళను, కండ్లను, తలలను, ముఖములను, చెవులను గలది. లోకములందన్నిటిని వ్యాపించుకొని యున్నది.

(శంకరులు) ఎరుంగవలసిన వస్తువైన (బ్రహ్మము) ఉన్నదను మాటకుగాని తలంపుకు గాని అందనందున లేదను శంకకలుగగా అన్నిప్రాణుల ఇంద్రియములనెడి ఉపాధులను గైకొని అది (బ్రహ్మము) ఉన్నదను దానిని నిరూపించుచున్నవాడై అట్టి శంకను నివర్తించుటకై చెప్పుచున్నాడు. ఏ విధముగను లేనిదై మాటకును మనస్సునకును అందనిదైన ఒకవస్తువును చూడలేము. మఱి దీనికి విపరీతమైన దానిని ఏదైననొక ధర్మమును బడసినదై మాటకును మనస్సుకును అందునట్టి వస్తువును ద్వైతమును చూచుచున్నాము. కావున బ్రహ్మము వ్యర్థమైనది, పాడైనది, అని శంకింపగా సమాధానము వెనుక జెప్పినట్లు అగును. — అది పాడైనదిగాదు. ఏలనగా అది (1) లోపలనున్న ఆత్మగనున్నది. (2) ఇంద్రియముల ప్రయత్నమునకును ఇతరమైన వాటికి కారణమైనది. (3) కల్పితమైన ద్వైతము బోధపడుటకు మూలాధారముగ నున్నట్టిది (4) ప్రపంచము నేలునట్టిది కావున అది యున్నట్టిదనుడు. ఇక "బండి మొదలగునవి తానుగనే వెళ్ళజాలవు. దానివలె జడవస్తువులైన శరీరము మొదలగు వాట్లలో జ్ఞాపకములేనిచో అవిస్వయముగనే వెళ్ళజాలవు. ప్రయత్నింపజాలవు. ఒకపనిని జేయజాలవు. కావుననే వాటిలో చేతన వస్తువుండవలెను" అను ననుమానముచే (1) "బ్రహ్మములోపలనున్న ఆత్మగనున్నట్టి అనుదానిని మొదట ప్రసాదించుచున్నాడు. ఎరుంగవలసిన వస్తువునకు చేతులును కాళ్ళును అన్నిచోట్లనున్నవి. క్షేత్రజ్ఞుడున్నాడనునది అన్నిప్రాణుల ఇంద్రియములగు ఉపాధులవలన సాధింపబడుచున్నది. ఏలనగా జడవస్తువులైన ఇంద్రియములు చేతనమును ముందుంచకయే కలుగజాలవు. మఱియు లోపలనున్న చేతనము క్షేత్రమను నుపాధివలన క్షేత్రజ్ఞుడుగ జెప్పబడుచున్నది. క్షేత్రమైతే చేతులు కాళ్ళు మొదలగువాటివలన పలువిధములుగ వేరుబడియున్నట్టిది. క్షేత్రమగు నుపాధియొక్క భేదము వలననైన మారుబాటులన్నియు క్షేత్రజ్ఞునికి భ్రమయే కావున వాటిని తొలగించి బ్రహ్మము నెరుంగవలెననునది "అదియున్నది యనబడుటలేదు. లేనిదనబడుటలేదు" (13-12) అని చెప్పబడినది. ఉపాధులు వాస్తవము కానట్టి యాకారముగలవైనను బ్రహ్మముయొక్క స్థితిని దెలియబరచుటకై ఎరుంగవలసిన వస్తువైన (దానియొక్క) ధర్మమునువలె కల్పించి "అంతట చేతులుకాళ్లుగలది" అనునది మొదలైనది చెప్పబడుచున్నది. ఆ విధముగనే సంప్రదాయము నెరింగిన వానియొక్క "అద్వైతమైన ప్రత్యేకవస్తువైనది అధ్యారోపముచేతను అపవాదముచేతను (ఎక్కించుటచేతను నిషేధించుటచేతను) వివరింపబడుచున్నది" అను వాక్యము గలదు. అధ్యారోపమనగా సర్పముగాని త్రాడున, సర్పము నారోపించుట, ఎక్కించుటవలె యథార్థవస్తువునందు అయథార్థవస్తువును

ఎక్కించుట. అపవాదమనగా త్రాడుయొక్క భ్రమాత్మకమైన దృశ్యమగు పాము, త్రాడు మాత్రముగనే నిలబడుటవలె వాస్తవమైన వ్యాపారముయొక్క అవాస్తవదృశ్యమగు ప్రపంచము వాస్తవవస్తువుగమాత్రము నిలబడుట. అంతటను అన్ని శరీరములయొక్క అవయవములుగ కన బడుచున్న చేతులు కాళ్లు మొదలగునవి ఎరుంగవలసిన వస్తువైన బ్రహ్మముయొక్క శక్తియుండుట వలన దానియొక్క సన్నిధానమాత్రము చేతనే తమకు ప్రయత్నము గలుగజేయబడయు చున్నవి. కావున ఎరుంగవలసిన వస్తువుండుటకు అవి గుర్తులగును. (కావున అవి) "ఎరుంగవలసిన వస్తు వునకు సంబంధించినవి" అను నుపచారవాదముచే చెప్పబడుచున్నవి. ఆ విధముగనే మిగతవాటిని వ్యాఖ్యానించుకొనుడు. (బ్రహ్మము) లోకమందలి ప్రాణివర్గములో నన్నిటిని వ్యాపించి నిలబడు చున్నది. నిలకడజెందుచున్నది. కదలుటలేదనుడు.

(శ్రీధరులు) బ్రహ్మము సత్తుగాదు, అసత్తుగాదని చెప్పగూడదు. ఏలయనిన లోకమందలి సకలవస్తువులున్ను సత్తుగాగాని అసత్తుగాగాని ఉండవలెనేగాని వేరు విధముగా ఉండవుగదా! "సర్వం ఖల్విదం బ్రహ్మ" "బ్రహ్మైవేదం సర్వం" ఇవి మొదలగు శ్రుతులలో సకల వస్తువులున్ను బ్రహ్మమని చెప్పబడుచున్నదిగదా! కావున బ్రహ్మము సత్తుగగాని, అసత్తుగగాని యుండవలెనని సిద్ధించుచున్నదే యనిన "పరాస్యశక్తిః వివిధైవ శ్రూయతే" మొదలగు శ్రుతులలో బ్రహ్మము అచింత్యశక్తి బడసినదని ప్రసిద్ధముగనున్నందున బ్రహ్మము ఉపాధివలన సత్ అసత్ అని చెప్ప బడుచున్నదనునది దీనిచే స్పష్టపరచబడుచున్నది.

(రామానుజులు) చేతులు మొదలు చెవులవఱకు చెప్పబడినవన్నియు పరిశుద్ధమైన ఆత్మ కున్నవనునదికాదు. ఎచ్చోటను చేతులుకాళ్ళు మొదలగు అవయవములుండిన ఆ యవయవములచే చేసికొనదగిన కార్యములు ఎట్లు చేసికొనవచ్చునో ఆ విధముగనే ప్రకృతి విముక్తాత్మ స్వరూపమును చెందిన జీవుడు అవయవములు లేకయే వాటిని జేసికొన శక్తికలవాడనునది తాత్పర్యము. ఆ ముక్తాత్మ జీవుడు సకలమును వ్యాపించుకొనియున్నాడు. "అపాణిపాదో జవనోగ్రహీతా పశ్యత్య చక్షుః సశృణోత్యకర్ణః = కాలులేకయే నడచువాడు. చేతులులేకయే గ్రహించువాడు. కన్ను లేకయే చూచెడివాడు, చెవిలేకయే వినువాడు" అనుశ్రుతిచేత పైకనినశక్తి పరమాత్మకు చెప్పబడి యుండగా ఆత్మకు ఎట్లు అట్టి శక్తులను చెప్పదగుననిన, ప్రకృతివిముక్తాత్మకు పరమాత్మతో పరమ సామ్యము చెప్పబడియున్నందున అట్టి శక్తి గలదు. "నిరంజనః పరమం సామ్యముపైతి" అను శ్రుతివాక్యముచేతను, "ఇదం జ్ఞానముపాశ్రిత్యమమసాధర్మ్యమాగతాః" అను నీ గీతావాక్యము చేతను ముక్తాత్మకు పరమాత్మతో పరమసామ్యము చెప్పబడుచున్నది.

(రాఘవేంద్రులు) ఆ భగవంతుని మహిమయే మరలను జెప్పబడుచున్నది. హరి జగద్విలక్షణమైనవాడు. ఎట్లనగా, తత్ = ఆ పరమాత్మవస్తువు, సర్వతః = సకల అవయవముల లోను, పాణిపాదం = చేతులు కాళ్ళు మొదలగు శక్తిగలది. అనగా ఒక్కొక్క అవయవమున్ను తనకంటె అన్యమైన ఒక్కొక్క అవయవముయొక్క శక్తిని గలిగినదని తాత్పర్యము. అది దేనివలన ననగా తెల్లని, నల్లని కేశముల అవతారమగు బలరాముడు కృష్ణుడు వీరలయెడ చెయ్యి మొదలగు నవయవశక్తి కనబడుటవలె. ఈ విధముగనే, సర్వతోక్షిశిరోముఖం = సకల అవయవములలోను కండ్లు, శిరస్సు, ముఖము, వీటి శక్తిని గలిగినది. సర్వతః శ్రుతిమత్ = సకల అవయవముల లోను శ్రోత్రేంద్రియశక్తిని బడసినది. దీని తాత్పర్యమేమనగా సకల ఇంద్రియములయొక్క విషయ ములను కర్మలను సకలేంద్రియములచేతను ఎరుంగునట్టిదియు చేయునట్టిదియు అనియే. లోకే =

ప్రపంచమున, సర్వం = సకలవస్తువులను, ఆవృత్య = వ్యాపించి, తిష్ఠతి = ఉన్నది. మరియొక యర్థము — ఆ పరమాత్మ సకల లోకములలోను, కండ్లు, తల, ముఖము, చెవులు మొదలగు వాటితో సకలమును వ్యాపించుకొనియున్నాడు. అనగా ఆ పరమాత్మ అణువులో నణువైన చేతులు కాళ్లు మొదలగు నవయవములతోగూడిన యనేక రూపములచే అంతట నున్నవాడై వ్యాపకరూపము చేత సకలమునందును వ్యాపించియున్నాడనునది తాత్పర్యము.

(స్వకీయము) ఈ శ్లోకమును లింగపురాణము మొదటిభాగము అధ్యా - 71 - శ్లోకము 107 లోను, వామనపురాణము అధ్యా 47 - శ్లో॥ 64 లోను చూడుడు.

శ్లో॥ సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితం ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥ 15

పద॥ సర్వేంద్రియ గుణాభాసం - సర్వేంద్రియ వివర్జితం ।
అసక్తం - సర్వభృత్ - చ - ఏవ - నిర్గుణం - గుణభోక్తృ - చ ॥

| | | | |
|---|---|---|---|
| తత్ | ఆ బ్రహ్మము | అసక్తం | దేనియందును అంటనిది |
| సర్వేంద్రియ గుణాభాసం | సమస్తములైన ఇంద్రియముల యొక్క వ్యాపారములచే ప్రకాశించునట్టిది | సర్వభృచ్చైవ | (ఐతే) అన్నిటిని భరించునట్టిది |
| | | నిర్గుణం | గుణములు లేనిది |
| | | గుణభోక్తృచ | (ఐతే) గుణములను అనుభవించు నట్టిది |
| సర్వేంద్రియవివర్జితం | (ఐతే) సమస్త ఇంద్రియములు లేనట్టిది | | |

తా॥ ఆ ఎరుంగదగిన వస్తువైన బ్రహ్మము సకల ఇంద్రియముల విషయాకారమైన వృత్తులలో ఆయా విషయాకారముగ ప్రకాశించునట్టిది. లేక సకల ఇంద్రియములనున్ను గుణములనున్ను వాటివాటి విషయములలో ప్రకాశింప జేయునట్టిది. ఐతే సకల విధములైన ఇంద్రియములు లేనట్టిది. ఒకదాని యందును అంటనిది. ఐతే సకలమునకును ఆధారమైనట్టిది. సత్త్వాదిగుణములు లేనిది. ఐతే సత్త్వాది గుణములను అనుభవించు నట్టిది.

(శంకరులు) జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములని పేరుగల చెవులు మొదలగు ఇంద్రియములు. అన్ని ఇంద్రియములు అనినందున బుద్ధి మనస్సు అనునంతఃకరణములనున్ను గ్రహింపవలెను, అంతఃకరణోపాధుల మార్గమునందే చెవి మొదలగునవిగూడ ఉపాధియగు చున్నది. కావున ఎరుంగవలసిన వస్తువు అంతఃకరణము బాహ్యకరణము అనునుపాధులచే సకల ఇంద్రియములయొక్క వ్యాపారములైన నిశ్చయించుట తలచుట వినుట మొదలగు వాటివలన ప్రకటమగుచున్నది. దానిని ఎరుంగవలసిన వస్తువు సకల ఇంద్రియములయొక్క పనులవలన వ్యాపారము ఉన్నట్టిదివలె కనబడుచున్నది. "ధ్యాయతీవ లేలాయతీవ" అను శ్రుతులచే చూడుడు.

మఱియే కారణమువలన "(బ్రహ్మము వాస్తవమున) వ్యాపారము గలిగియుండుటయే లేదు అని గ్రహింపబడుచున్నది అనుదానిని ఇందులో జెప్పుచున్నాడు. అన్నియింద్రియములు లేనిది ఎట్టి సాధనములేనిదని తాత్పర్యము. కావున అట్టి యెరుంగవలసిన వస్తువు ఇంద్రియముల వ్యాపారమువల్ల వ్యాపారము గలిగియుండుటలేదు. ఇంద్రియములు వ్యాపారము గలిగియున్నప్పుడు

అద్దానికాను వాస్తవముగనే వ్యాపారము గలిగియుండుటలేదు. ఐతే "అది చేతులు కాళ్లులేనిదై శీఘ్రముగ పోవునట్టిది, పట్టునట్టిది. కండ్లులేనిదై చూచునట్టిది. చెవిలేనిదై వినునట్టిది (శ్వేతాశ్వ 3-19) అని మొదలు పెట్టు నీమంత్రమేదిగలదో అది "ఆ యెరుంగదగిన వస్తువు అన్ని ఇంద్రియములు అను ఉపాధుల వ్యాపారములకు అనుకూల్యము పొందుటలో అనుకూలముగ నడచుశక్తి బడసినది" అను నీవిధమైన అర్థమును జూపునట్టిదే గాని "బ్రహ్మమునకు వాస్తవముగ శీఘ్రముగ బోవుట మొదలగు వ్యాపారములుగలవు అనునర్థము నెత్తి చూపునట్టిదిగాదు." 'అంధుడు రత్నమునుచూచెను.' (తై. ఆ. 1 - 11) అనునది మొదలైన మంత్రమయొక్క అర్థమువలె ఆ మంత్రమునకుగూడ అర్థముజేయవలెను. అర్థవాదమైనమాట అర్థమును గ్రహింపజాలదు. ప్రకృతమునకు శబ్దార్థములు అర్థమును జెప్పజాలవు. ప్రకృతము ననుసరించి అర్థము గ్రహించవలెను. ఆ యెరుంగవలసిన వస్తువు సకల ఇంద్రియములు లేనట్టిది. కావున దేనితోను సంబంధములేనట్టిది; ఇట్లున్నను సకలమును ధరించునట్టిదే. అన్నిటికిని సత్తుగదా ఆధారమైనది. సత్ అను తలంపు అంతట అనుస్యూతముగా నుండుటవలన ఎండమావుల నీరు మొదలగునవిగూడ ఆధారములేక లేవు. (సత్ - ఉన్నట్టిది, వాస్తవము.) కల్పితమైన ఘటము చెట్టు మొదలగునవి "ఘటమున్నది. చెట్టున్నది." అని ఉన్నదను జ్ఞానముచే ఎరుంగబడుచున్నవి. ఆ విధముగనే "ఎండమావుల జలమున్నది." అని ఉన్నదను బుద్ధిచే ఎండమావులజలముగూడ నెరుంగబడుచున్నది. కల్పితమైన ప్రతివస్తువున్ను ఈవిధముగ 'ఉన్నది' అనుదాని నాధారపడిన జ్ఞానముచే ఎరుంగబడుచున్నది. కావున సత్తను బుద్ధి అంతట ననుస్యూతముగనున్నదని ఎరుంగుడు. కావున బ్రహ్మము అన్నిటిని భరించుచున్నది యనబడెను.

"ఎరుంగవలసిన వస్తువున్నది" అని తెలియుటకై ఇదిగూడ వేరొకమార్గము. (బ్రహ్మము) సత్వము, రజస్సు, తమస్సు, అను గుణములు లేనిదైనను శబ్దము మొదలగు వాటిద్వారా (శబ్దము, రూపము, రుచి మొదలగు నింద్రియ విషయములవలన) సుఖాకారముగను, దుఃఖాకారముగను, మోహాకారముగను మారిన సత్త్వము, రజస్సు, తమస్సు అను గుణముల ననుభవించునట్టిది. ఆ యెరుంగవలసిన వస్తువు (వాటిని) ఎరుంగునట్టిదని తాత్పర్యము.

(రామానుజులు) ముక్తాత్మ, సకల ఇంద్రియములచేతను విషయముల నెరుంగు శక్తిని బడసినవాడుగను ఇంద్రియములులేకయే విషయముల నెరింగెడి శక్తిగలవాడుగనునున్నాడు.

అసక్తం = స్వభావముగా దేవాదిదేహ సంబంధములేనట్టిది. సర్వభృత్ = దేవాది దేహము మొదలగు సకలమును ధరించునట్టి సామర్థ్యముగలది. నిర్గుణం = స్వరూపముచేత సత్త్వాది గుణములులేనట్టిది. ఐతే సత్త్వాదిగుణములవలన గలుగు భోగము ననుభవించు సామర్థ్యముగలది.

(శ్రీధరులు) ఇంద్రియము లేనట్టిది. అనగా "అపాణిపాదోజవనోగ్రహీతా" అను శ్రుతి వాక్యమువలన చేతులు కాళ్ళు మొదలగునవి లేనిదనియగుచున్నది. గ్రహించునట్టిది, నడచునట్టిది, మొదలగు వ్యాపారములు చెప్పబడియున్నదేయనిన, ఆ శ్రుతి ఉపాధిననుసరించి చెప్పినదేగాని వాస్తవమున గ్రహించుట నడచుట మొదలగు వ్యాపారములు బ్రహ్మమునకులేవు. గుణభోక్తృచ (రక్షించువాడు).

(రాఘవేంద్రులు) బ్రహ్మము సకల ఇంద్రియములనున్ను విషయములనున్ను ప్రకాశ పరచుచున్నది. ప్రాకృతములుగ భిన్నములుగ నున్నట్టి ఇంద్రియములులేనిది.

గుణభోక్తృచ = సకలకల్యాణ గుణములు గలవాడు.



శ్లో॥ బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥ 16

పద॥ బహిః - అంతః - చ - భూతానాం - అచరం - చరం - ఏవ - చ ।
సూక్ష్మత్వాత్ - తత్ - అవిజ్ఞేయం - దూరస్థం - చ - అంతికే - చ - తత్ ॥

| | | | |
|---|---|---|---|
| తత్ | అబ్రహ్మము | తత్ | అది |
| భూతానాం | భూతములకు | సూక్ష్మత్వాత్ | సూక్ష్మముగ నుండుటవలన |
| బహిః | బాహ్యమైనది | అవిజ్ఞేయం | ఎరుంగవీలులేనిది |
| అంతశ్చ | అంతరమైనది | తత్ | అది |
| అచరం | స్థావరమైనది | దూరస్థం చ | దూరముగనున్నది |
| చరమేవచ | జంగమమైనది | అంతికేచ | సమీపముననున్నది |

తా॥ ఆ బ్రహ్మము భూతములకు బాహ్యమైనది, అంతరమైనది, స్థావరమైనది, జంగమమైనది. అది సూక్ష్మముగనుండుటవలన నెరుంగవీలులేనిది. అజ్ఞానులకు దూరములోనున్నట్టిది. జ్ఞానులకు సమీపముననున్నట్టిది.

(శంకరులు) అజ్ఞానమువలన ఆత్మయని గ్రహింపబడినదై చర్మమువరకున్నట్టిదైన శరీరము నుద్దేశించి దానినే ఎల్లగగైకొని బాహ్యమనబడుచున్నది. ఆ విధముగనే లోపలనున్న ఆత్మనుద్దేశించి శరీరమునే ఎల్లగగైకొని లోపలయనబడుచున్నది. (భూతములకు వెలుపలనున్న వస్తువులున్ను బ్రహ్మమే. లోపలనున్న వస్తువున్ను బ్రహ్మమేయని తాత్పర్యము.) "బాహ్యమైనది అంతరమైనది" అను స్వభావమువలన మధ్యఏదియులేనట్టుగనే దీనిని జెప్పుచున్నాడు, "స్థావరమైనది జంగమమైనది" జంగమస్థావరమైన శరీరము ఏదిగలదో అదిగూడ ఎరుంగవలసిన వస్తువే. (బ్రహ్మము) త్రాడులో సర్పదృశ్యమువలె వెలుపలనున్న వస్తువులకును లోపలనున్న ఆత్మకును మధ్య భూతాకారమై పలువిధములైన శరీరములుగ కనబడునట్టిదిగూడ బ్రహ్మమే. త్రాడున సర్ప భ్రాంతి ఇమిడియుండుటవలె బ్రహ్మమున దేహదృశ్యము ఇమిడి నిలబడుచున్నది. కావుననే మధ్య భాగముగూడ బ్రహ్మమే యనుకొనుడు. (ప్రశ్న) స్థావరములున్ను జంగమములైన వ్యవహారవస్తువులన్నియును ఎరుంగవలసిన వస్తువైన బ్రహ్మమైనచో ఏల అది యిది యనిగుర్తించి యెల్లరిచేతను అనుభవించి ఎరుంగబడుటలేదు? అనిన, వాస్తవమైనది అన్నిదృశ్యములుగ నున్నది. ఐనను ఆకాశమువలె సూక్ష్మమైనది (ఇంద్రియములకు గోచరముగానిది) కావుననే అది తనయాకారముచే ఎరుంగ దగినదైనను సూక్ష్మముగ నుండుటవలన అజ్ఞానులకు ఎరుంగుటకు అశక్యము. మఱి జ్ఞానులకు అనగా "ఆత్మైవేదం సర్వం"ఇది యంతయు ఆత్మయే. (బృహ - 2 - 4 - 6) "బ్రహ్మైవేదం సర్వం'' ఇదంతయు బ్రహ్మమే. (బృ - 2 - 5 - 1) అనునది మొదలైన ప్రమాణములవలన నెల్లప్పుడు ఎరుంగదగినది ఎరుంగబడనందున అది దూరమున నున్నట్టిది. నెయ్యికోట్ల సంవత్సరములలోను అజ్ఞానులకు పొందుట కశక్యమైనందున అది సమీపమున నున్నట్టిది = జ్ఞానులకు తమకు సొంతమైన ఆత్మగనుండుట వలన ననుడు.

(శ్రీధరులు) ఆ బ్రహ్మమైనది "తదేజతి తన్నైజతి తద్దూరే తద్వదంతికే = అది తిరుగుచున్నది, అది తిరుగుటలేదు. (ధ్యానము లేనివారలకు) దూరముననున్నను (ధ్యానించువారలకు) సమీపమున నున్నది'' (ఈశోపనిషత్ వాక్యము 5) అనుశ్రుతిలో నీ విధముగనే చెప్పబడియున్నది.

(రామానుజులు) భూతానాం = ప్రకృతిసంబంధమైన భూతములను త్యజించి శరీరములేక బయటనున్నట్టియు, శరీరము లోపలనున్నట్టియు, అచరం = స్వభావముగ సంచారము లేనట్టియు, చరం = దేహముగలిగియుండుటవలన సంచరించుట గలిగినట్టియు, స్వరూపము సూక్ష్మమైనందున సంసారిచే దేహముకంటె అన్యమైనదని ఎరుంగబడనిదిగనున్నట్టిది. ఆ యాత్మ అమానిత్వాది గుణములులేని అజ్ఞానులచేత దేహమునందున్నను దూరముననున్నవాడుగనే గ్రహింపబడదగినవాడు. అమానిత్వాది గుణములు గలవారలకు సమీపమున నున్నవాడుగ నెరుంగదగినవాడు.

(రాఘవేంద్రులు) అచరం=మార్పులేని స్వభావముగలది. చరం=అంతటను సంచరించునట్టిది. అవిజ్ఞేయం = సూక్ష్మమైనందున ఇంద్రియాగోచరమైనది. బ్రహ్మమంతట నుండుటచేత దూరములో నున్నది. సమీపములోను నున్నది.



శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితం ।
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 17

పద॥. అవిభక్తం - చ - భూతేషు - విభక్తం - ఇవ - చ - స్థితం ।
భూతభర్తృ - చ - తత్ - జ్ఞేయం - గ్రసిష్ణు - ప్రభవిష్ణు - చ ॥

| | | | |
|---|---|---|---|
| తత్ జ్ఞేయం | ఆ ఎరుంగవలసిన బ్రహ్మము | భూతభర్తృ చ | మఱియు భూతములను రక్షించునది |
| అవిభక్తం చ | వేరుగ విభజింపబడనిది | | |
| భూతేషు | (ఐనను)భూతములయెడ | గ్రసిష్ణు | (ఐతే) సకలమును మ్రింగునది |
| విభక్తమివ చ | వెవ్వేరుగ నున్నట్లు | ప్రభవిష్ణు చ | మఱియు సకలమును కలుగ జేయునది |
| స్థితం | ఉన్నది | | |

తా॥ ఆ యెరుంగవలసిన బ్రహ్మము వెవ్వేరుగ విభజింపబడనిది. ఐనను భూతములయెడ వెవ్వేరుగ విభజింపబడినదివలెనున్నట్టిది. మఱియునది భూతము లన్నిటిని రక్షించుచున్నది. ఐతే సకలమును మ్రింగుచున్నది. మఱియు సకల భూతములను కలుగజేయునట్టిది.

(శంకరులు) అది ప్రతి శరీరమునందును వెవ్వేరైనదిగాదు. ఆకాశమువలె ఒకటిగ నున్నట్టిది. ప్రతి ప్రాణియెడను వెవ్వేరుగ నున్నదానివలె కనబడుచున్నది శరీరములలోనే స్పష్టముగ కనబడుచున్నందున ఆ యెరుంగవలసిన వస్తువు ప్రపంచముండునప్పుడు భూతములను భరించునట్టిది. లీనమగునప్పుడు (వాటిని) మ్రింగుస్వభావముగలది. కలుగునప్పుడు వాటిని గలుగజేయు స్వభావముగలది. అయథార్థముగ కల్పితమైన పాము మొదలగువాటిని, త్రాడు మొదలగునవి కలుగజేయుటవలె.

(రామానుజులు) దేవమనుష్యాది దేహములున్నను స్వరూప మొక్కటేవిధమైనందున జ్ఞానులకు జ్ఞానాకారముగ ఒక్కటిగ కనబడుచున్నది. అజ్ఞానులకు దేవమనుష్యాద్యనేక దేహములతో గూడియుండగా పలువిధముగ గనబడుచున్నది. పంచమహాభూతములతోగూడిన దేహమును ధరించునట్టిదిగను భూతసంబంధమైన అన్నాదులను భుజించునట్టిదిగను, భుజింపబడిన అన్నము వేరు స్వరూపముగ మారి మఱియొకటి గలుగుటకు కారణముగ నున్నట్టిదిగనున్నది. భూతము

లను ధరించి భుజించుట ఉత్పత్తిచేయుట ఇవి జీవుడులేని దేహమునకు లేనందున వాటికి హేతువు దేహముకాదనునది నిశ్చితము. కావున ఆత్మయే వాటికి హేతువు.

(రాఘవేంద్రులు) సకల భూతములలోను బ్రహ్మము అనుస్యూతముగనున్నను అజ్ఞాను లకు వెవ్వేరుగ నున్నట్లు కనబడుచున్నది.

---

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితం ॥ 18

పద॥ జ్యోతిషాం - అపి - తత్ - జ్యోతిః - తమసః - పరం - ఉచ్యతే।
జ్ఞానం - జ్ఞేయం - జ్ఞానగమ్యం - హృది - సర్వస్య - విష్ఠితం ॥

| | | | |
|---|---|---|---|
| జ్యోతిషామపి | జ్యోతిస్సులకున్ను | జ్ఞేయం | ఎరుంగవలసినది |
| | అదిజ్యోతిస్సుగనున్నది | జ్ఞానగమ్యం | జ్ఞానముచే పొందబడునది |
| తమసః | అజ్ఞానమునకంటె | | అను ఇవి మూడున్ను |
| పరం ఉచ్యతే | తరువాత నున్నది యని చెప్ప బడుచున్నది | సర్వస్యహృది | అందరి హృదయమునందును |
| | | విషితం | విశేషముగ నున్నది |
| జానం | జానము | | |

తా॥ సూర్యచంద్రులకుగూడ ప్రకాశము నిచ్చునట్టిదిగను అజ్ఞానమును దాటియున్నదిగను జ్ఞానస్వరూపముగను జ్ఞానముచే నెరుంగదగినదిగను జ్ఞానమువలన పొందదగినదిగను సకలప్రాణుల హృదయమున విశేషించి యున్నట్టిదిగను చెప్పబడుచున్నది.

(శంకరులు) ఎరుంగవలసిన వస్తువు అంతటనున్నట్టిదైనను ఎరుంగబడనిచో అది అంధ కారమే యనిన, అట్లుకాదు. మఱియేమనగా అట్టి యెరుంగవలసిన వస్తువు సూర్యుడు మొదలగు జ్యోతిస్సులకును జ్యోతిస్సైనట్టిది. (వెలుపలనున్న సూర్యుడు మొదలగునవియు లోపలనున్న బుద్ధి మొదలగునవియునైన జడవస్తువులను ప్రకాశింపచేయుటవలనను బ్రహ్మము కలదనుడు.) కావున జ్ఞాన ప్రకాశముచే ప్రకాశింపబడిగదా సూర్యుడు మొదలగు ప్రకాశములు ప్రకాశించుచున్నవి. "సూర్యుడు ఏ ప్రకాశముచే ప్రకాశింపజేయబడి ప్రకాశించుచున్నాడో" (తై. బ్రా 3-12-9) "ఇదంతయు దాని ప్రకాశముచే ప్రకాశించుచున్నది. (శ్వే-6-14) అనునది మొదలైన మంత్రముల చేతను ఇచ్చటనే "సూర్యునిజేరిన కాంతియేది గలదో" (15-12) అనునది మొదలైన స్మృతిచేతను గ్రహింపుడు. (బ్రహ్మము) అంధకారమునకు తరువాత నున్నట్టిది. అజ్ఞానముచేత స్పృశింపబడనిది యనంబడుచున్నది. ఎరుంగవలసిన వస్తువున్ను సాధనమున్ను ఫలమున్ను ప్రతివాని హృదయము నందును కలవు. జ్ఞానము మొదలగువాటిని సంపాదించుట మిక్కిలి కష్టమనితలంచి మనో దౌర్బల్యము గల (అర్జునుని) ఉత్సాహపరచుటకై మనోదార్ఢ్యము కలుగజేయుటకై చెప్పుచున్నాడు. జ్ఞానమనగా వినయము మొదలగునవి. (13లో 7-8-9-10-11-) ఎరుంగవలసిన వస్తువనగా "ఏది" అనునది మొదలు (12-13-14-15-16-17) చెప్పబడినది. ఎరుంగవలసిన దాని నెరుంగగా (అదియే) ఆ యెరుంగవలసిన వస్తువే జ్ఞానమునకు ఫలము కావున జ్ఞానమువలన పొందదగినదనబడుచున్నది.

మఱియు నది ఎరుంగబడు వస్తువుగ నుండగాఎరుంగవలసిన వస్తువుకూడ (బ్రహ్మము నెరుంగవలసి యుండునపుడు అది యెరుంగబడు వస్తువు. అప్పుడే అది యెరుంగవలసిన వస్తువనుడు.) ఈ మూడున్ను సర్వప్రాణుల హృదయమున బుద్ధిలో విశేషముగ నున్నట్టివి, దానిలోగదా మూడున్ను గనపడుచున్నవి. (కావుననే అవి దేశాంతరమున బహుదూరమున లేవని సిద్ధము.)

(శ్రీధరులు) "యేన సూర్యస్తపతి తేజసేద్ధః"; న తత్ర సూర్యో భాతి; ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్'' మొదలగు శ్రుతులను చూడుడు.

(రామానుజులు) ధిష్ఠితం = అనియు పాఠము. ఎక్కియున్న యనియర్థము. సూర్యుడు, చంద్రుడు, అగ్ని మాణిక్యములు వీటికిగూడ ప్రకాశము గలుగజేయునట్టిది. సూర్య చంద్రాదులు కండ్లకును విషయములకును గలుగునట్టి సంబంధమును అడ్డగించునట్టి చీకటిని మాత్రము పోగొట్టును. ఆత్మయనగా సూర్యచంద్రాది సకలవస్తువులను ప్రకాశింపజేయును. అనగా ఆత్మ యొక్క ప్రకాశరూపమైన జ్ఞానమే సూర్యాదులను ప్రకాశింపజేయుచున్నది. సూక్ష్మావస్థతోగూడిన ప్రకృతికంటె అన్యమని చెప్పబడుచున్నది. ఆత్మయైనవాడు జ్ఞానమునే స్వరూపముగ గలవాడును, అమానిత్వాది జ్ఞానసాధనములచే పొందదగినవాడు. దేవమనుష్యాది శరీరములయొక్క హృదయ ప్రదేశమునందుండువాడు.

(రాఘవేంద్రులు) ప్రకాశస్వరూపముగ నున్నట్టిది జ్ఞానము. తనచేతనే తన్నెరుంగు స్వయం ప్రకాశరూపమైనది జ్ఞానము. జ్ఞానగమ్యం = అపరోక్ష జ్ఞానముచేత ముక్తుడుగ నెరుంగ దగినవాడు.

(స్వకీయము) ఈ 15 - 16 - 17 - 18 శ్లోకములకున్ను జీవపరముగనే రామానుజు లర్థము జేసియున్నట్లుగ నెరుంగదగినది.

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥ 19

పద॥ ఇతి - క్షేత్రం - తథా - జ్ఞానం - జ్ఞేయం - చ - ఉక్తం - సమాసతః ।
మద్భక్తః - ఏతత్ - విజ్ఞాయ - మద్భావాయ - ఉపపద్యతే ॥

| | | | |
|---|---|---|---|
| ఇతి | ఈవిధముగ | ఉక్తం | చెప్పబడినవి |
| క్షేత్రం | క్షేత్రమున్ను | మద్భక్తః | నా భక్తుడు |
| తథా | ఆ విధముగనే | ఏతద్విజ్ఞాయ | దీనినెరింగి |
| జ్ఞానం | జ్ఞానమున్ను | మద్భావాయ | నాస్థితికి |
| జ్ఞేయం చ | ఎరుంగవలసిన వస్తువున్ను | ఉపపద్యతే | యోగ్యుడగుచున్నాడు. |
| సమాసతః | సంగ్రహముగ | | |

తా॥ ఈ విధముగ క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము, ఇవి సంగ్రహముగ జెప్పబడినవి. నాయొక్క భక్తుడు దీనినెరింగి నాయొక్క బ్రహ్మస్వరూప మగుటకు యోగ్యుడగుచున్నాడు.

(శంకరులు) క్రింద కనబరచిన విషయములను ముగించుటకై ఈ శ్లోకము మొదలుపెట్ట బడుచున్నది. క్షేత్రమునుగూర్చి "మహాభూతాని" మొదలు "ధృతిః"వరకు సంగ్రహముగజెప్పబడినది.

ఆ విధముగనే జ్ఞానము ''అమానిత్వము'' మొదలు "తత్వజ్ఞానార్థదర్శనం'' వఱకు చెప్పబడినది. మఱియు నెరుంగవలసిన వస్తువు ''జ్ఞేయం యత్ తత్" మొదలు "తమసః పరముచ్యతే'' వఱకు సంగ్రహముగ జెప్పబడినది, వేదార్థమంతయు ఇదియే. గీతార్థముగూడ ఇదే. అది యీ విధముగ సంగ్రహించి ముగించి చెప్పబడినది. ఇట్టి సమ్యగ్దర్శనమునకు ఎవ్వడు తగినవాడనగా నాయొక్క భక్తుడు. అనగా సర్వజ్ఞుడను పరమేశ్వరుడను పరమాచార్యుడను వాసుదేవుడను నగు నాయెడ ఆత్మజ్ఞానమంతయు నుంచినవాడు. (భగవంతుని అన్నిటియొక్క యాత్మగ గ్రహించినవాడు.) దేనిని చూచుచున్నాడో వినుచున్నాడో లేక తాకునో అదంతయు భగవంతుడైన వాసుదేవుడేయను నీ విధమైన సిద్ధాంతముగల బుద్ధిని బడసినవాడు. అట్టి నాభక్తుడు మునుపుచెప్పిన అతత్త్వజ్ఞానమును పొంది నాస్థితికి తగినవాడగును. అనగా మోక్షమును పొందుచున్నాడు,

(శ్రీధరులు) వీటినిగూర్చి వసిష్టాదిమహర్షులచే విస్తారముగ జెప్పబడియున్నదియే నాచే సంగ్రహముగ జెప్పబడినది. వీటిని మునుపటి యధ్యాయమున జెప్పబడియున్న భక్తుడెరింగి బ్రహ్మస్వరూపుడగుచున్నాడు,

(రామానుజులు) క్షేత్రస్వరూపనిశ్చయము, క్షేత్రజ్ఞస్వరూపనిశ్చయము, క్షేత్రమునకంటె అన్యమైన (జీవ) స్వరూపము నెరుంగుటకు కావలసిన జ్ఞానసాధనములయొక్క నిశ్చయము వీటి నెఱింగి, మద్భావాయ = నావలె అసంసారిత్వ ధర్మమును పొందుటకై.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ 20

పద॥ ప్రకృతిం - పురుషం - చ - ఏవ - విద్ధి - అనాదీ - ఉభౌ - అపి ।
వికారాన్ - చ - గుణాన్ - చ - ఏవ - విద్ధి - ప్రకృతిసంభవాన్ ॥

| | | | |
|---|---|---|---|
| ప్రకృతిం | ప్రకృతిని | వికారాంశ్చ | వికారములను |
| పురుషం చ | పురుషుని | గుణాంశ్చ | గుణములను |
| ఉభావపి | రెంటినిగూడ | ప్రకృతిసంభవాన్ ఏవ | ప్రకృతివలన గలిగినవిగనే |
| అనాదీ ఏవ | ఆదిలేనివిగనే | విద్ధి | ఎరుంగుము |
| విద్ధి | ఎరుంగుము | | |

తా॥ ప్రకృతి, పురుషుడు ఈ రెండిటినిగూడ ఆదిలేనివిగ నెరుంగుము. దేహేంద్రియాది వికారములను సుఖ దుఃఖ మోహాదులను ప్రకృతినుండి గలిగినవని యెరుంగుము.

(శంకరులు) ''భిన్నా ప్రకృతిరష్టధా'' (అధ్యా 7, శ్లో॥ 4) అనినందున మాయ ఈశ్వరునికిగూడ అపరప్రకృతియనియు, "అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం। జీవభూతాం'' (అధ్యా 7, శ్లో॥ 5) అనినందున జీవుడు ఈశ్వరునియొక్క పరప్రకృతి యనియు సిద్ధమగుచున్నది. ఈ మాయ, జీవుడు వీర్లను వరుసగా ప్రకృతి పురుషులుగను, క్షేత్రక్షేత్రజ్ఞులుగను జెప్పినదియే గాక అనాదులనియు నిత్యులనియు ఈ యధ్యాయమున జెప్పబడినవి. ఈశ్వరుని నిత్యుడుగను అనాదిగను ఒప్పుకొనవలసిన మనము, ఆ ఈశ్వరునియొక్క పరాపరప్రకృతులైన

మాయ జీవుడు వీరలనుగూడ నిత్యులుగను అనాదులుగను ఒప్పుకొనవలసినదే. ఈ రెండుప్రకృతులచే ఈశ్వరునికి సృష్టి, స్థితి, సంహారము మొదలగు వాని కారణత్వము చెప్పబడుచున్నది. ఈ ప్రకృతి పురుషులకు అనాది నిత్యత్వములు చెప్పదగివనిన ఈశ్వరత్వ జగత్కారణత్వములు బ్రహ్మమునకు జెప్పదగవు. ప్రకృతి పురుషులను గలవాడెవ్వడో అతడే ఈశ్వరుడు. ప్రేరేపించుటకు వస్తువులేనిచో ప్రేరేపించెడు యజమానత్వమనునదిలేదు. ప్రకృతి పురుషులు అనాదులు కారు. కలిగినవారలే యనిన వారలు కలుగుటకు మునుపు ఈశ్వరత్వము లేకుండ నుండవలెను. పురుషునికి అనాదియైన కర్మబంధమనునదియుకూడదు. మఱియు ఈశ్వరుడొక జీవుని సుఖిగను, మఱియొకని దుఃఖిగను పూర్వ కర్మమను కారణము లేకయే సృష్టించినయెడల అతనికి పక్షపాతమున్ను నిర్దయత్వమున్ను సంభవించును గాన బంధమే లేదనియగును. బంధము లేనియెడల మోక్షమేల? మోక్షాదులను జెప్పెడి వేదముచే నేమి ప్రయోజనము? కావున ప్రకృతి పురుషులు అనాదులని చెప్పుట సరియైనదే. మఱియు ఈశ్వరునియొక్క ప్రకృతులు నిత్యములు కాన ఇవియన్నియు కుదిరియే యున్నవి. ఎట్లనగా మారుబాటుకు కారణమైన ఈశ్వరశక్తియే త్రిగుణాకారమైన మాయ బుద్ధి మొదలగు శరీరము వఱకుగల పైన జెప్పబడు వికారములకును సుఖదుఃఖమోహ జ్ఞానములయొక్క ఆకారములై మారియున్నవి. పైనజెప్పబడు గుణములకున్ను పుట్టిల్లని తెలిసికొనుడు. అవి ప్రకృతియొక్క వేరుబాటని ఎఱుంగుము. ఐతే ప్రకృతిని పుట్టిల్లుగ గల ఆ వికారములున్ను ఎవ్వి అను దానిని జెప్పుచున్నాడు.

(శ్రీధరులు) ప్రకృతియు, పురుషుడైన జీవుడున్ను అనాదులుగ నున్నవారలేగాని ఒక కాలమున బుట్టినవారలుగారు. ఏది కలిగినదిగ జెప్పబడునో అదంతయు ప్రకృతివలన గలిగినదే. ఆ ప్రకృతిగూడ కలిగినదనియే చెప్పితిమేని ప్రకృతిని కలుగజేయుటకై మఱియొక ప్రకృతిసదా యుండవలెను? అట్లున్నదనిన ఆ ప్రకృతిని కలుగజేయుటకు మఱియొక ప్రకృతిగావలెను. ఈ విధముగ ఒకదానినొకటి యనుసరించి ముగింపు లేనిదగును. కావున ప్రకృతిపుట్టినదని చెప్పగూడదు. ఈ విధముగ నుండుటవలననే ప్రకృతియైనది ఆది గలదిగాదని చెప్పబడినది. పురుషుడనగా, అతడు బ్రహ్మముయొక్క అంశమైనందునను, నిత్యుడైనందునను ఆదిలేనివాడని చెప్పబడినది.

(రామానుజులు) ఒకరికొకరు ఆసక్తిగల ప్రకృతి పురుషులను అనాదులుగ నెఱుంగుము. బంధమునకు హేతువైన ఇచ్ఛ, ద్వేషము మొదలగు వికారములను మోక్షమునకు హేతువైన అమానిత్వాదిగుణములను ప్రకృతినుండి గలిగినవిగ తెలిసికొనుము. అనాదియైన ఈ ప్రకృతి అనాదిగ పురుషుని సంబంధించి క్షేత్రాకారముగ పరిణమించి తనయొక్క వికారములగు ఇచ్ఛా ద్వేషము మొదలగు దోషములచే పురుషునికి బంధహేతువగుచున్నది. అమానిత్వాది గుణములచే మోక్షహేతువగుచున్నది.

(రాఘవేంద్రులు) ప్రకృతియనగా (25) ఇరువదియైదు తత్త్వములు, లేక జగత్తునకు కారణమైన పరమాత్మ. పురుషుడనగా జీవుడు, వీరలు అనాదులని యెఱుంగుము. గుణములు వికారములు ఇవి ప్రకృతివలన గలిగినవని యెఱుంగుము.

శ్లో॥ *కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥ 21

పద॥ కార్యకరణకర్తృత్వే - హేతుః - ప్రకృతిః - ఉచ్యతే।
పురుషః - సుఖదుఃఖానాం - భోక్తృత్వే - హేతుః - ఉచ్యతే॥

| | | | |
|---|---|---|---|
| కార్యకరణకర్తృత్వే | కార్యమును సాధనములను కలుగజేయుటలో | సుఖదుఃఖానాం | సుఖదుఃఖములను |
| | | భోక్తృత్వే | అనుభవించుటలో |
| ప్రకృతిః | ప్రకృతి | పురుషః | పురుషుడు |
| హేతుః | కారణముగ | హేతుః | కారణముగ |
| ఉచ్యతే | చెప్పబడుచున్నది | ఉచ్యతే | చెప్పబడుచున్నాడు. |

*'కార్యకారణ కర్తృత్వే' యనియు పాఠముగలదు.

**తా॥ కార్యమును (దేహమును) ఇంద్రియములను గలుగజేయు విషయమున ప్రకృతి (మాయ) కారణముగ జెప్పబడుచున్నది. సుఖదుఃఖముల ననుభవించు విషయమున జీవుడు కారణముగ జెప్పబడుచున్నాడు.**

(శంకరులు) ఐతే ప్రకృతిని పుట్టిల్లుగగలిగిన ఆ వికారములున్ను గుణములున్ను ఏవను దానిని చెప్పుచున్నాడు. కార్యమనగా శరీరము. సాధనములు (13) పదమూడు. 'కార్యము' అన్నందున శరీరమును బద్ధపరచుచున్న ఐదు భూతములున్ను, ప్రకృతిని పుట్టిల్లుగగల క్రిందకనబరచిన వికారములైన ఐదు యింద్రియవిషయములున్ను ఇచ్చట గ్రహింపబడుచున్నవి. "సాధనములు" అన్నందువలన ప్రకృతిని పుట్టిల్లుగగల సుఖదుఃఖమోహాకారముగల గుణములున్ను గ్రహింపబడుచున్నవి. సాధనములు వాటికాశ్రయమైనందున ఆ కార్యమును సాధనములను గలుగజేయు విషయమున ప్రకృతి కారణమనబడుచున్నది. వాటిని కలుగజేయునది కావున, ఈ విధముగ ప్రకృతియైనది. కార్యమును సాధనములను చేయులవలన సంసారమునకు కారణమగుచున్నదనుడు.

"కార్యమును కారణమును కలుగజేయుటయందు'' అను నీపాఠమునందును ఈ విధముగ నర్థమును గ్రహింపవలెను. ఏది దేనియొక్క మారుబాటగునో అది దానియొక్క కార్యము. వికారము. వికారముగలది వికారి కారణమనుడు. ఆ వికార వికారులగు కార్య కారణములను గలుగజేయు విషయమున ప్రకృతి కారణమైనందున అవియే క్రింద గనబరచిన కార్యమున్ను సాధనములున్ను కార్యకారణములనబడుచున్నవి. లేక వేరు విధముగను అర్థము జెప్పవచ్చును- ఇంద్రియములు 10, మనస్సు 1, ఇంద్రియవిషయములు 5, ఈ 16 వికారములున్ను కార్యమనబడుచున్నవి. మహత్తు, అహంకారము (5) ఐదు తన్మాత్రలు అని మూల ప్రకృతియొక్క వికారములు ఏడున్ను కారణమగును వాటిని గలుగజేయు విషయమున ప్రకృతి కారణమనబడుచున్నది, వాటినన్నిటిని కలుగజేయునట్టిదైనందున ఇక పురుషుడు సంసారమునకు ఏ విధముగ కారణమగునో అది చెప్పబడుచున్నది. పురుషుడు, జీవుడు, క్షేత్రజ్ఞుడు, భోక్త, అను నీ పదములు ఒకటే యర్థముగలవి. అనుభవించబడు సుఖదుఃఖముల నెరుంగు విషయమున పురుషుడు కారణముగ జెప్పబడుచున్నాడు ఇచ్చట జెప్పబడిన జీవుడు సోపాధిక జీవుడు. ఉపాధిగల జీవుడు. అతడు వాస్తవమున నిరుపాధికుడు - ఉపాధిలేనివాడు. బ్రహ్మముగ నున్నట్టివాడు అనుదానిని గ్రహించుకొనుడు.

(ఆక్షేపము) ఐతే కార్యకారణములను గలుగజేయునట్టిదియు సుఖదుఃఖములను అనుభవించునట్టిదియునైన దీనివలన ప్రకృతియు పురుషుడున్ను సంసారమునకు కారణమగుట ఎట్లు చెప్పబడుచున్నది? అనిన ప్రకృతికి దేహేంద్రియములుగా సుఖదుఃఖములుగా కారణ కార్యములుగా

వేరుబాటులేనప్పుడు చేతనవస్తువైన పురుషునికి వాటి నెరుంగుటయనునది లేనప్పుడు సంసారమను నది ఎచ్చుటనుండి వచ్చును? రాజాలదు. ఏలనగా నిత్యముక్తుడైన ఆత్మకు సంసారము స్వయము గనే లేనందున. ఐతే దేహేంద్రియములుగా సుఖదుఃఖములుగా కారణకార్యములుగా మార్పుజెంది అనుభవించబడు ప్రకృతితో దానికంటె వేరగు పురుషునికి అనుభవించు స్వభావముచేత అవిద్యాఽఽకారమైన సంబంధమెప్పుడుండునో అప్పుడు సంసారముండగలదనుడు. కావుననే ప్రకృతియు పురుషుడున్ను వరుసగా దేహేంద్రియములను కలుగజేయుటవలనను సుఖదుఃఖముల ననుభవించుటవలనను సంసారమునకు కారణమని ఏదిజెప్పబడినదో అది సరియేను.

(ఆక్షేపము) అయితే ఈ సంసారమనగానేమి? సంసారమనునదేదనగా సుఖదుఃఖముల ననుభవించుట, సంసారిగనుండుట యనునది. పురుషుడు సుఖదుఃఖములను అనుభవించువాడు గనే యుండుట.

ప్రకృతి జడమైనందున అది యెట్లు ఒకదానిని గలుగజేయునదిగ జెప్పుట తగును? జీవ స్వభావమనగా—వికారమును పొందదగినది గాదు. జీవునికి ఇంద్రియములు, మనస్సు, చిత్తము, అహంకారము మొదలగునవియు, ఆకలి మొదలగునవియు వాస్తవమున లేనందున అతను వికారము జెందుటకు కారణమేలేదు. కావున అతడనుభవించునట్లు ఎట్లు చెప్పదగును? అను నీ రెండు ప్రశ్నలు గలుగుచున్నవి. మొదటి ప్రశ్నను గూర్చి యనగా, ప్రకృతి జడమైనను జీవునియొక్క అవిద్యాకార్యమైన అనాదికర్మయనెడి అదృష్టవశముచేత ఆ ప్రకృతి వికారముచెంది జీవునకుపయుక్తముగ దేహేంద్రియాదులుగ పరిణమించుచున్నది. అదెట్లనగా జీవుడైనబిడ్డ పుట్టినతోడనే అతని ఆహారమునకై జడమైనపాలు కలుగుటవలె జీవునికుపయోగముగ జడపదార్థము లనేకములు గలుగుచున్నవి. అట్లు అనేకవస్తువులుగ పరిణమించునట్టిది ప్రకృతియే. కావున ప్రకృతి కారణముగ జెప్పబడినది.

రెండవప్రశ్నను గూర్చియనగా, జీవుడు జ్ఞానమునే స్వరూపముగగలవాడు. అతని జ్ఞానము సుఖఃదుఃఖాది సంబంధమైన విషయజ్ఞానముగాదు. ఐనను దేహేంద్రియాదులమూలముగ విషయజ్ఞానము గలుగుచున్నది. ఆ దేహేంద్రియాదులు కర్మవలన గలుగుచున్నవి. దేహముగలిగిన పిదప సుఖదుఃఖముల నెరుంగుట యనెడి విషయజ్ఞానమును పొందుచున్నాడు. ఇట్లు సుఖదుఃఖాది విషయజ్ఞానమును పొందుటవలన అతడు సుఖదుఃఖాదుల ననుభవించుటకు హేతువుగ జెప్పబడు చున్నాడు. పురుష సన్నిధానముచేత ప్రకృతికి కర్తృత్వమున్ను, ప్రకృతి సంయోగముచేత పురుషునికి భోక్తృత్వమున్ను గలుగుచున్నదని తాత్పర్యము.

కార్యమనగా శరీరము, కారణమనగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనస్సులు. కర్తృత్వమనగా దేహేంద్రియాదుల వ్యాపారము. కార్యకారణములకు కర్తృత్వమును గలుగజేయునట్టిది ప్రకృతియైనందున కార్యకారణములకు కర్త ప్రకృతియని చెప్పబడినది. ఏలనగా జీవునికి భోగ సాధనములుగనున్న వ్యాపారములు వానికి వాసస్థానముగను, దేహాదిరూపముగనునున్న ప్రకృతిని ఆధారముగ గలిగియుండుటవలన క్రియలకు కర్త ప్రకృతియని చెప్పబడినది. చూచుట, నడచుట; మాటలాడుట, యను వ్యాపారములకు జీవుడు కర్తయని లోకమున వ్యవహరింపబడుచున్నాడే యనిన ఆ వ్యాపారములకు కారణమైన దేహమును వాసస్థానముగ జీవుడుంచుకొని యుండుట వలనను, అట్టి స్థితిని పొందుటకు ప్రయత్నించుటవలనను జీవుడు కర్తయని వ్యవహరింపబడు చున్నాడు. సుఖదుఃఖానుభవమునకు ఆశ్రయుడుగ నున్నందున సుఖదుఃఖానుభవమునకు జీవుడు హేతువని చెప్పబడినది.

కార్యమనగా దేహము, కారణమనగా ఇంద్రియములు, కర్తృత్వమనగా క్రియ. ప్రకృతియే ఈ మూడు రూపములుగనున్నది. కావున ఈ మూటికి ప్రకృతిని హేతువుగ జెప్పుచున్నారు. జీవుడు జ్ఞానస్వరూపియైనందునను, సుఖదుఃఖముల నెరుంగుటవలనను సుఖదుఃఖానుభవమునకు హేతువని చెప్పబడెను.

దేహేంద్రియములయొక్క కర్తృత్వమునకు కారణము చిత్ప్రకృతి (లక్ష్మి). జీవుడు ప్రకృతి వికారములైన సుఖదుఃఖములననుభవించుటకు పురుషుడైన భగవంతుడు హేతువుగ జెప్పబడుచున్నాడు. సర్వకర్తయైన భగవంతునికి దేహేంద్రియాది కర్తృత్వమున్నను భోగమునిచ్చు విషయమున దేవికి (లక్ష్మికి) హేతుత్వమున్నను సుఖదుఃఖభోగముల నిచ్చుటలో దేవికి హేతుత్వము స్వల్పమైనది. కార్యకారణ విషయములలో హేతుత్వమధికము. కావున దేవియగు ప్రకృతి కార్యకారణ కర్తృత్వ హేతువుగ చెప్పబడెను. దేహేంద్రియ కర్తృత్వ ప్రవృత్తికంటె భగవంతునికి భోగము నిచ్చువిషయమున ప్రవృత్తియధికము కావున అందులో భగవంతుడే హేతువుగ జెప్పబడెను. లేక ప్రకృతియనగా జడప్రకృతి. పురుషుడనగా జీవుడు. దేహేంద్రియ వ్యాపారమునకు కారణము జడప్రకృతి యనబడుచున్నది. సుఖదుఃఖానుభవమునకు కారణము జీవుడనబడుచున్నాడు.

శరీరము కార్యము. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము ఈ పదమూడున్ను (13) దానికి కారణములు. లేక భూతములున్ను, విషయములున్ను కార్యము సత్త్వాది త్రిగుణములున్ను కారణములు. కారణమైన ప్రకృతి నాశ్రయించినందున గుణములు కారణములని చెప్పబడినవి. ఇట్టి కార్యకారణములు రెండింటికిని మూలము మాయ కావున ఆ మాయ కర్త యనబడినది. "కార్య కారణ కర్తృత్వే" అని కొన్ని పాఠములు కలవు, దానికి ఇదియే యర్థము. అథవా, (సాంఖ్యుల సిద్ధాంతముల ననుసరించి మనస్సుతో పదునొకండు ఇంద్రియములు, మహాభూతములు ఐదు.) 16 వికారములున్ను కార్యము. ప్రకృతి వికారములు (బుద్ధి, అహంకారము, భూతతన్మాత్రలు ఐదు) 7న్ను కారణము. వీటికి కారణము ప్రకృతి. కావున ప్రకృతి కర్తయనబడుచున్నది. సుఖదుఃఖాదులను జీవుడెరుంగువాడైనందున సుఖదుఃఖాదులకు అతడు భోక్తయని చెప్పబడెను. ప్రకృతి దేహేంద్రియ రూపముగను, సుఖదుఃఖాది రూపముగను పరిణమించని యెడల జీవునకు సంసారమనెడి బంధమేలేదని చెప్పవచ్చును. అతనికి సంసారమునకు ప్రకృతియే కారణముగనున్నది, కావున ప్రకృతి కర్తయని చెప్పబడినది. ప్రకృతి కార్యమగు దేహేంద్రియాదులలోను, సుఖదుఃఖములలోను తాను తనదను నభిమానాహంకారములతో గూడియున్నందున పురుషుడు సంసారమునకు హేతువగుచున్నాడు. కావున అతడు సంసారహేతువని చెప్పబడినది. ఇందలి 3-వ అధ్యాయము, 27-వ శ్లోకము చూడుడు.



శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు ॥ 22

పద॥ పురుషః - ప్రకృతిస్థః - హి - భుఙ్క్తే - ప్రకృతిజాన్ - గుణాన్
కారణం - గుణసంగః - అస్య - సదసద్యోనిజన్మసు ॥

| | | | |
|---|---|---|---|
| హి | ఏ కారణము వలన | ప్రకృతిజాన్ | ప్రకృతివలన గల్గిన |
| పురుషః | పురుషుడు | గుణాన్ | గుణములను |
| ప్రకృతిస్థః | ప్రకృతిలో నిలబడియున్నాడో | భుఙ్క్తే | అనుభవించుచున్నాడు |
| | ఆ కారణమువలన | అస్య | అతనికి |

| | | | |
|---|---|---|---|
| గుణసంగః | గుణములలోగల ఆసక్తి | | |
| సదసద్యోనిజన్మసు | మంచిచెడ్డలైన యోనులలో జనించుటకు | కారణం | కారణముగ నున్నది |

తా॥ ఏ కారణమువలన పురుషుడు అనగా జీవుడు ప్రకృతిలో నిలబడి యున్నాడో, అనగా ప్రకృతి కార్యమైన దేహమే తానను నభిమానముతో కూడియున్నాడో ఆ కారణమువలన ప్రకృతివలన గలిగిన గుణములను, అనగా సుఖదుఃఖాదులను అనుభవించుచున్నాడు. ఈ జీవునికి గుణములలో గల ఆసక్తియైనది గొప్పదైనట్టిదియు, తక్కువైనట్టిదియు నైన జన్మములలో జనించుటకు కారణముగ నున్నది.

(శంకరులు) సంసారిగనుండుట యనునది, పురుషుడు సుఖదుఃఖముల ననుభవించువాడగుట అని యేది చెప్పబడెనో, అది వాటి ననుభవించుట వానికి దేనివలన సంభవించుచున్నదని చెప్పెదము. అనుభవించెడి పురుషుడు దేహేంద్రియాకారముగ మార్పుచెందియున్న అవిద్య యనెడి ప్రకృతిలో నిలబడువాడు. ప్రకృతిని (దేహేంద్రియముల చేరికను) ఆత్మగ కొన్నవాడు. కావున సుఖాకారముగను దుఃఖాకారముగను మోహాకారముగను ప్రకృతినుండి వెలువడిన గుణములను "నేను సుఖముగలవాడను, దుఃఖముగలవాడను, మైకముగలవాడను, జ్ఞానముగలవాడను" అను నీ విధముగ ననుభవించుచున్నాడు, అనగా తలంచుచున్నాడని తాత్పర్యము. అవిద్య జన్మమునకు కారణముగనున్నను అనుభవింపబడు సుఖదుఃఖమోహములనెడి గుణములమీద ఆసక్తి యనునది, అనగా తాను అనుతలంపు ఏది గలదో అది యీ పురుషునిజన్మకు ముఖ్యకారణమగును. "స యథా కామో భవతి తత్క్రతుర్భవతి = అతడు దేనిని కోరువాడుగనుండునో దానిని అనగా దానికైన యుపాయమును వెతుకవలెననుకొనుచున్న వాడగుచున్నాడు" అనెడి (బృహదారణ్యకోపనిషత్తు 4-4-5) శ్రుతిచే చూడుడు. అనుభవించువానికి గుణములమీదగల అభిమానము మంచి జన్మలలోను చెడ్డజన్మలలోను జనించు విషయమున గుణములమీదనున్న ఆసక్తి ఇతని సంసారమునకు గారణమగును, కావున సంసారమనెడి పదమును అనువృత్తి చేసికొనుడు. మంచిజన్మలు దేవతలు మొదలగు జన్మములు. చెడ్డవి పశువు మొదలగు జన్మలు. మంచియు చెడ్డవియునైన మనుష్య జన్మములుగూడ విరుద్ధములుకావని కనుగొనుడు. ఇది చెప్పబడినదగుచున్నది:— ప్రకృతిలో నిలబడియుండు స్వభావము అవిద్య. గుణములలో నాసక్తి కామము. ఇవి రెండున్ను సంసారమునకు కారణమనియే. అవిద్య ఉపాదాన కారణము. కామము నిమిత్తకారణము.

(రామానుజులు) పూర్వజన్మ కర్మవలన జీవుడు దేవమనుష్యాది దేహములలోనున్నవాడై ఆ దేహములద్వారా సత్త్వాదిగుణములవలన గలుగు సుఖదుఃఖాదులలో ఆసక్తిగలిగి దేహములను సుఖదుఃఖాదులను అనుభవించుటకు కారణమైన పుణ్యపాపములను జేయుటలో ప్రవర్తించియున్నాడు. దానివలన ఉత్తమాధమ జన్మములనుపొంది ఆయాజన్మములలో సుఖదుఃఖముల ననుభవించుటయేగాక మరల కర్మలను జేయుచున్నాడు. ఆ కర్మకు తగినట్లు దేహమున్ను సుఖదుఃఖాద్యనుభవమున్ను అతనికి మరల మరల వచ్చుచునేయున్నది. అమానిత్వాది గుణములను పొందిననేగాని జననము నివర్తింపదు.

(రాఘవేంద్రులు) దేహమువలన గలుగు సుఖదుఃఖాదులను జీవుడు అనుభవించుచున్నాడనునది మిథ్యకాదను దానిని తెలుపుటకై "హి" అనుశబ్దము ప్రయోగింపబడియున్నది. గుణసంగః = సత్త్వాదిగుణ సంబంధము.

శ్లో॥ ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః॥ 23

పద॥ ఉపద్రష్టా - అనుమంతా - చ - భర్తా - భోక్తా - మహేశ్వరః।
పరమాత్మా - ఇతి - చ - అపి - ఉక్తః - దేహే - అస్మిన్ - పురుషః - పరః॥

| | | | |
|---|---|---|---|
| అస్మిన్ | ఈ | అనుమంతా చ | అనుమతించువాడు |
| దేహే | దేహములోనున్న | భర్తా | ధరించెడివాడు |
| పరః | మేలైన | భోక్తా | అనుభవించెడివాడు |
| పురుషః | పురుషుడు | మహేశ్వరః అపి | మేలైన ఈశ్వరుడు |
| ఉపద్రష్టా | సమీపమున నుండి చూచెడివాడు | పరమాత్మేతి చ | పరమాత్మయనియు |
| | | ఉక్తః | చెప్పబడియున్నాడు. |

తా॥ ఈ దేహముననున్న మేలైనవాడగు నీ పురుషుడు దేహేంద్రియముల వ్యాపారములను దగ్గఱనిలబడి చూచెడివాడు, అనుమతించువాడు, ధరించువాడు, అనుభవించువాడు, గొప్పవాడగు ఈశ్వరుడు, పరమాత్మయనియు చెప్పబడియున్నాడు.

(శంకరులు) మునుపుజెప్పినదానినే మఱలను గుర్తింపజేసి బోధించుచున్నాడు. ముక్తి నిచ్చునట్టిదిగ ప్రకృతము చెప్పబడుచున్న జ్ఞానమును నేరుగ తెలియబరచుటకై ఈ శ్లోకము మొదలు పెట్టబడుచున్నది. ఉపద్రష్టా = సమీపమున నిలబడి తాను వ్యాపారములో ప్రవర్తింపకయే చూచుకొని యుండువాడు (సన్నిధిమాత్రముచే సాక్షిగనుండువాడు). ఇచ్చట చూచుట యనగా చూచుటయను వ్యాపారముగాదు. వ్యాపారములేని సన్నిధిమాత్రమే. ఋత్విక్కులున్ను యజమానుడున్ను యజ్ఞకర్మలను జేయుచుండగా యాగవిద్యలో మిక్కిలి నేర్పరియైన పాదువైన మఱియొకడు వాటిలో ప్రవేశింపకయే (వాటినుండి వేరైనవాడై) వారల వ్యాపారముయొక్క గుణమును దోషమును ఏ విధముగ చూచుచున్నాడో, ఆ విధముగనే దేహము ఇంద్రియములు మొదలగువాటి వ్యాపారములలో పూనుకొనకయే వాటికంటె వేరైనవాడై ఆ వ్యాపారములను దగ్గరనిలబడి చూచెడివాడు. లేక శరీరము కండ్లు మనస్సు బుద్ధి ఇవి చూచెడివస్తువులు. వాటిలో బయటనున్న చూచెడివస్తువు శరీరమున్ను అచ్చటనుండి మిక్కిలి లోపలనున్నదియు, మిక్కిలి సమీపమునుండి చూచునట్టిదియు ఆత్మ. ఏలనగా మిక్కిలి లోపలనున్న చూచెడివస్తువు దానికంటె వేరొక్కటిలేదు. లేక యాగములో పైగా చూచువానివలె ఈ యాత్మ, జ్ఞానమాత్రాకారమై అన్నిటిని పైచూపు చూచుటవలన ఉపద్రష్టయనుడు.

అను మోదించుటయనగా ఇతరులు వ్యాపారములను జేయునప్పుడు వారి వ్యాపారములలో సంతోషించుట, లేక ఆత్మయగు పురుషుడు దేహేంద్రియముల వ్యాపారములలో తాను ప్రవేశించనివాడైనను ప్రవర్తించిన వానివలె వాటికనుకూలముగ కనబడుచున్నాడు. కావున అనుమతించువాడనుడు. లేక తమ తమ వ్యాపారములలో ప్రవర్తించి యున్నవారలకు సాక్షిగనున్న అతడు వారల నడ్డగించుటలేదు. కావున అనుమతించువాడనుడు. భర్తా = ధరించువాడు. చైతన్యముయొక్క వికారములై (దృశ్యములై) ఒకటిగా జేరియున్న దేహేంద్రియ మనోబుద్ధి మొదలగునవి. చేతనమైన ఆత్మయను యథార్థవస్తువు కారణముగ తమ యాకారములను ధరించుచుండుట యేదిగలదో అది చేతనమైన ఆత్మవలననైనది. కావున ఆత్మయను పురుషుడు దరించువాడనబడు

చున్నాడు. (చైతన్యము = జ్ఞానవస్తువు. త్రాడు అను కారణములేనిచో త్రాడుయొక్క దృశ్యమగు పామునకు స్థితియులేదు. కావున పామును ధరించునట్టిది త్రాడు అనుదానివలె) భోక్తా = సుఖ దుఃఖ మోహాకారములుగ విషయములన్నిటి నాశ్రయించినవైన బుద్ధియొక్క స్పర్శములు కలుగు నప్పుడు చేతనమైన ఆత్మచే మ్రింగబడినవివలె కనబడి, అగ్నియొక్క ఉష్ణమువలె ఎల్లప్పుడు జ్ఞానాకారమైన ఆత్మచే వెవ్వేరుగ స్పష్టముగ కనబడుచున్నది. కావున ఆత్మభోక్త యనబడు చున్నాడు. మహేశ్వరః = అన్నిటియొక్క ఆత్మఅయి స్వతంత్రముగ నుండుటవలన అతడు మేలైన ఈశ్వరుడనుడు. అజ్ఞానమువలన లోపలనున్న ఆత్మగ కల్పితములై శరీరము మొదలుగా అవ్యక్తమువఱకు గల వాటికి అతడు దగ్గఱనిలబడి చూచుట మొదలగు లక్షణములుగల మేలైన ఆత్మ కావున పరమాత్మయనుడు. శ్రుతులలోగూడ ఇతడు పరమాత్మయను శబ్దముచే చెప్పబడసిన వాడు. అతడు ఎచ్చట నున్నాడనగా అవ్యక్తమునుదాటి నిలబడువాడై ఈ శరీరములోనున్నాడు. "ఉత్తమః పురుషః" అని ముందురాబోవు 15-వ అధ్యాయము, 17-వ శ్లోకమును చూడుడు.

(శ్రీధరులు) అనుమంతా = సన్నిధాన మాత్రముచేత జరుగుచున్న కార్యము జరుగుటకు సమ్మతించినవానివలె నున్నవాడు. భర్తా = ఈశ్వరరూపముచేత జగత్తును భరించువాడు. భోక్తా = పాలించువాడు. పరమాత్మా = అంతర్యామి, పరః = గుణసంబంధములేనివాడు.

(రామానుజులు) ఉపద్రష్టా = దేహప్రవృత్తి కనుగుణమైన సంకల్పాది రూపముచేత చూచుచుండువాడు. అనుమంతా = దేహాదులవలన చేయబడు కార్యములను ఆమోదించువాడు. భోక్తా = దేహేంద్రియాదులయొక్క ప్రవృత్తివలన గలుగు సుఖదుఃఖాదులను అనుభవించువాడు. మహేశ్వరః = దేహమును ప్రేరేపించుట, ధరించుట, దేహమునకు శేషిగనుండుట, వీటివలన దేహేంద్రియ మనస్సులు మొదలగువాట్లకు యజమానుడుగ నున్నవాడు. పరమాత్మా = ఈ దేహేంద్రియాదులకు పరమాత్మయగుచున్నాడు అనగా దేహేంద్రియ సంబంధముగ చూచినచో వాటికంటె అన్యుడైన పురుషుడుగను, వాటికి మహేశుడుగను, వాటికి పరమాత్మగనునున్నాడు.

(రాఘవేంద్రులు) ఉపద్రష్టా = అన్నిటికంటె పైగా సర్వోత్తముడుగనుండి చూచెడి వాడు. అనుమంతా = చేయవలసిన పనులలో ఆలోచన చెప్పువాడు. లేక బుద్ధిపూర్వకముగ అనుకూలముగ నుండువాడు. భోక్తా = సర్వకర్మఫలసారములను గ్రహించువాడు. పరమాత్మా = గొప్ప చేతనుడు. పరః = దేహికంటె అన్యుడు. పురుషః = ఉపద్రష్టగనుండుట మొదలగు హేతు వులచే పరమాత్మ పురుషుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ యఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ 24

పద॥ యః - ఏవం - వేత్తి = పురుషం - ప్రకృతిం - చ - గుణైః - సహ ।
సర్వథా - వర్తమానః - అపి - న - సః - భూయః - అభిజాయతే ॥

| | | | |
|---|---|---|---|
| యః ఏవం | ఎవ్వడీవిధముగా | సః | అతడు |
| పురుషం | పురుషుని | సర్వథా | అన్ని విధములచేతను |
| ప్రకృతిం చ | ప్రకృతిని | వర్తమానోపి | ఉండినప్పటికిన్ని |
| గుణైస్సహ | గుణములతోగూడ | భూయః | మఱలను |
| వేత్తి | ఎఱుంగునో | నాభిజాయతే | జనింపుట లేదు |

తా॥ ఎవ్వఁడు పురుషుని ప్రకృతిని గుణములతోఁగూడ ఈ విధముగా, అనగా మునుపుజెప్పిన విధముగ నెరుంగునో అతఁడేవిధముగనుండినను, అనగా విధ్యుక్తముగ నడచినను విధిని అతిక్రమించి నడచినను మఱల బుట్టుటలేదు.

- ఏవంఅనుదానికి ఏతం అనియు పాఠముగలదు. (రామానుజులు)

(శంకరులు) ''క్షేత్రజ్ఞుని, నేనని యెరుంగుము'' అని మునుపుజెప్పబడిన విషయము విస్తారముగజెప్పి ముగించబడినది. అట్లు మునుపుజెప్పిన లక్షణములుగల ఈ యాత్మయనెడి పురుషుని ఎవ్వఁడు, జీవుడు ఈశ్వరుడు మొదలగు కల్పనలను తీర్చుటకు ఆధారముగ క్రిందజెప్పినట్లు ''ఇదిగో ఉన్నాడు'' అన్నట్లు ప్రత్యక్షముగ నెరుంగునో, ఆ విధముగనే మునుపుజెప్పినట్టిదైన ఆదిలేని ఇట్టిదని జెప్పుటకశక్యమైన సకల అనర్థములకును మూలకారణమైన అవిద్యయనెడి ప్రకృతిని, దాని మారుబాటులను ఎరుంగునో, అనగా అది జ్ఞానముచే నివర్తింపబడినదిగ లేక పోయెనని ఎరుంగునో అతఁడు ఏవిధముగనున్నను అనగా విధ్యుక్తప్రకారము నడచినను నిషిద్ధములను జేసినను మఱలను జనింపఁడు. జ్ఞానియొక్క ఈ శరీరము నశించినపిదప వేరొకశరీరము నెత్తుటలేదు అని తాత్పర్యము. అపి శబ్దము సత్ప్రవర్తనముగలవాఁడు మఱల జనింపడని చెప్పవలెనా అనుతాత్పర్యము నిచ్చునట్టిది.

జ్ఞానము గలిగినపిదప జన్మాంతరములేదని చెప్పబడినది. ఐతే జ్ఞానముగలుగుటకు మునుపు చేయబడిన కర్మలున్ను అది కలిగిన పిదపచేయబడియున్న కర్మలున్ను వాటిఫలముల నివ్వకయే నశించిపోవుట తగునా? తగదు. ఏలనిన, చేసినవి నశించుటతగదు. కావున ఈ మూడు విధములైన కర్మలున్ను ఈ మూడు జన్మములను కలుగజేయవలెను. లేక అన్నియు చేరియైనగాని ఒక జన్మమును కలుగజేయవలెను. ఇట్లుకానిచో చేసినవి ప్రయోజనములేక నశించునవగును. శాస్త్రముగూడ వ్యర్థమగును. అని చెప్పనీవిధమైన ఆక్షేపణకు ''క్షీయన్తేచాస్య కర్మాణి'' మొదలగు ననేక శ్రుతులచేతను, ఇచ్చట గీతలోను ''జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున'' మొదలగు శ్లోకములచేతను జ్ఞానముచే కర్మ దహించిపోవుట దృఢముగ జెప్పబడియుండుటయే చాలినంత సమాధానమగును.

అవిద్యయు దానినిబట్టి ''నేను నేను'' అని కలుగు నహంకారమును, నాకిది కావలెనను కామము మొదలగు దోషములున్ను సకల అనర్థములకు విత్తనములై వాటివలన గలుగు మంచి చెడ్డలు (పుణ్యపాపములు) జ్ఞానికి జన్మను గలుగజేయుచున్నవి. ఆ దోషములనెడి విత్తనములన్నియు జ్ఞానముచే కాల్పబడియుండును. జ్ఞానియొక్క కర్మలనగా చూపుకు మాత్రము రూపముగలవేగాని అవి శరీరము మొదలగువాటిని కలుగజేయు శక్తిలేనివి. మండిపోయిన వస్త్రము వస్త్రరూపముగలదైనను కట్టుకొనుటకు పనికిరానట్లును, అగ్నిచే కాల్చబడిన విత్తనము మఱల మొలవకయుండునట్లును జ్ఞానముచే కాల్చబడిన కర్మలచే మఱల దేహము గలుగజాలదు.

ఇక ఫలమునివ్వబూని ఇప్పుడున్న జన్మమును కలిగించిన ప్రారబ్ధకర్మలనగా జ్ఞానము గలిగినపిదపగూడ ఫలమునిచ్చియే తీరును. ఎట్లనగా ప్రయోగించిన బాణమువలె ఫలమునివ్వ తలబెట్టియున్నందున ననుఁడు. ఒక లక్ష్యమును రంధ్రపరచుటకై ధనుస్సునుండి విడిచిన బాణము లక్ష్యమును రంధ్రపరచిన తరువాతగూడ మొదలుబెట్టిన వేగము తొలగినగాని ఎట్లువిరమించుటలేదో ఆ విధముగనే శరీరమునుగలుగజేసిన కర్మశరీరముండుట యొక్క ప్రయోజనము తొలగినను ఆ కర్మవాసనాబలముయొక్క వేగము క్రుంగువఱకు మునుపువలె పోవుచునే యుండును. ఐతే

ఏవిధముగ అదే బాణము ధనుస్సులో సంధానముజేయబడినదైనను పోవుటకు కారణమైన వేగ ముతో ఉపయోగింపబడకయుండగా లక్ష్యమును గుర్తించి విడువబడనిదై ధనస్సునుండి వేరుగ నెత్తబడుచున్నదో అవిధముగనే ఫలము నివ్వబూనని కర్మలు, తమచోటనిలబడియే అనగా చైతన్య ప్రతిభానముగల అంతఃకరణమునుండియే తత్త్వజ్ఞానముచే మొలయు శక్తిలేక పోవుచున్నవి. కావుననే జ్ఞానియొక్క ఈ శరీరము నశించినపిదప అతడు మఱలను బుట్టుటలేదని చెప్పినది తగియున్నది.

(రామానుజులు) మునుపుచెప్పిన స్వభావముతోగూడిన ఈ పురుషుని ఇక జెప్పబోవు స్వభావములుగల సత్త్వాదిగుణములతోగూడిన ప్రకృతిని ఎవ్వడు వివేకమువలన నెరుంగునో, అతడు దేవాదిశరీరములలో మిక్కిలి యభిమానముతోనున్నను మరల బంధమును పొందుటలేదు. అనగా ఈ దేహము పోయినతోడనే పూర్ణజ్ఞానము గలిగినట్టియు సకల కర్మలులేనట్టియు ప్రకృతి విముక్తాత్మ స్వరూపమును పొందుచున్నాడనునదే.

(మధ్వులు) మునుపుచెప్పినట్లు ఎవ్వడు పరమాత్మను ప్రత్యక్షముగ నెరుంగునో అతడు జనించుట లేదనుదానికి, ఎవ్వడు తానే బ్రహ్మమని ఎరుంగునో అతడు జనించుటలేదని కొందఱు అర్థము జేసియుండుట సరియైనదిగాదు. పురుషుడే నేనని చెప్పగూడదు జనమేజయ మహారాజు నకును వైశంపాయనునికిని జరిగిన ఉత్తరప్రత్యుత్తరములగు మహాభారతము మోక్షధర్మమందలి క్రిందకనబరచిన వాక్యములను చూడుడు:—

" బహవః పురుషా బ్రహ్మన్ ఉతాహో ఏక ఏవ తు।
కోహ్యత్ర పురుషశ్శ్రేష్ఠస్తం భవాన్వక్తుమర్హసి॥
నైతదిచ్ఛన్తి పురుషమేకం కురుకులోద్భవ।
బహూనాం పురుషాణాం హి యథైకా యోనిరుచ్యతే।
తం తథా పురుషం విశ్వమాఖ్యాస్యామి గుణాధికం॥ "

దీనికి మధ్వసిద్ధాంతానుసారముగ తాత్పర్యము:—

ఓ బ్రాహ్మణోత్తమా! పురుషు లనేకులా? లేక ఒక్కడా? అనేకులైనచో వార్లలో శ్రేష్ఠుడెవ్వడు? అతనిని మీరు నాకు చెప్పవలెను.

పురుషులెల్లరు ఒక్కటనుమతమును జ్ఞానులొప్పుకొనుటలేదు. అనేకులైన పురుషులలో సమస్తమునకు కారణుడై ఒక్కడే చెప్పబడుచున్నాడు. అట్లు సమస్తమునకును కారణుడుగ అనేక గుణములతో గూడియున్న పురుషుని జ్ఞానులంగీకరించునట్లు నేను నీకు చెప్పెదను వినుము.

(రాఘవేంద్రులు) జీవుడు పరుడు అను నీ విధముగ రెండు విధములైన పురుషులను జడము, అజడము (చిత్ అచిత్) అను నీరెండు ప్రకృతులను వారి వారి గుణములతోగూడ ప్రత్యక్షముగ నెవ్వడెరుంగునో, అతడు అజాగ్రతవలన క్రమముదప్పి నడచినను మఱల జన్మించుటలేదు.

(స్వకీయము) ప్రకృతి పురుషులయొక్క స్వభావగుణముల నెరుంగుటచే పునర్జననము తొలగిపోవునట్లు ఈ శ్లోకమునుండి అర్థమగుచున్నది. ఐతే దీనిని మునుపటి శ్లోకముతోచేర్చి యర్థ పరచినచో పురుషుడు సకలవ్యవహారములకంటె అన్యుడనియు, సకల వ్యవహారములున్ను ప్రకృతి యొక్క గుణమనియు తెలిసికొనుట మాత్రముగాదు, ఆవిధముగ దెలిసి తాను సకలమునుండియు నివృత్తిచెంది అనుభోగిగ నుండవలెనని గ్రహింపవలెను.

శ్లో॥ ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 25

పద॥ ధ్యానేన - ఆత్మని - పశ్యన్తి - కేచిత్ - ఆత్మానం - ఆత్మనా ।
అన్యే - సాంఖ్యేన - యోగేన - కర్మయోగేన - చ - అపరే ॥

| | | | |
|---|---|---|---|
| కేచిత్ | కొందఱు | అన్యే | మఱికొందఱు |
| ధ్యానేన | ధ్యానముచేత | సాంఖ్యేన యోగేన | సాంఖ్యయోగముచేతను |
| ఆత్మానం | ఆత్మను | అపరేచ | మఱికొందఱు |
| ఆత్మని | బుద్ధిలోపల | కర్మయోగేన | కర్మయోగముచేతను |
| ఆత్మనా | అంతఃకరణముచే | పశ్యన్తి | చూచుచున్నారు. |
| పశ్యన్తి | చూచుచున్నారు | | |

తా॥ కొందఱు ధ్యానముచే బాగుపడిన అంతఃకరణముచేత బుద్ధిలో ఆత్మను జూచుచున్నారు. ఇతరులు కొందరు సాంఖ్యయోగముచేతను, మఱికొందఱు కర్మయోగముచేతను ఆత్మను అంతఃకరణముచే చూచుచున్నారు.

(శంకరులు) ఇక ఆత్మను జూచుటకు ధ్యానము మొదలగు ననేకమార్గములను చెప్పి భగవంతుడనుగ్రహించుచున్నాడు. ధ్యానమనగా శబ్దము మొదలగు విషయములనుండి చెవి మొదలగు నింద్రియ విషయములను ఒకేదృష్టిగా మనస్సుననీడ్చి ప్రవేశపెట్టి మనస్సును లోపలనున్న జ్ఞానవస్తువునందు ప్రవేశపెట్టి (ఆ వస్తువునే) చింతించుట యేది గలదో అది. ఆ విధముగనే"ధ్యాయతీవ బకః, ధ్యాయతీవ పృథివీ, ధ్యాయతీవ పర్వతాః" కొంగ ధ్యానించుటవలెను, భూమి ధ్యానించుటవలెను, కొండలు ధ్యానించుటవలెను అని (ఛాందోగ్యము 7-6-1-) లో ఉపమానము జెప్పబడియున్నది. తైల ధారవలె అవిచ్ఛిన్నమైన యెడతెగని తలంపు ధ్యానమన బడును. యోగులనగా ఉత్తమాధికారులు. ఆ ధ్యానముచేత తమయంతర్జ్ఞానముచేత, అనగా ధ్యానముచేతనే బాగుపడిన అంతఃకరణముచేత బుద్ధిలోనున్న యాత్మను, అనగా లోపలనున్న జ్ఞాన వస్తువును బ్రహ్మముగ జూచుచున్నారు. సాంఖ్యమనగా - "ఇవి (యంతియు) సత్త్వము, రజస్సు, తమస్సు అనుగుణములు, ఆత్మ వాటి వ్యాపారములకు సాక్షియై నిత్యమై గుణములకంటె వేరుగ నున్నది యని చింతించుట. ఇది సాంఖ్యమనెడియోగము. సాంఖ్యమనగా విమర్శించుటవలన కలిగెడి జ్ఞానము. ఇది యోగము నిచ్చుటవలన యోగమనబడుచున్నది. కొందఱు మధ్యమాధికారులు ఆ సాంఖ్యయోగముచే ఆత్మను అంతఃకరణముచే చూచుచున్నారు అని అనువర్తించును. కర్మ మనునదే యోగము. ఈశ్వరార్పణబుద్ధితో ననుష్ఠింపబడు కర్మ, యోగమునకుపయుక్తమగుటవలన ఉపచారవాదమునుగైకొని యోగమనబడుచున్నది. కొందఱు మందాధికారులు ఆ కర్మయోగముచే మనస్సు బాగుపడి జ్ఞానముగలుగుట మూలముగా ఆత్మను జూచుచున్నారు.

(రామానుజులు) యోగనిష్ఠను జెందిన కొందఱు శరీరములోనున్న ఆత్మను (జీవుని) మనస్సుచే ధ్యానించి యెరుంగుచున్నారు. యోగనిష్ఠలో సిద్ధిపొందనివారలైన కొందఱు జ్ఞానయోగ ముచే మనస్సును యోగ్యముగజేసికొని పిదప ధ్యానయోగమునకై ప్రయత్నించి ఆత్మనెరుంగు చున్నారు. జ్ఞానయోగములో నధికారముగలవారలున్ను లేనివారలున్ను సులభమైన యుపాయమును వెదకువారలై జ్ఞానమును సంపాదించుకొని ఆ జ్ఞానముచే ఆత్మ నెరుంగుచున్నారు.

(మధ్వులు) కర్మయోగికి కర్మయోగము సాంఖ్యయోగము ధ్యానయోగము ఇవి మూడున్ను అత్యావశ్యకములు. సాంఖ్యయోగి వేదమున జెప్పబడిన ఈశ్వరస్వరూపమును వినియు చూచియు చింతించియు ధ్యానించియు ఎరుంగవలెను.

(రాఘవేంద్రులు) కొందరు శ్రవణమననములతో గూడినవారలై ధ్యానముచేతను, బుద్ధి చేతను భగవంతుని తమదేహమున చూచుచున్నారు. కొందఱు వేదోక్తమైన భగవత్స్వరూపాపరోక్ష జ్ఞానముచేతను (నేరుగ జూచుటచేతను) ధ్యానముచేతను చూచుచున్నారు. సాధుకర్మమువలన గలుగునట్టిది భగవత్ప్రసాదము ఆ భగవత్ప్రసాదమువలన గలుగు శ్రవణమనన ధ్యానములచే పరమాత్మ నెరుంగుచున్నారు. ధ్యానమున కశక్తులైన మఱికొందఱు సాంఖ్యసంపాదనముచేత ధ్యానమును సంపాదించుకొని చూచుచున్నారు. ఇందులోను అశక్తులైనవారలు కర్మోపాయముచే శ్రవణాదులను సంపాదించి దానిచే పరమాత్మను జూచుచున్నారు.

(స్వకీయము) ఈ శ్లోకముచేత ఉపాసకులయొక్క తారతమ్యము చెప్పబడినది. (శివ పురాణము వాయుసంహిత 26-వ అధ్యాయమున యోగవిషయము విస్తరించి చెప్పబడియున్నది.)

---

శ్లో॥ అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 26

పద॥ అన్యే - తు - ఏవం - అజానన్తః - శ్రుత్వా - అన్యేభ్యః - ఉపాసతే ।
తే - అపి - చ - అతితరన్తి - ఏవ - మృత్యుం - శ్రుతిపరాయణాః (1) ॥

| | | | |
|---|---|---|---|
| అన్యేతు | మఱిఇతరులైన కొందఱు | శ్రుతిపరాయణాః | విన్నదానినే మేలైనగతియను కొన్న |
| ఏవం | ఈవిధముగా | తేపి చ | వారలుగూడ |
| అజానంతః | ఎరుంగనివారలై | మృత్యుం | మరణమును |
| అన్యేభ్యః | ఇతరులనుండి | అతితరన్తి | దాటనే దాటుచున్నారు. |
| శ్రుత్వా | విని | | |
| ఉపాసతే | ఉపాసించుచున్నారు | | |

తా॥ ఈ విధముగ (ఆత్మ ఉపద్రష్టృత్వము మొదలగు స్వభావము గలవాడని) ఎరుంగనివారలైన మఱి ఇతరులు కొందఱు గురువుమొదలగువారి ఉపదేశమునుపొంది ఉపాసించుచున్నారు. అట్లు వినిన దానినే మేలైనగతి యని తలంచిన వారలుగూడ గురూపదేశము నాశ్రయించుచు మరణమును దాటినవారలే యగుచున్నారు.

(1) శ్రుతిపరాయణాః - శాస్త్రార్థోపదేశమును బడయుటయే మోక్షమునకు ముఖ్యసాధనమని నమ్మియున్నవారలు (శంకరులు). అనేకకాలము శ్రవణము జేయుచుండి (రాఘవేంద్రులు).

(శంకరులు) ఈ విధములైన వాట్లలో ఏదైననొక దానిచేతను మునుపు చెప్పినట్లు ఆత్మ నెరుంగ జాలని మిగత కొందఱు, అనగా మిక్కిలి మందాధికారులు ఇతరులవద్ద నుండి అనగా ఆచార్యునివద్ద నుండి విని "దీనిని ఈ విధముగ ధ్యానించుము" అని యుపదేశింపబడిన వారలై యుపాసించుచున్నారు. అనగా శ్రద్ధతో చింతించుచున్నారు. అట్టివారైన వారలుగూడ మరణమును అనగా మరణముతోనే ఏర్పరచిన సంసారమును దాటుచున్నారు. 'శ్రుతిపరాయణాః' వినిన దానినే

మోక్షమార్గమునబోవుటకు మేలైన సాధనమనుకొన్నవారలు. అనగా కేవలము ఇతరుల ఉపదేశమునే ప్రమాణముగగల, అనగా స్వయముగ విమర్శించి యెరుంగు సామర్థ్యము లేనివారలు అని తాత్పర్యము. ఐతే ప్రమాణవిషయమున స్వతంత్రులై అనగా ప్రమాణములను తామే యూహించి యెరుంగువారలై విమర్శనాశక్తిగలవారలు మృత్యువును దాటిన వారలగుచున్నారని చెప్పవలెనా?

(రామానుజులు) పైగా జెప్పిన సాంఖ్య కర్మ యోగములలో అధికారము లేనివారలైన కొందఱు జ్ఞానులచే ఉపదేశముబడసి కర్మయోగాదులవలన ఆత్మనుపాసించుచున్నారు. శ్రుతి మొదలగువాటిని విని యెరింగియు కర్మయోగాదుల ననుష్ఠించియు దానిచే పాపమును బోగొట్టుకొని సాంఖ్యాది యోగములచేత మృత్యువు నతిక్రమించుచున్నారు.



శ్లో॥ యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ॥ 27

పద॥ యావత్ - సంజాయతే - కించిత్ - సత్త్వం - స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ - తత్ - విద్ధి - భరతర్షభ॥

| | | | |
|---|---|---|---|
| హే భరతర్షభ ! | ఓ భరతశ్రేష్ఠా ! | క్షేత్రక్షేత్రజ్ఞసం | క్షేత్రముక్షేత్రజ్ఞుడు వీరల |
| స్థావరజఙ్గమమ్ | స్థావరజఙ్గమమైన | యోగాత్ | సంబంధమువలన |
| యావత్ కించిత్ సత్త్వం | ఏయొక్క వస్తువు కలుగు | జాయతే ఇతి | కలుగుచున్నదని |
| సంజాయతే తత్ | చున్నదో అది | విద్ధి | ఎరుంగుము. |

తా॥ ఓ భరతులలో శ్రేష్ఠుడవైన అర్జునా! స్థావరము జఙ్గమమునైన ఏ యొక వస్తువు కలుగుచున్నదో అదియంతయు క్షేత్రము క్షేత్రజ్ఞుడు వీరల సంబంధమువలన కలుగుచున్నదని తెలిసికొనుము.

(శంకరులు) "క్షేత్రజ్ఞుని నేననియు నెరుంగుము" అని క్షేత్రజ్ఞుడున్ను (ఆత్మయు) ఈశ్వరుడున్ను ఒక్కటనుదానినిగూర్చిన జ్ఞానము ముక్తికిసాధనమని చెప్పబడినది. అది యే కారణము వలన ఆ విధముగనున్నదను దానిని స్పష్టపరచుటకై ఈ శ్లోకము మొదలుపెట్టబడుచున్నది. వస్తువులు స్థావరము జఙ్గమము అను వేరుబాటుతో పుట్టుచున్నవని చెప్పబడుచున్నవి. ఈ క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క సంబంధమెట్టిది? త్రాడుతో కుండకుగల సంబంధమువంటి సంబంధమని జెప్పగూడదు. ఏలనగా క్షేత్రజ్ఞుడైన యాత్మకు ఆకాశమువలె అవయవములు లేకుండుటవలన. లేక నూలు, వస్త్రము, వీటికివలె సమవాయము అనగా ఎల్లప్పుడు సంబంధము విడువకయుండుట యనునది లేదు. ఏలనగా క్షేత్రక్షేత్రజ్ఞులకు కార్యకారణభావము అంగీకరింపరాదు. మఱియేవిధమైనదనగా త్రాడు, సీసము, మొదలగువాటికి, విభజించి యెరుంగనందున, ఆరోపితమైనపాము, వెండి, మొదలగువాటి సంబంధమువలె వెవ్వేరు స్వభావముగల విషయ విషయులైన క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూప వివేకములేనందున గలుగునట్టి అధ్యారోపము, అనగా ఒకదానిలో మఱియొకదానిని దాని స్వభావములను ఎక్కించుటయను సంయుక్తమే. ఈ విధముగ క్షేత్రక్షేత్రజ్ఞులకు ఆరోపితమైన యీ సంబంధము మిథ్యాజ్ఞానమువలన నున్నది. శాస్త్రానుసారముగ క్షేత్రక్షేత్రజ్ఞుల లక్షణములను భేదములను ఎరుంగుటతోబాటు వాటిని ముంజయనెడి గడ్డినుండి మధ్యభాగమును విడదీయుటవలె విడదీసి, "నసత్తన్నాసదుచ్యతే" అనుటవలన ఉపాధిభేదమున్నియులేని ఎరుంగవలసిన (బ్రహ్మ

మును ఎవ్వడు స్వరూపముతో జూచునో అనగా అనుభవించి యెరుంగునో, మఱియు ఇంద్రజాలము వలన సృష్టింపబడిన ఏనుగు, భవనము, మొదలగునవి వలెను, స్వప్నమున జూచిన వస్తువువలెను, "లేనిదేయైన క్షేత్రమున్నదివలె కనబడుచున్నది" అను నీ విధముగ నిశ్చితవిజ్ఞానముగలవాడై ఎవ్వ డుండునో అతనికి మిథ్యాజ్ఞానము మునుపుజెప్పిన యథార్థజ్ఞానముయొక్క విరోధముచే తొలగిపోవు చున్నది. అతనికి జనించుటకు కారణము తొలగినందున "జ్ఞాని మఱలను బుట్టుటలేదని" "ఎవ్వడీ విధముగ నెరుంగునో" అని చెప్పబడినది సరియైనదే యనుడు.

(శ్రీధరులు) అవివేకముచే దేహాదులలో ఆత్మబుద్ధియే క్షేత్రక్షేత్రజ్ఞుల సంబంధమని చెప్పబడుచున్నది. సకలజగత్తు చిత్ప్రకృతి (లక్ష్మి) పరమాత్మ వీరల సంబంధమువలననే కలుగు చున్నది. ముఖ్యకారణము పరమాత్మయని తాత్పర్యము.



శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥ 28

పద॥ సమం — సర్వేషు — భూతేషు — తిష్ఠన్తం — పరమేశ్వరం।
వినశ్యత్సు — అవినశ్యన్తం — యః — పశ్యతి — సః — పశ్యతి॥

| | | | |
|---|---|---|---|
| సర్వేషు భూతేషు | సకలభూతములలోనున్ను | పరమేశ్వరం | పరమేశ్వరుని |
| సమం | సమముగ | యః | ఎవ్వడు |
| తిష్ఠన్తం | ఉన్నవాడున్ను | పశ్యతి | చూచునో |
| వినశ్యత్సు | నశించువాటిలో | సః పశ్యతి | అతడు చూచుచున్నాడు. |
| అవినశ్యన్తం | నశించనివాడునైన | | |

తా॥ అన్నివస్తువులలోపలనున్న సమముగనున్నవాడుగను నశించెడి వస్తువులలోనున్న నశించనివాడునైన పరమేశ్వరుని ఎవ్వడుచూచునో అతడే నేరుగ జూచుచున్నాడు.

(శంకరులు) "న స భూయోభిజాయతే" అని సమ్యగ్దర్శనముయొక్క ఫలము, అవిద్య మొదలగు సంసారబీజనివృత్తి మూలముగ జననములేకుండుట యనునది చెప్పబడినది. జననము నకు కారణమై అవిద్యవలననగు క్షేత్రక్షేత్రజ్ఞ సంబంధమున్ను జెప్పబడినది. కావున అట్టి యవి ద్యను బోగొట్టగల తత్త్వజ్ఞానము జెప్పబడినదైనను మఱల వేరుమాటలచే చెప్పబడుచున్నది బ్రహ్మ మొదలుగా స్థావరముపఱకుగల ప్రాణులలో భేదములేక స్థితిబడయు పరమేశ్వరుని చూచెడివాడు యథార్థజ్ఞానము గలవాడు. పరమేశ్వరుడు శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అవ్యక్తము, (కారణశరీరము) జీవుడు వీటికంటె మేలైనవాడు, ఏలెడి స్వభావము గలవాడు అతడు అన్ని ప్రాణుల లోను ఒక్కటేవిధముగ నిలబడుచున్నాడు. ప్రాణులకును పరమేశ్వరునికిని మిక్కిలి భేదముచూపుటకై ఆ పరమేశ్వరుని నశించనివాడని విశేషించుచున్నాడు. అన్నిబావవికారములకును జననమనెడి భావ వికారము మూలకారణము. నాశమును ముగింపుగగల మఱియితరములైన భావవికారములన్నియు జనించినపిదప గలుగునట్టివి. నాశమునకు పిదప వేరొకభావవికారములేదు. ఏలనగా వస్తువేలేకపోవుట వలననేయగు. కావుననే కడపటిదైన భావవికారము లేదనినందున దానికి పూర్వమున్న భావవికారము లన్నియులేవని చెప్పినవగుచున్నవి, కావున పరమేశ్వరు డన్నిప్రాణులకంటె అన్నివిధముల భేదము

గలవాడనియు, భావవికారము లేనివాడనియు, ఒక్కడుగనే యున్నవాడనియు చెప్పుట సరియైనది. ఎవ్వడీవిధముగ పరమేశ్వరునిజూచునో అతడు నేరుగ జూచుచున్నాడు. ఐన మిగతవారలు జూచుట లేదా? అనిన, తిమిరముచే చూపుతగ్గినవాడు అనేక చంద్రులను జూచుచున్నాడు. అతని నుద్దేశించి ఒకేచంద్రుని జూచెడివానిని "అతడే చూచుచున్నాడు" అని విశేషించి చెప్పుటవలె ఇచటను వేరు వేరుగ లేని మునుపుచెప్పిన ఒకటేయాత్మను ఎవడుజూచునో అతడు అనేకాత్మలను పొరబాటుగ జూచెడి వారలకంటె "అతడే చూచుచున్నాడు" అని విశేషించి చెప్పబడుచున్నాడు. మిగత వారలు గూడ చూచెడివారలైనను ఉన్నట్లు చూచెడివారలుకారు. అనేక చంద్రులను జూచెడివానివలె పొర బాటుగా జూచుటవలన ననుడు.

(రామానుజులు) ప్రకృతి పురుషులవలన గలిగియున్న దేవమనుష్య మృగపక్షి మొదలగు దేహములలోని జీవాత్మలు వారలు దేనితో సంబంధము గలిగియున్నారో అట్టి యవిద్యను తొలగించి చూచినయెడల వ్యత్యాసములేక జ్ఞానాకారముచే సమానులుగనున్నారు దేహేంద్రియ మనోబుద్ధుల కంటె అన్యులుగను వాటికి యజమానులుగను నున్నందున పరమేశ్వరులుగనున్నారు. అట్టివాడైన తన్ను దేహాదులు పలువిధముగనున్నట్లు ఆత్మగూడ వ్యత్యాసముగలవాడని యెరుంగువాడు బాగుగ నెరింగినవాడు. దేహాదులు నశించుటవలె ఆత్మనశించునట్టిదని యెరుంగువాడు బాగుగ నెరింగిన వాడుకాడు. కావున అతడు సంసారబంధమునకు తగినవాడుగ నున్నాడు.

(రాఘవేంద్రులు) ఉత్కృష్టనికృష్టములైన సకల ప్రాణులలోనున్న అచింత్యశక్తిగల పరమాత్మను అంతట నొకేవిధముగ నున్నవాడుగను జననమరణ దుఃఖదోషములతోగూడిన ప్రాణు లలోనుండు పరమాత్మకు ప్రాణులయొక్క దోషములలో సంబంధములేదనియు ఎవ్వడెరుంగునో అతడే వాస్తవమైన జ్ఞానిగనున్నాడు.

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరం ।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిం * ॥ 29

పద॥ సమం - పశ్యన్ - హి - సర్వత్ర - సమవస్థితం - ఈశ్వరం ।
న - హినస్తి - ఆత్మనా - ఆత్మానం - తతః - యాతి - పరాం - గతిం ॥

| | | | |
|---|---|---|---|
| హి | ఏలనగా | ఆత్మనా ఆత్మానం | తనచే తన్ను |
| సర్వత్ర | అన్నిప్రాణులలోను | న హినస్తి | హింసింపడు |
| సమవస్థితం | సమముగనిలబడిన | తతః | దానివలన |
| ఈశ్వరం | ఈశ్వరుని | పరాంగతిం | మేలైనగతిని |
| సమంపశ్యన్ | సమముగ జూచెడివాడు | యాతి | పొందుచున్నాడు. |

తా॥ ఏలనగా అన్నిప్రాణులయందును సమానముగా నిలబడిన ఈశ్వరుని సమముగ జూచెడివాడు తన్ను తనచే హింసించుకొనుటలేదు. దానివలన మోక్ష మనెడి శ్రేష్ఠగతిని పొందుచున్నాడు.

(శంకరులు) మునుపుచెప్పిన యథార్థజ్ఞానమును ఫలమునుజెప్పి పొగడవలెనని ఈ శ్లోకము మొదలుపెట్టబడుచున్నది. అన్ని ప్రాణులలోను సమానముగనిలబడు నీశ్వరుని, అనగా మునుపటి శ్లోకమున లక్షణము జెప్పబడ్డపినవానిని సమముగ అనగా, ఒకే ఆకారముగలవానిగ

చూచి యెరుంగువాడు దేనిని జేయుటలేదు? తన్నుతానే హింసించుటలేదు. చంపుటలేదు. ఆత్మను హింసింపకున్నందున మోక్షమనిపేరుగల మేలైనగతిని పొందుచున్నాడు. అనగా ఆత్మయొక్క వాస్తవస్వభావమును కప్పుచున్నట్టి అజ్ఞానతెఱయు అయథార్థజ్ఞాన తెరయు నశించినతోడనే అన్నిటి కంటె గొప్పగతియైనట్టి శ్రేష్ఠమైన పురుషార్థమగు పరమానందమును జ్ఞాని యనుభవించుచున్నాడనునది తాత్పర్యము. అట్లైన ఏ ప్రాణిగూడ తనయాత్మను హింసించుటలేదు. "అగ్నినె ప్రతిష్ఠ జేయుట నేలమీదగూడదు, ఆకాశమునగూడదు, స్వర్గమునగూడదు" అనునది మొదలైనదివలె హింసించుటలేదను మాటను ఎట్లు చెప్పుచున్నాడనగా ఎల్లరికి బాగుగ తెలిసియున్నట్టియు, నేరుగ ప్రత్యక్షముగనున్న యాత్మను అజ్ఞానులెల్లరు అలక్ష్యముచేసి ఆత్మకాని శరీరము మొదలగువాటిని ఆత్మయనుకొని పుణ్యపాపకర్మనుజేసి తనదనుకొని ఆ యాత్మను (శరీరము మొదలగువాటిని) చంపి మఱియొక నూతనమైన యాత్మను తనదిగ జేసికొనుచున్నాడు. దానినిగూడజంపి మఱియొకదానిని తనదిచేసికొనుచున్నాడు. అని యీ విధముగ వెదకివెదకి తనకుతనకని సంపాదించుకొని ఆ యాత్మను చంపుచున్నారు. కావుననే అజ్ఞానులెల్లరు ఆత్మను చంపెడివారలనుడు. మఱి వాస్తవమైన ఆత్మయేదిగలదో అదిగూడ ఎల్లప్పుడు నవిద్యచే చంపబడినదివలెనగును. నిత్యముగనున్న బ్రహ్మానందము ననుభవించకయున్నందున ననుడు. కావున అజ్ఞానులెల్లరు ఆత్మనుజంపెడివారలే. ఐతే మునుపుచెప్పిన ఆత్మనుజూచెడివాడైన మఱియొకడెవ్వడో అతడు రెండు విధములుగాను తన్నుతానే చంపుటలేదు. దానిచే శ్రేష్ఠమైనగతిని పొందుచున్నాడు. మునుపుజెప్పిన ఫలము అతనికి గలదని తాత్పర్యము.

(శ్రీధరులు) ఎవ్వడీవిధముగ నెరుంగునో అతడు సచ్చిదానంద స్వరూపియైన తన్ను చెరుచుకొనుటలేదు. అట్లెరుంగనివాడు దేహమే ఆత్మయని యెరింగినవాడైనందున అతడు దేహమునువలె ఆత్మనుగూడ చెడుపుకొనుచున్నాడు.

(రామానుజులు) న హినస్తి = రక్షించుకొనుచున్నాడు. అనగా బంధమునుండి విడిపించుకొనుచున్నాడు. తతః = తన స్వరూపము నీవిధముగ నెరుంగుటవలన, పరాం = బంధమునుండి విముక్తిచెందిన, గతిం = తాను పొందదగిన స్వరూపమును, యాతి = పొందుచున్నాడు. ఇట్లెరుంగనివాడు తన్ను సంసారమున ముంచుకొనుచున్నాడు.

(రాఘవేంద్రులు) పరమాత్మను సమముగ జూచెడివాడు తన్ను, నహినస్తి – నరకమున బడునట్లు చేసికొనుటలేదు.

* ఈ శ్లోకమును కూర్మపురాణము ఉత్తరభాగము అధ్యాయము యెనిమిదిలో చూడుడు.

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి * తథాఽఽత్మానమకర్తారం స పశ్యతి ॥ 30

పద॥ ప్రకృత్యా - ఏవ - చ - కర్మాణి - క్రియమాణాని - సర్వశః ॥
యః - పశ్యతి - తథా - ఆత్మానం - అకర్తారం - సః - పశ్యతి ॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వరు | పశ్యతి | చూచుచున్నాడో |
| కర్మాణి | కర్మలను | తథా | ఆవిధముగనే |
| సర్వశః | అన్నివిధముల | ఆత్మానం | ఆత్మను |
| ప్రకృత్యైవ చ | ప్రకృతిచేతనే | అకర్తారం (పశ్యతి) | అకర్తగ చూచుచున్నాడో |
| క్రియమాణాని | చేయబడుచున్నవిగ | సః పశ్యతి | అతడు చూచుచున్నాడు. |

తా॥ ఎవ్వఁడు కర్మలన్నియు, దేహేంద్రియాది స్వరూపముగనున్న ప్రకృతిచేతనే చేయబడుచున్నవనియు, ఆ విధముగనే ఆత్మ, కర్మలకు కర్త కాదనియు ఎరుంగునో అతడే వాస్తవమును జూచుచున్నాఁడు.

(శంకరులు) ప్రాణులన్నిటిలోనున్న ఈశ్వరుని సమముగ జూచెడివాడు తన్ను తనచే చంపుకొనుటలేదు. అని చెప్పబడినది. తమ గుణము వ్యాపారము వీటిభేదములవలన వెవ్వేరుగ వేరుబడిన అనేక ఆత్మలున్నవి. కావున సమముగ జూచుటయనునది తగదని శంకించి ఈ శ్లోకము జెప్పబడుచున్నది.

ప్రకృతియనగా భగవంతునిమాయ. త్రిగుణాకారముగలది "మాయాంతుప్రకృతిం విద్యాత్" మాయను ప్రకృతిగనెరుంగవలయునని మంత్రవర్ణమువలననను. ప్రకృతియే, అనగా ఈశ్వరునిశక్తియే, వాక్కు మనస్సు శరీరము వీటివలన జేయబడు వ్యాపారములనుజేసి పూర్తిజేయు చున్నది, మరొక్కటి కాదు అనియు. క్షేత్రజ్ఞుడైన ఆత్మ అకర్త, ఉపాధులన్నియు లేనివాడు అనియు ఎవ్వడెరుంగునో అతడు యథార్థవస్తువునుజూచి యెరింగినవాడని తాత్పర్యము. ఆకాశ మునకు భేదములేనట్లు నిర్గుణమై అకర్తయై భేదములేని వస్తువునకు భేదముగలదనుటలో ప్రమాణము లేదనునది తాత్పర్యము.

ఆత్మకు కర్తృత్వము దేహాభిమానముచేతనేగాని స్వభావమున కర్తృత్వములేదు.

''కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే'' (ఈ అధ్యాయము 21 వ శ్లోకము) అనునట్లు సకలకార్యములను జేయునట్టిది ప్రకృతియేగాని తానుకాదనియు, తాను జ్ఞాన స్వరూపి యనియు తనకు ప్రకృతి సంబంధమున్ను (శరీరిగప్రకృతియెడనుండుట) దానిమూలముగ సుఖ దుఃఖాద్యను భవమున్ను కర్మరూపమైన అజ్ఞానమువలన గలిగియున్నవనియు ఎరింగెడివాడు ఎరుంగవలసిన తనయాత్మను ఉన్నట్లెరింగినవాడు.

ప్రకృత్యైవ చ = ప్రకృత్యా = ఏవచ ఈశ్వరేణ = తానుజేయుచున్న సకలకర్మలు తన పూర్వకర్మానుసారముగనే ఈశ్వరుడు జేయించుచున్నాఁడనియు, ఆ ఈశ్వరునికి కర్త (యజమానుడు) వేరెవ్వరులేరనియు ఎవ్వడెరుంగునో అతడు ఈశ్వరుని జూచుచున్నాఁడు. ఈశ్వరుడు జీవుని పూర్వకర్మ ననుసరించి ఆ యాకర్మానుసారముగ కర్మలను జేయించుటవలన ఈశ్వరుని యెడ వైషమ్యము (పక్షపాతము) లేదు. లేక ప్రకృత్యా = చిత్రప్రకృతిచేతను, చ = ఈశ్వరుని చేతను, కర్మలు చేయింపబడుచున్నవనియు, జీవుడు తాను స్వతంత్రుడుకాడనియు ఎవ్వడుజూచునో అతడు వాస్తవమైన దానిని జూచినవాడు.

* 'తదా' అనియు పాఠము. అప్పుడు అనియర్థము.

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థమనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ 31

పద॥ యదా - భూతపృథగ్భావం - ఏకస్థం - అనుపశ్యతి ।
తతః - ఏవ - చ - విస్తారం - బ్రహ్మ - సంపద్యతే - తదా ॥

| | | | |
|---|---|---|---|
| యదా | ఎప్పుడు | అనుపశ్యతి | చూచునో |
| భూతపృథగ్భావం | ప్రాణుల వెవ్వేరైన స్వభావమును | తత ఏవ | ఆ ఒకదానినుండియే |
| ఏకస్థం | ఒకదానిలోనున్నట్లు | విస్తారం చ | విసరించునట్లుగను |

| | | | |
|---|---|---|---|
| అనుపశ్యతి | చూచునో | బ్రహ్మ | బ్రహ్మముగనే |
| తదా | అప్పుడు | సంపద్యతే | అగుచున్నాడు |

**తా॥ ఎప్పుడు (ఒకడు) ప్రాణులయొక్క నానావిధమైన ప్రత్యేకించిన స్వభావమును ఒకటైన ఆత్మలోనున్నట్లుజూచునో, ఆ యొకదానినుండియే (ఆత్మనుండియే) ఇవన్నియుకలిగి విస్తరించునట్లును జూచునో, అప్పుడతడు బ్రహ్మముగనే యగుచున్నాడు.**

(శంకరులు) అట్టి యథార్థజ్ఞానమునే మఱల వివరించి చెప్పుచున్నాడు. ప్రకృతియు దాని వికారములున్ను పురుషునికి విలక్షణముగనే యున్నవను సాంఖ్యుల సిద్ధాంతమును నిషేధించుటకై ఈ శ్లోకము చెప్పబడుచున్నది. ఒకడు శాస్త్రము ఆచార్యుడు వీరల ఉపదేశమును అనుసరించి భూతముల విభేదము విభాగము ఒకటేయాత్మయెడనున్నదని ఏకాలమున జూచుచున్నాడో, కల్పితములుగనున్నవన్నియు దాని కాధారముగ నుండుటకంటె దూరముగనుండుటలేదని ఎరింగి "ఆత్మైవ ఇదం సర్వం = ఇదంతయు ఆత్మయే" అని ఆత్మను ప్రత్యక్షముగజూచునో మఱియు "ఆత్మతః ప్రాణ, ఆత్మత ఆశా, ఆత్మతః స్మర, ఆత్మత ఆకాశః, ఆత్మతస్తేజః, ఆత్మత ఆపః, ఆత్మత అవిర్భావతిరోభావౌ, అత్మతో భూరాత్మతో న్నమాత్మతో బలమాత్మతో విజ్ఞానమాత్మతో ధ్యానమాత్మతశ్చిత్తం, అత్మ తత్సంకల్పః, ఆత్మతోమన, ఆత్మతోవాక్, ఆత్మతో నామ, ఆత్మతో మంత్రాః, ఆత్మతః కర్మాణ్యాత్మత ఏ వేదం సర్వం = ఆత్మనుండి ప్రాణము, దిక్కులు, ఇచ్ఛ, ఆకాశము, ప్రకాశము, జలము, ఉత్పత్తి, నాశములు, భూమి, అన్నము, బలము, వివేకము, ధ్యానము. చిత్తము, సంకల్పము, మనస్సు, వాక్కు, పేరు, మంత్రములు, కర్మలు మఱి సకల వస్తువులున్ను ఉన్నవి." అని (ఛాందోగ్యము, 7-26-1.) ఈ విధముగ భూతములు ఆ యాత్మ నుండియే అజ్ఞానముచేత గలిగి విస్తరించుచున్నవని ఏకాలమున జూచుచున్నాడో అప్పుడతడు బ్రహ్మమేయగుచున్నాడు. అనగా నంతట నిండినవాడగుచున్నాడని తాత్పర్యము.

(శ్రీధరులు) ఒకడు స్థావరజంగమములయొక్క భేదభావము, ఏకస్థం = ఒకటిగనేయున్న ఈశ్వరశక్తి రూపముగ ప్రకృతిలో ప్రళయకాలమున లయించియున్నట్లును ఆ ప్రకృతివద్ద నుండియే భూతములయొక్క విస్తారము సృష్టికాలమున గలుగునట్లును ఆలోచించుచున్నాడో, అనగా జూచుచున్నాడో అప్పుడు ప్రకృతిమాత్రముచేతనే భూతభేదములని, ఆభేదమును పరిపూర్ణముగ జూచుచు ఆబ్రహ్మమును పొందుచున్నాడు అనగా బ్రహ్మమే యగుచున్నాడు.

(రామానుజులు) ప్రకృతి పురుషులలో ప్రకృతియొక్కటే దేవమనుష్యాది రూపములుగ నున్నదనియు, ఆయాదేహములలోని దేవత్వము మనుష్యత్వము హెరుగుట, తగ్గుట, మొదలగు ధర్మములు దేహమునాధారపడినవేకాని ఆత్మనాధారపడినవి కావనియు, ప్రకృతిరూపములైన దేహములనుండియే పుత్రపౌత్రాది రూపములుగ ప్రపంచము విస్తరించుచున్నదనియు, ఎప్పుడతడు ఎరుంగునో, అప్పుడతడు పరిపూర్ణజ్ఞానప్రకాశముతోగూడిన ప్రకృతి విముక్తమైన తన నిజ స్వరూపమును పొందుచున్నాడు.

(రాఘవేంద్రులు) నానావిధ భేదములుగల ప్రపంచము ఒక్కడుగనున్న విష్ణువును ఆశ్రయించియున్నట్టిదనియు, ఆ విష్ణువువద్దనుండియే మరలగలుగునట్టిదనియు, ఒకడెప్పుడు జీవేశ్వరభేదమును జీవులలో పరస్పరభేదమును తారతమ్యముగజూచునో అప్పుడు బ్రహ్మమే యగుచున్నాడు.

శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయమవ్యయః ।
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే॥ 32

పద॥ అనాదిత్వాత్ - నిర్గుణత్వాత్ - పరమాత్మా - అయం - అవ్యయః।
శరీరస్థః - అపి - కౌంతేయ - న - కరోతి - న - లిప్యతే॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! | అవ్యయః | నాశనములేనివాడు |
| అయం | ఈ | శరీరస్థోపి | శరీరములోనున్నవాడైనను |
| పరమాత్మా | పరమాత్మ | నకరోతి | దేనిని జేయుటలేదు |
| అనాదిత్వాత్ | అనాదియైనందునను | నలిప్యతే | (కర్మఫలముచే) పట్టుబడుట లేదు. |
| నిర్గుణత్వాత్ | నిర్గుణుడైనందునను | | |

తా॥ ఓ కుంతీపుత్రా! ఈ పరమాత్మ అనాదియైనందునను, నిర్గుణుడైనందునను నాశములేనివాడు. ఈ పరమాత్మ దేహములోనున్నను ఏ వ్యాపారమును జేయుటలేదు. ఏ కర్మఫలముచేతను పట్టుకొనబడుటలేదు.

(శంకరులు). ఒకేయాత్మ అన్ని దేహములలోని ఆత్మయైనచో ఆ దేహములోని దోషములతో ఆత్మకు సంబంధమేర్పడవలెను. అనగా వాటిచే ఆత్మ ఆక్రమింపబడవలెనుగదా? అను నీ శంకనివర్తించుటకై ఈ శ్లోకమును భగవంతుడు చెప్పుచున్నాడు. ఆది యనగా కారణము. దేనికి ఆదిలేదో అది అనాది. దేనికి కారణముగలదో అది తానుగనే నశించుచున్నది. ఇదియన్నచో కారణములేని వస్తువైనందున అవయవములు లేనిది, కావుననే నశించునట్టిదిగాదు. గుణముగలవస్తువు ఆ గుణము తగ్గుటవలన నశించుచున్నది. ఇదియనగా నిర్గుణమైనందునను నశించుటలేదు. ఈ విధముగ ఈ పరమాత్మ నాశములేనిది. ఇట్లుండుటవలన ఈ యాత్మ దేహములలో నున్నదైనను అనగా ఆత్మ శరీరములలోనే కనబడుచున్నదన్నందున శరీరములలోనున్నట్లు చెప్పబడుచున్నదైనను ఏ వ్యాపారమునుగాని జేయుటలేదు. కర్మను జేయకుండుట వలననే దానిఫలముచే ఆశ్రయింపబడుటలేదు. ఎవ్వడు తాను కర్తయని తలంచునో అతడు కర్మఫలముచే కట్టబడుచున్నాడు, ముట్టడింపబడుచున్నాడు. ఈ యాత్మ యనగా అకర్త, కావుననే ఫలముచే పట్టబడుటలేదని తాత్పర్యము.

ఐతే దేహములలో అన్ని కర్మలను జేయువాడును వాటి ఫలములచే పట్టబడువాడును ఎవ్వడు? అతడు పరమాత్మకంటె వేరైన ఒక దేహి (జీవాత్మ) యనిన, అప్పుడు "క్షేత్రజ్ఞంచాపిమాం విద్ధి = క్షేత్రజ్ఞుని నేననియు ఎరుంగుము" అను దానివలన క్షేత్రజ్ఞుడున్ను ఈశ్వరుడున్ను ఒక్కటే యని చెప్పియుండుటకు తగియుండదు. ఈశ్వరునికంటె వేరైన ఒకదేహి, అనగా జీవుడు లేనందున ఈశ్వరుడే చేయుచున్నాడనవలెను. అప్పుడుచేసెడి స్వభావమున్ను అనుభవించు స్వభావమున్ను ఈశ్వరునికున్నచో అతడు గూడ జీవునివంటివాడేగాని ఈశ్వరుడు గాజాలడు. ఈశ్వరుడు కాడనీయే యగును. కావున భగవంతుడు చెప్పినవైన ఉపనిషత్తుల సిద్ధాంతము అన్నివిధముల ఎరుంగుటకును చెప్పుటకును వీలులేనిదని వైశేషికులచేతను, సాంఖ్యులచేతను, అర్హతులచేతను, బౌద్ధులచేతను చెప్పబడుటవలె త్రోసివేయవలసినదేనా? యనిన,

ఆ విషయమున భగవంతుడు "స్వభావస్తుప్రవర్తతే = స్వభావమే ప్రవర్తించుచున్నది. ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణాని సర్వశః" (13-వ అధ్యా 30-వ శ్లో॥) అనుదానిలో దీని పరిహారమును అనగా సమాధానమును తానే యనుగ్రహించియున్నాడు. వ్యాపారము అనుభవము

మొదలగు వ్యవహారములు అవిద్యచే ఆత్మయెడ నారోపింపబడుచున్నది. మఱి యవి పరమాత్మ యెడ వాస్తవముగనే లేవు. కావుననే ఈ యథార్థజ్ఞానమున నిలకడజెంది జ్ఞానమున దృఢముగ నిలబడువారలై అవిద్యను, దాని వ్యవహారములను తిరస్కరించియున్న పరమహంస పరివ్రాజకులకు కర్మలో అధికారములేదని అచ్చటచ్చట భగవంతునిచే ఉపదిష్టమైయున్నది.

(రామానుజులు) ఈ పరమాత్మ, అనగా ప్రకృతి విముక్తమైన ఆత్మ (జీవుడు) నిర్గుణత్వాత్ = సత్త్వాదిగుణములు లేనందున, నలిప్యతే = దేహధర్మములలో నంటుటలేదు.

(రాఘవేంద్రులు) అవ్యయః = నాశములేని, అయం పరమాత్మా = ఈ విష్ణువు, శరీరస్థోపి = దేహమున సంబంధించియున్నను, అనాదిత్వాత్ = అనాదియైనందునను, నిర్గుణత్వాత్ = సత్త్వాదిగుణములులేనివాడైనందునను, న కరోతి = లోకములోనివారివలె జేయుటలేదు, న లిప్యతే = చింత మొదలగు దుఃఖములను పొందుటలేదు. "సర్వంఖల్విదం బ్రహ్మ, పురుష ఏవేదం సర్వం" మొదలగు శ్రుతివాక్యములచే బ్రహ్మమునకును ప్రపంచమునకును అభేదము తోచుచున్నదేయనిన, ఆ శ్రుతులలోని అర్థమును బాగుగ నెరుంగనందున అభేదము తోచుచున్నదని భగవంతునిచే బైట బెట్టబడుచున్నది. ఎట్లనగా, అవ్యయః = నాశములేని, అయం పరమాత్మా = ఈ విష్ణువు, అనాదిత్వాత్ = దేహముతో జేరుటలోగాని దానిని విడచిపెట్టుటలోగాని కారణములేనివాడై నందునను, నిర్గుణత్వాత్ = సత్త్వాది గుణములు లేనివాడైనందునను, శరీరస్థోపిన = జీవుడుగగూడకాజాలడు. అట్లుండగా జడముకాగలడని ఎట్లు చెప్పెదము? కరోతి = చేసెడివాడగుచున్నాడు, నలిప్యతే = కర్మతో సంబంధపడుటలేదు, అయం = జీవుడనగా, నావ్యయః = దేహనాశముచే నాశముగలవాడు, శరీరస్థః = ఈ శరీరమును బడసినవాడు, న అనాదిత్వాత్ = దేహసంబంధము విభాగము వీటికి కారణముగలవాడైనందునను, ననిర్గుణత్వాత్ = సత్త్వాదిగుణములు గలవాడైనందునను, న పరమాత్మా, పరమాత్మగాడు, నకరోత్యపి = స్వతంత్రుడు కానందున జేయుటలేద్దైనను, లిప్యతే = కర్మఫలములో ఆసక్తిని బొందుచున్నాడు. అనగా బంధమును జెందుచున్నాడు.

౹౩ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥ ౩౩

పద॥ యథా - సర్వగతం - సౌక్ష్మ్యాత్ - ఆకాశం - న - ఉపలిప్యతే ।
సర్వత్ర - అవస్థితః - దేహే - తథా - ఆత్మా - న - ఉపలిప్యతే ॥

| | | | |
|---|---|---|---|
| సర్వగతం | అన్నిటిలోనున్న | తథా | ఆ విధముగనే |
| ఆకాశం | ఆకాశము | సర్వత్రదేహే | సకల దేహములలోను |
| సౌక్ష్మ్యాత్ | సూక్ష్మముగ నుండుటవలన | అవస్థితః | ఉన్నట్టి |
| యథా | ఎట్లు | ఆత్మా | ఆత్మ |
| నోపలిప్యతే | దేనిచేతను అంటబడుటలేదో | నోపలిప్యతే | (దేనిచేతను) అంటబడుటలేదు |

తా॥ (ఖురద మొదలగు) సకలచోట్లలోను వ్యాపించియున్న ఆకాశము సూక్ష్మముగ నుండుటవలన ఎట్లు (ఆ ఖురద మొదలగు వాటిలో) అంటబడుట లేదో, ఆ విధముగనే సకలదేహములలోనున్న ఆత్మ అంటబడుటలేదు. (ఆ దేహాదులయొక్క గుణములలో, లేక విషయములలో ఆత్మకు ఆసక్తిలేదని తాత్పర్యము).

(రామానుజులు) సర్వత్ర = దేవమనుష్యపశుపక్షి మొదలగు, దేహేఅవస్థితః = దేహములలో నున్నవాడైనను, ఆత్మా = జీవాత్మ, నోపలిప్యతే = అంటుకొనుటలేదు. అనగా ఆయా దేహస్వభావము ఆత్మనంటుటలేదు.

(స్వకీయము) ఆత్మ సకల వస్తువులలోనున్నవాడైనను ఆ వస్తువులకును ఆత్మకును సంబంధములేకయు ఆ వస్తువులకంటె అన్యుడుగను ఆత్మ యెట్లున్నాడనునది ఆకాశదృష్టాంతముచే చూపబడినది.

శ్లో॥ యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥ 34

పద॥ యథా - ప్రకాశయతి - ఏకః - కృత్స్నం - లోకం - ఇమం - రవిః।
క్షేత్రం - క్షేత్రీ - తథా - కృత్స్నం - ప్రకాశయతి - భారత॥

| | | | |
|---|---|---|---|
| హే భారత ! | ఓ భరతవంశమున నుదయించినవాడా ! | ప్రకాశయతి | ప్రకాశింప జేయుచున్నాడో |
| | | తథా | అవిధముగనే |
| ఏకః రవిః | ఒక సూర్యుడు | | క్షేత్రజ్ఞుడైనవాడు |
| ఇమంకృత్స్నంలోకం | ఈ అన్నిలోకములను | కృత్స్నంక్షేత్రం | సకలమైన శరీరమును |
| యథా | ఎట్లు | ప్రకాశయతి | ప్రకాశింపజేయుచున్నాడు. |

తా॥ ఓ భరతవంశమున నుదయించిన అర్జునా! ఒకడే సూర్యుడు ఈ లోకము లన్నిటిని ఎట్లు ప్రకాశింప జేయుచున్నాడో, ఆ విధముగనే క్షేత్రము గలవాడైన క్షేత్రజ్ఞుడు ఒకడుగనే యున్నవాడై అన్ని క్షేత్రములను (దేహములను) ప్రకాశింప జేయుచున్నాడు. అనగా తెలియునట్లు జేయుచున్నాడు,

(శంకరులు) మఱియు తెలియబరచునట్టి వస్తువైన ఆత్మ తెలియబరచబడు వస్తువుల స్వభావములచే అక్రమింపబడదు అనుదానికి దృష్టాంతము జెప్పుచున్నాడు. ఒకే సూర్యుడు ఈ లోకమునంతయు ప్రకాశింపజేయుచున్నాడు. దానివలె (13-వ అధ్యా 5-6-శ్లో లో) మునుపుజెప్పబడిన అవ్యక్తము మొదలగు స్థావరమువఱకైన మహాభూతములు మొదలు ధృతివఱకుగల క్షేత్రములను, క్షేత్రీ = క్షేత్రముగలవాడు పరమాత్మ ఒక్కడుగనేయున్నవాడై తెలియబరచుచున్నాడు. సూర్య దృష్టాంతము ఇచ్చట నాత్మకు రెండువిధములచేతను తగినదగుచున్నది. మొదటిది, సూర్యునివలె ఆత్మ అన్నిక్షేత్రములలోను ఒక్కటిగనేయున్నది అనునది. రెండవది సూర్యునివలె ఆత్మ గూడ ఒకదానియందును అంటనిది యనునది యనుడు.

(రామానుజులు) ఒకేసూర్యుడు సకలలోకమును ప్రకాశింపజేయుటవలె ఆత్మ తల మొదలు కాలువఱకున్న తనదేహమును తనయొక్క జ్ఞానముచే లోపలను బయటను ప్రకాశింప జేయుచున్నాడు. ఇందువలన సూర్యప్రకాశముచే ప్రకాశించుచున్న వస్తువులకంటె సూర్యుడెట్లు అన్యుడో ఆ విధముగనే దేహముకంటె దేహమును ప్రకాశింపజేయుచున్న ఆత్మ (జీవుడు) వేరేయని స్పష్టమగుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరం ॥ 35

పద॥ క్షేత్రక్షేత్రజ్ఞయోః - ఏవం - అన్తరం - జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షం - చ - యే - విదుః - యాన్తి - తే - పరం ॥

| | | | |
|---|---|---|---|
| క్షేత్రక్షేత్రజ్ఞయోః | క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క | ఏవం | ఈవిధముగ |
| అన్తరం | భేదమును | విదుః | ఎరింగెదరో |
| భూతప్రకృతి మోక్షం చ | ప్రాణులప్రకృతి నివర్తించుటను | తే | వారలు |
| | | పరం | పరవస్తువును |
| యే | ఎవ్వరు | యాన్తి | పొందుచున్నారు |
| జ్ఞానచక్షుషా | జ్ఞాననేత్రముచేత | | |

తా॥ ఎవ్వడు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదమును ప్రాణులయొక్క (అవిద్యయగు అవ్యక్తమనెడి) ప్రకృతి నివర్తించుటను, అనగా లేకపోవుటను జ్ఞాననేత్రముచేత మునుపుచెప్పిన విధముగ నెరింగెదరో వారలు పరమాత్మ తత్త్వమైన బ్రహ్మమును పొందుచున్నారు.

(శంకరులు) అధ్యాయమంతయు ఉపదేశించిన విషయమును ముగించుటకై ఈ శ్లోకము మొదలుపెట్టబడుచున్నది. మునుపు విస్తరించి చెప్పబడిన క్షేత్ర క్షేత్రజ్ఞులకు పరస్పరముగల భేదమును జ్ఞాననేత్రముచేత, అనగా శాస్త్రము, ఆచార్యుడు, వీరల ఉపదేశమువలన గలిగినదై ఆత్మను తెలియబరచు జ్ఞానమనెడి నేత్రముచే ఎవ్వరు క్రిందకనబరచునట్లు ఎరింగెదరో, ప్రాణుల అవిద్యయగు అవ్యక్తమనెడి ప్రకృతి లేకపోవుటను ఎరుంగుదురో వారలు పరమాత్మతత్త్వమైన బ్రహ్మమును పొందుచున్నారు. అనగా మరల శరీరమునెత్తుటలేదు. జనించుటలేదని తాత్పర్యము.

(రామానుజులు) క్షేత్ర క్షేత్రజ్ఞుల వివేకజ్ఞానముచే వారల స్వరూపము నెరింగి భూత స్వరూపముగనున్న ప్రకృతి బంధమును విడిపించుకొనుటకు ఉపాయములైన అమానిత్వాదులను ఎవ్వరనుష్ఠించుచున్నారో వారలు బంధమును పోగొట్టుకొని పూర్ణజ్ఞానాకారమైన స్వరూపమును పొందుచున్నారు.

(రాఘవేంద్రులు) భూతములనుండియు ప్రకృతినుండియు విడిపించుకొనుటకై అమానిత్వాది ఉపాయజ్ఞానముచే, లేక భూతానాం = జీవులకు, ప్రకృతి = అచేతన ప్రకృతినుండి, మోక్షం = మోక్షము నెవ్వరెరింగెదరో.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగ నున్న శ్రీకృష్ణార్జున సంవాదమున క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమను పదమూడవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు

చతుర్దశాధ్యాయ ప్రారంభః

# పదునాల్గవ అధ్యాయము

## (గుణత్రయ విభాగయోగము)



భగవానువాచ :—

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్।
యద్ జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః॥

పద॥ పరం - భూయః - ప్రవక్ష్యామి - జ్ఞానానాం - జ్ఞానం (1) - ఉత్తమం।
యత్ - జ్ఞాత్వా - మునయః - సర్వే - పరాం - సిద్ధిం - ఇతః - గతాః॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీభగవంతుడు చెప్పినది | గతాః | పొందిరో |
| మునయః సర్వే | మునులెల్లరు | (తత్) జ్ఞానానాం | దానిని జ్ఞానములలో |
| యత్ జ్ఞాత్వా | దేనినెరింగి | పరం ఉత్తమం జ్ఞానం | మేలైన గొప్పజ్ఞానమును |
| ఇతః పరాం సిద్ధిం | దీనినుండియుత్తమమైన సిద్ధిని | భూయః ప్రవక్ష్యామి | మఱల జెప్పెదను |

శ్రీభగవంతుడు చెప్పినది:—

తా॥ మునులెల్లరు దేనిని, అనగా ఏ జ్ఞానమును బడసి దీనినుండి, అనగా ఈ దేహబంధమునుండి విముక్తిచెందుట యనుమేలైన సిద్ధినిపొందిరో దానిని అనగా జ్ఞానములలో మేలైన అట్టి యుత్తమజ్ఞానమును మఱలను నేను చెప్పెదను.

(1) జ్ఞానం = బ్రహ్మోపదేశమును (శ్రీధరులు)

(శంకరభాష్యము) ఉత్పత్తిగల వస్తువులన్నియు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క సంబంధము వలన గలుగుచున్నవని చెప్పబడినది. అది యెట్లనుదానిని స్పష్టపరచుటకై ఈ యధ్యాయము మొదలుపెట్టబడుచున్నది. లేక "క్షేత్రక్షేత్రజ్ఞులు ఈశ్వరుని కధీనులుగ నిలబడియే, ప్రపంచమునకు కారణమగుదురు. ఐతే సాంఖ్యుల సిద్ధాంతమువలె స్వతంత్రముగ నిలబడియే అవి ప్రపంచమునకు కారణములు కావు" అను విషయమును చూపుటకై ప్రకృతిలో నివసించుటయు, తాను అప్రకృతియేయని మైకమొందుటయు, గుణములయెడ నాసక్తియు, అనగా శబ్దము మొదలగు విషయములమీద అత్యాసక్తియు సంసారమునకు కారణమని మునుపు చెప్పబడినది. (13 అధ్యా- 21 శ్లో) ఏ గుణమున ఎట్లు ఆసక్తి? గుణములనగా నేవి? ఏ విధముగ నవి చూపుచున్నవి? గుణములనుండి విడివడుట యెట్లు? ఆ విధముగ విడువబడినవాని లక్షణమెట్టిది? అనువిషయములను భగవంతుడు ఇందులోచెప్పి యనుగ్రహించుచున్నాడనియు గ్రహింపదగును.

'పరం' అనుదానిని 'జ్ఞానం' అనుపదముతో చేర్చుకొనుడు. జ్ఞానము మునుపటి అధ్యాయములలో పలుమారు చెప్పబడినదైనను దానిని నేను మరలజెప్పెదను. పరవస్తువును

గురించినదైనందున అది మేలైనది. అది ఎట్టిది? జ్ఞానమనునది శ్రేష్ఠమైన ఫలముబడసినదైనందున అది జ్ఞానములన్నిటిలో గొప్పది. జ్ఞానానాం అనునది 13 వ అధ్యాయము 7-10- శ్లోకములలో జెప్పబడిన అమానిత్వము మొదలగునవికావు. మఱియేవనగా యజ్ఞము మొదలగు ఎరుంగవలసిన విషయములనుగూర్చిన జ్ఞానములను గుర్తించునట్టిదని గ్రహింపవలెను. ఇది మోక్షమున కుప యోగించునట్టిది. ఐతే అదియనగా మోక్షమునకగునట్టిదికాదు. కావున వినువారల మనస్సున రుచి గలుగజేయుటకై ఈ పరం ఉత్తమం అనుపదములచే పొగడుచున్నాడు. ఆ జ్ఞానముబడసి సన్న్యాసులై చింతించెడి స్వభావముగలవారెల్లరు ఈ దేహబంధమునుండి విడువబడుటయను పేరు గల మేలైన సిద్ధినిపొందియున్నవారు.

సంయోగముగల ప్రకృతిపురుషులయొక్క స్వరూపనిశ్చయము నెరింగి భగవద్భక్తితో గూడిన అమానిత్వాదులచే బంధమును పోగొట్టుకొనవలెననియు "కారణం గుణసంగోఽస్య సద సద్యోనిజన్మసు" (అధ్యాయము 13, శ్లో - 22-) అన్నందున జీవునికి బంధహేతువు పూర్వకర్మాను సారముగ సత్త్వాది గుణమయమైన సుఖదుఃఖసంబంధమనియు చెప్పబడినది. ఈ యధ్యాయమున ఈ విధముగ గుణసంబంధము ఆత్మకు బంధహేతువనియు, అట్టి గుణసంబంధము ఈ విధముగ బోగొట్టుకొనవలెననియు, మునుపుచెప్పినవాటికంటె వేరైనట్టియు ప్రకృతి పురుషులలోనున్నట్టియు సత్త్వాదిగుణములవిషయమైన జ్ఞానమున్ను జెప్పబడుచున్నది. మునుపు చెప్పియున్న ప్రకృతి పురుషుల విషయములైన సకల జ్ఞానములలోను ఇది ఉత్తమమైనది.

బంధమును నివర్తింపజేసికొనవలెననిన ఆ బంధమువచ్చిన మార్గము నెరుంగవలసి యున్నందున ఆ బంధము సత్త్వాది గుణములవలన కలుగుచున్నదనియు దాని నివృత్తికైన యుపాయమున్ను చెప్పబడుచున్నది. "జ్ఞానానాంజ్ఞానముత్తమం" అనగా ఎరుంగవలసినవాటిలో శ్రేష్ఠమైనదానిని జెప్పునట్లు తాత్పర్యము.



శ్లో॥ ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥ 2

పద॥ ఇదం - జ్ఞానం - ఉపాశ్రిత్య - మమ - సాధర్మ్యం (1) - ఆగతాః ॥
సర్గే - అపి - న - ఉపజాయన్తే - ప్రళయే - న - వ్యథన్తి - చ ॥

| | | | |
|---|---|---|---|
| ఇదం జ్ఞానం | ఈ జ్ఞానమును | సర్గే | సృష్టికాలమున |
| ఉపాశ్రిత్య | పొంది | నోపజాయన్తే | జననమొందుటలేదు |
| మమసాధర్మ్యం | నా స్వరూపస్వభావమును | ప్రళయేపి చ | ప్రళయమునందును |
| ఆగతాః | పొందినవారలు | నవ్యథన్తి | చలించుటలేదు. |

తా॥ ఈజ్ఞానోపాయము ననుష్ఠించి నాయొక్క స్వరూపమును పొందిన వారలు సృష్టికాలమున జనించుటలేదు. ప్రళయకాలమునందును చలనమొందుట లేదు. అనగా వారలకు జననమరణములులేవని తాత్పర్యము.

(1) సాధర్మ్యం - సమత్వమును నాతోసమానమైన రూపాదులను (రామానుజులు). సారూప్య ముక్తిని (మధ్వులు).

(శంకరులు) ఆ సిద్ధి, తప్పక ముక్తినిచ్చునని ఇందులో జెప్పబడుచున్నది. వారలు మునుపుచెప్పిన ఈ జ్ఞానమునుపొంది. అనగా జ్ఞానసాధనముల ననుష్ఠించి పరమేశ్వరుడనైన

నా స్వరూపమగుటను బడసియున్నారు. సాధర్మ్యం = అనగా సమానధర్మము కాదు. రెండువస్తువులలో పరస్పరము భేదముండి, అయితే కొన్నిధర్మములు రెంటికి పొదువుగనున్నప్పుడు సామ్యము కుదురును. భేదమేలేనప్పుడు రెండు ఒకటేయనుడు. క్షేత్రజ్ఞునికిని ఈశ్వరునికిని గీతాశాస్త్రప్రకారము భేదములేనందున సాధర్మ్యం అనుదానికి నా స్వరూపము అని తాత్పర్యము ఈ ఫలవాదము జ్ఞానమును పొగడుటకొఱకై యనుడు. వారలు సృష్టికాలమునందును పుట్టుటలేదు. ప్రళయమునందును, బ్రహ్మనశించుకాలమునందుగూడ చలనమొందుటలేదు. స్థితిదప్పుటలేదు.

శ్లో॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్ ।
సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత ॥

పద॥ మమ - యోనిః - మహత్ - బ్రహ్మ - తస్మిన్ - గర్భం - దధామి - అహమ్ ।
సంభవః - సర్వభూతానాం - తతః - భవతి - భారత ॥

| | | | |
|---|---|---|---|
| హే భారత ! | ఓ భారతా ! | అహందధామి | నేను ఉంచుచున్నాను |
| మమయోనిః | నాయొక్క గర్భాశయము | సర్వభూతానాం | అన్ని ప్రాణుల |
| మహత్ బ్రహ్మ | మహత్తైన బ్రహ్మము (ప్రకృతి) | సంభవః | ఉత్పత్తి |
| | | తతః భవతి | దానినుండి గలుగుచున్నది. |
| తస్మిన్గర్భం | దానిలో గర్భమును | | |

తా॥ ఓ భరతవంశమున నుదయించిన అర్జునా! నాయొక్క గర్భము నుంచుటకు స్థానము మహత్తైన బ్రహ్మము, అనగా త్రిగుణాకారమైన నాయొక్క ప్రకృతియే. దానిలో నేను నా గర్భమునుంచుచున్నాను. ప్రాణులన్నిటికిని జనించుట దానివలననే యగుచున్నది.

(శంకరులు) క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క ఇట్టిసంయోగము, వస్తువులన్నియు గలుగుటకు కారణమని భగవంతుడనుగ్రహించుచున్నాడు. మమయోనిః=నాయొక్క మాయయగు గుణత్రయాకారమైన ప్రకృతియే వస్తువులన్నిటికి కారణము. కారణమైన ఆ ప్రకృతి తనకార్యము లన్నిటి కంటె పెద్దదైనందున మహత్తనియు, తన వికారమునకు కారణమైనందునను దానినిబాగుగ వృద్ధిపరచునట్టిదైనందునను బ్రహ్మ అనియు, యోనియే విశేషింపబడుచున్నది. క్షేత్రము క్షేత్రజ్ఞుడని రెండుప్రకృతులనెడి శక్తులను బడసిన ఈశ్వరుడైన నేను అట్టి గొప్పబ్రహ్మమనెడియోనిలో, గర్భస్థానమున గర్భమును, అనగా హిరణ్యగర్భుడు గలుగుటకైన విత్తనమును వస్తువులన్నియు గలుగుటకు కారణమైన విత్తనమునుంచుచున్నాను. అవిద్య, కామము, కర్మమనెడి ఉపాధులయొక్క ఆకారముల ననుసరించి అనగా వాటి వాసనలతో గూడిన క్షేత్రజ్ఞుని క్షేత్రముతో జేర్చుచున్నానని, తేలిన తాత్పర్యము.

ఓ భారత! అట్టిగర్భాధానమునుండి హిరణ్యగర్భుడు జనించుట మూలముగా వస్తువులన్నియు గలుగుట ఏర్పడుచున్నది.

(మధుసూదన సరస్వతి) వాసనలతోగూడి వడ్లు మొదలగు నాకారరూపమై తనలో నిమిడియున్న కుమారునిదేహముతో జేర్చిపెట్టుటకై తల్లియొక్క గర్భకోశమున తండ్రి రేతస్సును విడుచుట మూలమునా గర్భమునుంచుచున్నాడు, గర్భముగలిగి పిండమగుట మొదలగు స్థితులు

ఏర్పడగా ఆ గర్భాధానమునుండి పుత్రులు జనించుచున్నారు. దానివలె అవిద్యమొదలగు వాటి యొక్క వాసనలతోగూడి ప్రళయకాలమున నాయెడ, లయించియున్న క్షేత్రజ్ఞుని సృష్టిసమయమున అతడనుభవించవలసిన శరీరముతో జేర్చిపెట్టుటకై ప్రకృతిలో చిదాభాసుడనెడి రేతస్సును విడుచుట మూలముగా మాయావృత్తియగు గర్భమును నేనుంచుచున్నాను. అట్లు ఆకాశము వాయువు తేజస్సు మొదలగునవి గలుగుటయను స్థితిఏర్పడగా ఆ గర్భాధానమునుండి హిరణ్యాగర్భుడు మొదలగువస్తువులు గలుగుచున్నవి.

(శ్రీధరులు) సకల ప్రపంచోత్పత్తికి కారణమైనందున బ్రహ్మమనుపేరుగల ప్రకృతి. గర్భస్థానముగనున్నది. అవిద్యకామము కర్మలు వీటితో సంబంధించి ప్రళయకాలమున నాయెడ నిమిడియున్న చిదాభాసుడనెడి క్షేత్రజ్ఞుని సృష్టిసమయమున ఆతనికి భోగ్యమగు ప్రకృతిరూపమైన క్షేత్రమున (దేహమున) చేర్పించుచున్నాను.

(రామానుజులు) "భూమిరాపోనలోవాయుః" (అధ్యా-7-శ్లో 4) అనుచోట జెప్పబడియున్న యెనిమిది విధములైన ప్రకృతియైనది మహదహంకారములకు కారణమైనందున మహత్తనియు "తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నంచ జాయతే" అను శ్రుతిలో ఈ ప్రకృతిని బ్రహ్మముగనే జెప్పియున్నందున బ్రహ్మమనియు చెప్పబడుచున్నది. అనగా "అపరేయమితస్త్వన్యాం (7 అధ్యా-శ్లో 5) అనుచోట జెప్పినట్లు చేతన సమూహమైన పరప్రకృతి ప్రాణులన్నిటికిని విత్తనముగనున్నందున ఈ పరప్రకృతి యనెడి అచేతన ప్రకృతితో చేర్చిపెట్టుచున్నాననునది తాత్పర్యము. నా సంకల్పమువలన గలిగిన రెండువిధములైన ప్రకృతియొక్క చేరికచే బ్రహ్మమొదలు స్తంబము (స్తంబము = గడ్డి, లేక మిక్కిలి చిన్నదైన ఒక పురుగు) వఱకుగల సకలభూతములు గలుగుచున్నవి.

(మధ్వులు) మహత్తు బ్రహ్మమనెడి పదములు చిత్ప్రకృతిని గుర్తించుచున్నవి. చిత్ప్రకృతి యనగా శ్రీదేవి, భూదేవి దుర్గ, వీరలే. వారలయెడ నేను గర్భమును కలుగజేయు చున్నాను. వారలవలన సకల ప్రపంచములు గలుగుచున్నవి.

(రాఘవేంద్రులు) మహత్తుబ్రహ్మమనెడి చిత్ప్రకృతియగు నా యొక్క భార్యయెడ 24 తత్త్వములతో గూడియున్నట్టియు నాయుదరమునందున్నట్టియు జీవులను రేతస్సు రూపముగ చిత్ప్రకృతియొక్క గర్భమునందుంచుచున్నాను. ఆమెనుండి సకలప్రపంచములు గలుగుచున్నవి.

(స్వకీయము) నాయొక్క అధీనమగు మాయ, సకల భూతములకు కారణము. అది కార్యరూపమైన ప్రపంచముకంటె గొప్పదైనందున మహత్తనియు కార్యవృద్ధికి హేతువైనందున బ్రహ్మమనియు జెప్పబడుచున్నది. ఇందులో సకలభూతసృష్టికి కారణమైన హిరణ్యగర్భునియొక్క ఉత్పత్తికి కారణమైన విత్తనమును వెదజల్లుచున్నాను. అదియే గర్భమునుంచుచున్నాననుట. క్షేత్ర క్షేత్రజ్ఞులనెడి రెండు శక్తులు బడసిన ఈశ్వరుడగు నేను అవిద్య, కామము, కర్మ, వీటితోనంటియున్న క్షేత్రజ్ఞుని, క్షేత్రముతో చేర్పించుచున్నాను. అట్టి హిరణ్యగర్భుని మూలముగ సకల ప్రాణులయొక్క యుత్పత్తి సంభవిల్లుచున్నది.

సర్వయోనిషు కౌంతేయ మూర్తయస్సంభవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా ॥

పద॥ సర్వయోనిషు - కౌంతేయ - మూర్తయః - సంభవన్తి - యాః।
తాసాం - బ్రహ్మ (1) = మహత్ - యోనిః - అహం - బీజప్రదః - పితా ॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! | తాసాం | వాటికి |
| సర్వయోనిషు | అన్ని గర్భాశయములలోను | మహద్బ్రహ్మయోనిః | గొప్ప బ్రహ్మము గర్భాశయము |
| యాః మూర్తయః | ఏ రూపములు | | |
| సంభవన్తి | కలుగుచున్నవో | అహం బీజప్రదఃపితా | నేను విత్తనమిచ్చెడి తండ్రిని |

తా॥ సకల గర్భాశయములలోను ఎట్టి రూపములు గలుగుచున్నవో వాటికి గర్భస్థానము మహత్తైన బ్రహ్మము. అనగా ప్రకృతి కీశ్వరుడైన నేను విత్తనము నిచ్చెడి, అనగా గర్భాధానము జేయుతండ్రిని.

(1) బ్రహ్మ - మహాలక్ష్మి (రాఘవేంద్రులు)

(శంకరులు) దేవ పితృమనుష్య పశుపక్షి మొదలగు సకల యోనులలోను పెద్ద చిన్న యవయవములతో నేర్పడియున్న శరీరాకారమైన రూపములు ఏవేవిగలవో ఆయారూపములకు అన్ని స్థితులలోనున్నట్టి మహత్తైన బ్రహ్మము, అనగా ప్రకృతి, యోని, అనగా కారణము. ఈశ్వరుడగు నేను గర్భాధానముజేసెడి తండ్రిని - కర్తను.

(శ్రీధరులు) సకల ఉత్పత్తికిని కారణుడను. మొదట సంభవించు ఉత్పత్తికి మాత్రము కాదు, ప్రతి యుత్పత్తికి కారణమని తాత్పర్యము. (అధ్యా-7-శ్లో-10 చూడుడు,)

(రామానుజులు)గర్భాధానమునకు స్థానమైన జడప్రకృతిలో బీజమైన (విత్తనమైన) చేతన ప్రకృతిని దానియొక్క కర్మానుసారముగ చేర్పించుచున్నాను. కావున ప్రకృతి తల్లి, నేను తండ్రిని.

---

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్।　　5

పద॥ సత్త్వం - రజః - తమః - ఇతి - గుణాః - ప్రకృతిసంభవాః।
నిబధ్నన్తి - మహాబాహో - దేహే - దేహినం - అవ్యయమ్ ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో ! | ఓ గొప్ప భుజములను బడసినవాడా ! | ప్రకృతిసంభవాః | ప్రకృతి వుట్టిల్లుగ గలిగినవి |
| | | అవ్యయం దేహినం | నాశములేని దేహిని |
| సత్త్వం రజస్తమ ఇతి గుణాః | సత్త్వము రజస్సు, తమస్సు నెడి గుణములు | దేహేనిబధ్నన్తి | దేహమున గట్టిగ కట్టుచున్నవి. |

తా॥ ఓ గొప్పభుజములను బడసినవాడా! ప్రకృతినుండి గలిగియున్న సత్త్వరజస్తమోగుణములు దేహమున తాను తనదిఅను నభిమానముతోగూడియుండి నాశములేనివాడైన (దేహముగలవాడైన) ఆత్మను కట్టుచున్నవి. (తమయొక్క కార్యములైన సుఖదుఃఖమోహాదులతో చేర్చుచున్నవి.)

(శంకరులు) గుణములనగానేవి? అవియెట్లు కట్టిపెట్టుచున్నవనునది ఇందులో జెప్పబడుచున్నది. గుణములు సత్త్వము, రజస్సు, తమస్సు, అను పేరుగలవి. "గుణములు" అనుపదము పరిభాషచే వచ్చినది. అవి రూపము మొదలగునవివలె ద్రవ్యమును, అనగా ఒక వస్తువును ఆశ్రయించియున్న ధర్మములుగావు. గుణములనునవి ప్రకృతియొక్క ఆకారభేదమైనందున అన్నిటికి నాధారముగనున్నట్టివి. ఇచ్చట జెప్పదలంచినది గుణగుణులభేదముగాదు. అనగా గుణము వేరుగ

నున్నట్టిది. గుణముగల గుణి వేరుగనున్నట్టిది అనికాదు. కావున ధర్మములు ద్రవ్యముల కధీన ముగ నున్నట్లు గుణములు అవిద్యయొక్క ఆకారముగలవైనందున క్షేత్రజ్ఞుని కెల్లప్పుడు నధీనమైనవి. కావున అవి గుణములనబడుచున్నవి. అవి క్షేత్రజ్ఞుని కట్టిపెట్టుచున్నవివలె అనగా వాని నాధార ముగగొని తమ్ము నిలబెట్టుకొనుచున్నవి. కావున కట్టిపెట్టుచున్నవనబడుచున్నది. అవి నాశములేని దేహిని-దేహముగలవానిని - అనగా శరీరమే ఆత్మయనుకొన్నవానిని దేహమును గట్టిగ కట్టుచున్నవి వలె నున్నవి. మహాబాహువు = మోకాలువరకు పొడవైన బలముగల గొప్ప చేతులుగలవాడు. ''అనాదిత్వాన్నిర్గుణత్వాత్''అని (అధ్యా 13-శ్లో-31 చెప్పబడినది. దేహియైనవాడు గుణసంబంధము లేనివాడని అచ్చుటజెప్పి ఇచ్చటగుణములు దేహినికట్టిపెట్టుచున్నవని చెప్పుటదగునా? యనిన అందుకొఱకే 'కట్టిబెట్టునట్టిదివలెనని' ''ఇతి'' అనుశబ్దము ప్రయోగింపబడియున్నది.

(మధుసూదనసరస్వతి) ఒక పాత్రమందలి నీరు తనకుగలుగుచలనమనెడి వికారమును ప్రతిబింబ మోహముచే ఆకాశమందలి సూర్యునికి సంభవించునట్లు చూపుచున్నది. అనగా కదలు నట్టి జలము సూర్యుని కదలువానివలె చూపుచున్నది. ఆ విధముగ గుణములు తమకుగలుగు వికార ములను ఆత్మకు గలుగునట్లు చూపుచున్నవి.

(రాఘవేంద్రులు) సత్త్వరజస్తమోగుణములకు వరుసగా నభిమాని దేవతలైనలక్ష్మి, భూదేవి, దుర్గ, వీరలున్ను జడప్రకృతివలన గలిగిన సత్త్వాదిగుణములున్ను జీవసమూహములను సుఖదుఃఖ మోహాదులచే కట్టుచున్నారు, అనగా సత్త్వాభిమానియైన లక్ష్మి దేవతలను, రజోభిమానియైన భూదేవి మనుష్యులను, తమోభిమానియైన దుర్గ దైత్యులను, బంధించుచున్నది.



శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశకమనామయమ్ ।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥ 6

పద॥ తత్ర - సత్త్వం - నిర్మలత్వాత్ - ప్రకాశకం - అనామయమ్ ।
సుఖసంగేన - బధ్నాతి - జ్ఞానసంగేన - చ - అనఘ ॥

| | | | |
|---|---|---|---|
| హే అనఘ ! | ఓ పాపములేనివాడా ! | అనామయం | ఉపద్రవమును గలుగజేయనిది |
| తత్ర సత్త్వం | వానిలో సత్త్వగుణము | సుఖసంగేన | సుఖాసక్తిచేతను |
| నిర్మలత్వాత్ | మలికలేనిదైనందున | జ్ఞానసంగేన చ | జ్ఞానాసక్తిచేతను |
| ప్రకాశకం | ప్రకాశమైనది | బధ్నాతి | కట్టుచున్నది. |

తా॥ ఆ గుణములలో సత్త్వగుణము నిర్మలమైనదైనందున స్ఫటికమువలె ప్రకాశముగలది. దుఃఖము గలుగజేయనిది. (అదియాత్మను) సుఖాసక్తి చేతను జ్ఞానాసక్తిచేతను కట్టుచున్నది. (బంధించుచున్నది.)

(శంకరులు) సత్త్వము మొదలగు వానిలో మొదట సత్త్వగుణమునకే ఇచ్చట లక్షణము చెప్పబడుచున్నది. సత్త్వగుణము స్ఫటికమువలె స్వచ్ఛమైనది కావున ప్రకాశముగ నున్నట్టిది. ఉప ద్రవమునుగలుగ జేయనట్టిది. సత్త్వము స్వచ్ఛమైనది. మూయువానినినివర్తింప జేయునట్టిది. కావున ప్రకాశమైనది. జ్ఞానవస్తువును ప్రకటింపజేయునట్టిది. తొందరలేనట్టిది. స్వచ్ఛముగ నిలబడి సుఖమును బయటబెట్టునది. అదియాత్మను కట్టుచున్నది. ఎట్లనగా ''నేను సుఖముగలవాడను''అను సుఖాసక్తిచే

విషయమైన సుఖమును విషయియైన ఆత్మయెడ నంటునట్లుచేయుట వలననను. "నాకే సుఖము గలిగి యున్నది." అని సుఖముచే ఆసక్తిగొనుట మైకమే గావున ఇది అవిద్యయే. విషయముయొక్క స్వభావము విషయికిరాదుగదా? మఱియు ఆశమొదలు దృఢమైన స్వభావము వఱకుగల వన్నియు క్షేత్రమేయైన విషయముయొక్క స్వభావము. కావుననే సత్త్వగుణము ఆత్మను ఆత్మయొక్క స్వభావమువంటిదైన విషయ విషయులను విభజించి యెరుంగమియనెడి అవిద్యచేతనే తాను కాని, అనగా ఆత్మ కానట్టి సుఖమున ఆసక్తిగలుగునట్లు చేయుచున్నదివలె ఆసక్తిలేని దానిని ఆసక్తిగలిగిన దానివలె చేయుచున్నది. సుఖములేనిదానిని సుఖముగలిగినదానివలె జేయుచున్నది. అవిధముగనే జ్ఞానాసక్తి చేతను ఆత్మను సత్త్వగుణము కట్టుచున్నది. జ్ఞానమనునది ఇచ్చట సుఖముతోజేర్చి జెప్పబడినందున క్షేత్రమేయైన విషయమనెడి యంతఃకరణముయొక్క స్వభావమే. ఆత్మయొక్క స్వభావముగాదు. ఆత్మయొక్కదైనచో ఆసక్తిసంబంధములు దగవు. సుఖమున ఆసక్తి గలుగుటవలె జ్ఞానము సంపద మొదలగు వాటిలోను ఆసక్తి గలుగుటను జూచుకొనుడు. ఇచ్చట చెప్పబడిన సుఖమున్ను జ్ఞానమున్ను వృత్తి సుఖము వృత్తిజ్ఞానమేగాని స్వరూపానందము స్వరూపజ్ఞానముగాదని గ్రహింపుడు.

(రామానుజులు) సత్త్వరజస్తమో గుణములలో సత్త్వగుణము పరిశుభ్రత వలన ఆత్మకు సుఖమును జ్ఞానమును ప్రకాశింపజేయుచున్నది. అనగా వస్తువుల స్వరూపములను తెలిసికొనునట్లు చేయుచున్నది. అనామయం = రోగములనడ్డగించుచున్నది. ఇట్టి సత్త్వగుణము ఆత్మను సుఖ సంబంధము చేతను జ్ఞానసంబంధముచేతను బంధించుచున్నది. అనగా సుఖము జ్ఞానము వీటిని సంపాదించుటకై వైదిక లౌకిక కార్యములను చేయించి దానివలన సుఖము జ్ఞానము వీటిని గలుగ జేయుచున్నది. అట్టి కర్మానుసారముగ ఫలములను జెందుటకు మరల జననము నిచ్చుచున్నది. దీని వలననే బంధించునట్టిదిగ జెప్పబడెను.

(రాఘవేంద్రులు) సత్త్వాభిమానియైన లక్ష్మి, సత్త్వగుణముతో సుఖము జ్ఞానము వీటి వలన దేవతలను బంధించుచున్నదని తాత్పర్యము.

(స్వకీయము) సుఖము క్షేత్రసంబంధమైనది. ఆత్మకు సంబంధములేదు. అట్లుండగా ఆత్మను సుఖము తనదివలె భ్రమింపజేయుచున్నది. జ్ఞానముగూడ ఆ విధముగనే. ఈ జ్ఞానము ఆత్మస్వరూప జ్ఞానముగాదు. వృత్తిజ్ఞానము (ఆత్మస్వరూపజ్ఞానము కానట్టి ఇతర లోకవిషయమైన జ్ఞానమేవృత్తి జ్ఞానము).



శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ॥

పద॥ రజః - రాగాత్మకం - విద్ధి - తృష్ణాసంగసముద్భవం ।
తత్ - నిబధ్నాతి - కౌంతేయ - కర్మసంగేన - దేహినమ్ ॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! | విద్ధి | ఎఱుంగుము |
| రజః | రజోగుణము | తత్ | ఆ రజోగుణము |
| రాగాత్మకం | రాగస్వరూపమైనదిగను | కర్మసంగేన | కర్మసంబంధముచేత |
| తృష్ణాసంగసముద్భవం | ఆశకును ఆసక్తికిని పుట్టిల్లు అగుటను | దేహినం నిబధ్నాతి | దేహిని కట్టుచున్నది. |

తా॥ ఓ కుంతీపుత్రా! రజోగుణము ఆశ (కామ) స్వరూపముగను ఆశను అభిమానమును గలుగ జేయునదిగను నెఱుంగుము. అది కర్మసంబంధము చేత దేహిని (ఆత్మను) బంధించుచున్నది. (అనగా ఇహపరసాధనములైన కర్మలలో ఆత్మకు ఆసక్తిని గలుగజేయుచున్నది.)

(శంకరులు) రజోగుణము రాగమనెడి, అనగా కామమనెడి స్వరూపముగలది. కావిరాయి, వస్త్రమునకు రంగునిచ్చుటవలె రజస్సు ఆత్మకు రంగునిచ్చుటవలన, అనగా అనాత్మవిషయములలో ఆశను గలుగజేయుటవలన అది రాగమనబడుచున్నది. రాగము అనగా కామము అనియర్థము, ఆశ యనునది కాదు. వస్తువుమీద అది లభింపవలెనను ఆశ ఆసక్తియనబడుచున్నది. లభించిన వస్తువుమీద మనస్సుకున్నట్టి ఒక విధమైన ప్రీతి, అభిమానమను సంబంధము కర్మబంధము ఇహలోకపరలోకములకైన కర్మలలో ఆసక్తిగొనుట, అనగా వాటిలో మునిగి యుండుట. దానివలన రజోగుణము దేహిని అనగా శరీరముతో నిలబడునాత్మను కట్టుచున్నది.

(రామానుజులు) రాగః = స్త్రీపురుషులలోని పరస్పర ఆశ, తృష్ణా = వస్తువులలోని ఆశ, సంగః = పుత్రమిత్రకళత్రాదులలోని ఆశ, కర్మసంగేన = కర్మజేయవలెనను ఆశచే, అనగా ఆశ చేత తాను, (ఆత్మ) చేసెడి పుణ్యపాపకర్మలు వాటిఫలము ననుభవింపజేయుటకై జన్మలను గలుగ జేయుచున్నవి. ఈ రజోగుణము రాగ, తృష్ణా, సంగ, కర్మసంగమనెడి ఈ నాలుగు విధములైన ఆశకును హేతువైనదని ఎఱుంగుము.

(రాఘవేంద్రులు) రజోభిమానియైన భూదేవి రజోగుణముతో మనుష్యులను కర్మమున కట్టుబడునట్లు చేయుచున్నది.

---

శ్లో॥ తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం।
ప్రమాదాలస్య నిద్రాభిస్తన్నిబధ్నాతి భారత॥ 8

పద॥ తమః - తు - అజ్ఞానజం - విద్ధి - మోహనం - సర్వదేహినాం।
ప్రమాదాలస్యనిద్రాభిః - తత్ - నిబధ్నాతి - భారత॥

| | | | |
|---|---|---|---|
| హే భారత! | ఓ భారతా! | విద్ధి | తెలిసికొనుము |
| తమస్తు | తమోగుణమైతే | (హే భారత!) | ఓ భారతా! |
| అజ్ఞానజం | అజ్ఞానమునుండి పుట్టినదిగ | తత్ | ఆ తమోగుణము |
| సర్వదేహినాం | అందరు దేహులను | ప్రమాదాలస్య | అజాగ్రత్త సోమరితనము, |
| మోహనం | మోహముచే మైకము చెందిం చునదిగ | నిద్రాభిః | నిద్ర వీటిచే |
| | | నిబధ్నాతి | దేహిని కట్టుచున్నది. |

తా॥ ఓ భారతా! తమోగుణము అజ్ఞానమునుండి కలుగునదనియు, దేహులందరిని మోహములచే మైకము చెందించునదనియు ఎఱుంగుము. ఆ తమోగుణము అజాగ్రత్త సోమరితనము నిద్ర వీటిచే దేహిని బంధించుచున్నది. (అనగా) ఆత్మకు అజాగ్రత్త మొదలగు వాటిని కలుగ జేయుచున్నది.

(శంకరులు) మూఢపద్రైన తమోగుణము ఆవరణశక్తియగు అజ్ఞానమునుండి పుట్టి దేహులందఱిని మోహింప జేయునట్టిది, వివేకము లేకుండుటను గలుగజేయు నట్టిది.

(రాఘవేంద్రులు) తమోగుణాభిమానియైన దుర్గ, తమోగుణముతో దైత్యులను కట్టుచున్నది.



శ్లో॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥

పద॥ సత్త్వం - సుఖే - సంజయతి - రజః - కర్మణి - భారత!
జ్ఞానం - ఆవృత్య - తు - తమః - ప్రమాదే - సంజయతి - ఉత ॥

| | | | |
|---|---|---|---|
| హే భారత! | ఓ అర్జునా! | తమస్తు | తమస్సైతే |
| సత్త్వం సుఖే | సత్త్వము సుఖమునందును | జ్ఞానం ఆవృత్య | జ్ఞానమును కప్పివుచ్చి |
| రజః కర్మణి | రజస్సు కర్మయందును | ప్రమాదే ఉత | అజాగ్రతయందును |
| సంజయతి | చేర్పించుచున్నది | సంజయతి | చేర్చుచున్నది. |

తా॥ ఓ అర్జునా! సత్త్వగుణము సుఖమునందును, రజోగుణము కర్మయందును ఆసక్తి గలుగునట్లు జేయుచున్నవి. తమోగుణమనగా వీటికి విరుద్ధముగ జ్ఞానమును కప్పివుచ్చి అజాగ్రతలో చేర్చుచున్నది.

(శంకరులు) గుణముల వ్యాపారము మఱల సంగ్రహించి చెప్పబడుచున్నది. తమోగుణము తన ఆవరణ స్వరూపముచే, అనగా కప్పివుచ్చెడి స్వభావముచే సత్త్వగుణమువలననైన వివేకమును కప్పిపుచ్చి అజాగ్రతలో నా సక్తిని గలిగించుచున్నది. అజాగ్రత=చేయవలసినవాటిని చేయవలసినప్పుడు చేయకుండుట.

శ్లో॥ రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥ 10

పద॥ రజః - తమః - చ - అభిభూయ - సత్త్వం - భవతి - భారత!
రజః - సత్త్వం - తమః - చ - ఏవ - తమః - సత్త్వం - రజః - తథా ॥

| | | | |
|---|---|---|---|
| హే భారత! | ఓ అర్జునా! | (అభిభూయ భవతి) | అణగద్రొక్కి (తాను) వృద్ధి పొందుచున్నది |
| సత్త్వం | సత్త్వగుణము * | | |
| రజః | రజోగుణమును | తథా | ఆ విధముగనే |
| తమశ్చ | తమోగుణమును | తమః | తమోగుణము |
| అభిభూయభవతి | తక్కువపరచి (తాను) వృద్ధి పొందుచున్నది | సత్త్వం | సత్త్వగుణమును |
| | | రజశ్చైవ | రజోగుణమును |
| రజః | రజోగుణము | (అభిభూయ) | అణగద్రొక్కి |
| సత్త్వం తమశ్చ | సత్త్వతమోగుణములను | (భవతి) | తాను వృద్ధిపొందుచున్నది. |

తా॥ ఓ భారతా! సత్త్వము రజస్సును తమస్సును అణగద్రొక్కి వృద్ధి పొందుచున్నది. రజస్సు సత్త్వమును తమస్సును అణగద్రొక్కి వృద్ధి పొందుచున్నది. ఆ విధముగనే తమస్సు సత్త్వమును రజస్సును అణగద్రొక్కి వృద్ధి పొందుచున్నది.

(శంకరులు) గుణములు మునుపుచెప్పిన వ్యాపారములను ఎప్పుడు జేయుచున్నవను దానిని జెప్పెదము. గుణములు తమ తమ వ్యాపారములను ఒకటేకాలమునజేరి చేయుచున్నవా? లేక వెవ్వేరు కాలముల వేరువేరుగ జేయుచున్నవా? ఒకటే కాలమునందుగాని ఒకదాని కొకటి విరుద్ధముగ జేయుచున్నవా, లేక ఐకమత్యముతో జేయుచున్నవా? అనుదానికి ఉత్తరము. అవి తమ తమ వ్యాపారములను వెవ్వేరుకాలముల మారి మారి చేయుచున్నవి (ఆనందగిరి). ఎప్పుడు. సత్త్వగుణము రజోగుణతమోగుణముల రెంటిని అణగద్రొక్కి వర్ధిల్లుచున్నదో అప్పుడే జ్ఞానము ప్రబలమై సుఖము మొదలగు తన వ్యాపారమును జేయుచున్నది. ఆ విధముగనే ఎప్పుడు రజో గుణము సత్త్వగుణతమోగుణముల రెంటిని అణగద్రొక్కి వర్ధిల్లుచున్నదో అప్పుడు తనకార్యమైన కృషి మొదలగు వ్యాపారమును జేయుచున్నది. ఆ విధముగనే ఎప్పుడు తమస్సు అనుగుణము సత్త్వగుణ రజోగుణముల రెంటిని అణగద్రొక్కి తాను వర్ధిల్లుచున్నదో అప్పుడు జ్ఞానమును కప్పి పుచ్చుట మొదలగు తన వ్యాపారమును జేయుచున్నది.

(శ్రీధరులు) ఈ శ్లోకమును మునుపటి శ్లోకముతోజేర్చి అర్థముచేయవలెను. ప్రతి ప్రాణి యందును సత్త్వరజస్తమోగుణములు మూడున్ను గలవు. వాటిలో ఏగుణము ఏకాలమున పై బడుచున్నదో అప్పుడాగుణము తక్కిన రెండుగుణములను అణగద్రొక్కి తనకార్యములనే పెక్కుగ జేయించును. ఎట్లనగా సత్త్వగుణముపైబడిన సుఖమును జ్ఞానమును గలుగజేయును. రజోగుణము పైబడిన కర్మయందే పెక్కుగా ప్రవృత్తినిగలుగజేయును. తమోగుణము పైబడిన అజాగ్రత్త సోమరితనము నిద్ర వీటిని పెక్కుగ గలుగజేయును.

(రామానుజులు) పూర్వకర్మానుసారముగను ఆహారాది భేదముచేతను ఈ గుణములలో నొక్కటి పైబడుచున్నది.

(రాఘవేంద్రులు) పైబడుట గుణములకేగాని దేహులు దానితో సంబంధించుట లేదని గ్రహింపుడు.



శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత ॥ 11

పద॥ సర్వద్వారేషు - దేహే - అస్మిన్ - ప్రకాశః - ఉపజాయతే।
జ్ఞానం - యదా - తదా - విద్యాత్ - వివృద్ధం - సత్త్వం - ఇతి - ఉత ॥

| | | | |
|---|---|---|---|
| అస్మిన్దేహే | ఈ దేహమున | ఉపజాయతే | కలుగుచున్నదో |
| సర్వద్వారేషు | చెవి మొదలగు సకల ద్వారములలోను | తదా | అప్పుడు |
| | | సత్త్వం | సత్త్వగుణము |
| జ్ఞానం ప్రకాశః ఉత | జ్ఞానస్వరూపమైన ప్రకాశ మున్ను సుఖమున్ను | వివృద్ధమితి | పైబడియున్నదని |
| | | విద్యాత్ | ఎరుంగవలెను. |
| యదా | ఎప్పుడు | | |

తా॥ ఈ దేహమునందలి చెవి మొదలగు సకలద్వారములలోను జ్ఞాన స్వరూపమైన ప్రకాశమున్ను సుఖమున్ను ఎప్పుడు గలుగుచున్నవో అప్పుడు సత్త్వగుణము అభివృద్ధిచెందియున్నదని యెరుంగవలయును.

(శంకరులు) ఎప్పుడేగుణముపైబడియున్నదో అప్పుడు దానిలక్షణమిట్టిదని చెప్పెదము. చెవి మొదలగు ఇంద్రియములన్నియు ఆత్మకు ఎరింగెడి మార్గములు. అట్టి మార్గము లన్నిటిలో నున్ను అంతఃకరణమునిండుగ బ్రవేశించుట, అనగా బుద్ధివృత్తి వ్యాపించుట ప్రకాశము. అనగా తెలియుట. అదియే జ్ఞానమనబడుచున్నది. ఈ విధముగ నెప్పుడు జ్ఞానమనెడి ప్రకాశము ఈ శరీరమున ఇంద్రియములన్నిటిలోను కలుగుచున్నదో అప్పుడు జ్ఞానప్రకాశమనెడి గుర్తుచే సత్త్వగుణము వృద్ధిపొందియున్నదని తెలిసికొనుడు.

(రామానుజులు) ఈ దేహమున ఇంద్రియములచే వస్తువుల స్వరూపనిశ్చయజ్ఞానము ఎప్పుడు గల్గునో అప్పుడు సత్త్వగుణము అభివృద్ధియైయున్నదని ఎరుంగవలెను.

(స్వకీయము) "ఉత" ఈ పదమునుగొని సుఖమనునర్థమును శ్రీధరులు చేసియున్నారు. ఐతే ఆ పదము అట్టి యర్థమును ఇవ్వకున్నను 'ఉత' అనునది చేరిక అను అర్థమును ఇచ్చునది గావున మునుపు తొమ్మిదవ శ్లోకమున జెప్పినసుఖముగూడ ఇందులో జేర్చబడియున్నది.

---

శ్లో॥ లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ॥　　12

పద॥ లోభః - ప్రవృత్తిః - ఆరంభః - కర్మణాం - అశమః - స్పృహా।
రజసి - ఏతాని - జాయన్తే - వివృద్ధే - భరతర్షభ॥

| | | | |
|---|---|---|---|
| | ఓ భరతశ్రేష్ఠుడా! | కర్మణాం ఆరంభః | కర్మలను మొదలుపెట్టుట |
| రజసివివృద్ధే (సతి) | రజోగుణ మభివృద్ధమైనచో | అశమః | విశ్రాంతి లేకుండుట |
| లోభః | లోభము | స్పృహా | ఆశ |
| ప్రవృత్తిః | కార్యములో ప్రయత్నము | ఏతాని జాయన్తే | ఇవి కలుగుచున్నవి. |

తా॥ ఓ భరతశ్రేష్ఠుడా! రజోగుణము అభివృద్ధిచెందినచో అర్థాశ, కార్యములో ప్రయత్నము, కర్మలను మొదలుపెట్టుట, చిత్తసమాధానములేకుండుట, ఇచ్ఛ, ఇవి కలుగుచున్నవి.

(శంకరులు) లోభః = ఇతరుల వస్తువులను అపహరింపగోరుట, ప్రవృత్తిః = పొదువైన ప్రయత్నమునుజేయుట, వేటిననగా కార్యములను, కర్మణాం ఆరంభః = ఏద్దైన నొక కార్యమును జేయమొదలుపెట్టుచునుండుట. అశమః = సంతోషము ఆసక్తి మొదలగువాట్లలో ప్రవేశించి పోవుట, స్పృహా = సామాన్యములైన వస్తువులన్నిటినిగూర్చిన ఆశ. రజోగుణముపైబడియుండగా ఇవి గుర్తులని కనుగొనుడు.

(శ్రీధరులు) లోభః = అత్యాశ, కర్మణాం ఆరంభః = ఏద్దైనపనిచేయ నారంభించుచుండుట, స్పృహా = చూచినవస్తువులన్నియు ఉత్తమములైనను అధమములైనను అవి తనకు కావలెనను కోరిక.

(రామానుజులు) లోభః = తనయొక్క వస్తువును బొత్తిగ సెలవుచేయకుండుట యను కృపణత్వము, ప్రవృత్తిః = ప్రయోజనములేకయే ఏదైన ఒకపనిని చేయుచుండుట, కర్మణాం ఆరంభః = ఫలాపేక్షతో కర్మలనుజేయుట, అశమః = ఇంద్రియములను అణచకుండుట, స్పృహా = విషయములలో నిచ్ఛ.

(రాఘవేంద్రులు) రామానుజునివలె అన్ని పదములకును అర్థము జేసియున్నారు. ఐతే స్పృహా అనుదానికి మాత్రము లభించని వస్తువులో ఇచ్ఛయని అన్వయము చేసియున్నారు.



శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునందన ॥ 13

పద॥ అప్రకాశః (1) - అప్రవృత్తిః (2) - చ - ప్రమాదః (3) - మోహః - ఏవ - చ ।
తమసి - ఏతాని - జాయన్తే - వివృద్ధే - కురునందన ॥

| | | | |
|---|---|---|---|
| హే కురునందన ! | ఓ అర్జునా ! | ప్రమాదః | అజాగ్రత |
| తమసివివృద్ధే (సతి) | తమోగుణము వృద్ధిపొందినచో | మోహ ఏవ చ | మోహము |
| అప్రకాశః | అవివేకము | ఏతాని జాయన్తే | ఇవి గలుగుచున్నవి. |
| అప్రవృత్తిశ్చ | కార్యమున ప్రవృత్తిలేనితనము | | |

తా॥ ఓ అర్జునా ! తమోగుణము అభివృద్ధిపొందినచో అవివేకము, కార్యమున ప్రయత్నములేకుండుట, అజాగ్రత్త (ఒకదానిని మఱియొకటిగ నెరింగెడి) విపరీతజ్ఞానము, మోహము ఇవి కలుగుచున్నవి.

(1) అప్రకాశః - అవివేకము (శంకరులు). జ్ఞానమే కలుగకయుండుట (రామానుజులు). చెవి మొదలగు నింద్రియములకుగల జ్ఞానములేకుండుట (రాఘవేంద్రులు)

(2) అప్రవృత్తిశ్చ - బొత్తిగ ప్రయత్నము లేనితనము (శంకరులు). మందగించి యుండుట (రామానుజులు). ఏకార్యమునందును ప్రయత్నములేకుండుట (రాఘవేంద్రులు).

(3) ప్రమాదః - చేయదగని కార్యములనుగూడ చేయదలంచునట్టి అజాగ్రత్త (రామానుజులు).



శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే ॥ 14

పద॥ యదా - సత్త్వే - ప్రవృద్ధే - తు - ప్రళయం - యాతి - దేహభృత్ ।
తదా - ఉత్తమవిదాం - లోకాన్ - అమలాన్ - ప్రతిపద్యతే ॥

| | | | |
|---|---|---|---|
| దేహభృత్ | దేహమును ధరించియున్న (జీవుడు) | ప్రళయం యాతి | మరణమును పొందునో |
| | | తదా | అప్పుడు |
| యదా | ఎప్పుడు | ఉత్తమవిదాం | ఉత్తమము నెరింగినవారల |
| సత్త్వే | సత్త్వగుణము | అమలాన్ లోకాన్ | దోషములేని లోకములను |
| ప్రవృద్ధేతు | వృద్ధిపొందియుండునప్పుడే | ప్రతిపద్యతే | పొందుచున్నాడు. |

తా॥ ఎప్పుడు సత్త్వగుణము వృద్ధిపొందియున్నదో అప్పుడు మరణించెడి జీవుడు ఉత్తమజ్ఞానులు పొందదగిన పరిశుభ్రములైన లోకములను పొందుచున్నాడు.

(శంకరులు) మరణమొందినపిదప జీవుడేఫలమునుపొందునో అదంతయు గుణమువలన నైనదేయని తెలియబరచుటకై చెప్పబడుచున్నది. జీవుడు సత్త్వగుణమునుపొందినచో మరణ మొందినపిదప మహాజ్ఞానులు పొందెడి లోకములను చెందును. దేహీ = ఆత్మ. ఉత్తమ = మహత్తు మొదలగు తత్త్వములను, అమలాన్ లోకాన్ = శుభ్రములైన లోకములను అనగా - (ఆనందగిరి) రజస్సు, తమస్సు, గలుగుటలేనట్టి బ్రహ్మలోకము మొదలగువాటిని.

(శ్రీధరులు) హిరణ్యగర్భుని ఉపాసించువారలు పొందదగినట్టియు, ప్రకాశమయమై నట్టియు, సుఖానుభవమునకు యోగ్యమైనట్టియు లోకములను పొందుచున్నారు.

(రామానుజులు) ఆత్మస్వరూపమెరింగిన వారల పరిశుద్ధమైన గుంపులో చేరుచున్నాడు. అనగా మరణమునకు పిదప బ్రహ్మజ్ఞానుల కులమునబుట్టి ఆత్మజ్ఞానమొందదగిన పుణ్యకర్మలను జేయ నధికారముగలవాడగుచున్నాడు.

(రాఘవేంద్రులు) విష్ణుజ్ఞానులు పొందదగిన నిర్దోషమైన దేహమును పొందుచున్నాడు. అనగా ఉత్తములకులమున దేహమును పొందుచున్నాడు.

---

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే ।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే ॥ 15

పద॥ రజసి - ప్రళయం - గత్వా - కర్మసంగిషు (1) - జాయతే ।
తథా - ప్రలీనః - తమసి - మూఢయోనిషు (2) - జాయతే ॥

| | | | |
|---|---|---|---|
| రజసి | రజోగుణము | తథా | ఆ విధముగనే |
| (ప్రవృద్ధేసతి) | అభివృద్ధిచెందిన సమయమున | తమసి | తమోగుణము |
| ప్రళయం | మరణమును | (ప్రవృద్ధేసతి) | వృద్ధిపొందిన సమయమున |
| గత్వా | పొంది | ప్రలీనః | మరణమొందినవాడు |
| కర్మసంగిషు | కర్మలో ఆసక్తిగల మనుష్య వర్గమున | మూఢయోనిషు | జ్ఞానములేని పశువుమొదలగు జన్మలలో |
| జాయతే | పుట్టుచున్నాడు | జాయతే | పుట్టుచున్నాడు. |

తా॥ రజోగుణము అభివృద్ధిచెందియున్న కాలమున మరణమొందినచో కర్మయందాసక్తిగల మనుష్యవర్గమున బుట్టుచున్నాడు. ఆ విధముగనే తమోగుణ మభివృద్ధిచెందిన కాలమున మరణమొందినవారు పశు మొదలగు జాతులలో బుట్టుచున్నారు.

(1) కర్మసంగిషు - ఫలాపేక్షతో కర్మలను చేయువారల కులమునబుట్టి ఫలాపేక్షతో కర్మలను జేయుచున్నాడు. (రామానుజులు) కామ్యకర్మలను జేయువారలకులమున బుట్టుచున్నాడు. (రాఘవేంద్రులు).

(2) మూఢయోనిషు - కుక్క, పంది మొదలగు జాతులలో, అనగా ధర్మార్థకామమోక్షములనెడి పురుషార్థములకు యోగ్యుడు కానివాడగుచున్నాడని తాత్పర్యము. (రామానుజులు) వైద్యుల కులమున (రాఘవేంద్రులు).

శ్లో॥ కర్మణస్సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16

పద॥ కర్మణః - సుకృతస్య - ఆహుః - సాత్త్వికం - నిర్మలం (1) - ఫలమ్।
రజసః - తు - ఫలం - దుఃఖం (2) - అజ్ఞానం - తమసః - ఫలమ్॥

| | | | |
|---|---|---|---|
| సుకృతస్యకర్మణః | సాత్త్వికకర్మమునకు | దుఃఖం ఫలం | దుఃఖమును ఫలముగను |
| సాత్త్వికం | సత్త్వగుణమువలన గలిగిన సాత్త్వికమేయైన | తమసః | తామసగుణమువలన కలిగినకర్మకు |
| | | అజ్ఞానం | అజ్ఞానమును (మోహములేక మూఢత్వమును) |
| నిర్మలం ఫలం | పరిశుభ్రమైన సుఖమును ఫలముగను | ఫలం | ఫలముగను |
| రజసస్తు | రజోగుణమువలననైనకర్మకు | ఆహుః | చెప్పుచున్నారు. |

తా॥ సాత్త్వికముగనున్న కర్మకు సత్త్వగుణమువలన గలిగిన పరిశుభ్రమైన సుఖమునున్ను, రజోగుణమువలన గలుగు కర్మకు దుఃఖమును, తమోగుణమువలన గలిగిన కర్మకు అజ్ఞానమునున్ను ఫలముగ (విద్వాంసులు) చెప్పుచున్నారు.

(1) నిర్మలం - ప్రకాశాధిక్యముగల సుఖమును (శ్రీధరులు).

(2) దుఃఖం - సుఖమిశ్రమమైన దుఃఖమును (అనగా సుఖదుఃఖములు కలిసియుండుట).

(శంకరులు) సాత్త్వికకర్మకు సాత్త్వికమేయైన, అనగా సత్త్వగుణమువలననైన, అనగా రజస్తమస్సుల సంబంధములేనిఫలమని చెప్పుచున్నారు. రజస్సు అనుదానికి రాజసకర్మయని అర్థము. ఈ యధ్యాయము కర్మను బట్టినదైనందున రాజసకర్మయొక్క ఫలముగూడ దుఃఖమే. అది రాజసముగు రజోగుణమువలన నైనట్టిదే, తమసః = తామసకర్మయైన అధర్మమునకు.

శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ॥ 17

పద॥ సత్త్వాత్ - సంజాయతే - జ్ఞానం (1) - రజసః - లోభః (2) - ఏవ - చ।
ప్రమాదమోహౌ - తమసః - భవతః - అజ్ఞానం - ఏవ - చ॥

| | | | |
|---|---|---|---|
| సత్త్వాత్ | సత్త్వగుణమునుండి | తమసః | తమోగుణమునుండి |
| జ్ఞానం | జ్ఞానమున్ను | ప్రమాదమోహౌ | అజాగ్రతయు విపరీతజ్ఞానమున్ను |
| రజసః | రజోగుణమునుండి | | |
| లోభ ఏవ చ | ఎంత దొఱికినను ఇకను కావలెనను ఇచ్ఛయున్ను | భవతః | కలుగుచున్నవి. |
| | | అజ్ఞానమేవ చ (భవతి) | అజ్ఞానమున్ను కలుగుచున్నది. |
| సంజాయతే | కలుగుచున్నది | | |

తా॥ సత్త్వగుణమునుండి జ్ఞానమున్ను, రజోగుణమునుండి ఆశయు,తమోగుణమునుండి అజాగ్రత విపరీతజ్ఞానము అజ్ఞానము ఇవియు కలుగుచున్నవి.

(1) జ్ఞానం - పరమాత్మ విషయమైన జ్ఞానము, (రాఘవేంద్రులు).

(2) లోభ ఏవచ - స్వర్గాది విషయమైన అసక్తి (రాఘవేంద్రులు)

(రామానుజులు) అభివృద్ధిచెందినదైన సత్త్వగుణమునుండి ప్రకృతివిముక్తాత్మదర్శనమున్ను అభివృద్ధిచెందిన రజోగుణమునుండి స్వర్గాదిలోకములలో నాశయు అభివృద్ధినిచెందిన తమోగుణమునుండి ఆలస్యమున్ను దానిచే నకార్యమున ప్రవృత్తియు విపరీతజ్ఞానమున్ను తరువాత అజ్ఞానమున్ను కలుగుచున్నవి.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః॥ 18

పద॥ ఊర్ధ్వం - గచ్ఛన్తి - సత్త్వస్థాః - మధ్యే - తిష్ఠన్తి - రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థాః - అధః - గచ్ఛన్తి - తామసాః॥

| | | | |
|---|---|---|---|
| సత్త్వస్థాః | సత్త్వగుణములోనున్నవారలు | జఘన్యగుణవృత్తిస్థాః | నికృష్టగుణాచారములోనున్న |
| ఊర్ధ్వం గచ్ఛన్తి | పైకిపోవుచున్నారు | తామసాః | తమోగుణముగలవారలు |
| రాజసాః | రజోగుణముగలవారలు | అధః | క్రిందకు |
| మధ్యే తిష్ఠన్తి | మధ్యనిలబడుచున్నారు | గచ్ఛన్తి | పోవుచున్నారు. |

తా॥ సత్త్వగుణముగలవారలు పై లోకమును, రజోగుణముగలవారలు మనుష్యలోకమును, తమోగుణముగలవారలు క్రింది లోకమును పొందుచున్నారు.

* ఈ శ్లోకమును కూర్మపురాణమున మొదటి భాగము రెండవ అధ్యాయమునందును భవిష్యపురాణమున 2-1-21-లోను చూడుడు.

(శంకరులు) సత్త్వగుణాచారములోనున్న వారలు దేవలోకము మొదలగు వాటిలో బుట్టుచున్నారు. రాజసులు, అనగా రజోగుణ నడవడికగలవారలు మనుష్యులలో బుట్టుచున్నారు. నీచగుణమైన తమోగుణముయొక్క నడవడికలైన నిద్ర సోమరితనము మొదలగువాటిలోనున్న మూఢులైన తామసులు పశుపక్ష్యాదులలో బుట్టుచున్నారు.

(శ్రీధరులు) సత్త్వగుణము అభివృద్ధి పొందియున్నప్పుడు మరణమొందినవారలు ఒకదానికంటె ఒకటి నూరింతలు అధికమైన ఆనందముగల సత్యలోకమువఱకుగల పైలోకములోను (వారివారి సత్త్వాభివృద్ధికి తగినట్లు) పొందగలరు. రజోగుణాభివృద్ధి పొందినవారలు మనుష్యలోకమున మఱలమఱల జననమును పొందుచు ఉందురు. తమోగుణాభివృద్ధి పొందినవారలు (అభివృద్ధికి తగినట్లు) పై పైగా నరకమును పొందెదరు.

(రామానుజులు) సత్త్వగుణాభివృద్ధి చెందినవారలు క్రమముగ సంసారబంధమునుండి మోక్షమొందుచున్నారు. రజోగుణాభివృద్ధి చెందినవారలు రజోగుణములకు ఫలమైన స్వర్గమును పొందుటకై కర్మననుష్ఠించి స్వర్గమును పొందుటయు మఱల భూలోకమున జనించుటయు గలిగియున్నారు. తమోగుణాభివృద్ధిచెందిన వారలు మొదట తక్కువజాతియందును పిదప మృగాది జాతులలోను పిదప పురుగు మొదలగు జంతువులలోను తరువాత వృక్షము తీగె, రాయి, మట్టి, గడ్డి, మొదలగు వాటిలోను జననమొందుచున్నారు.

(రాఘవేంద్రులు) సత్త్వాదిగుణాభివృద్ధి పొందిన వారలు వరుసగా (స్వర్గమునకు పైబడిన) జనోలోకము వఱకుగల పైలోకములను స్వర్గాదిమధ్య (భూలోకమువఱకుగల) లోకములను నఱకాది క్రిందలోకములను పొందుచున్నారు.

(స్వకీయము) ఊర్ధ్వం-మధ్యే-అధః=పైగా-మధ్యగా-క్రిందిగా గచ్ఛన్తి=పోవుచున్నారు అనగా భాష్యకారులు చెప్పియున్నట్లు ఆయాలోకములలో దేహములను పొందుచున్నారని తాత్పర్యము. ఈ శరీరములు పదునాల్గువిధములైనవి. వాటిలో ఎనిమిదివిధములు మొదటివరుస. అవి పైగా పోగల దేహములు అవియేవనగా—

| | |
|---|---|
| (1) బ్రహ్మమొదలైన శ్రేష్ఠులైనదేవతలు | (8) పిశాచులు |
| (2) మనుష్యులు ఉత్పత్తికి కారణమైన ప్రజాపతులు | (9) మనుష్యులు |
| (3) చంద్రుడు మొదలగుదేవతలు | (10) పశ్వాది |
| (4) ఇంద్రుడు మొదలగు తక్కువైన దేవతలు | (11) మృగాది |
| (5) గంధర్వులు | (12) పక్ష్యాది |
| (6) రాక్షసులు | (13) ప్రాకెడిజంతువులైన మత్స్యాదులు |
| (7) యక్షులు | (14) చెట్టుతీగెగడ్డి మొదలగునవి |

కపిలుని సాంఖ్య ప్రవచనము 3 వ అధ్యాయము 42 వ సూత్రమును వారి శిష్యులైన ఈశ్వరకృష్ణులయొక్క సాంఖ్యకారిక 53 వ శ్లోకమును చూడుడు.



శ్లో॥ నాఽన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి।
గుణేభ్యశ్చ పరంవేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ 19

పద॥ న - అన్యం - గుణేభ్యః - కర్తారం - యదా - ద్రష్టా - అనుపశ్యతి।
గుణేభ్యః - చ - పరం - వేత్తి - మద్భావం - సః - అధిగచ్ఛతి॥

| | | | |
|---|---|---|---|
| యదా (కశ్చిత్) | ఎప్పుడు ఒకడు | గుణేభ్యశ్చ | గుణములకంటె |
| ద్రష్టా నఙ | వివేకముతో గూడినవాడై | పరం | అన్యునిగ |
| గుణేభ్యః | గుణములకంటె | వేత్తి | ఎరుంగునో |
| అన్యం | వేరైన కర్తను | తదా | అప్పుడు |
| నానుపశ్యతి | చూచుటలేదో | సః | ఆ వివేకియైనవాడు |
| చ | మఱియు | మద్భావం | నాయొక్క స్వరూపమును |
| (ఆత్మానం) | ఆత్మను | ఽధిగచ్ఛతి | పొందుచున్నాడు. |

తా॥ వివేకియైనవాడు బుద్ధ్యాద్యాకారముగ పరిణమించియున్న గుణములకంటె వేరొక్కని కర్తగ నెప్పుడు ఎరుంగుటలేదో గుణములకంటె అన్యుడుగ నాత్మనెరుంగునో అప్పుడు నా స్వరూపము నెరుంగుచున్నాడు.

(శంకరులు) సకలకార్యములకును కర్తగుణములేకాని ఆత్మకాదని ఎరుంగువాడు వాసుదేవత్వమును పొందుచున్నాడు. అనగా సకలము వాసుదేవ రూపమని చూచెడివాడుగనుండి వాసుదేవమయమగుచున్నాడని తాత్పర్యము.

(శ్రీధరులు) గుణముల వ్యాపారమునకు తాను కారణమున్ను కర్తయుగాదు. గుణములే కర్త. తాను కేవలము సాక్షిమాత్రముగ నున్నట్టివాడు, గుణములకంటె అన్యుడని యెరుంగువాడు బ్రహ్మమగుచున్నాడు.

(రామానుజులు) ద్రష్టా = సాత్త్వికాహారముచేసి ఫలాపేక్షలేక సకల కర్మలను భగవదారాధనరూపముగనేచేసి దానిచే శుద్ధముగను అభివృద్ధి చెందియున్ను సత్త్వగుణముగల వివేకియైనవాడు. వేత్తి = పరిశుద్ధుడైన ఆత్మకు అనాదియైన కర్మసంబంధమువలన గలిగిన గుణములచే కర్తృత్వము గలిగియున్నది, ఈ గుణసంబంధమే బంధము. ఇట్టి బంధమును నివృత్తిచేసుకొన్న శుద్ధాత్మయైనవాడు కర్తకాడు. అతడు పూర్ణమైన జ్ఞానస్వరూపియని ఎవ్వడు తన్నెరుంగునో, సః = అతడు, మద్భావం = నాయొక్క ధర్మమగు దుఃఖములేనితనమును, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

(రాఘవేంద్రులు) మునుపుజెప్పిన వాటివలన గుణములే సర్వకర్తయనితోచును. కావున దానిని నిరాకరించి గుణములు పరిణామికర్తయనియు స్వతంత్రకర్త ఈశ్వరుడనియు దీనిచే చెప్పబడుచున్నది. యదా = ఎప్పుడు, ద్రష్టానా = చూచెడి పురుషుడైన జీవుడు, గుణేభ్యః = గుణములకంటె, అన్యంకర్తారం = అన్యుడైన ఈశ్వరుని కర్తగ, అనుపశ్యతి = చూచునో, యః = ఎవ్వడు గుణేభ్యశ్చ = గుణములకంటె, పరం = స్వతంత్రుడైన పరమాత్మను, వేత్తి = ఎరుంగునో, సః = అతడు, మద్భావం = నాయెడనుండుటను, అధిగచ్ఛతి = పొందుచున్నాడు. లేక, యదా = ఎప్పుడు, ద్రష్టా = జీవుడు, గుణేభ్యః = గుణములకంటె, అన్యంకర్తారం = అన్యుడైన పరిణామి కర్తను, నానుపశ్యతి = చూచుటలేదో (మిగతవాటికి మునుపటి అర్థమే).

(మధ్వులు) గుణములు పరిణామి కర్తయనియు ఈశ్వరుడు స్వతంత్రకర్తయేగాని పరిణామి కర్తకాడనియు ఎరింగెడివాడు నన్ను పొందుచున్నాడు. "యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారం" అనుశ్రుతిలో ఈశ్వరుడు కర్తయని చెప్పబడియున్నది, కావున ఈశ్వరుడు కర్తకాదని చెప్పగూడదు. ఐతే ఈశ్వరుడు పరిణామికర్తకాడు.

అనేకములైన ఆభరణములుగ వికారమునొందియున్న బంగారము పరిణామికర్త. ఆ బంగారమునుగొని అభరణములనుజేసెడి కంసాలి స్వతంత్రకర్త. దీనివలె గుణములు పరిణామి కర్త. ఆ గుణములను గొని సృష్టికార్యములను జేసెడి భగవంతుడు స్వతంత్రకర్త.

శ్లో॥ గుణా నేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే ॥ 20

పద॥ గుణాన్ - ఏతాన్ అతీత్య (1) - త్రీన్ - దేహీ - దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైః (2) విముక్తః - అమృతం (3) - అశ్నుతే ॥

| | | | |
|---|---|---|---|
| దేహీ | దేహముబడసిన ఆత్మ | విముక్తః | విడువబడినవాడై |
| దేహసముద్భవాన్ | దేహమునకు కారణమైన | అమృతం | బ్రహ్మానందమును (మరణము లేనితనమును |
| ఏతాన్ త్రీన్ గుణాన్ | ఈ మూడు గుణములను | | |
| అతీత్య | అతిక్రమించి (దాటి) | అశ్నుతే | పొందుచున్నాడు. |
| జన్మమృత్యుజరాదుఃఖైః | జననమరణ వృద్ధాప్యదుఃఖములచే | | |

తా॥ దేహముబడసిన ఆత్మ, దేహమును గలుగజేసిన ఈ గుణత్రయమును అతిక్రమించి జననము మరణము వార్ధకము ఈ దుఃఖములచే విడువబడినవాడై బ్రహ్మానందమును పొందుచున్నాడు.

(1) అతీత్య = గుణములకంటె అన్యముగను జ్ఞానస్వరూపముగనున్న ఆత్మ నెరింగి (రామానుజులు)

(2) జన్మమృత్యు జరాదుఃఖైః = దీనిని 13-వ అధ్యాయమున 9-వ శ్లోకమున చూడుడు.

(3) అమృతం = నాయొక్క స్వరూపముగనుండుటను (శంకరుడు) ఆత్మానుభవమును ఇది యే తద్భావమనంబడును. (రామానుజులు) పరబ్రహ్మమును. (రాఘవేంద్రులు).

(శంకరులు) జ్ఞానియైన దేహిమాయయనెడి ఉపాధుల ఆకారములై శరీరముగలుగుటకు విత్తనములైన క్రిందకనబరచిన ఈ మూడుగుణములను బ్రతికియున్నప్పుడేదాటి జననమరణవార్ధకమనెడి దుఃఖములచే బ్రతికియున్నప్పుడే విడువబడినవాడై మరణింపకుండుటను బడయుచున్నాడు. ఈ విధముగ బ్రహ్మముయొక్క స్థితియైన బ్రహ్మానందమును బడయుచున్నాడు.



అర్జున ఉవాచ :—

శ్లో॥ కైర్లిఙ్గైస్త్రీన్గుణానేతా నతీతో భవతి ప్రభో ।
కిమాచారః కథం చైతాంస్త్రీన్గుణానతివర్తతే ॥ 21

పద॥ కైః - లిఙ్గైః - త్రీన్ - గుణాన్ - ఏతాన్ - అతీతః - భవతి - ప్రభో।
కిమాచారః - కథం (1) - చ - ఏతాన్ - త్రీన్ - గుణాన్ - అతివర్తతే ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | భవతి | కూడిన వాడగుచున్నాడు |
| హే ప్రభో ! | ఓ ప్రభో ! | కిమాచారః | ఎటువంటి ఆచారముగలవాడు |
| ఏతాన్ త్రీన్ గుణాన్ | ఈ మూడుగుణములను | కథం చ | ఎట్లు |
| అతీతః | అతిక్రమించినవాడు (దాటి నిలబడువాడు | ఏతాన్ త్రీన్ | ఈ మూడు |
| | | గుణాన్ | గుణములను |
| కైఃలిఙ్గైః | ఏ లక్షణములతో (గుర్తులతో) | అతివర్తతే | అతిక్రమించుచున్నాడు. |

తా॥ అర్జునుడు చెప్పినది:— ఓ ప్రభువా! ఈ మూడుగుణముల నతిక్రమించినవాడు ఏ లక్షణములు గలిగియుండును? ఎట్టి యాచారములుగలవాడు? ఎట్లు గుణత్రయము నతిక్రమించుచున్నాడు ?

(1) కథం చ - ఏ ఉపాయముచేత (రాఘవేంద్రులు.)

(శంకరులు) అర్జునుడు అడిగినదేమన – బ్రతికియుండగనే గుణముల నతిక్రమించి మరణింపకుండుటను ఎట్లు పొందును ? గుణముల దాటినవాని గుర్తులెవ్వి? గుణములను దాటినవానికి మార్గమేమి? దీనికి భగవంతుడు అర్జునుడు మొదటనడిగిన ప్రశ్నయగు గుణములను దాటినవాడు. ఎట్టి గుర్తులు గలవాడుగనున్నాడు అనుదానికి మొదట జెప్పుచున్నాడు.

భగవానువాచ :—

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ 22

శ్లో॥ ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥ 23

శ్లో॥ సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః ॥ 24

శ్లో॥ మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే ॥ 25

పద॥ ప్రకాశం - చ - ప్రవృత్తిం - చ - మోహం - ఏవ - చ - పాండవ।
న - ద్వేష్టి (1) సంప్రవృత్తాని - న - నివృత్తాని - కాంక్షతి (2) ॥

పద॥ ఉదాసీనవత్ (3) - ఆసీనః (4) - గుణైః (5) - యః - న - విచాల్యతే (6)।
గుణాః (7) - వర్తన్తే - ఇతి - ఏవ - యః - అవతిష్ఠతి - న - ఇంగతే (8)

పద॥ సమదుఃఖసుఖః (9) - స్వస్థః (10) - సమలోష్టాశ్మకాంచనః (11)।
తుల్యప్రియాప్రియః - ధీరః (12) - తుల్యనిందాత్మ సంస్తుతిః (13) ॥

పద॥ మానావమానయోః - తుల్యః (14) - తుల్యః - మిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ (15) - గుణాతీతః - సః - ఉచ్యతే ॥

| | |
|---|---|
| శ్రీ భగవానువాచ | శ్రీ కృష్ణపరమాత్మ చెప్పినది |
| హే పాండవ ! | ఓ పాండుకుమారుడా ! |
| యః | ఎవ్వడు |
| సంప్రవృత్తాని | తనయిచ్ఛగాగలిగిన (స్వభావముచే గలిగిన) |
| ప్రకాశం చ | ప్రకాశమును |
| ప్రవృత్తిం చ | ప్రవృత్తిని |
| మోహమేవ చ | మోహమును |
| న ద్వేష్టి | ద్వేషించుటలేదో |
| నివృత్తాని | నివృత్తములైన వాటిని |
| న కాంక్షతి | అపేక్షించుటలేదో |
| యః | ఎవ్వడు |
| ఉదాసీనవత్ | (పక్షపాతములేని) సాక్షివలె |
| ఆసీనః | ఉన్నవాడై |
| గుణైః | గుణములచే సుఖాదులచే |
| న విచాల్యతే | చలింపజేయబడుటలేదో |
| గుణాఏవ | గుణములే |
| వర్తన్తే ఇతి | కార్యములో ఈ విధముగనే ప్రవర్తించియున్నవని |
| అవతిష్ఠతి | దృఢముగ నిలబడునో స్వరూపనిష్ఠనుండి చలించుట లేదో |
| యః | ఎవ్వడు |
| సమదుఃఖసుఖః | సుఖదుఃఖములలో సమానుడుగను |
| స్వస్థః | స్వరూపనిష్ఠలో సంతుష్టుడుగనున్నవాడుగను |
| సమలోష్టాశ్మకాంచనః | మట్టిపెళ్ల, రాయి, స్వర్ణము వీటిలో సమానుడుగను |
| తుల్య ప్రియాప్రియః | ఇష్టానిష్టములలో సమానుడుగను |
| ధీరః | ధైర్యముగలవాడుగను |
| తుల్యనిందాత్మసంస్తుతిః | (తన్ను) నిందించినను స్తుతించినను సమానుడుగను |
| మానావమానయోః | మానావమానములలో |
| తుల్యః | సమానుడుగను |
| మిత్రారి పక్షయోః | మిత్ర శత్రుపక్షములలో |
| తుల్యః | సమానుడుగను. |

| | | | |
|---|---|---|---|
| సర్వారంభపరిత్యాగీ | అన్నివిధములైన ప్రయత్నములను విడచినవాడుగను నుండునో | సః | అతడు |
| | | గుణాతీతః | గుణాతీతుడుగ |
| | | ఉచ్యతే | చెప్పబడుచున్నాడు. |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ జెప్పినది:— ఓ పాండుకుమారా! ఎవ్వడు స్వభావమువలన గలిగినవైన సత్త్వగుణకార్యములైన ప్రకాశము మొదలగు వాటిని, రజోగుణవికారములైన ప్రవృత్తి మొదలగువాటిని, తమోగుణ కార్యములైన మోహము మొదలగువాటిని ద్వేషించుటలేదో, నివర్తించి పోయినవాటిని (మఱలను) అపేక్షించుటలేదో, ఎవ్వడు సాక్షివలెనున్నవాడై గుణకార్యములైన సుఖాదులవలన చలింపజేయబడుటలేదో, గుణములు (తమ తమ కార్యములలో) తామే ప్రవర్తించియున్నవని ఎవ్వడెరింగియుండునో, ఎవ్వడు స్వరూపనిష్ఠనుండి చలించుటలేదో, సుఖదుఃఖములలో సమానుడుగను, స్వరూపనిష్ఠలో నున్నవాడుగను, మట్టిగడ్డ, రాయి, స్వర్ణము వీటిని సమముగ దలంచెడివాడుగను, ఇష్టానిష్టములలో సమానుడుగను, ధైర్యముగలవాడుగను, తన్ను నిందించినను స్తుతించినను అందు సమానుడుగను, మానావమానములలో సమానుడుగను, శత్రుమిత్రపక్షములలో సమానుడుగను, సకల విధములైన ప్రయత్నములను విడచినవాడుగను నెవ్వడుండునో, అతడు గుణాతీతుడని చెప్పబడుచున్నాడు.

మఱియొక పాఠము "యో న తిష్ఠతి"

(1) నద్వేష్టి - ద్వేషించుటలేదు. అనగా తమోగుణకార్యమైన మోహముచే మోహమొందితిననియు, అజ్ఞానముచే నవివేకము చెందితిననియు, రజోగుణకార్యమైన కర్మప్రవృత్తిచే స్వరూపనిష్ఠకు బాధగలుగునట్లు కర్మలను జేయుచున్నాననియు, సత్త్వగుణకార్యమైన ప్రకాశము మొదలగు వాటిచే స్వరూపనిష్ఠకు బాధకముగ విషయసుఖమున నాసక్తిగలుగుటచే అదియు బంధస్వరూపముగ నున్నదనియు తలంచి వాటిని ద్వేషించుట లేదో (శంకరుదు).

(2) నకాంక్షతి - పైకనిన గుణములయొక్క కార్యములు తన్నువిడచి తొలగియుండగా అవి మఱల రావలెనని కోరుటలేదో (శంకరులు)

(3) ఆసీనః - గుణములను నివర్తించు ప్రయత్నమున నున్నవాడుగను (శంకరులు)

(4) ఉదాసీనవత్ - ఆత్మకంటె అన్యమైన విషయములలో ఆసక్తిలేనివాడుగను (రామానుజులు) విష్ణుసంబంధములైన కర్మలుదప్ప మిగతవాటిలో ఉదాసీనుడుగనున్నవాడుగను (రాఘవేంద్రులు).

(5) గుణైః - సత్త్వాదిగుణములవలన గలిగిన వికారములను పొందుటలేదు. (రాఘవేంద్రులు)

(6) న విచాల్యతే - ఇందలి 6 వ అధ్యా-9 వ శ్లోకము చూడుడు.

(7) గుణాః - సత్త్వాది గుణములు స్వతంత్రముగ గాక పరమేశ్వరుని ఇచ్ఛచేతనే (రాఘవేంద్రులు) 3 వ అధ్యా-28-శ్లో-చూడుడు.

(8) నేంగతే - గుణములయొక్క కార్యమునను సరించి నడచుటలేదో (రామానుజులు)

(9) సమదుఃఖసుఖః - దుఃఖముతో సమానమైన విషయ సుఖమును గలవాడుగను అనగా దుఃఖము నందువలె సుఖమునందును అభిలాషలేనివాడు (రాఘవేంద్రులు) (స్వ) అధ్యా 12-శ్లో-13 చూడుడు.

(10) స్వస్థః - ఆత్మనిష్ఠలో నున్నవాడు అనగా పుత్రమిత్రాది జనన మరణవిషయములలో సమముగ నున్నవాడుగను (రామానుజులు) వికారము లేనివాడుగను (రాఘవేంద్రులు)

(11) సమలోష్టాశ్మ కాంచనః - స్వర్ణమును, మట్టిపెళ్ళ రాయి వీటితో సమానముగ తలంచువాడుగను (రాఘవేంద్రులు) (స్వ) అధ్యా-6-శ్లో-8 చూడుడు.

(12) ధీరః - ప్రకృతి ఇట్టిది. ఆత్మ ఇట్టివాడను వివేకముగలవాడుగను (రామానుజులు)

(13) తుల్యనిందాత్మసంస్తుతిః = నిందాస్తుతులు ఆత్మను జేరినవిగావు. దేహమును చేరినవేయని ఎరింగెడివాడుగను. మిగత మానావమానములు మొదలగువాటినిగూడ ఈ యర్థమున గ్రహింపదగినది. (రామానుజులు) ఆత్మస్తుతిని నిందతో సమానముగనే ఎంచెడివాడుగను (రాఘవేంద్రులు) (స్వ) అధ్యా-12-శ్లో-19-చూడుడు.

(14) తుల్యః - విష్ణుభక్తిని విడువనివాడుగను (రాఘవేంద్రులు)

(15) సర్వారంభపరిత్యాగీ - దేహవిషయమైన సకల కార్యములను విడచినవాడు (రామానుజులు) వైష్ణవకర్మదప్ప మిగత కర్మలను జేయనివాడు (రాఘవేంద్రులు) (స్వ) అధ్యా 12-శ్లో-19 చూడుడు. సర్వారంభ = కనబడునట్టియు కనబడనట్టియు విషయములకై కర్మలను చేసెడివాడుకాడు. అనగా ఆహారాదులకు కావలసిన దానికంటె ఇతరమైనవి.

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
న గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ 26

పద॥ మాం - చ - యః - అవ్యభిచారేణ - భక్తియోగేన - సేవతే ।
సః - గుణాన్ - సమతీత్య - ఏతాన్ - బ్రహ్మభూయాయ - కల్పతే ॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వడు | ఏతాన్ | ఈ |
| అవ్యభిచారేణ | చలింపకున్న | గుణాన్ | మూడుగుణములను |
| భక్తియోగేన | భక్తియోగముచేత | సమతీత్య | అతిక్రమించి |
| మాం చ | నన్నే | బ్రహ్మభూయాయ | బ్రహ్మమగుటకై |
| సేవతే | ఉపాసించునో | కల్పతే | యోగ్యుడగుచున్నాడు. |
| సః | అతడు | | |

తా॥ ఎవ్వడు పరమేశ్వరుడైన నన్నే చలింపకున్న భక్తియోగముచే ఉపాసించునో అతడీ మూడు గుణములను అతిక్రమించి బ్రహ్మమగుటకు యోగ్యుడగుచున్నాడు.

(శంకరులు) ఏ యతి లేక కర్మియైనవాడు సకల భూతములయొక్క హృదయవాసియైన ఈశ్వరుడు నారాయణుడునైన నన్ను ఒకప్పుడున్ను వేరు విషయములలో ప్రవృత్తిలేక భజించుట యనెడి యోగముచే, అనగా వివేకవిజ్ఞానమనెడి యోగముచే (ఐక్యానుసంధానముచే) ఉపాసించునో

అతడు భగవదనుగ్రహమునకు పాత్రుడై గుణములు అధికమై బ్రహ్మభావనమనెడి మోక్షమును పొందుటకు యోగ్యుడగుచున్నాడు.

(రామానుజులు) "నాన్యంగుణేభ్యః కర్తారం' (అధ్యా 14-శ్లో-19) అనుదానివలన చెప్ప బడిన ప్రకృతి ఆత్మ వీటివివేకానుసంధానముచే మాత్రము గుణముల నతిక్రమింపజాలడు. ఏలనగా ప్రకృతి వాసనయైనది బహుకాలముగ వెంబడించి వచ్చియున్నందున దానిని దాటుట మిక్కిలి అరుదు. కావున భక్తవాత్సల్యము కృప మొదలగు గుణములతోగూడిన నన్ను ఎవ్వడు ఆశ్రయించునో అతడు గుణముల నతిక్రమించి నావలెనగుటకు యోగ్యుడగుచున్నాడు.

(మధ్వులు) బ్రహ్మభూయాయకల్పతే = చిత్ప్రకృతివలె నగుటకు యోగ్యుడగుచున్నాడు. అనగా చిత్ప్రకృతి ఎట్లు విష్ణువునకు ప్రియురాలో ఆ విధముగ ఈ భక్తుడుగూడ ప్రియమైన వాడగుచున్నాడు. లేక చిత్ప్రకృతిని పొందుచున్నాడు.

---

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ ॥ 27

పద॥ బ్రహ్మణః - హి - ప్రతిష్ఠా - అహం - అమృతస్య - అవ్యయస్య - చ
శాశ్వతస్య - చ - ధర్మస్య - సుఖస్య - ఐకాంతికస్య - చ ॥

| | | | |
|---|---|---|---|
| హి | ఏలనగా | ధర్మస్య చ | ధర్మమునకున్ను |
| అహం | నేను | ఐకాంతికస్య | తప్పనిదైన |
| అవ్యయస్య | నాశములేనిదై | సుఖస్య చ | సుఖమునకున్ను |
| అమృతస్య చ | అవికారియై | బ్రహ్మణః | పరబ్రహ్మమునకున్ను |
| శాశ్వతస్య | శాశ్వతమైన | ప్రతిష్ఠా | ఉండుచోటు |

తా॥ (గుణముల నతిక్రమింప నన్నుపాసించవలెను.) ఏలనగా నేను పరమాత్మకు ప్రతిబింబము. నాశములేని మోక్షమునకున్ను, శాశ్వతమైన ధర్మమునకున్ను, అఖండమైన సుఖమునకున్ను ఆశ్రయుడను.

(శంకరులు) అవ్యయస్య = వికారములేనిదియు, అమృతస్య = నాశములేనిదియు, శాశ్వతస్య = నిత్యమైనదియు, ధర్మస్య = జ్ఞానయోగమనెడి ధర్మమువలన పొందదగినట్టియు, సుఖస్య= ఆనందస్వరూపమైనట్టియు, ఐకాంతికస్య = మారని స్వభావము గలిగిన, బ్రహ్మణః = పరబ్రహ్మము యొక్క, ప్రతిష్ఠా = స్వరూపము, అహం = నేనే. ఏ శక్తిచే భక్తానుగ్రహార్థమై బ్రహ్మము ప్రవర్తించియున్నదో, ఆ శక్తియే బ్రహ్మము. అట్టి బ్రహ్మమే నేను. శక్తిగలవానికిని శక్తికిని భేదము లేనందున ఇట్లు జెప్పబడినది.

(శ్రీధరులు) నన్నుపాసించెడివాడు బ్రహ్మముగ నెట్లు కాగలడనగా, దానికి హేతువు జెప్పబడుచున్నది. ప్రకాశములయొక్క సమూహము సూర్యమండలముగ నెట్లు కనబడుచున్నదో అట్లే నేను బ్రహ్మమునకు ప్రతిమగనున్నాను. అనగా బ్రహ్మమే నేననునది తాత్పర్యము. (సత్-చిత్-ఆనందములనెడి ప్రకాశసమూహములు జేరిన ఒకరూపముగ అవతరించియున్నాననని తాత్పర్యము.)

(రామానుజులు) అవ్యయస్య = వికారములేనట్టియు, అమృతస్య = నాశములేనట్టియు, బ్రహ్మణః = పరబ్రహ్మమునకు, అహం = నేను, ప్రతిష్ఠా = స్వరూపముగనున్నాను, శాశ్వతస్య ధర్మస్య = పూర్ణమైన ఐశ్వర్యమునకున్ను, ఐకాంతికస్య = "వాసుదేవస్సర్వమితి" అనుచోట జెప్పిన జ్ఞానివలన పొందదగిన, సుఖస్య = సుఖమునకున్ను, ప్రతిష్ఠా = ఆశ్రయముగనున్నాను. "దైవీ హ్యేషాగుణమయీ మమ మాయా దురత్యయా। మామేవయే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే॥" (అధ్యా-7-శ్లో-14) మొదలగువాటిచే గుణముల నతిక్రమించుటకును అక్షరైశ్వర్యమునకును భగవంతుని పొందుటకును ప్రపత్తియనెడి భగవంతుని శరణాగతియే ముఖ్యకారణమని జెప్పబడి యున్నది, అదియే బ్రహ్మమువలె నగుటకును ముఖ్యకారణమని గ్రహింపవలెను.

(రాఘవేంద్రులు) గుణాతీతుడు నన్ను పొందుచున్నాడనియే చెప్పవలెను. లక్ష్మినిపొందుటను ఏల చెప్పవలెను? అనగా లక్ష్మి యెల్లప్పుడు నా వద్దనుండునది. గావున ఆమెను పొందినచో నన్ను పొందినదిగనే యగుననునది దీనిచే జెప్పబడుచున్నది. అహం = నేను, బ్రహ్మణః = చిత్ప్రకృతియైన లక్ష్మికిని, అవ్యయస్య అమృతస్య = ముక్తులయొక్క సమూహములకున్ను, శాశ్వతస్య ధర్మస్య = అక్షయమైన ఫలముగలుగచేసెడి ధర్మమునకును, ఐకాంతికస్య సుఖస్య = మోక్షసుఖమునకును, ప్రతిష్ఠా = ఆధారముగ నున్నాను.



ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే గుణత్రయవిభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగ నున్న శ్రీ కృష్ణార్జున సంవాదమున గుణత్రయ విభాగయోగమనెడి పదునాల్గవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు

పంచదశాధ్యాయ ప్రారంభః

# పదునైదవ అధ్యాయము

## (పురుషోత్తమ ప్రాప్తియోగము)

శ్రీభగవానువాచ:—

శ్లో॥ ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్।
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥

పద॥ ఊర్ధ్వమూలం - అధశ్శాఖం - అశ్వత్థం - ప్రాహుః - అవ్యయమ్ ।
ఛందాంసి - యస్య - పర్ణాని - యః - తం - వేద - సః - వేదవిత్ ॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీకృష్ణపరమాత్మ చెప్పినది | ప్రాహుః | (వేదములు) చెప్పుచున్నవి |
| ఊర్ధ్వమూలం | మేలైన పురుషోత్తముడైన | ఛందాంసి | వేదములు |
| | నారాయణుని మూలముగ | యస్య | ఏ సంసారవృక్షమునకు |
| | గలిగినదియు - | పర్ణాని | ఆకులో |
| అధశ్శాఖం | క్రిందకొమ్మలు గలిగినదియు | తం | ఆ వృక్షమును |
| | నైన | యః | ఎవ్వడు |
| అశ్వత్థం | స్థిరముకాని సంసారమనెడి | వేద | ఎరుంగునో |
| | అశ్వత్థ వృక్షమును | సః | అతడు |
| అవ్యయం | నాశములేనిదిగ | వేదవిత్ | వేదార్థము నెరింగినవాడు. |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ అర్జునునిగూర్చి జెప్పినది:— గొప్ప పురుషోత్తముడైన నారాయణుని మూలము (వేరు)గను క్రిందివారలైన బ్రహ్మాదులను కొమ్మలుగను గలిగియున్న స్థిరముకాని సంసారవృక్షమును* (ప్రవాహరూపముచే) నాశములేనిదిగ వేదములు జెప్పుచున్నవి. వేదములు ఏ వృక్షమునకు ఆకులో అట్టి వృక్షము నెవ్వడెరుంగునో అతడు వేదార్థము నెరింగినవాడు.

* (స్వకీయము) ప్రవాహరూపముచే నాశములేనిది అనగా నదులలో ప్రవహించెడి ప్రవాహజలము చూచుటకెల్లప్పుడునున్నట్లు కనబడినను ఒకనిమిషమునకు మునుపు జూచిన జలము ఇప్పుడచ్చట లేకున్నను నదిలోజలము ఎల్లప్పుడునున్నట్లుగనే చెప్పబడుచున్నది. రాకపోక గలిగి యున్నను నిన్నటి దినము జూచినజలము ఈ దినములేదేగాని నీటిపరంపర ఎట్లు నాశము లేనిదో అట్లే నిన్నయుండిన సంసారము ఈ దినములేకపోయినను ఒకటిపోయి మఱియొకటి వచ్చుటవలన ఈ విధముగనే పరంపరగనుండుట వలన ప్రవాహరూపముగ నాశములేనిదని చెప్పబడినది.

(శ్రీధరులు) మాంచ యోఽవ్యభిచారేణ (అధ్యా 14 - శ్లో 27 - ) అను శ్లోకముచే ఏకాంత భక్తిలో ఈశ్వరుని భజించువాడు జ్ఞానమువలన బ్రహ్మభావమును పొందునట్లు జెప్పబడి

యున్నది. అట్టి భక్తి జ్ఞానములు సంసారమున వైరాగ్యము చెందనివానికి కలుగజాలవు. కావున నట్టి వైరాగ్యమును అర్జునుని కుపదేశించుటకై రెండున్నర శ్లోకములచే సంసారమును వృక్షరూపముగ వర్ణించి భగవంతుడు జెప్పుచున్నాడు. అశ్వత్థం = రేపటి కుండునట్టిదిగాదు. అనగా, అ = కాదు, శ్వః = రేపు (పై నిమిషమునకుగూడ యని చెప్పవచ్చును,) త్థం = ఉన్నట్టిది, "ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థస్సనాతనః" (కఠోపనిషత్తు అధ్యా॥ 2, వల్లి 6, వాక్యము 1) ఇది మొదలైన శ్రుతివాక్యములలో సంసారము అశ్వత్థవృక్షముగ వర్ణింపబడియున్నందున 'ప్రాహుః' అను పదమునకు వేదములు చెప్పుచున్నట్లు అర్థము చెప్పబడినది.

(శంకరులు) కర్మానుష్ఠానము గలవార్లకును జ్ఞానులకును వారి వారి కనుష్ఠానమువలన గలిగెడి ఫలము తన యధీనమైనదనియు, భక్తియోగమున తన్ను భజించెడివాడు తనయొక్క ప్రసాదముచే క్రమక్రమముగ బ్రహ్మజ్ఞానమును చెంది గుణాతీతుడై మోక్షమును పొందుచున్నాడనియు మునుపటి అధ్యాయమున భగవంతుడు చెప్పెను. అర్జునుడు అడుగక యున్నను తన నిజస్వరూపమును అర్జునునికి తెలియబరచ తలంచి సంసారమున విరక్తి చెందినవాడే బ్రహ్మజ్ఞానమునకు అధికారిగ నున్నాడు గావున సంసారమున విరక్తి గలుగచేయుటకై అట్టి సంసారస్వరూపమును వృక్షరూపముగ వర్ణించి వక్కాణించుచున్నాడు. ఊర్ధ్వమూలం = కాలముచే సూక్ష్మముగను లేక కాలమునకంటె సూక్ష్మముగను నిత్యముగను సకలమునకు కారణముగను అవ్యక్తమనెడి మాయను శక్తిగ బడసినదిగ నున్నట్టి బ్రహ్మము ఊర్ధ్వము. అట్టి బ్రహ్మమును మూలముగ గలిగిన సంసారవృక్షము, అధశ్శాఖం = మహత్తత్త్వము, అహంకారతత్త్వము, పంచభూతములు, శబ్దాది విషయములు వీటిని కొమ్మలుగ గలది. ఇట్టి సంసారమాయాస్వరూపము, అవ్యయం = నాశము లేనిది. ఎట్లనగా మాయ అనాదియైనందున అట్టి మాయామయమైన సంసారముగూడ ఆద్యంతములులేని అనుసరణము గలది, యస్య = ఏ సంసారవృక్షమునకు, ఛందాంసి పర్ణాని - వేదములు ఆకులు వలె నున్నవో, ఎట్లనగా వృక్షమును ఆకులు ఎట్లు ఎండ మొదలగువాటినుండి కాపాడుచున్నవో అట్లే వేదములు ధర్మాధర్మములను బయటబెట్టి సుఖమును పొందుటకును దుఃఖమును నివర్తించుటకును మార్గదర్శిగ నున్నందున ఆకులుగ జెప్పబడినవి. ఇటువంటి సమూలమైన సంసారవృక్షమెవ్వడెరుంగునో అతడు వేదార్థమును పూర్ణముగ నెరింగినవాడు. అనగా బ్రహ్మమనెడి మూలమును, దానికంటె అన్యమగు ప్రపంచమును ఎరింగిన సర్వజ్ఞుడగును. మిగత వృక్షములను గుర్తింపక అశ్వత్థవృక్షమును జెప్పినదేలయనిన, అశ్వత్థం అనిన పై నిమిషమునం దుండునట్టిది కాదను నర్థము నిచ్చునట్టిది కావునను సంసారముగూడ అట్టి స్వభావముగలది కావునను అశ్వత్థమని వర్ణించి చెప్పబడినది. సంసారమునకును అశ్వత్థవృక్షమునకును అనేకసామ్యములుగలవని క్రింద కనబరచిన శ్రుతివాక్యములచేతను, పురాణశ్లోకములచేతను స్పష్టమగుచున్నది. శ్రుతివాక్యము పూర్వము శ్రీధరులు గుర్తించినదే. పురాణవచన మెట్టిదనిన —

"అవ్యక్తమూలప్రభవస్తస్యైవాను గ్రహోచ్ఛ్రితః।
బుద్ధిస్కంధమయశ్చైవ ఇంద్రియాంతరకోటరః॥
మహాభూత విశాఖశ్చ విషయైః పత్రశాఖవాన్।
ధర్మాధర్మ సుపుష్పశ్చ సుఖదుఃఖ ఫలోదయః॥

ఆజీవ్యస్సర్వభూతానాం బ్రహ్మ వృక్షస్సనాతనః।
ఏతద్బ్రహ్మ వనంచైవ బ్రహ్మావృక్షస్య తస్య తత్॥

(బ్రహ్మాచరతి నిత్యశః అని కలకత్తా పాఠము)

ఏతచ్ఛిత్త్వా స భిత్త్వా చ జ్ఞానేన పరమాసినా।
తతశ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నావర్తతే పునః॥

బహ్మమనెడి వేరునుండి గలిగినట్టియు, దాని యోగ్యతచే పెరిగినట్టియు, బుద్ధి యనెడి కొమ్మలు కలిగెడి చోటైన స్కంధము గలిగినట్టియు, ఇంద్రియములనెడి బొఱియ గలిగినట్టియు, మహాభూతములను మొద్దుగ గలిగినట్టియు, శబ్దాది విషయములను కొమ్మలుగను ఆకులుగను గలిగినట్టియు, ధర్మాధర్మములను పుష్పములుగ గలిగినట్టియు, సుఖదుఃఖములను పండ్లుగ గలిగినట్టియు, సకల భూతములున్ను జీవించియుండుట కాధారముగను బ్రహ్మమునకు వాసస్థానముగ నున్నట్టియు, అనాదిగ నున్నట్టి ఈ సంసారవృక్షముయొక్క సమూహమును జ్ఞానమనెడి కత్తిచే నఱికి చీల్చి దేనివలన తిరిగి (సంసారమునకు) రాడో అట్టి యానందమును పొందుచున్నాడు.

(రామానుజులు) క్షేత్రక్షేత్రజ్ఞులనుగూర్చి చెప్పిన ఇందలి 13 వ అధ్యాయమున ప్రకృతి పురుషుల స్వరూపమును విచారించి పరిశుద్ధుడును పరిపూర్ణజ్ఞానాకారుడునునైన జీవునికి ప్రకృతి సంబంధము గల గుణత్రయములయొక్క పరంపరా సంబంధమువలన గలిగిన దేవమనుష్యాది శరీర రూపముగ నున్న ప్రకృతి సంబంధము అనాది అని చెప్పబడినది. 14 వ అధ్యాయమున ఆ జీవునికి కార్యకారణరూపముగ గలిగిన గుణ సంబంధ మూలముగ భగవంతునిచే చేయబడినదనియు, ప్రకృతి సంబంధము అట్టి గుణసంబంధము ఇట్టిదని వివరించి చెప్పి అట్టి గుణ నివృత్తివలన ఆత్మ నిజస్వరూపమును పొందుటకు భగవద్భక్తి ముఖ్యమైనదనియు చెప్పబడినది.

ఈ యధ్యాయమునందనగా క్షరుడనెడి బంధమొందిన జీవుడు (సంసారి) అక్షరుడనెడి ముక్తజీవుడు వీరలు భగవంతుని విభూతిరూపములనియు, ఈ ఇరువురికంటె విలక్షణుడుగ నున్న భగవంతుడు నిర్దోషిగను పరిపూర్ణ కల్యాణగుణములతో గూడినవాడుగను సర్వోత్తముడుగ నున్నాడనియు చెప్పబడుచున్నది.

ఈ శ్లోకముచే అసంగమనెడి కత్తిచే నఱుకబడిన, బంధమును పోగొట్టుకొన్న అక్షరుడనెడి విభూతిని జెప్పుటకై ఛేదించుకొనవలసియున్నట్టియు ప్రకృతి సంబంధరూపముగను, బంధరూపముగను క్షరునికి సంబంధపడినట్టి సంసారమును అశ్వత్థవృక్షరూపముగ వర్ణించుచున్నాడు.

పై 7 లోకములలో శ్రేష్ఠమైన సత్యలోకమునందున్న చతుర్ముఖబ్రహ్మచే ఈ ప్రపంచము సృష్టింపబడినందున ఈ ప్రపంచమునకు చతుర్ముఖబ్రహ్మ, ఊర్ధ్వం = పైగా నున్న, మూలం = కారణముగ నున్నాడు. ఆ ఏడు లోకములకు క్రింద నున్న భూలోకమందలి మనుష్యుడు పశువు పక్షి పురుగుస్థావరము మొదలగునవన్నియు, అధశ్శాఖం=క్రిందుగానున్న కొమ్మలు, జ్ఞానోదయము గలుగు వఱకు సంసారము ననుసరించి యున్నందున ప్రవాహరూపముచే, అవ్యయం = నాశము లేనిది, ఛందాంసి = "వాయవ్యం శ్వేతమాలభేత భూతి కామః" "ఇంద్రాగ్న మేకాదశకపాలం నిర్వపేత్ప్రజా కామః" మొదలగు వేదములు, యస్యపర్ణాని=ఏ వృక్షమునకు ఆకులో, అనగా ఆకులు వృక్షముల నెట్లు వృద్ధిపరచుచున్నవో అట్లే కామ్యకర్మలను జెప్పెడి వేదములు సంసారమనెడి వృక్షమును వృద్ధిపరచుచున్నవి. కావున అట్టి వేదములు ఆకులుగ వర్ణింపబడినవి. ఇట్టి వృక్షము నెఱింగినవాడెవ్వడో ఆతడు వేదము నెఱింగినవాడు. అనగా ఈ వృక్షమును మొదట నెఱింగి ఆ పిదప వృక్ష

వెదుకవలెను. సంసారమనెడి వృక్షము తెలిసినచో దానిని నివర్తించెడి ఆయుధమునుజెప్పు వేదము నెఱింగినవాడగునని తాత్పర్యము.

(మధ్వులు) సంసారస్వరూపమున్ను దాని నివర్తించుటకు గల సాధనములున్ను వాటి జ్ఞానమున్ను ఈ యధ్యాయమున జెప్పబడుచున్నవి. ఊర్ధ్వమూలం = సర్వోత్తముడైన విష్ణువును మూలముగ గలది. అధశ్శాఖం = విష్ణువునకు క్రిందివైన సకల ప్రపంచములను కొమ్మలుగగలది. అశ్వత్థం = ఒకటేవిధముగ రేపున్నట్టిది కానిది. అవ్యయం = ప్రవాహరూపముగ నాశములేనిది. అనగా మునుపటి బ్రహ్మకల్పము నందుండిన ప్రపంచమే తరువాత కల్పమునందుగూడ కలుగుచు ప్రతిసృష్టి యందును ఉన్నందున నాశములేనిదిగ జెప్పబడినది. ఛందాంసి యస్యపర్ణాని = వేదములు ఆకులు, అనగా ఆకులు కలిగిన పిదపనే కాయ మొదలగు ఫలములు గలుగుచున్నవి. ఆ విధముగనే వేదములవలన సుకృతదుష్కృత ఫలములు (పుణ్యాపాపములు) కలుగుచున్నవని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) ఊర్ధ్వం = ఉత్తమమైన వారలున్ను మేలైనవారలునగు విష్ణువును చిదచిత్ప్రకృతులును, మూలం = మూలకారణముగ గలది. వీరలకు క్రిందివైన పంచమహాభూతములు మహత్తత్త్వము, అహంకారతత్త్వము, బుద్ధి, వీటినిన్ని వీటికభిమాని దేవతలనున్ను కొమ్ములుగ గలది. ఒకటేరూపముగ నున్నట్టిదిగాదు. లేక చంచలముగ నున్నందున అశ్వత్థమని పేరు బడసినది. ప్రవాహరూపముగ నిత్యమైనందునను పూర్వకల్పము నందున్నట్లు ఈ కల్పమునందు గూడ నున్నందునను అవ్యయం = నాశములేనిది, చందాంసియస్య పర్ణాని = వేదములను వేదాభిమాని దేవతలను ఆకులుగ గలది. ఇట్టి సంసారవృక్షమునకు భూమి యెట్లు మూలమగునో అట్లే జగద్వృక్షమునకు విష్ణువు ప్రత్యేకమైన మూలము. సత్త్వాది గుణత్రయమైన అచిత్ప్రకృతికి భూమి వలె పరిణామమూలము, చిత్ప్రకృతి అచిత్ప్రకృతికి అధిష్ఠాత (అనగా నియామకత్వముగలది.) అని యెఱుంగవలెను.

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః।
అధశ్చ మూలాన్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే॥

పద॥ అధః - చ - ఊర్ధ్వం - ప్రసృతాః - తస్య - శాఖాః।
గుణప్రవృద్ధాః - విషయప్రవాళాః॥
అధః - చ - మూలాని - అనుసంతతాని।
కర్మానుబంధీని - మనుష్యలోకే॥

| | | | |
|---|---|---|---|
| తస్యశాఖాః | ఆ సంసారవృక్షముయొక్క కొమ్మలు | విషయప్రవాళాః | శబ్దాది విషయములను ఇగుళ్ళుగ గలవి |
| అధశ్చ | క్రిందిలోకములలోను | మనుష్యలోకే | మనుష్యలోకమున |
| ఊర్ధ్వం చ | పైలోకములలోను | కర్మానుబంధీని | కర్మను గలుగజేయునవి (లేక) కలుగజేయునవై |
| ప్రసృతాః | వ్యాపించియున్నవి | | |
| గుణప్రవృద్ధాః | సత్త్వాదిగుణములచే బాగుగ పెరిగియున్నవి. | అనుసంతతాని | వరుసగ వ్యాపించియున్నవి. |

తా॥ సత్త్వాది గుణములచే వృద్ధిపొందియు, శబ్దాది విషయములను ఇగుళ్లుగ గలదియునైన ఆ సంసార వృక్షముయొక్క కొమ్మలు క్రిందిలోకములోను పై లోకములలోను వ్యాపించియున్నవి. క్రింది పై లోకములలో ననుభవించి మిగిలియున్న కర్మవిశేషమున్ను, భూలోకమున తమ యిష్టానుసారముగ కర్మలను నడిపించినట్టివియునైన వేళ్లు, పైకి క్రిందికి వ్యాపించియున్నవి.

(శంకరభాష్యము) జ్ఞాన కర్మ ఫలములే వ్యాపించియున్న కొమ్మలు ఆ ఫలములలో జేరినదే దేహము. ఆ దేహముకూడ కొమ్మలలో జేరినదే. ఆ దేహముచే వృద్ధియగు విషయములే ఇగుళ్ళు. (మిగతవి శ్రీధరుని యర్థమే.)

(శ్రీధరులు) చతుర్ముఖ బ్రహ్మయు అతనికంటె తక్కువైన సకల జీవకోట్లున్ను సంసార వృక్షమునకు కొమ్మలుగ జెప్పబడినవి. ఆ జీవకోట్లలో పాపముజేసినవారలు క్రింది (భూ) లోకమున పశుపక్ష్యాది జన్మలుపొంది వ్యాపించియున్నారు. పుణ్యము జేసినవారలు పైలోకమున దేవత మొదలగు జన్మలనుపొంది వ్యాపించియున్నారు. ఇట్లు క్రిందుగను పైగను వ్యాపించియున్నవారలే ఈ సంసారవృక్షమునకు పైగను క్రిందుగనున్న కొమ్మలు. ఈ కొమ్మలు సత్త్వాది గుణముల వలన వృద్ధిపొందియున్నవి. చెట్టుయొక్క కొమ్మలు నీరుచే వృద్ధిపొందుటవలె ఈ జీవులనెడి సంసారవృక్షముయొక్క కొమ్మలు గుణములవలన వృద్ధిపొందియున్నవి. అట్టి కొమ్మలకు విషయములనెడి శబ్దాదులు ఇగుళ్ళు. ఆ వృక్షముయొక్క వేళ్ళు శబ్దముచే క్రింది పైలోకములలో వ్యాపించియున్నవి. వాట్లలో ముఖ్యమైన తల్లివేరు ఈశ్వరుడు. మిగత ప్రక్కవేళ్ళనగా జీవకోటులు. క్రింది పైలోకములలో ననుభవింపగా మిగిలినది కర్మవాసనయే. అట్టి కర్మవాసన తనయొక్క పట్టుతో భూలోకమున జననమును గలుగజేసి తన స్వభావమునకు తగినట్లు కర్మలను కలుగజేయుచున్నవి. కర్మానుష్ఠానము భూలోకమునదప్ప మిగత యెచ్చోటను గలుగదు. కావున ఈ భూలోకమున కర్మలను జేయించునదిగ జెప్పబడినది.

(రామానుజులు) మనుష్య పశుపక్ష్యాదులను కొమ్మలుగ గలిగినదగు సంసారవృక్షమునకు మఱికొన్ని కొమ్మలుగలవు. అట్టి కొమ్మలేవనగా మనుష్యులవలన జేయబడిన కర్మలచే మాటిమాటికి గలుగునట్టియు, క్రింద వ్యాపించియున్నట్టియు మనుష్య పశుపక్ష్యాది రూపములే. పైన వ్యాపించియున్న కొమ్మలేవనగా దేవగంధర్వ యక్షకిన్నరాది రూపములే. ఇట్టి కొమ్మలే గుణముల వలన వృద్ధిపొందిన విషయములను ఇగుళ్ళుగగలవి. బ్రహ్మను మూలముగను మనుష్యపశ్వాదులను కొమ్మలుగ గలిగిన సంసార వృక్షముయొక్క వేళ్లు క్రింది పైలోకములలో వ్యాపించియున్నవి. పురుషునికి బంధమును గలుగజేసెడి కర్మలే మూలమనెడివేర్లు. మనుష్యలోకమున వ్యాపించియున్న వేళ్ళు ఏవనగా మునుపు మనుష్యుడుగ నుండగా జేసినకర్మలవలన వెనుకయు తనకు గలుగు మనుష్యాది రూపములే. పైలోకమును వ్యాపించియున్న వేళ్ళు ఏవనగా మునుపు మనుష్యుడుగనుండగా జేసినకర్మలవలన తనకు గలిగిన దేవగంధర్వాది రూపములే.

(మధ్వులు) కొమ్మలగు పంచమహాభూతములు, ఊర్ధ్వంచ = మునుపటి కారణప్రకృతులతో సూక్ష్మముగను, అతః = వెనుకటి దేహాదికార్యప్రకృతిలో స్థూలముగను వ్యాపించియున్నవి. భూతములేగుణములవలన అభివృద్ధిచెందియున్నవి. చూచిన మాత్రమున సుఖముగ కనబడునందున విషయములు ఇగుళ్ళుగ జెప్పబడినవి. పైదైన మూలమనెడి వేరు విష్ణురూపములు. కర్మానుబంధీని = జీవుడుచేసెడి కర్మలననుసరించి ఫలమిచ్చునవి.

(రాఘవేంద్రులు) ఈ జగద్వృక్షమునకు కొమ్మలయొక్క స్థానమున చిదచిద్రూపములైన మహదాది యెనిమిది పదార్థములు సత్త్వాదిగుణములవలన నభివృద్ధిచెందియు సూక్ష్మరూపముచే అవ్యక్తమునందును స్థూలరూపముచే దేహాదులలోను వ్యాపించియున్నవి. తాత్కాలిక సుఖహేతువున సామ్యమున్నందున శబ్దాదివిషయములు ఇగుళ్ళని చెప్పబడియున్నవి. విష్ణురూపములున్ను చిదచిత్ప్రకృతులున్ను సత్త్వాదిగుణములున్ను జగద్వృక్షమునకు క్రింది భాగమైన మనుష్యలోకమున కర్మానుసారముగ ఫలమిచ్చునవిగ మహదహంకారాది సకల పదార్థములలోను వ్యాపించియున్నవి.

శ్లో॥ న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా।
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా॥

శ్లో॥ తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తన్తి భూయః।
తమేవచాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥

పద॥ న - రూపం - అస్య - ఇహ - తథా - ఉపలభ్యతే
న - అన్తః - న - చ - ఆదిః - న - చ - సంప్రతిష్ఠా।
అశ్వత్థం - ఏనం - సువిరూఢమూలం (1)
అసంగశస్త్రేణ (2) - దృఢేన (3) - ఛిత్త్వా (4)॥

,, తతః - పదం (5) - తత్ - పరిమార్గితవ్యం
యస్మిన్ - గతాః - న - నివర్తన్తి - భూయః।
తం - ఏవ - చ - ఆద్యం - పురుషం - ప్రపద్యే
యతః - ప్రవృత్తిః - ప్రసృతా - పురాణీ॥

| | | | |
|---|---|---|---|
| అస్య | ఈ సంసారవృక్షముయొక్క | ఛిత్త్వా | చీల్చి |
| తథా | పై చెప్పినవిధముగనున్న | తతః | తరువాత |
| రూపం | రూపము | యస్మిన్గతాః | ఏ స్థానమును పొందినవారలు |
| ఇహ | ఇచ్చట | భూయః | మరలను |
| నోపలభ్యతే | కనబడలేదు | ననివర్తన్తి | తిరిగి (సంసారమునకు) వచ్చుటలేదో |
| అంతః న | ముగింపును కనబడుటలేదు | | |
| ఆదిః చ న | ఆదియు కనబడుటలేదు | తత్ పదం | ఆ స్థానము |
| సంప్రతిష్ఠా చ న | స్థితియు కనబడుటలేదు | పరిమార్గితవ్యం | వెతుకతగినది, లేక వెతుకవలెను |
| సువిరూఢమూలం | బాగుగ వేరునాటుకొన్న | పురాణీ | (సంసారవృక్షము) చాలకాల ముగ |
| ఏనం అశ్వత్థం | ఈ అశ్వత్థవృక్షమును | | |
| దృఢేన అసంగశస్త్రేణ | దృఢమైన అనాసక్తియనెడి గొడలిచే | ప్రవృత్తిః | మొదలుపెట్టి వచ్చుట |
| | | యతః | ఎవనివద్దనుండి |

ప్రపద్యే (ఇతి) శరణాగతి పొందుచున్నానని
తం ఆద్యం పురుషం అట్టి మొదటివాడైన పురుషునే (పరిమార్గితవ్యం) (వెతుకవలెను.)

తా॥ సంసారమందలి జనులచే ఈ సంసారవృక్షముయొక్క పైజెప్పిన విధముగనున్న స్వరూపము ఎరుంగబడుటలేదు. (దాని) ఆదిమధ్యావసానములు ఎరుంగబడుటలేదు. గట్టివైనవేళ్లుగల ఈ యశ్వత్థవృక్షమును దృఢమైన ఆసక్తిలేమి యనెడి ఆయుధముచే నఱికి దానివెనుక ఏ స్థానమును చెందినవారలు మఱలను సంసారమునకు వచ్చుటలేదో అట్టి స్థానమును వెతుకవలెను. ఏ పురుషునినుండి చాలకాలముగ వెంబడించివచ్చియున్న సంసారప్రవృత్తియైనది వ్యాపించియున్నదో అట్టి పురుషునే శరణమొందుచున్నానని వెతుకవలెను.

(1) సువిరూఢమూలం - విష్ణువు మొదలగువార్లను మూలముగగల (రాఘవేంద్రులు)

(2) అసంగశస్త్రేణ - పుత్రమిత్రద్రవ్యాదులలోని అభిమానమును విడచుట వైరాగ్యము. ఇట్టి వైరాగ్యమనెడి ఆయుధముచే (శంకరులు) మమకార అహంకారములను విడచుట యనెడి ఆయుధముచే (శ్రీధరులు) సంగమును విడచిపెట్టుటతోగూడిన జ్ఞానమనెడి ఆయుధముచే (మధ్వులు)

(3) దృఢేన - పరమాత్మనే గట్టిగనమ్మి అట్టి దృఢత్వముతో వివేకాభ్యాసమనెడి సానరాతిలో సానబెట్టబడియున్న (శంకరులు)

(4) ఛిత్త్వా - సంసారవృక్షమును విత్తనముతో నాశముజేసి (శంకరులు) సంసారమును నశింపజేసి (మధ్వులు)

(5) తతఃపరం - అనిపాతము. పరాపరతత్త్వ విషయ విచారణమైనతరువాత, అనియర్థము. (మధ్వులు - రాఘవేంద్రులు)

(రామానుజులు) చతుర్ముఖ బ్రహ్మను ఆదిగగలదైనందున వానిని పైవేరుగను, చతుర్ముఖబ్రహ్మయొక్క పుత్రపౌత్రపరంపరనుగల మనుష్యాదులను క్రిందుగనున్న కొమ్మలుగను, మనుష్యజన్మలో జేసినకర్మలనెడి మూలములవలనగలిగిన దేవపశ్వాదిదేహములను క్రిందుగను పైగను వ్యాపించిన కొమ్మలుగను గలిగి యున్నట్టిదైన ఈ సంసారవృక్షముయొక్క స్వరూపము పైగా నేవిధముగ జెప్పబడెనో అదేవిధముగ ఈ భూలోకమందున్న సంసారులవలన నెఱుంగబడుటలేదు. అనగా నేనతని పుత్రుడను ఇతనికి అతడు తండ్రి, ఇదినాయొక్కది, అది వానిది అనిమాత్రము (సంసారులు) ఎరుంగుదురేకాని సంసారవృక్షముయొక్క స్వరూపమును తెలిసికొనుట లేదని తాత్పర్యము. సంసారవృక్షముయొక్క ముగింపునుగూడ నెఱుంగుటలేదనగా త్రిగుణాత్మకమైన విషయభోగములలో నాసక్తిని విడుచుటచే ముగింపు నెరుంగవచ్చునని తెలియుటలేదు. సంసారవృక్షమునకు ఆదియనునది గుణసంబంధముచేతనే యనియు నెరుంగుటలేదు. ఆ విధముగనే దానిస్థితి దేహమేయాత్మయనెడి అజ్ఞానమువలననియు నెరుంగుటలేదు. ఇట్టి వేరు పాతుకొనియున్న అశ్వత్థవృక్షమనెడి సంసారమును వివేకజ్ఞానమువలన గలిగినట్టియు దృఢమైనవియునైన విషయాభిమానము లేకుండుటయను ఆయుధముచేనఱికి విషయాసక్తిని విడచిన పిదప ఏస్థానమును జెందినవారలు తిరిగివచ్చుటలేదో అట్టిస్థానమును వెతుకవలెను.

అనాదిగ ననుసరించి వచ్చిన త్రిగుణమయములైన వస్తువులలో భోగశక్తియు దానివలన గలిగిన విపరీతజ్ఞానమున్ను ఎట్లు నివృత్తికాగలదనునది (నాలుగవ శ్లోకముయొక్క ఉత్తరార్థమున) జెప్పబడియున్నది.

పురాణీ = జీవుని చాలకాలముగ వెంబడించి వచ్చిన, ప్రవృత్తిః = గుణమయమైన భోగ ప్రవృత్తియనునది, యతః = ఎవ్వనివద్దనుండి, ప్రసృతా = కలిగియున్నదో, తమేవచాద్యం పురుషం = అట్టి ఆది పరమ పురుషునే అజ్ఞాననివృత్తి కొఱకు ప్రపద్యే = శరణమొందవలెను. "ప్రపద్యేయతః" అని కొన్నిపాఠములుగలవు. దాని యర్థమేమనగా, ఆద్యం = ఆదియైన, తం పురుషం = ఆపురుషునే, ప్రపద్య = శరణమొంది ఇయతః = అజ్ఞానము నివృత్తి మొదలగువాటి కన్నిటికిని (కారణమైన) పురాణీప్రవృత్తిః = ప్రాచీనులయొక్క సాధనానుష్ఠానమైనది, ప్రసృతా= ప్రవర్తించియున్నది.

(మధ్వులు) అస్య = ఈ సంసారవృక్షమునకు, ఆదిః = ఎవ్వడుత్పత్తి కారణుడో, సంప్రతిష్ఠా = ఎవ్వడు స్థితికారణుడగునో, అంతః = ఎవ్వడు నాశకారణుడగునో సంసారవృక్షమున అనుప్రవేశించియున్న ఆ విష్ణువుయొక్కరూపం = రూపము, నోపలభ్యతే = ఎఱుంగబడుటలేదు.



శ్లో॥ నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వన్ద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞైః
గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్॥

పద॥ నిర్మానమోహాః - జితసంగదోషాః
అధ్యాత్మనిత్యాః - వినివృత్తకామాః।
ద్వన్ద్వైః - విముక్తాః - సుఖదుఃఖ సంజ్ఞైః
గచ్ఛన్తి - అమూఢాః - పదం - అవ్యయం - తత్॥

| | | | |
|---|---|---|---|
| నిర్మాన మోహాః | అహంకారము మోహము వీటిని నివర్తించినవారలై | ద్వన్ద్వైః | ద్వన్ద్వములచే |
| జితసంగ దోషాః | ఆసక్తియనుదోషమును జయించిన వారలై | విముక్తాః | విడువబడినవారలైయున్న |
| అధ్యాత్మ నిత్యాః | ఆత్మయెడ నెల్లప్పుడునున్నట్టి వారలై | అమూఢాః | మోహములేని జ్ఞానులు |
| వినివృత్తకామాః | బాగుగ కామముతొలగినవారలై | తత్ | (మునుపుచెప్పిన) అట్టి |
| సుఖదుఃఖసంజ్ఞైః | సుఖదుఃఖములను పేరుగల | అవ్యయం | నాశములేని |
| | | పదం | స్థానమును |
| | | గచ్ఛన్తి | |

తా॥ అహంకారము, దురభిమానము ఇవి లేనట్టియు పుత్రమిత్రాభిమాన దోషములేనట్టియు బ్రహ్మజ్ఞాననిష్ఠ గలిగినట్టియు ఆశనుండి నివృత్తిచెంది నట్టియు సుఖదుఃఖములనెడి పేరుగల ద్వన్ద్వములనుండి విడువబడినట్టియు అవిద్యను నివర్తించుకొన్నట్టియు (మోహములేని) జ్ఞానులు మునుపుజెప్పిన నాశములేని స్థానమును పొందుచున్నారు.

(రామానుజులు) ఈ విధముగ నన్ను శరణమొంది అనాత్మయైన దేహాదులలో ఆత్మాభి మానమనెడి మోహమును విడచినవార్లుగను గుణమయములగు వస్తువులలో భోగాసక్తియనెడి దోష

మును జయించినవార్లుగను ఆత్మజ్ఞానపరులుగను ఆత్మదప్ప ఇతరవస్తువులలోని అసక్తిని విడచిన వార్లుగను ఆత్మానాత్మ వివేక స్వరూపజ్ఞానమునుబడసిన వారలుగనునున్న వారలు పూర్ణమైన జ్ఞానాకారముగనున్న స్వరూపమును చెందుచున్నారు.

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ 6

పద॥ న - తత్ - భాసయతే - సూర్యః - న - శశాంకః - న - పావకః ।
యత్ - గత్వా - న - నివర్తన్తే - తత్ (1) - ధామ (2) - పరమం (3) - మమ (3) ॥

| | | | |
|---|---|---|---|
| తత్ | మునుపుజెప్పిన అస్థానమును | యత్ | ఏ స్థానమును |
| సూర్యః | సూర్యుడు | గత్వా | పొంది |
| నభాసయతే | ప్రకాశింపజేయుటలేదు. | న నివర్తంతే | మఱల తిరిగివచ్చుటలేదో |
| శశాంకః | చంద్రుడు | తత్ | అ స్థానము |
| న | ప్రకాశింపజేయుటలేదు. | మమ | నాయొక్క |
| పావకః | అగ్ని | పరమం | ఉత్తమమైన |
| న | ప్రకాశింపజేయుటలేదు | ధామ | పదము (స్వరూపము) |

తా॥ మునుపుజెప్పిన అస్థానమును సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వీరలు ప్రకాశింపజేయుటలేదు. ఏ స్థానమునుపొంది మఱల తిరిగివచ్చుట లేదో ఆ స్థానము నాయొక్క ఉత్తమమైన పదము. (స్వరూపము.)

(1-2-3-4) తేజోరూపమైనదియు ఉత్తమమైనదియునైన విష్ణువగు నా యొక్క స్థానము (శంకరులు) (స్వ) ఇందలి యధ్యా-8శ్లో-21 చూడుడు.

(స్వకీయము) ఈ శ్లోకమువంటిదైన కఠోపనిషత్తు 2 వ అధ్యా-5 వ వల్లీ-15 వదియు, ముండకోపనిషత్తు 2 వ అధ్యా - 2 వ ఖండము 11 వదియునగు వాక్యము క్రింద కనబరచబడు చున్నది.

"న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాన్తికుతోయమగ్నిః
తమేవభాన్త మనుభాన్తి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి ॥"

బ్రహ్మమును సూర్యుడు ప్రకాశపెట్టజాలడు. చంద్రనక్షత్రములు ప్రకాశింపజేయనేరవు. మెరుపులున్ను ప్రకాశింపజేయవు. ఈ అగ్ని ఎట్లు ప్రకాశింపజేయగలదు. తానుగా ప్రకాశించుచున్న అతనిని (బ్రహ్మమును) బట్టి సకలము ప్రకాశించుచున్నది, ఇవన్నియు వాని కాంతిచే ప్రకాశించు చున్నవి.

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః ।
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥

పద॥ మమ - ఏవ - అంశః - జీవలోకే - జీవభూతః - సనాతనః ।
మనష్షష్ఠాని - ఇంద్రియాణి - ప్రకృతిస్థాని - కర్షతి ॥

| | | | |
|---|---|---|---|
| మమైవ అంశః | నాయొక్కదేయైన అంశము | ప్రకృతిస్థాని | ప్రకృతిలో నిలబడియున్న (తమ తమ స్థానములోనున్న) |
| జీవలోకే | జీవులయొక్క లోకమున | | |
| జీవభూతః | జీవుడై | ఇంద్రియాణి | ఇంద్రియములను |
| సనాతనః | ఎల్లప్పుడునున్నట్టిది. | కర్షతి | (ఆ జీవుడు) ఈడ్చుచున్నాడు. |
| మనష్షష్ఠాని | మనస్సును ఆరవదిగ గలవై | | |

**తా॥ నాయొక్క అంశమునకు అనాదిగనున్న జీవుడు, మాయలో నిమిడి యున్నవియు మనస్సును ఆరవదిగ గలిగినవియునైన ఇంద్రియములను సంసారమున భోగార్థమై ఈడ్చుచున్నాడు.**

(శంకరులు) పరమాత్మయగు నా యొక్క అంశమైన జీవుడు, నా యొక్కదైన ఒక భాగ ముగనున్నాడు. నాకంటె అతడన్యుడుకాడు. ఐతే అతడు అవిద్యయను నుపాధిచే సంసారమున తాను కర్త, తాను భోక్తయని చాలకాలముగ ప్రసిద్ధిచెందియున్నాడు. అట్టి జీవుడు అఖండాకారము గను ఒకటేవస్తువుగనున్న నాయొక్క అంశముగను అన్యుడుగాకను ఎట్లుండదగుననగా, దానికి కారణము ఒక్కడేఅయిన సూర్యుడు నీటిలో కనబడుచున్నాడు. అట్లు జలమున కనబడు సూర్యుడు ఆకాశమార్గమున గనబడు సూర్యుని ప్రతిబింబమేకాని అన్యుడుకాడు. ఐతే జలమనెడి యుపాధిచే భిన్నమైనదివలె కనబడుచున్నది. అట్టి యుపాధియైన నీరులేనియెడల సూర్యప్రతిబింబము కాన రాదు. ఏ జలమున కనబడినదో ఆ జలమును నివర్తించి చూచిన ఒకడే సూర్యుడుగాని ఆకాశమునం దొకటి జలమునందొక్కటి యని రెండుకావు. ఆ విధముగనే ఒక పాత్రమందలి యాకాశమున్ను, సర్వవ్యాపకమైన మహాకాశమున్ను ఒక్కటైనను పాత్రమనెడి యుపాధిచే ఘటాకాశము మహాకాశ మునకంటె వేరైనదని తోచుచున్నది. ఘటము పగిలినచో మహాకాశమునకంటె అన్యమైన ఘటాకాశమనునదేలేదు. దీనివలె బ్రహ్మముయొక్క అంశమై, బ్రహ్మమునకంటె అన్యముకానిదైన జీవుడు, మాయాకార్యమైన అవిద్యయను నుపాధిచే దేహాదులలో వేరుగ గనబడినను ఉపాధినివృత్తి పొందినచో ఆ జీవుడు దేనియొక్క అంశమో అట్టి యంశమైన బ్రహ్మమేను. అంశము అంశిని పొందినచో తిరిగివచ్చుటయనునదిలేదు. జీవుడు ఈశ్వరుని కంటె అన్యుడు. అతడు కర్త - భోక్త - జనన మరణ ములనొందువాడు అను నిట్టి దృశ్యములన్నియు అవిద్యాస్వరూపమైన అజ్ఞానమువలన గలిగినవే. అవిద్యనివర్తించినచో నిలకడచెందియున్నట్టిది బ్రహ్మస్వరూపమొక్కటే, రెండవదిలేదు.

(శ్రీధరులు) ప్రకృతిబంధమును నివర్తించుకొనినవారలు కర్మశేషములతో ప్రళయ కాలము నందును (సుషుప్తి) నిద్రకాలమునందును ప్రకృతితోగూడిన ఈశ్వరునియెడ (సగుణబ్రహ్మ మునెడ) ఇమిడియుండి పిదప సృష్టికాలమున తిరుగుచున్నారేగాని కర్మబంధమును నశింపజేసికొని శుద్ధబ్రహ్మమును జెందినవారలు మరల జననమును పొందుటలేదు.

(రామానుజులు) అనాదిగను నాయొక్క అంశముగనునున్న ఒక జీవుడు అనాదికర్మ రూపమైన అవిద్యచే చుట్టుకొనబడి జ్ఞానైశ్వర్యములు తగ్గి జీవుడను నామముబడసి జీవులు నివ సించు లోకములలో నున్నవాడై పూర్వకర్మానుసారముగ ప్రకృతివలనగలిగిన దేవమనుష్యాది దేహములలోనున్న మనస్సుతోగూడిన ఆరు ఇంద్రియములను విషయముల ననుభవించుటకై ఈడ్చుకొనుచున్నాడు. మఱియొక జీవుడు పైజెప్పిన అవిద్యను నివర్తించుకొని స్వరూపముతో నున్నారు. (అనగా ప్రకృతి విముక్తాత్మ స్వరూపమును పొందుచున్నాడు.)

(రాఘవేంద్రులు) జగద్వృక్షచ్ఛేదముజేయు విషయమున బ్రహ్మమొదలగువార్లను ఆశ్రయింపవచ్చును గదా! యనిన వారలను ఆశ్రయించుటవలన సాధ్యము కాజాలదనియు భగవంతునే ఆశ్రయించవలెననియు చెప్పబడుచున్నది. బ్రహ్మాది దేహములలోని జీవులు నాయొక్క అంశభూతులే. వారలు నాకంటె అన్యులుగనున్నను సూర్యునికి మిణుగురుపురుగువలె (సూర్యుడైన నాకు జీవులైన అభాసాంశములు మిణుగురుపురుగుతో సమానమైనవారలు) నాయొక్క అంశాభాసులు. ఆభాసాంశులు కావున వారలకు కర్తృత్వము లేదాయనిన మనస్సుతోగూడిన, ఇంద్రియములను విషయములలో నీడ్చుకొనువిషయమున మాత్రము కర్తృత్వముగలదు. ఈడ్చుకొనుచున్నదనగా విషయములలో ప్రవర్తింపజేయుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ ॥ 8

పద॥ శరీరం - యత్ - అవాప్నోతి - యత్ - చ - అపి - ఉత్క్రామతి - ఈశ్వరః।
గృహీత్వా - ఏతాని - సంయాతి - వాయుః - గంధాన్ - ఇవ - ఆశయాత్ ॥

| | | | |
|---|---|---|---|
| ఈశ్వరః | దేహేంద్రియములకు యజమానుడైన జీవుడు | ఆశయాత్ | సుగంధమునకు స్థానమైన పుష్పమునుండి |
| యత్ శరీరం | ఏ శరీరమును | వాయుః | గాలియనునది |
| అవాప్నోతి | పొందుచున్నాడో | గంధానివ | వాసనసువలె |
| యచ్చాపి | ఏ శరీరమునుండి వెలువడు | ఏతాని | పైజెప్పిన ఇంద్రియములను |
| ఉత్క్రామతి | చున్నాడో (ఆ శరీరమునుండి) | గృహీత్వా | ఈడ్చుకొని |
| | | సంయాతి | పోవుచున్నాడు. |

తా॥ ఇంద్రియములకు యజమానుడైన జీవుడు ఏ శరీరమును పొందినను ఏ శరీరమునుండి వెలువడినను వాసనయుండుచోటైన పుష్పమునుండి గాలి వాసనను (గ్రహించుకొనిపోవుట) వలె పైజెప్పిన ఇంద్రియములను గ్రహించుకొని పోవుచున్నాడు.

(శంకరులు) జీవుడు ఇంద్రియములను గ్రహించుకొని పోవునట్లు మునుపు జెప్పబడినది. అట్లు గ్రహించుకొని పోవుకాలమిట్టిదని చెప్పబడుచున్నది.

(రామానుజులు) ఇంద్రియములను గ్రహించుకొని పోవుచున్నాడను దానికి ఇంద్రియములను భూతసూక్ష్మములతో గ్రహించుకొని పోవుచున్నాడని తాత్పర్యము.

(మధ్వులు) జీవుడు ఎప్పుడొక శరీరమును విడచి మఱియొక శరీరమును పొందునో అప్పుడు ఈశ్వరుడు అతనితోడనే ఇంద్రియముల నీడ్చుకొని పోవుచున్నాడు. ఏలనగా కర్మలకు ఫలముల నిచ్చువాడు ఈశ్వరుడు కావున కర్మఫలము ననుభవింప జేయుటకై ఆ జీవునికిచ్చిన క్రొత్తదేహముచే ననుభవింప దగిన కర్మఫలమును అనుభవించుటకు అనుకూలమైయుండునట్లు ఇంద్రియములనున్ను ఈశ్వరుడు గ్రహించుకొని పోవుచున్నాడు. జీవునికి గ్రహించుకొని పోవుటకు స్వాతంత్ర్యములేదు. సర్వస్వతంత్రుడు ఈశ్వరుడే.

(రాఘవేంద్రులు) (పైకనిన అర్థమేగాక) ఈశ్వరుడు, ఒక దేహమున బ్రవేశించునప్పుడును ఒక దేహమును విడుచునప్పుడున్ను జీవునిన్ని వానిజేరిన ఇంద్రియాది సూక్ష్మములనున్ను గ్రహించుకొని పోవుచున్నాడు.



శ్లో॥ శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥

పద॥ శ్రోత్రం - చక్షుః - స్పర్శనం - చ - రసనం - ఘ్రాణం - ఏవ - చ।
అధిష్ఠాయ - మనః - చ - అయం - విషయాన్ - ఉపసేవతే॥

| | | | |
|---|---|---|---|
| అయం | ఇతడు (జీవుడనువాడు) | ఘ్రాణమేవ చ | ముక్కును |
| శ్రోత్రం | చెవిని | మనశ్చ | మనస్సును |
| చక్షుః | కన్నును | అధిష్ఠాయ ఏవ | ఆశ్రయించియే |
| స్పర్శనం చ | త్వక్కును | విషయాన్ | విషయములను |
| రసనం | నాలుకను | ఉపసేవతే | అనుభవించుచున్నాడు. |

తా॥ ఈ జీవుడు చెవి, కన్ను, త్వక్కు, నాలుక, ముక్కు, మనస్సు వీటి నాశ్రయించి విషయముల ననుభవించుచున్నాడు. అనగా ఇంద్రియములు లేకయే విషయములను జీవుడనుభవింప హేతువులేదు. కర్మానుగుణముగ విషయానుభవమునకయ్యే దేహము వచ్చియున్నది. అట్టి విషయ భోగార్థమయ్యే ఇంద్రియములను గ్రహించుకొని పోవునట్లు మునుపు జెప్పబడినది.

(రాఘవేంద్రులు) ఇంద్రియములను విషయములలో ప్రవర్తించునట్లుజేసి దానివలన గలుగు ఫలమును ఈశ్వరుడనుభవించుచున్నాడు.

శ్లో॥ ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితం।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥ 10

పద॥ ఉత్క్రామన్తం - స్థితం - వా - అపి - భుఞ్జానం - వా - గుణాన్వితం।
విమూఢాః - న - అనుపశ్యన్తి - పశ్యన్తి - జ్ఞానచక్షుషః॥

| | | | |
|---|---|---|---|
| ఉత్క్రామన్తం | శరీరమునుండి వెడలువాడున్ను | విమూఢాః | అజ్ఞానులు |
| స్థితం వాపి | దేహమునందే నిలబడినవాడున్ను | నానుపశ్యన్తి | చూచుటలేదు |
| భుఞ్జానం వా | విషయముల ననుభవించువాడున్ను | జ్ఞానచక్షుషః | జ్ఞాన నేత్రము గలవారలు |
| గుణాన్వితం | గుణములతో గూడినవాడునైన జీవుని | పశ్యన్తి | చూచుచున్నారు. |

తా॥ (జీవుని) దేహమునందున్నప్పుడున్ను, మఱియొక దేహమును పొందునప్పుడున్ను, విషయముల ననుభవించునప్పుడున్ను, ఇంద్రియములతో జేరియుండు నప్పుడున్న అజ్ఞానులు చూచుటలేదు. జ్ఞాననేత్రముగలవారలు జూచుచున్నారు. (జ్ఞానులుదప్ప ఇతరులకు జీవుడు ఏ దశయందును కనబడుటలేదు.)

(శంకరులు) గుణాన్వితం = సుఖదుఃఖ మోహాదులతోగూడిన, ఇందులో జెప్పబడిన దశలన్నిటిలోను జూడదగినవాడుగనున్న జీవుని, విమూఢాః = కనబడునది వినబడునది మొదలగు వస్తువులలో మనస్సును వ్యాపించునట్లు విడిచెడివారలు ఎరుంగుటలేదు.

(రామానుజులు) గుణములవలన చుట్టుకొనబడిన దేహమునుగల జీవునిగాని ఆ దేహమును విడచిపోవు వానినిగాని, ఆ దేహమునందుండు వానినిగాని, గుణమయమైన విషయముల ననుభవించు వానినిగాని దేహమే ఆత్మయను జ్ఞానముగల మూఢుల్కు దేహమునకంటె అన్యుడున్ను జ్ఞానాకారుడునైన జీవుని ఒకప్పుడున్ను చూచుటలేదు. దేహాత్మ వివేకజ్ఞానముగలవారలు చూచుచున్నారు.

(రాఘవేంద్రులు) దేహమును విడచిపోవువాడుగను, దేహములోనున్న వాడుగను, శుభ ఫలముననుభవించు వాడుగను, అనేక గుణములతోగూడిన వాడుగనునున్న ఈశ్వరుని అజ్ఞానులు చూచుటలేదు. జ్ఞానులు చూచుచున్నారు.

శ్లో॥ యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితం।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః॥ 11

పద॥ యతన్తః - యోగినః - చ - ఏనం - పశ్యన్తి - ఆత్మని - అవస్థితం।
యతన్తః - అపి - అకృతాత్మానః - న - ఏనం - పశ్యన్తి - అచేతసః

| | | | |
|---|---|---|---|
| యతన్తః | ధ్యానాదులవలన ప్రయత్నించుచున్న | అకృతాత్మానః | చిత్తశుద్ధిలేనివారలైన |
| | | అచేతసః | అల్పజ్ఞానులు |
| యోగినః | యోగులు | యతన్తోపి చ | (శాస్త్రాభ్యాసాదులచే) ప్రయత్నము జేయుచుండినను |
| ఆత్మని అవస్థితం | తన బుద్ధిలోనున్న | | |
| ఏనం | (ఇతనిని) ఈ జీవాత్మను | ఏనం | ఈ జీవాత్మను |
| పశ్యన్తి | చూచుచున్నారు. | న పశ్యన్తి | చూచుటలేదు. |

తా॥ ధ్యానాదులవలన ప్రయత్నించు వారలైన జ్ఞానులు దేహములోని జీవాత్మను చూచుచున్నారు. చిత్తశుద్ధిలేని స్వల్పజ్ఞానులు శాస్త్రాభ్యాసాదుల వలన ప్రయత్నము జేయుచున్నను ఆత్మను జూచుటలేదు.

(శంకరులు) ప్రయత్నించెడి మనస్సమాధానముగల వారలైన కొందఱు, బుద్ధిలో తోచుచున్న ఆత్మను ఇతడేనేనని యెరుంగుచున్నారు. తపస్సు మొదలగువాటిని జేయుచున్నను కామ క్రోధములను అణచకయు నిషిద్ధాచారములను విడువకయునున్న అశుద్ధమైన బుద్ధితోగూడిన అవివేకులు ఆత్మను జూచుటలేదు.

(రామానుజులు) నాయొక్క శరణాగతి పూర్వకముగ కర్మయోగాదులలో ప్రయత్నము జేయుచున్న చిత్తశుద్ధిగల యోగులు యోగమను నేత్రముచే శరీరముకంటె అన్యుడుగను స్వస్వరూపముతో గూడుకొన్నవాడుగను శరీరమునందున్న జీవుని చూచుచున్నారు. నన్ను శరణమొందకయు అశుద్ధమనస్సుగలిగ్గియు ఆత్మనుజూడగల మనస్సులేనివారలుగనున్న అవివేకులు ప్రయత్నించినను జూచుటలేదు.

(రాఘవేంద్రులు) జ్ఞానులు పరమాత్మను జూచుచున్నారు. అజ్ఞానులు పరమాత్మను జూచుటలేదు.

శ్లో॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం॥ 12

పద॥ యత్ - ఆదిత్యగతం - తేజః - జగత్ - భాసయతే - అఖిలం॥
యత్ - చంద్రమసి - యత్ - చ అగ్నౌ - తత్ - తేజః - - విద్ధి - మామకం॥

| | | | |
|---|---|---|---|
| యత్ | ఏ | యత్ చంద్రమసి | ఏ తేజస్సు చంద్రునియెడనున్నదో |
| తేజః | తేజస్సు | యత్ అగ్నౌ చ | ఏ తేజస్సు అగ్నియెడనున్నదో |
| ఆదిత్యగతం | సూర్యునాధారపడి నిలచి | తత్ | ఆ |
| అఖిలం | సమస్తమైన | తేజః | తేజస్సును |
| జగత్ | జగత్తును | మామకం | నా సంబంధమైనదిగ |
| భాసయతే | ప్రకాశింపజేయుచున్నదో | విద్ధి | ఎరుంగుము. |

తా॥ ఏ యే తేజస్సు సకల లోకమును ప్రకాశింప జేయుచున్నదో అట్టి సూర్యుని యెడనున్నట్టియు, చంద్రునియెడ నున్నట్టియు, అగ్నియెడ నున్నట్టి దైన తేజస్సు నాయొక్కదని ఎరుంగుము.

(శంకరులు) "తద్ధామ పరమం మమ'' అనుదానిచే ఎట్టి భగవత్స్వరూపము చెప్పబడెనో అది సర్వాత్మకత్వము సర్వవ్యాపకత్వము ఇవి బడసినదని ఇది మొదలు నాలుగు శ్లోకములచే చెప్ప బడుచున్నది.

సూర్యుడు చంద్రుడు అగ్ని వీటిలోనున్నట్టియు, లోకమును ప్రకాశింప జేయునట్టిదైన తేజస్సు నాయొక్కదని ఎరుంగుము. లేక సూర్యచంద్రాగ్నులయెడనున్న చైతన్యము (ఆత్మ స్వరూపము) ఏదిగలదో అదియే సకలలోకమును ప్రకాశింప జేయుచున్నది. అట్టి చైతన్యస్వరూపము నేనని యెరుంగుము. సూర్యుడు చంద్రుడు అగ్ని వీరలు దప్ప మిగత వాటిలో చైతన్యస్వరూపము లేదా యనిన సకల వస్తువులలోను నాయొక్క చైతన్యప్రకాశ స్వరూపమున్నను సత్త్వాంశమధికముగ గల సూర్యచంద్రాగ్నులలో నా చైతన్యప్రకాశమధికమైనదని యెఱుంగదగినది. అదియెట్లనగా వృక్షము గోడ మొదలగు వాటిలో ముఖము తెలియకున్నను అద్దములో దాని తారతమ్యము ననుస రించి ముఖము దెలియుటవలె.

(శ్రీధరులు) పరమాత్మ స్వరూపము విచిత్రశక్తితో గూడినదనునది ఇది మొదలు నాలుగు శ్లోకములచే చెప్పబడుచున్నది.

(రామానుజులు) ఇంద్రియములు విషయములలో ప్రవర్తించుటకు బాధకముగనున్న అంధకారమును (చీకటిని) పోగొట్టి ఇంద్రియములను విషయములలో ప్రవర్తించునట్లు చేయు నవియు, మిక్కిలి ప్రకాశముతో గూడినవియునైన సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వీటిని ప్రకాశింప చేయునట్టి జ్ఞానమనుజ్యోతిస్వరూపుడుగను ప్రకృతి విముక్తుడు (ప్రకృతినుండి విడువబడినవాడు)గ నున్న ఆత్మయు, ప్రకృతి సంబంధముననున్న ఆత్మయు భగవంతుని విభూతులని "తద్ధామ పరమం మమ" "మమైవాంశః'' మొదలగు శ్లోకములచే చెప్పబడినవి. ఇప్పుడు ప్రకృతినుండి గలిగిన పంచమహాభూతములలో జేరిన సూర్యుడు, చంద్రుడు, అగ్ని, మొదలగు వాటిలోని జ్యోతిస్సుగూడ తనయొక్క విభూతియని చెప్పబడుచున్నది. సకలలోకమును ప్రకాశపెట్టుచున్న

సూర్యచంద్రాదులలోని ప్రకాశము ఆ సూర్య చంద్రాదులచే నేను ఆరాధింపబడి వారలకు నాచే ఇవ్వబడినదనియు ఆ ప్రకాశము నాయొక్క విభూతియనియు నెఱుంగుము.

(రాఘవేంద్రులు) సూర్యుడు మొదలగువాటి తేజస్సు నా కధీనమైనదని యెఱుంగుము.

(స్వకీయము) ఈ శ్లోకార్థమునే చెప్పెడి కఠవల్ల్యుపనిషత్తు 2-5-15 వాక్యము క్రింద కనబరచబడుచున్నది —

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతోభాన్తికుతోయమగ్నిః
తమేవ భాన్తమనుభాతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి ॥"

సూర్యుడుగాని, చంద్రుడుగాని, నక్షత్రములుగాని, మెఱుపులుగాని, ఆ పరమాత్మను ప్రకాశ పెట్ట జాలవు. ఈ యగ్ని ఎట్లు ప్రకాశింపజేయగలదు? ఆ పరమాత్మయొక్క ప్రకాశమునననుసరించి (పొంది) సూర్యుడు మొదలగు వారలు ప్రకాశించుచున్నారు. ఈ జగత్తంతయు పరమాత్మయొక్క ప్రకాశముచేతనే ప్రకాశించుచున్నది.

శ్లో॥ గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।
పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః ॥ 13

పద॥ గాం - ఆవిశ్య - చ - భూతాని - ధారయామి - అహం - ఓజసా ।
పుష్ణామి - చ - ఓషధీః - సర్వాః - సోమః - భూత్వా - రసాత్మకః (1) ॥

| | | | |
|---|---|---|---|
| అహం | నేను | రసాత్మకః | రసాకారమైన |
| గాం | భూమిని | సోమః | చంద్రుడుగ |
| ఆవిశ్య | ప్రవేశించి | | ఉన్నవాడనై |
| ఓజసా | బలముచేత | సర్వాః | సమస్తములైన |
| భూతాని | ప్రాణులను | ఓషధీః | పైర్లను |
| ధారయామి చ | ధరించుచున్నాను. | పుష్ణామి | పోషించుచున్నాను లేక పెంచుచున్నాను. |
| చ | మఱియు | | |

తా॥ నేను బలముచే భూమిని (భూమిలో) ప్రవేశించి ప్రాణులను ధరించుచున్నాను. రసస్వరూపమైన చంద్రుడుగనుండి అన్ని పైరులను పోషించుచున్నాను.

(1) రసాత్మకః - అమృతరస స్వరూపియైన (రామానుజులు.)

(శంకరులు) ప్రాణులను ధరించుచున్నాననగా ప్రాణులు నివసించెడి భూమిని సముద్రమున మునిగిపోకయు పగిలిపోకను ధరించుచున్నాననియు చంద్రకిరణములవలన పైర్లు వృద్ధి పొందుటవలన చంద్రస్వరూపముగనుండి నేను వృద్ధిచేయుచున్నాననియు గ్రహింపవలెను.



శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ 14

పద॥ అహం - వైశ్వానరః - భూత్వా - ప్రాణినాం - దేహం - [illegible]ః ।
ప్రాణాపానసమాయుక్తః - పచామి - అన్నం (1) - చతుర్విధమ్ (2) ॥

| | | | |
|---|---|---|---|
| అహం | నేను | ప్రాణాపాన సమాయుక్తః | (అగ్నిని జ్వలింపజేయు) ప్రాణాపానవాయువులతోగూడి |
| వైశ్వానరః | వైశ్వానరాగ్నిగా | చతుర్విధం | నాలుగు విధములైన |
| భూత్వా | అయి | అన్నం | ఆహారమును |
| ప్రాణినాం | ప్రాణులయొక్క | పచామి | జీర్ణింపజేయుచున్నాను. |
| దేహం | దేహమును | | |
| ఆశ్రితః | ఆశ్రయించినవాడై, లేక ప్రవేశించి | | |

తా॥ నేను ప్రాణుల దేహము నాశ్రయించి అగ్నిగనుండి అగ్నివిజ్వలింప జేయునట్టి ప్రాణాపానవాయువులతోగూడినవాడనై నాలుగువిధములైన అన్నమును పక్వపరచుచున్నాను. (జీర్ణింప జేయుచున్నాను.)

(1-2) అన్నంచతుర్విధం = (1) భక్ష్యం - ఖాద్యం = పండ్లచే కొఱికి తినదగినవస్తువులు (కాయలు గడ్డలు మొదలగునవి) (2) భోజ్యం = శోష్యం = పండ్లచే కొఱకదగినవి కానివై, నాలుకచే నమిలి మ్రింగదగిన వస్తువులు. (అన్నము మొదలగునవి.) (3) లేహ్యం = నాలుకచే స్పృశించి, లేక నాకి మ్రింగదగిన వస్తువులు (పచ్చడి మొదలగునవి.) (4) శోష్యం= పేయం = నోటిచే పీల్చి తినదగిన వస్తువులు (పండురసము) మొదలగునవి) (శంకరులు మొదలగువారి వ్యాఖ్యానములు.)

(స్వకీయము) "అయమగ్నిర్వైశ్వానరో యోయదన్తః పురుషే యే నేదమన్నం పచ్యతే యది దమద్యతే తస్యైష ఘోషోభవతి యమేతత్కర్ణావపిధాయ శృణోతి సయదోత్క్రమిష్యః భవతి నైనంఘోషం శృణోతి = పురుషుని దేహములలోనుండి భుజించు వస్తువులను అన్నమును పక్వము జేసెడి వాడెవడో అతడే పరమాత్మయగు నీ వైశ్వానరాగ్ని, చెవులలో చేతినుంచి మూసుకొనినచో కలిగెడి శబ్దము వానియొక్కదే. ఆ పరమాత్మ దేహమునుండి బయటబడగా ఇట్టి శబ్దము గలుగుట లేదు" బృహదారణ్యకోపనిషత్తు. 7 - 9

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహనం చ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాంతకృద్వేదవిదేవ చాహమ్॥ 15

పద॥ సర్వస్య - చ - అహం - హృది - సన్నివిష్టః
మత్తః - స్మృతిః - జ్ఞానం - అపోహనం - చ।
వేదైః - చ - సర్వైః - అహం - ఏవ - వేద్యః
వేదాంతకృత్ (1) - వేదవిత్ - ఏవ - చ - అహం॥

| | | | |
|---|---|---|---|
| అహం | నేను | సన్నివిష్టః | (అంతర్యామి రూపముగనున్నాను) లేక నిలబడియున్నాను. |
| సర్వస్య చ | సకల ప్రాణులయొక్క | | |
| హృది | హృదయమునందును, లేక బుద్ధియందును | మత్తః | నావద్దనుండి |
| | | స్మృతిః | తలంపున్ను |

| | | | |
|---|---|---|---|
| జ్ఞానం | జ్ఞానమున్ను | వేద్యః | ఎరుంగదగినవాడు |
| అపోహనం చ | వాటి చెరుపున్ను | అహమేవ | నేనే |
| (భవంతి) | వచ్చుచున్నవి | వేదాంతకృత్ | వేదాంతమును జేసినవాడున్ను |
| సర్వైః | సమస్తములైన | వేదవిచ్చ | వేదార్థముల నెఱింగినవాడున్ను |
| వేదైశ్చ | వేదములచేతను | అహమేవ | నేనే |

తా॥ సకల ప్రాణులయొక్కయు హృదయమున నేను అంతర్యామిగ నున్నాను. నాచేతనే (ఆ ప్రాణులకు) స్మరణము, జ్ఞానము, జ్ఞప్తితప్పుట, ఇవి గలుగుచున్నవి. సకలమైన వేదములచేతను ఎఱుంగదగినవాడు నేనే. వేదార్థ ముల నెఱింగినవాడును వేదాంతసంప్రదాయము నేర్పరచిన గురువున్ను నేనే.

(1) వేదాంతకృత్ - వేదవ్యాస రూపముతోనుండి బ్రహ్మసూత్రములను జేసినవాడున్ను (రాఘ వేంద్రులు)

(శంకరులు) సకలప్రాణులయొక్క, హృది=బుద్ధిలో, అహం = నేను ఆత్మగ, సన్ని విష్టః=ఉన్నాను.

(రామానుజులు) మునుపటి శ్లోకమునజెప్పిన సూర్యచంద్రాగ్నులయొక్కయు సకల ప్రాణులయొక్కయు హృదయమున, సన్నివిష్టః = నియామకుడుగనున్నాను. ఈ యర్థము "అంతః ప్రవిష్టః శాస్తా జనానాం" మొదలగు శ్రుతి వాక్యములచేతను "శాస్తా విష్ణురశేషస్య" మొదలగు స్మృతివాక్యములచేతను చెప్పబడుచున్నది. కావున నేను స్మరణము, జ్ఞానము, మరచిపోవుట, వీటిని గలుగజేయుచున్నాను. మునుపు అనుభవించినవాటిని జ్ఞప్తికితెచ్చుకొనుట స్మరణము, వస్తువుల స్వరూపమును యథార్థముగ నెఱుంగుట జ్ఞానము. కొంతకాలమునకు మునుపు తెలిసికొనబడిన విషయమున జ్ఞాపకములేకుండుట విస్మృతి. వేదములచే యెఱుంగదగినవాడనగా వేదములచే చెప్ప బడు వాయువు, అగ్ని, చంద్రుడు, సూర్యుడు, ఇంద్రుడు మొదలగు దేవతలు నా శరీరముగను, వారలకునేను శరీరిగనున్నందున నన్నే వేదములు చెప్పుచున్నవని తాత్పర్యము. వేదాంతకృత్= వేదోక్తకర్మలను జేయువారలకు ఫలమిచ్చెడివాడు అహం = నేనే. ఈ యర్థము "యోయో యాంయాం" మొదలుగా "లభతే చ తతః కామాన్" వఱకు గల శ్లోకములలో జెప్పబడియున్నది. పైగా జెప్పబడియున్నట్లు వేదార్థములు ఎఱింగినవాడు నేనే.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ 16

పద॥ ద్వౌ - ఇమౌ - పురుషౌ - లోకే (1) - క్షరః (2) - చ - అక్షరః - ఏవ - చ।
క్షరః - సర్వాణి - భూతాని - కూటస్థః - అక్షరః - ఉచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| లోకే | లోకమున | సర్వాణి భూతాని | అన్నివస్తువులున్ను |
| క్షరశ్చ | క్షరుడనియు | క్షరః | క్షరమని చెప్పబడుచున్నవి. |
| అక్షర ఏవ చ | అక్షరుడనియు | కూటస్థః | చేతనుడు, కూటస్థుడు |
| ద్వౌ ఇమౌ పురుషౌ | రెండు విధములైన పురుషులు గలరు | అక్షరః | అక్షరుడని |
| | | ఉచ్యతే | చెప్పబడుచున్నాడు. |

తా॥ లోకములలో క్షరుడు అక్షరుడను ఇద్దరు పురుషులుగలరు. బ్రహ్మాది దేహము మొదలుగాగల సకల అచేతనములున్ను (జడపదార్థములున్ను) క్షరమనియు, చేతనుడు అక్షరుడనియు చెప్పబడుచున్నారు.

* ఈ శ్లోకమును స్కాందపురాణము సైయాద్రి ఖండము 2-10 లో చూడుదు.

(1) లోకే - సంసారమున (శంకరులు.)

(2) క్షరశ్చ - నాశమొందదగిన (శంకరులు) ప్రకృతి సంబంధములోనున్న అముక్త జీవుడు (రామానుజులు) బ్రహ్మాది జీవకోట్లు (మధ్వ, రాఘవేంద్రులు.)

(శంకరులు) "యదాదిత్యగతం తేజః" (దీని 12-వ శ్లోకము) మొదలు ఉపాధివలన గలిగిన ఈశ్వరుడగు నారాయణుని మహిమయొక్క సంగ్రహము జెప్పబడినది. ఇప్పుడు క్షరాక్షరోపాధులనుండి వేరై నిరుపాధికుడుగను కేవలుడుగనునున్న వాని తత్త్వనిశ్చయమునకై మొదలు పెట్టబడుచున్నది. దీనికి ముందును వెనుకనునున్న అధ్యాయములలో సముదాయార్థమును మూడు పక్షములుగ విభజించి వాటిలో రెండు పక్షములు ఇచ్చట చెప్పబడుచున్నవి. లోకే = సంసారమున, క్షరః = నశింపదగిన పక్షమనియు, అక్షరః = భగవన్మాయాశక్తియగు నశింపని పక్షమనియు, రెండు విధములు. అట్టి భగవన్మాయాశక్తి ఎట్టిదనగా క్షరపురుషుని యుత్పత్తికి విత్తనముగను అనేక సంసారులైన ప్రాణులయొక్క కామ్యకర్మలు మొదలగువాటి వాసనలకు (కర్మశేషమునకు) ఆశ్రయముగను నున్నట్టిదే.

అట్టి పురుషులిట్టివారనుదానిని భగవంతుడు చెప్పుచున్నాడు. వికారమొందదగిన భూతములన్నియు క్షరమని చెప్పబడుచున్నవి. కూటస్థం = కూటః = రాశి (కుప్ప) వలె, స్థః = స్థితః = ఉన్నవాడు, లేక, కూటః = మాయ (దానిలో) స్థః = ఉన్నవాడు, జ్ఞానములేకున్న సంసార బీజము నశింపజాలదు. కావున అక్షరుడని చెప్పబడినది.

(శ్రీధరులు) కూటస్థుడైన జీవునే అక్షరుడని చెప్పియున్నది. ఎట్లనగా, కూటః = రాళ్ళ యొక్క రాసులిమిడియున్న కొండవలె, స్థః = ఉన్నవాడు. అనగా దేహము నశించినను ఇతడు కదలక కొండవలె నుండువాడని తాత్పర్యము.

(రామానుజులు) ప్రకృతి సంబంధమున నున్నవాడు అముక్తజీవుడు. అతడు క్షరుడని చెప్పబడుచున్నాడు. ప్రకృతి సంబంధమునుండి విడువబడిన విముక్తజీవుడను కూటస్థుడు అక్షరుడని చెప్పబడుచున్నాడు.

(మధ్వులు) బ్రహ్మాదులైన జీవులు క్షరములు. ఏలనగా దేహము నశించుటవలన లక్ష్మి అక్షరమైనది. ఈమె వికారము లేకుండుటవలనను పురుషునివలె శక్తిగలదైనందునను కూటస్థుడను పుంలింగపదముచే చెప్పబడెను.

---

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥ 17

పద॥ ఉత్తమః - పురుషః - తు - అన్యః (1) - పరమాత్మా - ఇతి - ఉదాహృతః।
యః - లోకత్రయం (2) - ఆవిశ్య (3) - బిభర్తి (4) - అవ్యయః - ఈశ్వరః (5)॥

| | | | |
|---|---|---|---|
| తు యః | మఱి ఏ | (సః) | ఆ ఈశ్వరుడు |
| అవ్యయః | నిర్వికారియైన | అన్యః | క్షరాక్షరములకంటె అన్యు డుగను |
| ఈశ్వరః | ఈశ్వరుడు | | |
| లోకత్రయం | మూడులోకములను | ఉత్తమః పురుషః | మేలైన పురుషుడుగను |
| ఆవిశ్య | ప్రవేశించి | పరమాత్మేతి | పరమాత్మయనియు |
| బిభర్తి | భరించుచున్నాడో | ఉదాహృతః | చెప్పబడుచున్నాడు. |

తా॥ మఱి ఎట్టి నిర్వికారియైన ఈశ్వరుడు (మూడు స్వర్గ, మర్త్య పాతాళ) లోకములను ప్రవేశించి ధరించుచున్నాడో అట్టి పరమపురుషుడు క్షరాక్షరములకంటె అన్యుడుగను పరమాత్మగను వేదములచే చెప్పబడియున్నాడు.

(1) అన్యః - క్షరుడను బద్ధజీవునికంటెను అక్షరుడను ముక్తజీవునికంటెను అన్యుడుగను (రామానుజులు) క్షరాక్షరోపాధుల సంబంధములేని నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావము గలవాడు (శంకరులు.)

(2) లోకత్రయం - భూలోక భువర్లోక స్వర్లోకములలో (శంకరరాఘవేంద్రులు) అచేతనము (జడము) దానితో జేరియున్న బద్ధజీవుడు ముక్తజీవుడు ఈ ముప్పురిని (రామానుజులు)

(3) ఆవిశ్య - తనయొక్క బలశక్తులచే ప్రవేశించి (శంకరులు.)

(4) బిభర్తి - ధరించుచున్నాడో (శంకరులు.)

(5) ఈశ్వరః - సర్వజ్ఞుడైన నారాయణుడని పేరుగల నియామకుడైన (శంకరులు) నియామకత్వము గలవాడు (రామానుజులు.)

శ్లో॥ యస్మాత్ క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ 18

పద॥ యస్మాత్ - క్షరం(1) - అతీతః(2) - అహం - అక్షరాత్ (3) - అపి - చ - ఉత్తమః (4) ।
అతః - అస్మి - లోకే (5) - వేదే - చ - ప్రథితః - పురుషోత్తమః ॥

| | | | |
|---|---|---|---|
| అహం | నేను | అతః | ఈ కారణమువలన |
| యస్మాత్ | ఏ కారణమువలన | లోకే | లోకమునందును |
| క్షరం | క్షరమును | వేదేచ | వేదమునందును |
| అతీతః | అతిక్రమించినవాడనో (దాటిన వాడనో) | పురుషోత్తమః | పురుషోత్తముడని |
| | | ప్రథితః | ప్రసిద్ధిజెందినవాడనై |
| అక్షరాదపి | అక్షరమునకంటె | అస్మి | ఉన్నాను. |
| ఉత్తమశ్చ | ఉత్తముడుగనున్నానో | | |

తా॥ నేను ఏ కారణమువలన క్షరమును (అచేతనమును) అతిక్రమించిన వాడనుగను (అచేతనమునకంటె అన్యుడుగను) చేతనము (అక్షరమున) కంటె ఉత్తముడుగనునున్నానో ఆకారణమువలన ప్రపంచమునందును వేదమునందును పురుషోత్తముడనని ప్రసిద్ధిచెందినవాడనుగ నున్నాను.

(1) క్షరం - అశ్వత్థమని మునుపుచెప్పబడియున్న సంసార మాయావృక్షమును (శంకరులు.)

(2) అతీతః - క్షరాక్షరముల నతిక్రమించినవాడుగను (రాఘవేంద్రులు)

(3-4-) అక్షరాదపి, ఉత్తమశ్చ = సంసారవృక్షమునకు మూలముగనున్న మాయకంటె పైగా యున్నవాడు (శంకరులు)

(5) లోకే - ప్రపంచమున జనులచేతను, కావ్యాదులలో కవులచేతను (శంకరులు) స్మృతిలోను (రాఘవేంద్ర (రామానుజులు)



శ్లో॥ యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥ 19

పద॥ యః - మాం - ఏవం - అసమ్మూఢః (1) - జానాతి - పురుషోత్తమమ్ ।
సః - సర్వవిత్ - భజతి - మాం - సర్వభావేన (2) - భారత ॥

| | | | |
|---|---|---|---|
| హే భారత ! | ఓ భరతవంశమున నుదయించినవాడా ! | సః | అతడు |
| యః | ఎవ్వడు | సర్వవిత్ | అన్నిటినెఱింగినవాడై |
| పురుషోత్తమం మాం | పురుషోత్తముడైన నన్ను | మాం | నన్ను |
| అసమ్మూఢః | మోహములేనివాడై | సర్వభావేన | పూర్తిమనస్సుతో (అన్నివిధముల) |
| ఏవం | మునుపుజెప్పినట్లు | భజతి | ఆరాధించుచున్నాడు (భజించుచున్నాడు.) |
| జానాతి | ఎఱుంగునో | | |

తా॥ ఓ భరతవంశమున నుదయించినవాడా ! ఎవ్వడు పురుషోత్తముడైన నన్ను మోహములేనివాడై మునుపుజెప్పినట్లు ఎఱుంగునో అతడు సర్వజ్ఞుడై (అన్నిటి నెఱింగినవాడై) నన్ను, నిండుమనస్సుతో (అన్ని విధములచేతను) ఆరాధించుచున్నాడు. భజించుచున్నాడు.

(1) అసమ్మూఢః - సర్వోత్తమత్వము మిథ్య (అబద్ధము) యను మోహములేనివాడు (రాఘవేంద్రులు)

(2) సర్వభావేన - ఇందలి 18 వ అధ్యాయము 62 వ శ్లోకము చూడుడు. (స్వకీయము)

(శంకరులు) ఎవ్వడు మునుపుజెప్పిన విధముగ నన్ను పురుషోత్తముడని, అసమ్మూఢః= మోహమును విడచినవాడై, జానాతి = నన్నేతాననియెఱుంగునో అతడు సర్వజ్ఞుడు. అతడు నన్ను, సర్వభావేన = సకలమున కాత్మగ, భజతి = ధ్యానించుచున్నాడు,

(రామానుజులు) జానాతి = నన్ను పురుషోత్తముడనియు నాశములేనివాడనియు క్షరాక్షరములకంటె అన్యుడనియు ప్రపంచమునే వ్యాపించియున్నవాడనియు దానిని ధరించువాడనియు ఈశ్వరుడనియు ఎవడెఱుంగునో అతడు, సర్వవిత్ = సర్వము నెఱింగినవాడు. అనగా నన్ను పొందుటకు సకల ఉపాయముల నెఱింగినవాడు. సర్వభావేన భజతి = నన్నుపొందుటకు ఏ యే విధముగ భజింపవలెనో ఆ యావిధముగ భజించుచున్నాడు. ఈ విధముగ నెఱుంగుటవలనను ఎఱింగినట్లు భజించుటవలనను నాకు కలుగు రెండువిధములైన ప్రీతికిని అతడు పాత్రుడగుచున్నాడు.

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయాఽనఘ ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత ॥ 20

పద॥ ఇతి - గుహ్యతమం - శాస్త్రం - ఇదం - ఉక్తం - మయా - అనఘ ।
ఏతత్ - బుద్ధ్వా - బుద్ధిమాన్ (1) - స్యాత్ - కృతకృత్యః (2) - చ - భారత ॥

| | | | |
|---|---|---|---|
| హే అనఘ ! | ఓ పాపములేనివాడా ! | (కశ్చిత్) | ఒకడు |
| ఇతి | ఈవిధముగ | ఏతత్ | ఈ శాస్త్రమును |
| గుహ్యతమం | అతిరహస్యమైన | బుద్ధ్వా | ఎఱింగి |
| ఇదంశాస్త్రం | ఈ శాస్త్రము | బుద్ధిమాన్ | మంచిజ్ఞానముగల వాడుగను |
| మయా | నాచేత | కృతకృత్యశ్చ | చేయవలసిన వాటినన్నిటిని చేసినవాడుగను |
| ఉక్తం | చెప్పబడినది | | |
| హే భారత ! | ఓ భారతా ! | స్యాత్ | అగును. |

తా॥ ఓ పాపములేనివాడా ! ఈ విధముగ అతిరహస్యమైన ఈ గీతా శాస్త్రము నాచే చెప్పబడినది. ఓ భారతా ! ఇట్టి సంపూర్ణశాస్త్రము నెఱింగిన వాడు మంచి జ్ఞానముగలవాడుగను మోక్షమునకై చేయవలసిన వాటినన్నిటిని చేసుకొన్నవాడుగ నగును. (అనగా నీవు అట్టి యోగ్యతగలవాడు కాగలవను దానిని చెప్పనక్కరలేదని తాత్పర్యము.

(1) బుద్ధిమాన్ - అపరోక్ష జ్ఞానిగను (రాఘవేంద్రులు)

(2) కృతకృత్యః - ముక్తుడుగను (రాఘవేంద్రులు)

(శంకరులు) ఇదంశాస్త్రం = ఈ యధ్యాయము. ఇందులో "యస్తంవేద సవేదవిత్" "వేదైశ్చసర్వైరహమేవవేద్యః" ఈ శ్లోకములచే సకలవేదశాస్త్రార్థములున్ను చెప్పబడియున్నందున ఈ యధ్యాయమే శాస్త్రమని ఉపచార వాదముచే చెప్పబడినది. అనఘ = పాపము లేనివాడా ! ఈ శాస్త్రము నెఱింగినవాడు జ్ఞానియగును. వేరొక దానిచేతను కాజాలడు. కృతకృత్యశ్చ = బ్రాహ్మణ కులమున ఉత్తముడుగ బుట్టినవానిచే, చేసుకొనవలసినదన్నియు చేసుకొన్నవాడుగను, స్యాత్ = అగును. మఱియేవిధముచేతను కాదు. ఈ యర్థము "సర్వం కర్మాఖిలం పార్థ" అను శ్లోకముచే చెప్పబడియున్నది. దీని నెఱింగినవాని జన్మమే శ్రేష్ఠమని "ఏతద్ధి జన్మ సామగ్ర్యం (జన్మసాఫల్యం అనియు పాఠముగలదు) బ్రాహ్మణస్య విశేషతః । ప్రాప్యైతత్కృతకృత్యో హిద్విజోభవతి నాన్యథా" అనుశ్లోకమున (మనుస్మృతి అధ్యా 12 - శ్లో 93) మనువుగూడ జెప్పియున్నారు. నీవు వీటి నన్నిటిని నా వలన తెలుసుకొనినందున కృతకృత్యుడుగ నున్నావు (అనగా చేయవలసినదానిని చేసుకొన్నవాడుగ నున్నావు.)

(రామానుజులు) ఈ విధముగ నేను (కృష్ణపరమాత్మ) పురుషోత్తముడని చెప్పబడియు రహస్యము లన్నిటిలోను అతిరహస్యమైనదైన ఈ శాస్త్రము నీవు పాపములేనియోగ్యుడని తెలిసి నాచే నీకు చెప్పబడినది. దీనినెఱింగినవాడు జ్ఞానియగును. అనగా నన్ను పొందవలెనను కోరిక గలవాడు అవిధముగ పొందుటకు కావలసిన సకలశాస్త్రములవలన గలిగిన జ్ఞానమును పొందిన వాడగుచున్నాడు. కృతకృత్యశ్చ = చేసుకొనవలసినదన్నియు చేసుకొన్నవాడగుచున్నాడు.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే పురుషోత్తమ ప్రాప్తియోగో నామ
పంచదశోఽధ్యాయః.



శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ, యోగశాస్త్రముగ నున్న
శ్రీ కృష్ణార్జున సంవాదమున పురుషోత్తమప్రాప్తియోగమనెడి
పదునైదవ అధ్యాయము ముగిసెను.



శ్రీరస్తు

షోడశాధ్యాయ ప్రారంభః

# పదునారవ అధ్యాయము

## (దైవాసుర సంపద్విభాగయోగము)



భగవానువాచ :—

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్॥

శ్లో॥ అహింసా సత్య మక్రోధస్త్యాగ శ్శాంతిరపైశునమ్।
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలం॥

శ్లో॥ తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా।
భవన్తి సంపదం దైవీమభిజాతస్య భారత॥

పద॥ అభయం (1) - సత్వసంశుద్ధిః (2) - జ్ఞానయోగవ్యవస్థితిః (3)।
దానం (4)-దమః (5)-చ-యజ్ఞః (6)-చ-స్వాధ్యాయః-(7) తపః (8)-ఆర్జవం (9)॥

„ అహింసా - సత్యం (10) - అక్రోధః (11) - త్యాగః (12) - శాంతిః (13) - అపైశునం (14)।
దయా (15)-భూతేషు-అలోలత్వం (16)-మార్దవం (17)-హ్రీః (18)-అచాపలం (19)॥

„ తేజః(20)-క్షమా(21)-ధృతిః(22)-శౌచం (23)-అద్రోహః(24)-న-అతిమానితా(25)॥
భవన్తి - సంపదం - దైవీం - అభిజాతస్య (26) - భారత॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీ భగవంతుడు చెప్పినది | అహింసా | చెరుపు చేయకుండుట |
| అభయం | భయములేనితనము | సత్యం | |
| సత్త్వసంశుద్ధిః | అంతఃకరణము పరిశుభ్రముగ | అక్రోధః | కోపములేనితనము |
| | నుండుట | త్యాగః | పరిత్యాగము (సన్న్యాసము) |
| జ్ఞానయోగ వ్యవస్థితిః | జ్ఞానము యోగము వీటిలో | శాంతిః | అంతఃకరణోపశమనము |
| | దృఢముగ నిలబడుట | అపైశునం | చాడీలు చెప్పకుండుట |
| దానం | దానమిచ్చుట | భూతేషు | ప్రాణులయెడ |
| దమశ్చ | వెలుపలి ఇంద్రియముల నణచుట | దయా | దయతోనుండుట |
| యజ్ఞశ్చ | యజ్ఞముచేయుట | అలోలత్వం | విషయములలో నాసక్తిలేకుం |
| స్వాధ్యాయః | వేదాధ్యయనముచేయుట | | డుట |
| తపః | తపస్సుచేయుట | మార్దవం | క్రౌర్యములేనితనము |
| ఆర్జవం | ఋజుస్వభావము (సరియైన | | లజ్జ (సిగ్గు) |
| | మార్గమునసుండుట | | |

| | | | |
|---|---|---|---|
| అచాపలం | చాపల్యములేనితనము, ఇంద్రియములు నిష్ఫలమైన విషయ చేష్టలేకుండుట | నాతిమానితా | మిక్కిలి గర్వములేనితనము |
| | | (ఏతాని) | ఇవి |
| | | హే భారత ! | ఓ అర్జునా ! |
| తేజః | గొప్పతనము, ప్రాగల్భ్యము | దైవీం సంపదం | దేవసంపదను |
| క్షమా | ఓర్పు | అభిజాతస్య | పొందదగిన యోగ్యతతో బుట్టినవానికి |
| ధృతిః | ధైర్యము | | |
| శౌచం | శరీరమనశ్శుద్ధి | భవన్తి | కలుగుచున్నవి. |
| అద్రోహః | ద్రోహము చేయకుండుట | | |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ అర్జునునిగూర్చి మఱియు జెప్పునది. భయములేనితనము, మనోనిర్మలత, ఆత్మజ్ఞానోపాయము, విమర్శించి యెఱింగి అనిష్ఠలోనుండుట, సత్పాత్రమున దానమిచ్చుట, బాహ్యేంద్రియములను (కర్మేంద్రియములను) అణచుట, దర్శపూర్ణమాసాది యజ్ఞములుజేయుట, బ్రహ్మయజ్ఞము మొదలగు జపయజ్ఞములుజేయుట, తపస్సుజేయుట, క్రమప్రవర్తనము, (ఋజుత్వము), (ఎల్లప్పుడు సకల కార్యములను సరియైన విధమునజేయుట,) ఇతరులకు చెరుపుచేయకుండుట, అబద్ధములేకుండుట, కోపములేనితనము దానము (త్యాగము), మనస్సును నిలబెట్టుట, చాడీలుచెప్పకుండుట, ప్రాణులయెడ దయతోనుండుట, విషయములలో నాసక్తిలేనితనము, క్రూరతలేనితనము, సిగ్గు, చాపల్యములేనితనము, గొప్పతనము, ఓర్పు, ధైర్యము, శరీరశుద్ధి, మనశ్శుద్ధి ఇతరులకు ద్రోహముజేయనితనము, గర్వములేనితనము ఇవి, ఓ అర్జునా! దేవతలుపొందదగిన సంపదనుపొందుటకు తగిన యోగ్యతతో బుట్టినవానికి కలుగుచున్నవి.

(1) అభయం - ఇష్టమైనవస్తువు నష్టమగుటకున్ను, అనిష్టముగలుగుటకును హేతువుగనబడగా, కలిగెడిదుఃఖము భయము. ఇవి లేకుండుట (రామానుజులు) తనచేగాని, ఇతరులచేగాని, తనకు భయము గలుగకనుండుట. "యస్మాన్నోద్విజతేలోకః" 12వ అధ్యా-15-శ్లోకము చూడుడు. (రాఘవేంద్రులు).

(2) సత్త్వసంశుద్ధిః - వ్యవహారములలో వంచన, మోసము, అబద్ధము, ఇవిలేనట్టి మనశ్శుద్ధి (శంకరులు) రజస్తమో గుణములయొక్క కార్యములను అంతఃకరణము చేర్చకనుంతు శుద్ధి. (రామానుజులు).

(3) జ్ఞానయోగవ్యవస్థితిః - శాస్త్రములచేతను ఆచార్యోపదేశముచేతను ఆత్మ మొదలగు పదార్థములయొక్క తత్త్వముల నెఱుంగుట జ్ఞానము. అట్లెఱింగిన జ్ఞానమును విషయములనుండి ఈడ్చి ఒకటే ధ్యానమున తనయాత్మను యెఱుంగువిషయమున నుపయోగించుట యోగము. ఈ జ్ఞానము, యోగము వీటిలో స్థిరమైననిష్ఠయే వ్యవస్థితి. ఇదియే దైవసంపద, ఈ సంపద పొందినవారల స్వభావమే సాత్త్వికస్వభావము. (శంకరులు) ప్రకృతి విముక్తాత్మ స్వరూపమునందే నిలకడచెందియుండుట (రామానుజులు) జ్ఞానోపాయమున నిష్ఠచెందుట (రాఘవేంద్రులు)

(4) దానం - శక్తికితగినట్లు అన్నవస్త్రాదులను దానమిచ్చుట (శంకరులు) (శ్రీధరులు) న్యాయముగ సంపాదించిన ద్రవ్యమును సత్పాత్రముననిచ్చుట (రామానుజులు)

(5) దమః - మనస్సును విషయములనుండి నివర్తింపజేయుట (రామానుజులు) మదోన్మత్తత లేకుండుట (రాఘవేంద్రులు)

(6) యజ్ఞః - వేదములలో జెప్పబడిన అగ్నిహోత్రాదులను స్మృతిలో జెప్పబడిన దేవపితృ యజ్ఞాదులను జేయుట, (శంకరులు) ఫలాపేక్షలేక భగవదారాధన రూపముగ యజ్ఞముల జేయుట, (రాఘవేంద్రులు)

(7) స్వాధ్యాయః - ఋగ్వేదాదుల అధ్యయనము (శంకరులు) సకల వేదములున్ను సకల జగత్తును విభూతిగగలిగియున్న భగవంతునియారాధనా ప్రకారమును జెప్పునట్టిదిగ తెలుసుకొనుటకై వేదాధ్యయనము జేయుట (రామానుజులు) వేదాధ్యయనము (రాఘవేంద్రులు)

(8) తపః - భగవంతునికి ప్రీతిగలుగజేయగల కృచ్ఛ్రచాంద్రాయణ వ్రతములు, ద్వాదశ్యుపవాసము మొదలగువాటి ననుష్ఠించుట (రామానుజులు) బ్రహ్మచర్యవ్రతము మొదలగునవి (రాఘవేంద్రులు)

(9) ఆర్జవం - మనోవాగ్దేహములయొక్క వ్యాపారములను ఒక్కటే విధముగ జేసుకొనుట. (రామానుజ రాఘవేంద్రులు)

(10) సత్యం - అబద్ధము లేకుండుటయు, ఇతరులకు అప్రియము కాకుండుటయు (శంకరులు) చూచినది చూచినట్లు హితముగ జెప్పు వాక్యము (రామానుజులు) (స్వకీయము)

ఏవం మిథ్యానకర్తవ్యా మృషాపాప ప్రసూతికా ।
నాస్తి సత్యాత్పరో ధర్మో నానృతాత్పాతకం పరం ॥ 95
అతః సర్వేషు కార్యేషు సత్యమేవ విశిష్యతే ।
అశ్వమేధ సహస్రంతు సత్యం చ తులయాధృతం ॥ 96
అశ్వమేధ సహస్రాది సత్యమేవ విశిష్యతే ।
యోవదేత్సర్వకార్యేషు సత్యం మిథ్యాం పరిత్యజేత్ ॥ 97

ఈ విధముగ నుపదేశించినందున అబద్ధము చెప్పరాదు. అబద్ధము పాపమును గలుగజేయుచున్నది. సత్యమునకంటె శ్రేష్ఠమైన ధర్మములేదు. అసత్యమునకంటె పాపము వేరొక్కటి లేదు. కావున అన్ని కార్యములలోను సత్యమే మేలైనదిగ నున్నది. వెయ్యి అశ్వమేధయాగముల ఫలమును ఒక తట్టలోను, సత్యమును ఒక తట్టలోను ఉంచి తూచినచో అశ్వమేధ ఫలముకంటె సత్యమే మిక్కిలి భారముగలిగినదిగ నుండును. అందరు అన్ని కార్యములలోను సత్యమునే జెప్పవలెను. అసత్యమును త్రోసివేయవలెను. ఈ శ్లోకములను పద్మపురాణము సృష్టిఖండము అధ్యా 45 లో చూడుడు.

"సత్యమూలం జగత్సర్వం లోకాస్సత్యే ప్రతిష్ఠితాః ।
సత్యేన సిద్ధిం ప్రాప్తాహి ఋషయో బ్రహ్మవాదినః ॥ 44
సత్యేనదీయతే కన్యాసత్యం జల్పన్తి బ్రాహ్మణాః ।
సత్యంజయన్తి రాజానస్త్రీణ్యేతాన్య బ్రువనృతం ॥ 45

సత్యేన గమ్యతే స్వర్గో మోక్షస్సత్యేన చాప్యతే।
సత్యేన తపతే సూర్యస్సోమస్స త్యేన రజ్యతే॥ ” 46

జగత్తునకు సత్యము మూలకారణము, లోకములు సత్యముచేతనే నిలకడ చెందియున్నవి. బ్రహ్మవాదులుగనున్న ఋషులు సత్యముచేతనే సిద్ధిని పొందిరిగదా! సత్యముచేతనే కన్యకాదానము చేయబడుచున్నది. బ్రాహ్మణులు సత్యమును పెక్కుగ మాటలాడు చున్నారు, రాజులు సత్యముచే జయమొందుచున్నారు. ఇవి మూడున్ను సత్యమునే బోధించుచున్నవి సత్యముచేతనే స్వర్గము పొందబడుచున్నది. సత్యముచేత మోక్షము గూడ పొందబడుచున్నది. సత్యముచేతనే సూర్యుడు తపించుచున్నాడు. సత్యముచేతనే చంద్రుడు సంతోషింపజేయుచున్నాడు. వరాహపురాణము ఉత్తరభాగము అధ్యా 139 లో చూడుడు. (స్వాభిప్రాయము)

(11) అక్రోధః - కష్టబెట్టబడుటవలన కలిగెడి కోపము నణచుట (శంకరులు) ఇతరులచే హింసింపబడినను మనస్సు వికారమొందకుండుట, కొట్టబడినను మనస్సు కలతచెందకనుండుట (రామానుజులు) ఇతరులను హింసించుటకై మనస్సులోగలిగెడి ఆతురతను విడచియుండుట (రాఘవేంద్రులు)

(12) త్యాగః - సన్న్యాసము మునుపే దానమను పదము వచ్చియున్నందున దీనికి సన్న్యాసమని యర్థము జేయబడెను. (శంకరులు) ఆత్మయొక్క సుఖమునకు విరుద్ధములైన వస్తువులను గ్రహింపకుండుట (రామానుజులు)

(13) శాంతిః - విషయములలోనున్న ఇంద్రియములనీడ్చి స్వాధీనపరచుకొనుట (రామానుజులు) చిత్తసమాధానము (శ్రీధరులు) భగవన్నిష్ఠ (రాఘవేంద్రులు)

(14) అపైశునం - ఒక్కని గుణదోషములను బైటబెట్టకుండుట (శంకరులు) కనబడనిచోట ఇతరులను దూషింపకుండుట (శ్రీధరులు) జనులకు అనర్థమును గలుగజేయదగిన మాటలను జెప్పకుండుట (రామానుజులు)

(15) దయా - వ్యసనమొందియున్న వానియెడ దయతోనుండుట (శంకరులు, శ్రీధరులు, రామానుజులు) ఇతరులకు సహాయముజేయుట, లేక ఇతరుల దుఃఖమును సహింపకుండుట. (రాఘవేంద్రులు)

(16) అలోలత్వం - 'అలోలుప్త్వం' అనియు పాఠము. అలోలుపత్వం అని చెప్పవలెను. ఐతే ఋషిచే చెప్పబడినందున 'ప' అను నక్షరములోని అకారముతగ్గి అలోలుప్త్వం అని అయినది. (దీని యర్థము అన్వయమున జెప్పినదే) (శ్రీధరులు, రామానుజులు) ఇంద్రియములు విషయములను సమీపమున గలిగియున్నప్పుడుగూడ వికారమొందకుండుట. అనగా మోహమును గలుగజేయు వస్తువులు సమీపముననున్నప్పుడును మనస్సు చలింపకనుండుట (శంకరులు)

(17) మార్దవం - సాధుజన సంగమునకు యోగ్యుడుగనుండుట (రామానుజులు) తన్ను కష్టబెట్టిన వానియందును విరోధములేకుండుట (రాఘవేంద్రులు)

(18) హ్రీః - చేయదగని కార్యమును జేయుటలో లజ్జ, లేక సిగ్గు (శ్రీధరులు, రామానుజులు, రాఘవేంద్రులు)

(19) అచాపలం - ప్రయోజనములేని పనులను జేయకుండుట. (శంకరులు, శ్రీధరులు) ఆశను గలుగజేయు వస్తువు యెదురుగనున్నను దానిలో నాశలేకుండుట. (రామానుజులు) గట్టితనము (రాఘవేంద్రులు)

(20) తేజః - అయోగ్యులవలన అవమతింపబడకనుండుట. (రామానుజులు, రాఘవేంద్రులు)

(21) క్షమా - కొట్టబడినను కష్టపెట్టబడినను మనస్సున ఆవేశము, లేక వికారము చెందకుండుట. (శంకరులు) ఇతరులచే కష్టపెట్టబడినను మనస్సు చలింపకుండుట. (రామానుజులు) అపకారము జేసినవానియెడ కోపమున్ను ప్రత్యపకారమున్ను చేయకుండుట. (మధ్వులు) అపకారము జేసినవానియెడ కోపములేకుండుటయేగాక ఉపకారమునుగూడ చేయుట (రాఘవేంద్రులు)

(22) ధృతిః - దేహేంద్రియాదులు దౌర్బల్యమును చెందినను దానినిగూర్చిన చింతలేకున్న మనోధైర్యము (శంకరులు) మహత్తైన ఆపత్కాలమునందును చేయవలసిన దానిని విడువక చేయుట (రామానుజులు) చింతలేకుండుట (రాఘవేంద్రులు)

(23) శౌచం - కామక్రోధాదులను విడచుట మనశ్శుద్ధి. నీరు మొదలగు వాటిచే మురికిని పోగొట్టుకొనుట దేహశుద్ధి. ఇట్లు శౌచము రెండు విధములు (శంకరులు) ఇంద్రియముల్ను మనస్సు వీటిని శాస్త్రోక్తకర్మానుష్ఠానములకు యోగ్యముగ చేసికొనుట (రామానుజులు) భగవద్ధ్యానము మొదలైనది లోపలి శౌచము, మృత్తికాదులచే చేసుకొనునది వెలుపలి శౌచము (రాఘవేంద్రులు) ఈ పదముయొక్క అర్థమును 13 వ అధ్యాయము 8 వ శ్లోకములో చూడుడు (స్వకీయము)

(24) అద్రోహః - ఇతరులను చంపతలంపకుండుట (శంకరులు, శ్రీధరులు) ఇతరుల కార్యములకు విరోధము చేయకుండుట (రామానుజులు, రాఘవేంద్రులు)

(25) న అతిమానితా - తన్ను ఇతరులు పూజించవలయును, గౌరవించవలయును అను తలంపు లేకుండుట (శంకరులు, శ్రీధరులు) అహంకారము లేనితనము (రాఘవేంద్రులు)

(26) దైవీంసంపదం - అభిజాతస్య - భగవదాజ్ఞానుసారముగ నడచువారలైన దేవతల సంపదను పొందుటకై బుట్టినవాడు. (రామానుజులు) దైవసంపదను అనుభవించుటకై బుట్టినవాడు (మధ్వులు)

(శంకరులు) ప్రాణులస్వభావము దైవము ఆసురము రాక్షసమని మూడువిధములుగ నున్నదని ఇందలి 9-వ అధ్యాయమున గుర్తింపచేయబడినది. వాటినిగూర్చి ఈ యధ్యాయమున విస్తరించి చెప్పబడుచున్నది. దైవసంపదచే బంధనివృత్తి కలుగును. కావున దానిని పొందుటకై ప్రయత్నింపవలెను. ఆసురరాక్షససంపదలచే బంధముగలుగును. గాన వాటిని విడువ యత్నింపవలెను అని తాత్పర్యము.

(రామానుజులు) 13-14-15 అధ్యాయములలో, చేరియు వీడియునున్న ప్రకృతి పురుషుల యొక్క స్వరూపనిశ్చయమున్ను, వారలయొక్క చేరికకున్ను విడిగానుండుటకున్ను కారణమైన విషయసంబంధమున్ను విషయనివృత్తియు వారలు చేరియున్నను విడిగానున్నను వారలు భగవంతుని విభూతియనియు అచేతనముకంటెను చేతనులైన బద్ధముక్తజీవులకంటెను భగవంతునికిగల విశేషమున్ను చెప్పబడినవి. ఇందులో శాస్త్రములచేతనే ఎరుంగదగిన కొన్నియర్థములను దృఢపరచుటకై దైవాసుర సంపదయొక్క విభాగమును చెప్పుచున్నారు.

(మధ్వులు) మోక్షసాధనములకు విరోధియైన దానిని పరిహరింపవలెననునది దీనిచే చెప్పబడుచున్నది.

శ్లో॥ దంభో దర్పోఽతిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీం ॥ 4

పద॥ దంభః (1) - దర్పః (2) - అతిమానః (3) - చ - క్రోధః (4) - పారుష్యం (5) - ఏవ - చ ।
అజ్ఞానం (6) - చ - అభిజాతస్య - పార్థ - సంపదం - ఆసురీం (7) ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ ! | ఓ పార్థా ! | క్రోధః | కోపమున్ను |
| దంభః | దంభమున్ను(కపటవేషమున్ను) | పారుష్యం | కఠినతయు |
| దర్పః | ఐశ్వర్యము విద్యమొదలగు వాటివలన మదించియుండుటయు | అజ్ఞానమేవ చ | అజ్ఞానమున్ను ఇవే |
| | | ఆసురీం సంపదం | అసుర సంపదనుగొని |
| అతిమానశ్చ | తన్ను మిక్కిలి గౌరవింపుకొనుటయు | అభిజాతస్య | జనించినవానికి |
| | | (భవన్తి) | కలుగుచున్నది. |

తా॥ ఓ పార్థా ! డంభము, ఐశ్వర్యము, విద్య మొదలగువాటివలన మదించియుండుట, ఆత్మశ్లాఘ (తన పొగడ్త), కోపము, కఠోరత, అజ్ఞానము, ఇవి అసురసంపదగలవానిగ (పొందదగినవానిగ) జనించినవానికి గలుగుచున్నవి.

(1) దంభః - కీర్తికొఱకై ధర్మముజేయుట (రామానుజులు), తాను అల్పుడుగనుండగా తాను గొప్పవాడని ఇతరులు తలంపవలెనని తలంచి దానికితగినట్లు చేయుట (రాఘవేంద్రులు).

(2) దర్పః - హితాహితముల నెరింగెడి జ్ఞానమును పోగొట్టగలదై విషయానుభవమువలన గలిగెడి సంతోషము (రామానుజులు).

(3) అతిమానః - చదువు మొదలగువాటివలన గలుగు అహంకారము (రామానుజులు). ప్రమాణము నతిక్రమించుట (రాఘవేంద్రులు). 'అభిమానః' అని పాఠము. అర్థమొక్కటే (శ్రీధరులు).

(4) క్రోధః - ఇతరులను కష్టపెట్టు విషయమున గలిగెడి ధైర్యము (రామానుజులు, రాఘవేంద్రులు).

(5) పారుష్యం - కఠినవచనము (శ్రీధరులు, శంకరులు) మంచివారికి మనస్సంకటము గలుగజేయునట్టి స్వభావము (రామానుజులు). ఇతరులకు ద్వేషమును గలుగ జేసెడి స్వభావము (రాఘవేంద్రులు).

(6) అజ్ఞానం - తప్పైన తలంపు (శంకరులు). పరాపరజ్ఞానముగాని కార్యాకార్య వివేకముగాని లేకుండుట (రామానుజులు).

(7) ఆసురీంసంపదం - ఉపలక్షణముగ రాక్షససంపదనుగూడ జెప్పినదిగ గ్రహింపవలెను. (శ్రీధరులు) భగవదాజ్ఞ నతిక్రమించి నడిచెడి స్వభావము (రామానుజులు).

శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ।
మాశుచస్సంపదం దైవీమభిజాతోఽసి పాండవ ॥ 5

పద॥ దైవీ - సంపత్ (1) - విమోక్షాయ (2) - నిబంధాయ (3) - ఆసురీ (4) - మతా ।
మాశుచః - సంపదం - దైవీం - అభిజాతః - అసి - పాండవ ॥

| | | | |
|---|---|---|---|
| దైవీసంపత్ | దైవసంపద అనునది | హే పాండవ! | ఓ పాండుపుత్రా! |
| విమోక్షాయ | సంసారబంధనివృత్తికొఱకున్ను | మాశుచః | వ్యసనింపకుము |
| ఆసురీ | అసురసంపద యనునది | దైవీం సంపదం | దైవసంపదను |
| నిబంధాయ | సంసారబంధము కొఱకున్ను | అభిజాతః | పొందుటకై బుట్టినవానిగ |
| మతా | (అని) భావింపబడియున్నది | అసి | ఉన్నావు. |

తా॥ దైవసంపద(సంసార)బంధనివృత్తికిన్ని, అసురసంపద(సంసార) బంధము కలుగుటకును కారణమని నిశ్చయింపబడియున్నది. ఓ పాండుపుత్రా! వ్యసనింపకుము. (నీవు) దైవసంపదను పొందుటకై పుట్టినవాడవుగనున్నావు.

(1) దైవీ సంపత్ - భగవంతుని యాజ్ఞను అనుసరించునట్టి దైవసంపద (రామానుజులు).

(2) విమోక్షాయ - నానావిధమైన మోక్షమునకున్ను (రాఘవేంద్రులు). బంధనివృత్తికిన్ని క్రమముగనన్ను పొందుటకున్ను (రామానుజులు).

(3) నిబంధాయ - తక్కువైన స్థానమగు చీకటిలో నివసించుటకున్ను (అంధ తమస్సునకున్ను) (రాఘవేంద్రులు).

(4) ఆసురీ - ఈశ్వరాజ్ఞను మీరి నడచుటయను అసురసంపదయనునది (రామానుజులు) అసుర రాక్షస సంపదయనునది (శంకరులు).

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు ॥

పద॥ ద్వౌ - భూతసర్గౌ - లోకే - అస్మిన్ - దైవః - ఆసురః - ఏవ - చ ।
దైవః - విస్తరశః - ప్రోక్తః - ఆసురం - పార్థ - మే - శృణు ॥

| | | | |
|---|---|---|---|
| అస్మిన్ లోకే | ఈ లోకమున | విస్తరశః | విస్తారముగ |
| భూతసర్గౌ | మనుష్యసృష్టులు | ప్రోక్తః | చెప్పబడినది |
| దైవః | దైవమనియు | హే పార్థ! | ఓ కుంతీపుత్రా! |
| ఆసుర ఏవ చ | ఆసురమనియు | ఆసురం | అసురసృష్టిని |
| ద్వౌ | రెండువిధములు | మే | నావద్దనుండి |
| దైవః | దైవసృష్టి | శృణు | వినుము. |

తా॥ ఈ లోకమున దైవమనియు ఆసురమనియు భూత సృష్టులు రెండు విధములుగనున్నవి. దైవ సృష్టియైనది విస్తారముగ జెప్పబడినది. ఓ కుంతీ పుత్రా! అసురసృష్టిని నావద్దనుండి వినుము.

(శంకరులు) సృష్టింపబడిన భూతములలో అసురస్వభావముగలవి, దైవస్వభావము గలవి అని రెండు విధములైన భూతములుగలవు. (అనగా దైవసంపదను పొందదగినవారలుగ కొందఱున్ను, అసుర సంపదను పొందదగినవారుగ కొందరున్ను సృష్టింపబడుచున్నారని

తాత్పర్యము.) ఈ లోకమునందు అనగా సంసారముననని తాత్పర్యము. "అభయం సత్వసంశుద్ధిః" (ఈ యధ్యాయము 1 వ శ్లోకము) మొదలు ఇంతవఱకు దైవసంపద చెప్పబడెను. ఇక నీయధ్యాయము ముగియువఱకు అసురసంపద విస్తారముగ జెప్పబడుచున్నది. ఎందువలన అట్లు విస్తారముగ అసురసంపదను జెప్పవలెనని, దానినెఱింగి నివర్తించుకొనుటకయ్యే.

(శ్రీధరులు) ఇందలి తొమ్మిదవ అధ్యాయము 12 వ శ్లోకమున అసుర రాక్షస స్వభావములనుగూర్చి చెప్పియున్నారు. ఇచ్చట అసుర స్వభావమును మాత్రము జెప్పి రాక్షస స్వభావమును (మాత్రము) జెప్పలేదు. ఏలనగా రెండుస్వభావములకున్ను ఫలమొక్కటే కాన ఒకదానిని జెప్పిన దానిచేతనే మఱియొకటి చెప్పబడినదిగనేయగును కావుననే.

(రామానుజులు) కర్మాశ్రయమైన ఈ లోకమున కర్మలైన భూతములయొక్క జననము దైవము అసురమని రెండువిధములుగ నున్నది, పూర్వకర్మానుసారముగ భగవదాజ్ఞప్రకారము నడచువారలు దైవజన్మమనియు, భగవదాజ్ఞను మీరినడచువారలు అసురజన్మమనియు చెప్పబడుచున్నారు. దైవసంబంధమైన జన్మము ఎట్టి ఆచారముననుష్ఠించుట కగునో అట్టి ఆచారము కర్మయోగము. జ్ఞానయోగము భక్తియోగముననునవియే. ఇవి మునుపే విస్తారముగ జెప్పబడియున్నవి. అసురసంపదను పొందినవారలయొక్క ఆచారమును విస్తరించి చెప్పుచున్నానని తాత్పర్యము.

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥

పద॥ ప్రవృత్తిం (1) - చ - నివృత్తిం (2) - చ - జనాః - న - విదుః - అసురాః।
న - శౌచం (3) - న - అపి - చ - ఆచారః (4) - న - సత్యం - తేషు - విద్యతే।

| | | | |
|---|---|---|---|
| అసురాః జనాః | అసుర స్వభావముగల జనులు | నవిద్యతే | లేదు |
| ప్రవృత్తిం చ | (ధర్మమున) ప్రవృత్తిని | ఆచారః అపి | ఆచారముగూడ |
| నివృత్తిం చ | (అధర్మమునుండి) నివృత్తిని | న | లేదు. |
| న విదుః | ఎఱుంగరు | సత్యంచ | సత్యముగూడ |
| తేషు | వారలయెడ | న | లేదు. |
| శౌచం | శుద్ధత అనునది | | |

తా॥ అసురస్వభావముగల జనులు ధర్మమున ప్రవృత్తిని, అధర్మమునుండి నివృత్తిని ఎఱుంగజాలరు. వారలయెడ శుద్ధతగాని ఆచారముగాని సత్యముగాని లేదు (ఉండదు.)

(1) ప్రవృత్తిం - ఏ పురుషార్థమైన కార్యమున ప్రవర్తింపవలెనో దానిని (శంకరులు). అభ్యుదయసాధనమ్ = పరలోక సౌఖ్యమునకు అనుకూలమైనది' (రామానుజులు). సత్కార్యమున ప్రవేశించుటను (రాఘవేంద్రులు).

(2) నివృత్తిం - పురుషార్థమునకు బాధకమైనదానిని నివర్తించుటయున్ను (శంకరులు). మోక్షసాధనము (రామానుజులు). దుష్కార్యమునుండి నివర్తించుటయున్ను (రాఘవేంద్రులు).

(3) శౌచం - శాస్త్రానుసారముగనున్న వైదిక కర్మానుష్ఠానయోగ్యత (రామానుజులు)

(4) ఆచారః-సంధ్యావందనాదులు "సంధ్యాహీనోఽ శుచిర్నిత్యమనర్హస్సర్వకర్మసు" ప్రాతస్సాయం కాలములలో చేయవలసిన సంధ్యావందనములను విడిచిపెట్టినవాడు అశుద్ధుడు. అతడు ఇతర సకల కర్మలకును అనర్హుడగుచున్నాడు (రామానుజులు).



శ్లో॥ అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం।
అపరస్పరసంభూతం కిమన్యత్ కామహైతుకం* ॥ 8

పద॥ అసత్యం - అప్రతిష్ఠం - తే - జగత్ - ఆహుః - అనీశ్వరం।
అపరస్పరసంభూతం - కిం - అన్యత్ - కామహైతుకం॥

| | | | |
|---|---|---|---|
| జగత్ | జగత్తు | అపరస్పరసంభూతం | స్త్రీ పురుష సంబంధమువలన కలిగినదనియు |
| అసత్యం | వేదాదిప్రమాణములు గలదికాదని యు, లేక అసత్యమైనదనియు | కామహైతుకం | కామమునే కారణముగ గల దనియు |
| అప్రతిష్ఠం | ధర్మాధర్మములనెడి ఆధారము లేనిదనియు | అన్యత్ కిం | వేరేమి కారణమున్నదనియు |
| అనీశ్వరం | ఏలువానిని బడసినది కాదనియు (దీనికి ఒక కర్తలేదనియు) | తే | వారలు (అసురసంపదగల వారలు) |
| | | ఆహుః | చెప్పుచున్నారు. |

తా॥ జగత్తనునది వేదాది ప్రమాణములను బడసినది కాదనియు, ధర్మాధర్మములయొక్క వ్యవస్థ గలిగినది కాదనియు, స్త్రీ పురుష సంబంధమువలన గలిగినదనియు, స్త్రీ పురుషులయొక్క కామమే దానికి కారణమనియు, వేరేమి కారణమున్నదనియు, అసురస్వభావముగల జనులు జెప్పుచున్నారు.

* 'కామహేతుకం' అని పాఠము. అర్థభేదములేదు. (రామానుజులు).

(శంకరులు) నిరీశ్వరవాదులైన చార్వాకమతస్థులు ఈ విధముగ జెప్పుచున్నారు.

(రామానుజులు) జగత్తనునది బ్రహ్మమువలన గలిగినది, బ్రహ్మమునకు శరీరమైనది, బ్రహ్మముతోగూడినది. కావున అది బ్రహ్మస్వరూపమైనదని మనము చెప్పుటను, అసురజనులు అట్లు చెప్పుట వాస్తవముకాదనిచెప్పి ఆక్షేపించుచున్నారు. జగత్తనునది బ్రహ్మవద్దనుండి, అనగా బ్రహ్మమునే ఆశ్రయముగగలదని మనము చెప్పినదానిని నిరాకరించి, అప్రతిష్ఠం = బ్రహ్మమువద్ద లేదనుచున్నారు. లేక, జగత్తు ఆదిశేషునిచే ధరింపబడియున్నదని మనము చెప్పినదాని నర్థగించి, అప్రతిష్ఠం = ఆదిశేషునిచే ధరింపబడియుండలేదనుచున్నారు. ఈశ్వరుడు నియామకుడని మనము చెప్పుటను దూషించి, అనీశ్వరం = నియామకుడుగ ఒక ఈశ్వరుడు లేడనుచున్నారు. స్త్రీ పురుష సంబంధమువలన మనుష్య పశుపక్ష్యాదులు కలుగునట్లు కనబడుచున్నదేగాని వేరొక హేతువుండు నట్లుగ కనబడలేదనియు చెప్పుచున్నారు.

(మధ్వులు) అసత్యం - అప్రతిష్ఠం=అనీశ్వరం = విష్ణువుచే సృష్టిస్థితి జేయబడుటగాని అతడు నియామకుడుగనుండుటగాని లేదనియు, అపరస్పరసంభూతం="అన్నాద్భవంతి భూతాని" (అధ్యా 3 శ్లో 14) అన్నట్లు ఒకదానినుండి ఒకటి గలుగుటయనునది లేదనియు అసురులు చెప్పుచున్నారు.

(రాఘవేంద్రులు) ముత్యపుచిప్పలో వెండివలె, అసత్యమగు జ్ఞానముచే అసత్యమైనందున అప్రతిష్ఠమనియు, అవిద్యాపరిణామమైనందున పరస్పర సంభూతముకాదనియు, సత్తుకాదు అసత్తు కాదనియు చెప్పుచున్నారు.



శ్లో॥ ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥

పద॥ ఏతాం - దృష్టిం - అవష్టభ్య - నష్టాత్మానః (1) - అల్పబుద్ధయః (2) ।
ప్రభవన్తి (3) - ఉగ్రకర్మాణః (4) - క్షయాయ - జగతః - అహితాః (5)

| | | | |
|---|---|---|---|
| ఏతాం దృష్టిం | ఈ దృష్టిని (మతమును) | ఉగ్ర కర్మాణః | క్రూరములైన కర్మలుగల |
| అవష్టభ్య | అనుసరించి | అహితాః | లోకశత్రువులై |
| నష్టాత్మానః | చెడిన ఆత్మగల | జగతః క్షయాయ | జగత్తును చెఱచుటకొఱకు |
| అల్పబుద్ధయః | అల్పబుద్ధిగలవారలు | ప్రభవన్తి | కలుగుచున్నారు. |

తా॥ ఈ చార్వాకమతము నాశ్రయించి చెడిన ఆత్మలుగల స్వల్పబుద్ధులు క్రూరములైన కర్మలుగల వారలై లోకవిరోధులై ప్రపంచమును చెఱచుట కొఱకు పుట్టుచున్నారు.

(1) నష్టాత్మానః - పరలోక సాధనములైన పనులను జేసికొనని చెడ్డస్వభావము గలవారు (శంకరులు). దేహముకంటె అన్యమైన ఆత్మలేదనువారలు (రామానుజులు).

(2) అల్పబుద్ధయః - విషయములలోనే బుద్ధిని ప్రవర్తింప జేయువారలు (శంకరులు). కనబడు వస్తువులలోమాత్రము బుద్ధిని ఉపయోగించు వారలు (శ్రీధరులు). భాండమువలెనున్న దేహమున దానికంటె వేరుగ నాత్మ యున్నాడను జ్ఞానములేనివారలు (రామానుజులు).

(3) ప్రభవంతి - కలియుగముయొక్క ప్రారంభ కాలమున గలిగియున్నారు (రాఘవేంద్రులు).

(4) ఉగ్రకర్మాణః - లోకమందలి ప్రాణులకు దుఃఖము కలుగజేయగల కర్మలను జేసెడివారలు (శంకరులు, శ్రీధరులు).

(5) 'అశుభాః' అని పాఠము. అసురమైన పనులనుగూడ జేసెడి వారలని యర్థము (రామానుజులు)

శ్లో॥ కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥ 10

పద॥ కామం (1) - ఆశ్రిత్య - దుష్పూరం (2) - దంభమానమదాన్వితాః ।
మోహాత్ (3) - గృహీత్వా - అసద్గ్రాహాన్ (4) - ప్రవర్తన్తే (5) - అశుచివ్రతాః ॥

| | | | |
|---|---|---|---|
| (తే) | వారలు | మోహాత్ | అజ్ఞానమువలన (మోహమువలన) |
| దుష్పూరం | నిండింప వీలులేని | అసద్గ్రాహాన్ | చెడ్డ సిద్ధాంతములను |
| కామం | కామమును | గృహీత్వా | గ్రహించి (అవలంబించి) |
| ఆశ్రిత్య | ఆశ్రయించి | అశుచివ్రతాః | అశుద్ధములైన వ్రతములుగలవారలై |
| దంభమాన మదాన్వితాః | దంభము, గర్వము, మదము వీనితో గూడినవారలై | ప్రవర్తన్తే | లోకమున ప్రవర్తించుచున్నారు. |

తా॥ వారలు సంపూర్ణముకాని కామము నాశ్రయించి దంభాహంకార గర్వములతో గూడినవారలై అజ్ఞానమువలన చెడ్డ సిద్ధాంతములను అనుసరించుచు (దురాగ్రహములతో గూడినవారలై) అశుద్ధములైన వ్రతములుగల వారలై లోకమున ప్రవర్తించుచున్నారు.

(1-2) దుష్పూరం కామం - తనచే అణగద్రొక్కదగని, వస్తువుల విషయమైనకోరిక (రామానుజులు). అంతులేని ఆశ (స్వకీయము).

(3) మోహాత్ - మిథ్యాజ్ఞాన స్వభావమునుచెంది (రాఘవేంద్రులు).

(4) అసద్గ్రాహాన్ - అక్రమముగ సంపాదించినవాటిని పొంది (రామానుజులు). దుశ్శాస్త్రములను నేర్చి దానివలన గలిగిన విపరీత జ్ఞానమును పొంది (రాఘవేంద్రులు).

(5) ప్రవర్తన్తే - లోకమున సంచరించుచున్నారు (శంకరులు).

(6) అశుచివ్రతాః - మద్య మాంసములను భుజించెడి వ్రతములను గలవారలు (శ్రీధరులు). శాస్త్ర నిషిద్ధములైన వ్రతములను జేయువారలు (రామానుజులు).

శ్లో॥ చింతామపరిమేయాం చ ప్రళయాన్తాముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥ 11

శ్లో॥ ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్ ॥ 12

పద॥ చింతాం - అపరిమేయాం - చ - ప్రళయాన్తాం (1) - ఉపాశ్రితాః
కామోపభోగపరమాః - ఏతావత్ (2) - ఇతి - నిశ్చితాః ॥

,, ఆశాపాశశతైః - బద్ధాః - కామక్రోధపరాయణాః ।
ఈహన్తే (3) - కామభోగార్థం - అన్యాయేన - అర్థసంచయాన్ ।

| | | | |
|---|---|---|---|
| | వారలు | ఆశాపాశశతైః | ఆశయనెడి పలుత్రాళ్ళచే |
| అపరిమేయాం | కొలతబెట్ట వీలులేనట్టియు | బద్ధాః | కట్టబడినవారుగనుండి |
| ప్రళయాన్తాం | మరణమునేముగింపుగగలట్టియు | కామ క్రోధ పరా యణాః | కామ క్రోధములను గొప్ప ఆశ్రయముగ గ్రహించి |
| చింతాం | చింతను | | |
| ఉపాశ్రితాః | పొందినవారలుగను | కామభోగార్థం | కామభోగములకయ్యే |
| కామోపభోగపరమాః | విషయానుభవమునే మేలైన పురుషార్థమనుకొన్నవారుగను | అన్యాయేన | అన్యాయముచేత |
| | | అర్థసంచయాన్ | ద్రవ్యపు కుప్పలను |
| ఏతావదితి | ఇంతేయని | ఈహన్తే | వెతుకప్రయత్నించుచున్నారు |
| నిశ్చితాశ్చ | నిశ్చయించిన వారుగను | | |

తా॥ వారలు కొలతబెట్ట దగనట్టియు, మరణమునే ముగింపుగ గలట్టియు చింతనుపొందిన వారలుగను, విషయానుభవమే పురుషార్థముగ గొన్నవారలుగను, ఇంతేయను (స్వల్పానందానుభవమే కడపటి ప్రయోజనము, దానికంటె శ్రేష్ఠమైన ప్రయోజనము లేదు అను) నిశ్చయమును గలవారుగను, ఆశయనెడి

అనేక త్రాళ్ళచే కట్టబడినవారలుగనునుండి కామక్రోధములనే గొప్ప ఆశ్రయముగగొని కామము ననుభవించుటకయ్యే అన్యాయముచే (దొంగతనము మొదలగు దుష్కృత్యముల్చే) ద్రవ్యముల సమూహములను వెతుకుటకై ప్రయత్నించుచున్నారు.

(1) ప్రళయాన్తాం - ప్రాకృత ప్రళయమువరకు, చింతాం=చింతను, ఉపాశ్రితాః=గలిగినవారుగను (రామానుజులు).

(2) ఏతావత్ - కామభోగముతప్ప వేరుగా స్వర్గాదిభోగములు లేవని (రాఘవేంద్రులు).

(3) ఈహన్తే - ప్రయత్నించుచున్నారు (శంకరులు).



శ్లో॥ ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథం।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనం ॥ 13

,, అసౌ మయా హతశ్శత్రుః హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ ॥ 14

,, ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥ 15

,, అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥ 16

పద॥ ఇదం - అద్య - మయా - లబ్ధం - ఇమం - ప్రాప్స్యే - మనోరథం।
ఇదం - అస్తి - ఇదం - అపి - మే - భవిష్యతి - పునః - ధనం॥

,, అసౌ - మయా - హతః - శత్రుః - హనిష్యే - చ - అపరాన్ - అపి।
ఈశ్వరః - అహం - అహం - భోగీ - సిద్ధః (1) - అహం - బలవాన్ - సుఖీ॥

,, ఆఢ్యః - అభిజనవాన్ (2) - అస్మి - కః - అన్యః - అస్తి - సదృశః - మయా।
యక్ష్యే (3) - దాస్యామి (4) - మోదిష్యే - ఇతి - అజ్ఞానవిమోహితాః॥

,, అనేకచిత్తవిభ్రాన్తాః - మోహజాలసమావృతాః (5)।
ప్రసక్తాః - కామభోగేషు - పతన్తి - నరకే - అశుచౌ॥

| | | | |
|---|---|---|---|
| ఇదం | ఈ వస్తువు | మే | నాకు |
| అద్య | ఇప్పుడు | పునః | మఱలను |
| మయా | నాచేత | భవిష్యతి | వచ్చిచేరును |
| లబ్ధం | పొందబడినది | అసౌశత్రుః | ఈ శత్రువు |
| ఇమం మనోరథం | ఈ కోరికను | మయా | నాచేత |
| ప్రాప్స్యే | పొందగలను. | హతః | చంపబడెను |
| ఇదం | ఈ ధనము | అపరానపి | మిగతవారలను(శత్రువులను)కూడ |
| అస్తి | ఉన్నది. | హనిష్యే చ | చంపగలను |
| ఇదం ధనమపి | ఈ ధనముకూడ | అహం | నేను |

| | |
|---|---|
| ఈశ్వరః | ఏలెడివాడను |
| అహం | నేను |
| భోగీ | భోగమునను భవించువాడను |
| అహం | నేను |
| సిద్ధః | (అన్నియు) బడసినవాడను |
| బలవాన్ | బలముగలవాడను |
| సుఖీ | సుఖముగలవాడను |
| ఆఢ్యః | సంపదగలవాడను |
| అభిజనవాన్ | గొప్పకులములోనివాడను |
| అస్మి | అయియున్నాను |
| మయా | నాతో |
| సదృశః | సమమైనవాడు |
| అన్యః | మరొక్కడు |
| కః | ఎవ్వడు |
| అస్తి | ఉన్నాడు |
| | యాగము చేయగలను |
| దాస్యామి | దానము చేయగలను |
| మోదిష్యే | సంతోషింపగలను |
| ఇతి | ఈవిధముగ |
| అజ్ఞానవిమోహితాః | అజ్ఞానమువలన పలువిధములుగ మోహించినవారుగను |
| అనేకచిత్తవిభ్రాన్తాః | పలుతలంపులవలన పలువిధములుగ భ్రమచెందినవారుగను |
| మోహజాల సమావృతాః | మోహమువలచే కప్పబడినవారుగను |
| కామభోగేషు | విషయభోగములయందు |
| ప్రసక్తాః | మునిగియున్నవారుగనున్న |
| తే | వారలు |
| అశుచౌ | అశుద్ధమైన |
| నరకే | నరకమున |
| పతన్తి | పడుచున్నారు. |

తా॥ ఈ వస్తువు ఇప్పుడు నాచే పొందబడినది. ఈ కోరికను పొందగలను ఈ ధనము నాకున్నది. (అనగా వేరొకనికి లేదు.) ఈ ధనముగూడ నాకు మఱియు గలుగును. ఈ శత్రువు నాచే చంపబడెను. మిగత శత్రువులనుకూడ చంపగలను. నేను ఏలెడివాడను. నేను భోగమునను భవించువాడను, నేను (అన్నియు) కలిగినవాడను బలముగలవాడను సుఖముగలవాడను సంపదగల వాడను ఉన్నతకులములోనివాడను అయియున్నాను. నాతో సమానమైన వాడు వేరెవ్వడున్నాడు? యాగము చేయగలను. దానముచేయగలను. సంతో షింపగలను. అని ఈవిధముగ అజ్ఞానముచేత మోహమొందియు, చంచలతతో గూడిన మనస్సుతో భ్రమచెందియు, మోహమువలచే కప్పబడియు, పలువిధము లైన విషయభోగములలో మిక్కిలి ఆశగలవారై ఉన్నవారు అశుద్ధమైన నరకమునబడుచున్నారు.

(1) సిద్ధః - పుత్రపౌత్రాది సంపన్నుడు (శంకరులు).

(2) అభిజనవాన్ - ఏడు తరములనుండి శిష్టాచారములుగల కులమున బుట్టినవాడు (శంకరులు)

(3) యక్ష్యే - నేను పెక్కుగ యాగములనుజేసి నావలె యాగముజేయని మిగతవారలను అవమాన మొందునట్లు చేయగలను (శంకరులు).

(4) దాస్యామి - నన్ను పొగడు వారలకు ఇచ్చెదను (శంకరులు). మిక్కిలి యధికముగ దక్షిణ నివ్వగలను. అన్నదానము జేయగలను (రాఘవేంద్రులు).

(5) మోహజాల సమావృతాః-పుత్రపౌత్రాదులయెడ అభిమానముగలిగియుండుట.(రాఘవేంద్రులు) (స్వకీయము) "తేన వినా న తృణమపి చలతి=దానిచేగాక (పరమాత్మవలననేగాక) పుల్లకూడ కదలదు" అనువాక్యమును నమ్మక, తానే సకలమును జేసినదిగను, చేయునదిగను, చేయబోవునదిగను

సకల సామర్థ్యములున్ను తనయెడనున్నట్లును తలంచి, ఈశ్వరుడుగను సకలమునకున్ను కర్తగను ఒక పరమాత్మగలడనుదానిని నమ్మనివాడు నరకమును పొందునని దీనిచే ప్రకటపరచబడినది.



శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్ ॥ 17

,, అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥ 18

,, తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥ 19

పద॥ ఆత్మసంభావితాః - స్తబ్ధాః (1) - ధనమానమదాన్వితాః (2) ।
యజన్తే - నామయజ్ఞైః (3) - తే - దంభేన (4) - అవిధిపూర్వకం ॥

,, అహంకారం - బలం - దర్పం (5) - కామం - క్రోధం - చ - సంశ్రితాః ।
మాం - ఆత్మపరదేహేషు - ప్రద్విషన్తః (6) - అభ్యసూయకాః (7) ॥

తాన్ - అహం - ద్విషతః - క్రూరాన్ - సంసారేషు - నరాధమాన్ ।
క్షిపామి - అజస్రం - అశుభాన్ - ఆసురీషు (8) - ఏవ - యోనిషు (9) ॥

| | | | |
|---|---|---|---|
| (తే) | వారలు | సంశ్రితాః | ఆశ్రయించినవారలు |
| ఆత్మసంభావితాః | తమచేతనే గౌరవింపబడినవారలై | ఆత్మపరదేహేషు | తమయొక్కయు ఇతరులయొక్కయు దేహములలో నున్న |
| స్తబ్ధాః | వినయములేనివారలై | మాం | నన్ను |
| ధనమానమదాన్వితాః | ధనమువలన గలిగినగర్వము మదము వీటితో గూడినవారలై | ప్రద్విషన్తః | ద్వేషించువారలు |
| | | అభ్యసూయకాః | నిందించువారలు |
| | | ద్విషతః | ద్వేషముగలవారలుగను |
| అవిధి పూర్వకం | విధ్యనుసారముగగాక | క్రూరాన్ | క్రూరస్వభావముగలవారుగను |
| దంభేన | డంబముచేత | అశుభాన్ | అశుద్ధమైనవారుగను |
| నామయజ్ఞైః | పేరుకుమాత్రమైన యజ్ఞములచేత | నరాధమాన్ | మనుష్యులలో తక్కువరకము వారుగనున్న |
| యజన్తే | యాగము చేయుచున్నారు | తాన్ | అట్టివార్లను |
| (తే) | వారలు | సంసారేషు | జననమరణమార్గములలోనే |
| అహంకారం | అహంకారమును | ఆసురీష్వేవ యోనిష్వేవ | అసురయోనులలోనే |
| బలం | బలమును | అజస్రం | ఎల్లప్పుడు |
| దర్పం | గర్వమును | అహం | నేను |
| కామం | ఆశను | క్షిపామి | పారవేయుచున్నాను. (త్రోయుచున్నాను.) |
| క్రోధం చ | కోపమును | | |

తా॥ వారలు ఆత్మశ్లాఘగలవారలై వినయము లేనివారలై ధనమువలన గలిగిన గర్వము మదము వీటితోగూడిన వారలై డంబముచే, వేదవిధ్యను

సారముగ లేక పేరుకుమాత్రమే యజ్ఞమగు క్రియలను జేయుచున్నారు. వారలు అహంకారము, బలము, గర్వము, ఆశ, కోపము వీటి నాశ్రయించిన వారలు. తమ యొక్కయు ఇతరుల యొక్కయు దేహమున అంతర్యామిగనున్న (పరమాత్మయగు) నన్ను ద్వేషించువారలు (నన్ను) నిందించువారలు. ద్వేషము గలవారుగను, క్రూరస్వభావము గలవారుగను, అశుద్ధమైన వారలుగను, మనుష్యులలో కడపటివారలుగనునున్న వారలను జననమరణ మార్గములలో అసుర యోనులలోనే ఎల్లప్పుడు నేను త్రోయుచున్నాను. (జనింప జేయుచున్నాను).

(1) స్తబ్ధాః - తమకు ఏ విషయమునందును కొఱతలేదని తలంచువారలుగ (రామానుజులు).

(2) ధనమాన మదాన్వితాః - ధనముచేతను విద్యచేతను గొప్పకులముచేతను కలిగినమదము అహంకారము, లేక గర్వముగలవారలు (రామానుజులు).

(3) నామయజ్ఞైః - యజ్ఞముజేసెనని పేరుగలుగుటకై జేసెడి యజ్ఞములచేత (రామానుజులు).

(4) దంభేన - తాను అందఱికంటె శ్రేష్ఠుడని చూపించుకొనుటచేత (రాఘవేంద్రులు).

(5) దర్పం - నాతోసమానమైనవాడులేదని తలంచుట (రామానుజులు).

(6) ప్రద్విషన్తః - తమయొక్క (నన్ను ద్వేషించువారలయొక్క) ఆత్మయు అన్యునియొక్క ఆత్మయు చిత్స్వరూపమున్ను నేనే గావున తన్ను ద్వేషించినను ఇతరుని ద్వేషించినను నన్నే ద్వేషించిన వారలగుచున్నారు. మఱియు వేదోక్తమైన యజ్ఞమున, పశుహింస దోషము కాకున్నను, వేదవిరుద్ధమైన యజ్ఞమున జేసెడి పశుహింస దోషమే. అట్టి హింస యనునది పశురూపుడైన నన్ను హింసించినదగుచున్నది. కావున అతడు ద్వేషియగుచున్నాడు. (శ్రీధరులు) సకలవస్తువులలోనున్న నన్ను కుతర్కముజేసి, నేనులేను, సర్వవ్యాపినికాను, సర్వశక్తిని గలవాడనుకాను, అని దూషించువారలు (రామానుజులు). నా యాజ్ఞను ఉల్లంఘించుటవలన విరోధులగుచున్నారు (శంకరులు). భగవంతుడొకడుండుటయు అతడు నియామకుడనునదియు వాస్తవమైనచో నేను చేయు నీ పనిని అడ్డగించుగాక, లేక ఇట్టి కార్యమునుజేయుగాక, యని చెప్పుటయే ద్వేషము, (రాఘవేంద్రులు).

(7) అభ్యసూయకాః - అసూయజెందువారలు (శంకరులు, రామానుజులు). సన్మార్గముననున్న పెద్దలయెడ దోషము జెప్పువారలు. (శ్రీధరులు) స్వామియేలేడని వాదించు వాదమనెడి అసూయగలవారలు (రాఘవేంద్రులు).

(8-9) ఆసురీషు యోనిషు - క్రూరములైన పులి మొదలగు జన్మలలో (శంకరులు, శ్రీధరులు). నాకు ప్రతికూలముగనున్న, అనగా ద్వేషించుచునేయున్న జన్మలలోనే (రామానుజులు).



శ్లో॥ అసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాన్త్యధమాం గతిం॥ 20

పద॥ ఆసురీం - యోనిం (1) - ఆపన్నాః - మూఢాః - జన్మని - జన్మని।
మాం - అప్రాప్య - ఏవ (2) - కౌంతేయ - తతః - యాన్తి - అధమాం గతిం (3)॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! | మాం అప్రాప్యైవ | నన్ను పొందకయే |
| ఆసురీం యోనిం | అసురజన్మను | తతః | దానికంటె |
| ఆపన్నాః | పొందినవారలు | అధమాం గతిం | తక్కువైనస్థితిని |
| జన్మనిజన్మని | ప్రతిజన్మయందును | యాన్తి | పొందుచున్నారు. |
| మూఢాః | మైకమొందినవారలై | | |

తా॥ ఓ కుంతీపుత్రా! ఒక్కొక్క జన్మలోను అసురజన్మను పొందిన మూఢులు నన్నుపొందకయే దానికంటె (అసురజన్మకంటె) నీచమైన తక్కువైన జన్మను పొందుచున్నారు.

(1) ఆసురీం యోనిం - నాకు ప్రతికూలమైన జన్మను (నన్నువిరోధించుజన్మను) (రామానుజులు).

(2) అప్రాప్యైవ - నేనొకడనున్నానను జ్ఞానములేకయే (రామానుజులు).

(3) అధమాంగతిం - కృమికీటాది జన్మలను (శ్రీధరులు). నికృష్టమైన జన్మములను (శంకరులు), నిత్యనరకములను (రాఘవేంద్రులు).

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ 21

పద॥ త్రివిధం - నరకస్య - ఇదం - ద్వారం (1) - నాశనం (2) - ఆత్మనః ॥
కామః - క్రోధః - తథా - లోభః - తస్మాత్ - ఏతత్ - త్రయం -

| | | | |
|---|---|---|---|
| కామః | కామము (ఆశ) | నరకస్య | నరకమునకు |
| క్రోధః | క్రోధము (కోపము) | ద్వారం | వాకిలి |
| తథా | ఆ విధముగనే | ఆత్మనః | ఆత్మను |
| లోభః | లోభము (ధనాశ) లేక ఇతరుల సొమ్ములోని కోరిక అనెడి | నాశనం | చెరుపుచున్నది |
| | | తస్మాత్ | అందువలన |
| త్రివిధం | మూడువిధములైన | ఏతత్త్రయం | ఈ మూటిని |
| ఇదం | ఇది | త్యజేత్ | విడిచిపెట్టవలెను |

తా॥ ఆశ, కోపము,లోభము, అని మూడు విధములైన ఇవి నరకమునకు వాకిలిగను, తనకు నాశమును (చెఱుపును) ఇచ్చుటకు హేతువుగను నున్నవి. కావున ఈ మూటిని విడిచి పెట్టవలెను.

(1) ద్వారం - హేతువుగను (రామానుజులు). సాధనముగను (రాఘవేంద్రులు).

(2) ఆత్మనః నాశనం - ఒక పురుషార్థమునకున్ను యోగ్యము కాకుండ తన ఆత్మను చెరుపునట్టివిగను (శంకరులు). తన స్వరూపమును పొందకుండ జేయుచున్నవి. (రామానుజులు). అనర్థమును పొందించుచున్నవి. (రాఘవేంద్రులు).

(శ్రీధరులు). (రాఘవేంద్రులు) అసుర స్వభావములోని అనేక దోషములలో ముఖ్యమైన మూడు దోషములు ఆత్మనాశమునకు కారణములుగాన వాటిని తప్పక నివర్తింపవలెనని దీనిచే ప్రకటితమైనది.

శ్లో॥ ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః ।
అచరత్యాత్మనశ్రేయస్తతో యాతి పరాం గతిమ్ ॥ 22

పద॥ ఏతైః - విముక్తః - కౌంతేయ - తమోద్వారైః - త్రిభిః - నరః ।
ఆచరతి (1) ఆత్మనః - శ్రేయః (2) - తతః - యాతి (3) - పరాం (4) - గతిం (5) ॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! | ఆత్మనః | తనకు |
| తమోద్వారైః | నరకమునకు ద్వారములైన | శ్రేయః ఆచరతి | మంచిని చేసికొనుచున్నాడు. |
| ఏతైఃత్రిభిః | ఈ మూటిచేత | తతః | దానినుండి |
| విముక్తః | విడువబడిన | పరాంగతిం | ఉన్నతమైనస్థితిని (మోక్షమును) |
| నరః | మనుష్యుడు | యాతి | పొందుచున్నాడు. |

తా॥ ఓ కుంతీపుత్రా ! నరకమునకు కారణమైన ఈ (కామ క్రోధలోభములు) మూటిచే విడువబడిన మనుష్యుడు తనకు మంచిని చేసికొనుచున్నాడు. దానివలన మోక్షమును పొందుచున్నాడు.

(1-2) ఆచరతిశ్రేయః - నా విషయమైన జ్ఞానమును పొంది నన్నారాధించుటలో ప్రవర్తించుచున్నాడు. (రామానుజులు). పురుషార్థసాధనము ననుష్ఠించుచున్నాడు.(రాఘవేంద్రులు)

(3-4-5) యాతి పరాం గతిం - నన్ను పొందుచున్నాడు (రామానుజులు).



శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ 23

పద॥ యః - శాస్త్రవిధిం (1) - ఉత్సృజ్య - వర్తతే - కామకారతః ।
న - సః - సిద్ధిం (2) - అవాప్నోతి - న - సుఖం - (3) - న - పరాం - గతిం (4) ॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వడు | సిద్ధిం | సిద్ధిని |
| శాస్త్రవిధిం | వేదవిధిని | నావాప్నోతి | పొందుటలేదు. |
| ఉత్సృజ్య | విడిచి | సుఖం | సుఖమును |
| కామకారతః | కామమువలన ప్రేరేపింపబడి | న | పొందుటలేదు. |
| వర్తతే | ప్రవర్తించునో (నడచునో) | పరాంగతిం | మేలైనగతిని (మోక్షమును) |
| సః | అతడు | న | పొందుటలేదు. |

తా॥ ఎవ్వడు శాస్త్రోక్తమైన ధర్మమునువిడిచి స్వేచ్ఛగ ప్రవర్తించునో అతడు తత్త్వజ్ఞానమునుగాని సుఖమునుగాని మోక్షమునుగాని పొందుటలేదు.

(1) శాస్త్రవిధిం - శాస్త్రమందలి విధినిషేధములను, (శంకరులు), వేదరూపమైన నాయాజ్ఞను (రామానుజులు)

(2) సిద్ధిం - పురుషార్థమునకు కావలసిన యోగ్యతను (శంకరులు). స్వర్గాదిఫలమును (రామానుజులు) పురుషార్థమునకు కావలసిన సాధనములను (రాఘవేంద్రులు)

(3) సుఖం - ఇహలోక సుఖమును (శంకరులు).

(4) పరాంగతిం - స్వర్గమునుగాని మోక్షమునుగాని (శంకరులు).

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి ॥ 24

పద॥ తస్మాత్ - శాస్త్రం - ప్రమాణం-తే-కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా - శాస్త్రవిధానోక్తం - కర్మ - కర్తుం - ఇహ - అర్హసి ॥

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | అందువలన | శాస్త్రవిధానోక్తం | శాస్త్రవిధిచే చెప్పబడిన |
| కార్యాకార్య వ్యవస్థితౌ | చేయదగినది చేయదగనిది అనువానిని వ్యవస్థజేయుటలో (నిర్ణయించుటలో) | కర్మ | కర్మను |
| | | జ్ఞాత్వా | ఎఱింగి |
| | | ఇహ | ఈ లోకమున |
| తే | నీకు | కర్తుం | చేయుటకు |
| శాస్త్రం | శాస్త్రము | అర్హసి | యోగ్యుడవుగనున్నావు. |
| ప్రమాణం | ప్రమాణముగనున్నది | | |

తా॥ అందువలన చేయదగినది చేయదగనిది అనువానిని వ్యవస్థజేయుటలో (శ్రుతి స్మృతీతిహాస * పురాణములనెడి) శాస్త్రము ప్రమాణముగనున్నది. శాస్త్రముచే విహితమైయున్న కర్మనెఱింగి ఈలోకమున జేయుటకు యోగ్యుడుగనున్నావు. (ఈ భూలోకమున ముముక్షువులు కర్మచేతనే చిత్తశుద్ధిని, దానివలన జ్ఞానమును, దానిచే మోక్షమును పొందవలసిన వారలు కావునను, నీవు కర్మాధికారిగ నుండుటవలనను, శాస్త్రోక్తమైన కర్మను క్రమముగ జేయవలసినదని తాత్పర్యము.)

* ఇతిహాసమనునది మహాభారతము వంటిది.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే దైవాసురసంపద్విభాగయోగో నామ
షోడశోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ ఉపనిషత్తులుగ బ్రహ్మవిద్యగ యోగశాస్త్రముగ నున్న
శ్రీకృష్ణార్జున సంవాదమున దైవాసురసంపద్విభాగయోగమనెడి
పదునాఱవ అధ్యాయము ముగిసెను.

ఓం తత్ సత్.

శ్రీరస్తు.

సప్తదశాధ్యాయప్రారంభః.

# పదునేడవ అధ్యాయము

## (శ్రద్ధాత్రయవిభాగయోగము)



అర్జున ఉవాచ:-

శ్లో॥ యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః॥ 1

పద॥ యే - శాస్త్రవిధిం - ఉత్సృజ్య - యజన్తే - శ్రద్ధయా - అన్వితాః॥
తేషాం - నిష్ఠా (1) - తు - కా - కృష్ణ - సత్త్వం - అహో - రజః - తమః॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | తేషాం | వారలయొక్క |
| హే కృష్ణ! | ఓ కృష్ణా! | నిష్ఠా తు కా | స్థితి యెట్టిది? |
| | ఎవ్వరు | సత్త్వం | సత్త్వమా? |
| శాస్త్రవిధిం | శాస్త్రవిధిని | అహో | లేక |
| ఉత్సృజ్య | విడిచి | | |
| శ్రద్ధయా అన్వితాః | శ్రద్ధతోగూడిన వారలై | రజః | రజస్సా? |
| యజన్తే | (భగవంతుని) ఆరాధించుచున్నారో | తమః | తమస్సా? |

తా॥ అర్జునుడు చెప్పినది:- ఓ కృష్ణా! ఎవ్వరుశాస్త్రవిధిని విడిచి శ్రద్ధ (ప్రయత్నము లేక ఉత్సాహము)తోగూడిన వారలై (భగవంతుని)ఆరాధించుచున్నారో (పూజించుచున్నారో) వారలస్థితి ఎట్టిది? సత్త్వమా? రజస్సా? లేక తమస్సా?

(1) నిష్ఠా - మూడవ అధ్యాయము 3 వ శ్లో - చూడుడు.

(శంకరులు) శాస్త్రవిధిని తెలిసియుండియు అట్టివిధిని నిరాకరించి నడచువానికి శ్రద్ధయే గలుగదు. శ్రద్ధయనగా ఆస్తిక్యబుద్ధి (భగవంతుడు కలడను నిశ్చయము, లేక వేదాదులలోనమ్మకము). శాస్త్రవిధి తెలిసిన వానికి శాస్త్రవిరుద్ధములైన ఆరాధన మొదలగు వాట్లలో శ్రద్ధ గలుగనేరదు. కావున శాస్త్రవిధినెతిగించినవాని విషయమున ఈప్రశ్న గలిగినదికాదు. ఏలనగా శ్రద్ధ మూడు విధములైనదనియు, సాత్త్వికులు దేవతలనున్ను, రాజసులు యక్షరాక్షసులనున్ను, తామసులు పిశాచాదులనున్ను శ్రద్ధతో పూజించుచున్నారనియు, ఇకముందు చెప్పబోవు ఉత్తరము శాస్త్రవిధిని నిరాకరించినవాని విషయమున కుదరదు. అశక్తివలనగాని సోమఱితనము వలనగాని శాస్త్రములను చూడకయు, లేక శాస్త్రార్థములను తెలిసికొనకయు, వంశపరంపరగ ననుష్ఠించివచ్చిన వృద్ధాచార

మును (లేక సత్సహవాసమును) గైకొని శ్రద్ధతో పూజాదులను జేయువాని విషయముగనే ఈ ప్రశ్న గలిగియుండవలెను. ఇట్టి వానియొక్క శ్రద్ధతోగూడినపూజ సాత్త్వికమైనదా, రాజసమైనదా ? లేక తామసమైనదా, సాత్త్విక మనిన ఇతడు జ్ఞానమును పొందుటకు అధికారియగును. "నససిద్ధిమవాప్నోతి నసుఖంనపరాంగతిం" (అధ్యా 16-శ్లో 23 అను దానిచే శాస్త్రవిధిని విడిచినవాడు జ్ఞానమున కర్హుడుకాడని యేర్పడుచున్నది. రాజసము, లేక తామసము అనిన ఇతడెప్పుడున్ను జ్ఞానాధికారి యగుట లేదు. శ్రద్ధతో భగవంతుని పూజించువాడు (శాస్త్రవిధి తెలియని నిమిత్తముచేత) ఎట్టి హితమును పొందుటకు మార్గములేనిచో ఈ పూజ ప్రయోజనములేనిదగుచున్నదిగదా ! అను సందేహముతో అర్జునుడడుగుచున్నాడు.

(శ్రీధరులు) శ్రద్ధయొక్క స్వరూపము సాత్త్వికమైనను అశక్తి, లేక సోమరితనమువలన శాస్త్రవిధిని తెలిసికొనకయుండుట, దానితో గూడిన శ్రద్ధ, రాజసతామసములలో జేరునా యను సందేహమువలన మూటినిజేర్చి యడిగినదిగ గ్రహింపదగినది.

(రామానుజులు) దేవాసుర స్వభావములనుగూర్చి వివరించినందున మనుష్యుడు పొందవలసిన తత్త్వజ్ఞానమున్ను దానికి కావలసిన ఉపాయమున్ను శాస్త్రముచేతనే ఎఱుంగవలెననునది మునుపటి అధ్యాయమున జెప్పబడినది. ఈ యధ్యాయమున శాస్త్రవిధినివిడిచి చేసెడి యజ్ఞాద్యారాధనలు నిష్ఫలమనియు, ఫలమివ్వదగినదియు శాస్త్రవిధి ననుసరించినదియునైన ఆరాధన యనుష్ఠింపదగినదనియు, శాస్త్రోక్తమైన యజ్ఞాద్యారాధనగూడ గుణములచే మూడు విధములైనదనియు, శాస్త్రవిధి యొక్క లక్షణమున్ను, చెప్పబడుచున్నవి. (ఈ శ్లోకమందలి తాత్పర్యమేమనగా) శాస్త్రవిధిని విడచి చేసెడి పూజ నిష్ఫలమనుదాని నెఱుంగని అర్జునుడు శాస్త్రోక్తము కానట్టియు శ్రద్ధతో జేయబడునట్టియు యాగాది ఆరాధనలవలన గలుగుఫలము సాత్త్వికమా, రాజసమా, లేక తామసమా, యని యడుగుచున్నాడు.

(మధ్వులు, రాఘవేంద్రులు) 14-వ అధ్యాయమున "నాన్యం గుణేభ్యః కర్తారం" అను శ్లోకమువలన చెప్పబడిన గుణము లిట్టివనియు వాటి కార్యమిట్టిదనియు ఈ యధ్యాయమున జెప్పబడుచున్నది. (ఈ శ్లోకమునకు శంకరుల తాత్పర్యమే వీర్లయొక్కదియు).



శ్రీభగవానువాచః—

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥

పద॥ త్రివిధా - భవతి - శ్రద్ధా - దేహినాం - సా - స్వభావజా ।
- రాజసీ - చ - ఏవ - తామసీ - చ - ఇతి - తాం - శృణు ।

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీభగవంతుడు జెప్పినది | రాజసీచైవ | రాజసమనియు |
| దేహినాం | దేహముగలవార్లకు | తామసీ చ | తామసమనియు |
| స్వభావజా | స్వభావమువలన (పూర్వకర్మ వాసనవలన) కలిగిన | ఇతి | ఈ విధముగ |
| | | త్రివిధాభవతి | మూడువిధములుగ నున్నది |
| సాశ్రద్ధా | ఆ (మునుపుచెప్పిన) శ్రద్ధ | తాం శృణు | దానిని వినుము. |
| సాత్త్వికీ | సాత్త్వికమనియు | | |

తా॥ భగవంతుడు చెప్పునది—ప్రాణులయొక్క పూర్వజన్మ కర్మవాసన వలన కలిగిన ఆ శ్రద్ధయనునది సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధములుగ నున్నది. దానిని వినుము.

(శ్రీధరులు) శాస్త్రవిధిననుసరించునట్టిదికానిదై పరంపరాచారమును అనుసరించిన శ్రద్ధ యనునది మూడు గుణములు గలది. ప్రాణులయొక్క పూర్వకర్మ వాసనవలన కలిగినది. అట్టి స్వభావమును శాస్త్రజ్ఞానము మార్చగలదు. శాస్త్రజ్ఞానముతో జేరిన పరమేశ్వరపూజాది విషయమైన శ్రద్ధ సాత్త్వికమే. అది గుణముచే మూడువిధములైనదికాదు.

(రామానుజులు) శాస్త్రవిరుద్ధమైన యాగాది విషయమైన శ్రద్ధకున్ను అట్టి శ్రద్ధతోజేయు యాగాదులకున్ను ఫలము లేదనుదానిని మనస్సునందుంచుకొని శాస్త్రోక్తమైనట్టియు శ్రద్ధతోజేయ బడునట్టియు యాగాది కర్మయే గుణములచే మూడువిధములనుదానిని తెలుపుటకై భగవంతుడు చెప్పుచున్నాడు.

శ్రద్ధయనునది, రుచి, లేక విశ్వాసముతో గూడిన ప్రవృత్తి. జన్మాంతర సంస్కారము వలన అట్టి శ్రద్ధ దేహము ఇంద్రియములు అంతఃకరణము విషయములు వీటివలన కలుగజేయ బడుచున్నది.

(స్వకీయము) ఎవ్వని పూర్వకర్మ సంస్కారము (కర్మశేషము) ఎట్టిదో అట్టిశ్రద్ధ వానికి గలుగుచున్నది. ఎట్లనగా పుణ్యకర్మ శేషమైనచో సాత్త్వికశ్రద్ధయు, పాపకర్మ శేషమైనచో తామస శ్రద్ధయు, పుణ్యపాప మిశ్రకర్మ శేషమైనచో రాజస శ్రద్ధయు నుండును.

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ॥

పద॥ సత్త్వానురూపా - సర్వస్య - శ్రద్ధా - భవతి - భారత ।
శ్రద్ధామయః - అయం - పురుషః - యః - యచ్ఛ్రద్ధః - సః - ఏవ - సః ॥

| | | | |
|---|---|---|---|
| హే భారత ! | ఓ అర్జునా ! | శ్రద్ధామయః | శ్రద్ధ అధికముగ గలవాడు |
| శ్రద్ధా | శ్రద్ధయనునది | యః | ఎవ్వడు |
| సర్వస్య | అన్ని ప్రాణులయొక్క | యచ్ఛ్రద్ధః | ఎంతటి శ్రద్ధతో గూడినవాడ గునో |
| సత్త్వానురూపా భవతి | (వారివారి) అంతఃకరణమును అనుసరించియున్నది | సః | అతడు |
| అయం పురుషః | ఈ పురుషుడు | స ఏవ | ఆశ్రద్ధకు తగినవాడే |

తా॥ ఓ అర్జునా! సకల ప్రాణులయొక్క అంతఃకరణము ననుసరించి శ్రద్ధ యున్నది. ఈ (శ్రద్ధతో పూజించు సంసారియైన జీవుడు) పురుషుడు శ్రద్ధనే స్వరూపముగ గలవాడు. ఎవ్వడు ఏ శ్రద్ధతో గూడియుండునో అతడు ఆ శ్రద్ధగలవాడే. (అనగా ఎవ్వడు ఎట్టి పూజలో శ్రద్ధయుంచునో అతనిని అట్టి శ్రద్ధగలవానిగ నెఱుంగవలయునని తాత్పర్యము. దీని 4 వ శ్లోకము చూడుడు.)

(శ్రీధరులు) శాస్త్రవిధి ననుసరింపక పూర్వీకుల శిష్టాచారము ననుసరించి శ్రద్ధతో పూజించువాని శ్రద్ధయనునది మూడు గుణములతో గూడినది. ఆ గుణములలో ఏగుణము వృద్ధిపొంది

యున్నదో ఆ గుణముగల శ్రద్ధగలవాడు అట్టి శ్రద్ధాళువని చెప్పబడుచున్నాడు. శాస్త్రవిధి నెఱింగి ఆ విధముగ శ్రద్ధతో పూజించువాని శ్రద్ధ సాత్త్వికమైనదే. రాజసముగగాని, తామసముగగాని ఉండ జాలదు. ఏలనగా అతడు శాస్త్రజ్ఞానమువలన రాజస తామస శ్రద్ధలలో ప్రవృత్తిని నివర్తించుకొన గలడు.

(రామానుజులు) సత్త్వానురూపా - సత్వం = అంతఃకరణము, అనురూపా = అనుస రించిన అనగా అంతఃకరణము యొక్క వృత్తి యెట్టిగుణముగలదో అట్టి గుణము ననుసరించు శ్రద్ధ గలుగుచున్నది. ఆ శ్రద్ధ యెట్టిదో దానికి తగిన కార్యములలో ప్రవర్తించుచున్నాడు. ఆ కార్య ములకు తగిన ఫలము గలుగుచున్నది. అట్లు గలుగు ఫలమెట్టిదో దానిననుభవించు పురుషుడున్ను అట్టివాడే.

(స్వకీయము) 'సత్త్వానురూపా' అను పదమునకు మధ్వులు 'చిత్తముననుసరించి' యని అర్థము జేసియున్నారు. అది అంతఃకరణము ననుసరించియని ఇతరులుచేసియున్నట్లే యున్నది. ఐతే రాఘవేంద్రులు జీవస్వరూపము ననుసరించి యని అర్థముజేసియున్నారు. ఈ మత సిద్ధాంతము ననుసరించి ఈ యర్థము సరియైనదే. ఈ మతసిద్ధాంతము తెలిసినగాని వీరి తాత్పర్య మిట్టిదని తెలిసికొనుటకు కొందఱు అన్యమతస్థులకు కష్టముగ నుండును గావున ఈ శ్లోకమునకు తగినంత ఈ మతసిద్ధాంతమును నాకు తెలిసినవఱకు సంగ్రహముగ వ్రాయుచున్నాను. దాని వెనుక రాఘవేంద్రులు ఈ శ్లోకమునకు జేసియుండు అర్థమును గూడ వ్రాసెద.

జీవస్వరూపములలో సాత్త్విక జీవస్వరూపము, రాజస జీవస్వరూపము, తామస జీవస్వ రూపమని మూడు విభాగములు గలవు. ఈ యొక్కొక్క విభాగములోను అనేక అంతర్విభాగ ములు గలవు. వాటిని వివరించవలెననిన మిక్కిలి వృద్ధిపొందును. కావున ముఖ్యమైన మూడు విభాగములను గుఱించి మాత్రము చెప్పెదను. ముక్తియోగ్యులైన జీవులయొక్క స్వరూపమే సాత్త్విక జీవస్వరూపము. వీరలెవ్వరనగా దేవతలు పితరులు ఋషులు రాజులు కొందఱు మనుష్యోత్తములు వీరలే. ఇటువంటి సాత్త్విక జీవస్వభావముగలవారలు ఆ యాజన్మలలోజేసిన పాపములచే రాజస తామసజన్మలనుపొందియున్నను జీవస్వరూపము సత్త్వగుణములు బడసిన దైనందున సాత్త్వికవృత్తియే హెచ్చుగనుండును. ఐనను "బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే" (అధ్యా 7 శ్లో 19) అను వాక్యానుసారముగ వీరలు పలుజన్మములనెత్తి క్రమక్రమముగ జ్ఞానముపొంది కడపట మోక్షమునే పొందెదరు.

నిత్యనరకయోగ్యులైన జీవులయొక్క స్వరూపమే తామసజీవస్వరూపము. వీరలెవ్వరనగా భగవంతునియెడ ద్వేషమున్ను శిష్టులయెడ అసూయయు వేదశాస్త్రాదులలో అపనమ్మకము గల వారలై పాపకృత్యములను జేయుచున్న జీవులే. వీరలు అనేకజన్మములలో పాపములను చేసివచ్చి ఆ పాపములున్ను భగవద్దూషణమున్ను వృద్ధిపొంది కడపట నిత్యనరకమును పొందుచున్నారు, ఇట్లు. నిత్యనరకమును పొందినవారలు మఱలవేరు జన్మను పొందుటలేదు. ఎల్లప్పుడున్ను నరకము నందే యుండదగిన వారలు, పైకనిన రెండువిభాగములలోను చేరనివారలే రాజసస్వభావముగల జీవులు. వీరలు భూలోకమునజేసిన పాపపుణ్యములకు తగినట్లు స్వర్గనరకములకు పోయి ఆయా పాపపుణ్యములకు విధింపబడియున్న కాలమువఱకు స్వర్గనరకముల ననుభవించి "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి" అను వాక్యానుసారముగ భూలోకమున జన్మించుచున్నారు. మరలను తాము చేయు పాపపుణ్యములకు తగినట్లు స్వర్గ నరకముల ననుభవించుచు తిరిగి తిరిగి వచ్చుచున్నారు. వీరలు మోక్షమొందుటయులేదు, నిత్య నరకమును పొందుటయులేదు. వీరలను నిత్యసంసారులని చెప్పుటగలదు.

ఈ విధముగ జీవస్వరూపము మూడు విధములుగనున్నదనుదానిని మనస్సునగొని ఈ శ్లోకమునకు జేసియున్న అర్థమును విచారింపవలెను. అనగా, సర్వస్య = సకల ప్రాణులకును, శ్రద్ధా = కలుగు శ్రద్ధయనునది, సత్త్వానురూపా = జీవస్వరూపమెట్టిదో దానికి తగినట్లు, భవతి = కలుగుచున్నది, అయంపురుషః = ఈ జీవుడు, శ్రద్ధామయః = శ్రద్ధను స్వరూపముగ గలవాడుగ నున్నాడు. అది యెట్లనగా, యః = ఏ జీవుడు, యచ్ఛ్రద్ధః = ఎట్టి శ్రద్ధగలవాడో, సః = అతడు, స ఏవ=అట్టివాడే.

---

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః॥ 4

పద॥ యజన్తే - సాత్త్వికాః - దేవాన్ - యక్షరక్షాంసి - రాజసాః।
ప్రేతాన్ - భూతగణాన్ - చ - అన్యే - యజన్తే - తామసాః - జనాః॥

| | | | |
|---|---|---|---|
| సాత్త్వికాః | సాత్త్వికులు | తామసాః | తామసులైన |
| దేవాన్ | దేవతలను | అన్యేజనాః | మిగతజనులు |
| రాజసాః | రాజసులు | ప్రేతాన్ | ప్రేతములనున్ను |
| యక్షరక్షాంసి | యక్షులను రాక్షసులను | భూతగణాంశ్చ | భూతగణములనున్ను |
| యజన్తే | పూజించుచున్నారు. | యజన్తే | పూజించుచున్నారు. |

తా॥ సత్త్వగుణము గలవారలు దేవతలను పూజించుచున్నారు. రజోగుణము గలవారలు యక్ష రాక్షసులను, తమోగుణముగల జనులు ప్రేత భూతములను పూజించుచున్నారు. (ఎవరెవ్వరు ఏ విభాగమును జేరినవారలను పూజించుటలో శ్రద్ధగలిగిన వారలుగనున్నారో) వారి వారిని ఆ యా విభాగమును జేరినవారలుగ నెఱుంగవలెనని తాత్పర్యము.

(రామానుజులు) సత్త్వాదిగుణముగలవారలనగా సత్త్వగుణమును ప్రధానముగగలవారలనియు రజోగుణమును ప్రధానముగగలవారలనియు, తమోగుణమును ప్రధానముగగలవారలనియు తాత్పర్యము. దేవతలను శ్రద్ధతో పూజించువారలు శ్రేష్ఠమైన సుఖమునున్ను, యక్షరక్షస్సులను శ్రద్ధతో పూజించువారలు దుఃఖమునున్ను అల్పసుఖమునున్ను, ప్రేతాదులను శ్రద్ధతోపూజించువారలు మహాదుఃఖమును అత్యల్పమైన సుఖమును పొందెదరు.

(రాఘవేంద్రులు) శాస్త్రవిధి తెలియక సాత్త్వికశ్రద్ధతో మాత్రము పూజించువారలు బ్రహ్మాది దేవతలయొక్క అంతర్యామిగ నున్న నారాయణుని పూజించుచున్నారు. వారలు మోక్ష మొందగలరు. రాజస శ్రద్ధతో పూజించువారలు అనుష్ఠించుయజ్ఞాదులలో యజింపబడినవారలు దేవతలేయైనను వారు ఆ దేవతలకు అంతర్యామియైన నారాయణుని గూర్చి యజింపక ఆ దేవతలను గూర్చియే యజించి నందున వారలకు ఆ దేవతలయొక్క పేరువంటి పేరుగల యక్షులు కల్పితమైన స్వర్గాది ఫలమునిచ్చుచున్నారు. కావున ఈ పూజ రాజసమగుచున్నది. తామస శ్రద్ధ గలవారలు శివుని పరిచారకులైన భూతపిశాచాదులను పూజించుచున్నారు. వారలనే పొందుచున్నారు.

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః।
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః॥ 5

,, కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామమచేతసః।
మాం చైవాన్త శ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్॥ 6

పద॥ అశాస్త్రవిహితం - ఘోరం (1) - తప్యన్తే - యే - తపః - జనాః।
దంభాహంకార సంయుక్తాః - కామరాగబలాన్వితాః (2)॥

పద॥ కర్శయన్తః (3) - శరీరస్థం - భూతగ్రామం (4) - అచేతసః।
మాం (5) - చ - ఏవ - అన్తశ్శరీరస్థం (6) - తాన్ - విద్ధి - ఆసురనిశ్చయాన్ (7)॥

| | | | |
|---|---|---|---|
| యే జనాః | ఏ జనులు | శరీరస్థం | శరీరమునందున్న |
| అశాస్త్రవిహితం | శాస్త్రముచే విధింపబడనట్టియు | భూతగ్రామం | అన్ని భూతముల సమూహములనున్ను |
| ఘోరం | క్రూరమైనట్టియు | | |
| తపః | తపస్సును | అంతశ్శరీరస్థం | శరీరములోపలనున్న |
| తప్యన్తే | చేసెదరో | మాం చైవ | నన్నును |
| తే | వారలు | కర్శయన్తః | కృశము (చిక్కిపోవునట్లు) చేయువారలు |
| దంభాహంకార సంయుక్తాః | దంభాహంకారములతో గూడిన వారలు | తాన్ | వారలను |
| కామరాగబలాన్వితాః | కామము, రాగము అనెడి శక్తి గలవారలు | ఆసురనిశ్చయాన్ | ఆసురమైన నమ్మకముగల వారలుగ |
| అచేతసః | అవివేకులు | విద్ధి | ఎఱుంగుము |

తా॥ ఏ జనులు శాస్త్రవిహితము కానట్టియు క్రూరమైనట్టియు తపస్సును జేసెదరో వారలు దంభాహంకారములతో గూడిన వారలు. కామము రాగమనెడి శక్తి బడసినవారలు అవివేకులు, శరీరములోని అన్ని భూతసమూహములనున్ను శరీరము లోపలనున్న నన్నున్ను చిక్కిపోవునట్లు చేయువారలు. వారలను ఆసుర నిశ్చయముగలవారలుగ నెఱుంగుము.

(1) ఘోరం - తమకున్ను ఇతర ప్రాణులకును కష్టమును కలుగజేయు (శంకరులు). మహా కష్ట రూపమైన (రాఘవేంద్రులు).

(2) కామరాగబలాన్వితాః - కామము రాగము వీటివలన గలిగిన బలముతో గూడినవారు (శంకరులు).

(3) కర్శయన్తః - 'కర్షయన్తః' అని పాఠము. అర్థమొక్కటే (శ్రీధరులు), మధ్వులు. (రాఘవేంద్రులు). ఈ పదమును ఇంద్రియ భూత సమూహములకు ఉపయోగించునప్పుడు (కృశీకుర్వన్తః) = చిక్కిపోవునట్లు చేయువారలనియు, భగవంతుని కుపయోగించునప్పుడు (అనుశాసనాకరణమేవ) = ఆజ్ఞను నిరాకరించువారలనియు, గ్రహింపవలెను (శంకరులు). కష్టపెట్టుచున్నారు (రామానుజులు). స్వల్పగుణముగలవారుగ తలంచుచున్నారు (రాఘవేంద్రులు).

(4) భూతగ్రామం - ఇంద్రియసమూహములు (శంకరులు). ఇంద్రియాభిమాని దేవతలగు లక్ష్మి మొదలగువారలు (రాఘవేంద్రులు).

(5-6) మాం - అంతశ్శరీరస్థం - కర్మబుద్ధి వీటికి సాక్షిభూతుడుగనున్న నారాయణుడనగు నన్ను (శంకరులు). నా యొక్క అంశముననున్న జీవుని (రామానుజులు). ఆ యభిమాని దేవతలనున్ను, వారలకు నియామకుడుగనున్న నన్నున్ను (రాఘవేంద్రులు).

(7) ఆసురనిశ్చయాః - నాయొక్క అజ్ఞను నిరాకరించి నడచువారలు (రామానుజులు). (స్వకీయము) అధ్యా - 16 - శ్లో - 18 లో చూడుడు.

---

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥

పద॥ ఆహారః - తు - అపి - సర్వస్య - త్రివిధః - భవతి - ప్రియః ।
యజ్ఞః - తపః - తథా - దానం - తేషాం - భేదం - ఇమం - శృణు ॥

| | | | |
|---|---|---|---|
| సర్వస్యతు | ఎల్లరికిన్ని | తపః | తపస్సున్ను |
| ప్రియః | ప్రియమైన | దానం | దానమున్ను |
| ఆహారోపి | ఆహారమున్ను | తథా | అట్లే (మూడువిధములుగనున్నది) |
| త్రివిధః | మూడువిధములుగ | తేషాం | వాటియొక్క |
| భవతి | ఉన్నది | ఇమం భేదం | ఈభేదమును |
| యజ్ఞః | యజ్ఞమున్ను | శృణు | వినుము. |

తా॥ ఎల్లరికిని ప్రియమైన ఆహారమున్ను (సాత్త్వికము, రాజసము, తామసమని) మూడువిధములుగ నున్నది. యజ్ఞము తపస్సు దానము ఇవి గూడ ఆ విధముగనే మూడువిధములుగ నున్నవి. వాటియొక్క ఇట్టి భేదమును (చెప్పెదను) వినుము.

(శంకరులు) శాస్త్రోక్తములైన యజ్ఞాదులున్ను గుణముచే భేదముకలవనునది చెప్పబడుచున్నది. అనగా -

సత్త్వాది గుణవృద్ధికి ఆహారము కారణముగ నున్నది. ఎట్లనగా మనస్సు ఆహారముయొక్క గుణము ననుసరించుచున్నది, అన్నము శుద్ధముగ నుండిన మనస్సు శుద్ధముగనే యుండును. మనస్సుశుద్ధమైన సత్త్వగుణము వృద్ధియగును. కావున ఆహారమున్ను గుణముకంటె భిన్నముగ జెప్పబడినది. ప్రాణులయొక్క గుణమునకు తగినట్లు అట్టి యాహారమున ప్రీతిగలుగుచున్నది. యజ్ఞాదులుగూడ అటులనే. "అన్నమయంహిసోమ్యమనః" అను ఛాందోగ్యోపనిషత్తును చూడుడు.

---

ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతివివర్ధనాః ।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా।ఆహారస్సాత్త్వికప్రియాః ॥

పద॥ ఆయుస్సత్త్వ (1) బలారోగ్యసుఖ ప్రీతి వివర్ధనాః ।
రస్యాః (2) - స్నిగ్ధాః - స్థిరాః (3) - హృద్యాః (4) - ఆహారాః - సాత్త్విక ప్రియాః॥

| | | | |
|---|---|---|---|
| ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః | ఆయుష్యము ధైర్యము బలము ఆరోగ్యము సుఖము సంతోషము వీటిని వృద్ధిచేయునవియు | స్థిరాః | స్థిరముగనున్నవియు |
| | | హృద్యాః | మనస్సునకు సుఖముగనున్నవియునగు |
| రస్యాః | రసము గలిగినవియు | ఆహారాః | ఆహారములు (తినబండారములు) |
| స్నిగ్ధాః | పసలేక తెలముగలవియు | సాత్త్వికప్రియాః | సాత్త్వికులకు ప్రియమైనవి. |

తా॥ ఆయుష్యము, ధైర్యము, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి, వీటిని వృద్ధిచేయునట్టియు, రసము గలిగినట్టియు, తైలము గలిగినట్టియు, స్థిరముగనున్నట్టియు, మనస్సునకు సుఖముగ నున్నట్టియు ఆహారములు సాత్త్వికులకు ప్రియమైనవి.

(1) సత్త్వం - జ్ఞానము (రామానుజులు). సాధుత్వము లేక చిత్తశుద్ధి (రాఘవేంద్రులు) సుఖం = ఒక కాలమున కొద్దిగ తిన్నను దానివలన కలుగునట్టియు చాలకాలముండునట్టియు సుఖము (రాఘవేంద్రులు) ప్రీతిః=తినునప్పుడే కలుగు సుఖము (రాఘవేంద్రులు).

(2) రస్యాః - తీపుగలవి. (రామానుజులు) మామిడిపండ్లు మొదలగునవివలె రసము గలవి (స్వకీయము)

(3) స్థిరాః - దేహమున చాలకాలము నిలకడగ నుండునట్టి సారముగలవి (శంకరులు, శ్రీధరులు, రామానుజులు). గోధుమరవ వంటివి (స్వకీయము). కొంతకాలమయిన తరువాత జీర్ణముకాగలవి (మధ్వులు).

(4) హృద్యాః - మనోహరమైనవి. అనగా ఇంకను కావలెనని ఆశపడదగినవి (రాఘవేంద్రులు).

శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥

పద॥ కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః ।
ఆహారాః - రాజసస్య - ఇష్టాః - దుఃఖ(1)శోకా(2)మయప్రదాః ॥

| | | | |
|---|---|---|---|
| కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః | అధికమైన చేదు, పులుపు, ఉప్పు, వేడి, కారము, కలిలేనితనము లేకదప్పి తాపము వీటిని గలుగ జేయునట్టివియు | దుఃఖశోకామయప్రదాః | దుఃఖము, శోకము, రోగము వీటినిచ్చునవియునైన |
| | | ఆహారాః | ఆహారములు |
| | | రాజసస్య | రాజసునికి |
| | | ఇష్టాః | ఇష్టములైనవి. |

తా॥ మిక్కిలి చేదు, పులుపు, ఉప్పు, కారము, వేడి, దప్పి, దాహము వీటినిగలిగినవిగను, దుఃఖము శోకము రోగము వీటిని గలుగ జేయునవిగ నునున్న ఆహారములు రాజసస్వభావముగల వానికి ఇష్టములైనవి. ఇట్టి ఆహారములనే మిక్కిలి ప్రీతితో తినువార్లను రాజసులని యెఱుంగదగినది. (ఈచేదు మొదలగు వాటివి అధికముగ తినగూడదని శ్రీధరులు, శంకరులు, వీరి తాత్పర్యము.)

(1) దుఃఖం - తత్కాలమున మనస్సున గలుగు వ్యసనము (శ్రీధరులు) దేహమునకు గలుగు చెరుపనియు చెప్పదగును. (స్వా)

(2) శోకః - చాలకాలము వరకు మనస్సులోగల వ్యసనము (శ్రీధరులు) మనస్సునకుగలుగు దుఃఖమనియు జెప్పవచ్చును. (స్వా)

శ్లో॥ యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ 10

పద॥ యాతయామం (1) - గతరసం - పూతి - పర్యుషితం (2) - చ - యత్ ।
ఉచ్ఛిష్టం (3) - అపి - చ - అమేధ్యం (4) - భోజనం - తామసప్రియం ॥

| | | | |
|---|---|---|---|
| యాతయామం | సగము పక్వమైనదిగను | ఉచ్ఛిష్టమపి | భుజించి మిగిలినదిగను |
| గతరసం | సారములేనిదిగను | అమేధ్యం చ | అపవిత్రముగనున్న |
| పూతి | దుర్వాసన గలదిగను | భోజనం యత్ | ఆహారమెయ్యదిగలదో |
| పర్యుషితం చ | పాతది (వంటచేసి ఒకరాత్రి యుంచినట్టిది)గను | (తత్) | అది |
| | | తామస ప్రియం | తామసునికి ప్రియమైనది. |

తా॥ (వంటచేసి) ఒకయామము గడచిన (సగము పక్వమైన) దిగను సారము లేకపోయినదిగను, దుర్వాసనగలదిగను, వండి ఒకరాత్రి యుంచి పెట్టినదిగను, ఒకడు తిని మిగులబెట్టినదిగను, అపవిత్రముగనున్న ఆహారమేదిగలదో అది తామసగుణముగల వానికి ప్రియమైనది. అనగా తామస గుణముగలవాడు ఇట్టి యాహారములలో ప్రీతినుంచునని తాత్పర్యము.

(1) యాతయామం — మందపక్వం = బాగుగ ఉడకనిది (శంకరులు). వండి చాలకాలమైనది (రామానుజులు). ఆరిపోయినది (శ్రీధరులు).

(2) పర్యుషితం - చాలకాలముంచినందున దానికిగల స్వభావమైన రుచిచెడి, వేరేరుచి గలిగినది (రామానుజులు).

(3) ఉచ్ఛిష్టం - గురువు మొదలగు వారికంటె ఇతరులు భుజించి మిగులబెట్టిన ఆహారము (రామానుజులు).

(4) అమేధ్యం - యజ్ఞమునకు యోగ్యము కానట్టిది (శంకరులు). వైశ్వదేవముమొదలగు యజ్ఞములు చేయక భుజించుట అపవిత్రమైనందున అట్టి అశుద్ధిగలది (రామానుజులు).



శ్లో॥ అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః ॥ 11

పద॥ అఫలాకాంక్షిభిః - యజ్ఞం - విధిదృష్టః(1) - యః - ఇజ్యతే ।
యష్టవ్యం - ఏవ - ఇతి - మనః(2) - సమాధాయ(3) - సః — సాత్త్వికః ॥

| | | | |
|---|---|---|---|
| అఫలాకాంక్షిభిః | ఫలమునుగోరనివారలచే | ఇతి మనః | అని మనస్సును |
| విధిదృష్టః | శాస్త్రవిధ్యనుసారముగ | సమాధాయ | స్థిరపరచుకొని |
| | నెఱుంగబడిన | ఇజ్యతే | అనుష్ఠింపబడుచున్నదో |
| యః యజ్ఞః | ఏ యజ్ఞము | సః | అది (ఆ యజ్ఞము) |
| యష్టవ్య మేవ | యజ్ఞము చేయవలసినదే | సాత్త్వికః | సాత్త్వికమైనది. |

తా॥ ఫలము నందిచ్ఛలేనివార్లచే శాస్త్రమువలన నెఱుంగబడిన ఏ యజ్ఞము జేయవలసినదే యని మనస్సును స్థిరపరచుకొని యనుష్ఠింపబడుచున్నదో అట్టి యజ్ఞము సాత్త్వికమైనది.

(1) విధిదిష్టః - అని పాఠము, విధింపబడినదిగనున్న (శ్రీధరులు)

(2-3) మనస్సమాధాయ = నేను చేయునది భగవదారాధనముగనే ఉపయోగపడవలెనని మనస్సును సమాధానముచేసికొని (రామానుజులు).



శ్లో॥ అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసం ॥ 12

పద॥ అభిసంధాయ - తు - ఫలం - దంభార్థం - అపి - చ - ఏవ - యత్ (1) ।
ఇజ్యతే - భరతశ్రేష్ఠ - తం - యజ్ఞం - విద్ధి - రాజసమ్ ॥

| | | | |
|---|---|---|---|
| హే భరతశ్రేష్ఠ ! | ఓ భరతకులశ్రేష్ఠా ! | యత్ ఇజ్యతే | ఏ యజ్ఞము అనుష్ఠింపబడుచున్నదో |
| ఫలం | ఫలమును | తం యజ్ఞం | ఆ యజ్ఞమును |
| అభిసంధాయతు | అపేక్షించిగాని | రాజసం | రాజసముగ |
| దంభార్థమపి చైవ | దంభముకొఱకె గాని | | ఎఱుంగుము. |

తా॥ ఓ భరతకులశ్రేష్ఠుడా! ఫలము నపేక్షించిగాని, దంభమునకైగాని, ఏ యజ్ఞ మనుష్ఠింపబడునో ఆ యజ్ఞమును రాజసమని యెఱుంగుము.

(1) యః - అని పాఠము (రామానుజులు).



శ్లో॥ విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణం ।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ 13

పద॥ విధిహీనం (1) - అసృష్టాన్నం (2) - మంత్రహీనం (3) - అదక్షిణం (4) ।
శ్రద్ధావిరహితం - యజ్ఞం - తామసం - పరిచక్షతే ॥

| | | | |
|---|---|---|---|
| విధిహీనం | విధిలేకయు | శ్రద్ధావిరహితం | శ్రద్ధలేకయు నున్న |
| అసృష్టాన్నం | అన్నదానములేకయు | యజ్ఞం | యజ్ఞమును |
| మంత్రహీనం | మంత్రములేకయు | తామసం | తామసముగ |
| అదక్షిణం | దక్షిణలేకయు | పరిచక్షతే | చెప్పుచున్నారు. |

తా॥ విధిని విడచియు, అన్నదానము, మంత్రము, దక్షిణ, శ్రద్ధ, ఇవి లేకయు జేయబడు యజ్ఞమును తామసమని జెప్పుచున్నారు.

(1) విధిహీనం సదాచారముగల బ్రాహ్మణునిచే యజ్ఞముజేయుమని ప్రేరేపింపబడినదిగానట్టియు (రామానుజులు).

(2) అసృష్టాన్నం-యజ్ఞమునకు కావలసినవిగ విధింపబడియున్న వస్తువులు లేకయు (రామానుజులు).

(3) మంత్రహీనం - స్వరము వర్ణము వీటిని క్రమముగనుచ్చరింపకయు (శంకరులు).

(4) అదక్షిణం - ఆ యజ్ఞమునకు ఏర్పడి యున్నంత దక్షిణలేకయు (రామానుజులు).

(స్వకీయము) ఇట్టి యజ్ఞమునకు ఇంతటి యన్నదానము, ఇంతటి దక్షిణ, ఈ ఈ పదార్థములచేత హోమముచేయవలెననునది మొదలగు విధులు వేదమునందును స్మృతులలోను ఏర్పడియున్నవి. ఆ విధులలో ఒకదానినిగాని విడచి యజ్ఞముజరిపిన ఆ యజ్ఞము నిష్ప్రయోజనమైనదగుట మాత్రముగాదు, దోషముగూడ గలుగగలదు. కావున ఈ విధమైన యజ్ఞము తామసమని చెప్పబడినది.

శ్లో॥ దేవ ద్విజ గురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ 14

పద॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం - శౌచం (1) - ఆర్జవమ్ (2) ।
బ్రహ్మచర్యం (3) - అహింసా - చ - శారీరం - తపః - ఉచ్యతే

| | | | |
|---|---|---|---|
| దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం | దేవతలు బ్రాహ్మణులు గురువులు జ్ఞానులు వీర్లను పూజించుటయు | బ్రహ్మచర్యం అహింసా చ | బ్రహ్మచర్యమున్ను ఇతరులకు చెరువు చేయకుండుటయు |
| శౌచం | శుద్ధియు | శారీరం | శరీరమువలన జేయదగిన |
| ఆర్జవం | ఋజుస్వభావమున్ను (క్రమప్రవర్తనము) | తపః | తపస్సని |
| | | ఉచ్యతే | చెప్పబడుచున్నది. |

తా॥ (బ్రహ్మవిష్ణురుద్రాది) దేవతలు, బ్రాహ్మణులు, గురువులు, జ్ఞానులు వీర్లను పూజించుటయు, దేహమును శుభ్రముగనుంచుకొనుటయు, ఋజుస్వభావమును (సన్మార్గమున ఒకటే విధముగ నడచుటయు), బ్రహ్మచర్యమున్ను, ఇతరులకు కీడు చేయకుండుటయు, శరీరమువలన చేయదగిన తపస్సని చెప్పబడుచున్నది.

(1) శౌచం - దేహమునకు స్నానాదులవలన చేసికొనెడి శుద్ధి (రామానుజులు) దేహమున లోపలను వెలుపలనుశుద్ధి (రాఘవేంద్రులు)

(2) ఆర్జవం - మనస్సువంటి శరీరపునడత (రామానుజులు).

(3) బ్రహ్మచర్యం - స్త్రీలయెడ భోగేచ్ఛగలిగి దానికి తగినచూపు మొదలగునవి లేకుండుట (రామానుజులు).

(స్వకీయము) "స్మరణంకీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం । సంకల్పోధ్యవసాయశ్చక్రియానిర్వృతిరేవచ ॥ ఏతన్మైథునమష్టాంగం ప్రవదన్తివిపశ్చితః । విపరీతంబ్రహ్మచర్యమేతదష్టాంగలక్షణం ॥" క్రింద కనబరచిన యెనిమిది విధములైన కార్యములలో నొకదానినిగాని చేసిన స్త్రీ భోగము చేసినదిగనే యగునని జ్ఞానులు చెప్పుచున్నారు, అవి యెవ్వియన — (1) స్త్రీని తలంచుట, (2) ఆమెపేరును నోటితో నుచ్చరించుట, (3) స్త్రీ వద్ద భోగమున కనుకూలమైన విధమౌర నాటలాడుట, (4) అట్టిభావముతో నామెనుచూచుట, (5) అధమమైనభావముతో

ఆమెతో రహస్యముగ మాటలాడుట, (6) దాని విషయమై ఫలానిదిచేయవలెనని యుద్దేశించుట, (7) దానివిషయమై ఒకనిశ్చయముజేయుట, (8) అవిషయమున తలంపుగొని కార్యమును నెర వేర్చుట ఇట్టి యెనిమిదివిధములైన వ్యాపారములులేకుండుటయే బ్రహ్మచర్యవ్రతమనబడును. ఈ విధమైన శ్లోకములను కఠోపనిషత్తునందును, అగ్నిపురాణము 171 అధ్యా - 9-10-11 శ్లోకములలోను చూడుడు.



శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥　15

పద॥ అనుద్వేగకరం(1) - వాక్యం - సత్యం - ప్రియహితం (2) - చ - యత్ ।
స్వాధ్యాయాభ్యసనం - చ - ఏవ - వాఙ్మయం - తపః - ఉచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| అనుద్వేగకరం | ఇతరులమనస్సు నొప్పించనట్టియు | (తత్) | అదియు |
| | | స్వాధ్యాయాభ్యసనం | వేదాధ్యయనము నభ్యసించుటయు |
| సత్యం | సత్యమైనట్టియు | చైవ | |
| ప్రియహితం చ | సుఖము నిచ్చునట్టియు హితమైనట్టియు | వాఙ్మయం | వాక్కుచే చేయదగిన |
| | | తపః | తపస్సని |
| వాక్యం యత్ | మాట ఏదిగలదో | ఉచ్యతే | చెప్పబడుచున్నది. |

తా॥ ఇతరులమనస్సునకు కష్టము గలుగజేయక, వాస్తవమై, సుఖము నివ్వదగి, హితమైనమాటయు, వేదశాస్త్రములయొక్క అభ్యాసమున్ను ఏవి గలవో అవి వాక్కుచే చేయదగినతపస్సని చెప్పబడుచున్నవి.

(1) అనుద్వేగకరం - ఇతరులకు చెరుపుజేయనట్టియు (రాఘవేంద్రులు).

(2) ప్రియహితం - వినుటకు ప్రియమైనట్టియు (రాఘవేంద్రులు) తరువాత సుఖము నివ్వదగినట్టియు (శంకరులు, శ్రీధరులు)

అనుద్వేగకరం - సత్యం - ప్రియహితం - వీటిలో ఏదైన ఒకటిలేకున్నను అదివాక్కుచే జేసెడి తపస్సు గానేరదు. (శంకరులు)

శ్లో॥ మనఃప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే ॥　16

పద॥ మనఃప్రసాదః (1) - సౌమ్యత్వం (2) - మౌనం (3) - ఆత్మవినిగ్రహః(4) ।
భావసంశుద్ధిః (5) - ఇతి - ఏతత్ - తపః - మానసం - ఉచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| మనః ప్రసాదః | మనస్సుయొక్క స్వచ్ఛత | భావసంశుద్ధిః | హృదయపరిశుభ్రత |
| సౌమ్యత్వం | మంచిమనస్సు గలిగియుండుట | ఇత్యేతత్ | అను నిది |
| మౌనం | మౌనము (భగవంతుని ధ్యానించుచుండుట) | మానసం | మనస్సుచే చేయదగిన |
| | | తపః | తపస్సని |
| ఆత్మవినిగ్రహః | తన్ను అణచుకొనుట | ఉచ్యతే | చెప్పబడుచున్నది. |

తా॥ మనస్సు మంచివృత్తిలో నిలకడగనుంచుటయు, మంచిమనస్సు గలిగి యుండుటయు, భగవంతుని ధ్యానించుచుండుటయు, తన్ను అణచు కొనుటయు, కపటము లేకుండుటయు, మనస్సుచే చేయదగిన తపస్సు అని చెప్పబడుచున్నవి.

(1) మనః ప్రసాదః - మనస్సును శుద్ధముగా నుంచుచుండుట (శంకరులు), కోపము మొదలగునవి లేకుండుట (రామానుజులు).

(2) సౌమ్యత్వం - ముఖసౌమ్యమువలన తెలుసుకొనదగిన అంతఃకరణవృత్తి, లేక శాంతముగ నుండుట.

(3) మౌనం - మాటలాడకయుండుట. మాటలాడకయుండుట వాక్కు యొక్క వ్యాపారము కావున మనస్సుయొక్క వ్యాపారముగ నెట్లు చెప్పదగుననగా మనస్సుయొక్క ప్రేరేపణచేతనే వాక్కు మాటలాడుచున్నది. మనస్సు వాక్కును ప్రేరేపింపక యూరకయుండినచో వాక్కుగూడ నిలిచిపోవును. కావున వాక్కును నిలబెట్టుటయనెడి మౌనము మనస్సు యొక్క వ్యాపారముగ జెప్పబడియున్నది. (శంకరులు) మనస్సుచేత వాక్కు నర్థగించుట (రామానుజులు)

(4) ఆత్మవినిగ్రహః — ధ్యానింపదగినవస్తువునందు మనస్సును నిలబెట్టుట (రామానుజులు). పరమాత్మయెడ మనస్సును స్థాపించుట (రాఘవేంద్రులు)

(5) భావసంశుద్ధిః - ఇతరులతో వ్యవహారములను నడుపుటలో మోసముచేయకుండుట (శంకరులు, శ్రీధరులు), ఆత్మతప్ప ఇతరవిషయములలో చింతలేకుండుట (రామానుజులు). మనశ్శుద్ధిని గలుగజేసికొనుట. అనగా ఇచ్ఛలేకుండుట (రాఘవేంద్రులు).

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥ 17

పద॥ శ్రద్ధయా - పరయా - తప్తం - తపః - తత్ - త్రివిధం - నరైః ।
అఫలాకాంక్షిభిః - యుక్తైః (1) - సాత్త్వికం - పరిచక్షతే ॥

| | | | |
|---|---|---|---|
| అఫలాకాంక్షిభిః | ఫలమునుగోరని | తప్తం | చేయబడిన |
| యుక్తైః | ఒక నిలకడ జెందిన | తత్ త్రివిధం | ఆ మూడువిధములైన |
| నరైః | మనుష్యులచే | తపః | తపస్సును |
| పరయా | శ్రేష్ఠమైన | సాత్త్వికం | సాత్త్వికమైనదని |
| శ్రద్ధయా | శ్రద్ధతో | పరిచక్షతే | (పెద్దలు) చెప్పుచున్నారు. |

తా॥ ఫలాపేక్షలేకయు, (ఇతరవిషయములలో ప్రవర్తించని) ఒకటేవిధమైన మనస్సుతో గూడియున్న జనులచే శ్రేష్ఠమైనశ్రద్ధతో జేయబడిన (శారీరము వాచికము మానసికమునను) ఆ మూడువిధములైన తపస్సును సాత్త్వికమైనదని పెద్దలు చెప్పుచున్నారు.

(1) యుక్తైః - పరమపురుషునియొక్క ఆరాధనమనెడి నిశ్చయముతోగూడిన (రామానుజులు), భగవత్స్వరూపలక్షణ జ్ఞానయోగముతోగూడిన (రాఘవేంద్రులు).

(స్వకీయము) ఈ యధ్యాయమున 14-15-16 శ్లోకములలో జెప్పబడియున్నట్లు దేహము వాక్కు మనస్సు వీటివలన ఫలాపేక్షలేక పరమాత్మ యొక్కనియందే నిలబెట్టిన మనస్సుతోను శ్రద్ధతోను జేయబడు తపస్సు సాత్త్వికమైనదని ఈ శ్లోకముచే వ్యక్తపఱుపబడినది.

॥ సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువం ॥ 18

పద॥ సత్కారమానపూజార్థం (1) - తపః - దంభేన (2) - చ - ఏవ - యత్ ।
క్రియతే-తత్-ఇహ-ప్రోక్తం - రాజసం-చలం (3) - అధ్రువం (4) ॥

| | | | |
|---|---|---|---|
| యత్ తపః | ఏ తపస్సు | తత్ రాజసం | అది రాజసమైనదని |
| సత్కారమానపూజార్థం | ఉపచారము, మతింపు, పూజ. వీటికై | ప్రోక్తం | చెప్పబడియున్నది |
| | | చలం | చంచలమైనది |
| దంభేన చైవ | డంబముచేతనే | అధ్రువం | స్థిరముకానిది |
| క్రియతే | చేయబడుచున్నదో | ఇహ | ఈ లోకమున నున్నట్టిది |

తా॥ ఏ తపస్సు ఉపచారము, మతింపు, పూజ, వీటికై డంబముచేత చేయబడుచున్నదో అది రాజసమైనదని చెప్పబడియున్నది. చంచలమైనదియు స్థిరము కానిదియునైన ఆ తపస్సు ఈ లోకముననున్నట్టిది.

(1) సత్కారమానపూజార్థం - "ఇతడు తపస్వి" అనునది మొదలగు వాటిచే వాక్కుతో స్తుతించుట సత్కారము. చూచినతోడనేలేచి నమస్కారము మొదలగునవి జేయుట, దేహముచే జేసెడి పూజ, మానము. బహుమతిబడయుట, పాదపూజ, మొదలగునవి పూజ (శంకర శ్రీధరులు). మనస్సుచే ఆరాధించుట సత్కారము, వాక్కుచే పొగడుట మానము, శరీరముచేత నమస్కారాదులను జేయుట పూజ (రామానుజులు, రాఘవేంద్రులు).

(2) దంభేన - మంచి యోగ్యుడైనవాడు తాను జేయునది ఈశ్వరప్రీతి కావలెనను తలంపుతో నెట్లు భయభక్తి విశ్వాసములతో నడచునో అటువంటి భావనమాత్రము చూపుట (ఆనందగిరి).

(3) చలం - నియమములేని (శ్రీధరులు). స్వర్గాదిఫలము నిచ్చుటవలన నిత్యముకానిది (రామానుజులు),

(4) అధ్రువం - ఏదో ఒక కాలమున ఫలమునివ్వదగినది (శంకరులు).

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థంవా తత్తామసముదాహృతం ॥ 19

పద॥ మూఢగ్రాహేణ (1) - ఆత్మనః (2) - యత్ - పీడయా (3) - క్రియతే - తపః ।
పరస్య - ఉత్సాదనార్థం - వా - తత్ - తామసం - ఉదాహృతం ॥

| | | | |
|---|---|---|---|
| మూఢగ్రాహేణ | అవివేక నిశ్చయముచేత | క్రియతే | చేయబడుచున్నదో |
| యత్ | ఏ | వా పరస్య | లేక, అన్యునియొక్క |
| తపః | తపస్సు | ఉత్సాదనార్థం వా | నాశముకొఱకైగాని |
| ఆత్మనః పీడయా | తనదేహమును హింసించుకొని | (క్రియతే) | చేయబడుచున్నదో |

| | | | |
|---|---|---|---|
| తత్ | ఆ తపస్సు | ఉదాహృతం | చెప్పబడియున్నది |
| తామసం | తామసమని | | |

తా॥ అవివేక నిశ్చయముచే ఏ తపస్సు తన దేహమును హింసించుకొని చేయబడుచున్నదో, లేక అన్యునియొక్క నాశముకొఱకై (అభిచారరూపమైన శూన్యాదులు మూలముగ) చేయబడుచున్నదో అది తామసమని చెప్పబడు చున్నది.

(1) మూఢగ్రాహేణ - అవివేకముతోగూడిన దురాగ్రహముచేత (రాఘవేంద్రులు).

(2) ఆత్మనః - పీడయా - తన శక్తికిమించిన పనులను చేయుటవలన గలుగునట్టి తనయొక్క దేహ పీడచేత (రామానుజులు). తన పోషణకై (రాఘవేంద్రులు).

శ్లో॥ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతం॥ 20

పద॥ దాతవ్యం (1) - ఇతి - యత్ - దానం - దీయతే - అనుపకారిణే (2)।
దేశే (3) - కాలే (4) - చ - పాత్రే (5) - చ - తత్ - దానం - సాత్త్వికం - స్మృతం॥

| | | | |
|---|---|---|---|
| దాతవ్యమితి | ఇవ్వవలసినది తనకర్తవ్యమను తలంపుతో | పాత్రే | వేదశాస్త్రసంపన్నుడైన యోగ్యుని కొఱకు |
| యత్ దానం | ఏ దానము | దీయతే | ఇవ్వబడుచున్నదో |
| దేశే చ | పుణ్యదేశమునందును | తత్ దానం | ఆ దానము |
| కాలే చ | గ్రహణాదిపుణ్యకాలములలోను | సాత్త్వికం | సాత్త్వికమైనదని |
| అనుపకారిణే | ప్రత్యుపకారము చేయ యోగ్యతలేని | స్మృతం | చెప్పబడియున్నది, లేక స్మరింప బడియున్నది |

తా॥ ఇవ్వవలసినది కర్తవ్యమను తలంపుతో ఏదానము పుణ్యదేశము నందును గ్రహణాది పుణ్యకాలమునందును ప్రత్యుపకారము చేయుటకు యోగ్యతలేని వేదశాస్త్రసంపన్నుడైన యోగ్యునికొఱకు ఇవ్వబడుచున్నదో ఆ దానము సాత్త్వికమైనదని చెప్పబడియున్నది.

(1) దాతవ్యం - భగవదర్పితము గావలెనను నిశ్చయముతో (రామానుజులు). ఆస్తిక్యబుద్ధి (రాఘ వేంద్రులు).

(2) అనుపకారిణే - ప్రత్యుపకారముచేయ నసమర్థుడు, లేక ప్రత్యుపకారము చేయగలిగినవాడైనను ప్రత్యుపకారమునకై తనచే ఎదురుచూడబడనివాడు (శంకరులు). మునుపు తన కుప కారము చేసినవానికొఱకు కాక. (స్వకీయము).

(3) దేశే - కురుక్షేత్రము మొదలగు పుణ్యదేశమున (శంకరులు, శ్రీధరులు).

(4) కాలే - సంక్రాంతి మొదలగు పుణ్యకాలమున (శంకరులు).

(5) పాత్రే - వేదార్థముల నెఱింగిన బ్రహ్మజ్ఞానులు మొదలగువారియెడ (శంకరులు). సత్పాత్రమున (రాఘవేంద్రులు). రక్షించువానికొఱకు అనగా దానమిచ్చినవానిని ఆపదనుండి నివర్తింపజేయువాడనునది తాత్పర్యము (శ్రీధరులు).

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్రాజసముదాహృతమ్॥ 21

పద॥ యత్ - తు - ప్రత్యుపకారార్థం (1) - ఫలం - ఉద్దిశ్య - వా - పునః।
దీయతే - చ - పరిక్లిష్టం (2) - తత్ - రాజసం - ఉదాహృతం॥

| | | | |
|---|---|---|---|
| యత్తుపునః | మఱి ఏదానము | పరిక్లిష్టం చ | కష్టముతోగాని |
| ప్రత్యుపకారార్థం | ప్రత్యుపకారమునుద్దేశించి గాని | దీయతే చ | ఇవ్వబడునో |
| | | తత్ | అది |
| ఫలం ఉద్దిశ్యవా | (స్వర్గాది)ఫలమునుద్దేశించి గాని | రాజసం | రాజసమని |
| | | ఉదాహృతం | చెప్పబడియున్నది |

తా॥ ప్రత్యుపకారము నుద్దేశించిగాని, స్వర్గాదిఫలము నుద్దేశించిగాని, మనోదుఃఖముతోగాని, ఏ దానమివ్వబడునో అది రాజసమైనదని చెప్పబడియున్నది.

(1) ప్రత్యుపకారార్థం - మునుపు తనకు జేసియున్న ఉపకారమునకు ప్రతి ప్రయోజనముగ (స్వకీయము).

(2) పరిక్లిష్టం-అమంగళమైన ద్రవ్యముగల (రామానుజులు). అన్యాయార్జితముగల (రాఘవేంద్రులు)



శ్లో॥ అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతం॥ 22

పద॥ అదేశకాలే (1) - యత్ - దానం - అపాత్రేభ్యః (2) - చ - దీయతే।
అసత్కృతం - అవజ్ఞాతం - తత్ - తామసం - ఉదాహృతం॥

| | | | |
|---|---|---|---|
| అదేశకాలే | అశుద్ధమైనచోటను అకాలమునందును | యత్ దానం | ఏదానము |
| | | దీయతే | ఇవ్వబడుచున్నదో |
| అపాత్రేభ్యః | అయోగ్యులకొఱకును | తత్ | అది |
| అసత్కృతం | పూజ మొదలగునవి చేయకయు | తామసం | తామసమైనదని |
| అవజ్ఞాతం చ | అమర్యాదతోను | ఉదాహృతం | చెప్పబడియున్నది. |

తా॥ అపవిత్రమైన దేశమునందును, అకాలమునందును, అయోగ్యులకొఱకును, పూజ మొదలగునవి చేయకయు, అమర్యాదతోను ఏ దానమివ్వబడునో అది తామసమని చెప్పబడుచున్నది.

(శంకరులు, (శ్రీధరులు) దేశము, కాలము, పాత్రము, వీటికి తగినదిగ లేకుండునదియు, పూజ మర్యాద ఇవిలేనిదియునగు దానము తామసమగును.

(1) అదేశకాలే - మ్లేచ్ఛులయొక్కయు అశుచి వ్యాపించియున్నట్టియు దేశమున, అకాలే = సంక్రమణము మొదలగు విశేషములులేని కాలమున (శంకరులు). తాను అశుచిగనుండు కాలమున (శ్రీధరులు).

(2) అపాత్రేభ్యః - మూర్ఖులు దొంగలు మొదలగువార్లకొరకు (శంకరులు). నటుడు, విటుడు, పాటగాడు మొదలగు వార్లకై (శ్రీధరులు).

శ్లో॥ ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధస్స్మృతః।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 23

పద॥ ఓం - తత్ - సత్ - ఇతి - నిర్దేశః - బ్రహ్మణః - త్రివిధః - స్మృతః (1)।
బ్రాహ్మణాః - తేన - వేదాః - చ - యజ్ఞాః - చ - విహితాః - పురా ॥

| | | | |
|---|---|---|---|
| ఓం | ఓం | తేన | ఆ పేర్లచేత, లేకదానిచే |
| తత్ | తత్ | బ్రాహ్మణాః | బ్రాహ్మణులున్ను |
| సత్ | సత్ | వేదాశ్చ | వేదములున్ను |
| ఇతి | అనునది | యజ్ఞాశ్చ | యజ్ఞములున్ను |
| బ్రహ్మణః | పరబ్రహ్మముయొక్క | పురా | ఆదికాలమున |
| త్రివిధః నిర్దేశః | మూడువిధములైన పేరుగా | విహితాః | సృష్టింపబడిరి |
| స్మృతః | స్మరింప(గ్రహింప)బడియున్నది | | |

తా॥ 'ఓం, తత్, సత్' అనునవి పరబ్రహ్మముయొక్క మూడు విధములైన పేర్లు అని జ్ఞానులవలన చెప్పబడియున్నవి. ఆ పేర్లచే బ్రాహ్మణులున్ను వేదములున్ను యజ్ఞములున్ను ఆదికాలమున సృష్టింపబడిరి.

(1) స్మృతః - బ్రహ్మజ్ఞానులవలన వేదాంతములద్వారా నిశ్చయింపబడియున్నది (శంకరులు). శిష్టులవలన చెప్పబడియున్నది. (శ్రీధరులు).

(శ్రీధరులు) ఓం అనునది బ్రహ్మముయొక్క నామమని ఉపనిషత్తున పలుచోట్ల చెప్పబడియున్నది. జగత్తునకు కారణముగను, జ్ఞానులచే చూడబడినదిగనునున్నందున పరబ్రహ్మము తత్ అని చెప్పబడుచున్నది. నాశములేనట్టియు, వాస్తవమైనట్టియు, ఉత్తమమైనట్టియు, వస్తువు ఏదిగలదో అది (బ్రహ్మము) సత్తనిచెప్పబడుచున్నది ఈ పేర్లనుగొని బ్రహ్మచే బ్రాహ్మణులు, వేదము, యజ్ఞము, వీరలు సృష్టింపబడిరి. లేక పైకనిన మూడు పేర్లు బడసిన బ్రహ్మముచే బ్రాహ్మణాదులు సృష్టింపబడిరి. లేక పరిశుభ్రముగ సృష్టింపబడిరి. కావున బ్రహ్మముయొక్క పేర్లుగ చెప్పబడుచున్నవి.

(రామానుజులు) బ్రహ్మణః = వేదోక్తమైన యజ్ఞాదికర్మకు, ఓం తత్ సత్ అను మూడు విధములైన శబ్దములున్ను, స్మృతః = అంటినవిగనున్నవి. ఎట్లనగా ఓం అనుశబ్దమును యజ్ఞాది కర్మలకు అంగముగ మొదట నుచ్చరించునట్లును, తత్ సత్ వీటిని ఆకర్మలకు యోగ్యతను గలుగ జేయుటకై కర్మకు అంత్యమున ఉచ్చరించునట్లును వేదమున విధింపబడియున్నది. కావున ఓం తత్ సత్ అనునవి వేదోక్తకర్మల నంటినవిగ చెప్పబడినవి. తేన ఆ మూడు శబ్దములచేత,

బ్రాహ్మణాః = వేదాధికారులైన (బ్రహ్మ క్షత్రియ వైశ్యులనెడి) మూడు వర్ణపువారలున్ను, వేదాశ్చ= వేదములున్ను యజ్ఞాశ్చ=యజ్ఞములున్ను, పురా=ఆదికాలమున, విహితాః=సృష్టింపబడిరి.

(రాఘవేంద్రులు) ఓం తత్ సత్ ఇవి మూడున్ను, బ్రహ్మణః = బ్రహ్మముయొక్క పేర్లు, ఆపేర్లను ఏల బ్రహ్మమునకు చెప్పవలెననగా సకల జగత్తును ధరించుటవలన ఓం అనియు, గుణములవలన వ్యాపించియుండుట లేక జ్ఞానులవలన చూడబడుటవలన తత్ అనియు, నిర్దోష ముగను శుభగుణ పూర్ణముగను నున్నందున సత్ అనియు శ్రుతులలో జెప్పబడియున్నందుననే. తేన = ఆ బ్రహ్మముచేత బ్రాహ్మణులు వేదములు, యజ్ఞములు, ఇవి యేర్పరచబడినవి.

(స్వకీయము) మనోవాక్కాయములవలన జేయబడు యజ్ఞ దాన తపస్సులనెడి కర్మలలో రాజస తామస కర్మలుగూడ బ్రహ్మముయొక్క నామములైన ఓం తత్ సత్ అనువాటిని ముగింపున ఉచ్చరించినచో సాత్త్వికమగుననియే తాత్పర్యము ఈ తాత్పర్యమును శ్రీధరస్వాములు ఆదరించు చున్నారు. మఱియు వేదము మొదలగునవి సృష్టింపబడినవనిన వేదము అనాదియను వాక్యము నకు విరోధమువచ్చును గదా యనిన విరోధముకాదు. ప్రతి సృష్టికాలమునందును వేదాదులు సృష్టి కర్తమూలముగ వెలువడుచున్నవి. ఇదియే సృష్టియనబడుచున్నది.



శ్లో॥ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥ 24

పద॥ తస్మాత్ - ఓం - ఇతి - ఉదాహృత్య - యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తన్తే - విధానోక్తాః - సతతం - బ్రహ్మవాదినాం ॥

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | (ఓం తత్ సత్ ఇవి మూడున్ను పరబ్రహ్మయొక్క నామ ములు) కావున | యజ్ఞదానతపఃక్రియాః | యజ్ఞదానతపస్సులనెడి క్రియలు |
| | | ఓం ఇతి | ఓం అని |
| | | ఉదాహృత్య | ఉచ్చరించి |
| బ్రహ్మవాదినాం | వేదమును బాగుగ నెఱింగిన వారలయొక్క | సతతం | ఎల్లప్పుడున్ను |
| | | ప్రవర్తన్తే | మొదలుపెట్టబడుచున్నవి (ప్రవర్తించుచున్నవి.) |
| విధానోక్తాః | శాస్త్రోక్తములైన | | |

తా॥ ఓం తత్ సత్ ఇవి బ్రహ్మముయొక్క నామములైనందున వేద మును బాగుగ నెఱింగిన వారలయొక్క శాస్త్రోక్తములైన యజ్ఞ దాన తపస్సు లనెడి క్రియలు ఓం అని ఉచ్చరించి ఎల్లప్పుడు నారంభింపబడుచున్నవి.

(శ్రీధరులు, రాఘవేంద్రులు) యజ్ఞాదిక్రియలను ఆరంభించగా ఓం అనుదానిని ఉచ్చ రించుట వలన ఆ క్రియలలో మంత్రతంత్రాదులయొక్క కొఱతవలన గలుగు దోషములు తొలగి ఆ క్రియలు సాద్గుణ్య మొందుచున్నవి. (సఫలములగుచున్నవి.)

శ్లో॥ తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః క్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః ॥ 25

పద॥ తత్ - ఇతి - అనభిసంధాయ - ఫలం - యజ్ఞతపః క్రియాః (1)
దానక్రియాః - చ - వివిధాః - క్రియన్తే - మోక్షకాంక్షిభిః ॥

| | | | |
|---|---|---|---|
| మోక్షకాంక్షిభిః | మోక్షమును వెదకువార్లచే | ఫలం అనభిసంధాయ | ఫలమును గోరక |
| యజ్ఞతపః క్రియా | యజ్ఞతపస్సులనెడి కర్మలున్ను | తత్ ఇతి | తత్ అని ఉచ్చరించి |
| వివిధాః దానక్రియాశ్చ | అనేకవిధములైన దానకర్మలున్ను. | క్రియన్తే | చేయబడుచున్నవి |

తా॥ మోక్షాపేక్షగలవారలచే యజ్ఞతపస్సులనెడి కర్మలున్ను అనేక విధములైన దానములనెడి క్రియలున్ను ఫలమును కోరక, తత్ అని ఉచ్చరించి చేయబడుచున్నవి.

(1) యజ్ఞతపః క్రియాః - యజ్ఞః = అగ్నిహోత్రము మొదలైనవి. తపః = శరీరము వాక్కు మనస్సు వీటిచే చేయబడినది. (రాఘవేంద్రులు)

---

శ్లో॥ సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥ 26

పద॥ సద్భావే (1) - సాధుభావే (2) - చ - సత్ - ఇతి - ఏతత్ - ప్రయుజ్యతే ।
ప్రశస్తే (3) - కర్మణి (4) - తథా - సచ్ఛబ్దః - పార్థ - యుజ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ ! | ఓ పార్థా ! | తథా | ఆ విధముగనే |
| సత్ ఇతి ఏతత్ | సత్ అను ఈపదము | ప్రశస్తే కర్మణి | మంగళకరమైన వివాహాది కార్యమునందును |
| సద్భావే | ఉన్నది అను అర్థములోను | | |
| సాధుభావే చ | మంచి స్వభావము అను అర్థములోను | సచ్ఛబ్దః | సత్ అను శబ్దము ప్రయోగింపబడుచున్నది. |
| ప్రయుజ్యతే | ఉపయోగింపబడుచున్నది. | | |

తా॥ ఓ పార్థ! సత్ అను పదము ఉన్నట్టిది అను నర్థములోను, మంచి తనము అను నర్థములోను ఉపయోగింపబడుచున్నది. అవిధముగనే మంగళ కరమైన వివాహాది కార్యమునందును సత్ అను శబ్దము ప్రయోగింపబడు చున్నది.

(1) సద్భావే - ఒకనికి లేనివస్తువు కలిగినను, లేక దొరకినను అట్లుగలిగిన, లేక లభించిన వస్తువు సత్తని చెప్పబడుచున్నది. ఎట్లనగా — పుత్రుడులేని వారికి పుత్రుడుగలిగిన ఆ పుత్రుని సత్ అని చెప్పుటగలదు. (శంకరులు, శ్రీధరులు, రాఘవేంద్రులు, మధ్వులు.)

(2) సాధుభావే - అయోగ్యుడు యోగ్యుడైనచో అతనిని సత్తనియు చెప్పవచ్చును (శంకరులు). మంచిదను నర్థములోను (రామానుజులు). ఉత్తమమైన వస్తువునందును (మధ్వులు).

(3-4) ప్రశస్తేకర్మణి - లోకమందలి మంచికార్యములలోను (రామానుజులు)

---

శ్లో॥ యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥ 27

పద॥ యజ్ఞే - తపసి - దానే - చ - స్థితిః (1) - సత్ - ఇతి - చ - ఉచ్యతే (2) ।
కర్మ (3) చ - ఏవ - తదర్థీయం (4) - సత్ - ఇతి - ఏవ - అభిధీయతే ॥

| | | | |
|---|---|---|---|
| యజ్ఞే చ | యజ్ఞమునందును | తదర్థీయం కర్మచైవ | బ్రహ్మోద్దేశమైన పూజాదు లున్ను వాటికి సహాయములైన కర్మలున్ను, లేక వాటి నాశ్ర యించినకర్మయు |
| తపసి | తపస్సునందును | | |
| దానే చ | దానమునందును | | |
| స్థితిః | నిలకడగనుండుట | | |
| సత్ ఇతి | సత్ అని | సత్ ఇత్యేవ | సత్ అనియే |
| ఉచ్యతే | చెప్పబడుచున్నది | అభిధీయతే | చెప్పబడుచున్నది. |

తా॥ యజ్ఞమునందును, తపస్సునందును, దానమునందును, (నిలకడగను దృఢముగను జేయుటయనెడి) నిష్ఠయైనది సత్తని చెప్పబడుచున్నది. బ్రహ్మోద్దేశమైన పూజలున్ను, వాటికి సహాయపడుకర్మలుగూడ సత్ అనియే చెప్పబడుచున్నవి.

(1) స్థితిః - నిష్ఠ, అనగా చేయబడు యజ్ఞాదులు భగవదర్పణము కావలయుననుతలంపు (రాఘవేంద్రులు).

(2) ఉచ్యతే - జ్ఞానులచే చెప్పబడుచున్నది. (శంకరులు).

(3-4) తదర్థీయం కర్మ - యజ్ఞ దాన తపస్సుల కనుకూలమైన ధర్మములు, లేక బ్రహ్మము యొక్క ఆరాధనకనుకూలమైన కర్మలు (శంకరులు, మధ్వులు). మనస్సుచేతను, వాక్కుచేతను జేసెడి పూజాదులేగాక, దేహముచేనమస్కారాదులున్ను, గుడికట్టుట, గుడిలో భగవదుద్దేశముగ పరిచర్యచేయుట మొదలగునవియు, దానికి సహాయమైన గుడినిగట్టుటకు ద్రవ్యము సంపాదించుట, పూజకు పుష్పాదులు దొఱకుటకై నందవన ముంచుట మొదలగునవియు (శ్రీధరులు). మూడువర్ణముల వార్లకున్ను తగినకర్మ లున్ను (రామానుజులు).

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28

పద॥ అశ్రద్ధయా - హుతం - దత్తం - తపః - తప్తం - కృతం - చ - యత్ ।
అసత్ - ఇతి - ఉచ్యతే - పార్థ - న - చ - తత్ ప్రేత్య - నో - ఇహ

| | | | |
|---|---|---|---|
| హే పార్థ ! | ఓ పార్థా ! | అసదితి | అసత్తని |
| అశ్రద్ధయా | శ్రద్ధలేక | ఉచ్యతే | చెప్పబడుచున్నది |
| హుతం | చేసిన హోమమున్ను | తత్ | అది |
| దత్తం | ఇచ్చిన దానమున్ను | ప్రేత్య | పరలోకమునకున్ను |
| తప్తం తపః | చేయబడిన తపస్సున్ను | న | (ప్రయోజనము) లేదు |
| కృతం | చేయబడిన (మిగతకర్మ) | ఇహ చ | ఈ లోకమునకున్ను |
| యత్ | ఏదిగలదో | నో | (ప్రయోజనము) లేదు. |
| (తత్ చ) | అదియు | | |

తా॥ ఓ పార్థా! శ్రద్ధలేక చేయబడిన హోమ (హవన) మున్ను, దానమున్ను, తపస్సున్ను, మిగత కర్మ ఏదిగలదో అదియును అసత్తని చెప్పబడుచున్నది. (అట్టి హోమదానాదికర్మలు) పరలోకమునందును ఈ లోకమునందును ప్రయోజనము లేకపోవుచున్నవి.

(రామానుజులు) ఎందువలన అసత్తనగా ఈ లోకమునందుగాని, పరలోకమునందుగాని ఫలమివ్వనందుననే.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే శ్రద్ధాత్రయ విభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః.

శ్రీమద్భగవద్గీతలుగ ఉపనిషత్తులుగ బ్రహ్మవిద్యగ యోగశాస్త్రముగ నున్న
శ్రీకృష్ణార్జున సంవాదమున శ్రద్ధాత్రయ విభాగయోగమనెడి
పదునేడవ అధ్యాయము ముగిసెను.

ఓం తత్ సత్.

శ్రీ ర స్తు

అ ష్టా ద శా ధ్యా య ప్రా ర ం భః.

# ప దు నె ని మి ద వ అ ధ్యా య ము

## (మో క్ష స న్న్యా స యో గ ము)



అర్జున ఉవాచః—

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుం।
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన॥

పద॥ సన్న్యాసస్య (1) - మహాబాహో - తత్త్వం - ఇచ్ఛామి - వేదితుం।
త్యాగస్య (2) - చ - హృషీకేశ - పృథక్ - కేశినిషూదన (3)॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | తత్త్వం | వాస్తవమునున్ను |
| హే మహాబాహో! | ఓ భుజపరాక్రమముగలవాడా! | త్యాగస్య | త్యాగమను దానియొక్క |
| హృషీకేశ, కేశినిషూదన | ఇంద్రియములకు నియామకుడవును, కేశియను రాక్షసుని జంపినవాడవునైన హృషీకేశా! | తత్త్వం చ | వాస్తవమునున్ను |
| | | పృథక్ | ప్రత్యేకముగా (సవిస్తరముగ) |
| | | వేదితుం | ఎఱుంగుటకు |
| | | ఇచ్ఛామి | కోరుచున్నాను. |
| సన్న్యాసస్య | సన్న్యాసమను దానియొక్క | | |

తా॥ అర్జునుడు కృష్ణపరమాత్మనుగూర్చి చెప్పునది. ఓ భుజబలముగల వాడా! ఇంద్రియములకు నియామకుడవున్ను కేశియను రాక్షసుని చంపినవాడవునైన హృషీకేశా! సన్న్యాసముయొక్కయు త్యాగముయొక్కయు తత్త్వమును (స్వభావమును) ప్రత్యేకించి ఎఱుంగగోరుచున్నాను.

(1-2) సన్న్యాసస్య - త్యాగస్య - సన్న్యాసమను పదమునకున్ను, త్యాగమను పదమునకున్ను తత్త్వం = స్వభావమైన అర్థమును (శంకరులు).

(3) కేశినిషూదన - గుఱ్ఱము రూపముతో నోరు తెరచుకొని యుద్ధమునకువచ్చిన కేశియను రాక్షసుని శ్రీకృష్ణపరమాత్మ అతని నోట తన చేతనుంచి ఆ చేతిని వృద్ధిపరచి దానివలన నతడు నోరుచీలి మరణించునట్లుచేసినందున ఈ పేరువచ్చినది. దానివలననే గొప్ప భుజములు గలవాడనియు చెప్పబడుచున్నాడు (శ్రీధరులు).

(శంకరులు) సకల వేదార్థమగు గీతార్థమంతటిని సంగ్రహించి ఈ యధ్యాయమున జెప్పుచున్నారు.

(శ్రీధరులు) "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖంవశీ" (అధ్యా 5, శ్లో॥ 13) అను దానివలన సకలకర్మలను మనస్సుచే విడిచినవాడు సుఖముగనుండుననియు "సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి" (అధ్యా 9, శ్లో॥ 28) అనుదానివలన సకలకర్మలను విడిచిన

వాడు మోక్ష మొందుచున్నాడనియు 'త్యక్త్వా కర్మ ఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః" (అధ్యా- 4, శ్లో॥ 20) "సర్వకర్మ ఫలత్యాగం తతః కురుయతాత్మవాన్'' (అధ్యా - 12, శ్లో॥ 11) వీటివలన సకలకర్మలయొక్క ఫలమును త్యాగము చేయవలయుననియు చెప్పబడియున్నది. ఇది పరస్పరము విరుద్ధముగ గనబడుచున్నది. కావున అర్జునుడు సందేహించి యడుగుచున్నాడు.

(రామానుజులు) ఈ యధ్యాయమున మోక్షసాధనముగ గుర్తింపబడియున్న సన్న్యాసము త్యాగము రెండు నొక్కటేయనియు, త్యాగముయొక్క స్వరూపము సకలకర్మలకును కర్త భగవంతుడే అనునను సంధానమున్ను, సత్త్వము, రజస్సు, తమస్సనెడి గుణములను వర్ణించుటవలన సత్త్వము నవశ్యముగ గ్రహింపవలెననియు, ఆ యా వర్ణములవారికి స్వభావముగనున్న కర్మననుష్ఠించుటవలన పరమపురుషప్రాప్తికి అది హేతువుగనున్నదనియు, సకల గీతాశాస్త్రసారమగు భక్తియోగమున్ను చెప్పబడుచున్నవి. ఈ శ్లోకమునందు క్రింద గనబరచిన శ్రుతులలో మోక్ష హేతువుగ జెప్పబడు సన్న్యాసము, త్యాగము రెండు నొక్కటేనా? లేక వేర్వేరైనవా? అని యడుగబడుచున్నది. ''న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః'' ''వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాస్సన్న్యాస యోగాద్యతయశ్శుద్ధసత్త్వాః। తే బ్రహ్మలోకే తు పరాంతకాలే పరామృతాత్పరిముచ్యన్తి సర్వే'' (కైవల్యోపనిషత్తును చూడుడు.)

భగవానువాచ :—

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥

పద॥ కామ్యానాం - కర్మణాం - న్యాసం - సన్న్యాసం - కవయః - విదుః।
సర్వకర్మఫలత్యాగం - ప్రాహుః - త్యాగం - విచక్షణాః॥

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవానువాచ | శ్రీకృష్ణపరమాత్మ చెప్పినది | విదుః | ఎరుంగుచున్నారు. |
| కామ్యానాం కర్మణాం న్యాసం | కామ్య కర్మలయొక్క పరిత్యాగమును (విడిచిపెట్టుటను) | సర్వకర్మ ఫలత్యాగం | సకల కర్మల ఫలమును విడిచిపెట్టుటను |
| | | త్యాగం | త్యాగమని |
| సన్న్యాసం | సన్న్యాసమని | విచక్షణాః | విద్వాంసులు |
| కవయః | పండితులు (జ్ఞానులు) | ప్రాహుః | చెప్పుచున్నారు. |

తా॥ శ్రీకృష్ణపరమాత్మ అర్జునునిగూర్చి చెప్పునది — కామ్యకర్మలయొక్క పరిత్యాగమును సన్న్యాసమని పండితు లెరుంగుచున్నారు. సకల కర్మల ఫలమును త్యజించుటను త్యాగమని విద్వాంసులు చెప్పుచున్నారు.

(శ్రీధరులు) "జ్యోతిష్టోమేన స్వర్గకామోయజేత'' స్వర్గమొందవలెనను కోరికగలవాడు జ్యోతిష్టోమమును, "పుత్రకామః పుత్రేష్ట్యాయజేత" పుత్రులను పొందవలెనను కోరికగలవాడు పుత్రకామేష్టి యను యాగమును జేయవలెనని వేదమున జెప్పబడియున్నదిగదా? అట్టి ఫలముగల కర్మ, కామ్యకర్మ మనబడుచున్నది. ఇట్టి కామ్యకర్మను చేయకుండుటయే సన్న్యాసమని కొందఱున్ను, వేదోక్తములైన నిత్యనైమిత్తిక కామ్యములనెడి సకలకర్మలను జేసి ఫలమును

ఈశ్వరార్పణము జేయుటయే త్యాగమని కొందఱున్ను చెప్పుచున్నారు. నిత్యకర్మలకును కొన్ని నైమిత్తిక కర్మలకును జ్యోతిష్టోమాదులకు ఫలము చెప్పియుండుటవలె వేదమున ఫలము చెప్పబడ లేదు గదా! అట్లు ఫలమేలేని కర్మనుజేసి ఫలమును త్యాగము చేయమని ఎట్లు చెప్పదగుననగా, అట్టి నిత్యనైమిత్తిక కర్మలు విధింపబడియున్న వేదభాగమున ఫలము చెప్పబడకున్నను "సర్వ ఏతే పుణ్యలోకా భవన్తి" "కర్మణా పితృలోకః" ఇట్టి వేదవాక్యములవలన విశేషమైన పుణ్యఫల ములు చెప్పబడియున్నందున ఫలముకలదనియే గ్రహింపవలెను.

ఇట్లు చెప్పినందున కర్మజేయవలసినదావశ్యకమని యేర్పడుచున్నది. "యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చమానవః (అధ్యా 3. శ్లో॥ 17) అనుదానిచే పరమాత్మయెడ మనస్సునుంచి ఆ యాత్మయందే తృప్తిపొంది యున్నవాడు కర్మజేయవలసినది లేదని యగుచున్నదిగదా? ఇది పరస్పర విరుద్ధముకాదా? యనిన, ఆత్మయెడనే తృప్తిపొంది ఆత్మధ్యాన సమాధిలోనున్నవానిని కర్మ, స్వయముగనే విడిచిపెట్టుచున్నది. అట్టివాడు కర్మ చేయవలెననునదిలేదు,

(శంకరులు) అశ్వమేధాది కామ్యకర్మలు అనుష్ఠింపవలసినదిగ సంభవించినను అనుష్ఠిం పక విడుచుటయే సన్న్యాసమని కొందఱున్ను, నిత్యనైమిత్తికములైన సకలకర్మలను జేసి ఫలమును ఈశ్వరార్పణము జేయుట త్యాగమని కొందఱున్ను చెప్పుచున్నారు. కామ్యకర్మను విడుచుటయని చెప్పినను, కర్మఫలమును విడుచుటయని చెప్పినను ఈ రెండున్ను త్యాగమనెడి ఒకేశబ్దమున కర్థమగుచున్నవి. (ఘటపటశబ్దములవలె విజాతీయములైన అర్థములుకావు.) నిత్యనైమిత్తికకర్మలకు ఫలమే లేనందున ఫలమును త్యజించుట యెట్లు తగునని కొందఱు చెప్పుచున్నారు. అది సరియైనది గాదు. వాటికి ఫలముగలదనియే భగవంతుని యభిప్రాయము. "అనిష్టమిష్టం మిశ్రం చ ........ న తు సన్న్యాసినాం" (ఈ అధ్యా శ్లో॥ 12) అనుదానిచే పరమార్థ సన్న్యాసికి కర్మఫలము అంట జాలదనుదానిని చూపించుచు అట్టి సన్న్యాసికి ఫలప్రాప్తి కలదనుదానిని చూపించుచున్నాడు.

(రామానుజులు) 'సర్వకర్మఫలత్యాగం' అనగా నిత్యనైమిత్తిక కామ్యకర్మ ఫల త్యాగ మని కొందఱు చెప్పుచున్నారు. (మిగత విషయమున శంకరుని అర్థమును బోలియున్నది.)

(మధ్వులు, రాఘవేంద్రులు) కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం, ఫలానిచ్ఛయా అకరణేనవా కామ్యకర్మన్యాసః = ఫలమునం దిచ్ఛను విడుచుటవలనగాని చేయకయుండుట వలనగాని కామ్యకర్మను విడుచుటయే సన్న్యాసము.

త్యాగస్తు ఫలత్యాగ ఏవ = త్యాగమనగా ఫలత్యాగమే (మధ్వులు). "సర్వకామ్య కర్మణాం భగవత్ప్రీత్యన్యఫలత్యాగః = భగవత్ప్రీతి విషయముతప్ప మిగతవిషయమున సకల కామ్యకర్మఫలమును విడచుటయే త్యాగము (రాఘవేంద్రులు).

నిత్యనైమిత్తిక కామ్యకర్మలు = స్వర్గాదిఫలము నుద్దేశించినవి గాక చేయబడు సంధ్యా వందనము, ఔపాసనము, అగ్నిహోత్రము, జ్యోతిష్టోమము మొదలగు నిత్యకర్మలు.

జాతేష్టి, గ్రహణేష్టి, ఆగ్రయణం, సంక్రాంతి, శ్రాద్ధాదులు ఇవి నైమిత్తికకర్మలు. ఫలోద్దేశముతో చేయబడు పైకనిన నిత్యనైమిత్తిక కర్మలున్ను, పుత్రకామేష్టి, సత్రయాగమ్ము, మొదలగునవియు కామ్యకర్మలు (స్వకీయము).

శ్లో॥ త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః
యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యమితి చాపరే ॥ 3

పద॥ త్యాజ్యం - దోషవత్ (1) - ఇతి - ఏకే (2) - కర్మ - ప్రాహుః - మనీషిణః (3)।
యజ్ఞదానతపఃకర్మ - న - త్యాజ్యం - ఇతి - చ - అపరే (4)॥

| | | | |
|---|---|---|---|
| కర్మ | కర్మను | అపరే | మఱికొందఱు పండితులు |
| దోషవత్ | దోషముగలది | యజ్ఞదాన తపఃకర్మ | యజ్ఞము, దానము, తపస్సు నెడి కర్మ |
| త్యాజ్యం | విడువదగినది | | |
| ఇతి ఏకేమనీషిణః | కొందఱు పండితులున్ను (వివేకులైన కొందఱు) | నత్యాజ్యమితి చ ప్రాహుః | విడువదగినది కాదనియు చెప్పుచున్నారు. |

తా॥ వివేకులైన కొందఱు కర్మ దోషమును గలుగజేయునట్టిది కావున విడువదగినదనియు, మఱికొందఱు యజ్ఞదాన తపస్సులనెడి కర్మ విడువదగినది కాదనియు చెప్పుచున్నారు.

(1) దోషవత్ - దోషముగల ధనాశ మొదలగు వాటిని త్రోయవలసియున్నట్లు (శంకరులు).

(2-3) ఏకేమనీషిణః - సాంఖ్యమతస్థులు (పరమార్థ సన్న్యాసులుకాదు.) (శంకరులు, శ్రీధరులు.) కపిల మహర్షియొక్క శిష్యులున్ను ఆ మతము ననుసరించిన వారలున్ను (రామానుజులు.)

(4) అపరే - కర్మయోగులు (శంకరులు). మీమాంసకమతస్థులు (శ్రీధరులు). కపిలమతము ననుసరించని మిగతవారలు (రామానుజులు).

(శంకరులు) పరమార్థసన్న్యాసులనెడి బ్రహ్మజ్ఞానుల విషయమై ఈ శ్లోకము ప్రవర్తించునది కాదు. కర్మయోగులు కర్మలు విడిచిపెట్టవలెననుదానిని కొందఱున్ను, విడువగూడదని కొందఱున్ను జెప్పుచున్నారు.

(రాఘవేంద్రులు). కొందఱు జ్ఞానులు బంధకత్వమనెడి దోషముతో గూడినదైనందున కామ్యకర్మవిడువదగినదనియు, లేక నిత్యనైమిత్తిక కర్మలయొక్క ఫలమును త్యాగముజేయవలెననియు చెప్పుచున్నారు.

శ్లో॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః॥

పద॥ నిశ్చయం - శృణు - మే - తత్ర - త్యాగే - భరతసత్తమ।
త్యాగః - హి - పురుషవ్యాఘ్ర - త్రివిధః (1) - సంప్రకీర్తితః॥

| | | | |
|---|---|---|---|
| హే భరతసత్తమ ! | ఓ భరతకులమున మిక్కిలి శ్రేష్ఠుడా ! | హే పురుషవ్యాఘ్ర | ఓ పురుషశ్రేష్ఠుడా ! |
| | | త్యాగః | త్యాగము |
| తత్రత్యాగే | ఆ త్యాగమునుగూర్చి | త్రివిధః హి | మూడువిధములుగనే |
| మేనిశ్చయం | నాయొక్క నిశ్చయమును | సంప్రకీర్తితః | చెప్పబడియున్నది. |
| శృణు | వినుము | | |

తా॥ ఓ భరతకుల శ్రేష్ఠుడా! ఆ త్యాగమునుగూర్చి నా యొక్క నిశ్చయమును వినుము. ఓ పురుషశ్రేష్ఠుడా! త్యాగము మూడు విధములుగనే చెప్పబడియున్నది.

(1) త్రివిధః = సత్త్వరజస్తమోగుణ భేదములవలన మూడువిధములు. (శ్రీధరులు). ఫలత్యాగము, అభిమానత్యాగము, కర్తృత్వత్యాగమనిమూడువిధములు. "మయి సర్వాణి కర్మాణి" (అధ్యా 3-శ్లో-30) చూడుడు (రామానుజులు). పైజెప్పిన అర్థమేగాక గుణమువలన మూడు విధములని కొందఱు చెప్పుచున్నారు (రాఘవేంద్రులు).

(శంకరులు) తత్ర = త్యాగము, సన్న్యాసము అను ఈ విషయమున, త్యాగోహి = త్యాగ సన్న్యాసశబ్దముల అర్థమొక్కటే. కర్మాధికారులకు సత్త్వాది గుణభేదమువలన మూడు విధములుగ జెప్పబడియున్నదేగాని బ్రహ్మజ్ఞాని విషయముగ జెప్పినదిగాదు. ఈ యర్థము సాధారణముగ గ్రహించుట కశక్యమైనందున దాని విషయమైన నాయొక్క నిశ్చయమును వినుము అని తాత్పర్యము.

---

శ్లో॥ యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 5

పద॥ యజ్ఞదానతపఃకర్మ - న - త్యాజ్యం - కార్యం - ఏవ - తత్ ।
యజ్ఞః (1) - దానం (2) - తపః - చ - ఏవ - పావనాని - మనీషిణాం (3) ॥

| | | | |
|---|---|---|---|
| యజ్ఞదాన తపః కర్మ | యజ్ఞము, దానము, తపస్స నెడి కర్మ | యజ్ఞః | యజ్ఞమున్ను |
| | | దానం | దానమున్ను |
| న త్యాజ్యం | విడువదగినదికాదు. | తపశ్చైవ | తపస్సున్ను |
| తత్ | అది | మనీషిణాం | వివేకులకు |
| కార్యమేవ | చేయబడవలసినదే | పావనాని | చిత్తశుద్ధిని గలుగజేయునట్టివి |

తా॥ యజ్ఞ దాన తపస్సులనెడి కర్మ విడువదగినదిగాదు. అది చేయబడవలసినదే. యజ్ఞము, దానము, తపస్సు, ఇవియే వివేకులకు చిత్తశుద్ధిని గలుగజేయునట్టివి.

(1) యజ్ఞః - ద్రవ్య యజ్ఞాదులు (మధ్వులు)

(2) దానం - అభయదానముగూడ (మధ్వులు)

(3) మనీషిణాం - ఫలాపేక్షనువిడచి చేసెడివారలైన వివేకులకు (శంకరులు).

(రామానుజులు) యజ్ఞ, దాన, తపస్సు మొదలగు వేదోక్తకర్మలు ముముక్షువులచే ఏ కాలమునందును విడువదగినవికావు. దేహమున్నంతవఱకు చేయవలసినవే. ఏలనగా ఆ కర్మలు, మనీషిణాం = మననశీలులకు (విమర్శించి యెరుంగువారలకు) పరిశుభ్రతను గలుగజేయుచున్నవి. అనగా బ్రహ్మోపాసనజేసెడి ముముక్షువులయొక్క ఉపాసనకు విరోధియైన ప్రాచీనకర్మను పోగొట్టుచున్నవి.

(రాఘవేంద్రులు) యజ్ఞ, దాన, తపస్సులు ఎల్లరికిని చేయవలసినవే. యతులకు జ్ఞానమే యజ్ఞము. విద్యాదానము, ఆశ్రయించిన వారలను కాపాడుటయనెడి అభయప్రదానము, ఇవియే

దానము. బ్రహ్మచర్యము మొదలగునవియే తపస్సు. స్త్రీ శూద్రులకు విష్ణునామాది కీర్తనము యజ్ఞము. సత్యవచనము దానము. ఉపవాసాదులు తపస్సు.

---

శ్లో॥ ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమం ॥ 6

పద॥ ఏతాని - అపి - తు - కర్మాణి - సంగం - త్యక్త్వా - ఫలాని - చ ।
కర్తవ్యాని - ఇతి - మే - పార్థ - నిశ్చితం - మతం - ఉత్తమమ్ ॥

| | | | |
|---|---|---|---|
| తు | ఐతే | త్యక్త్వా | విడిచి |
| హే పార్థ! | ఓ పార్థా! | కర్తవ్యాని | చేయవలసినవి |
| ఏతాని అపి కర్మాణి | ఈ యజ్ఞదాన తపస్సులనెడి కర్మలుగూడ | ఇతి | అనునది |
| | | మే నిశ్చితం | నాయొక్క నిశ్చయింపబడిన |
| సంగం | (తానుకర్తయను) అభిమానమును లేక ఆసక్తిని | ఉత్తమం | శ్రేష్ఠమైన |
| | | మతం | అభిప్రాయము (తాత్పర్యము, సిద్ధాంతము.) |
| ఫలాని చ | ఫలములను | | |

తా॥ ఓ పార్థా! ఈ యజ్ఞ దాన తపస్సులనెడి కర్మలు అభిమానమును ఫలములను విడిచిచేయవలెననునది నా యొక్క నిశ్చయింపబడిన శ్రేష్ఠమైన అభిప్రాయము.

(శంకరులు) సంగమును, ఫలమును అపేక్షించి చేసెడి యజ్ఞ దాన తపస్సులనెడి కర్మలు బంధమునిచ్చునవైనను, సంగమును ఫలమును అపేక్షింపక ముముక్షువుగూడ అట్టి కర్మలను జేయవలెననుటకై అపిశబ్దము చేర్చబడినదేగాని అన్యకర్మలను చేర్చుకోవలెనను తాత్పర్యముతోగాదు. కొందఱు నిత్యకర్మలకు ఫలములేదనియు ఫలములేని నిత్యకర్మలను, ఫలమును సంగమును విడిచిజేయుట అసంభావితమనియు, కావున అపిశబ్దముచేత యజ్ఞ దాన తపస్సులనెడి కర్మలున్ను కామ్యకర్మలున్ను, సంగమును ఫలమును విడిచి చేయవలసినవని అర్థము జేయుచున్నారు. అదిసరియైనదికాదు. "యజ్ఞోదానంతపశ్చైవ పావనాని మనీషిణాం" (ఇదేఅధ్యా-శ్లో-5) యజ్ఞ దాన తపస్సులనెడి కర్మలు మనుష్యులను పరిశుభ్రపరచుచున్నవి అను నీవచనముచే నిత్యకర్మలకు ఫలముకలదని మునుపే చెప్పబడియున్నది. మఱియు నిత్యకర్మలు బంధహేతువైనందున నిత్యకర్మలనే విడిచిపెట్టగోరుచున్న ముముక్షువు కామ్యకర్మ నిచ్చింపగలడనుట సరియైనదిగాదు. 'దూరేణహ్యవరంకర్మ' (అధ్యా 2 - శ్లో - 29) అని కామ్యకర్మ నిందింపబడియున్నందునను "యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర (అధ్యా-3 శ్లో-9) త్రైగుణ్య విషయా వేదాః (అధ్యా-9-శ్లో45) "త్రైవిద్యామాం సోమపాః" (అధ్యా-9-శ్లో-20 "క్షీణేపుణ్యే మర్త్యలోకంవిశన్తి" (అధ్యా - 9 - శ్లో - 21) వీటివలన కామ్యకర్మ బంధహేతువని చెప్పబడియున్నందునను అపిశబ్దముచేత కామ్యకర్మ చేర్పదగినదిగాదు,

(రామానుజులు) బ్రహ్మోపాసనవలె యజ్ఞ దాన తపస్సులనెడి కర్మాదులను ఈశ్వరార్పణ బుద్ధితో సంగమును ఫలమును విడిచి దేహమున్నంతవఱకు చేయుచుండవలెననునది నిశ్చయమైనదియు ఉత్తమమైనదియునైన భగవదభిప్రాయము.

(రాఘవేంద్రులు) కర్మలను విడువగూడదు, చేయవలసినదేయని చెప్పినది, కర్మను విడిచిపెట్టవలెనని మునుపు జ్ఞానులు చెప్పియున్నదానికి విరుద్ధమగుచున్నదని తలంప హేతువులేక సంగము స్నేహము స్వర్గాదిఫలము వీటినివిడిచి చేయవలెననునది ఉత్తమమైనమతమని భగవంతుడు చెప్పుచున్నాడు.

✦✦✦✦✦✦✦✦✦✦✦✦

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః ॥　　7

పద॥ నియతస్య - తు - సన్న్యాసః - కర్మణః - న - ఉపపద్యతే।
మోహాత్ - తస్య - పరిత్యాగః - తామసః - పరికీర్తితః ॥

| | | | |
|---|---|---|---|
| తు | మఱియిమన | మోహాత్ | అవివేకముచేత, లేక మైకము చేత |
| నియతస్య కర్మణః | నిత్య కర్మను | | |
| సన్న్యాసః | విడచుట | తస్య పరిత్యాగః | దానిని విడిచిపెట్టుట |
| నోపపద్యతే | కూడదు, లేక యుక్తము కాదు | తామసః | తామస (త్యాగ)మని |
| | | పరికీర్తితః | చెప్పబడియున్నది. |

తా॥ తప్పక చేయవలసినదిగా విధింపబడియున్న కర్మయొక్క పరిత్యాగము కూడదు. అవివేకముచేత దానియొక్క పరిత్యాగము చేయుట తామసమని చెప్పబడియున్నది. (అనగా కామ్యకర్మను విడుచుట యుక్తమేగాని, చిత్తశుద్ధిద్వారా మోక్షహేతువైనట్టియు, ముముక్షువైనవాడు ప్రతిదినము చేయవలసినట్టియు నిత్యకర్మను విడువగూడదు. అట్లు విడుచుట అవివేకమువలననే కావునను, మోహము తమస్సుయొక్క స్వభావమైనందునను, మోహమువలన విడిచినదికూడ తామసత్యాగమనియే చెప్పబడినది.)

(శంకరులు) నిత్యనైమిత్తిక కర్మలగు పంచ మహాయజ్ఞాదికర్మలను విడువగూడదు. ఏలనగా నిత్యనైమిత్తిక కర్మలు దేహమును పరిశుభ్రపరచునట్టివి. యజ్ఞము, వైశ్వదేవము బలి హరణము, మొదలగువాటినిజేసి మిగిలిన అన్నమును భుజించుటవలన దేహశుద్ధియు. సత్త్వగుణవృద్ధియు, దానివలన చిత్తశుద్ధియు, దానివలన జ్ఞానమున్ను, పిదప మోక్షమున్ను కలుగును. కావున నిత్యనైమిత్తిక కర్మలను విడువగూడదు. అట్లు విడిచిపెట్టినచో అది తామసమైనదే. ఏలనగా నిత్యనైమిత్తిక కర్మలనుజేసి దానిలో మిగిలిన అన్నమునుదప్ప ఇతరమైన అన్నమును భుజించువాడు పాపమును భుజించుచున్నాడని మునుపే (అధ్యా 3 శ్లో 13) చెప్పబడియున్నందుననే. కర్మము బంధమును కలుగజేయునట్టిదని తలంచి దానిని విడుచుట, అజ్ఞానమువలన విడుచుటయగుటచే తామసమైనది.

(రాఘవేంద్రులు) త్యాగమనగా ఫలత్యాగమేకాని, కర్మత్యాగముకాదని మూడు శ్లోకములచే చెప్పబడుచున్నది. నియతస్యతు = వర్ణాశ్రమములకు యోగ్యములైన ఈ కర్మలను విడువగూడదు. స్వకర్మములైన యజ్ఞాదులను విడిచిన నరకమొందును. త్యాగమనగా ఫలత్యాగము కాదనియు, కర్మస్వరూపత్యాగమనియు అజ్ఞానమువలన తలంచి ఎవ్వడైన కర్మను విడిచినచో అది తామసమనంబడును.

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్ ।
న కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ 8

పద॥ దుఃఖం - ఇతి - ఏవ - యత్ - కర్మ - కాయక్లేశభయాత్ - త్యజేత్ ।
సః - కృత్వా - రాజసం - త్యాగం - న - ఏవ - త్యాగఫలం (1) - లభేత్ ॥

| | | | |
|---|---|---|---|
| (అజ్ఞాని) | అజ్ఞానియైనవాడు | (సః) | అది (ఆ త్యాగము) |
| దుఃఖమిత్యేవ | దుఃఖమనియే తలంచి | రాజసః | రాజసత్యాగమనబడుచున్నది |
| కాయక్లేశభయాత్ | శరీరప్రయాసయొక్క భయముపలన | సః రాజసం త్యాగం కృత్వా | అతడు రాజసత్యాగమును చేసి |
| కర్మ | నిత్యకర్మను | త్యాగఫలం | కర్మసన్యాసఫలమును |
| త్యజేత్ యత్ | విడచుచున్నాడనునది యేది గలదో | నైవ లభేత్ | పొందుటయేలేదు. |

తా॥ ఎవ్వడు దుఃఖము గలుగుననియు, శరీరప్రయాసకు భయపడియు, కర్మను విడుచునో అతడు రాజసమగు త్యాగమునుజేసి త్యాగఫలమును (త్యాగముయొక్క ఫలమైన జ్ఞాననిష్ఠను) పొందుట యనునదేలేదు.

(1) త్యాగఫలం - భగవత్ప్రీతి రూపమైన ఫలమును (రాఘవేంద్రులు)

(శంకరులు) సకలకర్మలను జ్ఞానపూర్వకముగ విడిచెడి జ్ఞానివలె దుఃఖాదులవలన నిత్య నైమిత్తిక కర్మలను విడుచువాడు మోక్షమొందజాలడు.

(రామానుజులు) కర్మ, పరంపరగా మోక్షసాధనమైనను కర్మజేయుటకై కష్టపడి ధన సంపాదన చేయవలసియు దేహప్రయాసపడవలసియు నున్నందున మనస్సుకు క్లేశమును గలుగ జేయునదిగ నున్నదను భయముచేత యోగసిద్ధికొఱకై జ్ఞానాభ్యాసముచేత ప్రయత్నించవలెనని యెవ్వడు పంచ మహాయజ్ఞాది వర్ణాశ్రమ ధర్మములను విడచునో అట్టి త్యాగము రాజసమైనది. అనగా శాస్త్రార్థమును ఉన్నట్లు తెలియనందునచేసిన త్యాగమగుచున్నది. ఇట్టి రాజసత్యాగముచేత జ్ఞానోత్పత్తి స్వరూపమగు త్యాగఫలమును పొందనేరడు. ఇట్టి కర్మకు ఇట్టిఫలమని ఒకడు తెలిసి కొన్నందుచేతనే చిత్తశుద్ధి గలుగనేరదు. కర్మలనుజేసి ఫలమును త్యాగముచేయుటవలన భగవ త్ప్రసాదముగలిగి దానివలన మనఃప్రసాదము గలుగగలదు. కావున దేహప్రయాస మొదలగు దుఃఖములను తలంచి కర్మలను విడువగూడదు.

(స్వకీయము) తామస త్యాగమనగా కర్మజేయనందున ఇట్టి పాతకము అని తెలియక అవివేకమువలన కర్మచేయక విడిచిపెట్టుట. రాజసత్యాగమనగా కర్మచేయనిచో ఇట్టి పాతకము కలుగునని తెలిసియుండియు దేహప్రయాస మొదలగువాటికి భయపడి కర్మను విడిచిపెట్టుట.

శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః ॥ 9

పద॥ కార్యం - ఇతి - ఏవ - యత్ - కర్మ - నియతం - క్రియతే అర్జున ।
సంగం - త్యక్త్వా - ఫలం - చ - ఏవ - సః - త్యాగః - సాత్త్వికః - మతః ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున! | ఓ అర్జునా! | | |
| కార్యమిత్యేవ | చేయబడవలసినదేయని(తెలిసి) | క్రియతే యత్ | చేయబడుచున్నదనువది ఏది గలదో |
| సంగం | అభిమానమును, లేక ఆసక్తిని | | |
| ఫలంచైవ | ఫలమును | సః | అది |
| త్యక్త్వా | విడిచి | సాత్త్వికః త్యాగః | సాత్త్విక త్యాగముగ |
| నియతం కర్మ | నిత్యముగ జేయవలసినదని విధింపబడినకర్మ | మతః | గ్రహింపబడియున్నది. |

**తా॥ ఓ అర్జునా! నిత్యముగ జేయవలసినట్లు విధింపబడియున్న ఏ కర్మ చేయబడవలసినదని తెలిసి అభిమానమును ఫలమును విడిచి చేయబడుచున్నదో అట్టి (అభిమానము ఫలము వీటిని విడుచుటయనెడి) త్యాగము సాత్త్వికమైనదని నాయొక్క అభిప్రాయము.**

(శంకరులు) భగవద్వాక్యముచేతనే నిత్యకర్మకు ఫలముగలదని ఏర్పడియున్నది. అట్లు ఫలములేకున్నచో ఫలమును త్యాగముచేయవలెనని చెప్పుట యెట్లు తగియుండును? అజ్ఞానులు నిత్యకర్మలకు ఫలము చిత్తశుద్ధి, లేక, దోషనివృత్తియని కల్పించుచున్నారు. అట్లు కల్పింపనక్కర లేదనుదానిని ఇందువలన భగవంతుడు ప్రకటపరచుచున్నాడు.

కర్మత్యాగము మూడువిధములైనదని ఇందలి 4-వ శ్లోకములో చెప్పబడినది. తామస త్యాగమునుగూర్చియు (ఇందలి 7-వ శ్లోకము) రాజసత్యాగమునుగూర్చియు (ఇందలి 8 వ శ్లో.)కూడ చెప్పబడినది. ఆ రెండు త్యాగములున్ను (కర్మచేయకయే విడిచిపెట్టుటయనెడి) కర్మ స్వరూప త్యాగముగనున్నవి. ఈ సాత్త్విక త్యాగమనగా కర్మత్యాగముగాదు. కర్మయెడ అభిమానము, దాని ఫలము, వీటిని విడచుట యనునదిగనున్నది. కావున కర్మత్యాగము మూడు విధములైనదని చెప్ప నారంభించి మూడవదిగ ఫలత్యాగమును జెప్పుట ఎట్లు తగియుండుననగా కర్మను విడుచుటయు కర్మనుజేసి ఫలమును విడిచిపెట్టుటయు త్యాగశబ్దార్థమున (విడిచిపెట్టుట యనునర్థమున) రెండున్ను ఒక్కటే.

(రామానుజులు) "నియతంకర్మ" అన్నందున నిత్యనైమిత్తికములైన వర్ణాశ్రమములకు తగిన కర్మలను, సంగమును, ఫలమునువిడిచి భగవదారాధనమని తలంచియే చేయవలెను. ఇట్టి ఫలత్యాగము సాత్త్వికమైనది. అనగా సత్త్వగుణమువలన గలిగినదని యెరుంగదగినది. అట్టి త్యాగము జేయువాడు శాస్త్రార్థమును బాగుగ తెలిసికొన్నవాడగుచున్నాడు అని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) అవశ్యముగ చేయవలసినదిగను వర్ణాశ్రమములకు తగినదిగనునున్న కర్మను జేయక విడుచుటవలన దోషము గలుగగలదని యెరింగి, సంగమును స్వర్గాదిఫలమును విడిచి, ఆ యా వర్ణాశ్రమములకు తగినకర్మలను జేయుట సాత్త్వికమైన త్యాగముగుచున్నది.



**శ్లో॥ న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।**
**త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥** 10

పద॥ న - ద్వేష్టి - అకుశలం - కర్మ - కుశలే - న - అనుషజ్జతే।
త్యాగీ - సత్త్వసమావిష్టః - మేధావీ - ఛిన్నసంశయః॥

| | | | |
|---|---|---|---|
| త్యాగీ | త్యాగియై, లేక కర్మఫలమును విడిచినవాడై | ఛిన్న సంశయః | సంశయములేనివాడుగనున్నవాడు |
| | | అకుశలం | దుఃఖకరమైన, లేక హితముగాని |
| సత్త్వసమావిష్టః | సత్త్వగుణ ప్రాధాన్యము గల వాడై, లేక సత్త్వము నిండినవాడై | కర్మ | కర్మను |
| | | నద్వేష్టి | ద్వేషించుటలేదు |
| | | కుశలే | హితమైన కర్మయందు |
| మేధావీ | స్థిరబుద్ధిగలవాడై | నానుషజ్జతే | ఆస కిగొనుటలేదు. |

తా॥ సత్త్వగుణమును ముఖ్యముగ గలిగియు (సుఖమును గలుగజేయు నట్టి వీదైన ఒకకార్యమునుజేసి దానివలన సుఖమును పొందవలెనను బుద్ధి గాని, దుఃఖమును గలుగజేయునట్టి యేదైన ఒకకార్యమునుజేసిన దుఃఖము గలుగునని భయపడి దానినిచేయక యుండవలెనను బుద్ధిగాని లేనట్టి) స్థిరబుద్ధి గలిగియు (సుఖమొందబడునా, దుఃఖము నివృత్తియగునా, యనెడి భ్రాంతి యనెడి) సంశయము లేనట్టివాడైన (అభిమానము, ఫలము వీటిని విడిచిన వాడగు) త్యాగి (దేహప్రయాస మొదలగు) దుఃఖకరమైన కర్మను ద్వేషించుట లేదు. (స్వర్గాదిఫలమును గలుగజేయునట్టి సుఖకరమైన కర్మలో ఆసక్తి చెందుటయులేదు. అనగా ఇచ్ఛించుటలేదు.

(శంకరులు) సత్త్వసమావిష్టః = ఆత్మానాత్మ వివేకజ్ఞానమునకు కారణమైన సత్త్వ గుణమువలన చుట్టబడినవాడుగను, మేధావీ = ఆత్మజ్ఞానముగలవాడుగను, ఛిన్నసంశయః = ఆత్మ జ్ఞానమే మోక్షకారణమగు ననెడి సంశయమును పోగొట్టుకొన్నవాడుగనునున్నవాడై, త్యాగీ = సంగ మును ఫలమునువిడచి నిత్యకర్మను జేసెడివాడు, అకుశలం కర్మ = సంసారబంధ హేతువైన కామ్య కర్మను, న ద్వేష్టి = ద్వేషించుటలేదు, కుశలే నానుషజ్జతే = ఈ నిత్యకర్మ చిత్తశుద్ధి మూలముగ మోక్షహేతువైనదని దానిలో నాసక్తినుంచుటయులేదు. దీని తాత్పర్యమేమనగా నిష్కామముగ కర్మను జేసెడివాడు చిత్తశుద్ధిని, చిత్తశుద్ధివలన జ్ఞానమును, జ్ఞానమువలన మోక్షమును పొందు చున్నాడనియే.

(రామానుజులు) సత్త్వ సమావిష్టః = యథార్థజ్ఞానము గలవాడు, త్యాగీ = సంగము, కర్తృత్వము, ఫలము వీటిని విడిచినవాడు, అకుశలం = పాపకర్మము, (మిగతపదముల అర్థ ములలో భేదములేదు.)

- బ్రహ్మజ్ఞానియైన ఇట్టివానికి అనిష్టములు గలుగుట ఎట్లనగా అతనికి బుద్ధిపూర్వకముగ గలుగవు. ఐతే అతని ప్రయత్నములేకయే అనిష్టములు గలుగవచ్చును, అట్లు సంభవించినవానిని తనకు చెరుపైనవని తలంపడు.

(రాఘవేంద్రులు) అకుశలం = తత్కాలమున సుఖము నిచ్చునట్టిదిగను దేహప్రయాస మొద లగు దుఃఖమునిచ్చునట్టిదిగనునున్న, కర్మ=కర్మను, నద్వేష్టి=ద్వేషించుటయులేదు. కుశలే = పూర్వా ర్జితమైన పుణ్యాకర్మయొక్క ఫలమున, నానుషజ్జతే=ఇచ్ఛించుటయులేదు, సత్త్వసమావిష్టః=శుద్ధసత్త్వ గుణము గలవాడు, మేధావీ=భగవత్తత్త్వజ్ఞాని, ఛిన్నసంశయః=పరాపరతత్త్వవిషయమునగాని భగవ

ద్విషయములైన ధర్మముల ననుష్ఠించుటలోగాని సందేహములేనివాడు. త్యాగీ = సకల కర్మలను భగవత్సమర్పణముజేసినవాడు. ఇతడే సాత్త్వికత్యాగియనుచున్నాడు.



శ్లో॥ న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే॥ 11

పద॥ న - హి - దేహభృతా - శక్యం - త్యక్తుం - కర్మాణి - అశేషతః।
యః - తు - కర్మఫలత్యాగీ - సః - త్యాగీ - ఇతి - అభిధీయతే॥

| | | | |
|---|---|---|---|
| దేహభృతా | దేహాభిమానముగల జీవునిచేత లేక దేహమును ధరించి యున్నవానిచేత | తు | ఐతే |
| | | యః | ఎవ్వడు |
| | | కర్మఫలత్యాగీ | కర్మఫలమును విడిచెడివాడో |
| కర్మాణి | కర్మలు | సః | అతడు |
| అశేషతః | కొఱతలేక | త్యాగీ ఇతి | త్యాగియని |
| త్యక్తుం | విడిచిపెట్టబడుటకు | అభిధీయతే | చెప్పబడుచున్నాడు. |
| న హి శక్యం | అసాధ్యము, లేక, వీలుగాదు | | |

తా॥ దేహాభిమానముబడసిన జీవునిచే కర్మలన్నియు విడిచిపెట్టబడుటకు అసాధ్యమైనవి. ఎవ్వడు కర్మఫలమును విడుచునో అతడు త్యాగియని చెప్ప బడుచున్నాడు.

(శ్రీధరులు) సకలకర్మల ఫలమును విడిచినవాడే ముఖ్యత్యాగి. కర్మలను విడిచిపెట్టిన వాడు త్యాగి గాజాలడు.

(శంకరులు) దేహాభిమానము గలవాని విషయమున ఈ త్యాగము ముఖ్యత్యాగమని పొగడబడియున్నది. దేహాభిమానము లేనివానిచేతనే సకల కర్మలను విడిచిపెట్టబడుట సాధ్య మగును.

(రామానుజులు) కర్మలన్నిటిని ఒకడు విడిచిపెట్టుట అసాధ్యమైనది. ఏలనగా ఆహా రాదుల విషయమైన కర్మలుచేయకున్నచో దేహసంరక్షణ జరుగదు, ఆహారాది కర్మల ననుస రించియే కర్మలన్నియు చేయవలసినవగుచున్నవి. కర్మఫలత్యాగమే త్యాగమని శాస్త్రములలో జెప్ప బడియున్నది. కర్మఫలత్యాగమని చెప్పియున్నను కర్తృత్వాభిమాన త్యాగములుగూడ జెప్పబడిన వని గ్రహింపవలెను.

(రాఘవేంద్రులు) త్యాగమనగా కర్మఫలత్యాగమేగాని కర్మత్యాగముగాదు. ఈ యధ్యా యము యొక్క 3 వ శ్లోకమందలి తాత్పర్యమునకు ఈ శ్లోకము ఆధారముగనున్నది.

శ్లో॥ అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్॥ 12

పద॥ అనిష్టం - ఇష్టం - మిశ్రం - చ - త్రివిధం - కర్మణః - ఫలమ్।
భవతి - అత్యాగినాం - ప్రేత్య - న - తు - సన్న్యాసినాం - క్వచిత్॥

| | | | |
|---|---|---|---|
| అనిష్టం | దుఃఖకరమైనది, లేక చెడ్డది లేక ఇష్టముకానిది | ప్రేత్య | శరీరము పోయినపిదప |
| ఇష్టం | సుఖకరమైనది, లేక మంచిది లేక ఇష్టమైనది | భవతి | కలుగుచున్నది |
| మిశ్రం | కలసినది | సన్న్యాసినాం తు | ఫలాపేక్ష లేకయే కర్మజేయు వారలకు, లేక సన్న్యాసుల కన్ననో |
| కర్మణః త్రివిధం ఫలం | (ఇట్లు) కర్మయొక్క మూడు విధములైన ఫలము | క్వచిత్ | ఏకాలమునందును |
| అత్యాగినాం | ఫలాపేక్షతో కర్మజేయువా ర్లకు (త్యాగులుకానివారలకు) | న | కలుగుటలేదు. |

తా॥ దుఃఖకరమైన నరకము, పశుపక్ష్యాదిజన్మము, సుఖకరమైన దేవ జన్మము, సుఖదుఃఖముల రెంటికి కారణమైన మనుష్యాది జన్మము, ఇట్లు మూడు విధములైన పుణ్య, పాప, మిశ్రకర్మలయొక్క ఫలము, ఫలాపేక్షతో కర్మ జేయువారలకు మరణించిన తరువాత కలుగుచున్నది. ఫలాపేక్షలేక (ఈశ్వ రార్పణబుద్ధితో) కర్మజేయువారలకు ఒకప్పుడున్ను (ఆ మూడుఫలములున్ను) కలుగుటలేదు.

(శంకరులు) అత్యాగినాం = అపరమార్థ సన్న్యాసులగు అజ్ఞానులకు, సన్న్యాసినాం= బ్రహ్మనిష్ఠలోనే నిలకడగ నున్నవారలైన పరమార్థ సన్న్యాసులకు (మిగత పదముల తాత్పర్య మున వ్యత్యాసములేదు) ఏల పరమార్థ సన్న్యాసికి ఫలముకలుగుట లేదనగా బ్రహ్మజ్ఞానమువలన సకల కర్మలనుండి అతడు విముక్తి చెందినవాడైనందుననే యనుడు.

(రామానుజులు) అనిష్టం = నరకాది ఫలము, ఇష్టం = స్వర్గాది ఫలము, మిశ్రం = పుత్రధన పశ్వాదిఫలము, అత్యాగినాం = కర్తృత్వము అభిమానము ఫలము వీటిని త్యాగము జేయనివార్లకు, ప్రేత్య = కర్మజేసిన పిదప, భవతి = కలుగును. సన్న్యాసినాం = కర్తృత్వాదులను త్యాగము జేసిన వార్లకు, క్వచిత్ = ఒకప్పుడున్ను, న = కలుగనేరదు. కావున కర్తృత్వాది పరిత్యాగమే సన్న్యాసము. త్యాగము సన్న్యాసము ఇవి రెండును ఒక్కటే. వీరలకు మోక్ష విరోధియైన ఫలము గలుగదు.

(రాఘవేంద్రులు) నియతకామ్యకర్మ, అనియతకామ్యకర్మయని రెండు విధములు. నియతకామ్యకర్మయనగా ఫలోద్దేశముగనే విధింపబడినట్టిది. అనియతకామ్యకర్మయనగా ఫలా పేక్షతో జేసినచో కామ్యముగ మార్పుజెందు నిత్యకర్మ

అనియతకామ్యకర్మయొక్క ఫలత్యాగమును నియతకామ్యకర్మయొక్క స్వరూప త్యాగ మును చేసినవారలగు సన్న్యాసులకు ఇష్టానిష్టమిశ్రఫలము (స్వర్గనరక మనుష్యాది జన్మములు) గలుగుటలేదు. మఱియు ముక్తిలో అనందాతిశయము గలదని "తు" అనుపదముచే గుర్తింపచేయ బడుచున్నది.



శ్లో॥ పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే ।
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణాం ॥ 13

పద॥ పంచ - ఏతాని - మహాబాహో - కారణాని - నిబోధ - మే ।
సాంఖ్యే (1) - కృతాంతే (2) - ప్రోక్తాని - సిద్ధయే (3) - సర్వకర్మణాం ॥

| | | | |
|---|---|---|---|
| హే మహాబాహో ! | ఓ గొప్పచేతులు గలవాడా ! | సర్వకర్మణాం సిద్ధయే | సకలకర్మలు నెరవేరుటకైన |
| కృతాంతే | కర్మముగింపుగల, లేక కర్మ ముగియబడయునదైన | ఏతాని | ఈ |
| | | పంచ | ఐదు |
| సాంఖ్యే | వేదాంతశాస్త్రమున, లేక సాంఖ్యమున | కారణాని | కారణములను |
| | | మే | నావద్దనుండి |
| ప్రోక్తాని | చెప్పబడినవై | నిబోధ | తెలిసికొనుము. |

తా॥ ఓ గొప్పచేతులుగలవాడా! సకల కర్మల సిద్ధికొఱకై కర్మను నశింపజేయునవియు (కర్మఫలము నందాసక్తిగలుగునట్లు చేసెడి) బ్రహ్మస్వరూపమును తెలియబఱచెడి వేదాంతశాస్త్రమున చెప్పబడినవియు, నాచే చెప్పబడబోవునవియునైన ఐదు కారణములను నాయొక్క వాక్యములచే తెలిసికొనుము. (అనగా ప్రతికర్మకును తాను కర్తయని యజ్ఞాని తలంచుచున్నాడు. అది తప్పు. కర్తలు ఐదుగురున్నారని యెరుంగుమని తాత్పర్యము.)

(1) సాంఖ్యే - తత్త్వములను వివరించెడి సాంఖ్యశాస్త్రమున (శ్రీధరులు). వేదాంతశాస్త్రమున (శంకరులు). వేదమువలన గలిగిన జ్ఞానము, అనగా ఇంద్రియములు, ప్రాణము, జీవుడు, వీటిని తన కార్యములకు సహాయవస్తువుగ బడసిన పరమాత్మయే కర్తయను నిశ్చయముతోగూడిన (రామానుజులు). విష్ణువుయొక్క అవతారమైన కపిలుడు చేసిన సాంఖ్యశాస్త్రమున (రాఘవేంద్రులు).

(2) కృతాంతే - నిర్ణయమున (శాస్త్రమున) (శ్రీధర రామానుజులు).

(3) సిద్ధయే - ఉత్పత్తికొఱకు (రామానుజులు).

(శంకరులు) ఆత్మజ్ఞాని యొకనికే, కర్మలన్నిటిని విడిచిపెట్టుట వీలగునేగాని దేహమున ఆత్మబుద్ధి గలవానికి కర్మను విడచిపెట్టుట వలదనునది ఇది మొదలుగా జెప్పబడుచున్నది.



శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥ 14

పద॥ అధిష్ఠానం (1) - తథా - కర్తా (2) - కరణం (3) - చ - పృథగ్విధమ్ ।
వివిధాః - చ - పృథక్ - చేష్టాః (4) - దైవం (5) - చ - ఏవ - అత్ర - పంచమం ॥

| | | | |
|---|---|---|---|
| అధిష్ఠానం | శరీరము | వివిధాః చేష్టాశ్చ | పలువిధములైన వ్యాపారములు |
| తథా | ఆ విధముగనే | అత్ర | వీటిలో |
| కర్తా | కర్త | దైవం చైవ | (కన్ను, నోరు మొదలగువాటి నియామకులైన సూర్యాదులు, లేక సర్వాంతర్యామియైన ఈశ్వరుడు) లేక దైవమే |
| పృథగ్విధం | అనేకవిధములైన, లేక వేఱు వేఱువిధములైన | | |
| కరణం చ | కన్ను, నోరు, మొదలగు ఇంద్రియములు | | |
| పృథక్ | వేర్వేరైన | పంచమం | ఐదవ (కారణము) |

తా॥ శరీరము, ఆ విధముగనే అహంకారముతోగూడియున్న ఆత్మ (జీవుడు) అనేక విధములైన కండ్లు, నోరు మొదలగు నుపకరణములు, పలువిధములుగను వెవ్వేరుగనునున్న ప్రాణాపానాది వ్యాపారములు ఇవి కారణములు. వీటిలో కండ్లు, నోరు మొదలగువాటికి, నియామకమైన సూర్యాదులు, లేక సర్వాంతర్యామియైన ఈశ్వరుడు ఐదవ కారణము.

(1) అధిష్ఠానం - ఇచ్ఛాద్వేష సుఖదుఃఖ జ్ఞానాదులు ప్రకాశించుటకు ఆశ్రయమైన దేహము (శంకరులు). జీవునివాసస్థానమైన శరీరము (రామానుజులు). దేహము భూమి మొదలగునవి (రాఘవేంద్రులు).

(2) కర్తా - ఉపాధిలక్షణభోక్తా (శంకరులు). జీవుడు "కర్తా శాస్త్రార్థవత్త్వాత్ జ్ఞోఽతఏవ" అను సూత్రమువలన జీవుని కర్తయనియు, ఎరుంగువాడనియు చెప్పియున్నందున జీవుడని అర్థము జేయబడెను (రామానుజులు). జీవునికి కర్తృత్వములేదని మునుపే చెప్పియున్నందున కర్త విష్ణువు (మధ్వులు). విష్ణువు, లేక పరాధీనకర్తయైన జీవుడు (రాఘవేంద్రులు)

(3) కరణం - కండ్లు మొదలగు పండ్రెండు (అనగా జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, బుద్ధి, మనస్సుచేరి పండ్రెండు) (శంకరులు). కర్మేంద్రియములున్ను మనస్సున్ను (రామానుజులు). ఇంద్రియములు (మధ్వులు). జ్ఞానేంద్రియములు, లేక స్రుక్ స్రువాదులు (రాఘవేంద్రులు).

(4) చేష్టాః - చేతియొక్క వ్యాపారము లేక మానసక్రియయైన ధ్యానమున్ను, మిగత అవాంతర క్రియలున్ను (రాఘవేంద్రులు).

(5) దైవం - ఇంద్రియాది నియామకులైన సూర్యాదులు (శంకరులు). ముఖ్యకారణుడున్ను అంతర్యామియునైన పరమాత్మ. అధ్యా 15-శ్లో 15, ఈ అధ్యా 6-61- చూడుడు (రామానుజులు). అదృష్టమనెడి పుణ్యాపాపములు (మధ్వులు), అదృష్టము, లేక విష్ణువు (రాఘవేంద్రులు).



శ్లో॥ శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః॥ 15

పద॥ శరీరవాఙ్మనోభిః - యత్ - కర్మ - ప్రారభతే - నరః।
న్యాయ్యం - వా - విపరీతం - వా - పంచ - ఏతే - తస్య - హేతవః

| | | | |
|---|---|---|---|
| నరః | మనుష్యుడు | శరీరవాఙ్మనోభిః | శరీరవాక్కు మనస్సులతో |
| న్యాయ్యం వా | యుక్తమైనదిగగాని, లేక నేరుగనున్నదిగాని | ప్రారభతే | మొదలుపెట్టుచున్నాడో |
| విపరీతం వా | అయుక్తమైనదిగ గాని, లేక విపరీతమైనదిగగాని | తస్య | ఆ కర్మకు |
| యత్ | ఏ | ఏతే పంచ | (మునుపు చెప్పబడిన) ఈ అయిదున్ను |
| కర్మ | కర్మను | హేతవః | కారణములు. |

తా॥ మనుష్యుడు శరీరము వాక్కు మనస్సు వీటివలన యుక్తముగగాని అయుక్తముగగాని ఏ కర్మను మొదలుపెట్టునో అట్టి కర్మకు మునుపు చెప్పబడిన శరీరము మొదలగు నీమైదున్ను కారణములుగ నున్నవి.

(1) న్యాయ్యం - ధర్మమునకు హేతువైన, లేక శాస్త్రోక్తమైన.

(2) విపరీతం - అధర్మమునకు హేతువైన. లేక అశాస్త్రీయమైన (శ్రీధరులు, శంకరులు). శాస్త్ర నిషిద్ధమైన (రామానుజులు).

(శంకరులు) శరీరము వాక్కు మనస్సు ఈమూడు కారణములు మాత్రము ఎత్తిచెప్పబడినవి. మిగతకండ్లు చెవి మొదలగునవి చెప్పబడలేదు. చూచుట, వినుట మొదలగు కర్మలు కండ్లు చెవి మొదలగువాటివిగనుండగా వాటిని చెప్పకుండుటకు కారణమేమనగా, కండ్లు మొదలగునవి శరీరము వాక్కు మనస్సులకు సహాయసాధనములు. ఎట్లనగా రూపరసగంధాదులు కండ్లు మొదలగువాటికి విషయమైనను వాటిని గ్రహించి అనుభవింపవలసినది మనస్సు యొక్క కార్యము. మనస్సు, కండ్లు చెవులతో ప్రవర్తించినగాని కండ్లు చెవి మొదలగునవి ఒక దానిని గ్రహించజాలవు. కావున ముఖ్యములైన మనోవాక్కాయము లిచ్చట చెప్పబడియున్నవి. మిగిలినవి ఈ మూటిలో నిమిడియున్నందున అవి చెప్పబడలేదు. (పై భాష్యము నాధారముగనుంచి విస్తరించి వ్రాసినట్లు గ్రహింపదగినది.)

శ్లో॥ తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః॥ 16

పద॥ తత్ర - ఏవం - సతి - కర్తారం - ఆత్మానం - కేవలం - తు - యః।
పశ్యతి - అకృతబుద్ధిత్వాత్ - న - సః - పశ్యతి - దుర్మతిః॥

| | | | |
|---|---|---|---|
| తత్ర ఏవం సతి | అవి యిట్లుండగా | కర్తారం | కర్తగా |
| తుయః | ఐతే ఎవ్వడు | పశ్యతి | ఎరుంగునో |
| కేవలం ఆత్మానం | శుద్ధమైన ఆత్మను | సః దుర్మతిః | ఆ దుర్బుద్ధిగలవాడు |
| అకృత బుద్ధిత్వాత్ | పరిశుద్ధ బుద్ధిలేనందున | న పశ్యతి | (యథార్థమును) ఎఱుంగుటలేదు. |

తా॥ ఆ కర్మవిషయమున ఈ ఐదుకారణము లుండగా నిరుపాధికుడుగను సంగములేనివాడుగనున్న ఆత్మను కర్తయని యెవ్వడెరుంగునో దుర్బుద్ధి గలవాడైన అతడు వివేకములేని బుద్ధిగలవాడైనందున ఎఱుంగుట లేదు.

(శంకరులు) దేహము వేరు, ఆత్మవేరను జ్ఞానములేక, దేహమే ఆత్మయనుజ్ఞానము గలిగిన వాడైనందునను, ఆత్మవేరని యెఱింగియున్నను కర్త ఐదుగ నుండగా తానుకర్తయని తలంచుటవలనను, నిందింపదగినట్టియు విపరీతమైనట్టియు జననమరణములకు కారణమైనట్టియు బుద్ధిగలవాడైనందునను, దుర్మతిః = దుర్బుద్ధిగలవాడుగ జెప్పబడెను. అతడు శాస్త్రజ్ఞానముగాని ఆచార్యోపదేశ జ్ఞానముగాని లేనివాడైనందున, అకృతబుద్ధిః = అభ్యాసము జేయబడిన బుద్ధి గలవాడుగాడు. కావున అతడు కర్మస్వరూపమును గాని ఆత్మస్వరూపమునుగాని ఎఱుంగుటలేదు.

(రాఘవేంద్రరామానుజులు) సకల కర్మలను ఈశ్వరాధీనుడై చేయదగిన జీవుడు, తానే కర్తయని తలంచుటవలనను శాస్త్రజ్ఞానము లేనందునను దుర్బుద్ధి గలవాడుగ జెప్పబడెను. అతడు వాస్తవము నెరింగినవాడు కాడని తాత్పర్యము.

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాఽపి స ఇమాన్లోకాన్నహన్తి న నిబధ్యతే ॥ 17

పద॥ యస్య - న - అహంకృతః - భావః - బుద్ధిః - యస్య - న - లిప్యతే ।
హత్వా - అపి - సః - ఇమాన్ - లోకాన్ - న - హన్తి - న - నిబధ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| యస్య | ఎవనికి | | |
| అహంకృతః భావః | నేను కర్తయనుభావము | సః | అతడు |
| న | లేదో | ఇమాన్ లోకాన్ | ఈ ప్రాణులను |
| యస్య | ఎవనియొక్క | హత్వాపి | చంపినను |
| బుద్ధిః | బుద్ధియైనది | న హన్తి | చంపినవాడుకాడు |
| న లిప్యతే | (విషయములలో) ఆసక్తి చెందుటలేదో | న నిబధ్యతే | కట్టబడుటయు లేదు. |

తా॥ ఎవ్వనికి తాను కర్తయను తలంపులేదో ఎవ్వనియొక్క బుద్ధి విషయములలో ఆసక్తిచెందుట లేదో అతడీలోకమందలి ప్రాణులను చంపినను చంపినవాడుకాడు. కట్టబడుటయులేదు. (చంపినందున గలిగెడి పాపమువలన బంధమును పొందుటలేదని తాత్పర్యము.)

(శ్రీధరులు) కర్మజేయునది దేహేంద్రియాదులేగాని నిస్సంగుడైన ఆత్మ కర్మనుజేయుట లేదనియు, తానుకర్తకాదనియు నెరింగిన ఆత్మజ్ఞానముగలవాడు, చంపుటయను కార్యమును జేసినను ఇతరులకు అతనియెడ చంపుటయనెడి వ్యాపారమున్నట్లు కనబడునేగాని ఆత్మదృష్టి గలవాడు చంపుటయనెడి వ్యాపారము తనయొక్కదనిగాని తాను ఏదైననొక కార్యమును జేసినట్లుగాని యెరుంగడు. కావున చంపుటవలన గలుగు దోషము అతనికిలేదు. అట్లుండగా నిత్యకర్మవలన ఇతడు బంధమొందవచ్చునని జెప్పనవకాశమేలేదు.

(శంకరులు) చంపినవానిని చంపినవాడుకాడని ఎట్లు చెప్పదగుననగా, దేహమే ఆత్మయనియు, తానే సకలమును చేసెడివాడనియు తలంచువాడెవ్వడో అతనివిషయమున చంపినవాడు అతడేయని చెప్పుట సాధారణమైనను, ఆత్మశుద్ధుడు కేవలుడు, సాక్షిమాత్రుడు. వ్యాపారములు అతనికిలేవు. వ్యాపారములు దేహాదులకు చేరినవను ఆత్మదృష్టిగలవాడు చంపినట్లు ఆత్మదృష్టి లేనివానికి కనబడినను చంపుటయనెడి వ్యాపారము దేహాదులకు చేరినందున ఆత్మజ్ఞానికి అట్టి వ్యాపారముయొక్క దోషమంటదు.

కేవల ఆత్మకు కర్తృత్వము లేదనినందున దేహాదులతో జేరిన ఆత్మకు కర్తృత్వమున్నదని యగుచున్నదిగదా? అట్లుండగా ఎట్లు కర్తృత్వములేదని చెప్పుటయనినచో, ఆత్మ అసంగస్వభావుడైనందునను సంగమనునది ఆరోపితమైనందునను కర్తృత్వము జెప్పనవకాశమేలేదు. అవిద్యాసంబంధము ననుసరించి కర్తయని చెప్పబడెను. శుద్ధాత్మకు కర్తృత్వము జెప్పనవకాశము లేదు. ఐదుగురు కర్తలలో ఆతడు ఎవ్వడుకాడు. అతనిని కర్మలు వెంబడించుటలేదు. ''అవ్యక్తోయమచిన్త్యోయమవికార్యోయం'' (అధ్యా-2-శ్లో-25) ''శరీరస్థోపి కౌంతేయ న కరోతి న లిప్యతే'' (అధ్యా-13-శ్లో-32) వీటిలో ఈయర్థము మునుపే చెప్పబడియున్నది. అవిద్యా సంబంధమువలన ఆత్మకు కర్తృత్వమెట్లు ఆరోపిత మనగా. ముత్యపు చిప్పలో వెండియను భ్రమయెట్లుగుచుండెనో. శేవఃము

అనెడి శుద్ధాత్మజ్ఞానికే సర్వకర్మ సన్న్యాసము చెప్పబడియున్నది. "యఏనం వేత్తిహన్తారం (అధ్యా 2 శ్లో 19) వేదావినాశినం నిత్యం (అధ్యా 2 శ్లో 21) వీటినుండి శుద్ధాత్మయైన ఆత్మజ్ఞానికి సకల కర్మయొక్క సన్న్యాసము నారంభించి, పిదప పలుచోట్ల దానినిగూర్చిచెప్పి "నహన్తిననిబధ్యతే" అను నీ శ్లోకమందలి పదములచే ముగింపబడియున్నది. ఆ విధముగనే దేహాభిమానముగల అవివేకికి సకల కర్మలు గలవనియుజెప్పి దీనిచే ముగింపబడియునున్నది.

(రామానుజులు) ఈశ్వరుడు కర్మలన్నిటికిని ముఖ్యకర్తయేగాని, తాను కర్తగాడని యెవ్వడెరుంగునో అతడు కర్మలచే కట్టుబడుటలేదు. (ఈయుద్ధరంగమున) ఎదురుగ నున్న భీష్మాదులను మాత్రముగాదు, ఇక లోకమందలి అందఱిని చంపినను నీకు చంపిన దోషము లేదని తాత్పర్యము.

(రాఘవేంద్రులు) లోకసంహారార్థం - లోకమందు చంపుటను జేయుటకొఱకయ్యే జనించియున్న రుద్రుడు, యముడు, వీరలకు చంపుటవలన గలిగెడి దోషము లేదనునది ఈ శ్లోకమునకు తాత్పర్యము. మిగతవారివిషయమునందనగా ఎంతబ్రహ్మజ్ఞానికైనను స్వల్పముగనైనను అభిమానమున్ను అహంకారమున్ను లేకుండదు. మహాబ్రహ్మజ్ఞాని యైన దేవేంద్రునిగూడ వృత్రాసురుని చంపిన విషయమున బ్రహ్మహత్య దోషము పీడించెను. కావున ఎటువంటి జ్ఞానియైనను చంపుటయనెడి దోషము అతనిని విడువజాలదు. కావున జ్ఞానుల విషయమున ఈ శ్లోకము కుదురదు. ఇట్లు చెప్పినందున అభిమానత్యాగమే సన్న్యాస శబ్దార్థమని గ్రహింపవలెను.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మకర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥　　18

పద॥ జ్ఞానం (1) - జ్ఞేయం (2) - పరిజ్ఞాతా (3) - త్రివిధా - కర్మచోదనా (4) ।
కరణం (5) - కర్మ (6) - కర్తా (7) - ఇతి - త్రివిధః - కర్మసంగ్రహః ॥

| | | | |
|---|---|---|---|
| కర్మచోదనా | కర్మను ప్రేరేపించెడి వస్తువు | కరణం | కండ్లు మొదలగు ఇంద్రియము లేక సాధనము |
| జ్ఞానం | జ్ఞానము | | |
| జ్ఞేయం | ఎరుంగబడువస్తువు | కర్మ | కర్తకు ఇష్టమైన వస్తువు, లేక చేయబడువస్తువు |
| పరిజ్ఞాతా | ఎరింగెడివాడు | | |
| త్రివిధా | (అని) మూడువిధములైనది | కర్తా | చేసెడివాడు |
| కర్మసంగ్రహః | కర్మనిలబడుచోటు | ఇతి త్రివిధః | అని మూడువిధములైనది. |

తా॥ కర్మను నడిపించుటకు హేతువైనది - జ్ఞానము యెరుంగదగిన వస్తువు, ఎరింగెడివాడని మూడు విధములుగనున్నది. కర్మకాశ్రయమైనది కండ్లు మొదలగు నింద్రియములనెడి ముఖ్యసాధనము, ఇష్టమైన వస్తువు, చేసెడివాడు అను నీ విధముగ మూడు విధములుగనున్నది.

(1) జ్ఞానం - ఇది తన యిష్టమునకు సాధనమైనదను జ్ఞానము (శ్రీధరులు). ఇట్టి దానిని చేయవలసినదను జ్ఞానము (రామానుజులు).

(2) జ్ఞేయం - ఇష్టమునకు హేతువైనది. (శ్రీధరులు) చేయదగినది. ఈ జ్ఞేయమే కరణము కర్మకర్తయని విభజింపబడియున్నది (రామానుజులు).

(3) పరిజ్ఞాతా - ఇష్టహేతువిట్టిదను జ్ఞానమున కాశ్రయుడు (శ్రీధరులు). అవిద్యలోనున్న జీవుడు (శంకరులు). ఇట్టిది చేయవలసినదనియు ఇట్టిది చేయదగదనియు నెరింగెడివాడు. (రామానుజులు).

(4) కర్మచోదనా - జ్యోతిష్టోమాది కర్మలయొక్క విధి (రామానుజులు). కర్మవిధి (మధ్వులు).

(5) కరణం - చెవి మొదలగు నింద్రియములున్ను బుద్ధియు (శంకరులు). యజ్ఞసాధన వస్తువులు (రామానుజులు).

(6) కర్మ - వ్యాపారముయొక్క ఫలము గలుగుచోటు (శంకరులు). యాగాదులు (రామానుజులు).

(7) కర్తా - ఇంద్రియములకు వ్యాపారములను కలుగచేసెడివారైన జీవుడు (శంకరులు).

(8) కర్మసంగ్రహః - కరణం - కర్మ - కర్తా - ఇవి - మూడున్ను జ్ఞేయమనెడి కర్మలో నిమిడియున్నవి (రామానుజులు) కర్మయొక్క సంగ్రహమైనది. ఇందలి 14వ శ్లోకమున చెప్పబడియున్న ఐదు కారణములలో మూడు ఇచ్చట చెప్పబడినవి (మధ్వులు).

(రాఘవేంద్రులు) కర్మచోదనా = కర్మలను చేయునట్లున్న భగవదాజ్ఞ, త్రివిధా = మూడు విధములుగనున్నది. అదేమనగా, జ్ఞానం = భగవదాజ్ఞ ఇట్టిదనుజ్ఞానము, జ్ఞేయం = పురుష ప్రవృత్తి, దేహాదులు, కర్మ ఫలము ఇవి. పరిజ్ఞాతా = భగవదధీనుడైన జీవుడు, వీరలే. వీరలను నిమిత్తముగ గైకొని భగవదాజ్ఞ ప్రవర్తించుచున్నది. నిమిత్తము మూడు విధములైనను భగవదాజ్ఞను గూడమూడు విధములుగ నెట్లు చెప్పవచ్చుననగా నిమిత్తము మూడు విధములుగ నున్నందున అట్టి నిమిత్తములు గల విధిగూడ మూడువిధములని ఉపచారముగ జెప్పబడినది. విధియైనది నైమిత్తికముగను జ్ఞానాదులుమూడున్ను నిమిత్తముగను నున్నవి. ఎట్లనగా విధినెరింగిన పిదప అందులో తాను ప్రవర్తింపవలెనని భగవంతుని ప్రేరేపణమున్నదని ఎఱుంగుటయే జ్ఞానము. అట్టి జ్ఞానము వలన నగు ప్రవృత్తియే జ్ఞేయము. క్రియలను చేసెడి జీవుడే పరిజ్ఞాత. ఈ మూడింటిని నిమిత్తముగగొని విధిప్రవర్తించినందున విధియైనదినైమిత్తికమని చెప్పబడినది. కర్మసంగ్రహః = కర్మలనెడి అధిష్ఠానము మొదలగు నైదిటిలో ముఖ్యములైన మూటిని సంగ్రహముగ జెప్పినట్లు గ్రహింపవలెను. కరణం=ఇంద్రియములు; యజ్ఞమందుపయోగించు పాత్రములు, దర్భ, మొదలగునవి; దేహము; ఇవిమూడున్ను. కర్మ=కర్మేంద్రియములగు చెయ్యి మొదలగువాటి వ్యాపారము, కర్తా= పరాధీనకర్తయగు జీవుడున్ను స్వతంత్రకర్తయైన భగవంతుడున్ను, ఇతి = ఈవిధముగ, త్రివిధః = మూడువిధములైనది. పరాధీనకర్తయైన జీవుడు కర్మలను చేయునట్లు ఎట్లు విధింపబడ దగుననగా జీవుడెవ్వని కధీనుడో అట్టి ఈశ్వరుని యాజ్ఞయనెడి విధినిషేధములకు లోబడి నడచుట యితని కర్తవ్యమైనందున పరతంత్రుడుగనే కర్మలను నడుపుచున్నాడు.

~~~~~~~~~~

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥ 19

పద॥ జ్ఞానం - కర్మ - చ - కర్తా - చ - త్రిధా - ఏవ - గుణ భేదతః ।
ప్రోచ్యతే - గుణసంఖ్యానే (1) యథావత్ - శృణు - తాని - యపి ॥

| | | | |
|---|---|---|---|
| జ్ఞానం | జ్ఞానమున్ను | గుణసంఖ్యానే | గుణములయొక్క స్వరూపమును జెప్పెడి శాస్త్రమున |
| కర్మ | క్రియయు, లేక వ్యాపారమున్ను | | |
| కర్తా చ | కర్తయు | | |
~~~~~~~~~~

| | | | |
|---|---|---|---|
| గుణభేదతః | సత్త్వాది గుణములయొక్క భేదమువలన | తాన్యపి | వాటినిగూడ |
| త్రిధాఏవ | మూడు విధములుగనే | యథావత్ | (క్రమముగ ఉన్నట్లు |
| ప్రోచ్యతే | చెప్పబడియున్నది | శృణు | వినుము. |

తా॥ సత్త్వరజస్తమస్సులనెడి గుణములయొక్క స్వరూపమును జెప్పెడి సాంఖ్యశాస్త్రమున జ్ఞానము కర్మ కర్త ఇవి, గుణములయొక్క భేదమువలన మూడు విధములుగ జెప్పబడియున్నవి. వాటిని గూడ ఉన్నటుల వినుము.

(1) గుణసంఖ్యానే - గుణములయొక్క కార్యములను లెక్కించుటలో (రామానుజులు).

(శ్రీధరులు) ఈ శ్లోకమందలి "ఏవ" అను పదముచేత కర్తృత్వము గుణములయొక్క సంబంధమువలన ననియు, ఆత్మకుస్వభావమున కర్తృత్వములేదనియు చెప్పబడిన దగుచున్నది. బంధమునకు గుణములే కారణములని అధ్యా 14 - శ్లో - 6 - 7 - 8 - చే గుర్తింపబడినది. 17-వ అధ్యాయమున త్రిగుణస్వభావనిరూపణముచే సాత్త్వికాహారాదుల స్వీకరించి సాత్త్వికస్వభావమును పొందవలెనని చెప్పబడినది. ఇచ్చట యనగా, క్రియలు సాధనములు ఫలములు ఇవి ఆత్మకులేవని చూపించుటకై వాటికి గుణత్రయములయొక్క స్వభావము చెప్పబడుచున్నది.

(శంకరులు) గుణసంఖ్యానే = కపిలునిచే చేయబడియున్న సాంఖ్యశాస్త్రమున. ఈ శాస్త్రము జీవ - ఈశ్వరాభేదవిషయమున విరుద్ధమైనను గుణములయొక్కయు వాటివలన గలిగిన కార్యములయొక్కయు నిరూపణ విషయమున ప్రమాణముగ ప్రకృత మెత్తుకొనబడినది. జ్ఞానము క్రియకర్త ఇవి మూడున్ను గుణత్రయములకు లోబడినవేగాని వెలుబడినవికావనుదానిని తెలియ బరచుటకై 'ఏవ' అను పదము చేర్చబడియున్నది.

శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20

పద॥ సర్వభూతేషు (1) - యేన - ఏకం - భావం - అవ్యయం - ఈక్షతే
అవిభక్తం - విభక్తేషు - తత్ - జ్ఞానం - విద్ధి - సాత్త్వికం॥

| | | | |
|---|---|---|---|
| యేన | యే జ్ఞానముచేత | అవిభక్తం | ఎడతెగక వెంబడియున్నదిగను, లేక వెవ్వేరుగ లేనిదిగను |
| భావం | ఆత్మవస్తువును | | |
| సర్వభూతేషు | సకల వస్తువులలోను, లేక సకల భూతములలోను | ఈక్షతే | చూచునో |
| | | తత్ | ఆ |
| ఏకం | ఒకటిగను | జ్ఞానం | జ్ఞానమును |
| అవ్యయం | వికారములేనిదిగను | సాత్త్వికం | సాత్త్వికమని |
| విభక్తేషు | వెవ్వేరుగ నున్నవాటిలో | విద్ధి | ఎఱుంగుము. |

తా॥ వెవ్వేరుగ నున్న సకల వస్తువులలోను నెడతెగక యనుసరించి యున్నదిగను, ఒకటిగను, వికారములేనిదిగనునున్న పరమాత్మస్వరూపమును మనుజుడు దేనిచే చూచునో అట్టి జ్ఞానమును సాత్త్వికమని యెఱుంగుము.

(1) సర్వభూతేషు - బ్రహ్మమొదలు స్థావరమువఱకు గల సకల వస్తువులయెడ (శ్రీధరులు).

(శంకరులు) ఒకటిగనున్న పరమాత్మ స్వరూపమును మాయ మొదలు స్థావరమువఱకు గల వేరువేరైన సకల వస్తువులలోను భేదములేకయు, అనగా ఆకాశము సకల వస్తువులలోను నిండియున్నదని సత్యమైన వస్తువు బ్రహ్మ మొక్కటేయనియు బ్రహ్మమునకుగాని దాని ధర్మమునకు గాని వికారము లేదనియు నే జ్ఞానమువలన నెఱుంగునో అట్టి జ్ఞానము సాత్త్వికమైనదని యెఱుంగుము. ఈ విధమైన అద్వైతజ్ఞానమే సాక్షాత్తుగ మోక్ష హేతువుగను సాత్త్వికమైనదిగనునున్నట్టిది. ద్వైతజ్ఞానము మోక్ష హేతువు కాజాలదు. కావున దానిని రాజసతామసమని యెరుంగదగినది.

(రామానుజులు) విభక్తేషు = బ్రాహ్మణ, క్షత్రియ, బ్రహ్మచారి వానప్రస్థ గృహస్థులు మొదలగు భేదములచే పలువిధములైనవార్లుగనున్న వేదోక్త కర్మాధి కారులైన, సర్వేషుభూతేషు = సకల ప్రాణులయెడనున్న ఆత్మ, అవిభక్తం = అట్టి బ్రాహ్మణ క్షత్రియాది భేదముగలవాడు కాడనియు, ఏకం = భూతములు పలువిధములుగనున్నను, ఆత్మ, భూతములవలె, ఎత్తుపొట్టి మొదలగు పలువిధములైన ఆకారములు గలవాడు కాడు, ఒక్కటేవిధముగ నున్నవాడనియు, అవ్యయం = భూతములు నాశమొందదగినవైనను వాటిలోనున్న ఆత్మ నశింపదగినవాడు కాడనియు, లేక భూతములు వికారమొందునవైనను ఆత్మవికార మొందదగినవాడు కాడనియు, మఱియు కర్మకును దాని ఫలమునకును భూతము లెట్లు బాధ్యతగలిగినవో అట్లు ఆత్మ బాధ్యపడినవాడు కాడనియు, కర్మ బంధకాలమగు సంసారదశలో నెరింగెడి జ్ఞానమేదిగలదో అట్టిజ్ఞానమును సాత్త్వికమైనదని యెఱుంగుము. (ఇందులో ఆత్మయనగా జీవుడని యెరుంగదగినది).

(రాఘవేంద్రులు) విభక్తేషు = భిన్నభిన్నముగను తారతమ్యముతోనునున్న, సర్వభూతేషు = సకల జీవజడవస్తువులలోనునున్న వాడుగను, ఏకం = సర్వోత్తముడుగను, అవిభక్తం = ఎచ్చటనున్నను స్థానభేదముచేత భేదమొందనివాడుగను, అనగా ఎల్లప్పుడు నిర్దోషుడుగను, షడ్గుణ పరిపూర్ణుడుగను ఒక్కటే విధముగనునున్నాడని తాత్పర్యము. అవ్యయం = స్వయముగగాని దేనిలో నున్నాడో ఆ వస్తువు నశించుటవలనగాని నాశము లేనివానిగను, భావం = ఎల్లప్పుడు స్థిరముగ నున్న వానిగను విష్ణువు నెరుంగుటయనెడి జ్ఞానము సాత్త్వికమైనదని యెరుంగుము.



శ్లో॥ పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ 21

పద॥ పృథక్త్వేన - తు - యత్ - జ్ఞానం - నానాభావాన్ - పృథగ్విధాన్ ।
వేత్తి - సర్వేషు - భూతేషు - తత్ - జ్ఞానం - విద్ధి - రాజసం ॥

| | | | |
|---|---|---|---|
| యత్ తుజ్జ్ఞానం | మఱియే జ్ఞానము | వేత్తి | ఎరుంగునో |
| సర్వేషు భూతేషు | అన్నిభూతములలోను | తత్ జ్ఞానం | ఆ జ్ఞానమును |
| పృథగ్విధాన్ | వేఱ్వేరువిధములైన | రాజసం | రాజసముగ |
| నానాభావాన్ | పలుఆత్మలను | విద్ధి | తెలిసికొనుము, |
| పృథక్త్వేన | వేఱ్వేరుగ | | |

తా॥ ఏ జ్ఞానము సకల భూతములలోనున్న జీవులను స్వరూపముచేత వెవ్వేరనియు సుఖదుఃఖాది భేదములచేత పలువిధమైన వారనియు ప్రత్యేకించి యెరుంగునో అట్టి జ్ఞానమును రాజసమని యెఱుంగుము.

(శంకరులు) సర్వేషు భూతేషు = సకల శరీరములలోను, పృథక్త్వేన తు = ఒక్కొక్క శరీరమునందు ఒక్కొక్క జీవుడని ప్రత్యేకముగ నున్నందున, భావాన్ = జీవులను, నానా = భిన్నభిన్నులుగ నున్నట్లును, పృథగ్విధాన్ = ప్రత్యేకమైన లక్షణములు గలవారుగనున్నట్లును, యత్ జ్ఞానం = యే జ్ఞానము, వేత్తి = యెరుంగునో, తత్ జ్ఞానం = ఆ జ్ఞానమును, రాజసం = రాజసమైనదానినిగా, విద్ధి = ఎఱుంగుము,

(రామానుజులు) భావాన్ = ఆత్మలను, సర్వేషు భూతేషు = బ్రాహ్మణాదులలో, పృథక్త్వేన తు = బ్రాహ్మణుడు మొదలగు ప్రత్యేకమైన ఆకారముతో, నానా = భిన్నులుగను, పృథగ్విధాన్ = తెలుపు - నలుపు - ఎత్తు - పొట్టి మొదలగువాటివలన వేరుబడినవారుగను కర్మఫల మొందుటకు యోగ్యులనియు సంసారమునందుండగా, యత్ జ్ఞానం = యే జ్ఞానము, వేత్తి - ఎఱుంగుచున్నదో, తత్ జ్ఞానం = అట్టిజ్ఞానమును రాజసమని యెఱుంగుము.

(రాఘవేంద్రులు) సర్వేషు భూతేషు పృథక్త్వేన తు యత్ యజ్ఞానం = సకలజీవజడములను పరస్పరము భిన్నభిన్నములుగ తెలియబరచెడి జ్ఞానమేదిగలదో, అనగా, నానా భావాన్ = పలువిధములుగనున్న జీవజడరూప పదార్థములను, పృథగ్విధాన్ = ఒకదానికొకటి భేదముగలవనియు తారతమ్యముగలవనియు, వేత్తి = విష్ణువుకంటె వేరుగను యథార్థముగను ఐతే విష్ణువు విషయమున సంశయముగను ఎఱుంగునదేది గలదో, తత్ జ్ఞానం = అట్టి జ్ఞానమును రాజసమని యెఱుంగుము.

ఇందులో నున్న తుశబ్దముచేత 'వేత్తి' అను దానికి ఇట్టి అర్థము లభించుచున్నది.
ఈశ్వరవిషయమున సంశయరూపమైనందున ఈ జ్ఞానము రాజసమాయెను.

శ్లో॥ యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకం ।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥ 22

పద॥ యత్ - తు - కృత్స్నవత్ - ఏకస్మిన్ - కార్యే - సక్తం - అహైతుకం ।
అ ర్థవత్ - అల్పం - చ - తత్ - తామసం - ఉదాహృతం ॥

| | | | |
|---|---|---|---|
| యత్తు | మఱియేజ్ఞానము | | |
| ఏకస్మిన్ కార్యే | ఒక కార్యముమీద | అహైతుకం | యుక్తిలేనిదై |
| కృత్స్నవత్ | పరిపూర్ణముగ నున్నట్టిదివలె లేక అదే సకలమున్నువలె | అతత్త్వార్థవత్ | యథార్థ వస్తువులేనిదై |
| | | అల్పం చ | స్వల్పముగనున్నదో |
| సక్తం | జీవుడుగాని, ఈశ్వరుడుగాని ఇంతేయను నభిప్రాయముతోగూడినదై, లేక ఆసక్తిగలిగినదై | తత్ | అది |
| | | తామసం | తామసమని |
| | | ఉదాహృతం | చెప్పబడియున్నది. |

తా॥ ఏ జ్ఞానము ఒక దేహమున, లేక ప్రతిమలో పరిపూర్ణమునందువలె (పరిపూర్ణుడైన ఆత్మలో పరిపూర్ణుడనియుండు జ్ఞానమువలె) జీవుడుగాని ఈశ్వ

రుడు గాని ఇంతే యను నభిప్రాయముతో గూడినదై, యుక్తిలేనిదై, యథార్థ వస్తువు తెలియనిదై అల్పవిషయమైయున్నదో అది తామసమని చెప్పబడియున్నది.

(శంకరులు) ఏకస్మిఙ్ కార్యే = దేహమున జీవుడున్ను, వెలుపలనున్న ప్రతిమాదులలో ఈశ్వరుడున్ను, కృత్స్నవత్ = (సర్వంఖల్విదంబ్రహ్మ) సకల వస్తువులున్ను ఈశ్వరుడను జ్ఞానము వలె, సక్తం = దేహము ఎంతటిదో అంతే యీశ్వరుడున్నాడను నభిప్రాయముతో గూడియు, అహైతుకం = ఏల అట్లుండవలెనను విషయమున యుక్తిలేకయు, అతత్త్వార్థవత్ = వాస్తవము కాని విషయము గలదియు, అల్పంచ = అల్పవిషయముగను అల్పఫలముగనునున్న జ్ఞానమేదో అది తామసమని చెప్పబడుచున్నది. తామసులైన అవివేకులకు గలుగు జ్ఞానమిట్టిది.

(రామానుజులు) ఏకస్మిన్‌కార్యే = భూతప్రేత పిశాచాదుల ఆరాధనరూపమైన పూజ యనెడి ఒక కర్మలో, కృత్స్నవత్ = పూర్ణఫలము నిచ్చునని, సక్తం = అభిమానముతోగూడియు, అహేతుకం = (అని పారము) పూర్ణఫలము నిచ్చునను విషయమున తగిన ఆధారము లేనిదిగను, అతత్త్వార్థవత్ = తాను (ఆత్మ) బ్రాహ్మణుడు మొదలగు వర్ణములుగల వాడుగలేకున్నను అట్టి వర్ణము మొదలగునవి గలవాడని యెఱుంగునదిగను, అల్పంచ=మిక్కిలి స్వల్పమైనఫలము నివ్వ దగినదిగను అల్పమైనదేవత నెఱుంగునదిగనునున్న, యత్తు = యేజ్ఞానముగలదో, తత్ = అది, తామసముదాహృతం తామసమని చెప్పబడియున్నది.

(రాఘవేంద్రులు) సంసారియైనజీవుడు, ముక్తుడుగ చేయబడుటవలన కార్యమనబడు చున్నాడు. కార్యే = జీవుడైన తనయెడ, కృత్స్నవత్ = పరిపూర్ణమైన బ్రహ్మమే తానని యెరుంగు నట్టియు మఱియు, కృత్స్నవత్ = జగత్స్వరూపమే తాననియెరుంగునట్టియు, ఏకస్మిన్సక్తం = ఒకదేజీవుడు, అతడే బ్రహ్మరూపమని యెరుంగునట్టియు, అతడే జగత్స్వరూపమని యెరుంగు నట్టియు, అహైతుకం = యుక్తికి సరిపడనట్టియు, అతత్త్వార్థవత్ = అసత్యమైనట్టియు; అల్పంచ = అనేకములైన అజ్ఞానములతో గూడినట్టియు, జ్ఞానం = జ్ఞానమైనది, తామసమని చెప్పబడుచున్నది.

శ్లో॥ నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే॥ 23

పద॥ నియతం (1) సంగరహితం - అరాగద్వేషతః (2) - కృతం।
అఫలప్రేప్సునా - కర్మ - యత్ - తత్ - సాత్త్వికం - ఉచ్యతే॥

| | | | |
|---|---|---|---|
| యత్ కర్మ | ఏ కర్మ | కృతం | చేయబడిన |
| అఫలప్రేప్సునా | ఫలాపేక్షలేనివానిచే | నియతం | నిత్యకర్మయేదిగలదో |
| సంగరహితం | (తానుకర్తయను) అభిమానము లేక | తత్ | అది |
| | | సాత్త్వికం | సాత్త్వికమైనదని |
| అరాగద్వేషత | రాగద్వేషములులేక | ఉచ్యతే | చెప్పబడుచున్నది. |

తా॥ నిత్యముగ జేయవలసినదైన యే కర్మ ఫలాపేక్షలేనివానిచే అభిమానము లేకయు రాగద్వేషములు లేకయు చేయబడినదో అట్టి కర్మ సాత్త్వికమని చెప్పబడుచున్నది.

(1) నియతం - వానివాని వర్ణాశ్రమములకు యోగ్యమైన (రామానుజులు). హరియే సర్వోత్తముడను జ్ఞానపూర్వకముగ వానికర్పణముగనే చేయబడునట్టియు వర్ణాశ్రమములకుచితమైనట్టియు (రాఘవేంద్రులు),

(2) అరాగద్వేషతః — పుత్రాదులయెడ ప్రీతిచేతగాని శత్రువులయెడ ద్వేషమువలనగాని చేయబడక (శ్రీధరులు). కీర్తిలభించవలెను అనియు, అకీర్తి రాగూడదనియు తలంపు లేక (రామానుజులు, రాఘవేంద్రులు).



శ్లో॥ యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।
క్రియతే బహుళాయాసం తద్రాజసముదాహృతమ్ ॥ 24

పద॥ యత్ - తు - కామేప్సునా - కర్మ - సాహంకారేణ (1) - వా - పునః (2) ।
క్రియతే - బహుళాయాసం (3) - తత్ - రాజసం - ఉదాహృతమ్ ॥

| | | | |
|---|---|---|---|
| కామేప్సునా | ఫలాపేక్షగలవానిచేగాని | యత్తుకర్మక్రియతే | ముఱియే కర్మచేయబడుచున్నదో |
| సాహంకారేణ | తాను కర్తయను నహంకారము | తత్ | ఆ కర్మ |
| వాపునః | గలవానిచేగాని | రాజసం | రాజసముగ |
| బహుళాయాసమ్ | మిక్కిలి ప్రయాసతోగూడిన | ఉదాహృతం | చెప్పబడియున్నది. |

తా॥ ఫలాపేక్ష గలవానిచే గాని తాను కర్తయను నహంకారము గలవానిచే గాని మిక్కిలి ప్రయాసతోగూడిన ఏకర్మచేయబడుచున్నదో ఆ కర్మ రాజసమని చెప్పబడియున్నది.

(1) సాహంకారేణ - నేను దప్ప శ్రోత్రియుడెవ్వడు గలడను నహంకారము. అహంకారములు రెండువిధములు. తాను కర్తయనియు తాను శ్రోత్రియుడనియు (శ్రోత్రియుడనగా వేదాధ్యయనము బాగుగజేసినవాడు) (శ్రీధరులు, శంకరులు).

(2) పునః - ఈపదము శ్లోకపూర్తికై చేర్చబడినదని శంకరులు చెప్పుచున్నారు. చకారార్థముగ నుంచి, బహుళాయాసంచ=మిక్కిలి ప్రయాసతోను అనిరాఘవేంద్రులు చెప్పుచున్నారు. (స్వకీయము).

(3) బహుళాయాసం - ఇతరులచే చేయబడనట్టి ఈకర్మను మిక్కిలి ప్రయాసతో నేను చేయుచున్నానను నహంకారము (రామానుజులు).

శ్లో॥ అనుబంధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్ ।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే ॥ 25

పద॥ అనుబంధం - క్షయం (1) హింసాం - అనపేక్ష్య (2) - చ - పౌరుషం ।
మోహాత్ (3) - ఆరభ్యతే - కర్మ - యత్ - తత్ - తామసం - ఉచ్యతే (4) ॥

| | | | |
|---|---|---|---|
| అనుబంధం | ఇక రానున్న శుభాశుభములను | హింసాం | ఇతరులకు కలుగుబాధను |
| క్షయం | ద్రవ్యనాశమును | పౌరుషం చ | తనయొక్క శక్తిని |

| | | | |
|---|---|---|---|
| అనపేక్ష్య | ఆలోచింపక | తత్ | ఆ కర్మ |
| మోహాత్ | అజ్ఞానమువలన | తామసం | తామసమని |
| యత్ కర్మ | ఏ కర్మ | ఉచ్యతే | చెప్పబడుచున్నది |
| ఆరభ్యతే | మొదలు పెటబడునో | | |

తా॥ ఇక తనకు కలుగబోవుచున్న శుభాశుభములలో ద్రవ్యనాశమును, ఇతరులకు గలుగు బాధను, తనకుగల శక్తిని యోచింపకయే అజ్ఞానమువలన ఏ కర్మ మొదలుపెట్టబడునో అది తామసమని చెప్పబడుచున్నది.

(1) క్షయం - శక్తి కొఱతను ద్రవ్యనాశమును (శంకరులు).

(2) అనపేక్ష్య - అనవేక్ష్య అనిపాఠము, అర్థమున వ్యత్యాసములేదు (శ్రీధరులు). మొదలు పెట్టిన పనిని పూర్తిచేయగలమా? లేదా? అని పర్యాలోచింపక (శంకరులు).

(3) మోహాత్ - ఈశ్వరుడు ముఖ్యకర్తయను జ్ఞానములేకయే (రామానుజులు). తాను కర్తయను నజ్ఞానమువలన (రాఘవేంద్రులు).

(4) ఉచ్యతే - ఉదాహృతం - అనిపాఠము. అర్థభేదములేదు. (శ్రీధరులు).

శ్లో॥ ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే - 26

పద॥ ముక్తసంగః - అనహంవాదీ (1) - ధృత్యుత్సాహసమన్వితః (2) ।
: (3) - నిర్వికారః (4) - కర్తా - సాత్త్వికః - ఉచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| ముక్తసంగః | ఫలాపేక్షను విడిచినవాడై | నిర్వికారః | సంతోషవ్యసనములు లేనివాడుగనున్న, లేక వికారములేనివాడుగనున్న |
| అనహం వాదీ | "నేను" అని చెప్పనివాడై | కర్తా | కర్తయైనవాడు |
| ధృత్యుత్సాహ సమన్వితః | ధైర్యోత్సాహములతో గూడినవాడై | సాత్త్వికః | సాత్త్వికుడని |
| సిద్ధ్యసిద్ధ్యోః | పని నెరవేరినను నెరవేరకున్నను | ఉచ్యతే | చెప్పబడుచున్నాడు. |

తా॥ ఫలాపేక్ష అభిమానమువీటిని విడిచినవాడుగను, ధైర్యము ఉత్సాహము ఇవి గలవాడుగను, మొదలుపెట్టిన కర్మనెరవేరినను నెరవేరకున్నను సంతోష దుఃఖములు లేనివాడుగనునున్నవాడు సాత్త్వికకర్తయని చెప్పబడుచున్నాడు.

(1) అనహంవాదీ - తాను కర్తయను నభిమానమును విడిచినవాడు (రామానుజులు). సర్వకర్త భగవంతుడను నిశ్చయమువలన తానుకర్తయను నభిమానమువిడిచినవాడు (రాఘవేంద్రులు).

(2) ధృత్యుత్సాహసమన్వితః-మొదలుపెట్టిన కార్యమున కొనవఱకు గలిగెడి దుఃఖములను సహించువాడుగను (రామానుజులు), ధృతిః = ధారణం = ఎల్లప్పుడు జ్ఞాపకమున నుంచుకొనియుండుట (రాఘవేంద్రులు).

(3) సిద్ధ్యసిద్ధ్యోః కర్మఫలము సిద్ధించిన సిద్ధించకున్నను (శంకరులు).

(4) నిర్వికారః - శాస్త్రప్రమాణమును నమ్మినవాడై ఫలమునం దిచ్ఛలేకయే ప్రవర్తించువాడుగను (శంకరులు).

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ 27

పద॥ రాగీ (1) - కర్మఫలప్రేప్సుః - లుబ్ధః (2) - హింసాత్మకః (3) - అశుచిః (4) ।
హర్షశోకాన్వితః (5) - కర్తా - రాజసః - పరికీర్తితః ॥

| | | | |
|---|---|---|---|
| రాగీ | అభిమానముగలవాడై | అశుచిః | అశుద్ధుడై |
| కర్మఫలప్రేప్సుః | కర్మఫలమును పొందగోరిన వాడై | హర్షశోకాన్వితః | కార్యసిద్ధిలో సంతోషమున్ను అకీర్తియందు వ్యసనమున్ను గలవాడైయున్న |
| లుబ్ధః | ఇతరులసొమ్ము నందిచ్ఛగల వాడై, లేక లుబ్ధుడై | కర్తా | కర్త |
| హింసాత్మకః | పరహింసజేసెడి స్వభావము గలవాడై | రాజసః | రాజసుడని |
| | | పరికీర్తితః | చెప్పబడియున్నాడు. |

తా॥ అభిమానము, కర్మఫలమునందాసక్తి, ఇతరులసొమ్మున ఆశ, పరహింసజేయు స్వభావము, ఇవి గలవాడుగను, ఆచారము లేనివాడుగను, సంతోషము వ్యసనము ఇవిరెండును గలవాడుగనున్న కర్తయైనవాడు రాజసుడని చెప్పబడియున్నాడు.

(1) రాగీ - కీర్తిని గోరువాడు (రామానుజులు, రాఘవేంద్రులు).

(2) లుబ్ధః - ఇతరుల సొమ్ములోని ఆశ, లేక తనద్రవ్యమును యజ్ఞాదులలో సెలవుజేయ మనస్సు లేనివాడు (శంకరులు). కర్మకు కావలసిన ద్రవ్యమును సెలవు జేయుటకు ఇష్టము లేనివాడు. (రామానుజులు, రాఘవేంద్రులు).

(3) హింసాత్మకః - ఇతరులను బాధపెట్టియే కర్మజేసికొనుచున్నవాడు (రామానుజులు).

(4) అశుచిః - లోపల వెలుపల శుద్ధిలేనివాడు (శంకరులు). ద్రవ్యశుద్ధిలేనివాడు (రాఘవేంద్రులు).

(5) హర్షశోకాన్వితః - ఇష్టసిద్ధియందు సంతోషము, అనిష్టప్రాప్తియందు గాని ఇష్టసిద్ధికానందున గాని వ్యసనము గలవాడు (శంకరులు). యుద్ధమున జయము గలిగినచో సంతోషమున్ను గలుగనిచో వ్యసనమున్ను గలవాడు (రామానుజులు).

శ్లో॥ అయుక్తః ప్రాకృతః స్తబ్ధశ్శఠో నైకృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ 28

పద॥ అయుక్తః (1) - ప్రాకృతః (2) - స్తబ్ధః (3) - శఠః (4) - నైకృతికః (5) - అలసః (6)।
విషాదీ (7) - దీర్ఘసూత్రీ (8) - చ - కర్తా - తామసః - ఉచ్యతే ॥

| | | | |
|---|---|---|---|
| అయుక్తః | మనస్సమాధానములేనివాడును | శఠః | మోసగాడును, లేక తనశక్తి యింతటి దనుదానిని ఇతరు లెరుంగకుండ దాచిపెట్టువాడును |
| ప్రాకృతః | వివేకము లేనివాడును | | |
| స్తబ్ధః | వినయము లేనివాడును | | |

| | | | |
|---|---|---|---|
| నైకృతికః | ఇతరుల నవమానము చేయు వాడును, లేక ఇతరులను ద్వేషించువాడును | దీర్ఘసూత్రీ చ | కాలవిలంబము చేయువాడునునైన |
| అలసః | సోమరితనము గలవాడును | కర్తా | కర్తయైనవాడు |
| విషాదీ | దుఃఖముగలవాడును | తామసః | తామసుడని |
| | | ఉచ్యతే | చెప్పబడుచున్నాడు. |

తా॥ మనస్సు నిలకడలేనివాడుగను వివేకములేనివాడుగను వినయము లేనివాడుగను మోసగాడుగను ఇతరుల నవమానించు వాడుగను సోమరి తనము గలవాడుగను వ్యసనము గలవాడుగను (ఒక కర్మను ముగింప వలసిన కాలములోగా ముగింపక) కాలవిలంబము చేయువాడుగను నున్నకర్త తామసుడని చెప్పబడుచున్నాడు.

(1) అయుక్తః - శాస్త్రోక్తమైన కర్మకు యోగ్యుడు కానివాడు (రామానుజులు). భగవదర్పణము చేయనివాడు (రాఘవేంద్రులు),

(2) ప్రాకృతః - శాస్త్రము చదువనివాడు (రామానుజులు). భక్తిచేత శ్రేష్ఠత్వము పొందినవాడు (రాఘవేంద్రులు)

(3) స్తబ్ధః - చేయవలసిన పనిని చేయకున్నవాడు (రామానుజులు). ఆత్మశ్లాఘగలవాడై వినయము లేనివాడు (రాఘవేంద్రులు).

(4) శఠః - మాయావి (శంకరులు). అభిచారము చేయుటయందు ఆసక్తిగలవాడు (రామానుజులు), వంచకుడు (రాఘవేంద్రులు).

(5) నైకృతికః - 'నైష్కృతికః' అని పాఠము (అర్థమొక్కటే) (శంకరులు). వంచకుడు (శంకరులు). దుష్కార్యము చేయువాడు (రాఘవేంద్రులు).

(6) అలసః - ప్రారంభించిన పనిని ముగించవలసినకాలమున ముగింపక విడిచినవాడు (రామానుజులు). కాలమున జేయవలసిన దానిని చేయనివాడు (రాఘవేంద్రులు).

(7) విషాదీ - మిక్కిలి మనశ్చాంచల్యముగలవాడు (రామానుజులు).

(8) దీర్ఘసూత్రీ - ఒకదినము జేయవలసినదానిని ఒక మాసమునందుగూడ చేయనివాడు (శంకరులు) శాఠ్యముచేత ఇతరులను చాలాకాలము కష్టపెట్టతలంచువాడు (రామానుజులు) చేయవలసిన కర్మను తరువాత చేయుదమని తలంచువాడు (రాఘవేంద్రులు)

(శ్రీధరులు) కర్తలుమూడు విధములైనవారలని చెప్పినందున ఎఱింగెడివాడు మూడు విధములనియు, కర్మమూడు విధములని చెప్పినందున ఎరుంగదగిన వస్తువు మూడువిధములనియు చెప్పబడినది. బుద్ధి మూడు విధములని ముందు చెప్పబోవుచుండుటచే కరణము మూడు విధము లని చెప్పబోవునదిగ గ్రహింపవలెను.

శ్లో॥ బుద్ధేర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు ।
ప్రోచ్యమాన మశేషేణ పృథ క్త్వేన ధనంజయ ॥ 29

పద॥ బుద్ధేః (1) - భేదం - ధృతేః (2) - చ - ఏవ - గుణతః - త్రివిధం - శృణు ।
ప్రోచ్యమానం - అశేషేణ - పృథక్త్వేన - ధనంజయ ॥

| | | | |
|---|---|---|---|
| హే ధనంజయ ! | దిగ్విజయమున ధనములను జయించినవాడా ! | ప్రోచ్యమానం | చెప్పబడునట్టియు |
| | | బుద్ధేః | బుద్ధియొక్కయు |
| గుణతః | సత్త్వాది గుణములవలన | ధృతేశ్చైవ | ధైర్యముయొక్కయు |
| త్రివిధం | మూడువిధములుగ నున్నట్టియు | భేదం | భేదమును |
| అశేషేణ | పూర్ణముగను, (కొఱతలేక) | శృణు | వినుము. |
| పృథక్త్వేన | వేరువేరుగను | | |

తా॥ ఓ ధనంజయా ! సత్త్వాదిగుణములవలన మూడువిధములుగ నున్నట్టియు పూర్ణముగను వేరువేరుగను చెప్పబడబోవుచున్నట్టియు బుద్ధి యొక్కయు ధైర్యము యొక్కయు భేదములను వినుము.

(1) బుద్ధేః - వివేకపూర్వకమైన నిశ్చయజ్ఞానము యొక్క (రామానుజులు).

(2) ధృతేః - ప్రారంభించిన కర్మకు అడ్డుగలిగినను అట్టి విఘ్నము నివర్తించుకొని కర్మను నడిపెడి పట్టుదలగల (రామానుజులు).

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ ॥ 30

పద॥ ప్రవృత్తిం (1) - చ - నివృత్తిం (2) - చ - కార్యాకార్యే - భయాభయే ।
బన్ధం - మోక్షం - చ - యా - వేత్తి - బుద్ధిః - సా - పార్థ - సాత్త్వికీ ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ ! | ఓ కుంతీపుత్రా ! | బంధం | బంధమును |
| ప్రవృత్తిం చ | ప్రవృత్తిని | మోక్షం చ | మోక్షమును |
| నివృత్తిం చ | నివృత్తిని | యా బుద్ధిః | ఏ బుద్ధియైనది |
| కార్యాకార్యే | కార్యాకార్యములను | వేత్తి | ఎరుంగుచున్నదో |
| భయాభయే | భయమును, భయములేనితనమును | సా | అట్టి బుద్ధి |
| | | సాత్త్వికీ | సాత్త్వికమైనది. |

తా॥ ఓ కుంతీపుత్రా ! (శాస్త్రోక్తమైన కార్యమున) ప్రవృత్తిని, (శాస్త్ర విరుద్ధమైన కార్యమున) నివృత్తిని, (దేశకాలములనెరింగి ఇట్టిది చేయదగినది, ఇట్టిది చేయదగనిదను) కార్యాకార్యములను, (ఇట్టి కార్యమున భయము గలుగును, ఇట్టి కార్యమున భయములేదను) భయాభయములను, బంధమిట్టి దనియు, (ఈ విధముగ నడచినచో) మోక్షమొందవచ్చుననియు, ఏబుద్ధి యెరుంగునో అదియే సాత్త్వికమైనది.

(1) ప్రవృత్తిం - బంధకారణమును (రాఘవేంద్రులు) (స్వకీయము) 16 వ అధ్యా - 7 వ శ్లో చూడుడు.

(2) నివృత్తిం - మోక్షకారణమును (రాఘవేంద్రులు)

(శంకరులు) బంధహేతువైన శాస్త్రవిహితకర్మ మార్గము, మోక్షహేతువైన సన్న్యాస మార్గము, ఇవియే ప్రవృత్తి, నివృత్తి, యనంబడుచున్నవి. వీటినిన్ని ఆయాదేశకాలములలో దృష్టాదృష్ట (ఇహపర) ఫలములనివ్వదగిన కర్మలను చేయుటను, చేయక విడుచుటను, భయమునకు

కారణమైన పులి మొదలగువాటిని, భయము గలుగచేయని వస్తువులను, బంధమును, దానికి కారణమును, మోక్షమును, దానికారణమును, నెరింగెడిబుద్ధి సాత్త్వికమైనదని తాత్పర్యము.

(రామానుజులు) స్వర్గాది ప్రయోజనమున కావశ్యకమైన ధర్మము, మోక్షకారణమైన ధర్మము, వర్ణాశ్రమధర్మము, వీటినిన్ని, దేశకాలావస్థల ననుసరించి చేయవలసిన వాటిని, విడువవలసినవాటినిన్ని, శాస్త్రవిరోధముగ నడచిన భయము గలుగుననియు, శాస్త్రోక్తవిధమున నడచిన భయము గలుగదనియు, సంసారముయొక్క తత్త్వము నెరింగెడి బుద్ధి సాత్త్వికమైనది,



శ్లో॥ యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ।
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ॥ 31

పద॥ యయా - ధర్మం (1) - అధర్మం (2) - చ - కార్యం - చ - అకార్యం - ఏవ - చ।
అయథావత్ (3) - ప్రజానాతి - బుద్ధిః - సా - పార్థ - రాజసీ।

| | | | |
|---|---|---|---|
| | ఓ అర్జునా ! | అయథావత్ | (సందిగ్ధముగ)వేఱువిధముగ |
| యయా | ఏ బుద్ధిచేత | ప్రజానాతి | తెలిసికొనునో |
| ధర్మం | ధర్మమును | సా | అటువంటి |
| అధర్మం చ | అధర్మమును | బుద్ధిః | బుద్ధి |
| కార్యం చ | చేయదగినదానిని | రాజసీ | రాజసమైనది |
| అకార్యమేవ చ | చేయదగనిదానిని | | |

తా॥ ఓ అర్జునా! ఏ బుద్ధిచే ధర్మాధర్మములను కార్యాకార్యములను సందేహముతో నెరుంగునో అట్టిబుద్ధి రాజసమైనది.

(1) ధర్మం - శాస్త్రోక్తమైన కర్మ (శంకరులు).

(2) అధర్మం - శాస్త్రవిరుద్ధమైన కర్మ (శంకరులు).

(3) అయథావత్ ప్రతికార్యమునందును నిశ్చయబుద్ధిలేకయే (శంకరులు). ఇందులోజెప్పిన కర్మాదులలోకొన్నిటిని బాగుగను కొన్నిటిని విపరీతముగను నెఱుంగునది (రాఘవేంద్రులు).



శ్లో॥ అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ॥ 32

పద॥ అధర్మం - ధర్మం - ఇతి - యా - మన్యతే - తమసా - ఆవృతా।
సర్వార్థాన్ - విపరీతాన్ - చ - బుద్ధిః - సా - పార్థ - తామసీ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ ! | ఓ కుంతీపుత్రా ! | సర్వార్థాన్ | సకలవస్తువులను |
| యా | యేబుద్ధి | విపరీతాంశ్చ | విపరీతములుగను |
| తమసా | అజ్ఞానముచేత | మన్యతే | తలంచుచున్నదో |
| ఆవృతా | కప్పబడి (మూయబడి) | సా | ఆ |
| అధర్మం | అధర్మమును | బుద్ధిః | బుద్ధి |
| ధర్మమితి | ధర్మమ్మనియు | తామసీ | తామసమైనది. |

**తా॥ ఓ కుంతీపుత్రా! ఏ బుద్ధి అజ్ఞానముచే మూయబడి అధర్మమును ధర్మమనియు సకలవస్తువులను విపరీతముగను (ఒకదానిని మఱియొకటిగను) తలంచునో అట్టిబుద్ధి తామసమైనది.**

(శ్రీధరులు) మునుపటి రెండు శ్లోకములలోను ఇందులోను జెప్పిన బుద్ధియనగా అంతఃకరణము. జ్ఞానమనునది దానియొక్క వ్యాపారము. ధృతియనునదిగూడ బుద్ధియొక్క వ్యాపారమే. లేక బుద్ధియనునది నిశ్చయస్వరూపమైన అంతఃకరణ వ్యాపారమే. ధర్మా ధర్మములకు ముఖ్య సాధనములు బుద్ధి జ్ఞానధృతులైనందున వాటినిగూర్చి మాత్రము ఇచ్చట జెప్పబడినది. దానిచేతనే ఇచ్ఛ మొదలగునవిగూడ గుణత్రయముగలవని గ్రహింపదగును.

(రామానుజులు) అజ్ఞానమువలన కప్పబడియున్న తామసబుద్ధియైనది, సకలవస్తువులను విపరీతముగ నెఱుంగుచున్నది. ఎట్లనగా ధర్మము నధర్మముగను తక్కువైన దానిని ఎక్కువగను ఇట్లు అన్నిటిని వ్యత్యాసముగ నెరుంగునదే.

**శ్లో॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః ।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ ॥ 33**

పద॥ ధృత్యా - యయా - ధారయతే (1) - మనః ప్రాణేంద్రియ క్రియాః ।
యోగేన (2) - అవ్యభిచారిణ్యా (3) - ధృతిః - సా - పార్థ - సాత్త్వికీ ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ ! | ఓ పార్థా ! | మనః ప్రాణేంద్రియ క్రియాః | మనస్సు, ప్రాణములు, ఇంద్రియములు వీటి వ్యాపారములను |
| యోగేన | మనస్సు ఒకటే నిలకడలో నుండుటచేత, లేక సమాధిచేత | ధారయతే | నిలబెట్టుచున్నాడో |
| అవ్యభిచారిణ్యా | చలింపకున్న, లేక విషయములలో ప్రవర్తింపకున్న లేక చలించని | ధృతిః | ధైర్యము |
| యయాధృత్యా | ఏ ధైర్యముచేత | సాత్త్వికీ | సాత్త్వికమైనది. |

**తా॥ ఓ పార్థా! మనస్సు ఒకేనిలకడలో నుండుటచేత చలింపకున్న యే ధైర్యముచేత మనస్సు, ప్రాణములు, ఇంద్రియములు, వీటి వ్యాపారములను నిలబెట్టునో అట్టి ధైర్యము సాత్త్వికమైనది.**

(1) ధారయతే - మోక్షసాధనమైన భగవదుపాసనచేత (రామానుజులు). భగవద్భక్తితోగూడిన యోగముచేత (రాఘవేంద్రులు).

(2) యోగేన - భగవదుపాసనలోనే నిలకడ జెందజేయునో (రామానుజులు).

(3) అవ్యభిచారిణ్యా - విహిత మార్గమునను్న (రాఘవేంద్రులు).

(శంకరులు) యోగేన = యోగసమాధిచేత, అవ్యభిచారిణ్యా = సమాధితో నెల్లప్పుడు గూడియున్న, యయాధృత్యా = ఏ ధైర్యముచేత, ధారయతే = మనస్సు, ప్రాణములు, ఇంద్రియ

ములు వీటిని విషయములనుండి మరలింపజేసి ఆత్మధ్యానమున నిలబెట్టునో అట్టి ధైర్యము సాత్త్వికమైనది.

శ్లో॥ యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ॥ 34

పద॥ యయా - తు - ధర్మకామార్థాన్ - ధృత్యా - ధారయతే (1) - అర్జున।
ప్రసంగేన (2) - ఫలాకాంక్షీ - ధృతిః - సా - పార్థ - రాజసీ॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున! | ఓ అర్జునా! | ధారయతే | ఒకడు ధరించునో |
| యయాతుధృత్యా | మఱి యేధైర్యముచేత | హే పార్థ! | ఓ పార్థా! |
| ప్రసంగేన | (ధర్మార్థకామములయొక్క) అసక్తిచేత | సా | ఆ |
| | | ధృతిః | ధైర్యము |
| ఫలాకాంక్షీ | ఫలమునపేక్షించువాడునగునో | రాజసీ | రాజసమైనది. |
| ధర్మకామార్థాన్ | ధర్మముకామముఅర్థము వీటిని | | |

తా॥ ఓ కుంతీపుత్రుడైన అర్జునా! యే ధైర్యముచేత ధర్మార్థకామములను తప్పనిచ్చుటలేదో ధర్మార్థకామముల యొక్క ఆసక్తిచే ఫలమునపేక్షించు వాడగునో అట్టి ధైర్యము రాజసమైనది. (ధర్మాదులు ముఖ్యమైనవనియు, ఫలము ముఖ్యమైనది కాదనియు తాత్పర్యము.)

(రామానుజులు) ఏ ధైర్యముచేత, ఫలాకాంక్షీతు = ధర్మార్థకామములనెడి ఫలము నపేక్షించు పురుషుడు, ప్రసంగేన = అధికమైన యాసక్తిచే, ధర్మకామార్థాన్ = ధర్మకామార్థములకు కారణమైన మనస్సు ప్రాణములు ఇంద్రియములు వీటివ్యాపారములను, ధారయతే = అనుకూల పరచుకొనుచున్నాడో అట్టిధైర్యము రాజసమైనది.

(1) ధారయతే - ఎల్లప్పుడు ననుష్ఠింపదగినదని యే మనస్సుచే నిశ్చయించునో (శంకరులు).

(2) ప్రసంగేన - తనదను నభిమానముచేత (రాఘవేంద్రులు)



శ్లో॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ।
న విముఞ్చతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ॥ 35

పద॥ యయా - స్వప్నం (1) - భయం - శోకం (2) - విషాదం (3) - మదం (4) - ఏవ - చ।
న - విముఞ్చతి - దుర్మేధాః - ధృతిః - సా - పార్థ - తామసీ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ పార్థా! | మదమేవచ | మదమును |
| దుర్మేధాః | దుష్టబుద్ధిగలవాడు, లేక మూఢుడు | యయా | ఏ ధైర్యముచేత |
| | | నవిముఞ్చతి | విడుచుటలేదో |
| స్వప్నం | నిద్రను | సా | ఆ |
| భయం | భయమును | ధృతిః | ధైర్యము |
| శోకం | దుఃఖమును | తామసీ | తామసమైనది. |
| విషాదం | కష్టమును (మైకమును) | | |

తా॥ ఓ పార్థా! బుద్ధిగలవాడైన ఒకడు నిద్ర, భయము, వ్యసనము, వ్యాకులము, వీటిని ఏ ధైర్యముచే విడువడో అట్టి ధైర్యము తామసమైనది.

(1) స్వప్నం - అతినిద్ర (రాఘవేంద్రులు).

(2) శోకం - ఇష్టవస్తువు నశించుటవలన గలిగెడి దుఃఖము (ఆనందగిరి).

(3) విషాదం - ఇంద్రియముల దౌర్బల్యము (ఆనందగిరి). చింత, దుఃఖము, మనోవిచారము. (స్వకీయము)

(4) మదం - బుద్ధిని మైకమొందించు వస్తువులను తినుట, లేక ఆశ్రయించుటవలన గలిగెడి మైకము (శంకరరామానుజులు).

(రామానుజులు) భయము, శోకము, మొదలగునవి ఏ విషయములద్వారా గలుగునో అట్టి విషయములను త్యజింపకుండుట.

(రాఘవేంద్రులు) నిషిద్ధములైన స్వప్నము మొదలగువాటిని ఏధైర్యముచే విడుచుటలేదో అట్టి ధైర్యము తామసమైనది.

---

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి॥　　36

,, యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్॥　　37

పద॥ సుఖం - తు - ఇదానీం - త్రివిధం - శృణు - మే - భరతర్షభ।
అభ్యాసాత్ - రమతే - యత్ర (1) - దుఃఖాంతం - చ - నిగచ్ఛతి॥
,, యత్ - తత్ - అగ్రే (2) - విషమ్ - ఇవ - పరిణామే (3) - అమృతోపమమ్।
తత్ - సుఖం (4) - సాత్త్వికం - ప్రోక్తం - ఆత్మబుద్ధిప్రసాదజమ్(5)॥

| | | | |
|---|---|---|---|
| హే భరతర్షభ ! | ఓ భరతకులశ్రేష్ఠుడా ! | యత్ | ఏది |
| యత్ర | దేనియందు | అగ్రే | మొదట |
| అభ్యాసాత్ | అభ్యాసమువలన(వాడుకవలన) | విషమివ | (దుఃఖము నిచ్చుటవలన) విషమువలెను |
| రమతే | సంతోషమొందునో | | |
| దుఃఖాన్తం చ | దుఃఖముయొక్క పరిహారమును, లేక ముగింపును | పరిణామే | కడపట |
| | | అమృతోపమం | (సంతోష మిచ్చుటవలన) అమృతమువలెను నుండునో |
| నిగచ్ఛతి | నిశ్చితముగ పొందునో | | |
| తత్ సుఖం | అది సుఖమనంబడును | తత్ సాత్త్వికం | అది సాత్త్వికముగ |
| త్రివిధం | మూడువిధములైన | ప్రోక్తం | చెప్పబడియున్నది |
| (తత్) సుఖం | అట్టి సుఖమును | తత్ ఆత్మబుద్ధి ప్రసాదజమ్ | అది తనబుద్ధి స్వచ్ఛతవలన, లేక అశుద్ధి తొలగి శుద్ధముగ నుండుటవలన గలిగినట్టిది |
| ఇదానీం | ఇప్పుడు | | |
| మే (వచనాత్) | నాయొక్క వాక్యమువలన | | |
| శృణు | వినుము | | |

తా॥ ఓ భరతశ్రేష్ఠా! ఎందులో నభ్యాసమువలన మనుజుడు సంతోషము జెందగలడో దుఃఖమునుండి నివృత్తిజెందగలడో అది సుఖమనంబడును.

మూడు విధములైన అట్టి సుఖము నిప్పుడు నా వద్దనుండి వినుము. ఏ సుఖము మొదట విషమువలెనుండి కడపట అమృతమువలెనగునో అది సాత్త్వికమైనదని చెప్పబడియున్నది. అది తన బుద్ధి స్వచ్ఛతవలన, లేక జ్ఞానముచే మనస్సునందలి అశుద్ధి తొలగి శుద్ధముగ నుండుటవలన గలిగినది.

(1) యత్ర - ఏ సుఖానుభవమున (శంకరులు).

(2) అగ్రే - జ్ఞానవైరాగ్య ధ్యాన సమాధుల ననుష్ఠింపదొడగిన కాలమున (శంకరులు). యోగాభ్యాసమున తన స్వరూప సుఖము తెలియకున్న కాలమున (రామానుజులు)

(3) పరిణామే - జ్ఞానవైరాగ్యాదులలో సమర్థుడైన పిదప (శంకరులు). స్వరూపాను సంధానము నందుండగా (రామానుజులు).

(4) సుఖం - మునుపుచెప్పిన జ్ఞానము కర్మకర్త వీటికి శేషియైన సుఖమును (జ్ఞానము కర్మ కర్త వీటివలన గలిగెడి ప్రయోజనము సుఖమైనందున అట్టి సుఖము శేషి, జ్ఞానాదులు శేషము) (రామానుజులు).

(5) ఆత్మబుద్ధి ప్రసాదజం - పరిశుద్ధమైన ఎట్టి ఆత్మస్వరూప జ్ఞానముగలదో అట్టి నిర్మలమైన జ్ఞానము వలన గలిగిన, లేక అఖండాత్మ స్వరూపము తప్ప ఇతర విషయములలో ప్రవర్తించని జ్ఞానము పూర్ణమగు సమయమున గలిగిన (శంకరులు). ఆత్మ స్వరూపము తప్ప వేరేవిషయము తోచకయుండు బుద్ధివలన గలిగిన (రామానుజులు). విష్ణు ప్రసాదమువలన గలిగినది బుద్ధి ప్రసాదము అదియేదనగా విష్ణువునుదప్ప ఇతర విషయములను గ్రహింపకుండుటయే. దానివలన గలిగిన (రాఘవేంద్రులు).

శ్లో॥ విషయేంద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38

పద॥ విషయేంద్రియసంయోగాత్ - యత్ - తత్ - అగ్రే - అమృతోపమమ్।
పరిణామే - విషం - ఇవ - తత్ - సుఖం - రాజసం - స్మృతమ్ ॥

| | | | |
|---|---|---|---|
| యత్ | ఏది | పరిణామే | కడపట |
| విషయేంద్రియ-సంయోగాత్ | విషయములు ఇంద్రియములు ఇవి సంబంధించుటవలన | విషమివ | విషమువలెనునుండునో |
| (జాయతే) | (కలుగునో) | తత్సుఖం | అట్టి సుఖము |
| తత్ అగ్రే | అది మొదట | రాజసమ్ | రాజసమని |
| అమృతోపమమ్ | అమృతముతో సమానమైనదిగను | స్మృతం | చెప్పబడియున్నది. |

తా॥ ప్రసిద్ధమైన యే సుఖము విషయేంద్రియముల సంబంధము వలన మొదట అమృతముతో సమానముగను కడపట విషమువలెనునుండునో అట్టి సుఖము రాజసమైనదని చెప్పబడియున్నది.

(శ్రీధరులు) స్త్రీ సంభోగాదులు ఆరంభమున సుఖమువలెనున్నను విషయానుభవమైన పిదప ఇహపరములలో దుఃఖమును గలుగజేయును. కావున విషమువలె చెప్పబడినవి.

(శంకరులు) విషయసుఖము తన స్త్రీ మొదలగు విషయమున, బలము, పరాక్రమము, రూపము, జ్ఞానము, (మేధా) జ్ఞాపకశక్తి, ధనము, ఉత్సాహము, వీటిని పోగొట్టును. పర స్త్రీ మొదలగు విషయమున పాపఫలమైన నరకమునకు హేతువగును. కావున విషముతో సమానముగ జెప్పబడినది.

(రామానుజులు) ఆకలి మొదలగువాటి నివృత్తికై విషయముల ననుభవించిన పిదప అట్టి యనుభవము నరక హేతువైనందున విషము త్రావినట్లుండునని తాత్పర్యము.



శ్లో॥ యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః ।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥ 39

పద॥ యత్ - అగ్రే - చ - అనుబంధే - చ - సుఖం - మోహనం (1) - ఆత్మనః ।
నిద్రాలస్యప్రమాదోత్థం (2) - తత్ - తామసం - ఉదాహృతమ్ ॥

| | | | |
|---|---|---|---|
| యత్ సుఖం | ఏ సుఖము | నిద్రాలస్య ప్రమాదోత్థం | నిద్ర సోమరితనము అలక్ష్య భావము వీటివలన గలుగునదో |
| అగ్రేచ | ప్రారంభమునందును | తత్ | అది |
| అనుబంధే చ | ముగింపునందును | తామసం | తామసమైనదని |
| ఆత్మనః | తన్ను | ఉదాహృతం | చెప్పబడియున్నది. |
| మోహనం | మోహింపజేయునది | | |

తా॥ ఏ సుఖము ప్రారంభమునందును అంతమునందును తనకు మోహమును గలుగజేయునదిగను, నిద్ర, సోమరితనము, పనికిరాని విషయములను గూర్చి మనస్సున ఆలోచించుట యనెడి వ్యర్థపర్యాలోచనము వీటివలన గలిగినదిగనునున్నదో అట్టి సుఖము తామసమని చెప్పబడియున్నది.

(1) మోహనం - ఏయేవస్తువులు ఏయేవిధముగనున్నవో ఆ విధముగ దెలిసికొనుటకు జ్ఞానము లేకుండునట్లుచేయుట (రామానుజులు).

(2) నిద్రాలస్యప్రమాదోత్థం - నిద్రయనునది దాని ననుభవించు సమయమున వస్తువులను తెలియనివ్వదు. ఆలస్యము అనునది ఇంద్రియములను విషయములలో ప్రవర్తింపక నిలబెట్టి వస్తువులను తెలియనివ్వదు. ప్రమాదమనునది వ్యర్థమైన పర్యాలోచనలో మనస్సున్నందున చేయవలసిన కార్యమున దాని ప్రవృత్తినడ్డగించి వస్తువుల స్వరూపముల నెరుంగనివ్వదు. కావున వీటివలన గలిగిన సుఖము తామసమైనది (శంకరులు). ప్రమాదః-వాస్తవముగ గ్రహింపదగినదానిని విపరీతముగ గ్రహించుట (రాఘవేంద్రులు)



శ్లో॥ న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః ॥ 40

పద॥ న - తత్ - అస్తి - పృథివ్యాం - వా - దివి - దేవేషు - వా - పునః ।
సత్త్వం - ప్రకృతిజైః - ముక్తం - యత్ - ఏభిః - స్యాత్ - త్రిభిః - గుణైః ॥

| | | | |
|---|---|---|---|
| ప్రకృతిజైః | ప్రకృతినుండి గలిగిన | పృథివ్యాం వా | మనుష్యలోకమునగాని, లేక భూమిలోని మనుష్యులలోగాని |
| ఏభిఃత్రిభిఃగుణైః | ఈ మూడు గుణములవలన | | |
| ముక్తం | విడువబడినదై | దివి | స్వర్గలోకమునందున్న |
| యత్ స్యాత్ | ఏదిగలదో | దేవేషు వాపునః | దేవతలలోగాని |
| తత్ సత్త్వం | ఆ వస్తువు | నాస్తి | లేదు. |

తా॥ మాయవలన గలిగిన సత్త్వాది గుణత్రయముచే విడువబడిన (గుణ సంబంధములేని) స్థావరజంగమమైన వస్తువేదిగలదో అట్టిది మనుష్యలోకమున మనుష్యులు మొదలగు వార్లలోగాని స్వర్గమున దేవతలలోగాని మఱియెచ్చోటగాని లేదు. (అనగా, స్వర్గము, దానిక్రిందివైన లోకములన్నియు సత్త్వరజస్తమోగుణములతో గూడినవియే)

(రామానుజులు) బ్రహ్మాది స్థావర పర్యంతమైనవన్నియు గుణత్రయముచే వ్యాపింపబడినవే.

(రాఘవేంద్రులు) ముక్తులకు గుణత్రయ సంబంధము లేదనుదానిని చూపించుటకై మనుష్యలోకమునందును దేవలోకమునందును గుణముల సంబంధములేని జీవజంతువులు లేవని చెప్పినట్లు భావించవలెను.

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప ।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ॥ 41

పద॥ బ్రాహ్మణక్షత్రియవిశాం - శూద్రాణాం - చ - పరంతప ।
కర్మాణి - ప్రవిభక్తాని - స్వభావప్రభవైః - గుణైః ॥

| | | | |
|---|---|---|---|
| హే పరంతప! | శత్రువులను తపింపజేయు ఓ అర్జునా! | గుణైః | గుణములచేత |
| బ్రాహ్మణ క్షత్రియ విశాంశూద్రాణాం చ | బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకును, శూద్రులకును | కర్మాణి | కర్మలు |
| స్వభావ ప్రభవైః | సాత్త్వికాది స్వభావములకు కారణమగు, లేక పూర్వ కర్మ శేషమువలన గలిగిన లేక స్వభావమువలనగలిగెడు | ప్రవిభక్తాని | వేరువేరుగ విభజింపబడియున్నవి. |

తా॥ ఓ అర్జునా! బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు వీరలకు పూర్వకర్మ శేషమువలన గలిగిన సత్త్వాది గుణములచేత కర్మలు వేరువేరుగ విభజించి చెప్పబడియున్నవి.

(శ్రీధరులు) అన్నియు గుణమువలన చుట్టబడినవైనచో మోక్షమొందు మార్గమేది? అనుపక్షమున, వర్ణాశ్రమములకు తగిన కర్మలను పరమేశ్వరారాధనముగనే చేయుచున్నచో ఆ పర

మేశ్వర ప్రసాదమువలన జ్ఞానమును పొంది దానివలన మోక్ష మొందవచ్చునను గీతాసారము ఇది మొదలుగా అధ్యాయము ముగియువఱకు చెప్పబడుచున్నది.

(స్వాభిప్రాయము) ఇందులో *బ్రాహ్మణాది వర్ణములయొక్క స్వభావము సత్త్వాది గుణములచేత విభజింపబడినదిగ చెప్పబడియున్నదిగదా? ఆ విషయమునుగూర్చి భాష్యకారులున్ను వ్యాఖ్యాతలున్ను జెప్పియున్నట్లు క్రింద వరుసగ గుర్తింపజేయబడుచున్నది. ఈ క్రమమును ఇందలి 4 వ అధ్యాయము 13 వ శ్లోకము క్రిందను చూడదగును. అవి యేవన—

1. బ్రాహ్మణునకు - సత్త్వగుణము అధికము (శంకరులు, శ్రీధరులు) రజస్తమోగుణముల నణచి సత్త్వగుణము తలయెత్తియుండును. కావున వాని కర్మ సాత్త్వికముగనుండును (రామానుజులు).

2. క్షత్రియునకు-సత్త్వగుణము స్వల్పము, రజోగుణము అధికము (శంకరులు, శ్రీధరులు), సత్త్వతమోగుణములనణచి రజోగుణము తలయెత్తియుండును కావున వానికర్మ రాజసముగనుండును (రామానుజులు)

3. వైశ్యునకు-తమోగుణము స్వల్పము. రజోగుణము అధికము (శంకరులు, శ్రీధరులు), సత్త్వరజోగుణముల నణచి తమోగుణము స్వల్పముగ తలయెత్తియుండును. కావున వానియొక్క కర్మస్వల్ప తమోగుణము గలదిగ నుండును (రామానుజులు).

4. శూద్రునకు - రజోగుణము స్వల్పము, తమోగుణము అధికము (శంకరులు, శ్రీధరులు) సత్త్వరజోగుణముల నణచి తమోగుణము అధికముగ తలయెత్తియుండును. కావున వానికర్మ తామసముగనుండును (రామానుజులు).

* ఈ బ్రాహ్మణాది వర్ణముల వివరములను మహాభారతము ఆదిపర్వమున అధ్యా 8 శ్లో॥-50 మొదలు 55 వఱకు, భాగవతము 7-11-20 మొదలు 24 వఱకు, లింగ పురాణము అధ్యా-151 - వీట్లలో చూడుడు. (స్వ)

శ్లో॥ శమో దమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్* ॥ 42

పద॥ శమః(1) - దమః(2) - తపః(3) - శౌచం(4) - క్షాంతిః(5) - ఆర్జవం(6) -ఏవ-చ ।
జ్ఞానం(7) - విజ్ఞానం(8) - ఆస్తిక్యం(9) - బ్రాహ్మం - కర్మ(10) - స్వభావజమ్ ॥

| | | | |
|---|---|---|---|
| శమః | మనస్సును అణచుటయు | ఆర్జవమేవ చ | ఋజు స్వభావమున్ను |
| దమః | వెలుపలి ఇంద్రియముల నణచుటయు | జ్ఞానం | శాస్త్రజ్ఞానమున్ను |
| | | విజ్ఞానం | అనుభవజ్ఞానమున్ను |
| తపః | మనోవాక్కాయముల వలన చేయబడు తపస్సున్ను | ఆస్తిక్యం | వేదమున నమ్మకము, లోక, ఆస్తిక స్వభావమున్ను |
| శౌచం | మనశ్శరీరశుద్ధియు | స్వభావజం | స్వభావమువలన గలిగిన |
| క్షాంతిః | ఓర్పున్ను | బ్రాహ్మం కర్మ | బ్రాహ్మణజాతియొక్క కర్మ |

తా॥ మనస్సును వెలుపలి ఇంద్రియములను, అణచుటయు, తపస్సు, మనో దేహశుద్ధి, ఓర్పు, ఋజుత్వము (క్రమప్రవర్తనము), శాస్త్రజ్ఞానము,

అనుభవజ్ఞానము, వేదమున నమ్మకము, ఇవి స్వభావముచే గలిగినవైన బ్రాహ్మణజాతియొక్క కర్మలుగనున్నవి.

* ఈ 42-43-44 శ్లోకములను గర్గసంహిత మధురాఖండము అధ్యాయము 12-శ్లో-5-6-7 లందును, ఇందు కనబరచిన శమదమాదుల వివరణము శాండిల్యోపనిషత్తు, దర్శనోపనిషత్తు 2-వ ఖండము, భాగవతము 11-15-16-17, బృహన్నారదీయ పురాణము అధ్యా 23, గరుడపురాణము అధ్యా 49, వీటిలో చూడుడు. (స్వకీయము.)

(1) శమః - భగవన్నిష్ఠ (రాఘవేంద్రులు). వెలుపలి ఇంద్రియములను అణచుట (రామానుజులు).

(2) దమః-ఇంద్రియముల నణచుట (రాఘవేంద్రులు). అంతఃకరణము నణచుట (రామానుజులు).

(3) తపః - భోగముల నణచి శాస్త్రోక్తమైన విధమున దేహమును బాధపెట్టుట (రామానుజులు). ఇందలి అధ్యా6-శ్లో46 చూడుడు (స్వ)

(4) శౌచం - శాస్త్రీయమైన కర్మయోగ్యత (రామానుజులు)

(5) క్షాంతిః - ఇతరుల వలన చెరుపుచేయబడినను వికారమొందకుండుట (రామానుజులు).

(6) ఆర్జవమ్ - మనస్సులోనున్నట్లు వెలుపలగూడ నడచుట (రామానుజులు). మనస్సు, వాక్కు, దేహము వీటివ్యాపారము ఒకేవిధముగనుండుట (రాఘవేంద్రులు).

(7) జ్ఞానం - పరాపర తత్త్వజ్ఞానము (రామానుజులు). సాధారణ వస్తుజ్ఞానము (రాఘవేంద్రులు).

(8) విజ్ఞానం - భగవంతునియెడనున్న అసాధారణ విశేషముల నెఱుంగుట (రామానుజులు). వస్తువులయొక్క విశేషజ్ఞానము (రాఘవేంద్రులు).

(9) ఆస్తిక్యం - పరలోకముగలదను నిశ్చయము (శ్రీధరులు). పురుషోత్తముడైన వాసుదేవుడు పరబ్రహ్మము. అతడు సకలదోషములు లేనివాడు. స్వభావముగను పూర్ణముగను అతిశయముగనునున్న జ్ఞానము, శక్తి, మొదలగు ననంత కల్యాణగుణములుగలవాడు. ముఖ్యముగ వేదాంత శాస్త్రములవలన నెఱుంగదగినవాడు. జగత్తునకు ముఖ్యకారణమైనవాడు, సకల జగత్తునకు నియామకుడు. ఇట్టిభగవంతుని యారాధనకై సకల వేదోక్త కర్మలను జేయునట్లు వేదమున విధింపబడియున్నది. అట్టి కర్మలచే నారాధింపబడిన భగవంతుడే ధర్మార్థ కామ మోక్ష ఫలముల నిచ్చెడివాడు, అను సకల వేదాంతార్థములలోను నమ్మకము గలిగియుండుట. అధ్యా-6శ్లో-29, అధ్యా-7-శ్లో-7, అధ్యా-10 శ్లో-38, అధ్యా-15-శ్లో-15, అధ్యా-18-శ్లో-46 వీటిని చూడుడు (రామానుజులు). ధర్మము మొదలగు వాటివలన ప్రయోజనముగలదను నమ్మకము (రాఘవేంద్రులు),

(10) బ్రాహ్మం కర్మ - 'బ్రహ్మ కర్మ' అని పాఠము. బ్రాహ్మణుడు చేయవలసిన కర్మలని యర్థము. (శ్రీధరులు)



శ్లో॥ శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం ।
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ 43

పద॥ శౌర్యం(1)-తేజః(2)-ధృతిః(3)-దాక్ష్యం(4)-యుద్ధే-చ-అపి-అపలాయనమ్ ।
దానం (5) - ఈశ్వరభావః (6) - చ - క్షాత్రం - కర్మ - స్వభావజమ్ ॥

| | | | |
|---|---|---|---|
| శౌర్యం | పరాక్రమము, లేక శూరత్వము | అపలాయనమపి చ | వెనుజూపి పరుగెత్తకుండుట |
| తేజః | ప్రతాపము, లేక కీర్తి, లేక సాహసము | దానం | ఇచ్చుట |
| | | ఈశ్వరభావశ్చ | ఏలెడిశక్తి - ఇవి |
| ధృతిః | ధైర్యము | స్వభావజమ్ | స్వభావమువలన గలిగిన |
| దాక్ష్యం | సామర్థ్యము | క్షాత్రం కర్మ | క్షత్రియజాతియొక్క కర్మ |
| యుద్ధే | యుద్ధమున | | |

తా॥ పరాక్రమము, కీర్తి, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమున వెనుదీయకుండుట, దానమిచ్చుట, పరిపాలించు శక్తి ఇవి క్షత్రియునికి స్వభావముగనున్న కర్మలుగనున్నవి.

(1) శౌర్యం - యుద్ధమున భయములేకయే శత్రువులమీద ప్రవేశించెడి సామర్థ్యము (రామానుజులు). భయపడకుండుట (రాఘవేంద్రులు).

(2) తేజః - ఇతరులవలన తాను అపజయము చెందకుండుట (రామానుజులు). దేహకాంతి (రాఘవేంద్రులు).

(3) ధృతిః - ప్రయత్నించిన కార్యమున కడ్డుగలిగినను దానిని నివర్తించి కార్యమును పూర్తిజేయు సామర్థ్యము (రామానుజులు).

(4) దాక్ష్యం - సమయమున మోహముచెందక వెంటనే చేయుట (శంకరులు). సకలకార్యములను తానే నిర్వహించు సామర్థ్యము (రామానుజులు). సామర్థ్యము (రాఘవేంద్రులు)

(5) దానం - తనవియు న్యాయముగ సంపాదించినవియునైన సొమ్ములను ధర్మమునకై ఇచ్చుట (రామానుజులు), సత్పాత్రములో నిచ్చుట (రాఘవేంద్రులు).

(6) ఈశ్వరభావః - దండనాది కర్తృత్వము, (రాఘవేంద్రులు)



శ్లో॥ కృషి గౌరక్ష్యవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ 44

పద॥ కృషిగౌరక్ష్యవాణిజ్యం - వైశ్యం - కర్మ (1) - స్వభావజమ్।
పరిచర్యాత్మకం - కర్మ - శూద్రస్య - అపి - స్వభావజమ్॥

| | | | |
|---|---|---|---|
| కృషి గౌరక్ష్యవాణిజ్యం | పైరుబెట్టుట, గోవులను సంరక్షించుట, వ్యాపారము జేయుట, ఇది | పరిచర్యాత్మకం | మిగత మూడువర్ణములవారలకు సేవజేయుట |
| | | శూద్రస్యాపి | శూద్రునికి |
| స్వభావజమ్ | స్వభావమువలన గలిగిన | స్వభావజమ్ | స్వభావముగ గలిగిన |
| వైశ్యం కర్మ | వైశ్యకర్మగ నున్నట్టిది | కర్మ | కర్మగనున్నది. |

తా॥ పైరుబెట్టుటయు, పశువులను రక్షించుటయు, వ్యాపారము జేయుటయు వైశ్యునకు స్వభావముగ గలిగిన కర్మలుగనున్నవి. మిగత మూడువర్ణముల వారలకు సేవజేయుట శూద్రునికి స్వభావముగా గలిగిన కర్మగనున్నది.

(1) వైశ్యం కర్మ - 'వైశ్యకర్మ' యనిపాఠము. అర్థము సమానమే: (శ్రీధరులు)

(రామానుజులు) బ్రహ్మ, క్షత్రియ, వైశ్యలకు యజ్ఞాదులు స్వభావమైన కర్మలని వేదమున చెప్పియుండగా వాటినిన్ని బ్రాహ్మణులకు జెప్పియున్న శమము దమము తపస్సు మొదలగునవి క్షత్రియ వైశ్యలకుగూడ నుండవలసినవిగా నుండగా వాటినిన్ని ఏల జెప్పలేదనగా వారివారికి స్వభావమైన కర్మలుమాత్రము ఇచ్చట జెప్పబడినవి. ఇతరములైనవి నిషేధింపబడలేదు.

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥ 45

పద॥ స్వే - స్వే - కర్మణి - అభిరతః (1) - సంసిద్ధిం (2) - లభతే - నరః ।
స్వకర్మనిరతః - సిద్ధిం - యథా - విందతి - తత్ - శృణు ॥

| | | | |
|---|---|---|---|
| స్వేస్వేకర్మణి | వానివానికి విహితమైయున్న కర్మలో | స్వకర్మనిరతః | తనయొక్క కర్మలో ఆసక్తిగలవాడు |
| | | యథా | ఏ విధముగ |
| అభిరతః | శ్రద్ధగల | సిద్ధిం | జ్ఞానయోగ్యతను, లేక సిద్ధిని |
| నరః | మనుష్యుడు | విందతి | పొందునో |
| సంసిద్ధిం | జ్ఞానయోగ్యతను, లేక సిద్ధిని | తత్ | దానిని |
| లభతే | పొందుచున్నాడు | శృణు | వినుము. |

తా॥ ఆ యా వర్ణములవారలకు విధింపబడియున్న కర్మలో శ్రద్ధగలిగిన మనుష్యులు జ్ఞానయోగ్యతను పొందుచున్నారు. తన కర్మానుష్ఠానములో నున్నవాడు ఏ విధముగ జ్ఞానయోగ్యతను పొందునో దానిని (చెప్పెదను) వినుము.

(1) అభిరతః - కర్మననుష్ఠించి భగవదారాధనము జేయుచున్న (రాఘవేంద్రులు).

(2) సంసిద్ధిం - కర్మానుష్ఠానముచేత అశుచి నివృత్తియైన దేహేంద్రియములకు జ్ఞాననిష్ఠా యోగ్యతను (శంకరులు). పరమపదప్రాప్తిని (రామానుజులు). జ్ఞానముద్వారా ముక్తిని (రాఘవేంద్రులు).

(స్వకీయము) "సర్వేషా మాశ్రమాణాం చ స్వధర్మశ్శ్రేయశః పరం । స్వధర్మ హీనా నరకే పతన్తి మూఢ చేతసః" సర్వ వర్ణములలోనున్న ఆశ్రమములకును స్వధర్మమే ఉత్తమమైన శ్రేయస్సుగనున్నది. స్వధర్మమును జేయకయే విడిచిపెట్టువారలైన మూఢబుద్ధిగలవారలు నరకమున త్రోయబడుచున్నారు. బ్రహ్మకైవర్తపురాణము. ఉత్తరభాగము. అధ్యా 59 - శ్లో - 67,

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥ 46

పద॥ యతః - ప్రవృత్తిః (1) భూతానాం - యేన - సర్వం - ఇదం - తతమ్ ।
స్వకర్మణా (2) - తం - అభ్యర్చ్య - సిద్ధిం (3) - విందతి - మానవః ॥

| | | | |
|---|---|---|---|
| యతః | ఎవనివద్దనుండి, లేక ఎట్టి | యేన | ఏ ఈశ్వరునిచేత |
| భూతానాం | ప్రాణులకు | ఇదం సర్వం | ఈ ప్రపంచమంతయు |
| ప్రవృత్తిః (భవతి) | ప్రవృత్తి (కలుగుచున్నదో) | తతం | వ్యాపింపబడియున్నదో |

| | | | |
|---|---|---|---|
| తం | అతనిని | అభ్యర్చ్య | ఆరాధించి లేక పూజించి |
| మానవః | మనుష్యుడు | సిద్ధిం | జ్ఞానయోగ్యతను, లేక సిద్ధిని |
| స్వకర్మణా | తనకు సొంతమైన కర్మచేత | విందతి | పొందుచున్నాడు. |

తా॥ ఏ అంతర్యామియైన ఈశ్వరునివద్దనుండి ప్రాణులకు ప్రవృత్తి గలుగుచున్నదో ఏ ఈశ్వరునిచేత ఈ సకల ప్రపంచమున్ను వ్యాపింపబడి యున్నదో అట్టి యీశ్వరుని మానవుడు తనకు తగినకర్మచే నారాధించి జ్ఞాన యోగ్యతను పొందుచున్నాడు.

(1) ప్రవృత్తిః - ఉత్పత్తి, లేక చేష్ట (శంకరులు, రామానుజులు)

(2) స్వకర్మణా - ఆయావర్ణాశ్రమములకు తగిన వేదోక్తకర్మచే (శంకరులు). శమదమాదులతో గూడియున్న కర్మచే (రాఘవేంద్రులు).

(3) సిద్ధిం - భగవంతుని పరమపదమును (రామానుజులు). మోక్షమును (రాఘవేంద్రులు). 3 వ అధ్యాయము 4-35 చూడుడు (స్వకీయము).

(స్వకీయము) ప్రాణులకు ఉత్పత్తి మొదలగునవి ఈశ్వరునివలన ననుదానికిని, ఈశ్వరుడు సర్వవ్యాపియనుదానికిని అధ్యా 7-శ్లో-6-7, అధ్యా-9-శ్లో-10, అధ్యా- 10- శ్లో-8 ఇవి ప్రమాణములుగ నున్నవి.

శ్లో॥ శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47

పద॥ శ్రేయాన్ - స్వధర్మః - విగుణః - పరధర్మాత్ - స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం - కర్మ - కుర్వన్ - న - ఆప్నోతి - కిల్బిషమ్ ॥

| | | | |
|---|---|---|---|
| స్వధర్మః | తనయొక్క ధర్మము | శ్రేయాన్ | మిక్కిలి శ్రేష్ఠమైనది |
| విగుణః (అపి) | గుణము లేనిదైనను | స్వభావనియతం | స్వభావమువలన నేర్పడిన |
| స్వనుష్ఠితాత్ | బాగుగ, క్రమముగ, ననుష్ఠింప బడిన | కర్మ | కర్మను |
| | | కుర్వన్ | చేసెడివాడు |
| పరధర్మాత్ | ఇతరులయొక్క, లేక అన్యమైన ధర్మముకంటె | కిల్బిషం | పాపమును |
| | | నాప్నోతి | పొందడు. |

తా॥ తనయొక్క ధర్మము (తన వర్ణమునకు తగినదని విహితమై యున్న కర్మ) గుణములేనిదిగ కనబడినను క్రమముగ ననుష్ఠింపబడు ఇతరులయొక్క (అన్యవర్ణములవార్లయొక్క) ధర్మమునకంటె శ్రేష్ఠమైనది. స్వాభావికమైన (స్వభావముచే గలిగిన) కర్మను జేసెడివాడు పాపమును పొందడు. (దీనివలన ఇతరులయొక్క ధర్మము ననుష్ఠించినవాడు స్వధర్మమును విడుచుటచేతను, ఇతరులధర్మము ననుష్ఠించినందునను కలిగెడి పాపమును పొందుచున్నాడని సిద్ధించుచున్నది.)

(శంకరులు) విషములోని పురుగులకు విషమెట్లు దోషముకానేరదో, మిగతప్రాణులకు విషమెట్లు దోషమగుచున్నదో, అవిధముగనే, ఇతరులకర్మ దోషహేతువైనను, స్వకర్మమట్టిదిగాదు.

(శ్రీధరులు) క్షత్రియుడైన నీకు యుద్ధముచేసి చంపుట స్వధర్మముగను భిక్షమెత్తితినుట పరధర్మముగను నున్నదను దానిని అర్జునునకు భగవంతుడు గుర్తించి చూపినదగుచున్నది.

(రామానుజులు) స్వధర్మః = కర్తృత్వాభిమానమును విడిచిన పురుషునిచే వాని దేహేంద్రియముల వలన ననుష్ఠింపదగినదిగను ఈశ్వరారాధన రూపముగనున్న కర్మయోగము అనుష్ఠించుటకు సులభమైనదిగ నున్నది. అట్టి స్వధర్మమైన కర్మయోగము, విగుణః = గుణము లేనిదైనను, స్వనుష్ఠితాత్ = పరధర్మాత్ = ఇంద్రియములను స్వాధీనపరచుకొన్న పురుషునిచే ననుష్ఠింప దగినట్టియు, పొరబాటు రాగలిగినట్టియు, ఎప్పుడైన ఒక సమయమున మాత్రము బాగుగ ననుష్ఠింపదగినట్టియు జ్ఞానయోగమనెడి పరధర్మముకంటె, శ్రేయాన్ = (సులభముగ పొందదగినది గావున) శ్లాఘ్యమైనది. స్వభావనియతం కర్మ = ప్రకృతి సంబంధముతోనున్న పురుషుని దేహేంద్రియములయొక్క వ్యాపారము కావున వాని జననముతో గలిగియున్నట్టిదని మునుపు చెప్పిన స్వధర్మమగు కర్మయోగమును, కుర్వన్ = చేసెడివాడు, కిల్బిషం = సంసార బంధమును, నాప్నోతి = పొందుటలేదు. దీనితాత్పర్య మేమనగా కర్మయోగము సులభమైనది. ఏలనగా ఎప్పుడు దేహముగలిగెనో అదిమొదలు కర్మజేయ వాడుక పడియున్నది. ఇంద్రియములు మనస్సు వీటిని అణచి చేయవలసినదైన జ్ఞానయోగము అభ్యాసము లేనందున మిక్కిలి ప్రయాసము. చాలకాలము శ్రమపడవలసి యున్నందున దానికంటె ఫలమునందాసక్తియు అభిమానమును లేకయు, ఈశ్వరార్పణ బుద్ధితోను, చేయబడు కర్మయోగము శ్రేష్ఠమైనది. దీని వలన జ్ఞానమున్ను జ్ఞానమువలన మోక్షమున్ను శీఘ్రముగ గలుగుననియే.

శ్లో॥ సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్ ।
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ 48

పద॥ సహజం - కర్మ - కౌంతేయ - సదోషం - అపి - న - త్యజేత్ ।
సర్వారంభాః - హి - దోషేణ - ధూమేన - అగ్నిః - ఇవ - ఆవృతాః

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! | ధూమేన | (తోడబుట్టిన) పొగచేత (కప్పబడిన) |
| సదోషమపి | దోషముతో గూడినదైనను | | |
| సహజం | స్వభావమువలన గలిగిన, లేక తోడబుటిన | అగ్నిరివ | అగ్నివలె |
| | | సర్వారంభాః | సకలకర్మలున్ను |
| కర్మ | కర్మను | దోషేణ | దోషముచేత |
| న త్యజేత్ | విడచిపెట్టగూడదు | ఆవృతాః | చుట్టబడియున్నవి. |
| హి | ఎందువల్లననగా | | |

తా॥ ఓ కుంతీపుత్రా ! స్వభావమువలన గలిగిన కర్మను, దోషముతో గూడినదైనను విడిచిపెట్టగూడదు. ఏలనగా అగ్ని యెట్లు పొగచే కప్పబడియున్నదో ఆ విధముగనే సకల కర్మలున్ను దోషముచే కప్పబడియున్నవి. (పొగయున్నదను కారణమువలన అగ్నిలో హోమముజేయుట మొదలగు పనులను ఎట్లు విడిచిపెట్టుటలేదో అట్లే దోషముగలదన్నందున కర్మను విడిచిపెట్టగూడదు. కర్మజేసి ఫలమును గోరక ఈశ్వరార్పణము జేయుచున్నచో చిత్తశుద్ధిద్వారా మోక్షము పొందవచ్చునని తాత్పర్యము.)

(శంకరులు) సహజం = తనతోగూడనే జనించినది. సదోషమపి = త్రిగుణాత్మకమైనందున దోషముతోగూడినదైనను, సర్వారంభాః = స్వకర్మ పరకర్మలన్నియు, దోషేణ=దోషముచేత కప్పు (వ్యాపింప) బడియున్నవి. పొగచే అగ్ని కప్పబడియుండుటవలె దోషముతోగూడిన కర్మను ఏల అనుష్ఠింపవలెననినచో కర్మను విడిచియుండుటకు మనుష్యుడు శక్తుడుకాడు. కర్మ జేయకుండుటకు ఎవ్వనిచేతను వీలుగాదనునదిమునుపే చెప్పబడియున్నది. కర్మ, దోషముగలదైయుండగా మఱియొకని కర్మ ననుష్ఠించుటలో బాధకమేమిగలదనిన - ఇతరుల కర్మ ననుష్ఠించుట వలన అధికమైన బాధకము గలుగునని మునుపే చెప్పబడియున్నది. పరమార్థ సన్న్యాసియగు బ్రహ్మజ్ఞానికి కర్మలను విడిచిపెట్టుట వీలగును. ఐనను మిగతవారలు కర్మలను విడువగూడదు.

(రామానుజులు) సదోషమపి = దుఃఖము నిచ్చునట్టిదైనను, నత్యజేత్ = కర్మ సులభముగ జేయదగినదైనందున, జ్ఞానమార్గమునకు యోగ్యుడైననుకర్మనుజేయక విడిచిపెట్టగూడదు. సర్వారంభాః = జ్ఞానారంభ కర్మారంభములు, దోషేణ = దుఃఖముతో, ఆవృతాః=కూడియున్నవి. అగ్నితో పొగపుట్టియుండుటవలె కర్మము జ్ఞానము ఇవిగూడ దుఃఖముతో బుట్టియున్నవైనను కర్మయోగము సులభమైనదనియు, జ్ఞానయోగము కఠినమైనదనియు తాత్పర్యము.

శ్లో॥ అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ 49

పద॥ అసక్తబుద్ధిః - సర్వత్ర - జితాత్మా - విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం - పరమాం - సన్న్యాసేన - అధిగచ్ఛతి ॥

| | | | |
|---|---|---|---|
| సర్వత్ర | సకల వస్తువులలోను, లేక అన్నిటిలోను | పరమాం | ఉత్తమమైన |
| అసక్తబుద్ధిః | అభిమానములేని బుద్ధిగలవాడై | నైష్కర్మ్యసిద్ధిం | నైష్కర్మ్యసిద్ధిని, కర్మ నివర్తించిన స్థితిని |
| జితాత్మా | అంతఃకరణమును జయించినవాడై | సన్న్యాసేన | సన్న్యాసముచేత |
| విగతస్పృహః | ఫలాపేక్ష లేనివాడైన పురుషుడు, లేక ఆశతొలగినవాడుగ నున్నవాడు | అధిగచ్ఛతి | పొందుచున్నాడు. |

తా॥ సకలవస్తువులలోను అభిమానములేకున్న బుద్ధిని బడసినవాడుగను మనస్సును జయించినవాడుగను ఫలాపేక్ష లేనివాడుగనునున్న పురుషుడు ఫలమును అభిమానమును విడిచిపెట్టుటయనెడి సన్న్యాసముచేత ఉత్తమమైన సర్వకర్మనివృత్తియనెడి చిత్తశుద్ధిని పొందుచున్నాడు.

(శంకరులు) సర్వత్ర = పుత్రమిత్ర ధనకనకాది వస్తువులలో, అసక్త బుద్ధిః = తనదను నభిమానమును విడిచిన బుద్ధిగలవాడుగను, జితాత్మా = మనస్సును జయించినవాడుగను, విగత స్పృహః = పుత్రాదులలో ఆశలేని వాడుగనునున్న ఆత్మజ్ఞానియైనవాడు, పరమాం = శ్రేష్ఠమైన, నైష్కర్మ్య సిద్ధిం = జ్ఞాననిష్ఠను, లేక సద్యోముక్తిని, (ఆక్షణమే బ్రహ్మస్వరూపముగుటను), సన్న్యా

సేన = బాగుగ పొందియున్న బ్రహ్మజ్ఞానముచేత, లేక బ్రహ్మజ్ఞానముగలిగి సకల కర్మలను విడిచినందున, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

(రామానుజులు) సర్వత్ర = కర్మఫలము మొదలగువాటిలో, అసక్తబుద్ధిః = అభిమానము లేకున్న బుద్ధిని గలిగినట్టియు, జితాత్మా = మనస్సును జయించినట్టియు, విగతస్పృహః = తాను కర్తకాదు, ఈశ్వరుడు సర్వకర్తయనియెరింగి కర్తృత్వాభిమానమును విడిచినట్టియు, సన్న్యాసేన = అభిమానఫలత్యాగములనెడి సన్న్యాసముతో నుండినట్టివాడైన పురుషుడు పైకనిన విధమున ఈశ్వరారాధనరూపమైన కర్మలను జేయుచున్నచో, పరమాం=ఉత్తమమైన, నైష్కర్మ్య సిద్ధిం = జ్ఞానయోగమునకు ఫలమైన సకల కర్మలులేని ధ్యాననిష్ఠను, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

(రాఘవేంద్రులు) విగతస్పృహః = ఇహపరసుఖములలో నాసక్తినివిడిచినవాడు, పరమాం = పూర్ణమైన, నైష్కర్మ్యసిద్ధిం - నైష్కర్మ్య = మోక్షమునకుపయుక్తమైన, సిద్ధిం = ప్రారబ్ధముతప్ప మిగత అనిష్టకర్మల నాశమును, సన్న్యాసేన = కామ్యకర్మ త్యాగముచేత, లేక ఈశ్వరార్పణముగ జేయుటవలన, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.



శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే ।
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50

పద॥ సిద్ధిం(1) ప్రాప్తః - యథా(2) - బ్రహ్మ(3) - తథా(4) - ఆప్నోతి - నిబోధ - మే ।
సమాసేన - ఏవ - కౌంతేయ - నిష్ఠా - జ్ఞానస్య - యా - పరా ॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! | బ్రహ్మ | బ్రహ్మమును |
| జ్ఞానస్య | (బ్రహ్మ) జ్ఞానముయొక్క | ఆప్నోతి | పొందుచున్నాడో |
| పరానిష్ఠా | శ్రేష్ఠమైన ముగింపు | తథా | అట్టి విధమును |
| యా | ఏదిగలదో | సమాసేనైవ | సంక్షేపముగ (తరచుగనే) |
| సిద్ధిం | సిద్ధిని | మే | నావద్దనుండి |
| ప్రాప్తః | పొందినవాడు | నిబోధ | తెలిసికొనుము. |
| యథా | ఏ విధముగా | | |

తా॥ ఓ కుంతీపుత్రా ! బ్రహ్మజ్ఞానముయొక్క కడపటి ముగింపు ఎట్టిదో, బ్రహ్మజ్ఞాన సిద్ధిని పొందినవాడు ఏవిధముగ బ్రహ్మమును పొందునో, ఆ విధమును నావద్దనుండి తెలిసికొనుము.

(1) సిద్ధిం - నిష్కామకర్మచేత ఈశ్వరుని ఆరాధించి దేహేంద్రియములకు ఈశ్వర ప్రసాదము వలన గలిగిన జ్ఞాననిష్ఠాయోగ్యతను (శంకరులు), శరీరమున్నంతవఱకు అనుష్ఠింపబడిన కర్మయోగముచేత పొందిన ధ్యానశక్తిని (రామానుజులు).

(2) యథా - ఏవిధమైన జ్ఞాననిష్ఠచేత (శంకరులు). ఏవిధముగ నున్నవాడై (రామానుజులు).

(3) బ్రహ్మ - లక్ష్మిని (రాఘవేంద్రులు).

(4) తథా - బ్రహ్మజ్ఞానముచెందుట ఏవిధమైనదో బ్రహ్మమును చెందుట యెట్టిదో ఆ విధమును (శంకరులు),

(రామానుజులు) యా = ఏ బ్రహ్మము, జ్ఞానస్య పరా నిష్ఠా = ధ్యానమున కుత్తమమైన విషయమైనదో.

(స్వకీయము) ఈ శ్లోకములోనున్న "జ్ఞానస్యపరానిష్ఠా = జ్ఞానముయొక్క కడపట ముగింపైనది" అనుపదములయొక్క అర్థము, శంకరభాష్యమున పూర్తిగ విచారింపబడినది. దానివలన అద్వైత సిద్ధాంతము ప్రకటమగుచున్నది. కావున అట్టి భాష్యకారుని తాత్పర్యము ననుసరించి విస్తారముగను పలుదృష్టాంతములు ప్రమాణములతోను క్రింద వ్రాయబడుచున్నది. అదేమనగా - ఇట్టివస్తువు ఈ విధముగ నున్నట్టిదని యెఱుంగుట జ్ఞానమనియు ఆ జ్ఞానమువలన నెఱింగినదేదిగలదో ఆ వస్తువుకంటె ఇతరవస్తువులను చింతింపక యెఱింగిన వస్తువునే ఎల్లప్పుడు ధ్యానించుట నిష్ఠయనియు చెప్పబడును. దృష్టాంతము — గడియారమనగా ఇట్టిదని యెఱుంగని వానియెడ గడియారమని చెప్పినందున దాని రూపము ఉపయోగము మొదలగునవి ఇట్టివనుదానిని అతడెరుంగజాలడు, దానిరూపమిటువంటిది, దానిలోకొన్ని చక్రములు మొదలగునవిగలవు, వాటి సహాయముతో కాలపరిమాణమును చూపుచున్నది, అనునది మొదలైన వివరములు వానికి చెప్ప బడినచో దానిచే అట్లు వినినవానికి గడియారముయొక్క రూపము, దాని యుపయోగము, ఈ విషయములలో గలిగెడి వివేకమే జ్ఞానము. అట్టి జ్ఞానమునకు అందినవఱకు ఆ గడియారమును చింతించుట నిష్ఠ. ఇది విషయజ్ఞానమని చెప్పబడుచున్నది. అద్వైత సిద్ధాంతమున బ్రహ్మజ్ఞానము — సగుణబ్రహ్మజ్ఞానము, నిర్గుణ బ్రహ్మజ్ఞానమని రెండువిధములుగ జెప్పబడుచున్నది. సగుణ బ్రహ్మజ్ఞానముగూడ విషయజ్ఞానమైనను మిగత ప్రపంచజ్ఞానముకంటె సర్వశ్రేష్ఠమైనది. సగుణ బ్రహ్మమేదనగా - వ్యవహారదశలో ఉపాసకుల యనుగ్రహార్థమై మాయలో ప్రతిఫలించిన బ్రహ్మ చైతన్యమే. అదియే బ్రహ్మ, విష్ణు, రుద్రాది రూపములుగ వ్యవహరింపబడుచున్న ఈశ్వరులు. వీరలు మాయోపాధికులైనను మాయకులోబడిన వారలుకారు. మాయను స్వాధీనమున నుంచుకొని దానిమూలముగ సృష్టిస్థితి సంహారాది కార్యములనున్ను, దుష్టనిగ్రహ శిష్టపరిపాలనార్థమై రామ కృష్ణా ద్యవతారములనున్ను జేసెడి అనంతకల్యాణ గుణశక్తి సామర్థ్యాదులను బడసినవారలు. మలిన సత్త్వమాయయనెడి అవిద్యలో ప్రతిఫలించిన బ్రహ్మచైతన్యమే జీవులయిరి. వీరలకు ఈశ్వరాదులకు గల శక్తిసామర్థ్యాదులు లేవు. కించిద్జ్ఞులుగను అవిద్యకు లోబడిన వారుగను నున్నారు. ఇట్టి జీవులు ఈశ్వరులనుపాసించియే వారల యనుగ్రహమువలన చిత్తశుద్ధినిపొంది పిదప నిర్గుణ బ్రహ్మజ్ఞానమును చెందవలెను. సగుణ బ్రహ్మజ్ఞానమేదనగా, ఆ యీశ్వరులలో ఎవరినిగూర్చి ఉపాసనజేయునట్లు గురువువలన నుపదేశింపబడుచున్నదో వారినిగూర్చి శ్రుతిస్మృతి పురాణాదులలో చెప్పబడియున్నట్టివిధమైన రూపము శక్తి మొదలగునవి ఇట్టివని యెఱుంగుటయే. అట్లెరింగిన విధముగనే భక్తివిశ్వాసములతో ఎడతెగక చింతించుటయు నిష్ఠయగును. ఇట్టి సగుణ బ్రహ్మజ్ఞాన నిష్ఠనుగూర్చి పురాణాదులలో పలుచోట్ల చెప్పబడియున్నది. విష్ణుపురాణము 6 వ అంశము 6, 7-వ అధ్యాయములలోని కేశిధ్వజ ఖాండిక్య సంవాదమున ఇది మిక్కిలి స్పష్టముగ జెప్పబడియున్నది. నిర్గుణ బ్రహ్మమెట్టిదనగా - సకల ప్రపంచమునకును అతీతముగను, ప్రపంచ మున అన్నిదృశ్యములను "నేతి నేతి = ఇదికాదు ఇదికాదు" అని త్రోసిచూడగా మిగిలినదిగను, రెండవది లేని ఒక్కటిగను, మూడు కాలములలోను ఒకటే విధముగనున్నదిగను, సకల ప్రపంచమున కాధారముగను, అంతట వ్యాపించినదిగను, మనోవాక్కుల కందనిదిగను, సకలమును ప్రకాశింప జేయుచున్న స్వప్రకాశముగను సచ్చిదానంద ఘనముగను, జ్ఞానమునే స్వరూపముగ గలదిగను

ఉన్నవస్తువే. ఈ విధముగ బ్రహ్మమునెఱుంగుటయే నిర్గుణ బ్రహ్మజ్ఞానము. ఎల్లప్పుడు నట్టి జ్ఞానముతో నుండుటయే నిష్ఠ. ఇట్టి బ్రహ్మజ్ఞాననిష్ఠ గలవాడెవ్వడో అతడు జీవన్ముక్తుడని చెప్ప బడుచున్నాడు. అతనికి ఈ దేహము పోయినతోడనే మోక్షమేను.

ఇతడు విదేహముక్తుడని చెప్పబడుచున్నాడు, అనగా స్థూలసూక్ష్మ కారణదేహములు లేనివాడై బ్రహ్మముతో కలియుచున్నాడు. అది దేనివలెననగా - మహాకాశమున ఘటాకాశమున్ను, జలములో జలమున్ను, పాలలో పాలున్ను, నేతిలో నెయ్యిన్ని కలసిన భేదము తొలగిపోవుటవలె అని యెఱుంగదగినది. బ్రహ్మమే జీవేశ్వరులనినచో సంసారమున్ను సుఖదుఃఖాదులున్ను అట్టి బ్రహ్మమునకేగదా చెప్పవలెను? అట్లు బ్రహ్మమునకు సంసారాదులు చెప్పదగవుగదా? కావున జీవేశ్వరులు బ్రహ్మముకంటె అన్యులనియు చెప్పవలసి యున్నదనినచో అట్లుచెప్పుట శ్రుతివాక్య ములకును, అట్టి శ్రుతివాక్యములను ఆధారముగ గొన్న అద్వైత సిద్ధాంతమును స్థాపించిన మహా త్ములగు గౌడబ్రహ్మానందులు శంకరాచార్యులు మొదలగువారల వాక్యములకును విరుద్ధమగును, అజ్ఞానమున్నంత వఱకు ప్రపంచమున్ను జీవేశ్వరాది భేదములున్ను వాస్తవమువలె కనబడునేగాని జ్ఞానముగలిగినచో సకల భేదములున్ను అసత్యములై బ్రహ్మ మొకటియై సత్యమైమిగులును. అది దేనివలె అనగా - త్రాడులో పామున్ను, యెండమావులలో జలమున్ను, ముత్యపుచిప్పలో వెండియు ఎట్లు భ్రమయున్నంతవఱకు వాస్తవముగను, భ్రమనివృత్తి యైనతోడనే అసత్యములుగను నగు చున్నవో దానివలె ననుడు.

పైన జెప్పబడియున్నటుల ఏయే శ్రుతివాక్యములు, జీవబ్రహ్మము లొక్కటియే యనియు, బ్రహ్మమే జీవేశ్వరులనియు, ప్రపంచము అసత్యమనియు, బ్రహ్మముదప్ప రెండవవస్తువేలేదనియు, ప్రకటింపజేయుచున్నవో వాటిలోకొన్ని క్రింద నుదహరింపబడుచున్నవి. అవి యేవనగా-

## (1) ఈశావాస్యోపనిషత్

"యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి।
యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః॥
తత్ర కో మోహః కశ్శోకః ఏకత్వమనుపశ్యతః॥ 6-7

ఎవ్వడు సర్వభూతములను తనయాత్మగనే చూచుచున్నాడో, జ్ఞానికి సకల భూత ములు తానుగనే యేకాలమునసైనదో, ఆకాలమున (సకలమును) ఒకటిగనే జూచెడు నట్టివానికి మోహమెక్కడిది? శోకమెక్కడిది? ఈశావాస్యోపనిషత్తు 6-7

## (2) కఠవల్ల్యుపనిషత్

### చతుర్థవల్లీ

యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ।
మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥ 10
మనసైవేదమాప్తవ్యం నేహ నానాస్తి కిఞ్చన।
మృత్యోస్సమృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి॥ 11

ఏది ఇచ్చటనో (యీ ప్రపంచమున కార్యకారణోపాధితో సంసారివలె ప్రకాశించుచున్నదో,) అది (బ్రహ్మము) తనలోపలనే (ప్రకాశించుచున్నది.) ఏది తనలోపలనో అది యీ ప్రపంచమున (ప్రకాశించుచున్నది). ఇచ్చట (ఈ ప్రపంచమున) అనేకములుగా జూచెడివాడు మరణమునుండి మరణమును పొందుచున్నాడు. (మరల మరల జననమరణముల పొందుచున్నాడు.) కఠవల్ల్యుపనిషత్తు 4 వల్లి 10–11.

పంచమివల్లి

అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ ।
ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥ 9

ప్రపంచమున ఒకయగ్నియే పలురూపములుగ గనబడుచున్నాడు. (ఒక్కటే యగ్ని పలుకాష్ఠములలో ప్రవేశించి ఆయా కాష్ఠరూపముగ గానబడుచున్నది.) ఆ విధముగనే సకల భూతములలోనున్న ఆత్మయనునతడు పలురూపములుగ ఆకాశమువలె (ఘటాకాశము, మఠాకాశము, మహాకాశమువలె) గానవచ్చుచున్నాడు. పైదాని 5-వ వల్లి 9.

## (3) ముండకోపనిషత్ 2-1-1

తదేతత్సత్యం యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే సరూపాః ।
తథాఽక్షరాద్వివిధాస్సోమ్యభావాః ప్రజాయన్తే తత్ర చైవాపియన్తి ॥

ఓ సౌమ్యుడా! అది సత్యమైనది. మండుచున్న అగ్నినుండి అదేరూపముతో అనేక మిణుగురులు ఎట్లు గలుగుచున్నవో, ఆ విధముగనే అక్షరమునుండి పలువిధములైన దేహముల నుపాధిగాబడసిన జీవులు గలుగుచున్నారు. దానియెడనే లయమొందుచున్నారు. ముండకోపనిషత్తు 2–1–1.

పురుష ఏవేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతం ॥ 10

ఈ ప్రపంచము, కర్మ, తపస్సు, శ్రేష్ఠమైన యమృతము, ఇవియు పురుషుడగు బ్రహ్మమే. పై 2–1–10.

యథా నద్యస్స్యన్దమానాస్సముద్రేఽస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ ।
తథావిద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥ 8.
సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి.

ప్రవహించుచున్న నదులు నామరూపముల విడనాడి సముద్రమునుబొంది యెట్లు దానిలో లయించి పోవుచున్నవో, అట్లే బ్రహ్మజ్ఞానియైనవాడు నామరూపములనుండి విముక్తిజెంది సర్వశ్రేష్ఠముగను దివ్యముగనునున్న పురుషుని పొందుచున్నాడు. ఎవ్వడీవిధముగ బ్రహ్మము నెఱుంగునో యతడు బ్రహ్మమే యగుచున్నాడు. పై 3–2–8–9.

## (4) మాండూక్యోపనిషత్ 1-2

సర్వం హ్యేతద్బ్రహ్మాఽయమాత్మా బ్రహ్మసోఽయమాత్మా చతుష్పాత్ ॥

ఇదంతయు బ్రహ్మమే. నాలుగు పాదములుగల (జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయమను నాలుగు అవస్థలుగల) ఆయీ ఆత్మ (జీవుడు) బ్రహ్మమే మాండూక్యోపనిషత్తు 1–2.

ప్రపంచో యది విద్యేత నివర్తేత న సంశయః।
మాయామాత్రమిదం ద్వైత మద్వైతం పరమార్థతః॥

ప్రపంచమున్నచో అది నివృత్తమగుననుదానిలో సందియములేదు. ఈ ద్వైతము (పలు విధములుగ గనబడుట) మాయామాత్రమే రెండవదిలేనిదగు ఒక్కటే వాస్తవముగనున్నట్టిది. పై ఉపనిషత్తు 17.

స్వప్నమాయే యథా దృష్టే గంధర్వనగరం యథా।
తథా విశ్వమిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః॥ 31
న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః।
న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా॥ 32

స్వప్నము, మాయ, గన్ధర్వనగరము ఇవి యెటులనో ఆ విధముగనే ఈ ప్రపంచము, వేదాన్తములలో వివేకులైన వారలచే చూడబడినది. (31) ప్రళయములేదు, ఉత్పత్తియులేదు. బద్ధుడుకాడు. సాధించెడువాడుకాడు. ముముక్షువుకాడు, ఇవియే వాస్తవమైనది. (32) పైకారిక వైతథ్యప్రకరణము.

ఆత్మాహ్యాకాశవజ్జీవైర్ఘటాకాశైరివోదితః।
ఘటాదివచ్చ సంఘాతైర్జాతావేతన్నిదర్శనమ్॥ 3
ఘటాదిషు ప్రలీనేషు ఘటాకాశాదయో యథా।
ఆకాశే సంప్రలీయన్తే తద్వజ్జీవ ఇహాత్మని॥ 4
యథైకస్మిన్ ఘటాకాశే రజోధూమాదిభిర్యుతే।
న సర్వే సంప్రయుజ్యన్తే తద్వజ్జీవాస్సుఖాదిభిః॥ 5
రూపకార్యసమాఖ్యాశ్చ భిద్యన్తే తత్ర తత్ర వై।
ఆకాశస్య న భేదోఽస్తి తద్వజ్జీవేషు నిర్ణయః॥ 6
జీవాత్మనోరనన్యత్వ మభేదేన ప్రశస్యతే।
నానాత్వం నిన్ద్యతే యచ్చ తదేవం హి సమంజసమ్॥ 13
అద్వైతం పరమార్థో హి ద్వైతం తద్భేద ఉచ్యతే।
తేషాముభయథా ద్వైతం తేనాయం న విరుధ్యతే॥ 18
మనోదృశ్యమిదం ద్వైతం యత్కించిత్స చరాచరమ్।
మనసోహ్యమనీభావే ద్వైతం నైవోపలభ్యతే॥ 31

ఆకాశము ఘటాకాశముగా జెప్పబడునట్లు ఆత్మ, జీవులుగా జెప్పబడుచున్నాడు. (మట్టినుండి) ఘటము మొదలగునవి గలుగుటవలె (ఆత్మయే) పృథివిమొదలగు సముదాయములుగ గలుగుచున్నాడు. ఇది యుత్పత్తివిషయమున దృష్టాంతము (3). ఘటము మొదలగునవి నశించినచో ఘటము మొదలగు వాటిలోనున్న ఆకాశమెట్లు మహాకాశమున లయించుచున్నదో, అట్లే జీవుడు ఆత్మలో లయమొందుచున్నాడు. (4). ఒక ఘటాకాశమున ధూళి, పొగ మొదిలగునవి ఆవరించియుండగా మిగత ఘటాకాశములలో నవి (ధూళి మొదలగునవి) సంబంధించనట్లు, సుఖాది

విషయములలో జీవులు (5). రూపము, కార్యము, పేరు, ఇవి ఆయాచోట విభిన్నములుగా నున్నవి. ఆకాశమునందనగా భేదములేదు, జీవుల విషయమునందును ఇట్లే నిశ్చయము (6). జీవుడున్ను ఆత్మయు, భేదములేనివను నభేదముస్తుతింపదగియున్నది. భేదమనెడు ననేకత్వమనునది నిందింపబడుచున్నది. అదిసరియైనదే. (13). వాస్తవమైనది యద్వైతమేగదా? దానిభేదము ద్వైత మని చెప్పబడుచున్నది. వారలకు (ద్వైతులకు పారమార్థికము వ్యావహారికము) రెండింటిలోను ద్వైతమే. దానివలన ఇది (అద్వైతము) విరోధించుటలేదు. (18). ఏయొక చరాచర ప్రపంచమగు నీద్వైతము మనోదృశ్యమే. మనోనాశముగలిగినచో ద్వైతము కనబడుటలేదు. (31). వైకారిక అద్వైతప్రకరణము.

# (5) ఐతరేయోపనిషత్.

## తృతీయోఽధ్యాయః.

కోఽయమాత్మేతి వయ ముపాస్మహే కతరస్స ఆత్మా? యేనవా రూపం పశ్యతి యేనవా శబ్దం శృణోతి యేన వా గన్ధానాజిఘ్రతి యేనవా వాచం వ్యాకరోతి యేనవా స్వాదుచాస్వాదుచ విజానాతి (1) యదేతద్ధృదయం మనశ్చైతత్ సంజ్ఞానమాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధాదృష్టిర్ధృతిర్మతిర్మనీషా జూతిః స్మృతిః సఙ్కల్పః క్రతురసుః కామోవశ ఇతి సర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్య నామ ధేయాని భవన్తి (2) స ఏష బ్రహ్మ ఏష ఇన్ద్ర ఏష ప్రజాపతి రేతే సర్వే దేవా ఇమాని చ పంచమహాభూతాని పృథివీ వాయురాకాశ ఆపో జ్యోతీంష్యేతానీ మానిచ, క్షుద్ర మిశ్రాణీవ బీజా నీతరాణి చేతరాణి చాణ్డజాని చ జారుజాని చ స్వేదజాని చోద్భిజ్జాని చాశ్వాగావః పురుషాహస్తినో యత్కించేదం ప్రాణిజంగ మఞ్చ పతత్రి చ యచ్చస్థావరం సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ప్రజ్ఞా నేత్రోలోకః ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ (3) ॥

ఆత్మయని మనమెవ్వని నుపాసించుచున్నామో, ఆయాత్మ యెట్టివాడు? దేనివలన రూపమును చూచుచున్నాడో దేనివలన శబ్దమును వినుచున్నాడో దేనివలన వాసనను గ్రహించుచున్నాడో దేనివలన నోటితో మాటలాడుచున్నాడో, దేనివలన రుచియరుచి యని యెరుంగుచున్నాడో, (అతడాత్మ) (1) ఈ హృదయము, ఈ మనస్సు, ఈ చేతనత్వము, ఈశ్వరత్వము, వివేకము, సద్జ్ఞానము, శాస్త్రజ్ఞానము, సకలము నెరింగెడి జ్ఞానము, ధైర్యము. మననము, మనోదార్ఢ్యము, మనోవేదనజ్ఞానము, స్మరణము, రూపాదులను వికల్పముగ గాంచుట, నిశ్చయము, ప్రాణవృత్తి, ఆశ, స్వాధీనత, అనునవన్నియు ప్రజ్ఞానముయొక్క నామములేయగుచున్నవి. (2) అతడే బ్రహ్మ, అతడే ఇంద్రుడు, అతడే ప్రజాపతి. ఈదేవతలెల్లరు అతడే. భూమి, జలము, అగ్ని, వాయువు. ఆకాశమనెడు పంచమహాభూతములు, అల్పములగు జంతువులు, విత్తనములు, మిగత స్థావరజంగమములు అండజములు, జరాయుజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు, గుఱ్ఱము, ఆవు, ఏనుగు, మనుష్యులు, ఇక జంగమములైన ప్రాణులేవిగలవోయవి, పక్షులు, మిగతస్థావరములు అన్నియు ఆ ప్రజ్ఞానేత్రమే ప్రజ్ఞానమునందే నిలకడబడసినవి. లోకములు ప్రజ్ఞానేత్రముగనే యున్నవి. ప్రజ్ఞానమునే ఆధారముగ బడసినవి ప్రజ్ఞానమే బ్రహ్మము. (ఐతరేయోపనిషత్తు 3. అ.)

# (6) ఛాందోగ్యోపనిషత్

## తృతీయప్రపాఠకే చతుర్దశః ఖండః.

సర్వం ఖల్విదం బ్రహ్మ

ఈ సకలప్రపంచము బ్రహ్మమే (ఛాందోగ్యోపనిషత్తు 3-14)

## షష్ఠప్రపాఠకే ప్రథమఖండః.

యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం (4) యథాసోమ్యైకేన లోహ మణినా సర్వం లోహమయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారోనామధేయం లోహమిత్యేవ సత్యమ్. (5)

ఓ సౌమ్యుడా! ఒకే మట్టిముద్దచే (ఘటము మొదలగునవి) అంతయు మట్టిమాత్రమేయనియు (ఘటముమొదలైన) వికారములు, పేర్లు, మాటమాత్రమేయనియు మట్టిమాత్రమే సత్యమైనదనియు (4) ఓ సౌమ్యుడా! ఒకే లోహపిండముచే నంతయు లోహమాత్రమేయనియు వికారములు, పేర్లు, మాటమాత్రమేయనియు లోహముమాత్రమే సత్యమైనదనియు (ఎఱుంగుటవలె బ్రహ్మమొక్కటే సత్యమైనది. మిగత చేతనాచేతన ప్రపంచము మాటమాత్రమే) (5) పై ఉపనిషత్తు. 6-1

## ద్వి తీ యః ఖ ం డః

సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం

ఓ సౌమ్యుడా! మొదట నీప్రపంచము సత్తుగనే (బ్రహ్మముగనే) యుండినది. రెండవది లేదు. ఒక్కటిగనే యుండినది.

తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి

అది (సత్తునది) అనేకమగుదునని చూచినది.

## అ ష్ట మ ఖ ం డః

ఐతదాత్మ్యమిదం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో !

ఓ శ్వేతకేతువా! ఈ ప్రపంచమంతయు ఆ సత్తునే ఆధారముగ గలిగినది. అదియె సత్యమైనది, అదియే ఆత్మ, అది నీవుగనున్నావు, (ఇదే అర్థముగలదై పై 8-వ ఖండము మొదలు 16 వ ఖండమువఱకు శ్వేతకేతువునకుపదేశించబడియున్నది.)

## సప్తమ ప్రపాఠకే చతుర్వింశః ఖండః.

యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా, అథ యత్రాన్యత్పశ్యతి అన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పం యో వై భూమా తదమృతం, అథ యదల్పం తన్మర్త్యం స భగవః కస్మిఞ ప్రతిష్ఠితఇతి స్వే మహిమ్నిఇతి. 1

దేనిలో వేరొకదానిని చూచుటలేదో, వేరొకదానిని వినుటలేదో, వేరొకదాని నెఱుంగుట లేదో, అది మహత్తైనది (అన్నిటిలోను గొప్పది). దేనిలో వేరొకదానిని జూచుచున్నాడో వేరొక దానిని వినుచున్నాడో, వేరొకదానిని ఎఱుంగుచున్నాడో, అది యల్పమైనది. మహత్తైనది యమృతము, ఏది యల్పమైనదో అది నశింపదగినది. ఓ భగవంతుడా! అది దేనిలో నిలకడ జెందియున్నది, తన మహిమయందే, లేక మహిమలోను లేదు. (అనగా వాస్తవమున, బ్రహ్మ మున కాధారమేలేదని తాత్పర్యము,)

పంచవింశః ఖండః

స ఏవాధస్తాత్స ఉపరిష్టాత్స పశ్చాత్స పురస్తాత్స దక్షిణతస్స ఉత్తర తస్స ఏవేదం సర్వం ఇత్యథాతోఽహంకారాదేశ ఏవాహమేవాధస్తా దహము పరిష్టాదహం పశ్చాదహం దక్షిణతోఽహము త్తరతోఽహమేవేదం సర్వమితి ॥ 1

అథాత ఆత్మాదేశ ఏవాత్మైవాధస్తాదాత్మోపరిష్టాదాత్మా పశ్చాదాత్మా పురస్తాదాత్మా దక్షిణత ఆత్మోత్తరత ఆత్మైవేదం సర్వమితి సవా ఏష ఏవం పశ్యన్నేవం మన్వాన ఏవం విజానన్నాత్మరతిరాత్మక్రీడ ఆత్మమిథున ఆత్మా నందస్స స్వరాట్ భవతి. 2

అదియే (మహత్తే) క్రిందను పైనను ముందుగను దక్షిణమునను ఉత్తరమునను నున్నది. అది యేయంతయు. పిదప నేనను మాటలేదు. నేనే క్రిందను పైనను నేనే వెనుకను ముందును నేనే దక్షిణమునందును నేనే ఉత్తరమునందును ఇదంతయునేనే. తర్వాత ఆత్మోపదేశమే, ఆత్మయే క్రిందను ఆత్మయే పైనను ఆత్మయే వెనుకను ఆత్మయే ఎదుటను ఆత్మయే దక్షిణమునను ఆత్మయే యుత్తరమునను ఇదంతయు యాత్మయే. ఎవ్వడిట్లు చూచుచున్నాడో ఎవ్వడిట్లు తలంచుచున్నాడో ఎవ్వడిట్లు ఎఱుంగుచున్నాడో అతడాత్మయెడ సంతోషము ఆత్మయెడ ఆటలును చేరికను ఆత్మ యెడ నానందమై బ్రహ్మమే యగుచున్నాడు, (విదేహముక్తుడగుచున్నాడు.) ఛాందోగ్యోపనిషత్తున 7-వ ప్రపాఠకము 25-వ ఖండము.

## (7) బృహదారణ్యకోపనిషత్

### తృతీయాధ్యాయస్య చతుర్థం బ్రాహ్మణమ్

బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్తదాత్మా నమేవావైత్ అహం బ్రహ్మాస్మీతి తస్మా త్సర్వమభవత్ తద్యోయో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్తథా ఋషీ ణాం తథా మనుష్యాణాం తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదేహం మనుర భవం సూర్యశ్చేతితదిదమప్యేతర్హి య ఏవం వేదాఽహం బ్రహ్మాస్మీతిస ఇదం సర్వం భవతి తస్యహన దేవాశ్చనా భూత్యా ఈశతే ఆత్మాహ్యేషాం స భవతి అథ యోఽన్యాం దేవతాముపాస్తే అన్యోసావన్యోఽహమస్మీతి న స వేదయథాపశుః.

సృష్టికి పూర్వము ఈ ప్రపంచము బ్రహ్మముగనే యుండినది, అది తన్ను బ్రహ్మ ముగనే యెఱింగెను, దాని యొద్దనుండి ఈ ప్రపంచమంతయు గలిగినది. దానిని (బ్రహ్మమును)

దేవతలలోను ఋషులలోను మనుష్యులలోను నెవడెవడెఱింగెనో యాతడు అదేయాయెను, దీనిని (బ్రహ్మమును) ఎఱింగిన వామదేవర్షి ''నేను మనువైతిని సూర్యుడైతిని" అనెను. (సకలమును తన యాత్మగనే చూచెనని తాత్పర్యము) ఈ కాలమునందును ఇట్లు నేను బ్రహ్మముగనున్నానని యెవడెఱుంగునో అతడీ సకలమగుచున్నాడు. అతనికి విరోధము జేయుటకు దేవతలును శక్తులు గాజాలరు, ఏలన వారలకు నతడాత్మయగుటవలననే. ఎవడు (తనకంటే) అన్యుడుగ దేవతలనున్ను "అతడన్యుడు నేనన్యుడను'' అనియు నుపాసించుచున్నాడో, అతడు పశువువలె నెఱుంగనివాడే. బృహదారణ్యకోపనిషత్తు 3-వ అధ్యాయము. 4-వ బ్రాహ్మణము

## చ తు ర్థా ధ్యా య స్య ప్ర థ మం బ్రా హ్మ ణ మ్

సయథోర్ణనాభి స్తన్తునోచ్చరేత్ యథాగ్నేః క్షుద్రాఃవిస్ఫులింగా వ్యుచ్చ ర న్త్యేవమేవా స్మాదాత్మన స్సర్వే ప్రాణా స్సర్వే లోకా స్సర్వే దేవా స్సర్వాణి భూతాని వ్యుచ్చర న్తి.

సాలెపురుగు తననూలుతో నెట్లు సంచరించుచున్నదో, అగ్నినుండి అల్పములైన కణము లెట్లు బయలుదేరుచున్నవో అట్లే ఆ యీ ఆత్మనుండి సకల ప్రపంచములున్ను సకల లోకములున్ను దేవతలెల్లరున్ను సకల భూతములున్ను గలుగుచున్నారు. పై నాల్గవఅధ్యాయము మొదటి బ్రాహ్మణము,

## చ తు ర్థం బ్రా హ్మ ణ మ్

సయథా సైన్ధవఖిల్య ఉదకే ప్రాస్త ఉదకమేవాను విలీయేత నహాస్యోద్గ్ర హణాయేవ స్యాత్ యతోయతస్త్వాదదీత లవణమేవైవంవా అర ఇదం మహద్భూత మనన్త మపారం విజ్ఞానఘన ఏవ.

అది యెట్లనగా జలములోనుంచబడిన ఉప్పుగడ్డ జలములో గలసినచో దానిని గడ్డగనెత్త శక్తిలేనివాడుగ నగుచున్నాడు. దానివలె ఓ మైత్రేయీ ! యెల్లలేనివాడగు ఆ యీ ఆత్మయనునతడు ఆ విజ్ఞాన ఘనమనెడు బ్రహ్మమున జయించి పోవుచున్నాడు.

యత్రహిద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి, తదితర ఇతరం జిఘ్రతి, తదితర ఇతరం శృణోతి, తదితర ఇతర మభివదతి, తదితర ఇతరం మనుతే, తదితర ఇతరం విజానాతి, యత్రవా అస్యసర్వమాత్మైవాభూత్ తత్కేన కం జిఘ్రేత్, తత్కేనకం పశ్యేత్, తత్కేనకం శృణుయాత్, తత్కేనక మభివదేత్, తత్కేన కం మన్వీత, తత్కేనకం విజానీయాత్. యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్, విజ్ఞాతారమరే కేన విజానీయాదితి.

ఎచ్చట (అవిద్యావస్థలో) ద్వైతమువలె (జీవేశ్వర ప్రపంచాది భేదమువలె) నున్నదో దానిలో (ఆ యవస్థలో) ఒకడు మరియొకని జూచుచున్నాడు. ఒకడు మరియొకదానిని వాసన జూచుచున్నాడు. ఒకడు మరియొకదానిని వినుచున్నాడు. ఒకడు మరియొకదాని గూర్చి మాట లాడుచున్నాడు. ఒకడు మఱియొకదానిని దలంచుచున్నాడు. ఒకడు మఱియొకదాని నెఱుంగు చున్నాడు, అతని కెచ్చోట (యే జ్ఞానావస్థలో) సకలము ఆత్మాకారమైనదో దానిలో (ఆ యవస్థలో) దేనివలన దేనినివాసనజూచుట? దేనివలన దేనినివినుట? దేనివలన దేనినిజెప్పుట? దేనివలన దేనిని

తలంచుట? దేనివలన దేనినెఱుంగుట? దేనివలన దీనినంతను నెఱుంగునో ఆ జ్ఞానస్వరూపియైన ఆత్మను, అట్లెఱుంగువానిని, ఓ మైత్రేయీ! దేనివలన నెఱుంగుట? (అనగా ఆత్మతప్ప ఎఱుంగదగిన రెండవవస్తువులేదని తాత్పర్యము) 4-వ బ్రాహ్మణము.

పంచమం బ్రాహ్మణమ్

ఇయం పృథివీ సర్వేషాం భూతానాం మధ్వస్యై పృథివ్యై సర్వాణి భూతాని మధు. యశ్చాయమస్యాం పృథివ్యాం తేజోమయోఽమృతమయః పురుషోయశ్చాయమధ్యాత్మం శారీరస్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేదమమృతమిదం బ్రహ్మేదం సర్వం.

ఈభూమి సకలభూతములకును మధువువలె (మధువనగా తేనె, లేక మిక్కిలి ప్రియమైనదియు తీపుగల వస్తువున్ను) ఈ భూమికి సకలభూతములున్ను మధువు, ఈ భూమిలో (భూమిలోనంతర్యామిగా భూమిని ధరించుచున్న) తేజోమయుడు అమృతమయుడునైన పురుషుడెవడో, యీ శరీరమున తేజోమయుడు అమృతమయుడునైన పురుషుడెవడో అతడే యీ ఆత్మ. అతడే అమృతుడు. ఇతడే బ్రహ్మము. ఇతడే సకలము (ఇందులో భూమికి జెప్పబడినట్లే జలము, అగ్ని, వాయువు, సూర్యుడు, దిక్కు, చంద్రుడు, మెఱుపుశబ్దము (అనగా పిడుగు శబ్దము,) ఆకాశము, ధర్మము, సత్యము, మనుష్యత్వము, ఆత్మ వీటికి వరుసగా చెప్పబడియున్నవి.) ఐదవ బ్రాహ్మణము,

## (8) నారాయణోపనిషత్

నారాయణ ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యం నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః శుద్ధో దేవ ఏకో నారాయణః నద్వితీయోఽస్తి కశ్చిత్ య ఏవం వేద స విష్ణురేవ భవతి స విష్ణురేవ భవతి.

ఈ ప్రపంచమంతయు నారాయణుడే, కళంకము లేనివాడుగను, దోషములేనివాడుగను, వికల్పములేనివాడుగను, పేరులేనివాడుగను, శుద్ధుడుగను, దేవతగనునున్నవాడు నారాయణుడొక్కడే, రెండవవాడొకడు లేడు. ఇట్లెవ్వ డెఱుంగునో అతడు విష్ణువే యగుచున్నాడు. అతడు విష్ణువే యగుచున్నాడు. (నారాయణోపనిషత్తు,)

## (9) కైవల్యోపనిషత్

యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్ ।
సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేవ తత్ ।
జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వ బంధైః ప్రముచ్యతే ॥

సర్వరూపిగను ఈ ప్రపంచమునకు ముఖ్యస్థానముగను సూక్ష్మముకంటె సూక్ష్మముగను నిత్యముగనునున్న పరబ్రహ్మమేదిగలదో అది నీవే, నీవేయది. జాగ్రత్స్వప్న సుషుప్తులు మొదలగు వాటిలో ఏ ప్రపంచము ప్రకాశించుచున్నదో అది బ్రహ్మమే. అది (నేనే) అని యెఱింగిన సకల బంధములనుండి విముక్తుడగుచున్నాడు. (కైవల్యోపనిషత్తు,)

# (10) అమృత బిందూపనిషత్

తదేవం నిష్కళం బ్రహ్మ నిర్వికల్పం నిరంజనం।
తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వా బ్రహ్మసంపద్యతే ధ్రువం॥
నిర్వికల్పమనంతం చ హేతు దృష్టాంతవర్జితం।
అప్రమేయమనాదించ యజ్ఞాత్వా ముచ్యతే బుధః॥

న నిరోధో న చోత్పత్తిర్నబద్ధో న చ సాధకః।
న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా॥
ఏక ఏవాత్మామన్తవ్యో జాగ్రత్స్వప్న సుషుప్తిషు।
స్థానత్రయవ్యతీతస్య పునర్జన్మ న విద్యతే॥
ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః।
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచన్ద్రవత్॥
ఘటసంవృతమాకాశం నీయమానే ఘటేయథా।
ఘటో నీయేత నాకాశ స్తద్వజ్జీవో నభోపమః॥
ఘటవద్వివిధాకారం భిద్యమానం పునః పునః।
తద్భేదే చ న జానాతి న జానాతి చ నిత్యశః॥
శబ్దమాయావృతోనైవ తమసో యాతి పుష్కరే।
భిన్నే తమసి చైకత్వమేక ఏవానుపశ్యతి॥
*** నిష్కళం నిశ్చలం శాన్తం తద్బ్రహ్మాహమితిస్మృతం॥

ఆ బ్రహ్మము నిష్కళముగను, నిర్వికల్పముగను, శాంతముగనున్నది. ఆ బ్రహ్మము "నేనే" అని యెఱిగినచో బ్రహ్మమే యగుచున్నాడు, నిశ్చయము. ఏ బ్రహ్మము నిర్వికల్పమో, అనంతమో, కారణమును ఉపమానమునులేనిదో. యూహింపదగనిదో, అనాదియో, దానిని జ్ఞానియైనవాడు ఎఱిగి (బంధమునుండి) విడువబడుచున్నాడు. నాశములేదు, ఉత్పత్తియులేదు, బద్ధుడుగాడు, ఉపాసకుడుగాడు, ముముక్షువుగాడు, ముక్తుడుగాడు, ఇదియే వాస్తవమైనది. మననము జేయదగు ఆత్మ జాగ్రత్స్వప్న సుషుప్తులలో నొక్కడే. మూడు స్థానములను (జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను) దాటినవానికి మరల జననములెదు, భూతముల కాత్మయైన యొక్కడే ప్రతి భూతములో నున్నాడు. నీటిలోని చంద్రునివలె ఒకడుగను అనేకములుగను కనబడుచున్నాడు. ఘటము తీసికొని పోబడగా దానిలోనున్న యాకాశము తీసికొని పోబడుటలేదు. ఘటము మాత్రమే తీసికొని పోబడుచున్నది, ఆ విధముగనే జీవుడు ఆకాశమును బోలియున్నాడు. ఘటమువలె (దేహము) పలువిధములైన ఆకారములుగలది. మరల మరల నశించెడు ఆ దేహము తన నాశములో జ్ఞానముగలదిగాదు. అతడు (ఆత్మ) ఎల్లప్పుడు నెఱుంగుచున్నాడు. శబ్దాదిప్రపంచమనెడి మాయచే చుట్టబడియున్నవాడు. (ఆ మాయయనెడు) చీకటినుండి ప్రకాశమునకు వచ్చుటయే లేదు. (అనగా ప్రకాశమగు బ్రహ్మమును నెఱుంగుటలేదు.) ఆ చీకటి తొలగిన ఒకటిగ నుండుటను ఒక్కడుగానే చూచుచున్నాడు. *** నిష్కళముగను నిశ్చలముగను శాంతముగను

నున్న పరబ్రహ్మమునే బైటపెట్టవలయును. ఆ బ్రహ్మమే "నేను" అని స్మరింపబడియున్నది. (అమృతబిందూపనిషత్తు.)

# (11) నృసింహోత్తరతాపిన్యుపనిషత్

## సప్తమ ఖండః

నిరాత్మకమాత్మైవేదం సర్వం తస్మాత్సర్వాత్మకేనాకారేణ సర్వాత్మకమాత్మానమన్విచ్ఛేద్బ్రహ్మైవేదం సర్వం సచ్చిదానందరూపం సచ్చిదానందరూపమిదం సర్వం ॥

దేహములేనిదగు ఆత్మయే యీ సకల ప్రపంచము. కావున సర్వస్వరూపిగనున్న సర్వాత్మయైన ఆత్మను వెతుకవలయును. ఈ ప్రపంచమంతయు సచ్చిదానంద బ్రహ్మస్వరూపమే. (నృసింహోత్తరతాపిన్యుపనిషత్తు 7 వ ఖండము.)

## అష్టమః ఖండః

అయం సర్వాత్మాఽయం హి సర్వం నైవాతోఽన్యో హ్యాయమాత్మైక ఏవావికల్పో నహి వస్తుసదయం హ్యేత ఇవ సద్ఘనోఽయం చిద్ఘనఆనందఘన ఏవైక రసోహ్యయమాత్మైకలఏవ ***చిన్మయమిదం సర్వం తస్మాత్పరమేశ్వర ఏవైకమేవ తద్భవత్యేతదమృతమభయమేతద్బ్రహ్మాఽభయంవై బ్రహ్మాఽభయం హివై బ్రహ్మభవతి య ఏవంవేదేతి రహస్యమనుజ్ఞాతా హ్యాయమాత్మైష హ్యాస్య సర్వస్య స్వాత్మానమనుజానాతి.

ఇతడు సకలమునకాత్మ, సకలమితడే, యితనికంటె రెండవదిలేదు. వికల్పములేని యాత్మ యొకడే, వినివలె సత్తైనవస్తువులేదు. సద్ఘనుడు చిద్ఘనుడు ఆనందఘనుడు నాతడే. ఈ ఆత్మ ఏకరసుడు ఒక్కండే. *** ఈ సకల ప్రపంచము చిన్మయమే. కావున పరమేశ్వరు డొక్కడే అది యగుచున్నాడు. (ప్రపంచమగుచున్నాడు.) ఇదియే యమృతము. ఇదియే భయములేనిది. ఇదియే బ్రహ్మము, అభయమే బ్రహ్మము. బ్రహ్మమే యభయమగుచున్నదిగదా! ఇటుల నెఱుంగువాడు రహస్యము నెఱింగినవాడుగ నున్నాడు. ఇతడుగదా ఆత్మ. ఇతడు సకలమును తనయాత్మగ నెఱుంగుచున్నాడు.

చిన్మయమిదం సర్వం తస్మాత్పరమేశ్వర ఏవైకమేవ తద్భవత్య వికల్పో నా వికల్పోఽపి నాత్ర కాచన భిదాస్తి నైవతత్ర కాచనభిదాస్త్యత్రభిదామివ మన్యమానశ్శతధా సహస్రధా భిన్నో మృత్యోస్స మృత్యుమాప్నోతి.

ఈ ప్రపంచమంతయు చిన్మయమే. కావున పరమేశ్వరుడొక్కడే అది యగుచున్నాడు. (ప్రపంచమగుచున్నాడు) వికల్పములేనివాడయ్యును వికల్పముగలవాడైనను స్వల్పమైనను భేదము లేదు. భేదమేలేదు. భేదమున్నటుల దలంచువాడు నూరు విధములుగను వేయి విధములుగను భేదమును బొంది, (అనగా పలువిధములైన జన్మములబొంది) మృత్యువునుండి మృత్యువును పొందుచున్నాడు. (పుట్టి పుట్టి మరణించుచున్నాడని తాత్పర్యము.) 8 వ ఖండము.

## (12) మై త్రే యో ప ని ష త్

### ద్వి తీ యో ఽ ధ్యా య ః

దేహో దేవాలయః ప్రోక్తస్స జీవః కేవలశ్శివః।
త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహంభావేన పూజయేత్ ।
అభేద దర్శనం జ్ఞానం ధ్యానం నిర్విషయం మనః ।
*** భావనామఖిలాం త్యక్త్వా యచ్ఛిష్టం తన్మయోభవ ।
ద్రష్టృ దర్శనదృశ్యాని త్యక్త్వా వాసనయాసహ ।
దర్శనం ప్రథమాభాస మాత్మానం కేవలం భజ ॥

దేహము దేవాలయమని చెప్పబడుచున్నది. దానిలోని జీవుడు శివుడే. అజ్ఞానమనెడు నిర్మాల్యమును త్రోసి "అతఢు నేను" అను భావనచే పూజింపవలయును. అభేదముగ జూచుటయే జ్ఞానము, మనస్సు విషయముల విడిచియుండుటయే ధ్యానము. *** సకల భావనలను (దృశ్యమును) త్రోసి మిగిలినదేదో అదిగా (బ్రహ్మముగా) ఆగుదువుగాక. చూచెడివాడు చూడబడువస్తువు వీటిని వాసనతో త్రోసివేసి ప్రకాశించెడి శ్రేష్ఠమైన ఆత్మనే భజింతువుగాక. (మైత్రేయోపనిషత్తు. 2-వ అధ్యాయము.)

అహమస్మి పరశ్చాస్మి బ్రహ్మాస్మి ప్రభవోస్మ్యహం ।
సర్వలోక గురుశ్చాస్మి సర్వలోకోఽస్మి సోఽస్మ్యహం ॥
అహమేవాస్మి సిద్ధోస్మి శుద్ధోఽస్మి పరమోస్మ్యహం ।
అహమస్మి సదాసోఽస్మి నిత్యోఽస్మి విమలోస్మ్యహం ॥
విజ్ఞానోఽస్మి విశేషోస్మి సోమోస్మి సకలోస్మ్యహం ।
మానావమానహీనోఽస్మి నిర్గుణోస్మి శివోస్మ్యహం ॥
ద్వైతాద్వైతవిహీనోస్మి ద్వంద్వహీనోఽస్మి సోఽస్మ్యహమ్।
భావాభావ విహీనోఽస్మి భాషాహీనోఽస్మి భాస్మ్యహం ॥
శూన్యాశూన్య ప్రభావోఽస్మి శోభనా శోభనోఽస్మ్యహం ।
శుభోస్మి శోకహీనోస్మి చైతన్యోస్మి సమోస్మ్యహమ్॥
తుల్యాతుల్యవిహీనోఽస్మి నిత్య శుద్ధ స్సదాశివః ।
సర్వాసర్వవిహీనోస్మి ద్విసంఖ్యావానహం న చ ॥
ఏక సంఖ్యావిహీనోస్మి సాత్త్వికోస్మి సదాస్మ్యహం ।
సదసద్ద్వైతహీనోస్మి సంకల్ప రహితోస్మ్యహం ॥
నానాత్వభేదహీనోఽస్మి హ్యఖండానంద విగ్రహః ।
నాహమస్మి న చాన్యోస్మి దేహాదిరహితోస్మ్యహం ॥
ఆశ్రయాశ్రయహీనోస్మి ఆధారరహితోస్మ్యహం ।
బన్ధమోక్షవిహీనోస్మి శుద్ధం బ్రహ్మాస్మి సోస్మ్యహం ॥

చిత్తాది సర్వహీనోస్మి పరమోస్మి పరాత్పరః।
సదావిచారరూపోఽస్మి నిర్విచారోస్మి సోస్మ్యహం ॥
అకారోకారరూపోస్మి మకారోస్మి సనాతనః।
ధ్యాతృ ధ్యానవిహీనోఽస్మి ధ్యేయహీనోస్మి సోస్మ్యహం ॥
సర్వపూర్ణ స్వరూపోస్మి సచ్చిదానంద లక్షణః।
సర్వతీర్థ స్వరూపోస్మి పరమాత్మాస్మ్యహం శివః ॥
లక్ష్య లక్ష్యవిహీనోస్మి లయహీన రసోస్మ్యహం।
మాతృ మానవిహీనోస్మి మేయహీనశ్శివోస్మ్యహమ్।
న జగత్సర్వ ద్రష్టాస్మి నేత్రాదిరహితోస్మ్యహమ్॥
సర్వేన్ద్రియ విహీనోస్మి సర్వకర్మకృదప్యహం।
సర్వవేదాంత తృప్తోస్మి సర్వదాసులభోస్మ్యహం ॥
ముదితా ముదితాఖ్యోస్మి సర్వమౌనఫలోస్మ్యహమ్।
నిత్యం చిన్మాత్రరూపోస్మి సదాసచ్చిన్మయోస్మ్యహం ॥
యత్కించిదపిహీనోస్మి స్వల్పమప్యవినాస్మ్యహం।
హృదయగ్రంథిహీనోస్మి హృదయాంబుజ మధ్యగః ॥
షడ్వికారవిహీనోస్మి షట్కోశరహితోస్మ్యహం।
అరిషడ్వర్గముక్తోస్మి అన్తరాద న్తరోస్మ్యహం ॥
దేశకాలవిముక్తోస్మి దిగమ్బరసుఖోస్మ్యహమ్।
నాస్తిబన్ధవిముక్తోస్మి నకారరహితోస్మ్యహం ॥
అఖండాకారరూపోస్మి హ్యఖండాకారమస్మ్యహం।
ప్రపంచముక్త చిత్తోస్మి ప్రపంచరహితోస్మ్యహం ॥
సర్వప్రకాశరూపోస్మి చిన్మాత్రజ్యోతిరస్మ్యహం।
కాలత్రయవిముక్తోస్మి కామాదిరహితోస్మ్యహం ॥
కాయకాయివిముక్తోస్మి నిర్గుణః కేవలోస్మ్యహం।
ముక్తిహీనోస్మి ముక్తోస్మి మోక్షహీనోస్మ్యహం సదా ॥
సత్యాసత్యాదిహీనోస్మి సన్మాత్రాన్నాస్మ్యహం సదా।
గన్తవ్యదేశహీనోస్మి గమనాదివివర్జితః ॥
సర్వదా సమరూపోస్మి శాన్తోస్మి పురుషోత్తమః।
ఏవం స్వానుభవో యస్య సోహమస్మి న సంశయః ॥
యశ్శృణోతి సకృద్వాపి బ్రహ్మైవ భవతి స్వయం।

నేనుగనున్నాను, అన్యుడుగనున్నాను, బ్రహ్మముగనున్నాను, ఉత్పత్తికారణముగ నున్నాను, సకలలోక గురువుగనున్నాను, సకలలోకములుగనున్నాను, అతనుగనున్నాను, నేనుగానున్నాను, సిద్ధునుగానున్నాను, శుద్ధుడుగానున్నాను, ఉత్తముడుగానున్నాను, నేనున్నాను,

ఎల్లప్పుడు అతడుగానున్నాను, నిత్యుడుగానున్నాను, నిర్మలుడుగానున్నాను, విజ్ఞానముగానున్నాను, విశేషుడుగానున్నాను, చంద్రుడుగానున్నాను, సకలముగానున్నాను, మానావమానములు లేని వాడుగనున్నాను, (సత్త్వాది) గుణములులేనివాడుగనున్నాను, మంగళకరముగానున్నాను, ద్వైతా ద్వైతములులేనివాడుగనున్నాను, ద్వంద్వము (జంట) లేనివాడుగనున్నాను, అతడుగా (బ్రహ్మ ముగా) నున్నాను, భావాభావములు (ఉన్నట్టిది లేనట్టిది) లేనివాడుగనున్నాను, భాషలేనివాడుగ నున్నాను, ప్రకాశించుచున్నాను, శూన్యాశూన్య మహిమబడసినవాడుగానున్నాను, శోభనా శోభనుడుగానున్నాను, శుభుడుగానున్నాను, దుఃఖములేనివాడుగానున్నాను, చైతన్యముగా (జ్ఞాన ముగా లేక ఆత్మగా లేక ప్రేరేపించువాడుగా లేక సాక్షిగా) నున్నాను, సమముగానున్నాను, సమమైనది గలిగినవాడుగను సమమైనది లేనివాడుగనునున్నాను, నిత్యుడుగను శుద్ధుడుగను సదా శివుడుగనునున్నాను, సర్వుడుగనున్నాను, సర్వములేనివాడుగనున్నాను, సాత్త్వికుడుగనున్నాను, ఎల్లప్పుడునున్నాను, ఒక్కటియను సంఖ్యలేనివాడుగనున్నాను, రెండను సంఖ్యలేనివాడుగనున్నాను, సత్తు అసత్తు అను భేదములేనివాడుగనున్నాను, సంకల్పములేనివాడుగనున్నాను, అనేకములను భేదములేనివాడుగనున్నాను, అఖండానందస్వరూపిగానున్నాను, నేనుగానివాడుగానున్నాను, అన్యుడుగానివాడుగ నున్నాను, దేహాదులు లేనివాడుగనునున్నాను, ఆశ్రయుడుగనున్నాను, ఆశ్ర యము లేనివాడుగనున్నాను, ఆధారములేనివాడుగనున్నాను, బంధమోక్షములు లేనివాడుగ నున్నాను, శుద్ధమైనబ్రహ్మముగానున్నాను, అతడు నేనుగానున్నాను, చిత్తము మొదలగునవి లేనివాడుగ నున్నాను, ఉత్తముడుగనున్నాను, ఉత్తమోత్తముడుగానున్నాను, ఎల్లప్పుడు విచార రూపుడుగా నున్నాను, విచారములేనివాడుగ నున్నాను, అతడు నేనుగనున్నాను. అకార ఉకార రూపుడుగనున్నాను, మకారరూపుడుగ నున్నాను, (సకలమునకును మునుపటివానిగనున్నాను,) ధ్యానించువాడు ధ్యానము, ఇవి లేనివాడుగనున్నాను, ధ్యానింపదగినవాడుగాకయున్నాను, అతడు నేనుగనున్నాను, సకలమునందును పూర్ణస్వరూపుడుగా నున్నాను, సచ్చిదానంద లక్షణము గలవాడుగానున్నాను, సర్వతీర్థ స్వరూపుడుగానున్నాను. పరమాత్మగను శివుడుగనునున్నాను, లక్ష్యా లక్ష్యములు లేనివాడుగనున్నాను, (గుర్తించి చెప్పదగినవాడనుగాను, గుర్తించి జెప్పదగనివాడను గాను,) నాశములేని బ్రహ్మముగానునున్నాను, కొలిచెడువాడు కానివాడుగనున్నాను, కొలతలేని వాడుగ నున్నాను, కొలవబడువాడుగాక యున్నాను, మంగళకరుడుగా నున్నాను, నేను జగత్తు కాను, సకలము జూచెడువాడుగ నున్నాను, కండ్లు మొదలగునవి లేనివాడను, అంతట వ్యాపించిన వాడుగా నున్నాను, జ్ఞానిగానున్నాను, ప్రసన్నుడుగా (శాంతుడు లేక అణకువగలవాడుగా) నున్నాను. (సకలపాపములను) హరించువాడు (పోగొట్టువాడు)గా నున్నాను, సకల కార్యము లను జేయువానిగానున్నాను, సకలమైన ఇంద్రియములు లేనివాడుగా నున్నాను, సకల వేదాంత ముచే (ఆత్మస్వరూపముచే) తృప్తిజెందినవాడుగనున్నాను, ఎల్లప్పుడు సులభుడుగా నున్నాను, సంతోషముగలవాడనియు సంతోషములేనివాడనియు పేరుబడసినవాడుగ నున్నాను, సకల మౌన మునకు ఫలముగానున్నాను, ఎల్లప్పుడు చిన్మాత్రస్వరూపుడుగా నున్నాను.

ఎల్లప్పుడు సత్తనెడు చిన్మయముగానున్నాను, ఏదైన నొకటిలేనివాడుగ నున్నాను, స్వల్పముగూడ లేనివాడనుగాక యున్నాను. (అల్పవస్తువులలోను, అల్పకాలములోను, లేనివాడు కాడని తాత్పర్యము.) అజ్ఞానము లేనివాడుగా నున్నాను, హృదయకమలమధ్య నున్నాను, ఆఱు వికారములులేనివాడుగనున్నాను, జనించుట, ఉండుట, పెరుగుట, [illegible], తగ్గుట, నశించుట, ఇవి

ఆఱు వికారములు గర్భోపనిషత్తునందును వరాహోపనిషత్తున మొదటి అధ్యాయమునను జూడుడు.) ఆరుకోశములు లేనివాడుగనున్నాను, (చర్మము, రక్తము, మాంసము, కొవ్వు, మజ్జ, ఎముకలు ఇవి ఆరు కోశములు. వరాహోపనిషత్తున మొదటి యధ్యాయమున గాంచుడు.) ఆరు శత్రువులు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు) లేనివాడుగనున్నాను, (వరాహోపనిషత్తు రెండవ అధ్యాయము) లోలోపలనున్నాను, దేశములేనివాడుగనున్నాను, దిక్కులను వస్త్రముగాగల సుఖ స్వరూపిని. బంధములేనివాడుగను విడుపబడినవాడుగనునున్నాను, లేదనునది లేనివాడను, అఖండా కార రూపుడుగను నున్నాను, అఖండాకారముగ నున్నాను, ప్రపంచమునుండి వీడుపడిన చిత్తము గలవాడుగనున్నాను, ప్రపంచము లేనివాడుగనున్నాను, సకలప్రకాశ స్వరూపుడుగానున్నాను, చిన్మాత్ర జ్యోతిగానున్నాను. త్రికాలములనుండి విడువబడినవాడనుగానున్నాను, కామాదులు లేనివాడనుగానున్నాను, శరీరములేనివాడను శరీరముగలవాడను గానివాడను, గుణములేనివాడను ఒక్కటైనవాడను, ముక్తిలేనివాడను, ముక్తుడుగానున్నాను, ఎల్లప్పుడు మోక్షములేనివాడుగా నున్నాను, సత్యాసత్యాదులు లేనివాడనుగా నున్నాను, ఎల్లప్పుడు సత్తుకంటె వేరుగానివాడను, పోవలసిన దేశములేనివాడను, పోవుట మొదలగునవి లేనివాడను, ఎల్లప్పుడొక్కటే రూపముగల వాడను, శాంతుడుగా నున్నాను, పురుషోత్తముడుగా నున్నాను, ఇటులెవ్వనికి స్వానుభవము వచ్చి యున్నదో అతడేనేను, సందేహములేదు (దీనిని) ఒక్కమారుగాని ఎవ్వడు వినునో అతడు బ్రహ్మమే యగును, 3-వ అధ్యాయము.

# (13) సర్వసారోపనిషత్

ప్రత్యగాత్మా కథమ్ ?

సత్యం జ్ఞానమనన్తమానందం సర్వశరీరోపాధినిర్ముక్తం కటకమకుటాద్యుపాధిరహిత సువర్ణఘనవద్విజ్ఞాన ఘనచిన్మాత్ర స్వభావమాత్మ చైతన్యం బ్రహ్మయదవభాసతే తదవిద్యోపాధికం త్వంపదార్థస్స ప్రత్యగాత్మా.

ప్రత్యగాత్మ యెట్టిది? సత్యజ్ఞానానందమయమైనట్టిది. ఏ విధమైన శరీరోపాధి లేనట్టిది, కటకమకుటాది ఉపాధులులేని స్వర్ణపు ముద్దవంటిది. జ్ఞానపుముద్ద. చిత్స్వభావము ఆత్మ చైతన్యము. బ్రహ్మ యీ విధముగ నేది ప్రకాశించుచున్నదో అది, అవిద్యోపాధికి లోబడినదియు త్వంపదమువలన జెప్పదగినదియునైన ప్రత్యగాత్మ (జీవుడు)

పరమాత్మా కథమ్ ?

సత్యం జ్ఞానమనన్త మానన్దం సర్వజ్ఞత్వాద్యుపేతం మాయోపాధికం తత్పదార్థః పరమాత్మా ॥

పరమాత్మ యెట్టిది? సత్యము, జ్ఞానము, అనన్తము, ఆనందము, సర్వజ్ఞత్వము, మొదలగు వాటితో గూడినదిగను, మాయోపాధిగలదిగను, తత్పదముచే జెప్పందగినదిగనునున్న దేదో అదియే పరమాత్మ (ఈశ్వరుడు).

కిం బ్రహ్మ ?

సర్వోపాధి విముక్తం నిర్విశేష చిన్మాత్రం పదద్వైతమానన్దమమాయం

బ్రహ్మ, తద్ధి త్వంపదార్థాదౌపాధికా త్తత్పదార్థాచ్చోపాధిక భేదాద్విలక్షణమభేదమధిష్ఠానత్వేవలక్షితం శుద్ధం పారమార్థికం సత్తామాత్రమవినాశి.

బ్రహ్మమెట్టిదది? ఎట్టి ఉపాధియులేనిది, నిర్విశేషచిన్మాత్రము సత్తైనది, రెండవదిలేనిది, అనన్తమయినది, మాయలేనిది యేదో అదిబ్రహ్మము. అదిగదా ఉపాధితోనున్న త్వంపదార్థమున కంటెను ఉపాధిభేదముతోనున్న తత్పదార్థమునకంటెను విలక్షణముగను, అభేదముగను, అధిష్ఠానమువలె కనబడునట్టిదిగనునున్న శుద్ధము, పారమార్థికము, సత్తామాత్రము, అవినాశి.

కా మాయా ?

అనాత్మ మూలం మాయా సాచ బ్రహ్మణ్యాకాశే మేఘాదిరివదృశ్యతే। మాయానామ అనాదిర న్తవతీ ప్రమాణా ప్రమాణసాధారణా న సతీ నాసతీ నసదసత్య నిర్వాచ్యాధిష్ఠాన ఏవావిద్యమానాంతర్యాణీ వికల్పనిరూప్యమాణోచ్చావచ వ్యవహారభేదవతీ యా న విద్యతే వస్తుతస్సా మాయా. తత్స్వరూపమజ్ఞానం. తదేవమూల ప్రకృతిర్గుణసామ్యమవిద్యేత్యాద్యనేకాకారా జగదాకారేణ పరిణతా తదేవం బ్రహ్మవిజ్ఞానాత్యనుభవతి చ।

మాయ యనగానేది? అనాత్మకు మూలమైనదేదో అదియే మాయ. అమె ఆకాశమున మేఘాదులవలె బ్రహ్మమువద్ద గానబడుచున్నది. ఆ మాయయనునామె అనాది, ముగింపుగలది. ప్రమాణాప్రమాణములకు సాధారణమైనది. ఉన్నట్టిదికాదు లేనట్టిదికాదు. అవి రెండున్ను జేరినది గాదు. వాక్కున కందనిది (బ్రహ్మమనెడు) అధిష్ఠానమునందేలేనిది. విద్వాంసులచే వర్ణింపబడు హెచ్చు తక్కువగు భేదవ్యవహారములగలది. ఎవ్వతె వాస్తవమునలేదో అమె మాయ, అమె స్వరూపమజ్ఞానము. అదియే మూల ప్రకృతి. గుణసామ్యము (సత్త్వాది గుణములు ఒకదానితో నొకటి కలియకుండునట్టిస్థితి) అవిద్య మొదలగు ననేకాకారములుగలది. జగదాకారముగ పరిణమించియున్నట్టిది. అట్టి మాయను ఈ విధముగ బ్రహ్మజ్ఞాని ఎఱింగి యనుభవించుచున్నాడు — ఈ విషయమున శ్లోకములున్నవి.

నైవం భవామ్యహం దేహో నేన్ద్రియాణి దశైవతు।
న బుద్ధిర్మన ఈశశ్చ నాహంకారస్తథైవ చ॥
అప్రాణోహ్యమనాశ్శుభ్రో బుద్ధ్యాదీనాం హి సర్వదా।
సాక్ష్యహం సర్వదా నిత్యశ్చిన్మాత్రోఽహం సదాశివః॥
నాహం కర్తా నైవ భోక్తా ప్రకృతేస్సాక్షిరూపకః।
మత్సాన్నిధ్యాత్ప్రవర్తన్తే దేహాద్యా అజడా ఇవ॥
స్థాణుర్నిత్య స్సదానన్దః శుద్ధో జ్ఞానమయోఽమలః।
ఆత్మాఽహం సర్వభూతానాం విభుస్సాక్షీ న సంశయః॥

బ్రహ్మైవాహం సర్వవేదాన్తవేద్యం, నాహంవేద్యం వ్యోమవాతాదిరూపం।
నాహం దేహో జన్మమృత్యూ కుతోమే, నాహంకారః క్షుత్పిపాసేకుతోమే॥
నాహంచేతః శోకమోహౌ కుతోమే, నాహం కర్తా బన్ధమోక్షౌ కుతో మే।
ఇతిమునీ నదృశ్యవాణ్యువాచ సత్యమితి మునీ నదృశ్యవాణ్యువాచ. సత్యమిత్యుపనిషత్॥

నేను దేహముకాను, పది యిన్ద్రియములుకాను, బుద్ధి మనస్సు ఈశుడుకాను, ఆ విధముగనే అహంకారముకాను, ప్రాణముగలవాడనుకాను, మనస్సుగలవాడనుకాను, ప్రకాశము బడసినవాడను, నేను బుద్ధి మొదలగువాటికి ఎల్లప్పుడు సాక్షిగనుండువాడను, నేనేకాలమునందును నాశములేనివాడను, చిత్తుగనే యున్నవాడను, ఎల్లప్పుడు మంగళకరమైనవాడను, నేను కర్తనుకాను, భోక్తనుకాను, ప్రకృతికి సాక్షిస్వరూపముగనేయున్నవాడను. నాసన్నిధిమాత్రముచేతనే దేహాదులు జడములు కానివివలె కార్యములనుజరుపుచున్నవి. స్థిరముగను నిత్యముగను నెల్లప్పుడానందముగను శుద్ధముగను జ్ఞానస్వరూపిగను మలినము లేనివాడుగనునున్నట్టివాడను, నేను సర్వభూతములకు ఆత్మ. అంతటను వ్యాపించియున్నవాడను. సాక్షిని (వీటిలో) సన్దేహములేదు. సకలవేదాన్తములచే నెఱుంగదగిన బ్రహ్మమునేనే. ఎఱుంగదగిన ఆకాశము వాయువు మొదలగు రూపము నేనుకాను, రూపముకాను, పేరుకాను, కర్మకాను. సచ్చిదానంద స్వరూపియైన బ్రహ్మము నేనే, నేను దేహము కాను, (కావున) నాకు జననమేది? నేనహంకారముకాను, (కావున) నాకు ఆకలిదప్పులు ఎక్కడివి? నేను మనస్సుకాను (కావున) నాకు దుఃఖమోహములెక్కడివి? నేనుకర్తనుకాను, (కావున) నాకు బన్ధమోక్షములేవి? అని మునులకు అదృశ్యవాణి చెప్పెను. ఈ ఉపనిషత్తు సత్యమే (సర్వసారోపనిషత్తు)

# (14) నిరాలంబోపనిషత్

కిం బ్రహ్మ ?

మహదహంకార పృథివ్యప్తేజో వాయురాకాశాత్మత్వేన బృహద్రూపేణాండకోశేన కర్మ జ్ఞానార్థరూపతయా భాసమానమద్వయమఖిలోపాధి వినిర్ముక్తం తత్సకల శక్త్యుపబృంహిత మనాద్యన్తం శుద్ధం శివం శాన్తం నిర్గుణమిత్యాది వాచ్యమనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ.

బ్రహ్మమననెట్టిది? మహదహంకార భూమి జల అగ్ని వాయు ఆకాశములనెడు భూతము లిమిడిన గొప్పరూపముగు అండకోశముచే కర్మజ్ఞానార్థ రూపములుగ ప్రకాశించునదియు, రెండవది లేనిదియు, సకలవిధములైన ఉపాధులు (వేషము) లేనిదియు, సకలశక్తులతో గూడినదియు, ఆద్యంతములు లేనిదియు, శుద్ధము, శివము, శాంతము, నిర్గుణము ఈ శబ్దములచే జెప్పదగినదియు, వాక్కునకందనిదియునగు చైతన్యమెద్దియో అదియే బ్రహ్మము.

క ఈశ్వరః ? కిం లక్షణం ?

బ్రహ్మైవ స్వశక్తి ప్రకృత్యాఽభిధేయమాశ్రిత్య లోకాన్సృష్ట్వా ప్రవిశ్యాన్తర్యామిత్వేన బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియ నియన్తృత్వాదీశ్వరః.

ఈశ్వరుడెవ్వడు? అతనిలక్షణమెట్టిది? బ్రహ్మమే తనయొక్క శక్తియగు ప్రకృతిచే (ఈశ్వరుడనెడు) పేరునువహించి లోకములను సృజించి (దానిలో) అన్తర్యామిగ ప్రవేశించి బ్రహ్మ మొదలగువార్ల బుద్ధీంద్రియములకు నియామకుడుగ నున్నందుననే యీశ్వరుడగుచున్నాడు.

కో జీవః ?

ఈశ్వర ఏవ బ్రహ్మవిష్ణ్వీశానేన్ద్రాదీనాం నామరూపద్వారా స్థూలోఽహమిత్యధ్యాసవశాజ్జీవః. సోఽయమేకోఽపి దేహారంభకభేదవశాద్బహు జీవః.

జీవుడెవ్వడు? ఈశ్వరుడే బ్రహ్మ విష్ణువు రుద్రుడు ఇంద్రుడు మొదలగు నామరూపముల ద్వారా "నేను స్థూలదేహముగానున్నాను" అని యారోపము (తప్పుగ మోయుట) జేసికొనుటవలన జీవుడగుచున్నాడు. అతడొకడైనను దేహోత్పత్తికి గారణమగు కర్మబంధముచే పలు జీవులుగ గానబడుచున్నాడు.

కా ప్రకృతిః ?

బ్రహ్మణస్స్వకాశాన్నానా విచిత్ర జగన్నిర్మాణసామర్థ్యైక బుద్ధిరూప బ్రహ్మ శక్తిరేవ ప్రకృతిః.

ప్రకృతియననెట్టిది? బ్రహ్మ సన్నిధిమాత్రముచే పలువిచిత్రమైన జగన్నిర్మాణ సామర్థ్యము బడసిన బుద్ధిస్వరూపమగు బ్రహ్మముయొక్క శక్తియే ప్రకృతి.

కః పరమాత్మా ?

దేహాదేః పరతరత్వాత్ బ్రహ్మైవ పరమాత్మా, స బ్రహ్మ విష్ణుస్సరుద్రస్స ఇంద్రస్స శమనస్స సూర్యస్సచన్ద్రస్తే సురాస్తే అసురాస్తే పిశాచాస్తే మనుష్యాస్తాః స్త్రియస్తేపశ్వాదయస్థ్సావరంతే బ్రాహ్మణాదయస్సర్వం ఖల్విదం బ్రహ్మనేహనానాస్తి కించన.

పరమాత్మ యెవ్వడు? దేహాదులకంటె అతిశ్రేష్ఠముగనున్నందున బ్రహ్మమే పరమాత్మ. అతడు (ఆ బ్రహ్మమే) బ్రహ్మ. విష్ణువు, రుద్రుడు, అతడే ఇంద్రుడు, అతడే యముడు, అతడే సూర్యుడు, అతడే చంద్రుడు ఆతడే దేవతలు, అతడే అసురులు. అతడే పిశాచులు, అతడే మనుష్యులు అతడేస్త్రీలు, అతడే పశ్వాదులు, అతడే స్థావరము, అతడే బ్రాహ్మణులు మొదలగువారలు సకలము బ్రహ్మమేయగును. ఇచ్చట స్వల్పముగూడ అనేకమనునదిలేదు. (బ్రహ్మముదప్ప వాస్తవముగ నే వస్తువున్ను లేదని తాత్పర్యము.)

కిమజ్ఞానమ్ ?

రజ్జౌ సర్పభ్రాన్తిరివాద్వితేయే సర్వానుస్యూతే సర్వమయే బ్రహ్మణి దేవ తిర్యఙ్నరస్థావర స్త్రీపురుషవర్ణాశ్రమ బన్ధమోక్షోపాధి నానాత్మభేదకల్పితం జ్ఞానమజ్ఞానమ్.

అజ్ఞానమనగానేమి? రెండవది లేనిదిగను, అంతట అనుస్యూతముగ నున్నట్టిదిగను సకల స్వరూపముగనునున్న బ్రహ్మమునందు దేవమృగనరస్థావర స్త్రీపురుష వర్ణాశ్రమ బంధమోక్షోపాధి (కల్పితమగు వేషము, లేక కల్పితమైన అడ్డు)గనున్న పలుదేహభేదములచే త్రాడులో పామునెడు భ్రమవలె కల్పితమైన జ్ఞానమే యజ్ఞానము.

కిం తపః ?

బ్రహ్మ సత్యం జగన్మిథ్యేత్యపరోక్ష జ్ఞానాగ్నినా బ్రహ్మాద్యైశ్వర్యాశా సిద్ధసంకల్ప బీజసన్తాపరూపం తపః.

తపస్సనగానేమి? బ్రహ్మము సత్యము, జగత్తుమిథ్య అను నపరోక్షజ్ఞానమనే అగ్నిచే బ్రహ్మాదులయొక్క ఐశ్వర్యాశ దృఢపడియున్న సంకల్పమగు విత్తనమును మాడ్చుటయే తపస్సు.

కస్సన్న్యాసీ ?

సర్వధర్మాన్పరిత్యజ్య నిర్మమోఽహంకారో భూత్వా బ్రహ్మైకం శరణ ముపగమ్య తత్త్వమసి సర్వం ఖల్విదం బ్రహ్మేదం బ్రహ్మ నేహనానాస్తి కించనే త్యాది మహావాక్యార్థానుభవజ్ఞానాద్బ్రహ్మైవాహమస్మీతి నిశ్చిత్య నిర్వికల్ప సమాధినాస్వతన్త్రో యశ్చరతి స సన్న్యాసీ సముక్తస్స పూజ్యస్సయోగీ స పరమహంసస్సోఽవధూతస్స బ్రాహ్మణః.

సన్న్యాసియెవ్వడు? సకల ధర్మములను (వర్ణాశ్రమధర్మములు, సదసత్కర్మలు, మొదలగువాటిని విడిచి, మమకారాహంకారములు (నేను నాదిఅను ఆ సక్తులు) లేనివాడై బ్రహ్మ మొకదానిని శరణమొందినవాడై, తత్త్వమసి= అది నీవుగ నున్నావు, సర్వంఖల్విదం బ్రహ్మ = ఈ సకలము బ్రహ్మమేను, నేహ నానాస్తికించన = ఇచ్చట అనేకమనునది స్వల్పముగూడలేదు, ఇవి మొదలగు మహావాక్యార్థానుభవ జ్ఞానమువలన, బ్రహ్మైవాహమస్మి = నేను బ్రహ్మముగనే యున్నాను. అని నిశ్చయించుకొని నిర్వికల్పసమాధితో స్వతంత్రుడై సంచరించెడి యతి యెవడో అతడే సన్న్యాసి, అతడే పూజ్యుడు, (పూజింపదగినవాడు,) అతడే యోగి, అతడే పరమహంసుడు అతడే అవధూత అతడే బ్రహ్మజ్ఞానియని నిరాలంబోపనిషత్తు.

## (15) శుకరహస్యోపనిషత్

ఓం ప్రజ్ఞానంబ్రహ్మ, ఓం అహంబ్రహ్మాఽస్మి, ఓం తత్త్వమసి, ఓం అయ మాత్మాబ్రహ్మ, తత్త్వమసీత్యభేదవాచకమిదం యే జపన్తి తే శివసాయుజ్యముక్తి భాజోభవన్తి.

ఓం ప్రజ్ఞానము బ్రహ్మ, ఓం నేను బ్రహ్మముగానున్నాను, ఓం అది నీవుగానున్నావు, ఓం ఈ యాత్మ బ్రహ్మము, తత్త్వమసి = అది నీవుగనున్నావు. అను నీ యభేదవాచకము నెవడు జపించునో అతడు శివసాయుజ్యముక్తిని పొందుచున్నాడు.

జీవబ్రహ్మైకార్థేజపే వినియోగః.

జీవబ్రహ్మైక్యమునకై జపము జేయవలయును,

జీవోబ్రహ్మేతి వాక్యార్థం యావదస్తి మనస్థ్సితిః ।
ఐక్యం తత్త్వం లయే కుర్వన్ ధ్యాయేదసిపదం సదా ॥

మనస్సుయొక్క వ్యాపారము (ప్రవృత్తి లేక విషయాసక్తి) యుండువరకు జీవుడు బ్రహ్మ మనెడు వాక్యార్థమగు తత్త్వంపదముయొక్క యైక్యమును జేయువాడై (తత్త్వంపదముయొక్క) లయవిషయమున (ఒకటిగా కలిసిపోవు విషయమున) అసి పదమును నెల్లప్పుడు ధ్యానింప వలయును.

చతుర్ముఖేన్ద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు ।
చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి ॥

పరిపూర్ణః పరాత్మాస్మిఞ్జ దేహవిద్యాధికారిణీ।
బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే॥
స్వతఃపూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః।
అస్మీత్యైక్యపరామర్శస్తేన బ్రహ్మ భవామ్యహమ్॥
ఏకమేవాద్వితీయం సన్నామరూప వివర్జితం।
సృష్టేః పురాఽధునాప్యస్య తాదృక్త్వం తదితీర్యతే॥
శ్రోతుర్దేహేన్ద్రియాతీతం వస్త్వత్ర త్వంపదేరితం।
ఏకతాగృహ్యతేఽసీతి తదైక్యమనుభూయతాం॥
స్వప్రకాశాపరోక్షత్వమయ మిత్యుక్తితోమతమ్।
అహంకారాది దేహాన్తం ప్రత్యగాత్మేతి గీయతే॥
దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే।
బ్రహ్మశబ్దేన తత్ బ్రహ్మ స్వప్రకాశాత్మ రూపకమ్॥
అనాత్మదృష్టేరవివేకనిద్రామహం మమ స్వప్నగతింగతోఽహమ్।
స్వరూపసూర్యేఽభ్యుదితేస్ఫుటోక్తైర్గురోర్మహావాక్యపదైః ప్రబుద్ధః॥

చతుర్ముఖుడు ఇంద్రుడనెడు దేవతలలోను, మనుష్యులలోను, గుఱ్ఱము గోవు మొదలగు వాటిలోను, నావద్దను బ్రహ్మచైతన్యమొకటియే కావున ప్రజ్ఞానమే బ్రహ్మము. జ్ఞానమున కధికారము గల దేహమున పరిపూర్ణుడగు పరమాత్మ యనునాతడు బుద్ధికిసాక్షిగానుండి ప్రకాశించువాడు అహం పదార్థభూతుడుగ జెప్పబడుచున్నాడు. ఇచ్చట (ఈ దేహమున) తానే పూర్ణుడుగనున్న పరమాత్మ యనునతడు బ్రహ్మమనుపేరుతో వర్ణింపబడుచున్నాడు. "అస్మి = ఉన్నాను" అను వాక్యము ఐక్యమును దృఢపరచుచున్నది. కావున నేను బ్రహ్మముగానున్నాను. రెండవదిలేని యొక్కటి గను, సత్తుగను, నామరూపములులేనిదిగను, ఈ జగత్తుయొక్క సృష్టికి పూర్వమును, వెనుకను, ఇప్పుడును స్వయం ప్రకాశముగనున్నట్టిదే (బ్రహ్మమే) తత్పదవాక్యార్థముగ జెప్పబడుచున్నది. వినువాని (శిష్యుని) దేహేన్ద్రియముల కతీతమైనవస్తువు ఇచ్చట త్వంపదవాక్యార్థముగ జెప్పబడు చున్నది. 'అసి' యను పదముచే ఏకవచనముగ గ్రహింపబడుచున్నది. అట్టి యైక్యము అనుభ వింపబడు "అయం" అను వాక్యముచే స్వయముగనే ప్రత్యక్షముగ ప్రకాశించుచున్న యాత్మను జెప్పినట్టిదాయెను. అహంకారము మొదలు దేహమువరకున్నట్టివి ప్రత్యగాత్మగ జెప్పబడుచున్నవి. కనబడు సకల జగత్తునకు తత్త్వము చెప్పబడును. (ఇట్లు అజ్ఞానులు చెప్పుచున్నారని తాత్పర్యము) బ్రహ్మశబ్దముచే జెప్పబడునట్టిది స్వప్రకాశరూపమైన బ్రహ్మమే. నేననాత్మలో ఆత్మదృష్టిగలవాడ నైనందున అవివేకమైననిద్రలో "నేను, నాయొక్కది అను" స్వప్నగతిని పొందియుంటిని. గురువుచే బాగుగ బోధింపబడునట్టి మహావాక్య పదములచే స్వరూపమనెడు సూర్యుడుదయించినప్పుడు మేలు కొంటిని.

కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః।
కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే॥

ఈ జీవుడు కార్యోపాధిని (అవిద్యలో ప్రతిఫలించుటను) గలవాడు. ఈశ్వరుడు కారణోపాధిని (ప్రతిఫలితము) గలవాడు. మాయోపాధిలో కార్యకారణముల త్రోసివేసినచో పూర్ణజ్ఞాన స్వరూపమైన బ్రహ్మమే మిగులుచున్నది. శుకరహస్యోపనిషత్తు.

# (16) తేజోబిందూపనిషత్

## ప్రథమోఽధ్యాయః

దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేద్బ్రహ్మమయం జగత్।

చూపును జ్ఞానమయముగ జేసికొని ప్రపంచమును బ్రహ్మమయముగ జూడవలయును.

చిత్తాది సర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్॥

చిత్తము మొదలగు సకలభావనలచేతను బ్రహ్మత్వమునే భావించవలయును.

నిషేధనం ప్రపంచస్య రేచకాఖ్యస్సమీరితః।
బ్రహ్మైవాస్మీతి యావృత్తిః పూరకోవాయురుచ్యతే।
తతస్తద్వృత్తినైశ్చల్యం కుంభకం ప్రాణసంయమః॥

ప్రపంచముయొక్క నిషేధము రేచకమను పేరుగలదిగ జెప్పబడుచున్నది. "నేను బ్రహ్మముగానున్నాను" అను మనోవృత్తి వాయువుయొక్క పూరకమని చెప్పబడుచున్నది. పిదప ఆవృత్తిని చలింపక నిలబెట్టుట యను ప్రాణసంయమము కుంభకమని చెప్పబడుచున్నది.

## ద్వితీయోఽధ్యాయః

అఖండైకరసో జీవ అఖండైకరసో హ్యజః।
అఖండైకరసో బ్రహ్మ అఖండైకరసో హరిః॥
అఖండైకరసో రుద్ర అఖండైకరసోఽస్మ్యహమ్।
అఖండైకరసో హ్యాత్మా హ్యఖండైకరసో గురుః॥
××× దృగ్దృశ్యం యది చిన్మాత్ర మస్తిచేచ్చిన్మయం సదా।
సర్వాశ్చర్యం చ చిన్మాత్రం దేహశ్చిన్మాత్ర మేవ హి॥
లింగం చ కారణం చైవ చిన్మాత్రం న హి విద్యతే।
అహం త్వఞ్చైవ చిన్మాత్రం మూర్తా మూర్తాది చిన్మయం॥

జీవుడఖండైకరసము, నియామకుడఖండైకరసము, బ్రహ్మ అఖండైకరసము, హరి అఖండైకరసము, రుద్రుడు అఖండైకరసము, నేను అఖండైకరసము, ఆత్మ యఖండైకరసము, గురువు అఖండైకరసము, × × × చిన్మాత్రముగ నొకటియున్నచో చూపున్ను చూడబడువస్తువున్ను ఎల్లప్పుడు చిన్మయమే. సకలవిధమైన ఆశ్చర్యమున్ను చిన్మాత్రమే. (స్థూల) దేహము చిన్మాత్రమే గదా. లింగదేహము, కారణదేహము, ఇవి చిన్మాత్రములకంటె వేరుగావు. 'నేను నీవు' అనునవియు చిన్మాత్రమే. రూపారూపము చిన్మయమే. (ఈయధ్యాయమంతయు సకలప్రపంచము, బ్రహ్మము సకల ప్రాణులు అఖండైకరసమనియు, చిన్మాత్రమనియు ఒక్కొక్క వస్తువుగ గుర్తించి చూపబడియున్నది. వాటిలో గొన్నిమాత్రమిచ్చుట నైత్తిచూపబడినవి.)

తృ తీ యో ఽ ధ్యా య ః

బ్రహ్మమాత్రమిదం సర్వం బ్రహ్మణోఽన్యన్నకిఞ్చన ।
తదేవాహం సదానందం బ్రహ్మైవాహం సనాతనం ॥

ఈ సకల ప్రపంచమున్ను బ్రహ్మము మాత్రమే. బ్రహ్మముకంటె వేరుగా అణువంత గూడలేదు. ఎల్లప్పుడానందస్వరూపమైన అదియే (బ్రహ్మమే) నేను. నాశములేని బ్రహ్మము నేనే. 3 వ అధ్యా.

చ తు ర్థో ఽ ధ్యా య ః

దేహత్రయాతిరిక్తోఽహం శుద్ధచైతన్యమస్మ్యహం ।
బ్రహ్మాఽహమితి యస్యాన్తస్స జీవన్ముక్త ఉచ్యతే ॥

నేను మూడు దేహముల నతిక్రమించినవాడను, నేను శుద్ధచైతన్యముగనున్నాను, నేనె బ్రహ్మమునను భావన ఎవని యంతఃకరణమునగలదో అతడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.

అహం బ్రహ్మాస్మ్యహం బ్రహ్మాస్మ్యహం బ్రహ్మేతినిశ్చయః ।
చిదహం చిదహంచేతి స జీవన్ముక్త ఉచ్యతే ॥

నేను బ్రహ్మముగానున్నాను; నేనుబ్రహ్మముగానున్నాను, నేను బ్రహ్మముగానున్నాను. నేను చిత్తుగానున్నాను, నేను చిత్తుగానున్నానని యెవనికి నిశ్చయమున్నదో ఆతడు జీవన్ముక్తుడని చెప్పంబడుచున్నాడు.

బ్రహ్మైవాహం చిదేవాహమేవంవాపి న చిన్త్యతే ।
చిన్మాత్రేణైవ యస్తిష్ఠేద్వైదేహీముక్త ఏవసః ॥
నిశ్చయం చ పరిత్యజ్య అహం బ్రహ్మేతి నిశ్చయమ్ ।
ఆనందభరితస్వాన్తో వైదేహీ ముక్త ఏవసః ॥

బ్రహ్మమే నేను, చిత్తేనేను, అనుచింతనువిడిచి ఎవడు చిత్తుగనే యున్నాడో అతడు విదేహముక్తుడే. (బ్రహ్మమేనేనను) నిశ్చయమును నేను బ్రహ్మముగా నున్నానను నిశ్చయమును విడిచి పూర్ణానందముగా నున్నవాడెవ్వడో అతడు విదేహముక్తుడే. (ఇందువలన బ్రహ్మమే తానను జ్ఞానమున్నులేక, తానుదప్ప వేఱొకవస్తువు కనబడనిస్థితి యెట్టిదో అదియే ముక్తియని బైటబెట్ట బడినది.) 4 వ అధ్యాయము.

ప ం చ మో ఽ ధ్యా య ః

బ్రహ్మమాత్రం జగదిదం బ్రహ్మమాత్రం త్వమప్యహం ।
చిన్మాత్రం కేవలం చాహం నాస్త్యనాత్మేతి నిశ్చిను ॥
ఇదం ప్రపంచం నాస్త్యేవ నోత్పన్నం నోస్థితం క్వచిత్ ।
చిత్తం ప్రపంచమిత్యాహుర్నాస్తి నాస్త్యేవ సర్వదా ।
న ప్రపంచం న చిత్తాది నాహంకారో న జీవకః ॥

ఈ జగత్తనునది బ్రహ్మముమాత్రమే, నేను చిన్మాత్రముగానే యున్నాను. అనాత్మ లేదను నిశ్చయము కలవాడవై యుండుము. ఈ ప్రపంచము లేనేలేదు. దాని ఉత్పత్తియులేదు,

స్థితియు (నిలకడ) లేదు. చిత్తమే ప్రపంచమని చెప్పుచున్నారు. అది యెప్పుడును లేనేలేదు. ప్రపంచములేదు. చిత్తము మొదలైనవిలేవు. అహంకారములేదు. జీవుడులేడు,

రక్షకో విష్ణురిత్యాది బ్రహ్మా సృష్టేస్తుకారణం।
సంహారే రుద్ర ఇత్యేవం సర్వం మిథ్యేతి నిశ్చిను ॥
స్నానం జప స్తపో హోమః స్వాధ్యాయో దేవపూజనం।
మన్త్రస్తన్త్రం చ సత్సంగో గుణదోషవిజృంభణం ॥
అన్తఃకరణ సద్భావ అవిద్యాయాశ్చ సంభవః।
అనేక కోటి బ్రహ్మాండం సర్వం మిథ్యేతి నిశ్చిను ॥

విష్ణువు రక్షకుడనియు సృష్టికి బ్రహ్మ కారణభూతుడనియు, సంహరించువాడు రుద్రుడనియు ఇది మొదలైనదంతయు నబద్ధమని నిశ్చయించుకొనుము. స్నానము, జపము, తపస్సు హోమము, అధ్యయనము, దేవపూజ, మంత్రము, తంత్రము, సత్సంగము, గుణదోషముల యభివృద్ధి, అంతఃకరణముయొక్క స్థితి, అవిద్యాకార్యములు, అనేక కోటిబ్రహ్మాండములు, ఇవన్నియు అబద్ధములనియే నిశ్చయించుకొనుము.

యద్యత్కరోషి సత్యేన సర్వం మిథ్యేతి నిశ్చిను।
త్వమేవ పరమాత్మాసి త్వమేవ పరమోగురుః ॥
త్వమేవాకాశరూపోఽసి సాక్షిహీనోఽసి సర్వదా।
త్వమేవ సర్వభావోఽసి త్వం బ్రహ్మాసి న సంశయః ॥

ఏదియేది సత్యమైనదని నీవు చేయుచున్నావో అదంతయు అబద్ధమని నిశ్చయించుకొనుము. నీవే పరమాత్మగానున్నావు, నీవే పరమగురువుగానున్నావు. నీవే ఆకాశస్వరూపిగానున్నావు, నీవు ఎల్లప్పుడు సాక్షిలేనివాడవుగానున్నావు, సకలవస్తువులున్ను నీవుగానున్నావు. బ్రహ్మముగానున్నావు. సందేహములేదు.

ఇదం ప్రపంచం యత్కించిద్యద్యజ్జగతి విద్యతే।
దృశ్యరూపం చ దృగ్రూపం సర్వం శశవిషాణవత్ ॥

ఈ ప్రపంచమున్ను, జగత్తున చూడబడునదిగను, చూచునదిగను ఏది యేది గలదో అదంతయును కుందేలు కొమ్మును బోలినవి.

సంకల్పమేవ యత్కిం చిత్తత్వం నాస్తీతి నిశ్చిను।
నాస్తి నాస్తి జగత్సర్వం గురు శిష్యాదికోనహి ॥

ఏదైన సంకల్పమనియున్నచో, అది వాస్తవముగా లేదని నిశ్చయించుకొనుము, సకల జగత్తును లేనేలేదు. గురు శిష్యులు లేరు, 5 వ అధ్యాయము.

షష్ఠోఽధ్యాయః

సర్వం చైతన్య మాత్రత్వాత్సర్వదోషస్సదా న హి।
సర్వం సన్మాత్రరూపత్వాత్సచ్చిదానందమాత్రకం ॥

బ్రహ్మైవ సర్వం నాన్యోఽస్తి తదహం తదహం తథా ।
తదేవాహం తదేవాహం బ్రహ్మైవాహం సనాతనం ॥

బ్రహ్మైవాహం న సంసారీ బ్రహ్మైవాహం న మే మనః ।
బ్రహ్మైవాహం న మే బుద్ధిః బ్రహ్మైవాహం న చేన్ద్రియం ॥

బ్రహ్మైవాహం న దేహోఽహం బ్రహ్మైవాహం న గోచరః ।
బ్రహ్మైవాహం న జీవోఽహం బ్రహ్మైవాహం న వేదభూః ॥

బ్రహ్మైవాహం జడో నాహ మహం బ్రహ్మ న మే మృతిః ।
బ్రహ్మైవాహం న చ ప్రాణో బ్రహ్మైవాహం పరాత్పరః ॥

ఇదంబ్రహ్మ పరంబ్రహ్మ సత్యంబ్రహ్మ ప్రభుర్హి నః ।
కాలోబ్రహ్మ కలాబ్రహ్మ సుఖంబ్రహ్మ స్వయంప్రభం ॥

సకలము చైతన్యమాత్రమైనందున నెప్పుడును దోషములేనిది. అంతయు సన్మాత్రరూపమైనందున సచ్చిదానందమేను, సకలము బ్రహ్మమే-వేరులేదు. అట్లే అది నేను. అదియే నేను, అదియే నేను. శాశ్వతమగు బ్రహ్మమే నేను, నేను బ్రహ్మమే, సంసారికాను. నేను బ్రహ్మమే, బుద్ధికాను. నేను బ్రహ్మమే, ఇంద్రియముకాను. నేనుబ్రహ్మమే, నేను దేహముకాను. నేనుబ్రహ్మమే, కనబడు వస్తువుకాను. నేనుబ్రహ్మమే, జీవుడనుకాను. నేనుబ్రహ్మమే, వేదమున కుత్పత్తిస్థానముకాను. నేను బ్రహ్మమే జడముకాను. నేనుబ్రహ్మమే నాకు మరణములేదు, నేను బ్రహ్మమే, ప్రాణముకాను. నేను పరాత్పరుడయిన బ్రహ్మమే, ఈ ప్రపంచము బ్రహ్మమే, శ్రేష్ఠము బ్రహ్మమే, సత్యము బ్రహ్మమే, అతడే ప్రభువు, కాలము బ్రహ్మమేను, సుఖము బ్రహ్మమేను, స్వయముగనే యది ప్రకాశించుచున్నది.

జీవ ఏవ సదా బ్రహ్మ సచ్చిదానందమస్మ్యహం ।
సర్వం బ్రహ్మమయం ప్రోక్తం సర్వం బ్రహ్మమయం జగత్ ।
స్వయం బ్రహ్మ న సన్దేహః స్వస్మాదన్యన్న కిఞ్చన ।

జీవుడెల్లప్పుడు బ్రహ్మమే. నేను సచ్చిదానందముగానున్నాను. సకలము బ్రహ్మమయ మనియే చెప్పబడియున్నది. జగత్తంతయు బ్రహ్మమయమే, తాను బ్రహ్మమే సన్దేహములేదు. తనకంటె స్వల్పమయినదియు లేదు.

ఆత్మనోన్యజ్జగన్నాస్తి ఆత్మనోన్యత్సుఖం చ న ।
ఆత్మనోన్యద్గతిర్నాస్తి సర్వమాత్మమయం జగత్ ॥
ఆత్మనోన్యన్న హి క్వాపి ఆత్మనోన్యత్ తృణం న హి ।
ఆత్మనోన్యత్తుషం నాస్తి సర్వమాత్మమయం జగత్ ॥

ఆత్మకంటె అన్యముగా జగత్తులేదు. ఆత్మకన్యముగా సుఖములేదు. ఆత్మకంటె అన్యముగా గమ్యస్థానములేదు. జగత్తంతయు ఆత్మమయముగనే యున్నది. ఎచ్చటను ఆత్మకంటె, అన్యముగా నేదియులేదు, ఆత్మకంటెవేఱుగా తృణముగూడలేదు. ఆత్మకంటె అన్యముగా ఒక పొట్టు కణమంతగూడలేదు. జగత్తంతయు నాత్మస్వరూపముగనే యున్నది.

నిత్యానందమయం బ్రహ్మ కేవలం సర్వదా స్వయం।
అనంతమవ్యయం శాంతమేకరూపమనామయం॥
మత్తోఽన్యదస్తి చేన్మిథ్యా యథా మరుమరీచికా।
వన్ధ్యాకుమారవచనే భీతిశ్చేదస్తి కించన॥
శశశృంగేణ నాగేన్ద్రో మృతశ్చేజ్జగదస్తి తత్।
మృగతృష్ణాజలం పీత్వా తృప్తశ్చేదస్త్విదం జగత్॥

నిత్యానందముగను, ఎల్లప్పుడు కేవలముగను, ముగింపులేనిదిగను, నాశములేనిదిగను, శాంతముగాను, ఒకటే రూపముగాను దుఃఖములేనిదిగాను, నున్నట్టి బ్రహ్మమునేనే, నాకంటే వేఱుగానున్నచో ఎండమావు నీటివలె అది మిథ్యయేను. గొడ్డురాలి కుమారుడు చెప్పుమాటవలన భయమొందితినేని జగత్తున్నట్లు చెప్పవచ్చును. కుందేటికొమ్ముచే ఏనుగు చంపబడినచో, జగత్తున్నదని చెప్పవచ్చును. ఎండమావు నీరుత్రాగిన దప్పిపోయినచో జగత్తున్నదని జెప్పవచ్చును. (ఇవి యెట్లు అబద్ధమో అట్లే జగత్తుగూడ అబద్ధమని తాత్పర్యము.)

అహం బ్రహ్మేతి నిశ్చిత్య అహంభావం పరిత్యజ।
సర్వమేవ లయం యాతి సుప్తహస్తస్థ పుష్పవత్।
న దేహో న చ కర్మాణి సర్వం బ్రహ్మైవ కేవలం॥

నేనేబ్రహ్మమని నిశ్చయించుకొని అహంభావమును వదలుము. అప్పుడు నిద్రించువాని చేతిలోని పుష్పమువలె లయమునుపొందును. (పిదప) దేహములేదు, సకలము బ్రహ్మమాత్రమే. తేజోబిందూపనిషత్తున ఆఱవ అధ్యాయము.

# (17) నాదబిందూపనిషత్

అధ్యస్తస్య కుతోజన్మ జన్మాభావే కుతస్థ్సితిః।
ఉపాదానం ప్రపంచస్య మృద్భాండస్యేవ పశ్యతి॥

అజ్ఞానం చేతి వేదాన్తైస్తస్మిన్నష్టే క్వ విశ్వతా।
యథా రజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతి వై భ్రమాత్॥

తద్వత్సత్యమవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః।
రజ్జుఖండే పరిజ్ఞాతే సర్పరూపం న తిష్ఠతి॥

అధిష్ఠానే తదాఽజ్ఞాతే ప్రపంచే శూన్యతాంగతే।
దేహస్యాపి ప్రపంచత్వాత్ ప్రారబ్ధావస్థితిః కుతః॥

అబద్ధమైన దృశ్యమునకుత్పత్తి యెక్కడిది? ఉత్పత్తిలేనప్పుడు స్థితియెక్కడిది? మట్టిపాత్రమునకు ఉపాదానకారణము మట్టి యెటులనో అటులనే ప్రపంచమునకు అజ్ఞానమే ఉపాదానకారణమని వేదాన్తములవలన నెఱుంగుచున్నాడు. అట్టి అజ్ఞానము తొలగినచో ప్రపంచమెక్కడిది? భ్రమచే త్రాడును విడచి సర్పమునెటుల గ్రహించుచున్నాడో, అటులనే సత్యము నెఱుంగక మూఢబుద్ధి గలవాడు జగత్తునెఱుంగుచున్నాడు. త్రాటి తునకయను జ్ఞానముగలిగినచో పాముకు

జ్ఞానము దొలంగుచున్నది. ఆధారమైన వస్తువుయొక్క జ్ఞానముగలిగి ప్రపంచము శూన్యమైపోయి నప్పుడు దేహమున్ను ప్రపంచమైనందున ప్రారబ్ధముయొక్క స్థితి ఎక్కడిది? నాదబిందూపనిషత్తు.

## (18) ఆ త్మ బో ధో ప ని ష త్

వివేక బుద్ధి యుక్త్యాఽహం జానామ్యాత్మానమద్వయం।
తథాఽపి బన్ధమోక్షాది వ్యవహారః ప్రతీయతే ॥
నివృత్తోఽపి ప్రపంచో మే సత్యవద్భాతి సర్వదా।
సర్పాదౌ రజ్జుసత్తేవ బ్రహ్మ సత్తైవ కేవలమ్॥
ప్రపంచాధార రూపేణ వర్తతేఽతో జగన్న హి।
యథేక్షురససంవ్యాప్తా శర్కరావర్తతే తథా।
అద్వయ బ్రహ్మరూపేణ వ్యాప్తోఽహం వై జగత్త్రయం ॥
బ్రహ్మాది కీటపర్యన్తాః ప్రాణినో మయి కల్పితాః।
బుద్బుదాది వికారాన్తా స్తరంగాస్సాగరే యథా ॥

వివేకమను బుద్ధిచే రెండవదిలేనియాత్మను నేనెఱుంగుచున్నాను. అయినను బన్ధమోక్షాదివ్యవహారముగాసబడుచున్నవి. ప్రపంచము నాకునివృత్తియైనను ఎల్లప్పుడు సత్యమువలె ప్రకాశించుచున్నది. త్రాటిలో పాముమొదలగునవివలె (త్రాడులో పామున్భ్రమకు ఆధారము త్రాడేగదా అట్లే) ప్రపంచమునకు ఆధారరూపమై బ్రహ్మసత్తుమాత్రమే ఆవరించియున్నది కావున జగత్తులేదు. చెఱుకు రసము ఎట్లు చక్కెరను వ్యాపించినిండియున్నదో, అట్లే అద్వయబ్రహ్మరూపముచే మూడు లోకములలోను నిండియున్నాను. బుడగ మొదలగు వికారములున్ను, అలలున్ను ఇవి సముద్రమునఎట్లో అట్లే బ్రహ్మమొదలు చిన్నపురుగు వఱకుగల ప్రాణులు నాయెడ కల్పితములైయున్నవి.

## (19) నా ర ద ప రి వ్రా జ కో ప ని ష త్

### తృ తీ యో ప దే శః

అధ్యాత్మనిష్ఠ శుభాశుభకర్మనిర్మూలనపరస్సన్న్యస్య పూర్ణానందైకబోధస్తద్బ్రహ్మాహమస్మీతి ప్రణవమనుస్మరన్ భ్రమరకీటన్యాయేన శరీరత్రయముత్సృజ్య సన్న్యాసేనైవ దేహత్యాగం కరోతి స కృతకృత్యో భవతి ॥

ఆత్మనిష్ఠగలవాడై, శుభాశుభకర్మలను వేరుతోత్రుంచినవాడై సకలమువిడచి పూర్ణానందమగు నొక్కటేజ్ఞానముగలవాడై అట్టి బ్రహ్మము నేనేయని బ్రహ్మప్రణవమును స్మరించుచు *భ్రమర

* టిప్పణి — భ్రమరకీటన్యాయమనగా, తుమ్మెద ఆకుపచ్చవర్ణముగల ఒకపురుగును తెచ్చి ఒకచెట్టుతొఱ్ఱలోనుంచి వాడియగు తనముక్కుచే నా పురుగును పొడుచుచున్నది. ఇట్లు ప్రతిదినము కొంతకాలమువఱకు పొడుచుచుండుటవాడుక, ఆ పురుగు తుమ్మెద పొడుపును సహింపజాలక దుఃఖముజెంది భ్రమరమువచ్చి పొడవబోవుచున్నదని భయముచే నెల్లప్పుడు తుమ్మెదనే తలంచుచుండును. ఇట్లు కొంతకాలముండగా ఆ పురుగు తుమ్మెదగామారిపోవును. ఆ విధముగనే జీవుడు తాను బ్రహ్మమనియే యెల్లప్పుడు తలంపుగలవాడైనచో బ్రహ్మమే యగుచున్నాడు.

కీటన్యాయముగా * మూడు శరీరములను విడిచి సన్న్యాసముతో నెవ్వడు దేహమును విడుచునో అతడు మోక్షము బడయుచున్నాడు. నారదపరివ్రాజకోపనిషత్తున 3-వ ఉపదేశము.

పంచమోపదేశః

చిన్తయన్ పరమానందం బ్రహ్మైవాహమితిస్మరన్ ।

పరమానందమును చింతించుచున్నవాడై నేనే బ్రహ్మమని తలంచువాడై 5-వ ఉపదేశము.

షష్ఠోపదేశః

అస్మద్వ్యతిరిక్తం సర్వం కృతకం నశ్వరమితి మత్వావిరక్తః పురుష స్సర్వదా బ్రహ్మోఽహమితివ్యాహరేత్, నాన్యత్కించిద్వేదితవ్యం స్వవ్యతిరేకేణ జీవన్ముక్తోవసే త్కృతకృత్యో భవతి న నాహం బ్రహ్మేతి వ్యవహరేత్కింతు బ్రహ్మోఽహమస్మీత్యజస్రం ।

తనకంటె అన్యముగా నున్నదంతయు కల్పితమనియు, నశించునట్టిదనియు, నెఱింగి విరక్తిజెందిన పురుషుడు ఎల్లప్పుడు నేనే బ్రహ్మమని ఉచ్చరించవలయును. తనకంటె నన్యముగా దేనిని ఎఱుంగగూడదు, ఇట్లు నివసించు జీవన్ముక్తుడు తాను జేయవలసినదానిని జేసినవాడగు చున్నాడు, "నేను బ్రహ్మముకాను" అని వ్యవహరింపగూడదు. మరియెట్లనగా "నేను బ్రహ్మముగా నున్నా"నని యెల్లప్పుడు వ్యవహరించుచుండవలయును. 6-వ ఉపదేశము.

## (20) త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్

సర్వవస్తున్యుదాసీన భావమాసనముత్తమం ।
జగత్సర్వమిదం మిథ్యా ప్రతీతిః ప్రాణసంయమః ॥
చిత్తస్యాన్తర్ముఖీభావః ప్రత్యాహారస్తు సత్తమ ।
చిత్తస్య నిశ్చలీభావో ధారణాఽధారణంవిదుః ।
సోఽహం చిన్మాత్రమేవేతి చిన్తనం ధ్యానముచ్యతే ।

.... .... .... .... .... .... .... .... .... .... .... ....

అహమేవ పరంబ్రహ్మ బ్రహ్మోహమితి సంస్థితః ॥
సమాధిస్స తు విజ్ఞేయస్సర్వ వృత్తి వివర్జితః ।

ఓ శ్రేష్ఠుడా! సకలవస్తువులలోను ఉదాసీనభావము (ఆసక్తిలేకుండుట) లేక అలక్ష్యముగా నుండుట ఉత్తమమైన ఆసనము. ఈ జగత్తంతయు మిథ్యయను స్పష్టజ్ఞానము ప్రాణాయామము. చిత్తమును లోలోపల ద్రిప్పుటయే ప్రత్యాహారము. చిత్తముయొక్క చలనములేని భావము ధారణమనియు అధారణమనియు నెఱుంగుచున్నారు. చిన్మాత్రమగు నాతడే (బ్రహ్మము) నేనని చింతించుటయే ధ్యానమని చెప్పబడుచున్నది............నేను శ్రేష్ఠమగు బ్రహ్మమనియు, బ్రహ్మము నేననియు నున్నట్టి స్థితి యెద్దానిదో అది సకలవృత్తులు లేనిదగు సమాధియని ఎఱుంగుము. త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్తు.

* స్థూల, సూక్ష్మ, కారణదేహములనెడి మూడు శరీరములు.

# (21) మండల బ్రాహ్మణోపనిషత్

## ప్రథమం బ్రాహ్మణం

ఉక్తవికల్పం సర్వ మాత్మైవ. తల్లక్ష్యం శుద్ధాత్మ దృష్ట్వా వా యః పశ్యతి స ఏవ బ్రహ్మనిష్ఠో భవతి. జీవః పంచవింశకః స్వకల్పిత చతుర్వింశతి తత్త్వం పరిత్యజ్య షడ్వింశః పరమాత్మాహమితి నిశ్చయా జ్జీవన్ముక్తో భవతి.

చెప్పబడియున్న వికల్పమంతయు ఆత్మయే. దాని లక్ష్యమును (గుఱియగు వస్తువును) శుద్ధాత్మదృష్టితో నెవ్వడు చూచుచున్నాడో అతడే బ్రహ్మనిష్ఠుడగుచున్నాడు. ఇరువదియైదవ వాడైన జీవుడు తనచే కల్పితములయిన ఇఱువైనాలుగు తత్వములను త్రోసివేసి ఇఱువదియాఱవ దగు పరమాత్మ (నేనే) యను నిశ్చయమువలన జీవన్ముక్తుడగుచున్నాడు. మండల బ్రాహ్మణోప నిషత్ 1-వ బ్రాహ్మణము

## ద్వితీయం బ్రాహ్మణం

ప్రపంచస్యమనః కల్పితత్వాత్. తతో భేదాభావాత్. కదాచిద్బహిర్గతేఽపి మిథ్యాత్వ భావాత్. సకృద్విభాత సదానందానుభవైకగోచరో బ్రహ్మవిత్తదేవ భవతి *** శుద్ధాద్వైత బ్రహ్మోఽహమితి భిదా గంధం నిరస్య***విగత ప్రపంచ గంధస్సర్వజగదాత్మత్వేనపశ్య న్ త్యక్తాహంకారో బ్రహ్మోఽహమస్మీతి చిన్త యన్నిదం సర్వం యదయమాత్మేతి భావయన్ కృతకృత్యో భవతి.

ఈ ప్రపంచము కల్పితమయినది. కావుననే దానికి తర్వాత (ప్రపంచమును విడదీసిన పిదప) భేదములేదు. ఒకవేళ (మనస్సు) బైటవెడలినను అది (మనస్సునకు విషయమగువస్తువు) మిథ్య (అబద్ధము) అను సదానందానుభవముచేతనే మునిగియున్న బ్రహ్మవిత్తైనవాడు బ్రహ్మమే యగుచున్నాడు. *** భేదభావనను త్రోసి శుద్ధమగు నద్వైత బ్రహ్మము నేనని యుండవలయును. *** ప్రపంచవాసనలేనివాడై సకలము నాత్మగజూచెడువాడై అహంకారమును త్రోసినవాడై నేనే బ్రహ్మమని చింతించుచు ఈ ప్రపంచమంతయు ఆత్మయని భావించువాడు మోక్షమొందుచున్నాడు. 2-వ బ్రాహ్మణము.

## తృతీయం బ్రాహ్మణం

నిత్యశుద్ధః పరమాత్మాఽహమేవేతి తత్త్వమసీత్యుపదేశేన త్వమేవాహ మహమేవ త్వమితి తారకయోగమార్గేణాఖండానందపూర్ణః కృతార్థో భవతి.

నిత్యశుద్ధపరమాత్మ నేనే యనియు, తత్త్వమసియుపదేశమువలన నీవేనేను, నేనేనీవు, అనియు, తారకయోగమార్గముచేత నఖండానంద పూర్ణముగా ముక్తిజెందుచున్నాడు. 3-వ బ్రాహ్మణము.

# (22) స్కందోపనిషత్

సంవిన్మాత్రస్థితశ్చాహమజోఽస్మి కిమతః పరం।
వ్యతిరిక్తం జడం సర్వం స్వప్నవచ్చ వినశ్యతి ॥

***స ఏవ హి పరంబ్రహ్మ తద్బ్రహ్మోఽహం న సంశయః।
జీవశ్శివశ్శివోజీవస్సజీవః కేవలశ్శివః॥
తుషేణబద్ధోవ్రీహిస్స్యాత్ తుషాఽభావే తు తండులః।
ఏవం బద్ధస్తథా జీవః కర్మనాశే సదాశివః॥
పాశబద్ధస్తథా జీవః పాశముక్తస్తదాశివః।
*** దేహోదేవాలయః ప్రోక్తో జీవోదేవస్సదాశివః॥
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్।
అభేదదర్శనం జ్ఞానం ధ్యానం నిర్విషయంమనః॥

నేను జ్ఞానస్వరూపిగానున్నందున జననములేనివాడుగ నున్నాను. దేనికంటె వేరు ఏమున్నది? (ఆత్మకంటె) అన్యమైన జడవస్తువులన్నియు స్వప్నమువలె నశించిపోవుచున్నవి. *** అతడే పరబ్రహ్మము. అట్టిబ్రహ్మమేనేను, సంశయములేదు. జీవుడే శివుడు. శివుడే జీవుడు. అట్టి జీవుడు శివుడేను. పొట్టుచే ఆవరింపబడియున్నప్పుడు వడ్లుగానున్నది. పొట్టులేనిచో నదియే బియ్యమగుచున్నది. అట్లే జీవుడు ఆవరింపబడియున్నాడు. కర్మనశించినచో నెల్లప్పుడు శివుడుగా నున్నాడు. (కర్మ) పాశముచే కట్టుబడియున్నంతవఱకు జీవుడుగా నున్నాడు. పాశమునుండి విడువబడినచో నప్పుడు శివుడుగానున్నాడు. ***దేహము దేవాలయమని చెప్పబడుచున్నది. జీవుడెల్లప్పుడు మంగళస్వరూపియైన దేవుడుగనే యున్నాడు అజ్ఞానమనెడు నిర్మాల్యమునుత్రోసి అతడు (శివుడు) నేనను భావనతోపూజింపవలయును. అభేదముగ జూచుటయే జ్ఞానము. మనస్సు విషయమునందు ఆసక్తము గాకయుండుటయే ధ్యానము. స్కందోపనిషత్.

## (23) మహానారాయణోపనిషత్.

### ప్రథమోఽధ్యాయః.

త్వమేవ సర్వం త్వమేవసర్వం త్వమేవ సర్వం. త్వమేవమోక్షస్త్వమేవ మోక్షస్త్వమేవాఖిల మోక్షసాధనం. న కించిదస్తి త్వద్వ్యతిరిక్తం. యత్కించి త్ప్రతీయతే తత్సర్వం బాధితమితి నిశ్చితమ్.

సకలము నీవే, సకలము నీవే, సకలము నీవే, నీవే మోక్షము, నీవే మోక్షము, నీవే మోక్షము నిచ్చెడివాడవు. సకలమోక్షసాధనము నీవే, నీకంటె అన్యముగా నేదియులేదు. ఏదేది తోచుచున్నదో అదంతయు బాధింపబడునట్టి (మిథ్యయగునట్టి) దని నిశ్చయింపబడియున్నది.

సగుణ నిర్గుణ స్వరూపం బ్రహ్మ, ఆదిమధ్యాన్తం శూన్యం బ్రహ్మ, సర్వం ఖల్విదం బ్రహ్మ.

బ్రహ్మము సగుణ నిర్గుణ స్వరూపముగానున్నది. ఆది, మధ్య, ముగింపులేనట్టిది బ్రహ్మము ఈ సకల ప్రపంచము బ్రహ్మమేను. ఇచ్చట జెప్పియున్నట్లు రెండు స్వరూపములుగాను బ్రహ్మమున్నదనునది బృహదారణ్యకోపనిషత్తున 3 వ బ్రాహ్మణము ఆరంభమున జెప్పబడియున్న వాక్యము నిచ్చటనుదహరించుట వ్యర్థముకాదు. ("ద్వేవావబ్రహ్మణోరూపే మూర్తంచైవామూర్తంచ") మహానారాయణోపనిషత్తు 1 అధ్యాయము.

## ద్వితీయోఽధ్యాయః

**సచ్ఛబ్దవాచ్యం బ్రహ్మావిద్యాశబళం భవతి.**

సచ్ఛబ్దవాచ్యమగు బ్రహ్మము అవిద్యతో గూడినదగుచున్నది.

**తత్ర తత్త్వతోగుణాతీత శుద్ధసత్త్వమయో లీలాగృహీత నిరతిశయానంద లక్షణో మాయోపాధికో నారాయణ ఆసీత్.**

అచ్చట వాస్తవముగా గుణాతీతుడును, శుద్ధసత్త్వ స్వరూపియు లీలకొరకంగీకరింపబడిన నిరతిశయానంద స్వరూపముగల మాయోపాధికుడునైన నారాయణుడున్నాడు. 2 వ అధ్యాయము.

## తృతీయోఽధ్యాయః

**సంకోచవికాసాత్మక మహామాయావిలాస ఏవ సర్వోప్యవిద్యాప్రపంచః పరమార్థతో న కశ్చిదస్తి లక్షణ శూన్యానాది మూలావిద్యా విలాసత్వాత్ తత్కథమితి ఏకమేవాద్వయం బ్రహ్మ నేహనానాస్తి కించన తస్మాద్బ్రహ్మ వ్యతిరిక్తం సర్వం బాధితమేవ ......... తస్మాన్మాయోపాధిక ఆదినారాయణస్తథాస్య స్వరూపం భజతి సర్వేజీవాశ్చ స్వస్వరూపంభజన్తే యథా జపాకుసుమ సాన్నిధ్యాద్రక్తస్ఫటికప్రతీతిః తదభావే శుద్ధస్ఫటిక ప్రతీతిః బ్రహ్మణోఽపి మాయోపాధివశాత్ సగుణపరిచ్ఛిన్నాది ప్రతీతిః। ఉపాధివిలయాన్నిర్గుణ నిరవయవాది ప్రతీతిః.**

సకలమైన అవిద్యా ప్రపంచమంతయు ముడుచుకొనునట్టిదియు, వికసించునట్టిదియు అయిన మహామాయయొక్క ఆటలే. వాస్తవమున నేదియులేదు. ఏలనగా లక్షణశూన్యమయిన అనాదిమూలా విద్యయొక్క ఆటగావుననే, అదెట్లనగా రెండవది లేనిదైన ఒకటైనదే బ్రహ్మము, దానియెడ అనేక మనునది అణువంతయులేదు. కావుననే, బ్రహ్మముకంటె అన్యమైనదంతయు బాధింపబడినదే (మిథ్యయైనదే) కావున మాయోపాధికుడైన యాదినారాయణుడు తనయొక్క స్వరూపమును బొందుచున్నాడు. అట్లే జీవులెల్లరు స్వస్వరూపమును బొందుచున్నారు. దాసాని పుష్ప సమీపముననున్న స్ఫటికము ఎఱ్ఱరంగుతో గానబడుచున్నది. అది సమీపమునలేనియెడల శుద్ధముగానున్నది. బ్రహ్మమునకుగూడ మాయోపాధిచే సగుణత, వేరైనదివలె కనబడుట మొదలగు దృశ్యము గలుగుచున్నది. ఉపాధినశించినచో నిర్గుణత, అవయవములులేకుండుట మొదలగు దృశ్యము గానవచ్చుచున్నది. 3 వ అధ్యాయము.

## చతుర్థోఽధ్యాయః

**కార్యకారణోపాధిభేదాత్ జీవేశ్వరభేదోపి దృశ్యతే. కారణోపాధిరీశ్వరః. కార్యోపాధిరయం జీవః.**

కార్యకారణ (మాయా అవిద్య) ఉపాధిచే జీవేశ్వర భేదము చూడబడుచున్నది. కారణోపాధిగలవాడీశ్వరుడు. కార్యోపాధి గలవాడు జీవుడు.

**బ్రహ్మచైతన్యంతేషు ప్రతిబింబితంభవతి. ప్రతిబింబా ఏవ జీవా ఇతి కథ్యంతే. అంతఃకరణోపాధికాస్సర్వే జీవాః.**

బ్రహ్మచైతన్యము వాటిలో (అంతఃకరణములలో) ప్రతిఫలించుచున్నది. ప్రతిబింబములే జీవులని చెప్పబడుచున్నారు. సకలజీవులున్ను అంతఃకరణముపాధిగాగలవారలే. 4-వ అధ్యాయము

షష్ఠోఽధ్యాయః

త్వం బ్రహ్మాఽసి అహం బ్రహ్మాఽస్మి ఆవయోరన్తరం న విద్యతే. త్వమేవాహం అహమేవ త్వం ఇత్యభిధాయేత్యుక్త్వాఽఽదినారాయణస్తిరోదధే.

నీవు బ్రహ్మముగానున్నావు. నేను బ్రహ్మముగా నున్నాను. మన యిరువురిలో భేదము లేదు. నీవేనేను నేనేనీవు, ఇట్లు చెప్పి ఆదినారాయణుడు అంతర్ధానముచెందెను 6-వ అధ్యాయము.

అష్టమోఽధ్యాయః

యథా భూమేః పర్వత వృక్ష తృణ గుల్మ లతాద్యనన్తవస్తు భేదః తథైవాద్వైత పరమానంద లక్షణ పరబ్రహ్మణో మమ సర్వద్వైతముపపన్నం భవత్యేవ. మత్స్వరూపమేవ సర్వం, మద్వ్యతిరిక్తమణుమాత్రం న విద్యతే.

భూమికి పర్వతము, వృక్షము, తృణము, పొదలు, తీగె మొదలగు ననేక వస్తువుల భేద మెటులనో, అట్లే అద్వైత పరమానందలక్షణ పరబ్రహ్మమగు నాకు సకలద్వైతమున్ను కలుగ దగినదిగనేయున్నది. సకలము నా స్వరూపమే. నాకంటె నన్యముగా అణుమాత్రమున్ను లేదు.

అహం బ్రహ్మేతి భావనయా యథా పరమతేజో మహానదీప్రవాహాపరమతేజఃపారావారే ప్రవిశతి - యథా పరమతేజః పారావార తరంగాః పరమతేజః పారావారే ప్రవిశన్తి, తథైవ సచ్చిదానందాత్మోపాసకస్సర్వపరిపూర్ణాద్వైత పరమానందలక్షణపరబ్రహ్మణి నారాయణే మయి సచ్చిదానందాత్మకోఽహమజోఽహం పరిపూర్ణోహమస్మీతి ప్రవివేశ.

నేను బ్రహ్మమను భావనచే పరమతేజస్సగు నదీప్రవాహము, పరమతేజస్సగు సముద్రములలో నెట్లు ప్రవేశించుచున్నదో పరమతేజస్సగు సముద్రపు అలలు, పరమతేజస్సగు సముద్రమును ఎట్లు ప్రవేశించుచున్నవో అట్లే సచ్చిదానందాత్మ నుపాసించువాడు, సకలపరిపూర్ణాద్వైత పరమానంద లక్షణము బడసిన పరబ్రహ్మమగు నారాయణుడైన నాయెడ "నేను సచ్చిదానందాత్మను, జననము లేనివాడను, పూర్ణుడుగానున్నాను'' అని ప్రవేశించుచున్నాడు.

మదుపాసకస్తస్మాన్నిరతిశయాద్వైత పరమానంద లక్షణ పరంబ్రహ్మ భవతి. యో వై ముముక్షురనేన మార్గేణ సమ్యగాచరతి స పరమానందలక్షణ పరంబ్రహ్మ భవతి.

కావున నన్నుపాసించువాడు నిరతిశయాద్వైత పరమానంద లక్షణ పరబ్రహ్మమగుచున్నాడు. ముముక్షువగు నెవ్వడు ఈ మార్గముచే బాగుగా నాచరించునో అతడు పరమానంద లక్షణ పరబ్రహ్మమగుచున్నాడు. 8-వ అధ్యాయము.

## (24) అద్వయతారకోపనిషత్

**జీవేశ్వరౌ మాయికావితి విజ్ఞాయ సర్వవిశేషం నేతి నేతీతి విహాయ యదవశిష్యతే తదద్వయం బ్రహ్మ**

జీవేశ్వరులు మాయాస్వరూపులని యెఱింగి సకల విశేషమును ఇదికాదు, ఇదికాదని త్రోయగా ఏది మిగులుచున్నదో అది అద్వైతబ్రహ్మము. అద్వయ తారకోపనిషత్తు.

## (25) రామరహస్యోపనిషత్

రామమంత్రాణాం కృతపురశ్చరణో రామచంద్రోభవతి।
.........సదారామోఽహమస్మీతి తత్త్వతః ప్రవదన్తి యే॥
న తే సంసారిణో నూనం రామ ఏవ న సంశయః॥

రామమంత్రముల నావృత్తి జేయువాడు రామచంద్రుడగుచున్నాడు.........వాస్తవముగనే "నేను రాముడుగానున్నాను" అని యెల్లపుడు ఎవ్వరు చెప్పుచుందురో వారలు సంసారులుగారనునది నిశ్చయము. వారు రాముడేయనుదానిలో సందియములేదు. రామరహస్యోపనిషత్.

## (26) రామపూర్వతాపిన్యుపనిషత్

ప్రథమోపనిషత్

రమన్తేయోగినోఽనన్తే నిత్యానన్దే చిదాత్మని।
ఇతి రామపదేనాసౌ పరంబ్రహ్మాభిధీయతే॥
చిన్మయస్యాద్వితీయస్య నిష్కళస్యాశరీరిణః।
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా॥

అంతములేనివాడుగను, నిత్యానన్దుడుగను, చిదాత్మగనునున్నవానియెడ యోగులు రమించుచున్నారు. (అతిప్రీతి గలవారలగుచున్నారు) అనుదానిచే నితడు రాముడనుపేరుచే చెప్పబడు పరబ్రహ్మముగానున్నాడు. చిన్మయుడుగాను, రెండవది లేనివాడుగాను, కళలులేనివాడుగానున్న శరీరము లేనిబ్రహ్మమునకు ఉపాసకుల ప్రయోజనమునకై రూపము కల్పింపబడియున్నది. రామపూర్వతాపిన్యుపనిషత్తున 1-వ ఉపనిషత్తు.

## (27) రామోత్తరతాపనీయోపనిషత్

తృతీయోఽనువాకః

తత్పదార్థః పరం బ్రహ్మ రామచన్ద్రశ్చిదాత్మకః।
సోఽహమోం తత్రామభద్రః పరంజ్యోతిరసోఽహమోం॥
ఇత్యాత్మానమాదాయ మనసా బ్రహ్మణైకీకుర్యాత్।

సదా రామోఽహమస్మీతి తత్త్వతః ప్రవదన్తియే।
న తే సంసారిణో నూనం రామ ఏవ న సంశయః॥

చిదాత్మకమైన రామచంద్రుడనున దేది గలదో అది, సత్తగు బ్రహ్మము. అతడే నేను ఓం, అట్టి రామచంద్రుడనువాడు పరంజ్యోతిరవము "నేనే" యని యీ విధముగా మనస్సుచే ఆత్మను గ్రహించి బ్రహ్మముతో జేర్చవలెను. ఎవ్వరు యధార్థముగా "నేనే రాముడుగానున్నాను" అని యెప్పుడు చెప్పెదరో వారలు సంసారులుగారనునది నిశ్చయము. రాముడే సందియములేదు. రామోత్తర తాపనీయోపనిషత్తున 3 వ అన్వాకము.

## (28) శాణ్డిల్యోపనిషత్

అథ ధ్యానం తద్ద్వివిధం-సగుణం నిర్గుణంచేతి. సగుణం మూర్తిధ్యానం, నిర్గుణ మాత్మయాథాత్మ్యం.

ధ్యానములు సగుణ నిర్గుణములని రెండువిధములు. సగుణము మూర్తిధ్యానము, నిర్గుణము వాస్తవమగు ఆత్మస్వరూప ధ్యానము. 11.

అథ సమాధిః జీవాత్మ పరమాత్మైక్యావస్థా త్రిపుటిరహితా పరమానంద స్వరూపా శుద్ధచైతన్యాత్మికా భవతి. 12.

సమాధియనగా - త్రిపుటి (చూచెడివాడు - చూచుట - చూడబడువస్తువు - ఈ భేదము) లేనిదిగను, పరమానంద స్వరూపముగను, శుద్ధచైతన్యాత్మకముగను నున్నట్టి జీవాత్మపరమాత్మల ఐక్యావస్థయేను. 12 - శాండిల్యోపనిషత్తున 1-వ అధ్యాయము.

## (29) పైంగళోపనిషత్

### చతుర్థోఽధ్యాయః

అహమేవ పరం సర్వమితి పశ్యేత్పరం సుఖం।
యథా జలే జలం క్షిప్తం క్షీరంక్షీరే ఘృతంఘృతే॥
అవిశేషో భవేత్తద్వ జ్జీవాత్మ పరమాత్మనోః।
*** యత్ర యత్ర మృతో జ్ఞానీ యేన వా కేన మృత్యునా॥
యథా సర్వగతం వ్యోమ తత్ర తత్ర లయం గతః।
ఘటాకాశమివాత్మానం విలయం వేత్తి తత్త్వతః।
స గచ్ఛతి నిరాలంబం జ్ఞానాలోకం సమన్తతః।
*** అహం బ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మనాం॥
*** నాహం బ్రహ్మేతి జానాతి తస్య ముక్తిర్న జాయతే।

నేనే పరముగను సకలముగను నున్నానని చూచుటయే శ్రేష్ఠమైనసుఖము, నీటితో జేర్పబడిననీరు, పాలతో జేర్చబడినపాలు, నేతితో జేర్చబడిన నేతివలె జీవాత్మ పరమాత్మ భేదములేనిదగు

చున్నది. *** జ్ఞానియైనవాడు ఏయేచోట ఏవిధముగ మరణించినను అంతటవ్యాపించిన ఆకాశము వలె ఆ యాచోటనే లయమొందుచున్నాడు. వాస్తవముగా ఘటాకాశమువలె ఆత్మయను నతడు లయ మొందునటు లెఱుంగదగినది. అతడు నిరాలంబమగు జ్ఞానప్రకాశము నంతట పొందు చున్నాడు, *** నేనే బ్రహ్మమని యెల్లప్పుడుండుట మహాత్ములకు మోక్షహేతువగుచున్నది. *** నేనే బ్రహ్మమని యెఱుంగనివానికి ముక్తిగలుగుటలేదు. పైంగళోపనిషత్తున 4-వ అధ్యాయము.

## (30) మహోపనిషత్

ద్వితీయోఽధ్యాయః

అహం సచ్చిత్పరానంద బ్రహ్మైవాస్మి న చేతరః.

నేను సచ్చిత్పరానంద బ్రహ్మముగనేయున్నాను వేరుకాను. 2-వ అధ్యాయము.

చతుర్థోఽధ్యాయః

బ్రహ్మైవాహమితి జ్ఞాత్వా వీతశోకో భవేన్మునిః ।

మునియగువాడు నేనే బ్రహ్మమని ఎఱిగినచో శోకము లేనివాడగుచున్నాడు.

వినష్ట దిగ్భ్రమస్యాపి యథా పూర్వం విభాతి దిక్ ।
తథా విజ్ఞానవిధ్వస్తం జగన్నాస్తీతి భావయ ॥

దిగ్భ్రమముదొలంగినవానికి మునుపు కనబడినట్లే దిక్కుగనబడునట్లు, విజ్ఞానము నాశము జెందిన జగత్తు గనబడుచుండినను, లేనేలేదని భావించుము.

మత్తఐరావతో బద్ధస్సర్షపీ కోణకోటరే ।
మశకేన కృతం యుద్ధం సింహౌఘైరణుకోటరే ॥
పద్మాక్షే స్థాపితో మేరుర్నిగీర్ణో భృంగసూనునా ।
నిదాఘ ! విద్ధి తాదృక్త్వం జగదేతద్భ్రమాత్మకమ్ ॥

ఆవగింజయొక్క ఒక మూలలోనిద్వారమునకు మదపుటేనుగు కట్టబడియె. అణువు రంధ్రములో దోమ, సింహసమూహముతో యుద్ధముజేయుచున్నది. తామరవిత్తులో నుంచబడి యున్న మహా మేరు పర్వతమును తుమ్మెద కొదమ మ్రింగివేసినది. (ఇవి యెట్లు అసత్యముగనే యుండవలెనో అట్లే) ఓనిదాఘా! భ్రమస్వరూపముగానున్న జగత్తును వాటికి సదృశముగా దలంపుము.

అహంబ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మనాం ।

ఎల్లప్పుడు నేనే బ్రహ్మమనియుండెడిస్థితి మహాత్ములకు మోక్షహేతువగుచున్నది.

జీవేశ్వరాదిరూపేణ చేతనాచేతనాత్మకం ।
ఈక్షణాది ప్రవేశాంతా సృష్టిరీశేన కల్పితా ॥
జాగ్రదాది విమోక్షాంతస్సంసారో జీవకల్పితః ॥

ఈక్షణముమొదలు ప్రవేశమువఱకు జెప్పబడియున్నట్టి చేతనాచేతనాత్మకమైన జీవేశ్వ రాది రూపములగు సృష్టులు ఈశ్వరునిచే కల్పింపబడినవి. జాగ్రత్తు మొదలు మోక్షమువఱకుగల సంసారము జీవునిచే కల్పింపబడినది.

మరుభూమౌ జలం సర్వం మరుభూమాత్రమేవ తత్ ।
జగత్త్రయమిదం సర్వం చిన్మాత్రం స్వవిచారతః ॥

మరు భూమిలోగనబడు నీరంతయు మరుభూమియేతప్ప వేఱులేదు. మూడులోకములు సకలప్రపంచము విచారణచే చిన్మాత్రమేగదా. నాల్గవయధ్యాయము.

షష్ఠోఽధ్యాయః.

న తదస్తి న యత్రాహం న తదస్తి న తన్మయం ।
కిమన్యదభివాంఛామి సర్వం సచ్చిన్మయం తతం ॥
సమస్తం ఖల్విదం బ్రహ్మసర్వమాత్మేదమాతతం ।
అహమన్యమిదం చాన్యదితి భ్రాన్తిం త్యజానఘ ॥

నేనులేని వస్తువేలేదు. తన్మయముగాని పదార్థమేలేదు. సర్వముసచ్చిన్మయముగ వ్యాపించియున్నది. నేను వేరే దేనిని కోఁఅగలను? ఈ సకలప్రపంచము బ్రహ్మమే. విస్తారముగానున్న యీ ప్రపంచమంతయు ఆత్మయే. ఓ పాపములేనివాఁడా! నేను వేరు, ఈ ప్రపంచము వేఱను భ్రాన్తిని త్రోసిపుచ్చుము. 6-వ అధ్యాయము.

## (31) యోగశిఖోపనిషత్.

ప్రథమోఽధ్యాయః.

క్షేత్రజ్ఞః పరమాత్మా చ తయోరైక్యం యదా భవేత్ ।
తదైక్యే సాధితే బ్రహ్మన్ చిత్తం యాతి విలీనతాం ॥
పవనః స్థైర్యమాయాతి లయయోగోదయే సతి ।
లయాత్సంప్రాప్యతే సౌఖ్యం స్వాత్మానందం పరంపదం ॥

క్షేత్రజ్ఞుడు పరమాత్మ వీరిఱువురికి ఐక్యమెప్పుడు గల్గునో, ఓ బ్రాహ్మణోత్తమా! అట్టి యైక్యమెప్పుడు దృఢముగాంచునో అప్పుడు చిత్తము లయమొందుచున్నది. లయయోగము స్థిరపడినచో, వాయువు చలనము లేనిదగుచున్నది. స్వాత్మానందపరమపదమగు సుఖమనునది (శుద్ధ) లయమువలన బొందబడుచున్నది. యోగశిఖోపనిషత్తు 1 వ అధ్యాయము.

చతుర్థోఽధ్యాయః.

ఓంచైతన్యస్యైక రూపత్వాద్భేదో యుక్తో న కర్హిచిత్ ।
జీవత్వం చ తథా జ్ఞేయం రజ్జ్వాం సర్పగ్రహో యథా ॥
రజ్జ్వజ్ఞానాత్క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ ।
భాతి తద్వచ్చితిస్సాక్షాద్విశ్వాకారేణ కేవలా ॥
ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణోఽన్యన్న విద్యతే ।
తస్మాత్సర్వప్రపంచోఽయం బ్రహ్మైవాస్తి న చేతరత్ ॥

వ్యాప్యవ్యాపకతామిథ్యా సర్వమాత్మేతి శాసనాత్ ।
ఇతి జ్ఞాతే పరే తత్త్వే భేదస్యావసరః కుతః ॥
బ్రహ్మణః సర్వభూతాని జాయన్తే పరమాత్మనః ।
తస్మాదేతాని బ్రహ్మైవ భవన్తీతి విచిన్తయ ॥
బ్రహ్మైవసర్వనామాని రూపాణి వివిధాని చ ।
కర్మాణ్యపి సమగ్రాణి భాసన్తీవేతి భావయ ॥
సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వంచ శాశ్వతం ।
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వంచ తథా భవేత్ ॥
స్వల్పమప్యన్తరం కృత్వా జీవాత్మపరమాత్మనోః ।
యస్తిష్ఠతి స మూఢాత్మా భయం తస్యాపి భాషితం ॥
యదజ్ఞానాద్భవేద్ ద్వైతమితరత్తత్రపశ్యతి ।
ఆత్మత్వేన సదా సర్వం నేతరత్తత్ర చాణ్వపి ॥
అనుభూతోప్యయం లోకోవ్యవహారక్షమోపి సః ।
అసద్రూపో యథా స్వప్న ఉత్తరక్షణబాధితః ॥
స్వప్నే జాగరితం నాస్తి జాగరే స్వప్నతా న హి ।
ద్వయమేవ లయే నాస్తిలయోఽపి హ్యనయోర్నచ ॥
త్రయమేవ భవేన్మిథ్యా గుణత్రయ వినిర్మితః ।
అస్య ద్రష్టా గుణాతీతో నిత్యోహ్యేష చిదాత్మకః ॥
యద్వన్మృది ఘట భ్రాన్తిః శుక్తౌ హి రజతస్థితిః ।
తద్వద్బ్రహ్మణి జీవత్వం వీక్ష్యమాణోవినశ్యతి ॥
యథా మృది ఘటోనామ కనకే కుండలాభిధా ।
శుక్తౌ హి రజతఖ్యాతిః జీవశబ్దస్తథా పరే ॥
యథైవ వ్యోమ్ని నీలత్వం యథా నీరం మరుస్థలే ।
పురుషత్వం యథాస్థాణౌ తద్వద్విశ్వం చిదాత్మని ॥
యథైవ శూన్యేవేతాళో గన్ధర్వాణాం పురం యథా ।
యథాఽఽకాశే ద్విచన్ద్రత్వం తద్వత్సత్యే జగత్థ్సితిః ॥
యథా తరంగకల్లోలైః జలమేవం స్ఫురత్యలం ।
ఘటనామ్నా యథాపృథ్వీ పటనామ్నాహి తన్తవః ॥
జగన్నామ్నా చిదాభాతి సర్వం బ్రహ్మైవ కేవలం ।
యథా వంధ్యాసుతో నాస్తి యథా నాస్తి మరౌజలం ॥
యథా నాస్తినభోవృక్షస్తథా నాస్తి జగత్థ్సితిః ।
గృహ్యమాణే ఘటే యద్వత్ మృత్తికాభాతివై బలాత్
వీక్ష్యమాణే ప్రపంచే తు బ్రహ్మైవాభాతి భాసురం ॥

సదైవాత్మా విశుద్ధోఽస్తి హ్యశుద్ధో భాతి వై సదా ॥
యథైవ ద్వివిధా రజ్జుః జ్ఞానినోఽజ్ఞానినోఽనిశం ।
యథైవ మృణ్మయః కుమ్భస్తద్వద్దేహోఽపి చిన్మయః ॥
ఆత్మానాత్మవివేకోఽయం ముధైవ క్రియతే బుధైః ।
సర్పత్వేన యథా రజ్జూ రజతత్వేన శుక్తికా ॥
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ।
ఘటత్వేన యథా పృథ్వీ జలత్వేన మరీచికా ॥
గృహత్వేన హి కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా ।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥

ఓం - చైతన్యము ఒకే రూపమైనందున భేదమొకప్పుడుకూడ యుక్తముకాదు. త్రాటిలో పామను ధర్మమునువలె జీవత్వము నెఱుంగవలయు. త్రాడను జ్ఞానములేనందున ఒక క్షణములో త్రాడు సర్పముగ గనబడుచున్నది. అట్లే కేవలమగు చిత్తు తానే ప్రపంచముగ గనబడుచున్నది. ప్రపంచమున కుపాదానకారణము బ్రహ్మముదప్ప వేరొకటిలేదు. కావున ఇట్టి సకల ప్రపంచమును బ్రహ్మముగనేయున్నది. వేరుకాదు. సకలము ఆత్మయనువిధిచే ప్రవేశింపబడునట్టిదనునదియు. ప్రవేశించినట్టిదనునదియు మిథ్యయే. పరత్వము ఇట్లెఱుంగబడినచో భేదమునకు చోటేది? పరమాత్మ యనెడు బ్రహ్మమువద్దనుండి సకల భూతములు గలుగుచున్నవి. కావున నివన్నియు బ్రహ్మమే యగుచున్నవని తలంపుము. ప్రకాశించుచున్నదివలెనున్న సకల నామములు, పలువిధములైన రూపములు, సకలమైన కర్మలు బ్రహ్మమేయని భావించుము. స్వర్ణమువలననైన వస్తువులు స్వర్ణమే యని యెటుల నిశ్చయమో అట్లే బ్రహ్మమువలన గలిగినది బ్రహ్మమేయగుచున్నది. జీవాత్మ పరమాత్మలలో స్వల్పమైనను ఎవడు భేదమును తలంచియున్నాడో అట్టి మూఢాత్మునకే భయము గలదని చెప్పబడుచున్నది. దేనియొక్క అజ్ఞానమువలన ద్వైతముగలుగుచున్నదో అప్పుడొకదానిని ఒకటి చూచుచున్నది. సకలము నాత్మగ జూచునప్పుడు ఆ విషయమున అణువంతగూడ భేద మేమియులేదు. ఈ లోకమనునది అనుభవింపబడియున్నను అది వ్యవహారమునకు యోగ్యమైనదిగ నున్నను స్వప్నమనునది పై నిమిషమున నశించునట్లు అసద్రూపమైనదే. స్వప్నమున జాగ్రదవస్థ లేదు. జాగ్రదవస్థలో స్వప్నములేదు. సుషుప్తిలో రెండునులేవు. ఆ రెంటికి సుషుప్తిలేదు. ఇవి మూడు మిథ్యయేయగుచున్నవి. (అవి) గుణత్రయముచే కల్పింపబడినవి. ఇట్టిజ్ఞానమువలన నీయాత్మ చిత్తుగను నిత్యుడుగను గుణముల నతిక్రమించిన వాడుగను నున్నాడు, మట్టియెడ కుండయను భ్రమయు, ముత్తెపు చిప్పలో వెండి యనుస్థితియు ఎటులనో అటులనే బ్రహ్మమునందు జీవత్వము. దాని నెఱింగినచో (జీవభావము) నశించిపోవుచున్నది. మట్టిలో కుండయనుపేరు, స్వర్ణములో కుండలమనుపేరు, ముత్తెపు చిప్పలో వెండియను ప్రసిద్ధి, ఇవి యెట్లో అట్లే పరబ్రహ్మమున జీవుడను శబ్దము గలిగియున్నది.

ఆకాశమున నీలరూపము, మరుభూమిలో నీరుకనబడుట, స్తంభములో పురుషుడను భ్రాన్తి, యివివలె చిదాత్మయెడ ప్రపంచము తోచుచున్నది. వేతాళమనియు గన్ధర్వనగరమనియు ఆకాశమున రెండు చంద్రులనియు ఎటులలేదో అట్లే సత్యమగు బ్రహ్మము వద్ద జగత్తుయొక్కస్థితి. జలమే అలయనియు, పొంగుటయనియు ఎటుల రావచ్చుచున్నదో. మట్టి కుండయనుపేరుతో

నెటుల ప్రకాశించుచున్నదో, దారములు వస్త్రమనుపేరుతో నెటులనో, అట్లే జగత్తనుపేరుతో చిత్త ప్రకాశించుచున్నది. సకలము బ్రహ్మమాత్రమేను. గొడ్డురాలి కొమారుడు, ఎండమావుల నీరు, ఆకాశవృక్షము, ఇవి యెటులలేవో అట్లే జగత్తుయొక్క స్థితియులేదు. ఘటమును వివేచించి ఎఱుంగగా ప్రయత్నములేక స్వయముగనే మట్టిగా ప్రకాశించునట్లు, ప్రపంచమును వివేచించి చూచిన ప్రకాశమైన బ్రహ్మమే ప్రకాశించుచున్నది. త్రాడనునది జ్ఞానికిని, అజ్ఞానికిని రెండువిధములుగ (జ్ఞానికి త్రాడుగను అజ్ఞానికి పాముగను) తోచుటవలె ఎల్లప్పుడు శుద్ధుడుగనే యున్నట్టి ఆత్మయను నతడు ఎల్లప్పుడు అశుద్ధుడువలె గనబడుచున్నాడు. ఘటము మట్టిరూపముగా నుండుట యెటులనో అటులనే దేహముగూడ చిన్మయముగా నున్నది. విద్వాంసులచే ఆత్మానాత్మ విచారము వ్యర్థముగనే చేయబడుచున్నది. మూఢునిచే త్రాడు పాముగను, ముత్తెపు చిప్ప వెండిగను, నిశ్చయింపబడునట్లు, ఆత్మస్వభావము దేహముగ నిశ్చయింపబడుచున్నది, మట్టి యనునది ఘటముగను, ఎండమావులు నీరుగను, చెట్లు ఇల్లుగను, ఇనుము కత్తిగను, ఎటుల గ్రహింపబడుచున్నదో, అట్లే అజ్ఞానమువలన ఆత్మయెడ దేహత్వము నెఱుంగు చున్నాడు. యోగశిఖోపనిషత్.

షష్ఠోఽధ్యాయః

చిత్తే చలతి సంసారో నిశ్చలం మోక్ష ఉచ్యతే।
తస్మాచ్చిత్తం స్థిరీకుర్యాత్ ప్రజ్ఞయా పరయాపరే॥
చిత్తం కారణమర్థానాం తస్మిన్సతి జగత్త్రయం।
తస్మిన్ క్షీణే జగత్క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః॥

చిత్తము చలించుచుండగా సంసారమనియు, చిత్తముచలించకుండగా మోక్షమనియు చెప్పబడుచున్నది. కావున చిత్తమును శ్రేష్ఠమైన జ్ఞానముచే పరమాత్మయెడ స్థిరముగా నిలబెట్టవలయును. చిత్తము విషయములకు కారణముగనున్నది. అది నశించినచో జగత్తుగూడ నశించుచున్నది. దానిని ప్రయత్నముచే పరిశుభ్రముగావించవలయును. 6 వ అధ్యాయము

## (32) సన్న్యాసోపనిషత్

ద్వితీయోఽధ్యాయః

నిరస్తమననానందస్సంవిన్మాత్రపరోస్మ్యహం।
మలం సంవేద్యముత్సృజ్యమనోనిర్మూలయన్ పరం॥
ఆశాపాశమలంఛిత్వా సంవిన్మాత్రపరోస్మ్యహమ్।

నేను మననము, ఆనందము వీటిని విడిచినవాడనై చిన్మాత్రముగానున్నాను. ఎఱుంగదగిన దనెడు మలమునుత్రోసి, మనస్సంతయు నాశముజేసి, ఆశయమనెడు పాశమును నఱికి, శ్రేష్ఠమైన చిన్మాత్రముగనే నేనున్నాను. సన్న్యాసోపనిషత్. 2వ అధ్యాయము.

## (33) పరమహంసపరివ్రాజకోపనిషత్

బ్రహ్మోఽహమస్మీతి తత్త్వమస్యాది వాక్యార్థ స్వరూపానుసంధానం కుర్వన్ ***కృతకృత్యో భూత్వా బ్రహ్మాహమస్మీతి భావయన్***సచ్చిదానందాద్వయ

చిద్ఘనస్సంపూర్ణానందైకబోధో బ్రహ్మైవాహమస్మీత్యనవరతం బ్రహ్మప్రణవాను సంధానేన యః కృతకృత్యోభవతి స పరమహంస పరివ్రాట్।

నేను బ్రహ్మముగానున్నానని తత్త్వమసి మొదలగు వాక్యార్థములను అనుసంధానము జేయుచు***దేహము కృశించినవాడై నేనే బ్రహ్మమని భావనజేయుచు***సచ్చిదానందాద్వయ చిద్ఘన సంపూర్ణానందముగను, ఒక్కటిగను, జ్ఞానస్వరూపిగనునున్నట్టి బ్రహ్మమేనేనని ఎల్లప్పుడు బ్రహ్మప్రణవాను సంధానముచే నెవ్వడు కృతకృత్యుడగునో అతడు పరమహంసుడగు పరివ్రాట్, పరమహంస పరివ్రాజకోపనిషత్తు.

# (34) అన్నపూర్ణోపనిషత్.

## ప్రథమోఽధ్యాయః.

భ్రమః పంచవిధో భాతి తదేవేహ సముచ్యతే।
జీవేశ్వరౌ భిన్నరూపావితి ప్రాథమికో భ్రమః॥
ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవంవాద్వితీయకః।
శరీరత్రయసంయుక్త జీవస్సంగీ తృతీయకః॥
జగత్కారణ రూపస్య వికారిత్వం చతుర్థకః।
కారణాద్భిన్నజగతః సత్యత్వం పంచమో భ్రమః॥
పంచభ్రమనివృత్తిశ్చ తదాస్ఫురతి చేతసి।
బింబప్రతిబింబ దర్శనేన భేద భ్రమో నివృత్తః॥
స్ఫటిక లోహితదర్శనేన పారమార్థికకర్తృత్వభ్రమో నివృత్తః।
ఘటమఠాకాశ దర్శనేన సంగతి భ్రమో నివృత్తః॥
రజ్జుసర్ప దర్శనేన కారణాద్భిన్న జగత్సత్యత్వ భ్రమోనివృత్తః।
కనకరుచికదర్శనేన వికారిత్వ భ్రమో నివృత్తః॥
తదా ప్రభృతి మచ్చిత్తం బ్రహ్మాకార మభూత్స్వయం***।
సర్వవస్తు పరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే॥
ఆత్మావలోకనార్థంతు తస్మాత్సర్వం పరిత్యజేత్।
సర్వం సంత్యజ్యదూరేణ యచ్ఛిష్టం తన్మయోభవ॥
సర్వం కించిదిదం దృశ్యం దృశ్యతేచేత్ జగద్గతమ్।
చిన్నిష్పందాంశమాత్రం తన్నాన్యత్కించన శాశ్వతమ్॥

భ్రమ యైదువిధములుగా భాసించుచున్నది, అది యిచ్చట చెప్పబడుచున్నది, జీవేశ్వరులు వేఱువేఱు రూపమనుట మొదటిభ్రమ. కర్తృత్వగుణము వాస్తవముగా ఆత్మయెడనున్నదనుట రెండవది. మూడుశరీరములతో గూడియున్న జీవుడు వానిలోనంటి యున్నాడనునది మూడవది. జగత్కారణ స్వరూపునికి వికారిత్వము జెప్పుట నాల్గవది. కారణముకంటె జగత్తు వేరైనదనియు

జగత్తుసత్యముగా నున్నట్టిదనియు ఐదవభ్రమ. ఐదుభ్రమలున్ను మనస్సులో అప్పుడు నివర్తించెను. (ఎప్పుడనగా) బింబ ప్రతిబింబదర్శనముచే భేదభ్రమ నివర్తించినది. స్ఫటికమున నెఱుపును చూచి నందున కర్తృత్వము వాస్తవమైనదను భ్రమనివర్తించెను. ఘటాకాశ మఠాకాశదర్శనముచే సంబంధించి యున్నట్టిదను భ్రమనివర్తించెను. త్రాటిలో పామునుచూచిన దానిచే కార్యమునకన్న జగత్తు వేరైనది, జగత్తు సత్యమను భ్రమనివర్తించెను. బంగారుగిన్నెను జూచుటచే వికారిత్వభ్రమ నివర్తించెను. అది మొదలు నాయొక్క చిత్తము స్వయముగనే బ్రహ్మాకారముగనైనది * * * సకల వస్తువులను త్రోసినందువలన మిగులునది ఆత్మయని చెప్పబడుచున్నది. కావుననే ఆత్మను చూచుటకై సకలమును వదలవలయు. అన్నిటిని బాగుగా త్రోసివేసిన మిగిలినదేదిగలదో అట్టి స్వరూపమగుదువు గాత! చూడదగిన ఇదంతయు జగత్తున నున్నట్లెఱుంగ బడినచో అది చిత్తు యొక్క చంచలములేని స్వభావముయొక్క అంశము మాత్రమేను, శాశ్వతమైనది వేఱొకటిలేదు.

చతుర్థోఽధ్యాయః.

ప్రతిష్ఠా సర్వభూతానాం ప్రజ్ఞానఘనలక్షణః ।
తద్విద్యావిషయం బ్రహ్మ సత్యజ్ఞానసుఖాద్వయమ్ ।
ఏకం బ్రహ్మాహమస్మీతి కృతకృత్యో భవేన్మునిః ॥

ఆ బ్రహ్మము సకల భూతముల కాధారమైనది. ప్రజ్ఞాన ఘనమును లక్షణముగ బడసినది. జ్ఞానమువలన నెరుంగదగినది. సత్యము, జ్ఞానము, సుఖము, అద్వయము, ఏకము, ఇట్టి బ్రహ్మమేనేను అని మునియైనవాడు మోక్షమొందవలయును. 4వ అధ్యాయము.

పంచమోఽధ్యాయః.

చిన్మాత్రమక్షయం శాన్తమేకం బ్రహ్మాస్మి నేతరత్ ।
*** బ్రహ్మైవ సర్వమిత్యేవ భావితే బ్రహ్మైవపుమాన్ ।
న స్తౌమి న చ నిన్దామి ఆత్మనోఽన్యన్నహిక్వచిత్ ॥

చిన్మాత్రముగను, అక్షయముగను, శాంతముగను, ఒక్కటిగను, నున్నట్టి బ్రహ్మమే నేను, వేరుగాను. *** సకలము బ్రహ్మము అని భావించెడు పురుషుడు బ్రహ్మమే. *** ఆత్మకంటే అన్యముగా నేదియు లేనందున నేను స్తుతించుటయు లేదు, నిందించుటయులేదు.

ఏకమాద్యన్తరహితం చిన్మాత్రమమలం తతం ।
ఖాదప్యతితరాం సూక్ష్మం తద్బ్రహ్మాస్మి న సంశయః ॥
దిక్కాలాద్యనవచ్ఛిన్నం స్వచ్ఛం నిత్యోదితం తతం ।
సర్వార్థమయమేకార్థం చిన్మాత్రమమలం భవ ॥
సర్వమేకమిదం శాన్తం ఆదిమధ్యాన్తవర్జితమ్ ।
భావాభావమజం సర్వం ఇతి మత్వా సుఖీ భవ ॥
న బద్ధోఽస్మి న ముక్తోఽస్మి బ్రహ్మైవాస్మి నిరామయమ్ ।
ద్వైతభావవిముక్తోఽస్మి సచ్చిదానంద లక్షణః ॥

ఏవం భావయ యత్నేన జీవన్ముక్తో భవిష్యసి।
*** యథాకాశో ఘటాకాశో మహాకాశ ఇతీరితః॥
తథా భ్రాన్తైర్ద్విధా ప్రోక్తో హ్యాత్మా జీవేశ్వరాత్మనా।
యదా మనసి చైతన్యం భాతిసర్వత్రగం సదా॥
యోగినోఽవ్యవధానేన తదా సంపద్యతే స్వయం।
యదా సర్వాణి భూతాని స్వాత్మన్యేవ హి పశ్యతి।
సర్వభూతేషు చాత్మానం బ్రహ్మ సంపద్యతే తదా॥
యదా సర్వాణి భూతాని సమాధిస్థో న పశ్యతి।
ఏకీభూతః పరేణాసౌ తదా భవతి కేవలః॥

ఒక్కటైనదియు, ఆద్యంతములు లేనిదియు, చిన్మాత్రమైనదియు, శుద్ధముగను వ్యాపకముగను ఆకాశముకంటె అతిసూక్ష్మమైనదియునగు ఆ బ్రహ్మము నేనుగనున్నాను. సంశయములేదు. దిక్కు కాలము మొదలగువాటివలన విభజింపబడనట్టిదియు శుద్ధముగను ఎల్లప్పుడు ప్రకాశమైనదిగను, అంతట వ్యాపించినదిగను, సకలార్థస్వరూపిగను, ఒక్కటే అర్థముగను, చిన్మాత్రముగను, అగుదువుగాక. ఈ సకల ప్రపంచము శాన్తముగను, ఆది మధ్యాన్తములు లేనిదిగనునున్నది. లేదనునది లేనిదిగను, జననములేనిదిగనునున్న ఒక్కటేయైన బ్రహ్మమనితలంచి సుఖియగుదువుగాక. నేనుబద్ధుడనుకాను, నేనుముక్తుడనుగాను. దుఃఖము లేనిదగు బ్రహ్మముగానున్నాను, రెండవదను భావనలేనివాడను, సచ్చిదానంద లక్షణుడను, అని ప్రయత్నముతో భావనచేయుము. జీవన్ముక్తుడవు గాగలవు***ఆకాశమెట్లు ఘటాకాశమనియు మహాకాశమనియు జెప్పబడుచున్నదో, అట్లే, ఆత్మ జీవేశ్వరులుగ భ్రాన్తులచే రెండువిధములుగ జెప్పబడుచున్నది. యోగిమనస్సున నెప్పుడంతట ఎడతెగక చైతన్యము ప్రకాశించునో అప్పుడే అదియే యగుచున్నాడు. సకల భూతములను తాననియు, తన్ను సకల భూతములుగాను, ఎప్పుడుగాంచునో అప్పుడు బ్రహ్మమగుచున్నాడు. సమాధిలోనున్నవాడు ఎప్పుడు సకల భూతములను జూచుటలేదో, అప్పుడాతడు బ్రహ్మముతో కేవలమేకీభవించుచున్నాడు.

అలేపకోఽహమజరో నీరాగశ్శాన్త వాసనః।
నిరంశోఽస్మి చిదాకాశ మితి మత్వా న శోచతి॥
అహం మత్వావిరహితః శుద్ధోబుద్ధోఽజరామరః।
శాన్తశ్సమ సమాభాస ఇతి మత్వా న శోచతి॥
తృణాగ్రేష్వంబరే భానౌ నరనాగామరేషు చ।
యస్తిష్ఠతి తదేవాహమితి మత్వా న శోచతి।
భావనాం సర్వభావేభ్యస్సముత్సృజ్య సముత్థితః।
అవశిష్టం పరం బ్రహ్మ కేవలోస్మీతి భావయ॥
***మాభవగ్రాహ్యభావాత్మా గ్రాహకాత్మాచ మా భవ।
భావనామఖిలాంత్యక్త్వా యచ్ఛిష్టం తన్మయో భవ॥

నేను ఆసక్తిలేనివాడను, జరలేనివాడను, ఆశలేనివాడను, వాసనలేనివాడను, అంశములేనివాడను, చిదాకాశమైనవాడను, అనియెఱింగి దుఃఖించుటలేదు, అహంకారములేనివాడను,

శుద్ధుడను, జ్ఞానిని, జననములేనివాడను, మరణములేనివాడను, శాంతుడను, శమముగలవాడను, (అంతట) సమానముగా ప్రకాశించెడివాడను అని ఎఱింగినచో దుఃఖించుట ఉండదు. తృణముల కొనలలోను, ఆకాశమునందును, సూర్యునియందును మనుష్యులలోను, నాగములలోను, దేవతల లోను, ఎవడున్నాడో అతడేనేను అని ఎఱింగిన దుఃఖించుట ఉండదు. సకలవస్తువులనుండియు, భావననువిడిచి బయటబడి మిగులునది యేదిగలదో, అట్టి కేవలమైన బ్రహ్మమే నేను అని భావించుము. ***ఎఱుంగబడునట్టి వాడుగను, ఎఱింగెడి వాడుగను కాకుము. సకలభావనలను త్రోసి క్రమించునది యేదిగలదో, అట్టి స్వరూపమగుదువుగాక. 6వ అధ్యాయము.

## (35) అ క్ష్యు్ప ని ష త్

అవిద్యా తిమిరాతీతం సర్వాభాస వివర్జితం।
అనన్తమమలం శుద్ధం మనోవాచామగోచరమ్।
ప్రజ్ఞాన ఘనమానందం బ్రహ్మాస్మీతి విభావయ ॥

"అవిద్యయనెడు అంధకారము నతిక్రమించినదిగాను, సకల దృశ్యములు లేనిదిగాను, అనంతముగాను, నిర్మలముగాను, శుద్ధముగాను, మనోవాక్కుల కందనిదిగాను, జ్ఞానపు 'పెళ్ల' గాను, ఆనందముగానున్నట్టి బ్రహ్మము నేనుగానున్నాను" అని భావనజేయవలయును. అక్ష్యుపనిషత్తు.

## (36) అ ధ్యా త్మో ప ని ష త్

ఘటాకాశం మహాకాశ ఇవాత్మానం పరాత్మని।
విలాప్యాఖండ భావేన తూష్ణీం భవ సదా మునే ॥ ***
యత్రైష జగదాభాసో దర్పణాన్తఃపురం యథా।
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా కృతకృత్యో భవానఘ ॥

ఓ మునీ! ఘటాకాశమును మహాకాశమునందువలె ఆత్మను పరమాత్మలో లయింపజేసి యఖండజ్ఞానముచే ఎల్లప్పుడు తూష్ణీం (ఇంద్రియ మనోవ్యాపారములులేకుండు) భావమును పొంది యుండుము. *** ఓ పాపములేనివాడా! అద్దములో గానపడు పట్టణమువలె ఈ జగత్తుయొక్క దృశ్యము ఎచ్చటనో (యే బ్రహ్మమునందో) అట్టి బ్రహ్మము నేనెయని యెరింగి మోక్షమొందెదవుగాక.

సమాధినా వికల్పేన యద్వాఽద్వైతాత్మ దర్శనం।
అత్రాత్మత్వం దృఢీకుర్వన్నహమాదిషు సన్త్యజ ॥
ఉదాసీనతయా తేషు తిష్ఠేద్ఘటపటాదివత్।
బ్రహ్మాది స్తంబపర్యన్తం మృషామాత్రా ఉపాధయః ॥
తతః పూర్ణం స్వమాత్మానం పశ్యేదేకాత్మనా స్థితం।
స్వయం బ్రహ్మా స్వయం విష్ణుః స్వయమింద్రః స్వయం శివః ॥
స్వయం విశ్వమిదం సర్వం స్వస్మాదన్యన్న కించన।
స్వాత్మన్యారోపితాశేషాభాసవస్తునిరాసతః ॥

స్వయమేవ పరం బ్రహ్మ పూర్ణ మద్వయమక్రియం।
అసంకల్పో వికల్పోఽయం విశ్వమిత్యేక వస్తుని ॥

నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః।
ద్రష్టృ దర్శన దృశ్యాది భావశూన్యే నిరామయే ॥

కల్పార్ణవ ఇవాత్యన్త పరిపూర్ణే చిదాత్మని।
తేజసీవ తమో యత్ర విలీనం భ్రాన్తికారణమ్ ॥

అద్వితీయేపరే తత్త్వే నిర్విశేషే భిదాకుతః।
ఏకాత్మకే పరేతత్త్వే భేదకం తత్కథం వసేత్ ॥

అవికల్పసమాధిచే అద్వైతాత్మ దర్శన మెప్పుడుగల్గునో అప్పుడు దానిలో నాత్మత్వమును స్థిరపరచి అహంకారము మొదలగువాటిలో నాత్మభావనను త్రోసి వాటిలో నుదాసీనభావము వహించి ఘటపటాదులవలె చలింపకుండవలెను. బ్రహ్మ మొదలుగా గడ్డివరకు గల ఉపాధులు మిథ్యయేను. దానితరువాత ఒక్కటే స్వరూపముగానున్నట్టి పూర్ణమైన తనయాత్మను చూడవలెను. తానే బ్రహ్మ, తానే విష్ణువు, తానే ఇంద్రుడు, తానే శివుడు. ఈ జగత్తంతయు తానే, తనకంటె అన్యముగా నేదియులేదు. తనయెడ, నారోపింపబడియున్నట్టియు, ప్రకాశించుచున్నట్టియు సకల వస్తువులను విడదీయుటచే పూర్ణముగను రెండవది లేనిదిగను క్రియలేనిదిగనునున్నట్టి బ్రహ్మము తానుగనేయున్నాడు. ఒక్కటేవస్తువులో (బ్రహ్మములో) ప్రపంచమనెడు నీ మారుబాటు తలంప తగినదిగాదు. వికారములేనిదిగాను, రూపములేనిదిగాను, విశేషము లేనిదిగానునున్న దానియెడ భేదమెక్కడిది ? చూచెడువాడు, చూపు, చూడబడువస్తువు, మొదలగు దృశ్యములు లేనిదియు, దుఃఖము లేనిదియు, మహాప్రళయ సముద్రమునందువలె పరిపూర్ణమైనదియు, తేజస్సులో అంధకారము అణగినట్లు భ్రాన్తికి కారణమైన యజ్ఞానము ఎచ్చట లయించుచున్నదో అట్టి అద్వయ బ్రహ్మ పరతత్వమైనదియు, విశేషములేనిదియునైన చిదాత్మయెడ భేదమెక్కడిది? ఏకాత్మయగు పరతత్వమున అట్టి భేదమెట్లుండ గలదు?

మాయావిద్యే విహాయైవ ఉపాధీ పరజీవయోః।
అఖండం సచ్చిదానందం పరం బ్రహ్మ విలక్ష్యతే।
ఇత్థం వాక్యైస్తదర్థానుసంధానం శ్రవణం భవేత్ ॥

పరమాత్మయనెడు ఈశ్వరునకున్ను జీవునికిని క్రమముగా (చూచినచో) ఉపాధులగు మాయావిద్యలను త్రోసివేసియే, అఖండసచ్చిదానంద పరబ్రహ్మము లక్ష్యార్థమగుచున్నది. ఈ విధమగు వాక్యములచే నర్థము ననుసంధానముజేయుట శ్రవణమగును.

అహం బ్రహ్మేతి విజ్ఞానాత్ కల్పకోటి శతార్జితం।
సంచితం విలయం యాతి ప్రబోధాత్స్వప్నకర్మవత్ ॥

నేనే బ్రహ్మమను విజ్ఞానముచే నూరుకోట్ల కల్పములలో సంపాదింపబడియున్న సంచిత కర్మలు లయమునుపొందుచున్నవి. (అవి దేనివలెననగా) స్వప్నకర్మ, మేలుకొన్నతోడనే (లయమొందుట) వలె.

ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన ।
స్వానుభూత్యాస్వయం జ్ఞాత్వాస్వమాత్మానమఖండితం ॥
స సిద్ధస్సు సుఖం తిష్ఠన్నిర్వికల్పాత్మనాత్మని ।

బ్రహ్మమొక్కటే, రెండవదిలేదు, ఇచ్చట అనేకమనునదిలేదు. స్వానుభవముచేతనే అఖండితమైన తనయాత్మను తానుగనే ఎఱింగిన అట్టి సిద్ధుడైనవాడు, తనయెడ వికల్పములేని ఆత్మగా సుఖముగా నున్నాడు.

అసంగోఽహమసంగోఽహమలింగోఽహమహం హరిః ।
ప్రశాన్తోఽహమనన్తోఽహం పరిపూర్ణశ్చిరంతనః ॥
అకర్తాఽహమభోక్తాఽహమవికారోఽహమవ్యయః ।
శుద్ధబోధస్వరూపోఽహం కేవలోఽహం సదాశివః ॥

నేను సంగములేనివాడను నేను సంగములేనివాడను, నేను గుర్తులేనివాడను, నేనుహరిని, నేను శాంతుడను, నేను ముగింపులేనివాడను, పూర్ణమైనవాడను, ప్రాతవాడను, నేను కర్తనుకాను, భోక్తనుకాను, నేను వికారములేనివాడను, నేను నాశములేనివాడను, శుద్ధజ్ఞానస్వరూపిని, నేను మాత్రమున్నవాడను, ఎల్లప్పుడు మంగళస్వరూపిని, అధ్యాత్మోపనిషత్తు.

## (37) ఆత్మోపనిషత్.

ఆత్మసంజ్ఞ శ్శివశ్శుద్ధ ఏక ఏవాద్వయస్సదా ।
బ్రహ్మరూపతయా బ్రహ్మ కేవలం ప్రతిభాసతే ॥
జగద్రూపతయాప్యేతద్బ్రహ్మైవ ప్రతిభాసతే ।
విద్యావిద్యాదిభేదేన భావాభావాది భేదతః ॥
గురుశిష్యాదిభేదేన బ్రహ్మైవ ప్రతిభాసతే ।
బ్రహ్మైవ కేవలం శుద్ధం విద్యతే తత్త్వదర్శనే ॥
నచ విద్యా నచావిద్యా న జగచ్చ నచాపరమ్ ।
సత్యత్వేన జగద్భానం సంసారస్య ప్రవర్తకమ్ ॥
అసత్యత్వేనభానస్తు సంసారస్య నివర్తకమ్ ।

ఆత్మయనుపేరు బడసినవాడు మంగళకరుడు, శుద్ధుడు, ఎల్లప్పుడు రెండవదిలేనివాడైన ఒక్కడే బ్రహ్మరూపముచే బ్రహ్మము మాత్రముగా ప్రకాశించుచున్నాడు. జగద్రూపముగా ప్రకాశించుచున్నట్టిదియు బ్రహ్మమేను. విద్య, అవిద్య మొదలగు భేదముగాను గురువు శిష్యుడు మొదలగు భేదముగాను బ్రహ్మమే ప్రకాశించుచున్నది. దర్శనమునందు శుద్ధబ్రహ్మముమాత్రమే ప్రకాశించుచున్నది. విద్యయులేదు. అవిద్యయులేదు. జగత్తులేదు. మఱియేదియులేదు. సత్యముపలె జగత్తుతోచుట సంసార ప్రవృత్తిని గలుగజేయుచున్నది. జగత్తు అసత్యముగతోచుట సంసారనివృత్తిని గలుగజేయుచున్నది.

లక్ష్యాలక్ష్యగతిం త్యక్త్వా యస్తిష్ఠేత్కేవలాత్మనా ।
శివ ఏవ స్వయం సాక్షాదయం బ్రహ్మవిదుత్తమః ॥
జీవన్నేవ సదా ముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః ।
ఉపాధినాశాద్బ్రహ్మైవ సద్బ్రహ్మాప్యేతి నిర్ద్వయమ్ ॥
శైలూషో వేషసద్భావాభావయోశ్చ యథాపుమాన్ ।
తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠ స్సదా బ్రహ్మైవ నాపరః ॥
ఘటే నష్టే యథావ్యోమ వ్యోమైవ భవతి స్వయమ్ ।
తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయమ్ ॥
క్షీరం క్షీరే యథాక్షిప్తం తైలం తైలే జలంజలే ।
సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః ॥
***అస్తీతి ప్రత్యయోయశ్చ యశ్చనాస్తీతి వస్తుని ।
బుద్ధేరేవ గుణావేతౌ న తు నిత్యస్య వస్తునః ॥
అతస్తౌ మాయయా క్లృప్తౌ బన్ధమోక్షౌ న చాత్మని ।
నిష్కళే నిష్క్రియే శాన్తే నిరవద్యే నిరంజనే ।
అద్వితీయే పరే తత్త్వే వ్యోమవత్కల్పనా కుతః ॥
న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః ।
న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా ॥

గుఱి గలది గుఱిలేనిది అనునడకను విడిచి ఆత్మమాత్రముగ నెవ్వడుగలడో ఉత్తముడైన యీ బ్రహ్మవిత్తైనవాడు తాను సాక్షాచ్ఛివుడే. జీవించుచున్నను, ఎల్లప్పుడు ముక్తుడే, అట్టి బ్రహ్మవిత్తైనవాడు కృతార్థుడే. ఉపాధి నాశముచే బ్రహ్మముగనే యున్నవాడై రెండవదిలేని బ్రహ్మముగనే యున్నాడు. నటకుడు వేషము వేసికొనియున్నను వేయకయున్నను, ఎట్లతడు పురుషుడో, అట్లే శ్రేష్ఠుడైన బ్రహ్మవిత్తు బ్రహ్మమే, వేఱుగా కాజాలడు. ఘటాకాశము ఘటము నశించుటచే స్వయమాకాశముగనే యున్నట్టుల ఉపాధినాశముచే బ్రహ్మవిత్తైనవాడు తాను బ్రహ్మమగుచున్నాడు. పాలలో పాలును నూనెలో నూనెను నీటిలో నీటిని కలిపిన నెట్లు ఒకటిగా జేరిపోవుచున్నదో అట్లే ఆత్మవిత్తైనమునియగు వాడు ఆత్మలో కలిసిపోవుచున్నాడు. ***వస్తువున్నదను నమ్మకమేదిగలదో, లేదనునమ్మకమేదిగలదో, యివిరెండును బుద్ధియొక్క గుణములేగాని, నిత్యమైనవస్తువునకులేవు. కావున నవియు బంధమోక్షములున్ను ఆత్మకులేవు. నిష్కళుడుగను, క్రియలేనివాడుగను, శాన్తుడుగను, నిర్దోషుడుగను ఆసక్తిలేనివాడుగను, రెండవదిలేనివాడుగను, ఆకాశమువలె నున్నట్టి ఆత్మయెడ కల్పనమెక్కడిది? ప్రళయములేదు. ఉత్పత్తియులేదు. బద్ధుడుగాడు, సాధనజేయువాడుగాడు, ముముక్షువుకాడు, ఇదియే వాస్తవమైనది. ఆత్మోపనిషత్తు.

## (38) పాశుపతబ్రహ్మోపనిషత్.

వ్యావహారిక దృష్ట్యేయం విద్యావిద్యా న చాన్యథా ।
తత్త్వదృష్ట్యాతు నాస్త్యేవ తత్త్వమేవాస్తి కేవలం ॥

***యదా బ్రహ్మాత్మకం సర్వం విభాతి స్వత ఏవ తు।
తదా దుఃఖాది భేదోఽయం అభాసోఽపి నభాసతే॥
జగజ్జీవాది రూపేణ పశ్యన్నపి పరాత్మవిత్।
న తత్పశ్యతి చిద్రూపం బ్రహ్మవస్త్వితి పశ్యతి।
*** బ్రహ్మ విద్గ్రసతి జ్ఞానాత్సర్వం బ్రహ్మాత్మనైవ తు॥

ఈ విద్యావిద్యలు వ్యావహారిక దృష్టిచేతనేగాని వేరేకాదు. తత్త్వముగ జూచినచో లేనే లేవు. కేవలమైన తత్త్వమేయున్నది. *** తనకు సకలమున్ను, ఎప్పుడు స్వయముగనే బ్రహ్మ స్వరూపముగ ప్రకాశించుచున్నదో, అప్పుడు వాస్తవమైనదివలె కనబడు దుఃఖము మొదలగు భేదము ప్రకాశించుటలేదు. పరమాత్మజ్ఞానియైనవాడు జగత్తును జీవుడుమొదలగురూపముతోజూచి నను, దానిని చిద్రూపమైన బ్రహ్మవస్తువని చూచుచున్నాడేగాని వేరువిధముగా గాదు. *** బ్రహ్మ జ్ఞానియైనవాడు జ్ఞానమువలన సకలము బ్రహ్మస్వరూపమనియే గ్రహించుచున్నాడు.

అస్తిచేదస్తితారూపం బ్రహ్మైవాస్తిత్వ లక్షణం।
అస్తితా లక్షణా సత్తా సత్తా బ్రహ్మ న చాపరా॥
నాస్తి సత్తాతిరేకేణ నాస్తి మాయా చ వస్తుతః।
యోగినామాత్మనిష్ఠానాం మాయాస్వాత్మని కల్పితా॥
సాక్షిరూపతయా భాతి బ్రహ్మజ్ఞానేన బాధితా।
బ్రహ్మ విజ్ఞాన సంపన్నః ప్రతీతమఖిలం జగత్॥
పశ్యన్నపి సదా నైవ పశ్యతి స్వాత్మనః పృథక్॥

ఉన్నదనినచో యిట్టి స్థితియే స్వరూపము. ఉన్నదనుస్వరూపము బ్రహ్మలక్షణమేను. ఉన్నదను లక్షణమే సత్తుగూడ. అట్టిసత్తున్ను బ్రహ్మమేదప్ప వేఱుకాదు. సత్తుకంటె వేఱొక్కటి లేదు. వాస్తవమున మాయయనునదిలేదు. ఆత్మనిష్ఠులుగనున్న యోగులకు మాయయనునది యాత్మ యెడ కల్పింపబడినది, సాక్షిరూపముగ మాయప్రకాశించుచున్నది. బ్రహ్మజ్ఞానములో నది బాధింపబడుచున్నది. పరబ్రహ్మజ్ఞానముగలవాడు కనబడునట్టి సకల జగత్తును చూచుచుండినను, తనకంటె నన్యముగ జూచుటలేదు, పాశుపత బ్రహ్మోపనిషత్తు

## (39) త్రిపురతాపిన్యుపనిషత్

### పంచమ్యుపనిషత్.

తదేవ నిష్కళం బ్రహ్మ నిర్వికల్పం నిరంజనం।
తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వా బ్రహ్మసంపద్యతే క్రమాత్॥
*** ఏక ఏవ హి భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః।
ఏకధాబహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్॥
ఘటసంవృతమాకాశం నీయమానే ఘటే యథా।
ఘటోనీయేత నాకాశం తథా జీవో నభోపమః॥

*** గవామనేక వర్ణానాం క్షీరస్యాప్యేకవర్ణతా ।
క్షీరవత్పశ్యతి జ్ఞానం లింగినస్తు గవాం యథా ॥
జ్ఞాననేత్రం సమాధాయ సముహత్పరమం పదం ।
నిష్కళం నిశ్చలం శాన్తం బ్రహ్మాహమితి సంస్మరేత్ ॥

అట్టి బ్రహ్మమే నిష్కళముగను నిర్వికల్పముగను పాపము లేనిదిగను నున్నది. అట్టి బ్రహ్మము నేనే నేనే యని ఎఱింగి క్రమముగా నట్టి బ్రహ్మమే యగుచున్నాడు. *** ఒక్కడే యైన భూతాత్మ యనువాడు ప్రతిభూతమందును నున్నాడు. నీటిలో చంద్రునివలె ఒక్కటిగను అనేకములుగను గనబడుచున్నాడు. ఘటము దీసికొని పోబడగా అందులోని ఆకాశము తీసికొని పోబడుటలేదు. ఘటము మాత్రమే తీసికొని పోబడుటవలె జీవుడున్ను ఆకాశము బోలియున్నాడు. *** అనేకవర్ణములు గల పశువులయినను పాలు ఒక్కటే వర్ణముగ నున్నవి, జ్ఞానమనునది పాల వలె కనబడుచున్నది, లింగములనగా (ప్రపంచములో గనబడుచున్న పలువిధ రూపములనగా) ఆవులవలెనున్నవి. (నెయ్యి పాలలో దాగియుండునటుల జ్ఞానము దాగియున్నది.) జ్ఞాననేత్రమును నీవు పొంది నిష్కళము నిశ్చలము శాంతము ఇట్టి మహత్తైన పరమపదమగు బ్రహ్మమునేనేయని స్మరించవలయును. త్రిపురతాపిన్యుపనిషత్తు. 5-వ ఉపనిషత్తు (ఈ ఉపనిషత్తులోని యీ వాక్య ములను అమృతబిందూపనిషత్తునందును చూడుడు.)

## (40) కఠోపనిషత్.

జ్ఞాత్వా బ్రహ్మాహమస్మీతి బ్రహ్మైవ భవతి స్వయం ।
*** సర్వాన్తరేణ పూర్ణశ్చ బ్రహ్మానాన్యేన కేనచిత్ ॥
*** సద్రూపం పరమం బ్రహ్మ త్రిపరిచ్ఛేదవర్జితం ।
యదాహ్యేవైష ఏతస్మిన్నల్ప మప్యన్తరం నరః ॥
విజానాతి తదా తస్య భయం స్యాన్నాత్ర సంశయః ।

బ్రహ్మము నేనుగానున్నాను అని తెలిసినచో తానే బ్రహ్మమగుచున్నాడు. *** బ్రహ్మము సకలమునందును పూర్ణముగా నున్నది. వేఱొక్కటి లేదు, *** సద్రూపముగా నున్నట్టిదే. పర బ్రహ్మము. అది (కాలదేశ వస్తువులనెడు) మూడు పరిచ్ఛేదములులేనిది, ఈ మనుష్యుడు ఈ బ్రహ్మమువద్ద ఎప్పుడు స్వల్పమైనను భేధము నెఱుంగునో అప్పు డాతనికి భయయ గలుగుచున్నది. ఇందులో సందేహములేదు. కఠోపనిషత్తు.

## (41) రుద్రహృదయోపనిషత్.

ఘటాకాశ మఠాకాశౌ యథాఽఽకాశప్రభేదతః ।
కల్పితౌ పరమౌ జీవశివరూపేణ కల్పితౌ ॥
తత్త్వతశ్చ శివస్సాక్షాచ్చిజ్జీవశ్చ స్వతస్సదా ।
*** చిదేకత్వ పరిజ్ఞానే న శోచతి న ముహ్యతి ॥
అద్వైతం పరమానందం శివంయాతి తు కేవలం ॥

అధిష్ఠానం సమ స్తస్య జగతస్సత్యచిద్ఘ నం ॥
అహమస్మీతి నిశ్చిత్య వీతశోకో భవేన్మునిః ।
***ఆకాశమేకం సంపూర్ణం కుత్రచిన్నైవ గచ్ఛతి ।
తద్వత్ స్వాత్మపరిజ్ఞానే కుత్రచిన్నైవ గచ్ఛతి ॥
సయో హ వై తత్పరమం బ్రహ్మ యో వేదవై మునిః ।
బ్రహ్మైవ భవతి స్వస్థస్సచ్చిదానందమాత్రకః ॥

ఆకాశములో ఘటాకాశము మఠాకాశమని యెట్లు భేదము కల్పింపబడియున్నదో అట్లే పరబ్రహ్మమువద్ద జీవేశ్వరులు కల్పింపబడియున్నారు. వాస్తవమున శివుడు సాక్షాచ్చిత్తేను. జీవుడున్ను ఎల్లప్పుడు స్వయంచిత్తేను. *** చిత్తు ఒక్కటే అనుజ్ఞానముచే (జ్ఞాని) శోకమునుగాని మోహమునుగాని పొందుటలేదు. అద్వైత పరమానందశివుని మాత్రమే పొందుచున్నాడు. సకల జగత్తున కాధారముగను సత్యముగనునున్నట్టి చిద్ఘనము నేనుగానున్నానని నిశ్చయించి మునియైన వాడు శోకములేని వాడగుచున్నాడు. *** సంపూర్ణముగనున్నట్టి యొక్కటియగు నాకాశము ఎచ్చటను పోకుండుటవలె తనయాత్మ నెఱింగిన జ్ఞాని యెప్పుడును ఎచ్చటను పోవుటలేదు. ఏ మునియగువాడు ఇటి పరబ్రహ్మము నెఱుంగునో, తనలోపలనే చూచునట్టియు, సచ్చిదానందమాత్రమయినట్టియు అతడు బ్రహ్మముగనేయున్నాడు. (రుద్రహృదయోపనిషత్తు.)

## (42) దర్శనోపనిషత్.

### ప్రథమః ఖండః.

సర్వం సత్యం పరంబ్రహ్మ న చాన్యదితి యా మతిః ।
తచ్ఛ సత్యం పరం ప్రోక్తం వేదాన్తజ్ఞానపారగైః ॥

సకలమున్ను సత్యమైన బ్రహ్మమేగాని వేఱొక్కటిగాదను బుద్ధియేదిగలదో అదే శ్రేష్ఠమైనదియు సత్యమైనదియునైన పరబ్రహ్మమని వేదాంతజ్ఞానముయొక్క అంతము నెఱింగినవారలచే జెప్పబడియున్నది. (దర్శనోపనిషత్. మొదటిఖండము.)

### చతుర్థః ఖండః

విభేదజనకేఽజ్ఞానే నష్టే జ్ఞానబలాన్మునే ।
ఆత్మనో బ్రహ్మణో భేదమనన్తం కః కరిష్యతి ॥

ఓమునీ! భేదమును గలుగజేయునట్టి యజ్ఞానము జ్ఞానబలముచే నష్టమైనచో తెనకు బ్రహ్మమునకు లేసిభేదమును ఎవ్వడు గలుగజేసికొనగలడు? — 4వఖండము.

### నవమః ఖండః.

ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపం మహేశ్వరం ।
సోహమిత్యాదరేణైవ ధ్యాయేద్యోగీశ్వరేశ్వరం ।
***ఆత్మానం సచ్చిదానందం అనంతం బ్రహ్మ సువ్రత ।
అహమస్మీత్యభిధ్యాయేద్ధ్యేయాతీతం విముక్తయే ॥

జితేన్ద్రియుడుగను త్రినేత్రములుగలవాడుగను విశ్వరూపిగను యోగీశ్వరులకెల్ల ఈశ్వరుడుగను నున్నట్టి మహేశ్వరుని విశ్వాసముతో నతడేనేనని ధ్యానింపవలయును. *** ఓ మంచి వ్రతముగలవాడా! సచ్చిదానందముగను అనంతముగను ధ్యానమున కందనిదిగనున్నట్టి ఆత్మయగు బ్రహ్మమును ముక్తికొఱకై నేనదిగా నున్నానని ధ్యానింపవలయును. 9-వ ఖండము.

దశమః ఖండః.

తస్మాదద్వైతమేవాస్తి న ప్రపంచో న సంసృతిః।
యథాకాశో ఘటాకాశో మఠాకాశ ఇతీరితః॥
తథా భ్రాన్తైర్ద్విధా ప్రోక్తో హ్యాత్మా జీవేశ్వరాత్మనా।
నాహం దేహో న చ ప్రాణో నేన్ద్రియాణి మనో న హి॥
సదా సాక్షిస్వరూపత్వాచ్ఛివ ఏవాస్మి కేవలః।
ఇతి ధీర్యా మునిశ్రేష్ఠ సా సమాధిరిహోచ్యతే॥
సోహం బ్రహ్మ న సంసారీ న మత్తోన్యః కదాచన।
యథా ఫేనతరంగాది సముద్రాదుత్థితం పునః॥
సముద్రే లీయతే తద్వజ్జగన్మయ్యనులీయతే।
తస్మాన్మనః పృథఙ్నాస్తి జగన్మాయా చ నాస్తి హి॥

కావున అద్వైతమేయున్నది, ప్రపంచములేదు. జననమరణములులేవు, ఆకాశమనునది ఘటాకాశమనియు, మఠాకాశమనియు, ఎట్లు చెప్పంబడుచున్నదో, అట్లే అజ్ఞానులచే ఆత్మయనునాతడు జీవుడనియు ఈశ్వరుడనియు రెండువిధములుగ జెప్పబడుచున్నాడు. నేను దేహముకాను, ప్రాణముకాను. ఇంద్రియములుకాను, మనస్సుకాను. నేనెల్లప్పుడు సాక్షిస్వరూపుడుగానున్నందున శివుడుగనే యున్నానను బుద్ధి యేదిగలదో అది ఓ మునిశ్రేష్ఠా! సమాధియని జెప్పబడుచున్నది. అటువంటి నేను బ్రహ్మమేగాని, సంసారినికాను. నాకంటే వేఱొకటిలేదు. సముద్రమునగలుగు నుఱుగుమొదలగునవి మరల సముద్రమునందే యెట్లులయమొందుచున్నవో, అట్లే జగత్తనునది నాయెడనే లయమొందుచున్నది, కాన జగత్తైనదిమనస్సు (మనః కల్పన) తప్ప వేఱొకటిలేదు, మాయయులేదు.

యదా సర్వాణి భూతాని స్వాత్మన్యేవ హి పశ్యతి।
సర్వభూతేషు చాత్మానం బ్రహ్మ సంపద్యతే తదా॥
యదా సర్వాణి భూతాని సమాధిస్థో న పశ్యతి।
ఏకీభూతః పరేణాసౌ తదా భవతి కేవలః॥
యదా పశ్యతి చాత్మానం కేవలం పరమార్థతః।
మాయామాత్రం జగత్కృత్స్నం తదా భవతి నిర్వృతిః॥

సకలభూతములను తనయెడను, తన్ను సకల భూతములలోను నెప్పుడు గాంచునో అప్పుడు బ్రహ్మమగుచున్నాడు. సమాధిలోనున్నవాడు ఎపుడు సకలభూతముల జూచుటలేదో (అనగా తనకంటె అన్యమునా చూచుటలేదో అని తాత్పర్యము.) అప్పుడాతడు బ్రహ్మముతో నొక్కటియగుచున్నాడు. ఎప్పుడు వాస్తవముగ తన్నుశుద్ధునిగను, జగత్తంతయు మాయామాత్రముగను జూచునో, అప్పుడు మోక్షమగుచున్నది. 10-వ ఖండము.

## (43) తారసారోపనిషత్

ఓం యో హ వై శ్రీ పరమాత్మా నారాయణస్స భగవాన్ తత్పరః పరమ పురుషః పురాణ పురుషోత్తమో నిత్యశుద్ధ బుద్ధముక్త సత్యపరమానందానంతాద్వయ పరిపూర్ణః బ్రహ్మైవాహం రామోఽస్మి ।

ఓం శ్రీపరమాత్మయగు నారాయణుడెవ్వడో అతడు పర స్వరూపియగు భగవంతుడు, పరమ పురుషుడు, పురాణ పురుషోత్తముడు. నిత్యశుద్ధ బుద్ధ ముక్త సత్య పరమానందానంతాద్వయ పరిపూర్ణుడు. అటి బ్రహ్మమగు రాముడే నేనుగా నున్నాను. తార సారోపనిషత్తు.

## (44) పంచబ్రహ్మోపనిషత్.

ఏకేనైవ తు పిండేన మృత్తికాయాశ్చ గౌతమ ।
విజ్ఞాతం మృణ్మయం సర్వం మృదభిన్నం హి కార్యకమ్ ॥
ఏకేన లోహమణినా సర్వం లోహమయం యథా ।
విజ్ఞాతం స్యాదథైకేన నఖానాం కృన్తనేన చ ॥
సర్వం కార్ష్ణాయసం జాతం తదభిన్నం స్వభావతః ।
కారణా భిన్నరూపేణ కార్యం కారణమేవ హి ॥
తద్రూపేణ సదా సత్యం భేదేనోక్తిర్మృషా ఖలు ।
తచ్చ కారణమేకం హి న భిన్నం నోభయాత్మకం ॥
భేదస్సర్వత్ర మిథ్యైవ ధర్మాదేరనిరూపణాత్ ।
అతశ్చ కారణం నిత్యమేకమేవాద్వయం ఖలు ॥
అత్ర కారణమద్వైతం శుద్ధచైతన్యమేవ హి ।

ఓ గౌతమా ! ఒక్కటేమట్టి పెళ్లవలన గలిగిన మట్టిపాత్రలు మొదలగునవి మట్టికంటె అన్యముగావని ఎటుల నెఱుంగబడుచున్నవో, ఒక్కటే బంగారువలన గలిగిన ఆభరణములన్నియు బంగారుమయములని ఎటుల ఎఱుంగబడుచున్నవో ఇనుమువలనగలిగిన గోరగొల్లు (నఖచ్ఛేదిని) మొదలగునవన్నియు ఇనుముకంటెవేరైనవిగావని ఎటుల ఎఱుంగబడుచున్నవో, కారణముకంటె వేరుకాని కార్యము కారణమే కదా ! అట్టి (కారణ) రూపముగ నెల్లప్పుడున్నట్టిదే సత్యము, దాని కంటె విభిన్నముగ జెప్పుట అబద్ధమే యగుచున్నది. అట్టికారణమొక్కటే, కార్యము వేరుగాదు. ఉభయాత్మకముగూడకాదు. అంతటను భేదమనునది అబద్ధమేను, ఏలనగా దానికి ఇట్టిధర్మమని విధింపబడనందుననే, అట్టికారణము, నిమిత్తముగను, ఒక్కటిగను, రెండవది లేనిదిగను, నున్నది. అట్టికారణము రెండవదిలేని శుద్ధచైతన్యమేగదా ! (పంచబ్రహ్మోపనిషత్.)

## (45) గోపాలతాపిన్యుపనిషత్.

పరంబ్రహ్మ కృష్ణాత్మకో నిత్యానందైక స్వరూపః సోహమోం తత్సత్ గోపాలోహమేవ పరంసత్యమబాధితం, సోహమిత్యాత్మానమాదాయ మనసైక్యం కుర్యాదాత్మానం గోపాలోఽహమితి భావయేత్ ।

కృష్ణస్వరూపిగను నిత్యానందస్వరూపుడుగనునున్నట్టి పరబ్రహ్మము నేనే. అట్టి ఓంకార స్వరూపియైన సత్తగు గోపాలుడు నేనే. శ్రేష్ఠము మధ్యము బాధింపబడనిదియునైన ఆత్మను అతడే నేనని గ్రహించి మనస్సుతో నైక్యము గావించవలయును. తన్ను గోపాలుడనియే భావింపవల యును. (గోపాలతాపిన్యుపనిషత్తు.)

# (46) యాజ్ఞవల్క్యోపనిషత్

ప్రణమేత్కం తదాఽఽత్మజ్ఞో నకార్యం కర్మణా తదా।
ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవానితి।
ప్రణమేద్దండవద్భూమావాశ్వచండాలగోఖరాన్ ॥

ఆత్మజ్ఞానియైనప్పుడు ఎవరికి నమస్కరింపవలయును? అప్పుడాతనికి కర్మవలననగునదే మున్నది? ఏదియులేదు. భగవంతుడైన ఈశ్వరుడు తనయంశముచేతనే జీవుడుగా ప్రవేశించి యున్నాడని కుక్క, చండాలుడు, గోవు, గాడిద, వీటిని (భేదబుద్ధినివిడిచి) భూమిమీద చెట్టువలెపడి నమస్కరించవలయును, (ఇందులో మునుపటిభాగము ఆరూఢునిగూర్చియు, వెనుకటిభాగము ఆరురుక్షువునిగూర్చియు చెప్పబడియున్నట్లు గ్రహించవలయును.) (యాజ్ఞవల్క్యపనిషత్తు)

# (47) వరాహోపనిషత్

## ద్వితీయోఽధ్యాయః.

స్వపూర్ణాత్మాతిరేకేణ జగజ్జీవేశ్వరాదయః।
న సన్తి నాస్తి మాయా చ తేభ్యశ్చాహం విలక్షణః ॥
అజ్ఞానాంధతమోరూపం, కర్మధర్మాదిలక్షణం।
స్వయంప్రకాశమాత్మానం నైవ మాం స్ప్రష్టుమర్హతి ॥
సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమ వివర్జితం।
బ్రహ్మరూపతయా పశ్య న్బ్రహ్మైవ భవతి స్వయం ॥
భాసమానమిదం సర్వం భానరూపం పరంపదం ॥
పశ్యన్ వేదాంతమానేన సద్యఏవ విముచ్యతే।
*** చిన్మాత్రగ్ సర్వగ్ నిత్యం సంపూర్ణం సుఖమవ్యయం
సాక్షాద్బ్రహ్మైవ నాన్యోస్తీత్యేవం బ్రహ్మవిదాంస్థితిః ॥
*** స్వస్వరూపంతు చిన్మాత్రం సర్వదా సర్వదేహినాం।
నైవ దేహాది సంఘాతో ఘటవత్ దృశి గోచరః ॥
స్వాత్మనోన్యతయా భాతం చరాచరమిదం జగత్।
స్వాత్మమాత్రతయా బుద్ధ్వా తదస్మీతి విభావయ ॥
స్వస్వరూపం స్వయం భుంక్తే నాస్తి భోజ్యం పృథక్స్వతః।
అస్తిచేద స్తితారూపం బ్రహ్మైవాస్తిత్వ లక్షణం ॥
బ్రహ్మవిజ్ఞాన సంపన్నః ప్రతీతమఖిలం జగత్।
పశ్యన్నపి సదా నైవ పశ్యతి స్వాత్మనః పృథక్ ॥

*** అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారస్స ఉచ్యతే।
యస్మిన్కాలే స్వమాత్మానం యోగీ జానాతి కేవలమ్ ॥
తస్మాత్కాలాత్సమారభ్య జీవన్ముక్తో భవత్యసౌ।
అహం బ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మనాం ॥
*** ఘటాకాశమఠాకాశే మహాకాశే ప్రతిష్ఠితే।
ఏవం మయి చిదాకాశే జీవేశౌ పరికల్పితౌ ॥
యాచ ప్రాణాత్మనో మాయా తథా న్తేచ తిరస్కృతా।
బ్రహ్మవాదిభిరుద్గీతా సా మాయేతి వివేకతః ॥
మాయా తత్కార్యవిలయే నేశ్వరత్వం న జీవతా।
*** బ్రహ్మత్వేఽయోజితే స్వస్మిన్ జీవభావో న గచ్ఛతి ॥
అద్వైతే బోధితే త త్త్వే వాసనా వినివర్తతే।
అరబ్ధాంతే దేహహానిః మాయేత్థం క్షీయతేఽఖిలా ॥
అ స్తీత్యు క్తే జగత్సర్వం సద్రూపం బ్రహ్మ తద్భవేత్।
భాతీత్యు క్తే జగత్సర్వం భానం బ్రహ్మైవ కేవలం ॥
మరుభూమౌ జలం సర్వం మరుభూమాత్రమేవతత్।
జగ త్త్రయమిదం సర్వం చిన్మాత్రం స్వవిచారతః ॥
అజ్ఞానమేవ న కుతో జగతః ప్రసంగో
జీవేశ దేశికవికల్ప కథాతిదూరే।
ఏకా న్తకేవల చిదేకరస స్వభావో
బ్రహ్మైవకేవలమహం పరిపూర్ణమస్మి ॥

నాయొక్క పూర్ణాత్మ తప్ప జగత్తు, జీవుడు, ఈశ్వరుడు, మాయ మొదలగునవి లేవు. వాటికంటె నేను విలక్షణుడను. ధర్మము మొదలగులక్షణము బడసి అజ్ఞానాంధకారముగ నున్నట్టి కర్మయనునది స్వప్రకాశముగా నున్నట్టి ఆత్మయగు నన్ను స్పృశింపగలది కాదు. సర్వసాక్షిగను వర్ణాశ్రమములు లేనిదిగనునున్నట్టి (తన) ఆత్మను బ్రహ్మస్వరూపముగ జూచెడువాడు బ్రహ్మమేయగుచున్నాడు. ప్రకాశించుచున్న ప్రపంచమును ప్రకాశరూపముగా నున్నట్టి పరమపదముగా వేదాంత ప్రమాణముచే చూచెడివాడు వెంటనే మోక్షమొందుచున్నాడు. చిన్మాత్రముగాను అంతట వ్యాపించినదిగాను నిత్యముగాను సంపూర్ణముగాను సుఖరూపముగాను నాశములేనిదిగాను నున్నట్టిదే వాస్తవమగు బ్రహ్మము. దానికంటె వేఱొక్కటి లేదనునదే బ్రహ్మజ్ఞానుల స్థితి. *** సకల దేహధారుల యొక్క (జీవులయొక్క) స్వస్వరూపమనగా నెల్లప్పుడు చిన్మాత్రమేను. కంటికి గనబడు ఘటము వలె దేహాది సంఘాతములు (దేహము మొదలుగాగల తత్త్వ సమూహములు) లేనే లేవు ఆత్మకంటె అన్యముగాదోచు చరాచర ప్రపంచమునకు నీయొక్క ఆత్మగనెఱింగి అది నేనుగా నున్నానని భావనజేయుము. (అట్లు భావనజేయువారు) స్వరూపమును తానే అనుభవించుచున్నాడు. [illegible] (అమిత చింతరహిత) వస్తువు [illegible] [illegible] [illegible] బ్రహ్మమేను

బ్రహ్మజ్ఞానమును విశేషముగా గలవాడు ప్రసిద్ధముగనున్నట్టి జగత్తు నెల్లప్పుడు చూచుచుండినను తన యాత్మకంటే నన్యముగా జూచుటలేదు. *** నేనే బ్రహ్మమని ఎఱింగినచో, అది సాక్షాత్కారమని చెప్పబడుచున్నది, యోగియగువాడు తనయాత్మను కేవలము (పూర్ణము) గా ఎప్పుడెఱుంగునో, అదిమొదలు జీవన్ముక్తుడగుచున్నాడు, నేనే బ్రహ్మమని (అహంబ్రహ్మేతి) ఎల్లప్పుడు నుండుట మహాత్ములకు మోక్షహేతువుగానున్నది, *** మహాకాశములో ఘటాకాశ మఠాకాశముల వలె, చిదాకాశముగనున్నట్టి నాయెడ జీవేశ్వరులు కల్పింపబడియున్నారు, (జీవేశ్వరులగు) ఆత్మయొక్క సృష్టికి పూర్వము ఏదిలేదో, అట్లే అంతమునందును ఏది త్రోయబడినదో అదే మాయ యని వివేకముచే బ్రహ్మజ్ఞానులవలన జెప్పబడుచున్నది. మాయయు దాని కార్యమున్ను నశించినచో ఈశ్వరత్వములేదు, జీవత్వములేదు. *** తన లోపల బ్రహ్మభావమును జేర్చక (జీవబ్రహ్మైక్యముజేయక) పోయినచో జీవభావము పోవుటలేదు. వాస్తవమగు అద్వైతము ఎఱుంగబడినచో (విషయ) వాసనతొలగుచున్నది. (వాసనతొలంగిన) ప్రారబ్ధముపోయిన పిదప దేహమువచ్చుట లేదు. ఈ విధముగ మాయయంతయు నశించిపోవుట నిశ్చయము, జగత్తున్నదనినచో (అట్లు) ఉన్నదనునది సద్రూపమయిన బ్రహ్మమేను. జగత్తు ప్రకాశించుచున్నదనిన అట్లు ప్రకాశించుచున్నది. బ్రహ్మమేను. ఎడారిలోగనబడు జలమంతయు ఎడారియేగాని వేఱుగాదు. తన స్వరూప విచారముచే ఈ మూడులోకములున్ను (స్వర్గ, మర్త్యపాతాళములు) చిత్స్వరూపమాత్రమేను. జీవుడు, ఈశ్వరుడు, గురువు ఇట్టి భేదముగల కథలకు బహుదూరములోనున్న ఏకాన్తకేవల చిదేకరసస్వభావమైన బ్రహ్మమునందు అజ్ఞానమేలేదు. (ఇట్లుండగా) జగత్తుయొక్క ప్రస్తావన యెక్కడిది? పరిపూర్ణముగనే యున్నట్టి (అట్టి) బ్రహ్మము నేనుగానున్నాను. వరాహోపనిషత్తు 2-వ అధ్యాయము.

తృతీయోఽధ్యాయః

న హి నానాస్వరూపం స్యాదేకం వస్తు కదాచన।
తస్మాదఖండ ఏవాస్మి యన్మదన్యన్న కించన॥
దృశ్యతే శ్రూయతే యత్తద్బ్రహ్మణోఽన్యన్న తద్భవేత్।
నిత్యశుద్ధ విముక్తైక మఖండానంద మద్వయమ్॥
సత్యం జ్ఞానమనంతం యత్పరం బ్రహ్మాహమేవ తత్।

ఒక వస్తువు ఏకాలమునందును పలుస్వరూపములుగా కాజాలదు. అఖండమై (ఎడతెగనిదై) యున్నాను. గాన నాకంటే వేరుగా నేదియులేదు. ఏదేదికనబడుచున్నదో, ఏదేది వినబడుచున్నదో, అదంతయు బ్రహ్మముదప్ప వేరుగానుండలేదు. నిత్యముగాను, శుద్ధముగాను, విముక్తముగాను, ఏకముగాను, అఖండానందముగాను, అద్వయముగాను, సత్యముగాను, జ్ఞానముగాను, అనంతముగానునున్నట్టి పరబ్రహ్మమేదికలదో, అదియే నేనుగా నున్నాను. (3-వ అధ్యాయము.)

## (48) హయగ్రీవోపనిషత్

ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మాన్తర్యామ్యమృతః, అహం బ్రహ్మాస్మీతి మహావాక్యైః ప్రతిపాదితమర్థం త ఏతే మన్త్రాః ప్రతిపాదయన్తి.

ప్రజ్ఞానమే బ్రహ్మము. "నేను బ్రహ్మముగా నున్నాను." అది నీవుగా నున్నావు. ఇది యాత్మ, అన్తర్యామిగను, అమృతముగానునున్నాడు. నేనే బ్రహ్మముగానున్నాను. అను మహా వాక్యములచే బైటబెట్టబడిన అర్థమును ఆ ఈ మంత్రములు ప్రకటించుచున్నవి. (హయగ్రీవోప నిషత్తు.)

## (49) సరస్వతీరహస్యోపనిషత్

మయి జీవత్వమీశత్వం కల్పితం వస్తుతో న హి।
ఇతి యస్తు విజానాతి స ముక్తో నాత్ర సంశయః ॥

నాయెడ జీవత్వమున్ను, ఈశ్వరత్వమున్ను కల్పింపబడియున్నది. వాస్తవమునలేదు. ఇట్లెవ్వడెఱుంగునో, అతడు ముక్తుడే, సందియములేదు. (సరస్వతీరహస్యోపనిషత్తు.)

## (50) బహ్వృచోపనిషత్

ప్రజ్ఞానం బ్రహ్మేతి వా అహం బ్రహ్మాస్మీతి వాఽఽభాష్యతే తత్త్వమసీత్యేవ సంభాష్యతే అయమాత్మా బ్రహ్మేతి వా బ్రహ్మైవాహమస్మీతి వా యోఽహమస్మీతి వా సోఽహమస్మీతి వా యోఽసౌ సోఽహమితివా యా భావ్యతే సైషా షోడశీ శ్రీవిద్యా పంచదశాక్షరీ.

ప్రజ్ఞానము బ్రహ్మమనిగాని నేను బ్రహ్మముగా నున్నాననిగాని చెప్పబడుచున్నది. అది నీవుగానున్నావనిగాని చెప్పబడుచున్నది. ఈ ఆత్మ బ్రహ్మమనిగాని, బ్రహ్మమేనేనుగా నున్నానని గాని, ఎవ్వడు (గలడో అతడు) నేనుగానున్నాననిగాని అతడునేనేయనిగాని, యే యితడు గలడో అతడు నేనుగా నున్నాననిగాని, యేది భావనచేయబడుచున్నదో, అది (బ్రహ్మము) షోడశీపంచదశాక్షరీయనెడు శ్రీ విద్యగానున్నది. బహ్వృచోపనిషత్తు.

## (51) ముక్తికోపనిషత్

ద్వితీయోఽధ్యాయః

అన్వేష్టవ్యం ప్రయత్నేన మారుతే జ్యోతిరాన్తరమ్।
దర్శనాదర్శనే హిత్వా స్వయం కేవల రూపతః ॥
య ఆస్తే కపిశార్దూల బ్రహ్మ న బ్రహ్మవిత్స్వయమ్।

ఓమారుతీ! లోపలనున్న జ్యోతిని (జ్యోతిస్స్వరూపమగు ఆత్మను) ప్రయత్నముచే వెతుక వలయును. ఓకపిశార్దూలా! జ్ఞానాజ్ఞానములను విడిచి ఎవ్వడు తానే బ్రహ్మమని యున్నాడో అతడు, బ్రహ్మము నెఱింగినవాడు కాడు, అతడు బ్రహ్మమేను (ముక్తికోపనిషత్తు 2 వ అధ్యాయము.)

---

ఇదివఱకుదహరించి వచ్చియున్న 51 శ్రుతులలో అద్వైత స్వరూపముగనున్నట్టి యనేక వాక్యములలో బహుకొద్ది వాక్యములు మాత్రము ఇచ్చటనెత్తి చెప్పబడినవి. కొన్ని ఉపనిషత్తులను విడిచి పెట్టుటయు సంభవించెను. ఏలనగా నీ పుస్తకము మిక్కిలి విస్తరించిపోవునను కారణముచేతనే. ఈ శ్రుతివాక్యములు జీవేశ్వరులు, ప్రపంచము, మొదలగువవి యుక్తావకల్పిత మనివి యు

బ్రహ్మమే సత్యముగ నున్నట్టిదనియు అట్టి బ్రహ్మమునకు రూపాదులు లేవనియు కంఠోక్తముగ జెప్పియుండగా "ఆదిత్యవర్ణం - సువర్ణజ్యోతిః" మొదలగు శ్రుతులు బ్రహ్మమునకు రూపమును జెప్పుచున్నవి గదాయనిన, అవి బ్రహ్మము అన్ధకారము కాదను దానిని ప్రకటింపజేయవచ్చిన శ్రుతులేగాని, రూపమును ప్రకటింపవచ్చిన శ్రుతులు కావు. "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం, త్రిలోచనం నీలకంఠం ప్రశాన్తం" మొదలగు శ్రుతివాక్యములు రుద్రాది రూపముల జెప్పుచున్నవి గదాయనిన, ఇట్టి శ్రుతివాక్యములున్ను వీటి ననుసరించినట్టి స్మృతి పురాణాదులున్ను వ్యవహారదశ ననుసరించి, నిర్గుణబ్రహ్మోపాసన కనర్హులైన పురుషులు కడతేరుటకై సగుణోపాసనకు యోగ్యమైన ఈశ్వరాదిరూపములను జెప్పుచున్నవి. ఈ అర్థమును "ఏవం సతతయుక్తాయే", ''యేత్వక్షర మనిర్దేశ్యమ్", ''సన్నియమ్యేన్ద్రియగ్రామం" (దీనియందలి, అధ్యాయము 12. శ్లో. 1-3-4) మొదలగు శ్లోకములలో గాంచవచ్చును. ఇట్టి నిర్గుణోపాసన సాధారణజనులకు అసాధ్యమయినందుచే అట్టి వారలకొఱకై భక్తి, విశ్వాసము. ప్రపంచమున విరక్తి, సత్యము, నమ్మకము, మొదలగు వాటిని గలుగజేసి వాటివలన చిత్తశుద్ధిని క్రమక్రమముగ నొందించుటకై సగుణోపాసనను శ్రుతులు విధించియున్నవి. సగుణోపాసనలోను తీర్ణుడైనవాడు నిర్గుణోపాసనకు యోగ్యుడగుచున్నాడు. ఇది దేనివలెననగా, భూమినిదున్ని పండించువానికిని మంచి చదువరియై ఉద్యోగమునకై ప్రయత్నించు వానికిని తన ప్రయత్నమువలన పొందదగిన ముఖ్యోద్దేశము ధనమేగదా! పైరుబెట్టువాడు మొదట ధాన్యాదులపొంది పిదప అట్టి ధాన్యాదుల మూలముగ ధనమును బడయుచున్నాడు. ఇందులకు ఆలస్యమున్ను మిక్కిలి శ్రమయు గలుగుచున్నది. ఉద్యోగముజేయువాడు అట్టి ధనమును అతి శీఘ్రముగ బడయుచున్నాడు. వ్యవసాయదారుడు ఉద్యోగమును ఇచ్ఛయించినచో దానికి దగిన చదువు మొదలగువాటిని సంపాదించుటకై చాలకాలమభ్యసించవలయును. ఉద్యోగమున ప్రయత్నించుటకై వ్యవసాయమును మాత్రము వదలినచో తానుజేసిన వ్యవసాయము పోయి, ఉద్యోగము సిద్ధింపక రెండును చెడినవాడగును. కావున ప్రతియొకడు తనబుద్ధి, శక్తి, మొదలగు వాటిని నిదానించి తాను ఎందులో ప్రయత్నింపవలెనో, దానిని వెదకుటకై, శ్రుతి పలువిధములైన ఉపాసనలను విధించుచున్నది.

పై జెప్పబడిన ఈశ్వరాదులవలె రూపములేని బ్రహ్మము నెఱుంగుటయు, ఎఱింగినట్లు నిష్ఠజేయుటయు ఎట్లు శక్యమగుననగా - బ్రహ్మజ్ఞానమనగా బ్రహ్మముయొక్క ఆకారరూపముల నెఱుంగుటకాదు. బ్రహ్మస్వరూపము నెఱుంగుటయే. ఆకారమనగా ఎత్తు, పొట్టి, మొదలగునవి. రూపమనగా నలుపు, ఎఱుపు మొదలగునవి. స్వరూపమనగా అఖండాకారమై మార్పులేక ఒక్కటే విధముగ నెల్లపుడుండుట. ఆకారము రూపము ఇవి మార్పుజెందునవి. స్వరూపము మారనిది. అదెటులన నీటియొక్క ఆకారము స్థానమునకు దగినటుల పెద్దదిగను చిన్నదిగను కనబడును. అట్లేచేరిక ననుసరించి ఎఱుపు, తెలుపు మొదలగు రూపములను పొందినదిగ గానబడును. అయినను జలస్వరూపము మారనేరదు. అట్టి స్థానము చేరికమొదలగు నుపాధులను నివర్తించి జూచినచో, జలస్వరూపమున మార్పేయుండదు. అట్లే బ్రహ్మస్వరూపము మారని స్వరూపమే. అట్టి స్వరూప మేదనగా నిర్మలత్వము, సూక్ష్మత్వము, జ్ఞానము, ఆనందము మొదలగునవే. ఇట్టి బ్రహ్మస్వరూప జ్ఞానమును గురూపదేశమువలన బొంది ప్రపంచమును మరచి ఉపదేశించినటుల ఎడతెగక ధ్యానించుటయే బ్రహ్మనిష్ఠయని చెప్పంబడుచున్నది. సామాన్యమైనవాడు ఇట్టి నిష్ఠనుబడయుట యసాధ్యము ఏలనగా ప్రపంచములోని వారలెల్లప్పుడు విషయజ్ఞానముగలవారలుగనే యున్నారు. అనగా దేహమేయాత్మయని కొందఱు, ఇంద్రియములే యాత్మయని కొందఱు, విజ్ఞానమే యాత్మ

యనియు కొందఱు, దేహములోపల ప్రకృతి సంబంధములులేక అవ్యక్తముగను (కనబడనిదిగను) అవిద్యాస్వరూపముగను అవ్యాకృతమని పేరుబడసినదిగను నున్నట్టిదే ఆత్మయనికొందఱు, పలు విధములైన యజ్ఞానమువలన వాస్తవమయిన ఆత్మస్వరూపమునుగాంచక విపరీతజ్ఞానము గలవారు గను విషయములలో నాశగలవారుగను నున్నారు. వార్లకు వాస్తవమైన ఆత్మజ్ఞానమెటులగలుగ గలదు? ఇట్టియజ్ఞానులకు బ్రహ్మము ఆత్మకంటె అన్యమైనదనియు దూరములోనున్నదనియు అట్టి బ్రహ్మజ్ఞానమసాధ్యమనియుతోచును. గురూపదేశముబడసిన యొకడు:—

స్వదేహమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిం ।
ధ్యాన నిర్మథనాభ్యాసాత్ దేవం పశ్యేన్నిగూఢవత్ ॥
తిలేషు తైలం దధినీవ సర్పిరాపః స్రోతస్స్వరణీషు చాగ్నిః ।
ఏవమాత్మని గృహ్యతేఽసౌ సత్యేనైనం తపసాయోఽనుపశ్యతి ॥

తనదేహమును అరణిగను, ప్రణవమును (ఓం అనునక్షరమును) కవ్వముగను చేసికొని చిలుకుట యనెడు ధ్యానాభ్యాసమువలన కనబడకున్నట్టి బ్రహ్మము నెఱుంగును. (ఎట్లనగా) నువ్వులలో నూనెయు, పెరుగులో వెన్నయు, భూమిలో నీరును. అరణిలో అగ్నియు కనబడక పోయినను అవి బయటపడునటుల సత్యముచేతను తపస్సుచేతను వెతకువానికి వానిలోపలనే బ్రహ్మము ప్రకాశించును. శ్వేతాశ్వతరోపనిషత్తున మొదటియధ్యాయము 14. 15, వ వాక్యములలో జెప్పబడియున్నటుల అభ్యాసముజేయువానికి బ్రహ్మము స్వస్వరూపముగను సమీపమున నున్నట్టిది గను ఆనందమయముగను సులభసాధ్యముగను దోచును ఇదే యర్థము ''ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయం'' (అధ్యాయము 9, శ్లో, 2) అను శ్లోకముచే చెప్పబడియున్నది.

కొందఱు బ్రహ్మజ్ఞాననిష్ఠ అసాధ్యమనుచున్నారు. సద్గురువుయొక్క ఉపదేశమును బడ యకయు బ్రహ్మమును దెలిపెడి ప్రమాణముల విచారింపకయు విషయములలో ఆశ, అవిద్య వలన గలిగియున్న వస్తువులలో కర్తృత్వాభిమానము, తనదను మమత ఇవి గలవారై ఎల్లప్పుడు విపరీతబుద్ధితో గూడియున్నవారికి నిరాకార బ్రహ్మస్వరూపజ్ఞానము గలుగుట యసాధ్యమే. అయితే సద్గురూప దేశముబడసి వేదశాస్త్రాభ్యాసములనుజేసి ఆశ, అహంకారము, మమకారము విడిచి ద్వైతభావనన్రోసి ఆత్మదప్ప యన్యవస్తువులులేవను నమ్మకముతో ప్రయత్నించువానికి బ్రహ్మజ్ఞానము అతి సులభమయినది. ఈ అర్థము ''యా నిశా సర్వభూతానాం" (అధ్యా 2, శ్లో. 69) అనుచోట చెప్పబడియున్నది.

ఆత్మస్వరూపజ్ఞానము గలుగవలెననిన విషయవాసనను (ఆసక్తిని) విడువవలెను. విషయ వాసనను వదలవలయుననినచో విషయములలో వైరాగ్యము గలుగవలెను. వైరాగ్యము గలుగవలె ననిన వేదాంత శాస్త్రమును గురుముఖముగ తెలిసికొని విషయములను నశ్వరములుగ నెఱుంగవల యును. అట్లు చేయుటవలన విషయవాసన వదలిపోవును. ప్రతియొకరు జేయవలసిన ప్రయత్న మంతయు విషయవాసన వదలుటకేగాని ఆత్మస్వరూప ప్రకాశమగు మోక్షమును పొందువిషయ మున ప్రయత్నించుటకాదు. ప్రసిద్ధముగ నేనని ప్రకాశించుచున్న ఆత్మస్వరూపము ఒకనిచే విడువదగినదికాదు, ఒకనిచే పొందదగినదికాదు. దేహాదులను ఆత్మయని ఎఱుంగుట భ్రమ (విపరీతాభిప్రాయము). వాస్తవమున దేహాదులు ఆత్మ కావు.

ఒకడు తనదేహపు కొలత ఎంతయని తెలియవలసినచో, శాస్త్రాదులను విచారింపకయే యెట్లు తనచేతితో కొలిచి ఎఱుంగగలడో అట్లే తనయాత్మస్వరూపము నెఱుంగుటకు స్వానుభవము ముఖ్యమేగాని శాస్త్రవిచారణ ఆవశ్యకముగాదు, ఉపాధిని నివర్తించుటకే శాస్త్రవిచారణ ఉపయోగపడును. ఎట్లనగా దీపము ఒకపాత్రములోనుంచి మూయబడియున్నది. దానివలన దీపమునకుగాని దాని ప్రకాశమునకుగాని, కొఱతగాని, దోషముగాని, స్వరూపమున మార్పుగాని గలదా? అయితే దీపము దానిలోనున్నదని మనకు తెలియుటలెదు. ఆ దీపము దేనిచే కప్పబడియున్నదో, అట్లు మూతబడియున్న పాత్రమనెడు నుపాధిని తొలగించిన దీపము ప్రకాశించుచున్నట్లే మనకు గనబడును. దీపము మూయబడియున్నను తెరువబడియున్నను, ఆ ప్రకాశముయొక్క స్వరూపమున గాని స్థితిలోగాని, ఏయొకమార్పులేనందున దీపము ప్రకాశముగావలెనని దీపముయెడచేయవలసిన ప్రయత్నమేదియు లేదు. దానియుపాధియగు మూతబెట్టిన పాత్రమును నివర్తించు విషయమున తాను ప్రయత్నము జేయవలయును. ఆ విధముగనే అవిద్యవలన గలిగియున్న విషయవాసన నివర్తించుటకయ్యే వేదశాస్త్రాదులలో ప్రయత్నించవలయునేగాని, ఆత్మ నెఱుంగుటకై ప్రయత్న మొక్కటియు లేదు.

పైగాంచిన శ్రుతివాక్యములవలన ప్రతిపాదింపబడు బ్రహ్మము వాస్తవముగ నున్న దైనచో ఏల మనకు ప్రకాశించలేదనిన, గురూపదేశము, వేదాంతశాస్త్రార్థ విచారము శబ్దాది విషయములలో నాసక్తిని విడచుట మొదలగు వాటివలన "బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే'' (అధ్యా 7 శ్లో 19) అనువాక్యము ననుసరించి బహుజన్మలలో ప్రయత్నముజేసి అభ్యాసము వలన స్వానుభవము జెంది దానివలన బ్రహ్మస్వరూపము ప్రకాశించవలయునేగాని సాధారణముగ నెఱుంగదగినదిగాదు. ఒకనిచే నిరూపించి జూపదగినదిగాదు. అట్లు నిరూపించి చూపదగినది కాదనుటచేతనే ఆత్మ లేదని చెప్పకూడదు. ఏవిధమున ననగా తేనె, కలకండ, మొదలగు వస్తువులను భుజించినవాడు అవి రుచిగానున్నవనియు, రాజభోగము ననుభవించినవాడు మిక్కిలి సుఖము ననుభవించినట్లును జెప్పుచున్నాడు. దానిని విన్నవాడగు, తేనె కలకండ తిననివాడున్ను భోగములనుభవింపనివాడున్ను రుచి ఎట్లుండును? సుఖము ఎట్లుండునని అడిగిన, అతని కేవిధముగ నిరూపింపగలము? నిరూపించిజూపలేదను దానిచే అట్టివస్తువేలేదని నిశ్చయింపనగునా? రుచియు, సుఖమున్ను, ఎట్లనుభవముచే ఎఱుంగబడునో అనుభవించిన వాడు అనుభవించిన పిదపనెట్లు ఎఱుంగగలడో అట్లే బ్రహ్మస్వరూపము అనుభవముచేతనే ఎఱుంగదగినది. రుచికిని సుఖమునకును ఎట్లు ఆకారములేక, రూపములేకున్నను ఆ వస్తువుండుట వాస్తవమో, అట్లే బ్రహ్మ స్వరూపముగూడ వాస్తవమే. దానిని జ్ఞానమువలన నెఱుంగవచ్చుననునదియు వాస్తవమే. అట్టి జ్ఞాన నిష్ఠను బొందినవాడు బ్రహ్మస్వరూపముగ ప్రకాశించుటయు వాస్తవమేను.

బ్రహ్మజ్ఞాన నిష్ఠ ఒక ఆకారము, రూపము వీటిని బట్టినది గాదనియు, అది యిట్టిదనియు ఉపనిషత్తులలో పలుచోట్ల జెప్పబడియున్నది, వాటిలోగొన్ని ఇచ్చట నుదహరించి చూపబడుచున్నవి. ఛాందోగ్యోపనిషత్తున ఆరవయధ్యాయమున ఉద్దాలకుని పుత్రుడగు శ్వేతకేతువను నతడు పండ్రెండు సంవత్సరములు వేదాధ్యయనము జేసినపిదప తండ్రివద్దకు జని తనకు బ్రహ్మవిద్యను ఉపదేశింపవలయునని అడుగగా, నాతడు అట్లే చెప్పందొడంగె. ఆయధ్యాయమంతటను నాతని ఉపదేశమిమిడియున్నను మూడు విధములగు ఉపదేశములు మాత్రమిచట నిర్దేశింప బడుచున్నవి. అవి యేవన పైయధ్యాయము 12-13-14 ఖండములు: —

"న్యగ్రోధఫలమత ఆహరేతి, ఇదం భగవఇతి, భిన్ధీతి, భిన్నం భగవఇతి, కిమత్ర పశ్యసీతి, అణ్వ్యఇవేమా ధానా భగవఇతి, ఆసామంగైకాం భిన్ధీతి, భిన్నా భగవఇతి, కిమత్ర పశ్యసీతి, న కించన భగవఇతి, తంహోవాచయం వై సోమ్యైత మణిమానం న నిభాలయస ఏతస్య వై సోమ్యైషోఽణిమ్న ఏవం మహాన్న్యగ్రోధా స్తిష్ఠతి శ్రద్ధత్స్వసోమ్యేతి, సయ ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మాతత్త్వమసి శ్వేతకేతో ఇతి. భూయ ఏవ మాభగవాన్ విజ్ఞాపయత్విති, తథా సోమ్యేతి హోవాచ. లవణమేత దుదకేఽవధాయాథ మా ప్రాతరుపసీదథా ఇతి, సహ తథా చకార. తం హోవాచ, యద్దోషా లవణ ముదకేఽవాథా అంగ తదాహరేతి. తద్ధావమృశ్య న వివేద యథా విలీనమేవ. అంగాస్యాంతాదాచామేతి, కథమితి, లవణమితి, మధ్యాదాచామేతి, కథమితి, లవణమితి, అంతాదాచామేతి, కథమితి, లవణమితి, అభిప్రాశ్యైత దథమోపసీదథా ఇతి. తద్ధ తథా చకార. తచ్ఛశ్వత్ సంవర్తతే తంహోవాచాత్రవావకిల సత్సోమ్య ననిభాలయసేత్రైవ కిలేతి. స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి. భూయ ఏవ మాభగవాన్ విజ్ఞాపయత్వితి. తథా సోమ్యేతిహోవాచ. యథా సోమ్యపురుషం గంధారేభ్యోఽభి నద్ధాక్షమానీయ తం తతోఽతిజనే విసృజేత్, సయథా తత్ర ప్రాఙ్వా ఉదఙ్వా అధరాఙ్వా ప్రధ్మాయీతాభినద్ధాక్ష ఆనీతో భినద్ధాక్షో విసృష్టః. తస్య యథాభినహనం ప్రముచ్యప్రబ్రూయాదేతాం దిశంగంధారా ఏతాం దిశంవ్రజేతి స గ్రామాత్ గ్రామం పృచ్ఛన్ పండితోమేధావీ గంధారానేవోపసంపద్యేతైవమేవే హాచార్యవాన్ పురుషోవేద. తస్య తావదేవ చిరం యావత్ న విమోక్ష్యేథ సంపత్స్యఇతి స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతోఇతి".

(ఉద్దాలకుడు పుత్రునిచూచి) ఈన్యగ్రోధ (మఱ్ఱి) వృక్షముయొక్క ఫలమొకటి దెమ్మనెను. (పుత్రుడు)ఇదో తెచ్చితిని భగవంతుడా అనెను. (పిత) దానిని పగులగొట్టమనెను. (పుత్రుడు) పగులగొట్టితిని భగవంతుడా అనెను, (పిత) అందులో నెమిగానబడు చున్నదనెను (పుత్రుడు) మిక్కిలి సన్నని విత్తనములు గనబడు చున్నవనెను. (పిత) ప్రీతిగలవాడా! వాటిలో నొకదానిని పగులగొట్టమనెను. (పుత్రుడు) భగవంతుడా! ఇదిగో పగుల గొట్టితిననెను (పిత) దానిలో నేమి జూచుచున్నావనెను. (పుత్రుడు) ఏదియులేదు భగవంతుడా యనెను. (తండ్రి) అందులోని ఏ అణువు నీచేచూడబడలేదో అట్టి అణువునుండియే ఇంతటి పెద్ద మఱ్ఱిచెట్టు గలిగియున్నది. (దానివలె అణువైన సత్తునుండి ఈగొప్ప జగత్తు గల్గియున్నది.) ప్రేమగలవాడా! విశ్వసింతువుగాక. ఈఅణువే వీటికంతయు ఆత్మ, అది జగత్తుకెల్ల ఆత్మ, నీవదిగా నున్నావు శ్వేతకేతువా! యనెను, (పుత్రుడు) దానిని మరలను బోధింతువుగాక అని అడుగగా (పిత) అట్లే యనెను. (పిత) ఈ ఉప్పును ఆ నీటిలో బడవైచి రేపటిదినము తెల్లవారి నాయెడ రమ్మనెను. (పుత్రుడు) అట్లే చేసెను. (తండ్రి) బిడ్డా! నిన్నరాత్రినీవీ నీటిలో వేసిన ఉప్పునెత్తుమనెను! ఉప్పుకరిగి పోయినందుచే ఎఱుంగలేదు. (పిత) ఆనీటిలో పైభాగమున కొంచమెత్తి ఆచమనమును జేయుమనెను. (పుత్రుడు) అట్లే చేసెను. (తండ్రి) అదెట్లున్నదనెను. (పుత్రుడు) అది ఉప్పుగా నున్నదనెను. (పిత) మధ్య

కొంచమెత్తి యాచమనము జేయుము, అదెటుల నున్నదనెను. (పుత్రుడు) అది ఉప్పగా నున్నదనెను. (పిత) అడుగుభాగమున కొంచమెత్తి ఆచమనము జేయుము, అదెట్లున్నదనెను. (పుత్రుడు) అది ఉప్పగానున్నదనెను. (పిత) అయితే దానిని పోసివేసి నోరు కడుగుకొని నాయొద్దకు రమ్మనెను.

అతడు (పుత్రుడు) అటుల జేసివేసి నీటిలోకలిపిన ఉప్పు దానిలోనంతట నిత్యముగా నున్నదనెను. (తండ్రి) సత్యము గూడనటులనే బిడ్డా! నీవు దానిని జూడకున్నను అది ఈ దేహమంతయు వ్యాపించియున్నది, వీటికన్నిటికి నాత్మయగు అణువు సత్యము. అది జగత్తుకెల్లనాత్మ. నీవు అదిగానున్నావు శ్వేతకేతువా! యనెను. (పుత్రుడు) దానిని మరల దెలుపుదురుగాక యనెను. (తండ్రి) అట్లేయనెను. (తండ్రి) బిడ్డా! ఒకనిని కండ్లుగట్టి గాంధారదేశమునుండి బయటకు తీసికొని పోయి విడిచిపెట్టినచో, నాతడు నేను కండ్లుగట్టి కాంతారమున విడువబడితినని మొరపెట్టును. పిదప నొకడు ఆతనికండ్ల కట్టును విప్పి గాంధారదేశమునకు, ఇదిమార్గము, ఈ త్రోవగా పొమ్మనుచున్నాడు. బుద్ధిగలవాడు ఊరుఊరుగా అడుగుచు కడపట గాంధారమును జేరుచున్నాడు. ఈ విధముగనే తగిన ఆచార్యుని బడసినవాడు ఎఱుంగగలడు. ప్రారబ్ధక్షయ మగుటయే ఆలస్యము. అదియైనతోడనే ముక్తుడగుచున్నాడు. వీటికన్నిటికి ఆత్మయగు నణువు సత్యము. అది జగదాత్మ. నీవదిగా నున్నావు. శ్వేతకేతువా! అనెను.

కేనోపనిషత్తున మొదటిఖండము 3-వ వాక్యము మొదలు 8-వ వాక్యమువఱకు ఈ విధముగ జెప్పంబడుచున్నది. అదేమన-

న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనః ।
న విద్మో న విజానీమో యథైతదనుశిష్యాత్ ॥
అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి ।
ఇతి శుశ్రుమ పూర్వేషాం యే నస్తద్వ్యాచచక్షిరే ॥
యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే ।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥
యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతం ।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥
యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి ।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥
యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతం ।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥
యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే ।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥

దానిని (బ్రహ్మమును) నేత్రముగాని వాక్కుగాని మనస్సుగాని అందుకొనుటలేదు. దానిని మన మెఱుంగము. దాని నెఱింగించు మార్గముగూడ మనకు తెలియదు. అది తెలిసినదానికంటె వేరైనదగును, తెలియని దానికంటె వేరుగనున్నదని పెద్దలు చెప్పగా వినియున్నారము. ఏది

వాక్కువలన తెలియనిదో దేనిచే వాక్కు ప్రకాశించుచున్నదో అదియే బ్రహ్మమని నీవు ఎఱుంగుము. దేనిని ఇది యని యుపాసించుచున్నారో అది కాదు. దేనిని మనస్సుచే తలంచుటలేదో, దేనిచేమనస్సు తలంపబడినదిగ జెప్పబడుచున్నదో, అదియే బ్రహ్మమని నీవెఱుంగుము. దేనిని ఇదియని ఉపాసించుచున్నారో అదికాదు. దేనిని కండ్లచే జూచుటలేదో దేనిచే (ఒకడు) కండ్లను జూచుచున్నాడో అదియే బ్రహ్మమని నీవెఱుంగుము. దేనిని ఇది యని యుపాసించుచున్నారో అదికాదు. దేనిని చెవిచే వినుటలేదో, దేనివలన నీ చెవి వినబడుచున్నదో అదియే బ్రహ్మమని నీవెఱుంగుము. దేనిని ఇదియని ఉపాసించుచున్నారో అదికాదు, ఏది ప్రాణవాయువుచే శ్వాసించుటలేదో దేనిచే ప్రాణ వాయువు శ్వాసించుచున్నదో అది బ్రహ్మమని నీవెఱుంగుము. దేనిని ఇదియని యుపాసించు చున్నారో అదికాదు.

ముండకోపనిషత్తున మూడవ యధ్యాయమున మొదటిఖండములో నెనిమిదవ వాక్య మున నీ విధముగ జెప్పబడుచున్నది. అదేమనగా-

న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దేవై స్తపసా కర్మణా వా।
జ్ఞాన ప్రసాదేన విశుద్ధ సత్త్వ స్తతస్తుతం పశ్యతే నిష్కళం ధ్యాయమానః॥

అతడు (బ్రహ్మము) కండ్లచేగాని, వాక్కువలనగాని, మిగత ఇంద్రియములచేగాని, తపసుచేగాని, కర్మచేగాని, గ్రహింపబడనేరడు. అతడు ప్రసాదించిన ప్రసాదమగు జ్ఞానముచేత చిత్తశుద్ధిని పొందినవాడు ధ్యానించుచునే నిరవయవమగు బ్రహ్మమును గాంచుచున్నాడు.

కేనోపనిషత్తున 2వ ఖండము 11వ వాక్యము 3-వ అనువాకమున నీ విధముగ జెప్ప బడుచున్నది. అదేమనగా —

యస్యామతం తస్యమతం మతం యస్య న వేద సః।
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతాం ॥

(బ్రహ్మమును) ఎఱుంగను అనునాతడు ఎఱుంగును. ఎఱుంగుదునను నాతడు ఎఱుం గడు. (బ్రహ్మము) తెలియుననువార్లకు తెలియదు. తెలియదనువార్లకు తెలియును.

మాండూక్యోపనిషత్తున 7వ వాక్యమున నీ విధముగ జెప్పబడియున్నది. అదేమనగా—

నాన్తఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం నోభయతఃప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నా ప్రాజ్ఞం అదృష్టమవ్యవహార్యమగ్రాహ్యం అలక్షణం అచిన్త్యం అవ్యపదేశ్యం ఐకాత్మ్యప్రత్యయసారం ప్రపంచోపశమం శాన్తం శివం అద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా విజ్ఞేయః।

(ఆ బ్రహ్మము) స్వప్నావస్థగలది (తైజసుడనే జీవుడు) కాదు, జాగ్రదవస్థగలది (విశ్వుడను జీవుడు) కాదు. జాగ్రత్స్వప్నములకు మధ్యమైన అవస్థగలదియు కాదు, నిద్రావస్థగలది (ప్రాజ్ఞుడను జీవుడు) కాదు. ఈ మూడు అవస్థలలోని వస్తువులను ఒకే కాలమున నెఱుంగునదికాదు, జడము కాదు. చూడదగినదికాదు, నిరూపించి చూపదగినదికాదు. కర్మేన్ద్రియములవలన గ్రహింపదగినది కాదు. ఊహవలన నెఱుంగదగినది కాదు. తలంపున కందునదికాదు. వాక్కుచే (వేదములచే) నెఱుంగదగినదికాదు. (అయితే) స్వానుభవముచేతనే ఎఱుంగదగినది. జాగ్రత్ మొదలగు అవస్థలు లేనిది. వికారములేనిది. మంగళకరమైనది. మూడువిధములగు భేదము లేనిది. (అనగా సజాతీయము

విజాతీయము స్వగతము అను భేదములులేనిది. సజాతీయ భేదములేదనగా తనవంటి చేతనమగు వేరువస్తువును బడసినది కానిది. విజాతీయ భేదము లేనిదనగా, తన్నుదప్ప వేరు జడవస్తువును బడసినదికానిది. స్వగతభేదము లేనిదనగా అవయవము లేనిది.) ఇట్టిదానిని (తురీయమనెడు) నాల్గవదిగ తలంచుచున్నారు. 'తలంచుచున్నారు' అనినందున వాస్తవము కాదని అగుచున్నది. ఏలయనగా మునుపటివైన జాగ్రత్ మొదలగు మూడవస్థలున్ను వాస్తవమయితే గదా దీనిని నాల్గవ అవస్థగా జెప్పవచ్చును? ఆమూడు అవస్థలున్ను వాస్తవమగునవి కానందున తురీయావస్థకూడ వాస్తవము కాదు. ఇదియే ఆత్మస్వరూపము, దీనినే యెఱుంగవలయు.

ఛాందోగ్యోపనిషత్తున 8 వ అధ్యాయము 14వ ఖండమున, ఈ విధముగ జెప్పబడు చున్నది. అదేమనగా—

ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితాయదంతరా తత్ బ్రహ్మ తదమృతం.

పేరున్ను (పేరుకు కారణమగు) రూపమున్నుగలది ఆకాశము. వాటికన్యమైనది యేదో, అది బ్రహ్మము, అది అమృతము.

కఠోపనిషత్తున 6వ వల్లి 9వ వాక్య మీవిధముగ జెప్పుచున్నది. అదేమనగా—

న సంధృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనం ।
హృదా మనీషా మనసాభిక్ల్పో య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥

దీనికి (బ్రహ్మమునకు) రూపము (మన) చూపులోలేదు. దీని నెవ్వడును నేత్రముచే చూచులేదు. నిశ్చయరూపమైన యథార్థజ్ఞానముచేతనే ఎఱుంగబడుచున్నది. దీని నెఱింగినవారు అమృతత్వమును (మోక్షమును) పొందుచున్నారు.

ప్రశ్నోపనిషత్తున 4-వ ప్రశ్నము 10-వ వాక్య మీవిధముగ జెప్పుచున్నది. అదేమనగా—

స యో హ వై తదచ్ఛాయమశరీరమలోహితం ।
శుభ్రమక్షరం వేదయతే యస్తు సోమ్య స సర్వజ్ఞస్సర్వో భవతి ॥

ఓ ప్రీతిగలవాడా! ఎవడు దానిని (బ్రహ్మమును) నీడలేనిది, శరీరములేనిది, వర్ణము లేనిది, ప్రకాశముగలది, నాశములేనిది అని యెఱుంగునో ఆతడు సకలమునెఱింగినవాడుగను, సకలము తానుగను అగుచున్నాడు.

ఈ వాక్యములచేతను, మఱియు ననేక ప్రమాణములచేతను బ్రహ్మమనెడు ఆత్మ స్వరూపము ఇంద్రియములకు గోచరముకానిదని ఏర్పడుచున్నది. ఆత్మస్వరూప ప్రకాశము గలుగుటకు ఉపాయమేదనగా, ఇంద్రియములను మనస్సుతో నణచుకొని ఒక్కటే నిలకడలో నుండెడు సమాధియే. కావున ప్రతి ముముక్షువైనవాడును ఏమరినవాడై వ్యర్థముగా కాలముగడుపక ఆత్మస్వరూపజ్ఞానము బడయుటకై ప్రయత్నింపవలయును. ఈ అర్థమును శ్రుతియే చెప్పుచున్నది.

కఠోపనిషత్తున 3-వ వల్లి 14-వ వాక్యము —

ఉత్తిష్ఠత జాగ్రత, ప్రాప్య వరాన్ నిబోధత ।
క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదన్తి ॥

(అజ్ఞానమునుండి) మేలుకొనిలేవండి. శ్రేష్ఠమైనవార్లనుపొంది బ్రహ్మజ్ఞానమును సంపాదించండి. (ఏలనగా) దానిని తెలిసికొనుమార్గము మిక్కిలివాడియైన కత్తికొనలో నడచుటవలె మిక్కిలి కఠినమైనదని విద్వాంసులు చెప్పుచున్నారు.

కేనోపనిషత్తు 2వ ఖండము 6వ వాక్యము—

ఇహచేదవేదీదథ సత్యమస్తి
న చేదిహావేదీన్మహతీ వినష్టిః।
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి॥

ఈ జన్మలో (బ్రహ్మమును) తెలిసికొనినచో పిదప నిలకడగలుగును. ఈ జన్మలో నెఱుంగని ఎడల గొప్పనష్టముగల్గును. ప్రతిభూతములయందును బ్రహ్మమును జూచెడుధీరులు ఈ లోకమును విడిచి నిత్యపదవిని పొందుచున్నారు.



శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ।
శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥ 51

,, వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ 52

,, అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం।
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే॥ 53

పద॥ బుద్ధ్యా (1) - విశుద్ధయా (2) - యుక్తః - ధృత్యా (3) - ఆత్మానం (4) - నియమ్య(5) - చ।
శబ్దాదీన్ - విషయాన్ (6) - త్యక్త్వా - రాగద్వేషౌ (7) - వ్యుదస్య - చ॥

,, వివిక్తసేవీ (8) - లఘ్వాశీ (9) - యతవాక్కాయమానసః (10)।
ధ్యానయోగపరః (11) - నిత్యం (12) వైరాగ్యం - సముపాశ్రితః (13)॥

,, అహంకారం (14) - బలం (15) - దర్పం (16) - కామం (17) - క్రోధం(18)-పరిగ్రహం (19)।
విముచ్య - నిర్మమః (20) - శాంతః (21) - బ్రహ్మభూయాయ (22) - కల్పతే॥

| | | | |
|---|---|---|---|
| విశుద్ధయా | పరిశుద్ధమైన లేక, స్వచ్ఛత చెందిన | శబ్దాదీన్విషయాన్ | శబ్దము మొదలగు విషయములను |
| | | త్యక్త్వా | విడిచియు |
| బుద్ధ్యా | నిశ్చయముతో లేక బుద్ధితో | రాగద్వేషౌ | రాగద్వేషములను |
| యుక్తః | కూడినవాడుగను | వ్యుదస్యచ | నివర్తింపజేసియు |
| ధృత్యా | ధైర్యముచేత | వివికసేవీ | ఏకాంతమును ఇచ్ఛించువాడుగను, ఏకాంతమున వసించువాడుగను |
| ఆత్మానం | అంతఃకరణమును | | |
| నియమ్యచ | అణచిపెట్టియు | | |

| | |
|---|---|
| లఘ్వాశీ | మితమైన ఆహారమును గ్రహించువాడుగను, |
| యతవాక్కాయమానసః | వాక్కు, దేహము, మనస్సు వీనినణచిన వాడుగను |
| నిత్యం | ఎల్లప్పుడు |
| ధ్యానయోగపరః | బ్రహ్మధ్యానములో కోరిక గలవాడుగను, లేక ధ్యానమునందును, యోగమునందును, ఆసక్తిగలవాడుగను |
| వైరాగ్యం | వైరాగ్యమును |
| సముపాశ్రితః | చెందినవాడుగను |
| అహంకారం | అహంకారమునున్ను |
| బలం | దురాగ్రహము లేక, మొండితనము, లేక శక్తినిన్ని |
| దర్పం | దుర్మార్గమున ప్రవృత్తినిన్ని లేక మదమునున్ను |
| కామం | ఆశనున్ను |
| పరిగ్రహం | అభిమానమును, లేక స్వత్వమును |
| క్రోధం | కోపమును |
| విముచ్య | విడిచిపెట్టి |
| నిర్మమః | మమత లేనివాడుగను |
| శాంతః | విశ్రాంతిని పొందిన వాడుగను నున్నవాడు |
| బ్రహ్మభూయాయ | తానే బ్రహ్మమను నిశ్చయజ్ఞానముతో నుండుటకొఱకై, లేక బ్రహ్మమగుటకొఱకు |
| కల్పతే | యోగ్యుడగుచున్నాడు, లేక అధికారి యగుచున్నాడు. |

తా॥ పరిశుద్ధమైన నిశ్చయముతో గూడినవాడుగను, ధైర్యముచేత బుద్ధిని విషయములనుండి అణచినవాడుగను, శబ్దము మొదలగు విషయములను విడిచినవాడుగను, రాగద్వేషములను తొలగించినవాడుగను, ఏకాంతస్థలమున నివాసము, మితమైన ఆహారము, వాక్కుదేహము మనస్సు వీటినణచుట, అహంకారము, మొండివాదము, దుర్మార్గమున ప్రవృత్తి, ఆశ, కోపము, అభిమానము వీటిని విడిచిపెట్టుట, మమత లేకుండుట, విశ్రాంతి చెందియుండుట, ఇట్టి గుణములు గలవాడుగనున్నవాడు, తానే బ్రహ్మమను నిశ్చయజ్ఞానముతో నుండుటకు యోగ్యుడుగనున్నాడు. (ఇతడే జ్ఞానమును పొందుటకు యోగ్యుడనునది తాత్పర్యము.)

(1) బుద్ధ్యా - సాత్త్వికబుద్ధితో (శ్రీధరులు)

(2) విశుద్ధయా - కపటములేని (శంకరులు). ఆత్మస్వరూపమును గ్రహించునట్టి (రామానుజులు). విషయమునందాసక్తిలేని (రాఘవేంద్రులు).

(3) ధృత్యా — సాత్త్విక ధైర్యముచేత (శ్రీధరులు). నిలబెట్టెడి శక్తిచేత (రాఘవేంద్రులు).

(4) ఆత్మానం — కార్యకారణరూపమైన అంతఃకరణమును (శంకరులు). మనస్సును (రామానుజ రాఘవేంద్రులు).

(5) నియమ్య — స్వాధీన పరచుకొని (శంకరులు).

(6) విషయాన్ — శరీరము నిలబడుటకు కావలసిన ఆహారాదులు తప్ప మిగతవిషయములను (శంకరులు). శబ్దాదుల ననుభవింపవలెనను ఇచ్ఛలను (రాఘవేంద్రులు).

(7) రాగద్వేషౌ — శరీర సంరక్షణకై తనప్రయత్నములేకయే దొరకిన అన్నపానాదులలో రుచి వలన ఆసక్తియు, అరుచివలన ద్వేషమున్ను (శంకరులు).

(8) వివిక్తసేవీ — అడవులు, నదియొడ్డుననున్న ఇసుకదిబ్బ, పర్వతములలోని గుహలు ఇటువంటి ఏకాంతమైనచోట నివసించెడివాడు (శంకరులు). తనయొక్క నిష్ఠకు విరోధములేనిచోట నున్నవాడు (రామానుజులు). పరిశుభ్రమైనచోట నున్నవాడు (శ్రీధరులు).

(9) లఘ్వాశీ — అత్యాహారము, లేక బొత్తిగ నాహారమును తొలగించుట ఇవి రెండులేనివాడు (రామానుజులు).

(10) యతవాక్కాయ మానసః - వాక్కు, దేహము మనస్సు వీటిని ధ్యానమున కనుకూలముగ జేసికొన్నవాడు. (రామానుజులు). అయోగ్యమైన విషయములుతప్ప మిగత విషయములో వాక్కు, దేహము, మనస్సు, వీటి నుపయోగించెడివాడు. (రాఘవేంద్రులు).

(11) ధ్యానయోగ పరః - ఆత్మస్వరూపచింతనమే ధ్యానము. అందులో నెడదెగకయుండుట యోగము. వీటిలో నా సక్తిగలవాడు (శంకరులు). జ్ఞానయోగము నందాసక్తిగలవాడు (రామానుజులు). జ్ఞానమనెడి ఉపాయము నందాసక్తిగలవాడు (రాఘవేంద్రులు).

(12) నిత్యం - దేహాంతమువఱకు ప్రతిదినమున్ను (రామానుజులు)

(13) వైరాగ్యం సముపాశ్రితః - కనబడునవియు కనబడనివియునైన వస్తువుల విషయమున ఆశను విడిచినవాడు (శంకరులు). ధ్యానింపదగిన వస్తువుదప్ప మిగతవస్తువులలో వైరాగ్యమును రోజుకు రోజు వృద్ధిజేసికొన్నవాడు (రామానుజులు).

(14) అహంకారం - తానను నహంకారమును (శంకరులు). నేను విరక్తుడను అను నహంకారమును (శ్రీధరులు). దేహాదులలో ఆత్మబుద్ధిని (రామానుజులు). తానుకర్తయను నభిమానము (రాఘవేంద్రులు).

(15) బలం - కామరాగములలో గూడిన శక్తియేగాని దేహశక్తిగాదు. అనగా తనవద్దనున్న వస్తువులు తన్ను విడిచిపోకయుండ ప్రయత్నించు సామర్థ్యము కామముతోగూడిన శక్తి. తనకులేని వస్తువును సంపాదింప ప్రయత్నించు సామర్థ్యము రాగముతో గూడిన శక్తి (శంకరులు). అనాత్మలో ఆత్మబుద్ధియొక్కవృద్ధికి కారణమైన వాసనాబలము (రామానుజులు). తాను మిక్కిలి సామర్థ్యముగలవాడనను నభిమానమును (రాఘవేంద్రులు).

(16) దర్పం - యోగసామర్థ్యమువలన దుర్మార్గమున ప్రవృత్తిని (శ్రీధరులు). అతిసంతోషముచేత ధర్మవిరోధము గలిగెడి మదమును (శంకరులు). దేహాభిమానమువలన గలుగుమదమును (రామానుజులు). తాను, భయపడదగిన విషయమునగూడ భయపడకుండుటను (రాఘవేంద్రులు).

(17) కామం - ప్రారబ్ధమువలన గిట్టినవస్తువులలోని ఆశను (శ్రీధరులు). విషయములలోని ఆశను (శంకరులు).

(18) క్రోధం - తాను పొందినవవస్తువుల నపహరించిన, లేక నష్టపరచిన వానిమీద గలిగెడి కోపమును (శ్రీధరులు). ద్వేషమును (శంకరులు).

(19) పరిగ్రహం - దేహసంరక్షణమునగాని ధర్మానుష్ఠానమునగాని మధ్య సంభవించెడి యనావశ్యకమైన విషయమును (శంకరులు).

(20) నిర్మమః - కష్టపడక లభించిన వస్తువులలోగూడ అభిమానములేనివాడు (శ్రీధరులు). తన దేహమునందుగూడ అభిమానములేనివాడు (శంకరులు). తనదికాని దేహాదివ్యాపారము లలో తనదను నభిమానములేనివాడు (రామానుజులు). తాను జేయుకర్మలు తనవను నభిమానము లేనివాడు (రాఘవేంద్రులు).

(21) శాంతః - సకలవిషయములలోనుండి నివృత్తిచెందినవాడు (శ్రీధరులు). ఆత్మాను భవము నందే సుఖముచెందినవాడు (రామానుజులు). కోపమును గలుగజేయునట్టి విషయమున గూడ ఓర్పుతో నుండువాడు (రాఘవేంద్రులు).

(22) బ్రహ్మభూయాయ - బ్రహ్మమగుటకు (శంకరులు). బ్రహ్మమువలె నగుటకు (రామానుజులు). బ్రహ్మజ్ఞానమునకు (రాఘవేంద్రులు).

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ 54

పద॥ బ్రహ్మభూతః (1) - ప్రసన్నాత్మా (2) - న - శోచతి (3) - న - కాంక్షతి (4)।
సమః (5) - సర్వేషు - భూతేషు - మద్భక్తిం (6) - లభతే - పరామ్ ॥

| | | | |
|---|---|---|---|
| బ్రహ్మభూతః | తానే బ్రహ్మమైనవాడై బ్రహ్మ మును చెందినవాడై | నకాంక్షతి | కోరుటలేదు |
| ప్రసన్నాత్మా | శాంతమైన మనస్సుగలవాడు లేక ఆత్మయెడ ప్రకాశము బడసినవాడు | సర్వేషు భూతేషు | సకలప్రాణులయెడను |
| | | సమః (భూత్వా) | సమముగ నుండి |
| | | పరాం మద్భక్తిం | నాయెడ మేలైనభక్తిని |
| | | లభతే | పొందుచున్నాడు. |
| నశోచతి | దుఃఖించుట లేదు | | |

తా॥ తాను బ్రహ్మమను నిశ్చయజ్ఞానమున్ను శాంతమైన మనస్సున్ను గలవాడు (ఏదైన నష్టమైనదానినిగూర్చి) దుఃఖించుటయులేదు. (ఏదైన తనకు కావలెనని) కోరుటయులేదు. సకలప్రాణులయెడను సమముగనున్నవాడై శ్రేష్ఠమైన నా భక్తిని పొందుచున్నాడు.

(1) బ్రహ్మభూతః - బ్రహ్మమును పొందినవాడు అనగా జీవన్ముక్తుడు (శంకరులు). ప్రకాశించు నదిగను పరిపూర్ణ జ్ఞానాకారముగను, నాయొక్క శేషముగనునున్న స్వరూపమును గల వాడు (రామానుజులు). తనయొక్క మనస్సును బ్రహ్మమునెడనేయుంచి యున్నవాడు, అనగా లక్ష్మిని చెందినవాడు (రాఘవేంద్రులు).

(2) ప్రసన్నాత్మా - ప్రకాశించిన ఆత్మస్వరూపమును చెందినవాడు (శంకరులు). దుఃఖము మొదలగువాటినుండి నివృత్తిచెందిన స్వరూపముగలవాడు (రామానుజులు). స్వయము గనే విషయములనువిడిచి వేరైన మనస్సుగలవాడు (రాఘవేంద్రులు).

(3) నశోచతి - తాను దొడగినకర్మ ముగియనందుకై దుఃఖించుటలేదు (శంకరులు). తన్నుదప్ప ఇతరవస్తువులనుగూర్చి శోకముచెందుటలేదు (రామానుజులు).

(4) నకాంక్షతి - లేనిదికావలెనని యపేక్షించుటలేదు. "నహృష్యతి" అనియు ఒక పాఠముగలదు. దానికి ఇష్టప్రాప్తివలన సంతోషించుటలేదని యర్థము (శంకరులు) నన్నుదప్ప వేరొక దానిని అపేక్షించుటలేదు (రామానుజులు).

(5) సమః - తనయొద్ద సుఖదుఃఖములు ఎట్లనో, అట్లే ప్రాణులయొద్దను చూచెడివాడు (శంకరులు). సకలవస్తువులను లక్ష్యముజేయుటలేదు. (అనగా సకలవస్తువులను తృణముగ దలంచువాడు) (రామానుజులు).

(6) మద్భక్తిం - అంతట బ్రహ్మమే అనుభావనను (శ్రీధరులు) మత్ - మయి = పరమేశ్వరుడైన నాయెడ, భక్తిం = చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున! ఆర్తో జిజ్ఞాసురర్థార్థీజ్ఞానీ చ భరతర్షభ (అధ్యా 7-శ్లో16-) వీటిలో 4 వ పక్షపువారలైన జ్ఞానులు జేయదగిన భజనను (శంకరులు). అనేక మహిమలు బడసిన నా యెడ ప్రీతిననుభవించుటయనెడి భక్తిని (రామానుజులు).



శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥ 55

పద॥ భక్త్యా - మాం - అభిజానాతి - యావాన్ - యః - చ - అస్మి - తత్త్వతః।
తతః - మాం - తత్త్వతః - జ్ఞాత్వా - విశతే - తదనన్తరమ్॥

| | | | |
|---|---|---|---|
| అహం | నేను | తతః | తరువాత |
| యావాన్ | ఎట్టి పరిమాణముగలవాడుగను | మాం | నన్ను |
| యశ్చఅస్మి | ఎట్టి స్వరూపముగలవాడుగను, లేక ఏదిగనునున్నానో అవిధముగ | తత్త్వతః | యథార్థముగ |
| | | జ్ఞాత్వా | ఎఱింగి |
| | | తదనన్తరం | ఆ విధముగ నెఱింగినతోడనే, లేక వెంటనే |
| తం మాం | అట్టి నన్ను | | |
| భక్త్యా | భక్తిచేత | విశతే | నన్ను ప్రవేశించుచున్నాడు. (పరమానంద స్వరూపియగుచున్నాడు.) |
| తత్త్వతః | వాస్తవముగ, లేక ఉన్నటుల | | |
| (సః) అభిజానాతి | అతడు ఎఱుంగుచున్నాడు | | |

తా॥ నేను ఏ విధమైన పరిమాణము, స్వరూపము గలవాడనుగ నున్నానో అవిధముగ నన్ను భక్తివలన నెఱుంగుచున్నాడు. అట్లెరింగిన తరువాత వెంటనే (ఆలస్యములేకయే) పరమానంద స్వరూపి యగుచున్నాడు.

(శంకరులు) యావానస్మి = మాయమొదలగు నేయే ఉపాధులతో గూడియున్నానో, యశ్చాస్మి = ఉపాధిలేనిదిగను, అఖండముగను, జ్ఞానస్వరూపిగను, సర్వవ్యాపిగనునున్న యెట్టి స్వరూపము గలవాడుగనున్నానో ఆ విధముగ, అభిజానాతి = తెలిసికొనుచున్నాడు. "తతోమాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్" అని చెప్పబడియున్నందున జ్ఞానమునుపొంది దానివెనుక బ్రహ్మమును ప్రవేశించుచున్నాడని అర్థమగుచున్నట్లు కనఁబడును జ్ఞానమునకు ఫలమంతయుచేరి అవిద్యయొక్క నివృత్తియేను. దానివెనుక పొందవలసినది ఏదియులేదు. "క్షేత్రజ్ఞం చాపి మాం

విద్ధి సర్వక్షేత్రేషు భారత" (అధ్యా 13 శ్లో 3) అని క్షేత్రజ్ఞుడు అఖండబ్రహ్మముగ చెప్పబడి యున్నాడు. జీవుడని పేరుబడసిన తానే యట్టి యఖండబ్రహ్మము. కావున అతను పొందవలసిన దేదియులేదు. వేరుగనొక్కటి యుండినగదా దానిని పొందుచున్నాడని చెప్పగలము? పొందుట యనగా అవిద్యానివృత్తి చెందుటయే. అదియే బ్రహ్మమునుపొందుట యనఁబడుచున్నది. (సున్నము యొక్క స్వరూపముచేత శుద్ధమైననీరు సున్నముయొక్క రూపముగ కనబడినప్పుడు సున్నపునీరని వ్యవహరింపబడుచున్నది. వేరుపరచెడి సాధనముచేత సున్నము తొలగినప్పుడు నీరుశుద్ధమైనదని వ్యవహరింపబడుచున్నది. సున్నము నివర్తించినపిదప అట్టి నీరు దేనినిపోయిచేరినది. సున్నపునీరను వ్యవహారము తొలగినదనునదే నీరు శుద్ధమైనదనుదానిచే చెప్పబడుచున్నది.) ఆవిధముగనే అవిద్యా వస్థలోనున్న బ్రహ్మము జీవుడని వ్యవహరింపబడినది. అవిద్యానివృత్తిచే ప్రకాశమైన జీవస్వరూపము స్వప్రకాశముగనేయున్నది ఇందలి 50 వ శ్లోకమున జ్ఞాననిష్ఠవలన బ్రహ్మమును పొందు చున్నాడని చెప్పబడియున్నదిగదా యనిన, అచ్చటగూడ ఈ యర్థమే గ్రహింపదగినది. నిష్ఠ యిట్టిదని తెలిసికొనుటవలన నజ్ఞాన నివృత్తికి సాధకముగలదు. గురువు ఉపదేశించిన శాస్త్రజ్ఞానము వలన కలిగినట్టియు, అమానిత్వము మొదలగు గుణములతో గూడినట్టియు, ఆత్మతప్ప వేరు ఏ యొకవస్తువున్ను కనబడక తానే బ్రహ్మమను నిశ్చయముతో నున్నట్టియు దృఢమైన అఖండధ్యాన మేదిగలదో అదియే జ్ఞాననిష్ఠయని చెప్పబడుచున్నది. "చతుర్విధా భజన్తేమాం (అధ్యా 7 శ్లో 16) అనుచోట చెప్పబడిన నాల్గువిధములైన భక్తులలో నాలుగవదైన జ్ఞానభక్తియే శ్రేష్ఠమైనది. ఇదియే జ్ఞాననిష్ఠ. ఇదియే జీవేశ్వరభేదమును నివర్తింపదగినది. ఇదియే కడపటిదైన బ్రహ్మజ్ఞానము. ఇటు వంటిజ్ఞానికే సర్వ కర్మసన్న్యాసము చెప్పబడియున్నది. ఇట్టివానికే ఆత్మస్వరూపమగు మోక్షము చెప్పబడియున్నది. దానికి దీనికంటే వేరైనమార్గములేదు. వేరుమార్గముగలదని తలంచినచో, పడమట సముద్రమును పొందగోరి తూర్పుగా పోవుటవలె ప్రయోజనపడదు. ఇప్పుడు చెప్పబడిన జ్ఞాననిష్ఠామార్గము ఒక పర్వతము వలె నున్నది. మిగతమార్గము అవగింజవంటిది. కావున బ్రహ్మమున ప్రవేశించుట యనుమాటలకు అఖండాకార బ్రహ్మస్వరూపముగ వెలుగుటయనియే తాత్పర్యము.

(రామానుజులు) యశ్చాస్మి=స్వరూపముచేతను స్వభావముచేతను ఎట్టివాడుగనున్నానో, యావానస్మి = ఎంతటివిభూతులు గుణములు బడసినవాడుగనున్నానో, మాం = అట్టివాడనైననన్ను, భక్త్యా = మునుపుచెప్పిన భక్తిచేత, తత్త్వతః = యథార్థముగ, అభిజానాతి = ఎవ్వడెరుంగునో, తత్త్వతో జ్ఞాత్వా తదనంతరం = ఈవిధముగ నన్నెఱింగిన తరువాత, తతః = పైజెప్పిన భక్తిచేత, మాం = నన్ను, విశతే = పొందుచున్నాడు, ఇందలి "తతః" అనుపదము పైజెప్పిన భక్తియే మోక్ష మునకు ముఖ్యకారణమనుదానిని గుర్తించి చూపుచున్నది. 'భక్త్యాత్వనన్యయాశక్యః' (అధ్యా 11 - శ్లో 54) అనుచోట ఈయర్థమే చెప్పబడియున్నది.

(రాఘవేంద్రులు) యావానస్మి = ఎట్టిపరిమాణముగలవాడుగనున్నానో, యశ్చాస్మి = ఏవిధమైన నామరూపములతో గూడియున్నానో అట్టివానిగ, అనగా సకలదేశకాలవ్యాపిగను సకల గుణపరిపూర్ణుడుగను దివ్యనామరూపములు గలవాడుగను, మాం = నన్ను, భక్త్యా = ఈ యధ్యా యము 54 వ శ్లోకమున జెప్పబడియున్న పరమభక్తిచేత, తత్త్వతః = తనయోగ్యతానుసారముగ,

అభిజానాతి = ఎవడెరుంగునో అతడు, తతః = ఆ భక్తివలన, మాం = నన్ను, తత్త్వతః = యథార్థముగ, జ్ఞాత్వా తదనన్తరం = యెరింగిన పిదప, మాం విశతే = నన్నుపొందుచున్నాడు. అనగా ముక్తిని పొందుచున్నాడని తాత్పర్యము.



శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం *॥ 56

పద॥ సర్వకర్మాణి (1) - అపి - సదా - కుర్వాణః - మద్వ్యపాశ్రయః (2)।
మత్ప్రసాదాత్ - అవాప్నోతి - శాశ్వతం (3) - పదం (4) అవ్యయం (5)

| | | | |
|---|---|---|---|
| మద్వ్యపాశ్రయః | నన్నే ఆశ్రయించినవాడు లేక శరణముగనైకొన్నవాడు | మత్ప్రసాదాత్ | నాయొక్క అనుగ్రహమువలన |
| సర్వకర్మాణి | కర్మలన్నిటిని | శాశ్వతం | శాశ్వతమై (అనాదియై) |
| కుర్వాణః అపి | చేసినప్పటికిని | అవ్యయం | నాశములేనిదైన |
| సదా | ఎల్లప్పుడు | పదం | స్థానమును |
| | | అవాప్నోతి | పొందుచున్నాడు. |

తా॥ నిత్యనైమిత్తిక కర్మలను ఎల్లప్పుడు చేయుచు నన్నే ఆశ్రయించి యున్నవాడు నాయొక్క అనుగ్రహమువలన శాశ్వతమైనట్టియు నాశము లేనట్టియు స్థానమును పొందుచున్నాడు.

(రాఘవేంద్రులు) ఇందులోని "అపి" శబ్దము కర్మలన్నిటిని ఈశ్వరారాధన రూపముగనే చేయవలెననుదానిని గుర్తించుచున్నది.

* ఈ శ్లోకమును కూర్మపురాణము ఉత్తర భాగము అధ్యాయము 11 లో చూడుడు.

(1) సర్వకర్మాణి - నిత్యనైమిత్తిక కామ్యకర్మలను (రామానుజులు) విహితములైన సకలకర్మలను (రాఘవేంద్రులు).

(2) మద్వ్యపాశ్రయః - వాసుదేవుడనైన నన్నే ఆశ్రయముగ బడసినవాడు అనగా నా యెడ నొప్పగించబడిన మనస్సు మొదలగునవి గలవాడు (శంకరులు). భగవంతుడే సకలమునకును కర్తయని తలంచి యున్నవాడు (రామానుజులు) నా యొక్క ఆరాధన రూపముగ నా యెడ ఒప్పజెప్పి యున్నవాడు (రామానుజులు).

(3) శాశ్వతం - నిత్యమైనది (శంకరులు, రాఘవేంద్రులు).

(4) పదం - విష్ణువుయొక్క స్థానమును (శంకరులు). నన్ను (రామానుజులు, రాఘవేంద్రులు).

(5) అవ్యయం - వికారము లేనిది (శంకరులు, రాఘవేంద్రులు).

శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ॥ 57

పద॥ చేతసా (1) - సర్వకర్మాణి (2) - మయి - సన్న్యస్య (3) - మత్పరః (4)।
బుద్ధియోగం (5) - ఉపాశ్రిత్య (6) - మచ్చిత్తః - సతతం - భవ॥

| | | | |
|---|---|---|---|
| సర్వకర్మాణి | సకల కర్మలను | బుద్ధియోగం | నిశ్చితబుద్ధిని, లేక బుద్ధియోగ<br>మును |
| చేతసా | మనస్సుచేత | | |
| మయి | నాయెడ | ఉపాశ్రిత్య | పొంది, లేక ఆశ్రయించి |
| సన్న్యస్య | ఒప్పచెప్పి (అర్పించి) | సతతం | ఎల్లప్పుడు |
| మత్పరః | నన్నే పొందవలసిన ఉత్తమ<br>మైన స్థానముగ గలవాడు<br>గను, లేక మేలైనదిగ<br>గొన్నవాడై | మచ్చిత్తః | నాయెడనే చిత్తమునుంచిన<br>వాడుగను |
| | | భవ | అగుదువుగాక |

తా॥ సకల కర్మలను మనస్సుచేత నాయెడ నర్పించి నేనే (వాసు
దేవుడే) పొందవలసిన ఉత్తమమైన స్థానమని నిశ్చితబుద్ధినిచెంది ఎల్లప్పుడు నాయెడనే చిత్తమునుంచిన వాడవగుదువు గాక!

(1) చేతసా - వివేకబుద్ధిచేత (శంకరులు). తాను ఈశ్వరునియొక్క అధీనుడనియు, అతనివలన ప్రేరేపింపదగిన వాడనియు, వాని దాసుడనియు నిశ్చయబుద్ధిచేత (రామానుజులు).

(2) సర్వకర్మాణి - ఇహపర సాధనములైన కర్మలను (శంకరులు). కర్త, ఉద్దిష్టులైన దేవతలు వీరలతో కర్మలను (రామానుజులు) సకలములైన విహితకర్మలను (రాఘవేంద్రులు)

(3) సన్న్యస్య - యత్కరోషి యదశ్నాసి (అధ్యా. 9. శ్లో. 27) అనుచోట జెప్పినట్లు నాకర్పించి (శంకరులు).

(4) మత్పరః — నన్నే ఉత్తమమైన దైవమని నమ్మి (శంకరులు). ముఖ్యముగ పొందదగిన ఫలము నేనేయను నమ్మకముతో (రామానుజులు). నేనే సర్వోత్తముడనను బుద్ధితోగూడినవాడై (రాఘవేంద్రులు).

(5-6) బుద్ధియోగం ఉపాశ్రిత్య - మనస్సును నాయెడ నిలకడగ నిలబడునట్లు జేసికొని, అనగా నన్నే శరణము బొంది (శంకరులు). బుద్ధియోగము నాశ్రయించి (రామానుజులు) బుద్ధిని విషయములలో ప్రవర్తింపకుండ నడ్డగించి నాయెడ నిలబెట్టి (రాఘవేంద్రులు).

శ్లో॥ మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ।
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥ 58

పద॥ మచ్చిత్తః — సర్వదుర్గాణి (1) — మత్ప్రసాదాత్ — తరిష్యసి॥
అథ — చేత్ — త్వం — అహంకారాత్ — న — శ్రోష్యసి — వినఙ్క్ష్యసి॥

| | | | |
|---|---|---|---|
| మచ్చిత్తః | సాయెడనే చిత్తము గలవాడ<br>వైన నీవు | అథ | తరువాత |
| | | త్వం | నీవు |
| నర్వమర్గాణి | సకల దుఃఖములనున్ను, లేక,<br>దాటుట కళ్యమైన<br>వాటి నన్నిటిని | అహంకారాత్ | (నేనే తెలిసినవాడనను) అహం<br>కారమువలన |
| | | నశ్రోష్యసిచేత్ | (నేను చెప్పినదానిని)విననిచో |
| మత్ప్రసాదాత్ | నాయొక్క అనుగ్రహమువలన | వినఙ్క్ష్యసి | చెడిపోగలవు |
| తరిష్యసి | అతిక్రమింపగలవు | | |

తా॥ నీవు నాయెడనే మనస్సుగలవాడవైనచో నాయొక్క అనుగ్రహము వలన సకలదుఃఖముల నతిక్రమింపగలవు. నీవు తెలిసినవాడనను అహంకారమువలన నేను జెప్పినదానిని విననియెడల చెడిపోగలవు. (అనగా పురుషార్థమును పొందజాలవని తాత్పర్యము.)

(1) సర్వదుర్గాణి — సంసారమునకు హేతువైన సకలకర్మలను (శంకరులు) సకల సంసారదుఃఖములనున్ను (రామానుజులు).



శ్లో॥ యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ 59

పద॥ యది — అహంకారం (1) — ఆశ్రిత్య — న — యోత్స్యే — ఇతి — మన్యసే ।
మిథ్యా — ఏషః — వ్యవసాయః — తే — ప్రకృతిః (2) — త్వాం (3) — నియోక్ష్యతి ॥

| | | | |
|---|---|---|---|
| అహంకారం | అహంకారమును | ప్రకృతిః | మాయయైనది (రజోగుణ |
| ఆశ్రిత్య | పొంది | | రూపముగ పరిణమించి) |
| నయోత్స్యే ఇతి | యుద్ధము జేయలేనని | | లేక స్వభావమైనది |
| మన్యసే యది | నిశ్చయము గలవాడవైనచో | త్వాం | నిన్ను |
| ఏషః తే వ్యవసాయః | ఇట్టి నీయొక్క నిశ్చయము అబద్ధమైనది లేక వ్యర్థమైనది | నియోక్ష్యతి | (యుద్ధమున) ప్రవర్తించునట్లు చేయగలదు |

తా॥ ఒకవేళ అహంకారమునుపొంది యుద్ధముజేయనని నిశ్చయము గలవాడవైనచో అట్టి నీయొక్క నిశ్చయము అబద్ధమైనది. మాయయనునది నిన్ను యుద్ధమున ప్రవర్తింపజేయగలదు.

(1) యద్యహంకారం — 'యదహంకారం' అని పాఠము (శ్రీధరులు రాఘవేంద్రులు) యత్ మన్యసే = ఎట్టినిశ్చయము పొందెదవో, ఒకవేళ ఇష్టానిష్టముల నెఱుంగుటలో (నీవు) స్వతంత్రుడవను నభిమానమును (రామానుజులు).

(2) ప్రకృతిః — క్షత్రియ స్వభావము (శంకరులు). ఈశ్వరేచ్ఛ (రాఘవేంద్రులు).

(3) త్వాం — నాకు అధీనుడగుటలో భయము చెందియున్న నిన్ను (రాఘవేంద్రులు).



శ్లో॥ స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్ ॥ 60

పద॥ స్వభావజేన — కౌంతేయ — నిబద్ధః — స్వేన — కర్మణా ।
కర్తుం - న ఇచ్ఛసి - యత్ - మోహాత్ (1) కరిష్యసి - అవశః (2) - అపి - తత్ ॥

| | | | |
|---|---|---|---|
| హే కౌంతేయ ! | ఓ కుంతీపుత్రా ! | యత్ | ఏ యుద్ధమును |
| స్వభావజేన | పూర్వకర్మ శేషమువలన గలిగిన లేక స్వభావము వలన గలిగిన | కర్తుం | చేయుటకు |
| | | నేచ్ఛసి | ఇచ్ఛించుటలేదో |
| | | తత్ | దానిని |
| స్వేన కర్మణా | నీయొక్క కర్మచేత | అవశః అపి | పరాధీనుడవుగనే |
| నిబద్ధః | గట్టిగా కట్టుబడిన (నీవు) | కరిష్యసి | చేయబోవుచున్నావు |
| మోహాత్ | అవివేకమువలన | | |

తా॥ ఓ కుంతీపుత్రా! పూర్వకర్మవలన గలిగినట్టియు, నీయొక్క స్వధర్మమైనట్టియు శౌర్యము మొదలగు కర్మవలన కట్టుబడిన నీవు అవివేకము వలననే యుద్ధమును జేయగోరుటలేదో అట్టి యుద్ధమునుగూడ పరాధీనుడుగ జేయబోవుచున్నావు.

(1) మోహాత్ - బంధువులనెడి స్నేహమువలన (రాఘవేంద్రులు).

(2) అవశోపి - పరాధీనుడుగనే (శంకరులు). అవశః = ఇతరుల అవమతింపును సహింపక (రామానుజులు). భగవదిచ్ఛాధీనుడుగ నున్నవాడై (రాఘవేంద్రులు).

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥　61

పద॥ ఈశ్వరః - సర్వభూతానాం - హృద్దేశే (1) - అర్జున (2) - తిష్ఠతి।
భ్రామయన్ (3) - సర్వభూతాని (4) - యన్త్రారూఢాని (5) - మాయయా (6)॥

| | | | |
|---|---|---|---|
| హే అర్జున ! | ఓ అర్జునా ! | భ్రామయన్ | కర్మలలో ప్రవర్తింపజేయుచు లేక ఆడించుచు |
| ఈశ్వరః | ఈశ్వరుడు | | |
| సర్వభూతాని | సకల ప్రాణులను | సర్వభూతానాం | సకలప్రాణులయొక్క |
| యంత్రారూఢాని(ఇవ) | యంత్రమెక్కిన వస్తువులనువలె | హృద్దేశే | హృదయప్రదేశమున లేక స్థానమున |
| మాయయా | తనయొక్క శక్తిచేత (మాయచేత) | తిష్ఠతి | నిలబడుచున్నాడు. |

తా॥ ఓ అర్జునా! యంత్రమెక్కిన వస్తువులనువలె ప్రాణులనన్నిటిని తనయొక్క శక్తిచే కర్మలలో ప్రవర్తింప జేయుచు ఈశ్వరుడు సకలప్రాణుల హృదయములలో నున్నాడు.

(1) హృద్దేశే-ప్రవృత్తి నివృత్తి మూలమైన జ్ఞానము గలిగెడిచోటైన హృదయమున (రామానుజులు). "ఏకోదేవః సర్వభూతేషు గూఢం సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా, కర్మాధ్యక్షః సర్వ భూతాధివాసః సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ = సకల భూతములలోను అంతర్యామిగను, సర్వవ్యాపిగను, సకలభూతములకును అంతరాత్మగను, కర్మల కధిపతిగను, సర్వభూత ములలోను ఉంటున్నవాడుగను, సాక్షిగను, కేవలము చేతనస్వరూపిగను గుణములు లేని వాడుగనున్న దేవుడొక్కడే. (శ్వేతాశ్వతరోపనిషత్తు 6-వ అధ్యా-11 వాక్యము)

"యఆత్మని తిష్ఠన్ ఆత్మానమంతరో యమయతి ఏషత ఆత్మాంతర్యామ్యమృతః = ఎవ్వడు ప్రాణములోనున్నవాడై ప్రాణమును నియమించుచున్నాడో అతడే నాశము లేనట్టియు, అంతర్యామియైనట్టియు నీయొక్క ఆత్మ" బృహదారణ్యకోపనిషత్తు అంతర్యామి బ్రాహ్మణమును చూడుడు. (శ్రీధరులు).

(2) అర్జున - శుద్ధాంతఃకరణము గలవాడా (శంకరులు).

(3) భ్రామయన్ - పూర్వకర్మానుసారముగ ప్రవర్తింపజేయుచు (రామానుజులు).

(4) సర్వభూతాని - దేహాభిమానముతో గూడిన ప్రాణులన్నిటిని (శ్రీధరులు).

(5) యంత్రారూఢాని - శరీరమనెడి యంత్రమెక్కిన (శ్రీధరులు). తనవలన గలుగజేయబడి నట్టియు, ప్రకృతియని పేరుబడసినట్టియు దేహేంద్రియ రూపముగనున్న యంత్ర మెక్కిన (రామానుజులు), శరీరములోనున్న (రాఘవేంద్రులు).

(6) మాయయా - సత్త్వాది గుణములుగల విష్ణువుయొక్క మాయచేత (రామానుజులు). నా యొక్క స్వరూపమైన ఇచ్ఛాశక్తిచేత (రాఘవేంద్రులు).

(శ్రీధరులు) మునుపటి 59-60 శ్లోకములచే సాంఖ్యులు మొదలగువారల సిద్ధాంతము ననుసరించి జీవులు ప్రకృతికి లోబడిన వారలనియు, స్వభావమగు కర్మకులోబడిన వారలనియు, జెప్పి, ఈ 61-62 శ్లోకములవలన జీవులు తన కధీనులు అను స్వమతమును భగవంతుడు జెప్పు చున్నాడు.

(రామానుజులు) సకల భూతములున్ను పూర్వకర్మానుసారముగ మాయకులోబడి నడచునట్లు నాచే నియమింపబడియున్నవను దానిని చెప్పుచున్నాడు.

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం॥ 62

పద॥ తం (1) - ఏవ - శరణం - గచ్ఛ - సర్వభావేన - భారత।
తత్ప్రసాదాత్ - పరాం (2) - శాంతిం (3) - స్థానం (4) - ప్రాప్స్యసి - శాశ్వతం॥

| | | | |
|---|---|---|---|
| హే భారత! | ఓ భరతవంశమునం దుదయించినవాడా! | పరాం | ఉత్తమమైన (మేలైన) |
| | | శాంతిం | సకల విషయములలోనుండి నివృత్తి చెందిన చిత్తమునున్ను (చిత్త సమాధానమునున్ను) లేక విశ్రాంతినిన్ని |
| సర్వభావేన | దేహేంద్రియాదులచేత | | |
| తమేవ | ఆ ఈశ్వరునే | | |
| శరణం | శరణముగ | | |
| సర్వభావేన | అన్నివిధములచేతను | శాశ్వతం | నిత్యమైన |
| గచ్ఛ | పొందుము | స్థానం | స్థానమును లేక స్థితిని |
| తత్ప్రసాదాత్ | ఆ ఈశ్వరానుగ్రహమువలన | ప్రాప్స్యసి | పొందగలవు. |

తా॥ ఓ భరతవంశమున బుట్టినవాడా! దేహేంద్రియాదులవలన అట్టి యీశ్వరునే శరణముగ పొందుము. అట్టి యీశ్వరుని యనుగ్రహమువలన ఉత్తమమైన చిత్తసమాధానమునున్ను నిత్యమైన స్థానమునున్ను పొందగలవు.

(1) తమేవ - సకలలోకములకును నియామకుడుగను, ఆశ్రితవాత్సల్యమువలన నీకు సారథిగను, ఎదుటనుండి నిన్ను ప్రేరేపించువాడుగనునున్న నన్నే (రామానుజులు).

(2-3) పరాం శాంతిం - ఉత్తమమైన ఉపశాంతిని (శ్రీధరులు, శంకరులు). సర్వకర్మబంధ నివృత్తిని (రామానుజులు) బుద్ధిని ఎల్లప్పుడు భగవంతునియెడ నిలబెట్టుటను (రాఘవేంద్రులు).

(4) స్థానం - విష్ణువగు నాయొక్క వైకుంఠలోకమును (రాఘవేంద్రులు).

(స్వకీయము) మునుపటి శ్లోకమున ఈశ్వరుడు సకలప్రాణుల హృదయముననుండి కర్మలలో ప్రేరేపించువాడుగ చెప్పబడెను. ఈ శ్లోకమందలి "తం = వానిని" అను పదము ఆ యీశ్వరునే గుర్తించుచున్నది. అట్టి యీశ్వరుడే కృష్ణపరమాత్మగనుండగా "నన్ను" అని చెప్పక, కృష్ణపరమాత్మకంటె అన్యుడైన ఒక ఈశ్వరుడున్నట్లు "వానిని" అనిచెప్పుటకు కారణమేమనిన, అంతర్యామియై సకల భూతములలోనుండి ప్రేరేపించెడి యీశ్వరుడు కృష్ణపరమాత్మకంటె వేరైన వాడుకాడు. ఐనను ప్రతియొక్కడున్ను పరమాత్మ యెచ్చటనున్నాడని వెతుకనక్కరలేదు. వాని వాని హృదయమునందే నియంతగనున్నాడు. అట్టి యంతర్యామి స్వరూపముగూడ బ్రహ్మమే యనుదానిని గుర్తించిచూపుటకై "తం = వానిని" అనుపదము ప్రయోగింపబడినది.



శ్లో॥ ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63

పద॥ ఇతి - తే - జ్ఞానం (1) - ఆఖ్యాతం - గుహ్యాత్ - గుహ్యతరం - మయా।
విమృశ్య (2) - ఏతత్ - అశేషేణ - యథా - ఇచ్ఛసి - తథా - కురు॥

| | | | |
|---|---|---|---|
| ఇతి | ఈవిధముగ | ఏతత్ | ఈ గీతాశాస్త్రమును |
| గుహ్యాత్ | రహస్యములకెల్ల లేక రహస్యమున కంటె | అశేషేణ | పూర్తిగ |
| | | విమృశ్య | విమర్శించి (తరువాత) |
| గుహ్యతరం | అతిరహస్యమైన | యథా | ఎట్లు |
| జ్ఞానం | జ్ఞానము (హేతువైనశాస్త్రము) | ఇచ్ఛసి | ఇచ్ఛించుచున్నావో లేక ఇష్టపడుచున్నావో |
| మయా | నాచేత | | |
| తే | నీకు | తథా | ఆవిధముగ |
| ఆఖ్యాతం | చెప్పబడినది. | కురు | చేయుము. |

తా॥ ఈ విధముగ రహస్యములకెల్ల అతిరహస్యమైన జ్ఞానమును గలుగ జేయదగిన గీతాశాస్త్రము నాచే నీకు చెప్పబడినది. ఇట్టి గీతాశాస్త్రమును పూర్తిగ నాలోచించి (దానివెనుక) ఎట్లు ఇచ్ఛించుచున్నావో, అట్లు చేసెదవు గాక.

(1) జ్ఞానం - కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము, వీటిని స్పష్టపరచెడి గీతాశాస్త్రము (రామానుజులు). ఎరుంగవలసినది (రాఘవేంద్రులు).

(2) విమృశ్య-నీవు ఏయోగమునకు తగినవాడవనుదానిని నీవుగవిమర్శించి యెరింగి (రామానుజులు).



శ్లో॥ సర్వగుహ్యతమం భూయశ్శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥ 64

పద॥ సర్వగుహ్యతమం - భూయః (1) - శృణు - మే - పరమం - వచః ।
ఇష్టః - అసి - మే - దృఢం (2) - ఇతి - తతః - వక్ష్యామి - తే - హితం ॥

| | | | |
|---|---|---|---|
| సర్వగుహ్యతమం | అన్నిటికంటె మిక్కిలి రహస్యమైన | మే | (నీవు) నాకు |
| | | దృఢం | అత్యంతము (మిక్కిలి) |
| మే | నాయొక్క | ఇష్టః అసి | ఇష్టుడుగనున్నావు |
| పరమం | ఉత్తమమైన | ఇతితతః | ఈ దానిచే లేక అనుదానివలన |
| వచః | వాక్యమును | తే | నీకు |
| భూయః | మఱలను | హితం | అనుకూలమైన దానిని |
| శృణు | వినుము | వక్ష్యామి | చెప్పబోవుచున్నాను. |

తా॥ సకల రహస్యములలోను మహారహస్యమైనదియు, ఉత్తమమైనదియు నైన నాయొక్క వాక్యమును వినుము. నీవు నాకు మిక్కిలి ఇష్టుడుగ నున్నావు. ఈ నిమిత్తమువలన నీకనుకూలమైనదానిని మఱలను చెప్పబోవుచున్నాను.

(1) భూయః - మఱలను మునుపుజెప్పిన వాటిలో నేజి యెత్తిచెప్పబడునట్టి (ఆనందగిరి). మునుపు చెప్పియున్నను మఱలను (రాఘవేంద్రులు).

(2) దృఢమితి - 'దృఢమతి' అనియు పాఠముగలదు. నిశ్చయబుద్ధి గలవాడని అర్థము. (శ్రీధరులు). దృఢం = తప్పక. 'దృఢ ఇతి' అనియుపాఠము. గట్టితనముగలవాడని అర్థము (రామానుజులు).



శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ 65

పద॥ మన్మానాః - భవ - మద్భక్తః - మద్యాజీ - మాం - నమస్కురు ।
మాం - ఏవ - ఏష్యసి - సత్యం - తే - ప్రతిజానే - ప్రియః - అసి - మే

| | | | |
|---|---|---|---|
| మన్మనాః | నాయెడ మనస్సుగలవాడుగను | ఏష్యసి | పొందగలవు. |
| మద్భక్తః | నాయెడ భక్తిగలవాడుగను | తే | నీకు |
| మద్యాజీ | నన్ను ఆరాధించెడివాడుగను | సత్యం | వాస్తవముగ |
| భవ | అగుదువుగాక | ప్రతిజానే | ప్రతిజ్ఞజేయుచున్నాను |
| మామేవ | నన్నే | మే | నాకు |
| నమస్కురు | నమస్కరించుము. | ప్రియః | ప్రియుడవై లేక మిత్రుడవై |
| మాం (ఏవ) | (నన్నే) | అసి | ఉన్నావు. |

తా॥ నాయెడ మనస్సుగలవాడవుగను, భక్తిగలవాడవుగను, నన్నారాధించువాడవుగను అగుదువుగాక. నన్నే నమస్కరించుము, నన్నే పొందగలవు. నీకు వాస్తవముగ గట్టిమాట చెప్పుచున్నాను. నాకు ప్రియుడవుగ నున్నావు.

(రామానుజులు) మన్మనాః = ఎడదెగనట్టియు, చలించనట్టియు వేదాంతార్థస్మరణము గలవాడవుగను, మద్భక్తః = నాకు మిక్కిలి ప్రియమైనట్టియు ఎడదెగనట్టియు చలించనట్టియు స్వరూపస్మరణగలవాడవుగను, మద్యాజీ = మిక్కిలి ప్రియమైన నన్నారాధించు వాడవుగను, భవ= అగుదువుగాక, నమస్కురు = మిక్కిలి ప్రియమైన మిక్కిలి నమస్కారము జేయుము, మామేవ ఏష్యసి = నన్నే పొందగలవు, సత్యం = ఇది వాస్తవమేను. ఇట్లు నాయెడ ఎవ్వడు ప్రీతినుంచునో ఆవిధముగనే నేనుగూడ నతనియెడ ప్రీతిగలవాడనుగనున్నాను. వాని వియోగమును సహింపక అతడు నన్ను పొందునట్లు చేసెదను.

(రాఘవేంద్రులు) ఇందులో జెప్పబడియున్న నమస్కారము వఱకుగల నాలుగే సాధన చతుష్టయమనంబడును.

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ 66

పద॥ సర్వధర్మాన్ - పరిత్యజ్య - మాం - ఏకం - శరణం - వ్రజ ।
అహం - త్వా - సర్వపాపేభ్యః - మోక్షయిష్యామి - మాశుచః ॥

| | | | |
|---|---|---|---|
| సర్వధర్మాన్ | సకల ధర్మములనున్ను | అహం | నేను |
| పరిత్యజ్య | వదలి | త్వా | నిన్ను |
| మాం ఏకం | నన్ను ఒకనినే | సర్వపాపేభ్యః | సకల పాపములనుండి |
| శరణం | శరణముగ | మోక్షయిష్యామి | విడిపించెను |
| వ్రజ | పొందుము | మాశుచః | దుఃఖింపకుము. |

తా॥ సకల ధర్మములను (సంధ్యావందనము మొదలగు నిత్య నైమిత్తికములైన సకల కర్మలనున్ను వదలి, నన్నే శరణమొందుము. నేను నిన్ను (అట్టి కర్మలన్నిటిని విడచుటవలన గలిగెడి) సకల పాపములనుండియు విడిపింపగలను. (అట్లు విడిచిపెట్టుటవలన నిన్ను పాపమొందగలదని) దుఃఖింపకుము.

(శంకరులు) సకల కర్మయోగనిష్ఠకంటె పరమరహస్యమైన ఈశ్వరశరణాగతి కడపటిదిగ చెప్పడమైనది. ఇప్పుడు కర్మయోగనిష్ఠకు ఫలముగను, సకల వేదాంత సారముగనునున్న పూర్ణజ్ఞానము ఈ శ్లోకముచే చెప్పబడుచున్నది.

సర్వధర్మాన్ = సకల ధర్మాధర్మములనున్ను అనగా సకల కర్మలనున్ను, పరిత్యజ్య= వదలి, మామేకం = సర్వాత్మగను సమానముగ సర్వభూతములలో నున్నవాడుగనునున్న ఈశ్వరుడుగనున్న నన్ను నీవేయని (అనగా నీవే యట్టిబ్రహ్మమని) శరణం వ్రజ = నన్నుదప్ప వేరొక్కటిలేదని నిశ్చయించుకొనుము. త్వా = ఇటి నిశ్చయముగల నిన్ను, అహం = నేను, సర్వపాపేభ్యః = బంధరూపమైన సకలకర్మలనుండియు, మోక్షయిష్యామి = నాయొక్క స్వరూప ప్రకాశముచే మించుటవలన విడిపించుచున్నాను. ఈ యర్థము "నాశయామ్యాత్మభావస్థో జ్ఞాన దీపేన భాస్వతా (అధ్యా 10, 6-11) అనుచోట జెప్పబడియున్నది. మాశుచః = కావున దుఃఖింపకుము.

(శంకరభాష్యమందలి లోగఢ తాత్పర్యము) ఈ గీతాశాస్త్రమున "యద్జ్ఞాత్వాఽమృతమశ్నుతే" (అధ్యా 13,6-13) "తత్త్వతో జ్ఞాత్వావిశతే తదనన్తరం" (ఇందలి శ్లో-55) ఈ శ్లోకములు

జ్ఞానము మోక్షమునకు కారణమని చెప్పుచున్నవి. "కర్మణ్యేవాధికారస్తే" (అధ్యా2-శ్లో47-)"కురు కర్మైవ తస్మాత్త్వం" (అధ్యా 4-శ్లో-15) ఇవి మొదలగు శ్లోకములు కర్మలను అవశ్యముగ జేయ వలెనని చెప్పుచున్నవి. ఈ విధముగ జ్ఞానము కర్మలురెంటిని జేయ నుపదేశించినందున జ్ఞానము మాత్రమేనా, లేక కర్మమాత్రమేనా, లేక రెండును చేరియా మోక్షమునకు హేతువనుదానిలో సందేహముగలుగుచున్నది. కావున అనుష్ఠింపవలసినవాడు ఇట్టిదానినే యనుష్ఠింపవలెనని తెలిసి కొనుటకై ఒకదానిని నిశ్చయింపవలసినది అవశ్యకముగనున్నది. జ్ఞానమనునది సకల భేదబుద్ధిని నివర్తింపజేసి మోక్షమివ్వగలదిగ నున్నది. కర్మయనగా క్రియ, కారణములైన వస్తువులు, ఫలము, వీటియొక్క భేదబుద్ధిని మూలముగబడసియున్నది. నేను, నాది, నేను కర్త, నేను భోక్త, నేను బ్రాహ్మణుడను, గృహస్థుడను అను భేదబుద్ధులు అవిద్యవలన ఆత్మయెడ అనాదిగవ్యాపించి యున్నవి. నేను మాయలేనివాడను, కర్తకాను, క్రియలేనివాడను, పొందవలసినదిగ ఏ యొకఫలము లేనివాడను, నాకంటె వేరైన వస్తువులేదను జ్ఞానమైనది, పైజెప్పిన కర్మలో ప్రవృత్తికి హేతువైన భేదబుద్ధినిన్ని, దానికి కారణమైన అవిద్యనున్ను పోగొట్టును. కేవలము కర్మయనునది ఒక అంధ కారమును మఱియొక అంధకారము పోగొట్టజాలనట్లు భేదబుద్ధిని, అవిద్యను నివర్తింపజాలదు. జ్ఞానమైతే అది గలిగినతోడనే (సూర్యుడుదయించినతోడనే చీకటిని పోగొట్టుటవలె) కర్మకు కారణ మైన అవిద్యనుగూడ తొలగించుచున్నది. కావున జ్ఞానమునకు కర్మతోచేరిక యనునదే అసంభావి తము. కాన జ్ఞానముమాత్రమే మోక్షమునకు కారణము.

(రామానుజులు) సర్వధర్మాన్ = జ్ఞానయోగ కర్మయోగ భక్తియోగముల ఫలమును, లేక భక్తియోగారంభమునకు విరోధియైన పాపములను నివర్తించునట్టిదైన ప్రాయశ్చిత్తములను, పరిత్యజ్య=విడిచి, మామేకం = కర్తయైన నన్నే, శరణం = సేవింపదగినవాడుగను, పొంద దగిన వాడుగను, పొందుటకుపాయముగను, వ్రజ = అను సంధానము జేయుము, అహం = నేను, త్వా = నిన్ను, సర్వపాపేభ్యః = అనాది కాలముగ చేయదగనిదానిని చేసియు, చేయవలసినదానిని చేయకయు సంపాదింపబడి నన్ను పొందుటకు విరోధులైన సకల పాపములనుండి, లేక భక్తి యోగారంభమునకు విరోధులైన సకల పాపములనుండి, మోక్షయిష్యామి = విడిపించెదను. మాశుచః=శోకింపకుము లేక స్వల్పమైన ఆయుష్యము గల నేను అంతటి పాపములకున్ను ఎట్లు ప్రాయశ్చిత్తము జేయగలనని దుఃఖింపకుము.

(రాఘవేంద్రులు) సర్వధర్మాన్ = సాధన చతుష్టయము దప్ప మిగత ధర్మములను లేక సర్వ కర్మఫలములను, లేక అవైష్ణవ ధర్మములను, పరిత్యజ్య = విడిచి, మామేకం = నన్నొకనినే, శరణం వ్రజ = శరణముగ పొందుము. అహం = నేను, సర్వపాపేభ్యః = సకల పాపముల నుండియు, మోక్షయిష్యామి = విడిపించెదను, మాశుచః = సంసార భయమువలన దుఃఖింపకుము.

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥ 67

---

పద॥ ఇదం - తే - న - అతపస్కాయ - న - అభక్తాయ - కదాచన।
న - చ అశుశ్రూషవే - వాచ్యం - న - చ - మాం - యః - అభ్యసూయతి ॥

| | | | |
|---|---|---|---|
| తే ఇదం | నీ కుపదేశింపబడిన ఈ గీతార్థ తత్త్వము | అశుశ్రూషవే చ | ఈశ్వరగురుశుశ్రూషచేయని, లేక గీతాతత్త్వమును వినుటకు ఇష్టము లేనివానికి, గురు శుశ్రూష చేయనివానికిన్ని |
| అతపస్కాయ | తపస్సులేనివానికి | | |
| కదాచన | ఒకప్పుడున్ను | | |
| న వాచ్యం | చెప్పదగినదిగాదు | న | చెప్పదగినదికాదు. |
| అభక్తాయ చ | ఈశ్వరుడు గురువు వీరలయెడ భక్తిలేనివానికి, లేక భక్తిలేనివానికి | యః | ఎవ్వడు |
| | | మాం | నన్ను |
| | | అభ్యసూయతి | దూషించుచున్నాడో |
| న | చెప్పదగినదికాదు. | (తస్మై) చ | అతనికిన్ని |
| | | న | చెప్పదగినదికాదు. |

తా॥ ఈ గీతార్థతత్త్వము స్వధర్మానుష్ఠానము, లేక, తపస్సులేని వానికిన్ని, ఈశ్వరుడు గురువు వీరలయెడ భక్తియు వారి శుశ్రూషయు, లేక, దీనిని వినుటకు ఇష్టమున్ను లేనివానికిన్ని, నన్ను నిందించువానికిన్ని, ఒకప్పు డున్ను నీచే చెప్పదగినది గాదు.

(శంకరులు, రామానుజులు, రాఘవేంద్రులు) నీ కొఱకు చెప్పబడిన ఈ గీతార్థ తత్త్వ మును తపస్సుచేయని వానికి చెప్పకుము. తపస్సు చేయువాడైనను ఈశ్వరుడు, గురువు వీరలయెడ భక్తిలేని వానికి చెప్పకుము. తపస్సు భక్తియున్నను గురుశుశ్రూష, లేక వినుటకు ఇచ్ఛలేనివానికి చెప్పకుము. తపస్సు భక్తి శుశ్రూష ఇవి మూడునున్నను ఈశ్వరనిందగలవానికి ఒకప్పుడున్ను చెప్పకుము అని తాత్పర్యము.

(శంకరులు) తపస్సులేకున్నను మిగుత గుణములున్నచో (మేధావి) సూక్ష్మబుద్ధిగల వాడైనచో చెప్పవచ్చును.



శ్లో॥ య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥　　68

పద॥ యః - ఇమం - పరమం - గుహ్యం - మద్భక్తేషు - అభిధాస్యతి ।
భక్తిం - మయి - పరాం - కృత్వా - మాం - ఏవ - ఏష్యతి - అసంశయః ॥

| | | | |
|---|---|---|---|
| యః | ఎవ్వడు | మద్భక్తేషు | నాయొక్క భక్తులయెడ |
| పరమం గుహ్యం | పరమరహస్యమైన | అభిధాస్యతి | చెప్పునో, లేక ఉపదేశించునో |
| ఇమం | ఈ గీతాశాస్త్రమును | (సః) | అట్టివాడు |
| మయి | నాయెడ | మాం | నన్ను |
| పరాం | శ్రేష్ఠమైన | ఏష్యత్యేవ | తప్పక పొందుచున్నాడు. |
| భక్తిం | భక్తిని | అసంశయః | నాయొక్క భక్తులయెడ సంశయములేదు. |
| కృత్వా | చేయుచు | | |

తా॥ ఎవ్వడు పరమరహస్యమైన ఈ గ్రంధమును నాయొక్క భక్తుల యెడ జెప్పునో, లేక (వారలకు ఉపదేశించునో) అట్టివాడు నాయెడ శ్రేష్ఠమైన భక్తిజేసి సకల సంశయములు తొలగినవాడై, నన్నే పొందగలడు.

(శంకరులు) అభిధాస్యతి = గీతాశ్లోకములనుగాని, వాటియర్థములను గాని నాటుకొనునట్లు చేయునో (మనస్సులో పాతుకొనునట్లు చెప్పునో) భక్తిం మయి పరాం కృత్వా = నాయెడ మిక్కిలి భక్తిజేసి అనగా వాసుదేవుడైన భగవంతుని సేవను ఈ విధముగనేను చేయుచున్నానను తలంపుతో నుపదేశింపవలెననునది తాత్పర్యము.

(రామానుజులు) - (శ్రీధరులు) "యఇదం పరమంగుహ్యం" అని పాఠము. యః - ఎవ్వడు - ఇదం పరమం గుహ్యం = ఈ పరమ రహస్యమును.

శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥ 69

పద॥ న - చ - తస్మాత్ - మనుష్యేషు - కశ్చిత్ - మే - ప్రియకృత్తమః ।
భవితా - న - చ - మే - తస్మాత్ - అన్యః - ప్రియతరః - భువి ॥

| | | | |
|---|---|---|---|
| మనుష్యేషు | మనుష్యులలో | న చ | లేదు |
| తస్మాత్ | నా భక్తులయెడ గీతనుపదేశించు వానికంటె, లేక వానికంటె | చ | మఱియు |
| | | తస్మాత్ | వానికంటె |
| | | మే | నాకు |
| మే | నాకు | ప్రియతరః | మిక్కిలి ప్రియుడైన |
| ప్రియకృత్తమః | మిక్కిలి ప్రియమైనపనిని జేసెడివాడు | అన్యః | వేరొక్కడు |
| | | భువి | భూమిమీద |
| కశ్చిత్ | ఒకడు | భవితా న చ | ఉండబోవుటయులేదు. |

తా॥ మనుష్యులలో నాభక్తులయెడ గీతనుపదేశించువానికంటె నాకు ప్రియమును జేసెడివాడు ఎవ్వడును లేడు. నాకు వానికంటె అన్యుడైనవాడు, మిక్కిలి ప్రియమైన వాడుగ భూమిలో కలుగబోవుట లేదు.

(రామానుజులు) అధికారిని ముందు చెప్పక అనధికారిని ముందుచెప్పవలసిన దేలనగా ఈ గీతాశాస్త్రమును యోగ్యునికి చెప్పకుండుట కంటె, అయోగ్యునికి చెప్పుట మిక్కిలి అప్రియమైనదనియే.

(రాఘవేంద్రులు) మనుష్యులలో ప్రియమైనవాడు లేడని చెప్పినందున దేవతలలోనుండ వచ్చునని ధ్వనించుచున్నది.

శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టస్స్యామితి మే మతిః ॥ 70

పద॥ అధ్యేష్యతే — చ — యః — ఇమం — ధర్మ్యం — సంవాదం — ఆవయోః ।
జ్ఞానయజ్ఞేన — తేన — అహం — ఇష్టః — స్యాం — ఇతి — మే — మతిః ॥

| | | | |
|---|---|---|---|
| ధర్మ్యం | ధర్మమునుండి తప్పనిదైన | అహం | నేను |
| ఆవయోః | మన యిద్దఱియొక్క | జ్ఞానయజ్ఞేన | జ్ఞానమనెడి యజ్ఞముచేత |
| ఇమం సంవాదం | ఈ సంవాదమును (సంభాషణమును) | ఇష్టః స్యాం ఇతి | పూజింపబడినవాడనగుదుననునది |
| యశ్చ | ఎవ్వడు | మే | నాయొక్క |
| అధ్యేష్యతే | చదువునో | మతిః | నిశ్చయము. |
| తేన | వానిచేత | | |

తా॥ ధర్మమును విడిచిపెట్టనిదైన మనయిద్దఱియొక్క (యీ ప్రశ్నోత్తర రూపముగనున్న గీతాశాస్త్రమనెడి) సంవాదమును ఎవ్వడు చదువునో వానిచే జ్ఞానమనెడి ఉత్తమయజ్ఞముచే నేనారాధింపబడిన వాడనగుదుననునది నాయొక్క నిశ్చయము.

(శ్రీధరులు) ఈ గీతార్థము నెఱుంగక పారాయణము మాత్రముచేసిన వాడుగూడ నన్నారాధించిన వాడనునది తాత్పర్యము. దేనివలెననగా తన్ను ఇట్టివాడని తెలియక ఒకడు తన పేరుచెప్పి పిలిచిన మాత్రమున అతడు తన్ను పిలువకపోయినను తన్ను పిలిచినట్లు ఎట్లు తలంచునో, అట్లే తెలియకయే నా నామము నుచ్చరించినగూడ వానియెడ నేను ప్రసన్నుఁడ నగుదును. (నారాయణ నామముయొక్క మహిమతెలియక అంత్యకాలమున నారాయణనామమును నోటితో నుచ్చరించిన అజామీళునికి ప్రసన్నుఁడగుటవలెనున్ను, నిప్పునితెలియక దానిని త్రొక్కిన వానిని నిప్పు కాల్చుటవలెనున్ను, ఔషధమనితెలియక దానిని సేవించినవారి వ్యాధిని ఆ యౌషధము గుణపరచుటవలెనున్ను అనిగ్రహింపుడు)

(శంకరులు) జ్ఞానయజ్ఞేన = అనినందున ఈ గీతాశాస్త్రమును జ్ఞానయజ్ఞమునకు సమానమైనదని స్తుతించినట్లుగాని, లేక దేవాదివిషయములైన యజ్ఞాదులవలె ఫలమివ్వదగినదనిగాని గ్రహింపవలెను. ఏలనగా యజ్ఞములు నాలుగువిధములు — (1) విధియజ్ఞః — అనగా శరీరమువలన జేయదగిన బ్రహ్మయజ్ఞాదులు, (2) జపయజ్ఞః = జపయజ్ఞము, అనగా పారాయణాదులగు నోటితో నుచ్చరించుట, (3) ఉపాంశుయజ్ఞః - ఉపాంశుయజ్ఞము అనగా ఇతరులకు వినపడకుండునట్లు నోటిలోపలనే యుచ్చరించుట, (4) మానసయజ్ఞము అనగా మనస్సుచే ధ్యానించుట. ఈ నాలుగవ మానసయజ్ఞమే జ్ఞానయజ్ఞము (చదువుట జ్ఞానయజ్ఞముకాజాలదు. కనుక స్తుతిగ జెప్పబడినది).

(రాఘవేంద్రులు) ఫలమునుజెప్పి గీతార్థము స్తుతింపబడుచున్నది. ధర్మ్యం = సకల జగత్తును ధరించెడి భగవంతుని విషయమైన, లేక ధర్మమునకు కారణముగనున్న (మిగత అర్థములలో భేదములేదు.)

~~~~~~~~~~

శ్లో॥ శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపిముక్తశ్శుభాన్‌లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణాం ॥ 71

పద॥ శ్రద్ధావాన్ (1) - అనసూయః - చ - శృణుయాత్ (2) - అపి - యః - నరః (3) ।
సః - అపి - ముక్తః - శుభాన్ - లోకాన్ - ప్రాప్నుయాత్ - పుణ్యకర్మణాం ॥
~~~~~~~~~~

| | | | |
|---|---|---|---|
| యః నరః | ఏ మనుష్యుడు | ముక్తః | (సకలపాపములనుండి) విడువ బడినవాడై |
| శ్రద్ధావాన్ | శ్రద్ధ (లేక) నమ్మకముగల వాడుగను | పుణ్యకర్మణాం | పుణ్యకర్మలను జేసినవారల యొక్క |
| అనసూయశ్చ | అసూయలేనివాడుగను | శుభాన్ లోకాన్ | మంచి లోకములను |
| (ఇదం) | ఈ గీతాశాస్త్రమును | ప్రాప్నుయాత్ | పొందును |
| శృణుయాదపి | వినుటనైన చేయునో | | |
| సోఽపి | ఆతనుగూడ | | |

తా॥ ఏ మనుష్యుడు శ్రద్ధ (విశ్వాసము) గలవాడుగను, (ఇతరులు చదువునప్పుడు ఇతడు డంబమునకై చదువుచున్నాడు, ధనమునకై చదువు చున్నాడు, తప్పుగ జదువుచున్నాడు అనిచెప్పుట యనెడి) అసూయలేని వాడుగను, వినుటనైన జేయునో అతడుగూడ సకల పాపములనుండియు విముక్తిజెందినవాడై పుణ్యకర్మల జేసినవారల (పుణ్యకర్మలు చేసినవారలు పొందదగిన స్వర్గాది) గొప్పలోకములను పొందును.

(1) శ్రద్ధావాన్ — ఆస్తిక్యబుద్ధిగలవాడు (రాఘవేంద్రులు)

(2) శృణుయాదపి - అర్థజ్ఞానములేకయే విన్నను, 'అపి' అనుదానిచే, అర్థజ్ఞానముతో విన్నవాడు గొప్పలోకమునుపొందును అనుదానిలో సందియములేదనెడి కైముతికన్యాయము చెప్ప బడినది. (శంకరులు) ఈ అపిశబ్దముచేత విన్నవానికంటె చదివినివానికిన్ని, చదివిన వానికంటె ఇతరులకు జెప్పినవానికిన్ని, వానికంటె దేవతలకున్ను ముక్తిలో అధికమైన సుఖముగలదని గుర్తింపబడుచున్నది (రాఘవేంద్రులు).

(3) పుణ్యకర్మణాం — పుణ్యకర్మలనుజేసి నన్ను ఆరాధించిన వారలైన నాభక్తులయొక్క, శుభాన్ లోకాన్ = మంచిసమూహములను (రామానుజులు).



శ్లో॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ ॥ 72

పద॥ కచ్చిత్ — ఏతత్ - శ్రుతం - పార్థ - త్వయా - ఏకాగ్రేణ - చేతసా।
కచ్చిత్ - అజ్ఞానసమ్మోహః — ప్రణష్టః — తే — ధనంజయ ॥

| | | | |
|---|---|---|---|
| హే పార్థ! | ఓ అర్జునా! | హే ధనంజయ! | ఓ ధనంజయా! |
| ఏతత్ | ఇది (వరకు చెప్పవచ్చినది) | తే | నీయొక్క |
| త్వయా | నీచేత | అజ్ఞానసమ్మోహః | అవివేకమువలన గలిగిన అజ్ఞానము |
| ఏకాగ్రేణ చేతసా | ఏకాగ్రమైన మనస్సుతో | | |
| శ్రుతం కచ్చిత్ | వినబడినదా? | ప్రణష్టః కచ్చిత్ | పోయినదా? |

తా॥ ఓ అర్జునా! ఇంతవఱకు జెప్పవచ్చినది నీచే ఒకటేవిధమైన మనస్సుతో వినబడినదా? ఓ ధనంజయా! నీయొక్క అవివేకమువలన గలిగిన (బంధుస్నేహమనెడి) మోహము తొలగిపోయినదా ?

(శంకరులు) తనచే నుపదేశింపబడినదానిని అర్జునుడు బాగుగ తెలిసికొనెనా యనుదాని నెఱుంగుటకై భగవంతుడు ప్రశ్నించుచున్నాడు.

అర్జున ఉవాచ:—

శ్లో॥ నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥　　73

పద॥ నష్టః - మోహః - స్మృతిః - లబ్ధా - త్వత్ప్రసాదాత్ - మయా - అచ్యుత ।
స్థితః - అస్మి - గతసందేహః - కరిష్యే - వచనం - తవ ॥

| | | | |
|---|---|---|---|
| అర్జునఉవాచ | అర్జునుడు చెప్పినది | లబ్ధా | పొందబడినది |
| హే అచ్యుత ! | ఓ నాశములేనివాడా ! | (అహం) | నేను |
| మోహః | అజ్ఞానమోహము | గతసందేహః | సందేహము తొలగి |
| నష్టః | తొలగిపోయినది | స్థితః అస్మి | నిలకడచెందిన వాడనుగ నున్నాను |
| త్వత్ప్రసాదాత్ | నీయొక్క అనుగ్రహమువలన | | |
| మయా | నాచేత | తవ | నీయొక్క |
| స్మృతిః | ఆత్మస్వరూపాను సంధానము (లేక) ఆత్మతత్త్వమును గూర్చిన స్మరణము | వచనం | వాక్యమును |
| | | కరిష్యే | నెరవేర్చగలను (చేసెదను). |

తా॥ అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మను గూర్చి చెప్పునది. ఓ అచ్యుతా ! నీయొక్క అనుగ్రహమువలన అజ్ఞానము తొలగిపోయినది. నాచే ఆత్మస్వరూపాను సంధానము పొందబడినది. సందేహ నివృత్తి పొందినవాడనుగ నున్నాను. నీయొక్క వాక్యమును నెఱవేర్చెదను. (నీవుచెప్పినట్లు చేసెదనని తాత్పర్యము.)

(శంకరులు) అవివేకము తొలగిపోయినదా? అను ప్రశ్నకు అజ్ఞానము తొలగిపోయినదని ఉత్తరము చెప్పబడినది. ఈ యుత్తరమువలన శాస్త్రవిచారమునకు అజ్ఞాననివృత్తి, ఆత్మస్వరూపాను సంధానము ఇవియే ఫలములని బయటబెట్టబడిన దగుచున్నది.

"నీయొక్క వాక్యమును నెఱవేర్చెదను" అనినందున నాకు కావలసినదిగ నేదియులేదు. నీయొక్క ఆజ్ఞను నెరవేర్చుట నా యొక్క కర్తవ్యమని తలంచుచున్నాను అను తాత్పర్యము లభించుచున్నది

(రామానుజులు) స్మృతిః లబ్ధా = తత్త్వజ్ఞాన మొందితిని. అనగా ఆత్మ, ప్రకృతి విలక్షణుడనియు, ప్రకృతి స్వభావము గలవాడు గాడనియు, జ్ఞానస్వభావము గలవాడనియు, పరమ పురుషునికి శేషుడనియు, పరమ పురుషునివలన నియమింపఁబడదగినవాడనియు, ఇట్టి జ్ఞానమున్ను, సకల జగత్తులయొక్క సృష్టిస్థితి సంహారము మొదలగు లీలను గలిగినట్టియు, సకల దోషములకున్ను విరోధియైన కల్యాణ స్వరూపియైనట్టియు, అంతులేని సదృశములేని జ్ఞానము బలము ఐశ్వర్యము వీర్యము శక్తి తేజస్సు మొదలగు సకల కల్యాణ గుణసాగరమైనట్టియు, బ్రహ్మ శబ్దముచే చెప్పబడునట్టిదైన పరమ పురుషుని విషయమైన యథార్థ జ్ఞానమున్ను, ఇట్టి పరాపర తత్త్వములయొక్క యథార్థజ్ఞానాభ్యాసముచే రోజుకురోజు వృద్ధిచెందెడి పరమపురుషుని ప్రీతినే ముఖ్యఫలముగ బడసిన నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానము, నిషిద్ధపరిహారము, శమదమాది ఆత్మగుణ

ములవలన సంభవించెడి భ క్తియనెడి పరమపురుషోపాసనచేతనే వేదాంతమువలన నెఱుంగదగిన వాడును పరమపురుషుడును, వాసుదేవుడునునైన నీవుపొందదగినవాడవను జ్ఞానమున్ను లభించి నది. దానివలన, గతసందేహః = బంధుస్నేహము, కరుణ, వీటివలన వృద్ధిచెందిన విపరీత జ్ఞానమువలన గలిగిన సకలసందేహములున్ను తొలగినవాడనైతిని. నష్టోమోహః = అనాత్మయైన ప్రకృతిలో ఆత్మయనియు బరమ పురుష శరీరమైనందున వానినే ఆత్మగ బడసిన సకలచేతనా చేతనవస్తువులను అట్లుకాదనియు పరమపురుషుని యారాధనముగ నున్నందున పరమపురుష ప్రాప్తికి హేతువైన నిత్యనైమిత్తిక కర్మలు బంధహేతువులనియు గలిగియుండిన మోహము తొలగిపోయినది.

(రాఘవేంద్రులు) స్మృతిః లబ్ధా = నారాయణద్వేషులనున్ను, వారలను జేరిన వారల నున్ను చంపుట అవశ్యమనియు అది పరమధర్మమనియు జ్ఞానము పొందబడినది.

(స్వకీయము) ఈ శ్లోకమున భగవంతుని యనుగ్రహమువలన తానుచెందిన ప్రయోజన ములనుజెప్పి కడపట భగవదాజ్ఞను నెరవేర్చునట్లున్ను అర్జునుడు చెప్పుచున్నాడు. స్మృతిర్లబ్ధా = జ్ఞాపకము, లేక స్మరణము గలిగినది. ఈ జ్ఞాపకమనగా ఏదియనిన తనయాత్మస్వరూపమిట్టిదను నది ఇప్పుడు జ్ఞప్తికివచ్చినది. జ్ఞప్తికివచ్చినదన్నందుననే మరచిపోయిన స్వరూపము ఇప్పుడు జ్ఞప్తికి వచ్చిన దనునది స్పష్టమగుచున్నది. ప్రకాశమైన ఆత్మస్వరూపము మరచిపోవుటయనునది సంభావితమేనా యనిన అదిసంభావితమేను. స్వల్పకాలమువఱకు వేషములు ధరించి నటించు వాడు నటించు సమయమున తన పూర్వస్వరూప జ్ఞానము మరచిపోవుచున్నాడు. తన స్వభాషను విడిచి అన్యభాషయందే వ్యవహరించువాడు స్వభాషమఱచి పోవుచున్నాడు. ప్రయత్నమువలన పూర్వస్వభావమున్ను పూర్వభాషయు జ్ఞప్తికివచ్చుచున్నవి. అట్లుండగా అనేకకోటి జన్మలుగా మరిచిపోయిన ఆత్మస్వరూపము సాక్షాత్ భగవంతుని యనుగ్రహమువలనను ఉపదేశమువలనను జ్ఞప్తికి వచ్చినది.

నష్టోమోహః = మోహము తొలగి పోయినది. మోహమనగా నేను - దేహమే - ఆత్మ యనునజ్ఞానమే. జీవన్ముక్తునివంటి జ్ఞానులుతప్ప మిగత వారలు దేహమే ఆత్మయనెడి విపరీత జ్ఞానము గలవారలుగనున్నారు. దేహనాశమువలన ఆత్మకు నాశముగలదని తలంచుచున్నారు. పుత్రుడు, సహోదరుడు గురువు మిత్రుడు మొదలగువారలను ఎట్లుచంపెదనని మొదట అర్జునుడు చెప్పినది దేహమే ఆత్మయను నజ్ఞానమువలననే, ''వాసాంసిజీర్ణాని'' మొదలగు భగవద్వాక్యముల వలన ఆత్మ నాశములేనివాడనియు, పాతవస్త్రమును విడిచి క్రొత్తవస్త్రమును గ్రహించుటవలె ఆత్మ యొకదేహమును విడిచి మఱియొక దేహమును గ్రహించునట్లు ఎఱుంగుటచే దేహమే యాత్మయను మోహము తొలగిపోయినది.

''గతసందేహః = సందేహము నివర్తించినది. ''బ్రహ్మమువేరు. జీవుడువేరునా? బ్రహ్మమే జీవుడా? అను విషయముననుండిన సందేహము ''క్షేత్రజ్ఞంచాపిమాం విద్ధి'' ''మమై వాంశో జీవలోకే'' మొదలగు భగవద్వాక్యములవలన బ్రహ్మముతప్ప జీవుడు వేరు కాడను నభేద జ్ఞానము గలిగినందున సందేహము తొలగిపోయినది.

''తవ వచనం కరిష్యే = నీయొక్క వాక్యమును నెరవేర్చెదను'' స్వధర్మమపిచావేక్ష్య'' మొదలగు వాక్యములవలన నీక్షత్రియ ధర్మమునుండి నీవు వీడగూడదు ''యుద్ధాయ కృత నిశ్చయః = యుద్ధముజేయవలసినవాడవుగ నున్నావు'' ''కర్మణ్యేవాధికారస్తే = నీవుకర్మజేయుట యందే అధికారిగనున్నావు'' మొదలగు వాక్యములవలన యుద్ధమనెడి కర్మను జేయవలసినదిగ భగవదాజ్ఞ యున్నందున దానిని నెరవేర్తునని అర్జునుడు చెప్పెను.

సంజయ ఉవాచ :—

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాదమిమమశ్రౌష మద్భుతం రోమహర్షణం ॥ 74

పద॥ ఇతి - అహం - వాసుదేవస్య - పార్థస్య - చ - మహాత్మనః ।
సంవాదం - ఇమం - అశ్రౌషం - అద్భుతం - రోమహర్షణం ॥

| | | | |
|---|---|---|---|
| సంజయఉవాచ | సంజయుడు చెప్పినది | ఇమం | ఈ |
| ఇతి | ఈవిధముగ | అద్భుతం | ఆశ్చర్యమైనదియు |
| అహం | నేను | రోమహహర్షణం | గగుర్పాటు గలుగజేయదగి నదియునైన |
| వాసుదేవస్య | వాసుదేవునియొక్కయు | | |
| మహాత్మనః | మహాత్ముడైన | సంవాదం | సంవాదమును (సంభాషణను) |
| పార్థస్య చ | అర్జునునియొక్కయు | అశ్రౌషం | వింటిని |

తా॥ సంజయుడు ధృతరాష్ట్రమహారాజునుగూర్చి చెప్పినది. నేను ఈ విధమైన మహాత్ముడగు వాసుదేవునియొక్కయు అర్జునునియొక్కయు ఆశ్చర్యమైనదియు, గగుర్పాటుగలుగజేయదగినదియునైన ఈ సంవాదమును (వారిరువురికి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములను) వింటిని.

శ్లో॥ వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానేతద్గుహ్యమహం పరం ।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్ ॥ 75

పద॥ వ్యాసప్రసాదాత్ (1) - శ్రుతవాన్ - ఏతత్ - గుహ్యం - అహం - పరం ।
యోగం - యోగేశ్వరాత్ (2) - కృష్ణాత్ - సాక్షాత్ - కథయతః - స్వయం ॥

| | | | |
|---|---|---|---|
| గుహ్యం | రహస్యమైనదియు | కృష్ణాత్ | కృష్ణపరమాత్మవద్దనుండి |
| పరం | ఉత్కృష్టమైనదియునైన | వ్యాసప్రసాదాత్ | వ్యాసమహర్షి యొక్క అనుగ్రహమువలన |
| ఏతత్ | ఈ | | |
| యోగం | యోగశాస్త్రమును | సాక్షాత్ | నేరుగా, లేక నేరులో |
| స్వయం | తానే | అహం | నేను |
| కథయతః | అర్జునునికి జెప్పిన | శ్రుతవాన్ | వింటిని |
| యోగేశ్వరాత్ | యోగములకు ఈశ్వరుడైన | | |

తా॥ వ్యాసమహర్షి యొక్క అనుగ్రహమువలన రహస్యమైనట్టియు ఉత్తమమైనట్టియు యోగశాస్త్రమనెడి ఈ గీతను తానుగనే అర్జునునకు జెప్పినవాడున్ను, సకల యోగములకున్ను ఈశ్వరుడునునైన శ్రీకృష్ణపరమాత్మవద్ద నుండి నేను నేరులోనే వింటిని.

(1) వ్యాసప్రసాదాత్ - భారతయుద్ధము మొదలుపెట్టిన సమయమున కురుక్షేత్రములో యుద్ధరంగమున జరుగు సకలసంగతులు నాకు నేరుగ కనబడునట్లున్ను, తెలిసిన వాటినన్నిటిని మీకు జెప్పునట్లున్ను వ్యాసభగవంతుడు నాకుజ్ఞాన నేత్రములను చెవులను ఇచ్చియుండుట యనెడి యనుగ్రహమువలన (రాఘవేంద్రులు).

(2) యోగేశ్వరాత్ - జ్ఞానము బలము శౌర్యము వీర్యము శక్తి తేజస్సు మొదలగువాటికి నిధిగానున్నవాడైన (రామానుజులు).



శ్లో॥ రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76

పద॥ రాజన్ - సంస్మృత్య - సంస్మృత్య - సంవాదం - ఇమం - అద్భుతమ్ ।
కేశవార్జునయోః - పుణ్యం - హృష్యామి - చ - ముహుః - ముహుః ॥

| | | | |
|---|---|---|---|
| హే రాజన్ ! | ఓ ధృతరాష్ట్రమహారాజా ! | ఇమం సంవాదం | ఈ సంవాదమును |
| అద్భుతం | ఆశ్చర్యమైనదియు | సంస్మృత్య సంస్మృత్య | తలంచి తలంచి |
| పుణ్యం | పుణ్యమైనదియునైన | ముహుః ముహుః | మాటిమాటికి |
| కేశవార్జునయోః | కృష్ణార్జునులయొక్క | హృష్యామి చ | సంతోషించుచున్నాను. |

తా॥ ఓ ధృతరాష్ట్రమహారాజా ! ఆశ్చర్యమైనదియు పుణ్యమైనదియునైన కృష్ణార్జునులయొక్క ఈ సంవాదమును స్మరించి స్మరించి మాటిమాటికి సంతోషపడుచున్నాను.



శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః ।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః ॥ 77

పద॥ తత్ - చ - సంస్మృత్య - సంస్మృత్య - రూపం - అత్యద్భుతం - హరేః ।
విస్మయః - మే - మహాన్ - రాజన్ - హృష్యామి - చ - పునః - పునః ॥

| | | | |
|---|---|---|---|
| హే రాజన్ | ఓ రాజా ! | మే | నాకు |
| హరేః | హరియైన కృష్ణపరమాత్మయొక్క | విస్మయః | ఆశ్చర్యము |
| | | మహాన్ | అధికముగనున్నది |
| అత్యద్భుతం | మిక్కిలి ఆశ్చర్యకరమైన | పునః పునః | మఱియు మఱియు |
| తత్ రూపం చ | ఆ విశ్వరూపమునున్ను | హృష్యామి చ | సంతోషము చెందుచున్నాను. |
| సంస్మృత్య సంస్మృత్య | స్మరించి స్మరించి | | |

తా॥ ఓ రాజా ! హరియైన కృష్ణపరమాత్మయొక్క అత్యాశ్చర్యమైన అట్టి విశ్వరూపమునున్ను స్మరింప స్మరింప నాయొక్క ఆశ్చర్యము అధికముగనున్నది. మఱల మఱల సంతోషము చెందుచున్నాను.

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ॥ 78

పద॥ యత్ర - యోగేశ్వరః (1) - కృష్ణః - యత్ర - పార్థః - ధనుర్ధరః।
తత్ర - శ్రీః - విజయః - భూతిః (2) - ధ్రువా - నీతిః - మతిః - మమ

| | | | |
|---|---|---|---|
| యత్ర | ఏ పక్షమున (ఏ వైపున) | విజయః | విజయమున్ను |
| యోగేశ్వరః | యోగముల కీశ్వరుడైన | భూతిః | అభివృద్ధియు |
| కృష్ణః | కృష్ణుడున్నాడో | నీతిః | న్యాయమున్ను |
| యత్ర | ఏవైపున | ధ్రువాఇతి | నిశ్చయముగ నున్నవనునది లేక నిలకడచెందినవి అనునది |
| ధనుర్ధరః | గాండీవ ధనుస్సు ధరించిన | | |
| పార్థః | అర్జునుడున్నాడో | | |
| తత్ర | ఆ పక్షమున | మమ | నాయొక్క |
| శ్రీః | రాజ్యలక్ష్మియు | మతిః | అభిప్రాయము, లేక నిశ్చయము |

తా॥ ఏవైపున యోగములకెల్ల ఈశ్వరుడైన కృష్ణపరమాత్మయు, గాండీవమనెడి ధనుస్సును బడసినవాడై అర్జునుడున్ను గలరో ఆ పక్షమున రాజ్యలక్ష్మి, విజయము, అభివృద్ధి, న్యాయము ఇవి నిశ్చితముగ నున్నవనునది నాయొక్క అభిప్రాయము లేక నిశ్చయము.

(శ్రీధరులు) ఇంచుపలన ఈ విధమైన తన నిశ్చయమును విని ధృతరాష్ట్రుడు ఇకనైన కృష్ణపరమాత్మను శరణమొంది పాండవులతో సమాధానము చేసికొనునుగాక యనునది సంజయుని తాత్పర్యమని ప్రకటమగుచున్నది.

(1) యోగేశ్వరః - ఎచ్చు తక్కువైన సకల చేతన ప్రపంచములయొక్క సకల స్వభావములనెడి యోగములకు ఈశ్వరుడు. అనగా తనయొక్క సంకల్పముచేత, చేతనాచేతనములైన సకల వస్తువులయొక్క స్థితి ప్రవృత్తి వీటియొక్క భేదములను బడసినవాడనునది తాత్పర్యము. 'యోగేశ్వరః' అనియు పాఠము. ఉపాయముల నెఱింగినవారలకెల్ల శ్రేష్ఠుడైన ఈశ్వరుడని అర్థము. (రామానుజులు).

(2) భూతిః - ఐశ్వర్యము, లేక సంపద (రాఘవేంద్రులు).

ఓం తత్సదితి శ్రీ మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం
వైయాసిక్యాం శ్రీ భీష్మపర్వణి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున
సంవాదే మోక్షసన్న్యాసయోగో నామ
అష్టాదశోఽధ్యాయః.

శ్రీ వ్యాసమహర్షి ప్రణీతంబైన శతసాహస్రిక సంహితయగు శ్రీ మహాభారతాంతర్గతమైన
శ్రీ భీష్మపర్వమున శ్రీమద్భగవద్గీతలుగ, ఉపనిషత్తులుగ, బ్రహ్మవిద్యగ,
యోగశాస్త్రముగనున్న శ్రీకృష్ణార్జున సంవాదమున
మో క్ష స న్న్యా స యో గ మ నె డి
పదునెనిమిదవ అధ్యాయము
ము గి సె ను .

ఓం తత్సత్.

గీతార్థదీపికయను వ్యాఖ్యానము సమాప్తమయినది.

శ్లో॥ మంగళం వాసుదేవాయ చతుర్వర్గఫలేప్సుభిః॥
మహద్భిః సేవ్యమానాయ ఫలరూపాయ మంగళం॥

,, గీతార్థదీపికాం రమ్యామజ్ఞానధ్వాంతభేదినీం ।
అర్పయామి పరేశస్య పాదపఙ్కేరుహాంతికే ॥

శ్రీ కృష్ణాయ పరబ్రహ్మణే నమః.
శ్రీకృష్ణార్పణమస్తు.
ఓం తత్సత్.



ఓమ్

## శ్రీ మద్భగవద్గీతాన్తర్గత శ్లోకముల అకారాది వర్ణక్రమపట్టిక.

## స



## హ



శ్రీమద్భగవద్గీతాన్తర్గత అకారాది వర్ణక్రమపట్టిక వివరణము సమాప్తము.

శ్రీ కృష్ణ పర బ్రహ్మా ర్ప ణ మ స్తు.

హరిః ఓమ్ తత్ సత్.



అనుబంధము

# శ్రీ భగవద్గీత

# అధ్యాయముల మాహాత్మ్యము

[ శ్రీ పద్మపురాణమునుండి సంగృహీతము ]



ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# పీఠిక

శ్రీ వేదాంతగ్రంథావతంసమగు శ్రీభగవద్గీత ఏలాటి యుపాయాంతరముల నపేక్షింపక కేవల జపపారాయణాదులచేతనే సర్వపాపములను నశింపజేసి సకల జనులను సంసారకూపమునుండి యుద్ధరించి మోక్షసామ్రాజ్యమును పొందించుచున్నదను విషయము ప్రాచ్య ప్రతీచ్యాధునిక ప్రాక్తన పండితు లుద్ఘాటించియేయున్నారు. సనాతనధర్మస్థాపకులగు మహర్షిపుంగవులును, శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమును గనుగొని "గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః" గీతాశాస్త్ర మొక్కటియే యాధ్యాత్మిక జ్ఞానప్రాప్తికై పఠింపదగినది. ఇతరశాస్త్రములచేత ప్రయోజనమేమియు లేదు — ఇవి మొదలుగాగల వాక్యములచే ముక్తకంఠముగ నుద్ఘోషించియున్నారు. ఈ గీతామాహాత్మ్య విషయము సకలలోక ప్రసిద్ధమగుటచే విశేషించి వ్రాయనవసరములేదు. మరియు లోకోద్ధారకులగు మహర్షి శ్రీ సద్గురు మలయాళస్వాములవారు పరమ పవిత్రమగు శ్రీ గీర్వాణభాషలోనున్న అత్యుత్తమ మహాగ్రంథములను ఆంధ్ర భాషలో ననువదించి, యనువాదము చేయించి సకల జనులు తరించులాగున చేయుచున్నారను విషయము లోకవిదితము. ఇటుండ శ్రీ శ్రీ శ్రీ సద్గురు మలయాళస్వాములవారు ఋషిసంప్రదాయసిద్ధమైన శ్రీ భగవద్గీతయొక్క పఠన పారాయణములలోను తదర్థమును గ్రహించి స్వానుభవపూర్వకముగ వేదాంత తత్త్వమును ప్రపంచమున ప్రచారముచేయుటలోను, తన్మాహాత్మ్యగరిమను ప్రకటించుటలోను బద్ధశ్రద్ధులై శ్రీ మహాభగవద్గీతయొక్క నామధేయము సార్థకమొనర్చుటకై యనేకశాస్త్రములనుండి శ్రీ గీతామాహాత్మ్యము నుద్ధరింప తలపెట్టిరి. ఇటుండగ శ్రీ సద్గురు మలయాళస్వాములవారు శ్రీ పద్మపురాణములో విపులముగనున్న గీతామాహాత్మ్యమును జదివి తన్మహిమను దెలిసికొనియున్నవారగుటచే దీనిని సమస్త ప్రపంచమున కర్థమగునట్లు ప్రకటీకరించిన బాగుండునని తలంచి మమ్ము నాంధ్రీకరించునటుల నపారకరుణతో నానతిచ్చిరి. అద్దానిని శిరసావహించి యథాశక్తిగా నా మాహాత్మ్యమును నాంధ్రీకరించితిమి. ఇదివరలో నెవ్వరును దీనిని నాంధ్రీకరించియుండలేదు. శ్రీ సద్గురు

స్వాములవారట్టి పవిత్రకార్యములో మమ్ము నియోగించి యనుగ్రహించిరి. శ్రీ పద్మ మహాపురాణాంతర్గతమగు శ్రీ భగవద్గీతామాహాత్మ్యము పదునెనిమిది యధ్యాయములతో నున్నది. అనగా 18 అధ్యాయములకును ప్రత్యేకప్రత్యేకముగా నొక్కొకమాహాత్మ్యము గలదు. ఇందులో దాదాపు వెయ్యి శ్లోకములు గలవు. అందు మొదటి తొమ్మిది యధ్యాయములను సాహిత్యశిరోమణి పి. సి. గోపాలాచార్యులున్ను, మిగిలిన 9 అధ్యాయములను మరియు వరాహ పురాణాంతర్గత గీతామాహాత్మ్య ప్రతిపాదక శ్రీగీతాతరంగిణిలోని శ్రీభగవద్గీతా ద్వితీయమాహాత్మ్యమును సాహిత్యశిరోమణి టి. శివచరణం, సాహిత్యశిరోమణి ఇ. గోపాలరెడ్డియునగు మేము తెలిసినంతవర కాంధ్రీకరించితిమి.

శ్రీ భగవద్గీత జదువు భక్తుల యనుగ్రహమునకును, శ్రీ కృష్ణపరమాత్మ కృపాకటాక్షమునకును, శ్రీ సద్గురు స్వాములవారి యపార కరుణకును పాత్రులమగుదుమని విశ్వసించుచున్నారము.

శ్రీ సద్గురుదేవార్పణమస్తు.

పి. సి. గోపాలాచార్యులు.

టి. శివచరణం.

ఇ. గోపాలరెడ్డి.



ఓమ్

# శ్రీ భగవద్గీతా ద్వితీయ మాహాత్మ్యము

(వరాహ పురాణమునుండి)



ఋషిరువాచః—

శ్లో॥ గీతాయాశ్చైవ మాహాత్మ్యం యథావత్సూత మే వద।
పురాణమునినా ప్రోక్తం వ్యాసేన శ్రుతినోదితమ్॥ 1

తా॥ అనేకవిధములైన కథలనువినుచు శౌనకఋషి సూతునిట్లు ప్రశ్నించెను. ఓసూత మహర్షీ! వేదోక్తమై శ్రీవ్యాసమహర్షిచే చెప్పబడిన ప్రకారము శ్రీమత్భగవద్గీతామాహాత్మ్యమును నాకు చెప్పుము.

సూత ఉవాచః—

శ్లో॥ పృష్టం వై భవతా యత్తన్మహద్గోప్యం పురాతనం।
న కేన శక్యతే వక్తుం గీతామాహాత్మ్యముత్తమమ్॥ 2

తా॥ శౌనకమహర్షియొక్క ప్రశ్నను విని సూతుడిట్లు పచించెను. ఓ శౌనక మహర్షీ! నీవు ఏ గీతా మాహాత్మ్యమునుగురించి అడిగితివో అయ్యది అతిగోప్యమై ప్రాచీనమైనదిగా నుంటున్నది. అందువలన గీతయొక్క అత్యుత్తమమైన మాహాత్మ్యమును ఎవ్వడును చెప్పుటకు సమర్థుడు కాడు.

శ్లో॥ కృష్ణో జానాతి వై సమ్యక్ క్వచిత్కౌన్తేయ ఏవ చ।
వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః॥ 3

తా॥ ఈ గీతా మాహాత్మ్యమును బాగుగా శ్రీకృష్ణభగవానుడే ఎఱుగుచున్నాడు. మఱియు అర్జునుడు కొంచెము ఎఱుగుచున్నాడు. అటులనే శ్రీ వ్యాసమహర్షి, శుకమహర్షి, యాజ్ఞవల్క్యమహర్షి, శ్రీ జనకచక్రవర్తులు ఎఱుంగుచున్నారు. వీరందరున్ను కొంచెముమాత్ర మెఱుంగుచున్నారు.

శ్లో॥ అన్యే శ్రవణతః శ్రుత్వా లోకే సంకీర్తయన్తి చ।
తస్మాత్కించిద్వదామ్యద్య వ్యాసస్యాస్యాన్మయా శ్రుతమ్॥ 4

తా॥ మఱియు నితరజనులు ఈ గీతామాహాత్మ్యమును కర్ణేంద్రియములచే విని లోకమునందు వర్ణించుచున్నారు. కాని నిజమెఱుంగరు. అందువలన నేనెవ్విధముగా శ్రీ వ్యాసమహర్షియొక్క ముఖారవిందమునుండి వింటినో అటుల కొంచెము వచించెదను.

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥ 5

తా॥ సమస్తమైన ఉపనిషత్తులు గోవులు, పితుకువాడు శ్రీకృష్ణభగవానుడు, దూడ అర్జునుడు, బుద్ధిమంతులు భోక్తలు. ఇవ్విధముగా గీతామృతము లోకమునందు ప్రకటితమైనది.

శ్లో॥ సారథ్యమర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ।
సర్వలోకోపకారార్థం తస్మై కృష్ణాయ తే నమః॥ 6

తా॥ ఏకృష్ణభగవానుడు మొట్టమొదట అర్జునునికి సారథ్యముజేయుచు సమస్తలోకములయొక్క ఉపకారముకొరకు గీతామృతమునొసంగెనో అటువంటి కృష్ణభగవానునికి నమస్కారము.

శ్లో॥ సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో జనః।
గీతానావం సమారుహ్య పారం యాతు సుఖేన సః॥ 7

తా॥ ఎవడైతే ఘోరమగు సంసారసాగరమును దాటుటకు కోరుచున్నాడో, వాడు గీతయనెడు నావనెక్కి సుఖముగా ఒడ్డును చేరుచున్నాడు.

శ్లో॥ గీతాజ్ఞానం శ్రుతం నైవ సదైవాభ్యాసయోగతః।
మోక్షమిచ్ఛతి మూఢాత్మా యాతి బాలకహాస్యతామ్॥ 8

తా॥ ఎవడైతే గీతాసంబంధమైన జ్ఞానమును ఎల్లప్పుడు అభ్యాసయోగముచే వినుటలేదో ఆ మూర్ఖుడు మోక్షమును కోరినట్లైనచో బాలకునివలె పరిహాసాస్పదుడగుచున్నాడు.

శ్లో॥ యే శృణ్వన్తి పఠన్త్యేవ గీతాశాస్త్రమహర్నిశమ్।
న తే వై మానుషా జ్ఞేయా దేవా ఏవ న సంశయః॥ 9

తా॥ ఎవరైతే దివారాత్రములు గీతను చదువుచున్నారో, మఱియు వినుచున్నారో వారలు కేవలము మనుష్యులుకారు. మరెవరనగా దేవతలే. ఇందులో సంశయమేమియు లేదు.

శ్లో॥ గీతాజ్ఞానేన సంబోధ్య కృష్ణః ప్రాహ తమర్జునమ్।
అష్టాదశపదస్థానం గీతాధ్యాయే ప్రతిష్ఠితమ్॥ 10

తా॥ శ్రీ కృష్ణభగవానుడు గీతాజ్ఞానముచే అర్జునుని సంబోధించి ఇటులపలికెను. గీతయొక్క ప్రత్యేకాధ్యాయమునందు అష్టాదశ పదస్థానము (పరమపదము) స్థాపించబడినది.

శ్లో॥ మోక్షస్థానం పరం పార్థ సగుణం వాఽథ నిర్గుణమ్।
సోపానాష్టాదశైరేవం పరంబ్రహ్మాధిగచ్ఛతి॥ 11

తా॥ ఓ అర్జునా! సగుణమైనటువంటి లేక నిర్గుణమైనటువంటి మోక్షస్థానమునకు పదునెనిమిది అధ్యాయములను సోపానములుగాచేసికొని మనుష్యుడు పరబ్రహ్మమును పొందుచున్నాడు.

శ్లో॥ మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే।
సకృద్గీతాంభసి స్నానం సంసారమలనాశనం॥ 12

తా॥ ప్రతిదినము చేయునటువంటిస్నానము మనుష్యులయొక్క శరీరమాలిన్యమును పోగొట్టుచున్నది. గీతయను జలమునందొక్కమారు స్నానమొనర్చిన సంసారమాలిన్యము పోవును.

శ్లో॥ గీతాశాస్త్రస్య జానాతి పఠనం నైవపాఠనం।
పరస్మాన్న శ్రుతం జ్ఞానం నైవ శ్రద్ధా న భావనా॥ 13

శ్లో॥ న ఏవ మానుషే లోకే పురుషో విడ్వరాహకః।
యస్మాద్గీతాం న జానాతి నాధమస్తత్పరోజనః॥ 14

తా॥ ఎవడైతే గీతాశాస్త్రమును చదువుట చదివించుట నెరుంగజాలడో, మరియు నితరుల నుండి వినడో, యెవనికి స్వయముగా గీతాశాస్త్రజ్ఞానమును, శ్రద్ధయు, భావనయు లేవో అటువంటి పురుషుడు ఈ లోకమునందు గ్రామవరాహముతో సమానుడు. ఎందువలననైతే అతడు గీతా శాస్త్రము నెరుగడో అందువలననే అట్టి పురుషునికంటె మరియొక అధముడు లేడు.

శ్లో॥ ధిక్తస్య మానుషం దేహం ధిగ్జ్ఞానం ధిక్కులీనతాం ।
గీతార్థం న విజానాతి నాధమస్తత్పరో జనః ॥ 15

తా॥ ఎవడైతే గీతార్థమును తెలిసికొనజాలడో వానియొక్క మానుషదేహమునకు, జ్ఞానమునకు మరియు సత్కులీనతకు ధిక్కారమగునుగాక. అతనికంటె శ్రేష్ఠమైన అధముడులేడు,

శ్లో॥ ధిక్స్వరూపం శుభం శీలం విభవం సద్గృహాశ్రమమ్ ।
గీతాశాస్త్రం న జానాతి నాధమస్తత్పరో జనః ॥ 16

తా॥ ఎవడైతే గీతాశాస్త్రమును ఎరుగడో, వానియొక్క సుందరరూపమునకు సచ్ఛీల మునకు సంపదకు మరియు శ్రేష్ఠమైన గృహస్థాశ్రమమునకు ధిక్కారమగునుగాక. వానికంటె అధి కాధముడు రెండవవాడు లేడు.

శ్లో॥ ధిక్ప్రాగల్భ్యం ప్రతిష్ఠాం చ పూజాం మానం మహాత్మతామ్ ।
గీతాశాస్త్రే రతిర్నాస్తి తత్సర్వం నిష్ఫలం జగుః ॥ 17

తా॥ ఎవనికి గీతాశాస్త్రమునందు ప్రీతిలేదో వానియొక్క ప్రాగల్భ్యమునకు ప్రతిష్ఠకు పూజ్యతకు గౌరవమునకు మరియు మహత్తునకు ధిక్కారమగునుగాక. మరియు అతనియొక్క సమస్తకర్మ నిష్ఫలమగుచున్నది.

శ్లో॥ ధిక్తస్య జ్ఞానమాచారం వ్రతం చేష్టాం తపో యశః ।
గీతార్థపఠనం నాస్తి నాధమస్తత్పరోజనః ॥ 18

తా॥ ఎవడైతే గీతార్థపఠనముచేయలేదో వానియొక్క జ్ఞానమునకు నటులనే ఆచారము నకు వ్రతమునకు చేష్టకు తపస్సుకు, మరియు కీర్తికి ధిక్కారమగునుగాక. అతనికంటె అధిక మైన మరియొక యధముడు లేడు.

శ్లో॥ గీతాగీతం నయజ్ఞానం తద్విద్ధ్యాసురసంజ్ఞకమ్ ।
తన్మోఘం ధర్మరహితం వేదవేదాన్త గర్హితమ్ ॥ 19

తా॥ ఏ జ్ఞానము గీతను గానముచేయుటలేదో, ఆ జ్ఞానము అసురజ్ఞానమని తలంచబడు చున్నది. అది వ్యర్థమైనది. మరియు ధర్మరహితమైనది. వేదములచేతను ఉపనిషత్తులచేతను నిందిత మైనది.

శ్లో॥ యస్మాద్ధర్మమయీ గీతా సర్వజ్ఞాన ప్రయోజికా ।
సర్వశాస్త్రమయీ గీతా తస్మాద్గీతా విశిష్యతే ॥ 20

తా॥ ఎందువలననైతే భగవద్గీత ధర్మస్వరూపమైనదో, సమస్తజ్ఞానమునకు ప్రయోజన కారియో, మరియు సర్వశాస్త్రస్వరూపమైనదియో అందువలననే భగవద్గీత సమస్తశాస్త్రములందును శ్రేష్ఠమైనదని చెప్పబడుచున్నది.

శ్లో॥ యోఽధీతే సతతం గీతాం దివారాత్రౌ యథార్థతః।
స్వపన్గచ్ఛన్వదం స్తిష్ఠఞ్ఛాశ్వతం మోక్షమాప్నుయాత్ ॥ 21

తా॥ ఎవడు నిరన్తరము రాత్రింబవళ్లు అర్థసహితమైన గీతను స్వప్నములోను నడుచుచు మాట్లాడుచు మరియు నిలుచుకొనుచు, చదువుచున్నాడో వాడు నిర్వాణమును (మోక్షమును) పొందుచున్నాడు.

శ్లో॥ సాలగ్రామశిలాగ్రే తు దేవాగారే శివాలయే।
తీర్థే నద్యాం పఠేద్యస్తు వైకుంఠం యాతి నిశ్చితమ్ ॥ 22

తా॥ ఎవడైతే సాలగ్రామమునెదుట, దేవమందిరమునందు, శివాలయమునందు తీర్థములకడ, నదియొద్దన, గీతాధ్యయనముచేయుచున్నాడో, వాడు వైకుంఠమును పొందుచున్నాడు. ఇది నిశ్చయింపబడినది.

శ్లో॥ దేవకీనందనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి।
యథా న వేదైర్దానైశ్చ యజ్ఞతీర్థ వ్రతాదిభిః ॥ 23

తా॥ ఎటుల దేవకీనందనుడైన శ్రీకృష్ణభగవానుడు గీతాపఠనముచే సంతుష్టుడగుచున్నాడో అటుల వేదాధ్యయన దానయజ్ఞ తీర్థ వ్రతాదులచే సంతుష్టుడగుటలేదు.

శ్లో॥ గీతాఽధీతా చ యేనాపి భక్తి భావేన చేతసా।
తేన వేదాశ్చ శాస్త్రాణి పురాణాని చ సర్వశః ॥ 24

తా॥ ఎవడైతే భక్తిభావముచే మనస్సును సంలగ్నపరచి గీతాధ్యయనమునుచేయునో వాడు సమస్తవేదములను సర్వశాస్త్రములను సమస్తపురాణములనుకూడ చదివినవానితో సమానుడు.

శ్లో॥ యోగిస్థానే సిద్ధపీఠే శిష్టాగ్రే సత్సభాసు చ।
యజ్ఞే చ విష్ణుభక్తాగ్రే పఠన్యాతి పరాఙ్గతిమ్ ॥ 25

తా॥ ఎవడైతే యోగీశ్వరులయొక్క స్థానమునందును, సిద్ధపీఠములందును, శ్రేష్ఠపురుషులయొక్క సమ్ముఖమునందును, సత్పురుషుల సభలయందును, యజ్ఞమునందును, మరియు విష్ణుభక్తునియొక్క ఎదుటను, గీతను పఠించునో వాడు మోక్షమును పొందుచున్నాడు.

శ్లో॥ గీతాపాఠం చ శ్రవణం యః కరోతి దినేదినే।
క్రతవో వాజిమేధాద్యాః కృతాస్తేన సదక్షిణాః ॥ 26

తా॥ ఎవడు ప్రతిదినము గీతను పఠించుచున్నాడో మరియు శ్రవణముచేయుచున్నాడో వాడు సమస్త అగ్నిష్టోమయాగాదులను మరియు దక్షిణ సహితమైన అశ్వమేధాది క్రతువులను చేసిన వానితో సమానుడగుచున్నాడు.

శ్లో॥ యశ్శృణోతి చ గీతార్థం కీర్తయేచ్చ స్వయం పుమాన్।
శ్రావయేచ్చ పరార్థం వై స ప్రయాతి పరంపదమ్ ॥ 27

తా॥ ఎవడైతే గీతార్థమును వినుచున్నాడో స్వయముగా స్మరించుచున్నాడో మరియు నితరులకు వినిపించుచున్నాడో వాడు పరమపదమును పొందుచున్నాడు.

శ్లో॥ గీతాయాః పుస్తకం నిత్యం యోఽర్చయత్యేవ సాదరం।
విధినా భక్తిభావేన తస్య పుణ్యఫలం శృణు॥ 28

తా॥ ఎవడు ఆదరపూర్వకముగా ఎల్లప్పుడు గీతాగ్రంధమును శాస్త్రోక్తప్రకారముగా భక్తి భావముతోకూడినవాడై పూజించుచున్నాడో వానియొక్క పుణ్యఫలమునుగూర్చి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ సకలాయోర్వరాతేన దత్తా యజ్ఞే భవేత్కిల।
వ్రతాని సర్వతీర్థాని దానాని సుబహూన్యపి॥ 29

తా॥ ఎవడైతే గీతాపుస్తకమును పూజించుచున్నాడో వాడు యజ్ఞమునందు సమస్త పృథ్వీని దానముచేసినవానితో సమానుడగును. అటులనే సమస్తవ్రతములనుచేసి సర్వతీర్థముల యందుఅధికముగా దానమొనర్చినవానితో సమానుడగును.

శ్లో॥ భూతప్రేతపిశాచాద్యాస్తత్ర నో ప్రవిశంతి వై।
అభిచారోద్భవం దుఃఖం పరేణాపి కృతం చ యత్॥ 30

తా॥ ఏ ఇంటియందు గీతాపూజజరుగుచున్నదో అచ్చట భూత ప్రేత పిశాచాదులు మరియు శత్రువులచే చేయబడిన మంత్రయంత్రాదిక అభిచారయాగమువల్ల కలిగిన దుఃఖమున్ను ప్రవేశింపజాలవు.

శ్లో॥ నోపసర్పన్తి తత్రైవ యత్ర గీతార్చనం గృహే।
తాపత్రయోద్భవా పీడా నైవ వ్యాధిభయం తథా॥ 31

తా॥ ఏ ఇంటియందు గీతాపూజజరుగుచున్నదో అచ్చట దైహిక దైవిక భౌతిక ఈ తాపత్రయములవలన కలిగిన పీడ, మరియు, రోగభయము నుండదు.

శ్లో॥ న శాపం నైవ పాపం చ దుర్గతిం న చ కిఞ్చన।
దేహేఽరయః షడేతే వై న బాధన్తే కదాచన॥ 32

తా॥ ఏ యింటియందు గీతాపూజజరుగుచున్నదో అచ్చట శాపముయొక్కగాని పాపము యొక్కగాని మరియు దుర్గతియొక్కగాని భయముండదు. అటులనే దేహమునందుంటున్న షడింద్రియములనే శత్రువులు ఒకప్పుడున్ను పీడను కలుగచేయజాలవు.

శ్లో॥ భగవత్ పరమేశానే భక్తిరవ్యభిచారిణీ।
జాయతే సతతం తత్ర యత్ర గీతాభినన్దనమ్॥ 33

తా॥ ఎచ్చట గీతార్థముయొక్క వినోదము నిరన్తరమగుచున్నదో అచ్చట భగవంతుని యందు అత్యుత్తమమైన యఖండభక్తి కలుగుచున్నది.

శ్లో॥ స్నాతో వా యది వాఽస్నాతః శుచిర్వా యది వాఽశుచిః।
విభూతిం విశ్వరూపం చ సంస్మరన్సర్వదా శుచిః॥ 36

తా॥ స్నానముచేసినవాడుగాని లేక స్నానముచేయనివాడుగాని పవిత్రుడుగాని లేక అపవిత్రుడుగాని విభూతియోగము మరియు విశ్వరూపసందర్శనయోగముగల అధ్యాయములను చదివినచో ఆ మనుష్యుడు సర్వదా పవిత్రుడగుచున్నాడు.

శ్లో॥ అనాచారోద్భవం పాపమవాచ్యాది కృతం చ యత్ ।
అభక్ష్యభక్ష్యజం దోషమస్పర్శస్పర్శజం తథా ॥ 37

,, జ్ఞాతాజ్ఞాతకృతం నిత్యమిన్ద్రియైర్జనితం చ యత్ ।
తత్సర్వం నాశమాయాతి గీతాపాఠేన తత్క్షణాత్ ॥ 38

తా॥ అనాచారమువల్లకలిగిన, అవాచ్యాదులవలన గలిగిన, అభక్ష్యాదులను భక్షణ చేయుటచే కలిగిన, ఇటులనే అస్పృశ్యులను స్పృశించుటచేగలిగిన, అటులనే జ్ఞానిచే అజ్ఞానిచే చేయబడిన ఇన్ద్రియములవల్ల కలిగిన ఏ పాపమయితేగలదో అదంతయు గీతాపఠనముచే ఆ క్షణ మునందే నశించుచున్నది.

శ్లో॥ సర్వత్ర ప్రతిభోక్తా చ ప్రతిగ్రాహీ చ సర్వశః ।
గీతాపాఠం ప్రకుర్వాణో న లిప్యేత కదాచన ॥ 39

తా॥ ఎవ్వడు అంతట భుజించుచున్నాడో, ఎవడు అంతట దానమును తీసికొను చున్నాడో వాడున్ను గీతాపఠనమువలన పాపములచే లిప్తుడుగాడు.

శ్లో॥ రత్నపూర్ణాం మహీం సర్వాం ప్రగృహ్యాతివిధానతః ।
గీతాపాఠేన చైకేన శుద్ధస్ఫటికవత్సదా ॥ 40

తా॥ శాస్త్రోక్తముగాని రత్నపూర్ణమయిన సమస్తపృథివియొక్క దానము పరిగ్రహించి నప్పటికి ఒక్కగీతాపఠనముచే శుద్ధస్ఫటికమువలె సర్వదా పాపరహితుడగుచున్నాడు.

శ్లో॥ యస్యాన్తః కరణం నిత్యం గీతాయాం రమతే సదా ।
సర్వాగ్నికః సదా జాపీ క్రియావాన్ స చ పణ్డితః ॥ 41

తా॥ ఎవనియొక్క అంతఃకరణము నిత్యము గీతయందు సంలగ్నమగునో వాడు సర్వ అగ్నిహోత్రి (సమస్తయాగములుచేయువాడు) సర్వదాజపముచేయువాడు. తనకు విధించిన కార్యము నొనర్చువాడు. మరియు పండితుడునగుచున్నాడు.

శ్లో॥ దర్శనీయః స ధనవాన్ స యోగీ జ్ఞానవానితి ।
స ఏవ యాజ్ఞికో ధ్యానీ సర్వవేదార్థదర్శకః ॥ 42

తా॥ ఎవనియొక్క అంతఃకరణము సదా గీతయందు సంలగ్నమైయుండునో వాడే దర్శన యోగ్యుడు) వాడే ధనవంతుడు, యోగి, జ్ఞాని, యాజ్ఞికుడు, ధ్యానముచేయువాడు మరియు సమస్తవేదములయొక్క అర్థమెరింగినవాడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ గీతా మే హృదయం పార్థ గీతా మే సారముత్తమమ్ ।
గీతా మే జ్ఞానమత్యుగ్రం గీతా మే జ్ఞానమక్షయమ్ ॥ 43

తా॥ ఓ అర్జునుడా ! గీత నా యొక్క హృదయమగుచున్నది. గీత నా యొక్క శ్రేష్ఠ సారము. గీత నాయొక్క అగ్రిమజ్ఞానము, మరియు క్షయరహితమైన జ్ఞానముగా నగుచున్నది.

శ్లో॥ గీతా గంగా చ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ ।
బ్రహ్మవిద్యా బ్రహ్మవల్లీ త్రిసంధ్యా ముక్తగేహినీ ॥ 44

శ్లో॥ అర్ధమాత్రా చిదానందాభవఘ్నీ భయనాశినీ ।
వేదత్రయీ పరానంతా తత్త్వార్థజ్ఞానమంజరీ ॥ 45

తా॥ (1) గీతా, (2) గంగా, (3) గాయత్రీ, (4) సీతా, (5) సత్యా, (6) సరస్వతీ, (7) బ్రహ్మవిద్యా, (8) బ్రహ్మవల్లీ, (9) త్రిసంధ్యా, (10) ముక్తగేహినీ, (11) అర్ధమాత్రా, (12) చిదానందా, (13) భవఘ్నీ, (14) భయనాశినీ, (15) వేదత్రయీ, (16) పరా, (17) అనంతా, (18) తత్త్వార్థజ్ఞానమంజరీ యని భగవద్గీతకు నామములుగలవు.

శ్లో॥ ఇత్యేతాని జపన్నిత్యం నరో నిశ్చలమానసః ।
జ్ఞానసిద్ధిం లభేచ్ఛీఘ్రం తథాంతే పరమంపదమ్ ॥ 46

తా॥ ఈ పదునెనిమిది గీతానామములను నిశ్చలమైనమనస్సుతో ఎవరైతే జపించెదరో వారికి శీఘ్రముగ జ్ఞానసిద్ధిగలిగి మోక్షము లభించుచున్నది.

శ్లో॥ పితౄనుద్దిశ్య యః శ్రాద్ధే గీతాపాఠం కరోతి వై ।
సంతుష్టాః పితరస్తస్య నిరయాద్యాంతి సద్గతిమ్ ॥ 47

తా॥ ఎవడు శ్రాద్ధమునందు పితృదేవతలనుగూర్చి గీతాపఠనముచేయునో అతనియొక్క పితృదేవతలు సంతుష్టులగుచున్నారు. మరియు నరకవిముక్తులై పుణ్యలోకమును పొందుచున్నారు.

శ్లో॥ గీతాపాఠేన సంతుష్టాః పితరః శ్రాద్ధతర్పితాః ।
పితృలోకం ప్రయాంత్యేవ పుత్రాశీర్వాదతత్పరాః ॥ 48

తా॥ ఇవ్విధముగ పితృదేవతలు శ్రాద్ధముచే మరియు గీతాపఠనముచే ప్రసన్నులై పుత్రునికి ఆశీర్వాదమిచ్చుచు పితృలోకమునకు పోవుచున్నారు.

శ్లో॥ శతపుస్తకదానం చ గీతాయాః ప్రకరోతి యః ।
పితృలోకం ప్రయాత్యేవ పుత్రాశీర్వాదతత్పరః ॥ 49

తా॥ ఎవడు నూరు గీతాపుస్తకములను దానముచేయునో వాడు పునర్జన్మ రహితమైన వైకుంఠమును పొందుచున్నాడు.

శ్లో॥ గీతాదానప్రభావేన సప్తకల్పావధీః సమాః ।
విష్ణులోకమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥ 50

తా॥ గీతాదానముయొక్క ప్రభావముచే విష్ణులోకమునందు ఏడుకల్పముల సంవత్సరముల పర్యంతము విష్ణువుతోకూడ నానందము పొందుచున్నాడు.

శ్లో॥ సమ్యక్ శ్రుత్వా చ గీతార్థం పుస్తకం యః ప్రదాపయేత్ ।
తస్మై ప్రీతోఽస్మి భగవాన్ దదామి మనసేప్సితమ్ ॥ 51

తా॥ ఎవడు గీతార్థమును విని గీతాపుస్తకమును దానము చేయుచున్నాడో వానికి మనోవాంఛిత ఫలమిచ్చెదనని శ్రీ కృష్ణభగవానుడు పలికెను.

శ్లో॥ జనైః సంసారదుఃఖార్తైః గీతాజ్ఞానం చ యైః శ్రుతమ్।
సంప్రాప్తమమృతం తైశ్చ గతాస్తే సదనం హరేః॥ 52

తా॥ సంసారదుఃఖముచే పీడింపబడిన జనులు ఈ గీతాజ్ఞానమును వినినచో వారు మృత్యురహితులై విష్ణులోకమును పొందుచున్నారు.

# శ్రీ పద్మమహాపురాణమునుండి ఉద్ధరింపబడినది.

పార్వత్యువాచ:—

శ్లో॥ భగవన్ సర్వతత్వజ్ఞ శ్రీవిష్ణోస్త్వత్ప్రసాదతః।
శ్రుతా నానావిధా ధర్మాః లోకనిస్తారహేతవః॥ 1

శ్లో॥ అధునా శ్రోతుమిచ్ఛామి గీతామాహాత్మ్యమప్యహం।
శ్రుతేన యేన దేవేశ హరౌ భక్తిర్వివర్ధతే॥ 2

శ్లో॥ తద్వదస్వాధునా దేవ యద్యహం తవ వల్లభా।

తా॥ పరమశివుడు పార్వతీదేవికి భగవంతుని అవతారములను, వాటి మాహాత్మ్యములను అతనిగుణములను సర్వోత్కృష్టతను తెలియజేసెను. అదియంతయు వినిన పార్వతీదేవి సంతోషమొంది భగవంతునిచే ప్రోక్తమగు గీతయొక్క మాహాత్మ్యమునుకూడవిని కడతేరనెంచి ఈశ్వరుని నిట్లడిగెను. స్వామీ! సర్వతత్వములనెరిగిన తమరు దయచే నాకు నానావిధములగు మోక్షప్రదాయకములైన భగవంతుని విషయములనెల్లనుపదేశించితిరి. నాకు గీతయొక్క మాహాత్మ్యమును విన నాశయేర్పడియున్నది. అది నారాయణునియెడ అచంచలభక్తిని పెంచునని పెద్దలు చెప్పుచున్నారు. కాన దయచేసి తాము నాకు గీతామాహాత్మ్యమును తెలుపవలెను. మీరు నన్ను ప్రేమించునది వాస్తవమైన నా కోరికను నెరవేర్చవలెను.

ఈశ్వర ఉవాచ:— ఆ మాటలకిట్లు ఈశ్వరుడు బదులు చెప్పెను.

శ్లో॥ అతసీపుష్పసంకాశం ఖగేంద్రాసనమచ్యుతం।
శయానం శేషశయ్యాయాం మహావిష్ణుముపాస్మహే॥ 3

శ్లో॥ కదాచిదాసనే రమ్యే సుఖాసీనం మురద్విషం।
ఆనందయిత్రీ లోకానాం లక్ష్మీః పప్రచ్ఛ సాదరాత్॥ 4

తా॥ ప్రథమమున నల్లయవిసెపుష్పకాంతిని గలిగినట్టియు గరుడాసనుడైనట్టియు శేషశయ్యయందు పరుండినట్టియు ఆ మహావిష్ణువును ధ్యానించెదము. ఒకప్పుడు సుందరశేషాసనమున పవ్వళించియున్న నారాయణునిగూర్చి సకల జగదానందమును కలుగజేయు లక్ష్మీదేవి ఆదరముగ నిట్లడిగెను.

శ్రీరువాచ — లక్ష్మీదేవి చెప్పెను.

శ్లో॥ శయాలురసి దుగ్ధాబ్ధౌ భగవన్ కేన హేతునా।
ఉదాసీన ఇవైశ్వర్యం జగతి స్థాపయన్నివ॥ 5

తా॥ స్వామీ! మీరు జగద్రక్షణవ్యాపారనిరతులని వేదములు చెప్పుచున్నవి. అట్లుండ మీరు జగద్రక్షణలో సంబంధము లేనివారివలె క్షీరసాగరమున నిద్రించుచున్నారు. ఇది యెట్లు పొసగును? మీ నియామకత్వమును మీరు లోకమునకే ఇచ్చివేసితిరా? ఇట్లు ఔదాసీన్యము వహించుటకు కారణమేమి? అని లక్ష్మీదేవి యడిగెను.

ఈశ్వర ఉవాచ — ఈశ్వరుడు చెప్పెను.

శ్లో॥ ఇతి దేవ్యా వచశ్శ్రుత్వా మురభిద్ధ్యానగర్వితం।
ఉవాచ శ్లక్ష్ణయా వాచా విస్మయస్మేరలోచనః॥ 6

తా॥ మహావిష్ణువు ఈ దేవీవాక్యములను విని మందహాసముతో సూక్ష్మముగ నిట్లనెను.

శ్రీ భగవానువాచ — మహావిష్ణువనెను.

శ్లో॥ నాహం సుముఖి నిద్రాలుర్నిజం మాహేశ్వరం వపుః।
దృశా తత్త్వానువర్తిన్యా పశ్యామ్యంతర్నిమగ్నయా॥ 7

శ్లో॥ కుశాగ్రబుద్ధయో దేవి యదంతర్యోగినో హృది।
పశ్యంతి యచ్చ వేదానాం సారం మీమాంసతే భృశం॥ 8

శ్లో॥ తదేవమక్షరం జ్యోతిరాత్మరూపమనామయం।
అఖండానందసందోహ నిష్పాదిద్వైతవర్జితం॥ 9

శ్లో॥ యదాశ్రయా జగద్వృత్తిర్యన్మాయా చానుభూయతే।
నయేన రహితం కించిజ్జగత్తత్వం చరాచరం॥ 10

శ్లో॥ నిర్మథ్య బహుధాలోక్య వేదశాస్త్రాంబుధిం సుధీః।
ద్వైపాయనో యదాసాద్య గీతాశాస్త్రం విసృష్టవాన్॥ 11

శ్లో॥ యదాస్థాయ మహానందమానందీకృతమానసః।
నిద్రాలురివ దేవేశి ముగ్ధాబ్ధౌ ప్రతిభామి వై॥ 12

శ్లో॥ ఇతి తస్య మురారాతేర్మితమానందవద్వచః।
సాహర్షోత్ఫుల్లలోలాక్షీ లక్ష్మీశ్శ్రుత్వా విసిస్మిరే॥ 13

తా॥ దేవీ! నేను నిద్రించలేదు. నా యంతర్దృష్టిచే నా మహేశ్వర స్వరూపమును ప్రత్యక్షీకరించుచున్నాను. ఆ స్వరూపమునే కుశాగ్రబుద్ధులగు మహాయోగులు తమహృదయములయందు ధ్యానమాహాత్మ్యముచే వీక్షించుచున్నారు. అయ్యది వికారరహితము, అనశ్వరము, జ్యోతిస్వరూపము, అనంతము, ఆనందరూపము, ద్వైతరహితము, వేదవేదాంగ ప్రతిపాద్యంబునదియే. ఈ లోకములకెల్ల నదియే యాధారము. అది వ్యాపించని చరాచరములేదు. వేదవ్యాసుడు వేదశాస్త్రాభ్యాసముల నొనరించిఆ మహత్స్వరూపమును సాక్షాత్కరించి తద్ధ్యాన మహిమచేతనే గీతాశాస్త్రమును సృష్టించెను. అద్దానినిచూచి యానందతరంగములయందుయ్యాలలూగు నేను నీకు నిద్రించువానివలె నగపడుచున్నాను. అని మహావిష్ణువుచెప్ప, లక్ష్మీదేవి సంతోషపూరితురాలాయెను. సంతోషముచే నామెకన్నులు విరిసినవి. ఆమె మోమున మందహాసము తాండవమాడెను.

రువాచ — లక్ష్మీదేవి చెప్పుచున్నది.

శ్లో॥ భవానేవ హృషీకేశ ధ్యేయోఽసి యమినాం సదా।
తస్మాత్త్వత్తః పరం యత్తచ్ఛ్రోతుం కౌతూహలం హి మే॥ 14

శ్లో॥ చరాచరాణాం లోకానాం కర్తా హర్తా స్వయం ప్రభుః।
యథాస్థిత స్తతోఽన్యత్వం యది మాం బోధయాచ్యుత॥ 15

తా॥ మీరే సర్వప్రాప్యులని యెంచి ఇంద్రియ నిగ్రహముగల మహాయోగులు మిమ్ములను ధ్యానించుచున్నారు. మీకంటెను ఉన్నతవస్తువులేదని లోకము చెప్పుచున్నది. మీరు ధ్యానము చేయునది వాస్తవమయినచో మీకన్నను గొప్పవస్తువొకటి యుండవలెను గదా? అట్లొక ఉన్నత వస్తువుండిన నాకు మీరు దానిని తెలియజేయవలెను. సర్వలోకధ్యేయుడగు మీ చేత ధ్యానింపబడు ఆ యున్నత వస్తువును తెలియ నామనస్సు కోరుచున్నది. ఒకవేళ నా మహావస్తువు మీరేకావచ్చును. ఏలయనిన వేదములు మిమ్మే గొప్పవానిగ ఘోషించుచున్నవి. మిమ్ము లోకకారకుడనియు రక్షకుడనియు సంహర్తయనియు నేనెరిగియున్నాను. దీనికన్నను ఇతరులకగోచరమగు స్వరూపముండి దానినే మీరు సాక్షాత్కరించుచున్నారని నాకు తోచుచున్నది. ఆ స్వరూపమును నాకు ఎరుకపరచవలయును. అని లక్ష్మీదేవి నారాయణుని నడిగెను.

శ్రీ భగవానువాచ — శ్రీ మహావిష్ణువుచెప్పెను.

శ్లో॥ మాయామయమిదం దేవి వపుర్మే న తు తాత్వికం।
సృష్టిస్థిత్యుపసంహార క్రియాజాలోపబృంహితం॥ 16

శ్లో॥ అతోఽన్యదాత్మనో రూపం ద్వైతాద్వైతవివర్జితం।
భావాభావవినిర్ముక్తమాద్యంతరహితం ప్రియే॥ 17

శ్లో॥ శుద్ధసంవిత్ప్రభాలాభం పరమానందసుందరం।
రూపమైశ్వరమాత్మైక్యగమ్యం గీతాసు కీర్తితం॥ 18

తా॥ దేవీ! నీకును పామరులకును కనబడు నా స్వరూపము వాస్తవికముగాదు. ఇది మాయాస్వరూపము. వాస్తవమగు నా స్వరూపమునకు సృష్టిస్థిత్యాదిక్రియలుండవు. అది ద్వైతాద్వైతములకు లోబడనిది, ఈ స్వరూపమునకన్న వేరైనది, భావాభావములకు దూరమైనది, ఆద్యంతములులేనిది, శుద్ధ తేజోమయమైనది, అది జ్ఞానస్వరూపము. ఆనందరూపము. గీతాజ్ఞేయము అది ఆత్మైక్యము చేతనే పొందదగును. దీనినే నేను అనుభవించుచుంటిని అని ఉత్తరమిచ్చెను.

శ్లో॥ ఇత్యాకర్ణ్య వచో దేవీ దేవస్యామితతేజసః।
శంకమానాహ వాక్యేషు పరస్పరవిరోధిషు॥ 19

శ్లో॥ స్వయం చేత్పరమానందమవాఙ్మానసగోచరం।
కథం గీతా బోధయతి ఇతి మే ఛింధి సంశయం॥ 20

తా॥ ఈ మాటలను విని లక్ష్మీదేవికి అనేక సందేహములంకురించినవి. ఆమెకు మహావిష్ణువుమాటలు పూర్వాపరవిరుద్ధములుగా గనబడినవి. స్వామీ! మీ స్వరూపము లోకాతీతము

గను, వాక్కులకును మనస్సునకును అగోచరముగను నుండినయెడల అట్టి స్వరూపమును గీత మాత్రము ఎట్లు బోధించును? గీతయు వాక్యరూపమేగదా? అని సందేహించి మహావిష్ణువునడిగెను.

శ్లో॥ శ్రియశ్శ్రుత్వా వచో యుక్తమితి హాసపురస్సరం।
ఆత్మానుగామినీం దృష్టిం గీతాం బోధితవాన్ ప్రభుః। 21

,, అహమాత్మా పరేశాని పరాపరవిభేదతః।
ద్విధా తతః పరః సాక్షీ నిర్గుణో నిష్కలశ్శివః॥ 22

,, అపరః పంచవక్త్రోఽహం ద్విధా తస్యాపి సంస్థితిః।
శబ్దార్థభేదతో వాచ్యః యథాత్మాహం మహేశ్వరః॥ 23

,, గీతానాం వాక్యరూపేణ యన్నిరుచ్ఛిద్యతే దృఢః।
మదీయపాశబంధోఽయం సంసారవిషయాత్మకః॥ 24

,, యదాఖ్యాస పరాధీనౌ పంచవక్త్రమహేశ్వరౌ॥ 25

తా॥ సయుక్తికమగు దేవీవాక్యములను విని నారాయణుడు ఆమె సందేహములను తీర్చనెంచి, ప్రియే! గీతకును ఇతరశాస్త్రపురాణములకును మిగుల భేదముగలదు. ఆత్మజ్ఞానమునకు గీతయే అవలంబమగుచున్నది. నేను గీతచేతనే దృశ్యుడగుచున్నాను, సంసారుల యజ్ఞానమునే గాక నాపాశమును సైతము గీతతొలగించుచున్నది. ఆ గీతయునేనే. గీతాస్వరూపుడగు నన్ను పంచవక్త్రుడనెదరు. నామహత్తరమగు మహేశ్వరస్వరూపము ఆ గీతయందే ప్రతిపాదించబడియున్నది. అందు పంచ వక్త్రమనంబడు స్వరూపమును అపరస్వరూపమనియు చెప్పెదరు. మహేశ్వర స్వరూపమే పరస్వరూపమనబడుచున్నది. పేరునకు తగినట్లు అది సర్వోత్కృష్టమగు స్వరూపము. అది నిష్కల్మషమైనది. నిర్గుణమైనది. క్రియాశూన్యమై సాక్షిభూతముగనుండును.

శ్లో॥ ఇతి తస్య వచశ్శ్రుత్వా గీతాసారమహోదధేః।
ఇదం పరవిభేదేన బుధ్యతే భవభీరుభిః॥ 26

,, తమపృచ్ఛదిదం లక్ష్మీ రంగప్రత్యంగసంస్థితమ్।
మాహాత్మ్యం సేతిహాసం చ సర్వం తస్మై న్యవేదయత్॥ 27

శ్రీ భగవానువాచః—

శ్లో॥ శృణు సుశ్రోణి వక్ష్యామి గీతాసుస్థితిమాత్మనః।
వక్త్రాణి పంచ జానీహి పంచాధ్యాయాననుక్రమాత్॥ 28

,, దశాధ్యాయా భుజాశ్చైక ఉదరం ద్వౌ పదాంబుజే।
ఏవమష్టాదశాధ్యాయా వాఙ్మయీ మూర్తిరైశ్వరీ॥ 29

,, విజ్ఞేయా జ్ఞానమాత్రేణ మహాపాతకనాశినీ।
అతోఽధ్యాయం తదర్ధం వా శ్లోకమర్ధం తదర్ధకమ్॥ 30

,, అభ్యస్యతి సుమేధాయస్సుశర్మేవ స ముచ్యతే॥ 31

తా॥ ఈ మాటలనువిని గీతామాహాత్మ్యము అనన్యాదృశమని తెలిసి అంగప్రత్యంగముల మాహాత్మ్యముల సయితము గీతామాహాత్మ్యమును తెలియజేయవలసినదని వినయముతో లక్ష్మీదేవి నారాయణుని నడిగెను. ఆ సందర్భమున నా మాహాత్మ్యముల నవలంబించిన కథలను గూడ తెలుపవలయునని వేడుకొనెను. అప్పుడు మహావిష్ణువు నీ వడిగిన విధముగనె గీతామహాత్మ్యమును సాంగముగ దెలిపెదను. ప్రథమమున గీతాస్వరూపమును దెలిసికొనుము. గీతయు మనవలె నాకారవిశిష్టమగుదేవత. ముందుండునైదధ్యాయములు దానికి ముఖములగుచున్నవి. అనంతరముండు పదియధ్యాయములు దాని భుజములు. పదునారవ యధ్యాయము దానికి ఉదరము. పదునేడవ, పదునెనిమిదవ యధ్యాయములు దానికి పాదములగుచున్నవి.

ఇట్లుమూర్తిభవించిన ఆ శబ్దమయ దేవత తనలోని ఒకయధ్యాయమునైనను, లేక తదర్ధము నైనను, శ్లోకమునైనను. తదర్ధమునైనను జపించిన సమస్తపాపములను తొలగించుచున్నది. సుశర్మయను నతడే దీనికి తార్కాణము.



ఓమ్

# ప్రథమాధ్యాయమాహాత్మ్యము

శ్రీరువాచ — లక్ష్మీదేవి చెప్పెను.

శ్లో॥ సుశర్మానామకో దేవ కిం జాతీయః కిమాత్మకః ।
కుతస్తస్యచ వై ముక్తిః కేనాజాయత హేతునా ॥ 1

తా॥ స్వామీ! ఆసుశర్మ ఎవడు? అతడు ఏ జాతిలో పుట్టియుండెను? అతని స్వరూపమెటువంటిది? అతనికి మోక్షము ఎట్లు సిద్ధించెను? అని నారాయణుని ప్రశ్నించెను.

శ్రీభగవానువాచ — భగవంతుడు ఆ ప్రశ్నలకు క్రిందచెప్పబోవు విధమున జవాబిచ్చెను.

శ్లో॥ సుశర్మా నామ దుర్మేధాః సీమా పాపాత్మనామభూత్ ॥ 2
,, జాతో నాత్మవిదాం వంశే విప్రాణాం క్రూరకర్మణాం ।
న ధ్యానం న జపో హోమః న చైవాతిథిపూజనం ॥ 3
,, కేవలం విషయేష్వేవ బలాఢ్యేనాభివర్తతే ।
కృషికర్మరతో నిత్యం పర్ణజీవీ సురాప్రియః ॥ 4
,, మాంసోపహారీ సుచిరం కాలమేవం నినాయ సః । 5

తా॥ దేవీ! సుశర్మయొక దుష్టబ్రాహ్మణుల వంశమునబుట్టిన దుర్బుద్ధిగలవాడు. జపహోమాదులనుజేయక కేవలవిషయాసక్తుడై యుండెను తన ఇంటికరిగిన అతిథులను పూజించక తిరస్కరించువాడు. జాతికితగిన వ్యాపారమును అచరించక శూద్రవృత్తియగు కృషికర్మనుగైకొని కాలము గడుపుచుండెను. పాపమనియు తనకు తగనిదనియు తెలిసియున్నను వాడుబోయవానివలె పక్షులను బంధించి అమ్ముచుండెను. పామరునివలె కల్లుత్రాగుచును, మాంసమును భుజించుచును అసహ్యచరితుడై సమస్త పాపాత్ములకగ్రగణ్యుడై తిరుగుచుండెను,

శ్లో॥ ఆనేతుకామః పర్ణాని పర్యటన్నృషివాటికాం ।
తతస్స తత్ర దష్టోఽభూత్ కాలసర్పేణ మూఢధీః ॥ 6
,, కాలధర్మం సమాసాద్య గత్వా చ నిరయాన్ బహూన్ ।
పునరాగత్య మర్త్యేషు బలీవర్దత్వమీయివాన్ ॥ 7

తా॥ ఒకదినము వాడు పక్షులను గ్రహించగోరి మునులయాశ్రమ మొకదానినిజొచ్చి అచ్చట తిరుగుచుండెను. అప్పుడు అతనిని కాలసర్పమొకటి కరచివేసెను. దానిచేవాడు మరణమొంది యమలోకముజేరి తనపాపములకు తగిన యాతనల ననుభవించి అప్పటికి అతనిపాపములు నశించకుండుటచే తదనుభవమునకై భూలోకమున ఒక వృషభరూపమున నవతరించెను.

శ్లో॥ పంగునా కేన విక్రీతః స స్వజీవనహేతవే ।
నయుజా పృష్ఠేన శరదః సప్తాష్టౌ కష్టతోఽనయత్ ॥ 8

తా॥ దీని యజమానుడు వృషభమును ఒక కుంటివానికి అమ్మివేసెను. కుంటివానికి కాలులేకపోవుటవలన అతడు ఎక్కడ వెళ్ళవలసియున్నను దీనినెక్కియే సవారిచేయుచుండెను. ఇట్లు ఎనిమిది సంవత్సరములు ఆవృషభము కుంటివానిని మోసెను. దానిచే మిగులకష్టమునొంది ప్రయాసజెందెను.

శ్లో॥ కదాచిత్పంగునా తేన చిరమావర్తితో జవాత్ ।
పపాత తరసా భూమౌ మూర్ఛాం చ ప్రతిపేదిరే ॥ 9

తా॥ ఒకదినము కుంటివాడు వృషభమునకు విశ్రాంతినీయక చాలదూరము దాని నధిష్ఠించి ప్రయాణముజేయుటచే ఎద్దుచాలశ్రమనొంది నడువలేక పడిపోయెను. అదిమూర్ఛిల్లెను.

శ్లో॥ వికలాంగో వివృత్తాక్షో ఫేనసంతతిముద్వమన్ ।
న జీవతి న మృత్యుం వా ప్రతిపేదేస్వకర్మణా ॥ 10

తా॥ దాని అవయవములు శిథిలములయినవి, కండ్లుతేలవేసెను. నోటినుండినురుగు వెడలనారంభించెను. అది తనపాపముచే చావుబ్రతుకులమధ్య వ్రేలాడుచుండెను.

శ్లో॥ కౌతుకాకృష్టలోకేఽస్మిఞ్ తస్మిన్ జనసమాగమే ।
శ్రేయసే తస్య సుకృతీ కశ్చిత్పుణ్యం వితీర్ణవాన్ ॥ 11

తా॥ జనసమూహము దానినిచుట్టుకొని మిగులనుత్సాహముతో చూడనారంభించెను. అందొక పుణ్యాత్ముడు ఇది యిట్లు కష్టపడుచుండుటచూచి దీనిమేలుకొరకై తనపుణ్యమునుండి కొంచెము పుణ్యమును దానముచేసెను.

(ఇచ్చట గమనింపవలసిన ఒక అంశము గలదు. ధనము లేక ఆకలిచే మాడువానికి దయగల ధనికుడు ధనమునిచ్చి వానికష్టమును పోగొట్టుచుండుటను మనము చూచుచున్నాముగదా? ఇట్లే పుణ్యములేక కష్టపడువానికి ఒక పుణ్యాత్ముడు పుణ్యమిచ్చినచో వాడు సుఖపడుచున్నాడు.)

శ్లో॥ కర్మాణి స్వాన్యనుస్మృత్య దదురన్యే చ కేచన ।
గణికా కాపి తత్రస్థా లోకయాత్రానువర్తినీ ।
అజ్ఞాతనిజపుణ్యా సా కించిదుత్సృష్టవత్యభూత్ ॥ 12

తా॥ దీని దుస్థితికి చింతపడి మరికొందరు కొద్దిపుణ్యము నిచ్చిరి. ఒకవేశ్యకూడ ఆ విధము గనే తనపుణ్యమును దానముచేసెను. అయితే ఆమెకు తానుచేసిన పుణ్యముతెలియదు. పుణ్యమను నది డబ్బువలె చేతితో ఇవ్వదగినదిగాదు. ఏలయనిన ఆదిరూపములేనిది. దానిని ఇచ్చునపుడు మనస్సుచే ఇచ్చినట్లు భావింతురు. అచ్చటచేరియుండినవారును తమపుణ్యమును అట్లే మనస్సుచే భావించి ఇచ్చుచుండిరి. ఈ వేశ్యకూడ వారివలె తనకు ఏదైన పుణ్యముండునని భావించి పుణ్య దానముచేసెను.

శ్లో॥ పరేతనగరీమాదౌ స నీతః కాలకింకరైః ।
గణికాదత్తపుణ్యేన పుణ్యవానితి యోచితః ॥ 13

తా॥ వానిని యమకింకరులు ముందు యమపురికి తీసికొనివెళ్లిరి, అచ్చట ఇతని కర్మ యెట్టిదో యని పరీక్షించిరి. అప్పుడు ఇతడు పుణ్యవంతుడని తెలిసినది. ఇతడు మిక్కిలి పాపాత్ము

డగుటచే ఇతరులిచ్చిన పుణ్యమంతయు తీరిపోయినది. కాని వేశ్యయిచ్చిన పుణ్యము చాల గొప్పది. అది ఇంకనుతీరక అట్లే ఇతనిని అంటియుండెను. దానిచే యమభటులు అతనిని పుణ్యవంతుడని గ్రహించి విడిచిపెట్టిరి.

శ్లో॥ పునరాగత్య భూర్లోకం కులశీలవతాం గృహే।
ద్విజన్మనామసౌ జజ్ఞే జాతిం స్వామనుసంస్మరన్ ॥ 14

తా॥ వాడు మరల భూలోకమునుచేరెను. ఇప్పుడు పుణ్యకర్మగలవాడగుటచే కులశీలయుతులైన బ్రాహ్మణోత్తముల వంశమున జనించెను. వానికి తన పుట్టుపూర్వోత్తరములు ఆ పుణ్యమాహాత్మ్యముచే తెలిసియుండెను.

శ్లో॥ కాలే మహతి జిజ్ఞాసుః శ్రేయః స్వాజ్ఞాననోదనం।
ఉపేత్య గణికాదత్తం ఖ్యాపయిత్వా స పృష్టవాన్ ॥ 15

తా॥ చాలకాలమునకు అతనికి తన్ను నరకమునుండి విడిపించి ఉత్తమజన్మ నొసంగిన ఆ గణికాపుణ్యకర్మమును, దాని స్వరూపమును తెలిసికొనవలెను అని కోరికపుట్టెను. వాడు వేశ్య వద్దకుజేరి ఆమె అపత్కాలమున తన సంతరణార్థము ఇచ్చియుండిన పుణ్యమునుగూర్చి యడిగెను.

శ్లో॥ ఆచష్ట మాం శుకో నిత్యం పంజరస్థః పఠత్యసౌ।
తేన పూతాంతరాత్మాఽహం తత్పుణ్యం పర్యకల్పయం ॥ 16

తా॥ అయ్యా! నాకు ఆ పుణ్యము సంగతియే తెలియదు. అందరికివలె మనకును ఏదైన పుణ్యముండవచ్చునని తలంచి నీదురవస్థనుచూచి సహించలేక అందరు పుణ్యదానము చేయుచుండ నేనుకూడ చేసితిని, నాకు పుణ్యమున్న సమాచారము నీవృత్తాంతమును వినినతరువాతనే తెలిసెను. నేను నావృత్తి నవలంబించి జీవించుదానను. నాకట్టిపుణ్యము ఎట్లుకలిగెనో? అది నాకే తెలియకున్నది. నావద్ద నొక చిలుకయున్నది. అది ప్రతి దినమేవియో కొన్ని మంత్రములను పలుకుచుండును. దానిని విను వాడుక నాకు కలదు. దానిచేతనే నాకు పుణ్యముండిన వచ్చియుండవలెను. ఏలయనిన, నేను చేయునది నీచవృత్తి. నేను పుణ్యవర్ధకములగు యజ్ఞదానాదులను చేసియుండలేదు! అని ఆ వేశ్యాస్త్రీ సమాధాన మొసంగెను.

శ్లో॥ తాభ్యాం శుకస్తు పృష్టోఽసౌ వ్యాఖ్యాతుముపచక్రమే।
ఆఖ్యాయికాం పురావృత్తం స్మృత్వాజాతిం నిజామపి ॥ 17

తా॥ అనంతరము ఆమె చిలుకవద్దకు విప్రునితోడ్కొనివెళ్లెను. వారిరువురు శుకమును ఈ విధముగ ప్రశ్నించిరి. అయ్యా! నేను ఘోరనరకమునుండి ఈ వేశ్యయొక్క పుణ్యముచే విడిపడితిని. ఆమె నీవు ఉచ్చరించు మంత్రమునువిని ఆ పుణ్యమును సంపాదించితినని చెప్పుచున్నది. కాన అట్టి పుణ్యవర్ధకమగు ఆ మంత్రమేదియో మాకు తెలుపవలెను అనెను, అప్పుడు శుకము తన పూర్వవృత్తాన్తములను స్మరించి ఇట్లు చెప్పెను.

శుక ఉవాచ — చిలుక చెప్పెను.

శ్లో॥ పురా విద్వానహం భూత్వా వైదుష్యస్మయమోహితః।
రాగద్వేషేణ విద్వత్సు గుణవత్స్వపి మత్సరీ ॥ 18

శ్లో॥ కాలేనాహం తతః ప్రేత్య ప్రాప్య లోకాన్ జుగుప్సితాన్ ।
సోఽహం కీరకులేఽభూవం సద్గురావతినిన్దకః ॥ 19

తా॥ ద్విజోత్తమా! పూర్వజన్మమున నేనొక పండితుడను, నాకప్పుడు వైదుష్యమదము మెండుగనుండెను. దానిచే నేను విద్వాంసులను దూషించుచు గుణవంతులను తిరస్కరించుచు నుంటిని. నేను గురునిందాపరాయణుండనగుటచే నాకు మరణానంతరము క్రూరములగు యమ యాతనలను అనుభవింపవలసి ఏర్పడెను. యమభటులు గురునింద నొనర్చిన నన్ను శిక్షింపగోరి స్పష్టవాక్యములను ఉచ్చరించుటకు యోగ్యతలేని శుకజన్మ నిచ్చిరి.

శ్లో॥ కాలేఽధర్మణి దుష్కర్మా పితృభ్యాం చ వియోజితః ।
నిదాఘే ధ్వనిసంతప్తే చానీతో ఋషిపుంగవైః ॥ 20

తా॥ నా పాపముచే నన్నుగన్న పెద్దలు అకాలమున మరణించిరి. నేను రక్షించు వారులేక సంతప్తధూళిపూరిత మార్గమునబడి బాధపడుచుంటిని. అప్పుడు ఆ దారినవెళ్ళుచుండిన ఋషిపుంగవులు నామీద దయకలిగి నన్ను కాపాడగోరి అనేక సాధుసజ్జనులుండు ఒక ఆశ్రమ మునచేర్చిరి. అచ్చటివారు పిల్లి మొదలగు దుష్టప్రాణులచే నాకపాయము కలుగకుండుటకుగాను ఒక పంజరమును తయారుచేసి అందులో నన్ను ఉంచి కాపాడిరి.

శ్లో॥ ఆవర్తయద్భ్యో గీతానాం ఆద్యమధ్యాయమాదరాత్ ।
శ్రుత్వాఋషికుమారేభ్యః పాఠం చాకరవం ముహుః ॥ 21

తా॥ అచ్చటి మునికుమారులు ప్రతిదినము గీతా ప్రథమాధ్యాయమును జపించుచుం డెడివారు. ఆ అధ్యాయమును పలుమారు చెప్పుచుండ నేను నేర్చుకొంటిని.

శ్లో॥ ఏతస్మిన్నంతరే కశ్చిత్ వా గురిశ్చోరకర్మకృత్ ।
మామాహృత్య తదాక్రీణాత్ ఇతివృత్తముదాహృతమ్ ॥ 22

తా॥ ఇట్లుండ ఒక బోయవాడు నన్ను ఆశ్రమమునుండి అపహరించి నీకమ్మివేసెను. ఇదియే నా పూర్వవృత్తాంతము.

శ్లో॥ అధ్యాయోఽయం పురాఽఽమ్నాతః యేన పాపమనోదయం ।
పూతాన్తరాత్మా యేనాసౌ మోచితశ్చ ద్విజోత్తమః ॥ 23

తా॥ నేను నేర్చిన ప్రథమాధ్యాయమును అనేక పర్యాయములు నీ యెదుటనే ఉచ్చ రించి ఉన్నాను. తచ్ఛ్రవణముచేత వేశ్యాపాపము తొలగెను. బ్రాహ్మణుని పాపమంతయుతొలగి అతడు పవిత్రుడాయెను. ఇట్టి యమోఘమాహాత్మ్యము ప్రథమాధ్యాయమునకున్నదని

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ ఏవమన్యోన్యమాభాష్య తన్మాహాత్మ్యం ప్రశస్య చ ।
తేజవంతోఽనిశం ధీరాః ముక్తిం గేహే ప్రపేదిరే ॥ 24

తా॥ నారాయణమూర్తిచెప్పెను. దేవీ! ఇట్లు శుకవిప్రవేశ్యలు ఆ ప్రథమాధ్యాయ మాహాత్మ్యమును ప్రశంసించియు, ఆ అధ్యాయమును జపించియు, వినియు, పలికియుండుటచే ఉపాయాన్తర నిరపేక్షులై ముక్తిని బడయగల్గిరి.

శ్లో॥ తస్మాదధ్యాయమాద్యం యః పఠతే శృణుతే స్మరేత్ ।
అభ్యసేత్ తస్య న భవేత్ భవాంభోధిర్దురుత్తరః ॥ 25

తా॥ దేవీ! గీతాప్రథమాధ్యాయమును పఠించినను, వినినను, స్మరించినను, అభ్యసించినను, పాపములు తొలఁగి ముక్తిగల్గును. గీతాప్రథమాధ్యాయమును జపించువానికి సంసారసాగరము దురుత్తరము కాదు అని చెప్పెను.



ఓమ్

# ద్వితీయాధ్యాయమాహాత్మ్యము



భగవానువాచ — భగవంతుడగు నారాయణుడు చెప్పెను.

శ్లో॥ ఆదిమస్త్యైవమాఖ్యాతముదీరితమనుత్తమం ।
శృణు మాహాత్మ్యమన్యేషామధ్యాయానామపీందిరే ॥ 1

తా॥ దేవీ! నేనిప్పుడు ప్రథమాధ్యాయమాహాత్మ్యమును నీకు తెలియజేసితిని. అది సర్వోత్కృష్టమైనదని నీకు తెలుసును. పైయధ్యాయ మాహాత్మ్యములనుగూడ తెలియజేసెదను వినుము.

శ్లో॥ దక్షిణస్యాం దిశి శ్రీమాన్ ఆసీదామ్నాయవాదినాం ।
పురే పురందరాహ్వానే దేవశర్మేతి విశ్రుతః ॥ 2

,, అర్చితాతిథిరామ్నాతః వేదశాస్త్రవిశారదః ।
ఆహర్తా క్రతుసంఘానాం తాపసానాం ప్రియస్సదా ॥ 3

,, దేవాన్ సంతర్పయామాస హవ్యైర్హుతవహం చిరం ।
న చోపలేభే ధర్మాత్మా శాంతిమేకాంతికీం తతః ॥ 4

తా॥ దక్షిణదేశమున పురందరమను నొక పురముగలదు. అందు దేవశర్మయను బ్రాహ్మణుడొకడుండెను. వాడు వేదశాస్త్రములనభ్యసించి అందుతెలిపియున్నరీతిలో అతిథిపూజ మొదలగు పంచయజ్ఞములను క్రమముగచేయుచుండెను. మహర్షులనుపూజించి వారి అనుగ్రహములకు పాత్రుడాయెను. అనేకయాగములనుచేసి దేవతలను సంతోషపరచెను. ఇట్లనేక సత్క్రియలను చేసినవాడయినను మనశ్శాంతిలేక దుఃఖపడుచుండెను. వాని మనస్సు తానుచేసిన పుణ్యకర్మలచే తృప్తిచెందినది కాదు.

శ్లో॥ నిశ్శ్రేయసం స జిజ్ఞాసుః తాపసానవువాసరం ।
నిషేవే సత్యసంకల్పాన్ అనలైరేవ్వకల్పకైః ॥ 5

తా॥ వాడు మనశ్శాంతికి తగుసాధనమును తెలియగోరెను. కాలత్రయమును తెలిసి భువనత్రయమును కరతలామలకముబోలి చూచెడి మునులకు అగమ్యమేదైనకలదా? అట్లుండదుగదా కాననతడు తనకోరికను నెరవేర్చుకొనుటకై అనుదినము అనేక తపోనిధులను ఉపచరించెను.

శ్లో॥ ఏవమాచరత స్తస్య కాలే మహతి గచ్ఛతి ।
ముక్తకర్మా తతః కశ్చిత్త్పాదురాసీత్పురా భువి ॥ 6

,, అనుభూతనిరాకాంక్షీ నాసాగ్రన్యస్తలోచనః ।
శాంతచేతాః పరంబ్రహ్మ ధ్యాయన్ ఆనందనిర్భరః ॥ 7

తా॥ ఇట్లు కొన్నిదినములు గడచినవి. ఒక దినము అతని ఇంటికి ఒక సాధువు వచ్చెను. అతని ముఖమున ఆనందము తాండవమాడుచుండెను. అతడు నేత్రములను నాసాగ్రమున నిలిపి ధ్యానములోనుండెను. అతనిని చూచువారికి అతనిస్థితిగతులనుబట్టి అతడుమిగుల వైరాగ్యముగలవాడనియు శాంతమనస్సుగలవాడనియు గ్రహించనవకాశములుండెను.

శ్లో॥ పాదౌ తస్యోపసంగృహ్య ప్రణతేనాంతరాత్మనా ।
చకార విధివత్తస్మై విద్వానతిథిసత్క్రియాం ॥ 8

,, తం చ శుద్ధేన భావేన పరితుష్టం తపస్వినం ।
ప్రణతః పరిపప్రచ్ఛ నిర్వాణస్థితిమాత్మనః ॥ 9

తా॥ దేవశర్మ శాంతచిత్తుడగు ఈ మహాత్మునిచూచి ఇప్పటితో మన దుఃఖము తీరెను. వీరెవరో మహానుభావులు. మనము వీరిమూలమున శ్రేయస్సును బడయవలెననియెంచి ఆ సాధుపుంగవుని పాదములనుస్పృశించి నమ్రుడై వారికి వలసిన సత్కారములనొనరించెను. అప్పుడా మహాత్ముడు సంతుష్టుడగుటంజూచి ఇదియే సమయమని, స్వామీ! నేను అనేక పుణ్యకర్మలనొనరించియు సుఖపడకయున్నాను. నాకు శాంతిని మీరే కల్పించవలయును. అని వినయముతో వేడుకొనెను.

శ్లో॥ స తస్మై కథయామాస పురే సౌపురనామని ।
మిత్రవంతమజాపాలం ఉపదేష్టారమాత్మవిత్ ॥ 10

తా॥ భూసురా! సౌపురనగరమున మిత్రవంతుడను గొల్లవాడొకడున్నాడు. వానిని చేరి యడుగుము. వాడు నీకు శాంతిమార్గమునుగఱపి మనస్సునకు తృప్తిని కలుగజేయగలడు. అని ఆ మహాసాధువు వచించెను.

శ్లో॥ స చాభివంద్య తత్పాదౌ పేత్య సౌపురమూర్జితం ।
తస్యోత్తరదిశో భాగే దదర్శ విపులం వనం ॥ 11

,, మారుతాందోలితానేక కుసుమామోదసుందరం ।
ఉన్మత్తభ్రమరోద్ధూత నాదాపూరితదిఙ్ముఖం ॥ 12

తా॥ దేవశర్మ అతని వాక్యానుసారముగా సౌపురముచేరెను. దాని సమీపమున నొకయడవిగలదు. అందు ఎల్లప్పుడు అనేక పుష్పములు వికసించియుండుటచే సువాసనగమ్మియుండును. ఆ పుష్పములోని మకరందమునుత్రాగి మధుకరములు ఝుంకారధ్వనిని లేపుచుండును. అతడు అట్టి సుమనోహరవనమునకు వెళ్ళెను.

శ్లో॥ తస్మిన్ వనే సరిత్తీరే నిషీదంతం శిలాతలే ।
మిత్రవంతం దదర్శాథ సానందస్తిమితేక్షణమ్ ॥ 13

శ్లో॥ అపి స్వాభావికం వైరం హిత్వాఽన్యోన్యం విరోధిభిః।
సత్త్వైరావృతముద్యానే అందస్యందనభాస్వతి॥ 14
,, శాంతేషు మృగయూథేషు మహానందమనోజ్ఞయా।
కృపానువిద్ధయా భూమిం నిషించంతమివామృతం॥ 15

తా॥ అచట నదీతీరమున మిత్రవంతుడు శిలాతలమున కూర్చొనియుండెను. వాని నేత్రములు ఆనందముచే విరిసియుండెను. ఆ వనమున అనేకములగు ప్రాణులు గనుబడినవి. అవి తమ జన్మసిద్ధమగు విరోధమును మఱచి ప్రేమతో వ్యవహరించుచుండినవి. అదిచూడ ఇతని కాశ్చర్యముకలిగెను. మిత్రవంతుడు శాంతములైన ఆ మృగములనుచూచి ఆనందముతో పొంగుచుండెను. వాని దయామిశ్రితమగు చూపు అమృతమును వర్షించుచున్నట్లుండెను.

శ్లో॥ ఉపేత్య వినయేనాముమున్మనాః ప్రీతమానసః।
కించిదానమ్రశిరసా తేనాపి స తు సత్కృతః॥ 16
,, ఉపతస్థే తతో విద్వాన్ మిత్రవంతమనన్యధీః।
సమాప్తధ్యానకాలం స పర్యపృచ్ఛత్సమాహితః॥ 17

తా॥ దేవశర్మ మిత్రవంతునిచూచి తనకు దుఃఖవిమోచనము కలిగెననియెంచి వినయముతో అతనిని సమీపించి నమస్కరించెను. మిత్రవంతుడు ఇతని ప్రణామముల నందుకొనెను. అప్పుడు ధ్యానకాలమగుటచే ధ్యానించుచుండెనేకాని దేవశర్మకు ప్రతిసత్కారమును చేయలేదు. అతడు తన శిరంబును కొద్దిగవంచి తన సత్కారమును తెలిపెను. ధ్యానానంతరము దేవశర్మ అతివినయముతో తన సంగతియంతయు చెప్పదొడంగెను,

దేవశర్మోవాచ — దేవశర్మ చెప్పెను.

శ్లో॥ ఆత్మానం వేత్తుమిచ్ఛామి తదముష్మిన్మనోరథే।
లబ్ధసిద్ధిం ఉపాయం మాం ఉపదేష్టుం త్వమర్హసి॥ 18

తా॥ స్వామీ! నేను అనేక సత్కర్మలను చేసియున్నాను. అయినను ఆత్మజ్ఞానమును పొందలేదు. అది లేకపోవుటవలన అనేక సత్కర్మలను చేసియుండియు నాకు శాంతియు తృప్తియు సంతోషమును కలుగకున్నవి. కావున నా దుఃఖవిమోచనమునకు తగినమార్గమును తెలుపవలయునని మిమ్ములను కోరుచున్నాను.

శ్రీభగవానువాచ — భగవంతుడు చెప్పెను.

శ్లో॥ పరామృశ్య క్షణం సోఽపి మిత్రవానిదమబ్రవీత్॥

దేవీ! దేవశర్మమాటలనువిని మిత్రవంతుడు కొంచెమాలోచించి పిదప ఈ విధముగ నతనినిగూర్చి చెప్పెను.

మిత్రవానువాచ — మిత్రవంతుడు చెప్పెను.

శ్లో॥ విద్వన్ బుద్ధి పురావృత్తముచ్యమానమిదం మయా।
అస్తి గోదావరీ తీరే ప్రతిష్ఠానాభిధం పురం॥ 19

శ్లో॥ తత్ర దుర్దమనామాసీత్ అన్వయే చ మనీషిణాం।
తత్రాస్తి విక్రమో నామ సేవ్యమానో మహీపతిః॥ 20

,, దానాని ప్రత్యహం గృహ్ణన్ వర్తతే ఉదరంభరః।
కాలేన కాలపాశేన బద్ధ్వా నీతో యమాలయం॥ 21

,, నిరయేషు సమగ్రేషు యాతనా అనుభూయ చ।
కస్మింశ్చిత్స కులే జాతః దుర్వృత్తానాం ద్విజన్మనాం॥ 22

,, భవాంతరానువర్తిన్యా విద్యయా స పురస్కృతః॥

తా॥ ఓయీ భూసురా! నీవు ఉపాయము తెలియక పోవుటచే బాధపడుచుంటివి. నీకు తగిన ఉపాయమును చెప్పెదవినుము. గోదావరీతీరమున ప్రతిష్ఠానమను పురమున్నది. అందు దుర్దముడను వాడొకడుండెను. వాడు మంచి బుద్ధిమంతులవంశమున పుట్టియుండెను. ఆ నగరాధిపతియగు విక్రముడు పెక్కుదానములను చేయువాడు. దుర్దముడు వృత్త్యంతరమును వెదుకక ఇది పాపహేతువని యోచించక అతడిచ్చుదానములను స్వీకరించి కాలము గడుపుచుండెను. కొంతకాలమునకు వాడు మరణించగా వానిని యమకింకరులు యమపురినిచేర్చి అతని పాపములకు తగిన యాతనలను అనుభవింపజేసిరి. అనేక యాతనలను అనుభవించి వాడు మరల భూలోకమున దుశ్చరితులగు విప్రులకులమున నవతరించెను. అతనికి పూర్వజన్మపువిద్యలు సంస్కారరూపమున ప్రాప్తించినవి.

శ్లో॥ ఉపయేమే దురాధర్షాం కన్యకామధమే కులే
కాలేన సా వయో హిత్వా శైశవం యౌవనం యయౌ॥ 23

,, పీనస్తనీ చ సుశ్రోణీ మదగహ్వరలోచనా।
పతిం న సేహే దుర్వృత్తా చకమే స్వపతీన్ పరాన్॥ 24

తా॥ అట్లు విద్యావంతుడైన ఆ దుర్దముడు దౌర్భాగ్యవశమున అధమకులోద్భవయును దుష్టురాలును అగు ఒక కన్యకను పెండ్లియాడెను. ఆమెకు యౌవనము తటస్థించెను. ఆ సమయమున స్తనాద్యవయవములు బలిసి యౌవనమదము అధికరించినవి. ఆమె కండ్లు యౌవనమదముచే తిరుగ నారంభించినవి. ఆమె తన పతితో తృప్తిచెందక పెక్కుర జారపురుషులను ఏర్పరచుకొనెను.

శ్లో॥ వృత్తిమాహర్తుకామాస్మాన్నిర్గతా సా పురాద్బహిః।
సంగతా కాముకేనాసౌ చిరం చాండాలజన్మనా॥ 25

,, దధే గర్భమసౌ తస్మాత్ పూర్వపాపప్రసంగతః।
సాఽపి భార్యేవ తస్యాసీత్ సా చ కన్యోపపద్యతే॥ 26

తా॥ ఒకనాడు అమె జుగుప్సితమగు తన కామమును తీర్చుకొనుటకు జనసమ్మర్దభూయిష్ఠమగు నగరమున అవకాశమువుండదనియు, తన ఆశను పూర్తిచేయువాడు దొరకడనియు తలంచి నగరమును వీడి చండాలురు నివసించు ప్రదేశమునుచేరి ఒక చండాలునితో సంగమించి తన ఆశను నెరవేర్చుకొనెను. దానిచే ఆమె గర్భముధరించి ఒక కన్యకను ప్రసవించెను.

శ్లో॥ సైప వృద్ధా తతః కాలే డాకినీ సమజాయత ।
కుసంగాత్ కుమతిర్జాతా దుష్టనారీప్రసంగతః ॥ 27

తా॥ దుర్వృత్తురాలగు ఆ స్త్రీకి జనించిన ఆ యాడుబిడ్డ తనతల్లి దుశ్చరితురాలు గావున దుర్బుద్ధి కలిగియుండెను. కొంతకాలమునకు తల్లిదోషముచే ఆ తనయకు పిశాచరూపము కలిగెను.

శ్లో॥ చఖాద వ్యాధితం ఘోరం అసృగాస్వాదలాలసా ।
భ్రమంతీ విపినే ఘోరే జనైర్దృష్ట్వా బహిష్కృతా ॥ 28

తా॥ ఆమె అప్పటినుండియు నరమాంసభక్షకురాలాయెను. ఇట్లనేకులను భుజించి ఒకదినము తినుటకు ఏదియు దొరకనందున ఎదురుపడిన వ్యాధిగ్రస్థుడగు ఒకబోయవానినిచంపి తన ఆకలిని తీర్చుకొనెను. ఇట్లు ఆమె దురాకృతమును చేయుచుండ అది సహించని ప్రజలందరు యామెను దేశమునుండి తరిమివేసిరి.

శ్లో॥ పరేతలోకమాసాద్యవ్యాధో వ్యాఘ్రో న్యవర్తత ।

తా॥ ఆ బోయవాడు చచ్చి యమలోకముచేరెను. అనంతరము వ్యాఘ్రరూపమున భువిలో జన్మించెను.

నరకాన్ దారుణాన్ భుక్త్వా జీవహింసాప్రభావతః ॥ 29

తా॥ ఆ బోయవాడు తన జీవితకాలమున అనేక జీవములను హింసించినందువలన వాడు వ్యాఘ్రరూపమెత్తుటకు పూర్వము నరకముజేరి అనేక బాధలను అనుభవించెను.

శ్లో॥ సాపి కాలేన దుష్టాత్మా మృత్యువేగముపాశ్రితా ।
నిరయానేత్య దుర్ధర్షాన్ అజాజాయత మత్కులే ॥ 30

తా॥ ఆ పిశాచినియును నరకముజేరి తన పాపములకు తగిన ఘోరయాతనలను అనుభవించి తుదకు నా గృహమున మేకపిల్లగా పుట్టెను.

శ్లో॥ తామన్వావ్యహం ఘోరం పాలయన్ కాననాంతరే ।
అవశ్యం ద్వీపినం ఘోరం జిఘాంసంతమివాఖిలం ॥ 31

,, సమాలోక్యతమాయాంతం భయేన ప్రపలాయితం ।
అజాయూథం పరిత్యజ్య మయా మరణభీరుణా ॥ 32

తా॥ నేను నా మేకలను ఒకనాడు ఈ వనమున మేపుచుంటిని. ఆ మేకలతోకూడి ఈ మేకయు మేయుచుండెను. అప్పుడు ఒక వ్యాఘ్రము సమస్తమును మ్రింగగోరునట్లు తెరిచిన నోరుతో అజాయూథముపైబడెను. దానిని చూచినంతనే నేను ప్రాణభయముచే పరుగెత్తితిని. నా మేకలంతయు చెదరిపోయినవి.

శ్లో॥ ఉపద్రుద్రావ స ద్వీపీ పూర్వవైరమనుస్మరన్ ।
అజాఽపి తత్సమీపేఽగాత్ సత్వరం సరిదంతికే ॥ 33

తా॥ ఆ వ్యాఘ్రము పరుగెత్తుచున్న మేకలనువిడిచి పూర్వవిరోధముచేత ఈ క్రొత్త మేకమీద కొచ్చెను. ఆ మేకయు ఇతరమేకలవలె భయపడి ఆ నదీతీరమునకు పరుగెత్తెను.

శ్లో॥ తత్ర సా భయముత్సృజ్య హిత్వా వైరమనర్గళా ।
అవతస్థే చ చ ద్వీపీ తూష్ణీమాసీద్విమత్సరః ॥ 34

తా॥ నదీతీరమును చేరినంతట దానికి ఒక క్రొత్తయనుభవము కలిగినట్లుండెను. అప్పుడది వ్యాఘ్రమునుచూచి భయమొందలేదు. ధైర్యముతోను శాంతముతోను దానియాగమనమును యెదురుచూచెను. అప్పుడు మరియొక విశేషముకలిగెను. అది ఏదనిన కడుకోపముతో దీనిని భక్షించగోరి వచ్చిన ఆ క్రూరవ్యాఘ్రము శాంతమగు మృగమునంబోలె మాత్సర్యమును విడిచి యూరకుండెను.

శ్లో॥ తం తథావిధమాలోక్య సా వక్తుముపచక్రమే ।
ద్వీపిన్నభీప్సితం భుఙ్క్ష్వ మాంసముద్ధృత్య సాదరః ॥ 35

తా॥ అనన్తరము ఆ మేక తన్ను సమీపించిన ఆ పులిని, అయ్యా! నీవు ముందునన్ను చంపుట కుద్యుక్తుడైతివికదా! ఇప్పుడు నీ యాకలి తీరిపోయెనా? యేల ఊరకనిలబడి యున్నావు? నేను యెట్టి ఆటంకమును కలుగజేయను. నీకు కావలసిన మాంసమును నా దేహము నుండి యెత్తి తినవచ్చును. ఇట్లు శాంతముగానుండుట నీ స్వభావముకాదుగదా? వచ్చినప్పుడు యుండిన ద్వేషము యెచ్చటికి పోయెనో? నీ స్థితి నాకు ఆశ్చర్యమును కలుగజేయుచున్నది. అని అడిగెను.

శ్లో॥ ఇత్యాకర్ణ్య తదా వాక్యమాహ ద్వీపీ విమత్సరః ।
స్థానేఽస్మిన్మే గతో ద్వేషః క్షుత్పిపాసా చ నిర్గతా ॥ 36
,, న ప్రార్థయామి తేన త్వాం సమీపే సముపస్థితామ్ ॥ 37

తా॥ ఈ మాటలనువిని ఆ వ్యాఘ్రము శాంతముతో నో అజమా! నేను ముందు వైరముతో నిన్ను సమీపించితినిగాని ఈ స్థలమునుచేరిన తత్క్షణమే నా వైరము నశించిపోయెను. తత్స్థానమున ప్రేమ యావిర్భవించినది. ఇచ్చటికి వచ్చునప్పుడు నాకు ఆకలియు, దప్పికయు మిగుల యుండినవి. కాని ఇప్పుడు ఈ స్థలమును త్రొక్కగా నా యాకలిదప్పులు యెట్లో మాయమై పోయినవి. నేను తృప్తుడనైతిని. నా మనస్సునకు సంతోషము కలిగినది. నన్ను నీవు బ్రతిమాలు కొన్నను నిన్ను నేను భక్షించను. నాకిప్పుడు నీ యావశ్యకతలేదు.

శ్లో॥ సైవముక్తా తతః ప్రాహ జాతాఽహం నిర్భయా కథం ।
కిమత్ర కారణం వేత్సి యది మే వక్తుమర్హసి ॥ 38

తా॥ అయ్యా! మీకు ఆకలిలేదనియు నామీద ద్వేషములేదనియు ఈ చోటికివచ్చిన తర్వాతనే ఇట్లు సంభవించెననియు మీరు చెప్పుచున్నారు. ఇది నాకాశ్చర్యము కలిగించుచున్నది. నేను దూరమున మిమ్ములనుజూచి ముందు భయపడితిని. నదీతీరము చేరినతరువాత నాకాభయము లేకపోయెను. ఇప్పుడు మీరు శాంతస్వరూపులుగా నాకు కనబడుచున్నారు. వ్యాఘ్రమగు మీరు నన్ను చంపక విడిచిపెట్టుటయు, అజమగు నేను భయపడక మీతో సరససల్లాపములాడుటయు దురూహములై యున్నవి. దేనికేదో బలవత్కారణముండవలయును. అది తెలిసియుండిన తెలుప వలయునని మిమ్ముల వేడుచున్నాను. అని ఆ మేక పులిని అడిగెను.

శ్లో॥ ఏవముక్తః పునర్ద్వీపీ తామాహాజాం న వేద్మ్యహం।
పురోగతమిమం ప్రష్టుం మహాన్తమితి నిర్గతా॥ 39

,, తాభ్యాముభాభ్యామాగత్య పృష్టోఽహం బహువిస్మయః।
అహం చ సహితస్తాభ్యామపృచ్ఛం వానరేశ్వరమ్॥ 40

తా॥ అప్పుడు ఓయీ అజమా! నాకీ యాశ్చర్యములకు కారణము తెలియదు. మన యెదుటనున్న ఈ మహానుభావుని అడిగి తెలిసికొందము, అనిచెప్పి ఆ మేకను తోడుకొని నావద్దకు చేరి ఆ పులి స్వామీ! మా ఇరువురికి జరిగిన యనుభవములను మీరు చూచితిరిగదా! వీటికికారణ మేదో తెలుపవలయునని నన్ను వేడుకొనెను. నాకును దానికారణములు తెలియవు. కావున మేము ముగ్గురముచేరి యెదుటనున్న యొక వానరశ్రేష్ఠమును ఈ విషయమును గురించి ప్రశ్నించితిమి.

శ్లో॥ మయా పృష్టః స విప్రేంద్ర మ్యబవీత్ సాదరం కపిః।
శృణు వక్ష్యామ్యజాపాల వృత్తమత్ర పురాతనం॥ 41

,, ఇదమాయతనం పశ్య పురోద్యానగతం మహత్।
అత్ర త్ర్యంబకలింగం హి ద్రుహిణేన ప్రతిష్ఠితం॥ 42

,, సుకర్మా నామ మేధావీ పర్యుపాస్తే తపశ్చరన్।
వనపుష్పాణ్యుపాహృత్య సురపూజ్యం పురోభవమ్॥ 43

తా॥ సోదరులారా! మీ సంశయమును తొలగించెదను అని ఆ కపిశ్రేష్ఠము అత్యాదరముతో ఈ పురావృత్తాన్తమును మాకు తెలియజేసెను. అదిగోచూడుడు! ఈ ముందరి యుద్యానవనమున నొక దేవతాయతనమున్నది, ఈ యాలయమునందు బ్రహ్మదేవునిచే ప్రతిష్ఠింపబడి పూజింపబడిన సుప్రసిద్ధమగు త్ర్యంబకలింగముకలదు. కొన్నాళ్ళకుపూర్వము సుకర్మయను విద్వాంసుడు ఈ లింగమున కభిషేకముగావించి ధూపదీప నైవేద్యములచేసి పూజించుచుండెను. అతడు ఈ వనమునందు వికసించిన పుష్పములచే భగవంతు నారాధించుచుండెను.

శ్లో॥ సంస్నాప్య సరిదంబోభిః కేవలం కర్మణా వసన్।
కాలే మహతి తస్యాగాదతిథిః కశ్చిదన్తికమ్॥ 44

,, ఉపాహృత్య ఫలాహారం స తస్మై పర్యకల్పయత్।
తేనాతిథ్యేన సంప్రీతః సుకర్మాణమభాషత॥ 45

,, కిమిదం కర్మణో మూలం ఫలం భుక్త్వా తు తిష్ఠసి।

తా॥ ఇట్లు దేవతాప్రీతికరములగు కర్మలనుచేసి కాలమును గడుపుచుండ నొకనాడు అతిథి యొకడు అతనిదరిచేరెను. సుకర్మ అతిథిలాభముచే మిగుల సంతోషపడి ఆ యతిథిని నానావిధములుగా సత్కరించెను. ఫలాహారము చేయించెను. తేనెలొలుకు నా ఫలములను భుజించి మిక్కిలి సంతుష్టుడైన యా యతిథి, ఓయీ సుకర్మా! నీ వెందులకు కేవల ఫలాహారివై ఈ భగవత్సేవను చేయుచున్నావు? నీవాశించునదియేది? నీ కోరికను తెలుపుము.

గతానుగతయా వృత్త్యా కిం వా కేవలమీహసే॥ 46

తా॥ పలువురు శివార్చనచేయుటనుజూచి నీవు మనోరథ పూర్తికై ఈ కర్మలనుచేయుదువేని తత్క్షణము త్యజించుము. నీ మనోరథము వీనివలన సిద్ధించదు అని చెప్పెను.

శ్లో॥ స ఏవముక్తః ప్రాయేణ ప్రీతేనాత్మవిదా తథా।
ప్రత్యువాచ వచః స్పష్టం ఆత్మనో హితముత్తమమ్॥ 47

,, విద్వన్నవేద్మి తత్త్వేన ఫలమేతస్య కర్మణః।
ఋభుత్వయా పరశ్శంభుః సేవ్యతే కేవలం యయా॥ 48

,, ఫలమేతస్య సేవాయాః పరిపాకం కపర్దినః।
యన్మాం సమనుగృహ్ణాసి సంస్పృశ్యాత్మమనోరథమ్॥ 49

తా॥ ఆ మాటలను విని సుకర్మ, సాధుపుంగవా! నా హితమేదియో నాకు తెలియదు. నాకు జ్ఞానములేక నేను మిగుల దుఃఖము చెందుచున్నాను. నేను జ్ఞానముపొందవలయునని కోరుచున్నాను. తత్ప్రాప్తికై ఈ కర్మకాండలను అచరించుచున్నాను. నా జ్ఞానాశ నన్ను విచారపీడితునిగా చేసివేసినది. నేను నా శివ పూజాఫలముగ మీ యనుగ్రహమును కోరుచున్నాను. మీరు నన్ను అనుగ్రహించితిరేని నా మనోభీష్టము నెరవేరి నేను సుఖపడుదును.

శ్లో॥ తస్యైవం సూనృతం వాక్యం శ్రుత్వా ప్రీతస్తపోధనః।
ద్వితీయమాలిలేఖాసా గీతాధ్యాయం శిలాతలే॥ 50

,, ఆదిదేశాశు తం విప్రం పఠనాభ్యసనాయ చ।
ఫలిష్యత్యాత్మనః స్వైరం పరితస్తే మనోరథః॥ 51

,, ఇత్యుక్త్వాఽన్తర్దధే ధీమాన్ పురతస్తస్య పశ్యతః॥

తా॥ అతని దుఃఖమునుజూచి యా యతిథి సహించలేకపోయెను. ఇతనికి సుఖమార్గమును తెలియజేయవలయునని తనమదిలో తలంచెను. తుదకు గీతాద్వితీయాధ్యాయమును నొక రాతికి చెక్కి ఓయీ సుకర్మా! నీవు దీనిని అభ్యసించుము. విచారమంటదు. నీదుఃఖములు చెదరిపోవును. నీయభీష్టము నెరవేరి నీమనస్సునకు తృప్తికలుగును అని యుపదేశించి అంతర్ధానమయ్యెను.

శ్లో॥ విస్మితస్తస్య చాదేశాత్ అన్వతిష్ఠదనారతమ్।
తతః కాలేన మహతా భావితాత్మా ప్రసన్నధీః॥ 52

,, యత్ర యత్ర చచారాసౌ శాంతం తత్తత్తపోవనం।
న ద్వంద్వబాధా నైవ క్షుత్ పిపాసా న చ వా భయమ్॥ 53

,, తపసా తస్య జానీహి ద్వితీయాధ్యాయజాపినః।

తా॥ సుకర్మ యాశ్చర్యముచెంది మహాత్ముని యుపదేశము ననుసరించి యెల్లప్పుడు ద్వితీయాధ్యాయమును జపించుచుండెను. కొలదికాలముననే అతని విచారములు తొలగి అతని మనస్సు నైర్మల్యమును అనుభవించెను. వాని యాత్మశక్తి పెరిగెను. ఆ జ్ఞానవంతుడు సంచరించిన ప్రదేశములెల్ల శాంతతపోవనములుగా మారినవి. అతని పదస్పర్శమునుపొందిన స్థలములో పరస్పర విరోధముగల జంతువులు సహితము తమవైరమునువీడి ప్రేమజీవితమును నడిపించినవి. అతడున్నచోట అకలిదప్పికలు మాయమైనవి. భయమంతరించెను. అతని సంపర్కముచేత సర్వము దివ్యత్వమును పొందెను.

మిత్రవాన్ ఉవాచ — మిత్రవంతుడు చెప్పెను.

శ్లో॥ ఏవముక్తశ్చ తేనాహం ఖ్యాపయిత్వా పరాం కథాం।
అనుజ్ఞాతః ప్రసన్నేనభాగీ వ్యాఘ్రయుతో గమమ్॥ 54

తా॥ ఇట్లు మా సంశయమును ఆ వానరశ్రేష్ఠము తీర్చినపిమ్మట నేను దానివద్ద ననుజ్ఞనుపొంది అజావ్యాఘ్రములతో కూడి ఆశిలాతల సమీపమును చేరితిని.

శ్లో॥ గత్వా శిలాతలేఽపశ్యం అధ్యాయం లిఖితం శుభం।
తస్యైవావర్తనాదాప తపసః పారముత్తమమ్॥ 55

తా॥ అచ్చట వ్రాసియుండిన శుభమగు ద్వితీయాధ్యాయమును చూచితిని. దానిని వర్ణించి నందువలన ఘోరతపస్సుచేత కలుగు ఫలితము నాకనాయాసముగ లభించెను.

శ్లో॥ తేన త్వమపి కల్యాణం నిత్యమాహర్తుమర్హసి।
అధ్యాయం తేన తే ముక్తిరదూరస్థా భవిష్యతి॥ 56

తా॥ కావున నీకు నేను బోధించునదిదియే. నీవు కల్యాణప్రదమగు ద్వితీయాధ్యాయమును జపించితివేని నీదుస్థితిమారిపోవును. నీవుసుఖపడెదవు. నిత్యమగు ఆత్మానందమునుపొంది ముక్తిని చేరెదవు. నీవు శాంతినొందుటకు తగిన సాధనంబదియే. అని మిత్రవంతుడు తన యనుభవమునుబట్టి యుపదేశించెను.

శ్లో॥ దేవశర్మా సమాదిష్టః తేన మిత్రవతా స్వయం।
అభ్యర్చ్య ప్రణతో భూత్వా పురందరపురం యయౌ॥ 57

తా॥ ఆ యుపదేశములుపొంది దేవశర్మ మిగుల సంతోషపడెను. అతడు తనకున్నత మార్గము నుపదేశించిన మిత్రవంతునికడ వినయముతో తలవంచి అతనినిపూజించి తనపురమగు పురందరపురమును జేరెను.

శ్లో॥ తత్రాత్మవిదమాసాద్య దేవతాయతనే క్వచిత్।
వృత్తమేతన్నివేద్యాసౌ అధ్యాయమపఠత్తతః॥ 58

తా॥ నేరుగా నతడు దేవాలయమునుచేరి తనకు మిత్రవంతునితో పరిచయము గావించిన ఆ ఋషిపుంగవుని దర్శించెను. అతనికి తనయనుభవమంతయు తెలియజేసెను. తుదకు ద్వితీయాధ్యాయమును అనేక పర్యాయములు జపించెను.

శ్లో॥ శిక్షితస్తేన పూతాత్మా పఠన్నధ్యాయమాదరాత్।
ద్వితీయమాససాదోచ్చైః నిరవద్యం పరం పదం॥ 59

తా॥ గీతా ద్వితీయాధ్యాయపఠనముచే అతని యాత్మపవిత్రమాయెను. అతని పాపములు తొలగినవి. అతడు శాంతినిపొంది మహాత్ములచే పొందబడు నిర్దుష్టమగు పరమపదంబనంబడు శ్రీ వైకుంఠమునుచేరెను.

శ్లో॥ ద్వితీయస్యేదమాఖ్యానం కథితం శృణు సాంప్రతం।
తృతీయస్యాథ వక్ష్యామి మాహాత్మ్యమపి చేందిరే॥ 60

తా॥ దేవీ ! ఇప్పుడు ద్వితీయాధ్యాయమాహాత్మ్యమును నేను చెప్పవింటివి. తృతీయాధ్యాయమాహాత్మ్యమును ఇప్పుడు చెప్పబోవుచున్నాను. శ్రద్ధవహించుము. అని భగవంతుడు లక్ష్మీదేవితో ననెను.

ఓమ్

# తృతీయాధ్యాయ మాహాత్మ్యము

శ్రీభగవానువాచ — భగవంతుడు చెప్పినది.

శ్లో॥ జనస్థానే జడో నామ ద్విజన్మా కౌశికాన్వయీ।
హిత్వా జాత్యుచితం ధర్మం వణిగ్వృత్త్యాం మనో దధే॥ 1

తా॥ జనస్థాననగరమున జడుడు అను ఒక విప్రుడుండెను. అతనివంశము విశ్వామిత్ర వంశము. మంచికులమున పుట్టియుండినను వాడు తన జాతికితగిన ఆచారములను ఆచరించక పరిత్యజించి ధనాశాపరుడై వైశ్యుని వృత్తి నవలంబించెను.

శ్లో॥ వ్యసనీ పరదారేషు దీవ్యన్నక్షైః పిబన్మధు।
మృగయా నిరతో నిత్యం కాలమేవం నినాయ సః॥ 2

తా॥ ఆ వృత్తియందు మిగుల ధనమును ఆర్జించి ఆ ధనమును పరదారగమనములోను జూదమాడుటలోను సురాపానముచేయుటలోను వ్యయపరచుచుండెను. వాడు తనకు విసుగెత్తునపు డెల్ల వేటాడి సంతోషపడుచుండెను. ఇట్లు చాలా అకృత్యములనుజేసి వాడు జీవించుచుండెను.

శ్లో॥ క్షీణే విత్తే తతో రాత్రౌ చౌర్యమారబ్ధవాంస్తతః।
ప్రతిపేదే ధనం తేన యజ్వనాం యష్టుమర్థినాం॥ 3

తా॥ ఇట్లు దుర్వినియోగముచేసి అతని ధనమంతయు ఖర్చు అయిపోవుటవలన తిరిగి ధనసంపాదనార్థమై గత్యంతరములేక చౌర్యవృత్తి నవలంబించెను. వాడొకదినమున యాగముచేయ దలంచి చేర్చిపెట్టియుండిన యాగమును చేసినవారి ధనము నపహరించెను.

శ్లో॥ స దూరమగమత్తేన వాణిజ్యాయోత్తరాం దిశం।
కస్తూరిమగురుం కృష్ణం చామరాంశ్చంద్రికోజ్జ్వలాన్॥ 4
,, గృహీత్వాఽవృత్య చానిన్యే పంచషాదధ్వయోజనాత్।
అథాపరస్మిన్నహని ప్రియాదర్శనదోఽహని॥ 5

తా॥ వాడాధనమును మూలధనముగాచేసి వ్యాపారముచేయదలంచి ఉత్తరదేశమునకు వెళ్ళెను. అచటకేగి అగరువత్తులు చామరములు మున్నగు వస్తుజాతమును తీసుకొని అనేక యోజనదూరమునుండి తిరిగి వచ్చుచుండెను. వాడు బయలుదేరు సమయమున ఫలానదినమున వచ్చెదనని తన ప్రియురాలితోచెప్పి వెళ్ళియుండెను. ఆ దినము మరునాడగుటచే వాడు అతివేగమున ప్రయాణించుచుండెను.

శ్లో॥ దూరమధ్వానముల్లంఘ్య రవావస్తమితే సతి।
ధ్వాంతే ప్రసర్పతి స్వైరం దిశోదశతరోస్తలే॥ 6

,, గతోవశం సదస్యూనాం నిజఘ్నే త్రైశ్చ సత్వరం।
ధర్మలోపాదసౌ జజ్ఞే ఘోరశ్చోగ్రతరోగ్రహః॥ 7

తా॥ అట్లు చాలదూరము ప్రయాణముచేసెను. ఇంతలో సూర్యుడస్తమించి దిశల నెల్లను చీకటిక్రమ్ముకొనెను. వాడు ఉపరిప్రయాణము చేయలేక రాత్రిని అచ్చటనే గడుపనెంచి ఒక చెట్టుమూలమును చేరెను. అర్ధరాత్రమున కొందరుచోరులు ఇతనినిచంపి ధనమును దోచుకొనిరి. చంపబడినజడుడు పాపాత్ముడగుటచే మరణానన్తరము పిశాచరూపమును పొందెను.

శ్లో॥ పిపాసితో బుభుక్షార్తః లేలిహానశ్చ సృక్విణీ।
ఊర్ధ్వకేశోఽతిజంఘాలః ప్రృష్ఠలగ్నోదరో మహాన్॥ 8

శ్లో॥ అస్థిమాత్ర శరీరోఽభూద్దుర్వృత్తనయనోభృశం।

తా॥ అప్పుడతని రూపము మహాఘోరముగా మారెను. అతనిదేహమున రక్తము ఇంచుకైనను లేకపోయినది. ఎముకమాత్రమే మిగిలియుండెను. కడుపు వీపునంటియుండెను. వెంట్రుకలు పైకి ఎగురుచుండెను. మోకాలుబలిసి చూచుటకు జుగుప్సాదాయకమైయుండెను. కండ్లు వికారముగా తిరుగుచుండెను. అతనియాకలిదప్పికలకు మేరలేకపోయెను. వాటిచే అతడు పీడించబడి సెలవులు నాకుచుండెను. ఇట్లు అతనికి సురూపము నశించి మహాపాపములచే ఇటి ఘోరావస్థకలిగినది.

అత్రాంతరే సుతస్తస్య ధర్మాత్మా వేదకోవిదః॥ 9

శ్లో॥ పర్యపాలయదత్యర్థం దిదృక్షుస్తం తదాఽగమత్।
నిత్యమన్వేషయన్వార్తాం పాంథేభ్యో నోపలబ్ధవాన్॥ 10

శ్లో॥ తతః కదాచిదాయాతే సహాయిని చ మానవే।
తస్మాద్విదితవృత్తాంతః శుశోచ పితరం బహు॥ 11

తా॥ జడునకొక కుమారుడుండెను. అతడు మిగుల ధర్మాత్ముడు. వేదములను సాంగముగా నభ్యసించియుండెను. అతడు పరదేశము వెళ్ళిన తండ్రి తిరిగి ఈ దినమో రేపో వచ్చునని ఎదురు చూచుచుండెను. తండ్రిరాకకు విలంబమగుటచే దిగులుచెంది దేశాంతరమునుండివచ్చు పాంథులెల్లరిని తండ్రి విషయమై యడుగుచుండెను. కాని ఎవరు నతనికి తగిన సమాధానమివ్వ లేదు. ఇట్లుండ ఒకదినము తండ్రి సహాయార్థమై తోడువెళ్ళియుండిన యొకమనిషి దేశాంతరము నుండి తిరిగివచ్చియున్నాడని తెలిసి అతని వద్దకుచేరి తండ్రి కుశలమునుగూర్చి ప్రశ్నించెను. వానినుండి తండ్రి వృత్తాంతమునెరిగి అతని మరణమునకై మిగుల దుఃఖపడెను.

శ్లో॥ తతో విమృశ్య మేధావీ చికీర్షుః పారలౌకికం।
వారాణసీం ససంభారః స గంతుముపచక్రమే॥ 12

తా॥ విద్యావంతుడగుటచే అట్లే దుఃఖించుచుండక మనస్సును ఓదార్చుకొని మరణించిన తన తండ్రికి తృప్తిని కల్గించ నుత్తరక్రియలను చేయదలంచినవాడై అతడు దానికి కావలసిన యుపకరణములను వెంటదీసికొని కాశీనగరమునకు బయలుదేరెను.

శ్లో॥ మార్గే నివాసాన్ సప్తాష్టౌ నీత్వా తస్య తరోస్తలే ।
సంధ్యాం ప్రచక్రమే కర్తుం యత్రాస్య నిహతః పితా ॥ 13

తా॥ అతడు మార్గమున ఏడెనిమిది ప్రదేశములయందు విశ్రమించి తుదకు తనతండ్రి చంపబడిన చెట్టుమూలమును జేరెను. సంధ్యాకాలమగుటంజేసి అప్పుడు సంధ్యావందనము చేయ నారంభించెను.

శ్లో॥ తత్రాధ్యాయం స గీతాయా తృతీయం సంజజాప హ ।
తతో ఘోరస్వరస్తత్ర వ్యోమమధ్యే బభూవ హ ॥ 14

తా॥ అచ్చట సంధ్యావందనము ముగించి దినకృత్యముగా తానుపెట్టుకొనిన గీతా తృతీయాధ్యాయ పారాయణమును వాడుచేసెను. ఆ సమయమున అకాశమున భయంకరస్వర మొకటి వినిపించెను.

శ్లో॥ దదర్శ ఘోరమాకాశాత్పతంతం పితరం తతః ।
విస్మయేన భయేనాపి వికలీకృతలోచనః ॥ 15

తా॥ అప్పడతడు తలయెత్తి పైకిచూడ నాకాశమున నొక భయంకరదృశ్యముకన బడెను. అతనితండ్రి పిశాచాకారముతో పైనుండి క్రిందబడుచుండెను. అదిచూచి తనయుడు భయ మొందెను. ఆ ఘోర దృశ్యమును చూడలేక వాడు తన కండ్లను గట్టిగ మూసికొనెను.

శ్లో॥ తేజసా భూయసా వ్యాప్తమాలులోక పురోఽంబరే ।
కింకిణీ కోటిసంకీర్ణం తేజసా వ్యాప్తదిఙ్ముఖం ॥ 16

,, విమానమగ్రతోఽపశ్యత్ దివ్యమధ్యగ్రచేతనః ।
తత్రాఽపశ్యత్సమారూఢం దివ్యాభిస్త్రీభిరావృతం ॥ 17

,, సంస్తూయమానం పితరం మునిభిః పీతవాససం ।

తా॥ అంతలో ఆ భయంకరదృశ్యము అంతరించెను. నూతనమగు దృశ్యమొకటి బయలుదేరెను. ఆ కాశమధ్యమున దివ్యవిమానమొకటి నిలబడియుండెను. దాని సౌందర్యము వాగ తీతము, ఆ విమాన తేజస్సు నలుదిశల వ్యాపించియుండెను. చుట్టుకట్టబడియుండిన చిన్నగంటలు సుమనోహర ధ్వనిని చేయుచుండినవి. దాని మధ్యమున సుందరాప్సరోగణము అలరారుచుండెను. వారి మధ్యలో అతని తండ్రియుండుటయు అతనిని పలువురు మునులు స్తోత్రముచేయు చుండుటయు పుత్రునికంటికి అగుపడినవి. వాడదిచూచి విస్మయమునొంది అమందానందమునకు పాత్రుడాయెను.

ప్రణతస్తం సమాలోక్య యుయుజే తేన చాశిషా ॥ 18

తా॥ అతడు తనతండ్రిని నమస్కరించి తండ్రి యాశీర్వాదమునందుకొనెను.

శ్లో॥ తతోఽపృచ్ఛదిదం వృత్తం స చ తస్మై న్యవేదయత్ ।
దుస్త్యజాత్కర్మణో వత్స వపుషోఽపుణ్యాకారణాత్ ॥ 19

,, మోచితోఽస్మి త్వయా ద్వైవాదధ్యాయం జపతాంతికే ।
తన్నివర్తస్వ జపతః సాంప్రతం త్వాముపస్థితం ॥ 20

తా॥ పుత్రుడు తండ్రీ! ఇదియంతయు నాకాశ్చర్యముగానున్నది. మీరు ముందు ఘోరరూపముగలిగి యుండుటేమి? ఆ రూపమునుమాని ఇట్టి ఉత్కృష్టస్థితిని ఇప్పుడు పొందుట

ఏమి? ఈ మార్పులు ఎట్లు మీకు సంభవించినవి? ఇట్లు జరుగుటకు కారణమేమి? మీ వృత్తాంతమంతయు నాకుతెలియకున్నది. దయచేసి నాకు తెలుపవలయును. అని ప్రశ్నించెను. ఆ ప్రశ్నలకు పుత్రరత్నమా! నేను మహాపాపములనుజేసితిని. కల్పాంతమువరకు నరకముననుండినను అవి తీరునవి కావు. ఆ పాపములచేతనే నీవు ముందుచూచిన ఘోరాకారము నాకు గలిగెను. ఆ రూపము మారునదికాదు. నా పాపములున్నంతవరకు నేనాతనువుతోనే కష్టపడుచుండవలయును. ఇది కర్మవిలసితము. అదృష్టవశమున నీవు తృతీయాధ్యాయమును నేను వినునట్లు నేనున్నచోటు జేరి జపించితివి. దాని ఫలితముగా నాకీకర్మవిమోచనము కలిగెను. కురూపముపోయి సురూపము కలిగినది. నాయనా! ఇది యంతయు నీవు జపించిన తృతీయాధ్యాయమాహాత్మ్యమే అనిచెప్పి తండ్రి తనయుని సందేహమును తీర్చెను. ఇక నీవు జపమును నిలుపవచ్చును.

శ్లో॥ వారాణసీం యదర్థం య త్తదనుష్ఠితమాత్మనః ।

తా॥ నీవు కాశికివెళ్ళగోరితివి, ఇప్పుడు నేను ముక్తుడయిపోయినందున ఇక నా కొరకు ఎట్టి ఉత్తరక్రియలును సలుపనవసరములేదు. కాశిజేరి జేయవలసినదంతయు ఇచ్చటనే చేసివేసితివి.

ఏవముక్తః స చ ప్రాహ పితరం దీప్తతేజసం ॥ 21

శ్లో॥ హితం మామనుశాధి త్వం కార్యమన్యన్మయా ను కిం ।

తా॥ ఇట్లు తండ్రిచెప్పినపిమ్మట సుతుడు నాయనా! మీరు తృప్తినొందితిరి. ఇది నాకు సంతోషకరము. నేను చిన్నవాడను. నా హితమును నేనెరుగను. మీరు నా హితమును బోధించ వలయును. నాచేత కావలసినదేదైనసుండిన సెలవిచ్చి మీరే పూర్తిచేయించుకొనవలయును. అని వినయముతో తండ్రిని ప్రార్థించెను.

తతః ప్రాహ పితా పుత్రం కార్యమేతత్త్వయాఽనఘ ॥ 22

శ్లో॥ యన్మయాఽఽచరితం కర్మ భ్రాత్రా మమ తు తత్కృతం ।
స యాతో నరకం ఘోరం తం మోచయితుమర్హసి ॥ 23

,, అన్యే మదన్వయే యే వై నిరయం ప్రతిపేదిరే ।
తే చ మోచయితవ్యాస్తే ఇతి మేఽస్తి మనోరథః ॥ 24

తా॥ ఆమాటలకు జనకుడు పుత్రరత్నమా! నేను చేసిన పాపములనేచేసి నా అన్న నాముందు నరకముజేరి పలుబాధలను అనుభవించుచున్నాడు. అతనిని నీవు విడిపించవలయును. అతడేకాక నా వంశీయులనేకులు పాపములనుచేసి నరకములోనున్నారు. వారినివిడిపించి మోక్షమును జేర్పవలయును ఇదియే నేను కోరునది. దీనిని నీవు నిర్వహించవలయును. అని తన మనోరథమును తెలియ జేసెను.

శ్లో॥ ఇత్యేవముక్తః పుత్రస్తం పునః ప్రాహ కృతాంజలిః ।
కర్మణా కేన వా సర్వాన్ మోచయామి తదాదిశ ॥ 25

తా॥ అప్పుడు తండ్రిని జూచి నేనెట్లువారిని విడిపించగలను? వారిని ముక్తినిజేర్చుటకు ఏమి చేయవలయును? ఆ ఉపాయమును నేనెరుగను. మీరు నాకా ఉపాయమును తెలియజేయ వలెనని కుమారుడడిగెను.

శ్లో॥ ఏవం నివేదితో వాక్యం పితా సుతమువాచ హ।
యేనాహం మోచితో వత్స తదనుష్ఠాతుమర్హసి ॥ 26
శ్లో॥ అనుష్ఠాయ తదుత్పన్నం తేభ్యః పుణ్యం సముత్సృజ।

తా॥ ఆ మాటలకు తండ్రి ఇట్లు బదులిచ్చెను. ఓ పుత్రక! ఏ ఉపాయముచే నేను నీచే విడిపించబడితినో దానినే వారివిషయములయందును అచరించవలయును. నీవు తృతీయాధ్యాయమును జపించి దానివలన కలుగు పుణ్యమును వారిపరముజేయుము.

తతోఽహమివ తే సర్వే పూర్వే సంత్యజ్య యాతనాం ॥ 27
శ్లో॥ గమిష్యంత్యచిరేణైవ తద్విష్ణోః పరమం పదం।

తా॥ అప్పుడు నా పూర్వికులు యమ యాతనలనుండి విడువబడి మహా విష్ణువుండు పరమ పదమును చేరుకొనెదరు అనెను.

స సంతుష్టోఽవదత్పుత్రో యద్యేవం తాత నారకాః ॥ 28
శ్లో॥ సర్వానపి విమోక్ష్యామి యది తే రోచతే వచః।

తా॥ అంతట సంతోషించి ఆ వరపుత్రుడు తండ్రితోనిట్లనెను. జనకశ్రేష్ఠమా! తృతీయాధ్యాయజపము మీరు చెప్పినట్లు మోక్షసాధనమయిన యెడల ఒకరిద్దరినేకాక నరకమున నుండు అందఱు బాధితులను విడిపించి సుఖింపజేయవలెనని నా మనస్సుకోరుచున్నది. ఇట్టి యమూల్యసాధనము మనవద్దనున్నపుడు దానిని మనము బాగుగానుపయోగించుకొనవలయును. లేనిచో మనము మూఢులమగుదుము. మనకున్నశక్తినిబట్టి పలువురికి మేలుజేయుట మనకర్తవ్యముగదా? దానిని నేను దైవాజ్ఞయనియే భావించుచున్నాను. మీకు నా మాటనచ్చినచో సెలవిండు. అందరిని నరకమునుండి విడిపించ బూనుకొనెదను.

ఏవమస్తు శివం భూయాదుపపన్నం మహత్ప్రియం ॥ 29
శ్లో॥ ఇత్యాదిశ్య పితా పుత్రం యయౌ విష్ణోః పరం పదం।

తా॥ ఈ మాటలనువిని అట్లే కానిమ్ము. నీకు మంగళము సిద్ధించును. నాకిది మిగుల ఇష్టము. నే నడుగకయే నీవు దానిని చేయమొదలిడితివి. బాగుపడెదవు. అని ఈ విధముగా పుత్రు నాశీర్వదించి జనకుడు విష్ణుస్థానమునుజేరెను.

సోఽపి తస్మాత్పరావృత్య జనస్థానం ప్రపద్య చ ॥ 30
శ్లో॥ సుందరస్య పురః శౌరేశ్చాలయే కాలమభ్యగాత్।
స కుర్వాణః సమాధీని పిత్రా చ యదుదీరితం ॥ 31
,, ఉత్ససర్జ కృతం పుణ్యం మోచయిష్యన్ స నారకాన్।

తా॥ పుత్రుడు జనకాజ్ఞ ననుసరించి జనస్థానముచేరి సుందరేశుని యాలయమునకు వెళ్ళెను. అచ్చట భగవంతుని సమక్షముననే కూర్చుండి తనతండ్రిచెప్పిన ప్రకారముగా సంయతేంద్రియుడై తృతీయాధ్యాయమును జపించుచుండెను. తన్మూలమున సంభవించు పుణ్యములను నరకములోనివారిని విడిపించగోరి వారి వశముచేయుచుండెను.

అత్రాంతరే పదాద్విష్ణోః యాతనాపదమీయుషః ॥ 32
శ్లో॥ నారకాన్ మోచయిష్యంతః కింకరా యమమభ్యయుః ।

తా॥ పుత్రుని జపపారాయణాదులచే సంతుష్టుడయిన విష్ణువు నరకలోకములోని వారిని విడిపించి మోక్షము చేర్చుటకొరకు తన భృత్యులను యమునివద్దకుపంపెను.

తేన తే పూజితాస్సర్వే సత్క్రియాభిరనేకధా ॥ 33
శ్లో॥ కుశలం పరిపృష్టాస్తే సర్వతస్సుఖమూచిరే ।

తా॥ తన ఇంటికివచ్చిన నారాయణ కింకరులను అనేకవిధములగు సత్కారములచే యముడు పూజించెను. పూజించి కుశలప్రశ్నముజేసెను. వారప్పుడు మేమేకొరతయులేక సుఖముగ నున్నామని జవాబిచ్చిరి.

ఏవం సత్కృత్య మేధావీ పితృలోకమహేశ్వరః ॥ 34
శ్లో॥ హేతుమాగమనేఽపృచ్ఛత్తే చ తస్మై న్యవేదయన్ ।
విద్ధి కీనాశనాథ త్వం శేషపర్యంకశాయినా ॥ 35
,, శౌరిణా ప్రహితానస్మాన్ సమాదేష్టుం త్వదన్తికే ।
అస్మన్ముఖేన దేవస్త్వాంకుశలం పరిపృచ్ఛతి ॥ 36
,, నారకాన్ ప్రాణినః సర్వాన్ విమోక్తుం చ నియచ్ఛతి ।

తా॥ సత్కరించినపిమ్మట యముడు వారిరాకకుకారణమును దెలుపగోరెను. అప్పుడు ఆ విష్ణుకింకరులు ఓయి ధర్మరాజా ! మమ్ములను శేషశయనమున పవ్వళించు మహావిష్ణువు తన యాజ్ఞను తెలుపుటకు పంపియున్నాడు. అతడు మామూలమున నీ కుశలమును తెలియగోరు చున్నాడు. దానితో నరకములోనివారిని విడిపించి మోక్షమునకు మాతోపంపమనియు నిన్ను ఆజ్ఞాపించుచున్నాడు. అని యమునికి మహావిష్ణుని సందేశమును తెలియజేసిరి.

ఇత్యాకర్ణ్య సమాదేశం విష్ణోరమితతేజసః ॥ 37
శ్లో॥ న తేన మూర్ధ్నా సంభావ్య దధ్యౌ కించన చేతసా ।
విముక్తాన్నిరయాత్సర్వాన్ తాన్విలోక్య మదోత్కటాన్ ॥ 38
,, స తైరనుగతః సర్వైర్విష్ణోరాయతనం తతః ।
యయౌ స వరయానేన యత్రాస్తే దుగ్ధవారిధిః ॥ 39

తా॥ అపరిమిత తేజోనిధియగు మహావిష్ణుని సందేశమును శిరసావహించి మనస్సున నరకములో నున్నవారిని విడువవలెనని యెంచెను. వాడు తలంచినంతనే నరకస్థులు విడుదల పొందిరి. అకస్మాత్తుగ పుణ్యవంతులయి విడువడుటచేత వారు సంతోషముచెందిరి. వారుత్సాహ ముతో ముక్తిమార్గమున నడవనారంభించిరి. వారప్పుడు మదించియుండిరి. ఉత్కృష్టమగు తన వాహనమధిష్ఠించి యముడును వారిని వెంబడించెను. వారందరును భగవంతుని నివాసస్థానమగు క్షీరసాగరమును సంతోషముతోచేరిరి.

శ్లో॥ తదంత ఉదితానేక కోటిసూర్య సమప్రభం ।
ఇందీవరదలశ్యామమాలులోక జగద్గురుం ॥ 40

శ్లో॥ శయ్యాఫణిఫణారత్న మరీచ్యామిశ్ర తేజసం।
విలోక్యమానమానందనిర్భరం ప్రీతమానసం॥ 41
,, భావానుగైర్దృగాలోకైః శ్రియా ప్రేమ్ణేక్షితం ముహుః।
యోగిభిః పరితో జుష్టం ధ్యాననిష్పందతారకైః॥ 42
,, స్తూయమానం మహేంద్రేణ పరాజేతుం విరోధినః।
ఆమ్నాయవచసామంతే బ్రహ్మణో నిఃసృతైర్ముఖాత్॥ 43
,, మూర్తిమద్భిర్వచోభిశ్చ గీయమానం గుణోత్కరం।
సంప్రీతం చాప్యుదాసీనమపి సర్వాసు యోనిషు॥ 44
,, యోగసంచిత పుణ్యానాం యోగపద్యేన జంతుషు।
విలోకమానమాత్మానమఖిలం సచరాచరం॥ 45
,, ఆమోదయంతమాలోకైరాత్మానం దీప్తిపూరితైః।
ఆబిభ్రాణం వపుర్వ్యాపి ద్యోతితం భోగినస్త్విషా॥ 46
,, ఇందీవరదళశ్యామం జ్యోత్స్నయేవ నభస్తలం।
విలోక్య తం స తుష్టావ ధియా బహులమానతః॥ 47

తా॥ వారచ్చట భగవంతుని కనుగొనిరి. నారాయణుడు వీరికి ఎదురగుచుండ కోటి సూర్యులు చేరి ఉదయించుచున్నట్లుండెను. అతని తనువు నల్లకలువనుంబోలి శ్యామలముగా నుండెను. అతనిమీద ఆదిశేషుని పడగయందలి రత్నములకాంతులు ప్రసరించుటచే అతని స్వాభావిక తేజస్సు ద్విగుణీకృతమాయెను. భావములను తెలుపు శ్రీదేవి కడకంటిచూపులు అతనిమీద ప్రేమతో పడుచుండ అతడు సుప్రీతుడై ఆనందభరితుడైయుండెను. ఒక వైపున ధ్యాననిమగ్నులై యోగులు అతనిని చుట్టియుండిరి. మరియొకవైపు దేవేంద్రుడు తమ విరోధులను జయించకోరి తదుచితశక్తిని తనకిచ్చి అనుగ్రహింపమని వేడుచుండెను. మరియొకవైపున బ్రహ్మదేవుని ముఖము నుండి వేదములయంతమున బయలువెడలిన సూక్తులు మూర్తిమంతములై గుణనిధియగు ఆ విష్ణువును పొగడుచుండినవి. ఆ భగవంతుడు ఒకరిని ప్రేమించి మరియొకరిని నిరసించువాడు కాడు. అతడు మధ్యస్థదృష్టితో అందరిని చూచుచుండెను. అతనిని యోగులు యోగమహిమచే అన్ని చరాచరములయందును సాక్షాత్కరించుచుందురు. అట్టి నారాయణుడు తన ప్రకాశవంతమగు చూపులచే వీరిని సంతోషపరచుచుండెను. అతడు చూచుచుండ పరిమళ గంధము జనించును. లోకమంతయు వ్యాపించు అతని దేహము ఆదిశేషుని కాంతిచే నిగనిగలాడుచుండెను, తెల్లని ఆదిశేషునికాంతి శ్యామలదేహుడగు నారాయణునిమీద పడుచుండ అది వెన్నెలతోగూడిన నల్లని ఆకాశ కాంతిననుకరించెను. ఇట్టి నారాయణునిజూచి యముడు వినయముతో తలవంచి స్తోత్రముచేసెను.

**యమ ఉవాచ:—**

శ్లో॥ నమః సమస్తనిర్మాణ నిర్మలీభూతచేతసే।
వదనోద్గీర్ణవేదాయ విశ్వరూపాయ వేధసే॥ 48
శ్లో॥ బలవేగసుదుర్ధర్ష దానవేంద్రమదద్రుహే।
నమః స్థితౌ చ సత్త్వాయ విశ్వాధారాయ విష్ణవే॥ 49

శ్లో॥ నమః పాతకసంఘాతజిష్ణవే సర్వదేహినాం।
ఈషదున్మీలల్లాలాట నేత్రాగ్నిప్రభవార్చిషే॥ ౫౦

,, త్వం హి సర్వస్య లోకస్య గురురాత్మా మహేశ్వరః।
విసృజ్య వైష్ణవాన్ సర్వాన్ అతస్త్వమనుకంపసే॥ ౫౧

,, వ్యాపయన్నఖిలం లోకం మాయయా పరిబృంహితం।
న తయా పరిభూతోఽసి న చ తత్ప్రభవైర్గుణైః॥ ౫౨

,, అంతరావర్తమానోఽపి న తాభ్యామభిభూయసే।
దృశా విషయవర్తిన్యా నిగృహీతమనా అపి॥ ౫౩

,, తయా ఫలాభిగామిన్యా ఆత్మన్యేవాభిలీయసే।
నతవాస్తి మహిమ్నోఽంతః యథా నిరవధిః స్వయం॥ ౫౪

,, మౌనమేవాత్ర యుక్తం మే విషయోఽసి కథం గిరాం।
ఇతి స్తుత్వా తతో వాక్యమిదమాహ కృతాంజలిః॥ ౫౫

తా॥ స్వామీ! నీవు జగన్నిర్మాతవు. నీవు ముందు అజ్ఞానులగు చేతనులను జూచి దుఃఖమందితివి. వారి దుఃఖమునుజూచి సహించలేక వారికి అనన్తమగు మోక్షసుఖమును ఇవ్వ గోరి జీవాత్మలకు కరణ కళేబరయోజనాత్మకమగు జగత్సృష్టిని చేసితివి. చేసి మన భారమును కర్తవ్యమును నిర్వహించితిమని సంతసమొందితివి. ఏమి నీ కరుణ. జగద్రక్షకా! అజ్ఞానతిమిరమును పోగొట్టువేదములకు నీవేగదా ప్రథమ ప్రరోచకుడవు! ఈ చరాచరాత్మకమగు విశ్వమంతయు నీ దేహమే. నీవు ఈ లోకములను రజోగుణముచే సృష్టించి సత్వగుణముచే పాలించుచున్నావు. నీ ప్రజలకాంతిని నాశమొనరించు రాక్షసులను నీవు నాశమొనరించుచున్నావు. ఈ లోకములు నిన్నవలంబించియే నిలిచియున్నవి. జగదాధారుడవగు నీవు చేతనుల పాపములను తొలగించి వారిని ఉజ్జీవింపజేయుచున్నావు. దుష్టుల యత్యాచారములు అధికమగునప్పుడు నీవు ఇతరాపేక్షలేకయే స్వఫాలనేత్రోద్భవమగు ననలముచే వారిని అణచెదవు. నీకు నీ జనులన్న మిగులప్రియము. నీవా అపరాధులైనను వారిని నరకముననుండి విడిపించి మోక్షముచేర్పవలెనని కోరుట నీస్వభావము. మాయతోనిండిన ఈ లోకమును నీవు వ్యాపించియున్నను నిన్ను ఆ మాయయో లేక దాని దుర్గుణములో స్పృశించవు. ఆ మాయచే లోకములెల్ల మ్రింగబడినప్పుడు (ప్రళయకాలమున) నీవు నీలోనే లీనుడగుదువు. నీ మహిమలకు మేరలేదు. నీవనన్తుడవు. నిన్ను పొగడుటకు నాకైనను నా నాలుకకైనను శక్తిలేదు. నేను నిన్ను పొగడుటకన్న మౌనము వహించుటయే యుక్తము. ఏల యనిన, నీవు నా వాక్కుల కతీతుడవు. అని ఈ విధముగా యముడు నారాయణుని పొగడి పై విధముగా అంజలి జోడించి నివేదించుకొనెను.

శ్లో॥ వినియోగాదమీ ముక్తా దేహినో నిర్గుణా మయా।
సమాదిశ యదన్యన్మే కార్యమస్తి జగద్గురో॥ ౫౬

తా॥ స్వామీ! మీ యాజ్ఞ ననుసరించి నిర్గుణులయిన ఈ చేతనులను నరకమునుండి విడిచిపెట్టితిని. వేరేదైన కోరికయుండిన నాజ్ఞాపింపుడు. దానిని శిరంబుతో నెరవేర్చెదను.

" ఇతి విజ్ఞాపితస్తేన తమాహ మధుసూదనః ।
మేఘగంభీరయా వాచా సించన్నివ సుధారసైః ॥ 57

" పాపాదుద్ధార్యతే లోకో మయా సమయవర్తినా ।
త్వయి విన్యస్తభారోఽహం నానుశోచామి దేహినః ॥ 58

" తదాచర నిజం కర్మ ప్రయాహి స్వం నికేతనం ।
ఇత్యుక్త్వాఽన్తర్దధే దేవః సోఽపి స్వపురమాయయౌ ॥ 59

తా॥ అతనిమాటలను విని సంతసించి నారాయణుడు మేఘము గర్జించినట్లు గంభీరముగా తన యభిప్రాయమును వెలిబుచ్చెను. అతడు పలుకుచుండ అమృతమును వర్షించుచున్నట్లుండెను. ధర్మరాజా! నేను లోకులను పాపమునుండి ఉద్ధరించి (లేవదీసి) వారికి సుఖము నిచ్చుటకు కంకణము కట్టుకొనియున్న సంగతి నీవెరిగినదే. కావుననే ఇప్పుడిట్లు నేను జేయించితిని. నీవు నా ప్రియశిష్యుడవై చేతనులవిషయమున నా భారమంతయు వహించి పాటుపడుచున్నావు. నేనిప్పుడు చేతనులనుగురించి విచారించుటలేదు. నీ కర్తవ్యమును విడువకజేయుచుండుము, అదియే నా కోరిక. నీవిక వెళ్ళవచ్చునని యముని కాజ్ఞయిచ్చి తాను అంతర్ధానమాయెను. పిదప యముడు తన పురమునకు బయలుదేరెను.

శ్లో॥ సోఽపి స్వజాతిజాన్ సర్వాన్ నిరయస్థాననేకశః ।
ఉద్ధృత్య వరయానేన విష్ణులోకం యయౌ స్వయం ॥ 60

తా॥ ఈ ప్రకారము జడసుతుడు తన వంశీయులందరిని తండ్రి యాజ్ఞానుసారము మోక్షమునజేర్చి కృతార్థుడయి తన జన్మావసానమున దివ్యవిమానమధిష్ఠించి విష్ణులోకముజేరి సుఖమొందెను.



ఓమ్

# చతుర్థాధ్యాయమాహాత్మ్యము



శ్రీభగవానువాచ — మహావిష్ణువనెను.

శ్లో॥ చతుర్థస్యాపి మాహాత్మ్యమాఖ్యాస్యామ్యధునా శృణు ।
బదరీత్వం సముత్సృజ్య యేన కన్యే దివం గతే ॥ 1

తా॥ దేవీ! నేనిప్పుడు నాలుగవయధ్యాయముయొక్క వైభవమును కూడ చెప్పబోవుచున్నాను. దాని వైభవముచే ముందు రేగుచెట్టురూపముననుండిన ఇరువురు దేవకన్యకలు శాపవిమోచనమొంది స్వర్గమునకేగియున్నారు. అట్టి ఘనతగల చతుర్థాధ్యాయ మాహాత్మ్యమును నీవు శ్రద్ధతో వినవలయును.

శ్రీరువాచ — ఆ మాటలనువిని శ్రీదేవి ఇట్లు ప్రశ్నించెను.

శ్లో॥ కథం కన్యే దివం యాతే బదరీత్వం విసృజ్య వై ।
కే తే చాస్తాం పురా దేవ కథం ప్రాప్తే తు ముఖ్యతాం ॥ 2

తా॥ స్వామీ! ఎవరాకన్యకలు? వారుచేసినదేమి? వారెట్లు రేగుచెట్లుగ మారిరి? వారికి స్వస్వరూపప్రాప్తి యెట్లుకలిగెను?

శ్లో॥ ఏతద్వేదితుమిచ్ఛామి నాథ వక్తుం త్వమర్హసి।
న తు తృప్యామి శృణ్వంతీ పరమాం చ కథామిమాం॥ 3

తా॥ ఈ వృత్తాంతమంతయు తెలియగోరుచున్నాను. దయచేసి నాకు ఎరిగించవలయును. ఇట్టి పుణ్యకథల నెంతవినినను నా తనివితీరుటలేదు. ఇట్లు శ్రీ దేవి ప్రశ్నించ —

శ్రీ భగవానువాచ — భగవంతుడు చెప్పెను.

శ్లో॥ అస్తి భాగీరథీ తీరే నామ్నా వారాణశీ పురీ।
భరతో నామ యుక్తాత్మా యత్ర విశ్వేశ్వరాలయే॥ 4

శ్లో॥ నిత్యమాత్మరతస్తుర్యం జపత్యధ్యాయమాదరాత్।
తదభ్యాసాదదుష్టాత్మా న ద్వంద్వైరభిభూయతే॥ 5

తా॥ గంగానది యొడ్డున వారాణశియను పురమొకటియున్నది. అందలి విశ్వేశ్వరుని యాలయము మిగులగొప్పది. అందుభరతుడను నతడు భక్తివిశ్వాసములతో గీతయొక్క చతుర్థాధ్యాయమును జపించుచుండెను. దానినభ్యసించుటవలన నతని దోషస్వభావము లతనిని విడిచిపోయినవి. వాడు శాంతిస్వభావము కలిగియుండెను. సుఖదుఃఖములను లాభాలాభములను నతడు సమానముగా చూచు స్వభావము అతనికి జనించినది.

శ్లో॥ కాలే కదాచన క్రీడ యయౌ స నగరాద్బహిః।
ఉపాంత్యవర్తినో దేవా దిదృక్షుస్స తపోధనః॥ 6

తా॥ ఆ తపోధనునకు సమీపముననున్న దేవతలను దర్శించుటకు కోరికగలిగెను. అతడు ఒక సమయమున నగరముబయటనుండు ఆ దేవాలయములనుచూడ బయలుదేరెను.

శ్లో॥ విశశ్రామ తయోర్మూలే బదర్యోర్న్యపతతాం ఫలే।
ఉపాదాయ తయోరేకామన్యామాలంబ్య చాంఘ్రిణా॥ 7

తా॥ అతడు పెక్కుచోట్ల తిరిగి యాయాసపడి విశ్రమించుటకై అచ్చట రెండు రేగుచెట్లుండ వాటినీడనుచేరెను, అప్పుడు చెట్లనుండి రెండు రేగుపండ్లు రాలినవి. వాటిలో నొకదాని పండును వాడుచేతిలో దీసుకొనెను. మరియొకదానిపండును తన కాలిలోదూర్చుకొనెను, ఇట్లు రెండు చెట్లఫలములను వాడు తీసుకొనివెళ్ళెను.

శ్లో॥ తపస్విని తతో యాతే బదర్యోశ్చ తథా ద్వయం।
శుష్కం నిష్పత్రశాఖం చ దివసైః పంచషైరభూత్॥ 8

తా॥ ఆ తపోనిధి అచోటును విడిచిపోయిన తరువాత రేగుచెట్లురెండును ఐదారురోజులలో ఎండిపోయినవి. వాటియాకులు, కొమ్మలు అన్నియు నీరసమై రాలిపోయినవి,

శ్లో॥ గృహే క్వచన విప్రాణాం జజ్ఞాతే కన్యకే తతః।
వర్ధమానం తయోర్యుగ్మం సప్తభిః పరివత్సరైః॥ 9

తా॥ ఆ చెట్లునశించి ఒక బ్రాహ్మణునియింట కన్యకలుగ పుట్టినవి. పుట్టి ఏడువత్సరములు పెరిగినారు. ఇట్లుండ —

శ్లో॥ విహృత్య దూరదేశేభ్యః యతిమాయాంతమైక్షత ।
గృహీత్వా చరణౌ తస్య వచస్సూనృతమబ్రవీత్ ॥ 10

తా॥ ఒక నాడువారు దూరదేశములను తిరిగివచ్చుచున్న ఒకసన్యాసినిచూచిరి. సత్వరము లేచి వారిరువురును ఆతని పాదములనుగ్రహించి నమస్కరించిరి. అనన్తరము వినయముతో ఈ అమృత తుల్యమగు మాటనుచెప్పిరి.

శ్లో॥ త్వత్ప్రసాదాదేవ మునే మోచితం ద్వంద్వమావయోః ।
ఉత్సృజ్య బదరీభావం మానుష్యం ప్రతిపద్య వై ॥ 11

తా॥ స్వామీ! మీ యనుగ్రహముచేతనే మా కిరువురికి రేగుచెట్టు రూపమునుండి విమోచనము కలిగినది. మేము మనుష్యులమయితిమి అనిరి.

శ్లో॥ ఏవముక్తో మునిస్తాభ్యాం విస్మృతః ప్రత్యువాచ సః ।
కదా వత్సే యువాం కేన హేతునా మోచితే మయా ॥ 12
,, యువయోర్బదరీత్వే చ హేతుం బ్రూతాం న వేద్మ్యహం ।

తా॥ ఆ మాటలను విని ఆశ్చర్యపడి యతడు పుత్రికలారా! నేను ఎప్పుడు మీకు విమోచన గలిగించితిని? ఎట్లుకలిగించితిని? మీరు రేగుచెట్టగుటకు కారణమేమి? నా కేదియు తెలియదు. వివరింపుడు. అని యడిగెను.

ఊచతుః కన్యకే తస్మై బాదర్యే హేతుమాత్మనః ॥ 13
శ్లో॥ ఆదౌ విమోచనం తస్మాత్ దుస్త్యజాదపి రూపతః ।

తా॥ అప్పుడాకన్యకలు తాము రేగుచెట్లగుటకు కారణమును ముందుతెలిపి తుదకు దుస్త్యజమగు ఆ రూపమునుండి తమకు విమోచన కలిగిన విధమును తెలియజేసిరి.

అస్తి గోదావరీ తీరే తీర్థం పుణ్యప్రదం నృణాం ॥ 14
శ్లో॥ ఛిన్నపాపమితి ఖ్యాతం పరాం కోటిమవాప యత్ ।
తత్ర సత్యతపా నామ తపస్తేపే సుదారుణం ॥ 15

తా॥ గోదావరియొడ్డున ఛిన్నపాపమని తీర్థఘట్టమొకటిగలదు. ఆ నగరము నరులకెల్ల పుణ్యమును కలుగచేయును. పాపము నశింపచేయును. ఆ కారణముచేతనే ఆ తీర్థము ప్రస్తుత నామధేయముతో ప్రసిద్ధిగాంచియున్నది. ఆ తీర్థమున సత్యతపుండను యోగీశ్వరుడు దారుణమగు తపంబు నొనరించెను.

శ్లో॥ గ్రీష్మే మహతి తప్తానాం మధ్యగో జాతవేదసాం ।
వర్షాసు జలధారాభిర్నిత్యమాసిక్తమూర్ధజః ॥ 16

తా॥ ఆతడు కడు గ్రీష్మసమయమున నలుదిశలనగ్నిని నిలిపి తాను వాటిమధ్యనుండి తపస్సుచేసెను వర్షాకాలమున జలధారలచే తన కేశములు తడిసినను లక్ష్య పెట్టక తపస్సుచేయుచుండెను.

శ్లో॥ శిశిరే చ వసన్నప్సు బిభ్రత్కంటకితాం తనుం ।
విశుద్ధస్సతతం కాలే తపస్తప్త్వా స సంయమీ ॥ 17

,, ఆత్మన్యేవ మతిం చక్రే పరాం ప్రాప్య సునిర్వృతిం ।

తా॥ అతడు శిశిరఋతువున చలిచే తన దేహమంతయు రోమాంచములచే నిండి యున్నను గమనించక జలమధ్యమునుపొంది తపంబొనర్చెను. ఇట్లు ఆ నియతేంద్రియుడు శుద్ధ తపస్సునుచేసి అంతరాకృష్ట ఇంద్రియములుగలవాడై ఆత్మానుభవముచేసి సుఖించుచుండెను.

సదా ఫలాని బిభ్రత్సు సాంద్రచ్ఛాయేషు శాఖిషు ॥ 18

శ్లో॥ నిర్మత్సరేషు సత్త్వేషు బద్ధ్వా ప్రీతిం పరామపి ।
తపః ఫలానుసంధానే మనో నైవాప్రవేశయత్ ॥ 19

తా॥ అతడు ఫలపూర్ణములగు చెట్లనుజూచియు, ద్వేషభావములేని జంతువులను జూచియు తృప్తినొందుచుండెను. వాడు తన సంతోషమునకై తన తపస్సునకొక ఫలము నాశించలేదు.

శ్లో॥ బ్రహ్మాప్యేనం స్వయం పృచ్ఛన్ ఉపతస్థే తమన్వహం ।
తేన సంకోచహీనత్వాత్ బ్రహ్మణ్యనుగతేఽన్వహం ॥ 20

,, తద్ధ్యానానుగతవ్యక్తి వవృధే తస్య తత్తపః ।

తా॥ బ్రహ్మదేవుడతని తపస్సునకు తగినవరముల నివ్వగోరి ఇతనిదరిజేరి ఇతడు తన్నడుగునా యని యెదురుచూచుచుండెను. ఆ మహనీయుడు సంకుచితబుద్ధిగలవాడుకాడు. కావున నతడు నశ్వరభోగములనిచ్చు బ్రహ్మదేవుని వరములను గోరలేదు. సంతతధ్యానమున మునిగి తన తపంబు నధికరించుకొనెను.

విముక్తకల్పం మన్వానః సమృద్ధాదాత్మనః పదాత్ ॥ 21

శ్లో॥ అంతరాయశతం చక్రే తతో భీతః పురందరః ।
ఆహూయాప్సరసాం మధ్యాదావాం తుల్యం సమాదిశత్ ॥ 22

తా॥ దేవేంద్రుడు ఈతని తపసాధిక్యమును జూచి తన యున్నతస్థానమునకే లోటు కలుగునేమోయని భయపడెను. తన పదవిని నిలబెట్టుకొనుటకై యతడు అతనితపస్సున కనేక విఘ్నములను జేసెను. దేవేంద్రుడు అప్సరసలమగు మా యిరువురిని పిలిచి ఇట్లాజ్ఞాపించెను.

శ్లో॥ కురుతం తత్తపోవిఘ్నమనేనాచరితం యువాం ।
యో మాం పదాదవష్టభ్య స్వారాజ్యం భోక్తుమిచ్ఛతి ॥ 23

తా॥ మీరిరువురుజేరి సత్యతపుడుచేయు తపస్సు నాపవలయును. వాడు నన్ను పద భ్రష్టునిగావించి నా రాజ్యము ననుభవింపగోరుచున్నాడు.

శ్లో॥ ఇతి సందేశమాపన్నే పురస్తాచ్ఛ బిడౌజసః ।
గోదావరీమగచ్ఛావ స మునిర్యత్ర వర్తతే ॥ 24

తా॥ మేమతని యాజ్ఞను నెరవేర్చుటకు ఆ మహర్షియుండు గోదావరియొడ్డును చేరితిమి.

శ్లో॥ మృదంగైః మదగంభీరై ర్వేణుభిః కలనాదిభిః।
కలం గీతం సమారబ్ధం తన్వంగీభిః సమన్వితం ॥ 25

తా॥ మేమనేక సుందరీమణులచే అచ్చట తొలుదొల్త అతనిని ధ్యానమునుండి లేప వలయునని తలంపుచే గానముచేయించితిమి. కొందరు గంభీరమృదంగములను వాయించిరి. మరి కొందరు మనోజ్ఞముగ వేణుగానము చేసిరి.

శ్లో॥ ఉద్వహంత్యా పృథుశ్రోణీం ఘనపీనపయోధరే।
స్మయస్మేరముఖాంభోజే కించిదాకుంచితాలకే॥ 26

,, మణికుండలదృష్టాంసే పుండరీకోజ్వలేక్షణే।
తనుమధ్యే సువృత్తోరు వహంత్యా చ సమే పదే॥ 27

,, అనర్తాం యో వనన్యార్థే స్వరతాలలయానుగాం।
దర్శయంత్యో స్వతః కృత్స్నాం గతిం భావానుగామినీం॥ 28

,, మృదూపక్రమముత్పన్నాం మందం మందం వివర్ధనం।
గర్జయామాస దిక్చక్రం తత్తయోర్న్నృత్యమానయోః ॥ 29

తా॥ మే మిరువురము నృత్యముచేయ నారంభించితిమి. మేము విశాలనితంబములను ధరించి బలిసిన స్తనమండలములనుగలిగి చిరునవ్వునవ్వి యాడుచుంటిమి. మా ముంగురులు గాలికి విసిరి మా సౌందర్యమును హెచ్చించినవి యౌవనమదముచే మా ముఖములు విరిసియుండెను. మా కుండలములు భుజమండలమున వ్రేలాడుచుండెను. మా నేత్రములు తామర పువ్వువలె ప్రకాశించుచుండెను. మేము స్వరతాళములతోగూడి భావములను బోధించుచు నృత్యమును చేసితిమి. ఆరంభ సమయమున మెల్లగ నారంభించి మా గానన ర్తనములు రాను రాను పైస్థాయినిచేరి దిశలనెల్లను మ్రోగించినవి. సన్నని నడుములుగల మేము ఒకరిమాట ననుసరించి మరియొకరు నర్తించితిమి.

శ్లో॥ తతోఽఙ్గహారవేగేన వాయుర్వాసః సుశీతలః।
ఈషదుచ్ఛ్వసితే చైలే దర్శయంత్యో పయోధరౌ ॥ 30

తా॥ మా ఆభరణములు గాలికెగసినవి. చల్లనిగాలి మా వస్త్రములను కొద్దిగనూడ జేసెను. అప్పుడు ఇతరులు చూచునట్లు మా స్తనములు నిరాచ్ఛాదనములైనవి.

శ్లో॥ ఉద్వర్ధయంతీ కందర్పముల్బణా గతిరావయోః।
కోపముత్పాదయామాస మునేరవికృతాత్మనః ॥ 31

తా॥ మా నటత మన్మథావేగమును పెంచునదిగానుండెను. అయ్యది అట్టి వికారముల కతీతుడగు ఆ మునికి కోపమును గలుగజేసెను.

శ్లో॥ తతః శాపం దదౌ కోపాజ్జలముత్సృజ్య పాణినా।
బదరీత్వం ప్రపద్యేతాం జాహ్నవీ రోధసీతినా ॥ 32

తా॥ మీ రిరువురు స్త్రీత్వమును దుర్వినియోగముజేసితిరి. నాతపస్సునుచెరచ బయలు దేరితిరి. కాన మిమ్ములను గంగయొడ్డున రెండు రేగుచెట్లుగా మొలవవలెనని శపించుచున్నాను. అని కోపగించి ఆ మహానుభావుడు శపించెను.

శ్లో॥ ఆవాభ్యాం పారతంత్ర్యేణ యద్దుశ్చరితమాస్థితం।
తత్క్షమస్వ వినమ్రాభ్యాం మునిః పశ్చాత్ప్రసాదితః॥ 33

తా॥ మేమప్పుడు మిగుల భయమునొంది స్వామీ! మేము స్వతంత్రించి ఈ చెడ్డ కార్యమున దిగియుండలేదు. మేము పరతంత్రులము. మా యజమానుడగు నింద్రునియాజ్ఞచే ఇట్లు నడుచుకొంటిమి. ఇందు మా తప్పేదియులేదు. దయచేసి మమ్ములను క్షమించి శాపమునుండి విడిపించవలయునని బహుధాప్రార్థించితిమి.

శ్లో॥ తతః శాపవిమోక్షంనో కల్పయామాస పుణ్యధీః।
భరతాగమనాంతోఽయమితి సత్యతపామునిః॥ 34

,, మర్త్యేషు జన్మలాభశ్చ స్మృతిశ్చాతీతజన్మనాం।

తా॥ మాప్రార్థనలను దయావంతుడగు ఆ మహర్షి యంగీకరించెను. మీరు భరతుడను మహాత్ముడు వచ్చువరకు ఆ రూపముననుండవలయును. అనంతరము మీరు రేగుచెట్టురూపము మారి మనుష్యరూపమునుపొందెదరు. మరల ఆ భరతుడు వచ్చునపుడు మనుష్యరూపమును విడిచి దేవాంగనారూపమును పొందెదరు. మీకు అన్ని జన్మలయందును మీ పుట్టు పూర్వోత్తరములు మరువక తెలిసియుండును. అని ఆ మహాముని వచించెను.

ఆవయోరన్తికం గత్వా బదరీభూతయోస్తతః॥ 35

శ్లో॥ స్మరతా తుర్యమధ్యాయం భవతా నిష్కృతిః కృతా।
తత్త్వావత్ప్రణమావస్త్వాం శాపాదేవ న కేవలాత్॥ 36

,, ఘోరాదేవ తు సంసారాత్ త్వయైతేన విమోచితే।

తా॥ స్వామీ! మేమామాటలనువిని శాపానుభవమునకై బదరీరూపమును బొంది యుంటిమి. అప్పుడు మీరు మా యంతికముచేరి చతుర్థాధ్యాయమును స్మరించితిరి. దానిచే మాకు శాపవిమోచనము కలిగినది. కావుననే మేము మిమ్ములను ఇప్పుడు అర్చించుచున్నాము. ఘోర సంసారమునుండి మమ్ములను కాపాడిన మహానుభావులు మీరే అని ఆ కన్యకలు భరతునికి సమాధానమొసంగిరి.

శ్రీభగవానువాచ — మహావిష్ణువు చెప్పెను.

ఏవముక్తో మునిస్తాభ్యామతి ప్రీతమనాస్తతః॥ 37

శ్లో॥ పూజనాస్తే సమామంత్ర్య యథాగతమసౌ యయౌ।
కన్యే చతుర్థమధ్యాయం జపేతాం నిత్యమాదరాత్॥ 38

తా॥ ఈ మాటలనువిని ఆ భరతమునికి సంతోషముకలిగెను. అతడు పూజనందుకొని వచ్చిన దోవను త్రొక్కెను. ఆ కన్యకలును శ్రద్ధాభక్తులతో చతుర్థాధ్యాయమును జపించి సుఖమందిరి.



ఓమ్

# పంచమాధ్యాయమాహాత్మ్యము



శ్రీభగవానువాచ — మహావిష్ణువు చెప్పెను.

శ్లో॥ పంచమస్యాధునా దేవి మాహాత్మ్యం లోకవిశ్రుతమ్।
కథయామి సమాసేన సావధానా శ్రుణు ప్రియే॥ 1

తా॥ దేవీ! లోకప్రసిద్ధమగు పంచమాధ్యాయ మాహాత్మ్యమును నీకు సంగ్రహించి చెప్పెదను. శ్రద్ధతో వినుము.

శ్లో॥ పింగళో నామ భద్రేషు పురుకుత్సపురే ద్విజః।
అవదాతే కులే విప్రః విశ్రుతే వేదవాదినాం॥ 2

,, కులోచితాని శాస్త్రాణి తథా వేదాన్ విసృజ్య సః।
తౌర్యత్రికే మతిం చక్రే వాదయన్మురజాదికం॥ 3

తా॥ భద్రదేశమున పురుకుత్సపురమనెడి నగరమొకటిగలదు. అందు వేదజ్ఞానముగల పవిత్రులకులమున పింగళుడను బ్రాహ్మణుడొకడు పుట్టియుండెను. వానికులము వేదజ్ఞానమునకు పేరుగాంచియుండెనుగాని, అతడు వేదమునభ్యసించినవాడుకాడు. అతనికి సంగీతమనిన సంతోషము. కావున వాడు ఆ సంగీతమును సాంగముగ నృత్తగీతవాద్యములతోసహా అధిగమించి మృదంగము మున్నగు వాద్యములను వాయించి కాలముగడుపుచుండెను. కులోచితమగు వేదశాస్త్రాభ్యాసమనిన అతనికి చేదుగనన్పట్టెను. తన జాతికితగిన వ్యాపారమును విడిచిపెట్టెను.

శ్లో॥ కృతశ్రమస్తత్ర తత్ర గీతే నృత్యే చ వాదనే।
పరాం ప్రసిద్ధిమాసాద్య నృపసద్మ వివేశ సః॥ 4

శ్లో॥ సమాతస్థే స తేనాసౌ పురా భూమిభుజా సహ।
పరదారానుపాహృత్య బుభుజే తా అనన్యధీః॥ 5

తా॥ వాడు సాంగసంగీతకళాభిజ్ఞుడగుటచే ప్రసిద్ధిచెందెను. అతని సంగీతపాండిత్యము నెరిగిన ఆ దేశపురాజు అతనిని ఆహ్వానించి తన ఇంటనుంచుకొని పోషించెను. పింగళుడచిరకాలముననే ఆ రాజును తన శారీరముచే వశపరచుకొనెను. రాజభిమానించుటచే నిర్భయుడై పుణ్యాపుణ్యములసైతము విచారించక పరస్త్రీలను చెఱచి సుఖమనుభవించ మొదలిడెను.

శ్లో॥ తత ఉత్సిక్తగర్వోఽయం సూచమానో నిరంకుశః।
పరచ్ఛిద్రాణి చాముష్మై వివిక్తే స నిరన్తరం॥ 6

తా॥ రాజునకు తనమీద శంకకలుగకుండుటకుగాను పింగళుడు ఉద్యోగస్థుల యొక్కయు సాధారణప్రజలయొక్కయు సామాన్యలోపములను గొప్పవిగాపెంచి ఎల్లప్పుడు వర్ణించుచుండెను. అట్లు చేసినయెడల తన్ను గుణజ్ఞుడనియు, తనమీద పగచే ఇతరులు లేనిదోషములను మోపుచున్నారనియు రాజు గ్రహించునని అతడు భావించెను. ఇట్లు గర్వముచే కొండెము చెప్పుట అతని నిత్యకర్మయైపోయెను.

శ్లో॥ తస్యాసీదరుణా నామ భార్యా హీనకులోద్భవా।
భ్రమత్యన్వేషయంతీ సా కాముకేన విహారిణీ॥ 7

,, తమన్తరాయం మన్వానా నిశీథిన్యాం నిజాలయే।
నిజఘాన శిరశ్ఛిత్వా నిచఖాన మహీతలే॥ 8

తా॥ అతనికి నీచకులమున బుట్టినదగు అరుణయను భార్యయుండెడిది. ఆమె చల చిత్తురాలై జారపురుషునితో వ్యభిచరించుచుండెను. ఆమె తన స్వేచ్ఛాచారములకు పింగళుడు అడ్డముగా నుండుటనుచూచి ఒకదినము వాడు తన గృహముననుండగా అతనినిచంపి తచ్ఛవ మును భూమిలో పూడ్చిపెట్టినది.

శ్లో॥ వియోజిత స్తతః ప్రాణై రుపేత్య యమసాదనం।
దుర్గయాన్నరకాన్ భుక్త్వా గృధ్రోఽభూద్విజనేవనే॥ 9

తా॥ అతడు మరణానన్తరము యమగృహమునుచేరి తనపాపముల కనేకయాతనల ననుభవించెను. అనన్తరము నిర్జనమగు నొక వనమున గ్రద్దగా జన్మించెను.

శ్లో॥ భగన్దరేణ రోగేణ సాఽపి హిత్వా వరాం తనుం।
ఉపేత్య నరకాన్ ఘోరాన్ జజ్ఞే తత్ర వనే శుకీ॥ 10

తా॥ అతని భార్యయగు అరుణకు కుకార్యము లొనర్చినందున భగందరమను గుద రోగము సంభవించెను. అది వృద్ధినొందుటచే మిగులబాధల ననుభవించి దానిచేతనే మరణించెను. అమె నరకము చేరి శిక్షననుభవించి అదే అరణ్యమున ఒక చిలుకగాపుట్టెను.

శ్లో॥ కణానాదాతుకామాంతాం సంచరంతీమిత స్తతః।
విదదార నఖై స్తీక్ష్ణైః గృధ్రో వైరమనుస్మరన్॥ 11

తా॥ ఆ చిలుక ఒకదినమున ధాన్యపుముక్కలను సంగ్రహించ నటునిటు తిరుగు చుండుటను ఆ గ్రద్దచూచెను. దానికి పూర్వవృత్తాంతములు స్మృతికివచ్చినవి. దానిచే మిగుల గోపముచెంది యా గ్రద్ద చిలుకను తీక్ష్ణములగు తన నఖములచేగీచి నానాబాధలకు లోనొనర్చెను.

శ్లో॥ నృకపాలే పయః పూర్ణే నిపతంతీం తతః శుకీం।
అభిదుద్రావ గృధ్రోఽపి నిజఘ్నే న చ జాలికైః॥ 12

తా॥ దెబ్బతినిన ఆ చిలుక ఇచ్చటనిలిచిన మిగుల కష్టముకలుగునని యెంచి పరుగెత్తెను. కాని మిగుల నలసియుండుటచే అది యెగురలేక క్రిందనుండిన యొక నరకపాలములోపడి పోయెను. నరకపాలము జలపూర్ణముగనుండుటచే ముందే యలసియుండిన యా చిలుక అందు మునిగి చనిపోయెను. దానినిచంపగోరి దానివెనుక గ్రద్దపరుగెత్తెను. కాని బోయవాండ్లచే నది కొట్టబడెను.

శ్లో॥ పత్నీ వియోజితా ప్రాణైర్నృకపాలజలే తతః।
తత్రైవ నిమమజ్జాసౌ పేత్య క్రూరతరః ఖగః॥ 13

తా॥ తన భార్యయగు యా శుకము నరకపాలమునబడి చచ్చిపోవుటజూచి గనితీర్చు కొన్న వీరునివలె అదియు నచ్చటనేపడి తనప్రాణములను వీడుకొనెను.

శ్లో॥ పితృలోకం ప్రపేదాతే నీతౌ తౌ యమకింకరైః।
ప్రాక్కృతం దుష్కృతం కర్మ స్మరంతౌ భయభాగినౌ॥ 14

తా॥ వారిని యమభటులు యమలోకముచేర్చిరి. వారు తమలో అయ్యో! మహాపాపములను చేసిన మనకు యముడు ఏశిక్షను విధించునోయని మిగుల దిగులుచెందియుండిరి.

శ్లో॥ తతో యమః సమాలోక్య తయోః కర్మజుగుప్సితం।
అకస్మాదేవ తత్స్నానాత్ మరణే సుకృతం మహత్॥ 15

శ్లో॥ అనుజజ్ఞే తతో లోకమీప్సితం గంతుమేతయోః।

తా॥ యముడు వారిదుష్కర్మలకు వారిని నిరసించెను. కాని వారియకస్మాన్మరణముచే వారు పవిత్రులయియుండుటనుజూచి సంతోషపడి ఆర్యులారా! మీరు పుణ్యాత్ములు. మిమ్ములను నిర్బంధించుశక్తి నాకు లేకున్నది. మీరు ఇష్టపడుచోటునకు వెళ్ళి సుఖమనుభవించవచ్చును. అని చెప్పెను.

మహాపాతకసంఘాతైరపి దుర్ధర్షమానసౌ॥ 16

శ్లో॥ తతో విస్మయమాపన్నౌ స్మృత్వా తౌ దుష్కృతం నిజం।

తా॥ గొప్పపాపములకు సైతము చలించనివారి హృదయములు ఆ మాటలకు మిగుల విస్మయ మొందినవి. వారు తమ పాపములను తలంచి ఇది వాస్తవముకాదనియెంచిరి.

ఉపేత్య ప్రణతౌ భూత్వా వైవస్వతమపృచ్ఛతాం॥ 17

శ్లో॥ సంచితం దుష్కృతం పూర్వం ఆవాభ్యామపి గర్హితం।
లోకానామీప్సితానాం తు కో హేతుస్తద్వద్వస్వ నౌ॥ 18

తా॥ వారు ధర్మరాజును నమస్కరించి స్వామీ? మేము అధికపాపములనుచేసియున్నాము. దానికి తగినశిక్షలను మే మింకను ననుభవించలేదు, ఆ పాపములు నశించనప్పుడు మేమెట్లు పుణ్యాత్ములమైతిమి? మాకు మా యిచ్చవచ్చిన చోట్లకువెళ్ళ స్వాతంత్ర్యమెట్లుకలిగెను? అనిప్రశ్నించిరి.

శ్లో॥ ఏవముక్తస్తతస్తాభ్యామాహ వైవస్వతో వచః।
ఆసీద్గంగాతటే నామ్నా వటుర్బ్రహ్మవిదుత్తమః॥ 19

,, ఏకాకీ నిర్మమః శాంతః వీతరాగో విమత్సరః।
గీతానాం పంచమాధ్యాయమావర్తయతి సర్వదా॥ 20

,, తేన పుణ్యేన పూతాత్మా యయౌ బ్రహ్మసనాతనం॥ 21

,, నిర్మలీకృతదేహస్య గీతాభిర్భావితాత్మనః।
తత్కపాలజలం ప్రాప్య యువాం యాతౌ పవిత్రతాం॥ 22

తా॥ ధర్మరాజు వారిసిచూచి పూజ్యులారా! పవిత్రగంగాతటంబున వటువను పేరుగల బ్రహ్మజ్ఞాని యొకడుండెను. వాడుమిక్కిలి వైరాగ్యముగలవాడు, అహంకారమమకారములను విడిచి అతడు అనవరతము గీతాపంచమాధ్యాయమును జపించుచుండెను. దానివలన పూతాత్ముడయి వాడు సనాతనమగు పరబ్రహ్మమును చేరెను. అతనిదేహము పంచమాధ్యాయ పారాయణముచే మిగులపవిత్ర మయియుండెను. అతని కపాలమునుచేరి మీరు తనువును విడిచిపెట్టితిరి, కావున పాపిష్ఠులగు మీరు పుణ్యాత్ములయి పుణ్యపదంబుల కర్హులైతిరి,

శ్లో॥ తద్గచ్ఛతం యువాం లోకాన్ మనోరథపథి స్థితాన్।
గీతానాం పంచమాధ్యాయ మాహాత్మ్యేన పవిత్రితౌ॥ 23

తా॥ కాన ఇప్పుడు పుణ్యాత్ములనియు, స్వతంత్రులనియు నెంచి మిమ్ములను ఇష్టము వచ్చిన చోట్లకువెళ్లి సుఖపడవచ్చునని చెప్పుచున్నాను. అని బదులిచ్చెను.

శ్లో॥ ఏవం తౌ బోధితౌ తేన ముదితౌ సమవర్తినా।
వ్యోమయానం సమారుహ్య జగ్మతుర్వైష్ణవం పదం॥ 24

తా॥ ఈ మాటలనువిని ఆ దంపతులు సంతోషపడిరి. పిదప వారిని తీసుకొనిపోవుటకు విమానమువచ్చెను. దానినధిష్ఠించి శ్రీ విష్ణులోకమును వారు జేరిరి.



ఓమ్

# షష్ఠాధ్యాయమాహాత్మ్యము



శ్రీభగవానువాచ — శ్రీ భగవంతుడు చెప్పినది.

శ్లో॥ షష్ఠాధ్యాయస్య మాహాత్మ్యం ప్రవక్ష్యామి వరాననే।
యదాకర్ణయతాం నౄణాం ముక్తిః కరతలే స్థితా॥ 1

తా॥ ఓ సుందరముఖముగల లక్ష్మీదేవీ! నేనిప్పుడు అరవయధ్యాయ మాహాత్మ్యమును తెలిపెదను. దానిని వినువారికి మోక్షము సిద్ధించుచున్నది. వినువారు మానవమాత్రులైనచాలును. జాతి విచక్షణలేక గుణదోషవిచారణలేక లింగవ్యత్యాసము నాలోచించక వారికి మోక్షము లభించుచున్నది.

శ్లో॥ అస్తి గోదావరీ తీరే ప్రతిష్ఠానాభిధం పురం।
పిప్పలేశాభిధానోఽహం యత్రాస్మి స్మేరలోచనే॥ 2

,, యత్ర గోదావరీతీర శీకరైరవశీతలైః।
హంసాః పక్షపుటైర్యత్ర హరంతి యమినాం శ్రమమ్॥

,, స్ఫురత్పద్మావలీకోశ పరాగసురభీకృతం।
శ్లాఘ్యం గోదావరీ తోయం యేన తే నిర్జరా నరాః॥

,, ధిక్ సుధామౌషధీశస్య సకృత్తృప్తియవిధాయినీం।
మహారాష్ట్రవధూకానాం మజ్జంతీనాం మునీశ్వరాః॥

,, స్పృశంతి యత్ర వక్త్రాణి ఫుల్ల పంకజశంకయా॥

తా॥ గోదావరియొడ్డున ప్రతిష్ఠానమను పురమొకటికలదు. అందు నేను పిప్పలేశుడను పేరుతో నివసించుచున్నాను. అచ్చట పెక్కు మునిపుంగవులు తపస్సుచేయుచుందురు. ఆ నదిలో విహరించు హంసములు తమరెక్కలనువీచి చల్లని మెల్లనిగాలిచే వారి యలసటను తొలగించు

చున్నవి. అందు వికసించిన పద్మములనుండి పరాగములు నీటిలోపడి నీటికిసువాసనను కలిగించు చున్నది. శ్లాఘ్యమగు నా నీరును త్రాగుజనులు ముసలితనమనునదిలేక చిరకాలము యౌవనమును కలిగియుందురు. చంద్రుని తీయని అమృతధారకన్న మధురగోదావరీ జలమే గొప్పదని నేను చెప్పె దను. ఎందుకనిన, గోదావరీజలము ఎల్లప్పుడు మధురమై అందరికి లభ్యమగుచున్నది. చంద్రుని అమృతధారయన్ననో ఒక కాలమున వృద్ధినొందుచు మరియొక సమయమున నశించుచున్నది. కావున నది ఒకప్పుడు లభ్యముకాక పోవుచున్నది. అట్టి గోదావరియందు మహారాష్ట్ర సుందరీ మణులు స్నానముచేసెదరు. వారు స్నానము చేయుచుండ వారి ముఖములుమాత్రము పైకగపడు చుండును. వాటినిపద్మములని భ్రమించి దేవుని పూజకుగాను మునీశ్వరులు కోయుటకు స్పృశించెదరు.

శ్లో॥ యత్ర ఖేలన్మహారాష్ట్ర్యః క్వణత్కింకిణిసుందరాః।
హరంతి ధ్వనయోఽలీనాం మనాంస్యపి తపస్వినామ్॥ 7

,, అత్యుచ్చసౌధశిఖరవిహారి వనితాముఖం।
పశ్యన్ననుదినం యత్ర క్షీయతే మృగలాంఛనః॥ 8

,, యస్మిన్నాధూయమానానాం పతాకానాం మరుద్గణైః।
గతశ్రమా రవేర్యానే భవంతి రథవాజినః॥ 9

,, రాశీకృతైర్మలయజై రసంఖ్యాతైర్వణిగ్గణైః।
యస్మిన్నుపలశేషోఽసౌ లక్ష్యతే మలయాచలః॥ 10

తా॥ అచ్చటివారు విలాసపురుషులు. వారు ఎల్లప్పుడు విహరించుచుందురు. వారిగజ్జెల ధ్వని తుమ్మెదల ధ్వనికన్న మనోహరముగనుండును. మహర్షుల మనస్సులనుకూడ ఆ మనోహర ధ్వని యాకర్షించును. స్త్రీలు ఉన్నతమైనమేడలయందు విహరించెదరు. వారి యవ్యాజసుందరములగు ముఖములనుజూచి చంద్రుడు అసూయచే క్షీణించుచుండును. మేడలమీద నెగురుచున్న జయ పతాకములు సూర్యుని రథమునుమోసి యలసిన గుఱ్ఱములశ్రమను పోగొట్టుచున్నది. ఆ నగరపు అంగడివీధులలో వ్యాపారులు మలయపర్వతోద్భవములగు ననేక వాసనాద్రవ్యములను ప్రోగుచేసి పెట్టియుందురు. వాటిని చూచువారు మలయపర్వతమున శిలామాత్రమే మిగిలియుండునని భ్రమించెదరు.

శ్లో॥ తత్ర జానశ్రుతిర్నామ మేదినీవల్లభోఽభవత్।
యస్మిన్నుద్ధరతి క్షోణీం శేషోఽయం మణిసన్నిభామ్॥ 11

,, అపి ప్రతాపమార్తాండమండలీతీవ్రతేజసి।
నిత్యమధ్వరధూమేన శ్యామలాః కల్పశాఖినః॥ 12

,, అసాధారణదాతృత్వం పశ్యంత ఇవ లజ్జయా।
యదధ్వరపురోడాశ చర్వణాస్వాదలంపటాః॥ 13

,, న తత్యజుః సుపర్వాణః ప్రతిష్ఠానపురం మనాక్।
యస్య దానాంబుధారాభిః ప్రతాపజ్యోత్స్నయానిశమ్॥ 14

,, మఖధూమైశ్చ సంపుష్టాః వవృషుః సమయే ఘనాః॥ 15

తా॥ ఆ నగరమును జానశ్రుతియను రాజు పాలించుచుండెను. అతడు ధర్మాత్ముడు. భూమినంతను వాడు పాలించినందున ఆదిశేషుని భారముతగ్గి అతడు భూమిని తన శిరోమణిని

వలె ననాయాసముగ మోయగలిగెను. ఆ రాజు సూర్యునివలె ప్రతాపవంతుడు. వాడనవరతము యాగహోమములను చేయుచుండెను. వాటిపొగచే కల్పవృక్షములు నల్లబడిపోయినవి. ఇతని విశేష దానములనుజూచి లజ్జచే వాటిముఖములు నల్లబడినవో యనునట్లుండెను. దేవతలితడు యాగము చేయునప్పుడు తమకిచ్చు పురోడాశాదికములయందలి యాశచే ప్రతిష్ఠానపురమును విడువక యచ్చటనే నివసించుచుండిరి. ఇతని దానజలముచేతను, పరాక్రమమనెడు జ్యోత్స్నచేతను, యాగ ధూమములచేతను పెరిగిన మేఘములు ఉపకర్తకు ప్రత్యుపకారము చేయదలచినవివలె సకాలమున వర్షించుచుండినవి.

శ్లో॥ స్వల్పమాత్రమపి క్వాపి న పదం ప్రాపురీతయః ।
నీతయః ప్రసరంతి స్మ యస్మిన్ శాసతి మేదినీం ॥ 16

,, వాపీకూపతటాకానాం ఛద్మనాయోఽనువాసరం ।
హృదయస్థాని మేదిన్యా నిధానాని వ్యలోకయత్ ॥ 17

,, పాండురాభిః పతాకాభిః ప్రాసాదో యస్య రాజతే ।
వియద్గంగాతరంగౌఘైర్హిమాద్రిరివ సానుమాన్ ॥ 18

తా॥ అతని రాజ్యమున అతివృష్టి అనావృష్టి మొదలగు ఈతిబాధలకుచోటులేదు. అన్ని ప్రదేశములయందును నీతి ప్రబలియుండెను. అతడు అనేకబావులను గుంటలనుత్రవ్వి జనులకుమిగుల తోడ్పడుచుండెను. శాంతికిని సుభిక్షమునకును సూచకములగు తెల్లనిధ్వజములు అతనిమేడలపై నెగురుచుండ ఆ ప్రసాదములు ఆకాశగంగతోకూడిన హిమవత్పర్వతమువలె విలసిల్లుచుండును.

శ్లో॥ దానైస్తపోభిర్యజ్ఞైశ్చ ప్రజానాం పాలనేన చ ।
తుష్టాః స్వర్గౌకసస్తస్మై వరం దాతుం సమాగమన్ ॥ 19

,, తతోఽన్తరిక్షమార్గేణ ధన్వానాః పక్షసంతతీః ।
మృణాలధవలాదేవి దేవహంసా వినిర్గతాః ॥ 20

,, త్వరయాఽఽగచ్ఛతాం తేషామన్యోన్యం తత్ర భాషిణాం ।
భద్రాశ్వప్రముఖాద్విత్రాః పురస్తాన్నిర్యయుర్జవాత్ ॥ 21

తా॥ ఈరాజుయొక్క దానతపోయజ్ఞములను, న్యాయమగు ప్రజాపాలనమునుజూచిన దేవతలు ఇతనిని ధర్మనిధియనియెంచి అనుగ్రహింపనెంచిరి. వారతని స్వరూపమును చరిత్రమును సాక్షాత్కరింపగోరి అతనికి తెలియకుండుటకుగాను హంసరూపమున అతనున్నచోటునకు బయలుదేరిరి. వారిదేహచ్ఛాయ తామరకాడవలె తెల్లనిదైయుండెను. వారు అన్యోన్యము ఆకాశమార్గమున సంభాషించుచువచ్చుచుండిరి. ప్రతిష్ఠానపురమును సమీపించునపుడు భద్రాశ్వుడు మొదలగు హంసలు ఇతరులనుమించి వేగముగా ముందుపరుగెత్తినవి.

శ్లో॥ సర్వైర్భిర్మిలద్భిరూచుస్తే పురస్తాద్గచ్ఛతో జవాత్ ।
కథం వేగేన నిర్యాతా భవంతః పురతః స్థితాః ॥ 22

,, సర్వైర్మిలిత్వా గంతవ్యమస్మిన్నధ్వని దుర్గమే ।
ప్రకాశమానం పురతః తేజః పుంజం న పశ్యథ ॥ 23

శ్లో॥ జానశ్రుతేర్మహీభర్తుః పుణ్యమూర్తేరతిస్ఫుటం
నిశామ్య వచనం సమ్యక్ పాశ్చాత్యానాపురస్థితాః ॥ 24

తా॥ వాటినిజూచి వెనుక మెల్లగనడిచిన హంసలు ఓ సోదరహంసలారా ! మీరింత వేగముగ పరుగెత్తవచ్చునా? ఇది అవినయమును చూపట్టునదిగదా? ఇట్లు పరుగెత్తుటవలన ఎదురులో కనబడు తేజోనిధియగు జానశ్రుతికి మీరు అపచరించినవారగుదురే. ఆ మహానుభావుని తేజఃపుంజము ప్రకాశించుచుండుటను మీరు చూడలేదా? భయభక్తులతో నడుచుకొనదగిన ప్రదేశము గదా ఇది ? ఇచ్చట వినయముతో ఒకరివెంబడి నొకరు మెల్లగవెళ్లవలసియుండ మీరిట్లు చేయుట తగునా ? మీకు కీడుమూడునే ? అనియడిగినవి.

శ్లో॥ హంసా హసిత్వా సావజ్ఞమూచుర్వచనముచ్చకైః ।
రైక్వాభిధస్య దుర్ధర్ష తేజసో బ్రహ్మవాదినః ॥ 25
కిన్ను జానశ్రుతేరస్య రాజ్ఞస్త్రీవ్రతరం మహః ॥ 26

తా॥ ఆ మాటలను విని భద్రాశ్వాది హంసలు బిగ్గరగానవ్వి ఓ సోదరులారా ! మీరు పొరబడుచున్నారు. మీకు యథార్థము తెలియకున్నది. దుస్సహతేజోనిధియు, బ్రహ్మజ్ఞానియు నగు రైక్వమహర్షిని మీరెరుగరేమో ? వారి తేజస్సునకన్న ఈతని తేజస్సు గొప్పదికాదు. ఈతని జ్ఞాన తేజంబులసంపూర్ణములు. కావుననే మేమితనిని లక్ష్యపెట్టక మా దారిలోవెళ్ళుచున్నాము. అని సమాధానమిచ్చినవి.

శ్లో॥ ఇతి శుశ్రావ హంసానాం గిరో జ్ఞానశ్రుతిర్నృపః ।
అత్యుచ్చసౌధశిఖరమారుహ్య చ సుఖం స్థితః ॥ 27
,, తతస్సారథిమాహూయ నృపాలో విస్మయాన్వితః ।
సందిదేశ మహాత్మాఽసౌ రైక్వ ఆనీయతామితి ॥
,, తతోఽవధార్య భూపాలవచః పీయూషగర్భితం ।
నిర్జగామ మహో నామ్నా సారథిః ప్రథయన్ముదం ॥ 29

తా॥ ఆసమయమున జ్ఞానశ్రుతి రాజు తనమేడనెక్కి విశ్రమించుచుండెను. ఈ హంసాలాపములు అతనిచెవిలో బడినవి. ఆ మాటలనువిని సర్వోత్కృష్టతేజోనిధియగు రైక్వునిజూచుట కతడు తలంచెను. వాడు సారథినిబిలిచి నీవు రైక్వుడున్నచోటికి వెళ్ళి అతనిని తీసుకొనిరావలయును అని ఆజ్ఞాపించెను. అమృతసమానమగు నారాజుమాటలను శిరసావహించి అట్లే తెచ్చెదనని చెప్పి సంతోషముతో రథచోదకుడు బయలుదేరెను.

శ్లో॥ యత్రవారాణసీ నామ నగరీ ముక్తిదాయినీ ।
యత్ర విశ్వేశ్వరో నామ హ్యుపదేష్టా జగత్పతిః ॥ 30
,, తతో గయాభిధం క్షేత్రం యత్ర దేవో గదాధరః ।
ఉద్ధర్తుమఖిలాఞ్ లోకాన్ వసత్యుత్ఫుల్లలోచనః ॥ 31
,, తతో గౌరీపతేః పార్శ్వే సర్వైస్తీర్థైరనేకధా ।
పర్యటన్ గతవాన్ యత్ర కేదారః పాపదారణః ॥ 32

శ్లో॥ యమాలోక్య సకృన్మర్త్యాః ముక్తాస్స్యుర్నాత్ర సంశయః।
మహాపాపవినిర్ముక్తా భుక్త్వా భోగాన్ యథేప్సితాన్॥ 33
,, తతో గౌడేషు నిర్యాతః యత్రాస్తే పురుషోత్తమః।
యస్యావలోకనాదేవ నరాః స్వర్లోకగామినః॥ 34
,, తతో ద్వారవతీం ప్రాగాన్నగరీం ముక్తిదాయినీం।
యత్రాస్తే గోమతీతీరే రుక్మిణీవల్లభో హరిః॥ 35

తా॥ మహాత్ముడును భగవద్భక్తుడుననగు రైక్వుడు సాధారణ నగరగ్రామములయందు నివసించడనియు పావనతీర్థములయందో లేక భగవంతుని యాలయములున్నచోటనో జప తప పరాయణాసక్తుడై కాలము గడుపుచుండుననియు నిశ్చయించి యా సారథి ముందు జగత్ప్రఖ్యాతము లగుక్షేత్రముల వెదక నారంభించెను. అతడు జగత్పతియగు విశ్వనాథుడు విలసిల్లు కాశీక్షేత్రమును ప్రథమమున జేరెను. అనంతరము గదాధర మహావిష్ణువు నివసించు గయను, పార్వతీపతి నివసించునట్టియు అనేక తీర్థరాజంబులకు నిధియైనట్టియు కేదారక్షేత్రమును, పురుషోత్తముడుండు గౌడదేశమును, శ్రీకృష్ణపరమాత్మ నివసించు ద్వారకాక్షేత్రమును క్రమముగ జొచ్చి రైక్వుని వెదకెను. పై జెప్పబడిన క్షేత్రములు మహా పవిత్రములు వాటి దర్శనముచేత నరులు ముక్తిని బడయ గలుగుదురు.

శ్లో॥ స్నాత్వా చ గోమతీ తీర్థే పంచకృష్ణాన్ విలోక్య చ।
మర్త్యో ముక్తిమవాప్నోతి భుక్త్వా భోగాన్ యథేప్సితాన్॥ 36
,, తతస్సముద్రమాసాద్య సోమనాథం విలోక్య చ।
భుక్తిముక్తిప్రదం దేవం తతో నిరగమత్సుధీః॥ 37
,, అవంతికాం పురీం ప్రాప్తః భుక్తిముక్తిప్రదాయినీం।
యత్రోమయా సహ క్రీడన్ మహాదేవోఽస్తి శంకరః॥ 38
,, అథోంకారం సమాసాద్య శర్మదం నర్మదాతటే।
భుక్తిముక్తిప్రదాతారం త్వరయా నిర్గతస్తతః॥ 39
,, అశ్వమేధపురం నామ్నా నగరం పర్యటంస్తతః।
యత్ర శార్ఙ్గధరః శ్రీమానాస్తే లక్ష్మీపతిస్స్వయం॥ 40

తా॥ గోమతీ తీర్థమున స్నానముచేసి ఆ నగరముననున్న శ్రీ కృష్ణమూర్తులను మ్రొక్కు వానికి మనోభీష్టములు నెరవేరుచున్నవి. అటనుండి సూతుడు సముద్రముజేరి సోమనాథుని దర్శించి అవంతికాపురముజేరెను. అచ్చట శ్రీ మహేశ్వరుడు మహాదేవుడను నామధేయము కలిగి పార్వతీదేవితో విహరించుచున్నాడు. పిదప నర్మదాతటముజేరి ఓంకారనాథుని దర్శించి శార్ఙ్గధరుడుండు అశ్వమేధపురము జేరుకొనెను.

శ్లో॥ తతో విష్ణుగయాం ప్రాప్తః కుండం లోణారసంజ్ఞితం।
యత్ర స్నాత్వా చ పీత్వా చ ముచ్యతే బంధనాన్నరః॥ 41
,, తతః కొల్హాపురం నామ గతో రుద్రగయాం ప్రతి।
అస్తే భగవతీ యత్ర లక్ష్మీర్భుక్తిప్రదాయినీ॥ 42

శ్లో॥ పంచరథ్యాం నరః స్నాత్వా నరో లక్ష్మీం విలోక్య చ।
భుక్త్వా భోగాన్ యథాకామం భక్తిం చ ప్రతిపద్యతే॥ 43
,, తతోఽమలగిరిం నామ నగరీం ప్రతిపద్య చ।
నందికేశ్వరమారుహ్య శోభతే యత్ర శంకరః॥ 44
,, దృష్ట్వా చతుర్భుజం దేవం వరదానోద్యతం శివం।
సోమనాథం నృణాం ముక్తిర్భవత్యేవ న సంశయః॥ 45

తా॥ అనంతరమతడు విష్ణుగయకుపోయెను. అచ్చట లోణారమను పేరుతో సరంబొకటి గలదు. అందు స్నానపానములు చేయువారికి ముక్తిలభించుచున్నది. అటనుండి కొల్హాపురమనంబడు రుద్రగయను పొందెను. అచ్చట భక్తివర్ధకురాలగు లక్ష్మీదేవి విలసిల్లుచున్నది. పంచరథియను పుణ్యనదియు నచ్చటనే యున్నది. తరువాత సూతుడు నందికేశ్వరునెక్కి నాలుగు భుజములతో భక్తులకు వరప్రదానముజేయు సోమనాథదేవుడుండు అమలగిరియను పట్టణముచేరెను.

శ్లో॥ తుంగభద్రానదీతీరే దృష్ట్వా హరిహరం వపుః।
యుగే యుగే భుజా యస్య పతంత్యవనిమండలే॥ 46
,, యద్విలోక్య నరాన్సర్వే రమ్యం హరిహరం వపుః।
స్వర్గే కల్పశతం భుక్త్వా ముక్తసంసారబంధనాః॥
ముక్తిం చ ప్రతిపద్యంతే నాత్ర కార్యా విచారణా॥ 47
,, తతః శ్రీశైలమాసాద్య సిద్ధగంధర్వసేవితం।
గిరిజావల్లభో యత్ర మల్లినాథో విశారదః॥ 48
,, ఉద్ధర్తుమఖిలాన్ లోకాన్ సంసారాంబుధిమధ్యతః।
కాలే కాలే పరంజ్యోతిర్యస్సందర్శయతే స్వయం॥ 49

తా॥ అనంతరము హరిహరదేవుడు నివసించు తుంగభద్రాతీరమును వాడు చేరెను. అచ్చటి హరిహరుడు సుందరాకారుడు. అతని బాహువులు యుగమునకొకపర్యాయము క్రిందపడి క్రొత్తవిగ మొలచుచుండును. అతనిని దర్శించినవారు స్వర్గభోగమును అనుభవించి మోక్షమును జేరుదురు. దాని సమీపమున శ్రీశైలమను క్షేత్రమొకటిగలదు. అందు పార్వతీవల్లభుడగు మల్లినాథుడు జనులను సంసారసాగరమునుండి కాపాడగోరి అప్పుడప్పుడు తన జ్యోతిస్స్వరూపమును ప్రకటించుచున్నాడు.

శ్లో॥ అవలోకయతాం న్నాణాం యమనుస్మరతామపి।
దూరే తిష్ఠంతి సంత్రస్తాః తేషాం నిరయయాతనాః॥ 50

తా॥ అతనిని దర్శించువారు యమయాతనలనుండి తప్పించుకొనుచున్నారు.

శ్లో॥ స్వర్గే లోకే సుఖం భుక్త్వా ముక్తసంసారబంధనాః।
ముక్తిం చ ప్రతిపద్యంతే మానవా నాత్ర సంశయః॥ 51

తా॥ వారు సంసారబంధమును వీడి మోక్షమును చేరుచున్నారు.

శ్లో॥ రామోఽస్తి సానుజస్సార్ధం జానక్యా చ తతో గతః।
తత్ర స్నాత్వా చ పీత్వా చ ముచ్యతే నరకాద్ధ్రువం॥ 52

శ్లో॥ తతో నివృత్య చాయాతః పశ్యన్ భీమరథీ తటే।
ద్విభుజం విఠ్ఠలం దేవం భక్తిముక్తిప్రదాయకం॥ 53

తా॥ అచ్చటనున్న సీతాలక్ష్మణసమేతుడగు రాముని దర్శించి సూతుడు విఠ్ఠలదేవుడుండు భాగీరథీతీరమున జేరుకొనెను. ఆ తీర్థమున స్నానపానములు చేయుమానవుడు నరకము నుండి బయటబడుచున్నాడు. విఠ్ఠలదేవుడు రెండుభుజములుగలవాడు భక్తిముక్తుల నిచ్చువాడు.

శ్లో॥ యత్ర గోదావరీ జన్మస్థానం బ్రహ్మగిరిర్మహాన్।
గౌతమాలయమాశ్రిత్య యత్రాస్తే త్ర్యంబకో హరః॥ 54

,, అరుణారుణయోర్మధ్యే యత్ర గోధావరీ నదీ।
తత్ర స్నాత్వా చ పీత్వా చ బ్రహ్మహత్యా విలీయతే॥ 55

తా॥ పిమ్మటవాడు గోదావరీ జన్మస్థానమగు బ్రహ్మగిరిని జేరెను. అచ్చటనుండు గౌతమాశ్రమమున త్ర్యంబకేశ్వరుడున్నాడు. దానిప్రక్కననున్న అరుణారుణ పర్వతముల మధ్య గోదావరి ప్రవహించుచున్నది. అచ్చటస్నానపానములుచేసిన బ్రహ్మహత్యాపాపము తొలగిపోవును.

శ్లో॥ అసంఖ్యతీర్థసంపన్నం దృష్ట్వా బ్రహ్మగిరిం నరాః।
ముక్తిమేవ ప్రపద్యంతే ముక్తాః సంసారబంధతః॥ 56

,, గౌతమ్యుభయతీరస్థ తీర్థాన్వేషణకౌతుకీ।
తతో జగామ సూతస్తు మధురాం పాపనాశినీం॥ 57

తా॥ రథచోదకుడు అనేక తీర్థములతో కూడిన బ్రహ్మగిరిని దర్శించి సంతసమొంది మధురానగరమునకు వెళ్ళెను.

శ్లో॥ యత్ర స్వాయంభువం దేవం భజంతి సురమానవాః।
ఆద్యం భగవతః స్థానం మహన్ముక్తిప్రదాయకం॥ 58

,, త్రైలోక్యేశ జనిస్థానం విఖ్యాతం వేదశాస్త్రయోః।
నానాదేవ గణైర్జుష్టం ద్విజర్షి గణసేవితం॥ 59

,, కాళిందీకూలసంశోభి హ్యర్ధచంద్రప్రభాకృతి।
సర్వతీర్థనివాసైక పూర్ణమానందసుందరం॥ 60

,, గోవర్ధనగిరిప్రఖ్యం పుణ్యద్రుమలతావృతం।
ద్విషడ్వనం మహాపుణ్యవిశ్రాంతిశ్రుతిసారభృత్॥ 61

తా॥ అచ్చట నరులును దేవతలును పరమశివుని పూజించెదరు. అది నారాయణుని జన్మస్థానమని వేదశాస్త్రములయందు ప్రఖ్యాతిగాంచియున్నది. యమునాతీరముననుండు నానగరము అర్ధచంద్రాకారమై ప్రకాశించుచున్నది. సర్వతీర్థములును ఆ యమునయందుగలవు. ఆ నగరము పూర్ణానందదాయకము. దానిసమీపమున గోవర్ధనమను పర్వతమును బృంధయను నొకవనమునుగలవు. వేదాంత బోధ్యుడగు మహావిష్ణువు అచ్చట నివసించియుండెను. దానిచేత ఆ ప్రదేశములు మిగుల పావనములై దర్శించువారికి సుఖమును కలిగించుచున్నవి.

శ్లో॥ తతః కాశ్మీరనగరమపశ్యత్ ప్రత్యగుత్తరం।
దృష్ట్వా ధర్మధురం క్షేత్రం కురుక్షేత్రం సమంతతః॥ 62

,, యత్రాభ్రంలిహమేఘానాం పంక్తయః శంఖపాండురాః।
తా జాతా ధూర్జటేః స్పష్ట అట్టహాసదశా ఇవ॥ 63

,, స్వః సింధోః పతితానీవ హేతుపద్మాని మారుతైః।
యత్ర ప్రాసాదశిఖరేనీలపట్టపతాకికాః॥ 64

,, శైవాలవలయా భాంతి స్వస్సింధోర్లతికా ఇవ।
యత్ర కాశ్మీరమాశ్రిత్య నిత్యం వసతి భారతీ॥ 65

,, నోచేద్యుగపదేవేదం కథం లిఖతి వాఙ్మయమ్।
విశ్రామంత్యాః సరస్వత్యాః చిరం యత్ర మదాలసాః।
మృణాలచంచవో హంసా వాహనాని చరంత్యమీ॥ 66

తా॥ అచ్చటనుండి వాడు ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమునుచూచుకొని కాశ్మీరదేశమునకు వెళ్ళెను. ఆ దేశము ఉత్తరముననున్నది. తెల్లనిమేఘములు అచ్చట నాకాశమున ఎగురుచుండును. అవిచూచువారికి ఈశ్వరుని అట్టహాసములని శంకను కలిగించుచున్నవి. గృహముల పైభాగముల యందు సౌందర్యమునకై సువర్ణపద్మములను అమర్చియుందురు. ఆకాశగంగనుండి పడియుండునని వాటిని చూచువారు అనుకొనెదరు. నీల పతాకలు ఆకాశగంగలోని పచ్చని నీటితీగలో యనునట్లు ఆ నగర సౌధములయందు విలసిల్లుచుండును. అనగరమున ననేక కావ్యశాస్త్రజ్ఞులు పెక్కు కావ్యాదులనురచించుటజూచి సరస్వతీదేవి ఆదేశమున నిత్యవాసముచేయుచున్నట్లుదోచును. అనేక రాజహంసలు ఆదేశమంతట తిరుగుచుండుటయు ఈ యూహకు కారణమగుచున్నది. అవి సరస్వతీ వాహనములు. వాహనములు కనబడుటనుజూచి లోకములో దానియజమానుడక్కడ తికానావేసి యున్నాడని తెలిసికొనుచున్నారు గదా?

శ్లో॥ కలావిశేషం ప్రహితా యత్ర బోద్ధుం విరించినా।
తారా ఇవ విరాజంతే హంసా యాతాస్సమంతతః॥ 67

తా॥ ఆ దేశపు కలాసంపదను తెలియగోరిన బ్రహ్మదేవుడు తనవాహనములను పంపియుండెనాయను సందేహమును కలిగించుచూ రాజహంసములు సర్వత్ర సంచరించుచుండును.

శ్లో॥ ఉపన్యాసైర్ద్విజాతీనాం యత్ర న శ్రూయతే స్ఫుటం।
మూకోఽపి నిర్ఝరో వాచా పదకల్లోలడంబరః॥ 68

,, యస్మిన్నధ్వరధూమేన వ్యాప్తం నగరమండలం।
అపి చ క్షాలితం మేఘైః కాలిమానం న ముంచతి॥ 69

,, జన్మాభ్యాసవశేనైవ పఠంతి వటవస్స్వయం।
యత్రోపాధ్యాయసాన్నిధ్యమాశ్రిత్య సకలాః కలాః॥ 70

,, యత్ర బ్రాహ్మణపత్నీనాం కంకణధ్వనిహుంకృతిః।

లుంపత్యనుదినం భ్రామ్యద్భ్రమరాణాం చ గర్జితం॥ 71

శ్లో॥ యత్ర బ్రాహ్మణపత్నీనాం కపోలఫలకం ముహుః।
స్పృశన్ సమీరణో వాతి మందం శాపభయాదివ॥ 72

తా॥ అనగరమున బ్రహ్మజ్ఞానులు బ్రహ్మమునుగురించి సంతతముపన్యసించుచుందురు. ఆ నగరము సరస్వతీ నివాసస్థానమగుటచే అందలి మూగవారును వాచాలకులై ప్రకాశింతురు. అందు యాగహోమము లనవరతము జరుగుచుండును. వాటినుండి వెడలిన పొగ యాకసమును కప్పియుండును. మేఘములు వర్షించినను నాకాశము ధూమములచే వ్యాపించబడి నల్లగనేయుండును. అచ్చట బ్రహ్మచారులు పూర్వజన్మసంస్కారముచేతనే చదువుకొనెదరు. వారు నిమిత్తమాత్రముననే యధ్యాపకుల సాన్నిధ్యమును పొందియుందురు. ఆ దేశమున సుందర బ్రాహ్మణస్త్రీల సుమనోహర కంకణధ్వని తుమ్మెదలధ్వనిని అణచివేయును. ఆ స్త్రీరత్నముల కపోలములను వాయువు శాపభయముచే మెల్లగనే స్పృశించుచున్నాడు. అనగరమున యాగాగ్ని మిక్కుటముగ ప్రజ్వలించుటచేత అమృతమయుడగు చంద్రుడు కరిగి కళంకవంతుడగుచున్నాడు.

శ్లో॥ మాణిక్యేశ్వరనామాసౌ యత్ర శీతాంశుశేఖరః।
వసత్యనుదినం దేవో వరదానాయ దేహినాం॥ 73

,, అర్చితో భూపతీన్ జిత్వా మణికేశేన చాదృతః।
మాణిక్యేశ్వర ఇత్యాఖ్యాం తదా ప్రభృతి యో దధౌ॥ 74

,, రాజ్ఞా కాశ్మీరదేవేశ దిగ్జయోత్సవకారిణా।
అసౌ సుపూజితో యస్మాత్ మాణిక్యైర్భూరి భూతిభిః॥ 75

తా॥ ఆ దేశమున పరమశివుడు మాణిక్యేశ్వరుడను పేరుతో ప్రాణిసామాన్యముయొక్క మేలునుగోరి నివసించుచున్నాడు. ఒకప్పుడు ఆ నగరాధిపతియగు మణికేశుడు తన శత్రువుల నందర నోడించి తనజయమంతయు పరమశివుని కరుణాకటాక్షముచేతనే సిద్ధించినదని తెలిసి ఆదేవుని మాణిక్యములతో పూజించెను. అప్పటినుండి యాదేవునికి మాణిక్యేశ్వరుడని పేరు కలిగినది.

శ్లో॥ సంసేవమానం తద్వారి ఛాయాం శకటికోపరి।
కండూయమానమంగాని యంతా రైక్వమపశ్యత॥ 76

తా॥ ఇట్లనేక దేశములను తిరిగి తుదకు కాశ్మీరమునుజేరి సూతుడు ఈ సుప్రసిద్ధ దేవతాయతనమును ప్రవేశించబోయెను. అప్పుడాదేవాలయద్వారమున నొకమనిషి సూతునికంటి కగుపడెను. అతడు లోకాతీతుడుగ చూచుటకు కనబడెను. తనచుట్టుజరుగుచున్న వాటిని గురించి అతడు విచారించునట్లు కనబడలేదు. వాడెచ్చటనో మనస్సును నిలిపి ఒక బండిమీదికెక్కి తన ఒంటిని గీచుకొనుచుండెను.

శ్లో॥ రాజ్ఞాపి కథితైస్తైస్తైశ్చిహ్నైః పరిచితైర్గవాత్।
ప్రణతః సారథీ రైక్వం ప్రణమ్య తమభాషత॥ 77

,, కస్మిన్ బ్రహ్మన్ కిన్నామాసి స్వచ్ఛందోఽసి నిరంతరం।
కిమర్థమత్ర విశ్రాంతః కించ కర్తుం చికీర్షసి॥ 78

తా॥ ఆలయద్వారమున విశ్రమించియుండిన యావిలక్షణమనుష్యుడే రైక్వుడని రాజు చెప్పియుండిన గురుతులచే సారథికనుగొని అతనిదరిజేరి, స్వామీ! తామెవరు? ఏల ఇట్లు లోక మర్యాదను దాటి స్వచ్ఛందులుగ నిచ్చట విశ్రమించియున్నారు? మీరేమిచేయదలచుచున్నారు? అని వినయముతో ప్రశ్నించెను.

శ్లో॥ ఇత్యాకర్ణ్య చ తద్వాక్యం పరమానందనిర్భరః।
స్మృత్వా సారథిమిత్యూచే వయం పూర్ణమనోరథాః॥ 79

,, పరం కేనాపి బహునా పరిచర్యా విధాయినా।
భవితవ్యం మనోవృత్తిం జానతాఽస్మాకమేవ హి॥ 80

తా॥ ఇతని మాటలను వినిన రైక్వుడు ఇతనిరాకకు కారణమును జ్ఞాననేత్రముచే కనుగొని సంతసమంది అయ్యా! మేము పూర్ణమనోరథులము, నిష్కాములము, ఒకఫలము నుద్దేశించి మేమిట్లు వర్తించుటలేదు. మాస్వభావమది. నా యథావస్థిత స్వరూపమును తెలియ గోరినయెడల మిక్కిలి పరిచర్య చేయవలయును. అప్పుడే నా స్వరూపముగోచరించును. అని సమాధానమొసంగెను.

శ్లో॥ హృదయస్థితమాదాయ రైక్వాభిప్రాయమాదరాత్।
శనైర్నిరగమద్యంతా యత్రాస్తే వసుధాధిపః॥ 81

,, తతః ప్రణమ్య భూపాలం యథావృత్తం న్యవేదయత్।
బద్ధాంజలిపుటో హృష్టః సారథిస్స్వామిదర్శనాత్॥ 82

తా॥ రైక్వుని యాశయమెరిగి సారథి అతనివద్ద సెలవుపొంది రాజున్నచోటికిచేరెను. చిరకాలమునకు రాజునుచూచుటచే సంతోషపడి నమస్కరించి అంజలిజోడించి తనయనుభవ మంతయు వెల్లడించెను.

శ్లో॥ తతో నిశమ్య తద్వాక్యం విస్మయస్మేరలోచనః।
శ్రద్ధాలురభవద్భూపః రైక్వసంభావనావిధౌ॥ 83

,, ఆదాయాశ్వతరీయుగ్మయుక్తం శకటికామగాత్।
ముక్తాహారదుకూలాని సహస్రం చ గవాం నృపః॥ 84

,, గతోఽసౌ తత్ర యత్రాస్తే యోగీ కాశ్మీరమండలే।
సన్నివేద్య పురో రాజా దండవత్పతితో భువి॥ 85

తా॥ రైక్వుని వైరాగ్యసంపత్తిని ఆత్మజ్ఞానమును వినిన రాజునకట్టి మహానుభావుని దర్శించి బాగుపడవలెనని కోరికజనించెను. అతడు ముత్యాలహారములను పట్టువస్త్రములను గోసహస్రమును తీసుకొని శ్రేష్ఠాశ్వములుకట్టిన శకటమునెక్కి రైక్వుని సన్నిధానముజేరెను. దూరమున నే బండినుండి క్రిందకుదిగి వినయముతో సాష్టాంగ నమస్కారమాచరించి తానుదెచ్చియుండిన వస్తువులను కానుకగా గైకొనవలయునని వేడుకొనెను.

॥ రైక్వో రాజ్ఞే చుకోపహ।
హే శూద్ర మామకం వృత్తం న జానాసి దురీశ్వర॥ 86

శ్లో॥ గృహాణ శకటీమేతాముక్తాప్యాశ్వతరీయుతాం।
వస్త్రాణి ముక్తాహారాంశ్చ గాశ్చ దోగ్ధ్రీరపిస్వయం।
ఇత్థమాజ్ఞప్తవాజ్ఞా భూపం రైక్వేణ భయమాదధే॥ 87

తా॥ అదిచూచి రైక్వుడు కోపగించెను. ఓ జ్ఞానవిహీనా! నీవు ఐశ్వర్యముచే మదించి యున్నావు. నీవు గర్వముచే మహాత్ముల అమూల్యములగు ఆత్మజ్ఞానవైరాగ్యములను రత్నములతో నీ నశ్వరద్రవ్యమును పోల్చుచున్నావు. ఇట్టి నీ యాచరణ మహాపాతకము. ఇది మహాత్ముల కోపమును పెంపొందించును. ఇప్పుడే నీ వస్తువులను దూరీకరించుము. నా వృత్తాంతమును నీ వెరుగవు. అని ఆజ్ఞాపించెను.

శ్లో॥ తతః శాపభయాద్రాజా తత్పదాంభోరుహద్వయం।
గృహ్ణన్ భక్త్యా ప్రసీదేతి బ్రహ్మన్నిత్యాబివాన్ స్వయం॥ 88

,, భగవంస్తవ మాహాత్మ్యమేతదత్యద్భుతం కుతః।
ప్రసన్నీభూయ భగవన్నాఖ్యాహి మమ తత్వతః॥ 89

తా॥ రాజు మహర్షి తన యపరాధమునకు శపించునేమోయని భయపడి అతని పాదములపడి స్వామీ! మన్నించవలయును. తమ మాహాత్మ్యము తెలియక నే నిట్లు చేసితిని. దయచేసి తమ మాహాత్మ్యమును నాకు తెలుపవలయును అని ప్రార్థించెను.

శ్లో॥ గీతానాం షష్ఠమధ్యాయం జపామి ప్రత్యహం నృప।
తేనైవ తేజోరాశిర్మే సురాణామపి దుస్సహః॥ 90

,, గీతానాం షష్ఠమధ్యాయం రైక్వాదభ్యస్య యత్నతః।
జానశ్రుతిర్మహీపాలః ముక్తిమాప తతస్సుధీః॥ 91

తా॥ ఓ రాజా! నేను గీతయొక్క ఆరవయధ్యాయమును ప్రతిదినము జపించుచున్నాను. అదియే దేవతలకును దుస్సహమగు నా తేజంబునకు కారణము. గొప్ప వైరాగ్యజ్ఞానములును నాకు దానిచేతనే కలిగినవి. అని రాజు ప్రార్థనమునకు సంతోషించి శాంతముతో రైక్వుడు ఉత్తర మొసంగెను. చిరకాలము వినయముతో గురుశుశ్రూషచేసి జానశ్రుతిరాజు తేజోవర్ధకమగు నా యారవ యధ్యాయమును రైక్వునివలన నేర్చుకొనెను. తదభ్యాసముచే నతడు మోక్షసుఖమును బడయగలిగెను.

శ్లో॥ రైక్వోఽపి సుఖమాలేభే మాణిక్యేశ్వరసన్నిధౌ।
గీతానాం షష్ఠమధ్యాయం జపన్మోక్షప్రదాయకం॥ 92

,, మరాళవేషమాస్థాయ వరదానార్థమాగతాః।
దివౌకసోఽపి నిర్జగ్ముః స్వైరం విస్మయకారిణః॥ 93

తా॥ పిదప రైక్వుడును మాణిక్యేశ్వరుని సన్నిధానమున గీతాషష్ఠాధ్యాయ జపమును చేసి నిత్యసుఖముబడసెను. ఇది యంతయుచూచి హంసవేషము ధరించివచ్చిన దేవతలు మిగుల నాశ్చర్యముజెంది తమ స్థానమునకు మరలిరి.

ఓమ్

# సప్తమాధ్యాయ మాహాత్మ్యము

శ్రీభగవానువాచ — భగవంతుడు చెప్పినది.

శ్లో॥ అథ తే వర్ణయిష్యామి సప్తమాధ్యాయగౌరవం ।
యదా కర్ణస్య సుధాపూరపూర్తిర్భవతి కర్ణయోః ॥ 1

తా॥ నేనిప్పుడు నీకు దేనిని వినుటచే చెవులకు అమృతప్రాయముగనుండునో, అట్టి సప్తమాధ్యాయ గౌరవమును తెలుపబోవుచున్నాను.

శ్లో॥ అస్తి పాటలిపుత్రాఖ్యం నగరం తుఙ్గగోపురం ।
తత్రాభూద్బ్రాహ్మణో నామ శంకుకర్ణో దయార్ణవః ॥ 2

తా॥ పాటలీపుత్రమను నగరమొకటి కలదు. అందున్నతమైన గోపురములుండెను. ఆ నగరమునందు దయావంతుడగు ఒక బ్రాహ్మణుడుండెను. వానిపేరు శంకుకర్ణుడు.

శ్లో॥ వైశ్యవృత్తిం సమాసాద్య ధనమార్జితవాన్ బహు ।
పితౄన్న తర్పయామాస పూజయామాస నో సురాన్ ॥ 3

తా॥ వాడు బ్రాహ్మణవృత్తిని వదలిపెట్టెను. వానికి ధనాశమెండుగనుండెను. వాడు మిక్కిలి ధనమును సంపాదించగోరి దానికి వైశ్యవృత్తియే తగినవృత్తియనియెంచి దానినవలంబించెను. దేవతారాధనను పితృతర్పణమునుకూడ తన కర్తవ్యమని తలంచక వదలివైచెను.

శ్లో॥ పార్థివాన్ భోజయాంచక్రే ధనార్జన పరాయణః ।
తురీయపాణిగ్రహణం మంగలార్థం గృహాంతరే ॥ 4

తా॥ తాను ధనము సంపాదించుటకు రాజులను భుజింపజేసెను. వారికి కావలసిన సౌఖ్యములను చేకూర్చియిచ్చెను. ధనాశచే నతడు ఒక శూద్రుని కూతురితో పెండ్లిసైతము చేసుకొనెను.

శ్లో॥ తనుజైర్బంధుభిస్సార్ధం సంప్రవృత్తస్తే కదాచన ।
రజన్యాం ధర్మకల్పాయాం నిద్రాలోస్తస్య దోస్తలే ॥ 5

శ్లో॥ దశతి స్మ సమాగత్య దందశూకః కుతశ్చన ।
స దష్టమాత్రోఽసాధ్యాత్మా మణి మంత్రౌషధాదిభిః ॥ 6

శ్లో॥ క్షణైః కతిపయైరేవ గతాసురభవత్తతః ।

తా॥ వాడు ఒకనాడు తన బంధువు ఇంటజరుగు మంగళోత్సవమునకుగాను, బంధుమిత్ర పుత్రులతోచేరి నగరాంతరమునకు వెళ్లుచుండెను. మార్గమధ్యమున సూర్యుడు అస్తమించెను. ఆ రాత్రి కాళరాత్రివలె కారుమబ్బులతోకూడి భయంకరమైయుండెను. తదుపరి వారు నడువలేక ఒకచోట నిలిచి నిద్రించనారంభించిరి. అప్పుడు నిద్రించుచున్న శంకుకర్ణుని ఎచ్చటనుండియోవచ్చి

ఒక పాము కరచివేసెను. వానికి విషమెక్కకుండుటకు ఎన్నియో మంత్రములు వేసిరి. అనేక ఔషధములను తినిపించిరి. కాని లాభములేకపోయెను. వానిని మరణమునుండి తప్పించలేక పోయిరి. కరచిన కొన్ని నిముషములకు వాడు మరణించెను.

పిచుమందదలై ర్నాలైరవగుంఠితవిగ్రహం ॥ 7
శ్లో॥ తమారోప్య తరుస్కంధే సూనవో గృహమాయయుః ॥ 8

తా॥ అతని కుమారులు అతని దేహమును వేపాకులచేతను, వాటి కాడలచేతనుకప్పి అచ్చటనున్న చెట్టుయొక్క స్కంధముననే ఆ కళేబరమునుంచి ఇంటికి వెళ్ళిరి.

శ్లో॥ తతః కాలేన బహునా తతో జాతః సరీసృపః ।
తద్వాసనానిబద్ధాత్మా జన్మ పూర్వమనుస్మరన్ 9

,, వంచయిత్వా గృహానేతాన్ పూరయామి గృహోద్వహిః ।
ఆత్మనః కోటిసంఖ్యాకం యత్రాస్తే స్థాపితం వసు ॥ 10

తా॥ అనన్తరము చిరకాలమునకు శంకుకర్ణుడు సర్పజన్మమెత్తెను. పూర్వజన్మపు ధనాశ అతనియందు సంస్కారరూపమున నిలిచియుండెను. దానిచే వానికి ధనమున్నచోటికి వెళ్ళవలెనని ఆశ ఉదయించెను. దానికనుగుణముగ తన ఇంటివారిని బయటపంపుటకు నిశ్చయించెను. లేని యెడల తానచ్చటుండుటకు వీలుపడదుకదా! తాను ముందు ధనమును పెట్టివచ్చిన తన ఇంటికిపోయి చేరుకొనెను.

శ్లో॥ తతో నారాయణబలిం శ్రద్ధయా పరయాఽన్వితః ।
కృతవంతః పరే తస్య సూనవో హి ద్విజన్మనః ॥ 11

తా॥ అతని కుమారులు మరణించిన తన తండ్రికి చేయవలసిన నారాయణబలి మున్నగు ఉత్తరక్రియలను మిగుల శ్రద్ధతోచేసిరి.

శ్లో॥ ఏకదా స్వప్నమాగత్య పీడితః సర్పజన్మనా ।
అభాషయన్మనోవృత్తం పుత్రాణామగ్రతః పితా ॥ 12

తా॥ ఒకనాడు పుత్రులు నిద్రించుచుండ శంకుకర్ణుడు సర్పరూపముతో వారిస్వప్నములో కనబడి పుత్రులారా! నేను మీ తండ్రిని. ముందు నా ధనమంతయు నీ గృహ ఈశాన్య మూలలోపెట్టి చనిపోయితిని. అనేక జన్మములెత్తినను నా ధనాశనన్ను వీడలేదు. నేనిప్పుడు నా ధనమున్న ప్రదేశమునుజేరి దానినిచూచి ఆనందించుచున్నాను. మీ రిచ్చటుండిన నా భద్రతకు లోటుకలుగును. కావున మీరు ఈ ఇల్లువదలిపోవలయును. అని తన మనోభిలాషనుతెలియచేసెను

శ్లో॥ తతస్తే ప్రాతరుత్థాయ పరం విస్మయమోహితాః ।
ఇతరేతరమాఖ్యాయ పర్యంతస్తే నిరంకుశాః ॥ 13

తా॥ వారు తెల్లవారి నిద్రనుండిలేచిరి. లేచి ఒకచోటచేరి తాము రాత్రి స్వప్నమున చూచిన ఆశ్చర్యమగు తమ తండ్రి వృత్తాంతమును వారువారు చూచినట్లు కొంచెమైనను విడువక అన్యోన్యము చెప్పుకొనిరి.

శ్లో॥ ఏకస్తత్ర పితృస్నేహాత్ ఉద్ధర్తుమపి వాంఛతి।
అన్యో ద్రవిణలోభేన నిహంతుం సర్పమీహతే॥ 14

తా॥ వారిలో మొదటివాడు తండ్రియందు మిగుల భక్తివిశ్వాసముగలవాడు. మనము వెళ్ళిపోయెదము. లేనిచో సర్పరూపముననున్న మన తండ్రిగారికి ఇబ్బందికలుగును. వారిని సుఖపరచుట పుత్రులగు మనకు కర్తవ్యము అనిచెప్పెను. మధ్యముడు తండ్రివలె ధనాశగలవాడు. వాని మనస్సున ఎట్లైనను తండ్రి సంపాదించిపెట్టియున్న ధనమును గైకొనవలెనని కోరికపుట్టెను. వాడు ఆ ధనమును వశపరచుకొనునప్పుడు ఆ తండ్రియగు సర్పముచే ఏదైన అడ్డంకు ఏర్పడునని ఎంచి దానిని చంపివేయుటకు సైతము తీర్మానించుకొనెను.

శ్లో॥ ఇతరస్తు పితృస్నేహరసమోహితమానసః।
కిం వా అహిమయోనస్స్యాత్ శోచఞ్ రోదితి కేవలం॥ 15

తా॥ మూడవవానికి తండ్రియనిన మిగులప్రేమ. వాడందరికన్న చిన్నవాడు. వానికి. పసితనము ఇంకను వెళ్ళియుండలేదు. వాడు తండ్రికి సర్పరూపముకలిగియున్నది. అను విషయమును తెలిసికొన్నదిమొదలు వేరుతలంపులేక అన్నిపనులను విడిచిపెట్టెను. వానికేదియు తోచలేదు. వాడు హా యనిఏడ్వసాగెను.

శ్లో॥ మధ్యమస్తు తతః పుత్రో వంచయిత్వా సహోదరౌ।
కేనాపి ఛద్మనోత్థాయ జగామ నిజమాలయం॥ 16

తా॥ రెండవవాడు తనకోరికను నెరవేర్చుకొనదలంచెను. వాడు ఇతరులకు తన అభిలాషను తెలియజేయలేదు. తెలియజేసిన వారు ఒప్పుకొనరు, లేదా భాగమునకు వచ్చెదరు అనివాడు తలంచెను. అందుచేవాడు తన మనోరథమును తెలుపలేదు. ఏదోసాకుచెప్పి తానొక్కడే తన ఇల్లు చేరుకొనెను.

శ్లో॥ తతశ్శనైస్సమాహూయ గృహిణీం గుణశాలినీం।
కుద్దాలహస్తో నిరగాద్యత్రాస్తే పన్నగః పితా॥ 17

తా॥ వాడు తన ఇల్లుచేరి గుణశాలియగు తనభార్యను తాబోవుకార్యమున తనకు సహాయముగ రమ్మనికోరెను. అప్పుడు ఆ రమణి దానికి సమ్మతించి అతనిని వెంబడించెను. వారిరువురు మట్టిని త్రవ్వు సాధనములను తీసుకొని ఆ సర్పమున్నచోటును చేరిరి.

శ్లో॥ తేనావిదితవిత్తేన చిహ్నైర్నిశ్చిత్య తత్త్వతః॥
స్థానమాగత్య తం హంతుం వల్మీకం లోభబుద్ధితః॥ 18

తా॥ అతనికి ఫలానప్రదేశమున ధనమున్నదనితెలియదు. కాని కొన్నిచిహ్నములచేత పామునివసించు ప్రదేశమును కనుగొనెను. ఆ ప్రదేశమునుచేరి లోభబుద్ధిచేత ఆ పాము పుట్టను ధ్వంసముచేయ మొదలిడెను.

శ్లో॥ భార్యయోత్సార్యతే మృత్స్నా స్వయం తేన చఖన్యతే।
నిహన్యమానాదత్యుగ్రో వల్మీకాదహిరుత్థితః 19

శ్లో॥ తతో గరళగండూషై ర్నిర్గతై రతిదుస్సహైః।
గిరస్స కథయాంచక్రే ఫణీ ఫూత్కారమారుతైః॥ 20

తా॥ వాడు పుట్టనుపాడుచేసి త్రవ్వ నారంభించెను. అతని భార్య వాడు త్రవ్వుచుండ మట్టినితీసి దూరముగావేయుచుండెను. ఇట్లు వీరు త్రవ్వనారంభించిన కొంతసేపటికి ఆ పుట్టనుండి అత్యుగ్రమగు సర్పము బయలుదేరెను. అది బుస్సుమని బుసగొట్టి దుస్సహమగు విషమునుగ్రక్కి కోపముతో వానితోనిట్లనెను.

అహిరువాచ — పాము చెప్పుచున్నది.

శ్లో॥ కస్త్వం కిమర్థమాయాతః కుతో వా ఖన్యతే బిలం।
కేన వా ప్రహితో మూఢ తదాఖ్యాహి మమాగ్రతః॥ 21

తా॥ ఓ మూఢా! నీవెవరు? ఇచ్చట నేనుండుచోటునకు ఎందుకువచ్చితివి? నిన్నెవరు పంపినారు? నీవెందులకు నా గృహమును పాడుచేయుచున్నావు? అని అతనిని ప్రశ్నించెను.

పుత్రఉవాచ — పుత్రుడు చెప్పెను.

శ్లో॥ పుత్రస్తేఽహం శివో నామ హేమగ్రహణకౌతుకీ।
ఆగతో రాత్రిలబ్ధస్య స్వప్నస్య చ సువిస్మితః॥ 22

తా॥ అయ్యా! నేను మీ పుత్రుడను. నాపేరు శివుడు. రాత్రి కలిగిన స్వప్నముచే ఇచ్చట బంగారమున్నదనితెలిసి దానిని వశపరచుకొనగోరి ఇచ్చటికివచ్చి ఈ పనిని చేయుచున్నాను.

మహేశ్వర ఉవాచ — పరమశివుడు చెప్పెను.

శ్లో॥ ఇత్థమాకర్ణ్య పుత్రస్య గిరం లోకవిగర్హితం।
వక్తుమారభత స్పష్టాం హసన్నుచ్చైః ఫణీ తదా॥ 23

తా॥ పుత్రునిమాటలనువిని శంకుకర్ణునకు జ్ఞానోదయమయినది. వాడు ధనాశచెడ్డదని గ్రహించెను. ధనాశచే తన పుత్రులను వంచింపగోరినందులకు మిగుల దుఃఖపడెను. తన పుత్రుడు తన్ను ధనాశచేత చంపదలచిన వృత్తాంతముచే ధనాశపితాపుత్రులకుగల అవ్యాజప్రేమ మొదలుకొని అన్ని లోకమర్యాదలను త్రుంచివేయగలదని గ్రహించెను. దీనిచేకలుగు మనుష్యుని అధఃపతనమును ప్రత్యక్షముగ గ్రహించినవాడగుటచే దానినివిడిచి తన మనస్సును సతతము మంగళదాయకము పావనమునైన ముక్తిమార్గమువైపు త్రిప్పెను. వాడు తన కోపమును విడిచి ప్రసన్నుడై తన పుత్రునితో నిట్లనెను.

సర్ప ఉవాచ — సర్పము చెప్పెను.

శ్లో॥ యది పుత్రోఽసి మే తూర్ణం మామున్మోచయ బంధనాత్।
నిక్షేపార్థాయ సంజాతం పన్నగం పూర్వజన్మనః॥ 24

తా॥ నాయనా! నీవు నా పుత్రుడైనచో నా మీద నీకు పితృప్రేమయున్నచో నీవు ఒక పనిని చేయవలెను. నేను ధనాశచే తొలిజన్మమున ముక్తినొందక మరల భూలోకమున సర్పముగా పుట్టితిని. నేనిప్పుడు నా తప్పిదములకు మిగుల పరితపించుచున్నాను. నన్ను నీవు ఈ బంధము నుండి విడిపించి ముక్తినొందించవలెను. అనెను.

**పుత్ర ఉవాచ** — పుత్రుడు చెప్పెను.

శ్లో॥ పితః కథం తే ముక్తిః స్యాదిత్యాచక్ష్వ మమాగ్రతః।
పరిత్యక్త్వాఽఖిలం లోకమాగతోఽస్మి యథా నిశి॥ 25

తా॥ తండ్రీ! మీకు ముక్తి ఎట్లు సిద్ధించును? దానికి నేను ఏమిచేయవలెనో దానిని తెలిపిన నెరవేర్చు విషయమున నెన్నియాపదలువచ్చినను వాటిని నేను గణించక నెరవేర్చెదను. ఈ కారుచీకటియందు నేను భయమొందక నాలక్ష్యమును పొందుటకు ధైర్యముతో వచ్చితినిగదా? ఇట్లే మీ మాటను నెరవేర్చు విషయమున నడుచుకొనెదను.

**పితోవాచ** — తండ్రి చెప్పెను.

శ్లో॥ న తీర్థాని న దానాని న తపాంసి నచాధ్వరాః।
మాముద్మోచయితుం పుత్ర ప్రభవంతి చ సర్వదా॥ 26

,, గీతానాం సప్తమాధ్యాయమంతరేణ సుధామయం।
జంతోర్జరామృత్యుదుఃఖ నిరాకరణకారణం॥ 27

,, సప్తమాధ్యాయినం విప్రం మదీయే శ్రాద్ధవాసరే।
భోజయ శ్రద్ధయా పుత్ర తేన ముక్తిర్న సంశయః॥ 28

,, అన్యానపి ద్విజాన్ సర్వాన్ వేదవిద్యావిశారదాన్।
సంభోజయ యథాశక్తి పరమశ్రద్ధయాఽన్వితః॥ 29

,, ఇత్యాకర్ణ్య పితుర్వాక్యమురగత్వముపేయుషః।
తే సర్వే సూనవోఽకుర్వన్ యథాదిష్టం తతోఽధికం॥ 30

తా॥ వత్స! నేను మహాపాపిని. స్వధర్మములను వీడి పరధర్మమును గ్రహించితిని. నా పాపమునకు మేరలేదు. నా పాపమును తొలగించి నన్ను ముక్తినిచేర్చు సామర్థ్యము తీర్థస్నానములకైనను దానములకైనను తపంబులకైనను యాగములకైనను లేదు. అవి నన్ను బంధములనుండి విడిపించజాలవు. నన్ను కడతేర్చుశక్తి ఒక గీతాసప్తమాధ్యాయమునకేగలదు. మానవుల జన్మ జరామరణ వ్యాధులను తీర్చు ఔషధమదియే. కాన పుత్రరత్నమా! నీవు సప్తమాధ్యాయమును అనుదినము జపించు భూసురోత్తముని శ్రద్ధతో నాశ్రాద్ధదివసంబున భుజింపజేసితివేని నేను ముక్తిని బొందుదును. ఆ దినమునందు నీశక్తికొలది బ్రాహ్మణులను భుజింపజేయుము. అని తండ్రి చెప్పెను. అతని పుత్రులు ఆ మాటలను విని అతని మనోభీష్టమును బాగుగ నెరవేర్చిరి.

శ్లో॥ శంకుకర్ణస్తతః శ్రీమాన్ ఉత్సృజ్య తనుమౌరగీం।
కృత్వా విభాగం పుత్రాణాం దివ్యం దేహముపాదదే॥ 31

తా॥ పిదప శంకుకర్ణుడు తన ధనమంతయును ముగ్గురిపుత్రులకు పంచిపెట్టెను. అనంతరము అతడు భగవత్పాదారవిందమున తన మనస్సును నిలిపి సర్పదేహమును వదలి దివ్యస్థానమును చేరెను.

శ్లో॥ విభజ్య దత్తాం పిత్రా యద్ద్రవ్యం తత్కోటిసంఖ్యయా।
తేన తే సూనవస్సర్వే ముముదుస్సాధువృత్తయః॥ 32

శ్లో॥ వాపీకూపసరోయజ్ఞ దేవప్రాసాదగోపురాన్।
అన్నశాలాం ప్రకుర్వాణాః పుత్రాస్తే సాధువృత్తయః॥ 33

తా॥ ఆ పుత్రులు తండ్రి ఉపదేశముచే సుచరితులై తమకుక్రమప్రాప్తమయిన ధనమును అనేకరెట్లుపెంచి ఆధనమును బావులనుత్రవ్వియు, గుంటలనులోడియు, దేవాలయ గోపురములను నిర్మించియు, ఇట్లుపలువిధములగు లోకసేవజేసి వ్యయపరచి సంతోషపడిరి.

శ్లో॥ సప్తమాధ్యాయజపతో ముక్తిభాజోఽభవంస్తతః।
దేవమిష్టతమం జ్ఞాత్వా నిర్వాణార్పితబుద్ధయః॥ 34

తా॥ వారు సప్తమాధ్యాయమాహాత్మ్యమునెరిగినవారు కావున ఆ యధ్యాయమును జపించి భగవద్ధ్యానమును పొంది ముక్తిని బడసిరి.



ఓమ్

# అష్టమాధ్యాయమాహాత్మ్యము



శివఉవాచ — శివుడు చెప్పెను.

శ్లో॥ అష్టమాధ్యాయమాహాత్మ్యం శృణు వక్ష్యామి పార్వతి।
యస్య శ్రవణమాత్రేణ పరాం ముదమవాప్స్యసి॥ 1

తా॥ ఓ పార్వతీ! ఎనిమిదవ అధ్యాయముయొక్క మాహాత్మ్యమును ఇప్పుడు చెప్పబోవుచున్నాను. అదివినినమాత్రముచే నీకు మిక్కిలి సంతోషము గలుగును.

శ్లో॥ ఆమర్దకం పురం నామ్నా విశ్రుతం దక్షిణాపథే।
ద్విజనామ్నా భావశర్మేతి తత్రాసీద్గణికాపతిః॥ 2

తా॥ దక్షిణాపథమున ఆమర్దకమను ప్రసిద్ధనగరమున్నది. అందు భావశర్మయను బ్రాహ్మణుడొకడుండెను. వాడు వేశ్యాలోలుడై కాలము గడుపుచుండెను.

శ్లో॥ ఖాదన్మాంసం పిబన్మద్యం చోరయన్సాధుసంపదః।
రమమాణః పరస్త్రీభిరాఖేటకకుతూహలీ॥ 3

తా॥ వాడు తనజాతివృత్తిని విడిచిపెట్టెను. మాంసమును తినెను. కల్లును త్రాగెను. సాధువుల సంపదలనపహరించెను. పరస్త్రీలతో రమించెను. తనజాతికి ననుచితమగు వేటయందు ఎక్కువ అసక్తుడైయుండెను.

" అత్యవాహయదత్యుగ్రో గరీయాంసం మనోరథం।
సుహృదాం విటగోష్ఠ్యాం చ తాలీఫలసుధారసం॥ 4

" నిపీయ కంఠపర్యంతమజీర్ణేనాతిపీడితః।
మృతః కాలేన పాపాత్మా జాతస్తాలీతరుర్మహాన్॥ 5

తా॥ ఇట్లు వివిధములగు అకృత్యములను చేయుచు అభావశర్మ అతిక్రూరుడై మితిమీరిన తన మనోభిలాషను నెరవేర్చుకొనుచుండెను. అప్పుడప్పుడు మిత్రులతోనైన, విటులతోనైన కూడి మిక్కిలి కల్లును త్రాగుచుండుటవలన వానికి అజీర్ణరోగము ప్రారంభమాయెను. ఆబాధనోర్వలేక వాడుమృతినొందెను. వాడు తాటికల్లును మిక్కిలి ఆసక్తితోవాడుచున్నందున తాటిచెట్టుగా మరుజన్మమున జన్మించెను.

శ్లో॥ తస్య ఛాయాముపాశ్రిత్య నిబిడామతిశీతలాం।
అభూతాం దంపతీ కౌచిద్బ్రహ్మరాక్షసతాం గతౌ॥ 6

తా॥ ఆ చెట్టుయొక్కనీడ దట్టముగను చల్లగనుయుండెను. అందుచే బ్రహ్మరాక్షసరూపమును పొందిన ఇరువురు భార్యాభర్తలు ఆ నీడనుచేరి నివసించుచుండిరి.

దేవ్యువాచ — ఈ మాటలనువిని పార్వతిదేవి ఇట్లు అడిగెను.

శ్లో॥ కింజాతీయౌ కిమాత్మానౌ కిం వృత్తావిత్యుదీరయ।
కర్మణా కేన వా దేవ బ్రహ్మరాక్షసతా తయోః॥ 7

తా॥ స్వామీ! ఆ బ్రహ్మరాక్షసులు ఎవరు? వారు ఏ జాతిన జన్మించియుండిరి? వారి అసలు స్వరూపమేది? వారినడవడికయెట్టిది? వారికి ఏ పాపముచే ఇట్టి ఘోరబ్రహ్మరాక్షస స్వరూపము వచ్చినది? ఇది యంతయు మీరు సవిస్తరముగా నాకు చెప్పవలయును. అనిన అప్పుడు మహేశ్వరుడు పార్వతీ ప్రశ్నలకు సమాధానమివ్వగోరి ఇట్లనెను.

శివఉవాచ — శివుడు చెప్పెను.

శ్లో॥ వేదవేదాంగతత్త్వజ్ఞః సర్వశాస్త్రార్థకోవిదః।
సదాచారోఽభవత్కశ్చిద్ద్విజో నామ కుశీవలః॥ 8

తా॥ పూర్వము కుశీవలుడను బ్రాహ్మణుడొకడుండెను. అతడు మిగుల ఆచారపరాయణుడు. వేదములను శిక్షావ్యాకరణాది వేదాంగములను నేర్చియుండెను. ఇంతటితో నిలువక సర్వశాస్త్రములయందును పాండిత్యమును సంపాదించి ప్రకాశించుచుండెను.

శ్లో॥ జాయా చ తస్య కుమతినామధేయా దురాశయా।
స సభార్యో మహాదానాన్యాదదానోఽతిలోభవాన్॥ 9

తా॥ అతనిభార్యపేరు కుమతి. ఆమెపరిపక్వము చెందని దుర్హృదయముగలది. కుశీవలుడికి భార్యయందు మిగుల ఆశయుండెడిది. కాన వాడు తనభార్యను విడిచి అన్యత్ర ఉండడు. అందుచే వానికి మరియొకచోటికి వెళ్ళికి ధనార్జనచేయుటకు అవకాశములేకపోయెను. దానిచేతను, స్వభావముగ లోభగుణముగలవాడగుటచేతను వాడు పాపము సంభవించునే యని దిగులుచెందక మహాదానముల సైతము తీసుకొనుచుండెను.

శ్లో॥ మహిషీం కాలపురుషం హయాదీననువాసరం।
అప్యయచ్ఛన్ ద్విజాతిభ్యో దానలబ్ధాం వరాటికాం॥ 10

తా॥ మహాదానములను గ్రహించువారికి ఇచ్చువారి పాపములు వచ్చిచేరుచున్నవి. ఇది శాస్త్రార్థము. ఒకడు పిల్లిని చంపుచున్నాడు అని అనుకొందము. పిదప వాడు ఆ హత్యచే తనకేర్పడిన పాపములను తొలగించుకొనుటకుగాను బంగారముచేతనో, వెండిచేతనో ఒకపిల్లిని

నీర్మించి పుణ్యతీర్థతీరమున దానముచేసినయెడల ఆ పాపము అతనిని అంటక పిల్లినితీసుకొన్న వానినిచేరిపోవును. ఇట్లు ఆయాపాపములకు తగినట్లు ప్రతీకారములను శాస్త్రము విధించుచున్నది. ఇట్లే గ్రహించువానికి సంభవించు పాపములను తొలగించు మార్గముకూడ శాస్త్రము చెప్పుచున్నది. గొప్పదానములను తీయువాడు స్వపాపాపనోదార్థమై బత్తెను కాలపురుషుని గవ్వలను గుఱ్ఱము మొదలగువాటిని దినము ఇచ్చుచుండవలెను అని శాస్త్రములయందు చెప్పబడియున్నది. కాని కుశీవలుడు పరమలోభిగనుక బ్రాహ్మణులకు ఇటువంటి దానమును చేయలేదు.

శ్లో॥ కాలేన దమ్పతీ ప్రేతౌ బ్రహ్మరాక్షసరూపిణౌ ।
పర్యటంతౌ మహీమేతాం క్షుత్తృషాకులవిగ్రహౌ ॥ 11

తా॥ కావున అతనికి మరణానంతరము బ్రహ్మరాక్షసస్వరూపము కలిగెను. అతనిని ఆశ్రయించి అతడుతెచ్చిన దానవస్తువులను అనుభవించుటచే అతనిభార్యకును ఆ స్వరూపమేర్పడి నది. వారిని ఎల్లప్పుడు ఆకలి పీడించుచుండెను. దానిచే వారు మిగుల అలసిపోవుచుండిరి. ఒక ఆశ్రయములేక లోకమంతటా తిరుగుచుండిరి.

శ్లో॥ విశశ్రమతురాగత్య మూలం తాళీతరోస్తతః ।
కథమేతన్మహాదుఃఖమావయోరపగచ్ఛతి ॥ 12

శ్లో॥ కథం వా జాయతే ముక్తిః బ్రహ్మరాక్షసయోనితః ।
ఇతి పృష్టో గృహిణ్యాఽసౌ బ్రాహ్మణస్సమభాషత ॥ 13

తా॥ తిరిగితిరిగివారు కడకు తాటిచెట్టునీడనుచేరి విశ్రమించిరి. అప్పుడు బ్రహ్మరాక్షసి యగు అతనిభార్య నాథా! మనదుఃఖము ఎప్పుడు మనలను విడిచిపోవును? మనము బ్రహ్మ రాక్షసయోనినుండి ఎప్పుడు విడుదలపొందుదుము? అని అడుగగా అప్పుడు బ్రాహ్మణుడు మాట్లాడెను.

శ్లో॥ బ్రహ్మవిద్యోపదేశేన వినాఽధ్యాత్మవిచారణాత్ ।
వినా కర్మవిధిజ్ఞానాత్ కథం ముచ్యేత సంకటాత్ ॥ 14

తా॥ లోకములో సంకటమునుండి విముక్తినిగోరువాడు బ్రహ్మవిద్యోపదేశమును పొంది అధ్యాత్మవిచారణమొనరించి కర్మాకర్మలనెరిగి నిష్కామ కర్మయోగముననుండవలెను. మనము అతి ధనాశచే అధ్యాత్మ విచారముచేయక సత్కర్మలనాచరించక పాపకార్యములనుచేసి కాలము గడిపితిమి. ఇట్లుండ మనము ఎట్లు ఈ సంకటమునుండి తప్పించుకొనగలము? అని తన భార్య కుత్తరమిచ్చెను.

ఽవాచ:—

శ్లో॥ కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
ఏతావదుక్తే తత్పత్న్యా యదాశ్చర్యమభూచ్ఛృణు ॥ 15

,, అష్టమాధ్యాయశ్లోకార్థ శ్రవణాత్స తరుస్తదా ।
విహాయ తాళీరూపం తద్బభూవ ద్విజసత్తమః ॥ 16

తా॥ అప్పుడు అతనిభార్య - బ్రహ్మమనిననేమి? అధ్యాత్మమనిన ఏమి? కర్మపద మునకేమర్థము.? అని తనభర్తను ప్రశ్నించుచుండగా ఆశ్చర్యముగలిగెను. అదియేదనిన, అతని భార్యచే అష్టమాధ్యాయమునందలి ఒకశ్లోకార్థము ప్రశ్నసమయమున ఉచ్చరించబడినందున దానిని విని దానిమాహాత్మ్యముచే ఆతాటిచెట్టుగానుండిన బ్రాహ్మణుడు తన స్వరూపమును పొందెను.

శ్లో॥ సద్యో జ్ఞానవిధూతాత్మా విముక్తః పాపకంచుకాత్ ।
తన్మాహాత్మ్యాద్వినిర్ముక్తౌ దంపతీ తౌ బభూవతుః ॥ 17

తా॥ స్వస్వరూపమునుపొందినతోడనే అతనికి జ్ఞానముదయించెను. ఆజ్ఞానముచే అతని ఆత్మపవిత్రమాయెను. వానిపాపములు నశించినవి. బ్రాహ్మణునికి అభ్యుదయము కలిగినట్లు ఆ బ్రహ్మరాక్షసులకును బ్రహ్మరాక్షసస్వరూపమునుండి విడుదలయు ముక్తియు కలిగినవి.

శ్లో॥ ఏతావదేవ ముక్తం చ దైవాన్నిర్గత్య తన్ముఖాత్ ।
తతోఽన్తరిక్షాదాయాంతం క్వణత్కింకిణికం శుభం ॥ 18

,, దివి దివ్యాంగనావక్త్ర చంద్రమండలమండితం ।
అప్సరోవదనాంభోజ భ్రామ్యద్భ్రమరసంకులం ॥ 19

,, నిర్మథ్యమానదుగ్ధాబ్ధి వేలాడిండీరపాండురైః ।
గంగాతరంగసుభగైః చామరైరుపశోభితం ॥ 20

,, గాయద్గంధర్వసుభగం నృత్యత్సురవధూశతం ।
దివ్యం విమానమారుహ్య దమ్పతీ జగ్మతుర్దివం ॥ 21

తా॥ దైవానుగ్రహముచే గీతావాక్యమునుపల్కి ముక్తినిపొందిన ఆదంపతులకు ఆకాశమున ఒక సుందరవిమానము కనిపించెను. చుట్టున చిన్నగంటలతోకూడి శబ్దించుచున్న ఆవిమానమున అప్సరస్త్రీలు పలువురుండిరి. వారిముఖములను కమలములనియెంచి తుమ్మెదలు మకరందాభిలాషచే చుట్టియుండినవి. ఆ అప్సరసలు చామరహస్తులైయుండిరి. వారు చామరములను కదలించగా అవి చిలుకబడుచున్న పాలసముద్రమునుచేరు గంగానదియొక్క అలల ననుకరించుచుండెను. వీరేకాక కొందరు గంధర్వులు అందాసీనులై తమస్వాభావికమగు గానమునుచేయుచుండిరి. కొందరు దేవస్త్రీలు అందునృత్యము చేయుచుండిరి, ఈ విధముగా సుశోభితమైన ఆ విమానమును అధిష్ఠించి ఆ దంపతులు దివ్యస్థానమునకు వెళ్ళిరి,

శ్లో॥ అత్రత్యం వృత్తమఖిలమేతద్విస్మయకారకం ।
తతో లిలేఖ మేధావీ శ్లోకార్థమిదమాదరాత్ ॥ 22

తా॥ ఈ ఆశ్చర్యకరమైన వృత్తాంతమంతయు జూచిన భావశర్మ దీనికంతయు మూలము అష్టమాధ్యాయ శ్లోకార్థమేయనియెంచి దానినిజపించుటవలన మిక్కిలి శ్రేయంబుకలుగునని తలంపుచే దానిని వ్రాసిపెట్టుకొనెను.

శ్లో॥ యయౌ వారాణసీం నామ నగరీం ముక్తిదాయినీం ।
ఆరాధయితుమన్విచ్ఛన్ దేవదేవం జనార్దనం ॥ 23

తా॥ వాడు అనంతరము ఈ మంత్రజపముచే దేవదేవుడగు నారాయణుని పూజించగోరి కాశీనగరమునకు వెళ్ళెను.

శ్లో॥ స తత్ర కర్తుమారేభే తపః పరముదారధీః।
అత్రాంతరే జగన్నాథః దేవదేవో జనార్దనః॥ 24

తా॥ కాశీపురమునుజేరి వాడు మిక్కిలి కాయక్లేశములొనరించి తాను వ్రాసికొనిన గీతాష్టమాధ్యాయశ్లోకార్థమును జపించసాగెను.

శ్లో॥ పృష్టో దుగ్ధాబ్ధిసుతయా సంయోజ్య కరసంపుటం।
నిద్రాపథం విహాయైవ స్థీయతే కథ్యతామితి॥ 25

తా॥ ఆ సమయమున దేవదేవుడగు నారాయణుని హస్తమును గ్రహించి లక్ష్మీదేవి స్వామీ! ఏమది! 'మీరు ఈ సమయమున నిద్రించకయున్నారు. అని నారాయణుని అడిగెను. అది విని

శ్రీ భగవానువాచ — శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ కాశ్యాం భాగీరథీతీరే తపస్యతితరాం ద్విజః।
భావశర్మాఽతిమేధావీ మద్భక్తిరసపూరితః॥ 26

,, జపన్ గీతాష్టమాధ్యాయశ్లోకార్థం నియతేంద్రియః।
సంతుష్టవానహం దేవి తదీయతపసా భృశం॥ 27

,, చిరం విచారయన్నేవ తత్తపః సదృశం ఫలం।
దాతుముత్కంఠితమనావర్తేయం సాంప్రతం ప్రియే॥ 28

తా॥ దేవీ! కాశీనగరమున భావశర్మయను విప్రుడు నాయందలి భక్తిచేత తన ఇంద్రియములను జయించి గీతాష్టమాధ్యాయశ్లోకార్థమును జపించుచు నన్నుగురించి తపమాచరించుచున్నాడు. వాని తపస్సునకు నేను సంతోషించి అతనికి తగినఫలమేదియున్నదని చాలకాలమాలోచించితిని. తుదకు నాకు నిశ్చయమేర్పడినది. కావున సంతోషముచే నాకిప్పుడు నిద్రపట్టకున్నది. అని సమాధానము చెప్పెను.

పార్వత్యువాచ — పార్వతి ఈశ్వరుని అడిగెను.

శ్లో॥ హరిః ప్రసన్నభూతోఽపి చింతాం ప్రాప యది ప్రభో।
భావశర్మా హరేర్భక్తః ప్రాప్తః కిం తత్ఫలం పునః॥ 29

తా॥ స్వామీ! నారాయణుడు ప్రసన్నహృదయుడు. వాడు సమస్తవిషయములను యథావస్థితముగ తెలిసికొనువాడు. భావశర్మతపస్సునకు తగిన ఫలంబునుగూర్చి అతడు అలోచించెనని మీరు చెప్పుచున్నారు. దీనినిబట్టి ఆ నారాయణుడు దీర్ఘాలోచనచేసి నిశ్చయించిన ఫలము అసాధారణమైనదని గోచరమగుచున్నది. అదియేదియో మీరు దయచేసి భావశర్మచే పొందబడిన ఫలమును నాకు ఎరిగింపవలయును.

శ్లో॥ తతః ప్రసాదమాసాద్య ప్రసన్నస్య మురద్విషః।
సుఖమాత్యంతికం ప్రాప భావశర్మా ద్విజోత్తమః॥ 30

తా॥ నారాయణుని అనుగ్రహముచే భావశర్మకు సుఖమయ హరిపదము లభించెను.

శ్లో॥ లేభిరే పదవీం సర్వే తదీయా అపి వంశజాః।
తత్కర్మవశతో యే వై సంప్రాప్తా యాతనాం పురా॥ 31

తా॥ భావశర్మయొక్క పురాతనపాపముచే అతని పూర్వీకులు నరకమునబడి బాధపడుచుండిరి. వారుకూడ ఉత్తమపదవి యగు మోక్షపదవినిజేరిరి.

శ్లో॥ ఏతదేవాష్టమాధ్యాయమాహాత్మ్యం కించిదేవ తత్।
కథితం మృగశాబాక్షి ద్రష్టవ్యం తు సదైవ చ॥ 32

తా॥ ఓ మృగాక్షీ! ఇప్పుడు నేను నీకు అష్టమాధ్యాయమాహాత్మ్యము కొంచెమే చెప్పియున్నాను. ఒక శ్లోకార్థమునకే ఇంతవైభవమున్న అసలు అధ్యాయమంతటకు ఎంతమాహాత్మ్యముండునో నీవే ఆలోచించుకొనుము. ఈ మాహాత్మ్యము ఒకప్పుడును మరువదగినదిగాదు.

ఓమ్

# నవమాధ్యాయ మాహాత్మ్యము



మహాదేవ ఉవాచ — ఈశ్వరుడు చెప్పెను.

శ్లో॥ అతః పరం ప్రవక్ష్యామి నవమాధ్యాయమాదరాత్।
సంశృణుష్వ స్థిరీభూయ తుహినాచలకన్యకే॥ 1

తా॥ ఓ హిమవంతుని పుత్రికా! నేనిప్పుడు నవమాధ్యాయమాహాత్మ్యమును వర్ణించబోవుచున్నాను. నీవు శ్రద్ధతో వినవలయును.

శ్లో॥ అస్తి మాహిష్మతీ నామ నగరీ నర్మదాతటే।
తత్రాసీన్మాధవోనామ ద్విజన్మా సశివో ద్విజః॥ 2

,, వేదవేదాంగతత్త్వజ్ఞః కాలేకాలేఽతిథిప్రియః।
అర్జయిత్వా బహు ధనం విద్యయైవ విశుద్ధధీః॥ 3

తా॥ నర్మదాతీరమున మాహిష్మతియను పురమొకటికలదు. అందు వేదవేదాంగములనెరిగిన మాధవుడను బ్రాహ్మణుడుండెను. అతడు కాలత్రయములలోను అతిథులను పూజించువాడు. అతడు ధర్మమార్గమున నడచుచుండెను. అతడు తన జ్ఞానముచే బహుధనము నార్జించి ఒక యాగమును చేయనారంభించెను.

శ్లో॥ మహాంతమధ్వరం కర్తుం సమారేభే కదాచన।
ఆలంభనార్థమానీతః ఛాగః పూజితవిగ్రహః॥ 4

,, వాచమూచే హసన్నుచ్చైః జగద్విస్మయకారకః।
కిమేతైర్బహుభిర్యాగైః విధివద్విహితైరపి॥ 5

,, వినశ్వరఫలైర్జన్మ జరామరణహేతుభిః।
ఏతావత్యపి మే విప్ర దశేయం దృశ్యతామితి॥ 6

తా॥ అదియొక పశుయాగము. కావుననతడు హోమద్రవ్యముగ నొకమేకను అలంకరించి పూజించి అచటకు తెచ్చియుండెను దానిని కొన్నిమంత్రములను పఠించిఛేదింపబోవనది బిగ్గరగా నవ్వి అచ్చటివారాశ్చర్యపడునట్లు, బ్రాహ్మణా! నీవువ్యర్థముగ నాయసువును తీసివేయ యత్నించుచున్నావు. ఈ యాగముచే ఫలితమేదియు సిద్ధించదు అట్లు సిద్ధించిన ఆ ఫలితములును చిరస్థాయిగనుండవు. అఫలముల ననుభవింపగోరినయెడల జరామరణదుఃఖములకు పాలు పడవలసివచ్చును. నన్నుచూడుము. నాకీదుర్దశవచ్చుటకు ఇట్టి పశుమారణయాగాచరణయే కారణము. కాన నీవు బాగుపడవలయుననికోరిన ఈ చర్యను వదలవలయును. అని చెప్పెను

శ్లో॥ ఛాగస్యైవం వచోఽతీవ కుతూహలపరం జనాః ।
నిశమ్య విస్మయం యాతాః కృతమండపవాసినః ॥ 7

తా॥ యాగమండపమున చేరియుండినజనులు ఈ మాటలకు మిగుల నాశ్చర్యపడిరి. వారింతవరకు ఒక మేక మాటలాడుటనుచూచిన వారుకారు. వారు 'యాగములు వేదబోధితములగుటచే అవి అవశ్యకర్తవ్యములు యాగములయందుచేయు పశుబలులు బలులుకావు, వాటిచే పాపముసంభవించదు' అని తలంచువారు. వారికివిషయము క్రొత్తదగుటచే వారాశ్చర్యపడిరి.

శ్లో॥ తతో బద్ధాంజలిపుటః ద్విజాతిః స్తిమితేక్షణః ।
ప్రణమ్య శ్రద్ధధానస్తమపృచ్ఛచ్ఛాగమాదరాత్ ॥ 8

,, కిం జాతీయః కిమాత్మా త్వం కిం వృత్తమితి మే వద ।
కేన వా కర్మణా వాసీచ్ఛాగత్వమితి కారణం ॥ 9

తా॥ ఆ బ్రాహ్మణుడిదియంతయువిని ఈ మాటలలో ఏదోసత్యముండవలెనని యెంచి అతి శ్రద్ధతో నంజలిజోడించి ప్రణామముచేసి అయ్యా! యాగము శాస్త్రసిద్ధమనియు పలువురు అనుష్ఠించునదియనియు భావించి దానిని జేయబూనితిని. అది మేలును గలుగజేయునని మా నమ్మకము. మీ మాటలు దానికి ఎదురుగానున్నవి. దీనిలో ఏదిసత్యమో మాకుతెలియవలెను. దయచేసి మీ యనుభవమంతయు మాకు తెలియజేయవలయును. మీ రెవరు? మీకు ఈ దుర్దశఎట్లు కలిగెను? మీమాటలనుబట్టి మీరుకూడ మావలెనే ముందుజన్మముననుండినట్లు గ్రహింపవలసి యున్నది. దయచేసి మా సందేహములను తొలగించవలయును అని ఆ ఛాగమును వేడుకొనెను.

ఛాగ ఉవాచ — ఆ మాటలను విని మేక ఇట్లు చెప్పెను.

శ్లో॥ ఆసం పురా ద్విజాతీనామన్వయే చాతి నిర్మలే ।
ఆహర్తా క్రతుసంఘానాం వేదవిద్యా విశారదః ॥ 10

,, ఏకదా మమ గేహిన్యా పుత్రరోగప్రశాంతయే ।
ఛాగః ప్రయాచితో మత్తః చండికాభక్తినమ్రయా ॥ 11

,, తతో నిహన్యమానస్య చండికామండపస్థలే ।
ఛాగస్య జననీ మాం తు శశాప బ్రహ్మవాదినీ ॥ 12

,, అశాస్త్రీయాధ్వనా పాప మత్పుత్రం యజ్ఞిమాంససి ।
ద్విజాత్యధమ తేన త్వమజాయోనిమవాప్స్యసి ॥ 13

తా॥ అయ్యా! నేనును నీవలె పూర్వజన్మమున నొక బ్రాహ్మణుడుగనుంటిని. నా వంశముకూడ సద్వంశమే. నేను అప్పుడు వేదవేదాంగముల నభ్యసించి అనేకయాగములను సైతము చేసియుంటిని. నాభార్యయొక కాళిభక్తురాలు. ఒకసమయమున నా కుమారునికి ఏదోజబ్బుతగిలెను. అనేక ఔషధముల నిచ్చియు అది అనుకూలముకాకపోయెను. అప్పుడు కాళీదేవికి రక్తబలి యిచ్చిన ఈ రోగము శాంతమగుననిచెప్పి నా భార్యబలియిచ్చుటకై యొకమేకను తెమ్మని నన్నడిగెను. నేను మరుదినము ఆ మాటవిని యొక మేకపిల్లనుదెచ్చి కాళీదేవాలయమున దేవికి బలి యివ్వబోయితిని. ఆ దృశ్యమును చూచుచుండిన ఆ మేకపిల్లయొక్క తల్లి చాలదుఃఖమునొంది ఓ బ్రాహ్మణా! నీవక్రమముగ నా బిడ్డను జంపితివి. ఇది శాస్త్రసమ్మతముగాదు. ఇది కామ్యము. నీ క్షేమముగోరి పరులను హింసించితివి. కాన నీవు జన్మాంతరమున మేకగాపుట్టి నా పుత్రునివలె కష్టపడవలయును. అని నన్ను శపించెను.

శ్లో॥ తతోఽహం ప్రేత్య కాలేన ఛాగోఽభూవం ద్విజోత్తమ।
నిస్తీర్య చానేకవిధాయోనిసంతాపయాతనాః ॥ 14
జాతిస్మరత్వమప్యస్తి పశుయోనిముపేయుషః॥ 15

తా॥ పిదప చాలాకాలము అనేకయోనులజేరి మిగుల కష్టపడితిని. అంతమున నాకి ఛాగజన్మశాపానుసారముగ లభించినది. ఇట్లు అనేక నీచపశుజన్మములనెత్తియుండినను నాకు నాపుట్టుపూర్వోత్తరములు మరపురాకున్నవి.

విప్ర ఉవాచ — బ్రాహ్మణుడు చెప్పెను.

శ్లో॥ త్వదీయజన్మశుశ్రూషా కుతూహలరసోన్ముఖం।
మనః సర్వాన్ ద్విజానేతానపి తత్కథయాఖిలం॥ 16

తా॥ నీ మాటలనువిని నీ జన్మాంతరవృత్తాంతముల నంతయు వినవలయునని కోరిక నాకు కలుగుచున్నది. నా మనస్సు వినుటకు త్వరపడుచున్నది. ఈ విప్రులును నీ కథయంతయు వినగోరుచున్నారు. నీవు వినిపించవలయును. అని మేకను విప్రుడు ప్రశ్నించెను.

ఛాగ ఉవాచ — మేక చెప్పినది.

శ్లో॥ కదాచిన్మర్కటోఽభూవమాహితుండికశిక్షయా।
క్రీడద్భిర్వీక్షితో డింభైః నృత్యన్ ప్రతిగృహాంగణే॥ 17
,, ఉదారానాత్మనో దారాన్ విలోక్య తనయానపి।
క్రియాపరాఙ్ముఖో జాతః త్యక్తనర్తన సంభ్రమః॥ 18

శ్లో॥ తతో వర్తులదండైశ్చ దుస్సహైరాహితుండికః।
మాముచ్చైస్తాడయామాస రుషాలోహితలోచనః॥ 19

శ్లో॥ తతోఽహం మూర్ఛితోఽభూవం క్షరత్ క్షతజసంతతిః।
అబ్రిఘన్నుదకం చాన్నమగమత్కాలధర్మతాం॥ 20

తా॥ నేను మరణానంతరము మర్కటముగాపుట్టితిని. నన్ను ఆటగాడు ఒకడు ఆడించి బ్రతుకుచుండెను. నేనాడుటను చిన్నపిల్లవాండ్రుచూచి ఆనందపడెదరు. ఒకదినము ఒకగృహాంగణ

మున నా బిడ్డలు నాకగుపడిరి. వారు సుఖపడుచుండుటనుజూచి నేను పూర్వవృత్తాంతస్మరణము వచ్చి నా యాటను నిలిపివేసితిని. అదిచూచి నా యజమాని కండ్లు ఎఱ్ఱబడినవి. అతడునన్ను కోపమంది కఱ్ఱతో కొట్టెను. ఆ దెబ్బలకు నేను మూర్ఛజెందితిని. నా యొంటినుండి నెత్తురుధార ప్రవహించి నది. నా కన్నపానీయములన్న సహించకపోయినవి. అదేకారణమున నేను మరణించితిని.

శ్లో॥ తతోఽహమాసీచ్ఛునకః పరిభ్రామ్యన్ గృహేగృహే ।
కుక్షింభరిరహం మార్గే త్యక్తోచ్ఛిష్టాన్నభక్షకః ॥ 21

,, కదాచిదావిశం స్వాంతరాత్మవేశ్మ మహానసం ।
బుభుక్షితో భక్షయితుం స్థాలీస్థాపితమోదనం ॥ 22

,, జిఘ్రన్ భూమితలం పశ్యన్ శనైర్దశదిశో భయాత్ ।
శంకమానో జనరవాత్ పార్శ్వే చ విలిహన్నివ ॥ 23

తా॥ మర్కటజన్మనువీడి, నేనొక శునకముగా పుట్టితిని. నాకు తిండి పెట్టువారు లేక పోయిరి. నే నాహారమునకై అన్నిచోట్లతిరిగి అగసాట్లుపడి ఎంగిలియాకులలోని అన్నమును తిను చుంటిని. ఒక దినము ఎన్నిచోట్ల తిరిగినను నాకన్నమగుపడకపోయెను, ఆకలిచే మిగుల బాధబడి తిని. నా పూర్వగృహమునుజేరి వంటఇంటిలోని అన్నమును తినగోరితిని. ఇతరులు చూచెదరేమో అని భయముచే మెల్లగ భూమిని వాసనచూచుచు నలువైపులచూచుచు నా ఇంటిలోనికి వెళ్ళుచుంటిని. భయముచే నా దేహము జారిపోవునట్లుండెను.

శ్లో॥ తతః కుతశ్చిదాగత్య వీక్షితైస్తనుజైర్నిజైః ।
,, జాయయా చ జరత్యాఽహం తాడితో లగుడాదిభిః ॥ 24

,, తతో భగ్నకటిర్యాతః బహుశోణితముద్వహన్ ।
నిర్జగామ బహిర్గేహాత్ కథంచిన్మూర్ఛయాఽఽకులః ॥ 25

,, అంగేషు పూతిగంధేషు కృమిగర్భేషు కాలతః ।
తతః కదశ్వతాం ప్రాప్తః శౌండికస్య చ వేశ్మని ॥ 26

,, అశ్వోఽభవమహం విద్వన్ మృతః కాలక్రమాదిహ ॥ 27

తా॥ అప్పుడు నా భార్యాపుత్రులుచూచి రోకలితో నడుమువిరుగునటుల కొట్టివేసిరి. నా యొడలంతయు నెత్తురుమయమైపోయినది. నా ప్రాణములునన్ను విడిచిపోవునట్లుండెను. నా నడుమువిరిగిపోవుటచే నడువలేక మిగుల శ్రమపడి బయటకువచ్చితిని. కొన్నిరోజులకు నా దేహ మంతయు పురుగుపట్టినది. దుర్గంధమధికమాయెను. ఇట్లు నా శునకజన్మము ముగిసెను. అనన్త రము నేనొక కంచరగాడిదగాపుట్టి కల్లమ్మువానిఇంట బ్రతుకుచుంటిని.

శ్లో॥ కదాచిచ్చత్వరే తేన సమానీతో జనాకులే ।
విక్రయాయ జరాలీఢః పతయాలురదావలిః ॥ 28

తా॥ కొన్నాళ్ళకు నాకు వార్థక్యమేర్పడెను నావలన ఎక్కువ ప్రయోజనముండదని తెలిసి వాడు నన్నమ్మివేయుటకు సంతకు తీసుకొని వెళ్ళెను.

శ్లో॥ జాయయా ద్వారకాయాత్రాం కర్తుముద్యతయా సకృత్ ।
మౌల్యేనాల్పీయసా క్రీతం తురంగం చేష్టమానయా ॥ 29

,, జగృహేఽహం తయా దామ్నా చాల్పేన వసునా జిరన్ ।
గంతుం చారభతద్విత్రైః పుత్రైరారుహ్య మాం సమం ॥ 30

తా॥ అప్పుడు నా భార్య నన్ను ముసలివాడనగుటచే అల్పమూల్యమునకేకొనెను. ఆమె ద్వారకాయాత్ర చేయవలెనని కోరుచుండెను. నన్ను కొని తన పుత్రులతోసహా నన్నెక్కి సవారిచేయ మొదలిడెను.

శ్లో॥ శనైశ్శనైస్సరస్తీరే మగ్నోఽహం గాఢకర్దమే ।
తత్రాహం కుటిలగ్రీవశ్చాపతం కర్దమాంతరే ॥ 31

తా॥ నేను బరువెక్కువగుటచే మెల్లగనడిచితిని. నాకొకనదియడ్డు తగిలినది. నేను లోతైన బురదలోచిక్కుకొంటిని. బరువుచే నా కాయాసము మిక్కుటమాయెను. నేనచ్చటనే నిలువ లేక పడిపోతిని.

శ్లో॥ తాడ్యమానో ముహుః పుత్రైః కుటిలోపలపాణిభిః ।
ఉద్ధాప్యమానో బహుధా ప్రాణాన్మోచితవానహం ॥ 32

తా॥ లేవతీయుటకుగాను నన్ను నా పుత్రులు బెత్తములతోను రాళ్ళతోను కొట్టిరి. కాని ఇదియంతయు నా ఆయాసమును అధికరించినందుచే నేను మరణించితిని.

శ్లో॥ తతో నిశ్చిత్య మాం తత్ర మృతం భగ్నోద్యమాః సుతాః ।
ఆక్రుశ్య మాతరం దీనాం ప్రావృత్య ప్రయయుర్గృహం ॥ 33

తా॥ నేను చచ్చితినని తెలిసివారు లేవదీయుయత్నమును వదలిపెట్టిరి. ముసలిగుఱ్ఱమును తెచ్చి డబ్బుపాడుచేసినందులకు తమతల్లిని ఎక్కువగాతిట్టిరి. అనంతరము నిరాశులై తమ ఇంటికి మరలిరి.

శ్లో॥ తతః కాలేన బహునా సంప్రేత్య భాగతాం గతః ।
నిస్తీర్ణానేకహీనోచ్చ యోనిసంతాపయాతనః ॥ 34

తా॥ ఇట్లు చిరకాలమునేననేకజన్మలనెత్తి అనేకయాతనల ననుభవించితిని. కడకు ఈ జన్మను శాపప్రకారముగ తీసుకొంటిని

ద్విజ ఉవాచః—

శ్లో॥ కిమనేన మహాభాగ దుఃఖజాతేన నిత్యశః ।
యథావదంజసా మహ్యాం సుఖమాత్యంతికం భవేత్ ॥ 35

తా॥ ఆ మాటలనువిని బ్రాహ్మణునికి యాగమునందలి ఉత్సాహము తగ్గిపోయెను. అతడు ఓ యజమా! నీ వికనూరకుండుము. నీ మాటలు దుఃఖము నిచ్చుచున్నవి. పశుయాగము పాపదాయకమనిచెప్పుచున్నావు. యాగము చేయనిదే మనుష్యునకు సుఖమెట్లు సంభవించును? నేను నా సుఖమున కేమిచేయవలెనో నాకు తెలియకున్నది. నీవు నాకు హితమును చెప్పవలయును అని అడిగెను,

ఛాగ ఉవాచః—

శ్లో॥ ఆశ్చర్యం కథయిష్యామి పునరన్యదపి ద్విజ।
స్వష్ఠమాపృచ్ఛమానస్య తవాస్తి యది కౌతుకం॥ 36

,, అస్తి నామ్నా కురుక్షేత్రం నగరం ముక్తిదాయకం।
సూర్యవంశ్యోఽభవ త్తత్ర చంద్రశర్మా మహీపతిః॥ 37

,, సూర్యోపరాగసమయే శ్రద్ధయా పరయాఽన్వితః।
దానం స కాలపురుషం దాతుం సముపచక్రమే॥ 38

,, సమాహూయ ద్విజన్మానం వేదవేదాంగపారగం।
స్నాతుం పుణ్యోదకైః పుణ్యైః యయౌ సార్ధం పురోధసా॥ 39

తా॥ ఆ మాటలకు మేక ఇట్లు బదులుచెప్పెను. ఇప్పుడు నేను చెప్పినది యంతయు మీ కాశ్చర్యమును కలుగజేసియేయుండును. ఇంతకన్నను ఆశ్చర్యమగు మరియొకకథను నీకు వినవలెనని యుత్సాహముండిన చెప్పగలను. మోక్షదాయకమగు కురుక్షేత్రనగరమును నీవు విని యుందువు. అచ్చట చంద్రశర్మయను సూర్యవంశపురాజొకడుండెను. వాడొక సూర్యగ్రహణకాలమున కాలపురుషదానముచేయదలంచి ఒక బ్రాహ్మణుని రప్పించి పురోహితాదులతోకూడి పుణ్యనదీతీరముచేరెను. ఆ దానము స్నానముచేసి పవిత్రముగ చేయవలసినదానము. ప్రతిగృహీతయగు బ్రాహ్మణుడు వేదవేదాంగములనెరిగి ఆచారపరాయణుడైనవాడు.

శ్లో॥ అథోచ్చైః కాలపురుషః వాచమూచే హసన్నిమాం।
అన్యైనైవ ప్రగృహ్ణంతి క్షేత్రే చాణ్వపి కంచన॥ 40

తా॥ అప్పుడాకాలపురుషుడు నవ్వుచు ఓ బ్రాహ్మణా! నీకేమి మతిచెడినదా? ఇట్టి పుణ్యక్షేత్రమున ఎవ్వడును ఎట్టిదానమును తీయడుకదా?

శ్లో॥ సూర్యోపరాగసమయే కురుక్షేత్రాభిధే స్థలే।
దానం చ కాలపురుషం జిఘృక్షసి కథం ద్విజ॥ 41

తా॥ సాధారణదానములను తీసినను ఇచ్చువాని పాపములు తీయువానికిని, తీయువాని పుణ్యములు ఇచ్చువానికిని పోవునని శాస్త్రములుచెప్పుచున్నవి. పుణ్యక్షేత్రములయందలి ప్రతిగ్రహములు మిగుల పాపహేతువని శాస్త్రజ్ఞుడయిన నీకు తెలిసియే యుండును. కురుక్షేత్రము అన్ని క్షేత్రములకన్న ఉత్కృష్టక్షేత్రము. ఆ క్షేత్రముననే సూర్యగ్రహణకాలముననే కాలపురుషుని ప్రతిగ్రహించ బయలు దేరితివి. దీనివలన కలుగు నీ వినాశమును నీవెరుగుదువా? ఈ క్షేత్రసమయవస్తువు లొక్కొక్కటియును నీ అధఃపతనమును చేయగలిగినవిగదా?

శ్లో॥ జ్ఞాత్వాఽపి నిశ్చితం సర్వం పీతత్పాతకకారకం।
ప్రవర్తసే కథం కర్తుం ధనలోభాంధయా ధియా॥ 42

తా॥ ఇదియంతయు. నీవెరిగినదే. పాపకారణములని నీవు తెలిసికొనియే ధనాశచే ఈ కార్యమునకుద్యుక్తుడగుచున్నావు. ఏమీ నీ మూర్ఖత! అనిచెప్పెను.

శ్లో॥ ఇత్థమాకర్ణ్య తద్వాక్యం జగద్విస్మయకారకం ।
కిమనేన మహాదానభయేనేత్యవదద్ద్విజః । 43

,, ఏవంవిధమహాదానపాతకాగాధవారిధిం ।
జానామి తరితుం సమ్యగుపాయమహమేవ హి ॥ 44

తా॥ ఆశ్చర్యకరమగు ఆ మాటలనువిని ద్విజుడు నాకీదానమును తీయుటలోభయము లేదు. దీనివలన మహాపాతకము సంభవించినను దానిని తొలగించు ఉపాయమును ఎరిగియుండుటచే నేను భయపడుటలేదు. నేనాపాపవారిధిని దాటుకొనగలను అని బదులు చెప్పెను

శ్లో॥ తతః స్నాత్వా మహీపాలః పరిధాయ చ వాససీ ।
శుచిః ప్రసన్నహృదయః సితమాల్యానులేపనః ॥ 45

,, అవలంబ్య కరాంభోజం పార్శ్వవర్తీ పురోధసః ।
సమాయయా సేవ్యమానః స తత్కాలోచితైర్గుణైః ॥ 46

తా॥ రాజుస్నానముచేసి వస్త్రములనుధరించి ప్రసన్నహృదయుడై బ్రాహ్మణుడున్న చోటికివచ్చెను. అతడు ఆ కాలమునకు తగిన పరివారముచే సేవింపబడుచుండెను. తెల్లనిమాలను ధరించి పురోహితుని కరంబునుబూని వాడచ్చటకు జేరెను.

శ్లో॥ సమాగత్య చ భూపాలః సంప్రాదాత్కాలపూరుషం ।
యథోచితేన విధినా తస్మై భక్త్యా ద్విజన్మనే ॥ 47

తా॥ రాజు బ్రాహ్మణునిజేరి భక్తితో శాస్త్రోక్తప్రకారముగా అతనికి కాలపురుషుని దానముచేసెను.

శ్లో॥ నిర్భిద్య కాలపురుషహృదయాన్నిర్దయోదయః ।
పాపాత్మా నిర్యయౌ కశ్చిచ్చాండాలో రక్తలోచనః ॥ 48

,, కించ ప్రాపితకాలస్య పరనిందారతోత్సవే ।
నిందా చాండాలికాదేహ పార్శ్వమాగాద్ద్విజన్మనః ॥ 49

,, ఏతచ్చాండాలయుగలం నిర్గత్యారుణలోచనం ।
తతః సంచరితుం చక్రే ప్రసహ్యాంగే ద్విజన్మనః ॥ 50

తా॥ అప్పుడు ఆ కాలపురుషుని హృదయమును భేదించుకొని కఠినహృదయుడగు నొక చండాలుడు బయలుదేరెను. ఆ పాపాత్ముడు రక్తలోచనుడై భయంకరదృశ్యము కలిగియుండెను. అతడు కాలపురుషుని రూపమునయుండునపుడు పరనింధయొనర్చియుండెను. కాన ఇప్పుడు ఆ నిందయు చండాల స్త్రీ రూపమునుదాల్చి అతనిని వెంబడించెను. వారిరువురును బ్రాహ్మణుని సమీపముజేరిరి. చేరి అతనిని బలాత్కరించి పీడించనారంభించిరి. ఆతనినిచుట్టి కోలాలము చేయ నారంభించిరి.

,, గీతానాం నవమాధ్యాయం జపన్నేవ హృది స్థితః ।
కంపమానం ద్విజం కించిత్తూష్ణీం పశ్యతి భూపతౌ ॥ 51

తా॥ వాని బాధలనుండి తప్పించుకొనుటకై ద్విజుడు తన మనస్సుననే గీతానవమాధ్యాయమును జపించసాగెను.

శ్లో॥ తతో గీతాక్షరోద్భూతై ర్వైష్ణవైః పరిపీడితం।
పలాయమానం చాండాలయుగలం నిష్ఫలోద్యమమ్॥ 51

,, తన్నిశ్చ్రక్రామ వేగేన ద్విజాతేః పార్శ్వవర్తి యత్।
శరీరే వర్తమానం చ పరనిందా రతోత్సవే॥ 52

తా॥ నవమాధ్యాయము జపించినందువలన కొన్ని వైష్ణవములగు శక్తులు బయలుదేరినవి. అవి ఆ చండాలయుగ్మమును బాధించి తరుమగొట్టినవి. ఆ చండాలయుగ్మము వాటికి ఎదురునిలువలేక బ్రాహ్మణునివదలి పారినవి. ప్రక్కలోనిలచి బాధించుచుండిన కాలపురుషుడగు చండాలుడు పరుగెత్తెను. అతని దేహమునుండి వెడలిన ఆడుదియు అతనిలోనే ప్రవేశించెను. ఇట్లు వారిరువురు తొలగిరి.

శ్లో॥ ఇత్థం కలితవృత్తాంతః ప్రత్యక్షం క్షితివల్లభః।
పర్యపృచ్ఛద్ద్విజన్మానం విస్మయస్మేరలోచనః॥ 53

,, కథమాపదియం ఘోరా నిస్తీర్ణా మహతీ త్వయా।
కిమ్మంత్రం జపతా విప్ర కం వా సంస్మరతా సురం॥ 54

తా॥ ఈ వృత్తాంతమంతయుజూచి ఆశ్చర్యపడిన దాత యగు రాజు ఓ బ్రాహ్మణా! ఇంతటి పెద్ద ఆపదను నీవెట్లు దాటుకొంటివి? నీవేమంత్రమును జపించితివి? ఏ దేవతను ధ్యానించితివి? నాకాశ్చర్యముగనున్నది. నీవు తప్పించుకొనిన విధమును నాకు తెలుపవలయును అని అడిగెను.

ద్విజ ఉవాచః—

శ్లో॥ చండాలమూర్తి మాసాద్య మూర్తం కిల్బిషముల్బణం।
యోషిన్మూర్తిమయీ నిందా ద్వయమేతదవైమ్యహం॥ 55

తా॥ ఆ మాటలకు బ్రాహ్మణుడు ఓ భూమిపా! నేను మహాదానమును పుణ్యకాలమున పుణ్యతీర్థతీరమున ప్రతిగ్రహించితి. కాన నాకు మహాపాపము సంభవించినది. అదియే ఈ చండాలరూపమునవచ్చి నన్ను హింసింపసాగినది. ఆ కాలపురుషునినింద స్త్రీరూపమున వచ్చినది. రెంటి పూర్వోత్తరములను నేనెరుగుదును.

శ్లో॥ గీతాయా నవమాధ్యాయ మంత్రమాలా మయా స్మృతా।
తన్మాహాత్మ్యమిదం సర్వం త్వమవేహి మహీపతే॥ 56

తా॥ నేను వాటి దురాకృతములనుండి తప్పించుకొనుటకు గీతానవమాధ్యాయమనెడి మంత్రమును జపించితిని. తన్మాహాత్మ్యముచేతనే అవి పటాపంచలై పారిపోయినవి.

శ్లో॥ గీతాయా నవమాధ్యాయం జపామి ప్రత్యహం నృప।
నిస్తీర్ణాశ్చాపదస్తేన కుప్రతిగ్రహ సంభవాః॥ 57

తా॥ భూపతే! నేను గీతానవమాధ్యాయమును ప్రతిదినము జపించుచున్నాను. అదియే నా కుత్సితప్రతిగ్రహములచేకలుగు పాపమునుండి నన్ను కాపాడుచున్నది. నన్ను ఇట్టి ఆపదలనుండి రక్షించుచున్నది. అని బదులుచెప్పెను.

శ్లో॥ అభ్యస్య నవమాధ్యాయం రాజా తస్మాద్ద్విజన్మనః।
తావుభావపి లేభాతే పరాం నిర్వృతిముత్తమామ్॥ 58

తా॥ నవమాధ్యాయ మాహాత్మ్యమును ఇంతగొప్పది అని ఎరిగినరాజునకు ఆ అధ్యాయమును నేర్వవలెనని కోరిక ఉదయించెను. వాడు బ్రాహ్మణునిసేవించి అతనివద్దనుండి ఆ యధ్యాయమును అభ్యసించెను. దానిని రాజబ్రాహ్మణులిరువురు జపించి తన్మాహాత్మ్యముచే ముక్తినిపొందిరి.

ఓమ్

# దశమాధ్యాయ మాహాత్మ్యము

దేవ్యువాచ:—

శ్లో॥ సర్వజ్ఞ సర్వచైతన్య సర్వేశ్వర గిరాం గురో।
ధన్యాఽస్మి శివమాన్యేన దృశ్యమానేన యత్త్వయా॥
,, నిరూపితమిదం పుణ్యం నవమాధ్యాయ వైభవమ్।
అనేకవిస్మయస్వాదు కథానకమయం మధు॥
,, శృణ్వంత్యా మమ దేవేశ న తృప్తిర్జాతు జాయతే।
అకుంఠా శ్రవణోత్కంఠా వర్ధతే వృషభధ్వజ॥
,, ఆసీన్మమహిమాంభోధే గీతానాం శ్రుతి జీవితమ్।
తత్రాపి దశమాధ్యాయం ప్రధానం మునయో జగుః॥
,, తముద్దిశ్య మహాధ్యాయమభిధేహి కథానకమ్।

తా॥ పార్వతీదేవి పరమేశ్వరునిగూర్చి యీ విధముగ ప్రశ్నించెను. ఓ సర్వజ్ఞుడా! సమస్తచైతన్యస్వరూపుడవగు ఓ సర్వేశ్వరా! సమస్తవిద్యలకును గురువైనవాడా! ఎల్లప్పుడును శివస్వరూపుండవగు నీ దృష్టికి పాత్రురాలనగుటచే నేను కడుధన్యురాలను. ఇదివరకనేక ఆశ్చర్యములకు స్థానమైనట్టిదియు, కథామృతమగు మిగుల పవిత్రమైన నవమాధ్యాయ మహాత్మ్య వైభవమును బాగుగా నిరూపించితిరి. అట్టి దివ్యామృతమును గ్రోలుచున్న నాకు తృప్తికనబడుటలేదు. ఇకను వినుటయందుత్కంఠవృద్ధిని పొందుచున్నది. ఓ గీతామహిమ సముద్రుడా! తమరు మాకు వినిపించుటకుజీవితప్రాయులుగనున్నారు. ఇకను దశమాధ్యాయమును మునీశ్వరులు ప్రధానముగ జెప్పిరి. అట్టి దశమాధ్యాయకథను నాకు జెప్పుడు.

శివ ఉవాచ:—

శృణు సుశ్రోణి నిశ్రేణీం స్వర్గమార్గస్య దుర్లభాం॥ 5
శ్లో॥ సీమామివ ప్రభావానాం పావనీం పరమాం కథాం।

తా॥ శివుడు పలికెను. ఓ దేవీ! స్వర్గమనెడి దుర్గస్థలమునకు నిచ్చెనగానైనట్టియు, దుర్లభమైనట్టియు సమస్తప్రభావముల కవధియైనట్టియు పరమోత్కృష్ట కథనువినుము.

శ్లో॥ ఆసీత్కాశీపురే విప్రః పుణ్యకీర్తి పరాయణః॥ 6
ప్రశాంతచేతా నిర్ముక్త హింసాకార్కశ్యసాహసః।
,, నివృత్తి నిరతో నిత్యం జితేంద్రియతయా తథా॥ 7
ధీరధీరితి విఖ్యాతో నన్దీవ మయి భక్తిమాన్।
,, నిస్తీర్ణనిగమాంబోధిః సర్వశాస్త్రార్థకోవిదః॥ 8
తస్య ధ్యానపరాధీన చేతసః ప్రతిగచ్ఛతః।
,, అన్తరాత్మని నిర్మగ్నమనస స్తత్వచక్షుషః॥ 9
కరావలంబనం తస్య ధావన్ ప్రీత్యా దదామ్యహం।
,, కదాచన చమత్కారకారకం విమనా మునిః॥ 10

తా॥ కాశీపట్టణమందు ధీరబుద్ధియను నామధేయముతో ప్రఖ్యాతిగాంచిన విప్రవరుడొక డుండెను. అతడు పుణ్యకీర్తులయందాసక్తిగలవాడు, ప్రశాంతచిత్తుడు, కఠినస్వభావమును హింసా కార్యములను సాహసమునువదలినవాడు, నివృత్తిమార్గమునందు ప్రవర్తించుచున్నవాడై జితేంద్రియుడై నందీశ్వరునివలె నాయందు నిత్యము భక్తిగలవాడు, సకలవేదసారమును దాటినవాడు, సకలశాస్త్రార్థకోవిదుడు. మఱియు నిరంతరము ధ్యాననిమగ్నుడును, పరమాత్మయందు లీనమైన మనస్సుగలవాడును తత్త్వజ్ఞానియునగునట్టి యా ధీరబుద్ధి నాకెదురురాగా నేను పరుగెత్తుచూ అతనికి నా చేతిని నూతగానొసంగి యతనివెంబడి సంచరించుచుందును. ఒకప్పుడు చమత్కారజనకమగు నిద్దానిని గనుకొని భృంగిరిటిముని ఇట్టిస్థితి నాకు లభింపదయ్యెనని విమనస్కుడాయెను.

శ్లో॥ ఆశాంతః కించ నాసాగ్రపరమానందమేదురాం।
దృశ్యమాసాద్య నిద్రాణ కరణోఽయమివ స్థితః॥ 11
,, ఉపాధాస్య విశాలాక్షి విశాలం ద్వారదేహలీం।
అశేత నిశి నిశ్శంకం తావల్లంబేక్షణః క్షణం॥ 12
,, మామపృచ్ఛత్ భృంగిరిటిః ప్రణమ్య పాదపంకజం।
అనేన విధినా కేన విహితం తవ దర్శనమ్॥ 13
,, తపస్తప్తం హుతం జప్తం కిమనేన మహాత్మనా।
దత్తే ప్రతిపదం దేవో యస్య హస్తావలంబనమ్॥ 14
,, అయం న లభతే గంతుం కస్మాదస్మాత్పురాద్బహిః।
యదృచ్ఛయా యదా కాశీ సీమాముల్లంఘ్య గచ్ఛతి॥ 15
,, న పశ్యతి తదా సర్వాన్ పార్శ్వస్థానపి దేహినః।
అత్ర హేతుమహం జ్ఞాతుమిచ్ఛామి స్వామిభాషితమ్॥ 16
,, అనుగ్రాహ్యోఽస్మి చేద్వక్తుం యుక్తం చేత్తదుదీరయ।
భృంగిరిటేరిమం ప్రశ్నం సమాకర్ణ్యాహమూచివాన్॥ 17

తా॥ ఆ భృంగిరిటి కొంచెము శాంతించిన మనస్సుగలవాడై పరమానందముతో గూడు కొన్న నాసాగ్రదృష్టినివహించి ముద్రితములగు సకలేంద్రియములు గలవాడువలెనుండెను. అనగా ఉపశమించిన ఇంద్రియములుగలవాడై యోగనిద్రలోనుండెను. తరువాత విప్రుడు పార్వతీదేవి యొక్క విశాలమగు ఇంటియొక్క ముంగిలిప్రదేశము నాశ్రయించి ఏలాటి సందేహములేనివాడై రాత్రియందు క్షణకాలము సుఖముగ నిద్రించెను. ఆ సమయమున భృంగిరిటి మహర్షి నా పాద ములకు నమస్కరించి యీ ప్రకారమడుగసాగెను. ఓ దేవా! ఈ ప్రకారము మీ దర్శనభాగ్యము ఎవరికి కలిగినది? ఈతనిచే నెట్టి తపస్సు గావించబడెను? ఏ యే హోమము లాచరింపబడెను? ఈ మహాత్ముడెట్టి జపముజేసెను? ప్రభువులే స్వయముగావెళ్లి చేయూతనొసంగుచున్నారు గదా? ఏ కారణముచేత ఈ పట్టణమువదలి మరొకచోటికి నీ ధీరబుద్ధి పోజాలకున్నాడు. ఒకవేళ కాశీ పురముయొక్క హద్దునుదాటి స్వేచ్ఛగా చనినయెడల నప్పుడు పార్శ్వస్థులనుగూడ తానుజూచుట లేదు. ఈ కారణమును ప్రభుముఖమునుండి వినగోరుచున్నాను నేను అనుగ్రహింపదగినవాడ నైనచో వచించుటకు యుక్తమనితోచిన సెలవిండు. ఇవ్విధమున భృంగిరిటిమహర్షియొక్క ప్రార్థనా పూర్వక ప్రశ్నవిని ఓ దేవి! నేను భృంగిరిటికి జెప్పితిని..

శ్లో॥ కదాచిదాసం కైలాస పార్శ్వే పున్నాగ కాననే।
రణత్ఖేచరసుశ్రోణి పూర్ణస్తబక కాననే॥ 18
,, కలకంఠకులాలాప కల్లోలితదిగంతరే।
గరుత్మదాదిదాత్యూహ సమూహస్వరసంకులే॥ 19
,, భ్రమద్దారుఘటీయంత్ర ప్రోల్లసత్ బిందుదంతురే।
ప్రబుద్ధసారణిప్రాంత కదళీకందలాలసే॥ 20
,, కస్తూరీహరిణోపేతే కిన్నరస్వర మోహితే।
రోమంథమంథరాపాంగైః మృగైః క్వాపి నిషేవితే॥ 21
,, హంసైః కీరేషు పాండిత్యం కుర్వాణైస్సంకులే శుకైః।
నిర్ఘ్రాదిక్వణినీరంధ్ర సమీరణవిలోడితే॥ 22
,, మాధవీపుష్పనిర్యాస సీధుక్షీబమధువ్రతే।
ఉన్మీలత్త్రివళీపుష్ప గుచ్ఛసారభనిర్భరే॥ 23
,, ప్రోత్ఫుల్లవకులామోద మదమంథరషట్పదే।
సోమాదుద్భూతపీయూష క్షాళితస్థితిమండలే॥ 24

తా॥ కైలాసపార్శ్వభాగమున పుష్పగుచ్ఛములయందు క్రీడించుచు గానముచేయుచున్న ఖేచరులతోకూడుకొన్నదియు, అవ్యక్తమధురధ్వనిగల కోయిలయొక్క యాలాపములచే కల్లోలముగ జేయుచున్న దిఙ్మధ్యప్రదేశముగలదియు, గరుత్మంతుడు భరద్వాజముమొదలగు పక్షులయొక్క స్వరములతో కూడుకొన్నదియు, దారుమయజలయంత్రముచే వ్యాపింపజేయబడిన జలబిందువులచే శీతలముగా నున్నదియు, నిర్మలములగు కాలువలయొక్క ప్రాంతప్రదేశమున అరటిచెట్లుపుట్టగొడుగు లతో వ్యాప్తమైనదియు, కస్తూరిమృగములతోకూడుకొని కిన్నరస్వరములచే మోహింపజేయునదియు, నొకచోట నెమరువేయుచున్న మెల్లనిచూపులతో కూడుకొన్న మృగములతో కూడినదియు, పరస్ప రము దమ పాండిత్యమును ప్రకటించు శుకహంసలుగలదియు ఎల్లపుడు క్వణక్వణయని శబ్దించు

చున్న వాయువుచే చలింపజేయునదియు, బండిగురిగింజ పుష్పపానముచే మదించిన తుమ్మెదలు గలదియు, వికసించిన తెగడ పుష్పగుచ్ఛముల పరిమళభరితమైనదియు, బాగుగ వికసించిన పుష్పముల పరిమళముచేత మంధరగతిగల తుమ్మెదలతోకూడినదియు, చంద్రునినుండి ఉద్భవించిన అమృతముచే కడుగబడిన భూమండలముగలదియునగు సురపున్నాగవనమునందు,

శ్లో॥ అధ్యాస్య వేదికామేకామహం క్షణమవస్థితః।
ఉద్దండశాఖిసంఘట్ట స్ఫుటజ్ఝ మంథాముఖోత్కరైః॥ 25

,, ప్రకమ్పితాచలచ్ఛాయో వవౌ చండసమీరణః।
పశ్చాదభూన్మహాఘోషో నిర్ఘోషితదరీతటః॥ 26

,, అవాతరత్ తతః కశ్చిత్ పక్షీ గగనగహ్వరాత్।
శారదానీరదచ్ఛాయః కజ్జలానామివోచ్ఛ్రయః॥ 27

,, తమసామివ సంఘాతః పక్షచ్ఛేదీవ పర్వతః
అవష్టభ్య క్షితిం పద్భ్యాం పక్షీ మాం ప్రణనామ సః॥ 28

,, ఆనీయ పద్మమమ్లానమసౌ మత్పాదయోర్వ్యధాత్।
అథాసౌ స్పష్టయా వాచా పక్షీ స్తోత్రముదీరయత్॥ 29

తా॥ వేదికను అధిష్ఠించి క్షణకాలముంటిని. ఆ సమయమున మందరపర్వతశిఖరములను గొప్పగొప్పవృక్షములను పెళ్ళగించుకొనుచు గొప్పపర్వతములనుకూడ చలింపచేయుచున్నట్టి ప్రచండవాయువువీచెను. తరువాత గుహకందరములను మ్రోగింపజేయుచు నొక మహాధ్వని యుదయించెను. తరువాత నొకానొక పక్షిశ్రేష్ఠము ఆకసమునుండి దిగివచ్చెను. ఆ విహంగమము శరత్కాలమేఘమువలె నున్నదై కాటుకరాశివలెను చీకట్లయొక్క సమూహమువలెను నుంటున్నదై రెక్కలులేని పర్వతమువలె భూమిమీదపడి నా పాదములకు నమస్కరించెను ఆ పక్షిరాజము వాడని కమలమును నా పాదములయందు సమర్పించి స్పష్టమైనవాక్కుతో స్తోత్రము జేసెను.

శ్లో॥ జయదేవ చిదానంద సుధాసింధో జగత్పతే।
సదా సద్భావనానంగ కల్లోలానంతవిగ్రహ॥ 30

,, అద్వైతవాసనా మత్యా మలత్రయవివర్జిత।
జితేంద్రియవరాధీన సమాధిప్రాప్య నిగ్రహ॥ 31

,, నిరుపాధీ వినిర్ముక్తనిరాకార నిరామయ।
నిస్సీమనిరహంకార నిరాకరణనిర్గుణ॥ 32

,, శరణాగత సంత్రాణప్రవీణ చరణామ్బుజ।
భీమమాల మహావ్యాళ జ్వాలాదగ్ధమనోభవ॥ 33

,, కుఠారభిన్నదైత్యేంద్ర గండూషితమహావిభో।
త్రిపుర ప్రమదాఫాల సింధూరోద్ధూళిమార్జన॥ 34

శ్లో॥ కాత్యాయనీకుచామ్భోజ వరకుంకుమచర్చిత ।
నమః ప్రమాణరాయ నమః ప్రమతిరూపిణే ॥ 35

,, నమశ్చైతన్యనాథాయ నమస్త్రైలోక్యరూపిణే ।
వందే తవ పదామ్భోజం యోగిప్రవరచుమ్బితమ్ ॥ 36

,, అపారభవపాథోధి పారావతరణాద్భుతమ్ ।
వాచస్పతిరపి స్తోత్రే భవతో న ప్రగల్భతే ॥ 37

,, సహస్రవదనస్యాపి ఫణీంద్రస్య న చాతురీ ।
త్వద్వర్ణనే మహాదేవ కోఽహమల్పమతిః ఖగః ॥ 38

స్తోత్రమేతత్ సమాకర్ణ్య కృతం తేన పత్రిణా ।
తమవోచమహం కోఽసి కుతస్త్యోఽసి విహంగమ ॥ 39

,, హంసేన సదృశః కాయో వర్ణః కాకేన సన్నిభః ।
ప్రయోజనం కిముద్దిశ్య ప్రాప్తోఽసీహ తదుచ్యతామ్ ॥ 40

,, ఇతి పక్షీ మయా పృష్టః ప్రశ్రయా నతకంధరః ।
జగాద శ్లక్ష్ణయా వాచా పక్షీ వాక్యవిదాం వరః ॥ 41

తా॥ ఓ దేవా ! చిదానందరూపా ! అమృతసింధో ! సర్వలోకపతే ! ఎల్లప్పుడును సద్భావములు అను నలలచే తరంగితమగు శరీరముగలవాడా ! అద్వైతవాసనతోకూడిన బుద్ధిచేత ఆవరణాది మలత్రయమును దూరీకరించినవాడా ! జితేంద్రియులకు వశుడవై సమాధిచేత పొందతగిన ఆకారముగలవాడా ! ఓ ఉపాధిరహితా ! ఓ విముక్తస్వరూపా ! నిరాకారా ! నిరామయా ! హద్దులేనివాడా ! నిరహంకారా ! నిర్గుణా ! శరణాగత జనులను సంరక్షించుటకు సమర్థమైన పాదకమలముగలవాడా ! భయంకరమగు ఆవరణవర్జితా ! మాలారూపమైన గొప్పసర్పముయొక్క విషజ్వాలచే దహింపబడిన మన్మథుడుగలవాడా ! గోర్ధలిచే ఖండింపబడిన గజాసురుని తొండముగలవాడా ! మహావిభో ! త్రిపురాసురుల స్త్రీల యొక్క ఫాలభాగమునందలి సింధూరద్రవ్యమును పోగొట్టినవాడా ! పార్వతీ కుచకమల కుంకుమలిప్తాంగ ! ప్రమాణములకందని వాడవును జ్ఞానస్వరూపుడవును అగు నీకు నమస్కారము. చైతన్యనాథుడవగు నీకు నమస్కారము. త్రిలోకస్వరూపుడవగు నీకు నమస్కారము. అంతములేని సంసారసాగరమునుండి తరింపజేయుటచే ఆశ్చర్యకరమును యోగిపుంగవులచే స్పృశింపబడినదియునగు నీ దివ్యపాదకమలమునుగూర్చి నమస్కరించుచున్నాను. ఓ భగవంతుడా ! మిమ్ము స్తుతించుటకు బృహస్పతియును సమర్థుడు కాజాలడు. వేయిముఖములు ధరించిన ఆదిశేషునకుకూడ నట్టి చాతుర్యములేదు. యిటుండ, ఓ మహాదేవా ! నిన్నువర్ణించుటకు అల్పమతిగల పక్షియగు నే నెంతవాడ ? ఈ ప్రకారము పక్షిచే గావింపబడిన స్తోత్రమును నేను బాగుగా నాకర్ణించి దాని నీప్రకారముగా ప్రశ్నింపదొడగితిని. నీ వెవండవు ? ఎచ్చటనున్నవాడవు ? నీయాకారముజూడ హంసమువలెనున్నది. కాకవర్ణము నీ కెట్లు లభించెను ? దేని నుద్దేశించి ఇచట కేతెంచితివి ? దానిని సమగ్రముగా వినిపింపుము. తరువాత ఆ పక్షిరాజము నాచే ఈ ప్రకారము ప్రశ్నింపబడినదై నమ్రభావముతో వంచబడిన మెడగలదై వాక్యవిశారదమై సూక్ష్మవాక్కుతో నీప్రకారము జెప్పెను.

శ్లో॥ దేవేశ ధూర్జటే విద్ధి మాం మరాళం స్వయంభువః
కర్మణా యేన మే కార్ష్ణ్యం జాతమాధునికం విభో ॥ 42

,, తదాకర్ణయ సర్వజ్ఞ పృష్టం యది తదుచ్యతే।
మానసాత్సరసః పృథ్వీం యాతః ప్రాప్తోఽస్మి సంకటమ్ ॥ 43

,, సౌరాష్ట్రనగరాదారాత్సరసి స్ఫుటదమ్బుజే।
బాలేందుఖండధవళా మృణాలకబలానహమ్ ॥ 44

,, ఆదాయ బలమాశ్రిత్య నిరగాం గగనం ద్రుతం।
విహాయస స్తత స్తస్మాదకస్మాదపతం భువి ॥ 45

తా॥ ఓ దేవేశ! నన్ను బ్రహ్మదేవుని హంసనుగా దెలిసికొనుడు. యిప్పుడు నాకు నల్లదనము ఏ కర్మచేత కలిగెనో దాని నడిగితిరి గనుక వినుడు. నేను మానససరోవరమునుండి సంచారము జేయుచు భూప్రదేశమునకేతెంచి ఇట్టి సంకటమును పొందితిని. సౌరాష్ట్రదేశమున నొకా నొక తామరకొలనుగలదు. అందులోని చంద్రలేఖవలె తెల్లనగు తామరతూండ్లను కబలముగా గైకొని దానిబలముచే శీఘ్రముగా నాకసమున కెగసితిని. అకస్మాత్తుగ నేనాయాకసమునుండి నేలబడితిని.

శ్లో॥ అథ మోహపరీతాత్మా సర్వథా వికలేంద్రియః।
వేపమానవపుర్మోహాత్ స్పృష్టశ్శీతై స్సమీరణైః ॥ 46

,, ప్రబుద్ధః పతనే హేతుమపశ్యన్నాత్మన స్తదా।
అహో కిమేతదాపన్నమద్య పాతః కథం మమ ॥ 47

,, కాలిమా యేన కాయేఽస్మిన్ పక్వకర్పూరపాండురే
ఇత్యహం విస్మయావిష్టో యావత్కుర్వే విచారణమ్ ॥ 48

,, తావదమ్బురుహాద్వాణీ మశ్రౌషమహమీదృశీమ్।
ఉత్తిష్ఠ హంస వక్ష్యామి కారణం పాతకార్ష్ణ్యయోః ॥ 49

,, అథోఽత్థాయ సమాగత్య మయా మధ్యే సరోవరమ్।
దృష్టా రాజీవినీ రమ్యా రాజీవైః పంచభిర్యుతా ॥ 50

తా॥ తరువాత వికలేంద్రియుడనై మూర్ఛితుడనైతిని. చలింపచేయబడిన శరీరముగలవాడనై చల్లనివాయువులచే మూర్ఛనుండి తేలితిని. నేనుపడుటకు కారణమేమో నే నెరుంగనైతిని. అయ్యో! ఇట్లేల సంభవించెను? ఇప్పుడు నాకు పతనమెట్లు గలిగెను? కర్పూరమువలె తెల్లనగు నీ శరీరమున కాలిమవర్ణ మెటులకలిగెను? ఈ ప్రకారము ఆశ్చర్యచకితుడనై విచారంబున మునింగియుండ, నింతలో నటనున్న సరోవరకమలమునుండి ఓ హంసమా! లెమ్ము. పతన కారణము, కాలిమవర్ణ హేతువును నేను వక్కాణించెదను. అనువాక్యము నాకర్ణించితిని. తరువాత నేను సరోవరమధ్యమునకుంజని, అచ్చోట పంచకమలములుగల రమణీయముగానున్న తామర లతను గాంచితిని.

శ్లో॥ కారణం ప్రష్టుమారేభే కార్ష్ణ్యస్య పతనస్య చ।
అథ తత్ర ఘనశ్యామా స్వర్ణవర్ణామ్బరావృతా ॥ 51

శ్లో॥ చతుర్భుజాన్ గదాశంఖచక్రపంకేరుహాయుధాన్ ।
కిరీటహారకేయూరకుండలద్యుతిచిత్రితాన్ ॥ 52
,, అద్రాక్షమన్తరిక్షస్థాన్పురుషానయుతాని షట్ ।
నత్వా ప్రదక్షిణీకృత్య పంచపద్మాం సరోజినీమ్ ॥ 53
,, ఆత్మీయం పాతమారభ్య పృష్టం తదఖిలం మయా ।

పద్మిన్యువాచ:—

కలహంస గతోఽసి త్వం మాం విలంఘ్య విహాయసా ॥ 54
తేన పాతకయోగేన పతితోఽసి మహీతలే ।
,, తేనైవ కాలిమా కాయే పక్షిసత్తమ లక్ష్యతే ॥ 55
,, భవన్తం పతితం వీక్ష్య కృపాపూర్ణేన చేతసా ।
మధ్యమేనాముఖాబ్జేన వదతా జాతసౌరభమ్ ॥ 56
,, ఆఘ్రాయ షట్పదాష్షష్టిసహస్రాణి దివం యయుః ।
ఏతే యే భవతా దృష్టా నీలోత్పలసమత్విషః ॥ 57
,, సర్వే తే సప్తమేఽతీతే జన్మన్యాసన్మునేస్సుతాః ।
అస్యైవ సరసస్తీరే తేపుస్తే పరమం తపః ॥ 58
,, కదాచిత్కామినీ కాచిచ్చమ్పకస్తబకస్తనీ ।
చలాపాంగాలకాకాంత తరంగితరసాలినీ ॥ 59
,, నాసాముక్తాఫలజ్యోత్స్నా చుమ్బితస్మితదీధితిః ।
వీణాం విన్యస్య కుచయోర్వనేఽస్మిన్ మధురం జగౌ ॥ 60

తా॥ తర్వాత నేను నా నీలవర్ణమునకును పతనమునకును కారణంబడిగితిని. అచ్చట మేఘమువలె నల్లనైనవారును, పీతామ్బరధారులును, చతుర్భుజులును, గద, శంఖ, చక్ర, కమల, ఆయుధములను ధరించినవారును, కిరీటము, హారము, భుజకీర్తులు, కుండలములు, వీటియొక్క కాంతులచే చిత్రితవర్ణులును, అగు ఆకాశమున సంచరించు అరువేలమంది పురుషులను గాంచితిని. పంచపద్మములుగల తామరతీగెకు ప్రదక్షిణనమస్కారముచేసి, నా పతనము మొదలుకొని సమస్త వృత్తాంతములు నాచే ప్రశ్న గావింపబడెను. తర్వాత ఆహంసనుజూచి తామరతీగె పలుకుచున్నది. ఓహంసరాజమా! నన్ను స్వేచ్ఛగా నతిక్రమించి గగనమున కెగసితివి. ఆ పాతకముచే భూమిపై బడితివి. ఆ కారణమువల్లనే ఓ పక్షిరాజమా! నీ శరీరమున నీలవర్ణము కనబడుచున్నది. పడిన నిన్ను జూచి కృపాపూర్ణమనస్సుచే నా మధ్యనున్న కమలమీప్రకారము చెప్పుచుండగా దానిముఖము నుండి గలిగినసౌరభము నాఘ్రాణించి అరువదివేల తుమ్మెదలు స్వర్గమును పొందినవి. నీలోత్పల సదృశకాంతిని ధరించిన ఆ భ్రమరములన్నియు నీచే చూడబడినవికదా? వాటి పూర్వజన్మవృత్తాన్త మును వినుమా. అవన్నియు, ఏడుజన్మములకు ముందుజన్మమున మునిపుత్రులై ఈ సరోవర తీరమున పరమతపస్సును చేసినవి.

ఒకానొకప్పుడు ఒకానొక కాంతామణి వీణను చేబూని మధురముగా గానముజేసెను.

శ్లో॥ మయా దృష్టా మమైవేయమిత్యూచుస్తే పరస్పరం
ముష్టాముష్టి స్తత స్తేషాం భ్రాతౄణామభవద్రణః॥ 61

,, గాయన్త్యాః స్వరమాకర్ణ్య బ్రాహ్మణా హరిణా ఇవ
తాం సమాగత్య తే సర్వే సమమేవ వ్యలోకయన్॥ 62

అన్యోన్యముష్టినిష్పిష్ట రక్షస న్త్యక్తజీవితాః।
తే భుక్త్వా నిరయాన్ ఘోరాన్ బభూవుస్సారసా భువి॥ 63

,, తదా తే శ్వాపదాన్ జఘ్నుర్దగ్ధావన్యేన వహ్నినా।
తతో మాతంగతామేత్య పథి పాంథానఘాతయన్॥ 64

,, వనే విషోదకం పీత్వా తే యయుర్యమమందిరమ్।
ఖరోష్ట్రకపిమార్జాల జన్మాన్యాసాద్య చ క్రమాత్॥ 65

,, తతో మధువ్రతా జాతా వర్తన్తేఽత్ర సరోవరే।
అద్య మే గంధమాఘ్రాయ ప్రాపుస్తే వైష్ణవం పదమ్॥ 66

తా॥ ఆ వనితయొక్క గానమునువిని జింకలువలె బ్రాహ్మణులు ఆ కాంతను నొకేమారుచని జూచిరి. వారలలో 'మొట్టమొదట నాచే చూడబడినది, గనుక నీ కాంతనాది'యని పరస్పర వివాదము చెలరేగెను. తరువాత ఆ సహోదరులకు ముష్టాముష్టియుద్ధము జరిగెను. అందుచే వారందరు మడిసిరి. తరువాత వారలనేక నరకములనుపొంది సారసములై జన్మించిరి. అవివ్యాఘ్రములనుకూడ చంపునవై అరణ్యాగ్నిచే దహింపబడినవి. తరువాత మరుజన్మమున నవి ఏనుగులై బాటసారులను చంపినవి. వనమున విషమును పానముజేసి మరణించినవి. ఇకను నవి గార్దభములుగను ఒంటెలుగను, కోతులుగను, మార్జాలములుగను జన్మించినవై నీ సరోవరమునందే ఇప్పుడు తుమ్మెదలై నా యొక్క పరిమళము నాఘ్రాణించి విష్ణుస్థానమున కరుదెంచినవి.

శ్లో॥ శృణు పక్షీంద్ర వక్ష్యామి యేన మయ్యస్తి వైభవమ్।
ఏతస్మాజ్జన్మనః పూర్వే తృతీయే జన్మని క్షితౌ॥ 67

,, సరోజవదనా నామ ద్విజాతేః కన్యకాఽభవమ్।
పాతివ్రత్యైకనిరతా గురుశుశ్రూషణే రతా॥

,, కదాచిత్సారికామేకాం పాఠయంత్యా విలమ్బితం।
సారికా భవ పాపే త్వం పత్యా శప్తాఽస్మి కుప్యతా॥ 69

,, ప్రేత్య సారిత్వమాసాద్య పాతివ్రత్యప్రసాదతః।
మునీనామేవ సదనే కన్యా కాచిత్ పుపోష మాం॥ 70

,, గీతానాం దశమాధ్యాయం విభూతిరితి విశ్రుతం।
ప్రాతః పఠతి విప్రోఽసావశ్రౌషం తమఘాపహమ్॥ 71

,, కాలేన సారికాదేహమహం హిత్వా విహఙ్గమ।
దశమాధ్యాయమాహాత్మ్యాదప్సరాశ్చాభవం దివి॥ 72

తా॥ ఓ పక్షిరాజమా! నాయొక్క మాహాత్మ్యమును వినుము. ముందు మూడవ జన్మమునందు సరోజవదనయను పేరుగలదాననై బ్రాహ్మణకన్యకగ యుంటిని పాతివ్రత్యముతో గురుశుశ్రూషజేయుచుంటిని. నేను నొకానొకప్పుడు, విశ్రాంతిలేక గోరువంకను పఠింపజేయు చుంటిని. అప్పుడు నా పతి కోపముతో గోరువంకవగుమని శపించెను. తరువాత నేను పాతివ్రత్య మాహాత్మ్యముచే సారికగాజన్మించి మహర్షులయొక్క గృహమునందొకానొక కన్యక నన్ను పోషించెను. నేనచ్చోట బ్రాహ్మణుడు సకల కల్మషముల హరించునట్టి విభూతియోగమనబడు దశమాధ్యాయమును పఠించుచుండగ, వింటిని. కొంతకాలమునకు నా సారికాత్వముపోయి, ఓ పక్షి రాజమా! దశమాధ్యాయ మాహాత్మ్యమువలన స్వర్గలోకమున నొకానొకనప్సరగనైతిని.

శ్లో॥ పద్మావతీతి విఖ్యాతా పద్మాయా దయితా సఖీ।
కదాచన మయా యాంత్యా విమానేన విహాయసా॥ 73

,, వీతత్సరోవరం రమ్యం విలోక్య విమలామ్బుజం।
అవతీర్య జలక్రీడా యావదారభ్యతే మయా॥ 74

,, దుర్వాసాస్తావదాయాతో వివస్త్రా తేన వీక్షితా।
తద్భయాత్పద్మినీరూపం ధృతమేతన్మయా స్వయమ్॥ 75

,, పద్భ్యాం పదద్వయం చైవ ద్వయం హస్తద్వయేన చ।
ముఖేన పంచమామ్భోజమితి పంచామ్బుజాస్మ్యహమ్॥ 76

,, దృష్ట్వా తేన మునీంద్రేణ కోపజ్వలితచక్షుషా।
అనేనైవ స్వరూపేణ తిష్ఠ పాపే శతం సమాః॥ 77

,, ఇతి శాపం సముత్సృజ్య స చైవాంతర్దధే క్షణాత్।
విభూత్యధ్యాయమాహాత్మ్యాత్ వాణీ మే న విలీయతే॥ 78

,, మద్విలంఘనమాత్రేణ పతితోసి మహీతలే।
అద్య శాపనివృత్తిర్మే తిష్ఠతస్తే ఖగోత్తమ॥ 79

,, నిశామయ మయా గీయమానమధ్యాయముత్తమం।
యస్యాకర్ణనమాత్రేణ త్వమద్యైవ విమోక్ష్యసే॥ 80

,, ఇత్యసౌ దశమాధ్యాయం పపాఠ శ్లక్ష్ణయా గిరా।
తమాకర్ణ్య తయా దత్తమాదాయ చ సరోరుహమ్॥ 81

,, మయా సమర్పితం తుభ్యం పద్మిన్యా పద్మముత్తమం।
ఇత్యుక్త్వా స జహౌ దేహం తదద్భుతమివాభవత్॥ 82

తా॥ లక్ష్మీదేవికి ప్రియమైన చెలికత్తెలై పద్మావతియను నామధేయముతో ప్రసిద్ధిపడ సితిని నేను నొకానొకప్పుడు విమానములో సంచరించుచూ నీ సరోవరమునుజూచి దిగి జలక్రీడచేయ నారంభించితిని. ఇంతలో దుర్వాసమహర్షి నన్నుజూచెను. నే నాతని భయమువలన నే నిట్టి తామర తీగరూపమును ధరించితిని. నా యొక్క రెండుపాదములు రెండుకమలములుగను, హస్తద్వయము కమలద్వయముగను, ముఖముచే ఐదవకమలముగనై పంచామ్బుజయనెడి పేరుతోవిలసిల్లితిని.

ఈ విషయము నంతయు దుర్వాసమహర్షి గనుగొని తీవ్రకోపముతో నీ విట్టి రూపములోనే నూరు సంవత్సరములుండు మాయనిశపించి అదృశ్యుడాయెను. గీత దశమాధ్యాయ పఠనమాహాత్మ్యముచే నీ జన్మములోకూడ నా వాక్కు విలుప్తముగాలేదు. నన్ను దాటి నీవు చనినమాత్రముచేతనే నీవు భూమిమీదపడితివి. నీ వుండగనే నాకు శాపనివృత్తి కలుగుచున్నది. నేను గీతదశమాధ్యాయమును చదువుచున్నాను వినుము. దానివలన నీవు పాతకమునుండి విడివడెదవు. ఈ ప్రకారముజెప్పి నా పద్మిని సూక్ష్మవాక్యముతో దశమాధ్యాయమును పఠించెను. తర్వాత విముక్తిజెందెను. నేను దానినివిని దానిచేయివ్వబడిన కమలమును మీపాదములయందర్పించితిని. ఇట్లనిజెప్పుచు తన దేహమును వదలెను. యెంతో ఆశ్చర్యమయ్యెను.

భృంగిరిటిరువాచ:—

శ్లో॥ పురాతనే భవే కోయం బ్రహ్మ హంసోభవత్కథం।
తవాగ్రతః కుతో హేతోరుత్ససర్జ కళేబరమ్॥ 83

,, ఇతి భృంగిరిటేర్వాక్యమాకర్ణ్యాహం తదాఽబ్రువమ్।
ద్విజవేశ్మని పూర్వస్మిన్ జన్మన్యయమజాయత॥ 84

,, సుతపా ఇతి విఖ్యాతో బ్రహ్మచారీ జితేంద్రియః।
వసన్ గురుకులే కుర్వన్ వేదాధ్యయనమన్వహమ్॥

,, గురుశుశ్రూషణం సమ్యక్ విదధాతి చ భక్తితః।
శయానస్య గురోశ్శయ్యాం నిద్రితః స పదాఽస్పృశత్॥

,, తేన పాపేన తిర్యక్త్వమయం స్వర్గేఽపి లబ్ధవాన్।
పద్మయోనిమరాలానాం మధ్యే జాతస్తతో ద్విజః॥ 87

,, అస్మిన్ జన్మన్యముష్యేహ పురాస్మల్లోకనావధి।
గీతానాం దశమాధ్యాయం నళిన్యా కథితం తతః॥

,, ఆకర్ణ్య విహగో లేభే బ్రహ్మజ్ఞానమనుత్తమమ్।
సోఽయం విప్రకులే జాతో దశమాధ్యాయవైభవాత్॥

,, జన్మాభ్యాసవశాదస్య శిశోరపి ముఖాంబుజాత్।
గీతానాం దశమాధ్యాయః సముల్లసతి సర్వదా॥ 90

,, తదర్థపరిణామేన సర్వభూతేష్వవస్థితం।
శంఖచక్రధరం దేవమయం పశ్యతి సర్వదా॥ 91

,, యస్మిన్ యస్మిన్ యదైవాస్య దృష్టిః స్నిగ్ధా శరీరిణః।
స స ముక్తో భవేత్పూర్వః సురాపో బ్రహ్మహాఽపి వా॥ 92

,, తద్విజ్ఞాయ మయా విప్రః పరమాత్మస్వరూపిణా।
ఇదం నగరమానీతో ముక్తిక్షేత్రం స్వభావతః॥ 93

,, అత్రత్యానాం మనుష్యాణాం ముక్తిః కరతలే స్థితా।
తేనాస్య దృష్టిపాతేన విశేషోఽన్యో న జాయతే॥ 94

శ్లో॥ న దదామి బహిర్గంతుమహమన్య పురా కృతం।
దశమాధ్యాయమాహాత్మ్యాత్ తత్త్వజ్ఞానం సుదుర్లభమ్॥ 95
,, లబ్ధమేతేన మునినా జీవన్ము క్తిరియం తథా।
తేనాస్య చలతో హస్తం దదామి పథి గచ్ఛతః॥ 96
,, దశమాధ్యాయ మహిమా భృంగిరిటే మహానయం।
ఇతి భృంగిరిటేరగ్రే కథితం యత్కథానకమ్॥ 97
,, తవేదమత్ర కథితం సర్వపాపప్రణాశనమ్।
నరో వాఽప్యథవా నారీ యాఽపి కోఽపి చ వా పునః॥ 98
,, అస్య శ్రవణమాత్రేణ సర్వాశ్రమఫలం లభేత్॥ 99

తా॥ భృంగిరిటిముని మరల పరమేశ్వరుని నిట్లు ప్రశ్నించెను. పూర్వజన్మమున యీ హంస యేమిగాయుండెను? బ్రహ్మకు వాహనముగ నెటులాయెను? తమదగ్గరకు వచ్చుటకు హేతువేమి? యెందులకు శరీరమునువదలెను? ఈ ప్రకారము భృంగిరిటివాక్యమునువిని ఓ దేవీ! నేనిటు లాతనితో జెప్పితిని. పూర్వజన్మమున బ్రాహ్మణకులమున సుతపుడని పేరుతో విఖ్యాతిగాంచి జితేంద్రియుడగు బ్రహ్మచారి గురుకులమున వేదాధ్యయన తత్పరుడైయుండెను. చాలభక్తితో గురుశుశ్రూష జేయుచుండెను. ఒకప్పుడు గురువు నిద్రించుచుండ తానున్ను నిద్రించుచుండగా తనకు తెలియకుండ తనపాదము గురువునకుతగిలెను. ఆ దోషముచే యాబ్రహ్మచారి స్వర్గలోకమున బ్రహ్మదేవునిహంసలలో నొకహంసగా జన్మించెను. ఈ జన్మమున నన్ను చూచువరకు పద్మినిచే పఠింపబడిన గీతయొక్క దశమాధ్యాయమును వినుటచేతను, ఈ హంసపక్షి అత్యుత్తమమగు బ్రహ్మజ్ఞానమును పొందెను. అట్టి హంస దశమాధ్యాయ పఠనముచే బ్రాహ్మణుడైపుట్టెను. ఆ బ్రాహ్మణుని పుత్రుడు గీత దశమాధ్యాయమును పఠించుచుండును. ఆ యర్థమును విశదీకరించుటచే సమస్తభూతముల యందున్నట్టియు శంఖచక్ర గదాపాణియునునగు విష్ణుదేవుని యెల్లప్పుడు తనలో గాంచుచుండెను. ఆ మాహాత్మ్యముచే యీతనిదృష్టి యెవరిపైపడునో వాడు సురాపానపాతకుడైనను బ్రహ్మహంతకుడైనను ముక్తుడగుచున్నాడు. యీ విషయములను దెలిసికొని పరమాత్మస్వరూపుడగు నేను ఈ బ్రాహ్మణోత్తముని నీ నగరమునకుఁ దీసికొనివచ్చితిని. గనుక నిది స్వభావముగనే ముక్తిక్షేత్రమాయెను. అందుచే నిచటనున్న మనుష్యులకు ముక్తియనునది చేతిలో నున్నది. ఇయ్యదియే విశేషము. అందువలన నేనితనిని నీ పట్టణమునుండి వెలుపలికి వెళ్ళనివ్వను. దశమాధ్యాయ పఠనమాహాత్మ్యమువల్లనే సుదుర్లభమగు తత్త్వజ్ఞానమునుబడసి జీవన్ముక్తుడైయున్నాడు. ఈ ప్రీతిచేతనే మార్గమున నడచునప్పుడీతనికి చేయూతనొసగెదను. ఓ భృంగిరిటీ! దశమాధ్యాయమహిమ చాలాగొప్పది. ఓ దేవీ! ఆతనికి బోధించిన కథాభాగమునే నీకు నేను నుడివితిని. ఇయ్యది, సమస్త పాతకములహరించునది, పురుషుడైనను స్త్రీ యైనను శ్రవణమాత్రమున సర్వాశ్రమధర్మముల యనుష్ఠించు ఫలమును పొందుచున్నారు.

ఓమ్

# ఏకాదశాధ్యాయ మాహాత్మ్యము

దేవ్యువాచ:—

శ్లో॥ ఇతిహాసోఽయమీశాన శ్రేయసాం సాధనం పరం।
ఆకర్ణ్య కరుణాపూర్ణ మమ కాంక్షా ప్రవర్తతే॥ 1
,, ఏకాదశస్య మాహాత్మ్యమధ్యాయస్య కథాశ్రయమ్।
వ్యావర్ణయ విరూపాక్ష వక్తౄణాం ప్రథమ ప్రభో॥ 2

తా॥ పార్వతిదేవి అడిగెను. ఈ కథాభాగము మిగుల శ్రేయస్కరము. ఓ కరుణాపూర్ణా! వినగ వినగ ఉత్కంఠ ఉదయించుచున్నది. అటులనే ఓ ప్రవక్త ప్రవర! పదునొకండవ అధ్యాయ మాహాత్మ్యమును విశదీకరింపుము.

ఈశ్వర ఉవాచ:—

శ్లో॥ ఆకర్ణయ కథాం కాన్తే గీతావర్ణనసంశ్రయాం।
విశ్వరూపాభిధానస్య మాహాత్మ్యమపి పావనమ్॥ 3
,, అధ్యాయస్య విశాలాక్షి వక్తుం తావన్న శక్యతే।
సహస్రాణి కథాస్సన్తి తత్రైకా కథ్యతే మయా॥ 4
,, ప్రణీతాయాస్తటేనద్యా మేఘంకరమితి శ్రుతం।
నగరం గరిమాధార తుంగప్రాకారగోపురమ్॥ 5
,, విశాలాశ్రమశాలాసు స్వర్ణస్తంభవిభూషితం।
శ్రీమద్భిః సుఖిభిః శాన్తైః సదాచారైర్జితేంద్రియైః॥ 6
,, అధిష్ఠితం జనైశ్చారు శృంగాటకమనోహరం।
మణిస్తంభస్ఫురత్ స్వర్ణాపణచత్వరశోభితమ్॥ 7
,, పతాకా కింకిణీక్వాణకదమ్బకకలస్వరం।
వేదాధ్యయననిర్ఘోష వాచాలితదిగంతరమ్॥ 8
,, తూర్యసంఘోషణాకీర్ణ విశాలవ్యోమమండలం।
పతాకా పల్లవోద్భూతవాతనిర్జితవిగ్రహమ్॥ 9
,, రాజమార్గవరద్వార నారీమంజీరశింజితైః।
వల్లకీ వేణుజైర్గీతైర్భాతి వాజీంద్రహేషితైః॥ 10
,, ప్రేక్షమాణమివాభీక్ష్ణం దిక్పాలానాం పురైస్సమం।
ఆస్తే జగత్పతిర్యత్ర శార్ఙ్గపాణిర్విరాజితః॥ 11

తా॥ ఈశ్వరుడిట్లుపలికెను! ఓ దేవీ! ఈ భగవద్గీతావిషయమై నిక వాక్రుచ్చెదరు వినుము. పదునొకండవ యధ్యాయము అగు విశ్వరూపసందర్శన యోగముయొక్క మాహాత్మ్య

ప్రతిపాదనా విషయమై వేలకొలది గాధలుగలవు. దాని పవిత్రత పొగడ సాధ్యముకాదు. ఆ విష యమై ప్రధానమగు నొక కథను వక్కాణించెదను. ప్రణీతయను నదియొక్కయొడ్డున మేఘంకర మను ప్రసిద్ధివడసిన పురమొండుగలదు. అప్పురమున ఉన్నతమైన ప్రాకారగోపురమును స్వర్ణ స్తంభనిర్మిత విశాలాశ్రమ భవనములును శ్రీమంతులును, సుఖవంతులును, శాంతులును, దాంతు లును, సదాచారసంపన్నులును, జితేంద్రియులును, తీక్ష్ణబుద్ధిగలవారును మనోహర చతుష్పధము లును సువర్ణమయ విపణివీథులును గలవు. మరియు నా పట్టణమున పతాకాధ్వనులును వేదా ధ్యయన ఘోషలు తూర్యనినదములు శత్రుభయంకర పతాకావాయువులును, వీణావేణుగీతములు శ్రేష్ఠమైన అశ్వధ్వనులు వీటిచే నొప్పుచున్నదై దిక్పాలకులయొక్క పట్టణముతో సమానమై యుండెను. ఆ పురవరంబున సకలలోకపతియగు శార్ఙ్గపాణి (విష్ణువు) విరాజిల్లుచుండెను.

శ్లో॥ మూర్తిమత్పరమం బ్రహ్మ జగల్లోచనజీవితం।
లక్ష్మీనయనరాజీవపూజితాకారగౌరవః ॥ 12

,, త్రివిక్రమవపుర్మేఘశ్యామలః కోమలద్యుతిః।
శ్రీవత్సవక్షరాజీవ వనమాలావిభూషితః ॥ 13

,, అనేకభూషణోపేతః సరత్న ఇవ వారిధిః।
చలత్ సౌదామినీదామ సాంద్రమేఘసమద్యుతిః ॥ 14

,, తస్యాస్తే ముకుటే సాక్షాత్ శార్ఙ్గపాణిః పురః పుమాన్।
తం దృష్ట్వా ముచ్యతే జంతుః జన్మసంసారబంధనాత్ ॥ 15

తా॥ ఆ భగవంతుడు మూర్తీభవించిన పరబ్రహ్మస్వరూపుడై సకలలోకములకు నేత్ర ప్రాయుడైయుండెను. లక్ష్మీపూజ్యభావదృష్టికి సాక్షాత్కరించువాడును, త్రివిక్రమావతారుడును, మేఘశ్యామలాంగుడును, శ్రీవత్సధరుడును, వనమాలా భూషితుడును, మరియు ననేక భూషణము లతో కూడుకొని రత్నములతో కూడుకొన్న సముద్రునివలె యుంటున్నవాడును, లక్ష్మీధరుడు గనుకనే మెఱుపుతీగతోనొప్పారు మేఘసమాన కాంతిగలవాడునై యుండెను. ఆ పట్టణముయొక్క శిఖరభాగమున పరమపురుషుడగు విష్ణువు సదా నివాసియైయుండెను. ఆ భగవంతునిగాంచి జను లెల్లరు ముక్తిని బడయుచుండిరి.

శ్లో॥ యస్మిన్ పురే మహాతీర్థం విద్యతే మేఖలాభిధం।
యత్ర స్నాత్వా నరైర్నిత్యం ప్రాప్యతే వైష్ణవం పదం॥ 16

,, తత్ర వీక్ష్య జగన్నాథం నరసింహం కృపార్ణవం।
స ప్తజన్మార్జితాద్ఘోరాన్ముచ్యతే దుష్కృతాన్ నరః॥ 17

,, మేఖలాయాం గణాధీశం విలోకయతి యో నరః।
స నిస్తరతి విఘ్నాని దుస్తరాణ్యపి సర్వదా ॥ 18

,, బ్రహ్మచర్యపరో దాంతో నిర్మమో నిరహంకృతిః।
తస్మిన్మేఘంకరే కశ్చిదభూత్ బ్రాహ్మణసత్తమః॥ 19

శ్లో॥ సునంద ఇతి విఖ్యాతో వేదశాస్త్రవిశారదః ।
వశీకృతేంద్రియగ్రామో వాసుదేవపరాయణః ॥ 20
,, దేవస్య శార్ఙ్గిణః పార్శ్వే గీతాధ్యాయమిమం ప్రియే ।
ఏకాదశం పఠత్యేష విశ్వరూపప్రదర్శనమ్ ॥ 21
,, అధ్యాయస్య ప్రభావేన బ్రహ్మజ్ఞానమవాప సః ।
పరమానందసందోహశ్లాఘ్యసంవిత్సమాధినా ॥ 22
ప్రత్యఙ్ముఖేంద్రియతయా నిశ్చలాం స్థితిమీయుషా ।
సతతం స్థీయతే తేన జీవన్ముక్తేన యోగినా ॥ 23
,, ఏకదా స మహాయోగీ సింహరాశిస్థితే గురౌ ।

తా॥ ఆ పట్టణమున మేఖలయను మహాతీర్థమొండుగలదు. అచ్చట స్నానమాచరించి కృపాసముద్రుడును జగన్నాథుడగు నరసింహమూర్తిని దర్శించినవారు విష్ణుస్థానమును పొందుచున్నారు. ఏడుజన్మములనుండి యొనర్చిన పాతకమునుండి విముక్తులై జ్ఞానసంపన్నులగుచున్నారు. ఆ మేఖలాతీర్థమునందలి గణాధిపతిని దర్శించినవారు దుస్తరములగు విఘ్నములనుకూడ యెల్లప్పుడు నశింపజేసికొను చున్నారు. ఆమేఘంకరనగరమున సునందుడను బ్రాహ్మణసత్తముం డొకడు గలడు. అతడు బ్రహ్మచర్యవ్రత పరాయణుడు. అహంకార మమతాశూన్యుడు, వేదశాస్త్ర ప్రవీణుడు, జితేంద్రియుడునై యుండెను. మరియు నాతడు వాసుదేవభక్తుడై శార్ఙ్గపాణి సన్నిధి యందు ఏకాదశాధ్యాయము నిత్యము పఠించుచుండెను. ఆ అధ్యాయపఠన ప్రభావమున నాతనికి బ్రహ్మజ్ఞానము ప్రాప్తించెను. పరమానంద ఘనీభూత నిశ్చలచిత్సమాధిచే అంతర్ముఖేంద్రియుడై ఎల్లప్పుడు జీవన్ముక్తస్థితిలోనుండెను. ఒకా నొక సమయమున నా మహాయోగి బృహస్పతి సింహ రాశిని ప్రవేశించునప్పుడు,

శ్లో॥ గోదావరీతీర్థయాత్రాం విధాతుముపచక్రమే ।
ప్రథమేఽహ్ని సమాగత్య విరజం తీర్థముత్తమమ్ ॥ 24
,, నాభిమారభ్య తీర్థేషు స సమభ్యర్చ్య దేవతాం ।
మజ్జన్మజ్జన్ జగద్ధాత్రీం కమలాం స వ్యలోకయత్ ॥ 25
,, తాం సంపూజ్య మహామాయాం సర్వకామఫలప్రదాం ।
తారాతీర్థే తతః స్నాత్వా కపిలాసఙ్గమే తతః ॥ 26
,, అష్టతీర్థమసౌ చక్రే విధాయ పితృతర్పణం ।
కుమారీశం శివం నత్వా కపిలాద్వారమాయయౌ ॥ 27
,, తత్ర నిర్మజ్య నిర్ధూత ప్రాగ్జన్మాంతరదుష్కృతః ।
సంపూజ్య నత్వా శ్రుత్వా చ దేవం వై మధుసూదనమ్ ॥ 28
,, ఉషిత్వా తత్ర తాం రాత్రిం ప్రాగాత్ప్రాతః సహద్విజైః ।
నరసింహవనే తత్ర తీర్థే రామస్య దీర్ఘికా ।
ప్రహ్లాదపూజితస్వాఙ్ఘ్రిరాస్తే యత్ర నృకేసరీ ॥ 29

శ్లో॥ తం దృష్ట్వా దేవదేవేశం పూజయిత్వా తు భక్తితః।
తత్ర తం దివసం నీత్వా స యయావమ్బికాపురం॥ 30

తా॥ గోదావరీ పుష్కరతీర్థయాత్రచేయుటకై బయలుదేరెను. మొదటిదినమున విరజా తీర్థమును సేవించెను. నాభితీర్థము మొదలుకొని ఆయాదేవతల పూజించి నచ్చటచ్చట తీర్థముల యందు స్నానమొనర్చుచు మహామాయారూపిణియగు లక్ష్మీదేవిని పూజించెను. తారాతీర్థ యమునాసంగమములయందు స్నానమాచరించెను. ఈ ప్రకారము అష్ట తీర్థములు సేవించి పితృ తర్పణముజేసి శివునిపూజించి కపిలాద్వారమునకు పోయెను. అచ్చట స్నానమాచరించి నిర్ధూత కల్మషుడై మధుసూదనుని నమస్కరించి స్తుతించి పూజించి నా ప్రదేశంబున నారాత్రివసించి బ్రాహ్మణులతోకూడ వేకువజామున నరసింహవనమునుగూర్చి పోయెను. ఆ తీర్థమున రామదీర్ఘిక యందు ప్రహ్లాదునిచే పూజింపబడిన నృసింహస్వామి గలడు. అచ్చట నా స్వామిని భక్తితోదర్శించి ఆ దినమునుగడపి అమ్బికాపట్టణమునుగూర్చి పోయెను

శ్లో॥ అనుగ్రహేణ భక్తానామమ్బికా తత్ర తిష్ఠతి।
పూరయన్తి మనుష్యాణాం వాంఛితాన్యఖిలాన్యపి॥ 31
,, పూజయిత్వాఽమ్బికాం భక్త్యా పుష్పగంధానులేపనైః।
ఉపహారైశ్చ వివిధైః స్తోత్రైః ప్రణమనైరపి॥ 32
,, విప్రస్తస్మాత్పురాత్ప్రాప్తః కంఠస్థానాభిధం పురం।
యత్రాస్తే పరమా శక్తిర్మహాలక్ష్మీర్మహాద్యుతిః॥ 33
తామవేక్ష్య సుధాభానుభాస్కరద్యుతిమండలామ్।
సంసారతాపవిచ్ఛేద పద్మపీయూషవాహినీమ్॥ 34
,, యోగిరాజహృదమ్భోజరాజహంసనిషేవితాం।
అనాహతమహానాదమయీమవ్యయరూపిణీమ్॥ 35
,, మహాలక్ష్మీం భగవతీం వాంఛితార్థప్రదాయినీం।
అరాధ్య భక్తిభావేన చేతసా స మునీశ్వరః॥ 36
,, వివాహమండపం ప్రాప పురం విప్రైస్సమన్వితః।
పురే తత్ర ప్రతిగృహం వాసస్థానమయాచత॥ 37

తా॥ అచ్చట భక్తులననుగ్రహించుటకొరకై అమ్బికాదేవి బద్ధకంకణురాలై మనుష్య మనోరథములను నెరవేర్చుచుండెను. పరమభక్తితో నా యమ్బికాదేవిని ప్రణామస్తోత్రాదులచేత పూజించి తరువాత నా సునందుడు కంఠస్థాన పురమునుగూర్చి వచ్చెను. అచ్చట పరమశక్తి స్వరూపిణియగు మహాలక్ష్మి గొప్పతేజస్స్వరూపిణియై ప్రకాశించుచుండెను. సూర్యమండల చంద్ర మండలముల ప్రకాశింపజేయునదియు సంసారసంతాపము నశింపజేసి సుధను ప్రవహింపజేయు నదియు యోగిశ్రేష్ఠుల హృదయకమలమునకు రాజహంసయైనదియు అనాహత మహానాదమను ప్రణవధ్వనిరూపిణియు అవ్యయమై పూజ్యురాలై వాంఛితార్థముల యిచ్చునట్టి మహాలక్ష్మినిజూచి భక్తితోపూజించెను. అటుతరువాత బ్రాహ్మణులతో కూడినవాడై కల్యాణమండపమను పురమునకు వచ్చెను. ఆ పట్టణమున తానుండుటకై నివాసస్థానమును ప్రతిగృహమునందును యాచించెను.

శ్లో॥ న లేభే వసతిం స్థాతుం గేహే కస్మిన్నపి ద్విజః ।
దర్శితం గ్రామపాలేన విశాలం వాసమందిరమ్ ॥ 38
,, ప్రవిశ్య వసతిం చక్రే బ్రాహ్మణస్సంగిభిస్సహ ।
తతః ప్రభాతే విమలే సునందోఽసౌ ద్విజోత్తమః ॥ 39
,, బహిరాలోకయాంచక్రే వాసగేహాన్నిజం వపుః ।
అధ్వాన్యానఖిలాన్ యత్ర జాతాన్ క్వాపి యదృచ్ఛయా ॥ 40
,, గమ్యమానః సమాయాన్తం గ్రామపాలో దదర్శ సః ।
తం బభాషే గ్రామపాల ఆయుష్మానసి సర్వశః ॥ 41
,, భాగధేయవతాం పుంసాం పుణ్యైః పుణ్యవతామసి ।
ప్రభావో విద్యతే వత్స కోపి లోకోత్తరస్త్వయి ॥ 42
,, క్వ ప్రయాతా సహాయాన్తే కథం తత్సదనాద్బహిః ।
తత్పశ్య మునిశార్దూల కథయామి తవాగ్రతః ॥ 43
,, కింతు నాన్యం త్వయా తుల్యం పశ్యామీహ తపస్వినం ।
కిం జానాసి మహామంత్రం కాం విద్యామవలమ్బసే ॥ 44
,, కస్య దేవస్య కారుణ్యాచ్ఛక్తిర్లోకోత్తరా త్వయి ।
తత్కారుణ్యవశాత్తిష్ఠ గ్రామేఽస్మిన్ బ్రాహ్మణోత్తమ ॥ 45
,, శుశ్రూషామఖిలామేవ భగవన్తే కరోమ్యహం ।
ఇతి సంవాసయామాస తస్మిన్ గ్రామే మునీశ్వరమ్ ॥ 46
,, పరిచర్యాం చ తస్యాసౌ భక్త్యా చక్రే దివానిశం ।
దివసేషు ప్రయాతేషు సప్తాష్టసు సమేయివాన్ ॥ 47
,, ప్రాతరాగత్య తస్యాగ్రే రురోద భృశదుఃఖితః ।
అద్య మే భాగ్యహీనస్య గుణవాన్ భక్తిమాన్ సుతః ॥ 48
,, జాజ్వల్యమానదంష్ట్రేణ భక్షితో నిశి రక్షసా ।
ఇత్యేవం రక్షకేణోక్తం తం పప్రచ్ఛ స సంయమీ ॥ 49

తా॥ ఎచ్చోటను నా సునందునికి వసతి లభింపకపోయెను. ఇట్లుండగ నా గ్రామాధికారి విశాలమగు నొకమందిరమును జూపెను. ఆ రాత్రి యా ప్రదేశమునందు తాను మిత్రులున్ను నివసించిరి. తెల్లవారగానే నా సునందుడు తానొక్కడు వెలుపలికివచ్చెను. మిగిలినవారిని చూడకపోయెను. ఆ సమయమున గ్రామపాలుడు తిరిగివచ్చి నాసునందునితో నిటులపలికెను. ఓ ఆయుష్మంతుడా! ఓ మహాభాగధేయా! నీవే పుణ్యాత్ములలో పుణ్యపురుషుడవు. నీయందొకానొక లోకోత్తర ప్రభావమున్నది. నీతోకూడ నున్నవారలెటుల జనుదెంచిరి? తమ రిచ్చట మిగిలియున్నారు, మీతో సమానుడగు మహాతపోవంతుని నేనెచ్చటనుగనలేదు. తమరెట్టి మహామంత్రమును దెలిసికొనియున్నారు? యే విద్య నుపాసించితిరి? యే దేవుని యనుగ్రహమువలన మీ కిట్టి శక్తిలభించినది? మీరు నా యందు దయయుంచి నీ ప్రదేశముననే నివసించుడు. సమస్త పరిచర్య

లను నేనొనర్చుచుందును. ఇటుల వాక్రుచ్చి నా బ్రాహ్మణోత్తముని నచ్చటనే వసించునటుల నా గ్రామాధికారి యొనర్చెను. ఈ ప్రకారమాయధికారి రాత్రింబవళ్లు నా సునందమహాయోగికి పరిచర్యజేయుచుండెను. ఇటుల ఏడు ఎనిమిది దినములుగడువగా ప్రాతఃకాలముననే నాగ్రామాధి కారి సునందునిదగ్గఱకొచ్చి మిగులదుఃఖించెను. ఓ స్వామీ! నేను భాగ్యహీనుడనైతిని. సకలగుణ సంపన్నుడును, భక్తిపరాయణుడునగు నాసుతుని పెద్దకోరలుగల ఒక రాక్షసుడు యీ రాత్రి భక్షించెను. ఇట్టి దీనారవమును నాసునంద మహాత్ముడు విని ప్రశ్నించెను.

శ్లో॥ క్వాస్తే స రాక్షసః పుత్రో భక్షితస్తే కథం వద ।

గ్రామపాల ఉవాచః—

వర్తతే నగరే ఘోరః పురుషాదో నిశాచరః ॥ 50

శ్లో॥ స ఖాదతి నరానేత్య నిత్యం నగరగోచరాన్ ।
న సర్వైర్నాగరైరత్ర ప్రార్థితః పురుషైః పురా ॥ 51

,, రక్షరాక్షసనస్సర్వాన్ గ్రామస్తే కల్పయామహే ।
పథికా నిశి నిద్రన్తి యే చ తాన్ భుంక్ష్వ రాక్షస ॥ 52

,, ఏతస్మిన్ సదనే పాంథాన్ గ్రామ[illegible]ప్రవేశితాన్ ।
ఆహారం కల్పయాంచక్రురాత్మీయప్రాణగుప్త[illegible] ॥ 53

,, భవాన్ సుప్తో గృహేఽముష్మిన్నధన్యైః సంయుతః పరైః ।
తే గ్రస్తాః కిల చానేన త్వం ముక్తోఽసి ద్విజోత్తమ ॥ 54

,, ప్రభావం భవతో వేత్తి భవానేవ ద్విజోత్తమ ।
మదీయతనయస్యాద్య మిత్రమేకముపాగతమ్ ॥ 55

,, అజానతా మయా సోఽపి తనయస్య ప్రియస్సఖా ।
అన్యైః పాంథజనైస్సార్ధం తస్మిన్ గేహే ప్రవేశితః ॥ 56

,, శ్రుత్వా తత్ర ప్రవిష్టం తం నిశీథే తనయో మమ
తమానేతుం గతస్సోఽపి భక్షితస్తేన రక్షసా ॥ 57

,, దుఃఖితేన మయా ప్రోక్తః ప్రాతస్స పిశితాశనః ।
మమాపి పుత్రో దుష్టాత్మన్ భవతా నిశి భక్షితః ॥ 58

,, భవజ్జఠరనిర్మగ్నః సుతోఽసౌ యేన జీవతి ।
అస్తి చైవముపాయస్తే బ్రూహి మే త్వం నిశాచర ॥ 59

రాక్షస ఉవాచః—

శ్లో॥ అంతః ప్రవిష్టం త్వత్పుత్రమజ్ఞాత్వాఽహమభక్షయమ్
అజానన్ భక్షితః పాంథైః సహితోఽసౌ సుతస్తవ ॥ 60

తా॥ ఓ గ్రామపాలా! నీకుమారుని భక్షించిన రాక్షసుఁడెచ్చోట నివసించుచున్నాఁడో దానినంతయు చెప్పుము - గ్రామాధికారిచెప్పెను. మహాత్మా! ఈ నగరమున నరభక్షకుఁడగు ఘోరరాక్షసుఁడొకఁడున్నాఁడు. ప్రతిదిన మాతడువచ్చి యీ యూరివారల తినుచున్నాఁడు. అంతట గ్రామస్థులమందరమేకమై యాతని నిటుల ప్రార్థించితిమి. నీవే మమ్ముల రక్షింపుము.

ఓ రాక్షసవరేణ్యా! నీ భోజనమును మేము కల్పింతుము. ఇతర గ్రామములనుండి యిచ్చటికేతెంచి నిద్రించువారలఁదినుచుండుము. ఇట్లు గ్రామస్థులరక్షణకై యీ ధర్మశాలను నిర్మించి గ్రామాధికారులు యితరులను నిందులో ప్రవేశపెట్టి వానికాహారము కల్పించిరి. ఇప్పుడు దురదృష్టవంతులైన కొంతమంది బ్రాహ్మణులతోకూడ తమరున్ను నీ గృహమున నిద్రించితిరి. తమరుతప్ప వారందరు నీ రాక్షసునివాతబడిరి. తమప్రభావము తమకేతెలియును. యీ దినమున నా కుమారుని మిత్రుఁడొకఁడువచ్చెను. ఆ మిత్రుని నేను తెలియక బాటసారులతోకూడ ప్రవేశపెట్టితిని. ఈవార్తను నా కుమారుడువిని వాని మిత్రునివెదకుచు నిచ్చోటఁజని నా రాక్షసునిచే భక్షింపఁబడెను. ప్రాతఃకాలముననే రాక్షసునియిటుల ప్రశ్నించితిని. ఓ దుష్టాత్మా! నియమ మతిక్రమించి నీవెటుల నా కుమారునిఁగూడ భక్షించితివి. నీ యుదరముననున్న నా కుమారుని బ్రతికించుటకు యెద్దైన నుపాయము కన్పట్టినేని నద్దానిని నాకునుడువుము. రాక్షసుఁడుచెప్పెను. ఓ గ్రామాధికారీ. పథికులతోగూడ వచ్చినందున నీ కుమారుఁడును నాచే భక్షింపబడెను. ఆ విషయము నేనెరుంగను,

శ్లో॥ యథా జీవతి మే కుక్షౌ యథా భవతి రక్షితః।
తథా విహితమప్యస్తి దైవేన పరమేష్ఠినా॥ 61

,, గీతైకాదశమధ్యాయం యః పఠత్యనిశం ద్విజః।
తత్ప్రభావేన మే ముక్తిర్మృతానాం పునరుద్భవః॥ 62

గ్రామపాల ఉవాచ:—

శ్లో॥ కథమేకాదశాధ్యాయసామర్థ్యమిదమద్భుతం।
ఇతి పృష్టో మయా విప్ర స బభాషే నిశాచరః॥ 63

,, పురా గృధ్రేణ కేనాపి నభోమార్గేణ గచ్ఛతా।
అస్థిఖండం స్వతుండాగ్రాత్పాతితం క్వాపి వారిణి॥ 64

,, తం జలాశయమాగత్య కోపి జ్ఞానీశ్వర స్తదా।
మహాతీర్థమితి జ్ఞాత్వా విదధే పితృతర్పణమ్॥ 65

,, తమూచిరే జనాస్సర్వే తీర్థమేతత్కథం వద।
జపత్యేకాదశాధ్యాయం త్రిసంధ్యం నియతేన్ద్రియః॥ 66

,, కృతమౌనస్తు విప్రోఽసౌ చోరైర్వ్యాపాదితః పథి।
తస్యాస్థిశకలం గృధ్రవదనాత్పతితం జలే॥ 67

,, తేన తీర్థమిదం దివ్యం జాతం పాతకనాశనం।
తతస్తే మానవాస్సర్వే సస్నుస్తత్ర జలాశయే॥

,, నిష్కల్మషతయా చైనం ప్రాపుస్తే పరమంపదమ్।
ఏకాదశస్య సామర్థ్యాదధ్యాయస్య భవిష్యతి॥ 69

,, మమాపి ముక్తిః పాంథానాం పునరుత్థానమేవ చ।
యో మయా కశ్చిదుద్దీర్ణో బ్రాహ్మణోత్రైవఽతిష్ఠతి॥ 70

తా॥ నాచే భక్షింపఁబడినవారు నా యుదరమున సురక్షితులైయుందురు. ఈ ప్రకారము బ్రహ్మదేవునిచే విధింపఁబడినది. దీనికి ప్రత్యామ్నాయమునుగూడవినుము. గీతలోని యేకాదశాధ్యాయమును పఠించు బ్రాహ్మణుఁడు తత్ప్రభావముచే నాకు శాపవిముక్తిని, మరణించినవారి యొక్క పునర్జీవనమును చేయఁగలఁడు. తిరుగ నారాక్షసవరేణ్యుని నే నిటుల ప్రశ్నించితిని. గీత యేకాదశాధ్యాయ మాహాత్మ్యము అత్యాశ్చర్యకరముగానున్నది. దానివిషయము తెలుపుమని యడిగితిని. ఓ బ్రాహ్మణవరేణ్యా! నాచే ప్రశ్నగావింపఁబడిన రాక్షసుఁడీవిధంబు చెప్పఁదొడఁగెను. పూర్వకాలమున గగనమార్గమున నొకానొక గ్రద్ద నోటిచే నెముకముక్కను కరచుకొని పోవుచుండెను. ఆయస్థిఖండముజారి యొకానొకచోట జలములోపడెను. ఆ జలాశయముగూర్చి యొక గొప్పమహాత్ముఁడు జనుదెంచి ఇది మహాతీర్థమైనదని తెలిసికొని పితృతర్పణముచేసెను. అద్దానిని గనుఁగొని యచ్చటనున్న జనులు ఇది యెటుల మహాతీర్థమయ్యెనని యా మహాత్ముని ప్రశ్నించిరి. అట నా జ్ఞాని యిటులచెప్పెను. ఒకానొక బ్రాహ్మణుఁడు మౌనవ్రతముధరించి జితేంద్రియుఁడై గీతయొక్క ఏకాదశాధ్యాయమును పఠించుచుండెను. అట్టి పుణ్యసత్తముని దొంగలు మార్గమున వధించిరి. ఆ మహిమాశాలియొక్క యస్థిఖండమును గైకొని గ్రద్దపోవుచుండఁగా నదియే నిచ్చోటఁ బడెను. అందుచేతనే యిది గొప్పతీర్థమాయెను. యిచ్చోట గ్రుంకులిడిన వారందరు పవిత్రులగుదురు. తదనంతరమాతీర్థమున నీ విషయమును తెలిసినవారందరు స్నానము చేసి వీతపాపులై వైష్ణవస్థానమునుఁబొందిరి. ఓ విప్రవరేణ్యా! విశ్వరూపసందర్శన యోగమను గీత యేకాదశాధ్యాయ మాహాత్మ్యముచే నాకును, కుక్షిస్థజీవులకును, విముక్తికాఁగలదు. అట్టి అధ్యాయమహిమఁగల బ్రాహ్మణుఁడు నాచే భక్షింపఁబడక నీ భవనముననే యున్నాఁడు.

శ్లో॥ స చ ఏకాదశాధ్యాయం జపతి స్మ నిరంతరమ్ ।
న తేనాధ్యాయమన్త్రేణ సప్తవారాభిమన్త్రితమ్ ॥ 71
,, విధాయ వారి విప్రేన్ద్రః క్షిపేద్యది మమోపరి ।
తతో మే శాపనిర్ముక్తిర్భవిష్యతి న సంశయః ॥ 72
,, ఇతి తేనాస్మి సన్దిష్టస్సమాయాత స్త్వదన్తికమ్ ।

విప్ర ఉవాచః—

రాక్షసః కేన పాపేన జాతోఽసౌ వద రక్షక ।
యత్తపాయాం గృహే తస్మిన్నరాన్ ఖాదతి నిద్రితాన్ ॥ 73

తా॥ ఆతఁడు నిరంతరము నేకాదశాధ్యాయము జపించుచుండెను. ఆ యధ్యాయ మంత్రముచేత నేడుసార్లు మంత్రించి యమ్మహాత్ముఁడు నాపైజలము ప్రోక్షించెనేని నాకు శాపవిముక్తిగలుగును. అని రాక్షసుఁడుఁజెప్పెను. గాన, సోమహానుభావా! నీ దగ్గరకు చనుదెంచితిని. తరువాత నా విశాలమందిరములోనున్న సునందమహాయోగి గ్రామాధికారినిఁగూర్చిచెప్పెను, అతఁడెవఁడు? యెందులకై రాక్షసుఁడాయెను? యెందువలన నిదురించుచున్నవారిని భక్షించుచున్నాఁడని యీ ప్రకార మడిగెను.

గ్రామపాల ఉవాచః—

శ్లో॥ అస్మిన్ గ్రామే పురా కశ్చిదాసీద్విప్రః కృషీవలః ।
ఏకదా శాలికేదారరక్షణే వ్యాకులో ద్విజః ॥ 74

శ్లో॥ నాతిదూరే మహాగృధ్రః పాంథమేకమభక్షయత్।
తం విమోచయితుం దూరాద్దయాంచక్రేఽపి తాపసః॥ 75
,, భుక్త్వా పాంథం ఖగస్తావన్నిరగాదంబరాధ్వనా।
తతస్స తాపసః కోపాత్తం బభాషే కృషీవలమ్॥ 76
,, ధిక్త్వాం హాలిక దుర్బుద్ధే కఠోరమతి నిర్ఘృణ।
కుక్షింభరం పరత్రాణవిముఖం హతజీవితమ్॥ 77
,, చోరైశ్చ దంష్ట్రిభిః సర్పైరరివహ్నివిషాంబుభిః।
గృధ్రరాక్షసభూతైశ్చ వేతాళాదిభిరాహతాన్॥ 78
,, జనానుపేక్షతే శక్తః న తద్వధఫలం లభేత్।
న మోచయతి యో విప్రం ప్రభుశ్చోరాదిభిర్వృతమ్॥ 79
,, స యాతి నరకం ఘోరం స పునర్జాయతే వృకః।
నిహన్యమానం విపినే గృధ్రవ్యాఘ్రేణ పీడితమ్॥ 80
,, ముంచముంచేతి యో వక్తి సయాతి పరమాంగతిమ్।
గవామర్థే హతా వ్యాఘ్రైర్వ్యాళైర్దుష్టైశ్చ రాజభిః॥ 81
,, తేఽపి యాన్తి పదం విష్ణోర్దుష్ప్రాప్యం యోగినామపి।
అశ్వమేధసహస్రాణి వాజపేయశతాని చ॥ 82
శరణాగతసన్త్రాణకలాం నార్హన్తి షోడశీమ్।
దీనస్యోపేక్షణం కృత్వా భీతస్య చ శరీరిణః॥
,, పుణ్యవానపి కాలేన కుంభీపాకే స పచ్యతే।
పశ్యన్నపి భవాన్ పాన్థం దుష్టగృధ్రేణ భక్షితమ్॥ 84
,, నివారణసమర్థోఽపి న చక్రే యన్నివారణమ్।
నిష్కృపోఽసి యతస్తస్మాద్భవిష్యసి నిశాచరః॥ 85
,, ఇమం శాపం మునేశ్శ్రుత్వా కంపమానకళేబరః।
ప్రణమ్య హాళికో విప్రం బభాషే కరుణం వచః॥ 86
,, అత్రాహం క్షేత్రరక్షాయాం చిరం క్షిప్తేన చక్షుషా।
న వేద్మి నికటే గృధ్రం హన్యమానమిమం నరమ్॥ 87
,, తేన మేఽనుగ్రహం కర్తుం కృపణస్య త్వమర్హసి।
విప్రఉవాచః—
యో వేత్త్యేకాదశాధ్యాయం జపత్యనుదినం చ యః॥ 88
శ్లో॥ తేనాభిమంత్రితం వారి యదా శిరసి తావకే।
పతిష్యతి తదా శాపాత్తవ ముక్తిర్భవిష్యతి॥ 89
,, ఇత్యుక్త్వా తాపసో యాతో హాలికో రాక్షసోఽభవత్।
తదాగచ్ఛ ద్విజశ్రేష్ఠ తేనాధ్యాయేన మన్త్రయ।
తీర్థోదకం స్వహస్తేన తస్య మూర్ధ్ని నిక్షిప॥ 90

తా॥ గ్రామపాలుఁడు వచించెను. ముందీపత్తనమున వ్యవసాయముజేయునట్టి విప్రుఁ డొకఁడుండెను. అతడు తనపొలమున గూరుచుండి భార్యాపుత్రాదుల రక్షణయందు వ్యాకులచిత్తుఁ డాయెను. ఇటుండవానికి కొంతదూరముననే యొక పెద్ద గ్రద్ద బాటసారి నొకనిని తినివైచెను. ఆ బాటసారిని విడిపించుటకు తాపసుఁడొకఁడు దయావంతుఁడై ప్రయత్నించెను. అ పక్షిమాత్రము వానిని భక్షించి యాకాశమునఁజనెను. తరువాత కర్షకుడగు బ్రాహ్మణునిదగ్గరకా తపస్వివచ్చుదెంచి కోపముతో నిటుల పలికెను. ఓ దుర్బుద్ధికర్షకా! కరినాత్మా! కృపారహితా! నీకు నిందయగుగాక. యెందుకనగా కేవల స్వోదర పోషణరతుఁడవుగను, పరత్రాణ పరాఙ్ముఖుఁడవుగను, నిందిత చరిత్రుఁడవుగనునైతివి. కాన నీకు తిరస్కారము. ఎవడు దొంగలు, పందులు, సర్పములు, శత్రువులు, అగ్నివిషజలము, గద్దలు, రాక్షసులు, పిశాచములు, వీటిచే హతులగు దీనజనుల రక్షింపశక్తుఁ డయ్యు తూష్ణీంభూతుఁడగునో యట్టివాఁడు వారిని చంపకపోయినను తద్వధఫలమునే పొందును. ఎవఁడు చోరాదులచే హతుఁడగు వానిని యుపేక్షించునో యాతఁడు తీవ్రనరకముననుసరించి తిరుగ తోడేలై పుట్టుచున్నాడు. అట్టి దీనజనులనురక్షింప సామర్థ్యములేకపోయినను, విడువుము విడువుము అని ఎవఁడువచించుచున్నాఁడో అట్టివాఁడుత్తమగతిని పొందుచున్నాడు. మఱియు గోరక్షణార్థమై యెవఁడు క్రూరమృగములచేతను, కిరాతులచేతను, దుష్టరాజులచేతను చంపబడునో, అట్టివాఁడు యోగులకుగూడ దుష్ప్రాప్యమగు వైష్ణవపదమును పొందుచున్నాడు. వేయి అశ్వమేధయాగముల యొక్కయు, నూరు వాజపేయయాగములయొక్కయు ఫలము ఆర్తుఁడై శరణుపొందినవానిని రక్షించుటచే గలిగినఫలములో పదునారవ భాగమును గూడ పొందదు. భయపడిన దీనునిరక్షింపకు పేక్షించినవాఁడు పుణ్యవంతుఁడైనను, కొంతకాలమువరకు కుంభీపాకనరకమున పంపబడు చున్నాఁడు. కాన, ఓయీ! కర్షకబ్రాహ్మణా! గృధ్రమునుండి బాటసారిని రక్షింపశక్తుండ వయ్యును. ఔదాసీన్యమును వహించితివి. దయలేనివాఁడవైతివి. కాన నీవు రాక్షసుడవగుము అని తాపసిశపించెను. ఈ శాపమును ఆ హాళిక విప్రవరుఁడువిని కంపమానదేహుండై నమస్కరించి దీనాలాపములతో నా తాపసిని ప్రార్థించెను. ఓ మహానుభావా! నేను, నా యుదరపోషణనిమిత్తమై నా పొలమును కాపాడువిషయములో దృష్టినింపియుంటిని. అందుచే నాకివిషయము తెలియదు. నాయందు దయయుంచి నన్ననుగ్రహింపుము. తరువాత నా తాపసబ్రాహ్మణుఁడు, అయ్యా! నీయొక్క శాపవిమోచనోపాయమును చెప్పెదవినుము. గీతయొక్క పదునొకొండవ యధ్యాయమును గుర్తెరింగి ప్రతిదినము నద్దానిని జపించువాఁడు తదధ్యాయమంత్రముచే నభిమంత్రించి నీ శిరమున జలముప్రోక్షించెనేని అప్పుడు నీవు శాపమునుండి విడువఁబడుదువు. యీ ప్రకారమునుడివి తాపసవరేణ్యుఁడు చనఁగా నా కర్షకుఁడు రాక్షసుఁడాయెను. కాన, నో సునందబ్రాహ్మణా! రమ్ము. ఈ ప్రకారము ఈ రాక్షసునిపై నీ హస్తముతో నధ్యాయమంత్రాభిమంత్రిత తీర్థోదకముల ప్రోక్షింపుము.

శ్లో॥ ఇతి తత్ప్రార్థితం తస్య శ్రుత్వా చ కరుణాప్లుతః।
తథేతి సహపాలేన మునీ రక్షోన్తికం యయౌ॥ 91

„ ఏకాదశేన తేనాంబు విశ్వరూపేణ మంత్రితమ్।
నిక్షిప్తం తస్య శిరసి తేన విప్రేణ యోగినా॥ 92

శ్లో॥ గీతాధ్యాయప్రభావేణ శాపమోక్షమవాప సః ।
విహాయ రాక్షసం దేహం చతుర్బాహుస్తతోఽభవత్ ॥ 93
,, నిగీర్ణా యే జనాస్తేన పాంథా అసన్పహస్రశః ।
చతుర్భుజా బభూవుస్తే శంఖచక్రగదాధరాః ॥ 94
,, తే విమానాన్యారురుహుస్తావదూచే స రాక్షసమ్ ।
మదీయస్తనయః కస్త్వం దర్శయస్వ నిశాచర ॥ 95
,, ఇత్యుక్తే గ్రామపాలేన దివ్యధీరాహ రాక్షసః ।
ఏనం చతుర్భుజం విద్ధి తమాలశ్యామలద్యుతిమ్ ॥ 96
,, మాణిక్యముకుటం దివ్యమణికుండలమండితమ్ ।
హారహారి మహాస్కంధం స్వర్ణకేయూరభూషితమ్ ॥ 97
,, రాజీవలోచనం స్నిగ్ధం హస్తే కృతసరోరుహమ్ ।
దివ్యం విమానమారూఢం దేవత్వం ప్రాప్తమాత్మజమ్ ॥ 98
,, ఇతి తస్య వచః శ్రుత్వా సుతం దృష్ట్వా చ తాదృశమ్ ।
స్వగేహం నేతుమారేభే జహాస న సుతస్తతః ॥ 99
,, కతి వారాణి జాతోఽసి త్వం పుత్రోమమరక్షక ।
పూర్వం పుత్రస్త్వదీయోఽస్మి అధునా విబుధోఽస్మ్యహమ్ ॥ 100
,, యాస్యామి వైష్ణవం ధామ బ్రాహ్మణస్య ప్రసాదతః ।
నిశాచరోఽపి ప్రాప్తోఽయం పశ్య దేహం చతుర్భుజమ్ ॥ 101
,, ఏకాదశస్య మాహాత్మ్యాద్యాతి స్వర్గం సమం జనైః ।
విప్రాదస్మాత్తమధ్యాయమధీష్వ త్వం జపానిశమ్ ॥ 102
,, భవిష్యతి న సన్దేహస్తవాపి గతిరీదృశీ ।
తత తస్మాత్సతాం సంగం దుర్లభం సర్వథా జనైః ॥ 103
,, సోఽవ్యద్య తే సముత్పన్నో హ్యాత్మనస్సాధయేప్సితమ్
కిం ధనైర్భోగదానైర్వా కిం యజ్ఞైస్తపసా ను కిమ్ 104
,, కిం పూర్తైర్వా వరం శ్రేయో విశ్వరూపస్య పాఠతః ।
తద్విష్ణోః పరమం రూపమధ్యాయస్య శ్రుతేన చ ॥ 105
,, యత్పూర్ణానందసన్దోహ కృష్ణబ్రహ్మస్య నిర్గతమ్ ।
కురుక్షేత్రేఽర్జునే మిత్రే తత్కైవల్యరసాయనమ్ ॥ 106
,, నృణాం వై భవభీతానామాధివ్యాధి భయాపహమ్ ।
అనేకజన్మ దుఃఖఘ్నం నాన్యత్పశ్యామి తత్స్మర ॥ 107

శివ ఉవాచః—

శ్లో॥ ఇత్యుక్త్వా సహ తైస్సర్వైర్యయౌ విష్ణోః పరం పదమ్ ।
తమధ్యాయం తతో విప్రాద్గ్రామపాలః పపాఠ సః ॥ 108

శ్లో॥ తావుభౌ తస్య మాహాత్మ్యాజ్జగ్మతుర్వైష్ణవం పదమ్ ।
ఇత్యేకాదశమాహాత్మ్యకథా తుభ్యం నిరూపితా ॥ 109
,, యస్యాశ్శ్రవణమాత్రేణ మహాపాతకసంక్షయః ॥ 110

తా॥ మహాదేవుఁడగు పరమశివుఁడు పార్వతీదేవికి తరువాత కథాభాగమును వర్ణించుచున్నాఁడు. యీ ప్రకారమా గ్రామపాలుని ప్రార్థనమువిని ఆ సునందమహాజ్ఞాని కరుణాతరంగిత హృదయుఁడై రాక్షసుని దగ్గరకుఁజనెను. విశ్వరూపసందర్శన యోగమగు పదునొకండవ యధ్యాయమును పఠించుచు నా రాక్షసుని శిరమున జలము ప్రోక్షించెను. తన్మహిమచే నా రాక్షసుఁడు శాపవిముక్తినిబడసి విష్ణ్వంశ సూచకములగు చతుర్భుజముల ధరించినవాఁడాయెను. ఆ యధ్యాయమహిమచే నా రాక్షసముఖమునుండి నిదివరకు భక్షింపఁబడిన బాటసారులు బయలువెడలినవారై విష్ణురూపధరులైరి. అనఁగా చతుర్భుజములును, శంఖ, చక్ర, గదాయుధసహితులైరి. వైకుంఠయానమునకై విమానము నధిష్ఠించిరి. నా సమయమున గ్రామాధికారి ఓ రాక్షసా! నా కుమారుఁ డెక్కడ? చూపుమని యడిగెను. తర్వాత వానివాక్యములనువిని దివ్యబుద్ధియగు రాక్షసుఁడు ఇదిగో నీ కుమారుఁడు చతుర్భుజములు గలవాఁడును, శ్యామదేహుడును, మాణిక్యకిరీటధరుఁడును, దివ్యమణికుండల భూషితుడును, మనోహరములగు హారములతోడను, స్వర్ణమయ భుజకీర్తులతోడను వెలయు భుజస్కంధములు గలవాఁడును, పుండరీకాక్షుఁడును, నిగనిగ మెరయువాఁడును, హస్తమున కమలము ధరించినవాఁడును, దివ్యవిమానాధిష్ఠితుఁడును, దేవత్వమును పొందినవాఁడైయున్నాఁడు. చూడుమని గ్రామపాలునితో పలికెను. అట్టివాక్యములువిని విష్ణురూపధరుఁడగు కుమారునికన్గొని పుత్రప్రీతిచే తనగృహమునకు తీసికొనివెళ్ళుటకు ప్రయత్నించెను. ఆ సమయమున కుమారుడు యో గ్రామరక్షకా! ఎన్నిసారులు నీవు నాకు పుత్రుఁడైతివి? ఆ ప్రకారము నీకు నే ననేకసారులు పుత్రుఁడనైతిని. ఇప్పుడు నేను జ్ఞానినైతిని. వైష్ణవస్థానమును నీ సునందుని ప్రసాదమువలన పోవుచున్నాను. రాక్షసుఁడును దివ్యత్వమునుపొందెను. ఈ యేకాదశోధ్యాయ మాహాత్మ్యమువలన జనులతోగూడ ముక్తిధామమునుగూర్చి పోవుచున్నాఁను. కనుక నీవున్ను నీ సునందునికడ నీ విశ్వరూపయోగమును పఠించి, నిరంతరమును జపింపుము. నీకున్ను దివ్యత్వము గలుగును. ఇందు సందేహమొందులేదు. నాయనా! సత్పురుషులసంగము కడుదుర్లభము. అట్టిది నీకిప్పుడు లభించెను. కనుక నీ కోరికను సాధించుకొనుము. ధనముచేతను, భోగములచేతను, దానములచేతను, తపస్సుచేతను, జలాశయాదుల త్రవ్వుటచేతను, నేమీ ప్రయోజనములేదు. యీ విశ్వరూపయోగము వలన ముక్తి సులభముగా లభించును. వినుటచేతను విష్ణురూపముకలుగును. ఎందువలననగా కురుక్షేత్రమున పరమమిత్రుఁడగు యర్జునునికై పూర్ణానందభరితుఁడగు శ్రీకృష్ణపరమాత్మయొక్క ముఖముద్వారా సాక్షాత్తుగా నీ విశ్వరూపయోగము వెడలినది. గాన, నిది కైవల్యామృతము. సంసారభీతులకును, మనోవ్యాధిభయగ్రస్తులకును, నభయమొసంగునది. అనేక జన్మములనుండి వచ్చుచున్నట్టి దుఃఖములను, పాపములను పోగొట్టునది. మరియొకటి యిటువంటిదానితో సమానమగునదిలేదు. శివుఁడు చెప్పుచున్నాఁడు.. కుమారుఁడు నీ ప్రకారముజెప్పి రాక్షసాదులతోకూడ విష్ణుస్థానమునుపొందెను. తదనంతర మా ప్రకారము నా సునంద మహాత్మునివలన నా యధ్యాయమును పఠించి గ్రామపాలుఁడును, పుణ్యాత్ముఁడాయెను. వారిద్దరు నాసునందగ్రామపాలురు నా యధ్యాయమహిమవలన వైష్ణవ పరమపదమునుఁ బొందిరి. ఓ దేవీ! విశ్వరూప సందర్శన యోగ మాహాత్మ్యకథను నీకు నేను నిరూపించితిని, దీనిని శ్రవణముజేసినంతమాత్రముననే సకలజనులును, సకలమహాపాతకములు నశించినవారలగుదురు.

ఓమ్

# ద్వాదశాధ్యాయ మాహాత్మ్యము

మహాదేవ ఉవాచ:—

శ్లో॥ అస్తి కోల్హాపురం నామ నగరం దక్షిణాపథే।
సుఖానాం సదనం సాధ్వి సాధూనాం సిద్ధిసంభవమ్॥ 1

,, పరాశక్తేః పరం పీఠం సర్వదేవనిషేవితం।
పురాణేషు ప్రసిద్ధం యద్భుక్తిముక్తిఫలప్రదం॥ 2

,, కోటిశస్తత్ర తీర్థాని శివలింగాని కోటిశః।
ఆస్తే రుద్రగయా యత్ర విశాలం లోకవిశ్రుతమ్॥ 3

,, తుంగాచలమహావప్ర గోపురోల్లాసి తోరణమ్।
ప్రాసాదశిఖరే యత్ర తుంగం చ కనకధ్వజమ్॥ 4

,, సోమకాంతిమహాసౌధవలభీపంక్తిశోభితం।
జాలరంధ్రోద్గిరద్ధూపధూమామోదితదిక్తటమ్॥ 5

,, చలత్పతాకవిస్తీర్ణచ్ఛాయం దేవాలయాన్వితమ్।
చతురైః సుందరైః స్నిగ్ధైః శ్రీమద్భిః శుచిమానసైః॥ 6

,, అధిష్ఠితం సదాచారైః పురుషైర్భూరిభూషణైః।
కురంగనయనాశ్చంద్రవదనాః కుటిలాలకాః॥ 7

,, ఉత్ఫుల్లచంపకచ్ఛాయాః పీనతుంగపయోధరాః।
కృశమధ్యా నిమ్ననాభి వళిత్రయవిరాజితాః॥ 8

విశాలజఘనాశ్చారు జంఘాయుగ్మా వరాఙ్ఘ్రియః।
వాచాలమేఖలాదామ నిక్వణన్మణినూపురాః॥ 9

,, రణత్కంకణహస్తాబ్జ స్ఫురత్కరజరశ్మయః।
వసన్తి ప్రమదా యత్ర మాదయన్త్యో మునీనపి॥ 10

,, సమస్తవస్తుసంయుక్తం సర్వభోగసమన్వితం।
మంగళైః సకలైర్యుక్తం మహాలక్ష్మీసమన్వితమ్॥ 11

తా॥ గౌరీదేవికి మహాదేవుఁడు చెప్పెను. దక్షిణదేశమున సమస్తసుఖములకు నాలయమైనట్టియు, సాధువులకు సిద్ధినొసంగునదియు, సమస్తదేవతలచే సేవింపఁబడునదియు, భుక్తిముక్తుల నొసంగునదియు, పురాణములయందు ప్రసిద్ధివహించినదియు, నగు పరాశక్తి పీఠముతో కూడుకొనిన కోల్హాపురమను నగరముగలదు. ఆ పట్టణమున కోటితీర్థములును, కోటిశివలింగములును గలవు. రుద్రగయ అను మహాతీర్థమును గలదు. ఇంకను నాపురశ్రేష్ఠము సకలలోక విఖ్యాతమై విశాలమై పర్వతమువంటి ప్రాకారములతోడను, గోపురములతోడను ప్రకాశించు బహిర్ద్వారములు గలదియు,

మేడల యగ్రభాగమున నెత్తగు స్వర్ణధ్వజములతో గూడుకొనినదియు, వెన్నెలవలె ధవళములగు సౌధపంక్తులతో శోభించునదియు, గవాక్షమార్గములనుండి వెలువడు ధూపధూమములచే పరిమళవంతములగు దిగంతములు గలదియు, విస్తృత పతాకచ్ఛాయఁగలదియు, దేవాలయము గలదియు నైయున్నది. ఆ నగరమున నిపుణులును, సుందరులును, దయార్ద్రహృదయులును, ధనికులును పరిశుద్ధమనస్కులును సదాచారసంపన్నులును, సకలాలంకారభూషితులునునగు పురుషులుఁగలరు. నారీమణులును, నత్యంత దయాదాక్షిణ్యాది గుణములుగలవారలై తమరూపములచే మునీశ్వరులను సహితము మోహింపజేయుచున్నవారై సాధ్వీవ్రతమును ధరించినవారైయుంటున్నారు. ఇఁకను ఆ పురవరము సమస్తభోగములతోడను, సమస్తమంగళములతోడను, సకలవస్తుసామగ్రితోడను కూడినదై యొప్పుచున్నది. అచ్చోట మహాలక్ష్మీదేవి నివసించును.

శ్లో॥ తత్రాగచ్ఛత్పుమాన్కశ్చిద్యువా గౌరస్సులోచనః ।
కంబుకంఠః పృథుస్కంధో మహావక్షా మహాభుజః ॥ 12

,, సమస్తలక్షణోపేతో గోచరానక్తమాననః ।
ప్రవిశ్య నగరం పశ్యఞ్ఛోభాం సౌధేషు సర్వతః ॥ 13

,, ఉత్కంఠితమనా ద్రష్టుం మహాలక్ష్మీం సురేశ్వరీం ।
మణికుండే కృతస్నానః సంపన్నపితృతర్పణః ॥ 14

,, మహాలక్ష్మీం మహామాయాం నత్వా తుష్టావ భక్తితః ।
జయత్యపారకరుణా శరణ్యా జగదంబికా ॥ 15

,, కుర్వాణా జగతో జన్మ పాలనం క్షపణం దృశా ।
యయా శక్త్యా కృతాదిష్టః పరమేష్ఠీ సృజత్యసౌ ॥ 16

,, అవష్టభ్య చ తాం శక్తిం పాలయత్యచ్యుతో జగత్ ।
యయా శక్త్యా కృతావేశః సంహరత్యఖిలం హరః ॥ 17

,, తాం భజే పరమాం శక్తిం సర్గస్థితిలయోర్జితామ్ ।
యోగిధ్యేయాంఘ్రికమలే కమలే కమలాలయే ॥ 18

,, స్వభావానఖిలాన్నస్త్వం గృహ్ణాసీన్ద్రియగోచరాన్ ।
త్వమేవ కల్పనాజాలం తత్కల్పం కురుషే మనః ॥ 19

,, ఇచ్ఛాజ్ఞానక్రియారూపా పరసంవిత్స్వరూపిణీ ।
నిష్ఫలానిర్మలా నిత్యా నిరాకారా నిరంజనా ॥ 20

,, నిరంతరా నిరాతంకా నిరాలంబా నిరామయా ।
తవైవం మహిమానం హి కో వర్ణయితుమీశతే ॥ 21

తా॥ ఆ నగరరాజమునకు ఒకానొక యువకుఁడు చనుదెంచెను. అతఁడు గౌరవర్ణదేహుఁడు, సుందరమగు నేత్రములుగలవాఁడు. అతనికంఠము శంఖమువలెనున్నది. ఎత్తైన భుజములు గలవాఁడు, విశాలవక్షుఁడు, ఆజానుబాహువు. సమస్తమహాపురుషలక్షణసంపన్నుఁడు. అట్టి పురుషుఁడు దృశ్యవస్తుదర్శన వినోదమునకై ఆ నగరమునంతయు వీక్షించుచు నా మేడల సౌందర్యమును నభివర్ణించుచు నందున్న మహాలక్ష్మీదేవి దర్శనార్థమైచని మణికుండ తీర్థమున స్నానముచేసి పితృతర్పణముచేసెను. మహామాయాస్వరూపిణియగు నా దేవికి నమస్కరించి యీ ప్రకారము

స్తుతించెను. అపార కరుణాస్వరూపురాలును, రక్షకురాలును, లోకాంబికయునై లోకముయొక్క సృష్టిస్థితిలయములను దృష్టివిలాసము చేతనే యొనరించుచున్నదై, యే దేవి సర్వోత్కర్షముగా నుండుచున్నదో, ఆ యంబికాశక్తిచేతనే యాజ్ఞాపింపఁబడినవాఁడై బ్రహ్మదేవుఁడు సృజించును, విష్ణుమూర్తి పాలించును, హరుఁడు హరించును. అట్టిపరమశక్తి స్వరూపిణియు, సృష్టి స్థితిలయకారిణియు, యోగులచే ధ్యానింపఁబడునదియునగు లక్ష్మీదేవిని నేను స్తోత్రముచేయుచున్నాను. కమలములయందు నివసించు నో మహాలక్ష్మీ! మా యింద్రియ విషయములను, సకలస్వభావములను, నీ వెరుంగుదువు. నీవేసంకల్పములను, మనస్సును సృష్టింతువు. ఇచ్ఛా జ్ఞాన క్రియా స్వరూపిణియు, కేవలవిజ్ఞానరూపిణియు, ఫలము నపేక్షింపనిదానవును, నిర్మలస్వరూపిణియు నిత్యురాలును, నిరాకారనిరంజన సర్వవ్యాపక నిస్సంశయ నిరాశ్రయ నిరామయ స్వరూపిణియు నీవే! నీయొక్క మహిమలు వర్ణించుటకు నెవఁడు సమర్థుండు?

శ్లో॥ వందే నిర్భిన్నషట్చక్ర ద్వాదశాంతర్విహారిణీమ్ ।
అనాహతధ్వనిమయీం బిందునాద కళాత్మికామ్ ॥ 22

,, మాత స్త్వం పూర్ణ శీతాంశుగళత్పీయూషవాహినీ ।
పుష్ణాసి వత్సలే బాలాన్ సనకాదీన్దిగంబరాన్ ॥ 23

,, అనుస్యూతాశివాసంవిజ్జాగ్రత్స్వప్నసుషుప్తిషు ।
తురీయాయాం వర్తమానాం దయాసూనృతసన్నిధౌ ॥ 24

,, దదాసి ప్రాణినాం సర్వాః సతతం బ్రహ్మసంపదః ।
సంహృత్య తత్వసంఘాతం తురీయాతీతయా త్వయా ॥ 25

,, యోగినాం బింబతాదాత్మ్యం దీయతే నిర్వికల్పయా ।
పరాం నమామి పశ్యన్తీం మధ్యమాం వైఖరీమపి ॥ 26

,, రూపాణి దేవి గృహ్ణాసి జగత్సంత్రాణహేతవే ।
త్వం బ్రాహ్మీవైష్ణవీ చ త్వం మాహేశీ చ త్వమంబికే ॥ 27

,, వారాహీ త్వం మహాలక్ష్మీః నారసింహీ త్వమైన్ద్రికా ।
త్వం కౌమారీ చండికా త్వం లక్ష్మీస్త్వం విశ్వపావనీ ॥ 28

,, సావిత్రీ త్వం జగన్మాతా శశినీ త్వం చ రోహిణీ ।
త్వం స్వాహా త్వం స్వధా త్వం హి త్వం సుధా పరమేశ్వరీ ॥ 29

,, చండముండభుజాదండ ఖండదోర్దండమండితే ।
రక్తబీజగళద్రక్తపానఘూర్ణితలోచనే ॥ 30

,, ఉన్మత్తమహిషగ్రీవోన్మూలనప్రౌఢదోర్యుగే ।
శుంభాసురం మహాదైత్యదారణాయతవిక్రమే ॥ 31

,, అనంతచరితే తుభ్యం నమస్త్రైలోక్యమాతృకే ।
శక్తకల్పలతే మహ్యం ప్రసీద పరమేశ్వరి ॥

శ్లో॥ ఇతి తేన స్తుతా దేవీ మహాలక్ష్మీ స్తతస్స్వయం।
నిజరూపం సమాస్థాయ పురుషం ప్రత్యువాచ తమ్ ॥ 33

తా॥ మరియు నిటుల నా దేవిని నా యువరాజు స్తుతించుచున్నాఁడు. బాగుగా వికసించిన మూలాధారాది షట్చక్రకమల దళములయందు విహరించునట్టియు, ప్రణవధ్వని స్వరూపిణియు, నాదబిందుకళా రూపిణియునగు నిన్ను నమస్కరించుచున్నాను. ఓ తల్లీ! నీవు పరిపూర్ణ చంద్రునినుండి స్రవించు అమృతమునువలె జ్ఞానామృతవాహినివి. జగదంబికే! దిగంబరులగు సనకాదులు నీ ప్రియపుత్రులు. వారిని ప్రేమతో పోషింతువు. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందు తేజోరూపిణివియై మంగళస్వరూపిణివై, యెడతెగకయుందువు. నాల్గవదియగు దయాసత్యాది మార్గమున క్రీడింతువు. సమస్తప్రాణులకు జ్ఞానసంపదల నొసగుదువు. మహదాది తత్వసమూహము లుపసంహరించి తురీయాతీతస్థితిలోనున్నదానవై, నిర్వికల్ప స్వరూపిణివై, యోగులకు నాత్మతాదాత్మ్యమును నొసఁగెదవు. పరమస్వరూపిణీ! నిన్ను నమస్కరించుచున్నాను. నీవు పశ్యన్తీ, మధ్యమా, వైఖరీవాణుల స్వరూపిణివి. లోకమును సంరక్షించుటకు ననేకరూపములు ధరింతువు. నీవే సరస్వతివి. లక్ష్మివి, పార్వతివి యగుచున్నావు. ఓ తల్లీ! వరాహస్వరూపిణీ! మహాలక్ష్మీ! నారసింహస్వరూపిణి, శచీదేవి, కౌమారి, చండిక, సావిత్రి, రోహిణి, స్వాహాదేవి, స్వధ, సుధ, పరమేశ్వరి, వీర్లరూపమును నీవే ధరించుచున్నావు. చండముండాసురుల భుజదండముల ఖడించు బాహుదండముల ధరించినతల్లీ! రక్తబీజాసురుని రక్తపానముచే నెర్రగాచేయఁబడిన నేత్రములచే కూడుకొన్న అంబికా! మహిషాసురుని కంఠమును నూఁడబెరుకుటయందు దృఢమైన దోర్యుగముగలదానా! శుంభాసురుని చీల్చుటచే ప్రకటింపఁబడిన పరాక్రమముగలదానా! జగజ్జననీ! అనంతచరితా! భక్తకల్పద్రుమా! ఓ పరమేశ్వరీ! నన్ననుగ్రహింపుము. ఈ ప్రకారము స్తుతింపఁబడినదై మహాలక్ష్మీదేవి ఆ భక్తునికొరకు సాక్షాత్కరించి యిట్లుజెప్పెను.

శ్రీలక్ష్మీరువాచః—

శ్లో॥ రాజపుత్ర ప్రసన్నాహం వృణీష్వ వరముత్తమం।

రాజపుత్ర ఉవాచః—

పితా మే ధరణీపాలో వాజిమేధం మహాక్రతుమ్ ॥ 34

శ్లో॥ కుర్వాణో దైవయోగేన రోగాక్రాన్తో దివం యయౌ।
తద్వృత్తస్తత్ర తైలేన శోషయిత్వా మయా తతః ॥ 35

,, స్థాపిత స్తత్ర యాగోఽసౌ యథాపూర్వమవర్తత।
అథాక్రాంతమహీచక్రో యూపే యాగతురంగమః ॥ 36

,, నిశీథే బన్ధనం హిత్వా నీతః కేనాపి కుత్రచిత్।
అదృష్ట్వా తద్గతం క్వాపి నివృత్తేషు జనేష్వహమ్ ॥ 37

,, ఆమంత్ర్య ఋత్విజః సర్వాన్ శరణం త్వాముపాగతః।
ప్రసన్నా యది దేవి త్వం తస్మే యాగతురంగమః ॥ 38

,, దృష్టో భవతు యాగోఽసౌ సంపూర్ణో జాయతే యథా।
అనృణ్యం మమ తాతస్య తేన రాజ్ఞో భవిష్యతి ॥ 39

శ్లో॥ తథా కురు జగద్ధాత్రి శరణాగతవత్సలే।

తా॥ ఓ రాజపుత్రా! నీయందు నేను అనుగ్రహచిత్తురాలనైతిని. ఉత్తమవరమును కోరుము. తరువాత రాజపుత్రుఁడుచెప్పెను. ఓ తల్లీ! మాతండ్రి గొప్పదగు అశ్వమేధయాగమును చేయుచున్న వాఁడై దైవవశమున రోగగ్రస్తుఁడై స్వర్గస్థుఁడయ్యెను. వానిశరీరమును చెడకుండ తైల ద్రావకమున భద్రపరచియున్నాను. యాగముమాత్రము యథాప్రకారము ప్రవర్తించెను. యాగాశ్వము భూ భ్రమణముజేసి యూపస్తంభమునకు కట్టఁబడెను. తదుపరి అర్ధరాత్రమున దానినివిప్పి యా యశ్వమును నెవఁడో యెచ్చటికో తీసికొనివెళ్లెను. వెదకినను నదిలభింపలేదు. నేను ఋత్విక్కులను సిద్ధపరచి తమ యనుగ్రహమునకై యిచ్చోటికి పరుగిడివచ్చితిని. తమ కటాక్షముచే నా యశ్వము లభించుగాక. యాగము పూర్తియై మా తండ్రి ఋణవిముక్తుఁడగుగాక. ఓ శరణాగత తత్పరురాలా! ఆ ప్రకారము నన్ననుగ్రహింపుము.

దేవ్యువాచ :—

మమ ద్వారం ద్విజస్సిద్ధసమాధిరితి విశ్రుతః॥ 40

శ్లో॥ మమాజ్ఞయా స తే సర్వం కార్యం నిష్పాదయిష్యతి।
ఇత్యుక్తః శ్రీ మహాలక్ష్మ్యాతతో రాజకుమారకః॥ 41

,, ఆజగామ మునిస్సిద్ధసమాధిర్యత్ర తిష్ఠతి।
ప్రణమ్య తస్య పాదాబ్జం కృతాంజలిరవస్థితః॥ 42

,, తమువాచ తతో విప్రః ప్రహితోఽసి త్వమమ్బయా।
త్వదీప్సితమిదం సర్వం సాధయామి విలోకయ॥ 43

,, ఇత్యుక్త్వా త్రిదశాన్సర్వానాచకర్ష స మాంత్రికః।
బద్ధాంజలిపుటా తనయోఽసౌ తదా సురాన్॥ 44

,, కృతాంజలిపుటాన్ దేవాన్ వేపమానకళేబరాన్।
అథ తానమరాన్సర్వాన్సంబభాషే ద్విజోత్తమః॥ 45

,, అముష్య రాజపుత్రస్య వాజీ యజ్ఞాయ కల్పితః।
నీతోఽస్తి దేవరాజేన క్షపాయామపహృత్య సః॥ 46

,, గీర్వాణా అశ్వమేవాస్య సమానయత మాచిరమ్।
అథ తస్య మునేర్వాక్యాద్దేవైర్యజ్ఞతురంగమః॥ 47

,, సమర్పిత స్తత స్తేన తేఽనుజ్ఞాతా దివౌకసః।
ఆకృష్టానమరాన్దృష్ట్వా గతం లబ్ధ్వా తురంగమమ్॥ 48

,, మహీపతిసుతో నత్వా తం మునిం వాక్యమబ్రవీత్।
ఆశ్చర్యమిదమేతత్తే సామర్థ్యమృషిసత్తమ॥ 49

,, కృతం త్వయా చిత్రమిదం త్రిదశాకర్షణం క్షణాత్।
హస్త్రాదాకృష్య తత్తో మే యజ్ఞీయోఽయం తురంగమః॥ 50

శ్లో॥ న కంచిదపరం యావద్దుష్కరం యత్నరైరపి।
ప్రభవిష్యతి తత్కర్తుం భవానేవ న చాపరః॥ 51

,, శృణు విప్ర మహీపాల పితాఽసీన్మే బృహద్రథః।
ప్రారబ్ధహయమేధోఽసౌ దైవేన నిధనం గతః॥ 52

,, అద్యాపి తస్య దేహోఽస్తి తప్తతైలేన శోషితః।
తస్య సంజీవనం భూయః కర్తుమర్హసి సత్తమ॥ 53

తా॥ లక్ష్మీదేవిచెప్పెను, ఓ రాజపుత్రా! నా ద్వారము చెంతనే యొక బ్రాహ్మణుండు కలఁడు. అతనిని సిద్ధసమాధి యని యందురు నా యాజ్ఞచే నాతఁడు నీ సకల కార్యములను నెరవేర్పఁగలఁడు. ఈ ప్రకారము లక్ష్మీదేవి యానతిగైకొని రాజపుత్రుఁడు సిద్ధసమాధి దగ్గరకువెళ్లెను. వాని పాదకమలములకు నమస్కరించి ముకుళితహస్తుఁడై యీ విషయమునంతను నా మహర్షికి విన్నవించెను. నాయనా! లక్ష్మీదేవిచే పంపఁబడితివా? నీ కోరికలను నెరవేర్తును, చూడుమని దేవతలనందరిని మంత్రప్రభావముచే నా ఋషివర్యుఁడు తెప్పించెను. దేవతలందరు గడగడ వణంకుచు నిలువఁబడిరి. అపుడు ఆ సిద్ధసమాధి ఓ దేవతలారా! యీతని యాగాశ్వమును దేవేంద్రుఁడు రాత్రియందు నపహరించెను. శీఘ్రముగా దానినిగొనిరండు అని యాజ్ఞాపించెను. తరువాత నా దేవతలు గుఱ్ఱమును తీసికొనివచ్చి సమర్పించిరి. దేవతలు మహర్షి యనుజ్ఞగైకొని వెడలిరి. దేవతలు ఈ మహర్షియొక్క యాజ్ఞాబద్ధులగుటయు, పోయినగుఱ్ఱముఁలభించుటయుఁజూచి యారాజకుమారుఁడు మహర్షికి నమస్కరించి ఇట్లుచెప్పెను. స్వామీ! ఈ దేవాకర్షణశక్తి యెట్లుల లభించెను? నా యజ్ఞాశ్వమును వారలు వారిచేతిగుండా నాకిచ్చిరిగదా? ఇంతకన్న దుష్కరమగు కార్యము మరేదికలదు? తమరేసమర్థులు. ఓ విప్రవర్యా! మా తండ్రి బృహద్రథుఁడు మరణించి యున్నాఁడు. అతని దేహము ద్రావకముచే సంరక్షింపఁబడియున్నది. తిరుగవానిని బ్రతికించుఁడని ప్రార్థించెను.

శ్లో॥ ఇత్యాకర్ణ్యస్మితం కృత్వా స జగాద మహామునిః।
యామస్తత్ర పితా యత్ర తావకో యాగమండపః॥ 54

,, అథాగత్య సమం తేన తత్ర సిద్ధస్సమాధినా।
పయోఽభిమన్త్ర్య విదధే తస్య ప్రేతస్య మూర్ధని॥ 55

,, తతః ప్రాప నృపస్సంజ్ఞాముత్తస్థౌ వై దదర్శ చ।
స తం పప్రచ్ఛ విప్రేన్ద్రం కోఽపి ధర్మేతి భూపతిః॥ 56

,, తతో రాజసుతస్సర్వం భూపాలాయ న్యవేదయత్।
స నత్వా బ్రాహ్మణం రాజా తం పునర్దత్తజీవితమ్॥ 57

,, బభాషే కేన పుణ్యేన త్వయి శక్తిరలౌకికీ।
యయా మే జీవితం దత్తమాకృష్టాశ్చ దివౌకసః॥ 58

,, యాగశ్చోద్ధరితో విప్ర యేన మే తన్నిరూపయ।
ఇత్యుక్తస్తేన విప్రోఽసౌ జగాద శ్లక్ష్ణయా గిరా॥ 59

శ్లో॥ గీతానాం ద్వాదశాధ్యాయం జపామ్యహమతన్ద్రితః।
తేన శక్తిరియం రాజన్ యయా ప్రాప్తోఽసి జీవితమ్॥ 60

,, ఏతదాకర్ణ్య రాజాఽసౌ ద్వాదశాధ్యాయముత్తమమ్।
పపాత తస్మాద్విప్రర్షేః సకాశాత్ బ్రాహ్మణాన్వితమ్॥ 61

,, తస్యాధ్యాయస్య మాహాత్మ్యాత్తే సర్వే సద్గతిం యయుః।
అన్యే పతిత్వా జీవాశ్చ ముక్తిమాపురహో పరామ్॥ 62

తా॥ ఈ ప్రకారము ఆ ముని విని నవ్వి చెప్పెను. మీ తండ్రియు నీ యాగమంటపమును ఉన్నచోటికి పోదుమనిచెప్పి యచ్చటికిపోయెను. తరువాత నా సిద్ధుఁడు ఆ రాజకుమారుని యొక్క పితృమృతకళేబరముపై జలముప్రోక్షించెను. వెంబడే జీవించినవాఁడై ఆ బ్రాహ్మణుని మీరెవ్వరని యడిగెను. ఆ విషయమునంతను తన కుమారుడు పూర్తిగా చెప్పెను. తరువాత నా బృహద్రథుఁడు ప్రాణప్రదాతయగు ఆ మునీశ్వరుని నమస్కరించి మహాత్మా! నాకు జీవనమిచ్చినట్టి శక్తియు, దేవతాకర్షణశక్తియు యాగోద్ధరణశక్తియు నే పుణ్యముచే కలిగెనని ప్రార్థించెను. తరువాత నా సిద్ధయోగి సూక్ష్మస్వరములో నాయనలారా! నేను కడుభక్తితో గీతయొక్క భక్తియోగమనఁబడు ద్వాదశాధ్యాయమును నిరంతరము జపింతును. ఆ శక్తిచేనిదంతయు నాకు లభించినది. ఈ విషయమును నా బృహద్రథమహారాజు కనుఁగొని ఆ సిద్ధయోగివలన భక్తియోగమును విని, తానును తన కుమారుఁడును నా యధ్యాయమాహాత్మ్యముచే మరికొందరును ముక్తులైరి కాన, దానిని జపించినవారందరు పరమవిముక్తిని పొందుదురు. ఇట్లు మహాదేవుఁడు పార్వతీదేవికిఁజెప్పెను.



ఓమ్

# త్రయోదశాధ్యాయమాహాత్మ్యము



దేవ్యువాచః—

శ్లో॥ ద్వాదశాధ్యాయమాహాత్మ్యం భవతా కథితం మమ।
బ్రూహి త్రయోదశాధ్యాయ మాహాత్మ్యమతిసున్దరమ్॥ 1

ఈశ్వర ఉవాచః—

శ్లో॥ శృణు త్రయోదశాధ్యాయమహిమాంభోనిధిం శివే।
యదాకర్ణనమాత్రేణ పరాం ముదమవాప్స్యసి॥ 2

,, అస్తి దక్షిణ దిగ్భాగే తుంగభద్రామహానదీ।
తత్తటే నగరం రమ్యం నామ్నా హరిహరంపురమ్॥ 3

,, యత్రాస్తే భగవాన్దేవో హరిహరః స్వయమ్।
యస్య దర్శనమాత్రేణ పరం కల్యాణమాప్యతే॥ 4

శ్లో॥ తస్మిన్ పురే ద్విజన్మాసీద్ధరిదీక్షితసంజ్ఞకః ।
తపస్స్వాధ్యాయనిరతో శ్రోత్రియో వేదపారగః ॥ 5

,, దురాచారేతి తస్యాసీద్భార్యా నామ్నా చ కర్మణా ।
న సుష్వాప సమం పత్యా దురాలాపా కదాచన ॥ 6

,, క్షణమప్యాత్మసదనే న చాస్తే స్వైరచారిణీ ।
కంఠదఘ్నం ద్విజద్వారే ధయంతీ వారుణీరసమ్ ॥ 7

,, పతిసంబంధినస్సర్వాన్ తర్జయన్తీ పునః పునః ।
విటైస్సహ సదోన్మత్తా రమమాణా నిరంతరమ్ ॥ 8

,, కదాచిద్వ్యాకులం దృష్ట్వా పురం పౌరైరిత స్తతః ।
సంకేతగేహమకరోత్కాంతారే నిర్జనే స్వయమ్ ॥ 9

,, అథ తత్రైవ సా ధూర్తా రమమాణా విటైస్సహ ।
నినాయ సా బహూన్ కాలాన్ని జయౌవనగర్వితా ॥ 10

తా॥ పార్వతీదేవి పరమశివునిగూర్చి చెప్పెను. ఓ మహేశా! ద్వాదశాధ్యాయ మహిమను తమరు సెలవిచ్చితిరి. అటులనే అతిపవిత్రమగు పదమూడవఅధ్యాయ మాహాత్మ్యమును నాకు చెప్పుడు. తరువాత ఈశ్వరుడు ఓ పార్వతీ! వినుము. త్రయోదశాధ్యాయ మహిమయపార మైనది. ఆ యధ్యాయమును వినుటచే పరమానందమును పొందగలవు. ఈ ప్రకారము జెప్పెను. దక్షిణదేశమున తుంగభద్రయను మహానదియొకటి గలదు. తత్తీరమున నతిమనోజ్ఞమగు హరిహర పురమను నగరమొండు విలసిల్లుచున్నది. ఆ దివ్యపత్తనమున సాక్షాత్పరంధాముడు హరిహర రూపుడై స్వయముగా వెలయుచున్నాడు. వారిని సందర్శించినవారలు మోక్షమును పొందుచుండిరి. అట్టి నగరములో హరిదీక్షితుడను పేరుగల విప్రవరేణ్యుడు వేదాధ్యయనము తపస్సునుజేయుచు వేదపారంగతుడై శ్రుత్యుక్తధర్మానుష్ఠానపరుడైయుండెను. వానిభార్య దురాచారయని పేరుగలదై దానికి తగినటుల దురాచారకర్మలను జేయుచునుండెను. ఎల్లప్పుడును దుర్భాషిణియైన యా దురాచార భర్తతో శయనించలేదు. క్షణకాలముగూడ తన గృహములో నిలువక స్వచ్ఛన్దచారిణియై యుండెను. ఆ శ్రోత్రియ బ్రాహ్మణుని గృహద్వారముననే కంఠమువరకు కల్లుద్రావి భర్తకు సంబంధించిన గొప్పవారువచ్చిన వారిని భయపెట్టుచు నవమానపరచుచుండెను. విషయాభిలాషిణియై నిరంతరము విటులతో రమించుచుండును. ఇటుండ నొకానొకప్పుడు ఆ పురము పురజనములతో నిండియుండెను. అప్పుడీ దురాచార నిర్జనప్రదేశమైన యరణ్యమధ్యమున సంకేతమేర్పరచుకొని విటులతో క్రీడించుచుండెను. యౌవనోన్మత్తయైన దురాచార యిట్లులనే బహుకాలము గడిపెను.

శ్లో॥ అథ తస్మిన్పురే రమ్యే నివసన్త్యా నిరంకుశం ।
వసంతకాలస్సమభూత్పరం చిత్రేషువస్సుణా ॥ 11

,, ఆమూలపల్లవాకీర్ణః సహకారవికారిణా ।
పికానాం శంఖమాలా హైః ॥ 12

౹౹ స్ఫురత్ చంపకసౌరభ్య హారకైర్మలయానిలయైః ।
మందం మందం ప్రసర్పద్భిరాన్దోళితవనద్రుమః ॥ 13
,, ఉత్ఫుల్లమల్లికామోద మదిరాపారణావతామ్ ।
అళీనాం కలటంకారై స్సమన్తాద్రావశోభితః ॥ 14
,, ప్రసన్నచారిభిస్స్మేరః సరోవరసుగంధిభిః ।
మీలన్మరాళనివహైస్సరోభిః ప్రకటీకృతః ॥ 15
,, ఘనచ్ఛాయాసుఖాసీనహరిణార్భకధారిభిః ।
నీరంధ్రవల్లవైర్నానాశాఖిభిశ్శోభితావనిః ॥ 16
,, తస్మిన్వనంతసమయే ముదితా సాఽభిసారికా ।
అపశ్యజ్జగదానందదాయినీం చంద్రికాం నిశి ॥ 17
,, చంచచ్చకోరచంచ్వగ్ర గలత్పీయూషశీకరామ్ ।
ద్రవదిందుశిలానిర్యత్సుధానిర్ఝరనిర్భరామ్ ॥ 18
,, వికాసికుసుమక్రోడ సాంద్రీభూతకలోత్కరామ్ ।
ఉల్లాసితపయోరాశి కల్లోలాలింగితాంబరామ్ ॥ 19
,, మనోభవమహాసింహ కులటాకంఠకర్తరీమ్ ।
ఘనాంధకారసందోహ విదారణపటీయసీమ్ ॥ 20
,, శ్వేతీకృతసతీకార పరార్థహిమగర్భిణీమ్ ।
మానపంకజసంకోచాం యూనామానందదాయినీం ॥ 21
,, చక్రవాకవధూవక్త్ర కరుణాక్రోశసాక్షిణీమ్ ।
ముక్తాశ్రేణీవిశుద్ధాంశు ప్రభాసితదిగన్తరామ్ ॥ 22

తా॥ ఈ ప్రకారమాకులట నివసించుచుండగ వసంతకాలమువచ్చెను. మామిడిచెట్లు మొదలైనవి కొసవరకు బాగుగ చిగిర్చినవై పికాళాపభరితమై మన్మథుని నా వసంతకాలము బ్రతికించునదివలె నుండెను. మరియు మెల్లనివాయువులచే చంపకాదిపుష్పముల పరిమళమును గైకొనుచు వనములను మెల్లగా నూపుచు పుష్పరసపానోన్మత్త భృంగముల టంకారరవములచే దిగన్తముల శబ్దింపజేయుచు మనోహర సరోవరములను పరిమళవంతములనుగా జేయుచు సరస్సులయందు హంసరాజముల నిద్రింపజేయుచు చల్లనినీళ్ళయందు సుఖముగానున్న లేళ్లను సంచరింపజేయుచు సకల వృక్షములను దట్టముగా జేయుచు విహరించెను. ఆ సమయమున నొకానొకరోజున నా యభిసారికయైన దురాచారసంతోషము గలదై సమస్తజనులకు నానందము గలుగజేయునదియు, చకోరపక్షులు చంద్రకిరణామృతమునుద్రావి గ్రక్కుచుండగా నట్టి బిందువులతో గూడినదియు, చంద్రకాంతమణులనుండి స్రవించు నమృతప్రవాహములతో గూడికొన్నదియు, సమస్తపుష్పములను వికసింపజేయునట్టి చంద్రకిరణములుగలదియు, సముద్రమును నుప్పొంగునటులజేయుచు తరంగములచే సంఘట్టితమగు నాకాశప్రదేశముగలదియు, మన్మథుడను మహాసింహముచే వ్యభిచారిణుల కంఠములను కత్తిరించునదియు నిబిడాంధకారమును పటాపంచలుగా జేయునదియును పాతివ్రత్య

మునుగూడ భంగపరుపజాలు చల్లనిమంచుతో గూడుకొన్నదియును కమలములను ముకుళించు నటులజేయుచు యుపకులను ఆనందింపజేయుచు చక్రవాకపక్షులను అలపింపజేయుచు ముత్యములు పరుపబడినవివలెనున్న ధవళకాంతితో విరాజిల్లుచున్న చంద్రికను జూచెను.

శ్లో॥ అథ తస్యాం ప్రభూతాయాం పూరయన్త్యాం దిశోదశ ।
కామాంధా కామినీ జాతా పథి సౌధ విహారిణీ ॥ 23

,, అపశ్యన్తీ విటాన్రాత్రౌ నిర్భిద్య భవనార్గళమ్ ।
యయౌ సంకేతభవనం నిర్గత్య నగరాద్బహిః ॥ 24

,, తత్ర ప్రియతమం కంచిత్కామమోహితమానసా ।
అన్వేషయన్తీ నాద్రాక్షీత్కుంజేకుంజే తరౌతరౌ ॥ 25

,, ఆకర్ణ యన్తీ కాన్తస్య మందాలాపాన్పదే పదే ।
అభియాతి తతః క్రీడా యత్రసంహారినిస్వనః ॥ 26

,, చక్రవాకరవాంచ్ఛ్రుత్వా కాంతాలాపభ్రమాదసౌ ।
సరోవరాణి సర్వాణి పర్యటన్తీ ముహుర్ముహుః ॥ 27

,, కాంతభ్రాన్త్యా తరుతలే ప్రసుప్తాన్హరిణోత్కరాన్ ।
ప్రబోధయన్తీ స్వోచ్ఛ్వాసమాగతాస్మీతి భాషిణీ ॥ 28

,, ఆలింగన్తీ వనస్థాణుం జీవనేశ్వరశంకయా ।
తదాననభ్రమాద్భూయః చుంబన్తీ వికచాంబుజమ్ ॥ 29

,, తత్ర తత్ర కృతవ్యర్థశ్రమా దృష్టప్రియా స్వయమ్ ।
విలలాప వనే తస్మిన్మూర్ఛన్తీ వివిధోక్తిభిః ।
హా కాన్త హా గుణాక్రాన్త మచ్చైతన్యస్యనాయక ॥ 30

,, హే మనోహర సౌభాగ్య భాగ్య లావణ్యశేవధే ।
హా పూర్ణచంద్రవదన హా సరోజాయతేక్షణ ॥ 31

,, హా కాన్త తత్త్వసాహిత్య విశ్రామయ సురద్రుమ ।
యది కోపేన కుత్రాపి గుహ్యవేషోఽత్ర తిష్ఠసి ॥ 32

,, ప్రసాదయామి త్వాం కాన్త దత్వా ప్రాణాన్ప్రియానపి ।
ఇత్యుచ్చైస్సర్వతో దిక్షు విలపన్త్యా వియోగతః ॥ 33

తా॥ ఆ వెన్నెలలు దశదిశలను వ్యాపించియుండగా నా కామిని మార్గమునందున్న మేడలపై విహరించుచు కామాంధురాలై తనకనువగువిటులను కానరానిదై రాత్రియందింటియొక్క గడియను నూడబెరికి బయలుదేరినదై నగరముయొక్క బయటనున్న సంకేతస్థానమునకు బోయెను. అచ్చోటెక్కడను తనప్రియుని కానరానిదై కామవికారముచే బాధితురాలై తనవిటుని పొదరిండ్లయందును చెట్లయందును వెదకుచు నున్మత్తురాలై సంచరించెను, ప్రియతముని మందాలాపములకై చెవినిచ్చుచు గొప్పగా ధ్వనించుచున్నదై భ్రమించెను. చక్రవాకధ్వనులను కాంతాలాపములని తలంచినదై సరస్సుల తిరుగాడెను. నిద్రించుచున్న హరిణపోతములను దయితభ్రాంతిచే మేలు

కొలుపుచు అయ్యో ! బ్రతికితిని వచ్చితినియని మాట్లాడుచుండెను, వృక్షముయొక్క మొద్దును ప్రియుడని యాలింగనముజేయుచు వికసిత కమలమును విటునిముఖమని ముద్దిడుకొనుచు వ్యర్థప్రయత్నములచే నలుగడల సంచరించుచు ప్రియుని గానకపోయెను. ఆ సమయమున మూర్ఛనొందినదై తరువాత ననేక వాక్యములతో నీ ప్రకారము విలపించెను. ఓ కాంతా! ఓ నా మనోనాథా! చైతన్యనాయకా! దాగియుండినచో నన్ననుగ్రహింపుము. ప్రియములగు నా ప్రాణములు నీకర్పింతును. ఇటుల దుఃఖించెను.

శ్లో॥ తస్యాశ్శ్రుత్వా వచః కోఽపి సుప్తో వ్యాఘ్రః ప్రబుద్ధవాన్ ।
కుర్వన్ ఘురఘురధ్వానం పశ్యన్ప్రతిదిశం రుషా ॥ 34

,, ఆస్ఫాలయన్నఖైర్భూమిం గర్జన్నాకాశగహ్వరమ్ ।
వృష్ఠనిర్భుగ్నలాంగూలః ద్రుతముత్థాయ వేగవాన్ 35

,, గతో వ్యాఘ్రస్సముత్పత్య యత్రాస్తే సాఽభిసారికా ।
అథ సాఽపి తమాయాంతమాలోక్య ప్రియశంకయా ॥ 36

,, నిర్జగామ పురఃస్థాతుం ప్రేమనిర్భరమానసా ।
తత స్తస్య నఖక్రీడాక్రూరతాంధీకృతా సతీ ॥ 37

,, అహో ప్రియవపుఃశంకాం శ్రుత్వా గర్జితమూర్జితమ్ ।
తథావిధాపి సా నారీ భ్రాన్తిముత్సృజ్య సత్వరమ్ ॥ 38

,, వ్యాఘ్ర త్వన్తు కుతో హేతోర్మాం నిహన్తుమిహాగతః ।
ఇదం సర్వం సమాఖ్యాహి యత స్త్వం హన్తుమిచ్ఛసి ॥ 39

తా॥ అదురాచారిణియొక్క వాక్యములు విని ఒకానొకవ్యాఘ్రము నిద్రనుండి మేల్కొనెను. ఘురఘురధ్వనినిచేయుచు మహాకోపముతో భూమినిగోళ్లచేగీరుచు ఆకాశకుహరము పగులునట్లు గర్జించుచు తనతోకను విదలించుకొనుచు ఆ దురాచారిణిపైబడెను. ఆ అభిసారిక తన ప్రియుడని తలంచి మిగుల ప్రేమతో నా వ్యాఘ్రమును నాలింగనము చేసికొనెను. ఆ వ్యాఘ్రముయొక్క తీక్ష్ణములగు గోళ్ళదెబ్బలను నోర్చుకొనలేక గర్జనమునువిని తన ప్రియుని శరీరముగాదని తలంచెను. అప్పుడా క్రూరస్త్రీ భయపడక ఓ వ్యాఘ్రమా! ఎందులకై నన్ను చంపుచున్నావు అని యడిగెను.

శ్లో॥ ఇతి తస్యావచశ్శ్రుత్వా శార్దూలశ్చండవిక్రమః ।
క్షణం విహాయ తద్గ్రాసముమవాచ ప్రహసన్నివ ॥ 40

,, మలాపహా నదీ నామ్నా దేశే తిష్ఠతి దక్షిణే ।
నగరీ మునిపర్ణేతి తస్యా రోధసి వర్తతే ॥ 41

,, తత్రాస్తే భగవాన్ సాక్షాత్ పంచలింగో మహేశ్వరః ।
తస్యాం పుర్యామహం విప్రపుత్రో భూత్వా స్థిత స్తతః ॥ 42

,, అయాజ్యాన్ యాజయన్నశ్నన్నేకోద్దిష్టే నదీతటే ।
వేదపాఠఫలం శశ్వద్విక్రీణన్ ధనకాంక్షయా ॥ 43

శ్లో॥ భిక్షుకానపరాన్ లోభా త్తిరస్కుర్వన్ దురుక్తిభిః ।
అదేయద్రవిణం గృహ్ణన్నదత్తమనిశం దినమ్ ॥ 44

,, ఛలయన్ సకలాంల్లోకాన్ క్షణగ్రహణకౌతుకాత్ ।
తతః కతిపయే కాలే జరఠత్వముపాగతః ॥ 45

,, వలీపలితవానంధః ప్రపతన్ ప్రస్ఖలద్గతిః ।
పతద్దంతోఽభవం భూయః ప్రతిగ్రహపరాయణః ॥ 46

,, హస్తే గృహీతదర్వోఽహమగమం తీర్థసన్నిధిమ్ ।
ధనగ్రహణలోభేన భ్రమన్ పర్వసు పర్వసు ॥ 47

,, తతోఽహం శిథిలాంగస్సన్ కంచిద్విప్రనిర్జరాలయమ్ ।
గతవాన్యాచితం భోక్తుం దష్టో మధ్యేపదే శునా ॥ 48

,, అపతం మూర్ఛితో భూత్వా తతః క్షితితలే క్షణాత్ ।
తతోఽహం గళితప్రాణో వ్యాఘ్రయోనిముపాగతః ॥ 49

,, అత్ర తిష్ఠామి కాంతారే పూర్వపాపమనుస్మరన్ ।
న భక్షయామి ధర్మిష్ఠాన్ మునీన్సాధుజనాన్ సతీః ॥ 50

,, కింతు పాపాన్ దురాచారానసతీర్భక్షయామ్యహమ్ ।
అతోఽనతి త్వం తత్తేన మమైవ కబలాయసే ॥ 51

,, ఇత్యుక్త్వా స్వైర్నఖైః క్రూరైస్తాం విభజ్యాంగఖండశః ।
అథ తాం భక్షితాం తేన పాపదేహముపాశ్రితామ్ ॥ 52

,, యమస్య కింకరానిన్యుః సద్యస్సంయమనీం పురీమ్ ।
యమాదేశేన తత్రాపి పాతయామాసురాశు తామ్ ॥ 53

తా॥ ఈ ప్రకారము ఆ దుష్టస్త్రీ వాక్యము నా పులి విని కొంతకాలము తినుటనుమాని తన గాథను చెప్పఁదొడంగెను. దక్షిణదేశమున పాపనాశినియను నదియొక్క యొద్దున మునిపర్ణ యను గ్రామమొండుండెను. అచ్చట పంచలింగస్వరూప మహేశ్వరుడు సాక్షాత్కరించి యుండెను. ఆ పట్టణమున నేను విప్రుడనైయుంటిని. ఆ నదీతీరమున గూర్చుండి యనర్హులచే యాగము చేయించుచు వారి యన్నమును గుడుచుచు ధనాశచే వేదపాఠఫలమును నమ్ముకొనుచు యాచకులను మోసగించుచు గైకొనుటకు నర్హముగాని ద్రవ్యమును గ్రహించుచు ధనాశచే సకలజనులను మోసగించుచు కాలముగడుపుచుంటిని. ఇటుండ వృద్ధత్వముచే శరీరము ముడుతలుపడెను. నడువజాలని వాడనైతిని. నాదంతము లూడిపడెను. అయినను నితరుల ధనము నాశించువాడనై చేతిలో దర్భల నిడుకొని యా తీర్థసన్నిధానమున పర్వదినములయందు దిరుగుచుంటిని. అవయవములు సడలిన నేను ఒకానొక బ్రాహ్మణుని యింటికిబోవుచు యాచితాన్నమును భక్షించుటకై దొరకొనగా నన్ను కుక్కగఱచెను. వెంబడే నేను మూర్ఛితుడనై భూమిపైబడి మరణించి పులినై జన్మించితిని. నేనిచ్చోట పంచరింతును. నేను పాపభీతిచే ధర్మిష్ఠులను మునీశ్వరులను సాధువులను సతీమణులను భక్షించను. పాపాత్ములను కులటలను భక్షించుదును. కనుక నీవు దుర్మార్గురాలవు. నాకు కబలముకమ్ము అని చెప్పుచు క్రూరనఖములచే నా స్త్రీనిఖండశః విభజించి విభజించి భక్షించెను, అట్టి దుష్ట స్త్రీని యమకింకరులు తీసికొనిపోయి ఘోరనరకములయందు బడవైచిరి.

శ్లో॥ విణ్మూత్రరక్తపూర్ణేషు ఘోరకుండేష్వనేకధా ।
కల్పకోటిషు పీతాసు తస్మాదానీయ తాం ముహుః ॥ 54
,, రౌరవే స్థాపయామాసుర్మన్వంతరశతావధి ।
తతోఽప్యాకృష్య తాం దీనాం రుదతీం సర్వతోముఖీమ్ ॥ 55
,, ముక్తకేశాం భగ్నగాత్రాం చిక్షిపుర్దహనాననే ।
ఏవం పాపపరాం ఘోరాం భుక్త్వా నరకయాతనామ్ ॥ 56
,, ఇహ జాతా మహాపాపాత్ పునశ్శ్వపచయోనిషు ।
తతశ్శ్వపచగేహేఽపి వర్ధమానా దినేదినే ॥ 57
,, పూర్వజన్మవశేనైవ తథైవాసీద్యథా పురా ।
తతః కతిపయే కాలే పునః స్వభవనం యయౌ ॥ 58
,, యత్రాస్తే జృంభకా దేవీ శివస్యాంతః పురేశ్వరీ ।
తత్రాపశ్యద్ద్విజన్మానం వాసుదేవాభిధం శుచిమ్ ॥ 59
,, గీతాత్రయోదశాధ్యాయముద్గిరంతమనారతమ్ ।
తతస్తచ్ఛ్రవణాదేవ ముక్తా శ్వపచవిగ్రహాత్ ।
దివ్యం దేహం సమాసాద్య జగామ త్రిదశాలయమ్ ॥ 60

తా॥ మలమూత్రరక్తములతోగూడిన ఘోరకూపములయందు కల్పకోటికాలమువఱకు వానిని త్రావించుచు మన్వంతరకాలమువఱకు రౌరవనరకమున బడద్రోయుచు నాదుష్టస్త్రీని శతవిధముల బాధపెట్టిరి. ఏడ్చుచున్నటువంటి యాదీనురాలిని జడబట్టియీడ్చి శరీరమును చితుకగొట్టి అగ్నిజ్వాలలయందుబడవైచిరి. ఈ ప్రకారము నరకయాతనలననుభవించి యాక్రూరస్త్రీ శ్వపచకులమునబుట్టెను. ఆ జాతిలో వృద్ధిబొందుచు తనపూర్వవాసనచే క్రూరకర్మలనే చేయుచుండెను. తరువాత బంచలింగేశ్వరుని దయితయగు జృంభకాదేవియున్నట్టి నగరమునకుపచ్చెను. అచ్చోట శ్రోత్రియబ్రాహ్మణుడగు వాసుదేవునిదర్శించి తద్ద్వారాగీతయొక్క త్రయోదశాధ్యాయమగు క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమును శ్రవణముచేసెను. తరువాత నాస్త్రీ దివ్యదేహమునుధరించి స్వర్గమునకు వెళ్లెను.

---

ఓమ్

# చతుర్దశాధ్యాయ మాహాత్మ్యము

ఈశ్వర ఉవాచః—
శ్లో॥ అతఃపరం ప్రవక్ష్యామి భవాని భవముక్తయే ।
గీతాచతుర్దశాధ్యాయమవధారయ సుస్మితే ॥ 1
,, మేదిన్యాం యత్కిలస్థూలమస్తి కాశ్మీరమణ్డలమ్ ।
రాజధానీ సరస్వత్యా ఆస్తే చైవ మనోహరా ॥ 2

శ్లో॥ యామధిష్ఠాయ వాగ్దేవీ బ్రహ్మలోకం ప్రయచ్ఛతి ।
హంసమారుహ్యమానాపి సావిత్రీ ప్రహతైరపి ॥ 3

,, సరస్వతీపదాంభోజ సేవామాశ్రిత్య కుంకుమైః ।
యత్ర గౌరవయన్త్యాశా హంసపక్షపుటోద్భవైః ॥ 4

,, నిరంతరం తయా చైవ నృణాం సంస్కృతభాషిణామ్ ।
సుపర్వాణమయీ భాషా నిమేషేణోపలభ్యతే ॥ 5

,, ప్రాత ర్గృహాంగణోద్భూతై ర్యత్ర కుంకుమపాంసులైః ।
సర్వతోఽరుణితచ్ఛాయ శశాంకరవిమణ్డలమ్ ॥ 6

తా॥ ఈశ్వరుడు పార్వతీదేవితో నిటులనెను. ఓ దేవీ! ఇక సంసారవిముక్తిని గలుగ జేయు గీతాచతుర్దశాధ్యాయ మహిమనువినుము. ఈ పుడమిలో విశాలమగు కాశ్మీరదేశముగలదు. అందు సరస్వతీరాజధాని వెలయుచున్నది. అచ్చోట సరస్వతీదేవి నివసించుచున్నదై బ్రహ్మలోక ప్రాప్తిని జనులకు గలుగజేయుచున్నది. సావిత్రీ ప్రయోగములచేతను నచ్చటనున్న హంసపక్షులు సరస్వతీ పాదకమలసేవనుగైకొని అచ్చటనున్న కుంకుమద్రవ్యములచే సమస్తదిక్కులను అరుణితములను గావించుచున్నది. ఆ సరస్వతీదేవి నిరంతరము సంస్కృతమును భాషించువారలకు గీర్వాణవాణిని నొక నిముషములో అనుగ్రహించుచున్నది. ప్రాతఃకాలమున ముంగిళ్లయందుద్భవించిన కాశ్మీర రజములచే చంద్రసూర్యమణ్డలములను నెఱ్ఱగా ఆదేశముచేయుచున్నది.

శ్లో॥ తత్రాసీత్తేజసాం రాశిశ్శౌర్యవర్మా నరేశ్వరః ।
ఉద్యదుజ్జ్వలబాణౌఘ ఖండితారాతిమణ్డలః ॥ 7

,, అభూచ్చ సింహళద్వీపే రాజా సింహపరాక్రమః ।
నామ్నా విక్రమవేతాలః కలానామపి శేవధిః ॥ 8

,, ఉభౌ పరస్పరం మైత్రీం వర్ధయాం చక్రతుః క్రమాత్ ।
తత్తద్దేశసముత్పన్నై రపూర్వైః ప్రచురోత్కరైః ॥ 9

,, ఏకదా ప్రహితం ప్రేమ్ణా ప్రభూతం శౌర్యవర్మణా ।
రాజా విక్రమవేతాలో విలోక్య శునకీద్వయమ్ ॥ 10

,, మత్తమాతంగతురగ మణిభూషణచామరమ్ ।
ప్రేషయామాస మిత్రాయ ప్రభూతం శౌర్యవర్మణే ॥ 11

,, ఏకదా శిబికారూఢశ్చారు చామరవీజితః ।
సువర్ణశృంఖలారూఢం వాద్యడిండిమడమ్బరమ్ ॥ 12

,, శునీయుగళమాదాయ మృగయాకౌతుకోత్సుకః ।
రాజా జగామ వాహ్యాళిం సమం రాజకుమారకైః ॥ 13

,, పణబంధవిధానేన సముపేతం శశామిషమ్ ।
తత్ర రాజకుమారాణాం మహాన్కోలాహలోఽభవత్ ॥ 14

శ్లో॥ తతస్సమానవయసా కేనచిద్రాజసూనునా ।
బహుమూల్యం పణం కృత్వా రాజా చిక్రీడ కౌతుకీ ॥ 15
,, తతోఽవతార్య దోలాయా బిరుదావలిగర్వితామ్ ।
ధావతశ్శునకస్యోచ్చైః పృష్ఠే ముఞ్చన్నృపశ్శునీమ్ ॥ 16
,, ముమోచ రాజపుత్రోఽపి ప్రేమపాత్రం మహాభుజః ।
విరరామ శునీముచ్చైస్సంకీర్త్య బిరుదావళీమ్ ॥ 17
,, అలక్ష్యమాణవేగేఽస్మిన్ శునీయుగళకే భృశమ్ ।
ధావత్యుత్థితమేవాసీత్ పశ్యతాం సర్వభూభృతామ్ ॥ 18
,, పపాత గర్తే మహతి శశకోఽతిశ్రమాదసౌ ।
పతితోఽపి శునీవశ్యో నాభవచ్ఛశశావకః ॥ 19
,, తత్పశశైస్సముత్థాయ ధావన్నాక్రమ్య రోషతః ।
జగృహే రాజశున్యాఽసౌ శశకః ఫేనముద్వమన్ ॥ 20
,, తతః కథంచిదుత్ప్లుత్య గచ్ఛన్స్వస్థలయఞ్ఛశః ।
రాజపుత్రశునక్యాఽసౌ గృహీతః కంధరాతలే ॥ 21
,, జితమస్మాభిరత్యర్థమితి సంజల్పతాం నృణామ్ ।
కోలాహలే శంకితాయా శున్యా నిర్గతవాన్ముఖాత్ ॥ 22
,, తతో దంష్ట్రాపదశ్రేణీ క్షరద్రుధిరధారకః ।
క్వాపి మర్మరభూభాగే నిలీయ స్థితవాఞ్ఛశః ॥ 23
,, జిఘ్రన్త్యా రాజశున్యాఽసౌ భూభాగం ఘనరోషయా ।
దృష్టమాత్రః పరిత్రస్తో హన్తమాత్రం తతోఽగమత్ ॥ 24
,, యత్ర కర్పూరకదళీక్రోడవ్యాఘ్రఘ్నదరీతలః ।
చోళీకపోలఫలకాన్చుంబన్వాతి సమీరణః ॥
,, ఉద్భిన్న కేతకీకోశ రజోముకుళితేక్షణా ।
విస్రబ్ధా హరిణా యత్ర ఛాయాం తాం పరితన్వతః ॥ 26
,, నారికేళఫలైర్యత్ర స్వయం నిపతితైరధః ।
అపి చూతఫలైస్తృప్తాః పక్వైశ్శాఖామృగా అపి ॥ 27
,, అపి కేసరిణో యత్ర ఖేలన్తి కలభైస్సమమ్ ।
ఫణినః కేకిబర్హేషు నిర్విశంకం విశన్తి చ ॥ 28
,, యత్రాశ్రమాన్తరే విప్రో వత్సనామా జితేన్ద్రియః ।
శాంతశ్చతుర్దశాధ్యాయం జపన్నాస్తే నిరంతరమ్ ॥ 29
,, తత్ర తచ్ఛిష్యపాదాబ్జ ప్రక్షాళనజలైః కృతే ।
కర్దమే న్యపతద్గత్వా జీవశేషో ముహుశ్శ్వసన్ ॥ 30

,, తతః కర్దమసంస్పర్శమాత్రాని స్త్రీర్ణసంసృతిః ।
దివ్యం విమానమారుహ్య నిర్యయౌ శశకో దివమ్ ॥ 31
,, తతః శున్యపి లిప్తాంగీ స్తో కైః కర్దమబిందుభిః ।
క్షుత్పిపాసా ర్తిరహితా శునీరూపం విహాయ సా ॥ 32
,, తతో దివ్యాంగనారమ్యం గంధర్వైరుపశోభితమ్ ।
దివ్యం విమానమారుహ్య శున్యపి త్రిదివం యయౌ ॥ 33

తా॥ ఆ కాశ్మీరదేశమున తేజోరాశియగు శౌర్యవర్మయను ప్రభువు సమస్తరాజుల జయించి కీర్తిమంతుండైయుండెను. మఱియు సింహళద్వీపమున విక్రమవేతాళుడను సింహపరాక్రమముగలరాజు సకల కళలకు (విద్యలకు) నిధియై యేలుచుండెను. ఆ శౌర్యవర్మ విక్రమవేతాళురు పరస్పరము వస్తుసామగ్రిని పంచుకొనుచు మైత్రిలోనుండిరి. ఒకప్పుడు శౌర్యవర్మ విక్రమవేతాళునకు రెండు వేటకుక్కలన బంపెను, ఆ వేతాళభూపతియు మదించిన యేనుగును గుఱ్ఱమును మణిభూషణాదులను శౌర్యవర్మకొఱకు కానుకగానిడెను. ఒకప్పుడా విక్రమవేతాళభూపతి పల్లకినెక్కి చామరములచే వీచబడుచున్నవాడై, బంగారుగొలుసుతో కట్టబడిన యా రెండు కుక్కలను తీసికొని వేటయందాసక్తిగలవాడై వాద్యఘోషములతో గొంతమంది రాజకుమారులతో గూడ విహారమునకువెళ్లెను. కుందేళ్ళ మాంసమునకై పందెము వేసికొనుచు పరస్పరము రాకుమారులకు గోలాహలము చెలరేగెను. ఆ సమయమున సమవయస్కుడగురాజుతో నా వేతాళభూపతి బహుధనమును బందెమునకైయునిచి క్రీడించెను. తరువాత డోలికనుండి అనేక బిరుదములతో నొప్పుచున్నదియు శౌర్యవర్మచే బంపబడినదియునగు వేటకుక్కను బరుగిడుచున్న కుందేలుతో బందెమునకై పంపెను. ఆ రాజువిడచి దాని బిరుదులను గీర్తించి యూఱకే యుండెను. అవి రెండును బరుగిడునప్పుడు ధూళిమాత్రమేకనుబడుచుండెనేగాని వానినిమాత్రము రాజులుచూడలేదు. పరుగిడుచు గుందేలొక గుంటలోబడెను. అయినను కుక్కకు వశముకాకుండెను. కొంతసేపటికి కుందేలు పైకిలేచి పరుగిడుచుండగా కుక్క దానిని పట్టుకొనెను. అప్పుడు కుందేలునోటిగుండ నురుగుగ్రక్కుచుండెను. అయినను మహారోషముతో నెగిరిపరుగిడుచున్న కుందేలుయొక్క మెడను తిరుగ ఆ యాడకుక్క గ్రహించెను. ఆ సమయమున రాజులందరు మేము జయించితిమని బిగ్గఱగా నఱచిరి. తరువాత శునకముఖమునుండి కుందేలు తప్పించుకొని రక్తధారలచే సిక్తమై యొకానొక రహస్యప్రదేశమున నా కుందేలుడాగెను. కుక్కయు తద్గంధమును గ్రహించుచు నచ్చోటికి బరుగిడివచ్చెను. దానిజూచి కుందేలు భయపడి యొకచేతిదూరములోనున్న ఆశ్రమమునకు జనెను. ఆ యాశ్రమమెట్లున్నదనగా కర్పూరవృక్షములతోడను, అరటిచెట్లతోడను, వ్యాఘ్రసంచారముతోడను గూడినదై చల్లనిగాలితో గూడుకొన్నదై మొగిలిపుష్పములతో బ్రకాశించుచున్నదై యొకచోట వృక్షచ్ఛాయలనిద్రించుచున్నలేళ్లతో నొప్పారుచున్నదై వెలయుచుండెను. మఱియొకచోట కోతులు వృక్షముల క్రిందబడిన నారికేళఫలములతోడను, మామిడిపండ్లతోడను. దృప్తినిజెంది విహరించుచున్నవి. అచ్చట సింహములు ఏనుగుగున్నలతో మిక్కిలిప్రేమతో నాటలాడుకొనుచున్నవి సర్పములు నెమళ్ల పింఛములయందు శయనించుచున్నవి. అట్టి ఆశ్రమమున వత్సుడను పేరుగల విప్రుడునివసించుచుండెను. ఆతడు నిర్జితేంద్రియగ్రాముడై శాంతుడై గీత పదునాలుగవ యధ్యాయమగు "గుణత్రయవిభాగయోగము"ను నిరంతరము జపించుచుండెను. ఆ యాశ్రమమున నాతని శిష్యగణపాదజలముచే

నేర్పడిన బురదయందీకుందేలు ప్రాణములు మాత్రమమిగిలియుండగా వచ్చిపడిపోయెను. తరువాత నా బురదయొక్క స్పర్శచే సంసారబంధము విడిపోయినదై యా కుందేలు దివ్యవిమానము నెక్కి దివ్యరూపముతోనేగెను. ఆ యాడుకుక్కయు నందులోబడి తత్పుణ్యవశముచే నాకలి దప్పులు లేనిదై దివ్యరూపము ధరించి విమానమునెక్కి స్వర్గమునకుఁజనెను.

శ్లో॥ తతో జహాస మేధావీ శిష్యో నామ్నా స్వకంధరః।
విచార్య విస్మితః పూర్వజన్మవైరస్య కారణమ్ ॥ 34
,, రాజాపి పర్యపృచ్ఛత్తం విస్మయస్మేరలోచనః।
ప్రణమ్య పరయా భక్త్యా వినయైకపయోనిధిః ॥ 35
,, కథాం కథయ మే విప్ర హీనయోనినిషేవితా।
అజ్ఞౌ యౌ జగ్మతుస్స్వర్గం శునీ శశకశావకౌ ॥ 36

శిష్యఉవాచ:—

శ్లో॥ వత్సనామా ద్విజన్మాఽస్తి వనేఽముష్మిన్ జితేంద్రియః।
చతుర్దశం తు హ్యధ్యాయం గీతానాం సర్వదా జపన్ ॥ 37
,, శిష్యోఽహం తస్య భూపాల బ్రహ్మవిద్యావిశారదః।
చతుర్దశం తు అధ్యాయం జపామి ప్రత్యహం నృప ॥ 38
,, మదీయచరణాంభోజప్రక్షాలనజలే లుఠన్।
శశస్త్రిదివమాపన్నశ్శునక్యా సహ భూపతే ॥ 39

రాజోవాచ:—

శ్లో॥ హేతునా కేన కథయ హసితం చ ద్విజోత్తమ।
అతః కిమసి సాకూతం మన్యమానేన సాదరమ్ ॥ 40

శిష్యఉవాచ:—

శ్లో॥ మహారాష్ట్రేఽస్తి నగరం నామ్నా ప్రత్యుదకం మహత్।
తత్రాసీద్బ్రాహ్మణో నామ్నా కేశవః కితవాగ్రణీః ॥ 41
,, విలోభనాఽభవత్తస్య జాయా స్వైరవిహారిణీ।
తేన సా హన్యతే క్రోధాద్వైరం సంచిన్త్య జన్మనః ॥ 42
,, తతః స్త్రీవధపాపేన శశకో జాయతే ద్విజః।
కిల్బిషాచ్ఛునకీ సాఽపి జాతా వంచనజన్మనః ॥ 43
,, పూర్వేణ జన్మనాభ్యస్తం వైరం విస్మరతో న హి।
ఆసేదివద్భ్యాం బహుధా యోన్యన్తరమపి క్వచిత్ ॥ 44
,, ఇత్యాకలయ్య సకలం భూపాలశ్శ్రద్ధయాఽన్వితః।
గీతామభ్యస్య సకలామవాప పరమాంగతిమ్ ॥ 45

తా॥ తరువాత వత్సమహర్షియొక్క శిష్యుఁడగు మహాబుద్ధిశాలి స్వకంధరుఁడనువాఁడు మిగుల నాశ్చర్యముతో విచారణాగ్రస్తుఁడై యా కుందేలు కుక్కలయొక్క పూర్వజన్మమునుండి

వచ్చిన వైరకారణమును గనుంగొని పెద్దగానవ్వెను. దీనినంతయుఁజూచి యాశ్చర్యముచే వికసిత నేత్రుడైన ఆ శౌర్యవర్మప్రభువు మిగులభక్తితో వినయైకసముద్రుడై యా శిష్యునికి నమస్కరించి ఓ బ్రాహ్మణవర్యా! నీచయోనిలోబుట్టిన యీ మూఢజంతువులురెండును నెటుల స్వర్గప్రాప్తిని బొందినవి? ఆ కథను నాకు నుడువుండని కడునాదరముతో వాని నడిగెను. శిష్యుడు చెప్పు చున్నాడు. ఈ వనంబున వత్సనామకుండగు విప్రోత్తముడుగలడు. అతడు వశీకృతేంద్రియుఁడు. ఆ యోగిసత్తముడు గీతయొక్క పదునాల్గవ అధ్యాయమును నిరంతరము జపించుచుండును. నే నాతని శిష్యుండ, బ్రహ్మవిద్యాకోవిదుండ. ఓ భూపాల సత్తమా! నేనును ఆ గుణత్రయ విభాగ యోగమును ప్రతిదినము జపించుచుందును. నా పాదకమలములయొక్క కడుగబడిన జలమునందు ఆ కుందేలును ఆడకుక్కయు పోర్లాడినవై తన్మహిమచే స్వర్గమును బొందినవి. తర్వాత రాజు మరల ప్రశ్నించెను. ఏదియో మనముననుంచుకొని వాటినిజూచినవ్వితిరి. అందులకు కారణమేమి నుడువుమా? శిష్యుడు చెప్పెను - మహారాష్ట్రదేశమున ప్రత్యుదకనగరమొందు గలదు. అచ్చట మహాధూర్తుడగు కేశవుడను బ్రాహ్మణుడుండెను. అతనిభార్య విలోభనయను పేరుగలది. అది వ్యభిచారిణి. అందువలనవాడు దానిని కొట్టిచంపెను. ఆ పాపముచే నాతడు కుందేలుగాను, ఆతని భార్యయగు పాపిష్ఠురాలు అడుకుక్కగాను జన్మించిరి, వారిద్దరు జన్మాంతరమునందును సహజ వైరమును విడువక కుందేలు కుక్కరూపులై పోరాడిరి. ఇట్టి పవిత్ర జలస్పర్శచే దివ్యత్వమును జెందిరి. దీనినంతయు నారాజాలోచించి గీతయొక్క పదునాల్గవ అధ్యాయమగు గుణత్రయ విభాగయోగమును నభ్యసించి పరమపదవిని బొందెను.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆

ఓమ్

# పంచదశాధ్యాయ మాహాత్మ్యము

ఈశ్వర ఉవాచః—

శ్లో॥ ప్రవక్ష్యామి విశాలాక్షి! తుహినాచలకన్యకే!।
గీతా పంచదశాధ్యాయ మాహాత్మ్యమవధారయ ॥ 1

,, కృపాణుర్నర సింహో౽భూన్నామ్నా గౌడేశ భూపతిః
యస్యాసిధారయా సంఖ్యే దేవసంఘావధీకృతాః॥ 2

,, యదీయ మత్తమాతంగ దాన ధారా జిలైరిలా।
నిదాఘే౽పి చ సేహేతాం రవి సంతాపవేదనాం॥ 3

,, సంక్రందన పరిత్రస్తాయదీయ శరణం గతాః।
రేజిరే కరిణో౽మత్తాశ్చలంతః పర్వతా ఇవ ॥ 4

,, మత్తమాతంగ చీత్కార ప్రతిస్వనమివాదరాత్।
యస్య గోపాయత శ్శైలావ్యాహార న్తి కృపావతః॥ 5

,, యదీయధావత్తురగ క్షుర సంఘాత జర్జరం।
నాభూచ్చిత్రం కథం కారం గతఖండం ధరాతలం ॥ 6

శ్లో॥ యస్మిన్ వృత్రహణోఽమిత్రే సముద్ధరతిమేదినీం
పునరుజ్జ్వాలయాం చక్రే మహాభాష్యం ఫణీశ్వరః॥ 7

తా॥ ఈశ్వరుడుచెప్పెను. ఓ విశాలాక్షి! హైమవతి! గీతయొక్క పంచదశాధ్యాయ మాహాత్మ్యమును వినుమా! గౌడదేశమున నరసింహభూపాలుడు మిగుల దయావంతుడై ప్రజలను పాలించుచుండెను. వాని ఖడ్గధారచే దేవతలుగూడ వధింపబడుదురు. వానియొక్క మదించిన యేనుగులయొక్క మదజలధారలచే భూమి గ్రీష్మకాలమునందును చల్లగా నుంటున్నది. ఇంద్రుని వలన భయపడిన గజము లితనికడజేరి మదించినవై, తిరుగాడు పర్వతములవలె నొప్పుచున్నవి. వీని ఏనుగులయొక్క ఘీంకారధ్వనిని విని పర్వతములుగూడ ప్రతిధ్వనించుచున్నవి. వీని అశ్వములయొక్క గిట్టలయొక్క సంఘట్టనలచే ఈ భూతలము ముక్కలుముక్కలు చేయబడినదై యాశ్చర్యమును గలుగజేయుచున్నది. పూర్వమింద్రుడు వృత్రాసురునిచే భూమిక్రుంగిపోగా నా భూమిని రక్షించెను. మహాభాష్యకారుడగు ఆదిశేషుడు తిరుగా నామహీతలమును పైకెత్తెను. ఇపుడట్టివారెవరును లేకపోయిరి.

శ్లో॥ తస్యాసీత్ సైనికోధీమాన్ శస్త్రశాస్త్రకళానిధిః।
నామ్నా శరభభేరుండః ప్రచండభుజమండలః॥ 8

,, ఖాండారేణ తురంగైశ్చభటైర్వీర రసోద్భవైః।
సమాన ఏవ భూపాల దుర్గైరత్యంతదుర్గమైః॥ 9

స కదా చిత్ స్వయం రాజ్యం కర్తుం పాపోదధేమనః।
నిహత్యవసుధాపాలం బలాత్స్వకం కుమారకైః॥ 10

,, కర్తుం వ్యవస్యదివసైరల్పైరిత్థం చికీర్షయా।
విషూచి కామ యాదాశు పరాసుస్సమజాయత॥ 11

,, కాలే నాల్పీయసా ప్రేత్యపాపాత్మా తేన కర్మణా।
తేజస్వీతురగోజాతః సింధుదేశే కృశోదరః॥ 12

,, మూల్యేన బహునా క్రీత్వా హయత త్త్వవిదాతతః।
బహుయత్నవతానీతః కేన చిద్వైశ్యసూనునా॥ 13

,, రాజాఽపి పాత్ర నప్త్రాద్యైస్తస్యైవ మరణాత్పరం।
కాలేన వృద్ధతాం ప్రాప్తః స్వరాజ్యం చాపి పాలయన్॥ 14

స వైశ్య సూనుస్తంచాశ్వం రాజ్ఞేదాతుం సమాగతః।
రాజ్ఞోద్వారి స్థిత స్తత్ర ప్రతీక్షం స్తత్సమాగమం॥ 15

,, జ్ఞాతపూర్వోఽపి వైశ్యోఽసౌ ప్రతీహారేణ దర్శితః।
కిమర్థం బ్రూహిరాజ్ఞేతి పృష్టః స్పష్టమభాషత॥ 16

దేవత్రిజగతీరత్నమితి మత్వాతురంగమః।
మయానియుత మూల్యేన బహునాసాధులక్షణః॥ 17

,, తతోఽవ లోక్యవక్త్రాణి భూపాలః పార్శ్వవర్తినాం।
సమాధిదేశ వణిజమశ్వోఽత్ర నీయతామితి॥ 18

శ్లో॥ శిరాంసిధూనయన్ నృణామశ్వలక్షణవేదినాం।
శూరాణామపి చేతాంసి ముహురుత్సాహయన్మహాన్ ॥ 19

,, అఖండమేదినీవేగ బహుసంక్రమణార్జితం।
లాలాఫేన చ్ఛలేనాసౌ వమన్ శుభ్రతరం యశః॥ 20

,, ఉచ్చైశ్శ్రవస్తులాం భేజే గుణసామ్యేన తత్త్వతః।
విష్ఫణ్వన్నతితేజస్వీ హ్రియేవ నతకంధరః॥ 21

,, చామరై రిందు ధవళై ర్వీజ్యమానో నిరంతరం।
దుగ్ధాంభో నిధి లోలై స్తైశ్శ్వైసైరుచ్చైశ్శ్రవా ఇవ॥ 22

,, నీలాతపత్రయుగళం ఘనచ్ఛాయతుల్యశ్రియా।
బిభ్రాణో వారిదాలీఢహిమాద్రి శిఖరశ్రియం॥ 23

,, మేదినీమండలస్పర్శ సంక్రాంతమివ పావకం।
ముహురుద్ధరయన్ధున్వన్ బంధురం కంధరాతటం॥ 24

,, దారయన్ వైరిణః సర్వాన్ వ్యాహరంశ్చ జయశ్రియం।
హేషారవేణ గురుణాదిక్షు ప్రఖ్యాపయన్ యశః॥ 25

,, సత్త్వస్య రాశిరత్యుచ్చైర్గతీనామివ శేవధిః।
రూపస్య నిలయం సాక్షాల్లక్షణానాం పయోనిధిః॥ 26

,, ఆనీతో వణిజా వాజీ రాజ్ఞా చ సమదృశ్యత।
బహుధా వర్ణితోఽమాత్యైరశ్వలక్షణవేదిభిః॥ 27

,, యథేచ్ఛం వణిజోద్దీర్ణం స్వర్ణం దత్వా మహీపతిః।
జగ్రాహ తురగం వేగాదసీమానందనిర్భరః॥ 28

,, తతోఽశ్వపాలమాహూయ యత్నత స్తం నిరూప్య చ।
విసర్జితనఖాలోకో గృహాన్తరమగాన్నృపః॥ 29

తా॥ ఆ నరసింహభూపాలునికి మిగుల బుద్ధిమంతుడును సకల శస్త్రాస్త్రకళలకు నిధియైనవాడును తీక్ష్ణభుజమణ్డలధారియునునగు సరభభేరుండుడను నొక సేనాధిపతియుండెను. ద్రవ్యములోను తురంగబలములోను వీరభటులలోను దుర్గస్థలములలోను రాజుకు సమానుడై యుండెను. ఇట్లుండ నా సేనాధిపతికి రాజునుదునుమాడి తన కుమారులతోగూడ తానే రాజ్య మేలవలయునని పాపబుద్ధి పొడమెను. కొన్ని దినములలో నే నీకార్యమును నెరవేర్పవలయునని తలంచియుండగా ఆ సరభభేరుండుడు విషూచికావ్యాధిచే మరణించెను. శీఘ్రకాలములోనే యా పాపాత్ముడట్టి దుష్టతలంపుచే సింధుదేశమున అత్యుత్తమాశ్వమై జన్మించెను. అది చాలావేగము గలది. అద్దానినొకానొక వైశ్యపుత్రుడు గొప్పధనముచే మిగుల ప్రయత్నముచే రాజుకడకు దీసికొని వచ్చెను. ఆ నరసింహభూపాలుడు సేనాధిపతి మరణించినను వానిపుత్రులచే సేనాధిపత్యము వహింపబడగా రాజ్యమును చక్కగా పాలించెను. అవణిక్పుత్రుడు సింధుదేశాశ్వమును మహారాజు కొసంగుటకై ద్వారముకడ నిలుచుండెను. అప్పుడు ప్రతీహారి రాజాజ్ఞచే వానిని దీసికొనిరాగా

నావణిక్కు రాజుచే ప్రశ్నింపబడి ఇటుల చెప్పెను. ఓ దేవా! ఈ అశ్వము త్రిభువనరత్నము. సాధులక్షణములుగలది. లక్ష నాణ్యములచే కొంటిని. ఆ సమయమున నితర రాజులయభిప్రాయ మును గనుగొని గుఱ్ఱమును తనకిచ్చునటుల వణిజుని రాజాజ్ఞాపించెను. మహాశూరులగు నారాజులు అశ్వలక్షణములను గుర్తెరింగినవారగుటచే భేష్‌భేష్ అనుచు తలలూపిరి. ఈ భూమినంతను అక్రమణచేయగలిగిన యశస్సును తనలోటిలోని లాలాజలముయొక్క నురుగుచే ప్రకటించెను. పరాక్రమముననను ధవళత్వములోను ఉచ్చైశ్శ్రవముయొక్క సామ్యమును వహించెను అను విషయ మును వివరించుచుండగా ఈ యశ్వము సిగ్గునొందెను. ఆ గుఱ్ఱము చంద్రధవళ చామరములచే వీచబడుచుండెను, నిట్టూర్పులలోను ఉచ్చైశ్శ్రవసువలెనొప్పెను. రెండు నీలఛత్రములచే కూడి కొన్నదై నల్లని మేఘముతో గూడుకొనిన హిమవత్పర్వతమువలె ప్రకాశించెను. భూమండలమును వ్యాపించి ప్రజ్వలించుచున్న యగ్నివలె తేజరిల్లెను. మాటిమాటికి మెడనుగదలించుచున్నదై పెదవు లను త్రిప్పుచున్నదై శత్రువులను బెదరించుచున్నదై జయలక్ష్మిని తెలుపుచుండెను. తనసకిలింతచే దిక్కులయందు తన కీర్తిని ప్రకటింపజేయుచుండెను. సత్వగుణరాశియై యున్నతగుణములకు కుప్పయై సౌందర్యనిలయమై సల్లక్షణములకు పయోరాసియై చెన్నొందెను. ఆ వణిక్పుత్రుడా హయ మును తీసికొనిరాగా రాజులు మంత్రులు పారజూచి తదుత్తమలక్షణములను నభివర్ణించిరి. అత్యధికానంద భరితుడై రాజు వణిక్పుత్రుడడిగిన ధనమును నొసగి శీఘ్రముగా నా తురంగమును గైకొనెను. ఆ గుఱ్ఱమును గుఱ్ఱపురౌతు కొప్పజెప్పి తానున్న సభామణ్డపమునువదలి యా రాజు తన గృహమునకరిగెను.

శ్లో॥ అనేకధా సమాపృష్టో మహీపాలం రణాంగణే।
శస్త్రవ్రణకిణశ్రేణీ భూషణం సత్వసన్నిభమ్ ॥ 30

,, ఏకదా మృగయాఖేలన్కుతూహలరసాత్మనా।
తమారుహ్య మహీపాలో వనం ప్రవివేశ సః ॥ 31

,, విసృజ్య సైనికాన్పృష్ఠే ధావతః పరితోఽఖిలాన్।
ఆకృష్యమాణో హరిణైః పిపాసాకులితోఽభవత్ ॥ 32

,, తత ఉత్తీర్య తురగాజ్జలమన్వేషయన్నృపః।
బద్ధ్వాఽశ్వం తరుశాఖాయామారురోహ శిలాం నృపః ॥ 33

తా॥ అనేక పర్యాయములు ఇతరులచే ప్రేరేపింపబడినవాడై యొకానొక సమయమున వేటకై జనుచు నా గుఱ్ఱమునెక్కి యరణ్యమున ప్రవేశించెను. అచ్చట సైన్యములవదలి మృగము లతో వేటాడుచు దప్పిగొన్నవాడై గుఱ్ఱమును దిగి నీటికై వెదకుచు నానృపసత్తముడు చెట్టుకు తన యుత్తమాశ్వమును బంధించియొక శిలపైగూర్చుండెను.

శ్లో॥ గీతాపంచదశాధ్యాయశ్లోకార్ధలిఖితం తతః।
పాతితం మరుతా తత్ర యత్ర ఖండే విలోకయన్ ॥ 34

,, పత్రం వాచయతో రాజ్ఞః శ్రుత్వాగీతాక్షరావలీమ్।
తతో ముక్తిపదం లేభే తురగస్త్వరయాఽపతత్ ॥

,, తతో గ్రన్థిం సమాచ్ఛిద్య పల్యాణమవతార్య చ।
ఉత్థాప్యమానస్తురగో రాజ్ఞా నోత్థితవాన్మృతః ॥

శ్లో॥ తతస్సరభభేరుండో నృపమాభాష్య సుస్వరమ్ ।
దివ్యం విమానమారుహ్య జగామ త్రిదశాలయమ్ ॥ 37

తా॥ తదనన్తరమచ్చోట రాతిఫలకముపై రాజుకూరుచుండియుండగా నొక పత్రము (తాటియాకుముక్క) గాలిచే కొట్టుకొనివచ్చెను. ఆ పత్రముపై గీతయొక్క పదునైదవ అధ్యాయము లోని ఒక శ్లోకముయొక్క అర్ధభాగము మాత్రము వ్రాయబడియుండెను. దాని నా ప్రభువుతీసికొని చదువుచుండగా నా గీతాక్షరములను విని గుఱ్ఱము శీఘ్రముగా భూమిపై పడి ముక్తినిపొందెను. తర్వాత ఆ రాజు దాని బంధమును విప్పి జీనును తీసివైచి గుఱ్ఱమును పైకిలేపగా అదిలేవలేదు. మరణించియుండెను. తదుపరి తనసేనాధిపతియగు సరభభేరుండుడు ప్రభువుతో మంచిస్వరముతో సంభాషించి దివ్యవిమానారూఢుడై స్వర్గమునకుఁజనెను.

శ్లో॥ తతో గిరిం సమారుహ్య దదర్శాశ్రమముత్తమమ్ ।
పున్నాగకదళీచూత నాళికేరసమన్వితమ్ ॥ 38

,, ద్రాక్షేక్షువాటికాపూగ నాగకేసరపఙ్కకమ్ ।
ఖేలత్కరభసారంగం నృత్యత్కేకికులం నృపః ॥ 39

,, ప్రణిపత్య ద్విజన్మానముటజాభ్యన్తరస్థితమ్ ।
పప్రచ్ఛ పరయా భక్త్యా ముక్తిసంసారవాసనాత్ ॥ 40

,, తురగో నిరగాత్స్వర్గం హేతునా కేన మే వద ।
ఇత్యాకర్ణ్య వచో రాజ్ఞో ద్విజన్మా వాచమూచివాన్ ॥ 41
కాలేన బహునా ప్రేత్య తత్పాపాత్తురగోఽభవత్ ।
అథ పంచదశాధ్యాయశ్లోకార్ధం లిఖితం క్వచిత్ ॥ 42

,, తతో వాచయతశ్శ్రుత్వా నిరగాత్తురగో దివమ్ ।
తతస్సమాగతైస్తత్ర పరివారజనైర్వృతః ॥ 43

,, ప్రణిప్రత్య ద్విజన్మానం హృష్టరోమా వినిర్గతః ।
పత్రం తదేవ లిఖితం గీతాపంచదశాక్షరమ్ ॥ 44

,, వాచయన్స మహీపాలో హర్షసంపుల్లలోచనః
అభిషిచ్య నిజం పుత్రం మన్త్రవిన్మంత్రిభిస్సమమ్ ॥ 45

,, సింహాసనే సింహబలం ముక్తిమాప విశుద్ధధీః ॥ 46

తా॥ తరువాత నరసింహభూపాలుడు ఆ పర్వతశిఖరమున సురపున్నాగ కదళీవృక్షముల తోడను, మామిడి, టెంకాయ, ద్రాక్ష, చెఱకు, పోక, చంపక, నాగకేసర తరువులతోడను గూడుకొన్నదియు క్రీడించుచున్న సింహములు ఏనుగులు గలదియు, ఆడుచున్న మయూరములు గలదియునగు ఋష్యాశ్రమమునుగాంచెను. అచ్చట పర్ణశాలలోనున్న మహర్షి వర్యుని పరమ భక్తితో నిర్ముక్త సంసారవాసనగలవాడై యా రాజశ్రేష్ఠుడీ ప్రకారమడిగెను. అయ్యా! మీరు సర్వజ్ఞులుగనుక నా యశ్వమెందులకు స్వర్గమును బొందెను? అట్టిస్థితివచ్చుటకు గారణంబేమి! సెలవిండు. ఈ వాక్యములమ్మహర్షివిని యీ ప్రకారముజెప్పెను. చాలకాలము పాపముజేసియుండుటచే గుఱ్ఱముగా

అయెను. తమరు పంచదశాధ్యాయములోని యర్ధశ్లోకము జదువుచుండగా ఆ అశ్వమును తన్మహిమచే దివ్యత్వమునుబొందెను. తదనంతరమారాజవరేణ్యుడు సపరివారముగా నామునిసత్తముని నమస్కరించి యాజ్ఞగైకొని పంచదశాధ్యాయ శ్లోకార్ధలిఖితాక్షరముగల పత్రమునుగైకొని దానినిజపించుచు సంతుష్టచిత్తుడై తనకుమారుడగు సింహబలుని సింహాసనమున నధిష్ఠింపజేసెను. ఆ అర్ధశ్లోక మన్త్రాక్షరముల జపించుచు దివ్యజ్ఞాన సంపన్నుడై ముక్తినిబొందెను.

ఓమ్

# షోడశాధ్యాయ మాహాత్మ్యము

ఈశ్వర ఉవాచ:—

శ్లో॥ అతఃపరం ప్రవక్ష్యామి షోడశాధ్యాయగౌరవమ్।
ఆకర్ణయ కురంగాక్షి హర్షోత్కంఠ ప్రవర్షిణీ॥

,, అస్తి సౌరాష్ట్రికం నామ్నా పురం గుర్జరమణ్డలే।
తత్రాసీత్ ఖడ్గబాహుశ్చ రాజా చంద్ర ఇవాపరః॥ 2

,, యదీయకుసుమామోద మాలాసురభితోదరే।
వారాంనిధౌ హరిస్స్వాపస్థ్యాద శేత సహ పద్మయా॥ 3

,, యదీయకీర్తి కర్పూరకణా భాన్తి నభోంగణే।
కీర్ణా వైరికృతశ్వాసమారుతైస్తారకాచ్ఛలాత్॥ 4

,, యస్యాసిధారాతీర్థేషు స్నాతా వై రిపుభూభుజః।
వ్యావర్తన్తే దివోఽద్యాపి స్వర్గస్త్రీ వాగ్విమోహితాః॥ 5

తా॥ మహాదేవుడు వచించెను. ఓ ఉత్కంఠాశాలినీ! గౌరీ! ఇక షోడశాధ్యాయగరిమను నీవాకర్ణింపుము. గుర్జరదేశమున సౌరాష్ట్రికమను పురశ్రేష్ఠమొండుగలదు. దానిని ద్వితీయచంద్రుని వలె ఖడ్గబాహువను రాజు పరిపాలించుచుండెను. వాని పుష్పమాలికలయొక్క పరిమళముచే, పరిమళించుచున్న సముద్రమునందు హరి లక్ష్మీదేవితో సుఖముగా నుండును. ఆ రాజుయొక్క కీర్తియను కర్పూరఖండములు శత్రువులయొక్క పెద్ద నిట్టూర్పువాయువులచే నెగురగొట్టబడినవై గగనతలమున నక్షత్రములై శోభిల్లుచున్నవి. పరమపవిత్రములగు వాని ఖడ్గధారలను దీర్థముల యందు స్నానముజేసిన వైరి రాజులు స్వర్గమునుండి యిపుడుగూడ రంభాదివేశ్యల వాఙ్మాధుర్యమున మోహితులై తిరుగవచ్చుచున్నారు.

శ్లో॥ తస్యారిమర్దనో నామ మదహస్తీ మదోద్ధురః।
మదాంబుధారాసలిలే గుంజద్భ్రమరమణ్డలః॥ 6

,, కపోలఫలకోత్తీర్ణ మదధారాజలావిలః।
బభౌ యో నిర్ఝరోద్గారైరఞ్జనాద్రిరివోచ్ఛ్రితైః॥ 7

,, యస్యాంగేషు వ్యరాజన్త చామరాశ్చన్ద్రికోజ్జ్వలాః।
కిరణా ఇవ శీతాంశోః పతితాః కాననోదరే॥ 8

శ్లో॥ సింధూరపాంశుపటలీ రాజత్కుంభస్థలో బభౌ ।
యస్సంధ్యావారిదవ్యాప్తం వియత్ఖండమివస్థితమ్ ॥ 9

,, స కదాచిన్మోచయిత్వా శృంఖలాన్నిగడానపి ।
ఛంక్త్వా లోహదృఢస్తంభం ప్రసహ్యా నిశి నిర్గతః ॥ 10

,, ఆధోరణగణాన్సర్వాన్వార్ణి విస్ఫూర్జదంకుశాన్ ।
క్రోధాదవగణయ్యైవ నిజశాలాం బభంజ సః ॥ 11

,, తీక్ష్ణాంకుశముఖైర్విష్వక్ హన్యమానోఽపి వైణవైః ।
దండైస్త్రాసయామాసుః సాదినో న మనాగపి ॥ 12

,, తతో రాజా సమాగత్య నిశమ్యేదం కుతూహలమ్ ।
తత్ర హస్తికలాభిజ్ఞైః సమం రాజకుమారకైః ॥ 13

,, అదృశ్యత సమాగత్య రాజ్ఞా దంతావళో బలీ ।
మోహయన్నుద్భటాటోపో హృతాట్టాలికమాలికః ॥ 14

,, దదృశుస్తం మహాభీమం పౌరా దూరతరం స్థితాః ।
గోపాయస్తశ్శిశూన్కృత్యా నివృత్తాన్యకుతూహలాః ॥ 15

,, రుద్ధేషు తత్ర మార్గేషు పలాయనపరైర్జనైః ।
వాసితేషు తదీయోగ్రదానధారాంబు శీకరైః ॥ 16

తా॥ ఆ ఖడ్గబాహునకు అరిమర్దనమను పేరుగల మదపుటేనుగొకటి గలదు. అది సర్వదా మదజలమును స్రవించుచుండగా దానిమీదవ్రాలి భృంగములు ఝుంకారములు జేయుచుండును, దాని గండస్థలము యెడతెగని మదజలముచే కలుషితమైయుండును. ఇట్టిగజము నదీప్రవాహముతో గూడుకొన్న గొప్పకాటుక కొండవలె ప్రకాశించెను. దాని యవయవములయందు చంద్రికవలె ప్రకాశించుచున్న చామరములు అరణ్యమధ్యమునపడిన చంద్రకిరణమువలె విరాజిల్లెను. దాని కుంభస్థలము సిందూరద్రవ్యముతో గూడుకొనియుండగా సంధ్యాకాల మేఘఖండమువలె భాసిల్లెను. అమత్తగజమొకప్పుడు రాత్రికాలమున తనకు బంధనములగు గొలుసులనుగూడ త్రెంపివైచి ఆలానస్తంభమునుగూడ విరచివైచి రాత్రిలో యథేచ్ఛగా విహరించెను. మావటివాండ్రనేకులు అంకుశములతో బొడిచిరి. వాటిని లెక్కింపక మహాకోపముతో గజశాలను తుత్తునియలుగాజేసెను. తీక్ష్ణాంకుశములచేతను పెద్దవెదుళ్ళచేతను శరీరమంతయు పొడువబడి కొట్టబడినదైనను ఆ గజము ఆ రౌతులనుజూచి కొంచెముగూడ భయపడకపోయెను. రాజుగూడ ఈ విషయమును విని గజరహస్యమును గుర్తెఱింగిన రాజకుమారులతోగూడవచ్చి యా యేనుగుయొక్క బలమును భయంకరాటోపమును కొత్తళముల విరుగగొట్టుటను జూచెను. పురజనులందరు దూరముగానుండి తమబిడ్డలను గాపాడుకొనుచుండిరి, జనులందరు పరుగిడి మార్గములను నడ్డగించుకొనిరి. దాని మదజలముచే మార్గములన్నియు తడుపబడినవై పరిమళించుచుండెను.

శ్లో॥ స్నాత్వా తేనాధ్వనాయాతః సరసః కశ్చన ద్విజః ।
గీతానాం షోడశాధ్యాయశ్లోకానఽతిపయాఞ్జపన్ ॥ 17

శ్లో॥ నిషిధ్యమానో బహుధా పౌరై రాధోరణైరపి ।
అమన్యమానః కరిణో భీతాన్ చలితవాం స్తతః ॥ 18

,, పూత్కారేణ స అవృణ్వన్ననాన్విపరిమర్దయన్ ।
స్పృశన్దానాంబుజం తస్య స్వస్తిమాన్నిర్గతో ద్విజః ॥ 19

,, తతో మహానభూత్తత్ర విస్మయో వాగగోచరః । 20

,, మానసే భూమిపాలస్య పౌరాణామపి పశ్యతామ్ ।
సమాహూయ తతో రాజా ఫుల్లరాజీవలోచనః ॥ 21

,, తామపృచ్ఛద్ద్విజం వాహాదవతీర్య ప్రణమ్య చ । 22

తా॥ ఈ ప్రకారముండగా ఆ మార్గముననే సరసుడగు ఒకానొక బ్రాహ్మణుడు స్నానమాచరించి గీతలోని పదునారవ అధ్యాయ శ్లోకములకొన్నింటిని జపించుచు మావటివాండ్రు పురజనులు నిషేధించుచున్నను గజమువలన భయపడినవారిని తానుజూడక బయలుదేరెను. ఇటుండ నా మత్తగజము జనులను భయపెట్టుచు పూత్కారముజేయుచూ వచ్చెను. దానితుండమును స్పృశించి గండస్థలమును నిమిరి యా బ్రాహ్మణసత్తముడు సురక్షితుడై బయలుదేరెను. అచ్చటనున్నరాజు పురజనులున్ను చూచుచుండిరి. వారికవాఙ్మానసగోచరమగు ఆశ్చర్యముదయించెను. తదనంతరమారాజు ఆద్విజవరేణ్యునిరావించి సంతుష్టహృదయుడై తానువాహనమునుండి డిగ్గి నమస్కరించి యా మహాత్ముని నిటులప్రశ్నించెను.

రాజోవాచ — రాజు పలికెను.

శ్లో॥ అలౌకికమిదం విప్ర త్వయాఽద్యాచరితం మహత్ ।
కృతాంతకల్పాదేతస్మాత్కథం నిర్యాతవాన్గజాత్ ॥ 23

,, కమర్చయసి గీర్వాణం కం మంత్రం జపసి ప్రభో ।
కా చ సిద్ధిస్తవాస్తీతి ద్విజన్మన్సముదీరయ ॥ 24

ద్విజఉవాచ:—

శ్లో॥ గీతాయాష్షోడశోధ్యాయశ్లోకాన్కతిపయానహం ।
జపామి ప్రత్యహం భూప తేనైతాస్సర్వసిద్ధయః ॥ 25

,, తతో విహాయ ద్విరదం కౌతూహలరసం నృపః ।
అజగామ ద్విజన్మానమాదాయ నిజమందిరమ్ ॥ 26

,, శుభం ముహూర్తమన్వీక్ష్య తోషయిత్వా ద్విజోత్తమమ్ ।
సువర్ణైర్లక్ష్యసంఖ్యాకైర్గీతామంత్రముపాదదే ॥ 27

,, గీతాయాష్షోడశోధ్యాయ శ్లోకాన్కతిపయానపి ॥

,, సమభ్యస్య తతో రాజా సత్కారేణ స కౌతుకః ।
అథైకదా వినిర్గత్య వాహ్యాళీం సహ సైనికైః ॥ 29

,, తమేవామోచయద్రాజా మత్తమాధోరణాద్గజమ్ ।
విస్పష్టమితి వాక్యాని రాజ్యసౌఖ్యమమానయన్ ॥ 30

శ్లో॥ తృణవజ్జీవితం రాజా గజస్యాగ్రే విశత్తతః।
ఆదాయ గండఫలకం మదపంక్తి నిరంకుశమ్ ॥ 31

,, అయయౌ మంత్రవిశ్వాసాన్నృపస్సాహసికాగ్రణీః।
రాహోరివముఖాదిన్దుః కాలాస్యాదివ ధార్మికః ॥ 32

,, సాధుః ఖలస్య వదనాన్నృపో నిరగమద్గజాత్।
ఆగత్య నగరం రాజాత్వభి షిచ్యకుమారకమ్।
గీతాయాష్షోడశాధ్యాయాదవాప పరమాంగతిమ్ ॥ 33

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! తమచే ఆచరింపబడిన కర్మమానుషసాధ్యము గానిది. యమునితో సమానమగు ఏనుగునుండి తమరు తిరుగావచ్చితిరిగదా? కనుక మీ కెట్టిసిద్ధిగలదు? ఏ దేవుని నుపాసించుచున్నారు? ఏ మంత్రమును జపించుచున్నారు? దీనినంతను దయతోనుడువుడు. ఆ పై నామహాత్ముడు చెప్పెను. ఓ మహారాజా! గీతయొక్క షోడశాధ్యాయమగు దైవాసురసంపద్విభాగ యోగములోని కొన్నిశ్లోకములను నేను ప్రతిదినము జపింతును. దానివలన నాకీసిద్ధులు గలిగినవి. తరువాత గజముయొక్క వేడుకను చాలించి యాబ్రాహ్మణుని తనయింటికడకు తీసి కొనిపోయి ఒకానొక శుభముహూర్తమున నా విప్రోత్తముని లక్షస్వర్ణనాణ్యములచే సంతోషపరచి గీతామంత్రమును గైకొనెను. తదనంతరమారాజు ఆ యధ్యాయములోని కొన్ని శ్లోకములను ప్రతిదిన మాదరముతో జపించుచు కొంతకాలమరిగినపిదప అత్యంతఉత్సాహముతో నా మంత్రమహిమను పరీక్షింపగోరి విహారప్రదేశమున సైనికులతోగూడ నా మత్తగజమును విడిపించెను. జీవితమును తృణముగాదలచుచు రాజ్యసౌఖ్యమునుగూడ కోరనివాడై మత్తకరీంద్రముయొక్క సమ్ముఖమునకు బోయెను. దాని గండస్థలమదధారను స్పృశించి మంత్రముయొక్క ప్రభావమువలన నా సాహసికాగ్రవర్తి తిరుగవచ్చెను. అదెటులున్నదనగా రాహువునుండి చంద్రునివలెను మృత్యుదేవతనుండి ధార్మికుండువలెను, దుర్మార్గునినుండి సజ్జనునివలెను నా దుష్టగజమునుండి రాజు వచ్చిన వాడాయెను. వెంటనే తనకుమారునికి రాజ్యపట్టాభిషేకముజేసి తానువిజనప్రదేశమున నా షోడశాధ్యాయగీతామంత్రమును జపించి ముక్తుడాయెను.

ఓమ్

# సప్తదశాధ్యాయమాహాత్మ్యము

ఈశ్వరఉవాచః—

శ్లో॥ షోడశాఽధ్యాయసామర్థ్యం కథితం శ్శృణు సాంప్రతమ్।
స్పష్టం సప్తదశాధ్యాయమహిమాంభోనిధింశివే ॥ 1

,, ఖడ్గబాహోస్సుతస్యైవ భృత్యోదుశ్శాసనోఽభవత్।
తం గజం ధర్తుమాగత్య గజాత్ప్రాప్తోయమక్షయమ్ ॥ 2

శ్లో॥ తద్వాసనా నిబద్ధాత్మా గజయోని మవాప్య చ।
గీతాసప్తదశాధ్యాయం శ్రుత్వా ప్రాప్తః పరం పదమ్। 3

దేవ్యువాచ —

శ్లో॥ దుశ్శాసనో గజత్వం హిప్రాప్య ముక్త ఇతి శ్రుతమ్।
తదేవ వద కల్యాణ విస్తరేణ మమ ప్రభో॥ 4

ఈశ్వర ఉవాచ —

శ్లో॥ స్థితః కశ్చన దుర్మేధా మండలీక కుమారకైః।
బహుమూల్యం పణం కృత్వాగజమారూఢవాంస్తతః॥ 5

,, గత్వా కతిపయాన్యేవ పదానిజనవారితః।
నామ్నా దుశ్శాసనో మూఢః ప్రౌఢవాక్య ముదీరయన్॥ 6

,, తతో నిశమ్య తద్వాక్యం క్రోధాంధస్సింధురోఽభవత్।
న్యపతచ్చ స్ఖలత్పాదః కంపమానకుమారకైః॥ 7

,, తతో నిపతితం కించిదుచ్ఛ్వాసం తం గజో రుషా।
ఊర్ధ్వమున్మూలయాంచక్రే కృతాంతక నిరంకుశః॥ 8

,, గతాసోరపి రోషేణ తస్యాస్థ్యాం చ గణంగణః।
వికీర్ణవాన్పృథక్కృత్వా మత్తో దంతావలస్తతః॥ 9

,, తతః కాలేన సంప్రేత్య గజయోనిమవాప సః।
మహాన్తంకాలమనయత్సింహలద్వీపభూపతేః॥ 10

,, మైత్రీ గరీయసీ సార్ధం ఖడ్గబాహుమహీభుజా।
తతోఽయం జలమార్గేణ ప్రాపితో వారణోమతః॥ 11

,, జయదేవేన ఖడ్గబాహోః ప్రీత్యా నీతో మహీభుజా।
జాతిం స్మరయన్స్వకీయాం స పశ్యన్సింధూన్సహోదరాన్॥ 12

,, ఉవాస ఖడ్గబాహోశ్చ గృహే తూష్ణీమనిర్దిశన్।
దుఃఖేన మహతా స్తోకాన్దివసానత్యవాహయత్॥ 13

,, సకదాచిత్తు సంతుష్టః సమస్యాశ్లోకపూరణే।
కస్మైచిత్కవయే ప్రాదాత్తముపాయనహస్తినమ్॥ 14

తా॥ ఈశ్వరుడు చెప్పెను - ఓ దేవీ! పదునారవ అధ్యాయమహిమను జెప్పితిని. ఇక పదునేడవ అధ్యాయమహిమను వినుము. ముందుకథలో నిర్దేశింపబడిన ఖడ్గబాహుసుతుడు వీర సింహుడు ప్రభువగుచుండగ వానిభృత్యుడు దుఃశాసనుడనువాడు ముందువర్ణింపబడిన మత్తగజ మును బెదరించుటకైవచ్చి యమసదనమునకరిగెను. గజభావనచే నాతడు మరణించెను గనుక మరుజన్మమున గజమైపుట్టి గీతాసప్తదశాధ్యాయమును విని ముక్తుడాయెను. తర్వాత పార్వతీదేవి శివునిప్రశ్నించెను. ఓ మహానుభావా! దుఃశాసనుడు గజమగుటెట్లు? వానికి మోక్షప్రాప్తిగలుగుటకు హేతువేమి? మహాదేవుడు సవిస్తరంబుగాజెప్పెను. ఒకానొకనాడు దుష్టబుద్ధిగల దుశ్శాసనుడు రాజు

కుమారులతోగూడ బహుధనమునకై పందెమువేసి యాదుష్టగజమును నెక్కెను. కొంతదూరము పోయిన తరువాత నా దుశ్శాసనుడు ప్రగల్భములు జెప్పుచుండగా, ఆ వాక్యమును మదాంధగంధ సింధురము విని క్రోధాంధమై వానిని క్రిందబడవైచి కాళ్ళతో గజిబిజిజేసెను, ఐనను బ్రతికియున్న వానినిగా తలంచి మింటికెగురవైచెను. ఇకను మహారోషముతో వాని యస్తిపంజరమును ఖండ ఖండములుగా జేసి యాదంతావలము దిగంతములకు జిమ్మెను, తరువాత ఆ దుఃశాసనుడు గజ జన్మమును ధరించి సింహళద్వీపరాజుదగ్గఱ చాలాకాలముండెను. ఆ రాజునకును ఖడ్గబాహు భూపాలునికిని చాలమైత్రిగలదు. తద్వశమున జయదేవుడను రాజు ఖడ్గబాహునకాగజము నిచ్చెను. తన పూర్వజన్మ వాసనావశముచే నా గజము తన బంధువులను సహోదరులను తలంచుకొనుచు చాల దుఃఖముతో దివసములను గడపుచు నూరకయుండెను. ఒకప్పుడు ఆ రాజు సమస్యనుపూర్తిజేసిన కవికొఱకు సంతుష్టహృదయుడై కానుకగా నా యేనుగును నొసగెను.

శ్లో॥ శ తేన తేన కవినా రోగోపద్రవభీరుణా ।
మాలవక్షోణిపాలస్య విక్రీతశ్చైత్య కుంజరః ॥ 15

,, కియత్యపి గతే కాలే పాల్యమానోఽపి యత్నతః ।
ముమూర్షురభవత్తత్ర కుంజరో దుర్ధరజ్వరః ॥ 16

,, న జిఘ్రతి పయశ్శీతం నాదత్తే కబలం గజః ।
స్వపిత్యపి న సౌఖ్యేన ముఞ్చత్యశ్రూణి కేవలమ్ ।
తతో హస్తిపకాఖ్యాతం వృత్తాన్తమవనీపతిః ॥ 17

,, ఆకర్ణ్య స సమాయాతో యత్రాస్తే జ్వరితో గజః ।
స చావలోక్య భూపాలం జగద్విస్మయకారిణీమ్ ॥ 18

,, వాచమూచే గజస్సమ్యగ్విస్పష్టజ్వరవేదనః ।
రాజన్నశేషశాస్త్రజ్ఞ రాజనీతిపయోనిధే ॥ 19

,, నిర్జితారాతిసంఘాత మురారిచరణప్రియ ।
కిమౌషధైరలంవైద్యైః కిం ధానైః కిన్ను జాపకైః ॥ 20

,, గీతాసప్తదశాధ్యాయ జాపకం ద్విజమానయ ।
తేనాయం మామకో రోగః శామ్యత్యత్ర న సంశయః ॥ 21

,, యథాదిష్టం గజేనాసౌ తథా చక్రే నరాధిపః ।
తతో గజత్వముత్సృజ్య ముక్తో దుశ్శాసనోఽభవత్ ॥ 22

,, తేన విప్రేణాభిమన్త్ర్య జలే క్షిప్తే తదుత్తమే ।
అథ దివ్యం సమారూఢం విమానమవనీపతిః ॥ 23

,, తం దుశ్శాసనమద్రాక్షీత్పాకశాసనతేజసమ్ ॥ 24

రాజోవాచః—

శ్లో॥ కిం జాతీయః కిమాత్మా త్వం కిం వృత్త ఇతి మే వద ।
కేన వా కర్మణా జాతో గజః కథమిహాగతః ॥ 25

శ్లో॥ పృష్టో రాజ్ఞా విముక్తోఽసౌ విమానస్థః స్థిరాక్షరమ్।
వృత్తం యథా తథాఽఽచఖ్యౌ నిజం దుశ్శాసనః క్రమాత్ ॥ 26

,, గీతాసప్తదశాధ్యాయం జపన్మాలవభూపతిః।
నరవర్మాఽభవన్ముక్తః కాలేనాల్పీయసా తతః ॥ 27

తా॥ ఆ కవీశ్వరుడాయేనుగును సంరక్షింపనసమర్థుడై నూరు నాణ్యములకు ఏనుగును మాలవభూపతికి విక్రయించెను. తర్వాత నా గజము కొంతకాలమరుగగా మిగుల ప్రయత్నముతో రక్షింపబడుచున్నదైనను మరణేచ్ఛచే దుష్టజ్వరగ్రస్తమాయెను. ఆ సమయమున కబలమును అది నోటపెట్టదు. నీరుద్రావదు. సుఖముగా నిద్రింపదు. ఎప్పుడును కన్నీరు గార్చుచుండును. ఈగజము యొక్క దుఃస్థితినిచూచి మావటివాడు రాజునకెఱిగించెను. తర్వాత నా విషయమును వినిగజమున్న చోటికి నృపతిచనుదెంచెను. అప్పుడు గజమాభూపాలునిజూచి లోకమునకు విస్మయ జనకమగు వాక్యముతో గతజ్వరయై ఇటులవచించెను. ఓ మహాప్రభూ! అశేషశాస్త్రజ్ఞా! రాజనీతిపయోరాశీ! జితశత్రురాజా! విష్ణుచరణప్రియా! ఔషధములచేతను, వైద్యులచేతను, ఆహారపదార్థములచేతను, మన్త్రజ్ఞులచేతను, ప్రయోజనములేదు. మరియేమనగా గీతయొక్క సప్తదశాధ్యాయమును జపించు మహాత్ముని నిటకు తీసికొనిరమ్ము. అందుచే నా వ్యాధి నశించును. సందేహములేదు. ఏనుగు చెప్పిన రీతిగా నా ప్రభువు గీతా సప్తదశాధ్యాయమును జపించుబ్రాహ్మణుని తీసికొనివచ్చెను. తర్వాత అమ్మునిసత్తముడు జలమునభిమన్త్రించి చల్లగా నా దుశ్శాసనుడు గజత్వమునువదలి ముక్తుడాయెను. అట్టి దివ్యత్వమును పొందినవాడును ఇంద్రునివలె ప్రకాశించువాడునునగు దుశ్శాసనుని విమానమున జూచి రాజుపలికెను. ఓ పుణ్యాత్మా! నీ వెవడవు? ఏ జాతికిచేరినవాడవు? నీ చరిత్ర మేమి? నాకుచెప్పుమా. ఎందుచే గజత్వప్రాప్తి నీకు గలిగెను? ఇటురాకతంబేమి? ఈ ప్రకారమా ముక్తుడు ప్రశ్నచేయబడినవాడై విమానములోనుండియే జరిగినవృత్తాంతమును పూర్తిగా క్రమముగా చెప్పెను. తర్వాత మాలవాధీశ్వరుడగు నరవర్మ గీతయొక్క పదునేడవఅధ్యాయమగు శ్రద్ధాత్రయ విభాగయోగమును జపించి త్వరలోనే ముక్తుడాయెను.

ఓమ్

# అష్టాదశాధ్యాయమాహాత్మ్యము



పార్వత్యువాచః—

శ్లో॥ ఉక్తం సప్తదశాధ్యాయగౌరవం భవతా శివ।
సత్వమష్టాదశాధ్యాయ మహిమానముదీరయ ॥

ఈశ్వర ఉవాచః—

శ్లో॥ ఆకర్ణయ చిదానందనిష్పాదినిగమోత్తరమ్।
పుణ్యమష్టాదశాధ్యాయ మాహాత్మ్యం గిరినందిని ॥

శ్లో॥ సమస్తశాస్త్రసర్వస్వం శ్రోత్రప్రాప్తరసాయనమ్।
సంసారయాతనాజాలవిదారణపరాయణమ్॥ 3

,, పరం రహస్యం సిద్ధానామవిద్యోన్మూలనక్షమమ్।
చైతన్యం కైటభారాతేరగ్రగణ్యం పరంపదమ్॥

,, వివేకవల్లరీమూలం కామక్రోధమలాపహమ్
పురందరాదిగీర్వాణ చిత్తవిశ్రామకారకమ్॥

సనకాదిమహాయోగి మనోరంజనకారణమ్।
పాఠమాత్రపరాభూత కాలకింకరగర్జితమ్। 6

,, అష్టోత్తరశతవ్యాధి మూలోన్మూలనకారకమ్।
నాతఃపరతరం కించిద్రహస్యం హంసగామిని॥

,, ఉపతాపత్రయహరం మహాపాతకనాశనమ్।
యథా కాలేష్వహం నిత్యో యథా పశుషు కామధుక్॥

,, యథా వ్యాసో మునీంద్రేషు వ్యాసేషు బ్రహ్మవిత్తమః।
యథా దివౌకసాం శక్రో గురుశ్శక్రాద్యథా వరః॥

,, యథా రసానాం పీయూషముత్తమం విశ్వవిశ్రుతమ్।
యథా గిరీణాం కైలాసో యథా చేన్ద్రో దివౌకసామ్॥ 10

,, తీర్థానాం పుష్కరం తీర్థం యథా పుష్పేషు పంకజమ్।
పతివ్రతాసు నారీషు యథా లోకేష్వరుంధతీ॥ 11

,, యథా మఖేష్వశ్వమేధో యథోద్యానేషు నందనమ్।
యథా రుద్రేషు సర్వేషు వీరభద్రో మమానుగః॥ 12

,, యథా దానేషు భూదానం యథా సింధుషు గౌతమీ।
యథా లోకే హరిక్షేత్రం ప్రశస్తం ధర్మకర్మసు॥ 13

,, తథైవాష్టాదశాధ్యాయ మాహాత్మ్యం భువనోత్తరమ్।
తత్రాఖ్యానమిదం పుణ్యం భక్త్యాఽఽకర్ణయ పార్వతి॥ 14

,, యదాఽఽకర్ణనమాత్రేణ జంతుః పాపైః ప్రముచ్యతే।

తా॥ గౌరీదేవి మహాదేవునితో నిట్లులపలికెను. తమరు సప్తదశాధ్యాయ మహాత్మ్యమును నుడివితిరి, అట్లులనే అష్టాదశాధ్యాయ ప్రభావగరిమను వచింపుడు, తదనంతరము మహేశ్వరుడు చెప్పెను. ఓ శైలాధి రాజతనయా! చిదానందములను నొసంగునదియు వేదసారంబునునగు అష్టాదశాధ్యాయముయొక్క యుత్కృష్టతను వినుము, మోక్షసన్న్యాసయోగమనబడు నా యధ్యాయ మెట్టిదనగా సకల శాస్త్రసారము, కర్ణపేయ పీయూషము, సంసారయాతనల విచ్ఛేదకము, పరమ రహస్యము, సిద్ధాదులయొక్క విద్యాసమూలనాశ దక్షము, చైతన్యరూపము శ్రీ కృష్ణభగవంతుని కత్యంతప్రీతికరము, సర్వోత్కృష్టస్థానము వివేకమను తీగకు మూలము, కామక్రోధాదిమాలిన్యాది

నాశకము, దేవేంద్రాది దేవతలయొక్క చిత్తవిశ్రాంతి ధామమునైయున్నది. సనకాది మహాయోగులకు మనోరంజకమై పఠనమాత్రముచే పలాయమాన కాలకింకరసంఘముగలదై సకలవ్యాధి నిర్మూలన హేతువై యీ యధ్యాయ మొప్పుచున్నది. ఓ హంసగమనా! దీనికన్న రహస్యమగునది వేరొండులేదు. సకల సంతాపహారకము మహాపాతక వినాశకమునై యలరారుచున్నది. ఇకను దీనిశ్రైష్ఠ్యమును వినుము. కాలములలో నిత్యుడనగు నావలెను, ధేనువులలో కామధేనువువలెను, మునీంద్రులలో వ్యాసమహర్షివలెను, వ్యాసమునులలో బ్రహ్మవిత్తగు వ్యాసభగవానునివలెను, దేవతలలో దేవేంద్రునివలెను, వానికన్న బృహస్పతివలెను, రసములలో నమృతమువలెను. పర్వతములలో కైలాసమువలెను. ద్విజులలో చంద్రుడువలెను, తీర్థములలో పుష్కరతీర్థమువలెను, పుష్పములలో కమలమువలెను, పతివ్రతా మణులలో నరుంధతీదేవివలెను, యజ్ఞములలో నశ్వమేధమువలెను, ఉద్యానములలో నందనవనమువలెను, రుద్రులలో వీరభద్రుడువలెను, దానములలో భూదానమువలెను, నదులలో గంగానదివలెను, పుణ్యక్షేత్రములలో ధర్మకార్యాచరణకు విష్ణుక్షేత్రమువలెను, నీయష్టాదశాధ్యాయము సకలలోకోత్తరము ఓ దేవీ! దీనికి తార్కాణముగా నొక పవిత్రకథను నుడివెదను. భక్తితో వినుము. దానిని శ్రవణముజేసినంతమాత్రమున సకల ప్రాణులు సకల పాపములనుండి విడివడుదురు.

అస్తిమేరుగిరేశ్శృంగే పురీరమ్యాఽమరావతీ ॥ 15

శ్లో॥ పురా మమ వినోదాయ నిర్మితా విశ్వకర్మణా ।
నిరన్తరం గుణయుతా కోటిగీర్వాణసేవితా ॥ 16

,, తేజః పుంజవతీ సాక్షాద్బ్రహ్మావిద్యేవ విశ్రుతా ।
చింతామణిశిలాబద్ధాః ప్రాసాదా యత్ర కామదాః ॥ 17

,, జయన్తి మేరుశిఖరే చతుర్ముఖపురావధి ।
యత్ర కల్పద్రుమచ్ఛాయా సుఖాసీనా పులోమజా ॥ 18

,, శృణోతి శ్యామాలా గీర్భిర్గీతం గన్ధర్వయోషితామ్ ।
యత్రాస్తే స బలారాతిర్దైవైశ్చ దళితాయుషాం ॥ 19

దైత్యానాం రక్తకల్లోలై స్స్వర్ధునీ శోణతాం గతా ।
పురాతనసుధాస్వాదు స్మారంస్మారం దివౌకసః ॥ 20

,, ధయన్తి యత్ర క్షుత్క్షామాః కలాం ప్రత్యహమైన్దవీమ్ ।
తస్యాం కైవల్య కల్పాయామాసీత్పూర్వం శతక్రతుః ॥ 21

,, శచీసమన్వితశ్శ్రీమాన్ సర్వగీర్వాణసేవితః ।
స కదాచిత్సుఖాసీనో విష్ణుదూతైరధిశ్రితం ॥ 22

,, సహస్రనేత్రమాయాన్తమపశ్యత్పురుషం వరమ్ ।
తత స్తదీయతేజోభిరభిభూతః పురందరః ॥ 23

,, మణిసింహాసనాత్తూర్ణం పతితస్స్వానమండపే ।
సింహాసనాత్ప్రయాతస్య తత స్తస్య హరేర్భటాః ॥ 24

,, గీర్వాణగణసామ్రాజ్య పట్టబంధం వితేనిరే ।

తా॥ మేరుపర్వతశిఖరమున దేవశిల్పియగు విశ్వకర్మచేత నా వినోదముకొరకై నిర్మింపబడిన అమరావతీ పట్టణముగలదు. అదిమిగుల సౌందర్యవంతమైనది. అచ్చోట కోటిదేవతలు నివసింతురు. బ్రహ్మవిద్యవలె తేజోరాశియై యా పురవరము మెఱయుచున్నది. అచ్చటనున్న మేడలు చింతామణులచే నిర్మితములైనవి. గనుకనే సకలకామముల నొసగుచున్నవి. ఆ సౌధములు మేరుశిఖరమున బ్రహ్మదేవుని పురమువరకు వ్యాపించియున్నవి. ఆ అమరావతీపట్టణమున యౌవన మధ్యస్థయగు నాశచీదేవి కల్పవృక్షముల నీడనకూర్చుండి గంధర్వస్త్రీల గానమును వినుచున్నది. దానికధిపతి దేవేంద్రుడు దేవతలు రాక్షసులనుచంపగా వారిరక్తధారలచే ఆకాశగంగ అరుణిత మాయెను. ఆ దేవతలు ఆ కొన్నవారై పూర్వములభించిన అమృతమును స్మరించి స్మరించి ప్రతి దినము చంద్రకళలను పానముచేయుచున్నారు. ఇట్లుండగా కైవల్యముతో సమానమగు నా యమరావతీపురమున సకలదేవతలు సేవించుచుండగా, శచీదేవితోగూడుకొన్నవాడై శ్రీమంతుడగు దేవేంద్రుడొకప్పుడు సుఖాసీనుడైయుండెను, ఆ సమయమున సహస్రనేత్రములుగలవాడును. తేజో రాశియునగు నొకానొకపరమపురుషుని అచ్చోటికి విష్ణుదేవునియొక్క దూతలుతీసికొనిరాగా ఆపరమ పురుషుని తేజఃపుంజముచే దేవేంద్రుడు కాంతి విహీనుడై యా ఆస్థానమణ్డపమున సింహాసనము నుండి నేలగూలెను. తరువాత సింహాసనమును విడిచి దేవేంద్రుడుచనగా అచటనున్నభటులు సకలదేవతలయొక్క సామ్రాజ్యపట్టమునా వా దివ్యపురుషునికి గట్టిరి.

అథ తస్యాభిషిక్తస్య మహేన్ద్రస్య పులోమజా ॥ 25

శ్లో॥ వామాంకమారురోహాశు దివ్యదుందుభినిఃస్వనైః ।
అథ త్రిదివసంగీతగీర్వాణాః ప్రమదాన్వితాః ॥ 26

,, సురా నీరాజయామాసుర్దివ్యైరత్నైస్సురస్త్రియః ।
తతో వై ఋషయో వేదైరాశీర్వాచాస్తదా దదుః ॥ 27

,, రంభాద్యా ననృతుస్తస్య పురస్తాదప్సరో గణాః ।
గంధర్వా లలితాలాపాఞ్జగుర్మంగళకౌతుకమ్ ॥ 28

,, ఏవం నూతనమిన్ద్రస్తు జుష్టం బహుభిరుత్సవైః ।
వినా శతక్రతుం దృష్ట్వా శక్రో విస్మయమాయయౌ ॥ 29

,, న తేన విహితా మార్గా తటాగా న వినిర్మితాః ।
న రోపితా మహావృక్షాః పాన్థవిశ్రాన్తికారకాః ॥ 30

,, న కదాచిదహో దృష్టో దేవస్త్రిపురభైరవః ।
నిధివాసే స్థితా దేవీ పూజితా న మదాలసా ॥ 31

,, మేఘంకరస్థితశ్శార్ఙ్గధరో నైవ నిరీక్షితః ।
న కృతం విరజే స్నానం నైవ కాశీం పురీం గతః ॥ 32

,, న దేవవాటికావాసీ దృష్టో నరహరిస్స్వయమ్ ।
ఏరండవిష్ణుర్హ్యేరమ్యో న జాతు పరిశీలితః ॥ 33

శ్లో॥ రేణుకా నేక్షితా జాతు మాతాపురనివాసినీ।
న భక్త్యా పూజితా దేవీ దానాపురనివాసినీ॥ 34

,, న భక్త్యా త్రిపురే దృష్టస్త్రిలింగస్త్ర్యమ్బకస్స్వయమ్।
న శార్దూలతటాకస్థో వీక్షితస్సోమనాథకః॥ 35

,, రేవాపురస్థితో దేవో ఘుసృణేశో న వీక్షితః।
నాగదన్తపురే ఖ్యాతో నాగనాథో న వీక్షితః॥ 36

,, పర్ణగ్రామస్థితో దృష్టో న మహానమృతేశ్వరః।
న తుంగభద్రా తీరస్థో దృష్టో హరిహరస్స్వయమ్॥ 37

,, న వేంకటాద్రినిలయశ్శ్రీనివాసస్సులక్షితః।
కావేరీకర్ణికాతీరే శ్రీరంగో నైవ వీక్షితః॥ 38

,, దీనాస్త్వనాథాః క్రోశన్తః కారాగారాన్న మోచితాః।
అన్నదానేన దౌర్భిక్షే ప్రాణినో నైవ పూజితాః॥ 39

,, రాత్రౌరాత్రౌ కృతా క్వాపి నిర్జలే నోదకప్రపా। 40

,, న గౌతమ్యాం కృతం స్నానం న దృష్టో హరిణేశ్వరః।
కృష్ణవేణ్యాఞ్చ న కృతం స్నానం కన్యాగతే గురౌ॥ 41

,, దత్తం నో భూఖండమపి కవయో నైవ పూజితాః।
న తీర్థేషు కృతం సత్రం న గ్రామేషు కృతా మఖాః॥ 42

,, పుష్కరిణ్యో న విహితా మధ్యేమార్గం బహూదకాః।
న ప్రాసాదాః కృతాః క్వాపి బ్రహ్మవిష్ణుపినాకినామ్॥ 43

,, న జాతుచిద్భయాక్రాన్తా రక్షితాః శరణాగతాః।
కథమేకేన పుణ్యేన దేవదత్తమిహార్జితమ్॥ 44

,, ఇతి చింతాకులో భూత్వా హరిం ప్రష్టుం పురందరః।
యయౌ సరభసం ఖిన్నః క్షీరకూపారగహ్వరమ్॥ 45

తా॥ ఆ సమయమున శచీదేవి దుందుభివాద్యములుమ్రోయ ఆ నవీనదేవేంద్రుని ఎడమ తొడను నధిష్ఠించెను. మిగుల సంతోషముతో గీర్వాణులు గీతమునుబాడిరి, దేవతలు దివ్యరత్నముల చేత స్త్రీలతో గూడుకొన్నవారై నీరాజములనొసంగిరి. తదనంతరము ఋషీశ్వరులందరా సమయమున వేదవాక్కులతో నాశీర్వాదముల నొసంగిరి. రంభాద్యప్సరసలు వాని మోలన్నృత్యముగావించిరి. గంధర్వాంగనలు మంగళార్థమై మృదుమధురముగా గానముజేసిరి. ఇప్పుడు క్రొత్తగావచ్చిన దేవేంద్రుడీలాగున బహూత్సవములతో గూడుకొనియుండగా శతమఖములు గావింపకయే అతడింద్రుడాయెనని మొదటి దేవేంద్రుడాశ్చర్యమునొందెను. ప్రస్తుతము నాయస్థానము నధిష్ఠించిన ఈతడు శాస్త్రవిహితకర్మల నాచరింపలేదు. తటాకముల త్రవ్వించలేదు. బాటసారులవిశ్రాంతికై గొప్ప వృక్షముల పెంచలేదు. త్రిపురభైరవుని సందర్శించలేదు. తత్సన్నిధానముననున్న మదాలసను పూజింపలేదు, మేఘంకరక్షేత్రమున వెలసియున్న శార్ఙధరుని దర్శించలేదు. విరజాస్నానము

నాచరించలేదు. కాశీపత్తనమునుగూడ గాంచలేదు. దేవవాకిటిలో స్థిరముగానున్న నరహరస్వామిని గనుగొనలేదు. విఘ్నగణేశులను పూజించలేదు. రేణుకాదేవిని కనుగొనలేదు, భక్తితో త్రిపురములో నున్న మహేశ్వరుని దర్శనముచేయలేదు. శార్దూలతటాకమున ఆసీనుడైయున్న సోమనాథుని, రేవాపురముననున్న ఘుస్రృణేశుని, నాగదంతపురముననున్న నాగనాథుని, పర్ణగ్రామవాసియగు అమృతేశ్వరుని, తుంగభద్ర తీరస్థుడగు హరిహరస్వామిని, శేషాచలనివాసియగు శ్రీనివాసుని, కావేరీకర్ణికాతీరమునందున్న శ్రీరంగదేవుని ఒకానొకప్పుడును సందర్శించలేదు. దీనులను అనాథులను కారాగారవాసులను విడిపించలేదు. ఒకానొకప్పుడైన దుర్భిక్షకాలములో అన్నదానముచేత ప్రాణుల తృప్తిపరచలేదు. రాత్రియందు సంచారముచేయువారి రక్షణార్థమై నిర్జలప్రదేశమున చలివిందరములను స్థాపించలేదు. గౌతమీనదిలో స్నానమాచరించి హరిణేశ్వరుని దర్శనము చేయలేదు. కృష్ణవేణియందు బృహస్పతికన్యారాశియందు ప్రవేశించియుండగా స్నానముచేయలేదు. ఒకానొకనికైన అడుగుభూమినైనను దానముచేయలేదు. కవులను గౌరవించలేదు తీర్థములయందు సత్రములనుగట్టలేదు. యజ్ఞములను నాచరించలేదు. మార్గమధ్యమున జలముగల పుష్కరణీలను నేర్పాటుచేయలేదు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులయొక్క దేవాలయములలో నొకదానినైన నిర్మించలేదు. శరణాగతులను రక్షించలేదు. ఈ ప్రకారమేపుణ్యములను చేయనివాడునునగు నీతడు ఏదియో ఒకానొక పుణ్యముచే ఇట్టి దేవరాజ్యమును సంపాదించెనని చాలా ఖిన్నుడై చింతాకులుడై విష్ణుదేవుని ప్రశ్నించుటకు దేవేంద్రుడు క్షీరసముద్రమునకు శీఘ్రముగాబోయెను.

శ్లో॥ తత్ర ప్రవిశ్య గోవిన్దం కృతనిద్రం నవైః స్తవైః।
అకస్మాన్నిజసామ్రాజ్యభ్రంశదుఃఖమువాచ హ॥ 46

ఇంద్రఉవాచః—

శ్లో॥ రమాకాన్త భవత్ప్రీత్యై కృతం క్రతుశతం పురా।
తేన పుణ్యేన సంప్రాప్తం మయా పౌరందరం పదమ్॥ 47

,, ఇదానీం నూతనః కోఽపి జాతో దివి పురందరః।
న తేన విహితో ధర్మో న తేన క్రతవః కృతాః॥ 48

,, మమ సింహాసనం దివ్యం కథమాక్రాన్తమచ్యుత।

మహాదేవ ఉవాచః—

ఇత్యేవం వదతస్తస్య శ్రుత్వా వాచం రమాపతిః॥ 49

శ్లో॥ ఉన్మీలితస్మితాక్షోసావువాచ మధురం వచః।

శ్రీభగవానువాచః—

కిం దానైరల్పఫలదైః కిం తపోభిః కిమధ్వరైః॥ 50

శ్లో॥ వర్తమానః క్షితితలే నత్వం ప్రణితవాన్పురా। 51

ఇన్ద్రఉవాచః—

శ్లో॥ భగవన్కర్మణా కేన స త్వాం ప్రీణితవాన్ద్విజః।
యత్ప్రీత్యా భగవాన్ప్రాదాత్తస్మై పౌరంధరం పదమ్॥ 52

శ్రీభగవానువాచః—

శ్లో॥ జపత్యష్టాదశాధ్యాయే గీతానాం శ్లోకపఞ్చకమ్ ।
యత్పుణ్యేన చ సంప్రాప్తం తవ సామ్రాజ్యముత్తమమ్ ॥ 53

,, సర్వపుణ్యశిరోరత్నభూతేన త్వం స్థిరో భవ ।
ఇతి విష్ణోర్వచశ్శ్రుత్వా జ్ఞాతోపాయః పురన్దరః ॥ 54

,, విప్రవేషధరో భూత్వా గతో గోదావరీతటమ్ ।
తత్రాపశ్యత్పురం పుణ్యం కాళికాగ్రామముత్తమమ్ ॥ 55

,, యత్ర కాలేశ్వరో దేవో వర్తతే కాలమర్దనః ।
తత్ర గోదావరీతీరే స్థితం పరమధార్మికమ్ ॥ 56

,, అపశ్యత్కరుణావంతం బ్రాహ్మణం వేదపారగమ్ ।
నిత్యమష్టాదశాధ్యాయం జపంతం దాంతచేతసమ్ ॥ 57

,, తతస్తచ్చరణద్వంద్వే లుఠిత్వా పరయా ముదా ।
సత్యమష్టాదశాధ్యాయమపఠత్తేన శిక్షితమ్ ॥ 58

,, అథ పుణ్యేన తేనాసౌ విష్ణోస్సాయుజ్యమాయయౌ ।
హిత్వా పురందరాదీనాం దేవానాం పదమల్పకమ్ ॥ 59

,, జ్ఞాత్వాఽతీవ ముదాయుక్తో వైకుంఠమగమత్పరమ్ ।
అతఏవ పరం తత్త్వం మునీనామిదముత్తమమ్ ॥ 60

,, దివ్యమష్టాదశాధ్యాయమాహాత్మ్యం కథితం మయా ।
యస్య శ్రవణమాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే ॥ 61

,, ఇత్యేవం గీతామాహాత్మ్యం కథితం పాపనాశనమ్ ।
పుణ్యం పవిత్రమాయుష్యం స్వర్గ్యం స్వస్త్యయనం మహత్ ॥ 62

,, యః శృణోతి మహాభాగే శ్రద్ధయా సంయుతః పుమాన్ ।
సర్వయజ్ఞఫలం ప్రాప్య విష్ణోః సాయుజ్యమాప్నుయాత్ ॥ 63

తా॥ ఆపాలసముద్రమును ప్రవేశించి నిద్రించుచున్న గోవిందుని నూతనస్తోత్రముల చేసి యాయిన్ద్రుడు తనకు ఆకస్మాత్తుగా గలిగిన రాజ్యభ్రంశదుఃఖమును మనవిచేసికొనెను. ఇంద్రుని కథనప్రకారమెట్టిదనగా, ఓ లక్ష్మీపతే! పూర్వము నేను తమప్రీతికై నూరుయజ్ఞముల జేసితిని. ఆ పుణ్యవశమున నాకింద్రపదవి లభించెను. ఇప్పుడెవడో నూతనముగావచ్చి స్వర్గమున రాజ్యపదవినధిష్ఠించియున్నాడు. అతడు యజ్ఞములనుగాని, ధర్మములనుగాని యాచరించినవాడు కాడు. అయినను నాయొక్క దివ్యసింహాసనము నెటుల నాక్రమించెను? ఓ అచ్యుతా! కారణము నుడువుడు. ఈశ్వరుడు తర్వాత కథనుజెప్పెను. ఈ ప్రకారమాదేవేన్ద్రుడు మొరపెట్టుకొను

చుండగా లక్ష్మీనాథుడిట్టుల నవ్వుచు మధురవాక్యముల జెప్పెను. శ్రీ భగవంతుడు వచించెను. ఓ దేవేన్ద్రా! నీచే గావింపబడిన యజ్ఞములచేతను, దానములచేతను, తపస్సులచేతను ఏమియు ప్రయోజనములేదు. ఒకవేళ అవి అల్పఫలమునే ఒసగును. తర్వాత ఇన్ద్రుడు ప్రశ్నించెను. ఓ భగవంతుడా! ఆతడు మిమ్ములనేపుణ్యకర్మచే తృప్తిపరచెను? ఎట్టి ప్రీతిచే దేవేన్ద్రపదవిని నాతనికొసగితిరి? తర్వాత గోవిందుడు వచించెను. నాయనా! ఆ పుణ్యాత్ముడు ప్రతిదినము గీత అష్టాదశాధ్యాయములో ఐదు శ్లోకములను జపించును. దాని ప్రభావముచే నుత్తమమగు దేవేన్ద్ర పదవిని పొందగలిగెను. గీతలోని మోక్షసన్న్యాసయోగమగు అష్టాదశాధ్యాయముయొక్క శ్లోక పంచకమంత్రము సకల పుణ్యశిరోరత్నము. దానిచే నీవున్ను అట్టివాడవగుదువు. తదనన్తరమా దేవేన్ద్రుడు శ్రీ విష్ణుభగవంతునిద్వారా యుపాయమును తెలిసినవాడై, బ్రాహ్మణవేషధరుడై గోదావరీ నదియొడ్డునకుబోయెను. ఆ తీరమున పరమపవిత్రమగు కాళికాగ్రామమను పట్టణమును గాంచెను. ఆ పురమున మృత్యుంజయుడగు కాలేశ్వరుడు నివసించుచుండెను. అట్టి గోదావరీనదీ తీరమున పరమధార్మికుడును సకలవేదపారంగతుడును, కరుణాస్వరూపుడును, దాంతుడై నిత్యము అష్టాదశాధ్యాయమును జపించువాడునుయగు శ్రోత్రియబ్రాహ్మణునిజూచి దేవేన్ద్రుడు పరమ సంతోషముతో ఆ బ్రాహ్మణుని పాదములపైబడి పొర్లాడెను. తర్వాత ఆ విప్రోత్తమునిద్వారా సుశిక్షితుడై ఆ యిన్ద్రుడు అష్టాదశాధ్యాయమును పఠించెను. ఆ పుణ్యవశముచే దేవేన్ద్రాదిపదవులను గూడ స్వల్పముగాతలంచి ఆ దేవరాజు వైకుంఠపురమును పొందెను. కాన ఓ దేవీ! సకల మహామునులకుగూడ నిది పరమతత్త్వము. ఇట్టి దివ్యమగు అష్టాదశాధ్యాయ మాహాత్మ్యమును నీకు జెప్పితిని. దానిని శ్రవణముజేసినంతమాత్రమున సర్వపాపములు నశించును. ఓ గౌరీదేవీ! ఈ విధముగా సకలపాపనాశకమగు శ్రీ భగవద్గీతా మాహాత్మ్యమును నీకుపదేశించితిని. ఏ పుణ్యాత్ముడు దీనిని శ్రద్ధతోవినునో ఆ మహానుభావుడు సర్వపాపనిర్ముక్తుడై సర్వయజ్ఞఫలమునుపొంది విష్ణుసాయుజ్యమును పొందుచున్నాడు.

ఇట్లు శ్రీ పార్వతీ మహాదేవ సంవాదరూప

శ్రీ భగవద్గీతా మాహాత్మ్యము

సంపూర్ణము.

ఓం తత్ సత్.

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు.

ఓమ్

# శ్రీ భగవద్గీతా గేయము

(శ్రీరాగము — ఆదితాళము)

[ శ్రీ ద్రోణమరాజురామమూర్తిగారి "గీతోద్యానవిహారము" నుండి ]

◆◆◆◆◆◆◆◆◆◆◆◆

భగవద్గీతోద్యానవిహారము భక్తినొనర్పఁగ పరుగునరండీ।
సొగసుగ దానిని జూడగనయ్యెడు సుళువగు త్రోవను జూపెదనండీ॥

1. భారతయుద్ధపు పరిసరభూముల బయలుదేఱిన భాగ్యంబండీ।
ధీరుఁడు వ్యాసుడు స్థిరముగ నాటిన దివ్యోద్యాన క్షేత్రముసుండీ॥

2. రహినిలకృష్ణుఁడు రక్తితోపార్థుని రథమును నడిపిన రంగంబండీ।
ఇహపర సుఖకర హేతుభూతముల నెన్నియొ యాతఁడు పన్నినదండీ॥

3. ఇలపయినది పదియెన్మిదియౌ యకరంబుల పరిమితి రాజిలునండీ।
నలలితముగ నట సప్తశతంబుల సద్వృక్షంబులు జెలఁగును జుండీ॥

4. ఎప్పుడు వాడనిపూవులుచుండీ ఎప్పుడు కుళ్ళని ఫలములుసుండీ।
తప్పక మనమా ధన్యవనికిఁజని తలకొక కొన్నిఁటిఁ దెత్తమురండీ॥

(హిందీ అరతీ)

1. జయభగవద్గీతే జయభగవద్గీతే।
హరిహియ కమలవిహారిణి సున్దరసుపునీతే॥

2. కర్మసుమర్మప్రకాశిని కామాసక్తిహరా।
తత్త్వజ్ఞాన వికాసిని విద్యాబ్రహ్మపరా॥ ॥జయ॥

3. నిశ్చలభక్తివిధాయిని నిర్మలమలహారీ।
శరణ రహస్యప్రదాయినీ సబవిధిసుఖకారీ॥ ॥జయ॥

4. రాగ ద్వేషవిదారిణి కారిణి మోదసదా।
భవభయహారిణి తారిణి పరమానన్దప్రదా॥ ॥జయ॥

5. ఆసురభావ వినాశిని నాశిని తమరజనీ।
దైవీసద్గుణదాయిని హరిరసికా సజనీ॥ ॥జయ॥

6. సమతాత్యాగ శిఖావని హరిముఖకీబానీ।
సకలశాస్త్రకీ స్వామిని శ్రుతియోంకీ రానీ॥ ॥జయ॥

7. దయాసుధాః సావని మాతృకృపాకీజై।
హరిపదప్రేమదాన కరఅపనోకరలీజై॥ ॥జయ॥

ఓమ్

# శ్రీ భగవద్గీతా గేయము

బేహాగ్ రాగము - ఆదితాళము (సంస్కృతము.)

రచన: శ్రీ నోముల అప్పారావు గారు.

జయ జయ జయ జయ భగవద్గీతే!
జయ భవబన్ధన శమన సుచరితే!

1. కాండత్రయ సంశోభితరూపే!
ఖండిత త్రిభువన ఘనసన్తాపే! ॥జయ॥

2. సాంఖ్యకర్మ యోగాది విలసితే!
సంశ్రితసాధక జన కల్పలతే! ॥జయ॥

3. పద్యన ప్రశత భవ్యతరాంగే!
పాపవిభంజన! పావనగఙ్గే! ॥జయ॥

4. భక్తిజ్ఞాన సోపానశోభితే!
పరమయోగి హృత్పద్మభావితే! ॥జయ॥

5. భగవత్ శ్రీముఖ పద్మమరన్దే!
పార్థహృత్పదన భరితానన్దే! ॥జయ॥

6. సకలోపనిషత్ సాగర జాతే!
సన్మునిమథనాచల పరిపూతే! ॥జయ॥

7. శాంతిసుఖప్రద సదమృతకిరణే!
జననమరణ భవసాగరతరణే! ॥జయ॥

8. భజనసమాజ సుభక్త హృదబ్జే!
పరిపూజిత పావన పాదాబ్జే! ॥జయ॥